# 11 గంటలకు

హాయిగాకూర్చొని తేనీరుత్రాగు వేళయినది. ప్రొద్దున చేసినపనికి అలసిపోయిన తేనీరుత్రాగిన అలసట తగ్గును. ఈ చక్కని తేనీరు త్రాగుచు రోజంత ఏమి చేయవలెనో ఆలోచించుకొనుము.

## తేనీరుచేయు విధము

శుద్ధమైన వేడినీరు. కొంచము వేడిచేసిన శుద్ధపాత్ర, ఒకస్పూన్ టీ యొక్కొక్కరికిన్ని, మొత్తముగా నొక స్పూన్ యధికముగాను పాత్రలోవేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి గిన్నెలలోపోసి పాలు చక్కెర చేర్చవలెను.



ఇంకా ఎప్పుడు తేనీరుత్రాగవచ్చునో తెలుసునా

1. తెల్లవారుజామున.
2. మధ్యాహ్నము.
3. సాయంకాలము.
4. రాత్రికి.



# ఎప్పుడైన ఎక్కడైన టీ త్రాగవచ్చును

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది

IK 119

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౪.] జూలై 1931 [సంచిక ౫.

PRINTED AT LODHRA PRESS, EGMORE, MADRAS

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' Schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

1 Ongole
2 Cuddapah.
3 Tadpatri.
4 Guntur.
5 Adoni.
6 Hindupur.
7 Tirupati.
8 Nellore.
9 Bezwada.
10 Berhampore.

## TALUK BOARDS.

1 Penukonda.
2 Ramachandrapuram.
3 Vellore.
4 Narasarowpet.
5 Berhampore.
6 Madanapalle.
7 Dhone.
8 Koilkuntla.
9 Karvetinagar.
10 Chendragiri.
11 Peddapur.
12 Tadepalligudem.
13 Proddatur.
14 Jammalamadugu.

*Editor,*

**GRIHALAKSHMI.**

**Post Box. 752.**

**EGMORE, MADRAS.**

# ప్రస్తావిక

శ్రీ వడ్లమాని అప్పారావు 'పద్మిని' అనుపద్యవ్యాసము ఈసంచికయందు పూజ్యపీఠమునందినది. ఇదియొక ఊహాసంభాషణము. కవి ప్రశ్నించుచున్నాడు. పద్మిని ప్రత్యుత్తర మిచ్చుచున్నది. కవి తనప్రశ్నలోనే పద్మినిని ప్రస్తుతించుచున్నాడు. పద్మిని తనప్రత్యుత్తరములోనే తన ప్రథితగుణములను ప్రదర్శనముగావించుచున్నది. రచయిత చమత్కార మీవిషయమున మిక్కిలి రమణించుచున్నది. కవివైచిన హృదయము కలంచు ప్రశ్నలకు వీరహృదయము గల పద్మిని ఎంతటి హృదయంగమమైన సమాధానము లిచ్చినదో! అయినను కవి వైచుప్రశ్నలకు అంతులేదే. సంభాషణము కవియే ప్రారంభముచేసినాడు. ఆప్రారంభమును ప్రశ్నతోడ. సంభాషణము కవియే ఉపసంహరించినాడు. ఆఉపసంహారమును ప్రశ్నతోడనే.

> "చనియు సడలని తావకచరితమందు
> జీవితామలనవ్యసౌశీల్యవృష్టి
> నెడతెగక రాల్చి, కవిలోక మెందుకిట్లు
> ముగ్ధబాష్పంపురొదలలో మ్రోగునిపుడు?"

ప్రశ్నలోనే ప్రస్తుతిని ప్రసవింపగల ప్రజ్ఞాధురీణుడగు ఈకవి ప్రశ్నకు ఒరులు సమాధాన మీయవలసిన అవసరమేది? పద్మిని చరిత్ర 'చనియు సడలని'ది కావున కవిగ్రామణు లద్దానిని ముగ్ధబాష్పంపురొదలలో మ్రోగింతురు.

శ్రీమతి రాజేశ్వరి 'అభిప్రాయభేదము' అనునది ఈ సంచికయందు ప్రథమగద్యవ్యాసము. భగవానుని సృష్టి చమత్కారమునకు అవధి, పురుషునకు 'ఆనందనిష్పత్తికి తరుగనిగని' అయిన స్త్రీనిగూర్చి పాశ్చాత్యులలో గల అభిప్రాయభేదము లీవ్యాసమున ప్రసర్పణము గావింపబడినవి. అచ్చట స్త్రీని కొందఱు నెత్తికెత్తి పూజించినారు; కొందఱు నేలనుపెట్టి మట్టినారు. ఈ అభిప్రాయభేదప్రదర్శనము వ్యాసకర్త్రికిప్రబర్హముకాదు. దానినుండి ఆమె సారమైనసత్యము నొకదానిని గ్రహించినది. 'ఈ అభిప్రాయభేదములకు వర్ణ్యమానవస్తు వెన్నటును కారణముగాదు. ఆయాభావధోర[illegible]లట్టివి,' ఈ సందర్భమున ఆమె భారత

దేశమునందలి పరిస్థితులను గూర్చి వెల్లడించిన విమర్శక వాక్యము చూడుడు: 'స్త్రీదూషణపూర్వకంగా పురుష మనశ్చాంచల్యము బాపుటకై పూర్వపుభారతతత్త్వజ్ఞులు ప్రయత్నించిరే కాని స్త్రీజాతినెన్నడును తక్కువపర్చే ఉద్దేశంతో కాదు.' ఇది ముమ్మాటికి నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయమనుటకు వ్యాసకర్త్రి శ్రీమచ్ఛంకరభగవత్పాదుల అమరుకము, 'మాతృదేవోభవ' అనుపూతవాక్యము, 'కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింటనుండనొల్ల' దను లోకోక్తి అను మూడింటిని నిదర్శనముగ నిచ్చినది. అవి చాలును. అయితే చివరకు తేల్చినదియేమి? 'పాతివ్రత్యము ఈ దేశమున నేలగిల్లినదొరకు సమృద్ధసస్యము. కావుననే అట్టి అభిప్రాయభేదము లీదేశమున పొడసూపలేదు' అని. ఇది ఇట్లుగూడ చెప్పవచ్చును. 'అట్టి అభిప్రాయభేదము లీదేశమున పొడసూపలేదు కావుననే పాతివ్రత్యము ఈ దేశమున నేలగిల్లినదొరకు సమృద్ధసస్య'మైనది. ఈవ్యాస రచనమున కవయిత్రి విషయసంగ్రహణశక్తి, సారగ్రహణ సామర్థ్యము, విమర్శకవైదుష్యము జాదుకొనియున్నవి.

శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు 'పుస్తకముకన్న ప్రకృతియే జ్ఞానాభివృద్ధి నతిశయింపజేయును' అను నీలమువంటినీతిని 'ప్రకృతి' అను గద్యవ్యాసమున పోషించినాడు. జ్యోతి, మాధవుడు భార్యాభర్తలు. మాధవుడు ఉత్తపుస్తకభుక్కు. కావున నాతడు గృహస్థాశ్రమము స్వీకరించిన ఋష్యశృంగుడుగా నుండినాడు. ఉండగా ఒక నాడు ఆతడు అదృష్టవశమున ప్రకృతిమాత ఒడిలోబడి నాడు. సూర్యుడు అస్తమించినాడు; కమలకాంత కనులు మూసినిద్రించినది—చంద్రుడు ఉదయించినాడు; కలువకన్నె కన్నులువిప్పి కలకలనవ్వినది. ప్రకృతిలో ఎటుచూచినను అన్యోన్యత. ఒకే తొడిమగలిగియున్న జాజిపువ్వులజంటను కోయుటకు ఆతడు ఎప్పుడు సంశయించినాడో అప్పుడే'ఆతని హృదయము ప్రేమమకరందముతో'నిండిపోయినది. ఇకఇప్పు డాతడు ఋష్యశృంగుడుకాడు. ప్రణయరాజ్యమునకుప్రధాని.

—[illegible] రావు బి. ఎ.

# విషయసూచిక

## జూను మాసపు యుక్తిలెక్కకు సమాధానము

జూను మాసము గృహలక్ష్మిలో శ్రీమతి నున్న సావిత్రీదేవిగారిచ్చిన యుక్తి లెక్కకుసమాధానము:

28 రోజులలో.

మేము పెట్టినగడువులోపల సరియైన సమాధానమిచ్చిన బాలబాలికల నామములు వరుసక్రమమున క్రిందపేర్కొనుచున్నారము. బ్రాకెట్లలో వారివయసు తెలుపబడినది.

1. వావిలాల వాసుదేవశాస్త్రి (6) 2. ఆరాధ్యుల సూర్యకాంతం (9) 3. వి. మె. బి. శాస్త్రి (8) 4. చాగంటి సుందరరావు (8) 5. కుసుమ సుబ్బారావు (9) 6. టంకాల పద్మావతి (9) 7. పాకల వేంకటకామేశ్వరీ దేవి (9)

పలువురుముప్పదిదినములనిప్రమాదపడిరి. నూర్గురకు పైగా సమాధానము పంపిరి. అందుసరియైన సమాధానము తెలిపినవారు ఈ ఏడ్గురే. వీరికి మాశుభాశీస్సులు.

—సంపాదకుడు.

# గృహలక్ష్మి శ్రావణమాససంచిక

## ఆంధ్రమహాశయులకు విన్నపము

శ్రావణమాసము పుణ్యస్త్రీలకు మిక్కిలి ప్రియమైన మాసము. మంగళగౌరీవ్రతములు, వరలక్ష్మీపూజలు, పేరంటములు, వేడుకలు, చిన్నమోచిదరో సువర్ణలాభము. పుణ్యస్త్రీల కిన్ని విధముల సంతోషప్రదమైన శ్రావణమాసపుమాహాత్మ్యమును ప్రస్తరించిప్రస్తుతించుచు 'గృహలక్ష్మి' తరపున నొకప్రత్యేకసంచిక వెలువరింపతలపెట్టినాము. పై మాసపుఅనగా ఆగస్టు మాసపు గృహలక్ష్మిసంచిక శ్రావణమాససంచికగ వెలువడును. ఆప్రత్యేక సంచికకు విలువగలప్రత్యేకవ్యాసములనర్థించుచున్నాము. శ్రావణమాసము: ప్రకృతి; వర్షఋతుచర్య; శ్రావణమాసము: మానవుని జీవితము, ఆతని ఆరోగ్యము; శ్రావణమాసము: వ్రతములు; మంగళగౌరీవ్రతము, దాని ఆంతర్యము, దాని కథ, దానికి సంబంధించిన పాటలు; వరలక్ష్మి పూజ, అందలి విశేషము, దానికథ, దానికి సంబంధించిన పాటలు; శ్రావణపూర్ణిమకు ముందరి శుక్రవారము యొక్క ఘనత; శ్రావణమాసపూజలకు జ్యోతిష, ఖగోళ, ఆరోగ్య, సాంఘికశాస్త్రములకు గల సంబంధము; శ్రావణపూర్ణిమ: యజ్ఞోపవీతధారణము; శ్రావణము: చాతుర్మాస్యవ్రతము; శ్రావణమాసము: వరాహజయంతి, శ్రీకృష్ణజయంతి, నాగపంచమి మొదలగు పండుగలు; 'శ్రావణపట్టీ:' స్త్రీలకు దాని విలువ; ఆషాడపట్టీ మున్నగువిషయములలో నొక దానికి సంబంధించినగద్యవ్యాసముగాని, పద్యవ్యాసముగాని, శ్రావణమాసమందలి ఆచారములచే నిర్వహింపబడు కథావ్యాసముగాని, ఆఆచారములందలి లోటుపాట్లను ప్రదర్శించు హాస్యవ్యాసముగాని, శ్రావణమాససంచికకు యథోచితమని తమకు తోచు మఱిఇతరవిషయకవ్యాసముగాని అనుగ్రహించి గృహలక్ష్మి నాదరించి మాయుద్యమమునకు తోడ్పడవలయునని మిక్కిలి ప్రార్థించుచున్నాము. పూర్వకవిరచితములగు కావ్యములనుండి, పాటలనుండి, పదములనుండి శ్రావణమాసవిషయములను ప్రస్తావించు భాగములనుగూడ వీలగుచో సేకరించి పంపగోరుచున్నాము. శ్రావణమాససంచికకు పంపబడు వ్యాసములన్నియు జూలై 7-వ తేదీలోపున మాకు చేరునట్లు పంపప్రార్థన.

ఈప్రత్యేకసంచికయొక్క విడికాపీలు కోరువారు ముందుగనే వ్రాయుట మంచిది. అదనముగ కొద్దికాపీలు మాత్రమే ముద్రించుచున్నాము.

శ్రావణసంచిక వెల రు 0-6-0 అణాలు మాత్రమే

**గృహలక్ష్మి కార్యాలయము** పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు.

## గృహలక్ష్మి

### ప్రథమ, ద్వితీయ, తృతీయ సంపుటములు

గృహలక్ష్మి ప్రథమ, ద్వితీయ, తృతీయ సంపుటముల ప్రతులు చాలభాగము సెల్లైపోయినవి. ఇక కొలది ప్రతులు మాత్రమే మిగిలియున్నవి. కావున వలయువారు వెంటనే మా కార్యాలయమునకు వ్రాయవలెను. ఆలసించిన దొరకవు. తిరిగి అచ్చుపడనేరవు. ఆశాభంగము కలుగకుండ నేడే ఒక కార్డు వ్రాయుడు.

సంపుటము ఒక్కింటికి రు 6 మాత్రము.

మేనేజరు

గృహలక్ష్మి కార్యాలయము

తపాలపెట్టె 752, ఎగ్మూరు, మదరాసు

## మీ అచ్చుపనులయందు :

మీకు కావలసినది అందమగు కూర్పులా? లేక చిన్నపనియైనను బాగుగ చేయుటయా? లేక సకాలమునకు ముద్రించియిచ్చుటయా?

మీ అవసరము లేవియైనను, మీమీ అచ్చుపనులను మేము చక్కగ చేయగలమని మీ అనుభవమే తెలియజేయగలదు. ఒకమారు పరీక్షింపుడు!

## లోధ్ర ముద్రణాలయము

తపాలపెట్టె 752, ఎగ్మూరు, మదరాసు.

## గొప్ప సరుకు విడుదల అమ్మకము.

### మూడు రూపాయలమీదను మాత్రమే విలువగల బహుమానములు





'ఆటో మోతియ' అత్తరువును ఒకేసారి ఆరుబుడ్లు కొనువారు క్రింది 324 విలువగల బహుమానములను ఉచితముగ పొందుదురు. బహుమానవస్తువుల వివరములు: ఒకబంగారుగిల్టుపోయబడిన ఆట ముంజేతిగడియారము, ఒకచేయి, ఒకజుబ్బా, ఒకఫాన్సీజేబురుమాలు. ఒకఫాన్సీ అద్దము, ఒకదువ్వెన్న, మంచివాసనగల ఒకసబ్బు, ఒకబంగారుగిల్టుపూయబడిన రాళ్లఉంగరము, రాళ్లుపొదిగిన బంగారుగిల్టుపూయబడిన బొగడలు ఒకజత, ఒకఫాన్సీ కత్తెర, ఒకనల్లని జాప్ఫవుంటెనుపేనా, ఒకడ్రాపరు, ఒకక్లిప్పు, బంగారుగిల్టుపూయబడిన చత్రముగలసులోచనములజత, రబ్బరుతోచేయబడిన ఊదెదుబెలూను, ఒకడజను సేఫ్టీపిన్నులు, ఒక సీసపుపుల్ల, 144 బ్లూబ్లాక్ సిరామాత్రలు, ఒకపెన్‌హోల్డరు, ఒకడజను పాలీలు, ఒకడజను నీటిబొమ్మలు, ఆరుతలపిన్నులు, బంగారుగిల్టుపూయబడిన చెవిపోగులు ఒకజత, ఒకబంగారుగిల్టుపూయబడిన ముక్కుకాడ, ఒకజత బంగారుగిల్టు పార్శిబక్రి, ఒకపిస్తోలు, నూరుటోపీలు, ఒకకత్తి, ఒకడబ్బులసంచి, 25 సూదులు, ఒకజత జీన్‌జోళ్లు (పాదములకొలత పంపవలయును) బహుమానములతోసహా వీనివెల రు. 3 ప్యాకింగు పోస్టేజి 10 అణాలు. ఇండియన్ స్టోర్సుకంపెనీ 47, బేనియాటోలావీధి, హట్కొహోలాపోస్టు, కలకత్తా.

# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సం|| చందా. రు. 4.

విడి పత్రిక. అ. 6

మాదిరి పత్రిక కోరువారు

6 అణాల స్టాంపులను పంపవలెను

ప్రకటన రేట్లు

| | | |
|---|---|---|
| నెలకు | ఒక పుటకు. | రు. 15 |
| నెలకు | $\frac{1}{2}$ పుటకు. | రు. 10 |
| నెలకు | $\frac{1}{4}$ పుటకు. | రు. 7 |

6 నెలలకు పైగా ప్రకటించువారికి నూటికి $12\frac{1}{2}$ వంతున కమీషను మినహాయింపబడును.

మేనేజరు

గృహలక్ష్మి

తపాలపెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

# తులసి, బిల్వ

ఇవి తులసి—బిల్వ అను జాతీయమూలికలను గూర్చి శాస్త్రవిషయిక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధీ గుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితముమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ప్రథమ ద్వితీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథముల కర్తలు: డాక్టర్ కె. యన్. కేసరి

ప్రతి ఒకటికి 0—8—0

గృహలక్ష్మి కార్యాలయము

పోస్టుబాక్సు నెం. 752

ఎగ్మూరు, మద్రాసు.

## పేరుగల శిశు లివరు మందు

అసత్యప్రకటనవలన మోసపోయి అసలుమందులను విడనాడి ఆశాభంగము నొందకుడు. నిజానిజములు నిలుకడపరీక్షపైనిగాని తెలియుటకష్టము. ఇట్టి ఔషధములనేకములుండవచ్చును. ఇట్టిస్థితిలో నమ్మకమే ప్రధానము. "ఇమిటేషను ఇమిటేషనే గాని" అసలెట్లగును? సంతృప్తిపై పెక్కురు డాక్టర్లుమాకువ్రాసిన లేఖలే మా మందులయొక్క నిజగుణస్వభావములకు ఆధారములు. "వైద్యో నారాయణో హరిః||" అను మర్యాద ఇట్టి యసత్యప్రకటనవలన తగ్గునా?

శిశువైద్యభూషణులగు

డాక్టరు జమ్మి వ్యాసారావుగారు, మెడలిస్టు స్ప్లీన్ అండ్ లివరు రోగములకు స్పెషలిస్టు "వ్యాసకుటీరము" విజయనగరం పోస్టు

వీరనేకనిస్పృహజెందిన కేసులను బాగుచేసిరి. వీరి ఔషధరాజములు గ్యారంటీగా గుణము త్వరలో నిచ్చును. వీరి ఔషధముల ననేకడాక్టర్లు అనుదినము వాడుచున్నారు. ఆంధ్రదేశమందంతటను మామందు లమ్ముటకు ఏజంట్లు కావలెను. నేడే వ్రాయుడు.

# కేరళా మంచిగంధపు సబ్బు

వేసవికాలమునకు తగిన సబ్బు



చలువచేయునది : శ్రమవార్చునది.

అన్ని తావులయందు దొరుకును.



శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు

ప్రభుత్వమువారి నియామకముచేతనే యగుగాక శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి బ్రిటీషుఇండియాలో శాసనసభల యందు సభ్యత్వమువహించిన స్త్రీలలో ప్రథమురాలు. జ్ఞానార్జనమున ఆమె ఎల్లప్పుడును విద్యార్థినియే. స్త్రీగా ఆమె వినయసుందరి. స్త్రీసముద్ధరణవిషయమున ఆమె కటారిక త్తియ. ఉన్నదీక్షకు ఆత్మవిశ్వాసము పైదోడు. భావము స్వాతంత్ర్యపుముద్ద. కార్యశౌర్యమునకు కొదువ అనునది లేదు. శ్రమపడుటలో పొదుపునెఱుగదు. విద్య, ఆరోగ్యము, పరిశ్రమలు, కార్మికసమస్యలు మొదలగు విషయములందు శాసనసభ ఆమెజ్ఞానమును వెల్లడించినది. అమె తననిరంతరాందోళనముమూలమున శాసనసభవారిదృష్టి ఎన్ని మోదురాచారముల వైపు త్రిప్పినది. దేవదాసిచట్టము; పశుపువృత్తి నిర్మూలనచట్టము; పాఠశాలయందును కళాశాలలయందును విద్యార్థులకు వైద్యపరీక్ష, ఆరోగ్యశాఖాధి కారిణినియామకము-ఇవి ఆమె శాసనసభామూలమున మద్రాసురాజధానికి ప్రసాదించిన దివ్యఫలములలో ముఖ్యమైనవి. తనకార్యశౌర్యప్రదర్శనమునకు చిక్కనైని ఇల్లవకాశ మిచ్చుచున్నను ఆమె శాసనసభయందు వ్యామోహము నుంపలేదు. ఆమె మద్రాసుశాసనసభకు ఉపాధ్యక్షపదవికి ఎన్నుకొనబడుట సమగ్రభారతమహిళాలోకమునకు అపూర్వగౌరవమే. ఆ అపూర్వగౌరవమును వదలుటచే ఆమె దివ్యత్వము నార్జించినది. మహాత్మాగాంధిని కొద్దిరోజులకు పట్టుకొందురనగా ఢిల్లీఅసంబ్లీ ప్రెసిడెంటు శ్రీ వి.జె. పటేలు తన పదవికి రాజీనామా నిచ్చినాడు. మహాత్మాగాంధిని పట్టుకొనిరనగా మదరాసు కౌన్సిలు డిప్యూటీప్రెసిడెంటు శ్రీ ముత్తులక్ష్మిరెడ్డి తనపదవికి రాజీనామానిచ్చినది. నూటఇరువది మంది సభ్యులుగల కౌన్సిలులో ఒక్కగానొక్క స్త్రీ ఏసభ్యుడును చేయజాలనంత పని నిర్వహించినది. శాసనసభలో ఏ పురుషుడింతటి నిశ్చితబుద్ధిని చూపినదో శాసనసభను విడిచి నప్పుడు ఆమె అంతకంటె ఎక్కువ నిశ్చితబుద్ధి చూపినది. ఇట్టి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి ఆంధ్రులయింటి కోడలు.




## స్మృతికారులు : విడాకులు*

అత్రి ఒకస్మృతికారుడు. ఆతడు స్త్రీదోషమును అంతగపాటింపరాదనువాడు. ఏకారణముచేతగాని, ఏపరిస్థితులలోగాని స్త్రీకి విడాకునిచ్చుటకుగాని, ఆమెను విసర్జించుటకుగాని ఆతడు అంగీకరింపడు. మగనియింట క్రొత్తపరిసరములయందు కలిగిన ఉద్రిక్తభావములచే పరవశురాలై గాని, కేవలము సుఖవినోదమును కోరిగాని ఆమె ఇల్లువదలి లేచిపోయినను; ఆమె అపదూరుకు గురిచేయబడినను; శక్తిసంపన్నులగు విలాసకాంద్రవాగురులకు ఆమె బలియైనను; బలవంతముగా ఆమెమానము చెఱుపబడినను; దొంగలచే చెఱగొనబడి చెఱుపబడినను స్త్రీని విసర్జింపరాదని అత్రిమహాముని చెప్పుచున్నాడు. జారత్వము—బుద్ధిపూర్వకమైనదికాని, బలవంతమైనదికాని—ఇతర తావులయందు విడాకు ఇచ్చుటకు ప్రబలకారణమై యున్నది. అది ఇచ్చట ఒకపరిగణనీయాంశముగనైనలేదు. మీదుమిక్కిలి అత్రి స్త్రీలు ఏకారణముచేతగాని విసర్జింపబడరాదని నిరూపించుచున్నాడు. అత్రి మొక్కవోని స్త్రీజనపక్షపాతి. ధర్మచ్యుతలైన స్త్రీల నాదరించి సంస్కరింపవలసిన బాధ్యత పురుషులపై నిలిచియున్నదని ఆతని మతము. సంస్కారము, ఉద్ధరణమును దార్జన్యముపొంతపోవని విద్యాప్రబోధముచే కలిగింపవలయుననియు, అది తొలగింప నుద్దేశించిన దోషముకంటె విడాకు దుష్టమైనదనియు అత్రి అభిప్రాయము.

మఱియొకస్మృతికారుడగు బోధాయనుడు ఈవిడాకులను గూర్చి ఏమని చెప్పెనో చూతము. 'సంతానవతికానిస్త్రీకి పెండ్లియైన పదిసంవత్సరములకు విడాకు ఈయవలయును. ఎప్పుడును ఆడుపిల్లలనే కనుభార్యకు పెండ్లియైన పండ్రెండుసంవత్సరములకు విడాకు ఈయ

* ఈవ్యాసమున కాధారము: శ్రీయుత ఆర్. నాగరాజశర్మగారి 'The International Journal of Ethics' అను పత్రికలో 'The Institution of Marriage : Divorce Law in India' అను వ్యాసము.

వలయును. ఎవతెబిడ్డలు పుట్టినవెంటనే చనిపోవుచుందురో అట్టి పెండ్లాముకు పెండ్లియైన పదునైదువత్సరములకు విడాకు ఈయవలయును. దుర్భాషిణియగు భార్యకు వెంటనే విడాకు ఈయవలయును. వివాహము పురుషసంతానమునుత్పాదించి పితౄణ మీగికొనుటకను పవిత్రమైన ఉద్దేశము బోధాయనునకు బాగుగ గలదు. పదిసంవత్సరములనగా దీర్ఘకాలమే. బోధాయనుని మతమున గొడ్రాలితనము విడాకునిచ్చుట కొకకారణము. పున్నామనరకము నుండి పితృదేవతల నుద్ధరించుటకు పుత్రుడు అవసరమగుట హిందూమతధర్మములలోనొకటి. నిరంతరము స్త్రీశిశువులనుగను భార్యను, ప్రసవించిన వెంటనే బిడ్డలను గోల్పోవు భార్యను విసర్జింపమనుట నేటివారికి కొంత వింతగనే యుండవచ్చును. కాని బోధాయనుని కాలమున పుత్రసంతానము యొక్క ఆవశ్యకత అట్టిదిగానుండెను.

ఇక యమమహర్షి తనబృహద్యమస్మృతియందు ఈవిషయమై ఏమని నిర్వచించెనో పరిశీలింతము. ఇతడు కూడ స్త్రీదోషవిషయమై ఉదారాశయములనే వెల్లడించెను. కాని ఇతడు అత్రివలె స్త్రీని ఏకారణముచేతగాని, ఏపరిస్థితులయందుగాని విసర్జింరాదను వాడు కాడు. జారిణియైనంతమాత్రమున భార్య విసర్జింపదగినదికాదు. జారత్వముచే ఆమెగర్భిణి యైనచో అప్పుడామెకు విడాకు ఇచ్చుటకు యమమహర్షి అంగీకరించును. ఇట్టి అతిశయ విషయ మప్పుడే విడాకుబాణము వాడవలయునని అతని తలంపు.

గౌతముడు తనధర్మసూత్రములలో పదునెనిమిదవఖండమున స్త్రీ ఏయేసమయము లయందు తన భర్తకు విడాకునీయవచ్చునో సూచించియున్నాడు. భర్త హఠాత్తుగ పరదేశ గతుడై అతని జాడజబాబులు తెలియరాకున్నను; అతిబాల్యమునందును, అకాలమునను భర్త చనిపోయినను; సన్యాసియగుటకు భర్త ఇల్లువిడచి వెళ్లిపోయినను; ఆతడు పుంస్త్వహీనుడైనను; తప్పత్రాగుటచేతగాని, దొంగతనముచేయుటచేతగాని, వ్యభిచారిణులగు స్త్రీలతో పొత్తుగలిగి యుండుటచేతగాని భర్త బందుజాలముయొక్కయు, ప్రజాసంఘము యొక్కయు మన్ననగోలుపోయినను భార్యఆతనిని విడనాడి మరల వివాహము చేసికొనవచ్చును. బోధాయనుడు, యముడు భర్త భార్యకు ఏయేవిషయములందు విడాకు నీయవచ్చునో చెప్పిరి. గౌతముడు భార్య భర్తకు ఏయేవిషయములందు విడాకునీయవచ్చునో చెప్పినాడు.

మనువు ఉభయపక్షములను చెప్పినాడు. బోధాయనుడుసూచించినవత్సరము లందును మనువు చెప్పిన వత్సరములందును కొన్ని స్వల్పవిభేదములు గాన్పించుచున్నవి. తన భార్య ఋతుమతియైన ఎనిమిదివత్సరముల పర్యంతము గొడ్రాలుగనుండుచో నామెకు విడాకు ఈయవలయును. ప్రసవించిన వెంటనే బిడ్డలను గోల్పోవు భార్యను పెండ్లియైన పిమ్మట పదియవవత్సరమునను, ఎల్లప్పుడు స్త్రీశిశువులనే ప్రసవించు భార్యను పెండ్లియైన పదపడి పదునొకండవవత్సరమునను విడనాడవలయును. దుర్భాషిణియగు భార్యను వెంటనే విడనాడ

వలయును. సారాయి, నల్లమందు మొదలగు మత్తుపదార్థములకు అలవాటుపడినను; కేవల సుఖవినోదముకొఱకు బుద్ధిపూర్వకముగ జారిణియైనను; మగనికి హానికలిగించునవియు, అనిష్టమైనవియు నగు కార్యములను నెడతెగక చేయుచున్నను; కుష్ఠు మొదలగు దుష్ట రోగములచే తీసికొనుచున్నను; గృహమందలి సేవకులు మొదలగు ఇతరవ్యక్తులను విసిరి కొట్టుచున్నను; చెమటయూడ్చిమగడు ఆర్జించుధనమును దుర్వ్యయము చేయుచున్నను అట్టి భార్యను ఎట్టిసంకోచమును లేక వెనువెంటనే విడనాడవలయును. ఇక భార్య ఏయేసమయము లందు విడాకునిచ్చుటకు మనువు సమ్మతించెనో కనుగొందము. మగడుఆధ్యాత్మికవిద్యాసము పార్జనమునకు విదేశగతుడైనచో భార్య ఆతని రాకకై ఎనిమిదివత్సరములు నిరీక్షింప వలయును. ఇతర విద్యలు నేర్చుకొనుటకుగాని, ప్రఖ్యాతినార్జించుటకుగాని, పేరుసంపాదిం చుటకుగాని దేశాంతరములకు వెడలిన పెనిమిటికొఱకు భార్య ఆఱువత్సరములు వేచియుండ వలయును. ప్రణయభిక్షార్థియై విదేశములకేగిన భర్తకొఱకు భార్య మూడుసంవత్సరములు మాత్రమే వేచియుండవలయును. స్మృతికారు డిట్లు స్పష్టముగా చెప్పుచుండ వ్యాఖ్యాత భార్య ఇట్లు వేచియుండి నియమితకాలము జరిగిన పిమ్మట ఆభర్తను వెదుకుకొనుచు పోయి అతనిని గనుగొని అతనియొద్ద ఉండవలసినదిగా వ్రాయుచున్నాడు. ఇదియెంతటి పాక్షికబుద్ధితో వ్రాసిన వ్రాతయో సులభముగనే నిర్ణయింపవచ్చును. ఈ వ్యాఖ్యాత వ్రాతలకేమి కాని పై స్మృతికారులు విడాకులను గూర్చి వ్రాసిన వ్రాతలవలన ఏర్పడిన నైతికధర్మములనుగూర్చి ఆలోచింపవలసియుండును.

## పద్మిని

వడ్లమాని అప్పారావుగారు

కవి

నాడు త్వదీయదృక్పథమునన్ పడుశాత్రవభీతి వెంటనే
వేడివిషాదవేదనలపీల్చెడు నీనయనాశ్రుమాలికన్
కూడినదేమొ; నీవపుడుకూర్చిన నీచితిరేగిమండగా
మ్రోడుచెడందతోవలచిపోరినశత్రువుడూరకుండెనా?

పద్మిని

ఏనొకరాజపుత్రిననియేడ్చిన నారొదనన్నగిల్లి దుః
ఖానలమందులేనపుడు కాష్ఠములారి మృషాపథమ్ము
పూనినశత్రురాజువలపుల్ ఫలమందునొయేమొ; కాని నా
మేనదహించిరాలుమసిపెంటలె మీకయిదాచె నానుడిన్.

కవి

నీగళమందురేగిన వినిర్మలవాక్సుధరాగసట్టియా
స్త్రీగణమెల్ల యూరకకృశించు నెడారులలోనిసోనలై

మూగతనమ్మునొందికనుమోడ్చిరఠ? కారుమొయిళ్లమాటలో
దాగినతారకావళివిధమ్మున దృష్టులులేనియంధులై?

పద్మిని

మాపరరాజభీతికి తమస్సులపాలునులూకమై ఖరిన్
పాపము వారలేడ్చిమొడబాయని దుఃఖనిశీతమస్వినీ
స్నాపితమైన నేత్రజలసాగరమందలికారుచిచ్చుతో
నేపడిపోవుకాష్టమున నిప్పుతగిల్చియువారుచావరే!

కవి

నీమృదుకంఠమందు మును నిర్జరశౌర్యమరీచిమాలికా
శ్రీమణిభూషలెన్నికయిసేసితివో; త్వరమైనమృత్యువం
దేమరి వానినెల్ల విరమింపని మంటలకాల్చివేసితో?
భూమినినిల్వగావిడిచిపోయితివో? సెలవిమ్ము పద్మినీ!

పద్మిని

మణులవికాసహాసము, తమస్సులవీడునుషస్సుఛాయలో
కనుగొనరానితారలవికాసముఔట, మదీయకంఠమం
దనవరతమ్ముదాల్పనుగదా! భువిలోనుదయించునంగనా
మణులతనూవిపంచికలు పాడుటకై త్యజియింతునప్పుడే.

కవి

అదరనివహ్నిదుందుడుకు టభ్రములన్ కయిసేయుమంటలో
బెదరనినీమనమ్ము, సడివేసవికెంఘునదీజలమ్ములై
పదపడిపోవుచుండ మెయివాల్పునెఱుంగనిదుఃఖవీచికా
హ్రాదములుసొమ్మసిల్ల, నిలయందుత్యజించుట కెట్టులోర్చితో?

పద్మిని

సడలునిశీథినిద్దురలసౌఖ్యము స్వప్నముకారుచిచ్చులో
పడిమృతినొందురీతి, నెడబాయనిగౌరవహీనవృత్తిచే
నడరి నశించునామనసుకందని దుఃఖపుటూర్పువీచికల్
విడిచితిభూమిపై కుములు వెల్గుతమమ్ములమధ్య నుండగాన్.

కవి

చనియు సడలని తావకచరితమందు
జీవితామలనవ్యసౌశీల్యవృష్టి
నెడతెగకరాల్చి, కవిలోకమెందుకట్లు
ముగబాష్పంపురొదలలో మ్రోగుచిప్పడు

# అభిప్రాయభేదము

శ్రీమతి రాజేశ్వరిగారు

ప్రేమ అనువస్తువొక్కటే మానవజీవితాన్ని ఉపభోగ్యంగావుంచుతూంది. స్త్రీ ఆనందనిష్పత్తికి తరుగని గని. ఆమె హృదయము ప్రేమామృతమునకు భక్తిసంపదకు కొటారము. క్రైస్తవసిద్ధాంతం ప్రకారం భగవానుడు సమస్తసృష్టిని ఆరురోజుల్లో నిర్మించేడు. అతని అవధికిచాలిన కడపటి నాటిసృష్టియే రమణీమణి.

ఆమెనుగురించి, ఆమె స్వాతంత్ర్యస్వత్వములనుగురించి పాశ్చాత్యులు నేడు చేయు కల్లోలమునకు పారములేదు. వారిలో ప్రాచీనులగు వేత్తలు ఆమెను నిందించినట్లు భారతీయులెన్నడును స్త్రీని తూలనాడలేదు. ఆమెనుగురించి మంచిమాటచెప్పినవారు చాల కొలది. వారి అభిప్రాయములో స్త్రీ అనునది కృతఘ్నతకు, దుర్మార్గమునకు, దగాకోరుతనమునకు పెట్టినదిపేరు—కామినీభూతము—ఇంతటి జుగుప్సకు కారణమేమో మృగ్యము. వారిలోకూడ పూర్వము లుక్రీషియా, కార్నీలియా మొదలగు మేలుబంతులు లేకపోలేదు.

సోలొమనుపుస్తెకట్టి పెండ్లాడినభార్యలు యేడువందలట. అతడేమన్నాడు? "చావుకన్నను స్త్రీ సహింపరానిది."

టెర్టలియన్ చెప్పినది:—"కామినీ! నీవు నరకద్వారమవు- పాపమునకు కారణమవు."

ప్లాటస్ అను విజ్ఞానియొక్క విసురు:— "పెళ్లినిమిత్తమె స్త్రీలలో యెంపుడవసరం లేదు. ముళ్లన్నీ ఒక్కలాగే గుచ్చుకుంటాయి."

ఏస్కిలసు రోదనము:—"వేదాంత తిరస్కృతమగు స్త్రీజాతికి నాయింటతావుండరాదని భగవంతుని ప్రార్థిస్తున్నాను."

సోక్రటీసు మహాశయులు సెలవిచ్చినది:—"పురుషవిరోధముకన్నను స్త్రీప్రేమయే యెక్కువ అపాయకరము. ఎరనుతగులుకొనుటచేపకెట్టిదో, పెండ్లితగులాటముకూడనట్టిదే." సోక్రటీసు పెండ్లాడేడో, లేదో!

ఆంటిఫెనీసు స్త్రీదూషణచక్రవర్తి:— "ఆడదాన్ని ఒక్కవిషయంలో మాత్రం నమ్ముతాను, చచ్చినతర్వాత తిరిగి బ్రదికి రాదని."

మిచెలెట్ ఆమెను "The Sunday of Man" అన్నాడు. స్త్రీబానిసత్వధోరణి అంతాఒక్కలక్కపిడతలో యిమిడ్చేడతను.

ఇక్కడవరకు చదివిన సోదరీమణులను కొంతసేద దీర్చుకొనుటకు అయిదునిమిషము లాగవలెనని కోరుచున్నాను.

* * *

ఇకపటము రెండవప్రక్క—

షిల్లరు సమర్పించిన ప్రేమాంజలి- "ప్రాపంచికమరుభూములందు స్వర్గసౌఖ్యప్రసవములను పుష్పింపజేయుటకై రమణులు సృష్టింపబడిరి—వారిదేగాక భాగ్యము!"

బాల్జక్ నిరూపణము:—"దేవతలకు మానవులకు నడిమిరకముగా స్త్రీజాతినిర్మింపబడినది. సత్యధర్మముల కామె నిత్యదాసి"

లామర్టయిన్ అనుభూతి:—"ప్రపంచమునందలిమహాదర్శముల కన్నిటికి ప్రారంభబీజము మహిళయే."

"చిత్రణకౌశల మెక్కుడుగాచూపుట

కనువగునట్లు, దేవుడు పురుషునికన్న స్త్రీని సున్నితమొనర్చె" నని అల్ ఫ్రెడ్ డీమస్సెట్ అభిప్రాయము.

విక్టరుహ్యూగో జగమెరిగిన బ్రాహ్మణుడు. అతని యోగ్యతాపత్రము:— "స్త్రీ స్ఖాలిత్యమెరుగని యొక మరుద్విగ్రహము."

ఈ అభిప్రాయభేదములకు వర్ణ్యమాన వస్తువెన్నడును కారణముకాదు. ఆయా భావధోరణుల సమయములట్టివి.

స్త్రీదూషణపూర్వకంగా పురుషమన శ్చాంచల్యము బాపుటకై పూర్వపుభారత తత్త్వజ్ఞులు ప్రయత్నించిరేకాని, స్త్రీజాతి నెన్నడును తక్కువపర్చె ఉద్దేశంతోకాదు. "నారీ స్తనభరనాభీదేశం దృష్ట్వామాగా మోహావేశం" అని వేదాంతంపాడిన శ్రీమచ్ఛంకరభగవత్పాదులు అమరుకంలో స్త్రీ యొక్క కోమలహృదయధర్మాన్ని మరుగు పర్చలేదు. "మాతృదేవోభవ" యను పూత వాక్యము భారతదేశమున సృష్టితోనే యుద్భవించింది. "కలకంఠకంఠికన్నీ రొలికిన సిరి యింటనుండ నొల్ల" దను లోకోక్తవచనము, హైందవుల Chivalry విషయమై కోటి నవలలపెట్టు. జీవననౌక కామెయే కర్ణధారిణి. పాతివ్రత్యము ఈదేశమున నేలగిల్లినదొరకు సమృద్ధసస్యము. కావుననే అట్టి అభిప్రాయ భేదము లీదేశమున పొడసూపలేదు.

ఎవ్వరేమన్నను స్త్రీయెన్నటికిని ఆది శక్తియే. అస్మద్దేశికానుమతిని వారి అభినందనముతో ఈవ్యాసము ముగింతును.

"ముద్దుమొగమున పెదవిపై దిద్దినట్లు
చిర్నగవు నవ్వు ; మదిచాలు ; సృష్టియెల్ల
వంగి, నీపదయుగళికి వ్రాలి మ్రొక్క !"

# ఓయి మిత్రమ !

కొమఱ్ఱాజు వినాయకరావుగారు

ఓయిమిత్రమ ! నాతోడ హాయిమీర
సరససంభాషణమ్మాడ సలుపవేని—
ఏను భవదీయమానమ్ముతోనె నించి
కొందును మదీయహృద్పాత్ర కొరతదీర.
ఏను గాఢమానమ్మునేబూని సతము
విసుగులేకయ,తలవంచి వినయవృత్తి
వేచియుందు, ప్రశాంతముతో, చెలంగు
రెప్పవాల్పనిచుక్కల రేయివలెనె.
రాకయుండునె యేనాడొరాక మున్నె ?
ఆ—మహాయుషఃకాలోదయమ్ము ! అంత
పర్వియుండెడి చీకట్లు పారిపోవె ?
అంత మిత్రమ ! నీదుగళాంతికంపు
టాకసమ్మును జీల్చి వేయడు లేక
నీమధురవాక్సుధారస హేమధార
భూతలంబున ప్రవహింపబోకయున్నె ?
ఈవనమ్మున నాతోన నెపుడు మనెడు
పక్షిగూండులలోనుండి పవనుఁగూడి
పరువులెత్తు తీయని తెల్గుపాటలందు
లలన ! నీగానరవములే యాలకింతు ?
అంత మిత్రమ! నీదుగళాంతికంపు
రాగమాధురీలహరీతరంగసంఘ
బుద్బుదమ్ములు, యౌవనభూములందు
అలరు పొదరిండ్లు, నరవిచ్చుయలరుబోండ్ల
తడిపివైచును; అంతపూతలిరుబోండ్లు
వికచనేత్రలగుచు పసపెంపులీను
[illegible] స్తోత్యములరమింత్రు,

# ప్రకృతి

**చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు**

మాధవుడు విద్యార్థికుడు, కాని లోకమెరుంగని అమాయకుడు. ప్రేమ యననేమో అతడెరుంగడు. జ్యోతి మాధవున కొకఆటవస్తువు. ఆమె సౌందర్యమును గాంచి సంతోషింపవలసినవిధ మాతడెరుంగడు. ప్రణయ సుధాకరునిపై అజ్ఞానజీమూతము లల్లుకొనియున్నవి.

గ్రంథమును వదలి ఆతడశోకవనమున కేగెను. కన్నులార ప్రకృతిని గాంచ దొడగెను.—కమ్మపుప్పొడి కనుల కడ్డుపడుటచే, వకుళవృక్షమని భ్రమసి, మధుపరాజు సంపెంగదరిజేరి సిగ్గుపడి, కలువకన్నెల వైపునకు మరలి వచ్చుచుండెను. అస్తమింపనున్న ప్రియుని అరమోడ్పుకనులతో జూచుచు, తుదిని తలవంచి కమలములు కన్నుమూసెను—మాధవుడు జాగరూకతతో పరిశీలించుచున్నాడు—చిరునవ్వుతో పైకెగప్రాకుచున్న నెలబాలునిగాంచి, కలువకన్నె కన్నువిప్పికలకలనవ్వినది.—మాధవునిహృదయమునం దలజడి ప్రారంభమైనది. అత డొకజాజిపువ్వును కోసికొనదలచినాడు; ఒకే తొడిమ గలిగియున్న పువ్వులజంటపై చేయిపడినది.—సంశయించి చేయితీసినాడు.

అల్లుకొని, పెనవైచుకొని యున్న రెండు తీగెలాతనికంటబడినవి— చిరునగవు పెదవిపై చిందులాడినది. సమీపమున తోటకాపరి పెనవైచు కొనియున్న తీగెలను వేరుపరచి విడివిడిగ నాటుచున్నాడు—వేడినిట్టూర్పు వెడలినది. తలవంచి నవ్వుచున్న యొకపువ్వునుండి తేనెతుంపురులు మెల మెల్లగా క్రిందనున్న పండుటాకుపై బడుచున్నవి; అచట గుమికూడియున్న చీమలను గాంచినాడు; తృప్తిచెందినాడు. ఒకపెద్దమ్రాకున కెగప్రాకుచున్న లేతతీగెను గాంచినాడు, ముచ్చటపడి ముద్దిడినాడు. ఆకులమరుగుననున్న చిగురుటాకులను, పువ్వులచాటుననున్న మొగ్గలను, పండ్లచాటుననున్న పిందెలనుగాంచి సంతోషించినాడు–తుదిని–దుఃఖించినాడు. రాలిపడుచున్న పండుటాకును, నవ్వుచున్న చిగురుటాకును గాంచినాడు. తనలో తాను నవ్వు కొన్నాడు.

జ్యోతి మాధవున కిపుడాఅవప్రాణము. అతనిహృదయము ప్రేమమక రందముతో నిండిపోయినది; కష్టసుఖములతో కలసిపోయినది.—తుచ్ఛు లగు మానవులు తమకు తెలిసినవిషయముల నొరుల కెరిగింపరు. ప్రకృతి మాత తన్నునమ్మినవాని కెల్లవిధములతోడ్పడును. పుస్తకముకన్న ప్రకృ తియే జ్ఞానాభివృద్ధి నతిశయింపజేయును.

## ప్రేయసీ!

**తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు**

'ప్రేయసీ! ప్రేమరసభూయిష్టములైన దృక్పరంపరలను ఒకమారు ప్రసరింపచేయు' మని మెల్లిగాఅడిగేడు. నేను చూచుచూ ఆతనివంకజూచి 'వెళ్ల' మన్నాను. కాని అతడు కదలలేదు. నాదగ్గిరకు వచ్చి నిలుచున్నాడు. మిక్కిలి ఆదరణతోను, అనునయ వాక్యాలతోను, కోమలమైన నాపాణిద్వయాన్ని పట్టుకున్నపుడు తీవ్రంగా అతనికేసి చూచి, కోపంతో 'వదలు' మన్నాను. అతడు నామాటలు సరకుచెయ్యలేదు. దేదీప్యమానంగా ప్రకాశిస్తూన్న ఆతని ముఖబింబాన్ని నాకర్ణములనద్దకు తీసికొనివచ్చేడు. 'సిగ్గువేయడంలేదా?' అన్నాను. అతడు మాట్లాడలేదు. మృదులమై, అరుణరాగరంజితమైన ఆతని అధరోష్ఠము నాకపోలములను స్పృశించెను. వెంటనే నాశరీరమంతా కంపించిపోయినది. అపుడునేను 'ఇది సాహసంసుమా!' అన్నాను. అతడేమీ ఉద్వేగం పొందలేదు. అట్లాగే చలించకుండా నిలుచున్నాడు. నవవికసితసుగంధసమ్మిళిత ప్రసూనాన్ని నాశిరోపరిభాగంలో అలంకరించేడు. నాగళసీమయందు ప్రకాశిస్తూన్న కుసుమావళిని పరిగ్రహించి వెళ్లిపోయినాడు. మనోవీధిలో ప్రవహిస్తూ ఉండే బాష్పవాహినులను అరికట్టి విషాదపూరితమైనహృదయాన్ని 'ఆతడు తిరిగి రాడేమి?' అని ప్రశ్నించేను.

—రవీంద్రుని 'తోటమాలి' నుండి.

## ఊహాపథి

**శ్రీ. శ్రీనివాసరావుగారు**

నే నిపు డీవిధాన పయనించెదనంతట ధారుణీహృదీ
మానరహోవకుంఠనము మాటికిమాటి కెడల్చుచున్ ప్రశాం
తానిలముల్ మహోజ్జ్వలయి స్వాగతగీతికలై ప్రబోధవి
జ్ఞానగళాంకవిస్ఫురితశంఖనినాదములై ధ్వనించెడున్.
మంజుల మానినీశిథిలసుకుమారవిలాసము! చంద్రికారజః
పుంజమునందడంగిన తమోనివహమ్ములు మట్పదీధను
శ్శింజితముల్ చెవిన్ చొర కృశించెడు శైశిరకాందిశీకుశే
ఖంజనిమెన్ తమాలములు క్రమ్మినతావుల దాగిపోవగన్.
నేనే ఈనిశనై మదీయరసనానిష్పన్నముల్ గానవీ
ణానాట్యమ్ములుగాగ ఈమృదులచంద్రజ్యోత్స్నలై మామక
ప్రాణాధారము లాశయద్యుతులె తారాకోరకాలైన వే
లానంతాంబుధులందు చేయనో ప్రవాళద్వీపనిర్మాణముల్.
ఇది కవితాసతీవికసితేచ్ఛపరీమళమొల్కు వేళ! శా
రదనవకౌముదీతరుణరాసకళానవలనమ్ము లాడు న
భ్యుదయపదమ్ము! విశ్వవిభు డూయెలనూగగ రేగు నీపువుల్
హృదయముకగ్గలైనా పలుకరింపుడు పాటలుపాడురాతిరిన్.

# స్త్రీలు : క్షయరోగము

శ్రీమతి పరుచూరు భువనేశ్వరీ దేవిగారు

నారీసమాజముయొక్క ఆరోగ్యమును దర్శించునటువంటి ధీమంతుల ధ్యానమధికముగా వారియందు క్షయరోగాతిశయమునకుగల కారణముల వైపున కాకర్షింపబడుచున్నది. అధునాతనమున వనితలలోపైన చెప్పిన రుగ్మత ఎందుకు వ్యాపించుచున్నది? ఏడెనిమిదివత్సరముల పర్యంతము చికిత్సాప్రయత్నము చేయుటకు క్షయరోగమున్న అనేకకాంతల సందర్శనముచేత వారిలో క్షయాతిశయమునకుగల కారణములు లెస్సగ విచారించి ఇచట తెలుపుచున్నాను.

మహిళామండలిలో క్షయఅతిశయించుటకు కిది ప్రథమహేతువు : జన్మించినతదుపరి స్త్రీపురుషుల యొక్క భోజనాచరణధారణాదులందు అధికభేదము ఉండుట. జననీజనకులు-ఇతరసంరక్షకులు ఈచెడ్డనడవడి ననుసరించుటచేతనే మగబిడ్డలయొక్క దేహము వికాసముగాను బలయుతముగాను ఉండుచున్నది. గోస్వరూపిణులైన రమణీమణులయొక్క శరీరములు క్రమేణక్షీణించుచున్నవి. మాతాపితలు-ఇతరసంరక్షకులు బాలికలశరీరసంరక్షణాదులయందు ఉదాసీనత వహించుచున్నారు. బాలికల సంరక్షణవిషయమై సమాజము వ్యర్థ విచారణచేయుచున్నది. "అర్థోహికన్యాపరకీయఏవ"యను సూక్తినిస్మరించి 'ఈబాలిక మనసొత్తుగాదు. ఇతరులసొత్తు. కొద్దికాలమునకే మనగృహమునుండి ఇతరులగృహమునకు వెళ్లిపోవును. మనకీబాలికవలన ప్రయోజనమేమి? మనము దీనికి వివాహముచేయవలయును. వివాహసమయములో ధనవ్యయమగును' అని తలంచి మగపిల్లలతోపాటుగ ఆడపిల్లలను పోషించుటవలన లాభములేదనియూహించి మగబిడ్డలకంటె హీనముగ ఆడబిడ్డలను పోషించుచుందురు. ధనముకొద్దీ విలువకొద్దీ సద్వస్తువులభించునను లోకోక్తిప్రకారము దీనికీపరిణామముకలుగుచున్నది. వనితలు పురుషులకంటె ప్రతివిషయమునందును వెనుకకునెట్టబడుచున్నారు. వారిశరీరవికాసము నానాటికి క్షీణించుచున్నది. ఈవిధముగ ఆరంభమునుండియు స్త్రీపురుషులపోషణలో భేదభావముండుటవలన వనితలలో క్షయరోగబీజములు సులభముగ నాటబడుచున్నవి. ఈదోషమును పారద్రోలుట అనుభారము దేశమాతలగు వనితలపైని, పితలగు పురుషులపైని మోపబడియున్నది. పురుషులు స్వీయపుత్రులను పుత్రికలను సమానదృష్టితోదర్శించుచు, పోషణలో సమానత్వమును వహించియున్నట్లయితే కన్యావర్గమభివృద్ధిజెందును. అందుచే స్త్రీలు బలయుతలై రోగదేవతకు సులభముగదానురాంద్రుకారు.

నారీసమాజములో క్షయప్రబలుటకు ద్వితీయహేతువు మహాపిశాచస్వరూపమగు బాల్యవివాహము. బాల్యవివాహముల మూలమున బాలికలకు శరీరాభివృద్ధి, అంగసౌష్టవము కలుగుటకుపూర్వమే అవినష్టపడుచున్నవి. శరీరశాస్త్రజ్ఞుల కథనమేమన- కన్యకు మాసికధర్మము కలుగునప్పటినుంచి వత్సరత్రయమువరకు మాసికధర్మము నవలంబించుచు, మాసికధర్మముయొక్క శక్తిహీనతశుద్ధమగువరకు గర్భాశయాదులు అంగసౌష్టవము పూర్ణమగువరకు సరిగాప్రతిమాసమునకు తదుపరి ఋతుమతియగుచు మరియు పూర్ణయువతీలక్షణము ప్రకటనములగువరకు వేచియుండి ఆనారికి అప్పుడు గర్భాదానసంస్కారముచేయుట ఉచితమని. అదియు కేవలము సంతానాపేక్షనిమిత్తమే యైయుండవలయును. కాని బాల్యవివాహదేవతయొక్క కారుణ్యముచే దీనికి బొత్తుగా వ్యత్యస్తమే జరుగుచున్నది. అజ్ఞానలగు బాలికలుగృహస్థధర్మములను గురుతించుటలేదు. యౌవనము ప్రాప్తించుటలేదు. మాసికధర్మము ప్రారంభమగుటలేదు. ఆటలు ఆడుకొను పాటలుపాడుకొనుస్థితిలో శారీరకమానసికవికాసముప్రారంభమగుసమయములో సంసారకారాగారమున బంధింపబడుచున్నారు. అందుచేత వనితలకు సర్వవిధముల ఔన్నత్యమునకు చేటుమూడుచున్నది. దీనికి దుష్పరిణామము యిది : పదునొకండుపండ్రెండువత్సరములకే బాలికలు తల్లులగుచున్నారు. ఎప్పుడైతే వీరు మాతలఅంకములో ఆడుకొనవలసినసమయముననే అవివేకులగు పతుల యవివేకముచేత స్వీయామూల్యారోగ్యమును, దైవప్రదత్తమగు

స్త్రీత్వమును గోల్పోవుచున్నారో అప్పుడే మనకట్టెదుట యుప్పట్టున కన్పట్టుచున్న భయంకరపరిణామము ప్రారంభమగుచున్నది. ఇప్పుడు దేశములోని యువతులు వృద్ధవనితలు సమానముగానున్నారు. మరియు ఘోరమగు కఠినమగు అసాధ్యమగుకాసను (దగ్గు), జ్వార్తి(జ్వరము), రక్తప్రదరము(ఒకస్త్రీరోగవిశేషము), సోమరక్తార్శ, గ్రహణి, క్షయ మొదలగు రోగములయొక్క చేతిలోచిక్కుకొనుచున్నారు. పూర్వోక్తరోగములు స్త్రీసంఘమున ప్రబలములుగానున్నవి. నూటికొకభాగ్యవతి అక్కడక్కడ చెదరుపాటుగ వీటినుండి రక్షింపబడియుండుచున్నది. ఈరీతిగ అసాధ్యరోగములు స్త్రీసముదాయమును జీర్ణింపజేసి ప్రళయదృశ్యమును దర్శింపచేయుచున్నవి. దీనిలో అతిశయోక్తిలేదు. పూర్వోక్తరోగములెన్నియున్నవో అవన్నియు దేహమున జీర్ణించి క్షయాకారమును దాల్చుచున్నవి. ఏవ్యాధిదేహమునందు దీర్ఘకాలముండి శరీరధాతువులను (రస, రక్త, మాంస, మేద, అస్థి, వస, శుక్ర, ఆర్తవ) నాశనముచేయునో దానిపేరే క్షయ. శరీరావయవాభివృద్ధి కలుగుటలేదు. పాపము? అమాయికలైన బాలికలను కాలమనెడి కారాగారములో బంధించుచున్నారు. వారికి భర్తలగు మహాశయులు కామశాస్త్రమునుండి సర్వథాఅజ్ఞానులగుచున్నారు. విషయభోగములలో నిమగ్నులగుటయే వారిజీవనసాఫల్యమని తలంచి సత్యానందమును పొందుచున్నామని మదినూహించి తమధర్మదారలైన కన్యలదేహములను నాశనముజేయుచున్నారు. అత్యంతసంయోగహేతువుచే ఎప్పుడైతే సోమరక్తార్శ, రక్తప్రదరప్రముఖరోగములు కలుగుచున్నవో అప్పుడు ఉభయధా శరీరమునకు ధాతుక్షీణతకలుగుచున్నది. అట్టి అవస్థలో సంతానముప్రాప్తించిన నాశిశుపోషణలో నధికపరిశ్రమ తీసికొనవలసివచ్చుచున్నది మరియు స్తన్యప్రదానమున శరీరపుష్టిగూడ తగ్గుచున్నది. ఇదిక్షయప్రారంభమునకు కారణమగుచున్నది. ఈ ప్రకారముగా ఎవరికి నలువిధములనుండి శరీరములకు క్షయాదిరోగములుకలుగుచున్నవో వారుయేవో అసాధ్యరోగములకువశులై దీర్ఘకాలము రోగగ్రస్తలై అనేకవిధములగు కష్టములనుభవించుచున్నారు. మరియు ఆకాలములోనే కాలమృత్యువునకు చల్గులై యిహలీలలను పరిసమాప్తిచేయుచున్నారు. దేశశుభచింతకులైనవారికి స్త్రీసమాజమును ఆరోగ్యవంతముగా నొనరించుట ప్రప్రథమకర్తవ్యము. బాల్యవివాహముయొక్క మూలమును ఛేదించి పూర్ణయౌవనసంప్రాప్తమగునంతవరకు కన్యలకు పరిణయపువిషయమును తలపెట్టకుందురుగాక! శరీరమునకు అవయవములకు పూర్ణత్వము- దృఢత్వముసిద్ధించిన మీదటనే గర్భాధానసంస్కారము చేయుట కలుగుసంతానమునకును మాతలకును మంచిది. ఈవిధానమవలంబింతుమేని స్త్రీలు సులభముగ క్షయాదిరోగములకు బలికారు.

స్త్రీలలో క్షయరోగోత్పత్తికి తృతీయకారణము పరదా. ఘోషాదురాచారముచే మహిళామండలియొక్క ఆరోగ్యము నాశనమగుచున్నది. రాక్షసాచారమగు ఘోషా లలనల యారోగ్యమునకెంత కీడును కలిగించుచున్నదో అంతకీడు మరేదియుకలిగించుటలేదు. పదిసంవత్సరముల వయస్సుగల కన్యలమొదలుకొని ఏబదిఅరువది సంవత్సరములస్త్రీలవరకు సమానముగా ఘోషాక్రమణముచేత బంధింపబడుచున్నారు. నవయువతీస్నుషలకు ఘోషా మహాపాశమైయున్నది. శుద్ధవాయు, వ్యాయామ, భ్రమణ, సభా,సమితి, సార్వజనికోత్సవప్రవేశవిషయములయందు వీరు సర్వథా లోభముచేత వంచితులగుచున్నారు. ప్రతిసమయమున నగరములమధ్య దుర్వాసనావాసితములగు వీథులయందు పతితప్రాకారకుడ్యములగు నికేతనములలోను, తడికలలోను, మరుగుగల దొడ్లలోను, ప్రఘాణములలోను, అర్ధగజముపొడువు అవకుంఠనమునుధరించి గ్రీవమునువంచుకొనిఆసీనురాలు కావలసివచ్చుచున్నది. ఇట్టిస్థితిలో వారిదేహమునకు హానికలుగకయెట్లుండును? శుద్ధవాయువులభించకపోవుటవలన రక్తవికృతియేర్పడుచున్నది. వ్యాయామరాహిత్యమువలన శరీరముయొక్క పుష్టితగ్గిపోవుచున్నది.

మెడనువంచుకొని గూర్చుండుటవలన రక్తనాళములు దుర్బలములగుచున్నవి. సదా అవకుంఠమునందే శ్వాస తీసికొనుచుండుటచేత లోనినుండివెలువడివచ్చిన అశుద్ధవాయువును పీల్చవలసివచ్చుచున్నది. అందుచేత హృదయమునకు, అంగములకు దౌర్బల్యమేర్పడి లెస్సగపనిచేయుట తటస్థించుటలేదు. సంచరణరాహిత్యమువలన రక్తసంచారము సరిగానుండుటలేదు. జీర్ణశక్తినశించుచున్నది. అందుచేత అపవిత్రపరిమాణువు మస్తిష్కమున కెక్కి ఉన్మాదము ఉద్భవించుచున్నది. మృగి (రోగవిశేషము) మొదలగు రోగములయుత్పత్తికలుగుచున్నది. పూర్వోక్తములగు సమస్తహేతువులచేత శరీరములో అనేకవ్యత్యస్తములు సంభవించి భయంకరములైన ప్రాణనాశనకరములైనక్షయాదిరోగములు ఉత్పత్తియగుచున్నవి. ఇంతేకాక ప్రతిసమయమున పరదాలోనుండుటవలన, అంధకారబంధురములగు మందిరములనుండుటవలన జ్ఞానోపదేశమునందుటకు గూడ ఆటంకము కలుగుచున్నది. ఆ ఆటంకమువలన, కారాగారబంధనమువలన ప్రస్తుతము స్త్రీసముదాయము పశుసమానముగనున్నది. ప్రతివిషయమునందును పరాశ్రయలగుటచే ఏతత్స్థితిసంభవించుచున్నది. ఘోషాఅనుగోడను మూలమట్టముజేసి పురుషులమాడ్కి అబలలకుగూడ జ్ఞానోపదేశప్రాప్తికి అన్నివిధముల అవకాశమిచ్చిన నారీసమాజమౌన్నత్యముజెందును. దేశమాతకు కల్యాణము సంప్రాప్తించును. పురుషుల శీర్షమునందు పత్నులయొక్క యేభారమున్నదో నదియుతగ్గిపోవును. స్త్రీరూపవిహంగమును పంజరమునుండి యెప్పుడుబయటికి విడుచుట లభించునో అప్పుడేవారికి అనేకవిధములైన సామాజిక, ఆర్థిక, సాంసారిక, వైజ్ఞానిక, వైదేశిక విజ్ఞానము బోధపడుటకు విశేషావకాశముండును. దీనిద్వారా వారికి సాహసము, కార్యకారణశక్తి, విశేషజ్ఞత మరియు స్వేచ్ఛ లభించుటవలన తమనురక్షించుకొనుటకు అనువగుశక్తి గలుగుచున్నది.

స్త్రీలలో క్షయరోగాభివృద్ధికి నాల్గవకారణము వారిభోజనవిధానము. ఏప్రకారముగా బాల్యావస్థలో మాతాపితలద్వారా బాలికాబాలకులకు భోజనవిషయమున భేదముండునో అదే ప్రకారము ఆగర్భశ్రీమంతుని మొదలుకొని ఆగర్భదరిద్రునివరకు సంసారసంబంధములలో స్త్రీపురుషులభోజనవిషయమున భేదముండుచున్నది. సాంసారికులగృహములలో ఒకసాధారణనియమమున్నది. పురుషులు బయటనుండి ఎన్నిఉత్తమములైన, బలిష్ఠకరములైన తినుబండపదార్థముల తెచ్చుచున్నారో వాటినన్నిటిని వారు (ఆగృహస్థులతల్లులు- సోదరీలు- భార్యలు) పురుషులకేపెట్టుచున్నారు. నిత్యము భోజనపచనాదులందుసైతము ఇదేవిధముగా జరుగుచున్నది. సత్గృహస్థుల గృహములలో పురుషులకంటె ముందుగా పత్నులు భుజింపరు. పురుషుడు విహారమొనరించి బయటినుండి ఏతెంచుచున్నాడు. పైనశ్రేష్ఠములైన పుష్టికరములైన పదార్థములతో పచనముచేసిన భోజనమును ఆరగించుచున్నాడు. పిమ్మట విశ్రాంత్యర్థమై సుందరమందిరమునకేగి పాన్పుపైపవళించుచున్నాడు. తదుపరిస్త్రీలు మిగిలియున్న చల్దిబొల్దికూడును గుడిచి తమపొట్టనింపుకొనుచున్నారు. పురుషమహానుభావులు "స్త్రీలేమితినుచున్నారు? స్త్రీలేమితినుటలేదు?" అను విషయమును గురుతించుటలేదు. సాధారణగృహములలో స్త్రీలు మాడుమక్కుడు చల్దిబొల్దికూడుతోనే స్వీయజీవితములను గడుపుచున్నారు. దీనికి ప్రథమహేతువు వనితల శిక్షారాహిత్యమే. ఆ కారణముచేత స్త్రీలు అజ్ఞానులగు తమపురుషులను సుజ్ఞానులని మదినివిశ్వసించి తమ జీవనమును నిరర్థకముగా వ్యర్థము నొనరించుకొనుచు స్వీయశరీరముల బాగునుగోరుటలేదు. దీనికితోడు పురుషుల అలక్ష్యము, స్వార్థపరత్వము, మిథ్యాభిమానము. మిథ్యాభిమానముచేతనే మనవారు తమను మహాధీమంతులనుగా తలంచుకొనుచున్నారు. వనితలభోజనాదివిషయముల లక్ష్యమునునుంచుటలేదు. తమపొట్టనిండిన తదుపరి ఇదిజ్ఞాపకమునకువచ్చుటలేదు. నిస్సారమైన అనర్హమైన చల్దిమాడుమక్కుడుకూడును పరిమితిలేక అసయములయందు అలక్ష్యముతోతినుటవలన స్త్రీలలో క్షయరోగము వృద్ధియగుచున్నదని వచింపవచ్చును. ఆయుర్వేదశాస్త్రజ్ఞులసిద్ధాంతము ననుసరించి భోజనము మానవులకు

జీవనాధారమని తెలియుచున్నది. పైనచెప్పినదోషములచే కలుషితమగు భోజనమును భుజించినయెడల భోక్తలవశ్యము క్షయరోగమును పొందెదరు. ఈదోషమును పారద్రోలుటకు ప్రతిగృహస్థుడును తమతమధర్మదార భోజనవిషయముల సదాదృష్టినుంచవలయును. ఎప్పుడైనను రుచికరమగు పదార్థము గృహమునకు వచ్చినట్లయినచో దానిని యజమాని స్వీయహస్తముతో విభాగించి కుటుంబమునందలి స్త్రీపురుషులకు సమానముగా నిచ్చుగాక! నిత్యమాచరింపబడు పచనాదులందుగూడ పురుషప్రవరులు ధ్యానముంచుదురుగాక! స్త్రీలు పురుషులతోపాటు అన్ని పదార్థముల తినుచుందురుగాక! మరియు క్షీరాదులనుసైతము విరివిగ చేకొందురుగాక! ఇట్టి నియమముల చేత వారిశరీరములు పుష్టివంతములుగాను, శక్తివంతములుగాను, ఆరోగ్యవంతములుగానుఉండును.

స్త్రీలలో క్షయరోగోత్పత్తికి పంచమహేతువు ఆయుర్వేదవిజ్ఞానవిహీనతయే. వనితలు చికిత్సాజ్ఞానవిహీనతచేత తమశరీరసంరక్షణాదులయందు బద్ధశ్రద్ధలు, దత్తచిత్తలుఅగుటలేదు. దుఃఖమేమన ప్రస్తుతకాలమునందు పాఠశాలలందు బాలికలకు ఉపయోగవిహీనములగు విషయముల బోధించుచున్నారు. అందువలనవారు సర్వథా శరీరసంరక్షణవిజ్ఞానవిహీనతచే వంచితులగుచున్నారు. అశిక్షితలైన సాధారణవనితలు ఆరోగ్యవిహీనలై నాశనము చెందుచున్నారు. శిక్షారాహిత్యకారణముచేత ఉన్నతవిద్యనుపొందిన నారీమణులుగూడ తమ కొంగుబంగారమును గేలిచేయు పీతకాంతికాంతములగు పూర్ణచంద్రజ్యోత్స్నసమాన హృదయాహ్లాదకరములగు ఆననములను కళంకములుగాను, రోగగ్రస్తములుగాను ఒనరించుకొనుటను మనము కనుచున్నాము. భారతీయవనితలలో అస్వస్థతయేర్పడుటకు ముఖ్యకారణము జ్ఞానవిహీనతయే. శరీరశాస్త్రవిజ్ఞానవిహీనతచే మనవనిత లీవిషయమునుగూడ గురుతించలేకున్నారు. 'శరీరముయొక్క ఏఅంగము లెంతవరకు ఉపయోగములు? వాని నేవిధముగ సంరక్షించుకొనవలయును? ఎందుచేత ఇట్టి హీనస్థితిసంభవించుచున్నది? ఒక సమయమున ఏదైన ఒకరోగము సంభవించినట్లయితే తద్రోగనిదానార్థమేయుపాయము చేయవలయును? ఉపాయముచేయనియెడల దీనివలనెంత భయంకరావస్థయుద్భవించుచున్నది?' పూర్వోక్తమైన జ్ఞానరాహిత్యముచేత స్త్రీలు మిథ్యాహారవిహారముల నొనరించుచున్నారు. మరియు తద్దోషముచేతనే దేహమునందనేకరోగములుపుట్టుచున్నవి. కానివారు శరీరయంత్రవిషయమై బాగోగులను తెలిసికొనుటలేదు. ఏతత్కారణముచేత కష్టఫలమనుభవింపబడుచున్నది. వారియొక్క దేహములు రోగములకు ఆకరములగుచున్నవి. కాని ఏతద్విషయమును లేశముగనైనను ఆలోచించుటలేదు. లేమలకు సంభవించురోగములు భయంకరపరిణామమును పొందుటకు వారియజ్ఞానమేకారణము. సాధారణరోగములను స్త్రీలిల్లుకొంచముగనైనను లక్ష్యపెట్టుటలేదు. ఎప్పుడారోగము శరీరావయవములందు సర్వత్రవ్యాపించి శరీరమును నాశనముచేయునో అప్పుడు నిప్పంటుకొన్న మీదట నీళ్లకొరకు నేలనుత్రవ్వినట్లు అఖిలోద్యమములు నిష్ఫలములు అగుచున్నవి. రోగశక్తిని అతిశయింపజేయుట మహానష్టదాయకమగుచున్నది. రోగప్రారంభసమయముననే ఉపాయముచేత (ఔషధముచేత) తన్నివారణమొనరించిన రోగమునశించుచున్నది. కాని విపరీతమేమన అది విశేషకాలము కాయమున నివశించుటచేత శరీరధాతువులలో ప్రవేశించి క్షయరూపమును ధరించుచున్నది. ప్రస్తుతసమయమున నారీసమాజమున క్షయాభివృద్ధికి ఇదియేకారణము. ఈదోషమును నాశనమొనరించుటకు ఈయుపాయమే కన్పట్టుచున్నది. దేశమునందలి స్త్రీశిక్షాసంస్థలలో శిక్షితలగు వనితలకు ఒకసంవత్సరమువరకు ఆయుర్వేదమును మరియు డాక్టరుల మతానుసారముగా ఆరోగ్యముయొక్క సాధారణనియమజ్ఞానము లభించుటకు నియమముగా ఆవిషయములను బోధించుచుండవలయును. పురుషుల ఆరోగ్యమునకంటె లేమల ఆరోగ్యము హీనముగానున్నది. అందువలన పురుషులకంటె అధికముగా స్త్రీలలో పరమావశ్యకమగు ఆయుర్వేదవిజ్ఞానము అత్యవసరమైయున్నది. దేశమునందలి సోదరీమణు లెంతవరకు ఆరోగ్యముయొక్క సాధారణ నియమములను గురుతించలేరో అంతవరకు సుస్థితినిపొందజాలరు. నారీసమాజమున ఎంతవరకు క్షయరూపమును దాల్చిన వేరుపురుగునివసించునో అంతవరకు దేశము శక్తినిబడయజాలదు. దేశశ్రేయోభిలాషులదృష్టి ఈప్రక్కకు ఆకర్షింపబడును గాక!

—హాక్మదేవి చ్ఛాబ్రాగారి హిందీవ్యాసమునకనువాదము.







# శ్రీ గాంధిస్తవము

కేసరి సుందరరామశర్మగారు

శ్లో. గాంధిదేవ నమస్తుభ్యం
ప్రసీదమమమంగళం
శాంతిదూత నమస్తుభ్యం
గాంధిదేవ నమోస్తుతే.

శ్లో. నమస్తే పురుషాధ్యక్ష
నమస్తే హైందవప్రియ
నమస్తేస్తుసదానంద
గాంధిదేవనమోస్తుతే.



శ్లో. స్వరాజ్యరథమారూఢం
సర్వలోకపితామహం
సర్వపాపహరందేవం
తంగాంధిం ప్రణమామ్యహం.



శ్లో. తంగాంధిం లోకకర్తారం
మహాతేజః ప్రదీపనం
దారిద్ర్యధ్వంసనందేవం
తంగాంధిం ప్రణమామ్యహం.





# స్త్రీ స్తవము

మహమ్మద్ ఖైరాత్ హుసేన్ గారు

శిష్యుఁడు

ఓగురువర్యా! ప్రపంచమున నెల్లప్రాణులలో స్త్రీవర్గమును ఒకఁడుకీర్తించును. మఱి యొకఁడు వారిదుర్గుణములవర్ణించును. ఇంకొకఁడు సర్వప్రపంచైశ్వర్యములను వారియందే గాంచును. మఱియొక్కొక్కఁడు అయోగ్యమైనదనియు, మాయామోహబంధరూపమనియు తలంచుచున్నాఁడు. కావున నోప్రభూ! వారియందెట్టియాధిక్యతయున్నదో నేడీప్రసంగమున స్పష్టపఱతురని వేఁడుచున్నాను.

గురువు

ఓశిష్యా! సావధానుండవై వినుము. స్త్రీ ఆదిశక్తియగు జగన్మాతయందొకయంశమును, భగవతీప్రతిబింబమును, సంతానరూపమున విశ్వముఁను సృష్టించునదియునై యున్నది. కావున ఆమెజగజ్జనని. నేనామెకు కోటికోటిప్రణామములు జేయుచున్నాను. పృథ్వియందావిర్భవించిన ఋషులు, మునులు, అవతారములు, మహాత్ములు, మహాపురుషులు మొదలగువారందఱు స్త్రీయొక్కపవిత్రక్రోడమునఁ గ్రీడించినవారే. మఱియామెవలననే పెరిగిపెద్దవారై పృథ్వినలంకరించిరి. కాబట్టి సర్వశ్రేష్ఠురాలయిన ఆమెకు నాసాష్టాంగనమస్కారములు. ఆమె పరమకల్యాణమయియు, ప్రేమావతారమును, సుకుమారవతియు, శాంతియుతమగుసౌందర్యరాశియు, ప్రతిభావంతమగుసౌశీల్యవతియునై యున్నది. క్షమయో? ఆమెకు సర్వసామాన్యస్వాభావికమేను. ప్రాణిమాత్రులను ఆమె ప్రేమించుటయే ఎఱుంగును. కావుననే అనిర్దోషస్త్రీసమూహము ధన్యమైనది. గేస్తురాండ్రయందు బుద్ధిమతులు, గృహలక్ష్ములు; రాజనీతియందు విదుషీమణులు, శాంతిసంస్థాపకులు, సలహానిచ్చెడివారు; విపత్కాలమునందు శుశ్రూషాతత్పరలు; సన్న్యాసమునం దేకాంతతపోనిష్ఠలు, నిశ్చలబ్రహ్మచారిణులు. కావున నీభిన్నభిన్నప్రాముఖ్యముల నిర్వహించునారీమణుల కేనుసాదరపూర్వకముగా వందనములర్పింతును. బాలునికి మాతృరూపమున కేవలముఅన్నపూర్ణ, పరమస్నేహమయి యగుజనని. సోదరునికై భగినీరూపమున అకలుషస్నేహవర్షాశ్రువులరాల్పు స్నేహమూర్తి. పత్నీరూపమున పతికమితానందసౌఖ్యములఁ గూర్చునది. కన్యారూపమున తండ్రికి నిస్పృహనిష్కపటస్వభావయగు సేవకురాలు. మఱియు పతికి అర్ధాంగి, పరమపతివ్రత, సేవామయియైయున్నది. భక్తిభావములతో మెలంగునది. ఇట్లీవివిధగుణగణముల కాలవాలంబగు నీయువతులెల్ల రీప్రపంచమున ధన్యురాండ్రు. విభునికి వెలంది భోజనకాలమున మాతృదేవియు, గృహకార్యాలోచనములయందు మంత్రియు, శయ్యాస్థలములందుపత్నియు, సేవయందు దాసియునై పరగుచుండు. ఇట్లొకటియయ్యు ననేకగుణములవర్తించుచున్నదామె. ఆమె నెట్లుప్రశంసింతును? విదుషీమణియగు మహిళ సాక్షాద్వాణి. సిరియందులక్ష్మి. ఎల్లరకల్యాణమును గోరుటలో మహేశ్వరి. దీన

దుఃఖితుల ప్రేమించుటలోను, దానమొసగుటలోను పరమకల్యాణమూర్తియగు అన్న పూర్ణ. ఈకారణమున సర్వశక్తిమయియగు స్త్రీప్రపంచమున కేను శిరమును వంచుచున్నాను. మూర్ఖులకు స్త్రీ మాయావిని; దుష్టులకు దుష్టదళనీరూపయగుభవాని; సతీత్వమున కవమానముఁగూర్చువానికి కేవలముమృత్యువు; అజ్ఞానులకును, మోహాంధులకును పవిత్రజ్ఞానోపదేశమొసగు పరమజ్ఞానమూర్తి; తనపరివారమునకును పూర్ణప్రపంచమునకును శుభముగోరునది. ఘోరాతిఘోరవిపత్తులయందును కర్తవ్యబుద్ధినుండి చలించునదికాదు. మేలెంతగాగోరునో, కీడట్లుకాదు. ఇచ్చుటెఱుగునుగాని పుచ్చుకొనుటెఱుంగదు. తనస్నేహంపువిలువయందు ప్రాణమును గోల్పోవుటయన తుచ్ఛముగా నెంచును. వివాహమాడుటకు అగ్నిహోత్రుడు సాక్షి. సహనశీలమున దివ్యమూర్తి. అత్యాచారముల నూరకసహించుకొనుటెఱుంగుఁగాని ప్రతిహింసల గోరుటెఱుగదు. దుర్మార్గులపైనను ప్రేమజూపుటెఱుంగును. ఉదాహరణమున కొకద్రౌపదినేరికొనుడు. సతీరూపమున వంద్యయగు దేవి మాతారూపమున ప్రపంచమునకును పూజనీయ. గురుజనులలో ఉచ్చపదవినధిష్ఠించునదిమాతయే. సన్యాసినీ, పవిత్రబ్రహ్మచారిణీరూపమున సాక్షాద్భైరవి. యోగినీరూపమున యోగమాయాదేవి. నాతులయందింకొకరూపమును గోచరించును. సంక్షిప్తముగాదానినిగూడ వివరింతునాలకింపుము. దుష్ట, కర్కశ, స్త్రీ కేవలము చండికయై గృహనాశనమొనరించునది. కుటుంబమునకు అశాంతినైనాప్రసాదించును. నిరంతరకలహప్రియ, కఠినభాషిణి, సమస్తసుగుణహీన, వాచాల, మిథ్యావాదిని, వ్యర్థారోహణముల నారోపించునది, ఒక్కమాటవిన్నదైనను తనవశముననుంపజాలనిది. అట్టిస్త్రీ తనపరివారమనగనెంత గ్రామములను రాష్ట్రములను సహితముచెండాడు సంహారికయు, అకల్యాణమూర్తియునగును. కులటయగుపొలతి మూర్తిమంతమగు పిశాచిని, పాపమునకు ప్రళయస్వరూప. ఇట్టియువతి విశ్వమునకైనను అశుభజ్వాలయే. అయినసీసంహారికాప్రళయస్వరూపనుగూడ సవినయముగ నమస్కరించుచున్నాను. ఓ ఆదిశక్తి! ఈరూపమున కేవలము ప్రాణిమాత్రులను రక్షించుచుండుము.

శిష్యుఁడు

ఓ గురూత్తమా! ఈప్రసంగమునాలకింప నాకపరిమితానందము కలిగినది. మొదటి స్త్రీస్వరూపమెంతపవిత్రమో, ఎంతసుందరమో కోమలమును సమస్తగుణసంపన్నమున అయి ఉన్నదో రెండవ స్త్రీస్వరూప మంతభయానకమును దుర్గుణపరిపూర్ణమును అయిఉన్నది. వాస్తవముగా స్త్రీఅద్భుతజీవి. ఈశ్వరసృష్టియందొకవస్తువిశేషము. నేనును స్త్రీలతేజోమయదివ్యస్వరూపములకు, పవిత్రమాతృస్వరూపులకు మనఃపూర్వకవందనము లాచరించుచున్నాను. మాతృస్వరూపకు జయ్, విశ్వమాతకు జయ్.

—హిందీనుండి అనువాదము.

# అత్తలు: కోడళ్లు

శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు

౧

[నాడు కార్తీకపూర్ణిమ. శివాలయమునకువెళ్లి వచ్చుజనుల సందడి యెక్కువగానున్నది. సాయంకాల మయిదుగంటలయినది. దేవాలయమునకు వెళ్లనుంకించుచున్న సీతమ్మ శృంగారించుకొని వీధిగుమ్మమువరకూ వచ్చి 'యేమేవు! తలుపుజాగ్రత్త' అంటూవెళ్లుతోంది. లోనినుంచి వచ్చిన 'అత్తయ్యా! నేనూ రావద్దూ'అను మాట లామె వినిపించుకోనట్లు వెళ్లిపోయింది. త్రోవలో కామాక్షమ్మ కనుపించింది సీతమ్మకి.]

కా:—వదినా! వచ్చేవా? కోడలేదీ?

సీ:—ఆ...వచ్చేను. యేమిచెప్పనమ్మా! చెప్పుకుంటేసిగ్గు. అది నాకోడలంటే దానిగొప్పకూడా పోతుంది. వస్తానన్నదికాని నేనేతీసుకురాలేదు. వినిపించుకోనట్లు చక్కావచ్చేను. నీకోడలేదీ?

కా:—నాకోడల్ని తీసుకురాలేదు. అదీ వస్తానంది యింటిపెండానుడైనావండకుండా. నాకు వళ్లు మండింది. నీవువస్తే నేను వెళ్లనన్నాను. ఆపట్టున వెనక్కుతగ్గింది. నీమనుమరాలినేనా చంకనేసుకు రాలేక పోయావా?

సీ:—అయ్యో: సరేలే. నేనెక్కడ తీసుకువస్తానో అని జ్వరమని వంకపెట్టి నిద్రకొట్టింది. నాతో పంపుతుందీ? దానికి పరువుతక్కువకాదూ? రోజల్లాసింగారించాలి, తను సింగారించుకోవాలి, తనతోటే తీసుకురావాలి. మూసివాయినపు ముత్తయిదువులావున్నాను. నాతోపంపితే నామోషీకాదూ?

కా:—ఇదేమి షోకులో వింతగావుంది. వదినా! చూడు: వాకిలివుండికూడా నీళ్లు పోసుకోడం, బట్ట విడవడం, తలదువ్వుకోడం, తాంబూలంవేసుకోడం, కచ్చేరినుంచి మొగుడువచ్చేసరికి గర్భాధానపు పెండ్లి కూతురులాగ గుమ్మములో నిలబడడం. ఆచారమన్నమాట అనేలేలేదుకదా.

సీ:—అయ్యోసంత! ఆచారమా? యేమిచెప్పమంటావు? నాకోడలు వాకిలుంటే పాలడబ్బా, సీసా, యేమిటో ధర్మపాత్రలు అన్నీ ముట్టుకుంటుంది. పోతపాలేకదూ? పాలివ్వడమా? యేమన్నానా?

కా:—యేదోలే ఒకపిల్లేనాపుట్టింది. నాకోడలుగొడ్డుకి అదీలేదు. ఇల్లు నిండుగానేనా వుంటుంది పిల్లలుంటే.

సీ:—చాలు. సౌడభ్యం. పిల్లలుకూడా యెందుకులే, పెంచడంచేత కాందే. ఆచదువుల్లోనూ, ఆసంగీతాల్లోనూ, ఆకవిత్వాల్లోనూ, ఆకుట్టుపనుల్లోనూ వున్నతెలివి యింటిపనిలోనూ, పిల్లల్ని పెంచడంలోనూ వుంటే బాగుండును.

కా:—ఏమి అల్లికలో, వదినా! వీళ్లఅల్లికలు తగలెయ్య. మాకోడలు యింటినిండా ఏనుగులూ, గుఱ్ఱాలు, సింహాలూ, చిలుకలూ, చెట్లులూ, పిట్టలూ-అన్నీవేసింది. యెందుకో, యేమిఅందమో నాకుతెలియదు.

సీ:—ఇంకోచిత్రమమ్మా! మాకోడలు నూలుకూడా వడుకుతుంది. యేమోనమ్మా మాకాలంలో శుభ్రముగా చుట్టుచంగాయి చీరెలుకట్టుకునేవాళ్లము. అంతేకాని రూపాయిచెల్లగా రూపాయి ఏకులుకొని సంసారం గుల్లచేసుకొని నూలువడకడాలు మేమెరగం బాబూ! మీటింగులట. పికిటింగులట, పేపరులట. పుస్తకాలట. అబ్బో! యెన్ని. అప్రదిష్టకూడాను. యింతకీ కర్మం కావలసినపిల్లని చేసుకొన్న వాళ్లని ముక్కూచెవులూ కొయ్యాలి, యెడంకాలి చెప్పుచ్చుకొని కొట్టాలి. తల్లోయి! తల్లో! నేననుభవస్తున్నాను. వద్దంటే వినక యీ గయ్యాళి నంటకట్టేరు. నాపరువుప్రతిష్టపోతోందని యేడుస్తున్నాను.

కా:—వదినా! నాకుఅంతా తెలుసును. నాకోడలికి యింగ్లీషుకూడావచ్చును. హిందీట అదీవచ్చును. మొన్న దానిఅన్నగారువస్తే యింగ్లీషుతో మాట్లాడింది. దీనిచదువు తగలెయ్యా. ఆరునెలలకాపరం మూడు నెలలు చేస్తుంది.

సీ:—నాకోడలు వీణెపాట యేదో అదీపాడుతుంది. వీణఅంటే యెల్లావుంటుందో యిదివరకు నేనెప్పుడూ చూడలేదు. యేమోనమ్మా దానిఅందం నాకేమీ కనుపించలేదు. టుయ్యాటుయ్యా మంటుంది. మనయింటి ప్రక్కనున్న హనుమంతరావు పెళ్లాము వీణనేర్చుకుంటూవుంది. ఆమొగుడు కేలానచ్చిందో కాని, యెనడో వస్తాడు, చాపవేస్తుంది, రెండుబుఱ్ఱలు తెస్తుంది, ఇద్దరూకూర్చుని చెరోబుఱ్ఱాపట్టుకుని టుయ్యాటుయ్యా అంటూ కీచుగాపాడుతారు. యిదివరకు యేమిటోఅనుకున్నాను. నాకోడలువచ్చిన తర్వాత దాని వీణెచూచి వీణెకదా అనుకున్నాను.

కా:—ఇల్లాంటిపరువు తక్కువపనులు చేసేదానికంటె చస్తేమేలు.

సీ:—అయ్యో! వాళ్లు చస్తారా మన్నిచంపుకు తినకుండాను. కొడుకుని పెంచుకొని ఇదోరంధి తెచ్చిపెట్టుకున్నాను. అందరూవద్దంటే విన్నానుకాను. ఇప్పుడనుభవిస్తున్నాను. నాకోడ లెన్నిఅన్నా మాట్లాడదు. బెల్లంకొట్టిన రాయి. ఏమిచెప్పుకోమన్నావు వదినా! నాఅవస్థ.

[ఇట్లు సంభాషించుకుంటూ దేవాలయం సమీపించేరు. చాలాప్రొద్దుపోయింది. ముత్తయిదువలంతా పళ్లుయిచ్చి తమతమ యిండ్లకు వెళ్లినారు. పూజారి వీరినిచూచి 'యేమమ్మా! యింతరాత్రివరకూ యేమిచేస్తున్నారమ్మా?' అన్నాడు విసుగుతో. 'నీకు విసుకెందుకయ్యా! మాకు త్వరగా ప్రసాదమిచ్చిపంపు. వెళ్లి రెండు మెతుకులుతిని పడుకుంటాము. వుపోషముచేత కాళ్లుచేతులూ లాక్కుపోతున్నాయి. త్వరగా పంపు నాయనా!' అంది సీతమ్మ. 'ఇంటికివెడితే అన్నమేనా వండిందోలేదో నాకోడలు, నేనేనందుకు చావాలేమో' అంది కామాక్షమ్మ.]

## ౨

[సీతమ్మగారికోడలు సుశీల, కామాక్షమ్మగారి కోడలు కల్యాణి. గోడదగ్గరనుంచి సుశీల 'కల్యాణీ' అని పిలచింది. వీరిద్దరిఇండ్లకి గోడమాత్రమే అడ్డము. కల్యాణి, సుశీల అత్తగార్లు యింటలేనప్పుడెప్పుడైనా తరుచు గోడదగ్గరనుంచి మాట్లాడుకొనుట వాడుక. ఆగోడపైన కప్పులేనందున వర్షానికితడిసి కూలిపోయింది. దానిచే యిద్దరూ అక్కడనుంచుని మాట్లాడుకోడానికి వీలుగావుంది. 'నువ్వు? వెళ్లలేదటే' అంటూవచ్చింది కల్యాణి]

సు:—నేనెక్కడికి వెళ్లను? నాకు గృహమేగుడి. అత్తగారినే ఆరాధించడం. నాతోకూడా యెవ్వరు వుపవాసముంటారూ అని విసుక్కున్నారని నేనూవున్నాను. లేకుంటే చంటిపిల్లతో నేనుపవాసమెందుకుంటాను? నేనుకూడా గుడికివస్తానంటే రానక్కరలేదన్నారు. పోనీలే. భగవంతుడెక్కడలేడు? యిక్కడనే పూజచేసుకున్నాను.

క:—సరే. యెప్పుడాటే మనకి. నేనూ వస్తానన్నందుకు మాఅత్తగారు హోరాహోరీని పోట్లాడినారు. గోడప్రక్కనేకదూ, వినలేదూ? అనరాని మాటలన్నారు. యేమిచెప్పుకోమంటావు నాగతి.

సు:—నాసంగతీ అట్లాగేవుంది. నన్నేగాకుండా నావాళ్లనందరినీకూడా తిట్టేస్తున్నారు. చెప్పితే నమ్ముతావోలేదోగాని నిద్రలోకూడ ఇదేగోల. అంత అసూయతయెందుకో తెలియదు. నేనుపాడితే తప్పు. వీణవాయిస్తేతప్పు. చదివితేతప్పు. భర్తగారితో మాట్లాడితేతప్పు. కుట్టుకుంటేతప్పు. జడలోపువ్వులుపెట్టుకుంటే తప్పు. మంచిబట్టకట్టుకుంటే తప్పు. నాదిచాకలికట్టుట. సానిపోకట. నుంచుంటేతప్పు. కూర్చుంటేతప్పు. నవ్వితే తప్పు. యేడిస్తేతప్పు. యెట్లాగచెప్పు. తలుచుకుంటే దుఃఖమాగుటలేదు? పరువుతక్కువసంబంధమని దుమ్మెత్తిపోస్తున్నారు. ఒక్కపని ఆమెను చెయ్యనీయను. ఆమెగీచిన గీటుదాటను. యింకనన్నెందుకు అనడం? అబ్బ! ప్రాణంవిసిగిపోతోంది. తల్లీ! బ్రతుకుమీద ఆశపోతోంది. (అని కన్నులనీరు బెట్టుకొనును).

క:—అవునే. బాబూ! నాకు చెప్పనక్కరలేదు. నేవింటున్నాగా? నన్నుగూడా ఒకవిధాన్నికాదు అన్నివిధాలాబాధపెడుతున్నారు. పడ్డవాళ్లు చెడ్డవాళ్లుకారని కొన్నిరోజులకైనా మంచిరోజులురావా అని కాలక్షేపముచేస్తున్నా కాని రోజులు గడవటంలేదు.

సు:—వూరుకుంటే వెల్లంకొట్టినరాయి అంటారు. సమాధానంచెపితే ఎదరించింది అంటారు. ముచ్చటగా తెచ్చుకు పెంచుకున్నారు కదా యెంతో ప్రేమగా చూస్తారనుకున్నాను గాని యింత విపరీతము జరుగుతుందని అనుకోలేదే, తల్లీ!

క:—పెంచుకున్నదానికి ఆపేక్షయెట్లావస్తుందే? కన్న మాఅత్తగారికేలేదు. నారాయణ! నారాయణ! పగలెల్లతిట్టుతూనే వుంటారు. కట్టెలుకాలకుండా వంటకావాలి. నెలకి అర్ధసేరు నూనెకంటె యెక్కువ కాకూడదు. నెలకి ఒకరూపాయి నెయ్యిలెక్కలు. అంతకంటె యెక్కువఅయితే అంతానేనే తింటున్నానట. నాకుపనిబద్ధకమట. గొడ్రాలినట. మొగుణ్ణివలలో వేసుకున్నానట. మామామగారు నన్నుఅన్నిఅంటూంటే విని ఆమెనుయేదోఅన్నారని ప్రొయ్యిలోమండే కొరకంచుపెట్టి ఆయనని నన్నుకూడా అంటించడానికి సిద్ధమయ్యారు. మేమిద్దరమూకూడా తప్పుకున్నాము. లేకపోతే యీపాటికి చురకలుపడేవే.

సు:—ఇటువంటివన్నీ చెప్పితే యెవ్వరూ నమ్మరు? ఖర్మం. నామీద మామగారికి ఇదివరకు యెంతో ప్రేమ వుండేది. ఇప్పుడు తంత్రాలుచెప్పి ఆయనమనస్సు విరిచేశారు. భర్తగారితో చెప్పుకుందామంటే పాపము వారు తల్లినియేమంటారు? అస్వతంత్రులు. వాళ్లకి తెలియాలిగాని. యేమన్నాఅంటే వారికిగూడా బహుమతులు తగులుతాయి. యేదో రెండుమెతుకులుతిని స్కూలుకు వెడుతున్నారు. ఈగోలంతా నేను చెప్పను. చెప్పి వారిమనస్సుపాడుచేయుట నాకిష్టముండదు.

క:—ఆడపిల్లలులేని వాళ్లకి కష్టసుఖములు తెలియవే. కనుకనే మనలను ఇంతబాధపెట్టుతున్నారు. మొన్నమాపుట్టింటికి వెడితే మీఅత్తారింట్లో నీవుసరిగా కాపురంచెయ్యడంలేదటకదూ అని అమ్మలక్కలంతా అడిగేరు. యెవ్వరన్నారంటే మొన్నవచ్చినప్పుడు మీఅత్తగారే చెప్పిందిఅన్నారు. నాకుచాలా సిగ్గువేసింది. యీమాటలన్నీ యెవ్వరితో చెప్పుకోనూ? చెప్పుకుంటే నాకేఅప్రతిష్ట.

సు:—నన్ను మావాళ్లయింటికి పంపమంటే పంపరు. యిక్కడిమాటలన్నీ చెపుతాననిభయం. మావాళ్లు సారెకొద్దిగాపెట్టినారట. వెండికంచం మాఅత్తగారికికూడాయివ్వలేదట. అందుకనినాకు మూడురోజులు నిలవ ఉంచినఅన్నం నీళ్లలోవేసి తినమంటారు. దాసీదాన్ని పెట్టరు. అంట్లుఅన్నీ నన్నే తోమమంటారు. యేమన్నా అంటే సంసారులు పనిచేసుకోరూ మీషోకులూగీకులూ నాదగ్గరసాగవు అంటారు. నాకేమిషోకే? కల్యాణి! చెప్పు. నేయివేయరు. అన్నముపెట్టరు. నెలకి ఒక్కసారి తలకునీళ్లు పోసుకోమంటారు. ఇటువంటివన్నీ నేను అంటే బాగుండదు. ఇటువంటిలోపాలు వాళ్లదగ్గరవున్నా తిరిగియేమన్నా సమాధానంచెప్పము మనము. కాబట్టే నేరస్తుల మవుతున్నాము. ఇంకోసంగతి. పిల్లకిజ్వరంవచ్చి పడుకుంటే గుడికితీసుకువెడతానని నిద్రపుచ్చావా అని నానామాటలు అన్నారు. జ్వరంవస్తే మందువేయకూడదట. సంసారంగుండం అయిపోతుందిట. పాలుచాలకపోతే పోయకూడదట. ఏడునెలలపిల్లకి పాలుపోస్తే చాలాకావాలట. అందుచేత మూడుపూటలా అన్నంపెట్టమంటారు. పెట్టనంటే చెప్పినమాటవినదు, పెద్దలయందు నిర్లక్ష్యము అంటారు. అన్నంపెట్టి అలవాటైనా చేద్దామంటే ఒకపూటపెడితేనే పడక జ్వరంవస్తోంది. ఏడుమాసములపిల్లకి అన్నమేమిటే? జ్వరంవచ్చినా మానకుండా పెడితే అలవాటవుతుందిట. అపుడేజ్వరమూరాదట. ఆమెపిల్లలని కనకపోయినా పెంచడం తెలుసునట. ఒక్కటయితే చెప్పవచ్చును. యెల్లప్పుడు ఒక్కేరీతిగా పాటకింద పాడుతూవుంటున్నారు. కల్యాణీ! అత్తగార్లుకారే అమ్మవార్లే, కాళిశక్తులే. చూస్తే భయంవేస్తోందే. వస్తారేమో యింట్లోకి వెడతాను.

క:—కట్టుకి బొట్టుకి ఆక్షేపించి సాధించేవాళ్లు అన్నిటికిమాత్ర మెందుకనరూ? చాలాప్రొద్దుపోయింది. మీఅత్తమాఅత్తకలుసుకుని కబుర్లుచెప్పుకుంటు[illegible] సుశీలా! [illegible] యీవూరువచ్చినతర్వాత

సంగీతమునకు స్వాడ్డుచెప్పేను. చదువుని సాగనంపేను. క్రమంగాకట్టూ అన్నీకూడా పోయాయి. భగవంతుడు యీదినములుగడిపి మంచిదినాలు యెప్పటికి తెప్పిస్తాడో?.

సు:—ఏమివిన్నావు యింకాను? యెప్పుడైనా చంటిపిల్లమీద విసుక్కుంటే అదిగో నాపేరుపెట్టావు నామీదవిసుక్కున్నట్లే, దాన్నితిట్టితే నన్నుతిట్టినట్లే అంటారు. యీపేరుపెట్టడానికి యెంతఅల్లరైనా చేశారు. నేను ఆమెపేరు పెట్టవద్దన్నానట. పట్టెదసుమీ, నేనేమీయెరుగను. యేపేరైతేయేమీ? కల్యాణీ! బ్రతికిబాగుండాలి కాని. చివరకి రాద్ధాంత సిద్ధాంతాలు అయినతర్వాత సీతఅని పెట్టించేరు. యిప్పుడెప్పుడైనా విసుక్కోకూడదుట. చంటిపిల్లకదా రోజూనీళ్లు పొయ్యనీయరు. కట్టెలుఅయిపోతాయి అంటారు. పైగా రోజూనీళ్లు పోస్తేనే వస్తుందిటజ్వరము. వారమునకు ఒక్కసారి పోయాలిట. కల్యాణీ! అమ్మా! యెన్నిచెప్పగలనే? ఈబాధ పడలేకుండావున్నాను. తల్లీ! ప్రాణంమీద విరక్తిపుట్టుతోంది. ఆత్మహత్య చేసుకుందామా అని అనుకున్నాను. నేనుపోతే నాపిల్లకిలోటు కాని యెవరికిలోటు? చక్కనిసంబంధం మాఅత్తగారుచేస్తుందిట మాఆయనకి. నన్ను యిదివరకే చావమనిచెప్పతోందే మాఅత్తగారు. నేనే యీయింటికి శనినట. బాగుందా? నీతోమాట్లాడితే కూడ తప్పు. యిల్లావుంది నాఅవస్త. తలుపుచప్పుడు అవుతోంది. అత్తగారే కాబోలు. వెడతా. నీవు కూడావెళ్లు.

క:—అట్లాగనే. మాఅత్తగారూ అంతే. మీయింటికేసిచూస్తే మీతోయేదో చెప్పేనంటుంది. మాయింటి తలుపూ చప్పుడవుతోంది. నేనూవెడతా, బాబూ! చూస్తేచంపేస్తారు. మనమొఱలాలకించి మనలను భగవంతుడే మన్నించికాపాడాలి. వెడతా.

—ఇద్దరు వెళ్లుదురు.

## సౌభాగ్యవతీభవ!

శ్రీమతి శ్రీ సువర్ణముఖీ దేవి గారు

చిన్ని తెమ్మెరవిసరులఁ జెదరుచున్న
ముంగురులఁ గేలఁద్రోయుచు ముద్దులొలుక
పసిడిగాజుల మిసమిసల్ పరువులిడగ
ముద్దగోరింటపూచెక్కుటద్దములను
విరిసి నునుసిగ్గుదొంతరల్ పరిమళింప
నాకుచిల్కలమేనిసోయగపుఁజీర
బంగరుహారంగు మెయినిశాబలితరుచుల
గొనరి యొకవింతసొబగునఁగ్రుమ్మరింప
జిలుగుపాంజేవుపట్టికచివురుపదపు
నడలబడలికఁ గన్గొనినవ్వనవ్వి
యెంతయో కోపమున మొగమెత్తఁజేయ
పూసికొనినట్టి గందపుఁబూఁతలలమి
గుప్పుగుప్పునఁ దావులగుప్పుచుండ
కెలకులవెలుంగు దీపాలవెలుగులోన
మించుతళ్కులలోలకుల్ మెఱసిపోవ
ముద్దుకనుఱెప్పదొప్పలమ్ముమ్మరించి
పరువుగొన్నట్టి భక్తిభావాలబరువు
భర్తృవాల్లభ్యకాంక్షాత్రపాప్రసూన
సురభిళంబౌచు మోమున దొరయుచుండ
మ్రోడుపెడఁదలు చివురించిమురియునటుల
చిమ్మగ్రోవిని పానకాల్ చిమ్మునటుల
నతివ! నీగొంతువీణియ యమృతనాదు
లట్టి మోహనగీతములాలపించి
యతిముదంబున సంతహారతులనీయ
నలహిమాలయశిఖరాలనతకరించి
దివ్యమై వెల్గు నార్యసతీసతీత్వ
మాననంబునఁ గలకలనాడుచుండ
తల్లి వరలక్ష్మిపూజలనుల్లమలరఁ
జేసి నీభావిమాంగల్యమాసజేతు
వా? కుసుమకోమలాంగి! సౌభాగ్యవతివి
కమ్ము హాయిగవేయేండ్లు గడచుచుండ

## సుహృదయ

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

ఈయనంతవిశాలప్రపంచమునఁ గేవలము నీవును ఒకజీవివి. అందు గర్వింపవలసినది నుతింపఁదగినదియు నీషత్తునులేదు.

త్వత్సజాతీయలు, ఏజన్మము తదీయపురాకృతదౌర్భాగ్యవశమ్మునఁగలిగినదని చింతింతురో, ఏజన్మము స్వాతంత్ర్యరహితమైనదని యెంతురో, యేజన్మము ఆభౌతికశరీరావసానము చతుష్కుడ్యపరీత మహానసమందే మ్రగ్గిమాడిపోవలయునని తలంతురో, ఏజన్మము సత్యసుఖము ననుభవింపఁజాలదని హతాశలగుదురో, సోదరీ! అట్టినీపవిత్ర జన్మమును "శక్తిస్వరూపిణి", "మాతృస్వరూపిణి", "నమాతుఃపరదైవతమ్", "జననీజన్మభూమిశ్చస్వర్గాదపిగరీయసీ" యిత్యాదిపవిత్ర పదములచే ప్రాచీనపరమహంసలాదిగఁ బూజించిరను విషయమును దెలిసికొని, నీగౌరవమును నీవయెఱింగి యైహికాముష్మికసుఖసంపాదనమున కీవు గడంగుట ముదావహము.

"మాయందుఁగలన్యూనత యెట్టిది?" "మేమేలమీవలె దేశారాధకోద్యమమునఁ బాల్గొనరాదు?" "మీవలె మేమేల సౌఖ్యానుభవమందును, ఋణోద్యపార్జనమందును బ్రయత్నింపఁగూడదు?" అనునీయుచ్చాకాంక్షాప్రశ్నలు విమర్శనీయములు. "సంయుక్త, నాగాంబాది ధైర్యవతులవలెనేనేల ప్రవర్తింపఁగూడదు?" "సావిత్రిమొదలగు వారివలె నిర్మలమైన నాయంతరాత్మ యుద్బోధించెడి యీపని నేనేల చేయఁగూడదు?" అనునీపవిత్రాలోచన లెంతయు నభినందింపఁదగినవి. కతిపయసాంఘికదురాచారములవల్లనణఁగి నిగూఢమైన నీపౌరుషము వినీలజీమూతపటలాంతరాళమందలి తారకాగణముభాతి మిణుకు మిణుకు మనుచున్నది. సోదరీ! నీకళాపిపాస అనంతము. నీసర్వమానవసాభ్రాతృత్వము, నీగురుభక్తి, అన్నింటికన్న మిన్నయగు నీపవిత్రవిస్పష్ట విశాలహృదయమును చెప్పుకోఁదగినవి. విశేషించినీకిట్టి కళోపార్జనకవకాశమొసంగి, నిన్నుజూచికొని నిత్యమునానందించు నీజననీజనకులు నంద్యులు. సోదరీ! నీకుభగవానుఁడాయురారోగ్యము లొసంగుఁగాక! నీజాతియంతయు నీవంటిపుణ్యమహిళామయమగుఁగాక! నీవునీజాతి కాదర్శప్రాయవగుదువుగాక! నీవంటిపవిత్ర స్త్రీలవల్లనే నేడు అధఃపతితమైనైచ్యమునందునీజాతి ప్రాచీనసౌందర్యము, ప్రాచీనగౌరవమునందిచిరము వెలుంగుఁగాక.

# క్రొత్తకోడలు

సింహాద్రి బ్రహ్మానందాచార్యులుగారు

కార్యం అయింతరవాత క్రొత్తగా కాపరానికి వచ్చింది. అత్తవారింటికొచ్చేటప్పుడు అప్పగారు వెంట వచ్చింది. ఆవిడ చెల్లెలితో పదిపూటలువుండి నిముషనిముషానికీ జాగ్రత్తగా చూస్తూ ధైర్యం చెప్పింది. ఇహ యెన్నాళ్లువుంటుందికనుక? యెవరిసొత్తు వారికి అప్పజెప్పి ఆవిడ వెళ్లిపోయింది. ఆవిడ వెళ్లేటప్పుడు చెల్లెలి తోటి—యేమీ భయపడకమ్మా! అంతా మనవాళ్లేను. కొంచెం కొత్తగా వుంటుంది, యెవరూ నిన్ను యెఱిగిన వాళ్లు లేక. నాన్న మళ్లీ పదిరోజుల్లో వస్తాడు. అత్తయ్య చెప్పినట్లల్లా జాగ్రత్తగా నడుచుకో. ఆడబిడ్డలేదైనా వేళాకోళం చేస్తారు. యేమీ కోపం తెచ్చుకోకు. బావగారికీ మామయ్యకూ మన్నన చెయ్యాలి సుమా! చిన్నతనం నీకు, మరిచిపోయేవు కనుక. మేమెవ్వళ్లమూ దగ్గర వుండము. అయినా నీకొచ్చిన ఫరవాలేదు. మామయ్య చాలా మంచివాడు. అన్నీ ఆయన కనుక్కుంటూనే వుంటాడు. నీకేమీ లోపం రానియ్యడు. అమ్మా, నాన్నా, అన్నయ్యా, తమ్ములూ, చెల్లెళ్లూ కనబడ్డం లేదని బెంగపెట్టుకోనేవు సుమా ఒకవేళ. నీయీడువాళ్లున్నారు. వాళ్లతో మంచిగా వుంటే మరేమీ ఫరవాలేదు. అబ్బాయి (అంటే మరిదిగారు) చాలా మంచివాడు. ఆతనికెలా యిష్టంగా వుంటుందో అలాగే ప్రవర్తిస్తూ వుండాలి సుమా; జాగ్రత్త. ఇది మనస్సులో పెట్టుకో. వొళ్లు మైమరచి నిద్రపోవడం, బద్ధకంగా ప్రొద్దుపుచ్చడం, యిలాంటివేమీ పనికిరావు సుమా. సూర్యోదయం కాకుండానే లేచి అత్తయ్యకు సాయంగా ఈపనీ ఆపనీ చేస్తూ, ఆవిడెలా చెపితే అలా చేస్తూ వుండాలి సుమీ. ఒకవేళ—పెద్దదికాదూ మరి!—యేమైనా విసుగుకుంటుందనుకో, నీవుమాత్రం కోపం తెచ్చుకోకు సుమీ. అధిక ప్రసంగం చెయ్యడం కాని, యెవరేమి మాటాడినా వూరికే అదేపనిగా నవ్వడం కాని పనికిరావు సుమీ— అంటూ యిలాంటిసోదేదో ఆవిడ చెప్పింది—చెల్లెలిని బుజ్జగించింది; ఆవిడ వెళ్లిపోయింది. కాస్తకష్టసుఖాలు నాటినదేమో, బండిలో కాలుపెట్టేవరకూ చెల్లెల్ని బుజ్జగించి ధైర్యం చెబుతూనే వుంది. ఒక కాసు సొమ్ము కూడా చెల్లెలి చేతిలో పెట్టి వెళ్లింది. ఎంత చెబితే మాత్రం పాపం చిన్నతనం కాదూ—అక్కగారు వెళ్లిపోతూం దంటే కొంచెం మొహం వేలాడేసింది; కళ్లనీళ్లు పెట్టుకుంది. చెల్లెలితో యేదో యీ నాలుగు ముక్కలూ చెప్పి వెళ్లిపోయిందా ఆవిడ? లేదు.—ముఖ్యంగా అత్తగారితో—యేదో మా చెల్లెలి సంగతి నేను చెప్పుకో కూడదు గాని, బొత్తిగా అమాయికురాలండీ. నేను వేరే మీకు చెప్పాలా? అన్నిటికీ మీరేవున్నారు. దానికొచ్చిన లోటేముంది. యేదో కొత్తగా పుట్టింటిదగ్గిరనుంచి యిదే రావడం కదండీ మరి! అమ్మనీ, నాన్ననీ యిదివర కేమన్నా విడిచివుందా యేమన్నానా? అంచేత యేమన్నా కొంచెం యెప్పుడన్నా బిక్కమొహం వేయవచ్చు. మీరు కాస్త లాలనచేసి మంచిమాటలాడితే మరిచిపోయి అలవాటుపడుతుంది. నేనేమిటో ఆరిందాదాని లాగ, యిలా చెబుతున్నా అనిచెప్పి మరోలా అనుకుండేరు సుమండీ! మీరు పెద్దవారు. సర్వమూ తెలిసిన వారు. మా చెల్లెలిక్కడనుంచి మీసొత్తే కాని మాసొత్తు కాదు. అది మీ అమ్మాయి కాని మా అమ్మాయి కాదు. ఇహ నే శెలవు పుచ్చుకుంటానండీ. మళ్లీ నేను మరదలు సుబ్బులక్ష్మి పెళ్లికి వస్తానేమో—.అని అత్తగారితో యెలా చెప్పాలో అలా చెప్పి, మరీ వెళ్లింది. అందులో ఆవిడ యేమీ లోటు చెయ్యలే.

చెప్పడం మరిచిపోయాను. యీ అమ్మాయి పేరు లక్ష్మి. ఈ అమ్మాయి అంటే కథానాయకురాలే సుమండి! పిల్ల చాలా లక్షణమైంది, బుద్ధిమంతురాలు కూడాన్ను. అందుకేమీ సందేహం లే. తల్లిదండ్రుల పోషవర్గంలో చాలా జాగ్రత్తగా పెరిగింది. జాగ్రత్తగా పెరగడం అంటే, యేదో యింత మస్తుగా తినడమూ, టింగురంగా అంటూ స్వేచ్ఛగా గంతులు వేయడమూ కాదు. పిన్నా పెద్దా అనీ, మంచీ చెడ్డా అనీ, కాస్త జ్ఞానం వుండేందుకూ, కాపురానికెళితే యేదో కాస్త మంచిపేరూ ప్రఖ్యాతీ తెచ్చుకుండేందుకూ, వీలుగా వుండేటట్టు

*
* *

ప్రజ్ఞావతీ! అంతర్జాతీయసమావేశము లకు పోయివచ్చిన ఆంధ్రస్త్రీలలో నీవు ప్రథమురాలవు. ప్యారిసు నగరమున నీచేసినఘన కార్యమింకను మేము విస్మరింపలేదు. ఎప్పుడును విస్మరింపకనేయుందుము. ఆంధ్రకీర్తిని ఖండాంతరములకు గొనిపోయిన ప్రజ్ఞావతివి నీవు.

త్యాగినీ! ఘోరోదయాంతమైన లవణ సత్యాగ్రహ సమరమునందు ప్రభుత్వమువారిచేత పట్టుబడినఆంధ్రపురంధ్రులలో — ఒక్క ఆంధ్రపురంధ్రులలోనే అననేల అఖిలభారత ప్రమదలలో — నీవే ప్రథమురాలవు. తమిళదేశమున వేదారణ్యక్షేత్రమున నిర్బంధింపబడి నీవు ఆంధ్రరమణుల సాహసమును చాటితివి. అనీకస్థురాలవై నిర్బంధదేవతకు ప్రథమమున బలియైన త్యాగినివి నీవు.

ఆంధ్రపుత్రీ! నలుబది వత్సరములకు పైగా సాగుచున్న జాతీయమహాసభకు ఒక్కసారికూడ ఆంధ్రుడు అధ్యక్షతవహింపలేదు. ఏటేట జరుగు అఖిలభారతవర్షీయములగు ఇతర సభలకుకూడ అధ్యక్షతవహించిన ఆంధ్రులనామములు గోవిందద్వాదశులవలె కొలదిగనున్నవి. ఇది మిక్కిలి శోచనీయమగు విషయమే. ఈశోచనీయవిషయమును నీవు గతవత్సరమున తొలగించి ఆంధ్రులను ఆనందతరంగితులనుగాజేసితివి. 1929-వ సంవత్సరము డిసెంబరు 26, 27, 28 తారీఖులందు లాహోరు నగరమునందు జరిగిన అఖిలభారతమహిళాసభకు అధ్యక్షతవహించి 1930-వ సంవత్సరమున సీత, సావిత్రి, దమయంతి మొదలగు పౌరాణికవనితారత్నముల సంతతికిచెందిన అఖిలభారతవర్షీయమానినీమణులకు శాసనకర్త్రివై వెలసితివి. ఇట్లు వెలయుటకు ఆంధ్ర స్త్రీలలో నీవే ప్రథమురాలవు.




శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు

దీక్షావతీ! కాండీ నగరమున కూడిన యువజనమహాసభకు అధ్యక్షతవహించిన పూజ్యురాలవునీవు. చెంగల్పట్టుజిల్లాబోర్డునందు సభ్యత్వము వహించిన దేశసేవాపరాయణవు నీవు. విద్యావతీ! నీవు మద్రాసువిశ్వవిద్యాలయపు సినేటునందు సభ్యురాలవైయుంటివి. ఇట్టి ఉదాత్తగౌరవమునందుటకు ఆంధ్రస్త్రీలలో నీవే ప్రథమురాలవు.

ఆంధ్రరమణీమణీ! ఇన్నివిషయములచే నీవు ఆంధ్రస్త్రీల నధ్యక్షించితివి. కావున పంచమ ఆంధ్రమహిళాసభకు అధ్యక్షురాలవైతివి. నీకు మాధన్యవాదములు. అన్వక్కరాండ్రమగు మమ్ము అరయుము.

* *
*

*

* *

శ్రీమతి సీరము సుభద్రయాంబగారి నామము గృహలక్ష్మి పాఠకులకు చిరపరిచితమైనది. ఆమె వ్యాసములు గృహలక్ష్మికి అలంకారములు. సుప్రసిద్ధాంధ్రకవులగు శ్రీయుత సెట్టి లక్ష్మీనరసింహము గారి అగ్రసోదరి ఈమె. ఈమెకుమారుడు విశాఖపట్టణము జిల్లా భీమునిపట్టణమున పోస్టుమేస్టరుగా ఉన్నాడు. ఈవిదుషీమణికి స్వప్రసిద్ధి బొత్తిగా ఇష్టకరముకానిది. భర్తృవియోగము కలిగిన తన యిరువదవయేటినుండియునీయమ యోగాభ్యాసమును, గ్రంథపఠనమును ముఖ్యకార్యములుగాఁ బెట్టుకొని మూలఁబడియుండుటకే ప్రయత్నము. సహజముగాఁ గలిగిన కవితాశక్తి భారతభాగవతరామాయణ సీతారామాంజనేయములను జదువుటవలనఁ గుదురు తేఱినది. అంతకంటె హెచ్చుగాఁ బ్రబంధాదులను జదివినది కాదు. వ్రాసిన పద్యములు ప్రచురింపవలయునన్న కుతూహలము లేనే లేదు. ఆమె రచియించిన గ్రంథములలో ఇంతవఱకు మూడుమాత్రము ప్రచురితములు. విశేషకారణముండుట చేతనే ఆమె ఈమూడు గ్రంథములను ప్రచురించుట కంగీకరించినది. కీర్తిశేషురాలైన తన మాతృదేవికిఁ గృతియిచ్చిన కారణమున సురుచీవిజయమను నాటకమును, తండ్రికిఁ గృతియిచ్చిన కారణమున శిరోమణియను నాటకమును అమె యచ్చొత్తించుటకు సమ్మతించినది. తన మేనల్లుఁడు అనగా సెట్టి లక్ష్మీనరసింహముగారి రెండవ కుమారుడు చదివి యర్థముచెప్పుచు వినిపించిన యాంగ్లేయ నవలనొకదాని ననుకరించుచు ఆమె 'జాగిలము' అను నవలను రచించినది. రాజమహేంద్రవరము నందలి సరస్వతీగ్రంథమండలివారు ఈనవలను ప్రచురించియున్నారు. ఈమూడు గ్రంథములు తక్కఁ దక్కిన ఈమె రచించిన గ్రంథములన్నియు నముద్రితములుగనున్నవి. 'భారతి' పత్రికాముఖమున 'ఉత్తరావిలాపము', 'రుక్మిణీ సందేశము' అను మనోహరపద్యవ్యాసములను ఈమె ప్రచురించియున్నది. ఈ విదుషీమణి గృహలక్ష్మి పత్రికాముఖమున 'సంక్రాంతి పండుగ' అను గద్య పద్యవ్యాసమును, 'శబరి', 'గృహలక్ష్మి', 'స్వయంప్రభా' అను పద్యవ్యాసములును ఇంతవఱకు వ్రాసియున్నది. ఈమె పుట్టుక ధాతృనామసంవత్సరమున. బలిజెకులము. విశాఖపట్టణము నివాసము. భర్తృనామము తన సురుచీవిజయ నాటకమున ఈమె ఇట్లు తెలుపుకొన్నది.



శ్రీమతి సీరము సుభద్రయాంబగారు

ఆ. వె. ఎవరిపేరివ్రాలె యీపద్యపాదాక్ష
రంబులందొలినలరారునో, మన
సెవరి కెల్లగతుల నవనీతసమమొ, య
ట్టిభవనిభుని నాథువిభుని దలఁతు.

* *

*

తల్లిదండ్రులు తరిఫీదుచేశారు. స్వతహా తెలివితేటలుగలదయిందవడంచేత లక్ష్మి కాపరానికెళ్లేటప్పటికే యెంత మంచిపిల్లమ్మా యెంతమంచిపిల్ల అని అనిపించుకుంది. అంచేత ఇహముందైనా అలాగే అనిపించుకుంటుం దనుకుందాం మనం.

అత్తవారింటికొచ్చి పదిహేనురోజులయింది—యిరవైరోజులయింది —నెల్లాళ్లయింది. కొత్త కొత్తల్లా కాస్తపాతగిల్లింది. ఇహఅత్తగారు కోడల్ని పిలవడంలో కొంచెంమార్పు తెచ్చింది. సలక్షణమైన 'లక్ష్మి' అన్న పేరుమానేసి 'లచ్చీ, లచ్చీ' అనడం మొదలెట్టింది. 'ఒసేలచ్చీ—యిలారా. ఈపనిచెయ్యి, ఆపనిచెయ్యి' అనడంలో దిగిపోయిందండి. 'లచ్చీ-లచ్చీ' అనికోడల్నిపిలిస్తే యేమైనామునిగిపోయిందా? 'లక్ష్మి' అన్నదిసంస్కృతం, 'లచ్చి' అన్నది అచ్చతెనుగూను. 'లచ్చి—లచ్చి'అని కేవలమూ ఆమహావిష్ణువు యొక్క అర్ధాంగినే కొమ్ములువచ్చిన కవిపుంగవులు సహితం సంబోధించేరుకదా, అందులో యేమీతప్పు లేదు అనియెవరైనా అంటారేమో? సరే—అదీనిజమే కాని యీసందర్భంలోమాత్రం కోడల్ని న్యూనతగా చూడాలనే వుద్దేశంతోనే అలాఅనడం మొదలుపెట్టింది. నేనుచెప్పడం యెందుకు? మీకేతెలుస్తుంది. చూడండీ! ఈవిడకు ఒహకూతురుంది. ఆ అమ్మాయిపేరు సుబ్బులక్ష్మి. కూతుర్నిపిలిచేటప్పుడు మాత్రం 'తూచాలు'తప్పకుండా 'సుబ్బులక్ష్మి—సుబ్బులక్ష్మీ' అంటూదీర్ఘంతీసుకొని మహావయ్యారంగా పిలుస్తుంది. ఇహకోడల్ని పిలిచినప్పుడో, అమాంతంగా యీ'లచ్చీ—లచ్చీ' అన్న తెగులుడుతుంది! అచ్చతెలుగో లేక మరేతెగులో? పాపం మనలక్ష్మికిమాత్రం కొంచెంకష్టంతోచింది, నిజంచెప్పవద్దూ. అందుకు మనంయేమీ అనడానికివీలులేదు. పుట్టింటిదగ్గిర—అక్కడవున్న దాసీదాన్ని 'లచ్చీ, లచ్చీ' అనిపిలుస్తారు. తనకీ అత్తగారింట ఆగతేపట్టింది. రోజులేదోయీడుస్తూనేవుంది—మహాకష్టంగా యీడుస్తోంది. అత్తగారు 'లచ్చీ'అని పిలవడంతోనే వొళ్లుమండుకుపోతూంది. ఒహటిరెండురోజులు వూరుకుంది. అక్కణ్ణుంచి 'లచ్చీ'అన్నపిలుపు వినడంతోనే కొంచెంముఖం జేవురించుకునేది. అత్తగారు యిదికనిపెట్టింది. 'యేమే, నేనుపిలవడంతోటే మొహమేమిటి అలాముడుచుకుంటావు? మామగారిదగ్గర మాత్రం మహాకలివిడిగానూ; మహాతెలివిగాను వుంటావు?' అని అనడం మొదలుపెట్టింది. పోనీ యేహో యిలాఅనివూరుకుంటుందీ! అబ్బో, ఆవిడేమిటీ-జగజ్జంత్రీ. 'మొహమేవిటే—యెప్పుడూ మొరడులాగేపెట్టుకుంటావ్? ఎప్పుడూ కొరకంచులాగే వుంటుందేం? నేనేంవిషంపెట్టేను నీకు?—నేనుపిలిచినా, నన్నుచూచినా అలాకొరకరలాడతావేం? మీఅక్కయ్య వెళ్లేటప్పుడుచెప్పిన పాఠాలాయేమిటివి?' అని అత్తగారు అంది.

మనలక్ష్మి యిహకోపంపట్టలేకపోయింది. 'ఇదేమిటండీ! మీరిలాఅనడం యేమీబాగాలేదు. పైగా మాఅక్కయ్యపేరెత్తుతారెందుకండీ, పెద్దవారుకూడాను' అని మహాకష్టంమీదఅంది. అనకతప్పిందికాదు. యేంజేస్తుందిమరి? మంచిదికనక అంతటితోవూరుకుంది. మరొకాంటిదైతేనా దూసుకో అంటేదూసుకో అని కచ్చాబిగించకపోయిందా? ఎలాగైతేనేం, అత్తగారు క్రమక్రమంగా కొంచంఅధికారం చలాయించడం మొదలు పెట్టింది.

ఏపాటి హెచ్చుతగ్గువచ్చినా బ్రహ్మరాక్షసి యీఅత్తగారు. నిలుమంటే మరామేకు, కూర్చుంటే మరామేకు అంటారే—ఆమోస్తరుగావచ్చింది లక్ష్మిసంగతి. పాపం యెవరితో చెప్పుకుంటుంది-యెవరితోచేస్తూంది? బాగాచదువుకున్నదికూడాను. ఐతేమాత్రం, ఒక్కవీసమెత్తయినా తల్లిదండ్రులకు వ్రాసిందా?—లేదు. వ్రాయదలుచుకోలేదు. తనతెలివితేటలచేత తానేసమర్థించుకోవాలనుకుంది. ఛావగొట్టి యింటిచాకిరీఅంతా చేయిస్తూనేవుంది అత్తగారు. కదిలితేపోటూ—మెదిలితేపోటూ. ఐతేమాత్రం యేంచేస్తుంది? మహాఓరిమిపట్టి రోజులు యీడ్చుకొస్తూంది. భర్త విష్ణువర్ధనరావు ఆయేడే బియ్యేప్యేసయాడు.

ఇంకాయేవుద్యోగంలోనూ ప్రవేశించలేదు. ఒక్కసుగుణం! ఈతడుమట్టుకుమాత్రం మూర్ఖుడుకాడు. చదువుకుంటేమాత్రం యెంతమంది దరిద్రగొట్టుదద్దమ్మలులేరు? భార్యయొక్క సుగుణాలుబాగాగ్రహించేడు, కుర్రాడైతేనేంగాను. తల్లియొక్క బుద్ధివిశేషతలు ఆతనికి బాగాతెలుసును. ఐతేనేం? భార్యను అన్యాయంగాబాధపెడుతున్నావని యేమన్నా అనగలడా? నిజమే; నిజంగా—అనవసరంగా—బాధపెడుతూనే వుంది. కాని యీవిషయమై యేమన్నాఅంటే అల్లరివచ్చిపోతుంది మరి? ఒహవేళ తెగించిఅంటే, తండ్రిమనస్సుకు యేమినొప్పితోస్తుందో? తండ్రి చాలామంచివాడు. బహూయోగ్యుడు. భార్యగుణాలన్నీ బాగాతెలుసును. గయ్యాళిగంపని తెలుసు. ఖర్మంచాలక యేదన్నాఅన్నాడో, అతనిపరువుమర్యాదలు వీధులో వున్నాయన్నమాటే. అంచేత మనలక్ష్మిభర్త చూచీచూడనట్టుపైకి వూరుకున్నప్పటికీ, పడకటింటరాత్రిసమయాల్ని, ఆవిడమనస్సు మహా ఆహ్లాదకరంగావుండేటట్టు ప్రవర్తించేవాడు. భర్తయందు లక్ష్మికిచక్కని ప్రేమకుదిరింది. అంచేత తనకేమీభయంలేదుకదా అనిమనోధైర్యమూ, నమ్మకమూ బాగాగలిగింది. అత్తగారిహ యెన్ననుకున్నా, తననుకానట్టే. తనపనియేదో తనుజాగ్రత్తగా చేసుకునేది. ఇహఈమనిషినైజం యింతేకదా అనుకుంది. మరెందుకు వృధావాగ్వివాదం అని ఊరుకుంది.

కాని కోడలువూరుకుంటే అత్తగారు వూరుకుంటుందీ? తనకు తోడయేటట్టు కూతుర్నికూడా కాస్త యెగదోసింది. కొంచెంయించుమించు, మూడుమూర్తులా తల్లేతల్లి—కూతురేకూతురు. చిన్నప్పటినుంచీ రణరాలుగాయి. ఇలాఅంటున్నాన్ని మీకుకోపంవస్తే చెప్పలేను. వంచడానికెవ్వడికీశక్యంలేదు. ఆవిడస్నానంచేయడానికి సిద్ధమైతే వదినెగారు వేడినీళ్లూ, పరికరాలు పుచ్చుకొని అడుగులకుమడుగులొగ్గుతూ సేవచేయవలసిందే. కట్టువిడిచినగుడ్డ వుతకవలసిందే. తన్వెదూపట్టుపట్టిలేచిపోతుంది. వదినెగారు విస్తరితియ్యాలిసిందే. మధ్యాహ్నము మూడుఘంటలయ్యేటప్పటికల్లా వదినగారు యెంతయెలాంటిపనిజేస్తున్నా సరే కొబ్బరినూనె, దువ్వెనాతెచ్చి ఆవిడతలదువ్విజడవేసి శృంగారించవలసిందే. ఇందులో యేదిలోటువచ్చినాసరే, దూదేకినట్టుయేకేస్తుందిగా! ఎవడుకట్టుకుంటాడోకాని బాబూ!—బ్రహ్మరాక్షసితోనైనా కాపరంచెయ్యొచ్చుగాని—అమ్మ! దానితో యెవడునెగ్గగలడుబాబూ, యిప్పుడేయిలావుంది? యెవడో తగినవాడు దొరకాలి—తెగులుకుదరాలి. అంతవరకూ క్రిందబెడితే యెండలులేవు—పైనబెడితే వానల్లేవు! నిముషనిముషానికీ ఆపిల్లయెముకలు కొరుక్కుతి నేసేదికాదూ! ఎందుకైనా తగినవాళ్లురా నాయనా!—తల్లికి తల్లీ, పిల్లకుపిల్లాన్నూ!

విష్ణువర్ధనరావు చూచేడు, చూచేడు. అంతకంతకూ ముదిరిపోతూందిరా అనుకున్నాడు. దీనికేమిటా?—గత్యంతరమేమిటా అని ఆలోచించేడు. ఒహనాడు ఏదిపాలుపోయిందికాదు. విసిగిపోయి న్యూసుపేపరు చదువుకోమనివిప్పేడు. మదరాసులో యేదో 40 రూపాయిలు గుమాస్తాపనికావాలన్నట్టు ప్రకటనచదివేడు. తక్షణం ఒకవిధమైన ఉత్తేజంవచ్చింది. మర్నాడు బయలుదేరేడు, యెవరితోనూచెప్పకుండా. అదృష్టం-—గుడ్డిలోమెల్ల—యేదోబాగుంది. సరే, అనుకున్నవుద్యోగం దొరికింది. తిరిగియింటికి వచ్చేడు. తండ్రిగారితో యీసంగతిస్పష్టంగాచెప్పేడు. భార్యనువెంటబెట్టుకొనే వెళతానని తండ్రిగారితోఅన్నాడు. తండ్రి బాగాఆలోచించేడు, కోడలుయొక్క సుగుణాలన్నీ గ్రహించినవాడవడంచేత, కొడుకుచెప్పిందే బాగుందనుకున్నాడు. ఒకమంచిరోజుచూచుకున్నారు. మదరాసుకు సుఖంగాప్రయాణం అయ్యేరు భార్యాభర్తలిద్దరూను. కోడల్నిపంపించనని మొట్టమొదట అత్తగారడ్డపడింది. ఘంటాపథంగా 'నేనుతీసుకువెళ్లకతప్పను, నాయిష్టం' అని విష్ణువర్ధనరావుఅన్నాడు. లక్ష్మి అత్తగారికీ, మామగారికీ నమస్కారంచేసి, 'వెళ్లివస్తాను సుబ్బులక్ష్మి!' అని ఆడబిడ్డతోచెప్పి, భర్తతో సుఖంగామద్రాసు చేరింది,—హాయిగాజీవనం చేస్తూంది.

# సౌందర్యము

శ్రీమతి యు. సత్యబాల సుశీలా దేవి గారు

౧

జ్యోతీక్ చిన్నపల్లెటూరిజమీందారు. కలకత్తాలోవుంటున్నాడు. చదువు, చక్కదనం, ధనం, గుణం ఎందునాకూడాలోపంలేదు. తగినగృహిణికావాలని అతనికింకాప్రబోధంకాకుండానే- లోచకపోవడం అనేనెపంతో హృదయం వెతుక్కుంటూన్నది. ఒకనాడు జ్యోతిక్ యావనప్రభంజనంలో లలితాసౌందర్యసుగంధం మందగమనంతోవచ్చేసియాతని ప్రేమహృదయం చలింపజేసింది. తండ్రివున్నప్పుడు లలితారాణి క్రిందపడి స్తేఅరిగిపొయ్యేది. అపుడు ఆమె లక్షాధికారికూతురు. ఇపుడో సామాన్యసిసోదరి. తల్లిఎంతిగారాబంగాచూసుకుంటున్నా ఆనౌకర్లు, అపట్టుడుస్తులు, ఆరత్నాభరణాలు ఇపుడేవి? అయినా ఆచూపుల్లో అమాయికపు చలనము, ఆగులాబీపెదవుల్లో చిరునవ్వువెన్నెలా, ఆకంఠధ్వనిలో మాధురీ ప్రవాహం, ఆపచ్చనిశరీరంలో ప్రవహించే విద్యుత్కాంతి అలాగేవున్నవి. వచ్చీరాని నేర్పుతో అల్లిబిల్లిగా అల్లుకున్నజడ, పిల్లవాయువుల్లో తేలిపోతూన్న ముంగురుల్లో మెరిసే కుంకుమబొట్టు, పాముకుబుసంలాగు పాదాలుదిగి జీరాడుతూన్నగులాబీచీర, బాహువల్లరి సౌందర్యం ద్విగుణీకృతంచేస్తూన్న నీలిపట్టురవికా, చేతులకు రెండేసిగాజులు, మెడలో చిన్న ముత్యాలదండ, చెవులకు చిన్నరవ్వకమ్మలు. ఇంతే యిప్పటి యామెముస్తాబు. పెంపుడుకుక్క వెంటనడుస్తూంటే పెంపుడుచిలకను చేతులోపెట్టుకొని వచ్చి తోటమధ్యవున్నగచ్చు అరుగుమీదకూర్చుని అవ్వేళే అన్నదగ్గరనేర్చుకున్న ఇంగ్లీషుపద్యం చిలుకకునేర్పుతూన్న ఆదృశ్యంచూచి జ్యోతీక్ చూపుమరల్చుకోలేకపోయ్యేడు. మీచెల్లెలిని చూడాలనేభావం సురేంద్రుడిదగ్గర కనబరచేడు. చెల్లెలిఅదృష్టానికి సురేశ్ పొంగిపోయ్యేడు. సురేంద్రుడి తోట జ్యోతీక్ మేడమీదికి బాగాకనబడుతుంది. సంపదంతాతండ్రితోపాటుగతించినా అతోట- ఆమేడ- కొద్దిగా ఆ స్తిమాత్రం నిలబడ్డవి.

౨

ఆవేళకు తిరిగివస్తానుగదాఅని గ్రామాంతరంవెళ్లిన సురేశ్ కార్యాంతరాలవల్ల రాలేకపోయ్యేడు. ఆసాయింత్రమే జ్యోతీక్ లలితని చూడ్డానికివస్తాడని లలితతల్లి ఆమెనుముస్తాబు చెయ్యడం మొదలెట్టింది. లలితకు యింతవరకూ అవసరంలేకపోవడంవల్ల ప్రత్యేకమైన విలువగలదుస్తులుగాని, వస్తువులుగాని లేవు. చూడ్డానికివచ్చేది జమీందారు. తన కూతురు తగినఆడంబరంగాలేకపోతే ఆమెకేమీబాగోలేదు. తనచిన్ననాటివస్త్రాభరణాలన్నీ బయటికితీసింది. ఆసుందరి ముఖానవాత్యమాడుతూండే ముంగురులన్నీ పైకిదువ్వేసి ఏడుస్తూన్నకొద్దీ సాధ్యమైనంతగట్టిగాబిగించి జడేసింది. ఆపైన ఆజడలో కొన్నివస్తువులు కూర్చి జడకనబడకుండా పువ్వులుకూర్చేసింది. ముక్కుకి ఆవిడపెట్టుకున్న నత్తు, బేసరీలు పెట్టింది. చెవులకేవోతగిలించింది. చంచలమైన యాపెద్దకళ్లకి దట్టంగాకాటుకపెట్టి

తిలకందిద్దింది. చూస్తేభయమేస్తోంది. ఆవ్రరంగు! ఆచెమ్కీపని! ఆలేసుకుచ్చులూ! అంతపెద్దది! ఆజాకట్టుతొడిగి దానికనుగుణంగా నిండుఊదారంగుబనారసుచీరకట్టించింది. ఆపై తనకున్నవస్తువులన్నీ ఎంతవదులైనా, ఎంతబరువైనా, ఆపిల్లఎంతఏడ్చినా—కంకణాలు, కాలిగొలుసులుకొన్నిజతలు, వడ్డాణము, మెడలోకాసులదండలు, వరహాలదండలు ఏవేవో అన్నీతగిలించింది. అయిదుగంటలుకొట్టగానే లలితాసుందరరూపం హృదయంలో చిత్రించుకుంటూ జ్యోతీక్ వచ్చేడు. కాబోయేఅల్లుడురాగానే ఏమిమాట్లాడాలో, ఎలా మర్యాదచెయ్యాలోనని వేసికున్నప్లానంతా తాత్కాలికహృదయావేగంలో కలిసిపోవడంవల్ల వచ్చిన పదినిమిషాలకీ అత్తగారు అల్లుణ్ని కూర్చోమనిమాత్రం చెప్పగలిగింది. "ఇదేమిటి! ఈవేషమేమిటి! ఆలలితే ఈలలితేలాగ? సురేశ్ ఏడి? అంతామోసం. సౌందర్యం భ్రమ. దూరపుకొండలునునుపు." జ్యోతీక్ తలతిరిగిపోతూన్నది. కొంతసేపటికి లలితకన్నీళ్లతో కలసినకాటుక మొహమంతాఅలుంకుంటూతలెత్తి జ్యోతీక్ వేపుచూసింది. తిరస్కారకోప సమ్మిళితంగా నవ్వుకుంటూ జ్యోతీక్ లేచినిలబడ్డాడు. లలిత బంధంవిడిపించుకున్న లేడిపిల్లలా పరిగెత్తింది. మరునాడు సురేంద్రుడువచ్చి సంగతేంటోకనుక్కోవాలని స్నేహితుడిదగ్గరకువెళ్లి నిన్నతానులేనందుకు క్షమాపణకోరుకున్నాడు. జ్యోతీక్ ఉదాసీనతచూచి భయపడుతూ మెల్లగా ఆవిషయంప్రస్తావించేడు. జ్యోతీక్ పెద్దగా ఊపిరితీసుకొని ఆవిషయమై ఆలోచించడానికి సమయంకావాలనిఅడిగేడు. ఆమాటతో సురేశ్ సెలవుతీసికొని లేచేడు. ఇంటికి వెళ్లుతూ ఇతడెక్కడో చపలచిత్తుడిలాగున్నాడు అనుకున్నాడు.

## 3

అవ్వేళసాయింత్రం జ్యోతీక్ షికారుకుపోలేదు. పరధ్యానంగా సురేశ్ తోటవైపుగా పిట్టగోడదగ్గరనిలబడి అర్థహీనంగాచూస్తున్నాడు. వయ్యారంగా వనలక్ష్మిలాగ తనశ్వాసకాలలో లలితవస్తోంది. అరే! ఏమిటీగోల? మొన్నఆవేషం! ఇవ్వాళఈవేషం! జ్యోతీక్ ఉలికిపడి సర్దుకున్నాడు. గుండెవేగంగా కొట్టుకుంటున్నది. ఆమె వచ్చేసి ఆఅరుగుమీదే ఆలాగే కూర్చుని చిలక్కిచెప్పినపద్యం వప్పచెప్పుకుంటూన్నది. ఈసమస్య ఎలాగనిర్ణయించడం? మళ్లా వాళ్లయింటికెళ్లిచూస్తే అలాగేకనబడుతుందేమో. ఎమన్నాకానీ అనుకొని తిన్నగతోటలోకివచ్చేసి కాస్తదూరంలోనుంచుని ఆనిర్మలసౌందర్యం తనివిదీరా తిలకిస్తూన్నాడు. దూరపుచూపులుగావు. నాఅవివేకం అనుకున్నాడు. ఆవిడకట్టుకున్న పసుప్పచ్చజరీచీర సంజకెంజాయతోకలసి ఆమెకు మరింతసౌందర్యంగూర్చింది. ఆపొట్టిచేతుల తెలిపట్టురవికలోంచి దుముకుతూన్న ఆశరీరకాంతిచూచితీరాలి. ఆవిడలేచిక్రిందపడిపోయిన చేరుమాలందుకుంటూంటే జ్యోతీక్ కనబడ్డాడు. ఇప్పుడాచూపులు జ్యోతీక్ హృదయాన్ని కలతబెట్టేశాయి. ఈచక్కదనం ఎక్కడుంటేమాత్రం ఏలాదాగుతుంది? మళ్లీ ఆవ్వేళటి వేషం ఈవేషంపోల్చుకునేప్పటికి జ్యోతీక్ కునవ్వాగలేదు. అవ్వేళటివేషాడంబరం ఈచంద

మామనుఃక్షమించమని వేడ్కొనసింది. సురేశ్‌ను అన్యాయంగానొప్పించేను, ఇప్పుడేవెళ్లిప్రాయశ్చిత్తంచేసుకోవాలనుకున్నాను. లలిత అప్పటికే మెరుపులామాయమైపోవడంవల్ల మరి ఉండాలిసిన అవసరంలేకపోయింది. శరవేగంతో సురేశ్ దగ్గరకువెళ్లేడు. జరిగిందంతాచెప్పేసి యిదంతా మీయమ్మగారి అలంకరణాచాతుర్యఫలితం గనుక నన్నుక్షమించవలసివుంటుందన్నాడు. సురేంద్రుడికికూడా నవ్వాగిందికాదు. ఇంతలో తోట్లోంచిబయలుదేరిన లలిత దాదా! అనిపిలుస్తూ గుమ్మందాకావచ్చి జ్యోతీక్ కనబడగానే అతనివైపు తీక్ష్ణంగాచూస్తూ గిరుక్కునతిరిగి వెళ్లిపోయింది. స్నేహితులిద్దరు ఒకరిమొహం ఒకరుచూసుకు నవ్వుకున్నారు. కొంతసేపు మాట్లాడి జ్యోతీక్ వెళ్లిపోయాడు. పర్యవసానం ఏవిటంటే వారంరోజులకు లలితాజ్యోతీంద్రులపెళ్లి! ఆవేళనుండి లలిత తోట్లోకిపోవడం మానేసింది.

## మల్లెపూవులకథ

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యల్.

మాపేరుమల్లెలు మాయింటిపేరు
పూలవారనుచెల్లబాలలంటారు;
సిరిసంపదలు మాకుబరువుగాలేవు,
ధన మింతగంధంబు ధవళకాంతులును.
నెలతలందరమేము నిత్యమల్లెలము,
బొండుమల్లియలెల్ల పురుషులుమాకు,
సన్నజాజులును మాజాతిలోవారె,
చంచరీకములు మాసావాసకాండ్రు.
భోజనంబులు మాకు భూమిసారంబు,
ఆలయంబులు మాకు ఆకుజొంపములు,
ఘనకార్యములు మాకు కళ్యాణవిధులు,
అనురాగమే మాకు హాయైనగాలి.
గాలిలోజనియించి, గాలిలోపెరిగి,
గాలిలోబెండ్లాడి, గాలిలోవలచి,
గాలిలోవికసించి, గాలిలోవాడి,
గాలిలోజీవాలు గడుపుకొంటాము.
వాసంతుడే రాజు, వనమె రాజ్యంబు,
వేవెల్గు, రేవెల్గు కావలయువారు,
నవ్వుమోములె మాకు నగలునాణెములు
మందయానలజడల్ మావాహనాలు.

శుభకార్యములు మేము చూడనివిలేవు,
కళ్యాణములు మేము గాంచనివిలేవు,
శోభనాల్జేసేము, సుఖములిచ్చేము,
పండుగులబాలించి ప్రతిభగన్నాము.
పూజాపురస్కారములలోన మేమె
పనులన్నియుంజేసి పాటుపడతాము!
కట్నాలుకానుకల్ ఘటియించువేళ
సద్గుణంబులుమేమె సాటిచెపుతాము.
సారెలో సిగ్గుచే జంకుజవ్వనికి,
అత్తవారింటిలో క్రొత్తకోడలికి,
దయితునిరాకకై తపియించుచెలికి
ఆనందమొనగూర్చి అభయమిస్తాము.
చిట్టిసాగసుకు మాకుపెట్టిందిపేరు,
మైత్రియందరితోడ మాయొక్కతీరు,
మనియుండినన్నాళ్లు మర్యాదసెడక
కాపాడుకొనుచుండి కళ్లుమూస్తాము.
మేమన్న అందరూ ప్రేమించుతారు,
ప్రజలప్రేమముకన్న భాగ్యమేముంది?
హాయినించుటయె మాకౌనుపావనము,
నెనరుబెంచుటయె మానిత్యజీవనము.

## పేరేమి పెట్టను?

పానుగంటి విజయరాఘవరావుగారు

క్రిందటిసహాయనిరాకరణపు దినాలలో పదేండ్లపిల్ల కళ. మెఱపుతీగలాగు దేహకాంతి - గుండ్రని ముఖము - చేరెడేసికన్నులు - మందహాసముతో బయలుపడే చెక్కిళ్ళమీద చిరుగుంటలు: ఇవి కళ చేయించుకొననిఆభరణాలు. జెబ్బలదాక చేతులున్న జపానుక్రేపు ఆఫారం - సింగపూర్ చీటీపరికిణీ - మెడలో ఆర్ అండ్ సన్స్‌హారము - చేతులకు అయిన్‌క్రీముగాజులు: ఇవి కళ చేయించుకొనిన ఆభరణాలు. అప్పటికి హైస్కూలులో రెండవఫారముచదివెడిది. కళ కాపురమున్న ఇంట్లో మనోహరం, రాజశేఖరం అను ఇరువురు పిల్లలుకూడా కాపురముండువారు. కళ ఈపిల్లలతోకలిసి ఆడుకొనుచుండెడిది. వారునివసించుపట్టణము, సముద్రతీరము కనుక ముప్వురును సాయంకాలములందు సముద్రతీరమున కాలముగడుపుచుండువారు. ఇసుకపై చిత్రింపబడిన తమపాదచిహ్నములు, సముద్రతరంగములలో కరిగిపోవుచుండుటచూచి, వారు. నిట్టూర్పులు నిగిడించువారు. కాలసర్పమువలెపైకిలేచి, విరిగిక్రిందపడు, అలలగర్వముచూచి నవ్వుకొనుచుండిరు. కెరటముల దెబ్బలకు జంకక, అచలమైయున్న కొండనుచూచి మెచ్చుకొనువారు.

*　　　　*　　　　*　　　　*　　　　*

మనోహరం నాజూకుగానుండువాడు. దేశభక్తిపూరితుడు. స్వదేశీపంచ, మోచేతులకుపైకిమడచిన స్వదేశీలాల్చీ, కుడిపాపటక్రాపింగు, బంగారుగొలుసుచేతిగడియారము కలిపిన మనోహరంబొమ్మ తయారగును. కన్నులు చిన్నవైనా భావపూరితాలు. కాబట్టి చక్కనివే. ఏలాగునవైన మనోహరంలో కళా సౌందర్యము ఉండెడిది. రాజశేఖరం కొంచెంస్థూలకాయుడు. అయినను మన్మథుని అపరావతారము. పుటముపెట్టినబంగార మతనిదేహచ్ఛాయ. గ్లాస్గోమల్లుపంచ, సిల్కుషర్టు, సన్‌ప్రూఫ్‌కోటు, రిమ్‌లెస్ కంటిచోడు రాజశేఖరానిని సదా ఆశ్రయించియుండెడివి. వీరిరువురమైత్రి మిగులప్రశంసనీయమైనది. ఊరివారికికూడా వీరిమైత్రి హృదయమునకెక్కెను.

కళకు రాజశేఖరమనినప్రీతి- ఆనందము. మనోహరమనిన జాలి- దయ. రాజశేఖరమును చూచుసరికి కళకు లోన సముద్రతరంగమువలె నేదియోపైకుబికెడిది. మనోహరమును చూచుసరికి బెంగ లోన ప్రవేశించెడిది.

'ఈమెను పెండ్లాడనిజన్మమేల' అని రాజశేఖరునియూహ. "ఈమె ప్రేమించువస్తువులో నే నొకయణువునైయున్న చాలు"నని మనోహరుని ఆశయము. "నన్నేల పెండ్లాడ"దని రాజశేఖరునిధైర్యము. "ఏమో! అట్టి భాగ్యమునావంటివానికి కలుగునా?"యని మనోహరునిదైన్యము. "పెండ్లాడననినయెడల రాక్షసవివాహము కావింతు"నని రాజశేఖరుని నిశ్చితార్థము. "నన్ను పెండ్లాడుమని యామెనుబలవంతము చేయుటకు నాకేమియధికారమున్న"దని మనోహరుని నైరాశ్యము.

కళమాత్రము రాజశేఖరునిపై మనస్సులగ్నముచేసెను. కాని అప్పటప్పట మనోహరునిమూర్తి యామెలో ప్రవేశించి అప్రయత్నముగా ఆమె కనుకొలుకులనుండి కన్నీటిబొట్టులై రాలి పోవుచుండెడది. 'పాపము'అని అప్రయత్నముగా అనుచుండెడిది. మనోహరం వ్రాసినగీతాలు ఆమె సదా సంగీతముతో పాడుచుండెడిది. ఒకనాడు కళ మనోహరునిగీతాలలో

"తిరిగి నీళ్లాడ దీకాలదేవత అపు
డనుభవించిన సౌఖ్యపుటరనిముసము"

అనిపాడుచుండగా రాజశేఖరమువచ్చి

"ఎన్ని నిదురశూన్యంపురే లీడ్చికొంటి
నో ముకుచుకొనసనికనుల..."

అని వచ్చియురాని రాగముతో పాడుకొనుచువచ్చెను. ఆతనినిచూచి కళ "శేఖరం! అబ్బ- వచ్చినావు టోయి- ఒడలు ఏమిటో, అవుచున్నది సుమా".

"కళా!

ఏనొకపుప్పలావికుడనేని తదీయకచాశరీరస
మ్మానితచిత్రచిత్రసుమమాలలనెన్నియొ

నీపాదాలమీద పడవేసినమస్కరించి యుందునుసుమా."

"మనోహరం పద్యాలు చాలాబాగుగావ్రాయగలడు సుమా. రాజ్! చూడుఈపద్యం. పాపము.

వాలుజడమీది చెట్టుసంపంగిదండ
కుడియెడమలకొత్తిగిలక జడతకాంచి
అకట! ఒక్కమారైన నాఅకలుషితపు
ప్రేమ తలచి తలాడపై రేగదేల?

శేఖరం! ఒక్కమాట. ఈమనోహరానికి ఈప్రేయసి యెవరోయి?"

"కళా! ఈవ్రాతవ్రాయువారి కిదొకపిచ్చి. ఏదో ఒకప్రేయసిని తలచుకొనుట. ఆమెను చిత్రించుట. ఆమెకై లేనిపోనిదే మదనతాపముపడుట. రాకపోయినను కన్నీరుమున్నీరైనదని పద్యాలలో ఏడ్చుట. ఈనవీనకవివరులకు మామూలు."

"ఏమోసుమీ! నాకట్టి నమ్మకములేదు. ఒక్కొక్క వ్రాతగాడికి రహస్యముగా ఒకప్రేయసి ఉండి తీరునని నానిశ్చితాభిప్రాయము. లేకపోతే వ్రాతకవిలేకనబడదు."

"ఆఁ. అదివట్టిదిలే. వ్రాసేవ్రాతకు చేసేకార్యానికి చాలాదూరము మనకవులలో"

"ఆలాగున సంఘాన్ని దూషించుటతప్పు. కాని మనోహరుని ప్రేయసియెవరోయి? నీతో చెప్పి యుండును."

"ఏమో, నాకు తెలియదు. నీతో చెప్పినాడాయేమి?"

"లేదు. కాని ఆలోచించగా"

"ఎవరని తేలినది?"

"నేనేనని"

ఈమాటవినుసరికి రాజశేఖరం నిర్విణ్ణుడై "కళా! నీఅభిప్రాయముతప్పు- ఆతడు నిన్నుప్రే..."

ఇంతలో మనోహరం

"వలపుతొలకరి మెరపువెన్నెల
చెలమలూరే ఆస్యసీమను
వేడియావిరి విరియబారిన
జాడపాడువడెన్-"

అని పాడుకొనుచువచ్చెను. కళకు ఒకకంట ఆనందము, ఇంకొకకంట దుఃఖము రెండుచుక్కలుగ వెలువడెను. మనోహరం "కళా! నాయనగారితో ఏమిటోచాలసేపు మాట్లాడినావే?" అని అడిగెను.

కళ:—ఔను నా వివాహవిషయమే మాట్లాడినాను. ఆ - మఱచినారు. శేఖరం! క్షమించాలి నా మొండి ప్రశ్నకు. నీవు నన్ను పెండ్లాడెదవా?

రాజ:—రైటు.

కళ:—మనోహరా! నీవో.

మనో:—నీవనుజ్ఞ నిచ్చు నెడల నిన్ను ప్రేమించెదను.

కళ:—అనిన?

మనో:—నీసౌందర్యము కనుల ఆకలి తీరునట్లు చూచెదను. నీపలుకులను చెవులదాహము తీరునట్లు త్రాగెదను.

కళ:—ఏమిటో, అంతా వేదాంతము.

రాజ:—మనోహరం! ఏమిటా అర్థశూన్యప్రసంగాలు. ప్రేమించిన పెండ్లాడవలెను. పెండ్లాడిన ప్రేమించవలెను.

మనో:—శేఖర్! నీవాక్యమందున్న మొదటిభాగము కొంతసత్యము. కొంతఅసత్యము. ఏలనన ప్రేమించినకన్యను పెండ్లాడిన జీవికిసౌఖ్యమెక్కువ. కాని నీవుప్రేమించినకన్య నీవశము కాకపోవచ్చును. నాబోటిక్రిమి సౌందర్యదేవతోపాసకుడగుటచే చక్కని స్త్రీని గాఢముగా ప్రేమింపవచ్చును. అట్లుప్రేమించుటలో స్త్రీపురుషులిరువురకుగూడ తప్పులేదు. కాని నాచే ప్రేమింపబడిన ఆవ్యక్తి, ఏకారణముచేనైన నావశముకాకపోవచ్చును. పెండ్లాడలేకపోతినికదా యని ప్రేమనుచంపుకొననా? ఈసంగతి స్త్రీలకుగూడ వర్తించునుకదా? ఆఁ. అదిగో మొగమునగము చేయుచున్నావు. నీలోనున్న దుర్బుద్ధి ఇదియే. స్త్రీస్వాతంత్ర్యమనుసరికి శవముఖమువేసెదవు. కాన ప్రేమించినవస్తువు తనకు స్వాధీనముకానికొలది దానియందు ప్రేమయెక్కువగును. ఇక పెండ్లాడినదానిని ప్రేమింపవలయుననికాదా? పెండ్లితో ప్రేమరాదు. ప్రేమతో పెండ్లియురానవసరములేదు.

రాజ:—ఏమో ఈమాటలన్నియు పుస్తకాలుచదువుటచే ఉడుకుజ్వరాలవలె పుట్టుచున్నవి.

కళ:—పోనీలెండు- ఎందుల కీఅనవసరప్రసంగాలు. మనోహరా! త్వరలో రాజశేఖరానికి నాకు వివాహము. నీవువచ్చెదవుకాదా?

మనో:—అవశ్యము. కావలసినంత కర్రపెత్తనముచేసెదను.

* * * * *

1930 సంవత్సరము ఏప్రియల్ ఆరవతేదీ కాలచక్రములో ప్రవేశించినది. ధర్మసంగ్రామములోనికి ప్రజలు దుమికినారు. ఓ- ఎక్కడచూచినను సభలే- ఎక్కడచూచిన సత్యాగ్రహసమరసన్నాహకోలాహలములే- రాజశేఖరం పూర్తిగామారిపోయినాడు- శుద్ధస్వదేశీబట్టలలో మునిగిపోయెను. కళ దేశదౌర్భాగ్యమును, వికసించిన వయస్సుకలదికనుక తెలిసికొని, స్త్రీలే దేశదౌర్భాగ్యమును తొలగచేయుటలో మొదటివారని తెలిసికొని, ఊరూరసభలుచేయుటకై తిరుగుచుండెను. ఇక మనోహరం అంతాసత్యాగ్రహమే- రాజశేఖరం బాహ్యవేషమే మారెనుకాని హృదయముమాత్రముమారలేదు. మనోహరం శేఖరునిగృహమునకు పూర్వమువలెనే వచ్చుచుపోవుచునుండువాడు- పైకిమాత్రము వారిమైత్రియందంత మార్పుకనబడుటలేదు.

ఒకనాడు ఎప్పటివలె మనోహరం రాజశేఖరుని గృహముప్రవేశింపపోవుసరికి లోన రాజశేఖరుని ఆగ్రహపూరితవాక్యములు వినబడుచుండెను. మనోహరం కొంతసేపాగి లోనికిప్రవేశించి "శేఖర్! ఇంకను కోపాగ్ని చల్లారలేదు. కాబోలు. అంతకుంచించుకొన్నావు మొగము" అన్నాడు.

# శ్రీరామనవమి: భద్రాచల దృశ్యములు



శ్రీరామదేవాలయము



ఆలయమునకు వెనుకవైపున



కళ్యాణమంటపము

కళ:—మీ శేఖరంగారి కోపము తీర్చే ప్రయత్నములో నీకు సాహాయ్యపడతాను, మనోహరా!

రాజ:—కళా! ఛీ, అపతలకు- పరపురుషునితో అనవసర ప్రసంగములెందుకు? అయినదిచాలదా?

మనో:—శేఖర్! ఏమిటి ఈవికృతము? అయ్యో! పూర్వపుటుదారమంతయు మనస్సునుంచి ఊడి పోయినదాయేమి? కాపురాలుచేయుచున్నవారి మనస్సులు అనుమానాలకు ఆస్కారం ఇచ్చునని అనుకొన వలసివచ్చుచున్నది.

రాజ:—మనోహరం! ఇకనీవు నాఇంటికిరాకు. నాభార్యతో కారణములేనిదే మాటాడకు.

మనో:—ఇకరానులే. కరిగిపోయెదను. గాలిక్రిందమారెదను. కాని నీచూపులనుంచి సెలవుపుచ్చు కొనుమునుపు నీకొకచిన్న ఉపదేశము చేయవలెననిఉన్నది.

రాజ:—నిన్న వేలకొలది ప్రజలలో కళ దేశాన్నిగూర్చి ఉపన్యాసము యిచ్చినదికాదా? ఆలాగుననే నీవుకూడ ఇచ్చెదవా?

మనో:—శేఖర్! ఎంత అజ్ఞానము నీబుఱ్ఱలో ఘనీభవించుకొనిఉన్నది? కళ నిన్నఉపన్యాస మిచ్చుటతప్పా?

రాజ:—ముమ్మాటికి.

మనో:—కేవలము అనుమానపిశాచమునకు బాడగాచాకరీచేయుచున్నావు నీవు. నీలోనమానుషత్వం ముసలిదయి రాలిపోయినదన్నమాట. నిన్న పాపము కళ నలుగురిలో లెక్చరిచ్చినదని రాత్రి ఆమెనుకొట్టి నావా? దుర్మార్గుడా! మానవవేషంలోనున్న రావణాసురునివలెనున్నావే?- శేఖర్! నీవు సంఘసంస్కరణ మును గూర్చి వ్రాసేవ్యాసములేమి? ఇచ్చేలెక్చర్లేమి? నీవుఇంట్లోచేసేచేష్టలేమి? ఎక్కడైన అతుకుఉన్నదా?

కళ:—మనోహరా! వృథగా ఊపిరిఖర్చుచేసెదవెందులకు?

మనో:—శేఖర్! ఇక ఈరోజుతో మనకుసరి. కనుక ఈలాగునచూడు: నీవు శర్మగారిఇంటికి అస్త మానము వెడలెదవెందుకు?

కళ:—వెళ్లడమే కాదు. రోజు అస్తమానూ అక్కడేమకాం.

రాజ:—శర్మగారిభార్య చాల ఉదారస్వభావముకలది. ఆమె ఆదరణ అనుపమానము.

మనో:—నీవుఆమెతో ఆలాగున నిర్భయముగాతిరుగుట, శర్మగారులేనిసమయము కనిపెట్టి, ఆమెను ఆమెస్నేహితురాండ్రను బండిలోవేసికొని తిరుగుట నీకుమంచిదేనా?

రాజ:—మనోహరం! ఇప్పుడు నీకుమానుషత్వములేదు. వారు ప్రేమైకజీవినులు. సౌందర్యోపాసినులు. నిర్మలహృదయలు. నేనుకూడ అట్టివాడనే. మనస్సులుకలసినవి.

మనో:—సరే బాగుగనేయున్నది. నీభార్యమాటయేమిచెప్పినావు? నీవు పరస్త్రీలలో నొకస్త్రీపై తిరిగిన అదినీకుమంచిదియా? నీభార్య దేశమునుద్ధరింపుడని తోడిసోదరుల వేడుకొనినతప్పా? నీవు పల్లె లన్నియు ఈమహిళామణులతో తిరుగుచున్నవా? ఇట్టినీవు- స్త్రీస్వాతంత్ర్యము నిర్మలహృదయముతో కోరు నీవు- ప్రేమ దైవస్వరూపమని వేదాంతం ఒలకపోసిననీవు- నీభార్యను నీస్నేహితుని ఇంటికితీసికొని వెళ్లినావా? ఆమెను నీస్నేహితులకు పరిచయముచేసినావా?

రాజ:—ఓహోహో! పాకముముదురుచున్నదే. కాని నీవుచెప్పినవన్నియు నిజమని ఒప్పుకొనక తప్పదులే.

మనో:—ఇంక కొంచెమువినుము. నీతోచదువుకొనిన వీరాస్వామిగారు చూచినావా పాపము పొటా సియముసైనైడ్ పుచ్చుకొనపోయినారు. ఎందులకోచెప్పనా? తాను మఱొకరినుంచి బలాత్కారముగా

లాగదలచిన స్త్రీ ఇంకొకని చూపులకు కన్నులతో జవాబుఉత్తరము వ్రాసినదని. ఇది అంతయు వారి ఊహా నిర్మితము. ఇదంతయు నీవెఱుగవాయేమి? ఈలాగుననున్నది మీప్రేమ. చిన్నతనమునుంచియు నీదికొంత మొండిపాకమే. కాని కళమాత్రము పాపము నిన్ను నిష్కల్మషముగా ప్రేమించుచున్నది. ఎంతో సౌఖ్య సముద్రములో నుండవలసిననీవు కానివారితోతిరిగి ఆదర్శప్రాయుడనైతి ననుకొనుచుంటివేమో- హాస్యాస్పదుడనైతివి.

రాజ: —బ్రహ్మచారివి. కబుర్లెన్నియైనను చెప్పగలవు.

మనో:—ఆజన్మబ్రహ్మచారిణిలు-మగలనుపవాసములుంచు మగనాలులనేస్తముకంటె నాఉపన్యాసము కళగానేయుండునులే. వెన్నవంటికళను కొట్టుటకు నీచేతులెట్లుసాగెను? ఇంకొకరిభార్యలనైపు మనము కన్నులకు అనిమిషత్వము తగిలించిచూచినతప్పులేదు. అది సౌందర్యోపాసన. కాని మనభార్యమాత్రమింకొకనివైపుచూచిన ఓ- మనహృదయములో తుపాను- కాలిక్రింద అగ్నిపర్వతము- కన్నులలో విషప్రవాహము- చేతిలో ఆత్మహత్యయో లేక స్త్రీహత్యయో- ఈవిధముగానున్నది మనసొసయిటీ.

రాజ:—మనోహరం! పశ్చాత్తాపమువచ్చినది. నన్నేమిచేయుమనెదవు?

మనో:—కళకు దొమ్మరివేషమువేయించి గడమీద సర్కస్‌చేయించమని నేననుటలేదు. ఆమెకు స్వాతంత్ర్యమిమ్ము. నీవు ఉపన్యాసాలలో స్త్రీస్వాతంత్ర్యమునకిచ్చిన ఖరీదులో లక్షవవంతు ఆమెకిమ్ము. నీవురాట్నముపడుకుము. బట్టలునేయింపుము. వానినన్నిటిని కళ అమ్ముకొనిపచ్చుచుండును. ఊరూరతిరిగి దేశసౌభాగ్యమునకు, దేశీయస్వారాజ్యమునకు, దేశదాస్యవిమోచనమునకు స్త్రీయే, స్త్రీయే మూలమని చాటుము. భావికాలములో భార్యలుకలపురుషులు దేశమునకు చేయుమేలేమేలు......కాని శేఖర్! నీకథ అంతయు వ్రాయవలెనని ఉన్నది.

రాజ:— పేరేమిపెట్టెదవు?

మనో:— పేరేమిపెట్టనా? అని ఆలోచన.

# దేవదాసి

కావ్యవిశారద అనుముల వేంకటశేషకవిగారు

దేవసేవార్థమైన జాతికినిజేర్చి
భారతీయులు మమ్ము పూర్వముననుండి
"దేవదాసీ" లటంచును పావనప్ర
భావదంబైన పేరుతోఁబలుకుచుండ
నూదుకడ్డీలకంటె మహోన్నతముగఁ
బ్రజ్వలించుచు దేవతారామములను
నాట్యములొనర్చుచుంటి మానాటనుండి
పూజనీయంబుగనె ప్రొద్దుపోవుచుండె.
తెలియనైతిని మాజాతితీరు, వారి
కట్టుబాటులు జీవిక కష్టసుఖాల
వాలమనుకొంటి; నీ దేవతాలయముల
నరులుదేవునిసేవింప, నాకు వారి
పాదధూళిఁగ్రహించెడి పాటుగదిరె.

చమురు, వత్తియు-జ్యోతియైజ్వాలలెగయు
చందమున నామనంబు ప్రజ్వలితమయ్యె
నార! దుష్టులాచారకారణమున
నిలువునదహింపఁబడితినో నేనుగూడ.
వింటిరేనాదుపాట మీవీనులార?
కంటిరేనాట్యకలన మీకన్నులార?
కలవుదీరెనె?—తీరిక కల్గెనేని—
భారముగఁ దోపలేదె నాబ్రదుకుమీకు?
వాలుజూపుల కోపులనైభవంబె
వలయు; నాయాటలేల కావలయుమీకు?
భావమెఱిఁగిన-చో నేను దేవదాసి
నగుటమృష—మానవునిదాసినగుటనిజము.

## నూతన వధూవరులకు

శ్రీ రిపి ఆంజనేయులు గారు

వధువునకు

అనయంబు సేవింపు మత్తమామలభక్తి
నాఁడుబిడ్డలఁజూఁచుమమ్మ రక్తిఁ
బతినిబ్రాణముగాఁగ భావించి యేవేళ
సకలోపచారముల్ సల్పుమీవ
బాంధవకోటిని బరమాదరమ్మున
నరయుము దీనులఁగరుణఁగనుము
పెద్దలగురువృత్తిఁ చిన్నలసంప్రీతిఁ
బరిజనమ్ముల దయాగరిమఁగాంచు
మితరసాధ్వులతోడ వర్తింపుమెలమి,
నింటఁగోటిచంద్రులు నుదయించినట్టు
లెపుడుఁ గలకలనవ్వుచు, నెల్లవారి
కింపుఁగూర్పుము గృహలక్ష్మియిదియనంగ.
కోపమనునది యెంతయుఁ బాపహేతు
వగును; దానిని దరిఁజేర్పవలదునుమ్మ.
ఓర్పునఁ భూమివలె సతియొప్పవలయుఁ
గాన, నిత్యప్రశాంతిని బూనుమమ్మ.

వరునకు

కడుపుదెఱచినీకుఁ గన్యనొసంగిన
యత్తమామలయాజ్ఞ నరయుమయ్య
అబల-కృశాంగి-మహాసుకుమారి మా
చిన్నితల్లినిఁ బ్రీతిసేయుమయ్య
అర్ధ్వవిద్యావతి- యనుపమగుణ- దీని
కొప్పిన స్వాతంత్ర్యమొసఁగుమయ్య
'అతిథిదేవోభవ' యనువేద, మద్దాని
నెంచిసార్థకము గావింపుమయ్య
ఆప్తమిత్రుల, విబుధుల, నాశ్రితులను
నుభయపార్శ్వంపుఁ జుట్టాలనొక్కభంగిఁ
దనియఁజేయుచు, ఘనులదీవనలఁ గొనుచు
నెసఁగుమోతండ్రి! గృహపతియితఁడనంగ.
సతులకంటె, గుణంబులఁ బతులువేయి
మడుఁగు లాధిక్యమునుజెందిమనుటయొప్పు
గానఁ, గరుణయు సహననిగ్రహములొకట
నెసఁగ, నీలలితాంగి భరింపుమయ్య!

వధూవరుల కట్నములు

అనుఁగుఁ బితరులకడనుండి, యాఁడుబిడ్డ
లల్లురును గొను నూత్నోపహారచయము
లందు, భారతీ - గృహలక్ష్మలధికతమము
లగును, విజ్ఞానకోశంబు లవియకాన.

## పరిచిత కంఠము

శ్రీమతి బసవరాజు వేంకట రాజ్యలక్ష్మీ గారు

ఆకసమున నవిగొ చుక్క-
లల్లుకొనెను, చందమామ
వృక్షములసందునుండి
తొంగితొంగి చూచుచుండె!
కొండలోయ దిగెడువాగు
నుండిజీవజలములవిగొ,
నురగగ్రక్కునలలతోడ
గుసగుసలాడుచుపోయెడు!
పండువెన్నెలన్ మెయిపర
వశమందగ కోకిలంపు
పాటకుచెవియొగ్గి, పూల
వాసనకున్ మదినిపొంగి,
కూరుచుంటి సుఖముగ నీ
కొండరాతిపైన, నౌర!
యేమిటిద్ది సఖి! యంచు
నెవరో! పిలచినట్లుదోఁచె!
నమృతమధురనాదముతో
నాత్మకట్టుకట్టిలాగు
నీకంఠము మున్నెపుడో
విన్నయట్టులున్నదహో!

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు

నెచ్చెలీ! మనమిత్రురాలగు రాజ్యలక్ష్మి నాకొకజాబువ్రాసినది. ఆజాబువలన కపట వేదాంతులుకొందఱు గ్రామములలోజేరి యెంతబీభత్సముచేయుచున్నదియు, అమాయకు లగు గ్రామజనులు వారిమాయావాగురలలో నెట్లుజిక్కువడుచున్నదియు తెలియుచున్నది. దానిని వేఱె నామాటలలో నీకు తెలుపుటేల? రాజ్యలక్ష్మివ్రాసినజాబునే నీకుఇందుతో బంపుచున్నాను, చూడుము.

"సౌభాగ్యవతియగు శారదకు

సోదరీ! ఎప్పుడు మనము పాఠశాలలో చదువుకొంటిమో, ఎప్పుడు అచ్చెనగాయ లాడుకొంటిమో, ఎప్పుడు దాగిలిమూతలాడుచు పరుగులెత్తితిమో, ఎప్పుడు బొమ్మల పెండ్లిండ్లుచేసి గుజ్జెనగూడు విందు లారగించితిమో, ఎప్పుడు వివాహమాయెనో, ఎప్పు డత్తవారియింటి కేగితినో అంతయు స్వాప్నికగాథ; మూడు నాళ్ల ముచ్చట. క్షణములో కలగని తెల్లవారినట్టులైనది నా బ్రదుకు. "అది అంతయు సుఖ సమాచారము, సుఖములు అనుభవించినట్టులుండవు. కష్టములు పీటలు పెట్టుకొని కూర్చున్నట్లుండును." అని అందువేమో! ఇరువదేండ్లప్రాయములో కన్నెతనము, ఆయిదవతనము అన్నియు చెల్లిపోయి దుర్భర మైన వైధవ్యావస్థ తలపైబడినపుడు నా జీవితములో సుఖముకంటె దుఃఖమే యెక్కువ పాలనుకొనక మానుటెట్లు? కాని నా యీదుఃఖమంతయు నీవెఱుగనిది కాదుగదా? ఎన్నిమాఱులో జాబులు వ్రాసినావు, ఎన్నిమాఱులో స్వయముగా వచ్చిచూచినావు? నీ సౌహార్దము నాకు మఱతుమన్నను మఱపురాదు. కావు ననే యిన్నికష్టములలో గూడ నీ స్నేహసౌహార్దము తలంచుకొని నప్పుడు నా కొకింత ఆనందము కలుగు చుండును. మఱియు నేవింతసమాచారము విన్నను నీకు తెలియజేయువలుకు తోచకుండును. కడలేని నాదుఃఖసాగరములో నీతోడిసఖ్యత యొకటే సుఖమిచ్చి.

ఈమధ్య మాగ్రామమున కొకవేదాంతురాలు వచ్చినది. ఆమె మా గ్రామమునకు క్రొత్తగా వచ్చిన మేష్టరుగారి తోబుట్టువు. నావలెనే గంగాభాగీరథీసమానురాలు. భారత భాగవతములు చక్కగా రాగ యుక్తముగా చదువగలదు. సీతారామాంజనేయములోని పద్యములు, పంచదశిలోని మహావాక్యములు, ఆమెకు కొట్టినపిండి. భగవద్గీత ఆమెకు కంఠపాఠము. ఎక్కడ ఏఅధ్యాయములో ఏశ్లోకమును చెప్పుమన్నను తడువుకోదు. ఇక అధ్యాత్మరామాణములోని కీర్తనలు, తరంగములు, తత్వములు ఆమెకు వచ్చునని చెప్పుట అల్పవిషయము. ఇట్టి పండితురాలు ఎందుమొగమెఱుగని మాగ్రామమునకు వచ్చినప్పుడు వారి కేవిధముగా బ్రహ్మరథము పట్టుదురో చూచినవారికే అనుభవము. మాగ్రామమునకువచ్చిన విదుషీమణిపేరు పూర్ణమ్మ. ఒక్క నెలయైనను పూర్తిగాకమునుపే పూర్ణమ్మగారి పాండిత్యప్రతిభ మాగ్రామమంతయు నల్లుకొన్నది. ఊరిలోని సగము ముప్పాతికమంది స్త్రీలామెకుశిష్యురాండ్రైనారు. రాత్రియనక పవలనక ఆమెను సేవించుట మొదలు పెట్టినారు. కొందఱ కామె వేదాంతదేశికురాలు. మఱికొందఱికి చదువులపంతులమ్మ. ఇంక కొందఱికి పాటలు పదములు నేర్పుగాయకురాలు. ఇంకను మఱికొందఱాపుత్రరాండ్రకు ప్రణవమంత్ర ముపదేశించి ముముక్షుజననిధానమగు పరతత్వమును చూపింపగల గురుదైవము. ఆమె గ్రామస్త్రీల నాకర్షించిన విధ మును, ఆమె ప్రజ్ఞావిశేషములును చూచి పెద్దపెద్దలే సమ్మోహితులైనారు. ఆడుదానికి చదువెందుకని

యీసడించే మూడుకాళ్లముసలమ్మలు, సనాతనధర్మపరాయణులగు పురుషోత్తములుగూడ పూర్ణమ్మగారి దంతయు భగవచ్చింతయేగాని యీకాలపు మిడిమిడిచదువులుగావు, ఆమె పాదము బట్టినను తప్పులేదు, ఆమె శుశ్రూషచేసినను తప్పులేదని తీర్మానించి తమ ఆడవారినిగూడ ఆమెవద్దకు పంప ప్రారంభించినారు. తామెందులోను చేరక, చేరినవారిని యుక్తాయుక్తవిచక్షణలేక తీవ్రముగా నాక్షేపించుచుండెడి యీ కన్సర్వేటివ్ పార్టీ వారినిగూడ తనవశము చేసికొనుటచే పూర్ణమ్మగారి సన్నిధికి పోయేబాట నిష్కంటకమైనది. కాబట్టి శీఘ్రకాలములో చాలమంది ఆమెకు నిర్భయముగను నిశ్శంకముగను శిష్యులైనారు. మాతలిదండ్రుల బలవంతముపల్లను, ఆమె విద్యావిశేషములు నామనంబునుగూడ నాకర్షించుటచేతను నేనుగూడ ఆమె దర్శనము చేయవలెనని వెళ్లినాను. మీ బావగారు పోయినతరువాత ఎనిమిదేండ్లకు సెలవుగా పట్టపగలు బయటకువచ్చుట ఆదియే మొదలు. అప్పుడింకను రెండుగంటలైనను కాలేదు. నల్గురు రాకముందే తీసికొని పొమ్మని నేను మా అమ్మను తొందరపెట్టుటచేత ఆ యెండలోనే తీసికొనివెళ్లినది. పూర్ణమ్మగారు తత్వజ్ఞురాలు గనుక పరమసాత్వికురాలుగా నుండునని నాయూహ. కాని ఆమెను చూడగనే నాయూహ హుఘ్న ఎగిరిపోయినది. మంచి హోదాగల అధికారివలె పూర్ణమ్మగారుఉన్నది. వ్రేళ్లను రెండుమూడుంగరాలు రాళ్లువేసినవి వేయనివికూడ ఉన్నవి. మనిషి కొంచము నలుపు. ఉన్నతము పుష్టియు సమానముగా నుండి భారీమనిషి అనిపించును. నల్లనిలలాటమున తెల్లని విభూతిరేఖలు మైలుదూరమునకైన కన్పడునంత దట్టముగా ఉన్నవి. అప్పటి కింకను పూర్ణమ్మగారు గ్రంథకాలక్షేపముచేయు సమయముకాకపోవుటచేత ఆమె ముఖ్యశిష్యురాండ్రిద్దరు తప్ప మరెవ్వరును లేరు. మెత్తని చిఱుచాపమీద తెల్లని గలీబు తొడిగిన దిండువేసికొని తానుకట్టుకొనిన చలువధోవతిలోని యొకమడతయైనను నలుగకుండ ఒప్పిదముగా పడుకొని యున్నది. ఒక శిష్యురాలు తములపాకులకు సున్నము రాయుచున్నది. మఱొకామె మామిడిపండ్లు కోసి చిన్నపళ్లెరములో పెట్టి పూర్ణమ్మగారి సమీపముగా నుంచి విసనకఱ్ఱతో విసరుచు ఆమెకు ప్రక్కగా కూర్చున్నది. ఆనైఖరి చూచి మేమప్పుడు వచ్చుటకు తరుణముకాదేమో అనిపించినది నాకు. కాని మాఅమ్మమాత్రము నిశ్శంకముగా నన్నామెకడకు గొనిపోయినది. మా అమ్మను ఆమె బాగుగా ఎఱుగును. కాన ఇరువ్వురకు మాటలు కలియుటకు ఆలస్యము కాలేదు. ఆమె ఎవరని నన్నుచూపి పూర్ణమ్మగారు మాఅమ్మను అడిగెను. మాఅమ్మయేనండి ఎనిమిది సంవత్సరాలైంది పెనిమిటిపోయి. నాటినుండి నేటిదాకా ఒక్కటేతీరు. ప్రపంచం చూడదు. దుఃఖం మానదు. ఏమో మీవంటి పెద్దల దర్శనంచేస్తేనైనా యీ వెఱ్ఱి దుఃఖం మానుతుందేమోనని బలవంతాన తమ సన్నిధికి తీసుకువచ్చేనని ప్రశ్న కవకాశము లేకుండ అన్ని సంగతులు మాఅమ్మ ఒక్కమాఱుగా చెప్పినది. పూర్ణమ్మగారు తలయూపి బెట్టుగా ఊరకొనినది. మన్మనో వ్యథను దూరీకృతము చేయగల ఆప్యాయకరమైన మాట యేదియైన నామె నోటినుండి వెలువడునేమోనని ఆసక్తితో చూచితిని కాని రాలేదు. ఆమె శిష్యురాలు మాత్రము మంచి పనిచేశావు పార్వతమ్మక్కా! రాజమ్మను యిక్కడికి తీసుకొస్తేబాగుండునని నేనుగూడా ఎన్నిమార్లోఅనుకున్నాను. అమ్మగారిపాదం బట్టితే అన్నిచింతలుపోతాయి. రాజ్యం అదృష్టబాగుండపట్టే నీకు మంచిబుద్ధిపుట్టి అమ్మగారిసన్నిధికి తీసుకొచ్చేవు. రోజూ ఇట్లాగేతీసుకొస్తే అదేఅలవాటవుతుంది. వారి నోటివాక్యాలే అన్నిచింతలూ పోగొట్టుతాయి, అన్నది బుచ్చంపిన్ని. శిష్యురాలైన బుచ్చమ్మగారీవిధముగా స్తుతింపగనే పూర్ణమ్మగారికి స్వాతిశయము హెచ్చినది కాబోలు "నావద్దయిటువంటివారెందఱో దుఃఖవిముక్తులై గురుకటాక్షంపొందేరు. ఇంతకు అదృష్టంబాగుండాలె. మహనీయులకటాక్షం కలగాలె. అనేకజన్మకృతపూర్వపుణ్యావిశేషంచేతగాని

బ్రహ్మవేత్తలైన వారిదర్శనంకలగడం, వారిశుశ్రూషలుచేయడం, వారికటాక్షం పొందడం లభించదు అన్నారు." చిత్తము తమరు సెలవిచ్చినమాట వాస్తవం, పెద్దలదర్శనము సామాన్యంగాకలుగుతుందా? అది సుకృతవిశేషమే అన్నది మాఅమ్మ. నేనేమియు మాట్లాడలేదు. ఉభయులమాటలువినుచు తలవంచుకొని ఒక ప్రక్కకు ఒత్తిగిలికూర్చున్నాను. ఈవిధముగా మాటలుజరుగుచుండగనే పూర్ణమ్మగారు మామిడిపండు ముక్కలు తినుటైనది. శిష్యురాండ్రిచ్చిన నీటితోపళ్లెరములోనే చేతులుకడిగికొని తములపాకులందుకొని వక్కపొడి నోటిలోవేసికొనినది. ఫలహారతాంబూలాదులగునప్పటికి మూడుగంటలైనది. పురాణమువిన వచ్చుస్త్రీలొక్కరొక్కరే రావడము, పూర్ణమ్మగారి పాదములకుమ్రొక్కి ప్రక్కగాకూర్చుండడము ఆరంభించినారు. ఒక్క అరగంటలో చావడినిండిపోయినది. వారిలో కాపులు, రెడ్లు, కమ్మవారు, కోమట్లు, విశ్వబ్రహ్మణులు, ఒకరేమిటి అన్నికులములకు చెందినవారుఉన్నారు. అందఱు చేరబారినతరువాత ప్రార్థనశ్లోకములు, పద్యములు, పాటలు మున్నగు ఆడంబరములతో పూర్ణమ్మగారు భాగవతపఠనమారంభించి నారు. ఆనాటికథాభాగము దశమస్కంధములోని కృష్ణలీలలు. కృష్ణలీలలకు పూర్ణమ్మగారు గొప్ప అంతరార్థము చెప్పిరి. అత్యంతనిగూఢవిషయములనుసైతము అమె విప్పివిప్పిచెప్పుచుండ దివ్యమైన ఆవాక్యార్థ ప్రసంగములలో నేను నిమగ్ననై నన్ను నేనేమఱచితిని. ఎన్నిరాజసలక్షణములున్న నేమి? ఈయొక్కపాండిత్య ప్రకర్షకే ఆమె పదసేవచేయవచ్చుననుకొంటిని. కాలక్షేపము జరిగినంతసేపు ఆమెశిష్యురాండ్రామెకు విరామములేకుండ వీవనలు విసరుచునేయుండిరి. ఆమె వాగమృతధారలుగ్రోలి తనిసిన ఆయానందములో ఆవీవన నేనుగూడబట్టుకొని ఆమెనించుక పరిచరింతమనియనుకొంటిని. కాని నాకు మాయబిడియముగదా! కాన నాతలంపులు-బుద్బుదములు నీళ్లలోనేబుట్టి నీళ్లలోనే కలిసిపోయినట్లు-నాలోనేపుట్టి నాలోనే కలిసిపోయినవి. ఇంచుమించుగ రెండుగంటలకాలము కాలక్షేపము జరిగెను. తదుపరి ఎవరియిండ్లకు వారునెడలిరి. క్షేమును అమ్మగారి సెలవుపొంది యింటికివచ్చితిమి. తరువాత రెండుమూడుమాఱులిటులనే భాగవతకాలక్షేపములకు వెళ్లివచ్చితిని. అన్నియు వదులుకొనినను యెవరైనచదువుచుండిన వినెడియిచ్ఛమాత్రము నన్ను వదలిపెట్టలేదు. కాన పూర్ణమ్మగారు యితరగ్రంథార్థములుపన్యసించుచుండగ కూడ వినవలయునని నాకు కుతూహలముకలిగెను. ముఖ్యముగా భగవద్గీతార్థము లామెవలనవినవలయునని నామానసంబపేక్షించుచుండెను. కాన అమ్మగారు భగవద్గీతనుజదివి అర్థముచెప్పునదెప్పుడని యామె శిష్యురాండ్రనడిగితిని. సాయంత్రము యేడుగంటలైనతరువాత భగవద్గీతచదువుదురని వారుచెప్పిరి. అప్పుడొకమాఱు వెళ్లవలయునని తలంచి మాఅమ్మను తీసికొనిపొమ్మంటిని. సరేయని మాఅమ్మతీసికొనివెళ్లెను. కిటికీప్రక్కగా ఒకనవారుమంచమున్నది. ఆమంచముపై గోడకుచేరవేసిన బాలీసానుకొని కాళ్లుచాచుకొని పూర్ణమ్మగారు కూర్చున్నది. కన్నులకు సులోచనములు, చేతిలో పుస్తకము, ప్రక్కను స్టూలుమీద లాంతరు పెట్టుకొని పూర్ణమ్మగారు చదువుటకు ఉద్యుక్తురాలైయుండెను. చుట్టును నల్గురుశిష్యురాండ్రుండిరి. ఒకామె పాదములుపట్టుతున్నది. మఱొకస్త్రీ వీవనతో విసరుచున్నది. తక్కినవారిద్దరు మంచపుపట్టెపట్టుకొని ఆమె పాదముల చెంతగా కూర్చున్నారు. ఆ అయిదుగురు ముఖమునపట్టించుకొన్న విభూతిరేఖలు దీపపువెలుతురున స్ఫుటముగా కనబడుచున్నవి. ఆదృశ్యంచూచి నేనాశ్చర్యచకితురాలనైపోయినాను. శిష్యానుగ్రహముకొఱకుమాత్రము మహావేదాంతినియగు పూర్ణమ్మగారిట్టిమహాభోగమనుభవించుటయు, ఆమెనింతగా వీరుసేవించుటయు బాగుగా ఉన్నదా? నా అంతరాత్మ తనలో తానే పశ్నలువైచుకొనినది. కాని సరియైన ప్రత్యుత్తరము మాత్రము పడయలేదు. ఇంతలో పూర్ణమ్మగారు భగవద్గీతాశ్లోకములు చదువుటారంభించినారు. ఒక్కొక్క శ్లోకము చదువుట, దానికి అర్థతాత్పర్యాదులు వివరించుట, ఆపై వానిలోని విషయముపై చక్కనిప్రసంగము. అరటి

పండు ఒలిచి చేతబెట్టినట్టున్నది. నామనస్సు మరల ఆనందసాగరములో నోలలాడనారంభించినది. గీతాశ్లోకములనిన నాకుకడుప్రీతి. పూర్ణమ్మగారి అర్థమంతకంటె ప్రీతికరముగానున్నది. ఒకగంటసేపీకాలక్షేపము జరిగినది. మా అమ్మయు నేనును యింటికిబయలుదేరివచ్చుచు వస్తావా? బుచ్చమ్మక్కా! అనిబుచ్చమ్మపిన్నిని పిల్చినది. బుచ్చమ్మగారు జవాబుచెప్పకుండ గుమ్మముదాకమాతోవచ్చి అమ్మగారు తలంటిపోసికొందురట, కాగానే వస్తానని చెప్పి లోనికివెళ్లినది. ఆమాటవినగానే నామనస్సేమో ఆందోళనపాలైనది. "ఇహభోగవిరాగమును బోధించేతత్వజ్ఞురాలేమి? ఈ అభ్యంగనాదివ్యవహారములేమి? పోనీ తలవెంట్రుకలు కలదైనకాదే? ఇటువంటి ఆమెకు తలంటిపోయుటకు మెటికలవంటి నల్గురు విధవలుకనిపెట్టుకొని కూర్చుండుటేమి? తలలు బోడులైనను తలపులు బోడులుకావను సామ్యము సార్థకమగుచున్నదే". అనుకొని త్రోవలో "అమ్మా! ఇదేమి? ఇప్పుడే ఎనిమిదిగంటలైందిగదా. ఇక ఈమె తలంటిపోసుకొనేదెప్పుడు? వాళ్లుయిండ్లకు వచ్చేదెప్పుడు? ఈమె మాటలకు చేతలకు పొందికలేనట్టున్నదే" అని మాతల్లితోఅంటిని. మాఅమ్మకుగూడ ఏమిచెప్పుటకును పాలుపోలేదు కాబోలు ఏమిటోనే అమ్మాయీ! అంతావింతగాఉంది అనినది. శిష్యులను అనుగ్రహించడానికేమో, పెద్దల ఉద్దేశాలు మనంతెలుసుకోలేముగా, అన్నానునేను తిరిగి. ఉఁ అనుగ్రహమూ, పాహూ అని మాఅమ్మ విసుగుగాజవాబిచ్చినది. ఆరాత్రియింటికివచ్చినను నాకు పూర్ణమ్మగారినిగూర్చినవితర్కము మనస్సునుండి తొలగిపోలేదు. ఆరాజసము, ఆఠీవి, ఆభోగాభిలాష నాకు మాటిమాటికి కన్నులగట్టినట్టులుండి శిష్యులననుగ్రహించునెపమున మాత్రము యిట్టిరాజసము నెవరైననలవర్చుకొనవచ్చునా? ఇది తన్నుదాను వంచించుకొనుటగదా, తాను చర్చించెడు పారమార్థికవిషయములేమి? అనుభవించెడి భోగములేమి? తానాచరించి యితరులనాచరించుమని చెప్పువారేగదా ఆచార్యత్వంబునకు తగుదురు? మనోవాక్కర్మంబులొక్కటిగా ననుష్ఠింపజాలనివా రితరులకు పరమార్థోపదేశము చేయుటకర్హులగుదురా? అని ఇట్టి సందియములెన్నియో నామనస్సును కలంచెను. అయినను ఏయుద్దేశముతో ఆమెయిట్లు ప్రవర్తించుచున్నదో సంగతి చక్కగా తెలిసికొనక విమర్శించరాదని యనుకొని మరల మనస్సమాధానము చేసికొంటిని. మొదట పూర్ణమ్మగారి ప్రసంగోపదేశములు ప్రతిఫలరహితములుగానుండెను. తదుపరి శిష్యురాండ్రే నేర్పిరో ఆమెయేకోరెనోగాని కూర, కాయ, పెరుగు, నేయి, పాలు, పండ్లు, కొంచెమువిడిముడి స్వీకరించుచుండెను. మన స్త్రీలకు ఒకరినిచూచి ఒకరుచేసెడివెఱ్ఱి అధికముగదా. వారిచ్చిరి మేమీయకపోవుటేలయని క్రమముగా పప్పుబియ్యములేమి ఫలశాకములేమి పాలునేతులేమి యామెకు దోచిపెట్టసాగిరి. ప్రతిస్త్రీకిని ప్రతియింటను యీవిధముగానర్పించుస్వాతంత్ర్యముండదుగదా! కాన చాటుమాటులుగూడ ప్రబలెను. గ్రామస్త్రీలవలన నిట్టిరాబడిచూచుకొనిన తరువాత తనప్రతిభను ఇంకనుచూపనెంచికాబోలు మాయింట శంకరజయంతి జరుపుదుమనియు, దానికి మాగురుస్వాములైన స్వాములుగారుగూడ వచ్చెదరనియు పూర్ణమ్మగారు చల్లగా తనశిష్యురాండ్రకెరిగించెను. ఈసమాచారము క్షణములో ఊరినిండప్రాకిపోయెను. ఆహా! ఏమి మనభాగ్యము! అమ్మగారు మన ఊరికిమహోచ్ఛదశతేనున్నారని ఆసమాచారమువినినపిన్న పెద్దలుపొంగిపోయిరి. ఉన్నఊరివారెంత మంచివారైనవారిని తెలిసికొనలేరుగా! పొరుగూరివారి ఆడంబరమునకు దాసోహమ్మనుట ప్రతియూరియందును సాధారణమేగదా. పెరటిచెట్టుమందుకురాదు. క్రొత్తవింత, పాతరోతగదా. మాగ్రామములోని పెద్దఆసామి రెడ్డమ్మచౌదరిగారు జయంతియుత్సవమునకుగాను పుట్టెడుధాన్యము పాతికరూపాయలు నావంతుఅనెను. అతడేనామొనగాడు ఆతనికిరెట్టింపుమావంతు అని మఱికొందఱుపెద్దలు పంతాలాడిరి. ఇకనేమికొదువ? క్షణములో ధనధాన్యములు సమకూడినవి. స్త్రీపురుషులు సాయపడిరి. పందిళ్లుపాకలువేసిరి. మండపములునిర్మించిరి. తోరణములుగట్టిరి. సకలసంభారములు సిద్ధమైనవి. ఈమహోత్సవము తిలకించుటకు చుట్టుపట్ల గ్రామములనుండి వేలకొలదిజనులువచ్చిమూగిరి. నలువురు మనుష్యులొక్కమాఱు వీధిని నడచుటయెఱుగని మాయూరు గ్రామజనులతో కిటకిటలాడుచు కనులపండువుచేసెను. జయంతిరెండు

దినములున్నదనగా స్వాములువారు విజయముచేసిరి. ఆయనకు ముప్పదేండ్లకన్న నెక్కువలేవు. మంచి సుందరుడు. కన్నులకు బంగారుతోకట్టిన సులోచనములు, కాలికిమేలితరము పాదుకలు. చేతచక్కనిదండములు. వ్రేలికి మంచిఅంగుళీయకమునుగలిగి కాషాయాంబరధారియయ్యు స్వాములవారు సౌందర్యపిపాసులగు నవనాగరికపు యువజనులకు తీసిపోకుండెను. ఆయనను చదువేమిచదువుకున్నాడోగాని స్వాములవారు ప్రొఫెసర్ లాగ బాగున్నాడురా అని పిల్లకాయలనుకొనజొచ్చిరి. జయంతి ఆరంభమయ్యెను. ఉదయముపూజ, భజన, శంకరచరిత్రాపారాయణము. మధ్యాహ్నము భోజనములు. సాయంత్రము హరికథలు, మున్నగు ఉత్సవవిశేషములతో మాగ్రామముభోరుకొనెను. ఆఉత్సవముజరిగిన అయిదుదినములును ఉన్నవూరివారును పొరుగూరివారును ఆవేడుకనెల్లునలో నిమగ్నులైయుండిరి. కాని వివాహమహోత్సవమైనవెనుక నాగపల్లినాడు వియ్యాలవారు పెండ్లికూతురువారిలోపములెన్నినట్టులే జయంతియైన మఱునాడు గ్రామములో గుసగుసలు బయలుదేరినవి. ప్రతిశుభకార్యము వెనుక పెత్తనదారులైన వారియెడ నిట్టినేరారోపణలు సర్వసాధారణమే యైనను పెద్దఉత్సవముగాన పెద్దపెద్దలోపములు క్రమముగా బయటపడసాగెను. నెల్లువతీసినతరువాత తడిసిపాడై దిబ్బకొట్టుకొనిపోవ వస్తుసముదాయముబైటపడినట్టులే ఉత్సవప్రవాహముతీసినతరువాత భజనలో, కాలక్షేపములో, వంటశాలలో, వడ్డనసమయములో జరిగిన అత్యాచారములు, అల్పులప్రవర్తనములు బయటపడెను. గుణదోషములులేనితావులేదు. కాని పైపైనవచ్చిపోవువారియందును, కూలినాలికి చేరినవారియందును ఎన్నిలోపములున్నను లెక్కచేయరు. కాని పూర్ణప్రజ్ఞగలరంధ్రాన్వేషకులు కొందఱు గ్రామజనులహృదయసీమలో పరమపూజ్యస్థానముననున్న పూర్ణమ్మగారియందును, స్వాములవారియందును పాపభూయిష్ఠమగులోపముల నెన్నసాగిరి. ఉత్సవదినములలో నాలోపమెటులనో పటేచిపోయినను ఉత్సవమైన మఱునాటినుండి యావిషయమై తీవ్రవిమర్శనలు బయలుదేరెను. పూర్ణమ్మగారియందు పరిపూర్ణభక్తివిశ్వాసములు కలవారు 'అనరాదు', 'వినరాదు', పాపము, పాపము, నరకమునబడిపోవుదురని వాదించినను చిన్నకారువారువినరైరి. 'ఇంతవేదాంతురాలే. ఈమెయందేలోపమా? జుట్టుజందెముతీసివైచి సర్వసంగపరిత్యాగినని కాషాయాంబరములుగట్టి మహాభాష్యప్రసంగములు చేయజాలిన యతీంద్రుడే. అట్టివానియందేలోపమా? లోకమున గురుపీఠమున నుండదగినవారియందే దుర్గుణంబులున్నచో వీరులోకులనేమిబాగుచేయుదురు? టట్. ఈదుర్మార్గులను ఉపేక్షింపరాదు. తగినశాస్తిచేసి బుద్ధిచెప్పవలసినదే." అని ఊరిలోని యువజనులు కొందఱు నిశ్చయించిరి. రాజుతలచిన దెబ్బలకుకొదువా యన్నటుల ఆకతాయలు తలపెట్టిన కానికార్యమేది? జయంతిముగిసిన రెండవనాటియుదయము లేచిచూచునప్పటికి పూర్ణమ్మగారి వాకిటిముందర ఎంతఅసహ్యము చేయవలయునో అంతయుచేసిరి. చక్కగానున్నముగ్గొట్టిన యింటిగోడలు కొంటెవాండ్లదుడుకువ్రాతలతో నిండిపోయినవి. బుద్ధిశాలినియగు పూర్ణమ్మగారీబీభత్సమునంతయు నెప్పుడులేచిచూచుకొనెనో గాని ఆమెయు, ఆమెస్వాములవారునుగూడ తెల్లవారునప్పటి కాయింటిలోకాదుగదా ఆయూరిలో గూడ కాన్పించలేదు. యోగ్యత మనుష్యులకు వజ్రాంగిజోడు. ఎట్టిపాండిత్యమును యెట్టిమనీషయు శీలముతో సరిరాదు. వినీతవర్తనమునకు నేడును నమూల్యగౌరవమున్నది. ఎట్టిపరిస్థితులయందును వక్రతలేని నైతికజీవితమును గడుపనేర్చినవారే ధన్యులు. వారే గురుపీఠమున నుండగలవారు. అట్టివారి విద్యావిశేషములే జగన్మాన్యతబడయును. జగమువారివశము. జగమునకు వారు అజేయులు. శారదా! భక్తిజ్ఞానవైరాగ్యముల విషయమై పరిశ్రమించిన యిట్టివేదాంతులసేవయే యింతప్రమాదభీకరమైయుండ నిక మావంటిపూర్వాసువాసినుల గతియేమి? ఏవిధముగా మాజీవితములు గడపుకొనవలయును? ఏమియు తోచకున్నది? నీవుదీనికేమి సమాధానమిచ్చెదవో యని నీకువ్రాసితిని. త్వరలో ప్రత్యుత్తరము వ్రాయగోరెదను.

ఇట్లు

సోదరి, రాజ్యలక్ష్మి."

కల్పలతా! రాజ్యలక్ష్మి వ్రాసిన ఉత్తరమే కడుదీర్ఘముగానున్నది. దీనికినేనువ్రాసిన ప్రత్యుత్తరముగూడ పంపినచో రెండునుగలిసి భారమధికమైనచో పోష్టలుడిపార్టుమెంటు వారు నీకడ అధికరుసుముతీయవచ్చును. ఈమధ్యనే అణాకవరునకు మఱియొకదమ్మిడీ తగిలించిరట. మనమిట్టి భారమైనజాబులు నకుపసాగినచో ఆదమ్మిడీ కానీగానో అర్ధణాగానో మారవచ్చును. ఈజబ్బుకఅవుదినములలో ఈకాగితపుసంచులు నానాటికి ప్రియమగుచున్నచో మనయుత్తరప్రత్యుత్తరములకు అంతరాయము వాటిల్లునేమోనని నా భయము. కాన నేను రాజ్యలక్ష్మికివ్రాసిన ప్రత్యుత్తరము ఈమాఱుజాబుతో పంపుదును.

—ఇట్లు, మిత్రురాలు, శారద.

## ప్రణయరాధ

కర్లపాలెము కృష్ణరావుగారు

పసిడిచాయల పుప్పొడినలువబరచి
కమ్మవిరిజాజిపూ దలగడరచించి
గంధసారములింపుగా గలిపితెచ్చి
సిద్ధమొనరించి నే నిరీక్షించుచుంటి
మోసమేలనురావోయి మోహనాంగ!
ఏమినీకిత్తునందువా, హృదయనాథ!
ధగధగలనీనురత్నాలతారహార
సుప్రభామాలికాజాలశోభితుడవు
కాన్కలొసగినతృప్తిని గాంచగలవె?

భాగ్యములరోసి, స్వామి! నీపదసరోజ
మృదురజోలేశదివ్యసంపదలగోరి
వాడవాడల వీథుల జాడలరసి
వెదకుచుండెడి కనునిరుపేదనోయి!
కాన్కగా నేమొసంగగాగలను నీకు?
గాన, తనివార, వలపూర, కలతదీర
గాఢభక్త్యానురాగసంకలితహృదయ
నీరజదళాలరాలు కన్నీటిచుక్క
నర్పణముసేతు, దయతోడ నరయుమయ్య!

## మీరాబాయి (స్లేడుకన్య)

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

నీలోనిత్యము ధర్మకాంతి సుషమా నీకంబు పెంపొందు; మే
మాలోకింతుము నిన్నుమాజననిగా న్యాయైకవారాసిగా
నీలీలాయుతదివ్యజీవితము నెంతే ధర్మకాంక్షాకన
ల్లీలన్ బోవిడనాడఁ బూనుటను తల్లీ! దివ్యశోభావతీ!
నీవాకయాంగ్లదేశరమణీమణివైన నుదారబుద్ధి హిం
దూవరమాతృకాప్రజ కనూనముదంబెద నుప్పతిల్ల స్వే
చ్ఛావిభవంబుకూర్పు నిజశక్తిని సర్వము ధారవోయఁజు
మ్మీవు మహాత్మునొద్ద కరుదెంచితివో జననీ! శుభఃఘృణీ!
"అదమన్నెర్తురు వైరిపొంకము ధనుర్వ్యాపారముల్ నేర్పుచో
సుదతీరత్నము" లన్మహోక్తి నిజమంచుం జూపఁగానేమొ స
ద్విదితాపూర్వమహాత్మకల్పితతతోర్వీశ్లాఘ్యశాంత్యాయుధం
బొదవన్ ధర్మరణోర్విఁ జొచ్చితిటు లీవో పూతవర్చస్వినీ!




## ఉయ్యేలపాట

శ్రీమతి సత్యవతీకన్యగారు

(ఆనందభైరవి రాగము—ఏకతాళము)

ఉయ్యా లుయ్యా లుయ్యాల
నెయ్యంపుబిడ్డకు నుయ్యాల ఉ॥
రాజబింబాననకు నుయ్యాల
రాజీవదళనేత్ర కుయ్యాల ఉ॥
చిలుకపలుకులబోటి కుయ్యాల
చెలువంపునాసకు నుయ్యాల ఉ॥
ఆవినీలకుంతలకు నుయ్యాల
నెలనెలు రుచిఫాల కుయ్యాల ఉ॥
కుసుమకోమలగాత్ర కుయ్యాల
బిసనాళ బాహకు నుయ్యాల ఉ॥
సొగసుగుల్కెడుబాలకుయ్యాల
సుగుణాలవాలకు నుయ్యాల ఉ॥
తళుకుంజెక్కులపాప కుయ్యాల
కలకంఠకంఠికి నుయ్యాల ఉ॥
వరకంబు కందరకు నుయ్యాల
సరికుందరదనకు నుయ్యాల ఉ॥
చిన్నప్రాయపుటింతి కుయ్యాల
వన్నెమీఱెడుకన్య కుయ్యాల ఉ॥

## వదినెపాట

శ్రీమతి చావలి బంగారమ్మగారు

హిందూస్తాని ఖమాస్

(వరుస: 'దరదే జిగర కే తుమీ హోదవా యాన'—వలె.)

తగునటె వదెనరో-తలవాకిట నిలువ
తరుణులలో నిది-తలవంపుకాదే
తామరసాక్షిరో-తామస మేలే?
తలవాకిటనిలువ-తగదె యోవదెనా! త॥
ఇంతిరో! మాయన్న-చెంతనె యుండగ
సంతసముననుండ-జాలవదేలా?
కాంతలతో నీకు-కయ్యమదేల?
యువిదరో నీకిది- యుచితమె బాలా! త॥
ఘనమగువారింట-బుట్టితి ననినీవు
గరువము చెందుట- ఘనమగునటవె?
పుట్టినయింటికి-మెట్టినయింటికి
మెప్పును దెమ్మా! మో- ముద్దులగుమ్మా! త॥

# జోలపాటలు

## ౧

(సంపాదకురాలు) శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

౧

జోలల్లుపాడితే జొన్నల్లుపండు
నాగస్వరంపాడితే రాజనాలుపండు
చిన్నారిగద్దు నాపొన్నారిగద్దు
శ్రీలక్ష్మిగద్దు నాఅబ్బితోనాడా.

౨

అబ్బాయినెవ్వరు ఏమన్నవారు
పదహారువన్నెల పమిడన్నవారు
చిన్నివ్రేళ్లకు చిన్నిఉంగరాలునీకు
మీతాతతెచ్చేను వూరుకో తండ్రీ!

౩

రచ్చలోపెదమామ రాజుచినమామ
అంగీలపెదమామ అమ్మసైదోడు
ఆడంగముద్దమ్మ పాడంగముద్దు
మిక్కిలిముద్దమ్మ మేనమామలకు.

౪

చిలుకలాడేనమ్మ హంసలాడేను
పావురములాడేను పందిళ్లలోను
చిలుకమాఅబ్బాయి హంసఅమ్మాయి
పావురముచిన్నబ్బి పందిళ్లనాడా.

౫

చిన్నారిపడువకు చిలుకపడువకు
చిట్టిముత్యమునీకు గుత్తులిచ్చేరు
చిన్నారిమువ్వల్లు చిరుతగంటల్లు
పొన్నంగసేనుడు ఏవీధినాడు?
పొన్నంగసేనుడు పాపఅబ్బాయి
పాలుత్రాగబ్బాయి పందిళ్లనాడు.

౬

పాలుత్రాగేనాడు పారాడేనాడు
పాపనిబుద్ధుల్లు పంచదారల్లు
చిన్నమాఅబ్బాయి చిత్రకూటల్లు
వేదానమెరుపుల్లు తమ్ముడాటల్లు.

౭

అబ్బాయినీవందు నీదానమందు
నీసాటివారిలో నిమ్మపండందు
నిమ్మపండందమ్ము నీలమేఘమ్ము
అబ్బాయినీముఖము చంద్రబింబమ్ము.

౮

చిన్నమాఅబ్బాయి చెన్నగిరిపండు
బాలలతోకూడాడ పసినిమ్మపండు
చిన్నమాఅబ్బాయి సిరిముఖముచూచి
సిగ్గుపడిచంద్రుడూ పొడువజాలాడు
మర్నాడుఅబ్బాయి మాటల్లుచూచి
మాణిక్యాలతోను పొడిచెచంద్రుడు.
గోవింద! గోపాల! గోకులాబృందా!
రారా! పరమానంద! రామగోవిందా!

## ౨

(సంపాదకురాలు) శ్రీమతి లకింశెట్టి పార్వతీ గంగారత్నముగారు

ఉళఉళలహాయీ ఆయమ్మఆయి
ఆయీ ఆపదలగాయీ
చిన్నవాళ్లనుగాయి శ్రీరంగశాయీ
దొండపండెజ్జన్న తొడిమిపచ్చన్నా
నిండుపున్నమినాడు పండెన్నెలన్నా
అబ్బాయిఎజ్జన్న కురులూనల్లన్నా
యిలఅరటిపండెఋవూ అబ్బాయీఎరుగు
యికసద్దుచేయకా నువ్వు నిద్రాపోవన్నా.

ఏడవకూఏడవకూ ఎఱ్ఱానీబాల
ఏడి స్తేనీకంట్లో కారు నీలాలు
నీలాలుకారితే నేజూడనొల్ల
పాలై నకారవే బంగారుకళ్లు.

ఉళఉళలఆయీ ఆయమ్మఆయి
ఆయీ ఆపదలగాయీ
చిన్నవాళ్లనుగాయి శ్రీరంగశాయీ
ఆయిఆయి ఆపదలుగాయి.

## 3

(సంపాదకురాలు) శ్రీమతి గిడుగు సత్యవతిగారు

చిన్నారిఅబ్బాయి చిరిముఖముజూచి
సిగ్గుబడిచంద్రుడు జేరెనాకసము
ఆలిచిప్పలబోలు నబ్బాయికండ్లు
ఆణిముత్యములు మాఅబ్బాయిపండ్లు

కాళ్లగజ్జెలుగట్టి కడియాలుబెట్టి
ఆట్లాడునబ్బాయి యలకృష్ణుబోలు
ఆడగాముద్దమ్మ పాడగాముద్దు
అందరికి నాతండ్రి అల్లారుముద్దు.

## ౪

(సంపాదకులు) మరకాని పరాత్పరరావుగారు

జోలల్లోపాపడికి జోడుంగరాలు
పాపమాయబ్బికి పయిడుంగరాలు
జోలలుబాడంగ జొన్నబండంగ
అబ్బినిపాడంగ పండేరాజనము
దొడ్లోనఅబ్బాయి దోగాడుచుంటె
దొండపండనిరాజు దోసిలొగ్గెను
పందిట్లోఅబ్బాయి పారాడుచుంటె
పనసపండనిరాజు పరుగులిడెను
అందరిమామలు చందమామలు
మాయబ్బిమామలు రామలక్ష్మణులు
చిలుకలుచెలరేగి జీడికొమ్మెక్కు
మాయబ్బిచెలరేగి మామభుజమెక్కు

ఊరుకోఊరుకో ఊళ్లన్నిమనవి
ఉత్తమ్మగుఱ్ఱాలు మీయత్తచుట్టాలు
అంగడమాయబ్బి ఆడబోయినాడు
ఆడబోయినచోట మాడలుదొరికె
మాడిచ్చిమరిమాడ మద్దికాయలు
మద్దికాయలుచేయించు మామసముయేలు.
ఏడవకుఏడవకు వెఱ్ఱినాతల్లి!
ఏడిస్తేనీకండ్లు నీలాలుగారు.
నిత్యగాజులసెట్టి! నీలాలసెట్టి!
పచ్చగాజులసెట్టి! పగడాలసెట్టి!
తొడుగోయిఅమ్మాయికి తేనెగాజులు.
చిచ్చోజోలా!

"కానలు కావు శైలములు కావు పయోధులు కావు భారముల్"
అను సమస్యనుపూరించి స్త్రీలు జూలై 15-వ తేదీ లోపున మాకుపంపిన గృహలక్ష్మిలో ప్రచురింతుము. స్త్రీలలో కవితాజిజ్ఞాస పెంపొందించుట కిదిఉద్దేశింపబడినది.

—సంపాదకుడు.

# పూలసజ్జ

కాళ్ళూరి వేంకటరామారావుగారు

కాంతం ముఖము చెరువగునట్లేడ్చుచుండెను. "బాబూ! వుంగరంసంగతే నాకు తెలియదు. ఒకవేళ నాకలాటివస్తువ వీధిలో దొరికినా స్వంతదారుణ్ణి కనుక్కుని దాన్ని వారికందచేసేవరకూ నాకు నిద్రపట్ట దన్న సంగతి నువ్వెరగవా? అయ్యో! నేనేమీయెరగను" అన్నది.

ఆమెమాటలు వినకుండనే జగ్గయ్యచెప్పుచుండెను. "ఈతల్లి, ఆగర్భశ్రీమంతుని ముద్దుకుమార్తె నీపై గల ప్రేమాతిశయంచేత పోలీసులబారినుండి నిన్నురక్షించడానికి స్వయంగావొచ్చింది చూశావా? ఇప్పుడే కదా నీకీమె ఆయమూల్యమగు బహుమానమునిచ్చింది! అట్టి సహృదయురాలియెదుట నీవు అసత్యమాడడం న్యాయంకాదు. అల్లాచెయ్యడం నీవినాశమునకే అనినమ్ము. నీదగ్గరవుంగరంవుంటే తక్షణంయిచ్చెయ్యి. దయార్ద్రహృదయయగు అమ్మాజీ నిన్నుశిక్షనుండి తప్పించిరక్షించగలదు. కాంతం! నిజంచెప్పు." మరల జగ్గయ్య చెప్పమొదలుపెట్టెను. "అమ్మా! వయోవృద్ధుడనైన నన్నుచూడు. అవసానదశలో నన్ను దుఃఖమున ముంచకు. ఏప్రభూత్తముని పవిత్రసామ్రాజ్యమునందు చోరులకు తావులేదో, ఏప్రభుని దివ్యసాన్నిధ్యమునకు నేను త్వరలోపోనైయున్నానో అట్టి పరమాత్ముని సముఖముననున్నట్లుగా వూహించుకుని నిజంచెప్పు. నీ ఆత్మోన్నతికొరకే నిజంచెప్పమని కోరుతున్నాను."

కాంతం నేలమీద మోకాలిపైకూర్చున్నది. ఆమె తనయశ్రుపూరితనయనముల నాకాశముపంకకు మరల్చినది. హస్తము లప్రయత్నముగానే అంజలీకృతములైపోయినవి. నిశ్చలహృదయమున నామెయిట్లు పల్కినది. "నాదగ్గిరవుంగరంలేదని సర్వేశ్వరుడెరుగును. నే నబద్ధమాడినయెడల శాశ్వతంగా నరకకూపము లలో కూలిపోదును గాక!"

కుమార్తె నిర్దోషియని జగ్గయ్యకు యిప్పటికినమ్మకముకలిగినది. అతడు "అమ్మా! నీదగ్గిరవుంగరం లేదని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. పరమేశ్వరుని సముఖమున అబద్ధమాడడానికి సాహసించలేవు. నీవు నిష్కల్మషురాలవని నమ్మకంగలిగినందుచేత నామనస్సుకికూడా శాంతికలిగినది. నాతల్లీ! నువ్వుకూడా శాంతిపొందు. ఏమీభయపడనక్కరలేదు. ప్రపంచకంలో ఒక్కపాపానికే మనము వెరవవలెను. మరణ శిక్షకిగాని, ఖైదుశిక్షకిగాని మనంభయపడనవసరంలేదు. మనకెల్లాంటి ఆపదలువచ్చినాసరే. తోడిప్రజలు మనలను విడనాడవచ్చునుగాని ఆతండ్రిమాత్రం మనలను పరిత్యజించడు. ఆదయామయుడే మననిర్దోషిత్వ మును ప్రకటితంచేయగలడు. సన్మార్గవర్తనులకు దైవమేశరణ్యము" అని ప్రశాంతగతిని చెప్పినాడు.

నేత్రములందు ప్రత్యక్షమైన అశ్రుబిందువులను తుడుచుకుని అమ్మాజీ చెప్పినది. "జగ్గయ్యా! మీవద్ద వుంగరంలేదని నేనూనమ్ముతున్నాను. కానిపరిస్థితులనుబట్టి ఎల్లాచూసినా వేరొకసమాధానం కుదరడంలేదు. వుంగరంతీసి గదిలో మేజాబల్లపై పెట్టినట్లు మాఅమ్మకి బాగాజ్ఞాపకమే. ఆవెంటనే నేనూకాంతమూ ఆగది లోకివెళ్లినాము. అప్పుడు నేనూ అమ్మా పక్కగదిలోకి వెళ్లవలసివచ్చింది. ఆసమయమందు అమ్మగదిలో కాంతం తప్పవేరెవ్వరూలేరు. నేను మేజాదగ్గిరకి వెళ్లనైనాలేదు. ఆసంగతి కాంతానికే తెలుసును. అంతకు ముందుగాని వెనకగాని ఒక్కపురుగైనా అమ్మగదిలోకివెళ్లలేదు. నేనూ కాంతమూపైకిరానిచ్చి మాఅమ్మ వేరొకచీరకట్టుకుని వుంగరం పెట్టుకొనబోయేసరికి కనబడలేదు. అమ్మస్వయంగా గదిఅంతటా వెతికినది. రెండుమూడుసారులు పూర్తిగావెతికి గదిలోవుంగరంలేదని నిశ్చయపరుచుకునేవరకూ అమ్మనన్నుగూడా గదిలో అడుగుపెట్టనియ్యలేదు. కాని లాభంలేకపోయినది. ఇప్పుడు సంగతంతావిన్నావుకదా. అనుమానం యెవరిమీద వుంటుందో నువ్వేచెప్పు."

"అమ్మా! ఆసంగతి చెప్పడానికి నాతరంకాదు. ఈవిషమపరీక్షయందు దీనజనసంరక్షకుడగు దైవమే మాకు సహాయుడగుగాక" అని చెప్పుచు జగ్గయ్యదృష్టి పైకిసారించి "తండ్రీ! మాకెట్టి ఆపదమూడనున్నదో చూడు. నేను సిద్ధంగానేవున్నాను. ప్రభూ! నీఅనుగ్రహంమాత్రం యీదీనునిపైనుంచు. అదే నాకుచాలు" అని పలికెను.

"విచారపూరితహృదయంతో నేను కోటలోకితిరిగిపోతున్నాను. ఇంతదుఖకరమైన జన్మదినమెన్నడునూ నేనెరగను. ఇందుమూలమున ఏమిప్రమాదములు రానున్నవో ఊహించడానికి వీలులేదు. ఇంతవరకూ ఒక్క నాతోతప్ప అమ్మయితరులతో యీసంగతిచెప్పలేదు. ఇంకదీనిని రహస్యంగావుంచడానికి వీలులేదు. అమ్మచేతిని వుంగరంలేకపోతే నాన్నగారు తప్పకుండా గ్రహిస్తారు. నాజన్మదినమునాడు ఆయన యిచ్చిన వుంగరమది. వుంగరం తెస్తూవుంటానని అమ్మకనిపెట్టుకుని చూస్తూవుంటుంది." ఒక్కనిముషంవూరుకుని అమ్మాజీ మరల "మీరునిర్దోషులని నేనుపూర్తిగా నమ్మినట్లుచెబతాను. కాని నామాటలు విశ్వసించేవారెవరు?" అని గ్రుడ్లనీళ్లుగ్రుక్కుకొనుచు అన్నది. అమ్మాజీ వెళ్లిపోయినది. విసాదభరమున మైనురచిపోయియున్న జగ్గయ్యాయును, కుమార్తెయును ఆమెతోగూడ వీధిగుమ్మమువరకైనను వెళ్లలేకపోయినారు.

చేతులమధ్య తలనానించుకుని జగ్గయ్య కూర్చున్నాడు. ముడుతలువారిన అతని చెక్కులపైకి ధారగట్టి అశ్రువులు స్రవించుచుండెను. అతడు తదేకధ్యానమున నేలవంకచూచుచుండెను. అప్పుడు కాంత మాతని పాదములపైబడి "బాబూ! నేను నిర్దోషిని. ఈ విషయంలో నేను నిజంగా నిరపరాధిని" అని దీనయై పలికినది. కుమార్తెను లేవదీసి జగ్గయ్య చాలసేపు తన దృష్టులామెదృష్టులలోకలిపి నిదానముగా పరికించెను. తరవాత నతడు "అవును కాంతం! నీవు కేవలం నిరపరాధివి. నిర్మలములై ప్రదీప్తములైన నీనేత్రములే నీ నిర్దోషిత్వమును చాటుతున్నవి" అన్నాడు. కాంతం ఒకనిట్టూర్పువుచ్చి "దీనికంతటికీ పర్యవసానమేమిటో తెలియడంలేదు. మనగతి యేమవుతుందోకదా! ఇందులో బాధపడేదాన్ని నేనొక్కర్తెనే అయితే నాకేవిచారమూ వుండదు. కాని బాబూ! ప్రాణాధికుడవైననీవు యీవయస్సులో నామూలాన్ని కష్టపడవలసివస్తే నేను సహించలేను." అని విచారించినది. "అమ్మా! జగదీశ్వరునియందు భారంవుంచి నిర్భయంగా వుండు. ఆయన ఆజ్ఞలేనిదే మనతలపైనున్న వెండ్రుకనైనా కదపడానికి ఎవరికీ సాధ్యంకాదు. ఏది జరిగినా అది భగవదాజ్ఞానుసారమే జరుగును. సర్వమూ మనమేలుకొరకే జరుగుతుందనినమ్ము. కాబట్టి నిర్విచారంగా నిజమే చెబుతూవుండు. నిన్ననేకవిధాల బెదిరించి భయపెట్టవచ్చు. అనేకవాగ్దానాలుచేసి ఆశపెట్టవచ్చు; ఏమైనాసరేగాని సత్యమును విడిచిపెట్టవద్దు. అంతరాత్మకి వ్యతిరేకంచెయ్యకు. భయంకరనిర్బంధమునసైనను నిర్మలాత్మసుఖిస్తుంది గాని కష్టపడదు. మనల నిద్దరినీ రక్షకభటులు విడదియ్యవచ్చును. నాముద్దుతల్లీ! నిన్నోదార్చడానికి నీజనకుడింక నీపక్కనివుండడు. కాని అందుకు విచారించకు. జగద్రక్షకుడైన ఆతండ్రినే మరింత గాఢంగా నమ్మివుండు. నిర్దోషులను రక్షించడాని కామహాత్మునికంటె శక్తిపరుడులేడు సుమా! అనుక్షణమూ నీకాయన సహాయం చేస్తూనేవుంటాడు. ఆయన సహాయం నీకు లభించకుండా చెయ్యడానికి వేరొకరికి శక్తిలేదు."

వారిట్లు మాట్లాడుకొనుచుండగానే వీధితలుపులు తోసుకొని రక్షకభటులులోపల ప్రవేశించిరి. కెవ్వునకేకవేసి కాంతం తండ్రిబాహువులలో పడిపోయినది. "వాళ్లని విడదియ్యండి. ఆపిల్లకి సంకెళ్లువేసి ఖైదుకి తీసుకుపొండి. ముసలాడికికూడా సంకెళ్లుతగిలించండి." అని పోలీసుఅధికారి కోపముతో కన్నులెర్రజేసి ఆజ్ఞాపించెను. తరవాత పోలీసుభటులు యింటిని పూర్తిగా పరిశోధించిరి. పరిశోధనపూర్తి అగువరకును ఎవ్వరిని తోటలోనికి రానియ్యలేదు. కాంతంజనకుని కౌగిలించుకొనియుండెను. పోలీసు లామెను బలవంతముగా

విడదీసి గొలుసులు చేతులకు తగిలించిరి. ఈ భయంకరదృశ్యమును సహించలేక ఆమె మూర్ఛావశురాలైనది. భటులామె నాస్థితిలోనే వీధిలోనికి తీసుకొనిపోయిరి. అక్కడ అప్పుడే ప్రజలుగుంపులు గుంపులుగా మూగి యుండిరి. ఉంగరముసంగతి గ్రామమంతటను ప్రాకిపోయినది. ఊరిలో ఒక్కడును లేకుండ అందరును తోటముందు చేరిపోయిరి. జరిగినదానినిగూర్చి పలువురు పలువిధములగు అభిప్రాయములను వెలిబుచ్చసాగిరి. సన్మార్గప్రవర్తనులును, పరుల కపకారమును తలపెట్టియైనను ఎరుగనివారును అగు జగ్గయ్యను, కుమార్తెయును ఆపదల పాలయినందుకు సంతోషించిన వారుకూడ కొందరక్కడ లేకపోలేదు. స్వకాయకష్టమున జీవించుచున్న ఆదీనుల బ్రతుకులుగూడ కొందరిలో నసూయను కలిగించినవి. "వీరింతసుఖంగా జీవించడానికి కారణమేమిటో యిప్పటికితేలింది. ఇదివరకీమాయ గ్రహించలేక పోయాంగదా! ఓ ఈపద్ధతిని అందరమూ ధనికులమే కావచ్చును." అని కొందరన్నారు. కాని ధర్మపరవాసులగు ప్రజలలో హెచ్చుమంది జగ్గయ్యకు కలిగిన విపత్తునకు హృదయపూర్వకముగా విచారించినవారే. "ఆహా! సన్మార్గులైనవారికే ఆపదలు తటస్థిస్తూవుంటాయి కదా! వీరి కీకష్టం వొస్తుందని కలలోనైనా అనుకున్నామా? సర్వేశ్వరుడు వీరినిర్దోషిత్వమును ప్రకటించు గాక!" అని కొందరు సహృదయులనుకున్నారు. జగ్గయ్యను కుమార్తెను రక్షకభటులు తీసికొనిపోవునపుడు గ్రామములోని పిల్లలు బిక్కమొగములతో "అయ్యో! వీరు ఖైదులోవుంటే మనకి పళ్లూపువులూ యిచ్చే వారెవరు? ఎంతపని!" అని ఏడ్చినారు.

## నాలుగవపుష్పము : కారాగృహము

చెరసాలలో ప్రవేశపెట్టినపుడు కాంతమ్మకు శరీరస్మృతిలేదు. కొంచెము తెలివిరాగానే ఆమెకు దుఃఖము తెలముంపులుగావచ్చినది. కొంతసేపుదుఃఖోపశమనమగునట్లు ప్రార్థించినది. భయమువలనను, విచారము వల్లను, అలిసిపోవుటవల్లను ఆమెశరీరము విశ్రాంతినికోరుచుండెను. అక్కడనున్న గడ్డిపరుపుపై మేనువాల్చిన వెంటనే ఆమెకు గాఢనిద్రపట్టినది. కాంతమ్మకు మెలకువవచ్చుసరికప్పుడే రాత్రిపడినది. గదిలో అన్ని మూలలను చీకట్లలముకొని దృష్ట్యవరోధమును కలిగించుచుండెను. ఉంగరముకథను పూర్తిగా జ్ఞాపకము చేసుకొనుట కామెకు చాలసేపు పట్టినది. అంతయును ఒకస్వప్నమువలె నామెకు తోచుచుండెను. తోట లోని బంగాళాలో తనగదిలోనున్నట్లే అమె భావించుకొన్నది. ఈస్థితిలో ఆమెచేతులనున్న యినపసంకెలలు ధ్వనిచేసినవి. భయభ్రాంతురాలై ఒక్కచెంగున పరుపుమీదనుండి లేవబోయినది. అప్పటి కామెకు నిజస్థితి పూర్తిగా జ్ఞాపకమువచ్చినది. మరల దుఃఖ మామెను ముంచివేసినది. అంజలిఘటించి ఆమెయిట్లు ప్రార్థించి నది. "దయానిధీ! తండ్రీ! నిగళబద్ధములైయున్న ఈ హస్తములను జోడించి నమస్కరించుటగాక నే నేమిచెయ్యగలను? ఈ భయంకరకారాగృహముననుండి నీకు నమస్కరిస్తూఉన్న యీదీనురాలివంక ఒక్క సారిచూడు. ప్రభూత్తమా! నేను నిర్దోషినని నీవెరుగుదువుకదా! ఈ విపన్నురాలిని రక్షించు. వృద్ధుడై మహావిచారభరమున క్రుంగియున్న మాబాబును దయజూడుము. నాకింతకు రెట్టింపు దుఃఖముననైనను సమ కూర్చి ఆముదుసలిని రక్షించు." జనకుడు తలపునకువచ్చుటచేత ఆమెకండ్లనుండి నీరు ధారాపాతముగా వర్షించి నది. దుఃఖోద్రేకమున నోటమాట కట్టుబడిపోయినది. ఆమె అట్లే కొంతకాలమేడ్చినది.

అంతవరకును మేఘములమాటున అణగియున్నచంద్రుడు నిర్మలకాంతులతో ప్రకాశించుచుండెను. గవాక్షమునుండి చంద్రకాంతి ఆమెబంధింపబడియున్న కొట్టులోనికి పడుచుండెను. ఆవెలుగున గదిలోని వస్తువులన్నియు స్పష్టముగా కనబడుచుండెను. రాతిగోడలు, నీటితోనున్న మంటికుండ, గడ్డిపరుపు అన్ని యును ఆమెకుగోచరించినవి. ఈ వస్తువు లామెకు దుఃఖప్రదములేయైనను చీకట్లుపోయినతోడనే ఆమెకు కొంతధైర్యము కలిగినది. కాని ఇంతలో ఒకకారుమేఘము తిరిగి చంద్రుని మాటుపరచినది. గది గాఢాంధ

కారబంధురమైపోయినది. కాని యీసారిచంద్రుడెంతోసేపు మేఘములచాటున నుండలేదు. అయిదునిమిషములలో మబ్బుతెరవిడిపోయి స్వచ్ఛమగు చంద్రకాంతి యథాప్రకారము ప్రపంచమున నిండిపోయినది.

ఆమార్పునుచూచి కాంతం "ఇలాగే నిరపరాధులుగూడ కొంతకాలము అపవాదలపాలయినప్పటికీ చివరకు వారు నిజనిర్మలకాంతితో ప్రకాశించక తప్పదు. ప్రస్తుతం నాజీవితం అంధకారావృతమైవుంది. అతినీచములగు అపవాదములు నాపై ప్రబలివున్నవి. తండ్రీ! వీనినన్నిటిని గడిచి నాఅమాయకత్వము ప్రకాశించేటట్లనుగ్రహించు." అని అనుకున్నది.

## అయిదవపుష్పము : విచారణ

రెండురోజులు గతించినవి. మూడవనాటి ఉదయమననే ఆమె విచారణకొరకు కొనిపోబడినది. న్యాయస్థానమునుచూచి కాంతంపణకిపోయినది. న్యాయాధిపతి సమున్నతవేదికపైని ఆసీనుడై యుండెను. అతనిముందొకబ్రహ్మాండమగు మేజాబల్ల కాగితముల భారమున మూలుగుచుండెను. ఆబల్లప్రక్కనే కాగితముకట్టలను సరిచూచుకొనుచు గుమస్తానిలుచుండెను. న్యాయస్థానము ప్రేక్షకులచే క్రిక్కిరిసి యుండెను. న్యాయాధిపతి అనేకప్రశ్నలువేసెను. కాంతం వానికన్నిటికిని నిజము తప్పకుండ జవాబులు చెప్పినది. ఆమె ఏడ్చినది. కాని నిశ్చలురాలై తన నిర్దోషిత్వమునుమాత్రము నొక్కిచెప్పుచుండెను. "ఏయ్! అమ్మాయీ! నన్ను దగాచెయ్యడానికి ప్రయత్నించకు. నువ్వుగాక ఆగదిలోకెవ్వరూనెళ్లలేదు. అల్లాంటప్పుడు వుంగరం తప్పకుండా నువ్వేతీసివుండాలి. తక్షణంనీనేరం వొప్పుకో" అని న్యాయాధిపతి గర్జించెను.

"నేనబద్ధంచెప్పలేదు-ఉంగరంసంగతి నాకుతెలియదు, నేను దానినిచూడనైనను చూడలేదు."

"ఆ! ఏమిటీ? నీచేతులో వుంగరంవుండగా చూచినవాళ్లుండగానే నువ్వు అబద్ధంచెప్పడం లాభంలేదు. ఇప్పుడైనా ఒప్పుకుంటావాలేదా?" న్యాయాధిపతి భయంకరగర్జనకు కాంతం గడగడలాడిపోయినది. అట్లుజరగడం అసంభవమనిమాత్ర మామెచెప్పివేసినది. విచారణాధికారి ఒకగంట కొట్టగానే దాసిపున్న లోపలప్రవేశించినది. ఈర్ష్యాగ్రస్తురాలగు పున్న యజమానురాలికి కాంతంపైని అసూయ కలిగించవలెనను అభిప్రాయముతో ఒక పన్నాగముపన్నినది. "ఆదుర్మార్గురాలుగాక యీవుంగరాన్ని యింకెవ్వరూ యెరగరు. మేడదిగి వొస్తున్నప్పుడు ఆమెచేతిలో ఒక వజ్రపుటుంగరం వుండగా చూశాను. నన్ను చూసేసరికామెవులికిపడి వుంగరాన్ని దాచేసింది. నాకప్పుడే అనుమానకలిగింది. కాని వృథాతొందరయెందుకని వూరకున్నాను. ఆమెకి అమ్మగారు చాలాబహుమానాలు యిచ్చివుండడంచేత యిదిగూడా ఆలాగిచ్చినదే కాబోలనుకున్నాను. దొంగతనమే అయితే యెలాగూదాగదుకదా అని నాఅభిప్రాయం. ఆరోజున అమ్మగారిగదిలోనికి నేను వెళ్లడం తటస్థించలేదు. అందుకు నేను సంతోషిస్తున్నాను. ఈ దుర్మార్గురాలివంటివారు ఏపాపమూ యెరగనివాళ్లమీద యీ అపవాదాన్ని తోసెయ్యగలరు." అని పున్న కోటలోనివారందరితోను చెప్పినది. పైప్రకారముచెప్పినందుకుగాను పున్ననుసాక్షిగా పిలిపించవలసివచ్చెను. అసందర్భములురాకుండ న్యాయస్థానమునందైనను తను మొదటచెప్పినట్లుగనే మరల మరల నిర్ధారణగా చెప్పవలెనని పున్న నిశ్చయము కొట్టుకున్నది. కాళ్లు కంపించినవి. అయినను అధికారిమాటలనుగాని అంతరాత్మబోధనలనుగాని ఆమె చెవిదూరనియ్యలేదు. "నేను మొదట ఒకలాగుచెప్పి యిప్పుడింకొకలాగుచెబితే నాకు శిక్షతప్పదు" అనుకుని పున్న కాంతంవైపుతిరిగి కఠినవాక్కులతో "నీచేతులో వుంగరంవుండగా నేను చూశాను. వుంగరం నీవేతీశావు" అని చెప్పివేసినది.

జంపులేకతనపై పున్నవేసిన అపవాదమునకు కాంతం స్తంభితురాలైనది. ఎంత అపుకుందమన్నను ఆమెకు దుఃఖమాగక పొంగిపోయినది. ఆమెకంఠము రుద్ధమైపోయినది. "నువ్వుచెప్పినదంతా అసత్యం. నువ్వు నాచేతులోవుంగరం చూశాననడంకంటె ఘోరమైన అబద్ధమింకొకటివుండబోదు. పున్నా! ఎన్నడును నీకేహానియైనను చేసి యెరగనినాపైని యిల్లాంటి అబద్ధాలుచెప్పి మహాపాపమును ఒడిగట్టుకోడానికి నీకు నోరెల్లావొచ్చిందీ?" అని అడిగినది. అసూయాభరితురాలగు పున్న కీధర్మపన్నములు వినబడలేదు. కాంతమ్మ యెడల క్రోధమును అసహ్యమును ఆమెలోనధికమైపోయినవి. అందుచేత ఏమాత్రమును వెనుకతీయకుండనే ఆమెసాక్ష్యమును యిచ్చినది. మరికొన్నివిషయములను కూడ కల్పించిచెప్పినది. న్యాయాధిపతి ఆమెను పంపివేసి కాంతం వైపుతిరిగి "నువ్వునేరస్థురాలివని అన్నివిధములా రుజువైపోయినది. సాక్ష్యమంతా నీకు వ్యతిరేకంగావచ్చింది. నీచేతులో వుంగరంవుండగా చూచినట్లు పున్నస్పష్టంగా చెబుతూంది. ఇప్పుడైనా ఎక్కడవుంచావో చెప్పు" అని అడిగెను. కాంతం మరల తాను నిర్దోషినని చెప్పినది.

ఆనిర్భాగ్యురాలిని కొరడాలతో కొట్టవలెనని న్యాయాధిపతియాజ్ఞాపించెను. సుమకోమలమగు నామె శరీరమునుండి రక్తధారలుస్రవించినవి. బాధకోర్వలేక ఆమె యాక్రందించినది. కాని వినువారెవ్వరు? సర్వేశ్వరుని ప్రార్థించుచు నామె శిక్షననుభవించినది. శిక్షపూర్తియగుటతోడనే యామెను మరలచెరసాలకు పంపివేసిరి. కొరడాదెబ్బలవల్ల కలిగినగాయములబాధ భరింపశక్యముగాకుండెను. ఆమెశయనించిన గడ్డిపరుపుకఠినమై గాయములబాధ నినుమడింపచేయుచుండెను. బాధకోర్వలేక ఆమెయేడ్చినది. మహాబాధ ననుభవించుచున్న పసరమువలె ఆమెమూలుగు హృదయవిదారణమైయుండెను. గడ్డిపరుపుపైపరుండి యామె జగదీశ్వరుని ప్రార్థించినది. పరాత్పరుడాదీనురాలిని నిద్రాధీనురాలినొనర్చి బాధనుకొంతమరపించెను.

మరునాడు మరల విచారణకొరకు కాంతమ్మను న్యాయాధిపతియెదుటికి తీసుకొనిపోయిరి. కఠిన శిక్షలు నిష్ప్రయోజనములగుటచే మంచిమాటలాడి వాగ్దానములనొనర్చి ఆమెచేత నిజముచెప్పించవలెనని న్యాయాధికారిప్రయత్నించెను. "అమ్మాయీ! నీవు ద్వీపాంతరవాసశిక్షకు అర్హురాలవని నిశ్చయించబడినది. ఇప్పుడైనామించిపోయినదిలేదు. నేరంఒప్పుకుని వుంగరం యెక్కడుందో చెప్పినట్లయితే నీకేబాధారాకుండా చూసేభారంనాది. ఇదివరకు జరిగినశిక్షతో నిన్నువిడిచిపెట్టేం. నువ్వు హాయిగా మీతండ్రితోయింటికి పోవచ్చును. బాగా ఆలోచించుకో—నిదానించు—తొందరపడకు. చావా? బతుకా? రెంటిలో ఏదో ఒకటి నిశ్చయించుకో. చిన్నపిల్లవు. వృద్ధిలోకిరావలసినదానవు. నిన్నుచూస్తే నాకుజాలికలుగుతూంది. ఇంతకఠినశిక్షతో నీప్రాణాలుపోతాయి. ప్రాణంపోయినతరువాత వుంగరం యేంచేసుకుంటావేమిటి?" అని అతడు చాలసేపుబోధపరచెను. కాని ఆబోధనలవల్ల లాభములేకపోయినది. యథాప్రకారమే తానునిర్దోషురాలననియే ఆమెచెప్పుచుండెను. తండ్రియందామెకు గలప్రేమాతిశయమును గ్రహించి న్యాయాధిపతి మరల చెప్పుట ప్రారంభించెను. "కాంతం! నువ్వు ప్రాణాలమీద ఆశలేకుండా నిజాన్ని మరుగుచేస్తున్నావు. సరే గాని మీతండ్రిగతికొంచెం ఆలోచించుకో. నువ్వింతపట్టుదలతో నిర్భయంగా అబద్ధమాడ్డానికి అతడుగాక ప్రేరేపకులెవ్వరుంటారు? అందుచేత అతడుకూడా శిక్షార్హుడే అన్నవిషయమునీకు తెలుసునా?"

ఈమాటలను వినుసరికి కాంతం నిలువునవణికిపోయినది. మూర్ఛపోవుట కామె సిద్ధమైనది. మరి కొంతసేపటికి న్యాయాధికారి "ఒప్పుకో. ఇప్పుడైనా వుంగరంతీసినట్లు ఒప్పుకో. 'అవును' అనేఒక్క మాటవల్ల నువ్వుసుఖపడడమేకాకుండా నీతండ్రినికూడా సుఖపెట్టగలవు. అది నీచేతులలోవుంది"అనిచెప్పెను. తనమూలమున జనకునకుగూడ నపాయమువాటిల్లునని వినుసరి కామె మితిలేనిదుఃఖమునుపొందినది. తాను నిర్దోషియే యైనను దొంగతనముచేసినట్లు ఒప్పుకుని తండ్రిప్రాణములను కాపాడవలెనని ఆమెహృదయము

కొట్లాడుచుండెను. కొంతసేపామె మౌనమునుధరించి యూరకుండెను. ఆమెహృదయము భయంకర వేదనల పాలగుచుండెను. ఈవిషమసమస్య నెదుర్కొనుట కామె కేమార్గమునుతోచకపోయినది. "ఉంగరం నేను తీసినమాటనిజమే. కాని దారిలోరోడ్డుమీదపడిపోయింది." అని అనవలెననుకున్నది. కాని వెంటనే "ఛీ! అబద్ధమాడేకంటె మరణమేమంచిది. ఏమైనాసరే నేనబద్ధమాడను. తండ్రీ! నీయాజ్ఞానుసారంగా ప్రవర్తించి సర్వమూభారం నీమీదనే పెట్టడానికి నిశ్చయించుకున్నాను. నిన్నేనమ్మివున్నాను" అనుకున్నది. అప్పుడామె న్యాయాధికారివంకదిరిగి సునిశ్చితకంఠస్వరమున 'అయ్యా! మాప్రాణాలను కాపాడుకోడానికైనా సరేగాని వుంగరం తీశానని చెప్పితినంటే గొప్పఅసత్యమాడినదాన్ని అవుతాను. అలాటిద్రోహానికి వొడిగట్టుకోజాలను. కాని నాకోరకు వృద్ధుడైన మాబాబునుమాత్రం హింసించవొద్దని మరీమరీకోరుతున్నాను. నాప్రాణాన్ని సమర్పించడానికి సిద్ధంగావున్నాను." అనిచెప్పివేసినది. ఆమాటలకు న్యాయస్థానమునవున్న వారిహృదయములు కరిగిపోయినవి. దయారసమనుమాటయే యెరగని అధికారిమనస్సుకూడ కొంతవిచారమును పొందినది. ఒక్కగడియ నిశ్శబ్దముగా కూర్చొని ఆలోచించినపిమ్మట కాంతమ్మను యథాప్రకారముగా చెరసాలలోనుంచమని యాజ్ఞాపించి న్యాయాధిపతి కచేరినిముగించెను.

## ఆరవపుష్పము: సంభాషణ

ఉంగరం చిక్కువిషయమున ఏనిర్ణయమునకు వచ్చుటకుగానుగూడ న్యాయాధిపతికి సాధ్యముకాలేదు. "ఈకేసువొచ్చి మూడురోజులైనది. ఎన్నివిధాలచూచినా ఆ అమ్మాయిమీదతప్ప యితరులపైని అనుమానం మోపడానికి వీలులేకుండావుంది. అంతలేతవయస్సులో ఆబింకమూ, పట్టుదలా నేనెక్కడాచూడలేదు. కాని పరిస్థితులెటుచూసినా ఆమెకు అనుకూలంగాలేవు. కాబట్టి ఆమెయేదోషి అయివుండాలి. రెండో మార్గం లేనేలేదు." అనుకున్నాడు.

ఇట్లు నిశ్చయించుకుని అతడు కోటలోనికిపోయి మరల సంగతులనన్నిటిని వివరముగా తెలుసుకున్నాడు. వున్ననతిరిగిజాగ్రతగా పరీక్షించినాడు. కోర్టులో కాంతం యిచ్చినవాఙ్మూలమును మరల మరల చదువుకుని ప్రతిమాటయొక్క అర్థమును తరిచితరిచి బోధపరచుకున్నాడు. చివరకు సాయంకాలమప్పుడు జగ్గయ్యను తనబసకుపిలిపించుకొని న్యాయాధిపతి యిట్లుబోధపరిచెను. "జగ్గయ్యా! నేను కఠినుడనని ప్రజలు చెప్పుకుంటారు. కాని బుద్ధిపూర్వకంగా నేనెవరికిని హానిచేసియెరగను. అందుచేత మిమ్మలిని అనవసరంగా బాధపెట్టాలనే వుద్దేశంనాకు అసలేలేదు అని నువ్వునమ్మవలెను. మీయందు నాకేవిరోధభావం కాని లేదు కదా! సాక్ష్యమూ, పరిస్థితులూ అన్నీకలిసి కాంతమే దోషియనిస్థిరపరిచినవి. కాబట్టి న్యాయశాస్త్ర ప్రకారం దోషులుదండింపబడునట్లు చూడడం నావిధి. అయినా యింకావ్యవహారం మనచేతుల్లోనుంచి జారిపోలేదు. ఉంగరాన్ని జమీందారువారికిచ్చివేసినట్లయితే ఆమె లేతవయస్సును పురస్కరించుకొని క్షమించడానికి మేము ఆలోచిస్తాం. అట్టిస్థితిలో నిజంచెప్పకుండా ద్రోహాన్నికప్పిపుచ్చడం ఆమె చేటుకే కారణమవుతుంది. అల్లాజరిగినప్పుడు వయస్సులో చిన్నదైనా నీకుమార్తె ద్రోహబుద్ధిలో ఆరితేరినదే అని ఆలోచించవలసివస్తుంది. ఆవిషయంలో మీరు శిక్షనుపూర్తిగా అనుభవించవలసినదేగాని గత్యంతరంలేదు. కాబట్టి నీవిప్పుడామెదగ్గిరకుపోయి వుంగరాన్ని తక్షణం యిచ్చెయ్యమనిచెప్పు. అలాచేస్తే శిక్షను తగ్గించే పూచీనాది. నీవామెకు తండ్రివిగనక ఆమెనీమాటలను వింటుందనేఆశ నాకువున్నది. ఇప్పటికైనా ఆమె తననేరాన్ని ఒప్పుకోకపోతే నీవుకూడాద్రోహివే అని అనుమానించకతప్పని సరివస్తుంది. ఉంగరం రాని పక్షంలో దయాదాక్షిణ్యాలు చూపనుసుమా! జాగ్రత్త!" న్యాయాధిపతి చెప్పినదంతయును నెమ్మదిగావిని జగ్గయ్య యిట్లనెను. "మీరుకోరినట్లు మా అమ్మాయితో మాట్లాడ్డానికినాకభ్యంతరలేదు. కాని ఆమె దోషి

కాదని నాకప్పుడే తెలుసును. నిర్దోషురాలైనను ఆమెకు శిక్షతప్పనపుడు ఇప్పుడిల్లాగ ఒక్కసారి ఆమెను చూడనివ్వడం నాకుమహోపకారమే."

ఒకరక్షకభటుడు ఆవృద్ధుని కాంతం గదిలోనికితీసుకొనివెళ్లెను. ఖైదీకొరకు తేబడిన ఆహారపదార్థములట్లే ఉపయోగింపబడక ఒకమూలబడియుండెను. కాంతమాభోజనమును ముట్టుకోలేదు. జగ్గయ్యా నచ్చట విడిచిపెట్టి భటుడుపైని తాళముబిగించుకుని వెళ్లిపోయినాడు. వారు గదిలోప్రవేశించుసరికి కాంతం గోడవైపు తిరిగిపరుండెను. గదిలో మనుష్యుల అలికిడివిని ఆమె వెనుదిరిగిచూచినది. ప్రియజనకుని చూచుసరి కాయమాయకురాలి సంతోషమేమని వర్ణించవచ్చును! ఒక్కకేకవేసి ఆమెలేవబోయినది. కాని సంకెలల మూలమున సాధ్యపడలేదు. గడ్డిపరుపుపైనే వృద్ధుడుకూడ కూర్చొనెను. తండ్రిమెడకు కాంతం తనబాహువులను పెనవేసినది. అశ్రుధారలు అవిరళములై కొంతసేపటివరకును వారిని మాటాడనియ్యలేదు. చివరకు జగ్గయ్య తనకు న్యాయాధిపతి చెప్పినట్లుగానే కుమార్తెను ప్రశ్నించినాడు. తండ్రి అట్లడుగుట కాశ్చర్యచకితయై అతనిమాటలు పూర్తికాకముందే కాంతం "బాబూ! నువ్వయినా నన్నునమ్మకపోతివికదా! ఆహా! నన్నునిర్దోషినిగా నమ్మువారు ఒక్కరైనాలేరుకాబోలు! బాబూ! నీకుమార్తెద్రోహికాదు. నమ్ము. ముమ్మాటికిద్రోహికాదు" అని దీనయైపల్కినది. "అమ్మా! తొందరపడకు. నేను నిన్నునమ్మకపోలేదు. తల్లీ! నిన్ను నమ్మనూ? కాని నిన్నిలాగ అడగాలని న్యాయాధిపతియాజ్ఞాపించేడు. కాబట్టి అల్లాఅడిగేను." అన్నాడు జగ్గయ్య.

ఇద్దరును కొంతసేపు మాటాడకుండ ఊరుకొనియుండిరి. జగ్గయ్య కుమార్తెముఖముపంకచూచెను. దుఃఖాతిరేకమున ఆమె చెక్కులుపాలిపోయి లోతుకుపోయియుండెను. కండ్లుగుంటలుపడిపోయినవి. అధికముగా నేడ్చుటవల్ల ఎఱ్ఱబారిపోయినవి. సుదీర్ఘములగు కేశపాశములు సంస్కారహీనములై చెదరి భుజములపైపడుచుండెను. ఆమె దీనావస్థనుగాంచి బెగిలిపోయి జగ్గయ్య "ముద్దుబిడ్డా! భగవంతుడు నిన్నుకఠిన పరీక్షకు గురిచేశాడమ్మా! కాని ఇంకాకఠినతరపరీక్షయుందున్నదనే నాభయం." అని వలవలయేడ్చెను.

"బాబూ! నాకోసం నేనువిచారించను. వృద్ధుడవైన నీకొరకే నామనస్సు దుఃఖిస్తూంది."

"తల్లీ! నాకొరకుభయపడకు. నాకేఆపదయును రానేరదు. నీస్థితిమాత్రం నిజంగాభయంకరంగావుంది. నీనిర్దోషిత్వమును ప్రకటించడమే దుర్ఘటమైనపనిగాతోస్తుంది. కాని ఆశమాత్రం నన్నువదలడంలేదు."

"ఆహా! నీకాపదరాదనుమాటే నాకుహాయిగావుంది. నిజంగా నాకుమరణశిక్షవిధిస్తే ఎంతబాగుండును? చావుకినేను భయపడను. జగదీశ్వరుని సన్నిధికిపోయి అక్కడ మాఅమ్మను కలుసుకుంటాను."

ఈమాటలు వృద్ధునిహృదయమును కలచివేసినవి. చంటిబిడ్డవలె అతడుఏడ్చెను. దుఃఖోద్రేకమున అతడు సర్వప్రపంచమును మరిచిపోయెను. హస్తములు జోడించి అతడిట్లనెను. "అమ్మా! ఈనేరానికే నీకు మరణశిక్షవిధించరు. కాని ఏచిన్నశిక్షయైనా మానవంతురాలవగు నీవుభరించలేక మరణముపాలవడంనిశ్చయం. నీకీవైరాగ్యభావములను ప్రసాదించిన సర్వేశ్వరునకు నమస్కరిస్తూన్నాను. వృద్ధాప్యమునకుంగిపోయిన యీ దీనునికి- ఇహలోకమున సౌఖ్యనిధానమై- లేకలేకమిగిలిన ముద్దుబిడ్డయై- కడకాలమున దిక్కయినకుమార్తెను యీరీతిగా నష్టపోవడం యెంతదుస్సహమో ఆలోచించు. కాని——"అతనికంఠము రుద్ధమైపోయెను. "కాని, ప్రభూత్తమా! నీయాజ్ఞకువ్యతిరేకంలేదు. దుఃఖాతురుడును వృద్ధుడునునగు ఈనాహృదయమునుండి ఒకమహాత్యాగమును కోరినావు. అయినను నాహృదయపూర్వకంగానే దానిని నీపవిత్రపాదారవిందములసన్నిధిని సమర్పించుకుంటున్నాను. ఈనాముద్దుకుమార్తెను నీహస్తకమలము లందుంచుతున్నాను. జగత్పితవగు నీయపార వాత్సల్యముననే నీబిడ్డను అప్పజెప్పుతున్నాను. తండ్రీ! నీసరంక్షణయందే ఆమె అధికసౌఖ్యమునందకలదు."

ఎడతెగకవచ్చుచున్న అశ్రుధార లాతనివాగ్ధోరణి నరికట్టినవి. కొంతసేపటికి మరల కండ్లుతుడుచుకుని అతడు చెప్పుటప్రారంభించెను. "అమ్మా! ఇంకొక్కసంగతి. నీశిక్షను దృఢపరిచినది పున్నసాక్ష్యము. ప్రమాణపూర్వకంగా నీచేతులో వుంగరాన్నిచూసినట్లు ఆమెచెప్పింది. కాని నువ్వామెను మనస్ఫూర్తిగా క్షమించాలి సుమా! ఆమె దుర్మార్గురాలేకావచ్చును. అయినా ఆమెయెడల నీకుక్రోధంవుండకూడదు. కోటలో, జమీందారుల భవనమందు, చీనిచీనాంబరశోభితయై, అనంతభోగముల ననుభవిస్తూవున్న పున్నకంటె అంధకారభరితమైన యీచెరసాలలో నిగళబద్ధవై కఠినమైన రానేలనున్న నీవే యెక్కువసౌఖ్యమును అనుభవిస్తున్నావు. గౌరవహీనమైన బ్రతుకుకంటె నిష్కలుషమైనచావేమేలు. అమ్మా! ఆమెనుక్షమించు. ఈబాధఅంతా భగవంతుడు నీమేలుకోసం కలిగించినదే అని త్రికరణశుద్ధిగానమ్మి పున్నను క్షమించు. ఏం?"

కాంతమ్మ అంగీకారసూచకముగ తలనాడించినది. ఇంతలో పోలీసుఉద్యోగి గదినిసమీపించుచున్నట్లు అడుగులశబ్దము వినవచ్చినది. ఇంక తాముविడిపోవుసమయమాసన్నమైనదని తెలుసుకుని జగ్గయ్యా కుమార్తెను కౌగిలించుకుని "తల్లీ! నాముద్దుబిడ్డా! నిన్నువిడిచిపోలేకుండావున్నానమ్మా! జగత్కర్త నిన్నురక్షించుగాక! అబ్బా! ఈయెడబాటు నన్నెంతబాధిస్తూంది! నాయనా! కాంతం! మన కిదేఆఖరుసంభాషణ అయినయెడల, యీలోకంలో మనకు యివేకడసారి చూపులయ్యే యెడల నేనుగూడా త్వరలో నీవెనుకనే స్వర్గానికిరావడానికి సిద్ధంగావున్నాననినమ్ము. నిన్నెడబాసినతరువాత నేను చిరకాలం జీవించివుండలేను." అన్నాడు. పోలీసుభటుడు తొందరచేయుచుండెను. కాంతం తండ్రినివిడిచిపెట్టలేకపోయినది. తనశక్తినంతను వినియోగించి ఆమెతండ్రిని కౌగిలించుకున్నది. రక్షకభటుని తొందరవల్ల మెల్లగ కుమార్తెకౌగిలిని విడిపించుకున్నాడు జగ్గయ్యా. మొదలునరికినవృక్షమువలె కాంతం నేలమీదకూలిపోయినది.

—మిగిలియున్నది.

## గృహలక్ష్మి

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మగారు

కలువకంటులపాలిటి కల్పతరువు
చిగురుబోణులపాలిటి దివిజమణియు
కమలనేత్రులపాలిటి కామగవియు
అంబుజాక్షులపాలిటి అమృతభాండ
మనగనొప్పు గృహలక్ష్మి నీవంకురించి
కోరివిద్యారసంబును గ్రోలిమించి
మెల్లమెల్లగ లతకూనయుల్లసిల్లి
అల్లిబిల్లిగ జగమెల్లయల్లుకొనియు
కొల్లలుగిమొగ్గలును మృదుపల్లవములు
వెల్లివిరియగపుష్పముల్ కొల్లపూసి
కాయలనుకాసి ఫలమియ్యగాగనుంటి
వమ్మ! మాతల్లి! సుగుణమణీమతల్లి!
చల్లగానాంధ్రసోదరీసతులనెల్ల
కోరవిద్యావతుల జేయకూర్మితోడ
నెన్నొయత్నంబులను జేసియలసినావు
వెన్నుకృపవల్ల నిప్పుడేవెలదులంత
మెల్లగాసరస్వతి కృపావల్లరులయి
సుగుణముల నేర్చి దుర్గుణరహితలగుచు
పతులసేవించుచును పతిప్రాణలగుచు
పరులకష్టముల్ గని దయాపరతలగుచు
పరులవిభవంబుగని అనసూయలగుచు
వన్నెగాంచుచునున్నారు వారిగనియు
సకలసంతోషసంయుక్తజలధియందు
నీదులాడుచు మురియుచు నీవుయుంటి
వమ్మ! గృహలక్ష్మి! జయమమ్మ! విజయలక్ష్మి!
తల్లి! గృహలక్ష్మి! నీకువందనములమ్మ!
పరగ స్త్రీవిద్యయందభిమానులైన
పావనులు ఆంధ్రసోదరప్రముఖులకును
పద్మపత్రాక్షునకు పార్వతీశునకును
భారతీదేవికిని ప్రణామంబుసేతు.

# విడాకులచట్టము

## ౧

## "పరాశరుని పద్ధతిని పోవుదము"

గౌరీదానదినములనుండి మనము నేడు శారదాశాసనమునకు వచ్చితిమి. ఇరువది యిరువదియైదు సంవత్సరములు వచ్చినపిమ్మటనే నేడు హిందూకన్యలు వివాహమాడుచున్నారనుటకు పెక్కు నిదర్శనములు కలవు. హిందూసమాజమున నలుబదిసంవత్సరములకు పూర్వము హిందూస్త్రీ తనబాలికకు చదువను వ్రాయను నేర్పుచో ఆమె తప్పకవైధవ్యము నొందునను మూఢాభిప్రాయము ప్రబలియుండెను. నేడు అత్తగార్లు తమక్రొత్తకోడండ్రు విశ్వవిద్యాలయమువారిపట్టాపొందివచ్చినవారని సంతోషగర్వములతో చెప్పుకొనుచున్నారు. పరిస్థితులలో వ్యత్యస్తము, సాంఘికాచారములలో మార్పు కలిగిన నేడు వివాహశాసనములందును, వివాహవిచ్ఛేదశాసనములందును, మార్పుకావలెననికోరుట వింతకాదు. సమానమైననైతికధర్మములు సమమైనఆదరణ నేడుహిందూస్త్రీలు వాంఛించుచున్నారు. ఇది నేటి వారిమనఃపరిణామమునకు సహజమైన ఫలము. స్త్రీలువాంఛించుదానిని ఇచ్చుటలో పిసినారితనముకూడదు. ఏదేనొకపరిష్కారము అవసరమని నేనొప్పుకొనుచున్నాను. కాని మనము ప్రత్యేకమైన సంకటనివారణమును సునిశ్చితముగకోరులోపల మనమద్దానిని పెక్కుమూలలనుండి నిలుకడయైన విమర్శచేసి నిదానముతో ముందడుగువేయవలయును. వివాహవిచ్ఛేదములు అనుమతింపబడుచో వాని ఆంతర్యమును గ్రహించి వానివలని లాభమును మనస్త్రీలెంతవరకు పొందగలరాయని సందేహము నన్ను పీడించుచున్నది. విడాకులపద్ధతి హైందవస్త్రీల స్వభావమునకు అనుగుణ్యాముగా కొనిరాబడవలయును. పూర్వహైందవఋషిసత్తములలో నొకడగు పరాశరుడు వివాహబంధములను అయిదు ముఖ్యకారణములచే త్రెంచుకొనుటకు అనుమతించి యున్నాడు. ఆపద్ధతులమీదపోవుదము. ప్రస్తుతపరిస్థితులలో అవసరమగుచో మరికొన్ని క్రొత్తకారణములను వానికి జేర్చుకొందము. కాని జీవితమునందలి కాలుష్యమును గ్రంథస్తమొనర్చుటకు మాత్రము విడాకుల తీర్పుగద్దెలకు పోవద్దు. లజ్జ, అభిమానము అను గుణములను పోగొట్టి వానిస్థానమున ముతకకామమును తెచ్చిపెట్టు స్త్రీస్వాతంత్ర్యమును కొనిరావలదు. సమానమైన నైతికమగు హక్కులు స్త్రీపురుషులగు ఉభయులకును మంచివియే. కాని సమానమైన నైతికమగు ఈహక్కులు సమానమైనఅవనీతికరమైనహక్కులుగా పరిణమించకుండునట్లు భద్రపడవలయును.

—శ్రీమతి పి. కె. రాయిసతి (కలకత్తాయూనివర్సిటీసినేటుమెంబరు)

## ౨

## "రాజీపద్ధతినవలంబింతము"

హూణవిద్యాసంపర్కము కలిగినను నా హృదయము హైందవవాసనకు దూరముకాలేదు. కావున నేనీవిషయములకు నాపూర్ణామోదమును తెలుపజాలకున్నాను. అయినను అనుమానమునకురాశి, అనాదరము చూపుటకు మొదలిపేరుఐన మగవానిని అంటుకొని స్త్రీ ఆజన్మము అవధిపడవలయుననుపాటిమూర్ఖత్వమునకు దోసిలియొగ్గుటకు నేను నవీననాగరికతావాసనసోకనిదాననుగాను. మగడు నమలరాని న్నారికేళమగుచో వానినుండి గౌరవపూర్వకముగా విడివడుటకు స్త్రీకి కొంతస్వాతంత్ర్యముండవలెను. కాని ఆ స్వాతంత్ర్యము ఆభాసపాత్రము, అతిసులభము కాగూడదు. అయినచో నాగరికసంఘమునకు పునాదియనదగిన నైవాహికప్రమాణము అపవిత్రమైపోవును. వితంతూద్వాహములైనను సరిగపాదుకొనని మనదేశమున విడాకులపద్ధతి నెలకొల్పుట అనుచితమును, అకార్యకరణమునైయున్నది. న్యాయస్థానమున తీర్పబడిన వివాహవిచ్ఛేదములపద్ధతియే వరణీయమును, నేటిమనఅవసరములకుతగియుండునదియుననుకొందును. బాగుగా పరి

కించితిమేని విడాకుపుచ్చుకొనుట యనగా పాతసంబంధమును వదలించుకొనుట మాత్రమేకాదు: క్రొత్త సంబంధమును కూర్చుకొనుటయునగును. పాతసంబంధములను త్రెంచుకొను అవకాశములను సాధ్యమైనంత తక్కువచేసియు, క్రొత్తసంబంధమలను కూర్చుకొనుట సాధ్యమగునంతవరకు లేకుండచేసియు మనమొకరాజీ పద్ధతి నవలంబింపగలిగితిమేని అదిమనప్రస్తుతసంఘస్థితికి అనుకూలమైయుండునని నేననుకొనుచున్నాను.

—శ్రీమతి ఇందిరాదేవి కవయిత్రి.

## 3

### "ఇది స్త్రీకి న్యాయదేవత ఇచ్చు చిన్న వరము"

వివాహవిచ్ఛేదములసమస్య1929-వ సంవత్సరమున ఇక్కడ కలకత్తాలో అఖిలభారతస్త్రీల సాంఘిక మహాసభలో తొలిసారి గొనిరాబడినది. కాని అపుడది నూటికి తొంబదితొమ్మండుగురచే త్రోసివేయబడినది. ఈసారి దానికే నలుబదియైదుగురువరకు ఆమోదకులు కలిగినారు. దీనినిబట్టి గాలి ఏదిక్కుగా వీచుచున్నదో తెలియనగును. తాగుబోతులు, దుష్టస్వభావులు అయినభర్తలచే అవమానింపబడి పశువులట్లుకొట్టబడి నిట్టు పాసముల ప్రగ్గింపబడి ఒక్కొకచో చంపబడిన భార్యలవృత్తాంతములు అసంఖ్యాకములు సేనెరుగుదును. బాధలుపెట్టిపెట్టి వారినివదలి వారిని దిక్కులేనిపక్షులుగాజేసి తాము మరల మరియొకకాంతను పెండ్లి యాడి కులుకు మగలను మనము పెక్కుమందిని చూచుచున్నాము. ఇట్టిపరిస్థితులలో స్త్రీలకు విడాకుహక్కు ఉండవలయునని నేను భావించుచున్నాను. చిరకాలముగా అణిచిపెట్టబడి నేడు నెమ్మదినెమ్మదిగా మేల్కొనుచున్న భారతమహిళలు సలుపుచున్నదాడిచే కొంచముకొంచముగ కూలిపోవుచున్న పూర్వా చారమనుమంటపముయొక్క మరియొకస్తంభమును యీవిడాకులచట్టము నేలమట్టముగావింపగలదు. వివాహన్యాయమున మగవానికొకపద్ధతి, స్త్రీకొకపద్ధతిఉండరాదనియు; స్త్రీపురుషులకు ఒకేపద్ధతి మీదజరుగువివాహన్యాయము ఉండవలయుననియు నేడందరును గుర్తించియున్నారు. స్త్రీపురుషులకు ఒకేపద్ధతిమీదనడచు వివాహన్యాయమును స్థాపించుటకు వలనుపడనిచో స్త్రీకి మగనినుండి విడాకును పొందుహక్కుమాత్రమైనను ప్రసాదింపబడవలయును. అణచివేయబడుచున్న స్త్రీకి న్యాయదేవత ఈయగల చిన్నవరము యిది. ఇట్టిచిన్నవరమును స్త్రీకి గల్గించుటకైన సమ్మతింపనిసంఘము తననాశనబీజములను తన లోనే ఇముడ్చుకొని యున్నదనినిస్సందేహముగ చెప్పవచ్చును.

—శ్రీమతి కుముదినీబోసుసరస్వతి.

## ౪

### "అన్యాయము తొలగిపోవును"

వివాహవిచ్ఛేదసమస్యను సాంప్రదాయము, ఆచారము నుండి విడదీసి హిందూస్త్రీ ఆలోచించుట దుస్తరము. హైందవవివాహము దురతిక్రమణీయమగు మతవిధి. కాంట్రాక్టుబీజము అందు కలికమునకైన కానరాదు. అయినను దానిమూలమున హిందూస్త్రీబద్ధురాలైయుండుటయు పురుషుడు తనభార్యనుకాదని తనకు తోచినప్పుడు పునర్వివాహము కావించుకొనుటకు స్వాతంత్ర్యము కలిగియుండుటయు న్యాయ విరుద్ధము. దుర్భరకష్టములకు గురిచేయబడినచో హిందూస్త్రీకి ఒక్కటేమార్గము. ఆమె మగనినుండి వేరుపడ వచ్చును. అప్పుడు ఆమె మగనిఅంతస్థుకు తగినమనోవృత్తి పొందుటకుమాత్రము హక్కుకలిగియుండును. ఇట్టిపరిస్థితులలో భార్యకు మగనికి విడాకుయిచ్చుహక్కు ప్రసాదింపబడుటకు అవకాశముగలదు. ఇట్టి

హక్కే ప్రసాదింపబడుచో మగనినుండి మనోవృత్తిపొందుహక్కును ఆమెకోల్పోవును. ఆమెతిరిగి వివాహముచేసుకొనుచో ఇట్టిహక్కు కోల్పోవుటనుగురించి విచారింపవలసినపని ఉండదు.

—శ్రీమతి ఏ. ఎన్. చౌదరిసతి (వంగరాష్ట్రీయస్త్రీసంఘోపాధ్యక్షురాలు)

౫

"ఆచారము మారవలెను. న్యాయము స్త్రీని రక్షింపవలెను"

హిందూదేశమున అణచివేయబడిన భార్యకు నిరంతరబ్రహ్మచారిణియై నియమబద్ధజీవితముగడపుటయో నీతినివీడిగి నికృష్టజీవన మవలంబించుటయోతప్ప మరియొకమార్గములేదు. న్యాయముగాని, ఆచారముగాని ఆమెకనుకూలముగలేదు. మగనినుండి విడివడి సంఘమున గౌరవనీయముగా జీవించుటకైనను ఆమెకు అవకాశములేదు. ఈఆచారము ఎంతత్వరగమారిన, న్యాయము ఎంతత్వరగా నామెను రక్షింపదొరకొన్న స్త్రీసంఘమునకును, తన్మూలమున ప్రజాసంఘమునకును నంతక్షేమము.

—శ్రీమతి సరళాదేవి.

౬

"స్త్రీలలో ఆత్మహత్యలు తగ్గిపోవును"

ఐరోపాఖండదేశములందు వివాహవిచ్ఛేదములపద్ధతి న్యాయసమ్మతమగుటకుగల అవసరములును, మహమ్మదీయులలో గల తలక్ పద్ధతి విడాకులచట్టమునకుగల అవసరములును నేటిమనహిందూసంఘమునకు ఎంతవరకు పట్టియున్నవను విషయము మనము దీర్ఘముగ నాలోచింపవలసినవానిలో ముఖ్యమైనది. కటికవాడగు భర్తకు కట్టుబడియుండి వానినుండి విడివడుటకు, దుర్భరజీవితదుఃఖమునుండివిడుమరగాంచుటకును వీలుచాలక తమజీవితమునంతను బొగ్గులపాలొనర్చుచున్న పెక్కురు హైందవభార్యల కడగండ్లను మనము సులభముగా నూహింపవచ్చును. నేటి హైందవభార్యలకు ఇట్టికడగండ్లు కలవనుటకు పత్రికలందు మనము దినదినముగాంచుచున్న భార్యలగు స్త్రీల ఆత్మహత్యావిషయకమగువార్తలే ప్రబలనిదర్శనములు. విడాకులపద్ధతియే యుండినచో ఈఆత్మహత్యలలో పెక్కులు పోసగకయే యుండునని నేను గాఢముగ నమ్ముచున్నాను. మగడుపెట్టుకష్టములచే ప్రపంచమును బాసిపోవు స్త్రీలు విడాకులపద్ధతియేయుండుచో దోషకరమగు ఆత్మహత్యకు కడంగక తనమగనినుండి విడివడి తగినప్రబోధమునంది నేడు దేశమున కెంతేని అవసరమున్న దేశసేవికలుగామారి అమృతతుల్యమైన సంఘసేవచేయగలుగుదురు. అయితే ఒకసంగతి. వివాహవిచ్ఛేదములను శాస్త్రసమ్మతమొనర్చు శాసనములలో స్త్రీపురుషులు చీటికిమాటికి విడాకులు కొనకుండునట్లు కట్టుదిట్టములు కావింపబడుటకూడ ముఖ్యమని నాదృఢమైన అభిప్రాయము.

—శ్రీమతి చారుబాలసరస్వతి (సరోజనళినీదత్తుస్మారకసంఘము)

౭

"శ్వానమార్జాలదాంపత్యము మంచిదా? విడాకు మంచిదా?"

శ్రీమతి లీలావతీదేవి మొదలగు మనసోదరీమణులు మనహిందూవివాహముయొక్క పవిత్రతను నిలబెట్టుటకు ఉత్సాహదీక్షనుకొని యుండుటకు మిక్కిలి సంతోషించుచున్నాను. హిందూన్యాయమున వివాహవిచ్ఛేదములకు ఎట్టి ఆస్కారము, లేకుండచేయవలెనని వారు దీక్షవహించియున్నారు. కాని పవిత్రమైన పూర్వసాంప్రదాయమును చెడగొట్టకుండనుండవలయునని మనమెంతగ నభిలషించినను వివాహవిచ్ఛేదపద్ధతినిగొనివచ్చుట తప్పనిసరియగుచున్నదని చెప్పుటకు విచారపడుచున్నాను. ఒక స్త్రీ తనమగనిని ప్రేమింపనిచో ఆమెను ఆతనితో జీవింపుమని నిర్బధించుటవలన ఏమిలాభము? పార్శ్వవర్తినియై ఆతనికి

సహాయము చేయుటకుబదులుగా ఆమె ఆతనికి ప్రతిబంధపుపేరటాలై 'అలుగాదిది తేలుగాని' అను కవి వచనమును సార్థకముచేయును. ఈశ్వానమార్జాలదాంపత్యమున నవసిపోవుటమేలో, ఎవరికివారేయై సుఖముగ జీవించుటమేలో యూహించుకొందురుగాక! కాని విడాకులు తగినన్యాయవిచారణ జరిగించినపిమ్మటను, పెక్కుకఠినినియమములకు తాళినమీదటను మాత్రమే యిచ్చుటకు నియమముండవలయును. మూడవసారి స్త్రీ విడాకునుకోరుచో ఆమె యికవివాహమాడకుండవలయును. ఈ నియమముండుచో అట్టిస్త్రీ మగలకొరకువేటాడుట యామెకొకవృత్తియైనదను అపదూరునుండి రక్షింపబడును.

—శ్రీయుత సంతోషకుమార రే.

౨

"దంపతులసామ్రాజ్యమున అధినివేశప్రతిపత్తి ప్రవేశపెట్టుడు"

హిందూదేశమున వివాహన్యాయమున ఒకపరివర్తనము గొనిరావలసియున్నది. భార్య భర్తయగువాని సొత్తేయను అభిప్రాయముపై నేటిమనవివాహధర్మము ఆధారపడియున్నది. మహాభారతమున ధర్మరాజు ఏమి చేసెనో తమకు అవగతమయ్యేయున్నది. ఆతడు జూదమున భార్యను ఒకపణముగా నొడ్డియున్నాడు. భార్య యనునది వానికి గృహోపకరణముగనో, నాణెముగనో వుండినది. ఈవివాహాదర్శము భారతస్త్రీపురుషులలో బాగుగా పాదుకొనియున్నది. హిందూబాలిక తాను తనభర్తయొక్క గృహోపకరణము మాత్రమే యను అనుచితభావమున పెంచబడుచున్నది. హిందూబాలుడు తనకు తనభార్య సేవకురాలనియు, తానామెకు యజమానిననియు అను అనుచితభావములనడుమ పెంచబడుచున్నాడు. ఇంతవరకు హిందూబాలిక తన యజమానిని ఆరాధించుటమాత్రమే యెరుగును. ఆతనికి తాను ఒకానొక గృహోపకరణముగా, ఆటవస్తువుగా మాత్రమే పడియుండుట ఆత్మవంచనయని యెరుగదు. కాని నేడు ఆపరిస్థితులు మారిపోవుచున్నవి. కన్యలకు అతిబాల్యమున వివాహమగుటలేదు. వారు స్వాతంత్ర్యవాతావరణమునడుమ పెరుగుచున్నారు. ఏదోకొంత విద్యాగంధమునొందుచున్నారు. స్వశక్తిపై తామాధారపడి యుండవలయునను సముచితభావము వారికికలుగుచున్నది. గతవత్సరము జాతీయసంగ్రామమున వారు పురుషులతో సమానమైన ఉజ్జీకితాళినారు. హక్కులయందును, అంతస్తునందును సమత నెలకొల్పుటకు వాగ్దానములు చేయబడినవి. కాగా ఇప్పుడు వారు పురుషులు మునుపటివలెనే తమ్ము అణగద్రొక్కుచుండుట ఎట్లు భరింపగలరు? అధినివేశరాజ్యములు విడిపోవుహక్కును పొందియు, బ్రిటీషుసామ్రాజ్యమునకు ఎట్లుహెచ్చుగా అంటుకొనివుండునో అట్లే స్త్రీపురుషులు స్వాతంత్ర్యసంవాసితమగు సంబంధమున ఒండొరులను విశ్వాసముతో నంటుకొనియుండ నభిలషింతురు. ఏతావతాచెప్పునది ఏమనగా స్త్రీలు దాంపత్యరాజ్యమున అధినివేశప్రతిపత్తిని గోరుచున్నారని. ఆఅధినివేశప్రతిపత్తియు వలయుచో దంపతులు ఒండొరులను వీడిపోవుటకు హక్కుకలిగించునదై యుండవలయును. ఈహక్కు ప్రసాదింపబడినంతమాత్రమున విరివిగ నుపయోగింపబడునని చెప్పుటకు వీలులేదు. ఉపయోగింపబడకయే ఉండవచ్చును. పతిభక్తి వారియందు అతిగాఢముగా నెలకొనియున్నది. కావున ఇట్టిహక్కుగలిగియు వారు వక్రమార్గమునపోవక తమ ప్రాణనాథులను అర్చించు ప్రణయినులే అయియుందురు. వారిరక్తనాళములయందు ప్రవహించుచున్న సీత, సావిత్రి మొదలగు పతివ్రతాశిరోమణుల పవిత్రరక్తబీజమును వారుకోరియు త్రోలగించుకొనజాలరు. కాని పురుషునిప్రకృతిలోకనుపట్టుచున్న తన భార్యనుకొట్టుటచేలాలించుఅనాగరికునిదుష్టస్వభావమును కాల్చివేయుటకే స్త్రీలీవిడాకులపద్ధతిని కోరుచున్నారు.

—శ్రీమతి మున్నీసతి.



శ్రీమతి కె. గంగమ్మగారు



శ్రీమతి చల్లనగరాజకుమారిగారు



శ్రీమతి అక్కరాజు వెంకటసుబ్బమ్మగారు

# కమలాదేవిఛటోపాధ్యాయ

శ్రీమతి జి. సీతాలక్ష్మీకన్యగారు

నవీనయుగమున భారతమహిళామండలియందు ప్రఖ్యాతిగాంచిన నారీమణులలో కమలాదేవిఛటోపాధ్యాయ యొకతె. ఈమె యశశ్చంద్రికలు దిగంతములవరకు వ్యాపించుచున్నవి. మద్రాసురాజధానియందు దక్షిణకెనరామండలమున మంగుళూరునందు ప్రఖ్యాతిగాంచిన నొక సారస్వతబ్రాహ్మణకుటుంబమున 1903 సంవత్సరమున కమల జననమొందెను. ఈమెతండ్రి మద్రాసు సివిల్ సర్వీసునందు గొప్పయుద్యోగి. తల్లి చాలసంపన్నమును, పలుకుబడిగలదియునగు కుటుంబమునకు చెందిన సాధ్వీమణి.

కమల చక్కనిచుక్క. స్ఫురద్రూపి. రూపమునకుతగినసుగుణరాసి. బాల్యముననె విద్యనభ్యసింపమొదలిడెను. కేంబ్రిడ్జిసీనియర్ పరీక్షవరకును మధ్యమవిద్య మంగుళూరు నందభ్యసించి తదుపరి మద్రాసునందు క్వీన్ మేరీ కళాశాలయందున్నతవిద్యనభ్యసింపమొదలిడెను. కాని విశ్వవిద్యాలయమున పట్టభద్రురాలు కాకమున్నె ఈమె వివాహము సందర్భించుటచే విద్యాలయమును విడువవలసివచ్చెను. ఇది ఈమెకు ప్రథమఅంతరాయము. వివాహమైన కొలదికాలమునకె కమలకు వైధవ్యము ప్రాప్తించెను. ఇకచేయునదేమి? సహజముగ కమల ధైర్యశాలి. విద్యావతిగాన ప్రథమమునుండియు హిందూసంఘపు కట్టుబాట్లకులోనై బాలికలు, స్త్రీలుపడుపాట్లను చూచి విచారించుచు సమయమగునపుడు దురాచారశృంఖలముల ద్రెంచివైచి సంఘోద్ధరణకెట్లు గడంగుదునాయని తీవ్రముగఁ దలపోయుచుండెను. ఈమెకు సమయమే తెంచెను. బ్రాహ్మణవంశమునఁ బుట్టినను జంకక సంఘముపై తిరుగుబాటొనర్చి వంగదేశయువకుని హరీంద్రనాథఛటోపాధ్యాయుని వరించి వివాహమాడెను. ఈవివాహము పూర్వాచారపరాయణులగు సారస్వతబ్రాహ్మణకుటుంబములలో గొప్పసంక్షోభమును లేవదీసెను. ఇది చిత్రవివాహము. వధువు సారస్వతబ్రాహ్మణకుటుంబమునకు జెందినది. విధవ. దాక్షిణాత్యురాలు. వరుడు వంగదేశీయుడు. విక్రమపురవాసి. బ్రాహ్మణయువకుడు. 'సముద్రపుఉప్పుఅడవిఉసిరిగకాయ' కలయికచిత్రము; దైవాజ్ఞ; అలంఘ్యము. ఈమె తన సాహసమునకుఁ దగినశిక్షననుభవించవలసివచ్చెను. బంధువులందరను వెలివేసిరి. స్నేహితులు పరిహాసమొనర్చిరి. సంఘమంతయు ఈమెను నిందించి వెలివేసినది. కాని ఈమె చలింపక చాలధైర్యమువహించి సంఘసంస్కరణకు మార్గదర్శియయ్యెను.

పూర్వాచారపరాయణులందరు నావికాయానమును నిషేధించిరి. మన కమలదేవి ఉన్నతవిద్యాభ్యాసముకై నౌకాయానమొనర్చి విదేశములకేగి లండన్ విశ్వవిద్యాలయమున సాంఘికశాస్త్రమును (Sociology) ఒకసంవత్సరకాల మభ్యసించెను. హిందూదేశము నెదుర్కొనుచున్న పెక్కుసంఘసమస్యల నీమెగుర్తించెను. సంఘసంస్కారమున

బాటుపడవలసినవారనేకులు భారతభూమి కావశ్యకమని కమలాదేవిగ్రహించి సంఘసేవకై తానునడుముకట్టెను. లండన్ విశ్వవిద్యాలయమున విద్యాపూర్తియైన పిమ్మట యిరోపాఖండమునఁ బర్యటనమొనర్చెను. ఫ్రాంసు, జర్మనీ, స్విట్జర్లాండు, మొదలగు దేశములఁజూచి, అచ్చటి నగరరాజములదర్శించి, అందుగల కళానైపుణ్యమునంతయుగ్రహించి, వివిధకళలను, సాంఘికాచారములను బాగుగగ్రహించి మాతృదేశారాధనకై జన్మభూమికేతెంచెను.

కలామదేవి విద్యావతి. ఆణిముత్యములొలుకునట్లుపన్యసింపగల నారీమణి. ఈమె వదినెగారగు శ్రీమతి సరోజనీదేవితో ఇంచుమించుతులతూగగల వాగ్జాలమును ప్రదర్శించు సామర్థ్యముగల కలభాషిణి. ఇదిగాక వ్యాసరచనయందద్భుతశక్తిగల లలన. తనకాలమును పత్రికారచనయందును, గొప్పసంఘసమస్యల, సారస్వతవిషయముల విపులముగఁ జర్చించుటయందును సద్వినియోగమొనర్చుచుండును. ఈమెకు కళలయందభిరుచిమెండు. ఖద్దరు పరిశ్రమకీమె చాలతోడ్పడెను. కమల ఖద్దరువస్త్రధారణమొనర్చి స్త్రీలకుమార్గదర్శియయ్యెను. ఖద్దరు చీరెల అద్దకమున చిత్రచిత్రలతలు మొదలగు నానావిధములగు అద్దకపు చిత్రములఁ గనిపెట్టెను. ఈమెకళానైపుణ్యమీయద్దకపుచిత్రములఁగాననగును.

అన్నిటికంటెను మిన్నయగు సామర్థ్యమీమె యందింకొకటికలదు. కమలాదేవికి కళలయందభిరుచిమెండని చెప్పియున్నాము. నాట్యకళాకౌశలమున కమలాదేవిఛటోపాధ్యాయనిశక్తి వర్ణనాతీతము. ఈమె సుప్రసిద్ధసినీమానటి. భారతసినీమారంగమున, అసమానప్రజ్ఞాధురీణలని వన్నెగాంచిన మిస్ సులోచన, మిస్ గోహార్, మిస్ జుబేడ, మిస్ యేనాక్షిరామారావు (భార్గవసతి) లోనుగాగల ప్రౌఢాంగనలలో జేర్పతగియున్నది. మిస్ ఏనాక్షి రామారావు (భార్గవసతి)తోగూడి 'వసంతసేన' మున్నగు ఫిల్ముకలందు కమలాదేవి నాట్యకౌశలమును ప్రదర్శించి సినీమారంగాకాశమున జ్యోతివలె వెలుంగుచున్నది. సుప్రసిద్ధసినీమానటికుండవలసిన లక్షణములన్నియు నీమెయందు మూర్తీభవించినవి. ఈమెతనులత మిక్కిలి సౌష్ఠవముగలిగి, బంగారుచాయను మించుచుండును. వేయేల? ఈమె పద్మినిజాతిస్త్రీ. సరససల్లాపములందును, భావ ప్రదర్శనమందును కమలాదేవి ప్రౌఢ. సర్వలక్షణలక్షణోపేత.

ఇన్ని సుగుణము లీమెయందు మూర్తీభవించుటజేసియు, విద్యావతియు సహజౌదార్యగాంభీర్యాదిగుణములుగల వనితామణియగుటఁజేసియు మన కమలాదేవిని పూనానగరమున జరిగిన అఖిలభారతమహిళాసభకు సన్మానసంఘకార్యదర్శినిగ నెన్నుకొనిరి. ఈమె తానుజేయబూనిన ప్రతిపనిని సంపూర్తిగనిర్వర్తించును. ఈకార్యభారము అతిశ్లాఘనీయముగ నిర్వర్తించెను. పైకారణమున అఖిలభారతమహిళామండలి కార్యదర్శినిగ ముమ్మారీమెను నెన్నుకొని గౌరవించిరి. మఱియు గతసంవత్సరమీమె అంతర్జాతీయ నానారాష్ట్రసభలకు భారతమహిళామండలి తరపునప్రతినిధిగ బెర్లిన్, జినీవా, ఎల్సినోర్,

ప్రాగ్వ్యా నగరములకు వెడలి వాటినిదర్శించి అచ్చట హైందవనారీమణుల స్థితిగతులగురించియుహైందవాశయములగూర్చియుగంభీరోపన్యాసములిచ్చినది.

మహాత్మాజీచే ప్రారంభింపఁబడిన హైందవస్వాతంత్ర్యసమరమున వెనుదీయక కమలాదేవి సన్నద్ధురాలయ్యెను. పిలుపువచ్చిన వెంటనే కమలాదేవి రణరంగమునకురికెను. బొంబాయి రాజధానియందు పికెటింగు ప్రారంభించెను. సహాయనిరాకరణోద్యమున తీవ్రముగఁ బాల్గొనినందున ప్రభుత్వమువారీమెను బంధించిరి. సంవత్సరకాలము శ్రీకృష్ణజన్మస్థానమున కంపిరి. నియమితకాలము దాదాపు పూర్తియగునప్పటికి, గాంధి - ఇర్విన్ ఒడంబడికననుసరించి, ప్రభుత్వమువారీమెను విడుదలజేసిరి. కారాగారమునుండి వెలువడి దేశమున పర్యటనము జేయనారంభించెను. తనప్రియుడగు హరీంద్రనాథఛటోపాధ్యాయునితోగూడి సంచారమొనర్చుచున్నది. స్వార్థమనునదిలేక లోకోద్ధరణకై నిరంతరము తన జన్మను ధారవోయు మనశ్రీమతి కమలాదేవికి సర్వేశ్వరుడు సకలసౌభాగ్యములొసగి చిరంజీవినిజేయుగాక!

# మేలుకొలుపు

శ్రీమతి లలితా కుమారి గారు

(ఉదయగానము)

శ్రీవర్ణమ్ములు తూర్పుకొండపయిన ర్తించెన్ ప్రభాతోత్సవం
బై, విశ్వస్తవగీతముల్ పికగళంబాలాపముంజేసె, ని
ద్రావేశంబునువీడిమేల్కొనుడటంచానందసంపూర్ణమా
రావంబొండరుదెంచుచుండె వినుఁడార్యావర్తబాలామణుల్.

తళుక్కులు తూరుపుందెస సుధామధురంబుగనిండి బంగరున్
ముల్కులవోలె నీపుడమిపొంతనెరాలుచునుండె, గీతముల్
చిల్కుచునుండెచిల్కలు నిశీతమసమ్ములుమాసె పూర్తిగా
మేల్కొనుమీ, సుషుప్తివిడుమీ! కనుమీ!! దెసలెల్లసోదరీ!!!

చీఁకటిలేక క్రొందళుకుచిన్నెలునిండిన యీప్రభాతమం
దాకులపాటులేని పదమల్లనవేయుము ముందుగా విపం
చీకమనీయనిస్వనధునీపరిపుల్లవచశ్చమత్కృతిన్
లోకములెల్లమేల్కొనగ నూత్నకృతుల్ వినిపింపుసోదరీ!

సకలాశాపరితృప్తి సూర్యునియుషస్సందేశముల్ తెల్పు నీ
యకలంకమ్మగువేళ మోహనము దివ్యమ్మన్సుమీ నేడు వి
శ్వకళాతంత్రులమీటి భారతయశస్సౌభాగ్యముల్పాడి మే
లుకొనంజేయుము నీదుగీతములలో లోకమ్ములన్ సోదరీ!




శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మగారు

**బొమ్మరిళ్లు;**—మట్టితోగాని ఇనుముతోగాని ఇల్లువలె కట్టుకొని ఆ యిల్లును అలికి ముగ్గులుపెట్టి అందులో పిల్లలందరుకలసి "బువ్వాలాట" "బొమ్మల పెళ్లిళ్లు" చేసి అనేకరకముల పాటలు పాడుదురు.

**గుజ్జన్న గూడు:**—పిల్లలందరు కలిసి బియ్యము, పప్పు, ఉప్పు, చింతపండు, మిరపకాయలు, కూరలు, విస్తరాకులు, నెయ్యి, నూనె, మజ్జిగ కొద్దికొద్దిగ దెచ్చి ఒక యింట్లో వంటచేసికొని వాళ్లంతాకలసి మెలసి కాస్త కాస్తే భోజనం చెయ్యడమునకు గుజ్జన్న గూడందురు.

**బువ్వాలాట:**—గుజ్జన్నగూడునకు మాదిరిగనే చిన్నపిల్లలు లక్కపిడతలు, నాగవల్లిపిడతలు పుచ్చుకొని కొంచము కందిపప్పుగాని, అటుకులుగాని తెచ్చి వండినట్లు నటించి ఏవో ఆకులు దెచ్చి విస్తరాకులుగా వాడి కందిపప్పును వడ్డించుకుని భోజనముచేసి చేతులు కడుగుకొనినట్లు నటించి చేతులు పరికిణీలకు తుడిచి పాటలుపాడుచు కేకలుపెట్టుచు తిరుగుదురు.

**బొమ్మల పెళ్లిళ్లు**—ఈ బొమ్మలపెళ్లిళ్లు సాధారణం బొమ్మరిళ్లలోనే జరుగును. పిల్లలు తాటియాకుల బొమ్మలతోను చందనపుబొమ్మలతోను ఒకచోటచేరి వారిలో కొందరు మొగబొమ్మలను కొందరాడబొమ్మలను పుచ్చుకొని కొందరు ఇంట్లోని డబ్బాలు దెచ్చి బాజాభాయింత్రీలుగా ఏర్పడుదురు. ఒకరు పెళ్లికొడుకు బొమ్మ, ఒకరు పెళ్లికూతురు బొమ్మ పుచ్చుకొందురు. వాళ్లల్లోనే కొందరు మొగపెళ్లివారు, కొందరాడపెళ్లివారు. ఒకళ్లు వియ్యపురాలు, ఒకళ్లు వియ్యంకుడు, ఇల్లా ఏర్పడ్డాక డబ్బాలు వాయిస్తూ బొమ్మలతోటి ఊరేగినట్టు అటు ఇటు తిరిగి పేరులు చెప్పడం, పసుపులునలవడము మొదలైన పాటలన్నీ పాడి భోజనాలు చెయ్యడము. ఇల్లా అయిదు రోజులు జరుగును. దీనికే బొమ్మలపెళ్లి అనిపేరు.




# సీతాదేవి:కన్య

ఆకుండి వేంకట.శాస్త్రి గారు

సీతాదేవికన్య 18సంవత్సరముల వయస్సుగల ప్రసిద్ధవంగీయ ఫిల్ము నటకురాలు. భారతీయఫిల్ము నటీ సమితిలో రాణియనపేరెన్నిక గాంచినది. ఈమె యధికలావణ్యవతియై, పదునైదు వత్సరముల వయస్సున, మిక్కిలి పిన్నవయసున ఫిల్ముసకై కడుచాకచక్యముగ ఖేలన మొనరించి ఫిల్ము నటీలోకమున కడుశీఘ్రకాలమున పన్నె గాంచినది. ఫిల్ముసకై ఖేలన మొనరించుట యన సామాన్యమైన కళకాదు. ముఖమున రసములను పరిస్ఫుటముగ వ్యక్తీకరింపవలెను. 1925 వ సంవత్సరమున లైట్ అఫ్ ఏషియా అను పేర బయలు వెడలిన బుద్ధచరిత్ర ఫిల్ములో సీతాదేవీకన్య బుద్ధుని సతియగు యశోధరాపాత్రమును ఖేలనమొనరించి, భారతీయ ఫిల్ము నటీ లోకమున వినుతి కెక్కినది. ప్రాన్జ ఆస్టెడు అను జర్మను దొరయు నతని పరివారమును కలకత్తాకు వచ్చి నిరంజన్ పాల్, హిమాన్సు రాయి అను వంగదేశజుల మార్గదర్శకత్వమున బుద్ధచరిత్ర ఫిల్మును తయారు చేయగల్గిరి. ఈ ఫిల్ము సీతాదేవికన్య యశోధరాపాత్ర ఖేలనమున తనయ ప్రతిమాన కౌశలమును ప్రకటించినందున ఈమెపేరు యింగ్లాండు, జర్మనీ, పోలండు, ఆస్ట్రియా మొదలగు పాశ్చాత్య



దేశములలో ప్రసిద్ధిబడసెను. ఈ ఫిల్ము దేశదేశములకు వెడలుటయు నచటి వారాఫిల్ములో ఖేలనమొనర్చిన సీతాదేవిచాకచక్యముగాంచుటయు వారివద్దనుండియు ముఖ్యముగా యూరపుఖండదేశస్థులనుండి ఈమె ఖేలనానైపుణిని కొనియాడుచు వ్రాసిన లేఖలెన్నియో ఈమెకువచ్చినవి. ఈమె ధారాళముగ యింగ్లీషులో మాట్లాడగలదు. సీతాదేవి ఫిల్ముకై ఖేలమొనర్చుట కెట్లు మొదటయవకాశము కలిగెనో మొదలగు స్వయ ఫిల్మునటీజీవితము నీక్రిందవివరించుచున్నది:

"నేను 1925-వ సంవత్సరమున ఫిల్ములకై పాత్రఖేలనమొనర్చుటకు ప్రవేశించితిని. ఫ్రాంజుఆస్టెంటు అను జర్మనుదొర లైట్ ఆఫ్ ఏషియా, అను ఫిల్ము తయారుచేయుటకై కలకత్తాకు వచ్చియచ్చటి గ్రేట్ యీస్టరన్ కార్పొరేషను లిమిటెడ్ ఫిల్ముకంపెనీవారి సహాయముగొని బుద్ధచరిత్రఫిల్ములో బుద్ధునిభార్య యగు యశోధరాపాత్రమును ఖేలనమొనర్పగల నీలములగు కన్నులును, చక్కని మైఛాయయు గలిగిన యంద కత్తెయగు బాలిక కావలెనని కలకత్తాలో పత్రికలన్నిటిలో ప్రకటించెను. నేనాపత్రికలలో ప్రకటనచేయ బడునాటికి పాఠశాలలో చదువుకొనుచున్న బాలికను. నాకప్పుడు పదమూడేండ్లు గడచినవి.

నేను వేడుకకొరకై స్త్రీపాత్రఖేలన మొనర్పగలనని యాకంపెనీవారికి నాదరఖాస్తును పంపితిని. ఆబుద్ధచరిత్రఫిల్ము తయారుచేయుటకు ఫొటోగ్రాపులు తీయుటకు డైరెక్టరైన నిరంజనుపాల్ గారి కడకు వెళ్లితిని. పాల్ గారును, తదితరులు కొందఱును నన్నుచూడగనే నేను ఫిల్ముకై స్త్రీపాత్రఖేలనమున కర్హురాలనని తలచి తమయామోదమును వెల్లడించిరి. అయినను వారు నన్ను నాఫోటోగ్రాఫ్ నుతీసికొనిరమ్మనిరి. నావద్ద నాఫొటోగ్రాఫ్ లేనందున వారికొఱకు నేను ఫొటోగ్రాఫ్ తీయించుకొనవలసినదాననైతిని. నాఫోటో గ్రాఫ్ను చూచినంతనే వారు నన్నుఫిల్ముకై నటిగా నంగీకరించిరి. ఫిల్ముకై ఫొటోగ్రాపులను తీయుట కేర్పడిన కాశీ, రాజపుత్రస్థానమునగల జయపురం, మసోౕర మొదలగు స్థలములకు నేను వెళ్లవలసివచ్చెను. అప్పుడు వేసవికాలము. మే, జూను నెలలు. కెమెరాకు యెదుటనిలచి నేను భావప్రకటనమునకై యెంతో భయమును బిడియమును పొందుచువచ్చితిని. క్రమముగ భయముతీరినది. యశోధరాపాత్రమును ఖేలనమొనర్చి శ్లాఘాపాత్రముగ నిర్వహించితిని. 1926-వ సంవత్సరమున నిరంజన్ పాల్ గారిచే వ్రాయబడిన "దేవత" అను శీర్షికగల నాటకమునకు ఫిల్మును తయారుచేసినప్పుడు నేను నాయికాపాత్రమును ఖేలనమొనర్చితిని. ఆసంవత్సరముననే మదన్ థియేటర్సు లిమిటెడు కంపెనీలో నేను నటకురాలనుగాజేరి వారుతయారు జేసిన నాలుగుఫిల్ములలో స్త్రీపాత్రధారణ మొనరించితిని. ఆనాల్గింటిలో "కృష్ణకాంతుని మరణశాసనము" అనుశీర్షికగల ఫిల్ములో నాఖేలన మధికమగుపొగడ్తగాంచినది. 1928-వ సంవత్సరమున హిమాన్సురాయిగారు రచించిన 'షిరాజ్' అను శీర్షికగల ఫిల్ముకై ఖేలనమొనర్చుటకై నను హిమాన్సురాయిగారే కోరిరి. పాత్ర ఖేలనాపోషణమును నేనీఫిల్ములో చక్కగ నిర్వహించితిని. గ్రేట్ యీస్టరన్ కార్పొరేషనులిమిటెడ్ కంపెనీ వారి "దిలవ్సు ఆఫ్ ఎమొగల్ ప్రిన్సు" అను శీర్షికగల ఫిల్ములోకూడ ఖేలనమొనర్చి ప్రశంసబడసితిని. హిమాన్సురాయి, ఫ్రాంజు ఆస్టెండుఅను జర్మనుదొరతోకలసి తయారుచేసిన "దిత్రో ఆఫ్ ఎడైస్" అను శీర్షికగల ఫిల్ముకై నేను పాత్రఖేలనమున మిగులకష్టపడవలసి వచ్చెను. ఏలనన యీఫిల్ము దక్షిణ యిండియాలో భీకరారణ్యమధ్యప్రాంతమున ఫోటోలు తీయవలసివచ్చెను. నేనొకరథమున కూర్చుండి యుండ రథము మహావేగముతో పోవుచుండగా నొకసంధిగ్ధతరుణమున నారథమువిరుగుటయు నేనుప డునట్లును ఫోటోతీయవలసివచ్చెను. మొదట నేను రథములో కూర్చుండ నక్కరలేకుండ నాకు బదులుగ నొకవిగ్రహమునుంచి రథము విరిగిపడిపోవుచున్నట్లుఫోటోతీయదలచిరిగాని తరువాత నేనే మిగులదెబ్బతో

గులకుండపడుట కేర్పాటు లాస్థలమున చేయబడెను. నిజముగ నేనుపడిపోవలసివచ్చెను. ఎంతజాగ్రత్తగా పడినను నాకుదెబ్బతగిలినది. ఇంతటితో నాకష్టము ముగియలేదు. కావేరీనదీజలపాతముగల శివసముద్రమునకు 60 మైళ్లదూరములోనున్న యెత్తైన ఒకకొండశిఖరమును బరువైన దుస్తులనుధరించి యెక్కవలసిన దాననైతిని. సినీమాలో పాత్రఖేలనమొనర్చుట సుఖకరమైనపనికాదు. నాకు పాశ్చాత్యఫిల్ముతీయు స్టూడియోలయందు నానటనాకౌశలము ప్రదర్శింపనెడలుట కిచ్ఛగలదు." అని సీతాదేవికన్య తనకథను ప్రకటించినది. మనిఇచ్ఛప్రకార మామె ఇప్పుడు విదేశముల కేగియున్నది.

# దానిమ్మ

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

## ప్రవర్ధనము

పెద్దతుప్పగగాని చిన్నచెట్టుగగాని వర్థిల్లుఫలవృక్షములలో నొకటియగు దానిమ్మ విత్తులవలనగాని, నేలయంట్లువలనగాని, చేరుపుఅంట్లువలనగాని వృద్ధిచేయనగును. సున్నపుపాలు ఎక్కువగాగల ఎఱ్ఱచెక్కనేలలు ఈచెట్టుయొక్క ప్రవర్ధనమున కెంతయు అనుకూలములు. చీకినపశువులయెరువులో ఇటుకపొడుమునుగలిపి ఈ చెట్లకు ఎరువుగావేసినచో బాగుగాఎదిగి ఫలించును.

## కాపు

గింజలువేసిపెంచిన దానిమ్మచెట్లు ఒకటి, ఒకటిన్నరసంవత్సరములకే కాపుపట్టును. సాధారణముగ దాడిమవృక్షములు వర్షాకాలమున విశేషముగా పుష్పించి శీతాకాలమున ఫలించును. కాని కొన్నిరకముల దానిమ్మచెట్లు అన్నికాలములయందును కొద్దిగనో గొప్పగనో పుష్పించి ఫలించుచునేయుండును. చెట్లమొదటను పుట్టురెమ్మలను ఎప్పటికప్పుడే కోసివేయుచుండవలయును. చెట్టున కాయలువిస్తారముగా ఉండినప్పుడు వర్షములేనిచో నీరుకట్టవలసియుండును. కాయలుకోసినపిమ్మట ఆకొమ్మల చిగుళ్లను కత్తిరించివేయుట మంచిపద్ధతి.

## కాయలు: వానిజాగ్రత

సులభముగనే పెంచవచ్చును. ఫలములును త్వరలోనే పొందవచ్చును. అయినను దానిమ్మకాయలకు విశేషముగ పురుగులుపట్టి వానిని పాడుచేయుచుండుటచే ఈ చెట్లను పెంచుటయందలి మోజును తగ్గించుచున్నవి. పురుగులుపట్టకుండ నిరోధించుటకు తగిన సులభసాధనోపాయము ఇంతవఱకేదియు కనుగొనబడలేదు. పొగాకుకాడలను చెట్లమొదట వేయుట కొంతవఱకు పురుగులను పోద్రోలుటలో కార్యకారిగా ఉండుచున్నది. చెట్లచుట్టుపట్ల గడ్డిగాదములను పెరుగనీయక ఎప్పటికప్పుడే కలుపుతీసివేసి నేలను కుళ్లగించివేయుచుండుట కొంతవఱకు ప్రయోజనకరముగ నుండగలదు. సీతాకోకచిలుకలుప్రాలి ఆకులమీద గ్రుడ్లుపెట్టును గావున వానిని చేరనీయ రాదు. పిందె ఏర్పడుసమయమున దాని

బొడ్డుచుట్టునుండు రక్షకపత్రముల చివుళ్లను దీసివేసి ప్రతికాయకును ఒక్కొక్క పలుచని గుడ్డసంచి కట్టినయెడల పురుగులుపట్టుటకు అవకాశము తక్కువగనుండును.

### దానిమ్మరకములు

పుల్ల తియ్య దానిమ్మలయందు గింజలు తెలుపుగనుండురకములు, ఎరుపుగనుండు రకములునుగూడ కలవు. పూలదానిమ్మలో తెల్లపూవులరకమును, ముద్దపూవులరకమును గలవు.

### దానిమ్మ, దానియంగములు, వానిసత్తు

దానిమ్మపట్ట, పండుయొక్కతొక్కయందు నూటికి 22 మొదలు 25 వ అరు టానిన్ (Tannin) కలదు. వేరుపట్టయందు (Punico-Tannic Acid) పూనికో టానిక్ యాసిడ్ నూటికి ఇరువదిమొదలు 25 వఱకును, మ్యానైట్ (mannite), పంచదార, పెక్టిన్ జిగురు (Gum Pectin), నూటికి పదిహేనుపాళ్లు బూడిద, తీవ్రమైన 'పెల్లేటియరైన్' అను ద్రవక్షార మును, 'ఇసా పెల్లేటియరైన్' అను జిడ్డుగల ద్రవమును, మఱియు రెండు మందక్షార ములు (Methyl Pelletierine) మెథిల్ పెల్లిటియరైన్, స్యూడో పెల్లేటియరైన్ (Pseudo-Pelletierine) అనునవికలవు. పూనికోటానిక్ ద్రావకము (Punico-tannic acid) గంధకధృతితో కలిపి వెచ్చపెట్టినచో ఎల్లాజిక్ ద్రావకము (ellagic acid) గాను, పంచదారగాను ఏర్పడును.

### వివిధాంగముల గుణములు

దానిమ్మగింజలు వానిక్షారములు మలముతోపడెడు చీము మొదలగువానిని కట్టెడు గుణముకలవియు, క్రిమిహరగుణముకలవియునై యున్నవి. దానిమ్మపువ్వులు, పండుయొక్క తొక్క మలముతోపడెడు చీముమొదలగువానిని కట్టును, జీర్ణశక్తిని వృద్ధిచేయును. పండు యొక్కరసము ఉష్ణశాంతికరమైనది, బలవర్ధకమైనది. 'పెల్లీటియరైన్' క్షారము క్రిములను హరించును. దానిమ్మ ఆకులరసము రక్తస్రావావరోధకమైనది; మలముతోపడెడు చీము, నెత్తురు మొదలగువానిని కట్టెడు గుణముకలది. ఎండపెట్టబడిన దాడిమకాండములపట్ట, వేరును క్రిమిహరశక్తిని కలిగియున్నవి.

### సాధారణగుణములు

మలముతోకలసిపడెడు చీము నెత్తురులను కట్టివేయును, ఏటికపాములుపడెడు రోగమున చాలఉపయోగము, బలవర్ధకము, ఉష్ణశాంతికరము. చీమునెత్తురులుపడుట ఆపు గుణము ఈ మూలికయందు విశేషముగనుండుటచే దీనిని ముక్కునుండి నెత్తురుపడుట, మూలరోగము, నోటినుండి నెత్తురుపడుట, నోటిదుర్వాసన, అజీర్తి మొదలగు రోగముల యందు ఇది విరివిగ లోపలికీయబడుచున్నది.

## మొగ్గలు : పువ్వులు

మొగ్గల చూర్ణము నాలుగైదుగింజలయెత్తు పుచ్చుకొనిన దగ్గు, గ్రహణి, నీళ్లవిరేచనములు వీనిని కట్టును. పచ్చిపువ్వులు నూరి పండ్లకు పూసిన చిగుళ్లవెంటరక్తము పసుటకట్టును. ఎండిన దానిమ్మపూలను గుల్నారు అందురు. వీనిచూర్ణము ఒకడ్రాము, అరేబిక్ చెట్టు జిగురు (Gum Arabic) ఒకడ్రాము, Sanguin Draconis రెండు డ్రాములు, నల్లమందు ఎనిమిదిగింజల (grains) ఎత్తు కలిపి తయారు చేయబడిన చూర్ణము రక్తపిత్తము, గ్రహణి మొదలగు రోగములయందు చాలఉపయోగకరము. మోతాదు 10 లేక 15 గింజలయెత్తు. క్రొత్తగాపుట్టి ఇంకనువిడుచుట కారంభింపని మొగ్గలు నూరి ఏలకిగింజల చూర్ణము, గసగసాల చూర్ణము, పిల్లికండ్ల గుగ్గిల చూర్ణము కలిపి లేహ్యముగా చేసి పుచ్చుకొనిన చిరకాలముగానుండిన పిల్లలరక్తగ్రహణి, గ్రహణి నయమగును. దానిమ్మపూవుల రసమును, గటికరసమును సమభాగములుగ నొనర్చి ముక్కువెంట నెత్తురు పడెడు రోగమున ఈయబడుచున్నది.

## దాడిమకాయల తొక్క

దాడిమకాయలపైతొక్కను దాడిమసారమందురు. కాయలతొక్కలు అయిదు తులములు యెత్తుగ్రహించి ముప్పావుసేరుపాలలోవైచి నాలవవంతుగ ఇగరకాచి సేవించిన పురాణరక్తగ్రహణికట్టును. దాడిమసారము జఠరదీప్తినిచ్చును ; వీర్యవృద్ధి చేయును ; అరుచి, గుల్మము, శూల, ప్రమేహము, గ్రహణి, అతిసారము, వాతరోగము, రక్తము పడెడు మూలవ్యాధి, కఫము, సర్వపైత్యములు, విదాహము వీటినన్నిటిని జయించును. రక్తగ్రహణియందును, తీవరించినగ్రహణీరోగమునందును దాడిమతొక్కకషాయమున నలగగొట్టబడిన లవంగములు గాని లవంగపట్ట గాని చేర్చి వాడనగును. కషాయము చల్లారినప్పటి మోతాదు తడవకు ఒకటిగాని రెండుగాని ఔన్సులు. దినమునకు మూడు నాలుగుసారులీయనగును. రోగప్రాబల్యమున ఈ కషాయపు మోతాదుకు తడవకు తడవకు అయిదుచుక్కల నల్లమందుద్రావకము చేర్చనగును. గొంతుకనెప్పియందు పైచెప్పిన కషాయమున కొంచము పటికపొడుము చేర్చి పుక్కిలించి ఉమియుట చాలమంచిది. యోనిస్రావము, రక్తశ్వేతప్రదరములు మొదలగు వానియందు ఈ కషాయము ఇంజెక్షను ఉపయోగకరమైనది. ఈరోగములందు ఇదివాడునప్పుడు లవంగములుకాని, లవంగపట్టకాని కలుపకుండవలెను. దానిమ్మ పండుతొక్క, మంగుస్తాను పండుతొక్క, కొడిశపాల పట్ట సమభాగములుగ దినుసు ఒక్కంటికి ఒకఔన్సు చొప్పున గ్రహించి ఒకపైంటు జలమున (20 ఔన్సులు) కషాయముకాచి దినమునకు ఒకటి లేక మూడుసారులు వాడుచో గ్రహణిరోగములయందు మంచిపనిచేయును. దాడిమసారము, తాడికాయ కలిపి నోటపెట్టుకునిసారముమ్రింగుచుండుట రొమ్ముపడిశము మొదలగు రోగములయందు చాలామంచిది.

—మిగిలియున్నది.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి కొప్పర్తి నాగరత్నముగారు

చిల్కచిల్క—
ఏమిచిల్క?
పచ్చచిల్క—
ఏమిపచ్చ?
ఆకుపచ్చ—
ఏమిఆకు?
మామిడాకు—
ఏమిమామిడి?
అంటుమామిడి—
ఏమిఅంటు?
మల్లెఅంటు—
ఏమిమల్లె?
తెల్లమల్లె—
ఏమితెల్ల?

పాలుతెల్ల—
ఏమిపాలు?
ఆవుపాలు—
ఏమిఆవు?
పెద్దఆవు—
ఏమిపెద్ద?
చెట్టుపెద్ద—
ఏమిచెట్టు?
తాడిచెట్టు—
ఏమితాడి?
పోతుతాడి—
ఏమిపోతు?
గొఱ్ఱెపోతు?
ఏమిగొఱ్ఱె?

నల్లగొఱ్ఱె—
ఏమినల్ల?
కాకినల్ల—
ఏమికాకి?
బొంతకాకి—
ఏమిబొంత?
గుడ్డబొంత—
ఏమిగుడ్డ?
కంబళిగుడ్డ—
ఏమికంబళి?
రత్నకంబళి—
ఏమిరత్నం?
నాగరత్నం—

౨. పాటలు

## చింతకాయపాట

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

చింతకాయ చింతకాయ
నీటరమణచింతకాయ
పడమటరమణచింతకాయ
మెంతైనాతరుగునాచింతకాయ
దమ్మిడీతీసికెళ్లి కోమటింటికెళ్లి
మెంతైనాతరుగునాచింతకాయ
నానొప్పులైనాతగ్గునా చింతకాయ
పొట్టబొఱ్ఱపోలిగా!

## వేడుకపదము

శ్రీమతి చేబోలు లక్ష్మీనరసమ్మగారు

రుంగురుంగుబిళ్ల! రూపాయదండ.
దండకాదు! దామరమొగ్గ.
మొగ్గకాదు! మోదుగనీడ.
నీడకాదు! నీరానిపోతు.

పోతుకాదు! బొమ్మంచుకట్టు.
కట్టుకాదు! కంభంమెట్టు.
మెట్టుకాదు! మేడలఇల్లు.
ఇల్లుకాదు! ఈతతట్ట.
తట్టకాదు! తూమెడుమన్ను.
మన్నుకాదు! గంధపుచెక్క.
చెక్కకాదు! వేపపూవు.
పూవుకాదు! చామంతిబిళ్ల.

## చిన్నపిల్లల పాటలు

శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

౧

బావాబావా పన్నీరు
బావనుపట్టుక తన్నేరు
వీధీవీధీ తిప్పేరు
వీరాగంధంపూసేరు
సావిడికొమ్ముకు కట్టేరు
చప్పిడిగుద్దులు గుద్దేరు.

౨

సీతమ్మ సింగారమే
ఒల్లంత బంగారమే
చూడంగ శృంగారమే
తలపోయ సంతోషమే
మాపిటికి కల్యాణమే
ఊరంత వైభోగమే.

౩

వదినా వదినా
వల్లంకి పిట్టా
గదిలో పెట్టా
మాన్నాయ్ కొట్టా
నీవేడవా
నేన్ నవ్వా.

౪

చింతకొమ్మకు చిగురు
వాలుకొమ్మకు వగరు
అన్నయ్యాపంచకు తొగరు
వదినకుపట్టింది పొగరు.

౫

ఆటలుపాటలు బాగుండాలి
అన్నాదమ్ములు బాగుండాలి
అత్తాకోడలు బాగుండాలి
అంతాలోకం బాగుండాలి.

## పుట్టినయింటికి

శ్రీమతి సాకలరత్నమాలగారు

కలవారికోడలూ కలికిసుందరీ
కలువపప్పాలబోసి కడుగుచున్నదీ
కడవమీదకాకి వాలుచున్నదీ
అంతలోకే వారిఅన్నలొచ్చేరు.

* * *

కాళ్లకునీళ్లిచ్చి కన్నీరునింపె.
ఎందుకూకన్నీరు? ఏలకన్నీరు?
తుడుచుకోకన్నీరు, ముడుచుకోకురులూ,
ఎత్తుకోపాపిడిని, ఎక్కుఅందలము,
మీఅత్తమామలకు చెప్పిరావమ్మా!

* * *

కుర్చీపీటమీద కూర్చున్నఅత్తా!
మాయన్నలొచ్చేరు మమ్మంపుతారా?
నేనెఱగ నేనెఱగ మీమామనడుగు—

పట్టెమంచంమీద పడుకున్నమామా!
మాయన్నలొచ్చేరు మమ్మంపుతారా!
నేనెఱగనేనెఱగ మీబావనడుగు——
భారతంచదివేటి బావపెదబావా!
మాయన్నలొచ్చేరు మమ్మంపుతారా?
నేనెఱగనేనెఱగ మీఅక్కనడుగు——
వంటల్లుచేసేటి ఓఅక్కగారూ!
మాయన్నలొచ్చేరు మమ్మంపుతారా?
నేనెఱగనేనెఱగ నీభర్తనడుగు——
రచ్చల్లోఉండేటి రాజేంద్రభోగీ!
మాయన్నలొచ్చేరు మమ్మంపుతారా?
వండుకోవరిపాలు, కట్టుకోచద్దీ.

* * *

ఇరుగుపొరుగక్కలకు చెప్పిరావమ్మా!
ఇరుగుశ్రీలక్ష్మీ! పోయివస్తాను,
పొరుగువరలక్ష్మీ! పోయివస్తాను,
మామరదిపెండ్లికి మరలివస్తాను,
అన్నల్లపెండ్లిండ్లు ఆగివున్నవీ,
తమ్ముళ్ళపెండ్లిండ్లు దాగివున్నవీ,
చెల్లెళ్లపెండ్లిండ్లు చేసిరావాలీ,
చేడె! నాపుట్టింట చేటల్లనోమే.
కుంతి! నాపుట్టింట కుంకుమలనోమే.
పణతి! నాపుట్టింట పసుపులానోమే.

* * *

పోయేనమ్మా శ్రీలక్ష్మిపొన్నల్లుదాటి
నిలిచెనమ్మా శ్రీలక్ష్మినిమ్మల్లనీడ
పోయేనమ్మ శ్రీలక్ష్మితనతండ్రిపాతశాలలోకి.

3. కథలు

## "ఈతడవనిప్పులుపెట్టెమరచిపోలా"

శ్రీమతి కూచిభొట్ల గంగమాంబగారు

అనగనగా ఒకవూళ్లో ఒక అత్త, కోడలు వుండేవాళ్లు. అత్త ఒకకాకరపాదువేసుకొని రోజూనీళ్లు పోసేది. కొన్నాళ్లకి పెద్దపెద్దకాయలు కాచేయి. కోడలికి కాకరకాయకూరంటే మహాయిష్టం. కాని అత్త ఎప్పుడు కూరవండినా కోడలికివేసేదికాదు. కోడలి కళ్లనీ్నకూరమీదేవుండేవి. అడిగితేగాని నెయ్య గూడదని అత్తనుకుంది. వేస్తేగాని తినగూడదని కోడలనుకుంది. ఇట్లా రోజులుగడిచిపోయాయి. ఒకరోజున అత్తకు తెలియకుండా కోడలు కొన్నికాయలుకోసుకు తెచ్చుకుని కూరవండుకుంది. ఎట్లాగో ఆపని అత్తకళ్లల్లో పడింది. నాతోచెప్పకుండా, నాఆజ్ఞలేకుండా నాపాదుఎందుకు ముట్టుకోవాలని అత్త కోడలినిచచ్చేటట్టు తన్నింది. స్పృహతప్పిపడిపోయింది కోడలు. అమ్మలక్కలందరూ పరుగెత్తుకొచ్చేరు. కోడలి మంచి తనాన్నిగురించి బాగాపొగిడేరు. మొగుడుకూడా విచారించేడు. చేసేది ఏమీలేదుగనుక ఏడుకట్లసవారీ ఒకటి తయారుచేసి కోడలిని దానిమీదవేసికట్టి అత్త, కొడుకు స్మశానానికి తీసుకవెళ్లేరు. శవమును దించి కట్టెలుగిట్టెలు అన్నీపేర్చి శవాన్నిదానిమీదపెట్టేరు. నిప్పంటిద్దామని నిప్పులుపెట్టెకొరకు వెదికేరు. పాపంమరచిపోయారు. సరేయింటికివెళ్లి నిప్పులుపెట్టెతెద్దామని తల్లి, కొడుకు యిద్దరు యింటికివెళ్లేరు. ఈ లోపల కోడలికి స్పృహతెలిసి లేచికూర్చుంది. దగ్గిరగా ఒకగుడిదగ్గర కొందరుదొంగల్నిచూచి ధడిసిగుడి చాటునదాక్కుంది. ఇంతట్లో దొంగలు బోలెడుడబ్బుతెచ్చి అమ్మవారికిమొక్కి వాళ్లు ఆరాత్రిచెయ్య బోయేపని సఫలమవుతుందోకాదో చెప్పమన్నారు. కోడలు చాటునవుండి "ఊ" అంది. అమ్మవారుపలి కిందని దొంగలు డబ్బంతాఅక్కడపోసి వెళ్లిపోయారు. ఈడబ్బంతా [illegible] అక్కడకూర్చుంది కానీ

పటివరకు. ఈలోపల తల్లి, కొడుకువచ్చి కట్టెలన్నితగలెట్టి వెళ్లిపోయారు. కోడలుముండచచ్చిందని చాల సంతోషించింది అత్త. తరువాత కోడలు కొత్తచీరకట్టుకుని నగలు డబ్బు అన్నీమూటగట్టుకుని యింటికొచ్చి తలుపుతట్టింది. ఎవరంటే నేనుకోడలినంది. దయ్యమువచ్చిందని అత్త బాగాభయపడింది. గంటసేపటికి తలుపుతీసింది. కోడలినిచూచేటప్పటికి నిర్ఘాంతపోయింది. ఎట్లాబ్రతికివచ్చేవు అని అడిగింది కోడలిని. నేను స్వర్గలోకమునకు పోయేను. అక్కడ దేవుడు నాకుస్వర్గముయిస్తానన్నాడు, బోలెడునగలు, డబ్బు, చీరెలు యిచ్చేడు అవన్నీయివిగో అని చెప్పిచూపింది. ఇంకా ఎన్నోకోతలుకోసింది. ఇవన్నీవినేటప్పటికి అత్తకి పెరపెరలాడింది. నేనూ వెళ్లివస్తా, నన్నుకూడా తీసుకువెళ్లమందికోడలిని. నేనురాను. నీకుదోవచూపిస్తానంది. తరువాత మొగుడు, పెళ్లాముకలసి అత్తని సవారిలోకట్టేరు. స్మశానమునకు తీసుకవెళ్లేరు. ఈతడవ కోడలు నిప్పులుపెట్టె మరచిపోలా. శుభ్రముగా తగలేశారు అత్తని. ఇంటికితిరిగివచ్చేరు ఇద్దరు. ఆరాత్రేమొగుడు, పెళ్లాము కాకరకాయ కూరవండుకుతిన్నారు. "కాకరకాయకూర మాబావుంటుంది" అని అందిపెళ్లాము మొగుడితో మొఖమువాచినట్లుగా. కథకంచికివెళ్లింది మనము యింటికివచ్చేము.

## పంది, తాబేలు

పోతాప్రగడ వేంకటచలపతిరావుగారు

ఒక ఊళ్లోపంది, భార్యాఉండేవారు. వారికి ఆవూళ్లోనేయున్న తాబేలుదంపతులతో పరిచయం జాస్తీ. ఒకరింటికొకళ్లు తరచుగారాకపోకలు చేస్తుండేవారు. ఇట్లాఉంటూండగా ఒకరింట విందుజరిగింది. తాబేలమ్మగారు పోవాలెవిందుకి. నగలులేవు పాపమావిడకు. అంచేతేంజేసింది. తిన్నగా నేస్తంగారింట్కి పోయి కాసులపేరొకటి ఎరువు అడిగింది. నేస్తం కోర్కెదీర్చింది పంది. విందుకెళ్లింది తాబేలు. సందట్లో ఏమిటయిందనుకున్నారు. ఎవరోదుర్మార్గులు ఎరువునగనికాజేసేరు. ఏంజేస్తుందిగనుకను. తిరిగివస్తూ త్రోవలోనేస్తాన్నిచూసింది. అందిగదానేస్తం 'కాసులపేరు జాగ్రత్తగాతెచ్చేవుగా' అని. 'అయ్యో ఎవరో కాని వాళ్లు దోచేరమ్మా ఏంజేయను' అంటూపల్కింది తాబేలమ్మ. "చాలాబాగుంది. నేనామధ్యను నష్టపోవాలసింది? పనికిరాదు. అచ్చుకోవాలసిందే మరి" అందిపంది. చాలారోజులు జరిగిపోయేయి. కాని కాసులపేరువచ్చేజాడలేకపోయింది. పంది, మొగుడితో అందికదా, "ఏమండీ! తాబేలమ్మకు నాకాసులపేరిచ్చేను. ఇంకాయిచ్చిందికాదు. నాల్గురోజుల్లో మావాళ్లింట్లోబారసాల. అప్పుడుమెళ్లో ఏమిలేకుండా ఎట్లాపోయేది. మీరుపోయి ఆమె మొగుణ్ణడిగి తీసుకురావాలే" అని. "సరే" అని మొగుడుబయలుదేరి పోయేడు కాసులపేరు తేవటానికి. పందిరావటం చూచేడు దూరంనుండి. చూచిఅన్నాడుకదా భర్త, 'ఓసేవ్ మీనేస్తం మొగుడొస్తున్నాడు. ఇంట్లోలేరనిచెప్పేయి.' ఇట్లాఅని వీధిగదిలో వెల్లకిలనుండి కాళ్లు లోనికిముడ్చుకుని సానరాయిలాపరున్నాడు. ఇంతలోపందిబావవచ్చేడు. లోపటనుండి "లే"రని జవాబు వచ్చింది. కాని చావడిలోనున్న తాబేటినిజూచి, సానరాయనుకొని కాసులపేరిచ్చేవర్కు యిదివుంచుదామని పట్టుకుపోయేడు. కొంతదూరంపోయి, గడ్డిలోదాచి, గుర్తుగా ఒకకర్రపాతి తిరిగివచ్చి తాబేలుగారి యింటిమొగనికాచేడు. పట్టిచేతులతోపోతే పెళ్లాం ఊరుకుంటుందికనుకనా. పందిబావ కదలిపోగానే తాబేలులేచి, మారుమార్గాన్నియింటికివచ్చేస్తూ గడపలో అడుగుపెట్టేడోలేదో పంది చరుక్కునవచ్చి కాసులపేరుయిమ్మని వేగిరించేడు. చావడిలో యిటూఅటూచూచి "ఓసేవ్, సానరాయిక్కడపెట్టిపోయేను గదా. ఎక్కడుంది" అని భార్యనికేకేసేడు. లోపలనుండి తలుపుసందుగుండా అంతాఎఱింగిన భార్యా అందిగదా "అన్నయ్య పట్టుకెళ్లేడు. తేలేదా" అని. "బావగారూ! సానరాయినిచ్చి మీకాసులదండ మీరు తీసుకెళ్లండి. ఒకళ్లదిమాకెందుకు" అని కమతమంది. "సరే"నని వెళ్లిందిపంది. గుర్తుదగ్గర్కుపోయేడు. వెదికినాడు. పాపం ఎక్కడాదొరికిందికాదు. సానరాయిలేందే యేవిధంగాపోతాడుగనక్క. అతడిప్పటికి వెతుకుతూనేయున్నాడు ఆతృతకొద్దీ. తనసంతతి వారికికూడా నేర్పేడు. అంచేతే మన్నులోను, బురదలోను, అన్నిచోట్లముట్టెతో తవ్వుతూ పందులుమనకి కనబడ్తవి.

## ౮. బాలికల రచనము

### పిల్లిగమ్మత్తులు

శ్రీమతి సచుయమంత్రి రాజ్యలక్ష్మి గారు

మాయింట్లో ఒక తెల్లపిల్లి ఉంది. అదిచిన్నప్పటినుంచి మాయింట్లోనే ఉండడంచేత చాలామచ్చికయి పోయింది. కాని ఆమచ్చిక యింట్లో అందరికికాదు. మాచిన్నచెల్లెలిదగ్గరే. మాచెల్లాయికి మూడోయేడు. మేము ఎవళ్లమేనా పిల్లినిపట్టుకుంటే పీకుతుంది. మాచిన్నచెల్లెలు శతకీర్తిదాన్ని ఎత్తుకున్నా, క్రిందపడేసినా, దాన్నిగుంజినా ఏమీచెయ్యదు. ప్రొద్దున్నే లేచి పిల్లినిపిలిచిదానికి అన్నంవేస్తుంది. ఆతర్వాత మాఅమ్మ పాలుపితికికుండలో పోస్తుంటే కొంచెంపాలు దానికిపోయిస్తుంది. కాఫీతాగేటప్పుడు కాస్తఇడ్డెనువిరిచి దానికిపెడుతుంది. ఇవిరోజూజరిగేవే. ఎప్పుడైనా వెన్నపిడత క్రిందపెడితే కాస్తవెన్నతీసికెళ్లి పిల్లికిపెట్టుతుంది. అన్నట్లుదానికి "మ్యావు" అనిపేరుపెట్టింది. "మ్యావు" అని పిలిస్తే ఎక్కడవున్నా పరుగెత్తుకుని వస్తుంది. బంతివేస్తేదాన్నిదొర్లించి ఆడుతుంది. ఈనపుల్లతోటి గమ్మత్తుగా ఆడిస్తుంది పిల్లిని మాశతకీర్తి. మామధ్యాన్నపుభోజనాలైనతర్వాత వెళ్లి పోయిదగ్గరపడుకోడం పిల్లికలవాటు. అన్నముముట్టుకోదు లేండి. మాశత భోజనం అయినతర్వాత పిల్లికోసంవెళ్లి దాన్ని తీసుకుంటానంది. మాఅమ్మమ్మ "పిల్లినితీసికో కూడదు. పిల్లి అంటైపోయింది" అంది. "పిల్లి అంటైపోతేకలిగిప్వంది" అందిశతకీర్తి. పిల్లితనదగ్గరకురాదని, పట్టుకుంటే పీకుతుందని, శతకీర్తిదగ్గరే అలవాటని మారెండోచెల్లెలు వీరాభాయికి చాలా ఉడుకుమోత్తనంగా ఉండేది. ఒకరోజున మాశతకీర్తి పిల్లితోటి ఆడుతుంటే ప్రమాదవశాన్నో, కరవాలనో పిల్లికరిచింది. కొంచెం పన్నుగుచ్చుకుని వ్రేలుకందింది. వ్రేలుబాధపెట్టికాబోలు ఏడుస్తోంది మాశత దొడ్లో తులసికోటదగ్గర నుంచుని. సావిట్లో కబుర్లుచెప్పుకుంటూన్న మేమందరంవెళ్లి చూచేటప్పటికి సంగతితేలిపోయింది. కసితీర్చుకోవాలని ఎదురుచూస్తూన్నమావీర "ఓతాయిలారిని పిల్లికరిచిందోయ్, లేవిడోయ్, చలిమిడోయ్" అని ఉడికించడం మొదలుపెట్టింది పెద్దపెద్ద కేకలేస్తూ. అదిఅందిగా" అని మేముకూడా అలాగఅన్నాము. ఈఉడికించడంతోటి అంతవరకు గట్టిగాఏడుస్తూన మాశత అభిమానంవచ్చి కాబోలు "నన్ను పిల్లికలవలేదోయ్. ముద్దెత్తుకుందోయ్" అంది బాధఅణచికొని. దానితోటి కేకలేస్తూన్న మావీర నోరుమూతపడింది. మూడేళ్లపిల్ల దీనికెంత అభిమానంరా బాబు అని అంతా ఆశ్చర్యపోయాం.

### చిత్రప్రశ్న

శ్రీమతి మాడభూషి చూడమ్మ గారు

సీ. కబ్బంబులలో పన్నెగాంచిన కావ్యంబు
నవవర్ణకములచే నమరెపేరు
ఆద్యక్షరద్వయంబవరంగ చూచిన
గ్రంథకర్తకుపేరు గలిగియుండు
మూడునాల్గక్షరమ్ముల మూర్తిగాంచిన
భారతయోధుని పలుకగలరు
ప్రథమాక్షరము విడచిపైమూడుకలుపంగ
యోధపుత్రునిపేరు బోధయగును
అయిదారువర్ణంబు లట్టెచేర్చినయంత
ద్రవమునకర్థంబు దనరియుండు
యారక్షరము మీదియచ్చుతో చదువంగ
నర్థవత్సరమున కర్థమగును
గీ. కడపటయిదక్షరంబులు కలిపిచూడ
మధురపానీయమయ్యె కవిహృదయమందు
కాన కబ్బంబుపేరును కాంతలార!
కడగి తెలుపంగవలయును గాంచిదీని.

ఇట్టివానియందు రుచిగల గృహలక్ష్మిపాఠకురాండ్రు ఈప్రశ్నకు జవాబు ఆలోచించి జూలై 7-వ తేదీలోపున లేఖాముఖమున మాకు తెలుపుదురుగాక!

—సంపాదకుడు.



**నూతనమనస్తత్వశాస్త్రము: సంయుక్తవిద్య:—**

మేమాసము 'Scholar' పత్రికలో శ్రీయుత టి. కె. వెంకట్రామన్‌గారు యం.ఏ.; యల్.టి. 'నూతనమనస్తత్వశాస్త్రము: విద్య' అను విషయమును గూర్చి నొకవ్యాసమును వ్రాయుచు అందు 'నూతనమనస్తత్వశాస్త్రము: సంయుక్తవిద్య (Co-education) అనుదాని నిట్లు ప్రస్తరించుచున్నారు:—

"నూతనమనస్తత్వశాస్త్రము యొక్క దృష్టినుపలక్షించి సంయుక్తవిద్యాసమస్యనుగురించి వ్యాసముయొక్క ముగింపున కొంతముచ్చటింపనగును. తనదేశముయొక్క పరిస్థితులను మాత్రమే మనమున నిలిపిన ఒకానొకపాశ్చాత్యగ్రంథకర్త బాలునిమనఃపరిణామమున మూడు అంతస్థులనేర్పఱచుచున్నాడు. తొలి అంతస్థు మొదటి ఏడుసంవత్సరములు. ఈకాలమున శిశువుఅక్కర తన్నుగూర్చియే. దీనినే మనోశాస్త్రవేత్తలు 'Narcissistic Stage' అందురు. ఏడవసంవత్సరము మొదలు పదునాలగవ సంవత్సరమువఱకును 'Homo-Sexual Stage'. ఈకాలమున బాలబాలికలు ఒండొరులతో కలసి తిరుగుటకు అభిలాషపడుదురు. పదునాలుగు సంవత్సరములు దాటినతరువాత యౌవనప్రాదుర్భావమగును. పదునాలుగు పదునేడుసంవత్సరముల నడును 'Hetero-Sexual Stage' అనుబడు మూడవఋతువు ఆరంభమగును. ఈకాలమున స్త్రీపురుషప్రేమకు తావలనుగు ఏకాంతమైన అన్యోన్యస్నేహము మొదలిడును. ఈమనఃపరిణామాభివృద్ధిక్రమము హిందూదేశమునందలి విశేషపరిస్థితులలో కొంతవిభేదించియుండును. హిందూదేశము ఉష్ణదేశమగుట నిచట బుద్ధియు, శరీరమును శీఘ్రవికసనమునందును. కావున పైనవివరించిన వయోవిభాగములు కొంతకొంత వెనుకకు నెట్టబడవలయును. సామాన్యముగ హిందూదేశపరిస్థితులలో బిడ్డకు అయిదవసంవత్సరము వచ్చువఱకును మొదటిఋతువుగా భావింపవచ్చును. ఈకాలమున సంయుక్తవిద్యచే నెట్టి హానియుకలుగజాలదు. ఏమందురా? స్త్రీపురుషవివక్షత దానికిచెందినవికారభావములు ఆచిన్నతనమున కలుగజాలవు. తరువాతి అంతస్థు మనదేశమున పండ్రెండవఏడు బిడ్డకు వచ్చినతోడనే ముగియునని చెప్పవచ్చును. ఈకాలమున బాలబాలికలను కలిపి చదివించుటచే ఆబాలబాలికల మనస్సులందు సూక్ష్మవిచిత్రభావములు కలుగుట కేర్పడును. ఈ ఏర్పడుట సంయుక్తవిద్యావిధానమువలదనుటకు ఒకచక్కని ఉపపత్తియగుచున్నది. కాగా మూడవకాలవిభాగమున సంయుక్తవిద్య మనసాంఘికనిర్మాణముపై అననుకూలమును, ఉపద్రవకరమునైన ముద్రనుంపవచ్చును. విచిత్రసాంప్రదాయములకు, వివిధాచారములకు కట్టుమట్టగుటచే చిత్రమైన సంఘవ్యవస్థగల మనదేశమున సంయుక్తవిద్యను ప్రవేశపెట్టుటకు మునుగా సంస్కర్తలీవిధానము ఇతరదేశములందు ఎట్లుపని

చేసినదో పరీక్షించి నిదానము చూపుటలెస్స. పాశ్చాత్యదేశములందును సంయుక్తవిద్యావిధానము కావలయు నను వారెంతమందియున్నారో వలదనువారు కూడ నంతమందియున్నారనియు, ఈవిషయమై ఏ ఒక్క దేశమునందును ఏకాభిప్రాయము లేదనియు తెలియుచున్నది."

## వెన్నెమ్మ:—

శ్రీయుత వీరేశ్వర దీక్షితులుగారిట్లు వ్రాయుచున్నారు:—

"స్త్రీలమ్మ వెన్నెమ్మను ఎన్నెమ్మయని పిలుచుచున్నారు. దాని యదార్థనామము వెన్నెమ్మ అయినను, పదిదినముల పురుడుగతించిన పిమ్మట దానిని స్మరింపని కారణముచే కాబోలు దానికలరూపును స్త్రీలేకాక విద్వాంసులగు పురుషులు సహితము గ్రహింపలేకయున్నారు. ఈవెన్నెమ్మయొక్క నిజతత్వము నెఱిగినచో స్త్రీలు దానినిగుఱించి భయపడవలసిన అవసరముండదు. పురుటింటిలో చెప్పు వెన్నెమ్మకథలో విశేషార్థమేమియులేదు. సోమయాజులకూతురు మాలవాని భార్యకథలో తల్లిదండ్రుల యభ్యాసములే బిడ్డలకు సంక్రమించునని తెలియుచున్నది. వెన్నెమ్మ పురుటింటిలో ఆరు, ఎనిమిది, పదియవరోజులలో తనశక్తిని విజృంభించుననియు, ఈరోజులలో శిశువునెత్తినణచుననియు, కాని తల్లి స్తన్యమిచ్చునపు డేమియుచేయజాలదనియు చెప్పుకొందురు. ఇట్టి మూఢవిశ్వాసమునందుకూడ కొంతవఱకు సత్యములేకపోలేదు. కాని దాని యదార్థమును తెలిసికొనుట మిక్కిలి యావశ్యకము. ఎన్నెమ్మయనగా వెన్నెమ్మయని ఇదివఱకే సుదహరింపబడినది. మనుజులకు బలీయస్థానము వెన్నెముకయుండుప్రదేశమే. వెన్నెముకగట్టిగను, వంకరలేకను ఉన్నచో వారి యారోగ్యముచెడలేదని చెప్పవచ్చును. పసిబాలురవెన్ను మిక్కిలి కోమలముగనుండును. అవెన్నునరము తెల్లనిద్రవపదార్థముగనుండి నడుమునుండి శిరస్సువఱకును ప్రవహించుచుండును. పసిబిడ్డలకు పుట్టినపిమ్మట రమారమి పదిరోజులకుగాని వెన్నెముకగట్టిపడి శిరోభాగముతో సంధింపదు. కారణాంతరమున అవి కలియకుండినచో బిడ్డలకు ప్రాణాపాయమువాటిల్లుటయుకూడ జరుగును. ఈవిధముగజరిగి బిడ్డలు మరణించినచో అది వెన్నెమ్మ సందుగొట్టినదని తల్లులు వాపోవుదురు. కావున తల్లులు తమపురిటిబిడ్డల నడుమును శిరస్సును ఎక్కువగ వంగకుండునట్లు పట్టుకొనవలయును. అందుకనియే తల్లి స్తన్యమిచ్చునపుడు వెన్నెమ్మ బాధయుండదు. ఏలయనగా ఆసమయమున బిడ్డయొక్క నడుమును శిరమును విశేషముగ కదలజాలవు. బాలింతరాండ్రు పైనిచెప్పబడిన విషయములనుగ్రహించి శిశువును జాగ్రత్తగపట్టుకొన్నచో వెన్నెమ్మపిశాచము వెనుకంజవేయగలదు. పురుటింటిలో దుర్గంధము, పొగ, గాలిలేమి ఇత్యాదికారణములచే జనించు చిన్నపురుగులను వెన్నెమ్మదూతలని భయపడుట కేవలమునెఱ్ఱితనము. వానిని చూచిభయపడి అకారణముగా చంపుటకేమని చెప్పవలయునో తెలియదు. దీనిని చదువువారైనను జీవహింసాఫలము మూటకట్టుకొనకుందురుగాక."

## శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారికి:—

శ్రీమతి పాకలరత్నమాలగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఆంధ్రమహిళామణుల కొకమనవి అనుశీర్షిక క్రింద శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారు వ్రాసిన వ్యాసమును గృహలక్ష్మి పాఠకులందఱెఱింగియేయుందురు. అందు వరుడు తాగుబోతు, వికలాంగుడు, కుష్టు, క్షయ, గుడ్డి, కుంటి మొదలగు రోగములచే పీడింపబడువాడు తటస్థమగునపుడు భార్య తనభర్తనుండి విడాకును పొందవచ్చుననియు, రాబోవు గుంటూరు పంచమమహిళాసభయందు ప్యాసుచేసి విడాకులచట్టమునకు ప్రాణప్రతిష్టచేయవలసినదనియు వ్రాసియున్నారు. అంగవికలులును రోగులునగు [illegible] వారిని పరు

లనుజూచి జాలిపడి వారికన్నోదకములనిచ్చి రక్షింపవలసిన మన మగ్నిసాక్షిగ బరిణయమాడినపతిని అనారోగ్యముగ నున్నప్పుడు, వికలాంగుఁడైనప్పుడు విడిచినచో వారలగతి యేమగునో కొంతవిచారింపవలసియున్నది. ఇప్పటికే పతిచే విడువఁబడివిచారించుచున్న సతీమణుల నెందఱనో మనముగాంచుచున్నారము. ఇఁక సతులచే విడువఁబడిన పతులగతికూడ నిట్లేయగుననుటకు సందియమేమి? అట్టి వికలాంగులు మరల పరిణయమాడవలెనన్న నెవ్వరంగీకరింపరుకదా? సంసారసాగరము దాటుటకు పురుషుఁడు నావయు, స్త్రీ తెడ్డుకఱ్ఱయునైయున్నారు. అప్పుడు తెడ్డుకఱ్ఱ చేయిజారిననావగతి యేమికాఁగలదో యాలోచింపవలదా? హిందూనారి కష్టసుఖముల సమముగా నెంచుకొనును. కష్టసుఖములు సమముగ ననుభవించుబాధ్యత సతీపతులలోఁగలదు. అట్టితఱి కష్టములున్నచోఁ గాపురమొనర్పనని సంసారమును విచ్ఛిన్నమొనర్చుట భావ్యము కాదు. పతి వికలాంగుడు, రోగిగానున్నప్పుడు సతి విడనాడుటమంచిదికాదు. అట్టి స్థితిలోవారిని వదలిననిక నాతనికి రక్షకులెవ్వరు? కావున వారల కుపచారములొనర్చుచు మాత, సోదరి పగిదిరక్షింపసమకట్టవలెను. పురుషులుకూడ స్త్రీలవలె ఏకపత్నీవ్రతులై యుండుటకును, త్రాగుబోతు, జూదరి అయి నిష్కారణముగ సతీమణులను బాధించువారిని, విడిచిపెట్టువారిని శిక్షించుటకేదైన నొకచట్టమును నిర్మింపుడనికోరవలెనేగాని. యీవిడాకులచట్టమునుకోరుట సమంజసముగాదు. ఇప్పట్టున సుమతీదేవిచరిత్ర నొక్కింత పరికింతుమేని కుష్ఠురోగియు వేశ్యాలోలుఁడునయిన పతినెట్లాదరించెనో మనకు విశదముకాఁగలదు. ఎన్నివిధములఁ బరికించిచూచినను విడాకులచట్టము యుక్తముకాదనియెంచుచున్నాను. కలకత్తానగరమున విద్యాప్రబోధముగల భారతస్త్రీలలో అగ్రగణ్యులగువారు సమావేశమై విడాకులతీర్మానమును త్రోసిపుచ్చుట గృహలక్ష్మి మనకువినిపించినది. వంగనారీమణులట్లే ఆంధ్రమహిళామణులెల్లరు పవిత్రభారతదేశమున నీచట్టమును ప్రవేశపెట్టకుండుటకు తీర్మానింతురుగాకయని విద్యాధికలగు సోదరీమణులను ప్రార్థించుచున్నాను. టర్కీదేశపు వివాహచట్టమును గూర్చి ఏప్రియల్ మాసపు గృహలక్ష్మి ప్రచురించియున్నది. అట్టి చట్టము మనదేశమునగూడఁబెట్టిన చాలమంచిది. అందు వివాహమునకు పూర్వము స్త్రీపురుషులను వైద్యులచే పరీక్షచేయించి ఆరోగ్యమగువారలు మాత్రమే వివాహమాడవచ్చునను పద్ధతి యెంతమంచిదో మనకు తెలియగలదు.అట్లు మున్ముందుజాగ్రత్తగా పరిశీలించి వివాహమాడుట శ్రేయస్కరముగాని వివాహానంతరము రోగులయినవారిని విడనాడుటుచితముకాజాలదని మదభిప్రాయము. విద్యాధికురాండ్రగు సోదరీమణులీవిషయమును శ్రద్ధతో గమనించుట లాభకరము. ఈవిషయమున తొందరపడుట మంచిదికాదనియు, భారతనారీమణుల పాతివ్రత్యమునకు భంగముకలుగకుండనుండవలెననిన ఈచట్టమునకు ప్రాణప్రతిష్ఠచేయకుండుటే మేలనియు నాఅభిప్రాయమును వెల్లడించుచు తక్కుంగల సోదరీరత్నములను కూడ విడాకులచట్టమును కోరవలదనియు నిందుమూలముగా వినయముతో ప్రార్థించుచున్నదానను."

పై విషయమును గూర్చియే శ్రీయుత వూరె సత్యనారాయణగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఈ మధ్యవెలువడిన గృహలక్ష్మి సంచికయందు శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబ గారు విడాకులచట్టావశ్యకతను గూర్చి వ్రాసినవ్యాసమును జదువనివారందఱును వెంటనే జదువవగును. ఆవ్యాసము సాంతముగ జదివినపిమ్మట ఆమె ప్రతిష్టింపగోరిన విడాకులచట్టమునందు గర్భితమైన విషయములు ఇంచుకదీర్ఘదృష్టిచే జూచినచో కేవలము నీతిదూరమై సనాతనధర్మనిర్మూలనకారణంబై హిందూసాంప్రదాయవిరుద్ధమై వధూవరులపురోవృద్ధికి ప్రబలనిరోధకమనుటకు సంశయములేదు. ఎట్లన: "వరుడు, త్రాగుబోతు, వికలాంగుడు, కుష్టు, గుడ్డి, కుంటిమొదలగు రోగములు కలవాడు తటస్థమగునపుడు....అట్టి వివాహమును రద్దుచేయవలసి

నది.” “వరుడు అప్రయోజకుడై పోషించుకోలేని దుస్థితిలో ఉన్నప్పుడును, దీర్ఘరోగముచే తీసికొను చున్నప్పుడును, మతిభ్రష్టుడైనపుడును, సోమరిపోతులయి సాపాటురాముడుగానున్నప్పుడును, వివాహానంతరము అంగవికలుడైనను భార్య తనభర్తనుండి విడాకును పొందవచ్చును” అనుఅంశము ఆచట్టమునందుండ వలసినవట. ఇవి ఎంతదూరదృష్టిరహితవాక్యములో సోదరసోదరీమణులు దిలకింపుడు. మానవప్రపంచమున నెట్టివాడును ఆజన్మాంతము యొకేతీరుగనుండగల్గునా? అయ్యది భగవదధీనముగాని మానవునిశక్తిలో నున్నదా? తొలుత విద్యాధనరూపబలసంపదల నలరారునట్టి యేవాఁడు కాలపరిణామమున జాడ్యగ్రస్తుడైనచో నట్టి భర్త త్యాజ్యుడేగదా? ఇకవానిగతియేమి? విధివశమున నైశ్వర్యలోపముగల్గి తినుట కన్నములేని దీనదశ కలుగగనే భార్యనుగూడ గోల్పోవలసినదేనా? కాలవశమున మతిభ్రష్టుడైనచో భార్యనువీడి వాతేరు చేర వలసినదేగదా? కర్మముచాలక కారునుండి క్రిందపడి కాలువిరిగినచో కారులోపికారుదిరిగినకాంతగూడ కాలు విరిగినభర్తను వదలి కఱ్ఱజేతకీయనలసినదేనా? ఆహా! కాలమహిమ. అట్లయిన వీరికిగలిగిన సంతానము మాట చట్టమునందెక్కడను ఇరికించియుండలేదే? వారిగతియేమి? భర్తతో విడచిపోవలెనా, భార్య తానుగూడ నుండగోరవలెనా? అన్నట్లడుగమరచితిని వివాహవిమోచనానంతరము ఆయమ స్వేచ్ఛావిహారిణియేనా? ద్వితీయ లమస్వయంవరము కూడనున్నదా? అదికూడనుండిననేగాని ఆచట్టమువలనప్రయోజనముండజాలదు. మరియొక్క మాట. ఈచట్టము పురుషులకన్వయించునదేగాని స్త్రీలపట్లనుపయోగించినచో కడుచిక్కులుగల్గునని కాబోలు వధువునుగూర్చి యెచ్చటను వ్రాసియుండలేదు. ఏమన వివాహానంతరము భార్య కురూపియైనను, గుడ్డిదైనను, కుంటిదైనను, దీర్ఘరోగియైనను భరణముమాటదలంపకుండ బంపివేయవలసినదేగదా? ఇకనామె గతియేమి? సోమరిపోతులయి సాపాటురాముడుగానున్న వరుడును, పనిపాటలు చేయజాలక పందయయికూర్చుండు వధువును నొకరాశిలోనివారేకదా? ఈచట్టముభయతారకముగ నుండగోరినచో బాగుగనుండునని కొందరు పురుషులు దలంతురేమోగాని హిందూలాసంస్కరింపబడి స్త్రీలకుగూడ పుట్టినింట భాగ్యోదయమైన తరువాత నిట్టిచట్టము వచ్చినను స్త్రీల కంతచిక్కులుండజాలవుగాని లేకున్న వారికిమాత్రము మరింతకష్టమనిపించును.”

**అతివిషాదకరమగు మరణము:—**

క్రిందిపంక్తులు మే 25-వ తేదీనాటి ‘ధర్మసాధని’నుండి గ్రహింపబడినవి:—

“కాకినాడలోని పిఠాపురము మహారాజుగారి అనాథశరణాలయమునకు చాలకాలము సూపరింటెంటుగా నుండి ప్రస్తుతము కాకినాడలో విశ్రాంతి ననుభవించుచున్న శ్రీయుత వి. పెదంబరాజుగారి ధర్మపత్ని యీనెల ౨౧-వ తేదీని కాకినాడలో పరలోకగతురాలయ్యెనని తెలియజేయుటకు మేము మిక్కిలి చింతిల్లుచున్నాము. భర్త బ్రాహ్మధర్మానుష్ఠానమునకు పూనుకొన్నపుడేమి, ప్రభుత్వోద్యోగమును వదలి అనాథశరణాలయమున పనిచేయుటకు సంకల్పించినపుడేమి ఆయన యభీష్టమునకు కాదనక, ఆయనతో బాటు ధర్మనిర్వహణమునందు పలువిధములయిన కడగండ్ల ననుభవించి తన ధర్మపత్నీత్వమును సంపూర్ణముగా చెల్లించుకొన్న పరమసాధ్వీమణి. ఆమె తనసొంతబిడ్డలనేగాక నిస్సహాయులై తమగృహమున జేరిన సమీపబంధువుల బిడ్డలనుగూడ పరమాదరముతో పోషించి పెద్దవారినిజేసిన దయార్ద్రహృదయ. ఆమె విసువన్నమాట యెఱుంగక, తమపెద్ద కుటుంబమును నెంతయు ఓపికతో చక్కగా నిర్వహించుకొనుచు వచ్చిన నిపుణురాలు. ఆమె కొన్నిమాసములనుండి అతిబాధకరమైన జాడ్యముచే పీడితురాలై శయ్యనుండి లేవలేని స్థితిలో నుండెను. పడుచున్న కష్టమునుచూడజాలక పరమదయాళునగు భగవంతుడామెను జీర్ణమయిన భౌతికశరీర గృహము నుండి తప్పించి తీసికొని వెళ్ళెను. అయిదుగురు కుమాళ్ళును, ముగ్గురు కుమార్తెలును, వృద్ధుడగు భర్తను, అతివృద్ధురాలగు తల్లిని తన వియోగమునకై విలపించుటకై భూమిపై విడిచి ఆమె దివంగతురాలయ్యెను.

దుఃఖాంబుధిలో మునిగియున్న ఆమె భర్తకును, సంతానమునకును, తల్లికిని, తక్కిన ఆప్తబంధువర్గమునకును మాహృదయపూర్వక సానుభూతిని వెల్లడించుచున్నాము. భగవంతుడు డామెకు చిరశాంతి ననుగ్రహించుగాక!"

**చూలింతతనము: దంతములు:—**

ఏప్రియలుమాసపు 'Longevity' పత్రిక ఇట్లు ప్రకటించుచున్నది:—

"చూలింతతనమున దంతముల ఆరోగ్యము చెడుటయు, వాని వైద్యమునకు ధనవ్యయము కొంచము హెచ్చగుటయు సర్వసాధారణము. కొంచము జాగ్రత్తతో ఇట్టివికలుగకుండ చేసికొనవచ్చును. ఉమ్మినీరు పులుపుయెక్కుటచేతనే చూలాలితనమున దంతములు చెడుచున్నవి. చూలాలితనమున ఎప్పుడైనను ఎట్టిసందేహమును లేక దంతవైద్యము చేయించుకొనవచ్చును. తల్లి తగిన జాగ్రత్త తీసికొనుచో బిడ్డకు చక్కని దంతములు వచ్చునట్లు చేయవచ్చును. క్షారవస్తువులతో చేయబడిన ద్రవముతో తఱచు గండూషించుటయు, చూలింత తనమున అంతము కాల్షియము తీసికొనుటయు విధికృత్యముగా స్త్రీలు గ్రహింపవలయును."

**నారింజపండ్లు:—**

'రవి'పత్రికనుండి నారింజపండ్లను గూర్చిన క్రిందివిషయములు జూనుమాసపు 'ప్రకృతిపత్రిక' ఉద్ధరించినది:—

"నారింజపండ్లయందలి ఆహారపువిలువను ఇప్పుడిప్పుడే గ్రహించి ప్రజలు విశేషముగ వీనిని వాడుచున్నారు. నారింజపండ్ల రసమునందలి పంచదార చాలబలము కలిగించును. శీఘ్రముగ అరిగి రక్తమునందు కలిసి వంటబట్టును. దానిలో కొంచెము ప్రొటీనుకూడ నున్నది. అది కండరములను పెంచును. ఖనిజసంబంధములైన ఉప్పులుకూడ నందున్నవి. అదిగాక పులుపుకలదు. మాంసము, బియ్యము, గోధుమలు బంగాళాదుంపలు, రొట్టెలు, పంచదారలందు ఇట్లు ఉప్పులు లేనందున నారింజలు చాల శ్రేష్ఠము. నారింజలు అజీర్తిని పోగొట్టును. పులితేనుపులను మాన్పించుటయందు అది చాల తోడ్పడును. నారింజపండ్లరసమునందు విటమినులు ఎక్కువగ కలవు. పాలలోలేని విటమినులలోపమును యివి తీర్చి పిల్లలకిచ్చిన వారు బాగుగ పెరుగుటకు చాల తోడ్పడును."

**కల్లు ఇజారాదార్లలో స్త్రీలు:—**

Health and Happiness పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"మార్చి 18-వ తేదీని వంగశాసనసభలో శ్రీ ఆర్. మెయిటీగారు మిడ్నపూరుజిల్లాలో కొన్నితావుల యందు కల్లుసారాయిదుకాణములఇజారా స్త్రీల కీయబడుచున్న విషయమును వెల్లడించిరి. ప్రభుత్వమువారి కల్లుసారాయిఇజారాపద్ధతి ఇంతవఱకు ఒక్కపురుషుల నైతికజీవితమునే ఎక్కువగా ప్రభ్రష్టమొనర్చుచున్నది. ఇకస్త్రీలకుకూడ నిందుప్రవేశముకలుగుచో చెప్పవలసినదేమున్నది? శ్రీ ఆర్. మెయిటీగారీ విషయమై తీవ్రమైన ఆందోళనము నడుపుదురుగాక యనికోరెదము."

**అరవవారి బాలికాపాఠశాలల దుస్థితి:—**

మేమాసపు The Indian Educator అను పత్రికలో టి. ఆర్. రంగస్వామిఅయ్యంగారు యం. ఏ; యల్. టి 'The Present State of Education' అనువిషయమునుగూర్చి వ్రాయుచు క్రిందివిచిత్రవిషయమును వెల్లడించినారు:—

"స్త్రీవిద్య ప్రముఖస్థానమునకు వచ్చుచున్నది. దానిప్రచారమునకు విపులప్రయత్నములును సాగుచున్నవి. కాని మర్యాదకుటుంబములోని బాలికలుపోయి విద్యాసముపార్జనము గావించుకొనగల ఉత్తమ పాఠశాలలు ఇంకను ఏర్పడవలసియున్నవి. ఒకానొక అరవఉపాధ్యాయిని సంగీతపాఠమప్పుడు తనబాలికలకు

ఒక తెనుగుకీర్తన చెప్పుచుండెను. ఆకీర్తన శృంగారరసభూయిష్టము. గ్రామాంతరస్థుడైన నాయకునిగూర్చి నాయికగావించు విలాపగీతమది. నేనీసంగతి ఆడుపాధ్యాయిని నడిగితిని. ఆమె తెల్లబోయినది. తనకావిషయము తెలియదని చెప్పినది. ఇట్టి వికృతములు తొలగిపోయి పాఠశాలలోని వాతావరణము పవిత్రవంతము కానిదే ఏహైందవమాతయు తనబాలికను పాఠశాలకు పంపుటకు అంగీకరింపదు."

సంగీతముకొఱకు ఆంధ్రభాష నవలంబించవలసిన అరవలస్థితి ఎంతహాస్యాస్పదముగ నున్నదో! భావము తెలియకపోయినను, అర్థముకాకపోయినను అరవలు సంగీతముకొఱకు తమకాసటబీసటభాషనువదలి తెనుగు నాశ్రయింపవలసిన వారగుచున్నారు. తనగీతి అరవజాతిని పాఠకులనుగా దిద్దితీర్చుచున్నది తెనుగువాణి.

## గృహణీగృహస్థులకు హితము:—

శ్రీయుత బోయనపల్లి లక్ష్మణరావు, ఎం.ఎస్.సి. గారిట్లు వ్రాయుచున్నారు:—

"ఆంధ్రనారీరత్నములకు మిక్కిలి ప్రియమైన "గృహలక్ష్మి" సంచికలయందు విడాకులచట్టమును గుఱించి అనేకు లనేకవిధముల తమతమ యభిప్రాయముల బ్రకటించిరి. ఈచట్టము మనదేశమునకు క్రొత్తదని చెప్పుటకేమియును సందేహములేదు. పశ్చిమదేశములందీచట్టము మిక్కిలి ప్రబలమైయున్నది. అమెరికా దేశములోని స్త్రీలందఱును, ఈనియమము మితిమీరినదనియు, అసంభావ్యమనియుదలచి యేవిధముచేనైనను దీనిని దొలగింపవలయునని ప్రయత్నించుచున్నారు. న్యూయార్కు (New York) పట్టణమున నరువది యేండ్లనుండి బీదవారలకు కోర్టుసంబంధమైన వ్యవహారములలో ధర్మార్థముగా సహాయముజేయుసంఘమువారు (Legal Aid Society of New York) వేలకొలది భార్యాభర్తలపరస్పరమనస్తాపములను, వాదములను, నితరవివాహసంబంధమైన దుర్దశాకరములైన నిజస్థితులను దెలిసినవారై, సంసారసుఖములను వృద్ధిజేయుటకు భార్యాభర్తలకై కొన్నినడతలను నియమించియున్నారు.

### గృహస్థునినియమములు

(1) నీసంపాదనననుసరించి యుదారత్వమును జూపుము. ఇవ్వగలిగినస్థితిలోనుండిన నీభార్యనిన్ను సొమ్మడుగును. భర్తనడుగక మఱెవ్వఱినడుగగలదు? (2) గృహకార్యములు నడుపుటయందు నీవుప్రవేశింపకుము. ఉన్నంతలో సమాళించుకొనుటకు మగవారికన్న స్త్రీజాతికి మిక్కిలిచాతుర్యముగలదు. (3) ఎల్లప్పుడును సంతోషముగనుండుము. ఇంటికొఱకు పాటుపడుచున్నయిల్లాలు మనోవ్యాకులముగల మౌనశీలుడైన భర్తనుజూచి మనస్సునందు వ్యాకులమునెందును. (4) తొందరపడక విచారింపుము. ఆమెకారణములేక ఫిర్యాదుచేయదు. ఇల్లు శుభ్రముగను, రమ్యముగను, సుఖకరముగనుఉండుటకై నీవు సహాయము చేయవలయును. (5) భార్యపై నెడతెగని ప్రేమకలిగియుండవలెను. ఉపేక్షించినచో ఆమె కుత్సాహములేక అలక్ష్యముచేయును. (6) స్వల్పమైన తప్పులకై తీక్ష్ణమైనపదములను ప్రయోగించిన ప్రేమతగ్గును. మఱియు నవి మనస్తాపములకు గారణమగును. తిరుగబడువాడుక కూడగలుగును. (7) సంసారము మీబంధువులకు దూరముగనుండునట్లేర్పాటుచేసికొనుము. భార్యాభర్తలకు మనస్తాపములు కలిగిన వారికివారే కొంతకాలనకు సమకూర్చుకొనెదరు. ఎంతదగ్గరబంధువులైనను మాటిమాటికి సలహాలుపుచ్చుకొనిన నొకానొకప్పుడైనను కీడుకలుగును. (8) అద్దెకు మఱియొకనిని కాపురముంచుకొనకుము. వేఱొకపురుషుడింటనుండుట యనుమానమును, అపనమ్మకమును కలుగజేయును. స్త్రీ మానవజాతియేగనుక ఆపురుషునిశక్తికిలోబడుటయసంభవముకాదు. అట్లుచేసినచో ఆతప్పునీదియగును. (9) నిర్మలమైన దేహమును, పరిశుభ్రమైన వేషమునుగల భర్తనుజూచి భార్యకు గర్వమును, మెప్పును, గౌరవమును గలుగును. లేనిచో అసహ్యమగును. (10) నీబిడ్డలపై కనికరముచూపుము. స్త్రీ తనబిడ్డలపై క్రౌర్యమునుజూపువానిని నమ్మదు.

ములు, ఉపనిషత్తులు, వేదములు కూలంకషముగ పరిశోధించి వ్రాయబడిన పరిషీత్తు కథగల ఉత్తమగ్రంథము. ఈగ్రంథము చదువుట వలన బాలురకు భాషతోపాటు ప్రాచీనభారతసాంఘికచరిత్ర, మతాచారములు కూడ తెలియును. పురటింటివర్ణనము, వివాహధర్మవర్ణనము, గోపూజావర్ణనము ప్రత్యేకప్రశంసనీయములుగ నున్నవి. గ్రంథమునందలి ప్రతిపుటయు కర్తగారి చిరపరిశోధనమును, విపులవిజ్ఞానమును దృష్టాంతరీకరించుచున్నది. వేదవాఙ్మయమునందలి ఉత్తమపదములు కొన్ని ఇందువాడబడినవి. ప్రాచీనకవులపద్యములు ఎడనెడ ఉదాహరింపబడినవి. నేటిపెక్కు పుస్తకములవలెగాక ఇదిబాలుర కెంతయు విజ్ఞానదాయకమైయున్నది. ఇట్టి ఉత్తమగ్రంథము నాంధ్రులకు ప్రసాదించిన శ్రీ శాస్త్రిగారిని మిగులకొనియాడుచు విద్యాశాఖాధికారు లీగ్రంథమును ఉచితరీతిని ప్రోత్సహింపవలసినదిగ హెచ్చరించుచున్నాము.

### గౌరీ, తులసీ, సంతానగోపాలపూజలు:—

స్త్రీలకు అత్యావశ్యకమయిన ౧ గౌరీపూజా, ౨ తులసీపూజా, ౩ సంతానగోపాలపూజా అనుగ్రంథత్రయమున కిదిసంపుటీకరణము. ఇది ఉచితముగ పంపబడును. మీవిలాసమును తెలుపుచు కార్డుమాత్రము వ్రాయుడు. పోస్టేజినికూడ భరించి దీనినుచితముగ మీకుబంపుదురు. దొరకుచోటు: స్వధర్మప్రకాశిని, బృందావనం, కీలుపాకు, మదరాసు. ఉచితముగ లభించుచున్న ఈ ఉత్తమగ్రంథమును కోరి పడసి స్త్రీలు యథోచితలాభములను పడయుదురు గాకయనికోరెదము. స్వధర్మప్రకాశినీసంపాదకులగు శ్రీయుత కనుపర్తి మార్కండేయశర్మగారి ధర్మపత్ని కీర్తిశేషురాలు కనుపర్తి రామమ్మగారి యొక్క అభిప్రాయానుసారము ఈగ్రంథము అభిలషించెడు వారలకు ఉచితముగా నొసంగబడుచున్నది. గ్రంథమున కీ. శే. కనుపర్తి రామమ్మగారి ఛాయాచిత్రముగలదు. గ్రంథము ఫుల్‌స్కాప్ సైజున 30 పుటలు. గ్లేజుకాగితములు.

### ఉపవాసచికిత్స:—

ఇదిప్రకృతిగ్రంథమాలలో అయిదవపుస్తకము. బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ప్రెస్‌నందు ముద్రితము. మరళూరు ఆర్యమూర్తిచే వ్రాయబడినది. ప్రకాశకులు ప్రకృతికార్యాలయమువారు, బెజవాడ. గ్రంథము క్రౌనుసైజున 110 పుటలు. గ్లేజుకాగితములు. గ్రంథమూల్యము గ్రంథమాల శాశ్వతచందాదారులకు రు 0-14-0 అణాలు; ఇతరులకు రు 1-0-0. గ్రంథకర్తగారి ప్రియజననియగు మరళూరు నారణాంబ కంకితము చేయబడినది. పెక్కుగ్రంథములు పరిశోధించి వ్రాయబడిన దగుటచే ఉపవాసచికిత్సావిషయముల నెన్నిటినో ఈగ్రంథము నెల్లడించుచున్నది.

### శ్రీరామచంద్రశతకము:—

న్యాయదీపిక, రెడ్డిరాణి పత్రికలనుండి పునర్ముద్రితము. శ్రీ వేణుగోపాల భక్త లీలామృతలహరీగ్రంథనిలయములోని షష్ఠమపుష్పము. బాలబ్రహ్మచారి, సహజకవి అగు వెలగల సుబ్బారెడ్డి గ్రంథకర్త. ఈపుస్తకము వెలగల వెంకమ్మగారి ద్రవ్యసహాయమున ముద్రింపబడినది. డెమ్మిసైజు 52 పుటలు. పీచుకాగితములు. వెల రు 0-2-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర మారుటేరుకు వ్రాయునది.

### పురాణపతివ్రతలు:—

గ్రంథకర్త సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు. చెన్నపురి, నుంగంబాకం, జయం అండ్ కంపెనివారు ప్రకటించిరి. 19·1. వెల రు 0-4-0. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు 52 పుటలు. సేవ్యాదేవి, సుకళాదేవి అను ఇద్దరు పతివ్రతల చరిత్రలు. ఆనుషంగికముగ మతికొందరును స్మరింపబడిరి. చక్కనిశైలి. బాలికలకు పఠనార్హమైనది.

### స్వార్థత్యాగము:—

బళ్లారి శ్రీకృష్ణదేవరాయగ్రంథమాలలో ప్రథమపుష్పము. గ్రంథకర్త ఘూళీ కృష్ణమూర్తిగారు. క్రౌనుసైజు, పీచుకాగితములు; 82 పుటలు. వెల తెలుపబడలేదు. రాజపుత్రస్థానమునందలి మేవాడచరిత్రకు సంబంధించిన చిన్నచక్కని నవల. పితృభక్తి ఇందు బాగుగా ప్రదర్శింపబడినది. గ్రంథము దొరకుచోటు: భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి.




## బరోడా మైసూరు రాష్ట్రములు: సంఘసంస్కారము:—

మైసూరు, బరోడా హిందూసంస్థానములు రెండును సంఘసంస్కారవిషయమున ముందంజవేయుచు తోడిసంస్థానములకే గాక బ్రిటీషుఇండియాప్రభుత్వమునకుగూడ మార్గదర్శకములుగనున్నవి. సంస్థానశాసనసభవారి అంగీకారముద్రను బడసిన హిందూవివాహ విచ్ఛేదముల బిల్లుకు ఈనడుమ బరోడామహారాజా గైక్వారువారు తమ సమ్మతినిచ్చిరి. బిల్లు శాసనమైనది. విడాకులపద్ధతి సంస్థానమున ప్రవేశపెట్టుటకు గల ఆవశ్యకతనుగూర్చి పూరావిచారణము జరుపుటకు ప్రత్యేకము మహారాజావారిచే నియమింపబడిన సంఘము వారిసూచనలకు ఈశాసనము ప్రత్యక్షఫలము. ఈక్రొత్తశాసనము ప్రకారము వివాహమైన స్త్రీపురుషులు తమ పార్శ్వవర్తి తప్పిపోయి ఏడుసంవత్సరములవరకు కనిపించకుండినగాని; మతాంతరమును పొందినగాని; సన్యసించినగాని; మూడుసంవత్సరములు నిరంతర దౌష్ట్యమునకు పూనుకొన్నగాని; విసర్జించినగాని; మద్యపానవ్యభిచారాదిదుర్గుణములకు అలవడినగాని; వివాహకాలమునాటికి చెవుడు, మూగ, గ్రుడ్డి, మతిభ్రష్టత, మతభ్రష్టత, వయోహీనత మొదలగు దోషములున్నగాని; వివాహవిషయమున మోసముజరిగినగాని తమతమ వివాహమురద్దుచేసికొనవచ్చును. వివాహములు రద్దు అయినతరువాతగాని; విడాకు ఈయబడిన తరువాతగాని ఆరుమాసములకు ఈశాసనము ప్రకారము స్త్రీ పునర్వివాహము గావించుకొనవచ్చును. ఇంతటి ముఖ్యశాసనమును మఱియొక విషయమునకు సంబంధించిన దానిని మైసూరుశాసనసభవారు మొన్నను ఆమోదించినారు. హిందూన్యాయమున స్త్రీల వారసత్వనిర్ణయవిషయికమైనదాశాసనము. దానిని గూర్చి హిందూపత్రిక ఇట్లు అభిప్రాయమిచ్చుచున్నది. "ఇది సంఘమును తారుమారుచేయుచట్టము మాత్రముకాదు. శాసనసభలోని సభ్యురాంద్రు దీనికి మొక్కవోని తమ ఆమోదమును తెలిపియుండుటచే మైసూరురాష్ట్రమందలి స్త్రీల వారసత్వవిషయమున ఇది చక్కనిన్యాయమును గలిగించునని నమ్ముట కెడముగలుగుచున్నది. అగుట దివాను తన అంత్యోపన్యాసమున ఈవిషయమున హిందూదేశమున కంతటకును మైసూరు మార్గదర్శకత్వము వహించినందులకు గర్వించు

చున్నామని చెప్పిన వాక్యములకు మేమాశ్చర్యము నొందుటలేదు." స్వదేశసంస్థానములం దిట్టి సముచితసంస్తవనీయసంస్కరణములు గొనిరాబడుచుండుటచే మేయమ్మచెప్పు హిందూ మతము సంస్కరణమునకు విముఖమైన దనువాక్యము ఆధారములేని ఆకాశపురాణమగు చున్నది. హిందూసంస్థానములు సంఘసంస్కరణవిషయములు పెక్కింటియందు ఇతర సంస్థానములకంటెను, బ్రిటీషుఇండియాకంటెను ముందంజవేయుచున్నవి.

ఆధునిక స్త్రీ రత్న దశకము :—

న్యూయార్కునందలి మతప్రచారకసంఘమునకు చెందిన పూజ్యపాదులు జాను హెయిన్సు హోమ్సుగారు నేడుజీవించియున్న స్త్రీరత్నములలో పది ఉత్తమరత్నముల పట్టిక తయారుచేసినారు. ఇది వారిపట్టిక.

1. జేనుయాడమ్సు : అమెరికాయందలి సంఘసేవకురాలు. 'ప్లస్ ఫోర్సుజేను' అను నది ప్రజామోదము బడసిన ఈమెనామము.
2. అనిబిసెంటు : దివ్యజ్ఞానసమాజకురాలు. కృష్ణమూర్తియొక్క ఇష్టదేవత.
3. కేథరైను బ్రెష్కోవ్స్కి : రష్యాదేశవిప్లవమునకు తల్లి.
4. మాడమ్‌క్యూరీ : ఫ్రాంసుదేశమునందలి శాస్త్రకోవిదురాలు.
5. ఎమ్మాగోల్డుమ్యాన్ : అంతర్జాతీయప్రఖ్యాతినందిన కార్మికనాయకురాలు.
6. హెలెన్‌కెల్లర్ : చెవిటిగ్రుడ్డివారల ఉపాధ్యాయిని; గ్రంథకర్త్రి.
7. ఎడ్నా : సెయింటు విన్సెంటుమిల్లే. కవయిత్రి
8. సరోజినీనాయుడు : కవయిత్రి; హిందూజాతీయనాయకురాలు.
9. మార్గరెటుసేంజరు : గ్రంథకర్త్రి; సాంఘికశాస్త్రకోవిదురాలు.
10. సిగ్రిడ్‌అన్‌డెస్టు : నార్వేదేశపుగ్రంథకర్త్రి.

ఈ స్త్రీరత్నదశకములో ఇరువురు పరాధీనభారతదేశపౌరులగుట సంతోషకరవిషయము. ఆధునికపురుషశ్రేష్ఠదశకములో మహాత్మగాంధి, మహాకవిటాగూరు ఇద్దరు భారత పురుషులున్నట్లే ఆధునికస్త్రీరత్నదశకములో అనిబిసెంటు, సరోజినీదేవి ఇద్దరు భారత స్త్రీలున్నారు. ఇదిభారతీయులు గర్వింపదగిన విషయములలో నొకటి.

కీ. శే. మెహర్బాయి దొరాబ్జి తాతాసతిగారు:—

జూను 18-వ తేదీ రాత్రి ఒంటిగంటవేళ లండనులో ఒకనర్సింగుహోమునందు శ్రీమతి మెహర్బాయిదొరాబ్జి తాతాసతి పరమపదించినది. చనిపోవుసరికి ఆమెకు ఏబది రెండువత్సరములు. మైసూరురాష్ట్రమున ఒకప్పుడు విద్యాశాఖాదికారిగానుండిన హోర్మాన్‌జీ జహంగీరు బహభాగారి కుమార్తె ఈమె. తీవ్రమైనరక్తహీనతవలన ఆమెతీసుకొనుచుండెను. వైద్యులసలహాపైని ఆమె భర్తతోకలసి ఏప్రియలు మూడవతేదీని ఇంగ్లాండునకు చేరెను. రథిన్‌లోని డఫ్‌హౌసులో చేరెను. అయినను ఉపయోగములేక పోయినది. మృత్యుదేవత

ఆమెను కబళించివైచినది. తాతాసతి 1879-వ సంవత్సరమున అక్టోబరుమాసమున జనన మొందెను. ఆమె బాగుగ చదువుకున్నది. విశాలహృదయముకలది. విద్యాసాంఘికవిషయములందు ఆమె చేసిన విశేషకృషి హిందూదేశజులకందఱకును ఎఱుకయే. బొంబాయి రాష్ట్రస్త్రీల సంఘాధ్యక్షత వహించి ఆమె తనకార్యనిర్వహణశక్తిని, దీక్షాపరత్వమును, ఉపజ్ఞామహితబుద్ధిని ప్రదర్శించెను. వ్యాయామవిద్యాకృషియందు ఆమెకు అభిమానము మెండు. కావుననే ఆమె ప్రిన్సెస్‌మేరివిక్టోరియా జింఖానావారి వ్యాయామశాఖాభివృద్ధికి మిక్కిలి పాటుబడెను. అంతమాత్రమున తుపాకులు పట్టుకుని స్త్రీలు సైనికులవలె కర్కశప్రదర్శనముగావించుట ఆమెకు ఇష్టముకాదు. తనకు ఇష్టముకాని సంగతిని చచ్చుతెగవేసి బహిరంగముగ చాటుటకు ఆమె ఎప్పుడును ఎంతమాత్రమును వెనుదీసి ఎఱుగదు. జోరాష్ట్రియనుల విషయమున కూడ ఆమె ఎట్టి మొగమోటమును లేక సలహాల నిచ్చుచుండునది. స్త్రీలసాంఘికసంస్థయగు భగినీసమాజమున ఆమె సభ్యురాలు. పూనాయందలి స్త్రీలక్లబ్బునిర్మాణమున తాతాసతికి చాలబాధ్యతగలదు. ఇండియను రెడ్‌క్రాసుసొసైటీయందుసభ్యురాలు. యుద్ధఋణమునకు సొమ్మువసూలు చేసి నప్పటి ఈమెచాకచక్యమునకు మెచ్చి ప్రభుత్వమువారు సి. బి. ఇ బిరుదమునిచ్చిరి. పెక్కుసంస్థల కామె ద్రవ్యసహాయము చేసినది. ఆమెచక్కగ ఉపన్యసింపగలదు. అతిబాల్యవివాహదురాచారనిర్మూలనము కొఱకు ఆమెసంస్థానాధీశ్వరుల భార్యలతో సంప్రదించి ప్రబలప్రయత్నముసాగించినది. స్వదేశీయుద్యమమున ఆమెకు మంచిఅభిమానము. టెన్నిసు ఆటయందు ఆమె నిరుపమానమైన చాకచక్యము గలిగియుండినది. వెస్టరన్ ఇండియా మిక్సెడ్‌డబుల్సునందు ఆమెకు రెండుసారులు ఛాంపియనుషిప్ వచ్చినది. హిందూదేశమునందును, యూరపునందును టెన్నిసుటోర్నమెంటులయందు ఆమె పాల్గొనుచుండినది. 1929-వ సంవత్సరము మేమాసమున జినీవాయందు జరిగిన స్త్రీలఅంతర్జాతీయసమావేశమునకు ఆమె భారతదేశప్రతినిధురాలుగా పోయియుండినది. బీడీపరిశ్రమయందు పనిచేయుచున్న స్త్రీలకడగండ్ల నామె లోకమువారిమెదుటబెట్టినది. భారతపారిశ్రామికచక్రవర్తియగు సర్ దొరాబ్ తాతాగారి భార్యయైనందుకు ఆమె తగినరీతినే ప్రవర్తించి దేశకళ్యాణమును కాంక్షించినది. భారతస్త్రీల సాంఘికవిద్యాభివృద్ధినిగూర్చి ఆమె సర్వవేళల తలపోయుచుండెను. గత వత్సరము బొంబాయిలో జరిగిన అఖిలభారతస్త్రీజనసభకు ఆహ్వానసంఘాధ్యక్షురాలుగానుండి ఆమె యొసంగిన ఉపన్యాసము ఆమెవిజ్ఞానమునకు నిక్షేపముద్రమై పలువురచే కొనియాడబడినది. భారతస్త్రీయుద్యమము ఇంకను ఒకకడకుచేరని ఈసమయముననే ఈయమ ఇహలోకమును వీడుట మనదురదృష్టము. ఈమెఆత్మ శాంతిధామమును చేరుగాక!

శ్రీమతి కజిన్సుసతి నిర్గమనము:—

పుట్టకచే ఐర్లాండుదేశమునకు జెందినది. కాని ఆమె పదునైదు వత్సరములుగ హిందూదేశమున నుండుచువచ్చినది. ఆయుండుట ఆమె ఇతర ఐరోపియనులవలె 'నన్ను

ముట్టుకోను నామాలకాకి' అనురీతినిగాదు. భారతమహిళల సముద్ధరణమునకై ఆయమ చేసినసేవ నిరుపమానము. ఆమెకు మదరాసు పౌరులిచ్చిన వీడ్కోలు సన్మానసభకు అధ్యక్షతవహించి ఆమెను గూర్చి శ్రీమతి ఆచంట రుక్మిణిలక్ష్మీపతిగారిట్లు చెప్పిరి: "భారతరాజకీయస్వాతంత్ర్యపోరాటమునందు కజిన్సుసతి చాల ఉత్సాహముతో పాల్గొని, భారతస్వాతంత్ర్యమును తనస్వాతంత్ర్యముగ భావించెను. భారతీయులకంటెను గూడ అపరిమితోత్సాహముతో నామె గత సత్యాగ్రహోద్యమమునందు దుమికెను. సహజస్వాతంత్ర్యాభిలాషియగు నామెకుస్వాతంత్ర్యపుపోరాటములును, కారాగారకష్టములును నూతనములు గావు. ఐరిషు స్వాతంత్ర్యోద్యమమునందును, అటుపిమ్మట ఆంగ్లదేశమునందలి స్త్రీలస్వాతంత్ర్యోద్యమమునందును, ఆమె కారాగారములకు జనియుండుటచే నది యామెకు క్రొత్తగాదు. గత సంవత్సరమునుండియు నామె స్వయముగ నూలువడుకుచు, పూర్తిగ కద్దరునేధరించుచుండుట, భారతీయులనేకులకు ఆదర్శనీయముగ నుండదగియున్నది. కజిన్సుసతిగారీదేశమునకు గావించిన సేవలన్నిటికంటెను భారతమహిళాప్రబోధమున కొనర్చిన సేవను ఎన్నటికిని మరువరాదు. కజిన్సుసతిగారు రాకపూర్వ మీదేశమందలి స్త్రీలలో నేమాత్రమును ప్రబోధమున్నటుల గన్పింపదు. ఆమెప్రేరణవలననే భారతమహిళామండలి యొకటి ఏర్పరుపబడెను. అప్పటినుండియు నామె భారతీయస్త్రీలయొక్క సాంఘికరాజకీయాభివృద్ధికి నిరంతరము పాటుబడుచున్నది." ఈభారతదేశహితైషిణి కిప్పుడు అమెరికాదేశమున ఉద్యోగమగుటచే నామె అక్కడికేగినది. అమెరికాదేశమునందున్నను భారతదేశమును ఆమె విస్మరింపదని ఆమె వెనుకటిచరిత్ర వెల్లడించుచున్నది. పైగా వీడ్కోలు సభలో ఆమె ఇట్లు ప్రకటించియున్నది: "నే నీదేశమున నేమైన పనిచేసినయెడల నది నాయాత్మసంతృప్తికొరకును, నా ఈప్సితార్థసాధనకొరకును గావింపబడెనేగాని ఒకరి మెప్పును బడయుటకు గాదు. భారతజాతీయస్వాతంత్ర్యోద్యమమునందు పాల్గొనుభాగ్యమబ్బుట నాపూర్వజన్మసుకృతము. ఐరిషుజాతిస్త్రీకి ఇంతకంటె గర్వింపదగిన విషయ మింకొకటియుండదు. విజ్ఞానమునందేమి, జాతీయాదర్శములందేమి, భావౌన్నత్యమునందేమి భారతదేశమునకును, ఐర్లండుదేశమునకును చాల సాదృశ్యముగలదు. భారతజాతీయస్వాతంత్ర్యోద్యమమును ఐర్లండుదేశమంతయు హృదయపూర్వకమగు సానుభూతితో పరికించుచున్నది. నేనును నాభర్తయు మొదట హిందూఆధ్యాత్మికవిజ్ఞానప్రభలచే నాకర్షింపబడి అనిబిసెంటుగారి ప్రోత్సాహమువలన నీదేశమున కరుదెంచితిమి. సుఖదుఃఖసంకులమగు నీయైహికజీవనమునుండి శాంతినాశించు మానవులకు హిందూవేదాంతమొక్కటే నిక్కువమగు శాంతినొసగగలదు. అట్టి శాంతినొసగగలదేశ మీప్రపంచమున మఱియొకటిలేదు." భారతదేశమునుగూర్చి ఇంతటి గొప్పఅభిప్రాయముగల కజిన్సుసతి ఎప్పటికైన భారతదేశమును మఱువగలుగునా? ఆయమకు ఆయురారోగ్యములు, ఐశ్వర్యము నిండారునట్లు భారతులు ప్రార్థింతురుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్ |
| బళ్లారి: | వి. రాజుమొదలియార్ & సన్సు, బ్రాహ్మణవీధి. |
| నెల్లూరు: | ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం. |
| బెజవాడ: | నామల ఆంతోని. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ |
| | జె.వి. ఆర్. శర్మ, న్యూస్ఏజెంటు |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్ |
| హైదరాబాదు: | ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడు,(మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియారూ 1-3-0అగును) |
| నిడదవోలు: | తాడిమేటి కుటుంబశాస్త్రిగారు. |
| కొవ్వూరు: | జి. వి. రామరావుగారు. |
| ఏలూరు: | ఎస్. పి. ఆచార్లుగారు, పవర్ పేట. |
| రాజమండ్రి: | ఎన్. బి. కృష్ణరావుగారు |
| తాడేపల్లిగూడెం: | కాశిరాజు శ్రీరాములుగారు |
| బరంపురం: | గోనియశెట్టిగారు, గొల్లపల్లి. |
| కొల్లూరు: | కాజా సుబ్బయ్యగారు, బాలికాపాఠశాల. |
| గుంటూరు: | విన్డ్సన్ కంపెని. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| పాలకొల్లు: | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపర్రు. |
| ఎలమంచిలి: | మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి. |
| కాకరపఱ్ఱు: | కే. సత్యనారాయణగారు, సరస్వతీగ్రంథమాల. |
| విజయనగరం: | కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి. |
| పిఠాపురం: | మొ. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం. |
| విశాఖపట్టణం: | అందే కృష్ణమూర్తి బ్రదర్సు. |
| జేమ్షెడ్పూరు. | టి. వి. రమణయ్యగారు, 12 టేమరియా రోడు, న్యూ 'L' టౌను. |

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# నేను ఎల్లప్పుడు రోగముతో నాశిల్లుచుండేని...















## జ్వరము ఎపుడూ బలహీనులకే తగులుతుంది

ప్రతిఘటించే శక్తి ఎపుడు తగ్గుతుందో అపుడు మీరు అంటు రోగాలకు బలి ఔతారు. కాబట్టి ఆరోగ్యంగావుండి నరముల బలహీనత పోగొట్టుకొని శక్తిని చేకూర్చుకొనండి. దీనికి హార్లిక్సు కంటె ఏదీ మీకు సాయముచేయలేదు. అది నూటికి నూరుపాళ్లు శరీరానికి బలం గలిగిస్తుంది; పోయిన శక్తిని చేకూర్చుతుంది. హార్లిక్సు రాత్రుల్లో పుచ్చుకుంటే తెల్లవారేసరికి మంచి శక్తి కలిగిస్తుంది.




## హార్లిక్సు బలము శక్తి నొసంగును.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము:

కుసుమవిలాసిని.




“ సుకుమారి, లలితాంగి, సుందరతన్వి!
చిన్నారిపొన్నారి చెలువలమిన్న,
తావుల వెదజల్లు ధన్యచరిత్ర,
సంతతామోద మొసంగుచు నెపుడు
సహజమాధుర్యంబు శ్రవిజూపి క్రొమురుల
తనియించు నీకన్యతగునోము పంట,
ఘనతరు ల్గాంచిన గారాబుపట్టి,
ఋషిమాత్రికే నిన్ను నాసక్తితోడ
దలయందు ధరియించి తనియగ బోను
సహజ సంపదలివి సర్వకాంతలకు
కృత్రిమంబులుగావు కుసుమకుమారి!
కాని నిన్గణియింప గలదు కారణము
మనుజుల దలదాల్ప మహితోగాని
వనములోననెగాని వసియింప వీవు. ”




# వ్యాసరచన

పత్రికాభివృద్ధి దేశమున కన్నివిధముల శ్రేయోదాయకమనుట నిర్వివాదాంశము. ఏదేని యొక యవాంతరమువలన ప్రపంచమందలి పత్రికలన్నియు నొక పక్షము నిలిచిపోయినవనుకొనుడు ఆపక్షకాలమున ప్రపంచమంతయు నెంత గగ్గోలుపడిపోవునో పత్రికాభివృద్ధి నిరంతరాయముగా జరుగుచున్న నీకాలమున మనమూహింపజాలము ఈ పత్రికలన్నియు వార్తాపరిపూర్ణములై యుండుటచే వాని యావశ్యకతగాని వ్యాసములంత ముఖ్యమయినవిగావని యనజెల్లదు. నేడు మానవలోకము నిరంతరాయముగా జీవితము గడపుటకు వార్తాలహరి యెంత యావశ్యకమో వారి యభివృద్ధికి వ్యాసములంత యావశ్యకములే. అందునను ఆర్థికసాంఘిక రాజకీయములందు కాలదోషమువలన వెనుకబడియున్న భారతదేశమువంటి దేశములలో వాని ప్రాముఖ్యము మరింత హెచ్చుగనుండును.

నవీననాగరికతాలోకసంపర్కముచే పత్రికాభివృద్ధి భారతదేశమున తిన్నగాసాగుచున్నది. ఇతరదేశములందువలె దానికి సంపూర్ణస్వాతంత్ర్యము, ప్రోత్సాహము మనదేశమందు లేకున్నను వానివలన గలుగు యుపయోగమును ప్రజలు పొందుచునే యున్నారు.

ఆంధ్రలోకమున కూడ పత్రికాభివృద్ధి యిటీవలనే కొంచమతిశయించినది కాని యిది కేవలము దేశాభ్యుదయదృష్టితో జరుగుటలేదు. దానికి కారణము పత్రికల నాదరించు విద్యావంతుల యందేగలదు.

వారు పత్రికలన్నియు దేశోద్ధరణకు పాటు బడునట్లు చేయగలరు. మొదట వానికి తగిన ప్రోత్సాహమిచ్చి, తదుపరి జాతీయాభివృద్ధికి గావలసి మార్గములను, పద్ధతులను, తాము నేరుగా రచించి వానిలో ప్రకటించుచు పత్రికలనుకూడ ఆధోరణియందే ద్రిప్పవచ్చును. అట్లుగాక వారు కాలక్షేపముకొరకు మాత్రము పత్రికలను జదువుట, పత్రికలకు వ్రాయుట పనిగా బెట్టుకున్నచో నివి యభివృద్ధికిరావు సరిగదా ప్రయోజన మిసుమంతయు నుండదు. కావున పత్రికాభివృద్ధిచే పరిపూర్ణోపయోగము బడయదలంచి యాంధ్ర రచయితులను — ముఖ్యముగ రచయిత్రులను — వ్యాసరచన నభివృద్ధికి దీసికొనిరా గోరుచున్నాము.

విద్యావతులైన స్త్రీలలో చాలమంది — ఎపుడేని తప్పని సరిగా వ్రాయవలసి వచ్చిన యేయుత్తరములో తప్ప — వ్రాయువాడుకే యుండదు. వారు విద్యయంతయు చదువుటతోడను, చదివి యర్థము చేసికొనుటతోడను లేక యితరులకు చెప్పుటతోడను మాత్రమే సంపూర్ణమగుచున్నదని తలంతురు కాబోలు. ఆ యుద్దేశముతోడనే వారెపుడును వ్రాయప్రయత్నింపరు. మరి కొందరు యేదోపత్రికలో తమపేరుబడినచో కృతకృత్యులగునట్లు భావమునదలంచి యతి కష్టముచే నొకవ్యాసమునురచించి అందుతో సంగతు లేమైనయున్నను లేకున్ననుకూడ ఆ వ్యాసమునకంటె దీర్ఘమైనలేఖతో యేపత్రికాధిపునో ప్రార్థింపుచుపంపుదురు. దురదృష్టవశమున ఆ పత్రికాధిపులా వ్యాసమును ప్రకటింపజాలమని త్రిప్పివైచినచో రచయిత్రులు తమ మహోన్నతకృత్యమంతటితో నమాంతముగ నంతరించినట్లు, వ్యాసరచనా విజ్ఞానము దూరమైనట్లు, ఉన్న ఉత్సాహమునుకూడ నూడబెరికి వ్యాసరచనకు తిలోదకముల వదలి త్రిప్పిపంపిన సంపాదకులను కొద్దిగనో గొప్పగనో బహూకరించి విరమింతురు. అంతియగాని వ్యాసముతిరిగి పంపబడినచో తమ రచనయందించుక లోపములున్నవని తెలిసికొనుట కించుకంతయు ప్రయత్నింపరు.

మరి కొంతమంది కందము వ్రాసినగాని కవిగ్రామనుకొని మొదటనే పద్యరచనకు దొరకొని తగినంత అనుభవజ్ఞానశక్తులు లేనందుననో మరెందువలననో విఫలులై వ్యాసరచనా విధానమెవరికోగాని మనకు గాదని నిరుత్సాహముతో నూరకుందురు. అభిప్రాయములు చక్కగ వెల్లడించుటకు పద్యములకంటె గద్యమే యెక్కుడుపయోగకరమని వా రితరులు చెప్పకనే దెలిసికొందురు.

ఆరంభవ్యాసరచయితల యవస్థలిట్లుండ సమర్థులైన వ్యాసకర్త్రులు చాలమంది మిన్నకున్నారు. చక్కని పద్యగద్యవ్యాసముల వ్రాయువారులేక ఆంధ్రదేశము గొడ్డుపోలేదు, కాని సమర్థులగు వారేమాత్రము రచనావిధానమందు శ్రద్ధలేకున్నందున నట్లు తలంపనగుచున్నది. పోటీపరీక్షలు కొంతవఱకు రచయిత్రులం దుత్సాహము పురి

కొల్పినవిగాని పూర్తిగా నుపకరింపలేక పోయినవి. తమతోడి సోదరీమణులకు మార్గదర్శకులుగానుండి వారినభివృద్ధికి దీసికొని రావలయుననుటకు వారి వ్యాసములుకూడ తదితరకృత్యములవలె యుపకరించునను విషయము వారు మరచినట్లున్నది. వారికనైన మేల్కొని తామార్జించిన విజ్ఞానమును, ప్రపంచానుభవనమును గురించి తేటతెల్లముగ తోడి సోదరీమణులకు వ్యాసముల మూలమున యుత్సాహము చేకూర్చి యున్నతికి తెచ్చుటకు శ్రద్ధవహింపవలయును.

ఇట్టి యుద్దేశములు కొంతమందికి గలవు. పాపము వారిట్టి యాశయములతోడనే వ్యాసరచనకు దిగుచున్నారు. కాని వారు వ్రాయునవన్నియు నీతులు. నీతులతో నిండియుండు వ్యాసరచనలు మంచివిగావని యనజాలము. నీతులైనను పాఠకులకు విసుగుగొల్పని రీతి రచింపబడవలయును. వ్యాసములు చదువుటకే విసుగెత్తించుచున్న ఆచరణలోబెట్టుట కెంతమాత్ర ముపకరించునో యూహింపనగును.

కొంతమంది—సాధారణముగా నందరు—యువతీయువకుల ప్రేమను కథావస్తువుగా గొని కథలను వ్రాయుచున్నారు. ఆకథలన్నియు నొకేరకము; నొకేపద్ధతి. వీనిని గూడ కేవలము శృంగారప్రియులైన యువతీయువకుల నాకర్షింప నితరపత్రికలందు వ్రాయబడు కథల నాదర్శముగా గొని వ్రాయ ప్రయత్నించుచున్నారు. దీని వలన పాఠకులకు ఆనందము గలుగుట లేదు; రచయిత్రుల రచన లభివృద్ధిజెందుట లేదు. దీని నెఱిగి మరికొందరు యితర భాషలనుండి అనువాదములకు బూనుకొనెదరు. స్వభావసిద్ధములైన తమ వ్రాతలందు చేతనైనంత మాధుర్యము నొప్పింపనగును గాని అనువాదముల నట్లుచేయుట సాధారణముగ నందరకు సాధ్యమగు విషయము గాదు. అందుచే కొందరు సోదరీమణుల అనువాదములు మూలమునకంటె పెక్కుమడుంగులు అనాకర్షనీయములై తొంటి సౌందర్యమును గోల్పోవుచున్నవి. అనువాదములు సర్వదా వాంఛనీయములు గావు. కాని యవి యుత్తమములని దలంచినచో సోదరీమణులు సాధ్యమగునంతవఱకు వానిని అనువాదములుగా గాన్పింపనీయక రచింపవలయును.

ఇక రచనావిధానములోకూడ భాషావిషయమై యొకమాట జెప్పుట మంచిది. ప్రారంభరచయిత్రులేగాక, చాలకాలము నుండి వ్రాయుటకలవడిన వారుకూడ భాషావిషయమున కొద్దిగనో గొప్పగనో విఫలులగుచున్నారు. అనగా అందరు తుచ తప్పక వ్యాకరణసూత్రముల కెచటను ఎపుడును లోపము రానివ్వక వ్రాయజాల కున్నారని గాదు. ఆధునిక రచయితలందు దప్ప పూర్వకాలమందు సాధారణముగా నందరు గ్రాంధికమునే వ్రాయుట కుపయోగించెడివారు. నేడు చాలమంది వ్యావహారిక భాషనుపయోగించుచున్నారు. గ్రాంధికమా,

వ్యావహారికమా, ఇందేది యుత్తమమను విషయముల చెంతకు మేము పోదలంచుకొనలేదు గాని యీ మూడింటిని గలపి వ్రాయు విచిత్రభాషను మాత్రము మేము పూర్ణముగ నేవగించుచున్నాము. ఇష్టమున్నచో, సాధ్యమైనంతవఱకు నిర్దుష్టముగ వ్రాయ సామర్థ్యముండుచో, రచయిత్రులు గ్రాంథికమందే వ్రాయుట మంచిది. అటులగాకున్న యిష్టమైనచో, నిపుడు సర్వసాధారణముగ నందరిచే గౌరవింపబడుచున్న వ్యావహారికభాషయందే వ్రాయుట మరింత మంచిది. కాని ఎపుడుగాని గ్రాంథికమందారంభించి, వ్యావహారికమందు ప్రవేశించి గ్రామ్యమందు ముగించుటగాని లేక కలిపి కొట్టరా కస్తూరిరంగా అని అన్నింటిని మిళితముచేసి అరవల అవియల్‌లాగున (అదికూడ తినుటకు కొంచము రుచిగానుండును) వ్రాయకూడదు. కొందరు వ్యాసమునందంతయు గ్రాంథిక ముపయోగించి సంభాషణలందు మాత్రము వ్యావహారిక ముపయోగించుచున్నారు. ఇది మంచిపద్ధతే. ఏలన ఎంతటి పండితప్రకాండులైనను మాట్లాడుటయందు పాణిని సూత్రముల ముందుంచుకొని మాట్లాడరు. సహజముగ మాట్లాడు భాషకు కట్టుదిట్టములుండవు. ఉండవలయునని యిష్టపడు వారు గ్రాంధికసంభాషణలనుకూడ గ్రంథములందు—వ్యాసములందు ఉపయోగించుకొనుట కాటంక మొంతమాత్రములేదు. ఇయ్యది రచయిత్రులందరు ముఖ్యముగ గమనింప గోరుచున్నాము.

పై జెప్పబడిన విషయములన్నియు శ్రద్ధగ గమనించి విద్యావతులైన సోదరీమణులెల్లరు వ్యాసరచనకు బూనెదరుగాక. వ్యాసరచనలందు సిద్ధహస్తులగువారితరులకు మార్గదర్శకులై తమ తోడివారి యభ్యుదయోన్నతికై తమ విజ్ఞానమును వ్యాసములమూలమున వెదజల్లుదురుగాక. అట్టివారలకు గృహలక్ష్మి మునుపటివలెనే యెల్లపుడును ఆదరించుచుండగలదు.

# ప్రపంచ పరిస్థితులు

## జర్మనీ

జర్మను దేశమునకు జపానుతో సంధి గావించుకొన్న తరువాత నుత్సాహ మిను మడించి చిందులు త్రొక్కడమున కారంభించినది. అసలే ప్రపంచమునంతయు ధిక్కరించుచు యథాప్రకారముగ ప్రపంచ సంగ్రామమునకు ముందుపద్ధతి నవలంభించు చున్న జర్మనీకి కొంచ మెచ్చుతక్కువగ నిదే యాశయములతో విజృంభించుచున్న జపాను తోడైనచో మరి చెప్పవలసిన దేమున్నది? ఈ యుత్సాహ మినుమడింప గత నెలారంభమునందు నాజీయాశముల నమలునందుంచుటలో హిట్లరుకు కుడిభుజ మనదగు గోరింగ్‌గారు కర్షకసమావేశ మందు మాట్లాడుచు జర్మని ప్రపంచ సంగ్రామమునకు ముందున్న స్థితికంటె మెన్నోరెట్లు ముందడుగు వేసియున్న దనియు, అవసరమగుచో ప్రతికర్షకుడును కత్తికట్టి దేశమునకై పోరాడుటకు సిద్ధముగ నున్నారనియు చాటెను. ఇంకను జర్మని దేశము జర్మనిప్రజలకు చాలుటలేదనియు, కావున నితరదేశములు—వలసరాజ్యములు—సంపాదింప నావశ్యకమనియు వారి యాశ యమైయున్నది. వీరి ప్రకటనలన్నియు క్షణ క్షణమునకు ప్రపంచశాంతిని దూరము చేయుచున్నవి. దీనికై జర్మనీని మాత్రమే నిందించిన ప్రయోజనములేదు.

* * *

## రష్యా

ఇక జర్మనీని ప్రత్యక్షముగ ప్రతివిషయ మునందును ప్రతిఘటింప సిద్ధముగనున్న రష్యా యూరకుండుటలేదు. జర్మని జపాను సంధిలోగల అంతరార్థమెఱిగి వెంటనే జపానుతోడి సంబంధములను త్రెంచుటకు పూనుకొన్నది. అంతటితో నూరకుండక రష్యా యే దేశముతోనైనను పోరాడి గెలువగలదనియు, తనను చెనకదలంచి తన సరిహద్దులను సమీపింప దలంచువారిని ఆ సరిహద్దులను దాటకుండగనే హతమార్చ గలదనియు ఘంటాపథముగ చాటినది. అట్లనుటలో రష్యా దృష్టియంతయు నొక ప్రక్క జపానుమీద మరొకవంక జర్మని మీదనే గలదు.

చైనా జపాను దేశములకు భైరవ మార్జాల స్నేహమని ప్రపంచమంతయు నెఱుగును. అందుచే తిన్నగ రష్యా చైనా దేశమునకు సాయపడి జపాను ప్రాబల్య మును తుదముట్టింపదలంచుచున్నది. చైనా దేశమునందంతయు సామ్యవాద సిద్ధాంత ములను ప్రచారము చేయుచున్నది. హిందూదేశమున కుత్తరముననున్న చైనా సింకియాంగ్ రాష్ట్రమున సైనికులను కూడ తయారుచేయుచున్నది. దీనియం దున్న ఖనిజసంపదకేగాక స్థలప్రాముఖ్యము నకుకూడ ముగ్ధులై బ్రిటిషు రష్యా సామ్రా జ్యములు దానికి చాలకాలమునుండియు

ప్రయత్నించుచున్నవి. అందులో నేడు రష్యా యెక్కువ పాటుబడుచున్నది.

* * *

## స్పెయిన్

స్పెయిననం దింకను ఘోరమగు పోరాటము జరుగుచునేయున్నది. కాని మునుపటివలె విద్రోహు లిపుడు విజయులగుట లేదు. ఏలన రెండు పక్షములవారికి నిపుడు పలు దేశములు రహస్యముగ సాయము చేయుచున్నవి. విద్రోహుల సైన్యమునకు మారణయంత్రసామగ్రి జర్మని ఇటలీ దేశములనుండి పంపబడుచున్నది. ప్రభుత్వ పక్షము విజయము గాంచవలయునని భగీరథ ప్రయత్నములు చేయుచు రష్యా ఫ్రాంసు దేశములు తగినరీతి సాయము చేయుచున్నవి. ఈసమాచారమును గనిపెట్టి విద్రోహులు స్పెయినుకు వచ్చుచున్న రష్యా నావలను కొన్నింటిని నాశనముచేసి రని తెలియుచున్నది. మొదట అంతఃకలహములతో ప్రారంభమైనను నేడు స్పెయిను ఐరోపా దేశములన్నియు నిగూఢముగ పోరాడు యుద్ధభూమియయి పోవుచున్నది.

* * *

## ఇంగ్లండు—ఫ్రాన్సు

దీనినంతయు గనిపెట్టి యీవిధముగా స్పెయినందు యుద్ధము సాగుచున్నచో నా దేశము నాశనమై పోవుటయగాక ప్రపంచ శాంతికి తప్పక భంగముగలుగునని గుర్తెఱిగి ఇంగ్లాండు ఫ్రాన్సు దేశములు మధ్యవర్తిత్వమునువహించి పోరాటము నేదో యొక విధముగ నిలుపజూచి యాసంగతిని నితర దేశములకు తెలియజేసినవి.

* * *

## పోర్చుగల్

రహస్యముగ కావలసినంత సాయమును చేయుచు విద్రోహుల కేంద్రస్థానమని వాకొనబడుచుండు పోర్చుగల్ బయటికి స్పెయినునందు శాంతి నెలకొల్పుట కిష్టపడినట్లు నటించుచు ఫ్రాంసు ఇంగ్లండు దేశములు సూచించినరీతి యొప్పుకొని స్పెయినుయుద్ధములో తా నెంతమాత్రము జోక్యము గల్గించుకొనసనని ప్రకటించినది.

* * *

## ఇటలీ—జర్మనీలు

కాని విద్రోహుల విజయమును నిరంతరమును కాంక్షించుచుండు ఇటలీజర్మనీలు దీనికి పూర్తిగా నంగీకరించుటలేదు. శాంతి నెలకొలుపుటకు ఫ్రాంసు ఇంగ్లండు దేశముల సూచించిన విధానములకు సరియగు సమాధానమిచ్చుట కింకను కాలము గావలయుననియు, జనరల్ ఫ్రాంకో స్పెయిను అధికారియని వారిదివఱ కంగీకరించినది మాత్రము సరియైనదేయనియు ప్రకటించినవి. ఇంకను కొంతకాలముగడువివ్వమనుటలో నీలోపల ఫ్రాంకో మాడ్రిడ్ నాక్రమించుననియు, తరువాత సర్వాధికారి యగుననియు వారి యాశయము కాబోలు.

## చైనా

ఐరోపాయం దిట్లు యుద్ధమేఘములు దట్టమగుచుండగా ప్రాచ్యప్రపంచమున పరిసితులు విషమించుచున్నవి. జపాను చైనా దేశమున జేయుచున్న విశ్వవిహారమును సహింపజాలక చైనా సంఘములు కొన్ని జపాను దౌర్జన్యమును నణపవలయునని పట్టుపట్టి ప్రచారము గావించుచున్నవి. వారికి సామ్యవాద సిద్ధాంతములన్న ప్రీతి. జపాను దౌర్జన్యము నణచుటకు సోవియట్ రష్యా తోడ్పాటు గావలయుననుచున్నారు. కాని చైనా ప్రభుత్వమువారు కారణాంతరములచే నీ పద్ధతి ప్రస్తుత మవలంభించుట లేదు. పైగా వారి ప్రచారము సాధ్యమైనంతవఱకభివృద్ధిజెందకుండ ప్రయత్నించుచున్నారు.

కాని యిపుడు పరిస్థితులు మారినవి. చైనాయందు షెన్సిరాష్ట్రపు ప్రధాననగరమగు సియాన్సునందున్న సైన్యము సామ్యవాదులతో నెక్కువ స్నేహభావముగలదై యుండుటవలన కేంద్రప్రభుత్వమువారు ఆ సైన్యము నచ్చోటినుండి ఫూకీను రాష్ట్రమునకు మార్చుట కుత్తరువులు ప్రకటించిరి. కాని చాంగుషూవేంగ్‌గారి నాయకత్వమున సైన్యము ప్రభుత్వపుటుత్తరువులను ధిక్కరించి తిరుగుబాటు గావించిరి. చీనా అధ్యక్షుడును ప్రధానసైన్యాధికారియునగు మార్షల్ చియాంగ్ కేషేక్‌గారు తిరుగుబాటుదారులచే నిర్బంధింపబడిరి. వారంతట కేంద్రప్రభుత్వమునకు వెంటనే జపానుతో యుద్ధమును ప్రకటించి, మంచూరియా రాష్ట్రమును వశపఱచుకొనుటకై గట్టి ప్రయత్నములు గావింపవలయుననియు, నీ కార్యసాఫల్యమునకై సోవియట్ రష్యాతో స్నేహము చేసికొనవలయుననియు షరతులను దెలిపిరి. కాని ప్రభుత్వమువారు దాని నంగీకరింపక తిరుగుబాటుదారగు చాంగ్ షూవేంగ్ దేశద్రోహి యని తీర్మానించి తిరుగుబాటు నణచుటకు తీవ్రముగ ప్రయత్నించుచున్నారు. ప్రభుత్వ సేనలకును తిరుగుబాటుదారులకేగాక జపాను సైన్యములతో పోరు ఘోరమగుచున్నదనియు, దీనితో చైనా జపాను సంబంధములు పూర్తిగా చెడి శాంతికి భంగము వచ్చునట్లున్నవనియు వార్తలు వచ్చుచున్నవి. స్పెయినునందువలె యీ యంతఃకలహము దేశారిష్టకమాటయేగాక విదేశములను గూడ గలుపుకొని పోరు భయంకర రూపము దాల్చునేమో యను భయమునకవకాశముగలదు.

# సంక్రాంతి దీవన

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

సీ॥ శుభలక్షణస్ఫూర్తి సుమనోభిరామమై లలిమించు సురకల్ప లతికవోలి
తేటలౌ మాటలతోటి సద్విద్యలదెల్పు నేరుపున వాగ్దేవి వోలి
అతులితారోగ్యభాగ్యానుభూతి నొసంగుసరణి సంజీవ నౌషధినివోలి
సతతంబు సేవించుసతుల కిష్టార్థసిద్ధి యొనర్ప శ్రీరమాదేవి వోలి

గీ॥ ధరణి పెంపొందిదామరతంపరటుల
సకలదిశలందు విజయశశ్చంద్రికలను
మించి విరజల్లి ధన్యత గాంచునీకు
లలిత 'గృహలక్ష్మి' నిత్యకళ్యాణమస్తు.

సీ॥ కవికల్పభూరుహాఖ్య నుతింప బరగిన ఘనయశశ్శాలి నీ కన్నతండ్రి
సుకవిహాసప్రియుం డకలంకమతి బుధజనసమ్మతుండు శిక్షాగురుండు
విదుషీశిరోమణుల్ వివిధభారతసతుల్ చెలువొంద కూర్మినెచ్చెలులు నీకు
ధీమతుల్ మేలన దేశభాషాసేవ సల్పుమహోదార చరితవీవు

గీ॥ అన్నిటను మిన్న వౌచు మహావిభూతి
చెలగు నీకేమటంచు నాశీస్సులిడగ
నేర్తు నూరులు వేలేండ్లు నిండుసిరుల
తల్లి 'గృహలక్ష్మి' ధరణి వర్ధిల్లుమమ్మ.

చ॥ అనఘుడు సచ్చరిత్రుడు మహాకవి నీదగు కంబుకంఠమం
దున సలరించె నేరు తులదూపగలేని యనర్ఘ్య రత్నశో
భనతర కంఠహారమును మంజులదివ్య సువర్ణ హారమున్
ఘనకవితావిహారము జగజ్జనభావుకభావసారమున్.

గీ॥ వరకవీంద్రుడు కూర్మి సువర్ణకలిత
శోభితంబయి యలరు కంఠాభరణము
నీకుగై సేసె పెంపొందు నిరతమిటులె
భావుకంబగు పండుగ దీవెనలివె.

# జయ భేరి

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

(వెనుకటి సంచిక తరువాయి)

మూడవయంకము — మొదటిరంగము

స్థలము-అనుమకొండకోటలోని రాజాంతః పురోద్యానము

కాలము-సాయంకాలము. పదమూడవదినము.

(రాణి ముప్పమదేవిగారును పదునాలుగేండ్ల బాలుడునుఅయిన యువరాజకుమారుడు రుద్రదేవుడును చల్లగాలికి దిరుగవలెనని వత్తురు. గంగాధరమంత్రి గూడ వారివెంట నుండును. ముప్పమదేవి ఖిన్నురాలై ఒక చంద్రకాంతాశిలా వేదికపై గూర్చుండి యుండ యువరాజకుమారుడును ఆమె నానుకొని నిలుచుండియుండును.)

గంగాధరమంత్రి:- దేవీ! విచారింపకుము. ఇంతలో మనకు వచ్చిన విపత్తేమీలేదు. అనుమకొండకోటలో సంరక్షణవిషయమై మన మహారాజులుంగారు స్వయముగా పరిశీలిస్తునేయున్నారు.

రాణి:—ఈశ్వరకటాక్ష ముండబట్టిగానీ, మహారాజుగారెక్కిన పట్టపేనుగు ఆమోస్తరు భంగంచేస్తే శత్రువులకు చిక్కకుండా తప్పించుకురావడం సాధ్యమయ్యేదేనా! అని మాకిపుడెంతో ఆశ్చర్యం వేస్తోంది.

గంగాధరమంత్రి:—అందుకనే మన పెద్దలు యుద్ధంలో జయాపజయాలు దైవాధీనములన్నారు.

యువరాజకుమారుడు:—గంగాధరమంత్రి గారట్లంటారేమిటితల్లీ! చేతిలో కత్తివుంటే జయంకాక మనకు అపజయం యెందుకవుతుంది?

రాణి:—కుమారా! నీవు కాకతిప్రోలరాజు కుమారుడవుకావా? అపజయం యెందుకవుతుంది. నాయనా! జయమేఅవుతుంది. అయితే మనశత్రువుల కవుతుంది అపజయం.

గంగాధరమంత్రి:— మనసైన్యమంతా కోటలో ప్రవేశించింది కనుక కోటవెలుపలవున్న శత్రువులపై పెద్దపెద్దరాళ్లు గుమ్మరించీ, వేడివేడినూనె ఇనుప బాణలితో పారబోయించీ, వారు కోటగోడలనెక్కకుండా యెన్నితంటాలుపడాలో అన్నితంటాలుపడి ఉపాయాలు చూపుతూవున్నారు.

యువరాజకుమారుడు:—అమ్మా నేనువెళ్లి చూచి వస్తాజా?

రాణి:—వద్దునాయనా! గంగాధరమంత్రీ! నీవు యుద్ధవిషయాలు చెబుతూవుంటే మాశరీరం జలదరిస్తోంది. ఇంకేంజరుగుతోందో మాకు వినిపించు.

గంగాధరమంత్రి:—అట్లే వినిపిస్తున్నాను. కొందరు శత్రుసైనికులు కోట బురుజులెట్లో యెక్కి లోపల దుముకాలని ప్రయత్నిస్తూవుంటే చూచి చురుకుతనంగల మనసైనికులు వాళ్లతో బాహాబాహీ ముష్టాముష్టిని జగడం జరిపినందుకు ఉభయసైనికుల్లో ప్రాణహానియెంతో అవుతుందికాని—

యువరాజకుమారుడు:—అమ్మా అట్లా యుద్ధము జరుగుతూవుంటే నేనువెళ్లి మనసైనికులకు సహాయం చేస్తాను.

రాణి:—వద్దునాయనా వద్దు. వాళ్లకు సహాయం చేయడానికి నీవంటి వీరభటులు నీకంటె పెద్దవాళ్లెంతే

మందోవున్నారులే! కానిమ్ము గంగాధరమంత్రీ నీ యుద్ధవర్ణన సాగనీ.

గంగాధరమంత్రి:— శత్రుసైనికులలో ఎంతమంది చచ్చి సైన్యమంతా పలుచబారుతూవున్నా జగద్దేవ మహారాజుమాత్రం మొండిపట్టుపట్టి మనకోట సాధించి తీరాలని పీఠం వేసుకొని వున్నాడట!

రాణి:—ఆ జగద్దేవుడెంత మొండివాడో కాని మనకోట ముట్టడారంభమై నాల్గుదినాలయినా ముట్టడి విడిచి వెళ్లకుండావున్నాడు.

యువరాజకుమారుడు:—తల్లీ! ఈ మాటలు వింటూవుంటే నావంట్లో రక్తంవేడెక్కుతోంది. మీ రాజ్ఞయిస్తే నేనిప్పుడేపోయి ఆజగద్దేవుని తలకాయ చక్కలయ్యేటట్టు చేయలేకపోదునా!

రాణి:—వద్దురా నాయనా! నీ యీపౌరుషం చూచిన మీ నాయనగారెంత సంతోషింతురో.

(తెరలో)

"జయము! జయము!! శ్రీమన్మహా మండలేశ్వర కాకతీయప్రోలమహారాజులుంగారికి జయము!!! శ్రీమత్కాకతీయాంధ్రసైనికులకు జయంబును జగద్దేవ మహారాజున కపజయంబును ప్రాప్తించిన సువార్త మహారాజులుంగార్కి విన్నవింప నేనేగవలసియున్నది. రాజుగారెక్కడ!"

గంగాధరమంత్రి:—దేవీ! అదిగో! మనకు శుభవార్తలు వినబడుతూవున్నవి. దేవణభట్టనే పేరుగల గూఢచారి మహారాజులుంగారిని వెతుక్కుంటూ వస్తున్నాడు. నేనుపోయి రాజుగారిసమక్షమున నే ఆశుభవార్తవిని మీకు దానిసత్యము తెలుపుదును.

(అని వెడలుచున్నాడు.)

(తెరలేచును. ఒక రాజభవనము గానవచ్చును. దేవణభట్టును, మహారాజుగారును, గంగాధరమంత్రియు ప్రవేశింతురు.)

ప్రోలరాజు:—మేలు! దేవణభట్టా! మేలు. ఈ శుభవార్త మాకు వినిపించినందుకు నీకుదగిన పారితోషికమిదిగో (అని తనమెడలోని సువర్ణకంఠాహారము దీసి దేవణభట్టునకు వేయబోవ, గంగాధరమంత్రి దానినందిపుచ్చుకొని వానిమెడలోవేయును.)

దేవణభట్టు:—మీపాదసేవకుడను! ఇది దేవరవారి నాపైగల అనురాగాతిశయమునకు చిహ్నము అని దీని ధరింపవలసినవాడనయితిని.

ప్రోలరాజు:—పొమ్ము! దేవణా! నీపనిమీద పొమ్ము. గంగాధరమంత్రీ! మన మంతఃపురము ప్రవేశించెదము రమ్ము. (అని ఇద్దరు వెడలుచున్నారు.)

## మూడవయంకము—రెండవరంగము

స్థలము-అనుమకొండకోటలోని రాజభవనమునకు పోవుదారి.

కాలము-సాయంకాలము ప్రొద్దుగ్రుంకు వేళ. పదునాల్గవదినము.

(కోటలోని జయభేరీ మ్రోగుచుండును. గంగాధరమంత్రి ప్రవేశించును.)

గంగాధరమంత్రి:—(తనలో) విజయభేరీ ఝాంకారాలు చెలరేగినకొద్దీ అనుమకొండ పౌరులమనసులు ఉత్సాహముతో పొంగి పొరలిపోతూవున్నవి. ప్రోలమహారాజుగారికిజయమూ, జగద్దేవమహారాజుగారికపజయమూ కలిగింది. జగద్దేవునిసైన్యములో చాలామంది హతమైపోయారు. హతావశేషమైనసైన్యాన్ని వెంట తీసుకొని శత్రువు పలాయనమైపోయినాడు. మహారాజు గురువులు అచింత్యేంద్ర స్వాములవారి ఆశ్రమములో దేవీనవరాత్రులు నిరాఘాటంగాను, మహావైభవంగాను జరిగిపోతున్నాయి. రేపు విజయదశమివడ్డవారం (శనివారం) నాడు కాకతీయాంధ్రభూపాలుని స్వాతంత్ర్యపతాకము అనుమకొండకోట బురుజులమీదప్రతిష్ఠింపజేయాలని మహారాజుగారాజ్ఞయింది. రేపుపగలు రెండుఝాములయ్యేటప్పటికి

దేవీనవరాత్రోత్సవాలు పూర్తగును. ఆ వుత్సవానికి ప్రోలమహారాజులుంగారు సపరివారంగా పోయి దర్శనంచేస్తారట! వారక్కడ పెద్దల ఆశీర్వచనాలు గ్రహించి ఆశ్రమానికివచ్చి బ్రాహ్మల్ని అందర్ని సదక్షిణతాంబూలాలతోను అమూల్యాంబరములతోను సత్కరించపోతూవున్నట్టు ముప్పును రాణిగారు నాతో జెప్పినారు. అంచేత నేనప్పుడు మహారాజుగారివెంట వుండి కావలసిన సన్నాహాలన్నీ చేస్తూవుంటాను. కనుక ఇప్పుడు మహారాజుగారి దర్శనముచేసుకుంటాను. (అని ముందుకునడచును. గంగాధరమంత్రి నిష్క్రమించిన వెంటనే అచింతేంద్రవరుడును, కొండుభట్లును ప్రవేశింతురు.)

అచింతేంద్ర:—శిష్యా! గంగాధరమంత్రిని బిలుచుకొనిరమ్మని నిన్నుబంప వెళ్లియుంటివికదా! అతడేమనినాడు?

కొండుభట్లు:—గురుదేవా! అతడు తమకొఱకెదురుమాసి ఇప్పుడే మహారాజులుంగారి దివ్యసన్నిధికి వేంచేసారట!

అచింతేంద్ర:—అట్లయినచో నీవుపోయి మన రాజపురోహితులతో నామాటలుగా జెప్పి రేపుదయ మన దేవీనవరాత్రోత్సవసమయమునకు ఆశ్రమమునకు దగినంతమంది బ్రాహ్మణోత్తములను సమావేశ పరచుకొని రమ్మనుము.

కొండుభట్లు:—చిత్తము గురుదేవరా! (అని నిష్క్రమించును.)

అచింతేంద్ర:—ఎవడురా అక్కడ?

(ఒక సేవకుడు వచ్చి)

సేవకుడు:—ఏమిసెలవు దేవరా!

అచింతేంద్ర:—మహారాజుగారున్న రాజభవనమునకు దారిచూపింపుము.

సేవకుడు:—సిత్తము దేవరా! ఇటుఇటు (అని ఇరువురును నిష్క్రమింతురు.)

(తెరలేచును)

(రాజభవనములోని యొక రహస్యమందిరమున ప్రోలరాజు ఉన్నతాసనముపై కూర్చుండియుండ గంగాధరమంత్రియు బేతనమంత్రియు వారికై వేయబడిన ఉచితాసనములపై గూర్చుండియుందురు.)

బేతనమంత్రి:—(లేచి నిలువబడి) దేవా! దేవర యాజ్ఞానుసారముగా రేపుజరుగబోవు దశరా (దశహరా) మహోత్సవమునకు మన సమస్త మండలేశ్వర దండనాయకులకు వారివారి సైన్యములను నడిపించుకొనుచు వచ్చి భేరీవాద్యములతో ఈయనుమకొండయందు సమావేశపరుపవలెనని సందేశహరులను బంపితిని.

ప్రోలరాజు:—మంచిది. మంత్రులారా! రేపటి దినము మనకు చాల ముఖ్యమైనదని యెంచుచున్నారము.

గంగాధరమంత్రి:—పశ్చిమచాళుక్యచక్రవర్తులకన్నివిధముల సాటివచ్చు కాకతీయరాజన్యపుంగవుల స్వాతంత్ర్యప్రకటన చిహ్నమగు కాకతీయపతాకము రేపేపాటికి అనుమకొండకోట బురుజులపై నెగురుచుండునని గురుదేవుల ఆశయము నెఱవేరుదినము కావున రేపు కాకతీయసీమాంధ్రులకెల్ల చాల పవిత్రమైనదినమని మహారాజుగారనుటలో సత్యమునే వచించిరి.

(సేవకుడు దారిచూపించుచురా అచింతేంద్రవరుడు ప్రవేశించును. సేవకుడు వెడలిపోవును.)

ప్రోలరాజు:—(పరికించి, లేచి ముందుకుబోయి) గురుదేవులకు నమస్కారము (పాదముల కెఱగును.)

అచింతేంద్ర:—రాజా! విజయీభవ! దిగ్విజయీభవ! (రాజును లేపును.)

బేతన గంగాధరమంత్రులు:—గురుదేవులకు మాసాష్టాంగ నమస్కారములు (సాష్టాంగపడి మ్రొక్కుదురు.)

అచింతేంద్ర—మంత్రి సత్తములారా! మీకు శుభమగుగాక (తనకై వేయబడిన పీఠముమీద సుఖాసీనుడగును.)

చేతనమంత్రి:—(రాజుతో) మహారాజా! రేపు జరుగబోవు రాజసభకు సామంతప్రభువులు దండనాయకులు మొదలైనవారు పరివారముతో విచ్చేసిరి కావున వారికితగిన విడుదలను నేర్పాటుచేయ నేగ నా కాజ్ఞయిండు.

ప్రోలరాజు:—అవశ్యము పోయిరమ్మా. (చేతనమంత్రిపోవును.) గురుదేవా! తమయాశ్రమ కార్యములు నిరాఘాటముగా జరుగుచు నేయున్నవిగదా?

అచింతేంద్ర:—మహారాజకుమారుని బాహుపరిరక్షితమైన, ఈ భూమండలమునందు సాధుపుంగవులకు ఆటంకముండునా!

గంగాధరమంత్రి:—దేవీనవరాత్రులు రేపటితో పూర్తియగునని మనరాజపురోహితులు మహారాజులుంగారికి నివేదించియున్నారు.

ప్రోలరాజు:—అందుచేత గురుదేవులను దర్శింపవలెనని మేము కుతూహలురమైయుండ వారే మాకడకు విచ్చేసిరి.

అచింతేంద్ర:—మహారాజకుమారులు రాజకీయ కార్యమగ్నులైయుందురు గావున మేము స్వయముగా నిక్కడకు వచ్చినారము.

గంగాధరమంత్రి:—రాజపుంగవా! రేపటిదినమున రాజసభాసమావేశము గురుదేవుల ఆశ్రమదేవతా దర్శనముగావించుకొని దేవతాప్రసాదమును బ్రాహ్మణాశీర్వాదమును బడయుట మేలయ్యెడునని రాజపురోహితు డిదివరలో మనతో చెప్పినది యెంతయు సమంజసముగానున్నది.

ప్రోలరాజు:—ఆంధ్రుల పూర్వవైభవము కాపాడుకొనస్థిరసంకల్పులమైన మేము తప్పక ఆశ్రమదేవతా సందర్శనము గావింప నిశ్చయించితిమి.

అచింతేంద్ర:—పశ్చిమచాళుక్యులకు లోబడినప్పటినుండియు కాకతీయసీమాంధ్రులు కేవలము కన్నడభాషాసేవయందే నిమగ్నులై తమ ప్రత్యేకత్వము పోగొట్టుకొనుచున్నారని తెలిసికొనుటకు విచారించుచుంటిని. అట్టి పారతంత్రతపోవు సూచనలు గనబడుచున్నందుల కెంతయు సంతసించుచున్నారము.

గంగాధరమంత్రి:—స్వాతంత్ర్యేచ్ఛగల మన మహారాజుగారు రేనాడీఅనుమకొండగడ్డపై నవతరించిరో ఆనాడే కాకతీయాంధ్రుల మనంబులందు సహితము స్వాతంత్ర్య తేజంబుల్లసిల్ల నారంభించినది.

ప్రోలరాజు:—శంభుదేవుని కటాక్షమువలనను పెద్దల ఆశీర్వచనంబుల మహాత్మ్యంబువలనను ఆంధ్రులస్వతంత్రులను మాటలు మాచెవులబడరాదని ధృఢసంకల్పులమై యున్నారము.

అచింతేంద్ర:—వత్సా! అట్లేయగుగాక. సంకల్పసిద్ధుడవు. జయలక్ష్మి నిన్నుతప్పక వరించును.

గంగాధరమంత్రి:—శరత్కాలమాసన్నమై దిక్కులన్నియు ప్రసన్నములైయున్నవి. కావున మహారాజులుంగారి దిగ్విజయమంత్రానుకూలములగు పరిస్థితులు సహితము సమకూరుట తప్పక యవి శుభసూచకములే.

ప్రోలరాజు:—గంగాధరమంత్రీ! ప్రొద్దుపోవుచున్నది. గురుదేవుల నాశ్రమమున విడిచివచ్చుటకు నొక సేవకుని సహాయముగా నిచ్చిపంపునది. గురుదేవా! భద్రముగా పోవుడు.

గంగాధరమంత్రి:—దేవరయానతి ప్రకారము ఇప్పుడే యేగెదను. గురుదేవా! నావెంటరండు. [అని గురుదేవులతో నిష్క్రమించును.]

(ప్రోలరాజంతఃపురము ప్రవేశించును.)

## మూడవయంకము—మూడవరంగము

కాలము—పగలు మధ్యాహ్నసమయము
పదునేనవదినము.

స్థలము—కోటలోని రాజభవనమునకు బోవుదారి.
(కొండుభట్లు రామభద్రచయనులు ప్రవేశింతురు.)

కొండుభట్లు:—ఈసంవత్సరం దేవీ నవరాత్రోత్సవం యెంతవైభవంగా ముగిసిందోయ్ చయనులూ!

చయనులు:—మహారాజుగారి దర్శనంయెట్లా అవుతుందాయని ఆతురతతో కనిపెట్టుకొనివున్న నాకు మనకంతెదగ్గరగా విలుచున్నప్పుడు ఆమహారాజును మొగమెత్తి చూసేటప్పటికి కళ్లుచెదరిపోయాయి.

కొండుభట్లు:—మంత్రపుష్పం చెప్పేటందుకు ముందు మనమంతా భజనచేస్తూవుంటే మహారాజుతో గూడా వచ్చిన గంగాధరమంత్రి భక్తిలో తన్మయుడై పోయాడు సుమీ!

చయనులు:—గంగాధరమంత్రి భక్తిపారవశ్యం చూసి, మహారాజుగారు మనగురువుగారితో "అతడు మనదేశములో తనకిచ్చవచ్చిన స్థలములయందు దేవతా ప్రతిష్ఠలు చేసికొనుటకును అతనికిచ్చవచ్చిన చోట్ల అగ్రహారాలు ఆదేవరలపూజార్థమిచ్చివేయుటకు స్వాతంత్ర్యమిచ్చి వేస్తా"మని చెప్పుతూవుంటే నాకు వినబడింది.

కొండుభట్లు:—ఇంకేమి? అతని జన్మధన్యమై పోయింది. ఆసంగతట్లావుంచు కాని మన మహారాజుగారు తెచ్చిన అమోఘములగు కానుకలన్నీ రాజపురోహితులకే పోతవా? మనకేమైనా వస్తవా?

చయనులు:—రాజపురోహితులు కనుక వారికి పెద్దభాగం వెళ్లినా అక్కడ సమావేశమైన యితర బ్రాహ్మలకుగూడా యింతోఅంతో దొరకడం న్యాయం కనుక వారితోబాటు మనకూను యేమీ దొరక్కుండా పోతుందా?

కొండుభట్లు:—అట్లాకాదని నా అభిప్రాయం. ఆశ్రమంలోవుండే శిష్యులకు ప్రత్యేకంగా యేమైనా అధికం దొరక్కపోతే యిక రాజగురువులకు మహారాజుగారు చూపించిన గౌరవాదరాలేం కనబడ్తాయ్ ఈవిషయం కాస్తామనస్సులో పెట్టుకోమని గంగాధరమంత్రి చెవులో వూదేనులే!

చయనులు:—అదిగో! కోటలో మరల జయభేరీ మ్రోగుతోంది. ఈవేళజరిగే దశరామహోత్సవానికి యిప్పటికిప్పుడే సామంతమంత్రిపురోహిత దండనాథాదులందరూ సైన్యంతో కోటలో బ్రవేశించి వుంటారు.

కొండుభట్లు:—రాజసభానంతరం జమ్మిపూజచేసికొని దిగ్విజయయాత్రకు బయలుదేరుతూవుంటే ఆ సైన్యవిభవం చూద్దాంపద [అని యిద్దరు నిష్క్రమింతురు.]

## మూడవయంకము—నాల్గవరంగము

స్థలము—అనుమకొండకోటలోని రాజసభాభవనము. పదునేనవదినము (విజయదశమి)

కాలము—మధ్యాహ్నము మూడుగడియలవేళ.

[ప్రోలమహారాజు కిరీటంబుధరించి సింహాసనముపై గూర్చుండియుండ ఇద్దరు పరిచారకులు వింజామరములు వీచుచుందురు. సభలో రాజునకొకవైపున రేచర్లకామచమూపతి సామంతబొల్లయరడ్డి మొదలగు సేనానులు సాయుధహస్తులై కవచశిరస్త్రాణంబులు ధరించి తమతమ యోగ్యస్థానముల పీఠంబులలంకరించియుందురు. మఱొకప్రక్క చేతను గంగాధరమంత్రులును, రాజపురోహితుడును అచింతేంద్రవరుడును ఉచితాసనంబుల నధిష్ఠించియుందురు.]

ప్రోలరాజు:—కావున నో మంత్రిసామంతదండనాయకులారా! వివిధరాజవంశములకు జెందిన సామ్రాజ్యాధిపులక్రింద విభాగింపబడి పరిపాలింపబడుచున్న ఈ తెనుగుజాతినేకచ్ఛత్రాధిపత్యముక్రిందకు దేవలెనని మాపూర్వకాకతి రాజన్యపుంగవుల పవిత్ర సంకల్పమని మీరందరెరింగియున్న సంగతియేగదా!

కామచమూపతి:—(లేచి)ఆసంగతి గ్రహించియే మావంశకర్తయగు బ్రహ్మసేనాని మొదలగువారు వీర దీక్షాగురువులై చోళమాళవమదేభమృగేశులగు కాకతి రాజన్యపుంగవులకు దమ ప్రాణధనములు ధార పోసిరి.

ప్రోలరాజు:—అట్టి మాపూర్వుల పవిత్రసంకల్పము పరాక్రమాతిశయ శత్రుసంహారకులగు మీరందరి తోడ్పాటువలన కార్యరూపమునకు దేగలమని ఆశించు చున్నారము.

రాజపురోహితుడు:—రాజపుంగవా! ఈసత్సం కల్పముతప్పక దైవోపదిష్టమని త్రికరణశుద్ధిగా నమ్మ చున్నాను.

బేతనమంత్రి:—నేటివరకు మహారాజులుగారికి జేకూరిన జయపరంపర లీవిషయమును రూఢిపరచు చున్నవి.

ప్రోలరాజు:—త్రిలింగదేశవాసులైన తెనుంగు నాయకులనేకులు తమతమ వీరభటవర్గసహితముగా యుద్ధప్రియులగు కాకతీయాంధ్ర సేనాసమూహము నందు జేరుచున్నారు.

బొల్లయరడ్డి:—ఆకారణమువలన మనయాంధ్రా వని వెలుంగు తెలుగుక్షాత్రతేజము త్రిలింగసామ్రాజ్య నిర్మాణమునకు దారిచూపగలదని విశ్వసించుచున్నా డను.

ప్రోలరాజు:—బొల్లయసేనానీ! చక్కగా నిరూ పించితివి.

బేతనమంత్రి:—గతపదిదినములలో మన అనుమ కొండయుద్ధాంగమంత్రి కార్యాలయమునజేరిన ఆంధ్ర సైనికులసంఖ్య యిరువదివేలకుపై బలిసియున్నది.

కామచమూపతి:—దేవా ప్రస్తుత మనకోట యందు సుశిక్షితులైన పదాతుల వీరవర్గసంఖ్య యొక్క లక్షకు మించియున్నది.

ప్రోలరాజు:—మా యీదిగ్విజయయాత్రయందు రేచర్ల కామచమూపతి యుద్ధాంగమంత్రియైనందున కాకతీయాంధ్రసేనాచక్రము నుద్దండలీల రణరంగమున శత్రుభయంకరముగా నడుప సమర్థుడతడే కావున నతనినే సేనాధ్యక్షునిగా నియమించుచున్నారము.

బేతనమంత్రి:—మహారాజుగారి దివ్యనియోగము మన సాయంతమండలేశ్వర దండనాయకులందరి సమ్మతమేయని తలంచుచున్నాడను.

బొల్లయ్యరడ్డి:—ఇది నాకు పరమసమ్మతము.

రాజపురోహితులు:—త్రిలింగసామ్రాజ్య నిర్మాణ దీక్షా గురువులైన ప్రోలమహారాజుగారు సుముహూ ర్తము దాటిపోకుండ ప్రస్థానయాత్రకు శీఘ్రముగా బయలుదేరవలయును.

అచింతేంద్రవరుడు:—వత్సా! పురోహితు లేర్పరచినముహూర్తమునకు కాకతీయాంధ్రసేనా చక్రము కదలింపుము.

ప్రోలరాజు:—గురుదేవా! ఆజ్ఞయొనరింపగలము.

బేతనమంత్రి:—మహారాజా! దేవరదిగ్విజయయాత్ర ముగించివచ్చుపరకు మన అనుమకొండరాజధానికి యువరాజకుమారులగు కుమారరుద్రుని యౌవరాజ్య పట్టాభిషిక్తునిగాజేయుట పరమకర్తవ్యము.

రాజపురోహితుడు:—రాజనీతి విశారదుడగు బేతనమంత్రివాక్కు సకలశాస్త్ర సమ్మతము గావున యువరాజకుమారు నిప్పుడే రప్పించి పట్టాభిషిక్తుని జేయుట యుక్తము.

గంగాధరుడు:—మహారాజుగారిదివరకే యీ విషయమై ఆలోచించియున్నారు.

ప్రోలరాజు:—గంగాధరమంత్రీ! పెద్దల వచనము లను మాయభీష్టమును నొక్కటేయైయున్నది కావున నీవుపోయి రాణిముప్పమదేవికి దెలిపి సురుచిరవస్త్రా లంకారభూషితుడైన యువరాజకుమారు నిటకుదీసి కొనిరమ్ము.

గంగాధరుడు:—చిత్తముదేవా! (అని వెడలి సుశోభాయుక్తాలంకారయుతుడైన రాజకుమారునితో ప్రవేశించును.)

యువరాజు:—బ్రాహ్మణోత్తములకు వందనములు (అని వంగి నమస్కరించును.)

అచింతేంద్ర పురోహితులు:—యువరాజకుమారునకు మంగళము.

యువరాజకుమారుడు:—తండ్రీ! మీకిదే నా మ్రొక్కు. (రాజునకు మ్రొక్కును.)

ప్రోలరాజు:—(ముందునకొచ్చి చేతులుజాచి) కుమారా! ఇటురమ్ము.

యువరాజు:—ఇదే వచ్చుచున్నాడను. (తండ్రి చూపించిన మరొకసింహాసనమువిూద కూర్చుండును.)

అచింతేంద్ర:—బ్రాహ్మణోత్తమా ఇంక నాలస్య మేల?

రాజపురోహితుడు:—ఇదిగో నారంభించుచున్నాడను. (ఎడమచేత ఒకపళ్లెములో జలకలశములను పట్టుకొని కుడిచేత పుష్పముధరించి రాజకుమారుని సమీపమునకు వెళ్లును. యువరాజకుమారుడు లేచి నిలుచుండును. పురోహితుడప్పుడు పుష్పములతో తలమీద నీళ్లు చిలుకరించును)

రాజపురోహితుడు:—అయంముహూర్తోసుముహూర్తమస్తు.

అచింతేంద్రవరుడు:—(ఒక కిరీటమును రెండు చేతులతో యువరాజు కుమారు శిరస్సుపై బట్టుకొని) రాజపుంగవా! సభ్యులారా! ఈశుభముహూర్తమున— (అందరులేచి నిలిచియుందురు. ప్రోలరాజు అంజలి మోడ్చినిలుచుండును.)

రాజపురోహితుడు:—స్వస్తిశ్రీ విజయశ్చాభ్యుదయశ్చాభవతు.

అచింతేంద్రవరుడు:—స్వస్తిసమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అనుమకొండాపుర వరేశ్వర పరమమాహేశ్వర పతిహితచరిత వినయవిభూషణం శ్రీమన్మహామండలేశ్వర కాకతీయమహారాజుల అగ్రతనయులైన శ్రీకుమార రుద్రదేవమహారాజులు యావ రాజ్యాభిషిక్తులై అన్మకొండరాజ్య లక్ష్మీకరగ్రాహులగుచున్నారు గావున శ్రీ శ్రీ శ్రీ యువరాజకుమారు లాచంద్రతారార్కముగా భూపరిపాలనంబు చేయుచుందురుగాక (అని కిరీటము యువరాజు శిరస్సుపై నుంచును.)

గంగాధరమంత్రి:—(యువరాజుమెడలో పూలహారమువేసి) శ్రీ శ్రీ శ్రీ కాకతికుమార రుద్రదేవ మహారాజుగారికి జయ్ (అందరును రాజకుమారునిపై పూవులజల్లుదురు.)

కామచమూపతి:— శ్రీ శ్రీ శ్రీ కాకతీయాంధ్ర మహారాజ్యలక్ష్మికీ జయ్.

రాజపురోహితుడు:—శ్రీశ్రీశ్రీ కాకతికులదేవ శ్రీస్వయంభూనాధకి జయ్ (అని గోడమీద వ్రేలాడుచున్న స్వయంభూనాధునిపటముపై పూలుచల్లును. జయభేరిమ్రోగ నారంభించును.)

అచింతేంద్ర:—

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతామ్
న్యాయ్యేనమార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యమ్
లోకాఃసమస్తాః సుఖినోభవంతు.

(తెరవాలును.)




## శాస్త్రి హోటలు అనగానేమి?

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు

అల్పాహారములకు పుట్టినిల్లు

వీర్యబలమునిచ్చు మధురపదార్థములు, చలిదేశమునకు అనుకూల
మైన శయ్యాగృహములు, దంపతులకు తగిన యేర్పాటులు.

## శాస్త్రి హోటలు

89 చిక్‌పేట — బెంగుళూరు సిటీ.

# సంగీతము

శ్రీమతి రాజ్యలక్ష్మిగారు

గీతము, వాద్యము, నృత్యము ఈమూటి యొక్క సమ్మేళనము సంగీత మనబడును. సనాతనధర్మమం దెట్లు చతుర్వేదములు గలవో యట్లే చతురుపవేదములునుగలవు. వాటిలో గాంధర్వము సామవేదముయొక్క ఉపవేదము. ఈ గాంధర్వవేదమే సంగీత శాస్త్రము. దీని సహాయముచేతనే సామ వేదము పాడబడుచున్నది.

సామవేదము సంగీతమాధుర్యమువలన తదితరవేదములకంటె మానవులకు సులభ గ్రాహ్యము. ఎక్కడ చేతనముండునో అక్కడంతయు శబ్దముండును. గాని ఈ చేతనాశక్తి తగ్గిపోయినప్పుడు శబ్దము మన కర్ణపుటములయందు జొరబడ నేరదు. ఎందుకనగా సూక్ష్మతరమైన విషయములు మన ఇంద్రియగణములు గ్రహణము చేయ జాలవు. కావున చేతనము గలిగినప్రదేశ మందంతట గంపనముండును. అది ఏదో ఒకవిధమున శబ్దరూపముగ మారుచున్నది. ఈ బ్రహ్మాండముయొక్క సృష్టియనునది గూడ యొక కార్యమైయున్నది. ఈ కార్యమువలన గలిగెడినాదమే ప్రణవము లేక ఓంకారమని చెప్పబడుచున్నది.

సమష్టిరూపమైన ప్రకృతియొక్కధ్వని ప్రణవనాదమై యున్నట్లు వ్యష్టిరూపము ప్రకృతియొక్క వివిధస్వరములై యున్నవి. మరియు స్వరరూపముతోగూడిన నానా విధములైన ప్రకృతియొక్క యావిర్భావము కొఱకే సంగీతశాస్త్రము పుట్టియున్నది. సంగీతశాస్త్రమునందు ముఖ్యముగా సప్త స్వరములున్నవి. దీనికి కారణము బహుశ ఈ బహిఃప్రకృతి సప్తవిధములుగ నుండి యుండవచ్చును. అందుచేతనే మన శాస్త్రములందు ననేకపదార్థములు సప్త విధములుగ భాగింపబడియున్నవి. సప్త సముద్రములు, సప్తరంగములు, సప్త రుచులు, సప్తదినములు, సప్తభూమికలు ఇత్యాది. ఈసప్తస్వరముల తారతమ్యము నుండి నానావిధములైన రాగము లుద్భ విల్లినవి. మానవహృదయమునం దెట్లు ప్రకృతియొక్క యావిర్భావము ముఖ్యమై యున్నదో, యట్లే రాగములద్వారా యొకమంత్రమో, గీతమో యాలాపించిన యెడల నిశ్చయముగ వాని హృదయము నందు ప్రకృతియొక్క స్ఫూర్తిగలుగుట కారంభమగును. ఉదాహరణముగ భైరవి రాగము రూపము వైరాగ్యముతో గూడు కొని బుషభవాహనము భస్మభూషితము జటాకాపీనధారి ఇత్యాది స్వరూపములచే వర్ణింపబడుచున్నది. ఈరాగముతో నొక గీతముగాని మంత్రముగాని శాస్త్రయుక్త ముగ బాడినచో శ్రోతలకు నచిరకాల ములో వైరాగ్యముగలుగగలదు. ఈతత్త్వ మును మనము బాగుగ విచారించిచూచిన

మొదల త్రికాలవేత్తలైన ఋషిపుంగవులు ప్రకాశింపజేసిన శాస్త్రము లెంత గంభీరము లైనవియు, అవి జ్ఞానమునకెంత సహాయ కరములైనవియు తెలియగలవు.

పదార్థములు దృశ్యాదృశ్య భేదములచే రెండువిధములుగా నగుచున్నట్లు, స్వరములుగూడ శృతాశృతములను భేదముచే రెండువిధములుగ నగుచున్నవి. జీవేంద్రియములశక్తి ఏయే స్వరముల గ్రహించునో అవి శృతములు. గ్రహించలేనివన్నియు అశృతములని చెప్పబడుచున్నవి. వృక్షములు లతలు మొదలగువాటిచే గలుగు రససంచార క్రియాశబ్దములన్నియు యశృతములు. పశుపక్షికీటకాది నానాభూతముల స్థూలధ్వనులన్నియు శృతస్వరములు. మానవుని శ్రోణితసంచార క్రియాశబ్దములు, ఆకాశమందలి నానావిధములైన గ్రహోపగ్రహముల భ్రమణముచే గలిగినశబ్దములు అశృతశబ్దములతో బోల్పదగును. సూక్ష్మబుద్ధితో విచారించిన ఓంకారము అశృతశబ్దముల కాధారభూతమై యున్నది. అట్లే సప్తస్వరములతోగూడుకొని స్వరగ్రామము శృతశబ్దముల కాధారమైయున్నది.

శబ్దోత్పత్తి యొకపదార్థము మరియొక పదార్థముద్వారా చలనమైనప్పుడు దాని యందుబుట్టిన కంపనాశక్తిచే గలుగుచున్నది. ఈపదార్థములయొక్క కంపనము మన సమీపమందున్న వాయువును గంపింపజేసినప్పుడు యది వాయువుద్వారా మన శ్రవణేంద్రియములయందు బ్రవేశించి స్వరానుభవము గలిగించుచున్నది. ఒక కంచు పాత్రమీదకొట్టినచో దానినుండి యొకవిధమైన శబ్దము బుట్టుచున్నది. ఈశబ్దము పాత్రయందు గంపన మున్నంతవఱకు నుండును, గాని యాపాత్రను మనచేతులయందుబెట్టుకొని దానికంపనము నడ్డగించినచో వెంటనే యాశబ్దము నియమిత కాలమునకుబూర్వమే యాగిపోవును. మురళి మొదలగు జంత్రలధ్వని వేణువునందుపస్థితమైన వాయువుయొక్క కంపనముద్వారా గలుగుచున్నట్లే, తమ కంఠములయందుండు వాయుచలనముచే గాయకులు నానావిధములైన స్వరముల నుత్పత్తి జేయుచున్నారు.

పైజెప్పిన శృతస్వరము లేడువిధములు. అందు ముఖ్యముగా పన్నెండుశ్రుతు లిమిడియున్నవి. ఇవి షడ్జమము, శుద్ధఋషభము, చతుశ్రుతి ఋషభము, సాధారణగాంధారము, అంతరగాంధారము, శుద్ధమధ్యమము, ప్రతిమధ్యమము, పంచమము, శుద్ధ దైవతము, చతుశ్రుతిదైవతము, కైశిక నిషాదము, కాకలినిషాదములని గుర్తింపబడుచున్నవి.

ఓంకారమూలమైన నానామంత్రముల ద్వారా యాధ్యాత్మికము జగత్తునందు తన శక్తిని విస్తరింప జేయుచున్నది. అట్లే సప్తస్వరములుతోగూడిన వివిధరాగముల సహాయముచే ఈ భౌతిక జగత్తునందు గాయకులు తమ శక్తిద్వారా నానావిధములైన ప్రకృతులను బుట్టించుచున్నారు.

ఈవిధముగా మహాశక్తివంతులైన ఋషిపుంగవులు లోకకళ్యాణార్థమై మాధుర్యమైన సంగీతవిజ్ఞానమును సృష్టించిరి.

సృష్టియొక్క యాదికాలమందు పార్వతీ పరమేశ్వరు లొకచోగూర్చుండి జీవుల దురవస్థలగురించి యాలోచించుచుండగా శ్రీపరమేశ్వరుని పంచముఖములనుండి పంచములును పార్వతి ముఖమునుండి యొకరాగమును మొత్తము ఆరురాగములు పుట్టినవి.

శ్లో. శివశక్త్యోః సమాయోగా
ద్రాగాణాం సంభవోభవేత్,
పంచస్యాత్ పంచరాగాఃస్యుః
షడ్జస్తు గిరిజా ముఖాత్.

ఇట్లు పుట్టిన యారురాగములను శివుడు బ్రహ్మకు నేర్పెను. బ్రహ్మసంగీత మభ్యసించినయనంతరము వేదములు ప్రకటించినందున సంగీతమునకును వేదములకు నింతటి సమీపబంధుత్వ ముండవచ్చును. తరువాత బ్రహ్మ తానునేర్చిన యారు రాగములుగాక తిరిగి ముప్పదియారు ఉపరాగములజేసి వాటిని మొదట నారద, తుంబురు, భరత, రంభాదులకు నేర్పెను. వీరిద్వారానే గీతవాద్యము, నాట్యము, నృత్యము అనునవి వాడుకలోనికి వచ్చినది. నారదుడు గానవిద్యను, తుంబురుడు వాద్యవిద్యను, భరతుడు నాట్యవిద్యను రంభ నృత్యవిద్యను బ్రవర్తింపజేసిరి. అటుతర్వాత శిష్యపరంపరా యనేకరాగములు ఉపరాగములు కనిబెట్టబడినవి. తుంబురునిచే గనిబెట్టబడిన ప్రధానవాద్యమగు తంబురయే మొదటివాద్యము. అటుతర్వాతనే మిగిలినవాద్యము లభివృద్ధి జెందినవి. ఋషులకాలములో సంగీతము మిక్కిలి గౌరవింప బడుచుండెను. ఆరోజులలో యనంతమైనరాగములు మున్నూటయిరువది తాళప్రయోగములతో బాడుచుండిరి. కాని రానురాను యారాగములన్నియు నశించియే కొద్దిరాగములో మిగిలినవి. తాళములలోగూడ ప్రధానములైన సప్త తాళములుమాత్రము యుపయోగపడుచున్నవి.

ప్రస్తుతము మనదేశమందు ప్రాచీనకాలమందలి నృత్యవిద్యాపద్ధతి బొత్తిగా నశించిపోవుచున్నది. ఇప్పటి నవీననృత్యవిద్యకును ప్రాచీన నృత్యవిద్యకును నేమాత్రము సంబంధమున్నట్లు గానరాదు. త్రివిద్యలు అనగా గీతవాద్యనృత్యములు పూర్తిగా మార్పునొంది ప్రాచీనకాలమందలి సంగీతము యెంత యనంతమైనదో యూహించుటకుగూడ నలవిగాకుండ జేయుచున్నవి. ఇతరవిద్యలవలె ఈస్వర్గీయమాధురీవిద్యలు గూడ రాను రాను నశించిపోవుచున్నవి. కాని ఐరోపాదేశీయు లన్నివిద్యలతో బాటు సంగీతవిద్యనుగూడ యభివృద్ధికి దేవలయునని ప్రయత్నము జేయుచున్నారు. అయినను ఆధునిక ఐరోపాసంగీతమునకును మన ప్రాచీనభారతీయ సంగీతమునకును చాల తారతమ్యమున్నది. ఐరోపాసంగీతము కేవలము బహిర్లక్ష్యముగలది. మన భారతీయ సంగీత మంతర్లక్ష్యము గలది. ఐరోపాసంగీతమునకు పునాది కేవలము

శిల్పనైపుణ్యము, గాని మన భారతీయ సంగీతమునకు పునాది కేవలము శిల్ప నైపుణ్యమే గాక గంభీరవిజ్ఞానముగూడ నైయున్నది. ఇది యైరోపాసంగీతమువలె బహిరానందము కొఱకేగాక ముఖ్యముగా నాత్మోన్నతి మార్గము కొఱకు సృష్టింప బడియున్నది. మహాఋషులు మానవ హృదయమునుండి నానావిధములైన ప్రకృతుల నావిర్భవింప జేయుటకై యనంత కోటిరాగములయొక్క యంతర్విజ్ఞానమును కౌశలముతో బ్రకటించిరి. వివిధతాళముల యొక్క విచిత్రగతులును, లయ, జ్ఞాన సూక్ష్మతా కౌశల్యము భారతీయసంగీత మందుమాత్రమే గలదు. గ్రీసుదేశమందు నితరవిద్యలతోబాటుసంగీతవిద్యయు భారత దేశముమీదికి దండెత్తివచ్చిన తరువాతనే వృద్ధినొందినది. గ్రీసునుండి రోముదేశమందును,అక్కడనుండి దాదాపు ఐరోపాదేశమంతయు యీ సంగీతవిద్య వ్యాపించినది.

కొందరు ఐరోపాపక్షపాతులు యూరపునందు సంగీతజంత్రములు వృద్ధినొందినట్లు మనదేశమునందు వృద్ధిబొంద లేదందురు. ఇది కొంతవరకు నిజమే గాని ఈవృద్ధికి మూలాధారము మన భారతదేశమే, భారత దేశమందలి వీణె యను జంత్రమునుజూచి నప్పుడు దాని గొప్పతనమును శిల్పనైపుణ్యమును మెచ్చుకొనని బుద్ధిమంతులుందురా? పియానో హార్మోనియము మొదలగు జంత్రములు వీణెయొక్క యనుకరణములే. మృదంగము మురళి మొదలగు వాటిననుస రించిగూడ యనేకజంత్రములు ఐరోపాదేశమందంతట జేయబడుచున్నవి. మృదంగము ననుసరించి డ్రమ్ (Drum) మొదలగు వాద్యములును మురళి ననుసరించి ఫ్లూట్ మొదలైనవాద్యములును సన్నాయి ననుసరించి కిలారినేట్ మొదలైన జంత్రములును యిట్లే మరియెన్నియో వాద్యవిశేషములు మనహిందూదేశపు వాద్యముల ననుసరించి చేయబడుచున్నవి. జంత్రములసంఖ్య ప్రస్తుతము మన భారతదేశమందుకంటె ఐరోపాదేశమందు నెక్కువగా నుండినప్పటికిని సంగీత విజ్ఞానోన్నతిలో దానికి మన భారత దేశమే సర్వవిధముల తోడ్పడినదనుట నిస్సందేహము. పైగా విశేషమేమనగా మృదంగము, వీణె మొదలైన మన ప్రాచీన జంత్రములందుండు శుద్ధత్వము, శ్రేష్టత్వము సంపూర్ణత యితరదేశమందలి వాద్యములందు గానరావు. మృదంగమువలె నన్ని స్వరములతో వాయింపబడుచున్న తాళాక్షర జంత్రము యితర దేశములందుగానము. కోమలములు, అతికోమలములు,తీవ్రములు, అతితీవ్రములు మొదలగు స్వరములు అతి స్పష్టముగా వీణెయందు బలికింపవచ్చును, గాని యాస్పష్టత, పూర్ణత్వము, పియానో, హార్మోనియము మొదలైన యనుకరణ జంత్రములందులేవని స్పష్టముగాజెప్పనగును.

ప్రస్తుతము సంగీతము మన దేశమందు చాల హీనస్థితిలో నున్నప్పటికిని భారత దేశమే సంగీతమునకు బుట్టినిల్లని చెప్ప వలసియున్నది. ఎంతవరకు మహాత్త్వ

వేత్తలైన ఋషిసత్తము లావిర్భవించి యుండిరో యంతవరకు సంగీతము మిక్కిలి యౌన్నత్యదశలో నుండెను. గాని మానవుని శక్తిసామర్థ్యములు తగ్గిపోవుచున్న కొలదిని ఈ మాధురీవిద్య ప్రాముఖ్యత గూడ తగ్గిపోవుచున్నది. ఋషుల కాలమందలి వేదములు మొదలైన యాధ్యాత్మిక విద్యలకును సంగీతవిద్యకును గాఢ సంబంధముండెడిది. ఆరోజులలో నిదిమార్గ విద్యయని చెప్పబడుచుండెను. కాలము గడిచినకొలది మనుష్యకోటి తమశక్తి హీనతచే ప్రాచీన సంగీతవిద్యావిధానము నంతయు మరిచిపోయినందున నవీనరీతి సంగీతము ప్రచారములోనికి వచ్చినది. ఈ నవీనవిద్యయే దేశీయవిద్యయని పిలువబడుచున్నది. అలెగ్జాండరు చక్రవర్తి మనదేశమునకు దండెత్తి రాకపూర్వము మన దేశమందు ఈ నవీనవిద్యా పండితులనేకులుండిరి. పరదేశవాసులువచ్చి మనదేశము నాక్రమించుటకు మొదలిడిన నాటనుండియు నన్నివిద్యలతోబాటు సంగీతవిద్యయు నశించుటకు మొదలిడినది. గాని తుగ్లక్ వంశజుడును ఢిల్లీచక్రవర్తియునగు సుల్తాను మహమ్మదుషా పాలనమందు నశించిపోవుచున్న ఈవిద్య కొంతవరకు నిలబడినది. పిదప అగ్బరుపాదుషా దీనిని మరింత యభివృద్ధికి దెచ్చెను. ఈతనికాలమందే తులసీదాసు, హరిదాసు, సూరదాసు మొదలైన గాయకులుండిరి. భారతదేశమందు మహమ్మదుషా, అగ్బరుల పరిపాలనమే లేనియెడల మార్గ విద్యవలె ఈ దేశీయవిద్యగూడ బొత్తుగా నశించిపోయెడిది. ఇట్లు నిలుపబడిన విద్యను శ్రీమహాభక్తాగ్రేసర త్యాగరాజాది గాయకరత్నములు మరింత యభివృద్ధికి దెచ్చిరి.

జీవితమునందు ప్రతికార్యమును సంగీతమునిూదనే యాధారపడియున్నది. స్వాతంత్ర్యము ప్రతిమానవునిజన్మహక్కైనట్లు, సంగీతముగూడ ప్రతిమానవుని జన్మహక్కని నిస్సందేహముగ జెప్పవచ్చును. ఈశ్వరోపాసన సంగీతముద్వారా జరుగునట్లు మరి దేనిద్వారాయు జరుగజాలదు. నారద, శాండిల్యాది మహాభక్తులు గానము ద్వారానే యీశ్వరోపాసకులకు బ్రహ్మానందము లభించునని సిద్ధాంతరీకరించియున్నారు. ఈ కారణమువలననే శ్రీ చైతన్యులవారు, వల్లభాచార్యులు మొదలగు వైష్ణవధర్మ ప్రచారకులు తమ ఉపాసనా విధియందు గానమునకు ముఖ్యస్థానమియ్యవలెనని యాజ్ఞాపించియున్నారు.

ఇట్టి పవిత్రవిద్యను గొందరు మిక్కిలి నైచ్యభావముతో జూచుచున్నారు. ఈ విద్య వేశ్యాస్త్రీలుమాత్రమే నేర్వదగినదని చెప్పుదురు. సహజముగ పురుషకంఠముకంటె స్త్రీకంఠమునం దెక్కువ మాధుర్యమున్నదనువిషయము నందరు నెరిగినదియే. కనుకనే స్త్రీలు కలకంఠులని వర్ణింపబడుచున్నారు. నిజముగ సంగీతము స్త్రీలకొరకే పుట్టినది. కనుక అవకాశముగల స్త్రీలందరు ఇహపరసాధనమైన ఈస్వర్గీయ మాధురీవిద్య నభ్యసించి దీనికిదగిన గౌరవ స్థానమిచ్చెదరు గాక.

# భాస్కర మాలిక

ఉ. శ్రీగల వాసుదేవుఁడును సృష్టియొనర్చు సరస్వతీశుఁడున్
భోగి విభూషణుండయి నభోతలకేశుఁడు మామహేశుఁడీ
మూఁగుర మూలమీవయను బుద్ధిని వేల్పొక దేవుఁగొల్వ, నీ
వేగతి కావవే దినమణీ! తరణీ! విలసన్నభోమణీ!

మ. అవతంసంబవు సర్వసృష్టి కుపమానాతీత తేజుండవున్
వివిధప్రాణిచయానుమోదకరుఁడౌ విశ్వేశు నిన్నీశుగా
స్తవముల్ సేయుశ్రుతుల్ సమస్తజగదంతర్యామివౌ నిన్ను నే
నవికారంబున సంస్తుతించెదను దేవా! సూర్యనారాయణా!

శా. విద్వత్సంస్తవనీయ భవ్యమహిమోపేతుండ వత్యుగ్ర సం
పద్వేగోన్నత తీవ్రరూపుఁడవు నీ మాహాత్మ్య మూహింప సా
ధ్యాద్విష్ణుండవు దేవ! నాదు మదికిన్ సర్వంసహారక్షచే,
సద్వంద్యు న్నినుఁబ్రస్తుతించెదను విశ్వవ్యాప్త తేజోనిధీ.

మ. పరమంబియ్యది దృశ్యమానమగు నీబ్రహ్మాండ మొక్కప్డు సం
కరపూరంబగు కాంతిపుంజమట తత్కాంతిన్వియద్వీధి వి
శ్వరహస్యంబులు లక్షలై పొడమె నక్షత్రాళి చండాంశులై
నరులీభావముఁ బట్టలేరు కడునంతర్బుద్ధి నూహించియున్.

ఉ. అంత మెఱుంగనేరని తదన్యదివాకర గోకజాల వృ
త్తాంతములేల? ధారుణి యదంచితమూర్తి కనారతంబు బ
ల్వింతగ కందుకాకృతిని వేగ నవగ్రహరాసితోడ సం
భ్రాంతి బరిభ్రమించునొ అపార గుణాన్వితు నట్టిదేవునిన్.

చ. అనిశము ప్రత్యహంబులును యన్మహితాత్ముఁడు చూడబట్టియే
జనులకు నేత్రయుగ్మములు సార్థకమయ్యెనొ యేమహానుభా
వుని కిరణప్రసారములఁ బుట్టెడు మార్పుల రీతిచేతనే
ఎనయగనింత గ్రీష్మమును నింతటివర్షము నింతశీతమున్.

# గృహలక్ష్మి

చ. దనరుచు కాలభేదముల తత్వములేర్పడు నట్టి సూర్యదే
వుని మనమెప్పుడున్ గనులఁ బొల్పుగఁజూచియు తన్మహత్వము
న్వినియును సర్వభూత భవవృద్ధి వినాశన హేతుభూతునా
యనుపమ తేజు సర్వనిగమాత్మకుఁ దత్వమెఱుంగ మించు కేన్.

ఉ. ఐననుఁ బల్కమానముకదా మన బుద్ధికిఁదోచు భావముల్
వేనకువేల యెల్లపుడు పృథ్వినవగ్రహ రాసితోడ నీ
స్థానమునుండియావలకుఁ దన్నుకువచ్చి బరిభ్రమింపగా
వీనికిఁ బ్రాణికోటు లోదవించు పటుత్వము వచ్చెనీదయన్.

ఉ. రాజసతామసాత్మలగు రాక్షసజీవులు బుట్టెనాదిలోఁ
దేజముతోడఁ బిమ్మటిగ ధీయుతుఁడై నరుడుద్భవించియే
యో నొ భూత ధాత్రి నిజయోగ్యతుఁడై వశమందునిల్పి స్వే
చ్ఛాజయసింహుఁడై తుదకు సర్వచరాళికి కాలుడయ్యెడిన్

మ. నరుఁ డత్యద్భుత విక్రముండు ధరణిన్ నానార్థపారీణుఁడై
పరమాశ్చర్య విధానయంత్రములతోఁ బ్రజ్ఞాబలంబుంచి ఖే
చరుభావంబున వ్యోమయానఘున దీక్షారక్షుఁడై మింటిపై
కరుగన్నేర్చెను, నేర్చునొక్కతుది దేవా నిన్ను చేరం గనన్.

చ. ఘనినిబిడాంధకారముల ఖండరయంబున నొక్కమాత్రలో
దన యుదయ ప్రభావమున దవ్వుగఁజేయుచు కర్మసాక్షియై
వనజము లుల్లసిల్లగ దొవల్ మొగుడంబ్రథ మాద్రిఁ బొల్చునీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్.

మ. పరతత్వజ్ఞులు వేదమూర్తులు తపః ప్రావీణ్యులైనట్టి స
త్పురుషశ్రేష్ఠులు నే మహామహిమునిన్ బుద్ధిన్విచారింప నే
ర్వరో ప్రత్యక్ష మహేశుఁ డెవ్వఁడతనిన్ వర్ణించి సేవింతు దు
స్తరమార్గంబునఁ దేజరిల్లుదరణిన్ స్వర్లోక చింతామణిన్.

దివాకర్ల శారదామణీదేవి

# ప్రేమ సమస్య

శ్రీమతి తాడి నాగమ్మగారు

(గతసంచిక తరువాయి)

"నలుబదియెనిమిది గంటలలో మేమువిధించిన షరతు లంగీకరించి మాయువరాజదంపతుల హత్యగురించి తగిన కారణము లివ్వనియెడల యుద్ధముతప్ప"దని జూలై 23 వ తారీఖున ఆస్ట్రియాప్రభుత్వమువారు సెర్బియా ప్రభుత్వమువారికి కడపటితీర్మానము నంపిరి.

నీచమైన కొన్నిషరతుల కంగీకరించినను తమ యాత్మగౌరవమునే నాశముచేయు కొన్నిషరతుల కంగీకరింపజాలమనియు వానివిషయమున అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించు హేగు న్యాయస్థానము నందు న్యాయముఖోందెదమనియు సెర్బియాప్రభుత్వము జవాబంపెను.

యుద్ధపిపాసగల ఆస్ట్రియా జూలై 28 వ తారీఖున సెర్బియాపై యుద్ధముప్రకటించి వెంటనే సైనికి సన్నాహములు గావింపసాగెను. దానికి జవాబుగ రష్యన్ సేనలు ఆస్ట్రియా సరిహద్దులందు మూగ సాగినవి. ఆస్ట్రియాపక్షముగ ఆగస్టు 1 వ తారీఖున రష్యాపై జర్మనీ తన రణమందుభిని మ్రోగించినది. వెంటనే యూరపుఖండమంతయు రణభేరులమ్రోతతో ఫిరంగుల పేల్పులతో, బాంబులఘోషలతో, విమానముల శబ్దములతో దద్దరిల్లిపోయినది. రష్యాపక్షముగ ఫ్రాన్సు జర్మనీపై కత్తిదూసినది. పరాయిసైన్యములు బెల్జియమునం దడుగుపెట్టకూడదని 1829 వ సంవత్సరమునందు కుదర్చబడిన సంధిషరతుల నుల్లంఘించి జర్మను సేనలు బెల్జియముపై దాడివెడలినవి. వెంటనే ఇంగ్లాండు జర్మనీపై యుద్ధముప్రకటించినది. ఈయుద్ధ జ్వాలలు మానవమండలియంతయు ప్రాకినవి. నాగరక జాతులన్నియు రెండుభాగములైనవి. ప్రపంచమంతయు పాలికలగమారినది. ఇట్టి మహాయుద్ధము మానవ చారిత్రమం దింతవరకు తటస్థించలేదు.

భూమిపై యుద్ధము జరుగుచున్నది. ఆకాశములో పోరు జరుగుచున్నది. సముద్రములో రణభేరులు మ్రోగుచున్నవి. సాగరాంతములందు బాంబులు ప్రేలుచున్నవి. మానవునియొక్క రసాయనిక విజ్ఞానమంతయు నిందుప్రదర్శింపబడుచున్నది. కర్షకులందరు కసాయివారివలె కత్తులుబూని రణరంగమున కురుకుచున్నారు. కార్మికులందరు కర్మక్షేత్రమునువదలి యుద్ధరంగమున దుముకుచున్నారు. విద్యార్థులు రోషావివశులై చదువులకు స్వస్తిచెప్పి తుపాకులను చేతబట్టుచున్నారు. ఘడియఘడియకెందరో యువతులు విధవరాండ్రగుచున్నారు. సనాథలు అనాథలగుచున్నారు. పృథ్వీతలమంతయు వితంతువుల ఘోషతోను, అనాథుల యార్తనాదములతోను, పసిపాపల యాక్రందన ధ్వనులతోను యల్లాడుచున్నది. మృత్యుదేవత తల విరియబోసుకొని మానవమండలియంతట విహరించుచున్నది. శివుడు సృష్టిలయమునకై తాండవ నృత్యము సల్పుచున్నాడు. క్షామదేవత చేతులుచాచుకొని దేశదేశములు తిరుగుచున్నది. జనసంకీర్ణములై యుండు పట్టణరాజము లిపుడు స్మశానవాటికలుగ మారుచున్నవి. చల్లని ప్రవాహము ప్రవహించు ప్రదేశములందిపుడు మానవకవోష్ణరక్త ప్రవంతులు ప్రవహించుచున్నవి. పలువిధములగు ఫలపుష్పములతో యలరారు దివ్యక్షేత్రము లిపుడు యెడారులుగా మారుచున్నవి.

జయదేవత మొదట జర్మనీవైపునకే మొగ్గుజూపినది. జయాపజయములు దైవాధీనములు. మానవుడు సంకల్పించును. భగవంతుడు వికల్పించును. జర్మనీ ప్రపంచమునంతయు నొకే సామ్రాజ్యముగ జేయ సంకల్పించినది. ఉన్నకొంచెము రాజ్యమును శిథిల

మగుట భగవంతునిలీల కాబోలు. కాలముగడచు కొలది జర్మనీయొక్క శక్తి తగ్గసాగినది. శక్తితగ్గు కొలది జర్మనీ యుద్ధరంగమునందు అనాగరికపద్ధతుల నవలంబింపసాగినది. పట్టణములపై బాంబులు కురిపించినది. నిరపరాధులపై విషవాయువులు ప్రయోగించినది. ప్రయాణికుల ఓడలనుముంచి వేయసాగినది. ఈ దుష్కృత్యములు ప్రపంచవాసుల హృదయములను కలచివైచినవి. వెంటనే అమెరికా సంయుక్తరాష్ట్రములు ప్రపంచమును ప్రజాప్రభుత్వమునకు భద్రము చేయుటకై (To make the world safe for democracy) మిత్రమండలి తరపున యుద్ధరంగమున కురికినది. నలుదిక్కులనుండి పరాజయవార్తలు బెర్లిన్ నగరము చేరుచున్నవి. బెర్లిన్‌నగరమంతయు సంచలనముతో నిండిపోవుచున్నది. ప్రజలలో కోలాహలమధికమగుచున్నది. గుంపులు గుంపులుగ మనుష్యులు దిక్కుతెన్నులు లేక పరుగెత్తుచున్నారు. పట్టణమంతయు ప్రళయసంరంభమును దాల్చుచున్నది. మూలమూలలనుండి కల్లోలతరంగములు లేచుచున్నవి. ప్రజలందరు ప్రభుత్వభవనముచుట్టును మూగసాగిరి. రాత్రియగు కొలది జనసముదాయము పెరుగుచున్నది. జనసంఖ్య పెరుగుకొలది ప్రజలలో యావేశమధికమగుచున్నది. భవనముచుట్టును ప్రభుత్వసైనికులు తుపాకులతో కావలికాయుచున్నారు.

సైనికులసంఖ్యను మించి వేలులక్షలు ప్రజలు నిమిషనిమిషమునకు పెరిగిపోవుచున్నారు. ఇంతలో మరియొక సైన్యము రప్పింపబడినది. గాత్రియగు కొలది విషాదవార్తలు ప్రభుత్వభవనము చేరుచున్నవి. సైన్యము వెంబడి సైన్యము ఓడిపోవుచున్నదను వార్తలురాగానే ప్రజలలో ప్రభుత్వముపై క్రోధాగ్నులు చెలరేగుచున్నవి. దేశదేశములనుండి జర్మను సేనలు తరిమి వేయబడుటయేగాక వేలకొలది జర్మన్ వీరులు చంపబడుచున్నారను వార్తలు నిమిషనిమిషమునకు వచ్చి చేరుచున్నవి. వానిని వినినకొలది ప్రజలలో కోలాహలము లేచుచున్నది. ఇంతలో ఫ్రెంచివారు రెండు జర్మన్ సేనలను రూపుమాపుటయే గాక వేలకొలది జర్మనులను చిత్రవధగావించిరను వార్త జర్మనుల హృదయములను కలచివైచెను. అంతలోనె ఇంగ్లీషునావల నెదిరింప యాజ్ఞాపింపబడిన జర్మన్ నావికులు తమ ప్రభుత్వముపై తిరుగబడిరనువార్త జర్మన్‌రాజ్యమంతట విద్యుత్ కాంతివలె మిఱుమిట్లు గొలిపినది. బెర్లిన్‌నగరము చేరగనె ప్రజలలో ఆవేశము చెలరేగి ("Down with Kaiser! Down with the Emperor")అని కేకలు వేయసాగిరి. వారిని చెదరిపోవలసినదిగ ప్రభుత్వమువా రాజ్ఞాపించిరి. ప్రజలు వినలేదు. వారిపై తుపాకులు పేల్చవలసినదిగ సైనికులాజ్ఞాపింపబడిరి. వారును వినలేదు. పైగా సైనికులందరు ప్రజలతోచేరి ఆందోళనచేయసాగిరి. వెంటనే జర్మన్‌సామ్రాజ్య చక్రవర్తియగు రెండవ విలియము (William II) హాలండుదేశమునకు పరారియాయెను.

అట్టి సమయమందు ఆల్బర్ట్ దుఃఖముతో కుర్చీలో జేరగిలబడియున్నాడు. తల్లి గోడుగోడున యేడ్చి సొమ్మసిల్లి పడిపోయినది. పొరలివచ్చు కన్నీటి ప్రవాహములను తుడుచుకొనుచు ఆల్బర్ట్ అట్టే యుత్తుంగశోకతరంగముల యల్లకల్లోలమునందు బడి కొట్టుకొనిపోవుచున్నాడు. మేరీవచ్చి యాదృశ్యమును చూచి నిశ్చేష్టితురాలైనది. శోకసాగరమున మునిగియున్న యాతడామెరాకను గమనించలేదు. ఇంతలో శోకమునుండి తెప్పరిల్లిన తల్లి దాహము కావలెనని సంజ్ఞ చేసెను. మేరీ వెంటనే గ్లాసెడు మంచినీళ్లు అందిచ్చినది. వానిని త్రాగి యామె మరల రోదనముచేయ మొదలిడినది. ఆమెనూరార్చి కారణమడుగ మేరీదగ్గర కరిగినది. ఇంతలోనె ఆల్బర్టు ఆమెను చూచెను. వెంటనే యాతనికి దుఃఖముపొంగి వచ్చినది. వెక్కివెక్కి యేడ్వసాగినాడు. మాతాపుత్రుల శోకముగాంచి కారణము తెలియకుండగనే

మేరీ కూడ గొంతెత్తి యేడ్చినది. ఇట్లా యిరువురు చాలా సేపు రోదనముచేసిరి. కన్నీటిప్రవాహమునకు కూడ అంతుగలదు. రెండుమూడుగంటలకు కొంచెము నెమ్మదిపడిరి. దుఃఖకారణము గురించి మేరీ మరల యడిగినది. వెంటనే ఆల్బర్ట్కు దుఃఖము రా సాగినది. ఇట్లు దుఃఖకారణము రేపినందుకు మేరీ తనను తానే నిందించుకున్నది. కొంతసేపైన తరువాత మేరీకి కారణము స్ఫురించినది. యుద్ధమునకుపోయిన ఆల్బర్ట్ తండ్రిగాని సోదరులుగాని మరణించియుండవలెను. ముగ్వురిలో యెవ్వరు తిరిగిరానందున బహుశః ముగ్వురు మరణించి యుండవచ్చును. పాపము! ఆల్బర్టున కెంతదుఃఖము ప్రాప్తించినది. ఈ యాలోచనలు మేరీ హృదయమును కలచివైచినవి. దుఃఖించుచు తల్లి అట్లే నిద్రపోయినది. అపుడు మేరీ ధైర్యమును చిక్కబట్టి "స్త్రీవలె దుఃఖించకు ఆల్బర్ట్. నన్ను చూచియైన కొంచము దుఃఖమాపుకొనుము"

"మేరీ! ఇక నేను విద్యకు స్వస్తి చెప్పవలెను గదా" యని ఆల్బర్ట్ రోదనముచేయ మొదలుబెట్టబోవుసరికి మేరీ దగ్గరకుపరుగెత్తి తన చేతిరుమాలుతో కన్నీరు తుడిచి" నిద్రబోవుచున్న అమ్మ లేస్తుంది. ఏడ్చి ఆమె సుఖమును చెరపకు ఆల్బర్ట్."

"నాయుదరపోషణమే గాక అమ్మయొక్క కష్ట సుఖములన్నియు నాపైననే యాధారపడియున్నవి గనుక ఉద్యోగము చూచుకొనుటతప్ప వేరుగత్యం తరము లేదుగదా మేరీ."

"ఇంత మాత్రమునకే విద్యకు స్వస్తి జెప్పవలసిన పనిలేదు. నీవెంతమాత్రము చదువును మానవద్దు ఆల్బర్ట్."

"ఆలోచించిన కొలది నాభావిజీవితము నిరాశా మేఘ నిబిడీకృతమైపోవుచున్నది. గాఢాంధకారపు చీకట్లు నాజీవితమును చుట్టుకొని వచ్చుచున్నట్లు నాకు దోచుచున్నది. ఈ క్లిష్ట పరిస్థితులనుండి దారిచూపగల ఆశాజ్యోతి మాత్రము కాన్పించుటలేదు".

"ఆల్బర్ట్ నీ యాలోచనల మధ్య నన్నుపూర్తిగ మరచినట్లే భావించు చున్నాను. ఈకష్టముల నుండి దాటించు ఆశాజ్యోతి లేదంటివి. నే నేమైతిని?"

"ఈవిషమ పరిస్థితుల యందు నీవు నాకెట్లు సహకరింపగలవు మేరీ?"

"నాతండ్రి కోటీశ్వరుడు. అతనికి నేనొక్కరితనే కుమార్తెనను మాట మరువబోకు ఆల్బర్ట్."

గత యూరపుసంగ్రామము ప్రపంచపటమును మాత్రమేగాక మానవజాతులయొక్క శక్తిసామర్థ్యములనుకూడ తారుమారు జేసివేసినది. శతాబ్దముల తరుబడి జర్మనుసామ్రాజ్యమును పెంచుచు పేరుప్రఖ్యాతులతో విలసిల్లుచున్న హోమెన్ జోలరెన్ రాజవంశము జర్మనీదేశమునుండి తుడిచిపెట్టబడినది. నామావశిష్టమైన పవిత్రరోమను సామ్రాజ్య (Holy Roman Empire) మును నామమాత్రముగ నెపోలియన్ కాలమువరకు నేలి నాటినుండి ఆస్ట్రియన్ సామ్రాజ్యము నేలుచున్న హేబ్సబర్గ రాజవంశము (Hapsburg dynasty) పదచ్యుతమైనది. యుగయుగములనుండియు నేకచ్ఛత్రాధిపత్యమువహించి నిరంకుశముగ రష్యన్ సామ్రాజ్యము నేలుచున్న రోమనవ్ రాజవంశము (Romanoff dynasty) నాశము గావింపబడినది. ఆస్ట్రోహంగేరియన్ సామ్రాజ్యము హతమొనర్పబడినది. టర్కిష్ సామ్రాజ్యము తుడిచివేయబడినది. రష్యన్ సామ్రాజ్యము పూడ్చివేయబడినది. నిరంకుశులచే నాశనముచేయబడిన పోలాండు తిరిగి సృష్టింపబడినది. సార్ రాష్ట్రము జర్మనీనుండి వేరుచేయబడినది. మెమెల్ రాష్ట్రమునకు ప్రత్యేకత కల్పింపబడినది. ఓడినవారివలన రాజ్యములను గెలిచినవా రాక్రమించుకొనిరి. ఆర్థికనీతి తారుమారైనది. ధనవంతులతో తులదూగు లండనునగరపు ప్రతిభ తగ్గినది. న్యూయార్కునగరపు విలువ హెచ్చినది. అమెరికను సంయుక్తరాష్ట్రములు ప్రపంచమునకు పెట్టుబడి దారులైనవి. ఋణదాతగనుండెడి ఇంగ్లాండు

ఋణగ్రస్తమైనది. క్రమక్రమముగా ప్రజాప్రభుత్వములు క్షీణింపసాగినవి. దేశదేశములందరాజకములు పొడజూపసాగినవి. అందుచే నియంతలు (Dictators) తలలెత్తసాగిరి.

ఇట్లు ప్రపంచపటమంతయు రాజకీయ, ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణ చిందరవందర సంక్షోభములతో తారుమారైనది. జర్మను సామ్రాజ్యము రిపబ్లిక్ (Republic)గా మారిపోయినది. ఏ వెర్సైల్సు పట్టణమందు బిస్మార్కుయొక్క శక్తి సామర్థ్యములవల్ల జర్మనీదేశము మహాసామ్రాజ్యముగ ప్రకటింపబడెనో ఆపట్టణమందే జర్మనీ అవమానకరమైన సంధిషరతుల కొడంబడి సంధిపత్రముపై సంతకముచేసినది. కాలక్రమమున జర్మనీకి హిండెన్‌బర్గు అధ్యక్షుడాయెను. మహాసంగ్రామపు దెబ్బనుండి జర్మనీ త్వరలోనే కోల్కొన సాగినది. ఆయుధసామాగ్రిని తయారుచేయు కర్మాగారములన్నియు వస్త్రోత్పత్తి యంత్రాగారములుగ మారినవి. సైనికులందరు కార్మికులుగ మారిపోయిరి. సామ్రాజ్య విస్తీర్ణముచేయ కంకణము కట్టుకొన్న వారిస్థానమందు సామ్యవాదులు కమ్యూనిస్టులుపనిచేయసాగిరి. యుద్ధపు ఋణములను తీర్చివేయుటయే వారి ముఖ్యాశయము. కాని కాలక్రమమున జర్మన్ రిపబ్లిక్ ఒక వ్యక్తియొక్క నియంతృత్వముక్రింద పరిపాలింపబడునని యెవరును యూహింపలేదు.

ఆనియంతయే హిట్లర్. హిట్లరుయొక్క పుట్టుపూర్వోత్తరములు చాలవింతయైనవి. నిజమునకతడు బొహీమియన్ తెగకు జెందినవాడు. అతనితల్లి బొహీమియన్‌జాతి స్త్రీ. హిట్లరు తనతల్లి బొహీమియన్‌జాతి స్త్రీయని చెప్పుకొనుటకు సిగ్గుపడును కనుకనే యాతవిషయమునందును తల్లిమాటయెత్తడు. తల్లిమాటయే గాదు స్త్రీజాతిపేరునే తలంపడు. అతని పూర్వికులనామకులు. హిట్లరు పేదలయొక్కబిడ్డ. మహాసంగ్రామమునందతడొక సామాన్యసైనికుడుగ పనిచేసెను. అప్పటివరకాతడు వియన్నాపట్టణ పరిసరప్రాంతములందు తాపీపనివాడుగను చిత్రలేఖకుడుగాను జీవించుచుండెడివాడు. దేశభక్తికంటె జీవితపునిరాశయే యాతని మొదట సైనికునిగతయారుజేసినది. చచ్చుటయే పరమావధిగాగలవాడు యుద్ధమునందు మేటివీరుడుగ పనిచేయును. హిట్లరు చాకచక్యములతోను తెగువతోను యుద్ధముచేయసాగెను. కందకముల యుద్ధము (Trench warfare) నందు హిట్లరు తీవ్రముగ పనిచేయసాగెను. ఇంతలో శత్రువులు విషవాయువును ప్రయోగించిరి. స్మృతితప్పి హిట్లరు తక్కినసైనికులతో పడిపోయెను. వారందరు మ్యూనిచ్ నగరమునకు గొంపోబడిరి. హిట్లరు దానికి విముఖుడు. సామాన్య సైనికునియొక్క అభిప్రాయములను సామ్రాజ్య నిర్మాతలయొక్క సంధిసరకుచేయుట కలలోనివార్త. స్వప్నదృశ్యములు సాధ్యముగా నెరవేరుట నాగరికతయొక్క లక్షణము. వెర్సైల్సుసంధిని ప్రతిఘటించుటకును జర్మనీని పునర్నిర్మించుటకును హిట్లరు సంకల్పించెను. వెంటనే ఒక సంఘమును స్థాపించెను. ఆదియే నేడు ప్రపంచమంతటను 'నాజీ' సంఘమని పిలువబడుచున్నది. హిట్లరుయొక్క అసమానప్రతిభా శేముషీ ధురంధరత్వమువలననే నేడు నాజీసంఘము ప్రపంచమారుమూలలందు పేరు మ్రోగుచున్నది. నాజీసంఘముయొక్క నిర్మాతయు ప్రాణమును పోషకుడును హిట్లరే. "జర్మనీ మేల్కొనుము! యూదా నాశనమగుము! ("Deutschland erwache! Juda revreche!") అనునదియే నాజీసంఘముయొక్క ముఖ్యసిద్ధాంతము. హిట్లరు తనకొక ప్రత్యేకసైన్యమును సిద్ధముచేసికొనెను. దానిబలముతో యాతడు జర్మనీనితిరిగి నిర్మింపసాగెను. తనప్రత్యర్థులనుచీల్చి చెండాడుటలో హిట్లరు కేవలము నిర్దయుడు. తన ఆశయములను నెరవేర్చుకొనుటకై యాతడు చేసిన దుష్కృత్యములు వర్ణనాతీతములు. తన యభిమతము నెరవేర్చుకొనుటకై యాతడెంతమందినో నిర్బంధించెను.



మిసర్స్. సుభద్రాచెట్టూర్
గౌరవన్యాయాధికారిణిగా నియమింపబడిరి.



మిసర్స్. పార్వతీఅమ్మాళ్
కోయంబుత్తూర్ విద్యాసంఘ సభ్యురాలుగా
నియమింపబడిరి.



లేడీకైలాస శ్రీ వస్తవగారు
ఈమె లక్నోలో జరిగిన అయోధ్య
మహిళాసభ కధ్యక్షతవహించెను.



జర్మను పాఠశాలలందు బాలికలు వాయువిమానములగట్టి ఆడుకొనుట

## ప్రేమ సమస్య

ఎన్ని ప్రాణములో తీయించెను. రీచ్‌స్టాగ్ భవనదహనపు కేసు (Reischstag fire case) యాతడు కేవలము కల్పించినదని బ్రైల్సుపర్టు మొదలగు విఖ్యాత విలేఖరులు ప్రపంచమునకు చాటిచెప్పిరి. 'ఆవింత ప్రహసనమునందు హిట్లరు తన ప్రత్యర్థులైన వాండర్‌లూబే, డిమిట్రాఫ్ మొదలగు సుప్రసిద్ధపురుషులను నాశముగావించినాడు. ఇంకను యెన్నియో వింతకేసులను సృష్టించి ప్రఖ్యాతప్రత్యర్థులను ఉరిస్తంభముల కెక్కించినాడు. యూదులనిన హిట్లరునకు చాలహేయము. దయ్యమే యూదుల తండ్రి (The devil is the father of the Jews) యని సతతము యాతడు పలుకుచుండును. జర్మన్ జాతికి యూదులు వేరుపురుగులవంటి వారని యాతడు నమ్ముచుండును. అందుచే యూదులను పూర్తిగా జర్మన్ రాజ్యమునుండి తరిమివేయుటకై యతడు సమకట్టెను. అందుకై యతడెన్నియో అట్టహాసములను గావించెను. యూదులకు విరుద్ధముగా ప్రచారము సల్పుటకై యాతడు ("The Berlinew Tageblatt," "Frank funter zeitung") అను రెండు పత్రికలను యూదియాభాషలో నెప్రకటించుచుండెను. యూదులకు విరుద్ధముగా నెన్నియో శాసనములను ప్రకటించెను. యూదులు ఎక్కువ లాభమును సంపాదింపకూడదు. మిక్కిలిగా ధనముకూడబెట్టకూడదు. జర్మను ప్రజలపై ఫిర్యాదులు చేయకూడదు. ప్రభుత్వఉద్యోగములందు వారు ప్రవేశింపకూడదు. పాఠశాలలయందు వారు బోధకులుగ నుండకూడదు. క్రైస్తవనామములను వారు ధరింపకూడదు. పన్నులు యూదులపై నెక్కువగా విధించవలెను. యూదులతో జర్మనుల కేవిధమగు సంబంధబాంధవ్యము లుండకూడదు. యూదులతో స్నేహముచేయుచున్న జర్మనులు కఠినముగ శిక్షింపబడుదురు. శక్తియున్న జర్మనులు యూదులయొక్క ప్రాణమానధనములను హరింపవచ్చును. యూదుల నేమిచేసినను ఫిర్యాదు లేదు. యూదులు స్వేచ్ఛగా ప్రయాణములు చేయకూడదు. ఇట్టి నిర్బంధశాసనములను హిట్లరు క్రమముగా వృద్ధిచేయసాగెను. ఇట్టి భయంకర రాక్షసశాసనములకు వెరచి యూదులు జర్మనీనివిడచి దేశదేశములకు పారిపోవజొచ్చిరి. అఖిల ప్రపంచ విఖ్యాత భౌతికశాస్త్రజ్ఞులకు చక్రవర్తియని పేరుగాంచిన ప్రొఫెసరు ఐన్‌స్టైన్ పండితుడు ప్రాణముల నరచేత బిగియబట్టుకొని ఇంగ్లాండు పారిపోయెను. అట్టే తక్కిన మేధాసంపన్నులందరు ఆయాదేశములకు పారిపోయి తలలు దాచుకొనసాగిరి. యూదులకును జర్మనులకును వివాహములు జరుగకుండునట్లు శాసనములు కావింపబడినవి. దానికి విరుద్ధముగ ప్రవర్తించినవారు నాజీసంఘముయొక్క నిరంకుశపద్ధతులకు బలియగుదురు. అందుచే యెవరును సాహసించి యూదులతో సంబంధబాంధవ్యములను జరుపకుండిరి.

---

తల్లి : లలితా! ఏమిటే చదువుతున్నావు ?

లలిత : నాకు దెలియదే.

తల్లి : ఏమిటో తెలియకనేనా అంతగట్టిగా చదువుతున్నావు ?

లలిత : గట్టిగా చదివాను కాని వినలేదమ్మా.

# తెలివితక్కువేనా?

యిన్. వి. రమణగారు

భారతదేశమంటారు. భారతదేశములోని వారంతా హైందవులు కానీ, మహమ్మదీయులు కానీ, కిరస్తానీలు కానీ సోదరులే అంటాము. లజపతిరాయిగారి గొప్ప, నెహ్రూగారిగొప్ప, మనగొప్పలాగే పొగడుతాము. బంగాళీ నవలలు బాగున్నవని వాటిని తెనిగించేస్తాము. పంజాబీవాడి పాగా బాగుందని మనమూ రెండుగజాలు యెత్తైనపాగా చుడతాము. కలకత్తా స్లిప్పర్లు బాగున్నాయని ఆకుచెప్పులు చిలక్కొయ్యకు తగిలించేస్తాము. ఇదంతా చాలాబాగుంది. సోదరభావమే. జాతీయవిజ్ఞానమే. కానీ, యేదీ మీ వ్యక్తిజీవనము?

మరేదేశానికేనా వెళ్లండి. ఆంధ్రులంటే అంధులంటారు. మీ కెక్కడా గౌరవము లేదు. ఏలాగుంటుంది? పంజాబీవాడి బలముందా? బంగాళీవాడి దబాయింపుందా? మార్వాడీవాడి డబ్బుకట్టె నిపుణత వుందా? అరవవాడి గడుసుదనముందా? హిందుస్థానీవాడి జబర్దస్తీవుందా? ఎంతసేపూ యెదుటివాడి గొప్ప చూసి పొగడ్డమే కానీ నీగొప్ప ఏదీ?

ఈ వ్యాసమందలి సంగతులు పూర్తిగా నసత్యములనిగాని సత్యములనిగాని చెప్పుటకు కొంచము వెనుదీయవలసి వచ్చును. కాని ఆంధ్రులలో నితరుల ననుకరించు గుణముమాత్రము అమితమని జెప్పనగును. అనుకరణముకూడ తమ వ్యక్తిత్వమునకు నష్టము గల్గింపక అభివృద్ధిదాయక మగునేని మంచిదే. కాని అనుకరణమే ఆదర్శప్రాయముగానెంచి వ్యక్తిత్వమును మంటగలుపువారి నిది మేలుకొల్పునని యెంచుటతిశయము గాదు.

సంపాదకుడు.

ఏలాగుంటుంది నీమీదగౌరవము? నీ క్రాపింగు బంగాళీ క్రాపింగు, నీచెప్పులు కలకత్తాచెప్పులు, నీపాగా పంజాబీపాగా, నీనవలలు, నాటకాలు, చిత్రపటాలు బంగాళీదేశమువి. నీపాటలు పారసీపాటలు. హిందుస్థానీ వరసలంటే పడిచస్తావు. నువ్వు పల్లవిలో యెవ్వడికీ తెలీయని "అపనా తనా మనా" మాటలు ఆపాటకివేస్తే చలామణీ మాజోరు. నీకు ప్రతాపరుద్రీయంలో తురకమాట లున్నచోట గొప్ప మక్కువ కనిపిస్తుంది; కన్యాశుల్కంలో యింగ్లీషు ముక్కలలో గొప్ప సారస్యము అవుపడుతుంది. ఏదయినా సరే నీకుస్వతంత్ర బుద్ధి లేదు. మీ వూళ్లో వాడికంటే మొట్టికాయ ప్రసాదిస్తావు.

మనలో యెవడైనా గొప్ప ప్రబంధకర్త బయలుదేరి మహాగ్రంథమువ్రాస్తే పదిమంది జమీందార్లని యాచించి వాళ్లకోట దేవిడీలలో పడీకాపులుపడి లేదనిపించుకొని చంకని పుస్తకముపెట్టుకుని, వాడిగుడిసెకు తిరిగీ వెళ్లిపోవాలి. మనలో యెవడైనా ఒకపెద్ద పేపరుమిల్లో, ఒక అగ్గిపుల్లల

ఫేక్టరీయో పెడతానంటే అంతా వాణ్ణి చూసి "మొన్న మొన్నటి కుఱ్ఱవెధవరా! వీడి తలకాయ వీడిపూహాలు మాజోరుగా వున్నా" యని తిడతాము. పదిమంది పెద్దలు కట్టిస్తే యేలాగో మధ్య సొమ్ము కనిపించ కుండాపోయి మిల్లయితే మంటగలుస్తుంది. మన దేశములో గొప్ప పాటగాడు నోటనో, ఫిడేలుమీదనో చక్కని పాండిత్యము చూపితే లక్షలోపాలు యెంచుతాము. ఏపిల్లో, మొదలియారో, అయ్యరోవస్తే మాబాగుండని నోళ్లు తెరుచుకుని ఆ రసము విరామంలేకుండా తాగేస్తాము.

నిజము చెప్పితే నిష్ఠూరము. ఏడీ మనలో రవీంద్రుడిలాంటి కవీంద్రుడు, బోసులాంటి శాస్త్రజ్ఞుడు, దాసులాంటి లాయరు, గాంధి లాంటి ఋషి, తిలక్‌లాంటి ధైర్యశాలి? పోనీ వీళ్లతో నిలపడానికి సమానమైనపేరు తెలుగువాడిది వొక్కటి చెప్పండి విందాము.

ఇంకేమిటి గొప్ప. వారు ముందు పరిగెడితే మనం వెనుక పరిగెత్తేము, అంతేనా?

కందిపప్పు, ఆవునెయ్యి, అప్పడాలు, గేదెపెరుగు, చేగోణీలు పీకమొయ్యా తింటూ, భూములమీదవచ్చిన సొమ్ము ఖర్చుచేస్తూ, యిరవైగంటలు టప్పాలు కొట్టడం మన దినచర్య.

పోనీ బాగా డబ్బు సంపాదించినవాళ్లయినా వున్నారా తెలుగువాళ్లలో? కోటి రూపాయలు ఆస్తిగలవాడున్నాడా! ఎక్కడచూసినా ఆంధ్రమాతకు జెయ్ అని కేకలు. ఆంధ్రమాత దీన్నివిని ఏమిరా నా కొడుకు లింత అపభ్రంశ జడ్డివాళ్లని విలపిస్తూంది.

---

## కష్టజీవి

౧

ఏల నింతువు కన్నీరు నోలలామ!

......................

ఎవఁ డెఱుఁగునమ్మ నీ లేమెడఁదలోన
రవులు ఘోరదావానల ప్రభలశిఖలు;
కష్టజీవిత యాత్రను గడుపలేక
విసుఁగుచెంది నీవెడనెడ విడుచునూర్పు
వేడిమి జగమునే మాడ్చి వేయునేమొ!

౨

తల్లియెడయిక కూర్చువంతను సహింప
లేని కసుఁగందుల గుడిసెలోన వదలి
ఎండలోనీవు కష్టించునెడఁ ద్వదీయ
సహజసౌందర్య విలసితాస్యంబుఁ గన్న
ఎంతటి కటికిగుండె ద్రవింపదమ్మ!!
కడుపుకై యింత కక్కుర్తి పడెదవేల?
పేదబ్రతుకెంత తెగువ నేర్పినదితల్లి!!!

జి. సీతారామయ్య

# స్వర్గీయ మనోరమ ముజుందారు సతి

పాలపర్తి ఆంజనేయులుగారు

దయాస్వరూపిణి ప్రేమపెన్నిధియైన యొక మహాత్మురాలు అనంతుని నిత్యనివాసమున కరిగినది. గతశతాబ్ద అంత్యదశకములలో బ్రహ్మసమాజ చారిత్రమున నవ్యభావతరంగితమై నూతనశక్తికి హేతుభూతమై విలసిల్లిన జ్యోతిర్మయ జీవితములలో తుది ప్రదీపిక నిర్వాణముచెందినది. ఏ యమ యొక్క ప్రేమాదరణములు నిజసంతానమునకు, స్వగృహమునకు, ఆత్మబంధుమిత్రులకు మాత్రమేగాక, అనాథలు, ఆర్తులు, దీనులును నైన యశేషజనమునకు వెల్లువయై ప్రవహించినవో, ఏ మాతృమూర్తి తోడి జనులదీనతను బాపుటకు విరామమెఱుగని కాయక్లేశములను కన్నతల్లివలె భరించినదో, ఏతల్లియొక్క సుధామయప్రేమవాక్కులు భగ్నహృదయులైన యువతీయువకుల జీవితోద్ధరణమునకు, విశుద్ధజీవనమునకు కారణమయ్యెనో, ఏసాధ్వి విమలచరితము, బోధామృతము తోడి మానవులకు తేజకరమై వారిని ఆనందమయ పూర్ణావస్థకు ప్రోత్సహించుచుండెడిదో అట్టి దీనజనబాంధవి, విమలచరిత, విదుషీమణి శ్రీమతి మనోరమ ముజుందారు వనితారత్నము యెనుబదైదు వత్సరముల నిండువయస్సున పండినపండువలె సంసారజీవన వృక్షమునుండి గతయేప్రిల్ 25 వ తేదిన రాలి పోయినది.

ఈమెభర్త గిరీశచంద్ర ముజుందారు. సుప్రసిద్ధుడైన బ్రహ్మసామాజికుడు. ఆయన చేసిన సకలకార్యములందును, పలికినపలుకులందును ప్రత్యేకప్రతిభను ప్రకటించువాడు. "నక్కలుదూరుటకు బొరియలును, ఆకసమున విహరించువిహగములు, విశ్రమించుటకు గూడులును గలవుగాని మానవపుత్రుడైన గిరీశునకు తలదాచుకొనుటకు చోటులే"దని నొకసందర్భమున బలికెను. అయినను బ్రహ్మసమాజ సేవాధురీణులైన మహాపురుషులలో, 'ఈశ్వరాజ్ఞను పరిపాలించినవారెల్లరు తనతల్లి, తోబుట్టువు, సోదరుడు' అను క్రీస్తువాక్యమును తలదాల్చిన మహనీయుడుగా గణుతికెక్కియుండెను. ఈ ఆత్మ సమర్పణానురక్తియే ఆయనజీవితమును మాధుర్య మొనరించెను. ఆయన శరీరమందలి ప్రతి జీవకణము ఈశ్వరకారుణ్యాభరితమనుటకు ఆయన దినదినము తోడిమానవులకొరకై బొందెడి శ్రమయే ప్రబలతార్కాణము. అవి బారిసాల బ్రహ్మసమాజములోని ప్రతిఆత్మయు విద్యుల్లతవలె ప్రకాశించుచున్నదినములు. విఖ్యాతులయిన మహాపురుషులెందరో నాడు నాసమాజమున సభ్యులుగా నుండియుండిరి. ఉత్సాహోద్రేకములతో సమాజము ప్రకంపిత మగుచుండెను. అట్టితఱి తన పదునేనవ యేట మనోరమ తనభర్తను వచ్చికలిసికొనెను. ఆమె 1851 సంవత్సరమున జననమొంది 1863 లో వివాహితయై 1866 న భర్తృగృహముచేరెను.

ఆ కాలమున బ్రహ్మసమాజమందలి స్త్రీలును అజ్ఞానాంధకారముననే తడవులాడుచుండిరి. విద్యాధికుని చేబట్టినను మనోరమయు విద్యావిహీనురాలుగనే యుండెను. అంతకుబూర్వమే తన సోదరసామాజికుల సతులకెందరికో విద్య గఱపుచున్న గిరీశుడు నిజసతికిని విద్య నేర్ప పూనుకొనెను. ఆమెను తన కుటుంబమునకు, సంఘమునకు, దేశమునకు, అమూల్య సంపదగ నొనర్ప నిశ్చయించెను. అందును ముఖ్యముగ నామె

యందుగల యాధ్యాత్మికశక్తిని రగులుగొల్పి తన ధర్మసమాజమున కుత్తను సేవకురాలుగ తీర్చి దిద్దుట కాయన యువ్విళ్లూరుచుండెను. గృహసంబంధమైన యనేకకార్యములలో దినమంతయు ఆమెకాలము గడచిపోవుచుండెను. తనభర్తకు తుల్యమయిన సహధర్మచారిణిగ శిక్షబడయుటకు ప్రశాంతమైన నిశీథ ఘడియలే ఆమెకు శరణమయ్యెను. విద్యయెడలను సత్యమందును ఆమెకుగల గాఢాభిలాషయు, భర్తపై గల నిర్వ్యాజానురాగమును పరస్పరమనోభావములపై యొండొరులకు గల గౌరవమును, తమ ధర్మప్రచారముయెడ వారికిగల పూనికయు మనోరమ మనోహర భవిష్యజ్జీవితమునకు స్వరూపలక్షణములు చేకూర్చి నవ్యదాంపత్య జీవనమునకు దారిదీసెను. చిన్ననాటనుండి వేరూనియున్న సంప్రదాయములను, ఆచారములను నొక్కవ్రేటున త్రుంచివేయుట కామె వెనుకాడి యుండలేదు.

మనదేశములో బ్రహ్మమతచారిత్రమున ఆచార్యపీఠ మలంకరించి ధర్మోపదేశముచేయ నర్హతను పొందిన ప్రథమ నారీరత్నమీమెయే. ఈయర్హతను 1881 సం. ననే ఆమె పొందియున్నను, 1893 సం. లో బారిసాలు బ్రాహ్మసమాజ ఆచార్యపీఠ మలంకరించి ప్రథమపర్యాయము తన మృదుమధుర వాగామృతధారలచే శ్రోతల నానందపరవశుల గావించెను. నాటి యానందానుభవమును నేటికిని భక్తియై స్మరించువారలు గలరు. మందిరము జనాకీర్ణమయ్యెను. యువకులనేకులు వసారాలయందు మూగి గుబ్బిసలాడుచుండిరి. మనోరమ బోధామృతము సంతతధారగా వర్షించుచు సదస్యుల హృత్క్షేత్రముల నార్ద్రిమొనరించి పునీతము చేయుచుండెను. విననోచుకొనని యువకుల తహతహనుచూచి గిరీశబాబువారిని తమ కుటుంబోపాసనల కాహ్వానించెను. తండోపతండములుగ యువజనులు గిరీశచంద్రుని గృహమునకు వారవారముబోయి యామె జ్ఞానబోధలచే సంస్కృతాత్ములై, బారిసాలువిద్యార్థు లుత్తమనీతివర్త[...]లను ఘనయశస్సును సంపాదించిరి.

అంతటనుకను గిరీశచంద్రుచే నడుపబడుచున్న బ్రహ్మయువతీ సమాజమును నడుపుబాధ్యత [...] జీవనమున శిక్షితురాలైన మనోరమ వహించె[...] ఆమెయొక్క సన్నిహిత సహచర్య సహవాస భాగ్యవశమున బ్రహ్మస్త్రీలు మాత్రమేగాక [...]లనేకులుకూడ చాలసంస్కారమును పొందిరి. [...] కుటుంబజీవనమును ననేకవిధముల పవిత్రమై [...]మయమయ్యెను.

ఒకస్త్రీ మతపీఠమలంకరించి యుపదేశము[...] చేయుట మతచారిత్రమున అనూనమైన సంఘటనము. విజ్ఞానవేత్తలయిన విదుషీమణు లెందరోగలరు. కా[...] సమాజముచే యెన్నుకొనబడి ఆచార్యపదవిపొం[...] ప్రథమగౌరవ మీమెకే చెందెను. నాటిపత్రికల ఈవిషయము ప్రశంసించియుండెను. నేటికిని యిట్టి హక్కు పాశ్చాత్యదేశములలో స్త్రీలకు లభ్యమై యుండలేదు. బ్రహ్మసమాజమునందే యిట్టి సంపూర్ణమైన సమత్వము అంగీకరింపబడియున్నది.

ఆమె స్వంతబిడ్డల కిలకిలారావములచే నామె గృహము నిరంతరము ప్రతిధ్వనించుచున్నను, నూత స్నాతకులయిన బ్రహ్మ యువతీయువకుల కామె గృహమే శరణాలయముగ నుండెను. ఆమె సేవోపచారములు కేవలము భౌతికశరీరమునకు మాత్రమే గాక ఆత్మకును పోషణహేతువుగ నుండెను. ఆధ్యాత్మికక్షుద్బాధల తాపోపశాంతి నిమిత్తము, భౌతిక కోలాహల సమ్మోహిత నగరిమధ్యమున హిమవన్నగ కందరములనుండి యవతరించిన ఋష్యాశ్రమముగ వారిగృహము విలసిల్లుచుండెను. ఈ ఋష్యాశ్రమ జీవనసౌభాగ్య మనుభవించినవా రనేకులుగలరు, కొందరిప్పటికిని సజీవులుగ నున్నారు.

ఉపాసనాదులందు ఆచార్యపదవినుండి ఆలో[...]త్తేజకరములయిన ధర్మోపన్యాసములజేయ సమర్థ[...]

# స్వర్గీయ మనోరమ ముజుందారు సతి

రాలనిమాత్రమేగాక, యువతీయువకుల కోమలహృదయముల నాకర్షింపగల సుత్తమోపాధ్యాయినిగాగూడ మనోరమ కీర్తిచంద్రికలు ఖండాంతరములందును వ్యాప్తిచెందెను. ఢక్కా-స్త్రీల పాఠశాలాధికారులు ఆమెఖ్యాతిని విన్నవారై తమసంస్థ నాయకత్వము వహించవలసినదిగా కోరుచు, ఆమెభర్త గిరీశచంద్రునికిని ఢక్కా కళాశాలలో ఆచార్యపదవిని సంపాదించిపెట్టిరి. ఈ దంపతులిరువురు మిక్కిలి హృదయభారముతో తమతోడి సాంఘికులను సహకారులను, పరిశ్రమక్షేత్రముల నెడబాసి 1886 సంవత్సరమున ఢక్కా కార్యరంగమున ప్రవేశించిరి. అప్పటికామె వయస్సు ముప్పదైదువర్షములు. ఇచటను ఆమెయొక్క యశము 1907 వరకును నిరుపమానమై ప్రకాశించెను. ఢక్కా బ్రహ్మసమాజ కార్యనిర్వహణ భారముచే నామె ఉపాధ్యాయినీవిధులకు కొంత యంతరాయము కలుగుచువచ్చెను. ఆమెసేవయు, కీర్తియు సర్వతోముఖమై ప్రసరించెను. 1888 సంవత్సరమున వారు తమ ఇరువురిపుత్రికల వివాహసందర్భమున కొలదికాలము ఢక్కా విడిచి కలకత్తా యందుండిరి. ఈరెండు వివాహములందును శ్రీమతి మనోరమాదేవియే ఆచార్యపదవి నలంకరించి వివాహవిధుల నడిపించెను. ప్రఖ్యాత వైద్యశేఖరులయిన సర్ నీలరత్న సర్కారునకు ప్రథమపుత్రికను, (స్వర్గీయ) సురేశచంద్ర సర్కారునకు రెండవకొమారితను యిచ్చి పరిణయము చేసెను.

ఆమె ప్రభుత్వసేవను ఇరువదియొక్క సంవత్సరములుమాత్రమే చేసెను. అయినను, ప్రథమ హిందూ స్త్రీ ఉపాధ్యాయినిగా ఆమెచేసిన నిరుపమానసేవను ఇండియామంత్రి మెచ్చుకొనినవాడై ఆమెయెడ నిబంధనల రద్దుపరచి గౌరవభృతి నేర్పాటుచేసెను. 1907 నుండి భార్యాభర్త లిరువురును కలకత్తాయందే కాపుర మేర్పరచుకొనిరి.

భగవదారాధనా తత్పరయైన యామెకు దారిద్ర్యమును, కష్టములను సమతతోను, సంతృప్తితోను జూచుట సహజమయ్యెను. వంగీయరమణీమణుల భవిష్య ద్వికాసమునకు హేతుభూతమైన నవసందేశమును ప్రచారమొనరించుట కామె యెట్టి కష్టనిష్ఠురములను, కాయక్లేశములను భరించియుండెనో నా చరిత్రమంతయు ముందు సంతతులవారికి ఆశ్చర్యజనకముగా నుండగలదు. దానిని యిప్పుడు వివరింపబూనజాలము. కొన్నిమాత్రమే స్మరింపదగును.

ఈ నానావిధశోధనలు, బాధలు ఆమెజీవితమును పరిపక్వ మొనరించెను. ఆమెకు చిన్ననాటనె కడగొట్టు ముద్దుబిడ్డ వియోగము కలిగెను. ఈ దుఃఖముచే నామె క్రుంగిపోయెను. కాని గిరీశచంద్రుడు ధైర్యోత్సాహముల కలుగజేసి ఈశ్వరవిశ్వాసమును దృఢపరచెను. శాంతిసాగరమువంటి నామె హృదయమున నీదుఃఖము యణగిపోయెను. కాని వెనువెంటనే బడబానలమువలె సముద్రగర్భమును కంపింపజేయు కష్టములు నొకటివెంట నొకటివచ్చిపైబడెను. ఆమె ముద్దుతనయ లిరువురును, పిమ్మట 22 నవంబరు 1913 సంవత్సరమున ప్రియభర్తయు పరమపదించిరి. తన జీవితకుసుమము మొగ్గలోనే మ్రగ్గిపోకుండ రేకులుతొడిగి ప్రఫుల్లమై నవనవసౌరభముల దశదిశల వెదజల్లుచు ననేక యువతీయువజనుల కాదర్శప్రాయమై విరాజిల్లునట్లు తీర్చిదిద్ది యెవరు పోషించియుండిరో అట్టి మనోవల్లభుడు, ప్రాణసఖుడు, పరమ గురువుయొక్క వియోగము వజ్రాఘాతమువలె ఆమెహృదయమును వ్రక్కలు చేసివైచెను. నాటినుండి నీ సాధ్వీమతల్లి తన దినముల లెక్కించుకొనుచు తన నిజనాథుని గలిసికొన యెదురుచూచుచుండెను. ఇంతలో నామె యేకైకపుత్రుడు ప్రేమరంజనుడును అస్తమించెను. ఈదుఃఖ పరంపరలందును ఆమె ప్రాణమృత్యువుల కధినాథుడయిన పరమాత్మ విస్మరింపక ఆయన సేవార్చనలయందే ఆత్మశాంతిని పొందినదాయెను.

[ఈ జీవితకథ ఇండియన్ మెసెంజరు పత్రిక లోనివ్యాసము ననుసరించి వ్రాయబడినది.]

# రమణుల రాజ్యము

సత్యవోలు శ్రీరామమూర్తిగారు

భారతదేశమందలి సంస్థానములలో తిరువాన్కూరు మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఇతర ప్రాంతములవారు స్త్రీస్వాతంత్ర్యముకొఱకు ఇటీవలెనే పాటుపడుచుండిరి గాని అనాదినుండియు తిరువాన్కూరు మహారాణులు మహిళాభివృద్ధికై ప్రయత్నించిన వారిలో ముఖ్యులు. 1817 వ సంవత్సరములోనే రాణీగారీపార్వతీబాయిగారు తన రాజ్యమునగల ప్రజలందరను విద్యావంతులుగ జేయుటయే ప్రధానాశయముగ జేసికొనెను. విశాలభావము, ఆదర్శవర్తనము, సమానదృష్టి ఇవన్నియు నామెకు సహజగుణములని చెప్పవచ్చును. ఆమె జీవితమంతయు ముఖ్యముగ స్త్రీజనాభివృద్ధికిని వారిహక్కులకును వినియోగించెను.

ప్రస్తుతపు మహారాజాగారి తల్లియగు శ్రీమతి సేతు లక్ష్మీబాయిగారు తన రాజ్యమందేగాక దేశమందంతటను స్త్రీస్వాతంత్ర్యమునకై కష్టపడి కీర్తిగాంచినట్లు మనకందఱకును తెలిసినవిషయమే. పూర్వమునుండి మనదేశమున ఆచరణలోనున్న పరదాదురాచారమును నిర్మూలించినగాని మహిళాభివృద్ధికి భంగముగలుగుచున్నదని ఈమె గ్రహించెను. స్త్రీలెంతటి విద్యావతులైనను ఈ దురాచారమువల్ల వారికళలభివృద్ధిగాజాలవని అఖిలభారత మహిళాసభకధ్యక్షతవహించినపుడీమెయుపన్యసించెను. అంతియగాక బాల్యవివాహములవలన మన హిందూసంఘముల దుస్థితిని పలువిధముల ముచ్చటించెను. మనదేశమున ప్రతి పదివేలమంది స్త్రీలలోను 15 మొదలు 20 సంవత్సరముల నడుమ వయస్సుగల వితంతువుల సంఖ్య 41. 20 మొదలు 25 సంవత్సరముల నడుమ 71. 25 మొదలు 35 సంవత్సరముల నడుమ 147. 35 మొదలు 40 సంవత్సరముల నడుమ 335. పైనుదహరించిన నడుమ వయస్సులలో ఇంగ్లాండుదేశమున వితంతువుల సంఖ్య సరుసగా 0, 1½, 13, 50. ఇవియట్లుండ మనదేశమున మొదటి 5 సంవత్సరముల నడుము వయసులో ప్రతి పదివేలమందికి ఏడుగురు వితంతువులు గలరని వినుటకు మిక్కిలి ఆశ్చర్యమగుచున్నది. బాల్యవివాహములవలనను, వితంతువివాహములకు మనసంఘము లంగీకరింపకుండుటవలనను ఈదుస్థితి వాటిల్లుచున్నదనియు, స్త్రీలస్వతంత్రలై యున్నంతకాలమీ దురాచారములు తొలగుట కవకాశము లేదనియు నామె ఆశయము.

అందువల్లనే నామె తనరాజ్యములో స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి దురాచారములనుమాన్పి విద్యాభివృద్ధికై మిక్కిలి ధనము వెచ్చించెను. తిరువాన్కూరు రాజ్యమున స్త్రీస్వాతంత్ర్యమునకీ మహారాణులే కారకులు. ఈరాజ్యమున స్త్రీలకు పురుషులకన్న హెచ్చు హక్కులుగలవు. వారసత్వాది విషయములందు చరస్థిరాస్తియంతయు

స్త్రీలద్వారానే ఒకహస్తమునుండి ఇంకొక హస్తమునకు మారుచుండును. ఒకపురుషుని ఆస్తియంతయు



శ్రీమతి సేతు పార్వతీబాయిగారు, తిరువాన్కూరు మహారాణి.

ఆతని మేనల్లునకు చెందును గాని తన కొమరునకు చెందదు. ప్రస్తుత రాజవంశమును స్థాపించియుండిన వీరి పూర్వు లీ నియమముల నేర్పరచియుండిరి. అవి నేటివరకు క్రమముదప్పకుండ ఆచరణలో నుంచబడుచునేయున్నవి.

రాణి సేతులక్ష్మీబాయికి మాతృభాషయన నెక్కువ ఆసక్తి, అభిమానము గలదు. అటులని ఆయమ ఆంగ్లభాష నిరసింపదు. తిరువాన్కూరునందలి కళాశాలా ప్రధానోపాధ్యాయినివద్ద ఆంగ్లము ప్రథమమున యభ్యసించియు అటు తరువాత కళాశాలకే స్వయముగ వెళ్లి పూర్తిగ నేర్చుకొనెను. దినమంతయు గ్రంథపఠనమందే ఈమె కాలము గడపుచుండును.

ఈ రాజ్యమున 150 స్త్రీ విద్యానిలయములు గలవు. ఇందలి పాఠశాలలలో విద్యగఱపుటకు జాతిమతభేదములు లేవు. అన్ని జాతులవారిని సమానముగ జూచుచు నలయువారికి వేతనమునిచ్చి ప్రోత్సహించుచున్నారు. బాలికల కుపయుక్తముగ సంగీతము, కుట్టుపనిమున్నగు సకల విద్యలను నేర్పుటకు తగిన యుపాధ్యాయులను ప్రతి పాఠశాలయందును ఏర్పాటుచేసిరి. బాలికల కనుకూలముగ ప్రత్యేక వసతి గృహముల నేర్పరచి విద్యార్థినుల సంఖ్య హెచ్చుచేసిరి. బాలురకు వలెనే బాలికలను గూడ



తిరువాన్కూరు శ్రీ అనంత పద్మనాభస్వామి దేవళమున మూలవిగ్రహము.

వ్యాయామక్రీడల పాల్గొనునట్లుచేసి (Girl guide movement) ఏర్పాటుచేసెను. ఈ సంఘమునకు మహారాజాగారి సోదరి ప్రధానకార్యదర్శినిగ నుండెను.

రాణీ పార్వతీబాయి తన కొమారుడు ప్రఖ్యాతితో రాజ్యపాలనము చేయుటకు తగినవిద్యగఱపెను. ప్రజలయొక్కయు ఆయాప్రాంతములయొక్కయు పరిస్థితులు ఆచారవ్యవహారములు పరిచయమగుట యవసరమనియెంచి తన కుమారుని చిన్నతనమున సంస్థానమందలి వివిధప్రాంతములకు తీసికొనివెళ్లెను.

ఈమె ప్రాచ్యపద్ధతులపైగల యభిమానముతోబాటు ఆధునికావసరములబట్టి నూతన విధానముల ననుసరించుటలో యించుకేనియు వెనుదీయదు. ఆ విశాల హృదయమే ప్రస్తుతపు మహారాజుగారి కలవడినదనుటకు సందియములేదు. సర్వ ప్రాణులను సమానమనియెంచి జాతిమత భేదములను పాటించక తన రాజ్యమునందలి దేవళముల హరిజనులకు తావిచ్చుటయే ఈతని విశాలహృదయమును చాటుచు చున్నది. ఇంతవరకు ఇతర స్వదేశసంస్థానాధీశులెవరును యిట్టి సంస్కరణము గావింపలేదు. ఇట్టి విషయమున శ్రీమతి రాణీ పార్వతీబాయిగారు పూర్వ ఆధునికాభిప్రాయములుగలవారందరికి యిష్టమై పాలనమొనరింపగల రాజును దయారుచేసినదని చెప్పవచ్చును.

# సోయా బీను

చదువుల రామచంద్రయ్యగారు

(గతసంచిక తరువాయి)

సోయామొక్క:—

సోయామొక్కలు కొంచమెత్తుమాత్రము పెరుగును. పెక్కు కొమ్మలతో గుబురుగ నుండును. ఆకుల ఆకారము, రంగు, పరిమాణములందు, మొక్కలలోవలె, చాల భేదములుగలవు. ఆకులనిడుపు 1 నుండి 5 అంగుళములవఱకు నుండును. ఈయాకులు పండుబారి కాయలు పండుకొలది రాలిపోవుట కారంభించును.

ఈమొక్కకు నూగుగానుండుట నైజగుణము. నూగులేనిమొక్క లింతవఱకు కనుగొనబడలేదు.

పువ్వులు ఊదా లేక తెలుపువర్ణముగా నుండును. వాసన ఉండదు. ఇవి గుత్తులుగుత్తులుగ నుండును. సాధారణముగా గుత్తికి 8 నుండి 16 వఱకు పువ్వులుండును. కాని యొక్కొక్కచో 25 నుండి 45 వఱకుకూడ పూచినట్లు నిదర్శనములు గలవు.

కాయలు చాలరకములలో దబ్బగనుండును. కాని కొన్ని గుండ్రముగ నుండుటగూడ గలదు. వీనిలో 3 నుండి 5 వఱకు గింజలుండును. ఇవి గుత్తులు గుత్తులుగనుండి యొక్కొక్కదానికి 3 నుండి 5 వఱకు నుండును. కొన్నింటిలో 16 నుండి 18 వఱకు కాయలుండుటగలదు. ఒక మొక్కయందే 300 కంటె యెక్కువ కాయలు గాయును. ఇవి గోధుమ వన్నెగాగాని, కొంచము పసుపుపచ్చగగాని, కొంచము నలుపుగగాని యుండును.

గింజలు ఆకారమును రంగునుబట్టి విభాగింపబడుచున్నవి. కొన్ని దబ్బగను, కొన్ని కోలగను, కొన్ని గుండ్రముగనునుండును. చాలరకములలో గింజ లొక్కరంగుగలవిగ నుండును. పసుపుపచ్చ, ఆకుపచ్చ, గోధుమ, నలుపురంగులేగాక, రెండురంగులుగలసిన గింజలుకూడ కానవచ్చుచున్నవి. కొన్నింటిపై మచ్చలుకూడ నుండును.

గింజలనుబట్టియే సోయాబీను రకములుగా విభజింప బడుచున్నవి. వీనిలో పసుపుపచ్చరకము, తెల్లనిమచ్చగలవి, బంగారువర్ణపుమచ్చ గలవి, గోధుమవర్ణము మిళితమైన వని మూడు తెగలుగా నెంచబడుచున్నది. నలుపువర్ణముగల వానిలో పెద్దవి పెద్దగనుండి దబ్బగ నుండునవియు, చిన్నగ నుండునవియు చేరుచున్నవి. పసుపురంగులో పైపొట్టు ఆకుపచ్చగనుండి బీజభాగము పచ్చగనుండునవియు, బీజభాగము పైపొట్టుకూడా పచ్చగనుండునవినై యున్నవి. ఇంకను కొంతమంది పంటపండుకాలమును బట్టి సోయాబీనుల వివిధరకములుగా నేర్పరచుచున్నారు.

సోయాబీనులు పండుటకు 2½ మొదలు 5 మాసములవఱకు బట్టును. 75 రోజులలోనే పండిపోవునవి గలవు. చాల నిదానముగా పండునవి 150 దినములకంటె యెక్కువకాలము పుచ్చుకొనును. వీనిలో ఆకారములో పెద్దగనుండునవియే యెక్కువ కాలము దీసికొనును. ఇది యితర దేశములందు

మొక్కలపంటకు గావలసిన కాలము కాని ఉష్ణదేశములలో నింకను తొందరగా పండును. వీని వ్యవసాయవిషయములగూర్చి యింకొక వ్యాసమున జూడనగును.

ఉపయోగము:

ఒక్క ఆహారపదార్థములందేగాక, పరిశ్రమలకును వ్యవసాయమునకునుకూడ సోయాబీను లెక్కువ యుపయోగపడుచున్నవని నేడు ప్రపంచమంతయు వానిని పండించుచున్నది. భారతదేశ మిటీవలనే మేల్కొని యీపంటయందు శ్రద్ధవహించినది. కాని అది యింకను మిక్కుటముగ అభివృద్ధి గాంచవలసి యున్నది.

సోయాబీను గింజలేగాక, మొక్క సమూలముగా పెక్కింటి కుపయోగపడుచున్నది. వానిలో గింజల యొక్క యుపయోగము ఆహారపదార్థముగా మొదట గమనింతము.

శరీరమునకు నిరంతరమత్యంతావశ్యకముగా గావలసిన లోహములు, క్రొవ్వు, మాంసకృత్తులు, ఆదిగా గల సమస్తవస్తువులుగల పదార్థమునే అత్యంతోపయోగమైనదని చెప్పవలసియున్నది. ఈదృష్టితో జూచిన తల్లిపాలు సృష్టిలోగల పదార్థములందెల్ల మానవుని కత్యంతోపయుక్తమని గణింపఁదగియున్నది. దాని తరువాత ఆవుపాలు గణింపబడుచున్నవి. సోయాబీనుపాలు వీనికితరువాత యెంచఁదగియున్నది. ఇతర ఆహారపదార్థములలో నిది ప్రథమస్థాన మాక్రమించును ఇతర పదార్థములందుకంటె శరీరాభివృద్ధికి గావలసిన సకలవస్తువులును సోయాబీనులందే గలవు. నవీనశాస్త్రజ్ఞులు శరీరాభివృద్ధికి తప్పనిసరిగా కావలయునను పెక్కువిటమినులు, ఒక్క సోయాబీనులందే గలవు.

సోయాగింజలతో తినుబండముల నెన్నిటినో చేయవచ్చును. పాలకు బదులుగా నుపయోగించుటకు వీని నుండి పాలను చేసికొనవచ్చును. ఇది అతిమాత్రవ్యాధిగలవారికి యమూల్యమైన గుణమిచ్చునని సుప్రసిద్ధ వైద్యులు నొక్కివచించియున్నారు. అంతియగాక నరములకు సంబంధించిన ప్రతివ్యాధికిని, మెదడునకును, శిశురోగములకును, శ్వాసకోశసంబంధమైన రోగములకును అత్యంతోపకారియని చెప్పబడుచున్నది. రక్తములో క్షారము నెక్కువచేసి శరీరారోగ్యమును పెంపొందించుటకు సోయాబీను ఎక్కువగ నుపకరించును. చైనా జపాను దేశములందు బౌద్ధసన్యాసులు మాంసాహారులుగారు కాని తాము భుజించు ముఖ్యపదార్థము లన్నియు సోయాబీనులతోడనే తయారు చేయుంచుకొందురు. ఆదేశములందు చిరజీవులు వారేయైయున్నారు.

పారిశ్రామిక వ్యవసాయకోపయోగములనుగూర్చి వ్రాయుటకుమున్ను సోయాబీనులతో జేసికొనదగు పదార్థములను, వివిధదేశములవారు తయారుచేయు వంటలనుగూర్చి కొంతవ్రాయుట మంచిదని యెంచుచున్నాను.

సోయాపాలు:

ఈపాలు తయారుచేసికొనుపద్ధతి గతసంచికయందే వ్రాయబడినది. మానవాహార పదార్థములలో పాలుకంటె ఉత్తమమైనది లేదని యెల్లరంగీకరించిన విషయమే. శరీరాభివృద్ధికి గావలసిన వస్తువులన్నియు నందు గలవు. కాని బీదసాదలకిది యందుబాటులోనిదిగాదు. వారద్దానిని ఆహారపదార్థము లమితముగా నుపయోగింపజాలరు. అదియునుగాక పశువుల సంరక్షణ భారతదేశమందు చక్కగ నుండకుండుటచే పాలు పెక్కు రోగములను మానవులకు దెచ్చిపెట్టుచున్నట్లు గనుగొనబడినది.

సోయాపాలు ప్రాచ్యదేశములగు చైనా, కొరియా మంచూరియా, జపానుదేశమందలి కొన్నిభాగములందును, ఎక్కువగ నుపయోగింపబడుచున్నది. ఆవుపాలను ఆచటివా రుపయోగింపరు. కారణ

మేమన ఆవుపాలు దూడకే నిర్ణయమనియు, ఆ పాలు త్రాగినవారందరు జంతువులై పశువులవలె కొమ్ములు మొలచుననియు నమ్మెదరు. ఆదేశీయులు సోయాబీనుపాలు తయారుచేసి పసిపిల్లల కిచ్చెదరు. ఈపాలు తయారుచేయు కర్మాగారము లాదేశములం దమితముగ గలవు. క్రీస్తునకు 2000 సంవత్సరముల ముందుండిన వేయెనెయిన్ట్జీ అను చైనా వేదాంతి యీపాలను గనిపెట్టెనని చెప్పుదురు. ఈపాలొకవిధముగ వాసన వచ్చునుగాని కొంచెము తేనెగలిపినచో పోవును.

కొరియా దేశమునం దెక్కువగా నీపాలు నుపయోగింతురు. వారు పాలు తయారుచేయురీతి వేరు. ఎండిన గింజలను మూడుమార్లు కడిగెదరు. తరువాత గింజలకు రెండింతలు నీళ్లలో 24 గంటలు నానవేసి ఆనీళ్లతో కూడ ఉడుకుపట్టువరకు కాచి తరువాత ఆనీటి తోడనే రుబ్బెదరు. దానిని గుడ్డలోపిండి పిండిని వేరుగా దీసివేయుదురు. ఆసారమునే వారు పాలుగా నుపయోగించెదరు.

కాని చైనాదేశీయులు వేరువిధముగా జేయుదురు. గింజలను మొదట బాగుగాకడిగి 12 గంటలకాలము నీటిలో నానవేయుదురు. గింజలు నాని మెత్తను పెద్దవిగను అగును. వానిని రెండు గుండ్రని తిరుగుడు రాళ్లమధ్య వేసిత్రిప్పుచు రుబ్బినట్లుచేయుదురు. తరువాత దానికి మూడింతలు నీటినిచేర్చి యుడుకబెట్టి పిండుకొందురు. ఉవిధముగా చైనాదేశమందంతయు కర్మాగారములలో తయారుచేయబడిన పాలు ఆబాల గోపాల ముపయోగింతురు. ఉదయమున మన పట్టణములందు పాలబేరములు సాగుచున్నట్లే చైనాపట్టణములందు సోయాబీను పాలవ్యాపారము జరుగుచుండును.

కొంతమంది చైనా గృహిణులు తమ కిష్టము వచ్చినపుడంతయు నింటియందే సోయాపాలును తయారుచేసికొందురు. నీటిని బాగుగా కాచిన తరువాత సోయాగింజలపిండిని కొంచెముకొంచముగా వేసి కలియబెట్టుచు తదనంతరముకూడ 10,12 నిముషములు పొయిమీదనే యుండనిచ్చి దింపి గుడ్డలో పిండివేయుదురు. 7 భాగములనీటి కొకభాగము పిండి వంతున గలుపుదురు. పాలింకను చిక్కగా గావలెనన్న పిండి నెక్కువగా గలుపుదురు. ఈవిధానము చాల సులభముగానుండును.

ఈపాలు సులభముగ జీర్ణమగును. పిల్లల కెండ కాలమునగలుగు విరోచనములకును, అతిమూత్ర వ్యాధికిని అమోఘముగ పనిచేయును. కొరియాపద్ధతిని తయారుచేయబడు పాలు శ్రేష్టమని చెప్పబడుచున్నది.

ఈవిధముగ తయారుచేసిన పాలునందు చాలినంత చక్కెరను గలిపి ఎండించి దానిని వివిధపదార్థములుగా విదేశముల కెగుమతిచేయుచున్నారు. పాలనుండి పెరుగును తయారుచేసి దానినిగూడ ఎండించి ఆహారపదార్థముగా నుపయోగించుచున్నారు.

సోయాపిండి:

సోయాపిండి రెండురకములు. గింజలనుండి నూనె దీసినతరువాత మిగిలినదానిని పిండిచేసికొన్నది ఒకటి. గింజలనే పిండిచేసికొనుట రెండవది. నూనెదీసిన తరువాత చేసికొనుపిండి గింజలపిండివలె బలవర్ధకము గాదు. గింజలపిండి భారతీయుల ఆహారపదార్థములందు సాధారణముగాలేని ముఖ్యమగువస్తువుల పరిపూర్తిచేయును. ఈపిండితో పెక్కు పరిశోధనలు చేసి గొప్పవైద్యులందరు ఇది సంపూర్ణాహారమని యంగీకరించియున్నారు.

హిందూదేశమునం దీ పిండితో పరిశోధనలుసల్పియున్నారు. మటుంగా శరణాలయమున పిల్లలకిచ్చు ఆహారపదార్థముల కుపయోగించు గోధుమపిండిలో గూడ సోయాపిండిని ఐదింట ఒకపాలుమాత్రము గలిపి రొట్టెలుగాచేసి ఉదయము సాయంత్రము వారి

కిచ్చుచు రాగా వారే యనారోగ్యమును లోపమును లేకచక్కగ నెదుగుచువచ్చిరి. భారతదేశమందటను రొట్టె సాధారణాహారమై యున్నది నూటికి 80 మంది యేదోవిధముగ రొట్టెలనాహారముగా నుపయోగించుకొనుచున్నారు. ఈరొట్టెలనుచేయు నితరవస్తువులతోబాటు సోయాపిండినికూడ కలుపుచువచ్చిన అది చాల ఉత్తమమగునాహారము గాగలదు. అంతియగాక ఈపిండికలిపి చేసినరొట్టె లితరములవలె త్వరగా చెడవు. ఐదింట నొకభాగముగాని నాల్గింట నొకభాగముగాని యితరపిండితోచేర్చి రొట్టెలజేసిన త్వరగా నవి జీర్ణమయి ఆరోగ్యమును పెంపొందించును.

ఈపిండి మనము సాధారణముగాజేయు అన్ని విధములయిన లడ్డూలు, వడలు, హల్వా, జిలేబీ, ఖాజాలు, మగజ్, సూతర్ పేనీ, పాకములు, గులాబ్జాంబు, రసగుళ, పప్పడము, మొదలగు తీపుపదార్థములకును, బాకర్ వడ, పట్వాడి, గాతియ, బజ్జీ, నచ్చూరీ, దోశ, రొట్టెలు, ఇడ్లీ మొదలగు సకల పదార్థములకును ఉపయోగింపనగును.

## సోయాబీనుతో చేయనౌ కొన్ని పదార్థములు

### పూరి

ఒకసేరు గోధుమపిండికి 10 తులముల సోయా పిండినిచేర్చి సాధారణ పూరీలవలెనే నేతితో తయారుచేసికొన్న చాల బలవర్ధకముగనుండును.

### రొట్టెలు

సాధారణముగా భారతీయులుపయోగించు అన్ని విధములైన రొట్టెలందును లోహక్షారములుక్లోరిన్ తక్కువ. రొట్టెలుచేయుపిండికి సోయాపిండి నాల్గింట భాగముగలిపి తయారుచేసికొన్న పైలోపము లేకుండబోవును. రొట్టెలుచేయు పెల్లరికిని తెలిసిన విషయమైనందున నిచట వ్రాయుటవసరముగాదని తలంతును.

### చట్నీ

నానిన సోయాబీనులు 10 తులములు, కొబ్బెర 5 తులములు, కొత్తిమిరి, మిరపకాయలు, అల్లము, రెండ్రెండు మాషములు (మాషము తులములో 12 వ భాగము) కరివేపాకు ఉప్పు చాలినంత చేకూర్చుకొనవలయును. రాత్రులందు సోయాబీనులను నానవేసి ఉదయము నీటిలో వానిని శుభ్రముగా కడిగికొనవలయును. తరువాత ఇతరవస్తువులతో కూడచేర్చి చట్నీవలె రుబ్బుకొనవలయును. నిమ్మపులుసుచేర్చిన రుచి చాల బాగుండును. ఇతరవస్తువులనుచేర్చి వివిధవిధములుగా చేసికొననగును.

### సోయా కాఫీ

కాఫీగింజలవలెనే సోయాబీనులనుగూడ ప్రాచ్య పాశ్చాత్యదేశములందు వాడుచున్నారు. ఇటలీయందు సోయాబీనులను కాఫీ బెర్రీ అనియు, కాఫీ బీనులనియు చాలకాలము అమ్మబడుచువచ్చెను. రష్యా, జపాను, స్విట్జర్ లాండ్ దేశములందు కాఫీకి సోయాబీనుల పొడి నమ్ముచున్నారు. ఇది కాఫీపొడరువలెనే యుండును. రంగు వాసనగూడ ఎక్కువగా భేదింపవు. ఏరకము సోయాబీనులైనను కాఫీకి పనికివచ్చును. వీనిని కాఫీగింజలవలెనే వేయించి పొడిచేసికొనవలయును. ఈ కాఫీ అతిమూత్రరోగుల కెక్కుడుగ నుపకరించును.

సోయాబీనుల నుపయోగించు ఆహారపదార్థములందు నేయి, పప్పు, యుపయోగింపవలసిన ఆవశ్యకత యుండదు. ఎందుకన రెంటియందున్న ఉత్తమగుణము లొక్క సోయాబీనునందేయున్నవి.

(సశేషము.)

# పోటీవ్యాసము

గృహపరిశ్రమచే ధనము గడించుటెట్లు ?

పై సమస్యపై ఉత్తమవ్యాసముల రచించిన సోదరీమణులకు ప్రథమ ద్వితీయ తృతీయ బహుమతులుగా రు 5, రు 3, రు 2. ఇవ్వబడును. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఆ పరిశ్రమ యీ క్రింది నిబంధనల ననుసరించి యుండ వలయును.

1. గృహిణులు ఇలువీడకనే స్వయం సహాయముతో చేసికొనుటకు తగి యుండ వలయును.

2. ఆ పరిశ్రమయందు విదేశవస్తువుల నుపయోగింపక అన్నివస్తువులును స్వదేశీయములై సులభముగా లభించునవియై యుండ వలయును.

3. ఈ పరిశ్రమ అనుభవసిద్ధమై యందు అందుబాటులో నుండవలయును.

4. ఈ పరిశ్రమవలన తయారగు వస్తువులు అందరికిని అత్యావశ్యకమైనవిగనుండి త్వరగా కర్చుగావలయును.

ఈ విషయములన్నియు గమనించి సోదరీమణులు త్వరలో తమకు దెలిసిన పరిశ్రమలనుగురించి వ్రాయుదురుగాక.

## కావలెను

ఏబదిరూపాయల జీతముగల గౌరవనీయమైన యుద్యోగముననున్న 25 సం. (బలిజ) పట్టభద్రునికి 16, 18 సంవత్సరములకు పైబడని కన్య కావలయును. వరకట్నాదు లనవసరము. కన్య రూపవతియు, విద్యావతియు సంగీతాది లలితకళలందు ప్రవేశము కలదియునై యుండవలయును. విద్యార్హపరీక్షయియున్న శ్రేష్ఠము. పైకులములోని యితర బేధముల పాటింపబనిలేదు. పై విషయముల తృప్తిపరచు బాలవితంతువులైనను సరియే. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యము గానుంచబడును.

వివరములకు :-

సి. ఎస్. C/o 'గృహలక్ష్మి'.

## గమనింపు

వధూవరులు కావలయునని ప్రకటనలింకమీదట ప్రతిమాసమును ప్రకటింపబడుచుండును. వలయువారలు ఇట్టి ప్రకటనలను 15 తేదికిముందే మా కార్యాలయమునకు పంపుకొనవలయును. ఉత్తరప్రత్యుత్తరములు రహస్యముగనుంచి వారివారికందింపజేయుదుము. ప్రకటలకు ఒకకాలము ఒక అంగుళమునకు ఒక రూపాయ ప్రకారము చార్జి చేయబడును.

గృహలక్ష్మికార్యాలయము

పోస్టుబాక్సు 752, ఎగ్మూరు, మదరాసు.

# బాలవిజ్ఞానశాఖ

## ఆంధ్రజాతీయవాచకము

కొం. జగన్నాథరావుగారు

(కాపీరైటు)

### అక్షరాభ్యాసము

ఓనమాలపాట

స్వరము

| | |
|---|---|
| ఓ నమః శివాయః | సా ధసా సమాగరి |
| సి ధం నమః | సా నీ ధారిసా। |
| అ ఆ ఇ ఈ ఉ ఊ | స మా గ మా గ రీ |
| ఋ ౠ ఌ ౡ | సరి సమా గరి సగా |
| ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః | స గ రి స గ రి సా నిసా |
| క ఖ గ ఘ ఙ | మ మ మ మా గరి |
| చ ఛ జ ఝ ఞ | గ గ గ గా రిస |
| ట ఠ డ ఢ ణ | సా స్స రీ గ్గ మ |
| త థ ద ధ న | మ మ మ మా గరీ |
| ప ఫ బ భ మ | గ గ గ గా రిస |
| య ర ల వ | ధ ని రీ స |
| శ ష స హ | ధ ని రీ స |
| ళ క్ష ఱ యితి॥ | స నిస నిస॥ సా |

## పసిపిల్లల్తో ఒకనాటి వినోదం

కవికొండల వేంకటరావుగారు

"అడివిలోమావిడిచెట్టు నో తేనె పట్టుపట్టింది. మాంచి తేనెపట్టు అది. కుంచెడుఅవుతుంది పిండితే. ఆపట్టుపడగొట్టి ఆ తేనె తాగాలని బుద్ధిపుట్టింది ఓకోతికి. పైకి తిన్నగాఎక్కిపోయి పట్టు రేపితే ఈగలన్నీ ముసురుకొచ్చి కుట్టేస్తాయి దానిముక్కూనూ, చెవుల్నూ, తోకనూ, ఎఱ్ఱటిపిఱ్ఱనూ; అందుకని ఏంచేసింది ? ఆకోతి కిందనుంచి పైకెగరేసింది ఒక సన్నావాలపేరు. ఎగరేసేసరికి ఆ తేనెటీగల్లో రాణీఈగ దానితుండంతో ఆ ఆవాలపేరు అందుకుని మెళ్లోవేసుకుని ఒయ్యారంగా మెడతిప్పుకుంది. మెడతిప్పుకునేసరికి ఆ ఆవాలపే రేమైందీ ? అదో ఎఱ్ఱచీమలుండే కన్నంలోకి జారిపడింది.

మఱి కనబడనేలేదా పేరే యీగలకు. ఆపాళంగా రాణీఈగ ఏడవడంప్రారంభించింది. మిగతా యీగలన్నీ రాణీఈగకు ధైర్యంచెప్పి ఏడవవద్దని దాన్ని ఆ చెట్టుమీదనే వుండమని వెలకడం ప్రారంభించాయి. తేనెపట్టును విడిచిపెట్టి సన్నావాలపే రెక్కడపడిపోయిందో అని జగత్తంతావెదకడం ప్రారంభించాయి.

ఈలోపుగా కోతేంచేసిందీ? తిన్నగా గబగబాచెట్టెక్కి తేనెపట్టూపిండి. ఆపాళంగా రాణీఈగ జుంమ్మంటూ ఈవలకుముసిరింది. కోతి కంగారుపడిపోయి చెట్టుమీదనుంచి క్రిందకో ముళ్లకంపమీదపడింది. కోతికాల్లో ముల్లువిరిగింది. కోతి నడవలేక చెట్టెక్కలేక బాధపడుతూంది.

పేరునెలకడానికి చెల్లాచెదరైపోయిన తేనెటీగలు — ఓపిల్లాడిదగ్గఱకెళ్లి "పాపారావు! పాపారావు! నిన్నుమేం ఏమీచెయ్యం. మారెక్కలమీ దెక్కించుకుంటాం. జగత్తంతాతిప్పుతాం. రాణీగారి పేరు కాసంత నెలికిపెడుదూఅన్నాయి. పాపారావు అన్నాడుగదా "ఈగల్లారా! ఈగల్లారా! తేనెటీగల్లారా! మీరేంగరుత్మంతులా నాబరువుమోయడానికి?" ఈగలన్నీకలిసి పాపారావుకు చెంచాడు పువ్వుతేనె నోట్లోపోసినాయి.

పాపారావు ఆతేనె చప్పరిస్తూ కొంచెంపాకి నేలమీదోచోట ఓఎఱ్ఱచీమలకన్నంలోకి తొంగిచూచాడు. ఆఎఱ్ఱచీమల్లో ఓగండుచీమ పాపారావు పెదిమికుట్టింది. పాపారావు "కార్" అని పెదిమిచేత్తో ఇలా అనుకున్నాడు. ఎఱ్ఱచీమ నలిగినలిగి చచ్చిపోయింది. ఆదెబ్బతో తక్కినచీమలన్నీ హడిలిపోయి ఆవాలపేరు పట్టుకొచ్చి పాపారావుముందుపెట్టి పట్టుకెళ్లుమన్నాయి. జయజయధ్వానములతో మిన్నుముట్టాయి. ఎగిరిపోయి తమ రాణీతో చెప్పాయి.

రాణీఈగ ఏమిటాఅని తేనెపట్టులోంచి తొంగి చూచింది. పాపారావు కనబడ్డాడు, ఆవాలపేరుతో. ఆలాతీసుకురమ్మంది పాపారావుని తన యీగల్తో. ఈగలన్నీకలిసి పాపారావునుపేరుతోకూడా రాణీయీగ దగ్గఱకు తీసుకెళ్లాయి.

ఆరాణీ పాపారావును ముద్దెట్టుకుని ఆవాలపేరు తనమెళ్లో వేసుకుని రోజూచెంచాడు పువ్వుతేనె పాపారావుకు పోసేది. పాపారావు కొద్దికాలంలోనే బలేఫైల్మాన్ అయ్యాడు. అప్పుడు రాణీ ఈగ పాపారావుకు చూపించి చెట్టుకిందవున్న కోతిని కొట్టెయ్యమంది. కొట్టేస్తే పాపారావుని పెళ్లాడతానంది రాణీయీగ.

పాపారావు ఉబ్బిపోయాడు. ఆపాళంగా జీడోలుచ్చుకు చెట్లుమీదనుంచే దుందుంవాయించాడు. కోతి హడిలిపోయి కుంటుకుంటూ కుంటుకుంటూ పారిపోయింది. పాపారావుని రాణి ఈగ గట్టిగా కౌగిలించుకుని బంగారు కంచంలో కుంచెడుపువ్వు తేనెపోసి పట్టించింది. గఱ్ఱున త్రేంచాడు పాపారావు. పెళ్లి బాకాలా!"

అని కథచెప్పాను. చెబితే పిల్లలంతావిని, "మాకథలే దొంగిలించి చెప్పావు"అన్నారు పుసుక్కున. "మీకథలంటే?"అన్నాను అంటేవాళ్లు—"అనగనగా ఓరాజు. ఆరాజు కేడ్గురుకొడుకుల కథాలేదూ? ఈగ ఈగ తనపేరు మఱిచిపోవడం కథా లేదూ? కోతీకోతి కాల్లోముల్లు విఱగడం, మంగలాడుతీసి పారెయ్యడం. కోతి తనముల్లుతనకు తిరిగి ఇవ్వమనడం కథా లేదూ? ఆకథలే కలిపితిప్పి చెప్పావు"అన్నారు వాళ్లు.

"అయితే మీకథలో బంగారుకంచం, కంచంలో కుంచెడుపువ్వుతేనె పొయ్యడం, అది పాపారావు తాగడం, పాపారావు గఱ్ఱున త్రేంచడంవున్నాయా?" అన్నాను. పాపారావు త్రేంచినట్టు త్రేంచండి మీకు చేతనైతేఅని ఛాలెంజిచేసాను. పిల్లలంతా గఱ్ఱుమంటూ ఒకట్రేత్రేంచడం; పువ్వుతేనె, మాతియ్యగావుందంటూ మాతియ్యగావుందన్నారు.

"చాలు! జయించానుజగత్తు"ననుకున్నాను.

# తుమ్మెద

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

గీ. తుమ్మెదా ప్రాతదూలాలఁ తొఱ్ఱలందు, కాపురఁమొనర్చు నీవేడ కానలందు
కొలనులందున ముద్దులుఁ గులుక విరియు, కన్నె నెత్తమ్మిపూలేడ గడగి తెల్ల
వారకమె తేనెలంగ్రోలఁ వచ్చుటేడ, సమయవేదివిగదె నీవుఁ షట్పదంబ
యెల్లెఱుంగుదె దెల్పుదు రెవరె నీకు, తమ్మిపుప్పొడివాసనల్ దవిలివెంట
రాగ వేగ నీ వెంత దూఁరానున్న, పిలువవచ్చెదునో గాద్పు పిల్లవాడు
చెంతనుండెడు కప్పకుఁ సుంతయైన, తెలియదది రొంపిలో మున్గి తేలుటెఱుగు
మంచివారిగుణంబునుఁ మంచివార, లెఱిగి మైత్రినొనర్పగాఁ నెంతురరయ
చెడ్డవార లెఱుంగరుఁ చేరి మైత్రి, నేయనొల్లరెఱింగిన చెంతనున్న.

* * *

గీ. పూవులన్నిటికిని మంచిఁ భోక్తవీవె, అన్నిసుమముల యందలిఁ యాసవంబు
గ్రోలిసుమములు కసుగందఁ కుండనుంచి, తుమ్మెదా యాడిపాడెదుఁ ఝుమ్మటంచు
తిన్నయిలు త్రవ్వువారలఁ తీరుగాక.

* * *

గీ. పనికిమాలిన పురుగులఁబట్టితెచ్చి, మించియోర్పున సతముపోషించి ప్రీతి
పాటలనునేర్పు నేర్పు నీబోటికలరె, గాని యెవరికిగలుగు భృంగంబ ధరణి.

* * *

గీ. నేర్పుగల వారలకునైతె నేర్పవచ్చు, నదియుగష్టమె మాబోటి కరసిచూడ
నేమియెఱుగక యాకుల నేరితినెడు, కీటకమునకు పూదేనె తేటమించు
గానమునునేర్పి నిర్మలఁ ధ్యానయోగ, మలవడంజేసి మంచి తెక్కలుజెలంగ
పెంచి దానినిగని సంతసించె దీవు, నీదు నేర్పునునోర్పు నక్షింపఁదరమె.

* * *

గీ. ఎట్టి సుధదానికాహార మిడుదువొక్కొ, యెట్టి ఘనయోగవిద్యనీ వెఱుగుదొక్కొ
యిట్టి ఘనజన్మసంప్రాప్తిఁ యిపుడెగలుగ, జేసితివి దానికది మాకుఁజెప్పరాదె.

* * *

గీ. నేరిచినపాట నెవరరైనఁ నేర్పుమనిన, బ్రతిఫలములేక నేర్ప మెప్పటికి జూవె
నిన్ను నెవ్వేళ గనుగొనుచున్న మేము, నీ యుదారగుణంబింత నేర్చికొనము.

ఉ. నల్లనివిదానవంచు నిను నవ్వగవచ్చునె గండుతుమ్మెదా
పల్లవపాణులం గవులుఁ బల్కుదురే యలివేణులంచు దా
నల్లలితంపుగావ్యముల సారెకుముంగురు లుంగరంబులై
నల్లగ నిన్నుబోలగడు నాణెమటంచు దలంతురేగదా.

* * *

గీ. తవిలి సర్వపుష్ప తతిజేరి మకరంద, పానకౌతుకమునఁ బఱగుదీవు
సగలగుణనిధాన సంపంగియాగదా, దాని తేనెగ్రోల తలపులేదె.

* * *

గీ. కనకమునకు నీకుఁ గర్భశత్రుత్వమా, తెలియ బలుకుమింకఁ దేటిఱేడ
దాని దరియనీకుఁ దలదిమ్మ గొననేల, దైవచేష్టితంబుఁ దప్పదటుకె.

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము.

## శ్రీమాన్ అమృతానందనాథ గురుప్రతిష్ఠితము.

ఇందే శ్రీమతి కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు గురుదీక్షవహించి జపతపంబులు గావించి, గురుదేవతాప్రసాదంబున శ్రీ జీవయాత్రాది గ్రంథములను రచియించిరి.



శ్రీమతి విద్వత్కవితిలక కవితావిశారద
కాంచనపల్లి కనకాంబగారు.

### ఈ మహావిద్యాపీఠ ప్రధానోద్దేశము.

వేదశాస్త్రవిహిత స్వధర్మ తత్త్వనిరత సదాచారపరాయణులైన వారికి గురుముఖంబున సర్వసంశయనివృత్తిద్వారా పరమశాంతిని లభింపజేయు భగవద్భాగవతకైంకర్యము, శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము యొక్క

ముఖ్యోద్దేశము.

మహావిద్యా పీఠస్థాపనాచార్యులగు శ్రీమాన్ అమృతానందనాథస్వామివారి సందేశము.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" యనుటలో "హరిమయము విశ్వమంతయు" ననియున్నదికాన మాకు లోకముపై నిచ్ఛాద్వేషములు లేవు. "అన్వయవ్యతిరేకములుగా ధర్మాధర్మంబు లీవిశ్వంబున బరమ జిజ్ఞాసువులబోధము కొరకును, తనవినోదముకొరకును పరమేశ్వరుడు సృష్టించెను. అందధర్మప్రవృత్తి నేడు విశేషముగ నున్నది. ఇట్టితఱి లోకకల్యాణమునకై యార్యవిజ్ఞానమును గాపాడవలయును. రాజబలము సంఘబలము దీనికి తోడ్పడుట నేటికాలమున నరిది. కావున గాయత్రీమంత్రార్థానుసారముగా ధర్మనిర్వాహణోత్సాహ మెవరికికలుగునో వారలే సంఘీభవించి యథాశక్తిగ నధీతిబోధాచరణప్రచారణములు గావింపవలయును.

వేద వేదాంగములు కళలు, భాషాగ్రంథములు పోష్యములు. శేషించియున్న విద్వాంసులందఱను బరిగణనముచేసి తారతమ్యములు నిరూపించి యుత్తములను సన్మానముచేయుచుండవలెను. ఒక్కొక్క విద్యకొక్కొక్కరినైనం బరంపర నిలువబెట్టుటకై పోషింపవలయును. కలికాలవశమున జనులకు ప్రచారము లేకపోయినను దేశకాలము లనుకూలించిన నాడు విస్తరించుటకై జ్ఞానబీజములు నిలిచియుండవలెను. గీర్వాణభాషావైరళ్యముగల యిక్కాలమున తొల్లింటి మహానుభావు లాంధ్రమునం తత్త్వబోధమునకు జేసిన తోడుగా సంపూర్ణవిజ్ఞానలబ్ధికి కావలసినసామగ్రి యీత్రిలింగపీఠమున దైవయోగముచే నెలకొల్పంబడి యున్నది. త్రిలింగదేశమున కీ పీఠము నీ పీఠమునకు త్రిలింగదేశము నన్యోన్యపోషకంబులై యుండ నీశ్వర సంకల్పము సిద్ధించుగాక.

## త్రిలింగమహావిద్యాపీఠ స్వరూపకథనము.

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము సృజించినది బ్రహ్మీభూతులగు శ్రీ అమృతానందనాథపరమాత్మ.

నందుఁ దోడుపడి కనకాంబగారి ద్వితీయశరీరమో యన్నట్టు లామెతోపాటు అభేదముగ నున్నవారు పంగనామాల అమ్మణ్ణమ్మగారు.

ఈపీఠమునకు శరీరమై సకలకార్యములు నిర్వహించుటకు గురువులచే నియమింపబడినవారు దంటు



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠము

నడుమ వెంకటేశ్వరపంచాయతనదేవతలు, పైన శ్రీమాన్ అమృతానందనాథస్వామివారి బింబము.
కుడివైపున వరుసగా శ్రీమతి పంగనామాల అమ్మణ్ణమ్మగారు, శ్రీమతి కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు.
ఎడమవైపున వరుసగా దంటు పార్థసారథిగారు, పంగనామాల రామానుజరావుగారు, వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు.
కూర్చున్నవారు కుడివైపు కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.
ఎడమవైపు ఆమ్నాయార్థవాచస్పతి, వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు.

ఈపీఠమునకు ఆత్మస్వరూపము ధరించి చైతన్యమొసంగువ్యక్తి శ్రీ జీవయాత్రాకర్త్రి గురుపుత్రికయగు శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకాంబగారు.

తోడబుట్టువై మొదటినుండి గుర్వీశ్వరకైంకర్యము

సుబ్బావధానిగారు. అవధానులగారి విలువ అమృతానందనాథులవారెఱుంగుదురు. అమృతానందనాథులవారి యంతరంగము నవధానులగారెఱుంగుదురు. కాని సద్గురుమూర్తి పేరు విన్నమాత్రమునఁ బులకితగాత్రుఁడై సాశ్రులోచనుఁడై ప్రపంచమును మఱచి పోవు [illegible] వధానిగారు.

# శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము

ఈపీఠమునఁ గార్యనిర్వహణమున కవధానులగారికిఁ బీఠములోని యితర శిష్యులు భక్తులు, కరణములై, యుపకరణములై యున్నారు.

ఈపీఠము నాశీర్వదించుసత్కవులు, పండితులు, కవులు, పరోక్షప్రియులగు దేవతలు. ఇట్టి పరమో



శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠము.

ఈ విలాసముగలభవనము—"కవితిలక కుటీరము" అను పేరం బరగును. అయ్యది శ్రీమతి కవితిలక గాంచనపల్లి కనకాంబగారి స్వగృహము.

త్కృష్టమగుసామగ్రి దైవయోగమున నీపీఠమునఁ బెద్దలయాశీఃప్రభావంబున సంపూర్ణఫలము నొసంగి యాంధ్రదేశమునకు సకలమంగళముల సమకూర్చుగాక.

*  *  *

## త్రిలింగపీఠశాఖలు

### వైద్యశాఖాకార్యములు

1 వైద్యరాజసిద్ధిసంస్థానము. వైద్యులకు రోగులకు ననితర సాధారణమగునౌషధములకు మంత్రాలోచనమునకు స్థానము, 3/71 లాయిడ్సురోడ్డు.

2 వైద్యరాజ డాక్టరు దంటు సుబ్బావధానిగారు, క్షయ మేహాది దీర్ఘరోగములయందు చేసిన పరిశోధనములు.

3 వైద్యరాజీయములగు "ఆంధ్రవైద్యనిదానము," "అభినవచారుచర్య," మొదలగునవి.

4 వైద్యమనం దవధానిగారు వినియోగించు సిద్ధౌషధంబులు.

* * *

## సాహిత్య శాఖ

ఈశాఖ ప్రధానముగాఁ గనకాంబగారిపై నాధారపడియున్నది. శ్రీమతి కనకాంబా విరచియిత గ్రంథములు.

1 రంగశతకము—(కందములు)
2 కాశీయాత్ర—(సీసమాలిక)
3 పాండవోదంతము—(వచనము)
4 బుద్ధచరిత్ర—(వచనము)
5 రాధ—(వచనము)
6 శ్రీ జీవయాత్ర—(పద్యకావ్యము)
7 అభిజ్ఞానశాకుంతలము—(నాటకము)
8 శ్రీమద్రామాయణకథాసంగ్రహము. (వాల్మీకి బాలరామాయణమునకు కనువాదము. చక్కని కందపద్యములు.)
9 హంసవిజయము—(వేదాంతనాటకరాజము)
10 అమృతసారము.(వేదాంతము. పద్యకావ్యము)
11 ఆనందసారము.(వేదాంతము. పద్యకావ్యము)
12 తోమాలియ, (నానావిధముల వర్ణనములుగల యపూర్వ మనోహరప్రబంధము నిప్పుడు రచించుచున్నారు.)

### త్రిలింగపీఠమునఁ బ్రధానశిష్యులగు శ్రీ దంటు సుబ్బావధానికవి ప్రణీత గ్రంథములు

1. "దాసగీత" ఇది మూడువందల పద్యములు గల యాంధ్రకావ్యము. ఇది గురుసన్నిధానమునను న్న తీవ్రాధికారియగు సాధకుని వర్ణించును.

2. "అంబికాచరణసరోజపూజ" పరాంబికా చరణసరోజోపాసనమందు కవికిఁగల భావోద్రేకము, భక్తితాత్పర్యము లిందు విందుగా వినంబడును.

3. "ఆంధ్రభామినీవిలాసము" ఇది పండిత రాయలసంస్కృతమున కాంధ్రభాషానువాదము.

### పీఠశిష్యులగు దంటు: శ్రీనివాసశర్మ బి.యే. బి.యల్. గారి గ్రంథములు

1. "నాగభూషణశతకము." అమృతానందనాథ స్వామివారి వ్యవహారనామమున కంకిత మీయఁబడి నది. ఇది ప్రతిపద్యరసోచితమగు శతకము.

2. "శ్రీ తులసీదాసచరిత్రము" ఈప్రబంధము పూర్వభాగ మూడువందలపద్యములుగలది. పూర్తి యచ్చగుచున్నది. ఉత్తరభాగమిఁక యిన్ని పద్యము కావచ్చును. ఈగ్రంథములు రెండును శ్రీశర్మగారి కేవలము పీఠమునందు సారస్వతకల్పోపాసనామహి మచే లబ్ధమైనవి. భక్తిరసభరితములు.

* * *

## విజ్ఞానశాఖ

గంగాయమునాసరస్వతులలో సరస్వతి యంతర్వా హిని. అట్లే ఏతన్మహావిద్యాపీఠముయొక్క వైద్య శాఖయు, సాహిత్యశాఖయు, గంగాయమునలవలె బాహ్యప్రపంచమున భారము నిర్వహింప నంతర్వా హినియగు సరస్వతీస్రవంతివలె నిగూఢముగా నీపీఠ మున విజ్ఞానశాఖ వెలయుచున్నది. జిజ్ఞాసువులైనవా రిందు నిత్యము 24 గంటలలో 'నిద్రాసమాధిస్థితి' అను న్యాయమున నిద్రాకాలమతప్ప, తెల్లవా జామున బ్రాహ్మీముహూర్తము మొదలు శయనించు వరకు నీపీఠమునం దెప్పుడు నేదోయొక రూపము భగవద్భాగవతకైంకర్యము జరుగుచుండును.

* * *

## శ్రీమతి కనకాంబగారి దినచర్య.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు శా. ప్రత్యూషంబున లేచి స్నానమును వ బ్రాహ్మణారాధ...



శ్రీ అమృతానందనాథస్వామి

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠస్థాపనాచార్యః

ప్రత్యాహారవిహారముల్ సలుపుచున్
వ్యక్తిత్వమున్ గాంచనై
నిత్యైశ్వర్యము గొన్న మేటియయినన్
నిర్లిప్తమై జీవునిన్
సత్యాన్వేషణ సేయు మాకనకమన్
వర్ణింతు బ్రహ్మంబునాన్.''

* * *

కవితిలక కనకాంబగారు ఆమెగ్రంథములు
—ఆధునిక మహాకవులయు విద్వాంసుల
యొక్కయు దృష్టి:—

కింకవీంద్ర ఘటాపంచానన శతావధాని
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

"ఇట్టి దుర్భిక్షకాలం దెపుడో పూర్వ
ముపనిషత్తుల వినబడు నువిదల తల
మానికంబును బోలెడు మగువయొకతె
పుట్టె మనభారతీయుల పుణ్యమనగ.''

అను పద్యమునఁ గనకాంబగారి పారమార్థిక స్వరూపమును

ఉ. "కావున విస్తరింపక యి
కన్ విరమించెదఁ గబ్బమిద్ది స
ద్భావులకున్ ముదంబిడుచు
భావికలార్థుల భాగ్యరాశియై
యీవిపులన్ యశమ్మగని
యెల్లెడలన్ జయమందుఁగాక యీ
కోవిదురాలి పుట్టువునకున్
ఫలమబ్బెడు గాక పూర్ణమై.''

ఈ పద్యమున జీవయాత్రాప్రాశస్త్యమును వివరించిరి.

నాటకచక్రవర్తి, విద్వత్కవి మల్లాది
అచ్యుత రామశాస్త్రిగారు, బెజవాడ.

సీ. పోతనామాత్యుని పోకడభక్తిలోఁ
భ్రాతదాయనిపించు పట్టులొకట
తిక్కన మంత్రి యీ తెలుఁగు తేటగ శాంతి
వ్రాసెనాయనిపించు రచనలొకట
బాణునినోటిలోబడక డాగినశబ్ద
జాలమాయిదియను సరణులొకట
బ్రహ్మసూత్రార్థతాత్పర్యమందలి సార
సరణులింతియయను స్థలములొకట
నమరియున్నవి గనుఁగొని హంసవిజయ
రూపకంబున హంస స్వరూపమనుచు
చెప్పవచ్చును నిక్కంబు సిద్ధగురుని
మహిమగాకున్న కృతియింత మహము
గనునె.

గీ. శారదా సత్కృపాసార సారమనఁగ
చెలగిచెలువొందుగాదె మీ జీవయాత్ర
గురుకులంబునఁగ్రమశిక్ష గఱచియున్న
శిష్యసంతతిగనదె సజ్జీవయాత్ర.

విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రి కవివర్య
విరచితములు.

గీ. అమృతసారముగాఁ కవిత్వము రచింప
శిష్టులౌననఁగఁ బవిత్రజీవయాత్ర
సలుపనేర్చిన సతిమోర్తు చాలదొక్కొ
కామినీలోకమున కెల్ల గాంతిగూర్ప.

క. పరదూషణ పరభూషణ
పరతర్కవనంబు వ్యర్థపరుపక పరమే
శ్వర చరణస్మరణమునకె
గురిచేసెన్ కనకమాంబ గురుకరుణాప్తిన్.

# ఆధునిక కాలము—కనకాంబగారి కవితాగౌరవము

జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం.ఏ.

[శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమున 8-12-1936 తేదీ శ్రీ కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యాజమాన్యమున జరిగిన సభలో నీ యుపన్యాసము శ్రీ. వే. బ్రహ్మశ్రీ జటావల్లభుల పురుషోత్తముగారిచే నొసంగబడినది.]

కవిహృదయమును గన్పఱచునది కావ్యములోని విషయము; కవి కౌశలమును గన్పఱచునది యీ విషయమును వ్యక్తపఱచురీతి. కావ్యవిషయము కవి సందేశమును దెల్పును; కావ్యకౌశలము కవి కళా వైదగ్ధ్యమును దెల్పును. ఆత్మసంస్కారమును గావించునది కవిసందేశము; ఆనందము నొసఁగూర్చునది కావ్యకళ. శాశ్వతకల్యాణమును గూర్చునది సందేశము; ఆసందేశమును హృద్యమగురీతిలో మనల కందించునది కావ్యకళ. ఏ కావ్యములో నుత్తమసందేశమును హృదయంగమ కావ్యకళయు మేళవించియుండునో యాకావ్యము ప్రశస్తమైనది. ఉత్తమసందేశము శ్రేయస్సునుగూర్చును. కావ్యకళ నిర్దుష్టములును శోభావంతములునునగు శబ్దములచేతను భావములచేతను నేర్పడుచున్నది. కనుకనే నన్నయగారు "విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతేచ వాగర్థే" అని చెప్పియున్నాడు. ఈ నిర్వచనమునకు లక్ష్యభూతముగ గావ్యములను రచించిన కొలదిమంది యాధునికకవులలో శ్రీ కాంచనపల్లి కనకాంబగారొకరు.

కవితాశక్తి భగవద్దత్తమనియు నది కేవలాభ్యాసమువలన గల్గునదికాదనియు మనవారును పాశ్చాత్యులునుగూడ నమ్ముచున్నారు. భగవద్దత్తమైన కళను భగవత్కైంకర్యమునకే యర్పించుకవి ధన్యుడు. ఆధునికకాలములో నిట్టి ధన్యతనొందినవారిలో ముందు పేర్కొనఁదగినవారు శ్రీ కనకాంబగారు. ఈయమ గ్రంథములలో భక్తి, జ్ఞానము, వైరాగ్యము ప్రధానముగ ప్రతిపాదింపబడినవి. నీతి సదాచారము మున్నగు ధర్మములుగూడ యథోచితముగ బోధింపబడినవి. ఈగ్రంథములలో జీవయాత్ర, అమృతసారము, ఆనందసారము — అనునవి పద్యకావ్యములు. హంసవిజయము స్వతంత్రనాటకము. ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము కాళిదాసునిగ్రంథమున కనువాదము. శ్రీమద్రామాయణ కథాసంగ్రహము వాల్మీకిమహర్షికృత బాలరామాయణమున కాంధ్రీకరణము. రంగశతక మనునది యీమెచే బందెండవయేట రచింపబడినది. ఇది నెల్లూరి రంగనాయకులపైఁ జెప్పబడినది. రాధ యను సాంఘిక నవలయు, గౌతమబుద్ధుని చరిత్రమును వచనగ్రంథములు.

ఆధ్యాత్మిక దుర్భిక్షముచే తహతహలాడుచున్న యాధునికులఁ దరింపఁజేయుటకే కవయిత్రి వర్ణించిన యమృతసారానందసారాదులు మిక్కిలి యుపకరించుననుటలో సందియములేదు. ఈమె వేదాంతబోధలు నేటికాలములో బయలుదేరిన యనేక సంఘముల యొక్కయు సమాజముల యొక్కయు "మెట్టవేదాంత" ధోరణిలోఁబడక స్వచ్ఛవైదికమార్గము ననుసరించియుండుట పరమామోదహేతువు. ఈమెది శ్రుతి స్మృతి పురాణేతిహాస సదాచార నిబద్ధమైన శుద్ధశ్రోత్రియమతము. ఈ ప్రమాణములలో గొన్నింటిని గొన్నిచోట్ల మార్పవలెనని గాని సంస్కరింపవలెనని గాని యీమె చెప్పదు; అక్షరశః వానినాచరణలోఁ బెట్టవలెననియే బోధించును. కాలానుసారముగా ధర్మమును మార్చుకొనవలెనను వాదము నీమె యంగీకరింపదు. ఋషులు మనకు సిద్ధాన్నము నిచ్చినారనియు దాని ననుభవించుటయే మన వి

యనియు నామె యాశయము. వర్ణాశ్రమధర్మములను వదలరాదనియు, శాస్త్రములయం దకుంఠితమైన విశ్వాసముండవలెననియు నీమె చాల స్థలములలో బోధించియున్నది. 'సంశయాత్మా వినశ్యతి' అను సత్యము నీమె ప్రమాణవిషయమున నన్వయింప జేయును. ఈ మెఱుగల ప్రమాణబుద్ధియంతయు నీమె గురువులైన అమృతానందనాథస్వామివారియందు కేంద్రీకరింపబడినట్లు కన్పట్టును. గురువుపట్ల పరమ ప్రమాణబుద్ధియుండుటయు నార్ష సంప్రదాయమే. ఇతరుల వ్రాతలనుగూడ దమ వ్రాతలుగనే చెల్లుబడి కావలెనని కవులు గ్రంథకర్తలు ప్రయత్నించుచున్న యీ కాలములో శ్రీ కనకాంబగారు తమ గ్రంథాళి లోని భావరత్నములు తమ స్వీయములు గావనియు నవి శ్రీ స్వామివారి కటాక్షముచే లబ్ధములనియు జెప్పుట చూడ నీమె యహంకారరాహిత్యము వ్యక్త మగుచున్నది. గురువులయందున్న యపారగౌరవ విశ్వాసములే యీమె కిట్టి కవితాశక్తిని బ్రసాదించి నవా యను నూహ పాఠకునకు గలుగకపోదు. కవి స్వీయచరిత్రలోని కొన్ని యంశముల ప్రయత్నముగ గ్రంథములోనికి బ్రవేశించుచుండును. హంసవిజయ ములో సుదర్శనుడు చెప్పిన యీ క్రిందిమాటలు కవయిత్రీపరముగ నన్వయింపకపోవు.

"మాటిమాటికిన్ గురుని
మాటలె జ్ఞప్తికివచ్చుచుండెఁగా"

శాస్త్రమునందును గురువునందునువలెనే మంత్ర జపమునందుఁగూడ శ్రీ కనకాంబగారి కకుంఠిత విశ్వాసము గలదు. మంత్రోచ్చారణ యేవిధముగ ఫలవంతమగునో యను భౌతికశాస్త్రీయచర్చ మన కక్కఱలేదనియు మనకు దెలియకపోయినను దాని పని నది మానదనియు చెప్పుటకై యీమె రచించిన యీక్రింది సాలంకారపద్య మీమె యుత్తమకవిత కొక యుదాహరణము.

పైపైని త్రిప్పుచుండుట
యేపని మరమే కెప్పుడది యెట్లాపోనీ
ఆపగిది మంత్రపఠనం
బేపని జీవాత్మ నీకు నేమేగానీ.

భౌతికచింతయే యేకైకచింతగను, స్వేచ్ఛావృత్తి యే యేకైకవృత్తిగను, నీచభావప్రకోపనమే కవితా లక్ష్యముగను భావింపబడుచున్న యీ యాధునిక కాలములో ప్రజలదృష్టి నాధ్యాత్మికవిషయముపైకి త్రిప్పుటకును, శాస్త్రములలో ప్రామాణ్యమును గలుగజేయుటకును, భగవత్కైంకర్యమే కవితాలక్ష్య మని యుదాహరణపూర్వకముగ బోధించుటకును శ్రీ కనకాంబగారు పూనుట యాంధ్రులభాగ్య మనక తప్పదు.

ఆంగ్లేయ సారస్వతవిమర్శకుల దృష్టినిబట్టి చూచి నను శ్రీ కనకాంబగారి కవితావిషయ మత్యుత్తమ మని చెప్పకతప్పదు. "Poetry is the criticism of life" అని మాత్యూ ఆర్నాల్డు చెప్పియున్నాడు. మానవజీవితమును క్షాళనచేసి యందలి మంచి చెడ్డలను విమర్శించి తత్త్వమును గన్పఱచుటయే కవి కర్తవ్య మని దీని తాత్పర్యము. మానవజీవయాత్రను విమ ర్శించుటయే కదా శ్రీ కనకాంబగారు గావించిన పని! ఇదియే కదా వారి గ్రంథములలోని విష యము! విషయమునకుఁ దగినట్లే యొక గ్రంథమునకు "జీవయాత్ర" యనుపేరు పెట్టబడినది.

మానవజీవితమునకు సంబంధించిన పరమరహస్య ముల నీయమ తన గ్రంథములలో సువ్యక్తము గావించినది. మన వాంఛలను తుచ్ఛభౌతికవిషయ ములనుండి యత్యున్నతాధ్యాత్మిక విషయములపైకి గొంపోవుట కీమె రచనలు మిక్కిలి తోడ్పడుచున్నవి.

శ్రీ కనకాంబగారి వ్రాతలను జదువునపుడార్ష ములగు నుపనిషత్తులు, గీత, రామాయణము మున్నగు నుద్గ్రంథములను బఠించుచున్నట్లే మనంబునకు గన్ప

ట్టును; ఆ గ్రంథములను బఠించునపుడు గల్గు తన్మయతయు బవిత్రానందనమును నీమె గ్రంథములను జదువునపుడుగూడ గల్గుచుండును. ఈమె రచనలలోని కొన్నివాక్యము లా యుత్తమగ్రంథములలోని వాక్యములను స్మరింపజేయుచున్నవి. ఇందు కొన్ని గ్రంథకర్త్రి బుద్ధిపూర్వకముగ నాంధ్రీకరించియేయుండును; కాని కొన్ని యీమెయు స్వతంత్రముగఁ దట్టిన భావములేయైయుండి యాదృచ్ఛికముగ నార్షవాక్యములను బోలుచున్నవి.

అప్పరావరుదర్శనమైన మాత్ర
సర్వసంశయభయములు సమసిపోవు
కర్మముహరించును హృదయగ్రంథివిడును
సత్యమిటు వేద నిచయంబు చాటుచుంట.

అను నీమెపద్య మీక్రింది ముండకోపనిషద్వాక్యములను దలపించుచున్నది.

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ
సంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్దృష్టే
పరావరే.

అను తైత్తిరీయోపనిషద్వాక్యము

"యతోవాచో వినివర్తంతే అప్రాప్య
మనసాసహా."

"మాటలెందునుండి మఱలుచుండును దేని
మనసు చేరలేదు"

అని యాంధ్రీకరింపబడినది.

"అడుగనివానికిఁ జెప్పఁగఁ
బడనేలా పలుగతులను బాధల జీవా"

అనునది

'నా పృష్టః కస్యచిద్బ్రూయాత్,'

అను మనుస్మృతిలోని వాక్యమును దలపించుచున్నది.

శ్రుతిస్మృతులలోని వివిధవాక్యములను స్మరింపజేయునట్టియుఁ బోలునట్టియు వాక్యములు శ్రీ కనకాంబగారి గ్రంథములలో నెట్లున్నవో చూపుటకు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు కొన్ని యుదాహరణములను జూపియున్నారు. వానినుండి కొన్నిటి నీపై నుదహరించియున్నాను.

ఇక కావ్యకళావిషయమున శ్రీ కనకాంబగారి కవితాప్రాశస్త్యము నించుక పరికింతము.

ఈయమ రచనలలో నెచ్చటను దోషము రాదు. భాషావిషయమున నీమె శుద్ధశ్రోత్రియ మార్గము నవలంబించినది. జీవయాత్రపై నభిప్రాయ మొసంగుచు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు చెప్పియున్నారు.

'పేరుజీవయాత్ర, ధోరణిసరళంబు,
తప్పుకానరాదు, తత్త్వ మెల్ల
యెడఁబవేద్యమిట్టి యెడద యేసాధ్వికి
గలుగుఁ బున్నెమెంతో సలుపకున్న'

దోషాభావమే యొకవిశేషము కాదు. పాండిత్య ప్రకర్షను దెల్పు ప్రౌఢప్రయోగము లీమె గ్రంథములలో నెచ్చటఁబట్టిన నచ్చటఁ గన్పట్టుచున్నవి.

'శైష్యోపాధ్యాయికచే
ఋష్యాదులు మున్నఁగాంచి రిహపర
సుఖముల్'

"శైష్యోపాధ్యాయికచే" అను ప్రయోగ మె 'హాయి'ని గూర్చుచున్నదో చూడుడు. వ్యాకరణమును, నిఘంటువునుగూడఁ ద్రోసి రాజను భావలో నిసుమంతయుఁ బాండిత్యము గలుగకున్న కవనములకుబూను యువకులు కవినామధారణ మొప్పుచున్న యీకాలములో శ్రీ కనకాంబగారి ప్రయోగములు ప్రత్యేకానందమును గూర్పఁగలవు.

శ్రీ కనకాంబగారి రచనలలో నర్థాలంకారము లును శబ్దాలంకారములును వెల్లువిరియుచున్నవి. ఉపమ, దృష్టాంత నిదర్శనార్థాంత రన్యాసాలంకార ములను వాడుటలో శ్రీ కనకాంబగారు కడునేర్ప రులు. తాము జెప్పఁదలచిన మహావిషయము పాఠకు నకు సులభముగ గ్రాహ్యమగుటకే యీమె యలంకా రములను వాడునుగాని యాడంబరముకొరకు వాడదు. ఈమె తెచ్చుపోలికలు సాధారణముగ నిత్యాను భవములోనివే.

త్రిప్పి త్రిప్పి త్రిప్పి తిన్ననినిలుఁ జేర్చు
గొడ్డువెంటనంటి గొల్లవాడు.
త్రిప్పిత్రిప్పి జీవు దిద్దిప్రోచును భక్త
తత్పరుండు హరి పరాత్పరుండు.

తన ప్రాచ్యపాశ్చాత్య విద్యాసమ్మేళనమునకు ఫలితముగా నీయమ యమూల్యవేదాంతరహస్యము లను సువ్యక్తము గావించుటకై ప్రకృతి శాస్త్రము నుండి సాదృశ్యములను దెచ్చుచుండును.

‘నడుచుచుదూలిన యప్పుడు
గడువైళమతాను నిర్వగాగదలుట నె
వ్వడునేర్పును దనుతత్త్వము
జడుడెవ్వడు? యత్న మిట్లుసలుప
సహజమా.’

‘తాటిచెట్టు కాల్వదాటుటకై వేయ
దానిమీదనడచు తరుణమందు
స్వాస్థ్యమునిలబెట్ట సహజంబుగాగాని
దానినెట్లు చెప్పఁబూనుచుండు.
చిత్రగతులనాడుఁ జేతులాడించును
వెఱ్ఱిచూపులఁజూచు వెతలఁబడును
ఉరసియరయ కెట్లొ యాత్మస్థితిని నిల్పు
కొనునుబుధుని సహజగుణముతపము.’

ఈ కవయిత్రి ప్రాకృతవిషయములనుండి పరమ సత్యములను నీతిబోధలను గ్రహించుటలో నేర్పరి. నలువదేండ్లకు ‘చత్వారము’ వచ్చుట లోకములో గాంచుచున్నాము. దీనివలన సమీపవస్తువులు సరిగఁ గన్పట్టకపోవుట సంభవించుచున్నది. ఆ వయస్సు వచ్చునప్పటికైనను నైహికములగు విషయవాంఛ లుడగవలెననియు నాముష్మికవిషయముపైకి దృషిమరల వలెననియుఁ దెల్పుటకే భగవంతుడు మానవుని భౌతిక దృష్టిలో నీపరిణామమును గల్గించుచున్నాడని యీ యమ యుత్ప్రేక్షించుచున్నది.

‘చుట్టుచేర్చినసామగ్రి గిట్టదింక
దూరదృష్టిఁబరాత్మను జేరవలయు
ననుచు బోధించుఁగాబోలు నబ్జభవుడు
దృష్టిభేదంబు నలువదియేండ్లకొసగి.’

ఈక్రింది క్రమాలంకారములో నెంతభావ మిమడ్పబడినదో చూడుడు.

‘పరమార్థైకపరాయణుఁ
డరయంగాఁబోడు లోకమాత్మస్థితిచేఁ
దరియించును సంసారము
విరమించురమించు మించువిభుడై శ్రీశా’

ఇటఁదుదిపాదములో మూడువిశేషములున్నవి. (1) ‘మించు’ త్రిరావృత్తమైనది (2) మొదటి పదములోని ‘వి’ పోయిన రెండవపదమును రెండవ పదములోని ‘ర’ పోయిన మూడవపదమునగుచున్నవి. (3) ఇంద్రియవ్యాపారమునుండి ‘విరమించిన’పిమ్మట నాత్మపదార్థమందు ‘రమించు’టయు నారమించుట ప్రారంభమైనపిమ్మట విభుడై ‘మించుట’యు జరుగును. కాన భావపరంపరలోగూడ క్రమము పాటింపబడినది.

ఈపద్యము విజయవిలాసములోని ‘తలయూచి యులూచి రసోచితంబుగన్’ అనుపాదమును దలపించుచున్నది.

సంస్కృతమున కాంధ్రీకరణమగు శాస్త్రలములోఁ గూడ శ్రీకనకాంబగారి కవితానైపుణ్యము వ్యక్తమగుచున్నది. ఇంతపఁబూర్వము బయలుదేరిన యాంధ్ర శాస్త్రలములలోఁగంటె నీమె శాస్త్రలములోనే కాళిదాసకవితాలక్షణములు 'హెచ్చుగఁ గనపట్టుచున్నవి. పరీక్షాస్థానములగుకొన్ని ఘట్టములలో నీమె మిక్కిలి ప్రశంసనీయముగ నాంధ్రీకంచియున్నది.

"అస్మాక్ సాధు విచన్త్య" అను శ్లోకములో "సామాన్య ప్రతిపత్తిపూర్వకమిందారేషు దృశ్యా త్వయా"అనుచోట వ్యాఖ్యాతలు చాల యర్థములను సూచించియున్నారు. శకున్తల నితరభార్యలతో సమముగఁజూడవలెనని యొక యర్థమును విశేషముగఁ జూడవలెనని మఱియొక యర్థమును గలవు. ఈ రెండుభావములును శ్రీ కనకమ్మగారు దీసికొని వచ్చుచు నిట్లు వ్రాసినారు.

గడుడక్కిన కూర్మిగడించి
దీని న్యాయమ్మసపత్నులట్లగన

ఇచట 'న్యాయమ్మ'అనునది యవధారణముననుండు కావునందును వర్తించుటచే నీ యర్థములు వచ్చుచున్నవి.

"తాపసి శకున్తలావణ్ణెంపెఖ"అను చోటనున్న శ్లేష నాంధ్రములోనికిఁ దెచ్చుటకై కవయిత్రిగారు "శకున్తలక్షణము"అని వ్రాసినారు "శకున్తము యొక్క లక్షణ"మనియు శకున్తలయొక్క క్షణమ (ఉత్సాహము)నియు రెండర్థములు వచ్చును.

సంస్కృతభాషలో శ్రీకనకమ్మగారికి మంచి పాండిత్యముగలదు. ఈమె శ్లోకములు మిక్కిలి హృద్యములుగనుండును. గ్రంథములలో సందర్భోచితముగ శ్లోకములను వ్రాయుట యీమెకు పరిపాటి. ఈ క్రింది శ్లోకముయొక్క గమనిక యెంతసరళముగనున్నదో పరికింపుడు.

మనసిజకుసుమాస్త్రాత్ మానినీదృ...
పా...
పశుగృహధనదారా పత్యసంసర్గదో...
...
పరశివగురుసేవాప్రాప్త విద్యాభి...
మాన...
పటుతరభవపాశాత్ పాతునః పార్వ...

సంగ్రహమును హృదయంగమమునునగు భా... నొకపరమసత్యమును జెప్పుట గొప్పకవుల రచన... గాంచనగును. ఇట్టి వాక్యరత్నములు ప్రజల నా... లోకములో హెచ్చువాడుకలోనికివచ్చి సందర్భ... సారముగ సంభాషణలలోను టంకింపబడుచుం... అట్టివియే కొన్ని సామెతలగును. ఒకకవి గ్రంథము... నిట్టి వాక్యములెన్నియున్న నాతనికవితయంతగొప్ప... నుండునను భావముకూడ విమర్శకులలోగలదు. ఆ... భాష మాట్లాడువారిలో షేక్స్పియరు వాక్య... హెచ్చు వాడుకలోనికి వచ్చినవి. పిమ్మట మి... వాక్యములున్నవి. ఆంగ్లేయకవులలో షేక్స్పి... మిల్టను వాక్యములున్నవి. ఆంగ్లేయకవులలో షే... పియరు మిల్టనులే ప్రథమగణ్యులగుటకూడ విశేష... శ్రీ కనకాంబగారి గ్రంథములోనట్లు సామెతలు... ప్రసంగపద్యములుగను నుండదగిన పద్యములెన్ని... కలవు. మచ్చునకు మూడుపద్యముల నీ క్రింద ని... చున్నాను.

'చదివిన పండితులగుదురు
విదితముగాకున్న యెడల వెఱ్ఱులె
పురుష...

చదివినఁజదువక యున్నన్
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టుక...
మంత్రి...

'కామిమైనవాఁడుకల్ల సంసారంబు
లో మునుంగు నాత్మలోఁ గలంగుఁ
గామిగానివాఁడు గాముఁడై నిశ్చింత
సహజకర్మమందు శాంతిఁజెందు.
ఇంటిమీఁదరాళ్ల నెన్నైనఁ బడనిమ్ము
సుప్తుఁడై నజనుఁడు సుఖమునుండు
మేలుకొన్నయప్పుడాలించు నల్లాడు
పొరుగువారిఁబిలుచు బొబ్బలిడుచు.'

ఈ కవయిత్రీమతల్లియొక్క రచనలాంధ్రులలోఁ బ్రచారము నొందినకొలఁదియు నిట్టి పద్యరత్నములు నిత్యసంభాషణలోనికి రాఁగలవని నాయభిప్రాయము. ఇట్టి పద్యములలోని రచనాసంగ్రహమును, భావ ప్రాశస్త్యమును మిక్కిలి కొనియాడదగియున్నవి.

భావ గాంభీర్యమునను, బోధప్రాశస్త్యమునను, రచనాశీవిలాసను శ్రీకనకమ్మగారి కవిత సాధారణముగ వాల్మీకిరామాయణము, భగవద్గీతమున్నగు నార్ష గ్రంథములలోని కవితను బోలియుండును. ఈమె కవితలోని యన్నిగుణములకనువన్నె దెచ్చునది ప్రసాదగుణము. ఈమెశైలి మృదుమధురమై గంగా ప్రవాహమువలెనుండును. పద్యములు వినినంతనే యర్థమగుచునన్వయకాఠిన్యములేక ద్రాక్షాపాకములో నున్నవి. ఇట్టి యుత్తమకవిత యచిరకాలములోనే యాంధ్రదేశములో నుచితస్థానము నొందగలదనుటలో సందియములేదు.

---



# పసిపాపలు — పోతపాలు

### శుభ్రత

బిడ్డలకు పోతపాలు వాడేటప్పుడు పాలు కాచిన నీళ్లు అప్పటికప్పుడు కలిపి వాడటం మంచిది. ఈపాలు నీళ్లు అతిజాగ్రత్తగా శుభ్రంగా వుంచాలి. లేకుంటే దుమ్ముపడి ఈగలుముసిరి అనారోగ్యమౌతవి. అట్టివి వాడితే జబ్బులు వస్తవి. అందువల్ల పాలు నీళ్లు చక్కగాకాచి,వడియకట్టి మూసి వుంచడం అవసరం. ఇలా తయారుచేసిన పాలు ఒకమారుపట్టి మిగిలితే మరొకసారి కని వుంచకూడదు.

### గమనిక

బిడ్డలను పాలిచ్చి కొంచెముసేపు ఎత్తుకొని రెండుమూడు త్రేపులు వచ్చినతర్వాత పడుకోపెట్టడము మంచిది. అలాచేయడము వల్ల చక్కగా నిద్రపోతారు. పోరుపెట్టరు.

### పాలుపడినవా?

బిడ్డలు చక్కగా నిద్రపోతూ మలబాధలు ఏమీలేక చలాకీగావుండి యీక్రింద పట్టీ ప్రకారము బరువులో హెచ్చుతుంటే పోతపాలు పడినవని వాటిని వాడుతూ రావచ్చు.

వారమునకు బరువులోమార్పు:

3 నెలలవరకు
5 మొదలు 7 ఔన్సులు
3 మొదలు 6 నెలలవరకు
4 మొదలు 6 ఔన్సులు
6 మొదలు 9 నెలలవరకు
3 మొదలు 5 ఔన్సులు

### దాహము

పోతపాలు త్రాగే బిడ్డలకు దాహము ఎక్కువ. ఇది జ్ఞాపకముంచుకొని కాచి చల్లారిననీళ్లు పాలవేళ కానప్పుడు వాడుట మంచిది. నీళ్లు కొంచెము హెచ్చుగా వాడినను చెడుపులేదు.

—ఎస్. శేషగిరిరా[illegible]

# మగని చెవిలో

‘అనసూయ’

(దినచర్య గురించి)

ఏమండీ! అంతచికాకు! నిద్రలేకుండా నేను చేస్తున్నానా, మీరు చేసుకుంటున్నారా? ఆ పాడుముండాక్లబ్బుకు వెళ్లడం కొంచెం తగ్గించకూడదూ! పోని, వెళితే వేగం రాకూడదా? ఔనుగాని తెలియక అడుగుతాను, ఏమిటిచేస్తారు ఆక్లబ్బులో? రోజూ చూచుకొనేమొగాలేనా మరెవరైనా కొత్తకొత్తఅమ్మాయిలు వస్తూవుంటారా? అలాంటిదేమీ లేదూ? మరేమిటి ఉంటుంది? పేకాటా, బాతాఖానీ, అంతేనా? పేకాట డబ్బువేసే ఆడతారా? రోజుకేపాటి మీరు పేకాటలో సంపాదన! ఎప్పుడూ నష్టమేనా! మీమఃఖానికి మరొక సెలాగవుతుంది!

అయితే, పేకాట లాడడానికి డబ్బుందీ? నేనడిగితేమాత్రం ధుమధుమలూ, రొసరొసలూనా! ఏమైనాఅంటే సణిగేవంటారుగాని రోజుకి అధమం అర్ధరూపాయి నష్టపోతూఉంటే, నెలకు పదిహేనురూపాయిలు చెదరు తిన్నసొమ్ము! మీరు తగలపెట్టడం బాగుందీ! అది మరి లెక్కలేదు! నేనడిగితే మాత్రం డెబ్భైపదకొండు ప్రశ్నలువేసి లేదు లేదని గునిసిగునిసి ఆఖరికి అడిగినదానిలో ఆరోవంతు యివ్వడం అబ్బురమైపోవడమా!

పోనీ, నేనేం తినేస్తున్నానా? నేనేం బట్టలూ పాతలూ నగలూ నాణెములూ కొనేసి పెట్టేసుకొని విర్రవీగేటందుకు అడుగుచున్నానా? మీ యింటిఖర్చుకు, మీ పిల్లలఖర్చుకు అడుగుచున్నాను గాని నేనేం మాపుట్టింటివారికి పెట్టివేయలేదే! నామీద ఎందుకంత అనుమానం? కాటువేసే పెళ్లాలలాగు నేనూ చేస్తూఉంటే మీకు బాగుండునుగాని నాకు అలాంటి గుణము లేదుగదా అని నన్ను యిలాగు యేడిపించుచున్నారు! యిది మీకు బాగానే ఉందీ? పోనీయండి! మొన్న శ్రావణమాసానికి ఒక్కకాసేనా కొన్నారూ? నాకేం బంగారంవస్తువులు కావాలనికాదు గాని అది లోకలాంఛనంగనుక అన్నాను. ఒకనెల పేకాట మానేస్తే బాగుండేదే! లక్ష్మి పూజకు బుద్ధిపుట్టదుగాని పేకాటలకు పిడుగులు!

అయితే యిప్పుడెందు కీఘోష అర్ధరాత్రప్పుడు అని అంటారా? బాగున్నది. మీకు మాట్లాడడానికీ పెళ్లాముమాటలు చెవుల పట్టించడానికీ వేళయేదీ? పిల్లలు బడినుండి వచ్చేవేళకు నిద్రలేస్తారు. పార్టీలతో గంట మాట్లాడేసరికి కోర్టువేళయిపోతుంది. అక్కడేదో పని మునిగిపోయినట్లు ఒకరోజైనా తప్పకుండా కొంచెము ఆలస్యమైనా కాకుండా మెతుకులు నోట్లో ఉండ

గానే పరుగెత్తి వెళ్లిపోతారు! అంతపనే ఉంటూఉంటే మరి యీ దరిద్రమేమిటి? అవునుగాని మనబంట్రోతు గుంటడు అంటాడు:—మీరూ తక్కినప్లీడర్లూ కచేరీలో ఉండక ఏదో మూలగదిలో కేకలేసుకుంటూ చుట్టలు సిగరెట్లు కాల్చుకుంటూ కూర్చుంటారట! కాఫీరాగానే ముగ్గురు నలుగురు అతుకడితాగేసి బాతాఖానీ కొట్టేసి మళ్లీ కచేరీనుండి వెళ్లిపోవస్తారట! నిజమేనా?

వాడిమొగం వాడికేమితెలుసునా! ఎంత చిన్నగుండైనా రోజూచూచినది చెప్పలేడా? కచేరీనుండిరాగానే షికారు; షికారునుండి క్లబ్బు; క్లబ్బునుండివచ్చేసరికి తొమ్మిదిగంటల రాత్రి! యీలోపల పిల్లలు నాప్రాణాలు తీసివేయడము! తిళ్లు పూర్తిఅయి ప్రక్కకు చేరేసరికి పదకొండుగంటలు అవుతుందిగదా! మరెప్పుడు సమయం మీకు వినడానికీ నాకు చెప్పడానికీ, అర్ధరాత్రప్పుడు ఘోషపెట్ట నంటే నాతప్పా మీతప్పా?

అసలు నాఘోష యింతకూ మీరువింటే గదూ! పిసరుతీరుబాటువుంటే నోవలు పట్టుకొంటారుగదా! ఏమిచెప్పినా, ఏమి మొత్తుకున్నా, 'ఊ,' 'ఊ' అనడమేగాని చెప్పినదానిమీద ధ్యానమేమైనఉందీ? అంతా బాగుందిగాని అల్లుడికి అలగడమే పిశాచ గుణమన్నట్లు ఆ 'ఊ' 'ఊ' అని నీరుకార్చ డమే బాగుండలేదు. అది విన్నట్లూకాదు, విననట్లూకాదు. ఇదిమంచి, ఇదిచెడ్డ, అని కట్టుకొన్న పెళ్లాంతో కాస్తసేపు మాట్లాడ డానికి టైములేదా లేక ఆసక్తిలేదా! అప్పుడే నిద్రపట్టిపోయిందీ! కానియ్యండి, కానియ్యండి.

---

## చలోక్తులు

చలోక్తులతో ప్రతికక్షులను మాడ్చివేయుటలో లాయడ్ జార్జివంటి ప్రవీణుడు నేడు గానరాడు. ఒకమారాతడొక ఎన్నికలసభలో నుపన్యసించుచుండగా నొకసభికుడు లేచి "లాయిడు జార్జిగారూ! మీ తాతగారు గాడిదబండిని తోలువాడను సమాచారం మరచారా?" అని యుక్తిగా ప్రశ్నించెను. జార్జి ఒకనిముషమాగి ఉపన్యాసమును ప్రారంభించుచు, "సభికులారా! క్షమింపుడు; నామదినుండి ఆబండి యిపుడు దూరమైనది; గాని ఆగాడిదమాత్ర మింకను జీవించియే యున్నది" అనెను. సభికులందరు కడుపు చెక్కలగునట్లు నవ్విరి. ప్రశ్నించినవాడసహాయుడై కూలబడెను.

---

మరొకమారాత డుపన్యసించుచుండ నొక సభికురాలు లేచి కోపముచే, "నేను మీభార్యనైతే మీకు విషమిస్తాను" అనెను. లాయడ్‌జార్జి నవ్వుచు "మేడమ్! నీవు నాభార్యఅయితే నేనావిషం పుచ్చుకుంటాను" అని బదులిచ్చెను. తరువాత ఆస్త్రీ యెపుడును అతని యెదిరించి మాట్లాడలేదట.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 25 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |

# ఆ యధికారము
# ఆ గౌరవము మీదే





గృహపత్ని గానుండుట సామాన్యంబుకాదు. ఎవ్వరును గమనించని నూరువిషయములు గలవు. వాటిలో కొన్ని స్త్రీలకే యధికారము. "టీ" తయారుజేయుపని వారికి ముఖ్యము. తెలిసిన స్త్రీ లీ దయాస్వరూపమైన "టీ" పురుషుల కిచ్చుట మరువరు. నిర్దోషమైన యీ యారోగ్యపానమే సంసారానందము గల్గచేయుచున్నది.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూన్ "టీ" యొక్కొకరికిన్ని, మొత్తముగా నొకస్పూన్ యధికముగాను పాత్రములో వేసి, బాగుగా నుడకబెట్టిన నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్చవలెను.

## సంసారమునకు తగుపానము — ఇండియా "టీ"

I K-33 RS

# వింతలు—విశేషాలు

## కళ్లార్పుట

ఈమధ్య లండను పట్టణములో ఒక డాక్టరు మనుష్యు డెన్నిసార్లు రోజుకు కళ్లు ఆర్పేది ఒక లెక్క తయారుచేసెను. ఆలెక్కలో రోజుకు పది హేను గంటలు మెలకువతో ఉండేటట్లయితే రోజుకు 2000 పర్యాయములు కండ్లు ఆర్పడము గలుగునట. ఇట్లు కండ్లార్పుటవల్లనే కండ్లకును వాటి నరములకును ఆరోగ్యము. కండ్లు ఆర్పుట ఎక్కువయినను తక్కువైనను అనారోగ్యమని అనుకొనవలెనట.

## ఐరోపాఖండమున పుట్టిన మొదటి ఆంధ్ర బాలిక

క్రిందటినెల 19వ తేదీని మదరాసు టైముప్రకారము ఉదయము 6 గంటలకు జెనీవాలో నానాదేశ సంఘ కార్యదర్శివర్గమువారి భవనమున శ్రీయుత వంగల శివరాముగారికి కుమార్తె పుట్టినది. యూరపులో నిదివరకు భారతీయశిశువు లెవరైన పుట్టిరేమో గాని ఆంధ్రశిశువు లెవరును పుట్టియుండలేదు. గాన శివరాముగారి కుమార్తెయే అచ్చట పుట్టిన మొదటి ఆంధ్రశిశువు. ఈ శిశువునకు వనమీనాక్షి అని నామకరణము చేసిరి. స్విట్జరులండు దేశపు పౌరసత్వము బడయుటకు హక్కుగల్గినది.

## ఉత్తరములు మోసిన పిట్ట

ఉత్తరాలు మోస్తూవున్న ఒకపిట్ట అరేబియాలో చచ్చి పడిఉన్నది. అరేబియాలో ఇయాన్‌బిడో అను ఒక అనాగరికతెగ గలదు. ఆతెగ తాలూకు కొంతమంది ఎడారిలో వెళ్లుచుండగా ఆ మందు యెడారిలో చచ్చిపడియున్న ఒకపిట్ట కనబడెను. ఆ పిట్టకాలికి ఒక చిన్న రేకుడబ్బా ఉన్నది. ఆ డబ్బా విప్పిచూసేసరికి అందులో ఒక ఉత్తరమున్నది. ఆ వుత్తరములో ఏవేవో గురుతులున్నవి. ఆ వుత్తరము పారిస్‌లో వ్రాసినట్లు 1936 ఆగష్టు తేదీ వేసిఉన్నది. ఆ చనిపోయిన పిట్టను, ఉత్తరమును పారిస్ పంపడమైనది.

## మనుష్యులకన్న జంతువులే ఎక్కువ ఉద్యోగములు చేయుచున్నవి

నేడు టాకీలలో జంతువులుకూడా జీతములు గడించుచున్నవి. హలీవుడ్ లో ఖడ్గమృగాలకు రోజుకు 100 రూపాయలు, కోతులకు 350 రూపాయలు వంతునను జీతములు ఇచ్చుచున్నారు. అయితే ఈ జీతాలు బాగా మచ్చికయై తెలివితేటలుగల కోతులకేగాని అన్నిటికీగాదు.

## టిక్కెట్టు వివాహము

జపానులో పెద్దపట్టణములలో క్రొత్తరకపు వివాహాలు బయలుదేరినవి. ఎవరికైనా పెళ్లిచేసుకొనుటకు పిల్ల కావాలంటే ఆతడు ఒక మెషీనులో ఒక పెన్నీ వేయవలెనట. అంతట రైలు ప్లాటుఫారము టిక్కట్టు వచ్చుమాదిరిగ ఒక పసుపు పచ్చటిక్కెట్టు వచ్చునట. ఆ టిక్కెట్టుమీద వరునికొరకు వెదుకుకొనుచున్న కన్యల పేర్లు, వారి వయస్సులు, తూనికలు, మంచి చెడ్డలు వ్రాసియుండును. పిమ్మట నాతడా పేర్లలో తనకు తగినదాని నెంచుకొని విలాసమునకు ఆ కంపెనీ వారికి వ్రాయవలెను. తర్వాత వివాహము జరుగును.

## పెండ్లాడని సంఘము

హలీవుడ్‌లో నిరుడు పెండ్లాడని సంఘ మొకటి ఏర్పడినది. అందులో పదహారుగురు స్త్రీలు గలరు. వారు సినిమాలలో పేరుపొంది "స్టార్సు" అనుపించు కొనువరకు పెండ్లాడమని వ్రతము పట్టిరట.

### రాక్షసపక్షి

దక్షిణ జర్మనీలో సైలీషియాదగ్గఱ అడవులలో ఒక రాక్షసపక్షి కనబడెను. దాని రెక్కలు ఒక్కొక్కటి 8 అడుగుల వెడల్పు గలదట. ఆ అడివిలో ఒక కుక్కను కాళ్లతో తన్నుకొనిపోవుటకై అది క్రిందికి దూకెనట. ఆకుక్క సామాన్యమైనది గాదు. ఆపక్షిని ఎదుర్కొన్నది. ఆ రెంటికిని ఘోరయుద్ధము జరిగెను. కాని ఆపక్షే గెలుచునట్లు కనబడెను. అంతలో ఒకడువచ్చి పక్షిని కాల్చి చంపెను. ఆ పక్షి ఆసియా, ఆఫ్రికా అడవులలో గలదని చెప్పుచున్నారు.

### శవాల గుండె కదలిక

సెయింట్ లూయిలోని డాక్టరు విల్లియం బి. కవుంట్ అనే ఆయన మానవహృదయం ఆరోగ్యస్థితిలోను, వ్యాధిలోను ఎలాగంటి మార్పులు పొందుతుందో పరీక్షించి చూస్తున్నాడు. ఈ పరిశోధనలకు జంతుహృదయాలు కాని, కోడిపిల్లల హృదయాలు కాని సహాయపడనందువల్ల మానవహృదయాలమీద పరీక్ష చేస్తున్నాడు. అందుకోసం అరవైమూడు శవాలలోనుంచి హృదయాలనుతీసి వాటికి స్పందనశక్తి కలిగించి పరీక్షిస్తున్నాడు.

### పిల్లలకు 1,400,000 పౌన్ల బహుమానం

1935 సంవత్సరం మార్చి 1 వ తేదీ మొదలుకొని ఇటలీ ప్రభుత్వం పెళ్లిళ్లక్రింద పిల్లలకన్నందుకు 1,400,000 పౌనులు పంచిపెట్టారు. ఈ మొత్తం డబ్బంతా బ్రహ్మచారులవద్దనుంచి పన్నుమూలకంగా వసూలుచేశారు. 10,958 మంది క్రొత్త దంపతులు చెక్కలను, 50,177 మంది తండ్రులు పెద్దకుటుంబాలకు బాధ్యులైవున్నందువల్ల బోనసులను పుచ్చుకున్నారు. ఇన్నితిప్పలు పడుతున్నప్పటికీ యుద్ధం ప్రారంభించినప్పటినుంచీ జననసంఖ్య తగ్గిపోయింది.

### గాజుకాంత

మన శరీరములలో ఏభాగము లెట్లుండునో ఏపనులు చేయుచుండునో పుస్తకములు చదివి ఊహించుటేగాని మనము చూచుటకు సాధ్యముగాకున్నది. గాని ఎక్సరే కనిపెట్టినప్పటినుండి ఫొటోలు తీసి కొంతవరకు వాటిమూలమున చూడగలుగుచున్నారు. అసాధ్యములు సాధ్యములుగ జేయుటయందే శాస్త్రవేత్తల గొప్పతనము కనబడును. ఈ మధ్యనే పలురకముల పదార్థములతో ఒక ఆడబొమ్మను తయారుచేసిరి. అది ముప్పదేండ్లవయసు గలదిగా కనబడును. శరీరమందలి ప్రతిభాగమును రక్తనాళములతో సహాగలవు. డ్రిస్డన్‌లో ఒక స్త్రీ చనిపోగా ఆమెలోపల అంగములనుతీసి అస్థిపంజరమును దీని కుపయోగించిరి. లోపలి అన్నిభాగములు స్పష్టముగ కనబడునట్లు గాజువంటి పదార్థముపైపూతకుపయోగించిరి. అందులకామెను గాజుకాంతయని పేరిడిరి. ఆబొమ్మకు లోపల 121 విద్యుద్దీపములు అమర్చబడినవి. ఏ భాగము పరిలీలించవలెనన్న ఆభాగపుదీపము వెలిగించి గమనింపవచ్చును. దానిని తయారుచేయుటకు పలువురు శాస్త్రజ్ఞులు పలువిధముల పరిశోధనలుచేసి విజయమొందిరి. ఈ బొమ్మను తయారుచేయుటకు సుమారు రెండుసవత్సరములు పట్టెను. దీనివలన విద్యార్థులకు శరీరశాస్త్రము సులభముగ నేర్పుటకు వీలగుచున్నది.

---

# పుష్ప చయము

## వ్యభిచార నిర్మూలనా ప్రయత్నాలు

మోరల్ అండ్ సోషల్ హైజీన్ అసోసియేషన్ వారి ప్రతినిధి మిస్ మేలెంట్ షెపర్డ్ వ్యభిచార వ్యాపార నిర్మూలనముకొరకు ఇండియాలో యేడేండ్లనుండి కృషి సల్పుతూవుంది. వ్యభిచారిణుల సంఖ్య పెరుగుటకు మిస్ షెపర్డు చెప్పినవిషయములు గమనార్హములు.

అభాగినులు వ్యభిచారవృత్తిని అవలంబించడానికి కారణము దరిద్రమే అని ఆమె అంగీకరిస్తుంది. కాని పూర్తిగా అదే కారణమనిమాత్రం అనుకోరాదంటున్నది. క్రొత్త క్రొత్త వ్యభిచారిణులు కావలెననే పరిస్థితులు దేశములో వున్నంతకాలము క్రొత్తస్త్రీలను సమకూర్చుటవల్ల యెక్కువ లాభము యేర్పడుతుందని అభాగినులను బయటకు తీసుకొనువారు యీపనిని సాగిస్తూనే వుంటారు. కనుక వ్యభిచారము తగ్గవలెనంటే యీ క్రొత్తక్రొత్త వ్యభిచారిణులు కావలెననే వాంఛ ప్రజలలో లేకుండేలాగు చేయాలని మిస్ షెపర్డు వెలిబుచ్చెను. దీనినిబట్టి దేశములోని ప్రజలభావములు చాలవరకు మారవలసి వుంటుంది.

మిస్ షెపర్డు యిలా చెప్పింది:—

"మానవుని స్వభావములో, అభిప్రాయములో, బ్రహ్మాండమైన మార్పు—విప్లవ సంస్కారభావము అవసరము. ఇటువంటి పరివర్తనము లేకుండిన మనము ఎన్నిచట్టములు చేసినను, ఎన్ని పతితోద్ధారణ ప్రయత్నములు చేసినను, యెంతటి వైద్యసహాయము చేసినను అంతయు నిష్ఫలము."

ఈ భావములను యెవ్వరును త్రోసివేయ వీలులేదు.

*　　　*　　　*　　　*

## ఒక పదమూడేండ్లబాలిక నిర్బంధమునకు పరితపించుచు వెల్లడించిన సంగతులివి

నాకు నిజముగా ఈసంవత్సరము ఖయిదు అయినది. ఎప్పుడును ఇంటినుండి బయటికి పోకూడదు. వాకిట నిలువకూడదు, నవ్వకూడదు, ఎవ్వరితోను మాట్లాడకూడదు, స్కూలుకు పోగూడదు, ఇక నాకు ప్రొద్దుపోవుట ఎట్లు? ఈ పదుమూడవసంవత్సరము నాప్రాణము తీయుటకే వచ్చినట్లున్నది. హా దైవమా! నాకేల ఇంతఆయుస్సు పెట్టితివి. పోనీ ఇప్పుడు నాకు పెన్సిల్ కాగితముతప్ప వేరేగతిలేదే! ఇకనించి ఇల్లే బజారు, ఇల్లే స్వర్గము, ఇల్లే సర్వస్వముకాబోలు. ఇక నేమిచేతును? స్త్రీలకు స్వేచ్ఛకలుగుననియు, స్త్రీలకు హక్కులు, శుభదినములు రానున్నవనియు పత్రికలు ఘోషించుచున్నవి కాని, ఆదినములు నామనుమలకు కూతుండ్రు పుట్టినతరువాత వచ్చునేమో? పోనీ అటువంటి తలిదండ్రులను ఇవ్వలేకపోతివనుకో! నన్ను చదివించమని నాతలిదండ్రులకేల బుద్ధి పుట్టింపకపోతివి? బుద్ధి పుట్టింపలేక పోతివనుకో! మృత్యుదేవతకేల రాయిగుండె పెట్టితివి? రాయిగుండె పెడితివికాని నాకు తోడు ఒక సోదరినేల ఈయగూడదు? దీనరక్షకుడవనియు, ఆపద్బాంధవుడవనియు, లోకము నమ్మును కాని ఎట్లునమ్మునో నాకు బోధపడుటలేదు. నేను

నీవు కనబడుటలేదా? నీవు గ్రుడ్డివాడవా? గ్రుడ్డివాడవైనచో దేశమంతయు నెట్లు పరిపాలించుచుంటివి? ఇంత పక్షపాతమెందుకు? పురుషులకు స్వేచ్ఛ, స్త్రీలకు నిర్బంధన, ఎంత కఠినుడవు? స్త్రీలను పురుషులకు అంత చులకన ఏలచేసితివి? ఇద్దరికి సమానహక్కులిచ్చిన నిన్ననువారెవరు? నాకేల అవమానము చేయించితివి? నేనేమి అపరాధమొనర్చితిని? నాతల్లితో! నాఎదురుగ! ఆమర్మాగ్గునితో అట్లనా అనిపించ వలసినది? నీవేమీ అమ్మాయికి నేర్పుచున్నావనియు, అంట్లుతోమట, వంటచేయుట, ఇల్లు చిమ్ముట ఇవన్నియు నేర్పక చదువులట, పత్రికలట, ఇవన్నియు ఆడువారికి ప్రయోజనములు లేవట. అమ్మో! ఎంత మాట. ఆతుచ్ఛునికి ఎంతపొగరు? నాకేమి, తండ్రియా, లేక అన్నయా, మామయా, చుట్టమా, లేకపక్కమా! ఎవరో దాయాదట, వచ్చి నన్ననుటయా? ఏమికాలము; కాలవిపరీతము; నాకు పనినేర్ప వద్దనుటకాదు, చదువేమిచేసినది? చదువులు, పత్రికలు, స్త్రీలు నోచుకొనలేదు కాబోలు? ఇట్లనే భారతసోదరీమణులు విచారించుచున్నారు కాబోలు.

* * * *

## స్త్రీల కరువు

కలకత్తాలో ఆల్బర్టుహాలులో "రేడికలు" పార్టీవారు జరిపించిన సభలో జవహరులాలుగారు ఉపన్య సించబోవు యువతీయువజనులారా అని సంబోధించినారు. కాని సభారంగములో పేరున కొరకు యువతి ర్యైన లేకుండెను. మేడమీద ఎవరైనాయుందురేమోయని తలయెత్తిచూచిరి. అక్కడ అంతకన్నా లేకుండిరి. అందరికి పెద్దనవ్వు వచ్చెను. జవహరులాలుగారికి ఒక ఫ్రెంచిగ్రంథకర్త వ్రాసిన వాక్యము జ్ఞప్తికివచ్చినది. కలకత్తానగరము స్త్రీలకు కఱవుపట్టిపోయిందని అతడు వ్రాసినాడట. రేడికలు పార్టీ వారి స్త్రీలకుకూడా ఇంతఘోషా ఇంతరహస్యము యేలవచ్చెనని జవహరులాలుగారు అడిగినారు. ఈపార్టీ అంతా బ్రహ్మచారులదండీ అని యెవరో సభలోనుండి కేకవేసిరి. సభఅంతయు నవ్వులతో ప్రతిధ్వనించెను.

* * * *

## వేడినీళ్ల ప్రవాహాలు

హిమాలయపర్వతప్రాంతములలో కాంగ్రాగుహలవద్ద వేడినీళ్లు ప్రకృతి సహజముగా ప్రవహించు చుండును. దానితో యాత్రికులు వంటచేసికొందురు. 'కులూ' జిల్లాయందు, మణికర్ణవద్ద ఎపుడూ వేడి నీళ్లు ప్రవహించు ఉష్ణజలపాతములు గలవు. ఈ పుణ్యతీర్థములను సేవించుటకువచ్చు యాత్రికులు, పేరే పొయ్యి అక్కఱలేకుండ యానీళ్లతోడనే వంటచేసికొందురు.

పాలంపూరు తహసీలులో నేస్నెకవద్ద తాత్వానీ (తప్తపానీ) అనుచోట యేటేట ఒకతీర్థము జరుగును. అక్కడ ఉష్ణజలధార పడుచుండును. ఆ పుణ్యజలములు చాలపవిత్రములనియు, ఒక్కసారి మునిగినచో కడుపునొప్పి పోవుననియు నమ్మకముగలదు.

రామఘర్ తాలూకాలో కాంగ్రాతహసీలునందు సాక్‌నది లోయలలో వేడినీటి ధారపడును. యాత్రికుల ఉపయోగముకొఱకు ధారచుట్టూ రాతిచపటాచేయబడియున్నది. అక్కడనుండి ఒక చెరువు లోనికి నీరుపడుటకు ఒక మట్టిగొట్టము అమర్పబడిఉన్నది. చెరువులో యాత్రికులు స్నానముచేతురు.

* * * *



యుద్ధానికి తయారు !

పెజ్విక్ అను నీటిపక్షి దేనితోనైన పోరాడుటకు రెక్కలను చాచి, ముక్కును ముందునకు వంచి తయారగును.



టోకియో నగరమందలి నూతన ఆహాంగభవనము.

కోట్లకొలది ధనముఖర్చుపెట్టి 20 సం. కాలము నిర్మింపబడినది.



స్వేచ్ఛాజీవుల కర్మకాండలును సంసేవిధానంబులున్
ఇచ్ఛాపథ్యముగాన గల్గుటరుదే హృద్వీధి జ్యోతిర్లతల్.

## భూగర్భనగరం

ఫ్రాన్సుదేశంలో అమీన్సు అనేచోట భూమితవ్వి లోపల ఒకనగరం నిర్మిస్తున్నారు. 7,500 అడుగుల వైశాల్యంగల మందిరాలు దారులు నిర్మించతగినభూమి త్రవ్వినారు. ఇంకా ఎంతదూరం తవ్వుదారో నిర్ణయంకాలేదు. యూరపుఖండములో ఇంతవరకు నిర్మించిన భూగర్భనగరాలలో ఇంతపెద్దది లేదు.

మూడవశతాబ్దంనుంచీ ఈనగరం అక్కడవుంది. ప్రాంతీయశత్రువులు వారిమీద దండెత్తివచ్చినప్పుడల్లా ఆ భూగర్భనగరంలో వాడు దాగివుండేవారు. ఆనగరం అక్కడవున్న సంగతే తరువాత జనులు పూర్తిగా మరచిపోయినారు. ముప్పదిసంవత్సరాలక్రితం ఒకఫాదరీ ప్రాతకాగితాలు తిరగవేస్తూవుండగా అక్కడ ఒకనగరం వున్నట్టున్ను, దాని పూర్తివివరాలున్ను కనుక్కున్నాడు. చివర కాస్థలంకూడా గుర్తించాడు.

ఈరోజున పరిశోధకులు ఆభాగం త్రవ్విచూస్తున్నారు. ఇంతవరకు 300 గదులు త్రవ్వినారు. అది భూమిపైభాగానికి నూరుఅడుగుల లోతునవున్నది. వాటిని పెద్ద సభాగారాలుగా వుపయోగించవచ్చునని అనుకుంటున్నారు. ఇంత లోతునవుంటే అక్కడినుంచి పొగపోవడానికి గొట్టాలువున్నవా అని పరిశోధన చేశారు. అక్కడనుంచి కొంతదూరానవుండే కొండలమీదికి గొట్టాలువుండేవనీ, ప్రజలు ఈ భూగర్భనగరంలోవున్నారని గుర్తించకుండావుండటానికే అలాచేస్తుండేవారనీ తెలుసుకున్నాడు. 18వ శతాబ్దములో ఉప్పు దొంగిలించేవారున్ను, పన్నులు చెల్లించనివారున్నూ, రాజద్రోహులున్నూ ఆనగరంలో దాగి వుండేవారట.

* * * *

## నిద్రలో గుర్రు

లండనులో కాపురముచేస్తున్న ముప్పదేండ్లస్త్రీ నిద్రలో బ్రహ్మాండము బ్రద్దలయేటట్టు గుర్రు పెడుతుంది. తెల్లవార్లూ విరామములేని గుర్రు. ఇది ఆమెభర్తకు యేమాత్రము యిష్టములేదు. పైగా యీ గుర్రువల్ల ఆతనికి రెండుసంవత్సరములుగ నిద్రలేనేలేదట. ఈగుర్రును నివారించవలెనని భార్యాభర్తలిద్దరు అనేక ఉపాయములు చేసిరి. కాని ప్రయోజనము లేకపోయినది. పిమ్మట ప్రాణమువిసిగి భర్త ప్రపంచమునగల వైద్యప్రముఖులకొక విజ్ఞాపన చేసికొన్నాడు. ఈవిజ్ఞాపన వృథాగాపోలేదు. గురకను అరికట్టే ఉపాయాన్ని ఒకయువకుడు సూచించి మన్ననలను పొందగలిగినాడు. ఈ యువకుడీపనికి తీసికొనిన సాధనసామగ్రి ఒక మైక్రఫోను, ఒకగంట, ఒకఅలారం. ఈసామగ్రినంతను యెట్లో ఆమెకు తగిలించినాడు. ఆమె గుర్రు ప్రారంభించగానే మైక్రఫోనులో వినబడుతుంది, అలారం కొడుతుంది, యీవిధంగా నిద్రపోనీయకుండా చప్పుడగుచుంది. నిద్రపట్టకపోతే గుర్రు రానేరాదు. ఈఉపాయంవల్ల ఆమె గుర్రుపోయింది. భార్యగుర్రువల్ల నిద్రాసౌఖ్యవిహీనులైన భర్తలీ పైఉపాయము పరీక్షింపతగినది.

* * * *

## తెల్లబానిసలు

అబిసీనియావంటి దేశాలలో బానిసత్వంవుంది. ఆదేశాలను బాగుచేస్తున్నాం అంటారు పాశ్చాత్య నియంతలు. కాని ఆ నాగరికదేశాలలోకూడా ఆడపిల్లలను బానిసలుగా మోసపుచ్చి తీసుకుపోవడం

ఈనాటికిన్నీ జరుగుతూవుంది. స్కాట్లండుయార్డువారు ఎన్ని తెలివితేటలతో ప్రయత్నిస్తున్నా ఇంగ్లండు కూడా ఇది జరుగుతూనే వుంది.

సినిమాస్టూడియోలదగ్గర ఎక్స్ట్రాలుగావుండే పిల్లలను ఎక్కువజీతా లిప్పిస్తామని భ్రమపెట్టి సరాసరి వాయువిమానాలమీద ఫ్రాన్సుదేశానికి జేరవేస్తారు. తరువాత వారిగతి ఏమయిందీ ఎవరికీ తెలియదు. ఇలా పిల్లల్ని మోసగించి తీసుకుపోయే సంఘంఒకటి వెస్ట్ఎండ్లోవున్నది. ఇటీవలనే వారిచేతినుంచి అదృష్ట వశాత్తు తప్పించుకొనివచ్చిన ఒక పదిహేడేండ్లపిల్ల ఈరహస్యం బైటపెట్టింది.

*　　*　　*　　*

## ఏమీ అపాయకరంకాదు

చలిజ్వరంక్రిములను మొదట కనిపెట్టిన సర్ లోనాల్డురోస్ అనే దొరగారు "టీ"నిగురించి మాట్లాడుతూ "నేను యింతవరకు ప్రతిరోజు తప్పకుండా రెండు మూడుసార్లు టీని త్రాగుతూవున్నాను. టీని నిరాక్షేపణీయంగా త్రాగవచ్చునని నా అభిప్రాయం. నాగరకతవిశేషంగా ప్రబలివున్న యూరోప్లో అనేకమైన యితరభోగాలతోపాటు టీ అభ్యాసంగూడ అనుభవయోగ్యంగావుంటుంది. ఇది కేవలం నిరపాయకరమైనది. బడలిక తగ్గించి సేద దీరుస్తుంది" అన్నారు.

అంతతెలిసినవాడు టీనిగురించి ఆవిధంగా చెపుతూవుంటే, అది మంచిదికాదనే అభూతకల్పన యెక్కడ నుంచివచ్చింది ? అయితే అదృష్టవశాత్తు టీలోవుండే మంచిగుణాలు యిప్పుడిప్పుడు యావన్మందికి తెలిసి వస్తున్నవి. కొంచెం చదువుకున్నవాళ్లదగ్గరనుంచి పైఅంతస్తులో వుండేవాళ్లంతా యీ వ్యతిరేకప్రచారకుల మాటలను విశ్వసించడంలేదు. సర్ రోనాల్డురోస్ దొరగారి మోస్తరుగానే, టీని విశేషంగా వాడుతున్న వాళ్లు దానిలో మంచిగుణాలు లాభాలు యావత్తు స్వయంగానే అనుభవముమీద తెలుసుకుంటున్నారు. శాస్త్రవేత్తలు, పరిశోధకులుగూడ అప్రమత్తులైయుండలేదు. టీలో యిదివరకే అందరికి తెలిసివున్న మంచి గుణాలుకాక, మానవకోటికి ఉపయుక్తంగావుండే గుణాలు టీలో యేమేమివున్నవో వాటినన్నిటిని పరిశో ధించి కొత్తకొత్త సంగతులను కనిపెడుతున్నారు. తేనీటియొక్క రంగు, రుచి, సువాసన, మంచిదనము మొదలయినవన్నీ ఆకులోనున్న వస్తుగుణాలవల్ల యేర్పడుతవి. టీ త్రాగినతరువాత మనసు మెదడు సేదదీరి హాయిగావుండడానికి యిదేకారణం. టీ త్రాగితే నరాలకు పుష్టివస్తుంది. శరీరపటుత్వం హెచ్చుతుంది. ఇది ప్రతివారికి నిత్యమూ కలుగుతుండే అనుభవం. అందుచేత కాయకష్టంవల్ల జీవించే పాటకజనానికి, మెదడు పరిశ్రమ అవసరమైవున్న ధీమంతులకును, ప్రకృతిసిద్ధంగానే వారివారి శరీరనిర్మాణంలోని అవయవాలు శ్రమాధిక్యతవల్ల శిథిలతబొందుతూవుంటవి. అటువంటి సందర్భంలో అటు దేహబలంగాని, యిటు బుద్ధిబలం గాని కొరవడకుండా వాటికి ఉత్తేజం కలిగించేటందుకు టీత్రాగడం అత్యావసరం అగత్యం.

"టీ త్రాగడంవల్ల మెదడుకు ఉత్తేజం కలుగుతుంది. ఎల్లప్పుడు చురుకుదనంగాను ఉత్సాహంగాను వుండటానికి టీ త్రాగవలెను" అని న్యూయార్కు, కొలంబియా యూనివర్సిటీలోని కాలేజీ ఆఫ్ ఫార్మసీ కులపతిగావున్న డాక్టర్ బస్సీదొరగారు చెపుతున్నాడు.

# గ్రంథ పరిచయము

## వాహిని (పత్రిక)

ఇది 23, స్ట్రింగరుస్ వీధి, జి. టి. మదరాసునుండి శ్రీయుత న్యాయపతి నారాయణగారి సంపాదకత్వమున ప్రతి మంగళ శుక్రవారము వెలువడుచు ముఖ్యముగా రైతుల యభ్యుదయమునకై పాటుపడు పత్రిక. ఇది వెలువడుటకుముందే ప్రభుత్వమువారు రెండువేల రూపాయలను సెక్యూరిటీ కట్టించుకొన్నారు. ఇటువంటి బాలారిష్టములను చెనకకుండా నిది యభివృద్ధి జెందునని యాశించుచున్నాము. హిందూదేశము కర్షకుల దేశము. వారు బాగుపడిననే దేశము బాగుపడును. వారు బాగుపడవలయునన్న నిట్టిపత్రిక లత్యావశ్యకములు. ఇది యట్టికొరత తీర్చగలదని యందు ప్రకటింపబడు విషయములు సాక్ష్యములుగ నున్నవి. విడిపత్రిక అరణా.

## అబిసీనియా విధ్వంసము

సాహిత్యలత 11-వ కుసుమము. రచయిత్రి శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు. దీనిని ప్రకటించిన శ్రీయుత కర్లపాలెం కృష్ణారావుగారు సంపాదకీయములో "నాటకములు రచించినగాని కవిత్వము పూర్తిగ వచ్చినట్లు గాదని పిచ్చినమ్మకముతో గ్రంథకర్త్రి భగీరథప్రయత్నము చేసినట్లు గనపడుచున్నది" అని వ్రాసిరి. చేసినది భగీరథప్రయత్నమైనను ఫలితము భగ్నమైనది. ఎయ్యది వ్రాసినను ఎట్లు వ్రాసినను నాటక మననగును నేని యీ గ్రంథమున కా నామధేయము చెల్లును. వస్తువిషయమున గాని, రచనావిధానమున గాని, భాషావిషయమునగాని మరెద్దానిలోగాని దీనినిగూర్చి వ్రాయవలసినది లేదు. కాని ఆధునికసమస్యలను గూర్చి వ్రాయ ప్రయత్నించిన కవితిలకగారి యోప్పు శ్లాఘనీయమే. ఇకమీదట రచయిత్రిగా రుత్తమ గ్రంథముల రచింప బ్రయత్నింతురనియు, 'సాహిత్యలత'యందు పరిమళయుతమైన కుసుమములు పూచుననియు యాశింతుము.

## సుశ్రుత సంహిత (నిదాన స్థానము)

ఇది భరద్వాజాయుర్వేద గ్రంథమాల ద్వితీయ కుసుమముగా వెలువడినది. దీనిని డాక్టరు పురాణపండ రామమూర్తిగారు రచించిరి. నేడు క్రమక్రమముగా నాయుర్వేద ప్రాముఖ్యము గమనింపబడుచున్నది. కావున అందు సంస్కృతమునగల గ్రంథములను తేటతెల్లమగు తెలుగులో జనబాహుళ్యమున కుపయోగపడునట్లు రచించు నావశ్యకత గలదు. ఇందు సంస్కృతమునకు తెలుగు వ్రాయబడినది. ఇది యందరికిని సులభముగనుండు రీతి వివరముగా రచింపబడియుండిన బాగుండును. రాబోవు భాగముల నారీతిగా ప్రకటించిన మంచిది. ప్రతులు వలయువారు సంపాదకుడు: భరద్వాజాయుర్వేద గ్రంథమాల, కాకరపఱ్ఱు, తణుకు తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా అని వ్రాసిన బడయగలరు. వెల 0-12-0.

## తుఖారామ్

ఇది నోబుల్ కళాశాలయందు ఆంధ్రోపాధ్యాయులుగా బనిచేసి, పెక్కు గ్రంథముల రచించిన

## గృహలక్ష్మి

శ్రీ రామవీరబ్రహ్మకవిగారిచే రచింపబడిన పద్యకావ్యము. తుఖారామ్ తన తండ్రినిజయించిన శ్రీకృష్ణదేవరాయలను తండ్రియానతిని వివాహమాడి, యతడు దాసీపుత్రుడని తల్లియు దాసియు నుగ్గోధింప నోడబడియుండ నాయుదంతము రాయలెఱింగి యామెను పుట్టినింటికి పంపెను. ఆమెయు పశ్చాత్తప్తయై నింటికి పోక రాయల రాజ్యమునందేయుండి కంబము చెఱువు గట్టించి బీదలపాలిటి పెన్నిధానమై అన్నపూర్ణ యను నామధేయముననుండ రాయ లెఱయెఱిగి యామెను తిరిగి దేవేరిగా స్వీకరించెను. ఇది యందలి యితివృత్తము. ఇది చరిత్రాత్మకము. కథకు సంబంధము లేని చరిత్రవిషయముల సైత మిందులో చేర్పబడినవి. కవితయందు ప్రబంధకవుల అనుసరణములు గలవు. ఇది ఇంటర్మీడియేటుకు పఠనీయగ్రంథముగా నంగీకరింపబడినది. వెల రు. 1.

**ద్రావిడవంశ చరిత్ర**

ఇది చిట్టల్ల సుబ్బారాయుడు (సహాయోపాధ్యాయుడు, బోర్డు హైస్కూలు, ఎలమంచిలి) గారిచే రచింపబడినది. ద్రావిడ వంశజుల గోత్రములు, పక్షములు, ప్రవరములు, వంశనామములు మొదలగువాని యుత్పత్తులు, వాని పరస్పర సంబంధములు నిందు వివరముగ గలవు. వెల 0-8-0.

**పులిగోరు పతకము**

ఆంధ్రులకు చిరపరిచితులైన శ్రీయుత వడ్డాది సీతారామాంజనేయ కవిగారు దీనిని రచించిరి. ఇందు "ఖా! శింకోటానన, హేమశైలభవనా! శ్రీ సత్యనారాయణా!" అనుమకుటముతో పద్యములన్నియు యేకప్రాసశార్దూల వృత్తములైయున్నవి. ఏకప్రాసమైనందున వచ్చిన పదజాలమే పలుమారువచ్చినను ధార కుంటుపడకయున్నది. వెల 0-2-0. ఖాసింకోటలో గ్రంథకర్త గారిసద్ద దొరుకును.




## ప్రేమ - త్యాగము:

నిష్కళంకమగు ప్రేమయందు త్యాగ మంతర్భూతమైయున్నది; త్యాగమునందు ప్రేమ అంతర్లీనమైయున్నది; ప్రేమలేని త్యాగముగాని త్యాగములేని ప్రేమగాని ప్రపంచమున నూహించుటకు సాధ్యము గాదు; ప్రేమయే త్యాగము; త్యాగమే ప్రేమ. ప్రేమ ప్రతిఫలముగోరదు. స్వార్థ పరత్వము చెంతజేరనివ్వదు; న్యూనతాధి క్యతల గమనింపదు; సాహసములకు వెను దీయదు. ప్రేమహృదయుడు పరమాత్ము డందురు. కొందరు ప్రేమయే పరమాత్ము డందురు. యువతీయువకుల మధ్యగలట్టిప్రేమ కిట్టిగుణము లుండునాయనున సందియ మనా వశ్యకము. నిజమైన నిష్కళంకమైన ప్రేమ యెట్టిచోటనైన నీగుణములకు దూరముగ నుండజాలదు.

1936 వ సంవత్సరము డిశంబరు 10 వ తేది ప్రపంచచరిత్రలో నాచంద్రతారార్క ముగా నుండుటకు సువర్ణాక్షరములతో లిఖింపబడవలసిన దినము. ఆ దినముననే ప్రపంచమునందద్వితీయమై,యతివిశాలమై, యసదృశవైభవోపేతమై; రవియస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యాధినాథుడైన అష్టమ ఎడ్వర్డు సార్వభౌముడు తాను హృదయ పూర్వకముగ ప్రేమించిన ప్రణయమూర్తిని వివాహమాడుటకు తన ప్రభుత్వ మంగీకరిం పకపోవుటచే సామ్రాజ్యమును తృణముగ పరిగణించి పరిత్యజించి ప్రేమ, త్యాగ సామ్రాజ్యములకు చక్రవర్తియై నాగరికతా లోకహృదయసింహాసనము నధిరోహించెను.

ఎడ్వర్డుగారికి 42 రెండు సంవత్సరముల ప్రాయమైనను వివాహము గాలేదు. తనకు నచ్చిన వనిత దొరకనిదే కారణమై యుండ వచ్చును. వారు గతసంవత్సరారంభమున తండ్రి యనంతరము రాజ్యాధికారమును పూనిన తరువాత వివాహవిషయమై పెక్కు ఊహలు బైలుదేరెను. గత ఆగస్టుమాసమునందు ఏడ్రియాటిక్ సముద్రమునందు విహారమునలుపుచున్న కాలమున వారివెంబడి పెక్కుయువతు లుండిరి. వారిలో నమెరికాదేశీయురాలైన వాలెన్ ఎర్నెస్ట్ సింప్సన్ సతియొకర్తె. సార్వభౌము లా కాలమున చేయుచున్న కార్యజాలమందు పాల్గొనుచువారికి సమీప వర్తియైయున్నందున అమెరికాయందలి పత్రికలు చక్రవర్తికిని ఆమెకును వివాహము జరుగవచ్చునని ప్రకటింపసాగెను. కాని బ్రిటిష్ ప్రతిక లా విషయమై యేమియు ప్రకటింపక మిన్నకున్నందున నందలి రహ

స్యము లెవరికిని దెలియవయ్యెను. కాని అక్టోబరుమాసమున సింప్సనుసతి కోర్టులో విడాకులకై ప్రయత్నించి డిక్రీనిపొందెను. ఇది పత్రికలందలి యూహలను మరింత బలపరచెను.

వాలిస్ ఎర్నెస్ట్ సింప్సను అమెరికా యందలి బాల్టిమూరుపట్టణ నివాసస్థురాలు. ఇంగ్లండుచరిత్రలో సుప్రసిద్ధులైన నార్మను ప్రభువులవంశమున జనించినది. ఈమె కిపుడు 38 సంవత్సరములు. ఆమె మొదట 1916 వ సంవత్సరమున అమెరికా నౌకాసేనానియగు స్పెన్సరును వివాహమాడెను. ఆరుసంవత్సరము లాతనితో కాపురమొనరించి విడాకులుపొందెను. తదుపరి ఎర్నెస్ట్ సింప్సను అను అమెరికను న్యాయవాదిని వివాహమాడెను. ఆతనికి యింగ్లండులో షిప్పింగ్ ఏజెంటు ఉద్యోగమైనందున నామె యింగ్లండులోనే యుండెను. ఎడ్వర్డుగారు వేల్సు యువరాజుగా నున్నప్పుడే యామెను గలసికొనుట తటస్థించెను. వారిపరిచయ మభివృద్ధినొంది, స్నేహరూపముదాల్చి యంత్యమున ప్రణయముగా పరిణమించెను. అప్పటి నుండియు నామె రాజాంతఃపురమున జరుగు విందులకెల్ల మంత్రులతోగూడ నాహ్వానింపబడుచున్నచ్చెను. కొంతమంది దీనిని సహింపరైరి. ఈసమాచారములెల్ల బ్రిటిషు పత్రికలందు ప్రకటింపబడకుండ నాపబడెను. కాని యమెరికాపత్రికలు విరామములేకుండ చక్రవర్తి నామె వివాహమాడుననియు, నామె రాణిగానున్నదనియు వ్రాయ ప్రారం

భించెను. అంతట మతాధికారులు మంత్రులును ఊరకుండు టుచితముగా తీవ్రముగ నాలోచింప మొదలిడిరి. చక్ర... మాత్రము తానామెను వివాహము... నిశ్చయించుకొన్నట్లు బాల్డ్విన్ ప్రధాని... చెప్పివైచెను. ప్రభుత్వము, సామ్రా... మందలి యితరరాష్ట్రములు దాని కంగీక... వనిచో రాజ్యమును త్యజించుటకు సిద్ధము... నుంటినని తెలిపెను. ప్రజలు చక్రవర్తి... యాశయములతో నేకీభవించినను వా... ప్రభుత్వమునురాష్ట్రములు నంగీకరింపలే... కారణ మేమన సింప్సన్‌సతి రాచకన్య... గాదు; పైగా రెండుమార్లు విడాకులిచ్చిన... అదియునుగాక బ్రిటిషు రాజ్యాంగపద్ధ... దాని కొప్పుకొనదు; సాంప్రదాయము... కదివ్యతిరేకము. తుదకు చక్రవర్తి 'మా... నాటిక్' వివాహమునకైన అనుమతివ్వ... నని కోరెను.

ఈ వివాహముప్రకారము ఆమె రాణి... కాజాలదు; ఆమె సంతతికి రాజ్యము సం... మించదు. కాని మంత్రి దాని కంగీకరిం... లేదు. బ్రిటిషు రాజ్యాంగములం దిట్టిద... మిదివఱకులేదు; నూతనముగా ప్రవే... పెట్టుటకు వారు సంసిద్ధులుగాలేదు; అ... ఆతని సమాధానము.

హృదయపూర్వకముగ ప్రేమించి... యామె సహకారతలేనిది సంతోషమేగా... రాజ్యభారముకూడ వూనజాలనని మొం... ప్రేమపూరితహృదయ మొకవంక; మాన... త్వము నెంతమాత్రమును లెక్కింప...

సాంప్రదాయములని ప్రాకులాడు రాజ్యాంగ పద్ధతిగల సామ్రాజ్య మొకవంక; ప్రకృతి సిద్ధమై సచ్చిదానందప్రదాయినియగు ప్రేమ యొకవంక; పెక్కు నిర్బంధములచే వ్యక్తిత్వమునుకూడ మంటగలుపు ఛాందస మైన సామ్రాజ్యాధికార మొకవంక; గను గొని,

"కారే రాజులు రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పో
వంజాలిరే? భూమిపై

పేరైనంగలదే?......'' అనియు,
'' .....రాజ్యములేల? వైభవము లే

లా ధర్మము లేనిచో'' అనియు దలంచి నశ్వరమగు సామ్రాజ్యము త్యజించి యనశ్వరమగు ప్రేమసామ్రాజ్యాధి పత్యము వహింప నిశ్చయించి డిశంబరు 10వ తేది రాజ్యత్యాగప్రమాణపత్రముపై సంతకముచేసెను.

ఇంతటి మహోన్నతత్యాగ మింతవఱకు ప్రపంచచరిత్రలో గానము. ఇకమీదట నైన నుండుట సందియమే. రాజ్యము నకు రాకముందే ఎడ్వర్డుగారు ప్రజాహృదయమును చూరగొనియుండిరి. వీరి సార్వభౌమత్వముచే సామ్రాజ్యమున నూతనోజ్జీవము గలుగునని యంద రాశించిరి. ఇవ్విధమున ప్రజాహృదయ మును గడించిన వీరు త్యాగముచే స్థిరముగ నందు నెలకొనిరి.

ఇట్టి వైవాహికసంబంధములు భారతీ యులకు నూతనముగనుండవచ్చును. కాని వారుకూడ చక్రవర్తిగారి యాశయములతో నేకీభవించిరి. పాశ్చాత్యదేశములం దిట్టివి సర్వసాధారణములు. అందుచే వారు చక్ర వర్తిగారి వివాహమున కడ్డుచెప్పుటలో నర్థములేదు. పైగా సాంప్రదాయములకై యుత్తముడగు చక్రవర్తి వ్యక్తిత్వమునకు ఆటంకముగదా! వాలిస్ సాధారణకుటుంబిని యైనందుననా నీయవరోధము? ఇదిమాత్రము సమంజసమా? ప్రభుత్వమునం దున్నత స్థాన మాక్రమించుటకు ప్రతివారు దగి యున్నారని వారి సిద్ధాంతముగదా? దీనిని బట్టియేగదా యూరుపేరులులేని హిట్లరులు, మసోలినీలు, మాగ్డనాల్డుగారలు పైకి వచ్చుట! ఇంతయేల? బ్రిటనునందే చక్ర వర్తికంటె యెక్కుడధికారముగలిగి వారిని సైతము చెప్పు నేతలలో నుంచుకొను ప్రధానామాత్యపదవిని పత్రిక లమ్ముకొని జీవించుచుండిన బీదబాలురుగూడ నాక్ర మింపనగుచో, చక్రవర్తియే హృదయ పూర్వకముగ ప్రేమించిన యొక సాధారణ కుటుంబిని రాణి కాకూడదా? తాము నాగరికులమని, కులభేదములు వర్ణవ్యత్యా సములు అనాగరికపద్ధతులని డంబములు బల్కుచు నితరుల వెక్కిరింపనగును గాని, వ్యక్తి స్వాతంత్ర్యమునుగాని, మానవత్వ మునుగాని, గుణప్రాధాన్యతనుగాని గమనించి మెలంగుట వారికి సాధ్యముగాదేమో?

ఎటులైననేమి? రవియస్తమింపని సామ్రాజ్యనాథుడైయుండిన ఎడ్వర్డును వాలిస్ ఐంద్రజాలికపోయినను, ప్రేమ సామ్రాజ్యధినాథుడై ప్రపంచహృదయమున స్థిరముగ నెలకొన్న నుత్తమపూరుషుని పొందగలదు.

బ్రిటిషుప్రభుత్వము ప్రేమించిన సాధారణ స్త్రీకొరకై చక్రవర్తి తనపదవిని త్యజించునా యని సందేహించెను కాబోలు. అట్లైనచో వారు ప్రేమయొక్క తత్త్వమును శక్తిసామర్థ్యములను సరిగా గమనించియుండరు. అది దేనిని లెక్కింపదు. అడ్డు వేసిన నిలువదు; అణగద్రొక్కిన నశింపదు. ఇట్టి పవిత్ర పరమోత్కృష్ట ప్రకృతిని ప్రకటించిన ఎడ్వర్డుగారికి నమోవాకములు. ఈ మహనీయుని యాశయములు లభించి యాత్మానందలబ్ధి లభించుగాక.

ఇంతట మహోన్నతుని స్థాన మాక్రమించిన యారవజార్జి సార్వభౌములును, యెలిజబెత్ రాణిగారును ప్రజల హృదయమును చూరగొని సామ్రాజ్యమును వైభవోపేతము గావించి వెలయుదురుగాక.

* * *

గృహలక్ష్మి కొకసోదరి

నవవర్షప్రాయమై నాంధ్రుల యింట నల్లారుముద్దుగా బెరిగి యందరి మన్ననల నందుచున్న 'గృహలక్ష్మి'కి ఈమాసారంభమున నొక సోదరి ప్రభవించినదని తెలిసికొనుటకు పాఠకు లానందింతురని మెంచెదము. జనవరి మాసారంభమునుండియు "గృహలక్ష్మి" యను పేరుతోడనే యాశయములతోడనే తమిళభా(అరవము)యందు మాసపత్రిక మాక్యాలయమునుండి వెలువడుచున్నది. స్త్రీ సంబంధించిన పద్యగద్యవ్యాసములు చిపటములు ఆంధ్ర గృహలక్ష్మియందు స్త్రీల యాయురారోగ్యాభ్యుదయము నభివృద్ధిజేయు నుద్దేశముతో ప్రకటింపబడుచుండును.

ఇదివరలో నరవమున స్త్రీల స... మాసపత్రిక యొక్కటుండినదిగాని ... డొక్కపత్రికయైన స్త్రీలకొఱకై ప్రత్యే... ముగ వెలువడుచుండుటలేదు. ఈకొ... తీర్చ తమిళ సోదరీమణుల నుజ్జీవిం... దలంపుతో వెలువడు తమిళ గృహలక్ష్మి... యందరి యాశీర్వాదములబలంబున తనసో... వలెనే తామరతంపరై వర్ధిల్లునని యాశి... చున్నాము.

* * *

నెహ్రూ.గారి విజయము

భారతీయనేతలందు లోకోన్నత పురు...డైన మహాత్మాగాంధిగారికి తరువాత నె... దగినవారును ప్రస్తుత పరిస్థితులలో దేశము... దంతయు నైకమత్యము నెలకొల్పి రా... విషమపరిస్థితుల నతి చాకచక్యముతో నెదుర్కొని దేశోన్నతికి దోడ్పడు సామర్థ్యము గలవారును శ్రీయుత జవహరిలాలు... రొక్కరేయని భారతీయులందరు-మహా... గాంధిగారుకూడ- యేకగ్రీవముగనంగీకరిం...

విషయమే. అందువలననే గతసంవత్సరమున జాతీయ సభాధ్యక్షతనాతని కివ్వబడెను.

తనను నేతగా నేర్పరచుకొన్నందులకు ప్రతిఫలముగా జవహరిలాలుగారు కాంగ్రెసు కార్యక్రమమంతయు నతి నిపుణతతో నిర్వహించుటయేగాక యావద్భారత దేశమంతయు దిగ్భ్రమ జనించురీతి సంచారముగావించి కాంగ్రెసు యాశయములను జనబాహుళ్యమునకు తేటతెల్లముగ వివరించి వారితరపక్షముల మాని జాతీయపక్షమునే బలపరచురీతిగావించి దేశీయ విదేశీయ ప్రముఖులచే శ్లాఘింపబడిరి. ఈలోపల తన యుద్యోగకాలము ముగియవచ్చెను. కాని తాను తలపెట్టిన కార్యక్రమమంతయు ముగియదయ్యెను. రానున్న సంవత్సరమున జాతీయాధ్యక్షత నింకొకరు వహించినచో వారలు జవహరిలాలుగారు ప్రారంభించిన కార్య మాతనివలెనే నిర్వహింతురనుట సాహసము. దేశీయులంద రామోదించిన యాకార్యక్రమమును నూతనాధ్యక్షులు అనుసరించుటవీడి నింకొకత్రోవత్రొక్కుచో నది శుభావహముగాజాలదు. అందునకై యీపరిస్థితులలో తాను దలపెట్టిన కార్యజాలమును గమ్యస్థానము చేర్చువఱకు నెహ్రూగారే యధ్యక్షులుగనుండిన యుత్తమమని భారతీయులంద రేకకంఠముగ బలుకజొచ్చిరి. జవహరిలాలుగారి కొక్కరే పెక్కుమారులు దేశీయసభాధ్యక్షులుగా నుండుట కిష్టములేకపోయినను దేశమంతయు కోరినచో తాను వారుగోరువిధముగ వర్తింపనంగీకరింపకుండుటుత్తమముగాదని తనను మరల సధ్యక్షునిగా నెన్నుకొన్నచో వారి యిష్ట ప్రకారమే కార్యజాలమును కొనసాగింతునని ప్రకటించెను.

దీనిపై ఫైజిపూరుకాంగ్రెసు సభాధ్యక్షునిగా జవహరిలాలు నెహ్రూగారెన్నుకొనబడిరి. ఇయ్యది అఖిలభారతదేశమంతయు నంగీకరించిచేసినపని కాన జవహరిలాలు యాశయముల గుర్తెఱిగి వారిపద్ధతులయెడ గౌరవముంచిరని తలంపనగును. వారు ప్రారంభమందు తాను దలపెట్టిన సామ్యవాద పద్ధతులనుమాని యితరుల యిష్టప్రకారము వర్తించునను యభిప్రాయమును వెల్లడించినందుననే యెన్నుకొనబడిరని యనజాలము. అధిక సంఖ్యాకుల యభీష్టమెటులుండునో దానినిబట్టి వారు వర్తింపవచ్చును. కాని యిదివఱకే వారి పద్ధతులందరికిని నచ్చినవి; చాలమందినేతలు వారి సిద్ధాంతములే దేశాభ్యుదయమునకు మార్గములని యెంచుచున్నారు. వారు తిరిగి యధ్యక్షులైనందుల కభినందింపుచు వారాపదవియందున్నంత కాలము అధికసంఖ్యాకుల యాశయముల ననుసరించి దేశవిముక్తికి పాటుబడ పరమాత్ముడు వారి పాలనుండుగాకయని కోరుచున్నాను.

'మాయాబజారు'—తెలుగుటాకీ

వేల్ పిక్చర్సువా రిదివరకే 'సీతాకళ్యాణము' 'కృష్ణలీల'లవంటి జనాకర్షణీయమైన తెలుగు టాకీలను తయారుచేసి కీర్తి

గడించినవారు. వీరిచే నిటీవలనే విడుదల
గావింపబడి 'మాయాబజారు' లేక 'శశి
రేఖాపరిణయము' అను తెలుగుటాకీ
బ్రాడ్వే టాకీసునందు పత్రికాభిప్రాయము
నకై పత్రికాప్రతినిధులకు చూపబడినది.
ఈ టాకీ ఇదివఱకు తయారుచేసినవాటి
కంటె టెక్నిక్‌లో నభివృద్ధిపొందినది.
దృశ్యములన్నియు నాకర్షనీయములై
యున్నవి. పాత్రలు చక్కగ తమ భాగ
ముల నిర్వహించిరని చెప్పనగును. ఘటో
త్కచుని పాత్రయు, నాతని మాయలును
నటునికిని నిర్మాతలకును కీర్తి తెచ్చునవి.
కీ॥ శే॥ దాసుగారీ చిత్రము ముగియునంత
వఱకు జీవించియుండినచో నిది మరింత
రమ్యముగ నుండియుండెడిది. సంభాషణా
విధానమును, పాత్రోచితభాషయు, గాన
కళాప్రావీణ్యతా ప్రదర్శన సందర్భములును
రాబోవు చిత్రములలో నింకను నుత్తమస్థితికి
వచ్చునని యాశింతుము. ఈ చిత్ర
మొత్తముపై జనాకర్షనీయమై డ
గడింపగలదు.

* * *

ఏలూరు అన్నవస్త్ర వైద్య విద్యాదాన
సమాజము – 8 వ రి

దానధర్మ దయాపరులచే పైసమా
జము ఏలూరునందు 1913వ సం॥మున
కొల్పబడి నేటికిని అవిచ్ఛిన్నముగా సా
చున్నది. ఈ సంఘమునకు వేలకొ
రూపాయలు పెక్కుమంది దానముచేయు
టయు, వాని నుచితరీతివా రావశ్యకతగ
వానికెల్ల వినియోగపరుచుటయు ము
వహము. ఇట్టి సమాజములు వికలాంగు
కును, సాయమపేక్షించువారలకు ప్రత్యే
శరణాలయములనే నెలకొల్పి స్థిరము
వానిని పోషించిన మంచిది. దానపరు
వానికి తోడ్పడుదురని మాయాశయము.

# విషయసూచిక

క॥ పరిచారికలెల్లరు నిద్దురవోవఁగ, బ్రోదిచిల్కతో నొంటిగ సుం
దరనందుని ప్రియవృత్తాంత రహశ్చింతనము సెప్పి తలఁపులుత్రవ్వెన్.

గీ॥ మూఁడులోకమ్ము లొక్కటముంచియెత్తు ప్రణయమందాకినిని గృహోపవనసరసి
నిలిపికొని మోలలాడఁగాఁదలఁచు టెల్ల వీఱిడితనమ్ముగాదఁటే, వెఱ్ఱిచిలుక.

ఉ॥ పారములేని తన్మధురభావసమర్పిత పుష్పవీథిపైఁ
దీరుపుకత్తెనై నిలిచి 'దేహి'యనన్ వరమిచ్చు వేలునై
కూరిమిదేవినై మెలపుకొన్న ననుంబడఁద్రోసి విశ్వసం
సారము రాజ్యమేలుకొనసాగెఁగదే తుదిఁ జిల్కనెచ్చెలీ.

గీ॥ కాంతుమదిలోఁతుగనక మోకాలిబంటిగాఁదలంచి యప్పొంగితి, గౌతమర్షి
యంతరాంతరమున నిధులరసియెత్తి శుభ్రమణులెల్లరఁ నెఱచూఱలిచ్చె.

గీ॥ కారుగ్రమ్మిన నామనోగహ్వరమున వెలుఁగుమంగళదీప విశ్వమెల్ల
నేఁడు వెలిఁగించెఁగదె, చెలీ! స్నేహపూర నిర్వికలనిత్యశుభకాంతి పర్వుకొనఁగ.

పల్లెటజడమ్ము పున్నెమ్ము ఫలియించి స్వామి సేవ లందుకొమ్మనఁగా, నేనుగాదంటినంటవె?
నీచికలతోఁ బ్రాఁగినిక్కింద్రూడ నించుకంత పాలోసఁగ కిట్లు వెలితినేల చిలుక?

అతఁడు విహారక్రీడ్యములఁ జిత్రించు భావములకు ప్రాణమ్మునర్పఁ

గీ॥ దగనఁటే నేను, నెచ్చెలీ! తనకుఁగాని భాగ్యమిది నాకుమాత్రము యోగ్యమంట వె?
అడవులకునేఁగి యిలునాకడవిఁ జేసె నయ్యడవి దేవళమ్ముఁ జూనఁటె నేను.

—సౌందరనందము.




# ఇవి కళ్యాణ కార్యములుగావు

ఆదినము డిశంబరునెల యిరువదేడవ తేది సోమవారము. చల్లని ప్రశాంత హృదయముతో గోదావరితల్లి ఆహ్వాన వీచికల బరపుచున్నది. ఎనిమిది గంటలు పదునైదు నిమిషములకు గోదావరి స్టేషనునందు దిగితిని. రాత్రి. మినుకుచున్న దీపములు క్రమ్ముచున్న చీకటిని దగ్గఱ చేరనీయకుండుటకే అతిప్రయాసపడుచున్నవి. రైలుదిగి యిండ్లకేగు జనుల కోలాహలమునకు భయపడినదానివలె మెల్లగా గోదావరి గట్టుననుండి 'బాజాభజంత్రీల' శబ్దము వినవచ్చుచుండెను. అపు డదేమిటని విచారించినవారే లేరు. కళ్యాణసూచకమైన ఆ శబ్దము అనతికాలముననే మహాఘోరమైన హృదయవిదారక హాహారవమున మునిగి పోవునని యెవ్వ రెఱుగుదురు?

బండిలో తిన్నగా మిత్రునింటి కేగితిని. కుశలప్రశ్నలైనవి. పరామర్శ జరిగినది. భోజనములు ముగిసినవి. 'కబుర్లు' ఆరంభమైనవి. తొమ్మిదిన్నరకు మించియుండదు. ఇంతలో ప్రపంచము బ్రద్దలైనటుల 'ఢాం ఢా'మ్మని ప్రచండశబ్దము ప్రశాంతవాతావరణమును జీల్చుకొని బయల్వెడలెను. అపుడపుడే నిద్రాదేవి యాదరణబొంద ప్రయత్నించు ఆ పరిసరవాసు లొక్కుమ్మడి త్రుళ్లిపడిరి. శబ్దమేమిటో తెలిసికొనవలెననెడి యాతురత యందఱిని ఇండ్ల బైటికీడ్చినది. ఇనుమడించుచున్న యాతురతచే నేను నా మిత్రునిగూడి ఆ శబ్దము వచ్చిన దిక్కునకు బరుగిడితిని. గోదావరి గట్టుమీద వైశ్యసేవాసదనమునకు సమీపమున పడమటిదిక్కునగల చిన్నరాగిచెట్టు

వద్ద ఆశ్బమ్ము బైలుదేరినది. అచట జనుల కోలాహలము పెచ్చుపెరిగి పోవుచున్నది. హాహాకారములు మిన్నుముట్టుచున్నవి. ఏడ్పులు పెడబొబ్బలు హృదయమును జీల్చుచున్నవి. అతిబాధాసూచకముగా వెలువడు మూల్గులు ప్రాణపట్టుల దాకు చున్నవి. దిక్కుతెలియక జనులు నలుదెస లకు పరుగిడుచున్నారు; నలుదిక్కులనుండి తండోపతండములుగ ఆచోటు చేరజను చున్నారు. కారుచీకటిని కలకల శబ్దముతో బారుగోదావరి సుడిగుండమునబడి తిరుగు భ్రమాకులవలె కకావికలై ఆచుట్టును పరువు లిడుచున్నవారిని గమనించినటులేలేదు. ఆ గుంపులోబడిఅతికష్టముతో ఆచోటుచేరితిని.

ఘోరము! అతిఘోరము!! భయంకరము!!! తలదిరిగినది. తనువు స్తంభించినది. ప్రాణములు పైకెగసిపోయినవి. అచట కొన్ని శరీరములు ఛిన్నాభిన్నములై గట్టు మీద బడియున్నవి. ఆ ప్రదేశమంతయు రక్తమయము. మొండెములనుండి రక్తము ఇంకను చిమ్ముచునేయున్నది. కాళ్లు, చేతులు తెగిన మొండెములు, తెగిన యవయవము లతోగూడి వెదజల్లబడియున్నవి. ఒక దుర దృష్టవంతుని ప్రేవులు ఎగిరి గట్టుక్రింద గోదావరినీటి సమీపమున బడియున్నవి. ఇద్దరు తెగగా మిగిలిన శరీరములతో గోదావరిలో జేరు మురికినీటి కాల్వతూములో బడి యున్నారు. ప్రాణములుపోవని మరికొందఱు భయంకరరూపములతో మూల్గుచు, తాము పడు యమయాతనల తమ రూపములచేతనే వ్యక్తపరచుచున్నారు. వచ్చిన రక్షక భటులు ప్రాణములుపోక పచ్చడిగా బడి యున్న కొందఱిని హాస్పిటలుకు పంపుచు న్నారు. అచటనున్నవారును, వచ్చువారును, ఊరులోనివారుసుకూడ ఏకకంఠముగ ఎలు గెత్తి దుఃఖించువారే. ఆ ఘోరవిపత్తునకు గురియైనవా రెవ్వరో తెలిసికొన వీలులేదు. ఆ ముక్కలైన శరీరములతో ఆ రక్తపాత ములో భూమాతయొడిలో పొరలాడు చుండువారేతల్లి మురిపెంపు ముద్దుబిడ్డలో, ఎవరిగారాబు'కన్నతండ్రు'లో వెంటనే తెలిసి నది గాదు. వారంద ఱా మరునాడుగాని గుర్తింపబడలేదు. మావారేరి? యని ప్రతి వారు ప్రతిచోటను వెదకువారే. మాయింట నందఱున్నారా యని ప్రతివారి నడుగువారే. తలిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, బంధువులు, తమతమ వారలను వెదకికొనుటయందు జూపిన ఆతు రత, ఆందోళన, ఆరాటము పాషాణముల గరగించును. అబిసీనియాలో జరిగిన ఘోర ములు, స్పెయినులో, చైనాలో జరుగు చున్న భయంకర పైశాచికకృత్యములు, ఆ యుద్ధభూములు, అఖండ మొండెములు, ఆ ప్రేలుడులు, ఆ హృదయవిదారకదృశ్య ములు, పత్రికాముఖమున వర్ణింపజాలని పదజాలములో, చీకటిని వెనుక వేసుకొని వచ్చు చిత్రపటములలో జూచుటయకాని యధార్థముగ జూచియెఱుగము. ప్రశాంత ముగబారు పవిత్ర గోదావరితల్లి యొడ్డున గాంచిన యీ ఘోరదృశ్యమునుగని ప్రప

చమం దితరచోటుల జరుగు ఘోరముల నూహించుకొంటిని. పైఘోరము ఒక కళ్యాణోత్సవ విశేషమే.

రాజమహేంద్రవరమున నొక గొప్ప వైశ్యకుటుంబమున కళ్యాణము జరిగినది. వారు ధనికులు. కళ్యాణమును వైభవోపేతముగ జరుపదలంచిరి. బాణసంచాలు దానికి తప్పనిసరియని యెంచిరి. 'బాణసంచాలు' గాల్చుట ధనమును నిష్కారణముగా తగులబెట్టుటయని వారెంచరైరి. ఆకస్మికాపాయముల కవి కారణములగునని తలంపరైరి. వధూవరుల నిరువురిని ఏనుగుపై నంబారిలో నూరేగింప దలంచిరి. ప్రథమమున గోదావరిగట్టున బాణసంచాలనుగాల్చి బయలుదేరదలంచిరి. గంభీరగమనయై గోదావరి వారివైభవ ప్రదర్శనమును తొణకనిహృదయముతో తిలకించుచుండినది. ఉత్సాహపూరితులై యూరివారందఱు గుంపులుగట్టి యేతెంచిరి. బాణసంచా కాల్చువారు 'షాటా'ను భూమిలో పాతినారు. నిప్పంటించినారు. అది సాధారణముగా ప్రేలి ఆకసమున కెగసి అచట మరల ప్రేలి ప్రేక్షకులకు తనప్రతాపమును ప్రకటించు స్వభావముగలది. ఆ కటికిచీకటి రాత్రి యది ఆకాశయానమున కనిష్టపడెనో, ఒత్తిగానువచ్చు చూపరులపై కినిసెనో, భూమట్టమునకువచ్చి చూపరుల మధ్య ప్రేలినది. అత్యుత్సాహముతో ఆకసమువంక జూచుచున్నచూపరులు 'షాట్' ధాటికి బలియైరి. ఆబలియే యంతటి భీభత్సరూపము దాల్చినది. ప్రతికి బైటబడిన అదృష్టవంతులుగాక బలియైనప్రాణములు పది. ఇట్టిఘోరము నిదివఱ కాంధ్రదేశమున కని విని యెఱుగను. బాణసంచాలు కాల్చువారియుద్దేశము వైభవప్రదర్శనము గావచ్చు; ఉత్సాహపరుచుట గావచ్చు; లేక ఆచారమే గావచ్చు. ఏమైనను ఇది నిష్ప్రయోజనమనియు, ఆకస్మికాపాయముల కెడమిచ్చుననియు నాలోచింపక పోవుట మాత్రము చింతనీయము. ఆకస్మికాపాయములు సర్వసాధారణములు కావు. అవెపుడు గల్గునో ఊహింప సాధ్యముగాదు. నిరుపయోగముగా ధనము భస్మముచేయు నీ బాణసంచాలు గాల్చు వాడుకకంటె కళ్యాణప్రదములైన కార్యము లుత్సహించు టెంత యుక్తమో యూహింపలేరా?

వివాహపు టాశయములు చాలవఱకు త్రుప్పుపట్టినవి. కళ్యాణమునకున్న యర్థమును దీసివేయుచున్నవి. పై పెచ్చుగ 'వాడుకలు' అనర్థములకు కారణము లగుచున్నవి. తెలిసినవారుకూడ 'గతానుగతికు' లగుట విచిత్రముగ నున్నది.

దేశసంఘపరిస్థితుల నెఱుగక, లేక యెఱిగియు లెక్కింపక యీవిధముగ ధనమును తగులబెట్టు నాచార మింకనైన కట్టుబడవలెను. కనుమరిగిన ప్రాణములదీయు బాణసంచాల గాల్చు నలవాటు నిషేధింపబడవలెను. అన్నవస్త్రములకు లేక నలమటించు వారిని గన్న కరుణాహృదయములు దీనిని సహింపవు. ప్రజాభ్యుదయమునుగోరు ప్రభుత్వము దీనిని భరింపజాలదు.

చదువుల రామచంద్రయ్య.

# గమనిక

డిశంబరు సంచికయందు 'ఆంధ్రరమణీమణులు' అను శీర్షికతో వ్రాసిన క్రిందివిషయములను పాఠకలోకమునకు జ్ఞాపకము చేయుచున్నాము. మాకింతవఱకు ఒక్క జీవితచారిత్రమే వచ్చుట చింత్యము.

కాలానుగుణ్యముగ ఆంధ్రులభివృద్ధి – అన్నిశాఖలందును – గాంచుచునే యున్నారు. అభివృద్ధిని గాంక్షించి రాత్రింబవళ్లు కృషిచేయు స్త్రీపురుషుల ప్రయత్నమే దీనికి కారణము. ప్రకృతమట్లు పాటుబడుచున్న రమణీమణులు పెక్కురు. వారిపద్ధతు లొకటిగాక పోవచ్చును. పథములు భేదింపవచ్చును. వారందు కుపయోగించు సామగ్రి వేరుగా నుండవచ్చును—సాంఘికాభివృద్ధికవి అత్యవసరము లనుమాట మఱవకూడదు—కాని గమ్యస్థాన మొక్కటియే. ఇపుడు ఆంధ్రాభ్యుదయముకై నిరంతరము కృషిసలుపువారిలో కలము చేబట్టి సంఘములోని కల్మషములఖండించి, సహృదయుల సానుభూతిని సంస్కారములపై బరపు రమణీమణులు గలరు. పాండిత్యమునుబడసి, విజ్ఞానమును విరివిగ గడించి విద్యావిహీనులకు సాదరపూర్వకముగ దాని నొసగు ప్రతిభాశాలు లున్నారు. సాంఘికోన్నతికి అడ్డపడు అలవాటులను అనాచారములను తుదముట్టింప బట్టుబట్టి చట్టములమూలముననైన సంఘమును సరిదిద్ద బూను సాహసికలు గలరు. అభివృద్ధిని గాంక్షించుచు ముందంజవేయ వెఱచియున్న వారికి ధైర్యముగొలుపు తామే నిష్ప్రయోజనమగు నిర్బంధముల త్రెంపి యాదర్శప్రాయులైన వారును గలరు. వివిధకష్టములబడి విద్యాలయములస్థాపించి యావజ్జీవము వానిని నిర్వహించుచు విద్యావ్యాప్తిని గావించు విదుషీమణులు గలరు. అట్టిసంస్థల ప్రోత్సహించువారును గలరు. మాతృదేశదాస్యశృంఖలముసుద్రుంప ఆత్మత్యాగులై, స్వాతంత్ర్యసమరమున కురికి అద్భుతమైన సహనము సాహసముజూపి, ఆంధ్రమాతహృదయమున నగ్రస్థానము సంపాదించుకొన్న స్త్రీరత్నములు గలరు. రాజకీయములందు పాల్గొని పరిపాలన బాగుచేయ పాటుబడువారును గలరు. విద్యాగంధ మిసుమంతయు లేకున్నను, మానవసేవయే మాధవసేవయనుట నెఱింగి బీదసాదలకెంతయో సాయమొనర్చుచు, సత్రములగట్టించి బావుల త్రవ్వించి తీరని సాయమొనర్చువారును గలరు. ఇంకను నెన్నియోవిధముల పాటుబడువారును లేకపోలేదు.

మేమిపుడు ఆంధ్రాభ్యుదయమున కేవిధముగనైనను పాటుబడుచున్న ఆంధ్రస్త్రీరత్నముల చరిత్రలు వారి ఛాయాచిత్రములతోబాటు (Who is who in Andhra Desa) ప్రకటింప సంకల్పించితిమి. దానిలో చేరదగిన వారి యోగ్యతయొక్కటే సేవ—దేశసేవ, జాతిసేవ, సంఘసేవ. వారు పండితులుగానిండు, పామరులుగానిండు, ధనికులుగానిండు, దరిద్రులుగానిండు, వారికందు స్థానముండును. గృహలక్ష్మల యభివృద్ధినిగోరు స్త్రీపురుషులెల్లరు అట్టివారి చరిత్రలను సేకరించి, క్లుప్తముగ, వారి ఛాయాచిత్రములతోబాటు పంప ప్రార్థించుచున్నాము.

# గుణవతి

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

'కలడుకలడమ్మ దేవుడు కలడు సుమ్మ'

క॥ ఇటులనెడు దీనచెలిగని, కుటిలాలకబలికె జాలిఁగొదకొనియెడు నా
కటడస్నితి భుజియించుమి, యటమట మొందకుము మాటలాడుద మవలన్.

గీ॥ అనుచు ప్రియమును నాదరం బలమికొనగ, నన్నమిడి కొదదీర నిట్లనియె నిన్ను
నాకడకు నేడుదేవుడే నడిపినాడు, నన్ను దిక్కుగజూపించినాడతండె.

ఉ॥ ఇచ్చటనుండు దేవుడట నెన్నగలేడనరాదు జూవె దా
నెచ్చటనైనగానిగలఁ డీశుడు లేక జగత్త్రియంబు నిం
కెచ్చటనుఁడ నేర్చునిది యెవ్వనియానతిమేర వర్తిలున్
మచ్చిగనెంచుమా ప్రభుడుమాన్యుడు బ్రోచెడు దైవమాతడే.

గీ॥ దైవమునునమ్మి శుభములందంగవచ్చు, ధర్మమొనరించి సుఖములందంగవచ్చు
దైవమునుగొల్చి ధర్మంబుదప్పకున్న, పాపమెడలి సుకృతములుబడయవచ్చు.

గీ॥ చేసికొనిన దుష్కృతములు చెడకయున్న, నీతిపున్నెంబు సుకమునిం కెటులగలుగు
ధర్మరతి నాజగన్నాథుఁదలచి, శాంతిదనరమెలగిన విపదబ్ధిఁదాటగలము.

గీ॥ శాంతమెడలిన ధైర్యంబుసన్నమగును, దేహపాటవమును జెడుతెగులు నొగులు
దిగులువగలబొగులజేయు మిగులమనము, గలచిగావున జగధీశుఁగొలువమేలు.

క॥ పరులకు భయపడరెవరో, పరులకు భీప్రదులుగాకఁ బ్రదుకుదురెవరా
నరులుత్తమపథధర్మా, చరణులు సుఖదుఃఖసమత జరగుదురుసుమీ.

చ॥ ఘనులకుగాని నీచులకుగాని శరణ్యముదైవమే సుమీ
వినుమిలబ్రోచుదేవుడని వెఱ్ఱినిసోమరివై జరింపకే
గొనకొని సత్కృపింజలుపఁగూడుదు కార్యములెల్లమాని నీ
వినయము, విద్య, తెల్వియు, వివేకము, ధైర్యమునుండు టొప్పగున్.

క॥ యీలీలవగచుచును ధృతి, దూలందగదమ్మ దేవుదూరకుమా నీ
పాలిటికర్జముదప్పనె, కాలనుదురతి క్రమంబుగద యెవ్వరికిన్.

ఉ॥ లెమ్మ ప్రయత్నముంజలుపు లేమరొవచ్చిరి వార్తబంపనీ
కొమ్మలు వీరికూతులకు కూర్మిజెలంగగ నొజ్జవౌచునీ
యమ్మలుమోదమందగ ప్రియంబునసోదరివై జెలంగుమీ
సమ్మతి నీదుబిడ్డలని చానరొ బాలికలందలంపుమీ.

గీ॥ అనుచు నామానవతుల కాయమనెఱుంగ, బలికివారల కామెకు చెలిమినెఱపి
రామునకునతి జేసి యారామబలికె, కలడుకలడమ్మదేవుడు గలడుసుమ్మ.

## మనసులోమాటలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

### స్త్రీ శిక్షణశాల

నేడు దేశహితైకమైన ప్రతి కార్యక్రమంలోను స్త్రీలుగూడా పాల్గొనవలెననే మాట ప్రతివారినోటా వినబడుతున్నది. దేశహితమైన యేవుద్యమంగాని స్త్రీలుచేపట్టినప్పుడే దానికి వ్యాప్తి విజయం సిద్ధిస్తుందని మహాత్ముడు మాటిమాటికి నొక్కినొక్కి చెప్పుతున్నాడు. ఆయనతోబాటు తదితర దేశనాయకులు గూడా అదే మంత్రం ఉపదేస్తున్నారు. కాని కార్యక్రమంలోచేరి స్త్రీలు గట్టిగా పనిచేయడానికి తగిన సామర్థ్యం స్త్రీలకు యే విధంగా కలిగించాలనో ఆ విషయం మాత్ర మెవరూ ఆలోచించడంలేదు. అసహాయోద్యమం బాగా విజృంభించిన రోజుల్లో చాలామంది స్త్రీలు ముందుకువచ్చి బాగా పని చేశారు. ఊరూరుతిరిగి ఉపన్యాసాలు యిచ్చారు. కాని పురుషుల ఉపన్యాసాలవలె స్త్రీల ఉపన్యాసాలు ప్రజలను ఆకర్షించేవికావు. అయినా మాటకంటె క్రియకే మెక్కువ విలువగలిగిన ఆ దినాల్లో పండువంటి సంసారాలను ముద్దులు మూటగట్టే బిడ్డలనూ దైహికమైన స్వసుఖాలను పరిత్యజించి కఠినకారాగారనివాసానికీ దారుణదండప్రహారాలకు తలయొగ్గి విచ్చేసిన ఆవీరనారీమణులు యే నాల్గుముక్కలు చెప్పినా ప్రజలుమేలు మేలనే వారు. ఇప్పుడు దేశం అటువంటి ఉరవడిలోలేదు. కలకదేరిన నదివలె ఉద్యమం నిలబడి చల్లగా వ్యాపిస్తున్నది. నదీప్రవాహానికి వెల్లువ వచ్చినప్పుడున్నంతవేగం సాధారణ పరిస్థితుల్లో ఉండదు. శాంతమై విషయ సమగ్రమైన ప్రబోధమే యిప్పుడు దేశానికి అవసరము. అట్టి ఉపయుక్తమైన ఉపన్యాసములు స్త్రీలు యివ్వవలెనంటె వారు అందుకు తగిన శిక్షణను ముందుగా పొందివుండాలె. ఇళ్లల్లో మగవారు మాట్లాడుకొనేమాటలనుబట్టి దోవను బొయ్యేవారు చెప్పుకొనే సంగతులనుబట్టి తెలిసీ తెలియని తమ వూహాలనుబట్టి స్త్రీలు ఉపన్యాసాలియ్యబోతే పరిహాసభాజనులు కావలసిందేగాని ప్రయోజనం ఉండదు. స్త్రీలవల్ల చక్కని ప్రబోధ కార్యక్రమం నిర్వర్తింపజేయవలెనంటే వయోజన నారీశిక్షణ శాల లేర్పరచి అధమం ఆరువారాలపాటైనా ప్రముఖులైనపెద్దలద్వారా ఉపన్యాసాలిప్పించీ 'మేజిక్‌లాంతరు ప్రదర్శనాలు చూపించీ' గ్రంథ పత్రికాపఠన పరిచయం గల్గించీ స్త్రీలకు జ్ఞానవికాసం కలుగజేయాలె.

ప్రస్తుతం మనదేశంలో రైతుసంస్థలు సహకార సంఘ ఉపయుక్తమైన యీ పద్ధతి ద్వారా యువజనులనేకులకు ప్రతివత్సరమూ శిక్షణ యిస్తున్నవి. స్త్రీలకుగూడా యీ విధంగా శిక్షణ యివ్వడం చాలామంచి పద్ధతి. దీర్ఘకాలం విద్యాభ్యాసం చేయడాని అవకాశంలేని స్త్రీలు యిట్టి వయోజనపాఠశాలలద్వారా అనతికాలంలో విశేషమైన జ్ఞానం సంపాదించగల్గరు. కాని యింతవఱకు యెవరుగాని దీనినిగురించి ఆలోచించినట్టు కన్పడదు.

స్త్రీలలో కొందఱికీ కుతూహలం వ్యక్తివరంగా ఉన్నా ధనసాధ్యమైన యీ ప్రయత్నం నిర్ధనులైనతాము తలపెట్టడం తలకుమీరిన కోరికని వూరుకున్నట్టు తోస్తుంది.

ఈ యత్నం స్త్రీలే చేయవలెననిలేదు. పురుషులుగూడా చేయవచ్చును. ప్రజలే పాటుపడాలెననిలేదు ప్రభుత్వంవారుగూడా సహాయమొసర్పవచ్చును. చందాలే దీనికి ఆధారంగాదు సంపన్నులైన వారొక్కరే దీనిని సాధింపవచ్చును గ్రామపునర్నిర్మాణమూ, మద్యనిషేధమూ, హరిజనసేవా, భాషాప్రయుక్తరాష్ట్ర విభజనము, గృహపరిశ్రమలు, జాతీయవిద్య, సంఘసంస్కారమూమున్నగు విషయాలెన్నో దేశంలో ప్రజలనాందోళన పెట్టుచున్నవి. వీటిని గుఱించి పురుషులు తెలుసుకొనుట యెంతఅవసరమో అంతకు నూరురెట్లు స్త్రీలు తెలుసుకోవలసిన అవశ్యకతగలదు. ఇందుకు శిక్షణశాల లేర్పరచి తర్ఫీతు యివ్వడమే చేయవలసిన పని; లేదా ప్రయోజన మాశించిన వారివల్లనే నిరోధం యేర్పడు తున్నదంటే ఆశ్చర్యపడవలసిన పని ఉండదు.

### ఋణ విమోచనపు మాత్ర

బాలురనక, వృద్ధులనక, అశక్తులనక, ఆడవారనక రాజధానీ ప్రజలందఱిచేతా ఋణ విమోచన బిల్లనే యీ మాత్రను మ్రింగించవలెనని చూస్తున్నది మద్రాసు ప్రభుత్వము. రైతులేమో దీనిని పంచదారగుళికగా భావించి యెప్పుడెప్పుడా అని వువ్విళ్లూరుతుంటే తదితరులు దీనిని క్వైనా మాత్రగాభావించి యెల్లాగురా యీకాలకూటపు విషాన్నిమ్రింగేదని తహతహలాడుతున్నారు. ఎవరేమిగా అనుకున్నాసరే దీనిని మ్రింగక తప్పదని మందలిస్తున్నారు మహామాత్యులు.

ఈ ఔషధంవల్ల కలిగేప్రయోజనం ముందుముందు యెట్లావుంటుందోగాని ప్రస్తుతం దీనివల్ల ప్రజలు రెండుగాచీలి పోయినారు. ప్రజనేశరీరానికి రైతే వెన్నెముక గనుక ఆ వెన్నెముక గట్టిగా ఉండటానికి యీ ఔషధం అవసరమని అనుకూలుర వాదన. వెన్నెముక గట్టిగా ఉండటానికి మేమూ ఆమోదిస్తామునరే వెన్నెముక శరీరంలో ఒకభాగమేకాని ప్రత్యేకవస్తువుకాదు గదా, తక్కిన యెముకలన్నీ చిదుకగొట్టి వెన్నుకకుమాత్రమే పుష్టి నిస్తే యేమి ప్రయోజనమంటారు వ్యతిరేకులు. కడచిన ఆర్థికమాంద్యంలో వెన్నెముకకు మాత్రమే గట్టిగా దెబ్బతగిలింది గనుక దానిని బాగుచేయడమే అవసరమంటారు అనుకూలురు. కాదండి వెన్నెముక యెప్పుడు దెబ్బతిన్నదో దానితోబాటు తక్కిన యెముకలూ జంకిచ్చినవి. శరీరంలో ఒకభాగంవ్యాధిగ్రస్తమైతే తక్కినభాగాలు మాత్రం పీడితంగావా అందులో ప్రధానమైన వెన్నెముకే దెబ్బతింటే తక్కిన యెముకలకు ఆప్రహారం సోకకుండా యెట్లాపోతుంది? శరీరంలోని అవయవాలన్నీ పరస్పర సంబంధంగలవే గాని విడివిడి ముక్కలు కావుగదా కనుక వెన్నెముకతోబాటు తక్కిన యెముకలూ దెబ్బతిన్నవి. కావలిస్తే ఎక్సురేతీసి చూడండి నిజం తెలుస్తుందంటారు ప్రతికూలురు. మొత్తంమీద యీ

వివాదం దేశాన్ని అట్టుడికించి నట్టుడికిస్తున్నది. ప్రజలు కంగారుపడుతున్నారు కాని యీ మాత్రను తయారుచేసిన మహావైద్యులు మాత్రం మాకేం పరవాలేదన్నట్టుగా అచంచలంగావున్నారు. అవును తల్లిగండం బిడ్డగండం ఉంటుంది. మంత్రసాని గండం వుండదుగా.

ఈ బిల్లు ఆడవాళ్లనుగూడా విడిచిపెట్టలేదు. సంపాదించిపెట్టే పెనిమిటి దురదృష్టవశాత్తు నడివయస్సులోనే విగతజీవుడైతే కాస్తోకూస్తో పొలపుచెక్కవుంటే యేరైతుకో మక్తాకిచ్చి తరతరాలనుంచీ ఉభయ కుటుంబాలకూవున్న సంబంధ సఖ్యతలచేత, నమ్మకంచేత వొంటిమీద గుల్లాగుట్రాగూడా అమ్మి ఆరైతుకే అప్పిచ్చి నాలుగేళ్ల పాటుయెట్లాగో తిప్పలుపడితే పిల్లపెండ్లికో పిల్లవాడి చదువుకో అక్కరకొస్తుందని రైతునే నమ్ముకొన్న అనాథస్త్రీ లెందరో దేశంలోఉన్నారు. అటువంటి సందర్భాల్లో యీ ఋణవిమోచనపు బిల్లు సంపన్నుడైన ఆసామీని రైతుగాభావించి రక్షణయిచ్చి అనాథయైన స్త్రీని షాహుకారుగా నిర్ణయించి శిక్షిస్తున్నది. యిది మరీ దుర్భరంగాఉంటే స్త్రీల విషయమై యేదో కొంచెం సవరించారుగాని ఆసవరణ స్త్రీలకు అనుకున్నంతలాభం కలిగించదు. స్త్రీకి పొలమనేది యేమాత్రము లేకుండావుండి మూడువేల రూపాయలకులోపు అప్పుమాత్రమే కలిగి అదే జీవనానికి ఆధారంగా ఉండిఉంటే అట్టి వారినిమాత్రం ఈబిల్లు బాధించదట. అయినా యీవడపోత లింకా పూర్తికాలేదు కనుక యీసెలెక్టుకమిటీసూచనలే నిఖరమనుకోడానికి వీలులేదు. స్థిరమైన వారసత్వపు హక్కులుగాని, సొంత సంపాదనా సౌకర్యములుగాని లేశమూలేని స్త్రీలకు యీబిల్లు వర్తింపజేయడం దారుణమైనశిక్షేగాని సామాన్యంగాదు.

'ఇతరూ యిందర్ని లబలబలాడించి రైతుక్షేమం రైతుక్షేమం' అని గంటలు మ్రోగిస్తూవస్తూవున్న యీబిల్లు రైతునేమాత్రం ఉద్ధరిస్తుందో అదీ సందేహాస్పదంగానే ఉన్నది. రైతులలో యెందరో పెట్టుబడిదార్లున్నారు. యివ్వడం పుచ్చుకోవడం అనేది రైతులకు పరిపాటివ్యాపారం కనుక రైతులందఱు నిక్కచ్చిగా ఋణస్థులక్రిందికి వస్తారని అనుకోడానికి లేదు.

రైతులలాభం యెట్లావున్నా రైతుకు ముంగొంగుపసిడిగాఉన్న చిల్లరమల్లర ఋణదాతల సహాయం కోల్పోవడమూ వారికియే కొంచెము అప్పుకావాలసివచ్చినా యెటువంటి మినహాయింపులు రక్షణలూలేక పూర్తిగా చెల్లింపవలసిన బ్యాంకులనూ సహకారసంఘాలనూ ఆశ్రయించడమూ, ఆబ్యాంకులు వారిఆస్తిని తాకట్టుపెట్టుకోడమూమాత్రం నిజం. అయ్యో! చెల్లించుకోలేనంటే బ్యాంకి వ్యక్తిగాదు గనుక అచ్చట రైతుకు యెటువంటి ఉపకారమూ పొందడానికి అవకాశం ఉండదు. పైకి యెంత పంచదారగుళికగా కనుపిస్తున్నా అది పూర్తిగా పంచదారే అయిందీ లేక పైపూత మాత్రమే అయిందీ చప్పరించిన మీదట గదా తెలుసుకొనేది.

# ప్రియసఖి

క॥ అస్మత్ ప్రియసఖి—
సస్మేరముఖేందుబింబ సమ్యక్ తేజో
భస్మిత(?) శోకాంధతమస,
విస్మయగుణధామ, మనను వెడలునె యెపుడున్?

సీ॥ తనకీర్తి భూనభోంతరముల నిరసించి చిఱునవ్వులై తన్నె చేరికొలువఁ
దనభావనాప్రభల్ ఘనవీధి గర్జించి కలికిచూడ్కుల మెఱుంగులుగఁ బర్వఁ
దనమనోహరత చంద్రజ్యోత్స్నలకుఁ బోక నడకలసొగసులో నడఁగియాడఁ
దనమార్దవము చిగుళ్లను బువ్వులను ద్రోచి పలుకులతీపిలోఁ గలసిమెలయ
నాత్మ దేహమ్మునకు దేహమాత్మకమరినట్లు, సుగుణము లవతారమందినట్లు
భాసురాకార సుందరవర్తనములఁ గనులమనసును జొక్కించు కాంతఁదలఁతు.

గీ॥ నిండుహృదయంబుతో మహోద్దండవృత్తిఁ
గాంక్షసేసినయది పండుగాకపోయెఁ;
గాలమాసను ద్రుంచె; నింకం ద్వరను ని
రాశ కాలంబుఁ ద్రుంచిన నదియెసుఖము.

గీ॥ కనులుమూయునంతఁ గలలును, గలలలో
భవదుదారమూర్తి వచ్చినిలుచుఁ;
గనులు దీర్ఘనిద్రఁ గప్పంగఁబడిన ని
న్ననవరతముఁ జూడనౌనె చెపుమ.

శా॥ పోయెంగాలము; ప్రాయముంగడచె; నింపుం బెంపులుంద్రుంగె; మి
థ్యాయత్నంబులెకాని మన్మనమునందత్యంతమౌ మక్కువన్
బాయంజాలక నిల్పియున్నతమి సాఫల్యమ్మునుం జెందలే
దాయుర్వృద్ధి యిఁకేలనాకుఁ; జనరాదా వేగ నాప్రాణమా.

శా॥ చానా! నిన్నుఁదలంచి సంతతము నే సంతాపముంజెంది మత్
ప్రాణంబైననొసంగి నీకుశుభముల్ భద్రంబు సేకూర్చి, నా
నా నవ్యోరువిలాస సంచయములన్ రాగంబునం దేల్ప నెం
తో నాకుండెను; కాలసంఘటనమయ్యో! యిట్టులాయెంగదే!

# గృహలక్ష్మి

చ॥ ఇఁకనొక జన్మమందయిన నీశ్వరుసత్కృపచే భవద్గుణ
ప్రకట సమానభాసుర శుభంబు పదంబును జెందుదమ్మ; నీ
యకుటిలవృత్తికిం దగినయార్యులు మిత్రులు బంధులౌదు, రీ
సకలముమెచ్చ శాశ్వతయశస్సు ధరింతువటంచుఁ గోరెదన్.

క॥ మృదుమధుర పదఫలాస్పద
సదారుణ నవసుమ వాక్ప్రశస్తను, దరశా
రదచంద్రికా సమాన వి
శద దరహాసామలార్యచరిత, మఱతునే.

గీ॥ నేత్రమరవిప్పఁ జేయు స్వామిత్రుసహజ
చేష్టితమునకుఁ గోపంబు సిగ్గువగపుఁ
బెరయ, సౌరభోచ్ఛ్వాసంబు నరుణముఖము
మంచుకన్నీళ్లునై తలవంచి నిలుచు
కమలమొకటియె నీదు ముగ్ధతకుసాటి.

గీ॥ మెఱుఁగుఁదీఁగెల సరిగెల మెఱయుమొగిలు
చీరయొడలుగప్పఁగఁ గురుల్ జీఱువార
ఘననినాదముల్ కంకణక్వాణములుగ
నలరి యాకాశలక్ష్మినీ ళ్లాడుబుతువ
నీ వివిధవిలాసంబుల వెఱపనేర్చు.

సీ॥ కల్లోలమాలికా కరములవీచుచు నెలుఁగెత్తిపిలిచెదు జలధినుండి
నిండారనెఱసిన పండువెన్నెలడాఁగి నవ్వెదునాతోడ నభమునుండి
గుసగుసల్వోవుదు కోర్కిమై సురభి శీతలమందమారుతావళులనుండి
తేనెలఁదావుల జానగుపువ్వుల హిమాశ్రులుర్లఁగఁ జూచెదవనినుండి
ఛటఛటారవరాజి ప్రస్ఫుటముగాఁగ ననుచితము సేయఁ గోపింతు వగ్నినుండి
సకలభూతమయాకార సారమహిమ నీవులేకయు నాకునున్నావెపుడును.

కట్టమంచి రామలింగారెడ్డి.

(అర్థశాస్త్రము సంకితమునుండి)

# గృహలక్ష్మి

(గత సంచిక తరువాయి)

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

●

మనకేకాదు. యెవరికేనా ఆస్తికుల మనుకొనేవారికి యిహంకన్న పరం ముఖ్యంగా కనపడుతుంది. యిహమనేది బహుస్వల్పకాలం. యీస్వల్ప కాలంలో పరాన్నిగూర్చి చేయవలసిన ప్రయత్నం చాలావుంది. ఆ ప్రయత్నం పురుషులు యెన్నోవిధాలచేసి కాని కృతార్థులు కాఁజాలరు. స్త్రీలో? వొక్క పాతివ్రత్యంవల్లనే దాన్ని సాధిస్తారు. అట్టి పాతివ్రత్య మనేది వొక్కవ్యభిచారం లేనంతమాత్రంచేతే సాధిస్తా మనుకోవడానికి వల్లకాదు. పాతివ్రత్యంలో సగంభారాన్ని వ్యభిచారభావం సాధిస్తుంది. తక్కిన సగాన్నీ పతియెడల చూపే వినయాదికంవల్లనే సంపాదించవలసి వస్తుంది. ప్రధానదుర్గుణంమాత్రం లేని స్త్రీలు లోకంలో చాలామంది వుంటారు. వారందఱూ పతివ్రతల తరగతిలో చేరుతా రనడానికి నాకు సాహసం చాలదు. భర్త యోగ్యతనుబట్టిగాని సంపూర్ణపాతివ్రత్యం సంపాదించడానికి స్త్రీలకు శక్యం కాదంటూ ఆపాతరమణీయంగా కొంద అంటారు. కాని ఆమాట తప్పు.

●

రామునివంటి లేక సత్యవంతునివంటి భర్తలుదొరికి వారు పాతివ్రత్యాన్ని వెలిగించారంటే అందులో గొప్ప వుందని యెవరనుకుంటారు? పచ్చిబోగందికూడా అట్టి భర్తతటస్థిస్తే ఆ లేదీ మొదలు పతివ్రతగానే వుంటుంది. కాబట్టి భర్తయెడల కొన్ని అననుకూలస్థితులు యేర్ప డ్డప్పుడుకూడా పాతివ్రత్యాన్ని కాపాడుకుంటేనే కవి వర్ణనీయమైన యోగ్యత యేర్పడుతుంది. అయితే యిట్టి సందర్భంలో సీతను మహాపతివ్రతగా యేల వర్ణించ వలసి వచ్చిందంటే? వినండి యెక్కడి కీశంకలు కలుగుతూనే వుంటాయి. రాజ్యహీనుఁడై అడవిలో ఆకూ అలమూ తింటూ వున్నభర్తను వంచించి త్రిలోకాధిపతి రావణుఁడు తీసుకవెళ్లి సగౌరవంగా తన్ను పెళ్లాడి యీ ఆధిపత్యాన్ని యేలుకోవలసిందని నయానా భయానా యెంత ప్రయత్నించినా దిక్కు లేని పక్షిగా వుండికూడా వాణ్ణి తృణీకరించి తన పాతి వ్రత్యాన్ని నిలవఁబెట్టుకోవడంవల్ల సీతామహాదేవి వర్ణనీయురాలయింది. అగ్నిహోత్రుఁడుకూడా ఆవిణ్ణి స్పృశించలేక పోయాఁడు. చూడండీ? నూర్జహాను సౌందర్యం యెంత వర్ణనీయమైనా ఆర్యధర్మా లెఱిఁ గిన కవి ఆపెను ఆదర్శంగా చిత్రించడానికి వొప్పు కుంటాఁడేమోను, రాజ్యవైభవాపేక్షచేతే కాదు. ప్రాణభయంచేతేనాసరే సీతాదేవి రావణుడికి వశ మయేటట్టయితే అంతవఱకు ఆమె నిర్వహించిన పాతి వ్రత్యమంతా భస్మీపటల మయి పోయేదే. కొందఱు పాశ్చాత్యవిమర్శకులు సీతాపాత్రవంటి పాత్ర వుండడ మనేది కేవలం అసంభవమనిన్నీ యీపాత్ర కల్పిత

మయి వుంటుంది కనక చారిత్రకంగా విశ్వసించడానికి వీలులేదనిన్నీ వ్రాశారని వింటాను. వారి అనుభవాన్ని బట్టి వారు ఆలా వ్రాయడంలో వింత లేశమున్నూ లేదు. మన ఆర్యులఅనుభవం యిందుకు జంకేది కాక పోవడంచేతనే అప్పటినుంచి యిప్పటిదాఁకా యెవ రున్నూ తుట్టతుదకు నాస్తికులుసమేతూ పై విష యాన్ని అన్యథాకరించక శిరసా వహిస్తున్నారు. భారతీయులుతప్ప పాతివ్రత్యస్వరూపాన్ని పూర్తిగా యెఱిఁగినవారు లేనేలేరేమో? అని భారతీయవిజ్ఞు లనుకుంటారు. శరీరబలానికి బ్రహ్మచర్యం యెంత ఆవశ్యకమో చరిత్రనిష్కళంకత్వానికి స్త్రీలకేమి పురుషులకేమి పరస్పరదూరతఃప్రవర్తన మంతే ఆవ శ్యకమని మన ఆర్యులతాత్పర్యం. భాగవతంలోవున్న యీపద్యం యీవిషయాన్నే బోధిస్తుంది.

ఆ.వె. పొలఁతి దాతవహ్ని పురుషుఁడాజ్యఘటంబు
కదియకుండ రాదు కదిసెనేని
బ్రహ్మయైన కూఁతుఁ బట్టకమానఁడు
వటున కింతిపొత్తువలదు వలదు.

యీవిషయం భరతఖండవాసులకేకాని పాశ్చాత్య దేశస్థులకు సమన్వయించేది కాదంటూ ఆపాతరమ ణీయంగా కొందఱు చెపుతారు. అది విశ్వసింపదగిన దిగా తోఁచకున్ననూ విశ్వసించే మాట్లాడుకుందాము. మనదేశకాలపాత్రాదులను బట్టియ్యేవే మనసంచారం వుండడం ఆవశ్యకమనేనా మనం అంగీకరించేపక్షాన్ని స్త్రీలకు యుక్తవయస్సు వచ్చినపిమ్మట యుక్త వయస్కులైనవారితో సహాసీనాదులు ఆమోదించ వలసినవి కావు. ఆయితే ఉన్నతవిద్యాభ్యాసం యెట్లాగ? అంటారేమో? భర్తవలనఁగాని తండ్రి తాతలవలనఁగాని సోదరులవలనఁగాని అభ్యసించ వలసి వుంటుంది గాని పురుషులతోపాటు డిగ్రీలు సంపాదించి వుద్యోగంచేసి కుటుంబాన్ని భరించవల సిందని స్త్రీలకు మనఆర్యు లెన్నఁడున్నూ విధించ లేదు. ప్రతిపురుషునకున్నూ భర్తృబిరుదులపొందడం ఆవశ్యకం కాకపోవచ్చును గాని ప్రతిస్త్రీకిన్ని భార్యాబిరుదం ఆవశ్యకమైనట్లు మనశాస్త్రాలు చెపు తాయి, ఆశబ్దవ్యుత్పత్తి భరించతగ్గది అని భర్తృ శబ్దవ్యుత్పత్తి భరించేవాఁడు అని, భార్య ఆర్జించే విత్తాన్ని అనుభవిస్తూవుండడం పురుషుఁడికి గౌరవా పాదకంగా మనవారు తలఁచరు.

"స్త్రీవిత్త మధమాధమమ్"

అనే అభియుక్తోక్తి పైసందర్భాన్ని తెలుపుతుంది. పోనీ ప్రస్తుతకాలంలో పురుషులు విద్యాధికులు కాఁ గలిగినప్పటికి వారికి తగినవుద్యోగాలు లభించనందున స్త్రీలద్వారా పోషింపఁబడే కోరికతో స్త్రీలను విద్యాధికురాండ్రనుగా చేదా మనుకొన్నా యిది మాత్రం యెన్నాళ్లముచ్చట—బ్రిటిషుప్రభుత్వం వచ్చి 150 యేళ్లయింది కాఁబోలును. కొన్నాళ్లు సర్వ సామాన్యంగా అక్షరాస్యులందఱూ ఉద్యోగార్హు లైనారు. పిమ్మట లోయర్ శకండరీ పరీక్షవా రున్నతోద్యోగాలు చేశారు. క్రమంగా మెట్రిక్యు లేషనుకొవలకూ డేఁకింది. తర్వాత యఫ్. యేలు, బి. ఏ. లు, యమ్. యేలు, ఉన్నతోద్యోగార్హు లైనారు. యిప్పుడో? బి. యే. యల్. టీలు, యెలి మెంటరీస్కూళ్లలో ఓ నా మా లు లేదా ఏ. బి. సి.డీ.లు చెప్పడానికి రావలసివచ్చింది. ఆలాగే స్త్రీలగతిన్నీ కొలఁదికాలంలో కాక తప్పదు. కాఁబట్టి స్త్రీలద్వారా జీవిద్దామనే వూహాహూడా తుదనెగ్గేది కాదు. సర్వవిధాలా స్త్రీమర్యాదను కాపాడుతూ వారికి విద్యాభివృద్ధికి మార్గం చూడాలి. విద్యాభివృద్ధి అంటే ఉద్యోగార్హత కాదు. జ్ఞానాభి వృద్ధి మర్యాద చెడితే తిరిగీ రాదు. స్త్రీమర్యాద పురుషమర్యాదవంటిది కూడా కాదు. చూడండీ సర్వమతాలవారుకూడా శిరసావహించే భగవద్గీత యేలా చెపుతూ వుందోను.

"స్త్రీషు దుష్టాసు కౌంతేయ జాయతే వర్ణసంకరః"

దీనివల్ల తేలేదేమిటి? సర్వాత్మనా స్త్రీలమర్యా

దను కాపాడవలసిందనియ్యేవే. యెవరివిషయం యీకాపాడడంః యెవరికి వర్ణసాంకర్యం సమ్మతం కాదో వారికిమాత్రమే పైకట్టుబాటు అవసరం. తది తరులు ఉత్పథచారులు. వారిని యీగీతావాక్యం ప్రతిబంధించదు. విద్యాధికురాండ్రైన స్త్రీలలో కొందఱు దాంపత్యవిషయంలో కులకట్టుబాట్లను అతిక్రమించి వారివారిబంధువులకు మిక్కిలీ తలవంపు ఘటించడం పత్రికలద్వారా తెలుస్తూ వుండడంచేత యిట్లు వ్రాయవలసివచ్చింది. విద్యావాసన లేనివాళ్లు కూడా యిట్టి అనర్థకార్యాలు చేసేవాళ్లువుంటారు. కాని వారికి సభ్యత్వం లేదు. వీరికో? ప్రస్తుత కాలంలో సభ్యత్వానికి ఆటంకం కనపడదు. యీవర్ణ సాంకర్యం యేలాగా ఆగదు. ప్రస్తుతం దాన్ని ఆపు దలచేయడానికి ప్రయత్నం చేయడమే తప్పంటారా? అయితేమాత్రం చూస్తూచూస్తూ సదాచారప్రవీణులు పూరుకోఁగలరా? యేవో తోఁచినమాటలు చెపుతూ వుంటారు. వినేవాళ్లు వింటారు. యితరులు వినరు.

శ్లో. బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవ స్స్మయ మాషితాః, అబోధోపహతా శ్చాన్యే జీర్ణ మంగే సుభాషితమ్.

అనే దురవస్థ మంచినిగూర్చి యిప్పుడే కాదు యెప్పుడూ వుంది. అట్లని బొత్తిగా మంచికి జగత్తంతా వ్యతిరేకంగానే వుంటుం దనుకోవడానికిన్నీ వీలు కనపడదు. అందుకోసమే యెప్పటి కప్పుడు సుభాషితాలంటూ వారువారు వ్రాస్తూవుండడం తటస్థించింది. నేను స్త్రీవిద్యను ద్వేషించేవాణ్ణి కాను. పూర్వంవిద్యావతులైనస్త్రీలు క్వాచిత్కంగావున్నట్టు గ్రంథప్రమాణం వుంది. వారు సభర్తృకలో? గతభర్తృకలో అనేవిషయం పరిశీలించాలి. గతభర్తృకలు పూర్వం వివాహం చేసుకోకుండా యోగినుల మాదిరిని కాలక్షేపం చేయడం నియతంగా వుండేది కనక అలాటివాళ్లు తండ్రివద్దో తాతవద్దో శాస్త్రాభ్యాసాదికంకూడా చేసి విజ్ఞత్వాన్ని సంపాదించినట్లు కనపడుతుంది. గతభర్తృకా వివాహంకూడా పూర్వమెప్పుడో వుండేదేమోకాని క్రమంగా అది స్త్రీలే యేవగించి మానినట్టు తోస్తుంది. భిక్కుపాఠకులు అనే వొక మహావిద్వాంసులు కాశీలో వుండేవారనిన్నీ వారు వొకవితంతువుకు భాష్యాంతం వ్యాకరణంచెప్పి మహావిద్వాంసురాలినిగా చేశారనిన్నీ మాపరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రిల్లుగారు చెప్పఁగావిన్నాను. రత్నఖేటదీక్షితులుగారి కొమార్తె అసాధ్యమైన ధారతో ఆశువుగా చెప్పిన వకశ్లోకం శిష్టపరంపరలో వినికిడి వుంది. ఆశ్లోకం వుదాహరిస్తాను.

శ్లో. విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చయే
సపత్నజ త్యయత్నమేవ రత్నఖేటదీక్షితే
బృహస్పతిః క్వజల్పతి క్వసర్పతి ప్రసర్పరా
దసన్ముఖశ్చ షణ్ముఖశ్చతుర్ముఖశ్చదుర్ముఖః

యీశ్లోకతాత్పర్యం తనతండ్రిగారైన రత్నఖేటదీక్షితులుగారితో శాస్త్రవాదానికి యెవరున్నూ నిల్వలేరని, యింతటికవిత్వం ఆశుధారలో అందులో సంస్కృతభాషలో చెప్పఁదగ్గ ఆడుబిడ్డ యెంతటి పాండిత్యం కలిగివుంటుందో? యిప్పటి సోదరీమణులు గమనించి ఆపె అభ్యసించినవిధానానికే తాముకూడా ప్రయత్నిస్తారని తలుస్తాను. యింకో పెళ్లికూతురు చెప్పిన శ్లోకంకూడా వుదాహరిస్తాను.

శ్లో. యస్య షష్ఠీ చతుర్థీ స్యా
ద్విహస్యచ విహాయచ,
అహం కథం ద్వితీయా స్యా
ద్వితీయా స్యా మహం కథమ్.

పైశ్లోకంలో వున్నంత శబ్దాడంబరం యీశ్లోకంలో లేకపోయినా గడుస్తనంమాత్రం దానికంటే దీనిలోనే యెక్కువ కనపడుతుంది. దీనిసందర్భం వివరిస్తాను. అప్పయ్యదీక్షితులవారి కొమార్తో మనమరాలో తనకు పెళ్లికొడుకు కాఁబోయే వరుణ్ణిగూర్చిన పాండిత్య లోపాన్ని వెల్లడించే సందర్భంలోది పైశ్లోకమని దాని

పోకడ విస్పష్టం చేస్తూవుంది, విహాస్య అన్న అవ్యయం రామస్య, అనేమాదిరిగా వున్నప్పటికీ షష్ఠీవిభక్తి కాదు, విహాయ అనే అవ్యయం రామాయవలె వున్నా చతుర్థీ విభక్తి కాదు. అహం, కధం, యీ రెండున్నూ రామం అన్నదానివలె వున్నా ద్వితీయావిభక్తి అని చెప్పఁగూడదు. యీజ్ఞానం యేకొంచెమో సంస్కృత సాహిత్యం వున్నవాళ్లకు తప్ప శబ్దమంజరీ రఘు వంశమూ చదివేవాళ్లకు గోచరించదు. ప్రస్తుతం వరుఁడు కాఁబోయే పిల్లవానిపాండిత్యం బొత్తిగా తక్కువస్థితిలోవుంది కనక నేను అతనికి భార్యగా వుండడం పరిహాసాస్పదంగా వుంటుందని ఆకన్యక స్పష్టంగా చెప్పింది. దీన్నిబట్టిచూస్తే విద్వాంసురాలు అవిద్వాంసునికి భార్యకావడం యెప్పుడూ అనుచితమే అని తేలుతుంది. ప్రస్తుతవిషయం భార్య అవిద్వాంసు రాలై భర్త విద్వాంసుఁ డయినప్పుడుకూడా సమన్వ యిస్తుందని కొందఱు వాదప్రధానులు చెప్పవచ్చును. కాని మనభారతీయులలోనే కాదు, యితరులలో కూడా భార్యాస్థానంకంటె భర్తృస్థానానికి గౌరవం నిషిద్ధంకాదనే తేలుతుంది. యెన్నివిధాల విచా రించినా హిందూసంసారమర్యాదలకన్న యితరత్ర వుండే మర్యాదలు గౌరవనీయాలనే తాత్పర్యం తేలదు. మహమ్మదీయులుకూడా నిన్న మొన్నఁటి దాఁకా యూరపుదేశ స్త్రీలఆచారాలను ప్రేమిం చడం లేదుగాని యిప్పుడిప్పుడు వారి ఆచారాలను అవలంభిస్తూన్నారని వినికిడి. మనలో అవివాహిత లైన స్త్రీ లంటూవుంటే! అది గొప్పపాతకంగా చూచేవారు. యేదేనా వ్యాధ్యాది హేతుకంగా స్త్రీకి వివాహంకావడం తటస్థించక పోయినట్టయితే దాన్ని చాలాతప్పుగాచూఁచి యేదోవిధంగా యెవరో పరస కలవారిచేత పుస్తె కట్టించేవారు. యిప్పటికీ ఆ ఆచారం అమల్లోనే వుంది. సుమారు రెండువందల యేళ్లనాడు కాఁబోలును బ్రాహ్మణులలోనే వక శాఖలో వొకపిల్లకు వివాహం కాకపోవడమున్నూ అంతట ఆమె రజస్వల కావడమున్నూ తటస్థించి ఆకారణంచేత ఆకుటుంబంవారు గంగాప్రవేశం చేయడానికి యత్నిస్తూవుండఁగా వకవిద్యార్థి ఆపిల్లను నేను వివాహం చేసుకుంటానని సాహసించి చేసు కున్నట్టున్నూ రజస్వలాకన్యకను వివాహం చేసుకున్న ఆవిద్యార్థి బంధుజాతంకూడా ఆకుటుంబాన్ని బహి ష్కరించక ఆమోదించడంచేత వారిని యితర గ్రామాల్లో వుండేస్వశాఖీయులు వెలిపెట్టినట్టున్నూ చెప్పుకుంటారు. నిన్న మొన్నటిదాఁకా ఆతెగవారికిన్నీ యితరత్ర వుండేతెగవారికిన్నీ సంబంధబాంధవ్యాలు వుండేవి కావు. గాని యిప్పుడిప్పుడు సంబంధబాంధ వ్యాలుకూడా వారికీ వీరికీ కలుస్తూవున్నాయి. యీ కట్టుబాట్లు వకవిధంగా సంఘానికి అనర్థదాయకం గానే తోస్తాయి. కాని చాలావిధాల శ్రేయోదాయ కాలుగానే కనపడతాయి. యిప్పుడెందటో బ్రాహ్మ ణులలో అవివాహితస్త్రీలు వున్నారని తెలుస్తూ వుంది. పట్నవాసాలలో ఆవిషయం అంత చర్చకు రావడం లేదు. గాని పల్లెటూళ్లల్లో అట్టివా రింకా నివసించి నెగ్గలేరు. యీమధ్య మాదగ్గఱబంధువుల లోనే వకపిల్లవాఁడు భార్యవుండఁగావే వితంతువును వివాహమాడి ఆపిల్లసహితంగా స్వగ్రామానికివస్తే గ్రామంగ్రామం యావత్తూ చూడడానికి విఱుగడిం దనిన్నీ అప్పుడు ఆనూత్నవధువు ఆశ్చర్యపడి "యేమిటి నన్నిలా చూస్తారని" అడిగిందనిన్నీ వకరు చెప్పఁగా విన్నాను. పట్నవాసాలకు ఫరవాలేదు గాని పల్లెటూళ్లకుమాత్రం యీ చిక్కు యింతట్లో వదిలేటట్టు తోఁచదు. నెత్తిమీద మొట్టే శారదా బిల్లునుకూడా లక్ష్యపెట్టనిపల్లెటూళ్లు అట్టి చిక్కు లేని వితంతూద్వాహాలను ఆమోదిస్తాయా? హిందు వులకట్టుబాట్లు సర్వాత్మనా మంచివే అయినా వాట్లకు తిలోదకాలు విడవడానికి తగ్గకాలంవచ్చింది. అనేకులు వీట్లకు వ్యతిరేకులుగా వున్నారు. ధర్మ శాస్త్రాలు మనవంటివాళ్లు చేసినవే కనక కాలాన్ని

బట్టి మనం మార్చుకోవడానికి అభ్యంతరం లేదంటు
న్నారు. యిట్టిస్థితిలో కర్తవ్యం కనపడడం లేదు.
పురుషులు నానావిధాల బరిదెగించి చాలాకాలమైంది.
వారిని అదమాయించడం మానుకునికూడా చాలా కాల
మయింది. స్త్రీలు అదమాయింపు జంకుచేత గాదు
గాని స్వతహాగానే మానమర్యాదలకు కట్టుబడి కుల
మర్యాదలను యింతవఱకూ కాపాడుకొని వచ్చారు.
యిక స్త్రీలుకూడా "గతానుగతికం"గా పురు
షుల త్రోవలోకి దూఁకేసూచన కనపడుతూ వుంది.
దీనికి కారణం పడమటిగాలే కానివ్వండి యుగమహ
త్త్వమే కానివ్వండి యేమైతేమాత్రం చేసేదేమిటి?
పూర్వాచారపరాయణులుకూడా కొంత కల్లెంబిగువు
తగ్గించుకుంటేనే బాగుంటుందని నాకు తోస్తుంది.
లేదా వున్నచిక్కులకు మఱికొన్ని చిక్కులు తెచ్చి
పెట్టుకొన్నట్లవుతుందే గాని ప్రయోజనకారి లేశమూ
కాదు. ఆయాపూర్వాచారులయందు యెక్కువ
నమ్మకం కలవారు నవీనాచారులు చేసే కొన్ని
కార్యాలు తాము స్వయంగా చేయకుండావుంటే
వుండవచ్చునేమోకాని చేసేవారిని వారించడానికి
బహిష్కారాద్యాయుధప్రయోగాలు పనిచేస్తాయనే
రోజులు గతించాయి. యిదిన్నీకాక మనఋషులు
పురాణాలలో యీవిషయమంతా కలిలో జరుగుతుం
దని సూచించే వున్నారుగదా?

శా. వ్యాసాదుల్ ఋషులై నిజంబులయి త
ద్వాక్కుల్ భవిష్యద్గతుల్
పూసగ్రుచ్చినరీతిఁ జెప్పటదియుఁ
బోకుండి యారౌర! వీ
రేసారజ్ఞులు వీరి కయ్యెడల లే
నేలేదు విశ్వాస మీ
యీ సల్లే నెటులుండు? భ్రష్టులగువా
రే తన్మతోద్ధారకుల్.

మేమిట్లు వ్రాయడానికి కారణం కాలదౌర్భా
గ్యమే. కాని యిప్పుడుకూడా పూర్వాచారాలు
పాటించేవారికి విశేషగౌరవంలేదని కాదు. పెండ్లి
చేసుకొన్నవితంతువుకన్న బ్రహ్మచారిణియందు
గౌరవంలేదని యెవరేని యనఁగలరా? పెండ్లి చేసు
కోక అన్యథాగా చరించువితంతువుకన్న పెండ్లిచేసు
కొన్నయాపె పరమపూజ్యురాలు. ఆ వివాహాలు
ఆమోదించే వారివుద్దేశంకూడా యిదే. అందఱూ
చేసుకు తీరవలసిందనే నిర్బంధం లేదు గదా? శాస్త్ర
రీత్యా దీన్ని సమన్వయించడానికి తరంగాదు. యీ
వివాహసంబంధం మన ఆర్యులమతాన్నిబట్టి యీ
జన్మంతో పరిసమాప్తి చెందేదిగా కనపడదు. అందు
చేత శాస్త్రజ్ఞులు దీనికి చొరవ చేయలేకపోయారు.
శాస్త్రరీత్య పాడేసంగీతపాటకులు కొందఱువుంటే
వుంటారుగాక. గాలిపాటపాడి లోకాన్ని రంజించే
పాటకులుమాత్రం యెందఱు లేరు? ఆలాగే కొందఱు
దయాళువులు కొన్ని క్రొత్తమార్పులు సంఘంలో
ప్రవేశపెట్టారని సరిపెట్టుకోవాలి.

శ్లో. ఆర్తాఽఽర్తే ముదితా హృష్టే
ప్రోషితే మలినా కృశా.

అనే శాస్త్రాన్ని అనుసరించే పతివ్రతామణులు
యెందఱో యిప్పుడుకూడా మనభారతీయులలో నే
కాదు. అన్యత్రకూడా వున్నారనే నానమ్మకం.
యిహంమాత్రమేకాక పరంకూడా వుందనే నమ్మకం
కలస్త్రీలు సర్వాత్మనా ఆనారీమణులను వరవడిగా
బెట్టుకొని ఆత్మగౌరవాన్నిన్నీ కులగౌరవాన్నిన్నీ
కాపాడుతారని వేఱే చెప్పనక్కఱలేదు. అది
వారికి సహజగుణమే అని నేను నమ్ముతూ దీన్ని
ముగిస్తాను.

# ఫెడరేషను — మంత్రి పదవులు

'మణి'

భారతీయ స్వాతంత్ర్యసమరం క్రిందటి ఎన్నికలతో నూతన మార్గాల ననుసరించింది. నేటి రాజ్యాంగ విధానం సర్వతోముఖంగా భారతదేశ భావి భాగ్యోదయానికి హానికరమని ఏకగ్రీవంగా వాక్రుచ్చిన కాంగ్రెస్సు, ఏడురాష్ట్రాలలో మంత్రిపదవుల్ని స్వీకరించింది. దీనివలన లాభాలు లేకపోలేదు; కాని, ఫెడరేషను విషయం మరీ అగమ్యగోచరంగా తయారైంది.

హరిపురంలో జరుగబోయే 51-వ కాంగ్రెసు మహాసభలో, ఫెడరేషను ఎన్నికలలో కాంగ్రెసు పాల్గొనడమా లేదా అనే విషయం చర్చకురాక తప్పదు. ఫెడరేషను బూటకమైనదీ నష్టాన్ని ఆపాదించేది కానట్లయితే ఏదేశానికైనా సౌఖ్యదాయకమే. అలాటి ఫెడరేషన్ని ఏదేశప్రజలైనా ఆహ్వానించి తీరవలసిందే. కాని ముందు అమలులోనికి రాబోయే మన ఫెడరేషను భారతదేశ నాశనానికి దోహదమిస్తుంది. సైన్య మతైకశాఖలు మనచేతుల్లో లేనంతవరకూ, వ్యాపార సంబంధమైన హక్కులన్నీ ఆర్థిక సలహాదారునిలో (Financial Adviser) మూర్తీభవించి నంతవరకూ, కరెన్సీ, కాయినేజి, మారకం (Currency, Coinage and Exchange Ratio) వీటి విషయాల్లో జోక్యం కలుగచేసికోవడానికి మన శాసనసభలకు హక్కులు లేనంతవరకూ సి.ఐ.డి. శాఖ మంత్రులుకాని ఇతరుల అధీనంలో ఉన్నంతవరకూ రైల్వే రేట్లు (Railway Rates) మన స్వాధీనంలో లేనంతవరకూ యీ ఫెడరేషను భారతదేశానికి పనికిరాదని ఘంటాపథంగా చెప్పవచ్చు. మనదేశంలో ఉన్న వృత్తుల్నీ వ్యాపారాన్ని ఇతర దేశముల నుండి దిగుమతి అయ్యేసరుకులమీద పన్ను వేసి కాపాడుకోవడానికి మనకు హక్కు లేదు. ఇంతేకాదు; భారతదేశ ప్రజలనందర్నీ స్వదేశసంస్థానాధిపతుల చేతులలో ఆటవస్తువులుగ తయారుచేస్తుంది. ఇలాటి ఫెడరేషన్ని ఆచరణలో పెట్టడానికి ఎన్నికలలో పాల్గొని మంత్రిపదవులను స్వీకరించి తన ప్రతిష్ఠను పోగొట్టుకుంటుందా కాంగ్రెసు అనేది విచారణీయాంశము.

ఇదీకాకుండా ఫెడరేషను భారాన్ని వహించడానికి పదిమంది మంత్రులు కావలసి ఉంటారని తేట తెల్లమౌతూఉంది. ఈ మంత్రిపదవులకోసరం ప్రశాంతంగా దొర్లిపోయే కాంగ్రెసునౌక ఎలాటి అల్లకల్లోలాలకు గురి అవుతుందో అని ఇప్పటినుండే కొంతవరకు భయము వెయ్యకపోలేదు. అందులో ప్రధానమంత్రివలన తీసికొనబడే మిగిలిన మంత్రులందరూ ఆయన ఆజ్ఞలకు తలలొగ్గి స్వతంత్రంగా దేశసౌభాగ్యమే




అఖిలభారత మహిళాసమావేశము, నాగపూరు. ప్రధానమండపద్వారము ముందు స్త్రీసేవాదళము బారులు దీరియుండుట గానవగును.



నాగపూరునందు సమావేశమైన అఖిలభారత మహిళాసమావేశాధ్యక్షురాలగు శ్రీమతి అమృతకార్ శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారితో.

తమ హృదయపీఠాల నధిష్ఠింపజేసి మన యీ క్లిష్టపరిస్థితులలో ముందడుగు వేయడానికి కావలసిన ధైర్యము స్వాతంత్ర్యము లేక చాలా బాధపడతారనేది సువిదమౌతూనేఉంది. ఈబాధకొరకు ఊహించలేనన్ని కలహాలూ కల్లోలాలున్నూ.

ఇలాటిసమయంలో కాంగ్రెసు మంత్రిపదవులను స్వీకరిస్తుందా? ఫెడరేషన్ని వద్దని నిరోధించేది ఒక్కసామ్యవాదులేకాదు; కాంగ్రెసుకూడాను. కాంగ్రెస్సేమంత్రిపదవుల నంగీకరిస్తే దేశానికంతకూ చెప్పరాని తలవంపు. భారతదేశానికీ బ్రిటిషుప్రభుత్వానికీ జరిగేటటువంటి తీవ్రమైన యీ యుద్ధంలో భారతదేశం ఓడిపోయిందని ప్రపంచచరిత్రలో ప్రతిపుటమీద పెద్ద అక్షరాలతో వ్రాసి ఉంటుంది. ప్రభుత్వాన్ని మనచేతుల్లోకి తీసికోవడం కాదిది; మనం ప్రభుత్వం చేతుల్లోకి వెళ్లడం.

కాంగ్రెసు మంత్రిపదవుల్ని స్వీకరించకపోతే వచ్చేమంత్రులందరూ ప్రభుత్వం చేతుల్లో కీలుబొమ్మలుకారా అనికొందరు కాంగ్రెసువాదులు ప్రశ్నించుతారు. నిజమే కాని, ఆకీలుబొమ్మల్ని తొలగించడానికి మనమే కీలుబొమ్మలుగా మారడం చాలా హాస్యాస్పదంగా ఉంటుంది.

కాబట్టి ప్రజాభిప్రాయాన్ని దేశక్షేమాన్ని గమనించి అనువైన ఒక తీర్మానానికి రేపు సమావేశముకాబోయే కాంగ్రెసు వస్తుందని అందరకూ దృఢనమ్మకం.

ముందు జరుగబోయే విషయాలకొరకు ఆతురతతో అంతా ఎదురుచూడవలసిందే.

---

# నిన్నుబోలిన ప్రజ్ఞాఢ్యుడున్నె కృష్ణ ?

గోపసుతుండవై గోపార్భకులతోడ శైశవక్రీడలు సలిపినావు
రసికోత్తముండవై రమణీమణుల నవ్యప్రేమార్ద్రహృదయాలు వలిచినావు
రాజ్యాంగవేత్తవై రారాజు కొలువులో వ్యవహారధర్మముల్ వలికినావు
పార్థసారథివయి పగ్గాలుచేపట్టి పరమార్థతత్వంబు గఱపినావు

ఒక్కవిషయాన నైపుణ్యమొప్పియుండి
యొకటలేదను వాదును నొందబోవు
అన్నివిధముల ప్రాజ్ఞుండ వలఘుమతివి
నిన్నుబోలిన ప్రజ్ఞాఢ్యుడున్నె కృష్ణ ?

కనుపర్తి వరలక్ష్మమ్మ.

# తప్పెవరిది?

శ్రీ గొల్లపూడి జోగారావుగారు, బి.ఏ.

"భాగ్యవంతుల పిల్లన్ని భాగ్యవంతుల యింటి కోడల్ని చెయ్యాలన్న పట్టుదల మన గృహాల్లో చాల పరిపాటిలోవుంది. విద్యాధికుడై, సుగుణవంతుడై, తమ కనులయెదుటనే పెరిగిన వరుడు నిర్భాగ్యుడయితే అక్కరకురాడు. కాని భాగ్యవంతుడైన ఆవరున్ని కొనుక్కోడానికి తమ భాగ్యములో సగము వెచ్చించాలి. ఆవ్యయమే పరోకుటుంబము నిలవడానికి సరిపోతుందని గ్రహించి నావంటి పిల్లల్నిగన్న తల్లుల మార్గమునకు నిండుజీవుల బలియివ్వవద్దని నాప్రార్థన. నా తుదిసందేశాన్ని సందేశాన్ని సంఘము మన్నిస్తుందనే నా ఆశయము."

నారాయణమూర్తికి ద్వితీయకళత్రంవల్ల కలిగింది వొక్క కమలే. ప్రథమభార్య సంతానములేకుండానే గతించడంవల్ల రాజేశ్వరి మంచిదనము పైకిరావడానికి వీలయింది. నారాయణమూర్తికి యింట్లో సవతిపిల్లల పోరు తప్పింది. ఆ దంపతుల నోముపంట—ప్రేమ నిధానము అయిన కమల అల్లారుముద్దుగా పెరిగింది.

నారాయణమూర్తికి సాలుకి అయిదు వేలు భూరాబడివుంది. తాత తండ్రులవల్ల వచ్చిన ఆస్తులు అలావుండగా సివిలుసర్జనుగా అతని స్వార్జితం యాభై వేల రూపాయిలకు పైదాటివుంది. స్వస్థలమైన రాజమండ్రీలో అతనికి వోలాగిలివుంది. మైలాపూరులో క్రొత్తగా అతడు బంగళా కట్టించాడు.

నారాయణమూర్తి రిటైరై యేడాదయింది. అతడికి వూళ్లో యెంతపెత్తనమున్నా యింట్లో రాజేశ్వరిదే రాజ్యాధికారము. అతని గృహాశ్రమావాసంలో ఆమెను ధిక్కరించి చేసిన పనులు వొకటి రెండు వుంటాయి. రాజేశ్వరి యిష్టములేకుండగనే అతడు ప్రసాదరావుకు చదువు చెప్పించాడు. ప్రసాదరావు అతని చెల్లెలికొడుకే. చిన్నతనంలోనే వొక్కడైన ప్రసాదరావుని అతడు చేరదీసాడు. అతనికి ప్రసాదరావుమీదుండే వాత్సల్యము రాజేశ్వరి అసూయకు దారివ్వలేదు. ప్రసాదరావు బి.యే. ఆనర్సు ప్యాసయేడు. ఉద్యోగప్రయత్నంచేస్తూ మేనమామ యింట్లోనే వుంటున్నాడు. ప్రసాదరావు అక్కడవుండడం కమలకి వుపకరించినది. ఆమె తన ఫోర్తుఫారమ్ పాఠములు అతనికడ నేర్చేది.

కమలకి జ్ఞానము వచ్చినదగ్గరనుంచీ ప్రసాదరావుని ఆమె చూస్తూనేవుంది. ఆమె తండ్రి బళ్లారిలోవున్నప్పుడు వేసవికి మెడ్రాసునుండి ప్రసాదరావు రావడం ఆమెకు తెలుసు. ప్రసాదరావు యోగక్షేమములు కనిపెట్టడానికి యీప్రపంచములో తనుతప్ప వేరొకరు లేరని తనతండ్రి చెప్పినపుడు కమల నిజంగా విచారించినది. కారణంలేకుండానే ఆమెకన్నుల నీరు నించినది. ఆనాడే ఆమె హృదయంలో అతనికై జాలినింపింది. రోజులు గడిచిన కొలదీ అది ఆమెకు తెలీకుండానే యెన్నో మార్పులు పొందినది.

ప్రసాదరావు బి.యే. ఆనర్సు ఫస్టుక్లాసులో వచ్చేడని కమల వినినపుడు ఆమె సంతోషాన్ని పట్ట

లేకపోయింది. 'అమ్మా! బావ యెంతో తెలివైన వాడే' అని తల్లితో చెప్పింది.

'నాన్నగారూ! యివాళ సినిమాకి వెళ్లకతప్ప దండీ! అని తండ్రిని హెచ్చరించింది. ప్రసాదరావు యింటికి రావడంతోటే 'బావా! నీవు ఫస్టుగా ప్యాసయినందుకు యేమిటి కావాలి?' అని వెర్రిగా అడిగింది.

ప్రసాదరావుని ట్యూటరుగా నియమించుకునే కమల క్లాసులో ప్రవేశించినది. కమలకి అప్పుడు పద మూడు సంవత్సరాలు వెళ్లిపోయాయి. కమలని యిక చదివించవద్దని రాజేశ్వరి పట్టుపట్టకపోలేదు. కాని కమల వుత్సాహము దాన్ని జయించినది. రజస్వ లయినతోడనే మానిపించుటకు నారాయణమూర్తి వొప్పుకుని కమలను ప్రవేశపెట్టాడు. ఆయేడు యెలాగ చదవకమాననని కమల ధైర్యము వహించినది.

* * * *

కాలం నడుస్తూంది. కమలకి పదునాల్గవయేడు నడచింది. ఆమె ప్రథమరజస్వల అయింది. రాజే శ్వరి ఆమె పెండ్లికై భర్తను తొందరచేయసాగింది. ఇంట్లోవున్న ప్రసాదరావుపై ఆమె ఆలోచన యెప్పుడూపోలేదు. కమల అతనితో అంతగా కలిసి తిరగడంకూడ ఆమె సహించలేదు. 'పెద్దచదువు చెప్పించాము. ఏదో వుద్యోగము చూచుకొని వెళ్ల మనండి' అని ఆమె భర్తతో అంటూండేది. నారా యణమూర్తికి మాత్రము కమలాప్రసాదరావుల కల యికకై ఆశవుండేది. కాని 'యింతకాలము పెంచి పిల్లని అట్టి దరిద్రునికా యివ్వడము అని రాజేశ్వరి అతనితో కచ్చితంగా చెప్పింది. 'మీరు అట్టి సంబం ధముచేస్తే నేను వొప్పుకోను' అని స్పష్టంగానే అంది. కమల వివాహవిషయంలో నారాయణమూర్తి చేయి క్రిందుఅయింది. ఆనాటినుంచీ అతడు పైసంబంధ ములు చూస్తూన్నాడు.

* * * *

నారాయణమూర్తి వరాన్వేషణంలో కమలా ప్రసాదరావులకు తెలిసిన విషయము యేదీలేదు. కమల పూర్వంకిమల్లే ప్రసాదరావుతో యిష్టాగోష్ఠి సలిపేది. అతనికై ఆమె అభిమానము పూజ్యత తగ్గలేదు.

ఆనాడు కమల స్కూలునుంచి వచ్చేసరికి రాజే శ్వరి ఆమెకు 'ముస్తాబు' చేసింది. ఆమె ముందు హాల్లోకి వెళ్లినతర్వాత కమల గ్రహించింది తనకోస రము వరుడు వచ్చేడని. వరుని మేనమామ అడిగిన ప్రశ్నలకి ఆమె మంత్రబద్ధవలె జవాబులిచ్చింది. అతడు పాడమంటే కోకిలస్వరంతో పాటపాడింది. వారు వెళ్లిపోయినతర్వాత ఆమె హృదయంలో యెన్నో ఆలోచనలు కలిగేయి. ఆమె హృదయం పెనుతుపాను రేగింది.

ఆరాత్రి ప్రసాదరావు యింటికి వచ్చినతర్వాత ఆమె శాంతించినది. తన తల్లిదండ్రులు నిద్రించిన మీదట ఆమె అతని గదిలోకిపోయింది. కిటికీదగ్గర సాలోచితంగా ప్రసాదరావు నించునివున్నాడు. ఆమె దాదాపుగా అతనిదగ్గరకే పోయింది.

'బావా!'

కిటికీ కావలనున్న 'సఫోటా' వేపుకే అతడు చూస్తున్నాడు.

'సాయంత్రం చిన్నతమాషా జరిగింది.'

'రామస్వామి అంతా చెప్పేడు.'

కిటికీలోంచి గదిలోకివచ్చిన ఆకుల్ని తెంపుతూ కమల నించుంది. కిటికీకావల వెన్నెట్లో విహారం చేస్తూన్నాయి అతని కనులు. మేడమీద ముందు వసారా యెత్తుకి పెరిగిన మాలతీలతలో తుమ్మెదసడి స్పష్టంగా వినబడుతోంది వారిద్దరికీ.

'నాన్నగారి అభిప్రాయమేమిటి?'

'భాగ్యవంతుల యింటి కోడల్ని చెయ్యటం మీ అమ్మ అభిప్రాయము' అని ప్రసాదరావు జవాబు యిచ్చేడు. కమల అతన్ని గమనించినది.

'బావా! నన్నేల యేడిపిస్తావు.'

ఆమె కనులలో రెండు అశ్రువులు తిరిగేయి.

'కమలా! వేలపుగాతుము.' అతని కంఠము నిశ్చలముగావుంది. నీతల్లి నీసౌఖ్యముకైయ్యే ప్రయత్నిస్తూంది.'

'బావా! అతని భాగ్యమునుచూచి నేను వుప్పొంగను. అతడు నాకు ప్రేమభాగ్యము నొసగలేడు.'

ఆమె దైన్యముతో అల్లాఅంది.

అతడు వూరుకున్నాడు.

'బావా! అతడు నాకు వరుడుకాడు. అతని నేను వరించలేను.'

ఆమె కొంతసేపు నించుంది. తర్వాత ద్వారము వేపు దారితీసింది.

'అసూయాపరురాలగు స్త్రీ కార్యకలాపం వెర్రికుక్క పంటికంటెను విషపూరితము.'

కమ లామాటలు వింది. వసారాసిట్టగోడను ఆని ఆమె నిలుచుంది. దారినిపోయే వెన్నెలపులుగు 'తీతీ' అని ఆ నిశావాయువులో పలికింది. వూర్లో గడియారం పన్రెండెంటు కొట్టింది. ప్రసాదరావుపై తన తల్లి అసూయతకు కారణ మూహించుకుంటూనే ఆమె మెట్లు దిగింది. తన గదిలోకి పోయింది. తలగడలో ముఖంపెట్టుకుని ఆమె పడుక్కుంది. అరగంట పోయినతర్వాత తలగడ తడిసినట్టు ఆమె తెలుసుకుంది.

*　　*　　*　　*

రాజేశ్వరి ఆ సంబంధము విషయములో పట్టుదలగానేవుంది. గోపాలరావు లక్షరూపాయిల స్థితిపరుడు. అప్పట్లో అతడు మునిసిపలు 'చైర్ మేను'గా వున్నాడు. రఘునాథరావు అతనికి వొక్కడే కుమారుడు. అతని యింటరుమీడియటు చదువుతోనే రాజేశ్వరి సంతుష్టిజెందినది. ఈకాలంలో చదువుకు యేమి విలువవుందనే ఆమె భర్తకు నచ్చచెప్పినది. తనకుమార్తె సుఖిస్తుందని ఆమె అభిలషించింది. కట్నకానుకలు అయిదువేలుగాక మరి వెయ్యిరూపాయిల వరకు నారాయణమూర్తి సంసిద్ధుడయ్యేడు. అంత సొమ్ము తన వివాహమునకై వ్యయంచెయ్యడము కమలకి యిష్టంలేదు. కాని ఆమె యేమిచేస్తుంది. తన తల్లితండ్రులతో చెప్పడానికి ఆమె జంకిపోయినది. వారి యెదుటపడే విధంగా ఆమె పెంపబడలేదు....

...................ప్రసాదరావు దరిద్రుడే-అయితే అతడు భాగ్యవంతుడవడానికి మార్గంలేదూ?' అని ఆమె ప్రశ్నించుకుంది. అది ఆమెలోనే జీర్ణించిపోయింది. రాజేశ్వరికే ఆప్రశ్న కలిగినట్టయితే కథ యెలా మారుండునో?

*　　*　　*　　*

వివాహానికి రెండురోజులు ముందుగా కమలా ప్రసాదరావులు మెరీనానుండి కారులో వస్తున్నారు. దారిలో కమల యిలాఅంది.

'బావా! యీప్రపంచంలో నేను వొకరి జీవితనౌకకు చుక్కాణి నవుతాననుకున్నాను. కాని......

ఆమె వూరుకుంది.

'కమలా! మనకువున్న జ్ఞాన మతిస్వల్పము. మీ అమ్మ అనుభవశాలిని. ఆమెకున్న జ్ఞానము మాకు య్యాడుకూడ లేదు.

కమల అతన్ని చూచింది. అతడు కారును నడుపుటలోనే లీనమైవున్నాడు. అతని మాటల్లోని గూఢార్థము ఆమెకు స్ఫురింపకపోలేదు. కారు బంగళాముందు ఆపుతూ ప్రసాదరావన్నాడు.

'కమలా! నన్ను మరిచిపో. నిర్భాగ్యదేవతతో పోట్లాటకు నే నీ విశాలప్రపంచంలోకి వెళ్లిపోతున్నా.'

కమల చెక్కిళ్లమీదకి అశ్రువులు జారేయి. అతడు వాటిని తనచేత్తో తుడిచేడు.

ఆరాత్రే ప్రసాదరావు బంగళావదలి వెళ్లిపోయేడు. ఉదయాన్ని రాజేశ్వరి చూచేసరికి కమల కన్నులు పచ్చిముద్దలయివున్నాయి.

*　　*　　*　　*

కమలారఘునాథరావులకు వైభవంగా వివాహము జరిగింది. వివాహంతోటే ఆమె విద్యకు స్వస్తి వాక్యము పలికింది.

కమల యిపుడు కాపురమునకు వెళ్లింది. ఆమె అత్తవారింటి జీవితంలో ఆమె ప్రవృత్తి యెన్ని విధాలో మారింది. వివాహమయినతర్వాత రఘునాధరావుకు తనకు వొకవిడదీయరాని సంబంధము యేర్పడ్డాదని ఆమె అనుకుంది. అందుకై ఆమె తన హృదయంలో అతనికి స్థానమిచ్చింది. అతన్ని ప్రేమించడం నేర్చుకుంది-అలవాటుచేసుకుంది. వొంటరిగా మసలే కాలంలోకన్న ఆమె భర్తసన్నిధానంలో తనవారిని మరవ ప్రయత్నించేది. ఒకరికై విచారిస్తున్నట్టు ఆమె అతనియెదుట యెప్పుడూ ప్రదర్శించివుండలేదు. రఘునాధరావుకైయ్యే ఆమె జీవించింది. అతనికైయ్యే ఆమె జీవిస్తూంది. అదే విధిప్రేరితము—తనవారి అభిమతము. ఒక్క కమల దానికి యెదురుతిరిగి లాభమేమిటి అని ఆమె సమాధానపడింది.

ఆమె భర్తగృహంలో లేనిసమయాల్లో కమల గదినివిడిచి పైకిరాలేదు. పెండ్లిలోనే తన పుట్టింటివారిచ్చిన 'కొలంబియా' ఫోను, యెంతో దీక్షతోకూర్చి ఆమెకు జ్ఞాపకార్థము ప్రసాదరావిచ్చిన సినిమా పిక్చరు ఆల్బము, ఆమె కాగోజుల్లో వుబుసుపోకకు కారణమయ్యేయి. గది కిటికీకి యెదురుగా వున్న పోకచెట్ల విలాసంలో లీనమై ఆమె సాయంత్రము గడపేది. హాటిమీద ఫుత్సాహంగా తిరిగే వుడతల ఆర్భాటంలో మమేకమై ఆమె కాలమును మరచేది.

* * * *

ఆరుమాసములు గడచిపోయాయి. ఆమె అత్తవారింటి పద్ధతి కమల అలవరచుకుంది. రఘునాధరావుతోపాటు ఆమె కా యింట్లో బాగా పరిచయమయినది లక్ష్మి. ఆమె రఘునాధరావు పుట్టుగదాదిగ అక్కడే పనిచేస్తూంది. ఆ స్వల్పకాలంలోనే లక్ష్మి తనయెడ నగపరచే పూజ్యభావానికి కమల ఆమెను అభిమానించినది. మొదట లక్ష్మి తన్ను పొగడినపుడు ఆమె నిజంగా కోపమే తెచ్చుకుంది. కాని తర్వాత లక్ష్మి చెప్పే విషయాలని ఆమె యెంతో వోపికతో వినేది.

ఆసాయంత్రం మూడు గంటలకే రఘునాధరావు బట్టలువేసుకుని క్రిందికి దిగిపోయాడు. అయిదు వేసిన తర్వాత మేడవూడవడానికి లక్ష్మి వచ్చి కమలను లేపింది.

'లక్ష్మి!...'

'ఏమమ్మా.'

'ఇప్పుడు యెన్ని గంటలయింది?'

'అయిదున్నర.'

'యింతవరకు లేపేవు కాదేమి?'

'అమ్మగారు వద్దన్నారు. మీవంట్లో బాగులేదని విన్నారుట.'

లక్ష్మి గది వూడుస్తూంది. వసారాలోవున్న నీళ్లతో మొగంకడుక్కొని కమల అద్దముముందు జుత్తు సరిచేసుకుంది.

'ఆవిడ అలా చెప్పేరా?'

'ఊఁ.'

'లక్ష్మి!...'

'.........'

'నిన్నరాత్రి వారు యెన్నిగంటలకు వచ్చేరో నీకు తెలుసు కదూ?'

'అవును.'

'సినిమాకి వెళ్లేనన్నారు నాతో కాని......'

దిగువనుండి అమ్మగారు పిలవడముచేత లక్ష్మి వెళ్లిపోయింది. కమల బయలులోకి చూచింది. దూరాన్ని కనబడే మసీదుశిఖరంపై నాలుగయిదు పిట్టలు స్వేచ్ఛగా యెగురుతున్నాయి. కృష్ణ కాలువ జాలులో పోతూన్న యే పశులకాపరిపాటో స్వచ్ఛంగా ఆమె కా సంధ్యావాయువులో వినబడుతూన్నాది. 'స్వేచ్ఛారహితమగు బ్రతుకు.........' ఆమె యేమేమో గొణుగుకున్నాది. గదిలోకిపోయి 'స్విచ్ఛ్' నొక్కింది. ఆమె సోఫాలో ఆలోచనా

పూర్వకంగా కూర్చుంది. ఎదురుగా గోడకు తగిలించిన పటములోంచి 'జమున' ఆమెకేసి దీనంగాచూస్తోంది.

ఎనిమిది అయినతర్వాత కమల మేడదిగింది. మెట్ల దిగువ విరియబూసిన నందివర్ధనము ఆ సంజవెన్నెట్లో ఆమెకు కొంత శాంతినిచ్చినది.

భోజనం అయినతర్వాత కమల మీదికి వస్తూంటే మెట్లదగ్గర లక్ష్మి ఆమెకు యెదురయింది.

'లక్ష్మీ!...వారు రాలేదుకదూ?'

'లేదు.'

కమల మెట్లెక్కుతూ వెనుకచూచింది. లక్ష్మి పైటచెరగుతో కళ్లు వత్తుకుంటున్నాది. ఆమె మీదికి పోయింది.

రాత్రి రఘునాధరావు యింటికి వచ్చేసరికి కమల మేడమీద వసారా 'ఆర్చి' దగ్గర నిలుచునుంది. పడమటివీధుల్లో చంద్రుడు మరుగుపడుతున్నాడు అప్పుడే.

అతడు గదిలోకిపోయాడు. ఆమెకూడ అతని వెనుకపోయింది.

'ఇవాళా సినిమాయేనా?'

'కాదు.'

'మీరు యెక్కడికి వెళ్లేదీ నాకు తెలియకూడదా?'

'కూడదు.'

ఆమె పూరుకుంది. అతడు మాట్లాడలేదు. వెనక గదిలో గడియారము కాలగతిని తెలుపుతూంది.

'నేను బయట పరుంటాను.........ఇంట్లో వుక్కగావుంది.'

అతడు ఆమె సహాయంలేకుండానే పరుపు అవతల వేసుకున్నాడు. కమల గదిలోనే వుండిపోయింది. మరోగంటవరకు అతడు పడుకోలేదని ఆమె 'సిగరెట్టు' పొగనుబట్టి అనుకుంది.

మరునాడు వుదయం కాఫీ అప్పుడు ఆమె రఘునాధరావుతో మాట్లాడ ప్రయత్నించింది. కాని అది నిష్ఫలమే అయింది.

ఆరాత్రి లక్ష్మి ఆమెను దిగువకు పిలువవచ్చినపుడు కమల ఆమెను కొంత ప్రశ్నించినది.

'వారి స్నేహితుల యింటికి తరుచుపోతూంటారు' అని లక్ష్మి చెప్పింది. కాని కమల అది నిజమని నమ్మలేదు.

* * * *

కాలవాహినిలో కొట్లాడింది కమల ఆ రెండు వారాలు. రఘునాధరావు జీవితరహస్యము తుదకు ఆమె లక్ష్మివల్లనే వింది.

ఆవుదయం 'విండోగ్లాసుప్లేస్సు' తెరుస్తూ కమల పైకిచూచింది. ప్రసాదరావు ఆఫీసురూము వేపు పోతున్నాడు. కాఫీపాత్రలు తీసుకుపోడానికి వచ్చిన లక్ష్మిచే అతనికి కమల కబురుచేసింది. ఆమె అతన్ని మెట్లదగ్గరే కలుసుకుంది.

'కమలా! నేనెట్టి సంఘటనను తలవలేదు.' అతడు ఆశ్చర్యంగా అన్నాడు.

కమల ముఖబింబములో దైన్యం తొలుకాడుతూంది.

'పారిస్ సిక్కురు డీలర్సు' షాపులో టైపిస్టుగా వున్నా. రఘునాధరావుకి నాకు అక్కడే పరిచయం. అతడు మా మేనేజరుకి రెండువందలు యివ్వాలి' అని ప్రసాదరావు అడక్కుండానే చెప్పేడు.

కమల నిశ్చలంగా వింది.

'మాఅమ్మ నా సౌభాగ్యమునకే యీ వివాహం చేసింది. కాని ఆమె నాకు ప్రేమభాగ్యమున కొరకే చేసింది. నేను జీవిస్తున్నాను. ఆజీవితంలో మాధుర్యం లేదు. నేను సుఖపడుతున్నానని ప్రపంచం అనుకుంటుంది. కాని అదో యెండమావి. మాఅమ్మ అవివేకానికి నాబ్రతుకు బలిఅయింది. నేను దానికి విచారింపను. కాని సంఘం అట్టి అవివేకాన్ని యిక పూజింపవద్దని నాప్రార్థన......'

ప్రసాదరావు ఆమాటలు విన్నాడు. అతని కనులలో అశ్రులు తిరిగేయి.

'బావా! అప్పట్లో నీ హృదయం యెంతో పరితపించివుంటుంది. ఆనాడు నేను 'వలవల' యేడ్చేను.' ఆమె రెండు నిముసములు వూరుకుంది.

'నిన్ను మళ్లా చూచేను. ఇదే కడసారి యేమో!' ప్రసాదరావు ఆమె ముఖంకేసి చూచేడు.

'నా హృదయతంత్రులు తెగేయి. ఆవిపంచీ స్వనం యిక యెవరూ వినలేరు' అలా అని కమల మెట్లెక్కి వెళ్లిపోయింది. వసారాలో కనబడ్డ లక్ష్మితో 'అతడు నా మేనత్తకొడుకు' అని ఆమె మామూలుగా అంది.

ఆసాయంత్రము రఘునాథరావు బయటికిపోతూన్నపుడు కమల అతన్ని అడ్డగించింది.

'మీరు యెక్కడికీ పోవద్దు. ఈవుదయం జరిగిన విషయం మీకు తెలీదు. మీ నాన్నగారితో వైరము వద్దు' అలా అని ఆమె బతిమిలాడింది. ప్రాధేయ పడ్డాది. అతడు చలింపలేదు. ఆమెను త్రోసిపుచ్చి వెళ్లిపోయాడు.

ఆ సంజచీకట్లో ఆమె గదిలో కూర్చుంది. ఆమె యవ్వనహృదయం నివారణకు వీలులేనంత దెబ్బతింది. దిగువకు పిలువవచ్చిన లక్ష్మితో 'నాకు ఆకలిలేదు' అని చెప్పడం ఆమెకు తెలీదు.

ఎనిమిది వేసినతర్వాత ఆమె లేచింది. గోడకు తగిల్చిన 'క్యాలండరు' గాలికి కొట్టుకుంటూంది. కిటికీలోంచి వానజల్లు ఆమె కూర్చున్న సోఫావరకు కొడుతూంది. కమల 'విండోషట్టర్సు' మూసింది. స్విచ్చినొక్కి వాలుకుర్చీలో జేరగిలింది.

'అమ్మా! నిర్భాగ్యమును స్త్రీ వొకప్పుడు నోర్చుతుంది. కాని వుపేక్షాభావమును ఆమె యెప్పుడూ సహింపదు. ఆమె తనలోనే అనుకుంది.

అరగంట పోయినతర్వాత ఆమె టేబిలుదరికిపోయి యేమేమో వ్రాసింది.

ప్రక్కగదిలో గడియారము పదకొండు కొట్టింది. ఆమె లేచింది. కిటికీతలుపు తెరచి బయలులోకి చూచింది. బయట 'రొజ్జ' గాలి కొడుతూంది. ఒక్కసారిగా వూర్లో 'లైట్లు' అన్నీ ఆరిపోయాయి. ఆమె స్విచ్చి నొక్కింది. లైటు పడలేదు. వసారాలోకి వచ్చింది. మందిరమంతా చీకటివడిలో నిద్రపోతూంది. ఎదురుగావున్న అరటిపొదలో గాలికి వూగాడుతూన్న ఆకులు చీకటిచాయల్లో దిగులు పుట్టిస్తున్నాయి.

కమల మెట్లుదిగి దిగువకు వెళ్లిపోయింది. ఆమె తిరిగీ మేడపైకి రాలేదు.

ఉదయాన్ని మేడపైకిపోయిన లక్ష్మి కమలగదిలో టేబిలుమీదున్న చీటిని గోపాలరావు కిచ్చింది. అతడిలా చదువుకున్నాడు.

"భాగ్యవంతుల పిల్లల్ని భాగ్యవంతుల యింటి కోడల్ని చెయ్యాలన్న పట్టుదల మన గృహాల్లో చాల పరిపాటిలోవుంది. విద్యాధికుడై, సుగుణవంతుడై, తమ కనులయెదుటనే పెరిగిన వరుడు నిర్భాగ్యుడయితే అక్కరకురాడు. కాని భాగ్యవంతుడైన ఆవరున్ని కొనుక్కోడానికి తమ భాగ్యములో సగము వెచ్చించాలి. ఆవ్యయమే మకోకుటుంబము నిలవడానికి సరిపోతుందని గ్రహించీ నావంటి పిల్లల్ని గన్న తల్లుల మౌర్ఖ్యమునకు నిండుజీవుల బలియివ్వవద్దని నాప్రార్థన. నా తుదిసందేశాన్ని సంఘము మన్నిస్తుందనే నా ఆశయము."

కమల మరణించినది. ఆమె శరీరము కృష్ణకాలువలో దొరికింది. 'ఆమెది తప్పుకాదు' అని గొణుకుకున్నాది లక్ష్మి ఆవార్త విన్నాక.

# స్త్రీలు - వైద్యవృత్తి

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

పురుషులతోపాటు సర్వవిషయముల లోను స్త్రీలకుకూడ సమానహక్కు నిచ్చుట దేశమునకు సౌభాగ్యహేతువు. మనదేశ మింత యత్యధమస్థితిలో నుండుటకు కారణ మేమియో గమనించితిరా? విదేశములలో స్త్రీపురుషు లిద్దరు సమానముగా చదువుకొని ఉద్యోగాములవలన ధనము సంపాదింతురు. మనవారలట్లుచేయుట మహాదోష మని తలంచి స్త్రీలకు విద్యాగంధాఘ్రాణము నొసరించుటకైనను గడువీయక దరిద్రతాపిశాచమునోటిలో పడుచున్నారు. భార్యాభర్త లిద్దరు నడుము బిగించుకొని యేకూలినాలియోచేసి నాలుగు డబ్బులు గడించి హాయిగా గంజిత్రాగుచు సుఖించుచున్న పాటకజాతి దేసుఖము. పెండ్లామును వంటయింట్లోపెట్టి పురుషులెంత సంపాదించుచుండిననేమి లాభము? మనదేశమున పురుషులు స్త్రీలు ఇంచుమించుగా సమముగానే యున్నారు. దీనినిబట్టి చూడగా పురుషులు బుద్ధిపూర్వకముగా హిందూదేశములో సగముమంది పనిచేయుగల వ్యక్తులను మూల ముసలమ్మలలాగ కూర్చుండపెట్టుచున్నారన్నమాట. ఇదియే మనదేశ దారిద్ర్యమునకు మూలకందము. ఇదియే మనకు తిండిలేకపోవుటలో హేతువు. కొందఱు బుద్ధిమంతులుపై సంగతులు బాగుగా పరిశీలించి దేశ దౌర్భాగ్యమును తొలగించుటకు స్త్రీలకు విద్యలు నేర్పవలయుననియు స్త్రీకి కూడ స్వాతంత్ర్యమీయవలయుననియు ప్రజలలో ప్రబోధముచేసిరి. నేడును చేయుచున్నారు. అది కొంతవఱకు వ్యాపించినది.

స్త్రీలకు నిర్మింపబడిన కళాశాలలు 26,335 కలవనియు పురుషులకొఱకు నిర్మింపబడినవి 1,37,437 కలవనియు గత గృహలక్ష్మిలో ప్రకటితమగు "మన భారతభూమి" యనునొక వ్యాసములో చదివినట్లు జ్ఞప్తి. దీనినిబట్టిచూచినచో నింకను స్త్రీకళాశాలలు ఇతోధికముగా వృద్ధికావలెనని తేలుచున్నది.

గత డిసెంబరు గృహలక్ష్మి పత్రికా సంపాదకీయములో స్త్రీలు - వైద్యసాహాయ్యము అనునది చూచినతోడనే నేనీ వ్యాసమువ్రాయ నుద్యోగించితిని. పురుషులకంటె స్త్రీలకు కొన్నిరోగము లెక్కువగుటచే స్త్రీరోగములే అధికముగానున్నవి. ఇంకను స్త్రీలకు ప్రసూతిరోగములు తఱచుగా వచ్చుచుండును. ప్రసూతి చికిత్సాలయములు ప్రభుత్వమువారు కొన్ని కొన్ని స్థాపించి తదుచితచికిత్స చేయించుచున్నారు. కాని అట్టి చికిత్సాలయములు పదిగ్రామముల కొకటియైనను నెలకొల్పవలయును. ఆచికిత్సాలయములయందు దేశీయ వైద్యమును గఱచిన స్త్రీలే వైద్యురాండ్రుగా నుండవలయును. స్త్రీ సంబంధరోగముల ననుభవపూర్వముగా నంగనలు చేసినంత శీఘ్రముగా పురుషులు చేయజాలరు.

ఆడుదివచ్చి పురుషునితో రహస్యములగు వ్యాధులను నిర్లజ్జముగా చెప్పుటకు సంశయ పడును. అదియే స్త్రీ వైద్యురాలైనచో మొగమోటము లేకుండగా తనవ్యాధి సంగతి చెప్పుకొనకలుగును. కనుక స్త్రీలే ప్రసూతి చికిత్సాలయములయందు తదితర స్త్రీ చికిత్సలకు నర్హులగుదురు.

స్త్రీలకు వైద్యము నభ్యసింపఁజేయుట తలిదండ్రులపైనున్నది. వైద్యుఁడైన తండ్రి కుమారునకే వైద్యము నేర్పును గాని గౌరవభంగమనియో పూర్వాచార భంగమనియో కుమార్తెకుమాత్రము వైద్యముచెప్ప నోపడు. పల్లెటూరువారు స్త్రీలకు చదువును చెప్పించుటయే మాని నారు. వైద్యమును చెప్పక పోవుటలో వింత యేమియని ప్రశ్నింతురేమో! అది నిజమే.

ఈ చెప్పెడు పైమాటలన్నియుఁ బల్లె టూళ్లలోనుండు వారి ప్రబోధమునకే పట్టణ వాసులు స్త్రీలకు స్వాతంత్ర్యము నిచ్చుచు స్త్రీకి విద్యనేర్పించుచు శక్త్యనుసారముగా మహిళామండలము నఖండముగా విజ్ఞాన మండితముఁ జేయుచున్నారు.

వైద్యవిద్య విషయములో మాత్రము పట్టణ ప్రజలుకూడ నశ్రద్ధవహించుచున్నా రనుటలో సందేహములేదు. అసలు పురుషు లకే వైద్యశాలలు బహుస్వల్పముగా నున్నవి. అందులో స్త్రీలకు బొత్తిగాలేవు. స్త్రీకళాశాలలు, స్త్రీ చికిత్సాలయములు, నిర్మించుటకును స్త్రీలకు తగినంత ప్రోత్సా హము వైద్యములో నొసఁగుటకు నేటి కాంగ్రెస్సు విద్యాశాఖాధికారులు పూను కొనవలయును. వైద్యవిషయమై ముక్త్యాల సంస్థానము కొంతవఱకు సహాయ మొనరిం చినది. సంస్థానములు, మంత్రులు, కూడ నీవిషయములో తగినశ్రద్ధ తీసుకొని తీరవల యునని ప్రార్థించుచున్నాను.

---

## సినీమా

ప్రకృతియనునది సితకాండపటముగాగ,
అమితజీవులు చలనచిత్రములుగాగ,
సకలభూతంబు లలరుప్రేక్షకులుగాగ
జగమె, యొకసినీమాహాలు సామ్యమగును.
అబ్బురము! మించుదీపంబు లార్చినంత
నంధకారములెల్లెడ నలముకొనిన
యపుడె, తెరమీద చిత్రములానునట్లు,
జ్ఞానవిజ్ఞానదీపముల్ సన్నగిల్లి
నపుడె యజ్ఞానతిమిరంబు లాక్రమింప
నస్థిరపదార్థసంతతు లానుచుండు.
మఱల మెఱపుదీపములిట్టె మెఱయునంత
సంతసముఁగూర్చు రమ్యదృశ్యంబులన్ని
కన్నులకు గోచరింబింత కానియట్లు,
జ్ఞానదీపంబు వెలిగిన కారణమున
స్థిరముస్థిరమంచు మఱపించు సృష్టియంత
శూన్యమై దివ్యతేజంబ చూడనగును.

భమిడి ఉమామహేశ్వరావధాని.

# కాశ్మీర మజిలీలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

## వెండిగుడి

మెల్లమెల్లగ నడచిపోతిమి. ఎందును ఎట్టిసందడి యును లేదు. నగరము సుషుప్తిమగ్నమై యుండెను. ఇంతలో వెండిగుడి కన్నులబడెను.

నిర్మాణమున నీయాలయమునకును, వెనుకటిగుడికిని ఎంతో పోలికకలదు. సిక్కులమందిరముతో, సజ్జీకాజాలు దేవభవనమును నిర్మింపవలెననియే హిందువులు దీనినిట్లు కట్టిరి. * ఈయాలయనిర్మాణమునకై మాలవ్యాపండితుడు విశేష కృషి సలిపెనని వింటిని. గుడి మీదిభాగముమాత్రము బంగారుతో రంగారి యున్నది. పాలరాతితో సహకరించిన వెండి విశేష ముగ దీనిశిల్పమున గలదు. ఇదికూడ నొకపుష్కరిణీ హృదయమున నలరారుచున్నది. గుడికెదుట సలిల మధ్యమునగల రాతిగట్టుపై చక్కని స్తంభము లున్నవి. వెండిరేకుల యంగీదొడిగినట్లివి తోచును. శశికాంత శిలామయమూర్తు లిందు శోభిలుచుండును. ఈలక్ష్మీనారాయణ విగ్రహములకెనయైన సుందర మూర్తులు భారతావనియందు మిగుల నరుదుగనున్నవి.

వెండిగుడిలోకూడ పగటివేళయందు సంకీర్తనములు జరుగుచుండును. కడచినపర్యాయము సంకీర్తన సమయమున నిందుంటిని.

ఇచటిచెరువులో ననవరతము నీరుండదు. మా యదృష్టమువలన గాబోలు ఈమాఱు సరస్సు సలిల సంభరితమై యున్నది.

కనకరశ్మిలో బంగారుగుడి ఎట్లు కాంతిలెనో ఎఱిగిన చదువరులు రజతరశ్మిలో వెండిగుడి ఎట్లు శోభిలినదో యూహించుకొనగలరు. వీనిరూపములు వేర్వేరైనవి. కాని వీని యందచందములు మహోత్కృష్టములుగదా! ఇవి గంభీరభావబంధురములు గదా!

"పగలుకడచి నిశియాసన్నమగువేళ నెట్టి విపత్తులు మూర్కొనునోయని యడలువారివలె ఆసన్నమృత్యువునుతలపోసి కడసారిముహూర్తమున దురపిల్లువా రందురు. కాని పున్నమరాతిరి మనసును రంజించు లీల, నైహికజీవితము కడచినపిదప మనుష్యాత్మ నలరించు మనోహరదృశ్యము లుండునేమో!" అని సౌందర్యపిపాసువు కీట్సు మహాకవి వచించినాడు. ఈమహాకవి సుఖము నెఱుగడు. క్షయరోగపీడితుడై ఇరువదియాఱవయేట పరదేశమున పరమపదించినాడు. ఐహికయాత్రను గడపినపిదప నీతనిజీవాత్మ పండువెన్నెలభాగ్యము నందగలిగెనేమో! కీట్సువాక్కునకును కీట్సుభావ్యానుభవమునకును ఎట్టి సంబంధమేర్పడెనో! 1 శాస్త్రవేత్తలు తార్కికసూత్రముల ననుసరించి సిద్ధాంతములు గావింతురు. కొంతకాలమీ సిద్ధాంతములు సత్యములట్లు గణింపబడును. కాని ఇవి అయదార్థములని నిరూపించి, నూతనసిద్ధాంతముల నావిష్కరించు భౌతికశాస్త్రజ్ఞు లుద్భవింతురు. కాని కవి మనసునుండి వెడలినసత్యములు యుగాంతములం

* సమ్ముఖద్వారమునకు పరితలమున నాంగ్లమున నీమాటలు తోచును. **Lakshminarayan Temple of Amritasar. Built by Madho Mal, Son of Sardar Sant Singh..............(and others) Tea merchants, Katra Ahluwalia A. S. F. 2nd October 1925.**

1 కీట్సుమనియుండ నీతనిప్రతిభను గుర్తింపనివారు పల్వురుండిరి. దుర్విమర్శ ఈతనిహృదయమునకు

దైన చిట్లిపోవు. మణికాంతులట్లివి యనంతకాలమున తేజరిల్లును. మనుష్యముఖమును నిమిత్తముగావించుకొని, జగదీశు డుచ్చరించినవాక్కులు కావున కవివాక్కు లమృతవాక్కులు కాజాలుచున్నవి. త్రికాలవేదియైన ఈశ్వరుడు సిద్ధాంతముల నుచ్చరించుటకై తర్కశాస్త్రము నాశ్రయింప నక్కరలేదు. కవిసిద్ధాంతములు తార్కికములుకాక ఆధ్యాత్మికశక్తి సముద్భవములగుడు, నిత్యసత్యములై వెలయుచున్నవి. ఈ యాధ్యాత్మికశక్తినే తాత్త్వికులు Intution అనుచుందురు. దీనికతనగలుగు భావోద్రేకమునుండి కవిత్వ ముద్భవించును. కావున తాముచ్చరించునదెద్దియో అందలిమహత్త్వమెట్టిదో కవులు తొలుత నెఱుగరు. "Poets are inspired madmen unconscious of what fell from their lips" అనికదా Plato పలికినాడు. సుందరదృశ్యములవలనను, భావబంధుర సంఘటనములకతనను హృదయోద్వేగము కలుగును. అద్భుతసత్యము లిందుండియే యుద్భవించును. తాఁగనినదానినుండి, తనగుండెను బలముగ గ్రుద్దిన అనుభవమునుండి ఉత్కృష్టభావములను కైకొనిగాని కవి తనజీవితరంగమునుండి వానిని కదలనీయడు. కవిని కోకిలకు, నెమలికి, చక్రవాకమునకు, తుమ్మెదకు పోల్పవచ్చును. చూతవృంతాగ్రమున నాసీనయైన కోవెలగుండెపై మలయమారుతస్పర్శ నందికదా నిస్తబ్దవనరాజ్యమున తీయని కూహుకూహూలను రాల్చును. కారుమబ్బునుచూచికదా పింఛమెత్తి మయూరము నృత్యము సలుపును! చంద్రికావృష్టి నవలోకించికదా చక్రవాకము కుత్తుకనొడ్డి దివిదెస నెగయును. సుందర సూనహృదయమున సుధాహ్రదమును విలోకించికదా మధురఝుంకృతులు సలుపుచు భ్రమరము దానిపై నడయాడును. కోకిలపాట యనుడు, బర్హినృత్యమనుడు, చక్రవాక గమనమనుడు, ద్విరేఫగానమనుడు ఉద్వేగమందిగదా అద్భుతకళాసృష్టిని గావించుచున్నవి! ఏయుద్వేగమునందని జంతువులును, జడములును కలవు. రాబండును శరన్నదిలోముంచిన, కలహంసవలె నలరునా? నల్లగాళ్లను వెన్నెలలో కడిగినను, కరగునా? చల్లనిజల్లులో బట్టెనునిలిపిన, నది కదలునా? మెదలునా? రూపుదాల్చిన సుందర భావమై కట్టెదుట పండువెన్నెల కాంతిలుచున్నను, కఠినహృదయము చంద్రకాంతశిలవలె కరగునా? కఠిన హృదయుడు, ఉద్వేగము నెఱుగని గుండెగలవాడు కవి కానేరడు సుడీ! ఉత్కృష్టరచనమును శాశ్వత దానముగ వసుమతికీయనెంచు రచయిత దానినుదాత్త భావవిభూతితో నింపవలెను. ఇట్టివిభూతి నీతడు భావసందీప్తదృశ్యముల నవలోకించి ఆధ్యాత్మికోత్తేజమంది సృష్టింపగలడు. కావుననే మహాకవులు సుందరప్రకృతి దృశ్యములతో వియ్యముసలిపి, దీని నెయ్యమున ధన్యులైరి. వ్యాకరణసూత్రములే, ఛందోనియమములే శరణ్యములని యెంచి వీని వియ్యమునే యెఱుగువారు పద్యము లల్లగలరు. కాని కవిత్వము చెప్పనేరరు. వీరి పద్యములందు పండువెన్నెల యుండదు. వీనియందు ప్రాణము హుళిక్కి! కన్ను గలవాడును హృదయసహితుడును చేపట్టిన లక్షణ సూత్రవితానము స్వయంవరాంగణమందలి సుందరిచేత గల సూనమాల్యమట్లు సురభిళ భావసమన్వితమై యుండును.

---

దురంతవ్యధను గలిగించినది. Black wood Magazine ఈతని జంపెనని వచించువారుండిరి. ఈతని యనంతరమీతనిప్రజ్ఞను గుర్తింపజాలినవారనేకులు పొడసూపిరి. కీట్సు మఱికొంతకాలము జీవించియుండినచో షేక్స్పియరంతటివాడు కాజాలియుండునని మేథ్యూ ఆర్నాల్డు వాకొనెను. ఈమహాకవికీర్తి పండువెన్నెలవలె ఈతనియనంతరము జగతియందు విస్తరిల్లెను. కష్టభూయిష్ఠమైన ఈతనిబ్రదుకు తీవ్రాతపమున కొనయైయుండ మరణానంతరమున నీతనియాత్మ నిండువెన్నెలనే యందినది. మరణానంతర భవిష్యత్కాలమునగూడ నీతని వాక్కు ఈతనిపట్ల నెట్లు సత్యమై పరిణమించినదో యూహింపుడు.

కౌముదీ స్నాతరజతాలయము నాటిశర్వరీ సమయమున నాహృదయమునకెట్టి భావభిక్ష పెట్టెనో పాఠకులూహించెదరుగాక. చిన్నదియైన ఈమజిలీయొక్క అంగణమున సాంతముగ నీభావరాజిని వెదజల్లలేను. కథనే వలచు సామాన్యులు విపులభావ విమర్శనమును కాంక్షింపరుకదా! ఈగ్రంథమున కథారూపమునుండి కదలిపోవుటకు నేనిచ్ఛగింపను.

బంగారుగుడిప్రక్క వెండిగుడిని, బంగారుకిరణములదాపున వెండికిరణములను నిలిపిన, నెట్టిదృశ్యము దృగ్గోచరమగునో యోచింపుడు. ఆయాలయము పొంత నీమందిరమును స్థాపించుట సాధ్యము కావచ్చును. కాని, ఆమయూఖమును, ఈ మరీచికను ఒకేముహూర్తమున నుజ్జీగానిలుపుట శక్యము కాదు. కాని బాహ్యజగతియందు సాధ్యముకానిది అంతరంగావనియందు సుసాధ్యమగును. కావుననే కవిహృదయమున కసాధ్యములుండవని వచింతును.

ఏండ్లు కడచినవి. అమృతసరమున నాటిరేబవళ్లు నాచిత్తమున చిత్రించిన రెండు చిత్రదృశ్యములు మాపుకాలేదు. నాటి యహర్నిశములు జోడు చెలిమికత్తెలై తన యందములరాశిని నాడెందమున కప్పనమని తమ భావబంధురసందేశములను నేడును నాయంతరంగమున వినిపించుచున్నవి. ప్రశాంతసమయమున కనులుమూసి చెవియొగ్గినపుడు, తియ్యనైన వీని గుసగుసలు హృదయాగారమున వినంబడును. వీని సౌందర్యసృష్టి మానసనేత్రమున కెదుట వింతతళ్కులనీనుచుండును.

నిలిచి వెండిగుడి నవలోకించినకొలది నాహృదయానంద మధికము కాదొడగినది. నిమీలితనేత్రుడై ఈశ్వరుడందు తపసొనరించుచుండ, నదృశ్యులై యమరులు అంబరమునుండి ఆతనిపై వెన్నెలవాన గురియించుచున్నట్లాదృశ్యము తోచినది. ఆమహత్తర దృశ్యమునకు సాగిలపడి నాహృదయము ధన్యనైతి ననుకొనెను. సౌందర్యము అనంతశాంతియందు విడియగాంక్షించునని అపుడే అది దివ్యశక్తిసమన్వితమై ఆనంద ప్రసవినియగునని నాటి నిస్తబ్దరజనీ ముహూర్తమున గుర్తించితిని. ఇట్టిముహూర్తములందే, ఇట్టి మధుమయసన్నివేశములందే, ఇట్టి సౌందర్యనిధానములందే కవిహృదయములు ఈశ్వరసంయోగమంది దివ్యకావ్యములను గనును. పిశాచములకు స్వర్గమున చోటులేనట్లు, ఇట్టి తావలములందు కుత్సితమునకు, కాఠిన్యమునకు నెలవులేదు. వీనిపై మనసు నిలిచినపుడు దుశ్చింతలు దీనిపై వ్రాలనేలవు; దీనిపై మలినము ప్రాకనేరదు. జ్ఞానదాతయైన సూర్యుని మయూఖవిభవమునకు నిజహృదయము నొడ్డు చంద్రునిపై చీకటులుపడునా? వెన్నెలకెన్నడైన బూజు పట్టునా? చంద్రికలపై పుర్వులు ప్రాకజాలునా? దోమలు వ్రాలగలుగునా? సౌందర్యదర్శనమువలన హృదయమందలి పెనగులాట అంతమగును. పిశాచము చొరజాలనపుడును, గుండెనుండి యది యంతర్హితమైనపుడును, అంతరంగమున కదనమెట్లుండును? శాంతినికేతనమైన మానసము దేవధామమగును. నిలింపులబోలు తలంపులే అందు వసించును. అపుడది ఆనందమయమగును. ముముక్షువులును, ఆనందవ్రతులును శాంతినిలయములందు, సౌందర్యనిధానములందు నేలకాపురముందురో యెఱుగమా?

పోయి, మేము మందిరసమ్ముఖమున గూర్చుంటిమి. వెన్నెలయే నీరై చెరువున నిండియున్నట్లూహించితిని, తనివార నందు మునిగి తేలవలెనని మక్కువపడితిని.

మందిరాగ్రము స్వర్ణమండిత మంటినిగదా! ఇది హేమముకుటమట్లు వెలుగొందుచున్నది. బంగారుకిరీటమునుదాల్చిన దివ్యాంగనయోర్తు సరస్సుననిలిచి నక్షత్రఖచిత విహాయసమును విలోకించుచుండుట లేదుకదా! వెండికంటె తాను మిన్నయని కాబోలు సగర్వమున బంగారుశిఖరమున నొప్పారుచున్నది!

వెన్నెల వలువను మేలిముసుగుజేసికొని హేమాంగిని యోర్తు మందిరాగ్రమున నాసీనయైనదని పరక్షణమున దలపోసితిని. తానువలచిన యెడందకు సౌందర్యభిక్ష బెట్టు గంధర్వయువతివలె బంగారుతళ్కుల నది సరోవరహృదయమున రాల్చుచున్నది. మలయసమీరస్పర్శచే కాసారకాంతమేన బులక లుదయించినవి. మిన్కులీను తరగలా సుందరిమోమున చిందులాడు చిరునవ్వులవలె నున్నవి. అల్లన నలలు చేయు సందడి ఆసీమంతిని చేయు గుసగుసలేమో యనుకొంటిని. సరోవరాంగన నిస్తబ్దనిశీథమున నెవ్వరితో రహస్యాలాపన మొనరించుచున్నది? దానిచూడ్కి దివిగల నెవ్వరిదెస నిబద్ధమైయున్నది? తారకాంగనలొనరించు నిస్తబ్దగీతికాలాపమునకలరి, మృదుస్వరమున, నగుమోమున, దనప్రశంసను వ్యక్తీకరించుచున్నదేమో! తదేకదృష్టిగ, తనపై కన్నునిలిపి వెన్నెలరూపందిన అనురాగలహరిని తనడెందమున నవిరళముగ పోయు శశాంకునిజూచి నవ్వుచు నేమేమో తెలుపుచున్నదేమో! ఎక్కడిచుక్కలు! ఎక్కడితటాకము! ఎక్కడిచందురుడు! ఎక్కడిసరస్సు! ఎంత పొందుగలదో! ఇంతను అంతను గల పండువెన్నెలవలె నీపొందుకూడ నందును నిందునుగూడ వెలయుచున్నది! చంద్రప్రతిబింబము సరోవరహృదయమున చరచర నడయాడుచున్నది! ఈయువతిప్రేమ గభీరత ఎట్టిదో ములుగీతవలన నతడు పరీక్షించుట లేదుగదా? స్థలకాల ప్రతిబంధకములను రాగమున కానకట్టులు కావు కాబోలు!

మిత్రులు మెల్లగ మేనులువాల్చిరి. కావున నైశప్రశాంతముపై కఠినశిలవలెపడు ప్రసంగము తత్పన్నము కాలేదు. విముక్తకవిహృదయమువలె నతులసౌందర్యప్రదీప్తమైయున్న విశ్వాదృశ్యమునకు కనులప్పగించి రెప్పలువాల్పకయే అపూర్వస్వప్నముల నల్లుచు నట్లే కూర్చునియుంటిని.

అపుడెందుండియో యొకపిట్ట చివాలున నెగసివచ్చి, తటాకముపై కుప్పగారాలిన చంద్రికలలో నొకదానిని ముక్కునగరచుకొని పోవుటకై కాబోలు, సరస్సుపై వ్రాలినది! తోడన వినువీధికెగసినది! మేఘములయంచునగల మెఱుగును ముక్కుతోబొడిచి తళ్కులనారగింప నాతురపడునది పక్షియే! వీచికాగ్రములం దుంపురులవలె నెగయు తెళ్కులగైకొన నువ్విళూరునదియు పక్షియే! దట్టమైన ఆకుగములందు మౌనియైయడంగి అవి చలితధ్యానమున మనసును ముంచునదియు పక్షియే! నడిరేయి గొనకొొబ్బపై కదలమెదలకగూర్చుండి బ్రహ్మాండమును సింహావలోకన మొనరించుచు, అబ్బురపడుచు హృదయమున బహుభావములను జేరవేసికొనునదియు పక్షియే! ఆహా! వికిరమెట్టి విజ్ఞానకాంక్షియో! ఎట్టిసౌందర్యపిపాసువో! సౌందర్యము నన్వేషించుచు అనంతవిశ్వమున రాతిరియంతయు నది పయనము సాగించుచున్నది కాబోలు! ఈయద్భుతాన్వేషణమున కనుకూలించు శారీరకసాధనములను జగదీశుడు దానికి ప్రసాదించినాడు. హృదయమందలి జిజ్ఞాసనిక్కమైనదగుచో నీశ్వరసాహాయ్యము చెంతనే యుండును. అదృష్టమయ్యు, మనోరథసిద్ధి కూడ నేయుండును. రెండు చిన్నిరెక్కలు వికిరము నెంతదూరము గొనిపోవుచున్నవో! పెద్దబారలుగల రాబందు పోజాలు దూరమెంత? జిజ్ఞాసువు అతికాయుడు కానక్కరలేదు; మహాకాయుడు కానక్కరలేదు. అంగుష్టమాత్ర శరీరుండైన జాలును. ఈతనిగుండెయందు నిక్కంపు జిజ్ఞాస యుండవలెను. బ్రహ్మాండమున నిండియున్న భగవంతుడు మనుష్యహృదయమున నిమిడియున్నట్లు * అనంతశక్తిగల జిజ్ఞాస చిన్ని యెడందయందు నుండగలదు.

అపుడు దూరమునుండి ఎవరో యిరువురువ్యక్తులు గుడిదెస వచ్చుచున్నట్లు తోచినది. ఇరువరు లాగులు

* Svetasvataropanishad Chap III. Verses 13, 20.

దోడిగిరి. పురుషులేయని యూహించితిని. కాని, కొండొక సమీపించినంతన నొకండు పురుషుండని గుర్తించితిని. వారాలుమగలై యుందురు. ప్రసంగ ధోరణినిబట్టి అనుదినము వేకువజామున వారు లక్ష్మీనారాయణమందిరమునకు విచ్చేయుదురని గ్రహింపగలిగితిని. నన్ను చూచిరికాని వారేమియు బలుకరించిరికారు. యాత్రీకుడనని గ్రహించియుందురు, శిరమెత్తి చూచితినిగాని నేగూడ నేమియు బ్రశ్నించితినిగాను. ప్రాంగణమున వారు కొంతసేపు నడయాడిరి. అనంతరము గుడి యవ్వలివైపునకరిగి కూర్చుండిరి.

భవబంధగ్రంథియందు గలిసిన రెండుప్రాణములు రెండు కపోతములవలె, — జీవాత్మ పరమాత్మలపగిది (ఉపనిషత్తులు వీనిని శకుంతములకు పోల్చినవికదం) ఎట్లవినాభావసంబంధమున వెలయుచున్నవో! దాంపత్యమన, నిట్టులేకదా యుండవలెను! కష్టము లెన్ని మార్కొనినను, దంపతులు తమస్వర్గమును తాము సృష్టించుకొని ఘోరనరకమును దూరముగ నొక కట్టు రాడునకు దూడనట్లు కట్టివేయుదురు.

ఇంతలో స్త్రీ కంఠమెత్తి హరిసంకీర్తన మారంభించినది. ఆహా! అదెట్టిగళము! అందుండి లేచిన మంజులరవము వింతగమనికతో దివిదెస సాగిపోవుచున్నది. అనంతశూన్యమున, ననంతశాంతమునఁ నీశ్వర చరణకమలములనంట జను కలహంసవలె నెట్లది చనుచున్నదో! మనుష్యహృదయ మొక దివ్యకల్హారము కాబోలు! అగుచో, నందుదయించి గళవినిర్గతములగు వివిధమంజుల స్వరములు దివ్యమరాళములేకదా! విష్ణుపాదసరోజముల నాశ్రయింప నవి దివిదెస పయనము సలుపును. మనుష్యజీవితమునుజూచి ఒక్కొకపుడు "ధిక్!" అను వారొకపరి నిజహృదయములను పరికించిరేని, అందలిసౌందర్యము కతన ముగ్ధులగుదురు. అందలి మాధుర్యమునకు చెదిరియొగ్గి, అమందానందమంది, తమ్మెదాము గుర్తించుకొని, స్వీయప్రజ్ఞగని ఆత్మవిశ్వాసమునంది పరమాశయము దెస సాగిపోదురు.

తనహృదయమున నెట్టి బంగారుగనులున్నవో యెఱుగని ధరిత్రివలె తనయంతరంగమున నెట్టి యద్భుతశక్తికలదో సాధారణపరిస్థితులందు మానవుడెఱుగడు. ఏలంటను నాకెమునంది దానివిలువనెఱుగక నేలబూడ్చి వ్యర్థజీవియై తండ్రికి సంతాపముగొలిపిన బైబిలుకథలోని యువకునివలె నిజశక్తిని గుఱుతింపని వ్యక్తిదానిని లోపల నడంచియేయుంచి, ఆత్మవృద్ధినందక జగదీశునకెంతేని వంతగొలుపును. సమయసమయములందు లోగలశక్తులాత్మప్రకాశము గావించుకొనును.

కొండొకవ్యక్తి హృదయోద్వేగము నందినపుడు కంఠమెత్తినంతన మనోమోహనస్వరము (కొండసానువులనుండి జాల్వాఱుకల్లోలినీ కలరవమువలె) వెడలును. ప్రస్తుత ప్రశాంతముహూర్తమున హరిసంకీర్తమాచరించు పైపెదవి హృదయమెంత పవిత్రవంతమైనదో! అందామె యెఱుగని ప్రతిభ వెలయుచు స్వీయవ్యక్తీకరణమున నెట్లు ధన్యనైతినని యుప్పొంగుచుండెనో! వెలుగుసోకినంతన నంతర్థానమగు చీకటి వలె, మధురనిస్వనము చెవిజొచ్చి మనసున నింకినంతన నందలికలుషము మటుమాయమగును. శుభ్రహృదయమండే ఆనందతరంగములు పొంగి పొరలును.

వెల్లువకెదురుగ చరచర సాగిపోవుపామువలె నొకమాఱును, నిస్తబ్ధ సరోవరహృదయమున నల్లన బ్రాకులాడు బాతువలె నింకొకపర్యాయమును ఆసీమంతిని మధురవాక్కులునై శశాంతినిగదల్చి హిల్లోలతరంగములందు గలిసినవి. మాంత్రికుని చేతిబెత్తము సోకినంతన సచేతనములచేతనములట్లు పడియుండు లీల నామెవాక్కులు చెవిసోకినంతన జగతియంతయు కదలమెదలకుండెను. ఎల్లప్రాణులు మంత్ర

ముగ్ధములై నట్లుండెను. వసుంధరను తన్మయత్వమున ముంచివేయజాలు శక్తి ఎట్టిదో యూహింపుడు.

కొంతసేపైనపిదప నాపురుషుడుకూడ హరిసంకీర్తనమున పాల్గొనెను. ఇర్వురగళనాదములు విశ్వవృక్షాగ్రమున విసరబడు జోడురజ్జువులని, ఆ పుణ్యదంపతుల పవిత్రాత్మలు అమందానందమున నందూయలలూగుచు కుజశాఖలందు పూవులవలెతోచు నక్షత్రములను విలోకించుచున్నవని యోజించితిని.

మేల్కొనినవారిని ఆనందమయ స్వప్నప్రపంచములోనికి పుత్తెంచునదియు, నిద్రించువారిని మేల్కొలుపునదియు గదా విపుల గాంధర్వము! నిద్రించుచున్న దాదాజీప్రభృతులు మేల్కొనిరి. దంపతులు కిన్నరదంపతులే యనుకొనుడు—మందిర పురోభాగమునను మేమున్నయెడ కరుదెంచిరి. దాదాజీ సూరజ్ సింగునకు వారు పరిచితులు. కాని ఎట్టిప్రసంగమునందును ప్రవేశింపక వారందరేకగ్రీవముగ 'కన్హైయా'నుగుఱించి సంకీర్తన మొనరింపసాగిరి. ఆహా! ఆపాటలు నాకు గూడ వచ్చియుండిన నాగళస్వనమునుగూడ సహకరించి ఆనందవీచికలం దుఱ్ఱూతలూగువాడనుగదా! గానామృతమునకు కర్ణాంజలులనొడ్డి దేవీ సమక్షమందలి భాగవతునివలె కూర్చుండియుంటిని.

ఇంతలో తూర్పుదిశ కందినట్లు కానంబడినది.

—:0:—

## పాట్లేశ్వరి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

సీ॥ అలకాధిపతితోడ దులదూగగాజాలు బహుభాగ్యశాలివై పరగుచున్న
భాషాధినాథుతో బ్రతివాదమొనరింప జాలినవిద్యావిశాలివైన
కంతుజయంతవసంతుల దెగనాడు సురుచిరాకారుడై వరలుచున్న
తనమాటవేదమై తనరారజేయుచు తనపంపునేవేళ మనుపుచున్న

గీ॥ వనితలెందఱో భర్తలగనరు నేడు
గడ్డిరొట్టెల గుడుచుచు గాననమున
బతియదైవంబటంచు సద్భక్తితోడ
సేవవలుగొల్చె పాట్లేశ్వరీమతల్లి.

చ॥ పొలుపుగభానువంశనిధి పూర్ణశశాంకుడు కృష్ణసింగుకో
డలవయినందు కిట్టులకటా విధి నిన్ను బరీక్షసేయగా
దలచెనొ కాక కష్టముల దార్చుటయేల? మెఱుంగవచ్చె మీ
కులమున నాడువారి కిటుగుందుట పూర్ణయశోదయంబెకా.

ఉ॥ భానుకులాబ్ధి చంద్రుడయి భాసిలునట్టి ప్రతాపసింహభూ
జానికిరాణివై సకలసంపదలం దులదూగు నీవు సీ
మానముప్రాణము న్నిజకుమారుల భర్తనుగాచుకొంచునా
కాననసీమలన్ వెతలగాలముద్రోసితి వెట్టిసాధ్వివో.

సీ॥ బుట్టలోనిడిరాజు చెట్టుకొమ్మకుగట్ట దూగుటుయ్యాలలంచు దూగినావు
కఱకురానేలపై గడుదవ్వునడువంగ పట్టుదుప్పటు లంచు మెట్టినావు
దూర్వాంకురంబులతో రొట్టెయలజేసి మృష్టాన్నమని భుజియించినావు
గండోపలంబుల దిండుగానొనరించి శేలుహాయిగ నిదురించినావు.

గీ॥ కష్టమోనిష్ఠురమొ భూమికాంతుతోడ
విపినదేశంబుల ననుభవించుకొనుచు
బతియసర్వంబటంచును బలికినావు
ఔర! నిజమైన గృహలక్ష్మివమ్మనీవు.

ఛ. ఇరువదియైదువత్సరము లెట్టుల ఘోరవనంబులందు గా
పుర మొనరించినావొ యరిమూకలు మిమ్ము క్షణక్షణంబునన్
గరువలియట్లు తాక నిజకాంతుడు చేత గృపాణమూనియొ
క్కరుడయి యుద్ధమం దరులగంతముల్గా దెగవ్రేయనేగగన్.

ఆ. వె. భిల్లపల్లెలోని భీమచాందునియింట
నిన్ను సుతులనునుచి కన్నుమూయ
కుండ గాచుకొనుచునుండు మీావనిపల్కు
పుడమిపాలు డేగు గడియలోన.

క॥ శాత్రవనివహంబులు నిన్
బుత్రులచెఱబట్టవచ్చి ముట్టుకొనంగన్
రాత్రులభీకరవిపిన
క్షేత్రంబుల దిరిగి తెట్లు సేమముతోడన్.

క॥ జనకజ మునుపెన్నడొ కా
ననముల నిడుములనుబడిమె వల్లభుతోడ
న్ననిమెద రది యేయుగమో
యినకులసంజాత సాక్షివిపుడీవెగదా.

గీ॥ వీరపత్నివి; ధీరవు; వీరమాత
వార్యసన్నుత శాంతమతావలంబి
వలఘు సద్గుణగణధన్యవైన నీకు
తరుణిజనముల ధన్యవాదంబులమ్మ.



# నా ప్రాణవిభుడు

నెమిలివలె వ్యర్థులై, ముఖస్తుతులకు ఉబ్బిపోవు స్వభావముగలవారు; అయితే, నవమన్మథుడు. మాలిన్యమును బోగొట్టి శిరోజముల కాంతిని నూత్నత్వమును కాపాడుకొనుట ఆయన యెఱుగుదురు. వారిని తిలకించిన మాత్రముననే స్త్రీలు సాధారణముగా సమ్మోహితలవుట నిక్కువము.

సుందరుని సృజించుట మన తరముకాదు; కాని సుందరతరముగా వానిని జేయగలుగుదుమనుట నిర్వివాదము. మా 'జై' కుంతలతైలములు ఎట్టి మొరటు వెంట్రుకలనైనను సుకుమారతా మనోహరతల జేకూర్చి సహజసౌందర్యమొసగును.

**jai**

'హేరాయిల్' మేలు రకము. లలిత పరిమళవంతము. 'బ్రిలియంటైన్' అత్యంత సువాసనా సమన్వితము. అందమైన బుడ్డీలు, కార్కులు.




ది తాతా ఆయిల్ మిల్సు కంపెని
లిమిటెడ్,
తాతాపురము, బొంబాయి.

టామ్కో సేల్సు డిపార్టుమెంటు,
19-A, వాణియన్ వీధి,
మదరాసు.

# తోటపని

## అంట్లుకట్టుటకు కావలసినపరికరములు.

1. కోతకత్తి (Pruning knife) దాని యొక్క దళము (Blade) కొంచెము వంకరగా నుండును. ఈ కత్తిని మంచి 'కంపెనీ'నుండి తెప్పించుకొనవలెను. సెనార్సు (Saynor's) కత్తులను అంట్లు కట్టుటను వృత్తిగాచేసుకొనువారు వుపయోగింతురు.

2. పలుచనిపొడవు దళమునుగలిగిన పదునయిన బలముగల కత్తి. ఇది మొగ్గతొడుగుటకు (Budding) కూడా పనికివచ్చును. దానినికూడా మంచి 'కంపెనీ' నుండి తెప్పించుకొనుట మంచిది.

3. చిన్న తీగరంపము.

4. అంటుకట్టు మయినమును తయారుచేయుటకు పింగాణీ గిన్నె;

5. మయినము, క్రొవ్వు, అరపూస, కర్పూర తయిలము.

6. కాలికోగుడ్డ, దూదివత్తి, అరటిచొప్పత్రాడు లేక రాఫియాత్రాడు, నాచు.

పయిన వివరించిన పరికరములన్నియు పదునుగాను పరిశుభ్రముగా నుంచవలెను. కొమ్మలనుకోయు కోత ఎంత పరిశుభ్రముగాను, నున్నితముగాను, సాఫుగా నున్న అంట్లయొక్క కలియకకూడా అంత బాగుగా నుండును. పరికరములు తుప్పుపట్టకుండా క్రొవ్వు గాని, వేసలయిను (Vaseline) గాని వుపయోగింపవలెను.

### అంటుకట్టమయినమును తయారుచేయు విధము.

| | |
|---|---|
| మయినము | 1 భాగము |
| క్రొవ్వు | ½ భాగము |
| అరపూస | 1 భాగము |
| కర్పూరతయిలము | 1/8 భాగము |

శ్రీ చిలకమర్తి లక్ష్మణాచార్యులుగారు

చిన్నమంటమీద పింగాణిగిన్నెలో క్రొవ్వు, అరపూసనుకలిపి కరుగనీయవలెను. అపుడు కొంచెము కొంచెముగా మయినమును అందులోవైచి బాగుగా కలిపి కరుగునట్టు చేయవలయును. ఆగిన్నిని మంటపై నుండి తీసి వెంటనే కర్పూరతైలమునుపోసి బాగుగా పుల్లతో కలుపవలెను.

### దీనిని వుపయోగించువిధము.

దీనిని వెచ్చగా కరిగివున్నప్పుడు బ్రష్‌తో వుపయోగించవలెను. అంటుకొమ్మలను దగ్గరకు తీసుకు వచ్చి గట్టిగా కట్టుకట్టినతరువాత దానిపై ఈ మైనమును ఆకోతకట్టు అంతమేరయును గాలిని చొరనీయకుండా ఈమైనముతో బాగుగా పూతపూయవలెను. దీనిని వుపయోగించుటకు యింకొక మంచి మార్గముకలదు. ఈమైనము బాగుగా కరిగియున్నప్పుడు ఒక పలుచని కాలికోకాగితమును దానిలో ముంచితీయవలయును. మైనము దానికి బాగుగా రెండువైపులను అంటుకొనినతరువాత దానిని బాగుగా విడదీసి చల్లారినపిదప సన్నటి (¼" to ⅓") బద్దీలుగా కావలసినంత పొడవుగా చింపుకొనవలెను. అంటు కొమ్మలను సరిగా కలసెడిస్థలమునకు తీసుకునివచ్చి ఈఅంటు కట్టుమైనముతోనున్న కాలికోపేలికలను ఆఅంటుస్థలమునకుచుట్టును ఖాళిలేకుండా గట్టిగా చుట్టి కట్టవలెను. కాలికోగుడ్డ బాగుగా అంటుకొనని యడల అరచేతితో దానిపై గట్టిగా రాశినయెడల ఆమైనము కొంత బాగుగాకరిగి బాగుగా అంటుకుని గాలిని చొరనీయకుండా చేయును.

అంట్లు కట్టునపుడు ముఖ్యముగా గమనింపవలసిన మాత్రమేమనగా తల్లిచెట్టుపైన కోయబడియున్న భాగమును, అంటుకొమ్మపై కోయబడినభాగమును సరిసమానముగా దగ్గరకు తీసికొనివచ్చినపుడు యీరెండు

కొమ్మలును కఱ్ఱభాగమునుపెంచు క్రొత్తకణములు (Cambium) బయలుదేరి రెండును కలసిపోవును. ఈరెండుభాగములును కలిపికట్టి గాలిని జొరబడ కుండా చేసినపుడు యీక్రొత్తకణములు యీరెండు కఱ్ఱభాగములనుకలిపి ఒకేదానినిగా చేయును. తల్లి మొక్కను మనము అన్నివిధములను నచ్చినమొక్కను ఎన్నుకొనవలెను. అంటుమొక్క నిమ్నజాతిదై యుండవచ్చును. అట్టివిత్తనములను మొదట చిన్న అంటుకట్టుకుండేలలో పెరుగనీయవలెను. ఆమొక్క లను బాగుగా ఎదుగుస్థలమునందుంచి వాటిని రెండవ యేట అంటుకట్టుటకు తీసికొనిరావలెను. తల్లిమొక్క కొమ్మ మిక్కిలి లేతగాగాని, ముదురుగాగాని యుండ గూడదు. నడిమివయస్సుకలిగి, త్వరితముగా యెదుగు కొమ్మను యెంచవలెను. కొమ్మ రమారమి చుట్టు కొలత ఒకటి మొదలు రెండంగుళములుండ అంటు యొక్క కాండమంత కయివారముండవలెను. అంటు మొక్క ఎంత హీనజాతిదైనను, ఎంతక్లిష్టపరిస్థితులలో నైనను పెరుగునదై యుండవలెను. తల్లికొమ్మపై చిగుళ్లు అయిదు లేక ఆరుకంటె యెక్కువ యుండ నవసరములేదు. మొదట తల్లికొమ్మను అంటుకట్టు చోట వంపుగాచేసి ఆవంపు రెండుమూడురోజులు టేపుతోకట్టి అంటుకట్టుసమయమున తీసివేయవలెను. అంటుమొక్కనుకూడ అట్లు చేయవలెను. మొదట చెప్పినపరికరములు సిద్ధముగా నుంచుకొనవలెను. క్రింద చెప్పబోవుపని ఎంతత్వరితముగా చేసిన అంత మంచిది.

తల్లిచెట్టుయొక్క అంటుకొమ్మను వంచినవైపున రెండు మూడంగుళములు పొడవుకలిగిన బెరడును, కొంచెము కఱ్ఱను ఒకేనాటుతో చేయునట్లు చూడవలెను. అదేవిధమైన నాటును అంటుచెట్టునకు కూడ చేయవలయును. తల్లికొమ్మపై కోతను, అంటు చెట్టుపై కోతను అన్నివిధముల సరిసమానముగా నుండునట్లు అతిజాగ్రత్తతో చేయవలెను. హెచ్చు తగ్గులు యుండినయెడల బాగుగా అతుకుకొనవు. కోతలు అతిసున్నితముగను, ఎత్తుపల్లములు లేకుండు నట్లుగను అన్నివిధములుగను ఒకేవిధముగ నుండు నట్లును చేయవలెను. అప్పుడు ఆరెండుభాగములను దగ్గరగా తీసికొనివచ్చి కదలిపోకుండ అరటిచాప్ప త్రాటితోగాని, రాఫియాత్రాటితోగాని గట్టిగా కట్ట వలెను. దానిపై అంటుకట్టు మైనముతోగాని, మైనము పూసిన క్యాలికోగుడ్డతోగాని గాలి చొరబడకుండా దానిపై చుట్టవలెను. అంటుకట్టుమైనము లేనియెడల ఒకభాగము రాగిడిమట్టియు, ఒకభాగము ఆవు పేడ యును బాగుగాకలిపి పట్టింపవచ్చును. దానిపై ఒక పలుచని గుడ్డపేలికనుగాని, అరటిచాప్పతోగాని అంటుకట్టినస్థలమునందు నీరుచొరబడకుండా గట్టిగా కట్టవలెను. దానిపై నాచును కట్టుగట్టిన స్థలమునకును చుట్టును చుట్టబెట్టియుంచినయెడల ఆఅంటును చల్లగా నుంచి త్వరితముగా అతుకుకొనునట్లు చేయును. ఈ అంట్లను నీడయందే ఉండునట్లు చేయవలెను. కొన్ని దినములకు తల్లికొమ్మయు, అంటుకొమ్మయు క్రొత్త కణములను పెంపొందించి ఆరెండుకొమ్మలను కలుపును. అంటుకట్టినప్రదేశమును జాగ్రత్తగా చూచు చుండవలెను. ఆప్రదేశములో చిట్లినట్లు కనబడిన యెడల ఆరెండుకొమ్మలును బాగుగాకలిసినవని తెలియును. అపుడు అంటుకట్టినస్థలమునుండి తల్లికొమ్మను ఒకఅంగుళము క్రిందికి పదునైనకత్తిలో అంటు కదల కుండా క్రిందికి యేటవాలుగా కోయవలెను. పై కట్టును చాలకాలముంచినయెడల ఒత్తిడిహెచ్చి అది పెరుగుటకు భంగముకలుగును. తల్లికొమ్మను పూర్తిగా కోయుటకంటె సగముకోసి తల్లిమొక్కయొక్కకొమ్మ ఆకులు వాడిపోవుట లేనియెడల పూర్తిగా కోయ వచ్చును. ఆకులు వాడినయెడల మరికొన్నిదినము లుంచవలెను. అట్లు తల్లికొమ్మ అంటుచెట్లు బాగుగా కలిసినదని దృఢపడినపుడు తల్లికొమ్మను పూర్తిగా కోసివేయవలెను. తల్లిమొక్క కొమ్మ ఏదియో,

అంటుమొక్క కొమ్మ ఏదియో స్పష్టముగా తెలియుటకు ఆకొమ్మలపై బిళ్లలు (labels) అంటించుకొనుట మంచిది.

తల్లిచెట్లు ఎత్తుగా నుండినయెడల అంట్లుకట్టుటకు కొంచెము యిబ్బంది కలుగవచ్చును. అపుడు మూడు వెదురుకఱ్ఱలతో ముక్కోణాకారముగా కట్టి దాని మధ్య అంటుమొక్కకుండని యుంచి మూడుకోణములకును త్రాళ్లుకట్టి ఆమూడుత్రాళ్లను అంటు కట్టబోవు తల్లికొమ్మకు సమీపముగా తగురీతిని వ్రేలాడదీసి పైని చెప్పినపనిని సాగింపవలెను.

## అంట్లను పాతువిధము.

వీటిని పాతునపుడు భూమి తేమగాను, గాలి తేమగాను యుండవలెను. భూమిపై నీరు నిలువ యుండకూడదు. జోరుగా గాలి తగులనీయరాదు. అందుకు తాటియాకులతోగాని కంచికొమ్మలతోగాని అంటు చుట్టును గుండ్రముగా రెండడుగులదూరముగా కంచి కట్టవలెను. భూమిలో సున్నము, భాస్వరము హెచ్చుగా నుండుట మంచిది. అవి మన్నులో తక్కువయని తోచినయెడల దానిచుట్టును ఎముకల పొడినిజల్లి పారతోత్రవ్వి లోనికిపోవునట్లు చేయవలెను. ఏయెరువును మొక్కయొక్క మొదలులో పోయకూడదు.

మొదట భూమిలో రెండడుగులవ్యాసము (diameter) కలిగి ఒకటిన్నరఅడుగులు లోతుకలిగిన గోతిని తీయవలెను. నారింజ మొదలగు ఫలవృక్షుములవేళ్లు భూమిలోనికి లోతుగాజొరబడక ప్రక్కలకు పోవును. అందువలన లోతు విస్తారముగా నుండనక్కరలేదు. ఈగోతులలో బాగుగా మగ్గినపెంటను, కొంచము దుమ్ములపొడినిచేర్చి బాగుగాకలిపి ఆగోతులను పూడ్చవలెను. మొక్కకును, మొక్కకునుమధ్య ఇరువదియడుగుల దూరముండుట మంచిది. ఈ అంట్లను పాతునపుడు కొన్నిఆకులను కోసివేయవలెను. ఈఅంట్లయొక్క వేళ్లకు దెబ్బతగులకుండ పైకుండని బ్రద్దలుచేసి ఆమొక్కను వేళ్లుపూర్తిగా భూమిలోనికుండునట్లు క్రిందికిదించి మట్టితో మెల్లగా చుట్టును పూడ్చి భూమిపైకి కొంచెము బొప్ప (elevalion) వచ్చునట్లు చేయవలెను. మొక్కచుట్టును చిన్న పళ్లెమువలెచేసి బాగుగా నీరుచే నింపవలెను. భూమిని తడిపినపుడు నీరు ఆవిరిరూపముగా పైకిపోకుండా నేల గట్టిపడిపోకుండా కుర్పికతో నేలయొక్క ఉపరిభాగమును గుల్లగా చేయుచుండవలెను. అంటుపాతిన అయిదారునెలలకు అంటుచెట్టుయొక్క కొమ్మను అంటుకట్టిన ప్రదేశమునకు కొంచెముపైగా ఏటవాలుగా కోసివేయవలెను. లేనియెడల అంటుమొక్క యేపుగాపెరిగి తల్లికొమ్మను ఎదుగనీయదు. ఈపనినిచేయక ఎందరో మోసపోవుదురు. అందుకు తల్లికొమ్మ ఏదియో అంటుచెట్టుకొమ్మ ఏదియో బాగుగా తెలియుటకు గుర్తు లుంచుకొనవలెను. అంటుకొమ్మకుబదులుగా తల్లికొమ్మను కోసినయెడల చాల భంగము వాటిల్లును. అంటుమొక్క కాండమును బలముగాను, నిలువుగాను ఎదుగునట్లు చేయుటకు భూమికిసమీపముగా ప్రక్కలకువ్యాపించు కొమ్మలను పదునయినకత్తితోగాని, తీగరంపముతోగాని కోసివేయవలెను. తల్లికొమ్మనుండి అంటుపాతిని సంవత్సరమునుండియే పూవు, పిందెలు కాయుట ప్రారంభించును. కాని చెట్టుకాండములో బలము చాలక ఫలభారముచే చెట్టు విరిగిపోవును. అందువలన అంటుపాతిన నాలుగుసంవత్సరములవరకును పూవులను గోరుతోగిల్లివేసి చెట్టును బలముగా విస్తరించునట్లు చేయవలెను.

# వెంకమ్మ వెఱ్ఱితనం

శ్రీ పై. రామబ్రహ్మంగారు

రామిరెడ్డి పొలంలో నిఘామానుగా వుండి తన కృషినంతా రెడ్డి కుటుంబానికే వినియోగించి రెండుపుట్ల మాగాణిపొలాన్ని నాలుగుపుట్లలోనికి తెచ్చాడు రాముడు. రెడ్డిపొలం రెట్టింపు అయితే పాలేరుకువున్న స్వల్పఆస్తి కనిగిరి పగడాలవర్తకుల రోజుల వడ్డీకే సరిపోయిందికాదు. రెడ్డి పంచభక్ష్య పరమాన్నములు ఆరగిస్తూవుంటే రాముడికి మిగిలినవి మడతకుడుములే. సాహుకారు రాముడుపైన మునసబు కోర్టులో దావా చేసి డిక్రిపొందాడు. వడ్డీ తగ్గించవలసినదైనా రాముడు చెప్పుకోలేకపోయాడు కోర్టు వారితో. 'కందకులేనిది బచ్చలికి ఏల' రాముడే కోరకపోతే మునసబుగారి కేమవు సరం. వేలం గ్రంథం అవుతూవుంది. గుమాస్తాకుముట్టిన ముడుపులవల్ల యేడాదికైనా తేలనివేలం ఆరునెలలకే సిద్ధమైంది. నేడో రేపో సాహుకారు కోర్టుఅమినాద్వారా మాలపల్లెలోవున్న తనయింటిని వప్పగించుకొని అవతలకు తోలేస్తాడనేదిగులు యెక్కువై మంచంపట్టి యీజీవితం భావించాడు రామునుడుకొడుకు బాపణ్ణివిడిచి. తండ్రిచేసిన ఋణం కొడుకును సామాన్యంగా బాధించదు. అమీనా వప్పగింతన అడ్డుకొట్టరాలని బాపడికి సలహాచెప్పే ప్రాజ్ఞులు గ్రామంలో వున్నా బాపడు ఆసలహాలను పెడచెవినిబెట్టి యిల్లు సాహుకారికి వప్పజెప్పి భార్యాబిడ్డలతో రెడ్డి దూడలపాకలో తలదాచుకోవడానికి వచ్చాడు. రెడ్డి మొదట బాపడి సంసారం తన పాకలో వుండటంచూచి విసుక్కున్నాడుగాని తన భార్యనుచూచి వూరుకోవలసి వచ్చింది.

రెడ్డిభార్య సుబ్బలక్ష్మి బాపడి బాధ చూడలేక తమవృద్ధికి చాలమట్టుకు రాముడే కారకుడని స్ఫురణకు దెచ్చికొని, తమ మాగాణిపొలంలో వుంతదగ్గరవున్న దిబ్బపైన బాపడు కాపురంవుండటానికి ఆస్కారం చేయవలసినదని భర్తను వత్తిడిచేస్తే విధిలేక రెడ్డి వొప్పుకున్నాడు. సుబ్బలక్ష్మి బాపడినిపిలిచి పొలంలో దిబ్బపైన శాశ్వతంగా కాపరంవుండమని ఆజ్ఞ చేసింది. బాపడి సంతోషానికి మేరలేదు. వీళ్లను వాళ్లను ఆశ్రయించి కర్రకంపజేర్చి రెడ్డి మినహాయించి యిచ్చిన కాస్తదిబ్బపైన బాపడు కుటీరా నొకదానిని నిర్మించాడు. యింటికి కావలసిన తాటాకుపట్టం గడ్డి తీసుకపోవలసిందని సుబ్బలక్ష్మి ఆజ్ఞ యిచ్చింది. తనకున్న స్వల్పచరాస్థిని గంపెడు బిడ్డలను, భార్యను బాపడు నూతనకుటీర ప్రవేశం చేయించాడు. బాపడికి రెక్కాడితేనేగాని డొక్కాడదు. రెడ్డిపొలంలోనే రోజుకు కుంచెడువడ్లు తెచ్చుకుంటున్నాడు. బాపడి యిల్లాలు వెంకి (వెంకమ్మ అంటే పిలిచేవానికి గౌరవలోపం). ఊడ్పులలోను, కలుపులలోను, కోతలలోను అక్కడా అక్కడా కూలినాలిచేసి రోజుకు కుంచెడు



పొట్టకూటికి తపస్సు



చీకూ చింతా లేని జీవనం

గింజలు తెస్తే చన్నీళ్ళకు వేడినీళ్లు సహాయం అన్నట్టుగానుండేది. ఇంటిపని తెరపి అయితే కళ్లాలలోకివెళ్లి కళ్లాలువూడ్చి రెక్కలు గుంజుకుంటే మానెడో అడ్డెడో గింజలు ధొరికేవి. ఏపనిలేనప్పుడు మగకుర్రాళ్లకు గోనాలు కుట్టేది. యింటికి వెనకాలవైపున వున్న దిబ్బమీద పాదులు మొక్కలు వేసి కాపించి అణాబేడా మిగిల్చేది.

2

రోజులు వొకమోస్తరుగా వెళ్లవుగదా ఎవ్వరికైనా? హెచ్చుపరిమితాలకు అదనం పన్ను వసూలుచేయటానికి వుద్దేశం గవర్నమెంటువారు బాపడువున్న జిల్లాలో రీసెటిల్మెంటు చేయమన్నారు. సర్వే పార్టీవారు క్రమంగా బాపడువున్న వూరుచేరి కొంత ప్రారంభించారు. పెద్దరయితులు సర్వేయర్లను దర్శించి ముడుపులుచెల్లిస్తే వారికున్న మాన్యాలపరిమితాలు పెరగవు. తరుగుతే లెఖప్రకారం తరగవచ్చుకూడాను. పోరంబోకులు రయితాధీనం అవుతాయి. సర్వేరాళ్లకు కాళ్లువచ్చి స్థలభ్రష్టత్వంకూడా పొందుతాయి. బీదలవిషయంలో పరిస్థితులు తారుమారవుతాయి. రెడ్డిపొలం కూడా కొల్చారు. సర్వేయర్లు, కరణాలు, గ్రామనౌకర్లు గొలుసులులాగి రాళ్లుమార్చి ప్లానులు గీశారు. ఈకొలతలు యెందుకో వీటి మహాత్మ్యం యేమిటో బాపడికి తెలియదు. బాపడి యింటి పెరటివైపున వున్న సర్వేరాయికికూడా కాళ్లు వచ్చాయి. కరణంగారి లోటులేకుండా బాపడితో 'ఒరే బాపా! అయ్యగారినిచూచి ఓ పుంజెడు యిచ్చుకోరా ముందు చిక్కవుండదు అంటే' 'నావద్ద యేంలేదు బాబూ' అన్నాడు బాపడు.

3

సర్వేవారు బాపడిగ్రామం దాటిపోయిన చాలాకాలం అయింది. తహశ్శీల్దారు హుకుంప్రకారం కరణంగారి చలవచేత 'బీ' ఫారం నోటీసు బాపడు అందుకున్నట్లు సంతకం చేయించడానికి గ్రామనౌకరు బాపడికడకు పట్టుకొనివచ్చి నిశాని పెట్టించుకుని వెళ్లినాడు. ఆకాగితం బాపడి కూతురు చేతుల్లోపడి ముక్కలైపోయింది. దానిమాటే మరిచిపోయాడు బాపయ్య. మళ్లీ కొంతకాలం అయ్యేసరికి వెనుకటివలెనే నోటీసువస్తే బాపడు దానిని పట్టుకొని గ్రామంలోవున్న కిరస్తానీ పంతులు వద్దకు వెళ్లి చదివించుకుంటే బాపడు వేసికొన్న వంటవసారా దానికి అంటివున్న దిబ్బ గవర్నమెంటు పోరంబోకులోనిదనిన్ని దానిని బాపడు ఆక్రమించుకొన్నట్లున్ను రెండు రూపాయలు శిక్షార్థపుపన్ను వెంటనే చెల్లించుతూ నోటీసు అందిన రెండువారాలలో బాపడు బుద్ధిపూర్వకముగా సదరు ఆక్రమణ తీసివేయనియెడల గవర్నమెంటు స్వంతనౌకర్లచేత తీసివేయించి ఖర్చులు రాబట్టుకోవడమగునని అందులో వుంది. బాపడు యీసంగతంతా వినిపిస్తుపోయాడు. 'ఇదే మన్యాయమయ్యా' అని కరణంగారిని బాపడడుగుతే వెనకనే నీకు చెప్ప

లేదా సర్వేయరుగారికి మేతవెయ్యమని నీవు వినలేదు. అనుభవించు అన్నాడు. అర్జీలమీద అర్జీలు కురిపించాడు. కొత్తగా వచ్చిన కుర్రాయన నల్లదొరగారు ఐ.సి. యస్‌కి బాపడు అర్జీయిస్తే 'విచారిస్తాము' వెళ్లు అన్నాడు. ఏమని బాబూ అని బాపడు అంటే బంట్రోతుచే ఆవలకు గెంటించివేసినాడు. రెండు నెల లయినతర్వాత 'సర్వేవారికి సకాలంలో అర్జీయివ్వనందున నీ మనవి త్రోసివేయబడింది. ఆక్రమణ తీసివేయవలెను' అను ఎండార్సుమెంటు తాఖీదుతో సహా తహశ్శీల్దారుగారివద్దనుండి వచ్చింది. తన నిస్సహాయస్థితికి తనకు జరిగిన ఘోర అన్యాయమునకు బాపడికి కోపము, విచారముకూడా వచ్చాయి. నిర్భాగ్యుడు! యేమి చేస్తాడు. ప్రభుత్వబలానికి తన శక్తికి హస్తిమశకాంతరం తేడావున్నది. బాపడికి యీసంగతి తెలియకపోలేదు.

౪

తెలవారగట్ల రెడ్డి తాలూకు పాడి దూడల పాలుపితికి, దూడలపాక బాగుచేసి ఇంటికొచ్చి గంజిత్రాగి రెడ్డి 'మ్యాల' పొలంలో కట్టేతవేయుటకు బాపడు వెళ్లాడు. మరోఘంటసేపటికి బాపడి పెద్దకొడుకు పరుగెత్తికుంటూవచ్చి 'బాబా! ఎవళ్లో మనింటికివచ్చి అమ్మను అల్లరిచేస్తున్నాడు' అని చెప్పేటప్పటికి బాపడు తనచేతిలో వున్న పనగట్టున పాలేశి కుర్రవాడిని వెనకాలరమ్మని చెప్పి యింటికి పరుగెత్తాడు. బాపడు యింటికి కొంచెందూరంలోనుండి 'రివెంజీ' యినస్పెక్టరుగారు కేకలేస్తూ గ్రామనౌఖర్లకు పురమాయిస్తున్నాడు. బాపడు యింటిలోవున్న నులకమంచం, చిల్లిచేట ఉప్పరితట్ట సగంపుడికిన అన్నపుకుండ ఓవైపున పడివున్నాయి. కాయలు, పిందెలుగల అనప, చిక్కుడుపాదులు పీకివేయబడి ఓమూల లుంగగావున్నాయి. చంటిపిల్లను యెత్తుకుని చింకిరితలతోను చినిగిపోయిన బట్టలతోను ఏడుస్తూ నిలబడి నాభర్త వచ్చేదాకా ఆపుచెయ్యమని బ్రతిమాలుతూవుంది వెంకి గ్రామనౌకర్లను. నౌకర్లు యింటివసారా ఆవలను పీకివేసి కట్టుతాళ్లను కోసివేస్తూ 'ఛీ అవతలకుపో' అని అదకిస్తూవున్నారు వాళ్లు. ఈదృశ్యం చూడటానికి అక్కడ ప్రత్యక్షమైనాడు బాపడు. ఒక్కసారి సింహావలోకనంచేసి చర్రున యింటిలోనికి పరుగెత్తి చూరులో వున్న కత్తిని బట్టుకుని యీవలకువచ్చి రివెన్యూ యినస్పెక్టరువున్నవైపు పరెగెత్తాడు. యినస్పెక్టరు దగ్గరనున్న గ్రామమునసబు కాలికి బుద్ధిచెప్పేడు. ఇనస్పెక్టరు కూడా మునసబును అనుసరించాలని తోచిందికాని కాలు సాగలేదు. నిలుచున్న చోటనే స్థంభించిపోయాడు ఆబ్రాహ్మడు. ఈసంఘటనఅంతా చూచింది వెంకి. చంకలోనున్న పిల్లను క్రిందపడేసి భర్తవెంట పరుగెత్తి, యినస్పెక్టరుకు బారెడుదూరంలోకి బాపడు వెళ్లేటప్పటికి, వెంకి వారిద్దరుమధ్య అడ్డుపడగా, బాపడు, చేతిలోవున్న కత్తిని లాగబోయేసరకి యినస్పెక్టరు మెడమీద

పడవలసిన కత్తి వెంకి తలమీదపడినది. ఆ మహాయిల్లాలు వెంకి సుమ్మసిల్లి క్రిందను వొరిగిపోయింది. రక్తం ధారగా ప్రవహిస్తూ వుంది. ఈ అదనుచూచి యినస్పెక్టరు నౌకర్లు అంతా మాయమైపోయారు.

ఒకగంటలో పోలీసువాళ్లు వచ్చి బాపడికి అరదండాలేశి పోలీసుస్టేషనుకు, వెంకిని ఆస్పత్రికి జేర్చారు. మరి నెల్లాళ్లకు బాపడిమీద మేజిస్ట్రీటుకోర్టులో కేసు పెట్టారు. ప్లీడరును పెట్టుకుని వాదించే శక్తి బాపడికి లేకపోయింది. డోలీమీద ఆసుపత్రినుంచి వెంకిని తీసికొనివచ్చి పోలీసువారు కేసులో సాక్ష్యం యిప్పించారు. జరిగింది జరిగినట్లు పూసగ్రుచ్చినట్లు చెప్పివేసింది. చేసిననేరము పెద్దదని నిర్వచిస్తూ బాపడి కేసు సెషన్సుకోర్టులో విచారణ నిమిత్తం మేజిస్ట్రీటు పంపివేశాడు. 'రెడ్డివచ్చాడు మొదలాడరా' అన్నట్లు సెషన్సుకోర్టులో విచారణ ప్రారంభం అయింది. కూనీ నేరంకాదు కనుక ప్లీడరు సహాయము గవర్నమెంటువారి ఖర్చున యివ్వనక్కరలేదని జడ్జీ చెప్పాడు. అప్పటికి వెంకి ఆసుపత్రిలోనుండి విడుదల అయింది. 'న్యాయసమ్మతంగా తనపనిని నెరవేర్చుటకు వచ్చిన యినస్పెక్టరుగారిని అడ్డుపెట్టి చంపుటకు ప్రయత్నించినందులకును, వెంకికి బలమైన గాయము కలుగచేసినందులకునూ నిన్నెందుకు శిక్షించకూడదు. నేరము చేశావా? అని జడ్జిగారు బాపడిని అడిగేటప్పటికి తనకు జరిగిన అన్యాయం తరువాత జరిగిన గ్రంథం అంతా విపులంగా కోర్టువారిని మనవిచేశాడు. 'అత్తిసర్లు' బాపడు నేరస్థుడు కాడు అన్నారు. జడ్జివారి అభిప్రాయంతో యేకీభవించక మొదటి నేరమునకు 5 సం॥రములు, రెండవ నేరమునకు 6 నెలలు శిక్షవిధించి రెండు శిక్షలను ఒకేసారి అనుభవించమన్నాడు. యేడుస్తూవున్న వెంకిని కోర్టుబంట్రోతులు వీధిలోకి గెంటేశారు.

* * *

'మొన్న జైలుకువెళ్లిన సత్తెయ్య అప్పుడే తిరిగివచ్చాడు. మా బావనికూడా గాంధిగారు వదిలేస్తారా బాబూ' అని గాంధిటోపీ దాసుడెవడైనా కనబడితే ప్రశ్నిస్తూవుంటుంది ముష్టియెత్తుకుంటూవున్న వెంకమతల్లి.

# వనితాలోక సంస్కరణము*

శ్రీమతి నందగిరి ఇందిరాదేవిగారు

కృష్ణాతరంగ పంక్తిఁ ద్రొక్కి త్రుళ్ళింత నాంధ్రనౌకలు నాట్య మాడునాఁడు
ఇంటింట దేశి సాహిత్య దీపములతో నాంధ్ర తేజస్సు రాపాడునాఁడు
సుకుమార శిల్ప వస్తు ప్రపంచమునందు నాంధ్రనైపుణి పంత మాడునాఁడు
సమర సేనావ్యూహ జయ పతాకలక్రింద నాంధ్రపౌరుషము చెండాడునాఁడు
చూచి, సంతోషమున తలలూఁచి, గర్వ మాచి, ఆంధ్రపుత్రీ పుత్రు లందఁ గలరు
శాంతి. నందాక లేదు విశ్రాంతి మనకు, కంకణ విసర్జనల కిది కాలమగునె.

—రాయప్రోలు

మానవశక్తి కతీతమైన దేదియులేదు. కావలసిన దెల్ల దృఢసంకల్పము, కార్యదీక్ష బద్ధకంకణము. ఆగత మెప్పుడును అనాగతమునకు మార్గదర్శక మగును. పూర్వపు ఔన్నత్యము ఔన్నత్యసాధనమునకు కారణభూతమగును. ఒక్కసారి ఆంధ్రుల చరిత్ర పుటలను త్రిప్పిచూడుడు. మనవారి గొప్పతనమును తలంచుకొని వారికీర్తికి తగినస్థానమును ముందు లిఖించబోవుపుటలలో దృఢపరచుడు. ఈప్సితము లీడేరువరకు పూనినపనిని త్యజించమని తీర్మానించుకొన్న సంకల్పము సమీపకాలములోనే సిద్ధించుట తథ్యము.

## నిర్బంధోచిత ప్రారంభవిద్య

ఉన్నత విద్యాప్రసారము మాతృభాషలో జరుగక పోవుటయేగాక నిర్బంధోచిత ప్రారంభవిద్య ఆచరణయందు లేకపోవుటగూడ స్త్రీ విద్యాలోపమునకు ముఖ్యకారణమగుచున్నది. నాగరికదేశము లన్నిటియందును నిర్బంధవిద్య ఆచరణయందున్నది. మన రాష్ట్రమునగూడ ఈవిధానము త్వరలోనే ఆచరణలోకి రాగలదని వినుచున్నాము. ఈ నిర్బంధవిద్య మాతృభాషలోనే గరపబడవలయును. మహారాష్ట్ర ప్రాంతమునకు మహారాష్ట్రమును, తెలంగానా ప్రాంతమునందు తెలుగును, కన్నడప్రాంతమునకు కన్నడముల ద్వారా కనీసము ఉన్నతవిద్యవరకు గరపబడవలయుననుట మన సహజవాంఛ. ఏ ప్రదేశమందైనను అన్యభాషలవారి సంఖ్య హెచ్చుగానున్న, వారికొరకు ఒకటి రెండు పాఠశాలలు వారి మాతృభాషద్వారా గరపునవి కదాచిత్తుగా ఉండవచ్చును. ప్రభుత్వము వారు నిర్బంధోచిత ప్రారంభవిద్యకూడ మాతృభాషల ద్వారా నేర్పించునట్లు చేయు బాధ్యత మనయందే యున్నది.

## సంయుక్తవిద్య

బ్రిటిషు ఇండియాలోని సంయుక్తవిద్యాసమస్యను వివరించుచు బులుసు సాంబమూర్తిగారు ప్రారంభకళాశాల విద్యలు యువతీయువకుల కిద్దరికిని ఒకచోట గరపవచ్చుననియు, మాధ్యమిక విద్యకుమాత్రము వేర్వేరుగా ఉండవలెననియు సెలవిచ్చిరి. నా యభిప్రాయములో మన మావిషయమును చర్చించుటకు తగిన స్థితిలో లేము. మనకు ఇంకను ఓనమాలే దిద్ద చేతకానప్పుడు కాళిదాసకావ్యములు చదివించవలయునా, లేక భవభూతినాటకములు చదివించవలయునా అన్నట్లు ఉండును. రాష్ట్రములో ప్రారంభవిద్యయే

* నిజామాబాద ఆరవ ఆంధ్రమహిళామహాసభ అధ్యక్షురాలి ఉపన్యాసము.

లేనప్పుడు, మాధ్య మిక ఉన్నత విద్యలదాకనా? అంతేగాక బాల్యవివాహములు గోషాపద్ధతి మొదలైన ఆటంకములుగూడ గలవు. ఇట్టి పరిస్థితులలో స్త్రీలకై ప్రత్యేకవిద్యాసంస్థలను స్థాపించకున్న పురుషులతోకలిసి విద్యాభ్యాసమొనర్చుటకు సిద్ధముగా లేనివారు నిరుత్సాహపడెదరు. స్త్రీలలో విద్యావ్యాపకమొనర్చుటకు సర్వోపాయములను అవలంబించవలసిన యీనాడు స్త్రీలకై ప్రత్యేకపాఠశాలలు, ప్రత్యేక కళాశాలలు స్థాపించుట మనప్రభుత్వపు విధియైయున్నది. అయినను ఈ ప్రత్యేకవిధానము కేవలము తాత్కాలికమనియును అనతికాలముననే సంయుక్తవిధానము నాహ్వానించవలసి యుండుననియు ముఖ్యముగా విద్యావతులైన సోదరీమణులు గమనించవలసియున్నది. విద్యావిహీనత యెక్కువగానున్న ఈపరిస్థితులలో, అందులో స్త్రీలస్వేచ్ఛకు బొత్తిగా ప్రోత్సాహములేని ఈరాజ్యములో నైజాం కళాశాలలో ధైర్యముతో పురుషులతో సరిసమానముగా విద్య నభ్యసించుచున్న మన సోదరీమణులను, తమ కూతుళ్లను అట్టి కళాశాలకంప నియ్యకొనిన వారి తల్లిదండ్రులను నేనభినందించుచున్నాను.

## భిన్నవిద్యా ప్రణాళిక

విద్యావంతులలో నిరుద్యోగసమస్య ప్రబలియున్న ఈ కాలములో ప్రస్తుతము కళాశాలవిద్యలు, ఉన్నత విద్యలు, జీవనోపాధికిగాని, దేశసేవకుగాని నిరర్థకములుగా నున్నవని, వీనియందు మార్పులు కలుగవలెనని సూచనలు చేయబడుచున్నవి. కనుక ఈవిద్యనే స్త్రీలకుగూడ ప్రసాదించి నష్టములు కలిగించుటకన్న వారికి ప్రత్యేకవిధానము ఉండవలయునని ఒక అభిప్రాయము. అనగా జీవనోపాధి కనుకూలపడే విద్యావిధానము పురుషులకెట్లో స్త్రీలకును లలితకళలు, పాకశాస్త్రము, ప్రథమచికిత్స మొదలైనవి అవసరమని వారివాదము. పురుషులనుకాని, స్త్రీలనుకాని ప్రత్యేక విద్యలుమాత్రమే నేర్చుకొనుమని నిర్బంధించుట కధికార మెవ్వరికినిలేదు. మహిళాలోకమునకెక్కువ లాభదాయక మగునట్లు అన్ని శాస్త్రవిషయములతోబాటు పైజెప్పిన లలితకళలు మున్నగునవి కూడ ఐచ్ఛికవిషయములుగా నుంచుట సమంజసము. వారివారి అభిరుచులు, ఆశయములప్రకారము స్త్రీలు పురుషులు అందలివిషయములను ఏరుకొని ప్రత్యేకత సంపాదించగలరు. ఒకవిద్యార్థిని తాను లలితకళలను నేర్చుకొనక అస్త్రవిద్య నభ్యసించి యుద్ధరంగమున సిపాయిగా పనిచేసి అస్త్రవిద్యానైపుణిని ప్రదర్శించెదననిన ఆమెను నిర్బంధించగూడదు. అట్లే ఒక విద్యార్థి శాస్త్రవిషయముల నొల్లక వంటపనియందు ప్రత్యేకత సంపాదించు నాసక్తిగలిగియున్న అతనికిగూడ పూర్తిఅవకాశము ఉండవలయును.

## ఆర్థికస్థితి

మహిళా మహాసభలలోనేగాక పురుషుల సభలలో కూడ "స్త్రీలకు స్వాతంత్ర్య మియ్యవలయును. అట్లిచ్చుట పురుషుల ధర్మమైయున్నది." అను తీర్మానములు అగుచున్నది. కాని స్వాతంత్ర్యమనునది ఒకరిచ్చి మరియొకరు పుచ్చుకొనునట్టి వాయనముగాదు. అది తమ శక్త్యనుసారము తాము సంపాదించుకొను విషయము. గృహపాలనమునందు సంపూర్ణస్వాతంత్ర్యము స్త్రీలదేయని, ఇంటికి ఆమె గృహలక్ష్మి యనుమాటలు కొంతవరకు సత్యములే అయినను స్వాతంత్ర్యము, అర్థము సన్నిహిత సంబంధము గలవి. ఒక దానితో నొకటి విడదీయుట కవకాశము లేదు. ఆర్థికముగా ఎవరు స్వతంత్రులో వారిదే నిజమైన స్వాతంత్ర్యము. భర్తసంపాదించు వేయి రూపాయలను నిరాటంకముగా వ్యయపరచు స్త్రీకెంత స్వాతంత్ర్యమున్నదో గుండెమీద చేయిపెట్టుకొనియోచించిన ఆమెకే తెలియగలదు. భర్త వేయి రూపాయలు సంపాదించినను తాను తన స్వంత కృషిచేత ఒక్కరూపాయ ఆర్జించినను ఆమె అనుభవించు ఆనందము అనిర్వాచ్యమైనది. ఆమె ఎంత ధనికురాలైనను, నిజముగా ఒక్కరూపాయ స్వాతంత్ర్యమును సంపాదించినదగును. కోట్లకొలది తండ్రి సంపా

దనను విచ్చలవిడిగా వ్యయపరచు ధనికునికన్న, చెమటోర్చి సంపాదించిన ఎనిమిదణాలను రెండుచేతులతో వ్యయపరచే కూలివాడనుభవించు సంతోషము ఉత్కృష్టమైనదని అందరెరిగినదే. ప్రస్తుతము నిరుద్యోగసమస్య ప్రబలిపోయినది. నెహ్రూపండితుడన్నట్లు జీవితపు వ్యయ పరిమాణము హెచ్చుచున్నది. వ్యయమెక్కువచేసిన ఆదాయ మెక్కువగునని ఆర్థికశాస్త్ర సూత్రము. కనుక ఒకరెక్కమీద కుటుంబమంతయు ఆధారపడుట సమంజసముకాదు. కుటుంబభారమంతయు వహించి స్త్రీ పురుషునికి ఎట్లు చేదోడుగా నున్నదో, అట్లే ఆర్థికసహాయముగూడ చేతైనంతవరకు చేయుట ధర్మము. ధనార్జన స్త్రీలకవమానకరముగాదు. చదువుకొనినస్త్రీలు ఉద్యోగములు చేయవచ్చును. స్త్రీలు పురుషులిరువు రుద్యోగములు చేసినట్లైన సంసారస్థితి చెడిపోవునని కొందరి భయము. ఆభయ మవసరములేదు. బర్మాదేశపు స్త్రీలు ఇంగ్లాండుదేశపు స్త్రీలు పురుషులతోబాటు ధనార్జన, గృహ నిర్వహణము రెండును చేయుచున్నారు. అయినను అందర కుద్యోగములు లభించుటసంభవము. నూలువడకుట, అల్లికపని, బట్టలు కుట్టుట, ఎంబ్రాయిడిరీపని, మొదలైన చేతి పనులయందు ప్రత్యేకత సంపాదించుకొనిన ధనార్జననేగాక గృహపరిశ్రమలను పోషించినవారై మాతృదేశమునకు గొప్పసహాయముచేసిన వారగుదురు. ఖద్దరు పరిశ్రమ ఓపికగల స్త్రీలచేతనే నిపుణముగా నిర్వహింపబడగలదు. కనుక బ్రిటిషు ఇండియాలో నున్నట్టి ఖద్దరు కార్యాలయములను ఇచ్చట స్థాపించవచ్చును. మొత్తముమీద స్త్రీలు పురుషులు తెచ్చినదానిని తినుచు రాగిడబ్బు స్వతంత్రముగా ఖర్చుబెట్టుటకు వీలులేకున్నను, అతిసంతృప్తిగా జీవనముగడుపక తమ విశ్రాంతిసమయమును వృథాగా ఖర్చు పెట్టకుందురుగాక యని ప్రార్థించుచున్నాను.

## శారదాచట్టము

బ్రిటిషుఇండియాలో శారదాచట్టము విధింపబడి ఎంతోకాలమైనను మనరాష్ట్రములో ఇంకను ఆచరణలోనికి రాకపోవుట ప్రభుత్వ నిర్లక్ష్యమనుటకన్న మన దురదృష్టమనుట సమంజసము. బండకు పట్టిన పాకురు సనాతనపుది కనుక కదలించగూడదను తర్కముతో ఎవరోకొందరు ఛాందసులు ఈశాసనమునకననుకూలురు గాగలరను మిషతో ప్రభుత్వము ఈ విషయములో అశ్రద్ధవహించుట శోచనీయమే. అయినను ఇట్టి ముఖ్యసంస్కారమును ప్రభుత్వముశాసనరూపముగా విధించునట్లు ఒత్తిడి కలిగించకుండుటకు మనమే బాధ్యులమైనందుకు సిగ్గు పడవలసియున్నది.

## వితంతూద్వాహము

దయామయులైన ప్రభువుగారు ఇటీవల వితంతూద్వాహ శాసనమునంగీకరించి వివాహము చేసికొనదలచెడు వితంతువులకు మిక్కిల సాయమొనర్చియున్నారు. ఇకముందు వితంతులవివాహము న్యాయసమ్మతమైనదిగా పరిగణింపబడును. వివాహమొల్లని వితంతువులకు ఒక శరణాలయమును రాజమహేంద్రవరమున స్థాపించిన కం. వీరేశలింగం పంతులుగారు చిరస్మరణీయులు. అట్లే పూనానగరమునందు వితంతువుల జీవనోపాధికై కృషి సలుపుచున్న సేవాసదనము శ్రీదేవధరు అను మహారాష్ట్రుని సేవాఫలితము. మన రాష్ట్రమున నిట్టిసంస్థలు నెలకొల్పబడవలసియున్నవి.

## శుల్కములు

వధువులను అమ్మపద్ధతి వరులను కొనుక్కొను పద్ధతి ఇంకను పోలేదు. వధువులను దారిద్ర్యమను మిషచేత తమ కన్నకుమార్తెల నమ్మివేయు దురాచారము దక్షిణదేశములో చాలగలదు. ఈఅరవలు తాము కన్న కుమార్తెలను అమ్ముకొని ఎన్నాళ్లు బ్రతుకదలంతురో! ఇంతకంటె క్రూరకార్యమింకొకటి యుండదు. అరువదేండ్లవరుడు కట్టెబట్టుకొని క్రొత్తభార్యతో నూరేగదలచి కొనుటకు సిద్ధమగును. కనుకనే వారమ్ముదురు. ముఖ్యముగా వరంగలుజిల్లాలో ఈదక్షిణదేశపు ముక్కుపచ్చలారని పిల్లలు తల్లిదండ్రులపై మనసు విరిగి 'నా' అన్నవారు లేక అవస్థపడుచున్నారు.

తాము కన్నబిడ్డలు తమకే భారమై గుడ్డిగవ్వకు కొరగాని వానికైనను వేలకొలది వరదక్షిణ లిచ్చి బిడ్డనుకూడ అప్పగించుచున్నారు. అంతకక్కుర్తిగా వివాహముచేయుటకు కారణము సంఘము కన్యల ప్రౌఢవివాహము నంగీకరించకపోవుటయే. వేలకువేలు పిల్లవాని కిచ్చుటకన్న వధువునే చదివించిన ఎంతో లాభకారి గాగలదు. అప్పుడు పరస్పరాంగీకారముతో వివాహము చేసికొనదలచిన వధూవరులకు వరదక్షిణలుగాని, శుల్కములుగాని అవసరముండవు.

## వేశ్యావృత్తి

వేశ్యావృత్తి నీచముగా ఎంచబడుచున్న ఈ నవీన యుగమందుకూడ మన సంఘములోని వెలమ, రెడ్డి, మొదలగు కొన్ని కుటుంబములలోను, కొన్ని దేవస్థానములలోను, స్త్రీలను ఆడబాపలు, దేవదాసీలను పేర పెంచి వివాహముచేయక దైవాధీనమని వదలెడి ఆచారము కలదు. కాని కరుణామయుడగు ఆదేవుడు విలాసోపాసకులగు నవయువకులరూపమున అవతరించి ఈ ఆడబాపలను, దేవదాసీలను అనుగ్రహించుచున్నాడు. ఆసర్వేశ్వరుని కటాక్షము మన సంఘమునందు విపరీతముగా పరిణమించి గృహకల్లోలములకును, ఉత్తమయిల్లాండ్ర మనశ్శాంతి భంగమునకును, కారణమగుచున్నది. దీనిని వెలమ, రెడ్డి కుటుంబములు దృష్టియందుంచి ప్రస్తుతము సాకుకొనుచున్న పిల్లలకు వివాహముచేసి ఈదురాచారమును అతిశీఘ్రకాలమున రూపుమాపుటకై ప్రయత్నించవలయును.

## ప్రసవశాలలు

మంత్రసానులు శిక్షణపొందినవారు గాకపోవుటచేత ముఖ్యముగా గ్రామాదులందు ప్రసవసందర్భమున అనేకులు మరణించుచున్నారు. ఈ అననుకూలమును తొలగించుటకై ప్రతితాలూకాకైనను సక్రమపద్ధతులపై ఒక ప్రసవశాల యుండుటవసరము. ఏ మారుమూలనున్న మంత్రసానియైనను ప్రభుత్వపువారిచే యోగ్యతా పత్రములేనిదే తనవృత్తిలో ప్రవేశించకూడదని నిబంధన యుండవలయును. వీరిని అట్లు ఉత్తమవిధముగా తయారుచేయుటకు కొన్నిపాఠశాలలు నెలకొల్పబడవలసి యున్నవి.

## ఆరోగ్యపోటీ

స్త్రీలలో ఆరోగ్యము పెంపొందించుకొనుటకు వ్యాయామ మవసరము. ఇంటిలోపనియే వ్యాయామముకన్న ఎన్నియో రెట్లుండునని కొందరి అభిప్రాయము. కాని అందరును వేరు వ్యాయామమవసరము లేనంత పనిగలవారు కారు. ఏమాత్రము మంచి స్థితియందున్నను పనిమనుష్యులను, వంటవారిని పెట్టుకొనుచున్నారు. అందుచేత వ్యాయామము లేక ఆరోగ్యముచెడి నానావిధములగు రోగములకు గురియగుచున్నారు. అట్టివారు వ్యాయామము లందు పాల్గొనిన శరీరము చక్కగా నుండగలదు, మన సంఘములో స్త్రీలయందు వ్యాయామవిషయమున అభిరుచి కలిగించుటకు అప్పుడప్పుడు వ్యాయామపోటీలు పెట్టించుట అవసరము. ఈపోటీలేగాక, ఆరోగ్యపోటీ, శిశుప్రదర్శనము మున్నగునవికూడ ఏర్పరచిన లాభదాయకమగును.

## శాసనసభా సభ్యత్వము

కాలానుసరణముగా మన రాష్ట్రములోకూడ మార్పులు జరుగుచున్నవి. స్త్రీవిద్యా ప్రసారముకూడ చురుకుగనే జరుగుచున్నది. స్త్రీలు తదనుసరణమగు మార్పులను దృష్టియందుంచుకొని విద్యావతులై ఉన్నతోద్యోగములకు శాసనసభాసభత్వమునకు ప్రయత్నించుట సమంజసము. మొన్నటిమహాసభతో శ్రీమతి నీలోఫరు రాజకుమారిగారు శాసనసభలందు పురపాలకసంఘమునందు తక్కిన ఇతరసంఘములందు, హైద్రాబాదు స్త్రీలకు సరియైన ప్రాతినిధ్యము ఉండవలయునను తీర్మానమును ప్రతిపాదించిరి. బ్రిటిషు ఇండియాలో స్త్రీలు మంత్రిపదవుల నలంకరించి ఎట్టి ఘనకార్యమునైనను స్త్రీలు పురుషులవలెనే సమాన నైపుణ్యముతో నెరవేర్చ సమర్థలని చాటుచున్నారు. ఇట్టివారిని ఆదర్శముగా నిడుకొని మనరాష్ట్రపు స్త్రీలుకూడ పాటుపడెదరని నమ్ముచున్నాను.

# డాక్టరుగారి డాబు

వినోది

"ఓహో! శాస్త్రీ? నేను ఆనవాలు పట్ట లేకపోయానుస్మా. గెడ్డం బాగా పెంచా శావే? యూరపునుంచి యెన్నాళ్లయింది వచ్చి?"

"అంతా ఫోర్ డేస్ (నాలుగురోజులు) అయింది వచ్చి."

"అయితే బ్రదర్, నువ్వెప్పుడూ క్లీన్‌గా గెడ్డం గీసుకుని తయారవుతోండేవాడవు. ఇలా గెడ్డంమీద మోజుపుట్టిందే. కిందటి సారి నీపుట్టినరోజుకు పంపినఫొటోలోకూడ పరేడుమైదానంలాగ శుభ్రంగానేవుండే నీ గెడ్డం. ఇంతలోనే దాడీవాలావైపోయావు.

"ఒరే! చూడు. ఇప్పుడు డాక్టరీబల్లకట్టి ప్రాక్టీసు ప్రారంభించాలి. ఈవృత్తిలో డాబు ముఖ్యంకదా. నీకు తెలియనేతెలుసు. గడ్డం మీసం శుభ్రంగా అద్దంలా తయారు చేస్తే 'ఇంకా కుఱ్ఱాడు ఈడాక్టరు. అను భవం లే'దనుకుంటారు ప్రజలు. ఇప్పుడు చూడు పెద్దగడ్డంవుంటే 'అనుభవశూన్యుడు కాదు. పెద్దవాడే' అనిపిస్తుంది. అందుకే గడ్డం పెంచాను. ఇల్లాంటివేమటి ట్రిక్సు ఆఫ్ ది ట్రేడ్ అంటే వృత్తిరహస్యాలు.

*　　*　　*　　*

డాక్టరు శాస్త్రి డాక్టరీకంటె భేషజం బాగా నేర్చుకున్నాడు. ప్రపంచంలో యెల్లా వ్యవహారం నడపాలో బాగాతెలుసు అత నికి. ఈయిఱవైయో శతాబ్దంలో డాబుకీ నటనకీవుండే వాల్యూ అతను బాగా యెఱు గును. అంచేత తనజ్ఞానానికి పూర్తిగా ఫలం పొందాలని నిశ్చయించుకున్నాడు.

మౌంటురోడ్డులో బజారుమధ్య రెండు గదులు అద్దెకు పుచ్చుకున్నాడు. ఒక దానిలో ఔషధాలు—రెండవది కన్సల్టింగు రూము.

ఔషధాలగదిలో కిటికీలో రెండు పెద్ద సీసాలు. ఓదాల్లో ఊదారంగునీళ్లు_రెండో దాల్లో ఎఱ్ఱనీళ్లు. వానికివెనక రెండు ఎల క్ట్రికుబల్బులు—రాత్రిళ్లు బాగా కనపడేం దుకు. గోడమీాద రక్తనాళాల పటమొకటీ, అస్థిపంజరపు బొమ్మఒకటీ తగిల్చివున్నాయి. తలుపుమీాద యిత్తడిఅక్షరాలతో తనపేరు, పారిస్ వియన్నా యూనివర్సిటీల డిగ్రీలతో సహా—బ్రాసోతో పాలిష్‌చేయించి పెట్టిం చాడు. దానిక్రింద ఆఫీసు తెరిచివుండే టయిము—రెండోవైపున మరోసైనుబోర్డు మీాద డాక్టరుగారు స్పెషలుగా ఎక్సపర్టు అయినవిషయాలు. దాదాపు ప్రపంచ ములోవుండే రోగాలన్నింటికీ ఆయన స్పెష లిస్టే. అట్టడుగున 'ఇంజెక్షన్' 'ఎ స్పెషలిటీ' అని తాటికాయలంత అక్షరాలు.

టెలిఫోనుకికూడా ఆర్డరు యిచ్చి వచ్చారు డాక్టరుగారు. ఒకవారంరోజుల్లో

కనెక్షను యిస్తామన్నారు టెలిఫోను కంపెనీ వారు.

నౌకరుతో గట్టిగా బోధించిచెప్పాడు. "ఎవరినీ ఒక అఱగంట కూర్చోపెట్టండే లోపలికి తీసుకురావద్దు. డాక్టరు చాలా తొందరపనిలో వున్నారని చెప్పవలె.

కావలసినయేర్పాట్లన్నీ జరిగాయి. ఒక్క రోగికూడా రాలేదు. ఒకరోజు గడిచింది. రెండురోజులు గడిచాయి.—మూడు—నాలుగు—అయిదు. ఒక్క పేషంటూ లేడు. డాక్టరుగారూ నౌకరూ అల్లా కూర్చుని కాలక్షేపం చెయ్యడమే. మరోపిట్టకూడా అటు తొంగిచూసినపాపాన్ని పోలేదు.

ఆరోనాడెల్లాయితే ఒకమనిషివచ్చాడు.

"డాక్టరుగా రున్నారా?"

"ఆఁ ఆఁ కూర్చోండి. చాలా తొందర పనిలో మునిగివున్నారు. కాస్సేపటిలో దొరుకుతారు."

నౌకరు డాక్టరుగారి ఆజ్ఞాప్రకారమే వచ్చినమనిషిని కూర్చోపెట్టి సంగతి డాక్టరు గారిదగ్గరకు తీసికెళ్లాడు.

ఆగంతకుడు డాక్టరుగారిమెదటికి వెళ్లే టప్పటికి అయన టెలిఫోను రిసీవరు చేత బట్టుకొని యెవరితోనో మాట్లాడుతున్నారు.

"ఆహా అయితే యిప్పుడు క్వైనైను మాత్రలివ్వండి. ఉదయం సాయంత్రం ఏస్పిరిన్ మాత్రలుకూడా యివ్వండి. ఇదిగో! చూడండి. చెమటపట్టితే జాగ్రత్త. జలుబు చేసి న్యూమోనియా రాకుండ జాగ్రత్త పడండి."

"..........."

"ఆఁ. ఆహారమా? సగ్గుజావ, పెసర కట్టు యివ్వవచ్చు. ఇదిగో! దగ్గువస్తే ఆ స్పూటమ్ (కళ్లి) ఒసీసాలో వేసివుంచండి. జనరల్ హాస్పిటలుకి పంపి ఎగ్జామిన్ చేయిద్దాం."

"ఓనాలుగునిమిషాలు యిల్లామాట్లాడి రిసీవరు బల్లమీద ఉంచారు. ఆగంతకుడు నిలబడి డాక్టరుగారివైపు తెల్లబోయిచూస్తు న్నాడు. డాక్టరు ఒకనిట్టూర్పువిడిచి రోలింగు కుర్చీ అతనివేపుతిప్పి: 'అబ్బ! ఈపేషంట్సు మూలంగా ఒక్కసారేనా వదలడానికి వీల్లే కుండావుంది రిసీవరు.

'అయ్యా! చెప్పండి. తమకేమిబాధ? మీాకేనా? జ్వరమా?దగ్గువస్తోందా? ఎక్కడ నొప్పి? ఒక్కటే ప్లైటుతో తగ్గిపోతుంది.' అన్నారు మెడలోవున్న శ్చతస్కోపు చెవల దగ్గరికి తీసుకుంటూ.

ఆగంతకుడు నిర్ఘాంతపోయి 'డాక్టరు గారూ! నేను పేషంటునుకానండి. టెలి ఫోనుకంపెనీతాలూకు మీాఫోనుకి కనక్షను పెట్టమని పంపారు."

డాక్టరు రోలింగుకుర్చీలో.......

# రైతు ఋణబాధానివారణ చట్టము

'శాస్త్రి'

హిందూదేశంలో రైతులు ఋణబాధచేత కృంగిపోయినారనే విషయము సర్వవిదితమే. ఇంగ్లాండులో పార్లమెంటు మొదలుకుని కాంగ్రెసుదాకా యీవిషయాన్ని అనేక పర్యాయములు చర్చించాయి. కాని ధైర్యంచేసి యీనాటివరకు నివారణచేయడానికి ఏప్రభుత్వమూ పూనుకోలేదు. కాంగ్రెసు గవర్నమెంటు మదరాసులో ముందంజవేసింది.

మదరాసు ఋణబాధానివారణ చట్టాన్ని గురించి చర్చించడానికి ముందర, ఋణస్వభావము ఎటువంటిదో తెలుసుకోవడం అత్యవసరం. రైతుఋణస్వభావంయొక్క నిజస్వరూపం తెలిస్తేనేకాని, బిల్లులోవుండే లోటుపాటులు అవగాహనం కావు.

మొదట మనము గుర్తించవలసినది ఈ ఋణసమస్య సామాన్యమైనది కాదు. క్లిష్టము.

రైతుల ఋణాలు 'ఆదిఅంత్యంలేని' జాతిలోనివి. తరతరాలకిందట వ్యుత్పత్తిఅయిన ఋణాలు వంశపారంపర్యంగా చలామణీ అవుతాయి. రైతుకు పైతృకమైన ఆస్తి సర్వసాధారణంగా కుటుంబపు అప్పు సరిపోయిమాత్రమే వుంటుంది ఇట్టిస్థితిలో పాతఅప్పు తీర్చడానికి రైతుకి ఒకటేమార్గం మళ్లీ అప్పుచెయ్యడమే.

పల్లెటూళ్లలో రైతులకు అప్పులు ఇచ్చేవాళ్లు జలగలలాటివాళ్లు. పట్టుకున్నారంటే పీల్చి పిప్పిచేస్తేనేకాని వొదిలే రకముకాదు. వడ్డీమీదివడ్డీ పెరుగుతూవుండడమే! ఎంతతీర్చినా వడ్డీ తీరడానికే చాలదు.

దీనికికారణం హిందూదేశంలో ఎప్పుడో కొన్ని సంవత్సరాలలో తప్ప వ్యవసాయము లాభకారికాదు. పన్నులను, శిస్తులను చెల్లించగా అతనికి మిగిలేది తిండికి సరిపోదు. పైగా ఋణదారుడు అతని పంటలను తక్కువధరకు కట్టి తీసుకోవడం పరిపాటిఅయింది. ఏనాడయినా పంటచెడిపోయిందా ఆనాడు జీవనోపాధికి గత్యంతరంలేదు. ఈ ఋణభారం పూర్తిగా విదుల్చుకొని, కొత్తగా మొదలిడితేనేగాని రైతు నడుము విరిగిపోకతప్పదని చాలాకాలం కిందటనే పెద్దలు తెలుసుకున్నారు.

సాధారణకాలంలోనే భరించడానికి దుర్భరమయిన యీభారము ఆర్థికమాంద్యంతో తెగపెరిగిపోయింది. ధరలు మూడువంతులు పైగా పడిపోవడంచేత ఆస్తి అంతా అమ్మినా అప్పు సగమైనా తీరనిస్థితి ఏర్పడింది. దివాలాలు తియ్యడం సర్వసామాన్యమయింది. వ్యవసాయాన్ని పునరుద్ధరించాలంటే ఈ ఋణబాధానివృత్తిచెయ్యక తప్పదు.

ఇప్పుడు చర్చింపబడిన విషయాన్నిబట్టి ప్రస్తుతపు ఋణబాధ మూడువిధాలయినదని తెలుసుకోవచ్చును. ఒకటి వంశపారంపర్యంగా వస్తున్నటువంటి ఋణము. అసలు పుట్టడమే ఋణంలోపుడితే ముక్తికలగడానికెప్పుడూ అవకాశమేలేదు! ఏనాడో ఒకనాడు పాతబాకీలకి చెల్లుబడిబెట్టి కొత్తగా జీవనం మొదలిడితేనే కాని హిందూదేశంలో వ్యవసాయము వృద్ధిరానేరదు.

రెండవది ఎక్కువ వడ్డీవల్లనయినది. కాంపౌండు వడ్డీలు కట్టడం, నూటికి రూపాయి వడ్డీలు వసూలు చెయ్యడం మామూలే. ఇంత వడ్డీ తీర్చుకోడానికి నిజంగా రైతులదగ్గిర వ్యవసాయం అంత లాభకారి కాకపోవడంచేత శక్తిలేదు. అయినా అతనికి కావలసిన ఆవశ్యాధిక్యాన్నిబట్టి ఎంతవడ్డీ అయినా యిచ్చుకోడానికి ఒప్పుకుంటాడు. ఈవడ్డీ తీర్చువనేటప్పటికి అతని నవనాడులు కృంగిపోతాయి. అసలు ఎప్పుడూ తీరదు.

ఈనాడు ఋణబాధ యింత ఘోరంగా కనిపించడానికి కారణం ధరలు పడిపోవడం. ఈ మూడు విధాల కారణాలని మనం ప్రత్యేకించి తీరాలి. ఋణబాధాసమస్యను పూర్తిగా మనము పరిష్కరించాలంటే, ఏకారణానికి తగిన ప్రతిక్రియ దానికి జెయ్యాలి. ఋణాభారము ఒక్క కారణమువల్లనే అయినట్లు ఊహించి ప్రతిక్రియ చెయ్యడంవల్ల మేలుకంటె కీడే ఎక్కువ కలుగుతుంది.

ఇప్పుడు మనకు మదరాసు ఋణబాధానివారణ చట్టాన్ని చర్చించడానికి వీలైన స్థితిలో ఉన్నాము. ఆ చట్టంలో ఋణనివారణని గురించిన విషయాలివి.

1. 1937 సం॥ అక్టోబరు నెలవరకు బాకీపడిన వడ్డీలు తీర్చ నక్కరలేదు.

2. 1937 సం॥ అక్టోబరునుండి 6% వడ్డీకంటె రైతులకడ ఎక్కువ పుచ్చుకొనకూడదు.

3. 9% కంటె ఎక్కువవడ్డీకి తెచ్చిన అప్పులు విషయము ఏ లెక్కక్రిందనయినను తీసికొనివచ్చిన దానికి రెండింతలు చెల్లించిన ఆఋణము పూర్తిగా చెల్లించబడినట్లగును. ఒకవేళ రెండింతలు పూర్తిగా చెల్లించబడకపోయిన, చెల్లించినదానికిని, చెల్లించవలసినదానికి కల తేడా యిచ్చిన ఋణము తీరిపోవును.

మనకు మొట్టమొదట ఋణబాధకు కారణముగా తేలినది వంశపారంపర్యముగా వచ్చుచున్న ఋణము. ఆఋణాలను ప్రత్యక్షంగా గుర్తించకపోయినా, అప్రత్యక్షంగా గుర్తించారు. వంశపారంపర్యంగా వస్తూన్న బాకీలను రెండింతలు ఈవరకే చెల్లుబడి సర్వసాధారణంగా పెట్టుబడి ఉంటుంది. కాని 9% కంటె ఎక్కువవడ్డీ కలిగిన అప్పులే అని చెప్పడంవల్ల ఈలాభం న్యాయంగా పొందవలసినవారిని కొందరిని విచక్షణచేస్తుంది. అందుచేత మొదటికారణాన్ని చుట్టు తిరుగుగా నివారించారనీ, అదియినా పూర్తిగా కాదని చెప్పాలి.

రెండవది వడ్డీబాధ. 1937 సం॥వరకు బాకీపడిన వడ్డీలన్నీ చెల్లుఅని చెప్పడం మూలాన్ని బాధానివారణ పూర్తిగా కలిగిందని అభిప్రాయపడవచ్చు. ఋణదాతలందరూ ఈవిషయానికి పూర్తిగా ప్రతిఘటిస్తున్నారు వడ్డీ తీర్చడానికి సిద్ధంగావున్నా, తీర్చనివ్వకుండావున్న ఋణదారులు అనేకులు. ఇటువంటి పరిస్థితులవల్లనే ఋణాలు అంతఅధికంగా పెరిగాయి. అందుచేత వడ్డీబాకీలు చెల్లాయని చెప్పడం సమంజసంగానేవుంది.

కాని, ఇది అనవసరంగా కొంతమందికి లాభం కలిగిస్తోంది. కొంతమందికి అన్యాయంగా నష్టం కలుగచేస్తుంది. కావలసినవారికి లాభం సరిగా కలగడమే లేదు. (తక్కువవడ్డీకి తీసుకొనివచ్చిన అప్పులవడ్డీ) పలుమారులు అడిగినా తీర్చక భీష్మించుకుని కూర్చున్నవారికి లాభం. ఎప్పటికప్పుడు తీర్చినవారికి తీర్చినందుకు కొంతైనా లాభం కనిపించకపోవడం. పైగా వడ్డీలు తీర్చనివారు పెద్దపెద్ద రైతులే. వీరు భాగ్యవంతులు కనక ధనానికి భంగమేమీవుండదనే ఉద్దేశముతో వడ్డీలు రాబట్టబడియుండలేదు. వడ్డీలు తుడిచివేయడమువలన ఇప్పుడు లాభాన్ని పొందేవారు పూర్తిగా పెద్దపెద్ద రైతులే. నిజంగా ఒకటి రెండు యెకరాలతో కాయకష్టంచేసి ఋణబాధ మూలాల్ని కృశిస్తూవున్న కర్షకులకు దీనివలన లాభం కొంతయినా కలగదు. వారిదగ్గరనుంచి పిండి, ఎప్పటికప్పుడు వడ్డీవసూలు చేయబడేవుంటుంది. దీని మూలాన్ని కొందరికి నష్టం కలిగిందన్నమాట సత్యం. ముఖ్యంగా వ్యాపారంచేసేవారికి దీనివలన పెద్ద దెబ్బగా కనిపిస్తున్నట్టుంది. 1933వ సం॥లో పెళ్లి కోసరం కొన్న బట్టలతాలూకు బాకీవడ్డీ చెల్లుబడి అయిందంటే పెట్టుబడిపెట్టిన వర్తకునికి పెద్దదెబ్బే. ఈలాభం ఎందుకు రైతు పొందాలి? అనవసరం. ధనమాంద్యం రోజులలో అప్పుచేసి పెళ్లిచేయవలసిన అవసరం ఎందుకు కలిగింది? పైగా యిలాచేసి లాభాన్ని పొందినవారందరు ఎక్కువ భూములను కలిగిన భూస్వాములే. న్యాయంగా కష్టంచేసి జీవించేవారికి దీనిమూలాన్న కొంచమైనా లాభం కలగదు.

ఋణబాధ ఈనాడు అత్యధికంగా ఇంతపైకి రావడానికి కారణం ధరలు పడిపోవడమే. దీనిని మదరాసు ప్రభుత్వంవారు గుర్తించనట్లే కనపడదు. ఇది గుర్తించకపోవడంవల్ల బిల్లుయొక్క ప్రయోజనం చాలమట్టుకు పోయిందని చెప్పకతప్పదు. దీనిని ఉదాహరణపూర్వకంగా చర్చిస్తే బాగా బోధపడు తుంది.

1928 సం॥ వ్యవసాయము లాభకారిగావుందని మూ డెకరాలు భూమికల ఒకరైతు 4 వేలు అప్పు చేసి నాలు గెకరాలు కొన్నాడని అనుకుందాము. ఈబిల్లు ప్రతిఅంశాన్ని అనుసరించి లాభాన్ని పొందే టట్టు అతను ఒప్పుకున్న వడ్డీ 10% అనీ, అతను ఈనాటిదాకా దమ్మిడీ చెల్లించలేదనీ అనుకుందాము. 1937 అక్టోబరు నాటికి బాకీవున్న వడ్డీఅంతా చెల్లు బడి అయిపోయింది. అతని నాలుగువేలు మాత్రమే బాకీ మిగిలింది. అతనికి ఈనాడున్న ఆస్తి 7 ఎకరాల భూమి. ఇదివరకు వెయ్యిరూపాయిలు ఖరీదుచేసే భూమి, ఈనాడు 500 రూ. కూడా ధరలేదు. అతని ఆస్తిని పూర్తిగా అమ్మివేసినా అతను 3500 రూ. కంటె ఎక్కువ తీర్చలేడు. అతనికి ఈ బిల్లువలన ప్రయోజనం యిసుమంతయినా కలగలేదు. పైగా హానికరంకూడాను. ఇన్నినాళ్లు ఎప్పుడో ఒకప్పుడు తీర్చుకోకమానదని ఒత్తిడిచెయ్యడం కొంత తగ్గించారు. కాని ఈబిల్లుతో వచ్చినంతమట్టుకు రాబట్టు కోవాలనే తొందరలో అసలు యిచ్చితీరాలని పేచీలు రాకమానవు; 3500 ఖరీదుచేసే ఆస్తిగల వానికి 4 వేలు తీర్చడానికి గవర్నమెంటుకూడా అప్పుయివ్వడానికి ఒప్పుకోదు. అతను ఆ అప్పును తీర్చేది ఎలాగ? అతని ఆస్తిఅంతా ఋణాన్ని తీర్చ డానికి సరిపోతే అతని జీవనాధారం ఎలాగ?

మదరాసు ప్రభుత్వం ఈ కష్టాన్నిగురించి ఆలోచించినట్టే తోచదు. ధరలు మూడువంతులకు పైగా పడిపోడం మూలాన్ని, వడ్డీయే భారముకాదనీ అసలు కూడా చాలా భారంగా పెరిగిపోయిందనీ గుర్తించి తీరాలి. దీనికి రెండేవిధాలయిన నివారణలు. ఒకటి పడిపోయిన ధరలనుబట్టి ఋణాల అసలునికూడా తగ్గించుట. రెండవది భూములకు ఒకధరను, గవర్నమెంటువారుకాని, కోర్టువారుగాని కట్టుట. ఇది అత్యావశ్యకము. అధర్మ మేమీలేదు. ఈ ఆర్థిక మాంద్యలో ప్రతిదేశంలోను ఈవిధానాన్ని అమలులో పెట్టారు. అప్పులు తీర్చడంకోసమని పదిమంది భూములను అమ్మడానికి ఒక్కమారు పైకివచ్చే టప్పటి ధరలు అసందర్భంగా పడిపోతాయి. పైగా కోర్టు వేలాలసంగతి మనకందరకూ తెలిసినదే. 1/8 ధరకూడా మామూలుదినాల్లోనే రావడం చాలా కష్టం. కోర్టువేలాలు ఇనుమడించే రోజులలో అతి చవుకగా భూములు వేలం అవుతాయి అనడంలో అసందర్భం ఏమీలేదు.

సెలక్టుకమిటీ రిపోర్టులో ఈవిషయాన్ని కొంత మట్టుకు గుర్తించినట్టున్నది. 1932 సం॥నకు, పూర్వము, తరువాత చేసినవని ఋణాలు రెండు తెగలుగా విభజింపబడ్డాయి. కాని ఈ విభజనచేసినది ఋణదారుల లాభంకోసము కాని, బాకీదారులకు బాధనివారణ చెయ్యాలని కాదు. 1932 సం॥ అక్టోబరు తరువాత చేసిన అప్పులకు 5% చొప్పున వడ్డీ చెల్లించితీరాలని బిల్లులో మార్పు. కొంచెము లాభంమాత్రము బాకీదారులకు కలిగిట్లుంది. ఇదివరకు 9% వడ్డీతో కూడిన బాకీలకే రెండింతలు చెల్లించిన బాకీ పూర్తిగా చెల్లిపోవుననే విషయం వర్తించేది. ఇప్పుడు 1932 సం॥ పూర్వము చేసిన ఏవడ్డీకయినా యీవిషయము వర్తిస్తుంది.

కాని యీబిల్లులో ధరలమాంద్యాని అనుసరించి 'అసలు' తగ్గించబడడానికి అవకాశం కలిగించకపోవడం చాలా లోపం. ఋణదారులందరూ ఆందోళన చేసి మదరాసు గవర్నమెంటును బిల్లు తమకు లాభకారిగావుండేటట్టు మార్పించారు. బాకీదారులుకూడా తమకు న్యాయంగా చూపవలసిన ఈవిషయాన్ని గురించి ఆందోళన చేసితీరాలి.



శ్రీమతి ఆర్. అలిమేలుమంగాదేవిగారు

రాష్ట్రభాషావిశారద

ఆంధ్రదేశమునుండి ఉత్తరహిందూస్థానమునకు బోయి ఉత్తమహిందీ నభ్యసించినవారిలో అగ్రగణ్యురాలు. "విదుషీ" అను ఉన్నతపరీక్షయందు త్తీర్ణులయిరి. దక్షిణభారత హిందీప్రచారసభవారి అత్యున్నతపరీక్ష యగు "ప్రచారక్" పరీక్షలో నుత్తీర్ణులైన యిరువురు ఆంధ్రస్త్రీలలో వీరొకరు. వీరి హిందీరచనా కౌశల్యము ప్రశంసార్హము. హిందీపత్రికా పాఠకులకు వీరి రచనలు చిరపరిచితములే. వీరికి ఆంధ్ర, ఆంగ్ల భాషలయందుకూడ మంచి పరిచయము కలదు. ఇప్పుడు మద్రాసు "సనాతనధర్మ కన్యాపాఠశాల"యందు ప్రధానోపాధ్యాయినిగా నియమింపబడిరి. వయసు 18.

# రాజ్ఞి ఇనుగంటి సరస్వతీదేవి

## శ్రీ శేషాద్రి రమణకవులు

పద్మనాయకసాధ్వులలో నుత్తమకవిత రచించువారలు పలువురు గలరు. కొన్నిమాసముల క్రిందట చేబ్రోలు సరస్వతీదేవి కృతమగు రామాయణమును బ్రశంసించియుంటిమి. గృహలక్ష్మి పాఠకలోకమున కా వ్యాసము పరిచితమైయుండెను. ఇపు డింకొక సరస్వతి సాహిత్యజీవితమును బ్రశంసింప నవకాశము గలిగినందులకు సంతసించుచున్నారము.

వెలమయిల్లాండ్రలో మేలుబంతి యనఁదగు బొబ్బిలి మల్లమాదేవిజీవితము, సాహసశీలములు విని యొడలు గఱపొడువ నానందబాష్పములు విడువని యాంధ్రుఁ డుండడు. నాఁటినుండి వెలమసాధ్వుల జీవితచరిత్రములలో నొక విశిష్టత్వము కలదను తలంపు దేశీయులకుఁ దోఁచినది. వెలమస్త్రీలలో సాహిత్యజ్ఞానము, నిరర్గళకవితాపాటవము వక్తృత్వ సంపద, పరిపాలనశక్తిగల సాధ్వు లెందఱోగలరు గాని వారి జీవితములు వాఙ్మయమున నంతగ గోచరింపవు. అదృష్టవశమున—కాదు దురదృష్టవశమున ఇనుగంటి సరస్వతీదేవి కవిత కావ్యరూపముదాల్చినది. ఈయమ అంతఃపురకాంత. ప్రాచీన సాంప్రదాయమునుబట్టి మాతృదేశమునకుఁ దన పవిత్రమూర్తినె గాదు, పేరు నేని వెలువరింపరాని ఘోషాగల సాధ్వీసముదాయమున బెఱిగిన ఆగర్భశ్రీమంతురాలు. సంస్థానాధీశుల యాఁడుబిడ్డ. జమీందారుల యింటికోడలు. సతీవిలాపరూపమున నీయమ మృదుమధురకవిత జదివి యానందించు భాగ్యము—భర్తృశోకపరవశయై కావించు కావ్యరూపాక్రందనము విని కన్నీరుగార్చు అభాగ్యము నేఁడు పాఠకలోకమునకు నేకసమయముననే సమకూరినది.

నిజాము రాష్ట్రమునఁగల సుప్రసిద్ధసంస్థానములలో జటప్రోలుసంస్థాన మొకటి. ఈ సంస్థానాధీశ్వరులగు సురభి వేంకటలక్ష్మారావుబహద్దరు రత్నమాంబా రాజ్ఞి యను పుణ్యదంపతులకు సరస్వతీదేవి పుత్రికారత్నము. పుత్రికాసంతానము కలవారగుటచే సుతనిర్విశేషముగఁ గుమార్తెలను బెంచి విద్యాబుద్ధులఁ జెప్పించి గణపతిదేవుఁడు రుద్రమదేవినింబలె జటప్రోలు సంస్థానాధీశ్వరులు కుమార్తెల సర్వకళానిపుణులను గావించిరి. సరస్వతీదేవి నిజముగ సాహిత్యసరస్వతియె. ఉరుదు, ఆంధ్రము, ఆంగ్లమునం దీయమకుఁ బరిజ్ఞానముగలదు. మృదుమధురముగఁ గవిత జెప్పఁగలదు. స్నేహలతాకుసుమముల నీయమ కబరీబంధమున నెల్లపు డలంకరించుకొనుచుండును. (చేబ్రోలు) సరస్వతి యీయమకుఁ జెలిమికత్తియ. వా. రామసుబ్బారాయకవి విద్యాగురువు. ఆధునిక ప్రాచీనాంధ్రకావ్యరత్నములలో నీయమ చదువని పొత్తమె లేదనవచ్చును. ఇట్టి యుత్తమావకాశములు గల సరస్వతీదేవి కవితావిశారదయగుటలో వింతలేదు.

సరస్వతీదేవిగారు 1917లో శ్రీరాజా ఇనుగంటి వేంకటకృష్ణరావుగారిని పరిణయమైరి. ఈదంపతులకు ముగ్గురు కుమారులు నలువురు కుమార్తెలు గల్గిరి. ఇందుఁ బ్రథమపుత్రిక ప్రకృత జటప్రోలుసంస్థాన యువరాజులును సాహిత్యప్రియులునగు వేంకటజగన్నాథరావుబహదూరువారి యర్ధాంగలక్ష్మి. సిరిసంపదలకెట్టి కొఱతలేక యనుకూలభర్తతో అనురాగపాత్రమగు సంతానముతో శ్రీ సరస్వతీదేవిగారు మహైశ్వర్యములతోఁ దులదూఁగుచు భాషాసేవ గావించుచు క్రమముగఁ గవితారచనమునఁగూడ నేర్పు గడించిరి.

అర్ధాంగలక్ష్మి యనుమతినొంది శ్రీమదినుగంటి వేంకటకృష్ణరావుగారు విమానముపయి ది 25-8-35న మదరాసున కేగుచుండ నెల్లూరుప్రాంతమున దుర్విధివశమున విమానము కూలుటచేఁ బరివారసహితముగ ఘోరమరణమొందిరి. శ్రీకృష్ణరావుగారు విమానయానకౌశలమునఁ బేరన్నికగన్నవారు. ఆర్తబాంధవులు. బహుభాషావిదులు. శౌర్యభూషణులు. ఇట్టి యోగ్యశీలుఁడును ధర్మాత్ముఁడునునగు భర్తతో జిరకాలము కాపురమొనర్చిన సరస్వతీదేవికి యాకస్మిక భర్తృమరణవార్త సంతాపము గలిగించెనుటలో వింతలేదు. ఆంధ్రలోకమె యాధన్యుని మరణమునకు

బొటబొట కన్నీరుగార్చినది. ప్రకృతియే గాఢతిమిరావకుంఠనముతోఁ బరితపించినది. విచారవశమున నిలువునీరై ప్రేమప్రవాహమును నాపుకొనఁజాలక సరస్వతీదేవి సతీవిలాపమను పేర నొక కావ్యము రచించినది. అందుఁ గొన్నిపద్యములు మాత్రము ప్రత్యేక గ్రంథరూపముగ ముద్రితమైనవి. వేంకటకృష్ణరాయ జీవితమున నివి చేర్పఁబడినవి. తొలుత నీ పద్యములు జదివినపుడు హృదయము తల్లడిల్లినది. మానవతియగు మా సరస్వతీరాజ్ఞికి దుర్విధి యీ పతివియోగమేల కూర్చెరాయని వగచితిమి. ఆదుఃఖావేగమున ఆ మృదుపదరచనము, ధారాశుద్ధి, నిరర్గళధార గోచరింపలేదు. ఆర్తురాలైయెల్లెడు సరస్వతీపుణ్యమూర్తియే గోచరించినది. ఇట్టి యద్భుతరచనము ఆంధ్రవాఙ్మయమున కమూల్యభూషణ మనఁదగియుండుటచేఁ బాఠకలోకమునకుఁ బరిచయముఁ జేయుటకు సాహసించితిమి.

గీర్వాణవాఙ్మయమునఁగాని ఆంధ్రవాఙ్మయమునఁగాని భర్తృవియోగచింతాతప్త సాధ్వీమతల్లులు వ్రాసిన కావ్యములు గానరావు. కుమారసంభవమునందలి రతీవిలాపము హృదయము గరగించుకరుణ రససారమె గాని యందలి భావములు కాళిదానునివి. విలాపము రతీదేవిది. కానవస్త్వైక్యములేదు. సతీవిలాప మట్టిది కాదు. సరస్వతీదేవి తన యేడ్గురుబిడ్డలతో భర్తకడ కేగి మదరాసునకుఁబోయి రమ్మని పంపినది. మూఁడవ నాఁడు వత్తునని భర్తప్రయాణమైపోయెను. ఇట నశుభచింత కవకాశములేదు. భర్త నలువదియేండ్ల దృఢగాత్రుఁడు. ఆకసమున ఏడుమైళ్లయెత్తున గంటకు తొంబదిమైళ్ల వేగముతో విమానమునునడిపి అద్వితీయ కీర్తి నార్జించిన జగజెట్టి విమానపతనముచే మరణించెను. లోకోత్తరుఁడును హృదయవర్తియునగు భర్తకై సరస్వతీదేవి కావ్యరూపమున విలపించినది. ఆయమతోఁబాటు ఆంధ్రవాఙ్మయమున్నంతవఱకుఁ బాఠకలోకము సైతము విలపింపఁగలదు.

"అధ్యాత్మతత్త్వతత్త్వరుఁడు", "ధర్మావతారుఁడు", "దీనత్రాత", "గుణమణిరాశి", "మహాత్ముఁడు", "వీరుఁడు"గ సరస్వతీదేవి భర్తను ప్రశంసించినది. "తుచ్ఛభోగములఁ గోరనివాఁడ"ని నొక్కి చెప్పినది. ఇట్టిభర్త "మూఁడుదినంబు లేగకయె మోదమెలర్పఁగవత్తు"నని చెప్పి ప్రయాణమయ్యెను. అమాయికురాలగు ధర్మపత్ని "ఎప్పుడు తెల్లవారు మఱియెప్పు దినత్రయమేగు ఎప్పుడు నీ ముఖాంబుజము జూచెదనని" నిముసములు లెక్కించుకొనుచున్నది. ఇంతలో వినరానివార్త వినఁబడినది. ఆయాక్రందనము, ఆదుర్భరశోక తరంగితభావములు, ఆపాతివ్రత్య ధర్మనిర్వహణదీక్ష, హృదయదారకములు. రాముని విచారరూపముజూచి ఆపిగ్రావారోదతి, అన్నాఁడు భవభూతి. ఈసరస్వతీవిలాపము భాషనె విలపింపఁ జేయుచున్నది. ఈవిచారతప్తురాలగు సరస్వతీరాజ్ఞి మైమఱచి "విరహదవాగ్ని నన్నుడుకఁబెట్టెడిని" అనుచున్నది. "నాబ్రదుకు వ్యర్థమని నిరాశాహతురాలగుచున్నది." "నాలునాళ్లిచటనిల్చి దివిన నినుగూడెదనని" శపథము చేయుచున్నది. "నీకారుణ్యమెందేగె, ననుబాయ నెటులోర్చితివని" భర్తను దెప్పుచున్నది. "కడకిది పురాకృత పాపఫలమని" నిబ్బరము తెచ్చుకొనుచున్నది. ఆహా! దుఃఖభాజనములగు నీనుడులు దుర్భరములు. విలపించి విలపించి భర్త యేనాఁడో చెప్పిన "భగవానుఁడె దిక్కు" అను తారకమంత్రము స్మరించి యాశోపజీవి యగుచున్నది. ఇంతతోఁబోక ఆర్తస్తుతియనియేని జంకక విచారపరవశయై కులదైవమగు విష్ణుని సంబోధించి నిరపరాధినియగుటచే సాహసాతిశయమున

"శ్రీధర నీకెపుడు సేవజేయుటె కాని
అన్యుల సేవింప నరుగనొకట
ఇన్నివిధముల నినుగొల్చుచున్న నాకుఁ
బ్రాణములకును బ్రాణమా పతినిఁబాసి
పాడుబ్రదుకొంది జీవచ్ఛవంబ నగుచు
చెలఁగు దౌర్భాగ్య మేల గూర్చితివితండ్రి."

ఒక్కప్రాణము రెండుమేనులుగ మెలఁగి, పాలు నీరువలె భర్తతోఁ గలిసి మెలసి వర్తించి ఇరువదియేండ్లు దోసములేనిరీతి కాపురమొనర్చిన యీపుణ్యకాంత తనలోఁదాఁ గృశించినది గాని విధిని దూషింపలేదు. ఆహా సాధ్వీత్వ మెంత గంభీరమైనది.

సరస్వతీదేవిగారువ్రాసిన "సతీవిలాసము" నలుబదిరెండు పద్యముల చిన్నకావ్యమైనను ఉత్తమ గుణములతోనుండి హృదయంగమముగా నున్నది. ఈయమ నిరర్గళమగు పదగుంభనము ఉత్తమ కావ్యరచనమునకుఁ దగియున్నది. భర్తృచింతావశమున బహిర్గతమైన యీయమరచనము ఉత్తమగ్రంథరూపమున భాషాసేవకలోకము నలరించునని వినుట కానందించుచున్నారము.

# సుహృత్ప్రేమలు

శ్రీ పైడిపాటి వెంకటనరసింహారావుగారు

తరుణవయోవిముగ్ధులయెడన్ మొలకెత్తెడి ప్రేమలల్లు పం
దిరులఁ బురాణదంపతు లతిప్రమదంబునఁ గూడియాడుచుం
దురు; పువుమొగ్గ లేరికొని దోయిళులం దలఁబ్రాలు వోసికొం
దురు; మనలేఁతడెందములఁ దొల్కినప్రేమలు నిట్టివే చెలీ!

ఎఱుగనివారు కాముకులమేయని నిన్నును నన్ను నిందసే
తురు; పెనుగ్రుడ్డిమూకలకుఁ దోచదు; భాగవతంబుఁ దీసి యం
దఱుదుఁగ నందనందనున కాసతిరాధకుఁ గల్గుప్రేమ గు
ర్తెఱుఁగవలెన్; మహాత్ములకె యియ్యది సాధ్యమగున్ దలోదరీ!

భ్రమరము తాకనట్టియొక భవ్యసుమంబవు నీవు; నేను యావనుం
డ; మనము ప్రేమనింపితి మెడందల నొండొరు కిచ్చుకోఁగ; సం
ఘము వ్యభిచారదోషమును గల్పనఁజేసి, మఱొండుఁగూర్చి ని
క్కముగను 'లంజ'ఁజేసి నిను గాఱియవెట్టి నిదేటిన్యాయమో.

తలపులు, ప్రేమ, చూపులును దప్పక యొక్కటియైన వప్డె, యా
త్మలు నొకటైనయప్డె వనితా! నను బెండిలియాడితీవు; నిన్
జలమున నింక నొక్కని కొసంగఁగ, నుంపుడుగత్తెసేయ, మూ
ర్ఖులదురితంపు సంఘమునకు న్నధికారమెవం డొసంగెనో!

కమలముఖీ! మనుష్యులకుఁగాక మృగంబులకైనఁ బక్షిజా
లములకునైన ధారుణీతలంబునఁ బుట్టఁగ నోచుకొన్న దే
హమువయి నస్వతంత్రమను నార్తి నినుందహియింపకుండు నీ
యమలినమైన యాత్మకును హాయినిగంతట మబ్బియుండుఁగా.

తలపకపాపులైన తలితండ్రులు నోరును వాయిలేని బి
డ్డలకు వివాహముల్ సలుపుటల్ మనదేశమునందు మంటలోఁ
గలియుటయెప్పుడో, యపుడ కాలముమాఱును నిన్నుబోటి పి
ల్లలు సుఖియింత్రు తారెడదలన్ వరియించిన వారిపొత్తులన్.

# గృహలక్ష్మి

వలచుటముందు; పిమ్మట వివాహము పెండ్లియనంగ నాత్మలన్
గలుపుటగాని, దేహమునఁ గల్పుటమాత్రమెకాదు; త్రాడులన్
గళములఁగట్టి బానిసలఁగా సతులం గయికొంట వేదవా
దుల మతమందుఁ జొప్పడదు తొయ్యలి! మెచ్చఁడు దేవుఁడేనియున్.

సతియన, సాధ్వినాఁబరగు జవ్వని యెట్టిదనంగ నాత్మ ము
న్నెతని ముఖంబునందు రమియించునొ, యింద్రియవర్గమెల్ల ము
న్నెతని పదాంబుజంబుల శయించునొ వానిన యాత్మ నిల్పి సం
తతముఁ దపించుకాంత; సఖి! తప్పక నీవును సాధ్వివే సుమీ!

తనువుఁ దలంపనీదు తలిదండ్రులదాటను వారియాజ్ఞ నె
త్తినిధరియించి కోర్కెలనుద్రెంచి, యమానుష బానిసత్వవృ
త్తిని నొకనీచుకున్ గుసుమదేహ మొసంగితి వాత్మ నాదియా
టను ననుజేరఁబంపితి పడంతి! నినుం నుతియింప శక్యమే!

ఉవిద! వయోవిలాసముల నుయ్యలలూగుచు మోక్షమార్గముం
దవులక కామలోభముల దారినిఁబోకు నిరంతరంబు, న
య్యవి భువి నస్థిరంబు నొకయాత్మయె శాశ్వత మాత్మపూజ మా
ధవు పదపూజ, మాధవుపదంబులు గొల్చుట నన్ దలంచుటే.

పరిశుద్ధాత్మలు రెండునొక్కటయి నిల్వన్ దాండవంబాడు సు
స్థిరమై యచ్చట విశ్వమాత; లయమున్ సిద్ధించు; పాపంబు జ
ర్జరితంబై చను; సృష్టి పెండ్లిజరుగున్ జంద్రాస్య లోకైక దు
ర్భరమయ్యెన్ మనప్రేమ; ప్రేమలు విషప్రత్యూష స్వప్నమ్ములో!

తలపఁగ నాత్మలన్నిటికిఁ దండ్రి రమాపతి; వానియాజ్ఞచే
నిలపయిభూతకోటి జనియించును; కర్మము వానిఁద్రిప్పని
చ్చట వెనుదన్ని; కర్మకును చక్రియె కారణ; మీశ్వరేచ్ఛ గా
వలయును విప్రయోగమిది; బాలిక! చింతిలనేల దీనికిన్.

# ఆచారమా ?

'త్రిపురసుందరి'

"...మాలలచ్చియని తూలనాడితిరే. మాలలచ్చి కాదండీ, మహాలక్ష్మి. నాపాలిటి భాగ్యలక్ష్మి. కులలక్ష్మి...

...తండ్రిదొర కెనని సంతసింతునో, ప్రియుని పోగొట్టుకొంటినని దుఃఖింతునో...

...ప్రేమ రూపుమాఱినది. ఇపుడది సోదరీ ప్రేమయే..."

'నాన్నగారూ, మీరెంతచెప్పినను మీమాటలు నాతల కెక్కుటలేదు. ఈనాముద్దు చెల్లింపరా? మీపై నాకు గురుభావము మెండు. మీమాట నుల్లంఘింప నాకు కీర్తిదాయకముకాదు. మీయాజ్ఞ నుల్లంఘించుట కోర్కెలేదు. ఈనామనవి వినుడు. నేను లక్ష్మిని పెండ్లాడతలచితిని. పెండ్లియాడుదును. మీరడ్డుపడకుడు. అడ్డుపడిన మీమాట నుల్లంఘింప వలసియుండునేమో? మిమ్ము నొప్పింప నాకిష్టము లేదు. విధిలేకవచ్చినది. నాన్నగారూ, మీకాళ్లపై పడెదను. ఈ నా వివాహమునకు అడ్డుచెప్పకుడ'ని మాధవరావు తండ్రిపాదములపై పడెను.

పుత్రునిమాటలు చెవుల శూలములై గ్రుచ్చ వకీలు శ్రీనివాసరావు పండ్లు పటపటకొరుకుచు 'ఓరీ కుల పాపకుడా. దినదినము ఈనీమనవులు మితిమీరి పోవు చున్నవి. రెండునెలలుగా ఒకేఘోష మొదలిడితివి. చిన్నవాడవని, నీవే యుక్తాయుక్తములాలోచించి నీమతము మార్చుకొందువని, సైరించితిని. కులనాశకుడా, పాలవంటికులమునకు మచ్చతే బూనుకొంటివా? నిర్దోషమైనకులమును మలినముచేయ బుట్టితివా? దుర్మార్గుడా, నాకడుపుకాల్ప బుట్టితివి. నానిష్ఠ మంటిపాలు చేయబుట్టితివి. నీవు పుట్టిననాడే చచ్చియుండిన నేనింత దుఃఖించియుండను. నీవు పూర్వజన్మమునందు నా కాగర్భశత్రువై యుందువు. ఆశత్రుత్వము దీర్చుకొన పుత్రుడై పుట్టినట్లున్నది. ఈవివాహము ఎంతమాత్రము తగదు. నలుగురిలో నాపరువుతీయ సంకల్పించితివా? వంశనాశనమునకై దీక్షవహించితివా ? నీకీదుర్బుద్ధి ఎట్లుదయించెను ? నిన్నీపనికి పురికొల్పినదెవరు ? మాలలచ్చి నా కోడలట్రా? ఓరీవెధవా! ప్రపంచమున నన్ను వెలివేయరా? నలుగురిలో పెద్దవకీలని పేరుమోసిన నేను నేటినుండి నాముఖమెక్కడ దాతును?' 'ఏమండీ వకీలుగారూ, మీకుమారుడు మాలపిల్లను పెండ్లిచేసుకున్నాడటనే; ఊరిలో ప్రజలనుకొనుచున్నారే, 'లోకులు పలుగాకుల'ని ఆమాటలు నేను నమ్మలేదు సుమండీ, ఏవిషయము మిమ్ము ప్రత్యక్షముగ యడిగి తెలుసుకొందమని ఇటువచ్చినాను. మీస్నేహితులగు మావద్ద మీకేమి దాపరికమండీ, సత్యమేమిటండీ' యని యడుగ నీచుడా, నేనేమని బదులిత్తునురా?' యని తలమోదుకొనుచు 'చాలు నీప్రసంగము, మానుము నీపెంకెపట్టు'యని గట్టిగ యరచెను.

'నాన్నగారూ, ఏలనండీ ఇంతకోపము? మాలలచ్చియని తూలనాడితిరే. మాలలచ్చికాదండీ, మహాలక్ష్మి. నాపాలిటి భాగ్యలక్ష్మి. మీకులలక్ష్మి. హరిజనబాలికయగులక్ష్మి సాక్షాల్లక్ష్మియే. నేను ఆమెను వివాహము చేసుకొందునని మాటయిచ్చితినే. ఇపుడెట్లు తిరుగుదును?'

'ఆ, ఏమంటివి, భాగ్యలక్ష్మి, కులలక్ష్మి, మాట ఇచ్చితివి. మాటయిచ్చితివా? నేను ఇచ్చితినిమాట

సదాచారసంపన్నయగు బాలికను నీవు వివాహము చేయుదునని. ఆమాటనెట్లు త్రిప్పమందువు? మాటల కేమి? వాటిని పాటింప నక్కఱలేదు. వివాహము చేసుకొననని ఆగుంటతో గట్టిగ చెప్పివేయుము. నీకేమి భయము?'

'నాన్నగారూ, ఇన్ని తెలిసి మీరిట్లనవచ్చునా? అమాయికయగు బాలను మోసముచేయుటా? నేను పరిణయమాడుదునని నమ్మియున్నదే! ఆచిన్నిహృదయమున ఎన్నియో ఆశాలతల నాటితినే! వివాహశుభ దినమునకై ఎదురుచూచుచున్నదే!'

'ఏమిప్రేలుచున్నావురా, అమాయికను మోసము చేయలేక నాపరువు గంగగలుప సాహసించితివా?'

ఇట్లు తందనాలుపాడుచు చిందులు త్రొక్క సాగాడు తండ్రి.

'అమాయకురాలిని మోసముచేయుటా? చేయక! నాపరువు గంగకలుపుటా' యని పలుమార్లు గొణుగు కొన్నాడు శ్రీనివాసరావు.

తండ్రికోపాగ్ని కాగలేక ఆహాలునుండి బైటికి వచ్చాడు పుత్రుడు.

II

పరమేశ్వరునికి జాతి వర్ణభేదములు లేవనియు, ప్రపంచమంతయు నొక్కకుటుంబమనియు, భూమిపై పుట్టిన ప్రతిప్రాణికి జగత్పతియగు ఈశ్వరుడొక్కడే తండ్రియనియు, భూదేవియే తల్లియనియు, మాలమాది గల దూరమున నుంచ నవసరములేదనియు, హీన కులులే భగవంతునికి ప్రీతిపాత్రులనియు, ఆమాలమాది గలకు హరిజననామ మెంతేని తగియున్నదనియు, మతమనుపేరిట వారినిగెంటిన దైవము సంతోషింప దనియు, హరిజనులను దేవాలయములోనికి రానీయ వచ్చుననియు, నందుడను భక్తునిచరితము పురాణము చెప్పి, హరిజనులు, మనతోడునీడలని, సోదరులని యుపన్యాసములెన్నేని ఇచ్చియున్నాడు మాధవరావు.

అవన్నియు అతని మానసవీధిని ఒక్కమారు సంచరించినవి. అతనికేమియు తోచలేదు. తండ్రిమాట మీఱుటకు సాహసముచాలదు. లక్ష్మిప్రణయమును తిరస్కరింప మనస్కరించలేదు.

లక్ష్మి సుగుణశీల. కులముచెప్పిననేకాని ఆమెను మాలపిల్లయని ఎవరును అనుకొనరు. భావములు చిన్నితరంగములవలె అతనిహృదయమున కొట్టాడు చుండెను.

తండ్రిని ఒకేరోజున ఒప్పించుట కష్టమనియు, ప్రతిరోజు కొంతబోధించి తండ్రిని వశపరుచుకొన వచ్చునేమోయని కుమారుడు తలచుచుండెను.

'నాబ్రతుకేమి? నేనే లెక్చర్లివ్వకున్న కొంత నయమేమొ? ఈనీతులన్నియు వేదికలకేనా, ఇతరుల కేనా? వేయిఉపన్యాసములు చేయలేనిపని చేయుదు ననుచున్నానే? నా స్నేహితులకడ ఎన్నియో ఉప న్యాసము లిచ్చితినే! వారితో నావుద్దేశముచెప్ప వారు సంతసించిరే. ఇపుడు నేను వెనుకంజవేయ వారు నన్ను పరిహసింపరా? ప్రవర్తనకు పలుకుల కింత భిన్నముగ ప్రవర్తింపవలయునా? మానాన్నేల యడ్డుతగలవలె? తనకులేని ధైర్యసాహసమును నా కున్నందు సంతసింపవలదా? నేచేయబోవుపనిని ఆమో దింపవలదా? ఇవి తనయుని భావములు.

వకీలు శ్రీనివాసరావు పేరుమ్రోగిన న్యాయవాది. పురమునజరుగు ప్రతిసభకును అధ్యక్షుడు. ఈసభ, ఆసభయని నియమములేదు, పూర్వాచార సనాతన ఛాందసధర్మసభలకు ముఖ్యుడు తండ్రి. ప్రస్తుతము ముందంజవేయు జాతి వర్ణసంకరసభలకు ముఖ్యుడు తనయుడు. తండ్రియో తనయుడో లేనిసభ ఇదివఱకు ఆపురమున జరుగనేలేదు.

రెండుసెలలుగా ఎడతెఱిపిలేకుండా హరిజనుల దేవాలయప్రవేశమునుగుఱించి దినదినము వందల కొలది లెక్చర్లిచ్చుచున్నాడు పుత్రుడు. మాలడే భగ

వంతుడని బోధించుచున్నాడు. ఆయూరి చుట్టు ప్రక్కలనుండు మాలమాదిగలందఱు మాధవరావే తమపాలిటిదైవమని పొగడుచున్నారు. హరిజనుల నుద్ధరింప బూనుకొన్నాడు తనయుడు; సనాతనుల నుద్ధరింప బూనుకొన్నాడు తండ్రి. తండ్రి తనయు లిరువురును పట్టుదలగలవారే. ఎవరు గెల్తురో.

## III

'నాన్నగారూ! ఏమందురు?'

'ఏమందును, వలదందును. నాయనా, నీవు కోపింపకుము. నేను నీతో కొంత ప్రసంగింపదలచితిని. తొందరపడక వినుము. నీవు నా యేకైకపుత్రుడవు. నీతల్లి నిన్ను కన్నదే కాని నీముద్దుముచ్చటలు చూడ నోచుకొనలేదు. నేనే తంటాలుపడి నౌకర్ల చాకర్ల పెట్టి పెద్దచేసితిని. విద్యాభ్యాసము చేయించితిని. నీవు పట్టపరీక్షయందు ప్రప్రథముగా నెగ్గినందుకు సంతసించితిని. ఇంకను గొప్పగొప్పపరీక్షలకు చదివింప బూనుకొంటిని. నీవే యీ వెఱ్ఱిస్వరాజ్యపు గొడవలో బడి చదువుకు స్వస్తిచెప్పితివి. బలవంతపెట్టి నీమనస్సు నొప్పింప నిష్టములేక చదువుమని చెప్పనైతిని. నేను పూర్వాచారపరాయణుడైనను నీవు వాలంటీరువని మద్య నిరోధమని యేవేవో పేర్లుచెప్పి మాలగూడెములు తిరుగుచున్న నోర్చుకొంటిని. నీవు యుక్తాయుక్తవిచక్షణగల్గి యీ వెఱ్ఱివేషములు మానుదువనియు సంప్రదాయసదాచార సంపన్నయగు చక్కని చుక్కను దెచ్చి నాకోడలుగ జేసికొనవలెనని రాత్రింబవళ్లు యోజించుచుంటిని. కలవరించుచుంటిని. నాయనా! యిపుడు నీవు మాలలచ్చిని దెచ్చికొన్న నాగుండె లాగిపోవా! కాంగ్రెస్సు, కాంగ్రెస్సు అందువు. కాంగ్రెసు తండ్రిని గౌరవించదా! కాంగ్రెసుకు పితృభక్తిలేదా! నీకు నయభయముల జెప్పిచూచితిని. నీవు విననైతివి ఇపుడు కాళ్లంటి బ్రతిమెలాడెదను. ఇప్పటివఱకు నీపనులకు వేనికి నేనభ్యంతరము చెప్పలేదు. నాయనా! ఈపనిమాత్రమువలదు. లచ్చినిమాత్రము చేసికొనకుమా! లచ్చి మంచిదే యగుగాక, అందకత్తెయే యగుగాక, కులహీనురాలు. నేనో ముసలివాడను. కాటికి కాళ్లు చాచుకొన్నాడనే. అవసానకాలమున నాకు మాలలచ్చియా సేవ చేయుట. నాగొంతుకలో తులసితీర్థము పోయుట మాలలచ్చియా? అయ్యో! ఇంత విడ్డూరమా! హరిజనులు హరిజనులు అని ఇంత సివమెత్తి తిరుగుచున్నావే. నల్గురు నీకు బోధించి నిన్ను రొంపిలో ద్రోయుచున్నారే. నేడు నిన్ను పురికొల్పువారే రేపు నిన్ను వెక్కిరింతురు. మనలను ఆంక్షపెట్టుదురు. రేపు మీతల్లితిథి వచ్చుచున్నది. మనయింటికి నిమంత్రణమునకు బ్రాహ్మణులు రారు. స్వాముల వారు మనయింటికి భిక్షచేయరు. ఏపెండ్లిపేరంటమునకు పిలువరు. నీయుపన్యాసమునకే నేనడలిపోవుచున్నాను. ఇప్పుడే నన్ను నలువురు నిష్ఠురములాడుచున్నారు. 'తండ్రిసదాచారి, తనయుడనాచారి' అనుచున్నారు. మాలలో కలియునట్లున్నది ఆకుటుంబమని చాటుచాటుగ మాటలాడుకొనుచున్నారు. ఆ వెఱ్ఱివాగుడు ఆఉపన్యాసములు మానుమనిచెప్పిన నీవు నొచ్చుకొందువని నేను అనలేక ఊరుకొన్నాను. అది నెపముగపుచ్చుకొని 'ఈకొడుకాటలు ఆతండ్రికిష్టమే. మనమనుకొన్నట్లు సనాతనధర్మపరాయణుడు కాడు. ఆతడు సనాతనులకై పాటుబడుచున్నానని చెప్పుట వట్టిఅబద్ధము, బూటకము,' అని పలువిధముల నిందించుచున్నారు. ఎన్నని చెప్పను? నాయనా! నీపిచ్చి వదలిపెట్టుము. నేను నెలరోజులలో నీకు మంచి అమ్మాయిని దెచ్చి పెండ్లికావించెదను.'

'నాన్నగారూ! నాకేమీ తోచుటలేదు. నాకు పెండ్లియేవలదు. చేసుకొంటినా లక్ష్మినే చేసుకొనెదను. లేదా నాకు పెండ్లియేవలదు.' అని అచటినుండి లేచివెళ్లెను.

## IV

మాధవుడు తిన్నగా లక్ష్మియింటికి దారితీసి

నాడు. లక్ష్మితల్లి వీధిలోనున్నది. మాధవునిచూడగానే 'బాబుగోరూ, దయనేండి, పెదబాబుగారు కులాసాగున్నారా? బ్యామ్మలు మీరూర్కే మా యింటికొస్తే మీకులం పెద్దలెలేయరు బాబుగోరూ!' అని ప్రశ్నించినది. 'వెలివేస్తారు, ఏంవేస్తే' యని 'లక్ష్మి యేంజేస్తున్నది' అనిఅడిగినాడు. 'లోపలుంది, పిలుత్తాను, 'లచ్చీ, బాబుగోరొచ్చారు రామే.'

లక్ష్మి చిన్నబోయినమొగముతో ఎదురుగా చనుదెంచినది. లక్ష్మిరాగానే తల్లి లోపలికివెళ్లి యేదో పని చేసుకొనుచున్నది.

లక్ష్మి మాధవునికి నమస్కరించి 'బాబుగారూ, ఏమి ఈపూట యెండలోనేవచ్చారే? ఏమైనా విశేషాలున్నాయా?' అన్నది.

'లక్ష్మి, విశేషాలేవీ లేవుగాని ఒక్కమాటడుగుతాను చెపుతావా? నీవు ఇంత చక్కగా తెలుగు మాటాడుతావుకదా? మీతల్లికి రాదేమి?'

'మాఅమ్మ ఏమైనా చదువుకొన్నదా యేంపాపం, నేనైతే బడికివెళ్లేదానను. కనుక నేర్చుకొన్నాను. లేకుంటే నేనున్ను ఆలాగే మాట్లాడేదాన్నే.'

'లక్ష్మి, ఇపుడు గట్టిచిక్కువచ్చి పట్టుకొన్నది. నేనెన్నిచెప్పినా మానాన్న వినేట్టులేదు. నిన్ను పెండ్లాడుటెంతమాత్రము కూడదనుచున్నాడు. నాకేమీ తోచుటలేదు.'

'సరే. మీకు నాన్న, నాకు అమ్మ.'

'ఏం? మీఅమ్మ నన్ను పెండ్లాడవద్దంటుందా?' చిన్నపోయిన ముఖంతో 'అవును.'

వేళాకోళముగ 'కులహీనుడ ననియా?'

కోపముతో 'మీకులొన్నతిగురించి మీరు పొగడుకొన నక్కఱలేదు. కులము కులమనెదరు. కులహీనురాలిని చేపట్టిన సత్కులము చెడునని మీ నాన్న చెప్పుచున్నట్లు మీరు చెప్పుచున్నారు. మిమ్ము పెండ్లాడుట నీతికాదని వావికాదని మా అమ్మ చెప్పుచున్నది. మీనాన్నగారి భగవద్గీతపారాయణమేమి, అనిష్ఠయేమి, సనాతనుల సభలేమి, రహస్యముగ మాలలగుడిసెల ప్రవేశించుటేమి? మీబ్రాహ్మణీకమంతయు నింతే? తనకు మాలసంపర్కము పనికి వచ్చెనా, మీకుపనికిరాకపోయెనా? మీనాన్నగారికి కూడా నాజన్మవిషయము తెలిసియే యుండును. ఆ కారణముచేతనే ఈవివాహము ఇష్టపడియుండరని నాకు తోచుచున్నది.'

ఈమాటలు విన్నంతనే మాధవరావు సంశయాస్పదుడయ్యెను. 'లక్ష్మి యేమనుచుంటివి. నీతికాదనా, వావికాదనా? ఏమినీతి, ఏమివావి, నీమాటలు నాకాశ్చర్యముగ నున్నవే?'

'మాతల్లి చెప్పునప్పుడు నాకును అట్లే యుండెను. కానీ మేము నీచకులజులైనను పాపభీతికలవారము. మాఅమ్మ తన కథంతయుచెప్పి మనయిరువురికి తండ్రి యొకడేయని చెప్పినది. నాకు తండ్రిలేడనియు నేను వావుల దురదృష్టవంతురాలనియు అనుకొనుచుంటిని. కాని నేడు నాతండ్రిని కనుగొంటిని. తండ్రి దొరకెనని సంతసింతునో, ప్రియుని పోగొట్టుకొంటినని దుఃఖింతునో తెలియకున్నది. వరుసకాదని మాయమ్మ ఈపెండ్లివద్దనుచున్నది. విషయమంతయు తెలిసిన పిదప మీపైనుండుప్రేమ వట్టిపోలేదుగాని రూపు మాఱినది. ఇపుడది సోదరీప్రేమయే' యని పలికి లక్ష్మి ఒకనిట్టూర్పు వదలినది.

అతనిహృదయములో అప్పుడెన్నియోభావము లుదయించినవి, కాని మాధవుడు వానిని వెలువరించలేదు. ఆభావములేవో? తండ్రివిషయమా? వివాహవిషయమా?

# కీర్తన

పల్లవి  నమో భరతమాతా! ప్రపూతా! నమో హిందుమాతా!

చరణములు  అపారమహిమాన్వితాసమేతా! కృపాహితా సోదరసమేతా!  ॥న॥

అతిపవిత్రమై ఆనందంబై ఆశ్రితవరదా! సాత్వికరంబై
అఖండనదియుత పంటపొలంతుల అలంకార సుందరతరమాతా!  ॥న॥

హిమవన్నగమే ఘనకిరీటముగ వింధ్యానగవన సుమజాలములే
విమలతార హారంబులుకాగా! పూర్వపశ్చిమాద్రులు పార్శ్వంబుగ
నీలగిరులె పద నూపురంబులౌ  ॥న॥

కన్నసుతులకు కలవుగల్లగా ఖండేతరులకు కల్పవృక్షమై
బానిససంతతి బాధితజీవిత సేవితజననీ సీతామాతా దీవించుమాతా!  ॥న॥

చేతివిద్యలు నూతనమయ్యెను లలితకళలు కలితములైపోయెను
పాతకములు ప్రబలంబుగ బలిసెను భూతికితరులకు
చేతికిచ్చి మాఖ్యాతిదొలంగగ వలసివచ్చెను  ॥న॥

ఆచంట సత్యవతమ్మ.

---

## మా అమ్మ ప్రాణంకాక....

ఏగతజన్మ సంభవ విజృంభిత కిల్బిష వహ్నికీలలో
నాగృహ మధ్యభాగమున నాల్కలుచాచిన కోడెత్రాచులై
ప్రేగుల నక్కళించి భళిరే! ప్రళయాకృతి, ఆదిశేష జి
హ్వాగళ దుగ్రతైజస విషాగ్నులు( గ్రక్కుచునున్న వక్కటా!
ఆహుత భక్ష్యఖాంచల విహారవికీర్ణ మయూఖమాలికా
బాహువులబ్బ నాజనని ప్రాణము(గొన్నవి "న్యాయమేకదా!
మోహమికేల నామెపయి పో;" అనుకొంటిని అంతమాత్రమే
దాహము తీరలేదది యదార్థము వహ్నిది బుద్ధిలోపమే.

కొడాలి వెంకటరాజారావు.

# పాకకళ

## కేబేజీకూరతో కజ్జికాయలను తయారుచేయుట

అరపౌను కాబేజిని సన్నపొరలాంటి ముక్కలుగ తరుగవలయును. పిదప ఆముక్కలను శుభ్రముగా కడగి ఒకగిన్నెలోవేసి దానికి తగినంత వుప్పువేసి అర్ధశేరు నీరుపోసి దానిని మెత్తగా వుడికించవలయును. వుడికినతర్వాత మిగిలిననీటిని వార్చవలయును. అది కొంతసేపు ఆరినపిదప పది పచ్చిమిరపకాయలు, కొంచెము అల్లము ముక్కలుగ తరగవలయును. బాణలిలో నాలుగుతులముల నెయ్యినివేసి బాగుగా కాగినపిమ్మట నాలుగు ఎండుమిరపకాయలు, ఒకతులం మినపపప్పు, పావుతులం ఆవాలు పోపువేయించి కమ్మనివాసన వచ్చినపిమ్మట తరిగిన పచ్చిమిరపకాయలు, అల్లం కొంచెము కర్వేపాకు వేయవలెను. యిది బాగుగా వేగినపిమ్మట ఒక పావుశేరు పచ్చిభటానీలు, ఆనబంగాళాదుంపలు, పొట్టుతీసి తరిగిన ముక్కలు, యీపోపులో వేయవలయును. వాటికి తిరిగి తగినంత వుప్పువేసి మూతపెట్టి మెత్తపడిన పిమ్మట వుడకబెట్టి వార్చిన కాబేజీని దీనితోకలిపి సన్ననిసెగమీద ఒక పదినిమిషములు దానిని మగ్గనియ్యవలెను. అట్లు మగ్గినకూరను ఒకపళ్లెములో ఆరబెట్టవలయును.

ఒకసేరు మైదాపిండితెచ్చి పూరీలపిండివలె నీటిని కలిపి పెట్టుకొనవలయును. వాటిని అప్పడములకువలె వత్తి, టేబిల్‌స్పూన్‌కూరను దీనియందుంచి కజ్జికాయ చేయవలయును. యిట్లు అన్నిటినిచేసి బాణలిలో నేతినిపోసి వాటిని దోరరంగు వచ్చునట్లు వేయించవలయును. వీటిని వేడిమీద తినినయెడల మిక్కిలి రుచికరముగనుండును. —మల్లాది వెంకటరమణమ్మ.

## జీరా

ఒకపలమునెయ్యిని ఒక బాణలిలోపోసి కాచి, చక్కగా కాగినమీదట కాలుపడి గోధుమరవను దానిలోవేసి పక్వముగా వేయించుకొని, ముక్కాలుపడి పాలనుకాచి పొంగువచ్చునపుడు వేయించియుండు గోధుమరవను దానిలోబోసి, కలియబెట్టి ఒకపొంగురాగానే ముందుగానే పదిపలములు తెల్లచక్కెరను పాకముచేసియుంచియుండు దానిని అందులోబోసి కలియబెట్టుచుండి మూడుపొంగులు రాగానే విత్తనములులేని ద్రాక్షపండ్లు రెండుపలముల నర, ఏలకపొడి కాలుపలము, వీనినంతయు వేసి తర్వాత నాల్గు గురింజగింజలయెత్తు కుంకుమపూవును పాలలో నూరి యందులోవేసి చక్కగా కలియబెట్టి అయిదు పలములు నెయ్యినిబోసి, నోటికి వాసినిగట్టి అయిదు నిమిషములదాక పొగలేని బొగ్గులనిప్పు సెగలోనుంచి అయిదుపలముల కలకండను మిరియములంతేసి ముక్కలుగాచేసి యందువేసి బాగాకలియబెట్టి యుపయోగించిన చాల రుచిగానుండును. —పప్పు కమలావతి.

## గోధుమలడ్డు

ఒకశేరు గోధుమరవతెచ్చి, శేరు నీళ్లలోనానబెట్టి ఒకరాత్రియంతయు యుంచి మరునాటి యుదయమున నీటినంతయు వడియకట్టి నూక నారబోయవలయును. పిమ్మట రవవలెనుండు వేచిన శెనగపప్పుపిండి అర్ధశేరు అటువలెనే పెసరపప్పుపిండి అర్ధశేరు వీటిని గోధుమరవతోకలిపి బాణలిలో అర్ధశేరు నేయిపోసి, మరుగుచున్నపుడు ఈమూడు దిన్సులను, ఆనేతిలో వేసి యెర్రగానగునట్లువేచి రంగువచ్చు సమయమున శేరుపావు చక్కెరయును, 10 తు॥ పన్నీరును, $\frac{1}{2}$ తు॥ కుంకుమపూవు చూర్ణమునువేసి కలుపుమా సువాసన వచ్చుట చూచి దించవలయును. దించిన అయిదు నిముషముల తర్వాత యిష్టమువచ్చినంత యురవుగల యుండిలుచేసి భుజింపవచ్చును. క్రొత్తకుండలో మూతవేసి యుంచిన 15 దినములవరకు చెడిపోదు.

—శీలా అప్పలకొండ.

# అల్లిక పనులు

శ్రీ ఎక్. వి. నరసింహయ్యగారు



7 వ పటము. రెండుప్రక్కల లోకేరీతిగ నున్న రెట్టింపు క్రోచెట్.

దీనిని నాల్గవ పాఠమునవలెనే ప్రారంభింపవలెను. అచట జెప్పబడినవిధముగా, అడుగుననున్న గొలుసుపై అల్లిక ప్రారంభింపవలయును. అయితే గొలుసుపై దారమునుమాత్రము లాగక, గొలుసుయొక్క రెండుదారములనులాగి, సూదిని దూర్చవలెను. మొదటి వరుస ముగిసినతరువాత తిరిగి యారంభింపవలయును. అయితే గొలుసులపైనగల దారమునుమాత్రము లాగి, గొలుసులలోని రెండుదారములనులాగి కొక్కెనిత్రిప్పి లోపలనుండి లాగవలయును. క్రొక్కెకిపైన ఉచ్చునుదీసి కొని దానిపైనున్న రెండుకుట్లను యొకమారుగా లాగవలయును. ముగియునంతవఱకీవిధముననే అల్లవలయును. ఒక్కొక్క వరుసయందును ముందునకు వెనుకకు అల్లవలయును. రెండుప్రక్కలందొకేరీతిగా నున్నందున ఏవిధముగ గావలయుననిన అట్లు అల్లుకొననగును.

8 వ పటము. సాదా ముప్పురి అల్లిక.

సాధారణమైన గొలుసునందు క్రిందిభాగమునుండి మొదలిడనగును. క్రింద కనబరచినదియు చేయవచ్చును. కొక్కెపైనున్న ముడిచుట్టు కొక్కెపై దారముతెచ్చి గొలును మొదటికుట్టుపై రెండుదారముల నెత్తుకొనుటకు కొక్కెని దూర్చవలయును. అడుగుభాగమును విడువ నిష్టములేకుండెనేని కొక్కెకి ప్రక్కనయున్న మొదటి మూడుకుట్లనువీడి తరువాత కుట్టునందు కొక్కెని దూర్చవలయును. రెండుదార



ములగుండా కొక్కెని లాగవలయును. కొక్కెకిపైన మూడుముళ్లుండును. కొక్కెకిపై ఉచ్చు దానిగుండా రెండుమారులు లాగవలయును. మరల కొక్కెకిపైన దారముదీసికొని మిగిలియుండు చెండునుండి లాగవలయును. ఇపుడు మూడుకుట్లు ముగియును. కొక్కెకిపై నొకముడి విడువబడియుండును.



9 వ పటము. నిడుపైన ముప్పురి అల్లిక.

కొక్కెతో దారమునుఎత్తుకొని, కొక్కెకిచుట్టి, రెండుమారులు ఉచ్చును చుట్టవలెను. అల్లకములో కొక్కెనిదూర్చి ఉచ్చును దానిమూలము కొక్కెకి యున్నదానిని లాగవలెను. కొక్కెకి పైనగల ఉచ్చును పోనిచ్చి రెండిటిమూలమున మరల కొక్కెపై ఉచ్చును ఇమిడ్చి దానిమూలమున రెండింటిని లాగవలయును. అపుడు కుట్టు ముగియును. ఆరంభమున చేసినరీతి

కొక్కిపై పూర్తిగా ముడియుండును. వెనుకవచ్చు ఒక్కొక్కకుట్టును ఈవిధముగా వేయవలయును.



## 10 వ పటము లాంగ్ డబుల్ ముప్పురిఅల్లిక.

కొక్కినిచుట్టులాగున మూడుమార్లు ఊలును చుట్టవలయును. కావలసినచోట కొక్కినిమిడ్చి దాని మూలమున ఊలును లాగవలయును. ఈచోట ఐదు గొలుసులుండును. కొక్కికిపై ఊలునుచుట్టి రెంటి మూలమున లాగవలయును. మరల పలుమారు మూడుమారులు కొక్కిలో ఊలునిమిడ్చి రెంటిమూలమున లాగవలయును. తరువాత కొక్కికిపై ఊలును పెట్టి రెంటిమూలమున లాగిన లాంగ్ డబుల్ ముప్పురి అల్లికయగును. కొక్కిపై నొకకుట్టు విడిచివేసిన అల్లిక ముగియను.



## 11,12 వ పటములు: సాధారణ ట్రైకాట్ (Tricot)

కావలసినంత పొలత గొలుసుతో అల్లిక ఆరంభము చేయవలయును. కొక్కిని మొదటి వరుస రెండవగొలుసులో దూర్చి, దానిమూలమున ఊలును లాగవలయును. మొదటికుట్టునందు కొక్కిపై క్రొత్తగాలాగబడిన కుట్టును నిల్పి గొలుసునందు రెండవవలయమునందు కొక్కినిదూర్చి, దానిమూలమున ఊలునుదూర్చి కొక్కిపై యీకుట్టు నిల్పవలయును. గొలుసులు పొడవైన కుట్లగువరకు మొనకు మొనను చేర్చి అల్లుచురావలెను. ఈఅల్లికను దిగువ



కనుపరచిన ప్రకారము వేయవలెను. ఒకగొలుసును వేయునపుడు కొక్కిపై ఊలునుపోనిచ్చి కడపటనుండు ముడిమూలమున లాగవలయును. కొక్కిపై ఊలునుంచి గొలుసుమూలమునలాగి కొక్కికిపై నున్న మరియొక ముడిని ఇట్లే వేయవలెను. మరల కొక్కిపై పైపున ఊలునుండి కొక్కికిపైనున్న రెండువలయముల మూలమున లాగవలయును. ఆఅల్లిక ముగియునంతవరకు ఇవ్విధముననే అన్నికుట్లుయుండును అల్లవలయును. ఇపుడు కొక్కికిపైన కడపట తీసిన యొకకుట్టు నిలువవలయును.



రెండవ వరుస.

కొక్కిపైగల కుట్టే మొదటికుట్టు. ముందువరుసయందు క్రిందికుట్టునందు నిలువుగానున్న దారమునకు దిగువ వెనుకకు త్రిప్పి, కొక్కి నుపయోగించి కొక్కిపై ఊలునుంచి దారముమూలమున ఊలునీడ్చి, కొక్కిపైన క్రొత్తకుట్టువేసి, కడపటవరకు, వెనుక వచ్చు ఒక్కొక్కకుట్టును ఎత్తుకొనుచుండవలయును. ప్రారంభమున గొలుసునం దెన్నికుట్లుండునో దానికి సరిగా కొక్కికిపైన కుట్లుండవలయును. వెనుకకు

పోవుటకు కొక్కెకిపై ఉచ్చులునుంచి కడపటనుండు కుట్టుమూలమున లాగవలయును. (గొలుసును వేయు రీతి) కొక్కెకిపై ఉచ్చులునుంచి యీ గొలుసుమూలము నను, కొక్కెకి పైనున్న ప్రక్కకుట్టు మూలముననులాగవలయును. కడపటనుండి ప్రారంభించి యొక కుట్టుమీదనే అన్నికుట్లను అల్లవలయును. ప్రక్కన నుండు ఒక్కొక్క వరుసయు నిట్లే అల్లవలయును.



13 వ పటము. (Bullion Stitch)

బుల్లియన్ లేక బియ్యపుకుట్లు.

దీనికి కావలసినంత వేసుకొనిగాని, చేతియందు మిగిలియున్న క్రోచెట్ పైనగాని అల్లికను ప్రారంభింపవలయును. దారమును ఆరుమారులు కొక్కెకిచుట్టి బుల్లియన్ కుట్టు యేర్పడుచోట కొక్కెనిదూర్చి, దానినుండి ఉచ్చులును నేరుగా ఆరుచుట్లమూలమునను కొక్కెకిపైనున్న కుట్లుమూలమునను ఒకేసమయమున లాగవలయును. ఇట్లే యిమిడ్చి అల్లికను పూర్తిచేయవలయును. కొక్కెని సులభముగా దూర్చుటకు ఎడమ చేతి బొటనవ్రేలునకు మధ్యవ్రేలునకు మధ్యయందు కొనలను పట్టుకొనవలయును. ఈ అల్లకమునందుపయోగించు దారమును వానిగుండా యీడ్చునంతవరకు పట్టుకొనవలయును. ఈఅల్లిక కుపయోగించుసూదికి కొక్కె చిన్నదిగను మధ్యభాగము (దండము) చేత పట్టుకొనుప్రక్కన లావుగను ఉన్నయెడల లాగుటకు గావలసినంత బలమిచ్చును.

**Smocking Stitches - తేనెగూటి కుట్టు.**

**(Spot Honey Comb) తేనెపట్టు అల్లిక.**

పటము 1,2,3. ఈ కుట్లను ముడి వేసి యెడమప్రక్క మొదటి మడతపైకి దారమును తేవలయును. తరువాత సూదిని యెడమవైపు త్రిప్పి మొదటి రెండు మడతలందును కుట్లను వేయవలయును. (పటము 1.) దారము రెండవ మడతయందు సూదిదూరుచోట మరల సూదిని గ్రుచ్చవలయును. మడతకు ఎడమ ప్రక్కన, ప్రక్కన క్రిందనుండు జంటకుట్లకు పైకి తేవలయును. 2 వ పటమునందు మొదటిపటము నందు జూపినమాదిరి రెండుమడుపులను చేర్చి యెత్తి కుట్టవలయును. తరువాత సూదిని మడతకు కుడి ప్రక్కనగ్రుచ్చి, మరల ఎడమవైపున, ముందువరుసను చేర్చి కుట్లకుపై బైటకు తేవలయును. వరుస కడపటి వరకు అల్లవలయును. (పటము 3.)

వ్యతిరేకపుకుట్లు.

(4,5,6 పటములు) వరుసకు కుడిప్రక్కన ఆరంభము చేయువలయును. సూదిని ఎడమప్రక్కకుత్రిప్పి రెండుమడతలను చేర్చి ఎత్తుకొనవలయును. (4 వ పటము) కుట్లు రెండుమార్లు వేయవలయును. (5 వ పటము) మరల అదేమడతలో కుడిచేతిప్రక్కలో దానినే 1/8 అంగుళములకు పైప్రక్కన సూదిని దూర్చి రెండుకుట్లు వేయవలయును. మరల దీని మూలమున ఒకకుట్టును ప్రక్కమడతమూలమున ఒక కుట్టును వేయవలయును. (పటము 6.) ఈకుట్టు రెండుమార్లు వేయవలయును. ఆ వరుసంతయు యీ కుట్టునే వేయవలయును. అదేమడుపులో ఆరంభించి ప్రక్కవరుసను చేర్చునట్టికుట్లతో రెండవవరుసను అల్లవలయును.

చుట్టుకుట్టు: పటము 7,12. ఇదివఱకుజెప్పిన చేపయెముకకుట్టు (Herring Bone) చూడవలయును. ఎడమప్రక్కన ప్రారంభించి, దారమును సూదిక్రింద పెట్టి మొదటిమడతలో నొకకుట్టు కుట్టవలయును. 7 వ పటము. ఈదారమును సూదికిపైన పెట్టి రెండవ మడతలో కుట్టవలయును. (8 వ పటము) సూదిని ప్రక్కవరుసనుచేర్చునట్టి కుట్లకుక్రింద నిమిడ్చి, సూది పైన దారమునునిల్పి మునుపటికుట్లవలె అదేమడతలో ఒకకుట్టు వేయవలెను. (9వ పటము చూడుము). ప్రక్కమడతలో దారమును సూదిక్రిందనుంచి కుట్టవలయును. (10 వ పటము.) ఈరీతిగానే వరసంతయు త్రిప్పిత్రిప్పి కుట్టుచురావలయును. రెండవ



VARIOUS USES OF STITCHES

వరుస వేయునపుడు, ప్రక్క వరుస ఆరంభము చేయవలెను. ఇంతవరకు చేయక విడిచిన కుట్టునిపుడు వేయవలయును.

ఈకుట్టునందు ఒక్కొక్క కుట్టునకు క్రొత్తమడతను వేసి కుట్టవచ్చును. ఇట్లయిన గంభీరమైన చిత్రములు ఏర్పడును. (పటము 11.) ఈకుట్టు ఉపయోగించుటకు మొదటివరుసయును కడపటివరుసయును, ఎక్కువకుట్లు రెండుమడతల లోను చేర్చివేసి బిగువు చేయవలయును. మొదటి కుట్టుకు వెనుక, రెండవకుట్టు కుముందును జేయవలయును.

(Feather Stitch) ఈక కుట్టు. 13, 14 వ పటములు. త్రిప్పి ఒక్కొక్క మడతయందును, ఒకే కుట్టుగా కుట్టి నూదిలో క్రిందవలయము వేయవలయును. దారమును లోపలి ప్రక్క త్రిప్పి మూడుకుట్లు వేయవలయును. (13 వ పటము) మరల రెండుకుట్లను వలయమునకు ఎడటి ప్రక్కన త్రిప్పి వేయవలయును.

రెండుకుట్లు వేసిన అల్లిక యారంభమునకు తోడను ప్రారంభమునకు తరువాత రెండుప్రక్కలందును చున్నది.

# పుష్ప చయము

## పతిగౌరవాన్ని నిలపడానికి బడితపుచ్చుకుంది

ఉట్‌మన్ జేలోవున్న కాంగ్రెసువాదులంతా జెయిల్లోవున్నారు. ఆవూళ్లోకి మిలిటరివారు ప్రవేశించారు. గ్రామస్థులనందరినీ ఒకచోట చేర్చినారు. తామింక రాజకీయాల్లో పాల్గొనమని ఖరారు వ్రాయించి వారందరినీ దాల్లో వ్రేలిముద్రలు వేయమన్నారు. అందరూ నిరాకరించారు. ఒకడుమాత్రమే వేశాడు.

అతడు ఇంటికి వెళ్లాడు. కాని భార్యమాత్రం వ్రేలుముద్రవేశారా అని వెంటనే అడిగింది. అతడు తప్పుచేసినవానిమల్లె తడబడ్డాడు, అవకతవక జబాబులిచ్చాడు. భర్త వ్రేలిముద్రవేశాడని, కులానికి కళంకం తెచ్చాడని భార్య తెలుసుకుంది. ఆమె కోపం భరింపలేకపోయింది. ఒకబడిత పుచ్చుకుంది. భర్తను వడవ మంది మిలిటరివారివద్దకు. తలవంచుకొని భర్త ముందు బడితపుచ్చుకొన్న భార్య వెనుక గ్రామస్తులు అధికారులు గుమికూడివుండే చోటికి వెళ్లారు. తాను చేసినదానికి సిగ్గుపడి, అక్కడవున్న గ్రామస్తులను క్షమాపణకోరుకుని తన వ్రేలిముద్రను ఉపసంహరింపచేసుకు నేంతవఱకు భార్య సుముఖత్వంవహించిందికాదు. దాంతో అధికారులు చెప్పింది వినాలని అనుకునేవారుకూడా లేకపోయారు. ఇటువంటివారు ఆదర్శప్రాయులుగావుండి వుత్సాహం కలిగిస్తారు.

—ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్.

* * * *

## న్యాయంకలిగించడానికి విక్రమార్కునివేషాలు వేయాలి

జగలాల్ చౌదరి బీహారురాష్ట్రపు మంత్రుల్లో ఒకరు. ఒక సబ్‌యిన్‌స్పెక్టరునుగురించి వారికి చాలా కంప్లెయింట్లు వచ్చాయి. ఆ యిన్‌స్పెక్టరుకు బాగా పాఠం నేర్పాలనుకున్నాడు మంత్రి. ఒకదినం మంత్రి రైతుదుస్తులు ధరించాడు. పోలీసుస్టేషనుకు వెళ్లాడు. సబ్‌యిన్‌స్పెక్టరు తనహోదాకు తగినఠీవితో కూర్చునివున్నాడు. మంత్రి క్రిందకువంగి చేతులుజోడించి నమస్కరించాడు. 'దేవరా! నామాడ ఒకటి పోయింది. న్యాయం దయచేయించండి బాబూ' అని వినయంగా చెప్పుకున్నాడు.

రిపోర్టు తీసుకోనడానికే ఒప్పుకోలేదు ఆ సబ్‌యిన్‌స్పెక్టరు. 'ఇది పోలీసుస్టేషను. కాంగ్రెసు ఆశ్రమం కాదు. తెలిసిందా? మేము దాల్లో పనిచేయాలంటే ఏమైనా అర్పించుకుండే శక్తివుంటే చూడు, లేకపోతే బయటికినడు' అని గద్దించాడు. మరుమాటాడకుండా జగలాల్ రెండురూపాయలు వినయంగా అర్పించుకున్నాడు. రూపాయలను క్రింద విసరికొట్టుతూ, "భిక్షాని కిస్తున్నట్టుందే" అని వురిమాడు ఇన్‌స్పెక్టరు. మంత్రి ఇంకొకరూపాయ యెక్కువయిచ్చాడు. ఇన్‌స్పెక్టరుగారికి తృప్తికలిగిందికాదు. నాలుగురూపాయలకు బేరంకుదిరింది. ఇన్‌స్పెక్టరు రూపాయలు జోబులో వేసుకొని రిపోర్టు వ్రాయడానికి పూనుకున్నాడు.

ఇన్:—నీ పేరేమి ?

మంత్రి:—సర్కార్ జగలాల్ చౌదరి.

ఇన్:—వుద్యోగం ?

మంత్రి :—హుజూర్ వుద్యోగం......మినిస్ట్రి (మంత్రివర్గం).

ఇక్ :—ఏమన్నావు......మిస్త్రి?

మంత్రి :—కాదండి సర్కార్ మినిస్ట్రి.

ఇక్ :—(భయభ్రాంతుడై) ఏమి మినిస్ట్రి?

మంత్రి :—మంత్రివర్గంలో ఆబ్కారీశాఖ.

ఇక్ :—(త్వరగా నిలబడి) మీరు.....తాము యువర్ ఆనర్......సర్కారు......గౌరవనీయ మంత్రులు......జగలాల్ చౌదరిగారు.

ఆకస్మికంగాకలిగిన భయంచేత స్తంభించిపోయి నానాఅవస్థలుపడుతున్న ఇక్స్పెక్టరును క్షమించారు మంత్రిగారు, కాని అటువంటి వదవడికమాత్రం ఇకమీదట చేయకు జాగ్రత్తని మందలించి వెళ్లారు.

—'సరస్వతి'-అలహాబాద్.

* * * *

## బాలికలు చదువవలసిన విద్య

మీచదువు పూర్తియగువరకు మీరు బ్రహ్మచర్యమునే జరుపవలయును. ఈ విధమున ఇంద్రియ నిగ్రహము కలిగియున్నచో మీ ఆత్మశక్తి వృద్ధియయి మీ చదువున కేవిధమైన ఆటంకము కలుగజాలదు. చిన్నతనముననే వివాహములు జేసికున్నచో కామాంధకారమునబడి ఆవిద్యను మంటగలిపి వేయుదురు. కావున పవిత్రమైన బ్రహ్మచర్యమును కాపాడుకొనుడు.

బాలికలు సంగీతము, సాహిత్యము చిత్రలేఖనము, అల్లిక, నేత, కుట్టుపని, రాటము, శిశుపోషణము, ప్రసవవైద్యము, పాకవిధానము మున్నగు స్వతంత్రవిద్యలు దేశీయపద్ధతుల ననుసరించి నేర్వవలయును. మరియు దేశచరిత్ర, భూగోళము, లెక్కలు, హిందీభాష, పదార్థ విజ్ఞానశాస్త్రము నేర్పినచో లోకజ్ఞానముకలిగి మన బాలికలు ఉన్నతభావములతో సర్వవిధముల ఉత్తమనారీమణులగుదురు. పరులదాస్యముకొరకుగాక తాము స్వతంత్ర జీవనమునుపొంది దేశసేవను చేయగల్గుదురు.

మాతాపితృభక్తి, దైవభక్తి, దేశభక్తి, త్యాగము ధార్మికచింత, ప్రేమ, విశాలవిశ్వమానవ సౌభ్రాతృత్వము, సౌశీల్యము, ఇవి మనబాలికలకు అలవడునట్లుచేయు బాధ్యత ఉపాధ్యాయినులయందున్నది.

—చుండూరు రత్నమ్మ. ఏలూరు హిందీసమావేశములో,

## పిల్లలెందుకు ఆడుకోవాలి ?

ఆటల్లో కలుపుగోలుతనం అభివృద్ధిచేసే గుణంవుంది. తత్ఫలితంగా అది అమోఘమైన ఫలితాన్నియిస్తుంది. వివిధవర్ణాలకు, అంతస్థులకు చెందిన పిల్లలనందరినీ భేదభావంలేని ఒకే అంతస్థుకు తీసుకొస్తుంది. ఆటల్లో పిల్లలంతా ఒకటే. ఆటలనుగూర్చిన అభిప్రాయాలు సరిసమానంగానే వుంటవి. ఈ మానవ సాధారణా వశ్యకత, యీ సాధారణ భావప్రకటనావైఖరి అన్ని రకాల అంతస్థుల్లో పరిస్థితులలోవున్న పిల్లలందరినీ కలప డానికి రంగభూమి అవుతుంది. వర్ణాలలోని న్యూనతాధిక్యాల పోగొట్టడానికి సాంఘిక వ్యత్యాసాల భేదాలు తొలగించడానికి, సకలమానత్వము నిరూపించడానికై పునాది వేయడానికీ ఆటలకంటె పిల్లలకు కోరదగిన ఉత్తమావకాశాలు లేవు. ఆటలు పిల్లలకు ఆలోచనా, ఆదరణా, కలిగిస్తాయి. వాళ్లల్లోవున్న

వుత్తమగుణాలని పైపబికిస్తాయి. అయినా మానవసౌభ్రాతృత్వాన్ని సంపాదించియిచ్చే చదువు పిల్లల విద్యా విధానంలో చేర్పబడలేదు.

జీవితములో ఆటలుకలిగించే క్రమశిక్షణ మరే అవకాశమూ కలిగించదు. సాంఘికోన్నతిని మనము కోరేటట్టయితే బాలబాలికల ఆటలనుగూర్చి అశ్రద్ధ వహించలేము. భారతదేశములో పౌరజీవితాన్ని నిరంతరమూ కలతపెట్టే కారణాలు-జాతిద్వేషాలు, వర్ణవ్యత్యాసాలు. ఇవి పరస్పరసానుభూతి, విచక్షణ లేకఎంతమూ ఎప్పటికీ ఏకీభావమువహింపని వ్యతిరేకాభిప్రాయాలు—వీనిపై దృఢంగా బైరాయించాయి. ఈభిన్నశక్తులనన్నింటినీ యేకీభవింపచేసే దుస్తరకార్యం సక్రమనిర్మాణపద్ధతులపైన యేర్పాటుచేసిన యీ ఆటల్లో తేలికైపోతుంది. కాబట్టే పిల్లలను సామాజికోన్నతపౌరులనుగా చేయాలంటే వారు తోడిమానవ లోకములో సానుభూతితో సాదరముతో సహకారముతో జీవించాలంటే, వారి ఆటలను—భావి ఉన్నత పౌరులగుటకు మార్గాలను నిరసనభావంతో చూడజాలము.

—డాక్టరు. జె. ఎం. కుమారప్ప.

# వ్యాసకర్తలకు

వ్యాసములు ప్రకటన కంగీకరింపబడుచో వ్యాసకర్తల కా సమాచారము వెంటనే తెలుపబడును. అంగీకరింపబడని వ్యాసములు ఆ మాసాంతమువఱకుమాత్రము భద్రపరుపబడి యుండును. వ్యాసములు కావలసిన ఆ యావ్యాసకర్తలు తగు తపాలబిళ్లలనుపంపి వానిని తెప్పించుకొనగలరు.

సంపాదకుడు.

---

# జ్వరానంతరము తగినబలము

# గ్రంథపరిచయము

భీష్మ స్తవరాజము.

కర్త: శ్రీమతి ఉభయభాషాప్రవీణ భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు, దానవాయిగుంట, రాజమండ్రి. వెల 2 అణాలు.

ఇది భారతాంతర్గత భీష్మ స్తవమునకు ఆంధ్రానువాదము. చక్కనిగీతములలో లలితపదగుంభనలతో నలరారుచున్నది. ఈ చిన్నిపొత్తము పఠనమువల్ల నీవిదుషీమణికి పంచమవేదముపై నెంత యభిమానమున్నదో తేటపడగలదు. ఎల్లరు చదువదగినది.

గజవిహారము.

కర్త: ఉభయభాషాప్రవీణ, అష్టావధాని శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవి, ఖాసీంకోట, విశాఖపట్టణముజిల్లా, వెల 2 అణాలు. 'సీతారామచంద్ర ప్రభో' అను మకుటముతో వెలయు నొకశతకము. ఈశతకమంతయు 'అతతమత్తేభము'లతో నడచుటచే కాబోలు దీనికి గజవిహారమని నామమిడిరి. శైలి లలితము. అర్థవంతము.

ఆంజనేయ నక్షత్రమాలిక.

కర్త: శ్రీ తుర్లపాటి గురుస్వామయ్యగారు, (c/o M. సుబ్బరామయ్య, నెం. 110, మునిసీపువీధి, చోళంగిపురము M. S. M.) వెల 2 అణాలు. ఘటికాచలమున వెలయు శ్రీమదాంజనేయస్వామినిగూర్చిన నక్షత్రమాలిక. ఇందు మొత్తము ఇరువదితొమ్మిది సీసపద్యములు గలవు.

శ్రీ లక్ష్మీనరసింహ స్తోత్రాక్షరమాలిక.
శ్రీ మదాంజనేయ స్తోత్రాక్షరమాలిక.

కర్త: శ్రీ తుర్లపాటి గురుస్వామయ్యగారు, చోళంగిపురం, వెల 2 అణాలు. ఇందు చోళంగిపురము శ్రీ లక్ష్మీనృసింహాలయ, శ్రీ ఆంజనేయస్వాములయు స్తవము అకారాదిగా నుండుటయేగాక శ్రీ లక్ష్మీనృసింహ పంచరత్నస్తోత్రము, శ్రీనృసింహ ద్వాదశనామస్తోత్రము, పంచాయుధస్తోత్రము, మహాలక్ష్మ్యష్టకము, ఇత్యాది ప్రాచీనస్తోత్రములు శ్రీగురుస్వామయ్యగారిచే సంపాదితములైనవియు గలవు. లక్ష్మీనృసింహాంజనేయుల భక్తులకు నిత్యపఠనకు మిక్కిలి తోడ్పడగలవు.

శ్రీ వేణుగోపాలనామ సంకీర్తనలు.

కర్త: తుర్లపాటి గురుస్వామయ్యగారు, చోళంగిపురం, వెల 8 అణాలు.

ఇందు త్యాగరాజు కృతులమట్టులు, రామదాసు చరిత్రలోని మట్టులు, ద్రవిడభాషయందుగల కావడిచిందు, తెమ్మాంగు, తిరుప్పుగళుమట్టులు, బ్యాండు మట్టులు మున్నగునవి గలవట. 'పాడగలవారి సామర్థ్యము కొలది పాటలసారస్యం బతిశయించుచుండును' అని గ్రంథకర్తగారు పీఠికలో వాకొనియున్నారు. ఇందలిసత్యమును సంగీతవిద్వాంసులే పరిశీలించుటకు సమర్థులు. మొత్తమిందు 125 పాటలున్నవి. రసికులమనంబుల కెక్కగలవనియే మా నమ్మకము.

శ్రీ బాలకోటేశ్వర స్తవము.

కర్త: శ్రీ వాసిరెడ్డి వేంకట సుబ్బయ్యగారు, సంపాదకుడు, ప్రేమ గ్రంథమాల, వడ్లమూడి, గుంటూరుజిల్లా.

ఇది వడ్లమూడి బాలకోటేశ్వరున కంకితముగా

శద్దేవప్రశస్తిని ప్రకటించుశతకము. ఇందైదుసర్గలు గలవు. పద్యములు మనంబుల నలరించుచున్నవి.

ప్రేమాంజలి.

శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్యగారు, వడ్లమూడి. గుంటూరుజిల్లా. ఇందలిరచనలు కవి బాల్యము నాటివి. 'మాతృదేవపదపూజనమునకై ప్రేమపురస్సరముగా నెత్తినయంజలియే యీగ్రంథమగుటయు కావ్యవస్తువు పరమార్థప్రతిపాదకమగు భగవద్గుణప్రశంసచే నిండి యుండుటయు నీరెంటం జేసి ప్రేమాంజలియనునామంబు సార్థకము' అని యీగ్రంథమునకు తొలిపలుకువ్రాసిన శ్రీమాన్ కొమండూరి కృష్ణమాచార్యులు గారు వచించి యున్నారు. ప్రథమసర్గమున నిందు శ్రీ రాజరాజేశ్వరీసంకీర్తన మొనర్పబడినది. ఈసర్గలో అచ్చటచ్చట గీర్వాణాంగ్లసుభాషితములకు చక్కని తెనుగు నుడులు కాన్పించుచున్నవి. ద్వితీయసర్గలో శ్రీ వేంకటేశ్వర స్తవము గలదు. దీన మొదటి కొన్నిపద్యములలోని 'వ్యాజస్తుతి' కానుల పురుషోత్తమకవి విరచిత ఆంధ్రనాయకశతకములోని పద్యముల దలపించుచున్నవి. తరువాత నెల్లశతకములవలె భక్త్యావేశములతో నిష్కామసిద్ధికై శ్రీ వేంకటేశ్వరకటాక్షమును కవి యాచించుచున్నాడు.

తృతీయసర్గము 'చంద్రశేఖరా' అను మకుటముతో 'పరమేశ్వర గుణగానము' చేయబడినది. గ్రంథమంతయు అతిసులభశైలిలో రచియింపబడిన దనుటలో విప్రతిపత్తిలేదు.

యౌవనజ్వాల.

కర్త: శ్రీ కందుర్తి నరసింహారావుగారు, c/o సండేటైమ్స్, మద్రాసు, వెల 12 అణాలు.

శ్రీ కందుర్తి నరసింహారావుగారిని ఆంధ్రజగత్తు బాగుగా నెఱుగును. వీరికవితలో యువకుని పట్టుదల భావావేశము ఎల్లెడల దలచూపుచుండును. 'యౌవన జ్వాల' నేటికవిత్వపద్ధతులపై నాధారపడి వెలువడినది. యువకునిమనస్సు ఎన్నివిధములతపించునో వానిని కొన్నిశీర్షికలలో స్పష్టముగా కవి చిత్రించినాడు. 'జవహరలాల్'ను జదివిన దేశస్వాతంత్ర్యమునకు మనరక్త ముడుకకపోదు. 'పంప' హంపీక్షేత్రమును దలపించి దానికిగలిగిన పతనమునకై మనకు ఆవేదన యొసగుచున్నది. ఈక్రిందిపద్యము దాని కుదాహరణము:

"అమ్మా పంప నిలింప సేవిత తరం
 గా నీకు జోహారు దుః
ఖమ్మోర్గోషబలమ్మో నాకు దెలి
 యంగా నీదు, నీ పార్శ్వభా
గమ్మానాడెటుమాచినన్ విడియ పా
 కై పండెనా? నేటికా
'కమ్మేరాకుల' తమ్మలో యెఱుపు ర
 క్తస్రావమా, భోగమా ?"

ఇట్టి వెన్నేని యుదాహరణములు ప్రతిశీర్షిక క్రిందను జూపవచ్చును. కవిగారు గ్రంథాంతమున 'నాతరముగాదు నీఖేలనమ్మికేల యెన్నినాళ్లువేధించునో యెఱుగనైన, దానికే యింత యత్నింతు నేను— జగము ఈమహాయత్నమందే నశించునేమి?' అనుటలో యౌవన ప్రతిభాశాలి యీకవి యెంత యాకులతతో భరింపగరాని మనోవేదనతో నున్నను కష్టపడి గట్టి యత్న మొనర్చి లోకకల్యాణమునకు పాటువడ కంకణబద్ధుడయియుండుట కనవచ్చును. దీనికి శ్రీ పరమేశ్వరుడు కవికి నిరతము తోడ్పడగలడనుట నిస్సంశయము.

శ్రీ రామకోటీశ్వర తారావళి.

కర్త: శ్రీ వాజపేయయాజుల రామసుబ్బరాయడు, కొల్లాపురము, మొరవకొండపోస్టు, కర్నూలుజిల్లా. ఇదియు నొకశతకము 'రామకోటీశ్వరా' అను మకుటముగలది. శ్రీ మద్దాలి కృష్ణమూర్తిగారు గురువులై రామకోటీశ్వర మాహాత్మ్యము వీరి కుపదేశించిరి కాబోలు, దానిని నిత్యప్రార్థనమున కనువగురీతి ఛందోబద్ధముచేసి యీవిధముగా కవికి

కవితాగానము చేయు నవకాశము కల్పించినారట. కవిసంకల్పము చాలమట్టు కిందీడేరిన దనవచ్చును.

**భారతనౌకాపరిశ్రమ.**

కర్త: కర్రా శీతారామయ్య, విశాఖపట్నము. వెల రూ. 1—0—0.

గ్రంథకర్త తీవ్రకాంగ్రెసువాది. ఆంధ్రదేశము యొక్క అదృష్టవశాత్తు వీరికి 'చిలక' అను ఓడలో ప్యాసెంజరు ఇన్‌స్పెక్టరు నౌకరియైనది. ఆకాలములో ప్రయాణీకుల కష్టసుఖములనారసి వారికివలయు సదుపాయముల గూర్చుచుండగానది ఓడల సొంతదారులగు విదేశీయాధికారులకు నచ్చకపోవుటయు వీరినుద్యోగమునుండి తప్పించుటయు జరిగినది. తరువాత కొంత కాలమునకు సింధియానావిగేషన్ కంపెనీలో తిరుగా ప్యాసెంజర్ ఇన్‌స్పెక్టరుగా కుదురుకొన్నారు. ఈ నౌకలలో చాలా అనుభవము సంపాదించిన వీరి భారత నౌకాపరిశ్రమగూర్చి రచించినగ్రంథము మిక్కిలి ప్రమాణవంతమనుట ముమ్మాటికిని నిజము.

ఇందు గ్రంథకర్తగారు, భారతదేశములో నౌకా పరిశ్రమ వేలకొద్ది యేండ్లుగానున్నవని వేదములు, పురాణములు, వీనినుండియు బౌద్ధమౌర్యయుగముల చరిత్రనుండియు ప్రబలప్రమాణముల చూపియున్నారు. ఆంధ్రయుగము (B.C, 225 to A.D, 225)లో నౌకా పరిశ్రమ బాల ఉన్నతస్థితిలో నుండెననుట నిర్వివాదాంశము. ఇట్లు ఈ పరిశ్రమ యెట్టులభివృద్ధికి వచ్చెనో చారిత్రకముగా జూపుచు కుంపినీయుగములో మనకు గలిగిన లాభాలాభముల జర్చించి అన్యాయమును విమర్శించియున్నారు. స్వదేశి నౌకా పరిశ్రమలకు విదేశీయులెట్టు (చౌకటికెట్లు కొన్ని చోట్ల అసలు టికెట్టులేకపోవుట కాకుండా దారిలో భోజనమువగైరాలు ఇప్పించుటలోనగు పద్ధతులతో) కల్గించుచున్నారో ఆధారములు చూపెట్టి కోస్తా వ్యాపారాభివృద్ధికిగాని నౌకా పరిశ్రమాభివృద్ధికిగాని ఇండియా గవర్నమెంటు సహాయసానుభూతులు ముఖ్యావసరమను విషయమును స్పష్టపఱచినారు. నేడు హిందూదేశములో స్వదేశవిదేశ కంపెనీ లెన్నెన్నో చెప్పి దీనినెట్లు ప్రతిఘటించి స్వదేశపరిశ్రమల నభివృద్ధికిదేవచ్చునో మార్గములు చూపియున్నారు. ముఖ్యముగా విదేశనౌకలను 'బహిష్కరించ'వలయుననియు (Boycott) సలహాయొసగియున్నారు. గ్రంథాంతమున వారుగావించిన 'విజ్ఞప్తి' వారియభిప్రాయములు సారాంశముల వ్యక్తపఱచునని యందలి యొండు రెండు వాక్యములిట గ్రహింపబడినవి. "వేదయుగము నుండి కంపెనీపాలనలో గూడ మహోన్నతదశలో నుండిన నౌకా పరిశ్రమ యీ డెబ్బదిసంవత్సరములోను భారతదేశములో నశించి విదేశ నౌకాపరిశ్రమలచే నణచివేయబడినది. ఇరువదవ శతాబ్దమున నీపరిశ్రమను వృద్ధిచేయు యత్నములును ప్రభుత్వము వారి విరోధదృష్టిచే భగ్నములయినవి; కాని మన ముక్తి మన హస్తములందేయున్నది......సాలీనా నుమారు డెబ్బదికోట్ల రూపాయిల విదేశీయుల కిచ్చుచున్నామని గ్రహించి మనము విదేశీయులకు సహాయము చేయుట మానవలయును. విదేశనౌకల బహిష్కరించవలెను... దేశప్రజలు దృఢమనస్సులతో నీ దీక్షను సాధించవలయును." ఈ వాక్యములతో నెల్లరేకీభవింతురనుటలో సందియములేదు. గ్రంథము అందఱకర్థమగు మిక్కిలి సులభశైలిలో వ్రాయబడినది. ఇట్టి యుత్తమ గ్రంథమును ఆంధ్రదేశమునకు ప్రసాదించిన శ్రీ సీతారామయ్యగారెంతయు కృతకృత్యులు ధన్యజీవులు.

**ప్రతిభ**

బళ్లారినుండి శ్రీయుత వి. సుబ్రహ్మణ్యముగారి సంపాదకత్వముగ వెలువడు జాతీయ వారపత్రిక. రాయలసీమలో తన బన్నములకు వాగ్రూపమిచ్చుటకైన-తగినన్ని పత్రికలు లేవు. ఇందు రాష్ట్రీయవార్త లధికముగను, ఇతరవార్తలు కొద్దిగను గలవు. ఆంధ్రరాష్ట్రైకమత్యమునకీ పత్రిక తృప్తి గనపరచుటలేదు. రాయలసీమవారి యాదర్శముల కొనసాగించు నైకమత్యమునకు పాటుబడి యభివృద్ధిజెందునని యాశింతుము. సాలుచందా రు. 2.

# పత్రికా పరిచయము

## ప్రజామిత్ర—సంక్రాంతి సంచిక

"సంక్రాంతి కర్షక కార్మికుల పండుగ; ప్రజామిత్ర కర్షక కార్మికుల పత్రిక. సంక్రాంతికీ కర్షక కార్మికులకూ ప్రజామిత్రకూవున్న అవినాభావసంబంధానికి ప్రత్యక్షరూప మీ సంచిక."

విశ్వనాథ కవిరాజుగారి 'సాలగ్రామం', శివశంకర శాస్త్రిగారి 'రంగస్థలము—నాటకములు', బి.టి. రాఘవాచార్యులగారి 'టాకీలు; నటన', ఆంధ్ర శేషగిరిరావుగారి 'వంగదేశపు విప్లవోద్యమ చరిత్ర', చలంగారి 'ప్రేమలేఖ' బాగున్నాయి. ఇంకా ఐదుకథ లున్నవి. సంక్రాంతి దృశ్యాలు అక్కడక్కడా 'తొలకరి' వర్ణనలతో వున్నవి. సినిమా నటకురాండ్ర చిత్రపటాలున్నాయి. కర్షక కార్మికుల సంబంధించిన సమస్యలు మృగ్యం.

"ప్రజామిత్ర ఏరాజకీయపక్షానికీ చెందిన పత్రిక కాదు. దానిది ఒకటే పక్షము-అది కర్షక కార్మిక పక్షము; ఒకటే లక్ష్యము-అది ప్రతిఫలాపేక్ష కాని ప్రజాసేవ." ఈ ఉన్నతాశయాలు నెరవేరడానికి ఆంధ్రులంతా ప్రజామిత్రను ఎక్కువ చేయూతయిస్తారని నమ్ముతాము.

## ఆంధ్ర సేవ

సంపాదకులు శ్రీయుత ముద్దా విశ్వనాధముగారు 150, అన్నాపిళ్లె వీధి, జార్జిటౌన్, మదరాసు. విడి సంచిక అణా. సాలుచందా రూపాయ.

ఇది ఆంధ్రాంగ్లములందు సారస్వత వాణిజ్య విషయముల ప్రకటించు సచిత్ర మాసపత్రిక. ఇందు ప్రకటింపబడు వివిధవిషయములు, ముద్రణ పాఠక లోకమును రంజింపచేయుటకొఱకు సంపాదకు లెంతయు పాటుపడుచున్నారని విదితము చేయుచున్నవి. పత్రిక విలువ స్వల్పమయ్యు ఆదరణగల్గినచో ఆంధ్రసేవ చేయునని నమ్మకము గలుగుచున్నది. ఎల్లరాదరణాభిమానముల జూపుదురని ఆశింతుము.

## ప్రజ

ఆంధ్రాంగ్లముల ప్రకటింపబడు స్వతంత్ర వారపత్రిక. కాంగ్రెసువార్త లెక్కుడుగా గలవు. హాస్య ప్రధానమైనవియు, సారస్వతవిశేషములతో గూడిన వియు వ్యాసములుకూడనుండుట ముదావహము. దీని అభివృద్ధిని కాంక్షింతుము. సంపాదకులు శ్రీయుత బోడపాటి శివరామ కవిగారు, రాజమండ్రి. విడిసంచిక అర్ధణా. పోషకులకు సంవత్సరపుచందా రు. 3.

## తెలుగు

ప్రతి గురు, సోమవారములు ప్రకటింపబడు పత్రిక. ముఖపత్రమందలి మహాత్ముని చిత్రము. జాతీయోద్బోధకపద్యములు, వందేమాతరగీతము పత్రికోద్దేశమునకు సాక్ష్యములు. మొదటిసంచికలో సోషలిజంపైన రాయిగారి అభిప్రాయములు, విదేశరాజకీయములపైన వ్యాఖ్యానములు, స్వదేశసంస్థలు, సంఘములు వీని యందలి యన్యాయముల బైటబెట్టుచు 'సాక్షి'గారి వంటి ఉపన్యాసాలు ఇతరవార్తలు గలవు. 'బాల్యమందే బహుభంగుల బ్రతుకుతెరువుల విసర్జించి, యీ భారతమాతృ దాస్యవిమోచనా సత్రయాగమున ఋత్విక్కులలో జేరుకొనుటచే నష్టములు తప్ప నాస్తులు లేకున్నను తెలుగుసేవ చేయవలెనని ప్రయత్నించిన సంపాదకుల పూనిక ప్రజాదరణచే ఫలించునని ఆశింతుము. సంపాదకులు శ్రీయుత గాడేపల్లి నారాయణ శర్మగారు, రాజమండ్రి. విడిపత్రిక అర్ధణా. సాలు చందా పోస్టుద్వారా రు. 4-8-0.

## నవశక్తి

కాలమటువంటిది. రాణ్మహేంద్రవరమున 'నవశక్తి' వారపత్రిక ప్రభవించినది. ఈ యుత్సాహమె ఇతర పత్రికలనుకూడ ఆయూర జన్మింపజేసినదేమో. నవశక్తి నాదరింపవలయునుగాని అది చేయనిదేది.

కట్టబట్ట తినతిండి లేనివారికి—కర్షకులైనా, కార్మికులైనా, మరెవరైనా—నవశక్తి కావలసినదే. ఈ 'నవశక్తి' అటువంటివారికి బాసటయై, వారందరి యభివృద్ధికి నిరంతరము పాటుపడుతుందనే నమ్మకము అందతికిని గలదు. నడుచుపంథా, వెల్లేరథము, నడిపించు సారథి అటువంటివారు గాబట్టి. ఈపత్రికలో విషయాలే దానికి సాక్ష్యాలు. ఇందులో అపుడే నారీమణులు సరిసమానమైన భాగము పంచుకున్నారు. అంటే వారీ పత్రికాభివృద్ధికి అమితోత్సాహము చూపెట్టుచు, దానిని తమ రచనలతో అలంకరించుచున్నారు. ఇది సర్వవిధముల నభివృద్ధి జెందుగాక.

సంపాదకులు శ్రీయుత మద్దూరి అన్నపూర్ణయ్యగారు, రాజమహేంద్రవరము. ప్రతి అణా. సాలు చందా మూడు రూపాయలు.




వీరపత్ని—వీరమాత అస్తమయము

జనవరి పదియవతేది ఉదయము ఐదు గంటలకు శ్రీమతి స్వరూపరాణిగారు అలహాబాదునందు 'ఆనందభవనమున' తన భౌతిక దేహమును చాలించిరి. వారి యాత్మకు పరమేశ్వరుడు శాంతినిచ్చుగాక.

వీరు మోతీలాలు నెహ్రూగారిని 1882-వ సంవత్సరమున వివాహమాడిరి. వారు పుట్టి పెరిగినది ఉన్నతాదర్శములుగల గొప్ప బ్రాహ్మణ కుటుంబమున. చేపట్టినది ఉన్నత స్థానమునకై అంగలు వైచుకొని అతిత్వరితముగా అభివృద్ధిమార్గమున నరుగుచుండిన మోతిలాల్ మహాశయుని. అందుచే సంసారారంభ సంవత్సరములలో రత్నత్రయమును—జవహరిలాల్, శ్రీమతి విజయలక్ష్మిపండిట్ శ్రీమతి కృష్ణహతీసింగ్-గని వారిని దేశసేవాధురంధరులను చేయు నున్నతగుణములనన్నింటిని నూరిపోయుటయందే శాంతముగ గడపిరి. 1921 అసహాయోద్యమములో భర్తకు భాసటమైనిలచి వారితోగలసి పాటుబడిరి. 1930 నుండి 1932 వఱకు జరిగిన స్వాతంత్ర్య సమరమున కుటుంబ మందరితో తానును పాల్గొని రెండుమారులు కారాగారవాసము జేసిరి. అందరితోబాటు లాటీ దెబ్బలకు కూడ గురిమై వృద్ధాప్యమున మిగుల బాధపడిరి. వారి పుత్రరత్నమన్నటుల వారి జీవితము "పోరాటము, దుఃఖము, బాధ" వీనితో నిండినది. కాని సర్వత్ర వారియందానందము తొలుకాడుచుండినది. తగిన కూతురు-శ్రీమతి విజయలక్ష్మిపండిట్-తల్లి గారినిగూర్చి అన్నదిది. "ఆమె ఒక నేరస్థుని పత్ని. మరికొందఱి నేరస్థులతల్లి. వారందఱు 'దేశసేవ'యను నేరమును చేసినవారు. దాని వలన ఆమెకు 'తలవంపులు' ఏమైన కలిగియున్న వాని నామె ధైర్యముతో సహించినది."

"ఆమె మహోన్నతజీవితము గడిపినది. మహోన్నతమగు సద్గతికి పోయినది. అంతియకాదు. ఆమె ఆదర్శపత్ని, ఆదర్శమాత. ఆమెమృతికి దుఃఖించవలదు. మన స్త్రీ లామె యాదర్శమును కొనిమెదరుగాక' అన్నారు మహాత్ములు నెహ్రూగారికి ఉపశమనవార్త పంపుచు. అట్టి మాతృదేవిని భౌతికముగా పోగొట్టుకున్న రాష్ట్రపతులకు మా హృదయపూర్వకమగు సానుభూతి. దేశనాయకుడై దివ్యదీప్తుల వెలింగి యమరత్వమందిన భర్త యనంతర మాతనికంటెను మహోన్నతుడైన కొమరుని గొప్పదనమును, మాతృదేశసేవారతిని యనిమిషదృష్టితో, అమితానందముతో తిలకించు

చున్న మాతృదేవి-రెండుసంవత్సరములుగా అధ్యక్షపదవి స్వీకరించి నిరంతర మాతృదేశ సేవాపరాయణుడై ప్రకృతము విశ్రాంతి గైగొన నానందభవనమున కరుగు తన ముద్దుకుమారుని నానందముతో స్వీకరించి 'నాయనా! అలసితివా? విశ్రాంతిగొమ్ము చేయవలసిన దింకను గలదు. తగిన బలోత్సాహములు చేకూర్చుకొమ్మ"నుచు ప్రేమపూర్వకముగా బలుకనుండిన మాతృమూర్తి మనరాష్ట్రపతికి కరువైనదా? ఎన్ని దుర్భరకష్టములనైన భరించు నెహ్రూగారి హృదయము మాతృ నష్టమునకు చలింపక మానదు. అది సహజము.

స్వరూపరాణిగారి మృతి భారతదేశమునకే తీరని నష్టమని యనిపించును. వారి మృతికందఱితోబాటు మేమును అశ్రువులను విడచితిమి. అనతికాలముననే మా మనోనేత్రమున కొక్కటి గన్పట్టి వెంటనే మా అశ్రువులు సంతోషాశ్రువులుగ మారిపోయినవి. ఈ విచిత్రవిషయమునకు పాఠకులాశ్చర్యపడెదరని మేమెఱుగుదుము. ఐనను మా సమాధానమిది.

స్వరూపరాణిగారుత్తమ నాయకుని పత్నియై భర్తకు బాసటయై దేశసేవచేసినవారు. భర్తకంటె యన్నివిధముల గొప్పయగు నుత్తమపూరుషుని కని, పెంచి, దిద్దితీర్చి దేశమున కర్పించినారు. శక్తిసామర్థ్యములనెల్ల నుపయోగించి సర్వముత్యాగముగావించి యాదర్శమహిళారత్నమైనారు. తన సంతానమేగాక భారతసంతానమందఱు తనవలెనే తయారగుదురను నమ్మకమును పొంది కాలముతీరి అమరత్వమును పొందినారు. వారిక చేయక మిగిలినదేది? వారిక లేరని దుఃఖించడమెందుకు? నిజమె; దుఃఖింపవలసినదే; ఎపుడు? ఇన్నివిధముల నాదర్శప్రాయగానుండి యందఱు తనవలెనే గావలెనని కాంక్షించుచు గతించిన స్వరూపరాణిగారివలెనే భారత నారీమణులు ఆసేతుహిమాచలపర్యంతము తయారుగాకపోయినచో. కాని భారతదేశమందంతయు లెక్కలేనంతమంది స్వరూపరాణిగారలు తయారగుదురన్న నమ్మకము ప్రకృత భారతనారీమణులు అమితముగ గల్గించుచున్నారు. స్వరూపరాణిగారు కూడ వారి మృతికి మనము దుఃఖించనందుకు చింతింపరుగాని వారి యాదర్శమునుగొని పలువురు నారీమణులారీతి తయారుగానిచో మాత్ర మమితముగ స్వర్గముననున్నను విచారింతురు.

ఆంధ్రయువతీమండలి—హైదరాబాదు.

ఈమండలి రెండుసంవత్సరముల క్రిందటనే స్థాపింపబడినది. ఇందలి సభ్యులును, అధ్యక్షులును, కార్యదర్శియు మండలి యభివృద్ధినికోరి మిగుల నుత్సాహముతో పాటుబడుచున్నటుల తెలియుచున్నది. ప్రతిమాసము పండుగపబ్బములను, తదితర అవకాశములను పురస్కరించుకొని సాధ్యమైనన్ని సమావేశములజరిపి వివిధవిషయములపై సుబోధకమగురీతి యుపన్యాసముల నిప్పించుచున్నారు. అపుడపుడు మండలిబాలికలచే నాటకముల నాడించుచున్నారు.

గానమునకు నెక్కుడు ప్రాశస్త్యమిచ్చుచున్నారు. అంతియగాక నొక పుస్తకభాండాగారమేర్పరచి గ్రంథముల చేర్చియున్నారు. పత్రికలను తెప్పించుచున్నారు. సభ్యులలో నేర్చుకొనగోరువారికి లలితకళల నేర్పు నేర్పాటు గావించినారు.

ఇన్నివిధముల స్త్రీలయభివృద్ధి కమితోత్సాహముతో బాటుబడుచున్న యీ మండలికి ప్రోత్సాహ మతిస్వల్పము. మండలియందు మొత్తము 55 మంది సభ్యులు గలరు. హైదరాబాదు వంటి గొప్పనగరములో, వేలకొలది విద్యావతులుండియు నీమండలి సభ్యులసంఖ్య యింత స్వల్పముగనుండుట విచిత్రముగ నున్నది. ప్రతియూరను మహిళామండలి యుండుట వలనగలుగు మేలు ప్రత్యేకముగ వ్రాయ బనియుండదు. విద్యావ్యాప్తికి, వివిధ సమస్యాపరిష్కారచర్చకు, స్వల్పజ్ఞానముచే గలుగు సంకుచితత్వవినాశమునకు, పరస్పర సానుభూతి సహకారాభివృద్ధికి, కుటుంబమున, సంఘమున, దేశమున తమతమ విధుల నెఱుంగుటకు—దేనికైనను మహిళామండలు లుండగ నుండగలవు. దానివలన గలుగుమేలు ప్రత్యక్షముగ గనుచున్న విద్యావతులుకూడ ఇట్టిమండలుల యభివృద్ధికై యుత్సహింపకుండుట వింతగనే తోచుచున్నది. ఈయువతీమండలి దినదినాభివృద్ధి జెంద విద్యావంతులందఱు తోడ్పడుదురని మాఆశయము.

బాపట్ల హిత్తైషిణీమండలివారి

గృహపరిశ్రమలు

మండలి సభ్యురాలగు శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారిచే తయారు చేయబడిన 'సేమియాలు', మాదీఫలరసాయనమును మాకందినవి. సాధారణముగా నంగడులందు అమ్మబడుచుండు వానికీవస్తువు లేవిధమునను తీసిపోకున్నవి. అంతటను లభించు వస్తువులనుండి, దైనికోపయోగమున కెక్కుడుగా నుపకరించు వస్తువుల మహిళామండలివారు ప్రోత్సహించి తయారుచేయించుట చాల బాగుగనున్నది. ముఖ్యముగా 'సేమియాల'వంటి వానినింకను తయారుచేయించి, వానివలన డబ్బు గడించుట మంచిపద్ధతి. ఇతర మహిళామండలులుకూడ నీవిధముగ గృహపరిశ్రమల నభివృద్ధిచేసికొని కావలసినడబ్బు గడించుపద్ధతు లవలంభింతురని యాశింతుము.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# విషయసూచిక










శంఖచక్ర గదాది సాధనమ్ములు దాల్చి హావణించు నాల్గు బాహువులతోడ
క్రొక్కారు మెఱుఁగునాఁ గొమరారు పదియాఱు వన్నె బంగారు దువ్వలువతోడ
మగరాల నత్తుపెన్నిగనిగల్ నగఁజాలు సొగసు గల్గిన చిన్ని నగవుతోడ
తనతోడఁ దులఁదూఁగఁ దగు నొయారముగల్గి యలరారు నెయ్యంపుఁ జెలులతోడ

తొగలవగకానిఁ దెగడు నెమ్మొగముతోడ
నున్నమెఱుంగు వెడందకందోయితోడ
డంబుచెన్నారు సత్త్వరూపంబుతోడ
నాతనికి శక్తి మ్రోలఁ బ్రత్యక్షమయ్యె.

— దేవీభాగవతము.




## గృహలక్ష్మి జయంతి మహోత్సవము

శ్రీ గృహలక్ష్మిజయంతి మహోత్సవము, శ్రీ గృహలక్ష్మి స్వర్ణకంకణబహూకరణోత్సవము, మార్చినెల 1-వ తేదీ బుధవారం సాయంత్రం 5 గంటలకు గృహలక్ష్మి స్వగృహమగు కేసరికుటీరము, రాయపేట, మద్రాసునందు, నెల్లూరు వాస్తవ్యులును సుప్రసిద్ధ దేశభక్తులును అగు శ్రీమతి పొణకా కనకమ్మగారి అధ్యక్షతను అత్యంత జయప్రదముగ జరిగినవి.

మంగళతూర్యనాదములతో శుభమహోత్సవము ప్రారంభమై, శ్రీమతి పొణకా కనకమ్మగారు, బాలాంత్రపు శేషమ్మగారు, రత్నాల కమలాబాయిగారు, కాంచనపల్లి కనకాంబగారు, ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు, తదితర పురంధ్రీమణులతోకూడిన ఛాయాచిత్రమును దీసిరి.

ఈ సమావేశమునకై అలంకరింపబడిన హాలు ఉత్సవమునకు విచ్చేసిన అనేకమంది పురప్రముఖులతో క్రిక్కిరిసిపోయినది.

శ్రీమతి రత్నాల కమలాబాయిగారి ప్రార్థనాగీతములతో సభ ప్రారంభమయ్యెను.

ప్రారంభమున శ్రీయుత డాక్టరు కేసరిగారు శ్రీమతి పొణకా కనకమ్మగారిని అధ్యక్షత వహించి కార్యక్రమమును నిర్వహింప గోరిరి. కరతాళముల మధ్య ఆమె అధ్యక్షపీఠము నలంకరించిరి.

శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు, అధ్యక్షురాలికిని, కంకణగృహీతలకును స్వాగతమొసగుచు, వారిని సభ కెరుకపరచుచు, కళలనుగురించి యీ క్రిందివిధముగా నుపన్యసించిరి :

సోదర సోదరీమణులారా!

శ్రీమంతంబగు గృహలక్ష్మీమందిరమున దేశభక్తియందును, త్యాగమునందును, సౌజన్యమునందును, నాతిథ్యమునందును వన్నెమీఱిన మా సఖీమణి, నేటి మహాసభ కధ్యక్షురాలగు శ్రీమతి పొణకా కనకమ్మగారికిని, విద్యావైదుష్యములచే నలరారుచు నేటికి ముప్పదిసంవత్సరములకుఁ బైగా నాంధ్రనారీమణులకు విజ్ఞానము నొసంగు హిందూసుందరి పత్రికామతల్లికి సంపాదకురాలై, షష్టిపూర్తి ము త్తయిదువయై, యెల్లెడఁ దన వాగ్ధాటి ధుర్యముచే సభారంగముల నలంకరింపఁజేయు ధీరురాలు నేటిసభలో బూజ్యురాలై గృహలక్ష్మి కంకణప్రదానమునకు నర్హురాలైన శ్రీమతి బాలాంత్రపు శేషాంబగారికిని, చిత్రకళానైపుణ్యమున మించి గృహలక్ష్మి పాఠకులగు నాంధ్ర నారీమణులకు నమందానందము గల్గించుచుఁ దాను కౌశలము సంపాదించుటయే గాక తోడివారలకును లలితకళాభిరుచిని గలుగఁజేయ నుద్యమించుచున్న చిరంజీవి సౌభాగ్యవతి రత్నాల కమలాబాయమ్మగారికిని స్వాగతమొసంగుటకును వారి పరిచయము నేటి మహాసభకుఁ గల్గించుటకును నా కవకాశ మొసంగిన డాక్టర్ కె. యన్. కేసరిగారి కెంతయుఁ గృతజ్ఞురాలను.

పురుషులలోఁ గవులను బండితులను సన్మానించుట విందుము గాని స్త్రీలలో నున్న విదుషీమణులను గవయిత్రుల నేరి కోరి పిలిచి సభారంగములఁ బూజించి సత్కరించు వారరుదు.

గృహలక్ష్మి కంకణము నేర్పరచిన కేసరిగారే యందగ్రగణ్యులని చెప్పుట యతిశయోక్తికాదు. మాట లెన్నైనఁ జెప్పవచ్చును గాని దానముచేయుట కష్టము. అట్లగుటచేకదా దానశౌండులని, దానవీరులని పెద్దలన్నారు. ధనము ప్రాణముకంటెఁ బ్రియతరమైనదనియు నా ధనమును నిర్విచారముగ నర్హుల కొసంగువారలు వీరులనియు మనవారు తలంచిరి. యుద్ధరంగములు లేక, వీరరసమున కవకాశము లేకపోయనను, సభారంగములలో సత్పూజలొనరించుపట్ల దానవీరులగుట కభ్యంతరములేదు. డాక్టర్ కేసరిగారి వంటివార లిప్పట్ల మార్గదర్శకులగుచున్నారు.

నా బాల్యమున నర్సాపురము పరీక్షలు, విజ్ఞానచంద్రికా పరిషత్తులు, నాయాసంఘములచే నొసంగఁబడిన బహుమానములు, మహిళాసభలు, హిందూసుందరిపత్రిక

మొదలగునవి నారీమణులలోఁ గొంత విద్యాప్రచారమునకు సాయపడినవి. క్రైస్తవ ప్రచారకులచేతను, సర్కారువారిచేతను స్థాపింపఁబడిన బాలికాపాఠశాలలయందును, యువతీ కళాశాలలయందును నెందఱెందఱో విదుషీమణుల లాంగ్లవిద్య గడించి పేరుఁ బడసినవారున్నారు. కాని యా పాఠశాలలయందుఁ గళాశాలలయందు గీర్వాణాంధ్రము లకుఁ బ్రాధాన్యము లేకపోవుటయు, స్వస్థానవేషభాషలకు స్వజాతిధర్మములకుఁ బ్రధాన స్థానము లేకపోవుట పెద్దకొఱఁత. కాలక్రమమున నీ లోపములు తీరి స్వధర్మపోషకము లగు విద్యలు వృద్ధి పొందగలవని విశ్వసించుచున్నాను.

నేను నెల్లూరుదానను. నాకు పొణకా కనకమ్మగారు చిన్ననాటి చెలి. నెల్లూరు వాసిని, మే మిరువురము పెన్నసీటితో నెల్లూరిబియ్యముతోఁ బెరిగినవారమే. కనకమ్మ యనుపేరును మా కిరువురకు సమమే. ఇంక నింటిపేరులలోఁ గొంతభేదమున్నను, కాంచనపల్లిలో ధనము, పొణకలో ధాన్యము పరిశీలించిచూచిన ధనధాన్యములు రెండును నొక్కటియే కాన మా కనకమ్మగారీ సభాధ్యక్షురాలగుటకు నాకు సంతసమను టలో వింతలేదు.

మా కనకాంబ రెడ్డిరాణి. గృహిణియై పేదసాదలను బందుగులను గనిపెట్టుటయేఁ గాక, యౌదార్యము కలిగి, యతిథుల నభ్యాగతులను బ్రాహ్మణులను, బండితులను, గవులను దనయింటఁ దగురీతిఁ బూజింపనేర్చెను. తరువాత గ్రంధాలయములయందుఁ, బత్రికలయందు, సభలయందు, సభా ప్రసంగములయందు నాదరముకలదై దేశభక్తుల గోష్ఠి తానును దేశభక్తి యలవఱచుకొన్నది.

మాటలుగాక తన సర్వస్వమును దాను నమ్మినమార్గమున వినియోగించి చివరకుఁ గారాగారమునకు వెళ్లవలసినపుడును జంకని ధీరురాలు.

నేఁ డీమె గృహలక్ష్మి కంకణప్రదానసభకు నధ్యక్షురాలగుట మనభాగ్యము సుమా! సర్వవిధములఁ దనతో నైక్యము వహించిన యేకపుత్రికను గోల్పోవుటయు, స్వార్థత్యాగముచేతను, కారాగారమున వసించుటచేతను బుత్రికావియోగముచేతఁ గృశించుట యనునవి తప్ప మా కనకాంబలో లోపములు లేవు. కాని ధీరత్వము వహించి యీ దుఃఖమును జ్ఞానముచే నుపసంహారము గావించుకొని పరమార్థచింతతోఁ బెద్దల సన్నిధానమునఁ గడుపుచున్న యీ పొణకా కనకమ్మగారికంటె నీ సభ కిట్టి తరుణమునఁ దగినవారు మనకు దొరకరు.

నేఁడు సభాధ్యక్షురాలైన కనకాంబగారు సభాపూజ్యురాలైన శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు సభావేదికపై, ననురూపులుగ నున్నారు. ఒక్కయామె యరుంధతివలె

నొక్కయామె పార్వతివలె నేఁడు వేదికపై వెలుంగుచు ధవళములైన యశస్సులతో శిరస్సులతో జ్ఞానపరిపాక ప్రవృద్ధమగు సౌందర్యములతో నలరారు నీ నారీమణుల సభ వారి కెరింగించుటయన్న నా మనస్సు పొంగిపోవుచున్నది.

శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారాంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. నా పదిరెండవయేడుమొదలు నేటివరకు నేనీ శేషమాంబగారు సంపాదకురాలుగా నడుపు చున్న హిందూసుందరిపత్రికను జదువుచు నద్దానికి వ్యాసములు వ్రాయుచునే యున్నాను. నా పదునారవయేట రచించిన కాశీయాత్ర మొదలు నేఁడు పెద్దప్రాయమున వ్రాయు చున్న నా ధర్మశాస్త్రగ్రంథము కనకసూక్తులవరకు, నా ఖండకావ్యములు, వ్యాసములు, కథానకములు, మొదలగునవన్నియు నీ పత్రికా స్వాగతమును బడసియున్నవియే.

నన్ను నా వయస్సునైన నెఱుంగకుండ, గేదె చెఱువులో నుండఁగాఁ గొమ్ములు చూచి బేరమాడినట్లు నా పదునారవయేటపత్రికలలో నా ప్రసక్తిఁజూచి నన్ను కాకినాడ మహిళాసమాజమున కధ్యక్షురాల నొనరించి యానందించినదీ వెఱ్ఱితల్లి.

ఈ యమ్మ యనాథలగు బాలికలకు ధైర్యముఁ జెప్పి ప్రోత్సాహపఱచి యథా శక్తిగ సమయములలో వారల నాదుకొని విద్య నేర్పించినది. ఈమె ప్రోత్సాహమున ననేక యువతులు విద్యఁ బడసి బుద్ధిమతులై వెలయుచున్నారు. అందు ముఖ్యముగా మద్రాసు క్షయవైద్యశాలలో మేట్రన్‌గా నర్సింగు వైద్యసహాయ మొనరించుచున్న శ్రీమతి ఇరగవరపు వెంకటరత్నగారును, బెంగుళూరునం దున్నతపాఠశాలలో విదుషీ మణిగా నున్న యుభయభాషాప్రావీణ భావరాజు రంగనాయకమ్మగారును, శ్రీమతి శేషమాంబగారి పట్టువలననే పై యిరువురును దురదృష్టవతులై బాలవితంతువులయ్యు నేఁడు స్వతంత్రలై విద్యాబుద్ధుల నలరారుచున్నారు. వార్ధక్యమును బుట్టిన తన యేక పుత్రిక కాంధ్రాంగ్ల గీర్వాణవిద్యలలోఁ బ్రవేశము కలిగించినది. ఆ బాలిక క్రమక్రమ ముగా వృద్ధిపొంది సంస్కృతములో మద్రాసు విశ్వవిద్యాలయమున ఎం.ఎ., ఎల్.టి. పరీక్షలో నుత్తీర్ణురాలై సారస్వతోపాసనఁ జేయుచు విద్యాబుద్ధులచే నలరారుచుఁ దన విభునితో గృహిణీధర్మ దీక్ష నిర్వహింపుచుఁ జిట్టిపొట్టి సంస్కృతశ్లోకముల రచింపుచు నాచారకృత ప్రబోధ సుధాకర మాంధ్రభాషలోని కనువదించుచు బాలసరస్వతివలెఁ బెద్దల యాశీర్వచనమువలన భాసిల్లుచున్నది. స్త్రీ విద్యావిషయమున నాచరణ ప్రచారము లీ రీతిగా వహించిన బాలాంత్రపు శేషమ్మగారి స్వర్ణకంకణమున కర్హురాలని నిర్ణయించు టలో డాక్టరు కేసరిగారి గుణగ్రహణపారీణత కానుపించుచున్నది.

ఇంక నీ వృద్ధ వనితలమధ్య పాండువర్ణముల నడుమ ప్రకాశించు కెంజిగురాకువలె

నున్నదీ చిన్నది రత్నాల కమలాంబ. ఈ సౌభాగ్యవతి చిన్ననా డున్నతపాఠశాలలో నా దగ్గఱ చదువుకొన్నది. సంగీతసాహిత్యములయందుఁ దగుపాటి ప్రవేశము తోఁబాటీ తరుణీమణి చిత్రకళా నైపుణ్యమునఁ బేరొందింది, గృహలక్ష్మీకంకణప్రదానమున కర్హురాలగుట మీ యందఱికంటె నా కెక్కువ యానందమును గూర్చుచున్నది.

ఈ చి. సౌ. మా కమలాబాయి రవీంద్ర శాంతినికేతనమునందు, వంగసంగీతమునందు విశేషకృషి సల్పినది. మద్రాసు విశ్వవిద్యాలయమున సంగీతమునందును, ఫిడేలు వాద్యమునందును ప్రత్యేక యోగ్యతాపత్రముల బొందెను. భారతదేశమున జరిగిన వివిధవస్తుప్రదర్శనములందు శ్రీ కమలాబాయి చిత్రములకు ననేక బంగారుపతకములును యోగ్యతాపత్రముల నిచ్చియున్నారు.

పొణకా కనకమ్మగారి స్వార్థత్యాగముకంటె, బాలాంత్రపు శేషమాంబగారి పత్రికాప్రచారముకంటెఁ జూచినంతనే యానందమును గొల్పు మా రత్నాల కమలాబాయి చిత్రలేఖనము సులభముగా నెల్లరకంటఁ బడుననుట కీ గృహలక్ష్మియే సాక్షి.

ఈ ముప్వుర నారీరత్నముల నెఱుకపరుచుటతో నా కృత్యము తీరినను, స్త్రీలలో లలితకళా వ్యాప్తినిగుఱించి యీ సభాముఖమున నాకుఁ దోఁచినవరకుఁ బ్రసంగింపుమని యీ సభా వ్యవస్థాపకులు కోరుటచే సూక్ష్మముగా నా యభిప్రాయమును నివేదించెదను.

సహృదయులందఱి గుణంబులు మాత్రమే గ్రహించి యానందింతురు గాక యని వేడుకొందును.

### లలితకళలు

చంద్రుఁడు షోడశకళా పరిపూర్ణుఁడు, కవిచంద్రులు చతుష్షష్టికళాప్రపూర్ణులు, యోగిచంద్రులు నాదబిందుకళా జ్ఞానపరిపూర్ణులు, కళలతోడనే యీ జగత్తు కలకలలాడుచున్నది. కళకాంతులు లేని మొగములు, గృహములు, గ్రామములు, నగరములు, దేశములు, శూన్యములై పాడుపడినట్లుండును. కళాప్రపూర్ణు లెల్లరు కాకపోయినను గళలోని యందము నెల్లరు గ్రహింపఁగలరు. కళలేకపోవుట పామరులు సైతము తెలియఁగలరు. కూరలో నుప్పు తక్కువైనట్లు మొగమున కళలేదని చప్పరింతురు. శుభమునకే కాక లోకమున నశుభమునకుఁగూడ కళయని వాడుకకలదు. ప్రేతకళ పాడుకళయని చెప్పుదురు.

ఆగమశాస్త్రమున 'కళావాహన' మనుమాట కలదు. మంత్రశాస్త్రమున దేవతా విగ్రహములకుఁ గళలు కలిగించుటయుఁ గళలు దించుటయు మొదలగు ప్రయోగములు

ఇట్లే మాళవికాగ్నిమిత్రమున రాజు విదూషకునితో మాళవిక చిత్రపటమును గాంచినతరువాత నృత్యారంభమున నామెను ప్రథమమున దర్శించినప్పు డిట్లనుకొను చున్నాఁడు. కీ. శే. వీరేశలింగముపంతులుగారి యనువాదము.

గీ. చిత్రపటమున నాఁడు వీక్షించినప్పు డట్టి సొగసుండదని సంశయంబువొడమె
నేఁడు ప్రత్యక్షముగ నీమెఁ జూడనిందు శిల్పి యప్రౌఢుడంచుఁ దోఁచెడినిమదికి.

భవభూతి తన యుత్తరరామచరిత్రమున పట్టాభిషేకానంతరము జనకాదుల యోధ్యనుండి వెడలిపోయినతరువాత సీతాదేవి చిత్తవినోదనార్థము తాను వ్రాయించిన పూర్వరామచరిత్రము పటములందు సిద్ధమైనదని రామునికడ లక్ష్మణునిచే పలికించినాడు. దానింగనుట కందఱును చిత్రశాలకుం బోవుదురు. సీతారామలక్ష్మణు లా చిత్రగత వృత్తాంతముల బరికింతురు. ఆకారణమున భవభూతి యీ వృత్తాంతముగలదానికి చిత్రదర్శనమను ప్రథమాంకమన్నాఁడు.

కాళిదాసు చిత్రకళ నెట్లు తన నాటకములందుఁ గావ్యములందు రూపించినాఁడో నృత్యకళనుగూడఁదన మాళవికాగ్నిమిత్రమునం దంత చక్కఁగ వెల్లడించినాఁడు. శర్మిష్ఠ యయాతిపై తనకుంగల వలపు తెలుపుటకు రచించిన ఛలికమును మాళవికచే నభిన యింపఁ జేసినాఁడు. నృత్యశాలలు, చిత్రశాలలు, సంగీతశాలలు మొదలగు లలితకళా మందిరములు రాజుల యిండ్లనుండుటయుఁ గవులు వర్ణించుటయు సర్వసాధారణము.

హర్షమహాకవికృత రత్నావళియందును, రత్నావళి (సాగరిక) తన ప్రియునిరూపము చిత్రఫలకమునవ్రాసి వియోగదుఃఖము నపనయించుకొన్నది. శ్రీమద్భాగవతమునఁ జిత్ర రేఖ సకలలోకములుసంచరించి సొగసుకాండ్రనందఱను జిత్రించి, యందుఁ దనచెలికత్తియ యగు నుషాకన్యకు స్వప్నమందు దర్శనమిచ్చిన యనిరుద్ధునిఁబట్టి తెచ్చెననువిషయ మెల్ల ఱకు విదితమే.

రాధారమణియు భర్తృ్యుద్రేకమున దన మనోధినాథుఁడగు జగన్నాథునిరూపమును రహస్యముగాఁ గస్తూరితో లిఖించినట్లు జయదేవకవి వర్ణించినాఁడు.

"విలిఖతి రహసికురఙ్గమదేన భవంతమ్" కళాకౌశలంబు కావ్యనాటకాదులయం దెల్లెడలను జిత్రింపఁబడియున్నది. ఆంధ్రకావ్యంబులన్నియు లలితకళావిలసితంబులు. స్త్రీపురుషులు నేటికాలమున నలసులై వానిని దీక్షతో నేర్వనేరక కళోపాసనముఁ జేయఁ జాలరైరి. చతుష్షష్టికళలకు మన ప్రబంధములన్నియు లక్ష్యములే. దంతపుష్టిగలవారలకుఁ జెఱుకుగడలోని మాధుర్యము నెఱుగఁబడినట్లు దంతపుష్టిగలవారలకుఁ గావ్యములలోని

మాధుర్యము గానవచ్చును. దంతములులేనివారలు చెఱుకుగడలను జేతికఱ్ఱలుచేసి కొందురు. అట్లే సాహిత్యజ్ఞానము నలవరచుకొననివారికిఁ బ్రబంధములు హస్తాలంకారములు, గృహాలంకారములు నై పోవును. వసుచరిత్రయందంతయు కళోపాసనమే. "నను సంగీతకళారహస్యవిదుఁ బిల్వంబంచి పల్కెన్ నృపన్" అని కవి చెప్పుకొన్నాఁడు.

పింగళి సూర్యనార్యప్రణీతంబై సార్థకనామధేయమున 'కళాపూర్ణోదయము' విరాజిల్లుచున్నది. అందొక శిలాచిత్రమును వర్ణింపుచు నొక్కయతిచే:

"ఆయతీశ్వరుఁడంత నతిరమ్యమైనయా మెప్పంపుపూఁబోడి యొప్పుఁగనుచు

భళిరశిల్పికులేంద్ర బ్రహ్మనుమీఱితే పగిదిఁజేసితిర యీప్రతిమననుచు"

పలికించినాఁడు.

సూరన తన ప్రభావతీప్రద్యుమ్నమందు, ప్రద్యుమ్నునిచిత్రమునుగాంచిన ప్రభావతిచే నిట్లు చెప్పించినాఁడు.

చ. కలకలనవ్వినట్లు తెలికన్నుల నిక్కమ చూచినట్లు తోఁ
బలుకఁగడంగినట్ల కడుభావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁదనర్చి జీవకళయుట్టిపడఁ జిత్రవాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దానుబోఁటియున్.

కళోపాసనము పరమభక్తులకును గర్తవ్యమని తోఁచుచున్నది. ఈశ్వరోపచారములలో సమస్తకళలకు వినియోగము.

నృత్యము, గీతము, వాద్యము, పుష్పకైంకర్యము, సుగంధద్రవ్యనిర్మాణము, పుష్పమాలాకరణము మొదలగునవన్నియు స్వామిసేవలలో వినియోగింపఁబడుట చూచుచున్నాము. షోడశోపచారములు, చతుష్షష్ట్యుపచారములు పరిశీలించినచో సమస్తకళలు భగవత్కైంకర్యమునకే వినియోగింపఁబడుచున్నవి. త్యాగరాజు, నారాయణతీర్థులు, సిద్ధేంద్రయోగులు, జయదేవుఁడు మొదలగువారలందఱు తమ కళాకౌశలమును భగవధ్ధ్యానమునకు వినియోగించుకున్నారు.

జయదేవుఁడు తనభార్య పద్మావతీదేవి, తానురచించిన గీతగోవిందమున కనుగుణ్యముగా నృత్యముచేసినదని చెప్పుకొన్నాఁడు.

'పద్మావతీచరణ చారణచక్రవర్తి' యని తన కదియొకబిరుదుగా వాడుకొన్నాఁడు. శ్రీనాథ మహాకవియుఁ దన కాశీఖండమున 'ఈశ్వరార్చన కళాశీలుండ'వని పొగడించుకొన్నాఁడు. అన్నికళలు నీశ్వరార్చన కళకంగములుగాఁ బెద్దలు సమన్వయించినారు.

శరీరమునకు మానసమునకు నాత్మకు నానంద మొసంగుట ప్రత్యక్షఫలమైన యీ కళోపాననమునందు శ్రద్ధలేకపోవుటయన్న మానవునియందుఁ బశుత్వము వృద్ధిఁజెందు చున్నదని చెప్పవచ్చును.

మనసును రంజింపఁజేయునదియై సోపానక్రమమున భగవత్కైంకర్యమునకు నాత్మానందమునకు హేతువై యుండవలెను. గావున మన దేశమున సకలకళలు పరమార్థపీఠమున నెలకొల్పఁబడినవి.

నేటికాలమునఁ గవిత్వము, గీతనృత్యములు, లలితకళలు, రేడియోస్టూడియోలలోఁ బ్రకృతివైచిత్రియు, నేరుపును గొంత కానఁబడుచున్నను బరమార్థము లేకయున్నది. తత్కాలమున వినువారికి చూచువారికి వేడుకకలిగించుటయు, ధనాకర్షణమున కనుకూలముగానుండుటయుమాత్రమే వీనికిఁ బరమప్రయోజనముగాఁ గానఁబడుచున్నది.

తెరలమీద పాశ్చాత్త్యుల ననుసరించి మానవతుల నసభ్యముగాఁ బ్రదర్శించి ధనమార్జించు ప్రయత్నము లశాస్త్రీయములగుటయేగాక యపాయకరములు. స్నానములు, భోజనములు, యుద్ధములు, ప్రత్యక్షవధలు, మొదలగునవి వేనిని చూపరాదని పెద్దలనుభవజ్ఞులు నిర్ణయించిరో వానిని పట్టుపట్టి ప్రదర్శించుచున్నారు. ఇది కూడదు.

లలితకళాభ్యాసమును నొకటిరెండు మాటలతో సూచింపుచున్నాను. బ్రహ్మచారులు, కన్యకలు నుండవలసినవిధి నిషేధములు నా 'కనకసూక్తుల'లోఁ గొంతవఱకు వివరించియున్నదానను.

బాలకులను బాలికలనుగలిపి నేటి కాలమందువలె విద్యాభ్యాసము చేయించుటలో మేలులేదని నిషేధించిరి. అనుభవమునందునట్లే కానఁబడుచున్నది. సామాన్యముగా స్త్రీలకు స్త్రీలే కళలు గఱపువారలై యుండుట మేలని మనవారి యభిప్రాయము. తల్లి పినతల్లి, మేనత్త, అక్క, వృద్ధదాసి, యోగిని మొదలగు వారలు బాలికల కుపాధ్యాయత్వము వహింపఁదగియుందురు. అనుభవజ్ఞులైన వృద్ధపండితులయొద్ద కుటుంబినులు నేర్చుకొని క్రమముగఁ దమ బిడ్డలకుఁ దామే చెప్పవచ్చును. పట్టుకట్టుట, పూలుకట్టుట, కుట్టుట, అల్లుట, మొదలగున వెన్నియో యిండ్లలో నేర్పించవచ్చును. సిద్ధహస్తములుగల స్త్రీలనుపాధ్యాయత్వమునకు వినియోగింపవచ్చును. అదిగాక లలితకళలను స్త్రీలు నేర్చినచో నిర్వ్యాపారసమస్య సులభముగాఁ దేలిపోవును. తమ కుటుంబమర్యాదలను దాము నిలువఁబెట్టుకొనుచు తమ యిండ్లలోఁగాని, యోగ్యులగు సంపన్నగృహస్థుల యిండ్లలోఁగాని తమ కళానైపుణ్యము వినియోగించుచు నేర్పుచు స్త్రీ లెందఱో సుఖముగా పవిత్రజీవనము

చేయవచ్చును. పాండవుల కాపదవచ్చినప్పుడు కళాకౌశలముచేతనే కదా వారందఱు రహస్యముగా గౌరవముగా విరాటరాజునొద్ద మెలఁగిజీవింపఁ గలిగిరి. పశుపాలనము కళయే; దానితో నొకఁడు, అశ్వశిక్షణకళతో నొకఁడు, నాట్యకళతో నొకఁడు, పాకకళతో నొకఁడు, ద్యూతకళతో నొకఁడు పురుషులు జీవింపఁగా మానవతీలలామ ద్రౌపదీమహాదేవి సైరంధ్రిగా గంధద్రవ్యములు సిద్ధముచేయుచు రాణులకు సిగలుముడుచుచుఁ దన జీవితమును గడుపుకొన్నది. దమయంతియు నాపద్ధర్మముగా సైరంధ్రివృత్తి నవలంబించినది. అట్లే నలుడును వంటలవాఁడై యశ్వహృదయమును వినియోగించుకొనెను. కావున నిహపరసాధనమైన లలితకళలు స్త్రీ పాఠశాలలయందు కళాశాలలయందు సంపన్న గృహములయందు మన సోదరీమణులు నేర్చుచు తామానందించి యొరుల నానందపఱచి స్వధర్మము నిలువఁబెట్టుచు, 'నిదియు నొక్క యారాధనవిశేషమ'ని తిక్కన వ్రాసినట్లు తమ కళలను భగవదారాధనకై యర్పించి కృతార్థతను జెందుదురుగాక!

ఉపన్యాసానంతరము శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు కంకణగృహీతలగు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారిని బిరుదప్రదాన సందర్భమున ప్రశంసించుచు యీ క్రిందిపద్యములను జెప్పిరి.

మ. సతి బాలాంత్రపు శేషమాంబయను విశ్వఖ్యాతినేఁ డబ్బెయు
న్నతి నారీమణికింతకంటె కలదా నానాఘముల్ తోడనే
సతినిన్ గన్న నడంగిపోవునని శాస్త్రంబుల్ వచించున్ నమ
స్కృతికిన్ లింగము నీడుఁజూడరుకదా యెన్నండునుం బండితుల్.

శా. స్త్రీలై యుండి సతీత్వముంగనిన సాధ్వీరత్నముల్ పూరుషుల్
జాలంబూజ్యలటంచు వేదములఁదెల్పంగా వృథాభేదమిం
కేలాచేయుదు శేరియందు గుణముల్ వృద్ధిన్ గనున్ వారలే
రాలో, స్త్రీలొ, గుణాలొ, యేవయిననున్ రత్నంబులందుర్గదా?

శ్రీమతి రత్నాల కమలాబాయిగారినిఁ బ్రశంసించుచు నీక్రిందిపద్యమును జెప్పిరి.

ఉ. పాత్రతమున్నెఱింగియె సభల్ నిను నీదగుహస్తమున్ గడున్
స్తోత్రముఁజేయుటం గనియు శోభనగానకళావిశేషమున్
గాత్రముగాంచి యిప్పసిడికంకణమున్ గృహలక్ష్మి యిచ్చుచున్
జిత్రకళావిశారదనుజేసెను నిన్ గమలాంబ నేడహో.

తర్వాత శ్రీయుత రామచంద్రుని వెంకటప్పగారు ప్రసంగించుచు శ్రీమతి పొణకా కనకమ్మగారు గత 20 ఏండ్లనుండియు జాతీయపోరాటములో పాల్గొని అఖండమైన సేవచేసి

యున్నారనియు, నెల్లూరుపురమున కాంగ్రెసు కార్యక్రమమందు తదితర ప్రజోపయోగ కార్యములందును యీమె అత్యంతోత్సాహముతో పాల్గొనుచు భాషాసేవ, దేశసేవ మొదలగు కార్యములందు ఎడదెగక కృషిసల్పుచున్నారనియు చెప్పిరి.

తదనంతరము శ్రీమతి పొణకా కనకమ్మగారు కరతాళధ్వనులు మ్రోగుచుండ అధ్యక్షపీఠమునుండిలేచి యీవిధముగా గంభీరోపన్యాసము నిచ్చిరి:

మిత్రులారా!

'గృహలక్ష్మి' సత్కారసమయాన్ని ఈ అధ్యక్షగౌరవానికి నన్నాహ్వానించినందుకు స్త్రీవిద్యాభిమానులగు శ్రీ డాక్టరు కేసరిగారికి, ఏతత్కార్యనిర్వాహకులకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతావందనములు. సమర్థతాసమర్థతలు ఎట్లున్నా, ఈ కార్య నిర్వహణమునకు తగినవారు చాలామంది యున్నప్పటికి, నాకే ఈ ఆధిక్యతయిచ్చి పిలవడము నాయందుగల ప్రేమగౌరవాలచేతనే అని భావిస్తాను. అధ్యక్షస్థానము కేవలము మర్యాదపూర్వకము, లాంఛనము అవుతున్నది చాల-చోట్ల. కాని అది చాల భారమైనది బాధ్యతతో కూడినది అని నాఉద్దేశము. ఏవిషయానికి అధ్యక్షతవహిస్తున్నామో అది సక్రమముగాను, జయప్రదముగాను నిర్వహించి ఆ కార్యోద్దేశము సఫలము చేయవలసి వుంటుంది. అటువంటి కర్తవ్యాన్ని ఎంతవరకు నిర్వర్తించి కృతకృత్యురాలను కాగలిగినానో చెప్పవలసినది మీరు.

'గృహలక్ష్మి' చాల చక్కనిపేరు. ఆపేరు భారతసాధ్వికే చెల్లుతుంది. ఏరికోరి అటువంటి మనోహరమైన నామధేయముతో అలంకరించినారు తమ ముద్దుబిడ్డను కేసరిగారు. గృహలక్ష్మి వారి పత్రికాపుత్రికమాత్రమేకాక ఆంధ్రప్రియపుత్రికలంతా గృహలక్ష్ములు కావాలని వారి యాశయము. ఆంధ్రుల ఆంధ్రత్వము వెల్లడించడానికి ఆంధ్రపత్రిక స్థాపించి కీ. శే. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు అఖండంగా సేవచేసినట్లే, ఆంధ్రస్త్రీల గృహలక్ష్యం ప్రస్ఫురితం చేయడాకినిఈపత్రికను స్థాపించినారు శ్రీ కేసరిగారు. ఈఆదర్శముగల శ్రీమంతులయింట వారి నోముఫలంగా పుట్టి పెరుగుతున్నది గృహలక్ష్మి బాల. గృహలక్ష్మి యిప్పుడు ద్వాదశవర్ష వయస్క. ఇంకా పరికిణీవీడని కన్నెపడుచే అయినా, పుట్టి పెరుగుతున్న పోకడలు భావిప్రతిభకు రేఖలు దిద్దుతున్నవి. నవనవోన్మేషముగ, శిరీషపేశలముగ లావణ్యకాంతులు జిమ్ముతూ, ఆంధ్రభూమిని ప్రభవించిన ఈసుకుమారి నూతనోత్తేజంతో, నూతనవిజ్ఞానవికాసాలతో, నూతన కళావిశేషాలతో నవోజ్జ్వలముగా వర్ధిల్లి, తన శక్తిప్రభల నపూర్వముగా ప్రకాశింపజేస్తుందని ఆశిస్తున్నాము. క్రొత్తపోకడలతో, క్రొత్తదారులుత్రొక్కి, విదుషీమణులకు పట్టుగొమ్మై, తన

సేవ వారికి వారిసహాయము తనకు పరస్పరముగా తెలుగుగడ్డ బలిమికలిమి దిశలు సాటి స్తుందని విశ్వసిస్తున్నాము.

ఆంధ్రప్రశస్తి దేదీప్యముగా ప్రజ్వలించిన యొకయుగములో రాజులు కవిరాజులను కనకాభిషేకాలతోను, గండపెండెరాలతోను సన్మానించినారు. గుణశీలములు, శక్తి సామర్థ్యములు మన్ననలంది కానుకలుగొన్న రోజులవి. విద్యావివేకములు విలువపొందిన దినములవి. ప్రౌఢదేవునిపాలనలో శ్రీనాథ కవిసార్వభౌముని శిరమున నభిషేకమై, క్రొత్తవన్నెగొన్న అలంకారములతో, ఆంధ్రప్రభువులకీర్తిరమ ఆశాంతాలు విహరించి అజరామరమైనది. ఆంధ్రభోజుడైన శ్రీ కృష్ణరాయసార్వభౌముని ఆదరణలో నిఖిలరాజన్యుల కలికితురాయిల వెలిగిన మేలిరత్నములతో గీలించిన కాలియందె కళలుజిమ్ముతూ మన్వంతరములు ఆంధ్రభాషాయోష శింజినీరవము సింగారించినది. కాని లక్ష్మిసరస్వతులనుకొలిచి కీర్తించిన సామ్రాట్టులు, కవి సామ్రాట్టులుకూడా పరోక్షంగా వారిని ఆరాధించినారేగానీ, ప్రత్యక్షముగా సత్కరించి సన్మానించినది పురుషులనుమాత్రమే. వేదకాలమునుండి నేటివరకు ప్రతిభావంతులైన స్త్రీలు కొరతపడకుండా కీర్తిపొందుతూనే వున్నారు. అట్టిస్త్రీలు ప్రత్యేకము ఈవిధముగ సన్మానముపొందడముమాత్రం కొరవడియే వున్నది. 'భారతము, రామాయణము; కవిత్రయం, భాస్కరుడు తెనిగించినారు. భాగవతము నాభాగ్యవశమున నాకోసమే వుంచినార'ని శ్రీ పోతనామాత్యుడు చెప్పినట్లు భాషాసేవకులైన విదుషీరత్నములను సన్మానించేగౌరవము ప్రత్యేకము శ్రీ కేసరిగారికి నిలిపినట్లున్నది. వారు ఆగౌరవమును సముచితముగాచేపట్టి కీర్తికాములగుచున్నారు. ప్రత్యేకము స్త్రీలకొరకు పత్రికస్థాపించి, స్త్రీ విజ్ఞానాభివృద్ధికి తద్వారా చేయుచున్నకృషి మిక్కిలి ప్రశంసాపాత్రము. ప్రత్యేకము పత్రికనుపెట్టి నిర్వహించవలసిన అవసరమున్నా, అది చేసికొనలేకపోయినప్పటికి, ఈఅవకాశాన్ని పురస్కరించుకుని అయినా మన సోదరీమణులు తగినంతఉపయోగాన్ని పొందలేకపోతున్నారనడము సత్యదూరముకాదు. అది విషాదకరమే. స్త్రీలకు ప్రత్యేకము పత్రికఉన్నప్పుడు, సంపాదకులు స్త్రీవిద్యాప్రోత్సాహకులైనప్పుడు, స్త్రీలుకూడా విద్యావతులు కరువులేనప్పుడు, పత్రిక మనకు మనము పత్రికకు తగినంత ఉపయోగము, ప్రయోజనము పొందలేకపోవడము ఉపేక్షింపదగినదికాదు. అది విమర్శించి సత్కరించుకోవలసిన విషయము. సారస్వతసేవ సామాన్యమైనదికాదు. కళారాధనకూడ అటువంటిదే. సారస్వతకళాప్రచారములకు ప్రధానసాధనము పత్రిక. చక్కగా నిర్వహింపగలిగితే కొన్నివందలపుస్తకములు చేయగలపని ఒక్కపత్రిక చేస్తుంది. కపట మెరుగని అమాయికపు లేత నెత్తురుగాని, నవోజ్జ్వలకాంతుల తరుణరక్తముగాని, పొంగులువారే యౌవనోజ్జ్వలిత వీరరుధిరముగాని, ప్రశాంతిపొందిన నిర్మలశోణితముగాని ప్రవ

హింపచేసే అద్భుతశక్తి పత్రికలు ప్రకటింపగలవు. అమృతధారలుగురిపించి నవజీవము నివ్వగలవు. నిశితచరిత్రగల సంపాదకుల కలంవాడికి రాజ్యాంగములుకూడా గడగడలాడిపోతవి, లేశంతప్పినా శల్యాశల్యము విమర్శించి ఎక్కడ ప్రాణములు తీస్తాయో యని.

భారతభూమియొక్క ఔన్నత్యము భౌతిక సంపదమీదనే ఆధారపడలేదు. అది మహామహుల జ్ఞానవిజ్ఞానములమీద నిర్మింపబడినది. పాశ్చాత్యుల భౌతికశక్తినిచూచి మనమీనాడు ముగ్ధులము కావచ్చును, కాని క్రౌంచెము సింహావలోకనముచేస్తే పరిమాణమైనఈశక్తిని అణుమాత్రము చేసేఅతీతమైన మహాశక్తి అలౌకిక తేజస్సుతో ఈ ఆర్యావర్తములో ప్రజ్వలించిన ఛాయలు దిగ్భ్రమగొలుపకమానవు. ఆ ఛాయలు నేటికి మాసిపోలేదు. ఎన్నటికి మాసిపోవు. మబ్బుపొరలు క్రమ్మవచ్చునుగాని సూర్యుడెపుడు ప్రకాశమానుడే. అట్టి హైందవభూమిలో వీర సాధ్వీమణులే కాదు విజ్ఞానవతులైన నారీమతల్లులకును ఎన్నడు కొరతలేదు. గార్గి, మైత్రేయి, సులభ మొదలైన బ్రహ్మవాదినులు శృతిస్మృతులు సహితము రచించినది, వేదాంతసాగరమును పారముముట్ట మథించినది జగత్ప్రసిద్ధము. దేవహూతివంటి మాతలుండడముచేతనే కపిల భగవానునివంటి ఘనులుద్భవించినారు. ఆనాటిపేరులుకూడ అంజనాదేవికుమారుడు ఆంజనేయుడు, వినతాసుతుడు వైనతేయుడు, గంగాపుత్రుడు గాంగేయుడు, సుమిత్రకొడుకు సౌమిత్రి, ఇట్లే పార్థులు, సౌభద్రుడు మున్నగుపేర్లు తల్లిపేరుతో ప్రసిద్ధిపొందడముచేత శృతియుగమునుండి పురాణయుగమువరకుకూడా స్త్రీలయందెట్టి భక్తిగౌరవములు ఆధిక్యత వుండెడిదో తెల్లమౌతుంది. సంధ్యావందనోపనయనాది కర్మసంస్కారాలకికూడా స్త్రీలకు హక్కు అధికారమువున్నట్లు తెలుస్తుంది. శ్రీరామచంద్రుడు కొలువుకు వచ్చేముందు సంధ్యావందనము చేయుచున్న జనని కౌసల్యవద్దకుపోయి మ్రొక్కివచ్చినట్లు రామాయణములో వున్నది. ఆనాటి స్త్రీల ప్రతిజ్ఞాపాలనము, ఔచిత్యము, న్యాయదక్షతకూడా అద్భుతము. శ్రీరాముడు రెండవమారు అగ్నిపరీక్ష అనేసరికి ధిక్కారముతో భూగర్భముజొచ్చిన సీతాదేవి ఆభిజాత్యము బంగారుపుటలలో రత్నఖచితమై శాశ్వితమైపోయినది. ధర్మపుత్రుడు ద్యూతంలో సమస్తమును కోల్పోయినప్పుడు ద్రౌపది ప్రశ్నలు ప్రతిజ్ఞ ప్రాచ్యఖండప్రతిష్ఠను ధృవతారలా నిల్పినవి. సుమతి అనసూయాదిపతివ్రతల మహామహిమ పౌరాణికమైన కట్టుకథలుగా కన్పించినను, స్త్రీల కప్పుడున్న గౌరవస్థానాన్ని నిరూపించడమునకు మనము నిదర్శనములుగా తీసికొనవచ్చును. నమ్మితే వారి అలౌకికశక్తిప్రతిభలముకాక తప్పదు. ప్రభావతి ప్రద్యుమ్నుని ఉద్ధరించడము, ఉషాకన్య కళావైదుష్యము, సత్యాదేవి యుద్ధకౌశలము ఇత్యాదులు ఆనాటి సకల విద్యాపాటవాన్ని ప్రదర్శిస్తవి. ఏవిషయములో చూచినా వారు వెనుకపడలేదు. భగవద్గీతలోకూడ స్త్రీల ఆధిక్యతనే

ఉద్ఘాటించినాడు శ్రీ కృష్ణభగవానుడు. స్త్రీల యున్నతియున్నంతవరకు జాతీయోన్నతికి చలనములేదని, స్త్రీలప్రతిష్ఠ సన్నగిల్లిననాడు అధఃపతనము తప్పదని వా(క్రు)చ్చినాడు. శృతికారులు సహితము, "యత్రనార్యస్తు పూజ్యంతే, రమంతే తత్రదేవతాః" అని కీర్తించినారు. సర్వతోముఖముగా ప్రకాశించిన స్త్రీల మహత్తరమైనఆశక్తి తర్వాత కాలములో ఒకవిధముగా మరుగుపడిపోయినది. చారిత్రకయుగము వచ్చేసరికి మహమ్మదీయాది పరరాజుల దండయాత్రలవల్ల విద్యావికాసానికి అవకాశము కొంత దూరమై, జ్ఞానశక్తులు నివురుగప్పినవి. అంతకుపూర్వము స్త్రీలు — రాణులుకూడ బాగా చదువుకున్నట్లే కనిపిస్తుంది. గుణాదపండితునిచేత బృహత్కథ వ్రాయించిన ఆంధ్రప్రభునిరాణి సంస్కృతపాండిత్య ప్రతిభాశాలిని కావడం లోకప్రసిద్ధము. మధ్యకాలంలోకూడా ఆంధ్రావనిలో మొల్ల, మోహనాంగి, వెంగమాంబ మొదలైనవారి విద్వత్తు మనోహరమై ప్రఖ్యాతమైనది. ఏలేశ్వరోపాధ్యాయులకూతురు నాచి గణితశాస్త్రప్రజ్ఞలో సంస్కృతకాలమునాటి లీలావతితో తులతూగినది. తుదకు మొన్నమొన్న చారిత్రకసాగరగర్భముల సంశోధించి అబలాసచ్చరిత్రమాలగ్రుచ్చి కీర్తిశేషమైన శ్రీ అచ్చమాంబ అమూల్యసేవ స్మరించకుండావుండలేము. మొత్తంమీద రానురాను అంటే బ్రిటిషుసంబంధమునకు కొంచెంగా పూర్వంనుండి స్త్రీలయున్నతి వైజ్ఞానికము పతనము పూర్తియై అజ్ఞానవిషాద మేఘాలలముకొన్నవి. మధ్యకాలంలో విద్యాసౌకర్యములు, సంఘములో ఔదార్యము, వ్యక్తుల ప్రోత్సాహము లేకపోవడముచేత ఆనాడు కావ్యములు రచించినవారు ఏ కొలదిమందియో యేర్పడిరి. కాని నిగూఢముగా పాటలు, పదాలు చేసిన వారెందరో యున్నారు. అవియే యెన్నో వేదాంతకీర్తనలు, భజనకీర్తనలు, పెండ్లి పాటలు, నలుగుపాటలు, జోలపాటలు, బిచ్చపుపాటలు మున్నగు రీత్యా గృహలక్ష్ముల కంఠస్థమై జాతీయనాగరికత మృగ్యమైపోకుండా నిలబెట్టడమునకు తోడ్పడినవి.

సృష్టికే పరిణామము సహజము. మత, రాజకీయ, సాంఘిక, విద్యావిధానములన్ని అప్రతిహతమైన కాలచక్రములో అనుక్షణము పరిభ్రమణముపొందుతూ, వాగతీతము గానే కాదు, ఊహాతీతముగాకూడ మార్పుపొందుతూవుంటవి. ఒక్కసారి కొంచెం సింహావలోకనముచేసి ఇరవైయేళ్లు వెనుకకువెళ్లితే ఈనాడు సంఘములో, దేశంలో మనము చూస్తున్నమార్పులు, ఆనాడు బుద్ధికికూడా అందనివి ఎన్నోవున్నవని స్పష్టమౌతుంది. అదేవిధముగా విద్యావిషయములోనూ అఖండమైన అభివృద్ధి, ప్రోత్సాహము, సౌకర్యములు, క్రొత్తపంథాలు, భావౌన్నత్యము, ఎంతోవిశేషముగా మార్పుపొందినవి. ధర్మములు, ఆచారములు, సంఘశ్రేయమున కనుకూలముగా అప్పటప్పటి కెట్లు మారుతూ వచ్చినవో, ఆవిధముగానే భాషకూడా నానాటికి మార్పుపొందుతూవచ్చినది. ఒకనాడు

క్లిష్టపదభూయిష్టమై, పదజాలముతో, సమాసాలంకారములతో పాండిత్యప్రకర్షక వున్నంత జటిలముగా గుప్పించడమే మెప్పుగొన్న భాష యిప్పుడు కటువైపోయినది. అర్థగాంభీర్యము, శబ్దసౌష్టవము, భావౌన్నత్యము, రసపుష్టి ఇప్పుడు ముందు నిలుస్తున్నవి. విషయమునకు ప్రాధాన్యతలేకుండా వాక్యములు, సమాసములు కురిపించడము యిప్పుడు విసుగుగా తోస్తున్నది. అంతే అంతమాత్రముచేత ఇదివరకు గ్రంథములన్ని చెత్త అని, ఇప్పుడు నిర్దుష్టముగా, పరిపుష్టమైన గొప్పభాష ఏర్పడినదని మా తాత్పర్యము కాదు. కాని పెద్దలు తీసిపారవేసేవిధముగా కాకుండా నేటి కవిత్వపాండిత్యములలో కూడా చక్కని శైలి, ఉత్తేజకరమైన విషయములు మనోహరమైన భావములు విషయ ప్రాధాన్యములతోనిండి ప్రాముఖ్యముగన్నవే విశేషమున్నవని మెచ్చుకొనక తప్పదు. అందుకు మనమంతా ఎంతో ఆహ్లాదము పొందవలెను. వాడుకభాష నిన్న మొన్నటివరకు గర్హ్యమైనది. కాని నేడు గణ్యతవహిస్తున్నది. రేపు ఇదే సాంప్రదాయమౌతుంది. భావోత్తేజమైన ఈభాషను సృష్టించి ఆయువుపోసినది గిడుగువారు, గురజాడవారు. ఇప్పుడు అనేకమంది వారి అడుగు జాడలననుసరిస్తూ భాషకు సుందరరూపము, నవ్య తేజము కల్పించి సుస్థిర మొనర్చుచున్నారు. ఏ సంస్కారమునకైనా ప్రారంభములో ప్రతిఘటన నెదుర్కొనవలెను. కాని ఆ సంస్కారము సంఘశ్రేయమునకు ముఖ్యమైతే ఎన్నికష్టములు వచ్చినను సరే దీక్షతో సాధించి తీరవలసినదే. అయితే యుగములు గడిచినా చెక్క అక్షరమైనా పొల్లు పోవడమునకు వీలులేని పంథలో అతి రమ్యముగా భాషకు భావమునకు కూడ భిక్షపెట్టిన గ్రంథములు కొన్నివున్నవి. అవి లెక్కపెట్టదగినవి మాత్రమే కాని అనుపమానమైన వాటిప్రతిభ, చిరస్మృతము శాశ్వితమునై వెలుగుతున్నది. గ్రంథకోటి పెరిగినను భారత భాగవత రామాయణాది గ్రంథములను మించిపోయే పుస్తకములను చూడలేము. వెలలేని విజ్ఞాన భాండాగారమున కవి ఉనికిపట్టులు. అట్లే ప్రతివిషయములోను అమూల్యములైన గ్రంథములు స్వల్పముగ కొన్నివున్నవి. ఆంధ్రవిజ్ఞానరత్నాకరములో అవి మణులు. ఆకాంతులలో నూతనవైజ్ఞానిక కళాజ్యోతి ప్రజ్వలిస్తుంది.

దేశము, కాలము, సంఘము ఆదరించి, అభిమానించి ప్రోత్సాహమిస్తే పొందియును, ఇవ్వకపోతే పోరాడియును ప్రతిజాతియు తన ఔన్నత్యమునకు, ప్రతిభకు ఉత్తమస్థితి చేకూర్చడమునకు కృషిచేయడము ధర్మము. ఇది సర్వదా యుగసంధి. రాజకీయ, సాంఘిక, విద్యావిషయములలో నిరంతరసంస్కారము అభివృద్ధి కోరుతున్నది కాలము. స్త్రీలుకూడ ఇంతకుముందువలె ఇప్పుడు వెనుకపడలేరు. అనేకవిధముల పురుషులతోపాటు ఉన్నతపథములను అలంకరిస్తున్నారు. ఏ ఉన్నతిపొందడమునకైనా విద్య ముఖ్యకారణము. ఏవిధముగానైనా మధ్యకాలములో పడిపోకుండా మన విద్యా, విజ్ఞానములను నిల్పుకో

గలిగితే మనదేశమున కీపతనము వుండేదికాదు. కొంతకాలం తమస్సులో నిద్రపోయి నాము. ఆమత్తువీడి ప్రబోధముపొందినాము. ఇక మన గమనాని కేదీ అడ్డు రాకూడదు. విజయలక్ష్మి మన తోడునీడుగా రావాలి.

రాజకీయమున కిక్కడ ప్రసక్తి లేకపోయినను, రాజకీయరంగము స్త్రీలనుద్బోధించి వేదికలమీదకు తెచ్చినదని, వారిశక్తి బహిర్గతమొనర్చినదని కృతజ్ఞులము కావాలి. మొన్న మొన్నటివరకు ఎంతటి ప్రాముఖ్యవిషయమైనా, సభలకుపోవడానికే జంకేస్త్రీలు నేడు సభావేదికలు చలించేటట్లు అనేకవిషయములు ధారాళముగాను, సమర్థతతోను చర్చించగలుగుతున్నారంటే అది రాజకీయసేవాప్రాబల్యమే. అదృష్టవశమున రాజకీయ రంగమే నేడు మేలుకొనకపోతే ఈసంఘపతనమున కింతలో మోక్షముండేదికాదు. ఎన్నో ఏళ్లలో భాషామూలకముగా చేయగలసంస్కారము కొన్నినెలల్లో అద్భుతముగా చేసివేయగలుగుతున్నది రాజకీయము. అయితే ఇప్పుడు మనము ఉపయోగించుకొనవలసిన దేమంటే, రాజకీయస్వతంత్రము సారస్వతాభివృద్ధికి, సారస్వతౌన్నత్యము రాజకీయప్రతిష్టకు అధికాధికముగా వినియోగించుకుంటూ, ఈపరస్పరప్రయోజనమును సంపూర్ణంగా పొందాలి. జాతీయవిద్యఅంటే భయము బహిష్కారముపోయి, జాతీయవిద్యనే నిర్ణయించే ప్రభుత్వము పాలించే రోజులువచ్చినవి. లక్షోపలక్షల దేశసేవకుల అద్భుతత్యాగము ప్రతి ఫలించేకాలము వచ్చినది. సభ్యతగల ఏదేశములోనైనా రాజకీయముతో సంబంధము లేకుండా వుండదు. దేశకాల పాత్రములన్నిటిలో రాజకీయం ఇమిడివుంటుంది. రాజకీయం అంటేనే అది. అయితే దురదృష్టమువల్ల దేశముపరాధీనము కావడముమూలాన్ని రాజకీ యము, ఇతరము వేర్వేరయినవి. ఇది పతితదేశములన్నీ అనుభవించవలసిన కష్టమే. కాని ప్రభుత్వము స్వాధీనమయినప్పుడుమాత్రము ఇవన్ని తొలగిపోయి అంతా ఒకటికావాలి. స్త్రీలు సంకల్పిస్తే ఎంతపనినైనా చేయగలము. ఒక పత్రికానిర్వహణమేకాదు, విద్యా సంస్థ పాలించడమేకాదు, రాజ్యాంగమునే శాసించగలము. ఊయెలలూగించే కోమల కరాలే రాజ్యాలు శాసిస్తవి. తూలికపట్టే మృదుహస్తాలే శతఘ్నులు విదలిస్తవి. జోలలుబుజ్జే సుకుమారపుచేతులే జయభేరులు మ్రోగిస్తవి.

దేశమిప్పుడు చాల పరీక్షలోవున్నది. ఒకప్రక్క శాంతివాయువులు వీస్తూవుంటే, ఒకప్రక్క అగ్నిజ్వాలలు రేగుతున్నాయి. విపరీతమైన ఫెడరేషనుసమస్య భయంకరముగ ఎదుర్కొనబోతున్నది. అనుకోనంత తీవ్రగమనముతో సంస్థానాలన్నిటిలో అగ్ని అంటు కుంటున్నది. ఆప్రజాశక్తిని నిరోధించడమునకు ఎవరికీసాధ్యముకాదు. భారతీయులందరు ముక్తకంఠముతోకోరే ఆబలిపేదో పరిహార మివ్వవలసినదే. అది అందరికి కూడుగుడ్డ

మాత్రము. కేవలము విద్య, సాంఘికవిషయములను మాత్రమే చర్చించే అఖిలభారత మహిళాసభవారుకూడా ఈవిషమసమయములో స్త్రీలురాజకీయాల్లో పాల్గొనవలసినదే నని తీర్మానించినారు.

భారతభూమిలో గృహలక్ష్ములయొక్క కర్తవ్యము చాలా అమోఘము. ఈజాతి కర్తవ్యమే ధర్మబద్ధమైనది. కాలవక్రతచేత అది లుప్తమైతే ఆలోపము కర్తవ్యానిది కాదు. శుద్ధాంతమువీడని అసూర్యంపశ్యలుకూడా సమయమువస్తే ఏపనినీ విస్మరించలేరు. అడవులువెళ్లినారు, యుద్ధాలుచేసినారు, జ్ఞానప్రచారముగావించినారు, ఈవిధముగా కర్తవ్యము ధర్మబద్ధమైన దీయార్యావర్తములో మాత్రమేనేమో ?

ఏవిద్యకయినా కళమూలము. అందుకే మనవాళ్లు అందముగాలేకపోతే ఏదైనాసరే కళలేదు, వెలవెలబోతున్నదందురు. అందుచేత ప్రతీది కళాకలితమని స్పష్టము. 64 విద్యలన్నీ చతుష్షష్టికళలన్నారు. అదేసృష్టి. ఈవాడుక మాటలుచాలు. ఒకప్పుడు దివ్యపథమంటిన మనవారి కళారాధన వెల్లడించడానికి సౌందర్యమూర్తిఅయిన ఈశ్వరుడే కళానిలయుడు కావడముచేత ప్రపంచమంతయు కళామయమే. అందుకే 'సత్యమ్, శివమ్, సుందరమ్' అన్నారు.

ప్రతివిద్యలోను కళవున్నను, కళాప్రాధాన్యమైన విద్యలుకొన్ని వున్నవి. అవే లలితకళలు. లలితకళలు ప్రత్యేకము స్త్రీలసొమ్ములని సగర్వముగాచెప్పకొనవచ్చును. గృహలక్ష్మియిల్లు చక్కగా తీర్చిదిద్దినట్లు ఎంతటిసమర్థుడైనా పురుషుడు చేయలేడు. పూర్వకాలమునుంచీచూస్తే శిల్పకళ పురుషుల్లోను, చిత్రకళ స్త్రీలలోను పంచుకున్నట్లు తోస్తుంది. అన్నిటితోపాటు కొన్నాళ్లు కళకూడా అంతర్ధానమైనను ఇప్పుడిప్పుడు మళ్లీ మొలకలెత్తుతున్నది. విద్యావంతులు పెక్కండ్రు కళలకు ప్రాధాన్యమియిస్తున్నారు. కళానిధిఅయిన ఉదయశంకర్ ఇందుకొరకు ప్రత్యేకవిద్యాలయము నిర్మిస్తున్నాడని వినడము ముదావహము. తెలుగుదేశములో ఏనాటినుండియో పేరుపొందినది కూచిపూడివారి భరతనాట్యము. పోషణలేక అది లుప్తమౌతున్నది. అన్నివిద్యలు పునరభివృద్ధిపొందుతున్న ఈరోజుల్లో అది పడిపోకుండా కాపాడడము మనవిధి.

కళలు బహిష్కృతములన్న పొరపాటుదిద్దుకుని మనవాళ్లు పెక్కండ్రు తమబిడ్డలకిప్పుడు చిత్రకళయేకాకుండా నృత్తగీతాభినయాది వివిధకళలూనేర్పిస్తూ ప్రజ్ఞావంతులను చేస్తున్నారు. కళాభిజ్ఞత బుద్ధివికాసమునకేకాదు, అది స్త్రీల శరీరారోగ్యానికి గొప్ప వ్యాయామము. తీరుతీరుల నలంకారములతో ఇంటింట ముద్దుముద్దుగా రంగవల్లులుతీర్చే గృహలక్ష్ముల కళానైపుణి ప్రకృతిసౌధంలోప్రవేశిస్తే ఎంత విశిష్టముగా వికాసిస్తుందో

తెలిసికొనగలము. కళ విజ్ఞానము రెండువిద్యలు అవినాభావసంబంధమైనవి. కళలేనివిద్య, విద్యలేనికళ, రెండూ సంపూర్ణముగాక కుంటిగానేవుంటవి. జాతీయాభ్యుదయమునకు సారస్వతమెంత సేవచేస్తుందో కళకూడా అంత సహాయముచేస్తుంది.

తాము పత్రికనుస్థాపించినా, సంపాదకత్వంవహించినా, గృహలక్ష్మిలో సంపూర్ణంగా స్త్రీలకే ఆధిక్యతవుండవలెనని కేసరిగారి తలంపు. సమర్థులైనస్త్రీలు గృహలక్ష్మి సంపాదకత్వానికి, కార్యనిర్వహణానికి పూనుకునేవారుంటే సంపూర్ణస్వాతంత్రమునిచ్చి సాదరముతో సహాయముచేస్తారు. కార్యస్థానములో ఉద్యోగములకు వారెన్నోమారులు ప్రకటిస్తూ వచ్చినారు.

గృహలక్ష్మిస్థాపనము, నిర్వాహకము, శ్లాఘాపాత్రమేమైనా అందుతోవిశేషించి సాహిత్యసత్కారము, కళాసన్మానము ప్రశంసనీయమేమైనా, శ్రీ కేసరిగారిబాధ్యత ఇంత మాత్రమేకాదు. సంపన్నులు, ఉదారులు, విద్యాభిమానులు అయినవారి ఈవి, ఐశ్వర్యము ఇంతటితో సంతృప్తిపడదగినదికాదు. ఆంధ్రదేశములో సర్వతోముఖమైన ఏకైక జాతీయ విద్యాసంస్థయొకటి అత్యంతావసరము. అది నామమాత్రముగాక, కళాప్రపూర్ణమై, విజ్ఞానప్రదమైన విద్యాలయముగా వుండవలెను.

భారతకవిసార్వభౌముడు శ్రీ రవీంద్రనాధఠాకూరు స్థాపించిన 'శాంతినికేతనము' వంటి ఉత్తమసంస్థను స్త్రీలకు అన్నివిధములైన కళాపరిజ్ఞానాన్ని ఉద్బోధించి, ఒక్క ఉత్కృష్టలక్ష్యముతో, ఒక్క ఉత్తమసిద్ధాంతముతో, ఒక్క ఉన్నతాదర్శముతో, ఒక్క వేదికమీద ఏకసూత్రాన్ని, స్త్రీజాతిమహోన్నతిని ప్రదర్శించేటట్టు ఏకైకసంస్థను నెలకొల్పి ఆర్జించిన సంపదను, కలిగిన విశాలబుద్ధిని ఇంకా సద్వినియోగము, శాశ్వతముచేసి చరితార్థులై చిరయశస్కులు కావలెనని శ్రీ డాక్టరు కేసరిగారిని కోరుతున్నాను.

'కార్నిజీ' కోటీశ్వరుడన్నాడు, 50 ఏండ్లు కొన్నివందలకోట్లు ఆర్జించినతర్వాత "కోట్లు సంపాదించడమే గొప్పకాదు. అది సద్వినియోగంచేయడం గొప్ప" అని. అట్లే నాలుగుదశలు ఆర్జించినకోట్లు, ఇంకొక నాలుగుదశలు వెచ్చించినాడు దేశమునకు ముఖ్యముగా విద్యకు; అమెరికాదేశములో నేడు నూటికి నూరుమంది విద్యావంతులేనంటే అందులో సగంప్రతిభ కార్నీజీది.

శ్రీ కేసరిగారు సాహిత్యసత్కారముతో కళాసన్మానముకూడ ఈసంవత్సరంనుండి ప్రారంభించి మార్గదర్శకులైనారు. ఇది భావిఅభివృద్ధికి సర్వదాశుభసూచన. సోదరి కమలాబాయిగారి కళాపాండితి పరిణతిపొందినది. భాషాసేవలో తలనెరసిన శ్రీమతి శేషమాంబగారితో ఒకవేదికమీద ఈ కంకణస్వీకారము చెయ్యడము పరమానందకరము.

ఈ సన్మానము కళను భాషను గౌరవించినట్లే కాకుండా యువతులను, వృద్ధులను ఒక్క భావముతో సత్కరించడము ఉభయత్రావిశేషార్థమును సూచిస్తున్నది.

గృహలక్ష్మి స్వర్ణకంకణములతో ఏటేటా ముత్తైదువులు తున్నా పుట్టినచోట సన్మానము పొందడమునకు ఇదే తొలిసారి. విశేషించి అది కళాసహితము కావడము ఇదే ప్రారంభము. ఈ విశేషగౌరమునకు నేను ఆధ్వర్యము వహించడము ఇదే ప్రథమము. ఇందులో మామూలుకు మించిన ప్రత్యేకత ఏదో గోచరిస్తున్నది. విదుషీమణియగు శ్రీ శేషమాంబ గారినిగూర్చి ఆంధ్రభూమిలో ఎరుగనివారులేరు. గృహలక్ష్మివంటి బిడ్డలుపుట్టి పెరిగి పేరు తేవడానికి వారి హిందూసుందరి మాతృత్వమే కారణమంటే అతిశయోక్తికాదు. స్త్రీలకు ప్రత్యేకపత్రికలవసరమన్న సంకల్పం ఏనాడో మొలకెత్తించి దోహదముచేసి సఫలులైనారు. ఈ పారితోషికము గ్రహించడమున శ్రీ శేషమాంబగారి కిది యొక ప్రత్యేకార్హతకలదు.

శ్రీ శేషమాంబగారిని నేను చాలకాలమునుండియు ఎరుగుదును. నా చిన్నతనములో హిందూసుందరి మాత్రమే స్త్రీలకు పత్రిక. తర్వాత పుట్టినవి సావిత్రి, అనసూయాది పత్రికలు. హిందూసుందరి నాటినుండి నేటివరకు కొనసాగింపబడుతున్నది. అది సామాన్యముకాదు. అందువల్లనే ఆమె కార్యదీక్షత ద్యోతకమగుచున్నది. పత్రిక యొకటియేకాదు. ఆమెగారు 'మహిళా విద్యాలయము'నుకూడ నిర్వహించినారు. వయసుచేతనేకాక భాషాసేవలో సైతము నాకంటె చాలపెద్దలు. వారికి నా అభివాదాలు.

నటరాజు ఆదిశంకరుడే నృత్యమునకు అధిదైవము. వీణాపాణి సరస్వతి లలితకళలకు అధిష్టానదేవత. భారతీయచిత్రకారులకు సర్వశక్తులు ఉత్తమస్వరూపములై గోచరించినవి. ఆకరాంగుళులు లలితమై, సూక్ష్మమై, గంభీరమై, నిర్మలమై, నిరుపమానమైన శక్తితో తాండవమాడుచున్నవి. భగవతాభిముఖమైన దివ్యస్థితికి మానవుని తీసికొనిపోయే విషయమేదిమైనను లలితకళయే. అదియే పరమార్థము.

శ్రీమతి కమలాబాయిగారి చిత్రకళ, సంగీతము పరిపక్వతపొందినవి. అవి మనోహరమై యొకవిశిష్టతను తెలుపుతూవుంటవి. ఆమె శాంతినికేతనములోను, మద్రాసు విశ్వవిద్యాలయములోను పొందినశిక్షణ నిగ్గులుదేరి సిద్ధహస్తను చేస్తున్నది. ఆమె మీరాబాయిలోని పరిపూర్ణమైన భక్తి, రాధాకృష్ణలోని ప్రేమ, సారూప్యమై అర్పణలో పరమావధి పొందినది. ఆమె ఇతోధికప్రతిభతో యువతీలోకములో యింకాయింకా యశశ్చంద్రికలు ప్రసరించెదరని ఆశీర్వదిస్తున్నాను.



టంగుటూరి సూర్యకుమారి



శ్రీమతి పద్మావతిదేవి



కుమారి వరలక్ష్మి

సారథివారి 'రైతుబిడ్డ'లో



మచిలీపట్టణము లేడీ ఏంప్థిల్ ట్రైనింగుస్కూలు వార్షికోత్సవసందర్భమున ఫాన్సీడ్రెస్సు
నందు పాల్గొన్న విద్యార్థినులు : 'ఎలుగు—మనిషి', 'పాములవాడు', 'నారదుడు'
క్రమముగా మొదటి, రెండవ, మూడవ బహుమానములను పొందిరి.

ఇంకొకవిషయము ప్రస్తావించకుండ ముగింపలేను. నన్నుగూర్చి మాసోదరి శ్రీ కనకాంబగారు చాల పొగడినారు. ఆమె, నేను బాల్యస్నేహితులము కావడమువలన నాయందున్న స్వల్పముకూడ విశేషముగానే కనుపడుతుంది. పొగడ్తలకు అనేకవిధముల నాకంటె ఆమెకే ఆధిక్యతవుంది. ఆంధ్ర, గీర్వాణ, ఆంగ్లభాషలలో ఆమె కోవిదురాలు. గొప్ప కవయిత్రి. ఆధునికులలో అనేకవిధముల అగ్రగణ్యురాలై మావంటి స్నేహితులకు ఆనందమును, మా నెల్లూరిసీమకు కీర్తిని చేకూర్చుచున్నది. అంతియగాక ఆమెలో ఇంకొక విశేషమున్నది. కవిత్వ వైదుష్యములను మించి ఆత్మసాక్షాత్కారమును పొందిన వెంగమాంబగారివలె కనకాంబగారుకూడ ఆత్మానుభవముపొందిన జ్ఞానులు.

ఇక్కడికే మీకాలము చాలకాలము తీసికొన్నాను. ఈసత్కారములు నూతన కావ్యరూపము పొందడమునకు, సంపాదకులను, కార్యనిర్వాహకులను, సహాయకులు కావలసిన మిమ్ములను మరియొకమారు కోరుతు ముగించుచున్నాను.—

అధ్యక్షోపన్యాసానంతరము శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు స్త్రీలు రాజకీయములనుగూర్చి ప్రసంగించుచు, స్త్రీలోకములో నూతనసంచలనము నూతనవివేకము రాజకీయములవలననే కలిగినదనియు, రాజకీయములందు వీలైనంతవరకు స్త్రీలు పాల్గొనవలయుననియు, స్త్రీలు రాజకీయములందు పాల్గొనుట ఎంతయో అవసరము గనుకనే అఖిలభారత మహిళాసంఘమువారు అందు కనుకూలముగ తీర్మానించిరనియు దెల్పిరి. స్త్రీలు_కళలను గురించి మాట్లాడుచు అనాదినుండియు స్త్రీలకు లలితకళలలో ప్రవేశముకలదనియు, ఆ కళాభ్యుదయమే స్త్రీజనాభ్యుదయమును సూచించుననియు, ప్రతిగృహిణియు యీ లలితకళలలో మంచిప్రవేశము కలిగియుండుట చాల యవసరమనియు నుడువుచు గృహలక్ష్మి పత్రికద్వారా శ్రీ కేసరిగారు అత్యంతమైన సేవచేయుచున్నారనియు, అందుకు నారీలోకము వారి కెంతో కృతజ్ఞత చూపవలసియున్నదనియు, తమ నుపన్యాసము నీయవలసినదిగా ఆహ్వానించినందులకు తమ కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నామనియు చెప్పిరి.

అనంతరము సుప్రసిద్ధ చిత్రలేఖకులగు శ్రీయుత సి. యస్. వెంకట్రావుగారు చిత్రకళ, భారతకళ, భరతనాట్యమును గురించి యీవిధముగా ఉపన్యసించిరి:

సోదరసోదరీమణులారా!

నావంటి బీదచిత్రకళా ఉపాధ్యాయునిచే యిటువంటి గొప్పసమావేశమందు ఉపన్యాసము యిప్పించుట హనుమంతునిఎదుట కుప్పిగంతులు వేయించుటయే; కానీ, యిది నాఅదృష్టఫలమని భావింతును. అందులకు 'గృహలక్ష్మి' సర్వాధికారి శ్రీ కేసరిగారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఈగౌరవమునకు అనర్హుడనని నాకు తెలియునుకాని, చిత్రలేఖనమే, చిత్రకళో పాసనమే, చిత్రకళాభివృద్ధికై ప్రయత్నించుటయే నా జీవితపరమావధి. ఇక్కడ ఆవిష యమై కొంత మాట్లాడ అవకాశముకలిగినది కాన, నాకు తెలిసిన రెండుముక్కలు చెప్పెదను.

నేను పండితుడనుకాను, కవియునుగాను. కాని పుష్పదామమునందలి దారమునకు సువాసన ఒడమినరీతి, కొందఱు విద్వద్వరేణ్యులగు మిత్రులసహవాసమున నాకును తెనుగుసాహిత్యముపై కొంత అభిలాష ఎక్కువయినది.

ఇంక 'గృహలక్ష్మి' పత్రికనుగూర్చి కొంత చెప్పవలసియున్నది.

ఎక్కువగ మన తెనుగు, అఱవతల్లుల నైతికాభివృద్ధికై సాహిత్యపోషణకై ఈపత్రిక స్థాపింపబడినది. స్త్రీలకు సంబంధించినవ్యాసములు, పద్యములు, చిత్రకళలు, పాకకళ, మొదలగునవి యిందు ప్రచురింపబడుట మీకు తెలిసినవిషయమే. అందువలన శ్రీమతి కమలాదేవివంటి చిత్రకళోపాసకురాలును గౌరవించుటకు ఇది సరియైనసంస్థ.

శ్రీ. దా॥ సత్యవాణి, బుచ్చిక్రిష్టమ్మ మున్నగు కళోపాసకులలో ఈమె మేల్బంతి. ఈమెచిత్రములు అనేకుల నాకర్షించినవిషయము మీకు తెలుసును. అట్టి సతీమణికి నేనీ బహుమానమొసంగుట కెంతయుసంతసించెద. ఈసతీమణి ఇంకను పెక్కుచిత్రముల చిత్రించి, తెనుగుదేశమందేకాక యావత్ భారతదేశమందంతయు మంచిపేరు ప్రతిష్టలచే వర్ధిల్లుగాక అని పరమేశ్వరుని ప్రార్థించువాడ.

## కళావిర్భావము (Origin of Art)

అనాదినుండియు సౌందర్యమును చిత్రించుటకై, సౌందర్యరచనకై మానవుడు ప్రయత్నించుచున్నాడు. తాను రచించిన చిత్రమున తన మనోభావములు గుర్తింపచేయు టయే చిత్రకళాలక్షణము. "The thing of beauty is a joy for ever." సుందరమగు వస్తువు సర్వకాలముల సంతోషదాయకము అను Keats మహాకవివాక్యము ఎల్లప్పటికిని నిజమైబఱుగుచున్నది. The living world of truth and beauty is the function of Art అను ఠాగూరుమహాశయుని వాక్యానుసారముగ సౌందర్యము అందలి సత్యము, వీటి సమ్మేళనమేకళ. ఇదియనుకాళ చిత్రలేఖనము, నృత్యము, గానము, సంగీతము వీటితో కూడినదే కళ.

ప్రపంచమున మొట్టమొదటరచించిన చిత్రమునకు ఒకవిచిత్రమైన పురాణగాథ కలదు:

భయాజిత్ అను రాజశ్రేష్ఠునిపాలనమున ఒకబ్రాహ్మణుడు ఒక్కనాడు తనపుత్రుడు మఱణించెననియు, దానికికారణముగా రాజ్యము ఎక్కువపాపముతో నిండినదనియు చెప్పెను. రాజు అందులకు కోపపడి యమునితోపోరి జయించెనట. కాని సృష్టికర్తయగు బ్రహ్మ, మనుజుడు కర్మానుసారముగ మృత్యువు ననుభవించునని చెప్పి, ఆబ్రాహ్మణుడు చనిపోయిన కుమారునిపటమును రచింపుమనినుడివి, ఆపటమునకు జీవమొసంగెనట. దానికి నగ్నజిత్ అని పేరిడిరి. అదియే ప్రపంచమున మొట్టమొదటిచిత్రము.

మఱియొకగాథ ఏమన: నారాయణయోగి ఈకళను సృష్టించెననియును, ఆతనిచే చిత్రితమైన 'ఊర్వసి' చక్కని అప్సరస ఆయెననియు, తర్వాత విశ్వకర్మ చిత్రకళ నేర్చుకొని యితరులకు నేర్పెననియు కథ. చిత్రకళకు ఎవరు తొలిపీఠమువేసినను బౌద్ధయుగమున ఈశాస్త్రము ప్రబలినదని చెప్పనగును. ఆయుగముననే ప్రసన్నజిత్ అనురాజు చిత్రలేఖనాశాల ఒక్కటి ఏర్పాటుచేసియుండెను. సుర్గూజా సంస్థానములోని రామగార్ కొండలలో మొట్టమొదటి భారతచిత్రలేఖనము దొరకినదని Doctor Bloch అనునతడు 1904లో తెలియబఱచెను. ఇదిక్రీస్తుకుపూర్వం 300 సం॥ చిత్రమట. అజంతాలోని చిత్రములు 100 సం॥ క్రీస్తుకు వెనుకటివి. భారతసాహిత్యము 64 లలితకళలవిషయమై చర్చించును. అందులో 'చిత్రకళ' చాల ప్రాముఖ్యమైనది.

వాత్స్యాయనుని కామసూత్రములలో ఈచిత్రవిద్యకు నాలుగవస్థానము యిచ్చినాడు. విష్ణుధర్మోత్తరములో మొదటిస్థానము యీచిత్రకళకు కలదు. అందు చిత్రకళ ధర్మార్థకామమోక్షము లొసగునని రచింపబడియుండుట నిజమని నా నమ్మకము. సంస్కృతవాఙ్మయమునందు హిందూరాజులు చిత్రకళపై అభిమానము, అభిలాషగలవారని తెలియవచ్చుచున్నది. అవేమన, సీతకు రాముడు మనోవ్యాకులత పోగొట్టుటకై చూపిన చిత్రలేఖనములు భవభూతి ఉత్తరరామాయణమందు వర్ణించినాడు. కాళిదాసు, దుష్యంతుడు శకుంతల విరహముతాళలేక స్వయముగ శకుంతలా చిత్రమును చిత్రించినట్లు తనశాకుంతలములో వ్రాసినాడు. శ్రీహర్షకవి దమయంతి నళుని సౌందర్యమువిని నళుని పటము వ్రాసినట్లు తెలిపినాడు. ఉషాపరిణయములో ఉషచెలి చిత్రలేఖ అనిరుద్ధుని రూపమునువిని ఊహచే అతనిపటమును లిఖించినట్లు మన సంస్కృతగ్రంథములు తెలుపుచున్నవి.

## భారతకళ (Indian Art)

ఇది అశోకునికాలమున ప్రారంభింపబడియె ననవచ్చును. అప్పుడు బుద్ధయుగము, అశోకునిస్తూపములు శిల్పశాస్త్రమునకు బునాదివంటివి. భారతకళను మూడుభాగములుగ విభజింపవచ్చును.

1. వస్తుశాస్త్రము (Science of Architecture)
2. శిల్పశాస్త్రము ( do Sculpture)
3. చిత్రసూత్రములు ( do Painting)

వస్తుశాస్త్రములో 20 విధములగు దేవాలయములు మేరు, మందర, గరుడ, కైలాస, పద్మ, మున్నగునవి 20 విధములుగ కట్టినట్లు వరాహమిత్రుని 'బృహత్ సంహితలో' కలదు.

శిల్పశాస్త్రవిషయమై తెలుపుగ్రంథములు లేవని ఒకపాశ్చాత్యుడు నొక్కి చెప్పియున్నాడు. అది గొప్పపొరబాటు. యిప్పుడు ఎందరో పరిశోధకులు సంస్కృత గ్రంథము లున్నవనియు ప్రకటించినారు.

ఈశాస్త్రవిషయమై అగ్నిపురాణం, మత్స్యపురాణం, శుక్రనీతిసారం మున్నగు గ్రంథములలో ప్రతిమాలక్షణం, దేవతావిగ్రహములకొలతలు వ్రాసియున్నవి. ప్రతిమా లక్షణమునకు చిత్రలేఖనము అవశ్యకము. చిత్రలేఖనమునకు నాట్యశాస్త్రజ్ఞానం అవసరము. నాట్యమునకు సంగీతము ప్రాముఖ్యము. సంగీతమునకు గాత్రము సుఖస్థాయి. కావున హిందూశాస్త్రప్రకారముగ ప్రతిమాలక్షణమునకు చిత్రలేఖనము, నృత్యము, సంగీతము ఈశాస్త్రపరిచయములు అత్యావశ్యకములు.

### చిత్రలేఖనమనగా నేమి?

చిత్రకారుని మనోభావములందలి బింబమును రంగులతో చిత్రించుటయే 'చిత్ర లేఖనము'. వస్తుసామగ్రులతోను, రంగులతోను, గీటులతోను చిత్రకారునిఊహల ఒక్క చోట నిలువచేయుటయే చిత్రము. చిత్రలేఖకునికి ఒక గొప్పదీక్ష, పట్టుదల, శాంతము యుండవలెను. తాను రచించినచిత్రములు చిరస్థాయిగనుండవలెనని అపేక్ష, శ్రద్ధ, భక్తి యింకను నేర్చుకొనవలెనను ఆకాంక్ష చిత్రకారునికి ఉండవలసిన గుణములు.

> " What is devotion to a relegious man
> What is philosophy to a thinker,
> The very same is the ideal of a Painter."

మతాభిమానికి దైవభక్తియం దెట్టినమ్మకమో, యోగికి, యోచనాపరునికి వేదాంత మందు ఎట్టిఅభిరుచియో, చిత్రకారునికికూడ తన ఆదర్శమందు భక్తివిశ్వాసములుండును. తాను గొప్ప అనుపించుకొనునంతలో నిదానము, పట్టుదల, శాంతము, దయ, చిత్రకళపై భక్తి అలవడజేసుకొని కళాభివృద్ధికై పాటుపడవలెను. అందుచేతనే చిత్రలేఖనము

గీతలతో, వన్నెలతో నిర్మించిన వేదాంతమనబడుచున్నది. కావుననే చిత్రలేఖకులు తమ జీవితాంతమందు యోగులుగనో, విరాగులుగనో, సన్యాసులగనో, తుదకు సర్వసంగ పరిత్యాగులగనో మారెదరన్న అతిశయోక్తికాదు.

## భరతనాట్యం

భరతనాట్యానికిన్ని చిత్రకళకున్ను పరస్పరసంబంధము గలదు. ఇదియును భారత కళలలో నొక్కటి. ఈ విద్యను మన పూర్వీకులందరును నిత్యకర్మానుష్టానముగా అభ్యసించుచుండిరి. ఇది మనదేహసౌష్టవమునకును ఆరోగ్యమునకును మరియు సుందరమగు ఆకారమును తీర్చును. ఈ విద్య నభ్యసించినవారు నడచిన, నిలబడిన ఎంతయో సొంపుగ గాన్పింతురు. ఈవిద్య నభ్యసించనివారు దానిని imitate చేయబోయిన వక్రువసుడికంటె అధ్వాన్నముగ కనబడుదురు. భారతకాలములో బృహన్నల ఉత్తరకు నాట్యము నేర్పినట్లు కలదు. యిప్పుడు ఈకళకు దేవదాసీల స్వాధీనమందేగతి పట్టినదో మీకే తెలియును. ఇప్పుడిప్పుడు శ్రీ॥ బాలసరస్వతి, గోపినాధ్, ఉదయశంకరుగార్లు ఈకళను పెంపొందజేయుట సంతోషదాయకము! ఈ భరతనాట్యము నేడభ్యసించు విజయనగరకళకు బునాదివంటిది. మన దక్షిణదేశమందుండు యావత్ దేవాలయములలోను మనము చూచెడు విగ్రహముల సొబగు, వైఖరి, ముఖవైఖరి ఇత్యాదులు కానవగును. ఇది మన చిత్రకళకు ఎంత ఉపయోగకారియో చూడుడు!

## ఇప్పటి చిత్రలేఖనము—నా అభిప్రాయము

ఉత్తమవాద్యములైన వీణ, తంబూరాలను మూలత్రోయించి నేముందని బయలుదేరిన హార్మోనియమును కొంతమట్టుకు ఈకాలపు కొందరు చిత్రకారులు వ్రాసిన చిత్రములతో పోల్చవచ్చును. ఎట్లన: చిత్రకారుడు ప్రమాణగ్రంధములను చదువక తన వ్యక్తిత్వమునుకూడ మఱచి లేనిపోని నవనాగరికతా పద్ధతులతో ఇచ్ఛానుసారముగ చిత్రముల రచించుచుండుట మిక్కిలి శోచనీయము. ఒక్కఉదాహరణము చెప్పిన మీరే గ్రహింపవచ్చును. పతివ్రతాతిలకమగు దమయంతీచిత్రమునకు ఒకపక్కపాపట, జంపర్ జాకెట్టు, లోలక్కులు పెట్టి ప్రాచీనపద్ధతుల మఱచి రచించిన చిత్రములనే ప్రమాణములుగాగొని ఆవిధముగా నాటకములలోను సినిమాలలోను దమయంతి, రుక్మిణి, సీత పాత్రలను ధరించి ప్రదర్శించిన చూచుటకు యెంత అసహ్యామో మీరే యోచింపుడు.

మన లలితకళలు వృద్ధికి రావలయునన్న హార్మోనియమును పై పేర్కొన్న చిత్రములను రాతికికట్టి నూతిలోపడ వేయవలెను.

4

కొందరు సోదరీమణులు తమ చిన్నిబిడ్డలను ఆచిత్రముల ననుసరించి అలంకరించి యిరుగుపొరుగువారితో 'చూడవే మాఅమ్మాయి దమయంతీదేవిలాగున ఉన్నదికదా' అని సంతోషించుచుండుట అనుదినము చూచుచున్నాముగదా. అటుగాక, సోదరసోదరీమణులారా, దేవతావిగ్రహములు కాని, పురాణగాథలుగాని చిత్రించునపుడు, ఆయా విగ్రహములకు తగుమైన అంగసౌష్టవము, భావగంభీరత సాధ్యమైనంతవరకు ఆకాలపు ఆభరణములు, వైఖరి కనుపడుచుపవలయును. భావశూన్యమైన చిత్రము చత్రాతిబంధయని నా అభిప్రాయము.

## విన్నపము

తన జీవితమంతయు చిత్రకారుడు చిత్రరచనలందే, తత్ పాండిత్య అన్వేషణమందే కాలముగడపి, తనకు అలవడినవిద్య తనతో నశింపచేయక, చిన్నబాలురకు బాలికలకు నేర్పి, వారి అభివృద్ధికై పాటుపడవలెను. ఒక్కొక్క చిత్రకారుడును తన జీవితములో కొందరిని తయారుచేసిన యితర దేశములకంటెను మనదేశము చిత్రకళయందు మిన్న యనుపించుకొనును. మనదేశమే ఇతర దేశములకు మార్గదర్శకము కాగలదు. అదియే నా ప్రార్థన. అద్దానికొరకే నేనిప్పుడు పాటుపడుట. ఒక చిత్రకారుడు వేరొక్కచిత్రకారుని జూచి అసూయపడు బుద్ధులు మాని విశాలదృష్టితో చూడవలెను. ఈఅఖిలభారతదేశమందలి చిత్రకళోపాసకులగు సోదరసోదరీమణులందరు మన దగ్గిరచుట్టములు. జాతి, మత, బేధములు లేవు మనకు. ఇంక మనకెందుకండీ యీ అసూయ?

ఈ చిత్రకళాభ్యాసముచే మన ఆత్మతృప్తికేకాక మనదేశ నాగరికతకు, పైగా ఆ సర్వేశ్వరుని అనుగ్రహమునకు పాటుపడినవారి మగుదుము. సోదరసోదరీమణులారా! ఈ విషయముల కొంత స్వతంత్రించి చెప్పినందుకు నన్ను మన్నింపకోరెదను. మీవంటి ఉదారహృదయులు చిత్రలేఖనమును, చిత్రకారులను, పోషించి ప్రోత్సహించి ఆదరింపవలెనని దీనతతో వేడుకొనుచున్నాను.

యిట్టి అవకాశమును నాకొసంగినందులకు శ్రీ కేసరిగారికి నాహృదయపూర్వక నమస్కారములు. ఓపికతో మీరందరు విన్నందుకు మీకును నా నమస్కారశతములు.

తర్వాత శ్రీమతి కొలచిన పద్మనీదేవిగారు కంకణప్రదానోత్సవసందర్భమున శ్రీమతి చిల్కపాటి సీతాంబగారిచే కంకణగృహీతలనుగురించి రచింపబడిన యీ దిగువ పద్యములను చక్కని రాగధోరణిలో శ్రోతానందకరముగ జదివిరి.

క. అమ్మా సుగుణమ్ముల జొంపమ్మా సౌభాగ్య భోగభావుకములవా
సమ్మా వనితా జనరత్నమ్మా మా వినతి గొనగదమ్మా నెమ్మిన్

## గృహలక్ష్మి జయంతి మహోత్సవము

క. డెందమున కార్యశూరత సందడిగొన ధీజనావళి సన్నుతిసేయన్
సుందరుల భాగ్య మనదగు హిందూసుందరిని ముప్పదేండ్ల వరుసగన్

చ. నడుపుదువంట యెంతటి ఘనంబగు కార్యధురీణవంచు ని
న్నుడువగ నేర్తు పూరుషుల నూనధనాది మహోపపత్తులన్
బడసి యొనర్ప కష్టతరమా నిక స్త్రీ జన మిల్లు పత్రికన్
దడయక నిర్వహించెడి విధంబు మహాద్భుతమా దలంపగన్.

చ. గుణము గ్రహించి తద్గుణము గోరి మహిన్ వెలయించి స్వర్ణకం
కణమలరించి మించిన సగౌరవయుక్తిని నాదరించె స
ద్గుణముల ప్రోవువైన నినుకోర్కి మెయిన్ గృహలక్ష్మి, బద్ధకం
కణగద స్త్రీ జనోన్నతికి కల్పకమే విదుషీజనాళికిన్

### మాసోదరి శ్రీమతి రత్నాల కమలాబాయిగారికి

ఉ. శ్రీ కమలాకుమారి నుతిసేయగనౌనె త్వదీయ చిత్రలే
ఖాకమనీయతాగరిమ గాంచిన మించిన హావభావ ర
మ్యాకృతులన్ సెలంగె నిటు మంజుల చిత్రకళా విభూతికిన్
నీకు సమానలేరి రమణీ! రమణీయ కళాకలాపనీ!

చ. అరయుదు తావకీన లలితాకృతిన్ గృహలక్ష్మిపత్రికా
వరమున నప్పుడప్పు చెలువంబుగ నిన్నటి మాసపత్రికన్
వరమతి చిత్రలేఖినిని వ్రాసిన శ్రీశువినోదలీలన్
దరమె నుతించి వ్రాయుటకు ధన్యవు చిత్రకళా ధురీణతన్

ఉ. ఒక్కతె ముందుగూరుచుని యొప్పులకుప్ప విధాన వేణువున్
మక్కువ నూదు మానియయి మానిని వెన్కవసించు నొక్కచోన్
టక్కరిదాంగ చందమున డాగె నొకర్తుక వెన్క కాన్తయై
యొక్క లతాంగితో మెలగుచుండె బ్రియంబునగూడి ప్రోఢమై.

గీ. గరిమ నీరీతి చిత్రరేఖా కలాప, చతురవౌ నిన్ను అభినవచిత్రరేఖ
యనుచు బేర్కొన జెల్లదే యది దలచియె, సరసకవియు ననల్పధీశాలియనగ
ప్రీతి బేర్గన్న పసుమర్తి కృష్ణమూర్తి, నీదు చిత్రకళారూఢి నిరుపమాన
మనుచు సవిమర్శనంబుగా ననియె మున్ను, రమణ గృహలక్ష్మి కంఠాభరణమునంద,
అట్టి దివ్యానుభావుల యాదరమున, ఘనతనొందిన సత్కలాకౌశలమున,

భవ్యగృహలక్ష్మి మన్నించు ప్రాభవమున, వాసిగనుమమ్మ సోదరీ! భారతీయ
లలితచిత్రకళా భాగ్యలక్ష్మివనగ ......

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు యీ వుత్సవమునకు రాజాలక, యుత్సవమునకు విజయమునోరుచు వ్రాసిపంపిన యీక్రింది యుత్తరము జదువబడెను:

"ఈవత్సరము గృహలక్ష్మి స్వగృహమున గృహలక్ష్మిజయంతి జరుపబడుటయు, ఈసమయముననే గృహలక్ష్మి కంకణసత్కారమహోత్సవముగూడ జరుగుచుండుటయు నెంతయు ముదావహముగనున్నది. నవీనములగు నీ యేర్పాటులవలన గృహలక్ష్మి కితోధికయశస్సు కలుగగలదని యాశించెదను.

దాదాపు నలుబది వత్సరములనుండి ఆంధ్రమహిళామణుల సర్వతోముఖాభివృద్ధికై బహువిధముల సేవయొనర్చిన ముసలిముత్తైదువ మాతృశ్రీ శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు గృహలక్ష్మి స్వర్ణకంకణము స్వీకరించుట అత్యంతానందజనకముగనున్నది. వీరితోబాటు సుప్రసిద్ధ చిత్రకారిణియగు శ్రీమతి ఆర్. కమలాబాయిగారుగూడ స్వర్ణకంకణముచే సత్కరింపబడుట సంతసము గలిగించుచున్నది. సాహిత్యకళల రెండిట గృహలక్ష్మికిగల సమానాదరము యిందువలన విదితమగుచున్నది. గృహలక్ష్మి స్వర్ణకంకణముల స్వీకరించుచున్న సోదరీమణు లిరువురకును నా మనఃపూర్వకాభివందనములు. ఆంధ్రనారీమణులకు తాము గావించుచున్న అపూర్వాదరసత్కారములకు నా నమస్సులు.

తమ సత్సంకల్పము లిటులనే నిరంతరాయముగ చిరకాలము నెరవేరుచుండునట్లు భగవాను డనుగ్రహించునుగాక."

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ (బొంబాయి)గారిచే కంకణగృహీతలను ప్రశంసించుచు వ్రాయబడిన యీ క్రిందిపద్యములు జదువబడినవి:

శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారికి,

శ్రీలీలామయబుద్ధి నిర్జరులు సంసేవింపరత్నాకరో
ద్వేలోత్తుంగతరంగముల దేవిగాగూడి క్రీడించుశ్రీ
లోలుండెప్పుడు బ్రోచు శేషమను వాలుంజూపులన్ లక్ష్మియే
కాలంబందుననైన మీకు సుఖసంఘాతంబులందిచ్చెడున్.

పరమంబగు విజ్ఞానము, సిరి, సౌఖ్యమునాయువులను, జేకూర్చుచుశ్రీ
హరియును సిరియును హరుడును పరమేష్ఠి నిరంతరంబుపాలింత్రు మిమున్.

# గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలు



ప్రథమ గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలు
శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు



శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు
1935



శ్రీమతి కవితిలక, కవితావిశారద
కంచనపల్లి కనకాంబగారు
1936

ధనమొ; మాటయొ; ఏమియో; యనువులేక పురుషులే నిర్వహింపగాబోల రెండు
నీవొనర్చితి పత్రికానిర్వహణము చెలగియేమని నుతియింతు శేషమాంబ.

హిందూసుందరి సుజనానందంబయి యనుదినంబు నభివృద్ధిపెసర్
జెందియ నంతయశంబును బొందుటనీనేర్పుగాదె పూతచరిత్రా.

కోరియింకదాన పారసారస్వత సేవచేసి సతమశేషవిభవ
భాగ్యమబ్బునట్లు పత్రికాముఖమున సేయుగాక మనకు శేషమాంబ.

శ్రీమతి కమలావతిదేవిగారికి,

కరివదనుఁడు మురిపెముతో కరముముదముసేయ జనని గారబమొప్పన్
దరిజేర్చుకొనగ నగియెడు హరుఁడనవరతమ్ము కమలమాంబను బ్రోచున్.

చిత్రలేఖకునుద్దియై చెలువుగుల్కు చిత్రముల పెక్కురచియించి చిన్ననాడె
కీర్తిగడియించి విఖ్యాతమూర్తివగుచు తెలుగువనితలకిల ఖ్యాతితెచ్చినావు.

తెనుగుశిల్పము కీర్తిగని కొండజాలకింపుగ జీవకళధారపోయునాడు
రాజరాజులమందిరంబులలో తెన్గుచిత్రకళలు గొప్పజెందునాడు
తెలుగుయశశ్చంద్రికలు చిత్రకారులకుంచెలందు ప్రతిఫలించునాడు
ఆంధ్రావనీశవిఖ్యాతకీర్తి జ్యోత్స్న శిల్పకళకు భిక్షసేయునాడు
లలితకళలకు బన్నముగలుగకుండ తెలుగుసతులు కళారాధకులుగ నేడు
ఆరితేరిరి నీవునునట్లె లలిత కళల బోషింపగడఁగుము కమలమాంబ.

రసమయంబులైన ప్రకృతిచిత్రంబుల చిత్రరూపములుగ జేసివైచు
కమలమాంబగారి కైవడి నికతెన్గు గరితలెల్ల నేర్వగలరుగాక!

ఇంకను కారణాంతరములచే రాజాలక తమతమ శుభ సందేశములను బంపిన శ్రీమతి పులవర్తి కమలావతిదేవిగారు (రాజమండ్రి), శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు (రాజమండ్రి), శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు (కాకినాడ), శ్రీమతి గం|| శివకాంతమ్మగారు (బరంపురం), శ్రీయుత బెజవాడ రామచంద్రారెడ్డిగారు (బుచ్చిరెడ్డిపాలెం), శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డి జమీందారుగారు (నెల్లూరు), శ్రీ|| యన్. తంబు చెట్టిగారు, మైసూరు హుజూరు కార్యదర్శిగారు (బెంగుళూరు), మొదలగువారి యుత్తరములు జదువబడినవి.

తదనంతరము, సభికులు కరతాళధ్వనులు చేయుచు తమ యుత్సాహమును దెల్పుచుండ, గృహలక్ష్మి సంపాదకులు శ్రీయుత డాక్టరు క. యన్. కేసరిగారు గృహలక్ష్మి ప్రశంసమును, లలితకళాభివృద్ధికై గృహలక్ష్మి చేయ బూనుకొన్న కృషినిగూర్చియు నీ విధముగ ఉపన్యసించిరి:

సోదరీమణులారా, సోదరులారా!

గృహలక్ష్మిబాలకు అత్యుత్సాహముతో యీనాడు పదునొకండు సంవత్సరములు వెళ్లి పన్నెండవవేడు ప్రారంభించుచున్నది. ఈ బాలకు బాలారిష్టములు ఏమియునులేక వైద్యునియింట హాయిగ వర్ధిల్లుచున్నది.

పుట్టినదాదిగ తన జిలిబిలిపలుకులతో ఆంధ్రవనితాలోకమునకు పరిచితమై, వారికి సారస్వతాభివృద్ధియందభిరుచి కలుగజేసి వారిచే రచింపబడుగద్య పద్యాదులను ప్రేమతో ప్రచురించి సర్వవిధముల ప్రోత్సహించుచున్నది.

ఆంధ్రదేశమందున్న కవయిత్రులకు, సంఘసేవకురాండ్రకు తానుత్తోడై, వారి యాశయములకు చక్కని ప్రచారము కలుగజేసి వారిని ప్రేమించి పూజించుచున్నది.

అబలయైనను, తన యాశయమగు స్త్రీజనోద్ధరణమునకు, సమయము వచ్చినప్పుడెల్ల స్త్రీస్వాతంత్రమునకును, విద్యాభివృద్ధికిని, వారి హక్కుల కాపాడుటకొరకును, సంఘదురాచారములను రూపుమాపుటకును ధైర్యముతో చర్చించి వాదించుచున్నది. స్త్రీజనపరముగ నేదైన హానికరముగ పరిణమించిన దానిని ఏమరుపాటులేక నిర్మొగమాటముగ ఖండించి నారీలోకమునకుతాను అండగ నిల్చుచున్నది.

ఇట్టి అమూల్యమగు సేవకు చేదోడువాదోడుగనుండి తన్ను అతిగారాబముతో పెంచి పెద్దచేయు ఆంధ్రవిదుషీమణులకు బంగారుకంకణముల దొడిగి తన కృతజ్ఞతను దెల్పుకొనుచున్నది.

కాని, నిష్కళంకమైన దేశసేవచేయుచు, వినయవిధేయతలు మూర్తీభవించియున్న యీ బాలకు ఆంధ్రుల యాదరణము అత్యల్పముగానున్నందున అప్పుడప్పుడు చికాకుపడుట తటస్థించుచున్నది.

ప్రస్తుతము యీ పత్రికకు డబ్బిచ్చిచదువు చందాదారులు 3000 మంది మాత్రమే యున్నారు. బెంగాలు, గుజరాతి, హిందీభాషలలో ప్రచురించు స్త్రీల పత్రికలకు పదివేల చందాదారులకు పైగా యున్నారని వినుచున్నాను.

ఆంధ్రదేశమున ప్రత్యేకముగా స్త్రీల పరముగ ప్రచురింపబడు పత్రిక యిది యొక్కటియే యని చెప్పవచ్చును. స్త్రీవిద్య దినదినాభివృద్ధి పొందుచున్ననూ, ఆర్థిక సాంఘికాది యితర విషయములలో యింకను ఎంతయో అభివృద్ధి చెందవలసిన యీరోజులలో యీ పత్రికాపుత్రికను పోషించి తమ సంఘవ్యక్తిత్వమును నిర్మించుకొనవలసినదిగా కోరుచూ, అట్టి విషయమున అశ్రద్ధవహించియున్న తెలుగుతల్లులను హెచ్చరించుచున్నాను.

చిత్రకళాభివృద్ధికై యీ గృహలక్ష్మిపత్రిక త్రివర్ణచిత్రములతో తయారుచేయబడుచున్నది. ఒక్క చిత్రమును తయారుచేసి ముద్రించుటకు సుమారు నూరు రూపాయిలు ఖర్చగుచున్నవి. అట్టియెడ యిది ఎంతకష్టమగు విషయమో వేరుగ జెప్పనక్కరలేదు. పత్రికయు చక్కని వనపుకాగితములపైనే అచ్చొత్తించి ప్రచురింపబడుచున్నది.

ఇంకనూ పత్రికను సర్వాలంకారభూషితమును చేయుటకు సర్వప్రయత్నములు జరుపబడు చున్నవి.

ఇట్టి యీ అమూల్యవిషయములకు సర్వవిధ ప్రోత్సాహము నిచ్చుచు, తన్ను ఎంతగనో ఆదరించుచున్న ఆంధ్ర రమణీమణుల విజ్ఞానాతిశయములకు మెచ్చి, ప్రతిసంవత్సరము వారి హస్తములకు రు. 116 లు విలువగలిగిన బంగారుకంకణముల దొడుగు చున్నది.

మొదటికంకణము బాపట్ల కాపురస్తులగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికిని, రెండవకంకణము నెల్లూరు కాపురస్తులగు శ్రీమతి చిలకపాటి సీతాంబగారికిని, మూడవసారి పండితపారితోషికముగ యీసభ నలంకరించియున్న శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకాంబగారికిని, నాల్గవకంకణము రాజమహేంద్రవరము కాపురస్తులు వైశ్యకుల దీపికయు అనదగు శ్రీమతి పులవర్తి కమలావతిదేవిగారికిని గృహలక్ష్మి సమర్పించు కొన్నది.

ఈ దినమున యీ పెద్దముత్తైదువ, యీ విద్యావతి, యీ సంఘసేవకురాలు శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారికి, గృహలక్ష్మి కన్య యీ స్వర్ణకంకణమును సమర్పించుకొనుచున్నది. గత 33 ఏండ్లనుండియు హిందూసుందరి పత్రికను నిరాటంకముగ నడుపుచు, నారీప్రబోధమును చేయుచున్నారు. ఇటీవల నేత్రపటుత్వము తప్పినను హిందూసుందరి పత్రికను సక్రమముగా నడుపుచున్నారు. నిష్కళంక సంఘసేవకురాలైన యీమె విద్యాభివృద్ధికి సర్వవిధముల దోడ్పడిన యీమె భర్తయగు శ్రీయుత బాలాంత్రపు సుందరరామయ్యగారికి నా నమస్కారముల నర్పించుచున్నాను.

గృహలక్ష్మి యీ సంవత్సరమునుండి, లలితకళాభివృద్ధికై పాటుపడ నుద్దేశించినది.

ఈ లలితకళలవిషయమున గృహలక్ష్మి యుద్దేశము నొకింత చెప్పదలచుకొన్నాను.-

సృష్ట్యాదినుండియు యీ లలితకళలకును మానవులకును అవినాభావసంబంధ మున్నది. అందును స్త్రీలయెడల నిది చక్కగ రాణించును. యీ లలితకళలలో ప్రత్యేకముగ చిత్రలేఖనమునందు పూర్వకాలమునుండియు స్త్రీలు విశేషప్రావీణ్యము గలిగియున్నారనుటకు అనేక నిదర్శనములున్నవి—

బాణసుతయైన ఉషాకన్య చెలికత్తెయగు చిత్రలేఖ చిత్రలేఖనమునందు మిక్కిలి నేర్పరి. ఉష తన స్వప్నమునందు వరించిన పురుషుని రూపురేఖవిలాసాదులు వినినంత మాత్రముననే యాతని చిత్రించి, స్వయంవరమందు యక్ష కిన్నెర గంధర్వాదులలో

యున్న అనిరుద్ధుని పోల్చుకొనుటలో చిత్రలేఖ ఉషాకన్యకు తోడ్పడినది.—నృత్యకళకు అధిదేవతలైన 16 గురిలో స్త్రీలు యిద్దరు. వారు పార్వతీదేవి, యీ ఉషాకన్య.

ప్రభావతీప్రద్యుమ్నమునందును, ప్రభావతికలలో పార్వతి కనపడి, ఒక రాకుమారుని చిత్రమును జూపి అతడు ఆమెకు భర్త యగునని జెప్పగా, కలలో చూచిన యాతని చిత్రించి చెలికత్తెకు చూపుటయు, శ్రీ హర్షుని రత్నావళీనాటికయందు సాగరిక తాను వరించిన రాజుయొక్క చిత్రమును చిత్రఫలకమునందు చిత్రించిన దానిని చూచి రాజు ముగ్ధుడగుటయు, మాళవికాగ్నిమిత్రమునందు రాణియగు వకులావళిక తన పరిచారిక యగు కౌముదిక నుద్దేశించి 'చిత్రములు ఏమైనా యున్నవా' యనుటయు, యీమె చిత్రించిన చిత్రముల జూపుటయు, అంత వాటినిగురించి చిత్రవీక్షణము, చిత్రచర్చలు మొదలగునవి జరుపుటయు మొదలుగాగల గాథలను జూడగా యీ చిత్రలేఖనమును వినోదార్థముగనే గాక, అంతఃపురాంగనలు దీని నొక ముఖ్యవిద్యగా నభ్యసించి, దాని నుపాసించెడివారని స్పష్టమగుచున్నది. మన పురాణేతిహాసముల గమనించిన మయసభాది విశేషము లిట్టివెన్నియో గనుపించును.

ఇటీవల చారిత్రాత్మకముగా యీచిత్రకళ హంపి, అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా, భాగ్ మొదలగు గుహలందు వెల్లివిరిసినది. భాగ్ గుహలందు గతమాసమున ఇంకను స్త్రీ పురుష చిత్రములు కొన్ని దొరికినవని తెలియుచున్నది.

కాని నేడు దీని మహాత్యమును పూర్తిగ మరిచిపోయి, దీని నుపాసించువారు చాల తక్కువగనున్నారు. అందును స్త్రీలలో చేతివ్రేళ్లమీది లెక్కకుకూడ చాలరు.

గాన లలితమంజులమైన గృహనిర్మాణమునకై నారీలోకమందు యీ లలితకళాభివృద్ధికొరకు నేటినుండియు గృహలక్ష్మి పాటుపడ సమకట్టినది.

ఈనాడు, యీచిత్రలేఖనమునందు మంచి నేర్పుగల యీ రత్నాల కమలాబాయి గారికి స్వర్ణకంకణమును దొడుగుచున్నది. ఈ కమలమ్మగారి చిత్రలేఖనప్రవీణత గృహలక్ష్మి పాఠకులకు చాల పరిచయముగలదు. ఈనాడు వెలువడిన యీ గృహలక్ష్మి పత్రికలోని 12 త్రివర్ణచిత్రములు యీ హాలులో ప్రదర్శించినచిత్రములకు ప్రతిరూపములే. ఈమెకు చిత్రలేఖనమందేగాక సంగీతమునందుగూడ పరిచయముగలదు. ఇంతకుముందు పాడిన ప్రార్థనాగీతములే యిందుకు నిదర్శనములు.

ఈమెకు ఛాయాచిత్రములను తీయుటలోను, వాటిని పెద్దసైజులలోనికి మార్చుటలోను సామర్థ్యముగలదు. యీమె తయారుచేసిన నాఫొటోను, బిడ్డఫొటోను యిచ్చట చూడనగును. యీమె ఉత్తమవిద్యలగు యీ గానకళ, చిత్రలేఖనములను రవీంద్ర కవీంద్రుని శాంతినికేతనమునందు అభ్యసించి శిక్షణము పొందియున్నది.

శ్రీ గృహలక్ష్మి జయంతిమహోత్సవము



అధ్యక్షులు, కంకణగృహీతలు, తదితర విదుషీమణులు ఇందుగలరు.



శ్రీ గృహలక్ష్మీ జయంతి మహోత్సవసందర్భమున జరిగిన శ్రీ గృహలక్ష్మీ
స్వర్ణ కంకణ బహూకరణోత్సవము.

సంపాదకులగు శ్రీయుత కేసరిగారు, చిత్రకళావిశారద శ్రీమతి రత్నాల కమలాబాయిగారి
హస్తమున శ్రీ గృహలక్ష్మీ స్వర్ణకంకణమును స్వయముగ అలంకరించుట.

నా ప్రోత్సాహముతో యీమె 'ఆంధ్రకళామందిర' మను పేరుతో నొక స్టూడియోను మద్రాసులో ఏర్పాటు చేయదలచినది. ఈమందిరమున చిత్రకళకు సంబంధించిన Oil-Painting, Photography మొదలైనవి తయారుచేయబడును. వీణ, ఫిడేలు, గాత్ర పాటలు నేర్పబడును.

లలితకళలకు సర్వవిధముల దోహదమిచ్చు యిటువంటి మందిరములు ఎంత యవసరమో గ్రహించగలరు.

లలితకళాభ్యుదయమే భారతజాతీయాభ్యుదయమని చెప్పి, రవీంద్రుడు తన శాంతి నికేతనమున లలితకళలకు ప్రత్యేకస్థానమిచ్చియున్నాడు. మహాత్ముడు గ్రామపరిశ్రమలను పునరుద్ధరించవలెనని హెచ్చరించినాడు. దీర్ఘముగ నాలోచించినచో, అది లలితకళా వికాసమేగాని వేరుగాదు.

స్త్రీచే నిర్వహింపబడబోవు యీ కళామందిరములలో నిది మొదటిదిగాన ఆంధ్రులందరు దీని యభివృద్ధికి సర్వవిధముల దోడ్పడుదురుగాకయని ప్రార్థించుచున్నాను.

రెండుసంవత్సరములుగ తమిళసోదరీమణులకు తమిళమున గృహలక్ష్మి పత్రికను కూడ ప్రచురించుచున్నాను. వారికికూడ వచ్చేసంవత్సరమునుండి కంకణముల సమర్పింప దలచుకొన్నాను.

మరియు, యీకంకణములను స్వీకరించువారిచే వ్రాయబడు గ్రంథములనుగూడ ఉచితముగ అచ్చొత్తించి యిచ్చుచున్నాను.

గాన యీనా సదుద్యమమునకు సర్వవిధములతోడ్పడి జయప్రద మొనర్పవలసినదిగా ఆంధ్ర సోదరసోదరీమణులను ప్రార్థించుచు, యీ గృహలక్ష్మి స్వర్ణకంకణములను స్వీకరింపవలసినదిగా శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారిని, శ్రీమతి రత్నాల కమలా బాయిగారిని కోరుచు యింతటితో విరమించుచున్నాను.

ఉపన్యాసానంతరము, శ్రీ|| కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణమును అధ్యక్షురాలగు శ్రీమతి పాణకా కనకమ్మగారిచేత వైద్యమునకు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారికి తొడిగించిరి.

చిత్రకళానైపుణికి శ్రీమతి రత్నాల కమలాబాయిగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణమును శ్రీయుత కేసరిగారు స్వయముగ తొడిగిరి.

కంకణ బహూకరణానంతరము తమ కృతజ్ఞతను దెల్పుచు, ఆదర్శ గృహిణీ ధర్మములకు తమ సందేశమునిచ్చుచు శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు యీక్రింది విధముగా నుపన్యసించిరి.

సభాస్వామినీ! సోదరీమణులారా! ఆర్యులారా!

నేడీమహాసభలో నాకు మన్ననగలుగు యోగ్యతకు కారణమైన నా నేర్చిన కొంచెము విద్యయు, నే జేసిన స్త్రీవిద్యాప్రచారమును నా కేదయామయుని యాజ్ఞచేత, నవ్యాజానుగ్రహముచేత యబ్బినవో యట్టి నా ప్రాణేశ్వరునకు నమస్కరింతు.

నాకంటె వేయిమడుంగు లధికమైన సతీరత్నములతోఁబాటు నాకీ 'గృహలక్ష్మి కంకణము' సభాసమ్మానము సంప్రాప్తించు శుభసమయమున నాకు సంస్కృత కావ్యపరిచయముఁ గలిగించిన శ్రీమాన్ కందాళ నరసింహాచార్లగారిని, మఱియు నాంధ్రకావ్య పరిజ్ఞానముఁ గలిగించి, ప్రచారమునందును నా కాదర్శప్రాయముగనున్న గం. భా. స. పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారిని తొలుత స్మరించుట నా ముఖ్యధర్మము.

ఈసందర్భమున నాతోఁబాటు చదువుకొని నా బహిఃప్రాణమై మా విద్యార్థినీ సమాజకార్యములందును, హిందూసుందరి పత్రికానిర్వహణమందును, సంపాదకత్వమునదును నాకుఁ జేదోడు వాదోడై యావజ్జీవము మెలంగి నన్నువిడిచి వైకుంఠవాసమున కేగిన శ్రీమతి మాడభూషి చూడమ్మగారికి నే తత్సభాతీర్థమున నశ్రుతర్పణము నొనరించి సఖీఋణము తీర్చుకొందును.

ధీరురాండ్రెందరో యాంధ్రదేశనారీరత్నముల విద్యాభివృద్ధికై ప్రచారమొనర్చి, గ్రంథరచనమొనర్చి కీర్తిశేషురాండ్రైరిన శ్రీమతి భండారు అచ్చమాంబగారు, గుండు అచ్చమాంబగారు, కళ్లేపల్లి వెంకటరమణమాంబగారు, దామెర్ల సీతమ్మగారు, కొటికలపూడి సీతమ్మగారు మొదలగువారు యశఃకాయములతో మనకు ప్రోత్సాహము నొసర్చుచున్నారు. వారెల్లరు చిరస్మరణీయులు.

ఫలములో భేదమున్నను స్త్రీవిద్య ప్రాచీనకాలమందుఁగూడ భరతఖండమునఁ బ్రచారమున నున్నదియే. నేటి స్త్రీ విద్యాప్రచారమున గార్గి, మైత్రేయి, గంగాదేవి, తరిగొండ వేంగమాంబ, మొల్ల మొదలగు మహానుభావురాండ్ర పేరులు స్మరింపఁబడుచున్నవి. కాని వారు చదివిన చదువులు నేఁ డెచ్చటనోగాని ప్రచారములో లేవు.

కాలభేదము కలిప్రచారము దానికిఁ గారణము. నేటికాలమునఁ బడమటిదేశపు తీరుల ననుసరించు విద్యలపై ప్రాచీనులకు నంత యాదరము లేదు. ఆకారణమున స్త్రీ విద్యకుఁ గొందఱు వ్యతిరేకులున్నారనుకొన్నను ఆ వ్యతిరేకము, విద్యావిధానములపై, బోధించు విషయములపై నున్నదే కాని విద్యపైఁ గాదు.

మ-రా-శ్రీ రాయసం వెంకటశివుఁడుగారి జనానా పత్రికయు, స్త్రీరత్నములచే నడుపఁబడిన సావిత్రి, అనసూయ, ఆంధ్రలక్ష్మి మొదలగు పత్రికలు కొలదికాలము స్త్రీ విద్యావ్యాపకమునకై తెలుగుదేశములో యత్నమొనరించినవి. పత్రికానిర్వహణము మన దేశమున పురుషులకే దుర్ఘటమగుచుండ స్త్రీలవిషయము చెప్పవలెనా? అందుచేత నన్నియు కొద్దిలోనే యలసి నిలిచిపోయినవి.

విత్తనమునకై మా పత్రిక యొక్కటియే ముప్పదియేండ్లకుపైగా విదుషీమణుల

సహాయమున నిలువఁబడియున్నది. మా హిందూసుందరి పత్రిక తొలుత మ-రా-శ్రీ సత్తిరాజు సీతారామయ్యగారిచే స్థాపింపఁబడి, దానికి స్త్రీల సంపాదకత్వము సంపాదింప ఆయన యెంత ప్రయత్నించినను నెవ్వరును దొరకకపోయిరి. శ్రీమతి మొసలిగంటి రామ భాయమ్మగారు కొలదికాలము మాత్రము సంపాదకురాలుగానుండి, పిదప నాకార్య భారము నాపైని మోపిరి.

సంపాదకత్వభార మొక్కటియేగాక, ముద్రణాలయమును ద్రవ్యమిచ్చి కొనవలసిన భారమును దానికి సంబంధించిన సమస్తమైన కార్యభారమును నాపైననే పడినది.

ఈతరుణమున మా కాకినాడ విద్యార్థినీ సమాజము నన్నాదుకొని తనపక్షమున కార్యమును నడచునట్లేర్పాటు కావించినది.

మాసమాజ సభ్యురాండ్రతో నేనును బ్రచారముఁగావించి కొంతధనము సంపాదించియుఁ గొంతస్వార్థము వ్యయమొనర్చియు నీముప్పదేండ్లనుండియు నాపేరనే యీపని నడచుచున్నది.

కాళిదాసు మహాకవియే "మణౌవజ్ర సముత్కీర్ణే సూత్రస్యే వాస్తిమేగతి" యని రఘువంశమణులలోఁ దాను సూత్రమువంటివాడనని చెప్పుకొన్నాడు. నేనును మా హిందూసుందరిపత్రికలో విదుషీమణులు, విద్వాంసులు విరచించుచున్న వ్యాసములకు సంపాదకురాలను పేరుతో సాక్షిగనున్నాను. సూత్రప్రాయముగ నామమాత్రముగనున్న నాకు, పుష్పములనుగట్టిన యరటినారకుఁగూడఁ బూజ్యత గలిగినట్లు నేఁడీ సభాపూజ్యత గలిగినది.

'గృహలక్ష్మి' మాకు కడగొట్టుచెల్లెలయినను, గడుశైశవయములో నున్నదయ్యును, సంపన్నురాలయ్యును, వృద్ధురాలైన యీ హిందూసుందరీ సోదరిని మన్నించి, తద్వారా పెద్దముత్తైదువునైన నాకు నేఁడీ స్వర్ణకంకణ ప్రదానముఁజేసి తన గుణగ్రహణపారీణతయు, సౌజన్యము వేనోళ్ల చాటుచున్నది. కావున మాయీ చిట్టిచెల్లెలు 'గృహలక్ష్మి' భాగ్యవతియై, చిరంజీవియై వర్ధిల్లుగాకయని యాశీర్వదించుచున్నాను.

ఈ కంకణప్రదానముచే నాంధ్రదేశమున నారీమణులను, వ్యాసరచయితలను, కవయిత్రీమతల్లులను, విదుషీమణులను గౌరవించుచున్న శ్రీయుత కేసరిగారును దీర్ఘాయురారోగ్యైశ్వర్యవంతులై వృద్ధిఁబొందుదురుగాక! ఇంతటితో నాకృత్యము సకలము పూర్తియైనను నారీమణుల విద్యావిషయమునుగూర్చియుఁ బరమధర్మములఁగూర్చియు నించుక ముచ్చటించుట నాధర్మమనియెంచి వృద్ధురాలనైన నాయనుభవము కొలది మాటలలోఁ జెప్పఁదలఁచుకొన్న నన్ననుగ్రహింతురుగాక యని సభవారిని బ్రార్థించు

చున్నాను. శ్రీయుత కేసరిగారు నాకీనాఁడు సభాముఖమునఁజేయుచున్న గౌరవముకంటె వేయిమడుంగులగౌరవ మీవఱకే కావించియున్నారు.

రెండేండ్లక్రిందట నెల్లూరుపురమున మొల్లజయంతిసందర్భమున గృహలక్ష్మి గౌరవము శ్రీమతి కవితిలక, కవితావిశారద, కంచనపల్లి కనకాంబగారి కైదునూట పదార్లు నన్నధ్యక్షురాలనుజేసి నాచేత నిప్పించిరి. ఆగౌరవము నేనెన్నఁడు మఱువఁజాలను. ఏనారీశిరోమణి, గార్గి, మైత్రేయి మొదలగు ప్రాచీనకాంతాలలామలవలె తత్త్వజ్ఞాన సంపన్నమై, తరిగొండ వేంగమాంబవలె యోగినినై, గంగాదేవివలె మహాకవయిత్రినై, సమస్తవిద్వత్కవిశిఖామణుల పొగడ్తకు నర్హురాలై, తొల్లి మహాకవి తిక్కనామాత్యు నింబోలి యేటేట మహావిద్వాంసులను, కవులను, నూరార్లచే గౌరవించుచు మూర్తీభవించిన భరతఖండ సారస్వతమోయన్నట్లు వెలుంగుటయేగాక యాంగ్లేయ విద్యావైదుష్యమును జాలినంతవడసి మేరీరాణికళాశాలలో నాంధ్రోపన్యాసకురాలుగనుండిన శ్రీమతి కాంచనపల్లి కనకాంబా సతీమణిని గౌరవించుసభకు నన్నధ్యక్షురాలుగ నొనర్చుట నాకు గౌరవ మొసంగుటకన్న నెక్కుడు గౌరవమని నేభావింతు.

స్వార్థత్యాగముచే పవిత్రమైన యీ పొణకా కనకమ్మగారి హస్తములతో నీ గృహలక్ష్మి కంకణము గ్రహించుటయు నాకు పరమానందము. నెల్లూరులో నేటికి నిరువదియైదు సంవత్సరములకు బూర్వము తాను కార్యనిర్వాహకురాలుగాను మహిళాసభలో మొదట నీ మహనీయురాలిని, పొణకా కనకమ్మగారిని దర్శించితిని. ఆ మహిళాసభలో నీయమ్మ యుత్సాహము నా కిప్పటికి కన్నులలోనున్నది. ఆసభకు తొలుత రూ 116 లు బహుమానము గావించిన యీమె త్యాగము జన్మవ్రతమై యీయమ జీవితము ధన్యమొనర్చినది. అట్టి పొణకా కనకమ్మగారు నేడు అధ్యక్షురాలగుట నా పుణ్యము.

నాకును విద్యాభ్యాసమందు నాశ మెండేగాని సంప్రాప్తి దానికితగినట్లు కలుగలేదు. కావున సంతతిమాయాసతీరక విదుషీమణుల గోష్ఠిలోను, మాసుందరీపత్రిక సంపాదకత్వములోను కాలముగడపుచు వార్ధక్యమున నాకీశ్వరుఁ డనుగ్రహించిన చి. సౌ. మహాలక్ష్మీసుందరమ్మయను నాయేకపుత్రికను సంస్కృతాంధ్రాంగ్లేయ విద్యలందుఁ బ్రవేశపెట్టి నాటినేటి విజ్ఞానమును సమకూర్ప నెంచితిని. ఈశ్వరేచ్ఛచేనాచిన్నది సంస్కృతమున M.A.L.T. పరీక్షలో నుత్తీర్ణురాలై, ఏలూరుస్త్రీలపాఠశాలలో ప్రధానోపాధ్యాయురాలుగఁ బనిచేయుచుఁ దనభర్తతో సుఖముగఁ గాపురము చేయుచున్నది.

ఈ రీతిగా నాశక్తికి జాలినట్లు స్త్రీ విద్యావిషయములో నాచరణము ప్రచారమును గావించియుంటిని. ఈ విషయము నా యనుభవము నిరూపించుటకు మాత్రమే చెప్పియుంటిని. పెద్దదాననై వెనుకముందు లన్నియు నెఱిఁగినదాననౌటచే నా యను

# గృహలక్ష్మి జయంతి మహోత్సవము

భూతిని నాంధ్రపురంధ్రీరత్నములు సానుభూతితో గ్రహింతురని వేడుచున్నాను. కాలపరిస్థితులు మారుటచేతను, సమిష్టి కుటుంబము లంతరించుటచేతను, తమ పోషణము తామే యొనర్చుకొనవలసిన వారుగా నేర్పడిన నారీమణులాపద్ధర్మముగా వ్యవహారమునఁ బ్రవేశించుటయు, నుద్యోగములు చేయుటయుఁ దటస్థించినను, దమతమ యాశ్రమములకుఁ దగిన భారతదేశధర్మమును నిలువఁబెట్టుటయే మంచిదనియు, పరధర్మములను స్వీకరించుట యపాయకరమని కంఠోక్తిగ చాటుచున్నాను.

అర్ధనారీశ్వరునియందువలె స్త్రీపురుషులేకమై యన్యోన్యసహాయంబున ధర్మము నిర్వహించుటకన్న పరమావధి లేదని యెఱుంగుఁడు. స్త్రీ పురుషునితో పోటీ చేయఁదగిన దనియు, పురుషులు స్త్రీలకుఁ బ్రత్యర్థులనియుఁ బ్రకటింపఁబడు భావము మన దేశమునఁ బ్రబలకుండుగాక యని కోరుచున్నాను. మన దేశమున మానవతులు మాతృత్వము, సతీత్వము, గృహిణీధర్మము, గురుదేవతాతిథిపూజనము, పరమధర్మములుగఁ బరిగణించిరి. కాలానుసారమున వాటియందు గొంత యాదరము తగ్గుచున్నను, వాని ననుసరించలేక పోవుట మనోదౌర్బల్యమేగాని విశిష్టధర్మము కాదని తేలుచున్నది.

ఇంక విద్యావిషయమున నక్షరపరిచయము లేనివారికిఁగూడ ధారణాబలమున విద్య నేర్పు కౌశలము మనదేశమున విస్తరించియుండెడిది. సరస్వతీదేవి తన సాహిత్యమును విస్తారముగఁ బురుషులయందును, సంగీతమును విశేషముగ స్త్రీలయందు నిలువఁ బెట్టియున్నది. కావున పాటలలో సమస్తమును స్త్రీలకై యిమిడ్చిన ప్రాచీనుల యేర్పాటు నేటికాలమునఁగూడ నుద్ధరింపబడియున్నది. "ముదితల్ నేరువరాని విద్దెకలదే ముద్దార నేర్పించినన్"అని మ-రా-రా-శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ మహాకవిగారును, "పాటలక్రింద బాడుదురు భారతవర్షమునందు నంగనల్। హాటకగర్భునోట నుదయంబగు వేదమునందు నర్థముల్। తేటగ భారతాదుల సుధీవరగాథల"నని, త్రిలింగవిద్యాపీఠమున కధిపతియు, వైద్యరాజునగు బ్రహ్మశ్రీ దంటు సుబ్బావధానికవిరాజుగారు చెప్పినరీతిగా సామాన్య కళాకౌశలము మొదలు బ్రహ్మజ్ఞానమువఱకు సతీరత్నములు సంపాదింప నర్హురాండ్రై యుండ మీరందఱు నాధునిక కాలమందలి పర విద్యాపరసంప్రదాయ వ్యామోహమునువదలి, యిహపరతారకంబును, భోగమోక్షప్రదంబునగు భరతఖండ సంప్రదాయము నిలువఁబెట్టుటలో నాంధ్రమహాజనులు తమ సతీరత్నములను బుత్రికామణులను నియోగింతురని ప్రార్థించుచున్నాను. సౌభాగ్యవతియగు నీ 'గృహలక్ష్మి'కిని, మఱియు నాంధ్రగృహలక్ష్ములగు పురంధ్రీరత్నములకుఁ బరమేశ్వరుఁడు సర్వదా సకల సౌభాగ్యముల నొసంగుగావుతమని యాశించుచు విరమించుచున్నాను.

శ్లో॥ శరదిందు వికాసమందహాసాం। స్ఫురదిందీవరలోచనాభిరామాం।
అరవింద సమాన సుందరాస్యా। మరవిందాసన సుందరీ ముపాసే॥

పిమ్మట శ్రీమతి రత్నాల కమలాబాయిగారు కంకణ ప్రదానమునుగూర్చియు, చిత్రలేఖనమును గూర్చియు యీవిధముగా దెల్పిరి:

సోదరసోదరీమణులారా !

ఈ దినమున జాతీయపోరాటమునందు పాల్గొని ఎంతగనో దేశసేవ చేసినవిదుషీమణి శ్రీమతి పొణకా కనకమ్మగారి ఆధిపత్యమున, సంఘసేవలోనే తమ జీవితమునంతయును గడపిన మాతృసమానులును హిందూసుందరి పత్రికాసంపాదకులును అగు శ్రీమతి బాలాంత్రపు శేషమాంబగారితో నాకు యీ గృహలక్ష్మి కంకణమును సమర్పించు నీ గౌరవము నాదికాదు. చిన్నతనమునుండియు నా కభిమతములైన యీ విద్యలందు నాకు అమితోత్సాహము నిచ్చి, ఎంతయో వృద్ధిలోనికి తీసుకువచ్చిన మా తండ్రిగారగు శ్రీ రత్నాల అబ్బాయినాయుడు గారిది. అందుకు వారికి నా నమస్కారముల నీ సమయములో అర్పిస్తున్నాను.

తరువాత నాచే వ్రాయబడిన చిత్రములను అన్నిటిని ఆదరించి, తమ పత్రికారాజమగు గృహలక్ష్మియందు ప్రకటించి, ఎంతయో ప్రోత్సాహమునిచ్చిన శ్రీ కేసరిగారికి నా కృతజ్ఞతాభివందనములను అర్పిస్తున్నాను.

ఈ సమయంలో చిత్రకళనుగురించి నాల్గుముక్కలు చెప్పడం నా విధి గనుక నాకు తోచిన విషయాలను చెప్పబూనుకుంటున్నాను.

గద్యపద్యాత్మకమైన సాహిత్యకళ ఎటువంటి ఆనందాన్నిస్తుందో, సుందరంగా వ్రాయబడ్డ ఒకచిత్రము అటువంటి ఆనందాన్ని సమకూరుస్తుంది. అంటే సుందరమైన ఒకచిత్రం మాటలులేని ఒకపద్యం అన్నమాట.

ఇటువంటి చిత్రకళయొక్క గుణానికి కొంతమంది ఆనందిస్తారు. కొంతమంది దాన్ని అర్థంచేసుకుని దానిలోని మాధుర్యాన్ని గ్రోలుతారు. కాని దీన్ని అర్థంచేసుకుని, దాని గుణ భావానికి ఆనందించే రెండురసాలు కలవారు చాలా తక్కువ.

ఏదైనా ఒక భావోద్వేగాన్నికూడ దీసుకుని, దాన్ని అలోచనరూపంగా మధించుకొని దానికి ఒకఆకారం యివ్వడమే యీకళయొక్కభావం. ఇట్టికళలో చాలా వుత్సాహంవుంటుంది. దీనిలో కృషిచెయ్యటం ప్రారంభిస్తే దానంతటదే వృద్ధిపొందుతూ, అనేక క్రొత్తరసాలకుచోటిస్తూ, ప్రకృతిసహజంగావుండే మహిమాస్పదమైన హంశలకి మార్దవం ఉట్టిపడేటట్లు నూతనపోకడలుపోతూ కృషిచేసేవారికి నూతనానందాన్ని కల్పిస్తూవుంటుంది.

కళకి మతనీతిశాస్త్రాలకి ఏమీ సంబంధంలేదు. కాని దీన్ని ఉపాసించేవారిని పోను పోను ఇది బ్రహ్మాండమైన అపరిమితత్వానికి దరిచేరుస్తుంది. సత్యానికి, నీతినియమాలకి, సౌందర్యానికి, ఆసర్వేశ్వరుడే అధిదైవతము. అట్టి అధిదైవతమున కధీనమైన పరమ పదానికి దగ్గిరచేరుస్తుంది, అతనిలో ఒకకళమైన యీచిత్రకళని ఉపాసిస్తే.

ఈకళల్లో నిర్దుష్టమైన స్థానమును సంపాదించాలంటే అది కేవలము క్రమమైనకృషి ద్వారానేవస్తుందిగాని, కృషిలేని అభిప్రాయవృద్ధివల్లరాదు. ఈకృషిలో అనేక అసందర్భ మైన అడ్డంకులు వస్తూవుంటాయి. వాటినన్నింటినీ మంచిఓర్పుతోజయించి పట్టుదలగా ప్రయత్నిస్తేనేతప్ప దీనిలో విజయవంతులవడం కష్టం.

అవి కేవలం అడ్డంకులనడానికీ వీల్లేదు. మనమనస్సులోని సౌందర్యమైనపూర్తి అభిప్రాయాన్ని లలితమంజులంగా చిత్రించడంలో అసంతృప్తియేకాని వేరుకాదు.

అనేకమంది యిల్లాంటి కళాపరిపూర్ణత మూర్తీభవించిన చిత్రాలుకొంటారు. ఎందుచేత ? అవి కళాశోభితంగావున్న చిత్రాలుకాబట్టి. కాని వారు ఒక లలితకళా సంస్థానాన్ని పోషించడం ఉద్దేశ్యంతోటే ఆకొనడం అని అర్థం తియ్యడానికి వీల్లేదు.

అటువంటిప్రోత్సాహం కేవలం ఏదో చిత్రంలో రంగులు బాగున్నాయని కొనడం లోనూలేదు; రాతిలోబొమ్మ చక్కగా చెక్కబడిందని కొనడములోనూలేదు. కాని ఆకొన్నవస్తువులు, వారివారిసంతానాన్ని నిజమైన వీరుల్నిగాగాని, స్వచ్ఛమైన భక్తుల్నిగా గాని, నిష్కళంకమైన దేశభక్తుల్నిగాగాని, తయారుచేసేవిగావుంటే వారి ప్రోత్సాహం లోనూ సత్యముంది, యిటు కళాపారిశ్రామికుల పరిశ్రమలోనూ సత్యమున్నదన్నమాట.

ఇటువంటి మహత్తరమైన కళాసంపత్తి, వాటిని ప్రోత్సహించే రాజాధిరాజుల సౌభాగ్యము కాలగర్భములో కలిసిపోయాయి; వాటి సౌందర్యసంపద ఏమాత్రము లేకుండా.

భారతదేశములో మనకు గర్వకారణభూతములైన ఇటువంటి దృశ్యాలు ప్రాచీన భారతకళావైభవాన్ని వెదజిమ్ముచూ నేటికీమిగిలివున్నాయి. అజంతా గుహలు, ఎల్లోరా లోని చెక్కడాలు, హంపీక్షేత్రములోని దివ్యదృశ్యాలు, భాగ్ గుహల్లోని అత్యున్నత మైన చిత్రలేఖనాలు, తమ ప్రాచీనకళాజ్యోతిని దశదిశలు వెదజల్లుతున్నాయి నేటికీ. ఈకళాలక్ష్మిని పూజించిన మహాసామ్రాజ్యాలు అంతరించినా వాటియొక్క కళాసేవ మాత్రం యీకళారూపాన్ని పొంది జీర్ణించి దృశ్యరూపంగావున్న యీగ్రంథాల్లోవుంది.

లలితకళ అంటే జరామరణములులేని ఒక మహోజ్వలవస్తువు. పూర్వకాలంలో భారతస్త్రీలు నృత్యగీతాదుల నభ్యసించడమేకాకుండా మిగిలిన లలితకళల్లోకూడా బాగా

కృషిచేసేవారు. కాని యీమధ్యయుగాల్లో వాటిజోలికిపోకుండా నిద్రమత్తులోవుండి ఇప్పుడిప్పుడు మేలుకుంటున్నారు, ప్రాచీనకళాసౌభాగ్యాన్ని పునరుద్ధరించాలని. గత కొద్ది సంవత్సరాల్లోనూ నా భారతసోదరీమణుల కళాకలాపంయొక్క వేగంచూస్తే అచిర కాలంలో మనం గోల్పోయిన మన ప్రాచీనకళాసంపద్యోతిని తిరిగి సంపాదించగలుగుతా మనే నమ్మకం నాకు పూర్తిగావుంది.

ఇట్టి సదవకాశానికి శ్రీ కేసరిగారు పూర్తిగా సహకారాన్ని యివ్వదలుచుకోవ డము చాలా సంతోషమైన విషయము.

ఇక వీరి ప్రోత్సాహము యీ లలితకళావికాసానికి మంచిమార్గాన్ని ఏర్పరుస్తుందని విశ్వసిస్తూ, నాయందున్న అల్పశక్తిని ఎంతో గొప్పగాచేసి గౌరవించి నాకీ ప్రోత్సాహము నిస్తున్నందుకు నా కృతజ్ఞతాభివందనములనర్పించుచూ, యింతటితో విరమిస్తున్నాను.

శ్రీమతి కమలాబాయిగారి ఉపన్యాసానంతరము స్వర్ణకంకణ బహూకరణోత్సవము విమల భావ పూరితమని ప్రశంసించుచు శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబగారు యీవిధముగ నుడివిరి:

సోదరసోదరీమణులారా!

అనృతములుకొన్ని ఎన్నడో ఎట్లో ప్రజలలోప్రవేశించి, ప్రచారశక్తినిపడసి, నిత్యపూజనుకూడ అంది ప్రపంచమున సత్యములుగా పరిగణింపబడుచుండును. విమర్శించి వీని కలరూపునుగుర్తించువారు మానవులలో నెందఱోలేరు. వెనుకనుండి 'భళీ!' అనువారే యనేకులుగదా! కాలదోషము అన్యాయాక్రమణముల కేగాక అనృతములకు కూడ కవచమగుచుండును. చిరానుష్ఠానమున జొచ్చినదోషము, చిరవిశ్వాసమున పీఠమును ప్రతిష్ఠించుకొనిన దోషము, నలునివేషమువేసికొని స్వయంవరాంగణమున బ్రవేశించిన దేవతలవలె సదాచారములలో, చక్కని విశ్వాసములలో ప్రవేశించి ప్రజల మతమందు, దైనికజీవితమందు గలసిపోవును. ఇట్టి యబద్ధములను కొన్నిటిని పరికింపుడు.

1. విజ్ఞానసంపాదనమున పురుషులకుగల సామర్థ్యము స్త్రీలలో లేదనునది ఒక యబద్ధము.
2. లక్ష్మీశారదల కెన్నడును పొందు లేదను నబద్ధము వేఱొకటి.
3. స్త్రీలలో అందందు తలయెత్తిన అవిద్య స్త్రీల అశ్రద్ధవలననే కలిగినను, పురుషులనిరోధము దానికు త్తరవాదియని తెలుపుట మూడవయనృతము.

మనుష్యలోకములో అభిప్రాయభేదములు పుట్టించి స్త్రీపురుషులు కలహించు చుండ జూడవలెనను మక్కువతో ఏనాడో ఏనారదుడో వీనిని సృష్టించియుండును.

గార్గి, మైత్రేయి మున్నగు విదుషీమణులు ప్రాచీనకాలమున వఱలిరనివిందుము. పురాణయుగమందును, చరిత్రయుగమందునుగూడ సర్వతోముఖమైన ప్రజ్ఞజూపిన స్త్రీ లుండిరికదా! స్త్రీల మేధాశక్తికెదురుగా ప్రశ్నచిహ్నమును నిలుపుట ఏమిన్యాయము?

# గృహలక్ష్మల లలితకళాశోభకు

* సౌందర్యమునకు
* సౌజన్యమునకు

సౌభాగ్యమునకు *
సౌశీల్యమునకు *

సామర్థ్య సంతోషములకు

లలితకళాసమన్వితమైన గృహనిర్మాణమునకు

## • గృహలక్ష్మి •

ప్రతిమాసము కొన్నిపుటలు ప్రత్యేకించి కృషిచేస్తుంది

అట్టి లలితకళల సంబంధమైన గద్య పద్య గేయములకు

## ఆహ్వానము



లక్ష్మికిని ధనమునకును దగ్గఱిచుట్టఱిక ముందు తెలుగుదుము, కాని మనపెద్దలు లక్ష్మిని అర్థమునకుమాత్రమే సహకరించిరికారు. ఉత్కృష్టమైన గుణమునుకూడ లక్ష్మియని, మనమునులును, మనకవులును సంబోధించిరి. 'గుణలక్ష్మి' 'మోక్షలక్ష్మి' అనుపద ములు మనకు అపరిచితములుకావు. గురుగుణములు విజ్ఞానసముద్భవములు కావా! విజ్ఞానమే వాణికదా! వాణీరమలకెట్టి అవినాభావసంబంధముకలదో గమనించితిరా?

ఈసత్యమును దృష్టాంతీకరించుఅంశములు వేర్వేరు యుగములందు గలవంటిని. ఎచ్చటికోపోనేల, ఎప్పటివిషయమో తెలుపనేల? కొన్నేండ్లనుండి మనరాష్ట్రమున ప్రసిద్ధివడసిన గృహలక్ష్మి స్వర్ణకంకణచరిత్రమే పూర్వోక్తాంశములందలి యదార్థమును రూఢిచేయుచున్నదికదా! శ్రీ పురోభివృద్ధిని, నిరోధించుటకాక, ద్విగుణీకృతమొనరించుట తమ జీవితపరమావధియని ఎంచిన గృహలక్ష్మి సంపాదకులీ చరిత్రకు జనకులు కదా! మహాలక్ష్మిసుందరులు కొందరు సరస్వతీప్రసన్నత నందుచుండుటలేదా! ఉరుగుణ సందీప్తచరిత్రలైన విదుషీమణులును, కళావ్రతమున ఆఱితేఱిన గృహలక్ష్ములును, ఆనందోపాసనమున యశస్తిలకలైన నారీమణులును, శారదాంబకు మిగులగూర్చు కన కాంబలును స్వర్ణకంకణ బహూకరణమును బడయుచున్నారుకదా! గుణలక్ష్మి గృహ లక్ష్ములకును, సన్మానలక్ష్మి స్వర్ణలక్ష్ములకును భేదముకలదని తెలుపగలవారెవ్వరు? కనుపర్తి, పులవర్తి, కాంచనపల్లి, చిలకలపాటి సోదరీమణులీవరలో వేర్వేరురూపుల బరగిన సిరిలక్ష్మికి నెచ్చెలులైరిగదా! స్వర్ణపతకమునందిన గుణవతి మా పద్మావతి సన్మానరమ నందెనుగదా! సోదరీమణులనిన కేవలము అక్కలకే ఈభాగ్యము లభించు చుండెనని తలపరాదు, నావదినెగారు శ్రీమతి శేషమ్మగారు నేడీభాగ్యము నందుచుండిరి గదా! నేటి పారితోషికములు ఒకవంక స్థితప్రజ్ఞకును, వేఱొకవంక కళారాధనమునకును లభించుచున్నవి. ఎదురుగాడ్పుల నెదుర్కొనుచు సుమారు ముప్పదేండ్లనుండి 'హిందూ సుందరి'ని జయప్రదముగ నడుపుచున్నదీ స్థితప్రజ్ఞకదా! స్వర్ణమనుడు, సన్మానమనుడు, సాహిత్యసేవ, దేశసేవ, కళాసేవలకు సన్నిహితములగుట నేడు కన్నులారా జూచు చున్నాము కదా!

ఉపన్యాసానంతరము కుమారి నాళం అమృతం సభికులు ముగ్ధులగునట్లుగా భరతనాట్య ప్రదర్శనమును గావించినది. పసితనమున అంత భావయుక్తముగాను, హృదయ రంజకముగాను నృత్య ప్రదర్శనము గావించి నందుకు ఒక స్వర్ణ పతకమును శ్రీ కేసరిగారు బహూకరించిరి.

తర్వాత శ్రీమతి కమలామాయిగారు ఫిడేలు వాయించుచు, తెలుగు, హిందీ, బంగాళీ పాటలను అతి శ్రావ్యముగా పాడి సభికులను రంజింపజేసిరి.

శ్రీయుత కేసరిగారు మాట్లాడుచు, తమ యాహ్వానమంగీకరించి సమావేశమును జయప్రదముగా జరుగుటకు తోడ్పడిన అధ్యక్షురాలికిని, సభికులకును తమ కృతజ్ఞతను వెలిబుచ్చిరి.

పిమ్మట సమావేశమునకు వచ్చిన అతిథులకు విందొనర్చి కార్యక్రమమును అత్యంత జయప్రదముగ మంగళధ్వనులతో ముగించిరి.

# గృహలక్ష్మీ కంకణ బహూకరణము

## సతి శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు

### —: జీవిత సంగ్రహము :—

గడచిన బహుధాన్యగాక క్రిందటి బహుధాన్య జ్యేష్ఠబహుళ అష్టమి (1878)నాడు ఆరువేలనియోగి బ్రాహ్మణులును, సంస్కృతపండితులును అగు శ్రీ సత్తిరాజు వెంకటరామ కృష్ణయ్యపంతులు మహాలక్ష్మమ్మ పుణ్యదంపతులకు తణుకు తాలూకా వేలవెన్ను గ్రామములో జన్మించినదీ వనితామణి శ్రీమతి శేషమాంబగారు. ఈమెకు ఒక అక్కగారును అన్నగారును గలరు.

తన పదవ నెలలోనే పితృవియోగము కలుగుటచే అక్కగారి భర్తయగు శ్రీ॥ శ్రీ॥ పోణంగి పార్వతీశముగారింట కొంతకాలము పెరిగిరి. తర్వాత మేనమామయగు వెలిచేటి భద్రాచలముగారివద్ద పెరిగిరి. అమలాపురమున బాలికాపాఠశాలలోచేరి అందు ప్రధానోపాధ్యాయులైన తన మేనమామగారి శిక్షణలో చక్కగ వ్రాయను చదువను నేర్చిరి. మేనమామగారు భగవద్భక్తులగుటచే శేషమ్మగారికి భారతభాగవతాది గ్రంథజ్ఞానము మెండుగా వృద్ధిచెందినది. తన పదునొకండవయేట ఆంధ్రదేశమందు అన్నదానాది సత్కార్యములకు పేరువహించిన బాలాంత్రపువారి కుటుంబీకులైన శ్రీ. సుందరరామయ్యగారిని వివాహమాడిరి. ఆసంవత్సరమే ప్రైమరీ పరీక్షయందు త్తీర్ణులైనారు. ఆ దినములలోనే వీరు బంధువులతో తల్లిగారితో రామేశ్వరయాత్ర సేవించిరి.

వీరు కాపురమునకు వెళ్లువరకు మేనమామగారివద్ద విద్యాభ్యాసము చేయుచునే యుండిరి. భర్తగారితో రాజమండ్రియందు నివసించుకాలమందు శ్రీ దేవగుప్తపు మహాలక్ష్మమ్మగారి సహచర్యములో కావ్యప్రబంధపరిచయము విశేషముగా గలిగినది. తర్వాత నరసాపుర పరీక్షలకు విజ్ఞాన చంద్రికాపరిషత్తుల పరీక్షలకు చదివి రెండవ తరగతిలో నుత్తీర్ణులైనారు. శ్రీ॥ కందాళ నరసింహాచార్యులుగారివద్ద సంస్కృతము నభ్యసించిరి. తదుపరి శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి సహాయమున కాకినాడయందు విద్యార్థినీ సమాజమును స్థాపించి స్త్రీలోకమున విద్యాప్రచారమును విరివిగ గావించిరి. ఆకాలములోనే శ్రీ॥ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారివద్ద కావ్యములు చదివిరి.

ఈ సమాజమునకు దోడుగా రాజ్యలక్ష్మీ పుస్తకభాండాగారమును స్థాపించిరి. అంతవరకు కంతేరు గ్రామమునుండి వీరిచే నడుపబడుచున్న 'హిందూసుందరి'అను మాస పత్రికను కార్యస్థానముతో సహా విద్యార్థినీ సమాజశాఖ తరఫున నడుపుటకు కాకినాడ మార్చి, తద్వారా యీముప్పదియైదు ఏండ్లనుండి నారీప్రపంచమున యుద్బోధము చేయుచు, నేటివరకు యీ పత్రికను నిరాటంకముగా నిర్వహించుచున్నారు.

1910 సంవత్సరమునుండి కాంగ్రెసు ఉద్యమములో పనిచేసిరి. 1923-వ సంవత్సర మున బొంబాయిపట్టణమున జరగిన అఖిలభారత మహిళాసభకు ఆంధ్రదేశ ప్రతినిధిగా వెళ్లిరి. కాకినాడయందు జరిగిన మహిళామహాసభకు కార్యదర్శిగానుండి జయప్రదముగా నిర్వహించిరి. 1928-వ సంవత్సరములో మద్రాసునందు డాక్టరు అన్నాబీగారి అధ్యక్షతను జరిగిన అఖిలభారత జాతీయమహా సభలో కౌమార్తెతోపాటు వలంటీర్లుగా పనిచేసి, కాంగ్రెసుపెద్దల మన్ననలకు పాత్రులైరి. 1931-వ సంవత్సరములో కాకినాడయందు శ్రీ శేషమ్మగారు, తమ పుత్రికతోకూడ ఉప్పుసత్యాగ్రహమును మొదట ప్రారంభించి, మహిళా ప్రపంచమున నొక నూతనోత్సాహమును కలుగజేసిరి. కాకినాడ పురపాలక సంఘమునకు స్త్రీప్రతినిధిగా ఎన్నుకొనబడి, నాలుగు సంవత్సరములు చాల ఉత్సాహ ముగ పనిచేసి ఎన్నో ప్రజోపయోగకరములైన కార్యములను చక్కజేసి ప్రజలయాదర ములకు పాత్రులైరి. నిరంతరదేశసేవా నిమగ్నులగుచు, బొంబాయి, కలకత్తా, బెల్గాం పట్టణములయందు జరిగిన కాంగ్రెసుమహాసభలకు హాజరైరి. బిసెంటమ్మగారి అధ్యక్ష తను కాకినాడలో జరిగిన ఆంధ్రమహిళాసభకు కార్యదర్శిగానుండి జయప్రదముగ నిర్వ హించి, ఆంధ్రవనితాలోకమున నొక నూతనోత్తేజమును కలుగజేసిరి.

వీరికి లేకలేక నలుబదవపడిలో శ్రీ మహలక్ష్మీసుందరమ్మ అను పుత్రికారత్నము కలిగిరి. ఆమెను ఎం.ఎ., యల్.టి., వరకు సంస్కృతము ప్రధానాభిమానశాఖగా చది వించిరి. ఈమెను శ్రీ కాళ్లకూరి శేషయ్యపంతులు బి.యె. గారి కిచ్చి వివాహ మొనరించిరి.

'సావిత్రి'మొదలగుపత్రికలకు యీామె అనేక పద్యగద్యములను వ్రాసిరి. పాఠశాల, పఠనాలయము, పత్రిక మొదలగు మహత్తర కార్యముల నిర్వహించి స్త్రీలోకోద్ధరణ మునకు తమ జీవితమును వినియోగించుచున్నారు.

# చిత్రకళానిశారద శ్రీమతి ఆర్. కమలాబాయిగారు

## — జీవితసంగ్రహము —

మదరాసు పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటులో చాలకాలము పనిచేసి ప్రస్తుతము పెన్షను తీసికొనుచున్న శ్రీయుత ఆర్. అబ్బాయి నాయుడుగారి రెండవకుమార్తె యీ చిత్రకారిణి శ్రీమతి ఆర్. కమలాబాయిగారు.

వీరు 1910 సంవత్సరమున ఒంగోలు పట్టణమున జన్మించిరి. తదుపరి గుంటూరు పట్టణమున స్కూలుఫైనలు తరగతివరకు చదివి అందు తీర్ణులైరి.

తరువాత భారతకవిశేఖరుడు శ్రీ రవీంద్ర కవీంద్రుని శాంతినికేతనమున జేరి చిత్రలేఖనమునందును, వంగసంగీతవిజ్ఞానమునందును విశేషకృషి సల్పిరి.

మద్రాసు విశ్వవిద్యాలయమున సంగీతమునందును, ఫిడేలు వాయిద్యమునందును ప్రత్యేకయోగ్యతాపత్రములను పొందిరి. భారతదేశమున జరిగిన వివిధ వస్తుప్రదర్శనములందు శ్రీ కమలాబాయిగారి చిత్రములకు అనేక బంగారుపతకములను, యోగ్యతాపత్రములను ఇచ్చియున్నారు.

చిన్నతనమునుండియు శ్రీ అబ్బాయి నాయుడుగారికి లలితకళలన్న, అందులో సంగీతము, చిత్రలేఖనములనిన అమితప్రీతి. మొదటినుండియు వారు యీవిద్యలయందు విశేషముగా కృషి సల్పుచునేయున్నారు. శ్రీ అబ్బాయి నాయుడుగారి అభిమానము వలనను, ప్రోత్సాహమువలనను యీవిద్యలకు వారి వంశములో మంచి ఆదరము లభించినది. శ్రీమతి కమలాబాయిగారి అక్కగారగు శ్రీమతి ఆర్. కృష్ణాబాయి, బి.ఏ. యల్.టి. గారు 1925లో పట్టభద్రులై, సంగీతమునందు చిత్రలేఖనమందుకూడ పట్టములబడసిరి. ఆమె వ్రాసిన చిత్రమొకటి భారతప్రభుత్వమువారిచే తీసికొనబడి బ్రిటిష్ ఎంపైర్ ఎగ్జిబిషనులో ప్రదర్శింపబడి అనేక ప్రముఖుల పొగడ్తలకు పాత్రమైనది. భారతవస్తుప్రదర్శనములందుకూడ శ్రీ కృష్ణాబాయిగారు తమ చిత్రములను ప్రదర్శించి బంగారు పతకములను పొందియున్నారు.

శ్రీ అబ్బాయి నాయుడుగారి రెండవకుమారులు శ్రీ ఆర్. కృష్ణమూర్తిగారు యీ లలితకళలయందు మంచి నేర్పు కలిగియున్నారు. అందును, సంగీతమందు విశేషప్రజ్ఞ గలదు. శ్రీ అబ్బాయి నాయుడుగారు వారి అభిమానవిద్యలైన సంగీతము, చిత్రలేఖనమునకు వారి కుటుంబమునందు స్థిరవాసమును కలుగజేసినారు. పుత్రులు, పుత్రికలు గూడ యీ విద్యలయందు దిట్టలు. వీరి వంశము లలితకళలకు పుట్టినిల్లైనది. ఇంటిపేరు రత్నాలవారు. సంగీతము, చిత్రలేఖనమునందు విశేషకృషిచేసి రత్నములవలె ప్రకాశించుచు రత్నాలవారు సార్థకనాములైనారు.

ఉన్నతవిద్యలనొంది, ప్రాచీనభారతలలితకళలయందు కృషిసల్పి వాటికి నూతన వికాసమునిచ్చుచు హైందవధర్మములకు సిరోభూషణములైన వినయవిధేయతలకు ఆటపట్టైన వీరి వంశమును 'కళాకుటుంబ'మనుటలో అతిశయోక్తిలేదు.

# అంతా దైవాధీనం

శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

ఘుమఘుమలాడే నూనెతలకు రాచుగుని, వసారాక్రాఫింగు నిగనిగలాడేటట్లు దువ్వుకొని, పెద్దాపురి సిల్కు అరచేతులచొక్కా తొడుక్కుని, గోరంచు జరీకండువా ఒల్లెవాటుగా వేసుగుని, మొహమలు స్లిప్పర్సు కాళ్లకు తొడుక్కుని, ఒకమాస పత్రికను చేతబట్టుకుని వచ్చాడు కృష్ణారావు. ఇంటికి పన్నెండు గంటలకు వచ్చి ఒక్కకేక వేశాడు హాల్లోనుంచి దౌర్జన్యంగా...

వంట సిద్ధంచేసి కనిపెట్టుకుని కూర్చున్న కృష్ణారావుతల్లి ఎదురుగా వచ్చి 'పెడుతున్నారా నాయనా' అని కంచంపెట్టి వడ్డించింది.

చొక్కా అయినా విప్పకుండానే కూర్చున్నాడు పీటమీద కృష్ణారావు. తల్లికూడా పీటవేసుగుని ఎదురుగా కూర్చుని మాట్లాడటం ప్రారంభించింది నెమ్మదిగా...

'కృష్ణా! నీచెర్య నాకేమి బాగుండలేదురా. అన్నందగ్గిర కూర్చున్నంతసేపైనా ఈదృష్టితో కూర్చోవు గదా? తిన్నగా అన్నం తినవుగదా? యెడాపెడా ఇంత విసిరి పారేసి లేచిపోతావు. ఎట్లా కడుపునిండుతుంది? అన్నంవేళకు అన్నానికిరావు. బొత్తిగా చెడిపోతున్నావు నాయనా.'

'నాయిష్టం. తింటేతింటా పారేస్తే పారేస్తా, నీకెందుకు?'

'హాయిగా మనకు ఇల్లువాకిలి ఉండి ఇంట్లో తల్లినిఉండి చేసిపెడుతూంటే నీవు యెక్కడో స్నానం చెయ్యడం, తలనువ్వుకోడం, గుడ్డలు కట్టుగోడం, ఫలహారం చెయ్యడం, పూటకూటికొంప కొచ్చినట్లు వచ్చి రెండుమెతుకులు నంజివెళ్లడం, నీ పద్ధతి నాకేమి బాగుండలేదు. ఎవరు చేస్తున్నారు నీకీ బోధలు? అమ్మా! అని పిలుపుకూడా మానేశావు.'

'యేమిటి? యింటికొస్తే సరి ఏదో గొడవ మొదలుపెడతావు. అందుకనే ఇంటికి అన్నానికి మాత్రమే వస్తున్నాను. ఇల్లా అంటూంటే అసలే మానేస్తాను. నా యిష్టం నాది. యెక్కడో తింటాను, ఎక్కడో కట్టుగుంటాను నీకెందుకు? యింటికొస్తే అన్నంపెట్టు లేకపోతే ఊరుకో. యెందుకల్లా నసపెడతావు ఒచ్చింది మొదలు?'

'నీకు గొడవలాగే ఉంటుంది. బంగారంలాంటి పిల్లనిచ్చి పెండ్లిచేస్తే దానివంక తిరిగైనా చూడక నీ ఇష్టం వచ్చినట్లు తిరుగుతూ ఉంటే చూసి ఎట్లా వోర్చేది? ఆ పిల్లైనా పరాయిదైతే నాకైనా ఇంతకష్టం ఉండదు. మనుమరాలు ఎంతో ప్రేమగా చూచుకుందామని అనుకున్నా. పెండ్లై నాలుగేండ్లైంది, పెద్దదై మూడేళ్లైంది. ఒక్కమాటైనా తీసుగొచ్చి ఈ పాపిష్టి కండ్లతో చూడకపోతిని గదా? దాన్నిచూచి ఎట్లా భరించను. ఒక్క కొడుకువుగదా, పరాయిది వస్తే నన్ను చూడదని మనుమరాల్ని చేసుగుంటే దాన్ని కండ్లనైనా చూడకపోతిని. మీ నాన్నగారు లక్ష రూపాయల ఆస్తి ఇచ్చిపోతే అప్పుడే ఆ రేండ్లకల్లా సగం ఆస్తి పాడుచేస్తివి. ఒక్క పిల్లవాడుగదా, నాడిష్టమొచ్చినట్లు వాడుకుంటాడు అని గారాబంగా ఊరుకుంటే

నానాటికి నీ దుండగములు యెక్కువౌతున్నాయి గాని తగ్గడంలేదు. ఆ పిల్లను వక్కమాటు ఇంటికైనా తీసుగురానివ్వకపోతివి. ఇవ్వన్ని చూచి నేనెల్లా భరించను?' అని కళ్ల నీళ్లు పెట్టుకుంది కృష్ణారావు తల్లి కోటమ్మగారు.

'ఊరుకోక యేం చేస్తావు? ఈ ఆస్తి అంతా నాది, ఎవరు అడ్డంవస్తారో రమ్మను. భరించలేకపోతే చావు. నీవు చావలేకపోతే నేనే చంపుతారా గొంతుపిసిగి; పీడ వదుల్తుంది. నువ్వు మాట్లాడకుండా అన్నం పెడతావా, అన్నానికైౖ యింటికొస్తా లేకపోతే అదీలేదు. ఏం చెప్పవ్? ఈ అన్నంవదిలేసి లేచిపోతా. నాకిష్టంలేకుండా ఓ కురూపిని తీసుగొచ్చి నాకంటగట్టి దాన్ని ఏలమంటే నే నేల్తానా? ఇక దాని మొఖం చూచేది వట్టిది. ఇల్లా మాట్లాడుతూ ఉంటే ఇక నీ ముఖంకూడా చూడను. జాగ్రత్త' అని గ్రుడ్లు ఉరుముతూ లేవబోతున్నాడు కృష్ణారావు.

చేయి గట్టిగాపట్టుగుని తల్లి 'నాయినా! మాతృప్రేమ గ్రహించలేకుండా ఉన్నావు. నీ క్షేమంకోర దాన్ని నేను వక్కత్తెనే. నీ మంచికోరి నీకు మంచిబుద్ధి కలగాలని ఉదయాస్తమయము భగవంతుణ్ణి ప్రార్థిస్తూఉంటా నాయనా. నీమనస్సు మార్చుకో. ఆ పిల్లను తెచ్చుగో. చక్కని పిల్ల, గుణవంతురాలు, ప్రేమగలది. ఈ వుంపుడుకత్తెలు నీకు శాశ్వతంకాదు. నామాటవిను, దాన్ని తెచ్చుకో'.

'దానికి ప్రేమలేదూ? నీకున్నదా ప్రేమ? ఇంటికి రాంగానే పోట్లాడే ప్రేమ నీది. దానిప్రేమ వంటి ప్రేమ యెవరికున్నది?'.

ఇంతలో వాకట్లో ఒక యువకుడు కేక: 'ఏం కృష్ణారావు ఇవ్వాళ ఇంతలేట్ చేశావు?' అని. ఆకేక విని చేయి విదలించుగుని 'ఛీ ఇక నీముఖం చూడను' అని వెళ్లిపోయినాడు కృష్ణారావు.

కృష్ణారావు తల్లి పూర్వాచార పరాయణి, దైవభక్తికలది. ఎల్లప్పుడు జపములు తపములు వ్రతములు చేస్తూఉంటుంది. తనకు వక్క కొమారుడైనందుకు, ఆవక్కడు త్రాగుబోతు, జూదరి, విటకాడు అయి జమీందారీవంటి సంసారం గుల్లచేస్తూ అక్క కొమార్తెకు పుస్తెకట్టి, మళ్లీ ఆవూరివంక తిరిగైనా చూడక సన్యాసియైపోతున్నాడనీ తలుచుకుని కృష్ణారావు తల్లి కృశించిపోతున్నది.

౨

'ఏం జానకీ, ఇన్ని రోజులనుంచీ నిన్ను చూచీ, మీ అమ్మ మరియాద చూచీ ఊరుకున్నాను గాని ఇక ఊరుకోను, ఈ రత్నంలాంటి బిడ్డను వాళ్లు కళ్లచూడకపోతే? ఎన్నాళ్లు భరించను ఈబాధ? రేపు గుంటూరువెళ్లి వాణ్ణి నాలుగుమాటలు అడిగి పరిష్కారం చేసుగొస్తా. ఆడపిల్లైనా అదే మగపిల్లవాడైనా అదే అనుకుంటా. చదువు చెప్పించి ఉద్యోగం ఇప్పిస్తా. మగపిల్లవాడనే అనుకుంటా. ఇక వాడిముఖంచూడను. వాడొచ్చి నాకాళ్లమీద పడ్డాగాని నాబిడ్డను పంపను. ఆ దుర్మార్గపు వెధవను నావాకట్లోకి రానిస్తానా! ఇంకా అన్నివిధాలా నాబిడ్డగొంతు నువ్వు కోశావు. ఎక్కడైనా సమస్తానంలో ఇచ్చేవాణ్ణి, హాయిగా సుఖపడేది నాబిడ్డ. ఏం మాట్లాడవేం? మొద్దులాగ' అన్నాడు రామారావు భార్యవంకచూచి కోపంగా.

'నేనేం చేస్తాను? అది వూహ తెలియని పిల్ల కాదు గదా? దానిష్టం మీ ఇష్టం, నాదేమిలేదు. ఆడపిల్లకలవాళ్లం తొందరపడితే యెల్లగా?' అన్నది జానకమ్మ నెమ్మదిగా.

# అంతా దైవాధీనం

'అవును నీదేముంటుంది? చేశావు ఊరుకున్నావు. మనదీపమే గదా అని ముద్దుపెట్టుగుంటే మూతి కాలిందిట, అల్లాగే నా తమ్ముడే గదా అని చేశావు, వాడు బాగా శాస్తిచేశాడు. ఆడపిల్లనిస్తే మటుకు ఎన్నాళ్లు ఊరుకుంటారు వాళ్లకు లొంగి?'

'నేనేం చేశాను? చిన్నవాడు, ఆస్తి ఉన్నది, మా నాన్నగారి ఆస్తి నా కూతురే అనుభవిస్తుందిగదా, అనుకున్నాను గాని వాడు ఇల్లా పనికిమాలిన వెధవైపోతాడనుకున్నానా? మీరు మటుక్కు అనుకున్నారా? అక్కడ ఇక యెవ్వరులేరు గదా? వాడు మనం చెప్పినట్లు వింటాడు అనుకున్నాం. ఇల్లా చేస్తాడనుకుంటే నేనుమటుక్కు ఎందుకిస్తాను?'

'సరే ఇక ఎవరుచేసేది ఏమిలేదు. పిల్ల పెద్దదై మూడుసంవత్సరాలైంది గదా? దాని గతేమిటి చెప్పు?'

'మీఇష్టం, నేనేం చెప్పను? ఇంకా కొన్నాళ్లుచూచి ఎవరిచేతనన్నా చెప్పించిచూద్దామని ఉన్నది నాకు.'

'నీవు నాలుగుసంవత్సరాలనుంచి ఇల్లాగే అంటున్నావు. ఇంక ఊరుకోను. నీ మాటవినను. మీ అమ్మకు జబ్బుగా ఉన్నదని ఉత్తరం ఒచ్చిందిగదా చూచి తేల్చుగురా. రేపే వెళ్లు. వచ్చే ఫస్టుతారీకునే స్కూల్లో చేరుస్తా, ఇంకా చూసేదేమిటి? ఆ వెధవ సలహా ఎందుకు నాకు? ఈ విషయం అమ్మాయితో చెప్పు. నే ఆఫీసుకు వెళుతున్నా' అని ఆఫీసుకు వెళ్లాడు రామారావు.

జానకమ్మ మేడమీద హాల్లో ఉయ్యాలబల్లమీద కూర్చుని పిలిచింది కూతుర్ని.

'ఎందుకమ్మా' అని చదువుతున్న 'గృహలక్ష్మి' చేతబట్టుకుని వచ్చి తానుకూడా కూర్చున్నది ఆ బల్లమీద రుక్మిణి.

'రుక్మిణీ! మీ నాన్నగారు నీతో కొన్నివిషయాలు మాట్లాడమన్నారు. నీ మనస్సులో మాట దాచక చెప్పాలి.'

'అమ్మా! నేను చిన్నదాన్ని తమరు పెద్దలు. నాతో మాట్లాడవలసిన సంగతులేమున్నాయి?'

'నే నడిగినదానికి సమాధానం చెప్పు.'

'సరే అడుగు తెలిస్తే చెపుతాను లేకపోతే లేదు.'

'నిన్ను నీ మేనమామ కిచ్చి వివాహము చేసినదీ, వాడు దుర్వృత్తులకు లోనై నిన్ను తీసుకువెళ్లక తిప్పలు పెడుతున్నసంగతి నీకు తెలిసినవిషయమే గదా? గనుక ఇప్పుడు మీ నాన్నగారు నీకు చదువు చెప్పించి,ఉద్యోగ మిప్పించవలెనని ఆలోచిస్తున్నారు. కనుక నీ ఇష్టం కనుక్కోమన్నారు, చెప్పునీఅభిప్రాయం.'

రుక్మిణి నిరుత్తరయై తలవంచుకుని కూర్చున్నది.

'రుక్మిణీ! నీవు పసిపిల్లవు కావు. యుక్తవయస్సు వచ్చినది. నీకు తెలియని విషయము లేదు. కనుక నీ ఇష్టమేమిటో చెప్పక తప్పదు.' అని జాలిగా, నిర్బంధంగా అడిగింది తల్లి.

'అమ్మా! నాన్నగారు నన్ను సుఖపెట్టవలెనని, వాళ్లమీద కోపముచేత, అంటున్నారు గాని అది నాకు సుఖముకాదు. స్త్రీకి గృహనిర్వహణమే తగియున్నది గాని ఉద్యోగము ఎక్కువముఖ్యము కాదని నా ఊహ. ఎంత చదువుకొనిననూ స్త్రీ గృహిణిగా ఉండినచే గృహమునకు గృహిణికీకూడా అలంకారము.

నాన్నగారు చెప్పేవిషయముకూడా మంచిదే. స్వంతంగా డబ్బు గడించుకొనుట, వ్యక్తి స్వాతంత్ర్యము మొదలైనవి ఉండవచ్చునుగాని నాకు మాత్రము ఇష్టములేదు. నాకు చదువుకునే వయస్సు మించినది. ఇదివర కొచ్చిన చదువు నాకు చాలును. అప్పటినుండి చదువుకొనుచున్నచో బాగుండెడిదిగాని ఇప్పుడు మళ్లీ చదువు కొనుట నా కిష్టములేదు. యెప్పటికైనా నాకు మంచిరోజులు వచ్చినసూ సరే, లేనిచో దేశసేవచేసి నా జీవితము సార్థకత చేసుకొనెదను.'

'మా అమ్మకు జబ్బుగా ఉన్ననూ నేను వెళ్లతలుచుగోలేదు. ఇప్పుడు మీ నాన్నగారి నిర్బంధనవల్ల వెళ్లక తప్పదు. వెళ్లి ఏవో రెండుఅక్షింతలు వేయించుగుని రావలెనని ఉన్నది. నిరుడు నేను వెళ్లి రెండు రోజులు ఉంటే వాడు ఇంటికే రాలేదు. ఇప్పుడు మాత్రం వస్తాడా, నాతో మాట్లాడుతాడా? నాఖర్మ ఇల్లా ఉన్నది. నా కడుపున వక్కత్తెవు పుట్టినా, నీ కన్నా నలుగురుబిడ్డలు పుట్టి వృద్ధి అవుతారని ఆశపెట్టు కున్నా. నీ స్థితి ఇల్లా వచ్చిందిగదా? ఎప్పటికైనా మంచిరోజులు ఉన్నవో లేవో, అని కళ్లనీళ్లు పెట్టుకున్నది జానకమ్మ.

రుక్మిణి లేచి తనగదికి వెళ్లి పడుకుని తనస్థితి తలుచుకొని దుఃఖసముద్రంలో మునిగిపోయింది.

3

'అమ్మా! నేను వచ్చిన రెండురోజులనుంచీ కృష్ణుడు ఇంటికికూడా రావడం మానేశాడు. అదివరకు ఎప్పుడన్నా వచ్చి నీకు ప్రాణం వున్నదీ లేనిదీ చూచి వెళ్లేవాడట, పనిచేసే అప్పి చెబుతున్నది. నేను వెళ్లుతా అమ్మా!' అన్నది జానకమ్మ తల్లి మంచందగ్గిర కూర్చుని.

'అయ్యో తల్లీ! నువ్వన్నా దగ్గిరుండవా?'

'అమ్మా! నేను ఉంటే రాడు. నేను ఉండి మాత్రం ఏం లాభం? నేను వెళ్లితే వాడు వచ్చి నిన్ను మట్టి చేస్తాడు. ఇదే కడసారపుచూపు' అని కళ్లనీళ్లు కారుస్తూ వెళ్లిపోయింది జానకమ్మ.

కృష్ణారావుతల్లికూడా కళ్లనీళ్లుకార్చి మైకంవచ్చి పడిపోయింది. అప్పి మటుక్కు కనిపెట్టుకుని అక్కడే కూర్చున్నది. కొంతసేపటికి మైకం తెలసి ఈ విధంగా అన్నది అప్పితో—

'అప్పీ! ఆఖరుకు నా బ్రతుకు ఎంతచేశాడు మా కృష్ణుడు. ఎంత బ్రతుకుబ్రతికినా భగవంతుడు యెట్లా వ్రాశాడో తప్పదుకదా? మా కృష్ణుడేమన్నా వచ్చాడా అప్పీ?

'రాలేదండి అమ్మగారు. మేడింటి సీతమ్మగారు జావ అక్కడ పెట్టారంట, ఇందాక మీరు పలకక పోతేను నాతో చెప్పారండి, అది తాగుతారా?'

'నాకేమి వద్దు. వక్కమాటు మా కృష్ణుణ్ణి పిలుస్తావా?'

చీట్లపేక ఆడేగదికి వెళ్లి పిలిచింది అప్పి 'అమ్మగారు పిలుస్తుండారు బాబు' అని.

'ఎందుకల్లా అరుస్తావు అప్పీ!' అని లోపలినుంచి కేకవేశాడు కృష్ణారావు భయంకరంగా.

'అయ్యగారు, పెద్దమ్మగారు ఇయ్యాల బతకరంట. అక్కయ్యగారు ఎల్లిపోయారు. మిమ్ము పిలుస్తుం డారు అమ్మగారు.'

'ఆ పిశాచం వదిలిందీ? అయితే వస్తానని చెప్పు' అని లేచి 'ఒకే బ్రదర్! నాప్లేసును పోగొట్టేవుసుమా ఇప్పుడే వస్తా' అనిచెప్పి జేబులోనుంచి సిగరెట్టుతీసి వెలిగించి, నీటుగా స్లిప్పర్సు కాళ్లతో చెటచెటామోగిస్తూ ఇంటికెళ్లి తల్లిమంచం దగ్గిర నుంచున్నాడు.

చప్పుడు విని కండ్లుతెరచిచూచి 'నాయనా వచ్చావా ?' అని కాళ్లు గట్టిగా కౌగలించుకున్నది తల్లి.

'యెందుకు పిలిచావు? నేను వెళ్లాలి అర్జంటుపనుంది' అన్నాడు కృష్ణారావు, కాళ్లు విదలించుకుని ఇవతలికి జరిగి.

'యేమీలేదు నాయనా. నేను వెళ్లి పోతున్నా.ఇకనైనా ఆపిల్లను తీసుకురా. మనజీవానికి ఏడుస్తున్నది పసిపిల్ల, అబల, ఇదే నా కోరిక.'

'ఇందుకే నేను ఇంటికిరావడం మానేశా. ఇక నా కామాట చెప్పవద్దు' అని వెళ్లిపోయినాడు కృష్ణారావు. 'అయ్యో నాయినా! చచ్చిందాక నయినా దగ్గిరుండవా తండ్రీ ? ఏమి గ్రహంపట్టిందిరా నిన్ను? ఎంతో పేరుపొంది ఎంతో గౌరవంగా బ్రతికిన సంసారానికి యెంతగతి పట్టించిందిరా ? కృష్ణా! అయ్యో! కృష్ణా!కృష్ణా!' అని పడిపోయింది కోటమ్మగారు. అక్కడేవున్న అప్పి 'అమ్మగారు!అమ్మగారు!' అని పిలిచింది. పలుకలేదు. వాకట్లోకి వెళ్లి ఇరుగుపొరుగువార్ని కేకలేసింది. అందరు వచ్చి చూచి కోటమ్మగారు చనిపోయిందని గ్రహించి కొమారుడికోసం కబురుచేశారు అప్పిచేత. అప్పి వెళ్లి మళ్లీ చీట్లపేక ఆడేగది దగ్గిరపిలచింది. 'ఇక్కడలేడు, వనజాక్షి ఇంటికెళ్లాడు' అని లోపలినుంచి కేకవినపడ్డదిఅప్పికి. వనజాక్షి ఇంటి కెళ్లి పిలిచింది. 'యెందుకు అప్పీ' అని వాకట్లోకి వచ్చాడు కృష్ణారావు.

'అమ్మగారు కాలంచేశారు. మిమ్ములను పిలుచుకురమ్మన్నారు' అని పెద్దగొంతులో ఏడుస్తూ చెప్పింది.

వనజాక్షికూడా వాకట్లోకివచ్చి 'యేమిటే అవులక్షణంగా ఏడుస్తావు, వీధిలోకివెళ్లి ఏడు' అని దాన్ని కసిరి, 'అయ్యో ఇప్పుడు మీరు వెళ్లుతారా ? నా పుట్టినదినం ఇంత ప్రయత్నం చేసుకున్నా' అని చేయి పట్టుకుని ఇంట్లోకి తీసుకెళ్లింది కృష్ణారావును.

'నేను వెళ్లవలసిన అవుసరముంటుందేమో, ఆ పీడ కాస్తా వదిలించుకుని వస్తా' అన్నాడు కృష్ణారావు.

'ఇవిగో ఎన్నిపిండివంటలు చేశానో చూడండీ, మీరు తినకపోతే నేను తింటానా ?'

'అయ్యో తల్లికదా ? వక్కమాటు అక్కడికి వెళ్లి, మళ్లీ ఇప్పుడే తిరిగివస్తాను.'

'నాకు తెలుసులెండి మీ ప్రేమ పట్టిప్రేమని, కపటప్రేమని. చస్తేమటుక్కు యేమీ ? ఇంకా మీరేం చేస్తారు పోట్లాడదుగదా ? తీసుకెళ్లేది ఇటే. అవుసరమైతే ఇటునుంచి ఇటేవెళ్లి రావచ్చు. నామీద ప్రేమైతే ఉండండి. వెళ్లితే, ఇక ఈ వీధినికూడా నడవవద్దు. మీమీదనే ప్రేమ పెట్టుకుని మిమ్ములనే నమ్ముకున్నందుకు ఇంత పరాభవం చేస్తారా ? ఇంక మీ వంక చూస్తానేమో చూడండి.'

'అయ్యో, వనజాక్షి! నీవల్లా అంటే నేను బ్రతుకగలనా ? అయితే నేను వెళ్లనే వెళ్లను.'

'నా పుట్టిన దినమని ఇంత ప్రయత్నము చేసుకుని బజారుకు వెళ్లవలెనని అనుకుంటూఉంటే, మీరు వెళ్లితే యెల్లాగ ? 'అప్పీ ! నేను ఇప్పుడు రావడానికి వీల్లేదని రానని' చెప్పు అప్పితో.'

'వనజాక్షి ! మనమిప్పుడు బజారుకెందుకూ ?'

'నిన్న చెప్పినవన్నీ నిన్ననే మరచినారా? బనారసుచీర, పట్టురవికలు, రవ్వలఅడ్డిగా, కెంపులగాజులు, చంద్రహారము, మా అమ్మకు గడియారపుగొలుసు నాలుగుపేటలు, మీకు రవ్వలపతకంతో ఉన్న రిష్టువాచి నిన్న లిష్టు వ్రాసుగోలేదూ? మరిచిపోయినారా?'

'మరువలేదుగాని ఇప్పుడు అంత మొత్తం నా వద్దలేదు. మొన్న నీకిచ్చిన మూడువేలలో ఏమన్నా కొంత ఉన్నదా?'

'ఉంచి తమకు మళ్లీ ఇవ్వమని యిచ్చారా? మా అమ్మనోముకు మా తమ్ముడు అత్తవారింటికి వెళ్ల డానికి కర్చు అయినవి.'

'సరే నేను బజారుకు వెళ్లి జట్కా పంపుతాను రా. నిన్న తాకట్టువ్రాశాను పదహారు యెకరముల మాగాణి. వాడు ఏమన్నా ఇస్తాడేమొ కనుక్కుంటాను. ఈ రోజు రొక్కం ఇస్తే పదివేలది ఐదువేలకే రిజష్టరు చేస్తానని చెప్పి పైకం తెస్తాను. ఆ కందువా ఇల్లా ఇయ్యి వెళతాను' అని వెళ్లాడు కృష్ణారావు. కొంచంసేపటికి వనజాక్షికూడా జట్కాబండిమీద వెళ్లింది బజారుకు.

అప్పివెళ్లి కృష్ణారావు చెప్పినప్రకారం చెప్పింది.

కృష్ణారావు పినతండ్రికొమారుడు వచ్చి దహనక్రియలు చేశాడు కోటమ్మగార్కి. కృష్ణారావు మళ్లీ ఇంటికే రాలేదు.

౮

కృష్ణారావు తెలివికలవాడు, ఆస్తికలవాడు, రూపసి, చదువుకున్నవాడు. యేమి ఉండి యేమి ప్రయో జనము? వుంపుడుకత్తెచేత జిక్కి జూదరియై వట్టి పనికిమాలిన శుంఠ అయిపోయినాడు. ఆస్తంతా పోయింది. తినటానికి తిండి, కట్టుకోటానికి గుడ్డ లేకుండాపోయిందిప్పుడు.

'వనజాక్షీ! వనజాక్షీ! తలుపుతియ్యవూ? వక్కమాటు తలుపుతియ్యి వాన కురుస్తున్నది. గుడ్డలు తడిసిపోయినాయి. చలివేస్తున్నది. కటికచీకటి, దారి కనుపించటం లేదు. ఈ పూటకు తలుపుతియ్యి పంచలో పడుకుంటా' అని విలపిస్తున్నాడు కృష్ణారావు వనజాక్షి వాకట్లో.

వనజాక్షి పలుకలేదు. దానితల్లి వచ్చి అన్నది, 'యిప్పుడు తలుపుతియ్యటానికి వీలుకాదు. యెందుకూ ఇంకా నీకు తలుపుతియ్యటం, కానీ పూలన్నా తీసుగురాలేనివాడికి? నీకేం తలుపులేదు గిలుపులేదు, వెళ్లు అరవబోకు ఇంట్లో పెద్దమనుష్యులున్నారు' అని కసిరి వెళ్లిపోయింది.

ఆకాశము నీలవర్ణముతో కప్పిఉన్నది. పెళపెళ ఆకాశము విరిగిపడునట్లు ఉరుములు పిడుగులు ఝుడిపిస్తున్నాయి. చక్కని పదహారొవన్నె బంగారువలె కండ్లు మిరుమిట్లు గొలుపుతూ నీలాకాశమున మధ్యమధ్య మెరుపుతీగలు మెరుస్తున్నాయి. వరుణదేముడు పగ తలచినట్లు పెద్దధ్వనిచేస్తూ వర్షధార లు కురిపిస్తున్నాడు. ప్రళయకాలము యిదియే ననునట్లుగా వ్రేళ్లతో సహా పెళ్లగిలి చెట్టు విరిగిపడునట్లుగా ఝంఝూమారుతము వీచుచున్నది. కృష్ణారావు వనజాక్షి ఇంటిముందు సైడుకాలువ వంతెనమీద కూర్చుని రాత్రి పన్నెండుగంటలు మొదలు ఆరుగంటలవరకు తెల్లవార్చాడు. ఇప్పుడు కృష్ణారావు దేహమంతా

మారిపోయింది. చిరిగిపోయిన బనియను తొడుక్కొని, మాసిపోయిన ఐదుమూళ్లధోవతిగూడ కట్టుగుని, మసి పాతవంటి తువ్వాలు ఒకటి బుజానవేసుకొని ఒక సిగిరెట్ల దుకాణంలో కూర్చున్నాడు, జీవకళలన్నీ పోయి నిర్జీవంగా ఉదయం ఏడుగంటలవేళ కృష్ణారావు.

'కృష్ణా! ఎందుకిక్కడ కూర్చున్నావు? అల్లా ఉన్నావేం? ఈ మధ్య రెండుమూడు నెలలనుంచీ కనిపించటంలేదు యెక్కడుంటున్నావు? నీరసంగా ఉన్నట్లున్నావు కాఫీహోటలుకు వెళ్లలేదా?' అన్నాడు కృష్ణారావు పినతండ్రికొమారుడు మోహనరావు.

జవాబు చెప్పటానికి సిగ్గుపడి ముఖము నేలకు వంచుకుని 'కాఫీహోటలేమిటి? అన్నం తిని రెండురోజులైంది. నాకు ఈ దరిద్రావస్థ పట్టినప్పటినుంచీ ఎవ్వరికి కనిపించటానికి సిగ్గుగా ఉండి దొంగవలె తిరుగుతున్నాను. దైవవశాత్తు నీవు ఇవ్వాళ ఇక్కడ కనిపించావు. నిన్ను చూచేటప్పటికి నాప్రాణం చచ్చిపోయింది' అని రెండుచేతుల్లోను ముఖము దాచుకొని హోరుమని ఏడ్చాడు కృష్ణారావు.

'అయితే మనింటికి వెళుదాముదా' అన్నాడు మోహనరావు.

'అన్నయ్యా నేను యే ముఖంతో మీ ఇంటికి వచ్చేది? నా ఆస్తి, నా దర్జా అంతా ఇల్లా పాడుచేసుగుని, ఈ బిచ్చగాని వేషంతో మీఇండ్లల్లో యెల్లా ఉండేది? అంత భోగం అనుభవించిన ఊళ్లో ఈవేషంతో యెల్లా తిరగనూ? ఈ బ్రతుకుకంటే ప్రాణత్యాగము మేలు. గనుక రైలుకిందనో కోనేట్లోనో పడి ప్రాణత్యాగం చేసుగుందామని ఆలోచిస్తూ ఇక్కడ కూర్చున్నా. అన్నయ్యా! ఆజ్ఞప్రకారం రానందుకు క్షమించు. ఇదే నా వందనములు.'

'యెంతవెఱ్ఱివాడివి కృష్ణా! దైవఘటనకు మనమేం చేయగలం? నీదేమీ తప్పులేదు, నీఖర్మలో ఇల్లా ఉన్నది. నేనొకమాట చెపుతా రా' అని చేయిపట్టుగుని మోహనరావు యింటికి తీసుకెళ్లి, బట్టలిచ్చి, భోజనం పెట్టి అన్నాడు:

'కృష్ణా నేనొకమాట చెపుతా వింటావా?'

'చెప్పు ఏదో.'

'ఒకచోట మంచి ఛాన్సు ఉన్నది. నిన్ను అక్కడికి తీసుకెళ్లి వదిలిపెడతాను. నీకు బాగా ఉంటే ఉండు, లేకపోతే రా.'

వస్తుతహ కొంచం మెత్త బుద్ధిగలవాడు గనుక కృష్ణారావు 'సరె, వెళ్లుదాము రా' అన్నాడు. ఇద్దరు బైలుదేరి వెళ్లారు రెండుగంటలబండీకి. మూడుగంటలకల్లా బెజవాడస్టేషనులో దిగి ఊళ్లోకి వెళ్లారు. ఒకమేడదగ్గిరికి తీసుకెళ్లి తలుపుకొట్టాడు మోహనరావు. ఇంట్లోనుంచి ఒకయువతి వచ్చి తలుపుతీసింది. ఏదో సౌజ్ఞ చేసి మోహనరావు వెళ్లిపోయినాడు.

ఆ యువతి కృష్ణారావును మరియాదచేసి, కాళ్లకు నీళ్లిచ్చి, ఫలహారం పెట్టింది. మరియాదగా స్నానభోజనాదులు జరుగుతున్నాయి. యిల్లా రెండురోజులు గడచినాయి. కృష్ణారావుకు ఇదేమిఅర్థమవక చివరకు అడిగాడు:

'ఓ అమ్మాయి! నీ వెవ్వరో నేనెరుగను. నీవు నన్నిలా మరియాద చెయ్యటానికి కారణం నాకు తెలియదు. నేనిక్కడుండినచో మీ పెద్దవారు వప్పుకొందురో లేదో తెలియదు. నీవుకూడా బ్రాహ్మణయువతి వలె కనుపించుచున్నావు. నీ పూర్వోత్తరము తెలియనిదే నేనిక్కడుండుటకు నాకు భయముగా ఉన్నది. నీ వృత్తాంతము నాకు చెప్పుటకు సందేహము లేనిచో చెప్పవలసినదిగా కోరుచున్నాను.'

'నా వృత్తాంతము మీతో చెప్పుటకు నాకేమీ అభ్యంతరములేదు. కొంతకాలమైన తరువాత చెప్పెదను. తమరిక్కడుండుటకు ఏ విధమైన అభ్యంతరమున్నూ లేదు.'

'అయితే ఈ ఊళ్లో మా అక్కా బావా ఉన్నారు. వాళ్లకు తెలియకుండాఉండాలి మనం.'

'మరేమీ ఫరవాలేదు. ఈ పై అంతస్తు దిగవలసిన అవుసరమేలేదు మనకు. యెంతకాలమైనా ఉండవచ్చు.'

'నీ ప్రేమ, సౌందర్యము, శాంతము, నీఉత్తమగుణమును చూచి అయస్కాంతము ఇనుమును ఆకర్షించినట్లుగా నా మనస్సు నిన్ను ఆకర్షించినది. నిన్ను చూచినప్పటినుంచీ నా మనస్సులో ఏదో క్రొత్తమార్పు కలిగినది. ఇక నిన్ను వీడిపోలేను. నా స్థితి తరువాత నీతో చెప్పుకొనెదను.'

'మీ వాళ్ల కెందుకు తెలియకూడదూ?' అన్నది ఆయువతి.

'మా అక్క కోమార్తెను నాకిచ్చి వివాహము చేసినారు. ఆ పిల్ల కురూపి, అనాకారి, మతిహీన అగుటచేత నేను తీసుగువెళ్లలేదు. వాళ్లకు తెలిస్తే తంటావస్తుంది. కొన్నిరోజులు గడిచినతరువాత మనము ఏదో దారి చూచుగోవచ్చు.'

'తెలియకుండానే ఉండొచ్చులెండి.'

ఇంతలో మెట్లమీదినుంచి చప్పుడైంది. కృష్ణారావు తలయెత్తిచూచి, నివ్వెరపోయి తలవంచుకొని చప్పున వెళ్లి కాళ్లమీదపడ్డాడు. 'అక్కా నా అపరాధములు క్షమించు, నాతప్పులు మన్నించు' అని రెండు కాళ్లు పట్టుకున్నాడు.

'కృష్ణా నీ తప్పుకాదు, దైవాధీనం నీవేం చేయగలవు?' అన్నది జానకమ్మ.

'రుక్మిణీ యెంతదానవు? సముద్రములో చాపను వలవేసి పట్టావు. తప్పంతయు నాదే. ఈ రోజునుంచీ ఈ కృష్ణుడు రుక్మిణీ విధేయుడు. నన్ను క్షమిచంవూ?' అని భుజముతట్టి చేయిపట్టుకున్నాడు రుక్మిణిని.

'క్షమించగల సమర్థత నా వద్ద ఉన్నదా? నా విధికి తమరేం చేయగలరు?' అన్నది రుక్మిణి.

ఇంతలో రామారావుగారుకూడా వచ్చారు. కృష్ణారావు బావగారిని చూచి సిగ్గులో విచారములో తలవంచి 'బావగారు! క్షమించవేడెదను. ఈ యపరాధి వందనము లర్పించుచున్నాడు' అని అన్నాడు.

'క్షమించుటకేమున్నది? కృష్ణా! అంతా దైవాధీనం' అన్నాడు రామారావు అల్లుని దగ్గిరికి తీసి.








## లలిత - కళ

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

కళావతి

లలితా! లలితా!

లలిత

యేమే కళావతీ, యేంజేస్తున్నావు?

కళావతి

గుమ్మాలకు పసుపుకుంకాలు పెడుతున్నా. రేపు శుక్రవారంగాదూ.

లలిత

అబ్బా! యెప్పుడుచూచి నా గుమ్మాలర్చించనూ, యిండ్లలకనూ, ముగ్గులెట్టనూ, రాటంవడకనూ, వండనూ, వడ్డించనూ యీబండచాకిరీలో మునగానాం తేలానాంగా యీదుతూవుంటావు. నాగరికత, లలితకళాకలాపం నీబుద్ధిలో చొచ్చనేచొచ్చవు. ఇందుకే నీసావాసమంటే నాకొకొక్కసారి చిరాకేస్తుంది.

కళావతి

పోనీలేవే, లలితకళలంటే యేమిటో కొంచెం విమర్శించూ, విందాం.

లలిత

విమర్శించేదేమిటి. సొంపుగా చేతిగుడ్డలల్లడం, కుట్టుపని, పూలల్లడం, పూసలమల్చడం చిత్రలేఖనం, సంగీతం, కోలాటం, కొలది పాటవస్తువులు, యిల్లాంటి ప్రియవస్తువులతో నాజూకుగా అలంకరించికో నేర్చియుండడం, యింకా యీలాంటివే లలితకళలంటాం.

కళావతి

ఐతే గృహనిర్వాహణానికి సంబంధించినపనులు లలితకళల్లో చేరవనా నీతలంపు?

లలిత

యెందుకుచేర్తాయి? వొళ్లలిసిపోయే పనులు చెమటలుబట్టంగా వెళ్ల యీదుతూ వుంటే, యెద్దుమొద్దుబండిలాగ రగడేగవు. అందుకనే వాట్ని బండచాకిరీలంటారు.

కళావతి

సరే, ఆమాటమీద నేవుండు. అట్టి లలితకళావిచక్షణలై నీవమర్చిన ఆవస్తువుల నేమిచేయాలి ?

లలిత

ఇంటియందలంకరించుకోవాలె. సుకుమారంగా అనుభవించాలె. ఆనందించాలి, సుఖించాలి.

కళావతి

అవి అలంకరించుకోడానికి గృహమేలా వుండాలి ?

లలిత

రమణీయంగా వుండాలె.

కళావతి

రమణీయ తెలావస్తుంది ?

లలిత

తెలివితేటలతో వోపికతో పాటుబడుతూవుంటే-

కళావతి

యెవరు... పలకవేం పడమటిసీమవారి పప్పుముద్దలాగా బిగుసుకొని జవాబియ్యవేం ?

లలిత

నువ్వే జెప్పు.

కళావతి

గృహిణి, గృహము, గృహోపకరణ పరిజ్ఞానము, గృహకార్యనిర్వహణము ఇవన్నీ ఆలలితాకళావిధానాలకు పునాదులే. పూర్వంనుండీకూడ మనభారతీయులు, దేశకాలపాత్రౌచితులనుబట్టి యెవరెవరి కేయే కళలయందభిరుచిమెండో గుర్తించి వారికావిద్యల నేర్పేవారు. చిత్రరేఖ చిత్రలేఖనమున గడితేరింది. ఉత్తరవాసవదత్త మాళవిక మున్నగు రాచకన్నియలు నృత్తగీతాదులందు అసమానపాండిత్యము పొందారు. కుంతి ద్రౌపది మున్నగువారు గృహోద్ధరణమే పరమకర్తవ్యముగా నిర్వహించుచు, పాకకళాది మహత్కార్యాలలో సమర్థురాండ్రై) వన్నె కెక్కారు. మహర్షిపత్నులు, సామాన్యగృహిణులు యీకళలనే పలురకాలుగా నుపయోగించుకొంటూ తమ తమ సంసారాలను సారవంతాలుగా చేసుకొనేవారు. నేర్పు, ఓర్పు, బుద్ధికౌశలతలు కలిగి గృహమును భూలోకస్వర్గముగా చక్కదిద్దుకొనడం యీకళలకి ప్రథమసోపానము. గోడలేనిచిత్తరువు లిఖించడానికి వీల్లేదు. ఆలాగే యిల్లు రమణీయంగా వుంటేనే యీలలితవస్తువులు శోభిస్తాయి. మున్ను

కోటేరువేసినట్లుంటేనే ముక్కెర రాణిస్తుంది. ఇల్లుజూసి యిల్లాలిని జూడమన్నారుపెద్దలు. గృహిణినేర్పంతా గృహనిర్వహణంలో ప్రతిబింబిస్తూవుంటుంది. సమర్థురాలైనగృహిణి చుక్కబొడుపున్నే నిద్దర్లేచి, కాలోచితకృత్యాల్దీర్చుకొని, 'కృష్ణా రామా గోవిందా' యని ప్రార్థనాగీతాలు పాడుకొంటూ, గుమ్మాలు శుభ్రంగాకడిగి పసపుకుంకాలతో అలంకరించి, చికిలిముగ్గులు బెడుతుంది. ఇట్టివే ఉదయాది గృహకార్యనిర్వహణరూపాన్ని ఆచరింపదగిన ఉత్తమకళలు స్త్రీమీద ఆధారపడివున్నాయి. ఇందేకళననుసరించినా ఒక్కొకవిధంగా ఆరోగ్యమునసేమి, ఆచారమునసేమి, ఆర్థికమగనేమి గొప్పప్రయోజనాలున్నాయి. గుమ్మాలకు పసుపుపూయుట : తరచు అందరు వచ్చుచుపోవుచుండు దారితల ముఖ్యంగా దారు నిర్మితమై వుంటుంది. అందు నడచువారివెంటవచ్చే విషక్రిములు చేరుట కవకాశముంటుంది. పసపు అట్టి క్రిముల్ని హరించే గుణంగలది. అటులే స్త్రీప్రకృతి కూడా పసపుకుంకాలచే ఆరోగ్యము మాంగల్యము పొందదగివుంటుంది. అందువల్లనే మహానుభావులగు పెద్దలు స్త్రీలచేతనే యీకార్యాలనిచేయించుట ఆచారమైంది. చికిలిముగ్గులు చిత్రించటం అలంకారమేకాక పిట్టలు చీమలు మొదలైన సాధుజీవాలకు జీవనమైవుంది. పారిశుధ్యత నెరిగి పాకకళ నిర్వర్తించడం నేరిస్తే ఆ సంసారం మనస్తృప్తి, ఆరోగ్యము కలిగి ఆనందనిలయమై వుంటుంది. తీరుబడివేళల్లో నూలువడకి ఖద్దరుప్రచారాన్ని పెంపొందిస్తే ఆర్థికలాభం ఎంతవుంటుందో తెలుసునుగదా. యీ పరిశ్రమల్లో సంపూర్ణమైన ప్రజ్ఞకలిగి సంసారాలను సారవంతాలుగా పాలించుకుంటూ తక్కిన కళల్ని యథాశక్తి పెంపొందించుకొంటే బంగారానికి పరిమళమబ్బినట్లుంటుంది. అలా కాక యెప్పుడో బడిలోచెప్పిన కొద్దిపాటి అల్లిక కుట్టుపనులకు పెట్టెడునూలు బుట్టెడుపూసలు ముందుబడేసుకొని, ఇంటిలోపనులు చేయడానికో బంగారక్క, భోజనాలమర్చడానికో వంటలక్క, పైనౌకరీకొక బంట్రోతు, గుమాస్తా యీవిధంగా యింటినంతా ఇతరుల కప్పగించి కూచుంటే యింకేముంది ? అతగాడి సంపాదనంతా ఇంటోవాళ్ల దుబారాలకుసరి. కాబట్టి నేనుజెప్పేదేమిటంటే ఏవిద్యనేర్చినా అందులో సంపూర్ణమైనప్రజ్ఞ సంపాదించాలె. గృహనిర్వహణానికి సంబంధించినకళలు కొన్ని సులభసాధ్యాలౌతాయి కాని, సంగీతం చిత్రలేఖనం ఇలాంటికళలతికష్టసాధ్యాలు. యీకళలభ్యసించి కృతార్థులైనవారే ఉత్తమకళోపాసికలు—శ్రీమతి వంగల వాణీబాయమ్మగారు, శ్రీమతులు విశ్వేశ్వరమ్మ భానూగార్లు వీణా వేణుగాత్రకళల్లో అసమాన పాండిత్యాన్ని పొంది సంగీతసరస్వతులని ప్రశంసింపబడ్డారు. శ్రీమతి ఆర్. కమలాబాయిగారు చిత్రలేఖనంలో చిత్రలేఖయై మొనలేనియశం ఆర్జించారు. అట్లే యేకళ అభ్యసించినా తుదిసెగ్గి తమవిద్య సార్థకమయ్యేటట్లు ప్రయత్నమొనర్చాలని నాపుద్దేశం. అనుభవజ్ఞులైన పెద్దల అందరిఅభిప్రాయాలు యివేనని తలుస్తాను.



# చిత్రపని (Fret-Work)

శ్రీయుత మామిడన్న వెంకటేశ్వరరావుగారు

---

మానవులకు ఏదియో ఒకకళయందు నేర్పరితనముండవలెను. కళాదృష్టిలో పూర్వకళలకు యిప్పటి కళలకు(శిల్పకళలు, చిత్రకళలు, చెక్కడములు వగైరా) కొంచెము సంబంధముండిన దనవచ్చును. కళలలో అనేకవిధము లున్నవని అందరెరిగిన విషయమే. కాని ప్రతివారు తమకు దేనియం దభిరుచియుండునో దానినే అభివృద్ధిలోనికి తీసుకొని రావలెను. పూర్వకళలను పూర్తిగా ఆచరణలో నుంచకపోయినను కొంత వరకైనను ఆచరణలో యిప్పుడక్కడక్కడ యుంచుచున్నారు. యీకళలవలన జీవనోపాధి జరుగని కుంటి గుడ్డివాళ్లు ఏదో ఒకపనిని నేర్చుకొని దానినే కళగా మార్చి పొట్టపోసుకొనుచున్నారు. విద్యలో అనుభవము లేనివారుకూడా యీకళలవలన పేరు పొందగలుగుచున్నారన్న సంగతి అందరెరిగిన విషయమే. కళలలో ఎన్నిరకము లున్నవో వాటివాటి ప్రాముఖ్యతలు ప్రతివారు తెలుసుకొనుట ముఖ్యావశ్యకము. భారత రామాయణ ప్రముఖులందరును ఏదియో ఒకకళయందు ప్రాముఖ్యత వహించియుండిరి. యిప్పుడిప్పుడు యీఇంగ్లీషు పరిపాలన వచ్చినతరువాత అన్నికళలు యంత్రములద్వారా జరుగుచుండుటచే పూర్వకళలు కొంతవరకు అంతరించిన వనవచ్చును. యిప్పటికికూడా కొన్నిప్రదేశములలో శిల్పకళలు, చిత్రకళలు మొదలగునవి మనము చూచుచున్నాము. అట్టివి చూచినప్పుడు "మనపూర్వులు అంత పనిచేసినారుగదా మనము యిప్పుడు చేయజాలకున్నా"మని ప్రతిమానవహృదయము నొచ్చక మానదు. యీరోజున (మ్యూజియం) ప్రదర్శనశాలలలో చూచినచో పూర్వకళలు బయల్పడక మానవు. కాని వాటిని ఆచరణలో నుంచకపోవుటవలన మనము యిప్పుడు వానిని చేయజాలకున్నాము. అంతేకాని వేరుగాదు. మనము ప్రయత్నించినచో వాటిని మించిన పని చేయగలము. యిప్పటికైనను అందరు కళలలో వెనుకపడియుండుట తెలిసికొని ఏదియో ఒకకళయందు ప్రాముఖ్యతవహించి ఖ్యాతిపడయ కోరుచున్నాను—

కళ అనునది స్త్రీలకు సంబంధించినదా లేక పురుషులకు సంబంధించినదా అనునది ఒకప్రశ్న. కొన్ని కళలయందు యిరువురకు సంబంధముండును. మరికొన్నిటియందు వారివారి ఔన్నత్యములకు ప్రాముఖ్యత ఇయ్యవచ్చును. కాని కళ అను వస్తువులో స్త్రీలకే ఎక్కువ ప్రాముఖ్యత యియ్యవచ్చును—

కళలలో నొకశాఖ చిత్రపని. యీ చిత్రపని (fret-work) క్రొత్తదిగాదు. ఇది పూర్వకాలమునుండి వచ్చుచున్న పనియే. యిప్పుడుగూడా కొన్నికొన్ని గ్రామాదులలో నేర్పరులగు వడ్రంగులు యంత్రసహాయము లేకయే, వారివారి చేతిపనిముట్లద్వారా యీ పనిని చాలఅందముగా తయారుచేసి తగినబహుమతులు బడయుట లేదా? యింకను బియ్యపుగింజలమీద చెక్కడములు మొదలగుకళలు చూచినచో కళలేని బ్రతుకెందుకాయని తోచక మానదు. ఆ కళవలననే మనిషికికూడా కళ వచ్చును. ఈ కళవలననే పెద్దలలో గౌరవమువచ్చును. ఇప్పటి ఆటువంటికళను ఆంగ్లేయుల యంత్రశాలల కర్పించి భారదేశీయులు బారుమనిన ఏమి ప్రయోజనము?

కైనను మేలుకొని సమయము చిక్కినప్పుడేదియో ఒకకళను అభ్యసించి పూర్వపుకళలను పునరుద్ధరింపఁ గోరుచున్నాను.

యీ క్రింద తెలియపరచబోవు యీచిత్రపని మిక్కిలి ఉత్సాహము కలిగించువానిలో నొక్కటి అని అనుభవమువలన మీరే తెలుసుకొందురు. తమ విశ్రాంతిసమయమును యీ పనియందు వినియోగించినచో మిక్కిలి ఉపయుక్తముగను, ఉత్సాహముగను ఉండి ఆనందమును కలిగించును. యీ పనినే వృత్తిగా బెట్టుకొని అనేక వేలమంది జీవనము గడుపుచున్నారు.

యీ పనిని గృహలక్ష్ములందరును తమ విశ్రాంతిసమయములో చేసుకొనవచ్చును. శ్రమ ఎంతమాత్రము తెలియదు. గృహలక్ష్ములకు వీలుగా నుండు సులభమార్గములచే యీ పనిని ఎట్లు చేయునది యీ క్రింద తెలియపరచుచున్నాను.

యీపనికి ముఖ్యముగా అవసరమగు పనిముట్లు :



1. Steel Hand frame
ఉక్కు చేతిఫ్రేము.







2. Cutting board and cramp

(3) (drill) డ్రిల్లు

4. Saw blades ఫ్రేము కుపయోగించు సన్నరంపములు, మొదటిచిత్రమునందు అమర్పబడినటువంటి సన్నని చిన్నరంపములు

5. One Half round and flat, and one full round ఆకురాళ్లు.

6. Sand or glass papers ఇసుక కాగితములు.

యీ పనికి అవసరమగు పనిముట్లు యేమాత్రము ఖరీదైనవికూడా కావు.

యీ చిత్రపనిని రెండువిధములుగా చేయవచ్చును. (1) మిషను (2) (Hand frame) చేతిఫ్రేము, యీ రెంకువిధములలోను చేతిఫ్రేము మిక్కిలి ఉపయుక్తమైనది. యెందుచేతననగా ఫ్రేముతో పని ప్రారంభించినచో ఆపవలసిన భాగమున ఆపుటకును అవసరములేని భాగములను కోయుటకును చేతిలో వీలుగా తిరుగుచుండును. మిషనును అట్లు ఆపజాలము. మరియు డిజైనుముందుకు జరిగి అందవికారముగా నగును. మరియు యింకను యిటువంటి కొన్ని కారణములచే చేతిఫ్రేము ఉత్తమమని చెప్పవచ్చును.



7. అద్దము, చట్రము.

## చేయు విధానము

మొదట మనకు కావలసిన డిజైనును, అనగా అద్దమును అమర్చుటకుగాని, లేక ఫొటోను అమర్చుటకుగాని, మరి ఏదైన మనకు కావలసినదాని బొమ్మను తయారుచేసికొనవలెను. దానిని (Tracing paper) ఉల్లిపొరకాగితము మీదతీసి, 3 పొరల చెక్కను (Ply-Wood) తీసుకొని ముందుగా దానిని గాజుకాగితముతో తెల్లగా వచ్చువరకు తోమి తరువాత చెక్కపై మైలాపిండి జిగురుపూసి చెక్కయొక్క (grains) చారలను నిలువుగా వుండునట్లు చూచుకొని తరువాత కాగితముయొక్క పైభాగమును చెక్కపైనుంచి, తెల్లనిగుడ్డతో మిగిలిన భాగమును కొంచెము కొంచెముగా చెక్కపై అతికించుచు వచ్చినచో చెక్క యొక్క మధ్యభాగమున గాలి బుడగలు లేక డిజైను బాగుగా అతుకుకొనును. ఒకచో అట్లు గాలిబుడగలు కలుగునట్లు కనుపించినచో యేదైన పిన్నీసునుగాని సన్నని సూదినిగాని తీసుకొని ఆయా ఉబికినస్థలములయందు రంధ్రములు చేసినచో గాలి తక్షణము బయటకువచ్చును. అప్పుడు మెత్తనిగుడ్డతో ఆ భాగమును నొక్కినచో బాగుగా అంటుకొని యుండును. పని ప్రారంభమునకు ముందు డిజైనును బాగుగా అతికించుట ముఖ్యము.

అట్లు అతికించిన పిమ్మట ఆ చెక్కను తడి ఆరునంతవరకు ఆరనియ్యవలెను. తరువాత డ్రిల్లు (3-వ చిత్రములో చూపినటువంటి పనిముట్టు) తీసుకొని డిజైనులోఉన్న కాళీస్థలములయందు చిల్లులు పొడుచుకొనవలెను.

తరువాత చేతిఫ్రేమును తీసుకొని ముందుగా దానికి అమర్చబడిన రంపముయొక్క పళ్లు అడుగునకు తిరిగి యుండునట్లు చేతితోపట్టుకొని ముందుగా దానిని ఫ్రేముయొక్క అడుగుమరలో బిగించవలెను. అట్లు అడుగు భాగమును బిగించిన తరువాత cutting board పై (2-వ చిత్రములోచూపిన పనిముట్టు) డిజైను చెక్కనుబెట్టి యీ చేతిఫ్రేమునకుబిగించిన రంపముయొక్క పైభాగమున డిజైనులోనుండిన రంధ్రముగుండా పైకిరానిచ్చి ఫ్రేము

యొక్క పైభాగమున ఉంచబడిన మరలో రంపమును వదులుగాలేకుండునట్లును, గట్టిగాఉండునట్లును బిగించి; ముందుగా లోపలిభాగములను అనగా డిజైనులో కావలసినభాగముగాక, డిజైనువచ్చునట్లు చేయుటకు అనవసరభాగములనుమాత్రము కోయుట ప్రారంభించవలెను. అట్లు కోయుట ప్రారంభించిన తరువాత గమనించవలసిన విషయములు ఏవన (1) ప్రేమును బిగించిన రంపము నిలువుగా కోయుచున్నది లేనిదియు (2) గగ్గులు లేకుండా కోయునట్లును గమనించి కోసినచో డిజైను బహు అందముగా తయారగును.

తరువాత Glass paper తో బాగుగా తోమి, ౯-వ నెంబరు చిత్రములో కనబరచిన డిజైనును కోసి, తర్వాత దానిలోచూపబడిన చుక్కలగీత ఆకారముగలిగినమాదిరి యింకొక చెక్కనుకోసి ఆ డిజైనులో అద్దమునుపెట్టి రెండవచెక్కను, డిజైనులో చూపినట్లుఉంచి మేకులతో తాపడముచేసి, అద్దమునకు వెనుకభాగమున అద్దముసైజులో ఒకదట్టమగు అట్టనుకత్తిరించి ప్రక్కలను, ఫొటోలకు మేకులనుబిగించుమాదిరి, మేకులు కొట్టినయెడల అద్దమునకు ఏ విధమైన ప్రమాదమునులేక, చాలకాలము ఉపయోగముగ వుండును.

wood polish చేసినచో design చాలా బాగుగా తయారగును. ఈ బొమ్మలో విశదపరచిన విధమును బట్టి, అనేకరకములగు టాయిలెట్టుపెట్టెలు, అద్దపు చట్రములు, మొదలగునవి ఎన్నియో శ్రమలేకయే గృహలక్ష్మిలు చేసికొనవచ్చును—

# తెలుఁగు వెలుఁగు

వివిధరాష్ట్రాలు వేర్వేఱఁ బజ్వరిల్లి విమలతేజంబుతో నేటికి వెలుఁగుచుండె;
యిరువదేండులఁబైనుంచి పోరుచుండ వెలుగలేదింక కటకటా! తెలుఁగు వెలుఁగు.
వెంకటప్పయ్య, పట్టాభి వీరవరుల సాంబమూర్త్యాది మహాఋషి సత్తములను
గలిఁగియుండియు నింతకు శక్తిలేక తెలుఁగు వెలుఁగుకు ధీశక్తిఁ గలుఁగలేదు.
పదవిమోహంబు వలలోన బంధమంది ఆంధ్రమంత్రులుఁ దమిళులయందఁజేరి;
'తాని తనిదాన'యనుచు నృత్యంబుసల్ప తెలుఁగు సీమకు వెలుఁగింకఁ గలుఁగఁబెట్లు?.
శౌర్యవీరాగ్నిఁ యెంత నాశ్చర్యముగనుఁ జలవఁబఱచెను నాంధ్రుల శక్తినేఁడు
తడవుసేయక నీవింకఁ దఱలివచ్చి తెలుఁగు వెలుఁగును వెలిఁగించుఁ దెలుఁగుతల్లి!

—శ్రీ మారేమండ కృష్ణమూర్తి

# దురాశ దుఃఖానికి చేటు!

శ్రీమతి ఇమ్మానేని చంద్రకాంతామణిగారు

నాకు చాలా చేతిపనులువచ్చు, ఎంబ్రాయిడరువర్కు, షేడోవర్కు, స్మాక్‌వర్కు మొదలైన వెన్నో చేస్తా. యింకా చాలారకాలు నాకువచ్చు. నా స్నేహితురాండ్రంతా నాచేతిపనుల్ని మెచ్చుకొని, నాదగ్గర నేర్చుకుంటూవుండేవా రీపనంతా.

మా వారొకసారి పట్నం వెల్లడం తటస్తించింది. తిరిగివచ్చేటప్పుడు పట్నంనుండి నాలుగు దిండువరలు కొనితెచ్చిపెట్టారు. వాటిచుట్టూ పోగులుతీసి మెషీనుతో చక్కగా కుట్టబడి చాలా అందంగా వున్నాయి. నేనిన్నిపనులు చేస్తానుగాని మెషీనుతో పువ్వులవీ కుట్టడం నాకురాదు. ఆదిండువరలు చూచి నాకు చాలా ముచ్చటవేసింది. కాని నా యీ వ్యాసానికికారణం యీ దిండువరలే అవుతాయని అప్పుడు నేననుకోలేదు.

మాయిల్లు నేనెప్పుడూ సాధ్యమయేంతవరకు శుభ్రంగా వుంచేందుకు ప్రయత్నిస్తా వుంటాను. అందులో మెవరైనా యింటికి చుట్టాలు వచ్చేరంటే యింకా బాగా వుంచేందుకు ప్రయత్నిస్తా. ఓనాడు మాయింటికి ఒకామె వచ్చింది ప్రొద్దున్నే 8 గంటలప్పుడు. ఆమె మాకేమీ దగ్గర బంధువుకాదు. పనిమీద మావూరువచ్చి అందరి బంధువులిండ్లూచూచి పోదామని వచ్చింది. యింకచుట్టాలొస్తే నేచేసేప్రయత్నం వ్రాశానుగా. ఇల్లంతా శుభ్రం చేసి, దిండ్లు, కుర్చీలు, బల్లలు, పరుపులు మొదలైనవాటిని నేను కుట్టిన పువ్వులగుడ్డలలో నింపేశా. దిండ్లకు మా వారు పట్నంనుండి తెచ్చిన నాల్గువరలు వేశా. మాబంధువురాలు నా యీ కుట్టుపనులన్నీ చూచి నా ఓపిక్కీ నాతెలివికి చాలా మెచ్చుకుంది. అన్నీచూచి చివరకి దిండువరలు దగ్గిరకొచ్చింది.

'మేరీ! యీ దిండువరలు కూడా నీవేనా కుట్టా'వని అడిగిందామె.

యిన్నికుట్టి అందరిచేత బాగున్నవని అనిపించుకున్న నాకు యివికూడా నేనేకుట్టానని చెప్పి మెప్పు పొందాలనే దురాశ కలిగింది. కాని ఆకించితదురాశమూలన్నీ, నేనెంత మనోదుఃఖం, యెంత ఆరాటం, యెంతసిగ్గు పొందేనో తల్చుకుంటే యిప్పటికీ నాకు ఒళ్లు జలదరించినట్లవుతుంది. 'నేనేకుట్టానని' యెట్లా అయితేనేం సాహసించి చెప్పేశా.

'యిది చేత్తో కుట్టిందికాదు, మెషీనుతో కుట్టబడింది. మెషీనులోకూడా కుట్టడం నీకువచ్చా?' అంది ఆవిడ.

'వచ్చున'న్నా సందేహిస్తూ.



శ్రీ శారదా రాయలసీమ ఫిలిమ్సువారి
'జయప్రద' లో
నటించుచున్న శ్రీమతి యశోద



సత్యాగ్రహసమరములో ప్రభుత్వముచే స్వాధీనము చేసికొనబడిన భూములను తిరిగి ఇటీవల యిచ్చివేసినపుడు బార్డోలీతాలూకా వరద అను గ్రామస్థులు తమ కృతజ్ఞతను యుత్సాహమును చూపుటకు జరిపిన సమావేశములకు భోజనాది సదుపాయములను చేయుచున్న మహిళామణులు.

'మేదిమేరీ! ఆ మెషీనొక్కసారి చూపించు' అన్నదావిడ ఎంతో ఇదిగా. నాకప్పుడే దిగులు పట్టుకుంది, యెందుకట్లాఅన్నాను దేవుడాఅని, 'ఆమెషీను యిప్పుడు నాదగ్గర లేదండీ'అన్నా సాహసించి.

'పోనీ అట్లాంటిమెషీనుకోసం యెన్నోతంటాలు పడ్తోంది మాఅమ్మాయి. అట్లాంటి దొకటి వ్రాసితెప్పిస్తావా? సొమ్మిస్తాను' అన్నదావిడ ప్రార్థనాపూర్వకంగా.

యిక నాకేమనడానికీ తోచలేదు. యిప్పట్లో నిజంచెప్పడం దుర్ఘటం అనిపించింది. యెప్పుడూ బొంకనేర్చేవాళ్ల కిట్టాంటిసమయాల్లో సమయస్ఫూర్తి వుంటుందికాని నాలాగు అలవాటులేక అడుసులో అడుగేసేవాళ్లకి సమయస్ఫూర్తి యెట్లావస్తుంది? ఛీ! రోటిలో తలదూర్చి రోకటిపోటుకి వెరవడం యెందుకని, అప్పట్లో నాకుతోచిన మార్గాన్నొక దాన్ననుసరించి, మాపుట్టిల్లు మావూళ్లోనే కాబట్టి యిట్లాఅన్నా జంకకుండా 'మా అమ్మ తెప్పించారండీ మాచెల్లెళ్లకోసం. అదియెంతైందో, యెక్కడ్నుంచి తెప్పించారో నాకు తెలియదు. మెషీనుకూడా మావాళ్లింట్లోనేవుంది.'

'అట్లా అయితే యిప్పుడు నేను మీ అమ్మవారింటికే వెళ్లబోతున్నా. అక్కడ కనుక్కుంటా'నందామె ఉత్సాహంగా. యిట్లా అని ఆవిడ వెళ్లిపోయింది.

యింక నాకు పైప్రాణాలు పైనే యెగిరిపోయాయన్నట్లయింది. అవి డెట్లాగూ మావాళ్లింటికి వెళ్తుంది. మా అమ్మను, చెల్లెళ్లనూ, యీవిషయమె అడుగు తుంది. వాళ్లకిక్కడ జరిగిన సంగతేమీ తెలవక గాభరాపడి, మాకామెషీను సంగతే తెలియదంటారు. యిక ఆవిడనన్నో అబద్ధాలకోరుగా భావించక తప్పదు. ఛీ! సత్యాన్నే ప్రధానంగా తీసుకునే నేను యీనాటికి పాడుదిండువరలకోసం అబద్ధమాడాలిసి వచ్చింది కదా! నిజంగా కష్టపడి నేర్చిన నాకుట్లన్నీకూడా నేను కుట్టినవికావనేభావం నాయీదురాశా భూతంవల్ల ఆవిడకి కలగకుండా మానదుకదా! నాకేమీ తోచలేదా సమయంలో. మా వారు 'తొందరగావెళ్లాలి. వంటయిందేమో కనుక్కొని వడ్డించు' అంటున్నా, పిల్లలు 'అమ్మా ఆకలేస్తుందే' అని అంటున్నాకూడా నావంటిమీద స్పృహే లేక పోయింది యీ ఆలోచనల్లోపడి. అప్పట్లో నేనుపడ్డ ఆవేదన యెప్పుడూ పొందలేదు. నా దురాశకు తగినశిక్ష దేవుడప్పుడే నాకు చూపించాడా యేమిటనిపించింది. మనస్సులో నాఆవేదన, పాలిపోయిననాముఖాన్నిచూసి మావారు'అట్లావున్నావేం మేరీ!' అని అడిగేరు.

యింతలో మా పుట్టింటినించి జవానొకడు వచ్చాడు. 'అమ్మావాళ్లేం చేస్తున్నా' రని అడిగా ఆదుర్దాతో.

'అమ్మగారూ, అయ్యగారూ, పిల్లలూ కలిసి మీ తాతయ్యగారి వూరికి వెళ్లారమ్మా, కారుమీద తెల్లవారుగట్ల. యేదో పనుండి రమ్మని నిన్న రాత్రి మీ తాతయ్యగారు అయ్యగారికి జాబువ్రాస్తే అందరూ ప్రొద్దున్నే వెళ్లారమ్మా, మళ్లా సాయంత్రం వస్తార'న్నాడా జవాను.

ఓ! యింకనాకు పట్టరాని ఆనందం కలగింది. ఆవిడ మధ్యాహ్నం బండికే వెళ్లి పోతుంది. యింక మావాళ్లింటికి వెళ్లేదెప్పుడు? మెషీను సంగతి అడిగే దెప్పుడు? బ్రతి కానురా దేవుడా! గండం గడిచింది. వెంటనే దేవుణ్ణి తల్చుకొని రెండుచేతులూ జోడించా.

షర్టుతీసుకొని వస్తూ నావైపుచూచి ఆశ్చర్యపోతూ 'యెవరికా వందనాలు మేరీ!' అన్నారు మావారు.

చిరునవ్వు నవ్వుకుంటూ చేసినపనికి సిగ్గుపడుతూ, జరిగిందంతా చెప్పా పూస గ్రుచ్చినట్లు.

'మాబాగుంది యెవరుచెప్పమన్నారీ అబద్ధాలు, యెవరు పడమన్నారీ పరితాపం! అంతగా అబద్ధం చెప్పినదానివి, మీవాళ్లింట్లోంచి తెచ్చానని యేడవకపోతే యెవరో స్నేహితురాలిదగ్గర తెచ్చానా మెషీను, ఆవిడ వూళ్లోలేదు అని చెప్పివుంటే తీరిపోయే దానికిన్నిపాట్లా. దురాశ దుఃఖానికి చేటన్నారిందునుంచే' అని మావారన్నారు.

నిజమే! అట్లా అనుంటే పోయేదిగాని, యెప్పుడూ అలవాటులేనిదే చేసేపనికి యిట్లాంటి విఘ్నాలే కలుగుతాయి. యెట్లా అయితేనేం, దేవుడు నన్నీ నిందనుంచి తప్పించాడు, అదేచాలు.



# 'కిట్టి - బుజ్జి'

శ్రీమతి వార్తకవి సీతాలక్ష్మీదేవిగారు



బుజ్జి: అక్కయ్యా! ఇంకో కథచెప్పవే.

కిట్టి: ఏమిట్రా? ఆకథతోటి నిద్దరోతానన్నావు. ఇప్పుడు మరొకటి కావాలి?

బుజ్జి: అక్కా, అక్కా ఇంకొక్కటిచెప్పవే పడుకుంటా.

కిట్టి: అబ్బా! నన్ను చంపవద్దురా. నాకు నోరు నొప్పెడుతూంది. కథచెప్పను, గిథచెప్పను. ఇష్టముంటే పడుకో, లేకపోతే గంతులేయి.

బుజ్జి: కిట్టిక్కా చూడు. నిన్న చెప్పావు కాకమ్మకథ—అది చెప్పావంటే నాన్నదగ్గర కానీపుచ్చుకొని నిమ్మపిప్పరమెంట్లు కొనిస్తా.

కిట్టి: నాకు విసుగ్గావుందిరా, పోదూ నేచెప్పను.

బుజ్జి: అయితే నువ్వు మంచిదానవుగావు. చూడు నేనేడ్చానంటే నాన్నవచ్చి నిన్ను కొట్టేస్తాడు.

కిట్టి: ఏడ్చుకో నాకేం. నువ్వు నాన్నతోచెపితే నేనమ్మతో చెపుతా.

బుజ్జికి కోపమువచ్చింది. 'కిట్టి, బుట్టి, తొట్టి, లొట్టి' అని వెక్కిరించాడు.

కిట్టి: నన్ను వెక్కిరిస్తావట్రా బుజ్జీ? 'బుజ్జి, గిజ్జి, బజ్జి, గొజ్జి' అంటూ ఒక లెంపకాయ చరిచింది. బుజ్జి మరల కొట్టబోయి క్రిందబడి బిగ్గరగా ఏడుస్తున్నాడు. నాన్నగారు ఆఫీసుగదినుండి వెలుపలికివచ్చి 'అబ్బా! ఈపిల్లలపోరుపడడం కష్టంగావుంది. ఎప్పుడూగోలే. ఏమిట్రా? ఏమిగావాలి?' బుజ్జి కళ్లునులుముకుంటూ 'నాన్నా, నాన్నా, కథచెప్పమంటే అక్కయ్య కొట్టింది' అంటూ చెంప చూపెట్టాడు. 'ఏమిటే, కిట్టీ, పెద్దదానివి, బుద్ధివచ్చినదానివి, కథచెప్పమంటే వాణ్ణి కొట్టడమే. ఈమాటు గోలచేశారంటే జాగ్రత్త' అని నాన్నగారు వెళ్లిపోయారు.

కిట్టికి దుఃఖమువచ్చింది. గట్టిగాఏడిస్తే నాన్నగారు కొట్టుదురని గుడ్డకప్పుకొని లోలోనఏడుస్తూంది. ఈసంగతిచూస్తూన్న తల్లివచ్చి బిస్కత్తులిచ్చి, ఇద్దరినిబుజ్జగించి రాజీచేసి వెళ్లింది.

బుజ్జి: అక్కయ్యా! కాకమ్మకథ చెప్పవూ?

కిట్టి: అస్తమానము కాకమ్మకథేనట్రా? ఈమాటు చిలకమ్మకథ చెపుతా.

బుజ్జి: నాయంత పెద్దకథచెప్పాలి. చిలకమ్మంటే కాకమ్మేనా?

కిట్టి: (నవ్వుతూ) చిలకమ్మంటే కాకమ్మ ఎలాగవుతుందిరా? చిలకమ్మ పచ్చగావుంటుంది. కాకమ్మ నల్లగావుంటుంది. చిలకమ్మముక్కు ఎఱ్ఱన్న, కాకమ్మముక్కు నల్లన్న.

బుజ్జి: (సంతోషముతో ఎగురుతూ) ఆ, చూశానులే. ప్రొద్దున మనదొడ్లో జామచెట్టులోకూచుని పళ్లన్నీ మెక్కింది.

కిట్టి: అవును గాని కథవిను. ఒకఊళ్లో ఒకతోట. ఆతోటలో ఒకచెట్టుంది. ఆచెట్లో—

బుజ్జి: ఏమిచెట్టక్కా ?

కిట్టి: ఏదో ఒకచెట్టురా, ఒక జామచెట్టుంది. దానిలో గూడుకట్టుకొని ఒకచిలకమ్మ కాపురం చేస్తుండేది. పాపమా చిలకమ్మ నాన్న, అమ్మ చిన్నప్పుడే చచ్చిపోయారు."

బుజ్జి: కిట్టక్కా! చచ్చిపోతేమంచిది చూశావా? అప్పుడు మనతాత చచ్చిపోయాడు. ఇంట్లో గారెలు బూరెలు చేశారు. రేపు నాన్నచచ్చిపోతే మరల గారెలు చేసుకతింటాం.

కిట్టి: ఓరి వెధవకుంకా, అలా అనగూడదురా. చచ్చినవాళ్లు మళ్లారారు. నాన్నచస్తే మనకు బువ్వ ఎవరు పెడుతారు?

బుజ్జి: అమ్మ పెట్టదూ ?

కిట్టి: నీమొగము నామొగము పెడుతుంది. డబ్బులేండే ఎలాగవస్తుంది అన్నము ?

బుజ్జి: అమ్మ, తప్పెలలోబియ్యమేసి పొయ్యిమీదపెట్టితే అన్నముగాదూ ?

కిట్టి: ఏడ్చావులే, కథవిందూ. చిలకమ్మ పెద్దదయింది. మొగుణ్ణివెతకడానికి బయలుదేరిపోయింది. దారిలో ఒకనెమలి కనిపించింది. 'నెమలీ, నెమలీ! నన్ను పెళ్లిచేసికొంటావా ?' అంది. 'కట్నమెంతిస్తా' వంది నెమలి. 'కావలసినన్ని ముద్దులిస్తా' నంది చిలకమ్మ. 'అలాఅయితే వెళ్లిపొమ్మం'ది నెమలి. వెంటనే ఒకహంసదగ్గర కెగిరిపోయింది చిలకమ్మ. 'హంసా, హంసా! నన్నుపెళ్లాడవూ' అన్నది. 'కట్నమెంతిస్తా' వంది హంస. 'కావలసినన్ని ముద్దులిస్తానంది' చిలకమ్మ. 'నేను పెళ్లాడను పో' అంది హంస. పాపము ఇలాగ ఎంతమందినో అడిగిందికాని, చిలకమ్మ నెవరుగాని కట్నమీయందే పెళ్లాడమన్నారు.

బుజ్జి: పోనీ—అక్కా నువ్వు పెళ్లాడుదూ.

కిట్టి: (నవ్వుతూ) ఆడవాళ్ల మెలాగురా పెళ్లాడుతాము?

బుజ్జి: అయితే నాన్నతోచెప్తా చిలకమ్మని పెళ్లాడమని.

కిట్టి: నాన్నకు పెళ్లయిందిరా. పెద్దవాడవయ్యాక నువ్వు పెళ్లాడుదూ.—పాపం చిలకమ్మ తిరిగింది తిరిగింది. చక్కని మొగుడు దొరకలేదు. ఒకరోజు విసుగెత్తి ఒక నల్లనికాకిరాజు నడిగింది. కాకిరాజు పచ్చని చిలకమ్మ అందానికి మెచ్చుకున్నాడు. పెళ్లికిగాను కాకిరాజింట్లో ఆవేళ ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇంటిముందర పందిళ్లు, తోరణాలు, ముగ్గులు వేశారు. పెళ్లింట కిలకిలమంటూ కలకలమంటూ అతి సంబరంగావుంది. ఒకవైపు పిల్లలగోల, మరోవైపు చెవులు గింగురుమనేటట్టు మేళతాళాలు, ఒకవైపు కోకిలమ్మగానము, మరోవైపు నెమలమ్మనాట్యము. పెళ్లి వేడుకతోజరిగింది. పెళ్లికి వచ్చినవారందరకు బొబ్బట్లూ, పేణీ పాయసాలతో భోజనాలు పెట్టారు.

బుజ్జి: గారెలు పెట్టలా ?

కిట్టి: ఛీ, పెళ్లింట్లో గారెలేమిట్రా? పోనిద్దూ అవిగూడపెట్టారు. పెళ్లిముగిసింది.

బుజ్జి: అక్కా! మనము పెళ్లాడుదామా? గారెలు తినచ్చు.

కిట్టి: ఛీ, మనము పెళ్లాడగూడదురా.

బుజ్జి: ఏం? నువ్వుచెప్పావుగా ఆడవాళ్లు మగవాళ్లు పెళ్లాడచ్చునని?
కిట్టి: అయితే? అక్కాతమ్ముళ్లు పెళ్లాడగూడదురా.
బుజ్జి: అమ్మా నాన్న పెళ్లాడలేదూ?
కిట్టి: అమ్మకు నాన్న తమ్ముడు గాదురా.
బుజ్జి: నేనుగూడా నిన్ను పెళ్లాడితే తమ్ముణ్ణిగాను.
కిట్టి: (కోపంతో) పో, అలా అంటే నేను కథచెప్పను.
బుజ్జి: అనునులే అక్కా, కథచెప్పు.
కిట్టి: ఆకథ అయిపోయింది. పెళ్లితో కథముగిస్తుంది. ఆతర్వాత చిలకరాణి కాకిరాజు హాయిగా వుంటారు. కథ కంచికీ—మనమింటికి.
బుజ్జి: ఇంకొక్కటి చెప్పక్కా. చూశావా రేపుఏడ్చినప్పుడు అమ్మిచ్చేబిస్కత్తులు నీకిస్తా — మంచికథ చెప్పావంటే.
కిట్టి: ఓనాచిట్టిబుజ్జీ, కథలంటే ఎంతఇష్టమురా. అనగాఅనగా ఒకవూరు. ఆవూళ్లో ఒకముసలమ్మ. ఆముస లమ్మ ఒకరోజు గుడ్డలుకుట్టుతూ సూదిపోగొట్టింది.

బుజ్జి ఊ, అని ఊకొట్టుతూవుంటాడు.

కిట్టి: ఊ అంటే వస్తుందా?
బుజ్జి: రాదు.
కిట్టి: రాదు అంటే వస్తుందా?

బుజ్జి ఊహూ, అని తలత్రిప్పాడు.

కిట్టి: ఊహూ అంటే వస్తుందా?
బుజ్జి: (కోపంతో) నీతలకాయంటే వస్తుంది. కిట్టి, బుట్టి, మట్టి అంటే వస్తుంది.
కిట్టి: నీవన్నట్లంటే వస్తుందా?
బుజ్జి: అయితే పో, నువ్వు నాజంటలేవు. కాకరకాయను, బెండకాయనూ థూ—థూ—
కిట్టి: (పెద్ద నవ్వునవ్వి) అలాఅంటే వస్తుందా?
బుజ్జి: ఏడ్పుమొదలెట్టాడు.

ఈమాటుఏడిస్తే బిస్కత్తుకుబదులు బెత్తముదెబ్బలు తగులునని కిట్టికితెలును. వెంటనే కథ మొదలెట్టింది. "అనగా అనగా ఒకపట్టణము."

బుజ్జి ఏడ్పుమాని ఊకొట్టుతున్నాడు.

కిట్టి: ఆపట్టణములో ఒకరాజు. ఆరాజుకు ఒకకూతురు గలిగింది. చక్కని రత్నమాణిక్యములాగుంది. ఆఅమ్మాయికి 16 ఏళ్లు వచ్చాయి.
బుజ్జి: నీకన్ని ఏళ్లక్కా?
కిట్టి: నాకేడేళ్లు, నీకారేళ్లు.
బుజ్జి: ఊ, నాకే ఏడేళ్లు, నీకారేళ్లు.
కిట్టి: అలాగేలెద్దూ. ఆఅమ్మాయికి పెళ్లి చేయాలని నానాదేశాలు తిరిగారు.
బుజ్జి: మన నాన్నింటికి రాలేదు?
కిట్టి: మననాన్న రాజుగాండే—ఎలా వస్తారురా?
బుజ్జి: ఏం. మననాన్న మంచిగుడ్డ లేసుకొంటారు. మీటింగులుకెళతారు. రాజుకుండేంత డబ్బుంది. ఎందుకు రాజుగాడూ?

కిట్టి: పిచ్చివెధవా! మననాన్న ఉత్తవకీలురా. రాజుగాడు. రాజంటే ఎంతో డబ్బువుంటుంది, యుద్ధాలు చేస్తాడు, ప్రజలను రక్షిస్తాడు. ఏడ్చే బుజ్జిలాంటిబిడ్డలకు బిస్కత్తులస్తాడు. ఏమిటో, కథ మొదలిడితే మధ్యమధ్య యాభై ప్రశ్నలేస్తావు కథ మరచిపోయా.

బుజ్జి: రాజు, అమ్మాయికి మొగుణ్ణి తేను వెళ్లాడుగదూ?

కిట్టి: ఆ, అవును. దేశాలన్నీ తిరిగితిరిగి, ఒకచక్కని రాకుమారుణ్ణి కుదిర్చాడు. పెళ్లిపనులు జరుగుతున్నాయి రాజుగారింట. ముహూర్తమువచ్చింది. ఇంతలో ఉన్నంట్టుండి ఎటునుంచో ఒకబ్రహ్మరాక్షసివచ్చి ఆరాజుకూతుర్ని ఎత్తుకపోయింది. అంతా కలకలంగావుంది.

బుజ్జి: అమ్మో! అమ్మో! భయం. (అంటూ అక్కను కౌగలించుకున్నాడు.)

కిట్టి: భయమేమిట్రా బుజ్జీ? కథలోవచ్చేది ఉత్తుత్త బ్రహ్మరాక్షసిరా.

బుజ్జి: అక్కా! బ్రహ్మరాక్షసి, అమ్మచెప్పే చీకటిబూచిలాగుంటుందికదూ?

కిట్టి: అలాగుండదురా, బ్రహ్మరాక్షసి కొండంతఎత్తుంటుంది. కోరలుంటాయి, నాలుగుచేతులూ, పెద్దకడుపు, మనఇల్లంతనోరు వుంటాయి. కానీ మనకేంభయం. మనదగ్గరకురాదు. ఆతర్వాత—రాజుగారింట్లో పెద్ద కలకలంగావుంది. అందరూ ఏడ్చేవాళే.

బుజ్జి: పాపం. ఆఅమ్మాయిని బ్రహ్మరాక్షసి తినేస్తుంది. (అంటూ కన్నీళ్లు గార్చాడు.)

కిట్టి: ఎవరు బ్రహ్మరాక్షసిని చంపి అమ్మాయినితెస్తారో వారికి ఆఅమ్మాయినిచ్చి పెళ్లిజేసి రాజ్యమిస్తానంటూ రాజుగారు నానాదేశాలరాజులకు తెలియజేశారు. కానీ ఎవరుసాహసించలే.

బుజ్జి: అక్కా! నేను బయలుదేరిపోనా? మనఇంట్లోని కత్తిపీటదీసుకొని అమ్మగదా వంకాయలు తరిగేలాగు ఆబ్రహ్మరాక్షసినితరిగేసి అమ్మాయిని దీసుకరానా? (అంటూ కళ్లు ఎఱ్ఱజేసికొని పైకిలేచాడు.)

కిట్టి: నిజమైన బ్రహ్మరాక్షసిగాదుగా. కత్తిపీటతోటి అదిచావదు. కథవిందూ, ఆతర్వాత—ఎటునుంచో ఒక పులితోలుగప్పుకొన్న ముసలాడు ఒక కీలుగుఱ్ఱంతో వచ్చాడు. 'రాజా! రాజా! మీ కుమార్తెను నేనుతెస్తా' నన్నాడు. అందరూనవ్వి 'ఓరి ముసలాడా! ఆబ్రహ్మరాక్షసి నిన్ను కాలితో రాచి పిండిజేస్తుంది సుమా' అంటూ హాస్యముజేశారు.

బుజ్జి: (నవ్వుతూ) కాదక్కా! నేచేయలేకపోతే వాడుమాత్రం చేస్తాడేమి?

కిట్టి: చూద్దాము. రాజుగారిఆజ్ఞదీసుకొని ముసలాడు గుఱ్ఱమెక్కి దానిచెవిలోనిమలు త్రిప్పాడు. బుర్రమంటూ గుఱ్ఱం రివ్వున పైకిపోయింది.

బుజ్జి: అక్కా! అక్కా! ఆగుఱ్ఱము కావాలినాకు. నాన్నగారి నడుగుతా.

కిట్టి: అది ఉత్తుత్తగుఱ్ఱమురా. ఆతర్వాత ముసలాడు కనబడకుండాపోయాడు. ఒకగంటపిమ్మట రాజుగారెదుట రాకుమార్తెతోగూడా ప్రత్యక్షమయ్యాడు. రాజుగారి కానందమయింది. అందరూ ఆశ్చర్యపడ్డారు. నవ్వుతూ ఆముసలాడు కప్పుకొన్నపులితోలు తీసివేశాడు. అబ్బా! ఎంత అందంగా వున్నాడు! వళ్లంతా బంగారమే. మిలమిలా మెరుస్తూంది. అమ్మాయిని అతనికిచ్చి పెళ్లిజేసి, రాజ్యాన్ని ఒప్పజెప్పి రాజుగారు తపస్సుజేసికొనడానికి అడవికి బయలుదేరిపోయారు. ప్రజలందరూ సుఖంగా వున్నారు. కథకంచికి, మనమింటికి.

అంటూ కిట్టి బుజ్జికేసిచూచింది. నోట్లో వ్రేలెట్టుకొని బుజ్జి గుఱ్ఱుతీస్తూ నిద్దరోతున్నాడు. తానుగూడా పడుకొంది.

# చదువులేని చక్కదనము

నీలికాంతులతో నిగనిగలాడుతూ నొక్కునొక్కులుగాఉన్న ఆమె కురులమీద దృష్టిపడితే పాలగచ్చుమీదమల్లెజబ్బునజారి, పిరుదల పరకూ వ్రేలాడే ఆమెజడ చివర నున్న ఉల్లువరకూ పోతాయి. ఆ విశాలఫాలభాగంమీద అరుణకాంతులతో థళథళ లాడేకుంకుమ వర్ణనాతీతం. గండుమీనుల మల్లే మెరిసిపోతూన్న ఆమె నేత్రద్వయం చూసే వారికి అనిమిషత్వం కలుగజేస్తాయి. కెంపెదవిమీద చిరునవ్వు ఎల్లప్పుడూ తాండవ మాడుతూ వుంటుంది. వకుళ సంసారిలక్షణాలులేని నవనాగరికకాదు. ప్రకృతిసిద్ధంగా సంప్రాప్తమైన అందాలచందమామ. ఆమెకు కోపంలేదు, దుఃఖంలేదు, గర్వంలేదు, విసుగులేదు, కొత్తలేదు, వింతలేదు, ఏమీలేదు! దైవమిచ్చిన ప్రాణంమాత్రంఉంది. పుట్టింటివారు ఆపేక్షగా మహద్భాగ్యంలాగ నేర్పిన చాకిరీ, వంట మొదలగునవి చెయ్యడం తెలుసు. భర్తంటే భగవంతుడని తెలుసు, అంతే.

వకుళభర్త బి.ఏ.ఎల్.టి. ఉపాధ్యాయఉద్యోగం చేస్తున్నాడు ఓబర్లో. చాలా తెలివైనవాడు,చురుకైనవాడు. అతనిపేరు వెంకట్రావు. సుందరరూపి. వయస్సువిషయంలో వకుళకి ఈడుకు జోడైనవాడు. కళాపిపాసి; ఏదైనాకళఅంటే మహాయిష్టం. అన్నికళలకూ సమానగౌరవం చూపించేమనిషి. బర్లోగాని, మరెక్కడైనాగాని నేర్చుకున్నదానికన్న ప్రకృతిదగ్గర, అనుభవందగ్గర ఎక్కువ నేర్చుకున్నాడు. విద్యఅన్నా విద్యావంతుడన్నా మహాసరదాఅయినవాడు. 'విద్యావిహీనః...' అన్నవాక్కు అక్షరాలానమ్ముతాడు. అల్లాంటి వెంకట్రావు తనభార్య వకుళని ఏడాదిక్రిందట తనయింటికి తెచ్చుకున్నాడు.

వకుళా వెంకట్రావులను చూస్తే ఎంతో ముచ్చటేస్తుంది. వాళ్లకి డబ్బుకిచ్చాటలేదు. ఇద్దరూ ఒకచిన్న మేడలో చిలకా గోరింకలలా హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. వెంకట్రావు నాకు ప్రాణస్నేహితుడు. నిరాటంకంగా ఒకరింటికొకరం పోతూండేవాళ్లం. ఒక్కొక్కప్పుడు అతనుఇంట్లో లేకపోయినా, తిన్నగావెళ్లి వెంకట్రావు డ్రాయింగురూమ్ లోకి పోయేవాడిని.

వెంకట్రావు ఒకొక్కప్పుడు విసుగుగాఉండేవాడు; విచారంగా ఉన్నట్టుకూడా చూశాను. తృప్తిలేనివాడిలాగ అగుపించేవాడు. ఆవిషయం అప్పుడప్పుడు చేష్టలలో వ్యక్తపరుస్తూన్నప్పటికి మాటలలో చాలా జాగ్రతగా ఉండేవాడు. కాని ఒకొక్కప్పుడు ఆగక పైకి వచ్చేది అతని హృదయాంతర్గత భావపరంపర మాటలరూపంగా. అప్పుడైనా అదిస్పష్టంగా ఉండేదికాదు. ఈ విషయమై ఎంత బుఱ్ఱకొట్టుకున్నా ఏమీ పాలు పోయిందికాదు. అడుగుదామా అనుకొనేవాడిని. మళ్లీ జంకేవాడిని.

అతడొక అవ్యక్తమైన బాధపడుతూన్నాడు. ఏమిటో!

ఎప్పుడైనా అతనికి వంట్లో బాగులేనట్టుంటే, నెమ్మదిగావెళ్లి 'చెల్లీ! అతనికేమిటి వంట్లోబాధ? ఉష్ణంగాఉందా?' అని అడిగేవాడిని వకుళని. పాపం ఆపిల్ల, అంతకన్న వెఱ్ఱిగా చూస్తూ 'ఏమో!' అనేది, అంతే! ముఖంలోనైనా మార్పుగాని భావసూచన గాని లేదు. వెఱ్ఱిపిల్ల! 'వెంకట్రావ్! ఏమిటోయ్ నీబాధ? చెప్పాదూ!' అంటే ఒక్క లిప్తలో అంతామార్చి 'ఏమీలేదోయ్!' అంటూలేచి ఖులాసాగా మాట్లాడేవాడు. అలా కొంతసేపు పిచ్చాపాటీ అయాక హార్మోనియమ్ వాయించడమో, పాడడమో చేసేవాడు. అతనికి పాట అంటే మహాయిష్టం. ఎవరైనా పాడుతూంటే గంటలకొద్దీ వింటాడు. శాంతాఆప్టే పాటలంటే వెఱ్ఱిపడతాడు. లలితకళ అంటే మహాసరదా. బొమ్మలు గీస్తాడు కూడాను.

ఇన్ని ఉన్నప్పటికీ భార్యని తల్చుకున్నప్పుడుగాని, ఆమెపేరు విన్నప్పుడుగాని మొహం చిట్లించుకుంటాడు. బాధపడిపోతాడు! నిర్మల ప్రేమాకాశంలో తళుక్కున మెరిసే చుక్కలాంటి, నిష్కళ్మష ప్రణయాంబుధిలో జఱ్ఱున జారేస్వర్ణనౌకలాంటి వకుళ అంటే అంత అసంతృప్తి ఏమి? ఆమెచేసిన తప్పేమిటి? వండడం చాతకాదా? వడ్డించడం చాతకాదా?

ఎంత రూపురేఖావిలాసభాస అయినా, చదువుకున్న వెంకట్రావుకి, ముఖ్యంగా కళాపిపాసి వెంకట్రావుకి, నిర్గంధ కుసుమంలాంటి వకుళ సరిపడదు. తేనెటీగకి తేనెటీగ కావాలిగాని లాతికీటకం ఎందుకూ? అతడు రాసిన ప్రణయగీతాలలో ప్రణయం, భక్తి గీతాలలో భక్తి గ్రహించలేక, అతనిశక్తి తెలుసుకోలేక అమాయకపు చూపులతో మెరిసిపోయే భార్యఎందుకూ? రసపూరితమైన అతని మాటలు అర్థంచేసుకొని తగినట్లు సమాధానం చెప్పలేని స్నేహితుడుగాని స్నేహితురాలుగాని ఎందుకూ? అందుకే చూడండీ! పార్కులలోగాని సముద్రపుటొడ్డులగాని సాయంకాలం మూకలుగా కూర్చున్నవారు ఎలాఉంటారో! చదువుకున్న వారందరూ ఒకదగ్గిర, అచ్చుపిడిచి

ఒదిలేయబడ్డవారందరూ ఒకదగ్గిర, ప్రమాదవశాత్తూ అందులోనివారు ఇందులోకి గాని, ఇందులోనివారు అందులోకిగానివస్తే అగమ్యగోచరంగా ఉంటుంది. ఇంతెందుకూ మనపెద్దలు 'సమానవియ్యం సమానకయ్యం' అనలేదూ! కాని మన వెంకట్రావు వకుళల కూడిక సరిపడనిది. వెంకట్రావుమాటలు అర్థంకాక అదోవెఱ్ఱిగా చూస్తుంది. ఆవెఱ్ఱి చూపుకి ఇతడు కొరడు బారిపోతాడు. ఆమె అదోలా అయిపోతుంది. ఈబాధపడలేక వకుళ కావలసినది రెండుముక్కలలో అడగడం; అడిగితే 'ఔను' 'కాదు'లలో జబాబు చెప్పడం, తరవాత మూకీభావంవహించడం ఆరంభించింది. ఆమూకీభావం ఇతన్ని చీకాకు పెడుతుంది. అది ఒకొక్కప్పుడు వకుళ అమాయకపు హృదయాన్నికూడా కలచేది; ఏంచేస్తుంది? అందక త్తే! అయితే? వ్రాయలేదు. చదవలేదు. బట్టలపద్దువేస్తుందోలేదో. వేస్తే అందులో తప్పులే వ్రాస్తుందో తెలీదు. 'రహివుట్ట జంత్రగాత్రములరాల్గరగించు' ఆమె కంఠం సంగీతగంధం లేక వ్యర్థంగాఉంది; అదే వెంకట్రావుబాధ. 'ఆఁ! చదువురానిభార్య ఉన్నంతమాత్రంలో అంతబాధపడతాడా? ఏదోకథ గాబట్టి సిరాదండుగకోర్చి గిలికేసేడు' అంటారేమో! అదితప్పు. క్షమించండి! వెన్నమీద వేలుపెడితేచాలు ఆనవాలుపడుతుంది.

ఈసంగతి చెల్లికిచెప్పి కొద్దిగాచదువుకొని, సంగీతం నేర్చుకొని తద్వారా భర్తకి హృదయాహ్లాదకరురాలవు కమ్మని ఎప్పుడైనా వీలైతే చెపుదామని ఉంది. 'ఆఁ! ఈ నాటికి చదువు!'అంటారేమో 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్'; కాలనియామకంకూడా లేదు!

కారణాంతరాలవల్ల నేను ఒకటి. రెండునెలలపాటు పైవూళ్లోఉండవలసి వచ్చింది. పైవూళ్లోఉన్నప్పటికీ నాకు ఎల్లప్పుడూ వకుళా వెంకట్రావులే తలపుకొచ్చేవారు.

అవేళ వకుళగారింటికెళ్లేను. ఇల్లు అదివరకులాలేదు. అదివరకు ఇల్లు నిర్మానుష్యంగా ఉన్నట్టుండేది. కాని ప్రస్తుతం నరపురుగులు సంచరిస్తూన్న వాసన తగిలినట్టుంది. నేను వెళ్లేటప్పటికి వెంకట్రావు అప్పుడే బరినుంచొచ్చేడు. కాళ్లూచేతులూ కడుక్కుంటున్నాడు, నన్ను చూడగానే "ఏమోయ్! శాన్నాళ్లకి! ఊరికెళ్లేవుట. వెళ్లేముందు చెప్పేవేకావు?" అన్నాడు. అతడు పీటమీదకూర్చొని భోంచేస్తున్నాడు. నేనూ పీటమీదకూర్చున్నా. వకుళ వడ్డిస్తోంది. వెంకట్రావుమాత్రం యిదివరకులాగాక మాంచిఖులాసా ఉన్నాడు.

"ఏమిటోయ్! అంతఖులాసాగాఉన్నావు, ఏమిటిసంగతి?"

"ఖులాసాఏమిటి! ఇంకాఅడగవు? చెప్పనా?" అంటూ భార్యవేపుతిరిగేడు వెటకారంగా. వకుళ చిన్నకోపంతో ఓరగానవ్వుతూ "చెప్పండి? ఆమహాద్భాగ్యమేమిటో! అందుకు

నా ఆజ్ఞకావాలా?" అంది. మనిషిలో అంతమార్పు వచ్చినందుకు ఆశ్చర్యం, సంతోషం కూడా పొందేను. వెంకట్రావు వెడగునవ్వునవ్వుతున్నాడు. "ఉఁ ఉఁ! తినండి, తరవాత నవ్వొచ్చు"అంది వకుళ. 'చదువుకుంటూన్న పెళ్లాంతో ఇదేతంటా' అన్నాడు వెంకట్రావు, ఆతంటాలోఉన్న మాధుర్యం అతనికి తెలీదనా ?

"ఈమధ్య మీచెల్లెలు ఒకఘన కార్యానికి పూనుకుందోయ్. ఆరోజు రావాలి కాని మనచేతిలో ఏముంది! ఏదేముడుతోపించాడో ఆబుద్ధి, ఈమధ్య ఓనాడునాతో అమాంతంగా 'నేను చదువుకుంటా, ఏమీతోచటంలేదు'అంది. నేను నిజంగా నిర్ఘాంత పోయాను. శాస్త్రంచెప్పినట్టు, నేను చదువుకుంటాను అంటే ఒద్దంటానా! ఆపుట్టింటారింట ఉన్నంతకాలం చాకిరీచేయించుకున్నారు, బాగా రెండుపూటలూ భోజనంపెట్టేరు, యింకా మూడుపూటలేమో ..".వకుళమొహం కెంపునవ్వుతున్నట్టుంది. "పిల్లన్నికనడం, తిండిపెట్టి పెంచడం, ఈడురాగానే ఎవడికో కట్టబెట్టి తగిలేయడమూ నేటి తల్లిదండ్రులపని. మారి... నావిషయం అంతేకాదూ? సరే! అదంతాఎందుకు, చదువుకుంటానంది. వెంటనే తెలుగూ హిందీ కూడా ఒక్కసారే ఆరంభించాను. హార్మోనియమ్‌కూడా ఆరంభించేను. ఇవన్నీ స్వయంగా 'చేసుకున్న బ్రాహ్మణుడా అనుభవించు'అని నేనేపూనుకున్నాను. కాని వకుళ శ్రద్ధ, ఆసక్తి, ప్రవీణత అత్యద్భుతం! ఆడది అంతశక్తికలదని తెలియలేదు సుమా!! ఇంగ్లీషు చెప్పించడం నాకిష్టంలేదు. తెలుగు, హిందీ చదవగలదు. హార్మోనియమ్‌లో చాలావరకూ వచ్చింది. ఈసంగతి నాకు ముందుగా తెలిస్తే ఎంతబాగుండేది"అన్నాడు.

"ఔను కాని ఇదివరకు వకుళని తల్చుకొని విచారించేవాడివే"

"ఔనయ్యా! నాకేంతెలుసు! దాని హృదయంవిచ్చి భావాలు వ్యక్తపరచడానికి శక్తిలేందే! ఆవేళవచ్చింది"అంటూ ఉత్తరాపోసనంపట్టేడు.

"ఆఁ మరేమిటనుకున్నావు, భారతమహిళశక్తి తెలిసిందా? అగ్నికిపైనున్న ధూళి పోతేగాని ప్రాముఖ్యతరాదు. భారతమహిళకి చదువురావడం బంగారానికి సువాసన వచ్చినట్టు. తెలుసా ?"

—శ్రీ అంగర వెంకటకృష్ణారావు.



# ఆశీస్సు

శ్రీ దేవినిత్యంబు చేదోడుగానుండి
యిష్టసంపదల నర్పించుగాక !
వనజోద్భవుని రాణి వాణి యస్వహము నీ
వదనంబు బాయక వరలుగాక !
సంతతంబును ధైర్యసాహసంబుల నిచ్చి
నగరాజతనయ నిన్గాచుగాక !
తలలోని నాల్క చందంబున నిరతంబు
పరమేశ్వరీదేవి యరయుగాక !
కువలయమువంటి యోరిమిగుణము, విశ్వ
మా నవానుజప్రేమ సంపదయు, గల్గి
రిక్క వలె వసంతకుమారి ! పృథివిఁ జిరము
వరలుమీయంచు దీవింతు వాసియెసగ !

—శ్రీ బాలకవి, పప్పు వరాహనరసింహమూర్తి.

# భారతీయనారి భవిష్యత్తు

స్వామి వివేకానంద

మన సంఘమున స్త్రీ పురుషాధికారభేదము సృష్టిఅయినది బౌద్ధులపతన సమయమున. ప్రతి ఆందోళనమున ఏయొక్క అసాధారణవిషయమో ఉండుటజేసియే దానికి అభ్యుదయము, జయము కలుగుచున్నవి. కాని దాని పతనసమయమున ఎయ్యది దానికి గౌరవమును గూర్చినదో అయ్యదియే దాని దుర్బలతకు ప్రధానోపాధానమగును. నరశ్రేష్ఠుడగు బుద్ధభగవానునకు సాంప్రదాయ సృష్టిశక్తి, తత్పరిచాలనాశక్తి అద్భుతముగ నుండెను; ఈశక్తివలననే ఆయన జగత్తును జయించెను. కాని, ఆయనధర్మము కేవలము సన్యాసిసాంప్రదాయమున కుపయోగించునది మాత్రమే. దానివలన ఈ అశుభఫల మొనగూడినది; సన్యాసి వేషముగూడ సమ్మానింపబడదొడగెను. ఆయనయే మొమ్మొదట మఠ సాంప్రదాయమును ప్రవర్తిల్ల జేసెను. అందువలన ఆయనకు తప్పనిసరిగ నారీజాతికి పురుషునికన్న నిమ్నాధికారము నొసగవలసి వచ్చెను.* ఏలన పెద్దపెద్ద మఠాధికారిణులు నిర్దిష్టమఠాధికారుల అనుజ్ఞ లేకుండ ఎట్టి గురుతరవిషయమున చేయిచేసుకొనజాలకుండిరి. దీనివలన ఆశించిన శీఘ్రఫలలాభము, అనగా వారి సంఘమధ్యమున సుశృంఖలత (కట్టుబాటు) లభించెను. కేవలము సుదూర భవిష్యత్తున దీనివలన కలిగిన ఫలితమునకు శోచింపవలసియున్నది.

వేదమునగూడ సన్యాసవిధియున్నది; కాని ఈ విషయమున నరనారీప్రభేద మొనర్పబడలేదు. జనకుని సభయందు యాజ్ఞావల్క్యున కెట్టిప్రశ్న వేయబడినదో గుర్తున్నదా? ప్రధానప్రశ్నకర్త్రి వాక్పటుత్వము చక్కనిది. ఆదినముల ఇట్టి మహిళాగణమును బ్రహ్మవాదిను లనెడువారు. ఆపెనుడివినది: 'నా ఈప్రశ్నద్వయము ప్రవీణ ధనుష్కుని హస్తస్థితములగు శాణితబాణములు' ఈ స్థలమున ఆపె నారీత్వమునుగురించి ఎట్టి ప్రశ్నము లేవనెత్తబడలేదు. మన ప్రాచీన ఆరణ్యోపనిషత్సమూహముల బాలబాలికలకు సమానాధికారముండెను. దానికన్న అధికతరసామ్యభావమికేమున్నది? మన సంస్కృతనాటకములను జదువుము; శకుంతలోపాఖ్యానమును జదువుము; పిదప టెన్నిసన్ ప్రిన్సెస్‌నుండి నేర్చుకొనవలసినదేమైన నున్నదేమో పరిశీలింపుము.

మన సంఘమునందలి నారీగణముయొక్క వర్తమానస్థితి నాకు సంపూర్ణముగ సంతుష్టికరమని నేనుడువుటలేదు. కాని వారి సంబంధమున మనకు చేయి గలుగ జేసుకొని అధికారము వారికి విద్యనొసగు పర్యంతము; స్త్రీలు వారివారి సమస్యలను వారేవారిభావము ననుసరించి మీమాంసించుకొను యోగ్యతను సంపాదించుకొనవలెను. వారి కొఱకుగాను ఇతరు లిక్కార్యము నొనర్పజాలరు, ఒనర్చుటయు నుచితముకాదు. మీ జగత్తునందలి ఇతర దేశీయనారులవలె మనదేశపునారులుగూడ ఇట్టి యోగ్యతాలాభమునకు సమర్థులు. మీరు స్త్రీలకు విద్యనొసగి విడచిపెట్టుడు; అప్పుడు వారే తమ ప్రయోజనీయ సంస్కారములను గుఱించి మీకు జెప్పెదరు. వారి విషయమున గల్పించుకొనుటకు మీరెవరు?

---

* ఈ నిమ్నాధికారము మఠజీవనమున. ఆధ్యాత్మికాధికారములన్నియు సరిసమానములుగనే ఉండెను. సంఘదృష్ట్యా నిమ్నాధికారము, వ్యక్తిగతముగ సామ్యముండెను.

(సశేషము)

# శా ర ద కు జా బు



అక్కా,

చిన్నతనమున మన ఆటపాటలు నేటికిని మరుపురాకయున్నవి. నీవు భాగ్యవంతుల బిడ్డవు. దూరదేశమునకు జెందితివి. నినుజూడ కుతూహలముగా యున్నది. కొన్నిరోజులు నీయొద్ద యుండవలయునని ఆశయున్నది. పలుమారు వచ్చుటకు ప్రయత్నపడితిని కాని, నాభర్తగారి యొక్క ఆర్థికదుస్థితిచూచి వచ్చుటకు సాధ్యముకాకయున్నది. కాలమంతయూ నిట్లేయుండునా? ఏనాటికైనను నిన్ను సందర్శించెదను.

యిపుడు నేనీజాబున వ్రాయునదేమనగా, నీవు ఈమధ్య మహిళాసంఘమున చేరినావనియు, సంఘ దురాచారములు బాపుటకు పాటుపడుచున్నావనియు తెలిసి ఆనందపడితిని. మీరు వితంతువులపై దయదలచి పునర్వివాహములు గావించుటకు శరణాలయములు ఏర్పరచి పాటుపడుచున్నారని సహితము తెలిసి, మిక్కుటమైన ఆనందమాయెను. మరియు నేను ప్రతిదినము పత్రికలయందు మదరాసు, గుంటూరు, రాజమహేంద్రవరము మొదలుగాగల చోట్లయందు ఫలాని దినమున ఫలానివారి పుత్రికను ఫలాని వరునకిచ్చి శాస్త్రోక్తముగా వివాహము జరిపిరనియు, పురప్రముఖులు చాల మందివచ్చి వధూవరుల నాశీర్వదించిరనియు, మేళతాళములతోను, పురప్రముఖులతోను వివాహము అతి వైభవముగా జరిగినదనియు చదువుచున్నాను.

సోదరీ యింతవరకూ జరిగిన వితంతు వివాహములు ఏ బీదవారింటనైనను గావించినారా? అట్టి వివాహములకు మీ సంఘములు సహాయము గావించుచున్నవా? వీటికి సహితము పురప్రముఖులు అందరూ వచ్చి కార్యములను జయప్రదమొనర్చుచున్నారా? అట్లు జరుగు వివాహములు పత్రికలయందు వెల్లడించుచున్నారా? తెలియబరతువని ప్రార్థన. సోదరీ, నాకన్నులయెదుట నా సోదరీమణులు ఎందరో వితంతువులై, సంఘ దురాచారమను పిశాచకట్టుదిట్టములకు జిక్కి, కృశించికృశించి కుమలిపోవుచున్నారు. కొందరినడతలే చెడినవి. కొందరి చర్యలు వ్రాయుటకు సాధ్యముగాకయున్నవి. కొందరిని కూర్చొనబెట్టుకొని 'నీవు పునర్వివాహము గావించుకొనకూడదా, చిన్నదానవే, నీ జీవితమంతయూ దుఃఖమయమేనా, మీ తలితండ్రులను అడుగుము' యని హితమొనర్చితిని. వారు 'అమ్మా! నాకు పునర్వివా

హముగావించుటకు మాతలిదండ్రులు సమ్మతించరు. ఎందుకనగా కులస్థులు వెలిబెట్టుదురట. అందులకు మానాన్న సమ్మతించడు' అని ఒక స్నేహితురాలనెను. మరియొక స్నేహితురాలు 'అక్కా విథంతువను కదా, మరియు దరిద్రురాలను. ఎవరునన్ను వివాహము గావించుకొందరు? తొలిపెండ్లికే కావలసినంతమంది కన్నియలున్నారు. కానుకలిచ్చి వివాహములు గావింతురు. నాపెండ్లికిగావించిన అప్పుయింకనూ తీరలేదు. మొన్న యొక యువకుడు వచ్చియుండెను; అతనికి 4000 రూపాయలు కట్నము, 1 శేరు బంగారునగలు పిల్లపై యుంచిన పునర్వివాహము గావించుకొందునని చెప్పెనట. కాన మాబోటి వారి జీవితము తయూ యింతియే. మన సోదరీమణులు ఈ కట్నదురాచారములనుబాపి మాబోటి అనాథ దరిద్రులైన వితంతువులను కాపాడుటకు ఎవరూ పూనుకొనలేదు. ప్రతిగ్రామమునకు సోదరీమణులుబోయి సభలుజరిపి సంఘబహిష్కారములని భయపెట్టు వీరిబాధలుమాన్పి కేవలము మాయట్టి అనాథలను ఏనాటికి ఆదరింతురోకదా' యని మొరపెట్టుకొనెను.

కాన ప్రియసోదరీ, శారదా! కేవలము మీరు మహిళాసంఘములయందు కూర్చొని కొన్నితీర్మానములు గావించుకొని, ఫోటోలు తీయించుకొని, పత్రికలయందుపడి కాలహరణ మొనర్చుటకన్న యిట్టిబీదల తలిదండ్రులకు, పోషకులకు నచ్చచెప్పి, వీరికష్టములు గట్టెక్కింతురని ప్రార్థన. మరియూ మీరెల్లరు కేవలము యిట్టి దురాచారములు బాపుటకు చర్యపుచ్చుకొందురని నమ్ముచున్నాను. స్నేహచనువులో సోదరీమణుల హీనదశయు, కష్టములుచూచి భరించలేక నేటికి నేనీజాబు నీకు వ్రాయవలసివచ్చినది. నాపెనిమిటి యింటికివచ్చువేళయైనందువల్ల యింతటితో చాలించినాను. త్వరలో నీబదులు జాబుకు నిరీక్షించుచుందును. నీప్రియసోదరులైన గృహలక్ష్మి సంపాదకులకు నా నమస్కారములు. యిట్లు విన్నవించు—

అనంతసాగరము,
1-4-39.

నీప్రియ సహోదరి,
క్రిష్ణవేణి.





# పుష్పచయము

## మొగది ఆడదిగామారే సూత్రం

చెట్లలో కొన్ని ఆడమగ విభేధాలు కలిగివుంటాయి. తాడి, బొబ్బాసిచెట్లు మనకందరికి తెలిసినవే. బొబ్బాసిచెట్టు మగదైతే పెద్దతీగలు వేసి, పూవులుపూసి, చివరకుకాస్తే చిన్నకాయలుకాస్తుంది. ఆడ చెట్టునిండా అంతాకాయలే; బిడ్డలతల్లిలాగ చూడ్డానికి యెంతో నిండుగావుంటుంది. ఈలాంటి చెట్ల ఆడమగ విభేధాలు మనదేశంలో యెవరికీ అట్టే అక్కరలేదు గాని, బొబ్బాసిచెట్లు విస్తారంగా పైరుచేసే ఫిలిప్పైన్సు మొదలైన దీవులలో కావాలి. తోటలో చాలచెట్లు మగవైతే అట్టేలాభం రాదు. అందుచేత యిది వారికి పెద్ద సమస్య అయింది. దీనికి ప్రతిక్రియ కనుక్కోవడానికి ఒకశాస్త్రజ్ఞుడు చాలకృషి ప్రయోగాలుచేసి చివరకు-'మగదానియొక్క జుట్టు (తల) నరికివేస్తేసరి, అది ఆడదిగా మారిపోతుంది' అనే సూత్రాన్ని కనిపెట్టేడట!

## ప్రాణంలేని వింత సెక్రటరీ

కాలిఫోర్నియా దేశస్థులిద్దరు డబ్లియు.యి. బ్రెయినార్డు, ఆర్.బి. వాల్డరు అనువారలు విద్యుచ్ఛక్తితో పనిచేసే ఒక 'అతి విచిత్రమైన మెషీను సెక్రటరి'ని తయారుజేసేరట. ఇది ఒక చిన్న టైపుమిషనంతి యున్నదట. ఇది నీవుచెప్పేమాటలేగాదు, జాబులేగాదు సెక్రటరీవలె వ్రాస్తుంది; నీవులేనప్పుడు యెవరైనా టెలిఫోనులో పిలిస్తే వారికి మారుపలికి వారుచెప్పేసంగతులు వ్రాసుకొని నీకుయిస్తుంది; నీ గదిలో జరిగే సంభాషణలు కావలిస్తే వ్రాసి రికార్డుచేసి వుంచుతుంది. ఇంకాయెన్నో ఆశ్చర్యకరములైన పనులన్నీ చేస్తూ ఆఫీసులు, బడులు, యిళ్లు, హోటళ్లు, నాటకశాలలు, సభలు మున్నగు వాటిలో చాలపని చేస్తూవుందట.

ఈ మిషినుయొక్క నిర్మాణ రహస్యాలింకా పూర్తిగా తెలియరాలేదుగాని, ఇది శబ్దగ్రహణం, ఒక మైక్రోఫోను ద్వారాచేసి ఏంప్లిఫై (Amplify) చేసుకొని ఒక కలమువంటి యంత్రసహాయంచే చిన్న (3/1000 అంగుళం దళసరి గల) ఫిలిముమీద వ్రాస్తుందట. వలసినప్పుడు ఆఫిలిముమీద వ్రాయబడినదాన్ని సినిమాటాకీలలోవలె లవుడ్ స్పీకరుద్వారాగాని హెడ్‌ఫోన్సుద్వారాగాని పంపి నీకు వినిపింపజేస్తుందట. 'వాయిస్‌లూప్సు' అనబడే యీ ఫిల్ములకు అగ్నిభయంలేదు; నలిగిపోతాయన్న భయం అంతకుమునుపేలేదు. ఎంతమడతలు పడిపోయినా, వంకరటింకరలుపడి చిత్తుకాగితాలవలె పూర్తిగా నలిగిపోయినా వాటిలో వ్రాయబడిన హంశాలకు ఏమాత్రంనష్టం కలుగదు. ఆవ్రాతను వంద పర్యాయములవరకు చదివించి వినటానికి సందేహంలేదు. ఆఫిల్ములు చాల తేలికకూడాను. 10 మామూలు జాబు-కాగితాలలో వ్రాయడానికి వీలయినంత వ్రాతఅంతా 3 ఫిల్ములలో పట్టుతుందట. ఆ 3 ఫిల్ములు మామూలు కవరులో అర్ధణాబిళ్లతో నీమిత్రునకు జాబువలె పంపవచ్చుట. దాన్ని మెషినుచేత చదివించుకొని వినవచ్చు. తర్వాత మరల కావలసివస్తుందనితోస్తే వాటిని ఫైలుచేసియుంచుకొని గ్రామఫోను రికార్డువలె వలసినప్పుడు మళ్లీజాబులోని సంగతులు వినవచ్చు. పెద్ద వ్యాపారాలుచేసే షావుకార్లకుకూడ యిది చాల వుపయోగం.

—కె. సు. మణి.

# గ్రంథ సమీక్ష

## నాటికా గుచ్ఛము

కర్త: శ్రీ పి. వి. రాజమన్నారుగారు, ప్రకటనకర్తలు: నమ్మాళ్వార్సు, పోస్టుబాక్సు, 1251, మద్రాసు. వెల ఆరు అణాలు.

దీనిలో విముక్తి, మాతృప్రేమ, నిష్ఫలం అను మూడు నాటికలున్నాయి. మొదటిరెండూ వీరు యిదివరలో వ్రాసి ప్రకటించినవే. మూడోదిమాత్రం క్రొత్తగా రచించినది.

మూడునాటకాలు ప్రస్ఫుటమైన మూడుఆదర్శాల ననుసరించి వ్రాసినవే. గ్రంథకర్తగారు నేటి సాంఘిక పరిస్థితులమీద మంచిమంచి విసురులు విసిరారు. సాంఘికపరిస్థితుల్లో మంచివికాసానికి దారిచూపు హంశాలు చక్కగా విమర్శింపబడ్డాయి, యీనాటకాలలో.

## భక్తాంజలి

కర్త: శ్రీ పాలపర్తి నరసింహంగారు. ఇదికూడా నమ్మాళ్వార్సు వారిచేతనే ప్రకటింపబడినది. వెల ఆరుఅణాలు.

భక్తిసంబంధమైన ప్రార్థనలు, గద్యపద్యాత్మకముగావున్న 64 పేజీల గ్రంథము. బ్రహ్మసమాజ ప్రపంచములో ప్రసిద్ధులు గ్రంథకర్తగారు. దీనిలో పండిత శివనాథశాస్త్రి, సతీశ చంద్రరాయి మొదలగు వారిరచనలకు అనువాదములు, కీ॥ శే॥ వడ్డాది సుబ్బరాయకవి, చి॥ నరసింహంగార్ల పద్యాలు వున్నాయి. భక్తిభావాన్ని పెంపొందించడానికి మంచిగ్రంథమిది.—

దీనితో 1938 సంవత్సరానికి నిర్ణీతమైన నమ్మాళ్వార్సువారి యిరవైనాల్గుగ్రంథాలు పూర్తవుతాయి. ఇదే ఆఖరిపుస్తకము.

సాహిత్యము, రాజకీయము, విజ్ఞానము సంబంధమైన గ్రంథాలను ఏర్చికూర్చిప్రకటించి ఆంధ్రభాషా సేవచేయుచున్న నమ్మాళ్వార్సువారిని మేము అభినందిస్తున్నాము. వీరియుద్యమమునకు సర్వవిధముల ఆంధ్ర మహాశయులు చేయూతనిత్తురుగాక!

## శ్రీ సాయి స్తవమంజరి

కర్త: శ్రీ శతావధాని దోమా వెంకటస్వామిగుప్తగారు. దొరకుచోటు: శ్రీ దోమా వెంకట స్వామిగుప్తగారు, 56, స్ట్రాటక్ ముత్యాలమొదలివీధి, జి. టి. మద్రాసు. వెల (?)

దీనిలో శ్రీ సాయిబాబా ప్రభువును స్తోత్రముచేయుచు 108 పద్యములున్నవి. సాయిభగవానుని భక్తితోగొలుచువారికి ఇది అత్యంత ఉపయుక్తంగావుంటుంది. స్వానుభవపూర్వకమైన అనేక ఉదాహరణలతో చక్కనిపద్యాలున్నాయి.

## నీటిబుగ్గలు

కర్త: శ్రీ చిట్రకంటి రామచంద్రుడుగారు. 'చాతక' గ్రంథమాలవారి తొలిపుష్పమిది. ప్రతులకు: లక్ష్మీ స్వదేశీప్రెస్సు, అనంతపురం. వెల (?)

ఇది చిన్నచిన్న పదాల్తో చక్కగా అల్లిన రకరకాల గీతికలుగల సంపుటి.

భావాలన్నీ తీవ్రమైన మార్పుకోరుతూ, ప్రాతనేపట్టుకు వ్రేళ్లాడేవాళ్లని హెచ్చరిస్తూ ఘసందుగా వ్రాయబడ్డాయి. కవిగారికి పాతఅంటే రోతన్నట్టు, ప్రతివిషయంలోనూ క్రొత్తకావాలనేవిషయం చాలా చోట్ల ధ్వనిస్తూవుంటుంది.

రాయలసీమలో రసవంతంగావ్రాసే రచయితలున్నారని సగర్వంగా చాటడానికి, యీ గ్రంథమాల వారు అనేకగ్రంథాలు ప్రకటిస్తారని ఆశిస్తున్నాము.

## కృష్ణవిజయము

కర్త: కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు, 'సాహిత్యలత' 16-వ కుసుమము. ప్రతులకు: కర్లపాలెం కృష్ణరావుగారు, చీరాల, గుంటూరుజిల్లా. వెల (?)

ఇదిఒక ఖండకావ్యము. దీనిలో భారతకృష్ణునిగురించి అనేకపద్యాలున్నాయి. కృష్ణునియొక్క అవతారతత్వము, సంస్కర్త, దీనబంధువు, ధర్మరక్షణ, రాజనీతి, భారతయుద్ధము, అహింసాసత్యములు మొదలగు విషయాలనుగురించి అనేకపద్యాలలో హృదయంగమంగా చిత్రించారు. ప్రార్థనాగీతములు, సూర్యగాయత్రి మొదలగువిషయాలతో, శ్రీ కృష్ణుని త్రివర్ణచిత్రంతో చక్కగావుంది పుస్తకం.





# సంపాదకీయములు

## స్త్రీలు - సాంఘికస్వత్వములు

విద్య, స్వాతంత్ర్యము మొదలగు ప్రాథమిక హక్కులు స్త్రీ పురుషులకు వారి వారి కెంతవరకు ఉచితమో అంతవరకు ఉండవలెననుభావము బాగుగ ప్రబలియున్నది. సాంఘికముగా పురుషుడు స్త్రీని తన యిష్టానువర్తినిగా నుండునట్లు ఆజ్ఞాపించుటగాని స్త్రీ పురుషుని ఆజ్ఞాపించుటగాని వింతభావములుగా పరిగణింపబడి నిరసింపబడుచున్నవి. అన్ని విషయములందును ఎక్కువతక్కువ భావములులేక, ఒకరికొకరు తీసిపోక, ఎవరిధర్మములు వారికున్నవని గ్రహించి అన్యోన్యస్నేహభావము, పరస్పర సహాయ్యము, అకళంకమగు ప్రేమతో ఒకరికొకరు తోడ్పడిన జీవితరథము చక్కగ లాగికొనపోబడి, యిరువురకును సమానగౌరవములుగలిగి జీవితము లానందదాయకములగును.

ఇట్టి సాంఘికహక్కులను గురించి ఇదివరలో 'గృహలక్ష్మి' ఉచితరీతిని తెల్పియే యున్నది. ఆసదభిప్రాయములను ప్రత్యక్షముగ నిరూపించుచు గడచిన మాసమందు మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు ఒక వకీలుగారిపై యాతనిభార్యచే తేబడిన జీవనాదాయపు దావాలో చెప్పిన తీర్పు చాల సమంజసముగ నున్నది.

ప్రతి విషయమును నూటికి నూరుపాళ్లు భర్త చెప్పినట్లాచరించి పూర్వాచారపద్ధతిని గాక నాగరికతాలక్షణముల ననుసరించి వస్త్రధారణ మొనర్చుటలో కలిగిన యభిప్రాయ భేదములు దాంపత్యసుఖమునుండి వారిరువురను విడదీసినవి. అతడు వకీలు; భార్య విద్యావతి. ఎవరికి వారు చక్కగ నలంకరించుకొనుట మానవప్రకృతి. అందులో విద్యావతియైన వనిత యిట్టి విషయముల ఎక్కువమక్కువ జూపుననుటలో సందేహములేదు. అయినను అది ఎవరికిని ఎందునను హానికరము కానేరదు.

ఇట్టి చిన్నచిన్న విషయములలోగూడ అధికారానధికారములు, ఆజ్ఞాపాలులు, వినయావినయవిధేయతలు నిరపాయముగ సాగింపచూచి అనవసరవైరములను పెంచుకొని కోట్లలకెక్కుట నేటి యువతీయువకులకు ధర్మముగాదు.

ఇట్టి యభిప్రాయభేదములవలన యామెనువదలి, యామెకు జీవనాదాయముగూడ నివ్వ నిరాకరించిన యాతని యభిచారమును వారించుచు, జీవనాదాయము నిచ్చునట్లు తీర్పుచెప్పుచు, యిట్టి విషయములను గురించి హెచ్చరించుచు, న్యాయమూర్తులు

"హిందూ స్త్రీ చదువుకున్నదైనను చదువురానిదైనను తనబాధ్యతలను తానెరుగును. కాని, భర్తకు అన్నివిధములైన హక్కులు లేవని నేను చెప్పుట లేదు. భార్య భర్త యొక్క ఆజ్ఞలకు లోబడియుండవలసినదే. కాని భర్త తన హక్కులను అతిక్రమించి ప్రతివిషయములోను తనకు సంబంధమున్నను లేకపోయినను కలగజేసుకొనకూడదు. ఈ కేసులో భార్య తన యిష్టమువచ్చినట్లు నడుచుకొననివిషయములో ఆమెను కొట్టి హింసించుటకుకూడ తన కధికారమున్నట్లు భర్త భావించియున్నాడని రూఢియగుచున్నది. ఆమె నడతలు నీతిదూరములుగా పరిణమించి, దుశ్చరిత్రగా మారునట్లున్న యెడల, ఆమె భర్తయొక్క ఆజ్ఞలకు బద్ధురాలై యుండకపోవుటతో నేనేకీభవించను. అయినను ఇటువంటి పరిస్థితులలో అన్యోన్యానువర్తనము, ఓర్పు ఉన్నయెడల పరిస్థితులు చక్కబడును. భార్యను సేవకురాలుగా గాక సహచరిణిగా భర్తచూచి ఆదరించవలయును. భర్త చెప్పిన వాటిని సహనముతో భార్య ఆచరించవలయును. ఇది సాంఘికజీవనములోని పవిత్ర ధర్మము..."అని చెప్పిన తీర్పు ఎంతయు సమయోచితముగను సమంజసముగను ఉన్నది.

అతి స్వల్ప విషయములలోగూడ పురుషుని యాజ్ఞలను శిరసావహించుచు, తుదకు స్త్రీ తన కట్టుబొట్టులలోగూడ పురుషుని యాజ్ఞలకు బద్ధురాలైయుండవలయునను భావము విపరీతము, అయోగ్యము, నీచము. ఇంత యతి స్వల్పవిషయమున గూడ అస్వాతంత్ర్యమైన యామె జీవితముకంటె నరకముమేలు.

ప్రాథమికహక్కులు, సాంఘిక స్వత్వములలో యొకరి యాజ్ఞలకొకరు బద్ధులై యుండవలెనను భావమును ఏనాగరిక ప్రపంచము అంగీకరింపజాలదు.

ఇట్టి విపరీత భావములను పురుషజాతి ఏనాడు కూలంకషముగా నిర్మూలించునో ఆనాడే స్త్రీ పురుషులనడుమ అన్యోన్యానురాగము వృద్ధియై సాంఘిక జీవనము సౌఖ్యానంద నిలయమగును. లేనిచో సంఘము భంగమే.

## స్త్రీలు - వయోజనవిద్య

స్త్రీలలో అవిద్యను రూపుమాపి, వయోజన విజ్ఞానమునకై పాటుపడుటకు మద్రాసు వుమన్సు ఎసోసియేషనువారు తీర్మానించి, విద్యామంత్రికి తత్సంబంధమైన ఒక అర్జీనికూడ పెట్టియున్నారనుట ఎంతయు ముదావహము. ఈ సమాజము తరపున పట్టణమందంతటను శాఖలు స్థాపించి తీవ్రకృషి చేయుటకు ప్రభుత్వమును, పురపాలకసంఘము వారిని ఆర్థికముగా కొంతసహాయము చేయమనిగూడకోరియున్నారని తెలియుచున్నది.

అసలు విద్యావిధానమే బాగుగలేదనియు, అది స్త్రీ పురుషోచితముగా నుండునట్లు ప్రభుత్వము సంతృప్తికరమగు చర్య తీసికొనుటలేదను విషయములు అందరెరిగినవే. యిప్పటి విద్యావిధానము పురుషులకుగూడ ఎందునను ఉపయోగకారి కాదన్న, ఇక స్త్రీల విషయము వేరుగ చెప్పవలెనా?

స్త్రీలలో నూటికి తొమ్మండుగురు చదువుకున్న వారున్నారనిన, చేవ్రాలైన చేయ లేని నారీలోకములో అవిద్య ఎంతవరకు వ్యాప్తమైయున్నదో తెలిసికొనవచ్చును. వయస్సు వచ్చిన స్త్రీలలో యీ అవిద్యను నిర్మూలించినగాని సాంఘికదురాచారములు నశించవు. విద్యావతులైన గాని సాంఘికముగా ఔన్నత్యమును పొందజాలరు.

ప్రభుత్వము ఇట్టి విషయములందు పూర్తిశ్రద్ధ తీసికొనకుండు నీ కాలములో ఇట్టి సమాజములు ఆ లోపమును తీర్ప సమకట్టుట ఎంతయు శుభసూచకము.

ఎట్టి ప్రతిఫలమును వాంఛింపకయే విద్యాభివృద్ధికి పాటుపడుదుమని ముందుకు వచ్చిన యీ సంఘసేవకురాండ్రగు మహిళామణులకు సర్వవిధముల తోడ్పడుట ప్రభుత్వమువారి ధర్మము.

ఇట్టి సంఘములు ఒక్క మద్రాసునగరమందేగాక, యావదాంధ్రదేశమునందును వెంటనే స్థాపింపబడి కృషిచేసిననే తప్ప యిట్టి మహత్తరకార్యములందు కృతకృత్యులగుట దుర్లభము. ప్రతిగ్రామమునందు మహిళాభ్యుదయమునకై సంఘములను స్థాపించి కృషి చేయుచున్నారు గదా? కేవలము వినోదలీలలందే వారి కాలమును వృథా పుచ్చక, ప్రతిదినమును ఏకొద్దిగంటలో యిట్టివిద్యాభివృద్ధికై కృషిచేసిన కొలదికాలములోనే నారీలోకమందు నిరక్షరాస్యతను పోగొట్టవచ్చును.

పెద్దమొత్తములగు ధనసహాయము లేకయే యీ కార్యములను అన్యోన్య సహకారముచే నిర్వహింపవచ్చును. బాలబాలికలకై వుపయోగించు పాఠశాలలందు, పాఠశాలలు పనిచేయని విరామకాలములందు వయస్సు వచ్చిన యువతులు చేరి క్రమమైన శిక్షణతో విద్య పొందవచ్చును. కట్టుబాటులతో ప్రవర్తించిన ఎచ్చటనైనను యిట్టి సంఘములను స్థాపించి కృషిచేయనచ్చును. ప్రతి పురపాలకసంఘమును, ప్రతి పంచాయితీ బోర్డువారును గ్రాంటురూపముగా కొంత సహాయము చేయుచు యిట్టి సంఘములను తగు రీతిని ప్రోత్సాహపరచిన అచిరకాలములోనే స్త్రీలలో అవిద్యను రూపుమాపవచ్చును.

ప్రభుత్వము యీ విషయమున వారి యాశయ పరిపూర్తికి తప్పక సహాయము చేయునని విశ్వసించుచున్నాను.

ఆంధ్రదేశమందు ప్రతిపట్టణమునందును, ప్రతిగ్రామమందును యిట్టి సంఘములను స్థాపించి కృషిచేయవలసినదిగా ఆంధ్రమహిళామణులను కోరుచున్నాము.

ఇట్టి అమూల్యకార్యమునకు గడంగి మార్గదర్శకులైన మద్రాసు వుమన్సు ఇండియన్ ఎసోసియేషనువారిని అభినందించుచున్నాము.

---

EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

## విషయసూచిక



త్రివర్ణ చిత్రములు:

ద్వైతాద్వైత ప్రేమతత్వం

చిత్రకారుడు : సి. ఎన్. వెంకట్రావుగారు.

# లక్ష్మీ వారి మహోజ్వల తార

జీవితపరిమాణములో అపురూపమైనది

అనుపమానమైన భక్తి, అమోఘమైన సందేశముగల చిత్రము

## మానవాతీతమైన పవిత్రప్రేమ



## రాధాకృష్ణ

(తెలుగు)

## శ్యామసుందర్

(తమిళము)

## సాటిలేనిది!

అద్భుతానురాగ, హాస్య, విషాద
సంభ్రమాలతో నిండియున్న చిత్రము

అసమానమైన

కళాపాటవము

డైరెక్షను:
ఎ. పి. కపూర్.

## సాటిరానిది!



## విడుదలకై ఎదురుచూడుడు!

**LAKSHMI CINITONE, MADRAS.**

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1-వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4. | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | .6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

తెలుగువారు నిరీక్షించుచున్న తెలుగు చిత్రము

త్వరలో విడుదల కానున్నది







రచన : వఝుల కాళిదాసు. గానము : వి. జె. గోపాల్ సింగు. దర్శకుడు : టి. యస్. మణి.



'పాశుపతాస్త్రం' పాటలు సన్. రికార్డులలో వినండి!

ఏయేవేళల నే సరోజముఖి యేయే లీలలంగోరుఁ దా

నాయావేళల నా సరోజముఖి నాయా లీలలం దేల్చి యే

చాయం జూచినఁ దానయై మెలగుచు న్సౌఖ్యాబ్ధి నోలాడు భో

గ్యాయత్తుండల్లు పెక్కురూపముల మాయా కల్పనాచాతురిన్॥

హరి యిట్లు సతులనందఱ

సరిగాఁ జూచియును భోజ జనపాలసుతం

దరుణీమణి సాత్రాజితి

నిరువురి మన్నించి మిగుల నిచ్చం జనవుల్॥

—పారిజాతాపహరణము.




## పతివ్రతామహిమకు ప్రత్యక్ష ప్రమాణము

క. తరుణి దన ప్రాణవల్లభు హరిభావముగా భజించి యతఁడును దానున్,
సిరికైవడి వర్తించును, హరి లోకమునందు సంతతానందమునన్.

క. ఉపవాసంబులు వ్రతములుఁ దపములు వేయేల భర్త దైవతమని,
నిష్కపటతఁ గొల్చినసాధ్వికి, నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్.

—శ్రీమదాంధ్ర భాగవతము.

పూర్వము సీత, అనసూయ, ద్రౌపది, చంద్రమతి, దమయంతి, సావిత్రి మొదలగు మహాపతివ్రతల చరిత్రములందు, స్త్రీలలో నిండినిబిడీకృతమైన యనంత శక్తిసామర్థ్యములు, దివ్యతేజోవంతమగు శీలప్రభావము పురాణములవలన ప్రపంచమునకు ప్రకటితములై యున్నవి. ఏయుగమందైనను, ఏకాలపరిస్థితులందైనను, ఎట్టి విపత్సమయములందైనను, ఎంత ఘోరయధర్మము ప్రబలి, ధర్మమునడంప ప్రయత్నించు పట్లనైనను, పతివ్రతల మహిమవలననే, వారి శాంతిసహితసహనశక్తియొక్క ప్రభావమువలననే ధరలో ధర్మము రక్షింపబడుటయు, సత్యము శాశ్వతజయమును పొందుటయు, లోక ముద్ధరింపబడుటయు, పురుషులజీవితములు పుణ్యతగాంచుటయు, జగత్ప్రసిద్ధరహస్యమై వెలయుచున్నది.

మానవహృదయమందలి మాలిన్యమును గడగివైచి పవిత్రములగు భావము లుద్భవింపజేసి చిత్తమును వికసింపజేయు నాటకములందును, సినీమా ప్రదర్శనములందును,

స్త్రీలయొక్క శీలసంపదను, ప్రేమమహత్వమును ప్రకటించునవియే సుప్రసిద్ధ ప్రదర్శనము లని సంస్తుతింపబడుచున్నవి. మహాకవి కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము' అత్యంత రమణీయమగు నాటకమని ఘనతకెక్కుటకు కారణమేమి? శకుంతలయొక్క సహజ సౌందర్యసంపద, పవిత్రప్రేమ, శీలసౌష్ఠవమును అతులిత మాధుర్యముతో కవి రచింప గల్గుటయే యని స్పష్టపడును. రామాయణము పురాణములలో పూజ్యతబడయుటకు సీతామహాదేవి దివ్యశీలతేజోమహిమయు నాసాధ్వీమణి పావనచరిత్రయు పాతివ్రత్య ప్రభావమును కారణములని నిరూపింపదగును.

లోకములో పతివ్రతామహిమకు ప్రత్యక్షప్రమాణములు పెక్కులున్నను, పూర్వము సీత, చంద్రమతి మొదలగుపతివ్రతలు తమ శీలప్రభావమును అగ్నిపరీక్షల మూలమునగూడ ప్రపంచమునకు ప్రదర్శించినట్లు పురాణములు చాటుచున్నను, అవి కవికల్పిత కథలనియు, పుక్కిడి పురాణములనియు, ప్రత్యక్షప్రమాణములు గావనియు చులుకనదృష్టితో జూడబడుచున్నవి. పతివ్రతలే లేరు, స్త్రీలలో మహిమయనునది మచ్చునకైనలేదని పలుచనగ పలుకువారు పలువురున్నారు. అట్టివారల వితండవాదము లను ప్రతిహతమొనరించుటకును, స్త్రీల శీలప్రభావమును గుర్తెరుంగక సాధ్వీమణుల చావగొట్టి యేడ్పించు చెనఁటులకు చక్కగ బుద్ధిచెప్పి, పవిత్రప్రేమమూర్తులు, త్యాగ స్వరూపిణులునగు స్త్రీలశీలమును సులభముగ శంకింపరాదను నీతిగఱపుటకును ఒక మానినీమణి మహితగుణశీలపరిశీలన వృత్తాంత మీమధ్యనే ప్రపంచమునకు వెల్లడింప బడినది.

ఈసంవత్సరం చైత్రమాసమున వెల్వడిన 'విభూతి' యను సచిత్రమాసపత్రిక యందు 'పతివ్రతామహిమకు ప్రత్యక్షప్రమాణము' అను అద్భుతమగుకథ ప్రకటింప బడినది. ఈవృత్తాంతము హిందీభాషలో సుప్రసిద్ధమైనదియు, సత్యమును సర్వత్ర వ్యాపింపజేయుటే యాశయముగా గల్గినదియునగు 'కల్యాణ' అను మాసపత్రికలో ప్రథమమున ప్రకటింపబడినదనియు, ఆపత్రికాసంపాదకులీ వృత్తాంతముయొక్క సత్యమును స్వయముగ తెలిసికొని ప్రకటించినట్లును స్పష్టపడుచున్నది.

ఈకాలములో పతివ్రతామహిమకు అగ్నిదేవుడుకూడ అల్లాడినాడంటే నమ్ము వారు చాలతక్కువగనుందురు. సతియొక్కశీలము హిందూమతధర్మమునకు మూలా ధారము. సతీత్వముయొక్క సత్యముపైననే సర్వసంపదలు, సర్వసుఖములు సృజింపబడినవి. సతీత్వమే సర్వశ్రేయస్సులకు ఆశ్రయము. అట్టిసతీత్వమును నిందించి, నిరసించి హింసిం చుట మహాపాతకముగాదె? ఇట్టిపాపమున కొడిగట్టిన పతితుల నుద్ధరించుటకును, పతి

వ్రతామహిమయనిన భయములేక పరిహసింప సాహసించువారిని గర్హించుటకునునై యీకథ నెక్కుడుగ వెల్లడింపవలసియున్నది. ఇందలివృత్తాంతము పలువురచే వీక్షింపబడిన దగుటచే వినువారలకు విస్మయము గొల్పుటేకాక స్త్రీల పాతివ్రత్యమన్న భగవంతునికి కూడ నెంతభయమో విశదపరచుచున్నది. ఇకముందైన పురుషులు పతివ్రతల ప్రభావ మనుగ్రహించి స్త్రీలలో శీలమెంత శక్తివంతమైయుండునో చక్కగ దెలిసికొని పతివ్రత లగు భార్యలను బానిసలుగపరిగణించి బాధింపకుందురనుభావముతో నాకథ యీదిగువ నుదాహరింపబడినది.

బీహారుసమీపమున 'ముంగేర్' అనుజిల్లాలో 'ఉలావు' అనుగ్రామమున 'గోరఖ్ పూరు'నకు చెందిన 'ఒడ్డెవార'ను నొకతెగవారు రాళ్లను పగులగొట్టు పనిచేయుచు కొన్నిమాసములనుండి నివసించుచుండిరి. వారిల్లో 'జయపాలుఁడు' అనువానికి పుత్రికయు 'నథునీ' అనువానికి భార్యయునగు 'సుందరి'యను యిల్లాలుండెను. ఆమెవయసు ముప్ప దేండ్లుమాత్రమె. 'బాబులాల్' అను కొండెకాఁడు ఆమెపై లేనినేరమునుమోపి ఆమె భర్తతో నాయింతి వ్యభిచారదోషము గలదనియు ఆమెకపుడు కలిగినగర్భము పరపురుష ప్రసాదమనియు బోధచేసినంత, నాయవివేకి తనభార్యను దోషిగభావించిన నాభామిని యానిందను సైపనోపక పతితో, తన పవిత్రశీలమునకు కళంకము గల్గింపనెంచి యా తులువ యట్లుచెప్పెననియు, అదియెల్ల కల్లయనియు స్పష్టముగబల్కెను. ఆపిమ్మట నాయువతి భర్తకోరినపరీక్షకు బద్ధురాలయ్యెను. ఆమెకు భర్త అగ్నిపరీక్ష విధించెను. గతసంవత్సరము డిసెంబరునెల ఆరవతేదీని ఈక్రింద దెలుపబడినవిధమున నాసాధ్వీమణి శీలము పరీక్షింపబడెను.

గ్రామమునకు దక్షిణమునందున్న యొక మఱ్ఱిచెట్టుక్రింద పెద్దగుట్టగబోసిన ఏరు పిడకలరాశికి నిప్పటించి అందులో రెండుసేర్ల బరువుగల ఇనుపసుత్తెను బడవైచిరి. అది యెఱ్ఱగకాలినపిదప నాయువతిని స్నానముచేయించి ఆమె రెండుచేతులు దోసిలిగాబట్టించి దానికి నెయ్యిరాసి దానిపై రెండుమూడు రావియాకులనుంచి పూదారముతో దోసిలిని కట్టిరి. అటుపైని కుమ్ములోనుండి ఏడు ఏరుపిడకలనుదీసి అడుగున కొంకటిచొప్పున వరుసగ పెట్టిరి.

ఆతరుణి అగ్నియొద్ద నిలిచియుండెను. వారికులపు పెద్దయొకఁడు చిమ్మటతో నిప్పులలోనుండి ఎఱ్ఱగ కాలియున్న ఇనుపసుత్తెను పైకెత్తి ఆయిల్లాలితో "నీవు నిర్దోషి వని నిరూపించుటకు ఈసుత్తెను చేతిలోబెట్టుకొని ఏడడుగులు నడువు"మని యాజ్ఞాపించెను. అంత నాస్త్రీరత్నము సూర్యభగవానునిపై దృష్టిబసారించి "ఓ త్రిమూర్త్యాత్మకా! నీవు సర్వసాక్షివి. నేను నిర్దోషురాలనేని నీవిపుడు నాశీలమును, ధర్మమును వీరలకు తెలియ

బరచి నన్నుగావు"మని ప్రార్థించి, ఆనందముతో నాసుత్తెను చేఁగొని ఏడడుగులునడచి దానిని భూమిపై బడవైచెను. ఆసుత్తెపడినతావున నేలయు, గడ్డియును రెండంగుళములలోతున కాలిపోయెను.

భగవంతుని పరిపూర్ణకటాక్షముచే నాయింతి దోసిలిగాని, రావియాకులుగాని దారమునుగాని యెంతమాత్రమును కాలియుండలేదు. ఈయద్భుతదృశ్యమును చూచుటకు సుమారు రెండువందలమంది చేరియుండిరి. చూపరులలో ఒడ్డెజాతివారుకూడ కొందరుగలరు. ఈపతివ్రతాతిలకముయొక్క సత్యశీలప్రభావమున కందరు కడునచ్చెరువొంది జయిజయధ్వానముల తమహర్షమును వెలిబుచ్చి యాపావనమూర్తిని పూజించి గౌరవించిరి.

సోదరసోదరీమణులారా! ఇట్టి మానినీమణి మహితకీర్తి మహిళామండలికెల్ల శాశ్వతయశోవైభవము చేకూర్చుటేగాక లోకమునంతను తేజోవంతముగ జేయగల్గుచున్నదనుట యతిశయోక్తికానేరదు. ఇపుడైన పతివ్రతామహిమయందు సంపూర్ణవిశ్వాసము దేశమునందెల్లెడల నాటుకొనునా? పాపము పెచ్చుపెరిగి, ధర్మమొకపాదమె నడచుచున్న యిక్కలికాలముననే సామాన్య స్త్రీలలోనే ఇట్టి మహాపతివ్రతలుండ, పూర్వము ధర్మము పూర్తిగ నడచుచుండినపుడు ఉన్నతకుటుంబములలోను ఉత్తమజాతి స్త్రీలలోను పరమపతివ్రత లుండిరనుటకు సందియముకలదా? ఇట్టి సాధ్వీమణు లిపుడు కూడ నున్నారు గనుకనే ప్రపంచము నిలిచియున్నది.

స్త్రీలయందలి దోషములను పరిశీలించుటకుముందు పురుషులు తమశీలమును గట్టిగ పరీక్ష చేసికొన పాడియగును. స్త్రీల ఉత్తమశీలప్రభావముపైననే పురుషునిఘనతయు గౌరవమును ఆధారపడియున్నవి. భారతదేశాభ్యుదయము భారతరమణీమణుల శీలప్రతిభ వలననే కలుగవలెను. స్త్రీలు విద్యాభివృద్ధికై విశేషముగ పరిశ్రమసల్పి, తమవిజ్ఞానమును వివిధవిషయములలో విస్తరింపజేయుచు, పురుషులయెడ వినయవిధేయతలతో మెలంగి వారికి తమ శీలశక్తిని సర్వవిధముల సహాయముగజేసి, దేశమును, సంఘమును నుద్దీపింపజేసి సత్కీర్తిగాంచ సమకట్టుటెంతయు సమంజసము. పతివ్రతలే ధర నుద్ధరింపగలవారలు. పతివ్రతలనుపూజించి, ప్రేమతోనాదరించి, వారి సత్ప్రయత్నములను ప్రోత్సహించి, స్త్రీలనందర సమభావముతో గౌరవించి వారి యభివృద్ధికై పురుషులు పాటుపడిననాడే భారతభూమి పూర్వమహిమను, యశస్సును బడయగలదు. పతివ్రతలను పరీక్షచేయువారును, ఉత్తమసతుల బాధించువారును శాశ్వతనరకమునకు త్రోవ వెదకుకొనువారగుచున్నారు.

# రాజకోట చరిత్ర

**అశాంతికూపాలైన సంస్థానాల్లో స్వాతంత్ర్యకిరణాలు ప్రసరించి ప్రజలు మేల్కొని బ్రిటిషు ప్రజానీకంతో చేతులుకలిపి స్వాతంత్ర్యసమరంలో పాల్గొనినప్పుడే దేశానికిమోక్షం. దీనికి నిదర్శనం రాజకోట.**

●

భారతదేశం రాజకీయంగా రెండుభాగాలు. ఒకటి బ్రిటిష్‌గవర్నమెంటువారిచే పరిపాలింపబడేది, రెండోది బ్రిటిష్‌గవర్నమెంటువారి అధికారానికిలోబడి సంస్థానాధీశ్వరులచే పరిపాలింపబడేది. భారతదేశపు మొత్తంవైశాల్యంలో నాలుగోవంతు యీసంస్థానాధీశ్వరుల చేతుల్లోవుంది. ఈనాలుగోవంతుభాగాన్ని సుమారు 500 సంస్థానాధీశ్వరులు పరిపాలిస్తున్నారు. ఒక లక్షరూపాయిల దగ్గరనుంచి 9 కోట్ల రూపాయిలు వరకు ఆదాయంవచ్చే సంస్థానాధీశ్వరు లున్నారు వీరిలో.

హిందూదేశంలో ఈస్టిండియా కంపెనీవారు రాజ్యాన్నిస్థాపించి పాలించినది లగాయతు యీరోజు వరకు యీ సంస్థానాధీశ్వరులతో, సందర్భాలనుబట్టి, అనేకసార్లు అనేకరాజీలు చేసుకుంటూ వచ్చారు. ఆరాజీలనుబట్టి వారివారికి కొన్నికొన్ని హక్కులను, కొంతవరకు గౌరవాదులను కంపెనీవారు ఇచ్చారు. దాని ప్రకారం ఆయాసంస్థానాధీశ్వరులు, వారివారితాహతునుబట్టి కొన్నిఫిరంగులు, తుపాకులు వుంచుకోనేందుకు అనుమతి ఇయ్యబడింది. కొన్నికొన్ని సంస్థానాల్లో నాణెములు మొదలయినవికూడా వారివారివి ఉన్నాయి.

ఇక యీసంస్థానాల్లో బ్రిటిష్‌గవర్నమెంటు వారితాలూకు, అనగా వైసురాయియొక్క ప్రతినిధి (రెసిడెంటు) ఒకడు వుంటాడు. సంస్థానాధీశ్వరుడు రాజ్యాంగంవిషయాల్లో, అనగా గవర్నమెంటువారి సంబంధమైనవిషయాల్లో యీ రెసిడెంటుయొక్క యిష్టప్రకారం నడుచుకుంటూవుండి, తనరాజ్యాన్ని తన యిష్టంవచ్చినట్టు పరిపాలించుకోవచ్చును.

యీ రెసిడెంట్లుయొక్క జీతబత్యాదులనన్నిటిని ఆయాసంస్థానాధీశ్వరులే భరించాలి. యీ రెసిడెంటుకుతోడు కొంతసైన్యాన్ని, బ్రిటిషుగవర్నమెంటు ఉపయోగార్థం, సంస్థానాధీశ్వరులే పోషించాలి. సంస్థానాధీశ్వరుడు తనరాజ్యాన్ని ఏవిధంగా పరిపాలిస్తున్నా బ్రిటిషువారు కలుగజేసుకోరు, అతడు ఎప్పుడూ పేరమాంటుపవరుకు లోబడేవుంటాడు కాబట్టి. ఈఅవకాశాన్ని వినియోగించుకుని సంస్థానాధీశ్వరులు తమ తమ భోగవిలాసాలకై ప్రజలనెత్తురు పిండడానికికూడా వెనుతీయకుండా పరిపాలిస్తున్నారు. ఈసంస్థానాలనన్నిటిని ఒక్కపెట్టున తుడిచివెయ్యగల బలం గవర్నమెంటుకున్నప్పటికి వారు ఆపనిచెయ్యరు; బ్రిటిషుగవర్నమెంటుకుగాను కొంతసైన్యాన్నిపోషిస్తూ వారికి అన్నివిధాలా ఉపకారిగా వున్నారు గనుక. నిజంగా భారతదేశంలో బ్రిటిషు రాజ్యాంగ మహాసౌధం నేడు అచంచలంగావున్నదంటే, యీసంస్థానాధీశులనే స్థంభాలే కొంతవరకు కారణంఅంటే అతిశయోక్తిగాదు.

ఆంగ్లేయప్రభుత్వంయొక్క అధికారానికి లోబడియున్న యీసంస్థానాధీశులు, యీసంస్థానాధీశులచే పాలింపబడేప్రజలు—బయటిప్రపంచంతో ఏవిధమైనసంబంధమూలేకుండా, రాజకీయంగా ఏవిధమైన వాక్బలం లేకుండా, ప్రాథమికస్వత్వాలైనా పూర్తిగా అనుభవించకుండా, సంస్థానాధీశుల దయాధర్మబిచ్చంలో, వారి

పటేల్ కుమార్తె శ్రీమతి మణిబెన్ పటేలుగారు మొదలైన నారీమణులుకూడా అరెస్టయినారు. ఖయిదీల్ల దుర్భరజీవనం మితిమీరిపోయింది.

ఇదంతాచూచి మహాత్ముడు, ఠాకూరుసాహేబు తాను అన్నమాట నిలుపుకోనందుకు ప్రాయోపవేశం ప్రారంభించాడు. యీవార్త భారతదేశంఅంతా వ్యాపించి అట్టుడికినట్టు ఉడికిపోయింది. బ్రిటిషు గవర్నమెంటు గడగడలాడింది. ఆనాల్గురోజుల్లోనూ ప్రపంచం నాల్గుమూలలా కదిలిపోయింది. పర్యటనంలో వున్న వైస్రాయి డిల్లీ చేరుకున్నాడు. ఏమిజరిగిందో ఏమో, ఠాకూరుసాహేబు, బ్రిటిషు రెసిడెంటు అందరు మహాత్ముని ముందు మోకరించి ఇదివరలో జరిగిన షరతులకేమీ భంగంలేదన్నారు. యీ విషయంలో ఏమైనా తేడావచ్చిన ఫెడరల్ ఛీఫుజడ్జి మధ్యవర్తిత్వంతో పరిష్కారంచేసుకోవచ్చునన్నారు.

నూరుగంటల కఠోరతపస్సు తర్వాత భారతదేశంలోని సుమారు 11 కోట్ల సంస్థానప్రజాబాహుళ్యపు యొక్క క్షేమాన్ని, తద్వారా 36 కోట్ల భారతీయులక్షేమాన్ని కాంక్షించి ఫలసిద్ధిపొందాడు మహాత్ముడు.

వైస్రాయి లిన్‌లిత్‌గోప్రభువు మహాత్ముడు సంప్రదించారు ముఖ్యమైన భారతీయసమస్యలనుగురించి. ఫెడరల్ కోర్టులో పటేలుగారితో జరిగిన ఒడంబడిక ప్రకారము ఠాకూరుసాహేబు చేయవలసినదాని తీర్పుచెప్పారు. తీరా ఏడుగురు ప్రతినిధులను ఏర్పాటుచేసి ఠాకూరుసాహేబుకు పంపుసమయంలో మళ్లీ వచ్చింది రచ్చ.

భారతజాతీయ పోరాటానికి సైంధవుడులా అడ్డొస్తూవుంటుంది యీ హిందూమహమ్మదీయ సమస్య. రాజకోటలోవున్న అల్పసంఖ్యాకులు ముస్లిములు, భూస్వాములు ఆ ఏడుగురు సభ్యులలోనూ ప్రాతినిధ్యంలో రారు. కాని గాంధీగారితో సంప్రదింపులు విఫలమైనాయి. రాజకోటయందు సత్యాగ్రహసమరము జరుగుచున్నప్పుడు యీ ముస్లిములు, భూస్వాములు ఏమయ్యారు? రంధివచ్చినప్పుడు సందులూను, విందువచ్చినప్పుడు పొందులూనా వీరికి?

వీరి ప్రాధాన్యంలేకుండా మహాత్ముడు 7గురు సభ్యులపేర్లు ఠాకూరుసాహేబుకు పంపివేసినాడు...

ఠాకూరుసాహేబు మహాత్ముడు పంపిన పేర్లప్రకారం సంస్కరణల కమిటీని ఏర్పరిస్తే రాజకోట భారత సంస్థానాల్లో మకుటమాతుంది. మళ్లీ భేదోపాయాల్ని పన్ని యీపేర్లను తిరస్కరిస్తాడా దేశం మరల అశాంతినిలయమైన ఒకభీషణ సంగ్రామాన్ని ఎదుర్కోవలసి వస్తుంది.

రాజకోట పోరాటమందు సాంకేతికమైనది ఒక్కరాజకోటవిషయంకాదు; అది సంస్థానాధీశ్వరులకు, బ్రిటిషు ప్రభుత్వానికి, ప్రజలకు మధ్యవున్న మహత్తరస్వాతంత్రసమస్య...

భారత భాగ్యవిధాత, భారతస్వాతంత్ర విజయసారధి, నిర్మకుటభారత చక్రవర్తి మహాత్ముడు తలిస్తే ఏదికాదు?

—శ్రీ ఏడిద కామేశ్వరరావు



# దుర్వ్యాడుకలు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

జేష్టమాసారంభం. గ్రీష్మఋతువు. ఆకల్లాడదు. ఎండవేడికితోడు తాపం జాస్తి. అప్పుడప్పుడు ఉరుములు మెరుపులుతో ఫెళఫెళార్భాటాలతో గాలి వానకూడా వస్తుంటాయి. ద్వంద ప్రకృతి పరిస్థితులుగల కాలమా జేష్ఠాషాఢమాసములే.

అట్టి రెండు శోభలుగల కాలమువలెనే భానుమతి ఇంటిస్థితులుకూడా ద్వందంగానే వున్నాయి. ఒకవంక కలకల్లాడే సంపత్తి, మరొకవంక హృదయాన్ని విదారించి బద్దలుకొట్టేభర్త దుర్నడవడి. ఎంత దుర్మార్గుడైనా సంతానంమీద ప్రేమేనావుంటుంది. కాని తాగుబోతువానికి మాత్రం ప్రేమ, హృదయం శూన్యమే అంటే మానవత్వాన్ని పోగొట్టే రాక్షసశక్తి పానంలోవుంది. అందుచేత సమయావకాశాన్న చూచుకొని మంచిగా బోధించడానికైనా భర్తదగ్గిర భానుకు అవకాశం లేదన్నమాట.

ఒకమూల పెళ్లికి లీల ఎదుగుతూంది. ముసలత్తగారు కొంపముంచేసే శారదాబిల్లు బిగుస్తూంది, త్వరగా తాను చావకుండాను కులంలో వెలికాకుండా, మనవరాలికి ముడిపెట్టేయమని కోడలిదగ్గిర గోలపెడుతూంది. వరశుల్కపిశాచదాడికి తాళుకోలేక సంసారాలు చితికిచింతకాయ పచ్చడిలా అవుతున్నాయి. అల్లా అవడానికి వప్పుకుంటేనే కాని మంచి సంబంధాలు వచ్చుటేలేదు.

తాగుబోతుమగడికీసంసారఘట్టాల సంగతే అక్కర్లేదు. ఎంతసేపూ పేకాట తాగుడు, స్త్రీలోలత, ఇంట్లో ఏదిదొరికితే అది అంకించుకొని పట్టుకుపోయి అమ్మి తగలేసి తన అలవాట్లు తీర్చుకోవడంతప్ప మారు ప్రసంగములేదు. అట్టివాడికి కూతురెదుగుతే ఏమి, పెళ్లిచేయకపోతే ఏమి? ఏదీ అంటడు, పైగా మితంతప్పినప్పుడింట్లో అందరికి ప్రహారాలుకూడాను.

ఒక్కభానుమతి ఇన్ని దినచర్యలలో కాలఘట్టాలని ఎదుర్కుంటూ విద్యావతి, సహనశీల, వివేకవతి గాబట్టి అందరిని సమాధానపరుస్తూ, బిడ్డలకారోగ్య విద్యాశిక్షణనిస్తూ, నిప్పుతొక్కిన కోతిలాంటి భర్తని రెచ్చగొట్టక కాలక్షేపంచేస్తూవుంది. కాని అల్లునెట్లు తేగలదు? అత్తగారి నిత్యపోరెట్లు మాన్పించగలదు? ఇంట్లో బాధ్యులు, పెద్దవాళ్లు శుద్ధమూర్ఖులై పాత ఆచారాలనే పట్టుకు ప్రాకులాడి బాధిస్తూంటే మాటలతోను ఉపన్యాసాలతోను సంఘపరిస్థితులు మారవు, బాగుపడవు. ముందర మూర్ఖులను దిద్దాలంటే భర్తృహారి సుభాషితంలో చెప్పినట్లు బ్రహ్మకే వశంకాదు. ప్రపంచకమంతా సృష్టించినకర్త మూర్ఖులమనసు మార్చ

డానికే ఉపాయం ఉందని ఇంకా ఆలోచిస్తూనేయున్నాట్ట. ఇంక మనమేంచేయం?

౨

తప్పతాగి తూలిపడుతూ వచ్చాడింటికి ప్రసాదరావు. వస్తూదారిలో ఆడుకుంటున్న చంటిపిల్లను తొక్కేశాడు. పిల్ల కెవ్వుమంది. దానితో ఇంట్లో గొల్లుమన్నారు. తల్లి కంయ్యిమని చీపురుకట్టతో చావకొట్టింది చెట్టంత కొడుకుని. దిక్కుమాలాడా, కడుపుని చెడపుట్టావురా, కన్నపిల్లని కాలితోతొక్కి చంపేశావురా అని కాళిశక్తిలా అర్చేసింది. ఇన్ని గడబిడలూకూడా ప్రసాదరావు మత్తు కళ్లను విప్పలేదు. మత్తులో ఓమూల క్రింద పడి తప్పతప్పమాటలతో లేస్తూపడుతూ దొర్లుతున్నాడు. భాను చచ్చినబిడ్డను ఒళ్లో పెట్టుకుని భరింపరాని గర్భదుఃఖంలోకుమలి ఏడుస్తూఉంది. బిడ్డా, తెలియనిభర్తచే చంపబడింది. వీధినిపడితే పోలీసులదాకా తెలిసి మొగుడ్ని అరెస్టుచేస్తారు. తెలియని తప్పిదానికి తెలిసి అనుభవించే పురాకృత కర్మల కెవరు బాధ్యులని దుఃఖం అణచుకొన్నా పొంగిపొరలివచ్చే గర్భశోకాన్ని ఆపుకోలేకుండా వుంది. చంటిచెల్లెలి శవాన్ని చుట్టుముట్టి మిగిలిన నలుగురు పిల్లలు దొర్లిదొర్లి ఏడుస్తున్నారు. ఇల్లు మహా భీభత్సంగాయుంది. ఎంతదాచుకొన్నా, ఇంత గడబిడ పొరుగిళ్ల వాళ్లకైనా తెలియదా?

అసలే భానుమతివంటి మంచి ఇల్లాలికి దుర్మార్గపు భర్తచే అగచాట్లని ఆవిడ నుద్ధరించాలని తలచే పొరుగింటి మంచివాళ్లు ఇదే ప్రసాదానికి బుద్ధివచ్చే అవకాశమని తలచి పోలీసులకు రిపోర్టుచేసారు. తక్షణం సబినస్పెక్టరుగారు కానిస్టేబిల్సుతో సిద్ధమైనాడు. రిపోర్టుకాగితం చూపించి మేజిస్ట్రేటిచ్చిన అరెస్టు పత్రంతో ప్రసాదరావు చేతికి బేడీవేశారు. ఆయనలోపంకాదు, తెలివిలేక చేసినపనని భానుమతి ప్రార్థించింది. అన్నీ కేసు, సాక్ష్యాలతో రుజువుకావాలని చెప్పి బలవంతాన్ని ప్రసాదరావుని లేవదీసి కూచోపెట్టి 'స్టేషనుకి నడు' అని పెద్దగా గర్జించాడు ఇనస్పెక్టరు. అప్పటికి పూర్తిగా మత్తువదిలింది, కళ్లువిప్పబడ్డాయి, కారణం తెలుసుకున్నాడు. కన్నకూతురి శవాన్ని కాళ్లముందర పడేసింది తల్లి. దీంతో పూర్తిగా కళ్లు, హృదయంకూడా విప్పబడ్డాయి. రాక్షసత్వాన్ని తొక్కేసి సహజమానవత్వం బయటబడింది. కాని ఏంచేస్తాడు? చేతులు కాలిపోయాయి. మాయతాగుడు మరిగి మంచిగా భార్యనాదరించి మెరగడు; తల్లిని 'అమ్మా'అని పిలిచి మాటాడెరుగడు; మహత్తర తీపైన కడుపుతీపి బిడ్డలందు చూపించి ఎరుగడు. ఒక్కనాడైనా ఒక్కలీలను కాని ఒక్కగోపాలుని కాని రామాన్నికాని ఆఖరికి ఆడుకుంటూ అల్లారుముద్దుగా లాలింపబడే ఆఖరి పిల్లలనైనా లాలించి ముద్దెట్టుకెరుగడు, తలిదండ్రులిద్దరు సమానప్రేమామృత దోహదమిస్తేనే కాని సంతాన మొలకలు పెరుగవు. ఆ మొలకలు తల్లి లాలింపేకాని తండ్రిప్రేమ వృష్టిమెరుగవు.

పితాదేవుని ఆదరణాదృష్టి చూచే మాతా దేవి ఆనందిస్తుంది. అట్టి ఆనందము భాను మతీదేవికి కలుగనేలేదు. అయినా ఆమహా తల్లి ఎల్లప్పుడు మగనిక్షేమంకోరుట, పతి నడవడి చక్కబర్చమని భగవంతుని ప్రార్థించుటే కాని మనసులోనైనా అనుకుని కాని, ఇతరులకు చెప్పుకొని కాని ఎరుగదు. అంతటి సహనశీలనే ఇంతగా దుఃఖపెట్టి పరీక్షిస్తున్నాడు భగవంతుడు! భక్తుల కనవరతము పరీక్షలేకాని భగవదనుగ్రహము త్వరలో కలుగదు. నిజమైన భక్తుడిన్నిటికి తట్టుకొని నిలచియే అంతమున ఐక్యమవుతాడు.

3

భానుమతి భర్తను ఠాణాకుతీసుకుపోయారు. ఇరుగుపొరుగువారు చంటిపిల్ల శవాన్ని బలవంతాన్ని భానుమతి ఒడిలో నుండితీసి, పనికిరాని వస్తువుని పట్టుకుని ప్రాకులాడి లాభంలేదని స్మశానవైరాగ్యబోధ నలుచేసి, అంత్యక్రియలు చేయుటకు తీసుకుపోయారు. ఇక్కడికి రెండుఘట్టాలు సమాప్తమయ్యాయి, దుఃఖంపూర్తిఅయింది, ఉన్న పిల్లల్నిచూసుకో అమ్మాఅని ఊరార్చారు ఇరుగుపొరుగు బంధువులుకూడాను. 'పోరు నష్టం పొందులాభం' అన్నారు' ముసలమ్మగారూ ఇంట్లో మీదీ పోరేకదా? ఆఅమాయిక సాధ్వికి పిల్ల పెళ్లోపెళ్లోయని ఏకపోరే. మీదే తగిలింది కుటుంబానికని కొందరు నవీనయువకులు కోపపడ్డారు.

కోర్టులో సాక్ష్యసంపన్నాలు, అవి, ఇవి అయ్యాయి. త్రాగుబోతని ప్రపంచక వినికిడే గాన తనవలన జరిగినపని (బిడ్డమృతి)తాగిన మత్తులో తెలియకచేసినది కాని బుద్ధి పూర్వకంకాదని ఋజువగుటచేత కేసు కొట్టేశారు గాని, ఇంతటినుండి తాగినావని తెలిస్తే శిక్షిస్తామని తీర్పుజెప్పి త్రాగి అల్లరి జేసిన నేరం క్రింద 50 రూ. జుల్మానా విధించి ప్రసాదాన్ని యింటికిపంపేశారు. గ్రుడ్డిలో మెల్లలాగ బిడ్డ దుఃఖముతీరందైనా మగనికి శిక్షలేకుండాను ముఖ్యంగా పశ్చాత్తాపం కలిగినందుకు భాను అత్యంతసంతోషంపొందింది. పరమాత్మునిఅనంతవిధుల సన్నుతించింది.

ఇక మిగిలింది పిల్లపెళ్లిపోరు. అది అత్తగారిచావుతోకాని పోదు. కాని, ముసలాళ్లు అన్నీ సాధిస్తేనేకాని పోరు. సంఘాని కుపయోగించేవాళ్లిట్లే మృత్యుకళాదంష్ట్రిలలో నలిగిపోతారు. ప్రకృతి కాలానుగుణ్యంగా మారుతుంది. వసంతానికి శోభిస్తుంది, శిశిరానికి మోడవుతుంది, గ్రీష్మానికి ఎండుతుంది, వర్షానికి నవనవశక్తితో కలకల్లాడుతూంటుంది. దానినుంచి పుట్టిన భూతజాలము కూడా శరీరమార్పులు పొందుతుంటాయి. ఇది సృష్టి సహజం.

ముసలావిడ నిత్యపోరు కాగలేక, మూడు వేలింటిమీద తణఖాపెట్టి తెచ్చి, బి.ఎ., ప్యాసయి నిరుద్యోగంలో కొట్టుకొంటున్నా, కట్నాలావేశంలో మునిగున్న ముక్కాల కామయ్యగారి కొడుకు మాధరావు కిచ్చి లీలను ముడెట్టారు. లాంఛనాలని, అలకలని, మరి ఐదువందలు లాగారు. అప్పు

చేసైనా ఐదురోజులు పెళ్లి చేయించింది బామ్మ. అన్ని మంగళప్రదంగా జరిగాయి. కూతురు చావుతోను, తన కేసుతోను, అప్పులవాళ్ల అలజడితోను, నిజమైన మానసికవర్తనం జరిగి, ప్రమాణంగా భార్యయెదుట శఫదంచేసి, త్రాగుడు దుర్వ్యసనం మాని బాగుపడ్డాడు ప్రసాదరావు. అయితే పూర్తివిద్య లేనందున, ఆర్జించే శక్తిలేకను, ఆస్తంతా అప్పులక్రింద పోవుటచేతను, చరాస్థిలో ఒక్కొక్కటి అమ్ముకుని కుటుంబం పోషించుకుంటున్నారు. ఇంతటి దీనావస్థకు, మూర్ఖం వదలని పెద్దవాళ్లే కారకులు. ఇట్టి స్థితిలోను, పండుగలకు అల్లుని తీసుకురావాలని, జరీచాపు లెట్టాలని పట్టుపట్టి చేయిస్తుంది.

క్రమంగా సంసారం చితకడం, తన బాల్యవివాహం, ఒడలెరుగని పెద్దల ఆచారపు ఖర్చులు, కట్నాల ఆశ అని తెలుసుకుని లీల విచారించింది. బి.ఎ ప్యాసైనభర్త అవివేకుడు కాజాలడని యోచించింది. తలిదండ్రుల ఆధీనములో వున్నందున స్వతంత్రబుద్ధి ఉపయోగించలేదు కాని, జ్ఞానప్రకాశమున్న యువకుడే అని గ్రహించి, సాహసించి విపులంగా తమవారి స్థితి తెల్పుచు వుత్తరం వ్రాసింది. అయాచితంగా వచ్చిన ఉత్తరం చదువుకొని ఆశ్చర్యానందాలు పొందాడు మాధరావు. సర్వము తెలిసిన వివేకవంతుడు. తనతండ్రి పట్టుచే, ప్రాతాచారం పాటించి, శుభకార్యం జరిపించాలంటే, అసలే తమవలన చితికిన అత్తవారి నింకా వీధిని బడవేయ్యడమవునని ఆలోచించాడు. ధైర్యం వహించాడు. తానుద్యోగమో వ్యాపారమో చేస్తేనేకాని, కార్యం చేసుకోనని నిర్భయంగాను, వినయంగాను, తండ్రికి చెప్పాడు. నాల్గువందలు బుచ్చుకొని, ఉద్యోగం ప్రయత్నాలని తలిదండ్రులకు వప్ప చెప్పి బయల్దేరి, అత్తవారింటికి వచ్చాడు.

ఎంతో హడావుడిపడితేనేగాని రాని అల్లుడకస్మాత్తుగా వచ్చేసరి కత్తగారు హడలిపోయింది కాని, అల్లుని అనునయింపులు, ఆప్యాయనము, మాటలుచూచి, సందర్భం మారిందికదా యని లీలాభానులు సంతోషించారు. మామగారిప్పుడే బిడ్డతీపి, జామాతప్రేమ, తెలుసుకున్నాడు. మర్యాద చేశాడు. మంచిమాటాడాడు. లీల భర్తకు సమస్త సదుపాయాలుచేసి గౌరవిస్తోంది. అత్తవారి కలిమిలేములతో సంబంధం లేకుండా తిని, అలిగి అధార్టీను చేయించుకునేమాదిరి కాకుండా మాధవరావు ఇష్టగోష్టి, కష్టసుఖాలు మాట్లాడుకుంటూ సంసారాలని తమమట్టుకు దెచ్చే సాంఘికకష్టాలు తొలగించే ఏర్పాట్లు చట్టరూపంగా చేయించి, సంఘం మార్పులు త్వరలో చేయించే శాసనసభ్యత్వమో, ఏదో దేశసేవలో నిమగ్నుడనై, సాంఘికపీడలను తొలగించనిదే, స్వపోషణవిషయమై పాటుపడనని, దేశమాతసాక్షిగా అత్తమామలయెదుట ప్రమాణంచేసి, సంఘోద్ధరణ, సంఘమంటూ తనబోటి కొందరు యువకులను ప్రోగుచేసి గ్రామాగ్రామాలు తిరిగి,



రామగోపాల్ పిక్చర్సువారి 'పాశుపతాస్త్రం'లోని
ఊర్వశి, తిలోత్తమ



జయాఫిలిమ్సువారి 'మహానంద'లో
శ్రీమతి కృష్ణవేణి



శ్రీ నెట్టెమి వెంకటలక్ష్మీబాయమ్మగారు

ఇటీవల విశాఖపట్నంజిల్లా ఎలమంచిలిగ్రామమున, శ్రీ సద్గురు మళయాళస్వాములవారి యాజమాన్యమున, శ్రీ సనాతనజ్ఞాన మహాసభ సందర్భమున జరిగిన స్త్రీల ప్రత్యేకసమావేశములకు అధ్యక్షతవహించిరి. వీరిచే బరంపురం(గంజాంజిల్లా)యందు స్త్రీలకొరకు ఒక ఆశ్రమమును, బందరులో స్త్రీలకొరకు ఒక ఆశ్రమును నిర్మింపబడినవి. వీరు స్త్రీలోకమందు ఆధ్యాత్మికాభివృద్ధికి సర్వవిధముల పాటుబడుచున్నారు.





కీ॥ శే॥ సత్యవతీదేవి

శ్రీ రామ వీరబ్రహ్మకవిగారి జ్యేష్ఠపుత్రిక.

రామాయణాది సద్గ్రంథములపఠించి, తనతోడి స్త్రీలకుబోధించుచు, ప్రతిశుక్రవారము భజనలు నేయుచు జీవితయాత్రగడిపిన భక్తురాలు. అట్టి యీమె గత జనవరిమాసములో తన 25 వ యేట స్వర్గస్తురాలయ్యెను. పరమేశ్వరుడీమె యాత్మకు శాంతి నొసగుగాక!



బోధిస్తూ పాటుబడుటకు నిర్ణయించాడు. లీల హృదయానందము వర్ణింపలేము.

మాధవునికి అత్యవసరంగా కావలసిన చట్టనిరూపణ పాంశాలు. (1) మద్యపాననిషేధము, (2) నిర్బంధిత మూర్ఖపు ప్రాతాచారములు, (3) బిగింపులేని చట్టరూపక బాల్యవివాహనిషేధము లందరిచే ఆచరింపచేయు గట్టి ఏర్పాట్లు, (4) కన్యాశుల్క వరశుల్క పిశాచహరణము, (5) మూఢ్యములను పోగొట్టి జ్ఞానోదయ వివేకాలనిచ్చే నిర్బంధ స్త్రీ విద్య, (6) మహిళామణుల సదవకాశ సదుద్యమాలను, విజ్ఞానబీజాలను, మానసిక శక్తివృద్ధులను, మాడ్చి మంట గల్పి, నిరాశ, దీనత్వము, అల్పత్వము, నీచత్వమును గల్గించి, గృహలక్ష్మికి గృహసౌఖ్యములు నీయని ఆర్థికదుస్థితులు లేకుండజేయు, వారసత్వపు సంపూర్ణ హక్కులు (7) గృహలక్ష్ముల సంసారవృక్షముల నిర్మూలించే వేరుపురుగులగు, వేశ్యా కులబోధ నిర్మూలము, నీతిబోధ, సంసారవంతులుగాజేయు నిర్బంధశాసనము, (8) పురుషుల బహుభార్యాత్వనిషేధము, (9) ప్రత్యేకంగా స్త్రీ పురుషులకు వేర్వేరు విద్యాలయనిర్మాణము, (10) అవినీతిగ్రంధ, పత్రికానిర్మూలనము. స్త్రీ జాతి నవమానించు వస్త్రవిహీన చిత్రలేఖననిర్మూలము, అతి బాల్యవయస్సుననే యువకత్వ మొందజేయు దృశ్యములగు సినీమా నాటకనిషేధములు, అమాయిక ప్రజలను మోసపుచ్చి అవినీతిని వృద్ధిచేయు ఔషధప్రకటనాదికములు మొదలగు సంఘపురుగులను, మొదలంట నాశనము చేయాలంటే, త్వరలో శాసననిర్మాణం కావాలనిపట్టుగా, దీక్షగా, కొన్ని విషయాలు ముందుగాతీసుకొని కార్యరంగాని కురికాడు. లీలా భానుమతులు చేదోడువాదోడుగా పనిచేయుటకు సంకల్పించారు. ప్రసాదరావు అల్లుని ఆదేశానుసారము బానిసోద్యోగము కన్న భారతాంబ నాశ్రయించి బ్రతుకు టుత్తమమని పరుల భూములు పాలికి తీసుకొని, వ్యవసాయం చేయించి కుటుంబము పోషించుచున్నాడు. గోపాలరాములు బుద్ధిగా చదువుకుంటున్నారు. లీల తన చిన్నచేతులతో లేసులల్లుచు దారపుకుట్టు, పూసలకుట్లతోను, చేతివిద్యలు వృద్ధిచేసుకుంటూవుంది. భానుమతి గృహిత్వమందినదగుటచేత, అత్తగార్కి భర్తగార్కి సేవ, పిల్లల పనులు, వంట వగైరాలు చేసుకుంటూ తీరికగా యున్నపుడే రాట్నమో, ఏ భాగవతమో కాలక్షేపంచేస్తూ, గుట్టుగా సంసారాన్ని వీధిని పడకుండా నడుపుకుంటూవుంది.

వాళ్ల అల్లుడు ధర్మమా అని ఆయన వేసిన ప్లానులోగిట్లు చట్టాలయాయంటే అందరం బ్రతుకుతాము. మూర్ఖపుపెద్దలు మారకపోయినా, సంఘం మారిందా అంటే క్రమంగా దేశదుఃఖం తీరిందన్నమాటే. వితంతువివాహోమోదమున్నదేగాని, నిర్బంధ

వైధవ్యాన్ని తొలగించకపోతే, భ్రూణ హత్యా శిశుహత్యాదోషాలు బాధ్యులు పొందుతారు బాలవితంతువివాహ ప్రబోధం. చేస్తానన్నాడు. మరీ అన్యాయంగా యుండే జూద, పాన, జారత్వాలనిర్మూలనం మొదలగువాటిని ముందుగా చట్టనిర్మాణం చేయాలని పట్టుగా పనిచేస్తానని తిరుగుచున్నాడు. భగవంతునిలీలా నటులగు మనస్వశక్తి గీర్వాణాలలో ఏమీలేదు. ఆయన బిడ్డలమైన మనం మనఅన్యాయాలని తొలగించి సౌఖ్య జీవితమిమ్మని మనతండ్రిని వేడుకుంటూ, పనిచేదామని తోడివారికి నచ్చచెప్పి ప్రబోధిస్తూ యూరూర సంచరిస్తున్నాడు. మంచి కార్యవాదికి భరతమాత దీవించి, అభయహస్తమిస్తుంది. లోకంమెచ్చి ఆశీర్వాదక్షతల నాతనిపై విసరుగాక!

# ఆంధ్రభోజుఁడు

దేవబ్రాహ్మణ మాన్యముల్ నిలిపి దిగ్దేశంబులన్ పౌరుష
శ్రీ వాల్లభ్యుడవై తురుష్క నృప విచ్ఛేదంబు గావింపగా
దైవాంశంబున బుట్టినాడవు కదా! ధాత్రీతలంబందునన్
దేవా! శ్రీకర! కృష్ణరాయ! పృథివీనేతా! నమస్కారముల్.

కృతులన్ గాంచితివెన్నియో భువిని, నంతేగాక ధీశక్తి స
త్కృతియున్ వ్రాసితి వాంధ్ర సత్కవులు తామెంతో నుతింపంగను
న్నుతిమై నొందితి 'వాంధ్రభోజు'డను విన్నాణంపు విఖ్యాతి, నీ
కితరుల్ రాజులు సాటిరారు గన, రాజేంద్రా! నమస్కారముల్.

'సమరంబందున నోడిపోవు టది యీ జన్మాన లే'దంచు గ
ర్వముతో తిమ్మరుసయ్యతో బలుకు గర్వస్ఫూర్తి మెవ్వానికుం
డు? మహిన్ రాజన నీకె జెల్లుసుమి! యీ లోకంబునన్ నిల్చినా
వు, మహాత్మా! కనకంపువర్ణముల సంపూజింప సత్పూరుషుల్.

—శ్రీ ఆకుండి వెంకటేశ్వరరావు.

# కాశీరమజిలీలు

శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాణమూర్తిగారు

## ఎచ్చటికని తెలుపుదును?

బస్సు చరచరసాగిపోవునపుడే గుండె దడదడలాడ దొడగినది. ఈ 'చరచర' ఎంతసేపునిలుచును? తెరువులో నెందైనదింపక, గమ్యస్థానమున సుఖముగా నిది చేర్చునని రాయిగ్రుద్దిచెప్పుటెట్లు? కాని, ఏమి ఘటిల్లినను ఒక అపూర్వానుభవము కొఱకేయని పదపడి యూహింపజాలితిని. ఈపర్యాయము జగదీశుడే బస్సును నడపుచున్నట్లు తోచినది ఎట్టియుపద్రవము కలుగలేదు. దేవుడు సారథియగుచో నాపదలెవరినిగాని మార్కొనగలుగునా?

లాహోరులోని ఢిల్లీగేటునకు అనతిదూరమున బస్సు ఆగినది. అప్పటికి అపరాహ్ణమున మూడు గంటలు కావచ్చెను. వెంటనే యొకటాంగా కుదుర్చుకొని బుడంకాయితోకూడ లజపతినగరమునకు పోతిని.

రావీనదీతీరమున తాత్కాలికముగా లజపతి నగరము నిర్మింపబడెననియు కాంగ్రెసు అందే సమావేశమయ్యెననియు, కాంగ్రెసు ప్రతినిధులకొఱకును, తక్కుంగలవారికొఱకును అందెన్నో డేరాలు వేయబడెననియు, రాజస్థానమునుండి నేనటచేరిననాడు రాజస్థానయువజనసంఘము వారిడేరాలో బసచేసితిననియు, పిదప తెలుగుసైదోడులనుజూచి వారి డేరాలో ప్రవేశించితిననియు, అందుండియే పొట్టిపిచికితో అమృతసరమునకు పోతిననియు జదువరులెఱుంగుదురు. టాంగానుండిదిగి, అనుచరునిగూడి డేరాలో ప్రవేశించితిని. అమృతసరవిశేషములను మిత్రులకు దెలిపితిని.

"రేపు మాఅమ్మతద్దినం. అవసరమైనవ్యవస్థను వెంటనే చేయవలెను. నాకు తోడ్పడెదరా?" అని డేరాలోని సోదరులనడిగితిని. నామాటలువిని వారు పకపకనవ్విరి. వేర్వేఱురీతుల పరిహాసములలోనికి దిగిరి. "ఇన్ని డిగ్రీలు సంపాదించి మీరింకా తద్దినపు పిచ్చిని వదల్చుకొనలేదా?" అని కొందఱును, "మీరు సంస్కరణాభిలాషు లనుకొన్నాము. మీ చదువు వ్యర్థమైనదని మఱికొందఱును, "తద్దినమును మూటగట్టుకొని కాంగ్రెసుకువచ్చుట సాహసమే యని" కొందఱును, "మేమందఱమూ బ్రాహ్మణులమే! భోజనాలవేళ నాలుగునూగింజలను మీద చల్లండి. సంభావనయిచ్చి ధన్యులుకం"డని మఱి కొందఱును, "మార్నింగుటిఫిను ముగిసినతర్వాత ఏలా వీలైతే ఆలా జరుపవచ్చు"నని కొందఱును ఎవరికి తోచినట్లు వారు నాకు సలహానిచ్చిరి. "వ్యవధిలేని సమయములో ప్రధానమైన పవిత్రకర్తవ్యమును నెఱపుటెట్లు దైవమా!"అని ఆతురంపడు నాకు వీరివచనములు ఆశాభంగమునుగలిగించినవి. విషయమును వారి ప్రోలనుల్లేఖించుట తప్పుయినదని గ్రహించితిని. దీనిని గుఱించి వారితో తర్కవితర్కములు సాగించుటకు నామనసొప్పలేదు. వెక్కిరింతలకును విషయవిమర్శనమునకును చుట్టఫుజూపులుండునా? నేనేమియు బదులుపలుకక డేరానుండి అవ్వలికిపోతిని. బుడంకాయి నావెంటవచ్చుచుండ వెన్కకులాగి మిత్రులు వానితో పరిహాసము లాడసాగిరి. ఏమియు బాలుపోక పోయి నదియొడ్డున గూర్చుంటిని. కొంతసేపటికి పొట్టిపిచికివచ్చి నన్నుగలిసికొనినాడు.

చిన్నిపసవయొకటి అపు డవ్వలికిపోవుచుండెను. లాహోరునుండి క్రొత్తగవచ్చినవారు కొందఱు అవ్వలి దృశ్యమునుచూచుటకై పోవుచున్నారని వారిప్రసంగమువలన గ్రహించితిని. "మనముకూడ పోవుదమా?" అని బుడంకాయి నన్నడిగినాడు. "పిదప పోవచ్చును. కాని రేపటిలెంతు జనుగువిధ మెద్దియో యిపుడు యోచింపవలెను. నీవు యీరాష్ట్రివానివే కదా! నీవెఱిగిన బ్రాహ్మణులెవ్వరును లేరా?" అని నేబలికితిని. మాఱేమియుపలుకక తలయూపి, పిచికిగాడు నిమిషములో నందుండి యెగిరిపోయినాడు.

సుమారు గంటదాటినది. ఇక నచిరములో ప్రొద్దు గ్రుంకును. బుడంకాయి యింకను తిరిగిరాలేదు. వీనిని నమ్మి నదియొద్దున వేచియుండుటతగదని లేచితిని. కాని కొంతదూరములో వాడు కనుపించినాడు. కావున మరల జతికిలపడితిని.

పిచికితో నొక నూతనవ్యక్తి వచ్చుచుండెను. వానినిచూడగనే నేనులికిపడితిని. నల్లని మీసముగడ్డముతో నొప్పుచున్నాడు. లాగు తొడిగినాడు. మోకాళ్ల నంటుకోటువానికాయమున నలరారుచున్నది. లంక గుమ్మడికాయకు అన్నగారనదగు బొజ్జ కోటునుధిక్కరించి ముందుల కుఱుకచున్నట్లున్నది. అతడు తురకవాడైయుండును. గుండె తల క్రిందులైనది. ప్రస్తుతకర్తవ్యమేది? ముసల్మాను సోదరుడేడ? బుడంకాయిప్రవర్తనము నంతరంగమున మిగుల గర్హించితిని, కాని వారిరువురు సమీపింపగనే నాయభిప్రాయమును మార్చుకొనవలసివచ్చెను. ఆ క్రొత్తవాని మొగమును చూచినతోడనే అందు కొన్ని గంధపురేక లగపడినవి. వాని చేతిలోనున్నటోపీ తురకటోపీ కాదు. "నమస్తే! పండిట్జీ!" అని యతడు నాప్రక్క జతికిలబడినాడు. బుడంకాయి కొంతదూరముపోయి,నదియొద్దున నెందులకో గంతులు వేయ దొడగినాడు. "మీదేయూర"ని ఆగంతువు నడిగితిని. "మాది మందసదగ్గతి యొకపల్లె. మేము కానుకుబ్జబ్రాహ్మణులము." అని యాతడనినాడు. మందసను నేనెఱుగుదును. అది సంయుక్తరాష్ట్రములలోనున్నది. అచటిస్టేషను చాగల్లుస్టేషనుకు తమ్మునివలెనుండును. "ఓహో! ఆలాగునా?" అని నేననుచుండ, "కాని, యిపుడు నేను లాహోరులో వసించుచున్నాను. ఒకఫర్మలో దర్వాన్ గానున్నాను." అని యాతడు పలికినాడు.

విషయము నాకబ్బురము గొలుపలేదు. హిందుస్థానీబ్రాహ్మణులు పల్వురు కలకత్తాలో దర్వానులుగాను, పోస్టుబంట్రోతులుగాను పనిచేయుచుండుట నేనెఱుగుదును. ఇట్లని వీరిని కొద్దిచూపుతో చూచుట తగదు. వీరు మంచిభక్తులు, కలకత్తాలోనుండగా వీరిలో కొందఱితో నాకు పరిచయముకలిగెను. ధర్మతలాకు సమీపమందలి ప్రిన్సెప్ వీధినుండి అచటికి రమారమి మూడుమైళ్లదూరములోనున్న చాంద్ పాల్ ఘట్టమునకు ఒక బంగాళీదాదానుగూడి స్నానార్థమై పోవునాడను. హిందూస్థానీయులును, మార్వాడీలును విశేషముగ బారాబజారులో వసించుచుందురు. వేర్వేఱుఫర్మలలో పనిచేయు హిందూస్థానీబ్రాహ్మణులు తెల్లవారుజామున నాలుగుగంటలకొక కేంద్రస్థానముగూడి అనుదినము ఆగంగాఘట్టమున కరుదెంచువారు. దాదాజీతోగూడ నేనచటికిపోవుసరికే వారు స్నానముముగించి వలయాకారముగనిలిచి ఆవేశముతో భజనచేయువారు. ఇతర యాత్రస్థలములకుపోవుతఱి వీరిలో కొందఱు నాకు తోడైరి. కావున వీరిని గలిసికొనుతరుణము పాఠకులకు మరలలభించును.

"మీరిక్కడ ఎంతకాలమునుండి యున్నారు?" అని నేనా యాగంతువు నడిగితిని.

"రెండేండ్లనుండి" అని యుత్తరమొసగి. "పాపము పోయినదెవరు? శవమెక్కడ?" అని అతడు ప్రశ్నించినాడు.

పొట్టిపిచికి ఆతనితో నేమిచెప్పియుండెనో యెఱుగను.

"అయ్యా! ఇపుడెవ్వరును మరణింపలేదు. నా పసితనమందే నాకన్నతల్లి మరణించినది. రేపు ఆమె స్వర్గస్థురాలైనదినము. తిథిపెట్టవలెను. అందుకై మీ సాయమును అపేక్షించుచుంటిని" అని నేబలికితిని.

"మీబంగాళీలు కొందఱు ఇందున్నారు. వారి నెఱుగుదును. వారికడకు మిమ్ము తీసికొనిపోదును. వారిమూలమున రేపటికర్తవ్యము సులభముగా జరుగవచ్చును. రండి" అని యాతడనినాడు.

నేను బంగాళీనని యీతడేలతలచెనో! నాఅదృష్టమో, దురదృష్టమో చెప్పలేను. ఉత్తర హిందూస్థానమున నీతడేకాదు మఱికొందఱు యిట్లే యపోహపడిరి. బంగాళీలద్వారా తద్దినముజరిగింపుడని యీతడనుచున్నాడు. వాస్తవముగా నుత్తరహిందూస్థానమందలి ఏబ్రాహ్మణులును మనలోజరుగు తద్దినపు తంతునకు పనికిరారు. వారు గౌడబ్రాహ్మణులు. భోక్తలుగా కూర్చుండుటకు పనికిరారు. వారి శ్రాద్ధమంత్రమునకును కొంత వ్యత్యాసమున్నది. కాని ప్రయాగలో కొందఱు హిందూస్థానీబ్రాహ్మణులు హరిజగన్నాథశాస్త్రిగారిని, వారికొడుకు గణేశశాస్త్రిగారిని ఆశ్రయించి కొంత తెలుగునేర్చుకొని తెలుగువారికి అక్కఱకైన మంత్రపుముక్కలను కొన్నిటిని ముక్కునబట్టి వేణీదానసమయమందును, అస్థికలను త్రివేణిలో గలుపునపుడును, గంగను కలశములలోనికి పట్టునపుడును, ముండనానంతరము కొంత తంతు జరుగునపుడును వానిని ప్రయోగించుచుందురు. పితృకార్యములలో, ప్రయాగలోవలె గయలోకూడ మన తెలుగుపండాలతోగూడి వీరు యాత్రికులనుండి డబ్బు పిండుచుందురు. తీర్థవిధికి వీరు పనికిరారని యెఱుగుదును. కాని నదీతీరమున పూర్వోక్తక్షేత్రములందువలె గొంత శ్రాద్ధవిధిని జరుపుటకు వీరు పనికివత్తురనియెఱిగియే, గత్యంతరములేక లాహోరులో వీరికై వెదుకులాడవలసివచ్చెను. ఇప్పటియాగంతువు బంగాళీల పేరెత్తుచున్నాడు. బంగాళీలు నాకు సన్నిహితులే! కాని భోజనాదులవిషయములో వీరి నూఱుయోజనముల దూరమందుండుటే మేలు. అనుదినము మనకు పప్పు ఎట్లవసరమో చేప వారికట్లవసరము. అపుడపుడు వారు మాంసమును మెక్కుచుందురు. స్నానమునకువలె వంటకుగూడ వారు ఆవనూనెనే వాడుదురు. "చింగిడీమాచో" అను నొకవిధమైనచేపను ఆవనూనెలో వేసి వారు వేయించుచుండ, వందలకొలది మైళ్లదూరములో వసించు దాక్షిణాత్యులు ఉక్కిరిబిక్కిరి కావలసినదే! తద్దినము జరుపవలసిన దీ మహాశయులతోడ్పాటుతోడనా?

ఆయాగంతువు మాటలువిని నవ్వుకొని "అయ్యా! నేను బంగాళీవాడనుగాను. దక్షిణదేశస్థుడను. మా దేశపువారి నెవరైన మీరిచట నెఱుగుదురా?" అని నేనంటిని.

"నేనెఱుగను. కాని మాల్ రోడ్డులోనున్న ఒక ఫర్మ్‌లో ఒక అయ్యరున్నాడు. అతనిబస యెందున్నదో యెఱుగను. రేపే తిథియనుచున్నారు. ఇపు డాతనిని కలిసికొనుట సాధ్యముకాదు. కానీ నాకొకయూహ తట్టుచున్నది. అనార్కలీకి సమీపమున సత్యనారాయణమందిర మొకటియున్నది. అచట నేనెఱిగినబ్రాహ్మణులు కొందఱున్నారు. మిమ్మచటికి గొంపోవుదును. రండు." అని ఆతడనినాడు.

"మంచిది. తమకు శ్రమకలిగించుచున్నందులకు మన్నించండి" అని నేను లేచితిని.

అనార్కలీ అచటికి చాలదూరముననున్నదని యెఱుగుదును. బుడంకాయినుపిలిచి, ఒక టాంగాను రప్పించితిని. ముగ్గురము అందుగూర్చుంటిమి. లజపతినగరమున జనసమూహమధికముగా నుండుటచే టాంగా మెల్లగా పోవలసివచ్చినది. అప్పటికప్పుడే ప్రొద్దుగ్రుంకినది. ఇక గమ్యస్థానము చేరుటెప్పుడు? బ్రాహ్మణులను గలసికొనుటెప్పుడు? "తద్దినమెట్లు

జరుగునో దైవమా ! దివంగతయైన కన్నతల్లిపట్ల విద్యుక్తముగ నేను నిర్వహింపవలసిన పవిత్రకర్తవ్యమున కెట్టి భంగపాటువచ్చునో ఈశ్వరా !" నాలోనేను మిగుల దొట్రుపడదొడగితిని. దక్షిణదేశమునుగుఱించి ఆగంతువు నన్నే మేమో ప్రశ్నింపసాగినాడు. ఆతని మాటలు నాచెవిబడలేదు. "ఎయ్ గంగారామ్‌కా ధర్మశాల్ హై ! గంగారామ్‌జీ బడేఆద్మీ థే !" ("ఇది గంగారాముని ధర్మశాల, గంగారాముడు గొప్పవాడైయుండెను") అని బుడంకాయి అఱువసాగినాడు.

కొంతసేపటికి మేము సత్యనారాయణమందిరమును సమీపించితిమి. బండిదిగితిమి. బండివానికి డబ్బులిచ్చులోపున మందిరమునుండి యేవో కేకలు వినవచ్చినందున నాదిక్కుగజూచితిని. బండివాడు హిందూస్థానీయుడే! లోనికిపోయి వెంటనే పకపక నవ్వుచు తిరిగివచ్చి "దేఖియే మజా !" ("చూడండి మజా !" అనినాడు. తోడనే మేము మువ్వురము మందిరాంగణమున బ్రవేశించితిమి. కొందఱు బ్రాహ్మణులందు దొమ్మియుద్ధమునకు డీకొనిరి. ఒకస్థూలకాయుడు నేలపై వెలికిలపడి వగర్చుచు, హిందీభాషావైచిత్రి యుట్టిపడునట్లు ఎదుటివారిని దూషించుచున్నాడు. ఎఱ్ఱనిమనిషి మఱింతకందిపోయినాడు. వానినిచూచినపుడు నవ్వును నేడ్పునుగూడ రాదొడగినవి. మాతోవచ్చిన గడ్డపుబ్రాహ్మణుడు వానిని భూతములనుండి లేవదీయుటకై విశ్వప్రయత్నము చేసినాడు. బలిష్ఠకాయుడేయైనను వానికది సాధ్యము కాలేదు. నేలమీది స్థూలకాయునకు లేవవలెనను తలంపే లేనట్లుతోచెను. తక్కిన యోధప్రవరులు అఱచుచు, కూలుచు, లేచుచు కురుక్షేత్రయుద్ధమును ప్రదర్శించుచున్నారు. "ఠండారహియే ! ఠండారహియే !" ("శాంతిల్లుము ! శాంతిల్లుడు !") అని మేమఱువసాగితిమి. క్రొత్తయుత్సాహముతో బుడంకాయి భీమకాయులైన ఆయోధులనడుమ బ్రవేశించి, యుద్ధమున పాల్గొనదొడగినాడు. సమర మింతలో ముగియునట్లు తోచలేదు. గడ్డపుబ్రాహ్మణుడు తన్నుదానుమఱచి దొమ్మిలో ప్రవేశించినాడు. తద్దినము జరుగవలసినది యీమహాపురుషుల యధ్వర్యమున! "తెంపలువాయించుకొను"మని నాయంతరాత్మ నన్ను త్వరపెట్టదొడగినది. ఎంతపిలచినను ఆబ్రాహ్మణుడు యుద్ధరంగమునుండి కదలిరాలేదు. ఇంతలో విధిగుమ్మమునుండి బండివాడు "బాబూసాబ్! భాడాదీజియే !" ("అయ్యా ! అద్దెయివ్వండి") అని కేకలు వేయసాగినాడు. నాతల గిఱ్ఱున దిరుగజొచ్చినది. జబ్బపట్టుకొని బుడంకాయి నీవలికిలాగి అందుండి యవ్వలికరిగి, వీధిబడి, బండిలో కూలబడితిని. పిచికిగాడు బండివానిపొంత గంభీరవదనుడై ఉపవిష్టుడైనాడు. "బండిపోనిమ్ము !" అని అఱచితిని. గుఱ్ఱమునుతోలుచు, బండివాడు "కహాజాయింగే బాబూసాబ్ !" ("ఎక్కడికిపోదురు అయ్యా !") అని యడిగినాడు.

"ఎచ్చటికి"కని తెలుపుదును?



# విద్యాదోషమా - వివేకలేశమా?

శ్రీమతి ఎల్లాయి సుబ్బాయమ్మగారు

'నరసా! నీ తండ్రిగారు స్వర్గస్థులైనది మొదలు నానా కడగళ్లూ పడుతున్నాం. మన భవిష్యత్తు గాఢాంధకారంగా తోస్తోంది. తిన్నది అరగడంలేదు. కన్ను మూతపడ్డంలేదు. నీకు జ్ఞానంరాకముందు పెళ్లిచేయడమే పొరపాటు. నేనుమాత్రం ఐదోయేట మీనాన్నకు అమ్ముడుబడ లేదూ? అతనితో కాపురం చేయలేదా? నేనడిగినదానికి జబాబు చెప్పకుండా నా మానసికవ్యథ పెంచుతావేమే? చదువు కున్నందు కీలాగు కన్నతల్లిని దుఃఖ పెట్టడమేమిటమ్మా?' అని ప్రశ్నించింది సుబ్బమ్మ. వార్తాపత్రిక చదువుకుంటూ వున్న నరస విసుక్కుంటూ 'రోజూ నా కిదో న్యూసెన్సు. నాతత్వం ఆతని తత్వం కేవలం భిన్నమైవున్నాయి. నువ్వు నన్నెంత బలవంతపెట్టినా నేనతనితో కాపురం చేయ లేను'. అని బదులుచెప్పి పత్రికాపఠనంలో నిమగ్నురాలైంది.

సుబ్బమ్మ ఎంతో పెద్దదికాదు. తన చిన్నతనంలోనే మూడోపెళ్లివానికిచ్చి తన తండ్రి వివాహం కావించాడు. వైధవ్యం నడివయసులోనే ప్రాప్తించినందు కామె చాల విచారిస్తోంది. తనవలెకాకుండా తన కుమార్తెకు బాగా చదువు చెప్పించి యుక్త వయస్సు వచ్చినతరువాత యోగ్యుడైన వరుణ్ణి తెద్దామని ఉబలాటపడుతూవుండేది. భర్త బ్రతికివున్నప్పుడు యీ వివాహం బల వంతంగా చేశాడు. ఈశ్వరు డామెవుద్దేశానికి విరుద్ధంగా తిరగడంచాత, చేసుకున్న అల్లుణ్ణి మానుకోలేక, సంఘనియమాల నుల్లంఘించ డం దూష్యమని యెంచి ఆమె కూతురికెన్నో బోధపరుస్తోంది కాపురానికి వెళ్లమని. వరుడు నిరక్షరకుక్షియైనా రూపసి, నాల్గు రాళ్లు సంపాదించి నిల్వచేశాడు. మామ గారి మరణానంతరం ఆతని కుటుంబాని కెన్నోవిధాల సహాయపడుతున్నాడు. భార్య రుచులకు అనుగుణ్యంగా కావలసిన కోర్కె లన్నీ తీరుస్తూ ఏవిధంగానైనా నరసను తన వైపు త్రిప్పుకొనే ప్రయత్నాలు చేస్తున్నాడు. 'రుచులు భిన్నమైతే కాపురాలు మాను కుంటారుటే తల్లీ! నీకు చదువు చెప్పించడం వలన ఇదా ఫలం? నీమగడెందులో తక్కువ వాడు?' అని అడిగింది సుబ్బమ్మ.

'నేను కాపురానికి వెళ్లను. ఇంగ్లీషులోనూ తెలుగులోనూ చెబుతున్నాను. మగాడికి బానిసనైవుండాలని నావుద్దేశం కాదు'. అని తన నిశ్చితాభిప్రాయంతేల్చింది నరస.

లోకంలో వివాహితలందరూ బానిసలు అనే నరస సిద్ధాన్తం. రాణి, దాసి, సాధారణ సంసారి అందఱూ పెళ్లాడగానే దాసీలౌతారు. పెళ్లాడి స్త్రీ తన స్వాతంత్ర్యం పోగొట్టుకుంటుంది. మగాళ్లకు సేవచేయడంలో రవంత కొదువకనబడితే ఎంతటి విద్యావతియైన పెళ్లామైనా చీవాట్లుతినక తప్పదు. బంధువులూ, అతిథులూ, స్నేహితులూ చూస్తూవుండగా భర్త భార్యనెంతో గౌరవంగా చూస్తాడు. మనం శునకాన్ని పెంచుతాం. మనతో సమానంగా తిండిపెట్టి, సబ్బుతో స్నానంచేయించి ముద్దాడుతాం. అది తన కర్తవ్యంలో కొంచమైనా తప్పు కనబరుస్తే 'ఛీ కుక్కా!' అంటాముగాని, 'మా నమ్మకమైనబంటు' అంటామా? మగవాళ్లమాట జవదాటనంతసేపు ఆడుదాని కేవిషయంలోనూ లోటువుండదు. ఆమె కించిత్తైనా ఆత్మగౌరవంకోసం తాపత్రయపడిందో, సంఘం ఆమెను 'కులట' అంటుంది. ఆమె సజ్జనుడైన ఇంకో మగాడితో మాట్లాడితే భర్త ఆమె శీలాన్ని అనుమానిస్తాడు. భర్త ఎందరాడంగులతో మాట్లాడినా 'బై వే ఆఫ్ ఫ్రెండ్షిప్పు' అని భార్య వూహించాలిట. ఇవన్నీ యమయాతనలు—స్వేచ్ఛలేని జీవితాలు—పెళ్లాడకుండావుంటే యేబాధా లేదు......ఇవి నరస సిద్ధాన్తాలు.

* * *

తరుణయ్య ముప్ఫైయేళ్లకు పైబడిన వయస్సువాడు. వాళ్ల కుటుంబం చాలా పెద్దది. ఆర్గు రన్నదమ్ములలో తరుణయ్య రెండోవాడు. తండ్రి యాయవారంచేస్తూ కుటుంబరథాన్ని నడుపుతూవచ్చాడు. పేద కుటుంబంవాళ్లు కాబట్టి కొడుకులకు పెళ్లిళ్లు దుర్లభమేనని తరుణయ్యతండ్రి తొలినుండి నిరుత్సాహంతోనే వుండేవాడు. శారదాబిల్లు ధర్మమా అని సుబ్బమ్మ కుమార్తెను తరుణయ్యకివ్వడం తటస్థించింది. నరసరూపంచూసి తరుణయ్య మురిసిపోతూ వుండేవాడు. అన్నదమ్ములందరిలో తానొక్కడే ఒకయింటివాడు కావడంచాత తరుణయ్యగర్వానికి మేరలేకుండేది. పెళ్లికి తరువాత అతడు కొంచం మద్యపాననిరతుడైనాడు.

నరస స్కూల్ ఫైనల్‌లో ఉత్తీర్ణురాలైందని విన్నాడు — అమితానంద భరితుడైనాడు తరుణయ్య. ఈతనిచరిత్రవిని నరస కాపురమే వద్దని ధృడసంకల్పం చేసుకుంది. ఆమెను తనవశంచేసుకోవాలని తరుణయ్య భగీరథప్రయత్నాలు చేశాడు. ఆమె తనకన్నచిన్నది. అందుచేత వయోధిక్యత ఆమెవిముఖత్వానికి కారణం కాబోలనీ, తాను ఫేషనబుల్‌గా లేని కారణంచాత ఆమెకు తను నచ్చలేదేమోననీ అతడు క్రొత్త క్రొత్తవేషాలువేయడం, నాలు గింగ్లీషు ముక్కలుదొర్లిస్తూవుండడం, ఇంకా ఏమేమో ప్రయత్నాలుచేసి విఫలమనోరథుడైనాడు.

అది ఆదివారం. నరస ఉదయానలేచి స్నానాదికాలుముగించి, 'టీ' త్రాగడం కోసం సిద్ధమైంది; కాని తన చెలికత్తె

పద్మావతి చాలాకాలం తర్వాత తన్ను చూడ్డానికి వస్తానని నిన్ననే వాగ్దానంచేసింది; ఆమెకోసం యెదురుచూస్తూ నరస టేబిలు దగ్గర అమర్చబడిన కుర్చీలో కూర్చుంది. ఉదయం 8 గంటలైంది. తల్లి అతిథికోస మున్నూ కూతురుకోసమున్నూ 'టీ' తయారు చేసి, టేబిలుమీద అమర్చింది. పద్మావతి బనారసుచీర కట్టుకుని చక్కని దేహ కాంతులతో తీర్చిదిద్దిన కుంకుమబొట్టుతో, లెస్సగా అలంకరింపబడిన నగలతో, నరసను చూడవచ్చింది. నవ్వుతూ చెలికత్తె చెంత గల ఒక ఆసనంమీద కూర్చుంది.

నరస ఆమెనుచూసి, 'ఇన్నాళ్లువలెనేను నిన్ను గౌరవంచేయనందుకు క్షమించాలి. నీ వివాహానంతరం నిన్నుచూడ్డం ఇదే. ఐనప్ప టికీ లేచి నిన్ను పలుకరించలేకపోయాను. మీ ఆయనగారేరీ ?' అంది.

పద్మ—'నే నిప్పుడు పైదాన్నైపో యానా ?

నరస:—ఆహా ! పెళ్లికిముందు నీవొక స్వతంత్రవు. నీ అలంకారాలు నీకు దాస్య శృంఖలాలు_వాటికోసం మగవానికి అమ్ముడు బడిన దాసివి నీవు. స్వాతంత్ర్యం గోల్పోయి స్త్రీజాతికంతకూ తీరని అవమానం తెచ్చి పెట్టావు.

పద్మ:— [మందహాసంతో] నీ అభి ప్రాయంలో నేను అవివాహితగావుండినప్పు డొక ఉన్నతపదవిలోనుంటిననీ, ప్రస్తుతం ఆపదవినుండి తొలగిన దాననని కదూ ? పదచ్యుతను కాబట్టి నీవు నామీద ఇతో ధిక సానుభూతి చూపవలసివుంది.

నరస:—గౌరవం వేరూ సానుభూతి వేరూను. నువ్వు అవసరంగా నా 'సింపథీ' 'క్లయిమ్' చేస్తున్నావు. నీకు ఇంకేదేనా విపత్తు సంభవిస్తే నా ప్రాణాలుకూడా త్యాగంచేస్తాను నీకోసం. ఆత్మ గౌరవం నష్టపెట్టుకున్న ఈస్థితిలో నీకు నేనేం చెయ్య లేను.

పద్మ:—నన్నుచూచి దుఃఖిస్తున్నావన్న మాట. ఈనగలజిగి, వాటిమూలంగా నా శరీర సౌందర్యం నీ ఈర్ష్యకు పాత్రములైనా యని తేలింది.

నరస:—సారీ ! పురాణాలు శాస్త్రాలు చదివేనంటావు. సంకుచితాభిప్రాయం మా నేవు కావు. ఇంగ్లీషు సంపర్కం లేశమైనా లేకపోతే ఇదే చిక్కు. మీరు బ్రాడ్ మైండెడ్ ఫెల్లోసు కాలేరు.

పద్మ:—ఈనగలు బొట్టు పుణ్యస్త్రీ తనానికి చిహ్నాలు.

నరస:—మగాడు బొట్టు, కట్టు, నగ, నాణెం పాటించకూడదని శాస్త్రకారుడు చెప్పాడూ ?

పద్మ:—ఆడుది మానవ సంఘానికి ముఖ్యాంగము. వైదికకాలంనుండి ఆమెకు సంఘంలో గొప్పస్థానం ఇస్తూవస్తున్నారు. ఈమధ్యకాలంలో మగాడు ధర్మరహితు డైతే ఆడుదీ నీతిమాలి వుండాలా ?

నర:—ఈకాలంనాటి ముచ్చటచెప్పా. ఆపుది విసిగిలేచిపోతుందేమోనని, ఆమె కాళ్లకు, చేతులకు, మెడకుకూడ సంకెళ్లు తగిలించి మగాణ్ణి 'దైవంగా చూడాలి. లేకపోతే నరకం ప్రాప్తిస్తుంది' అని బెదరిస్తున్నారు. మగాళ్ళు దుండగాలుచేయకుండా కట్టుబాట్లు ఇప్పటికి ఏర్పాటుకాలేదు. పతితోడి 'నరకం' అంటే బాధలు 'హెవెన్స్' లాగుంటాయట. దేవుడు స్వర్గం, నరకం అన్నీ ఇక్కడేఏర్పరచాడు. మనం 'ఫూల్సు' లాగున అదృశ్యమైనస్వర్గాన ఎప్పుడో వూగులాడే ఆశతో ఆజన్మాంతం మకుళ్లగా దాస్యంచేస్తున్నాం. స్త్రీలదాస్యంతోకూడ దేశం దాస్యంఅనుభవిస్తూవుంది.

వీరిలాగు సంభాషిస్తూవుండగా పద్మ భర్త కారుదిగి లోపలప్రవేశించి భార్యతో 'నేనుకూడ నీతోవచ్చేవాణ్ణి, చెప్పకుండా వచ్చావేం?'అన్నాడు. పద్మ చిరునవ్వుతో 'మీరు మీస్నేహితులతో నాకెప్పుడేనా పరిచయం గలిగించారాయేమిటి' అంది. ఆమాటఅందుకుని నరస తనకిదివరకు పరిచయంలేకపోయినా అతనినుద్దేశించి 'దట్ ఈజ్ రైట్-ఎంతకు అంతే!' అని పద్మను సమర్థించింది. వెకిలినవ్వునవ్వింది. ఆనవ్వులోగల ఆనందాన్ని ఆదిమూర్తి అనుభవించాడు. నరసవైపు కించిదాకృష్టుడైనాడు కూడాను. పద్మ అతనిముఖచిహ్నాలు కనిపెట్టి. ఏమండోయ్! స్త్రీలు పెళ్లాడి మగాళ్లకు గులాముతౌతారుట. మాచెలికత్తె అంటూవుంది. మీరు నన్ను గులాముగానే భావిస్తున్నారా? అనిప్రశ్నించింది. నరస అతనికి అవకాశం ఇవ్వకుండానే 'పద్మా! ఇది చర్చలకు సమయంకాదు. మీరు మా అతిథులు. 'టీ' నీరుత్రాగి కులాసాగా అన్యప్రసంగాలు చేసుకుందాం.' అంది.

ఇంతవరకూ తన్ను తర్కంలోదించి, విద్యావతినిగదా అనే గర్వంతో ఆడవాళ్ల ఆధిక్యతగూర్చి వాదించి, మగాళ్ల చర్యలను ఖండించిన నరసనోటనుండి వెడలిన పై వాక్యం పద్మను కంగారుపెట్టగా ఆమె రోషారుణిత నేత్రాలతో చెలికత్తెనుచూస్తూ— 'ఔను. నేనొక్కర్తెను ఆతిథ్య స్వీకరణానికి తగివుండలేదు. ఎంతైనా మగాళ్లకున్న ఆధిక్యత ఆడుదానికేలాగ వస్తుంది?' అని పకపక నవ్వి తన భర్తతో 'అత్తగారు కోప్పడతారు. నాచెలికత్తెతో కొంతసేపు మాట్లాడి మీరు రావచ్చును. నేను వెళతాను.' అని గ్రుకున లేచి వీధిలోనికి నడిచింది. నరసతానోడిపోయానుగదా అని లోలోన కొంతసేపు కుళ్లింది. ఆదిమూర్తి ఆనాడు కేవలం పరిచయంతో సంభాషణముగించాడు. అతడు స్థితిపరుడు. రసికుడు. పద్మ రూపవతియైనా, అతనిరుచికి తగిన భార్య కాకపోయింది. ఆతడు ఫిల్ముడైరక్టరు. పెద్ద జీతగాడు. పదిమంది స్నేహితులింటికివస్తే పద్మ వారికి 'టీ' ఇవ్వడం షేక్‌హాండులివ్వడం ఈ మొదలైన చేష్టలతో సంతోషపెట్టలేదు. భర్తతో కలిసి 'పార్టీ'లకు వెళ్లదు. ఇంగ్లీషు మాటలాడలేదు. ఈ కారణాలన్నీ నరస, ఆదిమూర్తుల గాఢమైత్రికి కారణములైనాయి.

పద్మ నానాటికి బెంగతో క్రుళ్లి ప్రాణా వశిష్టురాలైంది. ఆమె మరణశయ్యచెంత, ఆదిమూర్తి, అతని తల్లీ కూర్చున్నారు. పద్మ క్షీణించిన స్వరంతో, 'ఏమండి! నాకింకేదీ కోరికలేదు. మిమ్మల్ని సుఖపెట్టే భాగ్యం నాకు లేకపోయినందుకు నన్ను క్షమించండి. మీరు ఆవిడా ఖులాసాగా వుండండి; ఆవిడ (తన చెలికత్తె) మీ ధనం త్రోడేసింది. ఇదిగో! మీ నాన్నగారు నాకు కాపురానికివచ్చేటపుడు కానుకగా యిచ్చిన నగలపెట్టె—ఇందులో కొన్నివేలు రూపా యల విలువగల నగలున్నాయి. దీన్ని జాగ్ర తతో కాపాడుకోండి' అనిచెప్పి శాశ్వతంగా కన్నుమూసింది.

తరుణయ్యకు, తన భార్యకున్నూ ఆది మూర్తికిన్నీవున్న సంబంధం తెలియకపోలేదు. ఆమె ఆదిమూర్తివలన ధనవంతురాలై తనను మరీ తిరస్కరించడం ప్రారంభించింది. అతని దైన్యస్థితిచూచి, అత్తగారు సుబ్బ మ్మకు జాలివేసి అతణ్ణి తనయింటనే వుంచు కుని ఆదరిస్తూ అతని హృదయానికి ధైర్యం చేకురుస్తూవుంది. నరస మతాంతరప్రవేశం చేసి ఆదిమూర్తిని పెళ్లిచేసుకోవాలని సిద్ధాన్తీకరించుకుంది. షరతేమిటంటె ఆది మూర్తి తన భార్య నగలపెట్టె ఆమెకు సమర్పించడం. ఈవర్తమానం తరుణయ్య తెలిసికొని ఆదిమూర్తికి ఎంతో బోధ చేశాడు. ఆ మదాంధుడు వినక, పద్మ తన జ్ఞాపకార్థం ఇచ్చిన నగలపెట్టె పెళ్లికిముందే నరసవశంచేశాడు. సంగతివిని తరుణయ్య అత్తగారితో 'సుబ్బమ్మత్తా! నేను సర్వం త్యజించి కాశికిపోతాను. నాకీ జన్మలో సౌఖ్యం మృగ్యం. బ్రతికి ప్రయోజనం యే ముంది? ఈ ఇంగ్లీషుచదువులు సంసారాలని పాడుచేసి సంఘువిధ్వంసం చేయడానికి వచ్చాయి. ఎందుకు చదివిస్తారు అని నేను ఎన్నిసార్లు చెప్పినా వినుపించుకోకుండా, మీ పంతమే చెల్లించుకుని చివరికిల్లా నలుగురి లోను అప్రతిష్ఠ తెచ్చిపెట్టావు, నేనీ అప వాదుపడలేను. నా కింకేమి అక్కరలేదు ఆ కాశీవిశ్వేశరుడే వున్నాడు అన్నిటికినీ అని చక్కాపోయాడు తరుణయ్య. సుబ్బ మ్మకి పిచ్చెత్తినట్టయి 'చదువులేం జేశాయి. వీళ్లబుద్ధులు యిలా నాశనమైనాయిగాని' అని నెత్తినోరుకొట్టుకుంది. తరుణయ్యని ఇంట్లో వుండమని బ్రతిమలాడుదామను కుంది. కాని తను తిరిగిచూచేసరికి తరు ణయ్య కనపడలేదు.

మరి కొన్నాళ్లకి నరస ఆదిమూర్తిని ఊరించిఊరించి నగలపెట్టెతో ఎక్కడికో పోయింది. మళ్లీ కనపడలేదు నరస.

# —○⊱ కైవారము ⊰○—

సీ. బ్రహ్మదేశంబు నీపంట పండినచేను మధ్యరాష్ట్రముల నీ మాటచెల్లు
అస్సాములోన నీయందంబు రాణించు బీహారునందు నీ పీఠమలరు
వంగభూమికి వన్నెవాసికూర్తువు నీవు బొంబాయి నీవిలాసంబు నెలవు
మైసూరు సీమ నీ మంగళాకృతి వెల్గు మధురలో నీపలుకు మాఱుమ్రోఁగు

సింహళద్వీపమందు నీ చిన్నెలొప్పు
నాఫ్రికాఖండమది నీ విహారభూమి
సందియంబేల వైష్ణవీ శక్తివీవు
తెలిసికొన్నాఁడ నీపెంపు తెలుఁగు తల్లి!

సీ. చతురంతధారణీ చక్రంబు శాసించు వీరప్రతాపు లీవేళ లేరు
పరవీర్యలుంటాక బాహాబలప్రౌఢి గల బాలచంద్రులీ గడియ లేరు
ఖడ్గంబు నందిచ్చి కదనభూమికి నాదు నడుపు మాంచాల లీనాఁడు లేరు
కండలన్గదలించు కైతలామెతలిచ్చు తిక్కన్నయజ్వలీ దినము లేరు

లేరు పండితలోకావలేప జలద
మండలీ చండవాయువుల్ మల్లినాథు;
లూఁచపోయిన సంతాన మేచునట్లు
దీవనల్గురిపింపవే తెలుఁగు తల్లి!

—శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

గృహలక్ష్ముల లలితకళాశోభకు

* సౌందర్యమునకు
* సౌజన్యమునకు

సౌభాగ్యమునకు *
సౌశీల్యమునకు *

సామర్థ్య సంతోషములకు

లలితకళాసమన్వితమైన గృహనిర్మాణమునకు

• గృహలక్ష్మి •

ప్రతిమాసము కొన్నిపుటలు ప్రత్యేకించి కృషిచేస్తుంది

అట్టి లలితకళల సంబంధమైన గద్య పద్య గేయములకు

ఆహ్వానము



# గృహలక్ష్మి

## లలితకళా సంచిక

### ప్రముఖుల ప్రశంసలు • పత్రికల పొగడ్తలు

మహిళాభ్యుదయంకోసం బహువిధాల పరిశ్రమిస్తున్న శ్రీ డాక్టర్ కేసరిగారు, ఇప్పుడీ సుందరమైన కళాసంచికను వెలువరించినందుకు అభినందిస్తున్నాము... ఇది ప్రాచీన కళాస్వరూపాన్ని పఠితల కళ్లఎదుట ప్రతిబింబింప చేయగల విజ్ఞానపేటిక అని చెప్పడములో అతిశయోక్తిలేదు.

—ప్రజామిత్ర.

'గృహలక్ష్మి' ప్రతి ఆంధ్రనారీగృహమునకు మంగళకర జ్యోతియై అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయుచు చాలకాలమునుండి సేవచేయుచున్నది. 'గృహలక్ష్మి'యొక్క యీ లలితకళా సంచిక సుప్రసిద్ధులైన రచయితల లేఖినులనుండి వెల్వడిన చక్కని వివిధవ్యాసరాజాలతో అలంకరింపబడి సర్వాంగసుందరమై అలరారుచున్నది.

—ఢంకా.

...హృదయ మోహనమగు నిట్టి వయస్సంధిలోనే నేడు డాక్టరు కేసరిగారి తమ అల్లారు ముద్దుబిడ్డ "గృహలక్ష్మి"కి నేత్రోత్సవమొనర్చు నైపథ్యాలు కైనేసి జన్మదినోత్సవము జరిపించిరి. ఈనాటి గృహలక్ష్మి లలితకళాపూర్ణయై అలరారుచున్నది.

—మహతి.

లలితకళాసంచిక ప్రత్యేక శ్లాఘాపాత్రముగా నున్నది. కళా జనయిత్రులగు స్త్రీలకొఱకు మీరు గావించు సేవ నిరుపమానము.

—శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

'గృహలక్ష్మి' జయంతిసందర్భమున వెలువడిన మార్చి, ఏప్రియలు నెలల గృహలక్ష్మి సంచికలు రెండును అపూర్వములై అత్యంతానందజనకములై యుండెనని తెలుపుటకు సంతసమగుచున్నది. లలితకళాసంచికయందలి ప్రతియొక్క వ్యాసమును లలితకళల సుకుమార సౌందర్య మాధుర్య మార్దవముల విశదీకరించుచున్నవి.........గృహలక్ష్మి జయంతియొక్క ఆద్యంత సంచికలుగా ప్రకటితమైన నీ రెండుసంచికలును నామూలాగ్రముగా జదివినవారెల్లరు లలితకళల ప్రయోజన ప్రాముఖ్యతా స్వరూపములు చక్కగా గ్రహింపగలరనుటకు సందియములేదు. ఇంతటితో నీ పని తీరలేదు. ఈ కళల స్త్రీలెల్లరు నభ్యసించుటవలననే ఈ కృషి సార్థకము కాగలదు. ఆంధ్రనారీమణులెల్లరు తాము నేర్చిన వివిధకళలను గృహలక్ష్మిముఖమున తోడి నారీలోకమునకు పంచిపెట్టుటవలననే యీ యత్నము ఫలింపగలదు. 'గృహలక్ష్మి'లో కళలకై ప్రత్యేకింపబడెడి పుటలు ఆ కార్యమును సాధింపగలవని నమ్మెదను.

—శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ.




# కళలు

కళాప్రపూర్ణ
బ్రహ్మశ్రీ చళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు,
శతావధాని.

ఇవి అఱువైనాలుగని కొంచెం చదువుసంధ్యలు యెఱిగినవాళ్లందఱూ యెఱుగుదురు. పద్నాలుగువిద్య లనీ చతుష్షష్టికళలనీ సర్వసామాన్యంగా చెపుతూవుంటారుగాని తపసీలుగా వాటివాటి పేళ్లను విడదీసి చెప్పమంటే యెవరుగాని చెప్పలేరు. కళాశాస్త్రమంటూ వకటయితే పుస్తకంవుందిగాని, అందులో శృంగా రానికిసంబంధించిన స్త్రీపురుషుల జాతులనుగూర్చిన్నీ, వారి రహస్యప్రవర్తనాన్ని గుఱించిన్నీ కొంత వుంటుందిగాని యితరకళలనుగూర్చి లేశమున్నూ వుండదు. ఆపుస్తకం పండితులలో యెవరో కవులు తప్ప తక్కినవాళ్లు చదవరుకూడాను. మొట్టమొదట ఆకళలపేరులు వ్రాసి, పిమ్మట దానిలో యేదో వకదాన్ని పుచ్చుకొని నాలుగుమాటలు వ్రాస్తాను. సుమారు నెలరోజులనుంచి 'గృహలక్ష్మి' వుత్తరాలమీద వుత్తరాలు దీనికోసం వ్రాస్తూవుంది పాపం! ఆ వ్రాయడంలో కవిత్వాన్నిగూర్చికాక మఱియేదేనా కళనుగూర్చి వ్రాయ వలసిందంటుంది. సరే కళలపేరులు వుదాహరిస్తాను:

(1) గీతం, (2) వాదిత్రం, (3) నృత్తం, (4) నాట్యం, (5) చిత్రం, (6) పుస్తక కర్మ, (7) పత్రచ్ఛేద్యం, (8) లిపిజ్ఞానం, (9) వచనకౌశలం, (10) వైలక్షణ్యం, (11) మాల్యవిధి, (12) గంధయుక్తి, (13) ఆస్వాద్యవిధానం, (14) అనురంజనజ్ఞానం, (15) రత్నపరీక్ష, (16) సీవ్యం, (17) ఉపకరణక్రియ, (18) ఆజీవజ్ఞానం, (19) తిర్యగ్యోని చికిత్సితం, (20) మాయాకృతం, (21) పాషండసమయజ్ఞానం, (22) క్రీడాకౌశలం, (23) సంవాహనం, (24) శరీరసంస్కారకౌశలం, (25) ఆయప్రాప్తి, (26) రక్షావిధానం, (27) రూపసంఖ్య, (28) క్రియామార్గం, (29) జీవగ్రహణం, (30) నయజ్ఞానం, (31) చిత్రవిధి, (32) గూఢరాశి, (33) తులానిధి, (34) క్షిప్రగ్రహణం, (35) అనుప్రాప్తి, (36) లేఖ, (37) స్మృత్యనుక్రమం, (38) లీలావ్యాపారమోహనం, (39) గ్రహణాదానం, (40) ఉపస్థాననిధి, (41) యుద్ధం, (42) తతం, (43) గతం, (44) స్త్రీపురుష భావగ్రహణం, (45) స్వరాగప్రకాశనం, (46) ప్రత్యంగదానం, (47) నఖవిచారం, (48) దంతవిచారం, (49) నీవీస్రంసనం, (50) గుహ్యస్పర్శనలోమ్యం, (51) పవమార్ధకౌశలం, (52) భూషణం,

(53) సమానార్థత, (54) ప్రోత్సాహనం, (55) మృదుక్రోధప్రవర్తనం, (56) శుద్ధప్రసాదనం, (57) ఘుప్తాపరిత్యాగం, (58) పరమస్వాపవిధి, (59) గుహ్యాగ్రహం, (60) సా[illegible]పాతనం, (61) రమణవీక్షణం, (62) స్వయంశపథక్రియ, (63) ప్రస్థితానుగమనం, (64) పునర్నిరీక్షణం,

యీ అఱవైనాలిగింటిలో యేకొన్నిటినో తప్ప, తక్కినవాట్ల స్వరూపాన్నిగూర్చి చెప్పవలసివస్తే చెప్పతగ్గవారు యీనాటి పండితులలోఁగాని కవులలోగాని కనపడరు. జూదం, దొంగతనంకూడా కళలలోనే చేరతాయని నేను వినివున్నానుగాని, ప్రస్తుతం ఇచ్చిన జాపితాలో వాట్లను పేర్కొన్నట్లు కనపడదు. శేదా యీ మాటలలో యే మాటకేనా వాట్లను అర్థంగా చెప్పవలసివస్తుందేమో? దొంగతనాన్నిగూర్చి మృచ్ఛకటికలో శూద్రకమహాకవి మిక్కిలిగా వర్ణించి వున్నాఁడు. దాన్నిబట్టిచూస్తే నేనెప్పుడో యెవరివల్లనో విన్నమాట (దొంగతనం కళలలో చేరిందే అన్నది) నిక్కమే అని తోస్తుంది. పరిశీలించిచూస్తే దొంగతనానికి లోకంలో గౌరవస్థానం లేకపోయినప్పటికీ వాడికి (దొంగకన్నమాట) యెక్కడలేని తెలివితేటలూ వుండితీరాలి. వాడు యోగులకున్నంత యింద్రియనిగ్రహం వుండాలి. ఇంద్రియనిగ్రహం అంటే సర్వసాధారణంగా స్త్రీ వ్యామోహంలో పడకపోవడమే అని అర్థంచేసుకుంటారు. అంతమాత్రంలోనే వుండదు దానితాత్పర్యం. పంచేంద్రియాలనూ అరికట్టేసామర్థ్యంపేరే ఇంద్రియనిగ్రహం అనిపించుకుంటుంది. దొంగతనానికి వెళ్లినవాడు తుమ్మకూడదు, దగ్గకూడదు. అట్టే చెప్పేదేమిటి? తుదకు వూపిరికూడా ధారాళంగా విడవకూడదు, ఆకాస్తే నేపున్నా. ఈనియమాలలో దేన్నివుల్లంఘించినా 'కన్నానికెల్లి బాకాపట్టినట్టే' అవుతుందికదా? ఆయా శాసనాలతోచేరిన పనికనుకనే దీన్నినిర్వహించడం పెద్దనేర్పుకింద పరిగణించి దొంగతనాన్ని పూర్వకవీశ్వరులు చతుషష్టి (64) కళలలో వకకళగా పేర్కొన్నారనుకుంటాను. పట్టపగలు యెట్టయెదటకూడా దొంగతనాన్ని నిర్వహించేవాళ్లు యెక్కడో కాదు, మాగ్రామంలోనే వుండేవారని మానాన్నగారు వగైరా పెద్దలు చెప్పగా వినడమేకాకుండా నాఁగోజులలోకూడా ఆబాపతు శేషం కొంచెంవుండేది. అందులో వకఁడు, నాకన్నకొంచెం పెద్దవయస్సువాఁడు సుమారు పదిసంవత్సరాలనాఁడు గతించాఁడు. లోకల్‌ఫండు స్కూల్లో చిన్నప్పుడు నాతో వాఁడు చదువుకున్నాఁడు. వాళ్లపూర్వులు దొంగతనంలో చాలా పేరుప్రతిష్ఠలు ఆర్జించినట్లు చెప్పడమేకాని వాఁడెన్నఁడూ ఆకులవృత్తిని చేసినట్టులేదు. ఆకారణంచేత మావూళ్లో వక పెద్దసంపన్నగృహస్థు (వెలమవారు) వాణ్ణిదగ్గఱికితీసి ప్రేమిస్తూవుండేవారు. చాలాకాలం యోగ్యుఁడుగానే కాలక్షేపం చేశాఁడుకాని తుట్టతుదకు ఆఱువందలరూపాయీలు కాఁజేశాఁడు. యిప్పుడు ఆ జాతివాళ్లయితే మావూళ్లో యింకా కొందఱు హతశేషం లేకపోలేదుగాని, వాళ్లెవళ్లూ ఆయాకులవృత్తిని చేస్తున్నట్టులేదు. అయితే వాళ్లు మానుకున్నప్పటికీ మఱికొందఱు యితరకులాలవాళ్లు ఆవృత్తిలోకి దిగి అనాదిగా మాగ్రామానికివున్న పేరుప్రతిష్ఠలని కాపాడుతున్నారు. యెంతకాపాడినా వాళ్ల తెల్వితేటలుమాత్రం పెద్ద మున్నట్లు కనుపడదు.

చూడండీ వాళ్ల తెల్వితేటలేలాటివోను! వాళ్లు మాగోదావరిజిల్లాలో పేరుపడ్డ తీర్థాలు, కోటిపల్లి సోమేశ్వరస్వామి తీర్థం, అంతర్వేది నరసింహస్వామితీర్థం, (సప్తసాగర యాత్రలో ఇది ఆఖరు తీర్థం) యింకా కోరుకొండ వగయిరాలు కొన్నివున్నాయి. చెప్పొచ్చేదేమిటంటే? ఆ పచ్చిపాట్లు వైతీర్థాల

మాలాన్నే ముఖ్యజీవనం చేసేవారనిన్నీ, యెక్కడేనా అవసరానికి అప్పు పుచ్చుకోవలసివస్తే ఫలానాతీర్థానికి వెళ్లివచ్చిన తర్వాత తీరుస్తానని వూళ్ళోగృహస్థులదగ్గఱ అప్పు పుచ్చుకొనేవారనిన్నీ, నాకు వెనకటితరంలో వుండేపెద్దలు చెప్పేవారు. సరే, వాళ్లు యేదో కొంతజట్టు (నాటకపుజట్టుమాదిరిదే అనుకోండి) యేదో తీర్థానికి వెళ్లడం, స్నానాలరేవులో స్నానాలుచేసేవారితోపాటు వీరుకూడా లభీఖత్తుగా స్నానాదులుచేస్తూ స్వకులవృత్తిని నిర్వహించుకొనేవారంటూ వినడం—యేలాగంటే ? మనహిందువులలో యీ తీర్థాలకు వెళ్లడం యిప్పుడు పాశ్చాత్యానుకరణంవల్ల యేమాత్రమో తగ్గిందికాని వెనకటికాలంలో అలాకాదు, పూర్తిగా వుండేది. తీర్థానికి వెళ్లేటప్పుడు ఆడవాళ్లు తమకు నగలుంటే సరే సరి, లేకపోతే యెరవుతెచ్చుకొనేనా అలంకరించుకోవడం సర్వత్రావున్న అలవాటే. ఆలా భూషణభూషితాంగులైన ఆడవాళ్లు స్నానానికి దిగేటప్పుడు ఆయా భూషణాలు (అన్నీకాదు కొన్నేఅనుకోండి) తీసి వకబట్టని మఱికొన్ని పట్టుబట్టలు వగైరాలతో భద్రంగా మూటకట్టి, ఆ మూటమీద తమతాలూకుమనిషిని కూర్చోపెట్టి 'జాగ్రత్త సుమా' అనిచెప్పి, స్నానానికి దిగినప్పుడు ఆయీ సందర్భంఅంతా సవిమర్శంగా పరిశీలిస్తూవున్న పశ్యతోహరులు ఆమూటని బహుచమత్కారంగా అపహరించినట్లు చెప్పఁగా విన్నాను. ఈ పచ్చెపుజట్టులో వుండే వొకఁడు స్నానంచేసి బట్ట ఆరవిప్పుకుంటూవున్నట్టు ఆకాపలాకుఱ్ఱాడికి యెదురుగుండా నిల్చఁబడివుండగా యింకొకడు ఆకాపలా కుఱ్ఱాడియెదట చూచీచూడనట్టు వకటోరెండోరూపాయిలు పొరబాటున జాఱవిడిచినట్టు జాఱవిడిచి పోయాట్ట ? ముడ్డికింద నగలమూటపెట్టుకుని కూర్చున్నకుఱ్ఱాఁడు కాస్తపృష్ఠాన్నియెత్తి ఆరూపాయిలను అందుకునే అందుకోవడంలో ముడ్డికిందవున్నమూట అంచెలమీఁద దాఁటిపోయిందని చెప్పగావిన్నాను.

వాళ్ల వేషభావాలు శుద్ధశ్రోత్రియంగాకూడా వుండడంచేత పోలీసుభటులకు అనుమానించడానికి అవకాశంకూడా వుండేదికాదఁట! వీళ్లల్లోకొందఱు దేవతార్చన విధానంవగయిరా చిల్లర భట్టీయంముక్కలునేర్చుకొని, గుంటూరుప్రాంతంలో సంపన్నబ్రాహ్మణగృహస్థుల యిళ్లలో దేవతార్చన బ్రాహ్మణులుగా ప్రవేశించి, సమయందొరికినప్పుడు 'తస్కరాణాం పతయే నమోనమః' చేసి స్వదేశానికి పలాయనం చేసేవాళ్లఁట! యింతే కాదు. కొంతమంది అబ్రాహ్మలపిల్లలని పెళ్లాడినవాళ్లుకూడా వున్నట్టు వినడం కలదు. దీనిలో కొంత అతిశయోక్తివుంటే వుంటుందనుకుందాం. ఆయీ పచ్చెపుదొంగలు ఆనాఁటిజమీందార్లను తమ విద్యచేత మెప్పించి వారివల్ల భూములు మొదలైనవి బహుమతిగా పొందినట్టుకూడా విన్నాను. గర్భాధానంలోజున రాజుగారికూఁతురు కట్టుకొన్న బనారసుచీర దొంగిలించడం సందర్భంలో యీ బహుమతీ జరిగిందని చెప్పుకోవడం; అది యేలాజరిగిందంటే ? పగలే యేనవుకరులతోనో కలిసిమెలిసి తిరుగుతూ ఆ గదిసరంబీమీఁద దాక్కొని యీదొంగతనం చేశాట్ట వకబుద్ధిమంతుఁడు. ఈలోఁగా తొరపణంతో సరంబీకి సన్నపాటిబొత్త కొసివుంచి, ఆనవాలు తెలియకుండా యే మైనమో దానికి అంటుంచివుంచి, రాత్రి ఆమె పరున్నప్పుడు మెల్లిగా ఆమైనంతీసి ఆచిల్లిగుండా తామరతూడుద్వారాగా కొన్నినీళ్లు వదిలేటప్పటికి ఆవిడ ఆచీరవదిలి గదివసారాలో పడవేసిందనిన్నీ, తరువాత దాన్ని తస్కరించి రాజావారికి చూపేటప్పటికి వారుసంతోషించి భూములువగైరాలిచ్చి సమ్మానించారనిన్నీ చెప్పుకుంటారు.

కళలుగౌరవనీయాలయినప్పుడు వాట్లలో వకటిగా పరిగణింపఁబడుతూవున్న దొంగతనంమాత్రం గౌరవనీయం యెందుకుకాదని అప్పటివారి తాత్పర్యం. అయితే కావచ్చునని మనం వూహించుకోవాలి. అయితే

కళలలో గానం, కవిత్వం మొదలయినవాటి కున్నంత సభాపూజ్యత దీనికెందుకు లేకపోవాలని వస్తుంది. కొన్నికళలలో కవిత్వం మొదలైనవాటికంటేకూడా యెక్కువనేర్పు వుంటేనేకాని ఆయా కార్యాలు నెఱవేఱకపోవడం నిజమేకాని, అంతమాత్రంచేత వాటికి సభా పూజ్యతవస్తుందా? చేటుఁడు వాఁడు శృంగారనాయకుఁడికి సహాయంగావుండే విట విదూషకాదులలో వకఁడు. "కళానుకుశలశ్చేటః" అని లక్షణం. వాఁడికి చతుష్షష్టి కళలయందున్నూ ప్రజ్ఞవుండవలసివున్నా అది అసంభవం గనక, యేవో ముఖ్యంగా శృంగారనాయకునికిన్నీ ఆయన ప్రియురాండ్రకున్నూ అనుసంధానం చేయడానికి అత్యావశ్యకమైన కొన్నికళలయందేనా పాండిత్యం వుండితీరాలికదా? ఆలాటిచేటుఁడు ఆయా సందర్భంలో రాజుగారివల్ల గౌరవింపఁబడడమేకాని యితరత్ర కవులు వగయిరాలతో గౌరవింపఁబడ్డట్టు మన పూర్వ చరిత్రలవల్ల గోచరింపదు. అన్నీ కాకపోయినా, యేకొన్నోకళలు వచ్చినవాళ్లు, అందఱూ కాకపోయినా కొందరేనా వుండఁబట్టే అనుకుంటాను భోగంవాళ్లకు కొన్నిప్రాంతాలలో వ్యవహరింపఁబడుతూవుండే 'కళావంతు'లనేపేరు, అన్నిచోట్లా కాకపోయినా కొన్నిప్రాంతాలలో వ్యవహరింపఁబడుతూవుండేది. ప్రస్తుతం కాలంలో బొత్తిగా మోటుతనంగా కనుపడుతూవున్నట్టు అభిప్రాయపడి ఆ జాతీయులు ప్రసిద్ధమైన జాతి నామాన్ని పరిత్యజించి కళావంతులమని వ్యవహరించుకోవడం మొదలుపెట్టారు.

ఈశబ్దము కవులకు, పండితులకు అందఱికీ చెల్లుతుంది. కళాశబ్దానికి 'విద్య'అనే అర్థంకూడా వుందికదా! యూనివర్సిటీవారు 'కళాప్రపూర్ణ' బిరుదాన్ని యివ్వడంకలదు. వారు దాన్ని యేఅర్థం మనస్సులోపెట్టుకొని యిస్తూవున్నారో తెలియడంలేదు. యివ్వడంమాత్రం జరుగుతూవుంది. యీ రోజులలో ఆబిరుదం పొందడానికి అర్హులైనవారు పలువురున్నారుగాని, అందులో శ్రీయుతులు(అజ్జాడ)ఆదిభట్ల నారాయణదాసుగారు చిటికెన వ్రేలిమీఁదికివస్తారు. వయస్సుచేతకూడా వారు పెద్దలు; 75 సంవత్సరాలకు అంతోయింతో వారి వయస్సు యెక్కువగాని తక్కువకాదు. యూనివర్సిటీవారు యీమధ్య 'కళాప్రపూర్ణ'బిరుదంతో యెవరెవరిని సంభావించారో అందులో యేయిద్దఱు ముగ్గురో దాసుగారికంటే వయస్సులో కొంత పెద్దలే. అయినా తక్కినవారం దఱూ అంతోయింతో చిన్నలే. ఇదిన్నీకాక యూనివర్సిటీవారు యీబిరుదాన్ని యివ్వడం మొదలుపెట్టి యెన్నాళ్లయిందో నాకు బాగా తెలియదుగాని, సుమారు యేభైఅరవై యేళ్ల మధ్య యిన్నికళలలో ప్రజ్ఞకల వారు దాసుగారుతప్ప ఇతరులు శ్రుతంకాలేదు. సంగీతంలోవున్న అంగాలన్నిటిలోనూ ఆయనకు మంచిప్రవేశం కదా? పైఁగా చక్కనికవిత్వం, సంస్కృతాంధ్రాలు రెంటిలోనే కాక యింకా యింగ్లీషు, హిందీ వగైరా లలో సాహిత్యం; ఇన్నీ యీలావుండఁగా లోకోత్తరమైన జనరంజకత్వం; యింకా మనదాఁకారాని మరి కొన్నిటి కళలలో ఆయనకు ప్రవేశంవుంటే వుండవచ్చుననుకుంటాను. యిట్టిస్థితిలో యూనివర్సిటీవారు ఆయన్ని కళాప్రపూర్ణున్ని చేయకపోయినా లోకదృష్టిలో ఆయన యిదివఱకే కళాప్రపూర్ణులై భావిస్తూన్నా రనుకోకతప్పదు. అయితే నేఁడో రేపో యూనివర్సిటివారు ఆయన్ని ఆ బిరుదునిచ్చి సమ్మానిస్తారనుకుం దామా? అట్లుచేయడం జరిగినా లోకులకు సంతుష్టికలగదు. ఎప్పుడో యింతకుపూర్వమే సమ్మానించవలసి వుండఁగా ఆలాచేయక ఆలస్యంగా చేయడానికి కారణం వారు చూపవలసివస్తుంది.

సరే యిది విషయాంతరం. కళలు అఱువైనాలుగున్నూ తెలిసినవారు చాలా పూర్వకాలంలోవుంటే యెవరేనా వుండేవారేమోకాని యిటీవల యెవరూ వున్నట్లులేదు. యేవొకటి రెండిటిలోనో ప్రవేశం వుంటే



త్రిపురికాంగ్రెసు స్వదేశీప్రదర్శనములలో అఖిలభారత చరఖాసంఘమువారి ప్రదర్శనశాలయందు ఒక పార్సీవనిత నూలుతీయుచుండుట. ఈరాట్నమునకు రెండుకదురులు గలవు. రెండుచేతులతోను నూలుతీయవచ్చును. బాగుగ పని చేయగలవారు ప్రతిగంటకు ఒక్కొక్క అణాచొప్పున సంపాదింపవచ్చును.



రేపల్లెతాలూకా కాముసులతోటలో జరిగిన శ్రీ యోగాశ్రమము యొక్క షష్ఠమవార్షికోత్సవసందర్భమున శ్రీమతి జ్ఞానాంబగారి అధ్యక్షతను జరిగిన మహిళాసభ. అధ్యక్షులు మధ్య కూర్చొనియున్నారు.



బొంబాయి మ్యునిసిపల్ కమీషనరుగారైన శ్రీ యమ్. డి. భాట్ గారి అధ్యక్షతను బొంబాయి హిందూ జింఖానాస్థలములో జరిగిన వ్యాయామ ప్రదర్శనములు, అందు పాల్గొన్న యువతీయువకులు.

చాలుననుకొనేపద్ధతిని. అలాటివారు చాలామంది దొరుకుతారు. అంతకంటే అధికప్రవేశం, అంతకంటె చాలాకళలలో వున్నవారు అడిగుదానికి అర్హులనేపక్షంలో దాసుగారొక్కరే దానికి తగ్గవారని నేననుకొంటాను. నా చిన్నతనంలో కోమట్ల వివాహాలలో కవీశ్వరపళ్లెమంటూ వకటి వారివారి శక్త్యానుసారం యివ్వడంవుండేది. ఆ పళ్లెం యెత్తడానికి రివాజుగా కవిత్వప్రవీణుల వంశీకులు (వారు శుద్ధశుంఠలైనాసరే) వస్తూవుండేవారు. పూర్వకవిత్వమైనదేదో వక ఆశీర్వచనపద్యం చదివి ఆపళ్లెం యెత్తేవారు. యెత్తడంమట్టుకే కాని యెత్తినవారు ఆ సొమ్ము పుచ్చుకోవడానికి వల్లకాదు. ఆసొమ్మును 'తిలాపాపం తలాపిడికెడూ' అన్నట్టు అక్కడికి వచ్చిన బ్రాహ్మలందఱూ పంచుకొనేవారు. ఆ భాగస్థులలో యాచకులు, పాచకులు వీరంతాకూడా చేరేవారు. యెవరేనా సుప్రసిద్ధకవీశ్వరుఁడు ఆనాకబలిపళ్లెం యెత్తేసమయానికివస్తే అదివఱలో రివాజుగా పళ్లెంయెత్తేవారు ఆకవీశ్వరుణ్ణిగౌరవించి ఆపళ్లెం ఆయనచేత యెత్తించడమయితే జరిగేదిగాని పంపకం మాత్రం యథాపూర్వంగానే జరిగేది. ఇది నేను స్వయంగా యెఱిఁగిందే. బొత్తిగా చిన్నతనంలో వొకటి రెండుస్థలాల్లోకి వెళ్లి కొంత ఘర్షణకూడ పడ్డవాణ్ణె. నోరున్నవాఁడిది రాజ్యమన్నట్టుగావుండేది. ఆకోమట్లపెళ్లిళ్లలో యీకవిత్వకళకే కాకుండా యింకా చాలాకళలకు యీసమ్మానం వుండేది. యెక్కువ యిమ్మని ఆయీ కళావంతులున్నూ, యేకో యిచ్చిలేదనిపించుకుందామనే తాత్పర్యంతో తక్కువగానే యివ్వడానికి ఆపెళ్లివారున్నూ కయికురు బొయికురులాడడం నేను స్వయంగా యెఱుఁగుదును. యిటీవల క్రమంగా కోమట్లు ఆపళ్లేలివ్వడం మానుకున్నట్టుతోస్తుంది. యిచ్చేరోజుల్లో నే నా ఆత్మగౌరవంగల కవి యెవ్వఁడూ దానికి వెళ్లకూడదనిపించింది నాకు.

మాతరానికి వెనకటితరంలో శ్రీ పిండిప్రోలి లక్ష్మణకవిగారు ఆపళ్లేలకు తలుచుగా వెళ్లేవారని మల్లపేరు సోమయాజులుగారు చెప్పేవారు. కాని అప్పుడు దానిబాపతు ద్రవ్యం ప్రతివాడికిన్నీ పంచిపెట్టడం మాత్రం లేదనిన్నీ, అంతోయింతో కవులైనవాళ్లె వారివారి యోగ్యతానుసారంగా పుచ్చుకొనేవారనిన్నీ చెప్పఁగావిన్నాను. ప్రస్తుతం ఆయీసంగతికిన్నీ వ్రాసేవ్యాసానికిన్నీ సంబంధమేమిటంటే? పూర్వపురాజులు కోమట్లద్వారా ఆయీకళలను పోషించడమేకాకుండా స్వయంగాకూడా కొంత కలుగఁజేసుకొని ప్రోత్సాహంకలిగించేవారన్నదే. పూర్వపురాజులిచ్చిన పట్టాలువుండేవి; ఆపట్టాలనుబట్టియ్యేవే కోమట్లు తప్పకయిచ్చేవారు. క్రమంగా దేవాలయపు నాకిరీభూములతోపాటుగా యీపట్టాలక్కూడా విలువతగ్గిందని తోస్తుంది. యిప్పుడెక్కడా కోమట్లు వీటిని యిస్తూన్నట్టు తెలియడంలేదు. వొకవేళ ఏ అమాయక కోమట్లేనా యే రెడ్డిసీమప్రాంతంలోనేనా యివ్వాలనుకున్నా పుచ్చుకొనేవాళ్లు కనపడరు. నా చిన్నతనంలో యెక్కడేనా కాస్త పేరుమోఁగిన పెళ్లి, సదస్యం అయిందంటే అధమం నాలుగైదామడ దూరాన్నుంచి సంభావనకు బ్రాహ్మణబృందం వచ్చేనేది. యీ సందర్భం, నేను యానాంలో శ్రీమన్యం మహాలక్ష్మమ్మ జమీందారుగారి మేనకోడళ్ల వివాహాల్లో చూచేవాణ్ణి. ఆ సదస్యంలో వొకప్పుడు వకవిశేషం జరిగింది. పెళ్లిఅయినవాళ్లకు రూపాయినీన్నీ, బ్రహ్మచారులను అర్ధరూపాయినీన్నీ సంభావన యివ్వడం యేర్పఱిచారు. ఆ సంభావననాటికి బహుశః నాకు పండ్రెండేండ్లుంటాయి. ఆ నాఁడు యెందఱో బ్రహ్మచారులకు పెళ్లాంతో అవసరంలేని పెళ్లిళ్లు జరిగాయి, యేలాగంటే? గృహస్థులలో పదేసి జంద్యాలు వేసుకోవడంకూడా వుంటుంది. అసలు అవసరం రెండుమాత్రమే, "శ్లో॥ యజ్ఞోపవీతేద్వేధార్యే, శ్రౌతస్మార్తానిసాధనే" అని మాత్రమే వున్నది. అందుచేత ఆ గృహస్థుల మెడల్లో అదనంగా వున్న జంద్యాలతో యెందఱికో సంభావనదొడ్లో

పెండ్లి జరిగిందన్నమాట. అఱువై యేసియేళ్లవాళ్లుకూడా ఆ రోజుల్లో బ్రాహ్మణులలో పెండ్లి కావడం ఉపాధిలేక బ్రహ్మచారులు చాలామంది వుండేవారు. కోమట్లు యుక్తిపరులు కనక కొంతద్రవ్యవ్యయం తగ్గుతుందని యీ యుక్తి పన్నుకున్నారు; యుక్తిపై యుక్తి బ్రాహ్మలు చేశారు.

వ్యాసం విస్తరిస్తూవుంది. ప్రస్తుతాంశం, ఆ కాలంలోలాగ యీ కాలంలో వివాహాదులలో పూర్వం మాదిరిని కళలను కోమట్లు, యితర సంపన్నగృహస్థులుగాని శక్త్యనుసారం పోషించతలఁచుకొన్నప్పటికీ యిప్పుడు వెళ్లేబ్రాహ్మలు కనపడరనేది. బ్రాహ్మలేకావాలా? యితరులు పనికిరారా? అంటారేమో! యీదిక్కుమాలిన భిక్షాటన వ్యాపారానికి బ్రాహ్మలంత చొరవగా తక్కినజాతులు యెగఁబడరని వేఱే వ్రాయవలసివుండదు. యిప్పటికి అంతోయింతో కళలలో అంతర్భూతంగావుండే దొంగతనాన్నిగూర్చి కొంతవ్రాసినట్లయింది, తక్కిన వాట్లల్లోకవిత్వాన్నిగూర్చి వ్రాయనక్కఱలేదని 'గృహలక్ష్మి' స్వయంగానే కోరింది; అందుచేత దాన్నిగూర్చి వ్రాయడం అవసరంకాకపోయింది. కాని ఆయీ కళలన్నిటితోనూ మాత్రం కవికిసంబంధం వుండాలి. అంటే? దొంగతనం చేయకపోయినా చేసే మెళుకువలు తెలిసివుండాలి. శూద్రకుఁడు మహారాజై వుండికూడా ఆయా మెళుకువలు తెలిసినవాడవడంచేతనే శర్విలకుఁడనే బ్రాహ్మడిచేత అంత చక్కఁగా చేయించగలిగాఁడు. "శ్లో॥ నసావిద్యా నసాకళా" అన్నాఁడుకదా? అంటే? కవికి పనికిరానివిద్యగాని కళగాని యెక్కఁడా వుండనే వుండదన్నాఁడు. అయితే చతుష్షష్టికళలున్నూ వచ్చిన కవులు పూర్వమేనా వుండేవారో, లేదో? ఒక్క హంసవింశతి గ్రంథకర్తను మాత్రం అన్నీ కాకపోయినా అస్మదాదులకన్న కొన్ని కళలు అదనంగా తెలుసునని అతని రచనవల్ల గోచరిస్తుంది. 'యే కవికి యేయేకళలు తెలిసిందిన్నీ, 'శిద్దానికి పారణం రసీద'న్నట్టు ఆ కవిరచనే తెల్పుడు చేస్తుంది. కొందఱికి యతిప్రాసలున్నూ గణాలున్నూ మాత్రమే తెలుస్తాయి. ఆ బాపతుకవులు యేదో వ్రాయవలసివస్తే వ్రాస్తారుగాని దానిలో యే బాపతు కళగాని కాంతిగాని లేకపోవడంచేత కళకాంతులు లేని రచనగా లోకం భావిస్తుంది.

చతుష్షష్టకళలలో 44-వ నంబరు మొదలుకొని 51-వ నంబరువరకున్నూ ప్రతిశృంగారపురుషునికిన్నీ తెలిసివుండవలసినవేఅయినా విటులకుమాత్రం (అందఱికీ కాదు కొందఱికి మాత్రమే) తెలిసివుంటాయి. ఆ తెలియడమేనా యెవరికో తప్ప అందఱికీ తెలిసివుండవు, విటుఁడు విటుఁడంటూ తేలికగా చూస్తారు గాని తీరా అందులోకి దిగేదాఁకానే కాని, దిగిన తరవాత అందులో పేరుతెచ్చుకోవడంకూడా, కవిత్వాది కళలలో పేరు తెచ్చుకోవడానికి యెంతపరిశ్రమ చేయాలో దీనికిన్నీ అంత పరిశ్రమగాని అంతకంటే ఎక్కువ పరిశ్రమగాని చేయవలసివుంటుంది. కాని విషయం సద్విషయం కాకపోఁబట్టి విటునకు విటత్వ ప్రయుక్తమైన గౌరవం వున్నట్టులేదు. ఈ కళలలో సభాగౌరవం యేకొన్నిటికో తప్ప చాలావాటికి లేదు. అంతమాత్రంచేత తత్పరిజ్ఞానం దూష్యంకాదని ఉదారహృదయులు తెలుసుకుంటారు. పరిజ్ఞానమాత్రంతో తృప్తిపడడం దూష్యం కాదు గాని అంతతో తృప్తిపడక ఆచరణంలోకి దిగితే తప్పక దూష్యమవుతుందనేది యిందలి రహస్యం. విటశబ్దం కేవలసామాన్యానాయకపరంగా నర్సభూపాలీయాదులవల్ల తేలుతుంది. విటుఁడు సామాన్యానాయకుఁడు మాత్రమేకాక త్రివిధనాయికాభర్తలలో సామాన్యానాయకునకు నర్మసచివుఁడుగాకూడా వుంటాఁడని మృచ్ఛకటిక ప్రకరణం మొదలైన మఱికొన్నిటివల్ల తేలుతుంది. మృచ్ఛకటికకవి సర్వవిధాలా దూష్యమనుకొనే దొంగతనానికూఁడా కొంత గౌరవాన్ని సమర్థించివున్నాడు.—

"నిక్కమ్మగ నొక్కనిం గొలుచుకన్నను దొంగతికమ్మ తక్కువే"

అని మేము దాన్ని తెలిఁగించిన పద్యపాదం. ఇది మా స్వకపోల కల్పితంకాదు, మేము అనువాదకులం గదా? అయినా 'కాళిదాసుగారి కవిత్వం కొంత మా పైత్యం కొంతా' అనే అనుమానంకలవారు మూలగ్రంథాన్ని తిలకించండి. జమీందారులలో యెందఱో మొట్టమొదట సామాన్యపుదొంగలుగా వుండి, తరువాత బందిపోటు దొంగలక్లాసులోకి వచ్చి, క్రమంగా భూస్వాములై, తరవాత పెద్దరాజులుగా పరిణమించినట్టు పరిశీలిస్తే తేలుతుంది. భయపడుతూ భయపడుతూ వొకళ్ల ఆస్తిని అపహరించే అవస్థలోనే దొంగతనం అనిపించుకుంటుందిగాని, నిర్భయంగా వచ్చి వూళ్లకు వూళ్లుదోఁచుకుంటూవుండడం శూరత్వలక్షణంగా పరిణమిస్తుంది. ప్రస్తుతం జపానువారు వగయిరాలు మహాశూరులుగానే చరిత్రల్లోకి భవిష్యత్కాలంలో యెక్కుతారు. ఇతర రాష్ట్రీలవారిని నిరాటంకంగా ఆక్షేపించలేకపోవడానిక్కారణం వారు మళ్లీ ఆక్షేపిస్తారేమో అనే సందేహంచేతనే. 'అందఱింట్లో అంతంత పొయివుంటే మా యింట్లోనూ వుంది మట్టిపొయి" అన్న సామెతగా వుంటుంది పయివిషయం. కళలన్నిటిలో, పరలోకంమాట చెప్పలేముగాని, బాగాసాఁగేయెడల యిహలోకానందాన్ని కలిగించడంలో దొంగతనమే మొట్టమొదటి తరగతికి వస్తుంది. కొండఁడనే గజదొంగ విషయం మొన్నమొన్నటిదే. వాఁడివిచారణ బందరులోనే జరిగింది. ఆదొంగ భద్రాద్రిరామునియెడల మిక్కిలి భక్తుఁడు. యింకొక తురకనైజాం యిలాకాలో వకసామంతరాజుల యెస్టేటులోమట్టుకు దొంగతనం చేసుకోవడానికి ఆ జమీందార్లు సాలు 1-కి 600-0-0 రూపాయిలు పన్నుకట్టే పద్ధతిని లైసెన్సు యిచ్చివున్నారని చెప్పకోగా విన్నాను. నల్లమందూ, గంజాయీ, సారా మొదలైన నిషిద్ధవస్తువులను విక్రయంచే వర్తకుల క్లాసులోకే ఆ దొంగకూడా జమీందార్ల తాత్పర్యంలో చేరినట్లయింది. కొందఱు జమీందార్లు దొంగలని అరెస్టు చేసి ఖయిదులో వుంచడమయితే వుంటుందిగాని, వాళ్ల చేతనే అవసరమైతే దొంగతనం చేయించడంకూడా వుందని మేము దేశాటనం చేసేకాలంలో వినివున్నాం. అయితే ఆ జమీందార్లు పండితులకూ కవులకూ యేదేనా బంగారువస్తువులు (కంఠిపగైరాలు) బహుమతులిచ్చే సందర్భంలో ఆ దొంగలు తెచ్చిన బంగారాన్ని వినియోగపఱుస్తారనికూడా విన్నాము. క్రియతోమాట "పాపాలకల్లా భైరవులు" బ్రాహ్మలని ఆ పాపిష్ఠిద్రవ్యాన్ని వీళ్లు భరిస్తారని అలా చేసేవారని తోస్తుంది. ఆ సొమ్ము స్వంతఖజానాలోకి మాత్రం చేర్చరన్నది నిజం. యేదో వ్రాసిన కొద్దీ పెరుగుతూవుంది చేదస్తంగాను.

సంవాహనంకూడా వకకళే. సంవాహనమంటే వొళ్లు పిసకడం. మృచ్ఛకటికలో చారుదత్తుడుగారి దగ్గర సంవాహకుఁడుండేవాఁడు. అతఁడు బ్రాహ్మఁడు. అతనికి సంవాహనవిద్యలోనే కాక జూదంలోకూడా పాండిత్యంవుండేది. వొకరోజు జూదంలో వోడిపోయినప్పుడు వసంతసేన అనే భోగంది ఆయనకు వుపకారం చేసి అవతలివాళ్లబాధనుంచి విడిపించి 'అయ్యా, తమరెవరు, యేవిద్యయందు ప్రవేశం కలవా'రని అడుగుతుంది. దానిమీఁద ఆయన 'నేను బ్రాహ్మణుణ్ణి, సంవాహనవిద్యలో ప్రవీణుణ్ణి' అని సిగ్గుపడుతూ జవాబు చెపుతాఁడు. దానికి ఆ విడ చమత్కారంగా చిఱునవ్వునవ్వి 'మృదువైనవిద్యను అభ్యసించినారే' అని అభినందిస్తుంది. ఇదికూడా వక విద్యేకదా? అంటే కళే కదా అని అభ్యసించానంటాఁడు ఆ బ్రాహ్మడు. ఆయీపనులు చతుష్షష్టికళలలో చేరినవే అయినా వీట్లలో యేకొన్నిటినో తప్ప సంప్రదాయమైన బ్రాహ్మణులే కాదు, తక్కినజాతులలో ఉత్కృష్టజాతివారే కాదు అభ్యసించేవారుకారు. అభ్యసిస్తేనో? వారిని ఆ సమయంలోనే తప్ప యితరత్రా గౌరవించడం వుండేదికాదు. 'బాగోతుల బుచ్చిగాఁడికొక కొంచెమనంగ

గృహంబు చేయమిఁ' వగయిరాలవల్ల యీ సంగతి తేటతెల్లమవుతుంది, అప్పుడు మాత్రం యెంత గౌరవం వుండాలంటే?—

క॥ పతిరాచ పనికిఁగాదా?, వెలకామిని పాన్పుద్రొక్క విటుఁడు సహించున॥

అన్నాఁడు వకసందర్భంలో అడిదం సూరకవిగారు. వ్యాసం విస్తరిస్తూవుంది. యిప్పటికింకా యేకళను గూర్చిన్నీ విస్తరించి వ్రాసినట్లేలేదు. యిప్పుడు దొంగతనపు కళలోన్నుంచి ప్రసక్తానుప్రసక్తంగా సంవాహనమనే కళలో వున్నాము. ఈసంవాహన కళ యిప్పుడు బాగా నేర్చినవారు బ్రాహ్మల్లో వున్నట్టులేదు గాని, గంజాంజిల్లాలో ఓఢ్రమంగళజాతిలో యీకళ యిప్పటికిన్నీ బాగా పాదుకొనివుంది. నేనుమందస సంస్థానానికి వెళ్లినప్పుడు యీసంవాహనకళను బాగా అనుభవించివున్నాను—మాగోదావరిజిల్లాలో కూడా కొందఱు ఆదేశస్థులు వలసవచ్చి యీసంవాహనకళవల్ల జీవిస్తూవున్నవాళ్లు వున్నారు. ఓఢ్రదేశంలో సంగీతకళ సర్వశూన్యంగాని, భగవంతుఁడు ఆ కళకుబదులుగా యీకళను ఆదేశంలో అభివృద్ధి పరిచాఁడను కుంటాను. ఆయీకళలు క్వాచిత్కంగా సర్వవర్ణస్థులున్నూ నేర్చినప్పటికీ కొన్నికళలను కొన్ని జాతులునియతంగా యేర్పడివుండడం యిదివఱలో అచారం. ముచ్చిపని, బంగారుపని, చెప్పులుకుట్టడం యివన్నీ కళలలోకేవస్తాయి. చిత్రంఅనేది ముచ్చిపనే అవుతుంది. యీ 64 టిలో కొన్ని మఱికొన్నిటిలో అంతర్భూతాలు కూడా కావచ్చును. ఆపద్ధతిని కొంతసంఖ్య తగ్గుతుంది.

బ్రాహ్మణులు ఆయీ కళల్లో కవిత్వాన్ని తప్పతక్కినవాట్లను అంతగా అవలంబించేవారు కారని తోస్తుంది. ఋషులుకూడా కవులుగావున్నట్టు బాహాటంగా కనపడడంచేత నేమి, 'నానృషిః కురుతే కావ్యమ్' అని యితరులకేనా అంతో యింతో ఋషి అంశవుంటేనే కాని కవిత్వం పట్టుపడదని అభియుక్తోక్తి వుండడం చేతనేమి, ఆకళమట్టుకు అనాదిగా బ్రాహ్మణులు అవలంబించడానికి సంశయించినట్లు కనపడదు. గానాన్ని కూడా నారదాదులు అవలంబించినట్లు వున్నప్పటికీ తదవలంబకులను శుద్ధశ్రోత్రియులు పూర్తిగా యీసడించినట్లే కనబడుతుంది. దక్షిణదేశంలో మాత్రం తదవలంబకులలో చాలామంది బ్రాహ్మణేతరులలోవున్నప్పటికీ యిప్పటికింకా ఆచార్యస్థానంగా బ్రాహ్మణులేవున్నట్టు తేలుతుంది. నాట్యంకోసం ప్రత్యేకించి వకజాతి వేశ్యలువున్నట్టు కనబడుతుంది. బ్రాహ్మణులలోనూ, విశ్వబ్రాహ్మణులలోనూ కొందఱు స్త్రీవేషంధరించి లోకాన్ని సంతోషపెట్టినవాళ్లు లేకపోలేదుగాని, సామాన్యంగా నాట్యాభినయాలు స్త్రీలకు శోభించినట్టు పురుషులకు శోభించవనే చెప్పవలసివస్తుంది. నాట్యందాకాయెందుకు? గానండాకూ మగవాళ్లవల్ల వినడం ఆహ్లాదజనకం కాదన్నాఁడు శూద్రకమహాకవి. అంటేఅన్నాఁడుకాక, మగవాళ్లుకూడా మృదువుగా పాడేవాళ్లున్నూ చక్కఁగా అభినయించేవాళ్లున్నూ క్వాచిత్కంగా లేకపోలేదు. యింకొకటి మాత్రం విచారించాలి. యెంత మృదువుగా హాయిగా పాడేవాళ్లేనా మగవాళ్లకు వికారపు చేష్టలుంటాయి. ఆడవాళ్లకు అవివుండవు. దాన్ని ఆలావుంచుదాం. అభినయంలో వున్నట్టులేదు గాని క్వాచిత్కంగా సంసారిస్త్రీలకు గానంలో కొంత ప్రవేశం వెనకటికాలంలోనూ వుండేది. కాని ఆ స్త్రీలు సభలకెక్కిన మాత్రం కనపడదు. యిప్పుడు స్త్రీస్వాతంత్ర్య దినాలు కనుక కొందఱు సభలుకూడా చేస్తూన్నారు. కొందఱు స్త్రీలు సినీమా యేక్టర్లుగాకూడా తయారై పేరుప్రతిష్ఠలు గడిస్తూన్నారని పత్రికలవల్ల తెలుస్తుంది. అది వుచితంగాదని పూర్వాచారపరాయణులంటారు. నవీనులుమాత్రం ఆలా అనరు.

ప్రస్తుతం సంధికాలం. యింకా కొంతకాలానికి యీవిషయం యేలాపరిణమిస్తుందో తెలియదు. పూర్వుల అభిప్రాయంమట్టుకు రంగస్థలానికెక్కే స్త్రీలు స్వతంత్రంగా వుండవలసినవారే కాని, భర్తృప్రతిబంధకంలో వుండతగ్గవారుకారనియ్యాలే. అయితే ప్రస్తుతం ప్రతివిషయమున్నూ పూర్వులకు వ్యతిరేకంగానే జరుగుతూ వుంది; దానిలో యిదివకటి. 'గృహలక్ష్మి' తఱచుగా ఉత్తరాలమీఁద ఉత్తరాలు వ్రాయడంవల్ల యేవో నాల్గు మాటలువ్రాశానుగాని, నాకు వ్రాసే సామర్థ్యం వొంట్లోనూలేదు, పాండిత్యంలోనూలేదు. అంతో యింతో ఆయీకళలలో కవిత్వాన్నిగుఱించే అయితే వ్రాస్తే వ్రాస్తానేమో; దాన్నిగూర్చి వ్రాయనక్కరలేదని 'గృహలక్ష్మి' వ్రాసివుంది; పైఁగా లలితకళలనుగూర్చి వ్రాయవలసిందిగా ఆవిడకోరింది. చతుష్షష్టికళలలో దేన్నిగూర్చి వ్రాసినప్పటికీ ఆ లలితవిశేషణం వుంచవలసివస్తుంది, తీసివేయవలసివస్తుంది. లలితంగా ఆకళలనిప్రదర్శిస్తే అది లలితంగావుంటుంది. మోటుగా ప్రదర్శిస్తే లలితంకాకపోతుంది. నేనిందు దేన్నిగుఱించిన్నీ విపులంగా వ్రాయకపోయినప్పటికీ కొంతవఱకు దొంగతనాన్నిగూర్చి వ్రాసినట్లయింది. అందులో హత్యలు వగయిరాలు లేనిపద్ధతి దొంగతనాన్నిగూర్చే వ్రాయడంచేత అది లలితకళగానే అనుకోవచ్చునని నేననుకుంటాను—మొత్తం చతుష్షష్టి కళలపేర్లు మాత్రం రఘువంశవ్యాఖ్యానంలో చూచి యేకరువుపెట్టి వున్నానుగాని అందులో యే కొన్నిటినిగూర్చో నాకు కొంచెంతెలుసును గాని తక్కినవాట్ల స్వరూపమే నాకుతెలియదు. యిది వినయార్థంవ్రాసేమాట కాదు, యథార్థం. అయితే 'కళాప్రపూర్ణుఁడ' వెలాగయినావని అడుగుతారేమో? యూనివర్సిటీవారికి నాయందుకల్గిన నిర్వ్యాజాభిమానంవల్లనే అయినానని చెప్పఁగలనేకాని అంతకు మించిన జవాబు చెప్పలేను. యిదిన్నీకాక ఆయీ బిరుదు సంస్కృతభాషలోవున్నప్పటికీ దాన్ని యిచ్చే సంప్రదాయం హూణభాషకు సంబంధించినదని నే ననుకుంటాను. వారు దీనికిజెప్పే అర్థమేమో నాకుతెలియదు. దాన్నిబట్టి సమర్థనీయం అయితే అవుతుందేమో? యేదో వ్రాశాను. 'గృహలక్ష్మి' కోరిన కోరిక నెఱవేఱిందో లేదో; వీలుగావుంటే ప్రచురింపవచ్చును, లేదా ప్రచురింపనక్కఱలేదు. ఇంతేనా విజ్ఞప్తి—స్వస్తి.



# సినీమాలు – విద్యాభివృద్ధి

శ్రీ విం. అ. సూర్యనారాయణగారు

జ్ఞానసంపాదనకు చక్షురింద్రియము చాలా సహాయకారియని చెప్పనొప్పను. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అను వాక్యమునందెంతయు సత్యమున్నది. ఒక వస్తువుయొక్కగాని ఒక విషయముయొక్కగాని సంపూర్ణజ్ఞానమును పొందవలెనన్న అందులకు అంతర్దృష్టి యెంత అవసరమైయున్నదో బాహ్యదృష్టి బాహుళ్యముకూడ అంత ఆవశ్యకమైయున్నది. చక్కని, స్వచ్ఛమైనదృష్టిసంపద గల్గియుండినగాని విశిష్ట వస్తువులందలి సహజస్వరూప సౌందర్యములు బాగుగ పొడకట్టవు. పాఠశాలలందు బాలురకు భూగోళశాస్త్రమును బోధించుటకు ప్రపంచముయొక్కయు దేశములయొక్కయు పటములును, వస్తుశాస్త్రమును బోధించుటకు వస్తు ప్రదర్శనములును, కథలను బాగుగ బోధగావించుటకు చిత్రపటములును ఉపయోగింపబడుట అందఱెఱింగిన విషయమే. బోధింపబడు విషయములకు సంబంధించిన పటములను చూపుటచే నవి త్వరితముగ నని స్థిరముగ బుద్ధి గ్రాహ్యములగును. నిజానుభవైకవేద్యమగు జ్ఞానమునందు వస్తు స్వరూపపరిశీలన మొకభాగమైయున్నది. కేవలము మాటలతో నొక్క విషయమును విశద పరుచుటకంటె దానిని చిత్తరువందు వ్రాసి చక్షురింద్రియమునకు చక్కగ గోచరింపజేసిన నందలి యదార్థము బాగుగ మనసు గ్రహింపగల్గును.

విద్య నభ్యసింపనివారలకు విద్యగఱపి వారల నజ్ఞానాంధకారమునుండి తొలగించుటకు మంచి చిత్రప్రదర్శనము లెంతయు తోడ్పడును. సామాన్యజనులు స్వయముగపోయి చూడజాలని ప్రదేశములు, వింత దృశ్యములు, ప్రకృతి వైచిత్ర్యములు సినీమాలందు బహుకొలది వ్యయప్రయాసలతో చూడ నవకాశము గల్గుచున్నది. అనేక పురాణగాథలు, ప్రపంచచరిత్రయందలి యంశములు చిత్తరువులందు చూచు భాగ్యమును గల్గించు సినీమాల ప్రాముఖ్యతను గుర్తించనివారుండరు. దృష్టికితోడు శబ్దముగూడ కలియుటచే టాకీలు మూగప్రదర్శనములగు సినీమాలకంటె నెక్కుడు ఘనతగాంచి విశేషవిజ్ఞాన ప్రదాయకములై విరాజిల్లుచున్నవి.

అజ్ఞానాంధకారమును బోగొట్టుటకు ప్రపంచమందెల్లెడల నీ ఫిలిముకంపెనీలు పాటుపడుచున్నవి. రష్యాదేశములో ఫిలిములవలన గలిగిన విద్యాభివృద్ధి వర్ణనాతీతమై యున్నది. రష్యాలో నానాటికి అజ్ఞానము అంతరించుచు దేశమంతయు విజ్ఞానచంద్రికా వైభవముతో శోభిల్లుచున్నది. అందువలననే ఆ దేశమునందు ప్రజలజీవితమునందు గొప్ప మార్పులు గలిగినవి.

ఫిలిముప్రదర్శనముల మూలమున వ్యవసాయశాఖయం దెంత అద్భుతమగు అభివృద్ధికలిగినదియు ఇటలీదేశమందు ప్రత్యక్షము గావింపబడినది. 1924-వ సంవత్సరములో ఇటలీప్రభుత్వమువారు పొలముల నెంతయు బాగొనర్చి, అధికముగ ప్రశస్తమగు గోధుమలను పండింప పాటుపడుటెంతయు ప్రశంసనీయమగు విషయమై యొప్పుచున్నది. "గోధుమల ప్రచారము" (Wheat campaign) అను పేరిట రమారమి 2,000 మీటర్ల పొడవుగల చిత్రము సుమారు నూరుపట్టణములలో ప్రదర్శింపబడినట్లును సుమారు 2,500 పాఠశాలలలో నా చిత్రము ప్రదర్శింపబడి కోట్లకొలది ప్రజలచే సాయంసమయములందు వీక్షింపబడినట్లును విశదమగుచున్నది.

ఈ విషయములో అమెరికాదేశముకూడ చాల పరిశ్రమచేయుచున్నది. విద్యావ్యాప్తికి సినీమాప్రదర్శనము లెంతయు తోడ్పడగలవని అమెరికాయందు చక్కగా గుర్తింపబడినది. అందుచే నా దేశస్థులు వారిపిల్లలకు ఫిలిములమూలముననే విశేషముగా విద్యగఱపుచున్నారు. ఇంగ్లాండులో వ్యవసాయశాఖామంత్రివర్గమువారు శాస్త్రపరిశోధనా సహితమగు సాధనములచే వ్యవసాయ విద్యాభివృద్ధికై యెంతయో కృషిసల్పియుండిరి.

ఇట్టిచో జీవితమును పెంపొందించుట కనువగు మార్గముగ పరిగణింపదగు సినీమా పరిశ్రమ మనభారతదేశమునందు మాత్రమేల మిక్కిలి ప్రోత్సహింపబడరాదు? ఎల్లెడల నజ్ఞానాంధకారముచే నావరింపబడి అక్షరజ్ఞానములేనివారి నధికసంఖ్యాకులుగ గల్గియున్న మన దేశమునందుగూడ ప్రజలకు విద్యగఱపుటకే సినీమాల నేల ఎక్కువగా ఉపయోగింపరాదు? దేశమందీ ఫిలుముపరిశ్రమయొక్క ప్రాముఖ్యత ఇంకను బాగుగ గుర్తింపబడకుండుటెంతయు శోచనీయమైన సంగతియై యున్నది. ఫిలిములద్వారా విద్యావ్యాప్తి గావించుట బహు సుకరమును, స్వల్పవ్యయముతో గూడినదియు, త్వరలో సాధింపదగినదియునై యుండుట ఎల్లరకును విదితమైన విషయమే.

గ్రామపునరుద్ధారణమునకు సినీమా లెంతయు సహాయకారులు. మోటారుబండ్లను సినీమాసామగ్రితో నింపికొని ఒకయూరినుండి మరియొక యూరునకు గొనిపోవుచు నీ వింత దృశ్యముల నుచితముగ గ్రామస్థులకు జూపుచు, వారి నాకర్షించి వారి మనములకు ముదమును, జ్ఞానబోధయును గావింపవచ్చును. ఇందుకొరకై ప్రత్యేకఫిలిములను తయారుచేయవలెను. వ్యవసాయ సంబంధమగు నూతనపద్ధతులు, ఆరోగ్యము, గ్రామపారిశుద్ధ్యము, ప్రాథమికచికిత్సావిధానములు, చేతిపరిశ్రమలు మొదలగు విషయములకు సంబంధించిన చిత్తరువులు, సాంఘికజీవితవ్యవహారములు మొదలగువానిగూర్చి బోధసలుపు ఫిలిములను తయారుచేయించి, వారికి ప్రదర్శనముల నేర్పాటు గావించినచో గ్రామములలోని ప్రజలందరును జ్ఞానవంతులై దేశాభ్యుదయమునకు పాటుపడ గల్గుదురు.

# సేవకురాలుగాదు - సహచారిణి!

శ్రీమతి వల్లభనేని రంగాదేవిగారు



వండి పెట్టెడి
దాసీ దనుకొని
పిల్లల బెంచెడి
దాదనుకొంటే
నరకంబే ?

దూర దేశపు
యంత్రం బనుకొని
అవసరమప్పుడె
కదిలిస్తుంటే
పతనంబే ?





అధికారంబున
సేవలు బొందగ
పురుషుడు దలచిన
నరకంబగురా
గృహంబూ ?



సేవలుబొందుటె
ధర్మంబనుకొని
సేవలు జేయని
చెలరేగిన మరి
ఛిద్రంబే ?

దాసీ లాగా
సేవలె చేయుమన
పవిత్ర ప్రేమలు
పాడయిపోవును
గాదామరి ?





ఒకరికి నొకరూ
పూతంబగుచూ
దాసీ గాదని
సహచారిణి యని
చరించరా ?



భర్తల సేవలు
భార్యలు జేయుట
కర్ధంబేమన
సహచర్యంపూ
ఫలితంబే ?

ఆలీ మగలూ
ఆత్మలు గలపీ
సేవలు బొందితె
సహచర్యంబని
తెలుసురా ?

# ఆభరణాలెందుకు ?

శ్రీ గజపతిరాయవర్మగారు

● సర్. విలియం రిడ్జివె థియరీ ● రామపిషరోటి పరిశోధనావ్యాసం ●

● కేరళాభరణ సాంప్రదాయం ●



సొమ్ముంటే ఆశ, మరేదో అంటే గోసా సామ్యముంది. నగలంటే అందరకూ ఆశే—ఆబాలగోపాలం ఆభరణాలుచూచుకు మురిసిపోతుంటారు. ఆభరణాలకై అనేకులనేకపాట్లు పడుతుంటారు. అసలీఆభరణాలెందుకు ? ప్రపంచంఅంతటా అందరూ నగలుమోస్తుంటారు. అందానికా ? కాదు. ఇంకా లోతైనకారణం ఉంది.

మానవజాతిలో అలంకారాలు తొడగనివారలు లేరనడం ఏమాత్రం సాహసంకాదు. జాతిమతవర్ణ వివక్షతల్లేకుండా స్త్రీపురుషులంతా నగలు పెట్టుకోడానికి ముచ్చట చూపుతున్నారంటే ఒక పెద్ద కారణం ఉండకపోదు. అసలు నగలమోజు మనుష్యులకు స్వతహాగాకల్గే కోర్కెల్లో ఒకటి. అందరూ అలంకరించుకుంటారు. ఎవరిఅభిరుచులు వారివి. కాని వీరిలో ఆభరణాలు ధరించడం ఎందుకో ఎరిగినవారు ఏ అత్యల్ప సంఖ్యాకులో ఉంటారు. నగలతీరులో ధారణాపద్ధతిలో తేడాలుంటాయి. వయస్సు, జాతినిబట్టి కాలానుగుణ్యంగా ప్రత్యేకాభరణా లుంటాయి. పాతఫాషన్లు పోతుంటాయి. క్రొత్తవి వస్తుంటాయి. కాని ఆవిలోహాలే ఇంచుమించు ఆ ఆకారాలే ఎందుకుండాలి ?

కేంబ్రిడ్జి యూనివర్సిటీలో ఆర్కియాలజీ ప్రొఫెసరు, సర్. విలియం రిడ్జివె సిద్ధాంతంచెప్పాడు; జౌనాకాదా అని పరిశోధించి రామపిషరోటి వ్రాశాడు, ఈకేరళుల ఆభరణసాంప్రదాయ వివరణ. రిడ్జివే సిద్ధాంతాన్నిబట్టిచూస్తే ఆభరణాలు అందానికీ అభిరుచికి కావని తెలుస్తుంది. ఒకకులానికి, ఒకమతానికి, ఒక వయఃకాలాన్నిసూచించే ప్రత్యేకాభరణాలున్నాయి. నీటిలో అనేకులకు మాంత్రికసంబంధం ఉంది. ఆయుక్తిణీ వింటానికి వింతగాఉంటుంది. కాని ఆలోచించినకొద్దీ జౌననిపిస్తుంది. ఈకారణాన్నే, వన్నె చిన్నెలు హెచ్చుతున్నా, చాలా నగలఆకృతీ తయారూ అలానే ఉండిపోతూంది.

మలయాళీలకు ఇతరులకూ ఓభేదం ఉంది. వీరిలో శిరోభూషణాలు, కర్ణాభరణాలు, నాసికాలంకారాలు, వడ్డాణాలు, అందెలు మొదలైనవి అంతగా ధరించరు. కాని పశివాళ్లు మొలకూ కాళ్లకూ నగలు పెట్టుకుంటారు.

సాధారణంగా నగలు కంఠానికి, చెవులకు, ముంజేతికీ పెట్టుకుంటారు. ఆభరణాలు మొలక్రిందికిదిగవు. ఏమంటే కాళ్లకూ వాటికీ బంగారం, రత్నాలుపొదిగినవీ ధరించకూడదనే అభిప్రాయం ఉంది. రత్నాలు ధరిస్తారంటే ఎక్కువవన్నీ ముత్యాలు, ఇతరరత్నాలు ముత్యాలతర్వాత, అన్నీఅయాక ఆఖరుది బంగారం. ఏపిసరో బంగారం ప్రతీశరీరంమీదా ఉండాలట. ఇది ఆయుర్వృద్ధికరవిధానం. బంగారు కొనుక్కోలేని బీదలుతప్ప మరెవరూ వెండినగలు ధరించరు. రాగిఉంగరాలుమాత్రం ఉన్నాయి. దీనికీ ఓకారణంఉంది. ఎవరిశరీరంపై రాగివుంటుందో వారు పవిత్రులవుతారని వాళ్లనమ్మక. రాగిని ఇతరలోహాలతో కలిపికూడా ధరిస్తారు. రాగికలిసినగాజులూ అవీ నంపూత్రి (నంబూద్రి) స్త్రీలు ధరిస్తారు. ఇనుముకూడా ఉపయోగించు

కుంటారు కాని ధరించాలనే తప్పనిసరితనం లేదు. పురిటిపాపలకు ఇనపఉంగరాలు, గాజులు, కడియాలు వేస్తారు. బుతుదోషాల్లోనూ, వివాహసమయంలోనూ స్త్రీలు ధరిస్తారు. సూతకాల్లోనూ, చచ్చినవాని కార్యం చేస్తున్నప్పుడూ పురుషుడు ఇనుము ధరిస్తాడు. ఇలాంటప్పుడు సాధారణంగా కడియమో, చిన్న చాకో పట్టుకుంటాడు. గాలీ ధూళీ సోకనీయదట ఇనుము. (మనం శని అంటాం.)

నగలకు లోహాలూ రత్నాలేగాక చెట్లు చేమలు జంతువులుకూడా వస్తువులనిస్తాయి. చెట్లవేరులు, కాడలు, వ్రేళ్లు, గింజలు, కాయలు, పండ్లుకూడా ఆభరణాలుగా ఉపయోగింపబడుతుంటాయి. 'ఏలాణి' గింజను తాయత్తుగా ధరిస్తారు. జంతువులవి, ముఖ్యంగా పులిగోరు, దంతం, ఏనుగతోక వెంట్రుకలు ధరిస్తారు.

కేరళులఆభరణాలను మూడువిధాలుగా విభజింపవచ్చును. మొతీరం, తాళి, మాల. వయస్సననుసరించి ధరిస్తారు. మోతీరం చిన్నప్పుడు ధరించేనగలు, తాళిమాలలు పెద్దయాక ధరించేవి. మొతీరంఅంటే సాధారణంగా అంగులీయకం, కంకణమూను, మోతీరం అన్నిఆభరణాల కనువర్తిస్తుంది. అలాంటిదే పలకమోతిరం. అసలు కంకణం మొదటిఅలంకారం. కంకణాన్నీ పతకాన్నీకూడా మొతీరంఅంటారు. పాలకాయమొతీరం అంటే పాలచెట్టుకాయల పోలికనుండే బంగారువీ, పాలకాయలతో తయారైన కంఠాభరణమూను. పులినఖ మొతీరం-పులిగోరుపతకం.

తాళికి గింజలూ గోళ్ళూ పనికిరావు. పుత్తాళిఅంటే బాగావిడిసిన తామరపువ్వు ఆకారపు ఆభరణం. (మన చేమంతిపువ్వులేదూ) కన్నాడివిగ్రహం అంటే అదో దేవతావిగ్రహచిహ్నం. క్రైస్తవులు సిలువ మెడలోవేసుకున్నట్లుంటుందిది. పెండ్లయిందిసుమా అని తెలియడానికి మనంవేసే శతమానంవంటిదే తాళి. నాగపటతాళి పాముపడగలా ఉంటుంది. వైరమణీ, పనమాల మొదలైనవి మాలల్లోజను. ఈమాలల్లో వజ్రాదిరత్నాలు పలకలుగా గుండ్రంగా సానబట్టినవి గుచ్చిఉంటాయి.

ఈఆభరణాలననుసరిస్తే మరోకారణంకూడా కనిపిస్తుంది. వృక్షపూజ, హానిచేయవద్దని చేసేమృగారాధన, విగ్రహారాధన మొదలైన చిహ్నాలగుపడుతున్నాయి.

మోతీరం, తాళీ కాని ఆభరణం ఒకటుంది, యంత్రముకుళాల్. పేరునుబట్టి మాంత్రికమని తెలుస్తుంది. అనేకులు కనికట్టు, గారడీవాళ్లరకం రాగిరేకులు ధరిస్తారు. గాలీ ధూళీ సోకనీయకపోవడమేగాకుండా జవళ్యాని కుపకరిస్తుంది. ప్రాచీనమైన ఈతాయత్తుకు క్రమశః ఆదరణ అడుగంటిపోతూంది.

తాళిలో కాశాళి కంఠాభరణం, (కాసులపేరు) ఈకాసులమీదిబొమ్మలు దశావతారాలు. మోక్షదాయకంఅంటూ దశావతారాలు పేరువేసుకుంటారు. అందులో నంపూత్రి స్త్రీలు బహుళంగా ధరిస్తారు. కాసుఅంటే సాధారణంగా నాణెం. విళకాసు మనపిల్లకాసువంటిది. ఈనాడు కాసులమీద బ్రిటిష్ బుర్రలూ, ముద్రలూ వస్తూన్నాయికాని ప్రథమంనుంచీ చాలకాలంవరకూ ఈనాణాలమీద దేవుడుబొమ్మలే ఉండేవి. అలాంటివాట్లో లక్ష్మీపుతణ (వెండికాసు) విలువ 10, 20 పైసలు, ఒకప్పుడీ కాసులమీద ఇష్టగృహకులదైవాల చిత్రాలుండేవి. నాణెములపుట్టుకజూస్తే మొదట్లో వాటిపై బొమ్మలు దేవుళ్ళూ, వారియిష్టమైనఇతరాలు, ఆయుధాలు ఇత్యాలుండేవనవచ్చును.

## —బాల్యంలో నగలు—

ఆరోనెలలోపెట్టే ఆభరణం చోరుణు; అన్నప్రాశనసమయంలో ధరింపజేస్తారు. సాధారణంగా మొగశిశువుల మెళ్ళో వర్తులాభరణం కడతారు. ఆడపిల్లలకు చోరుణుతాళి కడతారు. ముంజేతులకు వళ, కాళ్లకు తళ నగలు పెడతారు.

పులియ (పులినఖ) మోతీరం పులిగోరుపతకం, ఇప్పుడంటే కృత్రిమాలొస్తున్నాయి కాని, చాలామంది అసలు పులిగోర్లే కట్టిస్తారు. ఇప్పుడే ఫాషన్సు మారుతున్నా పులిగోరు పతకాల్లో మార్పులు రావడంలేదు. బంగారేకాక కొందరు రత్నాలుకూడా చెక్కించుకుంటారు. తల అని మధ్యను రెండుపులిగోర్లు కలిపికట్టిస్తారు. తలగాక ఈపతకంలో ఇంకా విడివిడిగా ఇరవైఏడు పులిగోర్లుంటాయి. సాధారణంగా పులిగోరుపతకం మొగపిల్లల మెళ్లోనే వేస్తుంటారు. పతకం, పేరూ మొగాళ్లే ధరించాలనే నియమాన్నిబట్టి ఆలోచిస్తే 'వీరం' కారణమని గ్రహించవచ్చును. ఒకవీరుడు ప్రతాపచిహ్నంగా పులిగోర్లు, కొడుక్కూడా తనంతటివాడవాలనే ఉద్దేశంతో, బాలుని మెడలో వేస్తాడు. పులిగోరు, దంతం ధరిస్తే పీడకలలూ అవీ రావనే అభిప్రాయం ఉంది.

పాలకా(య) మోతీరం ఆడపిల్లలిఆభరణం. పాలచెట్టు కాయలపోలికలు. రజస్వల అయేవరకూ ఈనగ అమ్మాయిమెళ్ళో ఉంటుంది. భగవతికి పాలచెట్టు ప్రియమైనది. భద్రకాళి ఆలయపరిసరాల్లో ఈచెట్లు ఎక్కువగా నాటుతారు. అందుకనే పాలకాయఆకారం నగలుచేయించి అమ్మాయిల కంఠాభరణాలు చేయడము. కులాలు మోతీరంకూడా ఆడపిల్లలఆభరణమే, కాడలుకాడలుగా ఉంటుంది.

నడుముకు రెండురకాలున్నాయి ఆభరణాలు. కింగాణి గల్‌గిల్‌మంటుంది. మొలచుట్టూ మువ్వలు చిరుగంటలు ఉంటాయి. కదలికల్లో ధ్వనిస్తుంటాయి. ఆమువ్వల్లో రెండురకాలు, గుండ్రంగావుండేవి బాలురకూ, ఒకవైపు లోపల పల్చగావుండి పైకి ఉబ్బెత్తుగాఉండేవి ఆడపిల్లలమొలకూ కడతారు. అందవికారంగా ఉంటాయి ఈకింగిణి చిరుగంటలు, మువ్వలూను. గాలీధూళీ ఈకింకిణీధ్వనులు విని పారిపోతాయట.

పారణెళసు (బిళ్లలు) బాలబాలికలు ధరిస్తారు. స్త్రీలకు కంఠాభరణం, పురుషులు బిళ్లతాడువలె మొలకట్టుకుంటారు. కానీ అలంకారం పాతదైపోయింది. ఇదీ మాంత్రికసంబంధమనే తెలుస్తుంది. బంగారురేకులు (యంత్రం) ఈబిళ్లల్లో మూస్తారు.

ఎలుంకాయెళాను వెండిది, బాలురు, నంపూత్రి స్త్రీలు ధరిస్తారు.

శిశువులు ఎదిగాక చెవులుకుట్టిస్తారు. పూర్వపు కర్ణాభరణాలు నేటికీ నాయర్లలో ఉన్నాయి. పూర్వం ఈపోగులమధ్యకాడకు ముత్యంఉండేది. రానురాను ముత్యాలుఖరీదు హెచ్చినందున ఆస్థలం ముత్యానికివదులు కొంచంలోహాన్నే పిండిలా చేయించుకోనారంభించారు. అంబళవాసులీ ఆభరణం ముట్టుకోరు. పరమ ఛాందసులు (నిష్టాపరులు) నింద్యం అన్నారు.

ఆడపిల్లలు చెవులు ఇంకాసాగాలి. జైనవిగ్రహం వాటివలెనన్నట్లు వివిధపరిమాణాల బెండ్లుచెవుకుట్లల్లో పెడతారు. అవసరమైనంత రంధ్రంకాగానే బెండుతీసి గుండ్రనికర్ర లేక బంగారుబిళ్లలు పెడతారు. గ్రామ ఫోనురికార్డుమీది గీతలవలె దీన్నిండా గీతలుంటాయి. ఇవే తోటలు. మలయాళంలో తోటు అంటే తోట. ఈకర్ర నగలమీద రంగులూ చిత్రమైననక్షీలూ ఉంటుంటాయి. తర్వాత కర్రకుబదులు బంగారు తోట లొచ్చాయి. కొందరు వీటిమీద రత్నాలూ పొదిగిస్తారు. నంబూద్రి స్త్రీలుతప్ప ఇతరులీకర్రనగలు వివాహం వరకూ పెట్టుకుని తర్వాత బంగారుతోట తగిలించుకుంటారు.

రజస్వలకుపూర్వం ఆడపిల్లలు ధరించేవాటిలో మరో రెండురకాలు. నిలకా(య) మోతిరం-ఈకంఠా భరణం అవివాహితగా ఉన్నంతకాలం ధరిస్తుంది. తాండుమ్మోతీరాన్ని వ్యక్తురాలై వివాహానంతరంకూడా వేసుకుంటుంది. ఈఆభరణాలు గింజలు కాడలులా ఉంటున్నా చివళ్లు పాముపడగల్లాఉంటాయి. నగల్లో పాముపడగలుచూస్తే ఏనాడో అంతరించిపోయిన నాగులకూ వీరికీఉన్న సన్నిహితమా ఏమిటి అనిపిస్తుంది.

## —పెద్దయాక పెట్టుకు నేనగలు—

ఇందులో ముఖ్యాలు వివాహచిహ్నాలు; తాళి (శతమానం) చెవులు, ముంజేతులు, కంఠాభరణాలు. శతమానాన్ని (తాళి) భర్త బ్రతికున్నంతకాలం మనలోవలెనే ధరిస్తుంది. తాళి ఆకృతి ఆనాటి యీనాటికీ—ఒకలాగే చలనంలేకుండా ఉంది. పవిత్రంగా ఎంచబట్టి ముకురవిగ్రహం (కన్నిటిబింబం) ఓ ప్రత్యే దేవతాస్వరూపం, శతమానం దీనిరూపమే. ఒకవర్ణంవారింకోరకం మంగళసూత్రం కట్టుకుంటారు. ఏరుద్రాక్ష వంటిదో కట్టుకు నేవారు అంబళవాసులు (పరియరులు).

నంబూద్రిల్లో అధ్యానవాశ్యాను లనబడుశాఖలవారు రెండురకాలతాళి వేసుకుంటారు. ఇద్దర్లోనూడున్న తేడాఏమంటే ఆధ్యానులలో ఉబ్బెత్తుగాఉన్నవైపే శతమానము పైకుంటుంది. హాస్యానులతాళి పల్లంగా ఉన్నవైపు పైకుంటుంది. మధ్యనోపూసవేసి వీళ్లు రెండుమంగళసూత్రాలు కట్టుకుంటారు. రెంటిఅర్థం. భార్యాభర్తలు సమభాగస్థులు అని—బ్రాహ్మణుల యజ్ఞోపవీతాల్లో ఉన్న రెట్టింపుపోగుల అర్థంకూడాఇంతే.

వివాహసమయంలో వధువు సర్వదా ఒకఅద్దం పట్టుకు తిరుగుతుంటుంది. అది ముకురదేవతకు ప్రత్యామ్నాయం—అదిగాక అద్దం దృష్టిదోషాల్ని వాటినీ దరిచేరనీయదు.

కర్ణాభరణాలు ఎక్కువగా అలంకరించుకునేది నంపూత్రిస్త్రీలు. కన్యగా ఉన్నంతకాలం కర్రవి ధరిస్తారు. వివాహిత సిటూ ధరిస్తుంది. వితంతువైనా ఈ ఆభరణాన్ని తీయదు. సిటూచుట్టూ ఉండేబింమవులు ముత్యాలకు బదులై ఉంటాయి. నాయర్లకని ప్రత్యేకాభరణా లేవీలేవు.| మామూలుతోటలూ కర్ణాభరణాలే. కాని నాయర్లు, పరియర్లూ ఒకప్పుడు కతిళ ధరించేవారు—ఆనగ నిప్పుడు క్రైస్తవులుమాత్రం ధరిస్తున్నారు.

కంఠాభరణాలు మతాచారాలతో సంబంధించినంతవరకూ ప్రత్యేకాలు నంపూత్రిస్త్రీలవి. కాసాలి తర్వాత మణ్ణాళమణి ముప్పేటది. నంబూద్రిస్త్రీలకిది ప్రియాభరణం. మణిస్థానం ముత్యానిదై యుంటుంది. ఇవిగాక తాండుమోతిరం, పుత్తళిఉన్నాయి. ప్రత్యేకాలులేకున్నా ఈరెంటినీ నాయర్లు వేసుకుంటారు. నాగపటతాళి వివాహానంతరం ధరించేది, సిరఖమోతిరం చివరలు ఇలాగే పాముపడగల్లా ఉంటాయి.

ఇతరములు కమ్మలమాల, పాలమాల, ముల్లమోటుమాల (మల్లెమొగ్గలదండ), వైరమణిమాల, కుళిమిణ్ణు ఆవిలుమాల, ఇవన్నీ మాంత్రికాలే. మొదటిది కాసాళివంటిది. నాల్గవది చాలాపలకలూ కోణాలుఉండటం వల్ల స్కాంతవిద్యుత్తులకు దారియిస్తుంది. అయిదోది మన్నాటిబింబంవలె లోతుఅద్దంలా ఉంటుంది.

కంకణాల్లో పుత్తువళ నాలుగైదు కలిపికట్టిన గాజులజతలు. రూపం కోటియవళ వక్షిలు బొమ్మలు ఉన్నగాజులు. ఎక్కువగా లక్ష్మిబొమ్మలుంటాయి. పూర్వం అందరు ఈకంకణాల్ని ఆప్యాయంగా ధరించేవారు. నంపూత్రీలుగాక ఇతరులు వీటిని సాధారణంగా వివాహానంతరం అలంకరించుకుంటారు. రామాయణం వళ ఇంచుమించు పుత్తువళవంటిదే. కాని ఈకంకణాలమీద రామకథలు చిత్రింపబడిఉంటాయి.

నంపూత్రిస్త్రీలలో కంకణధారణం ఆట్టే కనిపించదు. వేసుకున్నారంటే అవి బంగారువెండివిగాక ఏఇత్తడి, కంచు, గాజులో అయివుంటాయి. ఇత్తడిఆధ్యానులు, కంచుహాస్యానులూ ధరిస్తారు. ఎక్కువళల్లం ఉండాలనేమో ఏలాయధుణోశావ స్త్రీలిలాంటివే ధరిస్తారు.

మొలకు నంపూత్రిస్త్రీలు అరంగుళంవెడల్పున వెండి, బంగారు అరన్నాళ్ ధరిస్తారు.

నంపూత్రిస్త్రీలు వెండిబంగారాలువదలి ఈ చౌకలోహాలు ధరించాల్సిన అగత్యం ఆలోచనీయం. దేవాలయాల్లో విగ్రహాలకిలాంటి మిశ్రలోహాల్నే ఆభరణాలుగా తొడుగుతున్నారని వీరూ ఇలా చేస్తున్నారేమో! ఎటుచూసినా ఏదోమంత్రం-యంత్రం-ఆధ్యాత్మికత్వం ఆభరణాల్లో కనిపిస్తుంది.

ఈనగలకీ మనిషికీ వున్నసంబంధం ఆలోచిస్తే, లోతుగాపోయినకొద్దీ కేవలం అందానికికాదనే రిడ్డిసిద్ధాంతం అంగీకరించక తప్పదు.

# మంచి జీవితచరిత్రముల యావశ్యకత

విశ్వమానవసౌభ్రాతృత్వానికి, సౌఖ్యప్రదమైన సంఘజీవనానికి, ఆబాలవృద్ధుల్లో
పరిపూర్ణ వివేకవికాసానికి విజ్ఞానచక్షువులు ఆదర్శజీవిత చరిత్రలు. ఆదర్శపురు
షుల జీవితాలలోని పవిత్రఘట్టాలని మననంచేసుకుంటే, భావిభారత
భాగ్యోదయానికి కారకులైన యువతీయువకుల సాంఘికజీవితం
విశాలవంతమై, తత్త్వాతత్త్వవిచారణల్లలో సంఘం,
దేశం మహోజ్వలవంత మౌతుంది.



ప్రపంచమందలి సకల ప్రాణికోటిలో మానవులే యుత్కృష్టు లనునది నిర్వివాదాంశము. బలమున మృగములు మానవుని మించవచ్చును; మత్స్యాది జలచరము లెక్కువ కావచ్చును, కాని యన్నిటిని, అన్నివిషయములందును, ముఖ్యమగు జ్ఞానమున నధికుడగుటచేతనే మానవుడు ప్రపంచ ప్రాణికోటియందు ప్రథమగణ్యుడుగ పరిగణింపబడుచున్నాడు. వాయుజలచరములకుండు శక్తులను దైవము తన కీయకున్నను, తన జ్ఞానప్రభావముచే మానవుడు జలమును ఆకాశమును (పూర్తిగా నిరపాయముగ సంచారమొనర్చుశక్తి కాకపోయినను, కొంతవఱకైనను ప్రశంసనీయముగ) జయించినాడు. కాననేడు మానవుడే సకలప్రపంచమునకు సార్వభౌముడన బఱగుచున్నాడు. దైవసృష్టికి మానవుడే యవధియగుచున్నాడు. మానవునికంటె, పరమాత్ముడుదక్క, నధికుడీ ముజ్జగముల లేడు. ఇట్టి పరమాద్భుతమగు మానవజన్మ (జన్మాంతరమనునదేయుండిన) ప్రాణికోటి కెన్నిజన్మములకో గాని లభించదు. ఇట్టి దుర్లభమగు మానవజన్మమెత్తియు, మానవకోటిలో నూటికి తొంబదితొమ్మండుగురవఱకు స్వోదరపూరణాభిలాషులై, పరద్వేషులై, కీర్తి కాసింపక, బుద్ధి నుపయోగింపక, పరోపకారమునకు బాటువడక నీచజీవితముల గడపుచు, నామరూపములు లేక నశించుచున్నారు. 'పుట్టుట గిట్టుటకొఱకే గదా;

చచ్చిపోయిన పిమ్మట మనవెంటరాని, మనల కేసాయముచేయని ఘనకార్యముల నొనర్పు టకు మనమేల పాటుపడవలెను? ఆ శ్రమపడు టేల? కీర్తియందురే కాని మనము చచ్చిన తరువాత మనలను తలపెట్టువాడెవడు? కావున బ్రదికియున్నంతకాలమును అట్టి యనవ సరములైన, యనుపయోగములయిన గొడవలలోపడిపోక సుఖముగ గడపిపోవలెను' అని కొందరి యభిప్రాయము. ఇట్టి సంకుచితాభిప్రాయులైన వారు మానవజన్మము నెత్తనేల!

ఇట్టిమానవులలో నూటికికోటికి నెక్కడో యొక్కడు మహాపురుషు డుద్భవించు చున్నాడు. ఇట్టివారిని వ్రేళ్ళమీదనే లెక్కించవచ్చును. హిందూదేశోద్ధారకుడగు గాంధిమహాత్ముడు, జర్మను నియంత హెర్ హిట్లర్, ఇటలీ డిక్టేటరు బెనిటో ముస్సోలినీ రష్యను భాగ్యవిధాత స్టాలిన్, ఇట్టివారిలో జేరుదురు. ఇంకను నెందరో భవ్యజీవులున్నను వీరే ప్రథమగణ్యులు. చూడుడు! ఇంతకాలమైనను యావద్భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్య మును, శాంతిని అనుభవించినదా? అంత శాంతియుతమని పురాణప్రఖ్యాతమై పొగడబడు రామరాజ్యము కాలమునకైనను మనదేశస్థులకు రాక్షసులకతమున యుద్ధబాధ తప్పలేదే! ఇక బ్రిటిషువారి పరిపాలనమున యుద్ధబాధతప్పినను, స్వాతంత్ర్యము మనదేశస్థులు కోలు పోయిరే! స్వాతంత్ర్యములేనిదే శాంత్యనుభవమెట్లు? ఇట్లు యుద్ధములకు, అశాంతికి, అస్వాతంత్ర్యమునకు, దారిద్ర్యమునకు, ఆలవాలమైన మనదేశమంతటను దేశభక్తిని ప్రబో ధించి, యావద్భారతదేశస్థులకు దేశభక్తిని కలిగించి, వీరులనొనర్చి, దేశమునకై తనరక్త మాంసముల నర్పించి శల్యపంజరమై, దేశమాత కోలుపోయిన స్వాతంత్ర్యసౌభాగ్యమును మఱల నామెకు కలిగించుటకై సాయశక్తులతో బాటుపడుచున్న గాంధీమహాత్మునికంటె లోకోత్తరపురుషుడీ మూడులోకములందునులేడు, ముమ్మాటికిని లేడు!

పై జెప్పినవారివలెనే ఈయనయు మానవుడే. కాని యీయన తాను మానవుడ నని గర్వపడగలడు. వారు గర్వపడజాలరు. ఇంతేభేదము. ఈ స్వల్పభేదమే ఆయనను ప్రపంచమున ప్రథమగణ్యునిగ నొనర్చినది; వారిని నీచులని నిరాకరించినది. వీరు చచ్చిన తలచువాడు లేడు. పైగా భూమికి భారముతొలగినదని సంతసింతురు. కాని ఆయనమో— ఆయన నామము భారతచరిత్రమున సువర్ణాక్షరములతో లిఖితమైనది. హిమాలయ మడు గంట వచ్చును. సముద్ర మింకపచ్చును. కాని యాయన నామము నశించదు. ఆయనకీర్తి మాయదు, అంతే! అది శిలాక్షరమైనమాట. సకల యూరపుఖండదేశవాసుల యుద్ధములకు రంగస్థలమై, అంతఃకలహములతో జిక్కియల్లాడుచు, యూరపుదేశస్థులందఱిచే నిరసింప బడెడి యిటలీదేశము నొక్కటిగజేసి దానిని యూరపుఖండవాసులకు ప్రక్కలోని బల్లె మగునట్లుచేసిన ముస్సోలినీకదా మానవుడు! ప్రపంచయుద్ధమున పరాజయమొంది పరా

భవమొంది పడిపోయిన జర్మనీదేశమును మఱల పునరుద్ధరించి, ఇదివఱకు దానిని నానావిధ ముల నే భయమునులేక హింసించినదేశములకు దాని నామమే సింహస్వప్నమగునట్లు చేసిన హిట్లరుకంటె ధన్యజీవియెవడు? వీరిరువురి కుటిలరాజనీతిని మానవమారణాభిలాష గర్హింపదగినవి కావాయని యడుగుదురేమో? కాని యిచ్చట రాజకీయములు మనము చర్చించువిషయములు ఎంతమాత్రముకాదు. ఏది యెట్లున్నను, వారియం దెన్ని దొసగు లున్నను, వారిని వారి దేశమాతలయొక్క నిజమైన కొడుకులనియు, నిజమగుభక్తులనియు, నొప్పుకొని తీఱవలెను. ప్రకృతమేమన, మానవకోటిలో నరుదుగపొడము నిట్టి యపూర్వ జీవుల జీవితములే తక్కిన మానవులకాదర్శప్రాయములు. మానవసేవకే జీవితమును వినియోగించి, మానవసేవయందేమరణించు దివ్యమానవుల జీవితచరిత్రమును తెలుపు గ్రంధములు, మన కాహార మెట్టిదో, దేశాభివృద్ధి కంతగ నావశ్యకములు.

జీవితచరిత్రములు రెండువిధములుగ నుండును. ఒక మహాపురుషుడు తనజీవితము నందితరుల కాదర్శములుగ నుండు విషయములు కొన్ని యున్నవని గ్రహించి యితరుల కవి సాయపడునను నుద్దేశముతో తన జీవితమును తానే వ్రాయును. ఇందు సాధ్యమై నంతవఱకు స్వోత్కర్షను సూచించువిషయముల నాయన విడుచును. ఈ తరగతి జీవిత చరిత్రలకు గాంధీమహాత్ముని 'ఆత్మకథ' యుత్తమమైన యుదాహరణము. దీనినిమించిన ప్రశంసనీయమగు జీవితచరిత్రము ప్రపంచమున లేదు. ఏలననగా గాంధీమహాత్మునికంటె నధికుడగు త్యాగజీవి ప్రపపంచమున మఱొకడులేడు. ఇందు వినుతింపదగిన విషయమే మన ఆయన యా గ్రంథమున తన లోపములను సుగుణములవలెనే నిర్మొగమాటముగ పూసగ్రుచ్చినట్లు వర్ణించెను. లోపములనుదాచి సుగుణములనే పేర్కొను సాధారణ లోకధర్మమునుండి యీగ్రంథము భేదించును. పైలోపము జీవితచరిత్రములందుండిన నా గ్రంధము లోకోపకారముకాదు. అది జనానురాగమును బడయదు. దాని ప్రయోజన మును చెడును. 'అబద్ధమాడరాదు' అనునదెల్లరకును దెలిసినదే. దానిని గొప్పగ జీవిత చరిత్రమున 'నే నబద్ధమాడలేదు' అని యిఱికించుటెందులకు? దానివలన డంభత్వ మగపడును గాని సౌజన్యము సూచింపబడదు. 'అబద్ధమాడరాదు'అను సూక్తిని ప్రజల మనసులందు నాటునట్లు చేయవలెననిన నా వ్యక్తి 'నేనొకపరి అబద్ధమాడితిని' (ఎవ్వరైనను ఎప్పుడో అబద్ధమాడి యుందురు కదా) అనియు 'దానివలన యీ నష్టముల ననుభవించితిని'అనియు చెప్పిన, తన జీవితచరిత్రమునకే లోటు కలుగదు సరికదా ప్రజ లా దుర్గుణమును తొలగించుకొనుటకు వీలుకలుగును. సౌజన్యమును సంపాదించ ప్రేరేపించును. గాంధీగారి గ్రంథమందలి యనేకోత్తమ లక్షణములం దిది ముఖ్యమైనది. ఆయన ఆగ్రంథమందు తాను తనభార్య నెన్నోవిధముల హింసించితిననియు, తానొకసారి

మాంసమును తింటిననియు, తన్ను నల్లవాడనను లోకువచే ఆఫ్రికాలో ఒకడొక ప్రయాణ సందర్భమున చెంపపై గొట్టెననియు, నిట్లనేకములగు డాంభికులు వ్రాయనిష్టపడని విషయముల నాయన విస్తరముగ వ్రాసియున్నాడు. దానివలన ప్రజలు భార్యలను దయతో జూడవీలగును. మాంసాహారమువలన నష్టము తెలియబడును. ఆయనకుండునట్టి యపూర్వ త్యాగబుద్ధి, కష్టసహనము ప్రజల కలవడును. ఇది జీవితచరిత్రములందు ముఖ్యముగ నుండవలసిన శోభ కలిగించు లక్షణము. దీనివలన నాయన లోకోత్తరపురుషు డెట్లయ్యెనో యను విషయమగమ్యగోచరము గాక సులభముగ బోధపడి, ప్రజల కట్లొనర్చిన తాము ను ఆయనవలెనగుదుమను నమ్మకము కలుగజేయును. ఇట్లు పూసగ్రుచ్చినట్లు, సమగ్రముగ వ్రాయక, కొన్ని దాచికొని పెంచుచు జీవచరిత్రములను వ్రాయువారు_తాము మహాపురుషులమను కొనువారే కాని మహాత్ములు కాజాలరు. అట్టివారు మొదలు తమ జీవచరిత్రములను వ్రాయుటే మానుకొనవలెను. లేనిచో వాణీదాసుని స్వీయచరిత్రమును జంఘాలశాస్త్రి నిరసించినట్లు ప్రజలీతని గ్రంథమును నిరసింతురు. అతడు నలుగురిలో నవ్వుల పాలగును. ఈ శ్రేణికి జెందిన జీవితచరిత్రములలో మన యాంధ్రదేశ మహాపురుషుడును, భారతదేశమున పొడమిన యద్వితీయ సంఘసంస్కర్తలలో నొకడును, నగు కందుకూరి శీరేశలింగ మహాకవి స్వీయచరిత్రమునుగూడ నొక యుత్తమమగు నుదాహరణముగ పరిగణించవచ్చును. ఇదియు గాంధీగారి 'ఆత్మకథ' యొక్క లక్షణములనే కలిగియుండు అపూర్వగ్రంథము. ఈ మహాపురుషు లీ గ్రంథములను తాము జీవించియుండగనే వ్రాసియుండుట మనదేశస్థుల యదృష్టమని చెప్పనొప్పును. 'ఆత్మకథ' యఖిల ప్రపంచమునకును, 'కందుకూరి వీరేశలింగకవి స్వీయచరిత్రము' ఆంధ్రదేశమునకు చేయు మేలు కొలయిడరానిది. ఈ మహాపురుషుల నాదర్శముగనుంచికొని జీవించువారు ధన్యులగుదురనుట కేలాటి సందియమును లేదు.

ఇక జీవితచరిత్రములందు రెండవతరగతికి చెందినవి: ఒకడు చనిపోయిన పిమ్మట నతనిని మహాపురుషునిగ గుర్తించి, అతని జీవితకాలమంతటను అతనిసన్నిహితుడై, ఆతని జీవితాంశములను సమగ్రముగ నెఱిగినపుత్రుడో, బంధువో, శిష్యుడో వ్రాసినవి. ఇవి కేవల సంఖ్యయందేకాక విశిష్టతయందుకూడ రెండవ తరగతికి చెందినవే. (వలనవనిందు అతిశయోక్తులు ఎక్కువ) వీనికొన్నిని యుదాహరణముల నీయగలము. న్యాయముగ నిందు గ్రంథకర్త గ్రంథనాయకుని లోపములను, సుగుణములను విప్పిచెప్ప నవకాశముండును. దాన నాయాగ్రంథములను లోకోపకారకముల నొనర్చవీలగును. కాని వీనియందీ లక్షణమే లోపించుచుండును. స్వమతాభిమాన పరమతద్వేషములచే తెగడుటో, లేక సరిపరిచయముచే మిక్కిలి పొగడుటో తప్ప యీ గ్రంథకర్తలు ఆయాజీవిత చరిత్రములందా



తణుకు బాలసరస్వతీసమాజ పంచమవార్షికోత్సవము, హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవముల సందర్భమున తీయబడిన చిత్రము.



ఏలూరు తాలూకా మహిళాసభ.

మార్చి 4 వ తేదీని ఏలూరులో మదరాసు అసెంబ్లీ ఉపాధ్యక్షురాలు శ్రీమతి ఆచంట రుక్మిణీదేవిగారి అధ్యక్షతక్రింద జరిగెను. సభయందు శ్రీమతులు ముల్పూరు చుక్కమ్మ, కలగర పిచ్చమ్మ, యీదర సుబ్బమ్మా దేవి, గంధం అమ్మన్న రాజా ఎం. ఎల్. ఎ., పత్తిరాజు శ్యామలాంబ, చుండూరు రత్నమ్మ, బులుసు ప్రకాశమ్మ, కానుమిల్లి లక్ష్మీకాంతమ్మ, నాళం సుబ్బమ్మ గార్లు మాట్లాడిరి.



కొవ్వూరు హిందీ బాలికాపాఠశాలలోని బాలికలు. వీరికి శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మగారు హిందీ, సంస్కృతము, తెలుగు, నూలుతీయుట మొదలగునవి రెండుసంవత్సరములనుండి నేర్పుచున్నారు. ఈపాఠశాల హిందీప్రచారమునకు మిక్కిలి పాటుపడుచున్నది.

యాత్యాగజీవుల జీవితాంశములను విస్పష్టముగ వివరించి నిర్మొగమాటముగ వ్రాయరు. ఇది మిగుల శోచనీయమైన విషయము. ఫ్రూడ్ అనునాయన తన స్నేహితుడగు కార్లయిలునుగురించి వ్రాసిన కార్లయిలుచరిత్రమున నీలోపము కాన్పించును. దీనివలన నష్టమేమన ప్రజలకాయా పురుషులెట్లు గొప్పవారైనదియు తెలిసికొనుట కష్టసాధ్యమగును. కాన నీజీవితచరిత్రములు వ్రాయువారీలోపమును తమ గ్రంథములకు బట్టకుండునట్లు చేసికొనుటమంచిది. చిత్తరంజనదాసుచరిత్రము, తాతాచరిత్రము మొదలగునవి రెండవతరగతి జీవితచరిత్రములకు జెందును. ఈతరగతి జీవితచరిత్రములు వ్రాయువారు వన్నెలు చిన్నెలు కల్పించియు, దూషించియు, వర్ణించియు, పొగడియు, కొన్నిదాచియు, కొన్నివిస్తరించియు గ్రంథమును పాడు చేయరాదు. తమకు దెలిసిన విషయములను పూర్తిగ నిర్మొగమాటముగ వ్రాసిన లోకోపకార మొనర్చినవారగుదురు. కాని యట్లుచేయనిచో నాజీవితచరిత్రములను చదివి కాలముపాడొనర్చుటకంటె తగులబెట్టుట మంచిది; వారట్లు వ్రాయకుండుటేమంచిది. స్వోత్కర్షకీ జీవితచరిత్రములలోగాని జీవితచరిత్ర రచనోద్యమమునగాని యెంతమాత్రము తావులేదు. ఉన్నదున్నట్లు చెప్పగలవారే, చెప్పనిష్టముకలవారే యీలోకోపకారకమగు పనికి పూనుకొనవలయును.

ఎప్పుడీజీవితచరిత్రములు సమగ్రముగ నుండునో యప్పుడే యవి జనాను మోదమును బడయును. ఎప్పుడియ్యవి పక్షపాత రహితములుగ నుండునో యప్పుడే వీనిని లోకోపకారకములన వీలుకలుగును. అప్పుడే వీనినివ్రాసిన గ్రంథకర్త ధన్యుడు కాగలడు. క్రమముగ నన్ని దేశములందును విద్య హెచ్చుచున్నది. దానితో గ్రంథరచనయు నెదుగుచున్నది. గ్రంథపఠనాభిలాషయు హెచ్చినది. కాని లోకోపకారకములని చెప్పదగిన గ్రంథములంతగ గ్రంథప్రపంచమున నుద్భవించుటలేదు. కేవలసారస్వతసేవకై రచించిన గ్రంథములు లోకోపకారకములు కాజాలవు. ఇప్పుడు మనదేశమున నీ జీవచరిత్రముల యావశ్యకత యెక్కుడుగ నగపడుచున్నది. ప్రజలుగూడ దీని విశిష్టతను గుర్తించినారు. ఇదియే జీవితచరిత్రములు బయలుదేరదగిన సమయము. ఈప్రయత్నమును బుద్ధిమంతులు పూనికొనసాగింతురుగాక !

—శ్రీ వంక వెంకటరామక్రిష్ణారావు.



# భారతీయనారి భవిష్యత్తు

స్వామి వివేకానంద

మనువనినాడు :

'యత్రనార్యాస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః। యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః' స్త్రీల కాదరములేనిచోట, వారు నిరానందమున నుండుచోట, ఆసంసారమున ఆదేశమున ఉన్నతి కాశలేదు. అందువలన వీరిని ముందుగ లేవనెత్తవలెను. వీరికొఱకు ఆదర్శమఠమును స్థాపింపవలెను.

భగవతాజ్ఞానముతో స్త్రీలను జూపించుటయే తంత్రముల అభిప్రాయము. బౌద్ధధర్మపతన సమయమున వామాచారము ఘోరముగ దూషితయయ్యెను; ఆదోషము ఇప్పటి వామాచారమున అట్లే నిలచియున్నది. ఇప్పటికిగూడ తంత్రశాస్త్ర మీ భావమున భావితమైయున్నది. ఏ మహామాయయొక్క రూపరసాత్మకమగు బాహ్యవికాసము మనుష్యుని ఉన్మాదునిగ నొనర్చియుంచినదో దాని జ్ఞాన, భక్తి, వివేక, వైరాగ్యముల ఆంతరిక వికాసమున మరల మనుష్యుని సర్వజ్ఞునిగను, సిద్ధసంకల్పుడగు బ్రహ్మజ్ఞునిగను ఒనర్చును. ఆమాతృ రూపస్ఫురద్విగ్రహరూపిణియగు నారీపూజను నే నెన్నడును నిషేధింపను. 'సైషాప్రసన్నా వరదానృణాంభవతి ముక్తయే' ఈమహామాయను పూజాప్రణతులవలన ప్రసన్న మొనర్పజాలకున్న ఆమె చేతులనుండి విడివడి ముక్తినంద బ్రహ్మవిష్ణులకుగూడ సాధ్యమా? గృహలక్ష్ముల పూజాకల్పముగ వారి బ్రహ్మవిద్యావికాసము కొఱకుగాను స్త్రీల మఠమును స్థాపింతును.

గంగకద్దరిని విశాలమగుభూమి కానబడును. అందు అవివాహితలగు కుమారికలుందురు, విధవలగు బ్రహ్మచారిణులుగూడ నుందురు. భక్తిమతులగు గృహస్థ-స్త్రీలుగూడ వచ్చిన అప్పుడప్పుడచ్చట ఉండనీయ బడుదురు. ఈ మఠమునకు పురుషులతో నెట్టి సంపర్కమును ఉండదు. పురుషమఠమునందలి వృద్ధసాధువుల సమర్థలగు స్త్రీలు లభించునంతవఱకు దూరమునుండియే కార్యభారమును జూచుచుందురు. ఈ మఠమున స్త్రీలకొక పాఠశాలయుండును. అందు ధర్మశాస్త్రము, సాహిత్యము, సంస్కృతము, వ్యాకరణము, ఇంకేమి కావలెను—ఇంతో కొంతో ఇంగ్లీషుగూడ—చెప్పబడును. కుట్టుపని, వంట, ఇంటిపనులు, శిశుపోషణ మున్నగు స్థూలవిషయములుగూడ నేర్పబడును. జపము, ధ్యానము, పూజ—ఇవన్నియు శిక్షాంగములుగ నుండనే ఉండును.

దేశీయనారి దేశీయవసనమును ధరించి ధర్మప్రచార మొనర్చిన–నేను దివ్యచక్షువుతో గాంచుచున్నాను–ఒక మహాతరంగముచేచి సమగ్రపాశ్చాత్యభూమిని ముంచివేయును. మైత్రేయి, ఖానా, లీలావతి, సావిత్రి, ఉభయభారతి—వారి జన్మభూమియందు మఱే నారికిని ఈ సాహసము కలుగదా? ప్రభు వెఱుంగును.

మనోరథమునకు స్త్రీపురుషు లిర్వురును గావలెను. ఆత్మయందు స్త్రీపురుష భేదములేదు. శ్రీరామకృష్ణదేవుని అవతారమున్న చాలదు—శక్తి వికాసము కావలెను, వేలకువేలుగ పురుషులు స్త్రీలు కావలెను–అగ్నివలె హిమాలయమునుండి కన్యాకుమారివఱకు ఉత్తర మేరువునుండి దక్షిణ మేరువువఱకు ప్రపంచమంతయు వ్యాపించువారు కావలెను.

సంపూర్ణముగ గృహమును వదలి ఇటనుండగల్గిన వారికి అన్నవస్త్రము లీ మఠమునుండియే ఒసగబడును. అటుండజాలనివారు విద్యార్థినులవలె ఇచ్చటికివచ్చి ప్రతిదినము చదివి పోవుచుండవచ్చును. ఇంకేమి కావలెను? మఠాధ్యక్షుల అనుమతి ననుసరించి మధ్యమధ్య ఇట ఎన్నిరోజులైన ఉండవచ్చును, తినవచ్చును. స్త్రీల బ్రహ్మచర్య సందర్భమున ఈ మఠమునందలి వయోవృద్ధులగు బ్రహ్మచారిణులు శిక్షాభారమును వహింతురు. ఈ మఠమున ౫ లేక ౭ వత్సరములు విద్య నార్జించినపిమ్మట వారి పెద్దలు వివాహమొనర్పవచ్చును. యోగ్యాధికారిణులని ఎంచబడిన పక్షమున వారిపెద్దల అనుమతి ననుసరించి చిరబ్రహ్మచర్యవ్రతము నవలంబించి ఇచ్చటనే ఉండిపోవచ్చును. చిరబ్రహ్మచర్యవ్రతము నవలంబించినవారే కాలక్రమమున ఉపాధ్యాయినులు, ప్రచారికలు అగుదురు. మఱియు ప్రతిపల్లెయందు, ప్రతినగరమున శిక్షాకేంద్రముల నెలకొల్ప స్త్రీవిద్యావ్యాప్తికి యత్నింతురు. చరిత్రవతులును, ధర్మభావాపన్నలును నగు ఇట్టి ప్రచారికలవలన దేశమున యదార్థ స్త్రీవిద్య వ్యాపించును. బ్రహ్మచర్యరక్షణము మూలభిత్తిగనుండును. ధర్మపరతా, త్యాగము, సంయమము లిచ్చటి విద్యార్థినుల కలంకారములుగ నుండును. ఇట్టి ఆదర్శజీవనమును గాంచిన వారి నెవ్వరు సమ్మానింపకుందురు—వారి నెవ్వరు సందేహింతురు? దేశమునందలి స్త్రీల జీవనమిట్లు నిర్మింపబడిననే కదా ఈ దేశమున సీతా, సావిత్రి, గార్గుల అభ్యుద్ధానమగును? దేశాచారమను ఘోరబంధనమున ప్రాణహీనలును, స్పందహీనలునై మీ స్త్రీ లిప్పుడే స్థితికి వచ్చినారో, ఒక్కసారి పాశ్చాత్యదేశమున కఱిగి వచ్చిన గ్రహింపగలిగియుందురు. ఈ దుర్దశకు కారణము మీరే (పురుషులు). మరల దేశమునందలి స్త్రీలను మేల్కొల్పుటగూడ మీ చేతుల నున్నది. అందువలననే కార్యము నారంభింపమని చెప్పచున్నాను.

ఈ మఠమున విద్యగఱచిన పిమ్మట అందఱి స్త్రీలకు ఒకేరకమ బ్రహ్మచర్యము నవలంబించు సామర్థ్యము కల్గునా? విద్య నొసగి వదలివేయవలెను. పిదప వారే భావించి, చింతించి, ఎట్లో ఒకట్లొనర్తురు. వివాహమొనర్చుకొని సంసారులైనను, ఇట్టి స్త్రీలు తమపతులకు ఉచ్చభావ ప్రేరణనొసగి, వీర పుత్రుల జననులగుదురు. కాని స్త్రీ మఠాధికారులు, విద్యార్థినులు ౧౫ వత్సరములు వచ్చువఱకు పెళ్లి పేరు తలపరాదను నియమము నొనర్పనగును.

మన రమణీగణము మీమాంసింపవలసిన సమస్య లనేకము లున్నవి. కాని 'విద్య' అను మంత్రబలముల సమాధాన మొనర్పజాలని సమస్య ఒక్కటియును లేదు.

మీ దేశపు స్త్రీలను జదివింప యత్న మొకింతయు నగుపడదు. మీరు చదువుకొని మనుష్యులగుచున్నారు కాని, మీ సుఖదుఃఖభాగినులును, అన్నివేళల ప్రాణమిచ్చి సేవ యొనర్చువారును నగువారికి విద్య గఱుప, ఉన్నతమొనర్ప మీరేమి యొనర్చుచున్నారు? మీ ధర్మశాస్త్రానుసారము, మీ దేశరీతి ననుసరించి, ఎచ్చట ఎన్ని విద్యాలయములు వెలసినవి? దేశమున పురుషులయందే చెప్పతగిన తీరున విద్యావ్యాప్తిలేదు. ఇక స్త్రీల నడుమనా? గవర్నమెంటు లెక్కలప్రకారము నూటికి పదిమంది పురుషులు శిక్షితులు, బహుశా స్త్రీలలో నూటికొక్కరైనను తేలరు గాబోలు? విద్యావ్యాప్తి, జ్ఞానోన్మేషము, లేనిచో దేశ మెట్లున్నతిని బొందగలదు? మీలో విద్యనేర్చిన కొద్దిమందియు—వీరే భవిష్యత్తు—ఉన్నతికాశాభూతులు—ఈ విషయమున నెట్టి యత్నమును సల్పుచున్నట్లగపడదు.

(సశేషము)

# గృహిణి

గృహమెన్న యరదంబు గృహమేధి రధికుండు
పాపపుణ్యంబులు వారువములు,
నిత్యకర్మచయంబు నిరుపమకళ్లెముల్
తొలిజన్మ ఫలితంబు దొడ్డగద్దె,
సుకృతదుష్కృతములు శకటంపు చక్రముల్
సుఖదుఃఖములు శుభాశుభగణంబు,
విజ్ఞానసూత్రంబు విమలమార్గంబొగి,
పరమపదవిజేరు టరుగుచోటు,

గాగ జీవనయాత్రకై కడఁగుచుండు,
ప్రాణనాథుని యరదంపు ప్రాజ్ఞణంబున,
"గృహిణిసారధి" యన్నట్టి కీర్తి బెంప,
దేరునడిపింపు మమ్మరో! తీరుగాను.

రథము, రథికుండు, రథ్యాళి రాణకెక్క,
సార్ధకతలేదు సారథి సరియుగాక!
గృహము, గృహమేధికృత్యంబు కీర్తిగాంచ,
గృహిణి నేర్పరిగాకున్న క్షేమమెద్ది?

గృహము శుభాశుభనిలయము,
గృహపతి సకలార్థవస్తు గృహీతయుగా,
గృహిణియె తత్ఫలసాధిని,
గృహిణీ! విధ్యుక్తమెరిగి కీర్తిని గనుమా.

గృహిణీ గృహపతులెలమిని,
గృహమునకధినేతలగుట కృతకృత్యంబుల్,
ఇహపరసార్థకమానటు,
లహరహమును జూడగల్గు నక్షయసుఖముల్.

—శ్రీ మునునూరి సాంబశివరామమూర్తి.

# శూన్యగృహం

'అనుమానం', డాక్టరుగారు పెదవి విరుస్తూఅన్నారు, 'కొన్నిగంటల్లోవుంది.'

రామం ఒక్కదీర్ఘ నిశ్వాస విడిచాడు; జాలిదృష్టులతో డాక్టరుని చూశాడు.

'నే చెయ్యగలిగిందంతా చేశాను. ఇప్పుడిచ్చిన ఈ రెండింజక్షన్లే నా కడపటి ప్రయత్నం—ఇంక నా చేతుల్లో లేదు. ఈ రాత్రికనక తెల్లారిందంటే ఆమె జీవించవొచ్చు. మందుకూడా పంపిస్తా. గంటగంటకీ యివ్వండి...ఆ తర్వాత మీ అదృష్టం...' అని ఆయన వెళ్లిపోయారు.

రామానికి తల తిరిగినట్లయింది. గోడకి జార్లాపడి కూచ్చుండిపోయాడు. అతనికళ్లు చీకట్లు కమ్మాయి. అతనిప్రాణం భౌతికశరీరాన్నివిడిచి ఎక్కడో తిరుగుతోంది.

గదిలోనుంచి మూల్గు వినపడింది...రామం అదిరిపడ్డాడు. లేచి చప్పుడు చెయ్యకుండా గదిలోకి వెళ్లాడు. రోగి కళ్లు మూసుకునివుంది. జానకి ప్రక్కనినుంచుని విసురుతోంది.

'పిల్లలు...వొచ్చారా ?'...కళ్లుమూసుగునే రోగి ప్రశ్నించింది.

రామం మంచందగ్గరగా వెళ్లాడు. రోగిమీద వొంగుని 'శ్యామం...' అని హీనంగా పిలిచాడు. రోగి కళ్లుతెరచింది. ఆమె చూపుల్లో ఆమె పడేబాధ అంతా కనబడుతోంది. ఆమె కళ్లల్లో రెండు నీటిబిందువులు మెదులుతున్నాయి. '...ఇంకా...పిల్లలు...రాలేదూ ?' అని నెమ్మదిగా నీరసంగా ప్రశ్నించింది. రామం కళ్లమ్మట నీళ్లు తిరగబోయాయి. కాని ప్రయత్నపూర్వకంగా ఆపుకున్నాడు. ఆమె మొహానికి దగ్గరగా తన మొహాన్నుంచాడు. తన కుడిచేతితో ఆమె ముంగురులు సవరిస్తూ 'శ్యామం!' అన్నాడు—బొంగురుబోయిన కంఠంతో.

ఆమె అతని కళ్లల్లోకి చూసింది.

'శ్యామం!—అమ్మాయీవాళ్లూ ఈ పాటికి వస్తూనేవుంటారు...; ఆమె దీర్ఘనిశ్వాస విడిచింది. కళ్లుమూసుకుంది. 'బాబునికూడా పంపించాను...నించున్న పళంగా తీసుకొస్తాడు' అన్నాడు.

'ఇంకా ఎప్పుడూ ?—పిల్లలు!' అంది ప్రక్కకి వొత్తిగిల్లుతూ ఆమె మూసుగున్నకళ్లగుంటల్లో తడి కనబడింది.

'శ్యామం! ఏడవకు శ్యామం!' అతనిమొహం ఆమెమొహానికి తగులుతోంది. ఆమెను తన పొదివిటపట్టుకున్నాడు. అతని చూపులలోనుంచి నిష్కల్మషమైనప్రేమ ప్రవహిస్తోంది...'మళ్లీ కబురు పంపిస్తా... ఏలాగేనా సరే అమ్మాయీవాళ్లూ ఈ వేళ వొచ్చేలాచేస్తా. వెంకణ్ణి యిప్పుడే సైకిలుమీద మళ్లీ పంపుతా.

అతనిప్రేమ పూర్వకమైన సంభాషణ ఆమెకి కొంచెం వూరటకలిగించింది. ఆమె నిద్రపోవడాని ప్రయత్నిస్తోంది. అతని హస్తాలు తన హృదయంమీద పెట్టుగుంది. ఆమె హృదయం శాంతించింది. తాపం కొంత తగ్గింది. కొంచెం కునుకుపట్టింది.

జానకి వరండాలోకి వెళ్లింది. ఖాళీగా వున్న గేటునిమాత్రమే చూడగల్గింది. లోపలికివచ్చి తలుపు జార్లా వేసింది. రామం ఆమె ముఖాన్నిచూసి సంగతి గ్రహించి ఒక్కనిట్టూర్పువిడిచాడు.

*　　*　　*　　*

రామం ఒక్కప్పుడు డబ్బున్నబిడ్డే. అతనిస్థితి చూసీ, వంశమర్యాదనిచూసీ శ్యామలని ఇచ్చి పెళ్లి చేసారు. శ్యామలకూడా మంచికుటుంబంలోంచి వచ్చిందే. ఆమె తన జీవితాన్నంతా భర్తకోసం వినియోగించింది. రామం కారణాంతరాలచేత పాడైపోయాడు. రానురాను ఆస్థి క్షీణించింది. అతను ఇంటిపట్టున వుండడమే మానేశాడు. అప్పుడప్పుడు డబ్బుకోసం వస్తూవుండేవాడు. ఆమె యెప్పుడూ లేదనలేదు. వస్తువు లన్నీ ఇచ్చేసింది, ఇంకా చెయ్యగలిగిందల్లా చేసింది భర్తని సంతోషపెట్టడానికి. అతనిమాటకు యెప్పుడూ ఎదురాడలేదు. ఆమెయొక్క ప్రేమ పుష్పాలల్లా ఇద్దరు మొగపిల్లలూ—ముగ్గురాడపిల్లలూను. వాళ్లని చూసు కుని ఆమె మురిసిపోయేది.

ఒక్కరోజుకూడా భర్త దుర్మార్గంగా తిరుగుతున్నాడని ఆమె కోపగించుకోలేదు—ఆఖరికి విసుక్కో లేదు కూడాను. ఆమె సంసారం చేసినంతకాలం ఎంతో పొదుపుగా ఉండేది—తన భర్తా, తనపిల్లలూ తప్ప ఇంకేమీ ఆమె కక్కర్లేదు.

రామంకూడా ఆమెను ప్రేమించకపోలేదు. అతనికి కోపమూ విసుగూ ఎక్కువ. ఆస్థినంతా పాడు చేసి, పిల్లల్ని అధోగతిపాలుచేశానని అతను అస్తమానూ విచారిస్తోండేవాడు. అతనికి ఆస్థిబాబతు ఇల్లొ క్కటి తప్ప, వేరేమీ మిగల్లేదు. ఇప్పటి తన స్థితిని చూసి రహస్యంగా అతను ఏడ్చేవాడుకూడాను. ఆమెను అతను ఇదివరకు పెట్టినబాధలు తలచుకుని ఎంతో విచారించేవాడు. కాని పశ్చాత్తాపం చాలా ఆలస్యంగా కలిగింది...అదేవిటోగాని అతనికి ఎంతకోపంవుందో, ఆమెకు అంత శాంతం వుంది.

రోజులు సరిగ్గా గడవవు. శ్యామాన్ని క్షయజబ్బు పీడించుకు తినసాగింది. ఆమెకి నీరసం బలహీనతే ఎక్కువ అయినాయి తనపిల్లలికే తను సంరక్షణచేసే స్థితిలో లేకపోయింది. పెద్దపిల్ల అత్తారింటిదగ్గరుంది. అక్కడ సంసారానికి ఆమె ఆడదిక్కు. అందుచాత పెద్దపిల్ల ఆశవదులుకుంది శ్యామం. ఇంకెవ్వరూలేరు. మిగిలిన పిల్లల్ని శశిగారింటికి పంపించింది. ఈమె శరీరంలో జబ్బు ప్రవేశించిన దగ్గర్నుంచీ రామం కళ్లుతెరచు కుని ఇంటిదగ్గరుంటున్నాడు.

కష్టాల్లో సామాన్యంగా ఎవరో ఒకరు తోడుపడుతోనే వుంటారు.

తిండికికూడా నానా యిబ్బందీ పడే యీ రోజుల్లో కాంతం, జానకీ, వీళ్లకి దేవతల్లాగ కనపడ్డారు. ఆమెని జానకి జానకి వితంతువు. రామానికి వరసకి అప్పగారవుతుంది. శ్యామం మంచంపట్టిన దగ్గర్నుంచీ, ఆమెని జానకి కనిపెట్టుకు కూర్చొనేది. ఏమైనా ధనావసరం కలిగితేకూడా వెనకదీయకుండా ఇలా చేసేది. ఇంతకీ ఆమెకి దగ్గిరబంధువులున్నా శ్యామంమీద నున్న ప్రేమచేతనే అల్లాచేసేది. రామాన్ని ఇదివరకు అంతా తిట్టినవారే.

కాని అతని పరిస్థితులు మారటంతోటే అతన్నిచూసి అంతాజాలిపడజొచ్చారు. కాంతం రామానికి మేనత్త వుంది. ఆమెకి రామం అంటే అమితప్రేమ. చంటితనంలో రామంతల్లి చనిపోయిన దగ్గర్నుంచీ ఆమెదగ్గరే పెరిగాడు. కాని రానురాను బుద్ధులు ఎక్కువైన కొద్దీ ఆమెమొహం చూట్టం మానేశాడు. అతనిగుణాలు చూసి అసహ్యాపడేది కాంతం. కాని శ్యామాన్ని చూస్తేమాత్రం కళ్లనీళ్లు కార్చేది. ఇప్పటి పరిస్థితులు చూడ్డంతోటే ఆమె పూర్వపుప్రేమ విజృంభించింది. కాంతం, కాంతం భర్తా, రామం ఇంటిప్రక్కనే వుంటున్నారు. కాంతం ఇప్పుడు రామానికి భోజనసదుపాయాలూ అవీ చేస్తోంది.

చుట్టుపక్కలనున్న ప్రకాశమ్మా, సుందరమ్మాకూడా రోజూవచ్చి చూసిపోతూవుండేవారు. వీళ్లకి శ్యామం అంటే ఎంతో ప్రేమ. పాపం పిల్లల్లేకపోవడంచాత 'చిట్టి'నీ 'కృష్ణ'నీ రోజూ తీసుకెళ్లి ఆడిస్తూ వుండేవారు.

'శశి' కాపరానికివెళ్లి రెండేళ్లయింది. 'శారద'కి పన్నెండేళ్లు, కొంచెం జ్ఞానమొచ్చిన పిల్ల. 'భాను' ఎనిమిదేళ్లవాడు. 'కృష్ణకి' ఐదు, 'చిట్టి'కి రెండు సంవత్సరాలు.

* * * *

ఆమెజీవితంలో కష్టాలూ సుఖాలూ కలలులాగ గడిచిపోయాయి. సుఖాలకంటె కష్టాలే ఎక్కువ అనుభవించింది. ప్రపంచం అనే నాటకంలో ప్రతీమానిసీ ఏదో వొకపాత్ర ధరిస్తాడు—ఆమెది కష్టాలను భవిస్తూ సంతోషించేపాత్ర! తన పాత్రధారణం ఆమె నిపుణతతో నిర్వహించింది—ఇంక విరమింపబోతోంది. ఆమెబిడ్డలు ఆమెపాలిటి ప్రేమ పుష్పాలు; భర్త కల్పతరువు. ఆమెకి తీరవలిసిన కోర్కెలన్నీ తీరాయి ఒక్కకోర్కెమాత్రం మిగిలింది.

ఆమె ఒక్కసారి పిల్లల్ని చూడాలని కోరింది. పిల్లలికి ధైర్యంచెప్పి, హాయిగా ఏ చింతా లేకుండా ప్రాణం వదలాలని ఆమెవూహ. ఇంక తనబ్రతుకు అట్టే కాలంలేదని ఆమె గ్రహించింది. పిల్లల్ని చూడగలుగుతానో లేనో అని ఆమెకంగారు పడసాగింది...ఆప్రాణికి పిల్లలే కావాలి. ఆమెదృష్టి వేటికేసీ మరలటంలేదు. ఏ సంగతీ ఆమెకి జ్ఞాపకంలేదు, ఆమెకి పిల్లలొక్కళ్లే ఈ ప్రపంచంలో కనబడుతున్నారు. ఆఖరికి భర్తవిషయంకూడా అట్టే ఆలోచించినట్లు కనబడదు. ఆమె! ఈ లోకంలోనే వున్నట్లు కనబడదు. అప్పుడప్పుడు మాత్రం కళ్లుతెరచి పిల్లలు వచ్చేరో లేదో కనుక్కుంటోంది.

సాయంత్రం పడినకొద్దీ ఆమెకి తొందర ఎక్కువ కాజొచ్చింది. ఆమె ప్రాణాలు పిల్లలకోసం కనిపెట్టుకు కూర్చున్నాయి! తల్లి ప్రాణి, అంత్యకోరిక!!

* * * *

సాయంత్రం ఐదుగంటలయింది...సూర్యుడు మబ్బుతెరలచాటున వున్నాడు.

రామం వరండాలో బల్లమీద అయోమయంగా కూర్చున్నాడు. అతని ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. పిల్లల్ని తలచుకోనేసరికి అతనిగుండెలు నీరవుతున్నాయి...ఇంక పిల్లల్నిచూసే దిక్కుండదు, పిల్లల్ని పెంచటం తనికి చాతకాదు. తనదగ్గిర పిల్లలికి అలవాటులేదు. అయితే పిల్లలగతేం కాను...? చిట్టి...అయ్యో!...తనమూలాన్నే కదా వాళ్ల కింతటి దురవస్థ వచ్చింది. తనకోసం నానాకష్టాలూ పడి,

నానాచాకిరీచేసి, తిండి సరిగ్గాతినక, పస్తులు పడుకోడం మూలాన్నేకదా శ్యామానికి ఇంతటి దురవస్థ వచ్చింది......తను ఎంతటి దుర్మార్గుడూ...ఒక్కరోజుకూడా తను ఆమెని ప్రేమతో పిలవలేదు. ఆమె సుఖంకోసం తను ఎప్పుడూ పాటుపడలేదు. ఆమె బ్రతికివుందో లేదో కూడా తన కనుక్కునీవాడుకాదు... ఆమెను తిట్టాడు, దుఃఖపెట్టాడు, తను దుఃఖించాడు, నానాహింసలూ పెట్టాడు. ప్రత్యుపకారం—? ఆమె నిద్రాహారాలు మాని తన సేవకోసం, తనసౌఖ్యంకోసం జీవితాన్ని అర్పించేస్తోంది. తన్ని సౌఖ్యపెట్టడానికని, తిరిగి తా నుద్ధరింపబడుతుందని, అమాయక నమ్మికతో, ఎక్కడినించో వచ్చి, అగ్నిసాక్షిగా తన్ను పెళ్లాడి, సంపూర్ణంగా హృదయమిచ్చిన ఆ అమాయక ప్రేమకుసుమాన్ని తను తుంచి పారేశాడు. నిష్కళంకమగు పవిత్రప్రేమకు ప్రతిఫలము పదాఘాతము. నవనీత కోమలమగు ఆమె ప్రేమ హృదయం పైన పదాఘాతము! అతని హృదయం క్షోభించిపోయింది. ఆమెను ఆఖరిసారి క్షమార్పణ వేడుకోనేందుకు నిశ్చయించుకున్నాడు.

అతని కళ్లల్లో నీళ్లబిందువులు తాండవమాడుతున్నాయి. అతనిదృష్టికి అడ్డుగా మబ్బుతెరలు క్రమ్ముకుపోయాయి. అతను వీధివేపు వెర్రిగా చూస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. నెమ్మదిగా 'గేటు' తెరవబడింది. గుఱ్ఱపుబండీలోన ప్రవేశించింది. రామం అప్రయత్నంగా లేచాడు. అతను కళ్లు తుడుచుకున్నాడు. అతన్ని కాళ్లు అతన్ని క్రిందికి తీసుకుపోయాయి. అక్కడ స్థంభాన్ని జార్లాపడి నుంచున్నాడు.

బండి పిల్లల్ని తీసుకువస్తోంది. బండివాడు దిగి బండిని నడిపిస్తున్నాడు. వెనక్కాల బాబు నడచి వస్తున్నాడు. వీళ్లకి కొంచెందూరంలో వెంకడు సైకిలుమీద వస్తున్నాడు.

బండీ గుమ్మందగ్గర ఆగింది. వరండాలో నించుని వున్నకాంతం బండిదగ్గర కెళ్లి చిట్టిని అందుకుంది. శశి దిగింది. బాబు కృష్ణనీ భానునీ దింపేడు. రామం బండిదగ్గరికి రెండడుగులు వేశాడు. తండ్రినిచూసి చిట్టి చేతులు చూపింది. సంతోషంతో తండ్రికాళ్లని కౌగలించుకున్నాడు కృష్ణ. రామం చిట్టిని అందుకున్నాడు. శశి తండ్రిమొహం చూడలేకపోయింది. ఉబికివచ్చే యేడ్పుని కళ్లల్లో ఆపుగుని మొహం రెండోవేపుకి తిప్పుగుంది. నెమ్మదిగా శారద బండిలోంచి దిగి అక్కప్రక్క నుంచుంది.

రామం చిట్టిని యెత్తుగుని కృష్ణచెయ్యి రెండోచేత్తో పట్టుగుని మేడ మెట్లకేసి నడక సాగించాడు. శారద కృష్ణని నడిపించ మొదలెట్టింది. శశీ, భానూ వెనక్కాలే వెళ్లారు. కాంతం, బాబూ వాళ్లని అనుకరించారు.

పాపం ఆ చంటిపిల్లలు ఎందుకు అంత నిశ్శబ్దంగా వెడుతున్నారో, వాళ్లు ఏం చూడబోతున్నారో తెలుసుకునే స్థితిలో లేరు. కాని విచారంతో మొహాలు వేలవేసుగుని వున్నారు.

గదితలుపు జార్లావేసివుంది.

రామం తలుపు నెమ్మదిగా తోశాడు. శ్యామం ఆతృతగా గుమ్మంవేపు చూస్తోవుంది. పిల్లలు వొకరి తర్వాత వొకరు లోపలికివెళ్లి శ్యామం మంచంమీద కూర్చున్నారు. రామంచేతిలోనిచిట్టి తల్లినిచూడ్డంతోటే 'అమ్మా,—అమ్మా!' అంటూ తల్లిమీదికి వురకలువేయసాగింది. తల్లికళ్ల నీళ్లుతిరిగాయి. చిట్టిని హృదయానికి అదుముకుంది. 'నాచిట్టితల్లీ-వొచ్చావా, అమ్మా' ఆమెముద్దులకి పరిమితిలేదు. ఆచంటిపిల్లని ఎన్ని

సార్లు హృదయానికి అదుముకుందో! చిట్టి కొంతసేపు ఆనందంలోపడి కొట్టుకపోయింది. తల్లిమొహం పరికించిచూచింది. 'అమ్మా!' అని తనభాషలో ఏదోఅంది. దానికి సమాధానంరాలేదు. తల్లి కృష్ణతల నిమురుతోంది. తల్లి మొహాన్ని చూసేసరికి చిట్టికి భయంవేసింది. తండ్రి చిట్టిని అందుకున్నాడు.

శ్యామం పిల్లల్ని తనివిదీరా ముద్దుపెట్టుకుంది. కళ్లు నాల్గింతలుచేసుకొని తనివిదీరాచూసుకుంది. అఖండ సౌఖ్యం ఆకాస్తసేపూ అనుభవించింది.

తల్లిదగ్గర కూర్చున్నంతసేపు శశికళ్లు చెమ్మగిల్లుతున్నాయి. శారదకూడా ఆవిధంగానేవుంది. భానుకి తెలిసీ తెలియనిజ్ఞానం. తల్లి అతన్ని ఎప్పుడు హృదయానికిజేర్చుకుందో అప్పుడు ఏడ్పు ఆపుకోలేకపోయాడు. కాని శశి మొహంచూసేసరికి ఏడవొద్దని సంజ్ఞచేసింది. ఇంక ఏడవటానికి అతనికి భయంవేసింది. కృష్ణకి ఇంకా అసలు తెలియనితనం. తల్లికి జబ్బుగావుందనీ ఏదో అవుతుందనీ తెలుసు. అది తల్లినీ, తమనీ బాధపెట్టే దని గ్రహించాడు. అక్కల మొహాలుచూసి ఏడుస్తోన్నట్లు గ్రహించాడు. తల్లి తనకేసి చేతులుచాచేసరికి, అంతవరకూ లోపలలోపల ఉడుకుతూవచ్చినయేడ్పు ఒక్కసారి పొంగిపోయింది. తల్లిహృదయానికి అంటిపెట్టుకుపోయాడు. 'కృష్ణా! ఏడుస్తావెందుకురాబాబు...ఏడవకు...నాకేం పరవాలేదు.' కృష్ణ తల్లికళ్లల్లోకి చూశాడు. 'నాకేమీ భయంలేదమ్మా. మిమ్మల్ని చూద్దామనివుంటే రమ్మన్నాను. అంతే. ఏడవకమ్మా,' అంది తల్లి. కృష్ణ బితుకు బితుకుమంటూ తల్లిపక్కని అంటిపెట్టుకు కూర్చున్నాడు.

తల్లి, 'అమ్మా శశీ! ఇలా నాకేసిచూడూ,' అంది లేనిపూపిరి ధైర్యం తెచ్చుగుంటూ, '...నేను ఇంక ఆట్టేసేపు బతకను. నాకోసం ఏడవకండి. నాకోసం బెంగెట్టుకోవద్దు. చెల్లాయిల్నీ తమ్ముళ్లనీ జాగ్రత్తగా చూస్తోవుండే. వాళ్లకేమీ తెలియదు, చంటితనం, విసుక్కోక—నాలోటు తీర్చాలమ్మా. నాకోసం బెంగెట్టుగుంటే ఎలాగ?...నాన్నగారికి ఏంకావలిసింది చూస్తూవుండు, ఏం?' అంది ఆశాపూరితనయనాలతో కూతురు కళ్లల్లోకి చూస్తూ.

శశి మాట్లాడలేకపోయింది. నాలుక అనేకసార్లు తడుపుకుని ఆఖరికి 'అలాగేనమ్మా' అంది.

తల్లి మిగిలిన పిల్లకేసితిరిగింది. కృష్ణనీ భానునీ బుజ్జగిస్తూ మాట్లాడసాగింది. 'అక్కయ్యని విసిగించక ఎలాగచెపితే అలాగచెయ్యాడేం. నాకోసం ఏడవొద్దు. నామాట తలపెట్టొద్దు. బాగా చదువుకోండి. నేను మీకు తెలియకుండా ఎప్పుడూ మీదగ్గరే వుంటానులెండి. ఏడవరుకదూ?' పిల్లలు ఆలాగేఅన్నట్లు తల వూపారు.

ఇదంతాపరికిస్తూ చిట్టి తండ్రిచంకలో నక్కికూర్చుంది. తండ్రికేసి చూసింది. అతనికళ్లమ్మట కారేనీళ్లు పరికించింది. ఆమెకి అనుమానంవేసి తల్లికేసి చూసింది. తల్లి ఏదో తనకి అర్థంకాకుండా విచారంతో మాట్లాడుతోంది. చిట్టికి భయంవేసింది. అక్కలకేసి తిరిగిచూసింది. వాళ్లకళ్లమ్మట నీళ్లువస్తున్నాయి. అన్నలుకూడా ఆలాగేవున్నారు. అంతాఎందుకూ ఆలాగున్నారు? కృష్ణకూడా గట్టిగాఏడ్చాడు. చిట్టికి చెప్పలేనంతభయం ఏడ్పూవచ్చింది. తండ్రిభుజంమీద తలఆన్చి ఏడ్పుసాగించింది...శశి చిట్టిని అందుకుంది. చిట్టి అక్కదగ్గర వుండలేదు. తల్లి నీరసంగా చేతులుచాపింది. చిట్టి తల్లిహృదయంమీద తలపెట్టుకుని భయం తీర్చుకుంది—ఆమెయేడుపు ఆగింది. ఆచిన్నహృదయం శాంతించింది. అక్కడికీ 'బిక్కు బిక్కు' మంటూనేవుంది.

పిల్లల్నందర్నీ శశిగారింటికే పంపించ దలచుకున్నారు. అక్కడే కనకను పిల్లలుంటే భయపడరాని వాళ్ల భయం. పిల్లలంతా లేచినుంచున్నారు. తల్లి మొహంమీద మందహాసచిహ్నం కనబడుతోంది. శశి చిట్టిని తల్లిచేతులోంచి అందుకోబోయింది. చిట్టిఏడ్చింది. తనకీ తనతల్లికీ ఏదో దూరమైపోతోందని అనిపించింది. ఎవరో తనకి తెలియనివారు తనతల్లిహృదయాన్నించి తన్ని లాగేస్తున్నారు. రానని ఏడ్చింది. కాని శశి మంచిమాటలతో తీసుకుంది. చిట్టిహృదయం భారమయ్యింది. కాని ధైర్యంగావున్న అక్క మొహం చూసి కుదుటబడింది.

పిల్లలు గదిలోంచి వెళ్లిపోయారు. మేడమెట్లమీద చప్పుడుకూడా సన్నగిల్లింది. గదిలోకి అంధకారం వ్యాపించింది. శ్యామం కళ్లుమూసుగుంది. ఆమెప్రక్కని రామం కూర్చున్నాడు.

కొంతసేపటికి ఆమె కళ్లుతెరచింది. ప్రాణేశ్వరుని ముఖంలోకిచూసింది. దూరంగావున్న దీపంలోంచి గుడ్డివెలుతురు ఆమె పాలిపోయినకళ్లమీదికి పడుతోంది. తన రెండు చేతులతోటీ రామం రెండుచేతులూ పుచ్చుగుని తనహృదయంమీదికి జేర్చుగుంది. హీనంగా... 'నాథా ! ఇంతవరకూ మీకు నేను ఏదైనా కొరత ఎందులోనేనా చేసివుంటే... నన్ను క్షమించరూ ?' కళ్లనీళ్లతో అంది, 'నాతప్పులన్నీ క్షమించరూ ?' అని ప్రాధేయపడింది.

రామానికి అంధకారంలోనుంచి వెలుగులో పడ్డట్టయింది. అతనిఏడుపుకి అంతంలేదు. 'శ్యామం! నిన్నా-నేనా ? ఏమని క్షమించమంటావు ?' అతనిగొంతుక గద్గదమయింది, 'నువ్వు నాకు ఏమి అపకారం చేశావని ? నిన్ను నేనే క్షమార్పణ వేడుకోవాలి. నిన్ను నానాబాధలూ పెట్టాను, నిన్ను కష్టాలూ పెట్టాను. క్షమించవూ ? శ్యామం ఈనిర్భాగ్యుణ్ని క్షమించవూ ? నాతప్పులు క్షమించి నన్ను ధన్యుణ్ణిచెయ్యవూ? నేను బుద్ధిహీనుణ్ణి, నారత్నాన్ని పోగొట్టుకుంటున్నాను, నన్ను క్షమించవూ ?' అన్నాడు ఆవేశంలో.

'లేదు. ఎన్నటికీకాదు. మీరు నాకు ఏమీ అపకారంచెయ్యలేదు. నాతప్పులు చాలావున్నాయి క్షమిస్తాననరూ ?' అని కరుణాదృష్టితో చూసింది.

'అటువంటివి ఏవేనావుంటే తప్పకుండా క్షమిస్తాను. నువ్వు అడక్కుండానే క్షమిస్తాను. నిన్ను పూజ చేసుగుంటాను' అన్నాడు; ఆమెచేతులతో తనముఖాన్ని కప్పుగుంటూ.........

'అమ్మయ్య !'అంది శ్యామం, తనఆశ అంతా తీరినట్టు.

ఆమె కళ్లుమూసుకుంది. ఆమెబరువులన్నీ తీరినట్లు ఒక్క దీర్ఘనిశ్వాస విడిచింది. రామం ఆమెచేతులు తనగుప్పిట్లో పెట్టుగుని కదలకుండా కూర్చున్నాడు. అతను ఏంచేస్తున్నాడో అతనికే తెలియదు.

కిటికీరెక్కలు టపటపా కొట్టుగున్నాయి. దీపం గజగజ వణకి ఆరిపోయింది. శ్యామం ప్రక్కకు వరగింది. జీవజ్యోతి ఆమెముఖంలోంచి అంధకారంలో లీనమయ్యింది.

రామం అలా ఎంతసేపుకూర్చున్నాడో అతనికే తెలియదు.

రెండుగంటలతర్వాత డాక్టరుగారు వచ్చారు. రామం శ్యామంచేతులు తన నుదిటిమీద పెట్టుగుని కూర్చునివున్నాడు. డాక్టరు రామాన్ని లేపారు. 'అంతా అయిపోయింది. ఆమె ఈలోకాన్ని విడిచి పోయింది' అన్నారు.

రామం 'లేదు...నన్ను వదల్లేదు...నన్నువొదిలి వెళ్లదు...ఇక్కడే వుంది...పొండి, అవలికి పొండి' అని పిచ్చికేకలు పెట్టసాగేడు.

డాక్టరు అతని రెక్కలుపట్టుగుని బలవంతంగా ప్రక్కగదులోకి ఈడ్చుకుపోయారు.

*　　　*　　　*　　　*

తెల్లవారేసరికి పిల్లల్ని మళ్లీ తీసుగొచ్చారు. రామం విచారంతో పచారుచేస్తున్నాడు. కాంతం వచ్చి 'రామం! నిన్నోసంగతడగాలి.'

రామం ఏమిటన్నట్లు చూశాడు.

'శశి అత్తగారింటిదగ్గరుండి చంటిపిల్లల్ని పెంచలేదు. పిల్లల్ని పెంచడం నీకూ చాతకాదు. చంటిపిల్లని సుందరమ్మ పెంచుకుంటుందట. కృష్ణని ప్రకాశమ్మ తీసుగెడుతుందట. నేను భానుని దగ్గరుంచుకుని చదువు చెప్పించుగుంటాను.'

ఇంతట్లోనూ జానకమ్మ అక్కడికివచ్చింది. 'వొద్దు. అందరం ఓదగ్గిర పడివుంటాం' అన్నాడు రామం.

'అలాకాదు. వాళ్లసదుపాయాలు చూడొద్దూ? నీకు వాళ్లసంగతిచూడ్డం అసలు చాతకాదు. శశి ఇంకా చంటిపిల్ల, లోకం యరగదు. వాళ్లకి తల్లిలేని కొరత తీర్చాలి. అది చాలాకష్టం. నువ్వు రోజూవచ్చి పిల్లల్నిచూసి వెడుతోవుండొచ్చులే. శారదని నేపెంచుకుని దానికి పెళ్లిచేసుగుంటాను. ప్రకాశానికీ సుందరికీ పిల్లల్లేనికొరత తీర్చు. శ్యామం వాళ్లూ ఎంతో ప్రాణంగావుండేవారు. చిట్టికీ కృష్ణకీ వాళ్లదగ్గిర అలవాటు కూడాను,' అంది జానకమ్మ.

'ఇల్లు నీకు సరిపడింది వుంచుకుని, మిగిలింది అద్దికిచ్చెయ్యి.' అంది కాంతం. 'ఇంక గతించినదానికి విచారిస్తే లాభంలేదు.' రామం ఒడంబడక తప్పిందికాదు.

*　　　*　　　*　　　*

ఇల్లంతా చాలా వెలితిగావుంది. గృహలక్ష్మి లేకపోవడంచేత పాడురూపు దాల్చింది ఇల్లు!

శ్యామం 'ఫొటో' చేత్తోపట్టుగుని చూస్తూ రామం రెండు కన్నీటిబొట్లు రాల్చాడు.

గాఢాంధకారం ఇంటిలోకి చొచ్చుకుంది. జ్యోతిలేదు ఆయింట్లో.—

విచారంతో పచారుచేస్తున్నాడు—రత్నాన్ని పోగొట్టుగున్నాడు—ఆ శూన్యగృహంలో....

—శ్రీ 'జీవన ప్రభాత.'



## పిల్లలకు

# 'గుజ్జనగూళ్లు'

### శ్రీమతి కొర్రప్రోలు వెంకటరంగమ్మగారు

మధ్యాహ్నం రెండుగంటలైంది. లక్ష్మివచ్చి 'మామ్మా! ఇంకా సుబ్బలక్ష్మి వాళ్లు బళ్లోకి రావటంలేదు' అంది. ఆమాటవినగానే సూర్యకాంతం 'వాళ్లంతా సుశీలగారింట్లో గుజ్జనగూళ్లు వండుకుంటున్నా'రంది. లక్ష్మి 'అవునో నేనుబళ్లోకి వస్తారేమో అని పిలవ డానికెళ్లాను. నన్నుచూచి శ్యామ యీ లక్ష్మీదేవిపరక అందరితోటి చెప్పేస్తుంది అంది. ఇప్పుడింకాకూర వేయిస్తున్నారు, మనం వెడదాంరా సూర్యకాంతం అన్నది.

సుబ్బలక్ష్మి సుశీలా అక్కచెల్లెళ్లు. యీ భోజనాలు చూతామని నేనుకూడా వెళ్లే సరికి ఆకులువేసి వడ్డన ప్రారంభిస్తున్నారు. బజ్జీలు, పులిహోర, బంగాళాదుంపకూర ఇంకా ఏవో చేశారు. కమల, శ్యామ, సుశీల, సుబ్బు.అంతావరసతీరి కూర్చున్నారు. సీత వడ్డిస్తూంది. వీళ్లంతా నన్నుచూసి 'మీరురాకుండా మాభోజనాలు అయిపోతున్నా'యన్నారు. ఇంతలో సుశీలతల్లి 'మీకువంటసరదా తీరకపోతుందా నేను వండిపెడతానంటే విన్నారు' కారంది. వెంటనే 'సీత కాదండీ నాకు అలవాటేనండీ. మాఅమ్మ ఊళ్లోలేకపోతే యెప్పుడైన మా నాన్నగారికి వంటచేస్తాను' అంటూ వడ్డనచేస్తూంది. భోజనాలుప్రారంభించాక కమల లక్ష్మినిచూచి 'శ్యామ అట్లాఅనకపోతే ఆమెకూడా వుండునేమో అంది. అందరూ పరక'ని యెందుకన్నావమ్మా అన్నారు! శ్యామకు కోపంవచ్చింది. ఒక్క మెతుకైనా నోటపెట్టుకుందోలేదో అట్లే కూర్చునిపోయింది. లక్ష్మిని తూలనాడితినని ఆమె మనసు నొచ్చింది. అందరి భోజనాలు అయినతర్వాత శ్యామ సరిగా భుజించలేదని ఒకరితోనొకరు చెప్పుకొని చివరకు సీత మమ్మందర్నీ బలవంతపెట్టింది. లేకపోతే శెలవురోజులలో సావ కాశంగా యెవరికి ఇబ్బందిలేకుండా వండుకొందుమన్నారు సీత. 'పోనీలెండమ్మా అంతా కలసి నేరంనామీదికి తోశారా? నాదేతప్పు. ఏంచేస్తాను మరి' అని కళ్లనీళ్లు గిరున తిప్పింది.

ఇదంతాచూస్తే నాకు జాలేసింది, 'పోనీలెండమ్మ చక్కగా భోజనాలుఅన్నీ అయి నాయిగదా? యీ నిష్టూరాలెందుకు? ఒకరిమీదనొకరు నేరముపెంచుకోక సంఘంగా వుండటం అలవాటుచేసుకోకుంటే యీ అలవాటే పెద్దవాళ్లయినాకకూడా వృద్ధి చేస్తారు. మీభావి జీవితమంతా పార్టీలతోను పంతాలతోను నిండిపోకుండా బాల్యంలో చక్కని విద్య సంపాదించి యవ్వనమందు మంచి విజ్ఞానాన్ని పొందివుండాలి. దేశముయొక్క భవితవ్యము మీపై ఆధారపడియున్నది. మీరంతా గృహలక్ష్ములై మీసంతానాన్ని సన్మార్గంలో నడిపించా'లనేసరికి పక్కన నవ్వారు. యెక్కడికోప మక్కడి కేపోయింది.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ! నీవు ఒక్కొక్కప్పుడు వేయు ప్రశ్నలింత అమాయకముగ నుండునేమి? ఈసంవత్సరము మన ఆంధ్రదేశమున జరిగిన మహిళాసభలన్నియు ప్రత్యేకరాష్ట్రమును వాంఛించుచు తీర్మానించుట పనిలేని పనియా? ఒకరినిజూచి ఒకరు గావించినవేలము వెఱ్ఱి చేష్టలా? నిజమునకు మహిళాసభలకు రాష్ట్రతీర్మానముతో సంబంధమేలేదా? ఔరా? నీ వాక్యము లెంత ఆశ్చర్యవిషాదముల గలిగించుచున్నవి! ఇరువదైదువత్సరముల రాష్ట్రోద్యమానంతరముగూడ నీబోంట్లు రాష్ట్రప్రాముఖ్యత గుర్తింపకుండుటయు మహిళాసభలకు దీనితోనేమి సంబంధమని ప్రశ్నించుటయు జూడ మన అజ్ఞానదశకు నాలోనాకే బిడియమగుచున్నది. ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడు విషయమున స్త్రీలకు మాత్రమేల సంబంధము లేదు? మహిళాసభలు వానినేల తీర్మానింపరాదు? రాష్ట్రప్రయత్నము కేవలము పురుషులకు సంబంధించినదేనా? స్త్రీ లోకము మాత్రమాంధ్రమహాజనములో భాగముగాదా? ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడినపు డందువలన గల్గెడి లాభములను స్త్రీలుమాత్ర మనుభవింపరా? నీవు పొరబడుచున్నావుగాని మన తెలుగుసీమ ప్రత్యేకరాష్ట్రమయ్యెనేని పురుషులకన్న మన స్త్రీలకే యెక్కువలాభము చేకూరగలదు. చూడుము! పదిరెండు జిల్లాల విశాలదేశమైయుండియు, ప్రత్యేక విశ్వవిద్యాలయముండియు, స్త్రీలకొక కళాశాలయైనలేదు, ఒక బోధనాభ్యసనాలయమైనలేదు, ఒక వైద్య పాఠశాలయైనలేదు, ఒక లలితకళా పరిశ్రమాలయమైనలేదు. ఏవిద్య నేర్వవలయుననినను 'చెన్నపురీ! యెక్కడనుంటి'వని పరుగెత్తవలయును. అంతగా పరుగెత్తివెళ్లినను అచట నూటికొక్కరికైన స్థానము లభించుటరిది. అంతటితో మన తెలుగు విద్యార్థినులు విద్యకుతిలాంజలి యొసగి బిక్కమొగములతో నింటికి జేరవలయును.

మనకు ప్రత్యేకరాష్ట్రమే యుండునేని మన ఆంధ్రస్త్రీలు విద్యార్జనకై యింత శ్రమపడవలసిన అవసరముండునా? ఈయొక్క విషయముననే యననేల మన ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర మేర్పడినయెడల మనమాతృభాష విద్యాపీఠములలో విద్యాబోధనము సేయు భాషయై, న్యాయస్థానములలో వ్యవహారముల పరిష్కరించు భాషయై చట్టసభలలో రాజకీయముల చర్చించుభాషయై విరాజిల్లదా? నేడాంగ్లమయమైన వ్యవహారతంత్రమంతయు మన ఆంధ్రభాషామయమైనపుడు, నేడు మూలబడియున్న మన ప్రాజెక్టులు నిర్మితములై యావదాంధ్రదేశము సస్యవిశాలధాత్రియై వరలినపుడు, నేడడుగునబడియున్న మన ఆంధ్రకళాపరిశ్రమలున్నతికివచ్చి దేశ సౌభాగ్యమునకు దోహదములైనపుడు, నేడు పేరుమాసియున్న మన సముద్రతీరపు రేవులు పునర్నిర్మితములైనపుడు నేడాంధ్ర భూగర్భమున నిక్షిప్తములై యున్న మన వజ్రాది ఖనిజసంపద పాతాళలోక

నిర్బంధమునుండి విముక్తినంది వెలికివచ్చి తన దీధితుల దశదిశల బర్వజేసినపుడు, నిజముగా మనకెంత ముదావహాము! ప్రత్యేక రాష్ట్రప్రాప్తిచేదక్క నిట్టి భాగ్యభోగ్యము లనుభవింప నన్యవిధముల మనకు సాధ్యమగునా? ఇట్టి అత్యంతప్రాముఖ్యమగు రాష్ట్రవిషయమున మన యాంధ్రమహిళా సభలన్నియు నేకగ్రీవముగా తీర్మాన మొనర్చుట ప్రశంసనీయముగు విషయముకాని, పరిహసింపవలసిన విషయముగాదు. అయినను నిందు నీతప్పులేదు లెమ్ము. రాష్ట్రప్రయోజనము నిసుమంతయైన గమనింపక నీవింత వెఱ్ఱిగా ప్రశ్నించుచున్నపుడు రాష్ట్రము కావలెనను వారి తీర్మానములు నీకు వెఱ్ఱివిగా దోచుటలో దోసమేమున్నది? కనులకే రంగుగల అద్దములు పెట్టుకొనిన జగమంతయు నావర్ణముగలదిగా నున్నట్టు దోచుట సహజముగదా!

కల్పలతా! నీవేమనుకొనినను సరియే కాని, రాష్ట్రతీర్మానము నామోదించుటలో మన ఆంధ్రమహిళామణులు మంచి ప్రాజ్ఞతనే చూపిరనియు, మంచి ఐకమత్యమునే వెల్లడించిరనియు, మంచి ఆదర్శమునే ప్రదర్శించిరనియు నాయభిప్రాయము. ఏలనందు వా, యిదియేవిషయములో పురుషులలో నిట్టి యేకాభిప్రాయము కానరాకున్నది. ముఖ్యముగా రాయలసీమలో నిదియొక గొప్ప వివాదవిషయమైపోయినది. వీరిలో నొక పక్షమువారికి ఆర్థికాభివృద్ధి ముందట ఆంధ్రరాష్ట్రము ఆవెనుకట; ఉత్తరసర్కారుల వారిని నమ్మరట. కోట్లకొలది రాష్ట్రధనమును తమ సొంతసొమ్ముగా వెచ్చించి, ఎన్నోప్రాజక్టుల నిర్మించుకొని, తమ తమిళనాడంతయు సస్యశ్యామలముగా జేసికొని క్షామ పీడితమైన తమ రాయలసీమకు రవంతయైన చేయివిదల్పని అరవలే వారి కాప్తబంధువులట. తమ భాషకు ప్రాముఖ్యత లేకపోయినను సరియే, తమ దేశమునకు ప్రాముఖ్యత లేకపోయినను సరియే మద్రాసు విశ్వవిద్యాలయముతోనే తాము కలిసియుందురట తమిళులుగాని కర్ణాటులు గాని, మహారాష్ట్రులుగాని, అన్యులెవరైనను వారితోడి సఖ్యము వారికి సమ్మతమేనట; సోదరాంధ్రులతో మాత్రము వారు కలిసిరారట. ఈ విధముగా 'అయిన వారి కాకులలో కాని వారికి కంచములలో' అను సామ్యమును స్ఫురింపజేయుచున్నది వారి వాదము. అయితే యీ విపరీతవాదమునకు కారణములేకపోలేదు. తాము స్వయముగా తమిళ మహారాష్ట్రకన్నడాది దేశములకు జెందినవారైయుండి, యిప్పటికిని ఆయాభాషలనే తమ యిండ్లలో మాట్లాడుచు, యేనాడో యీ తెలుగుదేశమునకువచ్చి యిచ్చటనే ఉండి పోయినవారు కొందఱున్నారు. ఈదత్త సంతానము ఉత్తర సర్కారులలోకన్న రాయల సీమలో నెక్కువ వీరికి తమ వేషభాషలు ప్రత్యేకమైయుండగా తెలుగుభాషపైగాని తెలుగు రాజ్యముపైగాని, తెలుగు జనులపైగాని ప్రేమ యెట్లుండును?

కాన తెలుగురాష్ట్రమేర్పడి, తెలుగుభాషయున్నతికివచ్చి, తెలుగులందరేకమగుట

వీరికిగిట్టదు. తెలుగు దేశమునకంతటి యున్నతివచ్చి తెలుగుల ప్రాబల్యముమోడైన అల్ప సంఖ్యాకులగు తమ దత్తసంతానము స్థితియేమగునో యనుభయము వీరి హృదయముల అంతర్గతమైయున్నది. కావున ఆర్థికాభివృద్ధియను నెపమున అనైకమత్య హేతువగు ఆందోళనను లేవదీసి శల్యసారధ్యముసేయుచు మన తెనుగువారి చిత్తముల కలంచుచున్నారు. అమాయకులగు తెలుగు ప్రజలీ మర్మమెఱుగక వారివలలో దగుల్కొని రాష్ట్రాందోళన కవరోధము గలిగించుచున్నారు. మన తెలుగువారివంటి పిచ్చివారెందైననున్నారేమో కనుము! వీరాలోచింపకనాడు మాటలేగాని, మన దేశమున బ్రిటిషుప్రభుత్వమేర్పడిన నాటి నుండియు రాయలసీమ చెన్నరాజధానిలో తమిళులతో పొత్తుకలిసియేయున్నది గదా. నాటినుండి నేటివఱకు రాయలసీమ క్షామదేవత కావాసమై నిప్పచ్చరముగనేయున్నది గదా. ఇంతటి దారిద్ర్యముతో కొట్టుమిట్టాడుచున్నను రాష్ట్రపరిపాలనములో ప్రాముఖ్యము వహించిన అరవవారు రాయలసీమను క్రీగంటనైనచూచిన పాపమునపోలేదు గదా. అయినను ఆ అరవస్వాములనే నమ్మియుండెదమనియు, వారే మాకష్టముల గట్టెక్కింతురనియు రాయలసీమ వారనుట అమాయకమును, అజ్ఞానమునుగాక మఱి యేమగును?

కల్పలతా! ఎప్పటికైన రాయలసీమ రత్నాలసీమ కావలెనన్నచో వారు సోదరాంధ్రులతో మనస్ఫూర్తిగా స్నేహముకలిపి సంఘీభావముతో రాష్ట్రసిద్ధికై కృషిసల్పవలయును కాని వ్యతిరేకించికాదు. అనైకమత్యమువల్లనే మన హిందూ సామ్రాజ్యము శిథిలమైనది. అనైకమత్యమువల్లనే నేడు కాంగ్రెసు సాధింపనున్న స్వరాజ్యము చేయికందక దవుదవ్వగుచున్నది. ఈ అనైకమత్యదోషమువల్లనే యిరువదైదేండ్లనుండి ప్రయత్నించుచున్నను మన ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము సిద్ధింపకున్నది. ఇందువలన మన దేశమునకు కలుగుచున్న కష్టనష్టములు కన్నులార చూచుచునేయున్నాము. అయినను సమయమునకు కలిసిరాక, అనుమానములు అపనమ్మకములు పెట్టుకొని కార్యభంగము కలుగజేయుట యెంతయు శోచనీయము. పరస్పర విశ్వాసము సంఘీభావములేనిచో నెంత చిన్నపనియైనను నెరవేరజాలదు. ఒకరు అవుననునది ఒకరు కాదనుచున్న నేపనియైన నెట్లు సానుకూలమగును? మన దేశములో నేమంచికార్యము తలపెట్టినను స్వార్థప్రేరితమైన నీ విభేదతత్త్వము విషక్రిమివలె మనసులలో ప్రవేశించుటయు, అంతటితో ప్రజలురాగల మేలు నెఱుగక ప్రతిఘటించుటయు, నిదికారణముగా నెప్పటి పద్ధతులే స్థిరపడిపోవుటయు జరుగుచున్నది. ఈస్థితిజూడ మన దౌర్భాగ్యస్థితి యింకను తొలగలేదు గదా యని మనస్సు విచారమగ్నమగుచున్నది. కృష్ణా గోదావర్యాది మహానదులు ప్రవహించుటచే తూర్పుతీరమున రాయలసీమలో నున్నంతకాటకము లేకపోవచ్చును. అందువలన కోస్తా

ఆంధ్రులు కొంచెము సంపన్నులుగనే చూపట్టవచ్చును. కాని యీజీవనదుల ప్రవాహము దైవికముగా నిటు ప్రవహించినదే కాని స్వార్థబుద్ధులగు ఉత్తర సర్కారులవారు రాయలసీమవారి నన్యాయముసేయుటకై స్వయముగా ప్రవహింపజేసికొనినవికాదు గదా. కాన పశ్చిమాంధ్రులు ఈ విషయమున ఉత్తరాంధ్రుల నేవగించుకొనుటమాని స్నేహభావముతో సోదరాంధ్రులతోకలిసి రాష్ట్రమును సంపాదించి, తన్మూలకముగా తమ సీమనుగూడ సుభిక్షము గావించుకొనవలయును.

అసలు లిబ్బి చేజిక్కించుకొనిన వెనుకదానిని పంచుకొనునపుడు పోరాడినను సబబుగానుండును గాని రాష్ట్రప్రయత్నమటులనేయుంచి, పంపకముల విషయమై వాదప్రతివాదములునేయుట 'అయితే పల్లికరిణీక మైతేగియితే బఱ్ఱెను కొంటేగింటే పాలుయిస్తేగిస్తే మీవాళ్లకు పోస్తావా? మావాళ్లకు పోస్తావా' అని వాదు లాడుకొన్న ఆలుమగల కథగానున్నది. ఉత్తరాంధ్రులు పశ్చిమాంధ్రులును ఈవిధముగా పరస్పరానుమానములతో ప్రవర్తించుటవలన ఆంధ్రరాష్ట్రము రాకపోవుట కవకాశమున్నదేగాని, రాయలసీమ ఆర్థికాభివృద్ధిబడయుట కేమాత్రము అవకాశములేదు. రాయలసీమాంధ్రులు తమ రాయలసీమ రాజనములు బండు రత్నాల సీమ కావలయునని కాంక్షింతురేని అయ్యది ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడుటవలననే కలుగగలదు. ఆ ఆంధ్రరాష్ట్రము విభేదరహితమైన యావదాంధ్రుల సమిష్టియత్నమువల్లనే చేకూరగలదు.

కల్పలతా! ఆంధ్రమహిళాసభలన్నియు రాష్ట్రతీర్మాన మొనర్చినందులకే నీవు నవ్వుచున్నావు. నన్నడిగినచో మన స్త్రీలీ తీర్మానములు చేసినచాలదు నడుముకట్టి కార్యరంగమున దుమికి "విడిచిరేయత్నమమృతంబు వొడముదనుక నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు" అన్నట్టు పనిచేయవలయును.

కల్పలతా! ఇప్పట్టున రాయలసీమాంధ్ర నారీరత్నములపై అనంతబాధ్యతకలదు. వారు ప్రత్యేకాంధ్రరాష్ట్ర ప్రయోజనమును చక్కగా గుర్తెరిగి తమ ప్రజలలో అఖండ ప్రబోధము సలుపవలయును. ఐకమత్యమునకు భంగము కలుగజేసెడి తలంపుల రూపుమాపవలయును. మనతెలుగువార మెచ్చటనున్నను అందఱమొక్కటే, మనలోమనము కలతలు పెట్టుకొనుట ఇతరులు బాగుపడుటకును మనము చెడుటకు హేతువని నచ్చచెప్పవలయును. పురుషులవలన కాని యీ సంఘటనకార్యము స్త్రీలచే నెరవేర్పబడెనేని స్త్రీలకు యశస్కరమేగాక ఆంధ్రులకెల్లరకు లాభదాయకముకాగలదు.

ఇట్లు,
శారద.

భావపురి,
౧-౫-౩౯

" రాత్రిపవలును విసుగు విరామమనక
చెమటనోడిచి కష్టంబుజేసి ప్రజకు
పిడికెడన్నంబు వేళకు బెట్టుచున్న
రాజ్యరక్షకుడవు నీవు రైతుబిడ్డ "




డైరక్టరు :
గూడవల్లి రామబ్రహ్మం.

మ్యూజిక్ :
భీమవరపు నరసింహారావు.

*For Bookings apply to:—*

**SARASWATI TALKIES LTD.,**

**BEZWADA.**

Phone No. 52,
Grams "SARASWATI".



శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి

'సారథి'వారి 'రైతుబిడ్డ'లో ప్రముఖపాత్ర నిర్వహించుచున్నది.

# సినీమా లోకం

## మూర్తీభవించిన ఆంధ్ర సతీత్వం—వాహినీవారి వందేమాతరం

ఇన్నాళ్లకి వచ్చింది ఆంధ్రులకు పేరు కీర్తులు తీసుకువచ్చే చిత్రం. కళాపాటవంలోనే గాదు, కథా సంవిధానంలోనే గాదు, కల్పనా చమత్కృతిలోనే గాదు ఇది ఏ ఉత్తర హిందూస్థానపు చిత్రానికి తీసిపోదు; పైగా పైచేయే అవుతుందేమో కూడాను.

చిత్రంచూస్తూవుంటే అన్నిటికంటా మొట్టమొదట మన్ని ఆకర్షించేది దానిలో ఉపయోగించినభాష. ఇంత లలిత భావపూరితమైనభాష యింతవరకువచ్చిన ఏ తెలుగు చిత్రంలోనూ లేదంటే అతిశయోక్తిగాదు.

ఆమూలాంతం 'జానకి' పాత్ర చిత్రాన్ని పాలించింది. అసలు పాత్రసృష్టిలో జానకిపాత్ర అన్నిసన్ని వేశాల్లోను మూర్తీభవించిన ఆంధ్రసతీత్వాన్ని వెదజల్లుతోంది. ఒక సతీత్వమేగాదు ఆంధ్రమాతృహృదయాన్ని కూడా చాటుతోంది. ఆంధ్ర సతీత్వాన్ని, మాతృత్వాన్ని పూర్తిగా అర్థంచేసుకుని ఈ చిత్రంలో అన్నిటా ప్రతిబింబింపజేశారు ఫిలింనిర్మాతలు. భర్త, పుత్రునివల్ల యెడబాటుగలిగి, వారిద్దరి అన్వేషణలోను ఆటమటించి పోయిన ఆపవిత్రమూర్తి జానకి హృదయం ఎంత తహతహలాడిపోయిందో, చూచిన వారి హృదయాలు ద్రవిభూతమైపోయినాయి—యీపాత్ర నతి చాకచక్యంగా నిర్వహించిన కాంచనమాల దీనితో ఆంధ్రసినిమారంగంలో ఒక అచంచలమైన స్థానాన్ని నిర్మించుకుంది.

ఇక రెండోది అత్తపాత్ర. ఆకపటప్రేమ, ఆగిల్లికజ్జాలాట, ఆరాక్షసత్వం చూస్తే కరడుగట్టిన అత్తగారి తనాని కేవిషయములోనూ తీసిపోదు. మనం సక్కుబాయిలోని అత్తవేషం చూచాముగాని, యీ అత్తముందు ఆ అత్త ఎన్నోవంతు? అత్తగారుచిత్రంలో కనపడిందంటే మళ్లీమళ్లీ యేమిచేస్తుందో, దానిఫలితం ఏవిధంగా పరిణమిస్తుందో అని డోలాందోళిత మనస్కులమై పోతాము.

పెద్దనాది అష్టదిగ్గజముల కవితాస్రవంతిలో తేలియాడి, శిల్పకళాలక్షికి ఆటపట్టై రాగాజులపక్కలో బల్లెమైన ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయల అనన్యసామాన్య ప్రతిభా విశేషాలతో ఒకనాడు అఖిలధారుణీ మండలంలో ధృవనక్షత్రంలా వెలిగి, ఆకళాపాటవాన్ని ఆకీర్తివిశేషాలని నేటికీ వెదజల్లుతున్న ఆంధ్ర తేజం హంపి శిథిలదృశ్యం. ఇది చూస్తున్నంతసేపూ, ఊపిరి పీల్చుకోవడంకూడా మరిచిపోయి, భాష్పారుణ నేత్రాలతో ఆవేశపరుడైపోతారు ఆంధ్రులైన ప్రతివారూను.

అయితే—లోట్లు లేనేలేవాఅంటే, లోట్లు లేని దేది ?

ఇందులోవున్న లోట్లు అట్టే పెద్దవికావు కూడాను. కొంచెం జాగ్రతవహిస్తే దిద్దుకోవచ్చు. అసలు ఏఫిలిమైనా 10,12 వేల అడుగులకు మించకూడదు. అంతకంటె మించినదైతే వినుగెత్తుతుంది. దానితో ఆ చిత్రంద్వారా మనం ప్రచారంచేయదలచుకున్న ఆశయంకూడా భంగమాతుంది. రెండుగంటలు, రెండున్నర గంటలు మించకుండా చిత్రముండాలి. ఫిలింనిర్మాతలు ప్రప్రథమంగా గుర్తించవలసిన ముఖ్యవిషయమిది. ఇందులోనే పాశ్చాత్యచిత్రాలకి, ఔత్తరాహులచిత్రాలకి మనచిత్రాలకి వున్న అసలు తేడా. ఈ ముఖ్య విషయాన్ని యింకా మన ఫిలింనిర్మాతలు గ్రహించినట్లులేదు. యీ విషయాన్ని వాహినివారుకూడా గమనించలేదు. అయినా వాహినివారు ఇక వారిముందు చిత్రాల్లో యీ విషయాన్ని గమనిస్తారని ఆశిస్తాము.

నిరుద్యోగ సమస్యని లాటరీటిక్కట్టుతో పరిష్కరించారు కథలో. ఇది ఏమంత బాగాలేదు; అసహజంకూడాను. ఆనిరుద్యోగిచేత పొలాలుదున్నించి వ్యవసాయపరిశ్రమల్లో నూతనవిధాలు చూపింఛో, లేక మరే నిర్మాణకార్యక్రమమో చేయించినట్లయితే అటు కథాబాగుండేది ఇటు కాంగ్రెసు గవర్నమెంటు వారికి చక్కని ఒక సమస్యనిచూపి దేశోపకారంచేసిన వారయ్యేవారు వాహినివారు. ఇలాంటివే ఇంకాకొన్ని అక్కడక్కడవున్నాయి. అయినా అవి ఏమంత గణింపదగినవికావు.

ఏది ఎలాగున్నా రాయనాధన్ శేఖర్ గార్ల ఫోటోగ్రఫీ సౌండురికార్డింగులతో, బి.యన్. రెడ్డిగారి దర్శకచాతుర్యంతో సముద్రాల రాఘవాచార్యులవారి కవితామాధుర్యంతో ఆంధ్రప్రసక్తికి కీర్తి తెచ్చే యిటువంటి వుత్తమచిత్రాన్ని సృష్టించిన వాహినివారిని అభినందిస్తున్నాము.

## మాడరన్ సినిటోన్‌వారి 'ఉషాపరిణయం'

పౌరాణికగాథల్లోని సుప్రసిద్ధ ప్రణయఘట్టమిది. దీనికి సామాజిక రూపురేఖావిలాసాలను వీలైనంత వరకు ఇచ్చి, తీర్చిదిద్ది, ఫిలిముగా ఆంధ్రదేశానికి అర్పిస్తున్నారు యువకడైరెక్టరు శ్రీ గాలి వెంకటేశ్వరరావు గారు. సుప్రసిద్ధ గాయనీమణి కుమారి పద్మావతి సాలిగ్రాంగారు ఉషపాత్ర ధరిస్తున్నారు. నాట్యకళా ప్రపంచంలో విశేషప్రజ్ఞగల శ్రీ నీలంరాజు శేషయ్యగారు అనిరుద్ధభూమికను నిర్వహిస్తున్నారు. సుందరం సౌండు స్టుడియోస్‌లో షూటింగు చాలా చురుగ్గా జరుగుతోంది.

## యీస్టిండియా ఫిలింకంపెనివారి 'వరవిక్రయము'

మహాకవి, స్వర్గీయ కాళ్లకూరి నారాయణరావుగారి నాటకరాజమిది. సాంఘికజీవితానికి వేరుపురుగై అనేకసంసారాలని నష్టేటముంచి, అమాయకులైన అనేక యువతీయువకులప్రేమ జీవనాలిని భస్మీపటలంచేసిన యీవరవిక్రయ పిశాచాన్ని చీల్చిచెండాడారు శ్రీ నారాయణరావుగారు, తమ వరవిక్రయనాటకంలో.

దీన్నిప్పుడు సిద్ధహస్తులైన పుల్లయ్యగారు ఫిలిముగా తీసినారంటే దీని గుణగణాలను వేరేవర్ణించాలా! శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు, దైతా గోపాలంగారు, శ్రీమతి పుష్పవల్లి, శ్రీరంజని, దాసరి కోటిరత్నం మొదలగువారు ప్రముఖభూమికలు నిర్వహిస్తువ్నారు. ఇటువంటి సామాజికచిత్రములు కుంటుపడిపోయిన నేటి సాంఘికజీవనాన్ని సన్మార్గంలోకి త్రిప్పడానికి చాలా వుపకరిస్తాయి. స్టిల్సుచూస్తే ఫిల్ముయొక్క కళాభిజ్ఞత కొంతవరకు అవగాహన అవుతుంది. ఇది సంపూర్ణకళాశోభితం అవుతుందనడానికి సందేహంలేదు.

## శ్రీ శారదా రాయలసీమా ఫిలిమ్సువారి 'జయప్రద'

అప్పుడే ఫిలుము సగం పూర్తయింది. ధర్మరాజ్యపరిపాలనాదక్షుడైన పురూరవచక్రవర్తి పవిత్రచరిత్రయిది. జయప్రద హరికథ విననివారూలేరు, ఆకష్టాలువిని కంటని నీరుపెట్టనివారూ లేరు ఆంధ్రదేశంలో. ఇట్టి అపూర్వచరిత్ర చిత్రరూపంలో వస్తోంది. సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు, శ్రీమతి యశోద, లలిత గార్లు ప్రముఖపాత్రలను నిర్వహిస్తున్నారు. త్వరలో విడుదలౌతుంది.

## సారథివారి 'రైతుబిడ్డ'

జమీన్‌రైతుల కడగండ్లను కండ్లకుకట్టినట్లు చిత్రించి, సాంఘికంగా ఉత్తేజాన్ని కలుగజేసి, రెవిన్యూ మంత్రి శ్రీ ప్రకాశంపంతులుగారి బిల్లుకు కొంత ఆసరా కలగజేయబోయే రామబ్రహ్మంగారి రెండో సాంఘికచిత్రం ఈరైతుబిడ్డ. కుమారి సూర్యకుమారి, పద్మావతీదేవి, వరలక్ష్మి, సుందరమ్మ రాఘవాచారి మొదలైనవారు ప్రముఖభూమికలు నిర్వహిస్తున్నారు. చిత్రం మూడువంతులు పూర్తిఅయింది.



# పుష్పచయము

## ముద్దుపెట్టుకొనుట నిషేధింపబడుట

ఇటలీలో పురుషుడు తాను ప్రేమించిన స్త్రీని బహిరంగములో ముద్దుపెట్టుకుంటే అతనిని వెంటనే చెరసాలలోనికి చేర్చెదరు.

బ్రిటనులో పురుషుడు స్త్రీని బహిరంగమున ముద్దుపెట్టుకొనుట నేరముగ పరిగణింపబడును. అనేక అమెరికాసంస్థానములలో ఆదివారమునాడు ముద్దుపెట్టుకొనుట నిషేధింపబడినది. రైల్వేకంపెనీలు, రైలుస్టేషను విడుచుముందు స్త్రీపురుషులొండొరులు ముద్దిడుకొనుట నిషేధించుటకు చట్టము లేర్ప రచినవి. ఏలనన ఈముద్దులముచ్చటవలన రైలుకు కాలాతీతము కలుగును.

ఇటీవల ముద్దులను రద్దుపరచినదేశములలో బాల్టిక్ స్టేటులలోని లాట్వియాదేశము కడపటిది. ముద్దులమూలమున క్షయరోగము కలుగుననిభావించి ఆదేశాధికారులు "ముద్దుపెట్టుకొనరాదు, ముద్దు పెట్టించుకొనగూడదు" అనునిరోధమును కాగితములపై ప్రకటించి పంచిపెట్టుచున్నారట. ఇది యంతయు కడు వింతగొల్పుచున్నది.

—సండేటైమ్సు.

## లాంఛనాలు కట్నం కలిసి రు. 500 లకు మించకూడదని శాసనం

ఈమధ్య డా॥ వాద్వానీగారిచే సింధుఎసెంబ్లీలో కట్నాలనిరోధచట్ట మొకటి ప్రవేశపెట్టబడి నట్లును అది సెలెక్టుకమిటీవారి చేతిలోనికి వెళ్లెనని తెలియుచున్నది. లాంఛనములతోసహా కట్నం రు. 500 లకు అధికముగా నుండరాదని తీర్మానించినారు. ఈశాసనం అమలులోనికి వస్తే హిందూ శిక్కువంశీయులకందరకూ ఇది వర్తించును. అయిననూ లాలోచీగా కట్నాలూ కానుకలూ జరుపు కోవడాని కవకాశములుండును గనుక పెళ్లికిముందూ తరువాత ఒకసంవత్సరంవరకూ ఇరువైపుల వారికిని ఇచ్చిపుచ్చుకోవడమనే లావాదేవీలేమియూ, విల్లు వారసత్వం మొదలైనవితప్ప, జరుగకూడ దట. వివాహసమయంలో యివ్వబడే కట్నాలకానుకలవివరములు కొందరు పంచాయతీదారుల జాబితా వ్రాసి దానిని ప్రభుత్వమువారికిపంపి రిజిష్టరు చేయించుకోవాలనీ ఆపంచాయతీదారుల పేర్లు కూడా కావలసినన్ని బిల్లులోగలవు. పంచాయతీదారులు ఆజాబితా వ్రాయకపోతే ప్రభుత్వంవారే చేస్తారట. బిల్లును భిన్నంగా ప్రవర్తించేవారికి రు. 1000 ల జరిమానాగాని లేక ఒకనెల ఖైదుగాని లేక రెండుశిక్షలూగూడా విధింపబడవలెననే క్లాజును సెలక్టుకమిటీవారు బలపరచుచు అదికూడా బిల్లులోవుండాలని ప్రభుత్వంవారిని కోరుచున్నట్లు బిల్లుమీద ఈనెలలో సంతకాలు జరుగుతాయనీ తెలియుచున్నది.

## మహాత్ముని ఆశ్రమంలోకూడా 'టీ' పానీయం!

మద్రాసు రాజధానిలో మద్యపాననిషేధం అమల్లోకొచ్చాక, ఇదివరలోఉన్న సారాయిఅంగళ్లు అన్నీకూడా 'టీ' శాలలు, కాఫీహోటళ్లక్రింద మారిపోయాయి. ఈశాసనాన్ని తీసుకువచ్చిన

ప్రధానమంత్రి రాజగోపాలాచార్లుగారే మొదటికప్పు టీ తీసుకున్నారు సేలంలో అంటే కల్లుపాకలకుబదులుగా టీ త్రాగడం మంచిదని ప్రచారంచేయడమన్నమాట. ఇక్కడ రాజగోపాలాచార్లుగారొక్కరే ఇల్లాచేశారంటే, యీయనవియ్యంకులు, పైగానుసాధువు అయిన గాంధీమహాత్ముని ఆశ్రమంలోకూడా యీ టీవాడుక ఉన్నట్టు అసోసియేటెడ్ ప్రెస్ వార్తవల్ల తెలుస్తోంది.

మొన్న కాంగ్రెసు అధ్యక్షుఎన్నికల్లో శ్రీ సుభాషబాబు గెలిచాడని తెలిసినవెంటనే, ఆయన ప్రప్రథమంగా మహాత్మునిదగ్గరకు వెళ్లాడు ఆయన ఆశీర్వాదాన్ని పొందడానికి. ఆయనతో అనేక ముఖ్యవిషయాలనుగురించి 3 గంటలసేపు మాట్లాడి తనకారుదగ్గరకు వచ్చేస్తూవుంటే, ఆశ్రమవాసియైన ఒకయిల్లాలు ఒకట్రేలో టీ, పళ్లూఫలహారాలుపెట్టుకుని గబగబ సుబాషబాబు దగ్గరకువచ్చింది. ఈమెనుచూసి చటుక్కున సుభాషబాబు ఆగిపోయి ఆమెతో 'బాబూజీ కా హుకుం హై'అన్నాడు చిరునవ్వునవ్వుతూ. ఆమె చిరునవ్వుతోతిరిగి 'జౌ'నని సమాధానంచెప్పింది. తక్షణం ఆదగ్గరలోవున్న ఒక అరుగుమీద కూర్చుని ఫలహారాలు ఆరగించి సుభాషబాబు వెళ్లిపోయాడు.

సుభాషబాబు మహాత్మునివద్దనుండి శలవుతీసుకొని వచ్చేస్తూవుంటే మహాత్ముడు చెప్పాడట, 'కాస్తఫలహారం, టీ తీసుకువెళ్ల'మని. కాని సుభాషబాబు 'ఆశ్రమంలో తయారుచేసుకొనే ఆహారపానీయాదులలో 'టీ' కూడా చేరివుండదు. మహాత్ముడు మర్యాదకు అట్లనివుంటాడ'ని తలచి వెళ్లిపోబోయాడు. ఇంకా తెలియదాయనికి 'మద్యపానానికిబదులుంగా యీమధురపానాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చారు రాజగోపాలాచార్లుగారనీ, ఆయనవియ్యంకుల ఆశ్రమంలోకికూడా ఇది ప్రాకిందనీని.

—(టీ న్యూస్ అండ్ వ్యూస్)



శైశవము — జిజ్ఞాస

చిరంజీవి అమ్మణ్ణి

పూవునీరీతి నలరించు ప్రౌఢయెవరొ,
సరసమకరంద మిటనిల్పు చతురుడెవరొ,
కమ్మతావులనిటజిమ్ము ఘనుడెవండొ,
ఎందునుండునొ కనుపింప డేలనొక్కొ.





పెళ్లికూతుళ్లు

భానుమతి, పుష్పవల్లి

వరవిక్రయములోని పాత్రలు



స్వర్గీయ శ్రీరాణీ చిన్నమ్మారావుగారు

ఆంధ్రమహిళామండలికెల్ల నాదర్శప్రాయమగు జీవితముగడపిన పతివ్రతాతిలకము.

# గ్రంథ సమీక్ష

## శ్రీ రాణి చిన్నమ్మారావుగారి జీవితచరిత్రము

కర్త: శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారు, ఏలూరు.

'స్తుతిభాజనమగు చిన్నమసతి భవ్యచరిత్ర' ఇది; స్త్రీ పురుషులందరికీ చిరస్మరణీయము. కవిత్వం భావ గర్భితంగాను, నవరసభరితంగాను, అలంకార భూయిష్ఠంగాను వుండి, మృదుమధురశైలితో హృదయరంజకంగా వుంది. భార్యాభర్తల ప్రేమతత్వాన్ని, గృహస్థ ధర్మాధర్మాలని విశదీకరిస్తూ గ్రంథకర్త వివిధవిషయ విజ్ఞానాన్ని వెల్లడించడం విదితమాతుంది.

స్వర్గీయ శ్రీ రాణీ చిన్నమ్మారావుగారి జీతవిము వనితాలోకానికి ఆదర్శప్రాయమైనది. ఈ ఉత్తమ యిల్లాలి ప్రశస్తగుణాలను ప్రత్యేకంగా పేర్కొంటే ఇంకో పెద్దగ్రంథమాతుంది.

పతివ్రతాధర్మములను పూర్తిగా నిర్వహించి, పతిప్రేమకే గాకుండా, ప్రజలగౌరవమునకుహూడ పాత్రయై, భౌతికదేహాన్ని వీడి, కీర్తి శరీరమును శాశ్వతంగా యీ భూమిమీద నిల్పిన సాధ్వీమణి, శ్రీ రాణి చిన్నమ్మా రావుగారి పవిత్రజీవితచరిత్ర ప్రతి ఆంధ్రసోదరీమణి చదివితీరాలి. ఈమె జీవితం స్త్రీలోకానికి ఒక ఆదర్శ మైన ఒరవడి అంటే అతిశయోక్తిగాదు—

ఆయమ జీవితానికి వన్నెతెచ్చిన కొన్ని విశేషగుణములను శ్రీ రాజావారు వర్ణించినవాటిలో కొన్ని చూడండి:

గీ. నిటల తటఘటితాంజలి పుటములొప్ప, సకల నారీమణులు నమస్కారములను,
జేయఁదగుఁ జిన్నమాంబకు; స్త్రీలెకాదు, పూరుషులును మ్రొక్కనర్హ యీ పుణ్యచరిత.

ఉ. అన్నముఁబెట్టు, వస్త్రములనర్థులకిచ్చు, ధనంబు నిచ్చుఁగా,
నోన్నతి నెంచి, విద్యలకు నోసమకూర్చు సమస్తమం, బరా,
కన్నది లేదు, స్త్రీలకు సహాయము చేయును యుక్తరీతిగాఁ,
జిన్నమదేవి యోగ్యత వచింపఁగ శేషునకైన శక్యమే.

గీ. రాగమును జూపు సంగీతరాగములను; భోగములఁగోరు సకల వైభోగములను,
యోగమును బూను నిల సదుద్యోగములను, రాగభోగయోగసమితి రాణి ధరణి.

అనయము నాత్మవల్లభునియం దనురక్తియు, సత్ప్రవృత్తియున్,
ఘనతరభక్తియుఁం, గలిగి, నర్మిలినింపుగ బాదసేవలన్,

వినయవిధేయరై పలిపి, పిమ్మటఁ దా శయనించు నిత్యమున్,
దన కిల భర్త దైవమనుతత్వము చిన్నమ విశ్వసించుటన్.

ఉ. పెట్టెలుఁ దాళముల్ సతికి వేఱుగ నెన్నడు లేవు, ధాత్రిపైఁ
బుట్టములుం గలాపములుఁ బొల్పుగ లేవు; సుతాళి యిచ్చుచో;
మట్టెలు నల్లపూసలును మంగళసూత్రము దక్క సొమ్ములిం
కెట్టివి లేవు దేహమున నింతి మృతింగని నప్పుడద్దిరా!

క. సిరియును రూపము గుణములుఁ, బరిపాటిగ నొక్కయువతి పట్టున నెపుడున్,
వరలవని పెద్దలందురు, తరుణీమణి యీమె దానిఁ దప్పుగఁజేసెన్.

క. ఆదర్శప్రాయముగాఁ, బ్రాదుర్భావంబునందెఁ బడఁతుకలారా!
సాదరమునఁ జిన్నాంబను, మాదిరిగాఁ గొని తరించి మను డెల్లపుడున్.

## విక్రమదేవశతకము

కర్త: శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తిగారు. ప్రతులకు: శ్రీరామాగ్రంథాలయము, వరాహపురం, గవరవరంపోస్టు, విశాఖపట్నంజిల్లా. వెల ఒక అణా.

గీర్వాణాంధ్రాంగ్లేయభాషా కోవిదులును, కవిశ్రేష్ఠులును, దానధర్మాదిసద్గుణ గరిష్ఠులును, విద్యావితరణ వైభవోసేతులును, విశేషించి దైవభక్తి తత్పరులు అయిన జయపురాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ బహద్దర్ వారి సుగుణసంపత్తినిస్తుతిచేస్తూ గ్రంథకర్తగారు ఎంతో చమత్కృతిగా ఒక శతకాన్ని రచించి శ్రీ మహారాజావారికి కృతినిచ్చి కృతార్థులయ్యారు.

అక్కడక్కడ కొన్ని పునరుక్తిదోషాలు పొడగట్టినను మొత్తముమీద శతకము సొంపునింపు సులభశైలితో బాగావుంది.

## వడ్డాది వేంకటేశ్వరశతకము

ఇదీ శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తిగారిచేతనే రచింపబడింది. ప్రతులకు పై ఎడ్రసుకే వ్రాయాలి— వెల రు. 0 10 0 లు.

భావాలు భాషాచాతుర్యం చాలా ప్రసంసనీయమై, భక్తియుక్తులతో ఎంతో ఆహ్లాదాన్ని చేకూర్చే సులభశైలిలో యీ శతకాన్ని రచించిన గ్రంథకర్తగారు చదువరుల ప్రస్తుతికి పాత్రులౌతారని విశ్వసిస్తున్నాము.

## శివానందలహరి

అనువాదకులు: శ్రీ విద్యాభూషణ సూరాబత్తుల సూర్యనారాయణగారు, రాజమహేంద్రవరం. వెల అర్ధరూపాయి.

శ్రీ శంకరాచార్య విరచితమై, జగద్విదితమైన యీ గ్రంథాన్ని ఆంధ్రీకరించిన గ్రంథకర్తగారి కవితా మాధుర్యము భాషాసంపత్తి ప్రశంసనీయము. ఇది మూలమునకు భాషాంతరీకరణము. తేటతెల్లమైన తెలుగు పద్యాలతోటి, తాత్పర్యంతోటి ఇంపుగా వుంది. అందరు చదువతగినది.

భూగోళవృత్తాంతము (రెండవభాగము)

కర్త: కూచి నరసింహంగారు, పిఠాపురం వెల: రు 0-12-0.

ఇది బాలబాలికలకు ఉపయుక్తంగా వుండేటట్లు బహు సులభశైలిలో వ్రాయబడింది. భూగోళ కథలు, భూగోళశాస్త్రమును బోధించుటకు ప్రథమవాచకపుస్తంగా పాఠశాలల్లో వుపయోగించతగివుంది. 'బాలవిజ్ఞాన తరంగిణి' అను పేరుతో నిట్టి పుస్తకాలను వ్రాయబూనుటలో గ్రంథకర్తగారి యుద్దేశాలం కొనియాడదగివున్నాయి.

ధార్మిక విప్లవము

అనువాదకులు: శ్రీ గుంటుపల్లి సీతారామయ్యగారు—ప్రకటనకర్తలు: నమ్మాళ్వార్స్, పోస్టుబాక్స్ నెం. 215, మదరాసు. వెల ఎనిమిదణాలు.

దీనిలో 'ఇది విప్లవయుగము', 'దేశముకొరకు ఉన్మత్తులుగండు', 'భయము వెనుభూతము' మొదలగు పన్రెండు వివిధవిషయములను గురించిన వ్యాసాలున్నాయి.

మానవుని దైనికజీవితములో అనేకసమస్యల నెదుర్కొనవలసి వుంటుంది. ప్రతిపరిస్థితియందు అతనొక క్రొత్తవికాసాన్ని పొందుతూవుంటాడు. అదే ఆతనిజీవితాన్ని నిర్మిస్తుంది, మంచిగానైనా చెడ్డగానైనా. ఈ వికాసానికి యిందులో చర్చింపబడినవిషయాలు చాలావరకు ఉపకరిస్తాయి. యీవిషయాలు మంచి మెలకువతో చర్చించుకుంటూ జీవితరథాన్ని యీడ్చుకుపోతే, పురుషార్థం సిద్ధిస్తుందనడంలో అతిశయోక్తి లేదు. యీవిషయాలు అనేకమంది ఇదివరలో చెప్పినవే. కాని గ్రంథకర్తగారు వాటినన్నిటిని సమకూర్చి అనువదించారు.—

ఉక్కుమనిషి

కర్త: శ్రీ గోవాడ నిరీక్షణరావుగారు, ఇదీ నమ్మాళ్వార్స్ వారిచేతనే ప్రకటింపబడింది. వెల ఆరు అణాలు.

ఉక్కుమనిషి అనేపేరుతో వ్రాయబడ్డ రష్యా నియంత స్టాలిన్ యొక్క రాజకీయజీవిత మిందులో పొందుపరుపబడింది.

'జాతిమత వివక్షత ఉండకూడదు, అంతా ఒకటే' అను మార్పురావాలనే గ్రంథకర్తగారి అభిప్రాయం ఆద్యంతము పొడమాపుతూవుంటుంది. స్టాలిన్ యొక్క సామ్యవాద సిద్ధాంతాలని తెలుసుకోవడానికీ గ్రంథం బాగా వుపకరిస్తుంది.—

## మనబిడ్డలు

కర్త: శ్రీ బుర్రా వెంకటనాంచారయ్యగారు. దీనిని నమ్మాళ్వార్సువారే ప్రకటించారు. వెల ఆరు అణాలు.

భావిభారతదేశం తేజోవంతంకావాలంటే, దాని పునాది యిప్పటినుంచీ బిడ్డలు తయ్యారయ్యేవిధాను మీద ఆధారపడివుంటుంది. ఇందులో గ్రంథకర్తగారు గర్భిణీలు మెలుగవలసినరీతులు చర్చించుకుంటూ, బిడ్డలుపుట్టినలగాయతు వారిని పోషించురీతిని, వారికి విజ్ఞానము కలుగజేయుమార్గములను చక్కగ సూచించినారు. పిల్లలయీడునుబట్టి వారికి బోధించేవిషయాలు మారుతూవుండాలని ఉదాహరణాలతో చూపించారు ప్రతితల్లిదండ్రులు చదువతగినది.

## ప్రపంచవీరులు (రెండవభాగము)

కర్త: శ్రీ కొత్తపల్లి శ్రీరామమూర్తిగారు, ప్రకాశకులు: దీనికీ నమ్మాళ్వార్సువారే. వెల ఆరుఅణాలు.

ఇదివరలో వీరిచే వ్రాయబడి ప్రకటింపబడిన ప్రపంచవీరుల చరిత్రకు ఇది రెండోభాగం. దీనిలో పిల్సుడుస్కీ, జవహరిలాల్ నెహ్రూ, హిట్లరు, ముసోలిని, అల్లూరి సీతారామరాజు, రిజాఖాన్‌ల జీవితచరిత్రలున్నాయి.

నాటి నేటి రాజకీయవేత్తలనుగురించి తెలుసుకోవడం ఎంత అవసరమో యీరోజుల్లో తెలియనివారుండరు. వారివారి జీవితసంగ్రహాలు విపులంగాకాకపోయినా, రాజకీయములలో వారివారి అనుభవాలు, సిద్ధాంతాలు తెలుసుకోనవలసిన అవసరం ప్రతిఆధునికవ్యక్తికి ముఖ్యధర్మము. ఇందులోని ఆరుజీవితసంగ్రహాలు ఆరు వివిధతరహాల ఆదర్శాలను చూపుతాయి.

## సూర్యనారాయణమూర్తి కథలు

కర్త: శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు. నమ్మాళ్వార్సువారే దీన్ని ప్రకటించారు. వెల ఆరు అణాలు.

శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తిగారి కథలు సాధారణంగా ఆంధ్రదేశంలో చాలామంది చదివేవుంటారు. ఇందులోనికథలు వీరు ఇదివరలోవ్రాసి 'భారతి' మొదలగు పత్రికలలో ప్రకటించినివే.

ఇందు 'పుట్టినరోజు', 'యానాదిసత్తి', 'ఇటేదుతరాలు—అటు ఏడుతరాలు' మొదలైన తొమ్మిది కథలున్నాయి.

సూర్యనారాయణమూర్తిగారి కథల్లో సహజత్వం, సరళత్వం సమానంగా సాగుతూనేవుంటాయి. నిత్యదైనికజీవితాలలోని అనేకఘట్టాలకి చక్కనిరూపునిచ్చి, దానికో విశిష్ఠత కలగజేసి, ఒకఆదర్శాన్ని చూపిస్తారు.

ఇందులోని తొమ్మిదికథల్లోను తొమ్మిది వివిధఘట్టాల్ని చూపించారు కన్నులకు కట్టినట్లుగా—

# పత్రికాపరిచయం

విభూతి

సచిత్రమాసపత్రిక. సంపాదకులు, పండిత, చిదిరెమఠము వీరభద్రశర్మగారు సజిన్‌లాల్ వీధి, సికింద్రాబాదు. సాలుచందా రు 2-8-0 లు; విడిసంచిక నాల్గణాలు.

⅛ డెమ్మీసైజులో చక్కగాఉన్నది. ఇందు సారస్వత, ధార్మిక, చారిత్రాత్మక పరిశోధనా సంబంధమైన ఉత్కృష్టవిషయములే కాకుండా చక్కనికథలు, గీతాలు, మొదలగువాటితో మనోహరంగా ఉన్నది. 'విభూతి' విభూతితో విలసిల్లి, భాషాసేవయను భాగ్యముతో బహుకాలము భువివెలయ పరమేశ్వరు డనుగ్రహించుగాక !

నవజీవన

జాతీయమాసపత్రిక, సంపాదకులు : బి. వెంకటరత్నంగారు. కార్యస్థానము : నెం 68 రు. మేడక్స వీధి, వేపేరీ, మద్రాసు.

సాలుచందా రు 1-8-0 లు. విడిపత్రిక రెండణాలు. క్రౌన్ సైజులో సుమారు 50 పేజీలుండును. జాతీయతకు దేశాభ్యుదయమునకు సంబంధించిన విషయాలు, రాజకీయ, సాంఘిక, ఆర్థిక వ్యవహారములను గూర్చిన వ్యాసములతో చాలా ఉపయోగకరముగా ఉండి ప్రజలకు హితకరముగ నున్నది.

ప్రథమసంపుటము మొదటిసంచిక మార్చినెలలో వెలువడినది. మద్రాసు కాంగ్రెసుబడ్జెట్, త్రిపురి కాంగ్రెసు; అస్పృశ్యతా ఎలా పోతుంది? అంటరానితనం, హరిజనుల్లో ఆర్యసాంప్రదాయం మొదలగు వ్యాసములు గలవు. 'హరిజనకుమారి'పై బి. యస్. మూర్తిగారి పద్యములు ప్రచురింపబడినవి. జాతీయోద్ధరణకై పాటుపడ సంకల్పించి ప్రజాసేవకై బయలుదేరిన ఈ పత్రిక యెల్ల రాదరించదగియున్నది.

జమీన్ రైతు

ఉగాదిసంచిక, నెల్లూరు. సంపాదకులైన యన్.వి. రామానాయుడుగారి ఉగాదికానుక ఘనముగనున్నదనుట అతిశయోక్తికానేరదు. వివిధచిత్రములతోను పలురకములగు వ్యాసములతోను బహుచతురతతో తయారుచేయబడిన సంచికయగుటయేకాక, మిక్కిలి ప్రశంసనీయమైన సేవా చిహ్నముగా తనరారుచున్న ఈ పత్రిక ఆంధ్రుల ప్రశంసకు ప్రోత్సహమునకు పాత్రమగుచున్నది. ఇందు త్రిపురీకాంగ్రెసుచిత్రములు, ఆంధ్రప్రముఖుల చిత్తరువులు తదితరనాయకుల బొమ్మలు సినీమాప్రకటన దృశ్యములు చాలగలవు.




**భర్త తానెంత గడించుచున్నది భార్యతో తెలుపవచ్చునా?**

ఇంగ్లాండు దేశములో నిటీవల ఇంటింటికి జరుపబడిన ప్రచారమువలన పురుషులెంత ధనమును సంపాదించునదియు వారిభార్యలకేమియు తెలియనట్లు స్పష్టపడినది. ప్రతినెల భర్త తానెంతసంపాదించుచున్నదియు భార్య యెరుగకుండుటే శ్రేయస్కరమని తేటపడినది. సాధారణముగ లోకములో భాగ్యవంతులగువారలలో చాలమంది తమ భార్యలకు తామెంతధనమును గడించుచుండినదియు, తెలుపకుండుట చూచుచున్నాము. భార్యలు తమభర్తలు సంపాదించు మొత్తముల నెరుంగ నవసరములేదనియే చెప్పనొప్పును. ఏలనన, భర్త భార్యకు కావలసినధనమును ప్రత్యేకముగ నేర్పాటుచేసి తనసంపాదనలో కొంతభాగమును పంచియిచ్చుచున్నపుడు ఆతనిసంపాదన సందర్భములు తత్సంబంధమైన వివరములు భార్యకు తెలియవలసిన యగత్యములేదు.

కాని పేదవారిలో భర్త యెంత సంపాదించుచున్నదియు భార్యకు బాగుగ తెలియుట కవకాశము లెక్కుడుగ నున్నవి. కుటుంబపోషణమునకు కావలసినంత ధనమును సంపాదింపలేకపోయినపుడు భర్తబండారము భార్యకు బయటపడును. ఏయింట భర్త సంపాదనవిషయములో భార్య జోక్యము కలుగజేసికొనుచున్నదో ఆయింట దారిద్ర్యదేవత తాండవమాడుచున్నదని విశదమగుచున్నది. ఎచ్చోట నీసంగతి రహస్యముగ నుంచబడుచున్నదో అచ్చట భాగ్యము పెరుగుచున్నదని భావింపనగును.

భర్త తనసంపాదనవివరములను భార్య కెరింగింపకపోయినంతమాత్రమున నాతని శీలమందు కళంకమున్నదనిగాని ఆతడు నీచవర్తనుడనిగాని నిర్ణయించుట న్యాయము కాదు. పురుషుడు గంభీరస్వభావుడగుటచే భార్యతో తన సంపాదనవిషయములగూర్చి సంభాషించడు. ఎపుడు పురుషుడు తన సంపాదనను గూర్చి భార్యతో ప్రసంగింపడో, ఎపుడు భార్య ఆవిషయమం దత్యంతాసక్తితో నుండదో అపుడు భర్త భార్యకు కావలసిన ధనసౌకర్యముల గల్గించుచు నామెను సంతృప్తహృదయగ జేయుచున్నాడనియే యూహింపనగును. భార్యకు తనసంపాదనవిషయమును తెలుపక దానిని గోప్యముగ నుంచినంతమాత్రమున భర్త భార్యయెడగల బాధ్యతనుండిగాని, ఆమెవలనగల్గు ధనవిషయికమైన ...

వారినోట నువ్వుగింజ దాగదనుభయముచే, స్త్రీస్వభావమందలి లోపమును చక్కగ దెలియుటచే, ఆమెవలన పెరవారికి తన గుట్టు బయల్పడుననుసంకోచముచే తనసంపాదన సందర్భములను భర్త భార్యకు దెలుప నిచ్చగింపడు. జీవితములో పెద్దయంతస్తు నాక్ర మించికొనిన ఉద్యోగస్తులు, ధనవంతులు, ఇరుగుపొరుగువారికిని, సహచరులకును తమ ధనసంపాదనసందర్భములు తెలియనీయకుందురు. ఈసంగతులు ఆడువారిమూలమున ఇంటింటికి ప్రాకును గనుక భర్తలు భార్యలతో ధనార్జనవిధానములగూర్చిన ప్రసంగ ములు నేయకుండుటే శ్రేయోదాయకము.

భర్త ఎంత సంపాదించుచున్నదియు భార్యకు తెలియుటవలన వచ్చెడిఫలితమేమి? సంసారమునందు ధనసంబంధమైనచిక్కులు సంభవించినపుడు భార్యాభర్తలిరువురును చింతల జిక్కుటకంటె భర్తయొకడే యామనోవ్యధ ననుభవించుట బాగుకాదా? భార్యగూడ పరితాపమునొంది భర్తమనసునకు మరికొంత చికాకుగల్గించుట పాడియగునా? స్త్రీకి ధనవిషయికమగు దిగులువొడమెనేని పురుషు డామెమనసుకు శాంతి చేకూర్ప గల్గునా? పేదరికముబాధింప నంతవరకు భార్యకు భర్తసంపాదనతో బనిలేదు.

అయినను భార్యాభర్త లుభయులును సంసారబాధ్యతవహింప సంసిద్ధులై, సంసారయాత్రసాగింప బూనుకొనుసమయముననే, నిష్కళంకహృదయములతో నొం డొరులమనములగల భిన్నాభిప్రాయములబాపికొని ఒకరినొకరు సంపూర్ణముగ విశ్వసించి పరస్పర సమభావ గౌరవమర్యాదలతో జీవితమునుగడుపుట సర్వవిధముల శ్రేయస్కరమే యగును.

కాని భర్త యెంతసంపాదించుచున్నదియు భార్య తెలిసికొనుటవలన ప్రయోజన మేమియు నున్నట్లు గాన్పింపదు. అయినను భర్త దుర్మార్గముగ బ్రవర్తించి సంసారమును పాడొనర్చుప్రయత్నములు సలుపుపట్ల భార్య ఆతనిసంపాదన యెట్లు వినియోగమగు చున్నదియు తెలిసికొని, తన వినయవివేకవిచక్షణాది సద్గుణసంపత్తిచే భర్తయొక్కజీవిత మును చక్కదిద్ద నర్హయగును. భర్తక్షేమమునకును పతిసౌఖ్యమునకును పాటుపడుసతికి భర్తపట్ల సర్వస్వాతంత్ర్యములును గలవు. కాని భర్త స్వాతంత్ర్యమును భంగపఱచి, తన సర్వాధికారములను సాగింప సమకట్టుసతికి స్వాతంత్ర్యము సర్వానర్థకరమేయగును.

### మద్రాసు మహిళాసభ

ఈమధ్య అఖిలభారతమహిళాసభయందలి మద్రాసు శాఖవారు సమావేశ మగుటయు నేతత్సభకు మద్రాసు ప్రభుత్వప్రధానమంత్రి అధ్యక్షపదవి నలంకరించుటయు శుభ సూచకమగు సంగతియేయగును. గౌ.సి. రాజగోపాలాచారిగారు ఆదర్శములను యదార్థములను చక్కగ సమన్వయింపగల సమర్థులలో నొకరని చెప్పనొప్పును. ఈ

సమావేశములో స్త్రీలందరను ఆదర్శములచే నావహింపబడుటయు, సభాధ్యక్షులగు సచివోత్తములు యదార్థవాదియై తనరుటయు నెంతయు చమత్కారముగనుండెను.

సభలో ప్రవేశపెట్టబడిన తీర్మానములలో చాలవరకు క్లిష్టసమస్యలును, స్త్రీలు తమ స్థితిగతులను చక్కజేయ సమకట్టుపట్టుదలయును నుత్సాహమును సూచించునవి యునునై యుండెను. కొన్ని తీర్మానములు తీవ్రరూపమును దాల్చినవై ప్రధానామాత్యుని ఆగ్రహమునకు అవకాశము గల్గించెను. ఆయన నిర్మొగమాటముతో నిష్ఠురోక్తులతో సాంఘికవిషయములకు సంబంధించిన సంస్కరణము లమలులో బెట్టుట సులభసాధ్యము కాదనియు, ప్రస్తుత దేశపరిస్థితులందులకు ప్రతికూలముగనున్నవనియు నొక్కివక్కాణించెను. అట్లనుటచే నాయన ప్రస్తుతమావిషయమై బొత్తిగ ప్రయత్నముమాను అభిప్రాయమును దెల్పుటలేదనియు, చేయవలసిన మార్పులకు సరియగు పునాదిని ముందుగ సిద్ధపరుపవలెని భావించెననియు స్పష్టపడగలదు. చట్టములు చేయుటకు పూర్వము, సంస్కరణము లాచరణలోనికి దెచ్చుటకుముందు, చక్కనిమార్గమును, సాఫల్యమునొందు పద్ధతులను, కల్పింపవలెనని ప్రధానామాత్యుని యుద్దేశము. ఇరుపక్షముల వాదములలోను న్యాయమున్నది. కాని పోలీసుశాఖవారును, కోర్టులును చేయవలసిన పనులకు శాసనసభలు బాధ్యతవహింపగోరుట సమంజసముకాదు. తీవ్రచర్చలవలన శాసనసభలకు తొందర గల్గించి కార్యమును సాధించుకొనజూచుట నిష్ప్రయోజనమగును. స్త్రీలు శాసనసభల హద్దులను గుర్తించుటయు ప్రధానామాత్యులు శాసన సహాయముచే స్త్రీలకు తగిన సౌకర్యములు గల్గింప నగత్యముగలదని గ్రహించుటయు సభయొక్క సార్థకచిహ్నములై పరిఢవిల్లినవి.

శాసనసభలో తీర్మానముల బ్రవేశపెట్టి చర్చించుటకు ముందు ప్రజలయొక్క సమ్మతిని సహాయమును బడయు టత్యంతవసరమైయున్నది. అన్నితరగతులవారును తమ తమ కష్టములను నివేదించుకొనిరి. అందు ముఖ్యముగ భర్తలచే విడువబడిన భార్యలును, అనాథలై దారిద్ర్యముచే దపించువారును, తలిదండ్రుల ఆస్తికి హక్కులేకుండ జేయబడిన పుత్రికలును, పలువిధముల బాధింపబడుచున్న బాలికలును, తగవుల దగుల్కొని వెతలగుందుచున్న వనితలును, వారివారి బాధలను బాపప్రయత్నములు సేయవలసినదిగ ప్రధానామాత్యుని ప్రార్థించిన, వారల విన్నపముల నాధీశాలి మిక్కిలిదయతో నాలకించెను.

మద్రాసు మహిళాసభవారి విన్నపములయెడ నాదరమును శ్రద్ధనుజూపిన ప్రధానామాత్యులు సాధ్యమైనంత త్వరలోనే వారి కష్టసుఖములను బాగుగయోచించి తగు సౌకర్యముల గల్పింప బ్రయత్నింతురని నమ్ముచున్నాము.

EDITED BY DR, K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# విషయసూచిక



త్రివర్ణచిత్రములు

సతీసుతసమేత శివనటనానువర్తనము

చిత్రకారుడు : శ్రీయుత సి. ఎన్. వెంకట్రావుగారు.

# గృహలక్ష్మి ఏజెంట్లు

బాపట్ల : ఎల్. బి. మనోహరరావుగారు.

చీరాల : నాదం బ్రదర్స్.

తెనాలి : కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్‌న్యూస్.

హైదరాబాదు : ఎస్. లక్ష్మీబాయిగారు, సుల్తాన్ బజారు. (పెద్దచావిడిదగ్గర)

తాడేపల్లిగూడెం : కాశిరాజు శ్రీరాములుగారు.

గుంటూరు : వెల్‌కం అండు కంపెని. సామర్లకోట : ఆరాధ్యుల మూటయ్యగారు, మర్చంటు.

పిఠాపురం : ఎం. నూకరాజుగారు, ఆంధ్ర నూస్ ఏజెన్సీ.

రాజమండ్రి, విశాఖపట్టణం : ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.

సికందరాబాద్ : శ్రీరామా బుక్ డిపో. బరంపురం : ఎస్. కె. మూర్తి అండ్ సన్స్.

బెజవాడ : ఆంధ్రా ఇండస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.

చిత్తూరు : వాటంబాటి వెంకటరమణయ్య శెట్టిగారు, 163 బజారురోడ్డు.

నరసాపురం : వై. సుందరరామయ్యగారు.

తణుకు, నిడదవోలు, కొవ్వూరు : కె. పి. చెన్న కేశవయ్యర్ గారు.

భీమవరం : వంగల అచ్యుతరామయ్యగారు, మేనేజరు, అశ్విన్‌కుమార్ ఫార్మసీ.

తిరుపతి : వై. వి. సుబ్బయ్య అండు కో.

రంగూను : వి. భగవతిశాస్త్రిగారు, న్యూస్ ఏజంట్, 248, ఫేర్ వీధి.

మచిలీపట్నం : ఆచంట లక్ష్మీనరసింహంగారు, రాజుపేట.

కర్నూలు : టి. బాలనాగయ్య శెట్టిగారు, బాలసరస్వతి బుక్ డిపో.

రాజంపేట, కాళహస్తి : యస్. అబ్దుల్ అజీజ్ సాహేబ్.

పొన్నూరు : జి. సూర్యనారాయణగారు.

విజయనగరం : ది. పాపులర్ ట్రేడింగ్ కంపెని, కస్బ.

పర్లాకిమిడి : బండారు నరసింహమూర్తిగారు, న్యూస్ ఏజంట్.

మదనపల్లి : ఎన్. రాధాకృష్ణయ్య శెట్టిగారు, న్యూస్ ఏజంట్.

ఏలూరు : ది. నేషనల్ న్యూస్ మార్ట్.

రాజోలు : ది నేషనల్ ఏజన్సీ, ప్రొప్రయిటరు చింతా సూర్యనారాయణగాగు.

ప్రొద్దుటూరు : వి. వెంకటసుబ్బయ్యగారు, న్యూస్ ఏజంట్.

హోసపేట : పి. నాగప్పశెట్టి & బ్రదర్స్. జమ్మలమడుగు : బి. రామాశాస్త్రిగారు.

బళ్లారి : హెచ్. శ్రీనివాసరావుగారు, బ్రామిన్‌స్ట్రీట్.

గుత్తి : ఎల్. ఎస్. కృష్ణమూర్తిగారు, న్యూస్ ఏజంట్.

గుడివాడ : యు. రామమూర్తి పంతులుగారు, న్యూస్ ఏజంట్.

మార్కాపురం : మెసర్స్ లీలా స్లేట్ వర్క్సు.

రామచంద్రపురం : పి. సూర్యప్రకాశరావుగారు.

అనంతపురం : వై. సాంబయ్యగారు, పెన్షనర్. కడప : జక్క సుబ్బరాయలుగారు.

అమలాపురం : మెసర్స్ డెల్టా మెడికల్ స్టోర్స్.

పాలకొల్లు : గరిమెళ్ల చినబాపన్నగారు, న్యూస్ ఏజంటు.

నరసరావుపేట : మెసర్స్ రాయల్ టైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూట్.

అనకాపల్లి : డి. వి. రత్నంగారు. కాకినాడ : రామమోహన్ అండ్ కంపెని.

షోలాపూర్ : లక్ష్మీబ్రదర్స్, దేశముక్ బుక్ డిపో.

హిగిన్ బాథమ్స్ స్టాలులవద్ద దొరకును.



ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.



శర్వాణీపాణితాలైశ్చలవలయఝుణత్కారిభిః శ్లాఘ్యమానం
స్థానే సంభావ్యమానం పులకిత వపుషాశంభునా ప్రేక్షకేణ
ఖేలత్పిచ్ఛాళికేకా కలకలకలితం క్రౌంచభిద్బర్హియానా
హేరంబాకాండ బృంహాతరళిత మనసస్తాండవంత్వాధినోతు॥

మూర్ధవ్యాధూయమాన ధ్వనదమరధునీ లోలకల్లోలజాతో
ద్భూతాంభః క్షోదదంభాత్ప్రసభ మభినంభః క్షిప్త నక్షత్రలక్షం
ఊర్ధ్వన్యస్తాంఘ్రిదండ భ్రమిభవరసోద్యన్నభస్వత్ప్రవేశ
భ్రాంత బ్రహ్మాండఖండం ప్రవితరతుశివం శాంభవం తాండవంవః॥

(సంస్కృత సుభాషితరత్న భాండాగారం)




# స్త్రీలు — వ్యాయామపరిశ్రమలు

దేశ సౌభాగ్యానికి సాంఘికంగా ఔన్నత్యం ఎంత అవసరమో, దారుఢ్యమైన జాతి నిర్మాణానికి స్త్రీ పురుషులలో ఆరోగ్యం అంత అవసరము.

అసలు ప్రకృతిలోనే జన్మ, వృద్ధి, వినాశనాలున్నాయి. జన్మ, మృత్యువులవలెనే వృద్ధికూడా పరిణామాన్ని పొందుతుంది ప్రకృతి తోడ్పాటుతో. ప్రకృతిని ధిక్కరించి, కృత్రిమ పద్ధతులమీద వృద్ధిచెందిన దేదైనాసరే అసహజంగావుండి, అల్పకాలపరిణామాన్ని పొందుతుంది. ఈవృద్ధి, ప్రకృతికి వ్యతిరేకము కాని సరియైన పద్ధతులలో, స్త్రీ పురుషన్యాయానుగుణ్యంగా నిర్మింపబడ్డ కట్టుబాటులతో, ఆయాజాతులకు పరివర్తింపబడాలి.

ఈ వృద్ధికి వ్యాయామం చాలా అవసరం. ఆహారము, నిద్ర, తదితర కార్యములవలె ఇదికూడా నిర్వర్తింపబడాలి, ఒక నియమబద్ధమైన కాలక్రమంతో. ఈవ్యాయామం స్త్రీ పురుషుల కిర్వురకు కావాలా అనేభేదంలేదు; కాని స్త్రీ పురుషులు తీసికొనే వ్యాయామంలో భేధముంది.

భారతీయాచారాలు అనాదినుండీ, భౌతికశాస్త్రానుగుణ్యంగా, భారతదేశ శీతోష్ణస్థితులననుసరించి, ప్రకృతి శిక్షణకు అసహజంగాని పద్ధతులమీద నిర్మింపబడ్డాయి. వాటిననుసరించి వచ్చినవే నేటి మన ఆరోగ్యసూత్రాలు, ఆచరణలూను.

సహజంగా పురుషునికన్న స్త్రీ బలమైనది. ఆహారములో, తదితరవిషయాలలో పురుషునికన్న ఎక్కువపాలు కోరుతుంది స్త్రీ. ఒకే యీడుగల మంచి ఆరోగ్యవంతులైన యిరువురు యువతీయువకుల బరువును పరీక్షిస్తే, యువతి యువకునికంటె బరువుగా వుంటుంది. పురుషశక్తికన్న స్త్రీశక్తి అధికమైనదే అన్నిటిలోనూను.

పంటలుపండటానికి బీజబలంకన్న క్షేత్రబలం ఎంతముఖ్యమో, మానవజాతి అనే యీ పంటకి, సృష్టికి కారణభూతురాలైన స్త్రీకి బలంఅంతముఖ్యం.

స్త్రీ తగిన దారుఢ్యంకలిగి వుండటానికి ఆమె తినేతిండి, నడిచేనడత, తీసికొనే పరిశ్రమ చాలవరకు కారణభూతములై వుంటాయి. సరియైన దేహబలానికి, అవసరమైన అంగసౌష్ఠవానికి, శక్తివంతమైన జాతినిర్మాణానికి, స్త్రీకి దారుఢ్యమైన దేహనిర్మాణం చాలా అవసరం. అట్టి దేహనిర్మాణానికి వ్యాయామం జీవం.

వ్యాయామమనే యీ అభివృద్ధి కారకమైనశక్తి సృష్ట్యాదినుండి మానవజాతికి సన్నిహితంగా వస్తూనేవుంది. శృతి, స్మృతి, పురాణకాలాల్లో స్త్రీ పురుషులిర్వురు వ్యాయామము మొదలైన సమస్త విషయాలలోను శిక్షణపొందుతూనే వుండేవారు. చిత్రలేఖనము, సంగీతము, నృత్యము మొదలగు లలితకళలు ఎల్లానేర్చుకొనేవారో, కత్తిసాము, విలువిద్య, రధసారధ్యము మొదలు యుద్ధముచేయడంవరకూగల సకలవిద్యలు అభ్యసిస్తూనేవుండేవారు:

కైక, దశరధునితోకూడా యుద్ధానికివెళ్లి, సారధిచనిపోతే, తానారథాన్ని నడిపి, భర్త విజయానికి తోడ్పడింది.

సత్యభామ, శ్రీకృష్ణునితో రణరంగానికిపోయి, భీషణ సంగ్రామంలో నరకాసురు నెదుర్కొని, విజయలక్ష్మిని తోడ్తెచ్చింది.

విలువిద్యలో విశేషప్రజ్ఞ కనపరచి, అర్జునుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణిచేసింది రాణీప్రమీల.

ఉదాహరణ నిమిత్తం ఇతిహాసాల్లో పేర్కొనబడ్డ యీ విషయాలేగాక, ఇట్టి విశేషప్రజ్ఞగల నారీమణులు ఆకాలంలో ఇంకెంతమందివుండేవారో...

ఇక చరిత్రాత్మకంగా, రుద్రమదేవి, ఝాన్సి లక్ష్మిబాయి, మొదలగు వీరవనితల శౌర్యధైర్యోత్సాహాలతో ఒకనాడు భారతభూమి తాండవమాడింది.

పల్నాటి వీరకాంత నాయకురాలు, అసమానధైర్య స్థైర్యాలతో రణరంగాన్ని శత్రుసేనలను చెండాడి, జాతిమత గౌరవాదులను నిలబెట్టిన ఆంధ్రవీరాంగన. ఇటువంటి వారు ఎంతమంది లేరు...?

ఇక ఈ ఆధునికకాలంలో తమ విశేష దేహబలంతో అనేకచోట్ల వివిధవ్యాయామ ప్రదర్శనాలను గావించి, అసమానఖ్యాతి గణించిన తారాబాయి, రుక్మాబాయి మొదలైన వారు లేరూ...?

ఇం తెందుకు? గతమాసంలో మధ్యపరగణాలలోని మురానీపూర్ సబ్ డివిజనల్ మేజస్ట్రేటుకోర్టులో, ఖూనీకేసులో అరెస్టుకాబడిన ఒక స్త్రీయొక్క దేహబలమునకు సంబంధించిన ఒక ఆశ్చర్యకరమైన సన్నివేశం జరిగింది.

ఆమె ఇంటివద్ద ఒక్కతె వున్నసమయంలో ఒక జమీందారు ఆమెను ఆశించి, ఆమె ఇంటికి వచ్చాడు. ఇక, ఆమె శీలానికి భంగంకలిగే సమయంలో ఆమె ఆజమీందారుని క్రింద త్రోసి, చంపింది. అందువల్ల పోలీసువారామెను అరెస్టుచేసి, కేసుపెట్టారు. విచారణలో పోలీసుఇనస్పెక్టరు 'బలవంతుడైన ఆజమీందారుణ్ణి ఆమె ఒక్కతేచంప గలిగిందా' అని ప్రశ్నించాడు. ఆమె 'తనకు కుస్తీబాగావచ్చునని, తనమాటమీద నమ్మకంలేకపోతే తన బలాన్ని పరీక్షించేందుకు తనతో కుస్తీపట్ట'మని ఆ ఇనస్పెక్టరును సవాల్ చేసింది. ఈ విషయం వార్తాపత్రికలలోపడి కొంత అలజడికి ఆశ్చర్యానికి కారణమైంది; 'ఆడదేమిటి కుస్తీలో ప్రావీణ్యురాలై వుండటమేమి'టని.

ఈ విషయంలో ఆశ్చర్యపడవలసినంత విశేషమేమీలేదు. స్త్రీలలో బలమైనవాళ్లు వున్నారనడంలో ఆశ్చర్యంలేదుగాని, వారు వ్యాయామంచేసి శరీరదారుఢ్యాన్ని పెంపొందింపజేసుకొనాలనే విషయం తెలుసుకొనడమే యిక్కడ ఆశ్చర్యపడవలసిన విశేషము. ప్రతి మానవజీవికి ముఖ్యధర్మమైన యీ విషయంలో, స్త్రీలు శరీరబలాన్ని వృద్ధిచేసుకొనవలసినదని చెప్పడం, ఆవిధంగా చేయించడంలో ఆశ్చర్యానికి తావూలేదు, అలజడికి కారణమూలేదు. పైగా యీ విషయాన్ని దైనికజీవితంలో ఒకముఖ్యధర్మంగా పరిగణించి అభ్యసించాలి.

వ్యాయామం అనగానే దండీలు, బస్కీలు మొదలైనవే చెప్పనక్కరలేదు. దీనికోసం బాడ్మింటన్, టెన్నిసు, బిలియర్డ్సు మొదలైన ఆటలమీద ధనము వృథాగా ఖర్చుపెట్టనక్కరలేదు. శరీరానికి శ్రమ కలుగజేసే కాయకష్టమేదైనా వ్యాయామంక్రిందనే వస్తుంది.

ఈ వ్యాయామం మనదేశంలో పూర్వకాలంనుంచీ మన దైనికజీవితాలకి మిళితం చేసి వేయబడింది. దీనికి నిదర్శనంగా, మన పల్లెగ్రామాల్లో పురుషులతోబాటు స్త్రీలుగూడా పగలల్లా పొలాల్లో పనిచేయడం మనం చూస్తునేవున్నాము. ఇటీవల కొద్దిపాటి అగ్రజాతులవారు పనిచేయకపోయినా, పల్నాడు ప్రాంతాల్లో ఇప్పటికీ బ్రాహ్మణాది అగ్రజాతులస్త్రీలు పురుషులతో సమంగా వ్యవసాయము మొదలైన పనుల్లోపాల్గొని కాయకష్టం చేస్తుంటారు.

కాని రానురాను ప్రజల అభిప్రాయాలు మారిపోయి, పాశ్చాత్యనాగరికత కళ్లకు కప్పివేసి, పాతరోత క్రొత్తవింతగా పరిణమించి, మనది మనకివెగటు పరులది పరమాన్న ముగా చూచు బుద్ధి భారతీయుల్లో బాగావ్యాపించి వేళ్లు నాటుకుపోయింది. అవ్యా మోహంలోపడి దేశం నిస్తేజమైపోయింది. నాగరికతావేశులైన కొద్దిపాటి అగ్రజాతుల వారు మన దేశాచారాలను, పద్ధతులను తిరస్కరించి, వాటిలో నిగూఢమైయున్న ఆరోగ్య విధులను, పవిత్రతలను తెలుసుకోలేకపోతున్నారు. ఏ అల్పసంఖ్యాకులో ఇటువంటి పని పాటలు లేనివారు గాని, మనదేశంలో నూటికి తొంభైమంది స్త్రీలు కాయకష్టం చేసేవారే.

ఇటువంటిభావమే పూర్వం ఆంగ్లేయుల్లోకూడావుండేది. ఎలిజబత్తురాణి ఇంగ్లాండును పరిపాలించేకాలంలో స్త్రీ సన్నగా బక్కపలుచగా వుండాలనీ, ఎండనైనా సహించలేనంత మృదువుగావుండాలనీ, ఏమాత్రం కాఠిన్యతకు శ్రమకు ఓర్చుకోలేనంత అబలగావుండాలనే భావాలు ప్రజలలో బాగా ప్రబలివుండేవి. దారుఢ్యవంతమైన జాతినిచ్చి, దేశాన్ని ఉన్నత స్థానంలోకి తీసుకురావలసిన స్త్రీయే ఇంత నిస్తేజంగావుంటే దేశానికి అధోగతేనను అభిప్రా యం ప్రజలలో కాలక్రమాన్నికలిగి, స్త్రీలను అన్నివిషయాల్లోను వృద్ధిలోకి తీసుకువచ్చారు, వస్తున్నారు.

అటులనే మనదేశంలోకూడా ఇప్పుడు కొంత చైతన్యం కలగాలి. పనిపాటలు చేసేవారిలో ఎంత దారుఢ్యవంతమైనవారున్నారో తెలుసుకొని, వారినిచూచి, వారివలెనే శరీరదారుఢ్యాన్ని నిర్మించుకొనడానికి ఈ మధ్యతరగతుల మహిళామణులు ప్రయత్నించాలి.

స్త్రీకి క్రమమైన కాయకష్టం లేకపోతే ఆమె సరియైన మాత కాలేదు. పనిపాటలు లేక తిని కూర్చునేవారు ఏ విధమైన శ్రమకు ఓర్చుకోలేరు. వారి ఆరోగ్యము ఎప్పుడూ మందులు కోరుతూనే వుంటుంది.

అన్నివిషయాల్లోనూ స్త్రీ పురుషులు సమానులే కాని, ఒక విషయంలో స్త్రీ ఆధిక్యత పొందుతుంది—జాతి సృష్టిభారంలో. ఇటువంటి మహత్తరకార్యానికి పూను కున్న ఆమె ఎంత దారుఢ్యవంతముగానైనా వుండాలి. ఈ విషయంలో మనదేశంలో అనేక మైన మహోపద్రవాలు సంభవిస్తున్నాయి. ఇది కేవలము కాయకష్ట మెరుగనివారిలోనే ఎక్కువ. వంటకొరకు, బజారుచేయుటకొరకు, ఇంటిలో చాకిరీచేయుటకొరకు,—ఇలా గునే ఇక్కడి వస్తువ నక్కడ పెట్టనక్కరలేకుండా, శరీరానికి ఏ విధమైన పరిశ్రమాలేని స్త్రీలలో శక్తి మృగ్యం—

మన ఆచారవ్యవహారాలు మన ఆరోగ్యవృద్ధికి దోహదమిచ్చేవిగానే సృష్టింపబడ్డ వనే విషయాన్ని గమనించి, పాశ్చాత్యపద్ధతులను పరిత్యజించి, మన స్థితిగతులను పరి కించి, మన వెనుకటివారి ప్రసిద్ధచరిత్ర విశేషాలను మననం చేసుకుని, మనకు మనసాటి ...

వారికి వున్న తారతమ్యాన్ని గ్రహించి, యీ విషయంలో మన వనితాలోకం ఎంత దురభిప్రాయపడుతున్నదో తెలుసుకొని తదనుగుణ్యంగా ప్రవర్తించాలి.

ఈ వ్యాయామపరిశ్రమను ఒకకళగాని, ఒకపరిశ్రమగాగాని పెంపొందిస్తే శరీరానికి చాలామంచిది; అవసరమైతే తిరువాన్కూరు,బరోడాసంస్థానాల్లోవలె స్త్రీ పోలీసులై దేశానికి మేలుకూడా చేయవచ్చు. నేడు సాంఘికంగా జరుగుతూవుండే దుర్భర అవినీతి కార్యాలలో తమతమ శీలరక్షణార్థంగాకూడా ఉపయోగపడుతుంది, మురానీపూర్ యువతికివలె.

ఈ వ్యాయామంకోసం షాలాల్లో పనిచేయనూ అక్కరలేదు, తాలింఖానాల్లో ఖసరత్తు చేయనూ అక్కరలేదు. ఇంట్లోనేవుండి సంగీతము, కుట్టు మొదలగువాటితోపాటు ప్రతిదినము గృహపరిశ్రమలమీదికి దృష్టి మళ్లించి, పరిశ్రమలరూపంగా శరీరానికి శ్రమ కలుగజేస్తే ఇటు వ్యాయామలాభము, అటు వస్తురూపంగా పరిశ్రమలాభమూను.

సహజంగా స్త్రీ పురుషులకు ప్రకృతిలో తేడా ఎలా వుందో, వారివారి పరిశ్రమల్లో కూడా భేదముండాలి. అట్లుకాక వీరిని వారు, వారిని వీరు అనుకరిస్తే రెండుజాతులకు అభివృద్ధికిబదులు పతనం కలుగుతుంది.

అంగసౌష్ఠవాన్ని, అవయవనిర్మాణాన్ని, బుద్ధికుశలతని, శక్తివంతమైన జాతినిర్మాణాన్ని కలుగజేసుకొనేందుకు ఏ విధంగా ఎంతవరకు ఉపకరిస్తాయో అటువంటి పద్ధతుల మీదనే యీ వ్యాయామపరిశ్రమలను ఆచరణలో పెట్టాలి.

భావిభారతదేశం ఎన్ని విధాలుగానో పరిణామం పొందవలసివున్నది. ఆ పరిణామాలకు తులతూగగల తేజోవంతమైనజాతి పూర్తిగా అవసరం; ఇది ముఖ్యంగా నేటి యువతులమీదనే ఆధారపడివుంది.

విద్య సంపాదించడం ఉద్యోగాలు చెయ్యడానికీ ఊళ్లు ఏలడానికీ ఎల్లాకాదో, శక్తివంతమైన శరీరనిర్మాణాన్ని సంపాదించడం యుద్ధాలు చెయ్యడానికీ కుస్తీలు పట్టడానికీమాత్రం కాదని గ్రహించి, ఉజ్వలమైన సంఘనిర్మాణంకోసం స్త్రీలోకం పాటుపడాలి; ఇది వారి ముఖ్యకర్తవ్యమూ, ధర్మమూ కూడాను—



# ప్రేమ

## శ్రీమతి నెసులి ప్రభావతీదేవిగారు

ఒక పెద్దవిశాలమైన గృహము. చుట్టూ తోట. తోటలో కొలను. దానిచుట్టు పలువిధములగు పుష్పముల మొక్కలు చూచుట కెంతయో ఆనందముగ నుండెను. ఆ నాడు పౌర్ణమి అగుటచే చంద్రుడు తన పూర్ణతేజస్సునంతయు వెలి బుచ్చుచు మధ్యమధ్య ఆ తోటలోని చెట్ల సందుల నుంచి దోబూచులాడుచుండెను.

సుమారు రాత్రి 10 గంటలప్పుడు ఒక 16 యేండ్లయువతి; పసిమిపచ్చనిఛాయ, తామర రేకులవంటి కన్నులు, నల్లత్రాచువలె మెడమీద నుంచి పిరుదులవరకు వ్రేలా డుచున్నజడ, ఆమె ధరించిన తెల్ల జరీచీర, 'వీ' నెక్కుపెట్టి కుట్టిన తెల్ల రవిక వేసుకొని; ఆ కొలనుకు చేరువనున్న ఒక ఆసనముపై కూర్చొని యేదియో ఆలోచించుచుండ చూచువారలకు ఆమె ఆ వనలక్ష్మియా యనిపించుచుండెను.

ఆమె అట్లు దీర్ఘాలోచనలో మునిగియుండునట్టి సమయమున వెనుకనుంచి 22 యేండ్ల యువకుడు వచ్చి ఆ లతాంగి కన్నులు గట్టిగ మూసెను. అంత ఆమె వులిక్కిపడి 'కమలాకరా' అని పిలిచెను. అంత కమలా కరుడు ముందునకు వచ్చి 'నేను. మరెవ్వరు కారు. నేను కాకుంటే మరి యెవరైనా నీ కన్నులు అంత ధైర్యముగా మూసెదరా' అనెను. ఆ యువతి సిగ్గుచే తలవంచుకొన్నది. అంత వారిరువురకు యీ విధముగ సంభాషణ జరిగినది.

కమ : ప్రేమా ! నేను నిన్న చెప్పినది మీ తండ్రితో చెప్పితివా ?

ప్రేమ : చెప్పితిని కాని ఆయన ఆ డబ్బులేనివాడిని పెండ్లిచేసుకునేమాట కలలో నయిన తలపెట్ట వద్దని చెప్పినారు. మా తండ్రికి నన్ను నా మేనత్తకొడుకు రఘురామున కియ్యవలెనని ఉన్నది. అతడికి 24 యేండ్లు; యింకా స్కూల్ ఫైనల్ పూర్తికాలేదు. తండ్రి సంపాదించిపెట్టిన 2 లక్షల ఆస్తి అతని చదువుకు పూర్తి అయ్యేటట్లువున్నది. పైగా అతను దుష్టుడు, త్రాగుబోతు. తండ్రి మహా మంచివాడు; పాపము, కొడుకు చెడునడతలకు వోర్వలేక పోయినసంవత్సరమే పరలోకము చేరినాడు. యిట్టి నా నిష్కళంక హృదయములో ప్రేమించుచున్న నిన్ను వదలి ఆ సుద్ధ అభాగ్యుని చేపట్టవలెనన్న నా మనస్సు యెంత తల్లడిల్లుచున్నదో ఆ పరమాత్మునకే యెరుక. అని చెప్పి తన శిరమును అతని విశాలవక్షస్థలమున చేర్చి దుఃఖించెను.

కమ : ప్రేమ ! దుఃఖింపకుము. ధైర్యము సాహసము వీడవలదు. స్త్రీలు యెవరిని మనసారవలచిరో వారినే చేపట్టెదరు. సావిత్రి తాను వరించిన సత్యవంతుని తప్ప మరెవ్వరిని వివాహమాడనని చెప్పిన, ఆమెతండ్రి అశ్వపతి అందులకు సమ్మతింపక ఆతనికి ఒక్కయేడాదే ఆయువు అని చెప్పినను, సావిత్రి విననందున చేయున దేమియులేక ఆమె యిష్టప్రకారము సత్యవంతున కిచ్చి పెండ్లిచేసెను. అయిననేమి ఆమె పాతివ్రత్యమహిమచే భర్తగండము తప్పించి మరియు అంధులైన అత్తమామలకు చూపు కలిగించెను. నేను యే విధముగానైన డబ్బు సంపాదించి తప్పక మీ నాన్నను వొప్పించి నిన్ను పెండ్లియాడెదను. అని చెప్పి ఆమెను తన విశాలహృదయ మునకు వొత్తుకొని వోదార్చెను.

వీరిద్దరు సంభాషించుచుండగనే గడియారము 12 గంటలు కొట్టుట వినబడెను. అంత వారిద్దరు ఒకరి నొకరు విడువలేక అతి వ్యసనముతోడ యిండ్లకు పోయిరి.

ఆనందరావు ఒక పెద్దవకీలు; అతనిభార్య కమలమ్మ. వీరికి పెద్దలు సంపాదించిన భూములు, రెండుపెద్ద యిండ్లు కలవు. భూములమీద సాలుకు 5000 రూపాయలు వచ్చును. వీరియొక్క యేకసంతానమే ప్రేమ.

ప్రేమగడచిన యేడాదియే స్కూల్ ఫైనల్ ప్యాసయి యీసంవత్సరము F. A. కు కాలేజీలో జేరినది. తనతోకూడ ఆ బడిలోనే చదువుచున్న కమలాకరునిమీద ప్రేమచే అతనిని తప్ప వేరెవ్వరిని పెండ్లియాడనని ఒకటే మొండిపట్టుపట్టి దినమునకు పదిసార్లయిన తండ్రిచే చీవాట్లు తినుచుండెను. ప్రేమ తల్లికిమాత్రము తనకూతురిని రఘురామున కిచ్చుట యిష్టములేదు కాని, పాపము యేమి చేయగలదు? అత్తగారింటిపక్క సంబంధము, అందులో ఆడబిడ్డకొడుకు. ఆడబిడ్డ అర్థంమొగుడు కదా! చేయునదిలేకలోలోన గుందుచుండెను.

కమలాకరునితండ్రి హైకోర్టులో గుమాస్తా. నెలకు 70 రూపాయలు జీతము, తల్లి మహాపతివ్రత, పేరు సుశీల. ఈ దంపతుల తెలివితేటలచే స్వల్పజీతమైనను మర్యాదలకు లోపములేకుండ సంసారము జరపుచు తమ యొక్క యేకపుత్రుని చదివించుచుండిరి. కమలాకరుడు మంచి తెలివిగలవాడగుటచే తలితండ్రులకష్టము వ్యర్థముచేయక 18 వ యేటనే బి.ఎ. ప్యాసుచేసి డాక్టరుపరీక్షకు చదువుచుండెను. అతనికి క్రాసువరడ్సు పజిల్సు అనిన మిగులయిష్టము. అందుచేత ప్రతినెల "weekly"లో యేదోవొక పజిలు తప్పక వేయుచుండెను.

ఇట్లుండ ఆనందరావు అక్కగారు తనకుమారునకు తన కూతునిచ్చి త్వరలో ముహూర్తము పెట్టని యెడల వేరే ఏ పిల్లనైన మాట్లాడెదనని బెదరించుచూ వుత్తరమువ్రాసెను.

రఘురామునితండ్రి జడ్జిగా వుండి సుమారు 2 లక్షలాస్తి సంపాదించెను. అంతఆస్తికి మరేపిల్ల హక్కురాలవునో అన్న భీతిచే ఆనందరావు వీలయినంతత్వరలో ముహూర్తము పెట్టెదనని అక్కకు జాబు వ్రాసెను కాని ప్రేమను ఒప్పించుట యెట్లనా యని యాలోచించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు కమలాకరుడు తన పఠనామందిరములో యేదో చదువుకొనుచుండెను. అప్పుడు పోస్టు జవాను అతనికి ఒకకవరు యిచ్చిపోయెను. ఆజాబు చూచినతోడనే అతని సంతోషమునకు మేరలేదు. దానియందు తాను గడచిన నెలలోపంపిన క్రాసువర్డు పజిల్ (Cross - word puggle) అంతా రైటనిన్ని, దానికి మొదటి బహుమానము 30,000 రూపాయలు పంపుచున్నామనిన్ని వ్రాయబడివుండెను. ఆజాబుతీసికొని తల్లి తండ్రులకు చూపి ప్రేమ యింటికిపోయెను. ప్రేమ తనగదిలో వీణవాయించుచూ కమలాకరునిరాక చూచి నవ్వుచు లేచివచ్చి చేతిలోనిజాబు యేమని అడిగెను. కమలాకరుడు ఆకవరు ఆమె చేతికిచ్చి 'ప్రేమా? యిక నైనను మీతండ్రి నీమాట నంగీకరించడా?' అని అడిగెను. యిట్లు వారిరువురు కొంచముసేపు మాట్లాడుకొన్న తర్వాత కమలాకరుడు యింటికిపోయెను.

మరుచటినాడు భోజనముచేయుచు ప్రేమ తన ప్రియుని బహుమానమును గురించియు, తాను అతనినిదప్ప అత్తకొడుకును చేసుకొనననియు, అట్లుకాకున్న యేబావిలోనో గుంటలోనోపడి చనిపోయెదననియు ధృఢముగ చెప్పెను.

అంత పాపమా తలితండ్రులు చేయునదేదియు లేక తమ కుమార్తెను కమలాకరునకిచ్చి అతి వైభవముగా వివాహము జరపిరి. పెండ్లికి బంధుమిత్రులెల్లరు వచ్చిరి, కాని రఘురాముడు వానితల్లియు రాలేదు. అంతియే కాక వారికి వీరికి నోటిమాటలుకూడ లేకుండపోయినవి.

కమలాకరుడు డాక్టరుపరీక్ష పూర్తిచేసి ప్రైవేటుగా ప్రాక్టీసు పెట్టుకొని నెలకు 400 సంపాదించు చుండెను. ప్రేమ చదువుమాని అత్తమామలసేవచేయుచు భర్తప్రేమకు పాత్రురాలయి యిద్దరుబిడ్డలతో సుఖముగ సంసారము గడుపుచుండెను. ఇట్లుండ రఘురామునకు త్రాగుడుయెక్కువై ఆస్థియంతయుపాడుచేసుకొని యిప్పుడు తినుటకుకూడ గతిలేక అల్లాడుచున్నాడని విని, ఆనందరావు అక్కమీద ప్రేమచే ఆమెను మేనల్లుడిని వచ్చి తన దగ్గిరవుండమని జాబువ్రాసెను. కాని రఘురాముడుమాత్రము కోపముచే రాలేదు. తల్లిమాత్రము చేయునదేమియులేక తమ్ముని దగ్గిరపోయి కాలము వెళ్ళబుచ్చుచుండెను. రఘురామునిగతి యేమయ్యెనో యెవ్వరికిని తెలియలేదు.

ఒకనాడు ప్రేమ తనకొడుకునకు పుట్టినపండుగని తలితండ్రులను, మేనత్తను విందునకు పిలిచెను. అప్పుడు ఆనందరావు తనకూతురి సుఖసంసారమునుచూసి 'ప్రేమా, నాయిష్టప్రకారము డబ్బుకాసించి నిన్ను రఘురామున కిచ్చి పెండ్లిచేసి నీ సుఖమును యేట గలుపదలచితినికదా? యిప్పుడు నీమనసారవరించినపతితో ఇంత సుఖముగ నున్న నిన్ను జూచిన నా మనస్సునకు అపరిమితానందము కలుగుచున్నది' అని చెప్పెను.

ప్రేమ 'తండ్రీ ప్రపంచములో కీర్తి, మంచిగుణము శాశ్వతముకాని, డబ్బు శాశ్వతమా? డబ్బు మనుష్యుని ఒకనాడు లక్షాధికారినిచేసిన మరొకనాడు బిక్షాధికారునిగాచేయును. డబ్బునకాశించి మనహిందూ దేశములో చిన్నచిన్న పసిపిల్లలను యే 40, 50 యేండ్ల ముసలివాండ్లకోయిచ్చి, ఆపిల్లల సుఖమును నడియేట గలుపుటలేదా? చిన్నతనము కాబట్టి అత్తవారుపెట్టు నాలుగు బంగారునగలుచూసి యిదికఆట అని అనుకొని యిష్టపడెదరు. కాని తరువాత వారి తలితండ్రులుచేసిన అన్యాయమునకు యేడ్చుచు కాలము గడిపెదరు' అని చెప్పెను.

ఇంతలో వంటమనిషి ఆకులువేసి వడ్డించడమయినదని అందరిని పిలచెను. అందరు లడ్డు, జిలేబి, పాయసములతో కడుపునిండ భోజనములుచేసి తాంబూలాదులను స్వీకరించి కొంచమసేపు కబుర్లు చెప్పుకొని యెవరిండ్లకువారుపోయిరి.

## సానిమేళము

మత్తమధువ్రత మంజులనాదమే ఘనవిపంచీకృత క్వాణనగాగ
చండమదోద్దండ సత్వనినాదంబె తతమృదంగధ్వాన తతులుగాగ
జలజలప్రవహించు సెలయేటిచప్పుళ్లే కాలభేదముఁజూపు తాళములుగ
కోమల కోకిల కుహూ కుహూరావంబె సరససంగీతంపు సరణిగాగ

కేకిసంఘంబుపురివిచ్చి నిక్కియాడ
నరయవనదేవతా వివాహంపువేళ
నలువనిర్మించు నర్తకి నాట్యమనఁగఁ
బ్రకృతికన్పించెనెల్లెడ బంధురముగ.

—శ్రీ జి. యమ్. సన్యాసయ్య

# విజయలక్ష్మి

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

[దృశ్యము: భారతస్వాతంత్ర్యనాటక ప్రథమరంగము. విజయలక్ష్మి ప్రత్యక్షమయినది పద్మసింహాసనమున గొలువుదీర్చినది. మధురస్వాతంత్ర్య మధుపానమత్తులగు తేటికుమారులు స్వేచ్ఛాగానములతో విజయలక్ష్మి పాదపీఠసోపానములపై యధికారపదవుల నలంకరించిరి. విజయదేవతను గొలుచుటకు వివిధరాష్ట్రనారీమణులు విచ్చేసిరి. వారివారి కుచితరీతుల పూజలర్పించిరి. అందు దేవీప్రసాదము ననుభవించుచున్నవారు సగర్వముగా మాతృదేవికి పూజలసమర్పించిరి. తద్భాగ్యమునుపొందని యబలలు తల్లికి తమనిర్వేదముల నివేదించిరి. అంతలోనే భూమిక ముగిసినది. దృశ్యము తెరమరుగైనది. విజయనాటకమున రెండవరంగము సూచితము. భరతపుత్రికలు ముందురంగమున తక్కిన స్వదేశీయ కుమారీరత్నములపొందున కలసి మెలసి నాట్యముచేయుదురో లేక వారితో వాదప్రతివాదములతో యీనాటకమును పెంపుచేయుదురో చూడవలసి యున్నదని భావము...]

అశుభోదయవేళ స్వేచ్ఛారుణాప్తి
కమలవనవాటిబూసె బంగారురంగు
మలయమారుతహతి పెద్ద జలరుహమ్ము
విరిసెనట వేయిరేకుల విరివితోడ!

తీయ తేనెకు నోరూరు తేటికులము
దిష్యకవిగాయకులు పాట తేటలొలుక
దళము దళమునవిడిసి రంతస్థకర్ణి
కాగ్రమున భాగ్యలక్ష్మి ప్రత్యక్షమయ్యె!

జలజకర్ణిక గొలువున్న స్వర్ణగాత్రి
గొలువవచ్చిరి వివిధజాతుల యువతులు
చిత్రచిత్రాకృతుల రూపసిరులు మెఱయ
భారతాఖండ గర్భసంభవలు వారు!

ద్రవిడకేరళ కర్ణాట రాజముఖులు
పొత్తుచేతుల నొకగొల్సు కత్తుగొలిపి
తియ్య త్యాగయ్యకృతుల నాంధ్రీమతల్లి
గొంతుతోకూర్చి పాడుచు గొలిచినిలువ

వచ్చెనంత మహారాష్ట్ర వయసుకన్నె
రైకచీరయు బిగిసి యేర్పరుపరాని
తనువు తనువెల్ల భక్తితాత్పర్య పులకి
తమ్ముగా వీరశృంగార తాండవముల!

మధ్యరాష్ట్రపురంధ్రి యాత్మచివురెత్త
జేతులెత్తి నివాళి వాసింపబట్టి
ప్రక్కవారల క్రేగంట పంతమాడి
మోడ్చి కేలింత పరవశామోదమలర!

రాజసముమీర కోసలరాజతనయ
ప్రాజ్యసామ్రాజ్య పట్టంపురాణివాస
సరణిచూపట్ట భక్తిపూజలనుసలిపె
విజయలక్ష్మికి పుట్టింటి విరిసరముల!

అంగకౌమారి స్వేచ్ఛావిహారకలన
జిన్ని వెన్నెల మెఱయించి చేసెపూజ
స్వాభిమానము భక్తితో సరసమాడ
నఖిల భారతలక్ష్మికి నలరు సరుల!

చిన్నదయ్యును తెలివిని పెద్దదగుచు
ఓఢ్రకన్యక నూత్నకవోష్ణభావ
కుసుమసంచయముల పూజ కోరిచేసె
విమల లక్ష్మీప్రసాదమ్ము వేడుకొనుచు!

భక్తి సరిహద్దు పట్టాణ బాలవచ్చి
చేరికొలిచెను పద్మజ శిష్టసరణి
మాతృసేవల మతభేద మార్గముడిగి
యక్కసెల్లెండ్ర కిసుమంత యడుగువడక!

కామరూపవిలాసిని కంఠమెత్తి
నూత్నవిజయోత్సుక తమయానూనరాగ
రక్తినటియించె భక్తియు యుక్తిదనర
బిసరుహాలయ కడసారి బిడ్డయగుట!

సింధుపంజాబు మత్తకాశినులు, కనుల
భక్తిభావమ్ము తళ్కొత్త, వాయివిడిచి
పాడగాలేని బంధనాభ్యంతరముల
నల్లనల్లన తలవంచి వెళ్లినారు!

వంగయువతీలలామ మభంగభక్తి
యుబ్బిగొబ్బుగ పూజసేయుటకువచ్చి
ఫలముదక్కమి గొంతెత్తిపాడియలసి
తనువువాలిచె పరవశత్వమ్ము మెఱయ!

వంగయువతీ విరహాకంఠ సంగతులను
తోచె హేమంత సామంత దోషమపుడె!
కలతపడి పద్మవనవాటి కలవరించె
భరతనాటక రంగమ్ము తిరిగిపోయె!

క్రమ్మనొక్కట పొగమంచు కమలవాటి
పద్మసింహాసనాలయ ప్రథమవిజయ
భామికతొలంగె యవనికాభ్యంతరమున
తళుక్కుమనెనంత మంచు ముత్యాలకాంతి!

ముందునాటకమేమానొ, ముదితహృదయు
లందరు కుమారికలుగూడి సుందరముగ
తక్కినయనుంగు చెల్లెండ్రప్రక్కనిలిచి,
స్వైరగానమ్ముసేతురో, వాదములను
కథనుసాగింతురో మీద కాంచవలయు.



# ఉవిదల ఉన్నత విద్యాదర్శములు

శ్రీయుత విం. ఆ. సూర్యనారాయణగారు

దేశభక్తియు జాత్యభిమానమును నానాటికి నభివృద్ధినొందుచున్న ఈశతాబ్దములో భారతీయులు కాలక్రమమున గోల్పోయిన పూర్వమహిమను, ప్రాచీన వ్యక్తిపటిమను మరల ప్రతిష్ఠించుటకై తీవ్రప్రయత్నములు సలుపుచుండుట సర్వజనవిదితమై యున్నది. జాతీయఘనతను పునరుద్ధరించుటకై ప్రజలహృదయములలో ప్రజ్వరిల్లుచున్న నూతనోత్సాహ మెల్లెడలబర్వి స్త్రీపురుషులను భేదములేకుండ నెల్లజనుల యుల్లముల పల్లటిల్ల జేయుచున్నది.

ఈ నూతనోద్భూత జాతీయభావవికాసము భారతరమణీమణుల హృదయాకాశముపై ప్రకాశించుట భారతదేశ భాగ్యోదయమునకు చిహ్నమన బరగుచున్నది. స్త్రీలును పురుషులభాతి ఉన్నతవిద్యాపరిశ్రమకు పాటువడుటయు దేశోద్ధరణకు బూనుకొనుటయు నెంతయు శుభావహమైయొప్పుచు భారతదేశచరిత్రలో నూతనయుగమును సూచించుచున్నది.

జాతియొక్కఘనతకును, దేశముయొక్క గౌరవమునకును, మానవజీవితముయొక్క సుఖమునకును, ప్రజలయొక్క నాగరికతకును స్త్రీలు తామొనర్పవలసిన కర్తవ్యమును గుర్తెఱుంగుటకు వారలలో విద్యావ్యాప్తి విశేషముగ కావలసియున్నది.

స్త్రీపురుషు లొండొరులయెడ సమభావముగలిగి చరించినగాని దేశముయొక్క సంపదయు నాగరికతయు పెంపువహింపవు. స్త్రీపురుషులందరునుగలిసి సాధింపనిదే దేశములో సంపూర్ణ సంఘీభావము గలుగదు. సరియైన సంఘీభావ మేర్పడనిదే రాజకీయ, ఆర్థికస్వాతంత్ర్యము చేకూరనేరదు. స్త్రీలును పురుషులును వారివారి ప్రత్యేకవిధులను పాటించుచేకాక, సాంఘికవిషయములలోను, సారస్వతవిషయములలోను, స్వాతంత్ర్య సమరమునందును ఒకరికొకరు చేయూతగజెలంగుచు పనిచేసినగాని భారతీయులకు సత్యమైన, శాశ్వతమైన శ్రేయస్సు సమకూరదు.

స్త్రీలశీలము పురుషులకు శక్తినొసంగును. స్త్రీలవిజ్ఞానము పురుషులజీవితము నుద్దీపింపజేయును. స్త్రీలప్రేమ పురుషుల హృదయములలో దయాదాక్షిణ్యములై పల్లవించును. అట్టి శ్రేయోదాయకమును సర్వసంపత్కరమునునగు స్త్రీవ్యక్తిని విద్యయను విద్యుచ్ఛక్తిచే ప్రకాశింపజేసిన నాదివ్యశక్తి దివ్యజ్యోతియై ప్రపంచమునంతను తేజోవంతముగ జేయగల్గును.

కాని, ఎట్టివిద్య స్త్రీలకు గావలెనను మహాసమస్య మహామనీషులును ధీదిట్టలునగు ఘనులచే నిర్ణయింపబడవలెను. పాశ్చాత్య విద్యావ్యామోహము పురుషులలో ప్రబలుట వలన సాంఘికజీవనము సర్వవిధముల తారుమారైనది. పాశ్చాత్యవిద్యావ్యాప్తి స్త్రీలను గూడ విద్యాపరిశ్రమకై పురికొల్పుటలో కొంతమేలే చేకూర్చెననుటలో సందియ మించుకయును లేదు. ఇట్లనుటచే ఉన్నత హూణవిద్యాపరిశ్రమ పూర్తిగ నువిదల యభ్యున్నతికి తోడ్పడెనని చెప్పసాహసింపజనదు. పాశ్చాత్యవిద్యావిధానము భారత రమణీమణుల కున్నతాధర్శములను ప్రబోధించి వారినెంతవరకు నుద్ధరించినదియు, వారి హూణవిద్యాప్రావీణ్య మెంతవరకు సాంఘికజీవనమును చక్కబరచినదియు నిర్ణయించుట సులభముకాదు. ఇంకను కొంతకాలము గడచినగాని అందలి యదార్థము తేటపడదు.

ఏదిఏమెట్లున్నను పాశ్చాత్యవిద్యాపరిశ్రమ స్త్రీలకు కొంత మానసికవికాసమును గల్గించుటేకాక, పురుషులు వారి నణగద్రొక్కుప్రయత్నములను ప్రతిఘటించుటకు వలయు బుద్ధిబలమునుగూడ బ్రసాదించెననుట నిశ్చయమని చెప్పనగును. అయినను పవిత్రమగు భారతీయసతీత్వమర్యాదలకు భిన్నముగపరిణమించి దివ్యతేజోవంతమగు మాతృత్వ మహిమను మాటుపఱచు విద్యావిధానము ప్రోత్సహింపదగినదికాదు. స్త్రీలు తమ సహజధర్మములను విడనాడి వింతనడతల నలవరచుకొన్న మానవజీవితము దుఃఖభాజన మగుటయేకాక దేశాభ్యుదయమునకును జాత్యౌన్నత్యమునకును హాని వాటిల్లగలదు.

దైవభక్తియు, దేశభక్తియు, పతిభక్తియు, పవిత్రజీవితమును, శీలసౌష్ఠవమును, చిత్తవికాసమును, భావబాహుళ్యమును, ఆరోగ్యభాగ్యమును, ఆధ్యాత్మికానందమును పెంపొందింపగల విద్యాభ్యాసము స్త్రీలకు ముఖ్యావసరమైయున్నది. కేవలము పురుషులతో పోరాటమునకు పురికొల్పునదియు సంఘములో తమ ప్రత్యేకవ్యక్తిత్వమును వెల్లడించుటకు హెచ్చరిక గొల్పునట్టియు విద్యాపరిశ్రమ నెక్కువగ బ్రోత్సహింపరాదు.

సంఘములో స్త్రీలకు పురుషులతోపాటు సమగౌరవమర్యాదలు కలుగకుండు టెంతయు శోచనీయమగు విషయమేయగును. పురుషులలో నీపక్షపాతబుద్ధి యంతరించు వరకు స్త్రీలు పురుషులపై పాశ్చాత్యవిద్యాపాశుపతాస్త్రమును ప్రయోగింపకతప్పదు. పాశ్చాత్యవిద్యాప్రభావమును స్త్రీలు చక్కగ గుర్తించియున్నారు. హూణవిద్యాప్రవీణ లగు విదుషీమణులప్రతిభకు పురుషులుభయపడి వారికి సంఘసంస్థలలో తావిచ్చి తాము తొలగుచుండుట యెల్లరకును విదితమే. స్త్రీలు తమ దీనస్థితిని బాపికొనుటకును పురుషులమూర్ఖతను పోనడంచుటకును ఉన్నతవిద్యయే యుత్తమసాధనమని గ్రహించుట ప్రశంసార్హమై యున్నది.

ప్రస్తుతము ప్రపంచమునంతను నావరించిన క్లిష్టపరిస్థితులలో భారతరమణీమణులు దేశోద్ధరణకై బహువిధముల బాటుపడవలసియున్నది. విద్యావిషయమై విశేషముగ గృషిసేసి వారివిజ్ఞానమును వివిధవిషయములలో విస్తరింపజేసి సంఘమునకు క్షేమమును శక్తిని చేకూర్చుట వారి ముఖ్యకర్తవ్యమైయున్నది. ప్రస్తుతరాజకీయ పరిస్థితులలో స్త్రీలు పాశ్చాత్య విద్యాప్రావీణ్యము సందగోరుట పాడియేయగును. ఉవిదల యున్నత హూణవిద్యాప్రాభవము పాశ్చాత్యదేశములందు ప్రసరించి భారతజాతియొక్క ఘనతను జాటవలసియున్నది. ఇప్పట్ల ఉన్నత హూణవిద్య వారినెంతయు నుద్ధరింపగల సాధనమే యనజెల్లును. రాజకీయాందోళనలో రణరంగముననిల్చి ధీరతతోబోరాడు బుద్ధిబలమును శక్త్యుత్సాహములును చాలగసేకరించుటకై వారు వివిధవిద్యల నభ్యసింపవలసియున్నది.

దేశములో వీరపత్నులును, వీరమాతలును, విదుషీమణులును వేలకొలది బయలు దేరి వారివారివిధులను కడుశ్రద్ధతో నిర్వహించిననాడే జాతీయాభ్యుదయము సేకూరును. ఉన్నతవిద్య యువతుల యభ్యున్నతికై తోడ్పడునదిగ నుండవలెగాని ప్రాచీనసాంప్రదాయములను పూర్తిగ పోనడంచునదిగ నుండరాదు. నవనాగరకతావ్యామోహముచే నారీమణులు జాతివిరుద్ధ వైఖరులననుకరింప నుత్సహించజనదు. విద్యాభ్యాసముచే శారీరక, మానసిక, నైతిక, ఆధ్యాత్మిక సౌష్ఠవము సమకూరవలెను. నైతికజీవితము నాతికి ముఖ్యాదర్శముగ నుండవలెను. ఏలనన, తల్లుల తనుమనోశక్తులు పిల్లలకు సంప్రాప్తించును. వారి మంచిచెడ్డలు బిడ్డల కుగ్గుపాలతో నబ్బుచున్నవి. సత్సంతానమునందిసంసారమునకు సుఖమును సంఘమునకు సత్కీర్తియు సంపాదించుట సతులకు సద్యాదర్శమై యున్నది.

సతీత్వమును పెంపొందించు సద్విద్య సంసారమునకు సుఖమును శాంతిని కలుగ జేయును. విద్యావినయవివేకవిచక్షణాదిసద్గుణసంపదచే సుదతులు తమసంతానమునకు చిన్నవయసులో శిక్ష సలుపవలసినబాధ్యత గలిగియుండుటచే వివిధవిషయములలో వారి బుద్ధిని వినియోగింపగలిగి యుండవలెను. బాల్యవిద్య, బాలురకును బాలికలకును, స్త్రీలే పాఠశాలలందు ఉపాధ్యాయినులుగ నియమింపబడినచో, బాగుగ పట్టువడును. కోమలమగు మనసుగల లేబ్రాయపు విద్యార్థులకు విద్యార్థినులకును, కోమలులే చదువు చెప్పుటెంతయు మనోహరమై యొప్పును.

స్త్రీలు ఉన్నత హూణవిద్య నభ్యసించి, స్వధర్మములకు స్వస్తిసెప్పి, పరధర్మముల స్వీకరించి వింతమర్యాదల నలవడజేసికొనజూచుచో నచిరకాలముననే జాతిపతనము ప్రాప్తిల్లగలదు. స్త్రీలు శక్తిస్వరూపిణులు, దేవతామూర్తులునని సంభావింపబడుచున్న భారతదేశమున, భామినులు వారి పవిత్రశీలమహిమను భంగపరచు నుద్యమములకు

గడంగిన దేశముయొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి హానిసంభవించును. పాతివ్రత్యప్రాభవమును పాడొనర్చి మాతృత్వమహత్వమును మాలిన్యమొనరించు విద్యాధిక్యత మానినులకు మంచిదికాదు. తమలోని దివ్యశక్తి నుద్దీపింపజేసి, పూరుషులచే పూజింపబడదగిన ఉత్తమ శీలమును ప్రకాశింపజేయు శాస్త్రములందు తీర్ణతగాంచుటయు, సహజసౌందర్యగరిమను గలుగజేయుకళల నుపాసించుటయు, జీవితానందమునొసంగు భక్తిజ్ఞానవైరాగ్యములందు నిమగ్నతనొందుటయును నుచితమగును. అన్నిటికంటె ముఖ్యముగ ఆరోగ్యభాగ్యమును, సత్సంతానమును, సంసారసుఖమును ప్రసాదింపగలుగు గ్రంధపఠనమునందును పను లందును బుద్ధిని ప్రకాశింపజేయుటయే ప్రధానాదర్శముగ పరిగణింపదగును.

స్త్రీల విద్యావ్యాప్తి కనేక యంతరాయములుండు టెల్ల రెఱింగినవిషయమే. సంఘములో సంకుచితభావములు ప్రబలియుండుటయు, విద్యకై వ్యయపరచువిత్తమునకు తగిన ప్రతిఫలము లభింపకుండుటయు, విద్య సరియగుపద్ధతులపై నేర్పబడకుండుటయు స్త్రీలలో విద్యాపరిశ్రమ యభివృద్ధిచెందుటను ప్రతికూల మొనరించినవి. స్త్రీలును సర్వ విధముల పురుషులతోసమానమగు మేధాసంపత్తిని బుద్ధికుశలతను గలిగినవారగుటచే వారికిని ఉన్నతవిద్యాపరిశ్రమకై వలయువసతులుగల్పింపబడి తగు నవకాశము లొసంగ బడవలెను.

కాని ఉన్నతవిద్యాపరిశ్రమయనిన హూణవిద్యాప్రావీణ్యమునకై పాటుపడు టయేయని యర్థముకాదు. ప్రస్తుతపరిస్థితులలో పాశ్చాత్యవిద్యయే గతి కావున అది అభ్య సింపవలసియున్నను పాశ్చాత్యనాగరకతావ్యామోహముచే హిందూసుందరీమణులు స్వధర్మములను పరిత్యజించి జాతివిరుద్ధపద్ధతులపై బుద్ధిని ప్రసరింపజేయుట పాడిగాదు. ప్రాచీనసాంప్రదాయమును పాడొనర్చు వేషభాషలను, వింతనడతలను, వికృతచేష్టలను విడువవలెను. సహజసౌందర్యమును చంపివేయుదుసులు, అలంకారములు, మెరుగు పూతలు, నాజూకునడకలును, సహజలావణ్యసంపదను చెడగొట్టు 'బూట్లు', బిగియకట్టులు, జుట్టు 'కట్టింగులు' మొదలగు దుర్వాడుకలను పూర్తిగ విడిచినగాని భారతదేశము బాగు పడదు. హిందూ యువతులు విదేశవనితల ననుకరింపనభిలషించుచు ద్విచక్రశకటముల త్రొక్కుట వికటప్రకటనమే యగును.

భారతదేశముయొక్క భావిసౌఖ్యసంపదలు భారతరమణీమణుల చేతులలోనున్నవి. స్త్రీలు చక్కని విద్యనభ్యసించి సంఘముయొక్క యభివృద్ధికై పాటుపడినగాని ముందు సంతతివారు సర్వతోముఖాభివృద్ధి గాంచనేరరు. పాశ్చాత్య విద్యాప్రావీణ్యమునకై పాటుపడువారికి పరదేశసాంప్రదాయములు పట్టుపడి తుట్టతుదకు జాతియొక్క యభ్యు న్నతికి చేటుగల్గుచుండు టటుండ, విద్యయనిన పెనుభూతమువలెభావించి దానిని దరిచేర

ఉవిదల ఉన్నత విద్యాదర్శములు

నీయని సుందరీమణు లెందరోగలరు. సర్వతోముఖాభివృద్ధినొసంగు చక్కని విద్యావిధానము కుశాగ్రబుద్ధిగల ఘను లేర్పరచువరకు ప్రస్తుత మనలులోనున్న ఉన్నతవిద్యనే యువతు లభ్యసించి దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదింపగలుగు నంతదనుక దేశోద్ధరణకై పాటువడుట ప్రధానకర్తవ్యమైయున్నది. పాశ్చాత్యవిద్యలోని పసజూడ ప్రయత్నించుచో ప్రాచీనధర్మములపోడిమిని పోగొట్టుట పాడియగునా? దేశకాలపరిస్థితుల ననుసరించి పరనాగరికతతో సంబంధమేర్పడినను దానికి బానిసలై స్వగౌరవమర్యాదల చెందనాడదగునా? ఆదర్శప్రాయమగు విద్య యేర్పడువరకు ఉన్నవిద్యయందే ఉన్నత స్థితిగాంచవలెను. ఈదేశములో విద్యావతులగు యువతులసంఖ్యజూచిన నెంతయు నిరుత్సాహమునుగొల్పును. నూటికొక స్త్రీమాత్రమే విద్యావతియై యుండుటెంత విషాదకరమగుసంగతి! విద్యనభ్యసించు స్త్రీలు పురుషులలో పదవవంతుగూడ లేరనుట యెంత యభాగ్యస్థితియో యూహింపనలవికాదు. ఇతర దేశములలో నూటికి తొంబదియెనమండ్రు స్త్రీలు విద్యనభ్యసించినవారుండ నీదేశములో విద్య నభ్యసింపనివారు నూటికి తొంబదియెనమండ్రు స్త్రీలుండుట యెంతయు శోచనీయముగాదా? వేషభాషలలో నున్నవ్యసనము విద్యనభ్యసించుటలో నేలయుండరాదు?

ఉన్నత హూణవిద్యనభ్యసించుట విదేశనాగరకతావ్యామోహముచే విరుద్ధధర్మములు పాటించుటకా? స్వజాతి నుద్ధరించుటకా? హద్దుపద్దులేనిహక్కులను సంపాదించుటకును సహజధర్మముల నతిక్రమించు స్వాతంత్ర్యమునుగైకొనుటకును ఉన్నతవిద్యాప్రావీణ్య ముపయోగింపబడిన నది స్త్రీలకు సర్వానర్థకరమే యగును. సంఘము నుద్ధరించి, దేశమునుసేవించి, జాతికి కీర్తిసంపాదింప బనికివచ్చునదే యుత్తమవిద్య. అట్టి విద్యయే స్త్రీల యభ్యున్నతికి ఉత్తమసాధనము.

మాతృదేశమునకు మానినీమణులే యెక్కువగ సేవసేయవలసిన స్థితిగతు లేర్పడినవి. పరిస్థితులననుసరించి స్త్రీలు తమ సాంఘికజీవనమును చక్కజేసికొనవలసియున్నది. జాతీయోద్యమములోను సాంఘికసంస్థలలోను పాల్గొనవలెనన్న విద్య చాలయవసరము. విద్య సంసారసుఖమునకును సాంఘికాభివృద్ధికిని తోడ్పడునదిగ నుండవలెను. పాఠశాలలలో బడసిన జ్ఞానము పాకశాలలో పరిపక్వత నొందవలెను. ఇంటిలోనిజీవితమునకును బడిలోని పాఠమునకును సరియైన సంబంధమేర్పడవలెను.

భారతరమణీమణులు ఉత్తమధర్మములను ఉత్కృష్టాదర్శములను ఉద్బోధించు ఉన్నతవిద్యయే తమయభ్యున్నతికి ఉత్తమసాధనమనిగ్రహించి విశేషముగ విద్యనుగడించి ఆదర్శమగు తల్లులును అభినుతింపదగిన ధర్మపత్నులును అయిననాడే భారతదేశము పూర్వమహిమను తిరిగిపొంది ప్రపంచమంతలోను పుణ్యభూమియైవెలసి యెల్లదేశములకు తల్లియై పూజింపబడును.

# కైకమ్మ

కైకమ్మా! భవదీయవృత్తమును సాకల్యమ్ముగాఁ జూడకే
లోకుల్ కాకులు, తిట్టిపోసెదరు, నీలోకోపకృత్యంబు చి,
తాకంతైన నెఱుంగలేరు, నిజమున్గ్గొన్న దోషాచరా
నీకంబుల్ తెగి లోకముల్ మనుటకు న్బీజంబు నీవేకదా!

మనుజులొనర్చు కార్యముల మంచియుఁ జెడ్డయు నిర్ణయింపగాఁ
జను ఫలితమ్ముబట్టియని జ్ఞానులువాకొని; రట్టిరీతిగా
మనమునఁ జెడ్డగోరితివొ మంచిదలంచితివో యెటైననే
మ నితరలభ్యసత్ఫలము నందెనుగాదె త్వదీయకృత్యముల్!

కాంతుఁడు కాళ్ళఁబడ్డఁగనికారము సుంతవహింప కీవుబల్
పంతముబట్టి రాము వనవాసమొనర్పఁగఁ బంపఁబట్టియే
యంతమునొందినారు నరహంతకులైన సమస్తరాక్షసుల్
సుంతదయార్ద్రచిత్తవగుచోఁ గథ సర్వముమాఱియుండదే!

మును దేవాసురయుద్ధ భూమిఁబతి సమ్మూర్ఛావశుండైన నె
మ్మనమందించుక భీతిఁజెందక రిపుల్ మార్కొన్నఁగంపింపకే
ఘననిర్ముక్త తటిల్లతాయన శతాంగం బొక్కలి ప్రేర్ రణా
వని దాటించి సుధీరతాగరిమ నీప్రాణేశురక్షించితో!

మగఁడువశంవదుండయిన మానినిదిట్టుట లోకధర్మమై
నెగడినదంతెకాని తననేర్పు మెయింబతిప్రేమ చూఱగొ
న్నగరిత ధన్యురాలు గణనార్హసుమీ మువురాంధ్రలోన నీ
మగనికి నీవెనచ్చితి, సమర్థవు కేకయరాజనందనా!

రాముఁడిలంజనించుట పరాక్రమగర్వితు రావణాసురున్
సోమపదార్చనారతు విశుద్ధతపోధన పీడనవ్రతున్
భూమిభరంబుఁదీర్ప వధముంబొనరించుటకంట, యాపనిన్
రాముఁడుగీముఁడీవు విపినంబులకంపక చేయఁగల్గునే!

ఆయతబాహువిక్రమ కళాభ్యుదయుండు ప్రశాంతశీలుఁడున్
శ్రీయుతమూర్తి రామ నృపసింహుని సచ్చరితంబెయైనరా
మాయణ కావ్యమంతకు సమర్థపుబీజము నీదుపాత్రమే
వేయునునేల? నీచరిత విజ్ఞులమన్ననలొందకుండునే!

— శ్రీమతి ఎన్. అలివేణి.



శ్రీ తూపురాణి
వెంకట చూడమ్మ

ఈ బాలిక వయస్సు 12 సం॥లు. రాజమహేంద్రవరమునకు చేరువనున్న కోరుకొండ గ్రామము. శ్రీ తెలికిచర్ల కందాళై గోపాలాచార్యులవారికుమార్తె. తండ్రిగారివద్ద కావ్యనాటకాలంకారములను అభ్యసించి, విశేష సాహిత్యమును గ్రహించినది. పలువురు భాష్యకర్తల యభిమతములను చక్కగ సమన్వయించి, భగవద్గీతా రహస్యములను మృదుమధురముగ సహృదయ హృదయంగముగా నుపన్యసించుచున్నది. ఇంత చిన్నవయస్సునందు ఇంతటి పాండిత్యమును సంపాదించిన యీమె ఆంధ్ర స్త్రీ లోకమున కలంకారము.



శ్రీమతి అంకాల అరవిందకన్యాగారు

ఈమె సుప్రసిద్ధ చిత్రకారులగు శ్రీ అంకాల వేంకటసుబ్బారావుగారి పుత్రిక. ఈమె మొన్నటి డిసెంబరునెలలో జరిగిన హాయ్యరు ఫ్రీహ్యాండు టెక్నికల్ టీచర్సు సర్టిఫికేట్టు పరీక్షలో ప్రథమ శ్రేణిలో కృతార్థురాలైనది. పెయింటింగు లోయరు పరీక్షలోకూడా యీ సంవత్సరమున ఉత్తీర్ణురాలైనది. ఇంగ్లీషున ఫోర్తుఫారమువరకును చదివినది. వయస్సు 14 సంవత్సరములు.

ఇదివరలో యీమె రచించిన 'భోగిమంట' అను చిత్రము 'గృహలక్ష్మి'లో ప్రకటితమైనది. భావపూరితమైన యీమె చిత్రములలోని పోకడలు భావిప్రతిభకు రేఖలు దిద్దుచున్నవి. ఇది నిజముగా స్త్రీ లోకములో శుభసూచకమైన ఆంధ్రాభ్యుదయము.



రాధాకృష్ణులు

కుమారి సుభాదేవి, సుభద్రాదేవి

సుప్రశిద్ధ వైశ్యప్రముఖులగు శ్రీయుత వి. యస్. గుప్తగారి పుత్రికలు. విశాఖపట్నం, శ్రీ మహారాణీపేట శ్రీ రామ లీలా మహోత్సవములో వీరిద్దరు రాధాకృష్ణ పాత్రలను ధరించి, భావప్రదర్శనము గావించి, ప్రజల మన్ననలకు పాత్రులైరి.

## • లీల •

శ్రీమతి వేమూరి జ్ఞానాంబగారు

'నాన్నగారూ, యివిగోనండి పత్రికా ఉత్తరమూను, పోష్టుబంట్రోతు యిచ్చాడు' అంటూ లీలవచ్చి విశాలరావుచేతికిచ్చింది వాటిని. విశాలరావు ముందు పత్రిక చించడం ప్రారంభించాడు. సరళ వంగి ఆయన చేతిలో ఉత్తరాన్ని పుచ్చుకొని తనలో తను చదువసాగింది. నాన్నగారు కూర్చున్న కుర్చీమీద చేయాన్చి ఉత్తరంలో ఉన్న విషయాలు తనుకూడా విందామని కాబోలు లీల నిలబడింది. విశాలాకాశాన్ని బారులుదీర్చి పరుగెత్తుతోన్న మేఘాలని తిలకిస్తోంది ఆమె.

లీలకు పదమూడుసంవత్సరాలు వయస్సయినప్పటికీ, చూచేవారికి పదహారుసంవత్సరాల నవయువతిలాగ కనపడుతుంది. ఆమెసౌందర్యం కవి కల్పనలతో తులతూగలేకపోయినా ఇట్టి రూపసులు వందలో ఒకరుగాని వుండరని చెప్పవచ్చును. లీల నల్లనిదే కాని ఆమెమొహంలోని ప్రసన్నతా, దీప్తులాలికే ఆమెకళ్లు సంధ్యా తారకల్లా ముద్దులొలుకుతున్నాయి. నాడు తలంటి నీళ్లుపోసుకుంది కాబోలు ముంగురులామె నుదిటిపై నాట్యమాడుతోన్నాయి. నల్లత్రాచులా జడ ఆమె పిరుదులు దిగి జీరాడులోంది. లీల సహజసుందరి.

విశాలరావు సరళవంక జూచి 'యేమిటా ఉత్తరంలో విశేషాలు' అన్నాడు.

'మన లీలను తనకొడుకు శ్యామలరావుకిచ్చేది లేనిది స్పష్టంగా తెలియజేయమని నా చిన్నతమ్ముడు వ్రాశాడు.'

'ఏం లీలా శ్యామలరావుని వివాహమాడ్డం నీకిష్టమేనా? నీ యిష్టంవొచ్చినవాణ్ణి పెళ్లాడతావనే యిన్నాళ్లు నీకు వివాహం చెయ్యకుండా జరుపుకొచ్చాను, ఏమంటావు?' అన్నాడు విశాలరావు ఆమెకురులు ఆదరంతో సవరిస్తూ.

లీలకు హృదయంలో చటాలున సిగ్గుదయించి దొంతర్లు దొంతర్లుగా ఆమె విశాలనేత్రాల్లోనుంచి పొంగి వచ్చింది. ఆకేగాని కామె కనురెప్ప లల్లాడిపోయాయి. చెక్కులు గులాబిరంగు దాల్చాయి. తలక్రిందికి వంగింది. ఆమె కంపితాధరంమీద చిరునవ్వు చిందులాడింది. ఆమెహృదయం తీవ్రంగా కొట్టుకోవడం ప్రారంభించింది. ఆమె ఏమీ మాట్లాడలేదు. 'నేను వీణపాడుకుంటూ వచ్చాను వెళ్లిపోవాలి' అని రివ్వున చావడిలో కెళ్లిపోయింది.

'వాడికేమి లోపముందనీ లీల అంగీకరించకపోవడానికి. లీలకేమి తెలును, చిన్నతనం. దూరాలోచన చేసి పనిచేయవలసినవాళ్లం మనం. కంటి కెవడయినా నీటుగోటుగా కనిపిస్తేసరి వాడిమీద వెళ్లి వాలతారు పిల్లలు చిన్నతనంలో' అంది సరళ.

'సరేకాని, చిన్నతనంనుండీ భయభక్తులు లేక ఆగతాయి తనంగా తిరిగి శ్యామలుడు చెడ్డవాడయ్యాడు. ఇక మోహనుడో సుగుణవంతుడు, మంచి...'

'చాల్లెండి యీ ఉపన్యాసం. ఎన్నాళ్లు చెప్పినా యింతేగా. మీ మాటలేమీ నాకు నచ్చవు. నా కంఠంలో ప్రాణమున్నంతవరకూ యీ సంబంధం నే నొప్పుకోను. ఒకవేళ మీరు స్వతంత్రించి చేసినా ఆ

సాడే గాదు తరువాతకూడా మీరు నన్ను చూడరు. ఏమవుతుందో అవుతుంది. అసలు లీల మనయిష్టం లేకుండా ఎవడినో ప్రేమించడం ఏమిటి? నేను వెడతానిక, వంటలక్క వచ్చినట్లుంది,' అని తీవ్రంగా చూస్తూ వరండా రెండోవైపుకు చరచరా నడిచిపోయింది సరళ.

విశాలరావు హృదయాన్ని యీ మాటలు కలతపెట్టాయి. అతని కేమిచెయ్యడానికీ తోచలేదు. చేతిలోఉన్న పత్రిక క్రిందపెట్టి పడక్కుర్చీలో ఓరగా జేరగిలబడి కళ్లు మూసుకొన్నాడు.

విశాలరావు విశాలహృదయుడు. ఆయన సంఘసంస్కారి. స్త్రీ స్వాతంత్రమంటే ఆయనకు మిక్కిలి యిష్టం. చదువుకున్న కుర్రాళ్లని అమితాదరంతో చూస్తాడు.

విశాలరావు తనచేతిగడియారం చూసేడు. నాలుగయింది. క్లబ్బుకెడదాం గదా అని కుర్చీలోనుంచి లేచి గుడ్డలు వేసుగుని, కూనరాగాలు తీస్తూ కూర్చున్న సాహేబుతో 'కారుతీసుకురా త్వరగా' అన్నాడు.

౨

మోహనుడి కిరవై యేళ్లులోపుగా ఉంటాయి. చామనచాయ, నూనూగుమీసాలు, అతనిముఖంలో వినయసౌశీల్యాలు ఉట్టిపడుతూ ఉంటాయి. అతని నేత్రాల్లో అతని హృదయమార్దవం విహరిస్తూ ఉంటుంది.

అతను బియ్యే జూనియరు ప్యాసయ్యాడు. అతనికిప్పుడు శలవులుగనుక యింటివద్దనే కాలము గడుపుతున్నాడు. మోహనునితండ్రి సామాన్య ఆస్తిపరుడైనప్పటికీ, విద్యంటే అభిలాషచేత మోహనరావు చదువు విషయంలో వెనుదీయకుండా డబ్బు పంపిస్తూ ఉంటాడు. మోహనుడు సహజంగా తెలివైనవాడు. ఇంతవరకూ ఏ క్లాసులోను డింకీ కొట్టకుండా గెంటుకొచ్చాడు. కాలేజీ విద్యార్థులవుండే తలతిరుగుడు అతనికెక్కడా లేదు.

విశాలారావింటికి సమీపములోనే మోహనుని యిల్లుంది. మోహనుడు తరచుగా వారింటికెడుతూ ఉంటాడు. విశాలరావు యీతని సద్గుణాలనుజూచి గౌరవదృష్టిలో చూస్తూఉంటాడు. చిన్నతనాన్నుంచి లీలా మోహనులిద్దరూ కలసిమెలసి ఒకింట్లో సంతతిలా తిరగడంచేత ఈ మధ్య వారి పరస్పరమైత్రి ప్రేమగా మారిపోయింది. ఇది విశాలరావు గ్రహించి మనస్సులో సంతోషించాడు. కాని సరళ కిదేమీ కిట్టిందికాదు. తాను లీలతో చిన్నతనంలోలా చనువుగా వుండడం సరళ కిష్టంలేకపోవడం గ్రహించి మోహనుడంతగా వారింటి కెళ్లడంలేదు.

'ఏమోయ్, మోహనరావు! వారమురోజులనుంచి యెక్కడా మా యింటికి రావడం మానేశావేని' విశాలరావు మోహనుని అనడంచేత ఆవేళ సాయంత్రం అతను విశాలరావింటి కెళ్లేడు. కాని విశాలరావు యింటివద్దలేదు. లీల పూలతోటలో ఉందని తెలిసికొని ఆమెను కలిసికోవడానికి వెళ్లాడు.

విశాలరావు గృహం ఊరుచివరఉండడంచేత తనింటికి చేర్చి చిన్నతోట నొకదాన్ని పెంచాడు. ఆ తోట మధ్య సిమెంటుతో చేసిన నుయ్యొకటుంది. దాని కిరుప్రక్కలా రాతితో కట్టిన బెంచీలు రెండున్నాయి. వీటిచుట్టూ పూలమొక్కలెప్పుడు కలకలలాడుతూ ఉంటాయి.

మోహనుడువెళ్లి ఓ బెంచీమీద కూర్చున్నాడు. లీల ఎక్కడా కనిపించలేదు. ఆమెతో ఆమెవివాహ విషయం మాట్లాడదామనుకున్నాడు. ఆవిషయమాతని హృదయంలోని ఊహాతరంగాలమీద చిన్ననావలా విహరించింది. సాయంత్రమయింది.

మోహనుడు వెళ్లిపోవాలని లేచాడు. ప్రక్కనే లీల గులాబిపువ్వు రేఖలు త్రెంపుతూ కనబడింది. ఆమె మునుపటిలా మోహనునిదగ్గరకొచ్చి మాట్లాడలేదు. మోహనుడు నెమ్మదిగా లీలదగ్గరకు వెళ్లి 'ఏం లీలా యిలా ఉన్నావు' అన్నాడు. ఆమె నిరుత్తరయ్యై ఒక్క దీర్ఘనిశ్వాసమాత్రం విడిచింది.

'ఏం లీలా జబాబు చెప్పవు' అన్నాడు మోహనుడు తనక్రాపు వెనక్కి సర్దుకుంటూ.

ఆమె రెండునిమిషాలవరకు మాట్లాడలేదు; డగ్గుత్తికతో 'ఏమీలేదు' అంది.

'నీ విచారహేతువేమి నాతో చెప్పకూడదా' అన్నాడు మోహనుడు.

'మా తల్లిదండ్రులు నన్ను శ్యామలరావు కిద్దామని నిశ్చయించుకొన్నారు' అంది లీల. భావోద్రేకము చేత ఆమె కంఠము రుద్ధమై పోయింది.

ఈ మాట వినేసరికి అతనిముఖంలో మార్పు కలిగింది. సూర్యరస్మిలో కలకలలాడే సరస్సుపై ఒకసారి మబ్బువేసినట్లయింది. 'మీ నాన్నగారుకూడా అంగీకరించారా' అన్నాడు అతను.

'మా నాన్నగారికి అంగీకారం లేదు కాని, మా తల్లిపట్టుచే ఒప్పుకోక తప్పిందికాదు.'

మోహనుని హృదయసీమలో అనేకభావాలు మెఱపులు మెఱసినట్లు మెఱసిపోయాయి. వాని చూపులు దీర్ఘాలోచనాన్ని సూచిస్తున్నాయి. 'అయితే యింత విచారమెందుకు? తల్లితండ్రులాజ్ఞ బిడ్డలు శిరసావహించుట ధర్మం గదా' అన్నాడు మోహనుడు.

'చిన్నతనాన్నుంచి ఆశించిన నీ ప్రేమ లభించనప్పుడు యిక నా జన్మ వృధా అని తోస్తోంది.'

'భార్యాభర్తల్లాగుంటేనేగాని ప్రేమించగూడదూ? నిన్ను సోదరిలా చూస్తాను. నన్ను నీవు సోదరుడులా చూడు. మన పవిత్రప్రేమ కడ్డేమిటి?' అతని విశాలనేత్రములు కొంచం చెమ్మగిల్లాయి.

'మోహనా, నిన్ను సోదరుడనుకోమంటావా? నిజమే. యీ మాటవల్ల నా హృదయభారం కొంత తగ్గినట్లుంది. మోహనా, నీవు నాకు సోదరుడవా? నా మనస్సు త్రిప్పుకోగలనా?'

'నీ మనస్సు మరలుచ్చుకొంటేనేగాని నీకు ముందు సౌఖ్యం ఉండదు. లేకపోతే చాలాపాపివికూడా అవుతావు.'

'మరి నీ వెవరిని వివాహమాడుతావు?' ఈ ప్రశ్న అడిగేటప్పటికి ఆమెహృదయం గుబగుబలాడింది. పాదాదిశిరఃపర్యంతమూ రక్తమంతా ఒక్కసారి ఉడికిపోయినట్లయింది. మోహనుడు సమాధానం చెప్పలేదు.

'చెప్పవూ ఎవర్ని పెళ్లాడేదీన్నీ' అని దీనంగా అంది లీల.

'ఏమో ఏమవుతుందో' అన్నాడు.

మోహనుని శరీరం నిలువెల్లా పులకరించిపోయింది. ఆమెను విడచి వేరొక స్త్రీతో కాలంగడపడం అసంభవం అనుకున్నాడు. ఈ ప్రపంచకంలో తాను చేయవలసిందింకేమీ లేదనుకున్నాడు. కొంతసేపటి కతని హృదయంలో ఏదో భావం జనించింది. అతనికళ్లు తేజోవంతములై ప్రకాశించాయి; 'అవును బాగుంది' అని అస్ఫుటంగా పైకన్నాడు.

వారిద్దరు రెండునిమిషాలు అలా నిలబడిపోయారు. ఒకరితోనొకరు ఏమీ మాట్లాడుకోలేదు.

విశాలాకాశాన్ని మేఘాలు మందగతిని విహరిస్తున్నాయి. అంతవరకూ వివిధ విహంగరావాలచే కల కలలాడుతూ ఉన్నతోట నిశ్శబ్దంగా ఉంది. గగనతలాన్ని ప్రకాశిస్తూఉన్న చంద్రుణ్ణి ఒకకారు మబ్బువచ్చి మింగేసింది. అంతకంతకు చాలా గాఢంగా కమ్ముకొచ్చాయిమేఘాలు. ఉరుములు మెరపులతో ఒకక్షణములో ప్రకృతి మహాభయంకరంగా మారిపోయింది. ప్రపంచం అంతా గాడాంధకారంతో నిండిపోయింది.

'మోహనా! యింటికి పోదామా. నిను అన్నలా ప్రేమించనా' అంటూ లీల అశ్రువులు జలజలా రాల్చింది. మోహనుడేమీ మాట్లాడలేకపోయాడు. ఇద్దరూ గృహోన్ముఖులై తక్షణం ఆ అంధకారంలో అదృశ్యులైపోయారు. ధారాపాతంగా వర్షం కురవడం ప్రారంభించింది.

3

లీల యింటికి వెళ్లి ఓచోట కూర్చుంది. తన విచారాన్ని తల్లిదండ్రులకు తెలియనీయకూడదని వాటికి దూరంగా ఉంటూ వచ్చింది. భోజనంవేళకు వంటింట్లోకెళ్లి రెండుమెతుకులుమాత్రం కొరికి తనమంచంమీద పరుంది.

ఆ వేళ ఏంభోంచేసిందో తానప్పుడెక్కడుందో ఆమెకేమీ తెలియదు. ఆమె తేజోవంతమైన దీప కాంతులలో మసలుతున్నా, అంధకారంలో తడుముకుంటూ నడుస్తూన్నట్టు ఆమెకు తోచింది. పరున్న అమెరికాదూది పరుపు కఠినశిలలా ఉంది ఆమెకు.

మోహనుని మరచిపోవాలని ఆమె ఎన్నోవిధాల ప్రయత్నించింది కాని వీలుకాలేదు. ఆమెకు మోహనుడు లేని ప్రపంచం స్మశానవాటికలా కనపడింది. ఆమెకేమి చెయ్యడానికీ తోచలేదు. ప్రపంచం అంతా గిర్రున తిరిగిపోతున్నట్టు కనబడింది ఆమెకు.

లీలకెక్కడ మనశ్శాంతిలేదు. ఎడతెగకుండా ప్రవహిస్తూన్న అశ్రుజలంచేత ఆమె ప్రక్కంతా తడిసి పోయింది. చిరకాలంనుంచి ఆమెహృదయఫలకంమీద చిత్రింపబడి హత్తుకొని పోయివున్న ఆ మోహనుని సుందరవదనాన్ని తన అశ్రుజలంచేత కడిగేద్దామని ఎంత ప్రయత్నించినా ఆమెకు సాధ్యంకాలేదు. ఒడ్డు తగిలి విరిగిపోయే సముద్రతరంగాల్లాగ ఆమె హృదయంలో వేనవేలు భావాలుదయించి తక్షణమే విరిగి పోతున్నాయి. ఆమెకు మతిపోయినట్లుంది. మోహనునిపై ప్రేమ ఒకవైపునా ప్రేమమహాత్వం తెలియని ఆమెతల్లి పట్టుదల ఒకవైపున లీల కోమలహృదయాన్ని నులిమివేయడం ప్రారంభించాయి.

లీల పడుతోన్న దుఃఖం చూడలేక కాబోలు ప్రకృతిదేవి రాత్రంతా యెడతెగకుండా భాష్పాలు రాలుస్తూనే ఉంది.

౪

అతని ఒళ్లంతా చెమట కారుతోంది. నిస్సత్తువచేత ఒక్కసారిగా ఆ బెడ్డలమీదే నడుం వాల్చాడు. కాని ఆ బాటసారి అంతలోనే చేరవనున్నగ్రామం చేరుకుందామని లేచాడు. నాలుగడుగులు వేసేటప్పటికి ఎవరో మూలిగినట్లు అతనిచెవినిబడింది. చరచరా ఆవైపుకు నడిచివెళ్లాడు. ఎక్కడా ఏమీ కనబడలేదు. అతను చుట్టుపట్లంతా కలదిరిగేడు. ఒకచెట్టుక్రింద ఏదో అతనికాలికి మెత్తగాతగిలింది. అతనిశరీరం పులకరించి పోయింది. పరీక్షించి చూసేడు. అది ఒక స్త్రీ.

'ఇలా పడివున్నావేం తల్లీ' అన్నాడు అతను. ఆమె ఏమీ మాట్లాడలేదు.

'నీదుఃఖంచూచి భరించలేకుండా ఉన్నాను. చెప్పమ్మా.'

'నాయనా నన్నిట్లు పడిఉండనీ. ఇది నానొసటివ్రాత' అంది.

'అలా అనకుతల్లీ మనుష్యప్రయత్నానికికూడా కొంత తావుంది.'

'నాకష్టకారణాలన్నీ నీతో చెప్పి వాట్ని జ్ఞాపకంచేసుకోవడంవల్ల మరింతదుఃఖం తెచ్చిపెట్టుకోవడమే గాని యేం ఫలముంది? నాకష్టాలు దాటరానివి. నాయనా నీవు నీదారిని వెళ్లు' అంది ఆమె.

'నిరాశజెందకు. నాకు సాధ్యమైనంతవరకు నీకష్టాలు తొలగించడానికి ప్రయత్నిస్తాను. చివరకు నీమేలునుగురించి నాప్రాణాలనయినా విడిచేస్తాను.' అన్నాడు అతను.

'ఏమినాయనా అంత దృఢనిశ్చయంతో పలుకుతావు. నీవు నాపాలిటి దేవదూతవుకావు కదా.'

'కాదు. నేను సామాన్యమానవుణ్ణే. విపత్తులోఉండేజీవులను రక్షించడం మానవధర్మంగదా. చెప్పు తల్లీ. కష్టసుఖాలు కావడికుండలు.'

'నాభర్త చాలాఆస్తిపరుడు. నేను కాపురానికివచ్చిన మరుసంవత్సరంలోనే నేను గృహలక్ష్మి నయ్యానని యీర్ష్యచేకాబోలు ధనలక్ష్మి వారిని పూర్తిగా వీడిపోయింది. కాసుగవ్వగా ఖర్చుపెట్టి, అతి దర్జాగా బ్రతికినవారు బీదరికంలో ఉండలేక, ఎప్పుడో ఆత్మహత్యచేసుకొంటానని అంటూవచ్చారు. చివరకు మాప్రక్కయింటిలోఉన్న ఓవితంతువును తీసుకొని ఎక్కడికో లేచిపోయారు. ఇప్పటికి నాలుగేళ్లయింది. వారిజాడా తెన్ను ఎవరికీ తెలియదు. తండ్రీ, యిప్పుడు నాకు నిలువనీడైనా లేదు. పరాయివారియింట్లో ఉంటున్నాను. క్షయ నన్ను పీల్చిపిప్పిజేసేస్తోంది. ఈదుర్భరజీవిత మెందుకని విరాగినై మతిలేక యిలా పోతూ ఓపికలేక యిక్కడ పడిపోయాను. ఎక్కడికెడదామని బయలుదేరానో నాకే తెలియదు.' అని ఆమె వెక్కివెక్కి ఏడువనారంభించింది.

'తల్లీ నీవు పుట్టింటికేల వెళ్లగూడదు?'

'నాయనా, నానిర్భాగ్య మిల్లాఉంటే, పుట్టిల్లుమాత్రము ఎందుకు బాగుంటుంది? భగవంతుడు నన్ను కష్టాలనుభవించమన్నాడు. అనుభవించక తప్పదు. నాకు పెళ్లయినకొద్దినెలల్లోనే కలరావచ్చి మాతల్లితండ్రు లిద్దర్నీ తన పొట్టబెట్టుకొంది. వారు చనిపోయాక అప్పులవాళ్లు లెక్కచూసుకుంటే, మాతండ్రిగారుచేసిన ఋణం ఆస్తిని మించిపోయింది. నాగతి యిలాఅయింది. నేనిక యీప్రపంచంలో ఉండిన్నీ నిరర్థకం' అని ఆమెహృదయాంతరాళం బీటలువారేట్టు ఒకదీర్ఘ నిశ్వాసం విడిచింది.

ఇంతలో ఒకముసలమ్మ లాంతరుపట్టుకొని ఆచెట్టుక్రిందకొచ్చి అక్కడున్నస్త్రీనిచూచి 'నాతల్లి, నాయమ్మా, యిక్కడున్నావా అమ్మా, నీకేం లోటమ్మా యిలావచ్చావు. నేను బ్రతికుండగా నీకేంలోటు?' అంటూ గబగబావెళ్లి కౌగలించుకుంది.

ఆలాంతరువెలుతురు ఆదుఃఖితయగు స్త్రీముఖంమీద పడేసరికి ప్రయాణీకుని అనుమానం తీరిపోయింది. తక్షణం—లీలా—అని గద్గదస్వరంతో అన్నాడు. ఇంకా ఏమేమో అనబోయాడు. కాని భావోద్రేకంచేత అతను మాట్లాడలేకపోయాడు.

కళ్లు తుడుచుకుంటూ లీల ఆశ్చర్యంతో ఆప్రయాణీకునివంక చూచింది. అతనిశిరమున జడలు, మేన కాషాయవస్త్రం, చంకని ఒకసంచి ఉన్నాయి. అతనికి ఒకప్రక్కన కమండలం వుంది. 'ఏం మోహనా! సాధువైపోయావా?' అంది లీల.

ఇరువురూ ఒకరినొకరుచూస్తూ అలా స్థంభించిపోయారు. చిన్నతనాన్ని తాముగడపిన సుఖజీవనాలు అప్పటి అన్యోన్యప్రేమ, పూలతోటయందలి కలయిక—అన్నీ వారి స్మృతిపటలాలమీద ఒక్కసారి గోచరించాయి. కొంచంసేపు అక్కడ గంభీరం, నిశ్శబ్దం నిలచింది.

ఆముసలమ్మ లీల శిరోజాలను సవరిస్తూ 'లీలా నేనంటే నీకు దయలేదూ. నాయాస్తి ఒకటీ నీయాస్తి ఒకటీనా? నీమామగారు ఆయనతండ్రీ పెంచినశరీరమేగా యిది. వారు పోయినంతమాత్రాన వారిఋణం తీరిపోయిందా? నేను నీదాన్ని. నాదంతా నీది. రాఅమ్మా యింటికెడదాము' అంది. లీల ఏమీ మాట్లాడ లేదు.

ఈముసలమ్మ యీమెసంతతీ లీల మామగారికుటుంబాన్ని పూర్వంనుంచీ సేవిస్తూవచ్చారు. ఐశ్వర్యం పీడిపోయిందిగదా అని ఈఅవ్వ వారిని విడువలేదు. ఈమె చాలా కృతజ్ఞురాలు. లీల సుగుణసంపత్తినిచూచి ఆమెను తనబిడ్డలా చూస్తోంది. లీల యీమధ్య క్షయతో బాధపడుతోండడంచేత తనకొడుకులు లేనిచ్చే మనోవర్తివల్లనే లీలనుకూడా పోషిస్తోంది. ఈమెమీద ఆధారపడిఉండడం లీలకేమీ మనస్కరించలేదు.

'మోహనా నన్నీ దుఃఖసాగరం దాటిస్తూ. ఆయన్ని ఎలాఅయినా ఒక్కసారి నాకళ్లకుచూపి నన్ను ధన్యురాలిని చెయ్యి' అంది లీల.

'దానికేమి. అతడెక్కడున్నా ఒక్కనెలలో తీసుకొస్తాను. అవ్వా అతనిజాడ ఏమయినా ఎరుగుదువా?' అన్నాడు అతను.

ఆముసలమ్మ 'ఇంటికిచేరక యింటివాళ్లనడిగి ఏసంగతీ చెపుతానుగాని, సాధుబాబా యింటికెడదాం. లే, లే తల్లీ' అని లీలను చెయ్యట్టుకొని లేవదీసింది. వారు గృహోన్ముఖులయ్యారు. కమండలాన్ని చేతబట్టుకొని సాధువుకూడా వారివెనుకనే వెడుతున్నాడు.

౫

దినాలు వారాలయ్యాయి. వారాలు నెలలయ్యాయి. శ్యామలరావుజాడ యింకా ఏమీ తెలియలేదు. ఆసాధువుపెట్టిన గడువు దాటిపోయింది. ఆమెకిప్పుడు మంచంమీదనుంచి లేచేందుకుకూడా శక్తిలేదు. ఆమె ప్రాణాలు శల్యావశిష్టమై ఉన్నాయి. శ్యామలుడు యింకా వస్తాడనే ఆశాజ్యోతి ఆమెహృదయంలో వెలుగులోండబట్టి లీలప్రాణాలు యింతవరకూ నిలచివున్నాయి.

సూర్యాస్తమయం అయింది. శ్యామలుడువచ్చి గుమ్మందగ్గర నిలబడ్డాడు. అతనికి లీలను సమీపించడానికి ధైర్యంచాలిందికాదు. సిగ్గుచే అతడధోముఖుడై పోయాడు.

అవ్వ అతన్నిచూచి లీలదగ్గరకు తీసికెళ్లింది. లీలలేచి అతనిపాదాలకు నమస్కరిద్దామని అనుకుంది. కాని ఆమెకళ్లతోటే అతనికి నమస్కారంచేసింది. శ్యామలుడు మోకాళ్లమీదవంగి ఆమెచేతులుపట్టుకొని అశ్రుపూరితనేత్రాలతో క్షమించమని ఆమెను ప్రార్థించాడు. లీల అతన్ని పలుకరించాలని అనుకుంది. పాపము

నోరు తిరుగలేదు. ఆమె కన్నీరుమాత్రం విడుస్తోంది. లీలముఖం ఆమె ప్రక్కమీదపరచిన దుప్పటికంటే కూడా తెల్లబడిపోయింది. భయంకరమైన దగ్గువల్ల ఆమెకీళ్లన్నీ కదలిపోయాయి.

'శ్యామలా, యిప్పటికొచ్చావా ? ఈపతివ్రత నిట్టికష్టాలుపాలు జేసావుగదా. ఆసాధు వేడీ?' అని అడిగింది అవ్వ శ్యామలుడిని.

'అవ్వా నేనిదివరకే చచ్చిపోయున్నాను. చచ్చినవాడ్ని యింకాచంపకు. సర్వవిషయాలు ఆసాధువు వల్ల విన్నాను. ఒక్కసారి పవిత్రచరిత్ర లీలనుదర్శించి ఆమెకాళ్లమీదపడి ప్రాణాలు విడిచేద్దామని వచ్చాను. నేను పాపిని. నేజేసిన ఘోరకృత్యాలు చెప్పడానికి నోరాడడంలేదు. అవ్వా యేమనిచెప్పను. నేను త్రాగి మత్తెక్కి స్పృహతప్పియున్నసమయంలో నాశత్రువును చాకుతోపొడిచి చంపపోతున్నాను. ఆసమయంలో ఎక్కడనుంచో ఆసాధువువచ్చి అడ్డుకున్నాడు. అయ్యో నేను ఘాతుకమృగాన్ని, మనుష్యుడనుగాను. విధి వశాన్ని ఆచాకుపోటు సాధువుకుతగిలింది. ఆచాకు చిన్నదైనప్పటికీ, దానికి విషం పూసిఉండడంవల్ల అతడు అక్కడే ఒక్కఅరఘడియలో ప్రాణాలు విడిచేసాడు. ఆసమయంలో నన్ను యింటికివెళ్లమని బోధించాడు. అవ్వా, నన్ను కోపదృష్టులతో చూడకు. నేను మునుపు శ్యామలుడనుగాను. ఇదిగో ఈచాకుపుచ్చుకొని నన్ను పొడిచై. అయ్యో! నేను పాపిని, బ్రహ్మహంతకుడను'అని శ్యామలుడు పశ్చాత్తాపానలంలో దగ్ధమైపోతు న్నాడు. అవ్వ మారు పలుకలేకపోయింది.

శ్యామలుడు లీలను అతిదీనంగా చూస్తున్నాడు. ఆమెముఖంమీద మృత్యుదేవత తాండవమాడుతోంది. లీల శ్యామలునికళ్లల్లో కళ్లెట్టిచూసింది. అతనిముఖాన్ని తనముఖానికిచేర్చమని సంజ్ఞచేసింది. అతడలాగే చేసాడు. లీల చూపులతోటే వానివద్ద శలవుపుచ్చుకొని రెండుకన్నీటిచుక్కలతోపాటు ప్రాణాలనుకూడా విడిచేసింది.

శ్యామలుడు కొయ్యబారిపోయాడు. ప్రపంచంఅంతా శూన్యంగా కనబడింది. మతిపోయినట్లుంది. 'దేవా నన్నిట్టిపాపినిగా సృష్టించావా ? సర్వజీవాలకీ, మేలుచేయడమే జీవితోద్దేశ్యంగా పెట్టుకొన్న ఆ సాధువు నాచేతనేగదా మరణించినది. భూలోకపతివ్రత నాభార్యచావుకు నేనేకదా ముఖ్యకారకుణ్ణి. ఇట్టి నరపిశాచాల్ని ప్రపంచకంలో యెందుకు సృష్టిస్తావు ? తండ్రీ! ఇక నాకీప్రపంచంలో ఏముంది, భార్యా ? బంధువులా ? మిత్రులా ? లీలా! యిదిగో నేనూ వస్తున్నాను. నీపాదసేవ జేస్తాను వచ్చి' అని మొలలోని విషంపూసిన చాకుతీసుకొని కంఠంలో పొడుచుకున్నాడు. ప్రపంచంఅంతా గాడాంధకారంతో నిండి పోయింది..........



# స్త్రీ కర్తవ్యము

శ్రీమతి గుమ్మళ్ల అహల్యగారు

సౌఖ్యప్రదమైన సంసారజీవనమును, ఉజ్వలమైన సాంఘికాభ్యుదయమును, తద్వారా దేశ సౌభాగ్యమును నిర్మించవలెననిన పురుషులలోని వివేకమును స్త్రీలలోని ఆనందమార్దవములును సమ్మిళితము కావలెను. విద్యాధికులైన స్త్రీలు, పాశ్చాత్యానుకరణముల నంతరింపజేసి, స్త్రీలోకమునందు స్వత్వబోధమును చేయవలయును.

○

నేడు స్త్రీలు తమ విద్యుక్తధర్మములను పూర్తిగ విడనాడి పాశ్చాత్యనాగరకతా వ్యామోహితులై దేశమునకు తీరనిహాని కలుగజేయుచున్నారు. గృహపాలనమునగల సహజశక్తిని విడనాడి, గ్రుడ్డిగా పాశ్చాత్యప్రకృతిని జేపట్టుట అవినీతికరము. స్త్రీలు ఆంగ్లవిద్యాధికుల దృష్టాంతరములజూచి అనుకరింపవలయునని ప్రయత్నముచేయుటయే తప్ప యందలి మంచిచెడ్డల నాలోచింపకుండుట విచారకరము.

తాను గ్రహించినవిద్య గృహస్థుడైన మానవుడు ఆచరణరూపమునబెట్టి, సన్మార్గమున క్రమక్రమమున ముక్తిబడయగలడు. ఆగృహస్థధర్మమునకు ప్రధానమైనది స్త్రీ. ఆమెయే పురుషునకుతోడై నిరతము మోక్షమార్గమున ప్రయాణముచేయుటకు శక్తి నొసగును. ఇట్లు స్త్రీపురుషులిరువురు భేదభావములెఱుగక కలసిసంచరించు జీవయాత్రయేసంసారమున కన్పించునో ఆసంసారమే జ్ఞానమును బడయుటకు అర్హమైనదని చెప్ప వచ్చును. ఇట్లు జ్ఞానమార్గమునకుతోడ్పడు స్త్రీని మూర్ఖురాలుగ చేయుటకు మానవుడు ప్రయత్నించునేని అతడు తనశక్తిని తానే యణచుకొనువాడగును. ఆనందము, అనురాగము, లాలిత్యము, మార్దవము అను సద్గుణములకుప్రాపు స్త్రీ.

పురుషుడు వివేకజ్ఞానముకలవాడు. ఇట్టి వివేకమునకును ఆనందాదులకు గల సహచర్యముచే స్త్రీ పురుషులిరువురు తమతమ విద్యుక్తధర్మములను నెఱవేర్ప శక్తివంతులగుదురు. కావున స్త్రీ విజ్ఞానకుశలయైనచో మానవధర్మము చక్కగా నడచును. ప్రస్తుతకాలమున భారతీయులందుగల ఆర్థిక, రాజకీయ, సాంఘికములగు కలవరములు తగ్గించి సరియైనమార్గమున సుఖజీవనమేర్పడుటకు తగుప్రయత్నములు స్త్రీలు చేయవలెను. మానవునకు సుఖదుఃఖములందుతోడై కుటుంబమును సుఖమార్గమున నడపునది స్త్రీ. పూర్వము మన దేశమందలి స్త్రీలు కార్యదీక్షగల్గి యిచ్ఛాజ్ఞానశక్తులలో త్యాగ తితీక్షల నవలంభించి అధర్మము నెన్నడు చేరనీక తమకుటుంబమునకు, లోకమునకు తమ చారిత్రముల వన్నె తెచ్చిరి. వారిననుసరించి తమజీవితములను పవిత్రములను చేసికొనుస్త్రీలే

నేటిభారతభూమికి అలంకారము లగుదురుగాని, సత్యమునకు దూరమైనట్టి కళావిహీన మగు పాశ్చాత్యస్త్రీ ప్రవర్తనావిధానములను, వేషాచారములను గ్రహించి ప్రకృతిసిద్ధమైన స్త్రీపురుషభేదము పాటింపక పురుషులవలె తాముండవలెననెడి కోరికతో ప్రవర్తించుట తగనిది.

స్త్రీలు విద్యావతులు కాదగినదే. విద్యావతియైన తల్లియే తనసంతతిని జ్ఞానవంత ముగ చేయు సామర్థ్యముఁ కలది కాగలదు. సంసారమున కష్టసుఖములకన్నింటికిని చేదోడు వాదోడై పురుషులలో సమానముగ స్త్రీలును సంచరింపదగినదే. పురుషునకు స్త్రీ యెల్ల వేళల దాసివలె మెలంగవలెననుట పొరబాటు. స్త్రీపురుషుల దాస్యస్వాతంత్ర్యము లన్యో న్యానురాగముపై నాధారపడియున్నవి. ఈవిషయమును గ్రహించి స్త్రీపురుషులిరువురు తమకు తగినస్వాతంత్ర్యమును, విద్యను, ఆహారవిహార వేషభాషలను అవలంభించి నచో మనదేశ మచిరకాలముననే పురోభివృద్ధికి రాగలదు. దీనినే ప్రజ్ఞాశాలురగు టాఁకూరు మొదలగు మహనీయులు తెలిపిరి.

భారతీయనాగరకతయే స్త్రీ లభ్యసింపవలసినది, కాని పాశ్చాత్యనాగరికత కాదు. గృహధర్మములను విసర్జించి, గృహిణీత్వము నేలపాలుచేయక తమకర్తవ్యమును నెరవేర్చు టకు నేటి నారీమణులు పూనుకొనవలెను. ఇందులకు మాతృభాష నారాధించుచు ప్రతీచీ నాగరికతయందు మానవాభ్యుదయమునకు దోడ్పడునంశములను గ్రహింపవలెను. లోక సేవకువలయు క్షమకలిగి గృహలక్ష్మియై తనప్రకృతికి విరుద్ధముకాని యాచరణమున మెలగుటయే స్త్రీకి ప్రధానమగుధర్మము. ఆధర్మము ననుసరించిననాడే వారు దేశాభ్యుద యమునకు తోడ్పడినవారగుదురు. ఈధర్మముల ననుసరించుటకు విద్యాధికులగు మహిళలు స్త్రీలలో సత్ప్రబోధము కావింపవలెను.

# నూతనసంవత్సర ప్రశంస

భ్రమరహితము సిరిపరువము అమలచిరాయుఃప్రదము ప్రమాదికమును, అ
శ్రమమును మా మన్నన కూరిమి, మాకును మీకు కేసరీ, గృహలక్ష్మీ!
చేబూనిన పనులను తమి కాంబోలును విజయఫలము కాఁగలవారిక్
మా బోటుల దీవనపై రాఁబడియగుతక్ సుఖము నిరంతరమగుతక్.
కవులకు లేమితొలఁగి, వాచవుల కనాదరణ తొలఁగి, సమయోచితమై
భవములకు నతిఁగలిగి, 'యవునవు'నన మా చదువు సఫలమగుత ప్రమాదిక్.

—శ్రీ కృత్తివెంటి వెంకటసుబ్బారావు, ఎం. ఎ.

ఏకాంకిక

# పూర్వ క్షత్రియవీరాంగనల శౌర్యసాహసములు

## శ్రీమతి వత్సవాయి మంగమాంబగారు

: ఇందు వచ్చుపాత్రలు :

విక్రమాదిత్యుడు: సంగ్రామసింహుని కుమారుడు, మేవాడుదేశమునకు రాజు. జవాహరభాయీ: స్వర్గీయ మహారాణా సంగ్రామసింహుని మొదటిభార్య. కర్మవతి: స్వర్గీయ మహారాణా సంగ్రామసింహుని రెండవభార్య. చారిణి: మేవాడ్ దేశ గౌరవగీతము లను పాడుస్త్రీ. బాఘ్‌సింహుడు: మహారాణా విక్రమాదిత్యుని పెదతండ్రి. బహాదుర్ శాహ: గుజరాత్ సుల్తాన్.

—: మొదటిరంగము :—

స్థానము:_కర్మవతి భవనము.

(కర్మవతి ఒంటరిగ విచారమగ్నయై నిలువబడియుండి ఆకాశమువంకచూచుచు చేతులు జోడించు కొని) హా! ప్రాణేశ్వరా! మీరు నాకొరకై నిరీక్షించుచున్నారా! మీరు ఏదేశముకొరకు బహుకష్టముల కోర్చి తమప్రాణములను అర్పించిరో అట్టిదేశముయొక్క గౌరవమునిలుపుటకును, గృహకలహములనుండియు శత్రువులబారినుండియు రక్షించుటకొరకును ఇంకను జీవించియున్నాను. ఏమి? ఆకాశమంతయు రక్తమువలె ఎఱ్ఱబారియున్నది. మేవాడుదేశముయొక్క భాగ్యాకాశముకూడ రక్తతృష్ణకు బలియగునా? మేవాడ్! ఇప్పుడు నిన్ను రక్షించుటకొరకు ఏవీరులు మిగిలియుండిరి?

(సామంతులతోకూడ బాఘ్‌సింహుడు ప్రవేశించును)

వదినగారూ! (శిరమువాల్చి విచారించుచుండును)

కర్మవతి

ఆ! అంత కంగారుపడుటకు ఏమిజరిగెను?

బాఘ్‌సింహుడు

ఏమి తెల్పుదును? సొరంగముత్రవ్వి శత్రువులు కోటగోడను తుపాకీమందుచే భేదించిరి. గోడపడుటకు విచారించుటలేదు కాని...(ఆగిపోవును)

కర్మవతి

ఏలఆగెదవు? తెల్పుము! క్షత్రియవీరులు భయంకరాస్పదమైనమాటలు తెల్పునప్పుడు కంఠావరోధ మ్కులు కాకూడదు. క్షత్రియులహృదయము పుష్పములకన్న కోమలముగను, వజ్రములకన్న కఠోరములుగను

ఉండునన్నమాట మరచితివా! వారు అన్నియు వినగలుగుచున్నారు, సహించుకొనగలుగుచున్నారు. ఏమాటల వల్ల మీరు ఇంత వ్యధితులగుచున్నారో తెల్పుడు.

బాఘ్‌సింహుడు

ఏవైపుగోడ పడిపోయినదో ఆభాగము మీసోదరుడు తనవీరులతో రక్షించుచుండెను. వానియొక్క వీరత్వము, సాహసము శత్రువులకోరికను విఫలముచేసెను. అట్టివీరుడు..........(తిరిగి ఏడ్చుచుండును)

కర్మవతి

అర్జునా! ధన్యుడవుకమ్ము. నీవు నారక్షాసూత్రముయొక్క ఋణవిముక్తుడవైతివి. బాఘ్‌సింహాజీ! మీరు కన్నీరువిడచుచున్నారా! క్షత్రియసోదరులహృదయము మండుచున్న మరుభూమితోసమానముగా జలహీనములు కావలెను. భగభగమండు నిప్పువలె నుండవలెను. వారికండ్లు మరుభూమియొక్క ఆకాశముతో సమానముగా మేఘహీనములై యుండవలెను. అర్జునా! నీవుకూడ గతించితివా! నీవు హాడావంశముయొక్క గౌరవమునకు ఉచ్ఛశిఖరమును పొందింపచేయుము. బాఘ్‌సింహాజీ!

బాఘ్‌సింహుడు

భాభీ! మీకండ్లయందు అస్రుధారలు లేకపోవుటచే నాకు భయమగుచున్నది.

కర్మవతి

ఏడ్చిఏడ్చి జీవనమును అస్రుధారలయందు ముంచుటచే ఏమియు లాభములేదు. అన్నివిపత్తులను సంతోషముతో అనుభవించుట మంచిది. మనస్సుమీద పర్వతమునుంచి నవ్వుటయే క్షాత్రాణీయులయొక్క ముఖ్యధర్మమై యున్నది. నాస్వామిమృత్యు సమాచారముకూడ ఆనందములో వినియుంటిని. ఇప్పుడుకూడ మనము మేవాడుదేశముయొక్క ఋణవిముక్తులము కాలేదు. స్వర్గతుల్యమైన మేవాడుదేశమును మనకు వప్పగించి భగవంతుడు తనకర్తవ్యము నెరవేర్చుకొనెను. దానిని రక్షించుట మన సాహసకార్యమైయున్నది. అర్జునుడు కేవలము నారక్షాసూత్రముయొక్క ఋణమునే తీర్చికొనియుండెను. కాని మనము మనదేశఋణము నుండి విముక్తులము కావలెను.

ఒక సామంతుడు

తల్లీ! మాప్రాణములను దేశముకొరకు బలిదానముచేయుటకు ఏమియు శంకించుటలేదు. కాని ఇప్పుడు దుర్గరక్షణము అసాధ్యము.

రెండవ సామంతుడు

దుర్గముయొక్క ఏభాగము ధ్వంసమయ్యెనో ఆభాగమునుండి శత్రుసేన ప్రవేశించుచున్నారు. మిడుతల దండువంటి యూరోపియనులు శత్రుసేనలకుతోడై తమ మందుగుండుసామానుతో ముందుకువచ్చుచున్నారు. కోటలో ప్రవేశించినతర్వాత రక్షణము దుర్ఘటము.

(సైనిక వేషములో జవాహరభాయి చారిణితోకూడ ప్రవేశించి)
దుర్గముయొక్కరక్షణము స్వయముగా దుర్గయే చేసికొనును.

కర్మవతి

నీవు సాక్షాత్ దుర్గవలెనే ఉన్నావు.

బాఘసింహుడు

నీపాదధూళి ధరింపగోరుచున్నాను.

జవాహరభాయి

దుర్గ రక్షణము కాదని ఎవరు చెప్పుచున్నారు? కోటగోడ ధ్వంసమైన ధ్వంసమైపోవుగాక! మేవాడు దేశముయొక్క ప్రతివీరాంగనయు ఒక్కొక్క అభేద్యపుగోడ! ఎప్పటివరకు మా చేతులలో ఖడ్గముగలదో, దేహమునందు ప్రాణముఉండునో అప్పటివరకు శత్రువులయొక్క ఒక పక్షికూడ చిత్తూరుకోటలోనికి రాసాహసించలేదు. యూరోపియనుల మందుగుండు సామాననగా ఎంత?

బాఘసింహుడు

వదినగారూ, నేడు మిమ్ము వదినగారు అనుటకుకూడ సిగ్గుపడుచున్నాను. నీవు సాక్షాత్ కరాళదేవివి, భైరవివి, నిర్జీవమైన పాషాణశరీరమువదలి మందిరమునుండి వెలికి లంఘింపుము. నీఖడ్గము సాక్షాత్ భైరవిఖడ్గమువలె కన్పట్టుచున్నది.

జవాహరభాయి

నిశ్చయము. ఇది భైరవియొక్క చిహ్నమే. నేడు దీనిదాహము తీర్చవలయును. చారిణీ! ఒకశక్తి గీతము పాడుము.

(పాడుచు పాడుచు అందరు నిష్క్రమింతురు)

—: రెండవరంగము :—

ధ్వంసమయిన చిత్తూరుదుర్గమునకు కొంచెముదూరములో బహాదుర్‌శాహ సైనికవేషమునందు తిరుగుచుండును. ముల్లూఖాన్, పోర్చుగీసు సైన్యాధ్యక్షుడు ప్రవేశింతురు.

బహాదుర్‌శాహ

సుబేదార్! ఇంకను మనసైన్యము కోటలోనికి ప్రవేశింపలేదా!

ముల్లూఖాన్

బాదశాహ సలామత్! ఒకగోడ ధ్వంసము కాగానే దానికన్న బలిష్ఠమైన రెండవగోడ తయారైనది.

బహాదర్‌శాహ

ఇంత త్వరలోనే రెండవగోడ తయారుకాబడినదా ఏమి? మీరు బొమ్మలవలె నిలువబడి చూచుచుండిరా?

పోర్చుగీసు గవర్నరు

మహాశయా, లేదండీ! అది రాతిగోడకాదు. కదలుచు, విద్యుచ్ఛక్తివలె ప్రకాశించుచు, నిప్పువలె మండుచుండుగోడ.



కాకినాడ మహిళా విశ్రాంతి సమాజపు 26-వ వార్షికోత్సవము సందర్భమున తీయబడిన ఛాయా చిత్రము. మాలాలంకృతురాలు, సమాజాధ్యక్షురాలైన శ్రీమతి జానకి గణపతి అయ్యరుగారు, ప్రక్కన గౌరవ కార్యదర్శి శ్రీమతి వేమగంటి పాపాయమ్మగారు, సభ్యురాండ్రు, బాలికలు గలరు.



అనంతపురం శ్రీ భారతమహిళా సమాజమువారి వార్షికోత్సవ సందర్భమున తీయబడిన ఛాయాచిత్రము. శ్రీమతి జగదాంబాళ్ గారు అధ్యక్షత వహించిరి.

ముల్లాఖాన్

స్వయముగా రాజమాతఅయిన జవాహరాభాయి ఈ ధ్వంసము కాబడిన భాగమును రక్షణచేయు చున్నది. ఎవడు ముందుకు పోవసాహసించునో వానిని నరకమునకు పంపుచున్నది.

పోర్చుగీసు గవర్నరు

ఎంతటి సుందరదృశ్యము ! రెండుహస్తముల రెండుకత్తులనుధరించి మనసైన్యముపైకి ఉరికెను. యుద్ధమూని ఆదృశ్యమునుచూడ మొదలుపెట్టితిని. మనస్సు ఆమెపాదములకు నమస్కరింపకోరినది.

ముల్లాఖాన్

ఆమెఖడ్గము మృత్యుసమాచారము తెల్పునట్లున్నది. ఆమెయుద్ధముచూచి రాజపుత్రసైన్యమునకు పిచ్చి ఎత్తినది. రక్తశిక్తమైయున్న ఖడ్గముతో ఆమె సాక్షాత్ శక్తిస్వరూపిణియైన దేవియే. ఆమె నిప్పులాలుకు చున్న కండ్లనుచూచి మనసేనలు ఆశ్చర్యపడినవి.

పోర్చుగీసు గవర్నరు

ఎప్పుడు ఆమె నల్లనిమేఘములవంటి జుట్టు గాలియందుఎగురుచున్నదో, విద్యుచ్ఛక్తివలె ఖడ్గము త్రిప్పుచున్నదో అప్పుడు మనసేన యోగనిద్రపొంద నారంభించినది.

బహాదర్‌శాహ

వింతగానున్నది ! నడువుడు, నేనే స్వయముగావచ్చెదను. (నిష్క్రమింతురు)

—: మూడవ రంగము :—

స్థానము-చిత్తూరు దుర్గముయొక్క లోపలిభాగము సమయము-ప్రాతఃకాలము. కర్మవతి ఇతరరాజపుత్రరమణులతో శృంగారించుకొని నిలువబడియుండును.

కర్మవతి

అగ్నిపుత్రికలారా ! మీరు తల్లిఒడిలో కూర్చుండుటకు కొంచెముకూడ వెనుతీయరని నమ్ముచున్నాను. వీరాంగనలారా ! మీరు మృత్యుదేవతను ఆలింగనముచేసికొనుటకు నిశ్చయించుకొనియున్నారా ? మీరు పరమానందముతో మీప్రాణములను అర్పించుటకొరకు తయారుగానుండుడు. ఎవరికి ప్రాణముమీద వాంఛ గలదో, సంసారసుఖదుఃఖములందు కోరికగలదో, మేవాడుదేశము పరహస్తగతమైయున్నప్పుడు చూచుటకు ఎవరికి సిగ్గులేదో వారు ఇప్పుడుకూడ వెడలిపోవచ్చునని హెచ్చరించుచున్నాను.

ఒక వీరాంగన

తల్లీ ! లేదు. అది ఎట్లు కాగలుగును? మాభర్తలు, పుత్రులు, బంధువులు అందరు జననభూమిని రక్షించుటకొరకు తమతమప్రాణములను త్యజించిరి. మామరణసమాచారమువిని, జీవించియున్న మిగిలినవారు కూడ వారిప్రాణములను దేశముకొరకు అర్పించుటకొరకు కోరుచున్నారు. మేము పరమానందముతో అగ్ని జ్వాలలయందుప్రవేశించి మాప్రాణములను అర్పించెదము.

కర్మవతి

ధన్యులగుదురుగాక! నేడు మనజీవితములయొక్క గొప్పపండుగ. మనము అగ్నియందు జన్మించితిమి, తిరిగి అగ్నియందే కలిసిపోవుచున్నాము. మన సౌభాగ్యమువల్లనే ఇటువంటి మృత్యువు సంప్రాప్తమైనది. స్వర్గమార్గము నవలంభించిపోవు ఓ సుందరీమణులారా! మేవాడుదేశముకొరకు ప్రథమ జౌహరునందు అగ్ని ప్రవేశముచేసిన వీరాంగనలతోకూడ పద్మిని మనరాకకై ఎదురుచూచుచున్నది.

ఆహా! నేటిప్రాతఃకాలము ఎంత సుందరముగానున్నది. ఎప్పుడైన ఆకాశమింత ఎఱ్ఱబారియుండెనా? మేవాడుతల్లియొక్క నుదుటమీద నేడు సౌభాగ్యఅమరసింధూరము నుంచి మనము వెళ్లుదము. సోదరీ రత్నములారా! సిద్ధముకండు.

రెండవ వీరాంగన

తల్లీ! మేము సిద్ధముగానేయున్నాము. నీదర్శనముమాత్రముచేతనే మేము ఉన్మత్తులమగుచున్నాము. క్షాత్రాణీయులకు ఇది సుందరమయిన మృత్యువు. అన్నిటికన్న గొప్పపదవి

కర్మవతి

ప్రియమైన సోదరీమణులారా! మనవీరులు రాజబలి ఇచ్చుటకొరకు వెళ్లకముందే మనప్రాణములను జౌహరుజ్వాలకు సమర్పించిన, వారు కుటుంబమోహమువిడిచి, మృత్యుభయముత్యజించి, పిచ్చివారలై యుద్ధము చేయగలుగుదురు. ఆహా! నేడు మనసౌభాగ్యముచూచి సూర్యుడుకూడ నవ్వుచున్నాడు. గీతముపాడుటకు ఇదేసమయము. సోదరీమణులారా! మరణగీతమును పాడుడు. వీరాంగనలారా! తయారైనారా! (మోకాళ్ల మీదకూర్చొని చేతులుజోడించి ఆకాశమువంక చూచుచు) ప్రాణేశ్వరా! ఏ మేవాడుదేశముకొరకు మీ ప్రాణములను అర్పించిరో అట్టిదేశమును రక్షింపజాలకపోతిని. చివరకు ఆడుదాన ననిపించుకొంటిని. (లేచి నిలువబడి) వీరాంగనలారా! చితి ప్రవేశించుటకు ఇదియే సమయము. గీతమును పాడుచునడువుడు!

(పాడుచు పాడుచు చితి ప్రవేశింతురు)

—హరికృష్ణప్రేమీగారు రచించిన 'రక్షాబంధన్' అను హిందీనాటక సహాయముచే.

# ఆంధ్రకవిత

రాజరాజనరేంద్ర తేజోవిరాజమా నాస్థాన సుస్థానమందు బొడమి
కవిబ్రహ్మమృదుమధు కవనంపు కనకంపుడోల లందు విలాస లీలఁబెరిగి
కవిసార్వభౌముని కావ్యగేహంబుల పరిపూర్ణ యవ్వన భాగ్యమంది
అష్టదిగ్గజ కవితారామ సీమల లీలావిహారంబు జాలసలిపి

సీమసీమల నాంధ్రయశోమరీచి
కలను వెలయించి ఘనవాదకలనవలన
కంచు ఢక్కాను బగులగొట్టించినావు
అఖిలదేశైకవిఖ్యాత! ఆంధ్రకవిత!

—శ్రీ చివుకుల ఆదినారాయణ.

# కట్నాల కబుర్లు

శ్రీమతి కె. యల్. యం. దేవిగారు

ఒక చిన్న డాబా ఇల్లు—హాలులో మాధవరావుగారు కుర్చీలో కూర్చునివుంటారు. ప్రక్కన జానకమ్మ నిలబడివుంటుంది.

జానకమ్మ:—మిమ్మల్నే, వినిపించుకోరేం? అయిన సంబంధాలన్నీ దాటిపోతున్నాయి. మన అమ్మాయికి పెళ్లయ్యేదారి కనపడదు. ఈడొచ్చినకూతురింట్లోవుంటే మీాకు నిద్ర యెలావస్తుందో నాకు తెలియకుండావుంది. నామాటలు మీాచెవికెక్కవు. చీమ కుట్టినట్లయినా లేదు, ఏమిచేయను? కూచివారి సంబంధం తోసివేశారు; వడ్లపూడి సంబంధానికి ఆరంభంలోనే అడ్డుతగిలారు. నలుగురూవచ్చి 'జానకమ్మగారూ, మీాలలిత కెప్పుడు పెళ్లిచేస్తారు' అని అడిగితే నాకెంతో చిన్నతనంగానూ, విచారంగానూ వుంటుంది. రామ, రామా! ఈ ఆడబిడ్డ లెందుకుపుట్టుతారో!

మాధవరావు:—అయితే మన లలిత కెన్నేళ్లంటావు?

జానక:—చాల్లెండి. ఇంకా ఎన్నేళ్లని అడుగుతారు. ఈ వైశాఖశుద్ధపాడ్యమికి పదుమూడోఏడుగూడా దాటిందిగదా, చాలవూ పద్నాలుగేళ్లు?

మాధవ:—ఏమిటే, పదునాలుగేళ్ల కంత తొందరా?

జానక:—అయ్యో! తొందరేమి? బంధువులందరూ మనల్నిచూచి నవ్వుతున్నారు. మొన్న మా మేనత్తవచ్చి ఎంతోఅంత తప్పుపట్టింది. 'ఎదిగిన బిడ్డనింట్లో పెట్టుకు కూచున్నావిదేమిటే, సానినిచేస్తావా లేక దొరసానినిచేస్తావా' అని తల ఎత్తకుండా చీవాట్లు పెట్టింది. అందరిముందూ నాకెంత అవమానమయిందో మీాకేమి తెలుసు?

మాధవ:—మా బాగుంది. ఒకరంటారని ఏడిస్తే ఎలాజరుగుతుంది? ఏమన్నా సరే, లలితకు పదిహేనేళ్లువచ్చేదాకా పెళ్లిచేయను. బుద్ధిరాని పిల్లకు పెళ్లిచేయడం తప్పు. అవునవును, శారదాచట్టంమాట మరచావు గాబోలు పెళ్లిచేశామా, నీవూనేనూ శ్రీకృష్ణజన్మస్థానం చూస్తాము, ఏమంటావు?

జానక:—ఏమంటాను. ఈ అవమానానికంటె అదేమేలు. శారదాచట్టం వుందనే మాటేగాని, పదేళ్లపిల్లలికి పెళ్లిజరగడంలేదూ? చూశారా మొన్న వేపకొమ్మ సుబ్బా

రావుగారి కూతురుకి పాండుచ్చేరిలో ఎంతో వైభవంగా పెళ్లిచేశారని పక్కింటి సుబ్బమ్మ చెప్పింది. ఆపిల్లకు తొమ్మిదేళ్లుగూడా దాటలేదట.

మాధవ:_సరేలే, ఆమాటకేం గానీ-నేను ప్లీడర్ని; అలాంటి దొంగపెళ్లిళ్లుచేసి కోర్టుకెక్కను. వాళ్లు చేస్తేచేయనీ. నాకాక్షేపణే. కావలిస్తే ఈమాటు పిల్లపుట్టినప్పుడు నీ బాధ్యతలో పెట్టుకొని నీముద్దుముచ్చట దీర్చుకొందువుగానిలే.

జానకి:-(తలవంచుకొని) చాల్లెండి. ఎప్పుడూ వేళాకోళామే, చూడండీ. మా అమ్మమ్మగూడా ముసలిదయిందిగదా మా పుట్టింటికి పోయినప్పుడల్లా 'అమ్మాయీ నాకళ్లెదుట పిల్లకు పెళ్లిచేయవే. ఈ ముచ్చటకాస్తా చూచుకొనిపోతా'నని పోరుతూ వుంటుంది. ముసలిది ఏళ్లువచ్చింది. బతికినన్నాళ్లు బతకదుగదా. అంచేత మాఅమ్మమ్మ కోరికగూడా దీర్చినట్లుంటుందని చెప్పేను.

మాధవ:_ఇదా రహస్యము. మీా అమ్మమ్మ ముచ్చటకోసం, ఏమి ఎరుగని పసి పిల్లకు ముడెట్టి ఇంటినుండి గెంటమంటావా? బాగుంది.

జానకి:-(కన్నీళ్లుగారుస్తూ) అవునులెండి! మా అమ్మమ్మముచ్చటకు చేయమన్నా నేమిటి? బుద్ధిలేక అడిగాను. దాని పెళ్లిగొడవ నాకెందుకూ? మీాఇష్టం వచ్చినట్లు చేయండి. మళ్లీ ఆమాటఎత్తినానంటే...(కన్నీళ్లుగార్చును)

మాధవ:_సరే! వ్యవహారం ముదిరింది. ఆడాళ్లకు మాట్లాడితేకోపం, మాటకు ముందర ఏడ్పు. కాదే జానకి, నేనేమన్నాను? నాకుమాత్రం అమ్మాయికి పెళ్లిచేయాలని లేదూ? నీవు మంచి భాగ్యవంతుణ్ణి చూడమంటావు. అమ్మాయికి మంచి రూపవంతుడూ, యువ్వనుడూ గావాలి. నాకుమాత్రం మంచి విద్యావంతుడయ్యుండాలి. ఇలాంటివన్నీ వుండేచోటు చూడాలి. తొందరపడితే ఎలాగు? ఈ విషయమై నీవేగాదు, నేనుగూడా రోజూ ఆలోచిస్తూన్నాను. ఎలాగైతేనేం, ఈ మాఘంలో మంచి ముహూర్తాలున్నా యని మన పేరిశాస్త్రిగారు చెప్పారు. అమ్మాయికి పదునాలుగేళ్లు నిండుతాయి. శారదా చట్టం భయంకూడా తీరుతుంది. మొన్న మన పేరిశాస్త్రి బీరకాయలవారి సంబంధం ఏసంగతి ఈవేళ చెప్పుతానన్నాడు. పోయి తెలుసుకొనివస్తా. వంటయిందా, ఆలస్యమా?

జానకి:_నావంటయి గంటయింది. మీారు ఆకుముందరకూచోవడమే ఆలస్యం.

మాధవ:_అయితే తొందరగా వడ్డించు కాళ్లు కడుక్కుంటా. (ఇద్దరులోనికి వెడతారు)

౨

(మాధవరావుగారి ఇల్లు. ప్రవేశం : మాధవరావు, జానకమ్మ.)

జానక:-ఏమండీ! ఏమి తేల్చారు?

మాధవ:_తేల్చడమేమిటే? కట్నము మూడువేలు, లాంఛనాలు ఒకవెయ్యి, పైగా, అల్లుడికి ఎం. ఏ. వరకు చెప్పించాలట. ఇదీ బీరకాయలవారి సంబంధం.

జానక:-చేమకూరవారి సంబంధమో?

మాధవ:_బీరకాయలను మించింది చేమకూర. అది మరీజగట. కట్నమేమో రెండువేలకెక్కువ అక్కరలేదట. లాంఛనాలు అసలేవలదట. కానీ అబ్బాయికి ఆనర్సు వరకు చెప్పించి, ఆతర్వాత లండన్ ఐ.సి.యస్‌కు పంపితే చాలట. చాలదూమరీ? మొత్తము పదివేలకుపైన పోదూ?

జానక:_కానీ అల్లుడు, కలెక్టరుద్యోగము చేస్తాడుగదూ?

మాధవ:_బుద్ధిమంతుడైతే కలెక్టరవుతాడు. తెలివిలేకపోతే మనము దరిద్రులమై అడుక్కుతింటాము.

జానక:_సరేగానీ వారిమాట ఏమయింది-కంచెర్లవారిది?

మాధవ:_ఓహో, కంచెర్లవారు కోరేదంతా కాంచనమే, పంద్రెండు శేర్లబంగారము మీద నడవాలట.

జానక:_చెప్పినవన్నీ బాగున్నాయిలెండి. అయితే మన అమ్మాయిమాట అంతేనా?

మాధవ:_అంతేనని ఎలావూరుకొంటాము? ఇంకా చూడాలి. మదరాసులోని మేట్రిమోనియల్ బ్యూరోకు వ్రాశాను. ఇంకా జవాబులేదు. అదిగో! పోస్టుమేన్ వస్తున్నాడు.

(పోస్టుమేన్ ఒక వుత్తరము ఇచ్చిపోతాడు)

మాధవ:_ఇదిగో జానకీ చదువుతావినూ. (పదిపేజీలుత్రిప్పి) ఇవన్నీ రూల్సే—ఆ, ఇదిగో! నియోగపువారి సంబంధాలిక్కడున్నాయి. (చదువును) కిప్పగంతుల అప్పారావు కుమారుడు కామేశ్వరరావు సన్నగా పొడుగ్గావుంటాడు. కాస్త చామనఛాయ. మెట్రిక్యు లేషన్‌వరకు చదువుకున్నాడు. కట్నం రెండువేలు, వియ్యపురాలి లాంఛనాలువేయి ఆడ పడుచులకు వారి భర్తలకు బెంగుళూరి పట్టుబట్టలు. ముహూర్తానికి మూడురోజులు ముందుగా డబ్బు చెల్లిస్తేనేగాని పెళ్లికొడుకు పుస్తెముడివెయ్యడు. పెళ్లికొడుకు మోహాన

వుండే మొటిమలు కుదిర్చినందుకయిన ఖర్చులుబాబతు ఐదువందలు వడ్డీతోసహా పెండ్లి కుమార్తె తరపువారే ఇచ్చుకోవలెను.

మిట్టపల్లి మిథ్యారావుగారి కుమారుడు జంబుకేశ్వరరావు. లావుగావుంటాడు. కలువరసెంతో పలువరసగూడా అంతే. ముందరిపళ్లు రెండూ ముందుకు పొడుచుకవచ్చినా, కురూపిమాత్రంగాడు. ఫస్టుఫారంవరకు చదివేటప్పటికి, తండ్రికి తలప్రాణం తోకకొచ్చింది. మంచి ఆస్తిపరుడు. ఒక లక్షరూపాయలకు తక్కువుండదు. కట్నం వెయ్యి నూటపదార్లుకావలెను. వెండిచెంబు, కంచం, బెనారసు పట్టుబట్టలు మామూలే. పెళ్లికూతురికి బంగారువడ్డాణం, చైనూ పెట్టాలి. పెళ్లికొడుకు తరపువారి ఖర్చులుగూడా పెళ్లికూతురి తరపువారే భరించవలెను. (జానకితో) చూశావా ? చదువురాని చవటకుగూడా కట్నమే!

జానకః—దానికేమి లెండి. చదువువచ్చినవాళ్లు మాత్రమేమిచేస్తున్నారు ? మనకు కావలసింది ఐశ్వర్యము. కూటికి గుడ్డకు కరవులేకపోతే హాయిగా కాలముగడుపవచ్చు.

మాధవః—బాగున్నాయిలే నీ తెలివితేటలు. ఐశ్వర్యముంటే చాలన్నమాట. అల్లుడు ముసలాడైనాసరే, కుంటైనాసరే, గ్రుడ్డైనాసరే, డబ్బుంటే చాలు. ఆడవారికి పెత్తనమిస్తే ఇలాగే చేస్తారు.

జానకః—అబ్బా ! మీ కెందుకులెండి అంతకోపం. మీ ఇష్టం వచ్చినవారికే కట్టండి.

మాధవః—సరే విను (చదువును) కస్తూరి కుటుంబరావుగారి కుమారుడు కృష్ణమూర్తి. పట్టపరీక్షకు చదువుతున్నాడు. ఆస్తి సాధారణంగావుంది. కుర్రవాడందంగా వుంటాడు. మంచి తెలివితేటలు గలవాడు. తల్లిలేదు. ఇంతవరకు ఐదువేల ఐదువందలు చదువుకయింది. అది తప్ప వేరేకట్నమక్కరలేదు. పిల్లవాడు బుద్ధిమంతుడు గనుక, పై చదువుకు లండను పంపాలి. లాంఛనాలు, తదితర బహుమానాల విషయము మీ ఇష్టం.

జానకః—ఇది మీకు నచ్చింది కాబోలు !

మాధవః—బీదవాళ్లని నీ యూహ గాబోలు ! పిచ్చిదానా, బీదవాళ్లు బ్రతుకడం లేదూ ? మనకు కావలసింది బుద్ధిమంతుడూ, విద్యావంతుడూ ఐన కుర్రవాడు. నీ మాటలకేమిగానీ, ఇదిగో మరొకటి చదువుతా (చదువును)

బొంతనూతుల శీతారామయ్యగారి మొదటిపెళ్లాం కుమారుడు రాఘవయ్య. ఎఫ్.ఏ.వరకు చదువుకున్నాడు. తల్లి చనిపోయింది. పినతల్లివుంది. వయస్సు యాభైఏళ్లకు మించకపోయినా, నలభైఏళ్ల చిన్నవాడిలాగే వుంటాడు. రెండోపెళ్లి గనుక, కట్నమక్కర

లేదు. వెండిబిందెలు, వెండిచెంబులు తగుపాటివిస్తే చాలును. వియ్యపురాలికి ఐదు బంగారుకాసుల కెక్కువ అక్కరలేదు. ఆడపడుచులు ముగ్గురికి నూరేసిరూపాయల బెంగుళూరి చీరలు, వెండిబొట్టు పెట్టెలు ఈయవలెను. నగలు వారికి తోచినన్ని పెడతారు; లేకపోతేలేదు. మరల దెబ్బలాడకూడదు. బొంతనూతులవారు మంచిధనవంతులు. డెబ్బయి వేలరూపాయల కట్టవుంది. భూములనుండి సాలుకు ఆరువేలరూపాయలు వసూలవును. పెండ్లికొడుకు అంత నల్లగా లేకపోయినా బూడిదవర్ణంగా వుంటాడు. దేహమునిండా వుండే అమ్మవారి మచ్చలు ఇప్పుడిప్పుడే మాసిపోతున్నాయి. (జానకితో)

చూశావా! కాటికికాళ్లు జాపుకొన్న ఈ ముసలాడికి పడుచు పెళ్లాం కావాలట. వీడి దుంపతెగా! మరణకాలంలోగూడా పెళ్లిచేసికొంటానంటాడు గాబోలు! అవును, చూస్తున్నాముగదూ. ఇలాంటి పెళ్లిళ్లుజరగడంకూడా, నాకే అధికారము వస్తే, ఈ పెళ్లిళ్ల వైఖరెంతో మార్చివేస్తా.

జానకి:_సరేగానీ, ఆ తర్వాత చదువండి.

మాధవ:_శృంగారపు సరేశ్వరరావుకుమారుడు సర్వోత్తమరావు. బి.ఏ. అయినాడు. కలకత్తాలో ఎం. బి. బియస్. చదువుతున్నాడు. పిల్ల రూపవతిగా, నవనాగరికంగా వుండవలెను. చక్కగా పాడడం నేర్చివుండాలి. ఉత్తసంగీతము చాలదు. హార్మోనియం వాయించుట రావలెను. పెళ్లికుమారుడు చూచుటకు వచ్చి, పాటపాడమంటే త్యాగరాజకృతులు పాడగూడదు. ఈ కృతులందరికీ వచ్చినవే కాబట్టి భావగీతాలు, వెంకిపాటలు పాడవలెను. కట్నమక్కరలేదుగాని, పిల్లవాడికి ఎం.బి.బియస్. పూర్తిఅయ్యేవరకు చదువు ఖర్చుమాత్రం భరిస్తే చాలును. పెళ్లికొడుక్కిచ్చే వస్త్రాలు సర్జి సూట్లయ్యుండాలి. 'ఫేవర్లూబా' రిస్టువాచి, (బంగారంది) ఒకమోటారుసైకిలు ఇస్తే తదితర బహుమానాలకై తొందరపెట్టడు.—పూర్తివివరాలకు ఈ క్రింది అడ్రెస్సుకు వ్రాయాలి. మేట్రిమోనియల్ బ్యూరో, మద్రాసు.

ఓరి దేవుడా! ప్రతివాడు వేలువేలు కట్నాలడిగేవాడే! ఈ కట్నాలతో మతిపోయేటట్లుంది. అంతా విన్నావు కదా జానకీ, ఏమి చేయమంటావో చెప్పు.

జానకి:_బాగుందిలెండి మీరు చెప్పడం. కట్నంలేకుండా అల్లుడు కావాలంటే ఎలా వస్తాడు? మీరు పుచ్చుకోలేదూ వెయ్యి నూటపదార్లు? ఆలాగే మీ కూతురికిగూడా ఇచ్చుకోండి.

మాధవ_అధిక ప్రసంగం చెయ్యకు. నేను పుచ్చుకున్నప్పుడు పరిస్థితులు వేరు,

ఇప్పటి పరిస్థితులువేరు. సంగతి సందర్భం తెలియకుండా ఏదో తెచ్చిపెడతావు. ఏమన్నా అంటే ఏడుస్తావు.

జానకి:—'మీరు కట్నం పుచ్చుకోలేదూ' అని అడగడం తప్పా? మీ ఇష్టం లెండి. వున్నమాటంటే ఎవరికైనా ఉలుకే.

మాధవ:—పోనిద్దూ, రామాయణంలో పిడకలవేట్లాటలాగుంది. ప్రస్తుత విషయం మాటేమంటావు!

జానకి:—కట్నంలేకుండా అల్లుణ్ణి తెచ్చుకొమ్మంటాను.

మాధవ:—సరసంలోకి దిగావు కాబోలు!

జానకి:—అయితే తర్వాతమాట.

మాధవ:—విరసమే.

జానకి:—మీ కెప్పుడూ పరిహాసమే. అమ్మాయిమాట ఏమి నిశ్చయించారు?

మాధవ:—త్వరలో పెళ్లి చేద్దామని.

జానకి:—కట్నం లేకుండానే?

మాధవ:-తప్పుతుందా జానకీ! ఈ కట్నాలకి భయపడి ఎంతకాలం ఊరుకోగలము. శారదాచట్టములాగు కట్నాలు పుచ్చుకోగూడదని మరోచట్టము బయలుదేరేవరకు, కూరకాయల విధంగా అల్లుణ్ణి బేరమాడక తప్పదు. చూశావా, మొన్న సింధుదేశంలో వరశుల్క లాంఛనాలతో సహా ఐదువందలకు మించకూడదని సెలెక్టుకమిటీలో తీర్మానమైంది. ఇలాంటిది మనకుగూడా వస్తే బాగుపడుతాము. మనము బ్రతికిపోతాం. అబ్బా! ఇవెక్కడి కట్నాలు? వీటితో ఎన్నికుటుంబాలు కూలిపోతున్నాయి! 'సంఘం, సంఘం' అనేది ఈ సంస్కారాని కెప్పుడు గట్టిగా పూనుకుంటుందో! ఆలాంటి అరుణోదయమెప్పుడు చూస్తానో!...........

జానకి:-భోజనం తర్వాత కట్నాలమీద కవిత్వాలు చెప్పుదురుగానిలెండి. ముందు కట్నాలు తెచ్చిపెట్టింది మీరే. ఇప్పుడు వద్దనేది మీరే. మళ్లీ ఆలోచిద్దాము గానీ కాళ్లు కడుక్కోండి.

(ఇద్దరు లేచి వెళ్లిపోతారు)

# గృహలక్ష్ముల లలితకళాశోభకు

* సౌందర్యమునకు
* సౌజన్యమునకు
* సౌభాగ్యమునకు
* సౌశీల్యమునకు

సామర్థ్య సంతోషములకు

లలితకళాసమన్వితమైన గృహనిర్మాణమునకు

## • గృహలక్ష్మి •

ప్రతిమాసము కొన్నిపుటలు ప్రత్యేకించి కృషిచేస్తుంది

అట్టి లలితకళల సంబంధమైన గద్య పద్య గేయములకు

## ఆహ్వానము



# గృహలక్ష్మి

## లలితకళా సంచిక

### పత్రికల ప్రశంసలు



గృహలక్ష్మి 11 ఏండ్లుగడచి పన్నెండో సంవత్సరమందిన ద్వాదశి కాబట్టే ఈమె సకల కళాశోభితయై దర్శన మిచ్చింది. కనుపర్తి వర లక్ష్మమ్మగారు ఈవిషయాన్నే విశదీకరించారు. అడవి బాపిరాజుగారు చిత్రకళాచరిత్రాన్ని సంగ్రహంగా తెలియపరిచారు. ఆంధ్రులకూ ఒక ప్రత్యేకమైన జాతీయనాట్యమున్నది, దానిని మరల పైకి తేవలసిన వారు ఆంధ్రులే యని కాశీపతిగారి యుపన్యాసము. మహాదేవుడు ధరించే కపాల, సర్ప, డమరు మొదలగువాని యంతరార్థం నాట్యకళకు సంబంధించిందని మరియొక ప్రతిపాదన. ఏదైనా ఒకజాతియొక్క సభ్య తాధిక్యాన్ని గుర్తించాలంటే అక్కడి లలితకళాసంపదను పరిశీలించా లని వేరొకరి యభిప్రాయము. ఇటులే కళాసంబంధకాంతుల వెదజల్లు వ్యాసాలిందులో అనేకములున్నాయి. విఖ్యాతులైన లేఖక, చిత్ర కారుల శిల్పనైపుణ్యాలతో బయటికి వెలువడిన ఈ కేసరిజాతేను, ద్వాదశిని, అడుగు అడుగునా కములారచితచిత్రశోభితను జూచిన ఎవరికానందము గలుగకుండును ?

— భారతి.

ఇందలి చిత్రములు శ్రీమతి ఆర్. కమలాబాయిగారిచే వ్రాయబడి నవి. లలితకళానైపుణిచే కమలాబాయమ్మ స్త్రీలోకమునకొక నవీనా లంకార మొనర్చినది. ప్రత్యేకసంచిక పలురూపమున వెలువరించి ఆంధ్రభాషామతల్లికిని, నారీలోకమునకును, అమితసేవచేయుచున్న సంపాదకులు కేసరిగారికి ఆంధ్రవనితామణులు ఋణపడియుందురు. గృహలక్ష్మిని ఆంధ్రులగృహముల నలంకరింపజేసుకొన అవసరం గలదని మాకోరిక.

— రెడ్డిప్రభ.




# ఆంధ్రుల శిల్పము

శ్రీ శేషాద్రి రమణకవులు

ఆంధ్రులు రాజ్యాంగవిషయములందును, సాహిత్యవిద్యయందును, శాస్త్రవిజ్ఞానమునందును నెటులఁ బ్రసిద్ధి వహించిరో యటులె శిల్పమునందును జగద్విఖ్యాతకీర్తి వహించినారు. శిల్పమునందుఁ బేరెన్నికఁ గాంచిన శిల్పులనామము లెఱుంగ రాకున్నను వారికీర్తి చిహ్నము లనఁదగు శిల్పములు మాత్రము నేఁటికిని నిల్చి యశేషజనముచేఁ బ్రశంసింపఁబడుచున్నవి. అజంటా, ఎల్లోరా శిల్పములు జగద్విఖ్యాతములు. ఇందెంతవఱకు ఆంధ్రులకృషి అనశ్వరముగ విలసిల్లెనో నిర్ణయింప నాధారములు లేకున్నను, ప్రఖ్యాతులగు మనపూర్వ సోదరు లందుఁగృషిచేసిరనియే చెప్పవచ్చును. అమరావతి, నాగార్జునకొండ, రామిరెడ్డిపల్లి, ఘంటసాల, భట్టిప్రోలు, లోనగు నాంధ్రదేశస్థగ్రామములలోఁ గనిపించు బౌద్ధశిల్పములును, జగ్గయ్యపేట, అల్లూరు, గంగాపురము లోనగుతావుల గోచరించు స్తూపభాగములును బౌద్ధయుగమునఁ బ్రఖ్యాతిగాంచిన ఆంధ్రుల శిల్పకళాకౌశలమునకు ముఖ్యదృష్టాంతములు. బుద్ధభగవానుని యమృతమూర్తుల నాలించి దేశమంతయు జీవకళ లుట్టిపడు శిల్పవిన్యాసములతో నలంకరించిన ఆంధ్రుల విఖ్యాతిచిహ్నము లింకను గాలగర్భమున మఱుఁగుపడియుంట శోచనీయమగు నంశము.

ఆంధ్రుల శిల్పచరిత్రములోఁ బ్రధానభాగ మాక్రమింపఁదగినది జైనుల శిల్పనైపుణ్యము. మతకలహములలో నహింసాజీవులును, శుద్ధసాత్వికమూర్తులును, ప్రకృతివిలాస విమర్శకులు నగు జైనుల యాలయములు పెక్కులు రూపుమాపఁబడినవి. జైనులు మతాంతరుల దౌర్జన్యముచేఁ జిత్రవధకుఁ బాల్పడిరి. వారి శిల్పకౌశల్యమును మఱుఁగుపఱచుటలో నానాఁటి దౌర్జన్యవాదులగు మతావేశపరుల ప్రయత్నము లించుకేనియు ఫలింపలేదనుట సత్యమున కతీతము కానేరదు.

ఆంధ్రదేశమున శిల్పమును బోషించి సర్వస్వము ధారబోసినవారిలోఁ బ్రథమగణ్యులు జైనులు, బౌద్ధులు. జైనుల తీర్థంకర విగ్రహములును, మహావీరవిగ్రహములు జీవకళలతో నలరారుచుండును. దరహాసకాంతుల వెదజల్లు సుందరాస్యము సమపీనములై, సృష్టికర్త కల్పనముల కనురూపములై ధ్యానముద్రాలంకృతములగు జైనవిగ్రహములు దేశమునందుఁ బలుతావుల గలవు. ఇందుఁ గొన్ని దిగంబరరూపములు. పురుషస్వరూప మును బూర్తిగా యథామాతృకముగా రక్తనాళములు, చర్మమునందు గల నిమ్నోన్నతభాగములు, అవయవ సంధులు, కూలంకషముగ మానవప్రకృతి ననుకరించుచుండునటుల మనోహరముగఁ దీర్పఁబడిన దిగంబరజైన మూర్తులాంధ్రదేశమునందుఁ బలుతావులలోఁ గలవు. మతావేశపరులహృదయములలోనే మాత్రము కళాభి

రతియున్నను నీ విగ్రహముల భిన్నభిన్నము జేసియుండరు. బ్రిటిషు పరిపాలనమునకుఁ జెందిన భాగములలోఁగల యాంధ్రులశిల్పములు చాలవఱకు దర్శనీయస్థితిలో నున్నవి. పత్రికలలో వాని ప్రతిబింబములు గాంచి మన పూర్వుల కళాకౌశల్యమునకు ముగ్ధులమగుచున్నారము. నిజామురాష్ట్రమున బూర్తిగా బదిమండలములు ఆంధ్రులవి. అచటఁ గల శిల్పములు, దేవళములు, దుర్గములు, జయస్తంభములు, జైనాలయములు సోదరాంధ్రుల కంతగాఁ బరిచితములుగా లేవని చెప్పవచ్చును. ఘనతచెందిన నిజాము దొరతనమువారు ఈ రాజ్యమునందుఁ గల చారిత్రకప్రదేశములు, శిల్పాభిరామములగు దేవాలయములు, ఆర్యుల జ్ఞాపకచిహ్నములు సురక్షితము గావించుచున్నారు. ఆంధ్రసోదరులకు నిజామురాష్ట్రమునందుఁ గల శిల్పములతో నించుకయేని పరిచయము చేయుటకే ఈ వ్యాసము వ్రాయుచున్నారము. యావదాంధ్రదేశమున కాయువు పట్టనదగు నిజాము రాజ్యమునందుఁగల ఆంధ్రుల శిల్పకళాకౌశలము దెల్పు దృశ్యముల వర్ణనమే ఈ వ్యాసరచనా సంకల్పము.

## కొలనుపాక - జైనవిగ్రహములు

నిజామురాష్ట్రమునఁగల సుప్రసిద్ధ జైనక్షేత్రములలో కొలనుపాక యొకటి. ఇచట సర్వాంగసుందరమగు జైనాలయములు పెక్కులు గలవు. కొన్నియాలయములు వైదికమతము వారాక్రమించి తమ విగ్రహములఁ బ్రతిష్ఠించిరి. వీరశైవులు కొన్ని యాలయములను మఠములుగా మార్చిరి. ఈ గ్రామమునఁగల ప్రధాన జైనాలయము నిపుడు జైనులు పునరుద్ధరించి, యందలి విగ్రహమును బూజార్హములు గావించిరి. ఇచట మహావీరవిగ్రహము మరకతశిలతో మనోజ్ఞముగ నున్నది. పురుషప్రమాణమును మించిన యీ విగ్రహము పురుషులకేని మోహము గలిగించుచు, పాలుగారు చెక్కిళ్లతో సమపీనములగు నవయవములతో కరుణరసకందళమగు ముఖములో నద్వితీయ శిల్పసంపదతోఁ దనరారుచున్నది. జైన సారస్వతమున నీ విగ్రహము రామాయణ కాలమునాఁటిదని చెప్పఁబడినది. ఈ యాలయమున తీర్థంకవిగ్రహములు, పద్మాక్షినాగరూపములు, దిగంబర జైన విగ్రహములు దర్శనీయములు. ఆంధ్రదేశమునకు మధ్యనున్న ఈ క్షేత్రమునందలి జైనశిల్పములన్నియు నాంధ్రుల కళాకౌశలమును సాటుచున్నవి. నల్లనిరంగుగల్గి సాలగ్రామముల వలె నిగనిగలాడు నీ విగ్రహముల నెంతగాంచినను తనివిదీరదు. భూగర్భముననుండి సైతము సర్వాంగసుందరములగు విగ్రహము లెన్నియో యిచట బయలుదేరుచున్నవి. శైవమతోద్ధారకుఁడగు రేణుకాచార్యుల కిది జన్మభూమి. రేణుకాచార్యుని కావల చాళుక్యులు, కాకతీయులు కొన్ని జైనాలయముల శివాలయములుగ మార్చిరి. బైరాములపల్లి, రేములవాడ, హనుమకొండ, ఇనుగుర్తి, జోగిపేట, అలంపూరు, ఓరుగల్లు, గంగాపురము లోనగు తావుల కొలనుపాకలోని జైనవిగ్రహములతో సాటివచ్చు జైనమూర్తులు కలవు. నగునూరిలోఁ బ్రోలరాజు రుద్రదేవుల మంత్రి యగు గంగాధరుఁడు చతుర్వింశతిమూర్తియుక్తమగు జైనభగవానుని బ్రతిష్ఠించితినని చెప్పుకొన్నాడు., ఇపుడా యాలయము ఖిలమైనది. పైఁ జెప్పఁబడిన చతుర్వింశతిమూర్తియుక్తమగు జైనవిగ్రహము ఆంధ్రుల అద్భుత శిల్పకౌశలమునకు దృష్టాంతముగ వీధిలోఁబడియున్నది. ఇందలి చతుర్వింశతిమూర్తులును ప్రత్యక్ష దర్శనీయములు. పటంచెఱువు ఏడునూరులు జైనాలయములు గల దివ్యక్షేత్రము. శైవులా క్షేత్రనాశనము గావించిన విధములు బసవపురాణమునఁ గాంచనగును. ఇచట జైనవిగ్రహములనన్యసామాన్య శిల్పద్యోతకములు. ఇందుఁ గొన్ని హైదరాబాదు వస్తుప్రదర్శనశాల నలంకరించియున్నవి. మెదకుమండలమునందలి జోగిపేట యొకకాలమున జైనాలయముల నాటపట్టుగ నుండెను. కాలక్రమమున జైనులు క్షీణించుటచే నందందుగల విగ్రహము లొకమందిరమునఁ జేర్పఁబడినవి. హతశేషులగు స్వల్పసంఖ్యాకులైన యాంధ్రజైనులా విగ్రహములకుఁ బూజాపురస్కార

ములు గావించుచున్నారు. ఇచట స్ఫటికములతో, కృష్ణశిలతో, చలువరాతితో, రాగి ఇత్తడులతోఁ జేయఁబడిన జైనవిగ్రహములు నూఱువఱకుఁ గలవు. విగ్రహములపైఁ బ్రతిష్ఠాపకుల నామములు గలవు. జైనమతవ్యాప్తి తరుణమున ఆంధ్రులు జూపిన శిల్పకౌశల్యము ప్రకృత్యనుకరణమనుట కీ విగ్రహములన్నియు సాక్ష్యమొసంగఁ గలవు. పురుషానుకృతి జైన బౌద్ధమత వ్యాప్తిలో శిల్పులు మిగుల నలవరించుకొనిరి. బౌద్ధయుగమున స్త్రీ విగ్రహముల విన్నాణముగఁ దీర్చి, చిఱునవ్వు బుగ్గలలో గుంటలు, ముఖభాగములు వెల్లడించుటలో అక్షి విన్యాసములగు, విలాసములగు భంగిమములు, చక్కదనము వెలువరించు జాతకథాఘట్టములు చలువఱాళ్లపయి నిర్మించనరీతిమరువరానిది. నాగార్జునకొండలో నిట్టి దృశ్యములను బెక్కింటిని గనుగొనవచ్చును. నిజాము రాజ్యమునఁ బలుతావుల బౌద్ధస్తూపములు గలవు గాని వానినింకఁ ద్రవ్వుటకుఁ బూనుకొనలేదు.

## కాకతీయుల శిల్పకౌశలము

నిజామురాజ్యమునందలి యాంధ్రప్రాంతములలోఁ జాళుక్యుల దేవాలయములు, కాకతీయుల దేవాలయములు మనోజ్ఞమగు పద్ధతిలోఁ గట్టఁబడినవి. ఆలంపూరు, శేములవాడ, గంగాపురము, మడికొండ, రాయపర్తి, కొఱవి లోనగుతావుల అందములగు లతావలయములతో వింతవింతచూరులతో గజబృందముల విలాసగమనములతో శిలలను నింపివైచిరి. గుల్బర్గా మండలములోని ఉజ్జిలి పూర్వనామము ఉజ్జయిని. దీనిని చాళుక్య విక్రమాదిత్యుఁడు రాజధానిగఁ జేసికొని అపూర్వశిల్పములు, విజయ స్తంభములు, వీరవిగ్రహములు, మహాకాళి దివ్యసుందరమూర్తి అద్భుతవిలాసములతో నలరు శివాలయాదికములు నెలకొల్పి తాను విక్రమార్కుఁడనని, తనకది ఉజ్జయిని యని దెసలలో సాటినాఁడు. ఇచటఁ గల జయ స్తంభములపైఁ బలకలు దీర్చుటలో నొక క్రొత్త విన్నాణము గలదు. పీఠములపయి నాశ్చర్యకరములగు లతావేల్లనములు గలవు. శిల్పసమయములరయు కళాపిపాసువుల కీ గ్రామ మొక విద్యామందిరము. నల్లగొండ చెంతఁ గల పానుగల్లు తొలుత చాళుక్యులకును బన్రెండవ శతాబ్దిలో ఆంధ్రులగుచోళులకును రాజధానిగ నుండెను. చెంతగల నల్లగొండలో అరువదియడుగులకంటె నెత్తగు జయ స్తంభము నేటికిని జెక్కుచెదరకున్నది. ఇంతటి యఖండశిలను సంగ్రహించుటలోను నేటివఱకు పట్టు దొలంగక దిమ్మెపయి నిలుపుటలోను ఆంధ్రులు చూపించిన యద్భుతశక్తి విస్మయకరము. పానుగల్లులోని పచ్చల సోమేశ్వరాలయము గోపురముగూడ జైన సాంప్రదాయానుసారముగా శిలాఫలక నిర్మితము. ఆలయ స్తంభములపై పురాణకథలన్నియు జీవకళ ఉట్టిపడునటులఁ జెక్కఁబడినవి. స్త్రీ విలాసాభినయ భంగిమములు పురుషుల వీరవిహారములు అనన్య సామాన్యములు. ఇచటి ఛాయా సోమేశ్వరాలయమున శివలింగము నంటి యెల్లవేళల దొలంగనటుల ఛాయ నిర్మించిన యాంధ్రశిల్పుల కళాకౌశలము ప్రశంసాపాత్రము. పానుగల్లు ఉదయచోడుని రాజధాని. ఇందుఁ గల వీరవిగ్రహములు, దేవతామూర్తులు, స్తంభములపయిగల హారాదికములు నేటికిని జెక్కుచెదరకున్నవి.

కాకతీయుల శిల్పాభిరతిని బ్రశంసించుటకొక ప్రత్యేకగ్రంథము కావలయును. మూఁడువందలసంవత్సరములేక హేలగా రాజ్యము బాలించి, కళాభిరతికిని, సారస్వతమునకును, జాతికిని వీరు గావించిన సేవ సహస్రముఖముల గొనియాడఁదగినది. హనుమకొండలోని పద్మాక్షిదేవాలయముచెంత గల గండశిలపయిఁ జెక్కబడిన జైనవిగ్రహముల యందము చూడఁదగినది. అచట రుద్రదేవుఁడు కట్టించిన దేవాలయము, ద్వారములపయిగల త్రిమూర్తుల విలాసస్వరూపములు, ముఖమండపముపయి జెక్కిన ఈశ్వరలీలను శిల్పలక్ష్మికి విలాస

భూములు. ద్వారములపయిగల నృత్యభంగిమములు వాద్యభేదముతోఁ గ్రీడించు నర్తకుల విలాసగమనములు స్తంభములపయి గల లతాచిత్రములు మనోహరతరములు. హనుమకొండనుండి రాజధాని ఓరంగల్లునకు మార్పఁబడిన పిదప రుద్రదేవుని యనంతరము స్వయంభూదేవాలయము కట్టఁబడినది. ప్రతాపరుద్రీయమున నీ యాలయప్రశంస విశేషించి కలదు. స్వయంభూదేవాలయము ప్రకృతము రూపుమాసినది. ఛిన్నభిన్నము గావింపఁబడిన ఈ యాలయమునందలి మనోజ్ఞశిల్పములను కోటగోడల కుపయోగించిరి. మొన్న మొన్న ప్రత్ని శోధనమువారీ యాలయమునకు సంబంధించిన శిలలను సురక్షితము గావించిరి. ఆలయమునకు నాలుగువైపుల నున్న శిలాద్వారములపయినిగల స్వర్ణకుంభములు కొనలయందుఁ గల హంసలు, ద్వారశాఖల కంటియుండి నేఁడు శిథిలములై పడియున్న మదపుటేనుఁగులపయిని నిల్చిన సింహస్వరూపములు ప్రత్యేకదర్శనీయములు. నల్లగ నిగనిగలాడు శిలలపై వ్యాఘ్రములతో పోరు వీరుల విజృంభణము, ప్రతిపక్షుల నెదిరించుచున్న వీర పురుషుల వీరవిహారములు, స్తంభములపయి నున్న లతాహారాదికములు, ద్వారములపయి దీర్చిన మూర్తుల స్వరూపములు మఱువరానివి. ఈ యాలయ స్తంభములు నల్లగ నిగ్గులు దేరుచు నేఁటికిని పన్నెదగ్గక ఆంధ్రుల శిల్పకౌశలము వెల్లడించుచున్నవి. ఆంధ్రప్రపంచమున నద్వితీయస్థాన మాక్రమింపఁదగిన ఈ యాలయరాజము నందలి మనోహరశిల్పములు కోటగోడలందును బురుజులందును మాటుపడియున్నవి. ఇందలి స్తంభములపైఁ దీర్చిన యాంధ్రుల స్వరూపములు, క్రీడావిధములు, అశ్వగజపదాతిరూపములు అన్యత్ర చూడఁజాలము. ఏకశైల దృశ్యముగ నిర్మింపఁబడిన ఈ స్వయంభూదేవాలయ శిథిలములు ఆంధ్రులమని సగర్వముగాఁ జెప్పుకొని తమ రాజధానిని ఆంధ్రనగరమని పేర్కొనిన కాకతీయాంధ్రరాజుల కళాభిరతికి దృష్టాంతములుగఁ జెప్పుకొనఁదగి యున్నవి. ప్రతాపచరిత్రమున ఓరుగల్లులో 1500 చిత్తరువులు వ్రాయువారిగృహములు గలవని ఏకామ్ర నాథుఁడు చెప్పినాఁడు. ప్రతాపరుద్రుని యంపుడుకత్తె చిత్రశాల నిర్మించి ప్రవేశోత్సవము గావించెనఁట. ఇట్లే రాజమందిరమునఁ జిత్రశాలలు గలవు. వీరుల గుడిపైఁ జిత్రచిత్రములగా పలనాఁటి వీరులయుద్ధ విజృం భణము రంగులలోఁ జిత్రించిరి. ఈ సూచనలు క్రీడాభిరామమునందె గలవు. దృశ్యప్రపంచములోనివి నశించినవి. ఏకవీర, కాకతి, చముడేశ్వరి దేవళముల పోలికయే కానరాదు. కేశవ స్వయంభూదేవాలయముల ఆద్భుత శిల్పములు కొన్ని మిగిలినవి. ఓరుగల్లులోని శిల్పములు సామాన్యముగా నీ యుభయాలయములకుఁ జెందినవే యని నిర్ణయింప నవకాశములు పెక్కులు గలవు.

పాలెంపేట దేవాలయము రుద్రసేనాని పదమూఁడవశతాబ్దమున నిర్మించినాఁడు. ఇచటి యిటుకలు నీళ్లపయి దేలుట కని వినని వింత. ఈ యాలయమున నాట్యకళ పరిపూర్తిగఁ జూపఁబడినది. చూరులకు బిగింపఁ బడిన స్త్రీమూర్తులు విస్మయకరములు. ప్రత్యంగము సౌష్ఠవవంతముగ నింత సహజముగఁ దీర్పఁబడిన యావిగ్ర హములను దర్శింప యాత్రికులు విచ్చలవిడిగ వచ్చుచుందురు. ఆలయపు దూలములుగ నున్న ఱాళ్లపయి శివ పురాణ కథాంశములు చెక్కఁబడినవి. ఇటకుఁ జేరువలో గణపురములో గణపతిదేవుఁడు ముప్పదిశివాలయ ముల నిర్మించినాఁడు. ఇందు ప్రత్యాలయము దర్శనీయమె. అరణ్య మీ యాలయములఁ దనగర్భమున మఱుఁగుపఱచుకొనుటచే నింతవఱకు సురక్షితముగా నున్నవి. పిల్లలమఱ్ఱి, సోమవరము, నాగులపాడు లోనగు తావుల కాకతీయుల సేనానాయకులగు రేచర్ల గోత్రీయులు అసంఖ్యాకములు నిర్మించిరి. శిల్పకౌశలమున నొకదానికొకటి తీసిపోవకున్నది. ద్వారనిర్మాణమునందె శిల్పసౌందర్యము తాండవించుచుండును. నగునూరు, కుందవరము, ఉప్పరపల్లి, బెక్కల్లు లోనగు తావులఁగూడఁ గాకతీయుల రాజప్రతినిధులు రాజులవలెఁ

గళారాధనము గావించిరి. ఆంధ్రులశిల్పము జైనశిల్పమువలె ధ్యానముద్రా మూర్తిమంతము. బౌద్ధశిల్పమువలె, శాలరాతిపయి నుకరముగాఁ జెక్కఁబడినది కాదు. వజ్రతుల్యమగు కృష్ణపాషాణములపయి జీవకళ లుట్టిపడు నట్లు వివిధరూపములు ప్రకృతి ప్రతిబింబములవలెఁ జెక్కి మొగము జూచుకొనఁదగినంత స్నిగ్ధమైన మెఱుంగు బెట్టి శిల్పజ్యోతిని పరంజ్యోతిగా వెలిగించినారు. ఇటుకలుగూడ విగ్రహనిర్మాణమున కనుకూలముగఁ దీర్చి నారు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఈ శిల్పము సర్వవిధముల నాశనస్థితికి వచ్చి నూతనవికాస ములోఁ బిదప విద్యానగరమున బునర్నిర్మితమైనది. ఆంధ్రులు సర్వవిధముల స్వాతంత్ర్యములు గోల్పోవుటచే నాంధ్రుల శిల్పకౌశలముగూడ జాలవఱకు నశించినది.

ఆంధ్రులు రాజస్వరూపములు శిలలపైఁ జిత్రించిరి. శైలములఁ దొలిచి సుందరతరాలయముల నిర్మిం చిరి. సముద్రమున కీడగు తటాకములు నెలకొల్పిరి. భూలోకమును నందనవనము గావించి మనోహర శిల్పము లలో రాజ్యముల నలరించిరి. అరణ్యగర్భములలో నెన్నియో దుర్గములు, స్తూపములు, దేవాలయములు, విచిత్రవిగ్రహములు, వీరశిలలు నేఁటికిని మరుగుపడియున్నవి. సిద్ధహస్తులగు ఆంధ్రశిల్పులు బౌద్ధ జైన విగ్రహనిర్మాణమునఁ బేరువడసిరి. రాచరూపులు గండశిలలపయి జీవకళ లుట్టిపడునటులఁ జెక్కిరి. అత్యు న్నతములగు శైలరాజములపై దుర్గమములగు దుర్గరాజముల నెలకొల్పిరి. కాల దౌర్భాగ్యమున నేఁటికిఁ బలు తావుల శిథిలావశిష్టముల దర్శించి మనపూర్వుల శక్తిసామర్థ్యముల కానందింపవలసిన దుర్గతి ఆంధ్రులకుఁ బట్టుట యత్యంత శోచనీయము.

చెదరివీథులఁబడ్డ శిథిల విగ్రహముల గజరాజముల మేనఁ గలుపుకొమ్ము
బల్లెంబు గొని గ్రొచ్చవచ్చు రాహుతుమేను శిథిలాశ్వతనువుతోఁ జేర్చుకొమ్ము
కూలిపోయిన శిలాస్తంభంబులు మహోన్నతద్వారశిరముల దార్చుకొమ్ము
విరిగిన రమణీయ విగ్రహావళి దేవ నిలయహర్మ్యములపైఁ దీర్చుకొమ్ము

అవలఁగను దోయిమూసి మహేంద్రనగర
దివ్యతరరూపరేఖ చింతించుకొమ్ము
ఆంధ్రసోదర ! నీకు మహేంద్రశిల్ప
గురుతరమహస్సు లోలోన గోచరించు॥



# వ్యభిచారము

శ్రీమతి డి. అనసూయాదేవిగారు



నేడు మనసంఘములో వ్యాపించియున్న దుర్వర్తనములలో వ్యభిచారము ఒకటి. అయ్యది ధనవంతులనక, ధనహీనులనక, విద్యావంతులనక, విద్యాహీనులనక, పుంస్త్రీలనక, వితంతువులనక, భార్యాసమేతులనక, భార్యావిహీనులనక అన్నిరకములవారిలోను తలచూపి యున్నదనువిషయము యెల్లరకు విశదమే.

ప్రస్తుతప్రపంచములో మార్పులయాధిపత్య మెక్కువైనది. ప్రజలలో స్థాపించుకొనిన మూర్ఖాచారములను బారద్రోలుటకై యదార్థజ్ఞానమును గమనింపగల్గిన మహాశయులు ప్రవేశపెట్టిన సంస్కరణలు ప్రచారము గాంచుచున్నవి. విద్యగూడ యించుమించు యెల్లెడల వ్యాప్తిజెందియున్నది.

ఇట్టితరి మన ధర్మశాస్త్రములకు వ్యతిరిక్తమగు నీవ్యభిచారము ఒకింతయు హీనదశనుజూపక పోషింపబడుట తలప విచారణీయాంశమైయున్నది. ఆర్యులచే నిషేధింపబడిన చర్యను సేవించుటలో కారణమేమి ? అందేమయిన గుణాధిక్యతయున్నదా ? యేదీ ? అదియెట్టిదో చూతము.

అనుకూలదాంపత్య మబ్బినదంపతులకు సాధారణముగా వ్యభిచారవాంఛ పుట్టనే పుట్టదు. అట్టిఅనుకూలత లేకపోవుటె జారవృత్తికి కారణమనుకొందమా ? అనుకొందము గాక, అనుకూలదాంపత్యమువలన పొందునట్టి నిశ్చలసౌఖ్యము జారవృత్తివలన పొందగలదా ?

సీ. పతియెరింగిన తనప్రాణంబుపై వచ్చునను భయంబున నుల్ల మదరుచుండ
జనులుగాంచిన మానుషము దూలుదన కనుపుయిలోటమున మోముపుల్లగిలగ
బోటికిదోచిన బాలియుదేకువయను వెగడునజెయ్యిలు వీడుపడగ
బంధులకగపడ్డ బాయినన్వయమను కలకమైచెమటలు గ్రమ్ముదేర

తే. గ్రీడ దెస గాతుకం బురియాడరతుల చవులు గొనియాడ నేరని జారపొందు
హృదయమునకింపు సేయమి నెరుకగలుగు వారు దీనిసుఖంబుగా గోరరెందు.

(భారతము)

కావున ప్రతికూలదాంపత్యము గలవారైననూ, అభిమానవంతులై ఆత్మానందాభిలాషులగుచో క్షణికమైన స్వార్థసుఖముకై ఉభయకుటుంబములకు కష్టములు తెచ్చిపెట్టు వరపొందు వాంఛింపరు.

యింక వితంతువులసంగతి చూతము. హృదయేశ్వరుడు మరణింప, తమ జీవిత శేషమును పరమార్థికముగనో లేక దైవచింతనముగనో గడపుట ఉత్తమ ఆర్యధర్మము. అట్లుగాక ప్రస్తుతానుభవమే స్వర్గనరకములనియు, జన్మాంతమున వేరొకస్వర్గనరకము లున్నవని భావించుట ఛాందసలక్షణమనియూ తలంచు స్వార్థాభిలాషులగు చంచలమతులైనచో పునర్వివాహమాడుటైన ఉచితము. కాని, సంఘమునకు వెరచి సనాతనతత్వమును వహించియు కామపీడితహృదయులై జారవృత్తికి లోబడుట, తన్మూలమున గర్భస్రావాది ఘోరాచారములకు హేతులగుట, తావరించినపురుషుని కుటుంబకలహమునకు కారకురాలగుట యెంతపాపము, యెంతహీనము, యెంతకష్టము!

యిట్లె భార్యా విహీనులకుగూడ ఒక గర్భోత్పత్తి భీతిలేకున్ననూ యితరకారణములనుబట్టియైన వ్యభిచారము వర్జనీయము.

కొందరీవృత్తికి ప్రేమ కారణముగా వ్యవహరించుచున్నారు. పవిత్రమైనదియు జయింపరానిదియు, మృదుహృదయవాసియు, అచలానంద మిడునదియునగు విశ్వప్రేమను ప్రాజ్ఞులు వర్ణించుటంగని కష్టసుఖములెరుగని మోహాంధతలుబ్ధమగు తమ హృదయజనిత వాంఛలకు పోల్చుకొనుట తలప హాస్యాస్పదముకాదా? యిక భయకంపితజనితమైనదియు ఆత్మసౌఖ్యదూరమైనదియునగు వ్యభిచారమునకు పాల్పడువారెల్ల ఆత్మజ్ఞానహీనులని తెల్లమగుచున్నది.

'జ్ఞాన విద్యాధీనం' అను నార్యోక్తి యదార్థమేఅయిననూ ప్రస్తుతము తమ విద్యచే ఆత్మసవరణకు గడంగక, శరీరపోషణార్థముపయోగించు ద్రవ్యార్జనకే వినియోగించువారిసంఖ్య ప్రబలుటచే అది అసత్యముగ తోచుచున్నది.

ధర్మాధర్మములను విమర్శింపజాలు విద్యావంతులే యిట్టి హీనచర్యలకు పాల్పడుచుండ యింక యితరులసంగతి వేరుగ చెప్పవలెనా?

పవిత్రాంధ్రమాత గర్భజనితులగు సోదరసోదరీమతల్లులు యింకనైన మనమాతృదేవి సౌశీల్యమును కాపాడుటకు ప్రయత్నింతురుగాక!

# సినిమా కథ

శ్రీమతి లోకనిండి సత్యవతీబాయిగారు

చిరునవ్వుతో నెమ్మదిగా కాగితాలనుసవరించి జేబులోపెట్టుకొని వెళ్లిపోతూన్న నిరంజనరావునిచూచి, చంద్రికాఫిల్ము్స డైరక్టరైన దేవకీబోసు 'అతనికి చాలా సహనముంది సుమా' అన్నాడు. ప్రక్కనే టైపు చేస్తూన్న సురేశబాబు తలయెత్తి 'ఆ...ఒకనాడు తెలుస్తుంది, ఆవోపికపట్టడమంతాను!' అని జవాబు చెప్పాడు. 'ఇది పదోసారి ఆతనికథల్ని నేను తిప్పికొట్టడము' అన్నాడు బోసు నవ్వుతూ.

ఇక నిరంజనుడీ బి. ఏ. ప్యాసయిననాటినుంచీ పడుతున్నాడు అవస్థలు. ఉదరనిమిత్తము ఉద్యోగము దొరకనేలేదు సరిగదా, పోనీ తానువ్రాసినకథలన్నా ఏసినిమాడైరక్టరైనా మెచ్చితీసుకొని, కథకొక ఐదు రూపాయలచొప్పునన్నా డబ్బిస్తే కొంతదారిద్రం తెరిపిఅయ్యేది పాపము. తపాలాబిళ్లలతో వెళ్లినకథలు తిరిగి వచ్చేనేవి. తక్కినవాటిసంగతి దేవునికెఱుక.

కాని నిరంజనునిలోని గొప్పతనమేమిటంటే నిస్పృహచెందడమూ, నిరాశపడడమూ అతనికి తెలియనే తెలియవు. ఎన్నిఆశాభంగాలు కలిగినా చిరునవ్వుతప్ప చీకాకుపడడమూ, విధినిదూరడమూ అతనిలోలేవు.

అసలు బొంబాయిరావడముకూడ ధనికుడైన ఒక ఆంధ్ర వైశ్యవర్తకునిబిడ్డలకు తెలుగు, ఇంగ్లీషు నేర్పితే పాతికరూపాయలు, ఉండుట కద్దెలేకుండాయిల్లు యిస్తారన్నప్రకటనను పత్రికలో చూడడము కారణమైంది. శికింద్రాబాదులో పాతికరూపాయలతో జీవనమూ, బొంబాయిలో వందరూపాయల జీవనమూ ఒకటేఅని అతనికి తెలిస్తేకదూ! 'కొత్తవూరు రైలుచార్జీకే బోలెడుడబ్బు కావాలి. పుట్టింటికి వెళ్లు' అని భార్య మాధవమ్మకు నచ్చచెప్పి వెళ్లిపోవాలనుకున్నాడు. సంపాదన ఏర్పడేవఱకు తనను కాపరానికి తీసుకుపోక పుట్టింటిలోఉంచినదినములు, మారుతల్లిదగ్గర తానుపడ్డ అగచాట్లు అన్నీ జ్ఞాపకానికివచ్చి పుట్టింటికివెళ్లనని మంరాముచేసిఏడిస్తే, ఏమీతోచక ప్రేమబంధాన్ని విప్పలేక మాధవమ్మనుకూడ బొంబాయి తీసుకపోవుట కొప్పుకున్నాడు. గ్రుడ్డిలో మెల్లన్నట్లు తాను పైరివేటు చెప్పబోయేకోమట్ల లారీఒకటి ప్రత్తిగింజలనునింపి బొంబాయి తీసుకుపోతూవుంటే, పరిచయముగల ఆలారీడ్రైవరు యజమానికివ్రాసి నిరంజనుని, ఆతనిభార్యను బొంబాయిమోటర్లో తీసుకుపోయాడు. అంతదూరము, 4 వందలమైళ్లు ఎన్నడూ బస్సులో ప్రయాణముచేయని ఆదంపతులకు లారీఅదుమూ, బండిచుట్టూ లేచినదుమ్మూ ఎంతో వేదనను కలిగించాయి.

కాని బొంబాయి సమీపించేసరికి ఆకాశాన్ని అంటుతున్నమేడలూ, దుమ్ములేకుండ అలికివుంచినట్లున్నఆవీధులూ ఎంతో పనితొందరమీద పోతున్నట్లున్న ఆమనుష్యులూ, కార్లూ, ట్రాములూ వీళ్లదృష్టిని



ఏలూరు గవర్నమెంటు హైస్కూలు 'పేరెంట్సు డే' సందర్భమున స్కూలు బాలికలు భరత నాట్య ప్రదర్శనము గావించిరి. ఇందు నాట్యముచేసిన బాలికలు, వారికావిద్య గరపిన ఉపాధ్యాయురాలగు శ్రీమతి చేబియ్యం కామేశ్వరమ్మగారును కలరు.



'గ్రామ జీవనం'

కుమారి

టంగుటూరి సూర్యకుమారి

సారథివారి

'రైతుబిడ్డ'లో



జమీందారుని ఆకర్షించడానికి నాట్యం అభ్యసిస్తోంది

సుందరమ్మ

ఆకర్షించి, అలసటను మరపింపచేసినవి. ఇంతలో గమ్యస్థానము కల్బాదేవిరోడ్డులో ఒక ఏడంతస్థుల మేడను చేరారు. పైఅంతస్థులో ఒకచిన్న బాల్కనీ వెనుకనుండి మెలికల మెట్లూవున్న ఒకగదిని వీరుండుటకు సేటుగారి మనిషి చూపాడు. ఒకటి లేక రెండు గదుల్లో కాపరము చేయాలసివచ్చినా, బొంబాయిమేడలు సంసారమున కనుకూలముగా వుంటవి. ఒకవైపు చిన్నఅరుగు, దానిమీద ఒకవైపు పంపు, జలదారి. ఇంకొకవైపు గ్యాసు ట్యూబుతో అమిర్చిన రింగువున్నది. సామానులు మేడలోవున్న 'భయ్యా' పైకి తెస్తూంటే గది నలువైపులా దృష్టిసారించి గ్యాసురింగును చూచి 'ఇదిఏమిటండీ' అని మాధవమ్మ అడిగింది. రబ్బరుట్యూబు చివరవున్న చిన్నవైపుకుండే లాటి మరతిప్పి బుస్సుఅని పైకివచ్చిన గ్యాసును చేత్తోతాకిచూపి అగ్గిపుల్లగీచి అంటిస్తే ఆయినపచక్రములోవున్న చిన్న చిన్న రంధ్రాలన్నీ చిన్నచిన్నమంటలుగా అంటుకున్నవి. 'దీనిమీద బియ్యము పప్పు కడిగిపెట్టితే నిమిషములో ఉడికిపోతవి. సీమలో బొగ్గు, కట్టెలతో వంట చేయరు. ఈగ్యాసుతోనే. కాని జాగ్రత్తసుమా. ఎప్పుడన్నా ఈమరతిప్పి మర్చిపోయేవు. ఈగ్యాసు గదంతానిండితే మనము చచ్చి పోతాము'—అన్నాడు.

*
* *

బొంబాయివచ్చి ఒక ఏడాదియైనది. ఆపాతికలోనే, ఆ ఒక్కరూములోనే ఎంతోజాగ్రత్తతో కాలము గడుపుతూవచ్చారు ఆదంపతులు. ప్రొద్దున్నే స్నానముచేసి బజారుకెళ్లి కాయగూరలు తెచ్చియిచ్చి మూడో అంతస్థులోవున్న సేటుగారిపిల్లలకు చదువుచెప్పను వెళ్లేవాడు. 10 గంటలవరకూచెప్పి తరువాత దుకాణానికి వచ్చిన కరెస్పాండెన్సు, ఇంగ్లీషుదిచదివి, వినిపించి వాటికితగిన ఉత్తరాలువ్రాసి, 11 గంటలకు మళ్ళీ తన రూముకి వెళ్లేవాడు. భోంచేసుకొని కూర్చుని సినేరియోలువ్రాయ మొదలుపెట్టేవాడు. 4 గంటలకు మళ్ళీ సేటుగారిపిల్లలను 5 కొట్టేవరకు చదివించి బైటకి వెళ్లేవాడు. తానువ్రాసినకథలు ఎవరన్నా కొంటా రేమో అని ఆశ. తానుచూసే రంజీటు, వాడియా వారికథలవంటి తనకథ సినీమాగామారితే ఎంతో బాగుం టుందన్న దృఢవిశ్వాస మాతనికున్నది. కాని తనకథారచనాశక్తి ఎవరికన్నా తెలిస్తేగా.

*
* *

ఒకనాడు మధ్యాహ్నము రెండుగంటలైనాకూడ యింటికిరాని భర్తకొరకు మాధవమ్మ ఎదురుచూస్తూ వుంది. ఆకలివల్ల ముఖమువాడివుంది. పాతికరూపాయల రాబడిలో ఆ ఇల్లాలు భర్తకు అన్నివిధములా సంర క్షణచేస్తూ కాపురమెల్లా చేస్తున్నదో ఆ మాధవమ్మకే తెలుసు, అన్నీచూసే భగవంతునికే తెలుసు. ఇంతలోనే ఉల్లాసంగా చిరునవ్వులొలుకు ముఖముతో బిల్డింగు వెనుకవైపున్న మెలికలసోపానాలెక్కి వస్తూవున్నభర్త గోచరించాడు. 'ఆనవ్వు, కులాసా యెల్లావస్తుందోగదా, కడుపులో మాడుతూవుంటే' అని ముఖము చిట్లించు కొంటూ లేచింది మాధవమ్మ. 'మళ్ళీ వాపసువచ్చిందిసుమా—మొన్న పంపినకథ. ఆసినిమా డైరక్టర్లను చూస్తే నాకు నవ్వువస్తుంది' అన్నాడు పైయుత్తరీయము గోడనున్న హుక్కుకితగిలిస్తూ. పెనిమిటికి భోజనము సిద్ధముచేస్తూ 'ఒక్కకథన్నా ఈనెల అమ్ముడుకాకపోయెను. ఈపాతికరూపాయల్లో ఎంతయింటద్దె లేక పోయినా, పిల్లలులేకపోయినా ఏమిసంసారము జరుగుతుంది. అక్కడికీ ఒకపప్పు, అన్నమే తింటున్నాము నెలకు 20 రోజులు'అంది. అన్నములో పప్పు కలుపుకొంటూ నేతికొరకు భార్యముఖము చూచాడు. 'నేతి గిన్నెలో అడుగునవున్న ఒక్కచుక్కనూ రాల్చి (గుడ్లనీళ్లను గుడ్లకు గుక్కుకుంటూ 'ఈవూర్లో అడుగు పెట్టాము, వెన్నకాచిననేతినే మర్చిపొయ్యాముగదా! పెరుగెల్లాంటిదో ఎరగనేఎరగము, మాకు జబ్బు

చేస్తుందేమో అని బెంగగావుంది' అన్నది. తానెన్నిమాట్లాడినా జవాబుచెప్పక తింటున్న నిరంజనుడు తలయెత్తి, 'మాధవీ—మనకు ఓపికపట్టడమనేది వుండాలిసుమా, నవ్వేశక్తి మానవుడికెందుకిచ్చాడనుకున్నావు భగవంతుడు. ఇంగ్లీషువాండ్లు దాన్నే Sense of humour అంటారు. ఆ Sense of humour కష్టసమయాల్లో అక్కరకు వచ్చేందుకే,' అని మజ్జిగైనా లేకపోవుటచేత చారన్నముతిని, ఇక తప్పేలాలో అన్నము లేకపోవడముచేత భార్య తిన్నదేమో అనుకుని కంచంలోనే చెయ్యి కడుక్కున్నాడు. పల్లెటూరిపిల్లగు మాధవమ్మకు పెనిమిటి తిన్నతరువాత అతనికంచంలోనే తినడము అలవాటు.

భోజనానంతరము చిత్తుకాగితాలూ పెన్సలూ పట్టుకుని తీరుబడిగా కూర్చుని ఏకదీక్షగా మరొక కథను వ్రాయపూనుకున్నాడు. వ్రాతముగించేసరికి 5 కొట్టారు. అంట్లు తోముకొని, బట్టలుతుక్కుని చిరిగినబట్టలు కుట్టుకునేటప్పటికి మాధవమ్మకుకూడా 5 అయింది. మర్నాడుప్రొద్దున ట్యూషనుముగించుకొని, తానువ్రాసిన 'సుషమ', అన్నకథనుపట్టుకొని సాగరుటాకీసువారి డైరక్టరు దర్శనార్థమువెళ్లాడు నిరంజనుడు. తనపేరువ్రాస్తే అవతలనుంచే పంపివేస్తారేమోనని తాను చదువుచెప్పుతున్న పిల్లలసేటుగారిపేరువ్రాసి కార్డు లోపలకంపాడు. ఒక పావుగంటతరువాత చీప్రాసీ లోనికిరమ్మన్నహుకుము తెచ్చాడు. తాను సమర్పించినకథ నటుయిటూత్రిప్పి పైపేజీమీదవున్న Synopsis చదివి వెంటనే చేతికిచ్చేశాడు, 'పబ్లికు మెచ్చరు, ఇంత Serious కథను emotionalగా వున్నకథ ఎవరికర్థమాతుంది. కథలో మంచి Stunts వుంటేBox office Success ఔతుందిగాని' అన్నరిమార్కుతో. మళ్లీ—చిరునవ్వుతో ఆకథను మడిచి జేబులోపెట్టుకొని యింటికి దారి పట్టాడు. మళ్ళీ యథాప్రకారము మాధవమ్మ భోజనముచేయక ఎదురుచూస్తూవుంది. భార్యను తిన్నావా లేదా అని అడగకుండానే భోజనముచేసి చిత్తుకాగితాలూ పెన్సలూపెట్టుకొని మళ్లీ వ్రాత మొదలుపెట్టాడు. 'నాకోసర మెదురుచూడవద్దు, భోజనము చేసేసేయి, చాదస్తాలు పెట్టుకోకు'—అని భార్యనెన్నోసార్లు మందలించాడు పాపము. ఈనాడు నిన్నటివలెనే 2 కొట్టారుగదా—భోజనము చేసేసిందేమో అనుకున్నాడు. ఈసారి చాలా జాగ్రతతో ఇంకొకకథను వ్రాశాడు. 'పరుసవేది' అన్న ఆకథను తప్పక ఎవరన్నాసరే స్వీకరిస్తారన్న గాఢనమ్మకముతోచింది. పారిసుపట్టణములో ఒకబీదసంసారములో మునుగుచూ తేలుచూ దరిద్రములపాలైనట్టి క్యూరీదంపతుల ఆదర్శజీవితమును, ప్రసవించిన మూడోరోజు నీరసముగానున్న పచ్చి బాలెంతరాలు రేడియముకొఱకు చేసిన రసాయనపరిశోధనను మూలాధారముగాగైకొని వ్రాశాడు. మహాశయములు మహాపురుషులనుగా చేస్తవనిప్రబోధించు ఆకథను టపాబిళ్లలతో మదన్ థియేటర్సువారికి రిజిస్టరు చేశాడు. వారమురోజులైంది. తానుపంపిన వాపసురాలేదు. ఒకవేళ స్వీకరించారేమో కంపెనీవారు అను కుంటే, చెక్కు పంపకపోయినా ఒకఉత్తరమైనా వ్రాయలా—ఏమో! అని నిరుత్సాహపడ్డాడు. మళ్ళీ ఇంకొకటి వ్రాయ మొదలుపెట్టాడు చిరునవ్వుతో, నవ్వేశక్తిని భగవంతుడిచ్చినందు కెంతో కృతజ్ఞతావందనములర్పిస్తూ. లేకపోతే యిల్లాంటి కడగండ్లు ఆశాభంగాలూ దాటేదెట్లా? ఈనెల ఎన్నోరూపాయలు తపాలబిళ్లలకూ రిజిస్టరుత్తరాలకే అయిపోయినది. ఇంట్లో గ్రాసము దగ్గరపడుతూందే—భార్య దినదినమూ నీరసించి పోతున్నదే, దిగులుపడి వుంటూవున్నదే, కారణమేమా? ఈఆలోచనలే లేవతనికి. తప్పక తనకథలు ప్రకాశమానములై తనపేరు ప్రతిసినీమా Advertisement మీద ప్రజ్వలిస్తుందన్న గాఢవిశ్వాసము నాటుకొని యున్నది. ఆగొంతెమ్మకోరికలలో లౌకికమే తెలియకుండా వచ్చిందతనికి.

# సినిమా కథ

ఒకనాడు జడివాన కురుస్తూవుంది. బైటికి వెళ్లడానికి వీల్లేకనూ, వ్రాయడానికి చిత్తుకాగితాలైపోవడం చేతనూ నిరంజనరావేహో ఆలోచిస్తూ బిచానాచుట్టనానుకుని చాపమీద కూర్చున్నాడు. తానువ్రాసిన కథలన్నిటిలోనూ మంచిపట్టుగావున్న సందర్భాలన్నిటినీ ఒకచోచేర్చి ఒకేకథగా కూరిస్తేనన్నా ఆ డైరక్టర్లు మెచ్చుతారేమో, Action, Emotion, Pathos, Comedy, Tragedy అన్నీకలిపి...అప్పుడాకథ నెవరూ తీసుకోకపోతే ఇకసినేరియోలు వ్రాయుట విరమించుకుందామని తీర్మానించుకున్నాడు. ఇక ఆచివరిప్రయత్నానికి యథాప్రకారము విరామంలేకుండా ఏకదీక్షగాకూర్చుని మళ్ళీ మొదలుపెట్టాడు. ముందు జేబులో తడిమి ఒక బేడడబ్బులైనా కాగితాలకి దొరక్కపోతే ఏమిచేయాలో తెలియక భార్యవేపుచూచాడు. వీధిలోకి వాననుచూస్తూ పరధ్యానముగా కూర్చున్నమాధవమ్మ యితన్నిచూడలేదు. చటుక్కున భార్య చాల నీరసించిపోతూవున్నదన్నసంగతి అతనికితోచి 'సుస్తీగావుందా' అన్నాడు. 'ఆ! ఏమిటి'–'ఒక బేడడబ్బులుంటే యివ్వూ'—నిశ్శబ్దముగాలేచి కొంగునివున్న 8 కానులూ పెనిమిటిచేతిలోపెట్టి 'ఇంతేవున్నవి' అంది.

చటుక్కున ఆవానతుప్పరలోనేవెళ్ళి నిమిషములో కాగితాలుపట్టుకువచ్చి వ్రాత మొదలుపెట్టాడు. అతని వయస్సుచూస్తే ఎంతటివారికన్నా వుత్సాహముపుట్టుతుంది. ఇక చిత్తూ సరీ రెండు వేర్వేరువ్రాయకండా ఒకటే వ్రాయదలచుకుని సిరాబుడ్డి కలము తెచ్చుకుని కూర్చున్నాడు. ప్రాతకథలసంపుటిని ముందువేసుకుని కథపట్లు ఏరడముకు పూనుకున్నాడు. రాత్రి 8 అయ్యేసరికి కథముగించాడు. కథకు 'చిత్రమయజగత్తు' అని పేరుపెట్టాడు. 'ఈదినము నాకు భోజనము అక్కరలా, ఆకలిలేదు' అని భార్యతోఅన్నాడు. 'అసలీవేళ సోమవారము, ఉపవాసమేగా' అని జ్ఞాపకముచేసింది భార్య. మర్నాడు ట్యూషనుముగించుకొని బయటికి వచ్చి చిత్రమయజగత్తులో డైలాగ్సు కొంచెము నిడుపుగా వుండాలిఅని కైలాస్‌వారి డైరక్టరు Remark చేసి వాపసుచేసినాడని భార్యకుచెప్పి మళ్లీ వ్రాతకుకూర్చున్నాడు. 'రాత్రి బాగాఐంది, భోంచేయరూ' అంది భార్య. పాలుంటే ఒకకప్పుటీచేసి యివ్వు. ఆకలిలేదు. అని 10 గంటలకు ఒకకప్పు టీత్రాగి అలసిపోయి నడుమువాల్చాడు. మర్నాడు శుక్రవారము ట్యూషనుకు సెలవు. స్నానముచేసి మళ్లీ వ్రాతకుకూర్చున్నాడు. 12 గంటలకు భోజనముచెయ్యండి అని మాధవమ్మ అడగనూలేదు, తాను అన్నముపెట్టమని అడగనూలేదు. 'తక్కువనోములునోచి ఎక్కువఫలములు కోరితే యెల్లాగు' అని ఏమిటో భార్య నసుక్కోవడము విన్నాడు. కాని తాను తలయెత్తి 'ఏమిటీ' అని అనలేదు. రాత్రి 8 గంటలకుమాత్రము 'పచ్చి మంచినీరన్నాత్రాగలేదు. అన్నమసలే తినలేదు. ఆకలిలేదూ' అంది. 'నీవు పెట్టితేగా తినడానికి' 'బియ్యము 4 రోజులక్రిందనే దగ్గరపడ్డవని చెప్పాను. మీరు ఎందుకిలా నన్నుబాధపెట్టుతారు అంది. అబ్బ నన్నువిసిగించకు, నీఏడుపే నాకింత దరిద్రము.' అని కసిరాడు. అన్నా, అని ముఖముచిట్లించుకుంది. ఎన్నడు యింతతీవ్రముగా, యింతకఠినముగా అతను మాట్లాడలేదు. సరే ఇంతలో వ్రాతముగించి ఉత్తరీయము పైనవేసుకుని వెళ్లిపోయాడు.

*
* *

ఆ ఆఖరుప్రయత్నానికి పూనుకున్ననాటినుండి తాను సరిగా భోజనమేచేయలేదనిన్నీ, భార్యఅయినా తిన్నదోలేదో అనిన్నీ అతనికితోస్తేగా! పైగా 3 రోజులున్నుంచి భార్య యింట్లో కటికిపస్తులుంటున్నదన్న సంగతి అతనికి తెలియదు. ఇద్దరికి అన్నమువండితే బియ్యముచాలవు. పెనిమిటి పనిమీదఉన్నాడని 4 రోజుల

బియ్యము 7 రోజులు పెనిమిటికే సరిపెట్టింది. ఒకసారి గ్రాసనుసంగతెత్తితే ఈనెలజీతము Advance తీసుకున్నాను, పైనెల్లో కాని జీతమురాదు. తప్పక ఒక్క కథన్నా అమ్మకముకావాలి' అన్నాడు. ఏదో ఒక నాడు గొప్పఅదృష్టము కొట్టుకొస్తుంది. New Theater's వారికథలకంటే తనకథలే చాలాబాగున్నవి ఇండియా అంత పేరుమ్రోగిపోతుంది. ధనలక్ష్మి యింట్లో చిందులుతొక్కుతుంది అన్నఆశే అతన్ని వెనుకంజ వేయనివ్వడములేదు. ఆమొండితనమూ, ఆపట్టుదలా, ఆఉత్సాహమూ, ఆచిరునవ్వుచూచి భార్య తెల్లపోయేది.

డైలాగ్సువ్రాసి తీసుకువెళ్లితే కైలాస్‌వారి డైరక్టరుదర్శనమే దొరకలేదు. 2 అణాలు 'టప్పా'తీసుకుని చప్రాసీదొరగారు వెళ్లిపోయారు అనిచెప్పాడు. ఆకథనుతీసుకుని దాదరుకు ట్రాముయెక్కి Sagar వారి డైరక్టరింటికే వెళ్లాడు. మంచివేళ ఆయన యింట్లోనే వున్నాడు. ఆయనభార్య ఎవరాఅనిచూచి పెనిమిటికి చెప్పింది. సరే, ఓపికతోవిని ఇన్ని Situations shoot చేయడము Studio లో చాలా Expensive అని చూస్తాను, ఆలోచిస్తాను అని కథనుతీసుకుని పంపించేశాడు. తిరిగి ట్రాములోపోవడానికి జేబులో దమ్మిడీ లేక నడిచిపోయాడు. కాల్నడకను కల్బాదేవి చేరేసరికి 2 కొట్టారు. ఉపవాసవ్రతముతో వాడిన ముఖముతో బాల్కనీలో నిల్చుని క్రిందవీధిలో చీమలబారువలె బోతూన్న కార్లనూ ట్రాములనూ చూస్తుంది మాధవమ్మ.

'ఇవ్వాళ వీధిలోనేకూర్చున్నావు పనితీరిందా'అని కులాసాగా పలకరించాడు ఆమెలికలమెల్లెక్కుతూ నిరంజనుడు. అతనికి ఆకథను వాపసివ్వకపోవడమే ఎంతో గొప్పగావుంది. 'ఏమన్నాడు డైరక్టరు. ఎన్ని రూపాయలిచ్చాడు ?' 'కథ ఓపికగావిన్నాడు. తక్కినవాళ్లకి చూపిగదూ నాకు డబ్బిచ్చేది ?'

మా:—మీరువెళ్లాక మామేనత్తకొడుకు సుబ్బారావు వచ్చాడు. వ్యాపారంపనులమీద బొంబాయివచ్చాడు. ఇల్లుదొరక్క చాలా వెదికాడట.

ని:—అల్లాగా, అంతాబాగున్నారా ? మీవాండ్లు ?

మా:—కూచోమంటే భార్య ముత్యాలు ఒకసరముకొని చంటిపిల్లకు బంగారుతీగలో కట్టించమందట, జావేరీబజారువెళ్లాలి అని భోంచేయమంటేకూడా చేయకుండా వెళ్లిపోయాడు. అవిగో ఆపళ్లు, మిఠాయి అతనే తెచ్చింది.

ని:—నిన్ను నాకివ్వకపోతే అతనిభార్యవే అయివుందువుగా. అన్నాడు కొంటెగాచూస్తూ.

మా:—బి. ఏ. ప్యాసయ్యారు, గొప్పవుద్యోగముచేసి బంగారముపూత పూస్తారు నాకు అని మానాన్న అప్పుచేసి 1116 రు. కట్నమిచ్చి మీకు పెళ్లిచేయకపోతే, మెట్రిక్లేషను తప్పినవానికి వ్యాపారము చేస్తున్న వానికియిస్తే సుఖపడను అనుకున్నాడు మానాన్న.

ని:—అసలు మీమారుతల్లి ఆడబిడ్డమీద పంతానికి నిన్ను బైటయిప్పించలా ?

మా:—ఆ ఇరుపోటీలమీద యిల్లుచెడ్డది. వాయువెప్పులమీద కల్లుచెడ్డది.

ని:—సామెతలు బాగావచ్చే; అని నవ్వుతూ; నీకు నామీదకంటే మీబావమీదే ఎక్కువమనసున్నట్లుంది. ఇక Divorce Bill కూడ Pass అవుతుందికాబోలు.

కోపములో ముఖము చిట్లించుకుంది. ఆపల్లెటూరి పిల్లకు ఈ బి. ఏ. వెనిమిటి సరసము చాలా పోటని పించింది. 'ఆకలి లేదు. పొద్దుపోవడమువల్ల చచ్చిపోయింద'ని నీళ్లుత్రాగి పడుకున్నాడు. భార్య కోపంమీదు న్నదని ఆమెను తినమని అడగలేదు, ఇంకా కోపమెక్కువౌతుందని. సాయంత్ర మూడుగంటలకు షికారు వెళ్లుతూ రమ్మనిపిల్చాడు. రానంది. 'ఇంకా నీపురాతనపు ఛాందసాలు వదలవే'అని వెళ్లిపోయాడు.

౬

వీధిలో స్నేహితుడెవడో కనపడి 'హిపాటీ'కి పిల్చుకుపోయి, దగ్గరలేవున్న తనయింటికికూడ ఆహ్వానించి, భోజనముపెట్టి, సినీమా రెండో ఆటకు తీసుకుపోయాడు. ఇంటికి తిరిగివచ్చేసరికి సరిగా 12-30 అయింది. అసలు ముఖము ముడేసుకు తిరుగుతూంది. ఏమంటుందో గదా అని జంకుతూ మెల్లగామెట్లెక్కి తలుపు తట్టబోయేసరికి నిశ్శబ్దముగా అది లోపలికి తెరుచుకుంది. నిరంజనునికి ఏమిటో వళ్లు జలదరించింది. భార్య ఎదురు చూచిచూచి అల్లాగే పడుకుని నిద్రపోయిందేమో అనుకుని తలుపుప్రక్కనవున్న ఎలక్ట్రిక్కు స్విచ్చికొట్టి తసిమి వెలిగించాడు. దీపము వెలుగలేదు. 'మాధవీ, మాధవీ' అనిపిలిచి పొయ్యిఅరుగుమీదవున్న అగ్గిపెట్టెతీసి పుల్లగీచాడు. ఆవెలుగున భార్య ఎక్కడా అగుపడలేదు. బిచానాచుట్ట పరిచవ్నాలేదు. తాను కూర్చుని కథలువ్రాసుకొనే చాపమీదమాత్రము 3 ఉత్తరాలు పడివున్నవి. భార్య అవతలకివెళ్లిందేమో అనుకుని, ఎలక్ట్రిక్కుబల్బు Fuse అయిపోయిందేమో అనుకుని, రోజూ రాత్రిళ్లు వెలిగించుకునే Bed Light వెలిగించాడు.

ఒకవుత్తరము మదన్‌థియేటర్సువారి ముద్రలోవచ్చిన కవరు, సరే తానుపంపిన 'పరుసవేది' అన్నకథ వాపసువచ్చిందేమోఅనుకుని 2 వ కవరు విప్పబోతూంటే అతనిదృష్టి మడచిన అమూడో కాగితపు ముక్కమీదకుపోయింది. ఎవరు వ్రాసివుంటారు అని ఆచీటీని విప్పిచదివేసరికి కళ్లు చీకట్లుకమ్మిపోయినవి. చిన్న పిల్ల దస్తూరీలో మాధవమ్మవ్రాసిన చీటీఅది.

"మీచేతుల్లోనే కళ్లుమూసుకోవాలన్నఆశ ఎంతోవుండేది. ఇలా వెళ్లిపోతూన్నందుకు మన్నించండి. భార్య దగ్గరవుంటే అన్నముపెట్టాలి, బట్టలుకొనాలి. ఈకష్టసమయములో మీకు నేనొకభారాన్ని. ఉత్తరం తెచ్చిన సేటుగారి చప్రాసీచెప్పాడు, మీరు యిక ట్యూషను చెప్పనక్కరలేదని. నమస్కారాలు. మిమ్మ లెన్నోసార్లు విసిగించాను; మర్చిపోండి. ఇట్లు, మాధవి."

ఈచీటీచూచి ప్రక్కనవున్న సేటుగారి కవరువిప్పాడు. ఇక అతనిట్యూషను అవసరములేదనిన్నీ, ఆఫీసుకువస్తే ఒక నెలజీతము ఎక్కువ యిచ్చేస్తామనిన్నీ, 24 గంటలలో రూము కాళీచేయవలసిందనిన్నీ, పిల్లలకు అతనిచదువుతోబాటు సినీమావెఱ్ఱి ఎత్తిందనీ, చాలాకటువుగా సేటుగారిదస్కత్తుతో మునీమువ్రాసిన వుత్తరమది. భార్యచీటికితోడు ఈ ఉత్తరముచదివేసరికి నిరంజనునికి కాళ్లుచేతులు సడలిపోయి, నీరసించిపోయి పడిపోయినట్లయిపోయింది ప్రాణము. మాధవమ్మ ఎక్కడికివెళ్లిపోయిందోగదా, వాళ్ల మేనత్తకొడుకు తీసుకువెళ్లివుంటాడా? ఆహా, ఎంతపొరబాటు! అగ్నిలాంటియిల్లాలిని అలా అనుకోవడముకూడా పాపం గాదూ? అయ్యో! మాధవీ, మన్నించవు? పరధ్యానంగానే పోస్టులోవచ్చిన కవరువిప్పాడు. నిస్పృహుడైవున్న అతనిదృష్టి కవరులోవచ్చిన ఊదాకాగితము మీదపడ్డది. అది సెంట్రలుబ్యాంకుమీద మదన్‌థియేటర్సువారి డైరక్టరు దస్కతుతోవచ్చిన 4 వేల రూపాయలచెక్కు. తప్పిపోయిందనుకున్న తన 'పరుసవేది' అన్న కథను కలకత్తావారు స్వీకరించినట్లున్నూ, దానికిమూల్యము సర్వస్వామ్యములతో అమ్మటకు 4 వేల రూపా

యీలచెక్కనూ, తన కథారచనా చమత్కృతిని పొగడ్తూ వ్రాసినవుత్తరమునూ చూచాడు. అతనికీవార్త సంతోషాన్నిగాని, విస్మయాన్నిగాని కలిగించలేను. 'మీకథను ఎవరన్నాకొని ఎన్నో వేలరూపాయలు గుమ్మరించిననాడు చూచుకుందాములెండి' అని భార్య దెప్పుతుండేది. చటుక్కున మాధవమ్మేదీ...?...? భార్య చీటీ మళ్లీ చదివాడు, తల పంకించాడు. బొమలుముడివేసి దీర్ఘముగా తలుపవతల చీకట్లోకి చూశాడు. ఎక్కడకువెళ్లిందోగదా! చప్పున స్పృహకుతట్టింది. ఆ! ఏమా! గ్రహించుకున్నాడు. మానవతియగు యిల్లాలు పస్తులుండలేక, భర్తకు భారంగాతోచకుండా వుండడానికేమిచేస్తుందో తనకుతెలీదూ! తానువ్రాసేకథల్లోని Heroine ఆ ఒక టాక్సీలోఎక్కి ఇంకోపురుషునితో భర్తమీద క్రోధముచల్లారేవఱకూ షికార్లుతిరగడానికి ఎంతబీదరికము వుంటేమట్టుకూ, ఎంత నిరాశగలిగితేమట్టుకు హిందూస్త్రీ భర్తను కనిపెట్టుకుని పడివుంటుంది. లేదా నూయో గోయో చూచుకుంటుందిగాని. అన్నా—అర్థమైంది. "మాధవీ ఎంతపనిచేశావు. నీవుండబట్టే గదా ఎన్నికష్టాలొచ్చినా ఓర్చుకోగలిగాను?" చెక్కుచూశాడు 4 వందలా, 4 వేలా? అబ్బో! 4 వేలే. 40 వందలు, 160 పాతికలు, 160 నెలలజీతము ఒక్కనాడే! పట్టలేనంత నవ్వువచ్చింది. గొల్లుమని ఒక్కనవ్వు నవ్వాడు. భగవంతునిసృష్టికోటిలో ఒక్కమానవుడేగద నవ్వగలడు! ఇలాంటిసందర్భములో నేగదా నవ్వగల శక్తి ఎంతో అవసరము!

౭

నిరంజనుడు యథాప్రకారము చిరునవ్వుతో లేచివెళ్లి ఒకకాగితముతీసుకుని దానిమీద వ్రాశాడు. 'ఇక నేను సహించలేను' అని. అశ్రువు లతనికి తెలియకనే చెక్కిళ్లమీదనుండిజారి అక్షరాలమీదపడ్డవి. ఆచీటీని ఆచెక్కుకిగ్రుచ్చి, దాన్ని మాధవమ్మఉత్తరానికిగ్రుచ్చి కవరులో పెట్టేశాడు. లేచివెళ్లి తాను వ్రాసిన వ్రాతకథలసంపుటిని పట్టుకువచ్చి చింపి ప్రోగుచేశాడు. వెళ్లి తలుపుమూసి గడను పైకెత్తేశాడు, ఆతొందరలో గడను ప్రక్కకుతిప్పాలి, లేకపోతే ఎవరన్నా అవతలనుంచి గట్టిగాకొట్టితే చిటుక్కుని క్రిందకుపడి వూరుకుంటుందని తోచలా. గట్టిగా గాలివీచినా పడిపోతుంది. చింపినకాగితాలని తలుపుకీ, కిటికీకీ, సందుసందులను దోపేశాడు. తనప్రక్కవిప్పి చక్కగాదులిపి పరుచుకున్నాడు. బొంబాయివచ్చాక ఈవొక్క నాడు తనకు మాధవమ్మ ప్రక్కవేయలే. గ్యాసు రింగుదగ్గరకువెళ్లి గ్యాసువచ్చేపైపును పూర్తిగా త్రిప్పివచ్చి దీపము ఆర్పేశాడు. దుప్పటితీసుకుని బాగాకప్పుకుని కండ్లు గట్టిగామూసుకొని పడుకున్నాడు. అతనికొకటే తోచింది. తాను చాలా అలసిసొలసి ఆవేదనలో వున్నాడనిన్నీ, గాఢనిద్ర ఆ అలపును బాపుచేస్తుందనిన్నీ, త్వరలో పరలోకములోనున్న మాధవిని చేరబోతున్నానుగదా అనుకున్నాడు. పాపము! ఇంతలో బాగా నిద్రపట్టిపోయింది.

౮

అర్ధరాత్రివేళ నిరంజనునికి మీద ఏదోపడ్డట్లయి గప్పున మెలకువవచ్చింది. ఎవరో ఒకవ్యక్తి పడుకున్న తనమీదవ్రాలి తనను గట్టిగాపట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తూన్నట్లుతోచింది. చప్పునలేచి కూర్చున్నాడు. మాధవమ్మ బెదిరిపోయిన లేడిపిల్లలాగు తనపక్కలోకూర్చుని తన్ను గట్టిగకౌగలించుకొని రోదనముచేస్తూంది. 'నేను చేయలేకపోయానండీ, ధైర్యము చాల్లేదండీ' అనిఅంటూ. నిరంజనునికింకా నిద్రమైకము వదలలేదు. 'ఎవరూ, ఏమిటీ?' అని కలవరిస్తున్నాడు. 'అయ్యో! ఏమిచేద్దామండీ, అయ్యో, అయ్యో! తెలవదా సేటుగారిభయ్యా చీటీతెచ్చియిస్తూ మీట్యూషను అవసరములేదు. పిల్లవాండ్లకు చదువుకుబదులు సినిమా

కంపెనీ తెరవాలి, నటన గొప్పకళ అని యేమేమో పిల్లలకు నేర్పారట. ఇకముందు పెద్దవాళ్లైతే ఉన్న డబ్బంతా సినీమాలకు, నాటకాలకు తగలేస్తారన్న భయముపుట్టి మిమ్మల్ని వద్దన్నారట. ఈకష్టంతా మునీ మది. అతని మేనల్లుడు మొన్నే బి. ఎ. పరీక్షకు వెళ్లాట్ట. 24 గంటల్లో గది కాళీచేయమని, అన్నీ సర్దుకో మని నాకుచెప్పాడు. అయ్యో ఏమిచేద్దామండీ? ఎవరో ఒకమనిషివచ్చి ఎలక్ట్రిక్కుబల్బు తీసుకుని గ్యాసు మీటరుదగ్గర ఏమిటోనొక్కి వెళ్లిపోయాడు. వంటచేదామంటే పొయ్యిమండలేదు. ఇంట్లో అసలే బియ్యము లేవు. నాకెంతో చిన్నతనమనిపించాయి నేటుగారిపనులు.' అని కన్నీరుకార్చుతూ చెప్పింది. నిరంజనుడు మాట్లాడలేదు. నాలుకరాలేదు. గొంతుఆరిపోయింది. 'డాబామీద నుంచన్నా పడిచస్తే బాధ విరగడై పోతుంది అని యింతసేపు పైనకూర్చున్నా. సుబ్బారావు యింటికి రాకూడదూ? ఒకనెల్లాళ్లపాటు...అమ్మ బోజా నిన్నుతల్చుకుంటుంది అన్నాడుకూడ. ఇలాటిసందర్భములో వెళ్లితే మీరేమనుకుంటారో అని ఆత్మ హత్య అన్నిటికీ త్రోవఅని తోచింది. అయ్యో! అన్నమన్నాతినక పడుకున్నారే. ఏమండీ మాట్లాడరూ?' అని వెనిమిటిని యింకా గట్టిగా అమముకుంది.

ఇప్పటికి బాగా జాగ్రదవస్థకువచ్చి భార్యమాటలన్నీ వింటున్న నిరంజనుడా చీకట్లో వణకుచున్న భార్యదేహాన్ని తన రెండుబాహువుల్లోకి లాక్కొని గట్టిగా కౌగలించుకుని పెదవులమీద ఒకముద్దుపెట్టుకుని బిగ్గరగా ఒక్కనవ్వునవ్వాడు. ఎంత Sense of humuor అతనికుంది!

నేటుగారికోపమూ, మునీముగారి కుట్రా, గ్యాసుకంపెనీవాడువచ్చి గ్యాసు కట్టివేసివెళ్లడమూ నిరంజనుని ప్రాణాలని కాపాడినవి. భర్తనువదలి వెళ్లలేక తమ మిథునానురాగమే మాధవమ్మప్రాణములు దక్కించినది.

—

"పరుసవేసి" 6 వ వారము, 12 వ వారము, 20 వ వారము, నిరంజనరావుగారికథ, మదన్ థియేటర్సు వారిది." అన్న సినీమా Advertisement చూచినప్పుడల్లా మాధవమ్మకు 'Sense of humuor ఉండాలి' అని భర్త అన్నమాటలు వినపడుతూ వుంటవి. సహనము నేసి మనిషికుంటేనే Suceess అనేది వస్తుందికాబోలు!

# జ్వరము

నరములను కండరములను నాశముచేయు విషమే జ్వరములందున్న మహాసర్థము. కాబట్టియే నీవు బలహీనుడవు ఆయాసపరుడవు నయ్యెదవు.

క్రొత్తబలము తెచ్చుకొనుటకు వ్యర్థమైన కండరముల పునర్నిర్మితము చేయవలెను. కాని అతి బలహీనావస్థనున్న నీకడుపునకు సామాన్యపదార్థముల జీర్ణించుకొను శక్తిలేదు.

ఇతరాహారములను వాంతి చేసికొన్న జ్వరగ్రస్థులు హార్లిక్సును జీర్ణించుకో గలరని భారత దేశమునగల అందరు డాక్టర్లును నిశ్చయించియున్నారు. మీదు మిక్కిలి హార్లిక్సు వ్యయ మగుచున్న కండరముల అపును. నీ శరీరమున కంతటికిని క్రొత్తబల మొసగును.

అనతికాలముననే ఉత్సాహవంతుడవు, బలవంతుడవు, వీర్యవంతుడవు నగుదువు.

నేడే హార్లిక్సుకొనుడు — ఎల్లచోట్ల దొరకును.

# శారదలేఖలు

సౌభాగ్యవతి కల్పలతకు,

నెచ్చెలీ! ఏమి వ్రాసితివి? కమ్మ, కాపు, వెలమ, రెడ్డి, వేశ్య, వైశ్య, విశ్వ బ్రాహ్మణ, ఒకరేమి ప్రతికులమువారును తమతమ కులసభలనుజరిపి తమతమ కులాభివృద్ధికై పాటుపడుచున్నారా? ఆయాకులములకుజెందిన పురుషులేగాక స్త్రీలును తమ కులసభలతోబాటు ప్రత్యేక స్త్రీసమావేశములుజరిపి స్వసంఘౌన్నత్యమునకై ప్రశంసనీయముగ కృషిసలుపుచున్నారా? ఒక్క బ్రాహ్మణులలోమాత్రమే యీ అభిలాష కనిపించుటలేదా! ముఖ్యముగా బ్రాహ్మణస్త్రీలలో చదువుకొనినవారు పెక్కురుండియు స్వీయసంఘవిషయమై నింతటి యుదాసీనతవహించుట నీకు మఱింతవిచారమును గలుగ జేయుచున్నదా? విద్యావతులైన బ్రాహ్మణస్త్రీలెల్లరుగూడి యొక్క బ్రాహ్మణమహిళా సభనుజరిపి తమసంఘస్త్రీల యభ్యున్నతికిదగిన సూచనలుగావించిన నెంతయో యుపయుక్తముగా నుండునా? అయ్యో! ఏమి నీవెఱ్ఱి! భారతీయ వర్ణవ్యవస్థయేమి, కుల సభలు జరుగమిచే కూలిపోవుటేమి? వేదయుగమునుండి నేటివఱకు యీ హిందూవర్ణాశ్రమధర్మముల విచ్ఛిత్తిజేయ నెన్నియో మతములు, ఎన్నియో సభ్యతలు, ఎన్నియో నాగరికతలు దాడిసల్పినవి, సల్పుచున్నవి. కాని యీ హిందూధర్మభిత్తికనుండి ఒక్క పెళ్లయినను నూడలేదు. మన హైందవవర్ణవ్యవస్థ అతిప్రాచీనమైనది. అది నిన్న నేడు బుట్టి కులసభలయార్భాటముచే అభివృద్ధినందునదియు, ఆయార్భాటములేమిచే నశించునదియు లేదు. వానివాని గుణదోషములనుబట్టి ఉన్నవియుండును. పోయినవిపోవును.

కులసభలు, కులసభలు, అని నీవువాపోవుట నాకు చాలా వింతగలిగించుచున్నది. కులసభల ప్రయోజనమేమియో నాకెంత యాలోచించినను బోధపడుటలేదు. మన దేశములో కష్టనష్టములేవియైన నున్న అవి యావద్దేశీయులను పీడించుచున్నవేగాని యేయొక్క సంఘమువారినో బాధించుటలేదుగదా. చీకటి ఒకచో వెలార్పతగినది ఒకచో నిలువ యుంచదగినదిగా నుండునా? శరీరములో నొకఅవయవము ఆరోగ్యముగా నుండతగినది వేరొకటి చచ్చుకపోవలసినదిగా యుండునా? అటులనే భారతదేశమున నేపురోభివృద్ధి కార్యముజరిగినను సమగ్రభారత జాత్యభ్యుదయమునకు జెందినదై యుండవలయునుగాని యేదోనొక మతమువారుమాత్రమే, తెగవారుమాత్రమే అభివృద్ధినందునదిగా నుండిన ప్రయోజనమేమి? అయినను అదియేమి దురదృష్టమోగాని యీమతసంఘసభలగోడన

మన దేశములో నానాటికి మిక్కుటమైపోవుచున్నది. ఏ తెగ కా తెగ యీవిధముగా స్వసంఘాభ్యుదయ యత్నముచేసిన సమిష్టి భారతకల్యాణకార్యము సుకరముకావచ్చునని కొందఱిభ్రమ. కాని యిది దుర్భ్రమయేగాని వేఱుగాదు. 'నాయన పల్లకీనెక్కుననుసంబరమేగాని తనకు సవతితల్లివచ్చుట కానకుండె'నను సామ్యముగా తమకుల మున్నతికి వచ్చునని మురియుటేగాని దీనివలన మనజాతికి గలుగుచున్నహానిని మనము గుర్తించుటలేదు. అందఱుమానవు లొకటే కావలయుననియు, వర్ణవిభేదముల తొలగవలయుననియు ఒకవంక పాటలుబాడుచు మఱియొకదెస కులములు శాశ్వతముగానుండుటకై కులసభలు జరుపుచుండిన నీవర్ణవిభేద మెట్లు రూపుమాయునో నేను తెలిసికొనజాలకున్నాను. ఒకకట్టడము బాగుగా లేదని తలంచినపుడు దానిని పడగొట్టుటేమంచిది. అది సాధ్యముకానప్పుడు అధమము దానికి మరామత్తులైన చేయించకుండనుండుట తగునుగాని గోడబోయిన గోడ, దూలముబోయిన దూలము, తలుపుపోయిన తలుపు, కప్పుపోయిన కప్పు మరల నేర్పరచుచుండిన ఆకట్టడము మరల సుదృఢమగునేగాని శిథిలమగునా? అటులనే మనప్రాచీనవర్ణవ్యవస్థ బాగుగాలేదనియు, హెచ్చుతగ్గులతోగూడి విభేదకారణముగా నున్నదనియు, యిందువలన జాతిదుర్బలమగుచున్నదనియు నిరసించుచు మరల కులసభలవలనను, సంస్థలవలనను నాకులములు చెక్కుచెదరకుండునట్లు బందోబస్తుచేయుచుండిన వర్ణవ్యవస్థ యెట్లు శిథిలముకాగలదు? ఇవి మాటలకు, తలపులకు, చేతలకు దూరమగు పనియగునుగదా?

కల్పలతా! నీవేఅభిప్రాయముతో కులసభలయెడ అభిమానము జూపుచుంటివోగాని నాకుమాత్ర మిది నచ్చుటలేదు. ఎటిగియో మెఱుగకయో బ్రాహ్మణస్త్రీలిట్టి కులసభను జరుపకుండిరేని నది మంచిపనియనియే నాయూహ. నామటుకు నేనట్టి మహిళాసభ జరుపబడినను పోను. నాఆదర్శము సమిష్టి మానవకల్యాణముగాని కేవలము మనకులముమాత్రమే యున్నతికి వచ్చుటగాదు. నేనేగాదు యెవరైనగాని యెప్పటికైనను భారతజాతియంతయు ఒకే మానవమూర్తియనియు ఇందు వివిధములుగా గనుపట్టెడి వర్ణములన్నియు ఆమానవమూర్తియొక్క అవయవములనియు, ఆ అవయవములన్నియు సమానపాటవము గలిగియుండుటే నిక్కమైనశోభయనియు తెలిసికొనిరేని మనలోమనకు విభేదములే కలుగవు. అట్లుగాక స్వసంఘాభివృద్ధియను నెపమున నీకులసభలను ప్రతికులమువారును జరుపుచుండిరేని తెగకును తెగకునుమధ్య స్పర్ధ, క్రోధము, ఈర్ష్య పెంపొంది జాతిక్షీణతకు హేతువగును. ఈఅనర్థకము గుర్తెరిగియేగదా అఖిలభారత జాతీయోద్యమము నడుపుచున్న కాంగ్రెసు యీవిభేదముల కెడమీయక మెలకువతో ప్రవర్తించుచున్నది. ఇంతటి మహత్తరసంస్థ కాకపోయినను మన భారతమహిళోద్యమముగూడ నీయాదర్శముతోనే సాగింపబడుచున్నది. సరియైనమార్గమిదియేయని యెల్లరెరుంగుదురు. అయినను యీకులములలో

నేమి యాకర్షణగలదో గాని విద్యావంతులును, జాతీయోద్యమములలో కృషిచేయు వారునుగూడ నీకులాభిమానముచే నాకృష్టులై కులసభలకువెడలి మహోపన్యాసము లిచ్చుచుండుట ఆశ్చర్యము గలిగించుచుండును.

మిత్రమా! ఈకులసభలయార్భాటములు, వీనిపై ప్రజలకుగల రాగవిరాగములు జూడ ఐరోపాఖండములోజరిగెడి ఆయుధవిసర్జనసభ నాకు జ్ఞాపకము వచ్చుచుండును. ఆఖండములో అన్నిదేశములవారును నొకచో సమావేశమై అప్పుడప్పుడు ఆయుధవిసర్జన సభయను నొకసభనుజరుపుచు, యేదేశమువారుగాని ఒకరికి తెలియకుండా ఒకరు సంగ్రామ పరికరముల వృద్ధిచేయరాదని తీర్మానించుచుందురు. ఆతీర్మానము నుల్లంఘించినవారు తక్కినదేశములవారిచే శిక్షార్హులగుదురనిగూడ కాగితములపై కట్టుదిట్టము వ్రాసికొందురు. కాని, తాము ఆయుధములు సిద్ధముగా నుంచుకొనకుండిన యితరరాష్ట్రములవారెవరు రహస్యముగా సంగ్రామపరికరముల వృద్ధిచేసికొని తమపై బడుదురోయని ప్రతివారికి లోలోనభయమే. కావున ఆయుధవిసర్జన సభకు హాజరుకానివారుగాని, రహస్యముగా ఆయుధముల నిర్మించనివారుగాని యుండరు. అటులనే మనదేశములో ప్రతికులము వారును వర్ణవిభేదము పోవలయునని వాచా పల్కుచుందురుకాని, సమయమువచ్చినప్పుడు కులసభలకుహాజరై తమకులోన్నతికిని, వీలైన నితరకులములపై దాడికిని ననువైన వాడి వేడివేడితీర్మానములు చేయుచుందురు. ఇతరకులములకంటె తామెక్కడ వెనుకబడి పోవుదుమో అనుభీతియే, సోదరమానవులపైనుండు నవిశ్వాసమే, కులసభలపై నింత మక్కువజూపుటకు కారణము. ఎన్నిమాటలు చెప్పిననేమి, పండితులనేమి, తత్త్వజ్ఞులనేమి, రాజకీయవేత్తలనేమి, న్యాయమూర్తులనేమి, సంస్కరణపరాయణులనేమి దేశసేవానిరతుల నేమి ఈకులాభిమానము వీడుటలేదు. ఆయుధనిర్మాణ మున్నంతకాలము సంగ్రామభయ మెటులతప్పదో కులసభలుండినన్నాళ్లు వర్ణవిభేద విద్వేషమును తప్పదు.

కల్పలతా! పరాధీనభారతము స్వతంత్రభారతమగుటకు కావలసినది యావద్దేశీయులెట్టి పొరపొచ్చెములులేక ఏకమగుటయే. ఈఅమృతఫలము చేజిక్కనేని ఐకమత్యముతోగూడిన యీసంఘీభావమువలన బడయరాని భాగ్యములేదు. ఈవిషయమును గుర్తించినవాడు గనుకనే పూజ్యతముడైన మహాత్మాగాంధీ ఈఅంతస్సఖ్యమునకై, మానసికపరివర్తనమునకై, పరస్పరవిశ్వాసమునకై, మతసంఘుపక్ష విభేదనిర్మూలమునకై కఠోరతపస్సు చేయుచున్నాడు. ఆమహాత్ముని దివ్యసందేశమునాలించి పరస్పరావిశ్వాసమునువిడచి వర్తించితిమా, స్వరాజ్యామృతమును చేరలజుఱ్ఱగలము. లేదా ఆదివ్యపీయూషము మనకు చిక్కనేచిక్కదు. ఒకవేళ చిక్కినను దేవాసురసంగ్రామమేగాని సుఖభోగ్యముమాత్రము కాజాలదు.

కులసమస్య చూపులకుచిన్నదే. ఆయాసంఘములకు చెందినవారెల్లరొకచో గూడి స్వాభివృద్ధిమార్గముల నాలోచించునపు డదిచూడ ముచ్చటగనేయుండును. కాని యది క్రమముగా స్థానికసంస్థలకుప్రాకి, ఆపై అఖిలభారత వ్యవహారములలో జొచ్చినపుడు దానియాకారమెంత వికృతమైనదియు, నది యెంతటిమహానర్థకముల గలుగజేయునదియు తెల్లమగును. కాని అప్పుడేమి చేయసాధ్యము? మొక్కగానున్నప్పుడు లొంగనిది మ్రానైనతరువాత లొంగునా?

సోదరీ! ఎవరును పాదుచేసి నీళ్లు పోయకపోయినను చావక పెరుగుచుండు ఉమ్మెత్త, జిల్లేడు, పల్లేరు చెట్లవలె మనదేశమున యీకులములుకూడా శాఖోపశాఖలుగా విస్తరించి విద్వేషకారకములుగా నున్నవి. ఇట్టివానికింకను ప్రత్యేకదోహదములిచ్చి రక్షించితిమేని వీనిచెడుగు వేరే చెప్పవలెనా? ఇప్పటికే సభలలో, సమాజములలో, సహకారసంఘము లలో, స్థానికసంస్థలలో, పాఠశాలలలో, ప్రజాహితకార్యములలో నీకులతత్వపిశాచ మెట్టి వికృతచేష్ట చేయుచున్నదియు కనులారగాంచుచునేయున్నాము. వీనినింకను సాగనిచ్చితి మేని మనలనింకను నధోగతిపాలు చేయును. కావున మతముపేరను, కులముపేరను నేర్పడు నేసమావేశములను, సంస్థలనుగాని ప్రాజ్ఞులైనవా రాదరింపకుండుటయే లెస్స. దొరతనమువారుగూడ నిట్టివాని కెట్టిసహాయ మొనర్పరాదనియే నాయభిప్రాయము. స్థానికసంఘములుగూడ నిట్టి కులసంస్థలకు విరాళములిచ్చుట అనుచితమేయగును. వర్ణ విభేదమునే అవలంబనముగాగొని ప్రభుత్వముసాగించిన పూర్వప్రభుత్వమువా రిట్టిసంస్థలకు సహాయమొనర్చినను ప్రస్తుతప్రభుత్వమువా రిట్టివానికి సహాయమొనర్చినచో తమధర్మము నతిక్రమించినవా రగుదురనుటకు సందియములేదు.

కల్పలతా! బ్రాహ్మణమహిళాసభను జరుపలేదనియు, అందువలన మనసంఘ మున కెంతయో మొప్పము గల్గుచున్నదనియు నీవు నలవలలాడుచు వ్రాయుటచే నాఅభి ప్రాయమును నీకు సాకల్యముగా వివరింపవలసివచ్చినది. కాని నాహితోక్తులచే నిది యంతయు చక్కబడుననికాదు. మహాత్మునంతటి పూజ్యతముడు, అహింసావాది, పవిత్ర సత్యాగ్రహియే మాటిమాటికి తనప్రాణములే పణముగానొడ్డియు దీని బరిమార్ప లేకున్నాడు! మనమా!

భావపురి,
1-6-'39.

మిత్రురాలు,
శారద.

# స్త్రీ జాతి దృక్పథం   

  శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

(అఖిలభారత రేడియో వారి యనుమతిని)

'స్త్రీజాతి దృక్పథం'—ఇదే నేటి నాప్రసంగానికి యితివృత్తం. పైకి యిది సులభమైనవిషయంగానే కనబడవచ్చు. తలచిచూస్తేమాత్రం ఎన్నోచిక్కులు కనబడతాయి.

ఇందుకు ఒక్కటే ఉదాహరణ చెపుతాను వినండి. స్త్రీజాతిదృష్టికి పురుషజాతిలో కనబడేలోట్లు యేవేవి అని నన్ను ప్రశ్నించారనుకోండి. స్త్రీనైన నేను యీప్రశ్నకు సరియైనసమాధానం చెప్పగలనా? చెప్పలేను, ముమ్మాటికీ!

ఎందుచేతనంటే యీప్రశ్నకు సమాధానం చెప్పవలసివస్తే నాజూకుతనాన్ని చంపుకోవాలి. ఇంతేకాదు ఇందుకు అఖండమైన నిష్పాక్షికబుద్ధికూడా వుండాలి. పురుషజాతిపట్ల నేనేకాదు, యేస్త్రీయైనాసరే, నిష్పాక్షికదృష్టిని కలిగివుండడం అసాధ్యం. లవలేశమంత స్వాతంత్ర్యకాంక్షను కనుపరిస్తేచాలు; పురుషులు మమ్మల్ని అధఃపాతాళానికి త్రొక్కివేస్తారు. ఇక వారిపట్ల నిష్పాక్షికంగా ఉండడంసాధ్యమా? స్త్రీలెప్పుడూ అన్యాయం జరుగుతున్నదనికాని, పురుషులు సర్వదా అక్రమంగా ప్రవర్తిస్తున్నారనిగాని నా మతంగాదు. కాని, పురుషుడు స్త్రీకి అన్యాయంచేస్తున్నాడనే అభిప్రాయమొకటి నాటుకుపోయివున్నది. ఈలాంటిఅభిప్రాయానికి తగినంత ఆధారం లేకపోవచ్చును. ఇది కేవలము కల్పితమైనదే అయియుండవచ్చును. అయినప్పటికీ యిలాటిఅభిప్రాయ మొకటిఉన్నప్పుడు మేము మాకు తెలియకుండానే కాఠిన్యాన్ని వహించవచ్చు.

ఇక రెండోచిక్కుసంగతి. ఇంతకుముందే సూచించినట్టు మొరటుతనంగా మాట్లాడానికి సిద్ధపడితేనేగాని, పురుషజాతి లోపాలవిషయమై స్త్రీ తనభావాల్ని ప్రకటించలేదు. స్త్రీ నోరెత్తుతేచాలు. 'ఆ! ప్రారంభమయిందీ? సాధింపు!' అని పురుషుడు విసుక్కుంటాడు.

ఇక ఆమె తన అభిప్రాయాల్ని బహిరంగంగా లోకానికిప్రకటిస్తే అతడిఆగ్రహానికి అంతుండదు. తాను అధికుడనని పురుషుడినమ్మకం. అంచేత అతడు 'విమర్శన' సహించలేడు. ఈ విమర్శ స్త్రీనించే వస్తే అతడు 'నిప్పులుత్రొక్కిన కోతి' అవుతాడు.

అంతేకాదు, తన్ను విమర్శించడానికి సాహసించిన స్త్రీని 'కృతఘ్నురాలు' అని తృణీకరిస్తాడు. తర్వాత మరి నిందించడానికేమీ కనబడకబోతే, 'ఇదెక్కడి పోయెకాలమోయి! పొట్టిచేతుల జాకెట్లేమిటి! ఆముఖానికి బూడిదేమిటి! తల్లో ఆరిబ్బన్లేమిటి! వినాశకాలే విపరీతబుద్ధిః అని పెద్దలూరికే చెప్పారా' అని వెక్కిరింపుకు దిగుతాడు.

తన పైవిమర్శవస్తే అందుకుతగిన సమాధానం చెప్పుకోవాలిగాని సందర్భశుద్ధిలేకుండా యిలా వెక్కిరించడం యేమిటీ! ఏమిసబబు?—కాదు! నిజమే! కాని, విమర్శకుతగు ప్రతివిమర్శలేనప్పుడు వెక్కిరించడమేగదా శరణ్యం!—అన్నట్టు యీసందర్భంలో ఒకవిషయాన్ని గుర్తించుకోవాలి.

పూర్వమొకప్పుడు స్త్రీకి సంఘంలో అత్యున్నతస్థానం వుండేది. దాన్ని తిరిగిపొందడానికి ఆమె కృషిచెయ్యాలి. ఇదీ ఆమెధర్మం. ఈధర్మాన్ని ఆమె నిర్వర్తించనిపక్షాన్ని ఆవిషయాన్ని నిర్లక్ష్యంచేసి కేవలం పురుషజాతిని 'మీరు మాకు అన్యాయంచేస్తున్నారు' అని విమర్శించడం ఒకవిధంగా తగదు.

ఏఆధునిక ప్రచురణాలయాన్నైనా సరే చూడండి. స్త్రీజనసమస్యపై అనేకగ్రంథాలు కనబడతాయి. కాని పురుషజాతి సమస్యపై వెతికి పట్టుకొందామన్నా పుస్తకందొరకదు.

అయితే యిక్కడ పెద్దవింత ఏమంటే, మహిళాసమస్యలపైగల ఈగ్రంథాలన్నీ నిజానికి పురుషజాతి సమస్యలకు సంబంధించినవే! అంటే స్త్రీజనాభివృద్ధికి పురుషులు ఏమిచెయ్యాలి అనేవిషయాన్ని చర్చించేవే ఈఅన్నిపుస్తకాలూ!

వీటిరచయితలు స్త్రీజాతిరక్షణభారం తమదే అయినట్లుభావించి ఆజాత్యోద్ధరణకు పురుషుడు ఇలా పాటుపడాలి, అలా పాటుపడాలి అని వివిధమార్గాల్ని సూచిస్తూవుంటారు.

'స్త్రీ అబల, స్త్రీ పరాధీన, ఆమె అభివృద్ధికి, ఆమెవున్నతికి పురుషుడే పూనుకోవాలి'అని అంటారు. ఈవైఖరి నాకు చాలాబాధకరంగా వుంటుంది.

స్వాతంత్ర్యం ఒకడు దానంచేయడానికి యింకొకరు పరిగ్రహించడానికీ భిక్షలాంటిదికాదు. స్వాతంత్ర్యాన్ని యెవరికివారే సంపాయించుకోవాలి; ఎవరికివారే నిలబెట్టుకోవాలి.

నేడు స్త్రీజనసమస్య ఒకటివున్నదని అంగీకరిస్తే దాన్ని స్త్రీలకోసం పురుషులు పరిష్కరించబూనడం తగదు. స్త్రీలు దాన్ని తమకుతామే పరిష్కరించుకోవాలి. తమజాతి అశక్తతనుచాటుతో, తమపట్ల ఉదారభావాన్ని ప్రదర్శించాలని కోరడంకంటె, స్త్రీజనాభ్యుదయానికి పాటుపడుతున్న మహిళామణులు వనితాలోకంలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందజేయడం ఎంతైనా అవసరం.

తాము సాధించవలసిన-తామే సాధించగల-మహత్తరకార్యాలు ఎన్నోఉన్నవని స్త్రీలు ఎంతశీఘ్రంగా గుర్తిస్తే వారికి అంత శ్రేయోదాయకం. నారీమణులకు సంబంధించిన ఒకవిషయంలో ప్రాచ్యఖండం పాశ్చాత్యప్రపంచానికి మార్గదర్శకమైంది. ఆఒకవిషయం యిది:

పాశ్చాత్యదేశాలలో పురుషుడికితప్పనట్టే స్త్రీకికూడా ఆర్థికబాధ తప్పదు. ప్రాచ్యభూములలో స్త్రీకి ఈబాధ దాదాపుగా లేదనేచెప్పాలి. ఆఫీసుల్లో మసకమసకగావున్న ఏమూలనోకూర్చుని మగవాడు చిత్రావర్జాలను తయారుచేసుకోవాలి. యేవ్యక్తి యేవృత్తి అవలంబించినా మనం చూడవలసింది ఒక్కవిషయమే. ఆవృత్తివల్ల ఆవ్యక్తి సంఘానికి మేలుచేస్తున్నదా లేదా? యీసూత్రం పురుషులికే కాదు, స్త్రీకికూడా వర్తిస్తుంది. అంచేత స్త్రీలను అవసరమైన నిషేధాలకు లోనుచేయరాదు. ప్రతిస్త్రీకీకూడా తాను ఏవిధంగా, ఏరూపంలో సంఘానికి అధికమైన సేవచేయగలదో అలానే చేయడానికి స్వాతంత్ర్యం వుండాలి.

ప్రాచ్యసాంప్రదాయంప్రకారం స్త్రీకి వ్యక్తిస్వాతంత్ర్యం లేదనడంగాని, తనకిష్టమైనపద్ధతిలో సంఘ సేవచెయ్యడానికి ఆమెకు హక్కు లేదనడంగాని పొరపాటు. ప్రాచ్యస్త్రీకి యీహక్కు నిస్సందేహంగా వుంది. అయితే ఆమె దాన్ని ప్రస్తుతం అంతగా వినియోగించుకోవడం లేదు. ఇందుకు మనదేశచరిత్ర కొంత వరకు కారణం. పురుషుని స్వార్థబుద్ధికూడా కొంతవరకు కారణం.

స్త్రీ పురుషునిపై ఆధారపడివుండాలనికాని, అతడికి లొంగివుండాలనిగాని, అజ్ఞానంలో వుండాలని గాని, వివేచనాశక్తి లేకుండా వుండాలనిగాని మన ప్రాచ్యసాంప్రదాయంలో లేనేలేదు. ఈమాటను కాదన్న వారికి మనసాంప్రదాయంగాని, మనచరిత్రగాని తెలియదన్నమాట! మీరాబాయిలాంటి కవయిత్రిని, నూర్జహాన్‌లాంటి రాజనీతజ్ఞురాలిని, ఝాన్సీలక్ష్మిలాంటి వీరరమణిని మనకు ప్రసాదించగలిగిన సాంప్రదాయం స్త్రీలకు స్వాతంత్ర్యంకూడదని విధించిననడం తగునా! పూర్వచరిత్రతో ప్రశక్తిదేనికి? ఒక్కసారి మన గ్రామసీమవంక చూడండి. అక్కడ పొలం పనిపాటలలో పురుషునితోపాటు స్త్రీకూడా సమానంగా పని చేస్తుంది. సమానబాధ్యత వహిస్తున్నది. మనవాఙ్మయానికి జీవగర్ర అయినటువంటి మనపల్లెపాటలలో, పల్లె పదాలలో, మన పేరాశిపెద్దమ్మ కథలలో ప్రాచ్యస్త్రీ పురుషునితో సమానస్వాతంత్ర్యాన్ని కలిగివుండేదనీ, సమానబాధ్యత వహిస్తూవుండేదనీ, సమానగౌరవాన్ని పొందుతూవుండేదనీ నిరూపించడానికి ఎన్నెన్నో నిదర్శనాలువున్నాయి.

స్త్రీజనోద్యమాలకు సంబంధించినకొందరు తమ వాచాలత్వం కొద్దీ ప్రాచ్యస్త్రీ కేవలం సంతానాన్ని కనేయంత్రం అనీ, భర్తకోసమే ఆమెజీవిస్తుందనీ, వినయవిధేయతలతో ప్రవర్తించడమే ఆమెకు ధర్మమై పోయిందనీ అంటారు. కొంతవరకు యీమాటల్ని కాదనలేము. కాని, ఇవి మన గ్రామసీమకు వర్తించవు. మనసాంప్రదాయాన్ని చాలాజాగ్రత్తగా కాపాడుతూవుండే తక్కువకులాలకు ముఖ్యంగా యివి వర్తించవు. స్త్రీ పురుష జాతివిద్వేషాలకుగాని, కామవికారాలకుగాని, తావులేని మన ప్రాచీనప్రాచ్య సాంప్రదాయాన్ని పునర్జీవింపచెయ్యడమే భారతస్త్రీ లక్ష్యం. మనం పురుషులతోపాటు సమానస్వాతంత్ర్యాన్ని, సమాన అవకాశాల్ని కోరుదాము; పరస్పరసహకారంకోసం, పరస్పరప్రతిష్టకోసం కృషిచేద్దాము.

మనకోర్కె సఫలమైతే మనకృషి విజయవంతమైతే వీరులకూ, వీరాంగనలకూ ఘనతగాంచిన ఈపుణ్య సభ్యతకు చిహ్నమైన లలితకళల అభివృద్ధికీ, విజ్ఞానవ్యాప్తికీ దోహదమివ్వగలుగుచున్నది. గృహలక్ష్మిగా నేమి, కళాసరస్వతిగానేమి ఆమె మానవలోకాన్ని ఆనందధామంగా చేస్తున్నది.

పొలాల్నిదున్ని, ఫ్యాక్టరీనినడిపి, వర్తకవ్యాపారాలనిచేసి పురుషుడు మానవజాతికి సేవచేస్తున్నాడు. దాన్ని నేను కాదనడంలేదు.

అయితే ప్రపంచానికి శాంతినీ, శోభనూ కూర్చగలశక్తి, ప్రజ్ఞవిశేషం అతడిలోలేదు. పురుషునిలో కనబడే యీలోపాన్ని ప్రాచ్యస్త్రీ తీర్చుతున్నది. పురుషుడివ్యవహారాలను, అతడిబాధ్యతలను తనపై వేసు కోవాలని స్త్రీ కాంక్షించడంలేదు. వాటికి ఎంతదూరంగా వుండడానికివీలైతే అంతదూరంగాపోవాలనే ఆమె ఆశిస్తున్నది.

ఇక, ఆమె వాంఛిస్తూన్నది ఏమిటి, స్త్రీగా తను తనబాధ్యతలను సక్రమంగా, సలక్షణంగా నిర్వహించడానికి తగినట్టుగా తనవ్యక్తిత్వాన్ని పెంపొందించుకోడానికి అవకాశంమాత్రమే.

# స్త్రీ జాతి దృక్పథం

కళాభిజ్ఞిణి కావాలనే కోర్కతో, సుఖప్రదాయిని కావాలనేకాంక్షతో స్త్రీ తనవ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలని ఆశిస్తున్నదన గలిగిననాడు స్త్రీజనోద్యమం స్త్రీలను కేవలం మగరాయళ్లుగా చెయ్యడానికి ప్రారంభమైంది కాదని తెలిపోతుంది.

వేషభాషలలో పురుషుని అనుకరించాలని ప్రాచ్యస్త్రీ కోరడంలేదు. ప్రకృతి రామణీయకతను నిదర్శనమైనపూలతో శృంగారించుకొనుట కాయత్తపడును. ఉద్యోగాలు చెయ్యాలనీ ఊళ్లను ఏలాలనీ ఆమె తాపత్రయపడ్డంలేదు. ముందుతరాలవారికి రూపులుదిద్దాలనిమాత్రమే కాంక్షిస్తున్నది.

విద్వేషజ్వాలల్నిదగిల్చి యుద్ధాలకు దోహదం మివ్వగోరడంలేదు. శాంతిని కాపాడాలనీన్నీ, సామరస్యాన్ని పెంపొందించాలనిమాత్రమే వాంఛిస్తున్నది. అయితే పైమాటల్నిబట్టి స్త్రీపురుషులకు వేర్వేరు కార్యకలాపాలున్నవనీ, ఒకరివిషయాలలో యింకొకరు జోక్యం కలిగించుకోరాదనీ నేను సిద్ధాంతీకరిస్తున్నానని అనుకుంటారేమో; అదిపొరపాటు. స్త్రీప్రకృతి యిది, స్త్రీ నిర్వహించగల కార్యకలాపాలు యివి అని నిర్దేశించినంతమాత్రాన వారు భిన్నమైనవిషయాలలో జోక్యంకలిగించుకోరాదని అనడం తగదు. యిలాఅనడం స్త్రీకి వ్యక్తిస్వాతంత్ర్యంకూడదు అని అనడమే.

వ్యక్తి స్వాతంత్ర్యం అవశ్యకతను ప్రస్తుతించని రచయితకాని, తత్వవేత్తగాని లేడు. ఇది పురుషునికి మాత్రమే తగునుగాని స్త్రీకి తగదని ప్రాజ్ఞుడైనవాడు అనగలడా? తన ధర్మం ఏదో, ఏ ధర్మాన్ని తాను చక్కగా నిర్వర్తించగలదో - ఈ విషయాన్ని విస్మరించనంతవరకూ స్త్రీ యే వుద్యోగాన్ని అయినాసరే స్వీకరించవచ్చును; ఏ పదవినైనా ఆక్రమించవచ్చును. స్త్రీ వైద్యవృత్తినిగాని, న్యాయవాదవృత్తినిగాని అవలంబించడానికి మన సాంప్రదాయాలలో నిషేధంలేదు. ఈ సందర్భంలో నాకు హెలెన్ నార్మంటన్ పలికిన ఒకవాక్యం జ్ఞాపకం వస్తున్నది, ఆమె న్యాయవాదవృత్తి అవలంబింపదలచి అందుకు అవసరమైన చదువుకోసం లాకాలేజీలో చేరింది. 'పురుషుల్ని అనుకరించడానికి నీవు ప్రయత్నిస్తున్నావు, లేకపోతే యీ చదువు దేనికి' అని కొందరు ఆమెను గేలిచేసేరు. అప్పుడు ఆమె వారికిచ్చిన జవాబిది:

'నేను స్త్రీని, స్త్రీజననోద్యమంతో నాకు సంబంధం వున్నది. పురుషులతోపాటు నాకుకూడా అన్ని విషయాలలో సమానమైన హక్కులున్నాయి అనే యీ ధోరణిలో కాకుండా న్యాయవాదవృత్తిద్వారా మానవసేవచెయ్యాలనే కోర్కతో చెయ్యగలననే నమ్మకంతో నేను యీ లాకాలేజీలో చేరాను' లేదా రణగొణధ్వనితో చెవులు చిల్లులుపడుతూవున్నట్టి ఏ ఫ్యాక్టరీలోనో రెక్కలు విరుచుకోవాలి. సంపత్తి వుత్పత్తికోసం అతడు ఈ పాట్లుపడతాడు. అతడిలానే స్త్రీకూడా వుత్పత్తిచేస్తుంది. అయితే ఆమె వుత్పత్తిచేసేది ప్రాణవిహీనమైన భౌతికసంపత్తికాదు. ప్రపంచానికి మూలాధారమైన జీవనసంపత్తి. వుత్తమమైన సృష్టికారిణి కావడమే స్త్రీ ప్రత్యేకత! ఆమె ఘనత! ఆమెను అలంకారం! ఆమెను ఆర్థికసంబంధమైన బాధలు తాను స్వయంగా పడవలసిన అగత్యంలేనందువల్లనే ప్రాచ్యనారీమణి భారతభూమిలో తిరిగి నూతన శకోదయం కాగలదనే నా విశ్వాసం.

# భారతీయనారి భవిష్యత్తు

స్వామి వివేకానంద

కాని, జనసామాన్యమునను, స్త్రీలయందును విద్యావ్యాప్తిలేమన్న ఏమియును జరుగవీలులేదు. అందు వలన నాకు కొందటి బ్రహ్మచారులను, బ్రహ్మచారిణులను తయారొనర్చ ఇచ్ఛయున్నది. బ్రహ్మచారులు కాలక్రమమున సన్యాసముపుదీసికొని జనసామాన్యమున విద్యావ్యాప్తికై యత్నింతురు. బ్రహ్మచారిణులు స్త్రీలనడుమ విద్యావ్యాప్తికై యత్నింతురు. కాని, దేశీయరీతి ననుసరించి ఈపని నొనర్పవలెను. పురుషులకును స్త్రీలకును విద్యనొసగి కొన్ని విద్యాకేంద్రముల నెలకొల్పవలెను. శిక్షితలును, సచ్చరిత్రలునునగు బ్రహ్మచారిణులు స్త్రీల విద్యాకేంద్రమును నడుపుభారమును వహింతురు. శిక్షితలగు పితంతువులు బ్రహ్మచారిణులపైననే విద్యాలయమున బాలముల నేర్పుభారమును నుంచవలెను. ఈదేశమున స్త్రీవిద్యాలయముల పురుషుల సంపర్కము సంపూర్ణముగ లేకుండుటయే మేలు. పురాణములు, దేశచరిత్రలు, గృహకార్యములు, శిల్పము, ఆదర్శచరిత్రనిర్మాణమున కనువగునీతులు, వర్తమాన విజ్ఞానసహాయ్యమున నేర్పనగును. విద్యార్థినులను ధర్మపరాయణలుగను నీతిపరాయణలుగను ఒనర్పవలెను. వీరిసంతానము పిదప ఈవిషయముల ఇంకను నేర్పును బొందగలదు. శిక్షితయును నీతిపరాయణయునునగు తల్లిగర్భముననే మహాపురుషులు జన్మింతురు. ఇప్పుడు మీరు స్త్రీలను పనినొనర్చు యంత్రములుగ మార్చివైచినారు. ఇది మీవిద్యయొక్క ఫలితమా? స్త్రీలను ముందుగ లేవనెత్తవలెను, పామరజనసామాన్యమును లేవనెత్తవలెను. అగుచో దేశకల్యాణము, భారతదేశ కల్యాణము లభించును.

సీతా సావిత్రులదేశము, పుణ్యక్షేత్రము భారతమున ఇప్పటికిని స్త్రీలయందగపడుచరిత్ర, సేవాభావము, స్నేహము, దయ, తుష్టి, భక్తులు, పృథివియందితరత్ర అంతగ కనిపించవు. పాశ్చాత్యదేశములందలి స్త్రీలను గాంచ నాకనేకతడవలు వారు స్త్రీలే అని తోచెడిదికాదు—సరిగ పురుషులే. బండ్లు నడపెదరు, ఆఫీసుల కటిగెదరు, స్కూళ్లకేగెదరు, ప్రొఫెసర్ పని నొనర్తురు. ఒక్క భారతవర్షముననే స్త్రీల లజ్జావినయాదులగాంచ కళ్లు చల్లపడును. ఇట్టిఆధారములు లభించినను మీరు వారిఉన్నతికి దోడ్పడజాలకున్నారు. వారియందు జ్ఞాన—ఆలోకమును జొన్ప యత్నింపలేకున్నారు. సరియైన విద్యనుబడసిన వీరు ఆదర్శస్త్రీలవగలరు. ధర్మము, శిల్పము, విజ్ఞానము, గృహకృత్యములు, వంట, కుట్టుపని, శరీరపాలనలను గుఱించిన స్థూలమర్మముల నేర్పవలెను. నావెల్, నాటకములను ముట్టనీయగూడదు. కేవలము పూజాపద్ధతి నేర్పిననుచాలదు. అన్నివిషయముల దెల్పవలెను. ఆదర్శస్త్రీలచరిత్రమును సర్వదా వారికన్నుల ముందఱ నుంచి త్యాగవ్రతమున వారికనురాగము ఒగవునట్లొనర్చవలెను. సీత, సావిత్రి, దమయంతి, లీలావతి, ఖానీ, మీరా, దేవులచరిత్రమును వారికెరుకపరచి, వారిజీవితము నాతెఱగున నిర్మించుకొనునట్లొనర్పనగును.

ప్రస్తుతము నడచుచున్న విద్యావిధానము కాదు. వాస్తవమగునది కొంత నేర్పవలెను. గ్రంథపఠనమే నేర్పబడిన చాలదు. ఎద్దాన చరిత్రనిర్మాణమగునో, మనశ్శక్తి పెంపొందునో, బుద్ధి వికసించునో, తన పాదముల తాను నిలబడగల్గునో అట్టివిద్య కావలెను. అట్టిశిక్షను బడసిన స్త్రీలు తమసమస్యలను దామే పరిష్కరించుకొందురు. మనస్త్రీలు మొదటినుండియు పిటికివిద్యనే నేర్చియున్నారు. ఏదైనజరిగిన కేవలము ఏడ్చుటకు తయారగుదురు. వీరభావమును నేర్పనవసరము. ప్రస్తుతము వారిరక్షణమును వారే ఒనర్చుకొనవలసిన అవసరమువచ్చినది చూడుము, ఝాన్సీరాణి ఎట్లుండినదో!

స్త్రీలకు నేర్పవలెను, తాముగూడ నేర్చుకొనవలెను. తండ్రి అయినంతమాత్రము చాలదు, చాల భారము భుజములమీద వేసుకొనవలసియుండును. మనస్త్రీల కొక్కసంగతిని సహజముగనే నేర్పవచ్చును. హిందూస్త్రీలు, సతీత్వమన నేమియో వారు సహజముగనే గ్రహింపగలరు. ఇది వంశపారంపర్యముగ అభ్యస్తమైనదికదా? ప్రథమమున వారిలో ఈభావమును లేవదీసి, చరిత్రమును నిర్మింపవలసియుండును. దాన, వారు వివాహితలే కానిమ్ము, లేక కుమారికలే కానిమ్ము, సతీత్వముకొఱకు ప్రాణములనొసగ వెనుదీయకుందురు. ఏదైన ఒకభావముకొఱకు ప్రాణములనర్పించుట తక్కువవీరత్వమా? ఈ అదనున, బహుకాలము నుండి వచ్చుచున్న ఈభావబలమున కొందఱిని, ఆ బాల్యబ్రహ్మచారిణులుగనుంచి త్యాగధర్మముల శిక్ష నొసగవలెను. వెనువెంటనే విజ్ఞానము మున్నగు ఇతరవిషయములగూడ, ఇతరులకును తమకును మేలుగూర్చు వానినిగూడ నేర్పవలెను. అగుచో, వారీవిషయములన్నిటిని అతిసహజముగనే నేర్చుకొనగలుగుదురు; ఇట్లు నేర్చి ఆమోదమునుగూడ పొందుదురు. మనదేశముయొక్క యదార్థకల్యాణముకొఱకు పవిత్రజీవనులగు ఇట్టి బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును గావలసియున్నారు.

వాస్తవవిద్యను గుఱించిన 'సిసలైన' అభిప్రాయము మనలో నింకను బొడమలేదు. శిక్షయన కొన్నిశబ్దముల నేర్చుట కాదు; మనవృత్తులు, శక్తులు వికసించుటయే విద్య. శిక్షయన ఇచ్చట సద్విషయముల బ్రవహించి, స్థిరమగునట్లొనర్చుటయే. ఈభావమున విద్యగఱచిన మన భారతకల్యాణసాధనమునకు సమర్థలును, నిర్భయహృదయలును, మహీయసలునునగు రమణులుద్భవింతురు. వారు సంఘమిత్త్ర, లీలావతి, అహల్యాబాయి, మీరాబాయిల పదాంకానుసరణ మొనర్ప సమర్థలగుదురు. వారు పవిత్రలును, స్వార్థగంధశూన్యలునునగుదురు. భగవత్పాదపద్మ స్పర్శవలన నేశక్తిలభించునో, వారాశక్తిని బొందెదరు. అందువలన వారు వీరప్రసవినులయ్యెదరు.

నేను ధర్మమును శిక్షాంతర్గతముగ భావింతును. నేను, నాయొక్కగాని లేక ఇతరులయొక్కగాని ధర్మసంబంధమగు అంగీకారానంగీకారములను ధర్మమని చెప్పుటలేదు. నాఅభిప్రాయము ఇతరవిషయములవలెనే ఈవిషయమునగూడ ఉపాధ్యాయినులు, విద్యార్థినుల భావగతులననుసరించి శిక్షనొసగ ఆరంభింపుడు, ఔన్నత్యమునుబొంద సహజపథమును జూపింపుడు, దాన ఇబ్బందులు చాలతక్కువగ నుండవలెను.

దీక్షాశిక్షలు ధర్మవిహీనములైన అందు లోటుబాట్లు ఉండనేయుండును. ఇప్పుడు ధర్మమును కేంద్రమొనరించుకొని స్త్రీవిద్యాప్రచారము సల్పవలెను. ధర్మముకంటె భిన్నమగు అన్యవిద్య గౌణము. ధర్మశిక్ష, చరిత్రనిర్మాణము, బ్రహ్మచర్యవ్రతము, వీటికొఱకే విద్య. వర్తమానకాలమున నింతవఱకు ప్రచారమునయున్న స్త్రీవిద్యయందు ధర్మము గౌణమొనర్పబడినది. అందువలన ప్రస్తుతమగుపడుదోషము లీస్త్రీవిద్యవలన కలిగినవి. తప్పుకాని, దాన స్త్రీలదోషమేమి? సంస్కారకులు బ్రహ్మజ్ఞులవక, స్త్రీవిద్యనొసగ నారంభించుటచేసి, తప్పటడుగుల వేసినారు. సత్కార్యప్రవర్తకులందరును అభీప్సిత కార్యానుష్ఠానమునకు పూర్వము కఠోరతపస్సహాయమున ఆత్మజ్ఞులవవలసియున్నారు. కానున్న వారికార్యమున లోటుబాట్లుండును. అయినను, ప్రస్తుతము ప్రచారములోనున్న స్త్రీశిక్షణకొఱకు ముందంజవేసినవారిది ఉదారబుద్ధి యనువిషయమున సందేహములేదు. దేశమున నూతనభావమును ప్రప్రథమమున ప్రచారమొనర్చునప్పుడు కొందఱీభావమును సరిగ గ్రహింపలేక పాడైపోదురు. అందువలన విశాలసంఘమునకు గలిగెడునష్టమేమియును లేదు. ఈ మాయికజగత్తున నారంభములన్నిటను దోషముండును. 'సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః' నిప్పున్నచోట పొగ ఉండును. అందువలన ఊరక కూర్చుండుటా. చేతనైనంతమంచిపని నొనర్చిపోవలెను.

# పుష్పచయము

## స్త్రీసమాజములు — వ్యాయామము

మనము విద్యయందేమి, దేశశ్రమయందేమి, కార్యనిర్వహణయందేమి పురుషులకు వెనుకబడరాదు. ఆరోగ్య, ఆర్థికదుస్థితులు మనము పెంపొందించుకొనవలెను. ఏదేశమైననూ అభివృద్ధిలో నుండవలెనన్న ఆదేశస్త్రీలు దాస్యమువదలి విద్య, ఆరోగ్య, ఆర్థికసంపదలు పొందవలయును. దేశసౌభాగ్యము స్త్రీలఆరోగ్యముపైననే ఆధారపడివుండునని నేచెప్పనక్కరలేదు. సత్సంతానము దేశమునకర్పించుటకు స్త్రీలు ముఖ్యముగ ఆరోగ్యసంపద అభిలషింపవలెను. ఈవిషయము దృష్టియందువుంచుకునే వ్యాయామమునకు యీమండలి ప్రత్యేకస్థానమిచ్చుచున్నది. ఘోషాపద్ధతివదలి సోమరితనముమాని కాయకష్టముచేయుట గౌరవలోపమని తలంచుట మరచి సోదరీమణులందరు నిత్యమును శరీరపరిశ్రమ ఆటపాటలద్వారా చేసినగాని వీరమాతలై వీరులగు పుత్రికాపుత్రులను దేశమున కర్పింపజాలరు. మన ఆరోగ్యముమీదనే మన సంతతియొక్క బలాబలములు నిలచియుండును. లెండు, ఈమండలి సభ్యులుకండు, సర్వతోముఖముగ విద్య, ఆరోగ్యము ఆర్థికముగా అభివృద్ధిపొందుటకు సహకారము సల్పుడు. అనవసరముగా సందేహములు పెట్టుకొని అవకాశములు పోగొట్టుకొనవద్దని కోరుచున్నాను.

—శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారు, బెజవాడ
భారతమహిళామండలి 11 వ వార్షికనివేదికలో—

## స్త్రీలు — స్త్రీసమాజములు

మనఇండ్లలో మగవారు అనేకవిధములగు ఖర్చులు తమకై చేసుకొనుచున్నారు. తమభార్యలను స్త్రీసమాజములలో సభ్యురాండ్రుగా చేర్చుటకుగాని, తెలుగుపత్రికనిచ్చి చదివించుటకుగాని, ప్రోత్సహించుటలేదు. దీనికికారణము వారివద్ద డబ్బులేకపోవుటకాదు. స్త్రీలు తమబాగోగులను తెలుసుకొని తమకుకావలసినవి తమభర్తలను అడుగలేకున్నారు. కాకపోయినయెడల సమాజమునకు వచ్చుటకు ఒక గంటకాలము తీరుబడిలేకపోవునా? నెలకొకపావలాఇచ్చి సమాజములో సభ్యురాలుగాచేరుటకు డబ్బులేనంత హీనస్థితిలోఉన్నారనిన నేనమ్మను. భర్తవద్దనుండి నెలకు నాలుగుఅణాలు తేలేనిస్త్రీ నిజముగా లేదు. మొగవారు తమక్లబ్బులు మొదలగువాటికి ఖర్చుపెట్టుదానిలో నిది చాలాస్వల్పము. ఆమాత్రము తమభార్యలకై ఖర్చుపెట్టలేరా? సమాజములో సభ్యురాండ్రుగా చేరకపోవుట ఆడవారి యొక్క అలసత్వము, అమాయకత్వమే కాని వేరుకారణములేదు.

—శ్రీమతి వే. సీతామహాలక్ష్మమ్మగారు, నరసారావుపేట స్త్రీ సమాజాధ్యక్షురాలైన శ్రీమతి యం. లక్ష్మీదేవమ్మగారి వీడ్కోలు సందర్భములో—

## లలితగాన పారిశ్రామిక కళాశాల, రాజమహేంద్రవరం.

ఈకళాశాల 1934 సంవత్సరంలో స్థాపింపబడి, స్త్రీలకు, బాలికలకు, సంగీతము, గాత్రము, వీణ, నృత్యము, చేతిపనులు నేర్పుచుండుటపరీక్షించి, మదరాసు డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీసువారు 1-4-'3,

తేదీనుండి లేసు, ఎంబ్రాయిడరీ 3 సంవత్సరములలో, డ్రెస్సుమేకింగు 4 సంవత్సరములలో, స్పిన్నింగు 1 సంవత్సరములో, వీవింగు రెండుసంవత్సరములలో నేర్పుటకు రికాగ్నిషన్ దయచేసియున్నారు. ఇంకా సంగీతనృత్యములకు విద్యాశాఖవారు రికాగ్నిషన్ దయచేయలేదు. కాని పని యథాప్రకారము జరుగుచున్నది. విద్యార్థినులకు విద్య ఉచితముగా నేర్పబడును. భోజనవసతులు వారే ఏర్పాటుచేసికొనవలెను. నృత్యమునకు తొమ్మిదిమందికే తావుగలదు. నేర్చుకొన అభిలాషగలవారు స్వయముగా వచ్చి కనబడవలెను. ఉత్తరప్రత్యుత్తరములు చౌ॥ వెంకటచలమమ్మ, ప్రిన్సిపాల్ అండు కరస్పాండెంటు, గారితో జరుపవలెను.

## పోస్టుకార్డు పుట్టుపూర్వోత్తరాలు

భారతదేశంలో ప్రతిరోజుకు ఎన్నివేలకార్డులు, కవర్లు, పోస్టుస్టాంపులు భారతీయులహస్తాల్లో మారిపోతున్నవో కొంచెమించుమించుగా అన్నివేల అనేకరకముల రూపాయిలనోట్లుకూడా మారుతున్నాయి. కాని రాష్ట్రం, రాజ్యం కోరేమనం వాటిఉత్పత్తిని గురించినవివరాలు తెలుసుకొనుటకు ప్రయత్నించడంలేదు. ఇవి ఎక్కడ ముద్రింపబడుతున్నాయో, ఎచ్చటనుండి విడుదల చేయబడుతున్నాయో ప్రతివారు తెలుసుకోవాలి.

పవిత్రగోదావరి జన్మస్థానం 'నాసిక్' అనే పట్టణంలోనే యీరహస్యచర్యంతా, అంటే వీటి ముద్రణ, ప్రభుత్వముయొక్క విడుదల మొదలైనపనులన్ని జరుగుతున్నాయి.

మనదేశంలో ఇన్ని గొప్పపట్టణాలుండగా నాసిక్ పట్టణాన్నే యీపనికి ఎందుకు ఎన్నుకోవాలి? దీనికికారణం ప్రప్రథమంగా అచ్చుపనికి, అనగా రంగురంగులతో ముద్రణ మొదలగువాటికి తగినవాతావరణం, వ్యాపారానికి అన్నిముఖ్యపట్టణాలకు సంబంధించిన హంగు కలిగిఉండటం, వ్యాపారలక్షణాలన్నీ కలిగిఉండుటచే యిది సరియైన స్థలమైంది.

మొదట్లో అనగా 1860 సం॥ రం నకు పూర్వం యీ పోస్టుబిళ్లలుగాని, రూపాయిలనోట్లుగాని అసలు అమల్లోనేలేవు. ప్రప్రథమంగా 1860 సం॥ రం మొదలు 1862 వరకు కలకత్తా టంకసాలలో 'Survey of India' అను పోస్టుబిళ్లలుమాత్రం ముద్రించబడ్డాయి. 1861 లో రూపాయిలనోట్లు Bank of England వారిచే ముద్రింపబడి మార్చి 1862 సం॥ రం లో ప్రథమ రూపాయిలనోట్లుగా విడుదలచేయబడ్డాయి. అప్పటినుండి 1928 వరకు ఆబ్యాంకువారే యీనోట్లను సప్లయి చేస్తూవచ్చారు.

1862 సం॥ రం నుంచి 1924 సం॥ రం వరకు Messers. Thos. Dela Rue and Company వారు పోస్టలుస్టాంపులను ముద్రిస్తూఉండేవారు. ఇంతలో యీరెండుకంపెనీలవారు తీసుకొన్నహక్కు ముగియడంచేత, భారతప్రభుత్వంవారు వీటిని భారతదేశంలోనే అచ్చువేయుటకు సంకల్పించడంచేత, యీముద్రణకు సంబంధించినవన్నీ భారతదేశానికి మార్చబడ్డాయి.

1923 సం॥ రంలో ఢిల్లీలో ఇవ్వబడిన అనుమతిప్రకారం 1924 సం॥ రంలో 20 లక్షల రూపాయిల ఖరీదుగలభూమిని 'నాసిక్' పట్టణంలోతీసుకొని. 6 లక్షలరూపాయిల ముద్రణాయంత్రములు నిర్మించారు 1928 సం॥ రం యేప్రియల్ 14 వ తేదీని అప్పుడు వైస్రాయిగా వుండిన ఇర్విన్ ప్రభువు, సర్. బాసిల్ బ్లాకట్ భారతప్రభుత్వార్థికమంత్రి, భూపేంద్రనాథ మిత్రగార్ల సమక్షంలో అతివైభవంగా యీముద్రణాలయ ప్రారంభోత్సవాన్ని జరిపేరు.

ఇప్పుడు ప్రతిసంవత్సరము యీముద్రణాలయంలో అచ్చయ్యేవాటిక్రింద ఖర్చుపెట్టబడుతోన్నడబ్బు

36 లక్షలరూపాయిలు. కాగితంఖర్చు 12 లక్షలరూపాయిలు. ఇక్కడ ప్రతిరోజున పోస్టుకార్డులు 10,50,000, రిప్లై కార్డులు 2,70,000, అన్నిరకముల రూపాయిలనోట్లు విలువ 15 లక్షలు, కవర్లు ¼ లక్షలు ముద్రణవుతున్నాయి. 600 మంది పనివాళ్లు వారమునకు 47½ ఘంటలచొప్పున పని చేస్తూన్నారు.

ఇన్నిలక్షల ఖరీదైనస్టాంపులు ప్రతిరోజున మనదేశంలో తయారగుతూ ప్రజలచేతుల్లోనుంచి ఎల్లా తిరిగిపోతున్నాయోగదా!

—శ్రీ మామిడన్న వెంకటేశ్వరరావు.

## స్త్రీలు విమానాలను నడపాలి.

ప్రపంచపరిణామాలు క్షణక్షణాలమీద మారిపోతున్నాయి. పాశ్చాత్యఖండాల్లో నియంతలరాజ్య తృష్ణవలన యుద్ధభీతి ప్రళయతాండవం చేస్తోంది. ఎప్పుడు యుద్ధంవస్తుందో ఎన్నెన్నిప్రాణాలు ఆహుతిఅయిపోతాయో అనేభయం దినదినాభివృద్ధి పొందుతోంది. ఇట్టిసమయంలో స్త్రీలు నెరవేర్చ వలసినకార్యాలు చాలా వున్నాయి.

ప్రప్రధమాన్ని వారు విమానాశ్రయాల్లో సభ్యులుగాజేరి విమానంనడపడం, మూంజీవిద్యామందిరంలోచేరి సైనికశిక్షణపొందడం, డఫరిన్ షిప్పులోచేరి నావికాశిక్షణ పొందటం మొదలైనవి నేర్చుకోవాలి. ముఖ్యంగా విషవాయువులనుండి తప్పించుకోవడం, యుద్ధంలో దెబ్బలుతిన్నవారిని రక్షించడానికి వైద్యసహాయవిద్య అభ్యసించడం మన వనితాలోకం గమనించాలి. యీవిషయాలను గమనించకపోతే, ప్రస్తుతం చీనా, స్పెయిన్ మొదలగుదేశాల్లో మహిళామణులు పడుతూన్న యిక్కట్లనే మన భారతనారీమణులుకూడా పడవలసివస్తుంది. ఇందుకోసం జపానుదేశంలోవలె దేశభక్తియుతమైన స్త్రీసమాజాలుస్థాపించి విజ్ఞానాన్ని సంపాదించాలి. ఈవిషయాన్నిగుర్తించి అనేకమంది స్త్రీలు యిటువంటివిషయాలలో మంచిప్రవీణత సంపాదిస్తున్నారు.

మిసెస్. ఏమీమోలిసన్ అనే ఆవిడ గంటకి 77 మైళ్ల వేగంతో లండన్నుంచి కేపుటౌనుకు 78 గంటల 28 నిమిషాలలో విమానంనడిపింది. మేడమ్ కొయిరుకోమక్, మేడిమోయి సెల్లీలూకాస్ నార్డిన్ అనే ఫ్రెంచి యువతులిద్దరు విమానంలో హిందూదేశం వచ్చారు. ఏమీమోలిసన్‌గారికి రాయల్ ఎరోక్లబ్బువారు బంగారుపతకాన్ని బహుమతిగా యిచ్చారు. మిస్. జేన్ చేటర్ అనే అమెరికాస్త్రీ విమానంమీద ప్రపంచం చుట్టివచ్చింది. మిస్. తెయిలర్ అనే 7 సంవత్సరములబాలిక లండనునుంచి కరాచీకి ఒక్కర్తె ప్రయాణంచేసింది. మూడుసంవత్సరాలు యీడుగలిగిన మరియొక బాలికకూడా యీలానే ప్రయాణంచేసింది.

మన భారతీయస్త్రీలుగూడా చాలామంది ఇటీవల విమానాల్లో ప్రయాణంచేస్తున్నారు. జవహరు పండితునికుమార్తె, కుమారి ఇందిరానెహ్రూ విమానంమీద ప్రయాణంచేసి అలహాబాదులో బామ్రోలి ఏరోడ్రోంవద్ద దిగినప్పుడు అనేకమందివనితలు ఆమెకు స్వాగతంఇచ్చి తీసుకువచ్చారు.

ఇట్టివిషయాలను పురస్కరించుకొనియే కలకత్తా యూనివర్సిటీవారు వైమానిక విద్యావిధాన్నికూడా నేర్పడానికి ప్రయత్నాలు చేశారు.

ఇట్టి ప్రసిద్ధవిషయాల్లో స్త్రీలు ముఖ్యంగా ప్రవీణతసంపాదిస్తే ప్రజలకి యుద్ధారోజుల్లో చాల సహాయపడి దేశఖ్యాతికి కారకులౌతారు.

# గ్రంథ సమీక్ష

**శ్రీ కృష్ణవాచకములు:—మొదటి, రెండవ, మూడవ, నాలుగవ, ఐదవ వాచకములు. (సవరింపబడిన ముద్రణము 1939)**

ప్రకాశకుడు: మహాకాళి సుబ్రహ్మణ్యముగారు, బి. ఏ. ఎల్. టి., మద్రాసు ఎడ్యుకేషనల్ సర్వీసు (రిటైర్డు) రాజమహేంద్రవరము.

వెల: మొదటివాచకము రు. 0 3 0, రెండవవాచకము రు. 0 3 6, మూడవవాచకము రు. 0 4 0, నాలుగవవాచకము రు. 0 4 6, ఐదవవాచకము 0 5 0.

పుస్తకములు వలయువారు పై చిరునామాకువ్రాసి. తెప్పించుకొనవచ్చును.

మద్రాసు విద్యాశాఖయందు చాలకాలముపనిచేసి విశ్రాంతిగైకొనిన శ్రీ మహాకాళి సుబ్రహ్మణ్యం బి.యే. యల్.టి. గారు తమ విశేషానుభవముతో ఆయాతరగతుల బాలుర కుపయుక్తమగు వివిధవిషయము లను పొందుపరచి తెలుగు వాచకపుస్తకములనువ్రాసి, వాటినిసవరించి, పునర్ముద్రణ మొనరించుటలో బాలుర మాతృభాషాభివృద్ధికిని, ప్రాథమికవిద్యావ్యాప్తికిని ప్రశంసనీయమగు సేవచేసిరనుట యతిశయోక్తి కానేరదు.

ఈవాచకములు చక్కని తేలికభాషలో వ్రాయబడుటచే బాలురకు పఠనీయగ్రంథములుగ నియమింప బడుటకెంతయు నొప్పియున్నవి. చెన్నపురి టెక్స్టుబుక్కు కమిటీవారి అంగీకారమునుపొందుటే ఈవాచకముల ప్రాశస్త్యమును వెల్లడించుచున్నది. ఐదవవాచకపుస్తకములో కీర్తిశేషులైన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిజీవితము చేర్చబడుట వాచకమునకు వన్నెతెచ్చుచున్నది. బాలురకు అనుభవజీవితములో నక్కరకు వచ్చు పెక్కువిషయములను చక్కగ బోధించుచున్న ఈవాచకములు ఆంధ్రదేశ మందన్ని పాఠశాలలలోను పఠనీయగ్రంథములుగ ప్రోత్సహింపదగియున్నవి.

**బ్రిటిషు ఇండియా చరిత్ర**

కర్త: శ్రీ దిగవల్లి వేంకటశివరావు.

ప్రతులకు: దిగవల్లి వేంకటశివరావుగారు, బి. ఏ. బి. ఎల్., బెజవాడ. వెల రు. 1 8 0

భారతదేశస్థులు బానిసలు. బ్రిటిషువారు కేవలం వీరిని ఉద్ధరించడానికి భారతదేశం వచ్చారు. వారు పరిపాలించుట కర్హతకలవారు; వీరు పరిపాలింపబడుటకన్న వేరుఅర్హతలేనివారు. వారు ఉత్తములు; వీరు నీచులు — ఈవిషయాలనే చిన్నప్పటినుండి బాలబాలికలకు బోధించి వారినెల్లప్పుడు బానిసలుగా వుంచాలనే దృష్టితో సత్యాన్ని కప్పిపుచ్చి, కల్పనలు చేసి వ్రాయబడ్డ హిందూదేశచరిత్రలే నేటివిద్యావిధానంలో ఉపయోగింపబడుతున్నాయి.

కాని గ్రంథకర్తగారు శ్రమించి అనేకవిషయాల్ని సేకరించి యదార్థహిందూదేశచరిత్రని యీపుస్తకంలో పొందుపరచారు.

గ్రామసౌభాగ్యము, గ్రామపరిపాలన నిర్దుష్టముగా 1565 నాటికే జరుగుచుండెనని ఉదాహరణలతో నిరూపించివ్రాశారు. శౌర్యప్రతాపులు ధర్మరాజ్యనిరతులు అయిన మహారాష్ట్రుల పరిపాలనాపద్ధతిని ఎల్ఫిన్‌స్టన్ అను ఆంగ్లేయరాజ్యతంత్రజ్ఞుడు ఎట్లు నాశనము చేసినదియు, ఆంగ్లేయులు భారతదేశమును భుజబలము చేత ఎన్నడు జయింపలేదనియు, మహమ్మదీయ పరిపాలనలోకన్న ఎక్కువధనము భారతదేశమునుండి ఆంగ్లేయులచే కొల్లకొట్టుకొన పోబడినదనియు మొదలగువిషయాలనెన్నిటినో సేకరించివ్రాశారు.

బ్రిటిషుపరిపాలన ప్రారంభదశలో వారిచే గావింపబడుచుండిన అన్యాయములనుఎదుర్కొని తన సర్వస్వము మాతృదేశోద్ధరణమునకై అర్పించి, నేటి స్వరాజ్యపత్రికకు తనసర్వస్వమును ధారవోసిన ప్రకాశం పంతులుగారివంటి దేశభక్తుడు, ఆనాడు ప్రసిద్ధాంధ్రవర్తకుడు శ్రీ గాజుల లక్ష్మీనర్సుగారు. ఆయనచరిత్ర యిందు విశదీకరింపబడింది.

అయోమయంగానూ, అసత్యభూయిష్ఠంగానూవున్న గడచిన భారతదేశంయొక్క నిజచరిత్ర తెలిసికోవలెనంటే యిది చదివితీరాలి.

ఇట్టి అత్యుత్తమవిషయాల్ని చేకూర్చివ్రాసిన శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారికి మాధన్యవాదాలు.

## గోభూమి

కర్త: శ్రీ నాగేశ్వరరావు, ప్రతులకు: కిసాన్ ప్రెస్; 23 స్ప్రింగరువీధి, మద్రాసు. వెల 4 అ.

'గోభూమి' యొక్క పవిత్రత దాని నేటిహీనదశనువర్ణిస్తూ చక్కనిగీతికలుగల సంపుటియిది. గోమాత యొక్క ఆక్రందనాన్ని వర్ణిస్తూవ్రాసిన ఒకగీతాన్ని చూడండి మచ్చుకి.

పాలున్న పదినెలలు
పితికారు
పిండారు
పీల్చేసి
పీసుగనె చేశారు
ఎండిపోయాపంచు కాటికేతోలారు
నువ్వెక్కడున్నావో నాతండ్రీ ?
నన్నుకావగరావ నాతండ్రీ ?

హారతి అందుకుంటూవున్న గోమాతయొక్క చక్కనిముఖచిత్రంలో భారతీరంగాగారి అక్షరాలతో పుస్తకం ముచ్చటగావుంది.

## సోవియటు రష్యా

సంపాదకుడు: శ్రీ నందూరి సత్యనారాయణ, తాడేపల్లిగూడెం. వెల ఒక అణా.

సౌఖ్యసాధనప్రచార గ్రంథమాలవారి ఉష్ణరక్తబిందువు ఇది.

సోవియటు రష్యానుగురించి తెలుసుకోవలసిన అనేకవిషయాలు చాలవరకు అతివాదపత్రికలనుండి మితంగాతీసి ప్రకటించారు సంపాదకులు దీన్ని.

## నవశక్తి—మే డే సంచిక

మామూలుఆకారం, 32 పేజీలుగల ప్రత్యేకసంచిక. విడిప్రతి రెండణాలు. నవశక్తి కార్యాలయం బెజవాడ.

కార్మికవర్గాలు తమతమశక్తిని పరీక్షించుకుని, భావికర్తవ్యానికి నూతనపోకడలు సృష్టించుకుని, దీక్ష వహించే పవిత్రదినం యీ మే 1-వ తేది. 1886 లో న్యూయార్కు కార్మికులపై కాల్పులుప్రయోగించినది మొదలుగా, ప్రతిసంవత్సరమూ జరుపబడుతూన్న మే దినోత్సవాన్ని పురస్కరించుకుని ప్రత్యేకముగా ప్రచురించారు యీసంచికను. కార్మికసమస్యలకు సంబంధించిన వివిధవ్యాసాలు, స్టాలిన్ ఉపన్యాసాలు, స్పెయిన్ దురవస్థనుతెల్పే వివిధచిత్రాలు వున్నాయి.



చిత్రలేఖ:— కలలో గాంచిన పురుషుని
కొనితెమ్మనిన ఎటులమ్మా ఉషా!

మాడరన్ సినిటోనువారి
'ఉష'
యందొక మధుర సన్నివేశము.

# ఓడియన్

## క్రొత్త గ్రామఫోను రికార్డులు



శ్రీమతి సూర్యకుమారి

## మృదు మధుర గానము

| C. A. 1209 | కాంగ్రెసు జెండా |
|---|---|
| | పావనహిందూమాతా |



**SARASWATHI STORES,**

MOUNT ROAD, MADRAS.






సంగీతము: సర్వకళలయొక్క సారమును మూలమునునైయున్నది:—

శ్రీమతి రుక్మిణీదేవిగారి ఉపన్యాససారాంశము

విజయకళాశాల (ట్రయంఫ్ కాలేజీ)యొక్క వేసవి హైందవ సంగీతపాఠశాల ప్రారంభోత్సవ సందర్భమున శ్రీమతి రుక్మిణీదేవిగారి ఉపన్యాసములో చక్కని భావములు వెలువరింపబడినవి.

సంగీతమునందు ప్రావీణ్యమును సంపాదించుట అందరకును సాధ్యము కాకున్నను, స్త్రీపురుషులెల్లరు సంగీతమును, భావోద్రేకమును బొంది ఉన్నతాదర్శములచే నావహింపబడి, ఆనందింపగలిగిన శక్తిని సంపాదింపవలెననుట చక్కని హితోపదేశ వాక్యమనదగును.

శీలమును చక్కజేయుటకు సంగీతము చాల సహాయకారియనియు, సంగీతమందు సరియగు అభిరుచి ప్రజలలో గలుగుట స్వజాతీయాభ్యుదయమునకు చిహ్నమనియు జాతియొక్క విజ్ఞానవైభవము సంగీతజ్ఞానాభివృద్ధిచే శోభించుననియు చెప్పిన శ్రీమతి రుక్మిణీదేవిగారి వాక్యములందెంతయు సత్యమున్నది.

సంగీతము, సాహిత్యము, శిల్పము, చిత్రలేఖనము మొదలగు లలితకళలన్నియు స్త్రీ పురుషులందరును వారివారి శక్త్యానుసారముగ నుపాసించుటయేకాక అందనుభవింపనగు ఆనందమును తమ జీవితవిధానములో వెల్లడింప పాటుపడవలెను. అప్పుడుగాని మానవవ్యక్తిలో నణగిమణగియున్న దివ్యత్వము తేజరిల్లదు.

సంగీతమే సర్వకళలకు సమాశ్రయము. గానమే ఆనందముయొక్క సహజస్వరూపము. ఎక్కడమాధుర్యము, సౌందర్యము, సౌజన్యము, సౌశీల్యము, సౌఖ్యసంపదలు, శాంతిసహనములు, దయాసత్యములు, గాంభీర్యౌదార్యములు సమన్వయము సెందునో అక్కడ సంగీతము సర్వేంద్రియానుభవమై హృదయము నానందపారవశ్యము గావించును.

సంగీతము దేశములో యెక్కువగనభివృద్ధిచెంది, స్త్రీపురుషులెల్లరును సంగీతముచే నానందకరమగు జీవితముల ననుభవించుటకు తగిన యవకాశములు చాల గల్పింప

నవసరమైయున్నది. సంగీతశాస్త్రజ్ఞుల సంఖ్య హెచ్చుటయేకాక ప్రజలకు సంగీతమందభిరుచి విశేషముగ కలుగవలెను. సంగీత విద్వాంసులకు సంస్థానములు తగిన ప్రోత్సాహమొసగ వలెను. సంగీతపాఠశాల లధికముగ స్థాపింపబడవలెను. అన్నిటికంటె ముఖ్యముగా స్త్రీలు సంగీతమునందు చక్కని పాండిత్యమునుబడయ విశేషముగ కృషిసలుపవలసియున్నది.

'విద్యారూపం విరూపాణాం' అనునట్లు సంగీతమే సుదతులకు సత్యమగు సౌందర్యమని వారు గ్రహింపదగును. 'కోకిలానాం స్వరంరూపం'అని మధురమగుగానమే ముదితలకు మురిపెంపు అలంకార మననగును.

రమణీయమగు దృశ్యములలోను, సుందరమగు సృష్టివైచిత్ర్యములలోను ముద్దులొల్కు మాటలందును, ఆనందము నతిశయింపజేయు నృత్యములలోను, శృంగారమును గురియించు చిత్తరువులలోను మాధుర్య ముట్టిపడుచుండుటను అంతరంగమున ననుభవింప గల వారలకు సంగీతమే వివిధరూపములగు సౌందర్యముగ గోచరించున్నదని స్పష్టపడ గలదు.

స్త్రీలు సౌందర్యమును చాలగ నభిలషించువారగుటచే సంగీతమును చక్కగ నేర్చుచో వారి సౌందర్యమునకు సంగీతము, బంగారమునకు పరిమళము భాతి తనరారును.

**పంజాబులో ఘోషా విద్యాపద్ధతులు:—**

పంజాబురాష్ట్రప్రభుత్వ ప్రధానమంత్రియగు సర్. సికందరు హైయట్ ఖాన్‌గారు 'జలందర్'లో స్థాపింపబడిన 'మద్రాసా' యను పేరబరగు మహమ్మదీయ బాలికాపాఠశాల యువతులవిశ్వవిద్యాలయముగ మారుట కవకాశములు గన్పట్టుచున్నవని తెల్పియుండుటెంతయు స్త్రీల విద్యావ్యాప్తికి శుభసూచకమైయున్నది. సర్. సికందర్ గారు, విద్యాలయమునకై నూతనముగ నిర్మింపబడనున్న భవనమునకు పునాదిశిలను ప్రతిష్ఠించుటయు, నా శుభకార్యము ముగియకమున్నె విద్యాశాఖామంత్రియగు మియాన్ అబ్దుల్ హే గారు ప్రభుత్వమువారు విద్యాలయ భవననిర్మాణమునకై పదివేలరూప్యములు ప్రసాదింప సంకల్పించుట నెరింగించుటయు నెంతయు ప్రశంసింపవలసియున్నది. భవనమునకై రెండు లక్షలరూప్యములు వెచ్చింపబడునని తెలియుచున్నది.

ఇదికాక ఏబదివేలరూప్యములు ప్రజలవలన సహాయముగ చేకూరుటచే భవననిర్మాణము త్వరలోనే పూర్తియగునను ఆశ జనించుచున్నది. ఈ విద్యాలయము 'ఆలిఘర్' విశ్వవిద్యాలయ ఘనత నినుమడించునా యను భావము నుద్భవింపజేయుచున్నది. ఇందులో కొంతభాగము పురుషులకై ప్రత్యేకింపబడునని తెలియుచున్నది.

కాని భవనబాహుళ్యము ఉద్దేశింపబడిన విద్యార్థినుల సంఖ్యకు చాలునా యను సంశయము గల్గుచున్నది.

ప్రస్తుత మీ విద్యాలయ పరిస్థితులు బహు చిత్రముగ నున్నటుల స్పష్టపడును. బాలికలు చాపలమీదనే కూర్చుండి విద్యగఱచుటయు తరగతులు వట్టి నేలమీదనే జరుపబడుటయు నిరాడంబరమగు పద్ధతులలో విద్య నేర్పబడుటయు నెంతయు నాశ్చర్యమును గల్గించుచున్నది. అక్కడ బాలికలు పొందుచున్న శిక్ష ఆదర్శప్రాయముగ నెన్నబడుటయు అనేకమంది బాలికలకు ఆ శిక్షావిధానము విద్యయందభిలాషను గల్గించుటయు శ్లాఘాపాత్రమై యున్నది.

బాలికాపాఠశాలలో 'మద్రాసా' యను బాలికాపాఠశాల ప్రధానస్థానమును పొందియున్నదని పలువురు పెద్దలు అభినుతించుచున్నారు. ఘోషాపద్ధతి నవలంభించుచు ప్రస్తుత దేశకాలపరిస్థితులలో నెంతయు ప్రయోజనకరమగు విద్య యిచ్చట నేర్పబడుటచే నీ పాఠశాల ఆదర్శప్రాయమగు విద్యాలయ మగుననుట నిశ్చయము.

ఇందలి విద్యావిధానము స్త్రీల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడునదిగ నున్నదని స్పష్టపడుచున్నది. 'తురకము' 'అరబ్బీ' ముఖ్యముగ నేర్పబడుటేకాక, ఇంటివిద్యలును నాగరకతాభివృద్ధి కనుగుణ్యమగు విషయములును, ఇంగ్లీషుభాషయు, శరీర వ్యాయామ శాస్త్రమునుగూడ బోధింపబడుటచే నీ పాఠశాల బాలికావిద్యాలయములలో నెంతయు ప్రస్తుతింపదగియున్నది.

మతవిషయములకు ప్రధానస్థాన మొసంగని విద్యావిధానమును మహమ్మదీయులొల్లరు. ఇందలి సత్యము పంజాబుప్రభుత్వ ప్రధానామాత్యులు పల్కిన వాక్యముల వలననే విశదమగుచున్నది. 'ఇస్లాముసాంప్రదాయము నీ విద్యాలయము సంపూర్ణముగ వెల్లడించుచుండుటచే నా మనసు నెంతయు నాకర్షించినది. ఇట్టి విద్యాలయములలోనే మనపుత్రికలును తోబుట్టువులును విద్య నభ్యసింపవలసియున్నది. ఇచ్చటిమాదిరి శిక్షణ నొందినవారే నిజమగు విద్యావతులని చెప్పదగును' అని సర్. సికందర్‌గారు నుడివి యున్నారు.

దేశములో ఘోషాపద్ధతిని తొలగించవలెనని తీవ్రమైన ప్రయత్నములు జరుగుచున్నను పెద్దకుటుంబములలో చాలవర కీ యాచారము తొలగింపబడినను ఇంకను హిందువులలోను మహమ్మదీయులలోను సామాన్యకుటుంబములలోగూడ నీ యలవాటు తల సూపుచునే యున్నది. ఈ యాచారము త్వరలో తొలగింపబడుటకు తగు ప్రచారము ప్రజలలో జరుగవలసియున్నది.

'జలందర్'లో ఈ పాఠశాలకాక మరొక బాలికా మహావిద్యాలయమున్నది. అది మౌలానా అబ్దుల్‌హక్ అబ్బాసుగారి ప్రయత్నముల ఫలితముగ 1926 వ సంవత్సరంలో స్థాపింపబడినది. ఇందులో విద్య యుచితముగ నేర్పబడును. ఇందలి ఉపాధ్యాయినిలు తక్కువజీతములతో సంతృప్తిజెంది విద్యావ్యాప్తికై కృషిసల్పుట ఘనకార్య మనదగి యున్నది. ఈ పాఠశాలలో విద్యనభ్యసింప హిందూదేశమున కావలిభాగములనుండి కూడ చాలమంది వచ్చుచుండుట ఈ విద్యాలయ ప్రతిభను చాటుచున్నది.

ప్రధానామాత్యులరాక 'మద్రాసా' విద్యాలయచరిత్రలో గొప్పవిషయముగ నెన్న బడుచున్నది. ధనసాహాయ్యము జేయుచున్న విద్యాశాఖాప్రభుత్వమువారు తమ నిబంధనలకు కట్టువడియుండి విద్యగఱపవలెనని ఇట్టి ఉన్నతాదర్శములుగల విద్యాసంస్థల నాజ్ఞాపించుట సమంజసముకాదు. కాని ప్రభుత్వమువా రీవిద్యాలయము విజ్ఞానమునెల్లెడల విస్తరింపజేయు చున్న విషయమును గమనించి ఈ పాఠశాలాభివృద్ధికి వలయు చేయూత నిచ్చుటచే ఈ విద్యాలయ మచిరకాలములో శాశ్వతమగు కీర్తిని గాంచి స్త్రీల విద్యావ్యాప్తికై పాటు పడు పాఠశాలలలో నగ్రస్థానము నొందునని యుత్సహించుచున్నాము.

ప్రధానమంత్రిగారీ విద్యాలయమును సందర్శించిన సమయమున చాల బాల్యదశ యందుండిన బాలికలే వారి సమక్షమున గూర్చుండియుండుటయు విద్యార్థినులు తెరచాటు నుండియె ఆహ్వానపత్ర మొసంగుటయు, వేడుకకార్యముల జరుపుటయు వింతగనున్నది. ఇది ఘోషాపద్ధతిని పూర్తిగ పరిపాటించుటను ప్రస్ఫుట మొనరించుచున్నది. ఈ యాచా రము సంఘములో తొలగినగాని దేశము సంపూర్ణవిజ్ఞానమును విదేశములలో విస్తరింప జాలదు.

**వితంతు శరణాలయస్థితిగతులను చక్కజేయు సత్ప్రయత్నములు:—**

సంయుక్తరాష్ట్రములలోనున్న వితంతుశరణాలయములను సరియైన పాలనలో నుంచుటకును అందు నివసించుచున్న వితంతువుల నైతికజీవితమును కాపాడుటకును వారి విద్యాభివృద్ధికిని పునర్వివాహములకును వలయువసతులను అవకాశములను సమకూర్చుట కును ప్రభుత్వవర్గమువారి ప్రమేయములేని ఒకబిల్లును శ్రీ. హెచ్.యన్. గుప్తాగారి సలీమణి శాసనసభలో ప్రవేశపెట్ట సంకల్పించినటుల ఈ ఏప్రియల్ 20-వ తేదీని ప్రచురింపబడిన 'గార్డియన్' పత్రికలో వెల్లడింపబడినది.

ఈ బిల్లును ప్రవేశపెట్టుటకు ఆరాష్ట్రములలోనున్న వితంతువులలో నూటికి సుమారిరువదియిద్దరు వివాహములకు యుక్తవయసులోనున్న వారగుటయే ప్రధానకారణ

మని తెలియుచున్నది. శాసనసభలో జరిగిన ప్రశ్నోత్తరములవలన రాష్ట్రములలోనున్న మొత్త మిరువదియేడు వితంతుశరణాలయములలోను పదమూడు మాత్రమే రిజిష్టరు చేయబడినవనియు తక్కిన పదునాలుగును రిజిష్టరు చేయబడలేదనియు, వాటిలో మొత్తము 280 వితంతువులు నివసించుచున్నట్లును విదితమగుచున్నది.

ఒక వితంతు శరణాలయమునకు మాత్రమే లక్షరూప్యముల మూలధనముండుటయు మిగతా శరణాలయములన్నియు కడుబీదస్థితిలో నుండుటయు నెంతయు నిరుత్సాహము గొల్పు విషయమైయున్నది. శాసనసభ వారికి వితంతుశరణాలయములయొక్క విషాదకర మగు పరిస్థితులనుగురించి ప్రభుత్వమువారు సంపూర్ణ వివరములను తెల్పియుండిన సందర్భ ములవలన, నీ శరణాలయములో నియమింపబడిన నిర్వాహకులును ఇతర ఉద్యోగస్థులును అందు నివసించుచున్న యువతుల నవతలకు తీసికొనిపోయి వారి శీలమును చెడగొట్ట ప్రయత్నించుచుండ పట్టువడి బంధింపబడిరనియు, శ్రేబాయములోనున్న బాలికలను బల వంతముగ బయటకు గొనిపోయి పంజాబురాష్ట్రములో వారిని విక్రయించినందులకై చెరగొనబడిరనియు స్పష్టమగుచున్నది.

సోదరసోదరీమణులారా! పైన పేర్కొనబడిన పత్రికలో, ఈ వార్త ప్రభుత్వమువారి వలననే వెల్లడియైయున్నట్లు ప్రకటింపబడియుండుటచే నిది యదార్థమనియే గ్రహింపవలసి యున్నదిగదా? అట్లగుచో, సంఘములో నిట్టి ఘోరకృత్యములు సాగుచుండు టెంత శోచనీయమగు సంగతియో యించుక యోచింపుడు. ఇట్టి విపరీతనడతలు అవినీతికార్య ములు సంఘ ముపేక్షనేసి యూరకొనదగునా? ఏపాపమెరుగని యువతులయెడ నిట్టి దుష్కృతములు, దుండగములు చేయ సాహసించు చెనటులకు చక్కగ సత్వరమే బుద్ధి చెప్పకున్న సాంఘికజీవితమునకు చేటు సంభవించుటేకాక ఇట్టి దుర్నీతులు దేశమునకే కాక నుర్వియంతకును కళంకమును గలిగింతురనుట నిశ్చయము.

ఈరీతిగ పరిపాలింపబడుచున్న పడుచులను, బాలికలను నుద్ధరించుటకై శ్రీ గుప్త సతీమణిగారు వితంతుశరణాలయముల స్థితిగతులను సంస్కరింప సమకట్టి ఈ బిల్లును ప్రవేశపెట్టబూనుటెంతయు ప్రశంసనీయమైయున్నది.

ఈబిల్లు సర్వజనామోదమునుబడసి శాసనసభవారిచే నేకగ్రీవముగ నంగీకరింపబడి శీఘ్రమే అమలులోనికి వచ్చినచో నిత్యము దైన్యముతో దురపిల్లుచు దుఃఖభాజనమగు జీవితముల గడుపుచుండు భర్తృవిహీనలగు యువతులకు జీవితమునందాశయు నుత్సాహ మును జనించు భాగ్యమొదవును. ఈబిల్లు అనాథలగు స్త్రీలనెల్లర నుద్ధరించునని నమ్ము చున్నాము.

మైసూరు వనితాసదనము:—

గతమాసము ప్రథమవారములో జరిగిన మైసూరు 'వనితాసదనము'యొక్క సమావేశములో యం. జీ. మేఖరీ (డెప్యుటీకమీషనరు)గారు బహుమతులను బంచిపెట్టు శుభకార్యావసరమున సదనమునందలి సుదతులు పాకశాస్త్రము, కుట్టుపని మొదలగు గృహకృత్యములలో చక్కని నేర్పును సంపాదింప శ్రమపడుచుండుటను సంస్తుతించు సందర్భమున వెల్లడించిన సంతసము స్త్రీల యభివృద్ధి నభిలషించువారల నెల్లర హృదయముల నాకర్షింపక మానదు.

వనితాసదనములోని యువతులు ముఖ్యముగా నింటిసంరక్షణము, శిశుపోషణము, ఆహారపద్ధతులు మొదలగు సంసారవిషయములను కడుశ్రద్ధతో నేర్చికొనుచుండుట, వారు చక్కని 'గృహిణులు' కాగోరి తగు కృషిసల్పుచుండుటయు నింటి విషయములలో నెంతయు నుత్సాహమును ప్రదర్శించుటయును ప్రేక్షకులకు కన్నులపండువుగ నుండుననుటకు సందియములేదు.

మైసూరు 'వనితాసదనము'ను మద్రాసు 'సేవాసదనము'వలెనే యువతుల కాదర్శప్రాయమగు విద్య నొసంగి వారిని చక్కని గృహలక్ష్ములను సేయ సమకట్టు టెంతయు శ్లాఘాపాత్రము.

స్త్రీలు గృహలక్ష్ములు కాగోరుచోనందులకు కావలసిన విద్యాబుద్ధుల నెక్కుడుగ యుక్తవయసు వచ్చులోపలనే గడింప పాటుపడవలసియున్నది. సంసారబంధము పైబడిన పిదప వివిధవిద్యల నభ్యసించుటకు విశ్రాంతియు నవకాశములును చాలినంత సమకూరవు. కనుక విద్యాభ్యాసము వివాహమునకు ముందుగనే పూర్తిచేసికొని సంసారమును చక్కగ నిర్వహింప నేర్చుచో సర్వవిధముల వారు సుఖింపగల్గుటేకాక వారి భర్తలకును బిడ్డలకును సుఖమును గూర్చ గలుగుదురు.

ఇట్టి వసతులను సౌకర్యములను చాలగ నొసంగుచు స్త్రీల జీవితములకు సుఖమునొడగూర్ప నుద్యమించిన నీ వనితాసదనము లవనివృద్ధిచెంది విలసిల్లుగాక!



EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# విషయసూచిక



## త్రివర్ణచిత్రములు

విజయునిపై వలపునిలిపిన ఉలూపి విలాస విలోకనము

చిత్రకారుడు : శ్రీయుత సి. ఎస్. వెంకట్రావుగారు.



# సారథి రెండవ సమస్యాచిత్రం

# రైతు బిడ్డ




ఉత్తమతరగతి ప్రచారక చిత్రం —ప్రజాబంధు

రైతు ఉద్యమ ప్రచారానికీ, జమీందారీలలోని ఘోరాలను బయలుపరచటానికీ బాగా ఉపయోగపడే చిత్రం —వాహిని

ఏ యెస్టేటులోనో జమీందారుకు రైతులకు మధ్య నడచిన సంరంభమును ఉన్నదున్నట్లుగా 'కెమారా'తో తీసారా అన్నంత స్వాభావికంగా ఉన్న ఘట్టాలతో నిండి ఉన్న చిత్రం —ఆంధ్రప్రభ

అద్భుతమైన ఫోటోగ్రఫీ-అసదృశమైన సంగీతం-చక్కని రికార్డింగ్-సమంజసమైన అభినయనం —జనవాణి

జమీందారులచేతుల్లో రైతులుపడే కష్టనష్టాలు, జమీందారులనాశ్రయించుకొని ఉండే తాబేదార్ల దుండగాలు, రైతుల అసహాయస్థితి, దీనదశా, బాగా నిరూపించిందీ చిత్రం —ఆంధ్రపత్రిక




| డైరక్టరు: | మ్యూజిక్: |
|---|---|
| గూడవల్లి రామ బ్రహ్మం | భీమవరపు నరసింహారావు |



సారథి రైతుబిడ్డ

విడుదలకు సిద్ధముగా నున్నది!

*For booking apply to:—*

SARASWATI TALKIES Ltd., BEZWADA.

క. భోగవతినుండి యెవ్వఁడు భాగీరథికడకువచ్చి భాసిలుమున్నే
నాగకుమారికయులూపి తమి నొక్కనాఁడటఁ జెంతన్.

... ... ... ...

సీ. బెళుకుఁగాటుక కంటిసోలవుఁ జూపెదలోనఁ బట్టియుండెడి ప్రేమఁ బట్టి యీయఁ
జికిలి బంగరుప్రాఁత జిలుఁగు టొయ్యారంపుఁ బైఁటగుబ్బల గుట్టు బైటవేయ
సొగసుఁగుచ్చెలఁ నీటువగలు కన్నులపండు గలుగ మాయవుఁ గాను గలుగఁజేయ
నిడుద సోగమెఱుంగు జడకుచ్చు గరువంపుఁ బిఱుఁదు రేఖకు గెల్పు బిరుదుచాటఁ

గీ. గంట సరినంటు కస్తురి కమ్మవలపు కప్పురపు వీడి యవుఁ దావిఁ గలసిమెలఁగ
నొఱపులకు నెల్ల నొజ్జయై యుండెనపుడు భుజగగజగామిని మిటారి పొలుపుమీఱి.

... ... ... ...

గీ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు నవురు జవురు నువిదమోవి
మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను.

గీ. రవరవలు నెఱపు నీలపు
రవరవణముతోడఁ జెలియరాళకచంబుల్;
కవకవ నవ్వున్ వలిజ
క్కవకవఁ గల కంతకంతి కఠినకుచంబుల్.

(విజయవిలాసము)




## హిందూస్త్రీలకు విడాకులహక్కు శ్రేయోదాయకముకాదు

ఈమధ్య కేంద్రశాసనసభలో డాక్టరు దేశముఖ్‌గారు, కొన్ని సందర్భములలో స్త్రీలు వివాహబంధమును వీడుటకై విడాకులహక్కును కల్గించుట కొకబిల్లును ప్రవేశ పెట్టుటయు, అది ఒక ప్రత్యేక సంఘముయొక్క పరిశీలనకై పంపబడుటయు పత్రికల మూలమున ఎల్లరకును తెలిసియేయున్నది.

ఈబిల్లుప్రకార మీాదిగువ పేర్కొనబడిన పరిస్థితులలో పడతులు తమ పతులను బహిష్కరించి సంపూర్ణ స్వాతంత్ర్యమును బడయవచ్చునని నిరూపింపబడినది. (1)పురుషుడు పుంసత్వమును పూర్తిగ గోల్పోయినను, ఔషధసేవచే ఆరోగ్యమును, యవ్వనమును తిరిగి పొందనలవికాని దుస్థితిలోనున్నను, (2) భార్యసజీవియైయుండ వేరొకభార్యను గైకొనినను, (3) స్వమతమును వీడి అన్యమతమును స్వీకరించినను, (4) భార్యను పూర్తిగ మూడుసంవత్సరములు విడిచిపెట్టియుండినను.

పై కారణములలో ఏయొకటి సంభవించినను స్త్రీ భర్తకు విడాకులిచ్చి వివాహ విచ్ఛేదము నొందవచ్చును. పుస్తిమెడలో పడిననాటినుండి ప్రాణములు మేనదాల్చు పర్యంతము ఎట్టి దుర్భర దుఃఖమునైన ననుభవించుచు పతియెంతపతితుడై బాముల బెట్టినను వాటినన్నిటి నోర్చికొనుచు సంసారయాత్రను సాగించుచు, పతియేగతియని

సంభావించి యాతని సేవించుటయే స్త్రీ తన పరమావధియని భావింపవలెననుట భావ్యము కాదని ఈబిల్లు ప్రబోధించుచున్నది.

పురుషులకున్న స్వాతంత్ర్యము స్త్రీలకేలయుండరాదని ఈబిల్లు ప్రశ్నించుచున్నది. స్త్రీలును తమ దుస్థితిని తొలగించికొని స్వేచ్ఛగ జరింపవచ్చునని హెచ్చరించుచున్నది.

పడుపడు అనువారే కాని పడినలేవనెత్తువారు లేరన్నవిధముగ భర్తలబారినుండి బయటపడుడని ప్రేరేపించుటయేగాని భర్తలను బాసినపిదప భార్యలగతియేమియను సమస్యను చల్లగ జారవిడిచిన యీబిల్లు సరియైన సంఘసంస్కరణవిధాన మనజెల్లునా?

ఈబిల్లు వివాహములలో జరుగుచున్నట్టి లోపములను చక్కజేయ సమకట్టునటుల గన్పట్టుటలేదు. పురుషుల వివాహబంధ విముక్తి కీబిల్లులో తావొసంగబడలేదు. స్త్రీలు యేయే న్యాయసమ్మతమగు సందర్భములలో విడాకులహక్కు నుపయోగించుకొనుటో సంపూర్ణముగ నీబిల్లునందు వివరింపబడలేదు. వివాహబంధవిమోక్షవిధాన మిందు చక్కగా సిద్ధాంతీకరింపబడలేదు.

భర్తలుబెట్టు బాధలనుండి భార్యలను తప్పింపజూచు ఈబిల్లు వారి జీవనోపాధికి సరియగు మార్గమును చూపుటలేదు. సంతానముగల స్త్రీలు విడాకులిచ్చినచో వారి పిల్లల గతియేమి? పిత్రార్జితములో భాగమును పంచికొనుటా లేక భిక్షాపాత్రమును గైకొనుటా?

బిల్లులోని విషయములు పేలవముగనున్నవని ప్రభుత్వపక్షమున సర్. యస్.యస్. సర్కారుగారు నిర్మొగమాటముగ నిరూపించిరి. ఈబిల్లునైతిక సంస్కరణవిషయముగ పరిగణింపదగిన బలమునుగాని ప్రాముఖ్యమునుగాని వహించుటలేదని యాన్యాయశాస్త్ర విజ్ఞానసంపన్నుడు స్పష్టముగ బల్కియుండెను. లోపములచే తూటువడిన ఈబిల్లుతుదముట్ట నిలుచుట కవకాశమున్నట్లు గాన్పించుటలేదు.

ఈబిల్లు హిందూమత ధర్మశాస్త్రవిధులకు విరుద్ధమై ప్రాచ్యపాశ్చాత్యసంప్రదాయ సమీకరణ సిద్ధాంతమగు స్వరూపమును చెందుటచే సనాతన సంఘమువారి సమ్మతిని బడయనేరదు. ప్రాచీనమత ధర్మములకు భిన్నమై సంఘమునకు చేటు సేకూర్చునదియగు ఈబిల్లును దేశహితులగు ధీశాలు రొల్లరనుట యెంతయు నిశ్చయము. లామెంబరుగారింగలి లోపములను గ్రహించి దీనిని ప్రతికూలింప బ్రయత్నించుటెంతయు బ్రశంసనీయమై యున్నది. ఈబిల్లుయొక్క ఆవశ్యకతయే అగుపడుటలేనప్పుడు దీని మంచిచెడ్డల విచారించుట అనవసరమేయగును.

డాక్టర్ దేశముఖ్ గారు హిందూధర్మశాస్త్రములో స్త్రీలకు తగినంతరక్షణను స్వాతంత్ర్యమును పెద్ద లేర్పరచియుండుటను బాగుగ పరికించియుండ లేదని భావింపవలసి యున్నది. దురాచారముచేతను అజ్ఞానమువలనను పురుషులు స్త్రీలను బాగుగ జూచుట లేదు కాని ధర్మశాస్త్రములు వారిని పక్షపాతదృష్టితో జూచుటలేదని గ్రహింపగలుగుచో నిట్టిబిల్లుల మూలమున స్త్రీల నుద్ధరింప నవసరములేదనియు, ఇట్టి ప్రయత్నములు బహు విధములగు అనర్థములను దెచ్చిపెట్టి దేశాభ్యుదయమును భంగపరచుననియు తేటపడును.

స్త్రీల దుస్థితిని తొలగింప నుద్యోగించుచు నిదివరలో కేంద్రశాసనసభలో ప్రవేశ పెట్టబడిన బిల్లులు బల్లలమీదనే పడియుండుటను దేశముఖ్ గారు గమనించినట్లు తోచుట లేదు. ఈబిల్లు స్త్రీలకు సరియైన స్వాతంత్ర్యమునకు సదుపాయములను సమకూర్పజాలి నదిగ లేనందున ఇది ఇంతటితో సమాప్తిజెందుట యెల్లరకును క్షేమకరమని చెప్పవలసి యున్నది. ప్రభుత్వము పక్షమునుండియు మహమ్మదీయుల వైపునుండియు రానున్న ప్రతివా దముల బారినుండి యీ బిల్లును తప్పింపదలంచి, శ్రీ సర్కారుగారు నిజనైపుణ్యజనిత న్యాయవిజ్ఞానవైభవమును జూపుచు మంచి యుపాయము నూహించి, ఈబిల్లును సెలెక్టు కమిటీవారి సమీక్షకై నియమించుటెంతయు శ్లాఘాపాత్రమగు విషయమనుటకు సందే యములేదు. ఈ బిల్లులో నుదాహరింపబడిన కొన్ని విషయములగూర్చి విచారణసలుపు టలో భర్తకు స్వస్తిసెప్పినస్త్రీకి నివాసమునకును, జీవనమునకును వలయువసతుల నీకమిటీ నిర్ణయింప నుద్దేశింపబడినది. మహమ్మదీయసోదరులీ విచారణ తమకు ప్రతికూలముగ పరిణమించుననుభయముచే నీబిల్లును, తద్విచారణను నిరసించుట న్యాయమేయగును.

అధికారేతరవర్గముల వారనేకులీ సవరణ నామోదించలేదు. ఇప్పుడమలులోనున్న న్యాయమునుబట్టి భార్య జీవనమునకు భర్తయు, సమిష్టి కుటుంబమువారును బాధ్యులై యున్నారు. భర్త పరలోకగతుడగుపట్ల భూహాపమైన స్థిరాస్థివిహీనుడైనచో భర్తృ విహీనయైన స్త్రీకి పోషకుడు తనతండ్రియా లేక పెనిమిటి తండ్రియాయను సమస్యస్థిర పరుపబడవలసియున్నది.

భార్య బ్రదికియుండగనే మరల పాణిగ్రహణము నేసినగాని లేక వేరొకసతి చెలిమి గోరి యామెను స్థిరముగ నింటనుంచినగాని భర్త ప్రథమభార్య నివాసవసతికిని జీవిత భరణమునకును బాధ్యుడా కాడా యను విషయమును గూడ నీ కమిటీ విచారించి నిర్ణ యించవలసియున్నది.

ఈ బిల్లు చాల యాక్షేపణలతోగూడిన దగుటచే తగినంత యాదరమును పొంద దనుటకు సందియములేదు. స్త్రీలు బాగుపడవలెనన్న వారికి పురుషులతోబాటు సమాన

గౌరవ మర్యాదల నొసఁగి సంఘములో వారికి కొంత స్వేచ్ఛ నిచ్చుటయేకాక, వారి జీవనోపాధికై పురుషులతో సమానమగు హక్కుల గల్పించి, వారి విద్యావ్యాప్తికై, ఉన్నతాదర్శముల నుద్బోధించు విద్యావిధానమేర్పరచి, విద్యాభ్యాసమునకు తగువసతులను అవకాశముల నొసంగి, సంసారసుఖమును, సద్గతులనుకల్గించు జీవితవిధానమును ఏర్పరచవలెగాని అన్నివిధముల భ్రష్టతను గూర్చు బిల్లు లెంతమాత్రమును శ్రేయోమార్గములు కావు.

ఈ విషయములో 'గృహలక్ష్మి' ఏ అభిప్రాయమిచ్చునో యని హిందూసుందరీమణులెంతయు నాసక్తితోనుందురు. భిన్నాభిప్రాయములకు ఎక్కువ అవకాశములతో గూడియున్న నీఘన సమస్యలలో ఇదమిత్థమని నిర్ణయించుట సులభసాధ్యముకాదు. 'హిందూ సంఘములో విడాకులు' అని, కాశీ విద్యాలయ ప్రాచీనభారత చారిత్రక విజ్ఞానశాఖాధ్యక్షులగు శ్రీ డాక్టరు ఎ.ఎస్. ఆల్టేకర్‌గారి ఆంగ్లవ్యాసమున కనువాద మిదివరలో 'గృహలక్ష్మి' 11-వ సంపుటము 2-వ సంచికలో ప్రచురింపబడినది. అందలి ముఖ్యాంశముల గొన్నిటి నిక్కడ నుదాహరించుట యుక్తమేయగుటయ కాక విడాకులపద్ధతి యిదివరలో హిందూ సంఘములో నుండెననుటకు కొన్ని నిదర్శనము లిందుగాననగుటచే నీయంశములు ఈ చట్టమునందలి గుణదోషముల విమర్శించుటకు కొంత సహాయపడగలవిగ నున్నవి.

"విడాకులను ప్రవేశపెట్టడము హిందూసభ్యత కెదురుచుక్క. ఇది సాధారణముగా ప్రతి హిందువుని నమ్మకము. అందులో సనాతన శాఖలవారికది హిందూమత భ్రష్టసూచకము...............
ఆరంభములో క్రైస్తవమతమువలె హిందూమతముకూడా వివాహసూత్రము విచ్ఛేదముకాదనే ఉద్దేశించినది. మనువు ఇంకొక అడుగు ముందుకువేసి,
ననిష్క్రియ విసర్గాభ్యాం భర్తు ర్భార్యా విముచ్యతే। ఏవం ధర్మం విజానీమః ప్రాక్ ప్రజాపతి నిర్మితమ్॥
విక్రయ ధనముగైకొన్నను, దాన మొసగినను భర్తనుండి భార్య విడుదలనొందనేరదు. అని బ్రహ్మ నియమించిన నిత్యమైన ధర్మమును మే మెఱిగియున్నాము.
క్రీ. శ. 400 నుండి క్రీ. శ. 200 వరకుగల కాలపు ధర్మశాస్త్ర నిర్మాతలు ప్రత్యేక సందర్భములలో విడాకు లుండవచ్చునని అంగీకరించినారు. మొదట వేదయుగంలో విడాకులంటే ద్వేషభావం ఉన్నట్టు ఎక్కడా కనపడదు. అథర్వణవేదంలో ఒకచోట (9, 5, 27-8) పునర్వివాహముచేసుకున్న ఒక స్త్రీనిగురించి చెప్పబడినది. అంతేకాకుండా ఆమె ద్వితీయభర్తతో కలసి స్వర్గాన ఉండటానికని కొంత కర్మకాండకూడా చెప్పబడియున్నది. ద్వితీయ వివాహము అయియుంటే మొదట విడాకులు ఉండి ఉండాలి. కొన్ని పరిస్థితుల్లో బ్రాహ్మణ స్త్రీలకుకూడా విడాకులు, పునర్వివాహము ఉండవచ్చునని ధర్మశాస్త్ర కర్తలంతా సమ్మతించారు.
కౌటిల్యుని అర్థశాస్త్రం కూడా విడాకులను అంగీకరిస్తూ వివిధకాలకు తగినట్లు కొన్నిమార్పులు చేస్తున్నది. పరాశరస్మృతికూడా విడాకులుండవలెనని స్పష్టంగా సిద్ధాంతీకరించుచున్నది. భర్తకు మగతనం లేకపోతే లేక ఆతడు సన్యాసి అయితే భార్య పునర్వివాహం చేసుకోవచ్చునంటుంది స్మృతి. ఈ పునర్వివాహము ప్రథమ వివాహసూత్రాన్ని భేదించవచ్చునని తలంచడానికి స్పష్టంగా వీలుకలుగ

జేస్తున్నది. ఒకటిగా సంసారము జరుపుకొనలేని దురదృష్టవంతులుగా ఉండే దంపతులు విడాకులు పొందటమునకు వివరముగా కౌటిల్యుని అర్థశాస్త్ర మేర్పరచిన నియమములు అసుర, గాంధర్వ వివాహములకే వర్తించునుగాని బ్రహ్మ, దైవ వివాహములకు వర్తింపవు. కాని మొదటి రెండు విధముల వివాహములు బ్రాహ్మణులుకూడ అవలంభించుచుండినందున వారిలోకూడ విడాకుల పద్ధతి వ్యాప్తిలో నుండి యుండవలెనని తేటపడుచున్నది.

మొత్తమునకు విడాకులు న్యాయసమ్మతమని అంగీకరింపబడినను సంఘములో అవి నైచ్యముగానే చూడబడుచూ వచ్చినది. ఇందువలన ధర్మశాస్త్ర నిర్మాతలు విడాకులహక్కును అంగీకరించినప్పటికిని అది ఉపయోగించుకున్నట్లు కనపట్టదు.

క్రీ. శ. 3 వ శతాబ్దమునుండి స్మృతికర్తలు విడాకులంటే ప్రతిఘటించుచుండినట్లు స్పష్టపడుచున్నది. ప్రారంభములో క్రైస్తవ మతముకూడా వివాహ విచ్ఛేదములేదని విడాకులను నిషేధించినది. ఇప్పటికిని రోమన్ క్యాథలిక్ దేశములలో విడాకులపద్ధతి లేదనియే చెప్పవచ్చును. ఇంగ్లాండు దేశములోకూడా 19 వ శతాబ్దము మధ్యవరకును ఏవ్యక్తి అయినను విడాకులను పొందవలెనన్న పార్లమెంటు చట్టము చేయవలసియుండెను. అందుచే ధనాధికులకే ఈ హక్కు చెల్లుచుండెను. 1715 మొ॥ 1855 కు ఆ దేశములో 180 మంది మాత్రం పార్లమెంటును ప్రోత్సహించి విడాకుల హక్కును బడయగల్గిరని తెలుచున్నది.

5 వ శతాబ్దమునుండి భారతదేశములో విడాకుల పద్ధతి వాడుకలో అంతరించినది. 19 వ శతాబ్దములో ప్రారంభములో బొంబాయి హైకోర్టు ఈ హక్కును అంగీకరించియుండెను. కాని తరువాత అది హిందూధర్మ విరుద్ధమని తలంపబడెను.......................................................

## ఏకపత్నీవ్రతాదర్శము

కాబట్టి క్రూరత్వానికి, వ్యభిచారానికి చిరకాల కారాగారవాసానికి విడాకులు అవశ్యకం అనడం హిందూస్త్రీల శ్రేయస్సునకు భంగము. విడాకులు విరివిగా వ్యాపించే పరిస్థితులు గలిగించితే నైతికాధిక్యము తగ్గిపోవడము చాలా వివాహాలు సౌఖ్యదూరాలు కావడము జరిగింది. ఇది పాశ్చాత్యదేశాల అనుభవము. పతితమయ్యే వస్తువుక క్రమక్రమంగా పురపడి యెక్కువయ్యేటట్లే పాశ్చాత్య దేశాల్లో విడాకులు పుచ్చుకోవడము నానాటికి అధికమవుతూవున్నది. ఇంగ్లండు రష్యాలందు ఇటీవల చేయబడ్డ చట్టాలను చూస్తే ఇదివరకు విడాకుల విషయంలో యివ్వబడిన స్వాతంత్ర్యాన్ని అరికట్టవలెననే వుద్దేశం స్పష్టమవుతూవున్నది.

సంఘశ్రేయానికి వివాహసూత్రము శాశ్వతమైనదే, విచ్ఛేదం కానిదే అని నిర్ణయం కావలసినదే. ఇందుకు సందేహముకూడదు, ఇది సాధ్యముకావాలంటే వివాహధర్మము అత్యున్నతముగా వుండితీరాలి; భార్యాభర్తలిద్దరు ఆత్మనిగ్రహము పరస్పరబాధ్యతాభావము కలిగివుండాలె, వారిదికూడా తెలిసికొనవలె; మానవప్రకృతిలో స్వభావభేదాలుండక తప్పవు; అవి దైనికజీవితములో రాక తప్పవు. జీవితములో కష్టాల నేదు ద్వితీయవివాహముచేత ఆ భేదాలను తప్పించుకోవడానికి సాధ్యముగాదు.

రోకావడానికి భార్యాభర్తలిరువురు గొప్పత్యాగాలుచేయ సిద్ధపడి వుండాలె. ఒకరిస్వభావం ఒకరు బాగా అర్థంచేసుకుని ఓర్పికతో నడుచుకోవాలి, అలా ఆయితే నీ కుటుంబజీవితములో సంతోష సౌఖ్యాలుండడానికి వీలవుతుంది

కాబట్టి విడాకులహక్కు భార్యను పలుమారు పరిత్యజిస్తూ రావడంగానీ, దీర్ఘకాలం పరిత్యజించడంగాని జరిగినపుడు మాత్రమే వుండవలెను. అదికూడా భార్య కోరికపైననే ప్రేరేపణపైననే అంగీకరింపబడవలెను.

శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్‌గారి బహుభార్యానిరోధచట్టమును గూర్చి కొందరు సుందరీమణు లిదివరలో పంపిన అభిప్రాయము లప్పుడపుడు 'గృహలక్ష్మి'లో ప్రచురింపబడినవి. శ్రీమతి సుబ్బరాయన్‌గారి బిల్లునకును శ్రీ దేశముఖ్‌గారి బిల్లునకును పరస్పరసంబంధ ముండుటచేతను బహుభార్యానిరోధచట్టమునుగూర్చిన అభిప్రాయములలో విడాకుల విషయముపై అనుకూలముగను ప్రతికూలముగను తెలుపబడిన యంశములు కొన్నిటి నిట నుదాహరించి పిమ్మట 'గృహలక్ష్మి' అభిప్రాయమొసంగుట సమంజసముగ నుండును. ఇరుపక్షములవారి వాదనలలోని సత్యాసత్యములను విచారించినచో విడాకుల పద్ధతి మంచిదా కాదా యను సంగతి తేటపడగలదు. చట్టమునందలి గుణదోషములను విమర్శించుటకు కొంత వికాసము నొసంగు అభిప్రాయములలోని ముఖ్యాంశములే యీ దిగువ పేర్కొనబడినవి.

గృహలక్ష్మి 11-వ సంపుటము 7-వ సంచికలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి అభిప్రాయములో:—

ఆరోగ్యమునకుగాని భద్రతకుగాని భంగకరమగు క్రూరప్రవర్తన కలిగియుండెనని ధ్రువపఱచబడినను అతడు ఆమెను వదిలిపెట్టి మఱియొక స్త్రీని పెండ్లాడుటకు సివిలుకోర్టునకు పిటీషన్ పెట్టుకొనవచ్చును. అతడు విషయమును బుజువుచేసినచో నతనికి కోర్టువారు పునర్వివాహాధికార మొసంగవచ్చును. ఈ హక్కు స్త్రీకి పురుషునిపైకూడ కలదు కాని పై విధ కారణములను జూపి యే భార్యగాని పునర్వివాహాధికారమును కోరునని నమ్మజాలము.

నిజమునకు ప్రతివిషయమును రచ్చకెక్కించి శాసనముల రక్షణగోరుట ఒకవిధముగ అనుచితకార్యముగనే కనుపట్టును. కాని జనులలో ఉదారములైన సంస్కరణములకు దేశకాలపాత్రములను బట్టి సుముఖత చూపనంతకాలము యిట్టి శాసనముల రక్షణ కోరక తప్పదు.

ఇంతకు యే శాసనములైనను హృదయపూర్వకమగు నైతికవర్తనతో తుల్యములు గావు. ప్రజలు నీతిధర్మముల నెఱిగి యుచితముగా ప్రవర్తింపనేర్చినచో రాజశాసనము లవసరములేకనే సుఖముగా మెలగవచ్చును. కాని సనాతనధర్మపరు లనెడివారు కాలధర్మ మెఱుగక యేటికెదురీదుట వలననే గోటితో మీటవలసినవి గొడ్డలితో ఖండింపవలసివచ్చుచున్నవి.

## హిందూస్త్రీలకు విడాకులహక్కు శ్రేయోదాయకముకాదు

ఈ వాక్యములవలన విడాకులహక్కు స్త్రీ లుపయోగించుకొనుటకు సాహసింప రనియు అది పురుషులకు ప్రయోజనకారి యగునుకాని స్త్రీల కంత యుపకరించ దనియు చట్టము సరియగు నైతికజీవితముతో సరిరాదనియు స్పష్టపడుచున్నది.

గృహలక్ష్మి 11-వ సంపుటము 10-వ సంచికలో శ్రీమతి కాకులపాటి రాధా సుందరమ్మగారు:—

"భార్యజీవితకాలములో భర్తయు భర్తజీవితకాలములో భార్యయు ఒండొరుల అనుమతి లేనిది ద్వితీయ వివాహమాడరాదు. కాని ఒకరివలన ఒకరికి ప్రాణహాని కలుగనున్నదని ప్రబలసాక్ష్యమున్నపుడు సివిల్ కోర్టులో పిటిషన్ పెట్టి విడాకులు పొందవచ్చును. అప్పుడు ఆస్తిని బట్టి కోర్టు, వారికి యుక్త మనితోచు పరిహార మిప్పించవలెను. దంపతులలో నెవరైన మానని అంటువ్యాధిచే పీడింపబడుచున్న యెడల రోగిగౌరవముగ జీవింపజాలినంత పరిహార మిచ్చి విడాకులు పొందవచ్చును. భార్య అనుమతితో భర్త ద్వితీయవివాహమాడు నాటికున్న నగలన్నియును ఆమెకు ఆమెబిడ్డలకును తన యావదాస్తిలో సగభాగమును ఇచ్చి విడాకులు పొందవచ్చును.

విడాకులకు అనుకూలముగ వాదించు వీరి అభిప్రాయము స్త్రీ పురుషు లిరువురకును సమానహక్కు నొసంగునదై యుక్తి యుక్తముగానే యున్నదని చెప్పవచ్చును. కాని దంపతులలో నెవరైన..... విడాకులు పొందవచ్చును. అను వాక్యములో అర్థము సంశయాస్పదముగ నున్నది. భర్త వ్యాధిపీడితుడైనచో భార్యకు భరణమిచ్చి తానే విడాకు లిచ్చుటా? లేక భార్య విడాకులు కోరిన భరణమిచ్చుటయా? భార్య రోగిమైన భర్త భార్యకు భరణ మిచ్చి ఆ పీడను వదల్చుకొనుటా? లేక భార్య భర్తృసుఖమును గోరి తానే విడాకులకు అర్జీపెట్టుకుని భరణమును పొందుటయా? రోగము వచ్చినచో విడాకులు తప్ప వేరు గతిలేదా?

గృహలక్ష్మి 11-వ సంపుటము 10-వ సంచికలో శ్రీమతి కందర్ప కమలకుమారి గారి అభిప్రాయములో:—

"5 సం॥రములు కుదురని రోగముచే బాధపడుచున్న స్త్రీగాని పురుషుడుగాని 5 సం॥లు అన్యోన్య ప్రేమ లేకుండిన 1 సం॥ ఇతర సంపర్కము గలిగి దేహారోగ్యము చెడినగాని ఇరువురిలో నెవరైన విడాకు లిచ్చుటకు కోర్టులో అర్జీ పెట్టుకొనవచ్చును."

అను వాక్యము విడాకులహక్కు స్త్రీపురుషు లిరువురికిని గల్గింపవలెనని ప్రోత్సహించుచున్నది.

గృహలక్ష్మి 11-వ సంపుటము 10-వ సంచికలో శ్రీమతి భూపతిరాజు వెంకమ్మ గారు:—

"దాంపత్యములో ఇద్దరకు అభిప్రాయభేదములు కలిగి ఇక్కట్టులకు పాల్పడు జీవితము గడుపుటకంటె ఒండొరుల యిష్టప్రకారము తగు పరిహార మిచ్చి విడాకులు పొందవచ్చును."

అని బిల్లులో చేర్చుట మంచిదని చెప్పుటచే వీరును స్త్రీపురుషు లిరువురకును విధా కులహక్కు కలిగింపవలెనను ఉద్దేశమును తెలియ జేయుచున్నారు. ఈ వాక్యము ఆంగ్లభాషా కవీశ్వరుడగు మిల్టన్ (Milton) మహాశయుని విడాకులమొరవాక్యములను మనస్సునకు దెచ్చుచున్నది. మొదటిభార్యయగు మేరీ పవల్ (Mary Powell) అనునామె తనకు తగిన ధర్మపత్ని కాదనియు సహజస్వభావసంఘర్షము (Incompatibility of temperament) సతీపతులలో సంభవించుట వారు విడిపోవుటకు తగినంత హేతువే యగునని మహాకవి యగు మిల్టన్ యెంతయో వాదించెను. స్త్రీ సరియగు సహచారిణిగాకున్నను (unfitness) దాంపత్యములో పరస్పర విరుద్ధభావము (Contrariety of mind) లేర్పడినపుడును భర్త ఆమెను పరిత్యజింపవచ్చునని ఈ అశేషశేముషీసంపన్నుని యభిప్రాయమైయుండెను. సంభాషణలో మేరీ తనతో సరితూగదని తలంచి ఆమెతో సఖ్యము సంతాపకరమనితోచి, విడాకులపత్రమును వ్రాసి పార్లమెంటుసభలో దానిని ప్రవేశపెట్టి పెద్దసంచలనము గావించి తుదకు విఫలమనోరథుడగుటయే కాక యెల్లరచే విరోధింపబడి యెంతయు పరిహాసాస్పదు డైన మిల్టన్‌కవి ఘనునకుగూడ విధి వ్రిప్పలు తప్పలేదు. ఆతనికి ప్రథమ భార్యాబంధ విమోచన మామె మరణముతోగాని లభింపలేదు సరికదా విడాకులవిషయములో నాత డొనర్చిన పటుప్రయత్నము లాతని ప్రశస్తకీర్తి నొకింత భంగపరచెను.

(గృహలక్ష్మి 11 వ సంపుటము, 8 వ సంచికలో) శ్రీమతి ద్వివేది సత్యవతిగా రొసంగిన అభిప్రాయములో చక్కనిభావములు కలవు.

"హైందవదంపతుల యన్యోన్యానురాగములు ధర్మబద్ధములై వారుచేసే ప్రతిపనిలోను మధుర గీతములను గానముచేయుచుండును.

పూర్వకాలమున దేశము శాంతియుతముగ నుండుటకీ భార్యాభర్తల అనుకూల్యమే ముఖ్యకారణము. ఒకపురుషుడు ఒకరికంటె నెక్కువమంది స్త్రీలను వివాహమాడకూడదు. ఒకస్త్రీకూడ అనేక భర్తృక అవగూడదు. కాని ఒకస్త్రీ అనేకభర్తృకగా నుండుట మనభారతీయుల ఆచారములో లేదు. ఒకపురుషుడే చాలమంది యాడువారిని పెండ్లియాడుచుండుట కలదు.

మగవాడు రెండవయామెను వివాహము చేసికొనుట సులువుకాని, అబలయైన యాడుదానికా సామర్థ్యము యౌవనమునశించుటతోనే నశించును. ఆయౌవనమైనను మనదేశమూ గో త్వరితము గావచ్చి త్వరితముగా వాడిపోవుట సోదరీమణు లెరింగినదే.

ఇంకను ఇట్టి అసందర్భాలు కలవు. వీటికన్నిటికిని మూలాధారములైన అతి బాల్యవివాహములు నశించితేకాని యిటువంటి కొన్నియవస్థలు తగ్గవు.

ఇంతకు మన హిందూసంప్రదాయముల ననుసరించుచు భర్త భార్యను సగౌరవముగచూచినచో భార్యదేలోపమును ఉండదని నాయుద్దేశము."

## హిందూస్త్రీలకు విడాకులహక్కు శ్రేయోదాయకముకాదు

పై వాక్యములలో స్త్రీలు ప్రథమభర్తనువిసర్జించి రెండవభర్తను స్వీకరించుట హిందూమతాచార విరుద్ధపద్ధతియనియు సులభసాధ్యముకాని కార్యమనియు స్పష్టపడు చున్నది. పురుషులు బహుభార్యాప్రియులుగాకుండ స్త్రీలను గౌరవముగ జూడవలెననుట సదుపదేశవాక్య మనదగును.

గృహలక్ష్మి 11 వ సంపుటము. 10 వ సంచికలో శ్రీమతి డి. భారతీదేవిగారు బిల్లు (బహు భార్యానిరోధచట్టము) పురుషులకే వర్తించవలెనని తెల్పుచు, వారి స్వాతంత్ర్యమును నిరోధించుటకై కొన్నిసవరణలను సూచించుచు, "స్త్రీలవిషయము ఆలో చించినచో పై స్వల్పకారణమును నిరూపించుచు ఏ హిందూభార్యయు తాను స్వయముగ భర్తను విడనాడు టకు సివిల్ కోర్టుద్వారా వివాహము రద్దుకావించుకొనుట కిచ్ఛగింపదు." అని నుడివియుండిరి. ఈవా క్యము హిందూస్త్రీయొక్క ఘనతనుచాటుచు స్త్రీలకు విడాకులు విరుద్ధపద్ధతియని వెల్ల డించుచున్నది.

ఈసంచికలోనే శ్రీమతి పాలూరి సత్యకుమారిగారు తెల్పిన అభిప్రాయములో "మనదేశమున స్త్రీలు భర్తనువదలి వివాహమాడ నిచ్ఛగింపరు. ఇష్టమున్ననూ వారియవ్వనము మొదటిభర్త వద్దనే నశించిన ఆమె నాసించువారెవరు?" ప్రకృతిధర్మమును బాగుగనెఱింగి తెల్పిన ఈయభి ప్రాయ మభినుతింపదగియున్నది. బిడ్డలున్నభార్యను పరిత్యజించినభర్త, వారి పోషణభార మంతయు వహించవలెనని వీరుచెప్పుటలో నెంతయు న్యాయమున్నది. వీరియభిప్రాయము స్త్రీలకు తగినంతభరణ మిప్పింపగోరుచున్నదేకాని స్త్రీలు మరల వివాహముచేసికొనుట సంప్రదాయవిరుద్ధమును సాధ్యముకానిపనియనియు నిరూపించుటచే విడాకులపద్ధతి నంగీక రించుటలేదు. పురుషులబాధ్యతను పూర్తిగనిర్ణయించు నీసవరణ సర్వజనసమ్మతమే యగును.

సోదరసోదరీమణులారా! విడాకులచట్టము హిందూస్త్రీలకు శ్రేయోదాయకము కాదనియు, వారికి సంఘములోగల లోటుపాటులను సవరింపగల్గిన సంస్కరణవిధానము కాదనియు "గృహలక్ష్మి" అభిప్రాయమిచ్చుటలో విడాకులచట్టమునుగూర్చి "హిందూ సుందరి" అను మాసపత్రికలో ఈ ఏప్రియల్ నెల సంచికలో శ్రీమతి పి. వెంకటసూరమ్మ గారువ్రాసిన వ్యాసమునెంతయు కొనియాడుచు, అందలిసందేశముతో పూర్తిగ నేకీభ వించుచున్నది. ఈసందేశము సత్యముపై నాధారపడియుండుటచే హిందూసుందరీమణు లాదర్శముగ సంభావింపవలసినదిగ నుండుటచే నందలి ముఖ్యాంశములగొన్నిటి నిక్కడ పొందుపరచుట యావశ్యకమని తోచినది.

"చపలత్వముచేగాని, అజ్ఞానముచేగాని, ధర్మనిర్వహణమును గావించుట కశక్తులైనంతమాత్రమున వ్యక్తులను సవరింపవలయునుగాని ధర్మమునే మార్పజూచుట కేవలము అనర్థదాయకము. భార్యలయం

దిష్టములేని భర్తలును, భర్తలయం దిష్టములేని భార్యలును సమయపరిస్థితులనుబట్టి సంఘమునం దుండ వచ్చును కాని అట్టివారు ధర్మభయము చేతను, సంఘభయము చేతను తమతమకృత్యములను చక్కగా నెరవేర్చుచు కుటుంబక్షేమమును కాపాడుకొనగల్గుట చూచుచున్నారము. ఇట్టిస్థితిలో ప్రధాన ధర్మము నేమార్చి, ఐచ్ఛికముగా నిర్వర్తింపవచ్చునని శాసించినచో, ఇపుడు సంఘమునందు ఎన్ని కుటుంబములు, భార్యాభర్తధర్మములు క్రమముగ నిర్వహింపగలుగునో, ఎన్ని కుటుంబములు విచ్ఛిన్నములై పోవునో నిశ్చయింపజాలము. కావున సంఘమునకంతకు మూలకారణమైన భార్యాభర్తల ధర్మమునకు విఘాతముగల్గించు నెట్టియవకాశమునైనను గల్గించుట శ్రేయము కాదు. ద్విదళబీజములు మొలకలెత్తి శాఖోపశాఖలుగావ్యాపించి, మహావృక్షములైనటులే భార్యాభర్తలిరువురు ఎన్నటికిని విడువనిసంబంధముగల ఏకీభావమును గాంచికుటుంబమును, సంఘమును, నిష్కంటకముగా వర్ధిల్ల జేయవలసియున్నది.”

“ఇట్టిస్థితిలో సాంఘికధర్మములం దన్నిటను ముఖ్యమైన భార్యాభర్తధర్మమునకే విఘాతము తటస్థించినయెడల ఒక్కసారిగా సంఘమంతయు కూలిపోకమానదు. దేశమునుబట్టియు సంఘపరిస్థితులనుబట్టియు, మనసంఘమందు దాంపత్యవిచ్ఛేదనశాసనము గావించుట ఎంతమాత్రమును శ్రేయోదాయకముగాదు!”

గృహలక్ష్మి 11 వ సంపుటము, 8 వ సంచికలో ‘గృహము-గృహలక్ష్మి’ అని శ్రీమతి కామరాజు మైత్రేయిగారు వ్రాసిన వ్యాసములోని కొన్నివాక్యములు ‘గృహలక్ష్మి’ ఈవిడాకులచట్టము సందర్భములో హిందూసుందరీమణుల కొసంగదలచిన కడపటిసందేశమునకు కొంతవరకు ఆధారములుగ నాదరింపదగినవిగ నున్నవి. పాశ్చాత్య దాంపత్య సంప్రదాయమునకును హిందూదాంపత్య ధర్మమునకునుగల వివక్షతను దెల్పుచు నీమానినీమణి హిందూదాంపత్యాచారము పాశ్చాత్యాచారముకంటె పదివేలరెట్లు పవిత్రమైనదనియు, అందువలననే పాశ్చాత్యదేశములలోవలె విడాకులులేవనియు హిందూయువతికిఉన్న పవిత్రగౌరవములు ఏ పాశ్చాత్యనారీమణికిని లేవనియు నిరూపించుటెంతయు ప్రశంసనీయమగు విషయమనదగును. ఇందువలన హిందూయువతులకు విడాకులహక్కును గల్గించుట పవిత్రమగు భార్యాభర్తల ప్రేమానుబంధమును భంగపర్చుటయే యగునని నొక్కివక్కాణించవలసియున్నది.

“సతీమణి జీవితాంతమువరకు భర్తకొరకై నియమింపబడిన దాసికాదు. అతని యొక్క స్నేహితురాలు; సహాయురాలు. ఈకాలప్రవాహంలో వారనుభవించే సుఖదుఃఖములను సమభాగంగా అనుభవించే సహధర్మచారిణి” అని మహాత్మాగాంధీ తన ఆత్మకథలో వ్రాసిన పదములెంతయు సత్యవాక్యములని శ్రీమతి మైత్రేయిగారు వ్యాసమునకు కడపట వ్రాసిన దివ్యసందేశమెంతయు శ్లాఘాపాత్రము. కాని ‘గృహలక్ష్మి’ ఇంకొకమెట్టుపైకిపోయి ఉపనిషద్వాక్య సందేశమెల్లరకు నందిచ్చుచున్నది. ఇంతియన నింతియే

కాదు. ధర్మపత్నియన సహధర్మచారిణియు స్నేహితురాలుమాత్రమే కాదు. ఆమె అర్ధాంగియనియు, శరీరములో ప్రశస్తభాగము (Better Half) అనియుకూడ చెప్ప బడినది. ప్రకృతిపురుషుల పరస్పరసంబంధమే భార్యాభర్తల ప్రేమానుబంధమని శాస్త్ర ములు ఘోషించుచున్నవి.

భార్య దైవికమైనచుట్టమని భారతమున యక్షప్రశ్నలలో ధర్మజునిచే జెప్ప బడినది. పూర్వకర్మానుసారముగ బ్రహ్మచే విధింపబడినభార్యను బిల్లులు భర్తనుండి బాప సాహసించునా? విధివ్రాతను విడాకులచట్టము తుడిచివేయజాలునా? విధివిధానము నరికట్టు విబుధులెవరు? "Marriages are made in heaven" వివాహములు విధిచే శాసించబడినవని పాశ్చాత్యభాషకూడ బిగ్గరగా పల్కుచున్నది. గీర్వాణ కవిసార్వభౌము డగు కాళిదాసు శకుంతలయొక్క మాలిన్యరహితమైన మనోహరమంగళమూర్తి మాధుర్యమును వర్ణించుచు,

శ్లో. అనాఘ్రాతం పుష్పంకిసలయ మలూనం కరరుహై। రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితరసమ్।
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘం। నజానే భోక్తారం కమిహసముపస్థాస్యతి విధిః॥

"మహాతత పుణ్యఫలంబుబోలు నాభాసురగాత్రిసోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో" అని దుష్యంతునినోట బల్కించి, స్త్రీపురుషుల సంయోగమునకు సృష్టి కర్తయే కారకుడని నిరూపించినాడు. సంయోగమును శాసించిన విధాతయే వియోగ మునుగూడ విధింపగల్గినవాడనుట విదితము గదా?

విరించివ్రాసినవ్రాతను విడాకులచట్టముచే సవరింపబూనుట ప్రకృతిధర్మములను కృత్రిమపద్ధతులచే సరిదిద్ద సాహసించుటే యగును.

"Marriages are made in heaven but the penalties are paid on earth" అని ఒక సామెతకలదు. వివాహములు స్వర్గములో విధింవబడినవి. ఫలితములు భువిలో ననుభవింపబడుచున్నవి. పాపపుణ్యముల ఫలమనుభవింపకతీరునా? పాపమునకు పరి హారము పవిత్రజీవితము, భగవత్ప్రార్థన. పవిత్రప్రవర్తన మలవడజేసికొని భర్తను స్వాధీనపరచుకొనలేని భార్య బిల్లులసహాయముచే మాటిమాటికి భర్తను మార్చుకొనుచు సౌఖ్యమును సాధించుకొనగల్గునా? ఒకవేళ సాధ్వీమణులనుచావగొట్టి యేడ్పించు చెనటులు చెలరేగినచో సంఘమువారిని తగురీతిగ శిక్షించుశాసనము లేర్పరుపవలెను. ప్రేమాదర్శ ములతో నైక్యత జెందవలసిన భార్యాభర్తలు విధివ్రాతచే వీడిపోవలసినదేగాని విడాకుల చట్టముచే వేరుపడి సుఖంపగలుగుదురనుట కలలోనివార్త. విడాకులచట్టముచే భార్యా భర్తల తగవుల బరిష్కరింపబూనుట అగ్నినాజ్యముతో జల్లార్ప బ్రయత్నించుటేయగును.

# వసుమతి

*  *  *  *

శ్రీమతి నేతి సత్యవతిగారు

'భూములుకొని పిల్లలను సుఖపెట్టే అభిప్రాయంతో గ్రహించిన కట్నపుధనం సంసారంక్రింద ఖర్చయిండి...
పై చదువులు చదవాలంటే డబ్బు కావాలి. ఇవ్వలేకపోయిన అత్తవారిమీద అలిగి, డబ్బుకోసం తిరిగి వివాహమాడాడు చిట్టి.....
వికృత వాతావరణంలోని వ్యతిరేక పరిస్థితులనన్నిటిని ఓర్పుతో, నేర్పుతో ఎదుర్కొని, చదుకొని, ఉద్యోగం సంపాదించుకుని, దరిద్రులై వున్న అత్తవారికి—భర్తకి, చివరకు తనే ఆధారమైంది వసుమతి...
రెండు సంసారాలని ఓకొడెకు కొని తెచ్చిన యీకట్నపుసొమ్ము కాలకూటవిషయం కన్నాకనికష్టం....

బెజవాడనుండి మూడుగంటలబండిలో దిగినాడు సుబ్బారావు. గుంటూరులో ప్రసాదరావు యింటికి వెళ్లినాడు వసుమతి పెళ్లిసంబంధముకొరకు. సుబ్బారావు తాలూకా గుమాస్తా, ముప్పదిరూపాయలజీతం. కొద్దిపాటి భూవసతి గలవాడు. నలుగురుబిడ్డలు; ఇద్దరు ఆడబిడ్డలు, యిద్దరు మగబిడ్డలు. పెద్దపిల్ల వసుమతికి పదమూడుసంవత్సరములు వచ్చినవి. తరుడుఫారము చదువుచున్నదిగదా, శారదాయాక్టు వకటివున్నదిగదా, స్కూలుఫైనలువరకు చదువుకుంటే కట్నము కొద్దిలో సంబంధమేదైనా సందర్భపడినపుడు పెండ్లిచేయవచ్చునని అతని యభిప్రాయము. కాని అది సాగినదికాదు. యింటిలో ముసలమ్మలది, భార్యది పోరు జాస్తిఐనది. 'పిల్ల పెద్దమనిషిఅయితే పుట్టి మునిగిపోతుంది. ఆడపిల్ల యింటిలోవుంటే అప్రదిష్టకాదా'యని భార్య; 'మేము ముసలివాళ్లము నేడోరేపో. ఆకాస్త వూపిరి యుండగాచేస్తే కళ్లతోచూస్తామని' అమ్మమ్మ, నాయనమ్మ—'నాయనా! పిల్లలు కలవాడివి, మీతమ్ముడు నీవుకలసివుండగా పెళ్లిచేస్తే వుమ్మడిలో ఖర్చుకలిసివస్తుంద'ని యితరులు కొందరుచెప్పగా పోరుపడలేక, తప్పనిసరిగా బయలుదేరి, సంబంధములువెతకగా, భార్యకు నచ్చినది తనకునచ్చదు, యిద్దరికినచ్చినది ముసలమ్మలకు నచ్చదు— చదువు వుంటే, తిండికిలేదు— తిండికివుంటే చదువులేదు. ఏదిలేనివాడికి వెయ్యినూటపదహార్లు యీరోజులలో—కాస్తచదువు, లేక కాస్త ఆస్తికలవాడికి రెండువేలు, మూడువేలు. రెండూకలవాడికి వేనవేలే—ఈవిధముగా తిరిగితిరిగి సుబ్బారావు యింటికి వచ్చినాడు.

ప్రసాదరావుకు గుంటూరులో ముప్పదిరూపాయలు యింటిఅద్దెమీద, సాలుకు రెండువందలు భూమిమీద వచ్చును. నలుగురు ఆడపిల్లలు, యిద్దరు మగపిల్లలు. పెద్దవాడిపెళ్లి వెయ్యినూటపదహార్లకట్నములో కొద్దిరోజులక్రిందట జరిగినది. స్కూలుఫైనలు ప్యాసయి యింటిలోకూర్చున్నాడు. రెండవవాడు స్కూలుఫైనలు చదువుచున్నాడు. వాడికి వసుమతినిచ్చుటకు సుబ్బారావు ప్రసాదరావుయింటికి వెళ్లినాడు. ప్రసాదరావుకు వుద్యోగములేకపోయినను యింగ్లీషు స్వల్పముగా చదువుకొన్నవాడు, కొంచము టాకుటీకుసంసారము.

సుబ్బారావు వెళ్లునప్పటికి ప్రసాదరావు నిద్రించుచుండెను. సుబ్బారావుతోగూడా తీసుకువెళ్లిన రామారావు సుభద్రమ్మ మేనత్తఅల్లుడికి అన్న; అతనిద్వారా ప్రసాదరావుభార్య సుభద్రమ్మ విషయమంతయు తెలుసు కొనినది. సుబ్బారావుగారిని, రామారావుని కాళ్లుకడుగుకొనమని మంచినీళ్లుయిచ్చి కూర్చుండమని గౌర వించినది. ఏదో పెళ్లి విషయము మాట్లాడుచుండగా ప్రసాదరావుగారి మూడవకుమార్తె రామారావుగారి తో, 'మామయ్యా-మా చిట్టిఅన్నయ్యపెళ్లికి మాకు నూటపదహార్లు తప్పవు. లేకపోతే పెళ్లి చెయ్యనియ్యా'మని అన్నది. 'మీకు నూటపదహార్లు, మీచిట్టిఅన్నయ్యకెంత, కమలా?' యని రామారావు అన్నాడు. 'అది నాకు తెలియదు. మాఅమ్మకు మానాన్నకు తెలుసు'నన్నది. నీకు నీనూటపదహార్లసంగతిమాత్రము తెలుసు, మిగతవి తెలియవు-యని అందరు నవ్వినారు.

యింతలో ప్రసాదరావుగారు నిద్రనుండి లేచినారు. సుభద్రమ్మ మంచినీళ్లుయిస్తూ అంతా చెప్పినది: మానుశీలబావగారు రామారావుకు స్నేహితుడట. నలుగురు పిల్లలట. కాస్తాకూస్తో కట్నము యివ్వగల వాడే, పిల్లచక్కనిదట. వంకలేదట. తెరుడుఫారం చదువుతున్నదట. మనచిట్టికి యిస్తామని వచ్చినారు—అని. ఇంతలో ప్రసాదరావుగారు వరండాలోనికివచ్చి రామారావునుచూచి 'ఏమి రామారావు ఎప్పుడు రావటం' అని పలకరించారు. 'ఒక అరగంటనేపయింది. మూడుగంటలబండిలో వచ్చినాము. ఇతను నాఆఫీసు లో గుమాస్తా-దేవులపల్లి సుబ్బారావుగారు. ఈతనికి నలుగురుపిల్లలు-యిద్దరుమగపిల్లలు, యిద్దరు ఆడపిల్లలు. వారిలో పెద్దదివసుమతి. పదమూడవఏడు—తెరుడుఫారము చదువుచున్నది. ఆపిల్లను మీచిట్టివానికిచ్చుటకు వచ్చినాడు. సుబ్బారావు! ఇతనే మాబావగారు ప్రసాదరావుగారు' అని ఒకరిని ఒకరికి తెలియజెప్పినాడు. 'చిట్టికి అప్పుడే ఏమిపెళ్లి రామారావు-పదహారవసంవత్సర మింకా వెళ్లలేదు. అదిగాక వాడు, చదువుకొం టాను, యిప్పుడేమిటి పెళ్లి, చేసుకొననుచున్నాడు. పెండ్లిచేసినను ఈదమూడేండ్లపిల్ల నా?' అన్నారు ప్రసాద రావుగారు. 'పిల్లకు పదమూడేండ్లయినా, పదకొండేండ్లపిల్లవలె వుంటుంది మావసుమతి. మీరు పిల్లనుచూచి ఈడుగావుంటే, చక్కగావుంటేనే చూడవచ్చును. పిల్లని చూచిపొండ'ని సుబ్బారావు చెప్పినాడు. 'సరే! చూద్దామ'న్నారు ప్రసాదరావుగారు. వారువెళతామన్నారు. కాని వీరు ఈపూటకు వుండిపొమ్మన్నారు. 'శలవులేదండి, వెళ్లిపోవాలి. మాపిల్లను చేసుకొని నన్నుద్ధరించితే, మీయింటికి ఎప్పుడువస్తే అప్పుడేవుంటాను' అన్నాడు సుబ్బారావు.

... ... ...

'పిల్ల చాలాబాగుంటుందండీ—ఏదో చదువు, సంగీతం, చక్కదనము అన్నివున్నయి. కట్నము రెండు వేలు యిస్తామన్నారా! ఆరెండువేలు పెట్టి మూడుఎకరాలపొలంకొంటే వాడికి కొంత ఆధారమవుతుంది. మనము పిల్లలుగలవాళ్లము, ఒకటొకటే అయితేమంచిది. చదువుచదువుఅంటే చదువుకొని సంపాదించేదేము న్నది. సంబంధాలు వచ్చినప్పుడు చేయకపోతే మళ్లి సరియైనవిరావు. పిల్లవాడికి నచ్చచెప్పి ఎట్లయిన కుదిరే ఉపాయము చూడండి.'

'సరే, రిజల్ట్సుతెలిసినతర్వాత చెప్పిచూదాము. 'యిప్పుడే పెళ్లికి తొందరేమిటి నాన్న' యని అంటాడువాడు. నన్నుగాక నాభార్యను, పుట్టబోయేపిల్లలను భరించగలశక్తి నీకుగలదా! లేనియడల నేను నాలుగుడబ్బులు సంపాదించేదోవలేనిదే పెండ్లి ఎందుకునాన్న—అంటాడు. కనుక చదువుపూర్తిఅయిన తరువాత వాడియిష్టప్రకారం చేదామనివుంది. పెద్దవాడుచూడు—'వివాహో విద్యనాశాయ'అని చదువులేదు.

చదివినచదువుకు వుద్యోగం ఎక్కడాదొరకలేదు. మనకా పెద్దఆస్తిలేదు. వాడు, వాడిపిల్లలు ఎట్లు జీవింపగలరాయని విచారం. అటువంటిస్థితిలో నీవు చదువుతానంటే పెండ్లిచేసి కూర్చోపెట్టమంటావు. పదమూడేండ్లపిల్ల; రేపుకాపురమునకువచ్చిన మనము కాపురముపెట్టి చనివించగలమా ?'

'వాడికి చదివేతెలివియుంటే పెళ్ళి అడ్డమువచ్చునా ? ఎంతచదివినా వీరు సంపాదించేదేమున్నది. రంగనాథంగారికుమారుడు బి.ఎ. ఆనర్సు ప్యాసయి మూడుసంవత్సరమూలైనది. పట్టుమని పదిరూపాయిలు సంపాదించినపాపమునపోలేదు. మనము పిల్లలుగలవాళ్లము. వున్నదికాస్తచదువులకు ఆడపిల్లలవివాహములకు సరిపోతే ఏమితింటాము ? కావున వాడు బాగుపడిన మంచిది వాడికిచ్చేకట్నములో రెండుపుట్లవడ్లు రాబడిగల తెరువు ఏర్పరిచితే చదవగలిగితే చదువుతాడు. లేకపోతే ఏట్యూషనులోచెప్పి పదిరూపాయలు తెచ్చుకొని కాలక్షేపంచేస్తాడు.'

'వాళ్లు యిచ్చినకట్నము చీరెలకు, సొమ్ముకు, పెండ్లిఖర్చులకు సరిపోతుంది. మనకు మిగిలేదేమున్నది?'

'కట్నముపెట్టి నగలుచేయించుదాము. రెండుచీరెలుమాత్రము పెళ్లిలోపెడుదాము. శారదాయాక్టవల్ల రహస్యముగా చేయుటచేత ఖర్చులు ఎక్కువవుండవు. సదస్యము సంభావనలు ఏవీవుండవు. రెండువేల అయిదువందలుగదా యిస్తామన్నారు. అయిదువందలు చీరెలకు, ఖర్చులకు సరిపెట్టి మూడుఎకరముల మాగాణీపొలంకొంటే బాగావుంటుంది. ప్రస్తుతము చిన్ననగలు పిల్లకువున్నవి. నాలుగేండ్ల రాబడిపెట్టి రెండుపెద్దనగలు తర్వాత చేయుంచుదాము.'

'వాళ్లు రెండువేల అయిదువందలు కట్నము యిచ్చినప్పుడు నగలుపెట్టకపోతే బాగుండదు.'

'నలుగురిలో వెయ్యిరూపాయలు నగలుక్రింద చదివించేది, తర్వాత మీపిల్లకు అల్లుడికే వుంటుందనితీసుకొని, పొలముకొని పంటడబ్బుపెట్టి నగలుచేయించుదామండీ.' అని సుభద్రమ్మ ప్రసాదరావు కూడబలుక్కొని ఒకనిర్ణయాని కొచ్చారు.

... ... ...

పెళ్లి సలక్షణముగా జరిగినది. మూడునిద్రలు మనుగుడుపులు అన్నిఅయినవి. చిట్టిరిజల్ట్సు తెలిసినవి. చిట్టి కాలేజిలో ఎఫ్.ఏ. రెండుసంవత్సరములు బాగుగచదివి ఫస్టున ప్యాసయినాడు. బి.ఎ. చదువవలెనని ఆశనికి వున్నది. కాని పరిస్థితులు అడ్డగించినవి. భార్య రజస్వలఅయి రెండుసంవత్సరములయినది. ఇక పుట్టినింట నుంచుట భావ్యముకాదని తలిదండ్రులు హెచ్చరించినారు. తలిదండ్రులు, పెద్దచెల్లెలగు సుశీల పెండ్లికి మూడువేలుకర్చుచేసి అప్పులలోదిగినారు. మామగారు ఎక్కువ స్థితిమంతులుగారు, అన్నవస్త్రములకు లోపములేని కుటుంబము. చిట్టికి పూర్తిఆశ, ఏ ఆశ అయినను అతిగానుండిన ఎప్పటికైన కీడే. విద్యమీద ఆశక్తి మంచిదైనను, చిట్టియెడల నది అపకారముచేసినది. చదువుకొరకు కొంతడబ్బు కట్నముగాఇచ్చినగాని భార్యను కాపురమునకు తీసుకొనివెళ్లనని పట్టుపట్టినాడు. సుబ్బారావుగారు పిల్లసుఖముకొరకై ఎంతప్రయత్నించినను, పిల్లలు కలవాడగుటచేతను, వసుమతి పెళ్లికొరకు చదువుకొరకు కొంతడబ్బు ఖర్చగుటచేతను, పిల్లవాడు స్కూలుఫైనలుకు ఎక్కివచ్చుటచేతను, డబ్బు తెమల్చలేకపోయినాడు. అదికారణముగా చిట్టి భార్యను వదలివేసి, గంగూరి మల్లపరాజుగారి రెండవకుమార్తెను నాలుగువేలకట్నముతో ద్వితీయవివాహముచేసికొని, ఆడబ్బుతో బి.యె. చదువుటకు కాలేజిలో చేరెను.

# వసుమతి

'హైమా, వసుమతి మొగుడు రెండో పెళ్లి చేసుకున్నాడట నిజమేనా?' అని వసుమతి స్నేహితురాలు సుందరి అడిగింది, బెజవాడనుంచి చిలకలపూడి వుత్సవములు చూచుటకు వచ్చిన హైమని. సుందరిభర్త ఒందరులో బి. యె. చదువుచున్నాడు. సుందరి, హైమా, వసుమతి చిన్ననాటి స్నేహితులు. ముగ్గురు బెజవాడలో మూడవఫారము చదివినారు. వసుమతి పెండ్లికాగానే ఒకసంవత్సరము చదివించినాడు సుబ్బారావు. నాల్గవఫారముతో మగపిల్లలు చదువులో ఎక్కువచ్చినందున వారికి ఈమెసకూడా జీతములు, పుస్తకములు భరించలేక సుబ్బారావుగారు వసుమతిని చదువు మాన్పించినారు. సుందరి నాల్గవఫారము చదువకమునుపే అత్తవారింటికి వచ్చినది. హైమభర్త డాక్టరుపరీక్ష మూడవసంవత్సరము చదువుచున్నందున మిగిలిన రెండు సంవత్సరములు చదవినకాని కాపురమునకు తీసుకువెళ్లనన్నందున హైమ ఇప్పుడు స్కూలుఫైనలు పరీక్షకు వెళ్లినది. వైశాఖములో వేసంగి శెలవులైనందున, బందరు వుత్సవములు చూచుటకు మేనమామగారి ఇంటికి వెళ్లినది. చిన్ననాటి స్నేహితురాలగు సుందరిని చూచుటకు సుందరియింటికి వెళ్లినది.

సుందరి మూడుసంవత్సరముల క్రిందట చూచిన తనప్రియస్నేహితురాలగు హైమనిచూచి చాలా ఆనందించి వసుమతి దుస్థితినిగురించి వినినందున, ఆవిషయముగురించి హైమను నిజమేనా అని అడిగింది. నిజమనియు, వసుతండ్రి అల్లునికి చదువుకొరకు కార్యపుకట్నము ఇవ్వనందున, ఇంకో నాలుగువేలకట్నముతో పెళ్లి చేసుకుని బి.యె. చదువుచున్నాడనియు హైమచెప్పెను. 'వసు ఏమైనా చదువుచున్నాదా?' అని సుందరి అనగా, 'ఏమిచదువుచున్నది? సుబ్బారావుగారికి అన్నీకష్టములే. వసు పెండ్లికి నాలుగువేలు ఖర్చుపెట్టినందున, 'వసుకు ఫోర్తుఫారమువరకు చదువు చెప్పించితివి. నాలుగువేలు ఖర్చుపెట్టి పెళ్లిచేసితివి. ఇంకా దానికొరకు ఖర్చుచేసిన శారదపెళ్లి, కుర్రవాళ్ల చదువులు మాట ఏమిటి? ఆడవాళ్లుచదివి ఉద్యోగములు చేస్తారా! ఏదోకాస్త ప్రపంచజ్ఞానముకొరకు కొంత చదువుకొన్నదికదా, చాలు. ఎల్లకాలం చదువులకు, సంగీతములకు సరిపోతే పిల్లపెళ్లి, పిల్లవాళ్లచదువులు ఇన్నికావాలి. అదికాక రజస్వలఅయినపిల్లను స్కూలుకు పంపనని భార్య అనినందున, వసుచదువు నాల్గవఫారముతో మాన్పించినారు. ఈసంవత్సరము తిరిగి చదివింతురట' అని చెప్పింది హైమ. 'పోనీ ఇప్పుడైనను చదివింతురుకదా!' అన్నది సుందరి.

'ఇప్పుడు' చదివించకపోతే ఎట్లా! ఈతల్లిదండ్రులు దాటినమరునాడు ఈఅన్న పెట్టునా! ఆతీరుగ జేసినభర్త, అన్నము పెట్టునా! ఎంతచెడ్డవారైనను తలిదండ్రులకు బిడ్డలయందుండు ప్రేమ వేరు, మిగతావారి ప్రేమ వేరు. కాని తలిదండ్రులు ప్రేమతో వారిని సుఖపెట్టుటే ముఖ్యోద్దేశము కలవారైనను, వారు సుఖమనుకొనినవి, బిడ్డలకు అసుఖకరములై ఒకప్పుడు బాధించును. విన్నావా సుందరి! ఈమధ్యను మనవూరిలో చెట్టూరివారిపిల్లవాడు సుబ్బారావు ఎవరో ఒకపిల్లను చేసుకుంటానని, ఆపిల్లబీదది మనతాహతకు తగదు. వాళేమి నీకు సరిగా ఒకపూటఅన్నమైనను పెట్టరు అని తలిదండ్రులు; ఆపిల్లగుణము కావాలికాని వారు పెట్టలేకపోతే మనకు వున్నదితినకూడదా! ఆపిల్లను తప్పకచేసుకొందునని అతను పంతముపట్టి ఆపిల్లనే చేసుకొన్నాడు. పుట్టినింటివారు బీదవారగుటచే రజస్వలఅయినవెంటనే తనయింటికి తెచ్చినాడు. ఇప్పుడు ఆపిల్లనుచూస్తే వీరికి సరిపడదు. తామువద్దంటే చేసుకొన్నాడని తలిదండ్రులకెంతో కోపము. తల్లి, ఆపిల్ల చేయు ప్రతిపనికి వంకపెట్టుట, ప్రతిమాటకు తప్పుపట్టి తగవులాడుట, ఇంటికి వచ్చునప్పటికి భార్యబాధ భార్యచెప్పును. తల్లిపితుకీ తల్లిచెప్పును. ఎంతనేర్పరిఅనుకున్నావు సుబ్బారావు. తల్లిఎన్నిచెప్పినా అట్లాగా

అని విని వూరకుండును. భార్యచెప్పిన నీవు సుఖపడతలచిన, నాసుఖము నీవు కోరినయెడల వాటినన్నిటిని ఓర్చి నాకు తెలియనీకు. నాకు ఈవిధముగా చెప్పినయెడల నేను ఇంటికిరానని చెప్పినాడు. పాపమాపిల్ల ఎంతో ఓర్పుగలది. ఆరోజుమొదలు మరీకష్టముగానున్నప్పుడు చాటుగాయేడ్చి మిగతాఅప్పుడు ఓర్పుతో సహించి ఆకష్టములను భర్తకు తెలియనీయక భర్తవచ్చునప్పటికి సంతోషమునే కనపరచుచుండును. ఒకానొక కొడుకు అతనిసుఖమే వారిసుఖముకదా! చూడుసుందరి! అతనికాపురమునకు కలహముపెట్టిన వారికేమి సుఖము. తమకేమిసుఖము. ఈవిధముగానే వసుతల్లికూడ వసుమీద ప్రేమకలదైనను, వసు మొదటనే చెప్పిననువినక, నాపెళ్లికొరకు నాలుగువేలు బ్యాంకులోవుంచి, దానిపై వడ్డీతో నన్నుచదివించండి, నేను చాల తక్కువఖరీదుగలదుస్తులతో నిరాడంబరమైన జీవితంగడిపితే, దానివడ్డీతో నేను జీవించగలను. పెళ్లి అవసరమైనపుడు ఈడబ్బు వుండనేవుంటుందాయెను పెళ్లికి. ఇప్పుడు చాలమంది శారదాచట్టము అమలులో పెట్టుచున్నారుకదా అని వసు చెప్పిననువినక, చిన్నదానవు నీకు ఏమితెలుసు? ఆడపిల్ల ఇంట్లోవుంటే అప్రదిష్ట అని కోపపడినదట! ఇప్పుడు ఇంటిలోజేరి ఏమిచేసినదో! నాలుగువేలువదలి, ఇంటిలో వసుమతిఇంటిలోనే వుండిపోయినదికదా! ఇప్పుడు రెండువిధముల భరించవలె; తిండిని, శీలమునుకూడ భరించవలెను. ఇప్పుడు తల్లి ఏడుస్తుందిపాపము!' అన్నది హైమ.

... ... ...

వసుమతిని స్కూలులో చేర్పించినారు. రెండుసంవత్సరములలో స్కూలు ఫైనలు ప్యాసయినది. ఎల్. ఎం. పి. కి వెళ్లినది. ఆరుసంవత్సరములలో ప్యాసయి గుంటూరు జనరల్ ఆసుపత్రిలో డాక్టరుగా చేరినది. చెల్లెలు శారద స్కూలుఫైనలు ప్యాసయింది. వసు అన్న బి.యే. ప్యాసయి 25 రూపాయలు సంపాదించుచున్నాడు. తమ్ముడు బి.యె. చదువుచున్నాడు. తండ్రి చనిపోయినాడు. అన్న పాతికరూపాయలు అన్నసంసారమునకే చాలవు. ఇప్పుడు వసు నూటపదిరూపాయలలో తమ్ముడుచదువు, తల్లి, చెల్లెలు మొదలగుసంసారము నడపుచున్నది. చిట్టి బి.యె. నాలుగేండ్లుతప్పి ఐదవసంవత్సరము ప్యాసయి, మొత్తము తొమ్మిదేండ్లలో బి.యె. పూర్తిచేసి రెండుసంవత్సరములనుండి వుద్యోగమునకు ప్రయత్నించుచున్నాడు. నాలుగేండ్లనుకొనినచదువు తొమ్మిదేండ్లగుటచేతను, చెల్లెళ్ల పెళ్లిళ్లతోడను అప్పులసంసారమైనది. అప్పులక్రింద ఆస్తి అంతయుపోయినది. మల్లపరాజుగారికి ఒకతేకూతురైనందున, ఈకష్టములసంసారమునువిడిచి పుట్టినింటనే వున్నది చిట్టి రెండవభార్య. వసుమతి గుంటూరులో డాక్టరైనందున ఈసంగతులువిని పెద్దతనములో కష్టముల పాలైన అత్తమామలనుచూచుటకు అత్తవారింటికి వెళ్లినది. అత్తగారు మామగారు ఆమె ఔదార్యమునకు సంతసించినారు. 'తల్లీ లక్ష్మివంటి నిన్నుత్రోసివేసినందున మాలక్ష్మి తొలగినది. లక్ష్మివలె మాయింటికివచ్చి మాకష్టములు తొలగింపు'మని వసుమతిని బతిమలాడిరి.

... ... ...

చిట్టి ఇప్పుడు బళ్లారిలో ఇంజనీరు. రెండువందలుజీతం. వసుమతి బళ్లారి గోషాఆసుపత్రిలో డాక్టరు. తనజీతంలో అరువదిరూపాయిలు తల్లికి, అరువదిరూపాయిలు మామగారికి పంపుతుంది. భర్తజీతంతో తమ సంసారం గడుపుచున్నది.

# విడాకులు

## శ్రీయుత శింగరపల్లి రామమూర్తిగారు

●

సంఘహృదయము ఒక మహాసముద్రములో ఏళ్లతరబడిగా నిలబడిఉన్న పెద్ద రాతిబండలాటిది. కాలపరిస్థితులనే అలలు ఎడతెగకకుండా అహర్నిశలూ తన్నుతూఉంటే క్రమేణా అరిగితిగి మృదుత్వము పొందాలనే కాని శాసనకుఠారాఘాతములకు అది ఒక్కమాటుగా మెత్తబడదు. సంఘము స్వీయసౌకర్యము కోసము నిర్మించుకున్న ఆచారాలూ, సాంప్రదాయాలూ, మామూళ్లూ, కట్టుబాట్లూ, రివాజులూ, ఎన్ని నూత్నచట్టాలనైనా ఎదురుసవాల్ చేసి ఓడించి పారవేయగలవు. అయితే శాసనకుఠారాఘాత సాహాయ్యముంటే కాలపరిస్థితులనే అలలకార్యక్రమము అధికతర వేగముతో నెరవేరకపోదు.

... ... ...

సాయంకాలము నాల్గుగంటలయింది. తమయింటినడవలో భాస్కరమూర్తీ, వాళ్లఅమ్మా, చెల్లెలు సూర్యకాంతం కూర్చునిఉన్నారు. భాస్కరమూర్తి పేపరు చదువుతున్నాడు. వెంకమ్మ బియ్యములో బెడ్డ ఏరుతూఉన్నది. సూర్యకాంతం మాసినచీరెతో విస్తళ్లు కుట్టుతూఉన్నది. భాస్కరమూర్తి పేపరు కిందపెట్టి,

"చెల్లీ! యీ మగవాళ్లదురాగతాలెన్నటికో ముగిసేది? నిన్న కరీంనగరంలో ఒక మొగుడు పెళ్లాము తన ఆజ్ఞమీరిందని చావతన్ని నూతిలోకి తోశాడట! రోజూ వాడు ఆమెను తన్ననిగంటే లేదట" అన్నాడు.

సూర్యకాంతం వెటకారముగానవ్వి, "అన్నయ్యా! మగడు భార్యను అవశ్యం కొట్టితీరాలనీ ఏదో స్మృతిలో ఉందటగాదూ" అన్నది.

భాస్కరమూర్తి వెంకమ్మనుచూపిస్తూ, "ఇల్లాటి కరుడుగట్టిన శాస్త్రావతారాలు ఇంటింటావెలిసి ఉంటే శాస్త్రప్రమాణాలకేమి లోటూ? అయితే, ఈ ముచ్చటమూలాన మళ్లీ జ్ఞప్తికి వచ్చిందిగానీ, మరి ఉంటే నాసలహాకేమి తీర్మానంచేశావు? అంతకన్నా నీకు మరింక గతిలేదు. నేనెంతకాలం నిన్ను పోషించగలను చెప్పు చెల్లీ?"

సూర్యకాంతం బాధాసూచకమైన నిట్టూర్పువిడిచి, "దావా చెయ్యటమా? అన్నయ్యా! నేను నీకు ఎన్నిమాట్లు చెప్పానురా! పరువైన ఆడది ఏలాగు సంఘతిరస్కారంచేసి కోర్టుకెక్కగలదు, నీవు చెప్పుమరి? నాలుగేళ్లనాడు నన్నూ, రెండేళ్ల వెధవ ఆశంకరాన్నీ మెడబట్టిగెంటి 'నిన్ను వదిలేశా! పో, దిక్కున్నచోట చెప్పుకో' అని వారు తిరస్కరించిననాటినుంచీ నీఅండనమ్ముకొని ఇల్లాగే వనవాసంలా కాలంగడుపుతున్నాను. నేటికి నీకూ నాపోషణ భారమైందిగాబోలు. నీ......"

భాస్కరమూర్తి చెల్లెలి కన్నీళ్లుతుడిచి, "పిచ్చిదానా! నీ పిడికెడు మెతుకులూ నాకు భారమవుతవా? లక్ష్మీకళతో కళకళలాడే నీ మొహంచూసినప్పుడల్లా, ఇరవైఏళ్లకే అనాథలాగు మాసినబట్టలో అల్లాడే నీదుర్భరదశ చూసినపుడల్లా నీమగడనే ఆక్రూరరాక్షసుడు ఉన్నా లేనివాళ్లలోనే జమఅయినాడే అని నాకు

పట్టరాని దుఃఖంవస్తుంది. విడాకులచట్టమొస్తే త్వరగా ఆతడితో సంబంధంతెంచుకొని, సుఖంగా మత్తో యువకుడినిపెళ్లాడి హాయిగా జీవించమని నేను ఎన్నిమాట్లు బోధించినా నీకది నచ్చకపోయె. నీచక్కదనమూ, నీచదువూ, నీతెలివీ ఇవన్నీ అడివిగాచిన వెన్నెలలా నిష్ఫలమవవలసిందేనా?"

సూర్యకాంతం నిస్పృహతో, "అన్నయ్యా! మళ్ళీమళ్ళీ ఆమాటలే ఆడి ఎందుకు నామనస్సు నీలాగు కల్లోలపరుస్తావు? నీవుఅన్న ఒక్కొక్కమాటలో ఎంతగంభీరత, ఎంత అగాధభావం ఉందో నీవు ఆలోచించకుండానే ప్లాట్‌ఫారాలమీద లెక్చర్లిచ్చేవాళ్లలాగు తేలికగాఅనేశావు. నేనా! విడాకులా! ఇచ్చి, మళ్ళీ పెళ్లాడడమా! నీకు నాహృదయం లేశమైనా అర్థంకాగలదా?"

వెంకమ్మ తలఊపుస్తూ, "బాగా చెప్పావే పిల్లా! వాడినోట గడ్డిపెట్టావే! వెధవ కలివిద్దూరాలు! విడాకులా, విస్తరాకులా! ఆఖరికి తక్కువకులాలైన మాలమాదిగవాళ్లల్లోకూడా మారుమనువంటే నీచంగా చూస్తారే. ఛీ! ఈ చదువుకున్న ఖుంతలకు సిగ్గు, బిడియాలు బొత్తిగాశూన్యం! వితంతువుల పెళ్లిళ్లయ్యాయి! సమర్తాడిన పిల్లలకు పెళ్లిచేయడాలయ్యాయి! ఇంకేమీ! మొగుడు మొద్దులాగు బతికిఉండగానే ఋస్తైపూసలుతెంచి వాడిమొహాన విసరికొట్టి ఇంకోణ్ని తీసికొని పోవడాలుకూడా మొదలెడితే లోటుతీరుతుంది"

భాస్కరమూర్తి క్రోధముతో అమ్మనుచూసి "చాల్లే! నీపెత్తన మొహాటిగూడానా! దయచెయ్యి." అని గదమాయించి చెల్లెలివైపు తిరిగి,

"పాతి చెల్లీ! ఆజన్మాంతం నీవీప్రవాసం అనుభవించవలసిందేనా? ఆ మొగుడనేవాడినిచూస్తే నీకు ద్వేషంలేదూ? నీకు వాడితో ఇంకా కాపరం చేస్తానన్న ఆశఉందా? ఇప్పటికి ఏవందమాట్లో రాయబారాలు జరిపించామే, నేనేవెళ్లి అడిగానే, ఆతనేమైనా లొంగాడా? చివరకి నీకు భరణముగూడా ఇవ్వ నిరాకరించాడుగదా! అంతతో ఊరుకోక నీమీద నీలాపనిందలన్నీ వేసి మళ్లీ పెళ్లిచేసుకున్నాడే! ఇంకా వాడిమీద నీకెందుకు శేషద్వేషం? విడాకులు పోనీ, చివరకు భరణపుదావాకూడా వెయ్యనియ్యవే? చెల్లీ! ఇటుచూడూ! ఎచ్చే! ఎందుకలాఏడుస్తావు? ఊరుకో! ఊరుకో!"

సూర్యకాంతం కళ్లనీళ్లు తుడుచుకుని, "అన్నయ్యా! నీకు సంఘమర్యాద తెలియదు. నీవేమో ఇంగిలీషు చదివి వాళ్ల ఆచారాలప్రకారం మమ్మల్నంతా నడపాలని చూస్తావుకాని అదెన్నటికీ జరగదు. సంఘహృదయంమారనిది నీచట్టాలూ, నీ గవర్నమెంటిచ్చేసహాయం మాబోటిఅనాధలకు పిసరంతైనా ఉపయోగించవు. ఇప్పటికీ ఎందఱు బాలవితంతువులు లోకపునోటికిభయపడి నిర్బంధవైధవ్యాన్ని పాలిస్తున్నారో, ఇప్పటికీ ఎన్ని బాల్యవివాహాలు నిరాఘాటంగా పల్లెటూళ్లలో జరిగిపోతున్నయో నీచట్టాలూ, నీగవర్నమెంటూ తెలిసికొని అడ్డగలిగాయా?"

భాస్కరమూర్తి వినుగుచూపే చేయివిసరుతో, "అవునులే కాంతం! సంఘహృదయం ఒక్కమాటుగా ఇలామారుతుంది? విజ్ఞానంవ్యాపిస్తేగానీ. ఇదుగో యీలాటిముసలమ్మలంతా, శాస్తుర్లవార్లంతా అన్నట్టు "కలిముదిరితే"గాని సంఘంలోని దురాగతాలకు వీడ్కోలుజరగదు. అందాకా నీమొగుడిలాటి నిరంకుశులకు, రాతిగుండెవాళ్లకు విశృంఖలాధికారమేనా? వాళ్లదురాగతాలకు అడ్డేలేదా? చెప్పుచెల్లీ! నీవు వట్టి మూఢురాలివిగావు. కొంత చదువుకున్నావు. నాశిక్షపొంది జ్ఞానాన్ని జాస్తిచేసుకున్నావు. కోర్టుకెక్కి

నంతసే నీపరువంతా బుగ్గయిపోతుందా ? పాపిష్ఠిసంఘం ఎవర్ని నిందించక అట్టేపెడ్తున్నది ? లోపాలు వెదకడమే దానిపని. ఇదుగో ! ఇంక నేనూరుకోలేను. ఊరుకోను. చివరసారి వెళ్లి నీమొగుడితో మాట్లాడి ఏదైనా సంధిగుది కేట్టయితే చూస్తాను ; లేకంటే దావాపడెయ్యడం నిశ్చయం.”

సూర్యకాంతం నీరవయై, నిరుత్తరయై నిల్చున్నది.

* * *

జాడీపల్లెలోకల్లా జనార్దనంగారికుటుంబం భాగ్యవంతమయింది. తాతలనాటినుంచీ ఆయన కుటుంబానికి ఆఊరి కరణీకము వస్తూఉన్నది. జనార్దనంగారి వంశీకులంతా కండబలిమిగల నియోగ్యాగ్రప్రభువులు. ఇప్పటికి వాళ్లవంశములో రెండుమూడుఖూనీలుకూడా జరిగాయి. జనార్దనముగారికి నాల్గుతరాలముందటివాడు గ్రామాన్నంతా నేలబెట్టి కాలరాస్తూఉంటే ఊరంతా ఇంక భరించలేక ఒక్కటయి ఒకనాడు పన్నెండుగంటల పట్టపగలే ఎనిమిది కత్తిపోట్లతో ఆతనిని పరలోకానికి పంపించారు. జనార్దనంగారి తండ్రికీ పినతండ్రికీ పార్టీలుపడి తత్ఫలితముగా ఇద్దరూ ఖూనీఅయ్యారు. ఇల్లాటి శూరకుటుంబములోవారైన జనార్దనంగారు కాలపరిస్థితులు మారుతూఉండబట్టీ, కాంగ్రెస్సుమూలాన రాజాగారి గ్రామాలలోని రైతులలో కూడా ప్రబోధముకల్గుతూఉండబట్టీ, తమక్షాత్రాన్ని కొంతకుకొంత చంపుకొన్నా, ఏదోఒకరకముగా దర్పముగానే కాలము గడుపుకుంటున్నాడు.

ఉదయము పదకొండుగంటలయింది. ఎండమిడిసికాలు తున్నది. ఊళ్లో రామస్వామిగుడి దగ్గర పెద్ద వేపమానుక్రింద ఏదో తగాదా పంచాయితీచేస్తూఉన్న జనార్దనంగారు రైతులనంతా ఇండ్లకుపంపించి, యింటికివచ్చి స్నానముచేసి గణగణగంటవాయిస్తూ ఊరంతా ప్రతిధ్వనులిచ్చేలాగు మంత్రాలుపఠిస్తూ దేవతార్చన ప్రారంభించారు.

కొంతసేపటికి వాకిటిలోనుంచి ఆయనభార్య ఇంటిలోకివచ్చి 'మీబావమరిది వచ్చాడండోయ్' అని చెప్పింది.

గంట గణగణ చటుక్కున ఆగిపోయింది. జనార్దనంగారు ముఖము మటమటలాడుతుండగా,

“ఎందుకొచ్చాడూ మళ్లీ ? నాల్గునెల్లనాడే తెగచెప్పివేశానే 'నాకింక ఆపిల్లతో సంబంధమేలేద'ని. బుద్ధి కొంచెమైనా లేదే యీచదువుకున్నవాళ్లకి” అని గొణుగుకుంటూ లేచి వాకిటిలోకివచ్చాడు.

వాకిటిలో భాస్కరమూర్తీ, అతనిమిత్రుడు సూర్యప్రకాశరావూ నిల్చొనివున్నారు. కొత్తమనిషిని చూడగానే జనార్దనంగారు కోపము కాస్త తమాయించుకుని ఇద్దటినీ లోపలికిరమ్మని చాపవేయించి కూర్చోపెట్టాడు.

భోజనముచెయ్యమని బలవంతపెట్టితే మిత్రులిద్దరూ ఇంతకుముందే అయిందనిచెప్పారు. జనార్దనంగారు వెళ్లి భోజనముచేసివచ్చి, దూరముగా మడికోసము ఒక చిత్రాసనము వేసుకొని కూచున్నారు.

సూర్యప్రకాశరావు రెండుమూడు చిన్నదగ్గులుదగ్గి “ఏమండీ ! మరి మీ మొదటి...”

జనార్దనంగారిముఖము కంపెక్కుతోంది. అయితే ఆయన అగ్రహారీకులు కాబట్టి వ్యవహారసరళిగా మాట్లాడితే ఎందుకైనా మంచిదని నిశ్చయించుకొని, మెల్లిగా ఒక్కొక్కమాటా తూచితూచిఅంటూ ఇల్లాగు పెలవిచ్చారు:

"అయ్యా! మీరేమో పెద్దమనుష్యులు. లోకవ్యవహారం బాగా తెలిసినవారుగా కనిపిస్తున్నారు. ఇదుగో, ఒకమనిషి మొహం చూడగానే ఆతడిస్వభావం తెలిసిపోతుందండీ! అల్లాగే మీముఖంచూడగానే నాకు మీమీద మంచివిశ్వాసం కుదిరిందండి. మీరేమో నా మొదటిపెళ్ళాంవిషయమై ఏదో రాయబారం తెచ్చారు. ఇదివరకు ఇల్లాటివి నూరువాకా అయ్యాయండి. అన్నింటికీ నేనొక్కటే జవాబిచ్చిఉన్నానండి. అడగండి 'ఏమిటాజవాబ'ని, అడగండి—"నాకాపిల్ల అక్కర్లేదు" అని."

భాస్కరమూర్తికి వళ్లు మండిపోతోంది. సూర్యప్రకాశరావు ఆతనికి మాట్లాడవద్దని సైగచేసి, "అయితే పంతులుగారూ! మీరల్లాగంటే ఏలాగు చెల్లుతుందండీ? ఆమె మీ ధర్మపత్నిగదా. భరించవలసిన 'భార్య'కదా ఆమె మీకు." అన్నాడు.

జనార్దనంగారు అంగవస్త్రముతో వంటిచెమట తుడుచుకుంటూ, "నిజమే. కాని మీకీవ్యవహారపు గుంట చిక్కులూ, లోతుపాతులూ అన్నీ తెలియవండీ. కాపరానికి వచ్చింది మొదలు అది నాతో పోట్లాడనిదినం లేదండి. ఒట్టిగయ్యాళిగంపండి. నాకు..."

భాస్కరమూర్తి ఇంక ఆపుకోలేకపోయాడు; క్రోధమూర్తియై, "అయితే, మఱి బావా—నిన్నా పేరుతోపిలవనే నాకు లజ్జగాఉంది—నీతో అది పోట్లాడిందంటావే; అది అంత మహాగయ్యాళిన్నీ, నీవేమో సాధుపుంగవుడివీనా? నీతో అది కాపురంవేగించిన ఐదేళ్లలోనూ నీవు దాన్ని చావచితకగొట్టనిరోజు ఒక్కటైనా ఉందా? మగాడు ఆడదాన్ని తాకి కొట్టవచ్చునా? అట్లా కొట్టేవాళ్లు మనుషులేనా? రాక్షసులుకారా?"

జనార్దనంగారు మహాగ్రహముతో "నీకు తెలుసులేవోయ్ మాచక్కగా! దానంతసాధుపలవ మఱి లేదు. అదీగాక, నేనొకవేళ రెండుదెబ్బలు వేశాననుకో, మొగుణ్ణయిన నాకామాత్రం అధికారంలేదూ?"

భాస్కరమూర్తి తీక్ష్ణముగాచూస్తూ, "కొట్టడమంటే అల్లాగిల్లాగా? ఒకరోజు నీమోట సత్తువంతా దానిపైని చూపేసరికి చెయ్యిదండ ఎముకవిరిగితే, నాల్గునెలలకుగాని తిరిగి కట్టుకుంది. అసలు నీబోటి ప్రాపంచికతాలోఖుడికి, పిసిరిగొట్టుకూ దానిలాటి కళాదృష్టిగల ఉన్నతాదర్శవతికీ ఏలా పొందుకుదురుతుంది?"

జనార్దనంగారు వెటకారముగా పండ్లిగిలిస్తూ, "కళాదృష్టి! ఉన్నతాదర్శం! ఆహా! ఎందుకు ఇంటిగుట్టు బైటవేసుకోవడమని నేనూరుకున్నానుగాని దాని తప్పుడుచేష్టలూ, దొంగతిరుగుళ్లూ నాకుతెలియనివా?"

భాస్కరమూర్తి ఉగ్రమూర్తిఅయి "ఆఁ! అల్లాటి సత్శీలను, గుణవతిని ఇలాగు మాట్లాడితే నీనోట పురుగులు పడిపోతవి. ఛీ! ఎంత దురాగతానికి దిగావు! ఏరీ! సాక్షులేరీ? ఋజువేదీ?" అన్నాడు.

సూర్యప్రకాశరావు శ్రుతిమించి రాగానపడటము గమనించి మెల్లిగా, "శాంతించు భాస్కరం! అయ్యా! జనార్దనంగారూ! ఆమెను నేను చిన్ననాటినుంచీ ఎఱుగుదును. నాచెల్లెలిలాగు ప్రేమించేవాడిని. వాళ్లిల్లూ, మాయిల్లూ పక్కపక్కనే ఉన్నవి. వాళ్లవంశంలో మచ్చన్నమాటలేదని మాతాతవాళ్లు వేనోళ్ల పొగిడేవారు. ఆమెనా మీరు ఇలాగు అనటం? ఋజువుచేయించగలరా?"

"ఋజువేమిటండీ? నాకుతెలుసు. అంతే, మఱో ఋజువు నాకెందుకు? నాభార్య పాతివ్రత్యానికైవాళ్లా జామీను?"

భాస్కరమూర్తి చెయ్యివిసరుతూ "అల్లాగంటే నీమాట అబద్ధమని నీకే తెలుసునన్నమాట. నీలాప నింద లీలాగు ఆమెపైనవేసి 'నాయిష్టమ'నటం కేవలం నిరంకుశత్వం, క్రూరరాక్షసత్వం."

సూర్యప్రకాశరావు తనమిత్రునిఆపి "ఏమండీ! మటీ భరణంమాటేమంటారు? బుద్ధిలేక మీపెద్ద వాళ్లూ, వాళ్ల పెద్దవాళ్లూ యీ పాడుసంబంధం కల్పించినందుకు యిలాగు పరిణమించిందికదా! పెళ్లప్పుడే ఆమె మీరు నచ్చలేదని ఎంతపోరిచెప్పినా వాళ్లనాన్న చెవినిపెట్టారు కానేకాదట. సరే, అయినదేదో అయింది. భరణవుదావా వెయ్యవలసిన జరూరులేకుండా......"

జనార్దనంగారు చటుక్కునలేచి "ఏమండీ! భరణాలూ, గిరణాలూ ఇక్కడేమీలేవు. ఏమైనాచేసు కోండి. విడాకులచట్టమొస్తే విడాకులకు దావావేస్తామని అనుకుంటున్నారటగా. అవీ వెలగబెట్టండి. చాలు. ఇంకనడవండి" అని గుమ్మమువేపు చూపారు.

భాస్కరమూర్తి గడపదాటుతూ "సరే! అల్లాగే చేస్తాను. నీబోటిక్రూరులకు బుద్ధిచెప్పే ఆచట్టం కోసం మహాందోళనచేసి, లక్షలకొద్ది అనాథలజీవితానికి కల్యాణంకల్గిస్తాను. అత్తా, భర్తా అనేపిశాచగణపు తాండవానికి హిందూకుటుంబంలో తావులేకుండా చేస్తాను. రావోయ్ ప్రకాశం" అంటూ వెళ్లాడు.

"పోవోయ్! నీలాటివాళ్లను అనేకుల్నిచూశా" అని గొణుక్కున్నాడు జనార్దనంగారు.

3

అన్నవచ్చి సంగతిచెప్పగానే సూర్యకాంతం కించిత్తైనా దుఃఖించలేదు. ఎందుకంటే ఫలితము ముందే తెలిసేఉండె. భాస్కరమూర్తి చెల్లెలితో రోజూ భరణపుదావా వెయ్యనియ్యకోనమని వాదించసాగాడు.

సూర్యకాంతం ఉదాసీనత రోజురోజుకూ ఎక్కువయింది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూఉండేది. రెండేళ్లకిందే ఇరుగుపొరుగిళ్లకు పేరంటానికిగూడా వెళ్లడము మానేసింది. ఎందుకంటే వెళ్లగానే నల్గురమ్మ లక్కలూ వేళ్లుచూపించి (మొగమెదటగాకున్నా వీపువెనకైనా) "మొగుడు తరిమేసిన గయ్యాళిదిగో" అని చెప్పుకునేవారు. ఇప్పుడు బయిటికి మొగము చూపించడమే మానేసింది.

ఇల్లాగు రెండునెలలుగడిచాయి. ఒకరోజు మాటలసందర్భాన సూర్యకాంతం అన్నతో "అన్నయ్యా! భరణపుదావా ఏమిటిరా? నాకీమగడక్కరలేదని చెప్పెయ్యగూడదూ? విడాకులిచ్చేస్తాను. ఇంక ఆగను. తీర్మానం చేసుకున్నాను"

భాస్కరమూర్తికి మహాశ్చర్యమువేసింది. సరేనన్నాడు. విడాకులచట్టమురాగానే మొదటికేసు తామే ఫైలు చేదామనుకున్నాడు.

మరునాడుఉదయంచూస్తే సూర్యకాంతం కనిపించలేదు. ఆమెగదిలో ఎక్కడిదో ఆమెభర్త ఫోటో ఒకటి మేజామీద నిలబెట్టివున్నది. సరిగా భర్తపాదములవద్ద ఒక్క రోజాపూవుంది.

సూర్యకాంతం శవం నూతిలో తేలింది పెరటిలో. 'కాంతం! నీకు భర్తపైని ద్వేషంలేదూ అయితే? నిన్నర్థంచేసుకోలేకపోయాను.' అన్నాడు భాస్కరమూర్తి కళ్లనీళ్లు తుడుచుకుంటూ....

# నా 33 దినముల ఉపవాసము

శ్రీమతి ఉప్పలపాటి పంచాక్షరమ్మగారు

నాకీప్రకృతి చికిత్సయం దనురాగమేర్పడిన నాటనుండియు తత్సంబంధమయిన గ్రంథములను విశేషముగా చదువుటవల్లను, మాకు ప్రకృతి చికిత్సా గురువర్యులగు శ్రీ రాఘవేంద్ర యోగిగారి యుపదేశమువల్లను ఉపవాస చికిత్సయందభిలాష యేర్పడెను. ఈ సంగతి శ్రీ యోగిగారికి తెలుపగా "దీర్ఘోపఘువాసము చేయదలంచినచో నట్టి ఉపవాసమునకు ముందు దీర్ఘకాలము కఠోరబ్రహ్మచర్యము నవలంభింపవలసి యుండు"నని పదే పదే నొక్కి చెప్పిరి. వారి యాజ్ఞాప్రకారము తప్పక బ్రహ్మచర్యము నవలంభింతుమని శ్రీ యోగిగారి కడనే మాదంపతులము ప్రతిజ్ఞచేసితిమి. కాని వారు విశ్వసింపలేదు. అనంతరము వారికడనుండి సెలవుతీసుకొని మానివాసములకు చేరుకుని, బ్రహ్మచర్యమునకు తీవ్రప్రతిబంధకమగు జిహ్వాచాపల్యమును కట్టివేయుట యవశ్యకర్తవ్యమని మేమిరువురము నిశ్చయించుకుని పక్వాహారము పూర్తిగావర్జించి, యపక్వాహారమును అనగా నప్పుడే పిదికిన పచ్చి మేకపాలు, పండ్లు, పచ్చికూరగాయలు సేవింప మొదలిడితిమి. ఇట్లొక సంవత్సరము సేవించితిమి. ఈ సంవత్సరములో మచ్చున కొకసారియైనను మా బ్రహ్మచర్యవ్రతమునకు భంగము కలిగించుకొనలేదని తెలిపిన పాఠకు లతిశయోక్తియని తలపకుండెదరుగాక. ఈ యపక్వాహారమువలన విషయాపేక్ష 99 పాళ్లు తగ్గిపోయెను. శ్రీ రాఘవేంద్రయోగిగారి కడ మేమిరువురము భగవంతునిసాక్షిగా బ్రహ్మచర్యమును కాపాడుకొందుమని ప్రతిజ్ఞ గైకొనియుండుటచేతను దీర్ఘోపవాసము చేయవలెనను కుతూహలమును, పరిపూర్ణారోగ్యమును పొందవలెనను గాఢదీక్షయును మా మనముల నాటుకొని యుండుటచేతను మిగిలిన యొకొద్దిపాటి విషయాపేక్షను బలవంతముగా నణచివేసితిమి. కాని మా యపక్వాహారవ్రతమున కొకసారి భంగముకలిగెను. ఇట్లు ఒక సంవత్సరకాలము గడచిన తరువాత శ్రీ రాఘవేంద్రయోగిగారి శేపల్లెతాలూకా మోర్తోట ఆశ్రమమునకువెళ్లి మా కుపవాసదీక్ష నిప్పింప శ్రీ వారిని కోరితిమి. వారు ముఖవైఖరి, విద్యయందు తమకు గల యత్యధికమగు ప్రావీణ్యముతో మా ముఖములను పరిశీలించి బ్రహ్మ

చర్యమును కాపాడుకొొను నట్లంగీకరించి దీర్ఘోపవాసము చేయగలరని చిరునవ్వుతో మమ్ముల నాశీర్వదించి 1938 సం॥ మే 3-వ తేదీని మాచే నుపవాసవ్రత మారంభింపజేసిరి.

## ప్రారంభమున కలిగిన బాధలు

ఆరంభించిన మూడురోజులవరకు కడుపులో వికారముగానుండుట, కాళ్లు చేతులు లాగుట, నిస్సత్తువ మమ్ముల బాధించినవి. ఈ సంగతి శ్రీ యోగివారికి చెప్పగా ఉదయము, సాయంత్రము, ఒక్కొక్క పెద్ద నారింజకాయ రసమునుతీసి వడగట్టి యొక గ్లాసులోపోసి దానినిండ చన్నీళ్లుపోసి త్రాగుచుండవలెననిరి. అట్లే చేసితిమి. మాకుకల్గిన వికారాదులు నాల్గవనాటనుండి తగ్గిపోయెను. ఇక నారింజపండ్లరసము నీరు మాకక్కరలేదని చెప్పితిమి. "ఆరసము రక్తమును శుభ్రముచేయుననియు విధిగా తీసికొనవలె"ననియు వారు చెప్పిరి. అట్లే చివరవరకు గైకొంటిమి.

## ఉపవాసకాలమున మా వ్యాయామము

నారింజరసము నీటివల్ల వికారాదులు పోయినను నిస్సత్తువ పోలేదు. ఈ నిస్సత్తువ పోవుటకై శ్రీ యోగిగారి సలహా ననుసరించి ఉదయమున రెండుమైళ్లదూరమును సాయంకాలము రెండుమైళ్లదూరమును షికారు పోవుచుండెడివారము. ఈ నడక పరిశ్రమతో మానిస్సత్తువ పూర్తిగా పోయినది. ఎప్పుడయిన నొకపూట మానినచో బలహీనముగా నుండెడిది. ఈ రీతిగా దినమునకు 4 మైళ్లవంతున కడవరకు నడచితిమి. కాని చివరకు కాళ్లు తేలిపోవుటచే రెండురోజులు మాత్రము 2 మైళ్లదూరము చొప్పుననే నడచితిమి. ఇంతకుమించి యుపవాసకాలమున నెట్టి వ్యాయామమును చేసియుండలేదు. కాని దినమునకు ఆరుగంటలకాలమునకు తక్కువకాకుండా పత్రికలును గ్రంథములను చదువుచుండెడివారము.

## మల విమోచనము – ఎనిమా

మేము ప్రాతఃకాలమున ప్రతిదినము నులివెచ్చని నీటితో ఎనీమా చేసుకొనుచుండెడివారము. ఉపవాసకాలమున మాకు నిరుత్సాహము గలుగజేయగలరను తలంపుతో మాతోగూడ నెవరిని పెద్దలను తీసికొని వెళ్లియుండలేదు. ఎనీమాకు నీళ్లుకాచుకొనుట, ఎనీమాచేసికొనుట మాకు మేమే చేసుకొనుచుండెడివారము. ఎట్టి మలముతోను మిశ్రమము కాకుండచేసికొన్న నీళ్లు ఆరీతిగానే తిరిగి బయటకు వచ్చువరకు ఎన్ని పర్యాయములైనను ఎనీమా చేసుకొనుచుండెడివారము. ఈ రీతిగా దినమునకు రెండుసార్లు తక్కువ కాకుండగను నాలుగుసార్లు దాటకుండగను చేసికొనవలసి వచ్చెడిది. ఆశ్చర్యము! మేముపవాస మారంభించిన నాటనుండియు కడపటిదినమువరకును ఎనిమావల్ల అధికముగా

మలము వెడలిపోవుచునేయుండెను. 33-వనాడు కూడ సుమారొక పావుశేరు మలము విరేచనమాయెను. ఆరోగ్యశాస్త్రదృష్టితో చూచినచో నెట్టి యాహారములేనిదే 33 రోజులు మలము వెడలుచుండుట కడువింత విషయముగా దోపవచ్చును. కాని ప్రకృతి చికిత్సలోగల విశిష్టత యిదియే ఓర్పుగలిగి పరిశోధనాదృష్టితో పరిశీలించుచున్నచో యీ ప్రకృతి చికిత్సలో మనమెన్నియేని వింతవిషయములను తెలిసికొనవచ్చును. నావిరేచన మొక్కొక్కసారి తెల్లగాను తరుచు ఆకుపచ్చరంగుగాను ఉండెడిది. ఆకుపచ్చగానుండు విరేచనము భరింపరాని కుళ్లువాసన కొట్టుచుండెడిది. ఒక్కొక్కసారి నేను వెనుక రోగ సమయములో తీసికొన్న ఇంగ్లీషు ద్రావకములవంటి మలము వెడలగా కంగారుతో వెంటనే వెళ్లి శ్రీ రాఘవేంద్రయోగిగారిని ప్రశ్నింప శ్రీవారు 'కొంతమంది శరీరములందు విషతుల్యములగు ఇంగ్లీషు ద్రావకములు జీర్ణింపక యట్లే నిలువ యుండుననియు నీవు జాగ్రత్తగా దాచుకొన్న యా బంగారమంతయు కరగి స్రవించుచున్నదనియు కంగారుపడవలసిన యవసరములే"దనియు చెప్పిరి.

## స్నానము - తలంటు

ఉదయము లేతయెండలో షికారువెళ్లి వచ్చిన తరువాత కొంచెము చెమటపట్టగా నపుడు చన్నీళ్లతో శిరఃస్నానము చేసెడివారము. శ్రీ యోగివారి సలహాప్రకారమునకు మేము వారమునకు రెండుసార్లు శరీరమంతయు మర్దనచేయించి నలుగుపెట్టించుకొని తల యంటించుకొను చుండెడివారము. శరీరమంతయు కదిలి మరునాడు ద్విగుణముగా విరేచన మగుచుండెడిది.

## నిద్ర

మేము రాత్రి సుమారు 8 ఘంటలు మొదలు తెల్లవారుజామున 4 గంటలవరకు గాఢ నిద్రపోవుచుండెడివారము. నిదురలేమిచే బాధపడుచు గడపిన రాత్రి మచ్చునకొకటియైనను మా యుపవాసకాలమునలేదు. 'తిండినిబట్టి' నిద్రయనెదరు. మాకేమి తిండిగలదు? ఈనిద్ర యెక్కడిది! మేముపవాసము చేసినది మంచివేసవికాలపు గాడ్పుల సమయమగుటచే ఆవేడిగాడ్పులకు మాశరీరములు తాళలేక పగలు 12 గం॥ మొదలు 2 గం॥ వరకు ఒడలు తెలియని మగతగా నుండెడిది. ఇది సుషుప్తికాదు, జాగరముకాదు, మధ్యరకము. సొమ్మసిల్లిపోవుట. మాకు తెలివివచ్చునప్పటికి గాడ్పుయొక్క తీవ్రత తగ్గియుండెడిది.

వెనుక మేము అపక్వాహారము తినుచున్నపుడెపుడయిన బంధువులు వచ్చినపుడు వంటచేయుచుండగా ఆసువాసనకు ఆవంటకములు తినవలెనను భ్రాంతి కలుగుచుండెడిది. ఉపవాసకాలములో బంధువులు వచ్చినపుడు వంటచేయగా నాకు భ్రాంతియే కలుగలేదు.

అవును శరీరయంత్రము మలములేక యన్యపదార్థమును బయటకు వెడలుగొట్టుపనిలో తదేకధ్యానముగా దీక్షతో పనిచేయుచున్నప్పుడు అట్టి భ్రాంతులకవకాశమెక్కడిది? ఇంత కాల ముపవాసముచేసినప్పటికి నాతూకము రెండుపౌనులు మాత్రము తగ్గెను. కాని మొగమునగల కళాకాంతులేమియు తగ్గలేదు. మీదు మిక్కిలి హెచ్చెను. ఒకనాడాశ్రమములో శ్రీమతి జ్ఞానాంబగారి యధ్యక్షత నొక బహిరంగసభ జరిగెను. ఆసభలో నేను ప్రకృతిచికిత్సనుగురించి యుపన్యసించితిని. ప్రస్తావవశమున సభలో "ఇది నా 23_వ యుపవాసదిన"మని చెప్పగా సభ్యులందరు నచ్చెరువునందిరి. 'ఉపవాసముచేయుచున్న మనిషిలాగున కనుబడుటలేదే'యని గుసగుసలాడిరి. నాభర్తగారు తిరిగి తమ హైస్కూలులో నుద్యోగమునందు ప్రవేశింపవలసియుండుటచే విధిలేక చాల అసంతృప్తితో నుపవాసమును ముగించవలసివచ్చెను. లేనిచో తక్కిన వారమురోజులుకూడ నుపవాసముండి మొత్తం 40 రోజులు పూర్తిచేసి యుండెడివారము. మే మిరువురము కడు దుర్బలశరీరుల మగుటచే నుపవాసము ప్రారంభింపకమునుపు దీర్ఘోపవాసమును భరింపగలమో లేమో యని చాల దిగులుపడితిమి. కాని యోగీంద్రులవారి యనుగ్రహమున సుఖాంతముగా ముగించితిమి. మా యుపవాసకాలమున దీర్ఘోపవాసమువలన కలుగులాభములనుగురించి మాకు చెప్పుచును, తమ జీవితములోని యమూల్యవిషయములను మాకుజెప్పి మమ్ములను సదా ఆనందపరవశులను జేయుచును, చికిత్సలో మాకుగల్గిన సంశయములను విసిగికొనకుండ జవాబులను చెప్పుచును, ఉపవాసకాలమందు మమ్ములను సదా తమ బిడ్డలవలె గాపాడిన శ్రీ రాఘవేంద్రయోగిగారికి జీవితాంతమువరకును మేము కృతజ్ఞులము. మృత్యువును నా సమీపమునకు గొనివచ్చిన నా భయంకరవ్యాధులన్నియు యీ దీర్ఘోపవాసమువలన సమూలముగా నశించుటచే నా జీవితయాత్రయందు నూతనోత్సాహముతో బాల్గొనుచున్నారు.



# పరిత్యాగం

శ్రీమతి ప్రాణహితగారు

అది ఫాల్గున మాసములోని పూర్ణిమనిశి. క్రొత్తఆమని మామిడిపూత వాసనలతో నిండిన పిల్లవాయువులు నలుదెసల వీస్తున్నై. చెరువు ప్రక్కగఉన్న 'విచీ' వృక్షపు ఒత్తైన ఆకులమధ్య దాగికొనిఉన్న 'పాపియా'* మధురస్వరము మేల్కొనిఉన్న ముఖర్జీకుటుంబము పడకగదిలోకి వినిపిస్తూంది. హేమంతుడప్పుడు ఏమీ తోచకుండగ ఉన్నాడు. భార్యకేశాలని తనవ్రేలికి చుట్టుకుంటూంటాడు కాసేపు. మరోసారి ఆమె గాజులు, కంకణము చప్పుడయేదాకా కదుపుతూంటాడు. తిలలో తాల్చిన పూలదండనులాగి ముఖముమీద వ్రేలాడేటట్లు వదిలివేస్తూ ఉన్నాడు. తనకిష్టమైన పూలపాదని దానిలో ఉల్లాసము లేపుదామని కాసేపు ఇటూ కాసేపు అటూ ఊపుతూ, దానితో ఆడుకునే మలయపవనములాగ ఉందతనిమనస్సు. అనంతమైన అంతరాళంవైపు జ్యోత్స్నపూరిత లోచనములతో కిటికీగుండాచూస్తూ కుసుమ నిశ్చలతతో కూర్చునిఉంది. తన భర్తచేసే లాలనలు ఆమెనేమీ పులకించటంలేదు. ఆఖరికి హేమంతుడు ఆమె హస్తాలను పట్టుకొని నెమ్మదిగా కదిలిస్తూ "కుసుమ, ఎక్కడున్నావు? ఓరిమితో ఒళ్లంతా కళ్లుచేనుకుని చూపినా నువ్వొక అణుమాత్రంగానే కనిపిస్తావు. నీవెంతోదూరంగా తరలిపోయినట్లున్నావు. ఓఁ! ఇంకా నాదగ్గిరగా రా! ప్రియతమా! చూడు, రాత్రి ఎంతశోభగా ఉందో" అన్నాడు.

కుసుమ దూరపుచూపును తనభర్తకేసి త్రిప్పుతూ "నాకో మంత్రం వచ్చును. అది ఈ వసంతనిశిని, ఈ శశిని ఒక్కనిమిషంలో తుత్తునియలు చేసేస్తుంది" అంది.

"నీవు అసలు చేయగల్గినట్లయితే, ప్రార్థిస్తున్నా బాబూ, పఠించకు; ఒక్కవారంలో మూడు నాలుగు శనివారాలు కల్గించి, రాత్రిళ్లను మర్నాడు సాయంకాలము అయిదుఘంటలదాకా పొడిగించినట్లయితే, నీ మంత్రశక్తిని తప్పకుండా ప్రయోగించు" నవ్వుతూ హేమంతుడన్నాడు.

ఇట్లా అంటూ, భార్యని ఇంకా దగ్గరగ చేర్చుకుందామని ప్రయత్నించాడు. కుసుమ ఆలింగనమునుండి తప్పించుకుంటూ "మీకు తెలుసునుగా, నేను మరణశయ్యమీద మీకు ఒక రహస్యమును విప్పిచెప్పుతానన్నా. కాని, అది ఈ వేళరాత్రే అంతవరకు ఆగకుండా చెప్పివేయాలని మనసవుతూంది. ఈ రాత్రి మీ రెంత కఠినశిక్ష విధించినప్పటికి, సహించగలననుకుంటా"

జయదేవుని గీతగోవిందములోని ఒకశ్లోకం చదువుతూ శిక్షలనుగురించి చలోక్తిగా ముచ్చటిద్దామనుకున్నాడు. అంతట్లోనే ఎవరో కోపంతో వస్తూన్న అడుగుల చప్పుడవటంచేత హేమంతుడు వాటి భావమేమిటో తెలిసికొనలేక ఆదుర్దాలో పడ్డాడు.

* వంగదేశమునందు మధురముగ గానము చేయుపక్షి

తలుపవతల నిలబడి హరిహరుడరుస్తూ "హేమంతా, తక్షణం నీభార్యను ఇంటినుండి తరిమివేయ్"

హేమంతుడు భార్యవైపు చూచాడు. ఏమాత్రంకూడా ఆమెలో విస్మయచిహ్నలం కనిపించలేదు. కుసుమ తనముఖాన్ని చేతుల్లో దాచుకుంది. తనకు గల శక్తితోను, లోతైన హృదయంతోను అక్కడే ఆ మట్టుగా శూన్యంలోకి కరిగిపోవాలనుకుంది. మలయపవనములో, తేలిపోతూ వెనుకటి 'పాపియా' కూజితమే గదిలోకి వినిపిస్తూంది. కాని ఎవ్వరు వినటంలేదు. ఈ పృథ్వి శోభలనంతము—కాని, ఎంత సులభంగా ప్రతివస్తువు అనాకారం చెందుతూంది!

౨

బయటనుండి తిరిగివస్తూ హేమంతుడు భార్యను అడిగాడు:

'అది నిజమేనా?'

'నిజమే' నంది కుసుమ.

'ఇంతకు పూర్వమే ఎందుకు చెప్పావుకావు నాకు?'

'నేనెన్నోసార్లు ధైర్యాన్ని చిక్కబట్టుకొని ప్రయత్నించాను; ప్రతిమాటు విఫలత చెందుతూండేదాన్ని; నేనభాగినిని'

'అయితే ఇప్పుడు అంతా సాంతంగాచెప్పు.'

కుసుమ ధైర్యంతో, జీరలేని గొంతుతో ఆత్మకథ చెప్పింది. బాధనెరుగక నెమ్మదిగ నగ్నపాదాలతో జ్వాలలో నడిచిపోయినట్లుగవుంది. ఎవ్వరూకూడా ఆ కాల్పుచేత ఎంతబాధ పడిందో ఎరుగరు. కథనంతా సాంతంగా విన్న తర్వాత హేమంతుడు లేచి బయటికి వెళ్లి పోయినాడు. తనభర్త ఇంక తిరిగిరాకుండా వెళ్లి పోయినాడనుకుంది. కుసుమ ఈ సంఘట్టనను క్రొత్తదిగా భావించక ప్రతిదినం జరుగుతూన్న దానిలాగే పరిగణించింది. ఈకొద్ది నిమిషాలలోను ఆమెమనస్సు చెదిరిపోయి 'నా'అనే వాళ్లు లేకుండగిపోయింది. మొదటినుండి చివరవరకు ప్రపంచము, ప్రణయము మాత్రము స్వప్నమువాదిరిగ కనిపించాయి.

క్రొద్దిదినాలక్రితం తన భర్తచేసిన ప్రణయప్రతిజ్ఞ స్మృతికివచ్చి, పదునైనకత్తితో హృదయాన్ని భేదించి నట్లుగ ఆమె పెదవులమీదకు వెలికాంతులీనే నిరుత్సాహపు నవ్వు చిలికింది. ఏప్రేమైతే జీవితానికి సాఫల్య మిచ్చేది—అనుభవాలికొక గాంభీర్యమూ, ఆత్మకి ఒక ఆప్యాయతా తెచ్చేది— ఎంత చిన్నవియోగాన్నైనా ఎంతో బాధాకరంగానూ, ఒక నిమేషపు సంయోగాన్నికూడా అత్యంతమధురంగానూ చేసేదీ—అపరిమితమైన వ్యాప్తికలిగి అనంతమైన మనికి కలిగి వచ్చేజన్మల్లోకూడా భరతవాక్యంలేనిదీ—అయివుంటుందో ఆప్రేమ తన ప్రేమఅని బహుశా అనుకుంటూంది ఆమె. అది ఎంత నిస్సహాయతకల్గి ఉన్నదంటే పురోహితుని గాలి సోక గానే ఈ అనంతప్రణయం మట్టిపాలవుతూంటుంది. ఇంతకు పూర్వమే అతను ఆమెచెవిలో ఊదినాడు 'ఎంతో అందమైన రాత్రి'అని. ఆరాత్రే ఇంకా తెల్లవారలేదు. అదే 'పాపియా' ఇంకా కూస్తూనేఉంది. అదే మలయానిలం దోమతెరను తొలిగిస్తూ గదిలోకి వీస్తూంది. తెరచిఉన్న గవాక్షంగుండా అదే జ్యోత్స్న శోభ లావణ్యంచేత బడలి నిదురిస్తూన్న సౌందర్యలతలాగ తల్పముమీద పడుతూంది. ఇదంతా మిథ్య! ఆమె కంటె ప్రణయమే ఎక్కువ కపటనాటకమాడుతూంది!

3

రాత్రంతా కనుక నేదిలేక పరిపరివిధాల పోయేమనస్సుతో మర్నాడు ప్రొద్దున్నే ప్యారీశంకరఘోషాల్ ఇంటితలుపు తట్టాడు హేమంతుడు. 'ఏమిటి సంగతి బాబూ?' అంటూ ప్యారీశంకరుడు అతన్ని లోపలికి తీసికొని వెళ్లాడు.

నిప్పులాలికే కోపంతో వణికిపోతూ 'మా కులాన్ని ధ్వంసంచేశారు. మావంశానికి పతనం తెచ్చి పెట్టారు. దానికి మీరే కారకులు' అంటూ హేమంతుడన్నాడు. ఇంకేమీ అనలేకపోయాడు; మాట్లాడలేక పోయాడు.

'మరి నీవు—నాకులాన్ని నిల్పావు; సంఘదూషణనుండి కాపాడావు; 'భేష్' అని ఎంతో లాలనతో నావీపు చరచావు!' అన్నాడు ప్యారీశంకరుడు కొద్దిగా హేళనగా నవ్వుతూ.

బ్రాహ్మణుని కోపానలం ప్యారీశంకరుని రెప్పపాటలో భస్మంచేయ గల్గుతుందని హేమంతుడను కున్నాడు. కాని తన అహాన్నేదగ్ధంచేసింది. ప్యారీశంకరుడు మాత్రం నిశ్చింతగా కులాసాగా ఏమీమార్పు లేకుండగ కూర్చునిఉన్నాడు.

'మీకెప్పుడైనా హానిచేశానండీ?' హేమంతుడు గద్గదస్వరంతో అడిగాడు.

'నన్నొక సంగతడగనీ—నా కూతురు, నా ఒక్కగా నొక్క కూతురు—నీతండ్రికి ఏమిహాని కల్గించింది? నీవు బొత్తిగ కుర్రవాడివి, మరినీవు బహుశా వినలేదేమో. అట్లాగయితే విను. ఇదిగో, అనవసరంగా వెర్రెత్తి పోకు. నేను చెప్పబోయేదానిలో చాలా నవ్వుతాలుంది.

నా అల్లుడు నవకాంతుడు నాకూతురు వస్తువులు దొంగిలించి ఇంగ్లండు పారిపోయాడు. అప్పటికి నీవు బొత్తిగ కుర్రవాడవు. ఆయిదేళ్లతర్వాత బారిష్టరై తిరిగివచ్చినప్పుడు ఊళ్లోజరిగిన గొడవమాత్రము నీవు బాగా ఎరుగుదువనుకుంటా. ఒకవేళ నీవుఎరిగి ఉండకపోవచ్చును కూడా. ఎందుచేతనంటే నీవు ఆసమయాని! కలకత్తాలో చదువుకుంటూండే వాడవేమో. మీతండ్రి బ్రాహ్మణకుల పెద్దననే అహంభావంతో అన్నాడు కదా—ఒకవేళ నేను నాకూతుర్ని భర్తదగ్గరకు పంపించినట్లయితే నేను మంచికోసం ఆమెను కలకాలము పరిత్యజించి గుమ్మంలోకి అడుగుపెట్టనీయకుండగ చేయాలని. నేను మీనాన్న కాళ్లమీదపడి ప్రాధేయ పూర్వకంగా 'సోదరా, ఈసారికి క్షమించుమన్నను. కుర్రవానిచేత గోమయం మ్రింగించ, ప్రాయశ్చిత్తం చేయిస్తాను. ఎట్లాగైనా అతణ్ణి కులంలోకి తీసికోండి!' అన్నాను; కాని మీ నాయన మంకుతనం వదలలేదు. నామట్టుకు నాకూతుర్ని విడువలేకపోయినా అందుచేత చుట్టాల్ని పుట్టినఊరుని విడిచిపెట్టి కలకత్తాకు పోయి నాను. అక్కడకూడా కష్టాలు కాళ్లవెంబడి నడిచాయి. నామేనల్లునికి పెళ్లిచేదామని అన్నీ సిద్ధముచేసి కొనేటప్పటికి మీనాన్న పిల్ల తాలూకువాళ్లల్లో అగ్నిరగిల్చి సంబంధం చెడగొట్టాడు. అప్పుడు నేను ఒట్టు పెట్టుకొన్నా: నాలోనే, నారక్త నాళాలలోనే ఏమాత్రమైనా బ్రాహ్మణరక్తం ప్రవహిస్తూన్నట్లయితే నేను కసి తీర్చుకుంటానని. ఇంతవరకూ కొంతైనా అర్థముయిందనుకుంటా? కాని కొంచెము సేపాగు. పూర్తిగవింటే ఆనందిస్తావు, చాలా వినసొంపుగా ఉంటుందిలే!

నీవు కాలేజీకి వెడుతూండేటప్పుడు నీవుంటూన్న వసతికి రెండోఇంట్లో విప్రదాస్ బెనర్జీ ఉంటూండే వాడు. పాపం! అతను గతించాడు. కాయస్థకులానికి చెందిన ఒక పెద్దమనిషికూతురు, తల్లీ తండ్రీలేని అనాథ,

బాలవితంతువు–'కుసుమ' అతని ఇంట్లో ఉంటూండేది. పిల్ల ఎంతో అందంగా ఉండేది. ముసలి బ్రాహ్మణుడు కాలేజీ కుర్రాళ్ల తీక్షణదృక్కుల బారినుండి ఆమెను రక్షిస్తూండేవాడు. కాని యువతికి ముసలివాని కళ్లకు కనికట్టుకట్టటం కష్టమైనపని కాదుగా! తరుచుగ ఆమె డాబామీదికి బట్టలార వేసికొనేందుకు వెళుతూండేది. డాబామీద ప్రశాంతంగా చదువు సాగుతుందని నీవు అక్కడే ఉండేవాడవనుకుంటా. డాబామీద ఉన్నప్పుడు మీరిద్దరూ మాట్లాడుకుంటూండేవారో ఏమో నేను చెప్పలేను. కాని ఆపిల్లప్రవర్తన కొంత ముసలివానికి అనుమానం కల్గించింది. గృహకృత్యాల్లో ఎప్పుడూ తప్పులు చేస్తూండేది. మరి హిమవంతుని కూతురైన పార్వతిలాగ భక్తిమార్గముత్రొక్కి నిద్రాహారాలు మానివేసింది. కారణం ఏమీలేకుండగ సాయంత్రమప్పుడు ముసలివానికి ఎదురుగ 'బారు' మంటూండేది.

ఆఖరికి డాబామీద మీరిద్దరూ తరుచు చూసికొంటూండేవారనీ చివరకి నీవు ఎన్నడూలేని దీక్షతో ఏకాంతంగా చదువుకునేందుకు కాలేజీ మానివేసికూడా మధ్యాహ్నమప్పుడు పుస్తకంచేత పట్టుకొని డాబామీద కూర్చుండటం తెలిసికొన్నాడు. విప్రదాను నాసలహాకోసంవచ్చి సంగతంతా చెప్పాడు. 'మామా ఎప్పణ్ణించో కాశీప్రయాణం చేద్దామని కోరుకుంటున్నారు. అమ్మాయిని నాకప్పగించి బయలుదేరండి. నేనామెను జాగ్రత్తగ చూస్తాను'అన్నాను.

అతనాప్రకారం వెళ్లిపోయాడు. ఆమెను శ్రీపతి చటర్జీ ఇంట్లోవుంచి అతన్ను ఆమె తండ్రి అని వెల్లడిచేశా. తర్వాత ఏమి జరిగిందీ నీకే తెలుసును. సాంతంగా ఈవిషయం చెప్పటంచేత ఈవేళ ఎంతో ఆనందంగావుంది. ఇదంతా ప్రణయగాథలాగుంది కదూ! ఓపుస్తకంవ్రాసి ప్రచురిద్దామని ఉంది. కాని నేను మట్టుకు రచయితను కాను. నా మేనల్లుడికి కాస్త అభిరుచిఉందని అందరూ అంటూంటారు. అతనిచేత వ్రాయిస్తా. నుళువైన విధమేమిటంటే, అతనితోపాటు నీవుకూడా పూనుకోవాలి. చివరఘట్టాలు నాకంత బాగా తెలియ'వన్నాడు ప్యారీశంకరుడు.

ప్యారీశంకరుని ముగింపుమాటలను సాంతంగా వినకుండా 'కుసుమ ఈపెండ్లికి అడ్డుపెట్టలేదా?' అన్నాడు హేమంతుడు.

'ఆవిషయం ఊహించటం కష్టం. నీకు తెలుసుగా బాబూ! ఆడవాళ్ల మనస్సు లెటువంటివో? వాళ్లు 'ఊహు' అంటే 'ఊ' అన్నమాట. క్రొత్తఇంటిలో ఉన్నదినాల్లో నిన్నుచూడలేక పోవటంచేత పిచ్చెత్తినట్లుగ బాధపడింది. ఎట్లాగో క్రొత్తఇంటి భోగట్టా తెలిసికొనిఉండి ఉంటావు. ఎందుచేతనంటే, కాలేజీకని బయలుదేరి దారి తప్పినట్లుగ శ్రీపతి ఇంటిచుట్టూ తిరుగుతూ ఉండేవాడవుకదూ. నీకళ్లు ప్రెసిడెన్సీకాలేజీకోసమే వెతుకుతూన్నట్లు తోచదు. ఎందుచేతనంటే విరహార్తులు కీటకాలు వతికే పరాయివాని ఇంటి కిటికీపైపే నీదృష్టిపోతూండేది. మీ ఇద్దరిగురించీ ఎంతేనా విచారపడుతూండేవాణ్ణి నీచదువు 'గుంటపెట్టి గంటవాయిస్తుంద'ని. మరి ఆపిల్ల జీవితం మరీ దుర్భరంగావుంటుందని గ్రహించగల్గా.

ఓరోజున కుసుమను చేరదీసి 'తల్లీ నేను చెప్పేదివిను. నేను వృద్ధాప్యంలోఉన్నా. నాముందర సిగ్గుపడనవసరంలేదు నీ హృదయానికి ఎవరంటే ప్రీతో నాకు తెలుసు. ఆకుర్రాడిస్థితికూడా ఒక్కమోస్తరుగనే ఉంది. మీ ఇద్దరినీ ఒక ఇంటివాళ్లని చేద్దామని నాకోరిక' అన్నాను. వినటములోనే కుసుమ ఒక్కపెట్టున కంటతడిపెట్టి పారిపోయింది. అప్పణ్ణించి సాయంత్రమప్పుడు శ్రీపతి ఇంటికిపోయి కుసుమనుపిలిచి నిన్ను

గురించి ముచ్చటిస్తూ సిగ్గువిడనాడేటట్లు చేయగల్గా. ఆఖరికి వివాహం సిద్ధపరుస్తానని అనటంతోనే ఆమె నన్నడిగింది. 'అదెట్లా సంభవిస్తుంది' అని. 'ఏమీ ఫరవాలేదు. నిన్ను బ్రాహ్మణకన్యగా పరిగణింపజేస్తాన'న్నాను. ఎంతో చర్చజరిగాక నీవు 'వల్లె' అంటావో లేదో కనుక్కోమని వేడుకుంది. ఏమిటి తెలివితక్కువ! అతగాడు నిన్నుగురించి పిచ్చెత్తినట్లు ఉన్నాడు—ఈ గొడవంతా అతనికి తెలియపర్చట మెందుకు? సునాయాసంగా కార్యం సాగిపోనీ. తర్వాత—అంతా మంచి ముహూర్తంలోనే ప్రారంభమైంది. శుభంగానే పరిణతి పొందుతుంది. ముఖ్యంగా ఏమాత్రము ఈవిషయం పైకి పొక్కిపోవటానికి ఆస్కారంలేకుండగ ఉన్నప్పుడు ఎందుకిదంతా బయటపెట్టి, అతన్ని జీవితాంతమువరకూ భగ్నహృదయుణ్ణి చేయటం?

నేనుసరించమన్న పంథా కుసుమకి సమ్మతమైందో లేదో నాకు తెలియదు. ఒక్కొక్కసమయంలో కంట నీరెడుతూండేది; ఊరుకుంటూండేది. నేనొకవేళ 'పోనీ ఆవిషయం తలపెట్టడము మానుకుందా'మంటే ఆమె ఏమీ తోచకుండగ ఉండేది. ఈ విధంగా పరిస్థితులుంటూంటే శ్రీపతిని వివాహవిషయమై నీవద్దకు పంపించా; ఏమాత్రము సందేహించకుండగ తక్షణం వెళ్లి చేసికోనేందుకు సమ్మతించావు. అంతాసిద్ధమైంది.

శుభముహూర్తం నిర్ణయించిననాటి క్రితందినం కుసుమ ఈవిధమైన పెండ్లికి వప్పుకోనని బలవంతంచేస్తే ఎంతో కష్టంమీద ఆమె మనస్సుకు నచ్చచెప్పగల్గా. అనుక్షణం మాత్రము 'బాబాయి, ఈవివాహం చేయటం మాని వేద్దురూ' అని అంటూవచ్చింది. నేను కూకలేశా; అంతాసిద్ధమైన తరువాత ఇప్పుడు వెనకతీయటం ఎట్లాగ?

'నేను చచ్చిపోయినానని ఓవదంతి పుట్టించి, నన్ను ఎక్కడికైనా పంపించివేయండి' అని వేడుకుంది.

'అట్లాగైతే ఆమంత్రవాని గతేమికాను? ఎంతకాలమునుండో పెంచుకుంటూన్న కోర్కె రేపు ఫలిస్తుందని అతను స్వర్గసుఖాన్ని అనుభవిస్తున్నాడు; మరి ఈవేళ నీ మరణవార్త అతనికి తెలియజేయమంటావు? జరుగబోయేదేమిటో తెలుసునా? అతని మరణవార్త నీకు చెప్పవలసిఉంటుంది. ఆ సాయంత్రమే నీవు చనిపోయినట్లు నాకు తెలుస్తుంది. ఏమైనా ఆలోచిస్తున్నావా తల్లీ! నేను కన్యాహత్యను బ్రాహ్మణహత్యను ఈ వయస్సులో తగుదుననుకున్నావా?'

పర్యవసానంగా శుభముహూర్తాన వివాహం జరిగింది. నావిధి నేను నెరవేర్చుకుని స్తిమితపడ్డా. తరువాత ఏమిజరిగిందో నీవే బాగా ఎరుగుదువు.'

'నివారణలేని గాయముచేసిన తర్వాత ఊరుకోలేకపోయినారా?' మాట్లాడకుండగ కొంచెముసేపుండి హేమంతుడు వెక్కిరించాడు 'రహస్యాన్ని ఇప్పుడెందుకు బయటపెట్టారు?'

'నీ చెల్లెలి పెళ్లికి అన్నీ సిద్ధముచేయటం చూచినప్పుడు నాలోనేననుకున్నా. సరే, ఒక బ్రాహ్మడి కులమునకు కళంకమాపాదించా అది నా విద్యుక్తకర్మ కాబట్టి. ఇప్పుడు మరొక బ్రాహ్మడికులం అటువంటిగతికి పాలవుతూంది. మరి ఈసారి తప్పించేవిధి నాది. అందుచేత వాళ్లకి నీవు నీ భార్యగా ఒక శూద్రస్త్రీని తీసికొన్నావని సర్వారణగా చెప్పగలనని వ్రాశాన'ని ఎంతో కులాసాతో చెప్పాడు.

విశ్వప్రయత్నంలో ఉద్రేకాన్ని అణచుకుంటూ హేమంతుడు 'ఇప్పుడు నేను పరిత్యజించే పిల్లగతేమి కాను? ఆమెకు తలదాచుకోటానికీ, భుక్తికీ మీరేమైనా ఇస్తారా?'

'నేను చేయవలసిన దేదో చేశాను. ప్రతివాడు పరిత్యజించిన భార్యని చేరతీయటం నాపనికాదు. ఎవరక్కడ? మంచు గడ్డవేసి కొబ్బరినీళ్లు, తమలపాకులు హేమంతబాబుకి తీసికొనిరా'అన్నాడు శాంతంగా.

ఆతిథ్యాన్ని స్వీకరించకుండానే హేమంతుడులేచి చక్కాబోయాడు.

౪

ఆవేళ పంచమి. చంద్రుడప్పుడే అస్తమించాడు–రాత్రి చీకటిగావుంది. పక్షులేమీ గానం చేయటం లేదు. చెరువు ప్రక్క నున్న 'లిచీ' వృక్షము, చీకటంత నల్లగాకాక సిరామరకలా కనిపిస్తూంది. మలయానిలం అంధకారంలో దారితప్పిన నిశాచరుడు (Sleep Walker)లాగ నలుదెసలా వీస్తూంది. చురుకైన కండ్లతో తారకలు ఏదో మహత్తరమైన మాయను తెలుసుకుందామని అంధకారంలోకి చొచ్చికొనుటకు ప్రయత్నిస్తున్నాయి.

పడకగదిలో దీపం వెలగటల్లేదు. హేమంతుడు తల్పానికి ఓప్రక్కగా కిటికీవైపు కూర్చొని తనముందు ఉన్న అంధకారంలోకి చూస్తున్నాడు. కుసుమ తన ముఖాన్ని అతని పాదాలమీద పెట్టికొని అతని పాదాల రెంటిని చేతులతో పట్టుకొని నేలమీద పడుకొనిఉంది. రొదలేని సముద్రములాగ కాలము నిల్చిపోయింది. అనంత రాత్రి నేపథ్యముమీద, కర్మ, సర్వకాలానికి ఈ ఒక్క చిత్తరువును వ్రాసినట్లుగ కనిపిస్తూంది–సర్వత్రా సర్వనాశనము, దానిమధ్య న్యాయవాది, మరి దోషి అతని పాదాక్రాంతుడు.

చెప్పులచప్పుడు మళ్లా వినవచ్చింది. తలుపుదగ్గరగవచ్చి హరిహరముఖర్జీ అన్నాడు 'నీకు వ్యవధి చాలిందనుకుంటా—ఇంక క్షణమైనా ఇవ్వను—ఆపిల్లని ఇంటినుండి తరిమివేయ్.'

ఇది వినగానే కుసుమ జీవితకాంక్షతో అతని పాదాలను కౌగిలించుకుంది. ముద్దులతో నింపింది. తన శిరస్సును పాదాలకు అప్రమతతో స్పృశించి లేచిపోయింది.

హేమంతుడులేచి, తలుపుదగ్గరకువెళ్లి 'బాబా! నేను నాభార్యను పరిత్యజించలేను'
'ఏమిరా! నీకులమే పోగొట్టికొంటావా'అని కోపంతో అరచాడు.
'నాకులంతో నాకు నిమిత్తంలేదు' అన్నాడు హేమంతుడు గంభీరంగా.
'అయితే నిన్నుకూడా వెలివేశా'... (రవీంద్ర ప్రణీతమున కనువాదము)

# తెలుగు వెలది

తన నిరర్గళ కవితా సుధారసముచే నలరించె బుధుల మా తెలుగు వెలది
తన ప్రభావమున సంధాచార బద్ధుల తెలివొందజేసె మా తెలుగు వెలది
తన వీరపత్నీత్వమున పతిన్ శౌర్యమూర్తినిఁజేసి నెగడె మా తెలుగు వెలది
తన శౌర్యఘనత శాత్రవసమూహముల నెదిర్చి చెండాడె మా తెలుగు వెలది

తన జనులు నేడు వ్యక్తిత్వధనము గోలు
పోయి దాస్యానమున్గి వాపోవుచుండ
మార్గదర్శినియై జగన్మహిత కీర్తి
దీప్తులందదె నేడు మా తెలుగు వెలది?

—శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి.

# సీత విలాపము

ఉ. నీచుడు రావణుండు తెగనిల్చుచు హుంకృతి జూపినంత, యా
నీచునిమాటలొల్లకను నీచునియొక్క తృణంబుజేసి ఓ
నీచతృణంబు ముందిడుచు నీచునిజేసియు మాటలాడ, నన్
నీచనిమెంచి యిప్పగిది నుంచుటధర్మమె? రామభూవరా?

ఉ. వెన్నెలరేడునాడు తనవెన్నెలశక్తిని జూపుచుండగా
వన్నెలకాడు రావణుడు వన్నెలగూడి వనంబుజొచ్చితా
మన్నలగూడి రాణిగనుమన్నుము యన్చును మూర్ఖతత్వమున్
మన్నలజేరమంచు మరిమందుడు రావణుఁడేగె నాటికిన్.

చ. గడువికలేదునాకు గడుక్రూరుడు రావణుచేతజిక్కనే
మడయగవచ్చునేమొ అవమానమునొందుట తప్పదేమొ నా
గడువునురాకమున్నె కడుకష్టములన్నియు దాపరించెగా?
తడయకగాచినన్ను దయదాక్షిణజూపుము రామభూవరా?

శా. నాథా! నన్నిటుబాసి యిప్పగిది నర్ధాన్నమున్ దుంచగా
భేదారూపుడు రావణుండు కడుభోగావేశమున్ జిక్కనన్
క్రోధాపూరిత రక్తధారలెగురన్ ఖండించ వేధించగాన్
నాథా! రామ దయన్ వహించిగనుమా నన్నిట్టి సందర్భమున్.

ఉ. చెల్వుడవైననీవు కడుచెల్వముతోడను బ్రోవకీనిశా
చెల్వుడునైన రావణుని చెంగటనుంచియు! రామ! నీవీ
చెల్వము గాంచుచుండియును చెల్యనుగావగ రాగదేమిరా
చెల్వుడ నిన్నునమ్మిన యీచెల్యలిప్రాణము బ్రోవుటెన్నడో.

చ. నిలువగలేను రామయిక నీదయలేకను యివ్వనంబునన్
ఖలుడగురక్కసుండు పటుక్రోధముజూపుచు రక్కసాధముల్
పిలువగనంపి ఖడ్గమున పింజలుపింజలు జేసిరక్తమున్
నిలువునద్రావుమంచు ననునంతముజేయుట కాజ్ఞయిచ్చెనే.

—శ్రీ రామశాస్త్రికవులు

# స్త్రీల స్వేచ్ఛ - సంఘములో సంకుచిత భావములు

శ్రీ విం. అ. సూర్యనారాయణగారు

మన దేశములో నిప్పుడు స్త్రీలు సంపూర్ణమగు స్వేచ్ఛ ననుభవించుచున్నారనియు వారికి స్వాతంత్ర్యము చాలవరకు లభించినదనియు ననేకులు భావించుచున్నారు. స్త్రీల యభివృద్ధికి ప్రతికూలమగు కొన్ని యాటంకములును ఆచారములును తొలగింపబడి నటుల సహగమనము నంతరింపజేయుట, వితంతు వివాహములు సమ్మతింపబడుట, బాల్యవివాహములు బహిష్కరింపబడుట, ఘోషాపద్ధతి క్రమక్రమముగ క్షీణింపజేయుట, మొదలగు సంస్కరణములు సూచించుచున్నవి. కాని, స్త్రీలకు వివాహ విషయములలో నింకను చాలినంతగ సరియగు స్వేచ్ఛ సమకూరలేదు. వధువు తనమనసుకు నచ్చిన పురుషుని వరించుటకు తలిదండ్రులామెకు తగినంత స్వేచ్ఛ నీయకుండుటయు, స్త్రీలు తమబిడ్డలను తమబుద్ధికి మంచివనితోచు పద్ధతులలో పెంచుటకు వారి భర్తలును, తదితర పెద్దలును సమ్మతింపకుండుటయు, పతులొనరించు అహితకృత్యములను నిషేధింప నధికారము లేకుండుటయు, భర్తలు బాధలబెట్టునపుడు భార్యలు వాటిని న్యాయశాస్త్ర సహాయముచే నివారించుకొనలేకుండుటయు సతులువారి సద్గతులను వారు వెదకికొనజాలకుండునట్లు సంఘమువారి ననగద్రొక్కజూచుటయు నెంతయు నన్యాయమే యనకతప్పదు.

మాటలలో మగవాండ్రు మగువలకొకించుక మర్యాద చూపినను క్రియలలో నాడువారికి గౌరవము సున్నయనియే చెప్పవచ్చును. స్త్రీలకు తగినంత స్వేచ్ఛ యొసగనిచో సంఘమభివృద్ధి సెందనేరదు. కాని స్వేచ్ఛయనిన సంపూర్ణ స్వాతంత్ర్యమని యర్థము ఎంతమాత్రమును కాదు. స్త్రీలు వారి బుద్ధికి మంచివిగ గన్పట్టు పద్ధతులు వారి యభివృద్ధికి తోడ్పడగలవని తోచినపుడు వాటి నవలంభించుటకు తగు నవకాశములు పురుషులొసంగకుండు టెంతయు పొరపాటు.

ఎల్లకాలములందును, అన్నిపనులందును వారు కేవలము ఒకరి యాజ్ఞకు లోబడియే యుండి తీరవలెననుట వారి సౌఖ్యమునకు భంగకరమేగాక సంసారమునందు శాంతికికూడ హానికరమగును. సంసారమునందు శాంతి సౌఖ్యములు లేనపుడు సంఘము సర్వతోముఖాభివృద్ధి గాంచుటకు తగిన పరిస్థితులేర్పడవు.

ప్రకటితతత్త్వవేత్తయు నాంగ్లకవితాపితామహుడుననగు 'విలియం వర్డ్సు వర్తు' (William Wordsworth) "The child is the father of the man" బాలుడే కాలక్రమమున తండ్రి యన బరగుచున్నాడని తెల్పియున్నాడు. అట్లనే Woman (Wifman) is the mother of man సతియే మనుజసంతతికెల్ల మాతయై వెలయుచున్నదని చెప్ప నొప్పును గదా ? పతియే తనసతిగర్భంబున సుతుడై జన్మించుచున్నాడను స్మృతివాక్యమును బట్టి సతీత్వములో మాతృత్వ మిమిడియున్నది కదా ? సతిని హింసించుట మాతను వెతలబెట్టుటయే యగును కదా ? అట్టిచో స్త్రీయొక్క స్వేచ్ఛ నరికట్టుట, ఆమె సౌఖ్యము నడ్డగించుట, ఆమె యభివృద్ధి నవరోధించుట పురుషునికి క్షేమకరమగునా ?

భార్య భర్తశరీరములో ప్రశస్తమైన యర్ధభాగమని పాశ్చాత్యభాషలోకూడ పొగడబడియున్నది. అర్ధశరీరముయొక్క యభివృద్ధి కాటంకములు గల్గించుచో స్వరూపమంతకును హానికరమే గదా ! నీరక్షీర న్యాయముతో నొప్పి అన్యోన్యానురాగముచే నత్యంత శోభాయమానమై నెగడవలసిన దాంపత్యధర్మములో తిలతండుల న్యాయమును దెచ్చిపెట్టి భిన్నభావముల ప్రోత్సహించుట శ్రేయోదాయకము కాదు.

పురుషులకున్న స్వేచ్ఛలో శతాంశమైన స్త్రీలకు గల్గుచో వారిజీవితములు సౌఖ్యప్రదములగుటయ కాక సంసారమునకును సంఘమునకును చాల మేలొనగూడును. విజ్ఞానము నానాటికి వికసించుచు, నాగరికత దినదినాభివృద్ధిజెందుచు, భారతదేశ మితరదేశములతో సమముగ ఘనతగాంచ నిచ్చలు తల్లడిల్లుచున్న నీ యిరువదవశతాబ్దములోగూడ స్త్రీలను సర్వవిషయములలోను సంకెళ్లలోనుంచు టెంతయు శోచనీయమైన సంగతికాదా?

పురుషుల బహుభార్యాప్రియత్వమును బాపుటకును, స్త్రీలకు విడాకులహక్కు నొసంగుటకును శాసనసభలలో బిల్లుల ప్రవేశపెట్టినంత నే స్త్రీలకు స్వేచ్ఛ సమకూరునా? వారికి సరియగు స్వేచ్ఛయు సౌఖ్యమును చేకూరవలెనన్న సంఘములో వారి వ్యక్తిత్వమును బుద్ధి పటుత్వమును త్యాగదీక్షను, స్వయంనిర్ణయమును శీలప్రభావమును, విజ్ఞానమును వెల్లడించుటకు వారు సర్వశక్తులను జాగరూకతతో సంపాదించుకొనవలెను. స్త్రీలకు సరియగు స్వేచ్ఛ లేకుండుట సంఘమునకు క్షేమకరముగాదు.

ఈ విషయములో సంఘమునందున్న సంకుచితభావములు సంపూర్ణముగ తొలగిన గాని దేశము ఖ్యాతిగాంచదు.

గృహలక్ష్మి

# సుప్రసిద్ధాంధ్ర రచయిత్రీ మణులకు

మనవి మాటలు

గృహలక్ష్మి దసరాసంచిక యథాప్రకారముగా అక్టోబరు మొదటి తేదీకి వెలువడును. ఎప్పటివలెనే రమణీమణులచే రచింపబడిన రచనలకే ప్రాధాన్య మివ్వబడును.

# దసరా సంచిక

దర్శనీయంగా, సర్వాంగసుందరంగా వెలువడడానికి సుప్రసిద్ధాంధ్ర రచయిత్రీమణుల సహకారాన్ని 'గృహలక్ష్మి' ఆశిస్తున్నది. వారు దానిని తప్పక ఆదరించగలరు.

◎

వ్యాసాలు స్త్రీజనాభ్యుదయానికి సంబంధించిన వివిధవిషయాలలో వేటినిగురించియైనా గద్యపద్యాత్మకంగా వుండవచ్చును. ముఖ్య సమస్యలు ఇవి:

◎

- ఆంధ్రాభ్యుదయానికి, రాష్ట్రనిర్మాణానికి స్త్రీలేవిధంగా కృషి చెయ్యవలసి వుంటుంది?
- సాంఘిక సౌమనస్యము సమకూరేందుకు కావలసిన చట్టాలేవి?
- నిరక్షరాస్యతను నిర్మూలించడానికి, వయోజనవిద్య వృద్ధికావడానికి స్త్రీలేవిధంగా తోడ్పడాలి?
- స్త్రీసమాజాల దృక్పథం ఎల్లావుండాలి, వాటిని ఊరూరా స్థాపించి నిరంతరాయంగా సాగించడం ఎల్లు?
- సంసారాన్ని సౌఖ్యప్రదంగా నిర్వహించడానికి సాధ్యమైన సలహాలు ఏవి?
- గృహనిర్మాణము — శిశుసంరక్షణ — ప్రాథమికవిద్య — గృహపరిశ్రమలు—

## గమనిక

వ్యాసాలు క్లుప్తంగా, విడివిడిగా నాలుగైదు పుటలకుమించకుండా వుండాలి భాష వ్యవహారికమైనా కావచ్చు, గ్రాంధికమైనా కావచ్చు. వచనరచనకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడును. అన్నివ్యాసాలు ఆగస్టునెలాఖరులోగా మాకు చేరాలి. వ్యాసములపై 'దసరాసంచికకు ప్రత్యేకము' అని వుండాలి.

సంపాదకుడు.

# గృహలక్ష్ముల లలితకళాశోభకు

* సౌందర్యమునకు

* సౌజన్యమునకు

సౌభాగ్యమునకు *

సౌశీల్యమునకు *

సామర్థ్య సంతోషములకు

లలితకళాసమన్వితమైన గృహనిర్మాణమునకు

## • గృహలక్ష్మి •

ప్రతిమాసము కొన్నిపుటలు ప్రత్యేకించి కృషిచేస్తుంది

అట్టి లలితకళల సంబంధమైన గద్య పద్య గేయములకు

## ఆహ్వానము






# కళలు-మనధర్మము

శ్రీమతి కె. సుగుణమణిగారు

మే 1939 'గృహలక్ష్మి' సంచికయందు 'కళా కలాపము' అను శీర్షిక క్రింద ప్రకటించిన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిచే రచింపబడిన వ్యాసమును ఆతురతతో చదివితిని. అది పఠించిన వెనుక, నాకు దెలిసిన యీ క్రిందిహంశములను వ్రాయవలెననెడి కుతూహలముతో నట్లు గావించుచుంటిని:

బ్రహ్మశ్రీ చె. వేంకటశాస్త్రిగారు చతుష్షష్టికళలను పేర్కొని వాటిజాబితాలో (తాము కళలని వినియున్న) 'చోరత్వము' యిత్యాది వాటినామధేయము లెందువలననో కానరావని వచించియుండిరి. రఘువంశవ్యాఖ్యానములో చూచినట్లు వాని నేకరువుపెట్టితిననిగూడ తెలియపరచియుండిరి. యదార్థమునకు వారలు అనుకొనినవి 'కళలే'; నేను వాటిపేర్లను వేరుగానేర్పుకొని యుంటిని. నాకుదెలసిన అరువదినాల్గు కళలపేర్లను క్రింద మనవిచేయుచుంటిని.

(1) ఇతిహాసము, (2) ఆగమము, (3) కావ్యాలంకారనాటకములు, (4) గాయకత్వము, (5) కవిత్వము, (6) కామశాస్త్రము, (7) దురోదరము, (8) దేశభాషాలిపిజ్ఞానము, (9) లిపికర్మము, (10) వాచనము, (11) అవధానము, (12) స్వరశాస్త్రము, (13) శాకునము, (14) సాముద్రికము, (15) రత్నశాస్త్రము, (16) రథాశ్వగజకౌశలము, (17) మల్లశాస్త్రము, (18) సూదకర్మము, (19) దోహదము, (20) గంధవాదము, (21) ధాతువాదము, (22) ఖనివాదము, (23) రసవాదము, (24) జలవాదము, (25) అగ్నిస్తంభము, (26) జలస్తంభము, (27) ఖడ్గస్తంభము, (28) వాచస్తంభము, (29) వయస్తంభము, (30) వశ్యము, (31) ఆకర్షణము, (32) మోహనము, (33) విద్వేషణము, (34) ఉచ్చాటనము, (35) మారణము, (36) కాలవంచనము, (37) పరకాయప్రవేశము, (38) పాదుకాసిద్ధి, (39) వాక్సిద్ధి, (40) ఘుటికాసిద్ధి, (41) ఐంద్రజాలికము, (42) అంజనము, (43) దృష్టివంచనము, (44) స్వరవంచనము, (45) మణిసిద్ధి, (46) మంత్రసిద్ధి, (47) ఔషధసిద్ధి, (48) చోరకర్మము, (49) చిత్రకర్మము, (50) లోహకర్మము, (51) అశ్మకర్మము, (52) మృత్కర్మము, (53) దారుకర్మము, (54) వేణుకర్మము, (55) చర్మకర్మము, (56) వస్త్రకర్మము, (57) లావకుక్కుట మేషాదియుద్ధకారక కౌశలము, (58) అదృశ్యకరణము, (59) దూతీకరణము, (60) మృగయావిధి, (61) వాణిజ్యము, (62) పాశుపాల్యము, (63) కృషి, (64) ఆసవకర్మము.

ఈజాబితాలో వారలిచ్చినవి చాలవరకు కలవు. అదిగాక, వారలు సూచించినవిగూడ యిందు కలి యుండుటచేతను, యిప్పటిపాశ్చాత్యులు తామే క్రొత్తగా కనిపెట్టితిమని జెప్పుకొను ప్రపంచశాస్త్రములు (Sciences) గూడ యిందిమిడియుండుటచేతను, మనలో పల్వురెరింగిన సంగీతసాహిత్యాదులు, శిల్పకళ, దారులోహకర్మములు, పాశుపాల్య, వ్యవసాయకృషులన్నియు నిందు జెప్పబడుటచేతను యీ పైజాబితా సరియైయుండునేమోయని తలంచెదను. ఈధైర్యమే నన్నీవ్యాసమును వ్రాయపురికొల్పినది. శ్రీ చె. వేం. శాస్త్రి గారుదెల్పిన 'జూదము', 'దొంగతనములు' యిందు 7, 48 సంఖ్యలకడ గాననయ్యెడిని. 'ముచ్చిపని', 'బంగారుపని', 'చెప్పులుకుట్టుట'లుకూడ కళలలోనికే వచ్చుననియు బల్కియుండిరి. అవియు నిందుగాన వచ్చుచున్నవి. (50,55 మున్నగునవి). 'అవధానము' ఒక ముఖ్యకళగా యుండియుండ (11 చూడుడు) శతావధానులగు బ్రహ్మశ్రీ చె. వేం. శాస్త్రిగారు–"యే కొన్నిటిని (కళలను)గూర్చియో నాకు కొంచెముగ దెలియునుగాని తక్కినవాటిస్వరూపమే నాకు తెలియదు. ఇది వినయార్థము వ్రాసెడిమాటకాదు; యదార్థము" అని వారలనియుండినమాటలలో నెంతటియదార్థమున్నదో నేనిటం జెప్పనక్కరలేదు! ఈజాబితా శాస్త్రిగారికిని పాఠకలోకమునకును సరియైనదనితోచి, నచ్చినయెడల కృతార్థురాలను.

'కళాప్రపూర్ణ' బిరుదమునుగూర్చికూడ శ్రీ చెళ్లపిళ్లవారు తమచమత్కారమును సూచించియుండిరి. హూణపరిపాలకుల పుణ్యమాయని శుద్ధశ్రోత్రియ 'బ్రాహ్మణులు'గూడ (రావు) 'సాహేబు'లుగా జేయ బడుచున్న యీవిచిత్ర 'సంధికాలము'లో (ఇది వాటినిస్వీకరించి పదేపదే గొప్పగా యీబిరుదములను యుచ్చరించుకొనువారికి గల్గినసంధియో, లేక మహోన్నతదశ ననుభవించిన దేశమునకిప్పుడు ప్రాప్తించిన విషపుసంధియో తెలియరాదుగాని)—శాస్త్రిగారికి ప్రాప్తించిన యీ 'కళాప్రపూర్ణ' బిరుదముమాత్రము మాతృభాషకుచెందినదై, భారతదేశసాంప్రదాయములకు సరిపడియుండి 'కవిఉద్దండ', 'కవితాపితామహ'యన్న పూర్వబిరుదముల బోలియున్నదిగనుక సర్వవిధముల యిది హర్షింపదగినవిషయమేననియు, దైవకృపచే నీసత్కవులు 'సాహేబులు', 'బహదూరులు'గ జేయబడనందుల కింతటితో యెల్లరు ఆనందించవలసియేయున్నదనియు మనవిజేయుచుంటిని.

ఈలలితకళలసందర్భమున సర్వసాధారణముగ జెప్పబడు యీక్రిందివిషయములు కళాప్రపూర్ణులగు శ్రీ చెళ్లపిళ్లవారి కెందువలన దెలియరాలేదో నాకాశ్చర్యముగనే యున్నది. నాకు జ్ఞప్తియున్న ఒకటిరెండు విషయముల నిటదెల్ప నుత్సహించుచుంటిని.

క. "ఒప్పులుగల్గిన మెచ్చుఁడు తప్పులుగల్గిన నెఱింగి తగదిద్దుఁడు త
ప్పొప్పునకుఁ డొప్పుతప్పని చెప్పకుఁడీ కవులుపాస్తి చేసెదమిమ్ముఁ గ."

అనిన నొక సత్కవివచనములిట సవినయముగ మనవిజేసికొని, నీక దెల్పసాహసించుచుంటిని.

* * * *

1. ఒకరాజుయొక్క ఆస్థానకవీశ్వరులలో చతుష్షష్టికళలను గూర్చి, చర్చరాగా నొకమహాకవి—(కాళిదాసేమోనని విన్నట్లుకూడ జ్ఞాపకం.)—'చెప్పులుకుట్టుటకూడ నొకకళయే'నని బల్కెనట. అందుల కారాజు కుపితుడై 'అట్లైన యీకళగూడ నీవునేర్చి స్వయముగ చెప్పుకుట్టి నాకు జూపినగాని' నాయాస్థానమునుండ వీలుపడ దనెనట. తానావిద్య (పని) నదివరకే నేర్చియుంటినని ఆపండితుఁడింటికేగి వలయు

సామగ్రినిదెచ్చి రాజసమక్షమున పాదరక్షలుజేసి చూపెనట. రాజు ఆనిమీదట ఖిన్నుడై క్షమాపణ కోరెననియు—దానికి ప్రాయశ్చిత్తము తనచే కుట్టబడినచెప్పును కొంత రాజుకొరికితినుటయేనని ఆపండితుడుబల్కెననియు; అందుల కాహాకారములు బయలువెడల ఆపండితుఁడు—'మహాపండితునిచే చెప్పులుకుట్టించిన మహారాజు చెప్పుతినిన గౌరవభంగముకాద'నియు, తాను మామిడితాండ్రలో నాపనిజేసి చూపితినినియుబల్కి, కడకు రాజుచే దానిని కరిపించి ఆస్థానప్రజలను 'సర్వకళలు సమానగౌరవార్హములైనవే; యెవరు దేనియందు కృషిసల్పి నైపుణ్యమును ప్రకటించినను నది ప్రశంసింపబడవగ్గ విషయమే; ఐనను కొందరికి కొన్ని తగియుండును గాన శ్రేయస్సునుగోరినపెద్దలు కొన్నివిధుల నిర్ణయించియుండిరి; ఆనియమముల నతిక్రమించి పాటింపకున్నను, అతిగా(యిప్పటి అతిశోచనీయ అసంఖ్యాకజాతిభేదములవలె) దీసికొనినను ముప్పగల్గును," అని హెచ్చరించెననియు జెప్పుదురు:

2. పైకాళిదాసే (ఆస్థానపండితుడనుడు) లలితకళలనామములు రాజునకుదెల్పుచు వాటిలోచేరియున్నది 'చోరత్వమే' యైనను 'జారత్వము'నుగూడ అందుజేర్చి యేకరువుబెట్టెనట! రాజాశ్చర్యపడి 'యీరెండును కూడ నీకు దెలియునా'యనఁ 'ఓ' యని కవి జవాబిచ్చెనట! కవులెంతటికైన దగుదురుగదా! అసాధారణకార్యములజెప్పియైనను, జేసియైనను వాటినిసమర్థించుకొను అసాధారణమగుసామర్థ్యము వారికడఁ గలుగబట్టియే ధాత్రీతలమున (గొందరెందరో రారాజులు నశించినను) కవిరాజులు తమ అవిచ్ఛిన్నసామ్రాజ్యమును సాగించగల్గుట!

ఈరెంటినిగూడ ప్రదర్శించిజూపిననేగాని శిరచ్ఛేదము గావింపబడునని రాజు వానినిబెదరించి 'అపయశోయద్యస్తి కిం మృత్యునా?' యనికూడ వచించెనట. అందులకా మహాకవి 'మృత్యువునుగూర్చి చింతింపనుగాని ('తమ' అని మెల్లగబల్కి) 'అపయశమునకై వగచెద'నని (గంభీరముగ) నర్మగర్భితముగబల్కి కొన్ని నెలలు గడువడిగెనట.

పండితుఁ డెప్పటివలె ఆస్థానమున కేతెంచుటయు, కతిపయ నెలలు గతించుటయు జరిగెనట. ఇంతలో నొకనాడు తమ అవివాహితయగు కూతుకడఁ గర్భిణీచిహ్నములు గాననయ్యెడినని మహారాణిగారు యేకాంతముగ రాజుగారికి విన్నవించిరట. రాజు, పోతుటీగకేని చొరరాని రాణివాసమున నిట్టిది అసంభవమని, ఐనను ఆరహస్యమును పూర్తిగ కనిపెట్టుమని రాణిని బంపెనట. ఆమె రాజసమార్తె అంతఃపురఅంతర్భాగమున నొక భూసారంగమును గనిపెట్టివచ్చి రాజునకుదెల్పెనట. అంతట రాజు రహస్యముగ నొక యంత్రసాధకుని రప్పించి, దూర్చినతలను ఖండించివైచు బోనువంటి చిన్నయంత్రము నొకదానిని నిర్మింపజేసి యాబిలద్వారమున కానరాకుండునట్లు దాని నమర్పించెనట.

మర్నాడు, ఆశ్చర్యము! ఆస్థానపండితునితల బోనులో చిక్కియుండెను. రాజీదృశ్యమును స్వయముగ తిలకించెను. ఇంట తనయ తలవంచి అంతయు నొప్పుకొనెను; గర్భధారణయు వాస్తవమాయెను. రాజు కర్తవ్యవిమూఢుడై జూచుచుండెను. కాగలకార్యముల నిదివరకె యెఱిగియున్నను రాజసమార్తె తానేగి యాపండితు నొకగదినుండి తోడ్కొనివచ్చెను. అప్పటికే సగము చచ్చినట్లున్న రాజునకిక శిరము కంపింపదొడగెను. 'రాజా! నాశిరస్సెట్లున్నది?' అని పండితుడు ప్రశ్నించెను. 'నీ' యా లేక 'నా'యా యని రాజు సంశయాకులములలో కొట్లాడుచుండెనట! 'ఆశిరస్సు మృణ్మయము. వర్ణములు, లేపములతో

నట్లు జేయబడినది. అట్టివానిని నిర్మించుటయు నొకకళయే'యని పండితుడుబల్క రాజునవుబట్టిన వైరికళ కొంత తొలగెనట. 'అపయశో యద్యస్తి కిం మృత్యునా'? యను మాట మరల అప్రయత్నముగ రాజునోట నుండి జారెను; కథ యెదురుతిరిగినది! ఇంక జేయునదిలేక రాజూరకుండెననియు, ఆపండితుడు చతుష్షష్టికళలను, చతుర్దశవిద్యలను దెల్పి, వీటికన్నిటికి ఆధారభూతములగు 'చతుష్షష్టితంత్రములు'గూడ గలవని వాటినిగూడ దెలియబల్కి, రాజప్రశంసనుబడసి, రాజతనయను పరిణయమాడి సుఖముగనుండెనని జెప్పుదురు.

ఆ 64 తంత్రముల పేర్లు :

(1) అవ్యాజపాలినీ తంత్రము, (2) రాజ్యలక్ష్మీప్రసాదక తంత్రము, (3) సర్వసామ్రాజ్య తంత్రము, (4) అంగారగమన తంత్రము, (5) రాజ్యోపాంగతంత్రము, (6) శ్రీబాలరాజ తంత్రము, (7) చామర ద్వంద్వతంత్రము, (8) ప్రహర్ష రాజతంత్రము, (9) ధీరతంత్రము, (10) గ్రామపాలనతంత్రము, (11) మిత్ర లక్ష్మీప్రయోగతంత్రము, (12) దుర్గపాలనతంత్రము, (13) ప్రాణలక్ష్మీప్రయోగతంత్రము, (14) ప్రభాలక్ష్మీ ప్రయోగతంత్రము, (15) తోయలక్ష్మీ ప్రయోగతంత్రము, (16) గంధలక్ష్మీ ప్రయోగతంత్రము, (17) పుష్ప లక్ష్మీ ప్రయోగతంత్రము, (18) కామరూపతంత్రము, (19) కలాజీవనికా తంత్రము, (20) కుంజరాంబర తంత్రము, (21) కనకప్రయోగ తంత్రము, (22) బోధినీతంత్రము, (23) సత్యలక్ష్మీ ప్రయోగతంత్రము, (24) పాదుకాతంత్రము, (25) ప్రజ్ఞాలక్ష్మీ ప్రయోగతంత్రము, (26) ఖేటకతంత్రము, (27) చాపతంత్రము, (28) లేపతంత్రము, (29) శల్యతంత్రము, (30) భీమలక్ష్మీ ప్రయోగతంత్రము, (31) మణిస్థానప్రయోగ తంత్రము, (32) పాతాళగమనతంత్రము, (33) మర్దినీతంత్రము, (34) స్ఫులింగలక్ష్మీ తంత్రము, (35) శంఖ మర్దళతంత్రము, (36) చక్రాయుధ ప్రయోగతంత్రము, (37) భైరవాది ప్రయోగతంత్రము, (38) నూప తంత్రము, (39) లేఖతంత్రము, (40) పృథివీతంత్రము, (41) అశ్వతంత్రము, (42) గజతంత్రము, (43) గోరక్ష తంత్రము, (44) ఐశ్వర్యలక్ష్మీతంత్రము, (45) ఉల్కాతంత్రము, (46) మిశ్రలక్ష్మీప్రయోగతంత్రము, (47) జీవనతంత్రము, (48) గిరితంత్రము, (49) వనతంత్రము, (50) స్థానాపత్యప్రయోగతంత్రము, (51) శ్రీ సర్వదండినీతంత్రము, (52) విఘ్నవిచ్ఛేదతంత్రము, (53) భరతతంత్రము, (54) శృంగవాద్యప్రయోగ తంత్రము, (55) నరవాహనతంత్రము, (56) స్తంభినీతంత్రము, (57) దాహినీతంత్రము, (58) మారిణీ తంత్రము. (59) ద్వేషిణీతంత్రము, (60) ఆకర్షణతంత్రము, (61) ఉచ్చాటనతంత్రము, (62) తోషిణీ తంత్రము, (63) మృతసంజీవినీతంత్రము, (64) హారమేఖలికాతంత్రము.

14 విద్యలను*గూడ నిటం దెల్పుట సమంజసము—

(1) ఋగ్వేదము, (2) యజుర్వేదము, (3) సామవేదము, (4) అధర్వవేదము, (5) శిక్ష, (6) వ్యాకరణము, (7) ఛందము, (8) నిరుక్తము, (9) జ్యోతిషము, (10) కల్పము, (11) మీమాంసా శాస్త్రము, (12) న్యాయశాస్త్రము, (13) పురాణము, (14) ధర్మశాస్త్రము.

* శ్రీనాధకవి విద్యలు 18గా వర్ణించి కవిచమత్కారమును "నలుండు 9 విద్యల నొకచెవిని మరి 9 రెండవచెవిని గ్రహించి 'అష్టాదశవిద్యల'కు ఆటపట్టాయే"నని జెప్పెను (చెవి ఆకృతి 9 అంకెమాదిరిని వుండుటనుబట్టి కేవలము చమత్కృతికై యిట్లు జెప్పియుండెనని దలంప నక్కరలేదు) పై 14 విద్యలకు— (15) ఆయుర్వేదము, (16) ధనుర్వేదము, (17) నీతిశాస్త్రము, (18) అర్థశాస్త్రము గూడ జేర్చినచో 18 విద్యలని జెప్పవచ్చును.

వాస్తవమే; జ్ఞానులు, పూజ్యులూనగు శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు నుడివినట్లు కళలపేరులైనను తెలియని కాలము వచ్చినది. పాశ్చాత్యవిద్యావిధానములు, శాస్త్రములు, వేషభాషలు మన యువతీయువకుల నాకర్షించుచున్నవి. దేశౌన్నత్యమును, దేశీయవిద్యలను, కళలను మరపింపజేయుచున్నదియు నీ వ్యామోహమే. వాస్తవముగ కళలకు దేశజాతి నియమములు లేవు. అవి యొకరిసొత్తుగాదు. అయినను నాగరికత తమతోడనే పుట్టినదని, అంతకు పూర్వమెల్లరు అజ్ఞానులై తిరుగాడుచుండిరని పాశ్చాత్యుల నమ్మకము! గొప్ప శాస్త్రములన్నియు తమవలననే బుట్టినవని ప్రకటించు పాశ్చాత్యులును, వాటిని అభ్యసించి సర్వజ్ఞులమనుకొని తిరుగాడు భారతీయులును పై 14 విద్యలు, 64 కళలు, 64 తంత్రములుగాంచి, మన పెద్దలకును మనకును గల వ్యత్యాసమును దలంచి—"తెలివి యొకింతలేనియెడ తృప్తులమై......"అన్న సుభాషిత పద్యమును నెమరు వేయవలసియున్నది.

భారదేశమందలి లలితకళలు, శిల్పచిహ్నములు, విద్యలు, శాస్త్రములు, స్త్రీ ప్రవర్తనము గాంచిన కొందరు పాశ్చాత్యులే తమ అభిప్రాయములను మార్చుకొని చాటి చెప్పిరి. వైద్యశాస్త్రము తాము కనిపెట్టినదే నని బుక్కు పాశ్చాత్యునకు ప్రాచ్య ఆయుర్వేదసూత్రములు దెలియవచ్చిన వెనుక కొంత సందేహము, మన్ననభావము గల్గినవి. రసాయనికశాస్త్రము, లోహశాస్త్రము మున్నగునవి తమదేశముననే జన్మించినవని వచించు శాస్త్రవేత్తలకు—అనేక సంస్కృతగ్రంథములు పరిశోధించి 'రసజలనిధి' యను అమూల్యగ్రంథమును రచించిన ఒక బెంగాలీ (హోమియోపతి డాక్టరు) బుధదేవు ముఖర్జీగారు మనపూర్వులు క్రీస్తుకు వేనకువేల సంవత్సరములకు పూర్వమే యీ విద్యలందు పరిపూర్ణులై యుండిరని రుజువుపరచిరి. శ్రీరాముడు గొప్పరసాయనశాస్త్రవేత్తగూడనట! దండకారణ్యవాసులగు ఋషులవలన నీ విద్య బడసెనట. శ్రీరాముడు తయారుచేసెనని జెప్పబడు సీతవిగ్రహమును తాను పరిశుద్ధపరచిన కనకముతోడనే జేసెనట. ఉత్తరహిందూస్థానమునగల కుతుబ్ మినార్ వుక్కుస్తంభమును పరిశోధించిన ఒక ఆంగ్లశాస్త్రజ్ఞుడు డిల్లపడి, యింతటి అపూర్వమగు శుద్ధఉక్కు యింతవరకు తమ కర్మాగారములలో చేయవీలుగాలేదని వ్రాసెనట! అందులకే యీ స్తంభము వందలకొలది సంవత్సరములైనను చెక్కుచెదరక దేశకీర్తిని చాటు స్తూపమువలె నలరారుచున్నది. దీనిని అప్పటి భారతీయులెట్లు కరగించిపోసి నెలకొల్పినదియు యిప్పటికిని దురూహ్యమే. శ్రీ ప్రఫుల్లచంద్ర రే గారు హిందూరసాయనశాస్త్ర పుట్టుపూర్వోత్తరములు సింహావలోకనము గావించి ఒక అపూర్వ విమర్శనను అచ్చొత్తించి పాశ్చాత్యశాస్త్రవేత్తల ప్రగల్భములకు కొంత యడంచిరి. ఎల్లోరా, అజంతాగుహలందును, తదితరప్రదేశములందును గాననగు శిల్పకళాచిహ్నములు పూర్వపుకళౌన్నత్యస్థితిని వేనోళ్ల జాటుచునే యున్నవి. ఇందు పెక్కురాళ్లు ఐరోపామ్యూజియములకు జేర్పబడి 'యివి మానవనిర్మితములై యుండునా!' యని ప్రశంసల నందినవి.

పైన కొంచెముగ నుదాహరించితిని. చెప్పునదేమన, సుభాషితవాక్యములు దలంచి, చింతించి, చేతకానివారమైతిమని యెంతమాత్రము నిరాశజెందనక్కరలేదని. వ్యామోహమును పోదన్ని, వివేకమును చేబూని, లోటుపాట్ల నెప్పుడు గుర్తించుకొంటిమో అప్పుడే కండ్లుతెరచి—సగము విజయులమై అభివృద్ధిమార్గమున బడితిమన్నమాట. పూజ్య గాంధిజీ వార్ధా విద్యాప్రణాళికవలన దేశీయవిద్యలను పునరుద్ధరించుటకు పునాదివేయ

బడినది. లలితకళలయెడ, దేశమున మరల ఆదరణ, ప్రోత్సాహము గానవచ్చుచున్నవి. స్త్రీ జనాభ్యుదయము నకై సర్వదా పాటుపడు శ్రీ కేసరిగారు, లలితకళలను పోషించుచు, 'ఆంధ్రకళామందిరము'ను స్థాపించి కృషిసల్ప నుత్సహించుటయు (ఏప్రల్ 'గృహలక్ష్మి' 109-వ పేజీలో) స్త్రీలపాలిట భాగ్యలక్ష్మియైన తమ 'గృహలక్ష్మి' పత్రికయందు 'కళాకలాపము' అను నొక శీర్షికతో లలితకళాభ్యుదయమునకై కృషిసల్పుటయు చూడ లలితకళాభివృద్ధికీ ప్రయత్నములు యితోధికముగ దోహదమొసంగగలవనుట సంతసింపదగిన విషయము. అదియును గాక, కళాపోషకులగు మహాశయు లిప్పటికిని దేశమున అందందు యెందరో లేకపోలేదు. భారతదేశపు నాగరికత, వేదాంతము, విద్యలు, సర్వదేశీయులకు మార్గదర్శకములు కాగల తరుణము—మనమనుకొనిన దానికంటె శీఘ్రముగ—అరుదెంచినది. లెండు ! ఆంధ్ర బాలబాలిక, యువతీయువక, గృహిణీ గృహమేధులారా ! లెండు ! జాతీయౌన్నత్యమును సమగ్రముగ నుద్ధరింప కంకణము దాల్చుడు. మీమీ విధ్యుక్తధర్మముల నిర్వర్తింప నిదియే తరుణము. ఈ అపూర్వతరుణమున ఆంధ్రప్రతిభ తిరిగి ప్రబలినగాక !

లలితకళలకును, రాజకీయములకును నిట్లు ముడి పెట్టుటేలనని కొందరనవచ్చును. దీనికి జవాబు శ్రీమతి పాణకా కనకమ్మగారిదివరకే (ఏప్రల్ గృహలక్ష్మి 93-వ పేజీలో) దెల్పియుండిరి. మాతృదేవత యొక్క క్రింద సేవకురాలై పడియుండ, ఆమె సంతానమునకు—తమతల్లి శృంఖలముల తెగనరకుట ప్రథమకర్తవ్యము గదా ! సేవకవృత్తి వదల్చుకొనిన వెనుకగదా గౌరవజీవనమునకు, స్వేచ్ఛాభివృద్ధికి మార్గము లేర్పడుట ? దానిని గుర్తించియే వివిధకళలలో నేర్పరులైనను మన జాతీయవీరులు, వీరరమణులు దీనికై పూనుకొనుట. (లేనియెడల డాక్టరు పట్టాభిగారు డాక్టరులై యుండియే అందు ప్రజాసేవసేయవచ్చునని తలంచియుందురు. నెహ్రూగారు లేగొప్ప గ్రంథకర్తలో నైయుందురు. పటేలుగారు ప్లీడరులై యుండియే ప్రజాసేవ కుద్యమించియుందురు. శ్రీమతి సరోజినీదేవిగారు ఆంగ్లపద్యముల వ్రాయుటయం దఖండ ప్రజ్ఞావంతులై, కవయిత్రులై, అందే నిమగ్నలై యుందురు. వీరలందరు—దేశ శృంఖలముల విదలించుట జాతీయవిద్యల అభివృద్ధికి, దేశాభివృద్ధికిని ప్రప్రథమమని గుర్తించియే గద !)

యుద్ధముకూడ నొకకళయే. అందును మనము చేయబోవునది ధర్మయుద్ధము, సత్యయుద్ధము. అహింసాపూర్వకయుద్ధమై యుండ యీ కళయందుగూడ కృషిసల్పుటకు మనమేల వెనుదీయవలెను ? లెండు ! సంసిద్ధులుకండు ! ! 'దేశగర్వము దీప్తిజెందగ, దేశచరితము తేజరిల్లగ' నన్నట్లు దీక్షతో సంగ్రామరంగమున కురికి, ధీరులమై, దిగ్విజయులమై, ధన్యులమై, కృతార్థతనందెదముగాక !

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగ నున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప కోరుచున్నాము.

సంపాదకుడు.

# నిజసుతుడే!

శ్రీమతి సా. విజయలక్ష్మిగారు

o

రివ్వున వీధిలోనుండి పరుగెత్తుకొని గదిలోకి వచ్చింది సరళ. పండ్రెండు వసంతముల బాలిక ఆమె... పెదవులలో ఎల్లప్పుడూ చిందులుత్రొక్కే చిరునవ్వు... మాటలలో పెంకెతనము...రోజాబుగ్గల్లో స్నోపరిమళము...చెవులకు నాజూకైన లోలకులు. శాంతాఆప్టె పాటలు నాలుక చివరనుంటాయి—ఎల్ల వేళలా.

గదిలో ఉయ్యాల ఊపుతూ, ఏడుస్తూన్న పిల్లడిని నిద్రపుచ్చుటకు జోలపాట పాడుతూంది శకుంతల. పిల్లడు నిద్రపోయేడు. పెద్దనవ్వుతో సరళ అక్కదగ్గరకువచ్చి... 'అక్కా అక్కా...బావ!' అన్నది. 'కేకవెయ్యకే, పిల్లడు లేచిపోతాడు' అని శకుంతల చెల్లెలి కేళింతలకు కొంచెము కోపము అభినయించి—లోన పట్టరాని సంతోషముతో—గదిలో నిలువుటద్దము కెదురుగ నిలచి మేనును గోళ్లకొనల కురులు సవరించుకొని...చక్కగా తిలకము దిద్దుకొని...పూనానుండి అన్న తెచ్చిన కొత్తచీరను ధరించి.. తన ప్రతిబింబితమైన సుందరమూర్తికి తానే మురిసిపోయి ..ముసిముసి నవ్వులతో... గుమ్మందగ్గిర తళుక్కుమని మెరిసింది. కొంతవరకూ చూచి ..ఏలనో మనస్సు చిన్నబుచ్చుకొని... చెల్లెలిని రహస్యముగ దగ్గరకు పిలచింది.

'ఔనే సరళా! నీకెప్పుడూ పెంకెతనమేనా...నిన్నుచూస్తే నాకెంత సంతోషమో యీవాళ అంత కోపం వస్తూంది!'

'ఏమే అక్కా! నేనేం చేసేనే?'

'ఇందాక నువ్వన్నమాటల్లోని సత్యం నాకవుబడలేదే!'

'సత్యం! ఔను సత్యం!' పక్కున నవ్వింది. శకుంతల పొరపాటున ఆమాట అనినందుకు...మరల చెల్లెలి కేళింతలకు అవకాశమిచ్చినందుకు విచారించింది.

'సత్యం ఔపడబోతూంటే ఎందుకంత తొందర?' అమాయకం నటిస్తూ, 'నేనే మన్నానమ్మా! 'బావ' అన్నాను. అంతేకాని సత్యంబావ వచ్చేడని నేననలేదు...నువ్వలాగ అర్థంచేసుకొని సినీమాస్టార్‌లాగ తయారవుతావని నాకేం తెలును!' అని మరింత అక్క మనస్సుకు నొప్పికలుగజేసి—సహజమైన పెంకెనవ్వుతో రివ్వున పారిపోయింది.

'అదుగో నాన్నగారు వస్తున్నారు...ఆయన్నడిగితే నిజంతెలుస్తుంది' అని శకుంతల వీధిలోనుండి, చేతిలో కవరుత్తరం పట్టుకొనివస్తూన్న నాన్నగారికొరకై ఆందోళనతో ఎదురుచూస్తూంది. ఉత్తరంలోని ముఖ్యమైన విషయం ఆయనవస్తూనే చెప్పినారు. అల్లుడు సత్యనారాయణగారు (చిన్నపేరు సత్యం) బారసాల చేసుకొనుటకు రాత్రి బండీలోవస్తున్నారని. ఇంట్లో అందరికీ ఆరోజున పండగే! శకుంతల సంతోషమునకు మేరయేలేదు...కాని సరళ ఎందుచేతనో విచారంగాఉంది. బావవచ్చి బారసాల అయిన పిదప అక్కను ఆమె ముద్దుల కుమారుని తీసుకొనిపోవునని ఆమెభయం. సంతోషము కంటె ఆమె ఆందోళన ఎక్కువైంది. రాత్రి బావ వచ్చేసరికి...యింట్లో అందరి యానందమునకు, ఉత్సాహమునకు మేరయేలేదు. కాని గదిలో సరళ ఒంటరిగ తన వెచ్చని కన్నీళ్లతో పరుపును ఎంతసేపటివరకు తడిపివేసిందో ఎవరికి తెలుసు ?

తెల్లవారింది. అప్పుడే నిద్రలేచిన పిల్లడిని ఎత్తుకొని శకుంతల గది గుమ్మంలో నిలబడింది—ఫోటోకి పోజు యిస్తూన్నట్టుగా. సరళ నిదానంగా అక్కవైపుచూసి... యింటిలోనికివెళ్లి, సగము తెరచియున్న 'గృహలక్ష్మి' చేతితోపట్టుకవచ్చి ..'అక్కా యీ పేజీచూడు!...ఇటుచూడు ...ఎంత ముద్దులుకారుతున్నాడే—యీ బొమ్మలోని పిల్లడు !'

'చూసేదేమిటే? 'లోధ్ర' ఎడ్వర్టయిజుమెంటు బొమ్మ' అని శకుంతల బొమ్మలో తల్లిచేతుల్లోనున్న పిల్లడి ముఖముచూచి ..తనచేతుల్లోనున్న అబ్బాయి లేతగులాబి బుగ్గలపై ముద్దులువర్షం కురిపించింది.

'అదికాదే అక్కా! నువ్వలాగ... చిట్టితండ్రిని... చేతుల్లోఎత్తుకొని నిలబడితే... నాకీబొమ్మజ్ఞాపకంవచ్చి...ముఖ్యంగా యిప్పటి నీపోజు...యింట్లోనున్న 'గృహలక్ష్మి' తెచ్చి నిన్ను యీబొమ్మను సరిపోల్చిచూసేను. అంతే' ఇంట్లోకి ఒకటే పరుగు.

సరళ వెళ్లిపోయిన తర్వాత శకుంతల 'గృహలక్ష్మి' తెరచి ఆపుస్తకములోని బొమ్మను తదేకధ్యానముగ చూచి...ఏవేవో జ్ఞావకంతెచ్చుకొంది...తన పూర్వగాథ... అన్నిటినీ మురిపించే అబ్బాయి ముఖముచూచి ముద్దులు ముద్రించింది.

అల్లుడు సత్యనారాయణగారికి ముప్ఫయి సంవత్సరములకు లోపువయస్సు. స్ఫురద్రూపి. గొప్ప ఆశయములుకలవాడు. సంగీతముకన్న భావప్రకటనే ప్రధానమనియు, భావము ప్రకటించేవరకే సంగీతము నాటకములలో ఉపయోగించవలెననియు వాదించే నరసింహారావుగారి లెక్చర్లకు యీయన ప్రతిధ్వనిస్తాడు.

ఆరోజున బారసాల అయినపిదప సాయంకాలము శకుంతల తనఫిడేలు తీసుకొని వచ్చి, సహజమైన గాత్ర మాధుర్యమునకు, సంగీతమునకుతోడు—భర్తగారి ఆశయముల ననుసరించి, కోకిలకంఠముతో—భావపరిపోషణకు ప్రాధాన్యమిచ్చి...పిల్లడి ఉయ్యాల మంచము ప్రక్కనే కూర్చుని ..పాట ఆరంభించింది.

'ఇహపరములకును గతియగు...సంతతిమె జగమునన్...నిజసుతుడే!' ఇంతట్లోనే తెరపడింది. నాటకంలో సీనుకాదు. మబ్బు తెర. ప్రపంచభానుడు తెరమరుగైనాడు. శకుంతల పాట పాడుతూండగా—చల్లనిగాలులు కోకిల ధ్వనులతో కలిసి నాట్యంచేసేయి. సగంపాట పాడేసరికి సత్యనారాయణగారు అందుకొని.

'మందమంద మారుత మానందకరముకాదే!' అని పాడేడు గంభీరమైన కంఠ స్వరముతో. మందముగా వీచే చల్లని గాలులతో కలిసి వాకట్లోనున్న పూబాదరిండ్లలోని కుసుమ సంచయములు వాసనలు వెదజల్లేయి. సమయముచూచుకొని సరళ ..'సుందర సుమ సౌరభమామోద మొసగు కాదే!' అని సారంగ రాగం సన్నని గొంతుతో ఆలాపన చేసింది. యింతలో శకుంతల అబ్బాయిని చేతుల్లోకి తీసుకొని.

'అదరెడి యధరము జూచిన...కదలెడి ముంగురులెంచిన...' అని యేమేమో పాడి పరవశత్వంలో పిల్లడిని ఎన్నిసార్లు ముద్దిడిందో ఆమెకే తెలియదు.

## ఆంధ్ర ప్రబోధము

ఆరయ నాంధ్రదేశ నిధియై తగునిస్తులత స్వతంత్ర తా
భూరి ఖరాసి జారిపడిపోయెను; దాస్యపిశాచ ఘోర దం
ష్ట్రారుచు లీమెడం బ్రబలసాగినవెల్లెడ; ఆంధ్రసోదరుల్
నేరిమి కూరిమింబరపి, నిర్మలకీర్తి గడింపుడీతఱిన్!
జంకుం గొంకుదొఱంగి యాంధ్రజనముల్ స్వాతంత్ర్యతాజన్య ని
శ్శంకాహంకృతి దాస్యపీడనము నాశంబొనటుల్ సేయఁగా
ఢంకాపై తొలిదెబ్బదీసి, తెనుఁగుం ఢాకన్ బ్రచారింప, మీ
వంకంజేరదె రాష్ట్రలక్ష్మి బహుళైశ్వర్యంబు పెంపొందగన్!
జాతింగాంచియు భావనుం దలఁచి, నైసర్గస్థితిన్ జూచియున్
ఖ్యాతింగన్గొని, కోట్లసంఖ్య జన సంఘాతంబులక్షించి, ప్ర
ఖ్యాతంబొనదులెంచి యార్థికసమస్యల్ బెల్లు యోజించియున్
స్వాతంత్రంబిడు నాంధ్రరాష్ట్రమును వే సాధింపుమో ఆంధ్రుడా!

—శ్రీ వారణాసి వెంకటేశ్వరులు.

## ● దేశభక్తి ●

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

గీ. మొగలు రాచఱికంపుదండి మగల కఱకుకత్తులందలి నెఱమానికంపు గెంపు
దిగువనీడల భారతదేశ లక్ష్మి శిరమువాలిచి ప్రొద్దుపుచ్చిన దినాలు.

యవనపట్టుప్రతాప విలయానలదీర్ఘ శిఖాచయమ్ము శా
త్రవబల దర్పరోచులఁ బరాజయధూమములందు ముంప హైం
దవజన గౌరవమ్ము పరతంత్రత కౌదలయీయరాదు; ఆ
హవమున గత్తిపోటులె సుభావహమన్నది యామె యొక్కతే.

అనిఁ గత్తివట్టినిల్చిన దండి మగలకు నూత్న దీక్షాశక్తి నూరిపోసి
జాతీయతానల జ్వాలహైందవ వీర రక్తనాళమ్ముల రవులుకొలిపి
తనప్రతాపాన లోద్ధత శుభారుణరేఖ దేశమాతకు రత్న దీపమెత్తి
స్వాతంత్ర్య సమరనిష్ఠల మాతృభూమికి ప్రాణాశుగమ్ము లుపాయనమిడి

జీవనధరమ్ము స్వచ్ఛంద భావవీధి ద్రిప్పుకొనుచుండి కీర్తిపొందినది గోండు
రాణి, దుర్గావతీదేవి రక్తినామె పేరు భారతహృదయాల మారుమ్రోయు.

కరిహయబృందముల్ సమసి, కాల్బలమెల్ల నశించె యోధు లె
ల్లరు హతులై, ప్రియాత్మజు డిలంబడియున్మది ధైర్యలక్ష్మి నే
బురిగొని జాతిగౌరవ విభూతికి భంగమురాకయుండ మో
హరమున నొంటియైనిలిచె నాయమ దెంతటి దేశభక్తియో.

అంగనయైననేమి! హృదయంబుగభీర స్వతంత్రభావ నా
రంగము; దేశగౌరవమె ప్రాణముమాకని జాటిచెప్పి పో
యెంగద, నట్టికాంత యుదయించిన భారతమాత గర్భ మె
న్నంగ మహాపవిత్రము; జనంబులునన్నిట నామె బిడ్డలే.

ఆహవభూమి, ఖడ్గమున కాహితరక్తమరంద బిందు సం
దోహము విందుచేసికొని దుర్గమరాజ్ఞి పవిత్రమూర్తియై
దేహమువాసె నాస్థలమదే యిపుడున్నది బూర్వవైభవం
బూహకుదెచ్చి జూడ్కుల కయోయనిపించును బుణ్యభూమియై.

ఈ మహారాణి రణభేరులేమొ యచటి జాతిగుట్టలు; ఆమె పరాక్రమంబు
జాటుకొనుచుండు నిప్పు డచ్చోటరాత్రి శ్రుతి పుటమ్ములబడు మహాద్భుతరవమ్ము'

# స్నేహబంధము

శ్రీమతి పంతం అమ్మాజీగారు

ం

నిర్మల మాధుర్యమయమైన స్నేహము నిర్మలామాధురిల నిరువురిని గాఢంగా బంధించివైచింది. ఆ స్నేహబంధంలోని మధువును గ్రోలుతూ వారొండురు లేకమైపోయారు...

కాని...దురపేక్షగల రమేశ బాబుచేష్ట, దానివల్ల అతడు పొందిన ప్రతిఫలం—మృత్యువు—కూడా వారి స్నేహాన్ని ఛిద్రము చేయలేకపోయింది; కాని తత్కాలికపు ఎడబాటును మాత్రము కలిగించింది...

మాధురి తన తండ్రిలోకం లె నిర్మలలోనే వినిర్మల ప్రేమనిధిని కనుగొన్నది. తత్కాలికంగా విడబడ్డ స్నేహబంధం తిరిగి బిగుసుకుంది. ఈ స్నేహబంధం లోని పటుత్వాన్ని తెగకోయడానికి ఆ అసాధారణసంఘటనకు కూడా పదును లేకపోయింది...

సాయంకాల మయిదు గంటలయినది. భాసుడు పశ్చిమదిశ జేరుచున్నాడు. నానాదిక్కులనుండి పక్షులు తమగూళ్ళను జేరి, తాము దెచ్చిన యాహారమును దమ పిల్లల నోటిలో బెట్టుచు, పగలంతయు దమ్మెడబాసి చింతించుచున్న యీ చిన్న పక్షులను ఓదార్చుచున్నవో యన కూయసాగెను.

చల్లని పిల్లతెమ్మెరలు నలుదిశల వీచుచున్నవి. ప్రకృతిఅంతయు ప్రశాంత భావమును దాల్చియున్నది. చావిడియందునే కూర్చుని ప్రకృతి నవలోకించుచుంటిని. అంతలో గేటు తెరచినట్లు శబ్దమైనది. నిదానించి చూచునంతలో 'నిర్మలుందాండీ!' అన్నది ఆ వచ్చినామె. ఆమె నాకపరచిత. వూదాసిల్కుచీర, పార్శీకట్టు కళ్ళకు జోడు ధరించినది. పాతికేండ్లుండవచ్చా మెకు ఆమె యాకృతి బహుచక్కనిది. ఆమెచేతిలో లెదర్ బాగ్ వున్నది. నడుచుచు వరండా మెట్లు సమీపించినది. ఆమె నాహ్వానించితిని. బాగ్ ప్రక్కనబెట్టి సోఫాలో ఆశీనయగుచు "క్షమించండీ" అన్నది. 'ఫరవా లేదు. ఎక్కడనుంచి వచ్చినారు?...ఎందుకు?'

"ఆమె నేను చిన్నప్పటి నుండి, స్నేహితులము. ఆమెను చూచి రెండుసంవత్సరములు కావచ్చుచున్నది. నగర్ నుంచి వచ్చితిని ఆమెను చూడవలెనను యభిలాషగలుగుటచే. ఏమి జేయుచున్నది? బయటకు వెళ్లినదా" అన్నది ఆమె ఒక్కగుక్కలో—

"ఆమె ఇప్పుడే రాగలదు. లోపలికిరండి; విశ్రాంతి పొందవచ్చును" అని లోపలికి తీసుకొని వెళ్లి తిని. హాలులో ఒకపెద్దదీపము వెలుగుచున్నది. హాలుదాటి ప్రక్కగదిలోనికి ప్రవేశబెట్టి, ఆమెకు భోజనవసతుల కేర్పాటుచేయుటకు లోపలికి వెళ్లితిని.

నేను గదిలో ప్రవేశించుసరికి ఆమె స్నానముచేసి దుస్తులు మార్చుకొన్నది. వైట్ సిల్కుచీర, బాడీస్ తొడుక్కున్నది. మెడలో ఒక పెద్దగొలుసు మాత్రమువున్నది. ఆమె అద్దమున కెదురుగా నిలువబడి బర్మాసిగ చుట్టుకొనుచున్నప్పుడు అద్దములో ఆమెవదన ప్రతిబింబము దీపకాంతికి మెరసినది. ఏమి యీ రామణీయకము ? ఆమె వెనుకకు తిరిగిచూచినది. నన్ను "నిర్మలేది సోదరీ!" అని ప్రశ్నించినది చిరునవ్వుతో.

"ఇప్పుడే వచ్చును. భోజనము జేయుదమా" అని అడిగితిని.

"ఊఁ" అన్నది...

'సోదరీ' అని సంభోధించిన దామె నన్ను; ఆమె వచ్చి ఎంతోసేపు కాలేదు. అయినప్పటికి మా ఇరువురికి మంచిస్నేహ మలవడినది. మే మిరువురము చాలా రాత్రివరకు ఆ మాటలు, ఈ మాటలు ప్రసంగించుకొంటిమి. ఆమె మధ్యమధ్య నిర్మలనుగురించి అడుగుచునే యుండెను. నే నామెకు వలయు సమాధాన మిచ్చుచునే యుంటిని.

అమె మరల అడిగినది! "నిర్మలకొరకీ మాధురిహృదయము ఎంతో త త్తరపడుచున్నది" అని.

ఆమె అట్లు అనుటలోనే నా హృదయము చలించినది. ఏమి ఈమె మాధురియా! ఈమెయే గదా నిర్మల ప్రాణమిత్రురాలు! ఈమెయేనా మాధురి? అయ్యో, ఈమె పేరు నే నింతవరకు తెలుసుకొనియుండ లేదు, ఆమెయును జెప్పియుండలేదు. నిర్మల మాధురిలిరువురు ప్రాణస్నేహితులు. అయిన నేమి? ఆ స్నేహము ఒకానొక కారణముచే విచ్ఛిన్నమయినదే! అయితే మరి ఇప్పు డెందుకొరకు వచ్చినదీమె? అన్న సమస్య నన్ను కలచివైచినది. ఆ వెంటనే నిర్మల జెప్పిన సంఘటనమంతయు స్ఫురణకు వచ్చినది. అప్పుడు నిర్మల ఇట్లు జెప్పినది :

"సోదరీ! మేము గ్రామమువిడచి నగర ప్రవేశించిన కొలదిరోజులకే ఒకకంపెనీలో నా తండ్రికి ఉద్యోగము లభించినది. మేము ఉన్నబంగళా ఆ కంపెనీ మానేజరు రమేశబాబు భవనము ప్రక్కనే ఉన్నది. అప్పటిలో రమేశబాబుకుమార్తె మాధురికి నాకు స్నేహము కలసినది. మాధురి నా వలెనే బాల్యముననే మాతృహీన. ఆమెకిద్దరన్నలు; వారు కలకత్తాలో చదువుచుండిరి. తండ్రికి నలభై ఏండ్లుండినను పైకి ముప్పఏండ్లవానివలె యుండెడివాడు. అత డే కారణముననో గాని మరల వివాహమాడలేదు.

మాధురీ నిర్మలలు మనుష్యులము వేరయినా హృదయములు ఒక్కటి. ఒకరినొకరు విడువలేనంత స్నేహమేర్పడినది. ఆ స్నేహము అపూర్వమయినది, అద్వితీయమైనది, అనంతమైనది. అయిన నేమి? మా యొక్క స్నేహము కొన్నికారణములచే భిన్నమయినది. అదొక విషమ సంఘటన. ఆ సంఘటన తలపునకొచ్చినప్పుడు నా శరీరము జలదరించుచుండును. మాధురి తరుచు మా బంగళాకు వచ్చుచుండెడిది. నేనును వారిఇంటికి వెళ్లుచుండెడిదానను. నే నని మాధురియే గాక రమేశబాబుకూడ గౌరవముగా చూచుచుండెడివాడు. కాని...

ఇట్లుండ అతనిలో కొంతమార్పు గలిగినది. ఆయన అప్పుడప్పుడు నన్ను వింతగా చూచుచుండెడివాడు. అట్టి సమయములలో నాకు భయము యుండెడిది. నే నతనికి ఒంటరిగ కనపడెడిదానను గాను......చివరకు నేను వారిఇంటికి పోవుట గూడ మానితిని. తండ్రి అభిప్రాయము మాధురి కనిపెట్ట గలిగినది. తండ్రివిషయమై తీవ్రముగ ఆలోచించినది. తండ్రిపై పట్టరానికోపము వచ్చుచుండెడిది. కాని పాప మామె ఏమి చేయగలదు?

ఆమెమాత్రము నా దగ్గరకు తరచు వచ్చుచుండెడిది. మేమిరువురము ఒకరినొకరు విడిచి యుండలేకపోయెడి వారము.

కాల మెక్కరీతిగ నుండదుకదా! నా తండ్రి కారోగ్యము తప్పినది. అనేక పరిచర్యలు చేసితిని గాని, ఆయనకు జబ్బు ఎక్కువైపోయినది. పెద్దపెద్ద డాక్టర్లను రప్పించితిమిగాని ఆయనను రక్షిం చుకొనలేకపోతిమి. నా తండ్రి నన్ను దిక్కులేని పక్షినిగా జేసివేసినాడు. తల్లికేగాక తండ్రికికూడా దూర మైతిని. అప్పటిలో మాధురే నా కన్నివిధముల తోడ్పడినది. ఆహా! మాధురివంటి స్త్రీ యీ లోకమందుండునా అనిపించెడిది. దయార్ద్రహృదయ యగు నా మాధురి నెట్లు మరువగలను? నా తండ్రి జబ్బులో నా తండ్రిని చూచుటకు రమేశబాబు వచ్చుచుండెడివాడు. నా తండ్రి పోయినప్పటినుండి బంగాళాలో సేవకుడుండినను ఒంటరిగ పరుండుటకు భయముగ వుండెడిది. అప్పటిలో మాధురి తనదగ్గిర పండుకొనమనియు, తానున్నంత వరకు నా కెటువంటి అపాయము కలగనీయననియు అభయమిచ్చినది. అప్పటినుండి ఆమెదగ్గరనే యుండినను నన్ను భీతి వదలలేదు.

ఇట్లుండ ఎప్పటివలె పై యంతస్తుయందు పండుకొనియుంటిమి. క్రింది మొదటియంతస్తులో రమేశ బాబుండును. సేవకవర్గము ఎవరిస్థానములలో వారు పరుండిరి. మాధురియు నేనును చాలరాత్రివరకు మాటలు చెప్పుకొనుచునే యుంటిమి. ఇక మా కవి తుదిపల్కులు గాబోలు? ఆ తరువాత నిద్రాదేవత మమ్ముల నాహ్వా నించినది. ఆ తరువాత నే నెంతసేపు నిద్రపోతినో నాకు తెలియదు. నే నకస్మాత్తుగ మేలుకొని కళ్లుతెరచి చూచితిని. కలయో నిజమో యెరుగలేక తిరిగి చూచితిని. అది కలగాదు, నిజమే. ఘోరము, ఘోరము. నే నెవనికై నిమిష నిమిషమునకు భయంకపితనై పోవుచుంటినో అట్టి దుర్మార్గుడు, రమేశబాబు నా యెదుట నున్నాడు. నే నున్నది వానియంతస్తు, వానిగది. నా కప్పుడు కలిగిన భయసంభ్రమములు, తొట్రుపాటు, ఆవేదన, ఎవరు వర్ణింపగలరు? పరమేశ్వరుడు దిక్కగునా? నా పాలిట సాక్షాత్కరించునా? వాని యుద్దేశ మేమన నన్నాతడు మరునాడుదయము ఎనిమిదిగంటలకు రహస్యముగా వివాహమాడునట! అందులకు వలయు ప్రయత్నమిప్పుడే చేయుననియు, ఈ విషయము నా నెచ్చెలియగు మాధురికిగాని సేవకులకుగాని తెలియదనియు, మాధురి నా కెట్టి సహాయము చేయలేదనియు, ఈ విషయమై మాధురి కెంతమాత్రము తెలియపర్చనీయడనియు తెలుసుకొంటిని. ఇక నేనేమి చేయగలను? అప్పటిలో నా మానసం బెట్లుండెనో నాకు తెలియదు. ఎంతగా ఏడ్చితినో, వానిని ఎన్నివిధముల బ్రతిమాలితినో ఎంత దీనత్వముగ వేడుకొంటినో! రాళ్ళు వర్షధారలచే ఆరు గును, కఠినహృదయము కన్నీళ్లచే కరుగునా? ఇక వానినుండి తప్పించుకొనుట అసంభవమని తెలుసుకొంటిని. ఇక నా జీవిత మధోగతిపాలగును...

ఆ పాషండుని దౌర్జన్యము తలంచుకొనినకొలది వందల కొలది తేళ్లు ఒక్కమారు కుట్టినట్లుండి నా అగాద మస్తకము భగ్గున మండిపోవుచున్నది. ఇప్పటికిని వానిని వీడుటకు ఒకటేదారి కాన్పించినది. నా చీరలో గుప్త పరుచుకొన్న 'పిస్టల్'ఏ నాకుగతి. అయినప్పటికిని వానిని పేల్చుట ద్రోహముకాదా అని అంతరాత్మ వెనుకకు లాగినది. కాని నా బ్రతుకేమిగాను, వానిని పేల్చకుండయుండవలెననిన నా ప్రాణముపై ఆశవదలితిని. ఈ విషమస్థితివల్ల నా మనస్సు కలవరపడినది. ఇక గత్యంతరములేదు. నా 'పిస్టల్'తో వానిని కాల్చితిని.

ఇక వానిగదినుండి ఈవలకు వచ్చితిని. అంతస్తునందు ఎవ్వరును లేరు. అంతయు నిశ్శబ్దముగ నున్నది. పైయంతస్తులో గడియారము రెండుగంటలు కొట్టినది. నా అంతర్యముమాత్ర మనేకబాధలతో కొట్టుకొనుచున్నది. నా నెచ్చెలికి తీరనికష్టము తెచ్చిపెట్టితిని. తండ్రికొర కెంతగా దుఃఖించునో! నేను మాధురి గదిలో ప్రవేశించితిని. అప్పటికి నా హృదయము పూర్తిగ చెదరిపోవుచుండెను. నేనేమి చేయుచుంటినో నాకేమియు తెలియుటలేదు. నేను గదిలోనికి ప్రవేశించునప్పటికి మాధురి మెలకువగా వున్నదని మాత్రము తెలిసుకొంటిని. ఆ తరువాత ఏమయినదో ఎరుగను. నేను తిరిగి తేరుకొనునప్పటికి మాధురి ఒడిలో వుంటినని తెలిసుకొంటిని. ఇక తెల్లవారినది, భవనమంతా మారుమ్రోగినది రమేశబాబు మరణవార్త. మాధురికి స్పృహ లేదు. నే నామె తేరుకొనువరకు పరిచర్యలు చేసితిని. ఇక నా నెచ్చెలిముఖము ఎట్లు చూడగలను? ఆమెతో ఏమని మాట్లాడగలను? ఇక నేను అక్కడ ఉండలేకపోతిని. నే నిక్కడకు వచ్చుట కదే కారణము! ప్రియతమమైన మాధురిని విడిచివచ్చినందున నే నెంతగా ఏడ్చుచుంటినో నాకే ఎరుక. తండ్రిచావు విషయమై గ్రాహ్యపరుచుకొనియే యుండును. ఇతరులకు తెలియుట కెట్టి యవకాశమును లేదు. మాధురియొక్క ప్రేమ, ఔదార్యము శ్లాఘనీయమైనది. అటువంటి మాధురిని నేను చూడగలనా? మా మిత్రత్వమున కీ విధముగ ఎడబాటు కలిగినది' అని చెప్పినది. నిర్మల తనమిత్రురాలు కొర కమితముగ దుఃఖించుచుండెడిది...

నేను నా యోచనా పరంపరనుండి తేరుకొంటిని. హాలులోని గడియారము ఠంగ్ ఠంగ్ మని పన్నెండుకొట్టినది. సుధాకరుని దివ్యవినీలకాంతులు కిటికీలగుండ లోనున్న సోఫాలమీద పడుచుండెను. అంతట నిశ్శబ్దముగ నున్నది. పిల్లనగ్రోవిమాత్రము ఎవ్వరో అతి శ్రావ్యముగా వాయించుచుండిరి. ఆ గానామృతము వీనులకు విందొనరించుచున్నది. వాయిద్య నైపుణ్య మద్భుతముగ ప్రదర్శించుచుండిరి. పిల్లనగ్రోవి వాయిద్యము మనస్సున కానందము నిచ్చుచున్నదికాని...మాధురికి అది ఆనందముగ లేదు. ఆమె చలనరహితముగా ఉన్నది. మాధురి దీర్ఘాలోచన ఆమె నేత్రములలో ప్రతిఫలించుచుండెను. ఆమె 'సోదరీ' అని పిలిచినది. నే నామె వంక చూచితిని. ఆమె ఇట్లనెను. "సోదరీ! ప్రపంచములో అనేకమంది ప్రాణస్నేహితులమని చెప్పుకొందురు గాని, కేవలము వారందరు ఆత్మస్నేహితులుగారనే నేను గట్టిగ చెప్పగలను. నిర్మలకు నాకు గల స్నేహమపారము. మా ఇరువురికి గాఢమైన మైత్రిగలదు, కాని మా మైత్రికి ఎడబాటు కలిగినది. నన్ను నిర్మల విడచినదాది నాలో ఒకభాగము విడిపోయినట్లుగ విలపించితిని. అంతయు శూన్యముగా కన్పించినది. మరియొక ఆశక్తి, ధోరణియు లేదు. మా శాశ్వతప్రేమ మరచిపోవుటకు అలవికానిది...

ఆమెకనులనుండి బాష్పములు రాలుచుండెను. అప్పుడే ఎక్కడనుండియో ఊడిపడినట్లు నిర్మల వచ్చినది. మాధురీ నిర్మలలు ఒక్కసారిగా పులకితులైరి. నిర్మల నిలువునా పడిపోయినది మాధురి ఒడియందు. మాధురి నిర్మలను తీసికొన్నది. ఒకరిలో ఒకరు లీనమై ఇహమును మరచిరి...





# విజ్ఞాన పరిచయం



'వసంత'

పాశ్చాత్య విజ్ఞానాన్ని కైవశంచేసుకొని ఆ దృష్టితో మనహిందూ సిద్ధాంతసాగరాన్ని మథించినకొద్దీ సిద్ధాంతాల ప్రాముఖ్యత, మహోత్కృష్టత బయల్పడుతుంది. కొన్ని విశిష్ట సిద్ధాంతాల యాదార్థ్యం గ్రహింపలేకున్నామంటే తగిన సూక్ష్మదృష్టి నేటికివి మనకు లభ్యం కాలేదనే చెప్పుకోవాలి కాని, శాస్త్రాలలోపం అనుట మహాసాహసం అని తోస్తుంది.



'విజ్ఞాన విశేషాలు!-ఎల్లప్పుడూ అవేకాకపోతే మరి దేన్నిగురించి అయినా వ్రాయ కూడదండీ?'

'ఆ!'

'మాకు బోధపడేడట్లు మరేమైనా వ్రాదురూ!'

'మీకు 'విజ్ఞానం' అక్కరలేదు; 'అజ్ఞానం'లో పడిఉంటారన్నమాట. అంతేనా?'

'మాకు 'విజ్ఞానం' వద్దు, 'అజ్ఞానం' వద్దు; మాకేదో జ్ఞానంకలిగేటట్లు మరే చక్కని విషయం మీదనైనా నాలుగుముక్కలు వ్రాస్తే బాగుంటుందని నామతం'.

'జ్ఞానం' కావాలి, 'విజ్ఞానం' వద్దు; చమత్కారంగా సమర్థించపోయేవు కాని కాలు జారింది'

'అజ్ఞానం'లోనున్న మేము 'జ్ఞానం' సంపాదిస్తేగదా 'విజ్ఞానం'దాకా పరుగెత్త డానికి? మాకు చదువడానికి ఆసక్తి జనించేటట్లు, సులభంగా బోధపడేటట్లు మీరు వ్యాసాలువ్రాస్తేనే విద్యయొక్క సాఫల్యంగాని, కొఱకడానికి వీలులేకుండా ఉంటే మాకేం లాభమండీ?'

'బాగుందికాని కొంచెం పొరబడ్డావు. ఈ 'విజ్ఞానం' అంటే 'విశేషమైన జ్ఞానం', 'విపరీతమైనజ్ఞానం' కాదు. ఆభ్రమలోపడి నీవు అజ్ఞానానికి, విజ్ఞానానికి మెట్లు కట్టేవు కాని, ఇది విశ్వాన్నిగురించి, ప్రకృతినిగురించి, మనకు తెలిసినజ్ఞానం. ఈ విజ్ఞానం ప్రతిజీవి కొద్దో, గొప్పో తెలిసికొనవలసి ఉన్నది'.

'అయితే జనసామాన్యానికి బోధపడే పుస్తకాలు ఇతర విషయాలమీదనున్నట్లు, ఇందులో లేవేమండీ?'

'మనభాషలో, మనదేశంలో తక్కువకాని, ఇతర భాషలలో, విదేశాలలో కొల్లలుగా పుస్తకాలున్నాయి. విజ్ఞానసారాన్ని హృదయస్థంచేసికొన్న మహామహులు స్త్రీలకు, బాలురకుసైతం సుబోధంగా ఉండేటట్లు వ్రాసిన పుస్తకాలు ఎన్నెన్నో ఉన్నాయి. తెనుగులో ఈమధ్యనే శ్రీకొండయ్యగారు 'విశ్వరూపం' అనే ఉద్గ్రంథం ఒకటి రచించేరు. అది సాక్షాత్తు విశ్వరూపమే. అసలు, ఆంధ్రంలో విజ్ఞానాన్ని ప్రచారంచేయడానికి ఇప్పుడిప్పుడు ప్రబల ప్రయత్నాలు జరుగుతున్నాయి. దిన పత్రికలు, వార పత్రికలు, మాస పత్రికలు ఏకగ్రీవంగా విజ్ఞానవిషయాలకు ఒక సుస్థానం ఇస్తున్నాయి'

'ఏమో, నేనంతగా చూడడంలేదు సుమండీ. అసలు, ఆవిషయం మాకు బోధపడదనే అభిప్రాయంతో ఆ వ్యాసాలు నేను తిరగవేయడంకూడా మానేశాను'

'అది నీ తప్పుకాదులే. ఈ దురభిప్రాయం నిన్నేకాదు, సామాన్య స్త్రీలోకాన్నేకాదు, కొంతమంది విద్యాధికులను కూడా ఆవరించి విజ్ఞానమంటే వారిని విముఖులను చేస్తూంది. కాని, అట్టి వ్యాసాలు ఒకసారి చదివేరంటే వాటిమీద ఆసక్తికలుగుతుంది. ఏమంటే, మనం నిత్యజీవనంలోచేసే ప్రతిస్వల్పమైన కార్యంలోను విజ్ఞానముంది. అది మనం గ్రహిస్తే ఆయాకార్యాలు విశేష శ్రద్ధతోచేయుటకు కుతూహలం జనిస్తుంది. అంతేకాదు, విశ్వరహస్యాలు తెలిసికొనుటవలన మనకు కొంతసహనం అలవడుతుంది. మమకారం తగ్గుతుంది'

'మీారెప్పుడూ ఇలాగే అంటారు. విజ్ఞానంమీాద మీాకుగల అభిమానం ఆవిధంగా అనిపిస్తుందేమో అనుకొంటాను. కోపగించకండి, కాని, విశ్వరహస్యాలకు సహనానికి మమకారానికి సంబంధమేమిటండీ ?'

'నిజంగా తెలిసికోడానికా, లేక ఊరికే వాగించడానికా ఈప్రశ్న ?'

'నాకూ ఎంతో కుతూహలంగా ఉంటూందండీ. కాని, అలాఅడిగితే మీారు కోపగిస్తారేమో అని భయంచేత ఈ ప్రస్తావన ఇన్నాళ్లనుండి వస్తూన్నా ధైర్యంగా ఎప్పుడూ మిమ్ము ప్రశ్నించలేదు'

'యదార్థం గ్రహిద్దామనే సదుద్దేశంతో కోరితే నాకు సంతోషమే; తప్పకుండా బోధపరుస్తాను. పెంకెతనానికి అడిగితేమాత్రం జవాబు వికారంగానే ఉంటుంది. సరే: భూమిలో బహుళంగా జీవరాసులున్నాయి. చర్విత చర్వణంగా జన్మించడం, పెరగడం, మరణించడం కన్న అవిచేసే ఘనకార్యమేమిలేదు. వాటి అన్నిటిలో మానవుడే—స్త్రీ పురుషులు—చావు పుట్టుకలకన్న అధికంగా ప్రపంచంతో, సంఘంతో, దేశంతో, జోక్యం

కలుగజేసికొంటున్నాడు. జీవికి విశిష్ట ఆశయాలుకలవని కనుగొన్నాడు. ఋజువర్తనానికి, నైతికాభ్యుదయానికి, సంఘపురోభివృద్ధికి నియమాలు ఏర్పాటుచేసేడు. జీవించినన్నాళ్లు గల ప్రాపంచిక సంబంధమేకాక మరణానంతరం జీవి ఆకాశంలో విహారంచేసి, ప్రాకృత కర్మానుగుణ్యంగా పునర్జన్మ పొందుతుందని, పునర్జన్మసిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఇహపరాలను ఒకేవిధంగా సాధించమని హెచ్చరించేడు'

'సైన్సు చదువుకున్న మీరుకూడా పునర్జన్మ ఉన్నదని నమ్ముతారండీ?'

'సైన్సు చదువుకోబట్టే కేవలం మూఢబుద్ధితోగాక హృదయపూర్వకంగా పునర్జన్మ సిద్ధాంతాన్ని ఆమోదించడానికి అవకాశం కలుగుచున్నదని నా దృఢనమ్మకము. మన జీవితాలు నక్షత్రగ్రహ ప్రాబల్యవశమై ఉన్నాయనునది నిర్వివాదాంశము. ఈవిశ్వంలో ఎంతెంత దూరంగానున్న నక్షత్రసమూహాన్ని గతులుతప్పకుండా నడిపేశక్తి ఏదిఉన్నదో, ఆశక్తియే మన జీవితాలను నక్షత్ర ప్రాబల్యానికి లోనగునట్లు చేసింది.

అనుక్షణం వేలకొలది జీవులు భూలోకంలో జన్మిస్తున్నారు. అట్టివారిలో, ఏక ముహూర్తమందు ఇద్దరు మనుష్యులు జన్మించేరనుకొందాం. వారిపై ప్రబలుచున్న నక్షత్ర గ్రహముల శక్తులు ఒకేవిధంగా ఉండకతప్పదు. అయితే, వారి జీవితాలు సమానాంతరంగా ఎట్టి భేదంలేకుండా నడవవలసి ఉన్నది. కాని, ప్రపంచంలో ఏయిద్దరి జీవితాలలో కాని, ఆకారాలలో కాని, మానసిక ప్రవృత్తులలోకాని సంపూర్ణ సారూప్యం గోచరించుట లేదు. వారి జీవితాలలో ఏర్పడిన వ్యత్యాసానికి కారణమేమిటంటే, పూర్వజన్మ కర్మల చేతనే ఆవైలక్షణ్యం కలిగినదను సమాధానం తప్ప వేరొకటిలేదు'.

'అయితే మనప్రాచీన సిద్ధాంతాలు నిజంగా గొప్పవా?'

'ఆప్రశ్న భారతీయ నారీమణి వేయవలసినదికాదు. కాని, మన విద్యావిధానం, పాశ్చాత్యవ్యామోహం మనకు ఆకర్మం కలిగిస్తున్నాయి. మిడిమిడి జ్ఞానంగలవారే ఎందుకు పొందక అధోగతి పాలౌతున్నారుకాని, పాశ్చాత్య విజ్ఞానాన్ని కైవశంచేసుకొని ఆ దృష్టితో మనహిందూ సిద్ధాంతసాగరాన్ని మథించినకొద్దీ సిద్ధాంతాల ప్రాముఖ్యత, మహోత్కృష్టత బయల్పడుతూంది. కొన్ని విశిష్ట సిద్ధాంతాల యాదార్థ్యం గ్రహింపలేకున్నామంటే తగిన సూక్ష్మదృష్టి నేటికిని మనకు లభ్యంకాలేదనే చెప్పుకోవాలి కాని, శాస్త్రాలలోపం అనుట మహాసాహసం అనితోస్తూంది. ఈవిధంగా మనప్రాచీన ఔన్నత్యాన్నిపునఃగ్రహించే మార్గం చూపిన ఆధునిక విజ్ఞానం మనకత్యంత మహోపకారి అని ఎరుగుట మన బాధ్యత.

పైగా ఈ అనంతవిశ్వంలో మన భూమికేవిధమైన గౌరవస్థానంలేదని ఘంటా పదంగా వచిస్తూన్న ఆధునిక విజ్ఞానం, విశ్వాన్ని ఏవిధంగా చిత్రిస్తూందో చూడు. ఆకాశంలో మెరుస్తూన్న నక్షత్రాలన్నీ మండుచున్న పెద్దపెద్ద అగ్నిగోళాలు. అవి, ఒక దాని కొకటి కోటానకోట్ల మైళ్లదూరంగా ఉన్నాయి. వాటి మధ్యనున్న అంతరాళం శూన్యాకాశము. అట్టి నక్షత్రమే మన సూర్యుడు. పూర్వమొకప్పుడు సూర్యగోళంనుండి విడివడ్డాయి కొన్ని చిన్నలాగాలు. అవే భూమి, బుధుడు, శుక్రుడు మొదలైన గ్రహాలు. ఈగ్రహాలు సూర్యునిచుట్టు నిత్యప్రదక్షిణాలు చేస్తున్నవి. ఇట్లుండగా, కొన్నాళ్లకు భూమిపై జీవం ఉద్భవించింది. అందులో, తరువాత మానవుడు జన్మించేడు. సౌర కుటుంబమండలి ఇతర బుధాది గ్రహాలలో దేనియందును మనమెరిగిన జీవంవంటి జీవం కనిపించదు. అట్టి సూచనలేలేవు. నక్షత్రాలలో ఇట్టిజీవం ఉండడానికే అవకాశంలేదు. ప్రమాదవశాత్తు అందు జీవంకలిగినా ఆ మహోగ్రతాపానికి భస్మంకాక తప్పదు.

ఈ అనంత ప్రదేశంలో ఒకనలుసుకన్న మనభూమి క్షుద్రం అని, మానవుని 70 ఏండ్ల ప్రాయము విశ్వకాలంలో ఒకక్షణంకన్న హీనమని వైజ్ఞానికుల అభిప్రాయం.

ఇక, జీవియొక్క పూర్వచరిత్రగాని, ఉత్తర చరిత్రగాని మనమెరుగము. ఎందుకో, ఎట్లో మాతృగర్భంద్వారా జీవి భూమిమీదపడతాడు. జీవితకాలం కాస్త గడచిపోగానే శరీరాన్ని భూదేవికర్పించి అస్తమిస్తాడు. ఈకాలచక్రంలో రైలుబండివలె రైలుప్రయాణం చేస్తూన్న కాలంలో అరిషడ్వర్గాలకు దాసుడై, మమతాహంకారాలకు చేతులుమోడ్చి, వివశుడై జీవితం వ్యర్థంచేసికొంటున్నాడు.

జీవిత చరిత్రమంతా రైలుబండిలోనే సూక్ష్మంగా గోచరిస్తుంది. సత్‌హృదయులు కొందరు రైలులోనైనా వారిపని వారు చూచుకొంటూ ఒకమూల కూర్చుంటారు. ఒక గంటలో దిగిపోయేదానికి ఆర్భాటం ఎందుకన్న సద్భావంతో తోడిప్రయాణికులకు కష్టం కలిగించకుండా వారిదారివారు చూచుకొంటారు. మరికొందరు, ఈస్వల్పకాలంలోనే వారి హక్కులు, స్వాతంత్ర్యం ప్రకటిస్తూ కయ్యానికి కాలుదువ్వుతారు. ఇంకా కొందరు, అంతతో ఆగక శిఖపట్లకు, ముష్టియుద్ధానికి సిద్ధమాతారు.

జీవితమనే ఈ అసిరస్థానంలో మనమాట మనం దక్కించుకొనుట ప్రధానము. దానికై, సాధ్యమైనంతవరకు పరోపకారబుద్ధితో, అహింసాతత్వంతో, న్యాయమార్గానుగమనంతో ప్రవర్తించాలి. పూర్వోత్తరచరిత్రలు తెలియని ఈ క్షణికజీవితానికి గమ్యస్థానమేది అని ప్రశ్నించుకొంటే, నిర్మలహృదయంతో నిశ్చలంగా భగవధ్యానంకన్న వేరొకటి లేదని స్ఫురిస్తుంది. సంగ్రహంగా ఇదే జీవిత తత్వం.

మూఢ విశ్వాసానికి తావులేని ఈకాలంలో సహేతుకంగా ఆధునిక విజ్ఞానపద్ధతులలో ఒక మహోత్కృష్ట జీవతత్వం నిర్మించినా మనహిందూ తత్వాని కేవచ్చేము. అనంత కాలాకాలలోనున్న భూమిని విశ్వచిత్రమందు యధాస్థానంలో చిత్రించి, తృణప్రాయమైన భూమిపై క్షణికజీవితం గడుపు జీవిని సాత్వికప్రవృత్తికి హెచ్చరిస్తే, తన అత్యంత అల్పత్వం గ్రహించి, విశ్వచిత్రానికి ఆశ్చర్యచకితుడై, విశ్వరూప సందర్శనానంతరము అర్జునివలె స్వీయధర్మం నిర్వహించడానికి సందేహంలేదు. ఈవిధంగా మనకు కొంత అహంకారం నశించి, సహనం అలవడుతుందంటే అసత్యమా? ఆశ్చర్యమా?'

'కేరు, కేరు' మన్నాడు పిల్లవాడు. ఊరకే గుక్క విడువకుండా ఏడుస్తున్నాడు. మాసంభాషణతో ముగ్ధురాలైన గృహలక్ష్మి పిల్లడి ఏడ్పుకూడా చెవినిపడనట్టి తన్మయావస్థనుండి తెప్పిఱిల్లి పిల్లవాని ప్రక్కమీాదకు వెళ్లి:

'బాబుని సముదాయించివస్తానండీ. మీాసైన్సులంటే ఇంత మనోజ్ఞంగా, ఆకర్షకంగా ఉంటుందని కలలోనైనా అనుకోలేదండీ: ఇలాంటి గొప్పగొప్ప విషయాలు చదువుకొన్నవారు ఎంత అదృష్టవంతులో!' అంటూ లాలిపాట ప్రారంభించింది. మహోన్నత భావాలతో, నూతనోత్సాహంతో హృదయం వెల్లివిరిసిందికాబోలు, సహజమంజులమైన కంఠస్వరంలో నవీనమాధుర్యం ఉత్పన్నమైనది. ఆ అమృత గానరసాస్వాదనంతో జాగ్రదవస్థను త్యజించి, నాహృదయం దేశకాలాలను అతిక్రమించిన లీలావిహారానికి పయనమైనది.—

## ఆమె నేర్పునకది పరీక్షాలయంబు!

ఘనతరధర్మార్థ కామమోక్ష ప్రాప్తి కగు సాధనము గృహస్థాశ్రమంబు
శ్రితజనాశేష సంసేవితదివ్యపాద పరాజమది గృహస్థాశ్రమంబు
సత్యవ్రతాచార సంపత్ప్రదర్శన స్థలమైనయది గృహస్థాశ్రమంబు
గురుమిత్ర బాంధవ పరిజనాదరణైక సంశోభితము గృహస్థాశ్రమంబు

అతిథి పూజావిశేష భాగ్య ప్రదంబు
ధర్మ కార్యాలయము గృహస్థాశ్రమంబు
ఏతదాశ్రమమున కధినేత గృహిణి
ఆమె నేర్పునకది పరీక్షాలయంబు.

—శ్రీ వంకాయలపాటి శేషావతారము.

# స్త్రీ విద్యకీనాడు శుల్కమొచ్చె!

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

[ స్త్రీలకు ఉచితముగా విద్యగరపవలెనను స్వర్గీయ శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి ఆశయమునకు ప్రోత్సాహమునిచ్చుచు, రాజమహేంద్రవరమున శ్రీవారి పేరనున్న శ్రీ వీరేశలింగోన్నత పాఠశాలయందు స్త్రీలకు ఇంతదనుక జీతములు లేకయే విద్యనొసంగుచు, ఆర్థికపరిస్థితు లనుకూలముగ లేవను కారణమున అందు చదువు స్త్రీలు కూడ జీతములివ్వవలెనని ఏర్పరచినందున, తమ అసమ్మతిని దెల్పుచు, ఉదారులగువారి సహాయమునర్థించుచు, రాజమహేంద్రవరమున జరిగిన బహిరంగసభలో జదువబడిన పద్యములు ]

ఐకమత్యములేక హైందవసామ్రాజ్య మాంగ్లేయుల పరంబగుటవలన
జాతీయవిద్యలు నీతిశీలంబులు స్వాతంత్ర్యబుద్ధులు సమసిపోవ
దేశీయవిజ్ఞాన దీప్తిపూర్తిగలేక పురుషులార్జనహీన పూర్ణులైరి
అందున స్త్రీలోక మతిహీనమునబడ కాంతలకష్టముల్ కడకుమిగిలె
పసిబాలపెండ్లిండ్లు బాలవైధవ్యంబు చాలగానెచ్చెను యెయ్యె సంఘమందు
అతివలవిజ్ఞాన మతిశయిల్లగనీక ఆత్మగౌరవమెల్ల అణగజేసి

నట్టిసమయానపుట్టిన జట్టివీవు సంఘలోపాలుచర్చించ సాహసించి
ఆర్తిరోగంబు నరియించి అమృతతేజమిచ్చు 'చింతామణీ'పత్రికిచ్చిబోధి
స్త్రీలపాలిట సుజ్ఞానచెలియలైన 'నీతిదీపిక' గ్రంథముల్ ప్రీతినొసగి
బాలవైధవ్యనిర్బంధ బాధలడప పరగశరణాలయంబొసగి పాటుబడిన
ఘనుడ! వీరేశలింగ శ్రీకవివరేణ్య ఈవు లేనట్టివెలితి మా కిపుడు తెలిసె!

నీవు నిర్మించిపోషించి నిలిపినట్టి స్త్రీలశరణాలయంబు నిస్తేజమయ్యె
ఆదుకొను నుదారాంధ్రులీ అవనిలేర? లేనియెడ నీవె మేల్కొల్పి లేపుమయ్య!
స్త్రీల కున్నతవిద్యయా చాలదనుచు తెలిసి యుచితంబుగానేర్ప వెలసినట్టి
నీదుపేరను కీర్తిగా నిలపినట్టి స్కూలులో స్త్రీలకీనాడు శుల్కమొచ్చె
బీదబానిసదేశంబు సోదరులకె విద్యకర్థంబులేకను వ్యర్థులవగ
అర్థహక్కులులేని నిరర్థస్త్రీలు ఎటులజీతంబులిచ్చుటో ఎరుగరాదు
నీదుసంస్థలుపోషించ నిలచినట్టి ఘనులజీవాత్మలంజేరి కర్తవగుచు
పూర్వప్రతిభ నునిల్పుమో పూతచరిత!

దేశము సంఘము నీగృహము దీనదశన్ పడియున్నవేళనా
వేశముతోడ పోరమది వీసమువంకక యత్నకార్య సం
దేశమొసంగి ధర్మసతి దీక్షగమీకు సహాయమాచు మీ
ఆశయముల్ ఫలించునటు లాశ్రితకాంతల నుద్ధరించె వీ
రేశ కవీంద్రచంద్ర! యరరే! చదువాళలువీడె నేటితోన్.




శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

'గృహలక్ష్మి' పత్రికతో చిరపరిచితముగల వ్యాసకర్త్రి.







శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

ఉన్నతాదర్శములకై ఉత్సహించు ఉత్తమగృహిణి.

"గృహలక్ష్మి" 11-వ సం|| 8-వ సంచికలో ప్రచురింపబడిన "గృహము-గృహలక్ష్మి" అను వీరి వ్యాసములో నొక కొన్ని ప్రశస్తభావములు మాత్ర మీ పత్రిక ప్రథమ సంపాదకీయ వ్యాసములో నుదాహరింపబడినవి.




శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయగారు

డెన్మార్కు దేశపు కోపెన్‌హేగన్ పట్టణమున జరుగబోవు అంతర్జాతీయ మహిళాసభకు భారతదేశపు ప్రతినిధిగా బోవుచు మార్గమధ్యమున ఈజిప్టుదేశమందు కొద్దిరోజులు సంచారము చేయుటకై ఆగినారు.

కైరోపట్టణపు లేడీస్‌క్లబ్బువారు ఈమెకు స్వాగత మొసగి పెద్ద అల్పాహారవిందొసగిరి. ఈజిప్షియన్ మిషను టు ఇండియా డిప్యూటీ లీడరుగారగు అబ్దుల్ ఫాత్‌గారుకూడ నాహాపాషా తరపున బ్రహ్మాండమైన స్వాగతమొసగినారు. అబ్దుల్ ఫాత్‌గారితో కలసి ఈజిప్టు పార్లమెంటునుచూచి, స్పీకరును, కొందరు మంత్రులను కలసికొనిరి. ఈజిప్టులో ప్రస్తుతము అబ్దుల్ ఫాత్‌గారి అతిధిగ నున్నారు.

# సినిమాలోకము

జయప్రద:—శ్రీశారదా రాయలసీమాఫిలిమ్స్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడిన 'జయప్రద' పత్రికాప్రతినిధుల యెదుట జూన్ 7 వ తేదీని ప్రదర్శింపబడినది.

ఇందలి కథ పురాణప్రసిద్ధమైనది. పురూరవ చక్రవర్తి పూర్వజన్మ కర్మఫలితముగ ననుభవించిన కష్టపరంపరలను విశదీకరించుచున్నది.

విధివ్రాతచే శనిప్రభావమువలన సంభవించిన రాజ్యభ్రష్టత, దుర్భరదారిద్ర్యము, సతీసుతులతో నెడబాటు, అవయవఖండనముచే గల్గిన అంగవైకల్యము, చక్రవర్తియంతటివాడుకూడ ననుభవింపవలసివచ్చుట హృదయ విదారకమగు విషయమైయున్నది. పేదరికము బాధించునప్పుడు ఆకలిదప్పులచే నల్లాడు సతీసుతులతో అరణ్యమధ్యమున అసహాయుడై సామాన్య మానవునివలె సంతాపమునొందిన చక్రవర్తి దుస్థితిగాంచిన కరుణకలుగక మానదు. కాలము తప్పినవారికి తిప్పలు తప్పవను నీతిని చక్కగ బోధించుచున్న ఈకథలో పాతివ్రత్య ప్రభావము బాగుగ వెల్లడింపబడినది. పురూరవుని భార్య లిద్దరును తమ పతివ్రతామహిమలో నొకరికొకరు తీసిపోవక పతియొక్క జీవితమున కెంతయు ప్రతిభ గల్గించినారు.

అక్కడక్కడ హాస్యరసమును వెల్లివిరియు సందర్భములున్నవి. కాని అవి కథలోని విషాదమయమైన రంగముల మధ్య విశ్రాంతి కల్గించునవిగ గన్పట్టలేదు. ఎందుచేతనో శబ్దగ్రహణము శ్రవణానందకరముగా లేదు. కథ పొడుగైయున్నను పొందిక బాగుగనున్నది.

నృత్యములలో మంచి కళానైపుణ్యము కన్పరుపబడినది. సిద్ధాంతిగారు, ఆయన భార్య బహు చమత్కారముగా నటించినారు. ఇందిర పాత్రకూడ బాగుగానేయున్నది. జయప్రద, పురూరవులలో పాత్రౌచిత్యము కొంత భంగపడినది. పురూరవపాత్రలో చక్రవర్తి కుండవలసిన లక్షణములలో శతాంశమైన ప్రదర్శితముకాలేదు. సంగీతము సందర్భములకు తగియుండలేదు. కథను జయప్రదముగానే కొనవరకు తీసికొనివచ్చుటకు డైరక్టర్లు చాల శ్రమచేసినట్లు విదితమవుచున్నది. పాత్రధారులు సరియైనంత ప్రతిభగలవారుగా సంభవింపనిచో దర్శకుల పరిశ్రమ సఫలత జెందనేరదు. ఏది యెట్లున్నను రాయలసీమవారి ప్రథమ ప్రయత్నఫలితముగ బయల్వెడిన 'జయప్రద'ను ఆంధ్రులెల్లరు ఆదరించి వీరి పరిశ్రమను ప్రోత్సహించవలసియే యున్నది. ఇందులోని లోపములను వీరు ముందు తయారుచేసే చిత్తరువులో సవరించుకొందురని విశ్వసించుచున్నాము.

## సారథివారి 'మాలపిల్ల', వాహినీవారి 'వందేమాతరం', ఈస్టిండియా ఫిలుమ్సువారి 'వరవిక్రయం'

తెలుగుఫిలుమ్సులో యింతవరకు వెలువడినవాటిలో వరవిక్రయంలాంటి సాంఘికచిత్రం రాలేదని నాఅభిప్రాయం. సంఘంలో ప్రత్యేకవ్యక్తులను విమర్శనచేయకుండా, ప్రస్తుతంసంఘంలో నిండి నిబిడీకృతమై యున్న వరకట్నాన్ని నిరోధించటానికి ప్రచారంచేయడంకన్న వేయిరెట్లు అధికమైన ప్రబోధం, ఉద్రేకం ప్రజాహృదయాల్లో కల్గించటానికి కేవలం ఈఫిల్ము నిర్మించినట్లుతోస్తుంది. తెలుగుఫిల్ముల్లోనే కొన్ని ఉన్నాయి. వాటిల్లో కళకు స్థానమిచ్చినట్లు తోచదు. కొంత కథాకల్పన కేవలం కథకు దూరంగా వుండి ధనార్జనకోఅని తయారుచేయబడినఫిల్ముల్లా కనబడతాయి. అందులో మాయాబజారు ఒకటి. కాని ఇటీవలవెలువడిన సారథివారి మాలపిల్ల, వాహినీవారి వందేమాతరం, ఈస్టిండియావారి వరవిక్రయం, ఇప్పటి ప్రాపంచిక నిత్యజీవితాన్ని ఉన్నదున్నట్టుగా తెరమీదికి తెచ్చి ప్రజాచిత్తాన్ని పూర్తిగా మార్చి సంఘసేవకు చేయూత యిస్తున్నాయంటే అందులో సందేహాస్పదం లేదు. ఈమూడుఫిల్ములు ప్రస్తుత సంఘదోషాలని ప్రతిఘటిస్తూ ప్రజాబాహుళ్యానికి ఒకవిధమైననీతిని బోధిస్తున్నాయి. ఇప్పటికి ఎందరి హృదయాలో మార్పుచెందివుండాలి. 'మాలలుమాత్రము మనుజులుకారా' అనేపాటతో హరిజనదేవాలయ ప్రవేశార్హతను, హరిజనసేవను మానవహృదయాల్లో నాటుకునేటట్లు చేసింది మాలపిల్ల. వందేమాతరం, నేడు పెనుభూతంలాగా పీడిస్తూవున్న 'నిరుద్యోగసమస్యను' కల్మషరాహిత్యమైన 'ప్రేమతత్వాన్ని' స్త్రీ పురుష లోకానికి ఉభయత్రా కనులఎదుట ప్రదర్శింపజేసింది. జానకి పడ్డపాట్లు తలుచుకుంటే, నిజంగా నిశ్చలమైన ప్రేమకోసము ఏస్త్రీ ఈకాలంలో కొండంటికంపడుతుంది, ఆలోచించండి. ఇక వరవిక్రయం కేవలం సంఘసేవకోసరం ఏర్పాటుచేయబడిన ఫిల్ము.

అయితే వరవిక్రయంలోని గొప్పతనం ఎందులో వుందంటారు? అంతా గొప్పతనమే. పుల్లయ్యగారి తారల నేరడంలోనేవుంటుంది ఫిల్ముయొక్క గొప్ప అంతా. ఇందుకు నిదర్శనంగా వధువు పాత్రధరించిన కమల, భ్రమరాంబపాత్ర నిర్వహించిన శ్రీరంజని, పేరయ్యపాత్రధరించిన శ్రీరామచంద్రమూర్తి, లింగరాజుపాత్ర నిర్వహించిన శ్రీ లక్ష్మికాంతకవిగారూను. కాళిందిమాత్రం తీసిపోయిందని నేననను. కాని కమలదగ్గరవున్న ఆ చాకచక్యము ఆమాటలపొందు, ఆకళ్లల్లోవున్న అందం; ఇవి కాళిందిలో కనపడవు. అయినా ముగ్ధస్వభావమేమో! భ్రమరాంభపాత్రధరించిన శ్రీరంజని తనపాత్రను చక్కని ఆదర్శమైనయిల్లాలుగా పోషించుకుంది. పురుషోత్తమరావు పాత్రధరించిన దైతా గోపాలంగారు సంఘంలో ఒక ఆదర్శవ్యక్తిలాగ అభినయించారు. ఇక పెండ్లిండ్ల పేరయ్యపడినపాట్లు పురుషోత్తమరావుగారి వరాన్వేషణప్రయత్నాలను తలపుకు తెస్తాయి. కళానిధి లక్ష్మికాంతంగారి పాత్ర నిర్వహణం ఇంతా అంతా అని చెప్పటానికి వీలులేదు. ఇలా ప్రతి వ్యక్తినీతీసికొని గుణాలని ఎన్నడం మొదలుపెడితే దస్తాలు పెరిగిపోతాయి. ఈఫిల్ములో దోషానికి ఎక్కడా స్థానమేలేదు. చలపతిరావుగారు పాడిన 'చెడెధర్మంబు' అనే పద్యభావాన్ని స్ఫురింపచేసింది ఆవు వేలంపాట. ఇది డైరక్టరుగారి నిపుణత. ఇక ఫిల్ములోని గానమాధుర్యం మరువదగ్గదికాదు. పిల్లలు పాడిన 'సంగీతసారమేరా', అనేది రేలంగివారి 'జీవా! మాయాకాయమురా', కమలపాడిన 'ఆపూలమొక్కలు' దీనికి నిదర్శనం.

చిత్రాలు ఎంత ప్రబోధరసపూరితమైనా చూచేప్రజలకు అందలిపాఠం ఆచరణలోకి వచ్చినట్లు తోచదు. 'వరకట్నాలని నిరోధించండి' అని చెపుతుందీ వరవిక్రయం. కాని నిరోధించేదెవరు? సంఘసంస్కర్తలే ఇంట్లో ఆడవాళ్లనువప్పించి ఈదురాచారాన్ని మాన్పించలేకపోతే మరెవరుచెప్పండి? కాళింది నూతిలోపడ్డప్పుడు మనమంతా 'అయ్యో! పాపము' అని స్మశానవైరాగ్యంలో మునుగుతాము ఆకాస్సేపు. హాలు బయటకివచ్చినాక మళ్లీ యధాప్రకారం. ఇలాఅయితే ఎలాచెప్పండి సంఘం బాగుపడేది? మాలపిల్ల లోని 'గొల్లవాడే, నల్లపిల్లవాడే' అనేపాట పాఠకలోకాన్ని ఆకర్షించినంతగా రేలంగివారి 'జీవా! మాయాకాయమురా' అనేతత్వబోధ ఆకర్షించదు. జానకి రఘుమీద చూపించినప్రేమ ఈయుగంలో ఏ స్త్రీ తనభర్తపైన చూపిస్తోందో చెప్పండి. ఫిల్ములో వుండేమంచిని, ప్రబోధాన్ని నీతిని గ్రహించి ఆచరణలో పెడితేనేసంఘం బాగుపడుతుంది. —శ్రీమతి ఎ. సరోజనీదేవి.

## మాడరన్ సినిటోనువారి 'ఉష'

చిత్రం మూడువంతులు పూర్తయింది. బాణాసురుడి దర్బారుకోరకు బ్రహ్మాండమైన సెట్టింగు నిర్మించారు. ఆఘట్టంలో గోపీనాద్ తంగమణిగార్ల భరతనాట్యప్రదర్శనం ఒక ప్రత్యేకత. దర్శకులు గాలి వెంకటేశ్వరరావు, శబ్దగ్రాహకులు కాశీనాధుని ప్రసాద్‌గార్ల కళాపరిజ్ఞానంలో వస్తూన్న యీచిత్రం సంపూర్ణ కళాశోభితమౌతుంది—నీలంరాజు శేషయ్య, పద్మావతి సాలిగ్రాం గార్లు ప్రముఖపాత్రలు నిర్వహిస్తున్నారు.

## సారథివారి 'రైతుబిడ్డ'

చిత్రం పూర్తయి ఎడిటింగులోవుంది. రషెస్ చూచినవారంతా, చిత్రాన్ని అంత చక్కగా తయారుచేసిన రామబ్రహ్మంగారి చాతుర్యాన్ని అనేకవిధాల కొనియాడుతున్నారు. రాబోవు ఎలక్షను రోజుల్లో విడుదలచేస్తారుట దీన్ని.

## రామగోపాల్ టాకీసువారి 'పాశుపతాస్త్రం'

చిత్రం ఎడిటింగు పూర్తయి విడుదలకు సిద్ధంగావుంది. యీ మాసాంతంలో విడుదలౌతుంది.

## లక్ష్మీవారి 'రాధాకృష్ణ'

ఎడిటింగు చాలా చురుగ్గా జరుగుతోంది. త్వరలో ఆంధ్రదేశమంతటా విడుదలౌతుంది.—

## 'ఓడియన్' వారి నూతన గ్రామఫోను రికార్డులు

కుమారి సూర్యకుమారి పాడిన 'ఇలశాశ్వతమా యీదేహం, త్వరపడవే మనసా' అనుతత్వం, 'నవమోహన రంగకృష్ణా, నాపైని దయలేదా' (No. C A 1212) అనుకీర్తనలు, రెండిటిలోను మృదుమధురమైన సంగీతం, భక్తిపారవశ్యమైన భావంతోటి శ్రోతలకు విందుగూరుస్తున్నాయి. వీటితోపాటుగా శ్రీమతి శ్రీరంజని చి॥ జె. కృష్ణమూర్తిగార్లు కలిసిపాడిన 'ఏమంటే పిల్లా' 'పాలు పాలు—పెరుగు పెరుగు' (No. C A 1215.) అను పాటలు పొట్ట చెక్కలుచేసే హాస్యంతోటి చాలా మాధుర్యంగావున్నాయి. ఇలాంటి ఉత్తమరికార్డులను ప్రచురిస్తూన్న ఓడియన్‌వారు అభినందనీయులు.

# భారతీయనారి భవిష్యత్తు

స్వామి వివేకానంద

మనము మనుష్యులమా! తంత్రమనుచున్నది—"కన్యాప్యేవం పాలనీయా, శిక్షనీయాఽతి యత్నతః," పిల్లలకు ముప్పదియేండ్లు మీదపడునంతవఱకు బ్రహ్మచర్యము నవలంబించి విద్యనుబడయునట్లు; స్త్రీలుగూడ. కాని, మనమేమి చేయుచున్నాము? మీరు స్త్రీల ఉన్నతికొఱకు యత్నింపగలరా? అగుచో ఆశయున్నది; లేనిచో పశుజన్మ తొలగదు.

మనదేశపు యథార్థకల్యాణముకొఱకు పవిత్రజీవనలగు బ్రహ్మచారిణుల అగత్యము కలిగినది. వారిని గాంచియు, వారియత్నమువలనను, దేశముయొక్క ఆదర్శము మారిపోవును. ఇప్పుడు పట్టుకొని పెండ్లిచేసిన చాలును, తొమ్మిదేండ్లేకానీ, పదేండ్లేకానీ! ఇప్పుడు దాపురించిన అవస్థ—పదమూడేండ్లపిల్లకు పిల్ల పుట్టిన ఆ కుటుంబమున కెంత ఆనందము, ఆ కోలాహలమేమి! ఈ భావము మారిపోయిన దేశమున క్రమముగ శ్రద్ధయు రాగలదు. బ్రహ్మచర్యమును పాలించినవాటి మాట వేరుగ చెప్పనక్కరలేదు. శ్రద్ధ, ఆత్మవిశ్వాసములింతగ వారికి గల్గునని నోట చెప్పజాలను.

క్రమముగ అంతయు జరుగును. సంఘశాసనాభయమున జంకక తమ కుమార్తెలను అవివాహితలుగ నుంచు విద్యావంతు లింకను దేశమున జన్మింపలేదు. చూడుము—పిల్లకు పదిరెండు, పదమూడేండ్లు నిండియు నిండకమునుపే లోకభయమున, సంఘభయమున పెండ్లిచేసివైచుచున్నారు. మొన్న శాసన మొనర్చువేళ సంఘనాయకులు లక్షలకొలది జనముతోగలసి కేకలుపెట్ట నారంభించినారు, 'మాకు శాసనమక్కరలేదు.'— ఇంకొక దేశమైన, సభచేసి కేకలుపెట్టుట వేరుమాట, సిగ్గుతో తలవంచుకొని ఇంటగూర్చుండి, 'మన సంఘమున నింకను ఇట్టి హీనకళంక మున్నదా?' అని చింతించెడువారు.

వంగదేశమున విద్యాధికులలో తమ పిల్లలకు తొందరగ వివాహ మొనర్చు ఆచారము నశించినది. ఆడపిల్లలకు గూడ ఒకటిరెండేండ్లు మునపటికంటె మీదపడిన పిమ్మటనే వివాహ మొనర్చుచున్నారు. కాని, అది డబ్బు ఇబ్బందివలన. ఎందు నిమిత్తమైనను సరియేకాని, ఇంకొంచెము పెద్దలైన పిమ్మట పెండ్లి చేయుట ఉత్తమము. కాని, నిర్భాగ్యుడగు తండ్రి ఏమిచేయగలడు! పిల్ల కొంచెము ఎదిగిన భార్య మొదలుగాగల ఆత్మీయులందరును, పేటలోని ఆడువారును పిల్లపెండ్లికై గునుపు లారంభింతురు. ఇంక మీ సనాతనుల మాట చెప్పిననేమి లాభము? వారిమాట నెవరును లక్ష్యపెట్టరు, కాని వారి గోలవారిదే. రాజనినాడు 'పదిరెండేండ్ల పిల్లతో నెవ్వరును సహవాస మొనరపరాదు'; వెంటనే సనాతనులు లేచి 'మతము మంటకలసినది' అని కేకలువేయసాగినారు. పదిపన్నెండేండ్లపిల్ల గర్భము తాల్చకపోయిన వారికి ధర్మము నిల్వదు. రాజు తలచును: 'ఆహా! వారిమతము! వారే మరల రాజనైతిక హక్కులను గోరెదరు!'

బాల్యవివాహపు మూలతత్వము నిర్దోషము; కాని, మనమిప్పుడా మూలతత్వమును మఱచినాము. ఏ మూలతత్వమునుండి బాల్యవివాహ-ఆచార ముద్భవించినదో, ఆ తత్వావలంబనమువలననే ప్రకృత సభ్యతే



బొంబాయిలో నిరక్షరాస్యతా నిర్మూలనము

బొంబాయి నిరక్షరాస్యత నిర్మూలనాసంఘమువారి యాజమాన్యమున బొంబాయినగరమున చదువు
రానివారికి విద్యగరుపబడుచున్నది. స్త్రీలుగూడ ఈ విషయమున ప్రత్యేకశ్రద్ధబూని పనిచేయు
చున్నారు. పిన్న పెద్ద తారతమ్యము లేక అందరు కలసి విద్యనేర్చుకొనుట ఇందు కానవగును.



బొంబాయిలో నిరక్షరాస్యతా నిర్మూలనము

నిరక్షరాస్యతను నిర్మూలించుటకై నియోగింపబడిన కొన్ని వందలమంది దేశసేవికలలో నొక యామె విద్య నేర్పుచున్నది. చదువురాని యొక వనిత అక్షరాభ్యాసముచేయుట ఇందు కానగును.

వ్యాపింపగలదు, అన్యథా కాదు. ప్రతి స్త్రీ పురుషునకు ఇతర ఏ నరనారినో పతిపత్నీరూపమున గ్రహించు స్వాతంత్ర్యము నొసంగిన వ్యక్తిగతసుఖము, పశుప్రకృతియొక్క పరితృప్తి సంఘమున నిర్విఘ్నముగ కొనసాగుచుండిన, ఫల మశుభమే యగును—దుష్టులును, అసురప్రకృతులును నగు సంతాన ముద్భవించును. ప్రతిదేశమున మనుష్యులిట్టి దుష్టవర్తనులగని, వారి నణచియుంచుటకు పోలీసులసంఖ్యను బెంచుచున్నారు. ఇయ్యది సంఘవ్యాధికి ప్రతీకారమవలేదు, పైగ సంఘమునుండి ఈదోషములు, ఈపశుప్రకృతుల ఉత్పత్తి కట్టువడునోయను మహాసమస్య తెచినది. నీవు సంఘమున నున్నంతకాలము, నీ వివాహముయొక్క ఫలితమును నేనును తదితరులునుగూడ అనుభవింపవలసియున్నది. అందువలన నీవెట్టితీరుగ వివాహము నొనర్చుకొనవలసియున్నావో, కూడదో, నిర్దేశించు అధికారము సంఘమునకున్నది. భారతీయ బాల్యవివాహాచారమున ఈఉచ్చభావములు, తత్వములు ఇమిడియున్నవి—ఇప్పటికిని జాతకఫలితముల ననుసరించియే వివాహము జరుగుచున్నది. ప్రసంగక్రమమున నేనీవిషయమును జెప్పగోరెదను. కామోద్భవుడగు పుత్రుడార్యుడుకాదని మనువు నుడివినాడు. ఆనిషేకమరణాంతకర్మలు వేదవిధిననుసరించి జరుపబడినవాడే ఆర్యుడు. ఇట్టిఆర్యులిక్కాలమున చాలకొద్దిమందియే జన్మించుచున్నారు. అందువలన కలియుగమున దోషరాశి ఉత్పన్నమగుచున్నది. మనము ప్రాచీనఆదర్శములను మఱచిపోయినాము. మనమిప్పుడీభావములనన్నిటిని కార్యరూపమున బెట్టజాలము. వీటిలో గొన్నిటినిగ్రహించి వికటమొనర్చి పారవైచినాము. ఇప్పుడు పూర్వపు తల్లిదండ్రులు లేరు. మునుపటివలె సంఘము శిక్షితముగాదు, ప్రాచీనసంఘముపై తదంతర్గతులకుండిన ప్రేమ, ఇప్పటివారికి లేదు.

బాల్యవివాహఫలితముగ అకాలమున ప్రసవించి పెక్కుమంది మృత్యుముఖమున బడుచున్నారు, వారి సంతానము దుర్బలులై దేశమున బిచ్చగాండ్రసంఖ్యను పెంపొందజేయుచున్నారు. తల్లిదండ్రులశరీరమున బలశక్తులు లేకున్న, శక్తిమంతులును, ఆరోగ్యవంతులును నగు పిల్లలెట్లు జన్మింపగలరు? చదువుకొని వయను మీరినపిమ్మట వివాహమొనర్చుకొనినవారికి గల్గిన సంతానమువలననే దేశక్షేమము చేకూరును. ఇంటింట ఇంతమంది విధవలుండుటకు గారణ మీబాల్యవివాహమే. బాల్యవివాహములతగ్గించిన, విధవలసంఖ్యగూడ తగ్గువడును.

బాల్యవివాహమన్న నాకు మిక్కుటమగు ఏవగింపు. ఈమహాపాపమువలననే మనజాతి కష్టపడుచున్నది. ఇట్టిపరిస్థితులలో సంపూర్ణముగగాని, అంశికముగగాని నేనీ రాక్షసాచారమును సమర్థించిన నాఆత్మగ్లానికి హద్దుఉండదు. నేను యథాసాధ్యము దీనిని కాలరాతును. నేనెవ్వరిసాయమును గోరను. ఎవరైన భయమునుబొందుచున్న వారు తమ్ము దూరముననుంచుకొని బ్రతుకుదురుగాక! శిశువివాహసంపర్కము నాకు లేదు, ఉండదు, ఉండజాలదు. శిశువులకు వరులనుగూర్చువారిని హత్యచేయగలను. అసలుమాట! నాకు సాయమొనర్చుటకుగాను సాహసులును, నిర్భీతులును, దేనిని లెక్కయొనర్పనివారునునగు మనుష్యులు కావలెను. లభింపనిచో నేనొక్కడనే ఈపని నొనర్తును. నాజీవితమున ఒక విశేషోద్దేశ్యమున్నది. నేనొక్కడనే దానిని సాధించిపోవుదును. ఎవరైనను వచ్చినను, పోయినను నేను లెక్కగొనను.

మహాపాపులు! పదేండ్లపిల్లకు పెండ్లి! ఎనిమిదేండ్లపిల్లకు ముప్పదేండ్లవరునిగూర్చి, తల్లిదండ్రులు మురిసిపోవుచున్నారు. ఆరేండ్లపిల్లయొక్క గర్భాధానమునుగురించి వైజ్ఞానికవ్యాఖ్యానసల్పి వారి దేదేశపు ధర్మము? చాలమంది ఈదోషమును ముసల్మానులనెత్తిన వైతురు. ఆహా! ముసల్మానుల దోషమే!! గృహ్యసూత్రముల నన్నిటినిబఠించిచూడుము.

(సశేషము)

# ● సుశీల ●

శ్రీమతి గాధంశెట్టి అహల్యాదేవిగారు

పేరావధానులకు సుశీల యొక్కతె కూతురు. ఇతర సంతానమేమియు లేదు. అవధానులుగారికి స్థిరచరాస్థులేమీలేవు, మధుకరవృత్తితో బ్రతుకుచున్నాడు. ఊరిబయట నొక పూరింటిలో నివసించుచున్నాడు. భార్యాభర్తల కిద్దఱకు సుశీల యారవప్రాణము. ఆమెమీదనే వారిప్రాణము లాధారపడియుండెను. "ధనమూల మిదంజగత్" అను నార్యవచనముమీద నాధారపడి తనకూతురి నెవరికైన నొక ధనికునికి, రెండవపెండ్లివానికైనను సరే యిచ్చివేయుదమని పేరావధాను లాలోచించుచుండెను. సుశీలకు తొమ్మిదవయేడు ప్రవేశించెను. నల్లకలువలవంటి కండ్లకు కాటుకపెట్టుకొని నున్నగాదువ్వి జడవేసుకొని, పావడచొక్కా తొడుగుకొని, మెడలో కాశికాయలదండ వేసికొని, యామె యెంతో అందముగ కనబడుచు నందఱికనులకు హాయిగొల్పుచుండెను. తల్లిదండ్రులకప్పుడే గుండెలో రాయిపడినట్లయినది. పేరావధానులు వరుని వెదుకుటకు బయలుదేరెను.

ఆయూరిలోనే హరనాథపంతులను బ్రాహ్మణుఁడు కొలదిగా మాగాణియు, నాలుగు పండ్లతోటలనుగలిగి నాలుగులక్షలను జేతపట్టుకొని పెద్దమేడకట్టుకొని యేచింతయులేకుండ హాయిగ కాలముగడపుచుండెను. ప్రొద్దుటనేలేచి దినకృత్యములు నెరవేర్చుకొని శుభ్రముగ భోజనముచేసి, మోకాలుదిగని పంచికట్టి, తుండుగుడ్డ పైనవేసికొని పొలములు చూచుటకు వెళ్లి 11 గం॥కువచ్చి భోజనముచేసి పరుండి సాయంకాలము తన తోటలను జూచుటకు వెళ్లుచుండెడివాఁడు. మహాలక్ష్మమ్మ హరనాథపంతులుగారి భార్య, సద్గుణవంతురాలు, పతినిఁ బల్లెత్తుమాటకూడ ననకయుండెడిది. కాని కాలమెప్పుడు నొకరీతిగ నుండదుకదా! కొన్నిదినములకు పాపము మహాలక్ష్మమ్మ కాలముచేసెను. అప్పటికి హరనాథపంతులుగారికి షష్టిపూర్తయి రెండేండ్లుకావచ్చెను. భార్య పోయినందుకు కొంత విచారము, పిల్లలులేనందుకు మఱికొంతవిచారము — ఎట్లైనను మరల వివాహముజేసికొని పున్నామనరకమును దప్పించుకొందమని వధువును వెదుకుటకై బయలుదేరెను. పేరావధానులు హరనాథపంతులు తటస్థపడిరి. ఇక చెప్పెడిదేమున్నది, యిద్దఱికోరికలు ఈడేరినవి. పెండ్లియంతయు మగపెండ్లివారిదే; ఆడపెండ్లిదొరకేమియు ఖర్చులేదు. పెండ్లికివచ్చినవాఱందరును సుశీలను జూచి కండ్ల నీరుకార్చిరి. కాటికికాళ్లు చాచుకొనిన నీముదసలిచే బెండ్లియన నేమొ తెలియని యమ్మాయికి మంగళసూత్రము కట్టించిరి. దీనికంతకు గారకుఁడు కన్నతండ్రి. సుశీల వస్తువులనుజూచి మురియుచుండెను. మరికొన్ని దినములకు సుశీలకు పన్నెండవయేడు ప్రవేశించెను. అప్పుడప్పుడే యామె

యందు యవ్వనము దలచూపుచుండెను. శుభముహూర్తమున సుశీల తన యత్తవారి గృహము ప్రవేశించెను. "అమ్మ గృహప్రవేశము, అయ్య యగ్నిప్రవేశము" అన్నట్లు ఆ గృహప్రవేశముహూర్తముననే హరనాథపంతులు స్వర్గప్రవేశము గావించెను. ఇప్పటికి పేరావధానులు కండ్లు తెరచెను. తనే తనకూతురి కంఠమును బాల్యవివాహమను పదును కత్తితో కోసితినని చింతించి చాల పశ్చాత్తాపము జెందెను. తన కికెట్లు మనఃశ్శాంతి కలుగునని ఆలోచించి, తన కూతురుకు పునర్వివాహము జేసినచో తనకు శాంతి కలుగునని గ్రహించెను. అట్లు చింతించి, పేరావధానులు వితంతూద్వాహ సంఘమున నొక సభ్యునిగ బ్రవేశించి సుశీలను మోహనరావను నొక విద్యావంతుడును, యువకుడును నగు నాతనికిచ్చి యతివైభవముగ శ్రీ గాంధిసేవాసంఘాశ్రమమందు శ్రీ గాంధిమహాత్ముని ప్రతిమముందు శాస్త్రరీత్యావివాహము గావించెను. లోకము హర్షించెను. పత్రికలు వేనోళ్ల వారిని శ్లాఘించెను.

## జ్వరాన్ని గురించి ముఖ్యమైన సంగతులు

జ్వరముుండేటపుడు ఆహారపదార్థాలనుచూస్తే డోకు వస్తూవుంటుంది. ఎందుకంటే శరీరంలో జీర్ణమైపోతూవుండే కండరాలు ద్రవపదార్థాలను కోరుతూవుంటవి.

అయితే బలహీనమైపోయిన జీర్ణకోశం సాధారణ ద్రవపదార్థాలను జీర్ణించుకోలేదు. అంచేత డోకు వస్తుంది. లేకపోతే అజీర్ణ భేదులౌతవి. అయినా జీర్ణించిపోయిన శరీరాన్ని త్వరగా పునరుద్ధరించుకోవాలి.

హార్లిక్సు త్వరగా జీర్ణంకావడమే కాకుండా శరీరానికి కావలసిన పోషణంతా యిస్తుందని డాక్టర్లు కనుగొన్నారు. రోగగ్రస్తులై వున్నపుడూ, తేరుకుంటూవున్నపుడూ మీరు విడువకుండా హార్లిక్సు తీసుకొంటూవుంటే తిరిగివచ్చేరోగాలని ఆటంకపెట్టే శరీరశక్తి అభివృద్ధి చేసుకుంటారు.

ఈదినమే హార్లిక్సు కొనండి—అంతటా దొరుకుతుంది.

# పుష్పచయము

## మానినులకు మాతృత్వమహిమనుగూర్చి మంత్రి రాజన్‌గారి హితోపదేశము

మే నెల 25 వ తేదీని మైసూరులో, మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రియగు గా॥ డాక్టరు. టి. యస్. యస్. రాజన్‌గారు, భాగినీ సేవాసమాజమువారి యెదుట గావించిన గంభీరోపన్యాసములో గాంధీమహాత్ముని కాలములో స్త్రీలయొక్క ఔన్నత్యమును ఘనముగకొనియాడుచు భారత మహిళామణులు ఆదర్శమగు మాతృధర్మముల ననుసరించి తమ సంతానముయొక్క సర్వతోముఖాభివృద్ధికి పాటుపడవలెనని తెల్పియుండిన సందేశము మరువరానిదై యున్నది.

తల్లులయొక్క బాధ్యతను సవిస్తరముగ దెలియబల్కుచు సచివోత్తములు మాతృత్వము ప్రేమ భావములకును, త్యాగ ధర్మములకును ఆదర్శమైన ఆలవాలమని అభినుతించిరి. తల్లుల తను మనోశక్తులు తమ పిల్లల కుగ్గుపాలతోనబ్బును గాన వారు చక్కని ఆరోగ్యమును సంపాదించి సత్సంతానమును బడయుటే కాక, వారిజీవితములను గొప్ప ఆదర్శములతో నుద్దీపించుటకై నెంతయు నుత్సహింపవలెననుట చక్కని ఉపదేశ వాక్యమనదగును.

భారతదేశముయొక్క భావి భాగ్యోదయము భారత రమణీమణులు తమ పిల్లలను పెంచు పద్ధతులపై నాధారపడియున్నదని భావించుటలో అమాత్యవర్యులు తమ ఉన్నతాశయములను వెల్లడించిరి.

తమపిల్లల బాగోగులకు తల్లులే ప్రధానకర్తలనియు, హిందూదేశము పూర్వకాలమందు గడించియుండిన ఖ్యాతిని, గౌరవమును, నాగరకతామహిమాతిశయమును నిలబెట్టుట స్త్రీలచేతిలోనే యున్నదనియు మంత్రిపుంగవుని యభిప్రాయము. సంగీతము, చేతిపనులు, కుట్టుపని మొదలగు గృహవిద్యలలో ఘనమగు నైపుణ్యము నందగలిగినపుడే గృహలక్ష్ములలోనున్న సుగుణప్రసూనములు వికసించి పరిమళమును వెదజల్లగలవనుట యతిశయోక్తికానేరదు.

దేశముయొక్క ఘనత యువకుల జీవితవిధానమునందు చిత్రితమగును. దేశములో వీరులు, బుద్ధిశాలురు, త్యాగమూర్తులు, తేజోవంతులు, సుగుణసంపన్నులు, సుగుణచారిత్రులు, సేవాపరులు, సత్యవంతులు, సౌఖ్యప్రదులు, శాంతియుతులు బయలుదేరి స్వజాతిగౌరవమును సుస్థిరముగ నిలుపవలెనన్న, స్త్రీలు ఉన్నతాదర్శములతో గూడిన నుత్సాహముతో నిండియుండి త్యాగస్వరూపిణులగు తల్లులై మాతృప్రేమతో తమసంతానమును తేజోమూర్తులజేయవలెను. హిందూమతములో మాతృత్వమే మహోన్నతాదర్శముగ నుగ్గడింపబడినది.

భారతరమణీమణులు తమపిల్లలను ప్రేమించినట్లుగ ఏదేశమందలి స్త్రీలును ప్రేమింపరనియు హిందూ యువకులఘనతయు, శక్తిసంపదయు నీ మాతృత్వమహిమయందే నిండియున్నవనియు గా॥ రాజన్‌గారు

చెప్పటలో నెంతయు సత్యమున్నది. మరిమందభిలాషయనిన భారతమాత పుత్రికల హృదయములందే నిజము కనుగొనగలమనియు, హిందూ సుందరీమణుల శాంతియుత సహనశక్తియు, త్యాగశీలమును సాటిలేని సంప్రదాయలక్షణములనియు నిరూపించిన ఆరోగ్యామాత్యుల అమూల్య వాక్యము లత్యంతాదరణీయములై యున్నవి.

స్త్రీలు, సాంఘికసంస్థలలోను, రాజకీయ వ్యవహారములలోను, విద్యా విషయములలోను విశేష శక్తి సామర్థ్యములను వెల్లడింపగలుగుటకు గాంధీమహాత్ముని వ్యక్తిప్రభావమును ఆయన ప్రోత్సాహజలము చేతను అని ప్రజలందరును గుర్తింపవలసియున్నదని ఆరోగ్య శాఖామాత్యులు చెప్పియుండిరి.

ఖద్దరు పరిశ్రమయు, చేతిపనులయభివృద్ధియు దేశము పెంపొందింపగల్గుటకు హిందూయువతుల యత్యుత్సాహమును, పట్టుదలయు, దీక్షాపరతంత్రతయును ప్రధానకారణములని భావించుట ప్రశంసనీయమగు విషయమైయున్నది. ఘనుడగు గాంధీజీ గృహలక్ష్ములనుద్ధరింప నెంతయు గృషిసల్పెననుటకు సందియములేదు. మహాత్ముడని మహినుతికెక్కి మానవజాతికంతకును మార్గదర్శకుడై వెలసిన పుణ్యపురుషుడు మహిళామండలికి మహోపకారముసేసెనని మంత్రిపుంగవుడు బల్కిన సత్యవాక్యములు సర్వజనసమ్మతములేయగును. భాగినీ సమాజమువారు భరతమాతయొక్క ఘనతను బాగుగ గాపాడవలెనని భావించినచో వారి భావిసంతానమును సర్వవిధముల చక్కజేయుటకు మాతృధర్మ మర్యాదలను పాటించుట కెంతయు పాటుపడవలెను.

—విం. అ. సూర్యనారాయణ

## స్త్రీలు — ఉచితవిద్య

స్త్రీ విద్యాభివృద్ధికై కంకణముగట్టుకొని మన యాంధ్రదేశమున పనిచేసిన మహనీయులలో మిక్కిలిగా పేర్కొనదగిన వ్యక్తులిరువురు. వారిలో నొకరు శ్రీయుత కందుకూరి వీరేశలింగంపంతులుగారు, రెండవవారు డాక్టరు కే. యన్. కేసరిగారు. స్త్రీవిద్యాభివృద్ధినిమిత్తమై వీరేశలింగంపంతులుగారు జనానాపాఠశాలలను పెట్టి స్త్రీలకు తీరికసమయములయందు విద్యగఱపి వారిని ప్రబుద్ధరాంధ్రులుగా నొనరించి మిగ్గిలిన స్త్రీలకు గూడ విద్య నేర్చుకొనవలయునను కుతూహలమును గల్పించిరి. వారు పిమ్మట వీరేశలింగాస్తికోన్నత పాఠశాలనునిర్మించి యందు స్త్రీలకెట్టి ధనమును బుచ్చుకొనకయే స్కూలుఫైనలు ప్యాసుఅగువరకు విద్యగఱపు నేర్పాటుగావించిరి. స్కూలుజీతము లక్కర లేకుండగ విద్యగఱపబడుటచే పెక్కురు బీదబాలికలా పాఠశాలయందు చదివి యుత్తీర్ణులై ధనము గడింపుకొనుచు తమ భావిజీవితములను సుఖప్రద మొనరింపుకొనుచున్నారు. పంతులుగారిఆశయము నేటికి ఫలించి పెక్కుమంది బాలికలాపాఠశాలయందు పఠించుచుండుటెంతయు ముదావహము. కాని ఆపాఠశాల మేనేజింగుకమిటీవారు ధనము లేకపోవుటచే ఇకముందునుండి స్త్రీవిద్యార్థినులు జీతములు చెల్లింపకపోయినచో చేర్చుకొనబడరని ప్రకటించుట మిక్కిలి చింతనీయము.

స్త్రీవిద్యకై మిక్కిలి కృషియొనర్చి దానియం దత్యంతయభిమానముగల శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనరశింహముగారు, పెద్దాడ సుందరశివరావుగారివంటి పెద్దలు ఉండగనే యిట్టిదురవస్థ వాటిల్లినందులకు స్త్రీలోకమంతయు మిక్కిలి విచారింపకతప్పదు. తిక్కన సోమయాజి కాండపటమునుగట్టి కవితానుధావృష్టి గ్రమ్మినాడును, శ్రీనాథకవినాథుని శిరముపై కనకాభిషేకమును జేయునాడును, రాజరాజనరేంద్రుని పూజల గైకొంచు నన్నయ రాజమహేంద్రవరమున వరలిననాడును మహోత్సాహముతో పొంగిపొరలిన అల్లసానికవీంద్రునియందలమును కృష్ణరాయకవీంద్రుడు కేలనెత్తినాడును,

శారద నేడు తన జాతిస్త్రీలకు విద్య యుండదనిన ఎంత హోరున యేడ్చునో యెవరు వర్ణింపగలరు? ఈ వీరేశలింగము పాఠశాలలోచదివిఎందరు బీదవిద్యార్థినులు సుఖమయమగు నీతిజీవనమును గడుపుచున్నారలో యొక్కపరి యోచింపుడు.

ఇందుకు ధనముగావలయునన్నచో జిల్లాబోర్డులను మునిసిపాలిటీలను మేనేజింగు కమిటీవారర్థింపవచ్చును. దీపావళిభిక్షల వేడవచ్చును. వార్షికమహోత్సవసమయములయందు వేయునాటకములకు టిక్కెట్లుబెట్టి డబ్బు సమకూర్పవచ్చును. అన్నిటికన్న ముఖ్యసూచనయిది: దీనిని మేనేజింగుకమిటీవారొనర్చినచో ధనాభావమంతర్ధానమైపోగలదు. వారు టెక్స్టుబుక్కు కమిటీ వారిచేత పంతులుగారి గ్రంథముల స్కూళ్లకు బెట్టించినచో ఎక్కడలేని డబ్బు సమకూరగలదు. ఆడబ్బంతయు యూరక లాభములపంచుకొను పబ్లిషర్లకుగాక స్త్రీవిద్యాభివృద్ధి కుపయోగపడును. వీరేశలింగంపంతులుగారికన్న నిప్పటికెవరు ఉత్తమగ్రంథములుగాని నీతిబోధకమగు గ్రంథములుగాని వ్రాయలేరుగదా? వారు నవలలు వ్రాసినారు, ప్రకృతిశాస్త్రగ్రంథములను వ్రాసినారు, నాటకములను వ్రాసినారు. వాటినన్నిటిని యితర స్కూళ్లవారు కొనకున్నమానెగాని ఒక్క వీరేశలింగంగారి పాఠశాలలోననే పెట్టినను కావలసినంత ధనము సమకూరగలదు. అంతేగాని అనాథలగు బీదయువతుల జీవనోపాధి నీవిధముగ దీసివేయదలంచుట చాల విచారకరము. జీతముల బుచ్చుకొనకుండ యుచితవిద్య స్త్రీలకు గరపునట్టిది, స్కూలు ఫైనలువరకు స్త్రీవిద్య జెప్పించునది యీయొక్క స్కూలేయగుట నింతదూరము వ్రాయవలసివచ్చినది. ఇందువిషయమై ఆంధ్రనారీమణులందరు అన్నిపత్రికలలో యాందోళనమొనరించుట చాలముఖ్యావసరము. 'గృహలక్ష్మి' యట్టివ్యాసములకు తప్పక దోహదమొనర్పగలదని నానమ్మకము. శ్రీ వీరేశలింగంపంతులుగారిఆత్మ యీసంగతివినిన మిక్కిలి దుఃఖపడగలదు. వీరేశలింగంపంతులుగారియందు భక్తిగలవారెల్లరు ఆమహాశయుని ఆదర్శమును నిలువబెట్టెదరని తలంచెదను.

—శ్రీమతి పులవర్తి కమలావతిదేవి

## ఒకేకాన్పుకు ముగ్గురుపిల్లలు—పోషించడానికి ధనంలేదు !

అనంతపురముజిల్లా, కదిరితాలూకా, కొక్కంటిగ్రామంలో గురుమూర్తి అనునతనికి చిన్నమ్మ అనే భార్య వున్నది. కొన్నిరోజుల క్రిందట ఆమె ముగ్గురుపిల్లలను కన్నది. కాని వారిని పెంచడానికి ఆ తల్లిదండ్రులవద్ద ధనములేదు. అందుచేత ప్రభుత్వమువారి డిస్క్రిషనరీ గ్రాంటునుండి కొంత ధనసహాయము ఆ పిల్లలను పోషించు నిమిత్తము కోరుకొన్నది.

## భార్యకోసం ప్రాయోపవేశం!

ఇండోరుసంస్థానంలో కొంతకాలంక్రిందట ఆర్ట్సుకాలేజీలో చదుకొంటూవున్న ఒకయువతి యువకుడు ప్రేమించికొని రిజష్టర్డు మేరేజస్ ఆక్టుక్రింద వివాహం చేసుకున్నారు. కొంతకాలమైన తర్వాత ఒకరితో ఒకరు దెబ్బలాడుకొన్నారు. అందుచేత ఆయువతికి అతనియందు యిష్టములేక వేరే నివసిస్తూవుంది. కాని ఆయువకుడు ఆమెను తనఇంటికివచ్చి తనతో నివసించవలసిందని అనేకసార్లు కోరాడు. సామదానభేదదండోపాయాలద్వారా ఆమెను ఒప్పించడానికి ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఇక ఆయువకుడు తనభార్య ఫోటో ఒకటి తన ఎదురుగుండా పెట్టుకుని, తన అత్తగారి గుమ్మంలో తన భార్యను తనవద్దకు పంపవలసిందని చెప్పి, అలాపంపకపోతే తాను "ప్రాయోపవేశం చేస్తున్నాన"ని నిరశనవ్రతం పట్టాడు. ఆ యువకుని ఈ తుదిప్రయత్నం ఎల్లా పరిణమిస్తుందో!

# గ్రంథ సమీక్ష

## నందనార్

గ్రంథకర్త: శ్రీ బాలకవి అల్లమరాజు నారాయణరావుగారు, బొబ్బిలి. వెల 8 అణాలు.

హరిజనభక్తాగ్రేసరుడగు నందనార్ చరిత్రము మృదుమధురమగు తెలుగుపద్యములలో వ్రాసి, గ్రంథకర్త సన్నుతింపదగిన సాంఘిక సేవయు, సారస్వత సేవయు జేసెననుటకు సందియములేదు. భక్తజనులును సంఘసంస్కర్తలును ఆదరింపదగిన పుస్తకము.

## హరనాథవాణి: ప్రథమభాగం.

కర్త: శ్రీ అరట్లకట్ట బ్రహ్మంగారు, ప్రెసిడెంటు అండ్ ట్రెజరర్, శ్రీ కుసుమహరనాథ సెంట్రల్ మిషన్, మదనసింగుపేట, రాజమండ్రి. వెల 2 అ. మాత్రమే. పుస్తకములకు పైవిలాసమునకు వ్రాయవలెను.

శ్రీకృష్ణపరమాత్మయొక్కయు, శ్రీ కృష్ణచైతన్యునియొక్కయు అవతారమూర్తియనబరగి, భగవంతుని దివ్యలీలలను తనజీవితమందు ప్రత్యక్షముగావించి అనంతమగు ప్రేమప్రభావముచే పతితులనుద్ధరించి, పావనమగు భగవన్నామసంకీర్తనమే మోక్షసాధనమని దశదిశలజాటి, తన దివ్యవచనామృతధారలచే భక్తుల నానంద పారవశ్యులనుజేసిన ప్రభుహరనాథుని ఉపదేశవాక్యములందు గొన్నిటినిజేర్చి ప్రథమభాగముగ ప్రకటించి భక్తలోకమునకందిచ్చిన గ్రంథకర్త సత్ప్రయత్నము శ్లాఘాపాత్రము.

## పాలస్టయిన్

గ్రంథకర్త: తుమ్మల వెంకటరామయ్యగారు, నవశక్తి కార్యాలయం, బెజవాడ. వెల తెలియదు.

'బ్రిటీషు సామ్రాజ్యములోని పవిత్రభూమి'యైన పాలస్టయిన్ ప్రదేశముయొక్క ప్రాముఖ్యతను, చారిత్రకపరిస్థితులను చర్చించుచు, చక్కని పరిశోధనజేసి రచియించిన పుస్తకము. ప్రస్తుతరాజకీయవిషయముల నాసక్తితో పరికించువారికెంతయు సహాయపడగలదు.

## సంస్థానాలు

గ్రంథకర్త: వావిలాల గోపాలకృష్ణయ్యగారు, 'జ్యోతి' పత్రికాప్రకాశకులు, సత్తెనపల్లి, (పోస్టు) గుంటూరుజిల్లా. వెల 6 అణాలు. వలయువారు పై చిరునామాకు వ్రాయవలెను.

హిందూదేశములోని వివిధసంస్థానములనుగూర్చి సంగ్రహముగా నన్నివిషయములును చక్కగా నిందు వ్రాయబడియున్నవి. ఈపుస్తకము సంస్థానములచరిత్రను, అందందు జరుగుచున్న పరిపాలనాపద్ధతులను, వాటి విస్తీర్ణత రాబడి మొదలగువివరములను దెల్పుచున్నది. స్వాతంత్ర్యసమరము నానాటికి విజృంభించుచు సంస్థానములలో పెద్దసంచలనమును గల్గించుచున్నతరుణములో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారీ గ్రంథమును సమయోచితముగరచించి ప్రజలకందిచ్చుట ప్రశంసనీయమగు విషయమైయున్నది. సంస్థానములలోని స్వాతంత్ర్యోద్యమమును తెలిసికొనగోరువారి కీగ్రంథము చాల సహాయకారిగ నున్నది.

## *** పత్రికాపరిచయం ***

### హరనాథ్

శ్రీ కుసుమహరనాథమహాసభ పక్షమున ప్రకటింపబడు భక్తి ప్రబోధక మాసపత్రిక.—

సంపాదకుడు : శ్రీ యం. వి. యన్. సుబ్బారావుగారు, యం. ఏ.

సంవత్సర చందా 1 రూపాయి మాత్రమే. విడిసంచిక వెల 0-2-0 లు మాత్రమే.

పత్రిక వలయువారు : మంథా గణేశ్వరరావుగారు, మేనేజరు, "హరనాథ్" విశాఖపట్టణము, అను చిరునామాకు వ్రాసికొనవలయును.

ఒకటవసంపుటము ప్రథమసంచిక (మే నెలది) మాకందినది. ప్రేమావతారుడును, భక్తిజ్ఞానవైరాగ్యమూర్తియు ముముక్షువులకు ముక్తిమార్గోపదేశకుడునైన ప్రభుహరనాథుని లీలలను వర్ణించుచు నమ్మహనీయతేజుని దివ్యవచనామృత ధారలతో వెల్లివిరియు ప్రేమసందేశమును భక్తుల కందరికి నందించుచున్న 'హరనాథ్' పత్రిక యెల్లరచే నాదరింపదగియున్నది. ఈ పత్రికను ప్రారంభించిన పత్రికాసంపాదకుల యాశయములు ప్రశంసాపాత్రములు.

### ఆంధ్రి

మాసపత్రిక. సంపాదకుడు : మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

సాలుచందా రూ. 1-0-0. విడిపత్రిక వెల రూ. 0-1-0.

కార్యాలయము : ఆంధ్రకుటీరము, పల్లిపాలెం, ఇంజరంపోస్టు, కాకినాడతాలూకా.

మొదటిసంపుటము మూడవనెలసంచికలోని శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి 'పత్రికాశయము' అను సందేశము ననుసరించి 'ఆంధ్రి' ఆంధ్రసారస్వతసేవచేసి ఆంధ్రుల పొగడ్తకు పాత్రమగునని విశ్వసించుచున్నాము.

### అడ్వర్టైజర్ (వార్షికసంచిక)

సచిత్రమాసపత్రిక. సంపాదకుడు : కే. శ్రీనివాసరావుగారు, విజయనగరం.

సాలుచందా రు. 1-0-0, విడిప్రతి వెల ఒకఅణా మాత్రమే.

వాణిజ్యము, పరిశ్రమలు, సినీమాలు ప్రస్తుతపుదేశీయ విదేశీయ విషయములు, కథలు, గీతములు మొదలగు వ్యాసములతో విలసిల్లు ఈ పత్రిక ఆంధ్రులెల్లరచే ప్రోత్సహింపదగియున్నది. జూన్ నెల వార్షికసంచిక మాకందినది.

### కిన్నెర:—ఆంధ్రవాఙ్మయ సేవాసమితివారి సాహితీసంపుటి

వివరములకు:—కార్యదర్శి, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి, బూర్గుంపాడు, భద్రాచలం పోస్టు.

కిన్నెర ఉగాదికానుక ఆంధ్ర భాషాపోషకులును, ఆంధ్ర విజ్ఞానసంపన్నులును ఆంధ్ర విశ్వవిద్యాలయాధిపతులును నగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారి ఆశీస్సుతో వెలువడినది. ఆంధ్ర సారస్వతాభిమానుల ఆశీర్వాదములనందుకొని, ఆంధ్ర కవిశ్రేష్ఠుల కలములనుండి గద్యపద్యముల గైకొని, వివిధ విషయవిస్తారతమై సొంపునింపుసైజున చక్కని కాగితములపై సొగసుగులుకు నచ్చుతో నలంకరింపబడిన ఆంధ్ర వాఙ్మయ సేవాసమితివారి ఉగాదికానుక యెంతయు ఘనతను గాంచుచున్నదనుట యతిశయోక్తి కానేరదు



# సంపాదకీయములు

## హిందువులలో వర్ణాంతర్వివాహములను బలపరచుబిల్లు

కేంద్రశాసనసభలో శ్రీప్రకాశగారు హిందువులలో నొక కులము వారితో వేరొక కులమువారు వివాహములు గావించుకొనవచ్చుననుచు, అట్టి వివాహములు న్యాయ శాస్త్రసమ్మతములని దృఢపరచుటకొక బిల్లును ప్రవేశపెట్ట సంకల్పించినటుల శాసనసభ వారికి ప్రకటనమూలమున వెల్లడించిరని తెలియుచున్నది. ఈ బిల్లుయొక్క ఆవశ్యకతను అందరును ఆమోదించవలసియే యున్నదని భావింపనగును.

ఇపుడమలులోనున్న హిందూన్యాయశాస్త్ర సిద్ధాంతముల కర్థము చెప్పబడు చున్న పద్ధతి ప్రకారము హిందువులలో వర్ణాంతర్వివాహములు ధర్మశాస్త్రవిరుద్ధములుగ పరిగణింపబడుచున్నవి. ఈ సిద్ధాంతము ప్రత్యేకవ్యక్తులు తమ యిష్టానుసారము వర్ణాంతర్వివాహముల జేసికొనుట నవరోధించుటయేకాక సరియగు వివాహసంబంధములను సమకూర్చుకొనుట కవకాశముల నొసంగుటలేదని శ్రీ ప్రకాశగారి గట్టి యభిప్రాయమై యున్నది. తగినట్టి వధూవరులు లభింపనప్పుడుగూడ ఒక తెగవారు తమ తెగలోని వారితోనే వివాహములు చేసికొనవలెనను నిర్బంధము సంఘముయొక్క అభివృద్ధి నాటంకపరచుటేగాక పరస్పర వైషమ్య భావములుగల భార్యాభర్తల సంయోగమును సంప్రాప్తింపజేయుటచే వారి సంతానము ఆరోగ్యవంతమైన ప్రేమఫలితము గాకుండుట సంభవించుచున్నదని ఈ సంఘసంస్కర్త నిరూపించుచున్నాడు.

వీరు ప్రవేశపెట్టబోవు బిల్లు ఒక కులములోని యువకుడు వేరొక కులమునకు చెందిన కన్య నుద్వహింప నిచ్ఛగించుచో లేక అకులములోనే ఇతర తెగలోని కుటుంబము నుండి ఇల్లాలి నేర్పరచుకొన గోరుచో నట్టి యుద్దేశమును సఫలముజేసికొనుటకు సర్వవిధముల ప్రోత్సాహ మొసంగుచున్నది. సివిలువివాహక్రమము ననుసరించుట క్లిష్టములేక వేదచోదిత ధర్మముల ననుసరించి వివాహముచేసికొనదలచిన వారికి వర్ణాంతరవివాహములు వేదశాస్త్రసమ్మత వివాహములవలెనే చేసికొనుట కెట్టి ఆటంకము లుండగూడదని ఈ బిల్లుయొక్క ముఖ్యోద్దేశమైయున్నది.

వర్ణాంతర వివాహముల నంగీకరించువారికిని ఆచరించువారికిని కావలసిన కొన్ని సంఘసంస్కరణ సందర్భముల నీబిల్లు యేర్పరుప నుద్దేశించినది. అందులో వివాహము

రిజిష్టరు చేయబడుట, వివాహమునకు వధూవరుల కుండవలసినవయసు హెచ్చింపబడుట, బహుభార్యాప్రియత్వము నిషేధింపబడుట ముఖ్యమైనయేర్పాటులుగ నెంచబడినవి. తదితరవిషయములన్నిటిలోను ఈబిల్లు హిందూమత ధర్మములకు కట్టుబడియేయుండి వాటిని భద్రముగ గాపాడ నుద్యోగించుచున్నది. ఒకేకులములో జరిగినట్టి వివాహములలో గూడ సంస్కరణ విషయములో ముందుజాగ్రత్తకై వివాహములు రిజిస్టరుచేసికొనుటకును, వివాహమునకు వయసును హెచ్చుజేయుటకును, బహుపత్నీ స్వీకారము నవరోధించుటకును ఈబిల్లు సహాయపడగలదని తెలుపబడినది.

శ్రీ ప్రకాశ్ గారు విశాల హృదయముతో బాహుళ్యమైన దృష్టితో ప్రవేశపెట్టబోవు ఈబిల్లుచే వివాహసంబంధముల గుదుర్చుకొనుటకు విస్తారమగు అవకాశములు గల్పింపబడగలవుగాన ప్రేమ వివాహములు ప్రోత్సహింపబడుటకు కొన్ని సదుపాయములు సమకూరును.

వర్ణాంతర్వివాహములకు శాసనసహాయము చేకూర్చుట హిందూసంప్రదాయమునకు విరుద్ధమగు పద్ధతిగ భావింప వీలులేదు. ఏలనన, అట్టి వివాహములు వేదచోదిత ధర్మముల ప్రకారము పురోహిత మంత్రవాక్యపురస్సరముగ జరుగుచున్నను సివిల్ వివాహచట్ట సహాయముచే జరుగుచునేయున్నవి. నవనాగరకతావ్యామోహము బాగుగ పట్టుపడిన యువకులును యువతులును ఒండొరుల యాశయములచే నాకర్షింపబడి పరస్పర ప్రేమబద్ధులై పరిణయమాడుటయు సివిల్ వివాహచట్టముచే వర్ణాంతర్వివాహనిరోధ సందర్భముల నధిరోహించి విధివిధానముచే సంకల్పసిద్ధులగుటయు ప్రత్యక్షప్రమాణమైయున్నది. అట్టితరి నిట్టి వివాహములకు సంఘములో తగుబలమును గూర్చుటకై ఈబిల్లు సహాయపడగలదిగనున్నది గదా?

స్త్రీసమాజములు—సాంఘిక సేవ

స్త్రీసమాజములలో జీవితములో పెద్దయంతస్తులం దున్నవారును, మధ్యతరగతి కుటుంబములకుచెందిన మహిళామణులును సభ్యురాండ్రుగ నున్నారు. పేదస్థితిలోనున్న స్త్రీలకివి అందుబాటులో లేవు. నిరుపేదలుగనున్న స్త్రీల క్షేమసమాచారముల నరయుచు వారిస్థితిగతులను చక్కగ దెలిసికొని వారియభివృద్ధికై ఒకింత చేయూతనొసంగుట స్త్రీసేవాసమాజములు సద్వ్యాదర్శముగ సంభావించవలసియున్నది.

కేవలము వినోదకరమగు విషయములలో తీరికసమయములందు కాలక్షేపముకొరకై స్త్రీసమాజము లేర్పడియుండుటయు సంఘముయొక్క అభివృద్ధికై ఈసమాజములు చాలినంతకృషి సలుపకుండుటయు శోచనీయమైన విషయమే యనవలసియున్నది.

## సంపాదకీయములు

స్త్రీలు స్వార్థపరత్వముతో స్వీయసంరక్షణమునే యెల్లపుడు చూచుకొనుచుండి నచో మాతృత్వమహిమకును సతీత్వఘనతకు నాధారభూతమగు స్వార్థత్యాగ మంత రించును. స్వార్థత్యాగమే స్త్రీల శీలసంపదకు పునాదియు పుట్టినిల్లును నై యున్నది.

పేదకుటుంబములలోని స్త్రీలు పొట్టకై పాటుపడవలసియుండుటచే వారు శిశు పోషణమునందు చాలినంత శ్రద్ధను తీసికొనజాలని స్థితియందున్నారు. స్త్రీ సేవాసమాజ ములీ పేదశిశువులను మంచిపద్ధతులలో బెంచుటకై తగువసతులనేర్పరుప కొంతకాలమును వినియోగింపగల్గుచో పేదకుటుంబముల నుద్ధరించు టేకాక సంఘముయొక్క అభివృద్ధికి చాలగ తోడ్పడినవా రగుదురు.

అనాధశరణాలయములలోని పేదబాలికలను బాలవితంతువులను ఉన్నతస్థితికి గొనివచ్చుటకు స్త్రీ సేవాసమాజములు విశేషముగ కృషి సలుపవలసియున్నది. కేవలము పేరుప్రతిష్ఠలను పెంపొందించు విషయములందును వినోదములలో ప్రొద్దుబుచ్చుట యందును తమ తీరికసమయములను వినియోగింపక, సంఘములో నజ్ఞానాంధకారముచే నావరింపబడి పేదరికముచే పీడింపబడుచున్న బాలికలను యువతుల నుద్ధరించుటకై స్త్రీసేవాసమాజములు పాటుపడవలసి యున్నది.

### స్త్రీలు—కాంగ్రెసు

ఈమధ్య ఉత్తరమద్రాసు మహిళాసమాజమువారి యాధిపత్యమున స్త్రీలు సమా వేశమై కాంగ్రెసుయొక్క ప్రతిభను బలపరచుచు పలువురుపన్యసించుచు దేశములో స్త్రీలు కాంగ్రెసులో నధికముగ చేరి ఆసంస్థకెంతయు బలమును చేకూర్చుటకు తమశక్తిని ధార వోయ సంకల్పించుటెంతయు శ్లాఘాపాత్రమై యున్నది.

దేశాభ్యుదయమునకు స్త్రీలు తోడ్పడుటకై దీక్షనుబూనుటయు, జాతీయతను పెంపొందించుటకై గట్టి స్వయంనిర్ణయమును జేసికొనుటయు, కాంగ్రెసుయొక్క ఘనతను గుర్తెఱింగి కాంగ్రెసుపద్ధతుల ననుసరింప నిశ్చయించుకొనుటయు వారి విజ్ఞానవికాసమును వెల్లడించుచున్నవి.

స్వదేశీవస్త్రములను, స్వదేశీయాభరణములను, స్వదేశీపాత్రలను, స్వదేశీయలం కారవస్తువులను, స్వదేశీగృహోపకరణములను చాల ప్రోత్సహింపబూనుకొనుటచే స్త్రీలు జాతీయఘనతకెంతయును సమకూర్పజాలుదురనుటకు సందియములేదు. స్త్రీలు దేశము యొక్క క్షేమమును, గౌరవమును కాపాడుటకై పాటుపడినప్పుడే భారతమాత ఖ్యాతి ఖండాంతరముల వ్యాపింపగలదు.

## వీరేశలింగం హైస్కూలు—బాలికలకు ఉచితవిద్య

రాజమహేంద్రవరములో కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారిపేర స్థాపింపబడిన ఆస్తికోన్నతపాఠశాల (Theistic High School)లో నికముందు బాలికలకుచితముగ విద్యనేర్పుట కవకాశములులేవని స్కూలుకమిటీవారు తీర్మానించినటుల తెలియుచున్నది.

స్త్రీవిద్య విశేషముగ వ్యాప్తికావలసిన సందర్భములలో బాలికలు జీతములీయవలెనని ఇంతవరకునులేని క్రొత్తనిబంధన నేర్పరచుట సమంజసముగ గన్పట్టుటలేదు. స్త్రీలకు ఉచితముగ విద్యనొసంగుటకు నెక్కువగ వసతులగల్పింప నవసరమైయుండ వారివద్ద జీతములదీసికొన నుద్దేశించుట వారి విద్యాభిలాషను నిరుత్సాహపరచుటయే యగును.

ఆంధ్రదేశమంతలోను విద్యలలోమిన్నయై ఆంధ్రమాతకు అధికయశస్సును గూర్చిన రాజమహేంద్రపుర మీవిషయములో వెనుకంజవేయునా? స్త్రీల యభివృద్ధికై తనజీవితమును ధారవోసినమహనీయుని ఆశయముల ననివార్యముగ గొనసాగనిచ్చి ఆవిజ్ఞానసంపన్నుని కీర్తినినిలుపుట పాఠశాలాధికారుల కర్తవ్యమై యున్నది.

ఈవిషయమై పురప్రముఖులును, స్కూలుకమిటీవారును బాగుగనాలోచించి, బాలికలకు ఎప్పటివలెనే ఉచితవిద్య కవకాశముల గల్గింతురని విశ్వసించుచున్నాము. పురపాలకసంఘమువారిందులకు తగుప్రోత్సాహమొసంగి పాఠశాలయొక్క పూర్వగౌరవమర్యాదలను నిలుప బ్రయత్నింతురని యాశించుచున్నాము.

## కీర్తిశేషులైన సర్. రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు

స్త్రీలయభ్యున్నతికిని అనాధ బాలికలయుద్ధరణమునకును హరిజనుల యభివృద్ధికి నెంతయు పాటుపడి సాంఘికసేవచేతను, సారస్వతసేవచేతను, సజ్జనసాంగత్యముచేతను, సన్మార్గప్రవర్తనముచేతను, విశేషించి సర్వకాల సర్వావస్థలయందును సర్వేశ్వర చింతాపరతంత్రతచేతను, తమ జీవితమును ధన్యముజేసికొని స్వర్గస్థులైన రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి సత్కీర్తి శాశ్వతముగ నిలపై నిలిచియుండుననుట నిశ్చయము.

పేదలపై దయారసమును ప్రవహింపజేసి, పతితులను ప్రేమప్రభావముచే నుద్ధరించి సత్యాన్వేషణలో జీవితమునంతను గడపిన సద్గుణసంపన్నుడు శాశ్వతానందపదవి జేరగలిగెననుటకు సందియములేదు. వేంకటరత్నము మహాశయునివంటి పుత్రరత్నమును గోల్పోవుట ఆంధ్రమాత యదృష్టహీనమేయగును. భౌతిక శరీరమును బాసి కీర్తిశరీరమును భువిపై నిలిపి దివికేగిన దీనబాంధవునియాత్మకు పరమాత్మ సాన్నిధ్యముచే శాశ్వతశాంతిపదవి సంప్రాప్తించునటుల సర్వేశ్వరుడనుగ్రహించు గాక!

EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రములు : చిత్రకారుడు-యస్. పద్మనాభన్‌గారు.

వీణావాదనవినోదము



## వీణావాదనవినోదము

సీ. తతనితంబాభోగ ధవళాంశుకములోని, యంగదట్టపుఁగావి రంగువలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁగాయ, నుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట ముద్దులునటింప
నాలాపగతిఁజొక్కి యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్య విభ్రమముఁదెలుపఁ
ప్రౌఢిఁబల్కించు [illegible] మకర పంకరుహరత్నకటక ఝణఝ
ణధ్వని [illegible] నింపుదళుకొత్త వీణవాయింపుచుండి.

(మనుచరిత్రము)

నమ్మిన వేల్పు టమ్మల మనమ్మలనుం డెడి [illegible]
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ [illegible]

క. నవరాత్ర వ్రతమునకీ । యవనిన్ [illegible]
భవమిడు నాయువునిడు, నిడు । శివము [illegible]

ఈ యాశ్వీజ శుద్ధపాడ్యమీ శుక్రవారము మొదలు [illegible]
వరకును దేవీ నవరాత్రి పండుగదినములై యున్నవి. [illegible]
లోను అత్యంత ప్రాముఖ్యతను వహించుచున్నవి. మహా[illegible]
లెంత ముఖ్యమో, గుజరాతీ దేశస్థులకు దీపావళీపండుగ [illegible]
[illegible] దసరాపండుగ [illegible] దేశమంతటను [illegible]




## దేవీ నవరాత్రోత్సవములు

ఉ. అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁ బె
దద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిఁ బుచ్చినయమ్మ దన్నులో
నమ్మిన వేల్పు టమ్మల మనమ్ములనుండెడి యమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.

(శ్రీమదాంధ్ర మహాభాగవతము)

క. నవరాత్ర వ్రతమునకీ। యవనిన్ వేఱొండుసాటి యనుకొనకుము వై
భవమిడు నాయువునిడు, నిడు। శివమున్ విద్యయును యశముఁ జేవయుఁ బరమున్.

(శ్రీ దేవీ భాగవతము)

ఈ యాశ్వీజ శుద్ధపాడ్యమీ శుక్రవారము మొదలు శుద్ధదశమీ ఆదివారం వరకును దేవీ నవరాత్రి పండుగదినములై యున్నవి. ఇవి హిందువుల పర్వదినము లన్నిటి, లోను అత్యంత ప్రాముఖ్యతను వహించుచున్నవి. మహారాష్ట్రులకు గణపతి మహోత్సవము లెంత ముఖ్యమో, గుజరాతీ దేశస్థులకు దీపావళీపండుగ ఎంత గొప్పదో, దేవీ నవరాత్రులతో గూడిన దసరాపండుగ భారతదేశమందంతటను హిందువులందరికిని అంత అత్యంతో

త్తమమై యొప్పుచున్నది. కాని ఈ మహోత్సవము బెంగాలురాష్ట్రమునందు, భారత దేశమం దితర భాగములలోకంటె నెక్కుడు ఘనముగను అధికోత్సాహముతోడను జరుప బడును. తొమ్మిదిదినము లేకవరుసగ నెడతెగకుండ నిష్టదేవతారాధనము సలుపబడుట జేసి ఈ యుత్సవమునకు నవరాత్రోత్సవమని పేరు కలిగినది.

ఈ నవరాత్రిపండుగ భారత రమణీమణుల కెక్కువ ప్రీతికరమును ఆనందదాయకమును అయియున్నది. ఇతర దేవతలను ఆరాధించువారుకూడ ఈ నవరాత్రులలో శ్రీ మహాదుర్గను తప్పక ఆరాధింతురు. ఆది, మధ్య, అంతములులేక అనంత విభూతులతో నిండియుండు ఆదిదేవుని, ఆదిశక్తిగ, మాతృదేవతగ భావించి పూజించుట భక్తులకు అతి సులభమును, క్షేమకరమును, శుభప్రదమును ఆనందదాయకమును అయియున్నది.

దేవుని దివ్యమాతగ, పరదేవతగ ఆరాధించి శ్రీ రామకృష్ణపరమహంస ముక్తి సాధనలో నవలీలగ సిద్ధినిగాంచెను. ఆయనకు ఏ కాంతయందు చూచినను శ్రీ కాళీ మాతయే కన్పట్టుచుండెను. మాతృదేవతగ మహాదేవుని ఆరాధించుట మహిత మోక్ష మార్గమని ఆ మహాపురుషుడు మానవకోటికి వెల్లడించియుండెను.

ఈ నవరాత్రిపండుగయొక్క మూలకారణము పురాణములలో పలువిధములగు కథలలో వివరింపబడినది. కాని అన్ని గాథలునుకూడ ఒక విషయములో మాత్రము ఒకే విధమగు సత్యమును చెప్పుచున్నవి.

ఆదిశక్తియగు దివ్యమాత మానవకోటి నుద్ధరింప మహిషాసురుని మర్దించెననుట సర్వగ్రంథ సమ్మతమగు సంగతియైయున్నది. ఆమె యా రాక్షసుని, బరిమార్చిన దినము యొక్క వార్షికోత్సవము జరుపు సందర్భముననే ఆ దివ్యజననిని బూజించు టర్హమగు ననియు అందుచే నామె సంప్రీతచేతస్కయై ఇష్టార్థముల నొసగుననియు సంపూర్ణ విశ్వాసము విశ్వవ్యాప్తమగుటచే, నీ యుత్సవము ప్రతివత్సరమును తొమ్మిదిదినములును రాత్రులును జరుపబడుచున్నది. అఖిలాండేశ్వరియగు అమ్మను పూజించుటకు సాయం సమయ మెక్కువ శ్రేష్ఠమగుటచేగాబోలు నీ యుత్సవమునకు నవరాత్రులను నామ మొసంగబడెను.

విషయవాంఛలను వీడి, ఆశల జయించి, సర్వమును త్యజించిన సంయమీంద్రులు సయిత మీపర్వదినములలో శ్రీ మహాదుర్గ నారాధించి తరింపగడంగెదరు. ఏలనన, కోర్కెలను బారద్రోలిన సన్యాసులకుగూడ ఆకలిబాధయు, రోగభయమును నుండుటచే క్షామదేవతా పీడాపరిహారార్థము పాటింపవలసిన విధులను, సంసారసాగరమందుబడి పలువెతల గుందుచుండు గృహస్థులవలెనే, వారును నిర్వర్తింప నవసరమైయున్నది.

కాని ఈ బాధల బాపుకొన బాటుపడుట సామాన్య మానవులకువలెనే సంయమీంద్రులకును విధియా? అను సంశయము కలుగకమానదు. మాయనుండి విముక్తులగుటకు మాయామయమగు మహాదేవి నారాధించు టావశ్యకమగుటచే నీ సందేహమునకు సదుత్తరమును చెప్ప నవకాశమున్నది.

సామాన్యజనులు గ్రామదేవత బారినుండి తప్పించుకొనుటకు ప్రయత్నించుచుండ, విజ్ఞానులు, మాయావరణనుండి సంపూర్ణముగ తొలంగుటకు దివ్యశక్తిస్వరూపిణియగు దుర్గాదేవిని, శుద్ధజ్ఞానస్వరూపిణియగు సరస్వతీదేవిని, విమలయశోవిశాల విజ్ఞానచంద్రికలతో విలసిల్లు విశాలాక్షీదేవిని, అనంతనామరూపముల వెలయుచు సర్వ సౌభాగ్యములతో నొప్పు ఆదిమహాలక్ష్మిని, ఆరాధించి, తాము అనవరతము అన్వేషించు శాశ్వతానంద పదవిని చేరగల్గుటకై ఈ యుత్సవములను జరుపుచున్నారు.

ఆపదలనుండి అభయమొసగి అజ్ఞానమను మాయనుండి మానవులను తొలగించి, అఖండ ఆనందబ్రహ్మమును చేర్పగల బ్రహ్మవిద్యాస్వరూపమే ఈ జగజ్జననియగుటచే గృహస్థులేకాక సన్యాసులునుగూడ నీ దేవీనవరాత్రి పూజలజేయ సంతసింతురు. అందుచే నీ దేవీపూజ మోక్షదాయకమును, మహదానందకరమును, అఖిల శుభప్రదాయకమును, సర్వజనాను సరణీయమును అగు సత్కార్యాచరణమై యొప్పుచున్నది.

మరియు, ఈ దేవీనవరాత్రి మహోత్సవ సందర్భముననే దసరాపండుగయని పిలువబడు పర్వదినములందు విద్య నభ్యసించువారెల్లరును సరస్వతీపూజల జేయుదురు. ఈ మహోత్సవ దినములలో సంగీతసభలు, చిత్రవస్తు ప్రదర్శనములు, పురాణపఠనములు, హరికథాకాలక్షేపములు నృత్యవాద్య వినోదములు, వివిధములగు వేడుకలు, పిండివంటలతోగూడిన షడ్రసోపేతములగు విందుభోజనములు, స్నేహగౌరవ మర్యాదలు, అల్లుండ్ర అలుకలు, అత్తమామల ఆరాటములు, ఆడపడుచుల అలంకార ఆనందాతిశయములు సుదతుల సొగసుసంబరములు, బాలికల బొమ్మలకొలువులు, పడుచుల పతిసందర్శన సంజనిత ప్రేమాతిరేక ప్రమోదములు, బాలుర అక్షరాభ్యాస ఆందోళనములు, మొదలగు మహా సంతోషసంభరిత సత్కార్యములతో భారతభూమియం దీపదినాళ్లును రామరాజ్యమునందుబోలె సంపూర్ణ స్వాతంత్ర్యసంయుతమగు స్వేచ్ఛావినోద విహారములతో ప్రజలు ఆనందాబ్ధినోలలాడుదురు.

ఈ మహోత్సవదినములు పదియవరోజున వచ్చు విజయదశమిపండుగతో నాఖరగును. పూర్వము శ్రీరామచంద్రుడు సీతాపహరణమొనర్చిన రావణాసురునియొక్క పదితలలను దినమునకొకటిగ త్రెగగొట్టెనని, ఒక పురాణగాథ గలదు. అందుచే పదియవనాడు

విజయదశమిపండుగ యను పేరుతో ఉత్సవములు, ఊరేగింపులును జరుపబడుచున్నవి. ఇదికాక, ఆనాడు శ్రీ మహాదుర్గ మహావిజయముతో విజృంభించెననియు, మహిషాసురుని వధించి మహా వైభవముతో వెలసెననియుగూడ నొకగాధ కలదు.

ఆనాటి సాయంసమయమున శమీవృక్షమునకు పూజసలుపబడును. ఇందులకు భారతమునందలి కథ ఆధారభూతమైయున్నది. అజ్ఞాతవాసమునకై పోయినపుడు పాండవులు తమ యాయుధముల నొక శమీవృక్షముపై శవాకారముగ (ఒరులంటకుండుటకై) జేసిపెట్టియుండిరనియు, అజ్ఞాతవాసానంతరము పాండవమధ్యముడగు నర్జును డాయాయుధములను తిరిగి గ్రహించెననియు, అర్జునుని ధనస్సును దాచియుంచిన వృక్షరాజమగుటజేసి సమీవృక్షము పూజ్యమైనదనియు చెప్పబడుచున్నది.

అందుచేతనే ఈ పర్వదినములలో ఆయుధపూజలు, యంత్రారాధనములు హెచ్చుగ జరుగుచుండును. శ్రీరామచంద్రుని విజయ మీపదిదినములలోను బాలురచే బహువింతను గొల్పు విధముగ జరుపబడును. బాలురందరు గిలకల బద్దల చేబూని సమూహముగ గూడి, బడిపంతులు వెంబడింప జయజయ ధ్వానములజేయుచు, వీధులలో నూరేగుచు, పాటలుపాడుచు, పెద్దలనుండి పప్పుబెల్లములగొనుచు చెలరేగుచుందురు.

దేవీ నవరాత్రులు, గణపతి నవరాత్రులు, శ్రీరామనవమి మహోత్సవములు మొదలగు సంతోషదినములు నవీనోత్సాహ సంజనకములై ప్రజలలో స్వాతంత్ర్యభావముల నంకురింపజేయును. మానవవ్యక్తిలోని సంపూర్ణత్వమును ప్రదర్శిత మొనరింపగల నీపర్వదినములలో, జంతుబలులు, జీవహింసలు, మద్యపానములు మొదలగు మూఢాచారములను, దురలవాటులను తుద ముట్టించినగాని ఈ పర్వము సంపూర్ణశుభప్రదమై తనరారదు. ఈ దినములలో మహామాతయగు ఉమాదేవి సంపూర్ణ కారుణ్య కటాక్ష వీక్షణములతో భక్తుల నందరి నాశీర్వదించుచు ప్రజల బాధలను బాప నిచ్చగించును గాన నీసుదినములలో మద్యపాననిషేధ ప్రచారమును చురుకుగ జరిగించిన శ్రీ మహాదుర్గ తోడ్పడగలదు. సత్సంకల్పములను సంపూర్ణముగ సిద్ధిపొందింపజేయు నాసర్వేశ్వరి సహాయమునకై సమారాధనలు, అన్నదానములు అమితముగ జేయవలెను. హరిజనుల నందరను ఆదేవి యనుగ్రహమున కర్హులగునటుల ప్రార్థనలుసలుప దేవాలయములలోనికి స్వేచ్ఛగ ప్రవేశింపనిచ్చి సంపూర్ణమగు సోదరభావముతో నాదరించిన భారతభూమి తిరిగి పుణ్యభూమియై ప్రకాశించును.

దేవీ భాగవతమునందు ఉమాదేవియొక్క వివిధరూపములును వర్ణింపబడినవి. అమ్మహాజనని శ్రీ మహావిష్ణువుతోడను, ఏకతముగను, తాల్చిన అవతారములన్నియును

వివరింపబడినవి. ఈ దుర్గపూజ కలకత్తాలోను, మైసూరునందును అతివైభవముగ జరుప బడును.

మహిషాసురుడు పూర్వము మైసూరు ప్రాంతములందు సంచరించుచుండెననియు, అతడు మహిషాకారమగు తల గలిగిన రాక్షసుడనియు, మనుష్యులను జంతువులను జంపి తినుచుండెననియు అంతట శ్రీమహాదుర్గ క్రోధోజ్జ్వలయై అవతరించి ఆతని నంతమొందించె ననియు పురాతన ప్రసిద్ధమైన గాధవలన విదితమగుచున్నది.

ఈదేవి కేవలము క్రూరరూపముతో గూడినదేకాక, సర్వశుభప్రదాయినియైకూడ తనరారుచుండుటచే సర్వజనారాధ్యయై శోభిల్లుచున్నది.

తాంత్రిక విధానమందీమె ఆరాధన కాధారభూతమైన మహాశక్తియై యొప్పు చున్నది. యోగమార్గమందీమె కుండలినీ శక్తియన బరగుచున్నది. జ్ఞానమార్గమందీమె బ్రహ్మవిద్యాస్వరూపిణియని నిరూపింపబడినది. భక్తిమార్గమందీమె మహామాతగ పరి గణింపబడి పూజింపబడుచున్నది. కర్మమార్గమందీమె ఇచ్ఛాశక్తియని చెప్పబడుచున్నది. వేదాంతమందీమె మూలప్రకృతిగను, మాయాస్వరూపిణిగను భావింపబడుచున్నది.

ఇట్టి సర్వమంగళ స్వరూపిణియు, మహాశక్తిమూర్తియు, సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపిణియు, మోక్షప్రదాయినియు, లోకైకమాతయునగు శ్రీ మహాదుర్గయొక్క కారుణ్యామృతపూర్ణ పూరితస్వరూపము నీ నవరాత్రులయందు భారతీయులెల్లరు నారాధించి సుఖసంపదలతోను, ఆయురారోగ్యములతోడను వర్ధిల్లుదురుగాక ! భారతభూమి సంపూర్ణ సిరి సంపదలతోగూడిన స్వాతంత్ర్యసుఖము ననుభవించుగాక ! భారతీయులందరును సోదర భావముతో నైక్యముసెంది భారతమాత అనంత విభూతులతో వెలయు ఆదిశక్తి స్వరూ పిణియని ప్రపంచమునకు ప్రదర్శింపగల భాగ్యమొదవుగాక ! సర్వజనులకు శాంతి చేకూరు గాక ! ప్రపంచమంతయు శాంతియుతమై శోభిల్లుగాక ! ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.



# పండుగలయొక్క పవిత్ర ప్రయోజనములు

శ్రీమతి వింజమూరి అనసూయాదేవిగారు

భవబంధముల బాపికొన బరమసాధనమగు భక్తిపాశముతో భగవంతుని బంధించి, పవిత్రమగు భావములతో నంతరంగమునంతను నింపి, పావనమగు భగవన్నామము నానందముతో బాడుచు, మేనెల్ల న్పులకాంకుర ప్రకరము ల్నిండార నాత్మపారవశ్యము నధికముగ ననుభవింపగలుగుటయే పుణ్యప్రదములగు పండుగలయొక్క పారమార్థిక ప్రయోజనము. తైలధారాసమాయుక్తమగు భక్తి ధారాప్రవాహ మెదనుండి పొంగి పొరల ఆనందబాష్పములు రాల హరినామసంకీర్తన మొనరింప, పూర్వులచే పర్వదినము లేర్పరుపబడినవి.

ప్రపంచముయొక్క సృష్టి, స్థితి, లయములకు కారణభూతుడైన పరమేశ్వరుని ప్రార్థించుట, భజించుట, పూజించుట, సేవించుట, మానవజీవితమును ధన్య మొనరించు కొనుటకు సాధనములైయున్నవి.

కలియుగములో మానవులు అల్పాయుష్కులును, నిరంతర రోగపీడితులును చంచలమనస్కులును ధర్మమార్గదూరులును అయియుండుటచే భక్తిమార్గము ననుసరించి భగవంతుని కరుణకు పాత్రులై తరించవలసినదే కాని జ్ఞానమార్గముచేతను యోగ సాధనలచేతను ముక్తినిపొంద సాధ్యముకాదు.

19వ శతాబ్దములో భారతదేశమునంతను భక్తిమహిమచే పవిత్రము గావించి సర్వ మతములయొక్క సామరస్యమును ప్రపంచమంతకును చాటింప అవతరించిన పుణ్యపురుషుడగు శ్రీరామకృష్ణపరమహంస కలికాలమునందు భక్తియే ముక్తికి పరమసాధనమని బోధించియుండెను.

భగవన్నామసంకీర్తనముయొక్క మహిమను, మాధుర్యమును, పూర్వము మహర్షియగు నారదుడు మొదలుకొని నేడు మహాపురుషుడని మహియం దెంతయు ప్రఖ్యాతి గాంచిన మహాత్మునివరకును ఆయాకాలములలో నుద్భవించిన మహాభక్తులెల్లరును లోకమునకు వెల్లడించియున్నారు.

హిందూమతములో పూర్వులచే నేర్పాటుగావింపబడిన పుణ్యదినములు భగవంతుని వలగొను భక్తిసాధనదినము లనబరగుచున్నవి. ఈ దినములలో భగవంతుని కీర్తించి, ఆత్మానందము ననుభవించి, ఆధ్యాత్మికాభివృద్ధిచే ఇహపరసుఖములను సాధించుకొనగల్గు

టమే ఈ పర్వముల ప్రయోజనమై యొప్పుచున్నది. ఇతర మతములలోగూడ భగవంతుని ఎక్కువగ ఆరాధించుటకు అనువగు కొన్ని ప్రత్యేక పుణ్యదినములు ఏర్పాటుచేయబడినవి.

హిందువులకు సంవత్సరాదిపండుగ మొదలుకొని సంవత్సరాంత సమీపమున వచ్చు శివరాత్రి పర్వదినము మధ్యగల పండుగలలో శ్రీరామనవమి, శ్రీకృష్ణజన్మాష్టమి, గణేశచతుర్థితో ప్రారంభించు గణపతి నవరాత్రులు, దేవీనవరాత్రులతో కూడిన విజయ దశమి, నరకచతుర్దశితోకూడ వచ్చు దీపావళి, వైకుంఠయేకాదశి, సంక్రాంతిపండుగ మొదలగు పర్వదినములు సుప్రసిద్ధములై యున్నవి.

పై పండుగులలో ఎక్కువదినములును, పెక్కుమంది హిందువులచేతను, విశేష వైభవముతోను, భక్తి పారవశ్యముతోను జరుపబడునవి, శ్రీరామనవమి అనగా శ్రీ సీతా రాముల కళ్యాణ మహోత్సవదినములు, గణపతి నవరాత్రులును, దేవీనవరాత్రులును అయి యున్నవి. ఈ పండుగలయొక్క ప్రత్యేకభక్తి ప్రాశస్త్యమొకటి గలదు. ఈ దినములలో ఎడతెగకుండ ఎక్కడచూచినను, భగవత్పూజలు, ప్రార్థనలు, భజనలు, హరికథా కాల క్షేపములు, పురాణ పఠనములు, సంగీత సభలు, నృత్యవాద్య వినోదములు మొదలగు సత్కాలక్షేపములు ప్రజలచే ఎక్కువగ జరుపబడును.

ఇట్టి పలువిధములగు దైవారాధన కార్యములు చిత్తశుద్ధిని, మనోవికాసమును హృదయానందమును ఆత్మసుఖమును ఒడగూర్చును. ఆనందముతోగూడిన ఆరాధనము ఆధ్యాత్మికాభివృద్ధికి ఎంతయు సహాయకారియని గుర్తింపనివారుండరు.

భాద్రపద ఆశ్వీజ కార్తీకమాసములు శ్రీ గణేశ పార్వతీ పరమేశ్వరులకు వరుసగ సంప్రీతికరములగు పర్వదినములతో గూడి, పుణ్యప్రదములై యొప్పుచున్నవి. భాద్రపద మాసములో గణపతి నవరాత్రములలో, ఎవని పావననామమును స్మరించుటచే ఎల్ల ఆపదలును ఆటంకములును తొలగుచున్నవో, యెవ్వని కరుణచే నెల్లకార్యములును సిద్ధిపొందగలవో, ఎవని ప్రసాదమహిమచే నెల్లవిద్యల నేర్వనగునో అట్టి, ఆదిదంపతుల అనుంగుబిడ్డడగు విఘ్నేశ్వరుని పూజించుట హిందువులందరకును విధియైయున్నది.

ఏతల్లి చల్లదనముచే అఖిలప్రాణులు ఆయురారోగ్యములచే నతిశయిల్లుచు అన్ని సుఖములను అనుభవింపగలుగుచున్నవో, యేమహామాత ఆజ్ఞకు అల్లాడి అఖిలభూతములు మాతృదేవతారాధన మొనరింప నుత్సహించుచున్నవో, యే పరమేశ్వరి కృపచే ఎల్ల శుభములు, అఖిలశక్తులు మానవులకు సంప్రాప్తించుచున్నవో అట్టి శ్రీ మహాదుర్గను ఆశ్వీజ మాసములో ఆరాధింప అఖిల హిందూ జనులకును ముఖ్యధర్మమైయున్నది.

ఏ మహాదేవుడు ఎల్లజీవులకును శుభప్రదాతయై యొప్పుచు, సర్వగురుడై, సత్య స్వరూపుడై, శుద్ధజ్ఞానమూర్తియై, సచ్చిదానందమయుడై, మూడుమూర్తులలోను మూల విరాట్పురుషుడని ఆమ్నాయములన్నిటిలో నైక్యకంఠముగ కొనియాడబడియున్నాడో అట్టి మహేశ్వరుని అభిషేకములతో నారాధింప కార్తికమాసము ఎంతయు ఘనతతో నొప్పుచున్నది. జగత్పితలగు పార్వతీ పరమేశ్వరులను ఆరాధించుట అఖిల శుభప్రదాయకమై యున్నది.

దేవీ నవరాత్రులలో, దేవీ భాగవత పురాణపఠనము ఎంతయు ముఖ్యమయి యున్నది. పురాణశ్రవణముయొక్క మహిమను కొంచముగనో, ఘనముగనో యెరుంగని మానవులుండరనియే చెప్పవచ్చును. కథలరూపముగ భగవంతుని లీలలనుగూర్చిన ప్రసంగములను వినుట, భక్తిజ్ఞాన వైరాగ్యములను పెంపొందించుటయే గాక బహు సంతోష దాయకముగకూడ నుండును.

ఉబుసుపోక, ఊరక ప్రొద్దుపుచ్చు యువతులకును, సోమరులై దుర్వ్యసనములకు లోనై చెడిపోవు యువకులకును, నిరంతర సంసారసంతాపముచే మనశ్శాంతిలేక తల్లడిల్లు గృహస్థులకును, భర్తృవియోగముచే ప్రపంచసుఖములకు దూరులైన పూర్వ సువాసినులకును, మహాపతివ్రతల చరిత్రములను విని పవిత్రములగు జీవితములను గడుప పాటుపడు ఉత్తమగృహిణులకును, కాలము చెల్లి, కట్టెచేయూతగ గొనుచు, కడునిడుమలబడుచు, కాలునిరాక కెదురుచూచుచుండు మూడుకాళ్ల ముదుసలులకును, వీరువారననేల, సమస్త జనులకును భక్తిప్రబోధకమై, దుఃఖనాశనకరమై, ఆనందదాయకమై అలరారు పురాణ శ్రవణమును, హరికథామృతాస్వాదనమును, అత్యంత సుఖానుభవములగుట అందరకును తెలిసినవిషయమే యైయున్నది.

కళలలో ఘనమై, శాస్త్రములలో గొప్పదై, భక్తిఆనందరసములతో వీనుల విందొనర్చు గానకళామాధుర్యమును తనివితీరగ గ్రోల నీపండుగదినములు ఎంతయు ప్రశస్తములై యున్నవి. దైవారాధన, విద్యాభివృద్ధి, ఆత్మశుద్ధిని కలిగించు సత్కార్యాచరణము, సంతోషముతో గూడిన సత్కాలక్షేపములు, ఇవియే పండుగలయొక్క ముఖ్య ప్రయోజనములు. బంధువర్గములతో కలిసి, పిండివంటలతోగూడిన విందుభోజనములు చేసి, అవి చక్కగ జీర్ణమగుటకై తాళవాయిద్యముతో కూడిన భజనలు సేయుటయే పండుగదినములలో సుఖానుభవములై యున్నవి. ఆత్మానందముతోగూడిన దైవారాధనకై పండుగ లేర్పడినవి.

# సమస్య

## శ్రీమతి లలితాదేవి భాస్కర్‌గారు

స్వార్జితమైన నాలుగు ఎకరాలలోను కుమారుని చదువుకోసం రెండెకరాలు అమ్మివేశాడు తండ్రి...
శేషం రెండెకరాలు వుద్యోగాన్వేషణలో ఖర్చు పెట్టాడు, పట్టభద్రుడు బాబు...
జీవనోపాధికి ఆస్తిలేదు — తనకు ఉద్యోగంలేదు...
మందుకుకూడ డబ్బులేని అతని అసహాయస్థితి, శశిని తనపొట్టను పెట్టుకుంది ..
పెళ్లియీడునచ్చిన పెద్దచెల్లెలు—అమాయకులైన పసి సోదరులు—ఇంట్లో దుర్భరదారిద్ర్యం—తనకు నిరుద్యోగం—ఇదిఒకపెద్ద సమస్య అయిపోయింది బాబుకి...
మహామ్మారిలావ్యాపించి దేశాన్ని పీల్చిపిప్పిచేస్తున్న నిరుద్యోగభూతం నోరు తెరచుకొని అతన్నిచూచి వికటాట్టహాసం చేసింది...
ఆరాటసికి లొంగిపోవడంకన్న—ఆత్మహత్య—వేరు మార్గంలేదా యీసమస్యను పరిష్కరించడానికి...?

తెల్లవారింది. నిద్రనుంచిలేచి లక్ష్మి కాలకృత్యాలు తీర్చుకొని, యింటిపనులు మొదలుపెట్టింది. ఇంతలో బాబు వొళ్లు విరుచుకుంటూ నిద్రలేచి, ముఖం కడుక్కొని, కాఫీకోసం వంటింట్లోకి వచ్చాడు. లక్ష్మి అతనికి కాఫీ అందిస్తూ ' అన్నయ్యా! మరి నీవు యీదినం యెక్కడికి వెళ్లవద్దు. నీవు చాలా నుస్తీగావున్నట్టు కనిపిస్తున్నావు' అంది.

బాబు మాట్లాడకుండా కాఫీ త్రాగేసి క్షణం నిశ్చలంగా కూర్చున్నాడు. లక్ష్మి అతని మొగంచూచి వొకనిటూర్పు విడిచింది. ఉన్నట్లుండి బాబు 'లక్ష్మి!' అన్నాడు.

ఎందుకన్నట్లుగా లక్ష్మి అతని మొగం వైపు చూచింది.

' నేను తిరిగి రెండుమూడు దినాల వరకు యింటికిరాను ' అన్నాడు బాబు యేదో ఆలోచిస్తూ.

' ఎక్కడికి వెడుతున్నావు? ' అంది లక్ష్మి నెమ్మదిగా కాఫీ చల్లార్చుకుంటూ.

' ఎక్కడికో యిప్పుడు చెప్పలేను. నేను తిరిగి వచ్చేవరకు పిల్లల్ని జాగ్రత్తగా చూస్తూవుండు. ఇంట్లో అన్నీ వున్నాయి కదూ?' అంటూ లేచాడు బాబు.

' ఉన్నవి. కాని నీవు త్వరలోరావడం మంచిది. నీ దేహారోగ్యం సరీగాలేదు. శశికికూడా వంట్లో నుస్తీగా వుంది '

' ఆలాగే ' అంటూ వొకతువ్వాలు పైమీద వేసుకొని వెళ్లిపోయాడు.

ఇంతలో శశి, మురళి వచ్చి 'అక్కా, అక్కా! అన్నయ్యయేడే?' అన్నారు యిద్దరు వొక్క సారిగా.

'అన్నయ్య పనిమీద యెక్కడికో వెళ్లాడు. ముందు మీరు కాఫీ తీసుకోండి,' అని లక్ష్మి కాఫీ గ్లాసుల్లో పోసి యిచ్చింది.

'అక్కా, నాకు పాఠం రాలేదు. అన్నయ్యాకూడా లేడు చెప్పించుకుందామంటే. చిన్నక్క చెప్పదట; చూడు మరి' అని ఫిర్యాదు చేశాడు మురళి.

ఏమే శశీ, నీవు పాఠం చెప్పనన్నావా?

'కాదక్కా, నే నిష్టంలేక చెప్పననలేదు. ఇవ్వాళ నా వంట్లో మరీ భారంగా వుంది. చూడు, నా వొళ్లెల్లావుందో' అని శశి అక్కగారిమీద చెయ్యివేసింది.

'అబ్బా! వళ్లెల్లా కాగిపోతోందో! జ్వరం బాగా వచ్చింది. తమ్ముడూ, అలమారులో కస్తూరి మాత్రలున్నాయి తీసుకోనిరా.' అంది లక్ష్మి ఖంగారుతో.

మురళి పరుగునపోయి కస్తూరి మాత్రలు తీసుకొచ్చాడు.

'శశీ, నీవుపోయి నిద్రపో. అట్టే తిరగకె' అంది లక్ష్మి, శశికి రెండు కస్తూరి మాత్రలు వేసి.

శశి మంచంమీద పరున్నది. మురళి పుస్తకం చేతులోపట్టుకొని మంచందగ్గర కూర్చొని చదువుకొంటున్నాడు. లక్ష్మి వంట చేస్తోంది.

* * *

బాబు తల్లితండ్రులు సామాన్య గృహస్థులు. బాబు, లక్ష్మి, శశి, మురళి వారి సంతానం. బాబును బి. ఎ. వరకు చదివించి పెద్ద వుద్యోగం చేస్తూవుండగా చూచి ఆనందించాలనుకొంది బాబు తల్లి. వానితండ్రి రామబాబు జిల్లాకోర్టులో గుమస్తాగా పనిచేసి నెలకు 50 రూపాయిలు సంపాదించేవాడు. బాబుకి స్కూలు ఫైనలు వరకు చదువుచెప్పించి మానేద్దామనుకొన్నాడు. కాని భార్య బాబు నెక్లైన పైకి చదివించమని పట్టు పట్టినందువల్ల రామబాబు భార్యమాట తీసివేయలేక బాబుకి బి. ఎ. వరకు చదువుచెప్పించి, మిగిలిన పిల్లలకు కూడా సామాన్యపు చదువు చెప్పించాడు, తన స్వార్జితమైన నాల్గు ఎకరములలో రెండెకరములు అమ్మి. ఇక రెండెకరముల పొలము, వొక సామాన్య గృహము, రెండు పాడిగేదెలు మిగిలినవి. బి. ఎ. పరీక్షలో మొదటితరగతిలో వుత్తీర్ణుడైన బాబు వుద్యోగంకోసం చాలా ప్రయత్నాలుచేసి విఫలుడయ్యాడు. అదే సమయంలో 'గోరుచుట్టుమీద రోకటిపోట'న్నట్లు తల్లిదండ్రులుకూడా దూరమయ్యారు. సంసారమంతా బాబు నెత్తినిపడింది. ఆ పొలంమీదనుండి వచ్చే గింజలుతోటే సంసారం గడుపవలసివచ్చుటచేత పిల్లల చదువులు ఆగిపోవలసి వచ్చింది. బాబు తన ప్రయత్నాలు సాగిస్తూనే వున్నాడు...

* * *

ఇప్పటికి రెండు సంవత్సరాలైంది బాబు తల్లిదండ్రులుపోయి. ఈ రెండేండ్లనుండీ, మానవుడు పడవలసిన కష్టములన్నీ పడుతున్నాడు బాబు. సంసారానికి పొలంమీదనుండి వచ్చే గింజలు సరిపోవుటంలేదు. అంతవరకూ తండ్రి 50 రూపాయలు పైగా తేవడంచేత సంసారం సుఖంగా జరిగిపోయేది. కాని యిప్పుడన్ని ఖర్చులు ఆ ధాన్యం మూలముగా వచ్చే సొమ్ముతోటే చేయవలసివచ్చుటచేత మధ్యమధ్య అప్పుతీస్తూ వచ్చాడు. లక్ష్మి, శశి, మురళిలు చాలా సుగుణవంతులగుటచేత సంసారానికి ఏదివున్నా యేది లేకపోయినా

గట్టుగా సాగించుకొంటున్నారు. ఎక్కడో గుమస్తాపని ఖాళీ వచ్చిందని విని స్వయంగా వెళ్లి ప్రయత్నించడానికి బయలుదేరాడు బాబు. అక్కడకూడా వీని 'ఆంధ్రత్వమే' అడ్డుతగిలింది ఉద్యోగ ప్రాప్తికి...

* * *

నాల్గవరోజు ప్రొద్దున్న 10 గంటలకు బాబు విచారవదనంతో, శూన్యహృదయంతో కాళ్లీడ్చుకొంటూ యింటికి జేరాడు—

'అక్కా, అన్నయ్య వచ్చాడే' అంటూ పరుగెత్తుకువెళ్లి యింట్లో చెప్పాడు మురళి.

లక్ష్మి గబగబ కాళ్లు కడుగుకోవటానికి నీళ్లిచ్చింది. బాబు కాళ్లు కడుగుకొనివచ్చి కూర్చున్నాడు. లక్ష్మి కొంచెము వేడిపాలు తీసుకొనివచ్చి యిచ్చింది.

'అమ్మా లక్ష్మి, శశియేది?...అవును అన్నట్లు శశికి వంట్లో సుస్తీగావుంది అన్నావు. ఎల్లావుంది?' అని అడిగాడు బాబు పాలుత్రాగుతూ.

శశికేమీ బాగాలేదన్నయ్యా. నీవు వెళ్లినరోజున జ్వరం బాగా వచ్చింది. ఎప్పటివో కస్తూరిమాత్రలు వుంటే వేశాను. మర్నాడు జ్వరం యింకా యెక్కువగావచ్చి వళ్లు తెలియకుండా పడిపోయింది. అప్పుడు డాక్టరుగార్ని పిలిపించాను. ఆయనవచ్చి 103 డిగ్రీలు జ్వరం వుందని కొన్ని మాత్రలు, అరకుయిచ్చి వెళ్లిపోయారు. రోజూ జ్వరం అల్లాగే వస్తోంది. ఏమీ తగ్గటంలేదు. డాక్టరుగారుమాత్రం రోజూ వస్తున్నారు అని చెప్పి కొంచెం ఆగి 'నీవు ఆలా ఉన్నావే అన్నయ్యా?' అంది లక్ష్మి.

'ఏమీలేదమ్మా, నిజంగా మనం అస్వతంత్ర భారతదేశంలో పుట్టినా, స్వంత రాష్ట్రమైనా లేని ఆంధ్రుడుగా పుట్టినందువల్ల అధః పతితులమైపోతున్నా మమ్మా. నేను వెళ్లిన గుమస్తాపనికి నూటయాభై దరఖాస్తులు వస్తే, కంపెనీ ఆంధ్రులదైనా వుద్యోగం మాత్రం ఆంధ్రేతరుల పరమైపోయింది. ఇంకా మనకీ దరిద్రం యెంతకాలమో తెలియడంలేదమ్మా' అంటూ శశివున్న గదిలోకి వెళ్లి మంచంమీద కూర్చొని 'శశీ!' అని తలనిమిరాడు.

శశి చాలా కష్టంతో కళ్లుతెఱచి అన్నను చూచింది.

'నీ వంట్లో యెలావుందమ్మా?'

'అబ్బా!......చెప్పలేనన్నా......నీకు ఉద్యోగం దొరికిందా?' అంటూ బాధతో కళ్లు మూసుకుంది శశి.

ఆ మాటలు వినేసరికి బాబు కళ్లు బరువెక్కాయి. శశికి ప్రతిదినము జ్వరము వస్తూనేవుంది. డాక్టరు మందులిస్తూనే వున్నాడు. కాని జ్వరం తగ్గటానికి బదులు క్రొత్తగుణాలతో హెచ్చుతూనే వుంది.

ఆరోజున ఉదయం శశికి జ్వరం విషమస్థితిలోనికి దింపింది. తక్షణం అదేదో మందు తేవడానికని ముప్పైరూపాయలిమ్మన్నాడు డాక్టరు. 'అదే ఆఖరుసారి మందు, తుది ప్రయత్నం—అ మందు వుంటే శశి జబ్బు తిరుగుమొఖం పట్టవచ్చు—తీవ్ర ప్రయత్నం చెయ్యాలి' అని చెప్పి డాక్టరు వెళ్లిపోయాడు. బాబు పరుగెత్తుకెళ్లి తన ఋణదాతను అర్థించాడు డబ్బుకోసం. ఇదివరకటి అప్పే తలమించి వుండడంచేత బాబుకి క్రొత్త అప్పు పుట్టిందిగాదు. ఏ వస్తువైనా తాకట్టుపెడదామని ఇంటికివచ్చి లక్ష్మివైపు చూచాడు. కాని లక్ష్మి వెలితిమెడ బాబు ఆశల్ని తృంచివేసింది. కాళ్లనున్న పట్టీలు తీసుకుపోతేమాత్రం నాలుగు రూపాయలకు

మించి రావు...కలతపారిన హృదయంతో, ఖంగారుపడిన కాయంతో ఇల్లంతా కలయద్రొక్కాడు బాబు పిచ్చివాడిలా. శశిని బ్రతికించుకుందామన్నా డబ్బులేకపోయిందతనికి. ఇంతలో...ఒంటిగంటయింది. డాక్టరు దగ్గిరికి పరుగెత్తాడు. డాక్టరు వచ్చి అనేకవిధాల పరీక్షించి, ఇక లాభంలేదని చెప్పి వెళ్ళిపోయాడు. ఆమాట విని లక్ష్మీ మురళిలు గట్టిగా యేడుస్తున్నారు. బాబు వారిని వోదార్చటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంతలో శశి మెల్లగా కళ్లుతెరచి, 'అక్కా! అన్నయ్య యేడే?' అంది మెల్లగా.

'ఎందుకమ్మా?' అన్నాడు బాబు శశి ముఖంలోకి చూస్తూ.

'అన్నయ్యా! నీకు వుద్యోగం దొరికిందా? అబ్బా! నాకు భయమేస్తోంది?' అంటూ కళ్లుమూసింది. మరొక క్షణంలో ఆదీపకళిక కొడికట్టింది. అందరు వొక్కసారిగా గొల్లుమన్నారు...

వారం రోజులు గడిచాయి; డాక్టరు 80 రూపాయలకు బిల్లు పంపాడు. దీనికితోడు 250 రూపాయలు యిదివరకటి అప్పు. బాబు వెఱ్ఱివాడులాగ అయిపోయాడు. తన వుద్యోగ ప్రయత్నాలకు అమ్మగా మిగిలిన యెకరం పొలం అమ్మి 400 రూపాయలు తెచ్చి అప్పులుతీర్చి మిగత 70 రూపాయిలతోటి సంసారం గడుపు తున్నాడు. ఎంతకాలం గడుస్తుంది? అయిపోయినవి డబ్బై రూపాయిలు ఆరు నెలలు తిరక్కుండా.

* * *

బాబు యిప్పుడు నిరుద్యోగంవల్ల పొట్టగడవక దుర్భరదారిద్ర్య బాధననుభవిస్తున్నాడు. ఇంట్లో గుప్పెడు గింజలులేవు. రెండు దినాలనుంచి ముగ్గురూ పస్తే. బాబు కూలికైనా వెళదామనుకున్నాడు. కాని అక్కడకూడా వాని 'పట్టభద్రతే' అడ్డుతగిలింది. తన తమ్ముడు, చెల్లెలు ఆకలికి అటమటలాడుతూంటే చూడ లేక చివరికి ప్యాక్టరీలో కూలికెళ్లాడు. అది అయినా రోజుకి అరణాలు. అది బాబు శరీరానికి పడక మూడు రోజులు జ్వరంవచ్చి మంచంమీదనుంచి లేవలేకపోయాడు. నాల్గవ రోజున జ్వరం తగ్గింది. కాని నీరసం మూలంగా కూలికి వెళ్లలేకపోయాడు. ఏమైనా దొరకుతుందేమోననే ఆశతో పెట్టెలన్నీ వెదికాడు. చివరకి తన బి. ఎ. 'సర్టిఫికేట్' మాత్రం దొరికింది. అది చూచేసరికి వానికి ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టపరీక్షలో వుత్తీర్ణులైన వారి నిస్సహాయస్థితి కళ్లకు కట్టినట్టయింది. అబ్బా! అనుకున్నాడు. క్షణంలో బాబు కండ్లలో నిరాశ, నిస్సహాయత పొడకట్టినవి—

...ఆనాడు మిగిలిన డబ్బులతో లక్ష్మీ వంట సామగ్రి తెప్పించి వంటచేసింది. అంతా భోజనం చేసారు. ఆ సాయంకాలం ముగ్గురు షికారు వెళ్లారు. బాబు ప్రస్తుత నిరుద్యోగసమస్యనుగూర్చి చెల్లికి చక్కగా చెప్పాడు...

ఆరాత్రంతా సుఖంగా పరున్నారు. బాబుకి నిద్రపట్టలేదు, యమయాతన అనుభవిస్తున్నాడు. ఒకప్రక్క దుర్భరదారిద్ర్యం—వేరొకప్రక్క సంసారం—పెండ్లి యీడువచ్చిన నిస్సహాయయగు చెల్లెలు—ప్రపంచం తెల్దియని చిన్న తమ్ముడు—వీరిని వొకదరికి చేర్చవలసినవాడు తాను—సర్వం అంధకారంలా కన్పించింది బాబుకి. ఈ క్లిష్టపరిస్థితుల్లోంచి బయలుపడటానికి వొకటేమార్గం నిశ్చయించాడు బాబు...

ఆమరునాడు పత్రికల్లో నిరుద్యోగియైన ఆంధ్ర పట్టభద్రుని ఆత్మహత్యా వృత్తాంతం ప్రకటింపబడింది. బాబు నిరుద్యోగాగ్నికి ఆహుతి అయ్యాడు. లక్ష్మీ మురళిలు నిస్సహాయులుగా దారిద్ర్యంలో విడువబడ్డారు. వారి స్థితిని చూడలేక కాబోలు సూర్యుడు పడమటిదెసకు దిగిపోయాడు బరువుగా...





కుమారి అమృతం (వయసు 11 సం॥ లు)

నాళం రామలింగేశ్వరరావు గారి కుమార్తె. 9 ఏండ్ల ప్రాయమునసే శాస్త్రయుక్తముగ భరతనాట్యము నభ్యసించి అసమాన నృత్యనైపుణ్యముచే నధికకీర్తినిగడించి ఆంధ్రదేశమునకొక దివ్యాలంకారమై నెగడుచున్నది.





శ్రీమతి సోమయాజుల లక్ష్మీకాంతమ్మగారు

# సంసారసుఖ సాధనములు

శ్రీమతి కందుకూరి మహాలక్ష్మిదేవిగారు

౦

ప్రేమయను పాశముతో బంధింపబడిన భార్యాభర్తలు. బిడ్డలను ముడులచే బిగువుగ గట్టబడి సంసారమును సర్వవిధముల చక్కగ నిర్వహించుటకు పవిత్రజీవితము, విద్యా వికాసము, పరస్పర ప్రేమాతిశయము, భగవద్భక్తి, ఉన్నతా దర్మములతోగూడిన సాంఘికాభివృద్ధియు ఆధారభూతములై యొప్పుచున్నవి.

అనుకూల దాంపత్యము

సంసారము సాగరమువంటిది. అందలి కష్టసుఖములు తరంగములువంటివి. సాగరమును దాటుటకు నావ యవసరమగునట్లు సంసారయాత్ర సాగించుటకు భార్యా భర్తలవసరము. భర్తనావగాను, భార్యా చుక్కానిగాను యేర్పడుచున్నారు. భర్త గృహస్థు, భార్య గృహిణి. వీరిద్దరి వలనను గృహమేర్పడినది. వీరిద్దఱును బండి చక్రములవంటివారు. వీరిద్దఱేకీభవించిన సంసార శకటము నిర్విఘ్నముగ సాగును. ఆయేకీభావమే అన్యోన్యానురాగము. అనురాగమే అనుకూల దాంపత్యమునకు మూలకారణము.

అనుకూల దాంపత్యమునకు ఆధారము ప్రేమ. ప్రేమ పాశమువంటిది. ప్రేమ పాశబద్ధులగు దంపతులకు కష్టములు కనబడవు. వారినిరంతర సౌభాగ్యానందములకు మేర యుండదు. ప్రేమలో సౌందర్యము, సౌఖ్యము, సంతోషము, తృప్తి, ఐకమత్యము మొదలగునవి ఇమిడియున్నవి. అద్దములో గానబడని సౌందర్యము ప్రేమలో గనిపించునని పెద్దలు నుడివిరి. ప్రేమమూర్తులకు భూలోకమే స్వర్గలోకము. ఇహసౌఖ్యమే స్వర్గసౌఖ్యము. ఇహానందమే బ్రహ్మానందము.

అతి బాల్య వివాహములవలన ప్రేమ కంతరాయము కలుగుచున్నది. వయోవివాహములు ప్రేమ నభివృద్ధి జేయుచున్నవి. యుక్త వయస్కులగు దంపతులు తమ వివేకముచే నొకరి కొకరు వశవర్తులై ప్రేమ బద్ధులగు చున్నారు. గనుక వయోవివాహములే యుత్తమమైనవి. ప్రియభాషణము, సత్ప్రవర్తనము, వినయవివేకాది సద్గుణములవలననే స్త్రీ పురుషులు పరస్పరప్రేమ పాత్రులగుదురుగాని మందులచేతను, మంత్రతంత్రములచేతను కాజాలరు.

'తలఁపు లొక్కటిగాఁగ నగ్గలపు వలపు।
చెలిమి కలిమిని దొలఁకక కలసి మెలసి।
భువిని క్షీరోదక న్యాయమునను వెలయు।
దంపతులు చేసినట్టిదే తపము తపము॥'

"అర్థం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమస్సఖా" అను ఆర్యోక్తిరీతిని భార్య పురుషునికి అర్ధశరీరముగను, స్నేహితులందరిలో నుత్తమ స్నేహితురాలుగను, యెల్లవిషయములందును భర్తతో సమానస్వాతంత్ర్యముగలదిగను యుండుటచేత నొకరి కొకరు విశ్వాసపాత్రులై, నిర్మలప్రవర్తకులై, ఐకమత్యముతో కష్టసుఖములలో నొకరి కొకరు సహాయము చేసికొనుచు ఆనందముతో దినములు బుచ్చుటయే సంసార సౌఖ్యమునకు ప్రథమ సోపానము.

## స్త్రీవిద్య

'ఆఁటినిదీవె యక్షయమహానిధి జూపునవాంజనంబునా।
రూరికివచ్చి తోడుపడనోపిన బంధుఁడు జాతివర్గముల్।
గోరనిసొమ్ము దేవనరలోక వశీకరణౌషధంబు, అసా।
ధారణమైన విద్యవసుధన్ నుతియింప వశంబెయేరికిన్॥'

'గృహిణి గృహముచ్యతే' యనునుడి ననుసరించి సంసారమును చక్కదిద్దుకొనుటకు బాధ్యత ముఖ్యముగా స్త్రీపై నాధారపడి యుండుటచేత సర్వవిధముల స్త్రీ విద్యావతిగా నుండవలయును. ఉన్నతవిద్యల నభ్యసించి యుద్యోగములు చేయుటకు గాకున్నను, గృహకృత్యముల నిర్వహించుకొనుటకును, గృహమును పరిశుభ్రముగా నుంచుకొనుటకును, దేహారోగ్యమును గాపాడుకొనుటకును, సంతానమును గాపాడుకొనుటకును, స్వయముగా వంటజేసికొనుటకును, గృహవెచ్చములను లెక్కవ్రాసికొనుటకును గృహిణియగు ప్రతిస్త్రీయున్నూ విద్య నేర్చియుండవలయును. ఇవిగాక కుట్టుపని, అల్లిక, సంగీతము మొదలగువానినిగూడ నేర్చికొనవలయును. అవివేకమను అంధకారమును దొలగించి జ్ఞానమను ప్రకాశమును గలిగించుటకు విద్య జ్యోతివంటిది.

స్త్రీలు విద్యనేర్చుటవలన, నాగరికతాభివృద్ధిజెంది సంఘమున చిరకాలము నుండియు బాధుకొనియున్న కొన్ని దురాచారములు, అతి బాల్యవివాహములు, కన్యాశుల్క, వరశుల్కములు మొదలుగాగలవి మూఢ విశ్వాసములు మొదలంట నిర్మూలమగుటకు మార్గమేర్పడును.

విద్యలవలన మనోవికాసమును, బుద్ధినైర్మల్యమును, యుక్తాయుక్తవిచక్షణజ్ఞానమును, పరోపకారబుద్ధి, భూతదయ, దైవభక్తి, శుచిత్వము, పాతివ్రత్యము,

సత్యము, ధర్మగుణము, శీలసౌష్ఠవము మొదలగు సుగుణసంపత్తి కలుగుటయేగాక, రామాయణ భాగవతాది సద్గ్రంథములను, సావిత్రి, సీత, సుకన్య, చంద్రమతి, దమయంతి, అనసూయ మొదలుగాగల యుత్తమ పతివ్రతల చరిత్రములను తమకుతామే పఠించుశక్తికూడ లభించును.

### నిరాడంబర జీవనము

స్త్రీలు విద్యనేర్పుటవలన వివేకవంతులై నిర్మలత్వముకలిగి నిరపాయమగు నిరాడంబర జీవనము సల్పుటకు మార్గమేర్పడు చున్నది. విద్యాగంధములేని యవివేకులగు స్త్రీలు తమకు ధనసమృద్ధికలదని విఱ్ఱవీగుచు, బీదలగువారి నలక్ష్యముగా జూచుచు మెడనిండా, యొడలినిండా నగలుధరించి, మిక్కిలి వెలగల వస్త్రముల గట్టుకొనుచు మసలుచుండుట మనము చూచుచున్నాము. ఇట్లు చేయువారిలో కొందరు తమనగలను చోరుల పాలొనర్చుటయేగాక, స్వప్రాణములనుగూడ గోల్పోవుచున్నారు. దేహారోగ్యకరములగు స్నానాది కృత్యముల నాచరించుచూ, జీర్ణకరములగు నాహారములను భుజించుచూ, శుభ్రమగు సాధారణవస్త్రముల ధరించుచూ, ఏవో ఒకటి రెండు భూషణముల మాత్రము నలంకరించుకొని యనవసరములగు వెలగల నగలకును, వస్తువులకును ధనమును వృథాగా వెచ్చింపక మితవ్యయమును జేయుచూ, సాధ్యమైనంతవరకు బీదల నాదరించుచు, తల్లిదండ్రులు, అత్తమామలు, బంధువులు మొదలగు పెద్దలయెడల విధేయతజూపి నడచుకొనుచు, భర్తృ శుశ్రూషాపరతంత్రతతో మెలగుచు, సంసారమును సుఖప్రదముగా కొనసాగించుకొనుటయే స్త్రీ ధర్మములలో నెల్లనుత్తమమైనవి.

### శిశుపోషణము

సంసారాభివృద్ధికి సంతానము మూలకందము. సంతానములేని సంసారము పువ్వులు లేని చెట్టువంటిది. సంతానములేనివారి చింత యింతింతయనరానిది. బిడ్డలుగలవారి భాగ్యమే భాగ్యము. వారి యానందమునకు మేరయుండదు. బిడ్డలు మాతాపితల ప్రతిబింబములే కావున తల్లిదండ్రులు తమసుఖమును జూచుకొన్నట్లే బిడ్డల సౌఖ్యమును జాగ్రత్తగా గమనించవలయును. శిశుపోషణమునకు పురుషునికంటె స్త్రీకి యెక్కువ బాధ్యత యుండవలయును. స్త్రీలు సహజముగ మృదు హృదయలగుటను, సహనగుణము గలవారగుటచేతను, కన్నకడుపగుటచేతను బిడ్డలయందు దయాభిమానముగలవారై యాదరముతోడను శ్రద్ధతోడను అమితప్రేమతోడను ఆనందముతోడను తమ సంతానమును పోషించుకొని వారు సదా ఆరోగ్యవంతులుగను, సదాచార సంపన్నులుగను, బుద్ధిమంతులుగను వినయము, వివేకము, సత్యము, దైవభక్తి, అహింస, పరోపకారము మొదలగు సుగుణములుగల వారిగను, విద్యావంతులుగను నుండునట్లు తగుశ్రద్ధ

దీసికొని వారికేవిధమగు రోగము, ప్రమాదమురాకుండా జాగ్రత్తగా కాపాడుచూ పెంచి పెద్దవారిని జేసికొనవలయును.

తల్లి తన బిడ్డలకు దినదినము స్నానముచేయించి, శుభ్రమగు దుస్తులను తొడిగి, శుచిగల భోజనముపెట్టి, సుఖనిద్రబుచ్చుచూ బిడ్డకేవిధమగు యనర్థము, అపాయము వచ్చిన తనకు కలిగినట్లు భావించి సంరక్షణము చేయుచుండవలెను.

బిడ్డలుగల గృహము లక్ష్మీకిస్థానమై సర్వమంగళముల కాటపట్టై సంతోష ప్రదముగ నుండును.

పూర్వకాలమునుంచి యిట్టి సద్గుణభావముల మదినుంచియే మన భారతస్త్రీలు తదనుగుణముగ నడచుకొని, పాతివ్రత్య ధర్మమును పాటించి నేటివరకును కీర్తిదాయినులై తేజోమూర్తులుగ వెలుంగుచున్నారన్న యంశము ఎల్లరకు విదితమైయున్నది.

## దైవభక్తి

సకల జంతుకోటియందు మానవజన్మ ముత్తమమైనదిగా నొనర్చి, జ్ఞానమను మహత్తరశక్తిని ప్రసాదించి, సర్వకాల సర్వావస్థలయందును, అన్నిచోట్లను సమాన మగు దయాదృష్టితోగాంచి సంరక్షించు సర్వేశ్వరుని విశ్వాసయుక్తమగు నిర్మల చిత్తముతో భక్తిపురస్సరముగా దినమున కొకతూరియైనను ప్రార్థించుకొనుట సర్వజను లకు విధియైయున్నది. మనుజులకు నిజమగు భక్తియేసిద్ధించిన మనోనిర్మలత్వము, పాపభీతి, సత్య, శౌచ, శాంతాది సుగుణసంపత్తి, నిరాడంబరత్వము, సౌఖ్యము, ఆనందము, పరోప కారబుద్ధియు కలుగుననుటకు సందియములేదు.

కాబట్టి ప్రతిగృహిణియు తనభర్త సౌఖ్యమునకు, తనసౌఖ్యమునకు, బిడ్డల సుఖ మునకు ప్రతిదినము భగవంతుని మనసారధ్యానించుట పరమ శ్రేయోదాయకమునకు మూలము.

# లలితసూక్తులు

లలితసూక్తుల నర్భకులందన
లాలిపాటల నిదురపుచ్చెదు
చలితహృదయను మాతృమూర్తిని
చర్చసల్పితిరే, మగువలు.
లిబ్బులుండిన నేమి, యబలకు
జబ్బుగుండెలఁ గ్రాకుచుండగ
మబ్బులతో యూహాపరంపర మసలివేధింపగ
లలితసూక్తులె యామె మనమును
లాలనము సేయుగ.

తల్లులెలమిని బిడ్డలనుగడు
నుల్లమలరగ నూరడింతురు
లలితసూక్తుల నారియే సుతు
లాలనము సేయగ.
సూక్తులుర్విని సూని జనముల
సూక్తులేయని మదిని నమ్మచు
భక్తితోడను లలితసూక్తులు
పఠనమొనరించగ.

—శ్రీ వక్కలంక రామాబాయి.

# "ఇల్లలుకగానే పండుగా?"

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

పండుగ అంటే అందరికి సంతోషమే. "సంతోషం సగంబలం" అన్నారు పెద్దలు. మనిషికి ఉన్నది పుష్టి, పసరానికి తిన్నది పుష్టి అని సామెతవుంది. ఇవన్ని స్వానుభవంమీద పెద్దలు సృష్టించారు. అవి మనం గుర్తించి మసులుకోవాలి. కాని, ఇల్లలుకగానే పండుగవుతుందా? అవదు. డబ్బుంటే, యజమాని చాలా ఖులాసాగా పండుగ వెళ్లబుచ్చుతాడు. యజమానురాలు కష్టపడి చాకిరితో తంటాలుపడుతున్నా, కూతుళ్లు అల్లుళ్లు వచ్చారన్న సంతోషముతో, పడ్డకష్టాన్ని సంతోషంగా భరించి పండుగిట్టే వెళ్లబుచ్చుతుంది:

ప్రస్తుతం, పాండవుల అజ్ఞాతవాసకష్టంలాగుంది దేశమంతాను; అంటే ఒకరి ఆధీనంలో కట్టుబడి యున్నారన్నమాట. పాండవుల రాజ్యపరిపాలనా ఐశ్వర్యదినాల్లో దసరాపండుగ వస్తే దేవీపూజచేసి, ఆయుధాల్ని పూజించి, దేశాల్ని జయించడానికి వెళ్లేవారు. సరస్వతీదేవిని మూలపూజనాటినుండి నిల్పి పూజించేవారు. అల్లాంటి ఉత్సాహదినాలు కొన్నాళ్లకు వారికి గ్రహస్థితి మారి తగ్గిపోయాయి. అరణ్యవాస కష్టంలో వారికి ఎండుగే కాని పండుగ పిండివంటలేవీ? ఆ దినాలు వెళ్లి, అజ్ఞాతవాసం చేయదలచిన దీక్షాదినం వచ్చింది. వారివారి ఆయుధాల్నిబట్టి వారిని గుర్తించవచ్చును. తమరా సంవత్సరం మరొకరులా మసలాలి, వేషాలు మార్చాలి. ఆయు




ధవిసర్జనం చేయాలి అందుకని, ఐదుగురు తమ ఆయుధాల్ని ఒక జమ్మిచెట్టుమీదుంచి,ఆ వృక్షరాజమును ప్రార్థించి, తిరిగి తమరొచ్చేవరకు వాటిని ఇతరులపహరించకుండా దాచిపెట్టమని కోరారు. వారి ధర్మమే వాటిని కాచునన్నట్టుగా, త్రిమూర్త్యాత్మకశక్తి లోకమాత వాటిని కాపాడింది. పరులకు వారి ఆయుధాలన్నీ పాముల్లా కనబడేవి. భయంచేత ఎవరూ ఆచెట్టుదరికేపోలేదు. ఆయుధాలు సురక్షితంగా సంవత్సరం ఉన్నాయి.

ఇంతలో వారి అజ్ఞాతవాసం ముగిసింది. ఆనాడు దసరా పండుగ ఆఖరురోజు. దశమితిథి, విరాటుని కొలువొదిలేశారు. తమతమ వేషాలు మార్చుకున్నారు. బృహన్నల అర్జునుడయ్యాడు, కంకుభట్టు ధర్మరాజయ్యాడు, వలలుడు భీముడయ్యాడు, అశ్వగోపరిపాలకులు నకుల సహదేవులయ్యారు. సైరంధ్రి ద్రౌపదైనది. ఇక కౌరవులతో సంధి రాయబారమో, కుదరకపోతే, యుద్ధమో తప్పదుకదా? అందుకని ఆయుధస్వీకరణానికని తమరు దాచిన జమ్మిచెట్టువద్దకు వచ్చారు. ఆచెట్టు నతిభక్తిగా పూజించారు. తమతమ కత్తి బాణాలు, గదాయుధాల్ని తీసుకున్నారు. అప్పటినుండే నేటికి, దశమిరోజున జమ్మిచెట్టుకు పూజాప్రభావ మబ్బింది. పాతుకుపోయిన పాతాచారాలను పెల్లగించడానికి వీలులేనంత కట్టుదిట్టాలుగా ఏర్పరిచారు పెద్దలు. పూర్వం స్వంత ప్రభుత్వం గనుక శక్తిపూజ చేసుకొని, వర్షాకాలం అంతరించి శరదృతువులో యుద్ధాలకి బయలుదేరేవారు కాని, పరాయిపాలనంలో బాధపడే! మనకు పూజించడానికి ఆయుధాలు లేవు; అక్కరలేదు. ఆచిహ్నాలే

పిల్లలకు గిలకలబద్దలు, బుక్కా క్రింద మారింది. దేవీపూజలు, ఉపవాసాలు, హరికథలు, బంధుప్రీతి, డబ్బున్న వాళ్లకుంది. డబ్బున్నా కష్టాలులేని ఇళ్లలో వుంది కాని, నేటిదినాలలో, నూటికి తొంభై యిళ్లలో పండుగోత్సాహమే లేదు.

పిల్లలకా పెళ్లిళ్లు, ప్రౌఢవివాహాలు, పెళ్లినాడే పిల్లని తీసుకెడతాడల్లుడు. చదువులోవుంటే, పెళ్లాంతో కాపరం పెట్టుటచే, పండక్కైనా అత్తారింటికి రాడు. నూతన యవ్వనవధువును విడవలేక పంపడు. అల్లుడు కూతురు రారు. ఉన్న కొడుకు కోడలు వెడతారు. ఆల్లాంటింట్లో పండగ సంబరమే యుండదు. కన్నె పిల్లుంటే బొమ్మలకొలువు పెట్టుకొని, పేరంటాండ్రను, తనతోడి చెలికత్తెలను తెచ్చుకుని కొంచెం సందడి చేస్తుంది. హైస్కూలు చదువుకాక, చిన్నక్లాసులు చదివే కుర్రాడుంటే, కాస్త గిలకల పద్యాలతో ఇల్లు గగ్గోలుచేసి, పప్పుబెల్లాలు, మేష్టరుగార్కి పంచెలచాపు మూట్టచెప్పిస్తాడు.

ఆ వైభోగంలేని, బిడ్డలులేని యిల్లుంటే, ఎన్నాళ్లుత్సాహంగా మగడు పెండ్లాం, పీటకోళ్లలా ఇద్దరూ ఏంసందడిగా వుంటారు ? సరి, బిడ్డలుండి, అన్నీ చేయాలని ఉత్సాహంగా ఉండే కొందరికి, వాళ్ల పూర్వ కర్మానుభవంగా డబ్బులేకుండా చేస్తాడు భగవంతుడు. పైసాలేనిదే వేషాలెల్లాగ? ఇల్లా వున్నాయి ఇప్పటి పరిస్థితులు. అందులో నిరుద్యోగ విద్యార్థికులు, మాడిపోయే బీదలు తెగించి ధనవంతుల్ని దోచుకోవడం, పైగా హత్యలుచేయడం మొదలైన భీభత్సాలతో, దేశగ్రామపట్టణాలట్టుడికిపోతుంటే, పండుగానంద మెట్లనుభవించడం ?

ఆనందమెప్పుడైతే తగ్గిందో శరీరంలో బలంలేదు. మునుపటివాళ్లు మట్టి ఇల్లులు అలుక్కొని, ముగ్గు వేసుకొని, వెల్లవేసుకొని, కలకల్లాడే గుమ్మాలకి పసుపుకుంకుమలు పెట్టుకొని వారంరోజులు నలిగిపోయేవారు. ఇప్పుడు పూరిగుడిసైనా నేలగచ్చే. కొన్ని తమాషా యిళ్లకు, లాకు తలుపుల్లాగ తలుపులు తప్ప గడపలేవు. కడిగే నేలకు ముగ్గువేయుటలేదు, గడపే లేనప్పుడు పసుపుకుంకుమలు పెట్టే బాధేలేదు. హోటలు మీల్సులు, స్వంతవంట కష్టమేలేదు. గృహిణికి ఇంటిపనే లేదు. పొట్టపూజ తప్ప, మడిదడి అమ్మవారి విగ్రహాలు తోము కొని పూజించుకొనే బాధేలేదు. అతివినయః ధూర్తలక్షణం అన్నట్లు అతి వేదాంతంలో, విగ్రహారాధన బాధే తప్పింది. యజమానికి డబ్బు సంపాదించే బాధకంటే, ఇల్లాలుచేయు కాఫీహోటల్సు టిఫెన్ బిల్లులు తీర్చుకునే బాధెక్కువైంది. ఇలా తేల్గ్గా పండుగలు జరిగిపోతున్నాయి.

కాని, పూర్వప్రతిభను నిలబెట్టే కొన్ని గృహాలున్నాయి. అవి భక్తి కుటుంబాలు, పెద్దలున్న యిళ్లు, భక్తిగలవారి గృహాలు, పీఠాధిపతుల మఠాల్లోను, ఎక్కువగా పల్లెటూళ్లలోను, భారతదేశ ప్రతిభ నిల్చి వుంది. ఆమధ్య మావూరికి కామకోటి పీఠం వచ్చింది. ఆయన వచ్చినట్లుగానే దసరా ఉత్సవాలూ వచ్చాయి. ఆబాలగోపాలంకు సంతోషమిచ్చే పండుగదే. ఆ స్వాములవారు పాడ్యమి మొదలు దశమి పర్యంతము దేవీ నవరాత్రులు జరిపారు. రమారమి ఊరంతా భోజనాలు పెట్టారు. పదిరోజులు రోజుకో బాలిక చొప్పునను, రోజుకోఏడు పెద్దదగు పిల్లకి పూజచేసి, వస్త్ర బహుమానపురస్కరముగా పదిమంది ఆడపిల్లలని, ఐదుగురు ముత్తైదువులను పూజించి సత్కరించేవారు. కాని, ఆయన వైదికి యగుటచే కొంచెం స్వశాఖాపక్షమే అవలంబించారని అనుకున్నారు కొందరు. ఆశలేనివారనుకోడం యెందుకో !

తర్వాత, మహావారులగు శాంతమ్మగారింట్లో బాగా జరిగింది దసరా వేడుక. బాల ఉపదేశంవారికీ, దేవీపూజ వారింట్లో తప్పదు. నవరాత్రులు శాస్త్రయుక్తంగా నడుపుతారా దంపతులు. బంధువుల నాహ్వానిస్తారు. వేదఘోష యొకచోట, దేవీ పురాణపఠన మొకచోట, శాస్త్రచర్చలొక చోట, హరికథా కాలక్షేపములు రాత్రులు, కుంకుమపూజలు, మోతెత్తిపోతుంటాయి. దశమినాటితో విగ్రహాన్ని ఎత్తేసి, నూతన వస్త్రాదికాలతో యథారీతి నందరిని సత్కరించి, సంతుష్టిపరచి పంపుతారు. ఈలోగా, పిల్లల వేడుకలలో పిల్లలు, అల్లుళ్ల అలకలతో అత్తలు, బంధు సత్కారంతో యజమాని, పిండివంట మొదలగు శాకపాకాలలో

వంటచేయువారు బాధపడుతూనే వుంటారు. గానసభలతో ఉద్యోగస్థుల ఉక్కిరిబిక్కిరి, సాయంకాల మయ్యేసరికి టిక్కెట్లకే తావులేక హడావుడులు పడుతుంటారు.

పండుగనాడు రోజూకంటె భోజనాలాలస్యమవుతాయి. సాధారణంగా చేసిచేసివుండడంచేత, బ్రాటో వర్లలో రాత్రివంటకు స్వస్తి చెప్పొచ్చు. తీరికయగుటచే సినీమా మొదటాటకే వెళ్లొచ్చు. ఇంట్లోచేసిన వంటలు నచ్చక, కాఫీహోటళ్లకు అల్లుళ్లు వెడతారు. పెట్టినబట్టలు బాగాలేవనో, ఖరీదు తమ దర్జాకు సరిపడనంత లేదనో, పెళ్లి కేగుల్లచేసిన అత్తారిళ్లు, ఇంకా గుల్లచేసే ధూర్తలక్షణయుతులగు యువక జామాతలు, చివరనాడు అలిగి, అత్తమామల ఉత్సాహమంతా చంపేసి, తనసొత్తే అగుటచే అధికారం చలాయించే దర్జాతో, పెళ్లాన్నికూడా తీసుకొని దశమిపండుగనాడే లేచిపోతారు కొందరల్లుళ్లు, ఇలా దిగాయి చివరకు పండుగలు.

భక్తి అంతరించింది. పటాటోపం మిగిలింది. శాస్త్రం తప్పింది. దీక్ష ఊడింది. త్యాగం పోయింది. కాని, మెట్టవేదాంతం, మూర్ఖవాదన, స్వార్థపరత్వం, అవివేకం, అనాచారం, నాస్తికత్వం ముదిరింది. పవిత్రత తొలగింది. అపవిత్రత, పాత్రానుకరణ, సినీమా ప్రవేశాలుకూడా గృహస్థులకబ్బాయి. విద్యావిజ్ఞానప్రబోధా లెక్కువగుచునే వున్నాయి. అంతకంటె అజ్ఞానం అధికమైంది. గృహిణీత్వ పవిత్రతకూడా తొలగి, విడాకు లామోదాలుకూడా కలిగాయి. పూజాభావం పోయి, నిరసనభావం కలిగింది. పనిబద్ధకం కలిగింది. మగాడికి డబ్బు సంపాదించే వీలులేదు. ఆడదానికి పనిచేసే శక్తి లోపించింది. దాంతో సంసారోత్సాహం తగ్గింది. ఈలా పండుగలన్నీ క్రమంగా ఎండుగలయాయి.

బానిసత్వం పాతాచారాలతోపాటు, డబ్బున్నా లేకపోయినా జరిపి తీరాలనే స్త్రీల నిర్బంధా లింకా కొందరిళ్లలో వున్నాయి. దేశకాలాల తోపాటు సంఘం మారాలి; మారి తీరాలి. ముందు దేశాభిమానం, స్వతంత్రాభిమానం కలగాలి. భారతీయపవిత్రత నిల్పుకోవాలి. జాతీయ విద్యావిజ్ఞానం, శాస్త్రజ్ఞానం, భగవద్భక్తి, సదాచారం నిల్పుకోవాలి. కాని, ఒక్క పండుగోత్సాహం అంటే మాటలా? ఇల్లలుకగానే పండుగవుతుందా, సరుకులు లేకుండా?

## దసరా కుసుమాలు

శ్రీమతి తాయారుగారు

దుర్గాదేవికి జేజేలూ
కాళీమాతకు జేజేలు—
దుష్టుల దునిమీ శిష్టుల నేలే
త్రిజగజ్జననికి జేజేలూ.
భారతమాతకు జేజేలూ
పరమపవిత్రకు జేజేలు—.
ముప్పదికోట్ల బిడ్డలగన్న
ముద్దుల తల్లికి జేజేలూ.
ఆంధ్రభూమికీ జేజేలూ
ఆంధ్రప్రతిభకు జేజేలు—

ఆంధ్రరాష్ట్రముకు అభ్యర్థించే
ఆంధ్రపుత్రులకు జేజేలూ.
విజయభవానికి జేజేలూ
విశ్వదాతలకు జేజేలు—
విద్యావతులకు విజయముగూర్చే
విజయదశమికీ జేజేలూ.
మహాలక్ష్మికీ జేజేలూ
మంగళగారికి జేజేలు—
మహిళామణులకు మణిహారమ్మగు
మా 'గృహలక్ష్మి'కి జేజేలు.

## • స్త్రీలు – విద్యాప్రచారము •

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

గొప్ప జనసంఖ్యగల భారతదేశంలోకల్లా ఏకొద్దిమందో అక్షరాస్యులు. మన దేశంలో విద్య చెప్పుకోదగినంత అభివృద్ధి ఇంకా పొందలేదు. ఇరవయ్యో శతాబ్దంలో కూడా విద్యావిషయికంగా మనదేశం వెనకబడి ఉండటం మన దురదృష్టం. ప్రపంచంలో నాగరికతగల దేశాలన్నిటిలోనూ చదువురానివాళ్లు చాలా కొద్దిమంది. మనదేశంలో అక్షరాస్యులే కొద్దిమంది. ఈవిషయం అందరికీ తెలిసిందే. ఆ కొద్దిమంది అక్షరాస్యులలోనూ పురుషులసంఖ్య సహజంగా అధికమై ఉంటుంది. ఇంతకూ చదివిన స్త్రీలు మనదేశంలో ఇంకా తక్కువంటే అతిశయం కాదు.



నిజానికి, కండ్లులేకుంటే మనిషి కెంతకష్టమో విద్య రాకుంటే అలాంటికష్టమే ఉంది. మానవునికి కండ్లు, బుద్ధి ఉన్నాయి గనుక తాను చూడగలిగే వస్తువుల తత్త్వాన్ని మాత్రమే తెలుసుకోగలుగుతాడు. అక్షరాస్యుడైతే చూడలేని విషయాలన్నిటినీకూడా తెలుసుకొని విజ్ఞానాన్ని పెంపొందించుకుంటాడు. తాను నివసించే స్థలమూ, తాను జీవించే వాతావరణమూ, తన చుట్టుపట్ల కనబడే పరిస్థితులూ తప్ప తక్కినదంతా చదువురానివాడికి అంధకారబంధురమే. ఇలాంటివాళ్లే ఎక్కువగా ఉన్న దేశం అస్వతంత్రగా ఉందంటే ఆశ్చర్యమేమిటి ?

చదువొచ్చిన వాళ్లంతా పుస్తకాలు తిరగేసి దేశానికిచేసిన మేలేమిటంటే, అది వేరే విషయం. దేశంలో అందరూ విద్యావంతులే అయితే అందులోని మేలు అప్పుడు తెలుస్తుంది. అందరూ విద్యావంతులైన పురుషులుగలదేశం అన్నిటిలోనూ ముందంజ వేస్తుంది; అది సహజం. పురుషులు, స్త్రీలూకూడా విద్యావంతులైతే ఆదేశం సంగతి వేరే చెప్పాలా ?

జాతీయనాయకులు మనదేశంలో చాలా రాష్ట్రాలలో ప్రభుత్వం చేస్తున్నారు. వారు దేశం మేలుకోసం పాటుపడుతూ, ఎదుర్కోవలసిన ముఖ్యసమస్యల్లో విద్యాసమస్య పెద్దది. అది వారి దృక్పథాన్నుంచి తొలగలేదు. కాంగ్రెసు ప్రభుత్వంచేస్తున్న అన్ని రాష్ట్రాలలోనూ కొద్దిగానో, గొప్పగానో విద్యాప్రచారం సాగుతూంది; ముదావహమే.

మే నెలనుంచి బొంబాయి ప్రభుత్వవర్గంవారూ తదితరనాయకులూకలిసి 'సాక్షరతా ప్రచారసమితి 'అని ఒకదాన్ని ఏర్పరుచుకొని విద్యాప్రచారం సాగిస్తున్నారు. ఇందులో స్త్రీవిద్య, వయోజనవిద్య, ఒకటేమిటి చదువురానివాళ్లందరికీ చదువు నేర్పాలనే ముఖ్యోద్దేశంతో ఈ సమితివారు పనిచేస్తూవున్నారు. చందాలు పోగుచేశారు; ప్రభుత్వసహాయం ఉంది. దేశంలో విద్యాభివృద్ధికి పాటుబడాలి, సహాయంచేయాలి, అని ఆశయంగల వాళ్లంతా ఇందుల్లోచేరి మేష్టర్లుగాను ఇనస్పెక్టర్లుగానూ తయారయ్యారు. ఇప్పుడున్న మునిసిపల్ ప్రాథమిక పాఠశాలల్లో దినానికి రెండుగంటలో, ఒకటిన్నరగంటలో రాత్రి పూట విద్యనేర్పుతున్నారు.

కర్మాగారాలలోనూ, ఇతర చోట్లలోను కూలిపనులుచేసే స్త్రీలకు రాత్రి పాఠశాలలలో విద్యనేర్పబడుతూవుంది. ఏది ఎలాఉన్నా, ద్విగుణీకృతోత్సాహంతోనూ, స్త్రీజాతిని విద్యావంతుల్ని చేయాలన్న పవిత్రోద్దేశంతోనూ ఉపాధ్యాయులు నేర్పించుతున్నారు; స్త్రీలు నేర్చుకుంటున్నారు. మిక్కిలి ఆదుర్దాతో శీఘ్రంగానేర్చుకునేవాళ్లకి మంచి పారితోషికాలు ఇస్తామని సాక్షరతాప్రచారసమితి ఉత్సాహం కల్పిస్తోంది. ప్రచారం ఫలరూపం దాల్చింది కూడాను. విద్య, సంస్కారము ఏమీలేకుండా క్రీస్తు పూర్వంనాటి ఆచార వ్యవహారాల్లో మునిగి తేల్తూన్న స్త్రీల దుస్థితిచూస్తే కడుపు తరుక్కుపోతుంది. మాతృదేవి అక్షరాస్యఅయితే బిడ్డలందరూ నిరక్షరకుక్షులై ఊరుకుంటారా? ఒక్క మాతృమూర్తి విద్యావతి కాని దోషంచేతనే ఇందరు చదువురానివాళ్లు మనదేశంలో వెలిశారంటే తప్పేమిటి?

చదువంటే మనదేశంలో ఇంగ్లీషు చదువు; మరొకటి చదువేకాదనే మూఢాభిప్రాయం ఉంది. చదువుకున్నవాడని ఎవరినైనా అంటే 'ఎందాక?'అనేప్రశ్న చప్పునవస్తుంది. ఏ బి. ఏ. దాకానో ఏ ఎం. ఏ దాకానో అంటే శాంతిస్తారు. ఊరికే మాతృభాష బాగా చదువుకున్నానంటే లక్ష్యం ఉండదు. చదువన్నా, విద్యఅన్నా ఇంగ్లీషే అనే దురభిప్రాయం మనవాళ్లలోనుంచి ఎప్పుడుపోతుందో ఆదినమే సుదినం.

ఈ దురభిప్రాయం ఉంది కాబట్టే మనము స్త్రీవిద్య అని గోలపెడితే 'ఎందుకమ్మా స్త్రీలకి విద్య, ఉద్యోగాలుచేయనా? ఊళ్లేలనా?' అని ఖండిస్తారు. సామాన్యంగా ఇలాంటి ఖండన పరంపరలకు అందఱూ గుఱిఅయ్యేవుంటారు. చదువంటే ఇంగ్లీషే, ఫలితం ఉద్యోగం చెయ్యడమే అనే అభిప్రాయం మనలోఉంటే స్త్రీలకు విద్య నేర్పుదామన్న అంతఃకరణ ఎవరికీపుట్టదు. నిజంగా చదువుకి పరమావధి ఉద్యోగం చెయ్యటమేనా? ఉద్యోగంకోసం చదువుతే జ్ఞానార్జన అనిపించుకుంటుందా? స్త్రీలు తెలుగు చదువనూ, వ్రాయనూ నేర్చుకుంటే ఆంధ్రవాఙ్మయంలోని గ్రంథాలన్నీ చదువుకోలేరా? పత్రికలు చదువుకో

లేరా? ఇవన్నీ చదువులుకావూ? తల్లిపాలు త్రాగినపిల్లలు బలంగా ఉంటారు; మాతృభాష బాగానేర్చినవారే అన్ని తెలుసుకుని విజ్ఞానవిషయకంగా పుష్టిగావుంటారు.

ఇక తల్లులందరూ తమతమ ఆడపిల్లల్ని బాలికాపాఠశాలలకి పంపి మాతృభాష బాగా నేర్పితే భవిష్యత్తు కళకళలాడుతుంది. ఇప్పుడు ఊరూరావున్న స్త్రీ సమాజాలు మహిళాసభలూ ఆయాగ్రామాల్లో సాక్షరతాప్రచార సమితిని నిర్మించుకొని చదువురాని స్త్రీలకు తీరిక సమయాల్లో ఒకగంటసేపు చదువునేర్పితే ఆవూళ్లో అందఱుస్త్రీలకూ చదువెందుకురాదు? విద్యావతులైనస్త్రీలూ, స్త్రీ జనాభ్యుదయానికి పాటుబడే మహిళాసమాజాలూ ఈ పనికి పూనుకోకుంటే పురుషులు భిక్షంపెట్టేదాకా కాచుకుని కూచుంటే అవుతుందా? నిజంగా ప్రచారంసాగిస్తే సహాయసానుభూతులు రానేవస్తాయి. విద్యాగంధంలేని స్త్రీలోకానికి జ్ఞానచక్షువులు వికసిస్తాయి. మనం కట్టేగాలిమేడలు గాలిలో కలియకుండా ఎక్కడనైనా ఒకచోట కార్యరూపం దాల్చకపోతాయా?

పురపాలకవర్గాలలోనూ, స్థానిక స్వపరిపాలనా సంస్థలలోనూ స్త్రీ సభ్యులు పెక్కుచోట్ల ఉన్నారు. తమతమ యేలుబడిలోని బాలికాపాఠశాలల్లోని ఉపాధ్యాయినిల చేతనే తీరిక సమయాల్లో వయోజనులగు స్త్రీలకు విద్య నేర్పించమంటే బాగానేఉంటుంది. చెప్పడానికేమి; చేయడంలోని కష్టనిష్ఠూరాలు స్వపరిపాలనా సంఘాలలోని సభ్యురాండ్రకే విదితము. ఏది ఎలాగైనా ఉండనీయండి. గ్రామాదులలోని కష్టజీవులగు స్త్రీలోకం సంగతేమిటి? గ్రామాలలో కర్షకులగు పురుషులకే విద్యరానప్పుడు వారి స్త్రీల నడిగేదేమిటి? అలాంటప్పుడు గ్రామాలలోని బాలికాపాఠశాలలూ, వాని అధికారులూ కండ్లు తెరవాలి. వయోజనవిద్యను ఏర్పాటుచేయించి, గ్రామంలోని పెద్దలనుచేర్చి 'సాక్షరతాప్రచార సమితి'ని నిర్మించితే అఖండఫలితాన్నే పొందవచ్చు. ఇది గ్రామపునర్నిర్మాణమునకు, తదుద్ధరణకు ముఖ్యసూత్రం అంటే నమ్మాలి. ఎందుకంటే ముఖ్యంగా విద్యాగంధము లేనివాళ్లు గ్రామాల్లో ఎక్కువమంది నివసిస్తున్నారు. హిందూదేశంలో గ్రామాలసంఖ్య వేనకువేలు. పట్టణాలలోని కార్మికులూ, పల్లెలలోని కర్షకులూ విద్యరానివాళ్లలో చేరితే బాలబాలికలకు ప్రభుత్వంవారూ స్థానికస్వపరిపాలనాసంస్థలూ పాఠశాలల్ని స్థాపించి విద్య నేర్పిస్తున్నారు. దీన్ని నిర్బంధోచిత ప్రాథమికవిద్యగా చేయాలన్న ఘర్షణలూ జరుగుతున్నాయి. వయోజనవిద్యా సమస్యనే అన్నివిధాలా ఆలోచించి అమలు జరిపింపవలసివుంది. జాతీయనాయకులకంటే అవసర రాజకీయవిషయాల్లో వారికి తీరికలేకుండావుంది. ఇక సంఘాలూ, సమాజాలు ఇవే ప్రయత్నించి అన్నిచోట్లా వయోజనవిద్య కేర్పాట్లు సాగించాలి. స్థానిక స్వపరిపాలనసంఘాలూ, పురపాలకసంఘాలు, లేడీస్‌క్లబ్బులు, సంఘ సంస్కర్తలు, సంఘనాయకులు పూనుకుంటే స్త్రీలకేమి, పురుషులకేమి, అందఱికీ విద్య చెప్పించవచ్చు. అన్నిటికీ మంత్రులమీదా, ప్రభుత్వంమీదా దాడిపడలితే ఎన్నాళ్లని చేస్తారు?

# స్వాతంత్ర్యము

విద్వాన్ కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకమ్మగారు



తనదు దేశంబు, వేసంబు, తనదు బాస, తనకులాచార పద్ధతి, తనకు మేల
టంచు నెవ్వారు నిజధర్మమందు నిల్తురార్యు లాంధ్రులు వారలే యంద్రు బుధులు

పరులభాషల వ్యవహార బాధఁబొరయకుండుటకు నేర్వ, నంతలో నుంచవలయుఁ
బరుల ధర్మాలపై బుద్ధి పారెనేని హాస్య భాజనమైపోవు నాంధ్రజాతి

జంతువులు, చెట్లు, రాళ్లు, స్వజాతిగుణము మానకుండుట గనఁడు సీ! మానవుండు
పరులధర్మం బనుష్ఠింపఁ బరువులెత్తు ఘన కలిప్రేరణంబున జ్ఞానమెడల

వ్యర్థమా ధర్మరహితమా నర్థ మట్ల కామములు దుఃఖదంబులై గానవచ్చు
నేకవాక్యత గానరాదెందునేని దేవగురు వర్జితంబైన దేశమందు

స్వైరవృత్తియు గాలిలో సాముసమము సంప్రదాయానువర్తన సౌఖ్యమిచ్చు
నూహాలంబట్టి జీవులు సాహసమునఁగట్టు తప్పిచరింతురు కలియుగమున

తోఁచినట్లెల్లఁ జేయంగఁజూచునొకఁడు చూచినట్లెల్లఁ జేయంగఁ జూచునొకతె
చూచినది తోఁచినది రెండు త్రోచియాప్త సూక్తివెంబడిఁ జరియింప ముక్తిగలుగు

కట్టుపాటుల నిలువంగఁ గష్టమంద్రు తోఁచినట్టులఁబోవ సంతోషమంద్రు
పామరుల కార్యులకు గట్టుపాట్లనుంట సద్గురూక్తుల నిలుచుట సంతసంబు

పట్టకుండుట తప్పెప్డుఁ బట్టఁదప్పు విడువకుండుట తప్పెప్డు విడువతప్పు
పట్టువిడుపులఁ బెద్దలవలననెఱిఁగి సత్పథంబునఁ జరియింప సౌఖ్యదంబు

తోఁచినటుచేసి చెడియెమున్ దొవలఱేఁడు చూచినదిగోరి సీతయు శోకమొందెఁ
జూచుటయు యోజనయుమాని ధీచతురత నాత్మతాదాత్మ్య మొందంగ నగునుశుభము

ప్రాతదియనియేది పథ్యంబు కాఁబోదు క్రొత్తదియైనంత రోతకాదు
క్రొత్త ప్రాత లేదు గురు నిగమోక్తికి సర్వకాలములఁ బ్రశస్తమదియ

ప్రాతదైనంత నెయ్యది పాడుకాదు క్రొత్తదైనంత మాత్రన గుణములేదు
ఆత్మధర్మంబు ప్రాతదై యమృతసమము నన్యధర్మంబు క్రొత్తదై హాలహలము

ఆపదలయందు స్థితిగతు లట్టునిట్టుఁ దారుమారయ్యు ధర్మంబు తప్పరాదు
మున్ను ద్రౌపది, దమయంతి బన్నములను బడియుఁ దమతమ శీలముల్ విడువరైరి

నిహము పరమునుండు నెవ్వారి కవ్వారి కుండు మంచిచెడ్డ లుర్విలోన
ఇహము పరములేక యిల్లేది? యాలేది? పసులమందగాక ప్రజలమూఁక

కానఁబడుదానికంటెను గానరాని దానియందున మతిఁబెట్టి, ధర్మమందు
స్త్రీలు పురుషులు నిలచిరి ధీరవృత్తి భరతఖండంబునందు స్వాభావికముగ

ప్రియునిమీఁదప్రేమ పిల్లలపైఁ బ్రేమ యత్తమామలందు నతిథులందు
గురులపైని భక్తి కుదిరిన యిల్లాలు కలిని కోటికొకతె గానవచ్చు

పుణ్యమని పాపమంచు నపూర్వమంచుఁ గర్మమని జన్మమంచు నాకంబటంచు
శాస్త్రమని వేదమని సాధు సంఘమనియుఁ బ్రగహము లివిసూ జీవుఁబట్టినదుప.

## ఆశీస్సు

సీ. అలరఁ 'గేసరి' యింట నల్లారుబిడ్డవై తెనుగుతల్లిప్రేమ తీపెఁగి
ప్రత్యాంధ్ర గృహలక్ష్మి ప్రతిభ జాటెడునట్టి విజయ పత్రికవౌచు వెలికిఁబ్రాకి
తనకు భాషాప్రౌఢతను జూపువారికి నపరంజికంకణా లమరదొడగి
సరస కళాభ్యాసనాసక్తి జూపెడివేళ లలనామణులకాశ లంటజేసి

గీ. ఆదిశక్తివి ముమ్మూర్తు లాంధ్రభాషా సిరికి, విద్యకు, సౌభాగ్య శీలములకు
ననుచుచాటితి వాశీస్సు లమ్మనీకు రమ్య గృహలక్ష్మి సౌభాగ్యరాజ్యలక్ష్మి.

—శ్రీ గుంటూరు విశాలాక్షి.

# ఆడువారికి వలయు ఆహారజ్ఞానము

శ్రీమతి కె. సుగుణమణిగారు

అగును పొరబాటుగాదు. "ఆడువారికివలయు అక్షరజ్ఞానము, ఆరోగ్యజ్ఞానము" అనిగాదు. ఆహారజ్ఞానమనియే నేనీమారు వ్రాయదలచుకొనిన వ్యాసాంశము. 'అక్షరజ్ఞానమును' గూర్చి ఆనేకులిదివరకే వ్రాసియుండిరి. అందు ముఖ్యముగ శ్రీ విం. అ. సూర్యనారాయణగారు జూన్‌మాసపు "గృహలక్ష్మి"లో 'ఉవిదల ఉన్నత విద్యాదర్శములు' అను వ్యాసములో వ్రాసినవి అమూల్యవిషయములు. ఆరోగ్యజ్ఞానము—వ్యాయామవిధానమునుగూర్చిగూడ పైగృహలక్ష్మి సంపాదకీయ వ్యాసములో నెన్నియో అమోఘములగు సలహాలు గలవు. సోదరీమణులు వాటిని పదేపదే పఠించి అందలి నియమములను పాటింప ప్రార్థితులు.

ఇక 'ఆహారజ్ఞానము' ఆడువారికెంత యావశ్యకమో నేనిట దెలుపనక్కరలేదు. ముప్పొద్దు వండిపోయు ముదితల ఆహారజ్ఞానముపై తనయొక్కయు, తమ భర్తలు, బిడ్డలయొక్కయు శరీరారోగ్య మాధారపడియున్నదని వ్రాయనవసరముండదు. శరీరారోగ్యమేగాదు, మానసిక ఆరోగ్యముగూడ ననవచ్చును. ఏలనన, మనము భుజించు భోజనపదార్థములను బట్టియే శరీరధారుఢ్యమును—మానసిక ప్రవృత్తియునుండునని మన పూర్వులే గాక సమకాలికుడగు గాంధిమహాశయుడుగూడ స్వానుభవముచే చాటిచెప్పిరి. పూర్వులు దెల్పిన రాజసిక, సాత్విక, తామసిక ఆహారములమాటమరచి వారలేర్పరచిన నియమములు మన్నింపకుంటిమి; ఆధునికులు దెల్పు ఆహారశాస్త్ర సూత్రములనైనను నేర్చి, ఇవియు పాటింపకుంటిమి. ఆహారజ్ఞానములేని ఆడువారు తమకుతోచిచది, తోచినట్లువండి, వడ్డించిపోయుటయు, ఆరోగ్యనియమములులేని భర్తలు, బిడ్డలు వలసినది వలసినంత తినిపోవుటయు జరుగుచున్నది. దీనిఫలితము—సారములేనితిండియు, దార్ఢ్యములేనిప్రజయు జీవములేని జాతియును. ఇవి మాటవరుసకనిన మాటలుగావు, యదార్థములు. మనపెద్దలకును మనకునుగల వ్యత్యాసము ఆహారవిధానములో, ఆరోగ్యనియమములలో, భావపటుత్వములో, శరీరదార్ఢ్యములో, జీవితపరిమాణములో జూచుకొనినచో యిందలియదార్థము సువ్యక్తముకాగలదు.

పూర్వులేర్పరచిన దేశాచారములు మనదేశశీతోష్ణ పరిస్థితులననుసరించి, ప్రకృతినియమములకు అనుగుణ్యమైన పద్ధతులమీద నియమింపబడినవి; కాని పాశ్చాత్త్య నాగరికత ప్రబలినకొలది ప్రతివారును సహజముగ లభించు ఆహారములుమాని, అన్నిట అసహజపద్ధతు లలవరచుకొనుటచే, అసంఖ్యాకవ్యాధులకు గురియై, నిర్జీవప్రజలవలె తయారయి—పెద్దలయొక్క ప్రతిష్టను దేశముయొక్క ధీరచరిత్రకు భంగముకలిగించుట తటస్థించుచున్నది. "కోటివిద్యలుకూడ కూటికొరకే సుమీ" అన్నసామెత యెల్లరెరింగినదే, ఐనను ఆ 'కూడు' ఎట్టిది తినవలెను? ఆతినుట—మనుట యెందులకు? అన్న విచక్షణ మనలో బహుస్వల్ప సంఖ్యాకులకే గలుగుచున్నది. భోజనము మనము ముప్పొద్దుచేయు ముఖ్యకార్యమేయైనను—పల్వురకుతాము భుజించు ఆహారపదార్థములలో నేమున్నది? ఏపదార్థము ఏపనిచేయుచున్నది? బిడ్డలు ఎదుగుటకు ఏవికావలెను? తాము ఏదితినవలెను, ఎంతతినవలెను? ఆహారమునకును, ఆరోగ్యమునకునుగల సంబంధమేమి? అనెడి జ్ఞానమే లేకున్నది. నిజమెరిఁగినచో 'ఆహారజ్ఞానము' అక్షరజ్ఞానముగల ఆడువారికేగాక నిరక్షరాస్యులకును ముఖ్యావసరము, ప్రప్రధమమును అని తెలియగలదు. మెట్ట వేదాంతులు కొందరు "ఆహారమునకేమి? ఈపాడు

శరీరమునకేది పడువైచిననుచాలును ; ముక్తిగదా జీవితపరమావధి ? " యనవచ్చును. కాని మనభౌతికశరీరము పుట్టిననాటినుండి యుక్తాహారమును భుజించి, యెదిగి, ఆరోగ్యవంతముగ నుండినప్పుడుగదా మనస్సు వికసించుటకును, ముక్తిగాంచుటకును వీలగుచున్నది ? ఇంకను శరీరమునకు సరిపడిన ఆహారవిధానమువలన అనేకరుగ్మతల నరికట్టవచ్చును. అదియునుగాక పెద్దలేర్పరచిన 'సాత్వికాహారము—నిరాడంబరజీవనము—ఉన్నతాశయములు' అన్న అమూల్యవాక్యములు మరచి మనలోపలువురు సరిగవీటికి వ్యతిరిక్తములగు 'తామసికాహారము'లు భుజించుచు, 'ఆడంబరజీవనము'లు జీవించుచు, 'ఆశయరహిత' బ్రతుకులు బ్రతుకుచు, కుటుంబమునకు కులమునకు దేశమునకు బరువైకడకు నిష్ప్రయోజనులై గతించుటయు జరుగుచున్నది.

ఆహార విహారములే ప్రధానముగా దోచు యీ పండుగ సమయమున మన యాహారమునుగూర్చి యీ క్రింది స్వల్పాంశములను సోదరీమణులకు దెల్ప నుద్యమించుచుంటిని. ఆహార శాస్త్రములో యిప్పటి శాస్త్రజ్ఞులు దెల్పు విషయములను పరికించి, మన పెద్దలేర్పరచిన నియమములకు అర్థము నారయచో యీ జ్ఞానమునంతయు వారలు పూర్వమే ఆర్జించి తత్తదనుగుణ్యములగు పదార్థములనే పద్ధతులనే యేర్పరచియుండిరని ఆశ్చర్యచకితులము కాగలము.

## మన శరీరము వేటితో చేయబడినది ?

మన శరీరము గర్భస్థపిండమై యుండు తరి తల్లియొక్క రక్తమునుండి (ఆమె భుజించి జీర్ణముచేసికొనిన ఆహారపదార్థములలోని) సారమును గ్రహించి యెదుగుచున్నది. జననమైనవెనుక మాతయొక్క స్తన్యము వలనను, ఆవెనుక మనము స్వయముగ భుజించు ఆహార పానీయములవలనను యీ శరీరసౌధము నిర్మింపబడుచున్నది. (నిర్మాణకర్త సర్వకర్తయగు యీశ్వరుడనుము, లేదా శరీరాంతర్గతమైయున్న జీవశక్తి యనుము.) ఎముకలు, రక్తము, మాంసము, కండరములు, నరములు మున్నగువానిచే యీ శరీరసౌధము—మనము భుజించు ఆహారపదార్థములందలి ముడిపదార్థముల (raw materials) నుండి యేర్పడుచున్నది.

## ఆ యాహారపదార్థములలో నేమున్నది ?

ముఖ్యముగ (1) నీరు (water), (2) మాంసకృత్తులు (proteins), (3) చమురు పదార్థములు (fats), (4) పిండి పదార్థములు (carbohydrates), (5) ఖనిజములు (minerals), (6) విటమినులు (vitamins) ను. మరల "వీటిలోనేమున్నద"ని ప్రశ్న రావచ్చును. నీరు—ప్రాణవాయువు (oxygen), ఉదజని (hydrogen) అను రెండు గాలుల సంయోగముచే నేర్పబడిన ద్రవపదార్థము. ఈ రెండు గాలులును, బొగ్గు (carbon) యను వివిధపాళ్లలో ఐక్యమయి 2, 3, 4 పదార్థము లేర్పడినవి ; ఇవిగాక (2) లో అదనముగా నుండునది నత్రజని (nitrogen) అను గాలియును, కొంత గంధకము (sulphur) ను, భాస్వరము (phosphorus) ను, (5) లో సున్నము (calcium), భాస్వరము, ఉప్పు (sodium), మగ్నము (magnesium), ఇనుము (iron), అయోడిను (iodine), రాగి (copper) అనునవి ముఖ్యమైన ఖనిజపదార్థములు. ఇక విటమినుల అరడజను రకములు ప్రాముఖ్యతలోనికి వచ్చినవి. ఇవియు బొగ్గు, ఉదజని, ప్రాణవాయువుల సంయోగముచే నేర్పడిన రసేంద్రియ పదార్థములే. కొన్నిటియందు నత్రజని, గంధకముగూడ నుండును. ఈ వివిధ పదార్థములు యెంతెంత యున్నవియు పాశ్చాత్తులు లెక్కకట్టిరి. మనుష్యుని శరీరములో మొత్తముమీద 10 గేలనుల (అనగా 2½ కిరసినాయిలు డబ్బాల) నీరును, 7 [illegible] చమురు పదార్థములును,

9000 పెన్సిలు మొనలకు సరిపడు బొగ్గును, చిన్నగదికి వెల్ల వేయుటకై వలయునంత సున్నమును, 3 అంగుళములు మతాబూ తీగ (magnesium ribbon) లో నున్నంత మగ్నమును, పట్టెడు గంధకమును, 2200 అగ్గి పుల్లల మందులోనికి సరిపడునంత భాస్వరమును, 2 అంగుళముల మేకులకు సరిపడు యినుమును గలదట! ఇది-శాస్త్రజ్ఞులు దెల్పు మానవశరీరముయొక్క విలువ! పాశ్చాత్త్యులు లెక్కకట్టిన యీ భౌతికవస్తువులే గాక—లెక్కలలో దెల్పరాని గొప్ప ఆధ్యాత్మిక జీవశక్తిగూడ శరీరాంతర్గతమై యుండి యీ వివిధ పదార్థములను మాంసము, రక్తము, నరములు మున్నగువానిగా మార్చి, శరీరసౌధమును నిర్మించి, పెంచి, పెద్దదిగ చేసి—యీ వినాశసౌధము నందవినాశియై యుండియుండెనని భారతీయులు జ్ఞప్తియుంచుకొనవచ్చును.

## ఆహారముయొక్క ఆవశ్యకత

శరీరమునకు ఆహారమావశ్యకమని ప్రతివారికి దెలియును. ఎందుల కావశ్యకమో సరిగ దెలియక పోవచ్చును. శరీరము యెదుగుటకును, పనిచేయుటకును కొంత శక్తి కావలెనని, దేహమునందు కొంత వేడి ఆవశ్యకమని, తిను ఆహారమునందున్న పదార్థములును శక్తియును రక్తములో ప్రవేశించి, ప్రతి అవయవమునకు చేరి అందు వినియోగింపబడి, వాటికి వలసిన శక్తిని వేడిమిని యిచ్చుచున్నవని, అందుచే శరీరము యెదుగుచు, పనిచేయుచు, సజీవముగ నుండుచున్నదని యెల్లరెరుంగకపోవచ్చును.

## వివిధ ఆహారపదార్థములు చేయు పని

మనము భుజించు ఆహారమునందు గల వివిధ పదార్థములు నీరు, మాంసకృత్తులు మున్నగునవి శరీరమునందు కొన్ని కొన్ని ముఖ్యపనులకు పనికివచ్చుచు కొన్ని ముఖ్యావసరములను తీర్చుచున్నవి. వీటిని తెలిసికొనినచో—వలయు పదార్థములను భుజించుటకును, భుజించు ఆహారములో యెదుగుటకు, బ్రతుకుటకు, ఆరోగ్యమునకు వలయునవన్నియు చేరియుండునట్లు సరిజూచుకొనుటకును, ఆయా పదార్థములు లోపించుటచే ప్రాప్తించు రోగములు (deficiency diseases) రాకుండ జేసికొనుటకు వీలగును.

నీరు :-ఇది కొద్దిగనో గొప్పగనో మనము గైకొను ప్రతిఆహారములోను యుండును. (ఉదా : పాలలో నూటికి 85 పాళ్లు, పప్పులో 10-15 పాళ్లు, గ్రుడ్లలో 73½ పాళ్లు, కూరగాయలు పండ్లు మున్నగువానిలో 60 మొదలు 95 పాళ్లు నీరే.) ఆహార స్వీకరణయందును, జీర్ణక్రియయందును, ఆహారసారమును ద్రవమువలె రక్తరూపమున ప్రతి అవయవమునకు గొనిపోవుటకును, శరీరకల్మషమును-మూత్రము, చెమటరూపమున వెడల నడచుటకును నీరు ముఖ్యావసరమై యున్నది. అదిగాక శరీరతాపమును క్రమరీతి నుంచుటలో నీరు చాల పని చేయుచున్నది.

నీరును, ప్రాణవాయువును లేనిచో ప్రాణమేలేదని తెల్పవచ్చును. మనము పీల్చు గాలిలో నున్న ప్రాణవాయువు కొంత శ్వాసకోశములలో నుండి రక్తములో ప్రవేశించి తద్వారా ప్రతి అవయవ అంతర్భాగమునకును గొనిపోబడి, అచ్చటి పదార్థములతో గలసి శక్తిని, వేడిని పుట్టించుచు, కణములకు వలయు ప్రాణము నిచ్చుచున్నదని తెలియవలెను. మాంసకృత్తులు, చమురు పదార్థములు, పిండి పదార్థములు యివి ప్రాణవాయువుతో కలసి శరీరమునకు వలయు వేడి (heat) ని, శక్తి (energy) ని యిచ్చుచు, శరీరావయవ నిర్మాణమునందు [illegible] ఎముకలు, దంతములు మున్నగువాటి నిర్మాణమునందు ఖని [illegible]

జము లెక్కువగ వినియోగింపబడుచున్నవి. ఇవి రక్తమునందును, తదితర ద్రవములయందును స్వల్పముగ నుండుచు, ఆ ద్రవములు తమతమ పనులను నిర్వహించుటయందు సహకారము గావించుచున్నవి. విటమినులు శరీరపోషణకు బహు స్వల్ప పరిమాణములలో గావలసివచ్చుచున్నవి; ఇవి లోపించినచో శరీర నిర్మాణమునకును శరీరారోగ్యమునకును భంగము కలుగుచున్నది.

## శరీరమునకు నిత్యము వలయు వేడిమి

మనము విశ్రాంతి తీసికొనుచున్నను, పని చేయుచున్నను గూడ మన శరీరమునందలి అవయవములు తమ తమ పనులు నెరవేర్చుటకును, శరీరకందరములు పనిచేయుటకును కొంత వేడిమి ముఖ్యావసరమైయున్నది. (87½ తులముల నీటికి 1 డిగ్రీ ఉష్ణము కలిగించుటకై వలయు వేడిని 1 కేలరీ calory అని పరిమాణముగ దీసి కొనినయెడల) సామాన్య మనిషికి ఒకదినమునకు వలయు ఉష్ణము 2600 కేలరీలు అయియున్నది. అతడు పని చేయుచున్నచో పనినిబట్టి గంటకు 100 మొదలు 300 కేలరీల అదనపు ఉష్ణము కావలసివచ్చుచున్నది. అట్లే ఒక స్త్రీకి నిత్యము దాదాపు 2100 కేలరీలు కావలెను; గర్భిణియైనచో 2400 ను, పాలిచ్చునామెయైనచో 3000 కేలరీలును అవసరమైయున్నవి. బాలబాలికలకు వయస్సునుబట్టి 520 మొదలు 2000 కేలరీల వేడిమి అవసరము. ఈ వేడి అంతయు మనము తిని జీర్ణించుకొనిన ఆహారమునుండి రావలసినదే. తగినంత ఆహారము లేనిదినములలో శరీరమునందలి క్రొవ్వు ఖర్చగును; అదియు లేనిచో శరీరమే దహింపబడి నానాటికి కృశించి పోవును. ఒకతులము పిండి పదార్థముగాని, మాంసకృత్తుగాని పూర్తిగా ప్రాణవాయువుతో కలసినప్పుడు 467 కేలరీల వేడిని, ఒకతులము చమురు పదార్థము 1060 కేలరీలను యిచ్చునని శాస్త్రజ్ఞులు లెక్కకట్టిరి. ఇట జ్ఞప్తియుంచుకొనవలసినదేమియన (i) ఈ పదార్థములే శరీరమునందు జీర్ణించినప్పుడు యిందు కొద్ది భాగముమాత్రమే సద్వినియోగమునకు వచ్చుననియు, (ii) మనము గైకొను ఆహారము శరీరమునకు పైన చెప్పినంతటి ఉష్ణమును సరఫరా చేయగలిగియుండవలెననియు, (iii) కేవలము కేలరీల వేడియే గాక నీరు, ప్రాణవాయువు, ఖనిజములు, విటమినులు కొంతకొంత ఆవశ్యకమనియు, (iv) ఇవన్నియు కలిగియున్నదియే 'యుక్తాహారము' అనబడుననియు జ్ఞప్తియుంచుకొనవలెను.

## మాంసకృత్తులు

ఇవి ముఖ్యముగా బిడ్డలు యెదుగుటకును, శరీరమాంసమేర్పడుటకును బనికివచ్చును. ఉష్ణము నిచ్చుటకు గూడ కొద్దిగ నుపయోగింపబడును. ఇవి యీ క్రింది పదార్థములలో యెక్కువగా నుండును. ['పాళ్లు' అని వ్రాసినప్పుడెల్లను—100 పాళ్ల ఆహారములో ఇన్నిపాళ్లు అని యెరుంగునది.] ప్రజలు తినుమాంసము (18½ పాళ్లు మాంసకృత్తు), గ్రుడ్లు (13½ పాళ్లు), పాలు (4 పాళ్లు), మున్నగునవియు, పప్పుదినుసులగు బఠాణీ (19½ పాళ్లు) కందులు (22 పాళ్లు) శెనగలు (17 పాళ్లు) మొదలగునవియు ముఖ్యమైన మాంసకృత్తు ఆహారములు. పసిపాపలకు పాలు ఉత్తమోత్తమమైన సంపూర్ణాహారము. అందు వారికివలయు మాంసకృత్తు చమురు మున్నగు పదార్థములేగాక ఖనిజములు మున్నగు సర్వపదార్థములు గలవు. ఎదుగుచున్న బాలబాలికలకు గూడ వీలైనన్ని పచ్చి, లేక, కాచిన పాలనిచ్చుట చాలమంచిది. ఈ మాంసకృత్తులయొక్క ఆవశ్యకతను గుర్తించియే పెద్దలు నిత్యము ఒక పప్పుదినుసును వాడునట్లేర్పరచిరి. పాడియొక్క ప్రాముఖ్యత యెల్లరెరింగినదే. మాంసాహారులు మాంసము, గ్రుడ్లు, చేపలు వాడుదురు. శాకాహారులు పాలు పప్పుదినుసులను మాంసకృత్తు



మిస్. కాంతామణి

'పాండురంగవిఠల్'లో వేశ్యపాత్ర నభినయించుచున్నది.





శ్రీమతి వట్టి శేషాంబగారు
పల్లెటూరి నివాసిని, తెలగాకన్య



శ్రీమతి సి. వి. రమణమ్మగారు







శ్రీ గుమ్మిడి ధనలక్ష్మి మనోహర
కుమారి

ఆహారములు తగు మిశ్రమములో వాడుటమంచిదని కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ మాంసకృత్తు పదార్థము పెద్దలకు నిత్యము 5-6 తులములును, పిన్నవారికి వయస్సునుబట్టి 5-8 తులములు అవశ్యకము. ఎదుగుచున్న బిడ్డలకు యివి యెక్కువకావలసియుండును. (8 తులములన-అంత మాంసకృత్తు పదార్థమని తెలియవలెను. 8 తులముల పప్పు, మాంసము, అనిగాదు) అందుచే ఏ ఆహారమునం దేయే వివిధ పదార్థములుగలవో ఆడువారు గమనించినచో -తత్తదనుగుణ్యములగు వానిని వాడుటకు వీలుండును.

## చమురు పదార్థములు

ఇవి వేడినిచ్చుటకును, ముఖ్యముగ కండరములకు శక్తి, అవయవములకు పుష్టినిచ్చి, శరీరమునందు నిలవ ఆహారముగా దాచబడుటకును పనికివచ్చును. మనము నిత్యమువాడు వెన్న, నేయి, నూనెలు మున్నగునవి ముఖ్యమైన చమురు (లేక, క్రొవ్వు) పదార్థములు. పాలలో 4-6 పాళ్లవరకు చమురుపదార్థమున్నది. గ్రుడ్లలో 13 పాళ్లు, మాంసములో 13 పాళ్లు, వేరుశెనగలలో 40 పాళ్లు, కొబ్బరిలో 41½ పాళ్లును చమురే. [అన్ని పదార్థములు దెల్పుట అసంభవము. అందుచే కొన్ని మాత్రమే పేర్కొనబడినవి] జంతువుల క్రొవ్వులు, చేపలనూనెలు కూడ చమురుపదార్థములుగనే పరిగణింపబడును. ఈ చమురుపదార్థములయొక్క 'ఆహారపు విలువ' (Nutritive value) యే గాక-వాటిలోనుండు విటమినుల (ముఖ్యముగ 'ఎ' 'డి' విటమినుల) వలనగూడ శరీరమునకు చాల లాభముకలుగుచున్నది. దినమునకు 4-6 తులములకు తక్కువగాని చమురుపదార్థము ప్రతివారికి ఆవశ్యకమైయున్నది. మన ప్రస్తుత భోజనవిధానములను, ఆర్థిక స్థితిగతులనుబట్టి చూచినచో-మనవారలు చమురుపదార్థములు చాలతక్కువగ నుపయోగించుచున్నట్లు తెల్లముకాగలదు. శరీరమునకు చమురుపదార్థముల ఆవశ్యకత గుర్తింపబడియే, కూరలుమున్నగునవి వండుటయందును, ఆ వెనుక ఆహారము-పలహారములతో వెన్న, నేయి, నూనెలు వాడుటయు ఆచరణలో బెట్టబడియున్నది.

## పిండి పదార్థములు

శరీరమునకువలయు వేడినిచ్చుటకై యీ పదార్థములు ముఖ్యముగ వినియోగింపబడును. మన నిత్యభోజన వస్తువులగు బియ్యము, తదితర ధాన్యపుగింజలు (జొన్నలు, చోళ్లు, గోధుములుమున్నగునవి) ముఖ్యమైన పిండిపదార్థములు, వీనిలో దాదాపు 75-80 పాళ్లు పిండియే. ఇవిగాక బెల్లము (95 పాళ్లు) చక్కెర (100 పాళ్లు) మున్నగునవియు యీ పదార్థముల క్రిందనే పరిగణింపబడును. దుంపలు (ఉర్లగడ్డ-23 పాళ్లు, చిలకడదుంపలు-31 పాళ్లు, కంద-20 మున్నగునవి, పండ్లు (అరటి-3; పాళ్లు, ద్రాక్ష-10 పాళ్లు, పనస-18 పాళ్లు, మామిడి-12 పాళ్లు, తాటి-9½ పాళ్లు) మున్నగునవి, కాయగూరలు-ఆకుకూరలు (వంగ-6 పాళ్లు, బెండ-8 పాళ్లు, పొట్ల-5 పాళ్లు, తోటకూర-6 పాళ్లు, కేబేజి-6 పాళ్లు) ఆదిగాగల ఆహారపదార్థములలో యీ పిండిపదార్థములు యెక్కువగానుండును. పప్పుదినుసులు మాంసకృత్తులుగా చెప్పబడినవని అందు చమురు పదార్థములు, పిండిపదార్థములు లేవని తలపరాదు. వాటిలోకూడ చమురు 5 పాళ్లును, పిండి 50-60 పాళ్లును ఉండును. ఇట్లే చమురుగింజలలో దాదాపు 15-30 పాళ్లు మాంసకృత్తులును, 10-30 పాళ్లు పిండిపదార్థము లును కలవు. యదార్థమునకు మనము భుజించు ప్రతి ఆహారవస్తువులయందును-ఈ మైపదార్థములేగాక, నీరు, ఖనిజములు, విటమినులు [illegible] యుండుచునేయుండునని జ్ఞప్తియుంచుకొనవలెను. పిండి,

చమురు, మాంసకృత్తు పదార్థములను జీర్ణించుకొని, శరీరావసరమునుబట్టి వానిని పరస్పరముగ మార్చగల సామర్థ్యము ప్రతిజీవికిని దైవప్రాసాదితమై యున్నది.

ఖనిజములు :—ఇవి శరీరద్రవములు తమతమ పనులు చేయుటకై అవసరమైయున్నవి. నరములు, కండరములు, యెముకలు సరిగా యేర్పడుటకును యివి కావలసియున్నవి. ఆహారమునందు యీ ఖనిజములు లోపించుటవలన రక్తహీనత (anemia), గొంతువాపు (goitre), దవడలు, కీళ్లు పడిపోవుట (tetany), ఆస్టమలేసియా మున్నగు రుగ్మతలు ప్రాప్తించును. ఆహారములో ప్రాముఖ్యతవహించు ఖనిజములు పైన పేర్కొనబడినవి. ఇవియు ఒక్కొక్కటి శరీరముయొక్క కొన్ని కొన్ని ముఖ్యావసరములను తీర్చుచుండును. ఎట్లనసున్నమును, భాస్వరమును, మగ్నమును కలసి యెముకలు, దంతములు నిర్మింపబడుటయందు అత్యంతావశ్యకములగుచున్నవి. (ఎముకలలో దాదాపు 36 పాళ్లు సున్నము, 17 పాళ్లు భాస్వరము, 1 భ్లులు మగ్నమునై యుండి, వీటి లవణములచే యెముకయొక్క 90-92 పాళ్లు నిర్మింపబడుచున్నవి.) గర్భిణి స్త్రీ గ్రహించు ఆహారమునందు తగినంత సున్నముగల కూరగాయలు, పదార్థములు లేనియెడల పిండముయొక్క యెముకలు క్రమరీతి నెదుగక చాల చిన్నశిశువు జన్మించును. సున్నము బొత్తిగా లోపించినయెడల గర్భధారణయే లేకుండును, లేదా పిండపతనము కలుగును. బాలింతరాండ్ర ఆహారములో యివి తక్కువైనయెడల, వారి పాలలో గూడ యివి లోపించి, శిశువు యెముకలు సరిగా నెదుగవు; లేదా తల్లి యెముకలు, దంతములనుండి కొంత సున్నము పాలలో జేరును; తల్లి నీరసించును. (సున్నమనఁ వట్టిసున్నము తీసికొనినచో జీర్ణమై రక్తములో ప్రవేశింపదు. ఆహారపదార్థములలోని సున్నముమాత్రమే సులభముగా శరీరమునందు యిమిడ్చికొనబడును; ఇట్లే ఇతర ఖనిజములును. అవి కూరగాయలు మున్నగువానిలో కొంతవరకు సేంద్రియ పదార్థముల రూపమున నుండును.) తెలగపిండిలో మిగతపదార్థములలోకంటె యెక్కువ సున్నము (3 పాళ్లు), తగినంత భాస్వరము (1 పాలు) యున్నవి. అందులకే కాబోలు పెద్దలు బాలింతరాండ్ర కిది తరచు యిచ్చుచుందురు. పాలలో నున్న సున్నము, భాస్వరము చాల సులభముగ వంటబట్టును. గనుక బాలింతరాండ్రు పాలు విస్తారము త్రాగవలెను. వాము, ఆవాలు, మిరియములు, కరివేప, మునగ, మున్నగువానిలోగూడ సున్నము, భాస్వరము యెక్కువగా నున్నవి. చేమదుంపలు, తోటకూరగూడ చాల మంచివి. మిగత ధాన్యములకంటె చోళ్లు యెక్కువ ఖనిజములు కలిగియుండును, ఎదుగుపిల్లలకు సున్నము అత్యంతావశ్యకము. రోజునకు వలయు సున్నము తులములో పదియవవంతు అనవచ్చును. ఇది స్వల్పముగనే తోచవచ్చును గాని మనము గైకొను ఆహారపదార్థములలో నుండు సున్నము చాల తక్కువయని జ్ఞప్తియుంచుకొనవలెను. బియ్యములో వేయికి 7 పాళ్లు మాత్రమే సున్నమున్నది; కూరగాయలోకూడ యిట్లే, బహు స్వల్ప పరిమాణము సున్నము, ఖనిజములుమాత్రమే యుండును. అందును ఉన్నదంతయు జీర్ణింపబడి ఉపయోగింపబడక పోవచ్చును. పాలు మాత్రము యీ విషయమున చాల ఉత్కృష్టమైనవి. అందుగల ఖనిజములే గాక ప్రతి పదార్థమును తల్లికిని, ఆ తల్లిపాలు త్రాగెడు శిశువునకునుగూడ చాల ఉపయుక్తములగును.

ఇనుముకూడ దినమునకు బహు స్వల్పము (తులములో 5 వ వంతు) కావలసియున్నను, యిది భోజన పదార్థములలో చాల తక్కువగ నుండును గాన, అవి పుష్కలముగ వాడినగాని శరీరమునకు వలసినంత యినుము ప్రాప్తించదు. ఈ యినుము రక్తమునందలి ఎఱ్ఱకణములలో చేరి, అవి ప్రాణవాయువును మోసికొనిపోవుటలో చాల సహాయము చేయుచున్నది. ఇనుము లోపించినచో రక్తహీనత (anemia), బలహీనత తప్పక

కలుగును. గర్భిణీ స్త్రీలు తరుచు రక్తహీనతచే బాధపడుచుందురు. ఆకుకూరలు విస్తారముగ వాడుట మంచిది. నువ్వులు, మెంతులు, జీలకర్ర, ఇంగువ, ధనియములు, వాము, తోటకూర, మునగ, మిరియములు, పసుపు మున్నగువానిలో యినుము కొంచము విస్తారముగ నున్నది. వీటిని ప్రతి కూరయందును పోపు రూపముననో మసాలరీతినో చేర్చు నియమము నేర్పరచిన పెద్దల విజ్ఞానదృష్టి అత్యంత ఆశ్చర్యకరము.

## విటమినులు

ఇప్పటికి ఎ,బి,సి,డి,యి అనునవి ప్రాముఖ్యతలోనికి వచ్చినవి. ఇవి శరీరమునకు బహుస్వల్ప పరిమాణములలో గావలసివచ్చినప్పటికి, ఆస్వల్పములోపించినచో శరీరపోషణ, కార్యక్రమము, ఆరోగ్యముసరిగా నుండవు. సహజముగలభించు ఆహారపానీయములలోను, కూరలు, పండ్లయందును యివి తగుమాత్రముగలవు; కానివాటిని మానినాగరకతా వ్యామోహముచే అసహజములగు వానిని, కర్మాగారములలో చేయబడినవానిని, నిలువ చేయబడినవానిని వాడి, నవనాగరీకులు అనేకరుగ్మతలను దెచ్చిపెట్టుకొనుచున్నారు.

ఎ:_ఇది వెన్నలో యెక్కువగనుండును. పాలు, పెరుగు, నేయి, గ్రుడ్లు, చేపలు, కాడ్ లివర్ ఆయిల్, పచ్చికూరలు మున్నగువానిలో, నిదితగినంతకలదు. కేరట్ దుంపలు, టోమెటో, మామిడి, బొబ్బాసి, నారంజ పండ్లు, బచ్చలి, కేబేజి, తోటకూర, కొత్తిమిరి, మునగకూర చాలఉపయుక్తములు; నిత్యభుజనీయములు. ఈ విటమిను ఆహారములో లోపించినయెడల కన్ను, శ్వాసకోశములు, నోరుమున్నగు చోట్లగల మ్యూకసు చర్మము యెండిపోవును; రోగకరములగు సూక్ష్మజీవులకు సులభముగలొంగిపోవును. శరీరము సరిగయెదుగుట యందును, గర్భధారణయప్పుడును, బాలింతకాలముననుగూడ యీ విటమిను ముఖ్యావసరమై యున్నది.

బి:-ఇదినీటిలో కరుగునుగాన కూరగాయలు పారించినప్పుడు ఆనీళ్లలోపోవును. పప్పుమొదలైనవి శీఘ్రముగ ఉడుకునని కొంచెముసోడా వేయుటమంచిదికాదు; అప్పుడును యీవిటమిను చెడిపోవును. కూరలు వండుటలో కొంతచింతపండు పులుసువేసి ఉడికించు పద్ధతిచాల ఉత్తమమైనది. అప్పుడు విటమినులు పాడుకావు. బి. విటమినుబియ్యపు' తౌడునందు సమృద్ధిగనున్నది; కాని నాగరికత హెచ్చినకొలది, తెల్లటి (మర) బియ్యమును తినుటనేర్చి—తౌడేకాక అమూల్యమును, బలకరమును అగు బియ్యపుగింజయొక్క పైపొరయు, అంకురమునుకూడ లేకుండజేసికొని, నిస్సారమగు అన్నమును దిననేర్చితిమి. తత్ప్రతిఫలము నరముల నీరసత్వము, బెరిబెరి (BeriBeri)యను రోగమును మనకు ప్రాప్తించినవి. దీని నెరింగి గృహిణులు దంపుడుబియ్యము అత్యంతశ్రేయస్కరమును, బలకరమును, ఆరోగ్యదాయకమునుగా దలంచి ఉపయోగింతురుగాక. అన్నము వార్చి గంజిపారబోయుటకంటె యిగరబెట్టుటవలన సారమంతయు అన్నములోనుండిపోవును. పచ్చికూరల లోను, పప్పుదినుసులు, గ్రుడ్లు, మాంసమునందును యీవిటమినుగలదు.

బి:_దీనినే 'యఫ్' విటమినుయని (6-వ దానిగా) జెప్పుదురు. ఇదియు బి తోడనే ప్రకృతి పదార్థములందు లభించును. ఇది లోపించినచో పెల్లాగ్ర (Pellagra)యను (శరీరమునందు కంతులు దద్దర్లలో) రోగము ప్రాప్తించును; నోటిపూతలు, నాలుక-పెదవులుపగలి పుండగుటకూడ కలుగునని చెప్పుదురు. గింజలు మొక్కకట్టి ఆకుకూరలలోనుగలదు.

సి:_ఇది నిమ్మ, టోమెటోమున్నగు పండ్లరసములలోను ఆకుకూరలలోనుగలదు. ఇది భోజనములో లోపించినయెడల స్కర్వీ (Scurvy)యను చర్మరోగమువచ్చును. (కారపుశెనగలవలె) భుజించినప్పుడును యీవిటమిను లభించును.

డి:-ఇదియు 'ఎ'తో కలసి వెన్నలోనుండును బిడ్డల యెముకలుల సరిగాయెదుగుట యందిదిఅత్యా వశ్యకమైయున్నది. ఇది లేనిచో ఆహారమునందు ఎంతసున్నము, భాస్వరము ఉన్నను అవి ఎముకల నిర్మాణమునందు వినియోగింపబడవు. ఇది లోపించుటచే చిన్నపిల్లలు యెదుగరు; ఎముకలు మెత్తగనుండి కురూపులు దొడ్డికాళ్లుకలవారు అగుదురు; పెద్దవారికి ఆస్టోమలేస్సియా అను రోగమువచ్చును రోగులకు కాడ్ లివర్ ఆయిలు, వెన్న, గ్రుడ్లులోని పూర్ణము మున్నగునవి వాడినచో యివి తీరును పిల్లల శరీరమునకు సూర్యోదయమునను సాయంకాలమునను సూర్యరశ్మిలో కూర్చుండబెట్టినచో ఈ విటమినులకొరత తగ్గును. ఏలనన, సూర్యరశ్మిలో అల్ట్రావైలెట్ (Ultra violet) కిరణములు యెక్కువగనుండును.

యి:-ఇది వెన్నలోను, కూరలు, మునగ, మాంసము, బఠాణీ, గోధుమ అంకురము, మొలకకట్టిన గింజలలోనుండును. ఈవిటమిను లోపించినచో ఆడువారికి గర్భమురాదు; వచ్చినను కొన్ని నెలలకే పిండపతనము జరుగును. స్త్రీ పురుషులకు కొంత నపుంసకత్వగుణములవడును. పెండ్లిసమయములందు పెద్దలేర్పరచిన మినప సున్ని యీ విషయమున కొంత మంచిదని తలంచవచ్చును.

ఈమాదిరి ఆహారజ్ఞానము కొంత తెలిసికొనినవెనుక గృహిణులు కొంతవిచక్షణ దృష్టితో "యుక్తాహారములను" సమకూర్చుకొనుటకును తామును తమ కుటుంబీకులును పుష్టిగ ఆరోగ్యముగ ఉత్సాహముగనుండుటకును వీలున్నది. సహజముగ లభించు శాఖాహారములును, పదార్థములును చాల ఉత్తమోత్తమము మనము కొను కూరగాయల 'ఆహారపువిలువ' వాటిఖరీదునుబట్టి యుండునని భావించుట మూర్ఖత్వము. చౌకగాలభించు ఆకు కూరలును, అరటిమున్నగు పండ్లును విలువగల కూరలకంటెను, యాపిల్ మున్నగు పండ్లకంటెను మంచివని గ్రహింతురుగాక. తమకును, తమపిల్లలకును వీలైనన్ని పాలు, మజ్జిగ, వెన్నలు, వాడుటఉత్తమము. వెన్న తీసిన పచ్చిపాలు (Skimmed milk)కూడ లభించినచో తప్పక వాడుటమంచిది. గ్రుడ్లుకూడ యుక్తాహారమే; యిష్టమైనవారు గైకొనవచ్చును. మాంసహారులు మాంసము, చేపలుకూడ వాడవచ్చును. (కాని వానిని పెద్దలు తామసిక ఆహారములుగ పరిగణించిరి). పండ్లు (అరటి, బొబ్బాసి మున్నగునవి), పండ్లరసములు (టోమెటో, నారింజమున్నగునవి) చాల ఆరోగ్యకరములు. వార్చిన అన్నముకన్న అత్తిసరు బలకరము. మిల్లు బియ్యముకంటె దంపుడు బియ్యము పుష్టికరము. గోధుమలు, జొన్నలు, గంటెలు, చోళ్లు చాలమంచివి. కొంత అన్నమునకు బదులు వీనిని వాడుట శ్రేయోదాయకము.

ఇట్లు అన్నియు సరిచూచుకొనుచు భుజించుటకు ఆరంభించినచో విస్తారవ్యయమగునని తలంచరాదు; తినువానియందే, మనము కొనగలవానియందే యుక్తాహారముల నేర్చి, వండుకొనుటకు వీలున్నది. అనవసరములు, అసహజములు, వ్యయములును నగు విదేశసరకులు మాని, సహజాహారముల భుజించుట శుభావహము. సాత్వికాహారము, నిరాడంబర జీవనము, ఉన్నతాశయములు అన్న పెద్దల అమూల్యసూత్రములు సోదరీమణులు నిత్యము జ్ఞప్తియుంచుకొని, తామును, తమవారును పెద్దలేర్పరచిన వివేకమార్గముల చరించి తరించెదరుగాక! ప్రతి విషయమునను పనికిమాలిన పాశ్చాత్యానుకరణగావింపక-స్వదేశ పరిస్థితులను, స్వగృహ స్థితిగతులను నెరింగి చరించెదరుగాక. తమ అభ్యుదయమునందు దేశాభ్యుదయమున్నదని గ్రహించి తమ సర్వతోముఖాభివృద్ధికై యత్నింతురుగాక!



మిస్. లలితా దేవి

నూటికి నూరుపాళ్లు తెనుగుబిడ్డ. తమ తెరమీదకు రమ్మనీ, సహజముగా అలవడ్డ
శ్రావ్యతర సంగీతాన్ని తమకు వినియోగింపవలసిందనీ ప్రథమంలో ఆమెను
సాగర్, వాడియాకంపెనీలవారు ఆహ్వానించారు. ఆమెఒప్పుకుంది. 14 చిత్రాలకు
మెరుగులు దిద్దింది. ప్రస్తుతం శ్రీ భవానీ పిక్చర్సువారి ప్రథమచారిత్రకచిత్రమైన
“చండిక” లో వీరపత్నిగా నటింప వచ్చింది. ఈమెకు సర్వదా విజయము
సిద్ధించుగాక.

# అక్టోబరులో విడుదల!

మాడరన్ సినిటోనువారి మహత్తర పౌరాణిక చిత్రము




## ఉషాపరిణయము

పద్మాసాలిగ్రాం
రాజకుమారి
విశ్వేశ్వరమ్మ
సూర్యకుమారి
భానుమతి
నీలంరాజు
వి. రాధాకృష్ణయ్య
డి. సుబ్బారావు
డి. భుజంగరావు
కృష్ణమాచార్య

డైరక్టరు : జి. వి. రావు.

కవి : టి. వీరరాఘవస్వామి.

మ్యూజిక్ : డి. సుబ్బారావు, జగదీశ సాలిగ్రాం.

*For Bookings:*

**MODERN CINETONE CO., LTD.,**
Sripuram, Royapettah, Madras.




# నాట్యక్రీడల వెలుగు వెన్నెలలు

కమలా!

నీకూ తెలుసు, శ్రావణమాస నీలమేఘాల చక్కదనాల వేళలలోకూడ పురివిప్పి యాడనేర్వని మయూరాలు పెరిగే ఈ పట్టణాలను...జలజలని ప్రవిస్తూ సెలపాటనే మరచిపోయిన సెలయేళ్లతో నిండిన ఈ పట్టణాలను...భూమికి రాలిపోయే పరిమళముల నెరుగని పుష్పసముదాయములతో నిండిన ఈ పట్టణాలను వదలి...చివరకు భావ తరంగాలపైనైనా తేలిపోయి, హాయిగా నవజీవకళల తేలిపోయే కోమలవనాల్లో హస్తాలు మోడ్చి, పరమాత్మను ప్రార్థించే గిరులలో,ఆనంద రసోద్రేకంలో ఎక్కడకో నిరామయం లోకి తరలిపోవాలనే ఆకాంక్ష ఎన్నోవత్సరాలనుండి నన్నుదహిస్తూఉన్న సంగతి నీకూ తెలుసు. కాని, ఈ బ్రతుకుతెరువు, ఈ ఉద్యోగము, ఈ గౌరవము, ఈ గర్వము ఈ నాప్రవాసపాషాణ జీవనమునుండి విదల్చుకొని బయల్పడనీయవు; గుండె క్షీణించి అగమ్య అరణ్యాలలో రోదించే కళోపాసకుని అరమోడ్పుకనులనుండి జాలువారే కన్నీటి దొంతరల నరికట్ట సాహసింపనీయవు.

కాని, అదృష్టముపండి ఒక ధనవంతుడైన సోదరుని సహాయమున విశాఖపట్టణము దగ్గిరనున్న జయపురపు అడవుల్లో స్వేచ్ఛగా తిరుగుతూ, పల్లవముల మెక్కి-కోయలపాడే ఆనందగీతికలకు రసోన్మాదినినవుతూ, కోయలుచేసే వింతనృత్యాలకు, పాడే చిత్రవిచిత్ర గేయాలకు తన్మయురాలనవుతూ ఆనందాన్ని అనుభవించడానికి చక్కటి అవకాశము లభించింది ఈమధ్య.

ఆనాడు పౌర్ణమి. కోయవాళ్లు తమతమ నృత్యములలో, ఆనందంలో తేలిపోయే రోజు అది.

'కోనవలస' దాటి, నల్లరాతికొండల కలంకృతముగా ఉన్న అడవి వృక్షాలను చూస్తూ జయపురందారిని వెళ్లిపోయే మమ్ములను, ఆకోయవాళ్లే వాళ్లరాగం వరుస, అర్థంకాని గేయాలతో, వాళ్ల సనాతన నాట్యభంగిమాలతో కలిసికొకపోయినట్లయితే

వాళ్ల నాట్యంలో ఎంతనిగూఢ సత్యము దాగిఉందో, వాళ్లపాటలు ఎంత భావోద్రేకాన్ని వ్యక్తీకరిస్తాయో నాకేనాటికి తెలిసి ఉండేవికాదనుకుంటాను.

వీళ్ల పురాతన నృత్యంలోకూడ శరీరభంగిమాలు, అవయవముల కదలికలు, రసరూపమును సృష్టించే హావభావ ప్రకటనలు, లయను కాపాడగల డప్పుల శబ్దాలు, రసతన్మయతకు దారిచూపే మురళీరవాలు, అన్నీ—అన్నీ ఉన్నాయి. ఒకరినొకరు నడుములు, కంఠాలు పట్టుకొని రసవిహారము చేస్తూఉన్నప్పుడు బృందావన రాసక్రీడలు స్మృతిపథానికి రాకమానవు.

అప్పుడు నృత్యము నాశనముచేసికొన్న ఈ పట్టణవాసులు కొన ఊపిరితో మృత్యువు నెదురుచూచే శ్వాపదాల్లాగు కన్పించారు నాదృష్టికి. నానీ చెప్పేవాడు జ్ఞాపకం లేదూ :

'Dance is Divine; and any nation that stifles its own dance, the medium of expression of its noble thoughts and emotions, will not live long.'

'నాట్యము పారమార్ధికమైనది; ఏజాతి తన ఉత్కృష్ట ఆభావాలను ఉద్రేకాలను వ్యక్తీకరించగల నాట్యశాస్త్రాన్ని నాశనము చేసివేసికొంటుందో ఆజాతి ఎక్కువకాలము జీవించి ఉండదు'అని.

నాట్యము పరమోత్కృష్టమైనకళ; సనాతనసిద్ధమైనది. వెన్నెలలో చంద్రుణ్ణి చూచి ఆకాశగంగతో ఆడుకోవాలని పైపైకిలేచే గంభీర సముద్రతరంగాలలో, ప్రళయ ప్రభంజనాలలో, ఊగిపోయే వృక్షసముదాయాల్లో, చిరుగాలి కెరటాలకు హృదయంగమముగా పాడనేర్చిన వెదురువాసాలలో, మ్రోడైన హృదయాలను చివుర్చే మురళీరవంలో, అన్నిటా ఈలయ, ఈతాండవము, ఈ నృత్యము ప్రత్యక్షమౌతుంది. వినగలిగిన వీనులకు గోళముల కదలికలోకూడ అత్యద్భుతగానకలకలము, లయ వినబడుతుంది. ఇది సహజసిద్ధమైన ప్రాణలీలాతాండవముయొక్క బాహ్యరూపము; అవయవముల నిర్హేతుక కదలిక మాత్రమేకాదు.

మానవోల్లాసమునకు ఉద్రేకపూరితమైన వ్యక్తీకారము కళ. ఆకళలయందు తన శరీరమనే వస్తువుగా, దాని ద్వారముననే హృదయ పద్మవికాసమును వ్యక్తీకరించగలిగినది ఈ నాట్యము మాత్రమే. అందువలననే ఈ హావభావ ప్రకటనలకు ఈ భంగిమలకు ఈ ముద్రలకు నాట్యమందు స్థానము.

శరీరావయవములకు ఇంపుసొంపును కూర్చేకళ, భక్తికందళిత హృదయాంతరంగులను రసతన్మయత్వములో ముంచివేయగల కళ, ముకుళితహృదయ పద్మాన్ని వికసింపజేసే ఈ కళే తప్పుడుదారి త్రొక్కి ఈ పట్టణాల్లో ఆదరణలేక మాడిపోతోంది! నాట్యాన్ని

విడనాడలేనికోయల జీవితాల్ని చూచైనా నాట్యభానునివైపు మన హృదయాలు తిరుగక పోవడం శోచనీయమైన విషయమే!

హృదయవికాసానికి నాట్యం ఎందుకు నేర్పరు మనవాళ్లు? మన బాలబాలికలకు అభిలాషతోనిండి ఆదరణనీయగల మాతృహృదయము లేకా? లేక పురుషహృదయము పాషాణ సదృశమైనదా? లేక నాట్యము ప్రబోధించే ఉత్కృష్టనీతికి, మార్పుకు అర్థంలేని వీళ్ల జీవితాలలో స్థానంలేదా?

అడవి మానసులు, అజ్ఞానులు అని పట్టణవాసులలో పిలువబడే కోయవాళ్లల్లోనే, వాళ్లహృదయాల్లోనే తాండవమాడే నాట్యాదర్శము ఈ పట్టణవాసుల్ని తాకలేక కృశించి నశించిపోతోంది! లజ్జతో భూమికి కృంగిపోయే వీళ్ల మొహాలలో ఏనాటికైనా ఇది ప్రతిఫలిస్తుందా?

నీకూ తెలుసు, కమలం! హృదయాన్ని శేకెత్తింపజేయడం ఎంత అవసరమో. కళాగీతికలను నడింపజేసే నాసీ హృదయవీణె—మహాశివుని నిత్యనూతన తాండవ నృత్యకేళికి శ్రుతి కలుపుతూఉంటుంది ఎప్పుడూ. 'విచారముకాని విచారమతనిది' అని నేనంటే ఆనాడు నీకర్థంకాలేదు. ఇప్పటికి తెలిసిందా?

ఆ సామరస్యమే మానవకృషికి ఫలితంగాఉంటే ఆహ్లాదజనితంగా ఉంటుందో, లేదో ఆలోచించుకొనవే..

కళాపిపాసతో మాతృమూర్తులు ఉత్తేజకారిణులుగా ప్రకాశించి పోవడానికి నీకు తగిన సహాయము నీవు చేయమని సదా నిన్నుకోరే,

మీ 'మణి.'

# గృహలక్ష్మి

కోనవూపిరుందిరా
ఉత్తరంజాడా
ఉత్తరంలేదంచు
'గృహలక్ష్మి' నిచ్చాడు
ఉడిగిపోయినవూపి
రుబికివచ్చింది
ఆనందమునవారికి

ఆకాశమంట
తలదగిలి
చందమామొంకరయ్యింది
తన్నడిగి
తెలుసునో
తప్పెవరిదేనో

—శ్రీ సి. హేమలతాదేవి.

# దసరా

బాలభాస్కరు నరుణ కాంతులు
ప్రాగ్దిశల వెలుగొందు వేళల
బాలయొక్కతె సెజ్జచేగొని
పూలకే తెంచుల.

జిలిబిలి పాటలబాడుచు
చెలులతో గుమిగూడివేడ్క చేతిలోవిల్లుల్
గిలకల బూనుచు సంతస
మలరగ నేతెంత్రు బాలికావళిలీలల.

పారిజాతాది సత్పరిమళ కుసుమముల్
సంతసంబున గొన్ని సంతరించి
కస్తూరికా గంధకర్పూరమాదిగ
పరిమళద్రవ్యముల్ పదిలపరచి
పుణ్యాంగనాజన పూజ్య చిహ్నములైన
పసుపు కుంకంబుల భక్తి దెచ్చి
సత్కవీశుల రచిత సద్గ్రంథములనెల్ల
భారతీపీఠాన బాదుకొల్పి
ప్రవిమలంబగు భక్తితో కవికుమారి
శారదాదేవి నర్చించు శ్రద్ధతోడ
దేవి నవరాత్రములుసల్పి తేజమలర
సంతసోత్సాహ మాత్మలో సంఘటిల్ల.

వీరగుణప్రధానమగు విల్లులనంబుల కేలదాల్చుచుల
వీరులగాథలల జనుల వీనులవిందుగ కీర్తి సేయుచుల
గారవమొప్ప స్నేహితుల గాంచుచు బెల్లము పప్పులాది
శారదవేళలల దినుచు సంతసమందుచు బాలురీగతిల.

దిరుగుచునుందురు దసరా
పరువడి దినంబులందు పరమప్రీతిల
కరుణామయి పరమేశ్వరి
నిరతంబును బ్రోచునిట్లె నిఖిలజనాళిల.

— శ్రీ దేశిరాజు భారతీ దేవి.

# స్త్రీలకు స్వాతంత్ర్య మవసరము

శ్రీమతి సోమయాజుల లక్ష్మీకాంతమ్మగారు

స్త్రీ పురుషుని సౌఖ్యార్థమై సృజింపబడిన విలాసవస్తువని కొందరి యుద్దేశము. ఆమె జన్మించునది, జీవించునది, మరణించునది కూడ పురుషునికొరకే పురుషసేవయే ఆమె జీవిత పరమావధి వినయము, కష్టసహనము, సేవ, పాతివ్రత్యము-స్త్రీ యనిపించుకొను ప్రతియామెకు నుండితీరవలెను. భర్త యెంత దుర్మార్గుడైననూ భార్య ఆవగింజంతైన అవిధేయత చూపరాదు. అతని దుశ్చేష్టల విమర్శింపరాదు. తుదకు నోరైన యెత్త కూడదు. రేయనక, పగలనక, కొట్టినభరించి, పెట్టినతిని నిష్కల్మష హృదయంతో భర్తృ పాదపంకజముల భజించుచుండవలెను. భర్త తన యొక్క హక్కులతో ననుభవించుట కెట్టి భంగమును వాటిల్లనీయకుండుటకై తన యాకృతి నెవ్వరును జూడకుండ, తన శరీరము నెవ్వరు స్పృశించకుండ జాగ్రత్తపడవలెను. ఏకారణముచేనైన సర్వసామ్య సంకలితమగు నాభోగ్య పదార్థమును నెవరైన ముట్టుకున్నచో-లేక నట్టి సందియమున కెడమున్నచో చాలును. చిల్లిపడిన మట్టికుండవలె విసిరి పారవైచెదరు. ఇందులకు సంఘము సహాయపడదు. ప్రభుత్వమడ్డురాదు. ఈ భర్తృ సేవాభిలాష అనన్య ప్రేరితమగ సహజముగ సాంఘికనియబద్ధకముగ కాక, హృదయమునుండి పొంగిపొరలివచ్చెడి ప్రేమఫలితముకాదు. అయినచో నిక చిక్కేయుండదు. స్త్రీ, స్త్రీగా పుట్టుటయే కారణముగ ఆమెకట్టి విధులు నిర్ణయింపబడినవి. ప్రపంచము పుట్టినప్పుడే పుట్టినదీ పద్ధతి దీనిని గురించి ప్రశ్నించుట కెవ్వరికినీ హక్కులేదు.

స్త్రీ గృహలక్ష్మియనియు అర్థశరీరమనియుకూడ కీర్తించుచుందురు. స్త్రీలకు వారిదుస్తుల నిర్ణయించుకొను అధికారము లేదు. మగనికి పెట్టుటకుమందు భుజించు ప్రాప్తములేదు. మగడు లేనిసమయమున గాలి పీల్చుటకైనను బయటకు కదలెనా ఆమెను సాంఘికబహిష్కరణ మొనర్చుటకు తగినంత కారణము. కనుకనే స్త్రీలను బండిలో నెక్కించి సూర్యకిరణములనైన లోనికి రానీయకుండ పైయుత్తరీయములతో గట్టిగ బంధించు పురుషులను పెక్కుమందిని చూచుచున్నాము. కాళ్లు కాలకుండ చెప్పులను, నెత్తి మాడకుండ గొడుగునైన నుపయోగింప నోచుకొనని స్త్రీ హృదయమునకురాణి, గృహమునకులక్ష్మి ప్రపంచమునకు ప్రభ్వి యనెడు బిరుదులచే సంతృప్తిపడవలెను కాబోలు! విద్యావతియైనచో తన అన్యాయాధికారమును తిరస్కరించునేమో, ప్రపంచ పరిస్థితుల నెరిగినచో స్వతంత్రతా జాడ్యమామె కంటునేమో ఇంకేమి జరిగిననేమి మునుగునో అని సర్కసులోని జంతువువలె స్త్రీని సాకుచున్నాడు పురుషుడు. స్త్రీకి సంఘమునందు స్వతంత్రస్థానములేదు. స్త్రీ స్థానము పురుషుని స్థానమునుబట్టి నిర్ణయింపబడుచున్నది. స్త్రీకి పెండ్లియైనంతనె భర్త యధీనమై పోవుచున్నది. అప్పటినుండి ఆమె అభీష్టములను, అభిప్రాయములను, అభిరుచులను భర్త పరిపాలించుట కారంభించును. ఆమె సూర్యోదయము మొదలు మరల సూర్యోదయమువరకు కొనసాగెడు కార్యక్రమమంతయు భర్త సంతృప్తికొరకే. ఈ విధముగ స్వేచ్ఛను కాలదన్నెడి స్వతంత్రాభిప్రాయశూన్యయగు భార్యను తయారుచేయుచున్నాడు. భార్యాత్వము దాస్యత్వమునకు పర్యాయపద మొనర్చినాడు.

స్త్రీ జన్మ పురుషుని సౌఖ్యముకొరకేనని స్త్రీని నమ్మించినాడు. పురుషునికంటె ముందు స్త్రీ తన సౌఖ్యము నాలోచించుకొన్నచో, మహా పాతకమను విశ్వాసము నెన్నటికిని చలింపకుండునట్లుగా నామె యందు నాటినాడు. విజయసూచక మందహాసముతో పురుషుడు "ఆమె స్వేచ్ఛను కోరుటలేదు. నాయధీన మందుండుటయే యామెకు సౌఖ్యదాయకము!" అని ప్రపంచకమునకు చాటుచున్నాడు. పాపము! స్త్రీ, పురుష సహాయములేని తన జీవనమునుగూర్చి యూహింపలేకున్నది. స్త్రీ బుద్ధి ప్రళయాంతకమనియు, స్త్రీని చెప్పుక్రింది తేలువలె పాలింపనిచో ముప్పువాటిల్లుననియు శాస్త్రములు రచించినాడు. స్త్రీలు స్వతంత్రలైనచో, అరరే... ఇకనేమున్నది? ప్రపంచము తారుమారై, సాంఘిక శాంతి నశించి నరకతుల్యమైపోవునని పెక్కుమంది భయకంపితులగుచున్నారు. స్త్రీలు స్వతంత్రలైనచో వారవినీతివర్తనులగుదురనుట కేవలము అవివేక ప్రభావమే. స్వాతంత్ర్య నిరోధమే అవినీతికి ప్రోత్సాహకరము. స్వాతంత్రమునిచ్చిన అసలు సిద్ధాంతమున కేమియు భంగమురాదు.

కొందరు స్త్రీ స్వాతంత్ర్యమునకై యింత యాందోళనమొనర్చుట వెర్రియనియు, స్త్రీ అవసరమును అర్హమునగుదానికంటె పెక్కువ స్వేచ్ఛనే యిప్పు డనుభవించుచున్నదనియు, పురుషుడు సంపాదించి తెచ్చిన దానిని యింటనుండి భుజించుట స్త్రీకి మిక్కిలి సౌఖ్యదాయకమనియు చెప్పుదురు. కనుకనే ఆమెను ఎండ తగులనీయక, వానకు తడువనీయక, ఇంటి బయటపని చేయనీయక, ఆలోచింపనీయక విలువగల బొమ్మవలె వాడుచుందురు. ఆమె పనిచేయుచున్నచో, బాధకల్గునేమోయని పురుషుడు తానే శ్రమపడి సంపాదించి పోషించుచుండును. ఆలోచించినచో ఆమె మెత్తని మనస్సు వ్యాకులపడునేమోనని తానే యాలోచించి ఆమెకొరకై సర్వకార్యముల నిర్వహించుచుండును. శ్రమపడి కళాశాలలకు వెళ్లి చదువలేదని, తానె విద్య నభ్యసించి పట్టభద్రుడగుచున్నాడు. ఆహా? ఏమి ఔదార్యాతిశయము... స్వాతంత్ర్యతా ప్రాథమికోద్దేశ్యము నెరిగినవారు యిట్లు పలుకరు. తాను స్వీకరించెడి ప్రతిఫలమునకు తగిన పరిశ్రమను తానొనర్చినప్పుడే, ఆమె యా ఫలితమునకర్హురాలు. తా నితరులకు చేయు పరిచర్యకైనను తన యిష్టములేనపుడు మానిచేయ నధికారము నుండినప్పుడే అది స్వచ్ఛందమగు సేవయనిపించుకొనును. లేనియెడల దాస్యముక్రింద చేరును. స్త్రీ ఆర్థికముగ స్వతంత్రతనొందవలెను. ఆమెకూడ తనకై తాను సంపాదింప గలిగియుండవలెను. ఆర్థికముగ తన కాళ్లమీద తాను నిలబడగల శక్తిని సంపాదింపవలెను. స్త్రీ పురుషు లిద్దరును, ఆర్థికముగ సమానమగు బాధ్యత వహింపవలెను. అసలు స్త్రీ పరాధీనతా జాడ్యమిచ్చటనే అంకురించినది. ఔషధ మిచ్చట పడిననేకాని రోగనివారణ కాదు. పురుషులాసంగిడి యాభరణములతోడను, అతడిచ్చెడి దుస్తులతోను, స్త్రీ కులికినచో ప్రయోజనము లేదు. ప్రభుత్వముకూడ నిప్పట్ల శ్రద్ధవహించి వారసత్వము మొదలగు చట్టముల సవరించి స్త్రీ పురుష పక్షపాతము తొలగించవలెను. సంఘముకూడ బాధ్యతను గుర్తించవలెను. స్త్రీని పురుషునికంటె యెక్కువగాగాని తక్కువగాని చూడరాదు. సరిసమానముగ పరిగణించవలెను. స్త్రీ స్వాతంత్ర్యముపట్ల పురుషుని విశాలదృష్టికి, గర్వము, అధికారవాంఛ, పూర్వాచారము నడ్డుతగులుచున్నవి. ఉదారస్వభావపూరితుడైనగాని, తన జన్మను సార్థకపరచుకొనజాలడు.

స్త్రీ యాజ్ఞలచే పరిపాలింపబడు పురుషులుకూడ కొంతమందిగలరనియు, వారు రేయింబవళ్లు పొలములలోను, ఆఫీసులలోను చెమటకార్చి తెచ్చెడు కష్టార్జితమంతయు వారి స్త్రీల చీరలకును, జాకెట్లకును, సినిమాలకును, సరిపోవుచున్నదనియు, వారికి కూడుగుడ్డయైన సరిగలేదనియును కొందరు చెప్పుచున్నారు. పాపమిట్టిపురుషులకు మా సంపూర్ణ సానుభూతి దెల్పుచున్నాము. వారు తమహక్కులకై పోరాడి దాస్యవిముక్తులగుదురుగాక! ఇతరులహక్కుల భంగపరచుట గొప్పపాపమని, వారిస్త్రీలు తెలిసికొనుట మిక్కిలియవసరము.

స్త్రీ, పురుషభేదములేక సర్వజనులును స్వాతంత్ర్యదేవత నారాధింతురుగాక!

# భారత స్త్రీజనోచితమగు విద్య

## శ్రీమతి పుత్సల సరోజినీ దేవిగారు

శ్లో. విద్యానామ నరస్యరూపమధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యాభోగకరీ యశస్సుఖకరీ విద్యాగురూణాం గురుః
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరాదేవతా
విద్యా రాజసుపూజ్యతే నహిధనం విద్యా విహీనః పశుః.

ఇట్లు భర్తృహారి విద్యయొక్క అమూల్యతను నిర్దేశించియున్నాడు. ఇట్టి యమూల్యమగు విద్యను ఈశ్వరసృష్టిలో సమానులగు స్త్రీ పురుషు లిరువురును బరిగ్రహింప నర్హులు.

విద్యయనగా జ్ఞానమని యర్థము. జ్ఞానమువలన వినయవివేకాది సద్గుణములు గలుగును. అందువలన యుక్తాయుక్త విచక్షణజ్ఞానముగలిగి, సత్కార్య నిర్వహణకు సమర్థత గలుగును. జ్ఞానాభివృద్ధికై పురుషులు వేద, రసాయినిక, భౌతిక, భూగోళాది శాస్త్రములను, మాతృ, పరభాషలను అభ్యసించుటయేగాక దేశక్షేమాభివృద్ధులకై కాల పరిస్థితుల ననుసరించి, రణరంగములకుడక నుద్యుక్తులై యుండవలెను. సంసారనౌకకు గృహిణి చుక్కాని. చుక్కాని లేనిచో నౌకాయానము జేయుట కడు దుర్లభము. భార్య అనుకూలవతి అయిననే భర్త కీర్తివంతుడగును. భార్య అనుకూలవతియగుట కామె జ్ఞానవతిగావలెను. అటుల జ్ఞానవతియగుటకు విద్య అత్యావశ్యకము. అయినచో స్త్రీజనోచితమగు విద్య ఎట్టిది? ఏవిధానములచే దానిని బడయవలయు? అను నీ ప్రశ్నలకు ముందు ప్రత్యుత్తరంబీయవలయు.

భారతాంగనలు తమ విద్యుక్తధర్మములను నిర్వర్తింప, వారు ముఖ్యముగా విద్యావతులై యుండవలెను. లేనియెడల వారి జీవితములు కడు దుఃఖభాజనములగును. దేశాభివృద్ధికి దారిద్ర్య ధ్వంసమునకు, గృహోద్ధరణకు స్త్రీవిద్య ప్రధానము. లేనిచో "A country trying to progress without Female education, is like a bird trying to fly with one wing" అనువాక్యమునకు మనదేశ ముదాహరణము కావలసినదే!

పై కారణములబట్టిచూడ భారత లలనారత్నముల కున్నత విద్యాభ్యాస మెంత యావశ్యకమో గోచరింపక మానదు. పూర్వము మన హిందూమాత స్వతంత్ర జీవియై, శిరోభూషణమై విరాజిల్లినదన విజ్ఞాన వికాసదీప్తుల వెదజల్లుచు, సమస్తదేశములకు

యామె బిడ్డల విజ్ఞాన సంపత్తివలననే గదా ? తురుష్కులు రాకపూర్వము, మనదేశమున విద్య ప్రబలముగనుండెడిది. వారు కాలిడినది మొదలనేక దుష్టకార్యములజేయుచు, కన్యల నపహరించుటచే బాల్యవివాహములు ప్రబలి, సమస్త విద్య లడుగంటసాగెను. మరియు పురుషుల యహంభావముగూడ నందులకుతోడై, పూర్తిగ స్త్రీజాతి నధఃపతనమొనరించెను. మరల కృష్ణదేవరాయల కాలమునుండియు స్త్రీ విద్యాంకురములు మొలకలెత్త నారంభించినవి. అనుపమాన మేధాశక్తిచేతను, అత్యంత శౌర్య పరాక్రమములచేతను, సామంతరాజుల నోడించి, ఓరుగల్లు సింహాసనమధిష్టించిన యువతీలలామ రుద్రమదేవియు, మృదుమధురశైలిని రామాయణమును రచించిన మొల్లయును, అతులిత కవితాప్రౌఢిచే వేదముల రచించిన విదుషీమణులగు గార్గి, మైత్రేయిలును, పతివ్రతాతిలకములగు సావిత్రి, అనసూయ, మున్నగు పురంధ్రీరత్నములెల్లరును భారతమాత సుపుత్రికలేగదా ? వీరందరు వనితాలోకమున కాదర్శప్రాయులు.

భారతవనిత తన సంసారజీవితమును సౌఖ్యప్రదముగ జేయుట కామె సమస్తకళల నభ్యసించి, తన విద్యుక్తధర్మములకు పతిసేవ, అతిథి సత్కారము, శిశుపోషణ, గృహ నిర్వహణము మున్నగు విద్యలందు నైపుణ్యము నొంది వినయవిధేయలతో నొప్పారుచుండవలయును.

వీటినన్నింటిని చేయుటకై దేహారోగ్యము ప్రధానము. కాన ప్రతి పాఠశాలయందును బాలికలకు దేహపరిశ్రమ నేర్పవలెను. అందువలన రూపురేఖలు వృద్ధిపొందుటయే గాక జ్ఞాపకశక్తియు వృద్ధిపొందును. విజ్ఞానసంపత్తికై దేశభాషలగు సంస్కృతము, ఆంధ్రము, హిందీ. పరభాషలగు ఆంగ్లము మున్నగున వభ్యసించి వేదము, భగవద్గీత, భారతరామాయణాదులు, పాతివ్రత్యము, నైతిక, మతవిషయములు, మితవ్యయాది విషయముల బోధించు గ్రంథములను పఠింపజేయవలెను. సంసారమును నెఱపుటలో నార్థిక విషయము ప్రధానముగాన గణితశాస్త్రమునందుగూడ ప్రవేశముండవలెను. దేశకాలస్థితుల నరయుటకై దేశచారిత్రముల బోధింపవలెను. భారతదేశ బానిసత్వమును బాపుటకు నూలువడకుట, బట్టలునేయుట, కుట్టుట, చిత్రములగు చేతిపనులు జేయుట నేర్పవలెను. విపులముగ సుదతులకు శిశుపోషణా విధానమును, పాకశాస్త్రమును దెలుపవలెను. వీనితో స్వల్ప వైద్యపరిజ్ఞానముగూడ గలుగజేయు టత్యవసరము. సంగీతము, చిత్రలేఖనము మొదలగు కళలం దభివృద్ధిజేయవలెను.

ప్రస్తుతము బాలికోన్నత పాఠశాలలతి స్వల్పమగుటచే స్త్రీ లున్నతవిద్య బడయుటకై పురుష విద్యానిలయములలో చదువుచుండుటచే వారి కుచితవిద్య లభించుటలేదు.

ఇంకను బాలికోన్నత పాఠశాలల నభివృద్ధిజేసి పై విద్యల బోధింపజేసినచో భారతభామలు మైత్రేయిగార్గిలవలె నాచంద్రతారకముగ వెలయగలరు.

మరియు, శిశుపురోభివృద్ధికి మాతయే మార్గదర్శకురాలు. తన బిడ్డల యోగ్యత లామెపై నాధారపడియుండును. కాన ఆమె విద్యావిహీనయై, మూర్ఖురాలైనచో తన సంతానమును సన్మార్గమునకు ద్రిప్పుట యశక్యమై, వారి భావిజీవిత సౌధముల గూలద్రోసిన దగును. జీజియాబాయి విద్యావతియగుటచేతనేగదా సకల సుగుణోపేతయై, కుమారుడగు శివాజీకి దైవభక్తి, హిందూమతసంరక్షణ మున్నగునవి తెలుపుటయేగాక బలపరాక్రమ ములను సూచించెడి పురాణకథలను, భక్తిరసపూరితములగు కీర్తనలను బోధించి, ఆదర్శ ప్రాయునిగ జేయగలుగుట! విద్యావతి తనభర్తకు కర్తవ్యమునందు, ఆలోచనయందు మంత్రిగను, సుఖదుఃఖములయందు సహకారిణిగను సర్వకాల సర్వావస్థలయందు చేదోడు వాదోడుగ నుండును.

విద్యావతిలో నిట్టి యపూర్వశక్తు లిమిడియున్నవి. కాన పుత్రులకేగాక పుత్రికలకు గూడ నున్నత విద్యాభ్యాసమున కవకాశమిచ్చి, వనితాలోకము నుద్ధరించు భారము తల్లి దండ్రులపై నాధారపడియున్నది. వనితాలోకమునే గాదు, యావద్భారతదేశమును మహోన్నతదశకు తెచ్చి, ప్రాచీనాభ్యున్నతిని మరల స్మరింపజేసి, దేశమాతను సౌఖ్య డోలికల నోలలాడించగలరనుటలో నతిశయోక్తిలేదు.



# జ్వరము వ్యాపారమునకు హానికరము.

బంద్రా వ్యాపారస్థులగు యన్. వి. రావుగారిట్లు వ్రాయుచున్నారు:-

నేను మూడువారములలో నొక కంట్రాక్టును ఏర్పాటుచేసుకొనవలసియుండెను. ఇంతలో నేను జ్వరముచే పీడింపబడితిని. ఆరోగ్యము బాగుపడునపుడుగూడ నేను వ్యాపారమును బొత్తిగ నిర్వహింపలేకుంటిని. ఆహారము నోటికి హితవుతప్పెను. తినినది వాంతియయ్యేడిది. నా తూకము తగ్గిపోయెను. డాక్టరు సలహాపైన హార్లిక్సు వాడినంతనే అద్భుతమగు మార్పుకలిగి, నీరసముపోయినది. నా కాంట్రాక్టును భద్రపరచుకొనగలిగినట్టి బలమును ప్రసాదించిన హార్లిక్సు నా వ్యాపారమును రక్షించినది దానిమేలు మరువజాలను.

నేడే హార్లిక్సును కొనుడు అన్నిచోట్ల దొరకును.

# స్త్రీజనాభ్యుదయమునకు వలయు సాధనములు

శ్రీమతి వట్టి శేషాంబగారు

ఆంధ్రాభ్యుదయమునకు రాష్ట్రనిర్మాణమునకు
స్త్రీ లేవిధముగా కృషి చెయ్యవలసియున్నది?

ఆంధ్ర రమణీమణులు స్వరాష్ట్రవిషయమున మూకీభావము వహించినచో వారి యశశ్చంద్రికకు కళంకము. ఆంధ్రరక్తముపారుచు మెదడుపనిచేయుచున్న ప్రతియాంధ్ర వ్యక్తియుగూడా నీరాష్ట్రోద్యమము విషయమై ఆలోచించుట, చర్చించుట, పనిచేయుట కర్తవ్యము. కాని ఈ సమస్య కింకను తగినంత బలము చేకూరలేదు. ఇందువిషయమై ప్రస్తుతము ఆంధ్రసోదరులు సలుపుచున్న కృషికింకను తగినశక్తి కావలయును. జాతీయోద్యమము వంకచూడుడు. అందు భారతదేశ స్వాతంత్ర్యమునకై పురుషులతోపాటు సమానముగా స్త్రీలుకూడా తమ సర్వశక్తుల ధారపోసియున్నారు. ఏదీ, ఆంధ్రరాష్ట్రోద్యమమున కట్టి సహాయసంపద? భారతదేశమున స్త్రీ, భర్తయొక్క అర్ధాంగి యన్నసూక్తి సర్వదావర్తించును. అట్టిచో ఆంధ్రోద్యమమునందు స్త్రీలు పాల్గొనుటలేదన్నచో నాంధ్రులలో సగముమందియైన ఆంధ్రరాష్ట్రము వాంఛించుట లేదన్నమాట. స్త్రీలు వీరపత్నులు వీరమాతలు మాత్రమేగాక వీరవనితలుకూడా కావలెను. ఏయుద్యమమైనను జయప్రదముగా కొనసాగవలెనన్న స్త్రీలు ముందంజలేయవలెను.

ఆంధ్ర సోదరీమణులారా! లెండు, ఆంధ్రమాత శుభాశీస్సుల నంది, యామెకు స్వేచ్ఛ సంపాదించు గౌరవము స్త్రీలే దక్కించుకొనవలెను. స్త్రీలోకమున ప్రబోధముకల్గిననేగాని యాంధ్రరాష్ట్రవాంఛ పల్లెపల్లెలందును వ్యాపింపదు. మనమాంధ్రులమనియు, మనకు ప్రత్యేకరాష్ట్రములేనిచో పరులదాస్యము తప్పదనియు, ఆంధ్రరాష్ట్రము లేకపోవుటవలన గల్గుచున్ననష్టములు, ప్రత్యేకరాష్ట్రమువలన సౌకర్యములు ప్రతివారికి తెలియజెప్పవలెను. ఇట్టిప్రచారము స్త్రీలయందును కార్మికకర్షకుల యెడలను పనిచేసినట్లు ఏమూలనోజరుగు గంభీరోపన్యాసములుగల బహిరంగసభలుగాని; ఉత్తేజకరములగు వ్యాసములుగల వార్తాపత్రికలుగాని నెరవేర్పజాలవు. ఆంధ్రరాష్ట్రప్రచార మీవిధముగా జేయు భారము స్త్రీలయందే గలదు.

ఇంటింటికేగి రాష్ట్రప్రచారమునకై చందాలువసూలు చేయుటయందు పురుషులకంటె స్త్రీలే సామర్థ్యముగలవారు. ఎక్కువధనము వసూలుచేయగలరు.

ఆంధ్రమహాసభ్యుల సంఖ్య తృప్తికరముగలేదు. ఆంధ్రులలో సగముమందియైనను సభ్యులైననేగాని ఈసంస్థకు తగినబలము చేకూరదు. కావున సభ్యుల జేర్పించు భారము ఆంధ్ర సోదరీమణులందే గలదు. ప్రతి ఆంధ్రాభిమానియు తనంతటతాను సభ్యురాలుగాజేరి ఇతరుల జేర్పించవలెను. పైనుండి యుద్యమములో పని చేయుటకంటె ఇట్టిమహాసభ సభ్యత్వమున నెక్కువ క్రమశిక్షణతో ప్రచారము జరుపుట కెక్కువ యవకాశములు గలవు. కాన మన సోదరీమణులందరీసభాసభ్యురాండ్రై, తదితర సోదర సోదరీమణుల నందరును సభ్యులుగాజేయుట ముఖ్యకర్తవ్యము. స్త్రీలీయుద్యమమున పాల్గొన్నచో మగవారినికూడా నీవిషయమై పురికొల్పగల్గుదురు. స్త్రీలలో స్త్రీలకును తద్వారాపురుషులకును జరుగు ప్రచారమునకుగల కట్టుదిట్టములు,

పురుషులు చేసినచో నుండదు. ఏదేశమందైనను చూడుడు. పురుషులు ఒంటరిగా పనికంటె స్త్రీపురుషులు కలిసి చేయు నుద్యమములే జయప్రదముగా నెరవేరుచున్నవి. నేటి చైనావనితలు తమ ప్రాణములనైనా సరకుగొనక దేశస్వాతంత్ర్యమునకై ఫిరంగిగుండుల కెదురునిల్చి జపాను సాహసము ఆంధ్ర స్త్రీలందరును గుర్తించి తమ కర్తవ్యము నిర్ణయించుకొన్నచో ఆంధ్రరాష్ట్రము సిద్ధదినములలోని మాటయగును. ప్రతి ఆంధ్ర స్త్రీకిని ముఖ్యకర్తవ్యములివి.

రాష్ట్రాభిమానము మీలోనూ మీయిండ్లలోగల ప్రతివస్తువునందును ప్రతిబింబింపచేయవలెను. అప్పుడే మనము ఆంధ్రనారీమణుల మనిపించుకొనుటకు పూర్ణార్హతగల్గినవారమగుదుము.

## సాంఘిక సౌమనస్యము సమకూరుటకు కావలసిన చట్టములేవి ?

1 కట్నములు—కానుకలు. 2. దేవాలయప్రవేశము. 3. మద్యపాననిర్మూలనము. 4. శారదాచట్టము.

## కట్నములు కానుకలు

భారతజాతిని దుర్భర దారిద్ర్యమునకు లోనుచేయుచున్న దీపిశాచము. అసలేదారిద్ర్య మనుభవించుచు కన్నబిడ్డలనే పోషించుటకు శక్తిలేక కుములుచున్న తల్లిదండ్రులు ఈ కట్నకానుకలు అర్పించి వివాహము చేయవలెనన్న వారిఅవస్థ చెప్పనవసరము లేదు. ఈ అనర్థకములనుగురించి ఫిల్ములద్వారా చూపించబడుచున్నను మన స్త్రీపురుషులలో కొంచమైనను పరివర్తనకలుగకపోవుట విచారకరము. ఇప్పటికేకాల మతిక్రమించినది. అనేకమంది నష్టపోయిరి. అయినను ఇప్పటికైన మన చెన్నరాష్ట్రములో ఎంతత్వరలో శాసనరూపముగా తెచ్చిన అంతమేలు.

## దేవాలయప్రవేశము

మన భారతదేశమంతట అస్పృశ్యత అనే పిశాచము వ్యాపించియున్నది. అందువలన దేవాలయములలో ప్రవేశించు హక్కు హరిజనులకు లేదు. పందులు దొర్లవచ్చును గాని పంచములు చొరరాదట. ఇది ఏటి న్యాయమో ఆలోచింపుడు. మనమున్నతదశకురావలెనని సంఘశక్తి కావలయును. సంఘశక్తి చాలాగొప్పది. ఇంగ్లాండు మొదలగు దేశములు ప్రస్తుత యౌన్నత్యములో నుండుటకు వాళ్ళకున్న సాంఘిక శక్తియే కారణము. ఐకమత్యమే బలము. మనసంఘమభివృద్ధికిరావలెనని వర్ణవిభేదములంతరించవలెను. తిరువాన్కూరు, మధుర మొదలగు దేవాలయములలో దేవాలయప్రవేశ మొనరింపబడుట ముదావహమగు సంగతి. ఆలాగుననే ప్రతి దేవాలయప్రవేశమునకై శాసనముచేయవలెను.

## మద్యపాన నిర్మూలనము

ఇది శాసనముకావింపబడి క్రమముగా ఒక్కొక్కజిల్లాలో అమలు పెట్టబడుచున్నది. ఈమత్తుపదార్థములు సేవించు దురలవాటులు కార్మికులలో హెచ్చుగానున్నవి. వారు దినమునకు సంపాదించు కూలి కనీసము రెండణాలూ మత్తుపదార్థములకు ఖర్చుపెట్టి భార్యాబిడ్డలను పస్తుపెట్టి ఏడ్పించుచున్నారు. భారతసంతానము యొక్క కడగండ్లు లెక్కింపరానివి; మట్టిగుడిసెలలో తలదాచుకొని చింకిచాపలపై పండుకొనును. కుండలే ఆస్తిగాగలిగి సామాన్యముగా రెండవ జత దుస్తులెరుంగక నిస్సారమగు వరిమెతుకులుతిని జీవధారణ మొనర్చుచు అల్పశక్తులై తూగాడు శరీరములతో జీవన్మరణముల మధ్య కొట్టుకొలది జనులల్లాడుచున్నారు. వీరందరకు ఈ చట్టముమూలమున కొంత మేలు కలుగగలదనుటకు సందియము లేదు.

శారదాచట్టము

ఇది అమలులోనున్నది గాని, ఈచట్టముద్దేశించిన ప్రయోజనముకలుగుటలేదు. కాబట్టి చట్టమునకింకను తగినకట్టుదిట్టములు చేయవలసియున్నది. జననమరణ రిజష్టర్లవలె ప్రతివివాహము రిజష్టరుచేయబడవలెనని గ్రామోద్యోగస్థులమీద బాధ్యతపెట్టినయెడల ఈ బాల్యవివాహములు అంతరించును. వారివద్దనే వయస్సు మొదలైన వివరములుండుటచేత తప్పువయస్సు చెప్పుటకు వీలులేదు. 'జననమరణములకువలె గ్రామమునసబు ఆగ్రామములో జరుగు ప్రతివివాహమునకు గొప్ప బాధ్యుడైయుండును.

ఇట్లే సంఘములో సంస్కరించుకోవలసిన విషయములు ఎన్నేని గలవు. నిర్బంధించి భయపెట్టి అమలు పెట్టబడు ఈచట్టములు ఆంతరంగిక పరివర్తనతో సరికాజాలవు. పత్రికలెంత ప్రబోధించుచున్నను, సభలలో గంభీరోపన్యాసము లెన్నియిచ్చుచున్నను అజ్ఞానులై ఈ ప్రమాదకరమగు బూజును దులుప నిచ్చగించనప్పుడు చట్టములే నిర్బంధముగా వదలించవలెను. సకాలమున మన సాంఘిక వ్యవస్థలు సంస్కరింపబడునా మనసంఘము శాంతముగా క్రమవికాసము నొందును. లేనియెడల అతిదారుణమైన పరిస్థితులు ఇంకను సంభవించును. ఈవ్యవస్థలను అతిక్రమించవలసిన కాలమాసన్నమైనది. హిందూసంఘమును కదల్చి సజీవముగ జేయగల కాలానుగుణ్యమగు మార్పులను పొందవలెను. ఇది సకాలములో సిద్ధించదా, కాలము మనల క్షమింపదు. కాలము నిర్వక్రగతిని తిరిగిపోవుచున్నది. మనమిప్పుడు నెమ్మదిని, శాంతిని అనుభవించుచున్నామని భ్రమించుచున్నాము. కాని ఈభ్రమ ఎంతకాలమో నిల్వదు. మనమనుభవించుచున్న శాంతి సరికాదు; నిర్జీవమైనది, చైతన్యరహితమైనది. మనమకోరతగినది జీవముతోగూడినశాంతి, అభివృద్ధి పొందింపగల శాంతి.

## నిరక్షరాస్యతను నిర్మూలించుటకు వయోజనవిద్య వృద్ధియగుటకు స్త్రీ లేవిధముగా తోడ్పడవలెను?

మనదేశంలో తీరికసమయమగు మధ్యాహ్నము స్త్రీలందరు ఒకచోట గుమికూడి లోకాభిరామాయణము చెప్పుకొనుట అలవాటు. ఆమహాసభకు ఒకరినొకరు ఎవరూపిలువ నవుసరములేదు. వారికివారే సమావేశమగుదురు. ఎంతపని ఉన్నప్పటికిని కొంచెము ఆసమావేశములో పాల్గొని కర్ణరసాయనముగా పారుగువారికథలు విని, తానుకూడా తనకుతోచిన రెండులోపాలు సభికుల హృదయము రంజిలునట్లుగా చెప్పినగాని మనసున కూరటఉండదు. వారికిదానిలోఉన్న అభిరుచి ఇంతాఅంతా కాదు.

పదుగురు గూడినదే కదా సభ అనెదము. దానిలో మంచివిషయములనుగురించి ఎవరైనా ఉపన్యాసరూపకముగా చెప్పిన ఇది కలికాలపు విడ్డూరపు మీటింగులని పరాపవాదము మహాసభలో తీక్ష్ణముగా నిరసించుచు తీర్మానము ప్యాసుచేసి సత్యాగ్రహ మవలంబించెదరు. ఈజట్టులో అక్షరాస్యులుకూడా లేకపోలేదు.

కాబట్టి కొంచెము జ్ఞానముతెలిసి చదువుకున్నవారందరూ వృథా కాలక్షేపము చేయుటకంటె మధ్యాహ్నము ఒకగంట ఇట్టివారివద్దచేరి వారి లోకాభిరామాయణము మూలకముగానే సౌమ్యముగా ఉదహరణలతో తెలియజెప్పుతూ క్రమముగా అక్షరాస్యులుగాచేయ సమకట్టవలెను. ఇట్లు నిరక్షరాస్యతను నిర్మూలనముజేసిన స్త్రీజనాభ్యుదయకరములగు 'గృహలక్ష్మి' మొదలగు పత్రికలద్వారా వికాసమునొందగలరు. ఈ విషయములో బొంబాయిస్త్రీలు ముందంజవేయుట సంతోషకరమగు సంగతి.

స్త్రీసమాజముల దృక్పథము ఎట్లుండవలెను?

వాటిని ఊరూరా స్థాపించి నిరంతరాయంగా సాగించుట ఎట్లు?

ఈకాలములో సమాజములు అవశ్యకము. స్త్రీలోకమంతయు అభివృద్ధికి రావలెననిన సమాజములే పూనుకొనవలయును. సమాజ ప్రచారము లేకపోయినయెడల మన సంఘము లింతమాత్రము అభివృద్ధికి రాజాలవు. అందుచేత ఈకాలమును సమాజయుగమని పేర్కొనవచ్చును. అందుచేత విద్యావంతులగు స్త్రీలందరు చిన్నచిన్న సంఘములుగజేరి స్త్రీలయొక్క అవిద్య, మూర్ఖత పోగొట్టవలయునన్న వారమున కొక్కసారైనను జ్ఞానవతులగు స్త్రీలను రప్పించి అస్పృశ్యతానివారణ. కట్నములు, స్త్రీవిద్య, ఆస్తిక్యము, ఘోషా, శిశుపోషణ మున్నగు విషయములనుగురించి ఉపన్యాసము లిప్పించుచుండుట మంచిది. ఇతర రోజులలో బాలికలకుగాని పెద్దవారికిగాని నేర్చుకొనినయెడల, లలితకళలు, లేసు, చాపలబుట్టలు అల్లుట, దారముతో లతలుకుట్టుట, విసనకర్రలు, నవ్వారునేయుట, చిక్కములు అల్లుట, సమాజ ఆవరణలో తోటపని మున్నగుపనులు నేర్పవలెను. ఇంకను ఒక్క చేతిపనులేగాక ఆరోగ్యము, మన దేశపరిస్థితులు మనలో సంస్కరింపకొవలసిన విషయములు, మున్నగువాటినిగురించి చిన్నచిన్న ఉపన్యాసములరూపమునను, ఆ సంబంధమగు గ్రంథములు చదివించుట ద్వారాను ఈ పిల్లలు చాలా అభివృద్ధికి వచ్చెదరు.

ఇక ఇట్టి సమాజములను పోషించుట ఎట్లు? అను విషయము ఆలోచింపవలసియున్నది. దీనిలో సభ్యులుగా జేరువారందరు నెలకు రు. 0-4-0 లు చందా ఇచ్చునట్లు విధించిన బాగుగనుండును. కాని చందాకు భయపడి సభ్యులుగా చాలామంది స్త్రీలు చేరరు. ఎన్నో అనవుసరపు వ్యయములు చేసెదరుగాని నెలకు ఒక 0-4-0 లు ఇచ్చుటకు భారతీయులు వెనుదీయుట కడు విచారమగు సంగతి.

భారత స్త్రీలు భిక్షాందేహి అన్నవారికి భిక్షమిడకమానరు గదా! అందుచేత ప్రతి ఇంటివద్దను ఒక్కొక్క బుట్టపెట్టిన రోజుకు పిడికెడు బియ్యము చొప్పున వారమునను ఒక తవ్వెడు బియ్యమగును. 100 గడపగల గ్రామములో ఇంటికొక బుట్టపెట్టిన వారమునకు 12, 19, కుంచముల బియ్యమగును. అవి అమ్మిన ఇప్పటి ధరలబట్టి కనీసము రు. 4-0-0 లు వచ్చును. ఇట్లు నెలకు రు. 16 లు ప్రోగుపడును. ఈ సమాజములో తయారుచేసిన వస్తువులనుకూడా అమ్మవచ్చును. ఈ డబ్బు సమాజపోషణకు సరిపోవుననుటకు సందియములేదు. ఈపద్ధతి కడుబీద స్త్రీలకుకూడా భారముకాదనియే నా అభిప్రాయము.

కావున నో సంఘాభిమానులారా? విదేశవిహంగముల కాశ్రయమై ఎండిపోయియున్న మన సంఘమహావృక్షము, పత్రపుష్పఫలశోభితము కావలెనన్న, మనదేశము నిత్యకల్యాణము పచ్చతోరణముతో నలరారవలెనన్న, అజ్ఞానమనెడు వేర్లు పుర్వులను నాశనముచేయవలయును. దానిచే సంఘ ఆర్థిక మతవైషమ్యములన్నియు నశించును.

సంసారమును సౌఖ్యప్రదముగా నిర్వహించుటకు సాధ్యమైన సలహాలేవి?

ఏ కుటుంబమునందు ద్వేషము, ఈర్ష్య, వివాదము, జగడగొండితనము ప్రవేశించుచున్నవో ఆ కుటుంబమునుండి సుఖసంతోషాదులు, శాంతి తొలగిపోవుచున్నవి. ఆ కుటుంబ మచిరకాలములోనే సిరిసంపదలనుండి భ్రష్టమగుటయేగాక. పరువు ప్రతిష్టలను గోల్పోవుచున్నది. కుటుంబశాంతిలేని గృహమునకు గౌరవమర్యాద

లంతరించును. ఒక కుటుంబ గౌరవాగౌరవములకు ఆ గృహిణియే కారకురాలనిన అతిశయోక్తిగాదు. కనుక గృహయజమానురాలీ విషయమున కడు జాగరూకురాలయి యుండవలయును. యావత్ కుటుంబమునందును ఎట్లు శాంతి నెలకొనియుండునో అట్టి విధానమును సదా చేయుచుండవలెను. నిరర్థకములగు మాటల కట్టిపెట్టి మితభాషిణి కావలయును. సిగ్గుకరములును, నిందాకరములును అయిన దూషణయుక్తములైన నుడువులుమాని అందరితోను సౌమనస్యముగానే పలుకవలయును. కుటుంబములోనివారి క్షేమ స్వాతంత్ర్య సౌఖ్యముల గుర్తించి మెలంగవలయును. తృప్తిలోనే ఆనందముగలదు. ఏ గృహిణి విద్యావినయ విశేషసంపదగలిగియుండునో, ఏ నారీమణి సుశీలయు, సంతుష్టురాలు, గృహకృత్యములందు సమర్థురాలును అయి ప్రవర్తించునో, ఏ యువిద ఇంద్రియనిగ్రహమును, ఓర్పును, భర్తృసేవాపరతంత్రయు, నైతికవర్తనము, సత్యాహింస, శమదమాదులుగలిగి మెలంగునో, ఆ మహిళ నిర్వహించు సంసారము సౌఖ్యప్రదమగుటకు సందియములేదు.

శిశుపోషణ

మనదేశములో, పుట్టిన ఏడాది ముగియకమునుపే వేయింట 200 మంది బిడ్డలు మృతినొందుచున్నారు. దీనికి కారణము లైదువిధములుగా కానవచ్చుచున్నవి.

(1) తల్లుల యజ్ఞానము (2) తల్లిదండ్రుల లేబ్రాయము, నిస్సత్తువ (3) మంత్రసానుల చేతకానితనము (4) ఇండ్లయొక్కయు, గ్రామములయొక్కయు అపరిశుభ్రత, అనారోగ్యము (5) మశూచికము, చలిజ్వరము మొదలగు అంటువ్యాధులు.

ఈ మరణముల సంఖ్యతగ్గి, శిశువులు ఆరోగ్యవంతులు కావలెననిన ప్రతితల్లియు శిశువును పెంచవలసిన విధముల గమనించవలెను.

చనుపాలు

బిడ్డలయొక్క ఆహారములలో చనుపాలకు మించినది ప్రపంచమునందేదియు లేదు. ఇందు బిడ్డకు కావలసిన పదార్థములన్నియు కలవు. ప్రసవమయిన 3, 4, గంటలోపలనే బిడ్డకొక్కసారి తల్లిపాల నివ్వవలయును. ప్రసవమయిన 2, 3, దినములవరకు పాలుండకపోవచ్చును. అయినను బిడ్డ కప్పుడప్పుడు పాల నిచ్చుటవలన తల్లి గర్భకోశము చక్కగా ముకుళించి చిన్నదగును. ఇదిగాక ప్రసవమయిన 2, 3 దినములవరకు చిక్కని పాలు కొద్దిగానుండును. వీటినే ముర్రుపాలందురు. వీటిని త్రాగినయెడల బిడ్డకు చక్కగా విరేచనమగును. ఈ దినములలో బిడ్డకు కావలసిన ఆహారమంతయు నీ ముర్రుపాలందే గలదు. బిడ్డకు పాలు చాలకపోయిన ఆవుపాలను చక్కగా ఒక్క పొంగువచ్చినట్లు కాచి పొయ్యిమీద నున్నప్పుడే నిమ్మకాయరసముపిండి, ఆ పాలను విరిచివేసి, విరుగుడును వడపోసి, మిగిలిననీటిలో చిటికెడు చక్కెర వేసి తడవకు అర అవున్సు చొప్పున పోయవలెను. ఇట్లు తల్లికి పాలుపడువరకును పోయవచ్చును. నిమ్మకాయరసమువలన శైత్యముగలుగునని తల్లులు భయపడవలసినపనిలేదు. ఈ విరుగుడు నీళ్లు పిల్లలకు మిక్కిలి సత్తువనిచ్చును. సులభముగ జీర్ణమగును.

తల్లికి పాలుపడిన తరువాత మొదటి 2 నెలల అంతమువరకు 2 గంటలకొకసారియు, 3 వ నెల నిండువరకు 3 గంటలకొకసారియు, 4 వ నెల మొదలు పాలు విడుచువరకు 4 గంటలకొకసారియు గంటల ప్రకా

రము పాలిచ్చుచుండవలెను. బిడ్డలకు పైనచెప్పినప్రకారము నిర్ణయమగు సమయములందే పాలియ్యవలసినది గాని వేళయినప్పుడును కానప్పుడును, అనగా బిడ్డ ఏడ్చినపుడెల్ల పాలిచ్చుట గొప్పతప్పు. అట్లుచేయుటవలన బిడ్డలకు మంకుతనము అభ్యాసమై ముందుముందుకూడ చెడ్డ అలవాట్లకు ఇదియే ప్రాతిపదికయగును. వేళతప్పకుండా పాలిచ్చుట తల్లి నేర్చుకొనినయెడల బిడ్డయు వేళకు తప్పకుండా పాలకు ఏడ్చుట నేర్చుకొనును.

బిడ్డకు పండ్లరసమిచ్చుటకూడా మేలు

బిడ్డ దుస్తులవిషయమైకూడా తల్లి ముఖ్యముగా గమనింపవలెను. మిక్కిలి చలిరోజులలో తప్ప మన దేశమందు ఎంత తక్కువ దుస్తులు వేసిన అంతమంచిది. బిడ్డకు వేషముచేయునప్పుడు గమనింపవలసిన ముఖ్య విషయములు.

(1) ప్రతి అవయవమును స్వేచ్ఛగా కదులుటకు తగిన యనుకూలములుండవలెను.

(2) ఋతువునుబట్టి అనగా శీతకాలములో కొంచెము దళమైనవి బొచ్చుతోకూడిన వూలు దుస్తులుండవలెను; వేసవికాలమున మిక్కిలి పలుచని దుస్తులుండవలెను.

(3) బిడ్డయొక్క దుస్తులు సాధ్యమైనంత తక్కువగా నుండవలెను.

ప్రస్తుతము శిశుపోషణ మొదలగు వ్యవహారములన్నియు స్త్రీలపనులైయుండడమువల్ల వారిపైననే దేహారోగ్యము ఆధారపడియున్నది.

మనదేశములో భావిపౌరులందరు అక్షరాభ్యాసులు కావలెననిన ప్రతి పల్లెటూరియందు పాఠశాలలు స్థాపింపవలయును. ఈ దిగువ లెక్కలబట్టియైనను భారతదేశ ప్రాథమికవిద్య ఎంత హైన్యస్థితిలోనున్నదో తేటతెల్లమగును.

| | | |
|---|---|---|
| కెనడాలో | 290 | మందికి ఒక ప్రాథమిక పాఠశాలగలదు. |
| దక్షిణాఫ్రికాలో | 350 | " " |
| న్యూజిలండులో | 500 | " " |
| ఆస్ట్రేలియాలో | 520 | " " |
| భరతఖండమున | 1400 | " " |

ప్రాథమికవిద్యకొరకు తల 1-కి సంవత్సరమునకు చేయువ్యయము

| | |
|---|---|
| అమెరికా | రు. 16-4-0 లు |
| ఇంగ్లాండు | 9-0-0 |
| ఫ్రాన్సు | 9-0-0 |
| డెన్మార్కు | 17-5-0 |
| జపాను | 7-0-0 |
| భరతఖండము | 0-2-0 |

## గృహనిర్మాణము - గృహపరిశ్రమలు

పూర్వము మనదేశములో తలిదండ్రులే గురువులు. గృహములే గురుకులములు. ప్రతి కుటీరము కర్మాగారమే. నిత్యకృత్యములన్నీ కళాకౌశల్యాపాదకములే. నిర్మించిన వస్తువులే బిరుదుపట్టములు. ఈవిధముగా ప్రతి జీవీ జీవితమనే కళాపరిషత్తులో స్నాతకుడయేవాడు. ఇట్టి సాంప్రదాయముగల మనదేశములో పూర్వ పరిశ్రమలన్నియు నశించినవి. మనజాతి వికాసవంతము గావలెనంటే మనకుగావలసిన వస్తువులన్నియు సాధ్యమైనంతవరకు నిర్మించుకొనవలయును. మనము నిర్మించలేని వస్తువులు సాధ్యమైనంతవరకు విదేశపువి కాకుండా చూడవలెను. ప్రతి మండలము, ప్రతి తాలూకా, ప్రతి గ్రామమూ కొరత అంటే ఏమిటో ఎరుగకుండా సుసంపన్నలై, సాధనభూతములైన మన కుటీరపరిశ్రమలపట్ల మన బాలబాలికలకు అభిరుచి, ఆదరము, పక్షపాతము కలిగించి తీరవలెను.

ఇంటినిచూసి మరీ యిల్లాలును చూడమని మనలోనొక సామెతకలదు. దీనినిబట్టి స్త్రీలు గృహనిర్మాణ విషయమైకూడా ఎంత శ్రద్ధపుచ్చుకొనవలసియున్నదో తేటతెల్లమగుచున్నది. ఎప్పటికప్పుడు ఎక్కడనుండు వస్తువులు అక్కడక్కడలంకరించియుండు గృహము చాలా ఆనందకరముగా నుండును. ఈ రెండు విషయములగూర్చి కూడా శ్రద్ధబూనవలయును.

## గృహలక్ష్మి పత్రికాభిమానులెల్లర కొక విజ్ఞప్తి

ప్రపంచమంతటను పెద్ద సంచలనమునుగొల్పు యుద్ధభయము ప్రబలుచున్నది. కాగితములధర హెచ్చుపెరిగి వ్యాపారమును పత్రికా నిర్వహణమును ప్రతికూలించు పరిస్థితులేర్పడినవి.

దేశమున నేక్షణమున నేయుపద్రవము సంభవించునోయని ప్రజలు తల్లడిల్లుచున్నారు. 'గృహలక్ష్మి' పత్రికను సాగించుటకు ప్రతికూలమైన పరిస్థితులేర్పడి, తాత్కాలికముగా పత్రికాప్రచురణ మాపివేయవలసిన యగత్యము కలుగునెడల నీ పత్రికాభిమానులెల్లరును మమ్ము దయతో మన్నింతురని భావించుచున్నాము.

సంపాదకుడు.

# ఆంధ్రరాష్ట్రం మేమే తెస్తాం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

కడచిన ఆగస్టునెల కడపటివారములో గుంటూరులో జరిగిన ఆంధ్రసభలు చూడ తగినవి. ఎందరో ఆంధ్రమహాపురుషులు ఎందరో ఆంధ్రనారీరత్నములు ఆ మహాసభకు విచ్చేసిరి. ఆంధ్రజనని కడుపారగనిన పుత్రపుత్రీసంతానమును కన్నులార చూడవలెనన్నచో, వారి వాక్కౌశలమును చెవులార వినవలెనన్నచో, వారి ప్రతిభా విశేషముల మనసార గ్రహింపవలెనన్నచో, ఆంధ్రమహాసభనే దర్శించవలయును. రాష్ట్ర, రాష్ట్రేతర, సంస్థానాంధ్ర స్త్రీపురుషులనెల్లర నొక్కచో జేర్చి, పరస్పర సందర్శన సల్లాపముల కవకాశము గల్పించి అన్యోన్యస్నేహసహకారముల వర్ధిల్లజేయు దివ్యపీఠము ఆంధ్రమహాసభాయే గదా! ఆంధ్రులెల్లరు ఏడాదికొక్కమారు ఈమాతృపీఠ సన్నిధింజేరి అర్చావిధులు సల్పుట యెంతయు సమంజసమైయున్నది.

ఈ వత్సర మాంధ్రమహాసభను జూచినవారికి రాష్ట్రవాంఛ ఆంధ్రులలో నానాటి కెంత ప్రబలమగుచున్నదియు, ఎంత ఆవేదనకు కారణమగుచున్నదియు, ఎంత అవమాన భరమున క్రుంగదీయుచున్నదియు విదితమైనది.

అవును, ప్రత్యేకాంధ్రరాష్ట్రమే నాటిమాట! యిరువదైదేండ్లు గిఱ్ఱున తిరిగిపోయినవిగదా. ఈలో బీహారు, ఒరిస్సా, సింధు సరిహద్దు మున్నగు క్రొత్త క్రొత్త రాష్ట్రము లెన్నియో నేర్పడె. మన రాష్ట్రోద్యమము మాత్రము ఏనాటికిని యెదుగుబొదుగులేక కనుగెప్పమీది వెండ్రుకలవలె అటులనేయుండె. ఓర్పుకైనమేర ఉన్నదిగదా; శాంతమునకైన హద్దుకలదు గదా; ఎంతకాలమని ఆంధ్రులు సహించి ఊరుకొనగలరు? అందువలననే యీ వత్సరము గుంటూరు ఆంధ్రసభలలో ఆంధ్రులరాష్ట్రవాంఛ మేరలుమీరి అసహనమునకు కారణమై యెల్లరి దిగ్భ్రమ నొందింపజేసినది.

పురుషులనేగాదు, స్త్రీలనుగూడ నీరాష్ట్రాభిలాష ఉడుకెత్తింపజేసినది. అఖిలభారత జాతీయోద్యమమునకు జరిగినట్టుగా అఖండప్రబోధప్రచారములు ఆంధ్రోద్యమము విషయమై జరుగకుండుటచే నింతదనుక ఆంధ్రస్త్రీలీ విషయమై నేమియు నెఱుగకుండిరి. కాని యిటీవల దేశములో జరిగిన ప్రబోధమువలన వారికిని రాష్ట్రము విషయమైఆసక్తి జనించినది. రాష్ట్రోద్యమములో పురుషులకు స్త్రీలును యికముందు బాసట కాగలుగుదురని మొన్న ఆంధ్రమహిళాసభ గాంచినవారికిని, వారి తీర్మానములు తిలకించినవారికిని విశదమైనది.

అన్నిటికన్న మహాసభజరిగిన రెండవదినము రాత్రి ఆంధ్రమహాజనులెల్లరు నిండుకొలువైయున్న అమ్మహాసభలో "ఆంధ్రరాష్ట్రము మేము తెచ్చెద"మని ఆంధ్రమహిళా

సభాధ్యక్షురాలగు శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు ఉచ్చైస్స్వరమున బల్కిన గంభీర వాక్కు ఆంధ్రులనెల్లర రజింపజేయుటయేగాక యిప్పటికిని ఆంధ్రప్రజాహృదయముల నినదించుచున్నది. ఆసభలో పలికినది ఆమెయొక్కతయేయైనను ఆపలుకు ఆంధ్రమహిళా మణులెల్లరి పక్షమున పల్కినపల్కనియు, అందు ఆంధ్రయోషారత్నముల కంఠములెల్లను నైక్యమైయున్నవనియు చెప్పుటకు సందియములేదు.

తెలుగునెలంత లెల్లరిపక్షమున రామసుబ్బమ్మగారు గావించిన ఆశపథము పొల్లుపోగూడదు. ఆఆవేశము చల్లారగూడదు. ఆదీక్షాకంకణమును విసర్జింపగూడదు. రామసుబ్బమ్మగారి ప్రతిజ్ఞ నెరవేరుట కాంధ్రనారీరత్నములెల్లరు నడుములు కట్టవలెను. ఏజాతియొక్క జాతీయత నిలబెట్టుటకైనను ఆజాతియొక్క స్త్రీలు పూనుకొనినపుడే అది సఫలము కాగలదు. జాతికి స్రష్టలై, పోషణకర్తలై వరలెడి మాతృమూర్తులైన స్త్రీలుగాక మఱెవ్వరీ బాధ్యతవహింప నర్హులు?

భారతదేశమున ఆంధ్రులదొక ప్రత్యేకవిలక్షణమైనజాతి. వారికొకకట్టు, ఒకబొట్టు, ఒకభాష, ఒకసాంప్రదాయము, ఒకనాగరికతగలదు. అవియెల్ల శిథిలముగాకుండ, సాంకర్యము జెందకుండ నిలిపినపుడే ఆజాతిసజీవమై, తేజోవంతమై, ప్రతిభా సమన్వితమై చెన్నారగలదు. కాన ఆంధ్రస్త్రీ లీపనికి మునుముందు పూనుకొనవలసియున్నది. పరదేశ పరరాష్ట్ర నాగరికతా వ్యామోహపంకనిమగ్నులుగాక తెలుగుభాషయొక్క మాధుర్యము, తెలుగుసంప్రదాయములవిశిష్టత, తెలుగుకళలయొక్క మనోజ్ఞత తమలో, తమబిడ్డలలో ప్రస్ఫుటమగునట్లు వర్తించుట తెలుగునెలంతలభ్యసింపవలయును. సాధ్యమగునంతవరకు తెలుగుసీమయందు తయారైన వస్తువులనే కొనుట అలవరచుకొనవలయును. తెలుగుల ప్రాచీనౌన్నత్యమును చాటెడి పండువులు, ఉత్సవములు సలుపుటకు ప్రయత్నించవలయును.

మఱియు ఆంధ్రమహిళాసభ తీర్మానించినట్లు ఊరూర ఆంధ్రమహిళాసంఘము లేర్పరచి ఆంధ్రరాష్ట్రావశ్యకతను గ్రహింపని ఆంధ్రనారీలోకమున ప్రబోధప్రచారములు సాగింపలవయును.

ఆంధ్రులలోగల విభేదభావముల రూపుమాపి, అఖిలాంధ్ర జనైక్యమునకు పాటుపడవలయును. ఆంధ్రమహాసభవారు ఆంధ్రరాష్ట్రము సంపాదించుటకై నిర్ణయించు కార్యక్రమములలో పాల్గొనుటకైగూడ ఆంధ్రనారీమణులు సంసిద్ధులు కావలయును. ఎప్పు డాంధ్రనారీరత్నములెల్ల రీవిధముగా ఆంధ్రజాతీయ సౌధనిర్మాణమునకు పునాదులవై చెదరో ఆనాడు ఆంధ్రరాష్ట్రము సిద్ధింపగలదు. ఆనాడు రామసుబ్బమ్మగారి శపథము నెరవేరగలదు. ఆనాడు ఆంధ్రమహాసభవారు గావించిన తీర్మానములు సఫలము కాగలవు. ఆంధ్రనారీరత్నములు పర్యాలోచింతురు గాక!

# ఆంధ్రపుత్రికను!

ఖండాంతరముల పేర్గన్న బంగరుసీమ భరతదేశమ్ము మా పురిటగీము
సంగీతసాహితుల్చను బాలచేపించు సరసిజాసనురాణి గురువులమ్మ
యమునిగుండె గలంచి హక్కుదక్కించిన సావిత్రి మాయాట జట్టుపిల్ల
పార్వతీ పద్మసంభవలు మా నట్టింటచేరి నోములగాంచు పేరటాండ్రు
గళముసవరించి మూడు లోకమ్ములకును చాటుకొందును నాభాగ్య సంపదలను
గాన గంగాస్రవంతి మార్గమునుబట్టి నికరమగుమాట! ఆంధ్రపుత్రికను నేను!
శత్రునాశముకాక జడముడివేయని ద్రోవది మా పెద్ద తోడబుట్టు
పదునాలుగేడులు వనవాసమోర్చిన సీత మా పుట్టింటి చిన్నిబాల
సకలదేవతల మోసములకుం జిక్కని దమయంతి మాకు బాంధవ్యురాలు
కత్తి చేతధరించి కదనకేళి జరించి యొరగిన లక్ష్మిమా పొరుగుపిల్ల
స్త్రీల మానముజెఱుప నాశించునట్టి నీచవైరుల గుండియల్నీరుగాగ
కంఠకాహళ భేరికా గర్జనముల ధిక్కరించెడి యాంధ్రపుత్రికను నేను!
మాభాషయందున్న మాధుర్యమును దక్కు జాతివారలకు వాచవికిబెట్టి
మాకవిత్వంపు సౌమ్యతకు దార్కాణగా మొల్ల పద్దెపు పూల జల్లుకురిపి
మాప్రేమహృదయ నిర్మలత రూపింపగా మాననీయ యుషాకుమారి జూపి
మాసతీశీల సంపద కన్నులగట్ట చంద్రమతీ గాథ చదివి చెప్పి
పుణ్య జనయిత్రితను వల్లి పుల్కరింప పాడుకొందును స్వర్ణ ప్రభాతవేళ
భక్తిముత్యాల హారతిబట్టి! తల్లి ఋణముదీర్చిన యాంధ్రపుత్రికను నేను!
పగతుర గుండియల్బగిలించు నాయకురాలి సాహస ముగ్గుపాలు మాకు
వీరబొబ్బిలివెలమ వెలదులజోహారు రత్నకాధిన్యాంగ రక్షమాకు
ముజ్జగంబుల మోహమున ముంపజాలిన వీణియగానంబు విద్యమాకు
పసలూరుచును భక్తిరసము చిప్పిలుచుండు మొల్లకావ్యము బాలబోధమాకు
శాంతి సమరాంగణము పాఠశాలమాకు దేశస్వాతంత్ర్య రణ సన్నివేశములకు
వీరతాండవనృత్యమ్ము వెలయసలిపి పేరుపొందిన యాంధ్రకుమారి నేను!
సకలమానవజన్మ సమతబోధించెడి దయకు నాచిత్త మద్దంపుబరణి
సరస సంగీతబంధుర కవిత్వములకు నాజిహ్వ కళ్యాణ నాట్యసీమ
ఇహలోకమున స్వర్గమహిమంబు గల్పించు ప్రేమకు నాహృది కామధుక్కు
అతిదూరరాష్ట్ర సమాగమాతిథిలోక వసతికి నాయిల్లు పాడిపంట
దిగ్గజములైన నాపుత్రధీరవరులు రచ్చగెలిపించినించు నిర్మలయశస్సు
భూతలాకాశముల నారబోసికొనుచు దినములనుబుచ్చు నాంధ్రపుత్రికను నేను!

—శ్రీ సామవేదుల చిరంజీవమ్మ.

# పుష్పచయము

## పెండ్లి, ప్రేమ, పౌరోహిత్యం

పెండ్లి స్త్రీ పురుషులకు పరస్పర సంబంధమును స్థిరపరచునట్టి వ్రతము. ఆ వ్రత నిబంధనలు ఆ జన్మాంతము అవిచ్ఛిన్నముగ అలరారునట్లు ఆర్యోత్తములు నియమించినారు. పెండ్లినాటినుండి దంపతులకు ఆస్థియందేమి, ఆచరణయందేమి, అన్యోన్య హక్కులేర్పడుచున్నవి.

సంసారయాత్ర సుఖవంతముగ సాగుటకు సతీపతుల సఖ్యత ముఖ్యావసరము, ఆ సఖ్యత స్వయముగ పుట్టునదే గాని ఆడుపు ఆజ్ఞలతో అబ్బునదికాదు. అనుకూలతలేని దంపతుల జీవితములో ఆస్థి ఆదాయములు ఆనందమును పుట్టింపజాలవు. ఆనందములేని జీవితము నిస్సారము. నిరర్థకము. "సంతోషము సగము బలము" అనునట్లు సంతోషచిత్తులకు లేమి ననుభవించుటొక భారముకాదు. కలిమిలేములు కావడికుండలు.

నేటి ప్రజలలో ఆస్థినిజూచి కన్యనిచ్చుట, కట్నములచూచి కన్యను దెచ్చుకొనుట ఆచారముగనున్నది. వివాహసందర్భమున విచారింపవలసినది, వధూవరుల గుణరూప విద్యాదివిషయములుగాని ధన కనక వస్తు నిలయాధులు కావు. వేడుకలరూపమున వ్యవహరింపబడుతూ వచ్చిన కట్నములు తుదకు క్రూర పిశాచములై యువతీయువకుల సౌఖ్య సంతోషములను సరకుగొనక అన్యాయమైన వివాహములకు కారణమగుచున్నవి.

బీదయింట సద్గుణ సౌందర్యరాశి జన్మింపదా ? కట్నముల నివ్వలేకున్న యబ్బాలికను అధికులు వరింప గూడదా ? కలిమితోదులదూగు జవరాలు, నిరుపేదయై రూపగుణ విద్యాధిక్యతచే తనకెంతయుం దగి యున్న పురుషుని వరింపగూడదా ?

ఇట్లు వరించుట పెద్దవారికి నామోషీగాకూడా తోచవచ్చు. కాని నవయవ్వనులగు బాలబాలికలకు మాత్ర మట్లు తోచదు. వారి హృదయము కేవలము ధనముచే ఆకర్షింపబడదు. అయిననూ పెద్దవారి నెదిరించి తమ యిచ్ఛానురీతి వరించుకొనుటకు తగిన ధైర్యావకాశములుండు టసంభవము.

శారదాబిల్లుయొక్క ముఖ్యాశయము పెండ్లాడునప్పటికి బాలబాలికలకు తగిన వయస్సు వుండాలని. ఆ ఆశయమింకా యిప్పటికీ సంపూర్తిగా తీరనేలేదు. యింకెప్పటికైనా తీరుతుందనుకొందము. అప్పుడు సహితము మన వివాహక్రమము సక్రమముగ నడువదని నేనంటాను, యెందువలనంటారా?

తలిదండ్రాదులు జ్ఞానం గలవారైతే తమ బిడ్డల మనోగతుల చక్కగ నెరింగి గాని వివాహయత్నము చేయరు. అట్టివారి పోషణక్రిందనున్న యదృష్టవంతులకెట్టి కొరంతా వుండదు. యిపుడా అదృష్ట హీనులనుగూర్చి యోచింతము.



అభినేత్రి కాంచనమాల

జగదీశ్ ఫిలిమ్సువారి 'మల్లీపెళ్లి'లో ప్రధాన భూమికను నిర్వహించుచున్నది.



అనిరుద్ధుడు :_

ఉషా! ఇప్పుడుగదా నీవు వీరపత్నివనిపించుకొంటివి!

మాడరన్ సినీటోనువారి ఉషాపరిణయంలో ఉషా, చిత్ర, అనిరుద్ధులు

పద్మా సాలిగ్రాం, రాజకుమారి, నీలంరాజులు

ఒక బాలిక వుంటుంది. ఆమెకు తగిన భర్తను వరించుకొనే వయోజ్ఞానమూ వుంటుంది. అట్టి బాలికకు పెద్దవారు వరునన్వేషించుకొస్తారు. వారిచే వరింపబడిన పురుషుడామె కయిష్టుడవుతాడు. అపుడా అయిష్టతను వెల్లడించుట కభిమానపడుతుంది. తనవారి నెదిరించుటకు భయపడుతుంది. ఒకవేళ అట్లు భయపడనిదై హృదయాన్ని వెల్లడించిననూ వారు లెఖ్ఖచేయక ఒప్పింప జూస్తారు. ఇష్టపడని పక్షమున గర్జనలతో భయపెట్టజూస్తారు. అందునా లొంగక మొండితేలెనేని ఆ సంబంధ మాగి పోవచ్చు. అయినా యేమి ప్రయోజనం? యింకొకసారిమాత్రం తగినవరునన్వేషింతురని నమ్మక మేముందీ? సారెసారె కెదిరించి జయించుటకు శిలాహృదయము కావాలి. అందు స్త్రీల భావలత అన్యాధారమున అభివృద్ధిగాంచునదే గాని ఒంటిగ నిలచునది కాదు. కనిపెంచినట్టి వారి ఆధారము వీడి స్వయముగ తన యీప్సిత మీడేర్చుకొనుటకు తగు సాహసముండుట సామాన్యముకాదు. కావున శారదాగారి చట్టము బాల్యవివాహముల నరికట్టిననూ పిత్రాదుల జ్ఞానశూన్యతకు యువతీ యువకులు జీవిత సుఖాశలను వీడిపోవలసివస్తుంది. అట్లు వీడుటలో పురుషులకన్న స్త్రీలే జాస్తి.

వీరిట్లు లొంగకుండ ప్రశాంత సౌఖ్యసమన్విత జీవితము నందుటకుగాను ప్రభుత్వముయొక్క తోడ్పాటు అవుసరము.

వైవాహిక కార్యముల జరపించునట్టి పౌరోహితుడు బంధుమిత్రబృందముమధ్య వధూవరుల యిష్టానిష్టము లెరుంగకయే తన మంత్రములతో బంధించి వైవకుండ వివాహమంటపమున పెద్దలెల్ల వినుచుండ దంప తులనోట అన్యోన్య అంగీకార వచనోచ్చారణ చేయించిన అనంతరం వివాహక్రతువు జరుపునట్లును లేకున్న మానునట్లును ఒక నిబంధన మేర్పడవలెను. యీ నిబంధనవలన పీటలమీద పెండ్లిండ్లు తప్పి పోవుననియూ అదియొక పాపమనియూ నెవ్వరేని సంశయింతురా? అయిష్టమైన పెండ్లి తమ మెడకు బిగిసీ బిగియని వురివోలె తగిలింపబడుచుండ జీవిత పర్యంతమూ బాధపడబోవువారిని రక్షించుట పుణ్య మగుగాని పాపమెట్లగును?

పౌరోహితుడీరీతి వర్తించునట్లు ప్రభుత్వమువారు శాసించిరేని మూర్ఖులగు తలిదండ్రాదుల ఆటలు సాగవు. ప్రయత్నమంతా ముగిసినవెనుక విఘ్నమొనరింతురేమొ నన్న భయమెల్లరకూ యేర్పడుతుంది. అందున ముందుగానే తమ బిడ్డల మానసికము నెరుంగునట్టి సదాచారమలవడుతుంది.

ఈ నిబంధనవలన గల్గు లాభనష్టములను పాఠక మహాశయులు 'గృహలక్ష్మి' ద్వారా వెల్లడింప ప్రార్థితులు.

(శ్రీ డి. అనసూయాదేవి)

## సంసారములో స్త్రీల బాధ్యత

సంసారమను శకటమునకు స్త్రీ పురుషులిద్దరును రెండు చక్రములవంటివారు. ఇందలి రెండు చక్రములయొక్క అవసరమును నొకటియె యైయున్నది. సృష్టియందును ఈ రహస్యమే గోచరించు చున్నది. వివేకధనులగు మానవులకు సూక్ష్మదృష్టితో చూచినను స్థూలదృష్టితో చూచిన నీపర మూర్ధమే గోచరింపగలదు. సంసారరంగమున పురుషునికన్నను స్త్రీయే బాధ్యతగల పాత్రయని చెప్ప వచ్చును. స్త్రీ జన్మతః స్వతంత్రురాలు కాదనుటకు సంఘవిద్రోహము మొదటి కారణము. స్త్రీ

తన్నుతాను గుర్తించలేకపోవుట రెండవ కారణము. ఏనాడు స్త్రీ తనశక్తిని గుర్తించి పురుషునివలె గృహనిర్వహణమున పాటుబడునో ఆనాడే పురుషుడు స్త్రీయొక్క నిజస్వరూపమును గుర్తించగలడు. అనేకమంది సోదరీమణులు అనాదినుండి పురుషులు స్త్రీ సంఘమునకు తీరని ద్రోహమును మనఃపూర్వకముగా కల్గించినారని పత్రికలలో వ్రాయు వ్రాతలు మనము చదువుచున్నాము. ఆ వ్రాత లెంతవరకు యదార్థములో నేను వ్రాయజాలను కాని ఒక్క విషయమును మాత్రము సాహసించి వ్రాయుచున్నాను. ఏమనగా, స్త్రీ ఎంతకాలమువరకు తాను సంతానోత్పత్తికొరకును పురుషునియొక్క భోగలాలసత్వముకొరకును ఏర్పడిన ఒక యంత్రమని తలపోయక సృష్టియందు తానుగూడ నొక భాగస్వామియని తలంచి ప్రతివిషయమునను కష్టపడినదో అంతవరకును స్త్రీ అదఃపతితురాలు గాక తన గౌరవమున నిలబెట్టకొనగలిగినది. క్రమక్రమముగా స్త్రీ సోమరితనమువలన సుఖజీవనమున కలవాటుబడి కుటుంబ బాధ్యతనంతయు పురుషునిపై వదలివేసినది—ఏనాడు తాను వంటచేయుటకును, పిల్లలను కనుటకును, భగవంతునిచే నిర్మింపబడిన యంత్రమని తలచి ముగ్ధురాలైనదో ఆనాడే స్త్రీ తన సహజస్వాతంత్ర్యమును గోల్పోయినది. కావున ప్రతి స్త్రీయును విద్యావతియై ఆర్థికవిషయములలోను దేశసౌభాగ్యములోను పురుషునకు బాసటగానిలచి 'కరణేషు మంత్రీ' యను నార్యోక్తిని సార్థకపరచవలయును. కావున సోదరీమణులారా! మనకు సమగ్రమైన విజ్ఞానముకలిగి సంచరించినయెడల స్వాతంత్ర్యమనునది ఒకరిచే నివ్వబడకయే కలుగగలదని మనవిచేయుచున్నాను.

(శ్రీ గుమ్మడి ధనలక్ష్మి మనోహరకుమారి)

## శ్రీమతి కొలిచిన పద్మినీదేవి నిర్యాణము.

ఈమె శ్రీ తిరుపతి శ్రీనివాస త్రిలింగ విద్యాపీఠమున కధిపతులగు వైద్యరాజ దంటు సుబ్బావధాని కవిరాజుగారి యేకపుత్రి. 14-9-1939 తేదీని (భాద్రపదశుద్ధవిదియ) రాత్రి 9 గంటలకు మదరాసు రాజధాని ఘోషా ఆసుపత్రిలో నిర్యాణమునొందినది. గర్భవతియై, 9 వ మాసమున మూర్ఛవ్యాధి చికిత్సనొందుచు నదిశమించగా, దురదృష్టవశత చికిత్స ధనుర్వాతముగా పరిణమించి యంతయు ముగిసిపోయినది. వినయము, గురుసేవ, పాతివ్రత్యము, మొదలగు సద్గుణములకు మేలిబంతియై 'గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః' యన్నట్లు పద్మినీదేవి బ్రదికిన నాలుగునాళ్లు పవిత్రముగా గడపెను.

బ్ర. శ్రీ. దంటు సుబ్బావధానులుగారికి వారి సతీమణి అన్నపూర్ణమ్మగారికి కలిగినట్టి యీ తీరని గర్భశోకము పరమేశ్వరుఁ డుపశమింపఁజేయుగాత. పరమేశ్వరుఁడు పద్మినీదేవి యాత్మకు శాంతిఁగూర్చుగాక! ఆయమ తలిదండ్రులకు, అత్తమామలకు, బంధువులకు, నాంధ్రపురంధ్రీమణుల సానుభూతినిఁ దెలియఁబరచుచున్నాను.

(శ్రీ బాలాంత్రపు శేషమ్మ)

## తెలుగు సినీమా

ప్రస్తుత ప్రపంచమున సినీమా పరిశ్రమ నానాటికి వృద్ధియగుచున్నది. సినీమాను కళగా భావించి సదభిప్రాయముతో కొందరును సినిమాయనిన దూష్యముగతలంచి దురభిప్రాయముతో కొందరు నున్నారు. ప్రస్తుత సినీమాలవలన కలుగు మంచిచెడుగుల విషయమును వదిలి తెలుగు సినీమాలయందు ప్రస్తుతము చూపబడుచున్న ఒక హేయమగు పద్ధతిని అందరును గుర్తింపవలసియున్నది.

మంగళహారతి

ఫిల్ము పరిశ్రమ అరవము, కన్నడము, బెంగాలీ, ఉర్దు, హిందీ, తెలుగు మున్నగు అనేక భాషలలో జరుగుచున్నది. ఫిల్ము ప్రపంచములో శృంగార, విషాదఘట్టములు రెండును ముఖ్యస్థానము నలంకరించి యున్నవి. అందు శృంగారఘట్టమే ప్రజానీకమును చాలవర కాకర్షించును.

ఫిలిం పరిశ్రమ ప్రస్తుత నవీనప్రపంచమున సర్వవిషయిక ప్రచారసాధనమై యున్నది. అట్టి ఫిలిం పరిశ్రమను సరియగు నాచరణలో బెట్టిన విశ్వమానవ కళ్యాణమున కెంతైనను తోడ్పడును. కాని ఆంధ్రుల దురదృష్టముకొలది తెలుగుఫిలిం నిర్మాతలు దేశసౌభాగ్యముకంటె ధనార్జనయే ముఖ్యముగా నెంచి ప్రజల నెక్కువగ నాకర్షించు శృంగారఘట్టములను అనుచితముగ ప్రదర్శింపజేయుచున్నారు.

పవిత్రప్రేమ చూపవలసినచోట కామోద్రేకమును గొల్పు రంగముల ప్రవేశపెట్టుచుండుటచే ప్రేక్షకులు ప్రేమమహిమను గుర్తింపలేక కామమునే ముఖ్యాతికమంది గ్రహించుచున్నారు.

దేశసౌభాగ్యసాధనగా నుపయోగింపవలసిన ఫిల్ము ఆశయములను దుష్పథమునందిడికొని తెలుగు ఫిలిం నిర్మాత లిప్పటికైన మేల్కొని శృంగారఘట్టములందు పవిత్రప్రేమను మాత్రమే చూపెట్టుటయందు శ్రద్ధ వహింతురుగాక! మరియు ఆంధ్ర నటీనటు లిట్టి పవిత్రప్రేమ పద్ధతినే ప్రోత్సహించి ఆంధ్రమాతకు యశము చేకూర్తురుగాక!

(శ్రీ ఇమ్మానేని చంద్రకాంతామణి)

---

# మంగళహారతి

రాట్నలక్ష్మికి మంగళం మా రాజ్యలక్ష్మికి మంగళం
పాలబోలిన నూలునొసగే భాగ్యలక్ష్మికి మంగళం
మా భాగ్యలక్ష్మికి మంగళం ॥రా॥

సిరులుతొలఁకెడు దివ్యవేళల కవులుతిమెడి కటికివేళల
కన్నబిడ్డల కాచిప్రోచిన కదురుతల్లికి మంగళం ॥రా॥

భిన్నమతముల భిన్నకులముల భిన్నభాషా భేదములనూ
భిన్నమయ్యెడు చిన్నిబిడ్డల చేర్చుజననికి మంగళం ॥రా॥

దండిభారత భాగ్యసంపద పిండిపీల్చిన యంత్రరక్కసి
మదమడంచగ నుదయమందిన ఆదిశక్తికి మంగళం ॥రా॥

ప్రతీచ్యదేశ ప్రజలువారలు పారుటాకులు గట్టునాటికె
మేలివలువల చెలువుజూపిన నూలుతల్లికి మంగళం ॥రా॥

జారిపోయిన దేశగరిమను మీరిపోయిన దేశసంపద
తిరిగిచేర్పగ తరలివచ్చిన వరప్రదాయికి మంగళం ॥రా॥

—శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ.

# గ్రంథ సమీక్ష

## సుయోధన శృంగభంగము

రచయిత :—మల్యాల జయరామయ్యగారు కొట్లలాడ్జి, రాజమండ్రి, మూల్యము రూ 1-0-0 ప్రతులు వలయువారు, గ్రంథకర్త పై చిరునామాకు వ్రాసిన బడయగలరు.

ఇది మూడంకముల నాటకము. ఇందలికథ, ఎఱ్ఱా ప్రగ్గడచే రచింపబడిన మహాభారతములో నారణ్య పర్వ భాగములోనిది. చిత్రసేనుడను గంధర్వుని బారినుండి ధర్మజునిచే తప్పింపబడిన సుయోధనుని గర్వభంగ మిందు చక్కని భాషలో, సులభమైన శైలిలో ప్రాచీన సంప్రదాయము ననుసరించి వ్రాయబడినది. పుస్తక ప్రారంభమందు సుప్రసిద్ధ పండితులయు, కవులయు అభిప్రాయములుంగలవు. ఆంధ్ర సారస్వతోపాసకులును, విద్యాధనవితరణవైభవోపేతులును జయపురాధీశ్వరులును అగు శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుం గారికి అంకిత మొనరింప బడుటచే సధికఘనతతో నెగడుచున్నది.

## నవీనసంఘ సంస్కారణం.

గ్రంథకర్త :—చిట్టా రామకృష్ణా రావుగారు, బి. యే. బి. ఇ. డి. టీచర్, యల్. యమ్. హైస్కూలు గుత్తి (పోస్టు) అనంతపురంజిల్లా వెల 8అణాలు, పై విలాసమునకు వ్రాసినచో ప్రతులు దొరకును.

ఇందు సుమారు నూటనలుబది పేజీలలో అరువదితొమ్మిది వ్యాసములలో వివిధవిషయములు కథల రూపమున బహురమ్యముగ సులభమగు వ్యావహారిక భాషలో వ్రాయబడినవి. ఈ గ్రంథము విజ్ఞాన గ్రంథ మాలలో ప్రథమ పుష్పమై, ఆహ్లాదకరమగు సాంఘిక సాహిత్య సేవాసత్ప్రయత్నమున నొప్పుచున్నది.

## మాయలోకం (తొమ్మిది జీవితతరంగాలు)

గ్రంథకర్త : ముద్దా విశ్వనాథంగారు. వెల 6 అణాలు. ప్రతులు వలయువారు ది. సౌత్ ఇండియన్ పబ్లిషర్సు లిమిటెడ్, 33, జోన్సువీధి, జి. టి. మద్రాసు. అని వ్రాయవలెను.

ఈ గ్రంథకర్త రచనలు బహు రసవంతమై చదువుటకెంతయు నింపుగనుండుననుటకీ గ్రంథము చక్కని తార్కాణము. ఇందలి కథలు సాంఘిక జీవితవిషయములను చక్కగ దెల్పుచున్నవి.

# పత్రికాపరిచయము

## గర్జన:—తెలుగు మాసపత్రిక

సంపాదకుడు : ఎం. చలపతిరావుగారు, కార్యాలయము:— 19, నాగమణితోటవీధి, మద్రాసు. సంవత్సరము చందా 8 అణాలు మాత్రమే. విడిపత్రిక అర్ధణా.

సెప్టెంబరు 5 వ తేదీని మొదటి సంపుటము, ప్రథమపత్రిక వెలువడినది. ప్రజాసేవసేయు సత్సంకల్పముతో నొక జాతీయ హాస్యరస పత్రికను సర్వాంగసుందరముగ తయారుచేసి ఆంధ్రలోకమునకు సమర్పింపనెంచిన ఈ పత్రికా సంపాదకుల సత్ప్రయత్నము శ్లాఘాపాత్రము.

ఢంకా:—సంపాదకులు—బి. టి. నరసింహాచార్యులుగారు—నెం. 6, సుందరరామచెట్టి వీధి, జి. టి. మద్రాసు. నూతనసంవత్సర ప్రత్యేకసంచిక, మాకందినది, నాలుగేండ్లనుండి, ఐదవసంవత్సరం జయప్రదముగ సాగించుచున్న, 'ఢంకా' అధికోత్సాహ పూరితమై అత్యంతాకర్షణీయమై యున్నది.




దసరాసంచిక

'గృహలక్ష్మి' దసరాసంచిక నలంకరింప, మా ఆహ్వానముల నందికొని, అత్యంతాదరభావముతో ప్రత్యేకవ్యాసముల నెంతయు నుత్సాహముతో వ్రాసిపంపిన సోదరీ మణులందరకును మా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాము.

ఈ సంచికను మేము మొదట అనుకొనినంత ఘనముగ నలంకరింపజాలకున్నందులకు మా పత్రికాభిమానులగు పాఠకులందరును, మాయెడగల దయతో పంపబడిన వ్యాసముల నన్నిటి నిందు ప్రచురింపజాలకుండినందులకు వ్యాసరచయిత్రులును,మన్నింతురని భావించుచున్నాము.

ప్రపంచమంతయు అశాంతి వాతావరణముచే నావరింపబడి ప్రజలందరకును ప్రాణభయమునుగొల్పు పెద్ద యుద్ధము పెనుభూతమువలె బయలుదేరుటచే, కాగితముల ధర పెచ్చుపెరిగిపోవుటచే తలపెట్టినంత పెద్దదిగ నీపత్రికను ప్రచురింప సాధ్యపడినదిగాదు.

పండుగదినములలో పిండివంటలతో గూడిన విందుభోజనము లారగించి వివిధములగు వేడుకలతో ప్రొద్దుపుచ్చుట కనువగు పరిస్థితులకు మారుగ, బాంబులువచ్చి పైబడునేమో అను భీతియు, ప్రజలను పీడించు కరువు ఘోరమై ప్రబలునేమో అను అలజడియు హెచ్చుగుచున్నవి.

ఏది యెట్లున్నను, సర్వప్రాణుల క్షేమము నొసంగి సంరక్షించి, అఖిలార్థములొసంగి అనుగ్రహముతో నాదరింపగల అఖిలాండేశ్వరియు, ఆదిశక్తిస్వరూపిణియు, జగజ్జననియునగు శ్రీ మహాదుర్గను సర్వజనులును శ్రద్ధాభక్తులతో నారాధింప నెంతయు నవసరమైయున్నది.

ఈ పత్రికయందు ప్రచురింపబడిన వ్యాసములలోని ప్రత్యేక ప్రాముఖ్యతను పాఠకులు గమనింతురను నాశతో నొక కొన్ని ముఖ్యాంశముల నిట బేర్కొనుచున్నాము.

'పండుగులయొక్క పవిత్ర ప్రయోజనము' లను వ్యాసములో పూర్వులు కొన్ని పుణ్యదినములను భగవత్ప్రీతికరమగు భక్తిసాధనలకై ప్రత్యేక ప్రయోజనములతో

నేర్పాటుగావించి మానవకోటి నుద్ధరించు మహితోపకార మొనరించిరను విషయము వివరింపబడినది.

'సమస్య' అను చక్కని కథలో నిరుద్యోగసమస్య ఎంత అనర్ధదాయకమై యువకుల నణచివేయుచున్నదో విశదీకరింపబడినది.

సంసారసుఖము సమకూరుటకు కావలసిన సాధనసంపత్తి 'సంసారసుఖసాధనము' లను వ్యాసములో చక్కగ దెలుపబడినది.

'ఇల్లలుకగానే పండుగా?' అను వ్యాసములో పూర్వకాలములో పండుగ లెట్లుండినవియు ప్రస్తుతకాలములో నెట్లు క్షీణించినవియు సోదాహరణముగ వర్ణింపబడినవి.

'స్త్రీలు - విద్యాప్రచారము' అను వ్యాసములో నిరక్షరాస్యతానిర్మూలన మెంత యవసరమో నిరూపింపబడినది. మాతృభాషాపరిజ్ఞానము విద్యావికాసమున కెంతయు నొడగూర్పగలదని నిర్ధారణ చేయబడినది.

ఆయురారోగ్యాభివృద్ధికిని, ఐహిక సుఖసాధనమునకును, ఆధ్యాత్మికానందానుభవమునకును ఆడువారికి ఆహారజ్ఞాన మత్యంతావసరమను సత్యమును చక్కగ విశదీకరించుచున్న 'ఆడువారికి వలయు ఆహారజ్ఞాన' మను వ్యాసములో అందరును చదివి అవశ్య మాచరింపవలసిన అంశము లనేకములున్నవి.

'కళాకలాప'మను శీర్షికలో ప్రచురింపబడిన కమలకు వ్రాయబడిన లేఖయందు నాట్యము పరమోత్కృష్టమైన కళయనియు, జాతియొక్క వ్యక్తిత్వమును, నాగరికతాభివృద్ధియు దేశములో లలితకళలయొక్క ఔన్నత్యముపై నాధారపడియుండుననియు, అడవి జాతులని పిలువబడు కోయవాళ్లలోగూడ కళాపిపాస హృదయసంచలనము గావింపగల నాట్య నైపుణ్యరూపమున ప్రదర్శితమగుచుండుననియు చక్కని భావములతో నిరూపింపబడినది. పద్యరచనలలో 'స్వాతంత్ర్యము', 'దసరా', 'ఆంధ్రపుత్రికను' అను మూడును రమ్యమగు భావములతో నిండియున్నవి.

స్త్రీజనాభ్యుదయమున కెంతయు నుపయుక్తములును ఆధారభూతములును అగు విషయములు, 'స్త్రీలకు స్వాతంత్ర్యమవసరము', 'భారత స్త్రీజనోచితమగు విద్య', 'స్త్రీజనాభ్యుదయమునకు వలయు సాధనములు' అను మూడు వ్యాసములలోను చక్కగ విశదీకరింపబడినవి.

ఆంధ్రరాష్ట్ర సంపాదన ఆంధ్ర మహిళామణుల శక్తిసామర్థ్యములచే, నిరంతర కృషిచే జరుగవలెనని ప్రబోధించుచున్న 'ఆంధ్రరాష్ట్రము మేమే తెస్తాము' అను వ్యాసములో హృదయసంచలన మొనరింపగల ఉన్నతాదర్శప్రేరితమైన ఉద్బోధ గలదు.

పుష్పచయమను శీర్షికలో స్త్రీల సమస్యలను చర్చించు విషయములొకకొన్ని చేర్చబడినవి.

ఇట్లు పండుగ సందేశములతో, విద్యావిషయ ప్రబోధములతో; సంసారసుఖ సాధన సంపత్తిని సమకూర్పగల సలహాలతో, స్త్రీజనాభ్యుదయమునకు సహాయపడగల సదుపదేశములతో, వనితలకు వివిధములగు వేడుకల గూర్పవచ్చుచున్న 'గృహలక్ష్మి' దసరాసంచిక ఆంధ్ర సోదర సోదరీమణుల ఆదరము నెదురుచూచుచు వారి ఆశీస్సుల నందికొన నాశించుచున్నది.

గాంధీమహాత్ముని జన్మదినోత్సవములు

ఏ మహాత్ముడు తన జీవిత మహిమాతిశయముచే ప్రపంచమున కంతకును మార్గదర్శకుడై వెలయుచున్నాడో, ఏ మహనీయతేజుడు అహింసావ్రతమనే పరమధర్మముగ భావించి ప్రపంచములో శాంతి సామ్రాజ్యమును స్థాపింప సంకల్పించినాడో, ఏదేశసేవా దురంధరుడు భారతదేశ స్వరాజ్య సంపాదనకై సర్వస్వార్థములను త్యజించి సర్వకాలసర్వావస్థలయందును మాతృదేశారాధన మొనరించుచున్నాడో, ఏ దివ్యప్రభావుని విశ్వప్రేమ పూరిత విశాల హృదయమునకు వశులై యెల్లఘనులును వర్తిల్లుచున్నారో అట్టి పుణ్యమూర్తియగు గాంధీమహాత్ముని డెబ్బదియొకటవ జన్మదినము అక్టోబరు 2వ తేదీయై యున్నది.

నాటిదిన మీభారత వీరశ్రేష్ఠుని ఉపదేశామృతమును హృదయమునిండ గ్రోలి ఆయన పావననామమును కీర్తించి ఆమహామహుని జీవితాశయమగు అహింసావ్రత ధర్మము నందరవలంబింప నిశ్చయించుకొనుటెంతయు పుణ్యకృత్యమై యొప్పును.

లోకమాన్యతిలకు మహాశయునిచే ఘనముగనెన్నబడి, ఆయన నిత్యజీవితమందు నిరవశేషముగ నిర్వహింపబడిన కర్మయోగము ననుష్ఠించి యద్దాన నిఖిల ప్రాణికోటికి నిష్టుడై ముదమొనగూర్చు మహాత్ముని జన్మదినము, భారతమాత బిడ్డలందరకును పవిత్ర దినమై, పుణ్యప్రదమైన పర్వమన బరగుచున్నది.

ఆనాడుమొదలు పదవతేదీవరకును గాంధీజయంత్యుత్సవదినములగుటచే నీరోజులలో ఖద్దరు వస్త్రధారణ మొనరించి, స్వరాజ్య ప్రతిష్ఠాపనకై వలయు కార్యక్రమమునందత్యంతోత్సాహముతో నెల్లరు పాల్గొని, మహాత్మునివంటి మహితసుతునిగన్న భారత మాతను నిండుసభలలో నారాధించి, ఆమహనీయునకు సంపూర్ణాయురారోగ్యముల బ్రసాదింప సర్వేశ్వరుని ప్రార్థించినచో నాసత్యస్వరూపుని శాంతచిత్తమెంతయు సంతసించును.

ఆయన అమృతవాక్కునుండి సారెసారెకు ప్రతిసభావీథికనుండియు, ప్రతిప్రతికాముఖమునుండియు వెల్వడుచున్న స్వరాజ్య సంపాదనాసాధనసిద్ధాంతములైదును

(1) అహింసావ్రతాచరణము (2) అస్పృశ్యతానివారణము (3) ఖద్దరువస్త్రధారణము (4) మద్యపాన నిషేధము (5) హిందూమహమ్మదీయ సమ్మేళనమును, ఐదు స్వరాజ్యసాధ సోపానములని సంభావించి, అందరును అవ్విధుల నాచరించినచో నామహాత్ముడు సంకల్ప సిద్ధుడై సంతుష్టిజెందును.

మహాత్ముని జన్మదినమహోత్సవము లాయనకు శతవర్షములు నిండుదనుక భారతీయులు సేయగల భాగ్యము సర్వేశ్వరుడనుగ్రహించుగాక ! మహాత్ముడు భారత స్వరాజ్య సింహాసన మధిష్ఠించి ప్రపంచశాంతి స్రామ్రాజ్యసంస్థాపకుడై సర్వదేశములచే నాదర్శ పురుషుడని సంస్తుతింప సర్వేశ్వరియగు శ్రీ మహాదుర్గ యాశీర్వదించుగాక !

## స్త్రీలు - చిత్రకళ

సౌందర్యము స్త్రీల సొమ్మని సాధారణముగ చెప్పబడుచుండును. కాని ఇది సంపూర్ణమగు సత్యముపై నాధారపడిన సంస్తుతివాక్యమనజెల్లదు. సౌందర్యమహిమ తక్కిన సద్గుణసంపదవలెనే స్త్రీ పురుషు లిరువురకును సమానమగు సల్లక్షణమై యొప్పుచున్నది. కాని, మానసిక, ఆధ్యాత్మికాభివృద్ధికి పురుషులెంతగ నుత్సాహింతురో, స్త్రీలు శారీరక సౌందర్యాతిశయమునకై అంతగ తల్లడించుచుందురు.

అందము, అలంకారము ఆడువారికి స్వభావసిద్ధమైన సల్లక్షణములుగ సృష్టిలోనే యేర్పడినవి. అలంకారముచే ప్రకృతిసిద్ధముగనేర్పడిన అవలక్షణములను సయితము స్త్రీలు సరిచేసికొనగలిగిన సహజనైపుణ్యముతో వెలయుచుందురు. సహజసౌందర్యమును సొగసుగుల్కు తళ్కుబెళ్కులతో శోభావంతముగజేసికొన సంతసింతురు.

పురుషుల సహజసౌందర్యసంపదను క్రేణిసేయగల రామణీయకవైభవము నందగల రమణీమణుల నెందరనో చూచుచుందుము. కాని కళానైపుణ్యములో పురుషుల ప్రతిభను తేజోహీనముగజేయగల ప్రాభవమును పొలతులు పొందలేకుండుటకు కారణమేమి ?

స్త్రీల కళావిభ్రమము, కళోపాసనాసక్తి, పురుషుల కళాపరిశ్రమతో పోల్చిచూచిన వారివారి ప్రకృతిధర్మములు బాగుగ తేటపడగలవు. స్త్రీల విద్యాపరిశ్రమయు, కళారాధనమును ఐహిక విషయములకును, స్థూలదృష్టికి గోచరించు విషయములకును నెక్కువగ సంబంధించియుండుటచే మితాదర్శములపై నాధారపడినదిగనుండును. ఆంతరంగికాభివృద్ధిని, విశాలమగు దృష్టివైభవమును వారి యూహాశక్తి కందరాని ఫలములై యుండును.

ఇందులకు 'విద్యాపరిశ్రమయం దభిలాష తక్కువగుటయే ముఖ్యకారణము. పురుషులచే గల్పింపబడిన అవరోధములటుండ, నైసర్గికమగు నిరుత్సాహముచేతను, సంకుచిత భావములతోగూడిన సంతృప్తిచేతను స్వల్పమగు దృష్టిసంపదచేతను వారికి విద్యలలోను, కళల

లోను పెద్దయంతస్తు లంతరంగములో పొడచూపకుండుటచే విద్యాపరిశ్రమయందు చాలి నంత దీక్షాపరతంత్రత కుదుర నేరదు.

అందుచేతనే లలితకళలని చెప్పబడు శిల్పము, చిత్రలేఖనము, సంగీతము కవిత్వము మొదలగు విద్యలలో పెద్ద ప్రావీణ్యమునుపొందిన ప్రమదలు బహు తక్కువగనుందురు.

భారతదేశములో చిత్రకళయందు చాల పరిశ్రమసలిపిన స్త్రీలను వ్రేళ్లపై లెక్కించ వచ్చును. స్వసౌందర్యాతిశయమును పెంపొందించుటకు చిత్రకళాపరిశ్రమ యెంత యవస రమో యెరుంగగల ఉవిదలు లేరనియే చెప్పవలసియున్నది. చిత్రకళలో నారితేరిన నారీ మణులలో నొక కొలదిమందికే ఈ ఘనరహస్యము తేటపడగలదు.

దేశముయొక్క నాగరకతాధిక్యత కళలయొక్క ఘనతనుబట్టియు, శిల్పసంపదను బట్టియు నిర్ణయింపవచ్చును. దేశముయొక్క భాగ్యమునకు, వైభవమునకు ప్రత్యక్ష చిహ్నమగు శిల్పమును స్త్రీ లెక్కువగ నభ్యసింపవలసియున్నది.

ఈ సందర్భములో నీమధ్య కలకత్తాలో జరిగిన షీలాబానర్జీ కన్యగారి చిత్రప్రద ర్శన మెంతయు ప్రస్తుతింపదగియున్నది. స్త్రీల కాదర్శప్రాయమగు చిత్రకళానైపుణ్యమును పొందగలిగిన ఈ యువతీలలామ, బెంగాలురాష్ట్రమునకే కాక భారతదేశమంతకును గూడ గొప్ప యలంకారమనబరగుచున్నది. ఇంతవరకు హిందూ యువతులెవ్వరు నందియుండ లేని ప్రావీణ్యము నీ సుందరి తన యద్భుత చిత్తరువులందు జూపగలిగినదని ప్రతిదిన మును వేనకువేలుగ నీ చిత్ర ప్రదర్శనమును జూడవచ్చిన ప్రజలెంతయు ప్రస్తుతించు చున్నారు.

హిందూ శిల్పసంప్రదాయమును తన చిత్తరువులలో శోభింపజేయుచు వివిధ దేశము లందలి శిల్పకళావైభవ విశేషముల నీమె చక్కగ సేకరించి సర్వసల్లక్షణ సమన్వితమగు చిత్రకళానైపుణ్యముతో నొప్పారు చిత్రములను సృష్టింపగలుగు టెంతయు శ్లాఘాపాత్రమై యున్నది.

కళానైపుణ్యముతో ఘనమగు సృష్టిచాతుర్యమును, కల్పనాసామర్థ్యమును ప్రక టింపగల చిత్తరువుల వ్రాయుటయందే కాక, వివిధాలంకారములతోగూడిన వాణిజ్య విష యకమైన వస్తువుల నత్యంతాకర్షణీయముగ నొనరింపగల నేర్పును గూడసంపాదించిన ఈ సుందరీమణి కళాపరిశ్రమ కడు ప్రశంసనీయమనుటకు సందియములేదు.

ప్రాచ్యపాశ్చాత్యశిల్పమహిమను బాగుగ సమన్వయింపగల ప్రావీణ్యమును బడసి బెంగాలురాష్ట్రమునకు శిల్పకళలో గలిగిన ప్రఖ్యాతిని ప్రపంచమున కంతకును బాగుగ విస్తరింపజేయ నెంతయు పాటుపడుచున్న షీలాబానర్జీ కన్య భారత రమణీమణుల కాదర్శప్రాయమై వెలయుచున్నది.

ఆంధ్ర మహిళామండలిలో చిత్రకళా ప్రావీణ్యమునకై పరిశ్రమసలుపుచున్న చిత్రకారిణిలకు ఉన్నతాదర్శముల నుద్బోధించుచున్న మీలాబానర్జి కన్య ఘనవిద్యాకౌశలము మిక్కిలి ప్రోత్సాహకరమగు లక్ష్యమై వారి నధికమగు శిల్పవిద్యాపరిశ్రమకై పురికొల్పునని విశ్వసించుచున్నాము.

ఇప్పట్ల, ఆంధ్రవనితారత్నము లీవిద్యయందు చేయుచున్న పరిశ్రమ నెంతయు ప్రశంసింపదగును. 'గృహలక్ష్మి' నలంకరింప నుత్సాహించుచు వివిధరచనావిలసితమగు నేర్పుతో చిత్తరువుల వ్రాసియిచ్చిన శ్రీమతి రత్నాల కమలాబాయిగారి చిత్రకళాపరిశ్రమ నభినందించుచు, నయనోత్సవమొనరించి, ఆత్మానందము నొడగూర్పగల చిత్రకళను ఉవిద లధికముగ సాధనసలుప నుత్సాహింతురని ఆశించుచున్నాము.

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ

ఈమధ్య గుంటూరులో ఆంధ్రరాష్ట్ర మహాసభా సమావేశసందర్భమున ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ గూడ జరిగియున్నది. శ్రీమతి కే. రామసుబ్బమ్మగారి అధ్యక్షోపన్యాసములో స్త్రీజనాభ్యుదయమునకు వలయు సాధనసంపత్తినిగూర్చి సవిస్తరముగ చెప్పబడినది. తదితర ఉపన్యాసములలోను స్త్రీల సమస్యలనుగూర్చిన విషయములు చక్కగ విశదీకరింపబడినవి. ఆ ఉపన్యాసములన్నియు సెప్టెంబరునెల 'గృహలక్ష్మి'లో ప్రచురింపబడినవి.

ఆంధ్రమహిళామణుల అభ్యుదయమున కాధారభూతమగు ఆంధ్రరాష్ట్ర సంపాదనయొక్క అత్యంతావసర మందరిచే గుర్తింపబడియుండుటచే ప్రత్యేకరాష్ట్ర ప్రతిష్ఠాపనమును గూర్చి ఆంధ్రనారీమణులు సమాలోచన సేయ సమకట్టి నవంబరు 4, 5, తేదీలలో, కడపలో ఆంధ్రరాష్ట్ర మహిళాసభను జరుప నుద్దేశించినారు. కావున ఈలోపుగా, అనగా అక్టోబరునెల 3వ వారం ఆఖరునకు, ఆంధ్రరాష్ట్రమందలి అన్నిపట్టణ తాలూకా, జిల్లా సంఘములును మహిళాసభల జరిపి, తీర్మానములు, రిపోర్టులు, ఆంధ్రరాష్ట్ర స్థాయిసంఘ సభ్యురాలగు శ్రీమతి ch. చంద్రమతిగారికి (రాజమండ్రి) పంప ప్రార్థింపబడుచున్నారు.

సభలో ముఖ్యముగా నీదిగువ పేర్కొనబడిన విషయములపై చర్చలును, తీర్మానములును గావింపబడును.

(1) ఆంధ్రరాష్ట్రము (2) ఆరోగ్యవిద్యావిధానములు (3) సాంఘికసంస్కరణము (దేవదాసి బిల్లు వగైరాలు) (4) రాజకీయమైన, చట్టసంబంధమైన స్త్రీలయిబ్బందులు (5) అన్నిజాతుల స్త్రీలయొక్క ఆర్థికస్థితిగతులు (6) కూలిజనసమస్య (7) గ్రామపునరుద్ధారణ (8) దేశపరిశ్రమలు.

# సంపాదకీయములు

పై దెల్పబడిన తేదీలలో నీసభాసమావేశ సందర్భములను, చర్చింపవలసిన తీర్మానములను, ఆంధ్ర సోదరీమణులందరును గమనింతురని భావించుచున్నాము.

## వివాహములలో కట్నములు కానుకలు కొలదికిమీరి యుండరాదు

పంజాబు శాసనసభలో రెండుబిల్లులు ప్రవేశపెట్టబడునని పత్రికలలో వెల్లడింపబడినది. మొదటిది కట్నముల బాధతగ్గించుటకై ఉద్దేశింపబడినది. రెండవది భార్యా వియోగము నొందినవారు భర్తృవియోగము నొందిన వనితలనే కాని కన్యలను వివాహమాడకుండజేయ సంకల్పింపబడినది.

సింధురాష్ట్రములో కట్నముల నవరోధించు చట్టము చేయబడుటచే ఎంతయు మేలొనగూడినది.

పంజాబు రాష్ట్రములోగూడ వివాహసమయములోగాని, వివాహనిశ్చితకాలమందు గాని, 500 రూప్యములకుమించి కట్నములుగాని కానుకలుగాని ఇచ్చిపుచ్చుకొనుటలు జరుగకుండజేయుటకై శాసనసభలో పార్లమెంటరీ ప్రయివేటు కార్యదర్శియగు 'తిక్క జగజిత్ సింగు'గారు ప్రకటనమూలమున వెల్లడించియుండుటచే ఒక రాష్ట్రము వెంబడి మరొకరాష్ట్రము కట్నముల బాధను బాప సంకల్పించు టెంతయు శ్లాఘింపదగిన శాసన సహాయ సహితమగు సంఘసంస్కరణమైయున్నది.

ఈ విషయమును మద్రాసు రాష్ట్రప్రభుత్వమువారుగూడ త్వరలో పరిష్కరించి కట్నముల పిశాచమును రూపుమాపుటకై తగు కట్టుదిట్టములతోగూడిన చట్టమును నిర్మింతురని ఆశించుచున్నాము.

సంసారనిర్వహణమే సాధ్యముగాక సకల కష్టములబడుచున్న పేద గృహస్థుల పాలిట పెనుభూతమై ప్రబలుచున్న కట్నముల దురాచారము దేశములో తలచూపకుండ జేయు టెంతయు నవసరమైయున్నది.

భార్యావిహీనులైన వారు భర్తృవిహీనలైన వనితలనే భార్యలుగ బడయదగును గాని ప్రాయములోనున్న కన్యలకుత్తుకగోయ ప్రయత్నింపరాదనుటయు బహు ప్రశంసనీయమైన సంఘసంస్కరణము. ఏబదిసంవత్సరములు పైబడి, పిల్లలగని, భార్యావియోగమును భరింపలేక, పదిపదారేండ్లప్రాయముగల బాలికలను మరల పరిణయమాడ దలంచు పెద్దల పట్టుప్రయత్నములను ప్రతిహత మొనరింపగలిగిన శాసనమగుటచే ఈబిల్లు త్వరలో నమలులోనికి వచ్చినచో సంఘమున కెంతయు శ్రేయోదాయకమగును.

## యావద్భారత మహిళామండలి సమావేశము

సంగ్లిలో నిటీవలనే అఖిలభారత మహిళామండలియొక్క స్థిరసంఘ సమావేశము శ్రీమతి రాణీ లక్ష్మీబాయ్ రాజవాడెగారి అధ్యక్షతను జరిగియుండుటయు నందు అంతర్జాతీయ సమస్యలు చర్చింపబడుటయు నాంధ్ర రమణీమణుల కత్యంతాసక్తిని, సంతసమును గలిగించు సంగతియే యగును.

జూలై నెల ప్రారంభములో స్త్రీలకు పురుషులతోపాటు సమాన ఓటు హక్కును పురపాలన విధానమునందు సమాన సభ్యత్వమును సమాన గౌరవమర్యాదలును ఏర్పరుప నుద్దేశించి 'కోపెన్‌హేగన్' పట్టణములో జరిగిన పదమూడవ అంతర్జాతీయ పరస్పర సంఘ సమావేశమునకు పంపబడిన భారతీయ ప్రతినిధుల పద్ధతుల పట్టీని ఈ సభవారనుసరించు టెంతయు సంతసకరముగనున్నది.

ఆసియాఖండమున కత్యంత సన్నిహితములైన ప్రాగ్దేశముల సమస్యలనుగూర్చి చర్చించుటను అంతర్జాతీయ సహకార సంఘమువారేల చల్లగ జారవిడిచిరో తెలిసికొన బ్రశ్నింపబూనిన భారత మహిళామండలివారి యుద్దేశములు ప్రస్తుతింపదగినవి.

అంతర్జాతీయ మహాసభకు వెళ్లియుండిన ప్రతినిధులు ఇండియా, బర్మా, సిలోన్, మళయాద్వీపకల్పము, ఈ ప్రదేశములలోని ప్రమదలందరును ప్రబలమగు ప్రత్యేక సంఘముగగూడి అంతర్జాతీయ సంఘములో నధిక ప్రతిభను ప్రదర్శింపవలెనను పట్టుదలను బూనిన ఈ సభవారి తీర్మానమును ప్రతి ఆంధ్రసోదరీమణియు బలపరచి అందులకై పాటుపడ నుత్సహించు టెంతయు నుచితమనజెల్లును.

విదేశములకేగి విశేష శ్రమలబడుచున్న భారతీయ సోదరసోదరీమణులకు మనప్రేమ సందేశమును పంపుచు, హిందూదేశహితులును విదేశనివాసులునగు భారతీయుల దుర్దశను తొలగింప ఇండియా, బర్మా, సిలోన్, బ్రిటిష్ గుజానా ప్రభుత్వములను బలవంతపెట్టుట యావద్భారతీయుల బాధ్యతయైయున్నదని ఈ సభవారు భావించుటచే జాతీయ ప్రతిభను పెంపొందించుటయే అంతర్జాతీయ సంఘముల ఆదర్శమను ఆంతరంగికాభిప్రాయమును వెల్లడించియుండిరని గ్రహింపదగును.

యావద్భారత మహిళామండలి సమావేశమునకు చక్కని యవకాశములను గూర్చుటకై పట్టణములందును పల్లెలందును మంచి ప్రచారమును జరిపి ఈ సంఘమును సుస్థిరముగ నిలుపుటకై ప్రతి భారతీయ సోదరీమణియు పాటుపడవలెను. ఆంధ్రసోదరీమణు లీ యాదర్శముల నాదరింతురుగాక!

---

EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

## ప్రమాదినామ సంవత్సర — భాద్రపదమాసము

1939-వ సం॥ నవంబరునెల

| | | |
|---|---|---|
| 1 | బు | చవి ఉ10-40 మృగ సా5-57 వరా2-6 మొ3-39కు* 7-0 |
| 2 | గు | పంచ ఉ9-24ఆర్ద్రి సా5-11వ తె4-42 మొ*6-56 |
| 3 | శు | షష్ఠి ఉ7-45 సప్త తె-5-48 పుసా4-8 శేవ6-12కు వరా11-43మొ1-13*కు6-54 |
| 4 | శ | అష్ట తె3-39 పుష్య మ2-39 వరా2-49 మొ4-19కు*6-50 |
| 5 | ఆ | నవ రా1-19 ఆశ్రే మ1-19 వరా12-39 మొ2-0కు*6-47 |
| 6 | సో | దశ రా10-57 మఖ ప11-38 వరా7-6 మొ8-36కు విశాఖకార్తె*6-44 |
| 7 | మం | ఏకా రా10-35 పుబ్బ ఉ9-58 వసా4-41 మొ6-11కు*6-40 |
| 8 | బు | ద్వాద రా6-19 ఉత్త-ఉ8-21 వసా 4-13 మొ5-43కు*6-36 |
| 9 | గు | త్రయో సా4-11 హఉ6-52 చిత్త తె5-36వమ2-27మొ3-58కు*-6-32 |
| 10 | శు | చతు మ2-24 స్వాతి తె4-37 వప10-59 మొ12-31కు తిథిద్వయందీపావళీ*6-28 |
| 11 | శ | ● అమా మ12-52 విశా తె4-1వప10-5మొ11-39కు ప్రతిపత్తిథి*6-24 |
| 12 | ఆ | శుపా ప11-44అనూ తె3-50 వఉ8-0 మొ9-35కు భో°6-20 |
| 13 | సో | విది ప11-2జ్యే తె4-6 వఉ9-30 మొ11-7కు భో° [illegible]-16 |
| 14 | మం | తది ప10-49 మూ తె4-51వరా3-13 మొ4-51కు భో°6-12 |
| 15 | బు | చవి ప11-9 పూషా. పూర్తివ. మ2-39 మొ4-20కు భో°6-8 |
| 16 | గు | పంచ ప12-0 పూషా ఉ6-8 వమ2-42 మొ4-25కు షష్ఠితిథి వృశ్చికం భో°8-16 |
| 17 | శు | షష్ఠి మ1-15 ఉషా. ఉ7-53 వమ12-14 మొ1-58కు శూన్యతిథి భో°8-12 |
| 18 | శ | సప 3-1 శ్రవ ఉ10-0 వమ2-24 మొ4-10కు సప్తమితిథి భో°8-8 |
| 19 | ఆ | అష్ట సా5-1ధని మ12-26 వరా8-25 మొ10-11కు భో°8-4 |
| 20 | సో | నవ రా7-11శత మ3-3 వరా10-9 మొ11-55కు భో°8-0 |
| 21 | మం | దశ రా9-17పూభా సా5-39 వతె4-13మొ5-59కు భో°7-57 |
| 22 | బు | ఏకా రా11-12 ఉభా రా8-4వర్జ్యములేదు భో°7-53 |
| 23 | గు | ద్వాద రా12-45 రేవ రా10-10 వఉ8-59 మొ10-43కు భో°7-50 |
| 24 | శు | త్రయో రా1-55 అశ్వి రా11-53 వరా7-37 మొ9-20కు భో°7-47 |
| 25 | శ | చతు రా2-34 భర రా1-17 వప9-59 మొ11-40కు భో°7-44 |
| 26 | ఆ | ○ పూర్ణి రా2-42 కృరా1-51వమ1-30 మొ3-9కు భో°7-40 |
| 27 | సో | బపా రా2-18 రోహి రా2-5వరా6-1 మొ7-38కు భో°7-37 |
| 28 | మం | విది రా1-29మృగ రా1-52వఉ7-39 మొ9-14కు భో°7-33 |
| 29 | బు | తది రా11-56 ఆర్ద్రి రా11-13 వప10-2మొ 11-36కు భో°7-29 |
| 30 | గు | చవి రా10-34పున రా12-14 వమ2-44మొ 2-16కు భో°7-25 |

☞ ప, పగలు. రా, రాత్రి. ఉ, ఉదయము. మ, మధ్యాహ్నము. సా, సాయంకాలం. తె, తెల్లవారుజామున. వ, వర్జ్యము. మొ, మొదలు. కు, వరకు. భో, భోగ్యము.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రములు : చిత్రకారిణి—శ్రీమతి ఆర్. కృష్ణాబాయిగారు.

వలపు విరిదండతో విశ్వామిత్ర తపోవనమున వెలసిన మేనక



వలపు విరిదండతో విశ్వామిత్ర తపోవనమున వెలసిన మేనక.



## ప్రపంచశాంతి సౌఖ్యప్రదాత, భారతభాగ్య విధాత,

## 'బాపూజీ'

"If there is any man in India to-day, whom the people of this country can look up to as Bapu (father) that is Gandhiji"—(Babu Purushottamdas Tandon, Speaker, U. P. Assembly)

భారతభాగ్యవిధాత అని ప్రస్తుతింపబడుట కెంతయు తగియున్న మహాత్ముని, సంయుక్తరాష్ట్ర శాసనసభాధ్యక్షులగు శ్రీ బాబూ పురుషోత్తమదాసు టాండన్‌గారు, 'భారతపిత' అని రెండు సంవత్సరములకు ముందు గాంధీజీ జన్మదిన వర్ధంత్యుత్సవ సందర్భమున ప్రశంసించియుండుటలో సత్యముతోగూడిన ఘనసందేశార్థసందీప్తితమగు రహస్యమును భారతీయులకు వెల్లడించియుండిరి. ఆయన చెప్పినటుల మహాత్ముడిపుడు 'భారతపిత'యే కాకుండ, ప్రపంచశాంతి సౌఖ్యప్రదాతయు, భారతదేశస్వరాజ్యప్రతిపాలనా ప్రాభవోపేతుడును, మానవకోటికెల్ల మార్గదర్శకుడునుగూడ నై అసమాన తేజోమహిమతో విలసిల్లుచున్నాడు.

పూర్వము భారతవీరులలో భీష్ముడు 'భారతపితామహ' బిరుదమున కర్హుడై అట్టి ఘనగౌరవము నొందియుండెను. ఇరువదవశతాబ్ద ప్రారంభములో దాదాభాయి

సారోజీ భారతీయులలో పెద్దగ (The grand old man of India) పరిగణింపబడి ప్రఖ్యాతిగాంచెను. ఇప్పుడు గాంధీమహాత్ముడు 'భారతపిత' (బాపూజీ) అను సార్థక నామముతో తనరారుచున్నాడు.

వయసునందు పెద్దతనమునే పూజ్యార్హతకు ప్రధానాధారహేతువుగ భావించి, దేశమునకంతకును వందనీయుడగు పురుషుడని ప్రశంసించుట భావ్యమగుచో నట్టి భాగ్యమున కర్హులగు వయోవృద్ధులు భారతమాత పుత్రులలో పెక్కురుగలరు. కాని ప్రపంచ ప్రఖ్యాత పుణ్యపురుషులని పేర్కొనదగిన పెద్దలలో గాంధీమహాత్మునితో బోల్చతగిన సమానార్హులే లేనప్పుడు అమ్మహనీయునికంటె నధికులెట్లుండగలరు?

ప్రపంచ మహాకవులలో పేరెన్నికగన్న రవీంద్రుడు మహాత్మునిగూర్చి పలుమారు పలికియుండిన ప్రస్తుతిభాషణములందలి సత్యమును పరిశీలించినచో మహాత్మునియం దా కవిసార్వభౌమునికి గల భక్తియు, ప్రేమయు విశదమగును. మహాత్ముని 69 వ జన్మదిన మహోత్సవసందర్భమున రవీంద్రుడు పంపియుండిన ప్రేమసందేశములో ("We are all grateful for the great gift of your life") మేమందరమును మీకిట్టి ఘనమగు జీవితమును భగవంతుడు ప్రసాదించినందుల కెంతయు కృతజ్ఞులమును కృతార్థులమును అగు చున్నాము, అని నుడివియుండెను.

రవీంద్రమహాశయుడే గాక, పండిత మాళవ్యాబాబు, శ్రీ బాబూ అరవిందఘోష్, లోకమాన్య బాలగంగాధరతిలక్, బాబూ రాజేంద్రప్రసాద్, జాన్ హేనెస్ హోమ్సు (John Haynes Holmes) మొదలగు మహాపురుషులెందరో మహాత్ముని ఘనతను వేనోళ్ల బొగడియున్నారు. హోమ్సుగారు చెప్పినటుల ("His soul has been lifted by virtue of incomparable discipline to the measure of the stature of those realities which are of God") భగవదంశనుబోలు సంపూర్ణ సత్యస్వరూప ప్రదర్శితమగు దివ్య సాధనలయొక్క సహాయముచే నీ మహాపురుషుని ఆత్మ అత్యంతౌన్నత్యము నందగలిగి యున్నది. ఆధ్యాత్మిక, మానసిక, నైతిక, శారీరక సామరస్యమును సాధించుటయందు సిద్ధిపొందిన జగత్ప్రసిద్ధ మహాపురుషుడగు మహాత్మునికంటె 'భారతపిత' యని పిలువబడ దగిన పెద్దలెవరున్నారు? ప్రపంచమంతయు నీ దివ్యతేజోవైభవమూర్తికి జోహారొనరింప నర్హమగు జగన్మోహన శీలసంపద గాంధీజీ యందుండుటచే, ఈ యనఘునితో సమానుడగు ఘనుడు కలియుగమున గానరాడు.

భారతదేశముయొక్క భావిభాగ్యము, నాగరకతౌన్నత్యము మహాత్మునియందు మూర్తీభవించినవి. జాతీయ ఘనగౌరవమీ ఘనునియందు ఘనీభవించి కానుపట్టుచున్నది.

ఇట్టి పురుషోత్తముని, సాధుసత్తముని, త్యాగమూర్తిని, ధర్మదేవతను భక్తరత్నమును గన్న భారతమాత భాగ్యము, భారతజాతిలో భేదములేర్పడి, ఐకమత్యము నశించుటచే, అన్యప్రభువుల యధీనముగావలసివచ్చె.

కాని రాజకీయ రాజయోగియు, ఖద్దరు కర్మయోగియు, అహింసావ్రత దీక్షాపర తంత్రుడగు ఆత్మజ్ఞానయోగియు, అగు మహాత్ముడు భారతదేశ స్వరాజ్య సంస్థాపనము గావింప శతవర్షములు నిండుదనుక భువిపై భౌతిక దేహమునుదాల్చియుండి, ప్రపంచములో శాంతిసామ్రాజ్యమును స్థాపించునటుల సర్వేశ్వరు డనుగ్రహింప సర్వజనులును ప్రార్థనలు సలుపవలసియున్నది.

మహాత్ముడు భారతదేశ స్వరాజ్య సింహాసనము నధిష్ఠించి, ధర్మరాజ్యమును రామరాజ్యమువలె నడిపి, అహింసయను దివ్యాయుధముతో ప్రపంచమంతను వశపరచికొని ధరలో ధర్మమును తిరిగి సంపూర్ణముగ ప్రతిష్ఠించి తనరునటుల భారతీయులందరును ఏకీభావముతో, తోడ్పడ విధియైయున్నది.

ఈ సందర్భమున, మహాత్ముడు, సర్వేశ్వరుడు సత్యస్వరూపుడని సర్వదా సంభావించుచు తెల్పియున్న సత్సందేశములోని వాక్యములు జ్ఞప్తికివచ్చుచున్నవి. అవి ప్రతి సత్యాన్వేషణ తత్పరునకును వేదవాక్యములై విలసిల్లుచుండుటచే నిచట నుదాహరించు టుచితమగును.

> "But for me truth is the sovereign principle, which includes numerous other principles........................There are innumerable definitions of God, bccause his manifestations are innumerable. They overwhelm me with wonder and awe and for a moment stun me. But I worship God as Truth only."

మరియొక దివ్యమగు మతబోధయననొప్పు హితవాక్యము మహాత్ముని నిరహంకార గుణము నుద్దీపింపజేయుచున్నది. "The world crushes the dust under its feet but the seeker after truth should so humble himself that even the dust could crush him" సత్యమును మించిన దైవమును ధర్మమును దివ్యబలమును వేరులేదు. సత్యమే భగవంతునియొక్క సంపూర్ణ సత్యస్వరూపము. సత్యాన్వేషణ తత్పరుడగు ప్రతి భక్తుడును తన పాదములక్రింద త్రొక్కపడుచుండు ధూళికి సయితము భయపడి మెలగుచు నిరహంకారముతో నిండిన హృదయమును గలిగియుండినగాని ఆ దివ్యసత్యజ్యోతి దృష్టికి గోచరింపదు. ఇవి వేదవాక్కులుగ పరిగణింపదగిన ఉపదేశామృతమన నొప్పుచున్నవి. సిద్ధపురుషుడగు మహాత్ముడు బుద్ధదేవుని అవతారావతారమూర్తి యనబరగుచున్నాడు.

ధర్మశాస్త్రములు తెల్పుచున్న నీతులను, మతములు బోధించుచున్న మహిత ధర్మములను ఇమ్మహనీయుడు రాజకీయ వ్యవహారరూపమగు వ్యాఖ్యానముతో విశదీకరించెను.

విశ్వవిఖ్యాత విమలజ్ఞానమూర్తి వైభవోపేతుడగు మహాత్ముని అద్భుతశక్తులన్నియు ఆయన జీవితములో వెల్లడింపబడినవి. ఆయననుగూర్చి మహనీయులొసంగిన మహితాభిప్రాయములన్నిటిని సంపాదించి, గ్రంథరూపమున నమర్చి, మహాత్మునికి 71-వ జన్మదిన మహోత్సవకానుకగా సమర్పించి, శ్రీ. సర్. సర్వేపల్లి రాధాకృష్ణపండితు లొనర్చిన ఘనగౌరవసత్కార మెంతయుశ్లాఘాపాత్ర మనదగియున్నది.

ఆ గ్రంథములోగల యభిప్రాయములలో రవీంద్రుడొసంగిన సన్నుతి చాల ప్రశంసనీయమైయున్నది. ("The influence that emanated from his personality was ineffable like music, like beauty") మహాత్మునియెడ ప్రజలకుగల గౌరవమర్యాదలాయనఘుని అద్భుతశక్తియుతమగు వ్యక్తినుండి యుద్భవించినవి. ఆయనయందున్న మాహాత్మ్యము సంగీతముయొక్క మాధుర్యమువలెను, సౌందర్యముయొక్క మహిమవలెను వర్ణింప నలవికానిదని రవీంద్రుడొసంగిన సందేశము, సంపూర్ణసత్యమును వెల్లడింపగల సంస్తుతియనుటకు సందియములేదు.

మైసూరు దివాన్ సర్. మీర్జా ఇస్మాయిల్ గారు మహాత్మునితో రౌండ్ టేబిల్ సమావేశమున సంభవించిన సత్సాంగత్య విశేషములను సంస్మరించుచు ("His political technique and philosophy furnish ample food for reflection to nations") ప్రపంచములో నన్నిజాతులవారును తమ జీవితములలో నిత్యము ధ్యానించి, ధన్యులై తరింపతగిన రాజకీయ విధానమును, వేదాంత రహస్యమును మహాత్ముడు తన జీవితములో వెల్లడించెననుటలో, ప్రపంచమునకంతకును గాంధీజీ మార్గదర్శకుడని నిరూపించియున్నారు.

లారెన్సుబిన్‌యన్‌గారు ("There is a light upon his name") ఆయన పవిత్ర నామములో నొకదివ్య తేజస్సు ఇమిడియున్నదని వ్రాసినారు. ఇట్టి ప్రశంసావాక్యరత్నములను ప్రోగుచేసి, ఒక దివ్యమాలను తయారుచేసి, మహాత్మునకర్పించి శ్రీ రాధాకృష్ణ మహాశయులు ధన్యులైరి. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు, గాంధీజీ డెబ్బదియొకటవ జన్మదిన వర్ధంత్యుత్సవసందర్భమున గావించిన ప్రకటనలో దెలిపినటుల మహాత్ముడు, భారతీయుల సర్వతోముఖ సంస్కరణమునకును అభివృద్ధికిని చక్కని పునాదులు వేసియున్నాడనుట సత్యము. ప్రజలను చిరకాలమునుండి పట్టి పీడించుచున్న దురాశాపిశాచమును పారదోలి వారికి సేవానిరతి కలుగజేసినాడనియు, భారతదేశమును

స్వయంపోషకముగ జేయుటయే మహాత్ముని నిజోద్దేశ్యమనియు, స్వాతంత్ర్యమునకు అర్థ మిదియేననియు, అస్పృశ్యతామహాదోషమును హిందూదేశమునుండి తరిమివైచి, త్రాగుడు దుర్వ్యసనమును సంపూర్తిగ నిర్మూలన మొనరించి, ప్రజల నైతిక ప్రవర్తనమును బాగు చేసి, సంఘమునకు సుఖమును సత్కీర్తిని కలుగజేయ మహాత్ముడెంతయు పాటుపడు చున్నాడనియు శ్రీ డాక్టరు పట్టాభిగారు తెల్పియుండిరి.

శ్రీ భూలాభాయ్ దేశాయిగారు మహాత్ముని జన్మదినోత్సవము బొంబాయిలో జరుపబడినపుడు, సమావేశమైన సభలో మహాత్ముని దివ్యమహిమను కొనియాడుచు ('God's rarest gift to humanity') ఆయన మానవజాతి నుద్ధరించుటకై భగవంతు నిచే ప్రసాదింపబడిన అవతారమూర్తియనియు, లోకమాన్యుడు భారతీయులకుపదేశించిన కర్మయోగమును అనుదినజీవితములో నెట్లభ్యసింపవలసినదియు మహాత్ముడు తన జీవితము నందు ప్రత్యక్ష మొనరించియున్నాడనియు తెలిపియుండెను. సంయుక్తరాష్ట్రముల మంత్రియగు కట్జూగారు గావించిన ప్రకటనలో మహాత్మునితో సమానులయినవారు ప్రపంచములో నిప్పుడున్న మానవులలో నెవరును లేరనియు, ఆయన విశ్వమానవప్రేమ, భగవద్భక్తి, సత్యం, అహింస అనే అమూల్యరత్నములను ప్రపంచమునకంతటికిని ప్రసాదించినాడనియు వ్రాసియున్నారు.

పూనాలో గాంధీజీ జయంత్యుత్సవ సందర్భమున మహారాష్ట్ర కాంగ్రెస్ సంఘా ధ్యక్షులగు గడ్గిల్‌గారు 'బుద్ధుని తరువాత గాంధీమహాత్మునివలె ప్రపంచమునకు సేవచేసిన వారు మరొకరు లేర'ని తెల్పియుండిరి. నాగపూరు టైమ్సుపత్రికలో నీ యుత్సవ సందర్భ మున రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్‌గారు పంపియుంచిన సందేశములో, 'రేపటితో మహాత్మునకు 70 వ యేడు పూర్తిఅగును, కావున రేపటిరోజు భారతీయులకందరికి గొప్ప పండుగరోజు... మహాత్ముని సేవను పడయని శాఖ ఏదియులేదు' ఆయన సేవ నిరుప మానము అని నుడువబడినది.

పాశ్చాత్యుల సిద్ధాంతప్రకారముగ పరిపూర్ణాయుర్దాయమని పరిగణింపబడిన అరు వదిపైని పది, (Three score and ten) అనగా డెబ్బది సంవత్సరములు, మహాత్మునకు నిండుటచే మహాత్ముడు వారికి పితామహ సమానుడు. హిందూమత సిద్ధాంతప్రకారముగ శతవర్షములు పరిపూర్ణాయుర్దాయమైయున్నది. ఇంకను ముప్పదేండ్లు పూర్తిమైనగాని జీవిత పరిమాణము సంపూర్తికాదు కనుక, ఆ ముప్పదేండ్లు గడుచువరకు గాంధీమహాత్ముడు భారతీయులందరికిని 'పిత' యనబరగి సంపూర్ణారోగ్యముతో దేశసేవచేయునటుల విధి యనుగ్రహించుగాక !

ప్రస్తుతమున ప్రపంచమందంతటను ఆవరించియున్న ప్రళయభైరవభీకరమగు యుద్ధమేఘములు క్రమ్మి, అశాంతివాతావరణమును వ్యాపింపజేసియుండ, భారతదేశము పలువిధములగు క్లిష్టపరిస్థితులచే పీడింపబడుచుండ, మహాత్మాగాంధీని, "అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణం మమ" అని ప్రతి భారతీయుడును హృదయపూర్వకమగు భక్తితో సేవించి, ఆయనచే ప్రతిపాదింపబడిన అహింసావ్రతమును ఆచరింప నిశ్చయించికొనుటకంటె శ్రేయోదాయకమగు మార్గములేదు. ఆ మహాత్ముని ఆదేశములను అందరును శిరసావహించి, అహింస, ఖద్దరు, మద్యపాననిషేధము, హరిజన సోదరులనెడ ఆదరణ, హిందూమహమ్మదీయ సోదరభావము, అను పంచతంత్రములను బాగుగ నభ్యసింపబూనుటయే భారతదేశక్షేమమునకు పరమసాధనము. లండనులో మహాత్ముని జన్మదినోత్సవ సందర్భమున నొసంగిన రేడియో ప్రసంగములో శ్రీమతి కమలాదేవిగారు తెల్పిన విషయము లందరును గమనింపదగినవి. ఆమె ఆ ఉపన్యాసములో చెప్పినట్లు, 'ఈనాటి రాజకీయ తంత్రభావములకును పరిపాలనావిధానములకును ఆయన గొప్ప సవాలుగా నున్నాడనుటకు సందియ మించుకయును లేదు'.

ఆయన ననుసరించిన భారతదేశమున కెట్టి బాధయు నుండబోదు. ఐకమత్యములో నందరమ్మహాత్ముని ఆజ్ఞల శిరసావహించి అన్యోన్యమైత్రితో మెలంగుచో భారతదేశము బాగుపడగలదు. ఏసుక్రీస్తు శిష్యవర్గమునకు 'నేను మిమ్మెటుల ప్రేమించుచున్నానో అట్లే మీరందరును ఒండొరులను ప్రేమించుకొనుడు' అని బోధించియుండెను. అట్లే వివిధమతములవారికిని వివిధవర్ణములవారికిని, వేర్వేరుగతులవారికిని మహాత్ముడు 'మీలోమీరు ద్వేషములను పెంచుకొనక, ఒకరికొకరు ద్రోహమొనరించుకొనక, ఒకే ఉన్నతాదర్శములో అందరైకమత్యముచెంది, నేను ఆచరించి నిర్ణయించిన మార్గముననుసరింపు'డని హితమును బోధించుచున్నాడు 'నేను అంతర్వాణికి విధేయుడను నన్ను నమ్మినవారికి సత్యమార్గమును చూపగలను' అని హెచ్చరించుచున్న దివ్యప్రభావునియెడ అందరును పితృభక్తితో చరించిన, ఆయన మార్గదర్శకుడై, సుఖమును శాంతిని భారతదేశమునకే కాక ప్రపంచమంతకును ప్రసాదింపగలడు. సర్వేజనా స్సుఖినోభవంతు.

# నిరుద్యోగసమస్య - గ్రామ పునర్నిర్మాణము

శ్రీమతి కోకా భానుమతిగారు

ఈ నిరుద్యోగసమస్య ఎచ్చట ప్రబలియున్నది? ఇది మధ్యతరగతికి జెందిన ఆంగ్లవిద్యా ప్రపూర్ణులగు యువకులను పీడించుచున్నది. టంకశాలలోనుండి వెలువడు నాణెములవలె ఏఁటేట విశ్వవిద్యాలయములు పట్టభద్రులను వేలకొలది తయారుచేయు చున్నవి. వీరందరికిని యుద్యోగములవసరము. వీరు విద్య పూర్తిజేసి విశ్వవిద్యాలయము దాటిన వెంటనే, ప్రపంచము వారనుకొనినంత సులభముగ జీవితమార్గమును చూపింపదు. ఇక వారి జీవితయాత్రలో ప్రథమఘట్టము, తుపానులో సముద్రయానముచేయు ఓడవలె వారిల్లు జేరుసరికి ఒకటివెనుక నొకటిగా నిబ్బందులు తటస్థించుచుండును.

ఆంగ్లవిద్యార్జనకై కుటుంబము ఋణగ్రస్థమై, తల్లిదండ్రులు వెతలగుందుదురు. ఎన్ని ప్రయత్నములు జేసినను యుద్యోగము లభింపదు. తల్లిదండ్రుల సాధింపు, భార్యభారము, పూర్వఋణములపీడ, ఊరివారు వూరక "నీవేమిచేయుచున్నా"వని యడిగిన ప్రశ్నలకు సమాధానము జెప్పలేకుండుట, పాపము! యువకుడేమిచేయగలడు? యూనివర్సిటీ పట్టభద్రపదవికి, తగిన యుద్యోగము లభింపదు. ఇక ఉన్నవి సర్వీసుకమిషన్ పరీక్షలు. పరీక్షలో కృతార్థత దేవుడెరుగు. పరీక్ష ధరఖాస్తునకు డబ్బు, ఆరోగ్యపత్రము నిచ్చుటకు జిల్లా వైద్యశాఖాధిపతికి డబ్బు, పరీక్షకుపోవుటకై డబ్బు, అన్నిటికినిడబ్బు, డబ్బు, డబ్బు. డబ్బెక్కడిది? అప్పు పుట్టదు, వెళ్లక తప్పదు. ఈ పరీక్షకు ఎట్లో డబ్బుపుట్టించి స్కూలు ఫైనలు, ఇంటరు, బి.ఎ., ఎమ్.ఎ., బి.కామ్., ఎమ్.ఎస్.సి. వారందరుకూడ పోతారు. చివరకు ఏ కొద్దిమందో కృతార్థులౌతారు.

పట్టభద్రులగు యువకులందరును గతిలేదని యుద్యోగములకే తాపత్రయపడవలెనా? ఏల యీ యుద్యోగకాంక్ష? ఆర్యులు, మహమ్మదీయులు, యూరోపియనులు, మొదలగు యితర దేశీయులకు జీవిత సౌఖ్యము, సంపద నొసగిన యీ విశాల భారతదేశము జీవనోపాధి నొసంగలేదా? లేకేమి? బానిస తత్వములో మునిగిన మన యువకులకు యుద్యోగ ముద్యోగమను ఘోషయేకాని స్వతంత్ర జీవనోపాధిని ఎట్లు సంపాదించవలెనో తెలియదు. తల్లి బిడ్డలమనోభావమున పుట్టుకలోనే భయమను బీజమును నాటుచున్నది. ఈ మహా బీజము బిడ్డలలోని ఆత్మశక్తిని కాల్చివైచుచున్నది. తల్లిపెట్టిన బిక్ష దినదినాభివృద్ధిగా ప్రాథమిక విద్యాలయములలోని యుపాధ్యాయులు పెంచుదురు. ఈ భయమే బాలుడు పెద్దవాడగుసరికి పదిమందిలో మాట్లాడలేకుండుట, ఏపనిచేయుటకు ధైర్యములేకుండుట, తనశక్తిపై తనకే నమ్మకము లేకుండుట, మొదలగు లక్షణములుగా మారుచున్నవి. ఇట్టి

పరిస్థితులలో దుర్బలునకు అంటువ్యాధి శోకినట్లు, కళాశాలలో బానిసత్వము అబ్బుచున్నది. ఘోర! కాలమహిమ! విద్యావంతులలోని నిరుద్యోగసమస్య ఎట్టి యిక్కట్లు గలుగ జేయుచున్నది!

శ్రీ బమ్మెర పోతనామాత్యుడు "సత్కవుల్ హాలికులైననేమి.......... నిజ దార సుతోదర పోషణార్థమై" అని చెప్పిన నీతియందును, Carlyle మహాశయుని Dignity of Labour అను వ్యాసమందును ఒకేనీతి, భావిప్రపంచమునకు నుపదేశించిరి. ఆయుపదేశమే యిప్పుడు మనకు మార్గదర్శి. పదునైదవ శతాబ్దమునందు టర్కులచే తరుమబడి, తలదాచుకొనుటకు నీడలేక కాన్‌స్టాంటునోపులునుండి గ్రీకు, లేటిన్ పండితులు పడమటదిశగా బోయి, యింగ్లండు మొదలగు దేశములలో నివాసమేర్పరచుకొని అక్కడ అజ్ఞానాంధకారము పటాపంచలుజేసి ఆక్సుఫరుడు, కేమ్‌బ్రిడ్జీ యూనివర్సిటీలకు శంకుస్థాపము జేసినారని ఆంగ్లచరిత్ర చెప్పుచున్నది. ఇదేవిధమున భారత నిరుద్యోగులు అవశ్యముగ పల్లెలకుబోయి అక్కడ నివాసమేర్పరచుకొని గ్రామపునర్నిర్మాణమునకు ఏల తోడ్పడరాదు? తోడ్పడి తమ జీవితమును ఏల గ్రామాభివృద్ధికై గ్రామ ప్రజారోగ్యమునకై, గ్రామ సాంఘిక ఆర్థిక విషయములను అభివృద్ధిపరచుటకై యత్నింపరాదు? నిరుద్యోగులలో ప్రబలిన ఈ చింత తీరుటకు ఇదియే ఉపాయము. వీరికి గ్రామస్థులు జీవనోపాధి కలుగజేయకపోరు. యిట్టి యువకులుమాత్రమే యిప్పుడు కాంగ్రెసు మహాసంస్థయొక్క ఆశయములను అమలులో పెట్టగలరు. వీరికి కుటుంబజీవితమునకు చాలినంత భూమిని ప్రభుత్వమువారుగాని, ప్రజలుగాని కవులుకిచ్చి తగిన పెట్టుబడికి స్వల్ప ధనసహాయముచేయుట అవసరము. ఇంతకుమించి యిప్పుడున్న నిరుద్యోగసమస్య నశించుటకై సూక్ష్మమైన మార్గము కన్పించదు.

ఇదేకాదు. ఈ పట్టభద్రులు గ్రామములో నిరక్షరాస్యత పారద్రోలి నాగరికత నభివృద్ధిపరచగలరు. ఏనాడు నిరక్షరాస్యత పల్లెలనుండి పారిపోవునో ఆనాడే సాంఘిక దురాచారములు, మూఢవిశ్వాసములు నశించును. అప్పుడు దేశీయకళలు, దేశీయవృత్తులు వృద్ధిజెందును. పట్టభద్రులంతా కళోపాసకులే గాక కళాధ్యాపకులగుదురు. వీరు గ్రామజీవితమునకు తమ నూతన శాస్త్ర పరిజ్ఞానమును మిళితముజేసి నాగరికత అభివృద్ధి జేయగలరు. సాంఘికముగ సహకారసంఘములను స్థాపించుట, నూతనపద్ధతులపై వ్యవసాయముచేయుట, కళలనుద్ధరించుట, సంఘీభావము పెంపొందించుట, ఆర్జనశక్తిని అభివృద్ధి పరచుట మొదలగు మహాకార్యములను చేసి దేశాభివృద్ధికి పట్టభద్రులు తోడ్పడగలరు. ఇట్లుచేసిన పట్టభద్రులకు గ్రామములో జీవనోపాధి పుష్కలముగ లభించుటయేగాక స్థిరముగ ఏర్పడును.

# గృహపరిశ్రమలు

**మానవజీవితమున కాధారభూతములగు అన్నవస్త్రములను ఆరోగ్యకరమగు పద్ధతులపై తయారుచేసికొనగల జ్ఞానమత్యంతావసరము. వంటచేయుట నూలువడకుట, గృహిణులవశ్యము అభ్యసింపవలసిన ఇంటి విద్యలు. పాకశాస్త్రము, రాట్నపరిశ్రమ, సంసారసుఖమునందు ప్రాధాన్యతను వహించుచున్న గృహపరిశ్రమలు. అత్యంతావసరములగు అన్నవస్త్రము లమరినతరువాత అలంకారముల నపేక్షింపదగును. వేడుకలకొర కుపకరించు విద్యలకంటె సంసారమునకు గావలసిన గృహకార్య నిర్వహణమందు నైపుణ్యమునకై స్త్రీలు విశేషముగ పరిశ్రమచేయవలెను.**

ఈ కాలంలో ప్రతీవాళ్లూ యేదో ఒక పరిశ్రమచేస్తేనేగాని, కాలంజరిగేటట్టు తోచడంలేదు. పరిశ్రమ అన్నది అనేకవిధాలుగా వున్నది. కొందరు తమ స్థూలకాయాన్ని చూసి ప్రతీవాళ్లూ పరిహసిస్తూవుంటే పూరుకోలేక, దేహపరిశ్రమ అంటే తెలియకపోయినా, యెలాగో ఒకలాగ దేహపరిశ్రమ చేస్తున్నారు. మరికొందరు తమ గాత్రం యెలాగవున్నా, యెలాగో గానపరిశ్రమచేసి, తమ గానంచేత లోకాన్నంతా సంతోషసముద్రంలో ముంచేద్దామని తీవ్రప్రయత్నాలను చేస్తున్నారు.

పరిశ్రమల్నిగురించి వ్రాయాలని వూహించి, అందుకు ఉదాహరణంగా యీ రెండింటినీ వ్రాసేను కాని అన్నింటినిగురించీ చెప్పడం మొదలుపెడితే పెద్ద గ్రంథం అవుతుంది. కాబట్టి, ముందు మన విషయానికి వద్దాం. ఇప్పుడు ప్రతీవాళ్ల నోటంటా 'పరిశ్రమ చేయాలి, పరిశ్రమ చేయాలి' అన్న ముక్క వినబడుతోంది. సంగీతవిద్వాంసులందరూ గానపరిశ్రమ మనదేశంలో వున్న ప్రతీవ్యక్తీ చేస్తే, భారతదేశపు కీర్తి దిగంత రాళాలా మ్రోగుతుంది అంటున్నారు. ఇంక విద్యాభిమానులంటున్నారూ; విద్యాపరిశ్రమ మనదేశంలో (తగినంత) లేకపోవడంచేతే మనదేశానికింకా ముక్తిరాలేదు అని. ఖద్దరు వుద్యమాభిలాషులుకూడా ఖద్దరు పరిశ్రమ మనదేశంలో ఎప్పుడు అధికంగా వుంటుందో, ఆ క్షణమందే మనకు స్వరాజ్యం వస్తుంది అంటారు. ఇంకా, యేపరిశ్రమ యెవరికిష్టమో ఆ పరిశ్రమనే మన దేశస్థులంతా చేస్తేనే తప్ప, మనదేశానికి విముక్తి లేదంటున్నారు.

ఇలాగ పరిశ్రమాభిలాషులంతా పోటీలమీద యిది చెయ్యండంటే యిది చెయ్యండని బోధించేకంటే, అందరూ కలిసి యీ అన్ని పరిశ్రమలు ఒక్కముక్కలో స్ఫురించేటట్టు చేస్తూ, మన భారతదేశానికి స్వాతంత్ర్యం సమకూరేవరకూ, మన ఆర్థికస్థితి బాగుపరచే గృహపరిశ్రమల్ని ప్రోత్సహిస్తే బాగుంటుంది.

అయితే, గృహపరిశ్రమ అంటే ఏమిటీ? అంటారు. గృహపరిశ్రమలంటే ఊలు, లేసులు అల్లడం, రంగు దారాలతో కుట్టడం, అప్పడాలు, వడియాలు, చారుపొడి, ఇత్యాదులు తయారుచేసి అమ్మడమేనని చాలామంది అభిప్రాయం. ఇవేగాక సబ్బులు, వాసననూనెలు, ఫేసుపౌడర్లు, మొదలైన టాయిలెట్ సామగ్రిని

కూడా తయారుచేసి విక్రయించడమనికూడా కొందరి అభిప్రాయం. ఇటువంటివి పరిశ్రమలే అయినా, అమ్మడంమాత్రం పరిశ్రమకాదని నా వుద్దేశం. యిలాగ మళ్లీ పరిశ్రమలు చేస్తూగూడా అమ్మడం మొదలు పెడితే, ధనికగృహిణులకుండే సోమరితనం నివృత్తి యెలాగ అవుతుంది? అందువల్ల గృహపరిశ్రమ యెవరు చేసినా సరే, వాళ్లమట్టుకు వాళ్ళు ఖర్చు తగ్గించుకోవడానికి చేస్తేనే పరిశ్రమ అనబడుతుంది గాని, అమ్మడం మొదలుపెడితే పరిశ్రమ యెంతమాత్రం అవదు.

లేసులు అల్లడం మొదలైనవి గృహపరిశ్రమలే గాని, అతి వృష్టి అయిపోతున్నాయి. ఏ యింట్లో చూసినా పువ్వులు కుట్టే మిషన్లూ, రంగు దారాలు, అల్లిక సూదులు తాండవం చేస్తున్నాయి. 'ఎందుకీడబ్బు తగలేసుకోవడం' అని యెవరేనా అంటే, 'లోకం అంతా గృహపరిశ్రమలనీ, లలితకళలనీ అఘోరిస్తూవుంటే, మేము దాన్ని పట్టుకు యేడుస్తూవుంటే, మీరెవరు మధ్య మమ్మల్ని అడ్డుపెట్టడానికి'కని చెప్పినవాళ్లని పట్టుకు చెడతిడుతున్నారు. ఇలా యెదురుతిరిగింది? యీ నవీనగృహపరిశ్రమాసమస్య.

వీటిమాటకేమి? నా వుద్దేశంలో గృహపరిశ్రమలు యేమిటో వ్రాస్తాను. ఆరోగ్యమే మహాభాగ్యమన్న ఆర్యోక్తి చూస్తే, ఆబాలగోపాలానికీ ఆరోగ్యం అవసరం. అందుకు దేహపరిశ్రమ ప్రధానం. మనదేశంలో దేహపరిశ్రమలకి సాధనం సూర్య నమస్కారాలు. కాని ఇప్పటి స్త్రీ పురుషులు బ్యాడ్మింటన్ మొదలైన ఆటలు తప్ప, దేహపరిశ్రమకు సాధనాలు లేవని అభిప్రాయపడుతున్నారు. ఈ ఆటలు ధనవంతులకే తప్ప, బీదలకు అక్కరకురావు. సూర్యనమస్కారాలయితే బీదలు, ధనవంతులు, రోగులు, అందరూ చెయ్య వచ్చును. బాలబాలికలు ఆరోగ్యవంతులుగా వుండాలంటే, ఈ ధనవ్యయంలేని దేహపరిశ్రమా విధానం ప్రతి గృహిణికీ తెలిసివుండాలి. ధనవ్యయంలేని కారణంచేత, దేహపరిశ్రమగూడా గృహపరిశ్రమల్లోదే నన్నమాట.

గృహపరిశ్రమల్లో భోజనవిషయం చూద్దాం. భోజనవిషయమంటే అప్పడాలు మొదలైన వ్యంజనాల విషయం యెంతమాత్రంకాదు. ఇటువంటి వ్యంజనాలవిషయం చెప్పుకోవలసినంత ఏముంది? అసలు పరిశ్రమల్లో చేరనేచేరవు. ఎంత బద్ధకంగల ఇల్లాలైనా అప్పడాలు, వడియాలుపెట్టడం మరిచిపోదు. అయితే భోజన విషయంలో గమనించవలసినదేమిటి? చాలామంది కబుర్లుచెపుతూ కూరల్లో పుచ్చులూ, పురుగులూ చూడ కుండా తరిగేస్తారు. వంటలో బద్ధకంగావుండే స్త్రీలయితే ప్రతీరోజూ కందెగుండతోనే భోజనం సరిపెడ తారు. అటువంటి వేమీలేకుండా శుభ్రమైనవీ, ఆరోగ్యకరమైనవీ చూచి చక్కగా వండడమే భోజన విషయమైన పరిశ్రమ.

వస్త్రవిషయం స్వంతంగా దారంతీసి బట్టలునేయించుకోవడం ఉత్తమమైన పరిశ్రమ. అన్నం, వస్త్రం, ఆరోగ్యం; ఆరోగ్యం అయినతరువాత అలంకరణవిషయం. అన్నిటికంటె అలంకరించుకోవడం అంటే స్త్రీలకి మిక్కిలి సరదా కాబట్టి బోలెడు డబ్బుపెట్టి బజారులో కొనుక్కోనక్కరలేకుండా (అలంకారసామగ్రి అంటే 'స్నో' మొదలైనవికావు) ఇంటివద్ద తయారుచేసుకోవచ్చును. భారతీయ స్త్రీల అలంకారసామగ్రి బజారులో కొనేఅక్కర లేదు. స్త్రీలకి కావలసిందల్లా దేహసౌందర్యం, కేశసౌందర్యమూను. అవి రెండూకూడా బజారువస్తువులు వుపయోగిస్తే శూన్యం అన్నమాట సోదరీమణులు యెరిగిందే. కాబట్టి జుట్టుపెంపొందించి పరిమళంయిచ్చే మందారనూనె, మల్లెనూనె, మొదలైనవి యింటివద్ద తయారుచేసుకోవచ్చును. దేహసౌంద ర్యం ఆశించేవాళ్ళు వట్టివేళ్ళు మొదలైనవాటిని నలుగుపిండిలోగాని, సీకాయలోగానివేసి విసిరించి వొళ్ళు తోముకుంటే శరీరం యెంతోనున్నగావుంటుంది. పుష్పాలంకారం పునిస్త్రీ చిహ్నమేగాక యెంతో అందాన్ని

యిస్తుంది. పువ్వులచెట్లు పెరళ్లల్లోవేసి పెంచితే ఇటు వృక్షపరిశ్రమా అవుతుంది, అటుఅలంకార పరిశ్రమా అవుతుంది.

దేహాలంకారంలోంచి గృహాలంకారంలోకి వద్దాం. ఈ గృహాలంకారంకోసం భర్తతెచ్చే జీతంలో మూడుపాళ్ళు వ్యయంచేసే వారిజాక్షులున్నారు. అంతడబ్బు ఖర్చుపెట్టనక్కరలేకుండా ఓచిన్నసూత్రం వుంది. రాట్నంమీదవేసిన నూలు బాగాపేని కిటికీలకీ ద్వారాలకీ కర్టెన్లు అల్లవచ్చును. ఆదారములకే మంచి రంగులువేసి టేబిల్ క్లాత్ కుట్టవచ్చును. అటువంటి అలంకారాలుగూడా లేకుండానే ఇంటిని అందంగా వుండేటట్టు చెయ్యడం; ఇలాంటివే గృహపరిశ్రమలని నావుద్దేశం. సాధ్యమైనంతవరకూ ప్రతిగృహిణీ భర్త యెంత తక్కువ స్థితిపరుడైనా తనబుద్ధిని వినియోగించి సంసారం సుఖప్రదంగా నిర్వహించగలిగేటట్టూ, ఆఖరికి వైద్యుడుకూడా ఆట్టే అవసరంలేకుండా డా॥ శేషగిరిరావుగారు ప్రసాదించిన ఇంటివైద్యాన్ని అమల్లోకి తెచ్చేలాగా, ప్రతిబాలికా వుత్తమగృహిణి అయి తనపిల్లల్ని తానే సంగీతసాహిత్యాల్లో ప్రవీణుల్ని చేసే లాగా ఈ పరిశ్రమాభిలాషులంతా పాటుబడి, ఊరూరా స్త్రీ విద్యాలయాలు స్థాపించి ఈ పై పరిశ్రమలన్నీ ప్రతిబాలికా ఆచరించేటటువంటి అవకాశం కలిగి స్తేనేతప్ప (వంటింటి అంటే గృహపరిశ్రమల్ని ప్రోత్సహించ నన్నాళ్ళు) వారి పరిశ్రమలు వారిదగ్గరనేవుంటాయి కాని, యింత పిసరుకూడా పైకిరావు. అందువల్ల పరిశ్రమ లన్నీ కలిపిపెట్టినపేరు గృహపరిశ్రమల్ని చక్కగా ప్రోత్సహించడమే పరిశ్రమాభిలాషుల విధి.

—శ్రీ గుంటూరు విశాలాక్షి.

# దసరా-కానుక

'గృహలక్ష్మి'! సకలాంధ్రలోక గృహలక్ష్మి! విస్ఫురద్భారతీ
మహిళాక్షీణకటాక్షవీక్షణసుధా మాధుర్య లీలామహా
మహిత స్వాదుమృదూక్తి! సర్వశుభసంపద్యుక్తి! సమ్యక్సుధీ
విహితాపాదకవృత్తి! నిన్నుకరుణ న్విశ్వేశ్వరుండేలుతన్.

అనవద్యహృద్య విద్యావిలాసముగూర్చి ఘనతర శేముషీ గరిమనొసగి
మధుసుధామధురోక్తి మహిమంబుసమకూర్చి భూరివివేక విస్ఫూర్తినిచ్చి
నిత్యపాతివ్రత్య నిరతిఁబసాదించి యఖిలలోకజ్ఞాన మలవరించి
శిశుపోషణకళా విశేషంబునొనగూర్చి గృహనిర్వహణశక్తి గీలుకొల్పి
యొజ్జవై స్త్రీజనంబుల కుచిత ధర్మసూత్రముల నుపదేశించుచును ధరం బ్ర
చారమొనరించు నిను నుతిసలుపవశమె? సుగుణలక్ష్మి, సురూపలక్ష్మి, 'గృహలక్ష్మి'

నినునిర్మించి సమంచితోక్తిమహిమన్ నిర్నిద్ర విద్యన్ సురూ
పనిరూఢిన్ సకలార్థసంపదల నొప్పంజేసి సమ్యక్ప్రవ
వర్తనలీలన్ ఘటియించి సర్వగుణ సౌందర్యంబుగల్గించి పో
షణముం జేయుచున్న 'కేసరి'ని శ్రీ సర్వేశ్వరుండోముతన్.

—శ్రీ నేమాన సూర్యప్రకాశ కవిరాజు.

# విజ్ఞాన విశేషం

"వసంత"

"మీరు చిత్రించిన విశ్వచిత్రానికి శరీరం పులకరించి హృదయం కంపించిందండి! ఆరాత్రి సుఖంగా నిద్రకూడ పట్టలేదు. కాని, మొన్న మా 'లేడీస్ క్లబ్బు'లో సైన్సు మీద చర్చవస్తే, మీ రానాడు వెల్లడించిన అభిప్రాయాలు నాకు బోధపడినట్లు కొంత మందితో ప్రసంగించగా మనకు సైన్సుచేసిన ఉపకారంకన్న అపకారమే అధికమంటూ వారు సైన్సుని తీవ్రంగా ఖండించడం ప్రారంభించేరండి. బాంబులను, విషవాయువులను, విమానాలను ఎంత దురన్యాయంగా ఉపయోగిస్తున్నారో చూడండి! యుద్ధసందర్భాలు ఊహాకైనా అందని అమాయకులగు సాధుజనులను అకారణంగా నిర్మూలించు యుద్ధ సామగ్రిని తయారుచేసినది సైన్సు కదూ? మా సోదరీమణుల వాదం సమంజసంగా ఉన్నట్లే స్ఫురిస్తూంది. ఈ సైన్సు ఇంతగా ప్రబలకపోతే ఇంత క్రూరంగా, ఇంత రాక్షసంగా, ఇంత త్వరితంగా సర్వనాశనంచేయడానికి మనిషికి సాధ్యమౌతుందా అన్న సందేహం నన్ను గాఢంగా బాధిస్తూందండీ!"

"నీమాటలు వింటూంటే నా విద్యార్థ్యవస్థ మెఱుపువలె జ్ఞప్తికివచ్చి హృదయాకాశంలో దీపించింది. మా ఉపాధ్యాయులందొక ఉత్తములు, ఆంగ్ల సారస్వత మహాసాగరాన్ని తరిచి, బీడువారిన బాలక హృదయక్షేత్రాలను తమ ఉత్తుంగజ్ఞాన వెల్లువలచే తడిపి నిరంతర వైదుష్య సస్యాభివృద్ధిగావించు ధీమంతులైనందున పాఠాలు చెప్పుచున్నప్పుడు సైతం సైన్సుని క్రోధోద్వేగంతో నిరసిస్తూ, శాస్త్రజ్ఞులపై మండిపడుచూ తిట్టిన తిట్లను వ్రాసియుంటినా ఎన్ని సంపుటములౌనో చెప్పలేను. లోకజ్ఞానం మెండుగా సంగ్రహించి, దేశదేశాల చరిత్రలు తెలిసికొని, వివిధజాతుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక పరిణామములు గుర్తిస్తూన్న బుద్ధిమంతులే సైన్సుని దూషిస్తూండగా మీబోటివారు వారిని అనుగమించేరంటే తప్పులేదు. అట్టివారిపై నాకెప్పుడు క్రోధంగాని, ద్వేషంగాని, ఈర్ష్యగాని ఉండదు. ఏండ్లతరబడి కష్టపరంపరల నోహటించి, ధనవ్యయమొనర్చి, శ్రమించి, ఉత్తమాకాంక్షతో ఉన్నతాదర్శాలతో సంపాదించిన లోకజ్ఞానాన్ని సర్వతోముఖంగా ప్రసరింపచేయలేక, పక్షపాతబుద్ధితో సంకుచితభావములకు తావిచ్చి, వాటి నతిక్రమింపజాలక యుక్తాయుక్తవివేచనదూరులౌచున్న తోడి మానవులను గాంచినప్పుడు వారిపై నాకు అనుకంప, విచారము, జనిస్తవి. కాని, వారైనను విజ్ఞానతత్వాన్ని విచారిస్తే అంత దుడుకుగా విజ్ఞానదూషణానికి దొరకొందురని తోచదు."

"ఏమో, నాకేం తెలియునండీ. వారన్నట్లు, ఏపాపం ఎరుగని అమాయకపు ప్రజ మీద ఆకాశంనుండి హఠాత్తుగా విషవాయువులను బాంబులను ప్రయోగించడం నిజంగా

అమానుషం అనడానికి సందేహముంటుందా? సైన్సు ఏ ఉపకారంచేసిందో మాకు తెలియదు. కాని, ఇంత విపరీత దౌర్జన్యానికి నెట్టుకొనుటమాత్రం మహా నింద్యమనుటలో తప్పులేదనే అనిపిస్తుంది."

"కావచ్చును. అందుకే సైన్సు తత్వం అవశ్యంగా గ్రహించవలసిన ఆవశ్యకత ఉన్నదని నా మతం. జ్ఞానోదయమైన ఆదిమ మానవుడు, ప్రాగ్వాసి, పశ్చిమవాసికూడ, విశ్వరహస్య మన్వేషింపవలెనను జిజ్ఞాసతో కర్మరంగంలో ప్రవేశించినమాట వాస్తవము. దృగ్గోచరంగానున్న జగత్తును శాస్త్రీయంగా, సక్రమంగా పరిశీలిస్తూ సోపానక్రమాగతంగా విజ్ఞానాభివృద్ధి కావించుకొంటూ, ప్రకృతి శక్తుల స్వభావం అవగాహనచేసికొంటూ, సృష్టి రహస్యాలను విశ్వమాహాత్మ్యమును కనుగొను సంకల్పంతో పాశ్చాత్యులు ఒక పథ మనుగమించి కృషిచేస్తున్నారు. వారి అవలోకనలు, వారి పద్ధతులు 'సైన్సు' అనబడుతూంది. భారతీయులవంటి ప్రాగ్వాసులు ఆత్మశక్తినే మూలసాధనంగా నియమించుకొని ప్రాపంచికసంబంధం విసర్జించుకొని ఆధ్యాత్మిక చింతనంతో యోగాభ్యాసంతో పరమార్థం గ్రహింప ఉద్యుక్తులైనారు. వీరి సిద్ధాంతాలు, నియమాలు 'తత్వం' అనబడుతూంది. రెండుపక్షములవారు అవలంబించిన మార్గాలు భిన్నమైనా, వారి లక్ష్యం ఒకటే."

"అట్లయితే, ఒక్కొక్కసారి అనేకమందిని నాశనంచేయగల యంత్రాలు మన భారతీయులు కనిపెట్టలేదేమండి?"

"లేకేమి? బహుజనాన్ని ఏకకాలమందు ఎదుర్కొనగల అస్త్రశస్త్రాలు వారు కూడా కనుగొన్నారు. నారాయణాస్త్రమంటే, బ్రహ్మాస్త్రమంటే, సమ్మోహనాస్త్రమంటే, గరుడాస్త్రమంటే సామాన్యమైనవా? ఎంతెంత శక్తివంతమైనవి! వినలేదూ—అజ్ఞాత వాసంలో పాండవులు విరాటుని కొలువుచేయుచుండగా కౌరవులు విరాటనగరంపై దండెత్తడం, ఉత్తర గోగ్రహణంలో ఉత్తరసారథ్యమున అర్జునుడు శత్రువుల నెదుర్కొనడం, భీష్మ ద్రోణ కర్ణ సుయోధనాది మహావీరులను ఒక్కొక్కరిని మార్కొని నిశిత శరపరంపరచే నొప్పించి పరాజితుల నొనర్చడం, తుదకు అసంఖ్యాకంగా నున్న కురుసేనా నివహాన్ని సమ్మోహనాస్త్ర ప్రయోగంచే మూర్ఛలో ముంచి ఉత్తరకోరినట్లు కురువీరుల పాగాకుచ్చులు బొమ్మపొత్తికలకుగా తెప్పించడం; ఇది విఖ్యాత పురాణభాగంకదూ! సమ్మోహనాస్త్రం ప్రయోగించగానే కౌరవులు

ఆ. వె. ఆయుధములు విడిచి, యంగముల్ సోలంగ, దలలు మెడలు జిక్క నిలువకొఱగ,
నెల్లవారు నెఱుక వెడలి చొక్కి నిద్రాతిశయముగూరినట్టులైరి.

అగస్త్యమహాముని తపోబలంచే శ్రీరామునకు అక్షయతూణీరాలు ప్రసాదించినట్లు, శంకరుని కృపాకటాక్షంచే అరణ్యవాసం చేయుచున్న అర్జునునకు పాశుపతాస్త్రం లభించి

నట్లు చదువుచున్నాం. ఆ అస్త్రాలు, శస్త్రాలు నేటి యుద్ధసామగ్రికన్న సాధువైనవా? అయితే, ఆ మహాస్త్రాలు నశించిపోబట్టి వాటి సామర్థ్యం పురాణగాథలలో నణగిపోయింది. మన విశ్వాసం క్షీణించిపోయింది. తప్పదు. అదే దాని పరిణామం. దానికేమి."

"మహత్తరమైన ప్రాచీనాస్త్రాలు నశించిపోవడం కాలధర్మ పరిణామమని అంత నిష్కర్షగా ఎలా చెప్పగలరండీ?"

"దానికి చారిత్రాత్మకమైన కారణాలు పెల్లుగా ఉన్నాయి. ఆ మహాస్త్రాలు అనన్య సామాన్యమైన తీవ్ర తపశ్శక్తి మూలంగానే లభ్యమయేవి. ఏండ్లతరబడి ఏకనిష్ఠాగరిష్ఠు లగు మహామునులు తపోనిమగ్నులై వాంఛితార్థాలు పడయడం ఆనాటి హిందూ జీవితంలో ఒక ఉత్కృష్టాశయంగా పరిగణింపబడేది. ఒకప్పుడు, లౌకికధర్మ ప్రాధాన్యంతో ప్రబలజొచ్చిన బౌద్ధ జైన మతసిద్ధాంతాలు వ్యాపించినప్పుడు కాలానుకూలంగా కొన్ని హిందూ ధర్మాల ప్రాముఖ్యం తగ్గింది. తరువాత, రాజ్యకాంక్షాపరులగు విదేశీయుల ఆగమనంతో ప్రవేశించి వృద్ధికాజొచ్చిన నూతన నాగరికత నవీనవీక్షణంతో కొన్ని ధర్మాల లక్ష్యం పతనం కాజొచ్చింది. రానురాను, చతుర్విధ ఫలావాప్తికి తపోనిర్వహణం ఏకైకసాధనరాజ మనజాలకపోయింది. ఆ పరిణామం, ఊహామాత్రాన్న హృదయవిదారక మగు విషాదగాథ, దానికేమి-"

"దృగ్గోచరంగా నున్న ప్రకృతిని, ద్రవ్యాన్ని సూక్ష్మంగా పరిశోధిస్తూ భౌతికమార్గ మవలంబించిన పాశ్చాత్యులు ప్రకృతి రహస్యాలు అదనంగా కనుగొన్నారు. వారు నిర్మించిన భావపథం, ప్రయోగం, పరిశీలన, ఊహానంమీద ఆధారపడినది. వారు కనుగొన్న విషయాలలో సజాతీయమైన వాటిని ఒక్కొక్క శాఖగా కూర్చి వివిధ విజ్ఞానశాఖలు కల్పించారు. విషయోచితంగా సిద్ధాంతాలు, నియమాలు ఏర్పరచి సుకుమార యంత్రాలతో వాటి సత్యం ధ్రువపరుచుకోనడం, అటుపైని యంత్రచాతుర్యం పెంపొందించుచు నూతనసిద్ధాంతాలు ప్రతిపాదించడం, ఈవిధంగా భౌతికమార్గానువర్తులై శ్రమిస్తూండగా శాస్త్రాభ్యున్నతితోపాటు సంకులయంత్రాభివృద్ధికూడ అనివార్యం కాజొచ్చింది."

"అదేనండి, ఈ యంత్రాలే ఇప్పుడు సమ్మూలజీవనాశం చేస్తున్నాయని ఎందరో ఘోషిస్తున్నారు."

"కాదు, శాంతంగా నేచెప్పేది ముందువిను. యంత్రాల విశేషం నీకేం తెలియును? భూమినిగురించి, ఆకాశాన్నిగురించి, నక్షత్రాలగురించి, జగత్తునుగురించి అద్భుతమైన జ్ఞానం విస్తారంగా మనకు లభ్యమగుట యంత్ర సహాయంచేతనేకదూ! వెలుగుచుక్క లట్లు మనకగుపించే నక్షత్రాలు లక్షలకొలది మైళ్లు నిడివిగలిగి, కోటానకోట్లమైళ్లు దూరంగా నున్న మహోజ్జ్వలగోళాలని మనకెరుకపరచి, ఆకాశానికి అంతు విశ్వానికి హద్దులు గలవా

అను విమమసందేహాన్ని మానవహృదయంలో నాటినట్టి దూరదర్శని (Telescope), సూక్ష్మాతిసూక్ష్మ పరిమాణంగల ద్రవ్యశకలములను వాడి చూపులను సైతం మరపించి తప్పించుకొను క్షుద్రక్రిములను విస్తరించి దృగ్గోచరమొనర్చు సూక్ష్మదర్శని (Microscope), సహస్రాధిక సంవత్సరాలు శుష్క ఆకాశయానం చేసిచేసివచ్చిన నక్షత్రకాంతిని విశ్లేషించి, యావద్నక్షత్ర జీవితచరిత్రను సుప్రసిద్ధచరిత్రకారునివలె నివేదించి, చిందఅవందఅగానున్న నక్షత్ర మహోగ్ర గర్భాలలో ద్రవ్యం పొందుతూన్న పరిణామాన్ని స్పష్టీకరించు కాంతి విశ్లేషిణి (Spectograph), పరమాణువులలో విరామంలేకుండ పరిభ్రమిస్తూన్న ఎలక్ట్రాన్లను జీవనదీజల ప్రవాహంవలె ప్రవహింపచేసి వాటి నైజగుణాలు బయల్పరుచు వాయు నాళములు (Gas tubes), ఇవి సామాన్యమైన యంత్రములా ? ఇట్టివికాక నిత్యజీవితంలో మహోపయోగంగానున్న విమానం, స్టీమరు, రైలు, మోటారు, విద్యుద్దీపాలు, నూనెమరలు మొదలైనవన్నీ సైన్సు ప్రసాదించినవేకదూ ! అంతరాళాన్ని ఉన్మూలించి వార్తా విశేషములు, గాన రసామృతము ప్రపంచమంతటను రెప్పపాటుకాలంలో వ్యాపింపచేయు రేడియో, రక్తమాంసరక్షితమై మానవశరీరంలో గుప్తంగానున్న అస్థిపంజరాన్ని ప్రదర్శించు కిరణాలు ; ఇవి దేని మూలంగా లభ్యమై విశ్వాసపాత్రమైన సేవకులట్లు మనకు ఉపచరిస్తున్నవో తెలియునా ? ఈవిధంగా సైన్సు విశేషం చెప్పతలచుకుంటే సైన్సు మినహా జీవితమే శూన్యమను నిర్ధారణకు రావలసి ఉంటుంది.

అయితే మానవసౌఖ్యాన్ని సహస్రాధికంచేసి అపరస్వర్గం భూలోకంలో సృజించగల నేటి పాశ్చాత్యవిజ్ఞానం తీవ్రంగా కొందరిచే దూషింపబడుతూందంటే దానికి కారణం స్వాభావికంగా సైన్సులోనున్న లోపంకాదు. దానికి కారకులు రాజ్యాంగవేత్తలు. స్వదేశాభివృద్ధికై పర రాజ్యాపహరణానికి దొరకొని కలుషహృదయాలతో పరదేశీయులను నిర్మూలించుచున్న రాజకీయవేత్తలు దురాశాపీడితులుకాక సర్వమానవ కల్యాణమే లక్ష్యంగాగల బుద్ధిమంతులైనచో విషవాయు ప్రసరణం, బాంబుల ప్రయోగంలేక జనులందరు సుఖింపకుందురా ?"

దబ్బున చప్పుడయింది. గూటిలోనున్న పాలబుడ్డిని పిల్లి క్రిందకు నెట్టేంది.

"అయ్యో ! బుడ్డితో పాలుకూడ పోయేయండీ ! పాడుపిల్లి ఏంపని చేసింది. 12 గంటలు కొట్టుతున్నారుకదూ ? పిల్లడికి పాలుపట్టే వేళయింది. క్రిందకువెళ్లి పాలు తేవాలి...... అయితే, మా సోదరీమణులు, అజ్ఞానంచేత అన్యాయంగా సైన్సుని తిట్టినట్లే నాకిప్పుడు అనిపిస్తూంది . వస్తా" అంటూ పాలకోసం వెళ్లింది.

పాలుకలిపి, పిల్లవానికి పట్టేలోపున నాకు నిద్రపట్టింది. అనేక కష్టాలకు లోనైనా లెక్కచేయక, విశ్వరహస్యం కనుగొందామనే ఏకాగ్రబుద్ధితో కృషిచేసిన మహామహులగు శాస్త్రవేత్తలు చలనచిత్రంలోవలె నా మానసనేత్రానికి గోచరించారు.

# స్త్రీ ధర్మ విషయములు

శ్రీమతి టి. మంగమ్మగారు

దైవాత్మస్వరూపులగు సోదరీమణులారా ! ప్రస్తుతకాలమునందు ఆడపిల్లలకు సద్విద్య, సద్బోధనలు గరుపుట కొరతబడినందున ధర్మాధర్మములు తెలుసుకొని నడుచు శక్తిగానక వారి జీవితదశయంతయు దుఃఖదాయకముగానే గడుపుచున్నారు.

చదువను వ్రాయను నేర్చినంత మాత్రముననే మనము మనశ్శాంతి పొందజాలము. పవిత్రమైన అమూల్యకాలమును మానవసేవచేయక ఒక నిమిషకాలము వ్యర్థమైనందులకు కంటినీరు కారులాగు భయభ్రాంతులై దుఃఖించుచు, దైవాత్మస్వరూపులగు అత్తగారు, మామగారు, నిజభర్త, బిడ్డలు, అతిథి, అభ్యాగతులకు భక్తి, శ్రద్ధలతో సేవజేయుటయే సర్వాంతర్యామియగు భగవంతుని సేవయని యెంచి సేవచేయుటయే భగవంతుని సేవ. తీరికయున్న సమయములందు వృథామాటలు మాట్లాడక చేతిపనులు, కుట్లు, అల్లికలు, భక్తిరసముగాయున్న పాటలు నేర్చుకొని, ఇతరులకు నేర్పుటయందు కాలముగడుపవలెను. కొంత సమయము సత్ గ్రంథములు చదివి అర్థ, భాషాజ్ఞానము గ్రహించి ఇతరులకు బోధించుటయే గృహిణి ధర్మము. ఈక్రింది విషయము లందరు గమనింపదగినవి.

ప్ర. ఎల్లవ్రతములలో గొప్ప వ్రతము ఏది ?
ఉ. అరయ జయగీతమానస ! సత్య వ్రతంబె
ప్ర. దానములలో ఘనమగు దానమెద్ది ?
ఉ. అన్నదానంబు, నిధానమె, ఉన్నత దానమెన్న
ప్ర. ధారుణీతలంబున దొడ్డవారెవరు ?
ఉ. విమల విజ్ఞానవంతులె పెద్దలరయ
ప్ర. వనిత, యీలోకమున భాగ్యవంతు లెవరు ?
ఉ. ఉన్నదానితొ సంతుష్టిగన్నవారె
ప్ర. ఎపుడునుండవలసిన వెవ్వి సుదతి ?
ఉ. దేవదేవుని భక్తియు జీవదయయె సుమీ.
ప్ర. వర్జనీయంబు లెవ్వి యవి వనజనేత్రి ?
ఉ. ప్రాణహింసయు స్వార్థపురతియు దలప
ప్ర. నిత్యసంతోష మెపుడబ్బు నిర్మలాంగి ?
ఉ. రాగమును, ద్వేషము బాసి సాగునపుడె
ప్ర. చెపుము దేనివలన సర్వసిద్ధులొదవు ?
ఉ. చిత్త నిగ్రహామువలన సిద్ధులొదవు.

ఓ దయామయుడగు సర్వేశ్వరా ! మా వాక్కుచేతను, మనస్సుచేతను, కాయము చేతను, యేవిధమైన క్లేశము యితర ప్రాణికి కలుగక సదా యుండులాగున యను గ్రహింపుము. ఓ కారుణ్యైకసింధో ! మా వాక్కుచేతను, మనస్సుచేతను, కాయముతో గూడిన క్రియలచేతను సర్వకాల సర్వావస్థలయందును, ప్రపంచములోగల సకల ప్రాణి కోట్లకు యుపకారము చేయులాగున యాశీర్వదింపుము. మాపై ఎవరైన నిందలు మోపి నను, అపకారములు చేసినను, నిరుత్సాహము కలుగచేసినను యవియన్నియు సహించు కొని చలింపక యుండులాగున యనుగ్రహింపుము. (దైవప్రార్థనతో దినచర్య చేయునది.)

# సంఘాభ్యుదయము-స్త్రీ సహాయము

శ్రీమతి పి. లలితాదేవిగారు

సంఘమనునది ప్రతిజీవరాశికిని పశుసంఘమని, మానవసంఘమని యిత్యాది నామములతో నొప్పుచుండును. కాని యుక్తాయుక్త వివేకసంపన్నమగు మానవసంఘము కొన్ని కట్టుబాట్లతో, శాస్త్రవిహిత ధర్మములతో వెలయుచుండును. మనపూర్వు లాచరణపూర్వకముగా చేసినదానినే శాస్త్రములద్వారా మన కందరికిని ఆదేశించియున్నారు. అనగా-వారుచేయు క్రియలవల్ల ప్రపంచమునకుగాని, మరి యే యితరజీవికిగాని యనర్థముకలుగుట కవకాశములేదని. సంఘములవల్ల నెట్టి ఘనకార్యమైనను చేయగల్గుదుము. కొన్ని గడ్డిపోచలుకలిసి యొక మదపుటేనుగును బంధించగలవు. సంఘీభావముండినగాని యెట్టి ఘనకార్యమును చేయజాలము. విడివడియున్నప్పుడు దేనికిని పనికిరాని ఆ గడ్డిపోచలవలననే బలముగల జంతువులలో పేరెన్నికగన్న మదపుటేనుగు బంధింపబడుచున్నప్పుడు వ్యక్తిగత శక్తిసంపదగల మానవసంఘములో నెట్టి సామర్థ్యమున్నదో వివరించుట యనవసరము. అందువలననే "సంఘేశక్తిః కలౌయుగే" యని మనపూర్వులు చెప్పియున్నారు. ఇట్టి సాంఘికవర్తనలో పురుషుడొక్కడే మెలగక స్త్రీకిగూడ కొంతతావును గల్పించవలయును. అట్లు చేసినపుడే సంఘాభ్యుదయము సర్వతోముఖముగా చేకూరును.

అధునాతనకాలమునుగూర్చి మనము కొంచెమాలోచించినచో సంఘమున నెట్టి లోటుపాటులున్నవో గమనింపవచ్చును. శాస్త్ర విహితధర్మముల నావలకుద్రోసి వంశక్రమానుగతములని, శాస్త్రాదేశములని సాకులుచెప్పి సంఘముపేరిట జరుగుచున్న అన్యాయములను మనము కన్నులార కాంచుచునే యున్నాము. అతిబాల్యవివాహములు, అవిద్య, అస్పృశ్యత మున్నగునవి యిప్పటిలో ముఖ్యమగు లోపములు. ఏ పాపమెఱుగని పసిబాలిక మెడకు వివాహబంధమును వేసి గృహస్థధర్మముల నామెపైమోపుట, తదుపరి యామె కాలగతిననుసరించి వైధవ్యమును పాల్పడుటయో—మరేయితర కారణములవలననో జన్మాంతమువరకు వాపోవుట నూతన విషయములుగావు. ఇట్టి యనర్థములవలన మన భారతదేశము దుర్గతికిలోనై, పూర్వపు టౌన్నత్యమును గోల్పోయి ఇతరదేశములన్నిటికంటెను అన్నివిధముల వెనుకబడియున్నది. మహోదారులు కొందరు వీటి నివారణకై ప్రయత్నించుచున్న నివి రహస్యముగా జరుగుచునేయున్నవి. ఇట్టి సాంఘికదురాచారముల నరికట్టుటకు స్త్రీ నేటికాలమున నడుముకట్టవలసియున్నది. ఇదియేకాక భారతజీవనములో ఆర్థిక, రాజకీయ, నైతిక సమస్యలెన్నియో తలలెత్తియున్నవి. వీని నెదుర్కొనుటకు స్త్రీ తనకుగూడ బాధ్యతకలదని గుర్తింపవలయును.

భగవత్సృష్టిలో సంపూర్ణజీవనమున సమానబాధ్యులు స్త్రీ పురుషులు. ఆదినుండియు మనపెద్దలు స్త్రీ పురుషులకు వ్యక్తిగతముగా కొన్ని ధర్మముల నియమించిరి. పురుషునకు 'నానృతంవదేత్' 'నపరదారాన్ గచ్ఛేత్' మున్నగు నియమముల శాసించినట్లు—స్త్రీకికూడ గృహవిషయికధర్మముల నిర్ణయించినారు. స్త్రీ దేవీస్వరూపమనియు, పవిత్రమూర్తియనియు నేటికిని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆమెయందు సర్వశక్తులును లుప్తమైయున్నవి. అవి అనుకూలసమయము చేకూరినపుడు బహిర్గతములగుచుండును. పనిబడి

నపుడు తనప్రాణములను సైతము అర్పించుత్యాగబుద్ధి ఆమెకుకలదు. మహత్తర సేవాధర్మము నెరపుటస్త్రీకి గల సామర్థ్యము పురుషునకు లేదు. భారతపురాణాదులలోని 'నమాతుః పరదైవతమ్' 'మాతృదేవోభవ' యిత్యాది వాక్యములచే స్త్రీ మహత్త్వము వర్ణింపబడినది. పురుషుడు చేయు ఘనకార్యములందును అతడెదుర్కొను నపాయములందును తనకు సమానబాధ్యత కలదని స్త్రీ యెరుగును. దృఢ నిశ్చయత, త్యాగబుద్ధి గలస్త్రీ, భారతరమణి. ఆత్మగౌరవ రక్షణార్థము అగ్నికుండమున నురుకుటకుగూడ ఆమె సంసిద్ధురాలగును. సాంఘిక, రాజకీయాది పరిస్థితులను యెదుర్కొనుట కామెకు వ్యక్తిగతముగానున్న బాధ్యతను గుర్తెరిగి సహనముతో ముందంజవేసి తనశక్తిని లోకమునకు చాటినది భారతస్త్రీ. తాను పూనుకొనిన ప్రతికార్యమును అతిజాగరూకతతో నిర్వహింపయత్నించి మిన్నువిరిగి మీదపడినను వెనుకంజవేయనిది భారత స్త్రీ.

ప్రాచీనచరిత్ర పరిశోధనను బట్టి తెలిసికొనినచో పూర్వకాలమున సత్య, ద్రౌపది మొదలగు స్త్రీలు తమభర్తలకు సహాయులై వారిని రక్షించిరి—క్షాత్రవంశ సంజాతవనితలగు ఝాన్సీ మున్నగు వీరరమణులు సహాయ శూరత్వముతో కదనరంగమునకురికి, ఖడ్గమును ధరించి ప్రచండముగా కయ్యమొనర్చి, పరదేశవాసుల హస్తస్పర్శసైతము తమ దేహములపై బడనీయక అప్రమత్తతతో మెలగి దిగంతములకు తమ యశశ్చంద్రికలను వ్యాపింపజేసిరి. మరియొకపుడు విద్యలలో నారితేరి సర్వకళానిపుణులగు పురుషులతో శాస్త్రచర్చలు జరిపి వారిని విస్మితులుగాచేసినగార్గి, మైత్రేయి మున్నగు విదుషీమణులు వెలసియున్నారు. ఇట్లు ఒకటననేల?— సర్వ విషయములందును, సర్వశక్తులతోనొప్పి ఆయాసమయములలో తమ ప్రాభవమును వెల్లడించి స్త్రీలు లోకకల్యాణమును చేకూర్తురనుట స్పష్టమే గదా!

కాలవశమున స్త్రీలలో నాశక్తులన్నియు గుప్తములైపోయినవి. అధునాతనకాలమున స్త్రీకి రాజకీయాదివిషయములలో నెట్టి బాధ్యతలేదనియు, గృహమే యామెకు పరమావధియనియు సనాతనులు కొందరు వాదించుచున్నారు. స్త్రీల విషయమున పూర్వమునుండి యున్న పవిత్రాభావములు ఇప్పుడు అడుగంటినవి. 'సహధర్మచారిణి' యను పదములోని పరమార్థమును గ్రహింపక, వివాహసమయమున జరుగు మంత్రతంత్రముల యర్థము నవగాహనచేసికొనక—శాస్త్రములు శాస్త్రములని వానిలో నున్నవానికంటె భిన్నార్థముల వెలికిదీసి, స్త్రీకి గల వ్యక్తిగత గౌరవమును గుర్తింపక జన్మాంతఖైదీగా గృహమే యామెకు శరణ్యమని యాదేశించుట విచారణీయాంశము. పూర్వమువలె నిప్పటికిని అట్టి వనితామతల్లులు లేకపోలేదు. మాణిక్యమెంత విలువగలదైనను మన్నంటిన దాని ప్రతిభ—దానిని తుడిచినగాని లోకమునకు తెలియదు. అటులనే సాంఘికముగా స్త్రీని దైనికజీవితములో నెదుర్కొను భిన్నోద్దేశ్యములు విడిపోయి, ప్రతి పురుషుడు తన స్త్రీకి పూర్వమునుండి వచ్చుచున్న పవిత్రాశయములను సాంఘికనియమములద్వారా అడ్డుపెట్టక—తగినంత స్వాతంత్ర్యమిచ్చినగాని భారతదేశస్థితి బాగుపడదు. ప్రతి స్త్రీయును తన గృహజీవిత నియమముల పోద్బలక దానికి సంబంధించిన నిత్యకర్మలను, భర్తృసేవను చేయుచు అతని యానతిపై దేశోపకారమునకుగాని, సాంఘిక సమస్యల నెదుర్కొనుటకుగాని ముందంజ వేయవలయును.

హిందూసంఘమున పూర్వము స్త్రీకి గల గౌరవాతిశయములను, ఖండ ఖండాంతరములయందు ప్రాగ్దిగన్న యామె కీర్తిని నేటి స్త్రీ యొకసారి కన్నుతెరచి చూచి కార్యరంగమున ప్రవేశించి కర్తవ్యాంశమును నెరపినగాని అతిబాల్యవివాహములు, అవిద్య మున్నగునవి యడుగంటవు. పవిత్రాశయములు, శక్తిసామర్థ్య

ములుగల నాటి భారతరమణి నేటి స్త్రీ దృష్టిపథమున ధ్రువతారయై వెలిగినగాని సాంఘిక దురాచారములు మొదలంట పెరుకబడవు.

పై విషయములనుబట్టి లోకకళ్యాణము సంఘశక్తిపై ఆధారపడియున్నదని తేలినది. అట్టియెడ సంఘము పవిత్రవంతమై ఉన్నతాశయములు గలిగి ఆదర్శప్రాయమగునపుడే లోకమున కుపకరించును. ఇట్టి మహోన్నతదశ సంఘమున కబ్బవలెనన్న ఉత్తమ వనితామణుల సహాయమత్యవసరము. దైనికజీవితమున పురుషుడు వనిత నాధారముగాగొని నీతియుతమగు ప్రవర్తనతో సుఖజీవనమును చేయుచున్నట్లే సంఘాభివృద్ధిలోకూడ వనితా సాహాయ్యము ముఖ్యముగా నపేక్షితమని అంగీకరింపకతప్పదు. స్త్రీలు విద్యావతులై సమస్తకార్యములను నిర్వహించుటయందు పరిపూర్ణమగు స్థితి కలవారైనపుడే వారు కన్నసంతానముగూడ విద్యాది సర్వశక్తిసంపన్నము కాగలుగును. అట్టి వ్యక్తులతో గూడిన సంఘము దేశమును సంకటమునుండి కాపాడి మహోన్నతదశకు తేగలుగును. దీనినిబట్టి సంఘము సర్వతోముఖముగా నభివృద్ధిగాంచుటకు వనితామణులు పునాదివంటివారలని చెప్పక తీరదు. కాలానుగుణముగా సంఘము స్త్రీలను ముందిడుకొని తన వివేకసంపదతో వారిలోని శక్తులను సక్రమమగు రీతిని వినియోగించుకొనగలిగినపుడు దేశాభివృద్ధి మిక్కిలి సుకరమై కరతలామకమగుననుటలో సందియములేదు.

కనుక తిరిగి గుప్తములైన తమతమ శక్తులను కార్యసాధకములుగా చేయుటకు సంఘము స్త్రీలకు తగు ప్రోత్సాహమునిచ్చి వారి సహాయముచే సర్వవిధములగు కార్యసిద్ధులను పొందగలుగును గాక!

# తెలుఁగు తల్లీ!

శ్రీమతి కవయిత్రి వేమూరి జ్ఞానాంబగారు

తొల్లి రాయలు నినుగాంచి తోషమందె;
రాజరాజనరేంద్రుఁడుఁ బ్రణుతికెక్కె;
మున్నుపుట్టిన వీరులుఁ బూజ్యులైరి;
ఆంధ్రమాత! నీకిపుడట్టి యాప్తులేరి?
'రాష్ట్రముల కెల్లఁ దల్లి యాంధ్రావని' యని
తెలుఁగు శిల్పాలు పాడంగఁ దెలియుచుండె
నాంధ్రరాష్ట్రంబు వలదని యనుచువారుఁ
గలిగిరోయమ్మ! దౌర్భాగ్య కారణమున.
ఆంధ్రదేశపుఁ బ్రఖ్యాతి నడఁపఁజూచు
వారి దరిజేరియు నీ దెల్గువారి వీడి
వారిపైననె యాధార పడితివకట
సింహముల వీడి నక్కలఁ జేఱునట్లు.
రాష్ట్రమా! నీవుపాడెడి ప్రాజ్ఞులేరి?
రాష్ట్రమా! నీవుకన్నట్టి రాజులేరి!
రాష్ట్రమా! నీవుపోషించు రైతులేరి?
వలయువేళను రారేమి పాపమొక్కొ!
'వ్యక్తిగతమార్గ్య విగ్రహానైక్య, సుబహు
నాయకత్వాగ్ని దగ్ధమైన హృదయాంత
రాళమున్, మాతృపూజక ప్రసుతాశ్రు!
వర్షధారలఁ జల్లార్ప వలయుఁగాదె!'
తెలుఁగువారల మొదలందుఁ దెలుఁగుదనము
పొంగి పొఱలెడియట్టులఁ బూన్కినూని
తెలుఁగు వీణియ మీటియా తేటపలుకుఁ
దెలుఁగు పాటతోఁ బాడుమా తెలుగుతల్లి
అమ్మా! నీస్థితి దుస్థితియయ్యె నిపుడు;
పుత్రులందఱ నొక్కచోఁ బ్రోవుచేసి
వారు 'మోమోటము' న్వీడి పనులఁ జేయ
నాజ్ఞసేయుట కర్తవ్యమమ్మ యిపుడు.

# సంసార సుఖమెట్లు సమకూరును

శ్రీమతి యమ్. మాణిక్యాంబదేవిగారు

**స్త్రీ పురుషులు ఎవరి సహజధర్మాలను వారు సరిగా నిర్వర్తిస్తేనే సంసారనౌక సరిగా నడుస్తుంది; లేకపోతే 'ఎవరికివారే యమునాతీరే' అను తెరగవుతుంది. ప్రకృతిధర్మములకు భిన్నంగా ప్రవర్తిస్తే భార్యాభర్తలు పరమశత్రువులై పరిణమిస్తారు. పరస్పర ప్రేమతో అన్యోన్య సహాయంతో స్వధర్మములను సంరక్షించుకుంటే సంసారంలో సుఖపడతారు.**

పై ప్రశ్న తలయెత్తగానే, అసలు సంసారం అంటే ఏమిటి? సుఖం అంటే ఏమిటి? అందుకు కావలసిన ఉపకరణాలు ఏవి? అనే ప్రశ్నలుకూడా వేసుకోవలసి యుంటుంది. ఈ విషయాలు అందఱకు తెలిసినవైనా ఆలోచనీయాంశములు కావడం కూడా సహజం....పూర్వజన్మ సంపర్కంవల్లనైతేనేం, ప్రకృతి నియమంచేతనైతేనేం "అడివిపుసిరికాయ సముద్రపుప్పువలె" ఒక అమ్మకన్న బిడ్డని, ఇంకో అమ్మకన్న బిడ్డని వివాహం అనే బంధనవల్ల బంధించి, "సంసారం" అనేదాన్ని తయారుచేయడం ధర్మ నియమం. కాని ఆ వివాహంయొక్క మహత్తరోద్దేశం, ఏకొద్దిమందో గ్రహించగల్గుతారు. వధూవరులు గ్రహించలేకపోయినా యిబ్బందిలేకపోవడం పరిపాటి అయిపోయింది. మనం, అటువంటివారిలో జమ అయినా పెద్దలు చెబుతూంటే వింటూంటాం, అసలు వివాహం యొక్క తంతు అంతటిలోనూ "పాణిగ్రహణం" అనేదాన్లోనే సరియైన అర్థం ఇమిడీ వుంటుందిట. వరుడు పాణిగ్రహణ సమయంలో చేసే ప్రమాణవచనాలే వివాహంయొక్క మూలసూత్రాన్ని వెల్లడిచేస్తాయిట. ఆ ప్రమాణాలేవంటే "ఓ స్త్రీ! నీ హస్తమును ఇదే నేను గ్రహిస్తున్నాను. ఇప్పటినుండి మనోవాక్కాయకర్మలతో నీవు నాదానవు. నేను కూడా త్రికరణశుద్ధిగా నీవాడను. మన ఇరువురిమధ్య ఐహికసంబంధమే కాక పరలోక సంబంధముకూడా కలదు. పరమాత్మను సందర్శించు భాగ్యము నావలననే నీకు కలుగును. అజ్ఞానపుంజమవగు, నిన్నుద్ధరింప బద్ధకంకణుడనగు ఆ పరబ్రహ్మస్వరూపుడను నేను. రమ్ము, నన్ననుగమింపుము. "త్వయాహస్తం గృహీతం"

ఈవిధంగా ప్రకృతిపురుషులనగా భార్యాభర్తల ఐక్యజీవనాన్ని సంసారమంటారు. ఇందులో కలిగే సుఖమే పరమాత్మస్వరూపమగు ప్రేమ. అదియే భగవంతుడు. అయితే సంసారంలోనే పరమాత్మ అనే సుఖం ఉంటే "సంసారం సాగరందుఃఖం" అనిన్ని, దాన్ని సౌఖ్యప్రదంగా నిర్వహించడానికి, సాధనాలు, సలహాలు వెదక్కోనేటంత అవస్థ ఎందుకు



శ్రీమతి మోగంటి మాణిక్యాంబా
దేవిగారు



శ్రీమతి చెరుకూరి నాగభూషణమ్మగారు



శ్రీమతి యన్. అలివేణిగారు



శ్రీమతి అల్లాడి గోదారమమ్మగారు



శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు

ఆంధ్ర విశ్వవిద్యాలయములో నీ సంవత్సరము రాజకీయ
శాస్త్రములో నత్యంతవిద్యాప్రాభవమునుజూపి ఆనర్సు
పరీక్షలో ప్రథమతరగతియం దుత్తీర్ణురాలై బంగారు పతక
మును అనేక బహుమతులను బడసిన ఆంధ్రనారీరత్నము.
ఈమె చేసిన దేశసేవ సాటిలేనిది.

ఏర్పడాలి? అని ప్రశ్నించుకుంటే, అసలు సుఖం అనేది ఎక్కడ వుద్భవిస్తుందో తిర్గి దాన్కి భంగం ఎందుకు కల్గుతుందో ఆలోచించాలి.

అసలు ప్రకృతి మాయాస్వరూపిణి, ద్వంద్వప్రవృత్తి కలది. భగవంతుడు ద్వంద్వాతీతుడు, ప్రకృతికంటె పరుడు. అని అందరికు విదితమే. అంటే ప్రకృతితోకూడినా దానికి లొంగడు. మాయాస్వరూపమగు ప్రకృతియొక్క క్షణికలక్షణాలకు లొంగక, ఆత్మవిశ్వాసమను చుక్కానితో ప్రకృతిని నడిపించుచున్నంతవర్కు పురుషుడు పురుషుడే, ప్రకృతితో స్నేహము, త్రాచుపాముతో చెరలాటవంటిది. ఏమాత్రం నిపుణత తప్పినా, నొప్పి కలిగించినా కాటువేయక మానదు. తోడనే పురుషుడు జీవచ్ఛవం, భగవంతుడు భద్రస్వరూపుడు, ప్రేమ పెనుభూతంవలె తయారవుతారు. స్వర్గసుఖం, నరకయాతనలవుతుంది. "సంసారీ దుఃఖీ సన్యాసీ సుఖీ" అనే రాగాలాపన చేయవలసిన అవుసరం కలుగుతుంది. కాబట్టి "వివాహం" అనే కర్మకాండకు దిగే పురుషుడు పై విషయాల్ని గ్రహించి అందుకుతగిన ఆత్మవిశ్వాసాన్ని సంపాదించడం ముఖ్యం, అనే సలహాలో పొరపాటుండదు.

తరువాత సంసారసుఖానికి ముఖ్యసూత్రం ప్రేమ అని పేర్కొన్నాం. అసలు సుఖం అనేది ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే "ఏకో నారాయణః" అన్నట్లు ఒకేవిధమైందిగా ఉంటుంది. కాని, దానికి చీలికలు, విధాలు కనబడవు. ఎందుకంటే అది ఆత్మోద్భవమైంది. దానికి అసలు "సుఖం, దుఃఖం" అనేది ప్రత్యేకించి కనబడితేగా, దుఃఖాన్ని పోగొట్టుకోవడానికి ప్రయత్నించడం. ప్రకాశానికి, ప్రకాశం అంటే ఏమిటో తెలిస్తేగా చీకటిని పోగొట్టడం. అది సహజమైంది. స్వప్రకాశమైంది.

శ్లో॥ సమదుఃఖ సుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియా ప్రియోధీర స్తుల్య నిందాత్మ సంస్తుతిః.

ఆ మాదిరిగా గీతావచనానుసారం, దుఃఖాన్ని సుఖం, బంగారాన్ని మట్టిగా భావించగల్గే ఆత్మసుఖం సంపాదిస్తే దుఃఖమనేదే వుండదు. కనుక అసలు సంకల్ప వికల్పాలకు మనస్సే ప్రధానం. మనస్సు కోతివంటిది. దానికి కోరిక అనే కల్లుపోస్తే కిందూ మీదూ తెలియక గంతులు వేసివేసి పడవలసిన బాధ పడుతుంది. మానవజీవితం ప్రకృతి జన్యమైనా సాధ్యమైనంతవర్కు దానిని కోరికలతో నింపక, నేను నాటకపాత్రధారులలో "బాద్‌శాహ్" (చక్రవర్తి)ని గాని అసలు సేవాస్వరూపుడగు పరమాత్మని "ఖదమత్‌గార్" (సేవకుడు)ను అని గుర్తెరిగి సంచరించడం, సుఖజీవనానికి వీలైనసలహా అనడం స్వాకల్పితం కాదు.

పై జెప్పినరీతిగా, వివాహానంతరం వధూవరులు సంసారసాగరంలో తమ జీవిత నౌకను వదలుతారు. దాన్ని నడిపే భారం ఇరువురిమీదా వుంటుంది. చెరొక తెడ్డూ

పుచ్చుకొని నడపడం, సుఖం ధర్మంకూడాను. యెందుకంటే "ధర్మమే జయం" కనుక, ధర్మసూత్రప్రకారం, పాణిగ్రహణ ప్రమాణాల్ని వుల్లంఘించకుండా స్వర్గసుఖం కల్గించడం ఎలావున్నా స్త్రీయొక్క ఇహలోకాన్ని నరకలోకంలా తయారుచేయకపోవడం కూడా గుడ్డిలో మెల్లే, అంటే దారాపుత్రాదుల కష్టసుఖాల్ని తనవిగా భావించి పాటు పడాలి. అట్లుకాక, నేపురుషిణ్ణి, అధికారం చెలాయించడమే నా కర్తవ్యం, అని పశు ప్రవర్తన ప్రవర్తిస్తే, ఆ సంసారం ఎలావుంటుందో సులభగ్రాహ్యమే. నేడు నూటికి తొంభైతొమ్మిది సంసారాలు ఈలాంటి పరిస్థితుల్లో ఉన్నాయంటే ఆశ్చర్యంలేదు. ఎంత సహనశీలమైనా పాపభారం మితిమీరినపుడు భూదేవి ఉగ్రరూపం దాల్చి ఏ భూకంపం లాగో మారుతుంది. ప్రకృతిలో ఏ తుపానో సంభవిస్తుంది. తన ప్రశాంత రామణీయకాన్ని తానే భయంకరరూపంగా తయారుచేస్తుంది. అప్పటి ప్రపంచ ప్రకృతియొక్క జాజ్వల్య మానమగు జ్వాలాసమూహాల్లో, భగవంతుని భగీరథ ప్రయత్నాలు భగ్నమౌతాయి. వీలు, నియమం తప్పితే ప్రాణదాతయే ప్రాణపిపాసి కావడం తటస్థిస్తుంది. ప్రాణాన్ని నిలపెట్టే పరబ్రహ్మస్వరూపమగు అన్నం, జ్వరసమయంలోనో, మితిమీరో, తింటే ప్రాణాపాయం సంభవిస్తుంది. సరియైన స్థలమందుంచకపోతే వెల్తురిచ్చేదీపం ఇంటిని తగుల బెడుతుంది. పురుషుడైన తాను సంసారంయొక్క లోతు పాతులు తెలుసుకొని దిగినప్పుడు దాన్ని సౌఖ్యప్రదంగా చేసుకోవడానికి బదులు, మితిమీరిన అధికారం చెలాయిస్తే దుఃఖప్రదం కాక మరేమవుతుంది? భర్తనే దైవముగానమ్మి సంచరించు స్త్రీని "నే తెడ్లు వెయ్యలేను నీవే నడుపు" అంటే భర్త ఆజ్ఞప్రకారం కొంతవరకు నడుపగల్గినా నావ యొక్కగతి అనేకరకాలుగా మారడమో, లేక మునగడమో సంభవించడం తప్పదు.

స్త్రీ విషయంలోకూడా పై విషయాలు వర్తిస్తాయి. ఎందుకంటే ఆమెకు సంసా రంలో సగంభాగం వుంది కనుక. లీలాశీలుడగు భగవంతుడు స్త్రీని ఎంత మాయబొమ్మగా నిర్మించినా, ప్రాపంచిక దృష్టిలో ఎంత అజ్ఞానమూర్తియైనా, హృదయం, ఆత్మ, అనేవి అందులోనూ ఇమిడివున్నాయి. స్త్రీకి కావలసిన సహజప్రకృతి దయచేశాడు, మార్దవం, సేవాభావం, వినయసౌశీల్యాలు, మాతృప్రేమ, ఇంకా ఏవో మనకు తెలియనివి ఇమిడ్చాడు. స్త్రీజన్మ కేవలం, పురుషునికొరకే నని మనం ఎంత భ్రమించినా 'ధర్మార్థకామేషు' స్త్రీ పురుషుని అనుగమించవలసిందే. కాని "మోక్షేషు, ఎవరికివారే యమునాతీరే" అని భగవద్వచనమైన ధర్మసూత్రం ఘోష పెడుతూంది. కనుక, స్త్రీ జీవితంయొక్క మహత్తర లక్ష్యం ఎంతవరకు వుందో పురుషలోకం గ్రహించకపోవడం చాలా విచారకరమగు విషయం. ప్రస్తుత ప్రపంచం వ్యతిరేకభావాలతో నిండిఉంది. భోగవిలాసాలే సంసారానికి సుఖోపకరణాలట. జన్మ ఎత్తినందుకు శరీరసౌఖ్యమే అనుభవనీయమట. శరీరంలో జీవ

కణాలు తగ్గినపుడే రోగం పూర్తిగా అలముకొంటుంది. ఆధ్యాత్మిక విచారాలు అడుగంటాయి. ఆడంబరత తలసూపింది. "ధనమూల మిదమ్ జగత్" అని ధనం సుఖానికి మూలసూత్రం అయింది. కాని ధనం వచ్చేదారి కనబడదు. ధనం లేందే, జగత్తు లేదు. జగత్తు లేందే సుఖం ఎక్కడ ?

ఈలాటి భావాలు పురుషబృందంలో బయలుదేరినపుడు స్త్రీ సంఘం ఎలా వుంటుందో అడగాలా ? "కళ్లెంకొద్దీ గుఱ్ఱంకాదు, గుఱ్ఱంకొద్దీ కళ్లెం" ఎంత ధీశాలియైనా ఇదమిద్ధమని నిర్ణయించడంలో తడబడతాడు.

ప్రేమయే సంసారాన్కి సుఖం కల్గించే మూలసూత్రం అని చెప్పబడింది. ప్రేమ వివిధగతులు కలది. వానిని యోచించడాన్కి, వర్ణించడాన్కి మనకెక్కడ అవసరంలేదు. కాని రెండింటిని పేర్కొందాం. (1) శారీరకప్రేమ. (2) ఆత్మికప్రేమ.—స్థూల సూక్ష్మ దృష్టితో ఆలోచిస్తే సంసారసుఖానికి రెండూ అవసరంగానే కనబడతాయి. కాని సమయాలు వేఱు అవస్థలు వేఱు. ప్రప్రథమంలో కలిగే వీక్షణసుఖం అనే మోహాన్ని ప్రేమ అంటారు. అది పుష్పించి, ఫలించాలంటే బీజమునకు నీరు ఎట్లా అవశ్యకమో అట్లాగే శారీరకప్రేమ, ఆత్మికప్రేమకూడా అవుసరం. నాటినతరువాత, బీజం, మొక్క, చెట్టు, కొమ్మ మొదలగు రూపాలు ధరించి చివరకు తిర్గి ఆ బీజరూపంగానే స్థిరపడుతుంది. తన రూపాన్ని తాను పొందుతుంది. అదేమాదిరిగా స్త్రీపురుషసంబంధజనితమైన ప్రేమ ఫలితం, నిశ్చలంగా వున్నప్పుడే సరియైన సుఖం, ఆత్మశాంతి కల్గుతుంది.

ప్రస్తుత ప్రపంచంలో వైవాహిక విషయమైన అనేక చర్చలు జరుగుతున్నాయి. బాల్యవివాహాలు నిషేధింపబడ్డాయి. వివాహాంతరువాత ప్రేమా ? లేక ప్రేమతరువాత వివాహమా అనేది ఒక సమస్య. ఇరువదవశతాబ్దములో, మహాశయబృందం పూర్వ ధర్మాలు ఇప్పుడు చెల్లవంటారు. కవిమహాశయ టాల్‌స్టాయ్ (Love is blind) అంటాడు. ధర్మవేత్తలంతాకూడా అదేమాట. కొంచెం వేదాంతప్రియులు ఎవరికర్మ వారిదేకాని, ధర్మాలు, ప్రేమలూ ఏమీచెయ్యవంటారు. పోనీ యేది ఏలావున్నా ప్రేమ అనేది, ముందో, వెనుకో కల్గాలికదా ! ఆ ప్రేమకి, సమవయోరూపలావణ్యాలు కావాలి. ముందు, అల్లాంటి పరిస్థితుల్లో, ధర్మమంత్రాలు చదివి 3 ఏళ్ళ పిల్లకి ముప్పైయేళ్ల పెళ్లికొడుక్కి కడితే ఏలా ? పోనీ పిల్ల యెదిగాక ప్రేమించుకుంటారంటే అబ్బాయికి 40 యేళ్లువచ్చి యౌవ్వనా స్తమానం అవుతోంటుంది. లేదూ, 10 ఏళ్ల అమ్మాయికి 11 ఏళ్ల అబ్బాయికి ముడిపెడితే, అంతకంటే అడివిగావుంటుంది. ఎందుకంటే స్త్రీయొక్కశరీరం, హృదయం రెండూ తొందరగా పరిపక్వానికివస్తాయి. కాబట్టి వయోవిషయంలోకూడా భార్యాభర్త

లకు 10 సంవత్సరాలు తేడావుండటం సమంజసంగా కనబడుతుంది. ధర్మసూత్రాల్లోకూడా ఆలాగే చెప్పివుంది అని వింటూాంటాం.

ఈ మాదిరిగా వయస్సులో నిదానించినా, కొన్నికొన్ని సంసారాలు దుఃఖప్రదంగానే కనబడతాయి. ఎందుకంటే తీరాముడిపడ్డాక వాళ్లవాళ్ల ప్రకృతులు, అంటే స్వభావాలు కలియకపోతే ఒకరికొకరు నచ్చరు. ఈ నచ్చకపోవడాన్కి కారణం వూహించడం చాలాకష్టం ప్రపంచానికి బాగానే కనబడతారు. కాని వారిలోవాఽకి ఏదో పెద్దకొరతగా కనబడుతుంది. ప్రస్తుత పరిస్థితులనుబట్టి ఆలోచిస్తే ప్రకృతులువేరు కావడానికి కారణం ప్రస్తుత నాగరికతా పిశాచం ఒకటి కనబడుతూంది. చదువులు ఒకటి కొంప తవ్వుతున్నాయి. పూర్వం పురుషుల్లోనైనా ఏకొద్దిమందో, వేదం, శాస్త్రం చదువుకొనేవారు. స్త్రీలు కేవలం గృహకృత్యాలు నిర్వహించడం, భర్త ఏలాటివాడైనా వాని పాదసేవ చేయడం తమ ప్రధానకర్తవ్యములనుకొని తమ జీవితాన్ని గడిపేవారు. కాని ఇన్ని తికమకలు వాళ్లకు తెలియవు. కాని ప్రస్తుతం స్త్రీ పురుషుల దృక్పథం, ధార్మికవిషయంలో, విద్యావిషయంలో ఆర్థికవిషయంలో ఒకే లక్ష్యాన్ని కేంద్రీకరించుతూంటే, ఇరువురి ప్రవృత్తులు సరిపడకుంటే సమన్వయం ఏలావస్తుంది? పిల్లీపిల్లీ ఒకరొట్టెముక్కకొఱకు పోట్లాడితే మధ్యకోతి ఎత్తుకపోయిందట. అదేమాదిరిగా వీరిరువురూ డీకొ్కంటే అసలు సంసారసుఖం, శాంతి, అంతరిస్తాయి; ప్రతి ప్రాణి తనమటుక్కు తాను గొప్పగా ఉండాలనే కోరుతుంది. కాని తమ హద్దుపద్దుల్ని మించుదామంటే సఫలత ఎట్లావున్నా అసలు శూన్యమగుట సత్యం.

కాబట్టి విద్యావిషయంలోనైతేనేం ధర్మవిషయంలోనైతేనేం ప్రేమవిషయంలోనైతేనేం స్త్రీప్రకృతికితగ్గ విషయాల్ని స్త్రీ, పురుషునికి తగ్గవి పురుషుడు పూర్తిగా అలవరుచుకొని సంసారనౌకను నడపడాన్కి పూనుకొంటేనే ఆనావ అవతల ఒడ్డుకు చేరకల్గుతుంది. లేదా తరువాత విషయం ఎవరికి వారే ఊహించుకోవచ్చు.

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగనున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప కోరుచున్నాము.

సంపాదకుడు.

# స్వదేశ స్వాతంత్ర్య సమరములో సమసిపోయిన

# పోలెండు

● పోలెండు నైసర్గిక స్వరూపము ● వివిధజాతుల జనాభా ● పంటలు, ఖనిజసంపద ● ఆచార వ్యవహారములు ● ప్రపంచ మహాసంగ్రామము ● పోలిష్ రిపబ్లిక్ ● మళ్లీయుద్ధం ●


శ్రీ

ఏడిద కామేశ్వరరావుగారు


యూరప్‌ఖండంలోవున్న సమస్తరాజ్యాల చారిత్రకవిషయం వొక తరహా, పోలెండు విషయం వొక తరహా. చరిత్రాత్మకంగా, రాజకీయంగా, సాంఘికార్థికాది విషయంగాకూడా, పోలెండు తదితర యూరపియన్ రాజ్యాలకంటె ఒక ప్రత్యేకత కలిగివుంది.

తీర్చి దిద్దినట్టుండిన పర్వతపంక్తులు, పర్వతపంక్తుల నడుమ దట్టంగా పెరిగిన చిట్టడవులు, చిట్టడవులనంటి చక్కగా వ్యాపించివున్న పచ్చికబయళ్ళు, పచ్చికబయళ్లలో చెల్లాచెదరుగావున్న సరస్సులు, సువిశాలమైన పంటభూములు కలిగి యూరపులో మరెక్కడా లేనటువంటి వ్యవసాయప్రకృతికి, నిశ్చలమైన శాంతి వాతావరణానికి పోలెండు పెట్టిపుట్టింది. ఇంచుమించుగా దేశమంతా వ్యాపించి, వుత్తర దక్షిణంగా ప్రవహిస్తూవున్న విస్తులానది పోలెండు ఆర్థిక రాజకీయ జీవితానికి వెన్నెముకలా ఆధారమై వుంది. ఈ నది ప్రసాదించే అమృతతోయాల నాధారంగాచేసుకొని సేద్యాదులు చేసుకుంటూ పోలిష్ ప్రజలు సౌఖ్యమయ జీవితాలను గడుపుతూ వుంటారు.

పోలెండు ప్రజాహిత జీవితంలో ప్రధానమైనది వ్యవసాయము. అసలు 'పోలు' అనేమాటకి 'పొలము' అని అర్థము; పొలాల నాధారముచేసుకుని జీవించేవారు కాబట్టి వీరికి పోలులనే నామం సార్థకమయ్యింది. అధికసంఖ్యాకులైన ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. అన్యవృత్తులలో జీవించేవారి సంఖ్య పోలెండులో చాలాతక్కువ. బంగారం నాటితే పుష్కలంగా ఫలించే భూదేవి నాశ్రయించి వ్యవసాయంచేసుకోకుండా అన్యవృత్తులమీదికి మనస్సెలాపోతుంది?

## పోలెండు జనాభా

పోలెండు వైశాల్యం 1,50,000 చదరపుమైళ్ళు. అంటే, ఇంగ్లాండుకంటె $1\frac{1}{3}$ రెట్లు పెద్దదన్నమాట. జనాభా 34,500,000. అసలైన పోలిషుజాతి విస్తీర్ణంలో పోలెండు యూరపులో ఆరవస్థానం ఆక్రమిస్తుంది.

సంఖ్య ఇందులో సుమారు సగంమాత్రమేవుంటుంది. మిగతా వారిలో, ఇంచుమించుగా 1,00,000 మంది జర్మనులు, 1,500,000 మంది రుమేనియనులు, 3,300,000 మంది యూదులు, 4,00,000 యుక్రేనియనులు. మిగిలినవారు వైట్ రష్యనులు; పోలెండు తూర్పు సరిహద్దు భాగాల్లో ఎక్కువగా నివసిస్తున్నారు. వీరిలో రుమేనియనులు పూర్తిగా వ్యవసాయదారులు. యూదులు కేవలం పట్టణాలలోనే వుండి వ్యాపారము సాగిస్తూ వుంటారు. జర్మనులకు పరిశ్రమలు, వ్యాపారాలు ఆధారం. యూదులు, జర్మనులు మాత్రం పరదేశస్థులు. ఇతరదేశాల నుండి వచ్చి పోలెండులో స్థిరమైనవాసంఏర్పర్చుకున్నారు. అంచేత వీరిని పోలెండుదేశీయులనడానికి వీలులేదు. ఈ పైజాతులవారు క్రమక్రమంగా పోలాండులో స్థిరత్వం సంపాదించుకని, అమాయకులైన పోలిషు ప్రజల మీద అధికారాలు చెలాయిస్తూ, వారికి అనేకవిధములైన బాధలు కలుగజేస్తూ వున్నారు. నూటికి నూరుపాళ్లూ వ్యవసాయ జీవితంలో గడిపే అసలు పోలిషు ప్రజలకి, కేవలం ఆ దేశాన్ని కొల్లగొట్టి, అక్కడున్న సిరిసంపదలను అనుభవిద్దామని వచ్చిన యితరజాతులవారి కుతంత్రాలు అర్థముకాలేదు. వ్యాపారం పేరు చెప్పి, వర్తకం నెపంపెట్టుకుని, మతావేశం కల్పించి, నాగరికతావ్యామోహం కలిగించి, స్వార్థపరత్వానికి రాక్షసబలాన్ని ఆధారంచేసుకుని, నెత్తికెక్కి కూర్చుని, పోలిషు ప్రజల నిర్మల జీవితాలలో సుడిగుండాలు కల్పించి, వారి కన్నివిధాలా ఒత్తిడికలిగించి, వారి సౌఖ్యస్వాతంత్రాలకి నీళ్ళుతోడారు.



## సస్య, ఖనిజసంపద

వ్యవసాయానికి అనుకూలమైన నైతిక సంపత్తి కలిగిన పోలెండు ఖనిజసంబంధమైన తదితర విషయాలలో కూడ మంచిస్థానం కలిగివుంది. కార్పేథియన్ పర్వతశ్రేణికి దగ్గరగా ప్రతిసంవత్సరం 50,7000 టన్నుల పెట్రోలు వుత్పత్తిచేసే పెద్దపెద్ద పెట్రోలుగనులున్నాయి. స్వాన్‌నదికి తూర్పువైపున బోరిస్లా నూనెగనులున్నాయి. పోలెండు దేశానికి సరిపోయిన నూనెను యీ గనులు నిరాటంకంగా వుత్పత్తిచేస్తాయి. కార్పేథియన్ పర్వతతీరాన్ని సాల్టుమైన్సు పుష్కలంగా వున్నాయి. ఇక్కడ చైలోస్టాన్ అనేది అమితంగా వస్త్రపరిశ్రమ జరిగే స్థలం. లాడ్జు, బెయిత్‌స్కో, వార్సా, భోమ్‌బర్గు, పోజ్‌వాన్ మొదలైన అనేక ఖనిజ పరిశ్రమ కేంద్రాలున్నాయి. అప్పర్ సైలీషియాలో అనేకచోట్ల సంవత్సరానికి 38,104,000 టన్నుల బొగ్గు, 9,500,000 టన్నుల బ్రౌన్‌కోల్, 873,000 టన్నుల ఇనుము, 108,000 టన్నుల తగరము వుత్పత్తిచేయగల గనులున్నాయి. ఇక సేద్యంచేసి పండించేపంటలు : 2,17.1,000 టన్నుల గోధుమలు సాలీనా పండుతాయి. వీనితో ఇంచుమించుగా మిగిలిన బార్లీ, ఓట్సు మొదలైనవికూడా పండుతాయి. తగువైన పంటలు, వాటితో తులతూగగల ఖనిజోత్పత్తి కలిగి, జీవితావసరాలకు ఏవిధమైన లోటూలేని పోలెండు ప్రజాహిత జీవిత వృక్షానికి పరదేశవాసులు వేరుపురుగులై పీడిస్తూవున్నారు.

## ఆచార వ్యవహారాలు

నేటి నాగరికతావ్యామోహం పూర్తిగా ఆవహింపని దేశం పాశ్చాత్యఖండాల్లో ఇంకా ఏదైనా వున్నదా అంటే పోలెండును ప్రప్రథమాన్ని చెప్పవచ్చు. నాగరికతా సంబంధమైన మార్పులను కొంత కొంత వరకు అమోదించినా పూర్వాచారాలకు, ప్రాచీన కట్టుబాట్లకు స్వస్తిచెప్పని జాతి పోలిష్ జాతి. ప్రాచీన ఆచారాలు, ఆధునిక నాగరికత సమానంగా మిళితమై ఒక ప్రత్యేక జీవిత క్రమం నేడు పోలెండులో ప్రత్యక్షమాతుంది.



నృత్యసంగీతశాల - వార్సా



సడి, సవ్వడి లేకుండా పోలెండులో భాగాన్ని పంచుకున్న రష్యన్ నియంత
స్టాలిన్

ఉద్రేకం, ఉత్సాహం, స్వాతంత్రపిపాస, తమజాతి అన్నా తమ ఆచారాలన్నా ఒకవిధమైన గౌరవభావం గలజాతి వీరిది. ఇతరులు తమ ఆచారవ్యవహారాల్లో వేలెత్తి వంకచూపించినా సహించే తత్వంగాదు వీరిది. అందుచేత వీరిది తగవులమారిజాతి అని దురభిప్రాయపడుతూవుంటారు. వీరిలో రైతులు, భూస్వాములు అనేవి రెండే రెండు ముఖ్యమైన తెగలు. వీరి ఆచారాలు చాలా ఆశ్చర్యంగానూ, ఒకవిధమైన సుహృద్భావం కలిగించేవిగానూ వుంటాయి.

ఏ పొలంలోనైనా, మరెక్కడైనా ఒక స్త్రీ కనపడిందంటే, పురుషుడు తాను చేస్తూవున్న పనిని కట్టిపెట్టి, తక్షణం ఆమె కుడి అరచేతి వెనుకభాగాన్ని ముద్దుపెట్టుకోవాలి. ఆచుంబనానికైనా పురుషుడు తాను వంగాలిగాని, స్త్రీ చేతిని తనదగ్గరకు లాగుకోకూడదు! అది మోటుతనమనిపించుకుంటుంది. ఈలా ముద్దాడడం వీరిలో ఒక గొప్ప ఆచారం, గౌరవమూను. ఇది మామూలు స్త్రీలనుకంటె కొత్తగా వివాహమైన స్త్రీల చేతిని ముఖ్యంగా ముద్దుపెట్టుకోవాలి. ఇక । వివాహంకాని కన్యలజోలికి పోకూడదు. ఒకవేళ ఎరగక అలాముద్దుపెట్టుకుంటే, ఆ కన్యలకు మిక్కిలిగా కోపమొస్తుంది. అల్లా ముద్దుపెట్టుకుంటే ఆ కన్యలను ముసలివారికింద పాటిస్తున్నారని వారిభావన.

ప్రతీవారు ఏదో ఒకపని చేస్తూవుండాలి. కడుపునిండాతిని, ఏపనీ లేకపోతే ఆ గ్రామాన్ని కనిపెట్టుకుని కూర్చుని వూరుకోకూడదు. చేపలైనా పట్టాలి, లేకపోతే దేశం నాల్గుమూలలా తిరిగైనా రావాలి.

కేవలం సేద్యంమీదనే జీవించే ప్రజలు గనుక పురుషునితోపాటు భార్యాపిల్లలుకూడా పొలంపోయి అతని కన్నివిధాలా సహాయం చేస్తూవుంటారు. బాతులు, కోళ్ళు మొదలైనవాటిని పెంచడం వీరికి మహా సరదా.

# ముస్తాబు ముచ్చట

పోలిషు ప్రజలు ముస్తాబంటే చెవికోసుకుంటూరు. రంగురంగుల గుడ్డలు ధరించడమంటే వీరికి చాలా మోజు. అందులో ఆకుపచ్చ, పసుపుపచ్చ, నీలం అంటే మరీ సరదా. వీటిమీద ఆపేక్ష తీరక యీ రంగులన్నీ కలిపి ఒక బొంత కుట్టుకుని ధరించడంకూడా వుంది. ఒక్కొక్క కాలానికి ఒక్కొక్కరకపు దుస్తులను వీరు ధరిస్తూవుంటారు. ఎండాకాలంలో నీలిరంగు దుసులు, వానాకాలంలో చారల గుడ్డలు, శీతాకాలంలో ఆకుపచ్చ, పసుపుపచ్చ దుస్తులు ధరిస్తూవుంటారు. స్త్రీలు తలకి ఒక రంగుగుడ్డ చుట్టుకుని, పువ్వులా ముడివేసుకుని దానిలో బాతు యీకలు, పువ్వులు పెట్టుకుని అలంకరించుకుంటారు.

పండుగరోజుల్లో పట్టపగ్గాలుండవు

ఇక పండుగలొచ్చాయంటే వీరి ఆనందానికి మేరవుండదు. ఒకటిగాదు రెండుగాదు, రకరకాలరంగులుగల దుస్తులు, తాము భరించగలిగినన్ని తొడుక్కుంటారు యువతులు. యువకులుకూడా ఆమాదిరిగానే ధరించుకుని వస్తారు. ఈలాటి వస్త్రధారణలో ఆరోజున ఏమంతైనా కొరత కలిగిందంటే, వారి హృదయంలో ఏదో బరువైన విచారం వున్నదన్న మాట. అప్పుడు ఆ విచారంగా వున్నవారి చుట్టూ యువతీయువకులు చేరి, వారి కళ్లవెంట కాల దాగివున్న ఆ నిరాశా మెరుపుల్ని తుడిచి వెయ్యడానికి ప్రయత్నిస్తారు. పండుగరోజుల్లో రంగురంగుల శీతాకోకచిలకల్లా తయారై, ఆ వూరినుంచి యీవూరు, యీవూరినుంచి ఆ వూరు తిరుగుతూవుండడం వీరికొక సరదా.



ప్రపంచ శాంతిభద్రతలకి తోకచుక్క—
హెర్ హిట్లరు

మనవ మల్లే ఉపవాసాలుచేసే పండుగలు వీరిలోనూ వున్నాయి. ఆరోజుల్లో వీరు మంచినీరైనా త్రాగకుండా కఠిన వుపవాసక్రమాన్ని ఆచరణలో పెట్టుకుంటారు.

వీరి పండగల్లోకల్లా పెద్దది 'క్రిస్టమస్' పండుగ. ఆ రోజున గృహ యజమానురాలు ఒక బొమ్మని రంగురంగుల గుడ్డలతో అలంకరించి పశువుల కొట్టంలో దాచిపుంచుతుంది. అది పిల్లలెవ్వరు చూడకూడదు. క్రీస్తు పుట్టాడని చెప్పటానికి అది ఒక గుర్తు. రాత్రి భోజనాలకి ముందు ప్రతివకరి పళ్లెంక్రింద గడ్డిపోచలు పెడుతుంది పండుగ గుర్తుగా. పండుగరోజు వుదయం ప్రతి వీధిమొనలోనూ పెద్దపెద్ద మంటలు వేస్తారు. దానిచుట్టూ యువతీయువకులు చేరి నృత్యాలు చేస్తారు. చేసిచేసి అలసిపోయి, ఆ మంటలు ఆరిపోయే సమయంలో వాటిలో దుముకుతారు. వారి ధైర్యసాహసాలకి అదే అగ్నిపరీక్ష; వారు చెయ్యబోయే ఘన కార్యాలకి అదే దీక్షావ్రతం. ఆనాడు సాయంత్రం ఒకరిమీద ఒకరు పిచ్చికారీలతో నీళ్ళు జల్లుకుంటూ ఆడతారు.

## కళాపిపాసులు

నృత్యగీతాలలో పోలిషు ప్రజల్ని మించిన ప్రావీణ్యులు పాశ్చాత్యుల్లో లేరు. తీరికసమయాల్లో వారు చేసేది విన్నాణ విన్యాసమయమైన దేవనృత్యం; పాడేది జిలుగుతరంగాల అమరగానం—రాజభవనాల్లో నృత్యసంగీతశాలలు ప్రత్యేకింపబడి వుంటాయి ఒక ప్రత్యేకపు శాఖగా. పూటకూలివాళ్ళు నివసించే పూరిగుడిసెలు మొదలుకొని, భూషణాలంకారాలతో భూస్వాములు నివసించే భూరిమేడలవరకు ప్రతి గృహంలోనూ నృత్యసంగీతాలకి ప్రత్యేకస్థలాలు విడిచిపెట్టి కళాలక్ష్మికి ఆరాధనలు సలుపుతూనే వుంటారు.

ప్రతి గ్రామంలోనూ ఒక చర్చి వుండాలి. చర్చిలేనివూరు వున్నదంటే వారికి నిద్రపట్టదు. మతమంటే వారికున్న భక్తి వినయాలు వారి ఆచారవ్యవహారాలన్నింటిలోనూ ప్రతిబింబిస్తూ వుంటాయి. ప్రతి గ్రామానికీ కేథలిక్ మతాధికారి ఒకడుంటాడు. అతడే ఆ గ్రామానికి పెద్ద. తరువాత చెప్పుకోతగ్గవారు వడ్డీవ్యాపారం చేసే జ్యూలు. మతాధికారంటే వీరికెంత గౌరవమో, జ్యూలంటే అంత కోపం. ఈ జ్యూజాతివారు పెట్టే యమయాతనలనుండి యిప్పుడిప్పుడే మతాధికారుల సహాయంతో సహకారసంఘాలు స్థాపించుకుని, కొంచెం కొంచెం బయటపడుతున్నారు పోలిషు ప్రజలు.

ఉపజ్ఞతోగూడిన ఉదాత్తాశయాలు, తమ దేశసౌభాగ్యంకోసము చేయదలచుకున్నది చేసితీరే పట్టుదల, ప్రతివిషయాన్ని పిచ్చిగా నమ్మకుండా వుండే విషయపరిజ్ఞానం—మతమువిూద మమత—వారి జాతికి ఒక ప్రత్యేకతని ప్రసాదించాయి. వీటిని వారెంతో గౌరవంగా కాపాడుకుంటారు-గర్విస్తారు కూడాను.

### మహాపురుషులకు మాత పోలెండు

కొన్ని ఆదర్శాలు, కొన్ని నియమాలు, కొన్ని నిబంధనలు సృష్టించుకుని, తద్వారా అభివృద్ధి సౌధాలకి యెగబ్రాకుతూవున్న పోలిష్‌జాతి ప్రపంచప్రఖ్యాత పురుషుల్ని కొంతమందిని తనవారిని చేసుకుంది. 'భూమి సూర్యుడుచుట్టు తిరుగుతోంది గాని, భూమిచుట్టు సూర్యుడు తిరగటంలేదు'ని నిరూపించిన సుప్రశిద్ధశాస్త్రవేత్త 'కోపర్నికస్'; 'రేడియమ్'ను ప్రప్రథమంలో కనిపెట్టిన 'మేడమ్ క్యూరి'; నోబుల్ బహుమతినిగడించుకున్న జగద్విఖ్యాత గ్రంథకర్త 'హెన్రీ సింకవిజ్'; పోలిష్ రిపబ్లిక్‌ను స్థాపించడానికి అష్టకష్టాలను అనుభవించి, విజయమొందిన 'ఫీల్సు డుస్కీ'; 'పియానో' వాయిద్యమందు పాశ్చాత్యులందరిలోను అఖండ నైపుణ్యాన్ని ప్రదర్శించిన ప్రశిడెంటు 'మాస్కెకీ' మొదలైన సంగీతవిద్యాప్రవీణులు, శాస్త్రవేత్తలు, రాజకీయ దురంధరులను కని, పెంచి ధన్యతపొందింది పోలెండు.

## రాజకీయచరిత్ర

రెండవ శతాబ్దానికి ముందువెనుకలనుండి పోలెండు అనే కొంతభూమి యూరపురాజ్యాలలో ఒక ప్రత్యేకమైన ఆకారాన్ని పొందివున్నా, నామమాత్రావశిష్టమై ఏవిధమైన ప్రాముఖ్యత లేకుండానే ఉంది. 10వ శతాబ్దము ఆఖరిభాగమువరకు కొంతమంది భూస్వాముల ఆధిపత్యంలోవుంటూ, చెప్పుకోతగ్గ అధికారం గాని అభివృద్ధిగాని లేకుండా ఒక ప్రత్యేకదేశం క్రిందమాత్రం పరిగణింపబడుతూ వుండేది.

18 వ శతాబ్దం ఆఖరివరకు, రష్యాచేతిలో కొన్నాళ్ళు, జర్మనీ పాదాలక్రింద కొన్నాళ్ళు, ఆస్ట్రియా, ప్రష్యా మొదలైన దేశాల పలుకుబడిలో కొన్నాళ్ళు నలిగిపోతూ, సాంఘిక ఆర్థిక రాజకీయంగా ఎట్టి అభివృద్ధీలేక అనామకంగా నిలిచిపోయింది. పరదేశస్థులు ప్రవేశించి పోలెండులో స్థిరపడి వారిభాషను, వారి వ్యాపారాన్ని, వారి నాగరికతను అభివృద్ధిచేయడానికి ప్రయత్నిస్తూ పోలుల నణగద్రొక్కుతున్నా, నిరుత్సాహంలో కుమిలిపోకుండా పోలులు తమ భాషను, తమ ఆచారాలను, తమ మతాన్ని విస్మరించకుండా కాపాడుకుంటూనే వచ్చారు. కాని వ్యాపార పరిశ్రమాభివృద్ధికి ఆటంకంకలిగి అస్వతంత్రులైపోయారు.

పోలెండు దేశస్థులు తమ స్వదేశంలో తమ స్వభాషకునూడా చదువుకోవడానికి వీలులేని దుర్భరమైన రోజులు ఒకప్పుడు గడిపినారంటే ఈ పరదేశ పిశాచముల పరిపాలనా ప్రభావము తెలుసుకోవచ్చు.

ఇంతలో 1914సం||లో ప్రపంచ మహాయుద్ధం (Great war) ప్రారంభమై అందులో సమస్తదేశాలు పాల్గొనవలసి వచ్చింది. యుద్ధానంతరం ఇంగ్లాండు, రష్యా మొదలైన దేశాలు పోలెండుకు స్వాతంత్ర్యమీయడానికి వప్పుకున్నా, జర్మనీ ప్రబలశత్రువై కూర్చుంది.



పార్లమెంటు భవనము — వార్సా

రిపబ్లికన్ పోలెండు పార్లమెంటు సమావేశాలు ఇక్కడ జరుగుచుండేవి. జర్మను బాంబులకు గురియై శిధిలమైపోయింది.



అకుంఠితమైన దీక్షతో 15 సంవత్సరముల
తీవ్రకృషి ఫలితమైన 'రిపబ్లికన్
పోలెండు' నిర్మాత

ఫీల్సుడుస్కీ



రిపబ్లికన్ పోలెండు ఎక్స-ప్రెసిడెంటు,
పియానో వాయిద్యమందు ప్రావీణ్యుడు,
గాంధిమహాత్ముని 'సత్యము-అహింస'
సూత్రములందు నమ్మకముగలవాడు అయిన

మాస్కెకీ



సంగ్రామానంతరము రష్యా,జర్మనీలచే నియమింపబడిన
రిపబ్లికన్ పోలెండుకు ప్రెసిడెంటు

[illegible]

ఈ సమయంలో పోలెండు భాగ్యవిధాత ఫీల్సుడుస్కీ పోలెండు రాజకీయాకాశంలో ధృవనక్షత్రంలా వెలుగుతూ, పోలెండు రాజకీయచరిత్రలో ఒకనూతన శకారంభాన్ని సృష్టించాడు. ఇంచుమించుగా పోలులందరు ఫీల్సుడుస్కీ నాయకత్వాన్ని ఆమోదించి ఆతనిచేతిక్రిందకి వచ్చేశారు. అతని అధ్యక్షతను సమావేశమై తీవ్రతరమైన విప్లవాన్ని లేవదీశారు. 1905 వ సంవత్సరంనాటినుండీ స్వాతంత్ర్యంకోసం పోరాడుతూవున్న డుస్కీకి ఇప్పుడు మంచి అవకాశం చిక్కింది. దేశంలో క్రమమైన విప్లవాన్ని సరియైన కట్టుబాట్లలో నడుపుతూ, పైన ఇంగ్లండు, రష్యా మొదలైన దేశాలయొక్క సహకారాన్ని, సానుభూతిని పొందుతూ, 1918సం॥ నాటికి పోలెండులో స్వాతంత్ర్యాన్ని స్థాపించి, తాను ఇన్నాళ్లనుండి కలలుకంటూవచ్చిన పోలిష్ రిపబ్లిక్‌కు తానే ప్రధాని, సేనానాయకుడుగా వుండి పోలెండుకొక నూతనాకారాన్ని ప్రసాదించాడు. కాని సరిహద్దుల విషయంలో వార్సైల్సు సంధిప్రకారం కొన్నిమార్పులు చెయ్యక తప్పిందిగాదు. సైలీషియాలో కొంతభాగం; తూర్పు రష్యావైపున కొంతభాగం జర్మనీ కలుపుకుంది. డాన్జిగ్‌ను 'ఫ్రీ సిటీ'ని చేసి పోలెండులోనే వుంచారు. ఫీల్సుడుస్కీయొక్క యీ ఆశయ పరిపూర్తిని క్రమక్రమముగా అన్నిదేశాలూ అంగీకరించాయి. నాటినుండి నేటివరకు పోలెండు స్వతంత్రదేశమై తీవ్రగమనాన్ని నాగరికతాభివృద్ధిని గావించుకుంటూ, సాటిదేశాలతో సమానప్రతిపత్తిని సంపాదించుకుంటూ వుంది.

# మళ్లీ యుద్ధం

పరరాజ్యాల వత్తిడినుండి బయటపడి గుండెమీద చెయ్యివేసుకొని స్వాతంత్రవాయువులను పీల్చుకుంటూవున్న పోలిష్ ప్రజలకి తిరిగి తీరనికాలం సంప్రాప్తించింది. పరదేశాక్రమణకీ, ప్రజాసామాన్య స్వాతంత్రాన్ని భగ్నం చెయ్యడానికీ సంసిద్ధుడై నేటి యూరప్ అశాంతి దావానలానికి కారణభూతుడైన హిట్లరు విజృంభించి పోలిష్ విషాదనాటకాన్ని మరల తెరకెక్కించి ఆడిస్తున్నాడు.

పోలెండుకు జీవగర్ర అయిన విస్తులానది ముఖద్వారంలో వుంది డాన్జిగ్ పట్టణం. పోలెండుయొక్క వాణిజ్య వ్యాపారమంతా విస్తులానదిద్వారా డాన్జిగ్ చేరి, అక్కడనుండి సముద్రంలోకి పోవాలి. అంచేత పోలెండుయొక్క వ్యాపారాభివృద్ధికీ డాన్జిగ్ గుండెకాయి.

పోలెండుకు ప్రాణసమానమైన డాన్జిగ్‌ను మ్రింగితే పోలెండు నిరాధార నిరంజనమౌతుందని, డాన్జిగ్‌లో వున్న 40,000 జర్మను ప్రజలయొక్క హక్కులను సంరక్షించాలనే నెపంమీద హిట్లరు మొట్టమొదలుగా దీనిని స్వాధీనపరుచుకుంటానన్నాడు. డాన్జిగ్ పరహస్తగతమైనప్పుడు పోలెండు స్వాతంత్ర్యం నశించినట్లే; అందువల్ల హిట్లరు అభిప్రాయాన్ని మన్నించారుకాదు పోలులు. దానిమీద పోలెండ్ స్వాతంత్ర్యంయొక్క అంకురానికే మోసం వచ్చింది. డాన్జిగ్‌ను వశంచేసుకుని, పోలిష్ ప్రభుత్వానికి ముందుగా తాను యుద్ధానికి వస్తున్నట్లుగాకూడా తెలియపరచకుండా, పోలెండుయొక్క రాజధాని నగరమైన వార్సాపై దండెత్తాడు హిట్లరు.

చావు బ్రతుకులకు తెగించి స్వాతంత్ర్య రక్షణార్థం సంగ్రామంలోకి దుమికిన పోలిష్ ప్రజలకు ఒక శాంతిసందేశాన్ని, యుద్ధమాపవలసినదిగా కోరుచు హిట్లరుకొక విన్నపాన్ని చేయవలసినదిగా ప్రార్థిస్తూ, పోలిష్ ప్రెశిడెంటు మాస్కికీ, ప్రపంచశాంతి ప్రతిష్ఠాపనాచార్యుడైన గాంధిమహాత్మునికి 'కేబిలు' నిచ్చాడు. మహాత్ముడు గుండెకరగి హిట్లరుకు 'శాంతిఛాతవు'కమ్మని వినతినంపాడు. కాని పరరాజ్యాలను కబళించాలనే ఆశన్మోమత్తెక్కిన హిట్లరుకిది వినపడుతుందా?

డిమాక్రసీపట్ల సుముఖమైవున్న నేటి సభ్యతా ప్రపంచం దీనినిచూచి గర్హించింది. బ్రిటను ఫ్రాన్సులు పోలెండు పక్షాన్ని నిలిచాయి. అసలే మొక్కవోని శూరులు, స్వాతంత్ర్యప్రియులు అయిన పోలులు, బ్రిటను ఫ్రాన్సుల అండచూచుకొని జర్మను ధాటికి నిలబడ్డారు.

ఆ బాలవృద్ధులు దేశసంరక్షణార్థం నడుముకట్టారు. ముఖ్యముగా స్త్రీలు యుద్ధభూములలో సైనికుల కొరకు 'ట్రెంచీలు' త్రవ్వటలో అమితంగా తోడ్పడ్డారు. యుద్ధంలో గాయపడినవారికి వైద్యసహాయం చేయడానికి వైద్యశాలలలో పనినంతా నిర్వహించారు.

కాని హిట్లరు రాక్షసబలాన్ని సమీకరించుకొని, పోలెండు రాజధాని నగరమైన వార్సాపై మృత్యు వర్షం కురిపించాడు. నడివీధులలో కుప్పలు తిప్పలుగా పడివున్న శవాలు, తల్లిదండ్రులకోసం గగ్గోలుపెడుతూ ఏదిక్కులేక, ఆకలితో అటమటించే అమాయక పిల్లలు, చనిపోయిన తల్లుల కౌగిలింతలలో ఉక్కిరిబిక్కిరయ్యే పసిపిల్లలతోటి వార్సా నగరప్రాంతము ఒక స్మశానంక్రింద మారిపోయింది.

తరతరాలనుండి పోలెండు చరిత్రకు ప్రబలనిదర్శనంగా వున్న బ్రహ్మాండమైన కోటలు, భవనాలు నేల మట్టమయిపోయినాయి. బాంబుల తాకిడి తగిలి, ఆ అగ్నికుండంలో చిరస్మరణీయములైన భవంతులు రూపు రేఖ విలాసాదులు లేకుండా గోజుల తరబడి కాలిపోయినాయి.

పోలులు తమకు వీలైనంతవరకు ధైర్యాన్ని చిక్కబెట్టుకొని యుద్ధం చేశారు. జర్మనీ యుద్ధంలోకి దిగిన వెంటనే "పోలెండు అరాచకమైపోయింది. మైనారిటీలుగా పోలెండులోవున్న రష్యను ప్రజలను రక్షించ డానికిగాను తానుకూడా దిగవలసిన అవసరము వచ్చిన"దని రష్యాకూడా తూర్పుసరిహద్దులో చొరబడి దేశాన్ని ఆక్రమించుకుంది.

# పరాధీన పోలెండు

అసలే చిన్నదేశం; అందుమీద ఇరువైపులా బ్రహ్మాండమైన ఆయుధబలంతో రెండు బలమైన రాజ్యాలూ ప్రళయతాండవం చేస్తూవుంటే, వారి పశుబలానికి ఆహుతి అవక తప్పిందిగాదు పోలెండు.

డిమాక్రసీకి (ప్రజాపరిపాలన) అగ్నిపరీక్షగా నిలిచి పోలెండు చితికిపోయింది. పోలెండు చరిత్రలో విషాదమయమైన ఆఖరి అధ్యాయం పూర్తి అయింది. ఇదేకాదు, పోలెండుచరిత్రలో మొదటినుండి యీ విషాద ధ్వనులు ప్రతి అధ్యాయంలోనూ ప్రతిధ్వనులిస్తూనే వుంటాయి. సిరిసంపదల కలిగి, ధర్మాన్ని పట్టుకుని వ్రేలాడే అమాయికపు పోలెండును గుటుక్కున మ్రింగాలని, స్వార్థపరత్వంతో మత్తెక్కిన నియంతృత్వరాజ్యాలు కనిపెట్టుకుని, ఎప్పటికప్పుడు ఉచ్చులు పన్నుకుంటూ చుట్టూ కూర్చునివున్నప్పుడు పోలెండుకు శాంతి ఎక్కడ... ?

జర్మనీ రష్యాలు పోలెండును వారివారి తాహతులకు సరివచ్చునట్లుగా పంచుకుని ఇరురాజ్యాలకు మధ్యగా ఒక చీలికను 'పోలిష్ రిపబ్లిక్' పేరిట ప్రత్యేకించి, ఆ నూతన పోలిష్ రిపబ్లికుకు కౌంటు రాజ్ నిస్కిని తమ పలుకుబడిక్రింద అధ్యక్షుణ్ణిచేసి, పోలెండు నామాన్ని రూపుమాపకుండా నిలిపారు.

ప్రతిజాతి, ప్రతిదేశం స్వాతంత్రపిపాసతో తీవ్ర కృషి సల్పుచున్న యీ కాలంలో, నియంతలైన ఫాసిస్టు ప్రభుత్వాల గుప్పెటలోంచి బయటపడి, వెనకటివలెనే పోలెండు తిరిగి తన స్వాతంత్రాన్ని నిర్మించు కుంటుందా? కాలగర్భంలో ఏమి అణిగిమణిగి వున్నదో....




# కళాభివృద్ధి కావాలంటే

**'ధనమూల మిదంజగత్' అనినట్లు ఏకళైనా దేశంలో అభివృద్ధికావాలంటే దానికి వలయు ధనసహాయం సమకూరినపిదప స్త్రీలకు కళారాధన మొనర్పగల సావకాశము లొసంగుటకు సంఘము సమ్మతింపవలెను. సాంఘికసహాయమును చేకూర్చుకొనిన తరువాత స్వజాతి గౌరవ మర్యాదలను కాపాడే కళాపరిశ్రమకే స్త్రీలు పాటుపడవలెను. గృహపరిశ్రమలను, లలిత కళలను అభ్యసించుట కనువగు కళాశాలలను కళాపరిశ్రమశాఖలను స్థాపించవలెను. సాంఘిక దుస్థితి తొలిగి ఆర్థికపరిస్థితులు బాగుపడవలెను.**

●

ప్రపంచాభివృద్ధి వాయువేగ మనోవేగములతో సాగుచున్నది. సమస్త జాతులకు స్వతంత్రాభిలాష హెచ్చుచున్నది. ప్రతి వర్ణమువారు, ప్రతి మతమువారు తమతమ హక్కులకై పోరాడుచున్నారు. ఎల్లరును విద్యాభివృద్ధికై పరితపించుచున్నారు. విద్యాభివృద్ధి, శాస్త్రాభివృద్ధి, కళాభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి, వేయేల సర్వతోముఖజ్ఞానాభివృద్ధి దశదిశల వ్యాపించి కంటికి మిరుమిట్లు గొలుపుచున్నది. సర్వజన సౌఖ్యము, సర్వజన విజ్ఞానము, సర్వజన స్వతంత్రము యెల్లరు కోరదగినదేగదా! దేశాభివృద్ధి యనగా సర్వజనాభివృద్ధియనియే యర్థము.

ఇట్లందరకు విద్యాపిపాస, కళాపిపాస, స్వాతంత్ర్యపిపాసగల దినములలో స్త్రీలు మాత్ర మూరుకొనగలరా? పురుషుని యర్థాంగమగు స్త్రీమాత్రము విద్యావిహీనయై, కళావిహీనమైయున్నచో సంఘసౌష్ఠవము గలుగునా? కావున స్త్రీలకు విద్యాభివృద్ధి, కళాభివృద్ధి యక్కరలేదని యెవరేని చెప్పగలరా? అయితే సంగీత సాహిత్యాది కళారాధనకు బూనుకొనినచో మానవుల హృదయము లత్యంతాహ్లాదకరముగ నుండితీరవలెను. శాంతముగగూడ నుండవలెను. పెద్దవారై సంసారమందలి కష్టసుఖములకు బాధ్యులైన తర్వాత కళారాధన మిగుల కష్టమేయగును. కావున బాల్యముననే విద్యాభ్యాసము చేయించుట యాచారముగనున్నది. గృహనిర్వహణ భారమేమియులేక బాలికలు సంతోషముగ గడపు

కాలమే విద్యాభ్యాసమునకును, తద్వారా కళారాధనకును అనుకూలమైనకాలము. కాని పదునాల్గు పదునేను సంవత్సరములలోపు బాలికలెంత విద్య నేర్చెదరో, నేర్చిన దానినెంత వృద్ధిగావించుకొందురో బాగుగ యోచించిన మనకే తెలియగలదు. పురుషుల కిరువది సంవత్సరములదాక విద్యాభ్యాసమున కవకాశముగలదు, గాని స్త్రీల కట్టి యవకాశము లేదనుట నిర్వివాదాంశము. యెవరో నూటికొక్కరి కట్టి సదవకాశము లభించిన లభించునుగాక. నూటి కైదుగురైన విద్యావంతులులేని మన దేశములో విద్యావతులగు కళారాధకు లెందరున్నారో వ్రేళ్లమీద లెక్కింపవచ్చును.

సహజముగా స్త్రీల హృదయం కళాత్మకం. అవిద్యావతులైనను కళాకౌశలమున అందెవేసిన చేతులే. రాగతాళముల నెరుంగనివారు శ్రావ్యముగ పాటబాడగలరు. నాట్యమననేమియో యెరుంగనివారు కోలాటములాడుట గొబ్బితట్టుట మున్నగు నాట్యవిన్యాసముల చూపగలరు. ఆర్టుస్టూడియో పేరెరుంగనివారు మనోహరముగ రంగవల్లుల చిత్రించగలరు. స్త్రీల యందంతర్భూతమైయున్న యీ కళాశక్తిని విజృంభింపజేయటానికి విద్యయవసరమని వేరే చెప్పనక్కరలేదు. వజ్రానికి సానబెట్టినట్లు స్త్రీలకు విద్యయున్నచో నివురుగప్పిన నిప్పువలె వారిలో నణగియున్న కళ ప్రజ్వలించి వారి జీవితమును యశోవంతము చేయును. కాని సాంఘికార్థిక పరిస్థితులు కొన్ని స్త్రీల విద్యాభివృద్ధి కాటంకములుగా నున్నవి. అవి చక్కబడిననే గాని స్త్రీ సంఘము కళారాధనకు బూనుకొన నవకాశము లభింపదు.

బాల్యవివాహములు చేయు నాచారము స్త్రీల విద్యాభ్యాసమునకు ప్రబలమైన యాటంకముగానున్నది. విద్య అతి స్వల్పకాలములో సాధింపదగినదికాదు. పురుషులకు సామాన్యముగా నయిదేండ్లు మొదలు పాతిక ముప్పది సంవత్సరములు వచ్చుదాక విద్య చెప్పింతురు. స్త్రీల కట్లుగాక పన్నెండేండ్లకే బడి మాన్పింతురు. వివాహితయగు బాలిక విద్యాలయమున కరుగరాదు. ఉపన్యాస వేదికలపై బాల్యవివాహ దురాచారముల మానుపుడని యెంత బోధించినను, బాల్యవివాహ దుష్ఫలితముల కన్నులార దినదినము చూచుచున్నను, బాల్యవివాహముల నిషేధించు శారదాచట్టమెంత కట్టుదిట్టముగానున్నను, బాల్యవివాహములుచేయు టాచారములేని వర్ణములవారు సైతము నిత్యము శారదాచట్టము నుల్లంఘించుచు బాల్యవివాహముల నిప్పటికిని నిరంకుశముగా చేయుచున్నారు. పెండ్లి కాగానే బాలికయొక్క యోగక్షేమముల విషయమైగల అధికారము తల్లితండ్రులకు బోవును. అత్తవారు పెత్తందారులగుదురు. వారి యిష్టములేనిది పిల్లను బడికి పంపుటకు తల్లితండ్రుల కధికారములేదు.

అందువల్ల బాలిక విద్య కుంటువడును. యిక రజస్వలయగుచో నసలే వీలులేదు. అటుపిమ్మట బడికిపోతే అమర్యాద, అవినీతి, అనాచారము, అన్ని దోషములు ముందుకు వచ్చును. కావున ఆడపిల్లల చదువు మఖలోపుట్టి పుబ్బలోగిట్టుచున్నది. ఇక కళాభ్యాసము నకు తావెక్కడ? సామాన్య విద్య పూర్తియైనపిమ్మట గదా, వివిధ కళాభ్యాసము చేయవలెను? సామాన్యవిద్య పన్నెండు పదమూడేండ్లకే పూర్తికావలెను. ఈలోగా కళాభ్యాసమెట్లు చేయవచ్చును? ఇది మిక్కిలి క్లిష్ట సమస్య. దీనినెట్లు సాధింపవలెనను నదియే ముఖ్య ప్రశ్న. దీనికి విద్యాధికులు, సంఘనాయకులు, రాజకీయవేత్తలు, సంఘ సంస్కర్తలు యేమి సమాధానము చెప్పెదరు? ఈ ప్రశ్న చాలకాలమునుండియు గలదు. కాని సమాధానము చెప్పువారు లేరు. ఆ విషయమంతగా వారికి పట్టదు. వారి దృష్టియం దావిషయమంత ప్రధానమైనదిగాదు. అది దేశస్వాతంత్ర్య విషయముగాదు. అందువల్ల దేశనాయకు లుదాసీనులై యున్నారు.

దేశస్వాతంత్ర్యయుద్ధమున స్త్రీలుకూడా యుత్సాహముతో పనిచేయవలెనని పెద్దలు కోరియున్నారు. కాని విద్యావిహీనులై రాజకీయవిషయముల నెరుంగజాలని వారెట్లు పురుషులకు చేయూతనీయగలరు? ఉన్నతాశయములు గలుగుటకును, ప్రపంచ చరిత్రల నెరుంగుటకును విదేశ స్త్రీలు చేయుచున్న గృహపరిశ్రమల నేర్చుకొనుటకును, జాతీయ కళల పోషించుటకును వ్యాపింపజేయుటకును ఉన్నతవిద్య కావలెనుగదా? సహజముగా పురుషులకంటె స్త్రీలకు కొన్ని కళల యందధిక నైపుణ్యము, చతురతగలదని చెప్పుట అతిశయోక్తిగాదు. రంగవల్లులు, పూలమాలలు, కుట్టుపనులు మున్నగునవెన్నియో స్త్రీల కళాకౌశలమునకు చిహ్నములని చెప్పుట చర్వితచర్వణమేగదా? కావున కళాభివృద్ధి కావాలంటే సంఘదురాచారములగు బాల్యవివాహములు రూపుమాసిపోవలెను. స్త్రీవిద్య యభివృద్ధి నందవలెను. తద్వారా కళాభివృద్ధి కాగలదు. "నిరాశ్రయేన శోభంతే పండితా వనితాలతా" యనునట్లు సంఘ పరిస్థితులు పరివర్తనముచెంది, విద్యకు కళకు తగిన దోహదమేర్పడాలి.

విద్యవలన స్త్రీల యార్థికపరిస్తితికూడా బాగుపడవలెను. గృహపరిశ్రమలవలన తగినయాదాయ మేర్పరుచుకోవలెను. చిత్రలేఖనము, సంగీతము మున్నగు కళల నభ్యసిం చుట కెల్లరకును వీలుగాదు. వాటికధిక ధనముగావలెను. అట్టికళలను శ్రీమంతులగు వారభ్యసించెదరుగాని సామాన్యమగు స్థితిగలవారికవి కష్టతరమగును. కావున, కళాపరి శ్రమాలయముల నేర్పరచి బాలికలకుచితముగ గృహపరిశ్రమలను నిర్బంధముగ నేర్ప వలెను. అట్టి పాఠశాలలస్థాపించుటకై తగినయాందోళనగావించి వానియభివృద్ధికై పాటు

పడవలెను. మరియుప్రస్తుతము స్త్రీసమాజములనేకములు స్థాపించి స్త్రీల పురోభివృద్ధికై పాటుపడుచున్న స్త్రీలు ముఖ్యముగా తోటిసోదరీమణుల విద్యకేగాక ధనవిషయములో గూడ సాయపడవలెను. ఇపుడున్న సమాజములలో కళాపరిశ్రమ శాఖల నేర్పరచి ప్రతివారికి యవసరమగు వస్తువులను స్త్రీలచే తయారుచేయించి విక్రయించవలెను.

ఇపుడు క్లబ్బులలో ముఖ్యముగా సంపన్నులగువారికే స్థానము గలదు కాని సామాన్యులకు లేదు. ఆటపాటలతో కాలంగడిపే క్లబ్బులు బీదవారి కేవిధముగాను సాయము చేయజాలవు. కావున స్త్రీజనపురోభివృద్ధిని, కళాభివృద్ధిని కోరు స్త్రీలందరు తమతమ సమాజములలో కళాపరిశ్రమాలయముల నేర్పరచి తగినశ్రద్ధతో స్త్రీల యార్థికదుస్థితిని రూపుమాపవలెను. "ధనమూల మిదంజగత్." కావున స్త్రీల యార్థికస్థితి బాగుపడిన కళాభివృద్ధి దానంత అదే కాగలదు. కాని కళలు నశించిపోయినవని విచారపడినను, కళలగూర్చిన వ్యాసములుచదివి యానందించినను లాభములేదు. సాంఘికార్థికపరిస్థితులు చక్కబరచుకొని తర్వాత కళాభివృద్ధికి తగిన ప్రోత్సాహ మొసంగి, యాచరించిన మేలు.

అయితే పాశ్చాత్యనాగరకతావ్యామోహము మనల వీడనంతకాలము మనకళలు, మననాగరకత, పెంపొందజాలవు కానీ, పండ్లపొడిలో సైతము మనవారు విదేశీవాటినే యుపయోగించుట మెచ్చుకోతగినదికాదు. దీనికి కారణము మనదేశములో నేవస్తువులును తయారగుటలేదు. ప్రస్తుతము వార్ధావిద్యావిధానము ననుసరించి యేకొద్దిమందియో కొన్ని వస్తువులను తయారొనర్చుచున్నారు గాని వాటిని విరివిగా వ్యాపింపజేయతగిన ప్రయత్నములు లేవు. కావున స్త్రీ లీవిషయమును గమనించి కళాపరిశ్రమశాఖల నేర్పరచి, తద్వారా పరిశ్రమలను పోషింపవలెను. బీదలగు స్త్రీ లనేకులు గౌరవముగ జీవించగలుగుటకు మార్గమేర్పడును. స్వతంత్ర జీవనోపాధిలేని స్త్రీలు తమ యాత్మగౌరవము నిలుపుకొనజాలక నీచవృత్తులకులోనై కళంకవర్తనతో కాలముగడపుచు స్త్రీ సంఘమున కగౌరవము దెచ్చుట సంభవించుచున్నది.

కావున స్త్రీలు తమ స్వజాతి గౌరవమర్యాదలను నిలుపుటకును, పరిశ్రమల ప్రోత్సహించుటకును, కళల పోషించుటకును మార్గదర్శినులై కళాపరిశ్రమాలయస్థాపన తప్పక గావించి, తత్సంబంధమగు వ్యాప్తికి ప్రచారమొనర్పవలెను. పల్లెలలోగూడ ప్రత్యేక బోధలవల్లను, ఉపన్యాసములవల్లను, కరపత్రములవల్లను నిరంతర ప్రచారము చేయవలెను. ప్రభుత్వమువారి సాయముగూడ కోరవలెను. ఇట్లనేకవిధముల నార్థికస్థితి బాగుపడి, సాంఘికదుస్థితి చక్కబడినయెడల కళాభివృద్ధికాగలదు.

—శ్రీ దేశిరాజు భారతీదేవి.



శ్రీమతి అ. సరోజినీదేవిగారు.

'గృహలక్ష్మి' పత్రికతో పరిచితముగల వ్యాసకర్త్రి. స్త్రీలు- నాగరికత అను వీరి వ్యాసములో మంచి విషయములున్నవి.



దేవులపల్లి వేంకటరత్నమ్మగారు.

'స్త్రీ విద్యాదర్శము'లను వీరి వ్యాసములో నొక కొన్ని ప్రశస్తభావములీ పత్రికయందు 'పుష్పచయ'మను శీర్షికలో ప్రచురింపబడినవి.

# స్త్రీలు - నాగరికత

## శ్రీమతి అ. సరోజనీదేవిగారు

ఇప్పటికాలపు సంఘజీవితానికి వేదకాలంనాటి సంఘజీవితానికి తారతమ్యవిమర్శన చేయడం ఈ వ్యాసంయొక్క ప్రధానోద్దేశం. వేదాలు మొదట ఆర్యులతోనే పుట్టాయి; పుట్టి ఇప్పటికి చాలాసంవత్సరాలు గతించాయి. సంఘంలో స్త్రీ పురుషుల జీవితానికి తగిన కట్టుబాట్లు, నియమాలు, నిబంధనలు వేదాల్లోనే ఉదహరింపబడి వున్నాయి. వేదాలు ఘోషించినట్లుగా ఆ కాలంలోని స్త్రీ పురుషు లేవన్మందీ ఆచరించే వాళ్ళు. వర్ణాంతరభేధాలుకూడా అప్పుడే ఏర్పడ్డాయి. రానురాను సంఘంలోని స్త్రీ పురుషులు, తమకు తోచినవిధంగా అభిప్రాయాలు ఉత్పన్నంచేసికోవడం,వాటిని సంఘజీవితంలో బహిరంగపరచడం, ఈసంఘాలు చెప్పినట్లే నడుచుకోవడం జరుగుతూవచ్చింది నేటివరకూ. ఈ రూపేణా సంఘం నేడు చాల క్షీణదశలోవుంది. ఇకముందు సంఘంలో మార్పేదైనా కలిగి బాగుపడుతుందనే నమ్మకము తోచదు. వేదకాలపు సంఘజీవితం లోని కట్టుబాట్లు, నియమాలు, నిబంధనలు యిప్పుడూ ఉన్నాయికాని అప్పుడున్నంత ప్రాముఖ్యంలో లేవు. ఇప్పటి మన సంఘాల్లోని ఆచారవ్యవహారాలు, నియమనిబంధనలూ అన్నీ వేదకాలంనాటివే, కాని ఆంధ్రుల విజయనగరసామ్రాజ్యంలా శిథిలావస్థలో వున్నాయి.

వేదకాలంలో పురుషుడు అనేకమంది భార్యలను పెళ్లాడవచ్చు. భార్యపోతే పురుషుణ్ణి అపత్నీకుడు అన్నారు. స్త్రీకి ఒకడే భర్త. ఆతడుపోతే ఆమెను విధవ అన్నారు. పురుషుణ్ణి అపత్నీకుడు అన్నట్లుగా, స్త్రీని అధవ అని పిలవలేదు. విధవ అంటే ధవుడు అనగా భర్తలేనిదని యర్థము. ఇప్పటి స్త్రీలల్లో స్వాతంత్ర్యకాంక్ష, బుద్ధివికాసం ఎక్కువవడంచేతనే వితంతువివాహాలు కావాలని కోఅడం. వేదకాలంలో వితంతువివాహాలు లేవు. భర్తపోతే తానుకూడా ఆతనితో మరణించడం అనగా సహగమనం చేయడం. అనం తరం ఇరువురూ పరలోకంలో మళ్లీ దాంపత్యం పొందటం వుండేది. స్త్రీకి పిల్లలున్నట్లయితే ఆ పిల్లలను చూచుకుంటూ, కృష్ణా'రామా' అనుకుంటూ, తనభర్తనే మనస్సులో తలచుకుంటూ చనిపోయేవరకూ రోజులు గడపడం ఆచారంగావుండేది. ఇప్పుడో ఆలాలేదు. సమయమొచ్చింది గనుక మనవిచేస్తాను. ఓ అమ్మకు 50 ఏళ్లపై మీదకొచ్చాయి. జుట్టంతా నెరసిపోయింది. చెత్వారంజోడు కూడా ధరించింది. అయితే ధవుడులేడు. పోయినభర్త పోతేపోయాడు, ఏడిస్తే తిరిగివస్తాడు గనుకనా, అని వేదాంతం వెళ్లబోసుకుని ఇంకా తనకాలం అప్పుడే ఏంతీరిందనుకుని, తానుకూడా ఏ Deputy Inspectress of schools గానో, Ladies Club శెక్రటరీ గానో at least hospital లో nurse గానో అవుదామని ఉద్దేశం మనస్సులో దాచుకుందో ఏమో, ఓ ఇంగ్లీషుప్రైమర్ పెట్టుకుని, తెల్లవారిఝామున లేవడం Cat=పిల్లి, Rat = ఎలుక, Ass = గాడిద అని వల్లిం చడం జరిగేది. ఎవరైనా ఇంటికి చూడడానికివస్తేమాత్రం పుస్తకం బీరువాలో దాచిపెట్టి భర్తను తలుచుకుని ఏడ్చేది. విధవలు ఇప్పుడు జుట్టుతీయకపోయినా చేతులగాజులు అట్టేవుంచుకున్నామే అనే భయంపోయింది. ఏదీతప్పులేదు. మాలాణ్ణి ముట్టుకుంటేమాత్రం దోషం. వేదకాలంలో స్త్రీకి లజ్జ, బిడియం, హృదయ గాంభీర్యము ఈ లక్షణాలన్నీవుండేవి. వాళ్ళు పరపురుషుణ్ణి కన్నెత్తి చూడకుండా ఎల్లప్పుడు తమ ఇంటినే కనిపెట్టుకునివుండేవాళ్ళు. ఆంగ్లమహాకవి రస్కినుకూడా వేదాలు చదివాడో, లేకపోతే ఊహించాడో యేమో

ఆతడు స్త్రీని "She is the Queen of the house", ఆమె లేకపోతే గృహంలేదనే భావంకూడా ఒకచోట వ్యక్తీకరించాడు. ఈవిషయం వేదాల్లోనూవుంది. ఇప్పుడున్న జనానాపద్ధతి ఆకాలంనాటిదే. ఇప్పుడు స్త్రీలకు పురుషులతోపాటు సమానహక్కులున్నాయి. వారుకూడా సభలకు వెళ్లేవారు; పురుషులున్న సభల్లో ముచ్చటించేవారు. ఎప్పుడూ ఇంటినికనిపెట్టుకుని ఉండడం ఓనియమమైనా, యజ్ఞయాగాదుల్లో పాల్గొనటం అవసరం గనుక తోడివాళ్లతోకూడా యజ్ఞశాలకుపోవడం వుండేది. ఈపద్ధతి మన స్త్రీలల్లో పెత్తనాలకిపోవడం, పేరంటానికిపోవడం రూపంగామారింది. వేదకాలంలో స్త్రీలు నృత్యం, శిల్పం, గానం, చిత్రలేఖనం నేర్చుకునేవాళ్ళు. ఇవేకాకుండా చాపలల్లడం, వున్ని నేయడం వారికివచ్చును. దీనివల్ల ఆర్థికంగాకూడా లాభం పొందేవారు. ఇప్పటి స్త్రీలుకూడా పూర్వాచారాన్నివదలకుండా గానం, నృత్యం, చిత్రలేఖనం, శిల్పమున్నగునవేకాకుండా ఊలుపని, కుట్టుపని, ఇంకా అనేకవిధమైన విద్యలు జీవనోపాధికోసం అభ్యసిస్తూవున్నారు. ఆకాలం స్త్రీలంతా సదా భర్తననుసరించి, భర్త చెప్పుచేతల్లో వుండేవాళ్ళు. అత్తమామల ఆజ్ఞలేకుండా ఏపనీ చేసేవాళ్ళుకాదు. హరిశ్చంద్రుని భార్యను వేదకాలపు స్త్రీకి ఉదాహరణపూర్వకంగా తీసుకునే కవి 'అడుగుదప్పి ఎఱుంగ దత్తమామలయాజ్ఞ పతిమాట రతనాలపైడిమూట' అని వ్రాసాడు. భర్తనే దైవంగా భావించి ఆతన్నే పూజిస్తూవుండేవాళ్ళు.

కనుకనే భార్య (అనగా భరియింపబడినది అని అర్థము) అని స్త్రీని, భర్తను పతి (అనగా పాలించే వాడని అర్థము) అన్నారు. ఇప్పుడు మనం వ్యవహరించే ఈరెండుపదాలు ఆకాలంలో పుట్టినవే. ఇప్పుడు భార్య భర్త అనే రెండుపదాలు తారుమారైనాయి. నేడు పాలించునది భార్య; పాలింపబడువాడు అనగా భరింపబడువాడు భర్త. భార్య చెప్పుచేతల్లో భర్త వుండాల్సిందే. లేకపోతే మూతిబిగింపులూ, మెటికలువిరుచుకోటాలు, మూడంకెవేయడం, నాపుట్టింటికి నేను వెళ్లిపోతాననడం హిందూ సంఘాల్లో కూడా విడాకులచట్టం త్వరలోనే అమలోనికి తెస్తాననడం, ఇంటిపనుల్లో జోక్యంకలుగజేసికోకుండా ఏ అనాధశరణాలయాలకో క్లబ్బుకో పోయి కూచోడం నిత్యం ప్రత్యక్షంగా చూస్తూవున్నదే. తదాది జరిగే విషయాలు చదువరులకు వదలివేస్తా. ఇప్పుడు బ్రాహ్మణ సంఘంలో తప్పుగా పరిగణిస్తూవున్న రజస్వలానంతర వివాహాలు అప్పుడు అన్ని కులాల్లోను వున్నాయి. వివాహం చేసినవెంటనే వధువు వరునిగృహానికి వెళ్లి భర్తతో కాపురంచేయడం ఆచారమైవుండేది. వివాహానికిముందు కన్యయొక్క అభిప్రాయంకూడా తీసుకుని వివాహం జరిపేవాళ్ళు: ఇప్పుడున్న బాల్యవివాహాలు అప్పుడు లేవు. పిల్లకు ఇష్టమైనా కాకపోయినా, భర్త ఆమెకు నచ్చినవాడైనా నచ్చకపోయినా, మెడలువిరిచి కట్టడం అప్పుడు లేదు: ఇప్పటి మార్పువల్ల సంభవించే వాటికన్నింటికి మనసంఘాలే కారణం. ఇప్పుడు కాలానుగుణ్యంగా వధువు పుట్టింటివద్దనే వుండడం, తర్వాత తన ఇష్టమైతే భర్తతో కాపురంచేయడం, లేకపోతే భర్త తనపుట్టింటికివచ్చి కాపురంచేయడం ఆచారమైంది. ఇటీవల పుట్టిన **Hindu law** కు బీజాంకురాలు వేదాల్లోవే. మన సంఘంలో భర్తపోయిన స్త్రీ న్యాయస్థానానికిపోయి మనోవర్తి తెచ్చుకోవడం అప్పుడేవుంది. ఆ ఆస్తికి హక్కుదారుడు కొడుకే అవుతాడుకాని కూతురు కాదు; ఇదీ వేదాల్లోవుంది.

వేదకాలంలో ఆడుపిల్లలు పరికిణీలు, పెద్దవారైనచో నడుముకుముడివేసి కొంతభాగం జారుపైటగా నుపయోగించు చీరెను ధరించేవాళ్ళు. మొగమున తిలకం పెట్టుకునేవారు. మెడలో ఆభరణాలు ధరించేవారు.

# స్త్రీలు - నాగరికత

ఇప్పుడున్న చిన్నగౌన్లు ఫ్రాక్కులు, Under wear లు, బాడీలు, లుంగీలు, అప్పుడులేవు. ముడివేసి చీర కట్టుకుని పైటవేసుకొనేవాళ్ళు యిప్పుడూవున్నారు, కాని అందులో తేడాలేదూ? ముడివేయటం మోపైన చోట్ల బెల్టులు పెట్టుకోడం, జారుపమిట పనికిరాదని పీపుదిగని పమిటలువేసుకోడం, ఇవేకాకుండా గోచీ పోసికట్టటం, బిళ్లగోచీపెట్టడం, సినీమాకట్లు గూడకట్లు, యిప్పుడు వెలిశాయి. కేశపాశాలు సంస్కరించుకుని ఓవిధమైన జడవేసుకోవడమో లేక చుట్టగాచుట్టుకోవడమో వుండేది ఆకాలంలో. ఇప్పుడున్న వంకెలజడలు, వాలుజడలు పక్కపాపిళ్ళు, క్రాపింగులు, మేకులు తల్లోగుచ్చుకోటాలు, పురుషులమీద అధికారంతోపాటు కేశపాశాలమీదకూడా అధికారంపొంది వాటిని అష్టవంకరలుగా త్రిప్పటం ఇవన్నీ అప్పుడులేవు. ఇప్పుడున్న సినీమా, నాటకాలు వగైరా ఆప్పుడులేవు. ఇవి రావడంతో అనుకరణవిద్య బాగా అంటింది మనజాతికి. దానితో పట్టశక్యంగాకుండా వుంది. ఇప్పుడు కొందఱికి తిలకం పెట్టుకోడం ఒక మోటయిపోయింది. చెవులకు యిప్పుడు పెట్టుకొనే పలువిధములైన లోలాకులు అప్పుడులేవు. బయటతిరిగే అవసరంలేదు గనుక అప్పటివారికి మేజోళ్ల బూడ్సులు, చెప్పులు, గొడుగులు ఏమీ అవసరంలేకపోయాయి. ఇక రవికెలు ఇప్పుడు మోచేతులు దాటిపోయాయి. ఆభరణాలవిషయంలో చేతికి గాజులు మోపైనాయి. అందుచేత తీసి పారేశారు. ఉంటే మెడలో ఒంటిపొరను ఓ బంగారందో లేకపోతే మెరుగుపెట్టిన ఇత్తడిదో ఒక గొలుసు వుండడం; లేకపోతే అదీ లేదు.

రజస్వల అయిన స్త్రీ తలకాయి దువ్వుకోవడం, పూవులు ముడవడం, స్నానంచేయడం కూడదు ఆ మూడు రోజులూ. ఇంకా యేమో యేమో చేయకూడదు. చేస్తే వచ్చే ఫలితాలు వేదాల్లో చెప్పనే చెప్పారు. ఆ మూడురోజులుకూడా ఐదోతనం పారిపోతుందేమో నని మామూలుగా కేశపాశాలు సంస్కరించుకోవడం, పువ్వులు ముడవడం, స్నానం చేయడం, తిలకం పెట్టుకోవడం ఇప్పుడు ప్రతిఇంటా చూస్తూవున్నదే. ఆంధ్రదేశంలో యీ పద్ధతి అంత తీవ్రంగా లేకపోయినా అరవదేశంలో తీవ్రత పొందింది. ఆంధ్ర స్త్రీలు యీ విషయంలో అరవలనుచూస్తే ముక్కుమీద వేలువేసుకుంటారు. స్త్రీలు ప్రసవించినాక నడికట్టు తీయకుండా పదినెలలపాటు వుంచుకునేవాళ్ళు వేదకాలంలో. ఇప్పుడది మోటవడంచేత పెడితే బెల్టు పెట్టడం, (ఇందులో నాజూకు, అవసరం రెండూ కలిసొస్తాయి గనుక) లేకపోతే అదీలేదు. అన్ని మార్పులవల్లా ప్రత్యక్షంగా ఫలితం కనబడ్డా కనబడలేదనుకుని తిరిగినా, ఈ విషయంలో దాఖలా స్త్రీలకు త్వరలో కనిపిస్తుంది.

వేదకాలంలో స్త్రీలు తమ భర్తలతోపాటు యుద్ధభూమికిపోయి తాముకూడా వారికితగిన సహాయం చేసేవాళ్ళు. ఇప్పటికాలం స్త్రీలు భర్తలతోనో, లేకపోతే తమంతట తామో, సినీమాలకి, నాటకాలకి, పార్కులకి, బీచీలకు వెళ్లి స్వేచ్ఛావిహారం సల్పుతు, ఈవిధంగానైనా తమ సహధర్మచారిణీత్వాన్ని కాపాడుకుంటూ వున్నారు, అంతేచాలు. వివాహాల్లో జరిపే సప్తపది, దీక్షవస్త్ర విసర్జన ఇప్పుడూవుంది. వివాహాలు సక్రమంగా జరిగే సంఘాల్లో. వుంగరాలు మార్చుకుని వివాహం అయిందనిపించుకునే సంఘాల్లో అసలేలేదు.

ఇప్పటి సంఘజీవితంలో నిలిచివున్న ఆచారవ్యవహారాలన్నీ వేదకాలంలో పుట్టినవే. ఇప్పుడు ఆ నిబంధనలు అంతగా ఆచరణీయంగా లేవు. ఇప్పటి సంఘంలోని మార్పంతా స్త్రీ, పురుషచిత్తాలపైన ఆధారపడి నడుస్తోందే కాని వేదాల్లో ప్రతిపాదించినట్లు జరుగటంలేదు. వరకట్నం అనేది అప్పుడూ వుంది. కాని ఇప్పటిలాగ పశువును వేలంపాట పెట్టినట్లు వరుణ్ణి డబ్బిచ్చికొనడంలేదు. వరునకు ఏదో వస్త్రాలంకార

రూపంగా ముట్టచెప్పడం ఆచారమయిపోయింది వేదకాలంలో. ఇప్పుడు అలా లేదే. వరుని తండ్రి కట్నం ఏమిస్తావని బేరం చేయడం, ఆ బేరం కుదిరితే మా అమ్మాయి మాకేంచెపతారని అడగటం, లోకాచారం అయిపోయింది. ఇప్పటి హిందూ సంఘాన్ని పట్టి పీడిస్తూవున్న ఈ వరకట్నపిశాచాన్ని ఆహ్వానించిం ఈ సంఘమే. వితంతువివాహాలు కావాలని కోరేది మనసంఘమే. స్త్రీలు భర్తలపై అధికారాన్ని చెలాయించ డానికి హక్కు ఇచ్చింది మనసంఘమే. కొంతకాలానికి హిందూసంఘంలోకూడా విడాకులచట్టం అమలులోకి తీసుకువచ్చేది ఈ సంఘమే. నిన్న గాక మొన్న పుట్టిన శారదాచట్టంకూడా ఇప్పటి సంఘసహాయమే కారణం. ఈ మార్పులవల్ల నరకప్రాప్తికి హేతువేనని తులసిపూసలు త్రిప్పుతూవుండే సనాతనస్త్రీలంతా అంటారు. పుస్తకాలుపుచ్చుకుని, గొడుగులువేసుకొని, కాలికి జోడువేసుకొని క్లబ్బులకూ, స్కూళ్లకుపోయే పడుచులంతా నరకప్రాప్తి వుందంటే ఒప్పుకుంటారు కాని, నాగరికతావ్యామోహంలో పడి అప్పుడప్పుడు మరచిపోతూ వుంటారు తమ గృహిణీధర్మాల్ని.



# ఆంధ్రపుత్రీ అవధారు!

అబలయయ్యును రణరంగమందు నిలచి
శాత్రవ సమూహములనొంచి సమరవిజయ
భేరి మ్రోయించె రుద్రమ వీరవనిత
అరయుమిక తన్వి తేజంబు ఆంధ్రపుత్రీ!

భీత హరిణేక్షణను నుడిబాసిపోవ
నువిద పాంచాలి భర్తను యుద్ధమునకు
బోదబంచెను ఎంతటి బుద్ధిశాలో
అరయు మికనైన వేగమే ఆంధ్రపుత్రీ!

ఆవహ భూమిలో అరిఘాతకును జంకి
పారివచ్చిన మగనికి బసుపునిచ్చె
నాటి తెలుగు కాంతల కీర్తి నేటికేని
అరయు మికనైన తల్లిరో ఆంధ్రపుత్రీ!

సామదానంబుచే నసాధ్యమయ్యె
యుక్తిచే తల్లి బంధవిముక్తి కాదు
హృదయమున సంశయంబొంద అదనులేదు
అరయు మికనైన సుగతి ఆంధ్రపుత్రీ!

జాతి నిర్వీర్యమై యగచాట్లబడియె
కరుడగట్టెను ఆంధ్రుల గౌరవంబు
ఆంధ్రరాష్ట్రంబు చేకూరు నంతదాక
ఆంధ్రసోదర హృదయ ముత్తేజమందు

వీరగీతికలపాడి వెలయు ఆంధ్ర
జాతి పతాకంబు చేబూని సత్వరంబ
ఆంధ్రరాష్ట్రము వేగ సాధింపు ఆంధ్రపుత్రీ!

—శ్రీ దేవులపల్లి సత్యవతమ్మ

# మన కర్తవ్యము ఏమి?

శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మగారు

మధ్యాహ్నం రెండుగంటలు దాటినతర్వాత ఆ పొరుగునవున్న ఆడవారంతా విజయలక్ష్మిగారింటికొచ్చి, పురాణకాలక్షేపమో, పత్రికాపఠనమో యితర విశేషములో విని సాయంకాలం నాలుగుగంటలు దాటినతర్వాత యెవరిదార్ని వారు వెళ్లటం మామూలుగావుండేది—సాధారణంగా ఏ కాలక్షేపంలేని ఆవీధిఆడవాళ్లంతా అక్కడికి చేరేవారు. ఆరోజున సుశీలమ్మగారుకూడా అక్కడకు వచ్చింది. విజయా ఏవిటి విశేషాలు, మీ హిందీపరీక్షలు దగ్గరకొచ్చినట్టున్నాయే? అంది.

విజయ :—ఆ, మీ శకుంతలకూడా చదువుతోంది కాదూ? నువ్వుమాత్రం మా అందరిసంగతులు వాకపుచేస్తువుండటమేకాని, ఏంచెయ్యవుకదా? ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని గురించి పేపర్లల్లో కావలసినంత ఆందోళన జరుగుతోంది.

సుశీల :—మనవేంచేస్తాం? అవన్నీ మనకేంతెలుస్తాయి? మొగవారేం తంటాలు పడతారో, వేళకి కాఫీ ఇవ్వకపోతే ఇంట్లో ఆరోజల్లా కావలసినంత ఆందోళన జరుగుతుంది.

విజయ :—అది నిజమేకాని, మనకేం తెలియదనిమాత్రం అనకు—భగవంతుడే గీతలో చెప్పాడు. "కీర్తి శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిక్షమాః" అని. ఏకాలంలో ఏ స్త్రీలు పట్టుదలతో చేసినపని నెరవేరలేదు?...వేదకాలంలో, పురాణకాలంలో, ప్రస్తుతకాలంలోనుకూడా మనం వింటూ చూస్తునేవున్నాం. మొన్న సత్యాగ్రహంలో చూళ్లేదూ? ముసలమ్మలూ, పడుచువాళ్లూ పిల్లల తల్లులూ, లాటీదెబ్బలు తిని జైళ్లకెళ్లటం?

ఇంతలో సోదెమ్మగారందుకుని మరేనమ్మా స్వరాజ్యం వొస్తుందంటూ ఆమధ్య మోటుగుడ్డలు కట్టుకుని అందరూ ఊరేగింపులు, ఉప్పుచెయ్యటాలు, కల్లుపాటలు వొద్దనటం, దెబ్బలుతినటం అన్నీ అయినాయి. స్వరాజ్యంలేదు ఏమీలేదు. అవన్నీ మనకెందుకు? ఏవో 'రామా, కృష్ణా'అంటే విందావని నే వొచ్చాను. విజయలక్ష్మమ్మా—అసర్గ అయిపోయిందా?—అడివికి పంపేసిందా? కైకమ్మ?—అంది.

విజయ :—అవునండి మామ్మగారు—ఆరంభశూరత్వముకాకుండా పట్టుదలతోటి, సంఘీభావంతోటి ఏంచేస్తే నెరవేరదు?.

చూడండి ఇప్పుడు చదువురాని ఆడవాళ్లు లేరనిన్ని, అంతా నాగరికం నేర్చారనీ మీవంటి పెద్దవారంటారు కాని ఇప్పుడుకూడా ఆడవాళ్లకు స్వతంత్రంకూడా వచ్చిందనుకుంటున్నారు. ప్రతి పట్నంలోనూ ప్రతి గ్రామంలోనూ, స్త్రీలను లెక్కపెట్టిచూస్తే

చదువుకున్న వాళ్లు, ఆచదువును వృద్ధిచేసుకుంటూన్న వాళ్లు నూటికెంతమంది వుంటున్నారో తెలుస్తుంది. రామకృష్ణారావుగారి భార్య లక్ష్మీదేవమ్మగారు మొన్న నాతో ఏంచెప్పిందో విన్నారా? కాకినాడలో ఆమె పుట్టింట ఉన్నప్పుడు కొంచెం తెలుగూ, హిందీ చదువుకున్నాను. దుర్గాబాయమ్మగారు కొంచెం హిందీ చెప్పారు. ఇక్కడికొచ్చాక నాకు చదువుకోవాలనే వుందికాని యీ వూళ్లో అంతా ఆక్షేపిస్తారంది. అప్పుడు నేను ఒకరు ఆక్షేపనలు చేస్తారని మనం యెన్నిపనులు మానివెయ్యగలం అన్నాను. పాపం యీవిధంగా యెంతమంది తమ అభిప్రాయాల్ని జీర్ణంచేసుకుంటూన్నారో చెప్పగలమా?—ఏదైనా అవసరమైన క్రొత్త పద్ధతులను ప్రజలలో వ్యాపింపచెయ్యాలంటే ఏ ఒకరిద్దరో ముందుకువస్తున్నారు ఒక గ్రామానికి. పట్నంలో అయితే పదిమందికంటె యెక్కువ కనిపించటంలేదు. తక్కినవారంతా ఏ రోటివద్ద ఆ పాటపాడేవారే కనిపిస్తున్నారు,అంది సోదెమ్మ. యీ వేళకిదే కాలక్షేపనా ఏమి? ఇంట్లోపనుంది. రామాయణం చదువరూ విజయలక్ష్మమ్మగారూ? యెందుకొచ్చిన గొడవలూ స్వర్గమా, మోక్షమా?

విజయ:—మామ్మగారు, ఆ రామాయణంలోకూడా నిజమైన పరమార్థమేదో తెలియకుండా యెన్నాళ్లు చదివినా, విన్నా స్వర్గం మోక్షంవస్తుందా? అక్కడకూడా సీత తనభర్త దేశస్వాతంత్ర్యానికి దీక్షవహించి స్వార్థత్యాగం జేసివెడుతూంటే నేనేం చెయ్యగలనని యింట్లో కూర్చోక సహకారిణిగాపోయి అష్టకష్టములను సహించి దేశంలో శాంతిని స్థాపించింది. అంత కార్యదీక్ష మనకున్నప్పుడే కార్యసిద్ధి కలుగుతుంది.

విజయ:—మాట వొచ్చింది గనుక అంటున్నాను తప్పుపట్టుకోకండి. మీకు పురాణంవింటం ఇష్టం. మీ కోడల్ని ఘోషాలోవుంచాలి. మీ మనమరాలు కాలేజీ విద్యార్థిని. మీ అబ్బాయి ఉద్యోగం చెయ్యాలి. అల్లుడు నాన్‌కోపరేటరు. కూతురు హిందీప్రచారిక. అందరికీ స్వరాజ్యంమాత్రం రావాలి. యెల్లాగండి?

సోదెమ్మ:—పోనీ లెండమ్మా, యెవరియిష్టం వారిది. యీరోజుల్లో ఒకరిమాట వినేవారెవరు? పనివేళైంది. చుట్టంకూడావున్నాడు. అని లేస్తోంది.

విజయ:—వెళ్లకండి. ఏదో కొంచెంసేపే చదువుకుందాం ఈవేళ మా సుశీల తీరుబడిచేసుకుని వచ్చింది గనుక యీ గోష్టి వచ్చింది.

సుశీల:—జూలై 'గృహలక్ష్మి' చూచావా విజయా? బొంబాయిలోని నిరక్షరాస్యతా నిర్మూలనచిత్రం.

విజయ:—ఆ, చూచితిని 'గృహలక్ష్మి'కూడా ఆంధ్రరాష్ట్ర సమస్యలను చర్చించబూని స్త్రీల కర్తవ్యమును తెలుపుట కవకాశ మొసంగియుండుటయు, అందును దసరా

సంచికయందే యీ విమర్శనములు ప్రకటింపజేయవలెనని సంపాదకులు నిశ్చయించుటయు సంతోషదాయకములు. ఇందుచే సంపాదకులు పాఠకలోకమునకు యెంతయు మాన్యులు, వందనీయులు అగుచున్నారు.

సుశీల:—విజయా, అయితే ఇప్పుడేమంటావు? మా శకుంతలను గరల్ స్కూలుకు పంపమంటావా? ఇంట్లో ప్రయివేటు చెప్పించి హైస్కూలులో చేర్పించమంటావా? లేకపోతే ఇంట్లోనే హిందీ, సంగీతం చెప్పించమనా? నీ వుద్దేశం చెప్పు.

విజయ:—నిజంగా నాసలహా నీకు కావలిస్తే చెప్పనూ? స్త్రీలు చెయ్యవలసిన పనులు చాలావున్నాయి. మొన్న ఆమధ్య బొంబాయి రేడియోశాఖలో ఉపన్యసిస్తూ సరోజినీదేవిగారు వంటలుచేయుట, అలంకరణములు, ఫాషన్లు తప్పితే స్త్రీలకు ప్రత్యేకంగా చెప్పదగిన సమస్యలులేవు? మానవకోటి సమస్యలన్నీ స్త్రీల సమస్యలేనని చెప్పారట. ఇక ఆంధ్రయువతీమణులలో చాలమందికి ఆంధ్రభాషను సరిగా పఠించుటే తెలియదు. ఆంధ్రదేశమందలి పాఠశాలలందు ఆంధ్రభాషకంతగా ప్రాముఖ్యమిచ్చుటలేదు.

ఇంగ్లీషు, హిందీ యందున్న అభిమానము, ఆసక్తి మన ఆంధ్రభాషయందు లేకున్నది. ఉన్నతవిద్య నభ్యసింపుచున్న బాలబాలికలుకూడా సరిగా ఆంధ్రభాషను పఠింపజాలకున్నారని చెప్పుటలో సందేహములేదు.

కాబట్టి సుశీలా, నైజాములో ఉర్దూ యెంత ప్రాముఖ్యంగావుందో అంతప్రాముఖ్యం మన ఆంధ్రానికి రావాలి. రష్యాలో స్త్రీ పురుషులు సమంగా పరిశ్రమ యెట్లాచేస్తున్నారని మనం పేపర్లల్లో చూస్తున్నామో అంత పారిశ్రామికసంస్థలు మనం స్థాపింపచెయ్యాలి. స్త్రీ పురుషులు కలిసి, ఏకదీక్షతో పనిచెయ్యాలి. పాఠశాలలందలి అధ్యాపికలు అధ్యాపకులును బాలబాలికలకు ముఖ్యంగా ఆంధ్రుల చరిత్రలనే బోధించాలి. అందుచేత మీ శకుంతలకు ముఖ్యంగా ఆంధ్రభాషాపరిచయము కల్గునట్లును ఆంధ్రోద్యమానికి ఆమె సహకారిణియగునట్లు తర్ఫీదుచేసి పిమ్మట ఏవిద్య నేర్పినను సరే. 'ముదితల్ నేర్వఁగరాని విద్యకలదే ముద్దార నేర్పించినన్' అని ఆర్యోక్తిగదా? పాఠశాలలందును గృహములందును బాలికలకును స్త్రీలకును ఆంధ్రాభ్యున్నతిని గూర్చియు ఆంధ్రభాషాభివృద్ధిని గూర్చియు నేటినుండి మనము ప్రచారముచేయుటే మన ముఖ్యకర్తవ్యము. యుక్తమును తెలుసికొని నడచుటే ముక్తికదా?

సుశీల:—సరే నీపేరు విజయలక్ష్మికదా? నీ యుద్యమమున కపజయముకలదా? నేడు యీ విమర్శతో అయిదుగంటలైంది. ఇంటికి వెళ్లుదునా? మళ్లా తీరికచేసుకు వస్తాను.

# స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యము లత్యవసరము

శ్రీమతి చెరుకూరు నాగభూషణమ్మగారు

ప్రపంచములో పుట్టి పెరుగు ప్రతిజీవికిని ఆహారము పరమావశ్యకమని ప్రతిమానవునికి దెలిసినవిషయమే. ఆహార మొక్కటితోనే తృప్తిపడక సర్వసౌఖ్యములను గూడ కాక్షించుట సహజగుణము. అందు మానవు లన్ని జీవులకంటె నుత్కృష్టజీవులగుటచేత, తక్కిన వాటికంటె జ్ఞానముతోగూడి, కాలానుసారముగ నాయా మార్పులతో ననేకవిధముల యభివృద్ధి మార్గావలంబులగుటకు యీ ప్రపంచమునందలి విశేష ప్రజ్ఞాకార్యములే నిదర్శనములు. జ్ఞానములేని పశు పక్ష్యాదులవలెగాక మానవులు దినదినాభివృద్ధినొంది, మానసిక తత్త్వ విషయాది సర్వవిషయములందును, కళాదికర్మలయందును నిపుణులగుట కవకాశము లనేకములున్నవి. ప్రతి కార్యమునందును, విద్యయను గద చేపట్టినంగాని విజయము పొందజాలరు. అట్టి సర్వోపయోగకరమైన విద్య తమ సహగమనలైన స్త్రీలకుగూడ ముఖ్యావసరమేనని, విజ్ఞులైన-స్వార్థరహితులైన పురుషులకెల్లరకు దెలిసిన విషయమే.

ప్రపంచమునకు పురుషులెంతవఱ కుపకరించుచున్నారో స్త్రీలును వారికంటె తక్కువగాకుండగనే తమతమ శరీరములమార్పు ననుసరించి యుపకరించుచునేయున్నారు. పురుషులకు తమ సుఖలాభాభివృద్ధు లన్నిటికిని స్త్రీలవసరమే. శాస్త్రకారులుగూడ "కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ, భోజ్యేషుమాతా, శయనేషు రంభా ధర్మానుకూలాక్షమయాధరిత్రీ" అని ప్రతి దానిలో పురుషుని కిన్నివిధముల తోడ్పడుమనియే జెప్పి యున్నారు. మహనీయులైనవారు మొదలు మూఢులవఱకు స్త్రీల తోడ్పాటున కాశించుచు పై సూత్రమునే వచించుచుందురు. ఇంకను భార్యాభర్తలకు గల సంబంధమతి గాఢమైనదనియు, నితాంతప్రేమ పాశబద్ధులై యేకవ్యక్తివలె యావజ్జీవితము గడుపవలెననియు, అట్టి వారలే పతివ్రతలనియు వ్రాయుచుందురేగాని పై శ్లోకమునజెప్పి నన్నివిధముల స్త్రీ లుపయోగకరవస్తువులనిగాని, వారి సాంగత్యమత్యావశ్యకమనిగాని, వారు సర్వవిధానంద స్థాయినులనిగాని తలంచక స్త్రీల నొక యవసరమైన పనిముట్టువలె చూచుచున్నారు. మూఢులేగాక కొందఱు విద్యాధికులుగూడ వారు జెప్పినట్లు కేవలము దాస్యమునే గాకుండా "కరణేషు మంత్రీ"అని చెప్పిన నొక్కవాక్యమును జూడుడు! కార్యములలో రాజునకు మంత్రివలె భర్తకు భార్యను తోడ్పడుమనిన, విద్యారహితలు-వివేకశూన్యలు-జ్ఞానహీనలునైన స్త్రీలెట్లు మంత్రివలె సహాయపడగలరు? రాజునకు మంత్రి తోడ్పడవలెననిన వానికెంత సామర్థ్యముండవలె! సామర్థ్యత, నిపుణత, ధైర్య సాహసములుండవలెనంటే,ముందు విద్య ప్రధానాంశము;తదుపరి దాని సహాయమున నెంతెంత కార్యములనైనను సాధింపవచ్చును. రాజుక్రింద మంత్రి కెట్టిబాధ్యతాయుత యర్హతలున్నవో, భర్తక్రింద భార్యకుగూడా నట్టి యర్హతపదవులున్నవి. అట్టిచో స్త్రీలు మూఢురాండ్రైనచో నెట్లుండునో, యెన్నిచిక్కులతోనుండునో మీరే యూహించుకొనుడు. పాపము! పురుషులు ధర్మములని యేవేవో సాకులుజెప్పి వాని ననేకవిధముల బోధించి, స్త్రీలచే దాస్యము జేయించుకొనుటకై ప్రయత్నించి, పై వాక్యముల నుచ్చరింతురుగాని శ్లోకమందలి వారి యర్హతలను కొంచెమైనను గుర్తించుచున్నారా?

స్త్రీలకు విద్యావసర మెంతవఱకో, వారికి విద్యయున్న సంసారమెట్లు వికాసవంతముగ నుండునో చాలమంది పురుషులు బొత్తిగా గుర్తించుటలేదు. విద్యయున్నగాని తెలివిగలుగదు. దానిచే యుక్తాయుక్త జ్ఞానముగల్గి చేయదగినపనుల నాచరించి, చేయతగనివి, పూర్వమునుండి యాచరింపబడునవైనను,మానగలుగుదురు. ఇంటిలోనివారితో జగడమాడక మిక్కిలి ఐకమత్యముతో గూడియుండ గలుగుదురు. పిల్లలుగూడా తల్లులను జూచి యనుకరించుచుందురు. ఇట్లనేక గృహములలో స్త్రీలబాధ్యతలే యెక్కువ గాబట్టి స్త్రీలకు విద్య ముఖ్యావసరమేనని సర్వజనులకు తెలిసిన విషయమైనను కొందఱు పురుషులు అజ్ఞానముచే స్త్రీలకు విద్య జెప్పించిన విటులకు త్తరములు వ్రాయుదురనియు, శృంగార గ్రంథములన్నియు చదివెదరనియు, దానివల్ల మనసులుమాఱి దుష్ప్రవర్తకులగుదురనియు, సభల కెక్కుదురనియు నిట్టి యాలోచనా రహితములైన పల్కులనేకములు బల్కుచుందురు. చదివినవారు చెడిపోరని, అనేక శృంగారప్రబంధ కావ్యాదుల నెక్కువగా చదివిన పండితులున్నతదశలో నుండుటయు, ఏమీచదువురాని సామాన్యజనులు వ్యభిచారాది దుష్టకార్యములెక్కుడుగా చేయుచుండుటే నిదర్శనము. ఎక్కడో నొక్కర్తుక విటునికుత్తరము వ్రాసినదని సర్వజనులకు సర్వోపయోగకరమైన విద్య స్త్రీలకు పనికిరాదనుట, నూతిలోబడి యేయజ్ఞానులోచచ్చిన బావులన్నిటిని పూడ్చుమను నట్లుండును. స్త్రీలెంత విజ్ఞానవికాసములతో గూడియున్న అంత సులభముగా అంత నిపుణతో, అంతధైర్యసాహసములతో తమ భర్తలకు కష్టములేకుండ తమతమ కుటుంబములనే గాకుండ దేశాభివృద్ధికరములైన పనులనుగూడ నత్యంతదీక్షతతో జేయగల్గుదురు. ఇట్లే స్త్రీవిద్య అనేకవిధముల లాభదాయకమని గుర్తించక కొందఱును, కొందఱశ్రద్ధవల్లను, మఱికొంతమంది మూఢులు స్త్రీలకు విద్య చెఱుపును గలిగించునని యును, జీవితపర్యంతము ఎల్లప్పుడు వారి సహాయముతోనే కాలముగడపు స్త్రీల నిట్లు విద్యలేకుండ, నిలువెడలనీక పాషాణప్రతిమలవలె తయారుజేయుచున్నారు. స్త్రీలు విద్యారహితలైనచో కుటుంబములలో అత్యాచారములు, అతివ్యయములు, అజ్ఞానముతోగూడిన అనేక కష్టనష్టములు సంభవించుచుండును. నిజముగా పురుషులు తమ కుటుంబ సౌఖ్యములను తామే కూలద్రోసికొనుచున్నారు. కావున తామేదైన నొక వినోదమును గాని, ఒక చిత్రప్రదర్శనమునుగాని జూచివచ్చినప్పుడు తమ యుల్లాసమును వెల్లడించుటకు 'యెప్పుడు భోజనము చేసి స్నేహితులదగ్గఱకు పరుగెత్తుదమా' యని చూచుచుందురు. ఏదైనా కష్టమాపాదించినప్పుడునూ అంతే. అట్టి సమయములందు తమ యిండ్లయందు తమ సహధర్మచారిణులైన నిల్లాండ్రతో జెప్పుకొనకుండ యెక్కడికో, యెప్పుడు వెళ్ళుదమాయని యనుకొనుటెందులకు సంభవించుచున్నది? అన్యదేశీయులు విద్యాప్రావీణ్యతంబొంది, యత్యంతాభివృద్ధితో ననేక సౌఖ్యములతో తులతూగుచుండ, తమ స్త్రీలకు విద్య కూడదనియు, స్వాతంత్ర్యమిచ్చిన నెత్తికెక్కుదరనియు, యిలువెడలనిచ్చిన చెడిపోవుదురనియు, ఇట్లే ప్రతివిషయములోనూ వారి నరికట్టి మూఢురాండ్రనుగా తయారుజేసి మనదేశములో పురుషు లనేకమంది స్త్రీలను పశుప్రాయులగాను సేవకురాండ్రగాను జూచుచున్నారు. చదువుకొన్న అన్యదేశ స్త్రీలు చెడిపోయిరా?

ఎప్పుడో పూర్వకాలముననాటి మాటయేల? మొన్న మొన్నటివారు ఝాన్సీ లక్ష్మీబాయి, రుద్రమదేవి మున్నగువారు స్వయముగా రాజ్యపాలనము జేసియుండలేదా? మొన్నటి మాటయేల? నేడు విజయలక్ష్మీ పండిట్ మంత్రిగా పనిజేయుటలేదా? సరోజినీదేవి పలుచోట్ల తిరుగుచు పలుకార్యములలో అందు ముఖ్యముగా రాజకీయవిషయములలో పాల్గొనుటలేదా? ఇంకా కస్తూరిబాయి గాంధీ, భారతి రంగా, కమలాదేవి ఛటోపాధ్యాయ మొదలగు నారీమణు లెంతమంది దేశసేవజేసి ప్రజలలో నెంతెంత ప్రబోధమును గలుగ

జేయుటలేదు? ఎవరికివారు తామే తెలివిగలవారమని గర్వించుటేగాని, యథార్థమును పరిశీలించువారు బహు తక్కువమందిగా గన్పట్టుచున్నారు. ఇంకను మిక్కిలి మూర్ఖులైన పురుషులలో నొకరు 'స్త్రీలకు విద్యేమిటి' అని యంటే, ఇంకొక మహానుభావుడు 'స్త్రీలు బయటికిరావచ్చునా?' అనును. అదేమి టిదేమిటని యింకొక మహావిజ్ఞాని 'ఆడుది మగవారికి కనుపింపవచ్చునా?' అని యనును. ఇట్లనేకవిధముల స్త్రీల విద్యావిషయ మేదైన వచ్చినపుడు 'ఆడుది చదివిన దేశము నాశనముగాదా?' అను విషయమే పైకి వచ్చును.

పురుషులలో కొందఱు విద్యాధికులుగూడ స్త్రీల విషయమున శ్రద్ధతీసికొనకపోగా, విద్యాజ్ఞానములేని మూఢులవలె స్త్రీలకు విద్య మిక్కిలి యవుసరముగానట్లు మాట్లాడుచుండుట వింతగనుండును. వీరు ప్రపంచ పరిస్థితులెట్లు మారుచున్నవో, యితరదేశము లెట్లభివృద్ధిజెందుచున్నవో, ఆయా దేశపు స్త్రీలేయే విజ్ఞానము లతో విరాజిల్లుచుండిరో చూచుటలేదా? రష్యాదేశపు యభివృద్ధినిజూచి యింగ్లండు, జర్మనీ, ఫ్రాంసు, ఇటలీ మున్నగు పాశ్చాత్యదేశీయులుగూడా ఆశ్చర్యచకితులై వారినిగురించే మాట్లాడుకొనుచు, వారి యభివృద్ధి కరమార్గములనే అనుసరించుచుండ, యీ భారతదేశపు పురుషులకు 'స్త్రీ విద్య' యనిన యెక్కడలేని నామర్దా వచ్చిపడుచున్నది. ఇట్టి మూర్ఖతకు అన్యదేశీయు లెంత హేళనజేయుదురో పాపము మనవారు కానరుగదా!

రష్యాలో 20 సంవత్సరములకు క్రిందట యెక్కడనో యేకొద్దిమందో తప్ప తక్కినవారందరు నిరక్షరా స్యులే. ఇప్పుడో నూటికి తొంబదిమంది చదువుకొన్నవారే. పురుషులలోగాకుండా స్త్రీలలోగూడ నీ సంఖ్యకు తక్కువలేకుండా చదువుకొన్నవారలేనని వేరే చెప్పనవసరములేదు. ఈ యిరువది సంవత్సరములనుండి రష్యా పొందిన విజయమునుజూచి యన్యదేశీయులందరు ముగ్ధులగుచున్నారు. ఎవరోగాదు స్త్రీలకు విద్యకూడదను మనవారు రష్యావనితల యభివృద్ధినిజూచి, యాశ్చర్యముతో ముగ్ధులగుచున్నారని నేననకుండగనే వారికే తెలుసును. రష్యాలోని స్త్రీలకు ఉపాధ్యాయపదవులు మొదలుకొని జడ్జీ పదవులవఱకు పురుషులతో సమాన హక్కులు గలవు. మనవారు చెప్పునట్లుగా రష్యా స్త్రీలు చదువుకొన్నందుకు వారిదేశము నాశనముగా లేదెందుకనో?

రష్యాయేగాకుండా టర్కీవిషయము జూడుడు; కీ॥ శే॥ ముస్తఫా కెమాల్ పాషా తమదేశములోనున్న నిరంకుశపాలనా నిర్మూలమును గావించి, ప్రజారాజ్యమును స్థాపించి, స్త్రీ పురుషులలో నున్న మూఢ మతా చారములనన్నిటిని పాఱద్రోలి, స్త్రీల కనేకవిధములైన స్వాతంత్ర్యములనిచ్చి, వారిలో నతిమూఢత్వముగాను, ఆరోగ్యమునకు మిక్కిలి యపాయకరముగాను నున్న బురఖాయను క్రూరజాడ్యమును నశింపజేసి, వారి దాస్య శృంఖలముల ద్రెంపివేసి, పురుషులతోబాటు స్త్రీలకు ఆస్తిపాస్తులతో సర్వవిధ హక్కులనిచ్చి, పాఠశాలల లోను, కళాశాలలలోను, విశ్వవిద్యాలయములలోను, యువకులతోబాటు యువతులను విద్య నభ్యసింపజేసెను. ఇప్పుడు వారు సర్వవిధ స్వాతంత్ర్యములంబడసి, నూతన రాజ్యాంగవిధానములో పురుషులతోబాటు యెన్ని కలలో ఓటుచేయుటకును, చట్టసభలకు సభ్యురాండ్రగుటకును హక్కుల సంపాదించి, స్త్రీ సభలు, స్త్రీ సంఘ ములు విరివిగా స్థాపించి, స్త్రీ కవయిత్రులు, స్త్రీ వక్తలు, స్త్రీ పత్రికాధిపతులు, స్త్రీ సంఘ సేవాధురీణలై మాతృదేశౌన్నత్యమునకై పాటుపడుచు, దేశాభిమాన దేశసేవలందు పురుషులతోబాటు పట్టుదలవహించి మిక్కిలి యభివృద్ధిదశలో నున్నారు.

# స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యము లత్యవసరము

ఇట్లే ప్రతిదేశములోని స్త్రీ పురుషు లభివృద్ధిమార్గము లవలంబించుచుండ, యేవిధమైన యభివృద్ధి లేకుండా, మన దేశములో స్త్రీలకు విద్యలేకుండా అతి మూర్ఖురాండ్రనుగా తయారుజేసి, తాము ను వారికి జతగా చాలమంది పురుషులు యే విషయవిజ్ఞానములేక పశువులమాదిరిగా జీవనౌకను నడపుచున్నారు. ఇంత యజ్ఞానముతో నింత యవివేకముతో నుండబట్టియే, ప్రక్కదేశీయుల జూచియైనను నేర్చుకొనక, ఆర్థిక, సాంఘిక, రాజకీయములలో ననేక యిడుమలంగుడుచుచు, ననేక బాధలపాలగుచుండుట మనదేశమునకు సంభవించుచున్నది.

లేనిచో, మిస్ మేయోవంటి పాశ్చాత్య యువతిచే అతి నైచ్యముగ హేళనబొంది, స్వపరిపాలన కర్హమైన జాతికాదని యనిపించుకొనుట కవకాశము కలిగియుండెడిది కాదుగదా! అన్యదేశీయు లభివృద్ధి నొందుటకు వారిలో నత్యధికసంఖ్యాకులకు విద్యాజ్ఞానముండుటయే ప్రధానాంశమని అందరు నొప్పుకొనవలసిన విషయమేగదా? అట్టిచో, మన యీ దౌర్భాగ్యపు దేశములో నూటింటికి 8 మంది పురుషులున్ను, ఒకటిన్నర స్త్రీలున్ను చదువుకొన్నవారున్నారంటే, విద్యాశూన్యదేశమని నిస్సందేహముగ చెప్పవలసినదే గదా? విద్య నశించినచోట మూఢ దురాచారములతో గూడిన దారిద్ర్యముగాక వేరేమియుండును?

చూచుచునుండగనే అన్యదేశములు వాయువేగ శరవేగములతో సమస్తైశ్వర్యములతో తులదూగు చుండ, యీ భారతదేశము యేనాటికీ, యెన్ని శతాబ్దములు గడిచినా, ఇట్లే వెనుకబడియుండుటకు పురుషుల మూఢ దౌర్జన్యములే కారణములని చెప్పవలసివచ్చుచున్నది. ఈ భారతదేశపు పురుషులందరు నిట్టివారేనా యని నెవరైన ప్రశ్నింతురేమో! చదువుకొన్నవారిలో నేకొద్దిమందో తప్ప, పలువురట్టివారేనని చూచు వారికి స్పష్టముగ దృగ్గోచరమగుచునే యున్నది. కొద్దిమందిచే దేశమభివృద్ధిజెందవలెనన్న బహుకష్టతరమైన విషయమని వేరుగచెప్ప నవసరములేదుగదా. ఆకొద్దిమంది విద్యావంతులలోగూడ వీరేశలింగంపంతులుగారు జెప్పినట్లుగా, కొందరు కార్యశూరత్వములేనివారు, కొందరు లోకుల దూషణోక్తులను శరపరంపరలకు వెఱచువారు, మఱికొందరు తమకు మంచిదని తోచినవిషయమునుగూడ బయటబెట్టుటకు సాహసములేక, సనాతనులైనవారి మూఢపంథాలను నడచువారే యెక్కువగా గన్పట్టుచున్నారు.

ఇట్టి పరిస్థితులలో దేశాభివృద్ధి జొందుటెట్లో తోచకున్నది. దేశాభివృద్ధి మాటటుంచుడు. ముందు కుటుంబాభివృద్ధిగాని కుటుంబసౌఖ్యముగాని పొందగలమా? ఎన్నెన్ని కుటుంబములు ఐకమత్యములేక, అజ్ఞాన తిమిరములో కూలిపోవుట మనము చూచుటలేదు? ఎంతమంది స్త్రీ పురుషులు తమతమ జీవితసౌఖ్యమును బొందలేక, కష్టపరంపరలకు లోనై దరిగానక, చివరకు నిరాశంజెంది, జీవితములను దగ్ధముజేసికొనుటలేదు? ఇన్నిటికీ మూలకారణము అజ్ఞానమేగదా!

సోదరులారా! న్యాయమాలోచించి, యదార్థమును పరిశీలించి, దేశకాలమాన పరిస్థితులను విమర్శించి, స్త్రీలలో విజ్ఞానమును నెలకొల్పి, వారికి వివాహార్థికాది సమానహక్కులనిచ్చి, సర్వవిధ స్వాతంత్ర్యములతో వారి వ్యక్తిత్వమును నిలబెట్టి, మీరందరు సంఘ దేశోద్ధారకులై భారతాంబకు శాంతి నొడగూర్చెదరని విశ్వసించుచున్నాను.

# గృహలక్ష్మి

శ్రీయుత బాలకవి అయ్యగారి విశ్వేశ్వరరావుగారు

జానకీ యిప్పుడత్తింటి వినతులంద
ముద్దుభర్తకు మది నెంతో ముదమునింప
తోడివారలకాదర్శ తోయజాక్షి
వగుచుమనకీర్తి పెంపుమా యనుగుతనయ !

చెరువునుండైన దగ్గర చెలవనుండి
చిన్నిగిన్నెడు నీళ్లేని చేతులార
తెమ్మటంచని చెప్పలేదమ్మనీకు
మెటుల మెలగుదో? యత్తింటనేమి సేతో!

క్రొత్తకోడలవౌటచే కోర్కెగదుర
పనులజేయగనీరమ్మ! వానినమ్మి
మొదలపనిజేయకున్నచో, మొండియనుచు
వాడవాడలవింతల వాగుచుంద్రు.

అత్తగారినిమామను, ఆడుబిడ్డ
లందరిన్గాంచి యణకువచిందులాడ
మాటమర్యాదపోనీక సూటిగాను
సాటిగృహలక్ష్మి వంచనసాగిరమ్మ!

కష్టములకోర్చి మీనాన్నకన్నతల్లి
నీకునాంగ్లము చెప్పింప నీవుగూడ
శ్రద్ధతోడుత నేర్చితో ముద్దుగుమ్మ
చదువునేర్చిన గృహలక్ష్మి సదయయౌచు
భర్తృసమ్మదహారియై బరగవలయు.

పట్టభద్రుడు నీభర్త మంచివాడు
కాని సంపాదనల్సేయు ఘనుడుగాడు
నాకు అదితెమ్ము యిదితెమ్మునావిధమ్ము
సహజగృహలక్ష్మి కెంతేనిసాగదమ్మ!

గాజులనుకొంట డబ్బనుకాంతకైన
కానినీయగలేనంచు కష్టపడుచు
శ.ముపోలికనుండగా సార్ధకమ్మ
అనుచు మృతినొందగాలేదె నవనిజడులు.

వినుచునున్నావు వార్తల వింతవిధము
ఆలుబిడ్డలపోషింప వలనులేక
ఆత్మహత్యకు గురియైన అధమమతులు
కాన, మంగళసూత్రమ్ము కాచికొమ్ము!

కాంతలెల్లరపాలిటి కల్పవల్లి
ఆంధ్రమహిళామతల్లుల కాశ్రయమ్ము
తెనుగువీధిని నడియాడు తేజమూర్తి
ముద్దు 'కేసరి' వారిదౌ పెద్దబిడ్డ
హావభావంపురచనల కాటపట్టు
బరగ 'గృహలక్ష్మి' మగువల భాగ్యలక్ష్మి!
వచ్చుచుండును నద్దానివాసి మెసగ
తోడి కామినీమణులకు తోచునటుల

చదువగదవమ్మ జానకీ సరసగతిని!
కలవు రాట్నమ్ము లవిమూడు కాంతుకడను
తీరుబడిగల్గి రాట్నమ్ము సరస కేగి
ఓపికనుబూని వడకంగ నొదవు శుభము
అదియ దారిద్ర్యపైశాచి నణంగద్రోయు
తీరుబడియున్నచో ముదమున వరలుకొఱు
వీణియనుబూని గానమ్ము వినగజేసి
భవ్యత్యాగయ్య కృతులను పాడుమమ్మ
గానచాతురి చాటుచు ఘనతనింప
నీవునేర్చిన యారోగ్య నీతులెన్నొ
నీదు గృహమందు స్థాపించి నిర్మలముగ
సతత సౌభాగ్యమహితవై సాగవమ్మ

నీదు సుతునకు విద్దెల నెన్నొగఱపి
ఆ జిజీభాయి శివాజి నాజికంపి
వీరమాతగ పేర్గన్న విధము మెఱయ
ఆంధ్ర వీరుని పంపుమా యనుగు తనయా!

# సినీమాలు - స్త్రీలు

శ్రీమతి అ. గోదావరమ్మగారు

మనదేశములో ప్రస్తుతకాలమునందు సినీమాచిత్రములు అన్నియెడలను, విచ్చలవిడిగ ప్రదర్శింపబడుట మనమెల్లర మెరిగినవిషయము. 15 లేక 20 సంవత్సరముల క్రింద అనగా యీ టాకీలు రాకపూర్వము సినీమాలు ఏ చెన్ననగరము మొదలగు రాజధాని పట్టణములలోనో ప్రదర్శింపబడుచుండెడివి. కాని యిప్పటియట్లు దేశ మంతటను వ్యాపించియుండలేదు. ఇప్పుడన్ననో అనగా గత 10 సంవత్సరములనుండి, ప్రతి జిల్లాపట్టణములోను ప్రతి తాలూకాపట్టణములోను సినీమా భవనములు నిర్మింపబడుచున్నవి. మన రాజధానియందైననేమి, తదితర రాజధానులందైననేమి, యీ టాకీ పరిశ్రమ కంపెనీలు లెక్కకు మిక్కుటముగా నున్నవి. యీ సినీమాచిత్ర ములను తయారుచేయు వస్తు సామగ్రికిని, యితరదేశములయందు తయారైన చిత్రముల తెప్పించుటకునుగాను, మనదేశమునుండి పాశ్చాత్యదేశములకు ధనము లక్షలకు లక్షలుగా ప్రతి సంవత్సరమునుపోవుచుండుట మనము కన్నులార చూచుచునేయున్నాము.

ఈ సినీమాలు, మనదేశమున కవసరమా లేదా, ప్రపంచ నాగరికతా దేశములన్నింటిలోను మిక్కిలి బీదదగు మనదేశ మిట్టి ధనవ్యయమును భరింపగలదా లేదా యను విషయము నొక్కరును నాలోచించునట్లు తెలియరాదు. యిప్పటి పరిస్థితులను పరికించిచూడగా నీ సినీమాలు, మనదేశమున స్థావరముగ నేయుండు నట్లు తోచకమానదు. దేశక్షేమాభివృద్ధికి హానికరమగు యిట్టి సినీమాల వ్యామోహము సులభముగా తగ్గునట్లు కానరాదు.

ఈ విషయమిట్లుండ, నీ సినీమాలలో స్త్రీలు పాల్గొనవచ్చునా, రాదా ? అట్లు పాల్గొనవచ్చునెడల మన దేశక్షేమమునకును, మనదేశమర్యాదలకును భంగములేకుండా, ఎంతవరకు పాల్గొనవచ్చునను విషయము ప్రతి హిందూదేశ నారీమణియు నాలోచింపవలయు విషయమనుట నిస్సందేహము.

ప్రస్తుతమున, మనదేమలో కోట్లకొలది స్త్రీలీ సినీమాచిత్రములను కనీసము వారమున కొక్కటి చొప్పునైనను చూచుచున్నారు.

వేలకువేలు స్త్రీలు యీ చిత్రప్రదర్శనములయందు పాల్గొనుచు పాత్రల ధరించుచున్నారు. పై రెండు విషయములగురించి మనమిపుడు ఆలోచింపవలసియున్నది. యీ సినీమాలను చూచుటయందలి లాభ నష్టము లను కొంత విచారింతము. లాభములనేకములున్నట్లు కానరావు. ఏమియు ప్రొద్దుపోనివారికివి కొంతవరకు మనోల్లాసమును కలిగించుటయే వీటివలని ప్రధానలాభముగ కనబడుచున్నవి. అంతియేగాక మంచి పురాణ గాథలను చూచుటవలన కొంతవరకు పామరజనులకు దైవభక్తి యందిష్టముకలిగించి నీతిబోధగావించుననుట నిజము. నష్టములు యోచించిచూచిన, లాభములకంటె అనేకరెట్లెక్కువగ నున్నట్లు కనబడుచున్నది. ప్రథమ మున నీ సినీమాలవలన సామాన్యకుటుంబములకు ధనవ్యయమధికము. రాత్రులయందు నిద్ర మేల్కొనుటవలన దేహమున కలసటయు చేకూరుచున్నది. చీకటిలో చిత్రప్రదర్శనములను చూచుటవలన నేత్రములకు హాని కరము. జన సమ్మర్దమగు ప్రదేశములందు పోవలసియుండుటవలన అంటువ్యాధులు వ్యాపించుటకు బలమగు కారణమగుచున్నది. అదియునుగాక అనేక గాథలయందు నీతి బాహ్యమగు విషయ ప్రదర్శనముల చూచుట వలన ప్రజల మనంబులు నీతి దూరములగుట కాధారములగుచున్నవి. యీ సినీమాభవనములు కొన్ని తావుల

యందు చోరులకు జారులకు తమదుర్వృత్తి నవలంబించుటకు నవకాశదాయకములై యున్నవి. అన్ని విషయములు యోచించిచూడ, నాసనంబునకు, హైందవస్త్రీలు, మంచివి, అనగా విజ్ఞానమును, సత్యమును, పాతివ్రత్య ధర్మమును ఆదర్శజీవనమును ప్రదర్శించునవియైన చిత్రములను విరివిగా గాక సంవత్సరమునకు రెండో పర్యాయములో మూడు పర్యాయములో తమ భర్తల యనుమతితో వారిననుసరించి చూచుటయందు తప్పే మియులేనట్లు తోచుచున్నది.

మనదేశ సాంప్రదాయానుసారము, పూర్వమునుండి నాటకములందెల్లెడలను స్త్రీ పాత్రములను పురుషులే ధరించుచున్నారు. ఇప్పుడట్లుగాక యీ సినీమాలయందు, స్త్రీ పాత్రములను స్త్రీలే ధరించుట మనమందరెరిగినవిషయమే. మంచిమంచి ప్రసిద్ధిగాంచిన కుటుంబములకు చెందిన స్త్రీలు సహితము ఈ సినీమాలయందు నటీమణులై వెలయుచున్నారు. ఇట్టి నటులుగ చేరినవారలనేకులకు పాతివ్రత్య ధర్మపరిపాలన మవసరముగా నుండునట్లులేదు. ఇటీవల కలకత్తానగరములో ప్రచురింపబడు 'ఓరియంట్' ఇలస్ట్రేటడ్ వీక్లీ (Orient illustrated weekly) అను సచిత్రవార పత్రికలో యీ సినీమాలకు చెందిన అధికారులనేకులు నూతన నటీ పరీక్షయను మిషచే ననేకులగు బాలికలను స్త్రీలను కష్టపెట్టి వారికి మానహాని యొనరించుచుండునట్లు ప్రచురింపబడినది. పాశ్చాత్య నటుల చరిత్రల చదివినవారందరికిని యిట్టిది అసమంజసమని తోచదు. ఇదియుంగాక అనేకులగు అనాథ స్త్రీలు యీ సినీమాలలోచేరి ధనముగణించి పొట్టపోసుకొనవచ్చునను ఆశచే వాటియందు చిక్కికొని తప్పించుకొను మార్గముకానరాక అల్లాడుచున్నారు. స్త్రీలు స్త్రీపాత్రలను ధరించనియెడల, సినీమాయంతగా, రాణించదను విషయము నిజమైనదేకాని, అట్లొనరించుటవలన దేశమర్యాదకును నీతికిని విశేషముగ నష్టమును లోటును కల్గుటచే, స్త్రీ పాత్రములను పురుషులే ధరించుట మంచిదని నాకు తోచుచున్నది. ఈ అభిప్రాయము సరియైనదైనచో ఆంధ్ర సోదర సోదరీమణుల ఆదరమునకు పాత్రమగుగాక!

—:o:—

# ప్రబోధము

సోదరీ! వేవేగలెమ్మా
చూడుమా కనువిచ్చి జగమును
ముసుగువెట్టుక ఒక్కపెట్టున
మొద్దు నిద్దురయా.

దిక్కులన్నియు తెలివిగాంచెను
దీప్తిమంతంబయ్యె జగతీ భువనము,
అప్పుడే బాలార్క కిరణము
లలముకొనె దిశలన్.

బాలికామణులెల్ల పుస్తక
పాణులై బడికేగుచుండిరి
విమల విజ్ఞానప్రదీప్తుల
విరియు మోములతో.

ఒక్కసోదరి వీణ చేగొని
ఉర్వి సర్వము కరగిపారగ
మధుర మోహనరాగపంక్తిని
మారుమ్రోగించెన్.

ఒక్కసోదరి కుంచె చేగొని
ఉర్వి సర్వము ప్రతిఫలించే
రంగు రంగుల చిత్రములను హా
రంగుగా వ్రాసెన్.

ఒక్కసోదరి కలము చేగొని
ఉర్వి సర్వము ముంచివైచెను
ప్రభావోజ్వల సుకవితా
గానవాహినులన్.

ఇంకొకతె రాజ్యాంగరథమున
ఇంపులొలుకగ వసించి సార
థ్యమ్మునెఱపె ననన్యసామా
న్య ప్రతిభతోడన్

మఱియొకతె డాల్ కత్తిపూనీ
మరణమన్నను సరకుసేయక
భండనోర్వి ప్రచండ భీకర
తాండవము సలిపెన్

వేరొకతె నేలగలవిద్యల
కాలదన్నన్ గాలిదేవీ
వ్యోమవీథి విమానయానము
లొంటిగా చేసెన్

సోదరీమణులెల్ల శక్తియుక్తిని
శక్తిమీఱ క్రియాకలాపము
నిర్వహింపగ నీవొకర్తెవు
నిద్రపోయెదవా!

దీర్ఘనిద్రను వీడివేగమె
తెలివిదాలిచి నీదుప్రతిభను
సాటిసోదరి వలెనె ధాత్రిని
చాటుమెల్లెడలన్.

—శ్రీ ఎన్. అలివేణి.

# పుష్పచయము

## కన్యగాని స్త్రీయొక్క వివాహము అశాస్త్రీయమనచెల్లదు

ఒక స్త్రీ తనభర్తపైన, తనపక్షమునను, తన మైనరుకుమార్తె పక్షమునను చేసిన మనోవృత్తిదావాలో రెండవ అప్పీలు హైకోర్టులో తేబడినపుడు న్యాయమూర్తులగు వార్సువర్తుగారు, భర్తయొక్క వాదమును త్రోసివైచి, గర్భముధరించిన స్త్రీయొక్క వివాహము శాస్త్రసమ్మతము కాదను వాదనను తిరస్కరించిరి.

మలబారులో యదునాథంశెట్టి సంఘమునకు చెందిన ఒక స్త్రీ తనభర్తపైన తెచ్చిన మనోవృత్తి దావాలో, ఆమె వివాహము శాస్త్రీయముగ జరిగినను, వివాహసమయమున కామె గర్భవతిగానుండి నందున ఆమె వివాహము శాస్త్రసమ్మతముకాదని, జిల్లా మునసబుకోర్టులో తీర్పు చెప్పబడెను.

అంత నామె జిల్లా జడ్జీగారికి అప్పీలుచేయగా, మునసబుకోర్టు తీర్పును రద్దుచేసి జిల్లా జడ్జీగారు, శూద్రులలో గర్భమునుధరించిన స్త్రీ వివాహమున కభ్యంతరము లెక్కడ చెప్పబడియుండలేదనియు కన్యగాని స్త్రీయొక్క వివాహము చెల్లదనుటకు వీలులేదనియు తీర్పు చెప్పిరి. అందుపైని తిరిగి హైకోర్టులో చేయబడిన అప్పీలులో, న్యాయమూర్తులు, హిందూ స్త్రీ, వివాహసమయమునకు కన్యగా లేనంత మాత్రమున ఆమె వివాహము శాస్త్రవిరుద్ధమని భావించుట భావ్యముకాదనియు, అట్లు అశాస్త్రీయమని నిరూపించుటకు తగినంత శాస్త్రప్రమాణము లేదనియు, పిల్లలకును, భార్యకును భరణమివ్వవలసిన బాధ్యతను తొలగించుకొనుటకై భార్యను పరిత్యజించిన భర్త ఆమెకు వివాహమునకు పూర్వము గర్భము కలిగియుండెనను నపవాదమును నారోపింప సాహసించుట తగదనియు వివాహమునకు పూర్వము తానే గర్భధారణమునకు కారకుడై, తదుపరి పరిణయమాడిన భార్యను పరిత్యజించుటకు గర్భధారణము సరియైన కారణముకాదనియు, అందుచే నీ స్త్రీయొక్క వివాహము గర్భధారణమను సాకుచే సరికాదని భర్త వాదించుట చెల్లదనియు తీర్పు చెప్పి అప్పీలును కొట్టివేసిరి.

## స్త్రీలు - గృహపరిశ్రమలు

ఈమధ్య బందరులో స్త్రీసమాజభవనములో శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరమ్మగారి యాజమాన్యమున నూలువడుకుపటలో బహుమతుల నొసంగుటకై సభజరిగినది. ఆ సభలో శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఉపన్యసించుచు మనదేశములో పరిశ్రమ లభివృద్ధియగుటకై గృహపరిశ్రమల పెంపొందించుటకు స్త్రీ లెక్కువగ పాటుపడ నవసరమనియు, దేశములో పరిశ్రమ లభివృద్ధిపొందినగాని బీదలకు అన్నవస్త్రములు లభింపవనియు దేశదారిద్ర్యము తొలగదనియు బహుచమత్కారమగు ఉపమానములతో చెప్పియుండిరి. ఆంధ్ర చరఖాసంఘ కార్యదర్శియగు వే. నారాయణమూర్తిగారు చరఖా సంఘ యాజమాన్యమున నీ స్త్రీసమాజములోని 54 మంది సభ్యులు రాట్నపరిశ్రమను నేర్చుకొను



వార్సా అగ్ని గుండము



యుద్ధమునకు ఉపకరించు 'ట్రెంచీ'లను త్రవ్వుటలో పోలిష్ స్త్రీలు అమితంగా సహాయపడ్డారు.



**మధ్యయుగపు రాతికోట — పోలెండు**

మధ్యయుగంలో పోలెండును పరిపాలిస్తూవున్న భూస్వాములు, జర్మనీ రష్యా దండయాత్రలను, యిటువంటి రాతికోటలలోవుండి ఎదుర్కుంటూ వుండేవారు.

చున్నారనియు అందులో హరిజనులు, మహమ్మదీయులుగూడ నున్నారనియు వారిలో నెలకు 33½ రూ॥ ల వరకు సంపాదించుకొనుచున్నవారు గలరనియు తెల్పియుండుటెంతయు సంతోషకరమగు శుభవార్త. స్త్రీల సహాయముచేతనే గృహపరిశ్రమలు వృద్ధిపొందగలవు.

## స్త్రీ విద్యాదర్శ విషయములు

భారత నారీమణుల యత్యవసరములగూర్చి యోచించునప్పుడు, వారు విద్యావిషయమున నెంతయో దవ్వు వెనుక నుండిరని విచారింపవలసి వచ్చుచున్నది. ఆంగ్ల విద్యాప్రభోధమువలన భారతపుత్రులు తమ జీవితములలో నున్నతస్థానముల నందుచున్నారు. కాని స్త్రీలుమాత్రము చేతులగట్టికొని కాలచక్రమునకు చాల వెనుకబడియున్నారు.

ప్రపంచములో నొకదేశమున స్త్రీ బానిసగను, వేరొకదేశమున నొక యాటవస్తువుగను, మరియొక దేశమున కేవలమలంకారమగను, బాగుగ ముందంజవేసియున్న దేశములలోమాత్రము నిజముగ విశ్వాసపాత్రమగు సహాయకారిగను పరిగణింపబడుచున్నది. స్త్రీలు తమ చాతుర్యముచేతను సహనశక్తిచేతను గృహమునకు సిరిసంపదలను గలిగించుటకును దేశమందలి వివిధవిషయములయందు తమ బుద్ధిని ప్రతిఫలింపజేయుటకును సంఘాభివృద్ధి కవసరమగు సంస్కారములను గావించుటకును భారతభావి బాల బాలికల నుచ్ఛస్థితికి దెచ్చుటకును, వారికి తగు విద్య యొసంగబడవలయును.

స్త్రీలందరకును విజ్ఞానకాంతి కలుగునంతవరకు మనదేశమందలి వివిధసంస్కారములు మూలపడియుండవలసినదే! భారతజాతీయ జీవితమునకు స్త్రీలు పునాదివలె నున్నప్పటికిని చాలవరకు వారు ప్రతి యుద్యమమునకు నడ్డంకివలె నున్నారు.

గృహమను విద్యాలయములో గృహలక్ష్ములగు స్త్రీలు, పాఠశాలలో బడయవలసిన ప్రాథమికవిద్యను తమ బిడ్డలకుతామే బాగుగ బోధింపగలరు. స్త్రీలే బిడ్డలకు దేశమతాచారముల నేర్పి, వారి గౌరవ జీవితమున కనువగు నాదర్శములను గరుపవలసిన బాధ్యతగలవారైయున్నారు.

స్త్రీలు పాశ్చాత్య నాగరికతావ్యామోహమున బడి భారతజాతీయ మర్యాదలను, ప్రవర్తనమును విడువరాదు. భారతస్త్రీ, బహు నమ్రతగలిగినదియు, సాత్వికస్వభావముగలదియు, పరోపకారపారీణురాలుగను నుండి, పతిభక్తి, దైవభక్తి, గలిగియుండవలెను.

నైతికమార్గములను, మతవిషయములను, ఆరోగ్యసూత్రములను, కళలను, శాస్త్రములను, గృహమునందే స్త్రీలెక్కువగ నభ్యసింపనగును. గృహము నత్యుత్తమస్థితియందుంచుటకు గృహిణి సంసారవిషయములను చక్కగ నెరిగియుండవలయును. ఇందులకు కొంత సారస్వతజ్ఞాన మవసరము.

ప్రస్తుతము స్త్రీల కొసగబడుచున్న విద్య స్త్రీల కవసరముగాని శ్రేయోదాయకముగాని కాదు. బాలురను బాలికలను కలిపి చదివించుట అగ్నిచెంత తుపాకిమందు నుంచినట్లే!

స్త్రీ తన సర్వశక్తుల నుపయోగించినగాని గృహము బాగుపడజాలదు. సంఘముకూడ హీనస్థితి గొందును. సంఘము బాగుపడవలెనన్న స్త్రీలకు గృహములను పాలించుట, బిడ్డల పెంచుట, వారి యారోగ్యమరయుట, సంఘసేవచేయుట, మొదలగు విషయములు నేర్పబడవలయును.

(దేవులపల్లి వెంకటరత్నమ్మ గారు)

## బాల్యవివాహములు

వధూవరులు యుక్తవయస్కులై, యొండొరుల ప్రేమించుకొని, పరిణయమైన వారిదాంపత్యము ఆదర్శప్రాయమైయుండును. అట్లుగాక, తలిదండ్రుల యిష్టానుసారముగ, ఎవరికో యొకరికి కట్టిపెట్టి, పెద్దవారైనవెనుక ఆమె నీ భార్య, అతడు నీ భర్త యని చెప్పినంతనే, వారికి అన్యోన్యానురాగ మెట్లుకలుగును? ఏనాడో తనకు కట్టిపెట్టిన భర్తయందు భార్యకుగాని, భార్యయందు భర్తకుగాని, ప్రేమ కుదురకపోవచ్చును. అనురాగములేని దాంపత్యమెట్లు శోభించును?

తల్లిదండ్రుల ఆజ్ఞకు బద్ధులై కొందరు, లోకమునకు భీతిల్లి కొందరు, అగ్నిసాక్షిగా వివాహమాడితిమి గాబోలునే యని దయాస్వభావముచే కొందరు భార్యల నేలుచున్నారు. దీనికిని వెరువని నిర్భీతులు వదలిపెట్టివేయుచున్నారు. స్త్రీకి అట్టి హక్కేమియు లేదు. తనకిష్టమున్నను, లేకపోయిననూ, గత్యంతరములేదు. అట్టివారి జీవితములు దుఃఖమయములు.

కర్మవశాత్తు వివాహమైన ఏ కొద్దిరోజులకో, భర్త మృతినొందిన, ఆ బిడ్డ విధవయనబడి, పసుపు కుంకుమ మొదలైన మంగళప్రదమైనవి ఉపయోగింపకుండ నిషేధింపబడి, నిర్బంధ బ్రహ్మచర్యదీక్ష ననుసరింపచేయబడును. రజస్వలానంతర వివాహములకే యొప్పుకొనని మూర్ఖజనులు పునర్వివాహములకొప్పుకొందురా? అట్టి వితంతువులు - పుట్టినిండ్లకు పెట్టని దాసీలు. యౌవనములోనున్న వితంతువులు, యింద్రియనిగ్రహములేక, వయస్సునకు వశులై, సంఘమునుండి త్యజింపబడుచున్నారు. పవిత్రులు మాత్రము లేకపోలేదు, వారి కష్టములు వర్ణనాతీతములు. వీనివలన, శిశుహత్యలు, భ్రూణహత్యలు, ఆత్మహత్యలు కలుగుచున్నవి. ఇట్టివారు, తినుటకు తిండి, నిలుచుటకు నీడలేక అల్లాడుచుందురు. దీనికి కారకులెవరు? బాల్యవివాహమొనర్చిన తల్లిదండ్రులు. యుక్తవయసునందు వివాహముచేసిన విధవలు కాకూడదా? యని ప్రశ్నించవచ్చును. కాని అట్టి యువిదలు కొంతకాలమైనను సుఖించియుందురు.

అంగసౌష్టవము లేకయే, భార్యాభర్తలు మాతాపితలగుట తటస్థించుచున్నది. వారికి కలిగిన బిడ్డలును దుర్బలులై, నిస్తేజులై, సరియైన మార్గమున పెట్టబడకపోవుటచే, భారతదేశములో బలవిజ్ఞానములు నశించుచున్నవి.

శారదాచట్టము అమలులోనికి వచ్చినప్పటికి, కొంతమంది ఆచారపరులు బాల్యవివాహములు మానక, ఏనాము, ఫ్రెంచిపేట మొదలగు గ్రామములలో చట్టము వర్తింపనిచోట వివాహములు చేయుచున్నారు.

తల్లిదండ్రులు తమ బిడ్డలక్షేమముకోరి, బాల్యవివాహముల రూపుమాపెదరుగాక! దేశాభ్యుదయ తారకములును, ప్రేమపూరితములును అగు యుక్తవివాహములు చేసెదరుగాక!

(శ్రీ చుండూరి రమాదేవి)

# గ్రంథ సమీక్ష

## మానసబోధామృతము

శ్రీసమర్థ రామదాసస్వాములవారిచే విరచితము. వెల :—ఉచితము—శ్రీ పేరిం ఆనంద శెట్టిగారు, నెం. 32, నరసయ్యవీధి, చాకలిపేట, మదరాసు. అని వ్రాసినచో నీ గ్రంథము దొరుకగలదు.

భక్తశ్రేష్ఠులగు పి. వి. మాధవరావుగారిచే పై గ్రంథమునకు ఆంధ్రభాషయందు విపులముగ తాత్పర్యము వ్రాయబడినది. ముముక్షువులెల్లరకు నత్యంతోపయుక్తమగు నీ సద్గ్రంథమునందు వివేక వైరాగ్యములు, భగవద్భక్తి,సగుణ, నిర్గుణ బ్రహ్మోపాసనావిధానము మొదలగువివిధవిషయములనుగురించి శ్లోకరత్నములున్నవి.

## సూర్యనారాయణమూర్తి కథలు

(ఆంధ్రకథావళి . ఆరవభాగము) గ్రంథకర్త :—అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు. ప్రకటన కర్తలు :—నమ్మాళ్వార్స్, పోష్టుబాక్సు 22, మద్రాసు, వెల ఆరు అణాలు.

ఈ గ్రంథములో మిక్కిలి రసవంతమగు కథలు ఆహ్లాదకరమగు అతి సులభశైలిలో వ్రాయబడినవి.

## ఉక్కుమనిషి

గ్రంథకర్త :—గోవాడ నిరీక్షణరావుగారు. ఇదియు నమ్మాళ్వార్సుచే ప్రకటింపబడిన గ్రంథమే. వెల 6 అణాలు, పై చిరునామాకే వ్రాయవలెను. రష్యన్ నియంత స్టాలిన్ జీవిత మిందు చక్కగా వ్రాయబడినది.

## నాటికాగుచ్ఛము

గ్రంథకర్త :—పి. వి. రాజమన్నారు. నమ్మాళ్వార్సుచే ప్రకటితము వెల 6 అణాలే.

ఈ గ్రంథములో విముక్తి—మాతృప్రేమ—నిష్ఫలం అనే నాటికలు మనోరంజకముగ రచింపబడినవి.

## పాలపుంత

గీతికా - ఖండికా - సంపుటి గ్రంథకర్త :—అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు, నవ్యసాహిత్య పరిషత్తు గుంటూరు. వెల అర్ధరూపాయి—పై చిరునామాకు వ్రాసిన బడయవచ్చును. రసజ్ఞులగు శ్రీ అడివి బాపిరాజుగారికి అంకితముచేయబడిన ఈ పుస్తకములో భావప్రకాశముతో ప్రజ్వరిల్లుచున్న పాటలు, పద్యములు పసందుగా రచింపబడినవి. తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారి పీఠికతో మరింత ప్రకాశమానమై వెలుగుచున్నది.

## శతకప్రబంధ హరిహరస్తోత్రము (ప్రథమభాగము)

శ్రీ చాగంటి రామారావుగారిచే సంపాదింపబడిన శతకములో మొదటి 54 పద్యముల సంపుటి. వెల 8 అణాలు—వలయువారు చాగంటి రామచంద్రరావు, గెద్దనాపల్లి, పెద్దాపురం తాలూకా, తూర్పు గోదావరిజిల్లా అని వ్రాయవలెను.

ఈ గ్రంథములో నాంధ్రకవులచే రచింపబడిన హరిహరస్తోత్ర పద్యరత్నములు పొందుపరుపబడినవి.

# పత్రికాపరిచయము

## ఆంధ్ర గ్రంథాలయము :—ఆంధ్రాంగ్ల త్రైమాసికపత్రిక

సంపాదకుడు :- పి. రాజశేఖరంగారు, బి.యే. బి.ఇడి. బ్రాడీపేట, గుంటూరు. ప్రచురణకర్త:-అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు, సారస్వతనికేతనం, వేటపాలెం, గుంటూరు.

సంవత్సరచందా 4 రూపాయిలు. సంఘసభ్యులకు 2 రూపాయిలు మాత్రమే. విడిపత్రిక 1 రూ. వలయువారు :- కార్యదర్శి, ఆంధ్ర గ్రంథాలయసంఘము, -పటమటలంక, వయా, బెజవాడ అని వ్రాయవలెను.

A good library is the best university in the world. అన్న తెరంగున ఒక ఆదర్శమైన పైత్ర పుస్తక భాండాగారమే విజ్ఞానమును విస్తరింపజేయగలుగుట కెంతయు తోడ్పడగల విశ్వవిద్యాలయమగుటచే ప్రపంచములో సర్వజనోపయోగమైన గ్రంథాలయములను చాలగ స్థాపింప నవసరమైయున్నది. గ్రంథాలయములను గురించిన వివిధవిషయములను, వాటి ప్రయోజనములను, అవి చేయవలసిన విద్యావ్యాప్తివిధానములను విశదీకరించు పత్రికయొక్క ప్రాముఖ్యమందరికిని విదితమైన విషయమే అయియున్నది.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపక్షమున వెలువడు నీ సచిత్ర త్రైమాసికపత్రిక పూర్వపు 'ఆంధ్రగ్రంథాలయ సర్వస్వ' మను పత్రికను పునరుద్ధరింప ప్రయత్నించుచు బయల్పడుట, ఆంధ్రుల సారస్వతాభివృద్ధికిని విజ్ఞానవ్యాప్తికిని తోడ్పడగల విషయమనుటకు సందియములేదు.

## చిత్రకళ :—నూతన సచిత్రమాసపత్రిక

సంపాదకులు :—శ్రీ కుమ్మమూరి నరసింహారావుగారు, బి. యే. సంవత్సరచందా—3 రూపాయలు, విడిసంచిక వెల రు. 0-4-0, మేనేజరు, కార్యాలయము, 108, మాబ్రేస్ రోడ్డు మైలాపూరు, మద్రాసు.

ఈ పత్రికయొక్క మొదటిసంపుటముయొక్క ప్రథమసంచిక ఆగష్టునెలది మాకు అందినది. ఇందులో సినీమాలకు సంబంధించిన వివిధవిషయములనుగూర్చి సుప్రసిద్ధ రచయితలచే వ్రాయబడిన వ్యాసములును చక్కని చిత్రములును సొంపునింపునటుల ప్రచురింపబడినవి. చిత్రములయొక్కయు, నటీనటుల కళానైపుణ్య విషయములయొక్కయు విమర్శనములు నిష్పక్షపాతబుద్ధితో నుచితరీతిని ప్రేక్షకలోకమునకు వెల్లడించి చిత్రకళయందు విశేషమగు విజ్ఞానమును దేశములో వ్యాపింపజేయ నుద్దేశించి ప్రారంభింపబడిన ఈ పత్రిక ప్రజల యాదరమునకు పాత్రమై ప్రఖ్యాతి బడయగలదని భావించుచున్నాము.

## జ్ఞానప్రియ

సంపాదకులు :—శ్రీ తత్త్వానందస్వాములవారు. సంవత్సర చందా :—రూ 2-0-0 లు. విడిపత్రిక వెల 0-3-0 లు. మేనేజరు, 'జ్ఞానప్రియ' ఆఫీసు, కొల్లూరు, గుంటూరుజిల్లా, అని వ్రాయవలెను.

ప్రాచీన భారత విజ్ఞానవిషయములను ప్రస్తుత కాలానుగుణ్యముగ బోధించుచు దేశాభ్యుదయమునకు వలయు వివిధవిషయజ్ఞానమును విస్తరింపజేయుటకై విద్యుద్దీపమువలె వెలువడిన ఈ పత్రిక బహు ప్రయోజనకారియనుటకు సందియములేదు. సంపాదకుల సద్యాదర్శములు సఫలీకృతములగునని విశ్వసించుచున్నాము. ఆంధ్రులెల్ల రీ పత్రిక నాదరింతురని ఆశించుచున్నాము.




**ఆంధ్రులు — లలితకళలు**

దేశములో కళలభివృద్ధి కావలెనన్న ప్రభుత్వసహాయమును, శాంతి వాతావరణమును అత్యంతవసరమగు విషయములు. ప్రజలు, జీవితమునకు-కావలసిన ప్రధానసౌకర్యములకే బాధపడవలసినంత బీదస్థితిలో నున్నపుడు, నాగరకతాభివృద్ధి కాధారభూతములగు కళలందు విశేషముగ పరిశ్రమసలుపుట కవకాశము లొనగూడవు.

సంఘము సర్వతోముఖాభివృద్ధి గాంచుటకు పరిశ్రమలు ముఖ్యముగా పోషింపబడవలెను. పరిశ్రమలు జీవితసౌకర్యములను గల్పించగల్గినవి. కళలు జీవితానందమును ప్రసాదించగల్గినవి. దేశములో, ప్రకృతిసంపద ఎంతయున్నను, పరిశ్రమలభివృద్ధి పొందనిదే దానివలన సరియైన ప్రయోజనముకలుగదు.

అట్లనే దేశములో ధనమొతయున్నను, అది కళలనభివృద్ధిచేయుట కుపయోగింపబడనిచో నాగరకత ఉన్నతస్థితిని గాంచలేదు. విద్యలభివృద్ధి గావలెనన్న ఆర్థికపరిస్థితులు అనుకూలముగ నుండవలెను. పరిపాలనావిధానము విద్యాపరిశ్రమకు తోడ్పడవలెను.

ఆంధ్రులొకానొకపుడు అన్నివిద్యలలోను కళలలోను, ఘనతగాంచి యుండుటకు, ఆంధ్రదేశమును పరిపాలించిన ప్రభువులయొక్క విద్యాప్రతిభయు, విద్యాపోషణమును కారణములు. ఆంధ్రుల శిల్పసంపద, ఆంధ్రదేశముయొక్క పురాతన చరిత్రలో నణగియున్నది. ఆంధ్రకవుల అసమాన విద్యాచాతుర్యము పురాణములలోను ప్రబంధములలోను ప్రజ్వరిల్లు చున్నది. ఆంధ్రుల సంగీతవైభవము అపరనారదావతారు డన బరగిన శ్రీ త్యాగరాజస్వామి యొక్క కృతులలో తేజరిల్లుచున్నది. ఆంధ్రుల చిత్రకళానైపుణ్యము మాత్రము ఆంధ్రమాత అంతరంగములో నదృశ్యజ్యోతియై దాగియున్నది. ఆంధ్రుల నాట్యకళానైపుణ్యము ఆంధ్రుల యభాగ్యవశమున, తగురాజపోషణలేమి, సహజతేజమును గోల్పోయి చలనచిత్రముల నాశ్రయించి నిర్జీవ ప్రతిమవలె నిలిచియున్నది.

ఆంధ్రరాష్ట్ర మమరినకాని ఆంధ్రులకళాసంపద శోభవహింపదు. ఆంధ్రులలో నధికమేధాసంపన్ను లున్నారు. కాని, వారిలో నైకమత్యత అంతరించినది. ఇతరరాష్ట్రములవారికున్నంత సహజసోదరభావము ఆంధ్రులలో కుదురలేదు. అందుచే అన్యులు, ఆంధ్రుల

భాగ్యసంపద ననుభవింప గలుగుచు, వారి బుద్ధిబలమును ఆకర్షించివైచి, వారిలో సంఘ కలహములను పెంచి, తాము బాగుపడుచున్నారు. ఇటీవల నాంధ్రులలోకొంత సంచలనము బయలుదేరి స్వరాష్ట్ర సంపాదనజేసిన గాని తమ పురోభివృద్ధికి మార్గములేదను భావము బుద్ధికి పొడకట్టుటచే, తమ స్వగౌరవ మర్యాదలను తిరిగి సంపూర్తిగ స్థాపించుకొనవలెననెడి పట్టుదలగలిగినది. ఈపట్టుదల తుట్టతుదవరకు గట్టిగనిలబడి యుండుచో, కార్యసాఫల్యము గలుగుటకు సందియముండబోదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము, ఆంధ్రుల లలితకళావైభవమును పునరుద్ధరించుటకు ప్రథమ కర్తవ్యము. ఆంధ్రులందరిని ఒకేవిధమగు ఆదర్శములతో నైక్యపరుప ఆంధ్రమహాసభ స్థాపింపబడినది.

ఈ మహాసభలో ఆంధ్రదేశాభ్యుదయమున కవసరమగు సంస్థలన్నియు వివిధ శాఖలుగ నేర్పరచుటకు వలయు అవకాశములు గల్పింపబడుచున్నవి. ఈ సెప్టెంబరులో ఆంధ్రమహాసభవారి ఆధిపత్యమున గా॥ న్యాయమూర్తి, పి. వేంకట రమణారావుగారు ఆంధ్రమహాసభయొక్క లలితకళావిద్యాలయ ప్రారంభోత్సవమును అత్యంతవైభవముతో జరపియుండుట ఆంధ్రులందరికిని ఆనందకరమగు విషయము. ఈ విద్యాలయములో చిత్రకళ, నాట్యకళ, నృత్యము, అను మూడుశాఖ లేర్పరుపబడుటెంతయు శుభసూచకము.

ఆంధ్రమహాసభాధ్యక్షులగు గా. బులుసు సాంబమూర్తిగారు తమ ఉపన్యాసములో చెప్పినటుల, ఆంధ్రులు నానాటికి క్షీణించుచున్న లలితకళలను పునరుద్ధరింప బద్ధకంకణులై యున్నారనుటకు సందియములేదు. న్యాయమూర్తులు నుడివినటుల ఆంధ్రులు పూర్వము కళలందు గాంచియుండిన ఘనతకు గర్వింపవలసినదియు, వారిలో కళానైపుణ్యమును ప్రదర్శించుటకు కావలసిన ఉత్సాహమున్న సంగతియును నిక్కువము. తీవ్రసాధనలచే గాని పనులు సమకూరవనుట సత్యము. ఆంధ్రులు ఇతర రాష్ట్రములవారికంటె నెక్కువ కళానైపుణ్యమునుగాంచి దిగ్విజయము చేయగలుగుటకు ఆంధ్రరాష్ట్ర మత్యవసరము.

నాట్యకళలో తమిళులకంటె నధిక ప్రతిభను ఆంధ్రులు పొందియున్నారనుటకు సందియములేదు. నాట్యకళా ప్రపంచములో ఖండాంతరఖ్యాతిగాంచి, అశేష క్షేమశ్రీసంపదను వెలయించు ననమాన కళాకౌశలమును, ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, నాట్యరంగములందు ప్రదర్శించి, ఆంతరంగికాభివృద్ధితో గూడిన పాత్రౌచిత్యముతో నత్యద్భుతముగ ప్రధానపాత్రలను ధరించి, పండిత లోకముయొక్క ప్రస్తుతికిపాత్రమగు ప్రజ్ఞావిశేషముతో ఆంధ్రుల నాట్యకళావైభవమును ప్రత్యక్ష మొనరింపగల భాగ్యము, బళ్లారి పట్టణ ప్రముఖులును, సుప్రసిద్ధ న్యాయవాదులునైన శ్రీ. టి. రాఘవాచార్యులవారికి గలుగుట, ఆంధ్రుల అదృష్టమును, ఆంధ్రమాత ఘనతయు ననదగియున్నది.

# సంపాదకీయములు

సంగీతసాహిత్యనృత్యవిద్యావినోదవైభవముతో మూర్తీభవించిన ఆంధ్రవిజ్ఞాన ఘనపొప్పు 'హరికథాపితామహ' శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు ఆంధ్రమాత మకుటములో నొక దివ్యాలంకారమగు మణిభూషణమనుటకు సందియములేదు.

సంగీతకళలో, తమిళ సోదరులకుగూడ నచ్చెరువును గలిగించిన విద్యానైపుణ్యమును ఫిడేలువాయిద్యములో ప్రదర్శించిన బుద్ధికుశలుడు శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడు గారు, ఆంధ్రుల సంగీతసంపదకు ప్రత్యక్ష నిదర్శనమనుట అతిశయోక్తికానేరదు. ఆంధ్ర వాగ్గేయకారక, హరి నాగభూషణార్యుడు ఆంధ్రుల సంగీతశాస్త్రఘనతను దక్షిణ హిందూ దేశమంతటను చాటగల్గిన విద్యాసంపన్నుడై యుండుట ఆంధ్రుల ప్రతిభయని నుడువదగును.

ఆంధ్రుల దురదృష్టముచే, ఆంధ్రమాత యనుంగుబిడ్డడై, ఆంధ్ర చిత్రకళానైపుణ్యమును అన్ని దేశములందును విస్తరింపజేయగలిగిన అద్భుతచిత్రములను రచించిన, అసమాన చిత్రకళారాధకుడైన దివ్యజ్యోతి, దామెర్ల రామరావును అకాలమృత్యువపహరించె.

ఆంధ్రుల అభాగ్యముచే లలితకళ లభివృద్ధిగాంచుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయములో ప్రత్యేక కళాశాల స్థాపింపబడలేదు. ఆంధ్రమహాసభవారిచే ప్రతిష్ఠింపబడిన లలిత కళావిద్యాలయము దినదినాభివృద్ధిగాంచి, ఆంధ్రుల కళానైపుణ్యమును పెంపొందించుట కెంతయు ప్రయోజనకారియై యొప్పునని విశ్వసించుచున్నాము.

దీపావళి - ఖద్దరు

ఆశ్వీజ శుద్ధ దశమిరోజున విజయదశమిపండుగ మహోత్సవసందర్భమున శ్రీ మహాదుర్గచే గావింపబడిన మహిషాసుర మర్దనముయొక్కయు, శ్రీరామచంద్రునిచే నొనరింపబడిన రావణాసురవధయొక్కయు, వార్షికోత్సవములను జరపియుంటిమి. ఇక ఆశ్వీజ బహుళ చతుర్దశినాడు శ్రీ కృష్ణభగవానునిచే సంహరింపబడిన నరకాసురవధ యొక్క వార్షికోత్సవమును, ఆ మరునాడు దీపావళీ పండుగయును జరుపవలసియున్నది.

పూర్వము క్రూరుడగు నరకాసురుడు ఋషులను, స్త్రీలను సూర్యరశ్మి చొర రాని చెరసాలలందు బంధించెననియు శ్రీ కృష్ణుడా రాక్షసుని శ్రీ సత్యభామాదేవియొక్క సహాయముచే బరిమార్చినతోడనే వారందరును, వెలుతురుకై తహతహలాడుచుండు హృదయములతో, దీపములను తండోపతండములుగ వెలిగించి ఆనందించియుండిరనియు, పూర్వగాథలు నుడువుచున్నవి.

నరకాసురసంహార సమయమున శ్రీ సత్యభామాదేవి యుద్ధముచేసి, శ్రీ కృష్ణుని సంప్రీతుజేసి, సన్నుతులొందుటయు, నరకాసురుని వధించినపిదప శ్రీకృష్ణుడు చెరనుండి విడిపించిన పదియారువేల కన్యలను పరిణయమాడుటయు, ఇన్ని యింతుల యిండ్లలో నిన్నివేల

రూపములతో శ్రీ కృష్ణపరమాత్మ సరససల్లాపములు సలుపుటయు, బహుచాతుర్యముతో శ్రీమదాంధ్ర మహాభాగవతమునందు వర్ణింపబడినవి.

శ్రీహరి ప్రియభార్యయగు సత్యభామ, ధవునిచే నొసంగబడిన ధనువుపు చేదాల్చి భాణమును సంధించు నవసరమున, వీరశృంగార భయరౌద్ర విస్మయములుగలసి భామిని యయ్యెనోయను భావములు పురుషోత్తముని బుద్ధికి పొడము నట్లత్యద్భుతముగ విలువిద్యానైపుణ్యమును వెలయించుచు, బలపరాక్రమ ప్రాభవోపేతమగు దివ్యశక్తిస్వరూప సౌందర్యాతిశయముతో నొప్పారుచు, నిజనాథుని ఆనందభరితాత్మునిజేసిన సందర్భమును వర్ణించుచు శ్రీ బమ్మెర పోతన రచించిన పద్యరత్నములు, ఆంధ్రకవిత్వమునందలి సహజ మాధుర్యమహిమను వెల్లడించుచున్నవి.

రణరంగమున అస్త్రవిద్యాచాతుర్య విశేషముచే రమణుని మనసును రంజిలజేయ గల త్రిజగదభిరామ, శ్రీ సత్యభామ, తన ప్రణయరసప్రభావముచే పతిని వశపరచు కొనుటలో నాశ్చర్యమేమి? విలువిద్యయందలి నేర్పును ప్రకటించిన ముద్దరాలి బాణ వృష్టి, పగతునికి ప్రాణభీతియు, పతికి ప్రమోదమును గలిగించెను. అసురుని యసురుల గొన నిశ్చయించి, అసమానమగు వీరరసమును బ్రదర్శించినపు డతివమనోహరరూప సంద ర్శనముచే సంజనితమైన భావజుని పుష్పబాణవృష్టి శ్రీ హరి చిత్తమును చూఱగొనెను. వీరరసముచే విస్తరిల్లిన సుదతిశృంగారలావణ్యము, శౌరి కానందసందోహమై తనరారె ననుటకు సందియములేదు. సత్యభామవంటి విలాసవతు లిక్కాలమునగూడ నెందరో యున్నారు. కాని ఆమెవంటి వీరవనిత లీభారతభూమిలో నిపుడెందరున్నారు?

దీపావళీపండుగనుకూడ పూర్వులొక ప్రత్యేకపవిత్రదినముగ నేర్పాటుచేసియున్నారు. మతధర్మములను, ఆరోగ్యవిధానములను సమ్మిళితమొనరించి, ప్రజల ఆధ్యాత్మికాదర్శ ములను ఐహికసుఖములను పెంపొందింప నేర్పరుపబడిన పర్వములలో నిది యొకటి. పురాణకథల మాట యెట్లున్నను, పూర్వాచారములు, ప్రస్తుతకాల పరిస్థితుల కనుగుణ్య ముగునంతవరకును, పాటింపదగినవేయగును. ఈ దీపావళి, ఆత్మలో నిండియుండిన ఆనంద జ్యోతిని ప్రదర్శించుటకు మానవులుసేయు ఆంతరంగికపారిశుద్ధ్యముతోగూడిన బహిః ప్రదర్శనమని చెప్పనొప్పును. ఈనాడు బాణసంచాను కాల్చుట ప్రయోజనరహితమగు వేడుకగ పరిగణింప భావ్యముకాదు. ఈ మందుగుండు సామానులు, సంవత్సరమున కొక పర్యాయమైన విరివిగ కాల్చుచో దోమలు, విషక్రిములు మొదలగు ఆరోగ్యహానికరము లగు జీవులునశించి, మానవుల కారోగ్యమును ప్రసాదింపగలుగునని పలువురి యభిప్రాయ మైయున్నది. ఏది యెట్లున్నను ఈ యుద్ధసమయములో నీ వేడుకలకు, వింతదృశ్యముల కంత అవకాశములేదు. వీటికై విశేష ధనవ్యయమును చేయుటయు యుక్తముకాదు.

ఈ పర్వము ఆంధ్రులకును, అరవలకునుగూడ అత్యంతాహ్లాదకరమగు వేడుక దినమై యొప్పుచున్నది. గుజరాతీదేశస్థులీ దీపావళినాడు ధనరాసులను పూజచేయ నెంతయు నుత్సాహింతురు. ఈనాడు భారతీయులందరును నూతన వస్త్రధారణము నెంతయు నభిలషింతురు. కావున, బీదలకు కల్పతరువగు ఖద్దరును ప్రోత్సహింప విధియై యున్నది. అహింసావ్రతము ననుసరించి దేశముయొక్క స్వాతంత్ర్యమును, సౌఖ్యమును సంపాదింపవలెనని విశ్వసించు ప్రతి భారతసోదరుడును, సోదరీమణియు ఖద్దరు బట్టలనేకొని ధరింప దీక్షబూనవలెను. ఖద్దరు స్వరాజ్య సంపాదనమునకు దివ్యసాధనము 'రాట్నమే, నా జపమాల' అని మహాత్ముడు నుడివియున్నాడు ఇందలి యదార్థము నెల్లరు గ్రహింతురుగాక!

ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్ట ప్రదానోత్సవము

ఆంధ్రవిశ్వవిద్యాలయ కన్యకు పదమూడేండ్లు పూర్తియైనవి. 'గృహలక్ష్మి'కి కూడ పంద్రండేండ్లు నిండబోవుచున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయకన్య కనుంగుసోదరియగు 'గృహలక్ష్మి' అగ్రసోదరియెడగల అనురాగమును, గౌరవమును వెల్లడించుట యుక్తమై యున్నది. ఈ అక్టోబరు 7వ తేదీని జయపురాధీశ్వరులు శ్రీ.శ్రీ.శ్రీ. విక్రమదేవవర్మ బహద్దరు వారి అధ్యక్షతను పదమూడవ పట్ట ప్రదానోత్సవము జరగియుండుటయు, సర్ నీలరత్న సర్కార్, (కే.టి. ఎం.ఏ., ఎం.డి. డి. సి. ఎల్. డి) గారు పట్టప్రదానోత్సవ స్నాతకోప న్యాసమొసంగుటయు, నెంతయు నానందకరమగు శుభకార్యములై యొప్పుచున్నవి.

ఆంధ్రరాష్ట్రావశ్యకత, పరిశోధనాపరిశ్రమల ప్రాధాన్యత, విద్యావిషయిక సంస్కరణముల ప్రాముఖ్యత, వైద్యవిద్యయొక్క విశేష ప్రయోజనములు, ప్రజల ఆరోగ్యాభివృద్ధికై ఏర్పాటులు, గ్రామములలో వైద్య సహాయముయొక్క అవసరము, మాతృభాషకు విద్యావిధానములో నేర్పరుపబడవలసిన ప్రత్యేక ప్రధాన స్థానము, నిరుద్యోగసమస్యా పరిష్కారవిధానము, స్వదేశీవస్తువులను విశేషముగ తయారుచేయవలసిన పద్ధతులు విశ్వవిద్యాలయములలో బోధింపబడుట, మొదలగు దేశాభ్యుదయ సహాయకరమగు వివిధ విషయములనుగూర్చి సర్. నీలరతన్ సర్కారుగారు పట్టభద్రుల కొసంగిన హితోపదేశోపన్యాసములో విశదీకరించియుండిరి.

విశ్వవిద్యాలయ సహాధ్యక్షులగు శ్రీ విక్రమదేవవర్మ మహారాజావారొసంగిన ఉపన్యాసములో, ఉన్నతాదర్శములతో గూడిన ఉత్తమభావములేకాక, యువిదల యున్నత విద్యాభివృద్ధికి గావలసిన విద్యాలయములను గూర్చిన విషయములుగూడ వెల్లడింపబడి యుండుట బహు సంతోషదాయకమైయున్నది. కళలలోను, శాస్త్రములలోను, గృహ విద్యలలోను, విశ్వవిద్యాలయ ప్రథమపరీక్షతరగతులు మొదలుకొని పట్టభద్రపరీక్ష లనంతరముకూడ విద్యాకృషిచేయుట కేర్పరుపబడు పెద్దతరగతులవరకును, స్త్రీలు విద్య

నభ్యసించుటకై వలయు వసతులను గల్పించుచు, ప్రత్యేక విద్యాలయములను స్థాపింప వలసిన యవసరమునుగూర్చి శ్రీ మహారాజావారు ప్రభుత్వమువారికి పలుమరు గావించి యుండిన విజ్ఞప్తులనుగూర్చి తెలిపియుండిరి. స్త్రీలకు ప్రత్యేక విద్యాలయములను, విద్యార్థినులకును, అధ్యాపకులకును, వసతిగృహములనుకూడ నిర్మింప నుద్దేశించిన శ్రీ జయపురాధీశ్వరుల సత్సంకల్పము సఫలీకృతమగునని విశ్వసించుచున్నాము.

ఆంధ్ర విశ్వవిద్యాలయములో నీ సంవత్సరము పట్టభద్రురాండ్రైన ప్రమదలను అభినందించుచున్నాము. శ్రీమతి గుమ్మిడదల దుర్గాబాయమ్మగారు రాజకీయశాస్త్రములో ప్రథమతరగతియందు త్తీర్ణతగాంచి పొందినబహుమతులును, శ్రీమతి రాజ్యలక్ష్మిగారు తెలుగు ఆనర్సులో విశేషప్రతిభతో కృతార్థత గాంచినందుల కొసంగబడిన బహుమానములును, ఆంధ్ర మహిళామండలి కెంతయు నానందదాయకమగు విషయములైయున్నవి.

ఈసందర్భములో శ్రీమతి గుమ్మిడదల దుర్గాబాయమ్మగారి ఉన్నత హూణవిద్యా పరిశ్రమనుగూర్చి విశేషముగ ప్రశంసింపదగిన విషయములలో నొక కొన్నిటి నిటదెల్పు టెంతయు సమంజసమగును. ఈ ఆంధ్ర వనితారత్నము చేసియుండిన దేశసేవ అసమానమైనది. చిన్ననాటినుండియు సంఘము నుద్ధరింపవలెననెడి ఆశయములు, ఈమె అంతరంగమున నాటుకొనియుండినవి. ప్రాథమికవిద్యకూడ పూర్తిచేయకుండగనే వివాహబంధనములలో చిక్కుకొనియుండియు, ఈమె ఉన్నతభావములచే పురికొల్పబడి, సాంఘికసేవ చేయ గడంగు టెంతయు శ్లాఘాపాత్రమగు విషయము.

పదునాలుగేండ్లప్రాయము మొదలు ఇరువదేండ్లు నిండువరకును హిందీ పాఠశాలాభివృద్ధికై పాటుపడుచు, బాలికలకును, యువతులకును సహజమైన పుణ్యాముచే నబ్బినవిద్యను బోధించుచు, తన విద్యాభివృద్ధికి వలయు బుద్ధికుశలతను సిద్ధిజేసికొనుట ఆశ్చర్యకరమగు విషయమే యగును. దక్షిణహిందూదేశములో నీమె హిందీప్రచారములో సలిపిన నిరంతరకృషి మహాత్ముని హృదయమునుగూడ నాకర్షించియుండెను. ఇయ్యువతీలలామ శాసనోల్లంఘ నోద్యమములో చేసిన విశేషసేవకును, ఈమె ప్రదర్శించిన అద్భుత ధైర్య సాహసములకును కఠిన కారాగారశిక్షచే గౌరవింపబడెను. దేశసేవ, ఈమె వ్యక్తిలో నణిగి మణిగియున్న ఘనతను వెల్లడింపగలుగుటకు గొప్ప యవకాశములను గలుగజేసెను.

ఈమె యూహాశక్తియు, బుద్ధిపటుత్వమును, భావబాహుళ్యమును ఉన్నతాదర్శ ప్రేరితమగు ఉత్సాహసంపదయు నీమెను ఉన్నతవిద్యాపరిశ్రమ కెంతయు ప్రోత్సహించెను.

సుమారిరువదిమైదేండ్ల వయసునందు ఆంగ్లమునం దక్షరజ్ఞానముకూడ లేని స్థితియందీమె కాశీవిశ్వవిద్యాలయముయొక్క ప్రవేశపరీక్ష కారుమాసములలో పరిశ్రమచేసి

వృత్తిశాస్త్రమునందును, గృహశాస్త్రమునందును విశేషాధిక్యతను వెలయించు విద్యా కౌశలమును జూపి, పరీక్షయందు రెండవతరగతిలో కృతార్థతనొందెను.

తదుపరి కాశీ విశ్వవిద్యాలయములోనే రెండుసంవత్సరములు విద్యార్థివేతనమును బడయుచు ఇంటర్మీడియేటు పరీక్షను పూర్తిచేసి, 1936 వ సం॥రం జూలై నెలలో ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఆనర్సు తరగతులందు చేరి, 1939 వ సం॥ మార్చినెలలో రాజకీయ శాస్త్రములోను, చరిత్రలోను, ప్రథమతరగతిలో ఆనర్సు పరీక్షలో నుత్తీర్ణురాలయ్యెను.

ఇంతవరకు నే హిందూ యువతియు నీ రాజకీయశాస్త్రములో పట్టభద్రురాలై యుండినది లేనందున, ఆభాగ్య మీ మహిళామణికి లభించినందున, నీమె ప్రత్యేక విద్యా ప్రాభవము నెంతయు ప్రస్తుతింపవలసి యున్నది.

ప్రస్తుతమీామె మద్రాసు విశ్వవిద్యాలయములో, న్యాయశాస్త్ర కళాశాలలో బి. యల్. పరీక్షలో ప్రథమతరగతియందు విద్యార్థినియైయుండి, న్యాయవాది జీవితా దర్శములను స్త్రీలోకమునకు ప్రదర్శింప నుత్సాహించుచున్నది.

ఈమె ఘన విద్యాకౌశలమునకును, అనర్సు పరీక్షా ఫలితములలో పొందిన ఘనత కును, సర్. ఆర్. వేంకటరత్నంసతి పేరట స్థాపింపబడిన బంగారుపతకమును, వంగల వనలతా దేవిపేర నేర్పరుపబడిన బహుమతిని, తదితర బహుమానములును నొసంగబడెను.

ఆంధ్ర విదుషీమణులలో నధిక విద్యాప్రతిభతో నొప్పుచున్న నీ రమణీమణి ఆయు రారోగ్యములతో వర్ధిల్లి ఆంధ్రమాత కపారమగు సేవచేయునట్లును, అద్భుతమగు విద్యా బుద్ధులతో అతివలందరును అతిశయిల్లి ఆదర్శములతోగూడిన ఆనందజీవితములను అనుభ వింపగల భాగ్యమొందునట్లును సర్వేశ్వరు డనుగ్రహించుగాక !

ఆర్థికవిషయ నిర్ణయవిధానములో ఆడువారికిగల స్థానము

జాతీయ నిర్మాణ విధానమును నిర్ణయించుట కేర్పరుపబడిన కమిటీవారిచే, సబ్ కమిటీలను తయారుచేసి యివ్వవలసినదిగ నడుగబడిన ప్రశ్నలపట్టియొక్క చిత్తును తయారుచేసి, మద్రాసురాష్ట్రములో పనిచేయబూనిన స్త్రీ సంఘమున కధ్యక్షురాలైన శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్‌గారు, ప్రచురణార్థమై పంపియుండిరి.

ఈ ప్రశ్నలపట్టీలో సాంఘిక, ఆర్థిక, న్యాయశాఖలలో స్త్రీలకెట్టి స్థాన మొసంగ వలసినది ? వారికి ఆస్తిని పంచుకొనుటలోగల హక్కులు, వారసత్వపు హక్కులు, ఉద్యోగ ములలో నేయే స్థానముల నాక్రమింప నర్హతగలదు ? స్త్రీలకు పురుషులతోపాటు సమాన వేతములనిచ్చుట, వారెట్టి పరిస్థితులలో పనిచేయవలెను ? మొదలగు విషయములను

గూర్చిన వివరములు తెలుపబడినవి. స్త్రీ సంఘములును, ప్రభుత్వమును, స్త్రీలకుగల చిక్కులనెట్లు సవరింప నుచితమైనదియుగూడ నిందు నిరూపింపబడినది.

సంసారములో స్త్రీలకుగల బాధ్యత, సమిష్టి కుటుంబవ్యవహారములు, స్త్రీలకు కుటుంబములోగల స్థానము, అను వివిధవిషయములు 'సంసారజీవితము-పరస్పర సంబంధములు' అను శీర్షికలో వివరింపబడినవి.

మూడవభాగములో వివాహములు, బహుపత్నీత్వము, బహుభర్తృత్వము, వితంతువివాహములు, కట్నములు, కానుకలు, విడాకులహక్కులు, మొదలగు విషయములు విశదీకరింపబడినవి. భర్తలను కోల్పోయిన వనితలకెట్టి జీవితసంపాదనపద్ధతులు ప్రయోజనకరములుగనుండును? వివాహము లేయే విధానము లనుసరించిన న్యాయసమ్మతములగును? పిల్లలకేయే యేర్పాట్లను కల్పించి పునర్వివాహములు జరుగవలెనను విషయములుకూడ సూచింపబడినవి.

నాల్గవభాగములో స్త్రీల కేయే పరిశ్రమ లనుకూలముగనుండును? ఎట్టి పరిస్థితులు బాగుగ తగియుండును? వివిధపరిశ్రమలలో పాటుపడుచున్న స్త్రీల సమాచారములను దెలుపు వివరములపట్టీలను తయారుచేయుట, మున్నగునవి కలవు.

అయిదవభాగములో స్త్రీల స్వాతంత్ర్యమును, ఆరోగ్యమును, మానసికాభివృద్ధిని అవరోధించు ఆచారములు, వాడుకలును తెలుపబడినవి.

తరువాత శీర్షికలో, ఎట్టి విద్య స్త్రీలకుండవలెను? ఏయే పద్ధతులలో నది బోధింపవలసినదియు నిర్ణయింపబడినది.

ఇంటి పరిశ్రమలు, పారిశ్రామిక విద్యలు, సహవిద్య, ప్రత్యేక విద్యాలయములలో గల వసతులు, మొదలగు విషయములను నిర్ణయింప నవసరమైయున్నది. స్త్రీలకు పురపాలనా విధానములోగల అర్హత, జాతీయ విషయములలోగల బాధ్యత, కులభేదముల యొక్క వివక్షత వారికెట్లు వర్తించును? అను ముఖ్యవిషయములుగూడ సూచనగ నీపట్టీయందు చేర్చబడినవి.

పై ప్రశ్నావళికను తయారుచేసి, స్త్రీల యభ్యున్నతికెంతయు సహాయపడగల విషయములను చక్కగ విచారించి స్త్రీజనోద్ధరణమునకు విశేషముగ పాటుబడుచున్న శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్‌గారి సత్ప్రయత్నములు సార్థకములగునని ఆశించుచున్నాము.

EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# ప్రమాదినామ సంవత్సర — ఆశ్వీజమాసము

1939-వ సంII డిసెంబరు నెల

| | | |
|---|---|---|
| 1 | శు | పంచ రా8-38 పుష్య రా10-57 వఉ7-49 మొ9-20కు భో7-21 |
| 2 | శ | షష్ఠి రా6-29 ఆశ్రే రా11-29 వప10-59 మొ12-29కు భో7-17 |
| 3 | ఆ | సప్త సా4-12 మఖ రా7-51 వఉ8-40 మొ10-10కు వరా3-20 మొ4-56కు |
| 4 | సో | అష్ట మ1-51 పుబ్బ సా6-12 వరా12-55 మొ2-25కు తిథిద్వయం భో7-9 |
| 5 | మం | నవ ఉ9-31 ఉత్త సా4-34 వరా12-27 మొ1-57కు దశమీతిథి భో7-5 |
| 6 | బు | దశ ఉ9-18 హస్త మ3-4 వరా10-38 మొ12-8కు భో7-1 |
| 7 | గు | ఏకా ఉ7-14 ద్వాద తె5-24 చిత్త మ1-44 వరా7-45 మొ-925కు భో6-57 |
| 8 | శు | త్రయో రా3-58 స్వాతి ప12-41 వరా6-9 మొ7-41కు భో6-53 |
| 9 | శ | చతు రా2-53 విశా ప12-0 వసా3-57 మొ5-30కు భో6-49 |
| 10 | ఆ | ● అమా రా2-16 అనూ ప11-43 వసా5-21 మొ6-58కు భో 6-45 |
| 11 | సో | శుపా రా2-7 జ్యే మ11-52 వర్జ్యములేదు భో6-41 [భో1-38 |
| 12 | మం | విది రా2-29 మూ ప12-31 వప10-52 మొ12-30కు వరా 10-38 మొ12-19కు |
| 13 | బు | తది తె3-22 పూషా ప1-40 వరా10-15 మొ11-57కు భో6-35 |
| 14 | గు | చవి తె4-46 ఉషా మ3-17 వరా7-40 మొ9-22కు భో6-32 |
| 15 | శు | పంచ పూర్తి శ్రవ సా5-22 వరా9-46 మొ11-32కు భో6-29 |
| 16 | శ | పంచ ఉ6-33 ధని రా7-45 వరా3-37 మొ5-22కు ధనుస్సంక్రాంతి భో 6-26 |
| 17 | ఆ | షష్ఠి ఉ8-35 శత రా10-55 వతె5-8మొ భో8-34 |
| 18 | సో | సప్త ప10-46 పూభా రా12-57 శేవ 6-57కు అష్టమితిథి భో8-30 |
| 19 | మం | అష్ట ప12-52 ఉభా తె3-25 వప11-32 మొ1-18కు నవమితిథి భో8-26 |
| 20 | బు | నవ ప2-47 రేవ తె5-37 వసా4-31 మొ6-16కు శూన్యతిథి భో8-22 |
| 21 | గు | దశ సా4-11 అశ్విని పూర్తి వరా3-14 మొ4-57కు దశమితిథి భో8-18 |
| 22 | శు | ఏకా సా5-28 అశ్వి ఉ7-26 వరా5-36 మొ7-17కు భో8-14 |
| 23 | శ | ద్వాద సా6-5 భర ఉ8-46 వరా9-13 మొ10-52కు భో8-10 |
| 24 | ఆ | త్రయో రా6-12 కృ ఉ9-38 వరా1-53 మొ3-31కు భో8-6 |
| 25 | సో | చతు సా5-49 రోహి ఉ10-0 వసా3-34 మొ5-10కు భో8-2 |
| 26 | మం | ○ పూర్ణి సా4-57 మృగ ఉ9-53 వరా6-7 మొ7-41కు భో7-58 |
| 27 | బు | బపా సా3-38 ఆర్ద్రి ఉ9-20 వరా8-53 మొ10-25కు పాద్యమితిథి భో7-54 |
| 28 | గు | విది మ1-52 పున ఉ7-25 వసా4-1 మొ5-32కు తిథిద్వయం భో7-50 |
| 29 | శు | తది ప12-3 పుష్య ఉ7-12 ఆశ్రే తె5-44 వరా7-16 మొ8-46కు భో7-46 |
| 30 | శ | చవి ఉ9-55 మఖ రా4-10 వసా4-59 మొ6-29కు భో7-42 |
| 31 | ఆ | పంచ ఉ7-38 షష్ఠి తె5-17 పుబ్బ రా2-31 వప11-38 మొ1-8కు భో7-38 |

☞ ప, పగలు. రా, రాత్రి. ఉ, ఉదయము. మ, మధ్యాహ్నము. సా, సాయంకాలం. తె, తెల్లవారుజామున. వ, వర్జ్యము. మొ, మొదలు. కు, వరకు. భో, భోగ్యము.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రములు: చిత్రకారుడు—శ్రీ ఎ. సోమేశ్వరరావుగారు.
హంసదూత్యము

అనిన విని ముహూర్తమాత్రంబు చింతించి యా యింతి శకుంతవల్లభున కిట్లనియె.

తే. బాల్యమునఁ జేసియేను జాపలముఁ బూని, నిన్ను నాయాసపెట్టితి నిగ్రహమున ;
దప్పుఁ జేసితి, లోఁగొమ్ము దయదలిర్ప, బ్రహ్మవాహన కులముఖ్య, పక్షిరాజ.

... ... ... ...

నా మనోరథంబు కంఠపథంబున వర్తించుచున్నయది ; ప్రబల లజ్జాభియోగంబును దుర్లభజనానురాగంబును సమప్రాధాన్యంబు నధిష్ఠించియున్నయవి ; యందని మ్రాకుల పండ్లు గోయం దలంచెద ; రాజుఁ బాణిగ్రహణంబున వశీకరింపం గోరెద ; బాల్యచాపలంబున బేలనై యున్నదాన నని సాభిప్రాయంబుగాఁ బలికె నప్పుడు.

... ... ... ...

తే. అనల సంబంధ వాంచ నా కగునయేని, యనల సంబంధ వాంచ నా కగునుజూవె ;
చాలు సందేహ వక్ర భాషణములింకఁ, దరళ, చక్రాంగ, పాథఃపతంగ శక్ర.

... బుద్ధి ప్రభుత్వము – ప్రేమ వెత్తనము ...

సీ. ఆతనిఁ గూర్చి నా ప్రాణంబు రక్షింపు ; మింతయు నీచేతి ; దేమి చెప్ప ?
నాశ్రిత సంరక్షణాభ్యుదితరంబైన పరమ పుణ్యంబు చేపట్టుమిపుడు ;
మిథ్యావిశంక యేమిటికిఁ ? బాటింపుమీ యవలంబనంబు ; నేయకు విలంబ ;
మనురాగ జలధి వేలాంతర్వినిర్మగ్నఁ దెప్పవై నన్నుఁ జేర్పు తీరమునకు ;

తే. ధర్మపరులు వరాటికాదానమాత్ర లాభమునకైన మెత్తురుల్లములలోనఁ ;
బ్రాణనాథ ప్రదాన తత్పరుఁడవైన నిన్ను నేమని మెత్తునో నిర్మలాత్మ !

... ... ... ...

కావున నవసరం బెఱింగి యాత్యంతికాసిద్ధి విలంబిసిదుల యందు నీకు నెయ్యది శుభంబై తోఁచునదియ చూచుకొనునది యని యప్పైదలి మదనోన్మాదంబునం జేసి లజ్జాభరం బుజ్జగించి కులకన్యాజనంబులకు నుచితంబులుగాని యతి ప్రౌఢ వచనంబులు వలికిన...

(శృంగారనైషధము)

For contemplation he and valour formed,
For softness she and sweet attractive grace ;
He for God only, she for God in him.
— Milton- (Paradise Lost)

ప్రేమ అనునది ప్రాణికోటి కెల్లను సామాన్యమైన అనుభవము. బుద్ధి అనునది మానవుని ప్రత్యేక గుణవిశేషము. ప్రపంచములో సర్వప్రాణులును ప్రేమ అను పాశముచే బంధింపబడుటయు, బుద్ధి అను బలముచే పరిపాలింపబడుటయు [illegible] విశేషములను [illegible] పరికించిన ప్రతి మనుజునకును [illegible]. బుద్ధిబలముచేతనే ప్రకృతిసంపదను వశపరచుకొని తన సుఖములకు [illegible] శక్తిసామర్థ్యములను వృద్ధిచేసికొనగలిగినాడు. బుద్ధిబలముచేతనే ప్రపంచములో స్థిరమైన పేరు ప్రతిష్ఠలను, ప్రభుత్వధర్మములను స్థాపింపగలిగినాడు. బాహుబలముకంటెను బుద్ధిబలమెక్కువ శక్తికలిగినది కావుననే శాస్త్రజ్ఞాన మభివృద్ధిచేసికొని యంత్రములను కనిపెట్టి, యంత్రసహాయముచే, శారీరకబలముచే సాధింపనలవికాని పనులను మానవుడు చేయగలిగినాడు.




## బుద్ధిప్రభుత్వము – ప్రేమపెత్తనము

For contemplation he and valour formed,
For softness she and sweet attractive grace;
He for God only, she for God in him.

*- Milton-* (*Paradise Lost.*)

ప్రేమ అనునది ప్రాణికోటికెల్లను సామాన్యమైన అనుభవము. బుద్ధి అనునది మానవుని ప్రత్యేకగుణవిశేషము. ప్రపంచములో సర్వప్రాణులును ప్రేమ అను పాశముచే బంధింపబడుటయు, బుద్ధిఅను బలముచే పరిపాలింపబడుటయు సృష్టియొక్క వైచిత్ర్య విశేషములను బాగుగ పరికించిన ప్రతి మనుజునకును బోధపడును.

మానవుడు బుద్ధిబలముచేతనే ప్రకృతిసంపదను వశపరచుకొని తన సుఖములను శక్తిసామర్థ్యములను వృద్ధిచేసికొనగలిగినాడు. బుద్ధిబలముచేతనే ప్రపంచములో స్థిరమైన పేరు ప్రతిష్ఠలను, ప్రభుత్వాధర్మములను స్థాపింపగలిగినాడు. బాహుబలముకంటెను బుద్ధిబలమెక్కువ శక్తికలిగినది కావుననే శాస్త్రజ్ఞాన మభివృద్ధిచేసికొని యంత్రములను కనిపెట్టి, యంత్రసహాయముచే, శారీరకబలముచే సాధింప నలవికాని పనులను మానవుడు చేయగలిగినాడు.

కాని బుద్ధియెంత హెచ్చినను ప్రేమబంధము నుండియు, ఆశాపాశమునుండియు విముక్తుడగుట సాధ్యపడలేదు. బుద్ధికంటె పెద్దప్రభువగు 'ఆత్మ' నాశ్రయించి ఆత్మనుండి, వచ్చుశక్తిని గ్రహించినకాని ప్రేమబంధనములను అరిషడ్వర్గమును జయించుట కలవికాదు.

ఇంద్రియములును, మనసును మానవునిబుద్ధిని ఆత్మవైపు మరల్చుటకు అవకాశ మొసంగవు. శారీరకసుఖము లోకవైపు, మనోవాంఛ లోకవైపు, బుద్ధిని పలువిధముల పీడించి, చికాకు పరచుచుండును. అత్తరి, బుద్ధిని ప్రశాంతముగజేసి, శరీరమును, మనసును సరియైన పరిపాలనలోనుంచుటకు ప్రేమ చాల సహాయకారియగును.

ఈప్రేమ అను పాశము మానవుని సుఖదుఃఖములతోగూడిన సంసారములో, లోక ప్రపంచములో సంబంధించిన జీవితములో, నెట్లు బద్ధుని చేయుచున్నదో, అట్లనే ఈ బంధనములనుండి విముక్తునిజేసి విశ్రాంతి నొసంగుటకు కూడ, నుపయోగపడుచున్నది. ప్రేమ అను సాగరములో బుద్ధి అను నావతో మానవుడు యాత్ర సలుపుచున్నాడు. బుద్ధి అను నావ లేనినాడు ప్రేమవారిధిలో మునిగిపోవును. ప్రేమను పవిత్రపరచిననాడు, ప్రేమ మానవుని పైకెత్తగలదు.

బుద్ధి, ప్రేమ, అనునవి, స్త్రీ పురుషులకెల్లను సామాన్యగుణములేయైనను, బుద్ధి పురుషుని ప్రత్యేకగుణమును, ప్రేమ స్త్రీయొక్క ప్రత్యేకగుణమును, అని చెప్పవలసి యుండును. బుద్ధి పర్వతమువంటిది. ప్రేమ సముద్రమువంటిది. ప్రేమ అను క్షీరసాగరములో బుద్ధి అను మేరుపర్వతము తేలుచుండును. బుద్ధి సూర్యునివంటిది. అనగా జ్ఞానమను వెలుగుతో వెలయుచుండు శక్తిప్రకాశము. ప్రేమ చంద్రునివంటిది. ఆనందమును ఆహ్లాదకరమగు కాంతితో నిండియుండును.

పురుషుడు జ్ఞానలక్షణములతోను, స్త్రీ ఆనందలక్షణములతోను ఒప్పియుండిన ఆ స్త్రీ పురుషుల వివాహము ఆదర్శప్రాయమై, సంసారజీవితము సౌఖ్యప్రదమైయుండును. స్త్రీలకు సహజముగనున్న బుద్ధిని, జీవితానందకరమగు విద్యలచే వృద్ధిచేసికొనిన వారిప్రేమ పవిత్రవంతమై, శోభాయమానమై, సతీపతుల కిర్వురకును శాంతిసుఖములను ప్రసాదింపగలదు.

పురుషుడు సంసార నిర్వహణమునకు వలయు వస్తుసముదాయమును సమకూర్చుటకు తగు పరిశ్రమ సలుపుచు, తన విద్యాప్రభావముచే వృద్ధిపొందిన బుద్ధిని, ఆత్మబలమును, ఆత్మజ్ఞానమును సంపాదించుటకై వినియోగించుచో, భార్యయొక్క ప్రేమచే పవిత్రహృదయుడై భవబంధములనుండి కాలక్రమమున విముక్తినొందగలడు.

సంసారములో భర్తయొక్క ప్రభుత్వము, భార్యయొక్క పెత్తనము బాగుగ జరుగుచో సంసారయాత్ర చక్కగ జరుగును. ఎవరి గమ్యస్థానమును వారు సునాయాస

ముగ చేరగలుగుదురు. బుద్ధిబలముచే పురుషుడు సంసారమును పాలింపవలెనుగాని బాహుబలముచేతను, ధనబలముచేతను పాలింప ప్రయత్నింపరాదు. అట్లనే స్త్రీకూడ తన ప్రేమమహిమచే పురుషుని వశపరచుకొని, పెత్తనము జరుపవలెను కాని తదితరమార్గముల తన స్వాతంత్ర్యమును స్థాపింపజనదు. బుద్ధిబలములేని పురుషుడు భార్యచే పాలింపబడ నర్హుడేయగును. ప్రేమప్రభావమును పరిపూర్ణముగ ప్రదర్శింపగలిగిన పతివ్రతకు పతిపట్ల సర్వస్వాతంత్ర్యము లున్ననుటకు సందియములేదు.

సామాన్యముగ సంసారములో భార్య పెత్తనమే యెక్కువగనుండును. ఇది సహజము. ఏలనన, అయ్య ఆయాసపడి సంపాదించిన పదార్థములను అమ్మ పచనముచేసిపెట్టిన గదా పిల్లల కాహారమమరునది ? అమ్మ పెట్టనిదే బిడ్డలకు బువ్వలేదు. అమ్మ అలిగి అన్నమువండకపోయిన, అయ్యకు భోజనములేదు. అంతా అమ్మయే చేయవలసియున్నది. అందుచే అమ్మ పెత్తనము జరుపవలసినదే. అయ్య అధికారము సాగవలసినదే.

అమ్మకు స్వరాజ్యమున్నపుడు అయ్యకు సామ్రాజ్యాధికారము గలదు. ఇది బుద్ధిబలముగల పురుషునియెడ వర్తించు ధర్మము. పవిత్రప్రేమగల భార్యపెత్తనమును, బుద్ధిబలముగల భర్తయెవడును అడ్డగింపనేరడు. అట్లుచేయుచో తన క్షేమమునకు, తన పురోభివృద్ధికిని తానే హానిచేసికొనుచున్నవాడగును.

సంసార విషవృక్షమునకు అమృతతుల్యములగు ఫలములు రెండుగలవని చెప్పబడినది. మొదటిది, కావ్యామృతరసపానము; రెండవది సజ్జనసాంగత్యము. మొదటిది, పురుషుడభ్యసించు విద్యవలని ప్రయోజనము ; రెండవది, భార్యవలననేర్పడు సంసారసంబంధమైన సత్కార్యాచరణమువలన నెక్కువగ సంప్రాప్తమగు ఫలితము. సంసారమన కేవలము కుటుంబవ్యవహారములను చక్కబెట్టుకొనుటయేకాదు. కుటుంబాభివృద్ధి నాధారముగజేసికొని జరుపవలసిన సాంఘిక జీవితముకూడ సంసారములో చేరియున్నది. గృహస్థులుగనున్నవారికిగదా పదిమందితో పనియుండుట ? సన్యాసికి ప్రపంచముతో పనియేమి ? సన్యాసియన సర్వసంగపరిత్యాగి. అట్టివానికి భార్యతోను బాహ్యప్రపంచముతోను పనిలేదు.

భార్య, పురుషుడను శిరస్సులో నేత్రమువంటిది. భార్య అను నేత్రము లేనపుడు బాహ్యప్రపంచ మగుపడదు. సంయమీంద్రులకుమాత్రమే అంతరంగికదృష్టిచే ఆధ్యాత్మిక ప్రపంచము గోచరించును. భార్య యున్నంతవరకే, అనగా ధనేషణ, దారేషణ పుత్రేషణములు, పురుషుని ఆశ్రయించి, పురుషుడు వాటిచే నావరింపబడియుండువరకే బాహ్యప్రపంచదృష్టి యుండునది.

సంసారమను శరీరములో, పురుషుడు శిరస్సు - స్త్రీ హృదయము - అని చెప్ప నొప్పును. శిరస్సును, హృదయమును సమన్వయముచెంది వర్తించినగాని సంసారశరీరము సరిగా నిలిచియుండదు. ఇందు శిరస్సునకు ప్రధానస్థానమున్నదనుట సత్యము. కాని హృదయము లేనినాడు శిరస్సు శిలతో సమానము. కనుక హృదయముండియే తీరవలెను. హృదయము ప్రేమకు నిలయము. శిరస్సు బుద్ధికాశ్రయము. శిరస్సు పరిపాలించవలెను. హృదయము పరిపాలనను సాగింప సహాయపడవలెను. భార్య గృహనిర్వహణమునందు సమర్థతకలిగి ప్రేమప్రభావముచే, పతిని, పిల్లలను సేవింపవలెను. భర్త సంసారపోషణము చేయుచు, జ్ఞానాభివృద్ధి చేసికొనుచు, సంసారరాజ్యమును పరిపాలించుకొనవలెను.

ఇంటిని సరిగా పరిపాలించుకొనలేని బుద్ధిమంతులు దేశమును, సంఘమును ఉద్ధరించగలరా? గృహమును చక్కబెట్టుకొనలేని నారీమణులు సంఘమును చక్కజేయగలరా? గృహరాజ్యములో మంత్రిపదవులకు రాజీనామానిచ్చి, సంఘముయొక్క స్వాతంత్ర్యమును సంపాదింప పాటుపడుచున్నామనుట ఏటి ప్రయోజనము? ఇంట గెలిచిగదా రచ్చ గెలుచుట? Charity begins at home అని, తమ ఇంటిని సరిదిద్దుకొనినగదా సంఘసేవ చేయబూనుట. సంసారమన అర్థమేమి? సంఘములో నొక చిన్నిభాగము (Unit). సంసారమును ఆదర్శయుతముగ జరిపిననాడు ఆ ఆదర్శములు వెలుతురువలె సంఘమంతటను వ్యాపింపకుండునా?

మానవుని ప్రేమ అభివృద్ధిచెంది, పరిపూర్ణతగాంచుటకు సంసారము (Family) కేంద్రస్థానము (Centre) అయియున్నది. కాని సంసారచక్రమే ప్రేమకు కైవారము (చుట్టుకొలత, Circumference) గ నుండరాదు. భార్యాబిడ్డలందు ప్రసరింపజేయు ప్రేమపరిపక్వతనొంది సంఘమునకును, దేశమునకును, ప్రపంచమంతకును క్రమక్రమముగ వ్యాపించవలెను. బుద్ధిని పదిలపరచికొని ప్రేమను సిద్ధిచేసికొనుటకు సంసారము భగవంతునిచే ప్రసాదింపబడిన పరమసాధనము.

అట్లనే పురుషులుకూడ తమ బుద్ధిని భార్యయెడలను, పిల్లలయెడలను ప్రసరింపజేసి వారిని బాగుచేసినపిదప దేశము నుద్ధరింపబూనుట సమంజసమగును. దేశోద్ధరణకు సామాన్య శక్తిసామర్థ్యములు చాలవు. మహాత్యాగము కావలెను. కాని ఈత్యాగము భార్యాబిడ్డల నేడ్పించిచేయుచో నది ప్రయోజనకరమగునా? భార్యాబిడ్డలనుకూడ తన బుద్ధిబలముచే త్యాగసంసిద్ధులుగ తయారుచేయవలెను. కాని వారిని మహారోదనము పాల్జేసి సంఘసేవ, దేశసేవ చేయసమకట్టుట సంస్తుతిపాత్రమగు త్యాగబుద్ధికాదు. బుద్ధినికివలె బుద్ధి పరిపక్వమొందిననాడు భార్యాబిడ్డ లడ్డరు. ప్రపంచ మడ్డలేదు.

కాని సంసారములు విచ్ఛిన్నము చేసికొని సన్యసించువారికిని, భార్యాబిడ్డలను దారిద్ర్యదుఃఖములో దిగద్రొక్కి సాంఘికసేవయు, దేశసేవయు, చేయబూనువారికిని, చేసినపిదప స్థిరచిత్తముతో నుండలేక సర్వదా చింతలజిక్కుకొని తల్లడిల్లువారికిని బుద్ధి బలము పరిపక్వత నొందినదని భావించుట భావ్యమగునా?

భార్యయన ప్రేమవాహిని. ఆ ప్రవాహమును అపవిత్ర మొనర్పరాదు. ప్రేమయను తేజమును గోల్పోయిన బుద్ధికి వికాసముండనేరదు. ప్రేమకుతగిన స్వాతంత్ర్యత నొసంగ కుండిన, అది పొంగి పొరలి పురుషుని ముంచివైచును. ప్రేమకు పెత్తనము సంసారములో సర్వవిషయములలోను ఇచ్చియే తీరవలెను.

అట్లనే బుద్ధి బలముగల భర్తకు పూర్ణమైన ప్రభుత్వాధికారములు గలవు. ఆబుద్ధి బలమును ప్రతిఘటింప సాహసించు భార్య, అజ్ఞానభాస్కరుని ఆతపతైక్ష్ణ్యముచే మాడి పోవును. ఎండయు, వెలుతురును ; వెన్నెలయు, చల్లదనమును ఎట్లు ఐక్యముచెంది వర్తిం చునో అట్లనే భార్యాభర్తలు అన్యోన్యానురాగముతో నైక్యతచెంది అలరారుట, ఆదర్శ దాంపత్య ధర్మమనబడును.

భార్యాభర్తలు నీరక్షీర న్యాయముతో నొప్పారుచు సంసారయాత్రలో తరింప గోరుచో, పురుషుని ప్రభుత్వము, స్త్రీ మంత్రిత్వము (కరణేషుమంత్రీ అనునట్లు) బాగుగ జరుగవలెను. పురుషుడు బుద్ధిని పోనాడినడచిన పదభ్రష్టుడగును. అట్లనే స్త్రీ ప్రేమను పరిత్యజించిన పతితురాలగును. జ్ఞానముకొరకు పురుషుడును, ఆనందముకొరకు స్త్రీయును పాటుపడుట సహజధర్మములై యున్నవి. ఆంగ్లకవి సార్వభౌముడగు మిల్టన్ మహాశయుడు 'He (man) for God, only, she (woman) for God in him' అని చెప్పిన ప్రకృతి ధర్మసూత్రవాక్యములో నెంతయు సత్యమున్నది. కాని పురుషునిలో జ్ఞాన మభివృద్ధి యైనప్పుడే ఆతనిలోనున్న దివ్యత్వము తేజరిల్లగలదు. ఆదివ్యశక్తి బుద్ధిరూపమున ప్రకా శించును. బుద్ధిప్రాభవమునకు ప్రేమప్రకాశము తోడైన పరిపూర్ణ మానవత్వము ప్రత్యక్ష మగును. పరిపూర్ణమానవత్వమే భగవంతునియొక్క సగుణస్వరూప సౌందర్యము.

పురుషుడు రాజు, స్త్రీ రాణి, అనబరిగిన నట్లే బుద్ధి ప్రభువు, ప్రేమ పెత్తందారు, అని చెప్పనగును. ఆత్మ అసలు అధికారి. ఆత్మ సామ్రాజ్యములో బుద్ధిప్రభుత్వములో ప్రేమ మంత్రిత్వము అను న్యాయము, స్త్రీ పురుష లొండొరులకుగల సంసారవిషయము లందువలెనె, ప్రపంచపరిపాలనా విధానములోగూడ పాటింపదగిన ధర్మమైయున్నది.

# మహిళాభ్యున్నతి

శ్రీమతి వేములపల్లి తాయారమ్మగారు

ఏసంఘమైనను అభివృద్ధికిరావలెనన్న సాంఘికరాజకీయార్థిక వాతావరణమనుకూలముగా నుండవలయుననుట నిర్వివాదాంశము. అట్టిచో సాంఘికరాజకీయార్థిక ప్రాథమికసూత్రములైనను మహిళాసంఘములకు అనుకూలములుగ లేవన్నచో నిక వారి యభివృద్ధిని గూర్చి వేరుగా చెప్ప నవసరముండదనుకొందును.

కాని, యేపరిస్థితులెట్లున్నను నేటి మహిళాజనోద్యమము కొంతకుకొంత ప్రశంసనీయమేయని తలంపవచ్చును. కొందరు నారీమణులు స్వార్థత్యాగులై రాజకీయములలో పాల్గొని దేశస్వాతంత్ర్యమునకై పాటుపడుచున్నారు. మఱికొందరు మహిళాసమస్యలను గూర్చి మిక్కిలి విచారించుచున్నారు. స్వసంఘోద్ధరణమునకై పాటుబడుచున్నారు. మఱి కొందరు స్త్రీజనోచితమగు శాఖలయం దుద్యోగులుగా పనిచేయుచున్నారు.

మహిళాసమస్యలనుగూర్చి పత్రికారాజములుకూడ ఉదారబుద్ధితో చర్చించుచున్నవి. కేవలము మహిళాభ్యున్నతికై కంకణముగట్టిన 'గృహలక్ష్మి' చేయుచున్న సేవ అపారము, అసమానము. 'గృహలక్ష్మి' పత్రికా నిర్మాతలగు శ్రీ కేసరి మహాశయులును, ఆంధ్ర వారపత్రికలో మహిళాసమస్యలకు ఉచితస్థానమిచ్చిన తత్పత్రికాధిపతులును సర్వదా స్మరణీయులు.

మహిళాభ్యున్నతికి మగవారి యాటంకములుండుట నిజమేకాని సంఘసంస్కరణపరాయణులగు కొందరు విద్యావంతులు, స్త్రీజనముపట్ల కొంత ఉదారభావముతో ప్రవర్తించుచుండుట కాంచనగును. ఉత్తమగ్రంథములుగాని, ఉత్తమనాయకులుగాని మహిళాభివృద్ధికి ఆటంకములు కారనుట సత్యము. శ్రీ కేసరిమహాశయుడు, వీరేశలింగంపంతులుగారు, విశ్వదాత, మహాత్మగాంధి, జవహరుపండితుడు మొదలగువారిని ఇందుకు నిదర్శనముగా చెప్పవచ్చును. ఈ సందర్భమున నాస్నేహితురా లొకామె చెప్పినవిషయము స్ఫురణకు వచ్చుచున్నది. "నిజమైన పురుషత్వముగలవారు స్త్రీత్వమును కాపాడుటకై ప్రయత్నింపగలరు" ఇందలి సత్యమును పాఠకులు గమనింతురుగాక!

విద్యావంతుడగు ఏపురుషుడు స్త్రీలు నీచురాండ్రనియు, స్వాతంత్ర్యమున కనర్హలనియు జెప్పసాహసించును? ఎవ్వరేనికొందరు అవిద్యావంతులు వ్యతిరేకముగ తలంచినను వారి కాదరణముండదనుట నిర్వివాదాంశము. స్వామివివేకానందుడు భారతదేశ సౌభాగ్యము భారతపుత్రులమెడగాక భారతపుత్రికల మెడలనేకలదని చెప్పుట ఇందలి పరమార్థ

మును గ్రహించియేకదా! ఇంతకునేను చెప్పునదేమన ఉత్తమ గ్రంథములుగాని, ఉత్తమ పురుషపుంగవులుగాని స్త్రీజనముపట్ల నిరాదరణమును జూపక ఉదారాశయమునే వెల్ల డించుచున్నారనియే.

స్త్రీ జనముపట్ల స్త్రీ జనమే కృతఘ్నుతతో ప్రవర్తించుచున్నదని తెలియ వచ్చును. స్త్రీలు తమ సామర్థ్యమును గుర్తింపజాలక పోవుటయు, అవిద్యావంతురాండ్ర గుటచేతను తమ సామర్థ్యమును, స్వీయజనాభివృద్ధిని గమనింపలేకపోవుచున్నారు. అంతియే కాక స్వీయజనాభివృద్ధికి ఆటంకములను తమకు తాము కల్పించుకొనుచున్నారు. భారతనారీమణులకు గృహరాజ్యములో పరిపూర్ణ స్వాతంత్ర్యముగలదు. తన అర్ధాంగి మాట నతిక్రమించి, యేగృహస్థుడును తద్భిన్నముగా ప్రవర్తింపజాలడు. మన సోదరీ మణులు అలంకారములకొరకును వస్తువాహనములకొఱకును చేయు హంగామాలేకుండ వారికిగల స్వాతంత్ర్యమును స్వీయ జనాభివృద్ధికై యుపయోగించికొనినచో వారిని కాదన గలవారుందురా? కొందరైన కృతార్థురాండ్రు కాకపోదురా? తల్లి తనకుగల స్వాతంత్ర్య మును తన ఆర్థిక, లాభములకై యుపయోగించుటేకాని పుత్రికల వివాహములపట్ల ఉప యోగింపజాలకున్నది. ఆభరణాంబరములను సంపాదించుటలో తనకున్న చనవు పుత్రికల విద్యకొరకుపయోగింపజాలకపోవుచున్నది. స్త్రీలు పురుషులొసగు స్వాతంత్ర్యమును సరిగ నుపయోగించుకొనలేక సర్వవిధముల తమ నిస్సహాయతను ప్రకటించుకొనుచున్నారు.

మరియు జానపదవాసులగు సోదరీమణులస్థితి మిక్కిలి శోచనీయము. వారు మూఢా చారములకు పెట్టినదిపేరు. తమ శ్రేయస్సును తాము బొత్తిగ గుర్తింపలేని స్థితియం దున్నారు. యుక్తవయస్కయగు సోదరీమణి విద్య నభ్యసించుటయు, తన భర్తతో చనవుగానుండుటయు భర్తతోపాటు సభలకో సమావేశములకో వెళ్లుటయు పతితురా లైన స్త్రీ లక్షణములని వాపోవుచుందురు. భర్త అసమర్థుడుగా నుండుటచేతగాని పతిత మార్గమున చరించునపుడుగాని గృహకార్యముల నిర్వహించుకొనుచు, భర్తకు కర్తవ్య మును బోధించుట గడుసరి లక్షణమని తలంతురు. ఏ స్త్రీ చీకటికొనయగు అంతఃపురమును వీడి ముంగిటికైన రాదో ఆమెయె, ఉత్తమ పతివ్రతయని వారితలంపు.

నిజమైన స్త్రీత్వమును వారు కనుగొనజాలకున్నారు. ఇట్టివేనా ఉత్తమ స్త్రీ లక్షణములు? చీకటిలో కూర్చున్న మాత్రమున దుశ్చింతలడంగునా? భర్తమాటకు జవదాటకుండుటయు, పాతివ్రత్యమును కాపాడుకొనుటయు వినయము నతిక్రమింపకుండు టయు ఉత్తమలక్షణములు కావని ఎవరును చెప్పసాహసింపరు. కాని ఉత్తమ స్త్రీత్వమును పోషించుకొనుటకు ఇంకెన్నివిధులు కలవో వారెంగరు. విశ్వమానవసోదర ప్రేమ, దరిద్ర

నారాయణసేవ, దీన మానవులయెడ కరుణ, జాతీయభావము, ద్వేషాసూయములు లేకుండుట, స్వార్థత్యాగము, ఇట్టివెన్నియో ఉన్ననేకదా ఉత్తమ స్త్రీత్వముగాని ఉత్తమ పురుషత్వముగాని ప్రకాశించును! పాపము! జానపదులగు సోదరీమణులకు ఇట్టి గుణములున్నవని తెలియవన్నచో అలవరుచుకొనుటకు ప్రయత్నమెక్కడిది? వీటికంతటికిని కారణ మవిద్య.

అవిద్యకు అందరాని అనర్థము లుండవుగదా! అందువల్లనే జానపద సోదరీమణులు ఇట్టి మూఢాభిప్రాయములు కలిగియుండుటకు, తమ శ్రేయస్సును మరచిపోవుటయు అక్కడక్కడ సంస్కారపరాయణులగు పురుషసోదరులసేవ నందుకొనలేకపోవుటయు సంభవమగుచున్నది. కావున మహిళాజనమునకు గల బాధ్యతలకును, ప్రకృతికిని, తగిన విద్యావిధానమును నిర్ణయించి, వారిని విద్యా పరిజ్ఞానము కలవారినిగా తయారుచేయవలయును. అప్పుడు ఒకరు స్వాతంత్ర్యము నియ్యనవసరము లేకుండనే తమ బాధ్యతలను కర్తవ్యమును నెఱింగి స్వయంప్రకాశమానసలై, ఉత్తమ సంతానమునొంది, సుశిక్షిత నాగరికపౌరులను సృష్టించి భారతమాతయొక్క దాస్యవిమోచనమునకు తోడ్పడగలరని నా ఆశయము.

## తాజమహాలు

సీ. శ్రీభారతాంగనా సిరికిలక్ష్యంబైన రమణీయహర్మ్య రత్నంబటంచు
మొగలు సామ్రాణ్మిధున మోహగీతంబుల మలచినిల్పిన మహా కావ్యమనుచు
'ముమతాజు' సామ్రాజ్ఞి మనసారగోరిన కొసరుకోరిక కొమ్మ ఫలమటంచు
సరసకళాప్రౌఢి సర్వజ్ఞుడైనట్టి 'షాజహానుని' యశ స్సారమగుచు

తే॥ గీ॥ యుగములెన్నైన నినుగాంచి యువకులెల్ల
ప్రేమతత్వంబు దెలసి సంప్రీతితోడ
నీతి నిర్మలజీవంబు నెఱపిధరను
ధన్యులౌగాక నీపూజ 'తాజమహల'.

—శ్రీ గుంటూరు విశాలాక్షి.

# నా వ్యాసం

'శశి'

ఇక్కడికి గృహలక్ష్మి వద్దనుంచి వుత్తరం వచ్చినప్పటినుంచి అడుగుతున్నా మా ప్రభువుగార్ని, ఏదైనా ఒక విషయాన్నిగురించి విపులంగా చెప్పమనీ, నేను వ్యాసంలా వ్రాసుకుంటాననీ. ఎప్పటికప్పుడే 'ఇవ్వాళ సాయంకాలం, రేపు, ఎల్లుండి, ఇప్పుడేం తొందరా, నెలాఖరుకుకదా' అంటూ అప్పులవాళ్లకులా వాయిదాలు వేస్తుంటే ఆఖరుకి నెలాఖరుకూడావచ్చేసింది. నాకు వ్యాసానికి కావాల్సిన పరికరాలేమీ దొరకనేలేదు. చూస్తుండగానే చిటికలో నెలాఖరు తేదీ వచ్చేసింది; దీనిల్లు బగారంకానూ. ఎప్పుడూ కథలూ, కబుర్లూ వ్రాసి పంపడమేకాని, వ్యాసం అనేది వ్రాసినట్లు జ్ఞాపకంలేదు. దీనికిమాత్రం ఒకళ్లని బ్రతిమాలుకోవాలా, మనం ఎందుకు వ్రాయకూడదూ అంటే, వ్యాసం అంటే లోకజ్ఞానంవుండాలి. ప్రపంచపరిస్థితులు బాగా తెలియాలె. కూపస్థమండూకంలా పిల్లలూ, సంసారం, బజారునుంచీ పప్పులూ, వుప్పులూ తెప్పించుకోవడం, వేళకు పిల్లలకు పాలుపట్టుకోవడం కాని, ప్రపంచంలో ఏఏ పనులెక్కడ జరుగుతున్నాయో, ప్రపంచయుద్ధం ఎప్పుడు మొదలుపెట్టుతారో, ఎందుకు జరుగుతుందో, అవన్నీ విపులంగా నాకేలా తెలుస్తాయి? కథా అంటే కథకీ, వ్యాసానికీ, ఏనుగుకీ దోమకీ వున్నంత వారావుంది. అలా అంటే కథారచయితలని నిరసిస్తున్నానని అనుకుంటారేమో, ప్రతీ కళలోను నేర్పువుంది. ఇంతకీముఖ్యం నేనూ కథారచయితనే. కథని కలం యిష్టం వచ్చినట్లుగా నడపవచ్చునుగాని, వ్యాసంవుందే అబ్బా! అందులో అన్నీ తిప్పలే. ఏవిధమైన లోటుపాట్లూ వుండకూడదందులో. ఇవన్నీ ఆలోచించి, వ్యాసం వ్రాద్దామని సరదాకలిగి మా దేవరవార్ని అర్థిస్తే, కబుర్లతో కాలక్షేపంచేశారు. ఒకళ్లమీద ఆధారపడివుంటే యిలాగే వుంటుంది. పోనీ యిప్పుడైనా బుద్ధితెచ్చుకుని కథే వ్రాసి పంపుదామంటే, అధమపక్షం మూడురోజులేనా బుర్ర బ్రద్దలుకొట్టుకుంటేనేగాని, ఆ కథా తయారవదు. ఈసంగతి కథారచయితల కందరకూ అనుభవమేకదా! తెల్లవారితే మధ్యాహ్నం పోస్టులో వెయ్యాలి కథైనా సరే, వ్యాసంఅయినాసరే. ఇంకా ఎన్నాళ్లు, ఎన్నిగంటలూ, ఆయన చెప్పుతారని అనుకోవడం. Time అయిపోయింది. చెకోర్కా, ముకోర్కా తేల్చేసుకోవాలి, యిక ప్రొద్దున్న తప్పదనుకుంటూ పడుకుని నిద్రపోయాను.

'ఏమండీ! అమ్మ పెట్టాపెట్టదు. అడుక్కుతినానివ్వదు. అన్న సామెతలావుంది మీతోపని. మీరు చెప్పి వ్రాయించారూకాదు. నన్ను వ్రాసుకోనిచ్చారూకాదు. ఇంకా ఎప్పుడండీ, యివ్వాళ 30 వ తారీకు ఆయెను. మధ్యాహ్నం అయినా పోస్టులో వెయ్యవద్దుటండీ' అన్నాను నేనుకూడా కాఫీతాగుతూ.

'ఏమిటీ, మీవాళ్లకు వుత్తరమా. నువ్వెప్పుడు వ్రాసుకున్నా నేనేమైనా అడ్డంపెట్టానా? ఎందుకు వ్రాసుకోలేదు?' అన్నారు ఏమీ ఎరుగనట్టు ఆశ్చర్యంగా.

అసలే వుడుకుబోతుతనంతో వుడుకుతూవున్న నన్ను ఇల్లా అంటే ఎల్లావుంటుందో మీరే ఆలోచించండి.

'ఏమిటండీ ఆ వేషాలు. నెల్లాళ్లనుంచీ మావాళ్లకు వుత్తరం వ్రాయడమేనా, నేనడుగుతూవుంట. పాపం. ఏమీయెరుగనట్టు ఎలానటిస్తారో. పోనీ, యిప్పుడేనా జ్ఞాపకంతెచ్చుకోండి. 'గృహలక్ష్మి'కి వ్యాసం' అన్నాను స్పష్టంగా.

'ఓస్ ! యింకా వ్రాయనేలేదూ. నిన్నా, నన్నా వ్రాయమంట, చెప్పు'

'నన్నే వ్రాయమన్నారు. మరి మీ రేమేనా ఒక విషయాన్నిగురించి విపులంగా చెప్పితే, నేను ఆలో చించుకు వ్రాసుకుంటాను. ఇంకా ఏమీ తెలియనట్టు అడిగితే ఏలాగా? మధ్యాహ్నం పంపాలి. Time లేదు' అన్నాను కంగారుపడుతూ.

'అయితే, యిలాచూడు, శశీ! నేనెప్పుడైనా ఏమైనా వ్రాశానా చెప్పు. నాకే వ్రాయడమే చేత యితే 'అదిగో! అల్లా చూడండి. పత్రికల్లో కథలూ అవీ వ్రాస్తుందీ ఫలాని రాజారాణీగారు. ఆవిడ పెనిమిటేట ఆవెళ్లే ఆయన. ఆయన ప్లీడరుట. అవతల వీధినున్నారు' అని ఆడవాళ్లందరిచేతా అనిపించుకో వడం ఎందుకూ?' అన్నారు, కాఫీ వూదుకుంటూ.

నాకెక్కడలేని కోపంవచ్చింది. 'ఇంకా వేళాకోళాలే, మీకేగాని నాకు లేదనుకున్నారా మర్యాదా మంచీనీ. వ్రాస్తాను అని మాటయిచ్చాక వ్రాయవద్దూ మరి. అయినా నాపేర వున్నవన్నీ మీరు వ్రాశారనే అనుకుంటున్నారుగా అంతానూ'.

'నాకు చేతకాదని నీకు తెల్సునుగా. తెలుసుండీకూడా ఎందుకు వూరుకున్నావు శశీ! వ్రాసుకో కూడదూ' అన్నారు నిర్లక్ష్యంగా.

'నాకదంతా తెలియదు. నేనడిగాను. మీరు సరే అన్నారు. చెప్పక తప్పదు. నాకు తెలియని వెన్నో విషయాలు మీకు తెల్సును, కనుక చెప్పమన్నాను. చెప్పితీరాలి'

'సరేలే! చూద్దాంవుండు' అంటూ లేచారు కాఫీ పూర్తిచేసి తాంబూలం నములుతూ.

'ఇంకా చూడ్డమేమిటి అవసానదశవచ్చాక. నాకు తెలుసు తప్పించుకు పారిపోవడానికని. ఇప్పుడు ఆఫీసులోకి వెడితే యింక దేవరవారు చెప్పినట్టే, నేను వ్రాసినట్లే. నేను వెళ్లనీయను' అన్నాను పంతంగా.

'అబ్బబ్బా! నువ్వు మంచిదానవుకదూ శశీ! యిలాచూడు అవతల పార్టీలు, పెద్దమనుష్యులూ, కని పెట్టుకు కూర్చున్నారు. బాగుండదు, తప్పుగావుంటుంది. వెళ్లనిద్దూ' అన్నారు సామంగా.

ఎవరో వచ్చినమాట నిజమేకాని, యిక ఇప్పుడు వెళ్లనిస్తే మరి లాభంలేదు. పదీకొట్టాక లోపలికి రావడం, వంగునీ, కూర్చునీ రెండు మెతుకులు నోట్లోవేసుకోవడం, బుట్టతలపాగా, బురకాలాంటి నల్లకోటూ వేసుకుని, నోజుకుంటూ కోర్టుకుపోవడం, రాత్రి ఏ ఏడింటికో (టెన్నిస్ కూడా పూర్తిచేసుకొని) రావడం. కూడా మళ్లా తయారు పార్టీలు యములాళ్లల్లాగ. మళ్లా ఆమనిషి నాకు రాత్రి 11, 12 గంటలకు కనుపించడం. ఈలోపల పిల్లలతో అవస్థ పడిపడి హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతాను నేను. మళ్లా తెల్లవారితే మామూలు దినచర్యే. ఇక ఇప్పుడు వదలిపెట్టితే లాభంలేదని గుమ్మానికి కడ్డంగా నుంచున్నాను. ఏదో తేల్తేగాని కదల దలచుకోలేదు.

'ఇదిగో, వినండి! మీమాట పుచ్చుకుని నేనేమీ వ్రాయలేదు. మధ్యాహ్నంలోపల పంపితీరాలి. నెల్లాళ్లనుంచీ వూరుకున్నానుకాని ఇక చెప్పితేకాని కదలనీయను' అని స్పష్టంగా, నిర్మొహమాటంగా చెప్పే శాను. ఇక లాభం లేదనుకున్నారు కాబోలు.

'సరే! అయితే యిలాచూడు. 'స్త్రీలు, విద్య' అనేపేరుతో వ్యాసం వ్రాయి. అదయితే నేను చెప్పేదేమీలేదు. అంతా నీకేతెలుసు' అన్నారు.

'అదక్కరలేదు ' స్త్రీలు, విద్య 'నుగురించి నే పుట్టకమునుపునుంచీ అంతా వ్రాస్తూనేవున్నారు. అది నేను వ్రాయను ' అన్నాను.

పోనీ ' స్త్రీలు సినీమాకళలను పోషించాలి ' అని వ్రాయి.

' అంటే ఏమివ్రాయాలి? ' అన్నాను.

' అబ్బే ఏముందీ పెద్దబ్రహ్మాండం ఏమీలేదు. ' స్త్రీలంతా సినీమారంగంలో ప్రవేశించాలి. ఏవిధమైన దురభిప్రాయాలు పెట్టుకోరాదు ' అని వ్రాయడం మొదలుపెడితే నీకేతోస్తాయి పదిపేజీలకు సరిపడే విషయాలు '.

' అయితే! నాకు తెలియకడుగుతాను. స్త్రీలు సినీమాల్లో వేషాలువెయ్యాలి అంటే, మరి స్త్రీలు, అంటే సంసారులుకూడా ప్రవేశించాలా ఏమిటండీ ' అన్నాను.

' ఆ! అప్పుడే ' కళారాధన ' అన్నది జరుగుతుంది '.

' మరి నేనల్లా వ్రాస్తాననుకోండి. మరి నా వ్యాసం చదివినవాళ్లంతా ' ఛీ, దీని పొగరుమండా! చెప్పడం అంతా చెప్పుతారు, కాపరాలు పడగొట్టడానికి. కాపురాలుచేసేవాళ్లంతా సినీమాల్లో వేషాలు వెయ్యాలిట. తను ముందు వెయ్యకూడదూ వ్రాసింది కనుక ' అని నన్ను తిట్టిపొయ్యరూ?

' అబ్బ! నేను ఏది చెప్పితే దానికే అడ్డు చెప్పుతావు. పోనీ ' స్త్రీలు, క్లబ్బు ' అనే వ్యాసం వ్రాయి.

' అబ్బా! అన్నీ అల్లాంటివే చెప్పుతారండి మీరు. ఏ జన్మాన్నయినా క్లబ్బు అంటే ఏమిటో నే నెరుగుంటేకదూ. వెళ్లానా, చూశానా. నాకేంతెలుస్తుంది? ' అన్నాను.

' అయ్యగారూ! ఎవరో వచ్చారుటండీ మీకోసం. గుమస్తాగారు చెప్పమన్నారు ' అన్నాడు బంట్రోతు వస్రాడు సుబ్బన్న.

' వుండు, నన్ను వెళ్లనియ్యి. ఏమీ తెలియకపోతే ఏమి వ్రాద్దామనుకున్నావు. నీ యిష్టంవచ్చింది వ్రాయి. చూడు, అప్పుడే 8¾ గం|| అయింది. రెండు అప్పీళ్ళు చదువుకోవాలి. Time లేదు '. అన్నారు కంగారుగా రిస్టువాచీ చూచుకుంటూ.

కాని నే వెళ్ళనీయదలచుకుంటేగా.

" ఎంతమంది వచ్చినాసరే నేను వెళ్ళనియ్యను. ముందు నాసంగతి చూడాలి " అన్నాను నిష్కర్షగా.

" ఒరే! ' వస్తున్నా, కూచోమనిచెప్పు! ' అబ్బా, ఏమిటి శశీ! మొండిపట్టుదల. నీకు తెలిసిన విషయాలేవో లోకానుభవంమీద వ్రాయాలి గాని, నన్నడిగితే ఎల్లాగ చెప్పు. ఇంక మాట్లాడకుండా " స్త్రీలు. స్వేచ్ఛ "ని గురించి వ్రాయి. ఇంక నన్ను వెళ్ళనియ్యి " అన్నారు, పెళ్లిలో తలుపుదగ్గర పేరు చెప్పి వెళ్ళనిమ్మని బ్రతిమాలుకునే పెళ్లికొడుకులాగ.

" సరేగాని, స్త్రీలకు స్వేచ్ఛ అంటే ఎలావుంటుందో, నాలుగుగోడల మధ్యనవున్న నాకెలా తెలుస్తుంది చెప్పండీ. మళ్లా ఏమన్నాఅంటే మీకు కోపమాయెను. ఎప్పుడేనా నేను స్వేచ్ఛగా ప్రవర్తించానా చెప్పండి మీ ఆజ్ఞలేకుండా. ఒక్క మీటింగుకుకాని, సమాజానికికాని వెళ్లానా చెప్పండి. స్త్రీలకు మగవారిలా స్వేచ్ఛ వుండాలి అని వ్రాస్తే, అసోషలిస్టుపార్టీ నాయకురాలు నన్ను బ్రతకనిస్తుందండీ. 'ఏవమ్మా! ఒకసారీ మామీటింగుకు వచ్చావుకాదు. ఎలా వ్రాసావమ్మా యీవ్యాసం' అని దూసెయ్యదూ?"

"సోషలిస్టుపార్టీ మీటింగుకు వెళ్లకపోవడం స్వేచ్ఛకు భంగకరంకాదు. 'స్వేచ్ఛ' అంటే 'విచ్చలవిడి' కాదు. 'స్వేచ్ఛ'కుకూడా నిబంధనలున్నాయి. పురుషుడికి 'స్వేచ్ఛ' వున్నదంటే కొన్ని కట్టుబాట్లున్నాయా లేవా? అలాగే స్త్రీలకూను. 'స్వేచ్ఛ' యిచ్చారుగదా అని ప్రతీచోటుకీ వెళ్ళడం, ఉన్నశక్తి శయాల్లేని ప్రతీ సంస్థలోనూ పాల్గొనడం, సంఘమర్యాద నతిక్రమించి పనులుచెయ్యడం మొదలైనవికాదు. ఆటువంటివి 'స్వేచ్ఛ' అనిపించుకోవు. వాటిని 'విచ్చలవిడి' అంటారు." అంటూ యింకా ఏమో చెప్పబోతూవుంటే.

"ఏమండీ! మరి యిప్పుడేదో 'ప్రపంచయుద్ధం జరుగుతుంది' అంటున్నారుగదా! పోనీ అన్ని విధాలా బాగుంటుంది. "స్త్రీలు, యుద్ధం" అనే వ్యాసాన్ని వ్రాస్తే యెలావుంటుందండీ?" అన్నాను అకస్మాత్తుగా.

"అమ్మగారూ! అయ్యగారు ఏవో కాగితాలమీద సంతకాలు సెయ్యాలంటండి. గుమస్తాగారు రమ్మని సెప్పమన్నారండి" అంటూ కబురుపట్టుకువచ్చింది మురళీ నెత్తుకుని దాసీపిల్ల.

"ఉండవే! అబ్బబ్బ. ఇదేమివుద్యోగమో కాని ఒక్కనిమిషం విశ్రాంతి తీసుకోనివ్వరుకదా! అస్తమానం, ఎవరో వాకరూ, చీకటితో 5 గం. మొదలు రాత్రి 12 గం. వరకూ ఒకటే యావత్తే. అందు చేతనే ప్లీడర్ల భార్యలంతా గంగిరెద్దుల్లా నగలూ, రంగురంగుల బట్టలూ ధరించి త్రిప్పుతుంటూ ఆనందపడడమే గాని, విద్యాగంధాన్నెరుగరుకదా! లతలూ, లలితలూ తగిన ఆశ్రయంలేనిదే ప్రకాశింపలేరని పూరికే అన్నారు? అస్తమానం పార్టీలు, కోర్టులు, ఫీజులూ, జమానులూ తప్ప వీరి మనస్సులకు, భార్యలుకూడా మనుష్యులేననీ, వారలకుకూడా వ్యక్తిత్వమూ, సంఘంలో స్థానమూ వుందనీ, వుండాలనీ, తోచదు కాబోలు. పట్టెడు నగలూ, పెట్టెడు చీరలూ ఇంటినిండా పెద్ద సంసారం, ఇవే భార్యలకు కావలసిన యిష్టపదార్థాలనీ, ముక్తిసాధనాలనీ కాబోలు వీరి వూహ. ఎన్నిరకాల వుద్యోగస్థుల భార్యలైనా క్లబ్బు మెంబర్లుగానూ, ఇతర సంస్థల నాయకురాండ్రుగానూ వుంటారు కాని, ఒక్కలిస్టులోనూ ఒక్క వకీలు భార్యపేరూ కలికానికైనా కనపడదుకదా!

"ఏమిటి శశీ! యివ్వాళ అపరసరస్వతివైపోయావే"

"అదేమిటే అమ్మా! నాన్నారికోసం ఎవరో యింతమంది కూర్చుంటే వెళ్ళకుండా అలా దెబ్బలాడుతావు. అమ్మతో నేను దెబ్బలాడుతా. మీరు వెళ్లండీ నాన్నారూ" అంటూంది అవతల మా వసంత.

"ఇన్ని కబుర్లు చెప్పతారు స్త్రీలు. వేషాల్లోనూ, భాషల్లోనూ, పాశ్చాత్యస్త్రీల ననుకరించకపోతే, ధైర్యసాహసాల్లో అనుకరించకూడదూ?"

"ఇన్ని నేర్చుకున్నారు దొరలనిచూసి. పరదాలోవున్న పత్నిని బహిరంగానికి తీసుకురావడాన్ని అనుకరించగూడదూ మగవాళ్ళు."

"అయ్యగారూ! గుమస్తాగారిక్కడికే వచ్చారండీ! ఏదో అర్జంటుపని వుందిట" అన్నాడు బంట్రోతు.

వెనక్కుతిరిగి చూస్తునుకదా! అవతల గుమ్మంలో నిజంగా గుమాస్తాగారు, చేతిలో కాగితాలూ ప్రత్యక్షం అయ్యారు. ఇకనేం చేసేది. లోపలికి తప్పుకున్నాను. 'బ్రతుకు జీవుడా' అని ఒక్క గంతులో అవతలపడ్డారు దేవరవారు.

గృహలక్ష్మి

ఇంతగ్రంథం జరిగినా వ్రాయబోయే విషయంమాత్రం తేలలేదని వుక్కుఁక్రోషంతో పడుకున్నా. పది కొట్టింది. నిద్ర మెలుకువవచ్చింది. పట్టరాని కోపమూ వచ్చింది మా ప్రభువుగారిమీద. 'ఇక నెప్పుడూ ఆయన్ని సలహా అడగకూడదు. అన్నివిధాలా నష్టం వస్తుంది. ఏదో వకటి నేనే వ్రాసితీరాలి' అని ఎల్లాగో సమాధానం చేసుకుని కుర్చీ యివతలకు లాక్కుని బల్లదగ్గర కూర్చున్నా.

అంతట్లోకే తయారయారు, భోజనానికి వేళయింది కాబోలు.

"రాణీగారేదో ఆలోచిస్తున్నారు. తెల్లకాగితాలు కావాలా?" అన్నారు వెక్కిరింపుగా.

"అక్కరలేదు" అన్నాను ముక్తసరిగా.

"కలం, సిరా."

"Not necessary"

"Opinion"

"Please dont talk with me" అన్నాను.

ఈలోపల పట్టుపంచ కట్టుకోవడం పూర్తి అయ్యింది. భోజనాల గదిలోకి వెళ్లిపోయారు.

రెండుగంటలకు టపా. నేనేమి వ్రాసిపంపేది చెప్పండి. అందుచేత ఏమీ తోచలే. ఈ ఘట్టాన్నే వ్రాసి పంపితే బాగుంటుందని ఇదే పంపా, వ్యాసంమాట యింకోమాటు చూసుకోవచ్చునని.

## గృహలక్ష్మి

సీ॥ శ్రీకరంబగుసర్వ సీమంతినీమణీ క్షేమంబు వాంఛించు శీలలక్ష్మి!
అబలాస్వతంత్రంబు నధికంబుఁగావించి విఖ్యాతిఁజేఁగూర్చు విజయలక్ష్మి!
సతులఁబాపెడు దుష్టపతులకెల్లనునీతి మార్గముద్దెల్పు సామ్రాజ్యలక్ష్మి!
సంసారరాక్షసిన్ సాధించివిజయమున్ సంతోషమిచ్చు విజ్ఞానలక్ష్మి!
దేశదారిద్ర్యంబుఁ దెల్లవారఁగఁజేయు ప్రకటనల్జూపు స్వరాజ్యలక్ష్మి!
వెలఁదిమిన్నలమంచివే విధంబులఁగోరి దరహాసమొలికించు ధైర్యలక్ష్మి!

గీ॥ విశ్వదభిరామవగుమేటి విజయలక్ష్మి!
అన్నిఁటికినోర్చు పూరుషర్ధాంగలక్ష్మి!
సర్వసత్కార్యశక్తివో శాంతలక్ష్మి!
కీర్తిగుణలక్ష్మి! గృహలక్ష్మి! కేలుమోడ్తు॥

ఉ॥ నీముఖచంద్రకాంతులు వినిర్మలతోషిత మందహాసముల్
ప్రేమతరంగజాలములు వీడినమందిర మక్కటక్కటా!
నేమముదక్కి ప్రేతవనసీమ నుమంబటుకాంతిహీనమై
నేమములేనినోముగతి నుండుఁగదా! సకలాశుభంబులన్.

—శ్రీ బాలకవి అల్లమరాజు నారాయణరావు.

# విదుషీమణుల విధ్యుక్త ధర్మము

శ్రీ దు. కృష్ణయ్యగారు

నిరక్షరాస్యతా నిర్మూలనమునకును, వయోజన విద్యకును, స్త్రీ లొనర్పగలసేవ యనంతానంతము. నేడు మనదేశములో అక్షరాస్యుల సంఖ్య 100 కి 10 కి మించలేదు. ప్రపంచములోని వివిధదేశములవారు పరిపూర్ణవిజ్ఞానము ననుభవించుచుండగా మనమీ యంధకారమున నెంతకాలముండగలము ? అజ్ఞానాంధకారావృతమై దుర్భర దారిద్ర్యమునకులోనై ప్రపంచములోని వివిధ దేశీయ సోదరసోదరీమణులలో మనమెట్లు తలమెత్తుకొని తిరుగగలము ? ప్రపంచములోని నిరక్షరాస్యులలో $\frac{1}{4}$ వ భాగము మనదేశమందే యున్నారనుటకంటెను భారతీయులకు దుఃఖకారణముకలదా ? పురుషులమాట యటుండ స్త్రీలలో విద్యాగంధము 100 టికి 3 కూడలేదు. తక్కిన వారిగతి విచారింపవలసిన ధర్మమెవ్వరిది ? అబలలని యూరకుండదగిన సమయమా ? పట్టుదలకు మించిన కార్యమేది గలదు ? సోదరీమణుల యజ్ఞానమును తొలగించి ప్రపంచములోని నారీమణులలో వారికొక స్థాన మొసగుటకు జ్ఞానాంగనలెంతయేని పని చేయవలసియున్నది.

విజ్ఞానము దీపకళిక. కాంతులీనుటయే దాని ధర్మము. భారతమాతకు జోహారులర్పించువారు ఆమె పుత్రికలు తల్లి జ్ఞానహారతులకై నేడు నిరీక్షించుచున్నది. నీరాజనములకుకాదు. దిక్కులేని, జ్ఞాన శూన్యులైన బిడ్డలనుజూచి ఆమె కంట నీరుబెట్టుచున్నది. ఆమె నోదార్చు వారెవ్వరు ? అశ్రుకణములను జూచియైన నారీమణులకు జాలి కలుగుటలేదా ! సోదరీమణుల అజ్ఞాన నివృత్తికై మాత పిలుపు వినబడుటలేదా ?

స్త్రీ విద్యను, స్త్రీలే అభివృద్ధి నొందింపవలసియున్నది. కొన్నికొన్ని కారణములచే యిది పురుషులకు దుస్సాధ్యము. స్త్రీ గణాంగమును సమీపించుటకు స్త్రీలకున్న యవకాశము పురుషుల కెన్నటికిని లేదు. స్త్రీల యాదరాభిమానములకు స్త్రీలే అధారము. చిన్నవయసులోనే గృహలక్ష్ములై గృహముల నలంకరింపవలసియుండు మన దేశములో స్త్రీలకు పురుషులేవిధమున జ్ఞానజ్యోతి నందింపగలరు ? తుదకు, బాలికాపాఠశాలలలోని పాఠ్యక్రమమును పరిశీలించుటకు స్త్రీలకుండు యవకాశములు పురుషులకు కలవా ! మహిళాభ్యుదయమునకు మూలమైన మహిళాసమాజములను స్థాపించి, పోషించుట స్త్రీల కర్తవ్యమే కదా ? ఇట్టి సమాజముల మూలమున నిరక్షరత్వమును ధారాళముగ పోగొట్టవచ్చును. పట్టుదలతో పనిచేసినచో అనేక మహిళాసమాజము లిట్టి కార్యమును జేయుచునే యున్నవి. మహిళాసమాజములు సర్వజనాదరణీయములు గావలయును. నేను బొంబాయిలో నిరక్షరాస్యతా నిర్మూలనమునకై నారీమణు లొనర్చుచుండు సేవ అమోఘము.

ఆదర్శప్రాయము. స్త్రీల పట్టుదలకును, కార్యదీక్షకును ప్రబలతార్కాణము. అట్టి ప్రయత్నమువలన మన రాజధానిలోకూడ మహిళామణుల విజ్ఞానము ఉజ్వలతేజో వంతము కాదా !

స్త్రీలలో మతప్రచార మొనర్చుటకునై క్రైస్తవనారీమణు లొనర్చుచుండు విధానము, ప్రచారము, అవిద్యా నివారణకై నారీమణులెట్లు సోదరీమణులకు సేవజేయవచ్చునో మార్గము జూపుటలేదా ? కార్యదీక్షకు గడంగినచో మార్గము సుగోచరము. దప్పి తీర్చుకొనదలచిన కాకికే మార్గము గోచరించినప్పుడు సోదరీమణుల విజ్ఞానాభివృద్ధికై పాటుపడ దలచిన పడతులకు మార్గము దోచదా ?

గృహలక్ష్ముల ప్రయత్నబీజమును సఫలీకృత మొనర్చుటకు పత్రికారాజములు పాటుపడుచునేయున్నవి. 'మహిళాభ్యుదయ'మను శీర్షికలేని పత్రికయే సామాన్యముగ లేదు. స్త్రీల ఆయురారోగ్య సౌభాగ్యములను పెంపొందించు పత్రికారాజములుగూడ లేకపోలేదు. నిదర్శనముగా, 'గృహలక్ష్మి' 'స్త్రీధర్మ' ఇత్యాదులు. ఇట్టి పత్రికాభిముఖమున నారీమణులు తమ విజ్ఞానాభివృద్ధికి పాటుపడుట వారివిధి.

బాలురకేగాక బాలికలకుగూడ సర్వసాధారణముగ సర్వత్ర నిర్బంధోచిత విద్య స్థాపించుట ప్రభుత్వ కర్తవ్యమని ప్రబోధమొనర్చుట పట్టుదలతో సాధించుట, విదుషీమణుల కర్తవ్యమే యగును.

ముఖ్యముగ గ్రామసీమల సంచారమొనర్చి అవిద్యాపిశాచ మావరించి పీల్చి పిప్పిజేయుచుండు గ్రామవాసులను-ముఖ్యముగ నారీబృందమును, విద్యావంతముగా జేయుటకు నారీమణులే నడుముకట్టుకొనవలయును.

ప్రత్యేక బాలికాపాఠశాలల నేర్పఱుప వీలులేని సందర్భములలో సహపంక్తి (Co-education) విద్యవలననైనను బాలికలకు విద్యనేర్పుట ప్రభుత్వపు కనీసధర్మమని నిర్భయముగా దెలుపుట పడతుల ధర్మమేయగును.

వీలుకలిగినప్పుడు విద్యనేర్పుటకై తగువసతులను, సేవకాదళమును ఏర్పాటుచేసి, అజ్ఞానులైన సోదరీమణులను సుజ్ఞానులుగ జేయుటకు పుణ్యాంగనలే పూనుకొని పుణ్యము గట్టుకొనవలెను. స్త్రీవిద్యా విషయములో పురుషులెంత ప్రయత్నించినను స్త్రీల యాదరాభిమానములు లేకున్న ఫలితము పూజ్యమేగనుక, స్త్రీలే పట్టుదలతో పనిచేయవలసి యున్నది.

మహిళా సమాజములలో పత్రికా పఠనాలయములను, గ్రంథాలయములను స్థాపించి వీటిమూలమున వయోజనవిద్యకు దోహదమొసగ వచ్చును. స్త్రీలకొఱకై ప్రత్యేక గ్రంథాలయములను పఠనాలయములను నెలకొల్పవలయునని స్త్రీసమాజముల ద్వారా ప్రభుత్వమును కోరవచ్చును. 'జననా' యందుండు స్త్రీలకు విద్యనేర్ప స్త్రీలకు గాక మరెవరికి సాధ్యము? చదువనేర్చినస్త్రీలు, తమ విరామవేళలయందు సోదరీమణుల యజ్ఞానమును నివారింపవలయును. ప్రచారమునకు తోడ్పడవలయును. సమాజమునకు సభ్యులను జేర్చవలయును.

స్త్రీలకు విద్యయెట్లు ఆవశ్యకమో స్త్రీసమాజములలో యుపన్యాసముల నొసగి ప్రబోధ మొనర్పవలయును. స్త్రీవిద్యాభివృద్ధిని సూచించు నాటకములను ప్రదర్శింప వచ్చును. "ముగుదల్ నేర్వగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అన్నారు గదా!

ప్రేమ తత్వమునకు పుట్టినిండ్లై, లాలిత్య లావణ్యములకు నిధులై, కార్యదీక్షకు కఠారులైన విదుషీమణుల విజ్ఞానాభివృద్ధికై పాటుపడ భారతి కరుణాకటాక్షములను ప్రసాదించుగాత!

## "సామ్యవాదము"

పుట్టునపుడే కిరీటంబుఁ బూనియెవఁడు
నవనియందున జన్మంబు నందరాఁడు;
చచ్చునప్పుడుం దానితో జావఁబోఁడు
బిచ్చకాండ్ర కపాలంపు బీరమిదియె!

ప్రాకృతిక సౌఖ్యమునెల్ల బ్రకృతియందు
బుట్టువాండ్రెల్ల రొక్కటే పోల్కి, ననుభ
వింపుచుందురు, ధనికులున్ బీదవారు;
తనరు నీభేదముల్ కల్పితములు కావె?

ఇట్టి యీసామ్యభావంబు నెంచిచూడ
నాది సిద్ధాంతమేయందు నగుపడుఁగద!
కృష్ణుఁడే చెప్పెగాదె! యా 'గీత' యందు;
వేయిచోటులఁ బరికించి వెదుక నేల?

'గీత' లోఁగల్గు సమభావ కీర్తనంబు
నొప్పికొని "భక్తిమార్గాన నొప్పిద" మని,
రాజకీయార్థికాల నీ లక్ష్యముంచ
నోపరిదియేమి పాపమో! యుర్వీజనులు

ఎల్లజనులును సములంచు నెంచవలయు,
జాతిమత వర్ణ భేదముల్ సడలవలయు
బీదలు ధనికులనియెడి భేదముండ
రాదు: దీనినేకద! "సామ్యవాద" మంద్రు!

—శ్రీ కవయిత్రి వేమూరి జ్ఞానాంబ

# సంఘబలి

శ్రీయుత కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

లలితా !

............

ఇదిగో !

............

ఇటుచూడు !

............

పలకవేం ! నాతో మాటాడడానికి అంత మొహమాటమెందుకు ?

............

పరాయివాణ్ణి చూసినట్టు అలా మొహం దాచుకుంటావెందుకు లలితా ?

............

నీతో కొన్నిమాటలు చెప్తాను శ్రద్ధగావిని, రోజూ అలా చేస్తూ ఉంటావా ?

............

చూడు వాళ్ల సుశీల, కిలకిలమని నవ్వుతూ, చకచకా మాట్లాడుతూ, గృహలక్ష్మిలా ఎంత ఆనందంగా ఉంటుందోను !

రామారావు ఆఫీసునుంచి వచ్చేసరికి, ఎక్కడలేని ఆనందంతో ఎదురుగాపోయి, ఏవేవో కల్పించుకుని, ఎంత హాయిగా కబుర్లు చెబుతుందో చూడు ఇందిర !

కలిగినదానికి సంతోషించి, భర్త సంపాదించు తక్కువ సొమ్ముతోనే కుటుంబ ఖర్చులన్నీపోగా, కొంత డబ్బు మిగిల్చి నగలుచేయించుకుంటూ, ఎంత పొదుపుగా సంసారం తిప్పుకుంటుందో చూడు కమల !

ఇతరులు తన్ను వేలుపెట్టి చూపకుండా, నేర్పుగా ఇంటిపనులు సవరించుకుంటూ, తీరికసమయంలో కుట్టుపనో పాటలో నేర్చుకుంటూ, అవకాశం కలిగినప్పుడల్లా ఏ పుస్తకమో పేపరో చదువుతూ, తనమనస్సుకి ఆనందాన్ని వికాసాన్ని కలిగించుకుని, తన మాటలవల్లా చేతలవల్లా భర్తకు హాయినీ ఉత్సాహాన్నీ కలిగించి, అతని అభిమానాన్ని చూరగొంటూ, ఇల్లూ వళ్లూ మాయకుండా, దేవకన్నెలకుకూడా పాఠం చెప్పేలా ఉంది చూడు వాళ్ల మీన !

నువ్వూ అలా అన్నీ నేర్చుకోవాలి. విద్యా వివేకమూ సంపాదించాలి. ఇతరులను చూసైనా మంచి గుణాలూ అలవాట్లూ అలవరుచుకోవాలి. అలా ఉంటేనే ఇల్లాలు ఇంటికి అలంకారమవుతుంది. లేకుంటే, ఆ యింటికంటే పాడుగుడి మేలనిపిస్తుంది.

అని కాపరానికొచ్చిన కొత్తరోజుల్లో ఉపదేశించడం ప్రారంభించేడు దాసు తనభార్య లీలకు. ఆమె అసలుపేరు సుబ్బమ్మ. తల్లిదండ్రులు సుబ్బీ అని ముద్దుగా పిలుస్తూ ఉండేవారు. ఆపేరులో నాగరికత

లేదని, అదిమార్చి లీల అని నామకరణంచేసేడు దాసు. కాని, అలవాటుపడిన ప్రజల్లోమాత్రం ఆమెపేరు పూర్వంలాగే చెలామణీ అవుతోంది.

దాసు ఒక సామాన్య వెలనాటి కుటుంబంలోనివాడు. విశాఖపట్టణానికి సమీపంగా ఉండే ఓ పల్లె అతని స్వస్థలం. అతని తండ్రి రామయ్యగారు ఉన్న పితురార్జితం కాస్తా ఊడిపోకుండా, ఊరూ నోరూ మంచిచేసుకుని, సాలీనావచ్చే సామాన్యమైన ఆదాయంతో కాలక్షేపంచేస్తూ, కొడుక్కి ఇంటరువఱకూ పట్నంలో చదువు చెప్పించేడు. దగ్గిఱసంబంధం దాటిపోతుందనీ, ముసలమ్మ ముచ్చటపడుతోందనీ, శారదా బిల్లు అమల్లోకొచ్చే పెళ్లికంట్రాక్టుల హడావిడిసమయం కనుక క్లుప్తంగానూ, అట్టే ఖర్చులేకుండానూ తేల్చె వచ్చుననీ, రెండుమూడు కార్యాలు కలిసొస్తున్నాయనీ, పంచశిఖలతోటే కొడుక్కి మూడుపోగులూ పడ్డా యనిపించేసేడు రామయ్యగారు. అందుచేత, బాల్యవివాహపిశాచకరాళ దంష్ట్రిలకెరయైన అభాగ్యులలో దాసొకడు. లోకవాసనలేని అమాయక ప్రాయంలోనే, అతని సర్వాంగమూ సంసార రజ్జులచే బంధింపబడి పోయింది. కాని భార్యా—సంసారమూ సంగతి అప్పు డతనికేంతెలుసు! ఏదో కలలాగ పిల్లకాయల బొమ్మలాటలాగ జటిగిపోయింది ఆ ముచ్చట కాస్తాను.

వయస్సుతోపాటు చదువుకూడా కొనసాగుతూన్న నాటి రోజుల్లో దాసు మంచి హుషారుగా ఉండే వాడు. చదువు పూర్తికావడంతోనే మంచి ఉద్యోగం సంపాదించి తనభార్యను విద్యావతినిగాచేసి, ఆమెను చేదోడువాదోడుగాచేసుకుని, భాషాసేవచేయాలనీ, బాల్యవివాహాలు కన్యా వరవిక్రయాలు, అస్పృశ్యత, త్రాగుడు మొదలగు దురాచారములు మాన్పి సాధ్యమైనంతవఱకూ సంఘసేవచెయ్యాలనీ, వృత్తి విద్యల్ని ప్రోత్సహించాలనీ, అధమపక్షం తనకూ తన కుటుంబానికీ సరిపోయే బట్టలకు కావలసిన నూలు స్వయంగా తయారుచేసుకోవాలని, గృహపరిసరంలో పాదులూ పందిళ్లూవేసి, కావలిసిన కూరానారా పండించాలనీ, ఎన్నెన్నో గాలిమేడలు కడుతూండేవాడు తన ఊహా ప్రపంచంలో.

ఆ దృష్టితో, పండుగనీ పర్వమనీ కథలనీ కార్యాలనీ అప్పుడప్పుడు జరిగే సంఘటనాల్లో, తన భార్యలో, తన ఉద్యమాలకూ ఊహలకూ సహాయపడే శక్తులూ లక్షణాలూ ఉన్నాయా లేవా అని పరిశీలిస్తూ ఉండేవాడు దాసు. ఆమె వెఱ్ఱిచూపులూ—అర్థంలేని మాటలూ—విసుగెత్తించే చేతలూ—గ్రామ్యమైన వేషం చూచేసరికి నిలువుకు నిలువునా నీరైపోయేవాడు. అంతటితో తాను నిర్మించుకున్న ఊహా సౌధాలన్నీ తుపానులోనూ, ఝంఝామారుతంలోనూ ఎగిరిపోతూండేవి.

పల్లెలో ఉండి, తగిన వ్యుత్పన్నుల సహవాసం లేకపోవుటచేత, తల్లిదండ్రులు చదువూ సంధ్యా చెప్పించి, బాల్యంనుంచీ మంచి తర్ఫీదు చేయకపోవుటచేత అలావుంది గాని, తనదగ్గిఱకొచ్చినతఱువాత విద్యాబుద్ధులుచెప్పి, మూడు నిమిషాల్లో నాగరిక యువతినిగా తయారుచేసి, తన ఊహలతోనూ చేతల తోనూ ఏకీభవించేలాగ చేసుకోలేకపోతానా! అని తమాయించి, చెదరిన హృదయాన్ని పదిలంచేసుకునేవాడు.

ఇంతలో ఇంటరు ప్యాసగుటవల్ల, ముందు చదువు సాగించడానికి తగిన ధనసహాయం లేకపోవుటవల్లా, భూమో పుట్రో తాకట్టుపెట్టో అమ్మచూపో పెద్ద చదువులు చదువుటచే అట్టే లాభంలేకపోతుందనీ, ఏదేనా జీవనపథంలో ప్రవేశించి తన ఆశయాల్ని నెఱవేర్చుకుంటే బాగుంటుందని ఆలోచించి, అంతటితో చదువుకు స్వస్తిచెప్పి స్వగ్రామం చేరుకున్నాడు.

# సంఘబలి

లోకంతోపాటుగానే లలితకూడా కాపరానికొచ్చింది. రెండేండ్లు గడిచేయి. కాళ్లూ చేతులూ అరిగిపోయేటట్టు సర్వప్రయత్నాలుచేసినా స్వతంత్ర జీవితానిర్వాహణానికి తగిన ఉద్యోగం లభించని విచారమొకవంక, తన అభిప్రాయములతోగాని ఉద్యమాలతోగాని ఐక్యమయే లక్షణాలేవీ తన భార్యలో లేకపోవుటేగాక, ఆమె, విద్యాగంధమూ ప్రపంచజ్ఞానములేక సృష్టికర్త ప్రమాదంవల్ల ఆడమనిషిగా నిర్మింపబడిన ఏ అడవి మృగంలాగో ఉండుటచే కలిగిన విషాదాగ్నిజ్వాల ఒకమూల, పాపం! దాసుని దినదినానికీ కృశింపజేసేవి.

‘విచారపడి చేసేదేముంది! కేవల విచారంవల్లా కలతలవల్లా ఏ కార్యమైనా నెరవేరుతుందా! మనిషిలో సర్వశక్తులూ ఇమిడున్నాయి. వాటిని ఉత్తేజితంచేసుకుని, సక్రమంగా ఉపయోగిస్తే, అసాధ్యమైనదేదీ ఉండదు. పౌరుషంలో ఎట్టి పనినైనా సాధించగలశక్తి ఉంది. తగిన దైవానుకూల్యం లేకపోవుటచేత, ప్రయత్నలోపంవల్లా, తాను తలపెట్టిన పని ఆలస్యంగా నెఱవేరవచ్చు. ఆలస్యానికీ, అప్పుడప్పుడు కలిగే ఆఘాతాలకీ, వెనుకంజవేయకుండా, పట్టుదలతోటీ, శాంతంతోటీ, ప్రయత్నించేవారికి అలభ్యమంటూ ఏదీ ఉండదు’ అని తన అంతరాత్మ బోధించింది దాసుకి.

ఉన్నపాళంగా ప్రయాణమయేడు పట్టణానికి, ఈ మారు ఉద్యోగం సంపాదించితీరాలనే పట్టుదలతో. పేరుగలవాళ్లనందర్నీ కలుసుకున్నాడు. ప్రతి ఫర్మ యజమాన్నీ చూసేడు, ప్రతి ఆఫీసు అధికారినీ ఆశ్రయించేడు. తుదకు తానిన్నాళ్లూ పడిన శ్రమకు ఫలితంగా, హార్బరులో నెలకు 50 రూపాయిల జీతంపైని ఓ గుమాస్తాగిరీ సంపాదించేడు. ధన్యోహమ్మనుకుని, కాలూచేయీకూడదీసుకుని, కొత్తగ్రహారంలో బీచికి దగ్గఱగా ఓ అద్దెయిల్లు మాట్లాడి కాపురంపెట్టేడు.

జీవితసమస్య తీరిపోయింది. ఇక మిగిలినదల్లా తనభార్యని విద్యావివేకాలూ నాగరికతా కలదాన్నిగా చేసి, ఒక ఉత్తమ గృహిణిగా తయారుచేయడమే. అందరికిని, ఒకనాటి సాయంకాలం, ఆఫీసునుంచి వచ్చిన తరువాత, పైవిధముగా లలిత కుపదేశించుట కారంభించేడు. ఆమెమాత్రం ఉఁ అఁ అనకుండా, అడ్డకాళ్లేసుకు కూర్చుని, ఏమిటో ఆధోరణి అర్థంగాక, మౌనంగా అలా వింటోంది ముఖం ఓరగాతిప్పి.

కొంచెంసేపు మౌనంగా ఊరుకుని, మళ్లీ ఇలా ఆరంభించేడు దాసు.

చూడు! అలా సామాన్లూ బట్టలూ కలగా పులగంగా విరజిమ్మేసినట్టు పెట్టగూడదు. కావలిసినప్పుడు వాడుకుని, మళ్లీ పొదుపుగా ఎక్కడివక్కడ ఉంచాలి. అవసరమైనదానికంటే ఎక్కువగా వండుకుని, వ్యర్థంగా పారబోసుకోకూడదు. ఎప్పుడు ఎక్కడ ఎవరితో ఎట్లా మాట్లాడాలో ఎలా మెలగాలో ఒకరిని చూసైనా గుర్తించి, అలా అనుసరిస్తూ ఉండాలి. ఇంటికెవరేనా ఆడవాళ్ళు వచ్చినప్పుడు, మౌనంతో సమాధానం చెప్పకుండా, ఆదరించి చనువుగా మాట్లాడుతుండాలి. జుట్టూ బట్టా అలా మాసిపోయినట్టు చేసుకోగూడదు. ఏపూట కాపూట పరిశుభ్రంచేసుకుని, ఇంటినీ, వంటినీ కంటికింపుగా ఉండేటట్టు ఉంచుకోవాలి.

ఇంటిపనులయినతరువాత ఇదిగో ఈ పత్రిక చదువుతూవుండు. పట్టుదలతో ప్రయత్నంచేస్తే, ఎంత జ్ఞానమేనా సంపాదించొచ్చు. రాదనీ, చిన్నతనంలోలేని చదువిప్పుడెలా పట్టుబడుతుందనీ, ఉదాసీనంగా ఉంటే ఏమీ పట్టుబడదు సరేకదా ఉన్న తెలివితేటలు కాస్తా ఉండి, అంతకంతకు గడిదేరి మొద్దులౌతారు. ఇరుగుపొరుగువారితో లేనిపోని కయ్యాలుపెట్టుకోక, ఊసుపోని సమయంలోమాత్రం వారితో మంచి ప్రసంగం

చేస్తూ, వాళ్లదగ్గిఱ ఉండే మంచిగుణాలని అభ్యసించడానికి ప్రయత్నంచేస్తూవుండు. గరల్స్కూలు మాస్టరమ్మ శైలాగారితో చెప్పేను; ఆవిడ రేపటినుండి సాయంకాలం వస్తూంటుంది; ఆమె చెప్పినట్టూవిని, జాగ్రత్తగా చదువుతూండు. ప్రతినిత్యమూ ఇలా చేసేవంటే, కొలదికాలంలోనే నువ్వూ నాగరికలలో నాగరికవు విద్యావతులలో విద్యావతివై, ఒకరికి ఉపదేశించే అంతటిదానవవుతావు.

అని, తనభార్యని విద్వావతినిచేయడానికి నాందిగా ఈమాటలు చెప్పి, ఆరుగంటలు దాటుటవల్ల చల్లగాలికోసం బీచివడ్డుకిపోయేడు దాసు.

౨

మర్నాడు సాయంకాలం ఆరుకావస్తోంది. దాసు ఆఫీసునుంచి వచ్చి, శైలాగారొస్తారు వేగం వంట ముగించి సిద్ధంగాఉండని లలితతో చెప్పి, క్లబ్బులో ఏదో మీటింగంటే వెళ్లేడు.

దాసు వెళ్లిన ఇంకో ముప్పావుగంటకి శైలాగారొచ్చి, గుమ్మంముందు నిలబడి 'ఇదేనాండి దాసుగారిల్లు'ని అడిగింది.

లలిత :—ఇదే, ఎందుకూ! అంది గరిసినట్టు.

శైలా :—మీరు దాసుగారికేమవుతారు! అంటూ లోపలికెళ్లి, చావడిలోవేసున్న కుర్చీలో కూచుంది.

లలిత :—ఏమో అవుతారు! అంతా మీకెందుకూ! ఏదో వచ్చినపని చూసుకోక! అంది పల్లెటూరుతనం ఎక్కువగా కనపడే ధోరణిలో.

శైలా :—అదికాదమ్మా! ఊరికే అడిగేను. మీపేరు లలితకదూ!

లలిత :—అవును

శైలా :—ఆయనగారు చదువు చెప్పమన్నది మీకేనా!

లలిత :—ఆఁ నాకే.

శైలా :—అయితే అలా దయ్యాన్నో భూతాన్నో చూచి బెదరినట్టు దూరదూరంగా నిలబడి జంకుతూ సమాధానం చెబుతావేవమ్మా! ఇలా దగ్గిఱగావచ్చి కూర్చో.

లలిత శైలాకు సమీపంగా కూచుని, ఆమెకేసి ఆ పాదమస్తకమూ పరకాయించి చూస్తోంది నివ్వెరపాటుతో. ఆమె ఎప్పుడూ పల్లెవిడిచి యెఱుగదేమో, ఇలాటి నాగరిక యువతిని చూడడానికి ఇది రెండోమారు. ఇంతకుముందు, తమవూళ్లో కరణంగారి కూతురికి పురుడు సరిగా రాకపోతే, పట్నంనుంచి డాక్టర్ని తీసుకొచ్చేరు. అతనితో వచ్చిన నర్సునిమాత్రం చూసింది. ఈమెకూడా ఆలాగే తెల్లని చీరా రవికా ధరించింది. కాళ్లకు లేడీస్లిప్పర్సున్నాయి. కొంచెంసేపయినతరువాత లలిత ఇలా ప్రశ్నించింది.

లలిత :—ఏమండీ! మీరు అప్పుడప్పుడు మంత్రసానిపనికూడా చేస్తూ ఉంటారా!

శైలా :—అబ్బే! లేదండీ! అసలు నేనాపనే నేర్చుకోలేదు. ఏదో కాస్త ఇంగ్లీషూ తెలుగూ చదువుకుని, ఆకేళ్లనుంచీ ఈవూరు ఆడపిల్లల బళ్లో పనిచేస్తున్నాను.

లలిత :—మగాళ్లకు మల్లేనే ఆడాళ్లకుకూడా బడి ఉందాండి!



సప్తమ గుంటూరుమండల మహిళాసభ ఆహ్వానసంఘము (బాపట్ల)



బొంబాయి ఫోర్టు గుజరాతీ హిందూ స్త్రీ మండలివారు దసరా మహోత్సవమును జరపిన
సందర్భమున బాలికలచే గావింపబడిన నాట్యవినోదము



కీర్తిశేషురాలైన దొడ్డపనేని సీతామహాలక్ష్మమ్మ
గారు. చిన్నవయసునందే హిందీ, ఇంగ్లీషు సంగీ
తము మొదలగు విద్యలలో విశేష ప్రతిభను
జూపి, అకాలమృత్యువుచే నపహరింపబడిన
ఆంధ్ర యువతీరత్నము



శ్రీమతి కోటంరాజు సీతాబాయమ్మ గారు
అసమాన గానకళానైపుణ్యమును ప్రదర్శించి
అనేక బహుమతులను బడసి ఆంధ్ర
మహిళా మండలిలో ఖ్యాతిగాంచిన
యువతీలలామము

శైలా :--- లేకేం ! ఇక్కడేకాదు చాలాచోట్ల వున్నాయి. మీవూళ్లో లేదు ?

లలిత :—మావూళ్లో మగపిల్లలకే గాని ఆడపిల్లల బరంటూ లేనేలేదండీ. చాలామంది ఆడపిల్లలు అక్కడికేవెళ్లి చదువుకుంటూ ఉండేవారు.

శైలా :—మీరుకూడా ఏమేనా చదివేరా !

లలిత :—ఏదోకొంచెం పేర్లుమాత్రం చదవడం నేర్చుకున్నాను.

మగపిల్లలూ ఆడపిల్లలూ కలిసి చదువుకేమిటని, ఉద్యోగాలుచెయ్యాలా ఊళ్లేలాలా అసలు ఆడదానికి చదువెందుకని, చదువుకున్న ఆడదీ చదువురాని మగాడూ పాడైపోతారనీ, మానాయన చెబుతూ ఉండేవాడు. అంచేత, నేనూ బడికిపోవడం మానేసేదాన్ని నిజంచెప్పండి ! ఆడది చదువుకుంటే ఎందుకేనా పనికొస్తుందీ ! ఈయన రెండేళ్లనుంచీ నువ్వు చదువుకోవాలంటూ చెబుతున్నారు. ఏదో పనీపాటూ నేర్చుకుంటే చాలదూ ! ఎందుకుపనికొస్తుందీ చదువు ! ఆడదానికి పని ముద్దూ మగాడికి చదువు ముద్దూ అన్నారుగదండి పెద్దలు ! ఆయన వెఱ్ఱిగాని నేను చదువుకు నేంజెయ్యాలి .

శైలా :—అయ్యో వెఱ్ఱితల్లీ ! ఆడది చదువుకుంటే పాడవుతుందని, చదువు కేవలం మగాళ్లకేననీ, ఎప్పుడూ అనుకోకు. చదువు జ్ఞానాన్నిస్తుంది. జ్ఞానం అందటి హక్కును. జ్ఞానంవల్ల మంచిచెడ్డలు తెలుస్తాయి. దాన్నిబట్టి మన జీవితంలో ఉండే తప్పొప్పులు సవరించుకోవచ్చు. మగవానితోపాటు ఆడదికూడా విద్యాబుద్ధులు కలదైతేనే ఆ సంసారశకటం ఒడుదుడుకులేకుండా సరీగానడుస్తుంది. విద్యాజ్ఞానవివేక సంపన్నులైన దంపతుల జీవితం నిత్యనూతనంగానూ ఆనందమయంగానూ ఉంటుంది. భార్యాభర్తలలో ఏ ఒకరు విద్యాగంధం లేనివారయినా, ఒకరిహృదయ మొకరికి సరిగా అర్థంకాక, ఉభయులమధ్యా ప్రతిక్షణమూ ఎన్నో కలతలు బయలుదేరుతూంటాయి. అలాంటి దంపతుల్లో ఆనందానికి చోటుండదు. నిత్యమూ రుసరుసలు గుసగుసలూను.

లలిత :—సరే చదువుకేంగాని,ఈ గాజులెక్కడ చేయించేరండి! (అంటూ ఆమె చేతులు తడుముతుంది.)

శైలా :—గాజులమాటకేం తరువాత చెప్తాను, ముందు చదువుకానీయమ్మా తల్లీ ! ఇదుగో ఈ సీత పాఠం చదువు తప్పులొస్తే చెబుతాను.

లలిత :—(చదువెందుకు అనుత్సాహాన్ని సూచిస్తూ) మీబళ్లో ఎంతమంది ఆడపిల్లలున్నారండి ?

శైలా :—రమారమి వందమంది.

లలిత :—మాస్టర్లందఱూ ఆడవాళ్లేనా మగాళ్లుకూడా ఉన్నారా ?

శైలా :—హెడ్ మాస్టరు మొదలు చిన్న మేస్టరువఱకూ అందఱూ ఆడవాళ్లే.

లలిత :—అయితే అందఱూ మీలాగే......

శైలా :—ఏమిటో అడుగమ్మా ! సగంలో ఆపేసేవు ! సందేహమెందుకు !

లలిత :—అదికాదండీ ! వాళ్లుకూడా......

శైలా :—అయ్యో పిచ్చిపిల్లా ! అడుగదలచినదానికి ఇంత జంకెందుకు !

లలిత :—మీకు పిల్లలెంతమందండీ ?

లైలా :—ఇద్దఱు మగపిల్లలూ ముగ్గురు ఆడపిల్లలూను.

లలిత :—వాళ్లేంజేస్తున్నారు ?

లైలా :—చదువుకుంటున్నారు.

లలిత :—వాళ్లని పోషించడానికి పాపం ! మీరే ఇలా మాస్టరీచేసి సంపాదిస్తున్నారన్నమాట !

లైలా :—నేనేయేం ! మా ఆయన మిషన్ హైస్కూల్లో మాష్టరుగావుండి నెలకు 50 సంపాదిస్తున్నారు. నేను గరల్ స్కూల్లో పనిచేస్తూ నెలకు 30 జీతం తెస్తున్నాను. సౌఖ్యంగా కాలక్షేపంచెయ్యంగా 20 రూపాయీలు మిగిలితే బేంకులో నిలువవేస్తున్నాం.

లలిత :—మీ ఆయన ఉన్నారన్నమాట ! అయితే మీముఖాన బొట్టులేదేం ?

లైలా :—ఇదా మీరడుగదలచింది ! మాజాతిలో బొట్టుపెట్టుకునే ఆచారంలేదు (అంది ఆమె అడిగిన ప్రశ్నలకు అసహ్యపడుతూ)

లలిత :—మీరు జాతివాళ్లా ?

లైలా :—క్రిస్టియన్సు.

లలిత :—అంటే.

లైలా :—అంటే ఏమిటి ! రాజులూ బ్రాహ్మలూ మొదలగు మీ హిందువులజాతులలాగే మాదీవొకతెగ.

లలిత :—ఓమారు మావూళ్లోబడికి నా చిన్నప్పుడు ఓ ఇన్స్పెక్టరు వచ్చేడు. అతడు కిరస్తానపాడనీ, అతన్ని తాకకూడదనీ, మానాన్న బట్టలుతడిపించి నన్ను స్నానంచేయించేడు. మీరూ ఆ కిరస్తానప్పాళేనా! అంటూ కొంచెందూరంగా జరిగి కూచుంది.

లైలా :—ఏమిటమ్మో ! అంతకంతకు ప్రసంగం ముదురుతోంది. చదువులేదుగాని మనస్సుకి నొప్పి కలిగించే కొంటెప్రశ్నలు మహా వేస్తున్నావ్ ! ఇలాంటి పిచ్చిపిల్లకి చదువు చెప్పడం నాతరంకాదు బాబూ! అని గొణుక్కుంటూ కుర్చీదిగి వెళ్లిపోయింది.

ఈనాటికి చదువుగండం తప్పిందికదా అని లలిత చంకలెగరేస్తూ, క్రిష్టియన్సుని తాకితే స్నానంచేయాలనే ఛాందసపుటూహాలు బాల్యంలోనే తనలో నాటుకుపోవుటచే స్నానంచేసి, పొడిబట్టలు కట్టుకుని, చింతపిక్కలుతెచ్చి ఆడుకుంటోంది లలిత తడిసినతల విరియబోసుకుని.

## 3

రాత్రి రమారమి ఏడున్నర ఎనిమిదవుతుంది దాసు ఇంటికొచ్చేసరికి. తడిజుట్టు విరియబోసుకుని చింతపిక్కలాడుకుంటూన్న లలితని చూసి నిర్ఘాంతపోయి, లైలాగారొచ్చేరా ? అని అడిగేడు.

లలిత :—ఆ.

దాసు :—అయితే ఆమె చెప్పిన పాఠం చదువుకోక ఇంకా చిన్నపిల్లలాగ ఆడుకుంటున్నావేం !

లలిత :—........

దాసు :—జుట్టు విరియబోసుకున్నావేం ! ఇప్పుడు స్నానంగానీచేశావా !

లలిత :—అవును.

దాసు :—చీకటిపడి స్నానమెందుకు చేయాల్సొచ్చింది!

లలిత :—కిరస్తానపాళ్లని తాకితే రాత్రేమిటి పగలేమిటి బట్టలుతడిపి స్నానంచెయ్యకపోతే ఆ మాల కూడు ఇంట్లో కలుపుకుంటామా!

దాసు :—ఏమింత వెఱ్ఱిదానవు! క్రిష్టయన్సును తాకితే బట్టలుతడిపి స్నానంచెయ్యాలి! ఎవరునేర్పేరు నీకీ ధర్మాలూ ఆచారాలూను!

లలిత :—.........

దాసు :—ఇంతకూ మాస్టరమ్మదగ్గిఱ ఏదేనా పాఠం చెప్పుకున్నావా లేదా!

లలిత :—.........

దాసు :—మాట్లాడవేం!

లలిత :—లేదు.

దాసు :—ఏం!

లలిత :—ఆమె కోపంవచ్చి వెళ్లిపోయింది.

దాసు :—కోపమెందుకు! నువ్వామెనేమేనా అన్నావా!

లలిత :—.........

దాసు :—ఏదోవుంది. సరే రేపు ఆమెనే అడిగి తెలుసుకుంటాలే. పద అన్నంపెట్టు. అని భోజనం చేసి, వాకట్లో కుర్చీవేసుకు కూర్చుని, వేగం అన్నంతినిరా. నీచేత ఓ పుస్తకం చదివించాలన్నాడు దాసు. ఆమె చేతుల్లోంచి తప్పుకున్నా ఈయన చేతుల్లోంచి తప్పేటట్టులేదురా భగవంతుడా అని లలిత గుండెల్లో రాయిపడింది. భోజనంచేసి వంటయిల్లు చక్కబెట్టి పిల్చిన ఒకగంటకి వచ్చి కొంచెందూరంలో నుంచుంది.

దాసు:—అలా దూరదూరంగా నిలబడతావెందుకు! ఇలాదగ్గిఱగా వచ్చికూచుని ఈపత్రికపై పేరు చదువు. అంటూ హిందూసుందరిచ్చేడు చేతికి.

లలిత:—పదినిమషాలుకూడబలికి వధూసుందరి అనిచదువుతుంది.

దాసు:—హఠాత్తుగావచ్చిన నవ్వుఆపుకుని, వధూసుందరికాదు హిందూసుందరి.

లలిత:—కొంచెంతప్పుల్తో మళ్లీఆలాగే చదివి, వెఱ్ఱిగా దాసుముఖంకేసి చూస్తుంది.

దాసు:—చిన్నప్పుడు మీవాళ్లేమీ చదువు చెప్పించలేదూ! అన్నాడు విసుగూ అసహ్యమూ ద్యోతకమయే చిన్నవ్వుతో.

లలిత:—లేదు

దాసు:—మరేమిటి చేస్తూఉండేదానవు?

లలిత:—మాఅమ్మ వెనకాల ఆపనీ ఈపనీ సాయంచేస్తూ ఉండేదాన్ని. పెరట్లో పశువుల పేడకూడేసి పిడకలుపెట్టేదాన్ని.

దాసు:—దినమంతా పనేఉండేదా! తీరికగా ఉండేటప్పుడేంచేసేదానవు?

లలిత:—పనంతాచేసి, తీరికగా ఉండేటప్పుడు, నరుసూ వెంకీవాళ్లతోనూ చింతపిక్కలూ వామన గుంటాలూ గవ్వలూ ఆడుకుంటూ ఉండేదాన్ని. అంది వికటంగా ఆవలిస్తూ.

దాసు:—సరే, నిద్దరొస్తోందిగామోను పోయిపడుకో అనిచెప్పి, తనపరుపుమీదపడుకుని, "ఇలాచిన్న నాటినుండి చదువూ వివేకమూ నేర్పించకుండా పాడుచేసేరు. బాల్యంలోలేనిదే ఇప్పుడెంత నూరిపోస్తేమాత్రం చదువొస్తుంది! వినేవాళ్లకూ చెప్పేవాళ్లకూ తలకాయ నొప్పేగాని! అలాగని నిరుత్సాహపడినా ప్రయోజనం లేదు! సాధ్యమైనన్ని ప్రయత్నాలు చేయడంనావిధి. విద్యాబుద్ధులు అలవడ్డాయా ప్రయత్నం ఫలించినదని సంతోషిస్తాను. లేదా ఆభగవంతునికో నమస్కారంపెట్టి ఊరుకుంటాను, ఇలాటిదాన్ని మెడకుముడివేసి నందుకు" అనే ఆలోచనలతోటీ, కలత నిద్దురలతోటీ దాసుకి ఆరాత్రి గడిచింది.

మఱుచటిరోజు దాసు హార్బరునుంచి ఇంటికొస్తూ తోవలో శైలాగారింటికెళ్లేడు, జరిగినసంగతేమిటో తెలుసుకోవాలని, ఆమె—భర్తా అంతకుకొంచెముందుగానే బడినుంచొచ్చి, బట్టలుమార్చి, పిల్లలాడు కుంటూంటే ఆవినోదంచూస్తూ ఏమో ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూన్నారు. వరండాపై కుర్చీలలో కూచుని దాసు గేటుదగ్గర నిలబడి లోపలికిపోవడానికి సందేహిస్తూంటే, శైలాచూసి 'లోపలికిరండి దాసు గారూ' అనిపిలిచి, తమకెదురుగా ఉన్న ఓకుర్చీ చూపింది. దాసు లోపలికెళ్లి, తనకు నిర్దేశింపబడిన కుర్చీలో కూచుని, కొంతసేపు ఆమాట ఈమాట అయినతఱువాత 'ఏమండీ మీరు నిన్న కోపంవచ్చి పాఠంచెప్పకుండా వచ్చేసేరట!' అన్నాడు శైలాతో.

శైలా:—అవునండీ! ఆపిల్లమాటలుచూస్తే ఎవరికేనా కోపంవస్తుంది. ఆమెకు చదువుమీద శ్రద్ధలేదు సరిగదా వివేకంకూడాలేదు! చదువమ్మాఅంటే ఆడాళ్లకు చదువెందుకంటుంది! ఏవేవో అనవసరమైన ప్రశ్నలు వేస్తుంది. మనస్సుకి నొప్పికలిగేటట్లు మాట్లాడుతుంది!

దాసు:—ఏమందేమిటి!

శైలా:—ఆమెనే అడగండి! ఆమాటలు అనవలసినవో అనరానివో మీకే తెలుస్తుంది!

దాసు:— అదికాదమ్మ! అవేమిటోచెప్తే, తప్పంటే అలాఅనకూడదని బోధపఱిచి, ఇకమీద అలాటి అత్యాచారం చెయ్యకుండా చేస్తాను.

శైలా:—మళ్లానానోటినుండి ఎందుకనిపిస్తారు దాసుగారు! మీరు ఇంతగాక ఇంతచెప్పండి ఆమెకు చదువుకోవాలనె అభిలాషలేదు. వివేకమంత కంటేలేదు! మీఉబలాటమేగాని ఆమెకొక్క అక్షరమేనా పట్టుబడేటట్టు కనుపించదు.

ఈమాటలు వినేసరికి పాపం! దాసు చిన్నపోయేడు. ఏమీసమాధానం చెప్పకుండా సరేవెళుతున్నా నంటూ, ఇంటిమార్గం పట్టేడు. ఇంటికొచ్చేసరికి లోపలినుండి రామరావణా యుద్ధంలాగ మహాగోల విని పిస్తోంది. ఏమిటాఅని కిటికీలోంచి తొంగిచూసేడు. చుట్టుపక్కల పిల్లలందఱూచేరేరు. కొందరు గెంతు తున్నారు. కొందఱు పాడుతున్నారు. కొంతమంది మంచాలమీద పరుపులమీద ఎక్కి దాగుడుమూతాలూ దొంగాటా ఆడుతున్నారు, వీరందర్నీ చూసి అభినందిస్తూ కొందఱు కెవ్వుమని కేకవేస్తున్నారు. ఓఅమ్మాయి దాసుకోటు తొడుక్కుని, ఓసంచీ సగానికిచింపి టోపీగా అమర్చుకుని, దొరగారొస్తున్నారండీ!

త్రోవలో లెండి! అంటూ అందరిదగ్గఱకీ వెళ్లి హంగామాచేస్తోంది. ఇదంతా చూసేసరికి దాసుకి వళ్లుమండు కొచ్చింది. గభాల్న తలుపు తెఱుచుకొని 'ఇదిగోనట్టా దొరగారొస్తున్నారు, ఉండండి ఒక్కొక్కర్ని వీపు పగలేస్తా' నంటూ చరచరా లోపలికెళ్లేడు. పిల్లిని చూసిన ఎలకల్లాగ, దాసుని చూసేసరికి స్తంభంచాటు నొకరూ, మంచంకింద నొకరూ, ఒకరివెనకాలొకరూ దాక్కున్నారు. గడుసుపిల్లలు వీధులో పడాయించేరు, లలిత బిక్కమొహం వేసుకుని, చేతులు నులుముకుంటూ, అలా నుంచుంది.

దాసు:—(పిల్లల్నందర్నీ వీధులోకి పంపించేసి, లలితకేసి చూసి) ఏమిటీ గోల! వీళ్ళనందర్నీ ఇంట్లో కెందుకు ప్రవేశపెట్టేవు!

లలిత:—నాళ్లేంగోలచేసేరు! ఏమీ ఊసుపోకుంటే ఆడుకుందాం రమ్మని పిలుస్తే వచ్చారు.

దాసు:—పాపం! ఆడుకునేందుకు ఇంకా చిన్నపిల్లవు! ఆటకి వేళా నియమాలు అక్కర్లేదూ! ఇలా వానరసైన్యాన్నంతా ఇంట్లో పెట్టి గగ్గోలచేయించరెవరూను. కావన్నా ఆ చిన్నగుంటలతో ఆటేమిటి! నీ యీడువాళ్ళా! జోడువాళ్ళా! చదువుకోమనీ, పనీపాటా నేర్చుకోమనీ నేచెబితే, ఇలా పసిపాపల్ని పెట్టుకుని ఆడుకుంటున్నావా! నిన్న మాస్టరమ్మొస్తే ఏవో పెళుసుమాట్లాడి పంపించేసేవు! నీకింకా ఎప్పుడొస్తుంది బుద్ధి! అంటూ విసుక్కుని కోటు పాగాకొయ్యని తగిలించి, ఇంటిదగ్గఱ ఏమీ తోచకుంటే అలా వీధులోకెళ్లేడు.

౫

తరువాత, ఆవూళ్లో మంచి అనుభవంగల ముసలిమేష్టర్ని పెట్టేడు దాసు లలితకి చదువు చెప్పటానికి. అతడు ఒక నెలరోజులు తన శాయశక్తులా ప్రయత్నించి, 'నాతరంకాదు బాబూ ఈ అమ్మాయికి చదువు చెప్పడమ'ని ఓ జోహారుచేసి వెళ్లిపోయేడు. పోనీ తానే ప్రయత్నించిచూస్తే ఎలాఉంటుందో అని, ఉదయమూ సాయంకాలమూ చిన్నచిన్న పుస్తకాలు చదివింపజేసేవాడు దాసు. కొంచెంకూడా ప్రయోజనం లేకపోయింది. తనభార్యకు విద్యాబుద్ధులూ వివేకమూ కలిగించడానికి ఎన్నివిధాల ప్రయత్నించాలో అన్నివిధాలా ప్రయత్నాలు చేసిచూసేడు. లేశమూ లాభంలేకపోయింది; సరేకదా అంతకంతకు మొద్దుతేనం, పెడసరంగా జవాబుచెప్పడం, ఇంటిపనుల నిర్వహించడంలో అశ్రద్ధ, పనిమనిషిమొదలు పక్కయింటివాళ్ళ వఱకూ జగడాలు దినదినానికీ అధికమయాయి.

ఇదంతాచూసి దాసుకి విసుగెత్తి అసహ్యంవేసింది. 'ఇంతకంటే ఏంచెయ్యగలం! ఆడదానికి కొంతలో కొంతైనా శ్రద్ధా వివేకమూ ఉంటే దానిపై మగాడు చేసినప్రయత్నాలు ఫలిస్తాయి. అలాటివాళ్లు ఏంచెప్పినా గ్రహించి, అలా నడుచుకుంటారు! వివేకంలేని అడవిమృగాలికి బృహస్పతి ఉపదేశించినా ఏంప్రయోజనం! చెప్పేమాట వినకపోవుటయేగాక, తిరగబడి వురిమి కరుస్తాయి!

అసలు, ఆడది జ్ఞానవతియై, విద్యావివేకాలు సంపాదించి, సంసారంలో భర్తకు చేదోడువాదోడుగా వుండి, పేరుప్రతిష్ఠలు సంపాదించి, తన జీవితాన్ని, తన్మూలంగా కుటుంబజీవితాన్ని ఆనందమయంగా చేయ గలంతటి సామర్థ్యంకలిగి వుండాలంటే, తల్లిదండ్రులు శ్రద్ధవహించి, బాల్యమునుంచీ తమ బిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పించి, మంచి శిక్షణాన్నియ్యాలి. మొక్కై వంగనపుడు, మానై వంగుతుందా! వంచినా పెళుసు విరుగుతుంది!

విద్యావివేకాలు గల కాంతామతల్లి తర్జనీ సందర్శనమాత్రానకు కుటుంబమంతా తలలొగ్గుతుంది! ఆమె మాటలలో వేదవాక్కులు ప్రతిధ్వనిస్తాయి! ఆమె నవ్వులో పండువెన్నెలలు విరిసిపోతాయి! ఆమె వసించినచోటు దివ్యతేజోమయమవుతుంది! ఆమె మెట్టినయింట్ల శ్రీదేవి అవతరిస్తుంది! అట్టి వుత్తమకాంత నిల్లాలుగా దయచేసిన పూర్వజన్మ సుకృతానికి నమోవాకము లర్పించి పురుషుఁడు ధన్యుఁడౌతాడు!

అవివేకి, అనక్షరాస్య అయిన ఆడదానితో కాపురంచేసేకంటె, అరణ్యంలో నివసించి మృగాలతో ఆడుకుంటే కొంత హాయనిపిస్తుంది. కఠిన పాషాణస్పర్శకూడా కొంత ఆనందాన్ని కలుగజేస్తుంది! ఆ యింటి కంటే పాడుగుడికూడా కొంత కాంతివంతంగా వుంటుంది!

నావలె, బాల్యవివాహ ఘోరవ్యాఘ్ర విషదంష్ట్రలమధ్య చిక్కి, ఎటు కదలుటకూ వీలులేక, సంతోషమునకూ సౌఖ్యమునకూ దూరులై, కృతకానందానికీ పశుసౌఖ్యానికీ తలలొగ్గి, ఇహలోక నరకంలో కనపడని వేదన ననుభవిస్తూ, ఎంతమంది యువకులు లోలోన కుమిలి బాధపడుతున్నారో!

ప్రభుత్వమంటే బాల్యవివాహ నిరోధకచట్టం ప్రవేశపెట్టింది గాని, సంఘంలో నీ తేదీ? అహింసా ప్రచారకులోమూల గోలపెడుతూంటే వికటాట్టహాసాలతో వారి వుపదేశాలను తిరస్కరించి, నోరులేని కోళ్ళనూ గొర్రెలనూ క్షుద్రదేవతలకు బలులిచ్చే మూర్ఖవిశ్వాసంగల గ్రామ్యజనంలాగ, ప్రభుత్వశాసనాన్ని అరకాలుతో తొక్కి, ప్రపంచజ్ఞానంలేని పసికూనల్ని ఏ మారుమూలలకో తీసుకుపోయి, సంసారరజ్జులచే వారి మూగగళాల్ని బంధించి, చిత్రవధ చేస్తోంది, వివేకమూ విచక్షణాలేని పాడుసంఘం! సంఘంలో జనసామాన్యానికికూడా విద్యావివేకాలు లేనప్పుడు ప్రభుత్వశాసనాలేంచెయ్యగలవు! ఇంతకూ, నావంటి యువకుల ఎందఱి జీవితాల్ని బలిగోరిందో ఈ పాడుసంఘం!

అనే ఆలోచనలతో దాసుమతి చలించిపోయింది. ఇదివఱలో ఎంత చుఱుకుగాను వుత్సాహంగాను వుండేవాడో అంత మందుఁడైపోయేడు. పూర్వంలాగ స్నేహితులతోనూ పరిచితులతోనూ మాట్లాడడమన్నా, ఏ సమావేశంలోనైనా పాల్గొనడమన్నా దాసుకి ఎంతో జంకూ భయం కలిగింది. ఏదో అపరాధంచేసి లోకులకు తెలిసిపోయిన అభిమానస్థుడులాగ, విచారమంతా మూర్తీభవించినట్లు, అప్పుడప్పుడు సాయంకాలం బీచిని కనిపిస్తూ వుంటాడు!



# భారత భాగ్యవిధాత



భావిదినముల శాంతికై భరతభూమిఁ
దిరముగా నిల్ప దలచెడు ధీవిశాలు
పరమ శాంతాత్మగుణమూర్తి భావవీథి
నంజలిని గొల్తు గాంధికి యణకువప్రజ.

రమ్యవాగ్వాణి వెడలెడు రాగమూర్తి
సత్యహింసల నైక్యాన సంఘటించు
పేద హరిజనుపాలిటి పెన్నిధియని
కరము నంజలి ఘటియింతు గాంధిగనుచు.

తనుపు శౌర్యంబు శీలంబు ధర్మమెనని
పజ్జనిల్చునో మూర్తిని బరిఢవిల్లి
యట్టి గుణఘను గొల్లాయి యంగధారి
ప్రీతి హృదయాన నెఱుగుదు ప్రేమమీఱ.

భాగ్యభోగాలఁ దృణముగాఁ బాఱద్రోలి
సత్యాహింసల వ్రతముగా సల్పునట్టి
మాని మందస్మితానంద మధురమూర్తి
శాంతిదూతను 'బాపుజీ' సన్నుతింతు.

విధిగ వేకువ భగవాను విడువకెపుడు
ప్రార్థనను బుచ్చి కార్యంపు ఫలముగనుచు
యోగదృష్టిని భరతాంబ నుజ్వలస్థితి
నుంప చింతిలు గాంధికి యొదిగియుందు.

ధాతృగతి భారతావని దగవెలింగి
పండితుని మ్రోల సర్వంబు పలికి పిఱుద
కార్యనిర్ణయ మొనరించు గాంధిదేవు
పావనాత్మకు నంజలి బరపినిలుతు.

తగువులన్నియు నశియించి ధరణిలోన
నెల్ల జనులైక్యకాములౌ యింపుతోడ
భారతావని 'బాపుజీ పండితులకు'
సంతసముఁగూర్ప సతతంబు సాగునట్లు
ఈశుఁ డాశీర్వదించుత యించుప్రీతి.

—శ్రీ వక్కలంక రామాబాయి

# భారత స్త్రీ దృక్పథము మారవలెను

శ్రీమతి డి. అనసూయాదేవిగారు

సృష్టిలో స్త్రీ పురుషులలో ఒకరు అధికులు, ఒకరు హీనులు అను భేదములు కల్పింపబడలేదు. సహజధర్మములను సరిగా నిర్వర్తింపకుండుటచే నీ భేదభావము లేర్పడినవి. స్త్రీ పురుషులిద్దరును సమానదృష్టితో సహాయమొనర్చుకొనుచు సంసారయాత్రను జరుపుటయే సంఘమునకు శ్రేయోదాయకము గాన స్త్రీలు తమ సహజధర్మములను గుర్తించి సంఘాభివృద్ధికి సహాయపడవలెను.



భారతనారి తన ఔన్నత్యాన్ని గుర్తించుకోలేక, పాశ్చాత్య వ్యామోహమునకు లోనై యొనర్చుచున్నట్టి అత్యాచారములు శోచనీయములు. ఎవరుగాని యేపనినిగాని విమర్శించి చేయుట శ్రేయస్కరము. మన స్త్రీలలో యీ స్వభావము చాలతక్కువ. ఒకరేదేని చేసిన అందలి మంచిచెడ్డలను విచారింపకయే, ఆ పనికి అందరూ గడంగు వేలం వెర్రి యెక్కువ. అందు ముఖ్యముగ నాగరికత విషయంలో యేక్రొత్త ఫాషను కనుపించినా అందరూ దానిని స్వీకరించటం పరిపాటైపోయింది. తనకుగాని తన సంఘమునకుగాని యేవిధమైన కష్టనష్టములూ చేకూర్చనపుడు ఆ వేషాలూ ఆ ఫేషన్లూ యేమిచేస్తాయని కొందరనవచ్చును. కేవలము బాహ్యామార్పులే కాకుండా ఆంతరంగిక మార్పులుగూడా పెచ్చుపెరిగిపోతున్నాయి.

అన్యదేశ కాంతలవలెగాక, మన హైందవ సాధ్వీమణుల గుణగణము స్తవనీయమైనది. సహన, సద్గుణ, త్యాగ, శీలములు వారి సౌందర్యము నుద్దీపింపజేయు అమూల్యాభరణములు.

ఆరోగ్యత ననుసరించిన నాగరికత ఆచరణార్హమైనదే. ఆ శరీరశుచిత్వముతో పాటు మానసికశుచిత్వంకూడా వుంటే పరిమళముగల పూవువలె సార్థకమవుతుంది. నేటి నాగరికతలో అట్టి సార్థకత్వ మతిక్షీణంగావుంది. కృత్రిమం జాస్తీగావుంది. ఆకృత్రిమ వేషభాషలకు భ్రమించి తన దివ్యస్థాన విధ్వంసము గల్గించుకొనుచున్న భారతకాంత స్థితి తన నిలయమును సంస్కరించుకోలేని మణిమయమందిర నివాసివలె తళుకుబెళుకుల మెరుపులుగని తబ్బిబ్బయినట్లున్నది.

లోకము స్త్రీజనాభ్యుదయాన్ని కాంక్షిస్తూంది. ఆ కాంక్షవల్ల స్త్రీలకొకింత స్వాతంత్ర్యాధికారా లేర్పడ్డాయి. ఈ యవకాశమెట్టి మహదాశయముతో లభించెనో యోచించకుండా గర్వముతో స్త్రీలు పురుషులవలె స్వేచ్ఛావర్తన నభిలషించుట యశస్కర మెంతమాత్రము గాజాలదని అంటే యిపుడు కొందరు నన్నిట్లు ప్రశ్నింపవచ్చు. స్త్రీలకు బానిసత్వ జీవితమే వాంఛిస్తున్నావా? అని. అందుకు జవాబిస్తాను. స్త్రీ బానిసత్వ మెవరికి చేస్తూంది? తన ప్రియునకు తన ప్రేమఫలములగు బిడ్డలకు. ఇది బానిసత్వ మెందుకవుతుంది? గతిలేక చేసినది బానిసత్వముగాని మనస్ఫూర్తిగా చేసినది బానిసత్వము కాదు. కాని అలా భావించడానికి కారణం వేరుగావుంది. స్త్రీ తన మనస్ఫూర్తిగా వలచిన పురుషుణ్ణే పెండ్లాడితే అతనికిజేయు సేవ బానిసత్వంగా పొరపాటునగూడా భావించదు. ఇది హిందూసాధ్వియొక్క సహజగుణం.

విదేశీయులు ప్రేమార పెండ్లాడిగూడా తదుపరి గల్గిన విభిన్నరుచులకై విడాకులు పొందుతారు. అందులో పవిత్రభావము లేదు. బుద్ధిపూర్వకముగా కోరి యొకసారి యిరువురి ప్రేమలతలూ కలుపుకొన్న తరువాత యేకారణముచేతనేని అందొకరిలతకు చీడపట్టిన రెండవవారు దానిని విదలగొట్టి బాగుజేయ యత్నించకయే తనలతను పెకలించుక పారిపోవుట స్వార్థపరత్వబుద్ధిగాని వేరుకాదు. మనజీవితము లశాశ్వతములు. అట్లు నిలకడలేక చరించుచో హృదయము స్థిరస్థాయియై సుఖించునదెపుడు? మానవులు తృప్తిని, సహనమును వీడిరేని యెన్నటికీ నిజమైన ఆనందాన్ని పొందజాలరు. కావున చపలత్వమును సూచించు విదేశాచారములకన్న మన సాంప్రదాయమే మహత్వమైనది. అయితే అక్రమ వివాహ ఘోరాచారము అననుకూలతను పాడుచేసి మన సాంప్రదాయమునందుగల యతులితానందమును అంతమొనరించి విదేశాచారముల నభిలషింపజేయుచున్నది. మన సంఘములోనున్న యీ దోషమును గుర్తించలేక విదేశ సాంప్రదాయము ననుసరింపజూచుట బుద్ధిహీనతగాని వేరుగాదు.

ప్రస్తుత నాగరికతారాధకులగు యువతులు బిడ్డలకు పాలివ్వ నిరసించుచున్నారు. ఇది అన్నిటికన్న హేయమగు ఆచారము. భగవంతుడు పసిపాపలకుగాను యేర్పరచిన పాలను అరికట్టుటలో అర్థమేమిటి? తన యవ్వనము సడలుతుందనేకాదూ? ఆశ్చర్యము! ప్రేమమూర్తియగు మాతృదేవిలో గల్గిన యీమార్పు అత్యాశ్చర్యము. క్షణికమైన విషయసుఖములకు లోనై పిల్లలకు పాలివ్వక ప్రక్కలో జేరనివ్వక శృంగారవతులై పాన్పుజేరడం! ఆరునెలలైన గడువకముందే బాలింత చూలింతగా మారడం.

ఈవిధంగా సృష్టించిన సంతతియొక్క వృద్ధెలావుంటుంది? పోతపాలతో పొట్టలు పెరిగి, కాళ్లూ చేతులూ సన్నగిల్లి, సరియైన పోషణలేక దాసీల చేతుల్లో కుదిలింపులు బడుతూ నీరసంగా కాలవాహిని నీదుతుంటారు. ఆ చీదరగొట్టు బిడ్డలకిక ఆ ఫాషన్ల మాతరచించు కృత్రిమవేషాలెట్లుంటాయి? నీళ్లులేక వాడిపోతూన్న తరుపత్రములకు సౌందర్యాభివృద్ధి చేయదలచి రంగులు చిలికినట్టు.

సృష్టిలోనే యిట్టి పోషణ నందుతూవచ్చిన వారు ముందెట్టి ఆరోగ్యజీవితము గడుపుదురో యోచించండి. నాగరికతయని యిట్టి వికృతచర్యల జేయుచున్న యీ తల్లుల కించుకైన జ్ఞానమున్నదా? కటకటా? అన్ని దేశములలో వన్నె కెక్కిన ఆంధ్రమాతబిడ్డల అంతరాత్మలు నేడు పడమరగాలి మాహాత్మ్యముచే పతితమయ్యెగదా?

యేమిమార్పు, సారసాక్షులకు వినీలకుంతల సౌరభ్యముగూడ వెగటుగ దోచుచుండె! తెల్లవారివలె గిరజాజుట్టొక ఫ్యాషనయ్యె. చలిదేశీయులగుటచే వృద్ధిపొందక మెర బారి వుంగరముతిరిగిన వారజుట్టు నొక ఫాషన్గా భావించి దీర్ఘములై యిందుముఖుల కందము చేకూర్చు చక్కటి కురులను కత్తిరించుకొనుటెట్టి వింత! ముచ్చటగ సుమసమితి నిడుకొను భాగ్యము లేదయ్యెగదా? అవి లేనివారు విచారించుచుండ, అదో అందమని భ్రమసివున్న వారూడగొట్టుకొనుటలో వారియొక్క విశేషవిచక్షణావిహీనత విశద మౌతూంది గాని వేరుగాదు.

నేడెల్లెడలా స్త్రీ స్వాతంత్ర్యము కావాలనే ఘోష ప్రతిధ్వనిస్తూవుంది. ఆ ఘోష విని స్వరాజ్యాన్నేలదలచి సమరసన్నద్ధులగుచున్నారు, కొందరు వీరనారీమణులు, పురుషులను జయించి స్వేచ్ఛారాజ్యం చేదామనే ఉబలాటంతో. యీ కోర్కెతో అష్టకష్టాలుపడియే కొందరైనా విజయాన్ని పొందుతారే అనుకొందాం అపుడు పరాజయాన్ని పొందిన పురుషులతో సంబంధంల్లేకుండా వుండటం పొసగుతుందా? అది అసంభవం. అలాగైతే సృష్టికే వినాశమొస్తుంది. యింక ప్రపంచమేముంటుందీ? అది గమనించియే సృష్టికర్త స్త్రీ పురుషులకు పరస్పరానురాగం స్వతస్సిద్ధంగా యేర్పరిచాడు. దాన్ని మనం నశింప జేసినా నశించేది కాదు. ఎలాగూ స్త్రీ పురుషులకు జంటజీవితం తప్పదు. అలాంటప్పుడు అందొకరు అధికారపదవినీ రెండవవారు సేవకపదవినీ స్వీకరించుట అన్యాయం, అఘాయిత్యం.

ఇంతవరకు అధికారపదవిని పురుషులధిష్టించారు. దయాదాక్షిణ్యాలు లేకుండా తమ ఆధిపత్యాన్ని చలాయించుకొన్నారు. ఇపుడు వారి ప్రవర్తన వారికి అక్రమంగా

తోచింది. స్త్రీల స్థితికి జాలి కల్గింది. వారిని వృద్ధిలోకి తేవాలనే కోర్కె పుట్టింది. ఇట్టితరి స్త్రీలేమి చేయాలి? ఇదే సందని అధికారపదవికి లంఘింపజూచుటయా?

మానినీమణులారా? మన మతిసహనముతో జీవితాన్ని పరమార్థముగా విని యోగించగలం. యెంత కష్టమైనా యెంత చీదరైనా యెట్టి బాధలైనా, భూదేవివోలె సహించుకోగలం. ఈ మహోత్కృష్ట గుణములు, పురుషులకు తలక్రిందుగ తపస్సుజేసినా లభించవు. అల్లాంటప్పుడు మనము పురుషపథాన్ని పొందగోరటం దేనికి? వారికంటే మన పథమే ఉన్నతమైనదని తెలిసికోలేకనే గదూ?

ఉన్నతపదవిని తగ్గించుటకన్న తక్కువపదవిని వృద్ధిపొందించుట శ్రేయస్కరము కాదా? కావున మనము పురుషులవలె తిరుగదలచి క్రుంగిపోవుటకన్న, పురుషులు మనపద విని గ్రహింపజేసిన చాల మేలగును. అంటే, గృహపారిశ్రామికాది విషయములలో గాదండి, మానసిక ప్రవృత్తిలో. స్త్రీ పురుషులలో ఒకరు తామధికులమనే అహమును దాల్చియున్నంతకాలమూ కుటుంబశాంతిగాని ప్రపంచశాంతిగాని కల్గనేరదు. స్త్రీ పురుషుని స్థానం కావాలనే పిచ్చివాంఛ పెట్టుకొనుటకన్న, స్త్రీ సంఘములోని దోషములను సరిజేయ నెంచుట మంచిది.

ఎన్నటికేని ధర్మము జయముగాంచకపోదు. పురుషుల హృదయములలోని స్వార్థ పిశాచము నశింపకపోదు. అప్పుడాంధ్రదేశము శాంతి సౌఖ్యములతో తులతూగకపోదు. ఆ అమృతమయ యుగాగమనముకొరకై మనమెల్లరమూ దేవదేవుని ప్రార్థిద్దాము; శక్తి వంచనలేక ప్రయత్నిద్దాము; ఇదె మనమొనర్పవలసిన కార్యము. ఇదే జగత్కళ్యాణ దాయకమగు స్త్రీ కర్తవ్యము.

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగ నున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప కోరుచున్నాము.

సంపాదకుడు.

# చివరకెల్లావచ్చింది మనగతి

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

'ఆఖరికి దేశవిషయాలేకాకుండా, సాంఘికవిషయాలు, మతవిషయాలు, జాతివిషయాలు, తుదకు ఇంటి సంసారవిషయాలుకూడా, శాసనం, చట్టం అనవలసిన స్థితికి వచ్చింది మనగతంటూ' కమల 'గృహలక్ష్మి' మొదలగు కొన్ని పత్రికలు తీసుకువచ్చి తన స్నేహితురాలైన కాంతానికి వినిపించింది.

కాంతం అట్టే పత్రికాపరిచయంలోను, లోకజ్ఞానంలోను సావకాశంలేని, సంసార తాపత్రయంలో కొట్టుకునే గృహిణీ లోకంలోయుండుటచేత, కమలకంటె విద్యలో వెనకడుగే. అందుచేత 'ఏమిటీ సంసార విషయాలుకూడా చట్టమనడమేమీ' అంది ఆదుర్దాగానూ, గాభరాగానూ. కాంతం తొందర చూచి, కమల నవ్వింది. 'నీకంతా చెప్పాలంటే గంటపడుతుంది. పనితొందర తీర్చుకొనిరా. కూర్చుని చర్చించుకుందా' మని కమల కాంతంవేసిన చాపమీద తిష్టేసుకొని కూర్చుంది.

కాంత మింతలో భర్తకు ఫలహారం తయారుచేసిచ్చి ఆయన నాఫీసుకుపంపించి, చంటిపిల్ల నుయ్యాలలో నిద్రపుచ్చి, దాసికి అంట్లువేసి, ఇంకను సర్దుబాటు పనులున్నను, స్నేహితురాలొచ్చి కూర్చుందన్న ఆవేశంచేత, ఉన్నవానక చేసుకొనవచ్చునని తలచి కమల దగ్గిరకు వచ్చి కూర్చొనెను.

కమల, 'గృహలక్ష్మి' పుటలు తిరగేస్తూ, 'చూడు కాంతం. విజ్ఞానానికి, వివేకానికి, వైరాగ్యానికి, ధర్మప్రవర్తనలకు, సత్యానికి, వేదాంతానికి, శీలానికి, పవిత్రతకు, భక్తికి, ముక్తికికూడా అనాదిసిద్ధంగా, యుగయుగాల వేలసంవత్సరాలనుంచి కర్మభూమిగా పేరుబడ్డ మనహిందూదేశాని కీనాటి కిట్టి అనర్థపు చట్టపు మొట్టికాయ లవసరమయ్యాయి. ఎందుచేతో చెప్పగలవా? కాంతం!'

'ఎందుచేతేమిటి! పూర్వం మన మాతృవిద్యలోనే, దేశవృత్తులలోనే, ఇతర జగమెరక్కుండా బ్రతికారు. పురాణాలు, చరిత్రలు, భూగోళాలు, మంత్రతంత్ర శాస్త్రాలు అన్నీ మనదేశంవారివే. అందుచేత, మన మతం, మనధర్మం, మనశీలం మనపవిత్రం నిలబడింది. రాజశాసనాలు, శిక్షలు అక్కర్లేకుండా, మనుశాస్త్ర విధినిషేధాల ధర్మనీతిగా మానవులు కట్టుబడి ప్రవర్తించేవారు. వారొకరికి చెప్పి బ్రతికేవారుగాని, ఏ విషయంలోను, ఏ విజ్ఞానంలోను, ఏ శాస్త్రంలోను, ఏ వ్యవహారిక, సాంఘిక, సంసారిక పరికరాలలోను ఒకరిచే చెప్పించుకోలేదు. ఒకరివలన నేర్చుకొనవలసిందిలేదు. ఇప్పుడో పడమటిసంపర్కం, పడమటిగాలి, పశ్చిమ విద్యావిధానం, వారియందలి వ్యామోహం కలిగినందుకు వచ్చిన ఫలితానర్థమిది. తల్లి చెవులు కొరికి పినతల్లికి పిండప్రదానంచేసినట్లుంది. మనజాతీయ సర్వవిజ్ఞాన కళాపరిశ్రమలు మరచిపోయి, విదేశవస్తు తత్వవిచారంలోపడి భ్రమసి, వారాచారాలు, వారి నడవళ్లకు మురిసి, ఆత్మీయనిగ్రహం జారబెట్టుకొని చేచేతల కులశీలధర్మాలకి నీళ్లువదలుకొని, జాతిమత కక్షలతో కొట్టుకొంటూ ఐకమత్యం విడిచి, తల్లి నేడ్పించి, పేదవారి భాహ్యాడంబర రూపాగ్నికి శలభప్రాయులై నశించు ముగ్ధత్వం కలిగుండుటచేత వచ్చిన అవినీతి పదివేల సంవత్సరాలక్రితం మనవారు చేసిచూపించిన పనులిప్పుడు పెరవారుచేస్తే మనకు చేతకానట్లు, సమస్త విజ్ఞానసంపన్నం పడమటివాళ్లకేయున్నట్లు, ఆశ్చర్యంగా మురుస్తూ నేర్చుకోవాలని తంటాలుపడుచున్నాం.'

'కమలా! నీకు పత్రికాపఠన, విద్యాభివృద్ధి అవకాశం వుండుటచేత ప్రపంచ సంగతులెట్లు కాలానుసారం మారుచున్నాయో, ఎప్పటికప్పుడు తెలిసికొంటున్నావు.

నాకీ సంసారసముద్రంలో మునిగుండుటచేత ప్రపంచమే తెలియుటలేదు, తీరికలేదు. కుడితిలోబడ్డ ఎలుకలాగ వెనుక దక్షులలేకపోబట్టి ఇల్లు, పిల్లలు, అన్నీ నా ఒక్క చేతిమీదే. పోనీ నీయట్టి విజ్ఞానవతి సహవాసం వుంది. చెబుతుంటావు విందామంటే స్థిమితంలేదుకదా? అప్పుడే పిల్ల కదుల్తాంది. బడినుండి పెద్ద పిల్లలొచ్చే వేళయింది. ఏమయినా పెట్టమంటారు. మావారు ఆఫీసులో పని చేసిచేసి యింటికి వస్తారు. వెంటనే వడ్డించమంటారు. అప్పుడే నాలుగైంది. చూచావా నాకాళీ. ఇంకెప్పుడు చదవను, ఎప్పుడు విసను. నాలాంటిది దేశానికేం వుపకరిస్తుంది, గృహపరిశ్రమలేంచేస్తుంది, లలితవిద్యలేమి నేర్చుకుంటుంది? దేశానికి సంఘానికి, వుపయుక్తమగు చేతివిద్యలకు, గృహిణీ ధనసమార్జనానికి,నీయట్టిదే అనుభవశాలి తోడ్పడాలికాదూ కమలా !’

‘కాంతం ! కొన్ని పత్రికలు చదివినంతమాత్రాన నావంటిదిమాత్రం ఏమిచేయగలదు. నాకు సంసారం లేదా? ఎట్లొచ్చే పిల్లలులేనిదాన నగుటచే చదువుకొనడానికి, ఏ మీటింగులకైనా వెళ్లుటకు వీలుందికాని సంస్కరణలో నేనేంచెయ్యగలను. మనం ఈలా పాడై అన్నిటికి పరహస్తాలపాలై, సంసారగుట్లు, ఆ చంద్రార్కం పాంచభౌతిక, వేదమంత్ర శాస్త్రవిధి బద్ధములగు దాంపత్య ధర్మాలుకూడా, అవినీతి ప్రవర్తకు లగుటచేతను, పురుష సంఘబల సమర్థతాధికారంచేత, అధికార రీత్యాశాసనంచేయించుకోవలసిన గతి పట్టింది కదాయని విచారిస్తున్నానంతే. మునుపు అప్పుపుచ్చుకుంటే ఫలానప్పుడిస్తాను. నీవింతిచ్చావు. అన్ననోరే కాగితం ప్రామిసరీనోటు అయేది. ఆలా మాటతప్పకుండా నిలబెట్టుకొని, మోసగించక బుణమొక రణమను కొని యిచ్చేసేవారు. సనాతనులకు యీ కాగితాలేవీ? పౌరాణికయుగంలో వ్రాతలన్నీ తాటాకులమీదే కదూ. గంటంతో వ్రాసి వ్రాసి ఒక్కప్రతి దాచుకొనేవారు. ఎందులకు? అప్పట్లో తన తోటివారలకు చెప్ప వలసిన దుస్థితేలేదు. అందరూ ధర్మప్రవక్తలే. అధర్మం తలెత్తిందీ అంటే, భగవదవతారం సంభవమగుట అసురాధర్మనిర్మూలమై తిరిగి ధర్మం నీతి నిలబెట్టుట జరిగేవికాని, ఇప్పటిలాగ చేతకానితన మెక్కడుంది. దేశం నిలబెట్టుకోలేదు. రాష్ట్రం నిలబెట్టుకోలేకపోతున్నాం సరికదా, తుదకు సంఘం, సంస్కారంకూడా స్వంతంగా నిలబెట్టుకోలేనంత చేతకానివారమయామంటే, ఎంత సిగ్గు! ఎంత చిన్నతనం!! ఎంత శోచ నీయం!!! ఎంత చులకన!!!! ఎంత అపనిందో గమనించు. ముందుముందు మనవాళ్లీలా సర్వశూన్యులవు తారని యూహించే, పూర్వీకులు న్యాయశాస్త్రాలు, పురాణధర్మాలు, ఏకపత్నీత్వ పతివ్రతాధర్మాలు మొద లైనవి వ్రాసిపెట్టేరు. వాళ్ల విద్యలు, స్వానుభవ రత్నపేటికలు, మన యుగాలకి పనికివస్తాయని దాచియుంచిన రత్నాలనుకూడా ఇమిటేషన్ విద్యారాళ్ల వ్యామోహంలోబడి, గ్రహింపులేక గులకరాళ్ల క్రిందచూస్తూ కాళ్లతో తన్నుకుంటున్నాము. పరుల ననుకరిస్తున్నాం. సజీవగ్రంథాలను విడిచి, నిర్జీవపువ్రాతల నామోదిస్తు న్నాము. దీనికితగ్గ ఫలితమే మనకబ్బుతూంది విన్నావా కాంతం’ అంది కమల ఆవేశంతో.

“విన్నాను. ఎంత అయోమయంలో యున్నా, అప్పుడప్పుడు దేశ సాంఘికపరిస్థితులు నీవల్ల, మావారివల్ల వింటూనే యున్నాను కమలా! గుండె నీరవుతూంది. మొన్న మావాళ్లింటికి పెళ్లికి వెళ్లాను. ఆ యూళ్లో ఓ సినీమా, ఓ నాటకం చూచాను. ఐదురోజులూ గ్రామాఫోను పెట్టారు. నీవు నిర్జీవ గ్రంథాల రచనలంటే జ్ఞాపకంవచ్చింది. నాటకం రసపుత్రవిజయం, మనలో ఉన్నదున్నట్లు చరిత్రవ్రాయడ మలవాటింకా యుంది. సత్యేతరాలు, ఊహించినవి, అసలుకంటె హెచ్చుచేసే పొగడ్తలు వ్రాయడంలేదు కాని, నిజమున్నా, మాంసం తింటున్నారని, ప్రేగులు మెడకువేసికోవడం బాగుంటుందా? అల్లాగే సత్యమున్నా హితవున్నవి,

లోకమనుసరింపతగ్గవీ, ఆదర్శనీతిగలవి వ్రాయాలి, చూపించాలి, చిత్రించాలి కాని, సంఘలోపాలను హేళన చేస్తే బాగుంటుందా? సరిజేయాలని మనస్సా పాటుబడి. ప్రబోధించి, మందలించి దిద్దాలి కాని వీధినిబెట్టు టొక గొప్పా! మరింత పరుల పరిహాసానికి పాత్రులవడం తప్ప మరేముంది. రసపుత్రవిజయంలో విమల క్షత్రియవంశ సంజాత. ఉత్తమకుల సంభవురాలగు విమల అక్కని, బలవంతానో, ఇష్టముగానో, ఔరంగ జీబు పెళ్లాడుట నిజచరిత్రే. తాను పెళ్లాడమే కాకుండా, తన చెల్లెలినికూడా, మతేతరుడగు తురకకిచ్చి పెళ్లి చేయాలని తలచే అక్కగారెచ్చటనైన యుండునా? అట్టి ధర్మేతర వివాహానికి, యుద్ధాలు, ఖైదులు, చివరకు వుత్తమ క్షాత్రధర్మం నిలబెట్టారుతే? ఇట్టి నాటకాలు, సమభావులగుటచే మనవారాడుచున్నారు. ప్రేక్షకలోకం విమర్శనజ్ఞానం లేకుండా ఆమోదించి చూస్తున్నారు. ఇట్టి నిజచరిత్రే కదా? మహా వీరాధి వీరుడగు ఛత్రపతి శివాజీయొక్క వీర సత్యశౌర్య గుణసంపన్నతకు మెచ్చి రోషనార, వివాహమాడ నిశ్చ యించినది. ఏకపత్నీవ్రతుడగుటచే శ్రీ శివాజి అంగీకరించలేదు. ప్రేమ ప్రణయినియగు రోషనార, విఫ లయై నిరాశాభి మానపూరితయై, యుద్ధముచేసి తుదకు శివాజీ చేతిమీదుగా నిర్యాణమొందినది. కథ జరిగిందే అయినా మహమ్మదీయుల మతాభిమానం, పట్టుదల, ఆకథ నాటకరూపకంగా ప్రేక్షకలోకానికి చూపించ కూడదని ఏకగ్రీవంగా కట్టు గట్టి ఆపుచేసేసారు. మనకా శౌర్యమేది?

ఇక సినీమాలోకం చూదామాఅంటే అన్ని ఎరగనివాళ్ల కేరువులెట్టేవే. శృంగారరసం, నవరసాలలో ఒకరసమైనా మితిమీరిన రచనారూపకాలు ఖండింపబడితేనే కాని లోకం బాగుపడదు. పైగా మనసంఘములో వితంతువు అవస్తే భరింపరానిది. దానికితోడు కేశఖండనం అనే ముండనకర్మ మరింత. స్త్రీలోకానికి ధుర్భరమైన జీవితావస్థ అమంగళ స్త్రీనామధారణము కదా. తదితర దేశాల్లోను మన వుత్తర హిందూదేశంలోను మరిమనలో బ్రాహ్మణేతరులకు యిట్టి దుఃఖజీవితావస్థలేదు. అంతకంటె శిరఃఖండనమే మేలనిపించుకుంటుంది ఆ స్త్రీకి. అట్టియెడ, సానుభూతిలేదు. దయావాక్యపరామర్శా లేదు సరికదా? బోడమ్మంటూ, బండితోలు తురకాడితో నర్మగర్భ సంభాషణలుగా, పాటలు, మాటలు, ప్లేట్లలోకి ఎక్కించారు. స్టేజిలోకి, సినీమాలోకి ఏదో హాస్యంగా, అవకతవకగా నిరూపిస్తున్నారు. ఇదంతా స్త్రీ లోకానికి ఎంత చిన్నతనము! మనల నిట్లవినీతి పరాభవాగ్నికి ద్రోసిన రచనా, రూపక, శిల్పకుల నేమనాలి? మనలో ఆ ఆవేశమేది? అదిచూచి భరించుటకంటె, మన స్త్రీ లోకమంతా ఏకమై, నీవిప్పుడు చదివిన వరలక్ష్మమ్మగారి వ్యాసంలో చెప్పినరీతి రాష్ట్రానికొకటి చొప్పననైన స్త్రీ నిర్వాహకమగు పత్రికలు స్థాపించి, అందులో మనకష్టాలు వ్రాసుకొని, ప్రపంచకానికి వ్యాసింపజేసికొని, అందోళనయైనా చేయాలి. లేక, మన సోదరీ శాసనసభా మెంబర్లచేత కాలానుగుణ్యంగా, అన్నిటిలాగే చట్టాలైనా చేయించాలి. ఇట్టి స్త్రీ నిందిత, రచనా రూపకాలు చూపించకూడదనిన్ని, స్త్రీల పవిత్రావరణలో దాగియుండిన అవయవ దృశ్యాలు చూపించి, స్త్రీ జీవితగోప్యమును భంగపరచే అసహ్యాపు లిఖితఫోటోలు, పఠాలుకూడా బహిర్గతం కాకుండాను నిషేధించి తీరాలి. అవయవ బహిరంగ మానభంగమగునన్న భీతిచేతనే కదా, ఆనాడు ద్రౌపదీదేవి గత్యం తరంలేక దీనశరణ్యుడగు భగవంతుని వేడుకొన్నది. అట్టి నిదర్శనాలెన్నోయున్న మన శిలాదికాలను వీధినిబెట్టు లిఖితాలను పోగొట్టుకొని, పవిత్రభారత స్త్రీ గోప్యం నిలబెట్టుకొనుట మనవంతే. ఏమంటే, ద్రౌపదికి, బలవంతులగు భర్తలు దగ్గిరే యున్నప్పటికి, పరదాస్యులై ధర్మానికి కట్టుబడి చేతకానివారిలా గూరకొనుట తటస్థించింది. మనకో, మన పురుషులే మనలను వీధిని పెట్టునప్పుడు మనకికగతేది? అందుచేత, భగవంతుని

ప్రార్థించుచూ మన గౌరవమర్యాదలు మనమే నిలబెట్టుకోవాలి, కమలా ! ఇల్లాంటివి నీబోటి విద్యావంతులే పూనుకోవాలి సుమా !'

“కాంతం ! నాకంటె విద్యాధికులున్నారు. పత్రికానిర్వహణం అంటే మాటలా ! ధనం ముఖ్యం, తర్వాత తగిన పరికరాలు. స్తోమతు, నిర్వహణశక్తి, విమర్శకజ్ఞానం, న్యాయవార్త విశేషాగమనిక, జీవరచనా నైపుణి మొదలగునవెన్నో కావాలి. మోసకారి ప్రకటనలతో స్వార్థధనలాభం చూడకుండా లోకహితమే గమనించుచూ పత్రిక నడపాలి. వుదారధనవంతులిందుకు తోడ్పడాలి. ఎక్కువ విద్యాయువకుల కెక్కుడు వుద్యోగవాంఛలు. డబ్బున్నవారు తమధనాన్నింకా ద్విగుణీకృతమవడానికి చూస్తారు కాని, దేశదారిద్ర్యంలో వుపాధిలేక కొట్టుకునే బీదలదిక్కు చూడరుకదా ! స్వంత సౌఖ్యాలకు ఖర్చుపరచే డబ్బులో, నిరుద్యోగ సమస్యాంధకారంలో దారితెన్నులేక యుండే లోకానికి దారిచూపించే సంస్థాప్రతిష్టలు చేయరుకదా ! మన ఊళ్లో కట్నాలిచ్చుకోలేకను, పెళ్లిచేయలేకను, పెరిగిన ఆడబిడ్డలను పోషించలేకను, తుదకు తలిదండ్రుల దుఃఖావస్థ చూడలేక ఆత్మహత్యలకు పాలవుచున్న బిడ్డలచావులైనా సహించియుండే సంసారుల కుపకారం చేయు ఫండుల స్థాపించకూడదా ? ఈ జమీందార్లు, రాజాధిరాజులు, ఈ వర్తకులు, ఈ వడ్డీలకాశించే ధనాశాపిశాచకులు, అబ్బే ! ఎంత అధర్మకాలము దాపురించింది. కాంతం !'

'అవును కమలా ! చెడుకాలం దాపురించింది. పుణ్యస్త్రీకి అలంకారమగు గాజులమోజులో, సంసారిణి చేత గాజులవానితో గూఢార్థశృంగారంగా పాటపాడించారు ప్లేటులో. అది మన కులస్త్రీలకెంత నామార్దాయో ఆలోచించు. ఏ దేశాల్లోను, లోపంలేని సంఘాలే లేవు కాని, మనలోవలె, స్త్రీజాతి నతి హేళనగాను, నిందనీయంగాను, నిరూపించే రచనలే లేవు. ఇంతెందుకు. చాకలివాళ్లమీద ఏదో చెడ్డగా పాటరచించి అది ప్లేటులో పెడితే వాళ్ళంతా కట్టుగావచ్చి ఆ ప్లేట్లన్ని బద్దలుకొట్టించారట మదరాసులో. అట్టి కట్టు మనలో కలగాలి. వినాశకాలే విపరీతబుద్ధిః అన్నట్లు, స్త్రీ లేదేశంలో దుఃఖిందెదరో ఆదేశానికరిష్టమే ఫలం. అర్ధాంగాని కసభ్యం ప్రతిపాదిస్తే, పక్షవాతపు రోగిలా పురుషుడగుపించడా ? కమలా మరోమాట, మనలో గురువంటే తండ్రివంటివాడనికదా అర్థం. కాళిదాసు భార్యకూడా, విద్యాగురువుకు దక్షిణివ్వగా నిరాకరించి, తన్నే కోరగా, నీతిగరపి, వినకున్నతరి యుక్తిగా తప్పించుకొని, తుదకు క్రోధపరవశుడగు గురుని తీవ్రపట్టుదలచే శుద్ధమూర్ఖుడై పడున్న కాళిదాసుకు పెండ్లిచేయించబడెను. ఆమె అదృష్టము, పవిత్రత, తుదకు మూఢభర్త శాపానుభవానంతరం కాళికానుగ్రహంవల్ల మహాకవిగా మారెనని గ్రంథస్థముకదా ! అట్టి యెడ, విద్యచెప్ప నెపానవచ్చి చెప్పిచెప్పి చివరకు శిష్యురాలిని పరిణయమాడిన రచనలు సత్యేవార్తలు కలుగుటయు, అట్టివి ఖండించక, లోకమామోదించి, వార్తాప్రకటనా నిపుణత్వాలతో గౌరవించుట అగౌరవమంటావా కాదా? అపవిత్రమంటావా కాదా ? పాశ్చాత్యదృష్టిలో నిట్టివి సవ్యమైనా, ప్రాచీనదృష్టిలో అవినీతివని నా నమ్మకం. ఇల్లాంటివిమన్ని మనమే నిందించుకొనే వ్రాతలు, సంఘంలో సంస్కరించుకునే లోపాలు. కాన, పురుషులు సంస్కరించకపోతే, మనమే లేవాలి. ఏమంటావు కమలా !'

'కాంతం ! ప్రాచీనానికి, ఆధునికానికి, గుణాలు మారాయి. పూర్వముండింది ప్రౌఢవివాహం. అప్పుడు విజ్ఞానదృష్టిలో నీతి నిలబడింది. అధునికలోకంలో, అనర్థాలొచ్చుటచే చట్టం కావలసివచ్చింది. ఎన్నాళ్లమ్మాయిని పెంచినా కన్యా వరవిక్రయాలు పూర్వంలోలేవు. బాహుబల ప్రదర్శనమో ? బుద్ధివైభవమో కారణంగా, వివాహాలు వధూవరుల ఇచ్ఛానుసారం జరిగేవి. అనుకూల దాంపత్యం పాతివ్రత్యధర్మం

ఏకపత్నీధర్మం నిలబడింది. ఇప్పుడో శుల్కవిక్రయాలు, అనుకూల దాంపత్యాలు, నిరసనభావాలు, విడాకులామోదాలు, బహుభార్యాత్వాలు ప్రబలుటచేత భరించలేక, సంఘం తిరిగి పూర్వ పవిత్రాదర్శ నిలబెట్టుటకై, చట్టాలు చేయవలసివచ్చింది. ఆలాగే, మన స్త్రీజాతి కిచ్చే అవమానావినీతి విశృంఖలాన్ని నిర్మూలించాలంటే, మనమే మనలో ప్రబోధించుకొని చట్టంచేయించుకుంటేనేకాని గత్యంతరంలేనట్టుంది. ఈసారి మహిళాసహావేశంలో, వీటిపై యుపన్యసించి రాష్ట్ర మహిళాసంఘమువారిచే, తీర్మానంచేయించి, అఖిలభారత మహిళామండలిద్వారా శాసనసభా సోదరీమణులచే, చట్టముచేయించాలి సుమా! దీనికి మన మున్ను, మన 'గృహలక్ష్మి' పాఠక రచనా సోదరీలోకం పూనుకొంటిమా నెగ్గితీరుతుంది. పూర్వం గోటిలో మీటేది ఇప్పుడు గొడ్డలిలో నెట్టడంవరకు వచ్చింది. ఇక నే వెడతాను నీపనికడ్డు. నీకేమి గృహిణీలోకానికి కావలసిన విజ్ఞానమంతా నీకుంది. నీవంటివాళ్లను లాగే తిరిగి విద్యావిధాన మార్పులలో తయారుచేయాలని యత్నిస్తున్నారు. ?

'కాంతం! వ్యక్తిస్వాతంత్రులమైనా మన ప్రకృతిననుసరించి, వికృతి వుపాధిశక్తులు కోరకుండా మనం నడవాలి. పురుషులు మనల నాదరించి గౌరవిస్తూ, స్త్రీ సౌఖ్యోన్నతి, సోదరీ శుభోదయం కాంక్షించుతూ, సహనంకలిగి, వారి ప్రకృతిననుసరించి వారు మెలగాలి. కాని, ఉచ్ఛనీచ చింతలెందుకు. ఒక్క నాలుకగా యుండే నోటిమాట నిలకడున్న అనాదిలో, భూమిలో కవుల్లుకూడా నోటికవుళ్లే. సంవత్సరాల తరబడిని అవి నిలబడేయుండేవి. అప్పుడు ధర్మశాసనం బుద్ధిచట్టం. ఎప్పుడా రెండు నశించి రెండు చీలిక నాలుకలుగల పాళీకలాలు యుద్భవించాయో కాకితం వ్రాత అసత్యం తప్పుడువ్రర్తన కలిగింది. అందుచేతను పైగా పర దాస్య బంధనా అస్వతంత్రపు జీవితంలోయుండడంచేతను, పరుల మేల్కొల్పులు కావలసివచ్చాయి. చూచావా. చివరకెల్లాంటి గతిపట్టిందో. ఇప్పుడు కాంగ్రెసుమంత్రుల ధర్మాన పూర్వపు ఔన్నత్యాలు నిలబెట్టబడుచున్నాయిలే. మరి సెలవ 'ని లేచెను. బొట్టుపెట్టి తాంబూలమిచ్చి చెలిని సాగనంపెను కాంతం. తిరిగి పనిలో లీనమైందికాని ధ్యానమంతా చర్చించినదానిమీదే ఉంది.



చెన్నపురి ఆంధ్రమహాసభకు చేరిన స్త్రీలశాఖా ప్రారంభోత్సవము మైలాపూరులో కళామందిరమున
నీ నవంబరు 12-వ తేదీని రుక్మిణీఅరండేలు సతీమణీగారిచే గావింపబడినది.
ఏతత్సమావేశమున గూడిన మహిళామణులు




## నాటకకళ

శ్రీమతి టి. వసుంధరాదేవిగారు

ప్రస్తుతము నాటకము లెట్లు వ్రాయబడియున్నప్పటికిని వాటి నెవ్వరు ప్రదర్శించు చున్నారు, ఎట్లు ప్రదర్శించుచున్నారు అను విషయము ఆలోచించితిమేని మన నాటక ప్రదర్శనా విధానము మిగిలిన దేశములవారి విధానమునకు చాల వెనుకబడియున్నదని చెప్పి తీరవలయును. మనలోకూడ ఉన్నతవిద్య పొందినవారున్నారు. దేశములు చూచిన వారున్నారు. రసజ్ఞులున్నారు. నాటకకళా చాతుర్యము తెలిసినవారు, గొప్పగొప్ప నట కులు, ఎందరో ఉన్నారు. అయినప్పటికిని మననాటక ప్రదర్శనము ప్రకృతివిరుద్ధముగాను, ఒక్కొక్కప్పుడు హాస్యాస్పదముగాను, చూచుటకు వికారముగాను, రసాభాసముగాను, ఉండును. సినీమాలలోకూడ ఈలోటులు చాలచోట్ల కనబడుచునే ఉండును. ఎందువలన అని ఎవ్వరైన కొంచెమాలోచించిన దానికి కారణములు తెలియగలవు.

ఈప్రపంచములో వేదాంతులెందరో ఇదివరలో చెప్పినట్లు మనమందరము నట కులమే. ప్రపంచమే నాటకశాల. ప్రకృతియే తన మార్పులతో దృశ్యములను మనసలహా లేకనే మార్చుచుండును. మనమాడుచున్న ఈ నాటకములనే కవి నాటకరూపముగా మార్చి వ్రాయగా, నటకులు చిన్నచిన్న నాటకశాలలందు చూపుచున్నారు. మన మొగము మనకు కనబడకపోయినను, అది అందముగానున్నను, వికారముగానున్నను, మనము దానిని అద్దములోచూచి మెచ్చుకొనుచుందుము. కవి నాటకమనే అద్దములో మన నడవడికలను, మంచిచెడ్డలను చూపుచుండును. వాటిని మనలో మనము గుర్తించ లేక పోయినను నాటకములో చూచి అనుభవించెదము, ఆనందించెదము, అద్దములో మొగముచూచి ఆనందించినట్లే. అట్లున్నప్పుడు మన నాటక ప్రదర్శనము బాగులేక పోవుట చాల పెద్దలోటని ఎంచి, నాటకప్రదర్శనాకుశలులు దానియందు తగుమార్పుల నొనర్చి సంస్కరించి ఇకముందైన చూడతగినట్లు నాటకముల ప్రదర్శింతురన్న ఆశతో నేను నా ఉద్దేశములను వెలిబుచ్చుచున్నాను.

మనలో నాటకప్రదర్శనము బాగుండవలెనన్న మనలోనున్న కొన్ని అలవాటులను, ఆచారములను, ఉద్దేశములను మార్చుకొనవలసి ఉన్నది.

ఇప్పుడు సాధారణముగా స్త్రీ పాత్రలను పురుషులు ధరించుచున్నారు. అట్లు చేయుటవల్ల నాటకమంతయు ప్రకృతివిరుద్ధముగా కనబడుచుండును. స్త్రీ పాత్రలను నాటకములలో తీసుకొనివచ్చినప్పుడు నాటకరచయిత నిజమైన స్త్రీలనే మనస్సులో ఆలోచించియుండును. అప్పుడు ఆ స్త్రీపాత్రను పురుషుడు తీసికొనుటవల్ల ఫలితమేమనగా స్వభావసిద్ధమైన స్త్రీ కంఠము మనకు వినబడదు. ఆమెయొక్క చేష్టలు మనకు కనబడవు. కండువా సవరించుకొను మనిషివచ్చి మనఎదుట చీర సవరించుకొనుట మొదలుపెట్టగానే హాస్యాస్పదదృశ్యమును చూచిన భావములు మనలో పుట్టును. అంతేకాక స్త్రీ సౌందర్యమును, ఆకారమును, కూడ చూపవలెనని ఎంత ప్రయత్నించినను ఆ ఆకారము సరిగా పొసగకపోవుటయో, ఒకవేళ సరిపోయినను పైట సవరించుటలో ఆకారము, వికారమై పోవుటయో సంభవించును. అప్పుడు ఆమనిషి మొగవానివలెకాక, ఆడుదానివలెకాక, ఒకవింత జంతువుమాదిరి కాన్పించును. కాని మనము నాటకశాలకు వింతజంతువులను చూచుటకు పోవుటలేదు. ఈ విషయము నా అనుభవమువల్ల నేను చెప్పుచున్నాను. రెండుమారులు నేనీవింతజంతువులను చూచుట తటస్థించుటవల్ల ఈ విషయములో మార్పు అత్యవసరమని తోచినది. స్త్రీ అవయవములసొంపు తెచ్చిపెట్టుకున్నయెడల వచ్చునది కాదు. ఇంకొకవిషయము ఒకవేళ కవి, గడ్డము, మీసము, ఉండే పురుషునియొక్క గొంతుకకల స్త్రీని నాటకరంగముపైన తేదలచుకుంటే అప్పుడు అట్టి స్త్రీ అసాధారణవ్యక్తి కావున పురుషుడే ఆ స్త్రీ వేషమువేయుట బాగుండును.

పురుషులు స్త్రీ వేషములువేయుటకు కారణమేమి? ఒకటి మన పూర్వాచారమనే పెనుభూతము ఒకప్పుడు స్త్రీ చదవకూడదు, పాటపాడకూడదు, సభలలో ఉపన్యాసము లీయకూడదు, నాట్యము చేయకూడదు, అని పురుషుడు తన స్వార్థతవలననో లేక తన మూర్ఖతవలననో శాసించెను. స్త్రీలుకూడ పురుషునిపాటకు తాళమువేసి అట్లే నడచుచుండిరి. చివరకు సర్వసాధారణముగా అందరకు రావలసిన సాహిత్యము, సంగీతము, నాట్యము, కొందరి చేతులలోనే నిలచి క్షీణింప మొదలుపెట్టెను. వెంటనే పురుషులీసంగతి కనిపెట్టి 'అయ్యో ఈ కళలుపోతే ఎలాగు' అనిచెప్పి స్త్రీలు మళ్లీ అవి నేర్చుకో వచ్చునన్నారు. పురుషుడేది చెపుతే అదివినేస్త్రీ, ఆకళలను మరల నేర్చుకొనుట మొదలుపెట్టినది. తర తరములనుండి పురుషుని చేతిలో కీలుబొమ్మవలెనున్న స్త్రీ ఇప్పుడిప్పుడే స్వతంత్రముగా ఆలోచించుట కూడ మొదలుపెట్టి, పురుషుని సహాయములేకనే, తనంతట

తానే స్వాతంత్ర్యమును సంపాదించుకొన్నట్లు అనుకొనుచున్నది. అంతేకాక పురుషులను నిందించుటకూడ ప్రారంభము చేసినది. ఇన్నితరములు పురుషునిచేతులోని కీలుబొమ్మ వలె తానాడిన ఆట మరచిపోయి స్త్రీ చదువునందు, సంగీతమందు, మిగిలిన శాస్త్ర ములందు, కళలయందు, తాను పురుషునితోపాటు సమానముగాను, ఒక్కొక్కప్పుడు ఎక్కువగాను ఉన్నప్పటికిని, ఆమె ఇంకా నాటకకళయందు శ్రద్ధ పుచ్చుకోవడంలేదు. ఎందుచేత ? నా సోదరీమణులు నామీద కోపము తెచ్చుకోకపోతే నిజము చెప్పెదను. పురుషుడు దానికితగిన ప్రోత్సాహమియ్యకపోవుటచేతనే. పురుషుడెందుకు ప్రోత్సాహిం చుట లేదు ? స్వార్థ పరాయణుడగుటచేత. ఈసంగతి తెలుసుకోలేక, స్త్రీలు నాటకరంగ మున నుండకూడదని, అట్లుండుటవల్ల స్త్రీలకు అవమానమని, స్త్రీలే వాదించుచుందురు. మానావమానములు గురించి నీత్యవినీతుల గురించి ఆయావ్యక్తి తనంతట తాను తెలుసు కోవలసినదేగాని, ఈ కాలములో ఒకరు బోధించుటవల్లగాని, ఒకరి ఆదర్శమువల్లగాని తెలుసుకోవలసిన విషయముగాదు. కొందరు స్త్రీలు బాగుగా వేషము వేయలేరనిగూడ చెప్పవచ్చును. కాని స్త్రీలు ఎంతబాగుగ వేషములు వేయగలరో అది అందరకును తెలిసిన విషయమే.

విదుషీమణులు, నాటకకళయం దభిరుచియున్నవారు, నాటకములలో పాల్గొనుట వల్ల దేశమునకు, మానవజాతికి మితిలేని సేవచేసినవారగుదురు. వారు నాటకరంగము మీదకు రాగానే, ఇప్పుడు నాటకప్రదర్శనములలోనున్న లోటులు చాలవరకు మాయమై పోవును. చూచువారికెందరకో, అపరిమితమైన ఆనందము నిచ్చువారగుదురు. జనాహ్లాద కరమైన పనిచేయుట, ఒక వస్తువును సౌందర్యకరముగాజేసి ఆనందము నిచ్చుటకన్న ఈ ప్రపంచములో ఒకవ్యక్తి మరి చేయవలసినదేమున్నది? అట్లు జీవితమును సార్థకము చేసికొనుటకు నాట్యకళాభిరుచి, నేర్పు, ఉన్నవారికి నాటకకళను మించిన దింకొకటి యుండదు. మిగిలిన దేశములలో ఎందరు స్త్రీలు ఈవిధమైన సేవజేయుటలేదు ? వారిని జూచి మనమెందరము సంతోషము ననుభవించుటలేదు ?

కొందరు, స్త్రీ నాటకములలో పాల్గొన్నయెడల ఆమె అవినీతికిని, అవమానమున కును పాత్రురాలగును, అని వాదింతురు. నేనిదివరకు చెప్పినట్లు, ఇవి మనలో మనము ఆలోచించవలసినవే. ఇదేవిధముగా మొదట స్త్రీలు సభలలో ఉపన్యాసములు చెప్పి నప్పుడుకూడ వాదించుచుండిరి. అలవాటుపడినపిమ్మట ఈ వాదములన్నియు మాయమై పోవును.

ఇంకొక వాదన ఏమిటంటే— "నాటకములలో పాల్గొన్నప్పుడు పర పురుషునకు భార్యగా వేషము వేయవలసివచ్చును. అది మనయొక్క పూర్వపద్ధతికి, పాతివ్రత్యధర్మము

నకు విరుద్ధము" అని. పూర్వపు పాతివ్రత్యధర్మములను ఈ కాలములో ఏ స్త్రీకూడ పాటించుటయేలేదు. నిజముగా అట్లు పాటించుచున్న యెడల కొందరు స్త్రీలు, తమ వృద్ధులైన భర్తలను వంటవారిపోషణ కప్పగించి సభలకు రానేరారు. భర్త మన్యస్థలములలో పనిచేయుటకు వెళ్ళినప్పుడు, భార్యలు పట్టణములలో తిరుగరు. స్త్రీ పురుషమిశ్రసభలకు ఒంటరిగాపోరు. రైలుబండ్లలో, బస్సులలో పర పురుషులపక్కను కూర్చోరు. అంతేకాక, నాటకములలో నంతియు వట్టినటనమే అన్నమాట మనము జ్ఞాపకముంచుకుంటే ఇట్టి వాదనలేరావు. మనలో ఎంతమంది పిల్లలో రుక్మిణీకల్యాణమును చదివి, కృష్ణుడు రుక్మిణి నెత్తుకొనిపోయి పెండ్లాడినట్లు తమ్మకూడా పెండ్లాడెనని పట్టపగలే కలవరించియుందురు. అంతమాత్రాన వారు మళ్లీ పెండ్లి చేసుకుంటే పాతివ్రత్యభంగము చేసినవారగుదురా? అట్లే వేషము వేసినంతమాత్రాన వేషము యదార్థముకానేరదు.

ఇప్పుడిప్పుడు మనలోకూడ కొందరు కులస్త్రీలు నాటకరంగమందు పాల్గొనుచుండుట చాల అభినందనీయము. ఇది క్రొత్త అంజ కాబట్టి పలువురు పలువిధములుగా మాట్లాడుచుందురు. వారి కళానైపుణ్యముకూడ అంత ప్రాశస్త్యమును పొందక పోవచ్చును. కాని రానురాను అదే వృద్ధిపొంది బాగుండుననిమాత్రము నాకు నమ్మికగలదు. సభా పిరికితనమువల్ల, తెలియక పొరబాటులవల్ల, కొన్ని లోటులు స్త్రీ వేషములోనుండును. నేనుకూడ కనిపెట్టితిని. సాధారణముగా ప్రేమసూచకపదములను, స్వభావవిరుద్ధములుగా పలుకుచుందురు. 'ప్రాణేశ్వరా, ప్రాణనాథా' మొదలైనవి దీనికి కారణము. ఈమాటలు మనము వ్యవహారికములో అనుదినము మన ఇండ్లలో ఉపయోగించకపోవుటయే. ఇట్టి మాటలను సాధ్యమైనంతవరకు నాటకములలోనుండి తీసివేయవలెను. లేదా అందరు అనుదినము ఉపయోగించవలెను. అప్పుడు ఆ స్వభావవిరుద్ధత మనకు తోచదు.

ఇంకొకటి స్త్రీలు అబలలని, అందుచేత వారు ధాటీగా మాట్లాడుట కష్టమని ఒక ఉద్దేశము చాలమందిలో ఉన్నది. అందువల్ల స్త్రీలు నాటకములలో మాట్లాడునప్పుడు మూల్గుతూ నీల్గుతూ మాట్లాడుదురు. ఇది ముఖ్యముగా రేడియోలో తెలుగు నాటకములు విన్నవారికి బాగుగా తెలిసియుండును. ఈ లోటులన్నియు రానురాను సర్దుకొనిపోవునేగాని ఎల్లప్పుడు నట్లుండవు.

ఇకముందైనను విదుషీమణులు ఎక్కువమంది ధైర్యముతో ముందంజవేసి నాటకరంగము నలంకరించి, నాటకశాలలను సంతోషదాయకములుగా చేయవలెనని నా కోరిక.

# గుంటూరుమండల మహిళాసభ, బాపట్ల.

## శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు

### (అధ్యక్షోపన్యాసము)

కాలచక్ర మతివేగముగా తిరిగిపోవుచున్నది. ఈ వేగములో నత్యద్భుతములగు మార్పులుకూడా కలుగు చున్నవి. ప్రకృతిశాస్త్రములలో, యంత్రనిర్మాణములో నత్యద్భుతములగు క్రొత్త విషయములు కనిపెట్టబడు చున్నవి. సాంఘికముగా, రాజకీయముగా, ఆర్థికముగా నెన్నో మార్పులు కలుగుచున్నవి. అనతికాలములో మన భారతీయులకు ఆర్థిక రాజకీయములలో సంపూర్ణాధికారములువచ్చు సూచనలు గానవచ్చుచున్నవి. ఇట్టి పరిస్థితులలో మనదేశ ప్రజలలో నర్ధభాగమగు స్త్రీలు ఈ విషయములను తెలిసికొనుటకైనను తగిన స్థితిలోలేక అజ్ఞానదశలో నున్నచో దేశము త్వరలో నభివృద్ధిచెందు టసంభవము. చిరకాలమునుండి చాలా యధమస్థితిలోనున్న మన స్త్రీలను పైకి లేవనెత్తుటకు స్త్రీలే పూనుకొనవలయునుగాని తదితరుల కసాధ్యమని తెలిసికొని కొంతమంది విద్యావంతులును, బుద్ధిమంతులును అగు స్త్రీలు ప్రత్యేకము స్త్రీల మానసిక, శారీరక, నైతిక, సాంఘిక, ఆర్థికాభివృద్ధులనుగూర్చి అన్యోన్య భావములను వెల్లడించుకొని చర్చించి వాటిని నమలులో పెట్టగలందులకై అఖిలభారతమహిళాసంఘమను పేర నొక సంఘముగా నేర్పడి నేటికి పదునాలుగు సంవత్సరములనుండి యీ సభలను నడుపుచున్నారు.

వీరు మొట్టమొదటి సభను 1926-వ సంవత్సరములో పూనా నగరములో జరిపిరి. అప్పుడు మనదేశము నందలి యేవోకొన్ని రాష్ట్రములే అందు పాల్గొన్నవిగాని అన్ని రాష్ట్రములూ చేరలేదు. వాటికా సంగతి కూడా తెలియదు. ఆ సంగతి తెలియని రాష్ట్రములలో మనయాంధ్రదేశ మొకటి. మరుసటి సంవత్సరము అనగా 1927-లో ఈ సభ ఢిల్లీలో జరిగినది. అప్పుడీ యఖిలభారత మహిళాసంఘ కార్యదర్శినియగు కమలా దేవి ఛటోపాధ్యాయగారు అప్పుడు రాజమహేంద్రవర స్త్రీల రిక్రియేషను క్లబ్బుకు కార్యదర్శినిగానున్న నాకు మనయాంధ్రదేశము పక్షమున పనిచేసి యీ దేశమునుకూడ అఖిలభారత సభలో పాల్గొనునట్లు చేయ మని వ్రాసిరి. అప్పుడు జిల్లాసభలు, రాష్ట్రసభలు జరిపి ఆంధ్రదేశమునుకూడా నా సభలో పాల్గొనునట్లు చేశాము. అప్పటినుండీ మనయాంధ్రదేశముకూడా అఖిలభారత సభలో నొక భాగమై తన యభిప్రాయము లనుకూడా నిచ్చుచున్నది. మనయాంధ్రదేశ మీ విషయములలో 13 సంవత్సరములనుండి పనిచేస్తోంది. మొట్ట మొదట్లో మేమీ సభలను జరిపినప్పుడు ఈ విషయములనుగురించి యే కొలదిమందికో తప్ప తక్కినవారికి తెలియదు. సభలో మాట్లాడేవారు బహు కొద్దిగా నుండేవారు. ఇప్పుడించుమించు మనయాంధ్రదేశమున కంతకు నీ విషయమై బాగుగా తెలియును. అనేకు లిందు పాల్గొని పనిచేయుచుండుట గొప్ప శుభసూచకము.

#### లాభములు

ఈ సభలు జరుపుటవలన లాభమేమైనాయున్నదా లేక యూరక ప్రతిసంవత్సరము వేడుకగా పలు పుర స్త్రీ లొకచోటచేరి ప్రసంగములనుచేసి యెవరిదారిని వారు వెళ్లిపోయి యెప్పటివలె నుండుటేనా అంటే లాభములు బాగా కనబడుచున్నవి. పది పంద్రెండు సంవత్సరముల క్రితమువరకు బ్రాహ్మణులలో బాలికలు వివాహములు కాకుండా రజస్వలయినచో నా కుటుంబము లెంతో పాపముచేసినట్లు భావించి సంఘమునుండి

బహిష్కరించే దినములుపోయినవి. ఇంకా కొన్ని లోపములున్ననూ శారదాబిల్లు అమలులోనికివచ్చి యుక్తవయస్కురాండ్రగువరకు వివాహమొనర్పకుండా బాలికల నుంచువారి కేయాటంకమును, బహిష్కరణము లేకుండా నిరాఘాటముగా, నిర్భయముగ నుంచగలుగుట కవకాశము కలిగినది. పర పురుషులను చూస్తేనే తప్పు, వారితో మాట్లాడితేనే తప్పు, వారితో కలసిమెలసి తిరిగితేనే తప్పు అనుదినములు గతించినవి. మన హైందవ స్త్రీలలోనే గాకుండా మహ్మదీయ స్త్రీలలోగూడ ఘోషాపద్ధతి తగ్గిపోవుచున్నది. పూర్వము కన్న స్త్రీలలో విద్య బాగా వ్యాపిస్తోంది. పురుషుల సహాయముంటేనేగాని ప్రయాణముచేయలేని స్త్రీలు అఖిలభారత మహిళాసభలు ఎక్కడ జరిగినను పురుషుల సహాయ మక్కరలేకుండగనే దేశమునందలి యన్ని ప్రాంతములనుండీ ప్రయాణముచేసి సభలకు విచ్చేయుచున్నారు. స్థానికసభలలోనూ, శాసనసభలలోనూ, స్త్రీలు సభ్యురాండ్రుగానుండి తమ విధ్యుక్తధర్మముల నతి సమర్థతతో నెరవేర్చుచున్నారు.

## విద్యావిషయములు

సోదరీమణులారా! మనకుఁగల యాశయములనుబట్టి చూస్తే పైనఁ జెప్పఁబడిన ఫలితములు చాలా తక్కువ. ఇప్పుడు స్త్రీలలో విద్య యెంత యెక్కువగా వ్యాపించినదని యనుకొన్ననూ తక్కిన ప్రాంతములతో పోల్చిచూచిననూ, జనసామాన్యమునుబట్టి చూచిననూ ఇది చాలా తక్కువయనియే చెప్పవచ్చును. చదువను వ్రాయను నేర్చినవారు నూటికి యిరువురుకూడా లేరు. ప్రపంచమునందలి తక్కిన నాగరికదేశములలో నూటికి 60, 70 మంది యున్నత విద్యావంతురాండ్రగు స్త్రీలున్నారు. మనదేశములోనే యొక ప్రాంతమగు మలబారులో, అందు ముఖ్యముగా తిరువాన్కూరు, కొచ్చిను రాజ్యములలో నూటికి యేబదిపైగా విద్యావంతులగు స్త్రీలున్నారు. దీనినిబట్టి చూస్తే మనదేశములో నీస్త్రీలు విద్యలో నెంత వెనుకఁబడియున్నారో చూడండి. అన్ని మార్పులకు, అన్ని విజ్ఞానములకు మూలము విద్య. కనుక స్త్రీలలో విద్య బాగా వ్యాపించాలి. ప్రస్తుతమున్న విద్య అంత లాభదాయకముగా గాన్పించుటలేదు. కనుక యీ విద్యావిధానములో మార్పులు కావాలి. బాలికా పాఠశాలలో బాలికల కత్యావశ్యకములును నత్యంతోపయోగకరములును అగు చిత్రలేఖనము, సంగీతము, కుట్టు, నృత్యము మొదలగు లలితకళలను బాగుగా నేర్పాలి. నిర్బంధ ప్రాథమిక పాఠశాలలను దేశమంతటా నెలకొల్పి జనసామాన్యములోఁగల నిరక్షరత్వమును పూర్తిగా తొలగించి అందఱును ఉన్నత విద్యావంతురాండ్రు కాలేకపోయినను వ్రాయను చదువను ఐనా నేర్చునట్లుచేయాలి. బాలబాలికలకు వేరువేరు పాఠశాలలు నెలకొల్పుటకు చాలినంత ధనములేనిచో ప్రాథమిక పాఠశాలలు ఇరువురకు కలిపే పెట్టవచ్చును. శరీరారోగ్యము, దార్ఢ్యములేకుండా విద్య నభ్యసించు టసంభవము. శారీరక వికాసములేనిదే మానసిక వికాస మభివృద్ధిచెందనేరదు. స్త్రీలకు శరీరారోగ్య దారుఢ్యములు కలుగుటకై బాలికలు స్వేచ్ఛగా నాడుకొనుటకు తగిన ఆటస్థలములను, వ్యాయామశాలలను నేర్పరచాలి.

## సాంఘికవిషయములు

మనలో సాంఘిక లోపాలు చాలా ఉన్నాయి. అవన్నీ తొలగిఁపోతేనేగాని మన సంఘం బాగుపడుట, అభివృద్ధిలోనికి వచ్చుట చాలాకష్టం. ఈ సాంఘిక లోపాలకు, సంఘ దురాచారాలకు కారణము చాలవరకు స్త్రీలనే చెప్పవచ్చును. చూడండి, పాపం ఎంతో కష్టపడి, ఎన్ని సంవత్సరములో శాసనసభా సభ్యులతో పోరాడి మన స్త్రీ సంఘము నందుఁగల గౌరవ సానుభూతులు కారణముగా స్త్రీ సంఘమునకు

## గుంటూరుమండల మహిళాసభ, బాపట్ల

మేలొనగూర్పఁదలచి సర్. హరవిలాస శారదాగారు శారదాబిల్లును ప్రవేశపెట్టి, గెలిపించి, అమలులోకి తెస్తే మునిగిపోయినట్లు, ప్రభుత్వమునకు, శారదాగారికి ఇంతే శాస్తియనునట్లు, తమ ముద్దుబిడ్డలకు కలుగఁబోయే నష్టములను, కష్టములను, తద్వారా తమకు కలుగు దుఃఖములను కొంచెమైననూ ఆలోచించక చాటు చాటున ద్రోసించి, పోర్చుగీసు ప్రదేశములలో పసిబాలికలకుకూడా విరివిగా వివాహాలు చేశేస్తున్నారు.

వరకట్న దురాచార మొకటి మనలో నతివిస్తారంగా నున్నది. అందుమూలమున ననేక కుటుంబాలు దివాలాలు తీస్తున్నాయి. అనేకమంది పసిబాలికలు పలుదుఃఖములకు పాలగుచున్నారు. ఇది ప్రతియింటా నున్నదే కాని యొకరికీ జ్ఞానము కలుగుటలేదు. ఈ కట్నములకొఱకు అత్త ఆడబడుచు లాంఛనములకొఱకు ఎక్కువగా పట్టుబట్టి బాధించేది స్త్రీలేకదా. అత్తగార్లకు, కోడండ్రకు, ఆడబడుచులకు, వదినగార్లకు మధ్య సయోధ్యలులేక, సహన శక్తులులేక ఒకరిని చూచిన మరియొకరికి గిట్టక ఎల్లప్పుడూ కలహిస్తో కుటుంబ కలహములకు కారకురాండ్రై స్వర్గతుల్యములుగా నుండతగిన గృహములను భూలోక నరకములనుగా మార్చి వేయునది స్త్రీలేకదా! భర్తపోయిన దుఃఖము చాలక వితంతు బాలికలకు, స్త్రీలకుచేయు అనేకవిధములగు నవమానములకు, కలిగించు పలువిధములగు కష్టములకు, దుఃఖములకు, దీనత్వమునకు ముఖ్యకారకులు స్త్రీలేకదా!

పురుషుల బహుభార్యాత్వమునకు, వారిచే విడిచిపెట్టఁబడిన అమాయకురాండ్రగు స్త్రీల దుఃఖములకు ప్రబలకారకులు స్త్రీలే; అందులోనూ ఉన్నత విద్యావంతురాండ్రగు స్త్రీలు. ఇంకా నిర్బంధ వైధవ్యము, బాలవితంతువులకు తిరిగీ వివాహముచేయక వారిని పలువిధముల బాధించుట మొదలగు దురాచారములు మన సంఘములో ననేకములున్నవి. స్త్రీలు తమ సంకుచితభావములను వదలి, విశాలహృదయులును, విజ్ఞానవంతులునై ఈ పైన చెప్పఁబడిన లోపములనన్నింటినీ తొలగించాలి. శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ సతి ప్రవేశపెట్టఁబోయే బహుభార్యా నిషేధకచట్టమును బలపరచుటయే గాక భార్యగల పురుషుని యే స్త్రీయూ పెండ్లాడకూడదని స్త్రీలలో ప్రచారముచేయాలి. ఆలా పెండ్లిచేసికొన్నవారిని సంఘమునుండి బహిష్కరించాలి. డాక్టరు దేశముఖుగారు శాసనసభలో పెట్టిన విడాకులచట్టము వీగిపోయినట్లు తెలిసింది. ఆ చట్టమునకు పురుషులంతా వ్యతిరేకులే. స్త్రీలలోకూడా పలువురు వ్యతిరేకముగానే యున్నారు. స్త్రీలు వ్యతిరేకముగానున్నారంటే దాని విషయమై పూర్తిగా తెలిసీ, వారికి మనస్ఫూర్తిగా ఇష్టములేకా కాదు. తమ పురుషులయొక్క యభిప్రాయములనుబట్టీ, వారేమంటారోయను భయంచేతా వ్యతిరేకురాండ్రుగా నున్నారు. విడాకులచట్టము లేకపోవుటవలన కలిగే నష్టము స్త్రీలకేగాని పురుషులకేమీలేదు. వారికా చట్టముండనూ యున్నది. లేకపోయినా నిరాఘాటముగా, నిర్భయముగా నే నేరమును, నే లోపమును లేకపోయినాకూడా చాలామంది పురుషులు అమాయకురాండ్రగు తమ భార్యలను విడిచిపెట్టి మొదటికన్న నెక్కువ కట్నములను దీసికొనియు, విద్యావంతురాండ్రగు స్త్రీలను చూచికొనియు, మొదటి భార్యలను వారి కర్మమునకు వదలివేసి మరల వివాహమాడి సౌఖ్యముల ననుభవించుచున్నారు. పాపము, ఏ పాపమెరుగని, ఏ లోపమూలేని, జీవించుటకే మార్గము తెలియని, అమాయకురాండ్రగు, ముగ్ధలగు ఆ స్త్రీలు తమ భర్తల ప్రాణముల కసూరుమంటో దుఃఖభూయిష్టులై ఎట్లో కాలముగడుపుచున్నారు. కనుక ఆ విషయమై బాగా ఆలోచించి మనదేశములో విడాకులచట్ట మవసరమని స్త్రీలందఱూ ఏకగ్రీవముగా కావాలని కోరినచో నది మరల తలయెత్తగలదు.

శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారు ప్రవేశపెట్టఁబోయే దేవదాసీ బిల్లు విషయములో కూడా స్త్రీలు పూనుకొని పనిచేసి ఆ బిల్లు అమలులోనికి వచ్చి అత్యంత సిగ్గుకరమును, నవమానకరమునగు మనలోని స్త్రీల యధమస్థితి తొలగునట్లును, పురుషుల దుర్వర్తన రూపుమాయునట్లును చేయాలి.

## హక్కులు— అధికారములు

స్త్రీలు పూర్తిగా నొకరిమీద నాధారపడియుండే యస్వతంత్రులేగాని వారికేవిధమైన హక్కులుగాని యధికారములుగాని లేవు. ఈలా యున్నన్నాళ్లు వారుకూడా మానవులేయని, వారికికూడా వ్యక్తిత్వము, స్వతంత్ర్యాపేక్ష, ఆత్మగౌరవము, పౌరుషము గలవని సంఘములో పరిగణింపబడరు. మనము స్త్రీలము ఏమిచేయగలము, మన మన్నివిధముల చేత తక్కువవారమే, మన మొకరిచేతిక్రింద నుండి నడిపింపబడవలసిన వారమేగాని స్వయముగా నేమిచేయగలమను దీనభావములు మననుండి పూర్తిగా తొలఁగిపోవాలి. మన బాలికలు కూడా బాలురవలెనే సమాన గౌరవప్రేమలతో పెంచబడాలి. బాలురతో సమానముగా కాక పోయిననూ కొంతవరకైననూ పిత్రార్జితమునకు హక్కుదారులు కావాలి. అత్తవారిండ్లలో భర్తయాస్తి కంతకూ నధికారులు కావాలి. సమర్థులగువారు, వీలున్నవారు ఉన్నత విద్యావిశారదలై ఉద్యోగములలో చేరి స్వతంత్రజీవనము చేయాలి. స్థానికసంస్థలు, శాసనసభలు మొదలగువాటిలో నింకా యెక్కువగా సభ్యురాండ్రై మహిళాభ్యుదయము కొఱకు పాటుపడి పనిచేయాలి. మన దేశమునందలి సంయుక్త రాష్ట్రములలో శ్రీమతి విజయలక్ష్మి పండిట్ మంత్రిపదవిని స్వీకరించి యెక్కుడు దక్షతతో తన ధర్మమును చక్కగా నెరవేర్చుచున్నదని వినుచుండుటకు చాలా సంతోషముగా నున్నది. అట్టి స్త్రీ రత్న మొక్కటైననూ బయలుదేరి మన స్త్రీలోకముయొక్క కీర్తిని నిలబెట్టుచున్నందులకు మనమంతా గర్వించాలి. ఇంకనూ రుక్మిణీ లక్ష్మీపతి, రాధాబాయి సుబ్బరాయన్, అమ్మన్నరాజా మొదలగు స్త్రీలు శాసనసభలలో సభ్యురాండ్రుగా నుండి మహిళాభ్యుదయము కొఱకు, దేశాభ్యుదయము కొఱకు పాటుపడి పనిచేయుచున్నారు. అందుకు మనమంతా సంతోషించవలసినదే. కాని ఆంతమాత్రము చాలదు. ఇంకా చాలామంది స్త్రీలు బయలుదేరి పనిచేయాలి.

## ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రరాష్ట్ర ప్రత్యేకతకొఱకు మనవాళ్లు చాలకాలమునుండి చాలాపట్టుదలతో పనిచేయుచున్నారు. మనదేశములోని తక్కిన యన్ని ప్రాంతములకన్న మన యాంధ్రదేశ మన్ని విషయములలోనూ చాలా వెనుకబడియున్నది. మనకు మన భాషయందభిమానము తక్కువ. ఐకమత్యము తక్కువ. ఆరంభశూరత్వమేగాని యేపనినిగాని పూర్తిగా నెరవేర్చ పట్టుదలలేదు. చూడండి, మొన్న మొన్న ప్రయత్నించిన ఓఢ్రుల కప్పుడే ఒరిస్సారాష్ట్ర మేర్పడ, 26 సంవత్సరముల క్రితము ప్రారంభించిన మనకు మనరాష్ట్రమింకనూ ఏర్పడలేదు. దీనికికారణము కొంతవరకు ఇతర రాష్ట్రముల చేతిక్రిందనుండి బాధ్యతయెరుగక పోవుటయేమోనని తోచుచున్నది. మనకు ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటచే మనలో విద్యలభివృద్ధినొందుట కవకాశములేకుండా పోతోంది. ముఖ్యముగా స్త్రీవిద్య, భాషాభివృద్ధి కాటంకము కలుగుతోంది. నిరుద్యోగ సమస్య యెక్కువవుతోంది. పెద్దయుద్యోగములేవియు మనయాంధ్రులకు లభించుటలేదు. ఆంధ్రరాష్ట్ర మొక స్వతంత్రరాష్ట్రము కాకపోవుటచే ప్రత్యేక వ్యక్తిత్వము లేకపోవుటచే తక్కినప్రాంతములలో, దేశములలో పొందవలసినంత గౌరవమును పొందలేకపోతోంది. అందువలన సత్వరముగా మనయాంధ్రరాష్ట్రము ప్రత్యేకింపబడాలి, ఆంధ్రదేశములో స్త్రీలకొక కళాశాల నెలకొల్పబడాలి. ఇవి రెండూ వచ్చేదాక మనము నిద్రపోకూడదు.

## గుంటూరుమండల మహిళాసభ, బాపట్ల

## స్త్రీలు—గృహపరిశ్రమలు

ఒకప్పుడు గృహపరిశ్రమలలో నెంతో ప్రఖ్యాతిగాంచిన మనదేశములో నాపరిశ్రమలిప్పుడు పూర్తిగా పడిపోయినవి. ప్రజలలో విదేశవస్తువ్యామోహము నానాటికి తగ్గుటకు బదులు హెచ్చిపోతోంది. రత్నగర్భ, మేరుపర్వతము మొదలుగాగల బిరుదునామములు కలిగి బంగారములతోనూ రత్నములతోనూ తులతూగుచుండే మనభరతఖండమిప్పుడు దరిద్రదేవత కాలవాలమైనది. లక్షలకొలది ప్రజలు తినతిండీ కట్టగుడ్డాలేక మాడిపోవుచున్నారు. ఉద్యోగములు లేక పురుషులు, పోషించునాధులు లేక స్త్రీలూ అల్లాడిపోతోన్నారు. ఈ దరిద్రదేవతకు కారణము కొంతవరకు మనదేశమునుండి ధనప్రవాహ మీవస్తువుల కొఱకై ఇతర దేశములకు పోవుటయే. కాబట్టి యీ విదేశవస్తువులయందలి బానిసత్వమును కొంతవరకైననూ విడిచిపెట్టి చివరకు మనము కట్టుకొను బట్టనైననూ మనదేశములో తయారయినదేగాని పరదేశపుబట్ట కట్టకూడదను దీక్షనుపూని దేశదారిద్ర్యమును తొలగింప ప్రయత్నించాలి. ఇంతేకాకుండా స్త్రీలు తీరిక సమయములలో నూలువడుకుట, చిత్రలేఖనము చేయుట, కుట్లుకుట్టుట, తోటలనుపెంచుట, పేనునార మొదలగు వానితో రకరకముల వస్తువులను తయారుచేసినచో తాము స్వతంత్రముగా జీవింపవచ్చును. కుటుంబమునకు సహాయము చేయవచ్చును. దేశీయపరిశ్రమలను కొంతవర కభివృద్ధినొందించి పరదేశములకు పోవు ధనప్రవాహమును కొంతవర కరికట్టవచ్చును.

శ్లో: ఉద్ధరేదాత్మ నాత్మానాం నాత్మాన మవసాదయేత్, ఆత్మైవ హ్యాత్మనోబంధం రాత్మైవ రిపురాత్మనః.

అనగా తనయాత్మను తానే లేవనెత్తుకొనవలయును. ఆత్మను బాధింపకూడదు. ఆత్మకు ఆత్మయే బంధువు. ఆత్మకు ఆత్మయే శత్రువు.

సోదరీమణులారా! మన యభివృద్ధికి మనమే పాటుపడి పనిచేయాలి గాని యితరులెవరూ మనలను పైకితేజాలరు.

మనము స్త్రీలము, మన మెందులకూ పనికిరాము, ఏమీతెలియని శుద్ధమూర్ఖులము, స్త్రీయై జన్మించుటే పాపము అనే ఆదురభిప్రాయమును మనస్సులలో నుండి పూర్తిగా తుడిచివేయాలి. మీరెంతో గౌరవించే, గొప్పవారని యనుకొనే, వారివలననే సమస్తకార్యములు కావాలిగాని మనమేమిచేయగలము. మనము వారి సంరక్షణలోనుండి వారిచే నడిపింపబడవలసిన వారమేగాని స్వయంగా నేపనినైనా చేయగలమా అని చెప్పఁబడే ఆపురుషులు స్త్రీలయొక్క గర్భవాసమందు జన్మించి బాల్యమున స్త్రీలచే పెంపబడి, యవ్వనమున స్త్రీల చేతులలోని కీలుబొమ్మలై వారాడించినట్లల్లా ఆడి, వృద్ధాప్యములో పుత్రికలయొక్కయో కోడండ్రయొక్కయో సంరక్షణలో నుండే స్త్రీల చేతులలోని వారేగాని పైనెక్కడినుండీ వచ్చినవారు కారు. వారి యభివృద్ధియూ, దేశముయొక్క యభివృద్ధియూ కూడా స్త్రీల యభివృద్ధిమీదనే యాధారపడియున్నది. స్త్రీ పురుషభేదమును తొలగించివేయవలయును. వారితో కలిసి మెలసి మనసంఘదేశాభివృద్ధుల కొఱకై పని చేయుటకు వెనుదీయకూడదు. మనముకూడా మానవులమే. మానవులకుఁగల బాధ్యతలలో సగము బాధ్యతలు మనమీదనున్నవి. పూర్ణారోగ్యముగల శరీర మేపనినైనను చేయఁగలదుకాని పక్షవాతరోగముచే బాధపడు దేహమువలన నేకార్యమూ నెరవేరదు. మన జాత్యభివృద్ధి కాటంకములగు మన సంఘములోని లోపములను సవరించుటలో భిన్నాభిప్రాయములు లేక అందఱూ నేకాభిప్రాయము కలిగి పనిచేయుటకు పూనుకొనుఁడు. అట్టి ధైర్యస్థైర్యములు, పట్టుదల, ఐకమత్యము, కార్యదీక్ష భగవంతుఁడు మనకు ప్రసాదించుగాక!

# విజ్ఞాన తత్త్వం

"వసంత"



దసరా నవరాత్ర్యుత్సవాలు మహావైభవంగా సమాప్తమయినాయి. ఎంత స్వల్ప సంసారులైనాసరే బొమ్మలకొలువు విధిగాపెట్టి తీరుతారు. మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వత్యాత్మకమైన ఆ దివ్యశక్తి ప్రభావం ఎటువంటిదో కాని ఆపూటకు లేనివారి చేతకూడా శతసహస్రాధికోత్సాహంతో యథాశక్తిని ఉత్సవాలు జరిపించి తీరుతుంది. సౌభాగ్యప్రదమగు పసుపు, కుంకుమ, దేవీప్రసాదం స్వీకరించుటకై రమ్మని పేరంటాల నాహ్వానించడానికని, ఉదయం కొలువుల శోభచూచి ప్రసాదం పరిగ్రహించడానికని సాయంకాలం సుమారు దినమల్లా తెరిపిలేకుండా సోదరీమణులు వాడవాడల సంచారం చేస్తూనే ఉంటారు. చందన కర్పూరాది సుగంధద్రవ్యపరిమళంతో నానానేకరుచిర భక్ష్యములతో శ్రవణానందదాయకమగు మృదుమధుర సంగీత వాద్యములతో ఆరోజులందు వనితాలోకం శోభాయమానంగా కలకలలాడుతూ ఉంటుంది. భారత నారీమణుల హృదయనైర్మల్యం, కళానైపుణ్యం, కల్పనాచాతుర్యం ప్రశస్యవైదుష్యం నిరుపమానంగా ఆ దినాలలో ప్రదర్శితమౌతవి. గృహబంధములజిక్కి పురుషునికి దాసియై వ్యక్తిత్వం గోల్పోలేదు సరికదా నివురుకప్పిన నిప్పు చందాన నిశితమైన అంతశ్శక్తులుగల భారత నారీమణి అదనుకు పురుషప్రభావాన్ని అతిక్రమించగల సర్వసమర్థురాలని సైతం ఆరోజులలో విశదమౌతుంది.

కొలువులు ముగించి బొమ్మలను యథాస్థానంలో క్రమంగా భద్రపరుస్తున్నారు. రాత్రి 9 గంటలకది పూర్తి అయింది. పిల్లలు కొన్ని బొమ్మలు తెచ్చి టేబిలుమీద పెట్టేరు. రెండు పెద్దబొమ్మలతో గృహిణి వస్తూండగా మోకాలునకు ద్వారబంధం తగిలింది.

'పొద్దల్లాపోయి ఎంత దెబ్బ తగిలిందండీ! నాకర్మం ఒక్కలాగునఉంది.'

'అదే కాదంటాను.'

'మీరేమన్నా అంటారు మీకేమి? ఆబ్రహ్మ నానొసట వ్రాసిపెట్టితే ఎవరు తప్పించగలరు? ఔను; నాకర్మం కాకపోతే నాఒక్కర్తికే గుమ్మం తగలడమేమి? ఎంతమంది రాలేదీ గదిలోకి?'

'కొంచెం 'జాంబక్' మర్దనాచెయ్యి......అయితే నీ నొసటనున్న వ్రాత ఎంత సులభంగా కనుగొన్నావు? మహామేధావు లెంతతీవ్రంగా పరిశోధిస్తూనా ఛాయా మాత్రంగా కూడ వ్యక్తంకాని విధినిర్ణయాలు, చిత్రగుప్తుని అగణ్యపుస్తకాలలోని

విషయాలు ఒకలిప్తలో ఒక మోకాలిదెబ్బతో నీకు విస్పష్టమవడం ప్రశంసనీయమే. కాని ప్రతిస్వల్ప సందర్భంలోను 'కర్మం'అను పదం అసంబద్ధంగా ప్రయోగించి మనకర్తవ్యం పూర్తిగా పరిత్యజిస్తున్నాం. ఈ దెబ్బ తగలడానికి కారణం నీవేకదూ ?'

'నాకు తగిలిందని నేనే కారణమంటారా ?'

'అదికాదు. నీవు కించిదప్రమత్తురాలవై ఉంటే నీకాదెబ్బ తగులవలసినదేనా ? ఇంతకు నీ అజాగ్రత మూలమున నిశ్చితానికి రాకతప్పదు.'

'ఎలాగైనా నాదే తప్పంటారు ! కానీయండి మోకాలుపగిలే దురవస్థ నాకు సంభవింపనున్నపుడు జాగ్రతగాఉండడం నాకు సాధ్యమౌతుందా ? అది నాకర్మంకదండీ?'

'ఒక్కనాటికికాదు బుద్ధిపూర్వకంగా ధర్మాన్ని మట్టుపెట్టి మనం అను నిత్యంచేసే అకార్యాలకు మనం నిర్వహించని విధ్యుక్తకృత్యములకు మన ప్రాలుమాలికకు మన జడత్వానికి మనం బాధ్యులంకామని ఈ అక్షంతవ్యదోషాల కర్తృత్వం 'కర్మ'పై పడవైచి, ఆత్మవంచకులమై జీవజ్యోతికి స్వహస్తాలతో అవసాన మాపాదిస్తున్నాను. 'కర్మ'అను విశిష్టపదానికి అపార్థాలు కల్పించి సత్యమైన జీవితలక్ష్యానికిదూరమై పూజ్య హిందూ తత్త్వాన్ని కళంకీభూతంచేసి, పశుప్రాయులమై, మానవౌన్నత్యాన్ని దగ్ధమొనరించు నికృష్టులముగా పరిణమిస్తున్నాము.'

అయితే 'నీవు నిర్వచించు' కర్మ సిద్ధాంతప్రకారంగా, ఏవిధంగానైన నీకాదెబ్బ తప్పదనే నీవాదం ?

'నాదుర్విపాకం అట్లుంటే తప్పతుందండీ ?'

'నీప్రయత్నం నిష్ఫలమన్నమాట. నీవెంత అప్రమత్తంగా, భద్రంగా సంచరించి ఉన్నప్పటికి దానిని వారింపలేకుందువనే నీ అభిప్రాయం ?'

'అవును. బుద్ధికూడా కర్మానుకూలంగానే పుట్టినపుడు నాకగత్యమగు జాగ్రత లభ్యమౌతుందా ? ఆస్థితిలో నాప్రయత్నానికి అవకాశమేలేదుకదండీ ?'

'ఆ, ఆ. అదేమెట్టవేదాంతము. నీవాదంయొక్క తార్కిక పర్యవసానం ఎంత అసందర్భంగాను, ప్రమాదకరంగాను ఉంటుందో ఎరుగుదువా ? జీవితంలో మానవ ప్రయత్నానికి స్థానమే లేదన్నమాట. 'బుద్ధిః కర్మానుసారిణీ' అని మనం క్రియాహీనులమై కార్యములపట్ల తగుప్రయత్నం మానుకొంటే ఒక్కక్షణం జీవించలేము. ఆపక్షమందు మానవుడు విధిచేతిలోని కీలుబొమ్మని, యోగముంటే స్వప్రయత్న రహితంగానే వాంఛితార్థములు బడయగలడని, ఉన్నతాదర్శము, ఉత్తమాకాంక్ష, నైతిక ప్రవర్తనము, జ్ఞానార్జనము మిథ్యని, శుభాశుభములు యథావిధిగా సకాలంలో సిద్ధించునని మనం

ఒప్పుకొనవలసి వస్తుంది. తదనుగుణ్యంగా వంటలుమానుకొని భోజనానికి నిరీక్షిం వచ్చును. ఎప్పుడైనా నీవంత తెలివితక్కువగా ప్రవర్తించినట్లు జ్ఞాపకముందా?'

'బాగుందండీ. వంటలేని భోజనం ఇంట్లో లభిస్తుందని ఎవరు నమ్ముతారు-హోటలు నుండివస్తే తప్ప. ఏమాటన్నా మీరిలాగే నిలవతీస్తారు. ఏదైనా అకస్మాత్తుగా సంభవించి నపుడు 'నాకర్మం' అనడం పరిపాటయిందికదా! నేనూ మామూలుగానే అన్నాను.'

"అది నే గ్రహించలేకపోలేను. అపరిపాట ఎంత ఘోరమైన పొరపాటో తెలియ చేయడానికే ఈ దీర్ఘ వితర్కమంతాను. అత్యుత్తమమగు పదానికి విపజ్జనకార్థం కల్పించి అయినప్పుడు కానప్పుడు ఆపదం ప్రయోగించుటవల్ల ఎంత అనర్థం వాటిల్లుచున్నదో కనిపెట్టలేకున్నాము. ఈనాడుకాదు, ఈతరంలోకాదు, కొన్ని తరాలవెంబడి ఈచెడుగు కలుగుతూందని చెప్పవచ్చును. 'నాకర్మం' అనుటకు బదులుగా 'స్వయంకృత' మని అప్రయత్నంగా నోట వెలువడితే మనమింత ధురవస్థలోనుండకపోదుమని నానమ్మకము."

'దెబ్బతిన్నానక 'స్వయంకృత' మంటేమాత్రం ఏంలాభమండీ? అది తప్పించుకునే మార్గముంటే నయంగాని, లేనప్పుడు, ఏమాటలతో మనశ్శాంతి పొందినా ఒకటే.'

'భేదంలేకపోలేదు. స్వయంకృత మనకుంటే తదనంతరమైనా దెబ్బ తప్పించుకొనే మార్గం గోచరిస్తుంది. ఇప్పుడు దెబ్బతగులగానే 'నాకర్మం' అన్నావు. అనగానే ఆదుఃఖా నుభవానికే నీహృదయం సిద్ధమయింది. కాని 'స్వయంకృత' మనుకున్నావంటే నీలోపంకొంత కలదను విషయం స్మరణకు వస్తుంది. హృదయం చివుక్కుమంటుంది. మునుముందు జాగ్ర తగా ఉండాలన్నజ్ఞానం హృదయంలో మెరుస్తుంది. 'నాకర్మం' అన్నఫక్కీలో నీవ్యక్తి త్వాన్ని సుతరాము నాశనంచేసి కొంటున్నావు. స్వయంకృత మన్నప్పుడు నీప్రాముఖ్యం గ్రహించి, మానవ జన్మమెత్తినందుకు నీపాత్ర యుక్తంగా పోషించుకొనవలసిన బాధ్యత నీపై నున్నదని గుర్తిస్తున్నావు. నీజీవితాన్ని నీవు సంస్కరించుకొనలేకపోతే జీవితం వ్యర్థమేకాదూ?

దేశభక్తి, రాజభక్తి, ఆత్మగౌరవం పసిపిల్లలకు ఉగ్గుతో కలిపిపోస్తారు. ఎందుకని? నిర్మలహృదయక్షేత్రాలలో ఇట్టి మహాబీజములు నాటితే ఘనంగావర్ధిల్లి రసవంతములైన ఫలితములిస్తవని; 'నాకర్మం' వంటి జాడ్యబీజములంకురిస్తే జీర్ణవృక్షములు పుట్టి రస హీనములగు ఫలములే పెట్టుతవి.

అతి విశిష్టమగు కర్మసిద్ధాంతం తుదకెంత హాస్యాస్పదమైపోయిందో చూడు; వంట ఆలస్యమైనా; రైలు తప్పిపోయినా; వీధిలో నడుస్తూ రాతిని తన్నినా; సంవత్సర మంతా దుర్వ్యసనాలతో వ్యర్థమొనర్చి, చదువక, పరీక్షపోయినా; ఇట్టి దేమైనాసరే

'నాకర్మం' అంటారే! కుప్పలుగా మనంచేసే తప్పులకు దేనికిని మనం జవాబుదారి కాదని తప్పించుకొనుటకే ఈ ఉపాయం. ఇది అద్వితీయమైన ఆత్మవంచన; ఆత్మహత్య అన్నా దోషంలేదు.

'అయితే దేనికిని 'నాకర్మం' అనడానికి వీలులేకపోతే, కర్మమే లేదంటారా ?'

'లేదనను. మనం అనుక్షణం కర్మచేస్తున్నాము. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు మనోవాక్కాయములలో దేనిమూలంగానైనా కర్మచేస్తున్నామన్నది నిర్వివాదాంశము.

'నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్,
కార్యతేహ్య వశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః.

ప్రకృతివలన బుట్టిన సత్వరజస్తమోగుణములచేత బరాధీనుడై ప్రతిప్రాణియు కర్మనుచేయుచునే ఉండును. ఒక్కడును క్షణకాలమైనను కర్మములను చేయనివాడగుచు నుండడు' అని మన సిద్ధాంతము. కేవలం భౌతికపథాల ననుగమిస్తున్న ఆధునిక విజ్ఞానం యొక్క ఛాయలు ఈ సిద్ధాంతానికేవిధంగా సహకారమై, జీవితంలో మానవ ప్రయత్నం యొక్క నిజస్థానం, మహత్వం ఎంత సరళంగా స్పష్టీకరిస్తున్నవో మనం తెలిసికుంటే, మన ప్రాచీనసిద్ధాంతాలను విశ్వసింపలేకుండ, మానలేకుండ సందిగ్ధావస్థలో క్లేశపడుచున్న మనహృదయములు పరివర్తనమొంది, సిద్ధాంతాల సత్యం గ్రహించుట కనువగు పరిస్థితు లేర్పడునని ఆశింపవచ్చును.

విశ్వంలో ప్రబలమగు శక్తులనేకమున్నవి. ఒక్కొక్క శక్తి ఒక్కొక్క లోకాన్ని తృటిలో నిర్మూలింపగల ప్రతిభావంతమైనది. శతకోట్లమైళ్లు దూరంగానున్న గ్రహాలను సూర్యగోళంచుట్టు నిరంతరం పరిభ్రమింపచేస్తూన్న దొకశక్తి. నక్షత్ర మహోగ్రకోశాలలో నుత్పన్నమై జీవస్ఫులింగాలతో దిగంతములు వ్యాపిస్తూన్న దొకశక్తి. నిపాత నిశితశర పరంపరవలె పరమాణువులపై ఆకస్మికముగావడి విచ్ఛిన్నమొనరించుచున్న దొకశక్తి. అప్రమేయమగు అనంతకోటి శక్తులకు క్రీడావిహారమగు విశ్వంలో ఒకమూల, ఒకరేణు వగు భూమిపై మానవుడు జీవితం గడుపుచున్నాడు.

చేతనాచేతనమగు జీవప్రపంచానికి మానవునికి ఒక్క భేదమున్నది. మానవునికి ఆత్మజ్ఞానము, బుద్ధికలవు. మానవుడు ఒక్కడే ప్రకృతిశక్తులకు 'దాసోహం' మనక వాటిని ప్రతిఘటించుటకు స్వశక్తిని ఉత్పన్నమొనరింపగలడు. అగుట వాని అంతశ్శక్తులు, మానవోద్భూతమైన శక్తులు కలిసి ప్రకృతిశక్తులతో నిత్యము సంఘర్షించుచున్నవి. ఈ అనంత మహాసంగ్రామంలో ఉభయపక్షములు స్వకీయ అస్త్రశస్త్రాభివృద్ధికి పాటుపడుట సహజం. ప్రకృతిశక్తులు మన కతీంద్రియమగుటచేత వాటి సాధనవిధానం మన కజ్ఞేయము. కాని, అప్రతిహతమగుట వైరి నెదుర్కొనుటకు మానవుడెంత సామగ్రి సమకూర్చినను

చాలదు. ఈ సమరంలో క్షణమైనను విశ్రాంతిలేదు. నేదతీర్చుకొనుటకు అవకాశంలేదు. విరమించుటకు సాధ్యంకాదు.

పైగా, కర్మరహితంగా క్షణం గడుపలేమన్నది నిశ్చయము. ఏమంటే: మనం మాట్లాడినప్పుడు నోటిముందున్న గాలిపై ఒత్తిడికలిగిస్తున్నాము. బాహ్యప్రపంచాన్ని ఆలోకించినప్పుడు వివిధకాంతులను కండ్లలోనికి జొరబడనిస్తున్నాము. అడుగుతీసి అడుగు పెట్టినప్పుడు భూతలాన్ని మర్దిస్తున్నాము. మానసిక విశ్రాంతి అనుభవిస్తున్న సుషుప్తిలో సైతము శ్వాసోచ్ఛ్వాసములు మన ప్రసక్తిలేకుండనే జరుగుచున్నవి; మలినరక్తము పరిశుద్ధమౌతూంది; ఆహారము జీర్ణమౌతూంది.

పవిత్రమైన మానవ స్వాతంత్ర్యాన్ని, వ్యక్తిగతంగా అంతర్భూతమై ఉన్న శక్తిని, ఆ శక్తిని పెంపొందించుకొను సూక్ష్మమార్గాలని గ్రహించినవానికి దుస్సాధ్యమైనది లేదని మన పురాణేతిహాసములే ఘోషిస్తున్నవి. కేవల మాత్మశక్తినే సాధనంగాను, కార్యసాధనమే లక్ష్యంగాను నియమించుకొని మృత్యువుని జయించిన మార్కండేయుడనగా; ఆత్మవిశ్వాసంతో, కార్యదీక్షతో, మనోనిశ్చయంతో ఒక మట్టిబొమ్మను గురువుగా ప్రతిష్ఠించి విలువిద్యలో అసామాన్య ప్రతిభాశాలియైన ఏకలవ్యుడనగా; సవతితల్లి అవమానించినదని కినిసి క్షుభితమానసుడై రాజనగరువీడి ఆత్మశుద్ధితో, ఏకాగ్రతతో అంతశ్శక్తులను ప్రజ్వలింపచేసి నభోమండలంలో సుస్థిరస్థానమొందిన ధ్రువుడనగా; వీరందరు మూర్తీభవించిన సంకల్పసిద్ధులు. వారిని ఆదర్శంగాపెట్టుకొని చిత్తవృత్తిని అవిచ్ఛిన్నమగు కార్యసాధన పథాలలో నియోగించుటకు మారుగ శుష్కులై తాళికులమై నిరర్థక స్తోత్రాలతో ప్రాచీనౌన్నత్యం ఉగ్గడించుకొంటూ, ఆ తన్మయత్వంతో కర్మరంగమందు నిర్వహింపవలసిన విద్యుక్తధర్మాలకు తిలోదకాలిస్తూ అధఃపతనమొందుచున్నాము. కాని, కర్మసిద్ధాంతాన్ని యథోచితంగా హృద్గతమొనరించుకొని కార్యసాధనకు ఉద్యుక్తులమైనపుడు సాధ్యంకానిది లేదన్న పరమసత్యం గ్రహించి తదనుకూలంగా దీక్షాయుతచిత్తులమైననాడు కదా భాగ్యోదయమయేది?

'అయితే, మానవునకసాధ్యమైన కార్యంలేదంటే, దైవాన్నిత్రోసి రాజంటారా?'

'అనను. అంటే అది అహంభావజనితము. అదీ అధఃపతన కారణమే. దైవమో, ప్రకృతిశక్తులో, విశ్వశక్తులో, ఏ నామంతో వ్యవహరింపబడుచున్నా అవి మానవునిపై అశ్రాంతము వర్తించుచున్నవి. వాటికి దాసులమై వాటి కరతాళములకు గంతులువేయకుండుటకే మనం స్వశక్తిని పెంపొందించుకొనవలసి ఉన్నది. అట్టి స్వాభ్యుదయానికి కీకారణ్యములలోనికి ఏకాకిగాపోయి తపోనిర్వహణ మొక్కటే మార్గంకాదని జిజ్ఞాస, జిగీష, పట్టుదలతో అనుక్షణము పనిచేయగల సామర్థ్యముగలవారు ఎవరైనా జ్ఞానాభి

వృద్ధికి, ఆత్మాభివృద్ధికి తోడ్పడగలరను ఉత్తమాదేశము పాశ్చాత్య విజ్ఞానులవలన గ్రహింపవలసిన బాధ్యత మనపై ఉన్నది'.

కాలచక్రం తిరిగిపోతూంది. ప్రాచీన మార్గానుసరణానికి పరిస్థితు లనుకూలంగా లేవు. అమోఘమైన ప్రాచీనశాస్త్రాలు నశించిపోతున్నవి. మనం నిర్వీణులమై దారితప్పి, క్రొత్తబాట కనుగొనలేక ఆత్మస్తుతి, పరనిందతో కాలం వ్యర్థమొనరించు కొంటున్నాము.

అటు, పాశ్చాత్యులు విశ్వచిత్రాన్ని అవగాహన చేసికొన్నారు. విశ్వశక్తులను గుర్తింపగలిగేరు. మానవుని నిజస్థానం గ్రహించేరు. బాహ్యప్రపంచానికి మానవునికిగల సంబంధము, మానవునిలో లీనమైయున్న శక్తుల మాహాత్మ్యము, సమయానుకూలంగా వాటిని బహిర్గమింపచేసి మానవాభివృద్ధికి సర్వతోముఖంగా వాటి నుపయోగింపగల విధానము కనుగొన్నారు. తదనుకూలంగా విజ్ఞానదీప్తులచేత హృదయాంధకారమును నిర్మూలిస్తున్నారు.

పాశ్చాత్యులు కళ్లు తెరవకపూర్వం మన ప్రాచీనులు జ్ఞాన సౌధాగ్రమంటి నిర్మలంగా నిర్వచించిన మహోత్కృష్ట సిద్ధాంతాలు మనం తెలిసికొన్నప్పటికి వాటిని మాత్ర ప్రాయంగా వ్యవహరిస్తూ ఆచరణలో పెట్టలేక, లాభంపొందలేక అన్ని విధాలా క్రుంగి పోతున్నాము. పాశ్చాత్యులో, కేవల భౌతికంగా పోతూన్నప్పటికి ఆసిద్ధాంతాలనే అన్యరూపేణ గ్రహించి, తదనుసారంగా జీవపథం నిర్మించుకొని వారుధన్యులై, పరులను ఉద్ధరిస్తున్నారు. వారిది 'స్వయంకృత' వాదమనవచ్చును. అప్పుడే, కార్యసాధనానికి దీక్ష సహాయ మౌతుంది. కాబట్టి, మానవాభ్యుదయం సిద్ధాంతాలతో లేదు. మానవుడు అవిచ్ఛిన్నంగా సాగించు దీక్షాయుత్తమైన స్వయంకృషి మీద ఆధారపడిన దనుట స్పష్టమే.......ఇంతచల్లగాఉన్నా ఎందుకింత దాహంవేస్తుందో? మంచినీళ్లిదూ.'

గాజుగళాసులో మంచినీరుపోసి తెస్తూండగా ఉయ్యాలకి మోచేయితగిలి గ్లాసు క్రిందపడింది. ముక్కలైంది.

'అయ్యో!......ఇదీ నీకర్మమేనా?'

'ఇంకా కర్మమంటూ నండీ. మొద్దులాగ ఉయ్యాలకనిపిస్తూండగా దాన్ని తప్పుకోకుండా వస్తే దెబ్బతగలదూ? నిశ్చయంగా ఇది 'స్వయంకృతమే' ఎన్ని పగులగొట్టేనండీ మూడు గంటలలో! నిజమే శ్రద్ధలేకపోతే నష్టమే'

'పోనీ ఇకముందు నష్టంరాదులే. నీజాగ్రత్త కాపాడుతుంది'

12గంటల నగారాప్రారంభించేరు. అనంతకోటి జీవులలో ఒక జీవిచేనైనా తానొనర్చిన తప్పులకు 'స్వయంకృత' మనిపించగలిగేనని నా ఆత్మకు కొంతశాంతి కలిగింది. హాయిగా నిద్రపట్టింది.

# పుష్పచయము

## పతి వియోగదుఃఖముచే ప్రాణత్యాగ మొనరించుట

పతిగతించిన కారణమున వియోగదుఃఖమును భరించలేక గోదావరిజిల్లా కొవ్వూరులో నొక యువతి గృహావరణలోనే రహస్యముగ చితిపేర్చికొని అగ్నిదేవుని కాహుతియయ్యెనను ఘోరమైన విషాద వార్త యీమధ్యనే పత్రికలలో ప్రపంచమునకు వెల్లడింపబడినది.

ఉద్యోగమునుండి విరమించి ఉపవేతనమును గైకొనుచున్న నొక మేజిస్ట్రేటు కుమార్తె భర్తృవియోగ బాధమృత్యువుకంటె దుర్భరముగదోచి ఆత్మహత్యకు గడంగుట అతిదారుణమైన విషాదమరణమై యున్నది.

వివాహబంధనము విధిచే విచ్ఛిన్న మొనరింపబడినపుడు ఆత్మధైర్యములేని యువతులెందరో ఆత్మ హత్యచేనంత మొందుచుండుట సంఘముయొక్క క్షీణదశకు ప్రబల నిదర్శనమైయున్నది.

పతిగతించిన పిదప సతికి జీవితాంతమువరకు దుఃఖమును లేక దుర్మరణమునుతక్క వేర సద్గతిలేదా? ఎంతయజ్ఞానము ఆడువారి నావహించియున్నది! ఎంత మూఢత్వము సంఘములో ప్రబలియున్నది!

భర్త మరణించినపిదప కొంతకాల మామితిలేని వియోగదుఃఖమును భరించుచు మేనప్రాణములు నిలిపి యుండియు తుదకు జీవితానందమునందు నిరాశజెంది ఆత్మహత్యకు సాహసించి అసువుల బాసిన నీయతివ విషాదాంతము ఆమె ఆత్మబంధువులకే దుఃఖహేతువుగాకుండ సంఘమునకంతకును అశాంతిని, ఆందోళనను కలిగించుచు, విన్నవారి హృదయములను పరి పరి విధముల కలచివేయు విషాదవార్తయై యున్నది.

విధిత్రిప్పులకు లోనైన వియోగబాధ స్త్రీపురుషులకుభయులకును సమానమేయయ్యు, ఆడువారి అజ్ఞానాంధకారమును, మగవారి నిర్దాక్షిణ్యముతోగూడిన నిరసనభావమును వారి నధికముగ పీడించు చుండుటచే వారి దుఃఖము అపారమైనది. పతిపజ్జ బ్రదుకుకే పరమావధియని యెంచి ప్రేమవారిధిలో బడి రక్షణోపాయము గానక తల్లడిల్లుచున్న సతులకు సద్గతులను కల్పింప నా సర్వేశ్వరుడే యను గ్రహింపవలెను. స్వార్థపరత్వముతో, పాపిష్టి సాంఘికాచారములతో, మూఢ మతవిశ్వాసములతో పాషండహృదయములతో, పాపపునడలతో పాడువడిన మానవసంఘమును చక్కజేయ మహాత్ములకే సాధ్యమగును.

ఈ యువతియొక్క సాహసకృత్యమునకు భర్తృ వియోగదుఃఖమే ప్రబలకారణమని వెల్లడింపబడినను ఆత్మబంధువుల నిరాదరణయు, సంఘముయొక్క దౌర్జన్యమును ఆమె భర్తృవిహీనజీవితమును మరింత బాధకరముగ జేసియుండెనా యను సందియము వొడమక మానదు. పరలోకముననైన ప్రాణనాథుని సందర్శనభాగ్యము కలుగునను నాశతో ప్రేమపాశము తెగియు, తెగకుండిన దుర్దశలో మిగుల

పరితపించుచు ప్రాణత్యాగ మొనరించిన ఆ యువతి ఆత్మకు శాంతికలుగునట్లు ఆర్తత్రాణపరాయణు డగు ఆదిదేవుడనుగ్రహించుగాక! పుత్రికా వియోగదుఃఖమున బొగులుచున్న ఆమె తలిదండ్రుల శోకము శాంతించుగాక!

సంఘములో నిట్టి దుర్మరణములు సాధారణమై పోవుచుండుటచే, సాంఘికాభివృద్ధికెంతయు హానికర మగు నీ విషయమై దేశహితమునకు సర్వదా పాటుపడుచున్న సత్పురుషులు సరియైన శ్రద్ధతో పరిశోధ నలు సల్పి, భర్తృవిహీనలై పలువెతల గుందుచున్న యువతుల నికృష్టజీవితముల కొకించుక ఆనందమును, ఆశయు గల్పింపదగిన అవకాశముల నరయుచు, ఇట్టి దైన్యావస్థలో దురపిల్లుచున్న వారి క్షేమమున కును సుఖమునకును సంఘములో తగు వసతులను గల్పింప నవసరమైయున్నది. తలిదండ్రుల బాధ్యత యీ విషయములో చాలగనున్నది.

## యదార్థ నవ్యసాహిత్యపరిషత్తు

పై పరిషత్తుయొక్క తృతీయ వార్షికోత్సవము శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారి అధ్యక్షతను మద్రాసు సెనేటుభవనములో నీ నవంబరు 5వ తేదీని జరిగినది. పలువురు పెద్దలును పండితులును సభకు విచ్చేసి కార్యక్రమములో పాల్గొనియుండిరి.

అధ్యక్షకోపన్యాసములో తెలుగు సాహిత్యమందు కాలక్రమమునగలిగిన వివిధమార్పులును సంగ్ర హముగ వివరింపబడినవి. అధ్యక్షులు తెల్పినటుల నీ నవ్యసాహిత్య పరిషత్తునకు 'యథార్థ' విశే షణము, ఇదివరలో స్థాపింపబడి వ్యవహరింపబడుచున్న 'నవ్యసాహిత్య పరిషత్తు'నకు భిన్నరూపము నాపాదించుచున్నదనుట నిశ్చయము.

ఇందులో నేపరిషత్తువారి సాహిత్యము ఘనత కెక్కినదియు, ఎందులో యదార్థమున్నదియు నెరుగ రాదు. సాహిత్యమనునది ఒకరిసొమ్ము కాదు. సత్యము ఒకతెగవారి ప్రత్యేకధనమెన్నటికిని కాదు. పూర్వులకంటె తాము ఘనులమని విఱ్ఱవీగు భావకవులు, గ్రామ్యవాదులును గొప్పసాహిత్యమును సృష్టించి ప్రాచీనకవుల సాహిత్యసంపదను మించిన ప్రజ్ఞావిశేషముల నేవియు ప్రదర్శింపలేదు. ప్రాచీన సంప్రదాయమునే అనుసరించి, పూర్వకవుల పాదచ్ఛాయలలోనే మెలంగుచున్నామను యదార్థ నవ్యసాహిత్యవాదుల బింకతనములలో విశేషప్రతిభయును లేదు.

భాషయు, భావములును ఒకరి ప్రత్యేకసొత్తు కావు. అవి అందరికిని పొందదగిన బుద్ధిఫలితములే యగుటచే, 'నామతమే గొప్పది, నేనువ్రాయుభాషయే రమ్యమైనది, నేనురచించురచనలే రంజకము లైనవి, నేనువెలిబుచ్చుభావములే సహజమైనవి, సత్యమైనవి' అని యెవరునుచెప్ప సాహసింపజనదు. ఎవరిబుద్ధి పోడిమినిబట్టి, ఎవరి ఆంతరంగికాభివృద్ధినిబట్టి వారి వారి భాషయు, భావములును ఏర్పడును. కాని, అందరికిని ఆదర్శప్రాయమగు నొక లక్ష్యముండవలెను. కావున, కాలప్రవాహములో కొట్టుకొనిపోకుండ గట్టిగనిలచియున్న గ్రంథములే అందరికిని ఆధారములును, ఆదర్శములునునై యున్నవి.

ప్రాచీనుల గ్రంథములు పెద్దకాలము నిలిచియుండుటచే, వారిని గురుభావముతో పూజించి, గౌరవించి, వారి గ్రంథరచనలలోని ఘనతను గ్రహించి, మన అవసరములకును, శక్తిసామర్థ్యములకును తగురీతిగ

వారిపద్ధతుల ననుసరించుచు, అందరును ఏకీభావముతో ఆంధ్రమాతను సేవించుట ఆంధ్రసాహిత్యారాధకుల ధర్మమైయున్నది.

## చెన్నపురి ఆంధ్రమహాసభకు చేరిన స్త్రీల శాఖయొక్క ప్రారంభోత్సవము

చెన్నపురి ఆంధ్రమహాసభకు సంబంధించిన ప్రత్యేక స్త్రీలశాఖను స్థాపించు సందర్భమున నవంబరు 12-వ తేదీని మైలాపూరులో 'కళామందిర' మను భవనమునందు, ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీ బులుసు సాంబమూర్తిగారును, తదితర పురప్రముఖులును పెక్కుమంది స్త్రీలును సమావేశమగుటయు, శ్రీమతి గుమ్మడదల దుర్గాబాయమ్మగారు ఏతత్సభాప్రారంభోత్సవమును గావించుటకు శ్రీమతి రుక్మిణీ అరండేలుగారి నాహ్వానింప నా మహిళారత్నము ప్రారంభోపన్యాస మొసంగుటయు నీ సంస్థ కెంతయు శుభసూచకములైయున్నవి.

శ్రీమతి రుక్మిణీదేవిగారు, స్త్రీ సంఘములు కేవలము వినోదక్రీడలకే గాక స్త్రీ సంఘాభివృద్ధికి వలయు విద్యావిషయముల కెక్కువ ప్రాధాన్య మొసంగుటుచితమనియు, హిందీతరగతు లీ సంఘమువారేర్పరచియుండుట సంతసకరమగు సంగతియనియు, ప్రాచీన భారతీయ సంప్రదాయమును సుస్థిరముగ నిలుపుటకై స్త్రీలు పాటుపడవలసియున్నదనియు భారతమాతఘనత స్త్రీలు గృహవిషయములలో నిపుణలైయుండుటలోనే యున్నదనియు, భారతీయవిజ్ఞానము మన కళలలోను, సాహిత్యములోను, వేదాంతములోను నిండి నిబిడీకృతమైయున్నదనియు, భారతరమణీమణులు భారత సతీత్వఘనగౌరవ మర్యాదలను ప్రపంచమునకంతకును వెల్లడింప పాటుపడవలెననియు, 'సతీత్వము, మాతృత్వము' అను నీ రెండు స్త్రీ ధర్మములలోను భారతమహిళామణుల ప్రత్యేకఘనత విశ్వవ్యాప్తము కావలెననియు హెచ్చరిక గావించుచు చక్కని హితోపన్యాస మొసంగెను. రావుబహదూర్ అల్లతూర్ నాథమునిచెట్టిగారీ సంస్థకు వేయిరూపాయిల విరాళ మొసంగియుండు టెంతయు ప్రాశంసాపాత్రమగు స్త్రీజనోద్ధరణ విషయికమగు సత్కార్యమైయున్నది.

## సప్తమ గుంటూరుమండల మహిళాసభ - బాపట్ల

సప్తమ గుంటూరుమండల మహిళాసభ అక్టోబరు 28, 29, తేదీలయందు బాపట్లపురమునందు సుప్రసిద్ధ విదుషీమణియగు శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారి అధ్యక్షతక్రింద అతి వైభవముగా జరుపబడినది. అఖిలభారత మహిళాసభ ఆంధ్రశాఖా స్థాయిసంఘ సభ్యురాలగు శ్రీమతి సి. హెచ్. చంద్రమతమ్మగారు సభా ప్రారంభము గావించిరి.

28 తేదీ ఉదయము అధ్యక్షురాలిని ప్రారంభకురాలిని మోటారుపైనెక్కించి బ్యాండు మేళములతో ఊరేగించిరి. మధ్యాహ్నం రెండుగంటలకు మహాసభ ప్రారంభమైనది. ఆహ్వాన సంఘాధ్యక్షురాలగు శ్రీమతి మిస్. టి. కమలా నారాయణస్వామినాయుడు ఎల్. ఎం. పి. గారు అధ్యక్షురాలిని ప్రతినిధులను ఆహ్వానిస్తూ స్వాగతోపన్యాసము గావించిరి. అనంతరము సభా ప్రారంభకురాలగు శ్రీమతి సి. హెచ్. చంద్రమతమ్మగారు ప్రారంభోపన్యాసము గావించిరి. తదుపరి అధ్యక్షురాలగు శ్రీమతి భాస్కరమ్మగారు స్త్రీ సమస్యలనెల్ల సమగ్రముగ చర్చించుచు గంభీరమగు నుపన్యాసము గావించిరి. పై ఉపన్యాసములైన వెనుక గుంటూరుజిల్లాబోర్డునందలి హైస్కూళ్లలో ఈ సంవత్సరము

బాలికలకు జీతములనుతీసికొను పద్ధతి నేర్పరచినందుకు తమ అసమ్మతి తెలియజేయుచు పై ఉత్తరువును వెంటనే రద్దుచేయవలసినదనియు, గుంటూరుజిల్లాలో నెచటనైనను బాలికలకు ప్రత్యేకముగ గవర్నమెంటువారు హైస్కూళ్లను స్థాపించవలసినదనియు, బాపట్లయందలి యువతీ విద్యానిలయం ట్రైనింగు స్కూలును హైస్కూలుగా మార్చుటకు దొరతనమువారు తోడ్పడవలయుననియు, ఆంధ్రదేశమున స్త్రీలకు ప్రత్యేక కళాశాలను పరిశ్రమలతో సహా కూడినదానిని స్థాపించవలసినదనియు, బాలబాలికలకు ఒకే ప్రాథమిక పాఠశాలల నేర్పరచి ఆ పాఠశాలకు స్త్రీ ఉపాధ్యాయినులనే నియమింపవలసినదనియు, అన్ని పాఠశాలలలో హిందీని నిర్బంధముగా నేర్పించవలయుననియు, లేబరు పాఠశాలల నేర్పరచి, పాటకపు స్త్రీలకు విద్య నేర్పవలయుననియు తీర్మానము చేయబడెను. పిమ్మట శ్రీమతి ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మగారును, శ్రీమతి కోటంరాజు సీతాబాయమ్మగారును అపూర్వమగు తమ గానవిద్యను ప్రదర్శించి శ్రోతల నత్యంతానందవారాశి నోలలాడజేసిరి. జాతీయ గీతగానముతో నాటి సభ ముగింపబడెను.

29-10-39 తేదీ విపరీతమగు వర్షము కురియుచుండుటవలన ద్వితీయదిన కార్యక్రమము 30-10-39 తేదీ మూడుగంటలకు ప్రారంభింపబడెను. కన్యాశుల్క వరశుల్కముల నిషేధించుచు దొరతనమువారు చట్టము చేయవలెననియు, హిందూ కుటుంబమునందు స్త్రీలకుగూడా పురుషులతోబాటు దానదమన విక్రయార్హమగు వారసత్వాధికారము నొసంగవలయుననియు, భారతశాసనసభలో శ్రీమతి సుబ్బరాయనుసతిగారు ప్రతిపాదింపనున్న బహుపత్నీ వివాహ నిరోధబిల్లును, మద్రాసు అసెంబ్లీలో శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారు ప్రతిపాదింపనున్న దేవదాసీ సంస్కరణ బిల్లును, నెల్లరామోదింపవలెననియు, విగత భర్తృకలగు హిందూ స్త్రీలకు స్వతంత్రమైన దత్తస్వీకారాధికార మొసంగవలయుననియు, స్త్రీ లెల్లరు స్వదేశీవస్తువులనే వాడవలయుననియు, మహిళాసంఘమున కొక ప్రత్యేక పతాక చిహ్నము నేర్పరచవలయుననియు, ఆరువారముల శిక్షణశాలల నేర్పరచి స్త్రీలకు ఉపన్యాసముల ద్వారా జ్ఞానాభివృద్ధిని కలిగించవలెననియు, రైలులో స్త్రీల పెట్టెను ట్రైనుకు మధ్యగా నుంచవలెననియు, రైలుపెట్టెలలో ఎక్కువారికిని దిగువారికిని ఘర్షణ, ఆలస్యముజరుగకుండా రైలుపెట్టెకు ఒక్కొక్క వైపుననుండు రెండు ద్వారములలో నొకటి యెక్కుటకును నొకటి దిగుటకును ప్రత్యేకించి ద్వారములపై నా విషయము వ్రాసియుంచవలయుననియు, ప్రత్యేకాంధ్రరాష్ట్రమును వెంటనే యేర్పరచవలెననియు, ఆంధ్రదేశమందంతటను స్త్రీలు సంఘములుగా నేర్పడి రాష్ట్రప్రచారము సాగింపవలయుననియు తీర్మానములు చేయబడెను. పిమ్మట శ్రీ విద్యానిలయం బాలికలును శ్రీ హితైషిణీమండలి బాలికలును పానపిశాచ విమోచనము, శాకుంతలము, పారిజాతాపహరణము నాటకములలో కొన్ని రంగములు ప్రదర్శించి సభవారి నానందింపజేసిరి. అధ్యక్షురాలి అంతిమవాక్యములతోడను కార్యదర్శిని వందనములతోడను మంగళగీతములతోడను సభ ముగింపబడెను. యువతీ విద్యాలయ ట్రైనింగు స్కూలు గైడ్ బాలికలు సభజరిగిన రెండుదినములు అపారమగు సేవాసహాయమొనర్చి ప్రత్యేక ప్రశంసకు పాత్రులైరి. పురస్త్రీ లసంఖ్యాకముగా విచ్చేసి సభా కార్యక్రమము తిలకించిరి.

4-11-39 తేదేని పై మహిళాసభ ఆహ్వాన సంఘమువారి యాజమాన్యమున మహిళాసభ కనేకవిధముల తోడ్పడిన పురస్త్రీలకును, గైడ్ సేవాదళమువారికిని అల్పాహార విందుచేయబడెను. ఫోటో తీయబడెను. పిమ్మట తన అపూర్వగానముచే శ్రోతల నెంతయు రంజింపజేసిన శ్రీ దాసు త్రివిక్రమ

రావుపంతులు బారట్లాగారి జ్యేష్ఠపుత్రికయగు శ్రీమతి కోటంరాజు సీతాబాయమ్మగారికి రజతపాత్రా బహూకరణము గావింపబడెను.

(శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ)

## మహారాష్ట్ర మహిళామహాసభ నిర్ణయాలు

క్రిందటి ఆదివారం కిర్లోస్కర్ వాడిలో జరిగిన మహారాష్ట్ర మహిళాసభకు వివిధ మహారాష్ట్ర జిల్లాల నుంచి 200 మంది స్త్రీలు ప్రతినిధులుగా వచ్చారు. పూనా వాస్తవ్యురాలు శ్రీమతి గంగూబాయి పట్వర్ధన్ గారు యీ మహిళాసభకు అధ్యక్షతవహించారు. శ్రీమతి అక్కాసాహెబ్ పంత్ గారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు. సభకు ఔంధ్ సంస్థానాధిపతి ఔంధ్ రాణి సాహెబా, శ్రీయుత ఎల్. కె. కిర్లోస్కర్ యింకా తదితర ప్రముఖులెందరో వచ్చారు.

సభలో శ్రీమతి హంసామెహతాగారి వుపన్యాసం సందేశంగా చదివారు. మంత్రివర్గపు రాజీనామాల హడావిడిలో తాను సభాధ్యక్షత వహించలేనందుకు విచారం తెలుపుతూ ఆమె సందేశం పంపించారు. అధ్యక్షురాలువుపన్యసిస్తూ 'మాకు సామ్యవాదంగాని, బోల్షివిజంగాని, ఫాసిజంగాని, బ్రిటిషు ఇంపీరియలిజముగాని అవసరంలేదు. మాకు భారతీయ సామ్యవాదం కావాలి. విద్యావిషయంలో ప్రజాహితోద్యమాల్లో పురుషులవలెనే మాకు సమానహక్కులుండి మహిళాసౌభాగ్యానికి సర్వావకాశాలుండాలి'. మహిళాసభవారు 29 తీర్మానాలు చేశారు. బొంబాయిరాష్ట్రంలో మద్య నిషేధచట్టం అమలులోకి తెచ్చినందుకు బొంబాయి కాంగ్రెసు మంత్రివర్గాన్ని అభినందిస్తూ ఒక తీర్మానమూ, పూనాలో వివాహాల రిజిస్ట్రేషన్ ప్రవేశపెట్టినందుకు పూనా పురపాలక సంఘంవారిని అభినందిస్తూ ఒక తీర్మానమూ, ప్రభుత్వోద్యోగాల్లో స్త్రీలకుకూడా సమానావకాశ మివ్వాలని ఓ తీర్మానమూ ప్యాసుచెయ్యడమే గాకుండా శ్రీమతి లీలావతీమున్షీగారు అసెంబ్లీలో ప్రవేశపెట్టిన కట్న నిషేధాన్ని, విడాకులచట్టాన్నీ ఆమోదించారు.

(ప్రజాబంధు)

## స్త్రీలకు విద్య కావలెను

జ్ఞానమునకు మూలాధారమైనది విద్య. విద్యలేనియెడల జ్ఞానము సున్న. కనుక విద్య స్త్రీ పురుషు లెల్లరకు అత్యవసరమైనది. కాని కొంతమంది మూఢాచారులు స్త్రీలకు విద్య అవసరములేదని భావించుచున్నారు. అది చాల మూర్ఖత్వమైన సంగతి. గృహనిర్వాహకము, శిశుపోషణ స్త్రీలయం దాధారపడియున్నదిగదా. బిడ్డల లేతహృదయములందు మొలకలెత్తుచున్న దుర్భావములను దుష్ప్రవర్తన మొదలైనవి ఖండించి, సత్ప్రవర్తన మొదలైనవి పెంపొందింపజేసి సుజ్ఞానవంతులుగ చేయుట తల్లియొక్క విధియై యున్నదని ఎల్లరకు తెలిసినవిషయమే కదా. విద్యలేక జ్ఞానశూన్యులైన స్త్రీలు మాతృత్వపదవిని స్వీకరించి తమ విధిని ఎట్లు నెరవేర్చుకొందురు. మరియు 'కరణేషుమంత్రీ' అని శాస్త్రము ఘోషించుచున్నదికదా. విద్యాజ్ఞానశూన్యులైనవారు మంత్రివలె నెట్లు సంచరింతురు? ఆడపిల్లలకు చదువు అవసరములేదని ఎంతమాత్రము భావించరాదు. స్త్రీలు పిల్లలను వస్త్రాభరణాదులతో అలంకరించి సంతోషించినయెడల ఏమియు లాభములేదు. మీరు బిడ్డలకు ముఖ్యముగా విద్యను నేర్పించి, సుజ్ఞానవతులుగా జేసినయెడల లాభము కలుగును. దేశదాస్యవిముక్తి కలుగును. స్త్రీలు నిరక్షరాస్యతను నిర్మూలింపచేయ పాటుపడవలెను.

(గొర్రెపాటి మహాలక్ష్మమ్మ)




**మతోద్ధారకులై, మాతృదేశారాధకులైన మహాపురుషులు**

“భారతభూమియే నా పాంచభౌతిక శరీరము. కన్యాకుమారి అగ్రమే నా పాద ద్వయము. హిమాలయపర్వతములే నా శిరస్సు. నా తలనుండియే గంగానది ప్రవహించు చున్నది. నా మూర్ధమునుండియే బ్రహ్మపుత్ర, సింధునదులు పుట్టినవి. వింధ్యపర్వతములే నా శరీరమధ్యము. కోరమాండల్ (తీరము) నా యెడమకాలు. మలబారు (తీరము) నా కుడికాలు. ఈ భారతదేశమంతయు నేనయై యొప్పుచున్నాను. తూర్పు పశ్చిమ భాగములు నా రెండుభుజములు నై యున్నవి. నా రెండుహస్తములను సాచి నేను మానవ కోటినంతను ఆలింగనమొనర్చుకొనుచున్నాను. నా ప్రేమ విశ్వవ్యాప్తమైనది. ఈ రీతిగ నా శరీర మమరియుండునట్లు నా ఆత్మశక్తిచే నిర్మించుకొని, ఎల్లప్రాణులలో నందమై వెలయుచున్న జీవాత్మలతో నైక్యముసెంది అద్భుతాకారముతో విలసిల్లుచున్నాను. నేను నడచునపుడు హిందూదేశమంతయు నడచుచున్నది. నేను పలుకునపుడు భారతదేశ మంతయు పలుకుచున్నది. నేను ఊపిరి పీల్చునపుడు దేశమంతయు శ్వాసమొనరించు చున్నది. నేనే భారతమాతను. నేనే శంకరుడను. నేనే సదాశివుడను. ఇట్లు సర్వకాల సర్వావస్థలయందును భావించుచుండుటయే దేశభక్తియొక్క దివ్యాదర్శమును, వేదాంతముయొక్క నిజానుభవము నై యున్నది” అని భారత భక్తాగ్రేసరుడును, తపోధనుడును, సాధుసత్తముడును, పంజాబును పవిత్రమొనరింప నవతరించిన భూదేవుడును నగు శ్రీ రామతీర్థస్వామి నుడివియున్నాడు.

మతోద్ధరణమే మాతృదేశారాధనమునకు మూలాధారమైన మానవసేవయని, సర్వమును పరిత్యజించి దేశక్షేమముకొరకును, ప్రపంచహితముకొరకును పాటుపడిన పుణ్యపురుషులగు శ్రీ వివేకానందస్వామి, శ్రీరామతీర్థస్వామి, లోకమాన్య బాలగంగాధర తిలకు, శ్రీ బాబూ అరవిందఘోష్, శ్రీ రవీంద్రనాథ ఠాగూర్, మహాత్మాగాంధీ మొదలగు వారు తమ జీవితాదర్శములలోను, నిత్యానుభవములలోను విశదీకరించియున్నారు.

పాశ్చాత్య ప్రపంచమున కాంగ్లభాషలో హిందూమతముయొక్క ఘనతను, భారత మాతయొక్క మహిమను ప్రకటించియుండినది శ్రీ వివేకానందస్వామి. అంతకుమున్నె

శ్రీ రాజా రామమోహనరాయ్ పాశ్చాత్య భాషాపాండిత్యమును సంపాదించి వేదోపనిషదర్థవివరణములగు (ఆంగ్ల) భాషాంతరీకరణముల నొనర్చి హిందూమతముయొక్క ఘనతను వెల్లడించుటయేకాక నందలి సత్యమును శోధించి, ప్రస్తుత సంఘసంస్కరణములకు చక్కని పునాదులు వేసియుండెను. కాని, హిందూమతోద్ధారక సార్థకనామధేయమునకర్హుడు శ్రీ స్వామివివేకానందుడే అని చెప్పదగును.

ఏలనన, చికాగోలో జరిగిన విశ్వమతసమావేశములో హిందూమత శంఖారావములను పూరించి, వేదాంత సింహగర్జనములతో దిక్కులు పిక్కటిలజేసి, భగవంతుని అనంతశక్తి జ్ఞానస్వరూపసమాశ్రయములగు వేదనాదములను ప్రతిధ్వనింపజేసి, ఎల్లమతములకును హిందూమతము తల్లియని నిరూపించి, హిందూమతమును సుస్థిరముగ ప్రతిష్ఠింపగలిగిన మహాభాగ్యము, మహామేధావంతుడును, వేదవేదాంత విజ్ఞానసంపన్నుడును, యోగిపుంగవుడును, భారతదేశస్వాతంత్ర్యమునకు పోరాడిన ప్రథమయోధుడును అగు శ్రీ స్వామి వివేకానందునికి గల్గెను.

హిందూమతముయొక్క ముఖ్యాదర్శము, ఆత్మజ్ఞానముతోగూడిన విశ్వమానవపూరితమైన వ్యక్తిని ప్రత్యక్షమొనరించుటయే, అని నిరూపించుచు అందులకు ప్రత్యక్షసాక్ష్యముగ తన గురుదేవుడగు శ్రీ రామకృష్ణపరమహంసదేవుని జీవితమును ప్రపంచమునకు వెల్లడించెను.

హిందూదేశమును పీడించుచున్న దారిద్ర్యమును తరిమివేయుట దేశోద్ధరణమునకు ప్రథమకర్తవ్యమని ఆ మహానుభావుడు పలికియుండెను. భారతదేశముయొక్కయు పాశ్చాత్యదేశములయొక్కయు ఆదర్శములనుగూర్చి తెల్పుచు ('The ideal of the west is, how much a man can amass; the ideal of the east is, how little a man can live upon') మానవుడెంత ధనమును కూడబెట్టి బంగరుమేడలను గట్టగలడో యని పాశ్చాత్యులు పరిశోధనలు సలుపుచుండ, భారతదేశ ఋషిపుంగవులు ఎంత స్వల్పముగ నిరాడంబరజీవితమును గడుపగలడనుసమస్యను పరిష్కరింపప్రయత్నించిరనిచెప్పియుండెను.

నవనాగరికత యనబరగుచున్న పాశ్చాత్య జీవితపధానముతో భారతీయులకు సన్నిహిత బాంధవ్యమేర్పడుటచే దైవారాధనము ధనారాధనముగ మార్పుచెందినది. మతవిషయములలోకూడ ఆడంబరత్వము (Elaborate ceremonial and ostentatious worship) హెచ్చయినది. భారతభూమి పుణ్యప్రదమై, సౌఖ్యవంతమై, సర్వసంపదలతో తనరారవలెనన్న ప్రజలు ప్రాచీన ఋషిపుంగవుల పవిత్ర జీవితాదర్శముల ననుసరించి తపోధనమును సమకూర్చ ప్రయత్నింపవలెను.

## సంపాదకీయములు

ఇప్పుడు మహాత్ముని జీవితము ఆదర్శప్రాయముగ నుండుటకు హేతువేమి? ఆయన నిరాడంబర జీవితము, మహాత్యాగము, తపోబలము, విశ్వమానవ ప్రేమ, ఈ మహా గుణసంపదతో కూడిన మానవసేవ, దేశసేవ, ఇవియే ఆయనను ప్రపంచమునకంతకును సంపూజ్యునిగ జేసినవి. శ్రీ వివేకానందస్వామి జీవితములో మతసేవ, మానవసేవ, సంఘ సేవ, దేశసేవ, అన్నియు సమన్వయము నొందినవి. ఈ మహాపురుషుడు భారతదేశ భావి భాగ్యోదయమునకు వలయు జ్ఞానోపదేశామృతధారలను వర్షింపజేసి వెడలె. ఆయన గతించిన యనంతరము, శ్రీ రామతీర్థస్వామి తన అద్వైతామృతమహావర్షోరుధారాపరంపర లచే భారతమాత మతవిజ్ఞానమును ప్రపంచమునం దంతటను వ్యాపింపజేసి, విశ్వమానవ ప్రేమబీజములను వెదచల్లినాడు. ఆయన మతప్రవక్తయే కాకుండ మహాదేశభక్తుడును అనుటకు తార్కాణముగ 'నేనే హిందూదేశము, హిందూదేశమే నేను, దేశభక్తులందరి మూలమునను దేశస్వాతంత్ర్యమునకు పాటుపడుచున్నది నేనే. ఇరువదవ శతాబ్దములో సగము జరుగుసరికి హిందూదేశము ఉన్నతస్థితిలో నుండగల'దని ఘంటాపథముగ చాటి యుండిన ఘనవాక్యములే గొప్పనిదర్శనములు.

ఆయన మౌనములోనుండియే సత్యగంభీరభాషణములు వెల్వడుచుండెడివి. ఆయన ముఖపద్మమునందు దరహాసచంద్రికలతో వెలయు ఆనందభావములు ప్రత్యక్ష మగుచుండెడివి. ఆత్మారామునితో నెల్లపు డైక్యముచెందియుండెడి రాముని దివ్యసందర్శ నము చూపరుల కాహ్లాదమును గొలుపుచుండెను. దీనులయెడలను, పేదలయెడను, ఆ పుణ్యపురుషుని కరుణ అపారమైయుండెడిది.

ఆడువారియెడల నా పురుషపుంగవుడు చూపియుండిన పవిత్రప్రేమ, గౌరవమర్యా దలును ఆదర్శప్రాయములు. ఆయన ఒక సందర్భములో (Infinite worship of woman is worship of God) స్త్రీరూపమును దివ్యమాతగ భావనచేసి పూజించుటే పరమాత్మ నారాధించుట అని చెప్పియుండెను.

వేదాంతమును నిత్యజీవితమం దెట్లనుష్ఠింపవలసినదియు ఆయన ఉపన్యాసములలోను, జీవితానుభవములలోను విశదీకరించియుండెను. హిందూదేశస్వాతంత్ర్యమును వేదాంత మార్గమువలననే సుస్థిరముగ స్థాపింపవలసియున్నదని హెచ్చరికగావించి మతప్రబోధలోను, మాతృదేశారాధనలోను మిన్నయై విలసిల్లిన మహాపురుషుడగు శ్రీ రామతీర్థస్వామియొక్క స్మారకవర్ధంతి లక్నో పట్టణమునందు నవంబరునెలలో దీపావళీపండుగ దినములలో ప్రతి సంవత్సరము భక్తిశ్రద్ధలతో జరుపబడుచుండుటచే నీ పర్వదినములలో నీ సందర్భమున ఆ దివ్య దేశభక్తుని జీవితమును, ఉపదేశములను ఒకపరిమనసార స్మరించుటర్హమగును.

మాతృదేశారాధనముకంటె, మతోద్ధరణముకంటె, మానవసేవకంటె మహిత ధర్మము లిలలేవని మహాత్యాగమొనరించి భారతమాతకు శాశ్వతమైన కీర్తిఘటింప పాటు పడిన పుణ్యపురుషులగు శ్రీ వివేకానందరామతీర్థులఘనత మహాత్ముని జీవితదర్పణములో ప్రతి బింబించుచున్నది. భారతమాత ప్రపంచప్రఖ్యాత పుణ్యపురుషులను గన్న వీరమాత, విశ్వ విఖ్యాత విమలవిజ్ఞానమూర్తివై భవోపేతులగు ఘనకుమారులనదగు వివేకానందరామతీర్థ గాంధీమహాత్ముల పుణ్యకార్యములచే. విశ్వమంతకును దివ్యమాతయై తేజరిల్లుటకు హిందూ మతముయొక్క ఉన్నతాదర్శములే మూలసూత్రములై యొప్పుచున్నవి.

పురుషుని ప్రతిభకు స్త్రీయొక్క ప్రోద్బలమే ప్రబలకారణము.

మానవజీవితములో, శైశవము, బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము అను ప్రతి యవస్థయందును స్త్రీలయొక్క ప్రోద్బలమును, ప్రేమ ప్రేరేపణమును పురుషుని సత్కార్యాచరణమునకు గాని దుష్కార్యాచరణమునకు గాని పురికొల్పుచు, ఆతని జీవితవిధానమును, సుఖదుఃఖానుభవములను, యోగ్యతాయోగ్యతలను నిర్ణయించు హేతువులై యున్నవి. ఇందులకు పురాణములనుండియు, చరిత్రగాథలనుండియు, ప్రస్తుత ప్రపంచములో జరుగుచున్న ప్రతి మనుజుని నిత్యజీవితమునుండియు నుదాహరణముల ననేకము చూపవచ్చును.

జగన్మాతయగు శ్రీ పార్వతియొక్క ప్రేమప్రభావమువలనగదా శ్రీ విఘ్నేశ్వరుడు తొలిదేవతగపరిగణింపబడి ప్రతిశుభకార్యమందును ప్రథమపూజ్యార్హతను బడయగలిగినది! తల్లియొక్క సర్వవాస్తిత్వ విశేషమువలనగదా కార్తికేయుడు ప్రతిస్త్రీయందును మాతృ దేవతయే యున్నదను మహితదృష్టి సంపదతో వివాహమును పరిత్యజించి నిత్యబ్రహ్మ చారియై నెగడగల్గెను!

తన తండ్రియగు శంతనునకు సత్యవతీదేవిని చేకూర్పసంకల్పించి, ఆమె యభీష్ట మును నెరవేర్పదలచి కాదె గాంగేయుడు శాశ్వత బ్రహ్మచర్య దీక్షనుగైకొనెను! సత్య వతీశంతనుల వివాహముకదా భీష్మప్రతిజ్ఞకు మూలకారణమై యాతనిదివ్యశక్తి సంప న్నుని జేయగలిగినది! కైకేయి పంతమును, మంథరమంతనము (దురాలోచన)ను కదా శ్రీరాముని వనవాసమునకును, దుష్టరాక్షససంహారమునకును మూలహేతువులు! సావిత్రి యొక్క పాతివ్రత్య మహిమవలనకదా సత్యవంతుడు మృత్యువునుండి రక్షింపబడి మహి లోమహిత సుఖము లొందగల్గెను!

సవతితల్లి ప్రేరణ ప్రభావమునగదా ధృవుడు తపోధనుడై శ్రీ మహావిష్ణువును సాక్షాత్కరింప జేసికొనెను! మేనకయొక్క సౌందర్యమహిమకు మోహపరవశుడై స

విశ్వామిత్రు డామె ప్రేమ సుఖానుభవముచే గాదె పుణ్యరాశియగు శకుంతలవంటి మనో హర సుందరరూపవతిని భూలోకమునకు ప్రసాదింపగలిగెను!

కాళిదాసుకవి యెట్లయ్యెను? కాళీప్రసన్నమువలనను కాంతారత్నఘనశక్తికాంతులచేగాదె? శివాజీ దేశభక్తుడును మహావీరుడును నెట్లయ్యె? మాతృదేవతారాధనముచేతను తల్లి యుపదేశబలముచేతను కాదె? ప్రపంచములో నిర్మింపబడిన భవనములలో నత్యద్భుత రామణీయకముతో నొప్పారుచు, మహావైభవముతో విలసిల్లుచున్న 'టాజమహాల్' దివ్యసుందరసౌధము 'షాజహాన్' చక్రవర్తి తన భార్యయొక్క పవిత్రప్రేమ చిహ్నముగ గదా భారతభూమియందు ప్రతిష్ఠించినది!

ప్రతి సారస్వతములోను గల రమ్యములగు కావ్యములను పురుషులు, స్త్రీప్రేమ మాధుర్యమహిమకు పరవశులై కదా వ్రాసియుండిరి! భారత యుద్ధమునకు ప్రబలకారణ మెవ్వరు? భూలోకసుందరి యనబరిగిన ద్రౌపదియేకదా? సత్యభామయొక్క సంప్రీతికై కాదె శ్రీ కృష్ణుడు స్వర్గమునుండి పారిజాతవృక్షమును భూలోకమునకు దెచ్చెను!

విజ్ఞానవైభవోపేతమగు దివ్యసుందరమూర్తితో దివ్యజ్ఞానమహిమను ప్రపంచ మందంతటను వ్యాపింపజేసి, విశ్వవిఖ్యాతపురుషుడై విలసిల్లుచున్న శ్రీ జిడ్డు కృష్ణమూర్తి (కృష్ణాజీ) మహాశయుని ఘనతకు కారణమెవ్వరు? విజ్ఞానమయదేవతయు, దివ్యజ్ఞాన సరస్వతియు, అనంతశక్తి స్వరూపిణియు అనబరగిన ఆనిబెసంటమ్మకాదా? అంతయేల! ఉన్నతాదర్శములకై నెంతయు నుత్సాహించుచున్న ఉత్తమసతియగు శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి ప్రోద్బలముచే గాదె నామెపతియగు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ గారు స్త్రీ జనోద్ధరణమునకై శారదానికేతనమను విద్యాలయమును స్థాపించినది!

ఆంధ్రవనితారత్నములలో నగ్రగణ్యయని భావింపదగు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ గారి అసమానదేశసేవాదీక్షయు, సంఘసేవా తత్పరతయు, శ్రీ ఆచంట లక్ష్మీపతిగా రొనరించుచున్న ఆయుర్వేదశాస్త్రప్రచార సంబంధమగు దేశసేవకును ప్రజాసేవకును అధిక శోభను, అమితానందకరమగు ఉత్సాహసంపదను కలుగజేసెననుటకు సందియములేదు.

ఆదర్శ సతీమణియై తన జీవితమున కెంతయు సౌఖ్యమునింపు సంసారసుఖమును ఆనందమును, సమకూర్చిన స్వర్గీయ శ్రీమతి కమలాన్నెహ్రూయొక్క ఘనప్రేమగౌరవ చిహ్నముగ అలహాబాదులో, నామె కీర్తి ఆచంద్రతారార్కము విలసిల్లుటకై ఆదర్శ ప్రజాసేవా స్వరూపమగు ఆసుపత్రిని నెలకొల్పుటకును నీ కమలాన్నెహ్రూ స్మారక చికిత్సా లయముయొక్క ప్రధానశిలాప్రతిష్ఠాపనోత్సవమును మహాత్ముడు జరుపుటకును, నామానినీ

మణిమహితసతీత్వప్రభావమే కారణము. కావున మానవజీవితములో ప్రతికార్యమును పురుషుడు స్త్రీయొక్క శక్తిచేతనే ప్రేరితుడై చేయుచున్నాడనుట నిశ్చయము.

ఈమధ్య చిత్తూరులో జరిగిన స్త్రీల ఆరోగ్యదినోత్సవ సమావేశములో, బాలికా పాఠశాలలపై నుపపరీక్షాధికారిణిగ నియమింపబడిన శ్రీమతి పి. పారిజాతం (నాయుడు) గారు 'హిందూ సతీత్వముయొక్క స్వప్నదృశ్యము' (A dream of India s womanhood) అను విషయమునుగూర్చి యుపన్యసించుచు, నీ విషయమునే చక్కని భావములలో విశదీకరించియుండెను.

స్త్రీలు, ఆరోగ్యము, (గృహ) పారిశుద్ధ్యము అను రెండువిషయములలోను కడు శ్రద్ధను వహించవలెననియు, ప్రపంచమందును, సంఘమందును పురుషులు పొందగలిగిన ప్రతిభకు స్త్రీల ప్రేరణమే ముఖ్యహేతువనియు బాల్యమందు తల్లియు, యౌవనమందు భార్యయు, పెద్దవయసునందు పుత్రికలును పురుషుని జీవితానుభవములకు ప్రోత్సాహకరములగు ప్రేమబంధనములనియు, స్త్రీలలో నిండి నిబిడీకృతమైన ప్రేమప్రభావమును, శక్తి సంపదను బాగుగ గ్రహింపగలుగుటే పురుషుని బలమునకును బుద్ధికుశలతకును ప్రత్యక్ష ప్రమాణమనియు, స్త్రీలు, పురుషులునిర్వహింపదగు బాధ్యతలను తాము నిర్వర్తింపపోరాడుట భావ్యముకాదనియు, గృహమును చక్కజేసికొనుట, పిల్లలను బాగుగ మంచి పద్ధతులలో తయారుచేయుట, స్త్రీ సంఘమునకు చేయవలసిన సేవచేయుట స్త్రీల యభ్యున్నతికై శ్రమపడుచు, పురుషుల ఘనతకొరకు సహాయపడుచు, సహజధర్మములను చక్కగ సాగించుటయే వారి కర్తవ్యమనియు, సదుపదేశముతోగూడిన హితబోధ గావించెను.

ఇందువలన స్త్రీ పురుషుల పరస్పర సంబంధమును, పురుషుని జీవితములో స్త్రీల ప్రోద్బలశక్తియు, విదితమగుచున్నవి. "Women are mistresses in youth, friends in middle age, and servants in old age" అనునట్లు యౌవనములో యువతులు వలపుగొలుపు సౌందర్యశక్తిచేతను మనోహరమగు శృంగార విభ్రమముచేతను పతులను వశపరచుకొని ప్రేమప్రభావముచే పాలింపగలుగుదురు. నడిమివయసులో భార్య భర్తకు మిత్రభావముతో సంచరించుచు సమాన గౌరవార్హతతో చెలగుచుండును. వృద్ధాప్యమందు భర్తకు, భార్య సేవకురాలై పరిచర్యసలుపుచు సహాయపడును. ఇందలి సత్యము సర్వజనవిదితము. మాతృప్రేమకును, ప్రియభార్య ముద్దులకును, సోదరీమణుల అనురాగమునకును, పుత్రికలయొక్క భక్తిసహితమగు సంప్రీతికిని లొంగని పురుషులుండరు.

**శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ గారికి వేలకువేలుగ వచ్చుచుండు వింతజాబుల వైఖరులు.**

ప్రపంచములో స్త్రీపురుషులలో నేయొకవ్యక్తియందైన నొక ప్రత్యేక ఘనతయున్నపుడు, దానిని ప్రజలు వివిధరీతులు, వారివారి మనోభావముల వైఖరిని బట్టి

వీక్షించుచు, వారివారి ఆంతరంగికాభివృద్ధినిబట్టి యర్థము చేసికొనుచుందురు. మహాత్మునిలో నున్న మానవాతీతమైన ఘనతయు, దివ్యగుణసంపదయు సత్యమార్గావలంబులకు సద్యాదర్శములుగ గోచరించును. బుద్ధిజాడ్యజనితోన్మాదులకును, బుద్ధిమాంద్యముచే బుట్టిన రుజారోగపీడితులకును ఆ సుగుణములు రాక్షసలక్షణములుగ కన్పట్టును.

భారత మహిళామండలిలో మణిభూషణమై వెలుంగుచు, గృహిణీలోకములో నాదర్శనారీమణియై వెలయుచు, దేశసేవనేయుచున్న హిందూ స్త్రీలలో దివ్యరత్నమై తేజరిల్లుచున్న శ్రీమతి విజయలక్ష్మీపండిట్ గారిని, భూలోకసుందరియనియు, ప్రేమమూర్తియనియు, ఆనందస్వరూపిణియనియు, జ్ఞానజ్యోతియనియు, వివిధ స్తోత్రపాఠములచే సంస్తుతించుచు నామె దివ్యసందర్శనభాగ్యమునకై తపించుచున్న యువకులెందరెందరో వ్రాసిన జాబులలోనివింతవైఖరుల నామె విస్మయముతో పత్రికలలో వెలిబుచ్చినది.

ఆమె స్త్రీజనముపాలిట పెనుభూతమనియు, సంసారములను చెడగొట్ట సమకట్టిన స్త్రీ పిశాచమనియు, స్త్రీలకు విపరీతబుద్ధులను గరపి వారికి సాంఘికజీవితమునకు హానికరమైన స్వాతంత్ర్యమార్గముల నుపదేశించుచున్న సాహసురాలనియు, నిట్లనేకవిధముల దెగడుచు వ్రాయబడిన జాబులలోని వింతవిమర్శనముల కామె విచారమును వెల్లడించెను.

ఈ జాబులలోని పిచ్చిభావములును, విపరీత విమర్శనములును ఆమెకు భారతీయ యువకహృదయములోని వికృతమనోగతులను విశదపరచుచుండుటచే భారత దేశము యొక్క సాంఘికజీవితములోని స్థితిగతులామెకు విదితమగుట యొకవిశేషమేయగును.

దూషణభూషణములు ఆత్మకు లేవను సత్యమును చక్కగ నెరింగిన ఈ యుత్తమ సతి కీసంస్తుతులుగాని, నిందాలాపములుగాని, ప్రేమ సందేశములుగాని యొనుమంతయు బాధకరములుగావనుట స్పష్టము.

ఇట్టి జాబులు చదువుట కెంతయు నాహ్లాదకరముగ నుండుననుటకు సందియము లేదు. ఒక వ్యక్తినిగురించి సంఘములో ప్రబలుచుండు వివిధాభిప్రాయములవలన దేశములోనున్న సాంఘిక జీవితములోగల తారతమ్యములును, వింతగతులును బుద్ధివైపరీత్యములును, లోటుపాటులును అద్దమునందువలె గోచరించుట కవకాశము లేర్పడును.

శ్రీ విజయలక్ష్మీపండిట్ గారు ఈ వింత వింత భావముల కొకించుకయు సంచలింపక, కరుణతో నిండిన కోమలహృదయముతో సంఘములోగల స్థితిగతులను సంపూర్ణమైన ఆదరముతో నుపలక్షించుట ఆమె వ్యక్తిమహిమను వేయింతలు తేజోవంతము గావించుచుచుండుట స్పష్టమగుచున్నది.

మానవహృదయములో గలుగుచుండు మార్పులను పరిశీలించుట కీజాబు లామెకు మంచి యవకాశమొసంగుటయే కాక, సంఘ సంస్కరణమునకు సరియైన మార్గముల నామె చక్కగ నాలోచింపగలుగుటకుకూడ నివి ఆధారభూతములుగ నేర్పడినవనుటకు సందియములేదు. ధీరచిత్తముతో, దయార్ద్రహృదయముతో నాయా భావప్రకటనముల లోని సత్యము నరయగోరివాటిని ప్రపంచమున కామె వెల్లడించియుండుటెంతయు శ్లాఘా పాత్రమగు విషయమై యొప్పుచున్నది.

మోడరన్ సినీటోన్‌వారి 'ఉషాపరిణయము'

ఈ చిత్రము ఈ నవంబరు 14-వ తేదీని ఆంధ్రదేశమందు ప్రధాన కేంద్రములలో విడుదలయగుటయు నా దినముననే మద్రాసులో పత్రికా ప్రతినిధులయెదుట ప్రదర్శింప బడుటయు ఆంధ్రుల కెంతయు నానందదాయకమగు విషయమనదగియున్నది.

ఇందలి కథ శ్రీమద్భాగవతమునందలి యాదవ రాక్షసవంశ సఖ్యహేతుభూతమైన ఉషానిరుద్ధుల ప్రణయపరిణయ గాథ. పార్వతీపరమేశ్వరుల సంకల్పముచేతను, నారద తంత్రముచేతను, చిత్రరేఖ పటుప్రయత్నప్రభావముచేతను, శ్రీకృష్ణభగవానుని అనుగ్రహముచేతను బాణనందనయగు ఉషాకన్య ప్రద్యుమ్నుని కుమారుడగు అనిరుద్ధుని పరిణయమొందగలుగుట ఈకథయొక్క పర్యవసానము. బాణాసురుడు పరమేశ్వరప్రసాదిత వరప్రభావముచే తనతండ్రియగు బలిచక్రవర్తినడంచిన శ్రీకృష్ణునిపై పగసాధించి, భండనమున చక్రపాణిచే పరాజయమొంది, తనపుత్రికను శ్రీకృష్ణుని పౌత్రునకిచ్చి వివాహమొనర్చి, పగతునిబహూకరించి, శివకేశవులను ప్రసన్నులజేసికొనుటతో నీకథ ముగియును.

ఇందు 'ఉష' పాత్రను ధరించిన పద్మావతీసాలిగ్రాంగారి గానమాధుర్యమెంతయు ప్రశంసాపాత్రము. ఈమె భావప్రదర్శనమును బాగుగనేయున్నది. చిత్రరేఖపాత్ర చతురతతో నిర్వహింపబడినది. అనిరుద్ధ పాత్రనుధరించిన నీలంరాజు శేషయ్యగారు పాత్రౌచిత్యముతో నొప్పు భావ ప్రదర్శనమొనరించి చక్కగనే నటించిరనుటకు సందియము లేదు. ఈ చిత్రమునకు గోపీనాథ తంగమణీదేవిగార్ల నాట్యమైపుణ్యలావణ్యము విశేష ఘనతను అధికశోభను సమకూర్చుననుట సత్యము. కాని ఛాయాచిత్రగ్రహణము శోభావంతముగ లేనందున నా దృశ్యము బాగుగ ప్రకాశింపలేదు. భావగాంభీర్యమును, భాషా చాతుర్యమును పౌరాణికగాథకు ప్రధానాంశములు. అవి పాటలలోగాని, సంభాషణలలో గాని బయల్పడలేదు. ఈ చిత్రము, శబ్దగ్రహణము, పాత్రపోషణమునందును కొలది లోపములతో గూడియు ఆంధ్రుల ఆదరమునకు అర్హమైన పౌరాణికచిత్రమై యున్నది.

EDITED BY DR. K.N. KESARI. PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

## మందహాసమును గొల్పు మంచి సంగతి

'గ్లాక్సో' బిడ్డలకు సుఖప్రదమగు ఆహారమనుటలో నాశ్చర్యములేదు. అందులో అన్ని సుగుణములును, ఆరోగ్యమును అధికముగ నున్నవి. ఎముకలను గట్టిపరచి, కండలకు పుష్టినిచ్చి, శరీరమునకంతకు బలమును ప్రసాదింపగలిగిన దివ్యాహారమిది. సులభముగ జీర్ణమై, మిక్కిలి బలహీనమగు బిడ్డలకుకూడ అత్యంత ప్రయోజనకరమగు ఆహారమగుటయే కాక, పరిశుభ్రమై, బిడ్డలనంటువ్యాధు లంటకుండ సంరక్షింపగల చక్కని శిశుపోషక పదార్థము.

'గ్లాక్సో'

**Glaxo**



ఇండియాలో అంతటను
విరివిగా దొరుకును.
ధర పెరుగలేదు.

# విషయసూచిక



త్రివర్ణ చిత్రములు : చిత్రకారుడు—శ్రీ ఎ. సోమేశ్వరరావుగారు.

పతిరాక కెదురుచూచు పొలతి

సంతతభావ సంపదల సాంతసమాదఁగఁ దద్గుణంబు లే
కాంతమునందుఁ జేరసకియల్ వినుతించుచు, నీప్రియుండు సం
క్రాంతికివచ్చుచుండెననినన్, వికచాంబుజనేత్ర వాకిటన్
గాంతునిరీక్షణాతి కుతుకంబుననిల్చును నోరవాటుగన్.

(శ్రీ గోనెల నరసింగరావు. ఎం. ఏ. బి. యల్.)



# ఏసుక్రీస్తు జన్మదినోత్సవములు

## నూతన హూణ సంవత్సరాది సందేశము

Old Year, Farewell! we still have grace to trust thee,
New Faith, new Hope, new Love thou yet can'st give:
Oh, grant us patient hearts to wait Truth's dawning,
And by Love's rosy firelight let us live.—(The "Peace")

పవిత్రప్రేమావతార పురుషుడై భువిలో విలసిల్లి, మానవజాతియొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి మార్గములగు సత్యము, ప్రేమ, భక్తి, అహింస అను మహితధర్మములయొక్క దివ్యాదర్శములను నిత్యజీవితానుభవములందు ప్రత్యక్షమొనరించి, మానవకోటియొక్క మోక్షమునకై ప్రాణములర్పించిన ఏసుక్రీస్తుయొక్క జన్మదినోత్సవ పుణ్యదినములలో ప్రపంచమంతయు ప్రేమమయమై, శాంతియుతమై, శోభావంతమైయుండుటకు మారుగ అల్లకల్లోలమయమై, అశాంతివాతావరణముచే నిండియుండుటెంతయు శోచనీయమగు విషయమైయున్నది.

ప్రపంచమందంతటను సంక్షోభమును గలుగజేసిన ప్రళయభీకరసంగ్రామము ఏసుప్రభువు బోధించియుండిన ప్రేమసిద్ధాంతముల కెంతయు విరుద్ధమైయున్నది. ఆ పుణ్యపురుషుడు ప్రపంచమునకు వెల్లడించిన దివ్యసందేశరహస్యములలో (Love thy neighbour as thyself) 'మీ [illegible] పొరుగువారిని మిమ్ములను మీరెట్లు ప్రేమించుకొందురో

అటులనే ప్రేమింపుడు ' అని నుడివియుండెను. అట్టియెడ ఆ దివ్యమతావలంబులని పేర్వడసిన పాశ్చాత్య దేశములవారికి పరస్పర వైరములు సంభవించుట ఆ మతసిద్ధాంతములకు మిక్కిలి విపరీతమైన విధానమైయుండలేదా ?

ఆ పుణ్యవర్తనుడు తన దివ్యజీవితమును, ప్రపంచములో శాంతిని, ప్రేమను పవిత్రతను, స్థాపించుటకొరకై పరమప్రీతితో సమర్పించియుండెను. శిలువపై చిత్రవధ గావింపబడు సమయమందుకూడ ఆ విశ్వప్రేమమూర్తి దయతోనిండిన విశాలహృదయముతో తన్ను హింసించుచుండినవారిపై తన దయారసమును ప్రవహింపజేసి దివ్యప్రేమ ప్రభావమును ప్రసరింపజేయుచు (Father! forgive them for they know not what they do) ' ఓ పరమపితా ! అజ్ఞానపరవశులై నన్ను వధింపబూనిన యీ నా సోదరులను కరుణతో వీక్షించి, వారల దోషమును సైరింపు'మని పరమేశ్వరుని ప్రార్థించియుండెను.

ఏసుప్రభువు కొండపై నొసంగిన ప్రసంగము (Sermon on the Mount) లోని ఘనసిద్ధాంతములను వేదవాక్కులుగ నిరూపించి, అందలి సత్యమును ప్రపంచమందెల్లడల ప్రకాశింపజేయ మతప్రచారమును మహాబుద్ధివైభవముతో సాగించుచున్న ఆ మతావలంబులామతధర్మములకు భిన్నమగు అశాంతివాతావరణముచే నావరింపబడియుండుట కాలవైపరీత్యముగాక మరేమనవచ్చును ?

ఏసుమహానుభావుడు అవతారమును చాలించి పందొమ్మిది శతాబ్దములపైన ముప్పదితొమ్మిది వత్సరములైనది. భారతభూమిలో పాశ్చాత్యప్రభువుల పరిపాలనము ప్రారంభమైన నాటినుండియు హిందువులకు హూణసంవత్సరాది ముఖ్యమైనదినముగ నేర్పడినది. వ్యావహారిక సంబంధమైన ప్రతివిషయమును హూణసంవత్సర కాలక్రమము ననుసరించియే జరిగించబడుచున్నది. పాశ్చాత్యులకాలమానపద్ధతులే హిందువుల నిత్యజీవితమునందును వర్తించుచుండుటచే ఇరువదవశతాబ్దములో నలుబదవసంవత్సర ప్రారంభదినమగు నీరోజున భారతీయులందరును పాశ్చాత్యసోదరులతోపాటు, ప్రపంచములో శాంతియు, సుఖమును సర్వజీవులును అనుభవింప ననుగ్రహించునటుల పరమేశ్వరుని ప్రార్థించుట పరమధర్మమైయున్నది.

గడచిన సంవత్సరములోని (1939 - 40) కడగండ్లను తలపునకు దెచ్చుకొనిన గుండెవ్రయ్యలగు భావములను గలుగజేయు విషయములు గోచరించును. గతసంవత్సరము యొక్క చివరభాగములో బయలుదేరిన, ప్రపంచమును తారుమారొనర్చు యుద్ధము, అన్నిదేశముల క్షేమమునకును చేటువాటిల్లజేయు విషాదసంఘటనమైయుండ, భారతదేశము

యొక్క అభివృద్ధికి హానికరములగు విషమపరిస్థితులేర్పడి యుండుటచే ఈ సంవత్సరము మహారిష్టకరమగు సంవత్సరమై ప్రపంచచరిత్రలో మరువరానిదై యున్నది.

కాంగ్రెసులో కలతలేర్పడినవి. ప్రభుత్వమువారికిని ప్రజాపరిపాలనావిధానము నకును పరస్పరభేదము లేర్పడుటచే, కాంగ్రెసు మంత్రివర్గములు పదవులకు రాజీనామాల నిచ్చియుండుటచే, పరిపాలకులకును, ప్రజలకును చీలికలేర్పడి, ప్రభుత్వముయొక్క ప్రతి భకును, ప్రజలయొక్క సౌఖ్యమునకును భంగముకలిగినది.

ఇది యిటుండ, దేశములో వివిధకక్షలేర్పడి, దేశాభ్యుదయమున కవరోధముల గల్పించు విభేదములు ప్రబలిపోయినవి. హిందూమహమ్మదీయ సఖ్యతను చెడగొట్టు పరిస్థితులేర్పడినవి. దేశములో ధరలుపెరిగి ప్రజలనుపీడించు కాటకము తలసూపుచున్నది.

మద్రాసు రాజధానిలో నుత్తర దక్షిణ భాగములలో అతివృష్టిచే పంటలు పాడగుటయేకాక భాగ్యమును తుడిచిపెట్టు పశునాశనము, ప్రజాపీడ, దారిద్ర్యమును సంభవించినవి. ఆంధ్రదేశములో గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలు నీటిమయమై బీదలు ఉండనివాసమును, తినతిండియునులేక అల్లాడవలసివచ్చినది.

ఇట్టుల మహాఘోరయుద్ధభయము, దేశములో వివిధ తెగలలో నంతఃకలహములు, దారిద్ర్యపీడ, మొదలగు మహాసంకటములచే భారతదేశము అన్నివిధముల క్షోభ ననుభ వింపవలసి వచ్చిన గతసంవత్సరములోని ఘటనలు, హృదయవిదారణములై యున్నవి.

అందుచే నాబాధ కొంత యుపశమించుటకై, ముందు సంవత్సరమైన కొంత మేలొనగూడగలదను నిండుభావముతో, నూతనోత్సాహపూరితమైన భావిజీవితమును అందరాశింపవలసియున్నది. ఈ సంవత్సరమైన భారతదేశప్రజలకు సుఖప్రదమగు జీవితము లభించుటకై, ప్రజలందరును పుణ్యజీవితమునకై పాటుపడుటయు, ఏకైకదృష్టితో దేశాభ్యుదయమునకై హితమొనగూర్ప నిశ్చయించికొనుటయు విధియైయున్నది.

మహాత్ముడు బోధించుచున్న అహింసావ్రతతత్త్వమే యేసుక్రీస్తు జీవితాదర్శమై యుండెను. ఆయన ప్రబోధించుచున్న హిందూమహమ్మదీయ సోదరభావము ఏసు ప్రభువు చాటియుండిన సర్వమానవసోదరభావమను దివ్యమతసిద్ధాంతరహస్యమును వెలయించు మానవధర్మమైయున్నది.

ఏసు మహాప్రవక్త ప్రపంచమున కెరుకపరచిన పవిత్రజీవితవిధానమే మహాత్ము డీపుడు భారతదేశమునందు స్థాపింపదలచిన నైతికజీవితాదర్శములు. హరిజనులయెడ నాదరభావము, మహాత్ముడు క్రొత్తగా కల్పించిన మత సంస్కరణముగాదు. విశ్వమానవ

ప్రేమను వెల్లడించిన ప్రతియవతారపురుషుడును ఘోషించియుండిన దివ్యప్రేమసందేశార్థ సందీప్తితమైన పరమధర్మమే మహాత్ముని హరిజనప్రీతి. ఇది హిందూమతధర్మ విరుద్ధాచారమని ఆంతరంగికాభివృద్ధితో గూడిన మతరహస్య విజ్ఞానవిలసితమహోదారబుద్ధి కెంతమాత్రమును దోచదు.

ఈ క్రీస్తుజన్మదినోత్సవపండుగను పాశ్చాత్త్యులవలెనే భారతీయులును పర్వదినములుగ పరిగణించుచుండుటచే ప్రజలెల్లరును వేడుకలతో నానందము ననుభవించుచు ఈ నూతనసంవత్సర ప్రారంభదినమున బంధుమిత్రులకు ప్రతివారును ప్రేమసందేశములను పంపుటయు, పరస్పరగౌరవమర్యాదలను వెలిబుచ్చుకొనుటయు నాచారముగ నేర్పడినది.

ఈనాడు చైతన్యముతో గూడిన నూతనోత్సాహ సంభరితమగు సంతోషముతోడను క్రొత్తయాశలచే ప్రేరేపింపబడిన ప్రయత్నములతోడను అందరి అంతరంగములును ఆవహింపబడియుండును.

విశ్వమానవప్రేమాదర్శములతో దివ్యసత్యసందర్శన సుఖానుభవైక వేద్యమగు శాంతిమయజీవితమును నూతనసంవత్సరములో నెల్లరభిలషింపదగు సద్యాదర్శమై యొప్పుచున్నది. సహనశక్తితో గూడిన కార్యదీక్షయు, దయతో నిండిన న్యాయబుద్ధియు త్యాగముతో విలసిల్లు సుఖసంపదలును, సత్కీర్తిని సంఘటింపజేయగల సద్ధర్మాచరణమును ఇహపరసుఖసాధనములగు ఆయురారోగ్యభాగ్యములను అనుగ్రహింప, సంపూర్ణ విశ్వాసముతో నీ దినమున సర్వజనులును సర్వేశ్వరుని ప్రార్థించుట శ్రేయోదాయకమగు శుభకృత్యమైయున్నది.

ఏసుక్రీస్తు జన్మదినోత్సవవారములో ఆదివ్యప్రభావుని ఆత్మశక్తి తేజోవంతమై వెలయుచు, ప్రపంచశాంతియుగోదయమును ప్రకాశింపజేయగలదను విశ్వాసము హృదయము నుత్సాహ భావములతో నింపుచున్నది.

ప్రపంచ నాగరికతకును, మానవ జాత్యభివృద్ధికిని, హానికరమగు మహాయుద్ధము ఇంతతో నంతరించిన ఈ సంవత్సరము శుభప్రదమై యొప్పగలదు. భారతదేశములో ప్రబలుచున్న పరస్పర వైరభావములు త్వరలో తొలగి, అన్యోన్య ప్రేమాస్పదమగు గౌరవమర్యాదలతోను ఐకమత్యముతోను అన్ని తెగలవారును, భారతజాతీయఘనతను పెంపొందించుటకును, ధర్మపరిపాలనాప్రాభవోపేతమగు ప్రజాపరిపాలనావిధానమును సుస్థిరముగ ప్రతిష్ఠించుటకును, పాటుపడునట్లును, లోకోత్తర పుణ్యపురుషుడగు మహాత్ముని సత్ప్రయత్నములు సఫలీకృతములగునట్లును, ధరలో ధర్మమును శాంతియును తిరిగి పునరుద్ధరింపబడునట్లును పరమేశ్వరుడు పరిపూర్ణ దయను ప్రసాదించుగాక!

ఉర్వియంతయు సిరిసంపదలతో తనరారునట్లును, ప్రజలెల్లరును ఆయురారోగ్య భాగ్యములతో వర్ధిల్లునట్లును, భారతదేశభావిభాగ్యోదయమును సూచించు చిహ్నములు భారతదేశాకాశముపై ప్రకాశవంతముగ గోచరింప నీ నూతనసంవత్సర ప్రారంభదినప్రభాతము పొడసూపునట్లును, ప్రజాపీడయు, ప్రబలారిష్టములును తొలగి పాడిపంటలతో భారతదేశప్రజలు సుఖించునట్లును, భారత మహిళాభ్యున్నతితో భారతమాత సద్యశో విశాలహృదయయై సంతసమొందునట్లును సర్వేశ్వరు డాశీర్వదించుగాక!

'గృహలక్ష్మి' పత్రికాభిమానులకును మా మిత్రవర్గములకును నూతనసంవత్సరము సర్వశుభముల నొడగూర్చి సుఖము చేకూర్చుగాక! ఆంధ్రరాష్ట్ర మీ సంవత్సరములో సిద్ధించి, ఆంధ్రుల పురోభివృద్ధికి పునాదులేర్పడుగాక! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

'తలయెత్తికొని తాము ధన్యులటంచును నిర్భీతి మానవుల్ నెగడుచోటు
విత్తసాధ్యమెగాక విద్య యెల్లరకును నుచితమైదొరకెడు నునికిపట్టు
స్వల్పభేదములచే శకలంబులై భూమి పాడుపడనియట్టి పరమపదము
సత్యగంభీరమా సంభాషణంబునే సర్వత్ర వినిచెడు సాధుభూమి
దూషితాచారంబు తొలగి వివేకంబు అమృతఝురంబై యమరువీధి
సతత పరిశ్రమాసక్తులై ప్రజలెల్ల నుత్తమముక్తికై యూనుతావు
కలదు స్వాతంత్ర్య స్వర్గంబుగాన తండ్రి! నిన్ను నేమరకెప్పుడు నిందుభావ
కార్య దీక్షల నెసగంగ కన్నతల్లి నటకుజేర్పుము జాగ్రత్త నలరజేసి!'

---

## ఆ శీ స్సు

స్త్రీజనాభ్యుదయమును వాంఛించి సతము
పాటుపడుచుంటి విప్పటివఱకు నటులె
దినదినాభివృద్ధిని బొంది తేజరిల్లు
మమ్మ! 'గృహలక్ష్మి!' నీకు దీర్ఘాయువగుత!

పదియు రెండేండ్ల ప్రాయంబు బడసినావు
మంచిచెడ్డల గ్రహియించి మించినావు
పండితులు బామరులు మెచ్చ బరగినావు
చిరతరంబగు సత్కీర్తి జెందె దీవు!

ఆంగ్ల సంవత్సరారంభమయ్యె, నిందు
సుకవయిత్రీ కృతవ్యాస సుమము లందు
కొందు, స్త్రీజనపత్రికలందు నెందు
సాటిలేనట్టి విమల యశంబు చెందు!

—శ్రీ చదలువాడ నాగరత్నము.

# శిశుపోషణ నియమములు

డాక్టరు శ్రీ రామారావు

తల్లి చనుబాలు బిడ్డకు ప్రకృతిసిద్ధమగు ఆహారము.

పోతపాలెన్నడును తల్లిపాలకు సమముగావు.

డబ్బాపాలు శిశువుఆరోగ్యమును చెఱచును.

తనబిడ్డకు పాలిచ్చుటవలన అంగసౌష్ఠవము చెడుననుట పొరపాటు. అది సహజ సౌందర్యమును దీపింపజేయును. మాతాశిశువుల కారోగ్యమునిచ్చును.

శిశుపోషణ యొక కళ. అందెంతనేర్పు సంపాదించిన మాతాశిశువులకంత శ్రేయస్కరము.

పాలను వేళనుకనిపెట్టి యీయవలెనేగాని, బిడ్డయేడ్చినపుడెల్ల నీయరాదు.

మొదటిరెండునెలలలో మూడుగంటలకొకసారి, తరువాత నెలలలో నాలుగుగంటలకొకసారి యివ్వవలెను. ఈమధ్యయేడ్చినను యివ్వరాదు.

పాలు తక్కువగానున్నచో కొంతవరకు ప్రయత్నించి చూడనిదే పోతపాలకై పఱుగెత్తరాదు.

తల్లి ఆహారనియమములను జాగ్రత్తగా పాటింపవలెను. వేపుడుకూరలుగాని, ఊరగాయలుగాని, కాఫీ, టీ, మొదలగు పానీయములనుగాని తదితర చిరుతిండ్లుగాని తినగూడదు. మరబియ్యం తినరాదు. పండ్లు, పాలు, గోధుమరొట్టె, పచ్చికూరలు విరివిగా తినవలెను. బాగానమలవలసిన పదార్థములు శ్రేష్ఠము.

చనుపాలు చాలనియెడల పాలిచ్చినవెంటనే కొంచెము ఆవుపాలు పోయవలెను. ఆవుపాలు 2వంతులు, కాచి చల్లార్చిననీళ్లు 1వంతుగాకలిపి అందులో కొంచెముపంచదారమిగడచేర్చి పోయవలెను. ఆవుపాలు లభించనిచోట్ల ఆరోగ్యకరములగు ఇతరాహారములను వాడునది. డబ్బాపాలు వాడుబిడ్డలకు నారింజరసము తప్పక పోయవలెను. నారింజలు దొరకనిచో బచ్చలకూరరసము పోయవచ్చును. నిమ్మపండ్లరసముకూడా వాడవచ్చును.

తొమ్మిది మాసములవరకు చనుపాలు. పదవమాసములో పిల్లకు చనుబాలలవాటు తప్పించవలెను. ఈమార్పు నెమ్మదిగా చేయవలెనేగాని హఠాత్తుగా చేయరాదు. ఎనిమిదవ మాసమునుండి పునాదివేయవలెను. అదివరకు ఆరుసార్లు యిచ్చుచున్న చను

బాలు 5 సార్లుగా మార్చి, ఒకసారి ఆవుపాలు పోయవలెను. తరువాత నాలుసార్లు చను బాలు 2 సార్లు ఆవుపాలు పిమ్మట 3 సార్లు చనుబాలు 3 సార్లు పోతపాలు తదుపరి 2 సార్లు ఆవుపాలు 4 సార్లు పోతపాలు ఇట్లు క్రమముగా చనుబాలు తగ్గించి ఆవుపాలు అలవాటు చేయుచు పదవమాసము వెళ్లుసరికి పూర్తిగా మాన్పించవలెను. ఆవుపాలు చెంచాతో పోయుట శ్రేష్ఠము. ఎనిమిదవ మాసమునుండి కొంచెము బిస్కటుముక్కగాని గోధుమ రొట్టెగాని కొరకుట నేర్పవలెను. ఇదేసమయములో అన్నముకూడా ముట్టించవచ్చును. మరబియ్యం వాడకూడదు.

పదవమాసము మొదలు రెండుసంవత్సరములు వెళ్లువరకు పాలు, పళ్లరసము, ఆపిల్సు, గోదుమరొట్టె, వెన్న, మీగడ, బంగాళాదుంపలు, పచ్చికూరలు, ఆకుకూరల పులుసు, ఇవి ప్రధానమైన ఆహారములు.

నడకవచ్చినప్పటినుండి బిడ్డకు ఊహ హెచ్చును గాన అట్టి శిశువును వ్యక్తిత్వము కలిగిన ఒకానొక మానవునిగా నెంచవలెనే గాని ఆటబొమ్మగ నెంచరాదు. అలవాట్లు యేర్పడు తరుణమిది. అందుచే బిడ్డకుమంచినడత అలవడునట్లు కడుజాగరూకతతో నడి పించవలెను. బుడుతసమక్షమున దుర్భాషలాడుట, దుశ్చేష్టలచేయుట గర్హ్యము. పరి శుభ్రత, కావలసినంత వెలుతురు, గాలి, వ్యాయామము, తగినవుడుపులు, మంచిశిక్షణ, సర్వ మానవప్రేమ, వినయాధిసుగుణములు, ధైర్యసాహసములు అలవాటు చేయ వలెను. ఆహారవిషయములో కడుజాగరూకత వహింపవలెను.

వేడిఅన్నమునే పెట్టవలెను. చల్దిఅన్నము వాడరాదు.

ఆహారము పండ్లకు పరిశ్రమ నిచ్చునట్లుండవలెను.

అన్నము రోజుకు మూడుసార్లు పైముప్రకారం పెట్టవలెను. మధ్య చిరుతిండ్లు పెట్టు టగాని, అన్నమని యేడ్చినపుడెల్ల పెట్టుటగాని తప్పు. అన్నముపెట్టుటకు అరగంటముందు స్వచ్ఛమైన మంచినీరు త్రాగించవలెను.

పండ్లు, పాలు, గోధుమ, వెన్న, మీగడ, తప్ప యితరచిరుతిళ్లు మప్పకూడదు.

పిల్లలను స్వేచ్ఛగా ఆడుకొననీయవలెను. కసరుటగాని, కొట్టుటగాని పనికిరాదు.

అన్నము తినునప్పుడు బిడ్డమనస్సు యెంత ఆహ్లాదకరముగ నుండిన అంత జీర్ణ శక్తి కలుగును. కావున అన్నము తినువేళ పిల్లలను విసుగుకొనుటగాని తిట్టుటగాని తప్పు. చల్లగా బుజ్జగించవలెను.

పిల్లలకు యేవి ఆరోగ్యకరమైన ఆహారవస్తువులో కనిపెట్టి తల్లులు వానినే అలవాటు చేయవలెనేగాని, పాపలుకోరినవన్నియు పెట్టరాదు. ఈ వయస్సున యేఅలవాట్లుచేసిన, నవే శాశ్వతమై నిలచును.

రోజుకు అథమము రెండు విరోచనములైన కావలెను. అట్లు కానిచో తగుచికిత్స జరిపించవలెను. నాల్గు విరోచనములకు మించరాదు.

నీరుడు పడకలోపోయుట చాలామందికొక దురలవాటు. నూటికి 99 పాళ్లు యిది తలిదండ్రుల లోపమువల్లనే కలుగుచున్నది. సరియైన పద్ధతిని నడిపించినయెడల ఈదురల వాటు రానేరాదు. నిద్రపోవుటకుముందు లేపి నీరుడుపోయించుట, పగటిపూట 3 గంటలకు పైగా నీరుడు బిగపెట్టునట్లు అలవాటుచేయుట మొదలగు సాధనలవల్ల దీనిని జయించ వచ్చును. తల్లిదండ్రులమధ్యకలుగు గృహకల్లోలములవల్ల బిడ్డలకిట్టి జబ్బు యేర్పడునని కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

బుడుతలడుగు చిన్నచిన్నప్రశ్నలకు సరియైన ఉత్తరము లీయవలెనేగాని కసరుకొన రాదు. భారత రామాయణములలోని నీతిగాథలను చెప్పి మంచి ఆదర్శముల చూపవలెను.

రెండుమొదలు 5సంవత్సరముల మధ్యవయస్సులో సంగీతము మొదలగు కళలయం దభిరుచులు గోచరించును. వానిని వృద్ధిపొందించుటకు తగు అవకాశములను కల్పించవలెను.

రోజుకు రెండుపర్యాయములు, ఉదయము, సాయంత్రము వరుండునపుడు భోజనా నంతరము పండ్లు పరిశుభ్రముగా తోమవలెను. లేనిచో పుప్పిపళ్లు, చిగుళ్లజబ్బులు తట స్థించును.

గృహములో మంచి వాతావరణము, బైట మంచి సహవాసము నుండునట్లు చూడవలెను. బాలురకు అనుకరణశక్తి మెండు. కావున తల్లిదండ్రుల దురలవాట్లను బిడ్డల భావిభాగ్యముగోరియైన మాన్పుకొనుట మంచిది.

వికృతరూపములను జూపించిగాని, చెప్పిగాని, బాలురను భయపెట్టరాదు. అది పిరికి తనమునకు విత్తనమై జీవితాంతమువరకు వేధించును. ఆటపాటలలో, తమతమ చిన్నారిపను లలో, స్వశక్తిపై నాధారపడునట్లు అలవాటు చేయవలెను. బిడ్డలు సగము ప్రయత్నించి ఆపైన చేయజాలక వదలినపనిని వారిచేతనే చేయించవలెను, గాని పెద్దలు చేయరాదు. ఇది ఆత్మవిశ్వాసమును వృద్ధిపొందించును. దయ్యములని, బూచులని జడిపించుట తప్పు.

పుష్పములు, ఫలములు, పచ్చనిచెట్లు, అందమైనపక్షులు, పచ్చికబయళ్లు, అందమైన పర్వత సరోవర దృశ్యములు మొదలగు ప్రకృతి సౌందర్యములమధ్య పెరిగినబిడ్డ శ్రేష్ఠుడై విలసిల్లును. కావున వీలైనంతవరకు యిట్టి దృశ్యములు చూపించవలెను.

# ప్రేమ విజయము

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

'ఏమే సీతా! ఈవాళ ఒక్కమారైనా కనబడలేదు? విసిగి నేనే మీయింటికి వద్దామని బయల్దేరుతూ వుంటే నువ్వొ వచ్చావు!' అన్నది చంద్ర.

'తెల్లవారేసరికి మా అన్న నారాయణ శలవులకి పట్నంనుంచి వచ్చాడు. ఆ వూళ్ళో వాడు కొని తెచ్చిన పత్రికలేవో వుంటే పగలల్లా చదువుకుంటూ ఉండిపోయాను. చీకటిపడకుండా ఓసారి నిన్ను చూచి పోదామని వచ్చా.'

సీత ఇంకా ఏమేమో చెబుతూవుంది. కాని చంద్ర పరధ్యానంగా వింటోంది. ఒక్కమారుగా చంద్ర భావాలు తన చిన్నప్పుడు స్కూలులో కలిసి చదువుకొనే నారాయణరావుని చిత్రించి ఆమె కన్నులకు కట్టాయి. మూడవఫారంతోనే తను మానివేయటం ఆ సంవత్సరమే నారాయణ స్కూలుఫైనలు ప్యాసయి రాజమహేంద్రవరం చదువుకునేందుకు పోవటం అన్నీ మెరపుల్లా జ్ఞాపకంవచ్చి యీ మూడు సంవత్సరాల్లోనూ నారాయణ యెంతగా మారిపోయుంటాడో అనుకుంది. అతని చదువుతోకూడా మనోభావా లెలా మారిపోయాయో. తన్నుచూచి పోల్చుకుంటాడా!...ఇంతలో సీత మాటలు ముగించి చంద్రవేపు ప్రశ్నార్థకంగా చూచేసరికి చంద్ర ఒక్కసారి మేల్కొని ఏమి జవాబుచెప్పాలో తెలీక ఉక్కిరిబిక్కిరయింది.

'అయితే సీతా! మీ అన్నయ్య ఇప్పుడేక్లాసు చదువుతున్నాడే!' అని తప్పుకునేందుకు ప్రశ్న వేసింది. 'బి.యే., మొదటి సంవత్సరమట' అని ముక్తసరిగా ముట్టజెప్పింది సీత. 'ఇంట్లో ఉక్కపెడు తోంది, ఒక్కమారు ఏటివైపు చల్లగాలికి పోయివద్దాం రా' అన్నది సీత.

చంద్ర కామాట ఆశాభంగం కలుగజేసింది. సీతతోకలిసి వాళ్ళింటికివెళ్ళి పరస్పరంగానైనా నారాయణ రావుని ఒక్కపర్యాయం చూచిపోదామనుకొంటూన్న చంద్రకి సీతమాటలు కొంచెం కంటగింపుచేసాయి. కాని తన మనస్సిట్టే బయటపెట్టుకొనుట కిష్టంలేక సరే పదమన్నది. ఇద్దరూ కలిసి మాట్లాడుకుంటూ ఊరికి ఫర్లాంగుదూరంలో సరిహద్దుగా పారుతూవుండే ఏటిదగ్గరకు చేరుకున్నారు.

నాగూరు పెద్ద అగ్రహారం. వీధులు తీర్చినట్లుంటవి. బ్రాహ్మణవీధి కానుకుని ఏటిదిక్కుగా అంటుమామిడి తోటలున్నై. తోటల మధ్యగా నడికిపోయే తోవ ఉంటుంది. చంద్ర తండ్రి రామారావు పంతులు చాలా ఆస్తిపరుడే కాక ఆ గ్రామం కరణంకూడాను. సీతగారి యిల్లు రామారావుగారింటి యెదురు గట్టనున్న పెద్ద భవంతి. సీత అన్నదమ్ములందరూకలిసి ఉన్నారు. వారికి తగుమాత్రము భూములున్నవి. కాని విశేష ధనవంతులుకారు. అందుచేతనే పెద్దఅన్న లిద్దరును స్వయముగా చేరీచేసి ఆఖరివాడగు నారాయణను మాత్రం తమ మేనమామగారింట పెట్టి రాజమహేంద్రవరంలో ఇంగ్లీషు చదువు చెప్పిస్తున్నారు. మొదటి మూడు సంవత్సరాలు నారాయణ స్వగ్రామం రాలేదు. నేటికి రాగానే ఆ యింటిలో అన్నలు, తల్లి, చెల్లి ఆనందంలో మునిగి తేలారు. నిజానికి ఆ గ్రామం అంతటికి పెద్దచదువు చదివినవాడతడొక్కడే అని గ్రామస్థు లందరికీ గౌరవం. నారాయణ ఊళ్ళోకి రాగానే చాలమంది గృహస్థులు వచ్చి చూచివెళ్ళారు. రామారావు గారుమాత్రం తెలిసినా వాళ్ళింటికి పోలేదు, అతడే తన యింటికివచ్చి తన్ను మన్నించాలనే ఊహతో.

రామారావుగారికి చంద్ర ఏకపుత్రిక. ఇంట్లో ఎవ్వరూ ఈడుపిల్లలు లేకపోవుటచేత చంద్ర యెప్పుడూ తమయింట్లో వారింట్లో సీతతోనే కలిసి కూర్చుని కుట్టుపనులు, చదువు, సంగీతం సాగిస్తూఉంటుంది. రామారావుగారికి నారాయణకుటుంబం దూరపుబంధువులైనా వాళ్లని లేనివాళ్లని రామారావు కొంచము హీనంగా చూస్తూఉంటాడు. కాని చంద్రనిమాత్రం వాళ్లింటికి వెళ్లకుండా అరికట్టలేదు. ఆమెమీది ప్రేమచేత ఆ విషయంలో ఆమెకు నిండు స్వేచ్ఛ యిచ్చాడు.

సీతా, చంద్రా మాట్లాడుకుంటూ ఏటిఒడ్డున ఎదురెదురుగా కూర్చుని వెనుకతోటల సరుగుడుతోరడి మీదనుండి వస్తూన్న చల్లగాలికి సేదతేరుతూ సంధ్యారాగంలో మెరుస్తూన్న నదీప్రవాహాన్ని తిలకిస్తున్నారు తదేకధ్యానంతో.

అప్పుడే తమతోట చూసుకొని ఏటివైపునున్న సరుగుడుమొక్కల బారుదాటి వస్తున్నాడు నారాయణ రావు. వెనుకకు తిరిగియుండుటచేత ఆ నూతనపురుషుడు మిక్కిలి చేరువకు వచ్చేదాకా గుర్తించలేదు చంద్ర. మాటల ధోరణిలో మునిగి, సీత అన్నవచ్చి పలకరించేవరకూ చూడనేలేదు.

'ఏమే సీతా! చల్లగాలికి వచ్చారా? ఈ పిల్ల ఎవరమ్మాయి' అంటూ చంద్రవంక చూచి ప్రశ్నవేసి ప్రక్కనే కూర్చున్నాడు నారాయణ. సీత నవ్వుతూ 'పట్నంవెళ్లి యింట్లోవాళ్లనికూడా పోల్చలేకుండా వున్నావేమిటన్నయ్యా! ఇది మన చంద్ర!' అని వెకవెక నవ్వింది.

'ఓహో! చంద్రా!' అంటూ ఆమెవేపు వింతగాచూచి నవ్వాపుకోలేకపోయాడు.

చంద్రకొక్కమారు సిగ్గు ముంచెత్తింది! తన పదహారేళ్ల నవయౌవనమూ ఒక్కసారి ముఖంలోకి తేరి తేటగట్టింది! కన్నులు అప్రయత్నంగా వాలుకున్నై! అంత చేరువగా అతడు కూర్చుండగానే తాను లేచి నిలువ ప్రయత్నించింది గాని కాళ్లు రాలేదు.

'చంద్రా! ఎంత మారిపోయావు! నిన్నుచూచి మూడేళ్లయింది. అప్పటికిప్పుడు నిజంగా నిన్ను పోల్చుకోలేకపోయాను.'

చంద్ర తన సహజసౌందర్యానికి తరుణయౌవనం తెచ్చిన శోభావికాసం, జాలువారే విశాలనేత్రా లొక్కమారు విప్పి వాని ముఖంలోకి చూచింది. నారాయణకి ఆ ఒక్కచూపులోనూ ఆమె సుకుమార హృదయంలో ఇమిడియున్న ప్రేమసామ్రాజ్యసింహద్వారం తెరచినట్లు తటాలున కనబడి ముగ్ధుడై ఆమె ముఖంకేసి చూస్తూ ఊరుకున్నాడు. మునిమాపు క్రమ్ముకుంది. చుక్కలొక్కొక్కటే పొడిచాయి. అంత ముగ్గురూ లేచి, ఎవరిభావాలలో వారు, ఎవరి వింత అనుభవంలో వారు, ఎవరి ఊహాప్రవాహంలో వారు మునిగి తేలుతూ నిశ్శబ్దంగా యిల్లుచేరుకున్నారు.

రాత్రి భోజనాలైనవెనుక వాకిట ప్రక్కలపై పరుండి సాయంకాలం ప్రసంగాన్ని అనుసరించినట్లు 'అయితే మన చంద్రకు పెండ్లైనదా' అని ప్రక్కమంచంమీద పరున్న చెల్లినడిగాడు నారాయణ.

'ఇంకాలేదన్నయ్యా! ఈయేడెలాగైనా వివాహం చేసితీరాలని పట్టుపట్టింది వాళ్లమ్మ. తగిన సంబంధం దొరక్క తిరుగుతున్నారు రామారావుగారు. మొన్న ఒక సంబంధం వచ్చి కట్నాల్లో చెడి పోయింది. రామారావుగారు కట్నాలు ఖండితము వద్దంటారు. ఒక్కకూతురు - క్రమేణా ఆస్తి అంతా ఆమెదే అవుతుంది - అన్నారు. వాళ్లు ఇష్టపడక వెళ్లిపోయేరు. సుఖంగా వస్తూన్న నిద్ర ఆపుకోలేక అన్న తిరిగి వేస్తూన్న ప్రశ్న వినిపించుకోకుండానే కన్నులుమూసింది సీత. తొలిరాత్రి ప్రయాణబడలికచే నారాయణ కూడా అవశుడై నిద్రించేడు.

చంద్రకుమాత్రం నాటిరాత్రి కంటికి కునుకులేదు. నారాయణరావుని చూచిన దగ్గరనుండి ఆమె మనసొక్కసారిగా అతనిని ప్రేమించినది. వాని సౌందర్యం, యౌవనం, విద్యా అన్నీ కలిసి ఆమెను ముగ్ధను చేసి ఆతనివైపున కాకర్షించినై. కాని ఆమె హృదయం అతనికెటిగించుటెట్లు? అదిగాక పెద్దచదువు చదివి అతడెంతటిదానిని చేసుకొంటాడో! అతని ఊహ లెట్లున్నవో! తన్నతడంగీకరించునా! సాయంకాలం తనవైపు గుప్తముగా అతడు చూచిన చూపుల కర్థమేమి—ఛీ! అప్పుడు సీతచూచి ఏమనుకుందో!—ఇదే నిజమయితే తన తండ్రి ఒప్పుకుంటాడా! అయ్యో అతడు చండశాసనుడే! తన మనోరథసిద్ధి కెన్నిపాట్లు

పడవలెనో ! అనుకూలదాంపత్యము కుదిరితే మరుక్షణం మరణించిననూ చాలదూ—భావపరంపరలతో సీతకారాత్రి తెల్లవారినది. సంజజాము—కలతనిద్దుర—కలలు—వింత అనుభవాలు—ఆమెకొక నూతనోత్సాహం, బెదరూ, సిగ్గూ కలిగించినై !

వేకువనేలేచి స్నానంచేసి చీర సింగారించి, వింతగా ముస్తాబై సీతగారింటికి వెళ్లింది చంద్ర ! సీత తల్లికి పనులు సాయంచేస్తూ పెరటిలో ఉంది ! ముందు సావడిలో యీజీఛైరులో కూర్చుని చదువుకుంటూన్న నారాయణరావామెనుచూచి, ఒక్కతే అచ్చట నిలచియుండుట కిష్టములేక 'చంద్రా యిటువచ్చి కూర్చో ! సీత పెరట్లో ఉంది వస్తుందిలే !' అని సంకోచిస్తూ అన్నాడు. ఒక్కమారుగా అతనిదగ్గరకుపోయి కూర్చుండుటకు సిగ్గుపడి అక్కడనే గడపలోనున్న కుర్చీమీద కూర్చుని, మధ్యమధ్య వానివైపు దృష్టులు సారిస్తూంది చంద్ర. నారాయణరావేమీ అడగక పుస్తకం తిరగేస్తూ నడుమ నడుమ ఆమెకేసి చూస్తూ చదువుతున్నాడు.

'చంద్రా నీకేమయినా చదువుకొనుటకు పత్రిక కావలెనా' అంటూ లేచి ఎదుటి బల్లపైనున్న 'గృహలక్ష్మి'ని తీసి ఆమెవద్దకుపోయి చేతికందిచ్చాడు. ఆమె చిరునవ్వుతో స్వీకరించి, అతని కన్నులలోనికి చూస్తూ 'ఇంకేమయినా ఉన్నదా' అని అడగబోయి లజ్జిస్తూ ఊరకుంది. 'నావద్ద చాలా తెలుగు గ్రంథాలున్నాయి. మా పాఠ్యగ్రంథాలే కాక పట్నంలో చాలా ప్రబంధాలూ అవీ కొన్నాను; నీకు కావలసినవి తీసుకవెళ్లి చదువుకోవచ్చు !' అంటూ ఎదుటి అల్మారులో బారులుతీర్చియున్న పుస్తకాలు చూపించి, తిరిగి తన కుర్చీలో పోయికూర్చున్నాడు.

సీత ఎప్పటికీ రాలేదు. చంద్రకి తన ఒంటరితనం కంటకింపు కలుగజేసింది. నిన్నరాత్రి తన మనోభావాలన్నీ ఒక్కసారి బయటకుబికి ఆమెను చలింపజేసాయి.

తన ఆంతరంగికమైన ప్రశ్న, తన జీవితసమస్యను నిరూపించగల ప్రశ్న, రహస్యమగు తన ఏకైకప్రశ్న ఆసమయంలో అతన్ని అడిగివేదామా అనిపించిందామెకు ! కాని ఆ ఉత్సాహమంతా గుండెల్లో కదుముకుని, సీత యింకా రాలేదన్న విసుగు సూచిస్తూ దిగ్గునలేచి నారాయణకెదురుగా నున్న పుస్తకముల షెల్ఫువద్దకు పోయి ఒక్కొక్కపుస్తకమే తిరగవేస్తూ నిలబడింది చంద్ర.

ఆమె సున్నగా దువ్వి వదులుగా వేసుకొన్న వాల్జడ నిలువునా తెల్లని సిల్కుచీరపై వాలి వెనుతిరిగి నిలచిన ఆమె విలాసాకృతిచూచి నారాయణరావు ప్రణయముగ్ధుడై దృష్టి మరల్చుకోలేక పుస్తకం అడ్డువేసుకొన్నాడు.

'చంద్రా ! నీకు కావలసిన పుస్తకము దొరకినదా' అని ఆమె నాకర్షించినాడు.

'ఒక పుస్తకం తీసుకొంటున్నా ! సాయంకాలం సీతచేతికిచ్చి పంపిస్తా !'

'చంద్రా ! నీకీ వేసవిలో పెండ్లగునట కదూ ! ఏవూరు సంబంధం ?' అని నవ్వుతూ అడిగాడు నారాయణ. చంద్ర సిగ్గుతో ముఖంవంచుకుని, 'ఛీ! ఎవరుచెప్పారు మీకీమాటలు ! సీత ఎంత పెంకిపిల్ల ! అదే చెప్పిఉంటుంది.' 'సరే ! ఎవరుచెప్తేనేం ! నిశ్చయమయిందా ! నాదగ్గర నీకింత సిగ్గెందుకూ ? చిన్నప్పుడు మనం కలిసి ఆడుకునేవాళ్లం కదూ !'

'సీతమాటలు నమ్మకండి' అని సిగ్గుతో మెఱుగెక్కిన ముఖం తిప్పుకుంది.

'పోనీ ! నీ మనసుకు నచ్చినవాడేనా !'

'అబ్బా నాకేమీ తెలీదు. అసలీమాట తెవరన్నారు.'

'వివాహమై అత్తవారింటికి వెళ్లి యీపూరూ, మమ్మల్నీ మరచిపోతావా ?' చంద్రకొక్కసారి కన్నుల నీరు కమ్మింది, నీరునిండిన కన్నుల్లో నిగనిగ నవ్వు మొలకలెత్తింది. తన మనోభావం చెప్పివేస్తే! ఎంత మంచి సమయం! సిగ్గు!

'బాగున్నాయి మీమాటలు. పట్నంవెళ్లి మీరు మమ్మల్ని మరచిపోయారుకదూ!' అని పెంకితనంగా చిరునవ్వుతో అతన్ని చూచింది.

'ఓహో! ఎంత మాటకారివి! చూడగానే నిన్ను పోల్చుకోలేకపోయాననా! అది నా పొరపాటు కాదు. యౌవనంవచ్చి నువ్వెంత మారిపోయావు! రూపంలో మార్పు, మాటలో మార్పు, నీ దృష్టుల్లోకూడా మార్పు కలిగింది, అన్నాడు నవ్వుతూ. ఆ చూపుల్లోని చోద్యం ప్రత్యక్షపరచిందామె కటాక్షాలతో.

ఇంతలో సీత పరుగునవచ్చి 'చంద్రా! ఎంతసేపయిందే నిన్నొక్కత్తెనూ నిలబెట్టి! పాలు పొంగు తాయని కాచుకొని కూర్చున్నానింతసేపూ! అయ్యో మరచిపోయా! నీ పూర్వస్నేహితుడు మన నారాయణ ఉన్నాడు కదూ నిన్ను పలకరించడానికి' అంటూ ఆమె విరగబడి నవ్వింది. చంద్ర చిరునవ్వుతో సీత బుగ్గలు నొక్కి చివుక్కున బయటకు నడిపించుకొనిపోయింది. గడపలో ఇద్దరూ కలిసి 'గృహలక్ష్మి' చదువుకుంటూ కూర్చున్నారు. చంద్ర మధ్యమధ్య నారాయణకేసి చూస్తూ తల త్రిప్పుకొనేది. పొద్దెక్కిందని వెళ్లటకు లేచింది.

'అయితే సాయంకాలం షికారుకి వస్తావుకదూ చంద్రా!'

'అలాగే, నువ్వు సిద్ధంగావుండు, ఐదయేసరికల్లా వస్తా' నంటూ వెళ్లింది. కిటికీలోంచి నారాయణ తన్ను తదేకధ్యానంగా చూస్తున్నాడని కనిపెట్టింది చంద్ర!

సాయంకాలమైనది. దినమంతా చదివి, చదివినది తలకెక్కక విసువుగా కుర్చీలో మేను వాల్చాడు నారాయణ. మెరపులా చంద్ర ప్రవేశించి వాని ముందు బల్లమీద ఉదయం పుచ్చుకొన్న పుస్తకం పడేసి, సీతను తోడ్కొని ఏటివంక పాదాలు సాగించింది. ఆమె చిరుపాదాల చిందులకు జలుగులు పెడుతూ గుమ్మంవరకూ చూపులతో సాగనంపి నారాయణ పరధ్యానంగా బల్లమీది పుస్తకం గుండెలమీద పెట్టుకొని పుటలు తిప్పుతున్నాడు. ఆ పుటల సందునుండి వాని వక్షముపై నొక కాగితపు మడత పడింది. అది విప్పి చదివి నారాయణ విస్ఫారిత నేత్రాలతో మిన్నుముట్టాడు! ఆ సౌందర్యరాసి, చంద్ర తన్ను ప్రేమించుచున్నదా! కలలోనివార్త కన్నులకుగట్టు నాకమ్మపై కమ్మని ముద్దులు కురియించి ముఖానికద్దుకున్నాడు.

ఏదో సంకల్పించుకొన్నట్లు నారాయణ చరచర సాగి తోటలోనికిపోయి, ఒక మామిడిచెట్టుక్రింద కూర్చుండి మరలమరల చంద్ర ప్రేమలేఖను చదువుకొన్నాడు. ఆహా ఎంత ధైర్యశీల! ఎంత నిర్మలహృదయ! నాకొరకెంత తపించుచున్నది? కాని తమ ప్రేమజీవనమున కామె రహస్యము విధించినది! అన్యోన్య ప్రణయ వల్లిక పుష్పించి వలపుల వెదజల్లక ఎంతకాలమడగియుండగలదు? దానికి సాఫల్యమేమి? ఆమె నిశ్చయ వాక్యము లాతనికి ధైర్యమును పురికొల్పినవి. ఈ కన్యకారత్నము నెట్లైన దక్కించుకొన సమకట్టినాడు. చీకటిపడుచున్నది.

ఏటిదిక్కుగా నడచి తిరిగి వచ్చుచున్న సీతాచంద్రలను కలుసుకొని చంద్రను చూపు పలకరింతల గిలిగింతలు గొల్పినాడు. చంద్ర వాని చూపుల యర్థము పూర్తిగ గ్రహించి కొంచము సిగ్గుపడి మరల ధైర్యము తెచ్చుకున్నది. కార్యదీక్షయే ఆమె కన్నులలో మెరసినది.



**కుమారి లక్ష్మి, ఆమె సోదరి కళ్యాణి.**

శ్రీ కె. రాఘవాచారిగారి కుమార్తెలు. ఇందగ్రజయగు లక్ష్మికుమారి
భారతనాట్య ప్రదర్శనములందనేక బహుమతులను బడసినది.



డాక్టరు శ్రీమతి వి. మంగళం.
రాజధాని గౌరవ మేజిస్ట్రేటు, దక్షిణ
ఇండియా రైల్వే సలహాసంఘములో
సభ్యురాలుగా నెన్నుకొనబడిన
ప్రప్రథమ స్త్రీరత్నము.





శ్రీమతి చదలువాడ
నాగరత్నంగారు.



విస్మయవిలోకనము

ముగ్గురు నడచుచు తోటకోరడి సమీపించేసరికి తోటలో దడికావలనున్న గులాబీపొదలలో వికసించిన పూవులగుత్తి సీతకు కనిపించినది. అది కోయుటకు వెనుకకు పరుగెత్తి సీత తోటవెనుక గేటులోనుండి లోనికి వెళ్లినది.

'చంద్రా! ధన్యుడను. నీ చూపులలోని వలపు నా హృదయమున కంటికొన్నది'.

'మెల్లగా మాట్లాడు, సీత వస్తుంది'.

'భయములేదు. చంద్రా! మీతండ్రి మన వివాహమునకు ఒప్పుకొంటాడా'.

'నాకా నమ్మకంలేదు. ధైర్యముంటే మనము ఇంకోత్రోవ చూచుకోవాలి'.

'వెర్రిదానా! మీనాయన పిడుగువంటివాడు. మనమెక్కడికి లేచిపోయినా విడిచిపెట్టేవాడు కాదు. దూరముగాపోయి సివిల్ మార్గంగా పెండ్లిచేసుకున్నా చట్టప్రకారం రద్దుచేయించి నిన్ను వశపరచుకోగలడు. నీకు వయస్సుచాలదు. అట్లుచేస్తే నాకు శిక్ష తప్పదు'.

'అయితే గుప్తంగా ఉండే ఉపాయమేమిటి'.

'మన యిరువురి ప్రేమనుగురించీ ఎవరికీ తెలియకూడదా'!

'అదికాదు. అది ఫలిస్తే తెలిసినా నాకిష్టమే. ముందు కార్యసాఫల్యం చూసుకోవాలి. బయలుచేసు కొని తుదకు ఫలందక్కకపోతే సిగ్గుచేటు'.

'సరే నీవు నన్ను మనసార ప్రేమించినట్లయితే నేను తగిన ప్రయత్నంచేస్తా'.

'నేను నిన్ను నిండుమనస్సుతో ప్రేమిస్తున్నా! అది దక్కించుకొనే పూచీ నీది. ఈరాత్రి యీవూరు వదలి నీతోరమ్మంటే వస్తా! లేదా! యిదే మన సౌఖ్యజీవనానికి స్వస్తి అంటే యిప్పుడే యీ నదీగర్భంలో దిగి నీతో శాశ్వతంగా సుఖిస్తా! నన్ను నమ్మవూ'! అని కన్నులు చెమర్చింది.

'పిచ్చిపిల్లా! నిన్ను నమ్మకకాదు. పవిత్రమయిన మనప్రేమ బయల్పరచుటకు నీవనుజ్ఞయిస్తే తగిన ఉపాయమాలోచిస్తా'!

'నీవేమిచేసినా నాకిష్టమే. నీవు నన్ను దక్కించుకోలేమంటే నేనుమాత్రం ఇంకొకరికి దక్కేదాన్నికా' నంటూ పొంగివస్తూన్న దుఃఖాన్ని గొంతుకలోకి దిగమింగింది చంద్ర.

'చంద్రా! నీవు ధైర్యముగా నిలచితివా మనము గౌరవంగా జయించగలము'. అని ఆమెను చేరదీసి బుజ్జగించినాడు నారాయణ.

సీత పాడుకొంటూ పరుగునావచ్చి రెండు పెద్దగులాబీపూవులు చంద్రకిచ్చి రెండు తను తలలో ముడుచు కుంది. తన నూతన ప్రణయరాగమల్లెరగా వలపులను జిమ్ము పూవుల తలధరించి నారాయణ కన్నులకి ఆనందం కలిగించింది చంద్ర!

నారాయణ కాళరాత్రి నిద్రపట్టలేదు. ఆలోచనలో మునిగియున్నాడు. తెల్లవారిలేచి, మంచిదుస్తులు ధరించి రామారావుగారి దర్శనమునకుపోయి వారిని కలుసుకున్నాడు. మొదట యీ నవయువకుని వేషభాష లకు కొంచము విముఖుడైనా, రామారావుగారు వాని వినయవిధేయతలు, విద్యాబుద్ధులు చూచి గౌరవంగా మాట్లాడుతున్నారు. సందర్భం చూచుకొని నారాయణ తనమనస్సులోని కోరిక తెలియజేసేడు.

అతడట్లడుగుట తనగొప్పకు భంగమైనట్లు చురచురలాడుతూ 'అది ఎంతమాత్రం కుదరదు. అదీకాక చంద్ర యీడువచ్చిన పిల్ల, ఆమె యిష్టం ప్రధానం' అని తప్పించుకోబోయారు.

'అమె నన్ను వరించిన మీకేమైనా ఆటంకమున్నదా'?

'ఆమె నిన్ను వరించుతుందనుకోను'.

'తప్పక నన్ను యిష్టపడుతుంది'.

'ఛీ. ఏమిటి నీ నీచపుమాటలు. ఆవలకు నడు. చనువిచ్చి మాటాడనిస్తే మతిలేని మాట్లాడతావేమిటి? నీ సంబంధం నాకెంతమాత్రం యిష్టంలేదు. ఇఁక ఆ సంగతి తలపెట్టక నోరుమూసుకొని యింటికిపో' అంటూ రౌద్రాకారుడయాడు రామారావు.

నారాయణ దీనంగా యింటికి తిరిగివచ్చి కూర్చున్నాడు. తల్లికీ అన్నలకూ యీమాట తెలిసి మందలించారు. పిల్లనిమ్మని అడగడంకన్నా నీచంలేదంది అమ్మ! నీ మూర్ఖత్వం చూచి రామారావు మన కుటుంబాన్ని మరీ హీనంగా చూస్తాడన్నారు అన్నలు.

నారాయణకు వారిమాటలు తలకెక్కలేదు.

ఆరాత్రి కోపం దిగమింగి, చంద్రను పిలచి నాటినుండి సీతగారింటికి వెళ్లకూడదని శాసించేడు తండ్రి. 'ఈ నీచుడు నా ఆస్తికోసం ఆశపడి నిన్ను మోసగించుదామని చూస్తున్నాడు. వీడనగా నెంత. వీడి చదువ నగా నెంత! నీకు గొప్ప సంబంధంచేస్తా! నీవుమాత్రం వాళ్లింటివేపు వెళ్లవద్దు'.

చంద్రకు గుండెల్లో రాయిపడింది. అనుకున్నంతా అయింది. నారాయణ తనమాట వినక యిట్టే ప్రేమ బయలుచేసినాడు. అది యిట్లు ఫలించినది. మనసార వానితో మాటాడి కన్నులు చల్లగా వానిముఖం చూచేందుకైనా యిప్పుడు అడ్డుకలిగింది. పాపం అతడేమి విచారిస్తాడో! తనతో యిప్పుడు మాటాడుటకైనా వీల్లేదు కదా!

మర్నాడు ఉదయమైంది. ఏదో నెపంమీద చంద్ర తమవాకిట నిలచి చూస్తూంది. వాళ్ల గుమ్మంలో నారాయణ కనబడ్డాడు. చూపులతోనే ఒకరి నొకరు పలుకరించుకున్నారు. ఇద్దరి కన్నుల్లోను ప్రేమజ్యోతి ప్రకాశిస్తోంది. మూగగా యింట్లోకిపోయారు. సీతమాత్రం వెళుతూ వస్తూంది కాని చిన్నపిల్ల ఆమెమాత్రం ఏమిచేస్తుంది, అన్న మనస్సామెకు తెలియదు. చంద్రమాత్రం సీతరాగానే ప్రాణంవచ్చినట్లు చేరదీసుకొని రహస్యంగా ఎన్నో ప్రశ్నలువేసేది. అన్న నిశ్చయం తెలియక సీత యేమీ చెప్పలేకపోయింది. చంద్ర దుఃఖంతో క్రుంగిపోయింది.

ఆ సాయంకాలం, కసరి, సీతనుకూడా రాకుండాచేసినాడు రామారావు. చంద్ర మనోవేదన హెచ్చిపోతూంది. తమ గది కిటికీలో తలపెట్టుకొని నీరుకమ్మే కన్నులల్లే వీధిలోకి విప్పిచూస్తూంది చంద్ర. రామారావు వీధిలోకి బయలుదేరుతున్నాడు. నారాయణ తొందరగావచ్చి ఏదో మాటాడుటకు వారి గుమ్మం ఎక్కాడు. రామారావు కోపంతో ఇంట్లోకిపోయినాడు. కిటికీదగ్గరగావచ్చి 'చంద్రా భయపడకు! నీ సాను భూతే నాకవసరము. చచ్చినను బ్రతికినను మనము భార్యాభర్తలమే'! అని మెల్లగా చెప్పి, తిరిగివస్తూన్న రామారావుకేసి మళ్లీ నమస్కారం చేయబోయాడు. అతడు దొడ్డిలోని పాలికాపుల నిద్దరను తీసుకొనివచ్చి, నారాయణను కొట్టించి లోపలకుపోయినాడు. కిటికీలోనుండి చూస్తూన్న చంద్ర దుఃఖము పట్టలేక కన్నీరు కారుస్తూ బిక్కజొచ్చి మంచము తడుపుతూంది.

సీత, తల్లీవచ్చి నారాయణ్ణి తీసుకొని వెళ్లారు. అన్నలు పొలంనుంచి వచ్చి జరిగినదానికి విచారించారు. ఆరాత్రి చంద్ర సాహసంచేసి తండ్రికి తన మనోభావం చెప్పేద్దామనుకుంది. కాని ఆ ముక్కోపి తనను లక్ష్యపెడతాడా?' అప్పటికి ఊరుకుంది.

మర్నాడు మళ్లా ఉదయం పదిగంటలకు రామారావు కచ్చేరీ సావడిలో కూర్చుండగా నారాయణ అక్కడ ప్రత్యక్షమయ్యాడు. నమస్కారంచేసి నవ్వుతూ, 'అయ్యా, మీపిల్ల నన్నిష్టపడిందీ లేనిదీ తెలుసు కున్నారా?' అన్నాడు.

'దానికేంతెలుసును చిన్నపిల్ల! కంటికింపయినవాణ్ణి చూచి కరిగిపోయే యీడు!' అని ఏదో నిశ్చయించుకొని 'చంద్రా యిలారా!' అని కేకవేశాడు. చంద్ర చంద్రరేఖవలె ప్రత్యక్షమై కన్నుల వెన్నెలగా నిలచింది.

'ఈ మూర్ఖునికి బుద్ధివచ్చేలాగ తిట్టి పొమ్మను!' అన్నాడు తండ్రి. చంద్ర యెక్కడలేని ధైర్యము తెచ్చుకొని చురుకుగా చూస్తూ

'నాన్నా! ఈయన్నే నేను మనసారా ప్రేమిస్తున్నాను. ఈయన్ని తప్ప యింకొకరిని వివాహం చేసుకోను, మీకిష్టంలేకుంటే పెంచిన చేతులతోనే నన్ను చంపివేయండి'. అని నారాయణకేసి ఒక్క దీన మైన చూపు చూచి గిర్రునతిరిగి వెళ్లిపోయింది.

రామారావుగారికి ఒక్కసారి ఆకాశం మీదపడ్డట్టయినది. కోపోద్రేకంగాలేచి అతడ్ని పొమ్మన్నాడు. ఈలాగ ఈ కబురు తెలిసి ఊరిలో పెద్దలు ఇరువై ముప్పైమంది అక్కడకు చేరుకున్నారీ వింత చూచేందుకు.

'నా యింటలేని రచ్చ తెచ్చిపెడుతున్నాడీ మూర్ఖుడు' అంటూ చూడవచ్చినవారికి ఉపన్యసిస్తు న్నాడు రామారావుపంతులు. ఈలోగా మరికొందరు పెద్దమనుష్యులు వచ్చి చేరుకున్నారు. అందరికీ నమస్క రించి నారాయణరావు. 'అయ్యా మీరు పెద్దలు. ఇందెవరు మూర్ఖులో మీరే నిశ్చయించండి. వధూవరుల కిష్టమయిన వివాహమున కడ్డుతగిలి యుక్తవయస్సు వచ్చిన కుమార్తె నోరునొక్కుటకు చూస్తున్నాడితడు' ఇదే నా నిశ్చయం!! శ్రీ రామారావుపంతులుగారు యీడువచ్చిన తమ కుమార్తెను చంద్రను ఆమె కోరు కొన్న వరునకిచ్చి వివాహంచేస్తానని మీ అందరిముందూ వప్పుకునేవరకూ నేను యిక్కడే ఉపవాసంచేసి ప్రాణాలువిడుస్తాను. ఇందెవరియందు దోషముంటే వారికి బుద్ధి చెప్పండం'టూ ప్రాయోపవేశం అవలంబించి నాడు నారాయణ.

ఆమాట వినేసరికి చూడవచ్చిన తగు మనుష్యులంతా హాహాకారాలు చేసేరు. అటువంటి కఠినత వద్దని నారాయణరావుని బ్రతిమాలేరు. రామారావుగార్ని మందలించారు. పరిచయస్థులు లోపలకువెళ్లి చంద్రనడిగి యదార్థం తెలుసుకొని రామారావుని నిందించిపోయారు. తల్లీ అన్నలూ వచ్చి నారాయణ్ణి మాన్పింప చూచారు, ఇరుపక్షాలా మనసు తిరగలేదు. కాగా ఎవరిపట్టు వారికి మరింత హెచ్చినది. నారాయణ తన పక్షం ధర్మం అన్నాడు. రామారావు తనపక్షం న్యాయం అన్నాడు. న్యాయానికి దయకూడా కలిపితేగాని న్యాయమే నా ప్రాణాంతకమన్నాడు నారాయణ. రామారావు లక్ష్యపెట్టక పాలికాపులచే వానిని వీధిలో పడవేయించినాడు. అతడల్లే యెండలోనుండి ఉపవాసదీక్ష సాగిస్తున్నాడు. తమ నిర్మలప్రేమ కదే అగ్ని పరీక్ష అనుకొని చలించలేదు నారాయణ. ఈ సంగతి ఊరంతా ప్రాకింది. జనం గుంపులుగావచ్చి చూచి వెళ్తున్నారు. భోజనాల వేళయింది, చంద్రమాత్రం భోజనానికి రాలేదు. రామారావు బలవంతంచేసి ఆమెను విస్తరిముందు కూర్చోబెట్టి ఎంగిలిచేయించినాడు. కాని ఆమె నోటి కెట్లుపోవును. కన్నీళ్లతో విస్తరి నింపే స్తూంది. మనోవేదన కంతులేదు.

అచ్చట సీత బెంగపెట్టుకొని అన్నం ముట్టలేదు. ముసలితల్లి విసుగుకొని ఊరుకుంది.

రాత్రి ఆయింది. నారాయణరావక్లే కూర్చున్నాడు. దినమంతయు వెక్కి వెక్కి యేడ్చి రాత్రిభోజనానికి చంద్ర రానేలేదు. రామారావొక్కడే తిని చేయి కడుక్కొనిపోయాడు. చంద్రతల్లి నిలువునా నీరవుతూంది. ఏమి చెప్పినా భర్త వినడు! నోరుమూసుకు ఊరుకొన్నది.

తెల్లవారి చూచుసరికి నారాయణ అక్కడే అలాగే ఉన్నాడు. రామారావు కోపం పట్టలేక 'ఛీ! శనిగ్రహమా' అని ఉరిమి కాలుతోతన్ని చరచర సాగిపోయినాడు. మధ్యాహ్నం! రాత్రి!! చంద్ర, నారాయణలక్లే ఉపవాసం చేస్తున్నారు.

నారాయణ తల్లి గుండె రాయిచేసుకొని ఊరకుంది. సీత దూరన్నుంచి అన్నను చూస్తూ గుమ్మంలోనే కూర్చుంది. మూడవదినం మధ్యాహ్నమయింది.

ఏడ్చి యేడ్చి ఉపవాసంచేత, ఎండవేడికి చంద్రకు ముఖం తిరిగింది. మంచాని కంటుకొనిపోయింది.

ఊరిలో వారందరూ కలిసి ఉపచారాలు చేయగా కొంచెం తెలివివచ్చి మరల యేడ్పు ప్రారంభించింది. కన్నులు విప్పి చూచింది. పరాకు, భయము! దుఃఖం!! కోపం!!! ఆ చిన్నిహృదయంలో శేగి ముఖంలోకి కనిపిస్తున్నాయి. పలవరింతలు కాబోలు!! తండ్రిని దూషించినది...సాయంకాలమైనది మరల చంద్రకు మైకము కమ్మినది. చాలమంది ప్రజలువచ్చి యింటిచుట్టూ ఉన్నారు.

రామారావు చంద్ర మంచముప్రక్క చదికిలబడి పిలచినాడు. పలుకులేదు. కదలికలేదు. తన యేకపుత్రిక తనకింక దక్కదని నిరాశతో ఆమెమీదవాలి ఒక్కభోరున రోదించినాడు రామారావు. ఆమెకు కొంచెము తెలివివచ్చి 'ఎదీ, ఎక్కడ' అని పలవించింది. మళ్లా కన్నులు మూసింది.

ఆ ఒక్క చూపు, నిర్మలమగు ప్రేమజ్యోతివంటి చూపు, ఆ ఒక్క చూపుతో తండ్రి గుండె కరిగి కరిగి నీరయింది. అతనికి ఆమె మనోవేదన అర్థమయింది. వెర్రివానిలాగతడు పరుగునపోయి ప్రజలను ఒత్తిలిస్తూ నారాయణరావు దగ్గరకువచ్చి వానిని లేవనెత్తి చేయూతయిచ్చి మెల్లగా చంద్ర మంచముదగ్గరకు తీసుకొనివచ్చి కూర్చోపెట్టాడు! ఒక్కవెల్లువగా విరిసిన కళ్లనీళ్లతో వానికాళ్లు కడిగి ఆమెచేయి అతని కందించి తన యజ్ఞానాన్ని మన్నించమని వేడుకున్నాడు.

కొంచెం మైకం వదలి తెలివితెచ్చుకున్న చంద్ర తనచేయి తన ప్రియుని చేతిలోనుండుట చూచి కలగా భ్రమించినది. ఆమెకు మెల్లగా తెలివితెప్పించి నారాయణ చంద్రను తనకానించి కూర్చుండపెట్టుకున్నాడు. చంద్ర రెండుచేతులతో వాని నడుముచుట్టి మనసు చెరువుగా యేడ్చినది. అతడామె కన్నులు తుడిచి అంతా సుఖాంతముగా పరిణమించినదని చెప్పి రామారావు తొందరగా తయారుచేసి తెచ్చిన పండ్లరసము చిన్న గ్లాసుతో ఆమె నోటికందించి తానుకూడా పుచ్చుకొన్నాడు.

మంచి ముహూర్తమున పెండ్లి దివ్యముగా జరిగింది. ఆమె కాపురమునకు వచ్చిన తొలిరాత్రి

'చంద్రా! నిర్మలప్రేమ నిజముగా జయించి తీరునుకదా'!

'ప్రియా! మన ప్రేమవిజయమే విజయము. నాకొరకు మీరెంత సాహసం చేసారు'!

'సత్యాగ్రహము రెండుపక్షాలకీ హితవేచేస్తుంది! మీతండ్రి మనసూ కరిగింది—మన యిరువురి ప్రేమ బలమూ తేటపడ్డది. ఇదే ప్రేమవిజయం'!

'అంటే ఒకరి నొకరం ప్రేమించి జయంపొందామనా అర్థం'?

'అంతేకాక, నిర్మలప్రేమచేత శత్రువులను సైతం జయించి ప్రేమ సామ్రాజ్యానికి పట్టభద్రులమయ్యామన్న మాట' అని చంద్రని దగ్గరకు తీసుకున్నాడు.........

శ్రీ జగదీశ్ ఫిలింమ్సువారి

వై. వి. రావు – కాంచనమాల

నటించిన

# "మళ్ళీ పెళ్ళి"



రెండువారములలో ఆంధ్రదేశములో

9 కేంద్రములయందు 300000 మంది చూచి

ఆనందించియున్నారు.

●

**30-12-39 నుంచి 3 వారము**

**ప్రారంభము.**

త్వరలో మద్రాసు బాడ్వేటాకీసుకు

వచ్చుచున్నది.

*Distributors:*

BOMBAY PICTURE CORPORATION,

Arcot Srinivasachar St., Bangalore City.




‘బుద్ధిప్రభుత్వము – ప్రేమపెత్తనము’ అను శీర్షికగల ప్రథమసంపాదకీయ వ్యాసము గతనెల యీ పత్రికలోనే ప్రకటింపఁబడియుండె. అందుఁగల కొన్ని ముఖ్య భావములు నా మనం బాకర్షింప నీ వ్యాసమును వ్రాయగడంగితి.

‘గృహలక్ష్మి’ పత్రిక యెట్టి శుభముహూర్తమున స్థాపింపఁబడినదో కాని నాఁటికి నేఁటికిఁ బండ్రెండుసంవత్సరములనుండి కావించుచున్న సేవావిధానము గొప్పదనియు లోకాదర్శప్రాయమనియు నందు విశేషించి స్త్రీవిద్యాభివృద్ధికిని తోడ్పడుచున్నదని నేఁడు క్రొత్తఁగాఁ జేసి చెప్పనక్కఱలేదు.

‘గృహలక్ష్మి’ అనుపేరు సార్థకమయ్యె. ‘గృహలక్ష్మి’ గృహలక్ష్మియే. గృహలక్ష్ముల కనేకులకు కుటుంబజీవయాత్ర నడపుకొనుటకేగాక దేశసేవచేయుటకును సంఘాభివృద్ధికిని యనువగు వ్యాసరాజము లెన్నో యీ పత్రికలోఁ గన్పడుచున్నవి. అందీపైన నుదాహరింపఁబడిన వ్యాసము మకుటమనఁదగియున్నది. ఇట్టి సంపాదకీయవ్యాసములు ముఖ్యముగాఁ జదువఁదగియుండి పత్రికాలంకారములై, భాషావధూటికి నూతనాభరణంబులై జీవితమార్గదర్శకములై యొప్పారుచున్నవి.

తమతమ కుటుంబనిర్వహణము జక్కఁగఁ బవిత్రముగ నాదర్శప్రాయముగ నీతికరముగ ధర్మమార్గమున సత్యపద్ధతులపై తత్వగుణప్రధానముగ నడపించుకొఁగలిగిన నాఁడుగదా లోకసేవచేయుట కవకాశముండుననియు నట్టి భాగ్యము లభించుటకుఁ బ్రతి మానవునకు బుద్ధియుఁ బ్రేమయు ప్రధానములనియు, “మానవుఁడు బుద్ధిబలముచేతనే ప్రకృతిసంపదను వశపఱచుకొని తన సుఖములను శక్తిసామర్థ్యములను వృద్ధిచేసికొనఁ గలిగినాడు.” అనియు సంపాదకులు వ్రాసిన వ్యాసభావము లెంతయుఁ జిరస్మరణీయంబులు. వీరి వ్యాస మాధ్యాత్మిక తత్త్వమొకఁడున్న మానవునకు సాధింపరానిదేదియు లేదని నిరూపించుచున్నది. జగత్కల్యాణవ్యాప్తికి, లోకోద్ధరణమునకు, సంఘబలమునకు, మొదటి బీజములు బుద్ధి, ప్రేమ, యనియు నీరెంటికిని లోకమంతయు లొంగియుండుననియు వక్కాణించిరి. ఇది యదార్థము. బుద్ధి, ప్రేమ, రెండును నవినాభావ సంబంధముగలవి. తోడు నీడవలెఁ బూవునుందావివలె నొకదానినొకటి వెన్నంటియుండును. ఈ రెంటిని స్వాధీనము నందుంచుకొని, రెండునేత్రములలో రెంటిని లగ్నముచేసికొని, సంసారజీవయాత్ర ‘ఆత్మ’ సారథ్యమున నడిపించుకొఁగలిగిననాఁడు సంసారసాగర మఘాధమనియు, సంసారయాత్ర దుర్భరమనియు తలంపనక్కఱలేదు. సారవిహీనమనియునెంచ నక్కఱలేదు. మోక్ష ప్రతిబంధకము కాదని కూడఁజెప్పుట సాహసవాక్యముకాదు.

అట్లు గానిచో నీ సృష్టి యెట్లు యేర్పడినది? మానవ కల్పితమందురా? కాదని నానమ్మకము. దైవదత్తము. సర్వము దైవాధీనము. మనము నిమిత్త మాత్రులమే కాని ధర్మమునకు వెనుకంజవేయక దయాసత్యశౌచములకుఁ గట్టువడి చక్కని దాంపత్యానురాగముగలిగి, ఆత్మీయులయందుఁ ప్రేమగలిగి వర్తించుకోఁగలిగిననాఁడు సర్వభూత సమాదరణ దృష్టియేర్పడు. అప్పుడు తనవారు పెరవారనుభేదమించుకేనియు లేక లోక సేవకై పాటుపడుట కెక్కుడవకాశముండును. కుటుంబము, భార్య, పిల్లలు, బంధుగణము, ఇదంతయు నశాశ్వతమని మెట్టవేదాంత వాక్యమొకటి చెప్పి త్రోసిరాజుచేసి సంసారకర్మ సన్న్యాస మేర్పఱుచుకొని తిరుగాడు వారలు రెంటికిఁ జెడ్డ రేవడివలెఁ జెడిపోవుదురు. కుటుంబము బుద్బుదప్రాయముకాదని నేను జెప్పను. ఈ లోకమే యీలోకాకృతియే, యీలోక సంభూతములే క్షణభంగురములు. కుమ్మరి పుర్వువలె నంటియంటని రీతిగ సంచరించి నమ్మరాని పదార్థమనియెఱిఁగి, కష్టసుఖములకు, క్లేశములకునాగి ధైర్యముగ జ్ఞానముకలిగి చరించువానికిది నిశ్చల తత్త్వమునకుగాని, నిర్వాణద్వారముచేరుటకుగాని ప్రతిబంధకము కాఁజాలదు. ఇందుఁగల శిక్షలన్నిఁటికి నాగిననాఁడుగాని బుద్ధి పరిపక్వము గాంచదు. 'ప్రేమ'యన నెట్టిదో సరిగ నేర్చుకొనుటకిది మొదటిమెట్టు.

వేయేల! వాత్సల్యబుద్ధి, పరోపకారము, నీతి, భూతదయ, సంఘాభిమానము, తోడి మానవులయందుప్రేమ, యిత్యాదిసుగుణగణమున కాధారము కుటుంబమే. క్రమమగు శిక్షలనుబొంది యిటనేర్చుకొనిన నీతిపాఠములు తనను నుద్ధరించుటయేకాక పలువురను తరింపఁజేయుట కవకాశమేర్పడును. ఈ మార్గమే సుగమమని చెప్పుటకు జనకాది మహాత్ములచరిత్రలు దృష్టాంతములు - "ప్రేమ" మానవుని పైకెత్తగలదు. అనిగట్టిగ జెప్పుటకే సంపాదకులు వ్యాసమును వ్రాసిరని నాభావము. వారివాక్యమమృత వాక్యము కాదో, సర్వకార్య నిర్వహణమునకును ప్రేమ ముఖ్యాధారముకాదో, ఆప్రేమ యెట్టిదై యుండవలె? ఈ పదార్థమును విశదీకరించుటకే నేనీవ్యాసమును వ్రాయఁబూనుట. మంచి విషయ మెన్నిపర్యాయములు చెప్పినను క్రొత్తగనేయుండును. మంచివిషయము మానవ హృదయమునకు త్వరితముగానెక్కదు. శాశ్వతముగానాటుకొనదు. అంతలోమఱపున కవకాశమేర్పడు - దానిని ఆయవిద్యను, ఆయజ్ఞానమును జయింపవలె. అట్టిది ప్రేమకే సాధ్యమగును. ప్రేమయన, నందు దాంపత్యప్రేమయన, వట్టి గ్రుడ్డిమోహముచే నేర్పడునది కాదు. కామోద్రేకమున నంతలోబుట్టి యంతలో లయించునదికాదు. ప్రేమ విశ్వప్రేమ కాదర్శముగనుండవలె. రాధామాధవవుల ప్రేమవలె లోకకల్యాణసంధాయకముగ నుండవలె.

'ప్రేమ, బుద్ధి' యివి రెండును సూర్యచంద్రులతోఁ బోల్చి భార్యా భర్తలకిది క్రమముగఁ బంచిపెట్టి, "శిరస్సు బుద్ధి కాశ్రయము. హృదయము ప్రేమకునిలయము" అని వక్కాణించి, సంసార రాజ్యపరిపాలనమునకు రెండును బ్రధాములని సూచించిరి. "సంసారమను శరీరములో పురుషుఁడు శిరస్సు - స్త్రీ హృదయము". "భార్య పురుషుఁడను శిరస్సులో నేత్రమువంటిది". సంసారములో భర్తయొక్కప్రభుత్వము భార్యయొక్క పెత్తనము బాగుగజరగుచో సంసారయాత్ర చక్కగజరుగును. అనిచెప్పి బుద్ధి ప్రేమలరెంటిని సమముగనడిపించిన వీరియాశయము గొప్పది. వీరిభావములు నేను సరికావని చెప్పను. కాని కేవలము ఒక్కప్రేమకే ప్రాధాన్యమిచ్చి భార్యాభర్తలనేకాక లోకమంతయు నిష్కామప్రేమపాశముచే గట్టి సంసారయాత్రయఁ దన్మూలమున దేశసేవ యాగమును నిర్వహించుమార్గమును జెప్పుచుంటి. ప్రేమకులోకమువశ్యము. ప్రేమకసాధ్య మగునదేదియులేదు. ప్రతిమానవునియందుప్రేమ సరియగుపద్ధతులపై నాటుకొనిననాఁడు సంఘాభివృద్ధియగునన్నమాట యటుండ, నైకమత్యమేర్పడి భేదాభిప్రాయములునశించి, శాంతియేర్పడును. అప్పుడు జయపతాకమెత్తుట కవకాశముండును. "ప్రేమ" అను రెండక్షరములపైన లోకమాధారపడియున్నది. ఇందునందు తరించుట కిదియేతారక మంత్రము. నిజప్రేమతత్త్వమెఱింగిన మహాత్ముఁడు కోటికెక్కడో యొక్కఁడుండు.

దైవమన నెక్కడనో మనకందరాని పదార్థముగ నున్నదని తలఁచి దానికై ప్రాకు లాడ నక్కరలేదు. అది మనయందే యున్నది. దానిని గుర్తించుటకు సాధించుటకు, ఆత్మానందమందుటకు – 'ప్రేమ' తత్త్వమెఱుఁగవలె - 'ప్రేమ' యున్న బుద్ధియున్నట్లే - సమస్తమున్నట్లే - బుద్ధియుండియుఁ బ్రేమలేకున్న సర్వము వ్యర్థము - ప్రేమలేని జీవితము శూన్యగృహ దీపకాంతివలెనుండు - కనుకనే ప్రేమ - ప్రేమ - ప్రేమ - యని లోకమంతకు వినఁబడునట్లనేక యుపన్యాసవేదికల నెక్కి యుపన్యసించుచు - ననేక పత్రికలలోఁ బలు భాషలలో రచించుచు - మనోవాక్కాయకర్మలయందు సిద్ధిఁగాంచి ప్రేమ బ్రహ్మలో నైక్యముగావలెనని మహాత్మాగాంధిగారి ధర్మోపదేశము, హితబోధ నాఁటికి నేఁటికి – లోకమందుఁ గలుగు మార్పులచే నించుకేనియుఁ జలింపక - యొకేవిధమున దేశదేశములఁ గావించుచున్నారు. ఆ మహాత్ముఁడొక్కడే 'విశ్వప్రేమ' యన నెట్టిదో యెఱింగినవాఁ డనుట సాహసవాక్యముకాదు - తక్కుంగల మానవులలో నది తక్కువ. దేశసేవ, దేశసేవ, యని, సంఘసేవ, సంఘసేవ, యని, తాత్కాలికావేశమున కేకలుపెట్టినంతమాత్రమున ప్రయోజనములేదు - కార్యసాధనములు కావలె. లోకమును, శత్రులోకమును ప్రేమాస్త్ర ప్రయోగముచే వశముచేసికొనవలె, ముఖ్యముగ కావలసిన ప్రేమబీజమే మనలో సున్న.

ప్రకృతిచేఁ బుట్టి ప్రకృతిలోఁ బెఱిగి, ప్రకృతిలోఁ దిరుగాడుచున్న మనము ప్రకృతి సౌందర్యమునకు దూరమై ప్రకృతినియమములకు దూరమై, ఆశాపాశబద్ధులమై, దురాచారముల కలవాటుపడి, స్వధర్మ కార్యనిర్వహణమెట్టిదో మఱచి, స్వార్థపరులమై, తృప్తిలేక దరిగానక, జీవితపరమార్థమెఱుంగక విసరిన గాలికెల్లను నెరలమగుచు మోహాంధకార నిమగ్నులమై యూగులాడుచున్నవారమనియు, తదితర జంతుజాలమంతయు నానందమయముగ నున్నదనియు మానవులు తదితర జంతువులకన్న 'బుద్ధి' యనుదానినొకటి ప్రధాన గుణముగాఁ గాంచినవారలయ్యు, ప్రేమశూన్యులగుటంజేసి - సహనశక్తిలేక, సంతృప్తిలేక, యిహలోకానందసౌఖ్యములకు దూరమై యేపురుషార్థమును సాధించలేనివారలగుచున్నారు.

ఇందలి యదార్థ మీక్రింద నుదాహరింపబడిన పద్యములచే విదితమయ్యెడిని.

ఉ. ఆకలి దప్పులన్ననిల నందఱకెంచ సమానమౌట నీ
లోకమునందు భూతములు లోఁదనివొందవి తీరినంతఁ జీ
కాకుపడుట్ నరుండటులఁ గాక మనంబునఁ దృప్తిఁబొందఁగాఁ
బోక విదాహమెంతయును బొందుచు మున్గుచుఁ దేలుచుట్ భువిన్.

ఉ. కాన సమస్తజీవముల ఖండసుఖంబునఁ దేలియాడఁగా
మానవుఁడెంతమాత్ర మణుమాత్రమునైన సుఖంబెసంగఁగా
రాని విచారబాధలనఁ బ్రాపయి తీరముజేరలేక, క
ట్టా! నశియించు బుద్ధిబలమందియుఁ బ్రేమనుఁ గాంచకుండుటన్.

గీ. నరుఁ డితరభూతములకన్న జ్ఞానియయ్యు
ధనముగాంచి వెచ్చించు సాధనమునందె
శక్తినంతయుఁ గడుపంగఁ జాలియుండుఁ
గాని ప్రేమపదార్థంబు గాంచఁడెపుడు.

ప్రేమ యొకఁడుండు భాగ్యంబు కలిగెనా దాని వెనుకనే యన్నియునుండు. దానననుసరించియే తృప్తి, దయ, సహనము, మొదలుగాఁగల సుగుణములుండు. కనుక ప్రేమ కీడురాగల గుణమేదియులేదు. తత్త్వబోధార్థకమైన ప్రేమ ఏ మానవునియందు డాగియుండునో వాఁడేకార్యమైనఁ దలపెట్టి నిర్విఘ్నముగ సాగింపఁగలఁడు. సంఘము నుద్ధరించఁగలఁడు దేశమునకై పాటుపడఁగలఁడు. ఒక ఘనకార్యమునకై ప్రాణమొడ్డఁగలఁడు. అట్టి ప్రేమస్వరూపుల కసాధ్యంబెద్ది? 'ఇంటఁగెలచి రచ్చ గెలుచుట' యన్న దీనిచేతనే కనుక ప్రేమతత్వమున కలవాటుపడుటయే మానవజన్మ ఫలము.

—శ్రీ వి. రామసుబ్బారాయఁడు.

# సర్వశాస్త్రజ్ఞాన సమాశ్రయమగు సత్యస్వరూపము

శ్రీయుత విం. అ. సూర్యనారాయణగారు

అధ్యాత్మ విద్యా విద్యానాం। వాదః ప్రవదతా మహం॥

('Of sciences I am the Science of the Soul; and of reasoners I am the reasoning')

ఆత్మజ్ఞానమును ప్రసాదించి పరమాత్మసాన్నిధ్యమును పొందగలుగజేయు వేదాంత శాస్త్రజ్ఞానమే సర్వశాస్త్రజ్ఞానమునకును మూలాధారమై యొప్పుచున్నది. శ్రీ సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమును గూర్చిన జ్ఞానబోధకమగు వేదాంతసత్యమే సకలశాస్త్ర సత్యమునకును గమ్యస్థానమైయున్నది.

ఇతర శాస్త్రజ్ఞాన సంపాదన వేదాంతశాస్త్ర జ్ఞానామృతాస్వాదనమునకు సహాయపడగలిగిననాడే అది సార్థకమై తనరారును. వేదాంత సత్యమున్నది కనుకనే ఇతర శాస్త్రజ్ఞానము ప్రపంచములో సజీవమై వెలయుచున్నది. వేదాంత సత్యములేనిచో సర్వమును శుద్ధశూన్యమై ఇతర శాస్త్రములన్నియును పూర్ణానుస్వారములై పరిణమించును.

ఇతర శాస్త్రములందు జ్ఞానసాధనమును జ్ఞానపర్యవసానమును వేరుపరచవచ్చును. వేదాంతశాస్త్రమునందన్ననో సాధనమును సాధ్యమును రెండును నొక్కటియే. వేదాంత సత్యాన్వేషణము, అనగా బ్రహ్మజ్ఞానచింతనము, సామాన్యముగ నల్పమేధావంతులచే, వెఱ్ఱిచేష్టయనియు, మతిభ్రమయనియు, ఎండమావులలో నీళ్లను వెదకికొనుటయనియు, కుందేటికొమ్మును వెదకసాధించుట యనియు, ప్రయోజనరహితమగు బుద్ధిపరిశ్రమ యనియు, పలుతెఱంగుల పలుచనగ పరిగణింపబడినను, యదార్థమాలోచించిన వేదాంత సత్యమును వెదకుటయే నిజమైన జ్ఞానమును పొందుటయనియు, తదితర జ్ఞానమంతయు మిథ్యయనియు స్పష్టముగ మానవుని ఉత్తమబుద్ధికి పొడకట్టును. వేదాంతసత్యము ఎంత మాత్రమును భిన్నస్వరూపము కలదికాదు. ఆ సత్యజ్ఞానానందానుభవములో భేదములు కలవు కాని, దాని సహజస్వరూపము మాత్రమొక్కటియేమైయున్నది.

వేదాంత సత్యమునకును (Philosophic Truth) కావ్యసత్యమునకును (Poetic truth) హెచ్చుపోలిక యున్నను రెంటికిని చాల తారతమ్యము గలదు. కావ్యసత్యము వేదాంత సత్యానుకరణము మాత్రమేమైయున్నది. కవి తన భావోద్రేకములను రమ్యమగు

భాషారచనప్రభావముచే ననుభవించి, తద్రసానంద నిమగ్నహృదయుడై, తాత్కాలికమగు తాదాత్మ్యమునొంది, సత్యముయొక్క స్వరూపమును సాక్షాత్కరింపజేసికొన గలుగునే కాని సంపూర్ణమగు సత్యజ్ఞానానందాతిశయమగు సుఖానుభవముచే సత్యమును సమీపించి దానితో నైక్యము చెందలేడు. ఇందుచే కవిత్వసత్యము వేదాంతసత్యరహస్యమును కొంతవరకు గోచరింపజేయగలదని చెప్పనగును. అందువలననే గ్రీకుదేశపు కుశాగ్రబుద్ధిశాలియగు ఆరిస్టాటిల్ మహాశయుడు కవి వేదాంతికి సన్నిహితబంధువుడనియు కవిత్వము వేదాంతముయొక్క ప్రాథమికజ్ఞానమనియు నుడివియున్నాడు.

వేదాంతసత్యమును ప్రకృతిశాస్త్రసత్యమును పరస్పరభేదరూపముగలవియయ్యు, వేదాంతసత్యము, కావ్యసత్యమునకువలె, ప్రకృతిశాస్త్రసత్యమునకును పట్టుగొమ్మయై దానిని పెంపొందించునదియై యున్నది. ఇందలి యదార్థము నొకచిన్నవిషయము నుదాహరణముగ నుడివి విశదీకరింపవచ్చును. వృక్షశాస్త్రజ్ఞుడు గులాబిచెట్టునం దుద్భవించిన పుష్పముయొక్క ప్రకృతి ధర్మములను చక్కగ దెల్పుచు, నం దెన్ని రేఖలున్నవో, పుష్పమెట్లు మొగ్గయొక్క అవస్థనుండి పరిపూర్ణస్వరూపము నొందగలిగినదో బాగుగ బోధించి అందలి వివిధమార్పులను విశదీకరింపగలడు. కవి, తన ఊహాశక్తిచేతను, భాషాచాతుర్యముచేతను, గులాబిపుష్పముయొక్క సౌందర్యమును, అందలి పరిమళమును వర్ణించి మనసునకాహ్లాదకరములగు భావములను కవిత్వములో ప్రదర్శించగలడు. కవి, గులాబిపుష్పమును గూర్చి తెలుపుసత్యము మనోహరమై మానవుని అంతరంగమున ఆనందమును గలిగింపగలిగినది. ప్రకృతిశాస్త్రజ్ఞుడు నిర్వచించు సత్యము స్థూలదృష్టిచే గ్రహింపబడినదగుటచే సామాన్యబుద్ధికికూడ అవగాహనమగు స్వల్పవిషయము మాత్రమేయైయున్నది.

ఇక వేదాంతశాస్త్రజ్ఞుడు, ఆపుష్పమును చూచినపుడు దాని సృష్టికర్తయొక్క కల్పనాచాతుర్యము నవలోకించుచు, గులాబిపువ్వుపుట్టుట, పెరుగుట, నశించుట అను మూడవస్థలయొక్క తత్త్వమును విచారించుచు, సృష్టి, స్థితి, లయములులేని ఆదిమధ్యాంతరరహితమగు ఆత్మయొక్క నిత్యత్వము (Eternity) ను గూర్చి ఆలోచనసేయ మొదలిడుటచే శాశ్వతసత్యస్వరూపమును క్రమముగ గ్రహింపగలిగి తాదాత్మ్యము ననవరతము ననుభవింపగోరును.

ఇందువలన ప్రకృతిశాస్త్రజ్ఞానముకంటె భావప్రకాశితమగు అంతరంగికానుభవమును వెలయించు సాహిత్యశాస్త్రము గొప్పదనియు, శాశ్వతానందకరమగు ఆత్మజ్ఞానము అన్నిటికంటె అతీతమైన సత్యమనియు తేటపడుచున్నది. ప్రకృతిశాస్త్రజ్ఞుడు గులాబిపుష్పములయొక్క ప్రకృతిధర్మములను మాత్రమే పరికించగలుగును. కవి అందలి ఆనందమును

భవింపగలుగుటచే పుష్పమును విడిచి, అందలి సౌందర్యమాధుర్యములను తన వ్యక్తిలోనికి నింపికొనును. వేదాంతి, ఆ పుష్పమును తన హృదయమందిడుకొని, దానితోనైక్యము చెంది, తన యాత్మకును దానికిని సంబంధమేర్పరచుకొని, దాని పుట్టుపూర్వోత్తరములకు మూలాధారము నరయుచు, తన ఆత్మయొక్క పుట్టుపూర్వోత్తరములను విచారణచేయుచు శాశ్వతమగు సత్యమును కనుగొనగల్గును. ఆ శాశ్వతమగు సత్యముచే సృష్టింపబడిన పుష్పమే యిందరి జ్ఞానమునకును కారణమగుటచే వేదాంతసత్యమే అన్ని శాస్త్రములందలి సత్యమునకునుపుట్టినిల్లును, గమ్యస్థానమునునై యున్నదని విశదమగుచున్నది.

కళలలో ఘనమైవెలయు చిత్రకళచే పొందదగు సత్యముసహితము చిత్రకారుని ఉద్రేకావస్థయందు భిన్నభిన్నముగ గోచరమగు సత్యదృశ్య సగుణచిత్రితమాత్ర సుఖానుభవమై, తదావేశాంతగతానుభవమగుటచే సంపూర్ణ సత్యసందర్శనఫలిత జ్ఞానసంయుతమగు సత్యముకానేరదు. అందుచే వేదాంతరహస్యము చిత్రకారుని ఊహాశక్తి కతీతమై అందని మ్రాని ఫలమై యొప్పుచున్నది. సగుణబ్రహ్మసాక్షాత్కారమునే పరమావధిగ గల్గియున్న మతములందలి సత్యముగూడ వేదాంతసత్యమునకు సరికాదు.

వేదాంతసత్యము శాశ్వతమై, అగోచరమై, అఖండమై, అద్వితీయమై, అనంతమై, అచ్యుతమై, అనిర్వచనీయమై, అనుభవైకవేద్యమై, సర్వశాస్త్రజ్ఞానాతీతమై, స్వచ్ఛమై, నిత్యమై, నిర్మలమై, నిరామయమై శోభిల్లుచున్న జ్ఞానజ్యోతి. అది సర్వజ్ఞానమునకును సరిహద్దును (Circumference & boundary.) కేంద్రస్థానమును (Centre) కూడ నై యున్నది.

అదియే భక్తిజ్ఞానవైరాగ్యకర్మమార్గముల గమ్యస్థానము (Goal and end,). వేదాంతసత్యజ్ఞునికి తెలియదగు విషయము, అంతకంటె మించినది ప్రపంచమున వేరొండు లేదు. వేదాంతసత్యము ఆధ్యాత్మికానందవిభవమును, దివ్యజ్ఞానప్రభావమును వెల్లడించునదియై యున్నది. వేదాంత సత్యమునకు మించిన విషయము పదునాల్గు భువనముల వెదకిన కానరాదు. అదిసూక్ష్మదృష్టికి గోచరించు విషయములను సూచించునేకాని స్థూలదృష్టికగుపడు వస్తువులకుమాత్రమె సంబంధించిన జ్ఞానముకాదు.

కవియొక్క సత్యాన్వేషణ మెచ్చట పరిపూర్తియై అంతమగుచున్నదో అక్కడ వేదాంతియొక్క సత్యాన్వేషణము ప్రారంభమగుచున్నది. వేదాంతవిచారము మృత్యుతత్త్వ విచారణతో ప్రారంభమై శాశ్వతజీవితనిరూపణతో నాఖరగుచున్నది.

వేదాంతసత్యము బాహ్యప్రపంచమునుండిగాని, గ్రంథపఠనమువలనగాని పొందశక్యముగానిదై, ఆంతరంగికదృష్టిచే లోనుండి తెలియవగినదై యున్నది. ఇందులకు,

స్వయంనిర్ణయము, స్వయంపరీక్ష, తన్నుదా విభజించుకొని నిజాత్మస్వరూపమును తెలిసికొనుటయు అవసరము. ఆత్మజ్ఞానము ఒకరినుండి వేరొకరు దానరూపముగ పరిగ్రహింప వీలులేనిది. ధనముచే విలిచి తెచ్చుకొనునదియునుగాదు. ఎవరికివారు, ఏ యుగమువారాయుగమునందు, ఏ తరమువా రాతరమునందు తిరిగి ప్రారంభమునుండి సాధన సలిపి సంపాదింపవలసినదేకాని వంశపారంపర్యముగ, వారసత్వముగ పరిక్రమించుటకు వీలులేనిది. వేదాంతశాస్త్రజ్ఞానము ఇతర శాస్త్రములందలి జ్ఞానమువలె ఒకరికి మరొకరు కొంతవరకు సాధించి పురోభివృద్ధికై అందిచ్చుటకు వలనుపడనిది. సర్వజనులును స్వశక్తిచే సాధింపదగిన జ్ఞానమేకాని పరులనుండి పరిగ్రహింపదగిన పణ్యావస్తువు కాదు.

వేదాంత సత్యభాస్కరుణునికిరణములే సర్వశాస్త్రములని చెప్పనొప్పును. సర్వశాస్త్రములును వేదాంత సత్యసాగరమున చేరుచున్నవి. 'సర్వదేవ నమస్కారః శ్రీకేశవం ప్రతిగచ్ఛతి', అనినట్లు ఏవిద్య నెవరభ్యసించినను తుట్టతుదకు వేదాంతములోనే ప్రతి విద్యయు లయమగుచున్నది.

ఆత్మజ్ఞానసాధనమునందు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాని, యీ మూడునుకూడ అభివృద్ధి జెందుచునేయుండును. 'తన్నుదా దెలిసిన దైవమెరుంగరా' యని తన ఆత్మయొక్క స్వరూపమును తెలిసికొనినంతనే పరమాత్మయొక్క స్వరూపము తేటతెల్లమగును.

జీవాత్మ పరమాత్మల రెంటికిని సూర్యరశ్మికిని సూర్యునకును, సముద్రమందలి అలలకును సముద్రమునకును ఎట్టి సంబంధమో, అట్టి సంబంధమే యొప్పుచున్నది. ఒక పిడికెడు మట్టియొక్క స్వభావమును తెలిసికొన్న, ప్రపంచమందున్న మట్టియంతటియొక్క స్వభావమును తెలియునట్లే, జీవాత్మస్వరూపమును గాంచిన యోగికి పరమాత్మస్వరూపము దర్పణమందు ముఖ ప్రతిబింబముమాదిరి గోచరించును.

జీవాత్మ స్వస్వరూపమును తెలిసికొనిన పిదప పరమాత్మలో లయమగుచున్నది. అదియే మోక్షమనియు, బ్రహ్మజ్ఞానమనియు చెప్పబడుచున్నది. ఆ జ్ఞానావస్థనే అఖండ సచ్చిదానందసుఖానుభవమని యోగిపుంగవులు స్పష్టముకానివాక్కులలో తెలిపియుండిరి. ఆ ఆనందమిట్టిదని నిరూపించుట కేరితరము?

వేదాంతసత్యము పశుప్రాయుని సయితము పరదేవతగా నొనరించును. అది వీడిననాడు మానవుడు దుర్బలుడై సుఖదుఃఖములచే, జననమరణములచే, పీడింపబడుచు దీనుడై వీ పించుచున్నాడు. వేదాంతసత్యము మానవున కెల్లమహిమల నొడగూర్చుటయేకాక, దేవుడు మానవుడై పుట్టినపుడు మానవుడు దివ్యత్వమునొంది దేవునిగా నేల మారకూడదనియు ప్రబోధించుచున్నది—దైవ మెల్లరను బ్రోచుగాత!



రామచంద్రపురములో జరిగిన 14-వ తూర్పుగోదావరిజిల్లా స్త్రీల సమావేశమునకు వచ్చిన సరస్వతీ స్త్రీ సమాజపు సభ్యులును, ప్రతినిధులును కూడిన ఛాయాచిత్రము. ఈ సమావేశ ప్రారంభోత్సవమును సోదరి చంద్రమతిగారు జరపిరి. శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు సభ కధ్యక్షత వహించిరి.

జనవరి నెలలో ఆంధ్ర దేశమంతట విడుదల

# కుబేరావారి మైరావణ




తారాగణం:
కాంచనమాల
గగ్గయ్య
రాయప్రోలు
రామిరెడ్డి
సుబ్రహ్మణ్యకుమారి
రాజు మొదలగువారు

డైరెక్టరు
చిత్రపు
నారాయణమూర్తి బి.ఏ.

అసిస్టెంటు డైరెక్టరు:
ఇ. యస్. యన్. మూర్తి

మ్యూజిక్:
జి. పి. నరసింహారావు

ఆర్టుడైరెక్టరు:
టి.వి. యస్. శర్మ

కెమెరా
జి. బడసాల్లే

సౌండు
రషీద్ కె. ఇరానీ

కవులు
బలిజేపల్లి లక్ష్మీకాంతం
వాణ్ణాశి సీతారామశాస్త్రి

*Sole Distributors:*

## KUBERA PICTURES LTD.,

141, Poonamalle High Road, Kilpauk, MADRAS.

| *For Nizams:* | *For Ceded Districts & Chittoor:* | *For Mysore:* |
|---|---|---|
| **Deccan Film Distributors,** Hyderabad. | **S. Ahmed Khan,** Proprietor, **New Talkie Picture Palace,** Nellore. | **Bhascar Pictures,** Bangalore. |

# అబలా బలాత్కార పాపఫలితము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

ం

అబలయగు శాంతను బలాత్కారముగ గొనివచ్చి పాపకూపములో బడద్రోయ నెంచిన వీరబాబు యొక్క పాపభూయిష్ఠమైన జీవితము ఆత్మహత్యతో నంతమొందెను. సతియొక్క శీలమే సంఘములోని దోషములను తొలగింపగల సాధనమనుటకు శాంత శీలప్రభావమే నిదర్శనము.

శాంత :—వయస్సు 17 సంవత్సరములు, చామనచాయగలిగి అందమైనది. సరళ స్వభావము, నాజూకు, మృదుత్వము, వయ్యారముతో సొంపునింపు సుదతి. మితభాషిణి. ఉద్దేశ్యాలలో నవీనత్వము వున్నది. స్కూలు పైనలుపరీక్షకు వెళ్లింది.

లక్ష్మి :—శాంతతల్లి. వయస్సు 50 సంవత్సరములుండును. పూర్వసువాసిని. నవీన సాంఘికాచార పరాయణురాలు, కావున శిరోజములు తీయలేదు. భర్త చనిపోయినప్పటి నుంచి శాంతను చదివించుతూ, ఆమెనే కనిపెట్టుకొని వున్నది. ఇతరదిక్కులేదు. శాంతను వివాహముచేసి ఒకయింటిదానినిగా చెయ్యాలనే ఆలోచన. బాల్యవివాహాలు అంటే యిష్టములేదు. వాటివలన వచ్చేకష్టాలు అన్నీ ఆమెకాలములో ప్రత్యక్షంగా చూసింది. అందుకనే శాంతకు యుక్తవయసు వచ్చేవరకు వివాహంసంగతి తలపెట్టలేదు. ఆమె వివాహం లోకానికాదర్శంగా వుండాలని వుద్దేశము. ప్రపంచములో జరిగే తంత్రాలు తెలియని అమాయకురాలు.

కమలాబాయి :—వయస్సు 30సంవత్సరములు. వగలాడి. అమె, తనఅన్న వీరబాబు చేతులలో కీలుబొమ్మ. వీరబాబుయొక్క కుడిచెయ్యి. ఆయన వుద్దేశ్యాల కనుగుణ్యంగా ప్రవర్తించుచు ఆతని అభీష్టం నెరవేర్చడమే ఈమెజీవితంలో ఆదర్శము. జిత్తులమారి. అన్నకోసము ఏమయినా చేస్తుంది. కాని ఆమెలోవున్న స్త్రీత్వము నశించలేదు. వీరబాబుని చూచిన భయము. తన స్వతంత్ర జీవితము చంపుకున్నది.

వీరబాబు :-వయస్సు 40సంవత్సరములు, కనికరము, జాలిఅంటే ఏమిటో యెరుగని కఠినహృదయుడు. కాని ఎప్పుడూ సంతోషంగానుండును. తలచుకొన్నది జరిగితీరాలి. సౌందర్యవతులగు స్త్రీలకొరకు పన్నాగాలుపన్ని వాళ్లను తనవలలో వేసుకోగలడు. స్త్రీలను వ్యభిచారవృత్తిలోదించి వారుసంపాదించిన పైకమును సంగ్రహించి, చాలా కూడబెట్టాడు. మంచి ఆలోచనాపరుడు. అమాయకపు స్త్రీలకు ఆర్తరక్షణ పరాయణుడుగా వచ్చి, తరువాత వారిని వశపరచుకొని పాపకూపంలో పడవేస్తాడు. ఇతనికి చేతోడు, చెల్లెలు కమలాబాయి. యిద్దరు ఆలోచించనిదే ఏపనీజరుగదు. స్త్రీలలో వ్యాపా

రము చేయుటే యతనివృత్తి. మర్యాదలకు పైతళుకులకు పెట్టినది పేరు. చూచుటకు అందవికారిగాడు. కొంచెము పొడగరి. కురుచయిన క్రాపింగు. చూపులలో వాడితనముంది. మనమనస్సులో వున్నది అంతా చదవగల పరేంగిత జ్ఞానమున్నదని భ్రమింపజేస్తాడు. మనోపటుత్వము లేనివాళ్లు, వీరబాబువద్ద బానిసలవుతారు. తనపని నెరవేర్చుకొనుటకు ఏయుపాయమునకైన వెనుదీయడు. పాపభీతియు ప్రాణభీతియులేని పాషండహృదయుడు.

సుశీల :-వెంకట్రావు భార్య. వయస్సు 20 సంవత్సరములు. గారాబంగా పెరిగింది. అన్యోన్యముగా వుంటారు భార్యాభర్తలు.

వెంకట్రావు :-వయస్సు 30 సంవత్సరములు. బ్యాంకులో రూ300 వచ్చే యుద్యోగి. నవీనభావాలు కలవాడు, ఆలోచనాపరుడు, కొంచెము రసికుడు, హృదయవైశాల్యము, వున్నతభావాలుగల న్యాయస్వభావుడు.

మధుసూధనరావు :-వయసు 25 సంవత్సరములు. సుశీల అన్న. అవివాహితుడు. సంఘసంస్కరణాభిలాషి. బావ వెంకట్రావునెడ భక్తి, ప్రేమవున్నవాడు ఈ ముఖ్యపాత్రలు శాక లలిత అనేపేరుగల ఒకదాసీ, ముగ్గురుస్త్రీలు వీరబాబువలలో వున్నవారు.

## ప్రథమాంకము

### మొదటి రంగము

[గృహం. వెంకటేంట్లో ముందువరండా. వరాండానుంచి లోపలిహాలునకు ఒక ద్వారం, హాలు విశాలంగావుంది. హాలులో నాలుగుకుర్చీలు, ఒకచిన్న బల్లావున్నాయి. ఆబల్లమీద పువ్వులగుడ్డ వేసివున్నది. ఆహాలుకు రెండుమార్గములున్నాయి. రెండు పెద్ద కిటికీలు గలవు. ఆకుర్చీలలో శాంత అల్లికదారములు, చట్రము అవివేసి కుడుతూ వుండును. లక్ష్మి ప్రక్కకుర్చీలో ఏదో ఆలోచిస్తూవుండును. సాయంత్రము 4గంటలయింది. కాఫీ ఫలహారముచేసి కూర్చున్నారు.]

లక్ష్మి :-శాంతా! ఎప్పుడు ఏదో పనేగదా! కాసేపు విశ్రాంతిగా కూర్చోవు. కళ్లు జబ్బుచేస్తాయి ఎప్పుడూ యిలా కుడుతూ కూర్చుంటే. మొగుడుతో ఏమి కాపురం చేస్తావో, ఆయనకు విసుగుపుడుతుంది, ఎప్పుడు యిలా కుడుతూ కూర్చుంటే.

శాంత :-ఏవే అమ్మా! ఎప్పుడూ సాధిస్తూనే వుంటావు. నా పెళ్లి విషయమై నీకు పిచ్చి ఎక్కినట్లుంది. [చేతులో వున్నవి బల్లమీదపెట్టి] ఎవరో ఒకరు వస్తారు. యిద్దరు వ్యక్తులు కలసి యావజ్జీవయాత్ర చేయాలంటే ఒకరి లోపాలు ఒకరు సర్దుకోకపోతే ఎలాగమ్మా మరి.

లక్ష్మి :-శాంతా, నీకు మంచి వరుడు కావాలని పేపరుకి పంపి వారంరోజులు కాలేదూ? అయింది. అవును (వేళ్లు లెక్కపెట్టి) నిన్నటికి సరిగా వారము, యింక ఎవరో ఒకరు వస్తూవుంటారు.

శాంత:-అమ్మా, యిన్నాళ్లు మనము యిద్దరము కలసివున్నాము కదా! ఒకరోజు ప్రొద్దున్నే, ఒక మాత్న వ్యక్తివచ్చి, నన్ను పెళ్లిచేసుకొని, నన్ను తీసుకొని వెళ్లిపోతే ఏంచేస్తావే! జీవితంలో ఎప్పుడూ ఏదో ఒక విచారము వస్తూవుంటుంది కదా! అబ్బా పిల్లకు పదిహేడేండ్లు వచ్చినాయి, పెండ్లికాలేదని ఆందోళన, మంచిఅల్లుడు వస్తాడారాడా, అందంగా వుంటాడా లేదా, మాపిల్లని సరిగా ఆదరించి గౌరవంగా చూస్తాడా చూడడా అని ఒకటే విచారము నీకు! వివాహము అయినతరువాత, నేను వంటరిగా ఎలా వుంటాను. ఈ పాడుజన్మ ఎందుకు, అని దేవుణ్ణి తిట్టిపోయ్యటమేకదా!

లక్ష్మి:-తల్లికివుండే కోరికలు, కోరికలనుంచి మనస్సుకుగలిగే విచారము, ఆలోచనా, జీవితచక్రము అలా దొల్లుకుపోతుంది. నిన్ను ఒక యింటిదానిని చేస్తే, అల్లుడు మంచివాడయితే దగ్గరవచ్చి వుంటాను. లేదా నీవు వున్న వూరిలోనే ఏదో యింట్లో వుంటాను. అచ్చం మీ నాన్నగారి పోలికలే అబ్బాయి నీకు. ఆయన యిలాగే నన్ను వాగిస్తూవుండేవారు. మీ నాన్నగారు పోయినప్పటినుంచి, మన విషయమయి మంచిచెడ్డలు కనుక్కునేవాళ్లు లేరుగదా! నీకు నేనూ,నాకు నువ్వూ దిక్కు. మన కష్టాలు ఎప్పుడు గట్టెక్కుతాయో గాని!

శాంత:-అమ్మా వుండు—ఎవరో వస్తున్నట్లున్నారు.—ఎవరండి అంది. (తలుపుదగ్గరకువెళ్లి) లోపలికి రండి—అమ్మా—ఈమె ఎవరో మనదేశస్తులుగా వుండలేదే.

లక్ష్మి:-లోపలికిరండి.

[ప్రవేశం - కమలాబాయి. శాంతను, లక్ష్మిని ఆపాదమస్తకంవరకు చూస్తుంది. శాంతను చూసి]

కమల:-అమ్మాయి. నీ పెండ్లి విషయమేనా! పేపర్లలో చూశాము. నీ పేరేమి?

లక్ష్మి:-శాంతండి. మా అమ్మాయి స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్లింది. బాగానే ప్యాసుకావచ్చు— మీపేరు?

కమల:-కమలంటారు. మా అన్నయ్యకు పెండ్లి సంబంధమై చూస్తున్నాను. దేవుడుధర్మానీ; అన్న వస్త్రాలకు లోపములేదు. సాలుకు పదివేలు రూపాయిలొస్తాయి. చక్కని చుక్కంటి భార్య ఒక నెలరోజుల క్రింద విషపజ్వరం వచ్చి చనిపోయింది. ఏదో వాడ్ని ఒక యింటివాడ్ని చేద్దామని నా తలంపు. ఒకటే దిగులుపెట్టుకున్నాడు. బయటికి కదలడు. ఏదో మీ అమ్మాయి విషయమై పేపర్లో చూచి వచ్చాము యిద్దరము. మావూరు దగ్గరే.

లక్ష్మి:-ఏమోనండి—రెండోపెళ్లివానికి యివ్వటము నాకు యిష్టములేదండి. మాపిల్ల చిన్నది. ముద్దు ముచ్చటలు చూసి ఆనందించాలని నా ఆశ.

కమల:-దానికేమిలెండి—అవి ఎప్పుడూ జరుపుకోవచ్చు. కాస్త సిరీ సంపత్తూ చూసుకోవలెనా వద్దా. మావాడు వద్దంటూంటె నేనే బలవంతముమీద తీసుకొవచ్చాను. మా అన్నయ్యకు నచ్చితే మీపిల్ల, వూళ్ళో అందరికీ నచ్చుతుంది—శాంతకు వయస్సు ఎంతండి?

లక్ష్మి:-17 సంవత్సరములండి—ఏవో చాల సంబంధాలు వస్తున్నాయి. ఏదో ఒకటి మంచిది చూచి ఈ ఏడాది పెండ్లి చెయ్యాలని ఆలోచన. మీ అన్నగారి వయసెంత?

కమల:-ఎంతండీ, మొన్న మొన్ననే నలభైయేండ్లు వచ్చినయి. అయినా ముప్పయిఏండ్లవాడిలా వుంటాడు. ఎన్నో సంబంధాలు వచ్చినా నచ్చటంలేదు. అసలు పెండ్లి వద్దంటాడు. నేనే పోరుతున్నాను—

సాయంత్రము ఏడుగంటలకు మా యింటికి వస్తే - బండి పంపుతాను - అక్కడ మా అన్నయ్యను చూడచ్చును. శాంతను తీసుకొనిరండి. పిల్లకు నచ్చకపోతే ఈ కాలములో ఎవరూ బలవంతము చెయ్యరుగా! మీకు అను కూలంగా వుండి, పిల్లకు నచ్చితేనే మా అన్నయ్యకు యివ్వండి. అందులో ఏమివుంది. వస్తారుకదూ. సరిగా ఆరున్నరగంటలకు బండి పంపుతాము సిద్ధంగా వుండండి. శాంతా! అంత సిగ్గెందుకు?—దేవుడి దయుంటే త్వరలోనే—మా వదినవు కాగలవు—నిన్ను చూసినప్పటినుంచి చిరపరచితురాలులా వున్నట్లు తోస్తోంది. మా అన్నయ్యకి నచ్చుతావనుకుంటా. తప్పక రా! వెళ్లొస్తాను. (అని నిష్క్రిమిస్తుంది కమల.)

శాంత:-నాకు ఈమెను చూస్తే అట్టే యిష్టములేదు. ఈమె మంచిదికాదని సందేహంగా వుంది. అప్పుడే, ఆమె వదిన అయినట్లు నాతో మాట్లాడుతూన్నది.

లక్ష్మి:-తప్పేమిటి—చూసొద్దాము. యిష్టములేకుంటే బలవంతముచేసేది ఎవరు? శాంతా, నీవూ రా. సిల్కుచీరె కట్టుకో. సంవత్సరానికి పదివేలు వస్తే ఆలోచించవలసినదే. కమలమాదిరిగా అన్నగారు వుంటే బాగుండవచ్చు. సరె లే—ఎవరి అదృష్టం ఎలా వుందో.

శాంత:-చూసివద్దాము. నాకు మనసులో ఆమెను చూచినప్పటినుంచి వివాహం అంటే భయంగావుంది. కారణం తెలియదు. అమ్మా! జీవితంలో మార్పుకలుగుతుంది అంటే మనస్సు వ్యాకులంచెందుతుంది కాబోలు.

లక్ష్మి:-పిచ్చిపిల్లా—ఏమి భయమే! సిగ్గు అలా అనిపిస్తుంది. చదువుకున్నదానివి—ఏమిటి ఈ వెఱ్ఱి భావాలు. చక్కగా డ్రస్సువేసుకో. కారు పంపుతామన్నారుకదా! సిద్ధంగా వుందాము.

(యిద్దరూ లోపలికి వెళ్లుతారు)

## రెండవ రంగము.

సాయంత్రము - 7 గంటలు.

[ఒక హాలు. హాలులోంచి పరికించి చూస్తే బయట వందగజాల దూరముగావున్న గేటు కనుపిస్తుంది. హాలునకు నడుమ ఒక బల్ల. చుట్టూ నాలుగు సోఫాలున్నవి. ఆ బల్ల మీద ఒక పెట్రొమాక్సులైటు. గేటునకు ఎదురుగావున్న సోఫాలో కమలాబాయి కూర్చునివున్నది. ప్రక్కనవున్న సోఫాలో వీరబాబు కూర్చునివుంటాడు. చక్కగా క్రాపు దువ్వుకొని, మంచి మడతగల సిల్కుసూటు వేసుకొని, చేత ఒక జేబురుమాలు పుచ్చు కొని విసరుకుంటూ వుంటాడు.]

కమల:-బాగానే వున్నది. నీకు నచ్చుతుంది.

వీరబాబు:-నీకు ఈమధ్య-సౌందర్యము అంటే అర్థము తెలుస్తున్నటులలేదు—(లేచి) కమలా—నేను చెప్పినటుల చేయక ఆటంకపరిస్తివా—(తిరిగి నవ్వి) కమలా—నిజంగా బాగుంటుందా—బాగుంటుందా—కమలా—బాగా లేకపోతే నిన్ను...(పండ్లు పటపట కొరకును) కమలా—అంతా సిద్ధముచేసినావా—ఫలహారము—టీ—7-30 రైలుకి ప్రయాణం. అనుకొన్నటుల అన్ని జరగాలి.

కమల:-అన్ని సిద్ధపరచాను—టాక్సీవాడిని వుండమన్నాను.—కారు శబ్దమవుతున్నది. వస్తున్నట్టు న్నారు. నీవు లోపలికి పో. వారు వచ్చినతరువాత రా అన్నయ్యా.

అలహాబాదులో జరిగిన సంగీత సమ్మేళనములో నృత్యములోను సంగీతము లోను ప్రతిభను ప్రదర్శించి బహుమతులొందిన ప్రమదలు



కుమారి ఊర్మిళానంద్.





కుమారి ప్రతిభానంద్.



కుమారి సుశీలా దత్తాత్రేయరావు

వేణుగానములోను గాత్రపాటలోను పతకములను పొందిన యువతీలలామము.





కుమారి తి ప్తీనన్యాల్.

[వీరబాబు లోపలికి పోవును. టాక్సీవచ్చి వీధిగేటులో ఆగును. లక్ష్మి ముందర—వెనుక శాంత ప్రవేశం. కమలలేచి—ద్వారమువద్దకు పోయి]

కమల:-రండీ. మీకోసమే కనిపెట్టుకొనివున్నాము. ఈ సోఫాలో కూర్చోండీ లక్ష్మిగారు. శాంతా నీవు ఈ సోఫాలో కూర్చో. మా అన్నయ్యని పిలుస్తాను.

[అని లోపలికి పోవును. వీరబాబు వెనుక ముందర కమల ప్రవేశం. లక్ష్మి, శాంతలు నుంచుంటారు. వీరబాబు శాంతను తదేకదృష్టితో చూచి]

వీరబాబు:-(మెల్లగా) కమలా నీవు చెప్పినది నిజమే బాగుంది. [ముందుకి రెండడుగులువేసి] లక్ష్మి గారూ నమస్కారమండి. మీ సంగతి అంతా నా చెల్లెలు కమల చెప్పినదండీ. మీ కొమార్తె పేరు శాంతాదేవని చెప్పినది. మీ దర్శనముచేత నా జీవనము పావనమయింది. కూర్చోండి. నిలబడినారు ఎందుకు.

[అందరు కూర్చుంటారు]

కమలా—వీరికి ఫలహారము—టీ తీసుకొని రా. వచ్చినవారికి మర్యాద చెయ్యనక్కరలేదా? (కమల లోపలికి పోవును)

శాంతా, మీరు స్కూలుఫైనలు పరీక్షకు వెళ్లినారటకదా!

శాంత:-అవును (బెదరినటుల చూచును)

వీరబాబు:-వర్ణణలవలన మనుష్యుల సౌందర్యమును వూహించుకొనుట కష్టము. చూచినపుడు వుండే ఆనందం ఎక్కువ. మీరు ఏదో పేపర్లలో వరుడు కావాలని వేయటంచేత, మేము వెతకుచుండుటచేత నేను యిచ్చటకు రావటం సంభవించింది. వచ్చినవారిని కాదనకుండా పంపటం బాధ్యత మీది—

[యింతలో ఫలహారములు. నాలుగు ప్లేట్లలో—నాలుగు కప్పుల టీ—అన్ని ఒక పళ్లెములో పెట్టు కొనివచ్చి నిలువబడును. వీరబాబులేచి] మీ ఫలహారము యిదిగోనండి—టీ తీసుకోండి (లక్ష్మికి యిచ్చును) శాంతా—మీరు ఈ ప్లేటులోని ఫలహారము తీసుకోండి—మా చెల్లెలు టీ బాగా చేస్తుంది (శాంతకు అందిచ్చును). వచ్చినవారిని సత్కరించుట మా దేశపు అలవాటు.

(అంతా ఫలహారములు చేసి టీ త్రాగుదురు. త్రాగుతూవుండగనే లక్ష్మి, శాంతలకు నిద్రవచ్చినటుల బరువయిన కండ్లు—తల తిరుగుట మొదలయిన మత్తులక్షణములు ప్రారంభించును. కమల నెమ్మదిగా వారి చేతులలో కప్పులు—ప్లేటులు తీసుకొనును. లక్ష్మి, శాంతలు సోఫాలలో వెనుకకు వరిగి కండ్లు మూసు కుంటారు. వీరబాబు త్వరగాలేచి)

వీరబాబు:-కమలా—ముసలిదానిని దానియింట్లో వదలిపెట్టి రా—టాక్సీవాడి సహాయము తీసుకో.

[కమల టాక్సీవాడు లక్ష్మిని ఎత్తుకుని తీసుకొని వెళ్లిపోతారు. వీరబాబు శాంతదగ్గరకు వచ్చి, తల, కళ్లు, చెక్కిళ్లు, చేతులు తడివి—లోపల నవ్వుకొని—తలక్రింద ఒకచెయ్యి, కాళ్లదగ్గర ఒక చెయ్యివేసి శాంతను చేతిలోనికి ఎత్తుకొని బుగ్గలమీద ముద్దుపెట్టుకుంటాడు.]

నా అదృష్టం బాగుంది—కమల చూసితెచ్చిన వారిలోనికి అల్లా శాంత బాగుంది. చదువుకున్నది. శరీరపుష్టి గలది. యిటువంటి బంగారుబొమ్మలు దొరికితే—నా వ్యాపారము చాలా బాగుపడుతుంది. చాలా అందంగా వుంది—దీని వయోవిలాసాలతో దేశాన్ని జయిస్తుంది. [మరల ముద్దుపెట్టుకొని] పెంకెతనము

చెయ్యకుండావుంటే బాగుపడుతుంది—లేదా—ముందుముందు తెలిసికొంటుంది. [అని మరలా స్తోఫాలో పడుకోపెడుతాడు. కానేపు యిటు అటు తిరిగి—చేతులు వెనుకకు పట్టుకొని ఏదో ఆలోచిస్తూవుంటాడు. యింతలో కమలా—టాక్సీవాడు ప్రవేశం] కమలా—త్వరగా, రైలు టైము అయింది. రెండవ క్లాసులో పక్కలు ముగ్గురుకి రిజర్వుచేసినావా—అన్ని సర్దివెయ్యి—పెట్టెలు టాక్సీలో పెట్టించు—త్వరగా [కమలా. టాక్సీవాడు రెండుమూడు పెట్టెలు టాక్సీలో పెడుతారు]—టాక్సీలో ప్రక్క కట్టెనులు తీయండి—నేను శాంతను తీసుకొనివస్తాను. [అని శాంతను తీసుకొని టాక్సీలోనికి వెళ్లి కూర్చుంటాడు. కమలవచ్చి చేరుతుంది. టాక్సీ వెళ్లిపోతుంది.]

అందరు వెళ్లిపోతారు.

## రెండవ అంకము

### మొదటి రంగము.

[స్థలం. ఒక హాలు. తలుపులకు కట్టెనులు కట్టివుండును. ఒకమూల ఆఫీసు బల్ల, నాలుగు కుర్చీలు. వ్రాసుకునే పరికరాలు అన్నీ బల్లమీద వుంటాయి. నేలమీద తివాసీలు వేసివుంటాయి. బల్లకు ఎదురుగావున్న కుర్చీమీద వెంకట్రావు కూర్చునివుంటాడు. ఏవో కాగితాలు వ్రాస్తూవుంటాడు. అతను వేసుకొన్నది ఒక లాల్చి. కుర్చీమీద ఒక తువాలు వేసియున్నది. అప్పుడప్పుడు ఒక చేతితో తల తడుముకొంటూ వుంటాడు. ఏమి తోచనివాడివలె విసుక్కుంటున్నటులు మొహం కనిపిస్తుంది. యింతలో సుశీల ప్రవేసిస్తుంది. నీటుగా వేషంవేసుకొని విలాసంగా వస్తుంది, చేతిలో ఒక పవిటచెంగు ఆడించుకుంటూ. చిరునగవు మొహంమీద కనిపిస్తుంది. నెమ్మదిగా వెంకట్రావు కూర్చున్న కుర్చీ వెనుకకువచ్చి నుంచున్నది. రెండుచేతులు కుర్చీ వెనుకమీద పెట్టి, వెంకట్రావు క్రాపుని ఒక వ్రేలితో తడుముచూ]

సుశీల:-ఏమండీ, ఎప్పుడూ పనేగాదూ. శెలవరోజుల్లో ఏమిపనండీ. శెలవల్లో యింటికి కాగితాలు తీసుకొనిరానని ఏన్నో సార్లు చెప్పారు. ఆమాట ఎప్పుడు నిలపెట్టుకోలేదుకదా!—అయ్యో - అదేమిటండీ వెంట్రుకలు నెరుస్తున్నాయి!

వెంకట్రావు:-నీకు ఎన్నిసారులు చెప్పినా యింతేగాదూ - పనిచేస్తున్నప్పుడు నన్ను ఏమి మాట్లాడించవద్దనీ. నాకు ఏమీ పని సాగటంలేదు. యిదుగో యిక్కడ వచ్చి కూర్చో. [సుశీల కుర్చీ చెయ్యిమీద కూర్చొని, ఒకచెయ్యి కుర్చీవెనుక వుంచును.] ఏం! - ఈరోజున జోరుగా వేషం వేశావు. ఏదో వుంది కారణం. ఆడవాళ్లకు యింత వుల్లాసాగా వుండటం - ఈ కాలంలో - సినీమాలకు వెళ్లడమంటేను, లేకపోతే పుట్టింటికి వెళ్లటానికి భర్తగారి అనుమతి అడిగేటప్పుడు..

సుశీల:-స్త్రీ హృదయాన్ని బాగా చూచినట్లు మాట్లాడుతారే! అయినా ఈతడవ మీరు చెప్పింది కొంచెము నిజమేలెండి. మా నాన్న రమ్మని వ్రాశాడు. మనమిద్దరం కలసివచ్చి చాలా కాలమయిందట. ఏదో ఆయన వున్నాడు కాబట్టి రాలేదని అనుకుంటాడు. ఆయన పెద్దవాడు అయినాడు. ఎన్నాళ్లు జరుగుతాయి ఈ ముచ్చట్లు.

వెంకట్రావు:- అనుకున్నటులే అయింది. యిందుకా ఈ లయలు - ఈ వయోవిలాసాలు. అర్ధమయింది.

సుశీల:- నేను ఎప్పుడు - అసహ్యంగా మీ కంటికి కనుపించానండీ? మీరు అట్లా అంటారనీ చాల జాగ్రత్తగా వుంటానుగదా.

వెంకట్రావు:- యిటువంటి సమయాలలో మొహంలో కళ ఎక్కువగా వుంటుంది. కళ్లు మెరుస్తూ వుంటాయి. భర్తమీద అవ్యాజప్రేమ వుదయిస్తుంది. స్త్రీ నైజము.

సుశీల:- సరేగాని! మీమాట చెబుదురూ. నా కోరిక చెల్లించండి. మీరు నాతో వస్తే - యిహా ఎప్పుడూ మీరు చెప్పినట్లు విని, మన కాపరము ఎప్పుడు వెన్నెలగా వుండేటట్లు చేస్తాను.

వెంకట్రావు:- నీ వుపన్యాసాలు ఎందుకు. నాకు విశ్రాంతి కావాలి. యిల్లు, గృహచ్ఛిద్రాలు - కుటుంబ కూపాన్నించి నాకు విశ్రాంతి కావాలి. నా స్వేచ్ఛ నాకు మళ్లీ కావాలని వున్నది. ఒక నెలగోజులు నీవు వెళ్లి పుట్టింటి భోగాలు అనుభవించిరా! పో. నన్నుమాత్రము అంతగా బలవంతంచేయకు. నేను కాలేజిలో చదువుకొంటున్న రోజులలో ఎంత స్వేచ్ఛగావున్నానో, యిప్పుడు ఆవిధంగా వుండాలని వున్నది తెలిసిందా.

సుశీల:- [మొహం చిన్నపుచ్చుకొని] రానని, నాతో నివసించటము వల్లగోత పుట్టిందని, ఎందుకండి వుపన్యాసాలు. నాకు వీల్లేదు - రావటానికి పనితొందరలు వున్నాయని చెప్పకూడదా. మీ వాగుడుకి వకీలు వుద్యోగములో చేరినా బాగుండేది. ఈ తలవంచుకొని కాగితాలమీద దస్కతుచేసే వుద్యోగము ఎక్కడ నుంచి వచ్చిందో. నన్ను చూస్తే మీకు విసుగుపుట్టిందా. వద్దు వద్దు అంటే మీదపడే జాతికాదు. మీరు ఏ ప్రవరాఖ్యుడో అనుకొన్నారా! మీరు రాకపోతే పోనీలెండి. నేను వక్కతనే వెళ్లుతాను, మీరు ఏమన్నా చేసుకోండి. పెళ్లిచేసుకొని సంసారాలు చేస్తున్నవారికి స్వేచ్ఛ కావాలిట - స్వేచ్ఛ, పెళ్లాలను వదలి పర స్త్రీ అన్వేషణార్ధము స్వేచ్ఛ, సంసారాలు గుల్లచేసుకోవటానికి స్వేచ్ఛ. నేను చూస్తున్నా. ఆ అల్లరి చిల్లరశాస్త్రి చేరినప్పటినుంచి మీ నడవడిక. చూడటం లేదనుకొంటున్నారేమో! అన్ని చూస్తున్నా. మీ చిరాకు, మీ విసుగు అన్నిటికి అర్ధంతెలుసు. అంత తెలివితక్కువదాన్ని కాదు - ఏ పెద్ద పరీక్షలు ప్యాసుకాకపోయినా. మానవతత్త్వమూ, మరి భర్తతత్త్వమూ, వెట్టి పోకడలూ కనిపెట్టటం తెలుసు. మీరు మా పుట్టింటికి రానక్కరలేదు. తెలసిందా! నేను వంటరిగా వెళ్తాను. మీ యిష్టమువచ్చినట్టు, యిష్టము వచ్చినవారితో వూరేగండి. నేను సాయంత్రము రైలుకే వెళ్లుతున్నాను. [అని చురా చురా చూచి అస్తలము వదలి వెళ్లిపోవును. వెంకట్రావు తిరిగి వ్రాసుకొనుచుండును.]

## రెండవ రంగము.

[వీరబాబు గృహము. అయిదు ఆరు గదులు వరుసగా వుంటాయి. వీటిముందర వసారా వున్నది. ఆ వసారాలోనుంచి వస్తే పెద్ద హాలు. చక్కగా అలంకరించివుంటుంది. నడుమ పెద్ద బల్ల. చుట్టూ సోఫాలు. ఈ హాలులోనుంచి చూస్తే పైచెప్పిన గదులు కనిపిస్తూవుంటాయి. అందులో మొదటిగదిలో ఒక పందిరిమంచము. దానిప్రక్కన నిలువు టద్దము. ఒక చిన్న బల్ల. దానిప్రక్కన రెండు కుర్చీలు. ఆ బల్లమీద పూలు పెట్టుకొను టకు ఒక చిన్న గిన్నె; ఆ పందిరిమంచముమీద పట్టుపక్క అమర్చివుంటుంది. దీనిమీద శాంత పడుకొనివుంటుంది. తలవెంట్రుకలు చిందరవందరగా వుంటాయి. పైట ఒకప్రక్కకు

తొలిగివుంటుంది. కళ్లు తుడుచుకుంటూ లేస్తుంది. మొహం వాడివుంటుంది. రెండురోజుల నుంచి అన్నపానములు లేవు. నీరసంగా కనిపిస్తుంది. ఏదో ఆలోచిస్తూవుంటుంది. దేవుని ప్రార్థించుదానివలె కళ్లు పైకిపెట్టి చూస్తుంటుంది. కన్నీరు కాలువలుగా కారుతూవుంటాయి. సమయం ప్రొద్దున్న 7 గంటలు.]

శాంత:-తిరిగి తెల్లవారింది. నా దౌర్భాగ్యపు జీవితమునకు విరామములేదు. స్త్రీలే యింత పాపకృత్యమునకు పాటుపడితే - [కంటివెంబడి నీరు కారుచుండును] నేను ఏపాపమెరుగను. నేను పడుపువృత్తికి దిగాలీ, నా వున్నత ఆశయాలన్నీ అడుగంటాలీ - స్త్రీ పడుపువృత్తికి దిగితే వారికి స్వేచ్ఛవచ్చినట్టా - వారి ఆర్థిక దుస్థితి పోతుందీ? తియ్యనిమాటలతో - బుజ్జగింపు కబుర్లతో కమల నన్ను పాపకూపాన్ని త్రోయడానికి ప్రయత్నిస్తోంది - తండ్రీ - జగద్రక్షకా నన్ను కాపాడుము. ఈ వీరబాబు, కమల, వారినుండి నన్ను రక్షించుము. వీరబాబు ఎంత క్రూరుడు! నిన్న కొట్టినదెబ్బ - [బుగ్గలు తడుముకొనుచూ] నేను భరించలేను. రెండు రోజులనుంచి తిండిలేదు. నేను సరేనంటే - హంసతూలికాతల్పములు, పట్టుచీరలు, కావలసినన్ని ఆభరణములు, చెలికత్తెలు, కోరినపైకము అన్నియు నా అరచేతియందు వుంటాయి? లేనిగెుడల ప్రాణహానియా? ఎంతటి విషాదగాధ అయింది నా జీవితం! [తలుపు చప్పుడు - ప్రవేశం, కమల.]

కమల:-శాంతా! లేచినావా! పెంకెతనము, పట్టుదల అంతా వదలి నిద్రలేచివుంటావు అనుకుంటాను. మొండితనముచేస్తే మా అన్న వూరుకోడు - క్రూరుడు అని నేను చెప్పలే! [దగ్గరచేరి జుట్టు చిక్కుతీస్తున్నట్టుల కనిపించును.] నీవు కోరినవి అన్నీ యిప్పిస్తాను. నిన్ను రాణిగా చేయిస్తాను. నీవు సరేనంటే భాగ్యభోగాలన్నీ నీవే. నీకు కావలసిన పరిచారికలు. లేదంటివా! మా అన్న వస్తాడు, ఆ కష్టములు నీకు తెలుసును. వస్తున్నట్లున్నాడే [వీరబాబు వస్తాడు.]

వీరబాబు:-ఏమంటున్నది. యింకా బుద్ధివచ్చిందా లేదా! నిన్నటిసంగతి జ్ఞాపకమువుందా లేదా ఏం! శాంతా! చెప్పినటుల విను. సౌఖ్యముకావాలా? లేక - (పళ్లు పటపట కొరకును.)

శాంత:-నన్ను క్షమించండి! నేను అటువంటిదాన్నిగాదు. (అని కన్నీరు కార్చును.)

వీరబాబు:-యింకను నీకు బుద్ధిరాలేదన్నమాట! శాంతా! నీమంచి నీకు తెలియదు. యింతవరకు నన్ను ఎదిర్చి బ్రతికినవారు లేరు. నా వుద్దేశ్యాలు యింతవరకు విఫలముకాలేదు. అనుకున్నది అయితీరాలి. నీ సౌందర్యాన్నీ, నీ వయస్సునూ, నీ సుకుమారత్వమునూ చూసి జాలిగావుంటున్నాను. నీసంగతి మితిమీరిపోతున్నది. శాంతా! నీవుచేయునది తప్పులేదు. అందరూ ఏదో ఒక సందర్భములో చేసే పనే! రాజకీయసమస్యలు స్త్రీలతో నడుస్తున్నాయి. ప్రతి సంస్థ ఎన్నికల ఫలితాలు స్త్రీలతో నడుస్తున్నాయి. వుద్యోగాలు స్త్రీలతో వస్తున్నాయి. పోతున్నాయి. అంతర్జాతీయ వ్యవహారములలో స్త్రీలే ఎక్కువమంది కృషిసలుపుతారు. శాంతా! నీ జీవితంలో రాగల గొప్ప మార్పు, గొప్ప యశస్సు కాలుతో తన్నబోతున్నావు. జాగ్రత్తగా ఆలోచించుకో.

శాంత:-ఆలోచించుకొనే చెప్పాను.

వీరబాబు:-ఆ ఎదురు జవాబా. (దగ్గరకువచ్చి చెయ్యిపట్టుకొని) అంత పొగరా! వీరబాబు సంగతి పూర్తిగా తెలియదు. నేను చెప్పినటుల వింటావా! వినవా చెప్పు (చెయ్యి మెలివేయును.)

శాంత:-అబ్బా! అమ్మా! అయ్యో!

# అబలా బలాత్కార పాపఫలితము

[వీరబాబు యింకను చెయ్యి మెలియవేయుచుండును. శాంత అరచుచుండును. కమల శాంత నోరు మూయును. శాంత వళ్లుతెలియక క్రిందబడిపోవును.]

వీరబాబు:-[కాలితో శాంతను తన్ని] ఈతడవ నీకు బుద్ధివచ్చును. కమలా ! నీవు ఈసారి వప్పించక పోతివా ! నీపని చూడు.

కమల:-అన్నయ్యా ! నీవు వట్టి మృగజాతికి చెందినవాడవు. ఎంత క్రూరుడవు. అమాయికపు పిల్లను యింత హింసించుటా !

వీరబాబు:-నీవు ఎదురుతిరుగుతున్నావా ! జాగ్రత్త. నోరు జాగ్రత్త. నేను అరగంట తరువాత వస్తాను. చక్కగ పన్నీట స్నానముచేయించి, మంచిచీరగట్టి సొగసుచెయ్యి. మంచి కాఫీ ఫలహారము యియ్యి. ఆకలి, నీరసముమీద, చెప్పినమాట వింటుంది. పద్మ, సరోజా, వసుమతిచేత చెప్పించు. యింకను విననియెడల రేపు ఏ నదిలోనో, ఏ పొదలలోనో, శాంత మృతకళేబరము కనిపిస్తుంది. చేచిక్కినవారు తప్పించుకొని పోలేరు. యిష్టములేనివారిని వదలిన మన సంస్థకు అపాయము వస్తుంది. కమలా ! జాగ్రత్త. (అని వెళ్లిపోవును.)

[శాంత యిటు అటు దొర్లి - నెమ్మదిగా కళ్లుతెరచి]

శాంత:-దాహము - దాహము. (కమల లోపలికివెళ్లి కాఫీ ఫలహారము పట్టుకొని వస్తుంది. శాంత తల వళ్లో పెట్టుకొని, కొంచెము కొంచెముగా చెంబుతో కాఫీ నోట్లో పోయును.)

కమల:-శాంతా ! నేను చెప్పలేదా ! మా అన్న వట్టి క్రూరుడు అని. నేను చెప్పినటుల చెయ్యి. నిన్ను నెత్తిమీద పెట్టుకొంటాడు. తిండిలేక శరీరము కృశించింది. మా అన్న పెట్టుబాధలకు మితిలేదు. బంగారు వంటి నీ శరీరము ఎలా కమిలిందో ! పిచ్చిపిల్ల - నీవు యింకా అమాయకురాలవు. నీ మానము యిదివరకే పోయింది. నీవు మత్తువచ్చి పడిపోయి రైలులో ప్రయాణము చేయునపుడే, నీ వళ్లు తెలియనపుడే, మా అన్న చేత చిక్కినావు. యిపుడు తెలిసి, నీచేత వప్పించవలెనని ప్రయత్నము. పెంకెతనముతో ప్రాణహాని రాగలదు. క్రొత్తలో కొంచెము కష్టముగా వుంటుంది. తరువాత అలవాటుపడుతావు. వసుమతీదేవి సంగతి చూడు. చదువుకున్నది. అందమయినది. మొదటమొదట ఎంత శ్రమపెట్టింది అనుకున్నావు. యిప్పుడో, దాని లయలు, దాని వన్నెలు చూడాలి. యిప్పుడు ఎంత సంపాదించిందనుకొన్నావు. కర్చులు పోను లాభములో చెరిసగము. వారి బ్యాంకీలో వారు వేసుకొంటారు. ఇచ్చట పేరుపొందిన అందకత్తెలు వున్నారు. మీకు ఎంత పలుకుబడి వుంటుందనుకొన్నావు. నీవు యిప్పుడు సరే అను. ఈ గృహంలో వుండే సౌఖ్యము అంతా నీదే.

శాంత:-[కన్నీరు కార్చుచు] నాకు రెండుగంటలు టైము యివ్వండి. తరువాత చెప్తాను.

కమల:-నీకు పరిచారిక నొకదాన్ని పంపుతాను. నీకు వుపచారములుచేస్తుంది. (అని కమల వెళ్లిపోతుంది.)

శాంత:-అబ్బ ! ఎంత దుర్భరము ! ఎంత క్రూరుడు. [చెయ్యిపట్టుకొని చూచును.] కర్తవ్యము. సమయోచితముగా వుండాలి. మొండితనముతో ప్రాణాపాయము రాగలదు. వుపాయము ఆలోచించాలి. పురాణాలలోవలె ఏ కృష్ణభగవానుడో వచ్చి మానసంరక్షణం కావించడు కదా ! ఐదుగురు భర్తలున్నను ఆమెకు శ్రీ కృష్ణపరమాత్మయే దిక్కయ్యెను. ధైర్యము అవలంబించవలెను. అబ్బా ! నాకు ఒక్కదానికి సాధ్యము అవుతుందా ! అబలనే ! పారిపోవుటకు మార్గము ఏమి తెలియదే. ఈ దేశము ఎదో తెలియదే. ఎవరో వచ్చుచున్నటుల వున్నది. వీరబాబు కాడుకదా ! (పరిచారిక ప్రవేశం) నీ పేరు ?

పరిచారిక:-లలిత.

శాంత:-ఎన్నాళ్లనుండి యిక్కడ వుంటున్నావు.

లలిత:-సంగతులు చెప్పకూడదని మాకు వుత్తరువు.

శాంత:-లలితా! ప్రాణదానము చేసినదానివి అవుతావు. నీకు ఏమయినా యిస్తా. యిదిగో ఈవుంగరం తీసుకో. యిది నీది. నాకు సహాయం చెయ్యి. నీకు యింకా బహుమతిస్తాను.

లలిత:-(వుంగరము తీసుకొని) దానికేమిలే అమ్మా. మీ దయ వుండాలి కాని, మిమ్మల్ని పెట్టే అవస్థలన్ని చూస్తున్నాను. చేయలేక వూరుకొన్నాను. మీరు సరే అనకపోతే, మిమ్మల్ని చంపేటానికి ప్రయత్నిస్తారు. జాగ్రత్త అమ్మా. బ్రతికివుంటే సుఖాలు ఎప్పటికయినా వస్తాయి. వీరబాబు కటికవాడు. యిద్దరు ప్రాణాలు తీసాడు. పోలీసులు వీరికి లోపాయికారీ. ఏమి బయటకు రానీయరు. పెద్దపెద్దవాళ్లు ఈయన స్నేహం. గొప్పగొప్పవాళ్లు యిక్కడకు వస్తారు. ఈ కాలానికి జాతి, నీతి, అన్నీ పొయ్యాయి. యివ్వాళ ఎవరో క్రొత్త ఆయన వస్తారని చెప్పుకొంటున్నారు. ఆయన - ఏమో. ఎవరి మనస్సు ఎట్లా వుంటుందో.

శాంత:-ఆలాగా! లలితా! కమలమ్మగారిని పిలు. (లలిత వెళ్లిపోతుంది). క్రొత్తగా వచ్చేవారిని, ఎవరో దించివుంటారు, నా మోస్తరు క్రొత్త జీవనమే అయివుంటుంది. క్రొత్త అయితే, నా పాలిటబడితే నా రక్షకుడు అవుతాడు. లేనియెడల ప్రాణాలు యిక్కడ పోవలసిందే. ఏడ్చి లాభములేదు. కార్యసాధనము కావాలి. ఈ సంస్థ రూపుమాపాలి. వీరిని అంతమొందించటానికి, నాబోటి యితర వనితలను కాపాడటానికి, నా జీవితాన్ని ధారపోస్తాను. తప్పించుకొంటినా, వీరబాబు కమలల జీవితము తుదిముట్టుతుంది. ఏదో నిర్ణయించాలి. వాడు దుర్నీతిపరుడు అయితే - చూద్దాము. ప్రపంచకములో అన్ని సుగుణములు ఒక్కరిలోను, అన్ని దుర్గుణములు ఒక్కరిలోను ఎప్పుడునూ వుండవుగదా. అన్ని గుణములు కలసి వుండవు. మంచిగుణములు ఎక్కువవున్నపుడు మంచివాడగును. చెడ్డగుణములు ఎక్కువగా వున్నపుడు చెడ్డవాడగును. సాధించెదను. పాపి పశ్చాత్తాపపడిన మోక్షము కలుగును. సన్యాసులు పాపములు చేయలేదని చెప్పుటకు వీలులేదు. పాపులకు భావి జీవితము, సన్యాసులకు వెనుక జీవితము ఎప్పుడు వుంటుంది. పాపి వచ్చినను భావి జీవితము కల్పించవచ్చు. (యింతలో కమల ప్రవేశం).

కమల:-శాంతా! కబురు పంపించావా.

శాంత:-అవును. ఆలోచించాను. మీ బాధలు చెవికి ఎక్కాయి. వీరబాబుగారితో చెప్పండి. సరేనని మనోనిశ్చయము చేసికొన్నాను. యివ్వాళనుంచే, మీ యిష్టము నెరవేరుస్తాను.

కమల:-శాంతా! నిజంగానా! నిజంగానా! ఎంత ఆలోచనాపరురాలివి. మా అన్నతో చెప్తాను. నీకు మృష్టాన్నములతో భోజనము—పన్నీరు స్నానము—వలచిన దుస్తులు, ఎంతో అందంగావుంటావు. (అని వెళ్లిపోతుంది సంతోషంతో)

శాంత:-వెనక్కి వెళ్లడానికి వీలులేదు. కృష్ణా! నీవే నన్ను కాపాడాలి. ఏవిధంగా రక్షిస్తావో చూస్తాను. నా శక్తివంచనచేయను. మానవ ప్రయత్నము చేస్తాను. భారము—రామా! అంతా నీమీద. మా అమ్మ ఏమిచేయుచున్నదో కదా. యింతవరకు నన్ను వదలివుండి ఎరుగదు. నాజాడ తెలియక ఎంత దుఃఖిస్తున్నదో. అమ్మా! నాకోసము నీ చిన్నివన్నెల హనుమంతునికి పూజలు సలుపవమ్మా. (కన్నీరు కారుచుండును. ఎక్కి ఎక్కి ఏడ్చుచూ) చేతులు జోడించి తోకముడుచుకొన్న ఆంజనేయుని, మేల్కొలిపి, వీరాంజనేయుని చేయవమ్మా. ఏ కష్టమువచ్చినా! ఏ దుఃఖమువచ్చినా నీ యిష్టదైవముని ప్రార్థించి - అమ్మా. అమ్మా—నా శరీరము—నాకు గోతగావున్నది (ఏడ్చుచూ క్రిందపడిపోవును).

(సశేషము)




# నాటకములు – నాటక ప్రదర్శనములు

## శ్రీమతి టి. వసుంధరాదేవిగారు

మనదేశములో నాటకములు పూర్వమునుండియు నీతిదాయకముగానో మంగళదాయకముగానో ఉండెను. పిమ్మట నాటకములు కొంతవరకు పూర్తిగా సంతోషదాయకములుగానే నుండుచు వచ్చెను. కాని నాటకములందలి పాత్రలుమాత్రము ఎల్లప్పుడును రాజులు, రాణులు, రంగములు, అంతఃపురములు, రాజవీధులు, రాజోద్యానవనములు, ప్రపంచములో ఎన్నికష్టములు ఎందరు అనుభవించినను, నాటకములలోని పాత్రములు ఎన్ని బాధలుపడినను – మనలో విషాదాంతనాటకములు చాల అరుదు. కట్టకడపట ఏదో విధముగా ఇంద్రజాల మహేంద్రజాలకులవలె దేవతలువచ్చి - దుఃఖమునంతను సంతోషముగా మార్చివేసెదరు - నాటకరచనాపద్ధతులు కాలానుగుణముగా నుండవలెను. ఒకప్పుడు పైన ఉదాహరించినమాదిరి నాటకములు ఆయా కాలములందు జనుల కామోదకరముగా నుండియుండవచ్చును - మనకు పురాణములందెంత అభిమానమున్నను, గౌరవమున్నను - ఎల్లప్పుడు ఆ కథలనే నాటకములుగా ప్రదర్శించుట - వాటినే సినీమాలుగా తయారు చేయుట మితిమీరి - ప్రస్తుతకాలపు మనుష్యులకు చూచుటకుకూడ సామాన్యమైపోయి పురాణములయందలి ప్రేమగౌరవములు తగ్గుచున్నవి.

రానురాను - మనయొక్క ప్రవర్తనలు, నీతినిగురించిగాని, వ్యక్తిస్వాతంత్ర్యమును గురించిగాని మన ఉద్దేశములు కాలానుగుణముగా మారుచుండుట అందరకును తెలిసిన విషయమే - అటువంటి సమయమందు - ఇంకను పురాణకథలనే నాటకములుగా వ్రాసి, వాటిని నీతిబోధకములుగా జేసి, భీకరాకారవేషములతో, భయంకరమైన రంగములతో, కన్నులకు కంటకముగానుండు వర్ణమిశ్రమములతో తెరల నేర్పాటుచేసి - సామాన్యమానవుని ఆలోచనకందకుండునట్లు ప్రదర్శించుట మనలోని మూర్ఖతను తెలియజేయుచున్నది.

కాలము పూర్తిగా మారిపోయినది. పెద్దవారు, పూర్వాచార పరాయణులు ఎంత ప్రయత్నించినను, కాలచక్రము నాపలేకున్నారు. ఒకప్పుడు పాతివ్రత్యధర్మములే స్త్రీలకు

ముఖ్యముగా నుండెడివి. స్త్రీలకు ఆ ధర్మములను అందరు కథలమూలమున, నాటకములమూలమున బోధించుచుండిరి. స్త్రీలుకూడ ఆ విషయమునుగూర్చి మనస్సులలో వివిధమైన చర్చయులేకుండ నీతికి స్త్రీలు కట్టుబడుట మంచిదని ఎంచి, పెద్దల బోధనలకు లోబడియుండెడివారు - ప్రస్తుతము అట్లుకాదు. స్త్రీకూడ తానొక స్వతంత్ర వ్యక్తియని తలచుచున్నది. పురుషునితోపాటు రాజకీయసాంఘిక విషయములందు, సమానత్వమును కోరుచున్నది. ఇప్పుడు స్త్రీ పురుషులకుండు, భార్యాభర్తల సంబంధము పూర్వమువలె వివాహసంస్కారమునందు ఇమిడిలేదు. పెండ్లితంతు జరిగినంతమాత్రాన - ఈకాలపు స్త్రీ తాను ఒక పురుషునకు అర్ధాంగిమాత్రమే యని తలపనేరదు - సంఘముకూడ, స్త్రీ పురుషుల స్వాతంత్ర్యవ్యక్తిత్వమునందు నమ్మకముగలదైన యెడల స్త్రీ స్వతంత్రాలోచన లేకుండ ఒక పురుషునకు అణగిమణగి ఉండవలెనని కోరదు. కోరలేదు. ఇప్పుడు భార్యాభర్తల సంబంధము, వివాహమునాడు పురుషుడు కట్టుదారముపోగువల్ల బలపరుపబడుటలేదు. కాని ప్రేమసూత్రమువల్ల బలపరుపబడుచున్నది. అట్టిచోట్ల స్త్రీపురుషుల సుఖదుఃఖములు, వారు ఒకరికొరకొకరు చేయు త్యాగములును వారి ప్రేమమీదనే ఆధారపడియుండును. అట్టివారికి, అనసూయ ప్రతిదినము భర్తపాదములు పట్టుట, భార్య ఎప్పుడును భర్తకన్న ముందు లేచుట, భర్త విసర్జించిన అన్నమును భుజించుట, ఇట్టివి నాటకముల మూలమున మనము చూపబనిలేదు. ఇదేమాదిరి - మిగిలినవిషయము లెన్నియో ఉన్నవి. ఇప్పుడు స్త్రీ పురుషులు, ట్రాములలోగాని, బస్సులలోగాని, రైలుబండ్లలోగాని, నాటకశాలలలోగాని సరిసమానముగా కూర్చుందురు. వ్యక్తిభేదము వారి మనస్సులందుగాని ఆలోచనలందుగాని తోచనే తోచదు. అట్టివారికి, రామాయణము నాటకమువేసి - అందులో సీత రావణునితో మాట్లాడునప్పుడు రావణునకు తనకు మధ్య గీతగీసి గడ్డిపోచ పెట్టెనని చూపించిన అది చాల హాస్యాస్పదముగా నుండును - ఇట్లు చెప్పుటవల్ల నేను పురాణములు మంచివికావని, చదవకూడదని చెప్పుటలేదు. పురాణములు పురాణములవలెనే చరిత్రాత్మకములుగా నుండవలసినదే గాని, నీతిబోధకములగు నాటకములుగా మార్చకూడదు. మన పురాణములు, పూర్వకాలపు నాటకములు, ఆయాకాల పద్ధతులననుసరించి వ్రాయబడ్డవి. పూర్వము దేశములను రాజులు పాలించుచుండిరి. 'రాజులే సామాన్యప్రజలకు ఆదర్శనీయులుగా నుండిరి. అందువల్ల వారినిగురించి కథలు, నాటకములు కవులు వ్రాయుచుండిరి. ఆకాలమందు బహుభార్యాత్వము రాజులలో సర్వసాధారణముగా నుండెడిది. కనుక ఒక్కొక్క నాటకమునందు రాజుయొక్క మనోవికారములు, ప్రేమానురాగములు, పట్టమహిషిమీద చూపుట ఎక్కువగా కనపడదు. ఎక్కడనో ఏదో ఒక స్త్రీ రాజునకు కనబడును. వెంటనే రాజునకు కామవికారములు కనబడును. తరువాత

పతివ్రతయగు పట్టమహిషి, భర్త సంతోషమే తన సంతోషమని యెంచి, ఆ స్త్రీని రాజు వివాహమాడుటకు తగు సహాయము చేయును. ఇట్టి నాటకము లీ కాలములో ప్రదర్శించుట ఎందువలననో. ఈ కాలపువారు బహుభార్యాత్వము నెక్కువగా ఆమోదించరు.

ఎక్కడనో నూటికి ఒకరిద్దరు భార్య జీవించియుండగనే పెండ్లి చేసికొన్నను - అందరు భార్యలతో ఒకేఇంట కాపురముచేయుట అరుదు. సంఘముకూడ అట్టివారిని జాలివల్ల సహించుచున్నదే గాని, బహుభార్యాత్వమును ఆమోదించి సహించుటలేదు. అంతేకాక, పూర్వము 'దేశము' రాజ్యపాలనములో నున్నది. ఇప్పుడు ప్రజాపరిపాలనలోనికి వచ్చినది. పూర్వము స్త్రీ పురుషునివల్ల నీచముగానో లేక, పురుషునిపైని ఆధారపడ్డ వ్యక్తికిందనో చూడబడియుండెను. ఇప్పుడు స్వతంత్రవ్యక్తిగా పరిణమించినది. ఇప్పుడామె స్వతంత్రజీవనము చేయగలదు. తన బుద్ధిని ఉపయోగించి, మంచిచెడ్డల నాలోచించి పని చేయగలదు. పురుషులుకూడ స్త్రీ బుద్ధిసూక్ష్మతను గ్రహించుచున్నారు. వారుకూడ స్త్రీ తమకు అణగిమణగి ఉండవలసిన వ్యక్తికాదని, తామేగాక స్త్రీలుకూడ ఈ సృష్టిలో సమభాగులని, సమానమైన భావములు కలవారని తెలుసుకొనుచున్నారు. అందువల్ల ఈ కాలానుగుణముగ నాటకములువ్రాసి ప్రదర్శించిన బాగుండునే గాని పాతకథలను పట్టుకొని వ్రేలాడుచు, మన బుద్ధిని వికసింపజేయక, క్రొత్త ఆలోచనలను చొరనీయకుండుట ఎక్కువ శ్రేయస్కరమైన పనికాదు. కనుక మనకు కావలసిన నాటకములు, ప్రస్తుతపు సాంఘిక, రాజకీయపరిస్థితుల నవలంబించియుండవలెను. ఏరోజు కారోజు మార్పునొందుచున్న మన దేశములో, మన సంఘములో, మన కుటుంబములలో వ్యక్తిస్వాతంత్ర్యమునకు పోరాడుచున్న నవయువకుల కష్టసుఖములగూర్చి, పాతదారులనువిడిచి రాలేక, క్రొత్త ఆచారములయందు దామోదన చూపలేక, తాము బ్రతకలేక, తమ సంతానమును బ్రతకనియ్యలేక, కష్టపడెడి పురాణపిశాచములగూర్చియు నాటకముల వ్రాసిన, ఎన్ని నాటకములనైన వ్రాయవచ్చును. అట్టి నాటకములవల్ల సంఘము మారిపోవుచుండవచ్చును. జగత్తు మారుటలోనే చిత్రమున్నది. ఈ మార్పులే ప్రపంచములో కావలసినవి. మార్పులేకపోయిన జీవితమునందు రసమే లేదు - రుచియే లేదు. అందరు ఒకేవిధముగా ఉన్నయెడల, అందరు నీతిపరులు, దయాపరులు, భక్తిపారంగతులు అయినయెడల, వ్యక్తిభేదమే యుండదు - చీకటిలో దీపము వెలిగినట్లు వెలుతురులో వెలిగినప్పుడు దాని ప్రకాశము మనకు కనబడదు. అట్లే ప్రపంచమంతయు మంచిగానే ఉన్నయెడల మంచి అను శబ్దమునకు విలువయే యుండదు. దుఃఖముతో పోల్చినప్పుడే సుఖమును దుర్గుణముల ప్రక్కనే సద్గుణములును ప్రకాశించును. అలాగని నీతికూడదని నేను చెప్పుటలేదు. ప్రపంచమన్న అన్నిరకముల గుణములు ఉండును. మనము మనుష్యుల భావములను, వారి

చర్యలను బాగుగా తెలిసికోవలెనన్న, వారి సాంఘిక, వ్యావహారిక, రాజకీయ పరిస్థితులను తెలిసికోవలెను. వాటిని తెలిపి, వారివారి స్థితిగతులు, ఆ స్థితుగతులు వ్యక్తులయందు తెచ్చు మార్పులను మనకు విశదముగా జూపు నాటకములు ప్రస్తుతము కావలసియున్నవి. అట్టి నాటకములవల్ల, సంఘములోను, కుటుంబములలోను ఎన్నియో మార్పులు రావచ్చును. కొన్ని కుటుంబములలో పిల్లల నతిగారాబముగా పెంచుటవల్ల - వారు ఎందుకు ప్రయోజకులు కాకుండపోవుదురు ? కొందరు తల్లులు తమ పిల్లల నతిశిక్షణలో పెంచుటవల్ల పిల్లలు పెద్దవారై సంఘములో మితిమీరిన స్వాతంత్ర్యమును గోరుచుందురు. ఇదేవిధముగా ఇంకను ఎన్నో కుటుంబములగూర్చి, సంఘములగూర్చి విషయములు తీసు కొని నాటకములుగా రచించి చూపిన, వాటినినుండి మనము నేర్చుకొను పాఠములుకూడ చాల ఉండును. ముందుముందు నాటకములు వ్రాయువారు ఈ విషయముల గమనించి, ప్రస్తుత స్థితిగతుల కనుగుణ్యములగు నాటకముల వ్రాసి దేశసేవ చేయవలెనని నా కోరిక.

## కోయిల

నిత్యసమ్ముదమన్నది నీదుసొమ్ము
చీకుచింతలనెఱుగక చిరతరమ్ము
పెద్దగాయకుకీవితో ముద్దులొలుక
'కో'యటంచును పాడెడి కోయిలదిగో!
రాజ్యభ్రష్టతనందిన రాజునైన
గణముకుదరనితరి నుండు కవియునైన
మోసగాడైన గానంపు మోహనంపు
సుధనుగ్రోలుచుసమ్ముద వీధిచనడె!
ఏమిపాడెద వీనూత్నసమయమందు
ఆయురారోగ్య స్వారాజ్యప్రాయులవగ
భారతీయులదీవించి పాడగదవె!
ముద్దుకోయిల చిగురుల ముందునిలచి!
క్రింగెబహుధాన్య నాగేశుమిత్తినిచ్చి
భారతావనిశోకాన క్రుగ్గజేసి
ఈ ప్రమాథిని 'శుభములనీయవమ్మ'
యనుచుపాడుమ! మనములహర్షమెసగ
ఆంధ్రరాష్ట్రమ్ము సాధింప నాంధ్రజనులు
పెద్దయత్నంబులన్సలుప సుద్దులనగ
రాష్ట్రసిద్ధికి దీవెనరాణ దనర
పాడగదవమ్మ కోయిలా! పాటనొకటి
ఆంధ్రపత్రిక లత్యమిత హర్షగతిని
ఆంధ్రగృహలక్ష్మి మణులకు నాదరముగ
విఘ్నరాహిత్య మొనరించి వెలయుకొఱకు
పాడుమమ్మరో! కోయిలా పాటనొకటి
బెట్టుసరిసల్పు, పాడంగ రట్టుపెంచు
అదియ, గాయకు సాజంపు విదితగుణము!
సహజగాయని వీవౌట సాహసించి
పాడమంటిని, పెంకివై వరలకమ్మ!
కవిరచించును, పాడునుగాయకుండు
అటులగాకుండ నేర్వకే పాటపాడు
నీవయొక్కర్తమిన్నవుగావె! జగతి
నిత్య సమ్మోదమూర్తివి నీవు కావె!
మంగళంబుల పాడుమీ మహితవేళ
శాంతి, జగమునశోభిల్ల శ్రావ్యగతిని
ముద్దులొలుకంగ జనములు ముదమునంద
పాటలెన్నెన్నొ నిత్తరి పాడగదవె!

— శ్రీ చాలకవి అయ్యగారి విశ్వేశ్వరరావు.

# తల్లి - బిడ్డ

## శ్రీమతి గుమ్మళ్ల అహల్యగారు

పాశ్చాత్యనాగరకత దేశమందు ప్రబలమగుచున్నకొలది నేటి నవనారీమణులలో తప్పు టభిప్రాయములుకూడ వృద్ధినొందుచున్నవి. నేడనేకులు, గృహనిర్వహణము నీచ మని యభిప్రాయపడుచున్నారు. స్త్రీలకు సహజమగుశక్తి గృహనిర్వహణమునందే కలదు. అట్టి విద్యుక్త ధర్మమును స్త్రీలు విడనాడి దేశమునకు తీరనిచేటు చేకూర్చుచున్నారు. దీనికి మూలకారణము నేటి స్త్రీవిద్యయే! స్త్రీ ధర్మములను బోధించు విజ్ఞాన మీ విద్య యందు లేదు. కావున స్త్రీలు మాతృభావయందలి మహత్వమును గుర్తెఱింగి తమ దృక్పథమును మార్చుకొనవలెను. నాడే వీరు దేశాభివృద్ధికి తోడ్పడినవారగుదురు.

శిక్షణకు, జీవితమునకు అవినాభావ సంబంధముకలదు. బాల్యావస్థయందు పొందిన శిక్షణను బట్టియే మానవుని భావిజీవిత మాధారపడియుండును. మానవుల జీవితములపై దేశ సౌభాగ్య మాధారపడియుండును. అట్టి శిక్షణపొందు స్థలము గృహము. అట్టి గృహము మాలిన్యము చెందిననాడు దేశము హీనదశకువచ్చుట నిశ్చయము. పై అంశములనుబట్టి దేశమును సంరక్షించు సైన్యము స్త్రీలని విదితమగుచున్నది. అట్టి సైన్యము తప్పు మార్గములను ద్రొక్కిన దేశము నాశనమగుటయు నిశ్చయమే!

బిడ్డలకు బోధించుశక్తి, ఒక్కతల్లికే గలదు. అట్టి మాతృహృదయము గంభీర యోచనగలిగి ఆదర్శములగు ఉన్నతాశయములకు నెలవైననాడే ఆదర్శమాత కాగలదు. ఆమె సుజ్ఞానియైననాడే జ్ఞానభూషణమైన సంతతిని దేశమున కర్పణజేయగలదు. నేటి శిశువులే భావిపౌరులు. కావున తల్లి తన బాధ్యతను గుర్తెఱింగి శక్తి వంచనలేక తన బిడ్డల భావి భాగ్యోదయము కొఱకు పాటుపడవలెను. క్రమశిక్షణకలిగి, మాతృప్రేమను జూపుచు తల్లి బిడ్డలకు మార్గదర్శిని కావలెను. ఓర్పులేనిచో తల్లి బిడ్డలయొక్క సున్నిత మగు ఆశయములను గాయపఱచి, వారిని పిఱికిపందలుగా చేయును. బిడ్డల ఆశయములను గ్రహింపగలశక్తి ఒక్కతల్లికే గలదు. తల్లియొక్క కోర్కెలు బిడ్డలఆశయములు ఒకే పథమున ప్రవహించిననాడే వీరి భావిజీవితములు సౌభాగ్య వంతములగును. ప్రాచీన భారత మహిళలు గృహమందలి దివ్యశక్తిని గ్రహించుట చేతనే మహాపురుషులను భారతభూమి కర్పింపగల్గిరి.

జనయిత్రి ప్రబోధమునంది శివాజీ శూరుడాయెను. మాతృశిక్షణపొంది నెపో లియన్ సేనానాయకుడయ్యెను. మాతృ హృదయమును చవిజూచి గాంధి, రవీంద్ర

నాథులు ఆదర్శపురుషులైరి. అహల్యాబాయి, భవానీవంటి రాజనీతినిపుణులు; మొల్ల, మోరికావంటి ప్రసిద్ధ కవితామతల్లులు; రుద్రమదేవి, ఝాన్సీవంటి వీరవనితలు మాతృశిక్షణ నందియే భారతభూమియందు సౌభాగ్యగరిమతో విలసిల్లిరి. అందుచేతనే ఆదర్శములగు వారిజీవితములు ఆచంద్ర తారార్కముగా అవనియందలంకరింపబడినవి.

గృహనిర్వహణము గృహిణియొక్క ముఖ్యకర్తవ్యమని ముందుగానే ప్రసంగించితిమి. కాని నేటి పాశ్చాత్యవిద్యాధికులీధర్మములను నెఱవేర్ప కష్టతరముగ భావించుచున్నారు. నాగరకతయను పేర నవనారీమణులయందు సుకుమారము హెచ్చగుచున్నదన్న అతిశయోక్తికాదు. దీనికి తార్కాణము, నేడనేకులు బిడ్డలకొఱకు ఆయాలను నియమించుటయే! దీనివలన బిడ్డల ఉన్నతాశయములు నశించి భావి జీవితము లభాగ్యములగును. బిడ్డలకు డబ్బాపాలనిచ్చుట మరొకవింత విషయము. పోనీ, తల్లియందు పాలు లేని సమయమున పరిశుభ్రములగు ఆవుపాలుకలవు. దేశమందు కామధేనువులకు కఱవు లేదే! పచ్చిక బీడులన్నియు మాడిపోయి, ఆలమందలన్నియు నొక్కసారిగ మరణించిన నాడు కదా ఈ డబ్బాపాలకు పరుగులెత్తవలసిన యగత్యము! సహజమైన ఆహారమునకు మారు శాస్త్రీయమైన ఆహారమును బిడ్డల కలవాటుపఱచి వారి యారోగ్యము నరికట్టుచున్నారు. భార్యలకు వంటచేయుట రానికారణమున దంపతులు నేడనేకులు హోటళ్ల నుండి భోజనము తెప్పించుకొనుటచూచుచున్నాము. ఇదన్నిటికంటెను శోచనీయము. ఇట్లన్ని విషయములలోను, మంచిచెడ్డల నాలోచింపక, పాశ్చాత్యులను గ్రుడ్డితనముగా అనుకరించుట కేవలము హాస్యాస్పదము.

బిడ్డల బాగుకొఱకు పాటుపడలేని నేటినవనారీమణులు దేశసౌభాగ్యమునకు తోడ్పడుదురనుట వెర్రినమ్మకము. కావున నేటి మహిళాప్రపంచము ప్రస్తుత పరిస్థితులయందలి లోపాలోపములను సూక్ష్మదృష్టితో పరిశీలనజేసి సంస్కారముగావింప పాటుపడవలెను. లేకున్న, ప్రపంచమున నొకప్పుడు అత్యున్నత పీఠమునలంకరించిన భారతదేశము మరింత కృంగి కృశించును. కావున భారతస్త్రీజాతి నేడున్నతినందుటకు ప్రబలప్రయత్నము సలిపి ముందంజవేయవలెను.

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగనున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప గోరుచున్నాము.

సంపాదకుడు.

# పత్రికాపరిచయము

## తెలుగుతల్లి :—మాసపత్రిక

సంపాదకులు :—శ్రీమతి రాచమల్ల సత్యవతీదేవిగారు, 36 A. బన్‌సీలాల్‌పేట, సికింద్రాబాద్ (దక్కన్) సంవత్సరం చందా రూ. 1-8-0. విడిసంచిక వెల 0-2-0.

వివిధవిషయ విజ్ఞానమును విస్తరింపజేసి ఆంధ్రదేశాభ్యుదయమునకును జాతీయైక్యతకును సహాయపడగల పత్రికాసేవనుచేయ సంకల్పించిన సంపాదకురాలి ఆశయములు అభినుతింపదగినవి. స్త్రీలు పత్రికా సంపాదకత్వ బాధ్యతను సమర్థతతో నిర్వహింపగలరనుట కీ పత్రిక చక్కని నిదర్శనమైయున్నది. ప్రమాధి సంవత్సర ఆశ్వీజ శుద్ధ దశమినాడు వెలువడిన మొదటి సంపుటములోని ప్రథమసంచికలో ప్రశంసనీయమగు వ్యాసరత్నములున్నవి. విజయదశమినాడు ప్రచురింపబడిన ఈ పత్రిక విజయవంతమై చిరకాలము వర్ధిల్లుగాక !

## విజయవాణి : తెలుగు వారపత్రిక :—

సంపాదకులు :—శ్రీ వి. ఆత్మారామప్పగారు, అనంతపురము. సంవత్సరం చందా రు. 3-0-0. విడిపత్రిక ఒక అణా. రాయలసీమయొక్క శ్రేయోభివృద్ధికి తోడ్పడు సంకల్పముతో ఆంధ్రభాషా సేవచేయ పాటుపడుచు, రాజకీయ, సాంఘిక సారస్వత విషయములను చర్చించుచు ఈ పత్రిక విజయవాణిని ఆంధ్ర దేశములో ప్రతిధ్వనింపచేయగలదని విశ్వశించుచున్నాము.

## కాంతి :—జాతీయ వారపత్రిక (తెలుగు)

సంపాదకులు :—డా॥ పి. టి. జగన్నాధరావుగారు, తిరుపతి. సంవత్సరం చందా రూ. 3-0-0. విడిపత్రిక 0-1-0. మొదటి సంపుటములో నిప్పటికి ముప్పదిరెండు సంచికలు వెలువడినవి. ఆంధ్రమాతయొక్క ఘనతను విస్తరింపజేయబూనిన పత్రికలలో 'కాంతి' శ్రీ తిరుపతి వేంకటేశ్వర సాన్నిధ్య విశేషభాగ్యముతో వెలయు వివిధవిషయ విజ్ఞానకాంతులను బ్రసరింపజేయుచున్నది. ఈ పత్రిక ఆంధ్రులందరి ప్రోత్సహాముతో దినదినాభివృద్ధి గాంచుగాక !

‘పరస్పర సహకారమునకు ప్రోద్బ‌లము’

‘అచంచలమైన మన భావిస్వాతంత్ర్య సౌధనిర్మాణమునకు’

కడపలో జరిగిన పదునాలుగవ

# ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభలో

మహిళామణుల గంభీరోక్తులు

(గృహలక్ష్మి ప్రత్యేక ప్రతినిధి)

పదునాలుగవ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ గతమాసము 16, 17 తేదీలయందు కడపలో అత్యంతవైభవముగ సమావేశమైనది. ప్రస్తుత పరిస్థితులయందలి మహిళా సమస్యలను సింహావలోకన మొనర్చుటకును, రాబోవు సంవత్సరమునకు కార్యక్రమము నేర్పాటుచేసికొనుటకును, అఖిలభారతమహిళామహాసభకు ఆంధ్రదేశమునుండి ప్రతినిధులను పంపుటకును మొదలైన వివిధవిషయములను చర్చించుటకు హైదరాబాదు వాస్తవ్యురాలును, సుప్రసిద్ధసంఘసేవాధురీణయునైన శ్రీ బేగమ్ అమీరుద్దీన్ సలీమాగారి అధ్యక్షతను సమావేశమైనది.

మహాసభకు ప్రతినిధులుగ శ్రీమతులు గంధం అమ్మన్నరాజా ఎం. ఎల్. ఏ., పెద్దాడ సుభద్రమ్మగారు (ఏలూరు), మాగంటి శకుంతలాదేవిగారు (మద్రాసు), సి. హెచ్. చంద్రమతిగారు (రాజమండ్రి), ఎగ్గూరు వెంకటరత్నమ్మగారు (నంద్యాల), కె. పిచ్చమ్మగారు (బెజవాడ), రామతులశమ్మగారు (గుడివాడ), వేమగంటి పాపాయమ్మగారు (కాకినాడ), రెడ్డి లక్ష్మమ్మగారు (కర్నూలు) మొదలగు మహిళామణులు ఆంధ్రదేశమందలి వివిధ ప్రదేశములనుండి సుమారు 200 మందివరకు విచ్చేసిరి.

'సమాన ప్రతిపత్తియే మన లక్ష్యము'

'హిందూ మహమ్మదీ యైకమత్యమే బలమైన పునాది'

ఆహ్వానసంఘాధ్యక్షురాలును, కార్యదర్శులును అగు శ్రీమతులు కె. రామసుబ్బమ్మ గారు, కుముదం భోగిగారు, నామగిరి కృష్ణారావుసతిగారు, తదితరులును సభకు విచ్చేసిన ప్రతినిధులకును అతిధులకును ముసాఫర్ బంగళాయందు భోజనాదివసతి సౌకర్యముల నొనర్చిరి.

కడపయందుజరుగుటకు ఇదియే మొదటి మహిళామహాసభ మైనను ఆహ్వాన సంఘమువారు అత్యంతశ్రద్ధతో నేర్పాటులగావించి పురజనుల సహకారముతో సభను విజయవంతముగ జరిపిరి.

ఈ మహాసభకై గత రెండుమూడు మాసములనుండియు జరుగుచున్న ఏర్పాటులతో కడప, పరిసరప్రదేశములలోను, యావత్ రాయలసీమ మహిళాలోకములోను నూతన చైతన్యము, కార్యదీక్ష కలిగి సమావేశముజరుగు రెండు దినములు ప్రతినిధుల యొక్కయు, పౌరులయొక్కయు ఉత్సాహ సంభ్రమములు కడపలో వెల్లివిరిసినవి. ఈ సమావేశముతో దత్తమండలమహిళా చరిత్రలో ప్రారంభమగు నిర్మాణకార్యదీక్షాబద్ధమైన ఒక నూతనశకారంభసృష్టికి కారణభూతులైన ఆహ్వానసంఘము వారెంతయును అభివందనీయులు.

మహాసభా ప్రారంభదినమున ముసాఫర్ బంగళానుండి అధ్యక్షురాలిని తదితర ప్రతినిధులను, బ్యాండువాయిద్యములతో, ప్రొద్దుటూరు సేవాసదనపు బాలికల జాతీయ గీతములతో ఊరేగించి, సభలకై ప్రత్యేకముగా నేర్పాటుజేసియున్న జిల్లాబోర్డు కార్యాలయమునకు మధ్యాహ్నము రెండుగంటలకు జేరిరి.

ఆనాటి మహాసభకు సుమారు వేయిమంది స్త్రీలు పరిసర గ్రామములనుండి విచ్చేసిరి. పెక్కుమంది మహమ్మదీయ స్త్రీలును, క్రైస్తవ స్త్రీలునుగూడ వచ్చియుండిరి. వివిధభాషలుగల స్త్రీజనమైనను, అందరును అత్యంతోత్సాహముతో కార్యకలాపము నందు పాల్గొనిరి.

కార్యదర్శినియగు శ్రీమతి కుముదం భోగిగారు అధ్యక్షురాలిని, ఆహ్వానసంఘాధ్యక్షురాలిని పుష్పమాలాలంకృతులను గావించినంత కరతాళధ్వనులు చెలరేగినవి.

ప్రప్రథమమున కడపజిల్లాబోర్డు అధ్యక్షురాలును, ఆహ్వానసంఘాధ్యక్షురాలును అగు శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు మహాసభకు విచ్చేసిన ప్రతినిధులను, ప్రేక్షకులను ఆహ్వానించుచు, నిర్మలోత్సాహ వాతావరణము మధ్య తమ స్వాగతోపన్యాసము నిట్లు చదివిరి:

అధ్యక్షా, సోదరీమణులారా!

మా ఆహ్వాన మంగీకరించి రాష్ట్రమందలి వివిధ ప్రాంతములనుండి వ్యయప్రయాసలకోర్చి మా కడప నగరమున జరుగు మహిళాసభకు విచ్చేసి మాకు నూతనోత్సాహము కల్గజేసిన మీ కెల్లరకు కడపమండల సోదరీమణుల తరపున నా హృదయపూర్వక స్వాగత మొసగుచున్నాను; కృపామతిని స్వీకరింపుడు.

సంఘాభివృద్ధి నరికట్టు బాల్యవివాహము, బాల్యవైధవ్యము మొదలగు లోపములు మన సంఘమును పీల్చి పిప్పిచేయుచున్నవి. వీటిని రూపుమాపుట మనకర్తవ్యము. బాల్యవివాహముల నిషేధించు శారదా చట్టము యిప్పటికిని అంత ప్రయోజనకారిగాకున్నది. ఆచట్టము యింకను సవరించి చట్ట విరుద్ధముగ జరిగిన

**సంఘము - దురాచారములు**

బాల్య వివాహములు రద్దగునట్లు చేసిననేగాని దేశమునకు లాభకరముగానుండదు. వ్యభిచార నిర్మూలచట్టము లందందు బయలుదేరిననేగాని యావద్భారత దేశమున కన్వయించు చట్టమింకను వెలువడలేదు. తదర్థమై పుస్తకములు, ఉపన్యాసములు, చలనచిత్రములు మొదలగు వాటిమూలమున ప్రబలాందోళనమును జరుపవలసియున్నది.

ఇంతవరకు స్త్రీల వారసత్వపు హక్కులు కేవలము అసంతృప్తికరముగా నుండెడివి. దేశముఖ్ మొదలగు స్త్రీజన సేవాపరాయణుల కృషివల్ల యీ హక్కు లిపుడొకింత మార్పుజెందినవి. త్వరలో మరొక వారసత్వపు శాసనము వెలువడనున్నది. ఇంతటితో మనము తృప్తిజెందియుండరాదు. పురుషులతోపాటు సమానమగు వారసత్వపు హక్కులు సంపాదించునంతవరకు మనము తీవ్రాందోళన సాగించుచునే యుండవలయును.

బహుపత్నీ నిషేధపుబిల్లొకటి ఇపుడు కేంద్ర శాసనసభలో శ్రీమతి రాధాబాయి సుబ్బరాయను గారిచే ప్రవేశపెట్టబడినది. బహు పత్నీత్వమువలన స్త్రీలకు సంఘటించుచున్న చిక్కులు లోకవిదితము. ఈ విషయమున అమోఘ కృషి సలుపుచున్న శ్రీ రాధాబాయి సుబ్బరాయనుగారి కెంతయు కృతజ్ఞులము. మన మందరము సంపూర్ణ సహకారమొనర్చి వారికృషిని సఫలీకృత మొనర్పవలసియున్నది.

శ్రీ దేశముఖ్ గారి విడాకులబిల్లును ఖండింపవలసివచ్చినందుకు నేనెంతయు విచారించుచున్నాను. హైందవమత సాంప్రదాయమునకు ఈబిల్లు కేవలము విరుద్ధము. ప్రాచీన హిందూదేశముచ్ఛస్థితి నొందియుండె నన్న అందులకు భారత నారీమణుల పాతివ్రత్య ప్రభావమేకదా! పాతివ్రత్యాచరణము సులభసాధ్యము కానిదయ్యును, హైందవ నారీమణులు యాదలదాల్చుట వారి పరమధర్మము.

విడాకుల చట్టములు విరివిగా ఆచరణయందున్న పాశ్చాత్యదేశములోని దాంపత్య జీవితములకంటె మనదేశములోని దాంపత్య జీవితములె ఎక్కువ సౌఖ్యప్రదముగను, శాంతియుతముగను కనబడకమానవు. దుస్సహములగు దాంపత్యములచ్చటచట మనదేశములో నుండక బోవు, కాని పాశ్చాత్యదేశములతో పోల్చిచూచిన వీటిసంఖ్య అత్యల్పము. వీటి నెదుర్కొనుటకై కళంక పూరితమగు దాంపత్య శాంతి భంగమునకు తోడ్పడు విడాకులచట్టమువంటి దారుణాస్త్ర ప్రయోగము కేవలము కొరివితో తలగోకికొనిన చందమగును.

పురుషులతోపాటు స్త్రీలకు సమానహక్కులుకావలెనని పోట్లాడుట ఇపుడు సహజమైనది. దైవదృష్టి యందు స్త్రీ పురుషులు సమానులని గుర్తెరుగక పురుషులు తామధికులమని స్త్రీలను నీచముగా జూచుటయు,

14-వ ఆంధ్ర రాష్ట్ర మహిళామహాసభా దృశ్యములు, కడప.





తాము సంపాదించిన ఆస్తియందు స్త్రీలకేలాటి హక్కు లేదని ఆస్తియందు స్వాతంత్ర్య మివ్వకపోవుటయు

### సమానహక్కులు - స్త్రీ విద్య

ఇత్యాది చర్యలవలన స్త్రీలు పురుషులతో సమానహక్కులకొరకై సంఘర్షణ చేయవలసి వచ్చినది. స్త్రీ పురుషులలో నొండొరులు చేయుపనులు ఇరువురి మేలుకొఱకే అయియుండియు ఒకరికి ఆధిక్యత ఒకరికి న్యూనత ఎక్కడిది? పురుషులు చేయవలసిన కార్యములలో స్త్రీలు చేయజాలని కార్యమేదియు లేదని నానమ్మకము. ఇపుడును, ప్రాచీనకాలమందును పురుషులతో సమానముగ సభలయందు చర్చించగలిగిన గార్గి, మైత్రేయి, సులభ మున్నగువారు లేరా? అద్వితీయమైన పాతివ్రత్యప్రభావము కనపర్చిన సాధ్వీమతల్లులెందరు లేరు? రాజ్యములుపాలించి అసమాన పరిపాలనాకౌశల్యముజూపిన రజియా, చాంద్‌బీబి, ఝాన్సీరాణి మున్నగువారు లేరా? పరిశోధనయందు పేరుగాంచిన మాడంక్యూరి మున్నగువారు లేరా? నేటి రాజకీయరంగమున ప్రవేశించి దేశస్వాతంత్ర్యమునకై అసమానధైర్యములను గనపరచి తమ సర్వస్వమును త్యాగముచేసిన సోదరీమణులెందరు లేరు? ఇప్పటికైన స్త్రీల శక్తిసామర్థ్యములను పురుషులు గ్రహించి, స్త్రీపురుషుల సమానత్వమును ఒప్పుకొని. తమచర్యలను సవరించుకొని, స్త్రీ పురుషులమధ్య సంఘర్షణకు అవకాశముకలిగించరని నమ్మెద.

స్త్రీలకు విద్య అత్యవసరము. భవిష్యద్భారతజాతికి తల్లియగు ప్రకృత స్త్రీకి విద్యలేకపోయిన భారతజాతి వికాసమందజాలదు. ముఖ్యముగ స్త్రీలలోనైనను' నిర్బంధ విద్యావిధానమును ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిననే కాని మన స్త్రీజాతి వికసింపజాలదు. స్త్రీజాతి వికసించిననేకాని దేశము దాస్యవిముక్తి నొందనేరదు. కాన ప్రభుత్వమువారు ధనవ్యయమునకు లెక్కించక స్త్రీలకైనను నిర్బంధవిద్యను ఉచితముగ గరపు నట్టి చట్టమును చేయవలెనని ఆందోళన చేయవలసియున్నది.

### స్వాతంత్ర్యము - సంఘౌన్నత్యము

స్త్రీలకు సాంఘికముగ, ఆర్థికముగ, రాజకీయముగ స్వాతంత్ర్యముండినగాని ఏదేశమును అత్యున్నతపదవి నందజాలదు. స్త్రీలకెక్కువ స్వాతంత్ర్యముండకూడదను కొందరు స్వార్థపరాయణుల తలంపాక దురూహ. స్త్రీ స్వాతంత్ర్యము సర్వతోముఖముగ సాగుటచేతనే రష్యాదేశ మిపుడు అధోగతిపాలైనదని ఎవరు చెప్పగలరు? మొన్నటివరకు పరదాలలోనుండి స్వాతంత్ర్యభేరి మ్రోగించిన స్త్రీజన మహిమచే టర్కీదేశ మిపుడు ప్రపంచమున నొకింత తలయెత్తి తిరుగగల్గినది. స్త్రీ స్వాతంత్ర్య శక్తిమూలముననే కదా, కేవలము దుర్బలయని యనబడుచుండిన చీనాదేశమిప్పుడు జపాను దుర్భర పశుబలమును నెదుర్కొనగలిగినది. కాన స్త్రీజన స్వాతంత్ర్యము సర్వశ్రేయోదాయకమనుట నిర్వివాదాంశము. మన స్వాతంత్ర్య సంపాదనమే గాక భారత

> భగవత్కృపవలన మహిళాసంఘములు కుటుంబ కలతలకు గురికాలేదు. మనలోనున్న యీ ఐకమత్యమును పురుషులకు కూడ వ్యాపింపజేసి ప్రపంచ సౌఖ్య స్థాపనమునకు శాంతిదూతలము కావలెను.
>
> ప్రపంచశాంతి ప్రతిష్ఠాపనకు మన గృహములే ప్రధమ రంగములు. గృహములోని శాంతి సంఘమునకు, సంఘమునుండి దేశమునకు, దేశమునుండి యావత్ ప్రపంచమునకును వ్యాపించును.
>
> అట్టి మహత్తరశాంతి ప్రతిష్ఠాపనమునకు వనితాలోకము మార్గదర్శకులు కావలెను.—
>
> —శ్రీ బేగం అమీరుద్దీన్‌సతి

దేశస్వాతంత్ర్య సంపాదనముగూడ భారతనారీమణుల ప్రధాన విద్యుక్తధర్మమని భావించవలెను. ప్రస్తుతప్పు స్వాతంత్ర్యోద్యమమునకు హిందూ మహమ్మదీయ సమస్య తీరని ఆటంకమును కలిగించుచున్నది. దీనినేవిధమునసైన పరిష్కరించుకొన్ననేగాని స్వాతంత్ర్యోద్యమము నిరాటంకముగ ముందుకు సాగజాలదు. హిందూ మహమ్మదీయ సోదరీమణులు యీ విషయమున ఏకైక దీక్షవహించి హిందూ మహమ్మదీయ సమస్యా పరిష్కారమునకు తమ యమూల్యపు సేవను ధారపోయుదురని ఆశించుచున్నాను. భారతీయుల జన్మహక్కగు స్వాతంత్ర్యమునకు హిందూ మహమ్మదీయుల విభేదములు అడ్డుతగులుచుండుట కడు శోచనీయము. భారతస్త్రీలయందు యీ విభేదములులేక సమగ్ర భారత స్త్రీజాతి ఔన్నత్యమునకు పాటుపడుచుండుట గర్వించవలసియున్నది. నేడు మనమధ్య అధ్యక్షపీఠము నధిష్టించిన మన సోదరీమణియగు బేగం అమీరుద్దీన్‌గారు యిందుకు తార్కాణము. కాన భారతదేశ దాస్యవిమోచనకయి మనమైనను హిందూ ముస్లిం సమస్యా పరిష్కారమును సాధించవలెను.

దయతో ఎన్నిపనులుండినను ఈ మహాసభాధ్యక్షతవహించుట కనుమతించి కడు దూరప్రయాణమొనర్చి వేంచేసియున్న శ్రీ బేగం ఆమీరుద్దీన్‌గారు అధ్యక్షపదవి నలంకరింతురని వేడుచున్నాను. వీరు కలకత్తా విశ్వవిద్యాలయములో పట్టభద్రురాలై, పశ్చిమదేశములలో సంచారమొనర్చి, పాశ్చాత్య విజ్ఞానమార్జించి యెల్లపుడు స్త్రీజనాభ్యున్నతికొరకు నిరంతరము సంఘసేవచేయుచున్న వీరియొక్క నిష్కామ స్వార్థత్యాగము గణనాతీతము. ఇట్టి సాధ్వీమణి ఈసభకు అధ్యక్షురాలగుట మనభాగ్యము.

పిమ్మట కరతాళధ్వనులు మిన్నుముట్టుచుండ శ్రీ బేగం అమీరుద్దీన్ సతీమణిగారు అధ్యక్షపీఠము నలంకరించి ఆంగ్లమున తమ అధ్యక్షోపన్యాసమును గంభీరముగ నిట్లు గావించిరి. అధ్యక్షురాలి ఉపన్యాసమును శ్రీ యస్. సుభద్రమ్మగారు తెనుగున అనువదించిరి.

సోదరీమణులారా!

ఈ మహాసభకు అధ్యక్షతవహింప నియోగించి నన్ను గౌరవించినందులకు మీకందరికి కృతజ్ఞురాలను. విజ్ఞానమునకు పేరుపొందినది ఆంధ్రదేశము. అట్టి ఆంధ్రదేశముయొక్క మహిళామణుల మహాసభలో మనమందరము నేడిచట సమావేశమయితిమి. 12 సంవత్సరముల క్రిందట ఉత్సాహపూరితులగు గోదావరీమండల మహిళామణులు కొందరితో కలిసి కృషిచేయు భాగ్యము నాకొదవియుండెను. తత్ఫలితముగనే అపుడు రాజమండ్రిలో ప్రథమ గోదావరీమండల మహిళామహాసభను, కాకినాడలో ప్రథమ ఆంధ్ర మహిళామహాసభను జరిపియుంటిమి. అది మొదలుగా ఆంధ్రదేశ మహిళామణులు తమ సహజోత్సాహముతో ప్రతివత్సరము ఈ మహాసభలు జయప్రదముగ జరుపుచుండుట చాల ముదావహము. అఖిలభారత మహిళామహాసభయొక్క ప్రాంతీయసమావేశములను జరుపుటలో అన్నిప్రాంతములవారికంటె ఆంధ్రమహిళామణులే పైచేయిగానున్నారు. భారతదేశములోని అనేకప్రాంతములలోకన్నను, ఆంధ్రదేశ స్త్రీజనమందు ఎక్కువ ప్రబోధము కలిగినదనుట నిశ్చయము. దీని నెవ్వరు కాదనజాలరు. భారతభూమికి, స్త్రీజనోద్యమమునకు సేవచేయుటలో వీరితో దీటురాగలవారెందరో యుండరు. ఆంధ్రదేశములో ఆరేండ్లు వసించి, అనుభవముతో నేను చెప్పచున్నమాట ఇది. భారతవర్ష భావిభాగ్యోదయమునకు ఆంధ్రమహిళలు ప్రశస్తముగ తోడ్పడి, తమ బాధ్యతనెరవేర్చుకొందురనుట నిస్సంశయము.

ఆంధ్రవనితలదే అగ్రతాంబూలము

# ఆంధ్ర మహిళా మహాసభ - కడప

భారత స్త్రీలోకమున గత 12 వత్సరములలో గొప్ప పరిణామము లెన్నో కలిగినవి. వారి స్థితిగతులలో కలిగిన మార్పులు నిజముగా అద్భుతములు. ఇదివరకు నిషేధింపబడిన వృత్తులలో, ఉద్యోగములలో ప్రవేశమివ్వబడినది. స్త్రీకి నేడు శాసనసభ్యత్వార్హత కలిగినదనిన, నిజముగా అది గొప్ప విజయమే. అనేక

### స్త్రీ లోకములో అభ్యున్నతి

పాశ్చాత్యదేశములలో నియంతృత్వ విధానములక్రింద స్త్రీజనోద్యమము నలిగిపోవు చున్న నేటికాలమున భారతదేశములో స్త్రీలు మంత్రులుగ, పార్లమెంటరీ సెక్రెటరీలుగ, డిప్యూటీ స్పీకర్లుగ, జిల్లాబోర్డు ప్రెసిడెంట్లుగ రాగలుగుట గొప్పవిశేషము. ఈ సందర్భమున కడపజిల్లాబోర్డు అధ్యక్షురాలగు శ్రీమతి రామసుబ్బమ్మగారిని నేనెంతయు అభినందించుచున్నాను. ఇంగ్లాండులో స్త్రీలు పురుషులతో సమానహక్కులు కలిగియున్నారనుటయే గాని, అక్కడకూడ అనేకమయిన యిబ్బందులున్నవి. ఇందును గురించి అచటి స్త్రీ సంస్థలలో వినియున్నాను. కేవలము స్త్రీ లనే కారణముచేతనే వారికి ముఖ్యమయిన ఉద్యోగపదవులందు చోటిచ్చుట లేదు. తగరనునట్లుగనే భావించుచున్నారు. అధవా ఒక స్త్రీ అందు గొప్పప్రతిభను చూపించినప్పటికిని గణించక 'స్త్రీ అయినా బాగానే నిర్వహిస్తూవుం'దని ఏదో చాచివేతగా మాట్లాడెదరు. గొప్ప అభివృద్ధి స్థితిలో నున్నవను పాశ్చాత్యదేశములలోనే స్త్రీలవిషయ మిట్లున్నపుడు భారతదేశములో ఇటీవల కలిగిన స్త్రీజనాభ్యున్నతి మిక్కిలి ప్రమోదావహముకాదా ?

> ప్రత్యేకాంధ్రరాష్ట్రము కోరుట ప్రత్యేక ఆంధ్రత్వముకొరకు. స్వరాష్ట్రవిజయులైన స్త్రీజనము స్వరాజ్య సంరంభమున ద్విగుణీకృతోత్సాహముతో పాల్గొందురు. గత స్వాతంత్ర్య పోరాటమున ఆంధ్ర నారీమణుల ధైర్యస్థైర్యములు అనుపమానములు.
>
> ప్రత్యేక రాష్ట్రసిద్ధివలన వారి కార్యదీక్ష యినుమడించును గాని సంకుచితము కాజాలదు. ఆంధ్రస్త్రీ లక్ష్యము అఖిల భారత జాతీయౌన్నత్యము—
>
> —శ్రీమతి రామసుబ్బమ్మ

భారతదేశ చరిత్రలో ఇప్పుడు జరుగుచున్నది అత్యంతప్రాముఖ్యమయిన కాలమని చెప్పదగును. భారతజాతీయ జీవపునరుద్ధరణయే నిజముగ జరుగవలసినచో, అనేక కష్టానుభవములకు మూలకారణమగు

### పాఠశాలా సంరక్షణ సంఘములు

విద్యావిహీనత తొలగించుట, అందుకు ప్రప్రథమముగ పెట్టుకొని తీరవలెను. అందులోను ముఖ్యముగ స్త్రీవిద్యకు ఎక్కువ ప్రాముఖ్యత నొసగవలెను. ఏమనగా, నిజమునకు పురుషుల విద్యకూడ స్త్రీ విద్యపై నాధారపడవలసినట్టిదే. భావిసంతతిని తయారుచేయునట్టిది ఎప్పుడును తల్లియే గదా? అయినప్పటికిని, రాజధానిలో ఎక్కడచూచినను తమిళనాడులో, ఆంధ్రదేశములోకూడ బాలికల విద్యావిషయమననే శ్రద్ధలేకున్నది. బాలుర విద్యకై కర్చుపెట్టు మొత్తమునకు, బాలికలవిద్యకు కర్చుపెట్టు మొత్తమునకును ఎంతమాత్రము పోలికయే అందదు. అదిగాక బాలికల విద్యకొసము కర్చుపెట్టు ఆ స్వల్పమొత్తముకూడ తగు ఫలిత మొసగకపోవుచుండుట మరింత విషాదకరము. కనుక ప్రాథమిక పాఠశాలలలో సంస్కార మత్యవసరము. ఈ సమస్య నెదుర్కొనుటకు నేనొక సూచన చేయుచున్నాను. ఆంధ్రదేశములో సాధ్యమయినన్ని పాఠశాలలకు, ముఖ్య

ముగ ప్రాథమిక పాఠశాలలకు 'పాఠశాల సంరక్షణ సంఘములు' (School-care Committees) ఏర్పాటు చేయవలెను. పిల్లల మంచిచెడ్డలను కనుగొనుచు, వారి చదువువిషయములో తల్లిదండ్రుల సహకారము సంపాదించుటయే ఈ సంఘములవారి పని. ఈ సంఘసభ్యురాండ్రు అప్పుడప్పుడు తల్లులవద్దకు వెళ్లుచు, వారు తమ బిడ్డలను క్రమముగా బడికి పంపుచుండునట్లు ప్రోత్సహింపవలెను. తగుకారణములు లేకుండ బడి మాన్పించిన తల్లులనుచూచి, వారితో మాట్లాడవలెను. బాలికల విద్యాభివృద్ధి విషయమున ఇట్టి సంఘములు చాల ఉపయోగపడునని నా నమ్మకము. కనుక ఆంధ్రదేశములోని సోదరీమణులు ఇందుకు త్వరలోనే శ్రద్ధవహించెదరని ఆశించుచున్నాను.

బాలికల ఉన్నతవిద్యకు ఈ ప్రాంతములో సదుపాయములుండవలెననికూడ నా సలహా. పెండ్లి వయసు పెంచబడినందున, బాలికలలో నేడు ఉన్నత విద్యాసక్తి ప్రబలముగ కనుపించుచున్నది. కనుక ఆంధ్రదేశములో స్త్రీలకు ఒక ఫస్టుగ్రేడు కాలేజి పెట్టుట మిక్కిలి అవసరము.

విద్యవిషయమై చెప్పినపుడు, వయోజనవిద్యావసరమునుగూడ కొంత విన్నవించక తప్పదు. వయోజన విద్య దేశముయొక్క రాజకీయ, సాంఘిక, ఆర్థికాభివృద్ధులతో వీడని సంబంధముగలది. అయితే పురుషులకు మాత్రమే వయోజనవిద్యాలయములు వెలయుచున్నవి కాని, స్త్రీల విషయములో ఎక్కడను తలపెట్టుటయే లేదు. పురుష వయోజనుల విద్యకంటె, స్త్రీ వయోజనుల విద్యవిషయమై ఎక్కువ శ్రద్ధచూపుట అవసరము. ఏమన జాతినిర్మాణము స్త్రీమీదనే ఎక్కువ బాధ్యతయున్నది. 'స్త్రీకి చదువునేర్పుట పురుషునికి నేర్పుటయే; స్త్రీ గుణసంపద నభివృద్ధిపరచుట ఆతని గుణాభ్యున్నతియే; ఆమె చిత్తస్వాతంత్ర్య ప్రవృద్ధియే సంఘమంతటియొక్క స్వేచ్ఛాన్నత్వము; ఏమన కుటుంబములతో సృష్టియయినవే దేశములు; తల్లులు తయారుచేసినవే ప్రజాసంఘములు' అని చెప్పబడిన వచనము చాల యుక్తమయినది. మాతృసంఘము అజ్ఞానమున మునిగియుండ, ఒక గొప్ప క్రొత్తజాతి ప్రభవించుట సాధ్యమా? కనుక వయోజనవిద్య విషయమై శ్రద్ధచేయు స్థానికసంస్థలు, ఇతరసంస్థలు స్త్రీ వయోజనవిద్యా కేంద్రములుకూడ స్థాపించవలెనని ఆశించుచున్నాను.

**వయోజన విద్య**

## సాంఘిక సమస్యలు

ఇక సాంఘికసమస్యలనుగురించి కొంత చెప్పెదను. వివాహము, వైవాహికజీవనములకు సంబంధించిన సంస్కారములు కొన్ని అత్యవసరమయినవి కనుపించుచున్నవి. అందులో ఒకటి, బహుభార్యాత్వమును మాన్పుట. దీనివిషయమున కొంతకాలముగ స్త్రీజనము శ్రద్ధచూపుచున్నారు. పెక్కుభార్యలను కలిగియుండు ఆచారము ప్రకృతిధర్మమునకు విరుద్ధమయినది. గృహములోనా వివాదములు; పరిత్యజింపబడిన భార్యకో, విశంతువులుకూడ అనుభవించని దుర్భరబాధలు. ఈ పరిత్యక్తల సంఖ్య నేడు సయితము హెచ్చుగుచుండుట మిక్కిలి విచారకరము. వీరు బాధలుపడుటమాత్రమే గాక, వీరి సంతానముకూడ అష్టకష్టముల పాలగుచుందురు. గనుక భావిప్రజాసంతతికిగూడ హానికరమగుచున్న సంగతి మనము గుర్తించవలెను. కావున ఈ దుష్టాచారమును శాసనముద్వారా రూపుమాపుటకు స్త్రీలందరు ముక్తకంఠమున కోరవలసియున్నది. ఇందులకై ప్రయత్నించు శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్‌గారిని సంపూర్ణముగ బలపరచుట అవసరము.

వృద్ధులు చిన్నబాలికలను పెండ్లియాడుట, బాలికల అతిబాల్యవివాహములు హిందూసంఘములో ప్రబల దురాచారములు. వీటినికూడ నిర్మూలించవలెను. ఏమన బాల్యవివాహము అమానుష ఆచారము. మాతృత్వమునకు వలసిన అంగసౌష్టవమేర్పడని బాలికల ప్రాణశక్తి నిది హరించివేయును. కాబట్టి మీలో నెవ్వరును సాధ్యమయినంతమట్టుకు కనీసము 16 యేండ్లు వచ్చువరకు మీ బాలికలకు పెండ్లిచేయవలదని నా సలహా: నేడు భారతదేశములో పురుషులసంఖ్యకన్న స్త్రీలు 60 లక్షలు తక్కువగ నున్నారు. మరణమునుండి తప్పించుకొనుటకు పురుషశిశువుకన్న స్త్రీ శిశువుకు ఎక్కువ శక్తియున్నట్లు శాస్త్రము చూపుచున్నను,

**బాల్యవివాహములు - అనర్థకములు**

ఈ శతాబ్దారంభమునుండియు స్త్రీలసంఖ్యయే విశేషముగ తగ్గిపోవుచున్నది. 15 మొదలు 30 యేండ్ల వయసు యువజనుల లెక్కచూచిన యెడల, పురుషులకన్న స్త్రీలు చాల తక్కువ తేలుచున్నారు. స్త్రీల సంఖ్య ఇట్లు తగ్గిపోవుటకు, బాల్యవివాహముల మూలముగ పడుచు బాలలు విశేషముగ మరణించుటయే కారణము. శారదాచట్టము వచ్చినను గూడ, ఇప్పటికిని మనదేశములో, ముఖ్యముగ గ్రామసీమలలో బాల్య వివాహములు జరుగుచునే యున్నవి. కనుక ఈ చట్టనిబంధనలను గ్రామ ప్రాంతములలో బాగుగ ప్రచారముచేసి, ఈ బాల్య వివాహ దురాచారమును వెంటనే అరికట్టివేయవలెను.

ఆడుబిడ్డలుగల కుటుంబములను అవమానముతో క్రుంగదీసి అధోగతిపాలుచేయు మహామారి కట్నముల దురాచారమును పూర్తిగ రూపుమాపవలెనన్న రెండుచర్యలు అత్యవసరమని నా యభిప్రాయము. ప్రజలందరు ఈ దురాచారమును ఏకగ్రీవముగ ఖండించునంతవరకు నిశ్చలదీక్షతో

**కట్నములు**

తీవ్రప్రచారమును జరుపుట ప్రథమచర్య; స్త్రీలు ఆర్థికముగ ఒకరిపైని ఆధారపడవలసిన అవసరములేకుండ అవసరమయినయెడల స్వతంత్రముగ ఏదో ఉద్యోగము చేసికొనుటకు తగిన విద్యను స్త్రీలకే ఇప్పించవలెను. మహిళామణులకు నిజమయిన విజ్ఞానము లభించునాడే, ఆ విజ్ఞానతేజమే కట్నముల దురాచారమును అంతమొందించగలదు. ఏలయనిన ఈ విజ్ఞాన ఫలితముగ స్త్రీలకు స్వతంత్రముగ బ్రతుకగల శక్తి లభించును. ఆశక్తి లభించిననాడే తలిదండ్రులకు తమ ఆడుబిడ్డల ఆర్థికస్థితినిగురించి ఆత్రము తొలగును.

స్త్రీలు ముఖ్యముగ గమనించవలసిన విషయము మరొకటి కలదు. సంఘసంస్కరణలకు ప్రజాభిప్రాయము పునాదివంటిది. ప్రజల అభిప్రాయములు సక్రమమార్గముల ననుసరించునాడే సంస్కరణలు జయ

> దేవదాసి అసలు సృష్టిలో దేవుని దాసి. కాని రాను రాను దేవదాసి నీచవృత్తులకు వాసిజెంది గాసినొందుచున్నది. ప్రస్తుతపు దేవదాసి సంఘమునకు మాయని మచ్చ. ఈ అత్యాచారము రూపుమాసిన గాని సంఘమునకు శ్రేయస్కరము కాదు. నృత్యగీతాది లలితకళలకు వారు ప్రత్యేకతనొంది పెంపొందింపవచ్చును, కాని వివాహితలు కావలెను. ఏ నాగరికప్రపంచము అంగీకరింపని ప్రస్తుతపు దేవదాసీ పద్ధతిని, పాతివ్రత్యమునకు పేరొందిన భారత స్త్రీ ఆమోదింపజాలదు—
>
> -శ్రీ గంధం అమ్మన్న రాజా

ప్రదములగును. కాబట్టి ప్రజల అభిప్రాయములను సంస్కరణలకు అనుకూలముగ ఉండునట్లు చేయవలెను.

**స్త్రీల పత్రికలు**

స్త్రీలు తమకు సంబంధించిన విషయములను పత్రికలద్వారా ఎక్కువగ వెల్లడిచేసి వాటిలో తగిన సంస్కరణలను చేయవలసిన ఆవశ్యకతను ప్రజలు గుర్తించునట్లు చేయవలెను. ఈ విషయమున నాదొక సూచన కలదు. ఆంధ్రదేశమున పూర్తిగ స్త్రీలచే నిర్వహింపబడు వారపత్రికలు, మాసపత్రికలు ఎక్కువగ ఉండవలెనని నా కోరిక. ఈ పత్రికలద్వారా స్త్రీలకు తమ స్వవిషయములను చక్కగ గుర్తించగల అవకాశము కలుగగలదు.

**వారసత్వపు హక్కులు**

వారసత్వపుహక్కు మానవజాతి హక్కులలో చాల సాధారణమయినది. హిందూ స్త్రీజాతి నేడు ఈ ప్రాథమిక హక్కునే కోరుచున్నది. ఎంతకష్టములకయినను ఓర్చి ఈ హక్కును పొంది తీరెదమని హిందూ స్త్రీలు కంకణము కట్టవలెను. ఆస్థివిభజనలోకూడ హిందూ స్త్రీలకు చాల అన్యాయము జరుగుచున్నది. ఈ విషయములోకూడ వీరు అనేక అగచాట్లపాలగుచున్నారు. పూర్వము 'స్త్రీధనమ'ను పేరిట స్త్రీలకు కొంత ఆస్థినిచ్చెడివారు. దీనిని పూర్తిగ స్త్రీలవశము చేసెడివారు. కాని ఇప్పుడు స్త్రీ దీనికయినను నోచుకొనుటలేదు. ఈ 'స్త్రీధనము'నకు ఇప్పుడు 'స్త్రీ ఎస్టేటు' అని పేరుపెట్టిరి. దీనిని ఇతర ఆస్థిలోనుండి వేరుచేయుటకు గాని, విక్రయించుటకుగాని హిందూస్త్రీకి ఇప్పుడు అధికారములేదు. దానిపైని ఏమయిన వడ్డీవచ్చినయెడల ఆ వడ్డీని అనుభవించుటకుమాత్రమే హిందూస్త్రీకి అధికారముకలదు. ఇది చాల అన్యాయమని వేరుగ చెప్పవలెనా? చట్టరీత్యా హిందూస్త్రీల స్థితినిగురించి విచారణచేయుటకు ప్రభుత్వమువారు ఒక విచారణసంఘమును ఏర్పాటుచేసిరి. కాని ఈ సంఘమువారు హిందూస్త్రీల వసతినిగురించి, పోషణనుగురించి మాత్రమే విచారణచేసెదరు. వారసత్వపుహక్కు మొదలయిన ముఖ్యవిషయములను వదలివేసి ఈ స్వల్పవిషయములపైని ప్రభుత్వమువారు దృష్టిని నిలుపుట చాల విచారకరము. చట్టసంబంధములగు ఇబ్బందులనుగురించికూడ అధికారులచేత విచారణ జరిపించవలెనని మనము కోరవలెను. హిందూస్త్రీల వసతులనుగురించి వారి పోషణనుగురించి విచారణకాదు ఇప్పుడు ముఖ్యముగ జరుగవలసినది; హిందూస్త్రీ సమస్య నంతటిని పూర్తిగ పునర్విమర్శించి చట్టరీత్యా మహిళాలోకమునకు న్యాయము జరుపుటయే ఇప్పటి ముఖ్యకర్తవ్యము.

భారతసంఘమునకు ఇంకను పెద్ద మచ్చగ నున్నది వితంతుసమస్య. సభావేదికలనుండి వితంతువివాహమునుగురించి తీవ్రప్రచారముచేయు వారేకలరుకాని వితంతువివాహములను ప్రోత్సహించి క్రియారూపముగ తోడ్పడువారు ఎక్కువగ కనుపించకున్నారు. 'హిందూస్త్రీల ఆస్థిహక్కుల చట్టము' వల్ల భాగ్యవతులగు

**వితంతు సమస్య**

వితంతువుల ఆర్థికస్థితి బాగుపడినది. కాని బీదలగతి ఏమి? వారిస్థితి హృదయవిదారకము. ఆ వితంతువులలో అనేకులు అర్ధఆకలితో జీవితమును గడుపుచున్నారు. ఇటువంటి బీదవితంతువులు తగిన విద్యనుపొంది ఏదో పనిచేసుకొనుటకు ప్రత్యేక వితంతు విద్యార్థి వేతనములను ఏర్పాటుచేయవలెను. వితంతువులు పాఠశాలలో పనిచేయుటకు ప్రత్యేక సౌకర్యములను చేయవలెను. సోదరీమణులారా! ఈ అభాగినులకు శక్తికొలది సహాయముచేసి, వారికి కొంత సౌఖ్యము చేకూర్చి ధన్యులుకండు. వారి సహాయార్థము ప్రతి పట్టణములోను వితంతుశరణాలయములను నెలకొల్పుటకు ప్రయత్నించుడు. ఇదియే మీకు నా మనవి.

**మాతృ మరణములు**

మనము ముఖ్యముగా గమనించవలసిన విషయము ఇంకొకటికలదు. ప్రసవసమయములో మరణించుచున్నవారి అత్యధికసంఖ్యను తగ్గించుటకు శక్తికొలది పాటుపడవలెను. కాని దురదృష్టవశమున అధికారులు ఈ విషయమును గుర్తించినట్లు లేదు. గర్భిణుల సహాయార్థము వారువినియోగించుచున్న ధనము చాల స్వల్పము. స్థానికసంస్థలు ఈ విషయముయొక్క ప్రాముఖ్యమును గుర్తించి గర్భిణుల సహాయముకొరకు శిశురక్షణార్థము తగినంత ధనమును ప్రత్యేకించునట్లు మనము చేయవలెను. తగిన తరిఫీదును పొందిన మంత్రసానులను ప్రతి గ్రామములోను నియమించి, ఆరోగ్యశాఖ అధికారులను తరుచుగ అచటికి పంపుచుండవలెనని స్థానికసంస్థలను కోరవలెను. పైగా మంత్రసానులకు అప్పుడప్పుడు సరిక్రొత్తపద్ధతులలో తరిఫీదు నిచ్చుచుండుట అవసరము.

**స్త్రీ సంఘములు**

ఆంధ్రజిల్లాలలో అనేక ముఖ్యనగరములలో స్త్రీలు క్లబ్బులను స్థాపించుట చాల ముదావహము. సంఘ సేవకు తగిన సంస్థ మరేదియు లేని ప్రదేశములలో ఈ సంస్థలే తగిన సేవను చేయుచుండవలెనని నామనవి. ఈ క్లబ్బులు సభ్యురాండ్ర వినోదములకోసమే కాక, తోడి స్త్రీల జీవితములను సుఖవంతములుగ చేయుటకు ఉపయోగపడుచుండవలెను. భారతమహిళ తన గృహకృత్యములకు మాత్రమే బంధింపబడియుండక వెలుపలికివచ్చి స్త్రీజాతి అంతటి క్షేమముకోసము పాటుపడవలసిన సమయము వచ్చినది. దేశములో అజ్ఞానము, దారిద్ర్యము తాండవించుచుండ కొందరు స్త్రీలు హాయిగా కాలుపైని కాలువేసుకొని దినములను గడపుట తగనిపని. వారు తమతోడివారి అభివృద్ధికొరకు పాటుపడుటకు దీక్షను పూనవలెను.

ఆంధ్రదేశ స్త్రీలు హిందూస్తానీపట్ల తగిన శ్రద్ధ చూపవలెనని నాకోరిక. యావత్ భారతదేశములోను ఐకమత్యమును స్థాపించగల భాష ఒకటున్నప్పుడు దక్షిణఇండియాప్రజలు ఆభాషను ఎందుకు చేర్చుకొనగూడదు? హిందీ ప్రాముఖ్యమును గురించి ఎంతచెప్పినను చాలదని నా అభిప్రాయము. ఇకమీదట యావత్ భారతదేశ సమావేశములలో హిందీయే వాడుకభాష కాగలదు.

**సంఘములలో సంఘీభావము**

హిందీ నేర్చుకొనుటతోపాటు స్త్రీలు సంఘ ఐకమత్యముకొరకు పాటుపడవలెను. కలకత్తలను అంతమొందించి వివిధజాతులకు పరస్పర ప్రేమానురాగములను నెలకొల్పగలవారు స్త్రీలే అని చెప్పగలను. ఐకమత్యముయొక్క ఆవశ్యకత మనదేశములో ఇంత ఎక్కువగ ఇదివర కెన్నడునులేదు. కాని ఈ అవసరసమయములోనే జాతికక్షలు కారుమేఘములై ఆకసమును కప్పి భయంకరరూపమును దాల్చినవి. భారతదేశములోని వివిధజాతులవారు పరస్పర విభేధములను మరచిపోయి అన్యోన్యసద్భావసహకారములతో పాటుపడినగాని దేశము ఏవిధముగను అభివృద్ధిగాంచజాలదను విషయమును భారతదేశములోని ప్రతివ్యక్తియుగమనించవలెను. మానవజాతినంతటిని ఒకటిగచేర్చి, జాతిని ఛిన్నాభిన్నముచేయుట ఏమతముయొక్క ఆశయమును కాజాలదు. మానవజాతినంతటిని ఒకటిగ చేర్చి, విశ్వమానవ సౌభ్రాతృత్వమును నెలకొల్పుటయే ప్రతిమతముయొక్క ఏకైక ఆశయము. కాబట్టి హిందువులు మహమ్మదీయులు ఈ విషయమును తమ మనసులో ఉంచుకొని, పరస్పర మతవిభేదములను మరచిపోయి, సద్భావముకలిగి భారతజాతి అంతటి క్షేమముకోసము పాటుపడవలెను. అదృష్టవశమున ఇతర రంగములలో చెలరేగుచున్న ఈ మతవైషమ్యములు, సంఘకక్షలు మన మహిళాలోకమునకు వ్యాపించలేదు. మహిళాలోకము

ఒక ప్రజాస్వామ్యరాజ్యమువంటిది. కులకక్షలకు, మతవైషమ్యములకు అది బలికాలేదు. మనకు ఐకమత్యము క్రొత్తకాదు. ఐకమత్యమే విజయప్రదమను ముఖ్యసూత్రమును మనము హృదయగతము చేసుకొన్నాము. పెనుకెరటములు ఉబ్బి తబ్బిబ్బులౌచోట నావలకు మార్గదర్శిగనుండు దీపస్తంభమువలె భారతరంగములో మన మహిళాలోకము సుస్థిర ఐకమత్యముకలిగి ఆదర్శప్రాయముగ నిలచియున్నది. మనలో ఉన్న ఈ ఐకమత్యమును పురుషులకుకూడ వ్యాపించునట్లు చేయుటకు మనము శాంతిదూతలము కావలెను.

మగవారితో పోటీపెట్టి మనము మహిళోద్యమమును స్థాపించలేదు. మన విలువను నిరాడంబరముగా విశదపరచుటకే ఈ ఉద్యమమును స్థాపించితిమి. అందువల్లనే మన ఉద్యమము భారతదేశ అభ్యుదయమునకు సహకారిగా నున్నది.

**పురుషులతో పోటీగాదు**

మరొకసంగతిని నేను స్పష్టపరచదలచితిని. దేశసేవ చేయవలెనని స్త్రీలకు అపార కుతూహలము కలదు. కాని ఈ విషయములో స్త్రీలు ప్రత్యేకసౌకర్యములు, హోదాలు మొదలగు వాటిని ఏమియు కోరుటలేదు. స్త్రీలయినంతమాత్రమున ప్రత్యేక హోదాలను కోరకూడదనువారిలో నేనొకదానిని. పురుషులతో సరిసమానత్వమును స్త్రీలు కోరుచున్నారు, నిజమే. కాని యోగ్యతాయోగ్యతలను పాటించక ఈ సమానత్వమును ఇవ్వవలెనని చెప్పలేదు. ప్రపంచములో స్త్రీ పురుషులు సరిసమానమయిన అవకాశములుకలిగి, దేశమునకు శక్తికొలది పాటుపడగల భాగహారులుగ ఉండవలెనని స్త్రీలు కోరుచున్నారు.

మానవజాతిలో స్త్రీ పురుషులు చెరిసగము ఉన్నారు. ఒకరి నొకరు మించి లేరు. కాని ఒకరిపై నొకరు ఆధారపడియున్నారు. దుఃఖభాజనములగు ప్రస్తుత ప్రపంచపరిస్థితులను తొలగించి వాటిస్థానమున సౌఖ్యప్రదములును శాంతిచరితములు నగు నూతన ప్రపంచపరిస్థితులను స్థాపించుటకు ఇరువురును శక్తికొలది పాటుపడవలసియున్నది. నూతనప్రపంచపరిస్థితులు స్త్రీ పురుషులసమష్టి ప్రయత్నఫలితములయిన నాడే అవి సౌఖ్యప్రదములు కాగలవు. మానవజీవితరంగములో స్త్రీ పురుషులకు చక్కని సహకారము కలిగిననాడే ప్రపంచమున సౌఖ్యము లభింపగలదు.

భావములను రగుల్కొలుపుటకు, మనకోరికలను విశదపరచుటకు, కార్యక్రమములను నిర్ణయించుకొనుటకు ఇటువంటి సమావేశములు చాల ప్రయోజనకరములే. కాని ఆ కార్యక్రమమును ఆచరణలో పెట్టుటయే అన్నిటికన్నను ముఖ్యవిషయము. నేను ముఖ్యముగా చెప్పదలచిన దేమనగా, మనము మన సూత్రములను ఆచరణలను ఒకదానితో నొకటి మేళవించవలెను. ఊరక ఏమేమో ఊహించుకొనుటవల్ల లాభములేదు. మనము యదార్థపరిస్థితులను ఆధారముగ తీసుకొని మన ఆశయసిద్ధికి నిశ్చలదీక్షతో ఉద్యమించవలెను. మనము మన ధర్మములను నిర్వర్తించి వాని ఆశయమును సాధించి ధన్యలము కాగలము. భగవంతుడు మనకు జయమును ప్రసాదించుగాక !



శ్రీ బేగం అమీరుద్దీన్ సాహెబాగారు
మహా సభాధ్యక్షురాలు
(హైదరాబాదు)

తంజావూరులో ప్రస్తుతము సెషన్సు జెడ్జిగానున్న శ్రీ మీర్ అమీరుద్దీనుగారి సతీమణి.

కలకత్తాయందు ఉన్నతవిద్య నభ్యసించి తదుపరి పాశ్చాత్యఖండములయందు సంచారమొనర్చి స్త్రీజన సమస్యలపట్ల విపులవిజ్ఞానమును సంపాదించిరి. జాతీయ అంతర్జాతీయ ప్రఖ్యాతినొంది అప్పటినుండియు భారత మహిళాసమస్యలందు అత్యంతశ్రద్ధతో పనిచేయుచున్నారు.

మొదటినుండియు ఆంధ్రవనితాలోకముతో ఎక్కువ పరిచయము కలిగి 1927-వ సంవత్సరములో రాజమండ్రియందు ప్రథమగోదావరీ మండల మహిళాసభను, కాకినాడలో ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభను జరుపుటకు ఈమె తీవ్రకృషి ప్రోత్సాహములే కారణము.

కడపయందు జరిగిన 14-వ ఆంధ్ర మహిళా మహాసభకు అధ్యక్షత వహించి, అధ్యక్షోపన్యాసమునందు ప్రస్తుతపు స్త్రీజనసమస్యలను విపులముగ విమర్శించి, నారీలోకమునకు నిర్మాణ కార్యక్రమమున కనువగు సందేశమునిచ్చి, సభాకార్యక్రమమును కడునేర్పుతో నిర్వహించి సన్నుతినొందిరి.





శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు
ఆహ్వాన సంఘాధ్యక్షురాలు

14-వ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగా నుండి సభా కార్యనిర్వహణమునకు అమితముగ తోడ్పడి కడపలో ప్రప్రథమముగ మహిళామహాసభను జరిపి రాయలసీమ వనితాలోకములో నూతన చైతన్యమును కలుగజేసిన వీరి ఉత్సాహ ప్రోత్సాహములు స్తుతిపాత్రములు



శ్రీమతి
నామగిరి కృష్ణారావు సతిగారు
ఆహ్వానసంఘకార్యదర్శిని

14-వ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభకు ఆహ్వానసంఘ కార్యదర్శినులలో నొకరై అత్యంత చాకచక్యముతో నేర్పాటుల భారము నిర్వహించి, సభ విజయవంతముగ జరుగుటకు తోడ్పడిన వీరి శ్రద్ధాసక్తులు ప్రశంసనీయములు.



ఇంగ్లీషు ఉపన్యాసమైనవెంటనే సభకు వచ్చియున్న మహమ్మదీయస్త్రీలకు అధ్యక్షురాలు ఉర్దూభాషలో ప్రత్యేకముగ వారివారి విద్యుక్త ధర్మములనుగూర్చి విపులముగ ఉపన్యాసము గావించిరి.

తదుపరి శ్రీమతి సి. హెచ్. చంద్రమతిగారు గత సంవత్సరపు కార్యనివేదికను చదువగా అది సభవారిచే నామోదింపబడెను.

సమావేశమునకు రాజాలక, సభను జయప్రదముగ జరుగునట్లు కోరుచు వ్రాసిన శ్రీ బొబ్బిలిరాణి, చల్లపల్లిరాణి, విజయనగరంమహారాణి, వెంకటగిరిరాణి, పెద్దాడ కామేశ్వరమ్మ, ముత్తులక్ష్మిరెడ్డి, భారతీ రంగా, కజిన్సుసతిగార్ల ఉత్తరములను ఆహ్వానసంఘకార్యదర్శినియగు శ్రీమతి కుముదం భోగిగారు సభవారికి చదివి వినిపించిరి.

తర్వాత శ్రీ కవికాంచన కమలమ్మగారు శ్రీ బేగం అమీరుద్దీన్ సతీమణిగారికిని, శ్రీ రామసుబ్బమ్మగారికిని అభినందనపత్రములను ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘమువారి తరపున చదివి సమర్పించిరి.

తదనంతరము మ్యునిసిపల్ ప్రాధమిక పాఠశాల బాలబాలికలచే 'రామదాసు' నాటకప్రదర్శనముతో ఆనాటి కార్యక్రమము అత్యంతోత్సాహముతో ముగిసెను.

# మహాసభ - తీర్మానములు

విషయ నిర్ణయ సభానంతరము 17-12-39 తేదీ ఆదివారం మధ్యాహ్నము సరిగా 2 గంటలకు శ్రీ బేగం అమరుద్దీన్‌సతిగారి అధ్యక్షతను తిరిగి మహాసభ సమావేశమైనది. శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారు యీనాటి సభకు విచ్చేసి కార్యక్రమమందు పాల్గొనిరి.

మొదటిదినముకంటె ఈదినమున అత్యధికసంఖ్యాకులైన పురంధ్రీమణులతో జిల్లా బోర్డు భవనము క్రిక్కిరిసిపోయినది. సుమారు రెండు వేలమంది ప్రేక్షకలోకముతో సభా కార్యక్రమము కడువేగముగ సాగినది. ఉపపాదింపబడిన వివిధ తీర్మానముల చర్చలలో సభికులు, ప్రేక్షకులుకూడ అత్యంత శ్రద్ధావిశేషములతో పాల్గొనిరి.

శ్రీ బేగం అమరుద్దీన్‌సతిగారి 'హిందూమహమ్మదీయైకమత్యమును' గురించిన ఉపన్యాసము; శ్రీమతి రామసుబ్బమ్మగారి 'ఆంధ్రరాష్ట్రోపన్యాసము', శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారి 'దేవదాసీ బిల్లు' ఉపన్యాసము, శ్రీమతి కుముదం భోగిగారి 'అస్పృ

శ్యతానివారణ' పై ఉపన్యాసము, శ్రీమతి యస్. సుభద్రమ్మగారి 'హిందీ-రాష్ట్రభాష' ఉపన్యాసము సభికుల నుత్సాహపరవశులజేసి కరతాళధ్వనులచే కీర్తిపాత్రములైనవి.

'భారతజాతీయ నిర్మాణమునకు, పొరపొచ్చములులేని హిందూమహమ్మదీయైకమత్యముకొరకు మహిళామణులెల్లరు పాటుపడవలెను' అను తీర్మానమును శ్రీ యస్. సుభద్రమ్మగారు ఉపపాదించగా శ్రీమతి బేగం టాజ్ అన్సారిసతిగారు బలపరచిరి. ఈతీర్మానముపై పలువురు మాట్లాడినంతట ఏకగ్రీవముగ సభవారిచే నామోదింపబడినది.

శ్రీమతి వి. సరస్వతీదేవిగారి 'సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ఆంధ్రమహిళామణులు పురుషులతోపాటు అకుంఠితదీక్షతో పాటుపడవలెను' అను తీర్మానమును శ్రీమతి వెంకటరత్నమ్మగారు బలపరచిరి. శ్రీమతి రెడ్డి లక్ష్మమ్మగారు 'ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ముందుగా తుంగభద్రాప్రాజెక్టు నిర్మాణము కావలెను' అను సవరణను ప్రతిపాదింప, దాని నెవ్వరు బలపరచనందున సవరణ వీగిపోయినది. పలువుర ఉపన్యాసములపైన అసలు తీర్మానము సభవారిచే నామోదింపబడినది.

'అస్పృశ్యతానివారణమునకై స్త్రీలెల్లరు పాటుపడవలెను' అను శ్రీ వి. సౌందరమ్మగారి తీర్మానమును శ్రీమతి కుముదం భోగిగారు బలపరచిరి; సభవారిచే నదికూడ ఏకగ్రీవముగ నామోదింపబడినది.

'భారతదేశమునకు హిందీయే రాష్ట్రభాష కావలయును. దాని నెల్లరు నేర్చుకొని భారతజాతీయైక్యతకు తోడ్పడ గోరుచున్నాము' అను శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారి తీర్మానమును శ్రీమతి రామసుబ్బమ్మగారు బలపరచిరి. శ్రీ రెడ్డి లక్ష్మమ్మగారి 'నిర్బంధ ముండగూడద'ను సవరణతో ఆ తీర్మానము ఆమోదింపబడినది.

శ్రీమతి చంద్రమతమ్మగారి 'మద్రాసు శాసనసభలో ప్రవేశపెట్టబడనున్న శ్రీమతి గంధం అమ్మన్నరాజాగారి దేవదాసీబిల్లును యీ సభవారు ఏకగ్రీవముగ బలపరచుచున్నారు' అను తీర్మానమును శ్రీమతి రామసుబ్బమ్మగారు బలపరచిరి. శ్రీమతి అమ్మన్నరాజాగారు దేవదాసీబిల్లుయొక్క ఆశయములను వివరించుచు దీర్ఘోపన్యాసమును గావించిరి. అంత సభవారిచే ఆ తీర్మాన మామోదింపబడినది.

అఖిలభారత మహిళామండలియొక్క శాఖలను ఆంధ్రదేశమందంతటను స్థాపించవలెననియు; ప్రతిజిల్లాలోను స్త్రీలకొరకై ఒక్కొక్క సెకండరీ పాఠశాలయును, ఒక ఫస్టుగ్రేడు కాలేజీయును స్థాపించవలయుననియు; మహమ్మదీయులలో పురుషులకు గల విడాకుల హక్కులను తీసివేయవలసినదిగను; భాషాప్రధానమున పాఠశాలలలోని పాఠ

ములు నేర్పబడుచున్నందువలన మహమ్మదీయ బాలికలకు ప్రత్యేక పాఠశాలల నిర్మింప వలయుననియు; రాధాబాయి సుబ్బరాయన్‌గారి 'బహుభార్యాత్వ నిషేధపుబిల్లు'కు తాము సంపూర్ణాంగీకారమును తెల్పుచున్నట్లును, రైలులో స్త్రీలపెట్టెను మధ్యగా నుంచి, స్త్రీ టిక్కెట్టు ఇన్‌స్పెక్ట్రెసులను నియమించి, టిక్కెట్టును కొనుటకు ప్రత్యేకపు ఏర్పాటులను చేయవలసినదిగా రైల్వే అధికారులు కోరబడుచున్నారనియు; జాతర్లయందును, తీర్థములయందును జంతుబలులను నిషేధించవలయుననియు; రాబోవు కౌన్సిల్ ఆఫ్ స్టేట్ ఎన్నికలకు స్త్రీ సభ్యురాలును ఎన్నుకొనుటకు మహిళాసంఘములు ప్రయత్నించవలసినదనియు; స్వదేశీవస్తువులనే కొనుచు, దేశీయపరిశ్రమలను పోషించవలసినదనియు; ప్రాథమిక పాఠశాలలలో స్త్రీలనే ఉపాధ్యాయినులుగా పెట్టవలయుననియు; నిరక్షరాస్యతా నిర్మూలనమునకై సంఘముల నేర్పరచి కృషిచేయవలయుననియు; మహిళా సంఘమునకు 'ప్రతి స్త్రీయు ఆమె ధర్మములను ఆమె విధిగా నెరవేర్చవలయును' అను వాక్యము వ్రాయబడియున్న ఒక ప్రత్యేక 'పతాకము' యుండవలెనని అఖిలభారత మహిళాసంఘమువారిని కోరుచున్నారనుచు సుమారు 40 తీర్మానములు సభవారిచే చర్చించబడి ఆమోదింపబడినవి.

తీర్మానముల చర్చానంతరము అధ్యక్షురాలు తన కడపటి సందేశముగా, హిందూ మహమ్మదీయైకమత్యమునుగురించియు, గ్రామసీమల వనితాలోకమునందు ప్రబోధమును గూర్చియు, రాబోవు స్వాతంత్ర్య పోరాటములో స్త్రీల కర్తవ్యమునుగురించియు గంభీరోపన్యాసము గావించిరి.

పిమ్మట యీ సంవత్సరమునకు శ్రీ బేగం అమీరుద్దీన్ సతీమణిగారు అధ్యక్షులుగను, కె. రామసుబ్బమ్మ, చౌదరీసతిగార్లు కార్యదర్శిని, కోశాధిపతులగను, శ్రీమతులు బత్తుల కామాక్షమ్మ, గంధం అమ్మన్నరాజా, టి. రాజేశ్వరమ్మ, పెద్దాడ సుందరమ్మ, కె. పార్వతీదేవి, సి. హెచ్. చంద్రమతమ్మగార్లు సభ్యులుగను ఎన్నుకొనబడిరి.

అనంతరము ప్రొద్దుటూరు సేవాసదనపు బాలికలు శ్రీ కృష్ణ తులాభారము నాటకమును కడురమ్యముగ ప్రదర్శించిరి.

అధ్యక్షురాలి అంత్యోపన్యాసముతోడను, ఆహ్వానసంఘమువారి కృతజ్ఞతాపూర్వక వందనములతోడను, మహిళామహాసభ మంగళప్రదముగ, అత్యంత జయప్రదముగ సమాప్తిజెందినది.

# గ్రంథ సమీక్ష

**మృగీస్తోత్రము :—**

పుల్లెల సుబ్రహ్మణ్యకవి ప్రణీతము, ప్రకటనకర్త :–మర్తింటి గు॥ వె॥ జ॥ సత్యనారాయణమూర్తిగారు. కార్యదర్శి, శ్రీ రామకృష్ణ సంఘము, బారువ, విశాఖపట్ణం జిల్లా వెల. రు. 0-2-0 మాత్రమే.

నిండు గర్భిణియై, వ్యాధుని క్రూరహింసకు గురియైన హరిణము, శ్రీహరిశరణమును వేడుచు చేసిన భక్తిస్తోత్రమును బహు రమ్యమగు పద్యములలో రచించిన గ్రంథకర్త సారస్వత సేవాసత్ప్రయత్నము శ్లాఘాపాత్రము. ఇందలి యనుబంధమునందు కొన్ని చక్కని హితబోధలు చేర్పబడినవి.

**బాలతపస్వి**

గ్రంథకర్త :—బి. భీమరావుగారు, (పాలచర్ల) వెల తెలుపబడలేదు. పుస్తకములకు, లక్ష్మీస్వదేశీ ప్రెస్, అనంతపురము, అని వ్రాయవలెను. భాగవతములోని సుప్రసిద్ధ కథయగు ధ్రువచరిత్ర నాటకరూపమున రసవంతమగు శైలిలో, మనోహరమగు భాషలో రచించిన ఈ గ్రంథకర్త ఆంధ్రభాషావధూటికొక చక్కని భూషణమును సమర్పించెననుటకు సందియములేదు.

**శతకప్రబంధ హరిహరస్తోత్ర రత్నాకరము**

గ్రంథకర్త :—చాగంటి రామచంద్రరావుగారు, గెద్దనాపల్లి, పెద్దాపురం తాలూకా, (తూర్పు గోదావరిజిల్లా) వెల 0-8-0 లు. శివకేశవులను స్తుతించుచు తెలుగుకవులు వ్రాసిన పద్యరత్నములను ప్రోగుచేసి చిన్న గ్రంథరూపముగ ప్రచురించిన యీ పుస్తక సంపాదకులు భక్తిరసపూరితమగు భాషాసేవను చేయబూనుట ప్రశంసాపాత్రము.

**శ్రీ మహాభక్తవిజయము :**—ప్రథమసంపుటము—రచయిత కీ॥ శే॥ శ్రీమాన్ పరవస్తు జియ్యరు సూరిగారు. ప్రకాశకులు—ఎంబార్ భాష్యాచార్యులుగారు, 175, నారాయణపిళ్లై స్ట్రీటు, బెంగుళూరు, దండు—వెల రూ. 3-0-0 తపాలాఛార్జి 0-12-0.

ఈ గ్రంథముయొక్క ప్రథమసంపుటమునందు భక్తపుంగవులగు పుండరీక, జయదేవ, కబీరుదాసుల జీవితములు సవిస్తరముగ చక్కగ వ్రాయబడినవి. రెండవసంపుటము వెలువడులోపల చందాదారులుగ చేరు వారి పేర్లు గ్రంథముఖమున ప్రకటింపబడునటుల తెలుపబడినది—చందా రూ. 5-0-0 లు.

**రామరావణ మైత్రి :**—గ్రంథకర్త :—ఎంబార్ భాష్యాచార్యులుగారు, వెల 0-0-6. వలయువారు ఒక అణాబిళ్లను పై చిరునామాకు పంపవలెను.

**స్వరాజ్య రణభేరి :**—రచయిత: శిల్లా రాజులురెడ్డిగారు, ఆంధ్ర హరిజనసేవా సంఘాధ్యక్షులు, పల్లిపేట, కళింగపట్టణం, ఉ. వి. జిల్లా. వెల 0-3-0. ప్రేమలత ప్రథమకుసుమముగ ఆంధ్రావనికి సమర్పింపబడిన యీ స్వరాజ్యప్రబోధ గ్రంథములోని పద్యములును గీతములును చక్కగ రచింపబడినవి.




సంక్రాంతిపండుగదినములలో స్త్రీ పురుషుల సంతోషకృత్యములు

ఈ సంవత్సర పుష్యశుద్ధపంచమీ భానువారము, పూర్వాభాద్ర నక్షత్రము వర్యాన్నామయోగము, బాలవాకరణము, వృషభలగ్నమునందు సూర్యుడు మకర రాశిలో ప్రవేశించునుగాన ఆనాడు మకర సంక్రాంతి పుణ్యదినమనబరగుచున్నది.

శతవర్షపరిమితంబైన మానవజీవితము, భౌతికప్రపంచధర్మముల ననుసరించి యేర్పడిన సంవత్సరములు, మాసములు, వారములు, దినములు, రాత్రింబవళ్లు అను, కాలక్రమానుగతిని నడచుచుండుట సర్వజనవిదితమగు సంగతియైయున్నది.

త్రిమూర్త్యాత్మకుడును, జీవనాధారభూతుడును, సత్యప్రకాశితుడును, సర్వకర్మ సాక్షియు, ప్రత్యక్షదైవతమునునగు శ్రీ సూర్యభగవానుడు సంవత్సరములో నారుమాసము లుత్తరదిశకును, ఆరుమాసములు దక్షిణోన్ముఖముగను, సంచారము సల్పుచు, భూభార ధర్మ నిర్వహణ మొనరించుచుండుటయు, ఆ భగవానుని నాశ్రయించియుండు తదితర గ్రహము లాదివ్యప్రభుని యాదేశానుసారము భూవలయమును త్రిప్పుచుండుటయు; సూర్యచంద్రులగతుల ననుసరించి రాత్రింబవళ్లేర్పడుచుండుటయు సృష్టిపరిపాలనావిధాన మును ప్రకృతి ధర్మవైచిత్ర్యములను వెల్లడించు విషయములైయున్నవి.

సూర్యదేవుడు మకరరాశిలో ప్రవేశించినదాదిగ తిరిగి కర్కటకరాశి జొచ్చువరకు నుగల యారుమాసములును ఉత్తరాయనమనియు, కర్కటకరాశిలో ప్రవేశించినది మొదలు మరల మకరరాశియందు ప్రవేశించువరకును గల ఆరుమాసములును దక్షిణా యన మనియు చాంద్రమాన సంవత్సరము రెండుభాగములుగ విభజింపబడి యున్నది.

కాలచక్రము ననుసరించి భూచక్రము తిరుగుచున్నది గావున కాలక్రమమునకు ప్రధానాధారధర్మస్వరూపుడగు ప్రభాకరుని ఉదయాస్తమయములును, ఉత్తరాయన దక్షిణాయనగతులును ప్రాణికోటియొక్క ప్రవృత్తినివృత్తిధర్మములను నిర్ణయించుచున్నవి.

ఉత్తరాయనమందు దివంగతులైనవారలు తేజోలోకములకు బోవుదురనియు, దక్షిణాయనమందు పరలోకగతులైనవారు తిమిరప్రదేశములకు బోవుదురనియు శాస్త్ర ములు దెల్పుచున్నవి.

ఏదియెట్లున్నను బ్రతికినన్నాళ్లును ప్రతిజీవియు సుఖమునే కోరుచుండుట సహజ ధర్మమై యున్నదిగాన, భూలోకమున భౌతికశరీరముతో నున్నపుడు పలువిధములగు సంతోషకార్యములలో నాత్మసుఖమును పొందగల్గుటయే మానవజన్మ ధన్యతనొందుటకు పరమోపాయమై యున్నది.

పూర్వులచే కొన్నిప్రత్యేక ప్రయోజనములతో నేర్పాటుచేయబడిన మతధర్మములలో పండుగదినములను పవిత్రవంతములుగ గడుపుట, ఆదినములందు ఆత్మసాన్నిధ్యము నొందుటకు ప్రథమావస్థయనదగు ఆనందము ననుభవించుట, భారతీయులందరకును చిరకాలమునుండి వచ్చుచున్న ఆచారమైయున్నది.

ఈ సంక్రాంతిపండుగ అట్టి పర్వదినములలో ప్రాధాన్యతనుపొందుచున్నది. మానవ జీవితధర్మములకును, భౌతికప్రపంచధర్మములకును గల అనువర్తనమును దెలుపుచు, ప్రకృతికిని మానవునకునుగల పరస్పర సంబంధమును వెల్లడించుచు, ఐహికాముష్మిక సుఖసాధనమగు సంక్రాంతిపండుగ దివ్యపర్వదినమై యొప్పుచున్నది. ఈ పండుగ స్త్రీ పురుషుల కెల్లరకును సంతోషకరమగు సుదినమగుటచే వివిధములగు వేడుకలలో, మతధర్మముల నాచరించుటలో, స్త్రీ పురుషులు ప్రమోదసంభరితచిత్తులైయుందురు.

సంక్రాంతిపండుగకు పూర్వదినము భోగిపండుగదిన మనబరగుచున్నది. ఆనాడు ఆబాలగోపాలమును, అభ్యంగనమాచరించి, భోగిపులగము నెల్లరారగించుదురు. పడుచులు పేడతోడను, బంతిపువ్వులతోడను పెట్టిన గొబ్బిపిడకలను భోగిపండుగదినమున చలి మంటలో బడవైతురు. మార్గశిరపుష్యమాసములు హిమవంతఋతువగుటచే చలి యెక్కువగనుండును గాన ఆనాటి తెల్లవారుఝామున అందరును చలికాగుటకై పెద్ద పెద్ద మంటలను వేయుదురు. స్త్రీలు వివిధములగు ముగ్గులతో గృహాంగణముల నలంకరింతురు. సంక్రాంతిరోజున పురుషులు పితృదేవతల ముక్తికొరకై తర్పణముల జేతురు. సర్వజనులును పిండివంటలతోగూడిన విందుభోజనము లారగింతురు. స్త్రీలు పేరంటాండ్రను బిలచి తాంబూల ఫలాహార సత్కారములతో పరస్పర గౌరవమర్యాదలను సలుప నుత్సహింతురు. పసిబిడ్డల శిరసులపై రేగుబండ్లను, వివిధ నాణెములనుబోసి యెంతయు వేడుకతో పడతులందరును సంతసింతురు.

పల్లెటూళ్లలో కోడిపుంజు పందెములను గొఱ్ఱెపొట్టేళ్ల పందెములను బహు ఆవేశముతోగూడిన ఉత్సాహముతో జరుపుచు జనసామాన్యము చెలరేగుచుందురు. అత్తమామలు అల్లుండ్రకును, తలిదండ్రులు ప్రియపుత్రికలకును నూతన వస్త్రాభరణములనొసంగి గౌరవింతురు. ఈపండుగను ఆంధ్రులును, అరవలును, అమితోత్సాహముతో నాచరించుచు ఆనాడు అధికముగ నూతనవస్త్రములను గొనుచుందురు. కావున పుణ్యప్రదమగు నీ పర్వ

# సంపాదకీయములు

దినములలో ప్రతివారును, భారతమాతకు సంతృప్తియును, భారతదేశస్వాతంత్ర్యమునకు ప్రబలప్రయత్నములుచేయుచున్న మహాత్ముని మనసునకు ముదమునుగలుగజేయు పవిత్ర కార్యమగు ఖద్దరువస్త్రధారణమును గావింప దీక్షనుబూనుట దేశహితమగు పరమధర్మమై యున్నది.

మహాత్ముడు గతమాసములో 'హరిజన' పత్రికలో వ్రాసిన 'స్త్రీలమూలమున స్వరాజ్యము' అను వ్యాసములో శాసనోల్లంఘనవిధానములో, నూలువడకుట, ప్రధాన ధర్మములలో నొకటిగ (వర్కింగుకమిటీ) కాంగ్రెసుకార్యనిర్వాహక సంఘమువారు నిర్ణయించిరనియు, స్వరాజ్యోద్యమములో దేశసేవసల్పుటకు స్త్రీల కెక్కుడవకాశములు గలవనియు, ఉప్పుసత్యాగ్రహ సందర్భములో స్త్రీలు బయటికివచ్చి తమ వ్యక్తిస్వాతంత్ర్యములను బ్రకటించి విశేషముగ సేవచేసిరనియు, భారతదేశము అహింసా పద్ధతులలో స్వాతంత్ర్యమును సంపాదింప నుత్సాహించుచున్నందున, అందుల కనుగుణ్యమగు పద్ధతుల నేర్పరచుటలో ఖద్దరు పరిశ్రమ కెంతయు ప్రాముఖ్యమొసంగ నవసరమున్నదనియు, స్త్రీ పురుషులు దేశపరిశ్రమలలో సరిసమానముగ పాటుపడవలెననియు, పూర్వము ఆదాము అవ్వలు (Adam & Eve) అను ప్రథమదంపతులలో, ఆదాము బట్టలనునేసెననియు, అవ్వ నూలువడకెననియు, త్యాగశీలములకు సంస్తుతింపదగిన స్త్రీలే అహింసావ్రతమును చక్కగ సాగించుటకు సమర్థతగలవారనియు, పురుషులుచేయలేని కార్యములను కడు నేర్పుతో నిర్వహింపగల నారీమణులు నూలువడకుటయన్న నెంతయు నుత్సాహమును వెల్లడింతురనియు, అందుచే ఖద్దరుపరిశ్రను స్త్రీల పటుదీక్షాపరతంత్రతచే నభివృద్ధి గావలెననియు తెల్పియుండిరి.

సంక్రాంతి పండుగకు క్రొత్తచీరలను ధరింప నెంతయు సంబరముతోనుండు స్త్రీలు, భర్తలచే ఖద్దరు వస్త్రములనేకొనిపించి, అల్లుండ్రకును, కూతుండ్రకును ఖద్దరుబట్టలనే కట్టబెట్ట నిశ్చయించెదరని విశ్వసించుచున్నాము.
దేశహితమునకు సహాయపడు వేడుక కృత్యములలోనే స్త్రీ పురుషులెల్లరును ఈ పండుగదినములను గడపుదురని భావించుచున్నాము. సర్వజనులకును సంక్రాంతిపండుగ సంతోషదాయకమై యొప్పునటుల సర్వేశ్వరుడాశీర్వదించుగాక !

స్వర్గీయ కమలనెహ్రూ ఘనస్మారకచిహ్నమగు చికిత్సాలయము

జీవించిన కొలది సంవత్సరములును
మూర్తీభవించిన సతీత్వమేయనబరగి, సేవను
సంసారమునకును సంఘమునకును దేశమునకును సత్కీర్తిని సంఘటింపజేయగల
సలిపి, కీర్తికాయమును భువిపై నిలిపి, దివికేగిన కమలానెహ్రూ జీవితము ధన్యతగాంచెను.
పండితజవహరలాలు నెహ్రూకు ధర్మపత్నియై మహిళామండలిలో మహితఖ్యాతి
నొందిన [illegible] తనువు చాలించి మూడేండ్లు గతించినవి. మానవసేవయే

పరమధర్మముగ పరిగణించిన యా సతీమణికి స్థిరమగు స్మారకచిహ్నముగ అలహాబాదులో స్త్రీల చికిత్సాలయమును నెలకొల్పబడునటుల దేశనాయకులు సంకల్పించియుండుటయు, అందుకుగాను అంచనావేయబడిన ఐదులక్షల రూప్యములలోను రెండులక్షలు వసూలగుటయు, ఆ సాధ్వి జీవితమునెంతయు సంస్తుతించిన సాధుసత్తముడును లోకోత్తరపురుషుడును అగు మహాత్ముడు ఆ చికిత్సాలయముయొక్క శంకుస్థాపనమును గత నవంబరు 19-వ తేదీని గావించియుండుటయు, భారతమహిళామండలి కెంతయు నానందదాయకమగు సత్కార్యమై యొప్పుచున్నది.

భారతదేశమంతయు నేకైకదృష్టితోనుండదగిన యీ సమయములో నీ ఆసుపత్రి ఒక సంయుక్తరాష్ట్రములకే కాక భారతదేశమునకంతకును ప్రయోజనకరమగు ప్రజాసేవా సంస్థమైయున్నదని మహాత్ముడు తెలిపియుండిన సందేశములో నెంతయు సత్యమున్నది. భారతీయులందరును ఈ ఆసుపత్రి నిర్విఘ్నముగ, జయప్రదముగ, పూర్తియగుటకు భూరి విరాళముల నొసంగవలెనని డాక్టరు జీవరాజుమెహతాగారు హెచ్చరిక గావించియుండిరి.

భారతదేశములో శిశుమరణము లసంఖ్యాకములుగ జరుగుచుండుటచే గర్భిణీ స్త్రీలకు వలయు ఆరోగ్యవిధానమును అతి నేర్పుతో ప్రసాదించగల మంత్రసానులను తయారుచేయుట ముఖ్యావసరమైయున్నది. గర్భోత్పత్తియైనప్పటినుండి ప్రసవమయ్యే పర్యంతము స్త్రీలకు చక్కని వైద్యసహాయమునకు వసతులను గల్పింప సంకల్పించి స్థాపింపబడుచున్న ఈ చికిత్సాలయములో గర్భిణీస్త్రీల యారోగ్యమును కాపాడుటకును, శిశుసంరక్షణమును చక్కగా చేయగలుగుటకును సరియగు శాస్త్రీయమైనశిక్షణ మొసంగబడునని తెలియుచున్నది.

ప్రస్తుతకాలపరిస్థితుల కనుగుణ్యమగు శాస్త్రీయవైద్యవిధానముతో కూడిన స్త్రీ చికిత్సాలయములు దేశములో చాలినన్ని లేనిసమయములో ఆదర్శప్రాయమగు పద్ధతులలో నీ చికిత్సాలయము ప్రజాసేవసేయ సమకట్టుట కడు శ్లాఘాపాత్రమైన విషయమై యున్నది. స్వార్థరాహిత్యబుద్ధితో సంఘసేవను దేశసేవను చేసిన సతీమణి ఆత్మకు సంతసమును చేకూర్పగల శాశ్వతకీర్తిచిహ్నమగు నీ చికిత్సాలయము త్వరలో స్థాపింపబడునటుల సర్వేశ్వరు డనుగ్రహించుగాక!

ఈ సందర్భమున ఈ యుత్తమసతియొక్క జీవిత చరిత్రనిట సంగ్రహముగ దెల్పుట సమంజసమగును. 1-8-1899-వ సంవత్సరములో నీమె ఢిల్లీలో జననమొందెను. ఈమె పండితజవహరమలుకౌలుగారి పుత్రిక. పదునేడుసంవత్సరముల ప్రాయమున పండితజవహరలాలుగారికి పాణిగ్రహణ మొనర్పబడెను. సత్యాగ్రహ ఉద్యమములో నాయకత్వమును వహించి, దేశసేవకై పాటుపడుచుండిన పతియొక్క ఉన్నతాదర్శములను బాగుగ గ్రహింప

గల బుద్ధికుశలతగల నీ వనితారత్నము స్వరాజ్యోద్యమములో ప్రవేశించి సంస్తుతింపదగిన సేవాపరతంత్రతతో పనిచేసియుండెను.

1926-వ సంవత్సరములో చేసిన జబ్బుకు ఐరోపాలో చికిత్సను పొంది మరల మాతృభూమికి వచ్చినపిదప వాలంటీరుగాచేరి దేహారోగ్యమునుగూడ సరకుగొనక అహోరాత్రము లీమె దేశసేవ సలిపియుండెను. 1931-వ సంవత్సరములో భారత కాంగ్రెసుకార్య సంఘములో నీమె సభ్యురాలుగ నెన్నుకొనబడెను. ఏతత్ఫలితముగ నీమెకు ఆరునెలల కారాగారశిక్ష సంభవించెను.

జయిలులోని జీవితము ఈమె ఆరోగ్యమునకు హానికరముగ పరిణమించెను. ఈమె యారోగ్యము చెడిన సంవత్సరములో భర్తకు తరుచు కారాగారవాసము విధింపబడు చుండుటచే పతిపజ్జనుండు భాగ్యమీమెకు లభింపకుండెను. ఈమె అనారోగ్య మంతకంతకు హెచ్చగుటచే 1935-వ సంవత్సరములో మరల ఐరోపాలో చికిత్సను పొందుటకై వెడలి యుండెను. ఈమె వ్యాధి తీవ్రరూపమునుదాల్చిన సందర్భములో ప్రభుత్వమువారు జవహర పండితుని చెరసాలనుండి విడిచిరి. సతిని కడసారి సందర్శించి, ఆమె సన్నిధిని సుమారు ఆరునెలలు ఆమె యాయురారోగ్యముల నాశించుచు అహోరాత్రములను గడపిన పతిని వియోగదుఃఖసాగరమున బడవైచి యాభామిని తన ప్రాణములనుబాసి చనెను.

స్త్రీ సదనము — పేదబాలికలకు సహాయము

ఈ రాష్ట్రములో స్త్రీల క్షేమమున కెంతయు పాటుపడుచు స్త్రీ జనోద్ధరణ విషయమై విశేషసేవ సేయుచున్న స్త్రీ సదనము (కేంద్రసంరక్షణ గృహము) యొక్క తృతీయ వార్షికోత్సవ మీా మధ్యనే జరిగియుండినది.

ఆసందర్భమున లీచ్ సతీమణిగారు స్త్రీ సదనముయొక్క అభివృద్ధికి, ప్రజాదరమును, ఆర్థికసహాయమును అత్యంతావసరములని హెచ్చరిక గావించియుండెను. మైలాపూరులో నున్న నీ సదనమునందు జరిగిననాటి సమావేశమున కనేకమంది విచ్చేసియుండుట సంతోష దాయకమగు విషయమైయున్నది.

వివిధములగు వినోదప్రదర్శనములచే సదరుసదనమందలి బాలికలు సభికుల నానందింపజేసిన పిదప, స్త్రీల క్షేమమునకు మద్రాసు రాష్ట్రమునందు కడుశ్రద్ధతో సేవ సలుపుచున్న స్త్రీ సదనముయొక్క (సూపరింటెండెంట్)అధికారిణియైన శ్రీమతి వి.టి. లక్ష్మి గారు గత సంవత్సరము (1938-39)యొక్క అభివృద్ధినిగూర్చిన నివేదికను చదివిరి.

ఈ స్త్రీసంరక్షణగృహము, స్త్రీజనాభ్యుదయమునకై బహుజాగరూకతతో పనిచేయుచున్న 'విజిలెన్సు' సంఘమువారిచే మద్రాసులో 1936-వ సంవత్సరములో

స్థాపింపబడియుండుటయు, తదుపరి మద్రాసు ప్రభుత్వమువారి ఆమోదమును, ఆదరమును బడయగల్గి క్రమముగ వృద్ధియగుటయు కడుప్రమోదమును గూర్చుచున్నది.

స్త్రీల అవినీతిప్రవర్తనావ్యాపారము నణంచుటకై చేయబడిన శాసనసహాయముచే, నీ సదనమునందున్న వారి యోగక్షేమములను భద్రపరచుటకై నీకేంద్రగృహము సరియగు శిక్షణనొసంగి సంఘమునకు చాల మేలొనగూర్చెనని తెల్పుచు, ఈ గృహము ప్రజాదరముతో దినదినాభివృద్ధి గాంచగలుగునని శ్రీమతి లక్ష్మిగారు సంపూర్ణ విశ్వాసమును వెల్లడించియుండుట స్త్రీల దుస్థితి తొలగుటకు అవకాశములను సూచించుచున్న శుభప్రదమగు సంగతియై యొప్పుచున్నది.

ఈ శరణాలయములో మూడు రకముల స్త్రీలు చేర్చుకొనబడినటుల తెలుపబడినది. (1) చెడునడత యలవడుటకు సరిపడిన పరిస్థితులలో చిక్కుకొనియుండినవారు. (2) పడుపువృత్తిని సాగించుచున్న గృహములనుండియు పాపభూయిష్ఠమైన వాతావరణమునుండియు తప్పింపబడినవారు. (3) దీనులును దిక్కులేనివారునైన పేదబాలికలు.

1936-వ సంవత్సరము తరువాత సుమారు నూటడెబ్బదియార్గురు బాలికల కీస్త్రీసదనము శరణ్యనివాసమైయుండుటయు, ఇందులో నూటయిరువదినల్గురు బాలికలు క్రమమైన శిక్షణమునొంది బాగుపడుటయు, గత రెండు సంవత్సరములకంటె నీ సంవత్సరము చేరిన బాలికలసంఖ్య హెచ్చుగనుండుటయు, ఈసదనముయొక్క విశేషఘనతను, సంఘసేవాతత్పరతను వెల్లడించు విషయములై యున్నవి.

ఈ శరణాలయములోని బాలికలకు చదువుట, వ్రాయుట, గణితము మొదలగు ప్రధానవిద్యా విషయములకుతోడు, నృత్యము, కుట్టుపని, తోటపని మొదలగు విద్యలలో గూడ మంచిశిక్షణ మొసంగబడుట ప్రశంసాపాత్రమైయున్నది.

ఈ శరణాలయాధికారిణి ఇందలి బాలికల యభివృద్ధికెంతయు పాటుపడియుండుట కొనియాడదగిన స్త్రీ సంఘసేవావిషయమనుటకు సందియములేదు.

ఇందు తరిఫీదు చేయబడిన వారిలో పదునారుగురు యువతులు, వివిధములగు వృత్తులలో ప్రవేశించి జీవితమును సంపాదించుకొనగల్గు చుండునటుల తెలుపబడినది. ఈ విషయమీ సదనమునందలి విద్యాపద్ధతుల ప్రయోజనమునకు ప్రబలసాక్ష్య మనబరగుచున్నది. సుమారు తొంబదిమంది బాలికలు తిరిగి తలిదండ్రులకడకును, భర్తలయొద్దకును చేరుకొని సుఖముగ జీవింపగలుగుట సంతృప్తికరమగు సంఘాభివృద్ధి యనదగును.

లీచ్ సతీమణిగారు స్త్రీ సదనముయొక్క సూపరింటెండెంటు చేసిన ఘనమగు సంఘసేవను సంస్తుతించుచు నీగృహమునందలి బాలికలకు వ్యాయామవిద్యనుగూడ నేర్పనవసరమై యున్నదని సలహానొసంగియుండు టెంతయు సమయోచితముగ నున్నది.

## సంపాదకీయములు

శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షురాలి కభివందనము లర్పించుచు, స్త్రీసంరక్షణశరణాలయములనెడ స్త్రీలే మిక్కిలి శ్రద్ధతో సేవచేయవలసిన బాధ్యతగలదని హెచ్చరిక గావించుటలో స్త్రీ జనోద్ధరణమునకు స్త్రీలే పాటుపడవలసిన యవసరమును విశదపరచిరి.

ఇట్లు స్త్రీలయభ్యున్నతి కెంతయు సమకూర్ప పాటుపడుచున్న ఈ స్త్రీసదనము అచిరకాలములో అద్భుతమగు సంఘశ్రేయస్సునొడ గూర్పగలదనుట సత్యము. ఈ సదనాధికారుల సత్ప్రయత్నములు సఫలీకృతములై సత్కీర్తిగాంచగలవను సంపూర్ణ విశ్వాసముతో సంతసమొందుచున్నాము.

### శ్రీ జగదీశ్ ఫిలిమ్స్‌వారి సాంఘిక చిత్రము 'మళ్లీపెళ్లి'

ఈ చిత్రము గతమాసము 14-వ తేదీని పత్రికాప్రతినిధులయెదుట ప్రదర్శింపబడినది. సత్యమును గోల్పోయి, స్వరూపమాత్రావశిష్టమైయున్న 'సనాతనధర్మ'మను పేర నిర్వహింపబడుచున్న మతాచారములకును, పవిత్రప్రేమాదర్శములచే ప్రేరేపింపబడి, సంఘమును సంస్కరింప నుంకట్టిన నవయుగయువక సత్ప్రయత్నసాహసములకును, పరస్పర సంఘర్షణమేర్పడి, ప్రాచీనమతమూర్ఖత్వముపై ప్రాకృతధర్మవిజ్ఞానము పూర్తిగ విజయము గాంచగల్గుటే ఈ చిత్రమందు కల్పింపబడిన కథావిషయమైయున్నది.

సనాతనధర్మపరాయణుడగు వకీలు జనార్దనరావు మూఢమతాచారపిశాచపీడితుడై, కపటసన్యాసియొక్క కుట్రకులకు గురియై, అవివేకముతో కన్నకూతురను కరుణాలేశములేక, అభమశుభ మెఱుంగని అమాయకురాలగు లలితను, ప్రారబ్ధవశమున బాల్యమందె భర్తృవిహీనయై పరితపించుచుండు యువతిని, పలువిధముల బాధింపపాల్పడును. దుఃఖభాజనమైన నికృష్టజీవితము దుర్భరమైతోచిన లలిత, సుందరరావను యువకుని హృదయపూర్వకముగ ప్రేమించి, తనదుఃఖమును కొంత యుపశమింపజేసికొన ప్రయత్నించును. సుందరరావాముగుదను మనసార ప్రేమించి, ఆమెయెడ నత్యంతాదరమునుజూపి, పునర్వివాహ జీవితసుఖమునకు ప్రోత్సహించును. ప్రేమపాశముచే బంధింపబడిన యాయిరువురును దుఃఖసాగర తరంగములలోబడి, కొంతవడి వేర్పడి, హృదయములలో నిండియున్న ప్రేమ బాగుగ పరిశోధింపబడినపిదప అదృష్టమను వాయువుచే నొడ్డునకీడ్వబడి, భాగ్యవశమున పాణిగ్రహణబంధముచే ప్రేమ విజయమును పొందగల్గుదురు.

ఈ ప్రధానకథ కుపాంగములుగ నేర్పరుపబడిన కమలా వేంకట్రావుల ప్రణయ పరిణయము, సుందరరావు వేంకట్రావుల స్నేహబంధము, కమలా సుందరరావుల ఘన

సోదరీసోదర ప్రేమ, జనార్దనరావు సుభద్రమ్మల (లలిత తలిదండ్రులు) దాంపత్యధర్మములు, మొదలగు విషయములు, కపటసన్యాస నాటకరంగ మధ్యమున చక్కగ బ్రదర్శింపబడినవి.

ఈ చిత్రమును సర్వాంగసుందరముగ తయారుచేసి, సుందరరావుపాత్ర నత్యంత నైపుణ్యముతో ప్రదర్శించిన నటశిఖామణి శ్రీ వై. వి. రావుగారు తమ అద్భుతకళా కౌశలమును ఆంధ్రదేశమునకు వెల్లడించి, ఆంధ్రచలనచిత్రకళావైభవమును, అభినుతింప దగిన దర్శకప్రాభవముతో, ప్రత్యక్ష మొనరింపగలిగిరనుట అతిశయోక్తి కానేరదు. ఈ సుహృదయుని అదృష్టవశమున విజయవంతమగు చిత్రమునకు గావలసిన విషయము లన్నియు చక్కగ సమకూరి యీ చిత్రమందు సమన్వయము చెందినవి.

జనార్దనరావుపాత్రను కడునేర్పుతో నిర్వహించిన కవితాకళానిధి శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు, కథలోని సందర్భముల కనుకూలముగను ఆయాపాత్రలకెంతయు తగియుండునట్లును, రమ్యమగుభాషలో పాటలను పద్యములను సంభాషణలను రచించి చిత్రమున కెంతయు ప్రతిభనొడగూర్చిరని నుడువవగును.

కాంచనమాల 'లలిత' పాత్రను మనోహరముగ బ్రదర్శించి, విశేషఘనతను గాంచగలిగెనని నిస్సంశయముగ చెప్పవచ్చును. సహజసౌందర్యగరిమతో, పాత్రౌచిత్య ముతోగూడిన భావప్రదర్శనముతో విలసిల్లు నీ నటీమణి శ్రీ రావుగారి దర్శకత్వ మహిమచే మరింతశోభవహించెను. తదితర పాత్రలును చక్కగ పోషింపబడినవి. ఈ చిత్రము చివరవరకును సొంపునింపురచనలచే, సొగసుగుల్కునటనలచే రసవంతమైయున్నది.

సంఘములో స్త్రీలదుస్థితిని తొలగించుటకు, వారికిగూడ పురుషులతోపాటు పునర్వివా హాధికారములను గల్పించుటవసరమనియు బాల్యవితంతువివాహములు ధర్మసమ్మతమనియు నిరూపించుటకు సంకల్పింపబడిన ఈ చిత్రము సంఘసంస్కరణమును ప్రబోధించుచు సాంఘిక సమస్యాచిత్రములలో నాదర్శప్రాయమై యొప్పుచున్నది.

ఆంధ్రులందరి యత్యంతాదరమునకు పాత్రమైయున్న ఈ చిత్రము, స్త్రీ జనాభ్యు దయమున కెంతయు సేవసల్పి, స్త్రీ పునర్వివాహ ధర్మమునకు సంఘసంస్కరణాదర్శము లలో ఉన్నతస్థాన మొసంగి, ఉవిదల నుద్ధరింప పాటుపడిన, కీర్తిశేషులగు శ్రీ వీరేశలింగం పంతులుగారి సదుద్యమమునకు అఖండవిజయమును చేకూర్చి, సంఘమునకు మేలును సమకూర్పగలదని విశ్వసించుచున్నాము.

EDITED BY DR. K.N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

## సౌఖ్యవంతమైన శిశువు!

పగలు వెంబడి రాత్రి వచ్చునట్లే 'గ్లాక్సో' ఆహార మివ్వబడిన బిడ్డకు ఆరోగ్యము వెనువెంట సౌఖ్యము కలుగును. బిడ్డకు కావలసిన పోషణకు సరియగు పరిశుభ్రమైన పాలాహారమైన 'గ్లాక్సో' మిక్కిలి తేలికమైన ఆహారమగుటచే నతి సులభముగ జీర్ణ మగును. దుష్టపదార్థము లేవియు నిందు చేరలేదని గ్యారంటీ చేయబడుటచే నిది పరిశుభ్రమైన ఆహార మనుటకు సందియము లేదు. బిడ్డ బాగా పెరుగు టకు కావలసిన పోషకపదార్థములన్నిటిని సూక్ష్మ రూపమున గలిగియుండుటచే శిశువులకు చక్కని ఆరోగ్యమును కలిగించి, సుఖజీవితమున కాధార భూతమైన ఆహారము 'గ్లాక్సో'



ఇండియాలో అంతటను
విరివిగా దొరుకును.
ధర పెరుగ లేదు.

**Glaxo**

# విషయసూచిక



త్రివర్ణచిత్రము:

ప్రణయవిదూర (మహాశ్వేత) చిత్రకారుడు—శ్రీ ఓ. సంబంధంగారు

(జనవరి "గృహలక్ష్మి" లో ప్రచురింపబడిన త్రివర్ణచిత్రముగూడ వీరిచేతనే చిత్రింపబడినది.)

చ॥ కనులకుఁ జల్వ నీ సొగసు కమ్మని తావులు మాటిమాటికిఁ
మనసుకు హాయిఁగూడ్చు సుమమంజరి ! నిన్ను స్పృశించినంతనే
తనువుకుఁ బారవశ్య జనితంబగు సౌఖ్యముగల్గు, పూజ్యుఁడౌ
మునిసుతు గర్ణసౌధమున మోహముమీర వసించు భాగ్యముఁ
గని కృతకృత్యవైతి; చిరకాలముఁజేసిన మీదు మైత్రి నీ
ప్రణయవిదూరబాపెనని పట్టకు వైరముఁ బారిజాతమా !

— చేబ్రోలు సరస్వతీదేవి.




## "గృహలక్ష్మి" పండ్రెండవ సంపుటములో ప్రచురింపబడిన స్త్రీల వ్యాసములు

'క|| తెనుఁగున గవితలనేర్చుచు వనితామణులెల్ల దేశభాషామత వ
ర్ధనమున కనుకూలములగు ఘనకృతులు రచించి కీర్తిఁ గాంతురుగాతన్||'

మాతృభాషా సేవయు మాతృదేశారాధనమును మాతృమతోద్ధరణమును
మహిళారత్నముల మహితధర్మములు. మాతృదేవతోపాసనయే
మోక్షసౌధమునకు మొదటి సోపానము.

పాశ్చాత్య విద్యావ్యాప్తి ప్రబలముగనున్న ఈ యిరువదవ శతాబ్దములో మాతృ
భాషారాధనము నానాటికి క్షీణించిపోవుచున్నది. స్వభాషాభిమానమును, స్వజాతి మర్యా
దలను స్త్రీ పురుషులెల్లరును త్యజించి, పరభాషాభ్యసనపరాయణులై పరధర్మాచరణ
వ్యసనముచే పీడింపబడుచుండుట భారతదేశముయొక్క హీనస్థితికి ప్రబలనిదర్శనము.

స్వజాతిమర్యాదలును స్వభాషాభిమానమును తిరిగి సుస్థిరముగ దేశములో ప్రతి
ష్ఠింపబడవలెనన్న మానవజీవితమహిమకు మూలాధారమైన మాతృదేవతారాధనము,
మాతృభాషా పరిశ్రమయు అత్యంతావసరమైయున్నవి.

మాతృభాషా వ్యాపనమునకు మాతృమూర్తుల విజ్ఞానసంపదయే మూలకారణము. తల్లుల విద్యాబుద్ధులే పిల్లల యభివృద్ధికి హేతుభూతములు గావున మాతృధర్మములను చక్కఁగ నిర్వహింపగల మతవిజ్ఞానమును, మాతృభాషారాధనముచే మానినీమణులందరును ఆర్జించుకొను టత్యంతావశ్యకమైయున్నది.

వనిత లుపాసించు విద్యలలోని ప్రతిభ వారిబిడ్డల కుగ్గుపాలతోనే పట్టుపడుచున్న దనుట సర్వజనవిదితమగు విషయమైయున్నది. మాతృభాషారాధన మొనరించు మానినీమణి తన సంతానమునకు మాతృదేవతామహిమను, మాతృభాషామాధుర్యమును ప్రసాదింప నెంతయు సామర్థ్యమును గల్గియుండును.

ఆంధ్రమాత ఆధిక్యతయు, యశస్సును, ఆంధ్ర మహిళామణుల విద్యాభివృద్ధిపై నాధారపడియున్నదనుట నిశ్చయము. ఆంధ్రభాషాపాండిత్యముగల అతివ, తన భర్తకును, బిడ్డలకును అందలి ఘనతను సహజతేజమును సంపూర్ణముగ వెల్లడింపగలిగి, వారి జీవితములను మాతృభాషారాధనకు మరల్ప జాలియుండుననుటకు సందియములేదు.

ఆంధ్రమునందు కవిత్వము గావింపగల వనితారత్నములు చాల అరుదుగనున్నారు. కవిత్వమన పద్యములను రచింపగల భాషాపాండిత్యమును పొందుటేయని యూహించుట చాల పొరపాటు. ఇంపగు భావములను రమ్యమగు పదజాలములో బాగుగ ప్రదర్శించుటే కవిత్వమనబడును. వచనరచనలలోగూడ కవితాప్రాభవముండుననుట కొందరకు వింతాభిప్రాయముగ తోచవచ్చును. కాని భావగర్భితమగు వచనరచనలలో సైతము పద్యములందలి మార్దవమును, సొంపును ప్రదర్శించుట కవకాశమున్నది.

పాశ్చాత్యకవులలో గద్యకావ్యములను రచించి ఘనమగు కళామాధుర్యమును ప్రదర్శింపజాలిన గ్రంథకర్తలనేకులున్నారు. భావమునకు తగిన భాషాసౌష్టవమును సమకూర్పగలుగుటే కవితాకళయందలి నైపుణ్యమనబడును.

పద్యరూపమునగాని గద్యరూపమునగాని హృదయాంతరాళమునం దనుభవించిన భావములను, బుద్ధిచే గ్రహించిన విషయములను సుందరమగు శబ్దజాలములో చిత్రింపగల్గుటే భాషాపాండిత్య ప్రభావమునకు ప్రత్యక్షనిదర్శనము. కావ్యములను రచించుటలో గల నిపుణతయే వ్యాసముల రచించుటలోను ప్రదర్శితమగును.

కళోపాసనాపిపాస ననుసరించియు, వ్యక్తిపటిమను బాగుగ పెంపొందింపజేయగల ప్రకృతి సౌందర్యారాధనమును బట్టియు, పూర్వజన్మ పుణ్యఫలముగ ప్రాప్తించు భగవదనుగ్రహమువలన ప్రస్తుతజన్మలోజేయు విద్యా పరిశ్రమనుబట్టియు, ఊహాశక్తితోగూడిన ఉత్సాహసంపదయు, ఉన్నతాదర్శప్రేరితమగు బుద్ధి పోడిమియు, భావసమృద్ధియు, భాషాపాండిత్య ప్రాభవమును స్త్రీ పురుషులకెల్లరకును ఏర్పడుచున్నది.

## "గృహలక్ష్మి" పంద్రెండవ సంపుటములో ప్రచురింపబడిన స్త్రీల వ్యాసములు

ఆంధ్రమహిళామండలిలో ఆంధ్రభాషాభివృద్ధి కెంతయు ప్రోత్సాహము నొసంగుచు
స్త్రీ జనోద్ధరణమునకు సర్వవిధముల తోడ్పడగల విజ్ఞానసంపదను వెలయించుచు, సార
స్వత సేవయు సాంఘిక సేవయు సల్పుచున్న 'గృహలక్ష్మి' పత్రిక కీసంచికతో పంద్రెండేండ్లు
పూర్తియగుచున్నవి.

బాల్యమును గడచి నవయౌవన సుశోభితమగు పదమూడవ వత్సరమును ప్రారం
భింపబోవుచున్న ఈ పత్రికారత్నము తనను ప్రేమాతిశయముతో నాదరించుచు, వ్యాసరాజ
ములచే నలంకరించుచున్న వనితారత్నముల కెంతయు కృతజ్ఞతాపూర్వకమగు అభినంద
నము లర్పించుచున్నది.

'గృహలక్ష్మి' పంద్రెండవ సంపుటములో నిది కడపటి సంచికయగుటచే నీయేడా
దిలో ఆంధ్రమహిళామణు లత్యాదరముతో వ్రాసిపంపిన వ్యాసములనుగూర్చి కొంత
ప్రశంసించు టీసందర్భమున సమంజసమేయగును.

అతివల అభ్యున్నతికి అన్నివిధముల తోడ్పడుచు, ఆంధ్రమాతను సేవించుచే ఆదర్శ
ముగ నిడుకొని, ఆంధ్రసోదరీమణుల ఆశీస్సులను అలంకారరచనలను అందికొని, అధిక
శోభతో అలరారుచున్న ఆంధ్రభాషావిభూషణమగు నీ పత్రిక ఆనందపూరితమగు అభిను
తులను వ్యాసరచయితల కందరకును అందజేసికొనుచు, ఆడువారియెడ నధికభక్తిని
వెల్లడించుటలో ఆశ్చర్యమేమియునులేదు.

1939-వ మార్చి మొదలు 1940-వ ఫిబ్రవరి వరకును ప్రచురింపబడిన స్త్రీల
రచనలు సుమారు నూరుగలవు. వాటిలో ముప్పాతికకుపైగా గద్యవ్యాసములేయై
యున్నవి. పద్యరచనలలోగల ప్రతిభకంటెను గద్యవ్యాసములలోనే ఘనమగు భాషాజ్ఞాన
సంపద వెల్లడింపబడియున్నది. ఇందులో నొక విశేషముగలదు. ప్రస్తుతాంధ్ర సారస్వతాభి
వృద్ధి పత్రికాప్రచారముపై చాలవర కాధారపడియున్నది. కాని పత్రికాభివృద్ధి ఆంధ్ర
భాషలో నింకను పరిపూర్ణత గాంచలేదనియే చెప్పవలసియుండును.

పద్యములల్లగలవారు కొల్లలుగనున్నారు. కాని సరియైన భాషాప్రభావమును
ప్రదర్శింపగల వ్యాసరచయితలు బహుకొలదిగనున్నారు. వ్యాసరచనాకౌశలము విశేషముగ
అభివృద్ధిజెందినగాని పత్రికాసారస్వతాభివృద్ధి పెంపొందనేరదు. స్త్రీలు విశేషముగ గద్య
రచనలకు గడంగుటే మిక్కిలి వాంఛనీయమగు సారస్వతసేవావిషయమని నుడువదగును.
ఏలనన, ప్రస్తుతనాగరకతా ప్రపంచములో శాస్త్రవిజ్ఞానమునకును, రాజకీయ, ఆర్థికవిషయ
విజ్ఞానమునకును విశేష ప్రాముఖ్యతయున్నది.

సాంఘికాభివృద్ధికి వివిధశాస్త్రజ్ఞాన మత్యంతావసరమగుటచే పద్యకావ్యముల
కంటె గద్యగ్రంథములే శాస్త్రవిజ్ఞాన ప్రచారమున కనుకూలమగు సాధనములు గాన

గద్యవ్యాసరచన యెక్కుడుగ అభివృద్ధిజెందవలసియున్నది. ఆనందదాయకములును, నీతి ప్రబోధకములును, ఆదర్శయుతములును అగు పురాణములను, ప్రబంధములను పూర్వులు లెక్కకు మిక్కుటముగ రచించి ఆంధ్రసారస్వత వైభవసంపదను వెలయించియున్నారు.

ఆదర్శము లమలులోనికి వచ్చుటకును అతి సులభముగ నాచరణలోనికి దెచ్చుటకును జ్ఞానప్రచార మవసరము. ఉపన్యాసములును, వ్యాసములును విశేషముగ జ్ఞాన ప్రచార మొనరించుట కనుకూలించును. ఇందుచే గద్యరచనలకే ప్రాధాన్య మెక్కుడుగ నిక్కాలమున గలదనుట నిర్వివాదాంశము.

'గృహలక్ష్మి' పండ్రెండవ సంపుటములో ప్రచురింపబడిన స్త్రీల వ్యాసములలో బహుప్రశంసనీయమగు భావములను, భాషాచాతుర్యమును ప్రదర్శించుచున్న రచనలు చాల గలవు. అందు ముఖ్యముగా ముగ్గురు రచయిత్రుల వ్యాసములు వివిధవిషయ విజ్ఞానమును విశదీకరించునవిగ నున్నవి.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వ్యాసములు 'గృహలక్ష్మి' పత్రికా పాఠకులకు చిరపరిచితములు. వారి రచనలు పాఠకుల మనసుల నాకర్షింపగల్గుటకు భావములకు తగిన భాషాప్రతిభయే ప్రబలకారణము. శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి వ్యాసములలో పద్యరచనలలోగల ప్రాభవము గద్యరచనలలో నంతగ ప్రదర్శితము కాలేదనియే విదితమగును. వీరి కవితానైపుణ్యము గద్యవ్యాసరచనాకౌశలముకంటె ఘనత గాంచినదనుట నిశ్చయము. వీరి పద్యములు గ్రాంథికభాషా పాండిత్యమును, గద్య వ్యాసములు వ్యావహారికభాషా పద్ధతులను బాగుగ వెల్లడించుచున్నవి.

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారి రచనలలో భావగాంభీర్యమును భాషాచాతుర్యమును, వివిధవిషయ విజ్ఞానవిశేషమును వెల్లడించు వ్యాసము లొకటిరెండు గలవు. 'సాంఘిక దురాచారములు—వాటి కట్టుబాట్లు' (సెప్టెంబరు సంచికలో) అను వ్యాసము ఇందులకు చక్కని నిదర్శనము.

పైన పేర్కొనబడిన ముప్వురు రచయిత్రులును 'గృహలక్ష్మి'కి పెక్కు ప్రశస్త వ్యాసములనుప్రసాదించిన స్త్రీరత్నములగుటచే వీరి వ్యాసరచనాకౌశలమును ప్రత్యేకముగ పేర్కొనవలసియున్నది. పద్యములలోను గద్యవ్యాసములలోను సమానమగు భావసంపదను భాషామాధుర్యమును వెల్లడించునవి శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారి రచనలని నుడువవగును. 'ధర్మచక్రము' (ఆగస్టు సంచికలో) అను వీరి పద్య వ్యాసములో బహుప్రశంసనీయమగు భావములున్నవి. 'ప్రేమవిజయము' (జనవరి సంచికలో) అను గద్య వ్యాసము (కథ) చక్కగ రచింపబడినది.

## "గృహలక్ష్మి" పండ్రెండవ సంపుటములో ప్రచురింపబడిన స్త్రీల వ్యాసములు

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారి పద్యరచనలును గద్యవ్యాసములునుగూడ ప్రస్తుతింపదగియున్నవి. శ్రీమతి వేమూరి జ్ఞానాంబగారి వ్యాసములును పద్యములును వన్నెగాంచిన భాషాపరిజ్ఞానమును వెలయించుచున్నవి. శ్రీమతి లోకనిండి సత్యవతీబాయిగారి కథారచనాకౌశలమెంతయు మెచ్చదగినది.

శాస్త్ర విజ్ఞానసంపదతోగూడిన వ్యాసములలో శ్రీమతి కే. సుగుణమణిగారి రచనలు సంస్తుతింపదగినవి. 'ఆడువారికి వలయు ఆహారజ్ఞానము' (అక్టోబరు సంచికలో) అను వ్యాసము ఇందులకు మంచి ఉదాహరణము. అక్టోబరు "గృహలక్ష్మి"లో వెలువడిన స్త్రీల ప్రత్యేకవ్యాసములన్నియు ప్రశంసాపాత్రములే యనుటకు సందియములేదు.

గద్యరూపమున రచింపబడిన, శ్రీమతి కామరాజు మైత్రేయిగారి 'అబలా బలాత్కార పాపఫలితము' అను మూడంకముల నాటకము 'గృహలక్ష్మి' (జనవరి, ఫిబ్రవరి సంచికలలో) వెలువడినది. సాంఘికనాటకరచనాకౌశలము గాంచగల్గుట స్త్రీలభ్యసింపదొడంగిన సులభసాధ్యమనుటకు ఈ నాటకము చక్కని నిదర్శనమని చెప్పదగును. స్త్రీలు నాటకములను వ్రాయబూనుట సన్నుతింపదగిన సారస్వతసేవయైయున్నది. శ్రీమతి టి. వసుంధరాదేవిగారిచే రచింపబడిన "నాటకకళ", "నాటకప్రదర్శనములు" అను వ్యాసములలో (డిశంబరు, జనవరి సంచికలలో) చెప్పబడినటుల స్త్రీలు నాట్యరంగమున పాత్రధారణమొనరించి, నాట్యకళానైపుణ్యమును ప్రదర్శించి, కళోపాసనమొనర్చుటగూడ చాల కొనియాడదగిన కళారాధనమనుటకు సందియములేదు.

ఈ పండ్రెండవ సంపుటములోని పండ్రెండు సంచికలలోని స్త్రీల రచనలన్నిటియందలి ప్రత్యేకగుణములను పేర్కొనినచో పెద్ద గ్రంథమగును. వారివారి రచనలలోని ఆనందమును అందరికిని విస్తరింపజేసి ఆత్మానందము ననుభవించుటయే నిజమగు ఘనత గావున ఆంధ్ర సోదరీమణులందరును ఆంధ్రమాతను సేవించుటే ఉన్నతమగు ఆశయముగ హృదయమందిడుకొని భాషాసేవయు ప్రజాసేవయు సేయ నుత్సాహింతురని ఆశించుచున్నాము.

స్త్రీల వ్యాసములకంటె పురుషుల వ్యాసములే ఈ పత్రికాలలామము నెక్కుడుగ నలంకరించియుండుటచే వ్యాసకర్తలందరకును "గృహలక్ష్మి" సంస్తుతులను సమర్పించుచు అందరి నేకరీతిగ ఆంధ్రభాషాభివృద్ధికి, వారివారి శక్తిసామర్థ్యముల ననుసరించి పాటుపడ ప్రోత్సహించుచున్నది. మాతృదేశారాధనమహిమను, మాతృభాషామాధుర్యమును గ్రహింపజాలని మానవజన్మ వ్యర్థము గాన ఆంధ్ర సోదర సోదరీమణులెల్లరును ఆంధ్ర సారస్వతామృతము నాస్వాదించి ధన్యతగాంతురని విశ్వసించుచున్నాము.

# దండం

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

దండమంటే కఱ్ఱ. దండమంటే నమస్కారమనికూడా అర్థం. నమః అనేది నమస్కార మౌతుందని, నైఘంటికులు నమస్కారం అనేది ఉచ్చారణలో కన్పఱచటం ఉన్నప్పటి కిన్నీ, క్రియారూపంలోనికి ఎందుకు దిగిందో చెప్పటం కష్టం. ఉచ్చారణలో దీనికి అనేక రూపాల్లో ప్రచారండున్నట్లే, క్రియారూపంలో అన్నే రూపాలుండవచ్చును అనుకుంటాను.

సాధారణంగా దీనికి తెలుగులో జోహారు, జేజే, దండము, జోత, మ్రొక్కు అని వ్యవహారనామములున్నాయి. మనం వాడుకునే సాంస్కృతికపదాలు ఉన్నాయి. మనల్ని సృష్టించి, మనకన్ని సౌకర్యాలనూ కల్పించిన భగవంతుడికి మనం కృతజ్ఞతా, భక్తిని, సవినయంగా వెలిబుచ్చుకోవటానికని మనపెద్దలు యీ ప్రదర్శనాన్ని కల్పించి ఉండవచ్చు. కేవలం భగవత్కైంకర్యానికని నిర్దేశింపబడిన యీ పవిత్రకార్యాన్ని మరువరాదు. గనుక అనాదినుండీ ఇందులో కల్గిన మార్పులు వగైరాలు గమనిస్తాం.

నిజంగా దీనిపుట్టుక ఏదేశంలోనా ఏ శతాబ్దంలోనా అని అంచనావేయటానికి చారిత్రకాధారాలేమీలేవు. శిలాశాసనాలుకూడా యిదివరకూ లభించలేదు. ఇది పరబ్రహ్మలాగా ఆదిమధ్యాంతరహితమని తోస్తుంది. వేదాలు అపౌరుషేయాలని చెపుతాం. వానిలో దీనిప్రశంస ఉండడంచేత ఇది ఆకాలంనుంచే ఉందని ఊహ కలుగుతుంది. వేదకాలపు ఆధారాలనిబట్టి భక్తిని వెల్లడించుకోవడాని కేర్పడిన పవిత్రకార్యమనికూడా తెలుస్తుంది. నమస్కారం ఏరూపంతో అనుష్ఠింపబడేదో నిర్ధారణచెయ్యలేము. వేదోక్తమైన అభివాదనమైతే కులగోత్రాదులు తెలిపే ప్రవర చెప్పి, సాష్టాంగంగానమస్కారంచెయ్యడం. 'కరయుగములు, చరణంబులు నురము, లలాటస్థలంబు, నున్నతభుజముల్ సరిధరణిజేర్చి మ్రొక్కిన' సాష్టాంగమౌతుందని పెద్దలు స్పష్టీకరించారు. దీన్నే దండవత్ప్రణామమనీ చెబుతారు. కఱ్ఱను నేలమీదవేస్తే ఎలాఉంటుందో అలా నేలమీదపడిపోతే సాష్టాంగమని వ్యవహరిస్తూవచ్చారు. ఇది శాస్త్రీయమేమో, పోతనగారుకూడా ఇలాంటి నమస్కారమే వేస్తూవచ్చారు. 'క్షోణితలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి' అని.

దేవాలయాల్లో పూర్వం ప్రజలంతా సాష్టాంగపడేవాళ్లు. ఇప్పటికీ ఉంది ఈ పద్ధతి. కేవలం దేవుళ్లకేగాకుండా, పూజ్యులైన పెద్దలను చూచినప్పుడుకూడా, జనసామాన్యం భక్తిని వెల్లడించుకోటానికీ, ఈ నమస్కారాన్ని వేస్తూవచ్చారు. జనం ఒకళ్లొకళ్లు కలుసుకున్నప్పుడు సంభావించుకోటానికి సాష్టాంగం అనుకూలింపలేదేమో, మరొక నమస్కారం కావాలిసొచ్చింది. ఇది ఏవిధంగా ఆచరణలోనికి తేబడిందో తెలియరావటంలేదు.

క్షిప్రంగా చేతులుజోడించి నమోనమః అనటమో, మరోవిధంగా ఉచ్చరించడంతోనో, సరిపొయ్యేది. ఇదీ దండమే, సాష్టాంగానికి సులభపద్ధతికావచ్చును. ఈ సులభపద్ధతీ అనాదిగానేఉంటూ ఉన్నట్లుతోస్తుంది. ఎందుకంటే భాగవతంలో రుక్మిణి 'అంజలిగావించెద భూసురాన్వయమణీ' అని బ్రాహ్మణుడితో అనడం తటస్థించింది. ఈ కరపుటములు నిటల తటంబున ఘటించేపద్ధతి, భాగవత రచనాకాలంనుంచీ ఉందేమో? దీన్నే అనేకులు అనేక విధాలుగా ప్రదర్శిస్తున్నారు. చేతులు ఆకాశాన జోడించి నమోనమః అనేవాళ్లు కొందఱు, నిటలానికి తగుల్తూ అంజలి ఘటించేవాళ్లు కొందఱు, వక్షస్థలాన్నే చేతులుజోడించి మంద హాస చంద్రికలు ప్రసరించేవాళ్లు కొందఱు. ఈ పద్ధతి పరస్పర సంభావనలకూ ఉపయోగింప బడుతూవచ్చింది.

చాలాకాలం క్రితంనుంచే మనదేశానికి యవనుల దండయాత్రలూ వారు రాజ్యాలు స్థాపించడాలు ఉండేవి. 'యథారాజా తథాప్రజా' అని వారు రాజులుకాగా మనంకూడా వారి పద్ధతినే నమస్కరించుకోవటం నేర్చుకున్నాం. అది మనకు మరీ బాగా నచ్చిన ట్లున్నూ సులభంగా ఉన్నట్లున్నూ గోచరిస్తుంది. సాష్టాంగం కాకుండా చేతులుజోడించడం కాకుండా ఒకచేయి నొసటచేర్చి అవనత శిరస్కులవడం (సలాం). ఈ సలాం చేయటాని క్కూడా శాస్త్రీయపద్ధతి ఉంది. ఈ పద్ధతి ననుసరించేవాళ్లుకూడా చాలామంది ఉన్నారు. యవనరాజ్యపతనం, ఆంగ్లేయుల రాకతోటి మన నమస్కార పద్ధతి మారి మరీతాక్యం వచ్చింది. ఆంగ్ల పద్ధతి అయితే సలాంలాగే ఒకచేతితో సలామేకాని, కాస్త తీవ్రంగా జరిగేది. డ్రిల్లు చెప్పినప్పటి సెల్యూట్ లాగ ఆంగ్లం నేర్చుకున్న నవీనులు 'గుడ్ మార్నింగ్' అంటూ సెల్యూట్ కొట్టడం రివాజు.

పాశ్చాత్యనాగరికత ప్రాకేకొద్దీ, సంభావనా పద్ధతి మరొక ధోరణికి దిగింది. 'హల్లో' అని అంటూ పాణిగ్రహణంచేయటం. మనవాళ్లు పాణిగ్రహణం పవిత్రంగా ఎంచుకొని ఒకమాటు పాణిగ్రహణం అయితే ఆ జన్మాంతం అది ఆలాగే అంటగట్టివేసే వాళ్లు పూర్వం. ఇప్పుడల్లా ఇదీ ఒక సంభావించుకోవటమే. ఇదే షేక్ హాండు. ఈ షేక్ హాండ్సులోకూడా చాలారకాలు లేకపోలేదు. హృదయానికి ముఖం దర్పణంలాంటిది. స్నేహానికి షేక్ హాండ్సు దర్పణమేమో. ఇవన్నీ ఎందుకు ఉపయోగిస్తున్నామా? ఎలా ఉపయోగిస్తున్నామా అనేది ఆలోచిద్దాం.

సాష్టాంగపడేవాళ్లు కొందఱు, పాదాలు ముట్టుకొని వంగి నమస్కరించేవాళ్లు కొందఱు, ఊరికే చేతులుజోడించేవాళ్లు కొందఱు, సమయానుకూలంగా అర్ధ నిమీలిత లోచనులై శిరఃకంపము చేసేవారు కొందఱు, కృష్ణుని సత్యభామను, మూపునతీసికొని

వెళుతున్న గరుత్మంతుడు తన అన్నను అనూరుని గతితోనే సంభావించాడనికూడా చెప్పారు. 'నతిజేసె వైనతేయుఁడు గతిభేదములోన, నన్నఁగని'— అని అసలు యీలాటి నమస్కారాలవల్ల ప్రజాసామాన్యానికి మేలేమిటో గమనిద్దాం. ప్రతిఫలాపేక్ష లేందే ఎవరూ ఏ కార్యమూ చేయరు. నమస్కారం నిష్ఫలంగాపోదు. ఎంత లంచమిచ్చినా సాధ్యంకాని కార్యాలు, దీనితో నిమిషమాత్రంలో జరుగుతున్నాయి. మనలో మాట, ఎంత డబ్బిచ్చినా సంతోషించని భగవంతుడు భక్తిగా ఒక నమస్కారము వేస్తే జబ్బులు కుదురుస్తాడు. బిడ్డల నిస్తాడు, డబ్బు ఇస్తాడు. సూర్యనమస్కారాలకు ప్రత్యేక ఫలితాలున్నాయి. ఈ మూడపేక్షలు లేకుండా ఏ పుణ్యాత్ములో తప్ప భగవంతుని పట్లకూడా నమస్కారాన్ని వుపయోగింపరు. ఆ భగవంతునికే దుస్సాధ్యమైన కార్యాన్ని సులభసాధ్యం చేయించింది ఈ నమస్కారమే. ఎన్ని చెప్పినా వినని సత్యభామ 'జగన్నాటక సూత్రధారి యదునందను డర్మిలి మ్రొక్కఁగా' చివాలున లేచి కూర్చుందట. పురాణమెందుకు, నిత్యానుభవము చూద్దాము.

మేష్టరుగారు కనబడినప్పుడల్లా చేతులుజోడించి వినయంకనబఱిచే విద్యార్థి చదవకున్నా ప్యాసవడం రివాజు. అనుదినము సలాంకొట్టే గుమాస్తా తొందరగామేజస్ట్రీసైౖ అవతలి తాలూకాలో తహసీల్దారవడం ఆశ్చర్యంకాదు. దొరగారికారు కనబడీ కనబడక ముందే చెక్కబొమ్మలా నిల్చుకొని చేయెత్తి శెల్యూట్ చేసే చిన్నక్లార్కు కలెక్టరుగారి హెడ్డుగుమాస్తాఅవడం తటస్థించుతూంది. హలో గుడ్ మార్నింగ్ అంటూ చేతికిచేయి కలిపితే మొహమెఱగనివాళ్లైనా ప్రాణస్నేహితులవడం తప్పదు. ప్రత్యహమూ దణ్ణాలు బాబుగారూ అనేరైతుకి జమీందారుగాత్లు శిస్తుముజరాయిస్తారు.

నలుగురిలో నాలుగుదండాలు స్వీకరిస్తే, అధికారికి ఐరావత మెక్కినంతౌతుంది. అధికారిప్లీడర్లనికి మరీని. నిజానికిచూస్తే యీదండంపెట్టినవాడికి లోటూలేదు. పుచ్చుకున్నవాడికి లాభమూఉండదు. అమాయకులు కొందఱు యీతత్త్వాన్ని గ్రహించుకోలేక అవస్థలపాలౌతున్నారు. సభలలోనేమి, నాటకాల్లోనేమి, హరికథలలోనేమి, ఎక్కడనైనా సభానమస్కారము వెయ్యకుంటే చిక్కులువస్తాయి. అందుకేపూర్వం నాటకాలకి 'నాంది' కల్పించారు. ఇప్పటి 'ఏకాంకికల'కే బాధాలేదు.

'పాపం నేవెళ్లేసరికి తానే కాఫీకిందపెట్టి రెండుచేతులుజోడించి నమస్కరించారు. నేనంటే అంతగౌరవం' అని మనలోపెద్దమనుష్యులు కొందఱు చెప్పుకొని ఆనందిస్తారు. ఆవ్యక్తిమీద అవ్యాజానురాగం కల్పించుకుంటారు. మనంపెద్దలకి ఉత్తరాలువ్రాసుకున్నప్పుడల్లా సాష్టాంగాలుపెడుతుంటాం. కానీ ఖర్చులేనిదండాలతో కావలిసినంత సాధింపగల్గుతున్నాము. 'దాసునితప్పు దండంతో చెల్లు'. నమస్తే.

# గృహలక్ష్మి

## జయంతి మహోత్సవము

## గృహలక్ష్మీ స్వర్ణకంకణ బహూకరణోత్సవాహ్వానము

భావబంధురమైన కవితాడోలికలయందు పాఠకుల నూచి, ఆనందవీచికలలో తేలించు మృదుమధుర రచనాపాటవము గల కవయిత్రులలో శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి గారొకరు. మొల్ల కవయిత్రి తరువాత రామాయణమును 'సరస్వతీ రామాయణ'మను పేర కృతినిగావించి, ఆంధ్ర సాహిత్య పీఠమున శాశ్వత పీఠ మలంకరించియున్న, కొల్లాపుర స్నేహలతాకవితా సంఘోపాధ్యక్షురాలైన శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారిని సత్కరించుట ఆంధ్రుల ధర్మమని యెంచి, యీ సంవత్సరము వారికి 'గృహలక్ష్మీ స్వర్ణకంకణము'ను సమర్పింపదలచితిమి.

ఈ కంకణ బహూకరణ శుభకార్యము మదరాసు రాయపేటయందున్న గృహలక్ష్మీ స్వగృహమగు కేసరి కుటీరమందు మార్చి 1 తేది 1940, శుక్రవారము రోజున, గృహలక్ష్మీ జయంతి మహోత్సవ సందర్భమున జరుపదలచితిమి. ఈ కంకణము గృహలక్ష్మీ పాఠకుల తరపున సమర్పింపబడును గాన పాఠకులు, అభిమానులెల్లరు విచ్చేసి ఈమహోత్సవమును జయప్రదమొనర్ప ప్రార్థితులు.

ఇట్లు

కె. యన్. కేసరి,

'గృహలక్ష్మి' సంపాదకుడు.

# శ్రీ సరస్వతీదేవి విరచిత రామాయణమునుగూర్చి
# పండితుల ప్రశంసావాక్యములు

'కవిత్వము మృదుమధురమై సదలంకార సమన్వితమై సరసమైయున్నది.........కర్ణపేయమై దేవిగారి కవితాగాన మశేషాంధ్ర మహాసంఘము నాకర్షించునుగాక!'

కవిసింహ, అవధాని పంచానన, రాజశేఖర వేంకటశేషకవులు, శతావధానులు.

మ॥ లలితద్రాక్షకవులెల్లఁ జూపిన వచోలావణ్యముంజూపి, స
త్కళలంగూడి వికాసమొందు కవిత న్గల్పించి భాస్వల్లతాం
తల సన్మార్దవశబ్దగౌరవరుచుల్ త్వత్కావ్యరాజంబునం
దెలమిన్ గూర్చితివమ్మ సత్కవులు నిన్నెంతేని వర్ణింపఁగన్॥

శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారు, బి. యే.

స్నేహలతాకవితాసంఘాధ్యక్షుడు.

ఉ॥ పోలికలేని మేలయిన పోకలఁ బోయెడు నీకవిత్వ పుం
జాలు సుధారసాలనఁగ జాలుఁ బదాళిక జాజిపూలనం
జాలును సొమ్ములన్న సహజాలు వరాల సరాలనేలుఁ, జే
బ్రోలు సరస్వతమ్మ! నినుఁబోలిన మొల్లయె పోలెడుంజుమీ.

శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు (అవధాని శిరోమణి)

'నేను వినినంతలో సరస్వతీరామాయణము మృదుమధురశైలిం దగిలి, ద్రాక్షాపాకమై, మనోజ్ఞమై యున్నది. ధారాశుద్ధి గంగాప్రవాహము ననుకరించుచున్నది. ఇప్పుడు స్త్రీలలోఁగాదు పురుషులలోను—ఇట్టి కవిత్వము చెప్పువారరిదియని నాకు విశ్వాసము కలిగినది'.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

'భగవదనుగ్రహమువలననో పూర్వ పుణ్యాలేశకతముననో లభించిన కవిత్వమును భగవంతుని పరము చేయుట మిక్కిలి శ్లాఘ్యము. పోతరాజునకుంబలె నీమెకు భగవంతుఁడిట్టి సద్బుద్ధిని, సలక్షణకవిత్వమును ప్రసాదించినందులకు మిక్కిలి యానందముగా నున్నయది'.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు (శతావధాని)

'ఈ విద్యావతి కుమ్మరిమొల్ల, తరిగొండ వెంకమ్మ మొదలగు కవయిత్రీమణులం దలపించుచు నాంధ్ర లోకమునందలి స్త్రీ మండలమునకు వన్నెఁదెచ్చుచున్నదనుట యతిశయోక్తిగాదు.'

డాక్టరు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు (ఆంధ్రసాహిత్యచక్రవర్తి)

'కవిత్వముసరసమై సహృదయ హృదయంగమముగానున్నది. నాతికఠినమైన సంస్కృతాంధ్ర పదముల కూర్పున నిందలి శైలిచక్కని పూర్వకవిత్వమును స్మృతికిఁ దెచ్చుచున్నది. ఈకాలమున స్త్రీలిటుల మృదు కవిత్వము చెప్పజాలినందుల కాంధ్రలోకము సంతసించుచు నీగ్రంధకర్త్రికి దగిన ప్రోత్సాహ మొసఁగుగాక!

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు (ఆంధ్రవిశ్వవిద్యాలయము.)

శ్లో. యాచేబ్రోలు సరస్వత్యారచితారామ సత్కథా
హృద్యావేద్యా సమారాధ్యా సాగేయా సర్వవిత్తమైః॥

చక్రాల లక్ష్మీనృసింహశాస్త్రిగారు.

# అబలా బలాత్కార పాపఫలితము

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

## మూడవ అంకము

### మొదటిరంగము

[శాంత గది. యిదివరకు చెప్పినట్లుగానే వుంటుంది. గదిలో చిన్న ఎలెక్ట్రిక్కు దీపము. మంచము చక్కగా అమర్చివుంటుంది. గది అంతయు శోభగా వుంటుంది. యిల్లు నిశ్శబ్దముగా వుంటుంది. వెంకట్రావు, కమల ప్రవేశం.]

కమల:- పెద్దలు దయచేశారు. మా అన్న పనిమీద వెళ్లాడు. మీరు వస్తారని శాస్త్రి చెప్పాడు. మంచి మాటకారి. మీరు అంత క్రొత్తగా నడుచుకోనక్కరలేదు. మీ స్వగృహంలాగే చూచుకోవచ్చు. శాంత చాల రూపసి. క్రొత్తగా వచ్చింది. మీరు మొహమాటపడవద్దు.

వెంకట్రావు:- అబ్బే, లేదు. (బెదురుచూపులతో అటూ యిటూ చూచుచుండును) ఏదో - కొంచెం క్రొత్త, అంతే. (జేబురుమాలుతో మొహం తుడుచుకొనుచుండును.)

కమల:- మీరు (గది చూపించి) యిక్కడ - ఈ కుర్చీమీద కూర్చోండి. కాస్త విశ్రాంతి తీసుకోండి. నేను వెళ్లి శాంతను తీసుకొనివస్తాను. (అని వెళ్లిపోవును.)

[వెంకట్రావు కూర్చున్నవాడు లేచి, తలుపు ఓరగానెట్టి, గది అంతా చూచు చుండును. జేబురుమాలుతో చేతులు తుడుచుకొనుచుండును. గది అంతయు తిరుగు చుండును. యింతలో కమలతో శాంత మంచి చీరెగట్టి, శృంగారముగా అమర్చబడిన ముడి, దానిచుట్టు వలయాకారముగా పువ్వులు, మందగమనముతో వస్తుంది. ముందు కమల, కమలచేతిలో శాంత చెయ్యి. కమల బలవంతముగా తీసుకువస్తున్నట్లుండును. శాంత మొహం వాడివుంటుంది.]

కమల:- (శాంతనుచూచి) వీరే వెంకట్రావుగారు. వీరిని మెప్పించు. మా అన్నయ్య యింకా రెండు గంటలకు వస్తాడు. నీసంగతి అడుగుతాడు. (శాంత తలయెత్తక గదిలోపల నిలువబడివుంటుంది. వెంకట్రావు వంకచూచి) యిప్పుడే వస్తాను. (అని తలుపు దగ్గరవేసి వెళ్లిపోతుంది.)

[వెంకట్రావు లేచి నిలువబడ్డాడు. శాంతను ఎగాదిగా చూస్తున్నాడు. శాంత తల యెత్తదు. తలవొంచుకొని విచారముగా చూస్తున్నది. నిరాశచే నిట్టూర్పువిడుస్తుంది]

వెంకట్రావు:- (శాంత దగ్గరగావెళ్లి) శాంతా (అని పిలుస్తాడు. జవాబులేదు) శాంతా! (జవాబులేదు) యింత మాట్లాడకుండావుంటే ఎలా? (జవాబులేదు. దగ్గరకువెళ్లి చూస్తాడు. శాంత కళ్లలో నీరు కొలుకులలో చేరుకొని క్రిందికి జారుతూవుంటాయి. చుక్కలుగా క్రిందికి జారుతూవుంటాయి. వెంకట్రావు హృదయము రెపరెపలాడుతుంది) శాంతా! ఎందుకు కన్నీరు. నీ కష్టము ఏమిటి. చెప్పవూ. నేను నీమనస్సు కష్టపెట్టానా? చెప్పు! నేచేసిన తప్పువుంటే క్షమార్పణ కోరుకుంటా. అపరాధము క్షమించు. నీ మనస్సులోవున్నది చెప్పు. (శాంత మాట్లాడదు) - నీవు ఏవిధముగా క్షమార్పణ కోరుకోమంటే అలా చేస్తాను. ఈ స్థితి నేను చూడలేను.

ఒక్క పొరపాటు; ఒక్క వేగిరపాటు సమయంలో వచ్చాను. ఈనడవడిక నాకు క్రొత్త - శాంతా! నీ సంగతి చెప్పు.

శాంత:-(గొంతుక సవరించుకొని) మీకు క్రొత్త - నాకు అంతే (వెక్కి వెక్కి ఏడుస్తూ) నన్ను మోసముచేసి, నన్ను...తీసుకొనివచ్చారు...బలవంతము...చేశారు...ఎవరయినా...రక్షిస్తారని...వప్పు కున్నాను (అని మాట్లాడలేకపోవును)

వెంకట్రావు:-ఆలాగా - ఆలాగా... నేను మర్యాద కుటుంబానికి చెందినవాడిని. నేను నిన్ను రక్షిస్తాను - నన్ను నమ్మి...నిన్ను బయటపడవేస్తాను. చెప్పినటుల చెయ్యి. మనమిద్దరము వెళ్లిపోదాము.

శాంత:-అంత సులభముగాదు. బయటకువెళ్లుటకు వీలులేదు...కోటవంటిది. మిమ్ములను నమ్మవచ్చునా!

వెంకట్రావు:-శాంత! నిన్ను సోదరినిగా ప్రేమిస్తున్నాను. నా తుచ్ఛవాంఛలన్ని పోయినాయి. నిన్ను రక్షించుటే నాపని - నేను చేసిన పొరపాటునకు క్షమించు. ఒక్క హృదయదౌర్బల్యస్థితిలో యిటువంటి తలంపు పుట్టి, వచ్చాను.

శాంత:-వీరభాబు చాలా పలుకుబడి గలవాడు, కటికవాడు. చేతచిక్కినవారిని వదలడు. మీకు ప్రాణాపాయమురాగలదు. జాగ్రత్తగావుండాలి. - మా లలితచేత రేపుకబురు - వీలయినసమయమున కబురు పంపుతాను. మీరువచ్చి......

వెంకట్రావు:-సరే - ఈమాట ఎవరికిచెప్పకు - నా విలాసము యిదిగో(అని ఒక కార్డుయిచ్చును). రేపు కబురు పంపు.

శాంత:-స్త్రీలకు మానసంరక్షణ చేసినవారవుతారు. కమల స్త్రీరాక్షసి - కఠినహృదయురాలు. తియ్యటిమాటలతో వశీకరణతంత్రము ప్రయోగిస్తుంది. - తలచుకుంటే......అన్నకు - కుడిచెయ్యి - ఎందరి స్త్రీలను...... రేపు.

వెంకట్రావు:-నీసంగతి చెప్పవా ?

శాంత:-అన్నగారు - విడుదల అయినతరువాత - అంతవరకూ నన్ను నమ్మండి.

వెంకట్రావు:-సరే! శాంతా! నిన్నురక్షించుటకే కాబోలు నాకు హృదయ దౌర్బల్యము ఏర్పడినది - ఎన్నడు లేనిది.

శాంత:-నా అదృష్టము.

వెంకట్రావు:-చూద్దాము. (అని తలుపుతెరచి వెళ్లిపోవును.) (శాంత కంటినీరుతుడుచుకొని, అద్దములో అందముచూసుకొని, తలసవరించుకొని సంతోషముతో నిలువబడును. యింతలో కమల వస్తుంది.)

కమల:-శాంతా! ఆయనఏడి ?

శాంత:-వెళ్లిపోయినారు.

కమల:-కోపముగా లేదు గదా!

శాంత:-లేదు.

కమల:-తిరిగి వస్తానన్నారా!

శాంత:-వీలయితే - రేపు.

# అబలా బలాత్కార పాపఫలితము

కమల:-ఎంతనేర్పరివి అయినావు!యింతదానివి అవుతావని మొదటినుంచీ అనుకొంటున్నాను. నీఅందంతో రాజ్యాలు ఏలగలవు. (అని శాంత తలనిమురును.) రాత్రి విశ్రాంతితీసుకో. నీసంగతి మాఅన్నకి చెప్పాలి. మాఅన్న నిన్ను వరిస్తున్నాడు (అని వెళ్లిపోవును. శాంత దీపముఆర్పి - తలుపువేసుకొని నిద్రపోవును.)

## రెండవరంగము

[వెంకట్రావు యిల్లు. యింట్లో హాలులో వెంకట్రావు కూర్చునివుంటాడు- పడక. కుర్చీలో ఏమితోచనివానివలె వుంటాడు. అప్పుడే కచ్చేరీనుంచి వచ్చినాడు. సాయంత్రము ఆరుగంటలు అయింది. లలితవస్తుంది. భయపడినదానివలె కనిపిస్తుంది.]

లలిత :-అయ్యా, మీరేనా, వెంకట్రావుగారు. సాయంత్రము 7-30కు వీరబాబు యింట్లోవుండడు. శాంతమ్మగారు సిద్ధం (అనిచెప్పి గబ గబ వెళ్లుతుంది.)

వెంకట్రావు :-నవలలో ముఖ్యపాత్రమో స్తరు అయింది నాపని. శాంతను రక్షించాలి. వీరబాబుయొక్క వ్యాపారమును తుదముట్టించాలి. దీనికి పోలీసు సహాయ్యంకావాలి. వంటరిగాఅయితే వ్యవహారము ముదర గలదు. శాంతకును నాకును ప్రాణహానిరాగలదు. (ఆలోచించి) చిన్న చిన్న పోలీసులు, వీరిపలుకుబడిలో వుంటారు. పోలీసు సూపరింటెండెంటు నాస్నేహితుడు, అతని సలహాకోరుతాను. పోలీసు సిబ్బందితోవస్తే బాగుంటుంది. ఏలాగయినా శాంతను రక్షించాలి. [అని ఆలోచించి కోటు, మొదలయిన దుస్తులు వేసుకొని బయటికి వెళ్లుతాడు]

## మూడవ రంగము.

[వీరబాబు గృహము. పోలీసులు 50 మంది, మామూలు దుస్తులతో, ఆయుధ పాణులయి కాపలాకాస్తూవుంటారు. పోలీసు కమీషనరు స్వయముగా బందోబస్తు చూస్తూవుంటాడు. వెంకట్రావు నెమ్మదిగా వీరబాబు యింట్లోనికి వెళ్తాడు. వీల ఒకటి భద్రముగా చేతిలో పెట్టుకొంటాడు.]

కమీషనరు:-వెంకట్రావుగారు - జాగ్రత్త. విరబాబు దేనికీ వెనుదీయడు. యితనిమీద ఎన్నో హత్యలు చేసినట్లు అనుమానాలు వున్నాయి గాని బుజువులేక వూరుకున్నాము. ప్రాణహాని రాకుండా చూసుకొండి. కాస్త వీలు తప్పతే, వీలవేయండి. మీ సహాయానికి వస్తాము.

వెంకట్రావు:-చాలా జాగ్రత్తగా వుంటాను.

[లోపలికి వెళ్తాడు. అటు యిటు చూస్తూ వెళ్తాడు. శాంత ఎదురుచూస్తూ వుంటుంది. లలిత ఏదో పనివున్నదానివలె యిటు అటు తిరుగుతూవుంటుంది. యిల్లు అంతా దీపపువెలుగు. వెంకట్రావు యిదివరకు వెళ్లిన గదిలోనికి వెళ్తాడు.]

వెంకట్రావు:-శాంతా! లలితా!

శాంత:-(ఆదుర్దాగా లోపలికివచ్చి) వచ్చారా! అంతా సిద్ధమా. నన్ను రక్షిస్తారా! ఎంతసేపయినా కాలము జరుగలేదు. మీరు వస్తారని ఎదురుచూస్తున్నాను.

వెంకట్రావు:-మాటలకు సమయంకాదు. సిద్ధంగావున్నావా!

శాంత:-ఆ.

[యిద్దరు - వెంకట్రావు ముందర, వెనుక శాంత గదిలోనుంచి తొంగిచూచి - బయటికి వస్తారు. మెల్లమెల్లగా నడుస్తూవుంటారు.

కమల:-ఎక్కడికి - శాంత...(జవాబులేదు.) శాంతా! (అరుస్తుంది) శాంతా! వసుమతీ, పద్మా, రోజా! లలితా - శాంత పారిపోతున్నది - పట్టుకోండి. రండి......(యిటు అటు పరుగెత్తుతుంది. వెంకట్రావు శాంత పరుగెత్తుతుంటారు.)

వీరబాబు:-(చేతిలో పిస్తోలుతో ప్రవేశిస్తాడు. వెంకట్రావు ఈలవేస్తాడు. పోలీసులు లోపల ప్రవేశిస్తారు. వీరబాబు కాల్చపోతుంటే, అతని చేతిమీద ఢమా అని శబ్దము. చేతిలో పిస్తోలు క్రిందపడిపోవును. యిది అంతా హాలులో జరుగుతుంది.)

కమీషనరు:-అందరిని అరెస్టుచెయ్యి. ఒక్కరిని పోనివ్వవద్దు. వీరబాబూ. చివరకి చిక్కావు.

వీరబాబు:-నన్ను పట్టువాళ్లు ఎవ్వరులేరు.

కమీషనరు:-వీరబాబూ - ఎన్నిహత్యలు చేసావో, ఎంతమందిని అపహరించావో చెప్పు.

వీరబాబు:-మీచేతచిక్కి, కోర్టుకు ఎక్కు తేగదా మీ అనుజ్ఞ - పేపర్లలో వేయటానికి - మీకు కితాబురావాలంటే - చెప్తాను. ఈమధ్య రెండుమూడు సంవత్సరాలుగా జరిగే హత్యలు - ముఖ్యముగా స్త్రీ హత్యలలో నేను - (వెకిలినవ్వు నవ్వుతాడు) - ఈ చేతులతో చేసాను - ఎంతమంది స్త్రీలనో పడుపువృత్తి లోనికి దించాను - ఎదురుతిరిగినవారిని (తిరిగి నవ్వుచూ) హత్యచేసినాను - తెలసిందా - కాని నాప్రాణాలు నా చేతిలో వుంటాయి. ఎప్పుడు విషము నా జేబులో వుంటుంది. అవుసరమొచ్చినప్పుడు - (అని ఒక పొట్లము విప్పి నోటిలో వేసుకొంటాడు) - నన్ను పట్టువారు లేరు. (అని క్రింద పడిపోతాడు.) (యింట్లో అందరిని అరెస్టుచేస్తారు, శాంత, లలిత, వెంకట్రావు యింటికి వెళ్లిపోతారు.)

## నాల్గవ అంకము

### 1 వ రంగము

[వెంకట్రావు గృహము - యింట్లో శాంత, లలిత తప్ప వేరే ఎవరు లేరు. వెంకట్రావు కచ్చేరి చావిడి - చుట్టూ కుర్చీలు. నడుమ బల్ల. వెంకట్రావు, శాంత కూర్చుని వుంటారు. లలిత తలుపుదగ్గరగా నుంచొనివుంటుంది. భోజనములు అయినాయి. పగలు 11 గంటలు.]

శాంత:-నా జీవితంలో మీరొక దేవుడిలాగ వచ్చి నన్ను రక్షించారు. మీఋణము ఎలా తీర్చవలెనో తెలియదు.

వెంకట్రావు:-అలా చెప్పవద్దు. నీ ఋణము నేను తీర్చుకోలేను. నా భార్య సుశీల సాయంత్రంబండికి వస్తుంది. యిప్పుడే వుత్తరము వచ్చింది. సాయంత్రం, యింట్లో అందరిని చూసేవరకు, ఆమె తందనాలు చూడాలి. ఆమె ఈర్ష్య, చురచురలు, ఆమె నడత అంతా చరిత్ర వ్రాయవచ్చు.



శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

1940-వ సం॥ నకు 'గృహలక్ష్మి' సువర్ణకంకణ బహూకరణముచే
నీ మానినీమణిని గౌరవింప నిశ్చయింపబడినది.

# చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీశాఖ





గృహప్రవేశ మహోత్సవమునాటి దృశ్యములు

శాంత:-ఆమె పేరు.

వెంకట్రావు:-'సుశీల'

శాంత:-నేను ఎవరినని చెప్తారు, లలితసంగతి ఏమని చెప్తారు.

వెంకట్రావు:-నేను యింకా ఆలోచించుకోలేదు. సమయానుకూలంగా చెప్పాలి మరి. ఆమె బంధువులను వెంబడిపెట్టుకొని రావచ్చు. ఒక బి. ఎ. ప్యాసుచేసిన తమ్ముడు వున్నాడు. చురుకయిన పిల్లవాడు. యుద్యోగప్రయత్నంలో వున్నాడు.

శాంత:-పేరు.

వెంకట్రావు:-మధుసూధనరావు. వయస్సు 25 సంవత్సరాలు వుంటాయి. పెద్ద ఆశయాలు. సంఘసంస్కర్త కావాలని ఆశ. అందువల్ల వివాహము చేసుకోలేదు. వాడు వస్తే చలాకీగా వుంటుంది.

శాంత:-అంత విశదంగా చెప్తున్నారు. ఎందుకు?

వెంకట్రావు:-నీకు పెళ్లికాలేదు గనుకా, నీ గుణములు, నీ నడవడిక బాగా తెలిశాయి గనుక - అతని సంగతి నాకు బాగా తెలుసును గనుక - మీరిద్దరు సరి అయిన వుజ్జీలు అని నా యుద్దేశ్యము గనుక.

శాంత:-(సిగ్గుతో తలవంచుకొని) చూసినతరువాత ఒకరికొకరు నచ్చాలి గాని, ముందరేసంబంధము నిశ్చయించుతే ఏలా అండీ.

వెంకట్రావు:-నాకు యిద్దరు బాగా తెలసు గనుక - చెప్పాను. పందెము వేసుకో, మధుసూధన్ వచ్చినట్లయితే నీకు - వాడికి అనురాగము వుదయిస్తుంది.

శాంత:-సరేనండి పదిరూపాయలు పందెము. ఎంతగట్టినమ్మకం, చూద్దాముగా, మీకు నిద్దరవస్తున్నట్లు వున్నది. కాస్తపడుకోండి.

[అంత వెళ్లిపోతారు.]

## రెండవరంగము

[వెంకట్రావు గృహము - అంతాఆలాగే వుంటుంది. సాయంత్రము 6గంటలు, సుశీల, మధుసూదన్ వస్తారు. బండివాడు పెట్టెలు, మూటలు లోపల పెడుతూవుంటాడు. మధుసూదన్ ముందరహాలులోనికి వస్తాడు. వెనకాల సుశీల.]

వెంకట్రావు:-ఏవోయి బావా! నీవు వస్తావని అనుకున్నాము సుమా. నీవువస్తావని నీకు ఒక తియ్యని పదార్థము దాచివుంచాను. నీకోసమే సుమా. రుచిచూస్తే వదలవు, ఆతీపు నిన్నువదలదు. సుశీలా - ఒక రహస్యము. యింట్లో యిద్దరుస్త్రీలు వున్నారు. ఒకఆమె శాంత. జరిగినసంగతి తరువాతచెప్తాను. గాని - ఈ లోపల చిందులు, గంతులు వేయవద్దు.

సుశీల:-అంతవరకువచ్చింది. ఆతాయం మధుసూధన్కోరకు తెచ్చారా!

వెంకట్రావు:- తెలివి తేటలు ఆలావుండాలి. అంటే నీ చలాకే ఎవరికిరాదు.

సుశీల:-మొదలు, రారా! మదుసూధన్ లోపలికిపోదాము.

[అంతా వెళ్లిపోతారు.]

## మూడవరంగము

[అంతా కూర్చునివుంటారు. మధుసూదన్, సుశీల, శాంత, వెంకట్రావు.]

వెంకట్రావు :- (నవ్వుతూ)శాంత - పదిరూపాయలు ఎప్పుడు యిస్తావు?

శాంత :-(నవ్వి వూరకుంటుంది)

మధుసూదన్ : (శాంతవంక చూస్తాడు. చూపులు కలసుకొంటాయి. నవ్వుతూ) బావా నాదగ్గరనుంచి పదిరూపాయలు తీసుకొంటావు టోయి.

వెంకట్రావు :- నిన్ను ఎవరు యిమ్మన్నారోయి.

మధుసూదన్ :- మేము ఎవరము యిచ్చినా ఒకటేగా.

వెంకట్రావు :-అలాగా అయితే ఎప్పుడు - ఆర్యసమాజము పద్ధతిని చేసుకొంటారా?

[మధుసూదన్ శాంత, ఒకరివంక ఒకరు ఓరచూపులు చూసుకొని నవ్వుకొంటారు.]

మధుసూదన్ :-అవును.

వెంకట్రావు :-అయితే వృద్ధదంపతుల దగ్గర మాటయివ్వండి. సుశీలా యిలారా.

[నలుగురు నుంచుంటారు. మధుసూధన్ చేతిలో శాంత చెయ్యిపెట్టాడు.]

ఒకరిని ఒకరు నిర్మలహృదయంతో ప్రేమిస్తున్నారు గదా!

మధుసూదన్ - శాంత :-అవును

అన్యోన్యముగా, ఒకరిమనస్సు ఒకరు కనిపెట్టి భార్యాభర్తలుగా వుండుటకును, ఆర్యసమాజికపు పద్ధతిని వివాహము చేసుకొనుటకు, మీకుయిద్దరుకు అంగీకారము గాదా !

మధుసూదన్:- శాంత అవును.

వెంకట్రావు :-సుశీల - మనబొమ్మల పెండ్లి జరిగినపుడు, ఈ ఒప్పదల లేదుగదా.

సుశీల :-పెద్దరికంవహించిన తరువాత చిలిపిగుణాలు మానండి.

[అంతా ఏదోకబుర్లు చెప్పుకుంటూ వెళ్లిపోతారు.]



# విజ్ఞాన తత్త్వం

"వసంత"

●

అప్పుడే రెండుమూడు రోజులై గృహిణిచిత్తం అన్యాయత్తమైన సూచనలు పొడ కట్టుతున్నవి. దీర్ఘాలోచనానిమగ్నురాలై గృహకృత్యములందుకూడ ఏమఱుట స్పష్టమగుచున్నది. కారణమేమో మాత్రం నికరంగా తెలియడంలేదు. ఆ అస్వాస్థ్యం శారీరకమో మానసికమోకూడ బయలుపడనప్పటికి, మానసికమనుటకు ఆధారములగుపడుచున్నవి. అవకాశం చిక్కినప్పుడల్లా నాతో ప్రసంగించపోతుండడము, తగ్గి వెనుతిరిగి పోతుండడము నేను కనిపెట్టుతున్నాను. విషయం నా ఊహకూ అందడంలేదు. కాని, లేనిపోని చిల్లర కోరికలచే హృదయం కలచుకొనే నైజంకాదామెది. దేనిగూర్చి అంతగా లోలోన కుములుతున్నదో ఎరుగుటకు నేనూ నిదానంగా పరిశీలిస్తున్నాను.

ప్రొద్దుక్రుంకకమునుపే పిల్లలంతా భోజనాలుచేసి పటాకీలు కాల్చుకొను సన్నాహంలో నున్నారు. మా భోజనాలుకూడ వేళగలగానే అయినవి. వీధిలోనున్న బుడుతలందరు ఎవరింటి గుమ్మందగ్గర వారు రంగురంగుల మహతాబాలు, చిచ్చుబుడ్లు వెలిగించి అమందానందమొందుతున్నారు. సుమారు 10 గంటల పర్యంతము బాణసంచు గాల్చి, తారాజువ్వల భయంచేత ఇండ్లలోనికి పోయినారు. ఏమనగా, హృద్యమైన బాణసంచు కాల్చుకొన మిషమీద వేలకొలది తారాజువ్వలు కట్టి పాతకావేషీలున్న ముష్కరులు వాటిని శరసన్నిభంగా ప్రయోగిస్తూ ఏ బయలుమీదనో సంగ్రామంలోనికి దిగేవేళ కావచ్చింది. ఆ ముష్కరుల కర్కశహృదయాలు దయాదాక్షిణ్యము లెరుగవు. బాలురు వీధిలో దీపావళీ సంబరంలో నున్నారని తెలిసినప్పటికి వీధి మళుపువద్దనుండి భూమిని తాకి పరుగిడునట్లు తారాజువ్వలు వదలుట వారికి పరిపాటు. అందుచేత, 10 గంటలయినంతనే సామాన్యంగా పటాకీలతంతునుండి విరమించి ఎవరిమట్టుకు వారు ఇండ్లలోనికి పోవుట ఆచారమైనది.

కోటలో 11 గంటలు కొట్టేరు. నిద్రమత్తుగా ఉంటే పుస్తకంమూసి మంచంమీద వెన్ను వాల్చేను.

'ఏమండీ?'

'ఆ.'

'ఏ అనర్థం మనకు వాటిల్లినా 'స్వయంకృత' మనుకోమన్నారుకదా, మన ఇష్టానిష్టములతో జోక్యంలేకుండా ఏదీ సంభవింపదని, మనం సర్వశక్తిమంతులమని నమ్మమంటారా?'

'లేదు. అట్టి నమ్మకంకూడ మన వినాశకారణమని సవిస్తరంగా ఇదివరకే హెచ్చరించాను. మనం సర్వజ్ఞులమనుకోకూడదు. కేవల మజ్ఞులమనుకోరాదు. ఈ జగత్తులో అనేకశక్తులు విహరిస్తున్నవి. గురుత్వాకర్షణము, విద్యుదయస్కాంతత్వము, ఉష్ణము, తేజస్సు, శబ్దము ప్రభృతిశక్తులు వాస్తవంగా మనప్రసక్తిలేకుండనే స్వకార్యనిర్వహణంలో అప్రమత్తములై ఉన్నవి. ఆ మహాశక్తులకు మానవుడొక లెక్కలోనికి రాడు. కాని, మానవునిలో అంతర్నిహితంగా ఉన్న శక్తులు సైతం సామాన్యమైనవి కావు. వాటి సామర్థ్యానికి మేరలేదు; వాటి ప్రభావానికి అంతులేదు. అయినప్పటికి, తానజేయుడనని గర్వించడము స్వాభ్యున్నతికి అనుకూలంగాదు.'

'బాహ్యశక్తులకు లోకువయే స్వశక్తి ఎంత అపారమైనా ఏమిప్రయోజనమండీ?'

నా హృదయాకాశంలో చట్టన నొక భావతటిల్లత మెరసింది. పత్నీ వ్యాకులతకు కారణం బోధపడింది. విజ్ఞానతత్త్వం చర్చించి మూడువారములు గతించినవి. విషయమేమో క్లిష్టమైనది. కాని, నేచెప్పినవి చర్చాంతమున తాత్కాలికంగా ఆమోదింపబడ్డవి. పురుషునికైనా, స్త్రీకైనా మానసిక వికాసార్జనంలో అభినివేశమున్నపుడు క్రొత్తవిషయాలనుగురించి చిత్తం యోచనాయత్తమై ఉండకతప్పదు. అట్టి ఆసక్తికి సైతమొక వ్యసనవలె వ్యక్తియొక్క హృదయాగ్ని తనపై లగ్నమగునట్లు ఆకర్షించు స్వభావం గలదు. నాటి విషయాలగూర్చి నిశ్చితాభిప్రాయానికి రాలేక కాబోలు గృహిణి రెండుమూడు రోజులై వ్యాకులతనొందుచున్నదని ఊహించుకొన్నాను. ఆ యోచనాకల్లోలములబడి ప్రత్యుత్తరమీయలేదు.

'అంతేనా, స్వశక్తి నిష్ప్రయోజనమని ఒప్పుకొంటారండీ?'

'ఏమంటావు?'

'మాన మర్ధాంగీకారసూచకమని.'

'కావచ్చును. ఈ సందర్భంలోమాత్రము కాదు. అట్లు ఒప్పుకొన్న పక్షమందు ఇంత వాదమున కవకాశమేలేదు. నేను చెప్పిన విషయం వాస్తవానికతి సూక్ష్మమైనది. ఆ విషయచాతుర్యం హృదయానికి హత్తుకొనుటకు ఒకవిధమైన మానసికావస్థ మనం కల్పించుకొనవలెను. మనం సముపార్జించిన జ్ఞానమే పరమసత్యమను నిశ్చల విశ్వాసంతో విషయపరిశీలనకు పూనుకోరాదు. పూతజీవుల మహామనీష విశిష్టసమయాలలో దివ్యశక్తి

ప్రేరకమున తేజోవంతమై, అజ్ఞానాంధకార పటలమును ఛేదించి కనుగొన్న నూత్నవిషయములు ఆదినుండి వర్షజలబిందువులట్లు చేరిచేరి ధారావాహికంగా వస్తూన్నదే మానవ జ్ఞానము. అది సర్వకాలములకు ఉపచరించు నిత్యరాశికాదు. ఒక్కొక్క ధీశాలి తన అపార మేధాశక్తిచే అకస్మాత్తుగా జ్ఞానవాహినిని క్రొత్తవంకతిప్పినట్లు చరిత్రనుండి తెలిసికొనగలము. కాని, అట్టి ఆవర్తము జ్ఞానాభ్యుదయమునే సూచించునని ఎరుగవలెను. ఒక కాలంలో సూత్రంగా, నియమంగా పరిగ్రహింపబడిన విషయము కొంతకాలమగుసరికి సూత్రలక్షణం గోల్పోయి స్థానభ్రష్టమొందినదంటే అప్పటి ఉపచితజ్ఞానానుసారంగా ఆ సూత్రము వర్తింపదని తదనుగుణ్యంగా సూత్రమును సవరింపవలెననియే భావము; జ్ఞానము సమగ్రమగుచున్నదనియే చిహ్నము. ఈ ధర్మవిశేషము విజ్ఞానంలో పదేపదే సంభవించుచుండును.

తూర్పునుండి పడమరకు వైభవోపేతంగా గమించు సూర్యుని పగలు, తారాగణమును రాత్రి గాంచుచున్న జనులు సూర్యతారకలే నభోమార్గమున భూమిచుట్టు భ్రమించుచున్నవని ఆదిని భావించిరి. అనంతరము, సూర్యునాశ్రయించి తిరుగుచున్న గురుశుక్రాది గ్రహములలో భూమి సైతమొక గ్రహమని గ్రహించినపుడు, సూర్యుడు స్థిరముగనున్నాడని, భూమి సూర్యునిచుట్టు సంచరించు సందర్భమున సూర్యుడే పరిభ్రమించుచున్నట్లు గోచరిస్తున్నదని వెల్లడియైనది. రానురాను, సూర్యుడును స్థిరుడుకాడని, గ్రహసమేతుడై ఆకాశమార్గమున యాత్రచేస్తున్నాడని బయలుపడినది. ఇకముందు మనభావములెట్లు పరిణామమొందునో! కాలగర్భములో నెట్టి విశేషములు దాగియున్నవో చెప్పలేము.

అచలవిశ్వాసము మతముపట్లకూడ పనికిరాదు. ఒక ఉదాహరణపూర్వకంగా దాని సత్యము చూపెదను. భూమికి ఊర్ధ్వలోకమై స్వర్గము, అధోలోకమై నరకము నిర్మింపబడినట్లు జనసామాన్యానికి నమ్మకమున్నది. కాని, ఆకాశంలో భూమి అనావలంబముగా భగణముచేయుచున్న గోళమని తెలిసినతరువాత ఆ భావమునకు తావులేదు. అయినప్పటికి విశ్వసింపక తప్పదన్నప్పుడే చిక్కు కలుగును.'

'అయితే, భగవద్గీతలోని 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం...' అను శ్లోకం చదువుచుంటారే! శాస్త్రం ప్రమాణంకాదని మీరిప్పుడు చెప్పుచున్నది దానికి విరుద్ధంగాదండీ?'

'చక్కగా ప్రశ్నించావు. 'శాస్త్రము'ను ప్రమాణంగా అంగీకరింపవలసినదే, నిజమే. కాని ఆ 'శాస్త్ర' మేది? శ్లోకరూపంగా పురాతన పుస్తకాలలో లిఖితమై ఉన్నదేనా అని ప్రశ్న. అందుకనే, మానవజ్ఞానము సుస్థిరమైన నిత్యరాశికాదని చెప్పేను. మానవజ్ఞానమొక వ్యక్తియొక్క సొత్తుకాదు, ఒకకాలంయొక్క ఏకాధికారంగాదు; ఒక

వీధితలుపు దబదబ బాదిన చప్పుడైనది. అందరు గాఢనిద్రలో నున్నారుకదా అని క్రిందకుపోయి తలుపు తెరచునరికి పొరుగింటి పిల్లవాడు తేలుకాటుచే వెక్కివెక్కి ఏడ్చుచు గుమ్మంవద్ద కూలబడి ఉన్నాడు. తేలు పాదంపై పొడిచింది. కాని, విషము కాలంతయు ప్రాకింది. నీరుతెచ్చి మంత్రించగా సుమారు పదినిమిషాలకు కాని బాధ పూర్తిగా నివారణకాలేదు. కుర్రవానిని పంపి, గదిలోనికి వచ్చునరికి గృహిణికి నిద్రపట్టింది.

బహుమానరాజమగు నోబెల్ బహుమానమును రెండుసార్లు పొందిన జగద్విఖ్యాత జనని క్యూరీసతి చరిత్ర చదువుచున్నాను. రేడియం అను లోహమును తయారుచేయుటకు భర్తకు సహకారిణిగా ఆమె పడినకష్టము వర్ణనాతీతము. ఆమెకు బహుమానాపేక్ష లేదు. అమూల్యమగు ఆ లోహమును విడతీసి జ్ఞానాభివృద్ధికి, నూతన భాగ్యోదయమునకు తోడ్పడవలెనన్న పవిత్రాశయమే ఆమె నావహించినది. ఆమె కుమార్తె జోలియోసతి 1935 లో తనభర్తతో నోబెల్ బహుమానమును పాల్గొన్నది సెబాస్!

భారతనారీమణులలో అట్టి ధీవిశాలురు లేరా? లేకేమి! వారి ధీశక్తిని సంఘ శృంఖలములు బంధించినవి. ఆ శక్తికి దిగంతములు ప్రసరించు సామర్థ్యములేకుండ మతము, సంఘము కలసి కుట్రపన్నినవి కావచ్చును. కాని, ఈ బంధనములు కాలప్రవాహ బలమునకు ఆగలేవు. అంతశ్శక్తి ద్విగుణీకృతంగా విస్తరించు రోజులు త్వరలో రాగలవు.

## 'గృహలక్ష్మి'

బంధురానందకందమై వరలునట్టి
నీదు సహజసౌందర్యంబు నెవరు వర్ణ
నమ్మొనర్పఁగఁలరు భళీ! బమ్మ సమ్ము
దమ్మలరఁ దయారొనరించె నమ్మ! ముద్దు
గుమ్మ నిన్ను; సుదృష్టినిఁ గోమలాంగి!
నీవు గరపెడి నీతులు నిర్మలమగు
స్త్రీల కుపయోగపడునట్టి చెన్నలరెడు
కథలు, పాఠక హృదయరంగాంగణాంత
రమున నిరతమ్ము నాట్యముల్ సలుపుఁగాదె?
కోవిదులు నిన్ను మెత్తురకుంఠితగతి
కులుకుపలుకుల పలుకు కోకిలవు నీవు
మేలు 'గృహలక్ష్మి!' మాపత్రికాలలామ
మా! భవత్కీర్తి నటియించు నఖిలదిశల.

—శ్రీ ఆలపాటి కామేశ్వరరాయకవి.

# ఆనంద సంసారము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

'హరేరామ! హరేరామ! రామరామ! హరే! హరే!'

'ఆపద్బాంధవా! అనాథరక్షకా! ఆర్తశరణ్యా! అక్రూరవరదా! ఆదిమధ్యాంతరహితా, కృష్ణా'
అంటూ తెల్లవారగట్లనే లేచి భగవన్నామస్మరణచేయుచు, దినకృత్యములు చేసుకుంటుంది సీత. సీత భర్తపేరు
రాముడే కాని, దశరథరాముడువంటివాడు కాడు. బండరాముడు. పరమనాస్తికుడు. అయితే, అక్రమ
ప్రవర్తన, మోసము, అసత్యము మాత్రంలేదు. అందుచేతనే 'కరకుమనిష'ని లోకులందరు మెచ్చుకుంటారు.
సీతారాముల సంసార మనుకూలంగానే జరుగుతోంది. వారికి పెద్దయిల్లు. దానికితగ్గ దొడ్డి, దొడ్డికితగ్గ పుష్ప
ఫలవాటికలు, పొదులు, కొబ్బరి, మామిడి, నారింజ, బత్తాయి, సపోటా మొదలగు ఫలవృక్ష సదుపాయాలు
కలవు. అవి కన్నులపండువుగా పెరుగుట చూడగా ఆ కుటుంబము వారికుండే శ్రద్ధ అపారమని తెలియు
చుండును.

"విజ్ఞాన నిలయము"

ఆ దంపతుల కిద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలరు. కొడుకుల్లో కృష్ణుడు పెద్ద. తర్వాతది
కమల కూతురు ఈ యిద్దరికే వివాహాలయ్యాయి. తర్వాత వాడు మాధవుడు పదేండ్లవాడు. లక్ష్మి, సుమి
త్రలు ఆఖరిపిల్లలు, ఎనిమిది, ఆరు ఏండ్ల కన్యలు. కమల అత్తవారింటికి వెళ్లినది. పెద్దకొడుకు భార్యతో
చెన్నపట్నంలో బి. ఏ. ఆనర్సు చదువుచు కాపురమున్నాడు. అల్లుడు మదుసూధనరావుకూడా చాలా మంచి
వాడు. రాజమహేంద్రవరంలో క్రొత్తగా ప్రాక్టీసు పెట్టి, ఎం. బి. బి. యస్. డిగ్రీ బల్లకట్టి డాక్టరుగా
యున్నాడు.

ఇంతలో, శరదృతు చిహ్నలంతరించి, హిమవంతఋతువగు మార్గశిరమాసమొచ్చింది. సుబ్రహ్మణ్యేశ్వ
రుడి షష్టినాడు సంకురాత్రినెల పట్టారు. వేణుగోపాలస్వామి కోవెల్లో ప్రభాతసేవ, జేగంటలు మ్రోగు
చున్నాయి. ఉదయానికి ముందే, పూజానివేదికము లగుచున్నాయి. ప్రసాదాలకి పిల్లలు, కాఫీహోటళ్లకు
నిండుచున్నట్లు నిండుచున్నారు. శైవులకు, అరటిపళ్లు, కొబ్బరిముక్కలే, విష్ణుభక్తుల కనేక భక్ష్యాలు దొరుకు
తాయి. అద్వైతులకు రెండూ ఒకటే గాన, కార్తీక మార్గశిరమాస ప్రసాదములు సమానస్వీకరణములే గాన,
వారి పనే మెరుగన్నారు కొందరు.

సీత, చిన్నకూతుళ్లు తెల్లవారగట్లే, చలికి జంకక, తల్లితోనే లేచి, తమ చిన్నచేతుల్తో, వీధిగుమ్మం
లోను, పెరట్లోను ముగ్గుల రంగవల్లులతో, తమ చిత్రకళా నిపుణత్వం చూపించుకొనుచు, పోటీలుగా ముగ్గుల
మయంచేసి, గొబ్బిళ్లు పెట్టుకొంటూ, రంగురంగుల బంతిపూలతో గొబ్బిళ్ల నలంకరించుకొనుచు, మురుస్తు
సందడిచేస్తున్నారు. మాధవుడు కుర్రాడు, మగపిల్లడు కాబట్టి తండ్రి జత. అందులో పరీక్షలై, క్రిస్టమస్
సెలవులిచ్చారు. కావలిసినంత అల్లరి. చెల్లెళ్ల ముగ్గులు చెరిపో, వారి గొబ్బిళ్లు తొక్కో వాళ్లని విసిగించి
ఏడ్పించుట, తండ్రితో కలసి, తల్లిని కాఫీ ఫలహారాలకి తొందరచేయుట, మొదలగు విసుగెత్తే అల్లరు
రామారావుకి
చేస్తుంటాడు. ఈ పేడదేముళ్లు, ముగ్గుల చాకిరి, పెళ్లాం స్నానాలు, పూజలు, ఉపవాసాలు

కిట్టవు. ఈయొక్క విషయంలోనే ఆ దంపతులకు భేదభావంకాని, మిగతా గృహోచిత ఖర్చు వెచ్చాలలో ఏ పొరలు లేవు. అనుకూలమే. క్రిస్టమస్ సెలవులకి, భార్యతో కృష్ణుడింటికి అమలాపురం వచ్చాడు. ఒక్క, కమలా, అల్లుడే వారి కుటుంబంలో లోటు. అందుకని సీత భర్తచే అల్లుడికి కమలతో ఈ సెల్లాళ్లు యుండి వెళ్లమని యుత్తరం వ్రాయించింది. అల్లుడు కూతురు వస్తారని, కొడుకు కోడలు వచ్చారని పెళ్లి పనుల్లా అన్నీ అమర్చిపెట్టింది సీత. రామారావుగారికి అమలాపురం హైస్కూలు టీచరు పని. నెలకేబదిరూపాయిలు జీతం. భూములమీద సంవత్సరానికి వెయ్యిరూపాయిలొస్తాయి. వారికే లోటులేదు. సిరీసంపదాకూడా అనుకూలం గానే యుంది. ఉన్నవాళ్లమన్న గర్వమేమీ వారికిలేదు. తల్లి చాలే ఆడపిల్లలకి వాళ్ళ యీడుకుతగ్గ చదువులు చదువుకుంటున్నారు.

౨

‘కమలా, మీ నాన్నగారు ఉత్తరంవ్రాశారు. రేపే మన ప్రయాణం. మీ అన్నయ్య, వదిన వచ్చారుట, మీ చెల్లెళ్లు గొబ్బిళ్లు, ముగ్గులు పెట్టుకుంటున్నారుట, అక్క బావ రావాలంటున్నారుట, మీ అమ్మ నీకోసం పలవరిస్తూందట. దసరా పండుగెళ్లి మూడునెల్లైనా కాలేదు. అప్పుడు వెళ్లివచ్చినా, నిన్నుచూచి చాలా నెలలైనట్లుందని, ఈ సెల్లాళ్లు, పండుగెళ్లి, నీ సావిత్రీ గౌరీనోములైయేవరకుంచమని వ్రాశారు. నేనిప్పటినుండే వచ్చి నీతో యుండడానికి, వైద్యుణ్ణగుటచే వీలులేదు కదా? రోగులే నా పిల్లలు. నన్నే నమ్ముకొన్న పేషెంట్ల బిడ్డలనువిడిచి నేను రాజాలను, నిన్ను మీవాళ్లింట్లో దింపి, నేను వచ్చేసి, తిరిగి పండుగ నాటికొస్తాను. పెట్టె సర్దుకో’మన్నాడు. మధుసూధనరావు కమలతో. కమల ముఖము కమలంలాగే సంతోషం చేత వికసించింది. ఆడవాళ్ళకు పుట్టింటి ఆశ అంతటిది. గబగబా పెట్టె సర్దేశింది. కాఫీ ఫలహారాలు చేసింది. వంటచేసి భర్తకెట్టింది. మధ్యాహ్నం స్టీమరుకు ప్రయాణసిద్ధమైంది.

ఆనాడు ముక్కోటి ఏకాదశి, రాజమండ్రి బజారుమొదలు కోటిలింగాలరేవువరకు, రామభజన సెట్ల తోను, వాహనాల యూరేగింపులతోను, స్నానములుచేసి, దేవాలయములకెళ్లే ప్రజలతోను వీధులు క్రిక్కిరిసి యున్నాయి. దగ్గిర యూళ్ళజనం, ఆ రోజుననే విడుదలై నాలుగైదు ఆటలు వేయుచున్న “పాండురంగ” సినీమా చూచుటకై కార్లమీద నిండి వచ్చుచుండిరి. జనసమ్మర్ధముతో ఎడతెరపి లేనందున, రాజమండ్రి కన్నులపండువగా పండ్లతో నిండిన వృక్షంలాగ కలకలలాడుచుండెను.

మన కమలా మధుసూదనరావులు, స్టీమరుపై బొబ్బర్లంకజేరి, అక్కడ అమలాపురం వెళ్లే కారెక్కిరి. దారిపొడుగున పల్లెటూళ్లు తగులుచుండును. సంక్రాంతి ముగ్గులు, బంతిచెట్ల సొబగులు, చేమంతిపూల సౌందర్యము, ధనుర్మాససేవలు చూడాలంటే పల్లెటూళ్ళలోనే చూడాలి. పట్నవాసస్థులకు పనిబద్ధకము, మతవిషయక ఉపేక్ష యెక్కువ, పల్లెటూరి పడుచులు చలికి వెరవరు. గోడలలికి వెల్లలువేయుట, మట్టి అరుగు లకు జేగురుపూసి చుక్కలెట్టుట, ముంగిళ్లు అలికినట్లుగా నున్నగాతుడిచి కళ్లాపులుచల్లి చిత్రచిత్ర ముగ్గు లెట్టుట, పాడి, పంట జాగ్రత్తపెట్టుకొనుట, వంటలు వగైరాలు చల్లలు చూచుకుంటే, పిల్లలు గొబ్బిళ్లు పెట్టు కొనుచు, పూలుకోయుచు, పనిలో తల్లులకు సహాయంచేయుచు ఆడుకుంటూ, బాల్య సౌఖ్యజీవితంలోని హాయి ననుభవిస్తూ, ఆరోగ్యజీవనం గడుపుకుంటారు. రోగాలు తరుచు, పట్నంలోనివాళ్ళకుమల్లె వాళ్ళని చుట్టుముట్టవు. స్త్రీలు, పురుషులు, బాలబాలికలు ఇంటి పాడి, పొలంపంట, పెరటికూరలు తిని, దుంపల్లా యుంటారు.

# ఆనంద సంసారము

అల్లాంటి దృశ్యాలన్నీ భార్య కమలకు చెప్పుచూ, మహానందంగా, ప్రకృతిసౌందర్యం చూస్తూ, పండి కోతకొచ్చిన పంట మహాలక్ష్మి సొబగు కాశ్చర్యపడుచూ, సాయంకాలానికి అత్తారింటికి చేరుకొనిరి. స్త్రీలకి కూతుళ్ళమీద, అల్లుళ్ళమీదను, పురుషులకు కొడుకు కోడళ్ళమీదను మమకారం ఎక్కువ. ఇది నైజము. గాన, సీత, కూతురు, అల్లుడు వచ్చారని అతి సంతోషంతో ఎదురొచ్చి తీసుకెళ్లింది. లక్ష్మి, సుమిత్రలిద్దరు, మాధవుడు బావ బావ అంటూ వెంటబడ్డారు. కృష్ణుడు బావను జబ్బపై చేయివేసి కుశలప్రశ్నలు వేశాడు. కోడలు పెద్దాడబడుచును హాస్యంగా మర్యాదచేసి పీటేసి కూర్చోపెట్టింది. ప్రొద్దున్ననగా తినివచ్చారని, సీత చప్పున, ఫలహారం కాఫీచేసి, కూతురికి అల్లుడికి పెట్టి, వంట పెందరాళే చేయుటకై వంటింట్లోకి వెళ్లింది. ఇంతలో రామారావుగారొచ్చి అల్లుని పలకరించి, కూతురును లాలించి, అందరిని సావిట్లోకి తీసుకొనిపోయి, కబుర్లతోను, హాస్యాలతోను, నవ్వులతోను, గృహానందసౌఖ్యం అనుభవిస్తున్నారు. యజమానురాలికి వంటపనులతో తీరికే యుండదు. కోడలికి పైచాకిరి.

ఈలా పదిరోజులు గడిచాయి. కోడల్ని పండుక్కు పంపమని అన్నగారువచ్చి బావనుకూడా ఆహ్వానించారు. కృష్ణుడు 'మా బావ చెల్లెలు వచ్చారు. నేను రాన'న్నాడు. అందరాశ ఒకటేయని, సీత ఆలోచించి, కోడల్ని అన్నగారితో పంపించింది. వివేకవతి ఇట్లే ఆలోచిస్తుంది. ఇంకో మూర్ఖగయ్యాళి అత్తగారైతే, మా యింటి చాకిరికి సహాయంలేకుండా, కూతుళ్ళను కూర్చోపెట్టుకోవాలని, కోడల్ని పంపనని పట్టేపట్టును. సీత అట్టివారిలో చేరదు. అల్లుడు కమలను దిగవిడిచి పండుగనాటికొస్తానని నాల్గురోజులుండి వెళ్లేడు.

ఇంతలో పండుగ దగ్గిరకొచ్చింది. నిత్యం శివకేశవులు, మేళతాళాలతో ఊరేగి ప్రజలందరికి అయాచితదర్శనభాగ్యం యిస్తున్నారు. లక్ష్మివిజయలు, బొమ్మలకొలువు పెట్టుకున్నారు. సంధెగొబ్బి సందడొకనాడు జరిపారు. చెలికత్తెలను తీసుకొచ్చి బొమ్మలకారతు లిచ్చుచు, ప్రసాదాలు పంచిపెట్టుచు సందడిగా యుంటూంటే మధ్యమధ్య మాధవుడు చిలిపిలా వాళ్ల బొమ్మలనులాగో ప్రసాదంఅంతనూతినో చెల్లెళ్లను విసిగిస్తూ
తల్లిచేత అన్నచేత చివాట్లుతింటూ తండ్రిచేత ఆదరింపబడుతూ అల్లరిచేస్తూయుండెను. భోగినాటికి తిరిగి
అల్లుడొచ్చాడు. తలంటులతోను, భోగి, పులగం పరమాన్నంతోను ఆనాడు గడిచింది. మధ్యాహ్నం విజయకు
బొమ్మలకు పళ్లుపోసి ఊరంతా స్త్రీలనుపిలచి వాయినాలు పళ్లుతాంబూలాలిచ్చి సత్కరించారు. పెద్ద
పండుగ, పెద్దపిండివంటలు, అల్లుడికి, కూతుళ్లకు, కొడుకులకు, భార్యకు, రామారావుగారు నూతన వస్త్రాలు
తెచ్చి కట్టబెట్టారు. ఖద్దరే వారింటికట్టుబట్టలు. దేశీయాభిమానులగుట జాతీయతవారింట్లో తాండవిస్తూంది.
అల్లుడికి అలకలేదు కూతుళ్లకు మూతిబిగింపులులేవు. ఈలా పండుగ బ్రహ్మానందంగా జరిగింది. ముక్కనుము
నాడు కమల సావిత్రిగారి నోము పట్టింది.

డాక్టరగుట మధుసూదనుడు వెళ్లిపోయాడు. బ్యాండువాయిద్యాలతో కుమ్మరింటికేగి సావిత్రి గారి
బొమ్మలను తెచ్చుకొని ఆవీధి యువతులందరూ సీతగారింట్లోనే సావిత్రీగారిని నిలిపారు. తొమ్మిదిరోజులు
బొమ్మలను తెచ్చుకొని ఆవీధి యువతులందరూ సీతగారింట్లోనే సావిత్రీగారిని నిలిపారు. తొమ్మిదిరోజులు

తొమ్మిదిపిండివంటల నివేదనలతో నోముసమాప్తమైంది. పదవరోజునకాలువకు అమ్మవారికి బుక్కాభగ్గుండి
బంతి, చేమంతి, గులాబిపూలుకలిపి జల్లుచూ ఊరేగింపుతో తీసుకెళ్లి వాళ్లాడించారు. పెరుగులోని అటుకు
లందరికి పంచి ఇండ్లకేగి అమ్మవారికి లాలిపాడి, ధన్యులైరి.

ఉత్తమసతికి భర్తృసన్నిధినివాసము, అత్తమామల సేవచేయమని యొకరులుచెప్ప నవసరంలేదు. ఆహ్వా
నించుట పిలిపించుకొనుట అసలేకిట్టదు. అట్టి ఉత్తమసతీతిలకమగు సీతకూతురు తల్లిచాలే భర్త తిరిగిరమ్మని

వ్రాయాలని తలచకుండానే స్వతంత్రముగా తలిదండ్రుల సెలవుపొంది అన్నగారిని తీసుకొని రాజమహేంద్రవరం జేరుకొనెను. అల్లే కోడలుకూడ పిలువకుండనే సీతగారింటికి నోములయిన వెంటనే ప్రవేశించెను. సెలవు లగుటచే కృష్ణుడుభార్యను తీసుకొని పట్నం ప్రవేశించెను. అందరూ వెళ్లడంతో సీతగారిల్లు చిన్నబోయింది. పిల్లలసబడులు తెరిచారు. ఇంట్లో అల్లరుతగ్గాయి. శనిగాడు ప్రవేశించని గృహాలిల్లే ఆనందగాను జయప్రదంగాను యుంటాయి. శిశిరఋతువు తర్వాత వసంతశోభ మోడుమ్రాకులు చిగురించి వెండిమొగ్గలుతొడిగి వసంతలక్ష్మి వికసితానందవదనయై నేత్రానందకరంగాను ఆనందగృహాల్లాగ కలకల్లాడుచుండును. ఇట్టి ఆనందభవన నివాసులగు గృహలక్ష్మీ యజమానులకు భూలోకస్వర్గమదేకదా ? జన్మ మెత్తినందులకు జీవులువాంఛించునదే జీవితానందము. భగవదోపాసకుల కట్టి అమృతప్రేమ లభించును. ఈ పండుగ సౌఖ్యంతో రామారావుకూడా ఆస్తికుడయ్యాడు. సీత తుదికోరిక నెరవేరింది. భక్తురాలు భక్తునిలో లీనమయింది.

భార్యాభర్తలమాట యేకమైనచోట యేకార్యము తలపెట్టినా నెరవేరుతుంది. సీతకు ఊరికేకూర్చుని యుండుట కిట్టదు. రాజమహేంద్రవరంలో చాలాచోట్ల లలిత చిత్రకళలు స్త్రీలకొఱకు స్థాపించుట, కొన్ని గవర్నమెంటువారు ఆమోదించి గ్రాంటుకూడా యిచ్చుచు వృద్ధిపరచుట మొదలగు సంగతులు కూతురుకమల తల్లికి చెప్పుటచే సీత తానుకూడ అట్టి నిలయమొకటి స్థాపించి అక్కడి బాలికలనుకూడ కళాకోవిదులను చేయదలచింది. కొంతసొమ్ము పెట్టుబడిపెట్టి తన సావిడిగదిలో ఏర్పాట్లన్నిచేసి చుట్టుప్రక్కల పిల్లలను పోగుచేసి తనకొచ్చిన కుట్లు అల్లికలు తా నుచితంగాచెప్ప టారంభించింది. ఈవిడచేసిన పనిలోని మంచిని గ్రహించిన సీత స్నేహితురాలు వీణ, ఫిడేలు వాయిద్యములమీద సంగీతముచితంగా చెప్పుట కంగీకరించింది. ఇంకొ కామె హిందీ, తెలుగు, సంస్కృతం చెప్పుట కామోదించింది. నాల్గురాట్నములు పెట్టారు. ఈలా బాలికలకు సకలకళలు ఏర్పాటయ్యాయి. "లలితకళా విజ్ఞాననిలయ"మని పేరుంచారు.

ఈలా రెండుమాసాలుగడిచేసరికి ఊరంతా యా మందిరంసంగతిప్రాకి, బాలికలేకాకుండా యువతులు కూడావచ్చి వారివారి యిచ్చవచ్చిన విద్యలు నేర్చుకొనుచున్నారు. సంస్థ పెరుగుచుండెను. ఉదారులు ఇట్టి విద్యానిలయాన్ని వృద్ధిచేయాలని అయాచితంగానే విరాళములు పరికరములు యిచ్చుచు వేరుగా వసతి గృహమొకటి యేర్పాటుచేసిరి. ఉదయం గృహిణిలకు తీరికయుండదు గాన మధ్యాహ్నం రెండుమొదలు ఐదుగంటలవర కాస్కూలుపనిచేయును. పాశ్చాత్యవ్యామోహముతో దేశీయవిద్యలు మరచిన మనవారు తిరిగి యిట్టి సంస్థలవల్ల మేల్కొని చేతకాని తనమును తరిమి జాతీయవిజ్ఞాన చిత్రకళా కోవిదులగుచుండుట భావిశుభసూచకము. స్త్రీ లోకమిల్లే మేల్కొని మరచిన చేతివిద్యలు పునరుద్ధరించుకొందురుగాక.

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగ నున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప కోరుచున్నాము.

సంపాదకుడు.

# 7-వ గుంటూరు మండల మహిళాసభ (బాపట్ల)

## శ్రీమతి మిస్. టి. కమలా నారాయణస్వామిగారు

[ ఆహ్వాన సంఘాధ్యక్షురాలి ఉపన్యాసము ]

నౌకా వాణిజ్యమున ఖండాంతర ఖ్యాతిగాంచిన వాడరేవు, మోటుపల్లి మున్నగు సముద్రతీరములు కలిగియుండుటచేతను, చరిత్రప్రసిద్ధివహించిన అనేక శిలాశాసనములుగల చోళరాజ్య ప్రతిష్ఠిత దేవాలయములు కలిగియుండుటచేతను బాపట్ల తాలుకా చిరకాలము నుండియు చారిత్రక విఖ్యాతిగాంచియున్నది. 1913 లో ఆంధ్రమహాసభ ప్రథమమున ఇచ్చట జరిగియుండెను. అప్పుడు ఈపుర వాస్తవ్యులైన శ్రీమతి స్వర్గీయ చీరగుడి శీతమ్మగారు మున్నగు సోదరీమణులు మహిళాసభనుకూడ జరిపియుండిరి గాన ఆంధ్రమహాసభకువలెనె ఆంధ్రమహిళాసభకును ఈపురమె జన్మస్థానమని తెలుపుటకు సంతసమగుచున్నది. స్మరణీయమైన ఆ మహిళాసభ జరిగి 26 వత్సరములైనది. ఈ 26 వత్సరములలో మనస్త్రీలు యెంతయో అభివృద్ధి పొందినమాట నిజమే. అయినను బాహుళ్యమైన మనస్త్రీ సంఘమింకను పొందవలసిన యున్నతిని పొందలేదనియే చెప్పవలసి యున్నది.

విద్యా విషయమున మనదేశస్త్రీల స్థితియింకను శోచనీయముగానె యున్నది. 1931 జనభాలెక్కల ప్రకారము 100కి 98 మంది స్త్రీ లింకను విద్యా విహీనులుగానె యున్నారని తెలియుచున్నపుడు చదువువిషయమున మనమభివృద్ధిచెందితిమని యెట్లు చెప్పగలము? మనదేశస్త్రీలలో ఈ విద్యావిహీనత పూర్తిగనశించి పోయినగాని మన దేశమునకు మోక్షములేదు. స్త్రీలు అజ్ఞానదశలో ఉన్నంతకాలము దేశములో అభివృద్ధికరమైన యే మార్పుజరుగుటకును అవకాశములేదు. స్త్రీలు చదువుకొనిన వారైతేగాని తమ స్థితిని తాము తెలిసికొనలేరు. తమ ఆరోగ్యమును కాపాడుకొనలేరు. తమ బిడ్డలను జాగ్రత్తగా పోషించుకొనలేరు. తమ ఆస్తిపాస్తులను తాము సంరక్షించుకొనలేరు. తమ ఉదరపోషణను తాము చేసికొనలేరు. తమ దేశస్థితిని తాము తెలిసికొనలేరు. తమ బాధ్యతను తాము గుర్తింపలేరు. అన్నిటికిని విద్యయే మూలాధారము కావున మన స్త్రీల విద్య విషయమై మునుముందు పాటుపడవలసియున్నది.

మన దేశమున స్త్రీలకు ప్రత్యేకమగు ఆర్థికవసతిలేకపోవుట గొప్పదురదృష్టము. స్త్రీల వారసత్వాధికారములు అధికము చేయబడినట్లు మనము పత్రికలలో అప్పుడప్పుడు చదువుచుందుము, కాని ఇవన్నియు కాగితములమీద వ్రాతలేగాని నిజమైన, సహజమైన ఆస్తిహక్కులు స్త్రీలకు కలుగనేలేదు. భర్త ఆస్తికి భార్య హక్కుదారురాలగుట న్యాయ

మైనను, దాయాదులై హక్కుదారులై స్త్రీలను పీడించెడి అవస్థ ఇప్పటికిని అటులనే యున్నది. స్త్రీకి సహజమైన ఆస్తి హక్కులేదు. స్వతంత్రమైన దత్తస్వీకారాధికారము లేదు. మనదేశస్త్రీ లెంతకాలమునుండియో మొఱ పెట్టుచున్నను తండ్రిఆస్తిలో కుమార్తె లకు హక్కు గల్పించుటకు దొరతనమువారును, దేశీయులును నిరాకరించుచునేయున్నారు. మనదేశమునందలి న్యాయచట్టములు స్త్రీల కనుకూలమగునట్లు పూర్తిగ సంస్కరింపబడిన గాని స్త్రీలకు న్యాయము కలుగజాలదు.

1935 యిండియాచట్టము ప్రకారము స్త్రీల రాజకీయాధికారములు కొంత హెచ్చు చేయబడినను వోటింగు హక్కుకూడ అధికము చేయబడినను చట్టసభలలోగాని స్థానిక సంఘములలోగాని స్త్రీల ప్రాతినిధ్యమునకు మాత్రముగనెయున్నది. బాహుళ్యమైన ఈ స్త్రీసంఘమునకు తగిన ప్రాతినిధ్యములేకున్నచో స్త్రీలకీయబడిన వోటింగు హక్కుగాని రాజకీయాధికారములుగాని నిరుపయోగమనియె చెప్పవలసియున్నది. స్త్రీ లీయర్హతను బడయుటకు కృషిచేయవలసియున్నది.

## స్వతంత్ర జీవనము

మనదేశస్త్రీలు స్వతంత్రజీవనము చేయజాలనివారుగాఉండి కేవలము పురుషులపై నాధారపడియుండుట పరిపాటిగాఉన్నది. స్త్రీ లిట్టి పరావలంబన స్థితిలో ఉండుటవలననే, స్త్రీలు యేకారణముచేతనైనను పురుషుల సహాయము కోల్పోవుట సంభవించినపుడు అల్లులేని తీగలవలె అసహాయులై అల్లాడవలసి వచ్చుచున్నది. స్త్రీ లీ నిస్సహాయస్థితి తొలగించుకొనవలయునన్నచో స్వతంత్రమైన ద్రవ్యసంపాదన విధానము నేర్వవలయును. విద్య, వైద్యము, న్యాయశాస్త్రము మొదలగు శాఖలలో ఉద్యోగము చేయుటకు పూనుకొనవలయును. మరియు తమ యింటియందేయుండి ద్రవ్యము సంపాదించుట కనువైన గృహపరిశ్రమలను లలితకళలను నేర్చి వానిద్వార ద్రవ్యము సంపాదించవలయును. స్త్రీ యేలాటివృత్తి పనియుచేయక ఊరక కూర్చుండుట పూర్వమేవిధముగా గౌరవ ప్రదముగా భావించుచున్నారో ఆవిధముగా నేడు పనిచేసి ద్రవ్యము సంపాదించుట గౌరవముగ స్త్రీలు భావింపవలయును. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యము చేకూరినగాని స్త్రీ నావరించియున్న పరాధీనత తొలగజాలదు.

## మాతృత్వ గౌరవము

భగవంతుడు స్త్రీలకు సృష్టికార్యమునొసగి స్త్రీలకు అసమాన గౌరవము కలుగ జేసియున్నాడు. జాతికి సృష్టులై స్త్రీల బాధ్యత కేవలము బిడ్డలను కనుటైనను వారికి తగిన శిక్షణము నొసగజాలనిస్త్రీ ఆమె తన ధర్మము నిర్వహించినది కాజాలదు. బిడ్డలకు తగిన విద్యాబుద్ధులు నేర్పి దేశకాల పరిస్థితుల కనుగుణముగా బిడ్డలను తయారుచేసి, ఉత్తమ

పారత్వలక్షణములు కలవారినిగాజేసి దేశమునకు సమర్పింపవలయును. స్త్రీలు తమ ధర్మము నిట్లా నిర్వహించినపుడె తమ తల్లి తనమును నిలుపుకొనగలరు.

ఆరోగ్యము:—స్త్రీలు ముఖ్యముగా పాటింపవలసిన విధులలో ఆరోగ్యము ముఖ్యమైనది. ఆరోగ్యమును మించిన మహాభాగ్యము లేదనువిషయ మందరెఱిగినదె. అయినను మనమింకను ఈ విషయమును అశ్రద్ధ చేయుచున్నాము. స్త్రీలు ఆరోగ్య రక్షణమున శ్రద్ధలేని వారగుటవలన నానాటికి వారు దుర్బలులైపోవుచున్నారు. వారితోబాటు వారిసంతానమును దుర్బలమగుచున్నది. ఆరోగ్యములేని జాతియందు బల పరాక్రమములుగాని బుద్ధివైశద్యముగాని యుండజాలదు, కానస్త్రీలు ఆరోగ్యవిధులను చక్కగానేర్చి ప్రతికుటుంబము ఆరోగ్యముతో కళకళలాడునట్లు చేయవలెను. ఈదేశమున బాలింతలయొక్కయు శిశువులయొక్కయు మరణములు అత్యధికముగా యున్నవి. పరదేశములతో వీరిసంఖ్యపోల్చి చూచినచో మనస్త్రీల అజాగ్రత్త విశదమై మన కెంతయో విచారము కలుగజేయును. మన దేశీయులింత దుర్బలులుగానుండుటకు కారణము ఆరోగ్య విధులెఱుగకుండుటయేగాక ఈదేశపు సాంఘిక పరిస్థితులును కారణముగానున్నవి. ఎన్ని విధముల ప్రబోధించినను, ఎన్నిచట్టములుచేసినను అతిబాల్య వివాహములు ఈదేశములో రూపుమాయలేదు. శారదాచట్టము చేయబడినను దానినెవరును లక్ష్యపెట్టకయె చిన్న పిల్లల వివాహములు చేయుచున్నారు. ఈబాల్య వివాహములవల్ల సంఘమునకు మహా హాని కలుగుచున్నది. కావున శారదాచట్టము బాగుగా అమలులోనికి వచ్చునట్లు చేయుట ప్రతిస్త్రీ కర్తవ్యమైయున్నది. ఇవియేగాక బహు పతి, పత్ని వివాహ నిరోధ చట్టము, దేవదాసి సంస్కరణచట్టము, మున్నగు, చట్టముల విషయముకూడ మనము ఆలోచించవలసియున్నది, గాని వ్యవధిలేమిచేతను, విదుషీమణియు, సంఘసేవా పరాయణయు, ఆదినుండియు యీ మహిళాసభలలో సంబంధముకలిగియుండి స్త్రీల సమస్యలను బాగుగా తెలిసికొనినవారును నేడు మన సభకధ్యక్షతవహింప నేతెంచిన శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారివలన అనేక విషయములను వినగలుగుదురు కావున మీ యమూల్యకాలమును నా నీరసవాక్యములతో వ్యర్థపరచక ఇంతటితో విరమించుచున్నాను.

సభలనుజరుపుటలో విశేషానుభవములేని వారమగుటవలనను, సమయమునకు వానదేవుడుకూడ యిక్కడమకాము వేసి మమ్ములనేపనియుచేయకుండ శ్రమపెట్టుటచేతను మీకుతగిన సౌకర్యములు చేయలేకపోవచ్చును. అయినను మాలోపములు మన్నించి మహాసభ జయప్రదముగాజరుగునట్లు తోడ్పడగలందులకు మిమ్మెల్లర ప్రార్థించుచు నా ఉపన్యాసమును ఇంతటితో ముగించుచున్నాను.

# ప్రేమవాహిని

శ్రీయుత గోనెల. నరసింగరావుగారు

వేఁగఁగనోవ, నాబ్రతుకు వేఁగయితోఁచె, మదంతరంగమం
దాఁగని, చెప్పరాని బహుళార్తి యెదో సుడికైవడిన్ మహో
ద్వేగముతోడ మాటికినిఁ ద్రిప్పులు వెట్టుచునుండె నక్కటా!
యీగతి నెంతదాఁకఁ గృశియించి, తపించుచునుండుటో సఖా!
వలపుల్ గొల్లగఁ గుమ్మరించుచును నా భావప్రసూనమ్ము రా
గిలుచుండెన్; దమకింప నీకుఁ దగునే? గీతాకళాస్ఫూర్తితో
లలితాకారముతోఁ బ్రసన్నమతితో రావే, సుధన్ గ్రోలవే;
దళముల్ తూలునో? బూదెయౌనో? దయరాదా, కృష్ణ సారంగమా!
తలఁపులు వింతఁగొల్పెడు విధమ్మున మాఱుచు, నాకు రాగ మ
గ్గలముగఁ గూర్చుచున్నటులె కాననసీమలఁ గోనలన్ మనం
బలరఁగ నాడునెమ్మి చెలి యందపుఁ బించెముఁ జూచి చూచి యా
నలనికి నీవెయంచరయ వచ్చితి, నంతనె మోసపోయితిన్.
గోనబుగ నొక్కకొండ కొనకొమ్మున వ్రాలిన మబ్బుతున్క నేఁ
గనుఁగొని గొబ్బునన్ దరియఁగా బరుగెత్తితి; నేమి సెప్పుదున్?
మనసొకభంగియాయె; మటుమాయల నాటకమాయె నంతయున్;
మినుకుల నీను నీదు నును మేననుకొంటిని, పొంగి, క్రుంగితిన్.
యమునాభంగ తరంగ సంఘముల నాట్యంబాడు రేయొండ ను
ల్లము రంజిల్లఁగఁ జూచి, గణ్యమగు నీ లావణ్యమౌనంచు వే
గముగా డాసితి, నీవు చేపడినటుల్ కౌతూహలంబందితిన్;
భ్రమయై, కాటుకకంటి నీరెనసె నంతన్ దన్నదీ తోయమున్.
పువుబోటిన్ గవుఁగింటనొత్తి, యలలన్ బుప్పోళ్లతోఁ దేలి, తా
నవుటాలం బచరించుకొంచుఁ బొదరిండ్లన్ దీవ వాల్గంటులన్
నవలీలన్ గవఁగూడునాపవను విన్నాణమ్ము నీ వేణుగా
నవిలాసమ్ముగ నెంచితిన్, గరఁగిదానన్ లీనమైపోయితిన్.
అదే! శ్రీకృష్ణ పదాంక; మీజమున భాగ్యం బెట్టిదోకాని,
జదధీశత్వ ధృతాంఘ్రి పంకజ రజస్సంపత్తికిన్ ధామమై
నది; నా పున్నెము పండి నేఁడిచటఁ గన్నారన్ గనం గల్గితిన్
బ్రదుకీనాఁటికి ధన్యమయ్యెఁ గొఱఁతల్ వాటిల్లవే పాటియున్.
ప్రభు చరణాంకమున్ గనులపండువుగా యమునాతటంబునన్
రభసము మీఱఁగా గనుచు రాధ కరంగి కరంగి, గంగ స
న్నిభ 'విరజా' స్రవంతియయి నేఁటికినిన్ బ్రవహించుఁ బ్రేమ సౌ
రభ విభవమ్ము తన్మృదు తరంగములందుఁ దురంగలింపఁగన్.



శ్రీమతి వి. రాధామణిగారు

పండితప్రవరులచే ప్రస్తుతింపబడిన 'ప్రసన్నకుమారి' అను నాటకమును రచించి తమిళ "గృహలక్ష్మి" పత్రికకు బహుప్రశంసనీయమగు వ్యాసభూషలను ప్రసాదించియుండిన ఈమెకు 1940-వ సం॥ "గృహలక్ష్మి" సువర్ణకంకణము నొసంగ నిర్ణయింపబడినది.







శ్రీ యం. సరస్వతీదేవి

## చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీశాఖ : గృహప్రవేశ మహోత్సవము



సమావేశమునకు అధ్యక్షతవహించిన సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు, వారి సతీమణి శ్రీమతి ఆండాళ్లమ్మగారు మధ్య పుష్పమాలాలంకృతులై యున్నారు. సభాధ్యక్షులు శ్రీ సాంబమూర్తిగారు, కార్యదర్శిని శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారుకూడ ఇందు గలరు.

# స్వయంకృతాపరాధము

శ్రీమతి పంతం అమ్మాజీగారు

నాన్నగారూ! ఆ సంబంధమనిన మాకేగాకుండ లీలకెంతమాత్రము ఇష్టములేదు. ఇందు విషయమై మీరు బాగుగ యోచించండి.

హేమా! మీకాసంబంధమెందుచేత నచ్చలేదు?

అన్ని విషయముల చేతనుగూడా నచ్చలేదు.

అన్ని విషయములనగా వరుడు బాగుండలేదా, వంశము మంచిది కాదా, ధనవంతులు కారా, ఎందులో నచ్చలేదు?

అన్నియు బాగానేవున్నవి. మనవారిలో నిజముగ వారు ధనవంతులే కానీ......
కాని ఏమిటి?

రామంగారు ఎంత ధనవంతుడైనను ఒక్కపైస ఖర్చుపెట్టడు! ప్రాణముకంటెను ఎక్కువగా చూచును డబ్బును. పరమలోభి. ఆయన భార్య భర్త గుణములన్నిటియందు సమానురాలు. ప్రసాద్ తల్లిదండ్రుల కెందులోను తీసిపోడు. వారు మానమర్యాదలు చూడరు, మంచిచెడ్డలు చూడరు, కీర్తి చూడరు, సౌఖ్యము చూడరు, వారికి ముఖ్యముగ కావలసినది ధనము.

హేమా! అయిన మీ యభిప్రాయమేమిటి? వారట్టులుండబట్టే ధనవంతులైరి.
నాన్నగారూ! మా యభిప్రాయమున కేమున్నది! అట్టివారింటబడిన యాడుదానికి సుఖముండదు.

సరి సరి అంతయు ధనముతోనే యున్నది. అదున్న వారికి సౌఖ్యముండదందువా? వారెంత ధనాశా పరులైనను కోడలికి తిండిపెట్టరా!

అత్తింట కోడలకి కావలసినది తిండనే మీరు తలుస్తున్నారా?
అదిగాకపోతే మరొకటి. అసలు యంశమేమో చెప్పు. నా మనస్సు నాందోళనపరచక!
అసలు యంశమేమున్నది! వారి సంబంధము తనకిష్టముగాదని లీలగట్టిగ చెపుతున్నది.

నీవు లోకజ్ఞానమింకను ఎరుంగవు. నీకంటెను లోకజ్ఞానమెరుంగనిది లీల. ఆ సంబంధమెటువంటిదో మీకేమి తెలియును! ఎంత ప్రయత్నపడితే లభించినదా సంబంధము. వేలకొలది కట్నమిచ్చెదమని తిరుగుచున్న వారికికూడ అది లభింపలేదు.

నాన్న......
హేమా! మీకింకను బాల్యము, మీకేమియు తెలియదు. నా మనస్సును వ్యధితమొనరించక చెల్లికి బుద్ధిగరపుము....శ్రీనివాసు టేబుల్ పైనున్న బుల్ బుల్ ని అవతలిప్రక్కగా గెంటాడు విసుగుదలగా. అతని నేత్రములలో కోపము ప్రతిఫలించుచుండెను. తండ్రియొక్క కోపాగ్ని కాగలేక హాలునుండి వెళ్లిపోయినది హేమ.

* * * *

రోజంతయు మనస్సు సరిగాలేదు. ఆమె చిత్తము నేదో చెప్పరాని యావేదన ముదయించినది. ఆమె హృదయమున విజృంభించిన యా బాధను శాంతించుకొనవలయునని లీల గదితలుపులన్నియు వేసుకొని లోపల కూర్చుండి చాలా సేపటివరకు ఏడ్చినది. ఆ బాష్పవర్షమున కంతులేకపోయినది.

తన హృదయమునకు శాంతి చేకూర్చవలయుననుకొంది. లీల బయటకు వచ్చినది. వీణ వాయించిన బాగుండుననుకొంది. మనస్సులో ఆమె వీణతీసి వాయించుచున్నది.

ఆమె కంఠస్వరమా నిశబ్దసమయమున గంభీరముగ వినబడుతున్నది. గానకళయందామెకు సంపూర్ణ ప్రావీణ్యత లేకున్నను, ఆ మధురగానము ఆకర్షణీయముగ వీనులకింపుగ హాయిగొల్పుచున్నది. ఆ యపూర్వ గానాన్ని తిలకించుచున్నవా యనునట్లు వృక్షములన్నియు నిశబ్దముగ నున్నవి. ప్రకృతంతయు మౌనము వహించినది కాని...ఆమె వెంటనే గానమాపివైచినది. ఆమె యెదుట ప్రసాద్ గలడు. అతని నేత్రములు క్రోధాగ్ని విస్ఫులింగములు వెడలగ్రక్కుచున్నవి. ప్రసాద్ వికృతస్వరముతో, ఇటువంటి సంగీతసాహిత్యములు మా యింటెన్నడులేవు. లేని అల్లరి తెచ్చిపెట్టకనెను.

పాపమామె కామాట హృదయశల్యమొనర్చినది. ఆమె నేత్రములు దుఃఖాశ్రు ప్రపూర్ణములైనవి.

*　　*　　*　　*

శ్రీనివాసు డబ్బే ప్రధానమనుకొనెను. తన కుమార్తె సౌఖ్యపడునో లేదో యను విచారము తనకు లేకపోయెను. లీల ఇష్టములేకనే ప్రసాదునకిచ్చి వివాహము చేసెను.

ఆమె కాపురమునకు వెళ్ళిన కొద్దిదినములకే ఆమె జీవితములో దుర్భరరంగము ప్రారంభమయినది. అత్తగారి సూటీపోటీమాటల సాదింపులతో కంపించిపోయినది. కఠిన దుర్భరయాత్ర సాగించేది లీల యత్తవారింట్లో.

ఆమె జీవితమునకు సౌఖ్యము లేకపోయినది. భర్త ఎంతో క్రూరముగ చూచును. స్వార్థపరుడు, ధనమే అతని జీవితము, బుద్ధివిశాలత తక్కువ, దయాదాక్షిణ్యాలు శూన్యము. ఏనాడో చెప్పుకొనే రాక్షసులకంటెనుగూడా కఠినమైన హృదయము ప్రసాదునిది.

లీల సౌందర్యవతి, వినయసౌశీల్య సద్గుణశోభిత, ఇతరులకు బాధ కలిగించేలా మాట్లాడదు. భర్తకు ఏమి కోపమువచ్చునో యని భయపడుతుంది. అతనిమాట కెదురుజవాబీయదు. అయితేనేమి! ఆమె ఎడ నిర్దయుడు! ఆమెనెంతో హీనముగ చూచును.

ఉదయమున లేచినదిమొదలు రాత్రి పరుండబోవువరకు అత్తగార్కి చాకిరీచేయుట, దానికి ఫలితము తిట్లు సాదింపులు బొందుట ఆమెకు పరిపాటైపోయినది. చిన్నప్పటినుంచి గారాబంగా పెంచబడి పని అంటే ఏమిటో యెరుగని ఆ అమ్మాయి జీవితము ఒక విషాధగాధగా పరిణమించినది.

*　　*　　*　　*

లీలా! నీవు పడుతున్న అవస్థలు చూడలేకపోతున్నా.

"............................."

పోనీ మీ తండ్రిగార్కి ఉత్తరమంపగూడదా. కొన్నాళ్లుపాటక్కడుండి రావచ్చును.

లతా! నేనట్టి నోమునోచుకొని జన్మించియుండలేదు. వీరు నన్ను పంపరు సరిగదా. ఒకవేళ పంపినప్పటికి అక్కడమాత్రము నన్ను చూచువారేరి! మారుతల్లి చూచునా! పోనీ అక్క తీసుకెళ్ళుటకైనను ఆమెది స్వతంత్రకాపురము కాదుగదా!

"............................."

లతా! ఇంత దుఃఖభాజనమైన ఈ జీవితము ఎంతకాలము భరించవలయునో గదా!

# స్వయంకృతాపరాధము

రాత్రి పదిగంటలుపైగా నైనది. ఆకాశముమీద మేఘము లాక్రమించుకొని చీకట్లు క్రమ్మినవి. ఉరుములు ప్రళయకాల గర్జనలవలె చెలరేగినవి. కుంభవృష్టిగా వర్షమారంభమయినది. లత క్యాంపుకాటు గోడప్రక్కగా ఈడ్చుకొని పరుండి. ఆభీతావహ సమయములో, వసారాలోనికి జల్లు విసురుగా కొడు తున్నది. అయినను ఆమె చలించలేదు. తను లీలదగ్గరనుండి వచ్చినప్పటినుండి ఆమె హృదయ మదొకవిధమైన యావేదనకు లోనైనది. లీలయొక్క బెదరుచూపులు, ఆ దీనవదనం, ఆ సుక్కించిపోయిన శరీరం, ఆ కన్నీళ్లు ఆమె హృదయాన్ని కలతపెట్టాయి. తను వుదయము లేచినదిమొదలు రాత్రి పరుండబోవువరకు ఆమె పడే శ్రమలన్నియు కనబడుతుంటవి తన కళ్లెదుట. ఆ దౌర్జన్యరహితుడు, ఆ పాషండహృదయుడు, ఆ ముగ్ధను కొట్టుటకు చేతులెట్లు వచ్చునో! ఆ లేత శరీరము, ఆ దెబ్బలు...అబ్బ...సరియైన భోజనముకూడా లేదు. పైగా చాకిరీ పాపం, ఆ యమకూపము వుంది...ఆ సుకుమారహృదయమెంత బాధ పొందుచున్నదో! తుద కామె ప్రాణసంకటమగు జీవితమ్మీద నిరాశగలిగి ప్రాణత్యాగ మొనర్చుకొనునేమో! అయ్యో అట్టి సుగుణ శీలను, అట్టి సౌందర్యరాశిని, అట్టి పవిత్రహృదయను, అట్టి స్నేహలతను మరల చూడగలనా! ఆ నరకములో నుండి యామెకు విముక్తిలేదా! అనుకొంది. అంతలో ఎదుటి మేడలోనుంచి చిన్న ఆర్తనాద మామె వీనులకు సోకి వెంటనే ఆగిపోయినది. అది లీల కంఠస్వరమే. ఆ ఏడ్పులో ఎంతో బాధ వున్నది. అది లత కపారమై యావేదన కలిగించినది. ఆమె వెంటనే లేచి వసారా చివరను నిలుచున్నది. వర్షము వెలిసినది. సన్నని తుంపరులు పడుతున్నవి. ఆకాశము మేఘావృత్తమైయున్నది. నక్షత్రము లెచ్చటను కాన్పించుట లేదు. అంతయు నిశబ్దంగా గాఢాంధకారమయమైయున్నది. ఆమెతో ఏమి చెప్పచుంటివి? చెప్పుము. అన్న కఠోరవాక్కులు మరల వినబడుచున్నవి. అవి ప్రసాదునివే. వాని మాటలలో క్రోధము ప్రతిధ్వనించు చున్నది. మరల రోదనశబ్దము వినిపించినది. అయ్యో! పాపాత్ముడు మరల కొడుతున్నాడను కొన్నంతలో, పో నీదిక్కున్నచోటికి అన్న తీవ్రగంభీర పలుకులు, వీధిలోపడిన శబ్దము,తలుపులుమూసివేసిన చప్పుడు ఒక్క మాటుగ వినబడినవి. ఆ నిశీధికరణములో ఆమె హృదయము కలవరపడినది. ఆమె భయభ్రాంతయై అతి త్వరితముగ సౌధమును దిగి వీధిలోనికి ప్రవేశించి చూచినది. అక్కడ లీల స్పృహతప్పి పడిపోయివున్నది. లత ఆమెను ఎత్తుకొని నెమ్మదిగ తన మేడలోనికి తీసుకెళ్లిపోయినది.

లీల చేతిమీదను తీవ్రమయిన గాయము తగిలినది. లత లీలకు కట్టుకట్టి వుపచర్యలు చేయడము మొదలు పెట్టినది. పాపం శరీరములోని సగము రక్తము పోవడమువలన ఆమె కళకాంతులు తప్పి వాలిపోయిన ముఖంతో మంచముమీద పండుకొంది. లత పాటుపడుతూవుంది. లీల అశ్రుపూరిత నయనాలతో లతనుచూస్తూ లతా! నీఋణం నేను తీర్చుకోలేను. నేను నిజముగ బ్రతుకలేను అని కళ్లుమూసుకొంది. లత ఆమె చెక్కిలి ముద్దాడుతూ లీలా! నీవుమాత్రము అధైర్యపడకుము. నీకు బాధ నిమ్మళమౌతుంది. త్వరలో ఆరోగ్యము పొందెదవు అంది.

ఉదయము డాక్టరు లీల జీవించదని చెప్పిన తరువాతను లత విచారభరితాత్మురాలైనది. ఆమె ఆశా లత తెగిపోయినది. అయ్యో! ఈ నాప్రియమైన వస్తువు వెళ్లిపోవునా! అబ్బా భరించలేను అనుకొంది తనలో. ఆమె నేత్రములనుండి దుఃఖాశ్రువులు వెడలినవి.

ఆవేళనే ఆమె శ్రీనివాసునకు హేమకు తంతినిచ్చినది లీల చాలా జబ్బులోవుందని. లీలకు జాగ్రత్తతో గంటగంటకు మందులిచ్చుచు పరిచర్యలు చేయుచున్నది. లీల కళ్లుతెరిచి చూచినది. ఆమెకళ్లలో అపరిమితమైన

దుఃఖము కాన్పించుచున్నది. లత ఆమె తల నిమురుతూ లీలా! అంది ప్రేమపూర్వకముగ. ఆమె లతచేతిని స్పృశించుచు అక్క వచ్చినదా! యని ప్రశ్నించినది హీనముగ. అక్క ఇప్పుడే రాగలిదని జవాబుచెప్పినది లత కన్నీళ్లతో. గడియారము రెండుగంటలు కొట్టినది. లత గేటువైపుచూచి నిట్టూర్పువిడిచింది. మరల ఆవైపునకు ఆమె దృష్టిని బంపింది. బండి గేటుతెరచుకొని లోపలకు వచ్చినది. బండినుండి దిగుతూనే నా చెల్లెలి కెట్లున్నది! నా చెల్లెలేది! అని యా వేగముతో హేమ ఆమెను అడిగింది. లత ఆమెమాటకు జవాబీయలేక వ్యాధిగ్రస్తయైయున్న లీలదగ్గరకు తీసుకెళ్లినది. హేమ తన చెల్లిలిని చూచుటతోనే కెవ్వుమంది. ఆమె దుఃఖమునకు పరిమితిలేదు. ఆ అక్కచెల్లెండ్రయొక్క దుఃఖము, వారి ప్రేమ, వారికలయిక లత హృదయమునకు మిక్కిలి దుఃఖము కలిగించినవి.

హేమ తన సోదరిని కౌగలించుకొని చెల్లీ! లీలా! తుదకు...తుదకీవిధముగ పరిణమించినదా! ఇరువురము నొక్కచోట బెరిగితిమి. ఎవ్వరి మిత్రత్వములో తల్లిని మరచితినో! అట్టి తోబుట్టువు నీకీవిధముగ దైవము వ్రాసెనా! అక్కా అక్కా యని ఒక్క నిముషంబైనను విడిచుండలేకపోయెడిదానవు. నిన్నొక్క నిముషమైనను విడిచుండలేకపోయెడిదానను. మన మిత్రత్వములో తల్లిని మరచితిమి. అమ్మ లేకపోయినను నిన్ను తలంచుకొని ఎంతో ఆశతో నుండెడిదానను. తుదకు దైవమీవిధముగ యెడబాటు గలుగజేయుచుండెనా! నా లీలా! నిన్నువీడి జీవించగలనా! పాపమామె మిక్కిలిగ విలపించెను.

లీల తండ్రి నుద్దేశించి నాన్నయని యేదో చెప్పబోయినది, కాని ఆమె కంఠము గద్గద పూరితమై పోయినది. ఆమె కళ్లంపట నీళ్లు కారుతున్నవి. తండ్రి దుఃఖ మాపుకొనలేకపోయెను. తనయను పట్టుకొని అమ్మా! లీలా! అజ్ఞానుడనై చేతులారా నీకే యవస్థను సమకూర్చితినా! నా బిడ్డా! ఆ సంబంధము వలదని కోరితివి, నీకోర్కెయే తీర్చియున్నచో నీకీదురవస్థ వచ్చియుండెడిది కాదుగదా! నీకిట్టి విపత్తు గలుగజేసిన వాడను నేనేగదా! తండ్రి మిక్కిలి వాపోవుచుండెను.

లీల తన సోదరిని కౌగలించుకొని అక్కా! మనతల్లి లేకపోవుటట్టికదా!......అమ్మ...వున్నచో... ఆమె గొంతు గద్గదపూరితమైపోయెను...ఆమె నేత్రములలో విషాదము ప్రతిఫలించుచుండెను. ఆమె మోము కళావిహీనమైయున్నది. ఆమె బాష్పపూరితనేత్రయై లతను కౌగలించుకొని సోదరీ! లతా! నీకు నాయందు నున్న ప్రేమ అగణ్యము. నీ ఋణమెట్లు తీర్చుకొందును!...'చూడు సోదరీ! లతా! భగవంతుడు నాయందు కాఠిన్యము పూనినాడు. ఏనాటికైనను భగవంతుడు నాయెడ దయజూపడా! యనెడి యాశచే కష్టములన్నిటిని ఓర్పుతో సహించితిని....కాని నాయాశ నిరాశయైనది......ఆమె కాయాసము హెచ్చయి పోయినది. తన కడసారి చూపులు తండ్రి హేమలతలమీఁత బరపి నేను పరలోకమున కేగుచున్నాను నావంటి నిర్భాగ్యురాలకు ఇహలోకమున ఇట్టి యాతనాజ్వాల తప్ప మరేమియులేదు. ఇక నన్నుగూర్చి దుఃఖించకుడు...'ఆమె మరి మాటాడలేకపోయినది. ఆమె శరీరము చల్లనైపోయినది. ఆ పరమసాధ్వి ఇహలోకమును విడిచినది...

ఆ సుకుమార హృదయము పెక్కు కష్టములను ఓర్పుతో సహించినది. తన శెప్పపాటికైనను భగవంతుడు సౌఖ్యము కలుగచేయునని ఆశవుండెడిది. కాని తుదకు ఈవిధముగ పరిణమించినది. తండ్రి తనయకోర్కె తీర్చియున్నచో ఆమె కిన్నిపాట్లు కలుగకపోవునుగదా! ఆహా! విధివిధానము! మానవ దౌర్బల్యము!!




# "కళ"

శ్రీయుత బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు

మన ప్రాచీనశాస్త్రములన్నియు అఱువదినాలుగు కళలని విభాగమొనర్చియున్నవి. అందిపుడు లోకానుభవములోనున్నవి చాలయరుదు. అవియును పూర్తిగా ననుభవించుటకూడఁ జాలతక్కువ యయ్యెను. ఇందులకు కారణము లనేకులనేక విధములుగ నుడువుదురు.

'కళ'న రసిక హృదయాహ్లాదమయి స్వభావానతిరిక్తమై అలరారునది. ఇది ప్రపంచ స్వభావాతిరిక్తమై యెప్పుడు నుండఁజాలదు. ఎట్లన లేఖకునిలేఖన సామర్థ్యము మహత్తరమై యొప్పారు ఉద్దిష్టమగు ప్రకృత్యన్తత పదార్థానతిరిక్తము ఎట్లు కాదో అట్లు ఈకళ ప్రకృత కార్యమునందును కర్త్రధీనమైయుండును. కార్యమెప్పుడును యత్కించిత్కళాశ్రయముకాక రచింపఁబడదు.

లోకములోని ప్రతివస్తువునందును అనగా చేతనాచేతన రూపములుగల వస్తువులయందును అనుకరణలయందును నూతన నిర్మాణములయందును కవన సంగీత, నాట్య, శిల్ప, చిత్ర యీ మొదలగువాని నన్నిటియందును కళలున్నవని విజ్ఞానుల యభిప్రాయము. కాని కొందఱు కొన్నిటియందు మాత్రమె కళలున్నవని నుడువుదురు. ప్రపంచమునందలి ప్రతి వస్తువునందును కళలుండవని వారి యభిప్రాయము. అట్లు అనుట చింత్యము. సూక్ష్మదృష్టిచే పరిశీలించిన ప్రతి పదార్థమునందును కళలున్నవనియె చెప్పనగును. కళలన్నిటికి ప్రాచీనులందఱు "లలితకళలని" కూడ నామ నిర్వచనము చేసియున్నారు.

ఈ కళలయొక్క అభిప్రాయములనంతములు, అనిర్వర్ణనీయములు, అభిమోచనీయములు. ఇట్టి లలితకళలయందలి మనోరంజకమగు భావములను తెలియుటకు సామాన్యుల హృదయములు సమర్థములు కాజాలవు. నిర్మలములగు హృదయములతోను, తగు భావనాశక్తితోను, సర్వసామాన్యముగ నన్ని ప్రకృతులయందలి భావమును గ్రహించుటలో సమర్థతగల హృదయములుగలవారై యుండవలయునని విజ్ఞానుల యభిప్రాయము,

ప్రస్తుతమున లోకమున నందఱు కళోపాసకులైయున్నారు. ఇదియు కొంతవఱకు నిశ్చయమనవలయును. కళలను పూర్తిగ ననుభవించినను లేకపోయినను చవిచూచినంతనె మేమును కళోపాసకులమనని హృదయముల చరనుకొందురు. చవిచూచినంతనె వారివారి హృదయము లీ విధముగ నానందసామ్రాజ్య పట్టమును దాల్చుచున్న, సంపూర్ణముగ ననుభవించు కళోపాసకుల ఆనందమపార మనవలయును. కళలో మహత్తరమగు శక్తి యున్నది. కళయందలి మాధుర్యము ననుభవించలేక లోకములో కొందఱు కళయందు ఆనందమయమగు కళలేదనిగాని కొన్ని పదార్థములయందు మాత్రమె కళయున్నదని గాని నుడువుచుందురు. ఇదియు విచారణీయమనవలయును. ఈ విధముగ వారు పలుకుటలో వారికి కళగాని తన్మాధుర్యముగాని తెలుసుకొను విధానముగాని యుంచుకయు వారికి పరిచయము లేదనవలయును.

కళలతో నిండియుండు వస్తుజాలమనంతముగా నున్నది. అన్నియు వ్రాయుట కడుం గడు దుస్సాధ్యము. సమయానుకూలముగా ప్రత్యక్షప్రమాణము కలిగినప్పుడెల్ల నాయా కళను అనుభవించుచుండవలయును. అందును కొన్నిటినిమాత్రము విమర్శించిచూతము.

కవిత్వములో కూడ కళలున్నవి. కళామాధుర్యముతో నొప్పారుచు చదువరులకు ప్రత్యక్షప్రమాణము ప్రతిపాదించు కవిత్వము లనంతముగనున్నవి. అందును ఆదికవి యనంబరమగు శబ్దశాసనుని కవితయందు లలితకళలున్నటుల కవులు కళోపాసకులు చాటుచుండిరి. నన్నయగారి కవితయంతయు కళాభూయిష్టమై చదువరులను ఆనందాబ్ధి యందు ముంచగలదు. నన్నయగారుకూడ వారి కవితయందు లలితకళల నన్నిటిని ఇమిడ్చి మృదుమధురములగు పదజాలములతో కవనమొనర్చి వాణి హృదయారవింద మును కరగించినారు.

వారి కవితయందు వెండిదివిటీలతో వెదకినను కళలేనితావుండదు. చూడుడు. శన్తనుఁడు యోజనగంధివద్దకు వెళ్లుసమయమున "యోజనగంధి"అను నామమునందు గల సారస్యమును కవి ప్రకరణ పురస్సరముగా నిరూపించుచు తన కవితానైపుణ్యమున వ్యక్త పరచెను.

'దాని శరీర సౌరభము
దాని విలోల విలోకనంబులుఁ
దాని మనోహరాకృతియు
దాని శుచిస్మిత వక్త్రకాంతియుఁ
...........................'

అని వర్ణించియున్నాఁడు. యోజనగంధియన యోజన (ఆమడ) మాత్ర దూరమువరకు పరిమళముగల మేనుగలదని తాత్పర్యము. శన్తనుఁడు అరణ్యమునకు వేటకై వెడలి యచట యోజనగంధినిచూచి వరించినాఁడు. శంతనునకు యోజనగంధికిని అనతి దూరమయినను దూరమునుండి తీసుకొనివచ్చి కూర్చినట్లు దాని శరీరసౌరభ్యమును చూపుటలో కవి యీ విధముగా చమత్కృతి చూపినాఁడు.

అసలు నామమాత్రముచే యోజనగంధి కాబట్టి ప్రథమమున "దాని శరీరసౌరభము" అనఁగా పరిమళముచే నాకర్షింపబడినవాఁడై పిమ్మట కొంతదూరము నడువగాఁ దాని విలోలవిలోక నమ్ములుఁ చంచలములగు చూపులచే ఆకర్షింపఁబడిన హృదయము కలవాఁడై మఱికొంత సమీపమునకు డాయగా "దాని మనోహరాకృతియు" మనస్సును హరించు ఆకారముచే విస్మృతుఁడై పిమ్మట సమీప్యమును చేరగా "దాని శుచిస్మిత వక్త్రకాంతియుఁ" చిన్నస్మితముతో కూడిన ముఖకాంతియు చూచి......ఈ విధముగ నొకభావము తరువాత మఱియొకభావము కలుగునట్లు చిత్రించి లోకప్రస్తుతికి గురియై నాఁడు.

ఈ ప్రకరణమునే మఱియొక కవియైనచో శన్తన యోజనగంధుల నొకచోట నుండు తఱిమె నిట్టి భావములు కలిగినట్లు వర్ణించునేమో! కాఁగా నన్నయగారు ముఖ్యముగా కథానిర్వాహకులు కాబట్టి పైవిధముగ చిత్రించినాఁడనుట సత్యదూరము కాజాలదు.

ఇదే విధముగఁ ప్రాచీనకవితలయందనేకములుగా లలితకళలచే నొప్పారు కబ్బములనేకములుకలవు. ఆధునిక కృతులందట్టి కల్పనములరుదనవలయును.

ఇఁక సంగీతమునందుకూడ లలితకళలున్నవి. ప్రకృతము నవనాగరకతా ప్రపంచమున సంగీత వాసనలేని మానవుఁడు లేఁడు. కాని సంగీతమంటే యేమిటో మెలుగనివారందఱు సంగీత విద్వాంసులమని చెప్పుకొనుట విచారణీయము. సంగీతమునకు ముఖ్యముగా గాత్ర సౌష్ఠవము ఉండవలయును. ఎంత సంగీత విద్వాంసుడయినను అది లేనిచో వాని సంగీతము ప్రకాశింపదు. మఱియు సంగీత విద్వాంసులందఱు దశవిధగమకములను పరికింపవలయును. అట్టి సంగీతములు శాస్త్రకట్టుబాట్లకు లోనై యుండును. ఇఁక గవ్వాయిపాటకుల (గాలపాట) సంగీతములకు శాస్త్రకట్టుబాట్లకు చాలదూరము.

గవ్వాయి పాటకుల సంగీతములలో కళపై కళవేసి రాగమును గుంజి నులిపి విడచిపెట్టెదరు. కాని శాస్త్రప్రమాణములేనిదే అది శోభనీయముకాదని సంగీత విద్వాంసుల యభిప్రాయము. మఱియు శాస్త్ర కట్టుబాట్లుకల విద్వాంసుల సంగీతములు దశవిధ గమకములతో నించుకయు హెచ్చుతగ్గులేక తాళము, లయ, కాలము అను వీనిచే

బంధించి రాగశూన్యమై నొప్పారుచుండును. అనఁగా రాగ ముండదనికాదు. గవ్వాయి పాటకులవలె రాగము వ్యాపించదు. కాఁగా సంగీతములో పై శాస్త్ర కట్టుబాట్లు చక్కటి రాగాలాపము కలచోట నట్టి సంగీతమునందు కళయుండును. అనఁగా నితర సంగీతముల యందు కళలు లేవని తాత్పర్యముకాదు. అంత మనోహరమగు కళలుండవని పై సంగీత విద్వాంసులె పలుకుదురు.

పై విషయములన్నియు చక్కఁగఁ బరిశీలించి గానమొనర్చువారు ఆనందాబ్ధియందు మునుగుచు వినువారలనుగూడ ముంచుటలో సమర్థులవగలరు, ఇది నిశ్చయము.

ఇఁక నాటకములయందును నటకులయందును గూడ లలితకళలున్నయవి. నాటకములయందలి కళలు ఎన్నటికి నశించనవివై చిరస్థాయిగా వెలయుచున్నవి.

నటకులయందలి కళలుమాత్రము పూర్తిగలేవు. ఎచ్చటనైననుండినను అవి పూర్తిగ నభివృద్ధిపొందుటలేదు. సామాన్యముగ నటకులని పేరుపెట్టుకున్నవారందఱు భావము, అభినయము, రసము యీ మొదలగునవన్నియు గ్రహించుటకోఁ దగు సమర్థతగల హృదయములుగలవారై యుండవలయును. అందేది లోపించినను మిగతా సామగ్రి యెంత మాత్రము శోభించుటకు వీలుండదు.

శాకుంతలమునందు దుష్యంతుని కణ్వాశ్రమ ప్రవేశానంతరమున శకున్తల చెలికత్తెలు కలిసి రాజును గౌరవించు సందర్భమున దుష్యంతుని శరీరమందుగల సౌభాగ్యమును జూచి లజ్జకలదై శకున్తల యచటనుండి వెడలుటకు ప్రయత్నింపఁగా, చెలులు వారింపఁగా, శకున్తల కారణమడుగగా చెలులు మాకు మొక్కలకు నీళ్లుపోయుటలో రెండు కడవల యుదకము బాకీయుండి యెట్లు వెడలెదవు అని యడుగగా, దుష్యంతుఁడు 'ఇప్పటికె చాల శ్రమనొందియున్నట్లుగా మీ చెలిని యూహించుచుంటిని' అని పలికినాఁడు.

> 'స్రస్తాం సావతిమాత్రలోహితతలౌ బాహూఘటోత్క్షేపనా
> దద్యాపి స్తనవే పథుం జనయతి శ్వాసః ప్రమాణాధికః
> స్రస్తం కర్ణ శిరీషరోధివదనె ఘర్మాంభసాం జాలకం
> బంధ స్రంసనిచైక హస్తయమితాః పర్యాకులా మూర్ధజాః ?.

భారమగు నీటికడవల నెత్తుటచే పల్లవ సామ్యములగు హస్తములు ఎఱ్ఱబారిన వనియు, మోయుటచే భుజములు జారినవనియు సహజమగు శ్వాసలకు నధికమై వెడలు నిట్టూర్పులకు కంచెలచే కట్టబడిన స్తనములు కంపించుచున్నవనియు కర్ణమున నిడిన శిరీష పుష్పశోభను మించి యొప్పుచున్న ముత్యములవంటి చెమటబిందువులు చెక్కిళ్ల

మీఁదుగా జారుచున్నవనియు, నొక హస్తమున కడవయుండుటచే వేరొక హస్తమున ముడుచుటవలన వ్యాకులములగు కేశములు గలదియు, అని ఆమె వృక్షసేచనమువలన కలిగిన శ్రమను పై విధముగ దుష్యన్తునిచే చక్కఁగఁ బలికించినాఁడు. ఇతర కవనముల యందున్నను ఇట్టి శోభను చేకూర్చదని ప్రాచీనుల యభిప్రాయము.

కాఁగా నిట్టి ప్రకరణమును నాటకులు ప్రదర్శింపవలయునన్న ముఖ్యముగా శకున్తలపాత్రను ధరించువారు చేతులు కందునట్లు చూపవలయునన చాల దుర్ఘటము. కాఁబట్టి అట్టి శ్రమవలన గలుగు బాధను అభినయరూపమున చూపరులకు చూపవలయును. అధికములగు శ్వాసలకు స్తన కంపములకు గజగజ వణకుచు బుసకొట్టకూడదు. శ్వాసలు చూపరులకు వినఁబడవు. స్తనకంప మగుపడదు. అట్టితతి బాధాసూచకములగు అభినయములనె చూపవలయును. కేశముల ముడుచుట యనునది నేర్పుతో చేయవచ్చును. ఈ దృశ్యములఁ జూచు దుష్యన్తపాత్రధారికూడ రంగస్థలమునఁ గడుంగడు జాగరూకుఁడై యుండవలయును. చూపరు లెల్లప్పుడు నటులయందు ప్రకృతిత్వమును వదలి దుష్యన్తుడు శకున్తల అనుభావన కలిగి యానాఁటి శకున్తలా చరిత్రమును హృదయములలోఁ దలఁచుచుందురు. కాఁబట్టి యన్నివిధములఁ దగు సమర్థులై నటకులభినయముచే కళామాధుర్యమును చూపఱులకు చవిచూపి బ్రహ్మానందమును కలుగఁజేయవలయును.

మఱియు స్త్రీలు ధరించు ఆభరణములలోఁగూడఁ జిత్రకళలున్నవి. కాని నవనాగరికాభిమానముగల భారతాంగనలు ప్రకృతము అనుకరణములచే నూతనములగు అలంకారములను ధరించుటలో వారి మనము ముందంజవేయుచున్నయవి. ఇట్టి యలంకారములను జూచి కొందఱు సహనస్వభావులగుదురు. కాని వానియందుఁగూడ నట్టి యసహనయోగ్యములగు కొన్ని లేకపోలేదు. చూచువారలకు సహనభావములగు అలంకారములను ధరించుచో నాకర్షణీయములగు చిత్రకళలు వానియందున్నవనియె చెప్పనగును.

కాఁగాఁ ప్రపంచమునందలి ప్రతి పదార్థమునందును కళలున్నవనియె చెప్పవలయును. వానిని యుపయోగించు సమయములనుబట్టి 'లలితకళలని' గూడ ననవచ్చును. కాఁబట్టి యట్టి కళలను పెంపొందించి లోకమున కానందము చేకూర్చవలయునన కళాభిమాను లెల్లరు ఇదివరలోఁ దాముచేయు కళోపాసనకంటె వేయిరెట్లుగా నుపాసనఁజేయుచో నానాఁడు లోకమంతయు కళామయమై అచేతనముల నయితము ద్రవింపఁజేయు మహానంద మనుభవింపఁగలదనుటలో నెంతమాత్రము నతిశయోక్తి కాజాలదు. ఇది నిశ్చయము.

# కమలకుమారి

శ్రీయుత కె. వి. రామానుజాచారిగారు

రాత్రిసమయము; చంద్రుని ధవళకిరణములు పృథ్విని తమ చల్లని వెన్నెలలో స్నానముచేయించుచున్నవి. శ్రీ కృష్ణభగవానుడు నిట్టూర్పువిడచి 'నేతలంచినది కాలేదు. మనుష్యుండే సంసారపు సర్వోత్తమ పదార్థముకాదు. వాయుతరంగములతో క్రీడ జరుపుచున్న యీ కమలము వానికంటె నెంతయో మనోహరముసు దృష్టులను తనవైపాకర్షించుకొనునదియునై యున్నది. దాని రేఖ లెంతసుందరములు! రంగు ఎంత మనోహరము! దాని రూపమెంత అనుపమమును నయనాభిరామమునై యున్నది. 'అందాలబజారు'లో నీ నిర్జీవపుష్పము ప్రపంచమున నందరికంటె నధికరూపవతియగు కామినినిగూడా ఓడించగల్గుచున్నది. మీదు మిక్కిలి జగత్సంపూర్ణ సౌందర్యము నొకరాసిగ చేసినను ఈ ఒక పూవులోనున్న మోహినీమూర్తి అందు కన్పించదు. పూవులలో కమలమువలె మనుష్యులలో నొప్పునట్టి కన్యక నొకతె నుత్పన్నము చేయుదునా? అనిపించుచున్నది. దానివలన లోకమునందలి అంధకారకోణములుజ్వాలుములుకాగలవు. దానిసమ్ముఖమున శ్యామసంగీతముగూడ మందమైపోవును.' అని యనుకొనెను.

ఇట్లాలోచించి కొన్నిక్షణములు మౌనముతోనుండెను. ఇపుడొక్కమారు తలయెత్తి, వ్రేలితోజూపుచు నిట్లనియె - 'ఓ నిర్జీవకమలమా! సజీవసుందరీరూపమును ధరించి నాకడకు రమ్ము.'

జలతరంగములు తమంతట దామె సరోవరతటములను డీకొనుచున్నవి. రాత్రి అధిక సుందరమైనది. చంద్రకిరణము లధిక ప్రకాశమానములైనవి. చంద్రకాంతి దానిలో నిమిడిపోయినదా? అన్నట్లుగ సరోవర జలములు ముత్యములమాదిరి మెరయజొచ్చినవి. నిద్రించుపక్షులు తమ సంపూర్ణశక్తితో పాడదొడగినవి. కొంచెముసేపటిలో నొక్కమారూరకున్నవి. తామరపూవు నీటిలో నొక్కమారుమున్గినది. తనపత్రములంబోలు కోమల వస్త్రములనుండి నీరోడుచు లావణ్యమయసుందరి యొకతె బయల్వెడలినది.

శ్రీకృష్ణ హృదయము ప్రసన్నమై కొట్టుకొనుచున్నది. అతడా కమలపుత్రినిజూచి కంపితస్వరముతో "ఇంతకుబూర్వము నీవు నిర్జీవమగు తామరపూవువు; ఇపుడు కమలపుసజీవమగు పుత్రికవు. ఏదీ, మాటలాడు" అనిచెప్పెను.

కమలకుమారి శిరమువంచి మాట్లాడ నారంభించినది. గాలిపరిమళయుతమైనది. "దేవా! నేను మీ ఆదేశముపై నుత్పన్నమైతిని. తమ ఆజ్ఞాపాలన మొనరింతును. నేనెక్కడనివసించునది! దయతో సెలవిత్తురా?"

చంద్రబింబమువైపు దృష్టులనిల్పి,

'పుష్పవాటికలో -' అనియుత్తరమిచ్చెను.

'ప్రభూ! ఆటపూవులకు వాయుప్రహారములు మెండు!'

'ఉన్నత గిరిశిఖరములు నీ కిష్టములేనా?'

'అక్కడ మంచు; చలితో నాహృదయము వణకుతుంది.'

'బాగున్నది; అయితే సముద్రతలమున, అక్కడ నీకొఅకొక పగడాలభవనము కట్టించెదను.'

'కాని, అది అగాధము'

శ్రీకృష్ణుడు చిఱునవ్వునవ్వి, 'అయితే నిన్నెక్కడనుంచునది? ఏమీ? హిమాలయకందరములలో-?' అని ప్రశ్నించెను.

కమలపుత్రిక ప్రతి అంగమును వణకినది. కంపితయై,

'అట నంధకారము.' అనియె.

'తామరపూవులకడ, నీటిమీదనో?'

'అక్కడ నాచు.'

'నిర్జర వనములందు?'

'అక్కడ నేకాంతము. దీనితో నా రక్తము నాడులందు గడ్డకట్టుకొనిపోగలదు.'

శ్రీకృష్ణుడు నొసలుపై చేయినుంచి నిములుచుండెను. ఇపుడు వాని చిత్తమెంతయు నుదాసీనము. పిల్లంగ్రోవిని దీసి పాడ నారంభించెను.

రాత్రి గడచినది. సూర్యకిరణములు నీటిపై నాట్యముచేయగొడగినవి. సరోవర జలములూ, తాళ పత్రములూ, చెట్లపై పక్షులూ నిద్రనుండి మేల్కొనినవి. ప్రకృతికి నూతనచైతన్యము కలిగినది.

'వీడు కవి' అనినాడు శ్రీకృష్ణుడు.

సరోవర నిర్మలోదకములపై నొక దీర్ఘమగు ఛాయ కన్పడినది. గాలిలో నెవనిదో మృదుభరిత గానము ప్రతిధ్వనించినది. పచ్చికపై నెవనిదో పాదముద్రికల సవ్వడి కొంచెము వినవచ్చినది. కొలదిదూరములో నొక యువకుడు చేత వీణియ ధరించి వచ్చుచు గన్పడినాడు. శ్రీకృష్ణు డతనిజూచి, గెట్టించుచు 'ఇతడు కవి' అని చెప్పినాడు.

కవి దగ్గరకు వచ్చినాడు. మరియొక సూర్యు డుదయించినట్లున్నది. అతడు కమలకుమారిని జూచుసరికి చేతినుండి వీణ జారిపోయినది. 'బేడీలు' తగిలింపబడెనా యన్నట్లుగ నతని కాళ్లు భూమిలో కూరుకొని పోయినవి. కృష్ణభగవానుడు కమలము నొక చైతన్యముగల బాలికను చేసినాడు. ఆ అనుపమలావణ్యామూర్తి కవి నాశ్చర్యపుమూర్తిని జేసినది.

'కవీ! విశేషములేమి?' అని కృష్ణుడు ప్రశ్నించెను. ఉలికిపడుచు, కవి, వీణ సర్దుకొని తలదించి, 'నేను ప్రేమించుచున్నాను; ప్రేమపదముల జేయుచున్నాను; ప్రేమగీతము పాడుచున్నాను; నా జీవనములో ప్రతియొక క్షణమును ప్రేమార్పణమైయున్నది.' అని జవాబిచ్చెను.

ఇట్లు జెప్పుచు కవి తృష్ణాపూరిత నేత్రములతో కమలకుమారివైపు జూచెను.

శ్రీకృష్ణుడు కూర్చొనియుండెను. ఇపుడు నిలబడి 'సుందరీ' నీవు తగినస్థానము దొరకినది.' అనెను.

'ఎక్కడ?'

కవి హృదయము దడదడలాడినది.

'ఈ కవి హృదయములో జొఱబడి నివసింపుము.' అనెను శ్రీకృష్ణుడు. కవి తలవంచినాడు. అతని వీణాతంత్రులనుండి ఝుంకారము బయలుదేరినది. కమలకుమారి సౌందర్యకటాక్షములతో ముందుకువచ్చి కవి

హృదయమున బ్రవిష్టముకాజొచ్చినది. కాని, ఒక్కమారుగ వెనుకకు తగ్గినది. ఇపుడా ముఖమండలము హిమమువలె తెల్లగనున్నది. శ్రీకృష్ణున కాశ్చర్యమైనది.

'ఏమి! నీకక్కడకూడ భయమగుచున్నదో!'

కమలకుమారి నేత్రముల నశ్రువులు దొరలజొచ్చినవి. గద్గదయై, ఆమె 'ప్రభూ! నాకొఱ కీస్థానమునా యెంచినారు? ఇక్కడ గగనభేదులగు పర్వతరాజుల హిమాచ్ఛాదిత నిమ్నోన్నత శిఖరములూ, భయానక తరంగములతోడి సముద్రాల గాంభీర్యమూ, శూన్యవనముల నిశ్శబ్దతా, హిమాలయాంధకార కందరములూ, అన్నియుఁ బ్రకాశములై యున్నవి. నేనిక్కడ నెట్లుండగలను?' అనినది.

అంత శ్రీకృష్ణుడు 'భయములేదు. సుందరీ! భయపడకుము. భయపడ నవసరములేదు. నీవు సుందరివి. నీ ఆసనము కవి హృదయము. అక్కడ హిమమున్నచో నీవు సూర్యబింబమవై దానిని కరిగించివేయుము. అట సముద్రపు గాంభీర్యమున్నచో నీవు ముత్యమవై దానిని ప్రకాశింపజేయుము. అట నేకాంతమగుచో నీవు నీ సుమధుర సంగీతమును నెలకొల్పుము; నిశ్శబ్దత పటాపంచలై పోవును. అట నంధకారమున్నచో నీవు దీపపు కళికవు గమ్ము; చీకటి దూరమైపోవును.'

కమలకుమారి తిరస్కారముచేయజాలకపోయినది. ఆమె నేటివరకు అక్కడనే నివసించుచున్నది.

# తల్లి పుత్రికకు హితబోధ

సీ॥ అత్తమామలునీకు నవనిదైవములమ్మ నతిభక్తివారల నరయుమమ్మ
పతికంటె సతులకు గతియెందులేదమ్మ పతియాజ్ఞ తలదాల్చి బరగుమమ్మ
పరులసుద్దుల నెప్పుడతి, త్రవ్వకుమమ్మ పొరుగిల్లు పనిలేక తిరుగకమ్మ
పనిలేకయుండిన పదిమంది వినదగు, సద్గ్రంథ పఠనంబు సలుపుమమ్మ
ఎవరేమిబల్కిన నెదురు బల్కకుమమ్మ కోపంబుజెందుట కూడదమ్మ
నగలు సొమ్ములటంచు మగనివేడకుమమ్మ సుగుణంబులే నీకు సొమ్ములమ్మ
ఆరోగ్యపద్ధతి ననుసరించుచు నిల్లు పరిశుభ్రముగ నుంచ బాడియమ్మ
అర్థంబువస్తువుల్ వ్యర్థంబుసేయక మితముగా నుండుట మేల్లదమ్మ
సన్మార్గచరులౌచు సబలులౌనట్లుగ బిడ్డల శ్రద్ధతో బెంచుమమ్మ

గీ॥ కలిమిస్థిరమంచు గర్వంబు గాంచకమ్మ
దీనజనముల కష్టాల దీర్పుమమ్మ
దైవమును నీవు నిత్యంబు దలపుమమ్మ
మమ్ము మదియందు నెన్నడు మఱవకమ్మ.

—శ్రీ యన్. వాసుదేవరావు.

## ‘ఆంధ్ర కళాభివృద్ధికి జాతీయాభ్యుదయానికి సర్వదా పాటుబడడమే మా స్త్రీశాఖ ఆశయము’

— శ్రీమతి దుర్గాబాయమ్మ



## ‘ఆంధ్రరాష్ట్రానికి మద్రాసే ముఖ్యపట్టణము’

— శ్రీ సాంబమూర్తి

### చెన్నపురి ఆంధ్రమహాసభ—స్త్రీశాఖ గృహప్రవేశ మహోత్సవము—ప్రముఖుల ప్రసంగములు—ప్రమదల కళాప్రదర్శనములు

(గృహలక్ష్మి ప్రత్యేక ప్రతినిధి)

పాతికేండ్లనాడు ప్రముఖులైన కొంతమంది చెన్నపురి ఆంధ్రుల ఆధ్వర్యాన్ని మద్రాసులోవున్న ఆంధ్రమహాశయులనందరిని ఒకచోట చేర్చేందుకు చెన్నపురి ఆంధ్రమహాసభ వెలసింది. 1914 లో కేవలం ఒక నాటకసంఘంగా వున్న యీ సభకు శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు అధ్యక్షులుగావుండి, పోటీగా బయలుదేరిన ఇంకొకసభను దీనిని ఏకంచేసి, ఆ నూతనసంఘానికికూడా వారే ప్రథమ అధ్యక్షులుగావుండి ఒక ఆకారాన్ని కలుగజేశారు.

తరువాత శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు, వారి నిర్యాణపర్యంతం దీనికి అధ్యక్షులుగా వుంటూవచ్చారు.

ఇంతకాలంనుండి కేవలం ఒక ‘సోషల్ క్లబ్బు’గా ఆటలతోటి, పాటలతోటి, దసరా వేడుకలతోటి కాలం వెళ్లబుచ్చుతూ, చెప్పుకోదగిన అభివృద్ధి ఏమీలేక, ఓమూల నామమాత్రావశిష్టముగా, తన కర్తవ్యాన్ని మరిచిపోయి, నిస్తేజంగా, నిర్వ్యాపారంగా నిల్చిపోయింది.

దేశోద్ధారకుని తదనంతరం శ్రీ సాంబమూర్తిగారు అధ్యక్షభారాన్ని వహించి, ఉత్సాహవంతులైన కార్యదర్శులతో చేతులుకలిపి, వారిలో కార్యదీక్ష నినుమడింపజేసి, చెన్నపురి ఆంధ్రమహాసభ క్రీడావినోదాలతో కాలం వెళ్లబుచ్చడంకాదు, మద్రాసును పరమ్మతుచేసి, మద్రాసాంధ్రులలో అనుకరణభావాన్ని అంతరింపజేసి, ఆంధ్రప్రతిభకు మద్రాసునే మకుటాన్ని చేయాలన్న కార్యదీక్షను కలిగించి, ఆంధ్రమహాసభయొక్క గతించిన పాతికసంవత్సరాల నిద్రమత్తునూ గత రెండుసంవత్సరాల్లోనూ మటుమాయం చేశారంటే, ఆనాటి ఆంధ్రమహాసభకు, యీనాటి ఆంధ్రమహాసభకు ఎంత వ్యత్యాసముందో అనాయాసంగా అర్థమాతుంది.

ఏదైనా ఒక సంఘంయొక్క ఆశయాలు సర్వతోముఖంగావుండి కార్యరూపాన్ని దాల్చినప్పుడే అది నిజమైన సంస్థ అవుతుంది. క్రీడావినోదాలే కాక వయోజనవిద్య, పతితజనోద్ధరణ, లలితకళాభివృద్ధి మొదలైన సాంఘిక, ఆర్థిక, విద్యావిషయాలలో తీవ్రకృషి వుంటేనేగాని సంఘం నూటికి నూరుపాళ్లూ సంఘసేవ చెయ్యలేదు. నిజమైన నిర్మాణకార్యక్రమంగల సంఘం అందరిని ఆకర్షించి, అందరి ఆమోదాన్ని పొందుతుంది.

గత 25 సంవత్సరములనుండి చెన్నపురి ఆంధ్రమహాసభకు ఈలాటి కార్యకలాపమే వున్నట్టయితే కాంగ్రెసు మహాసంస్థలాగ మద్రాసులో, మద్రాసు పరిసరాలలో, మహదాంధ్రభూమిలో, అఖిలాంధ్రజాతి వంతటిని తన చేతిక్రిందకు తెచ్చుకుని, పేరుకీర్తులు గడించుకునేది.

## ● అభివృద్ధి సోపానాలు ●

కాని, ఈ విషయాన్నే ఇప్పుడు దృష్టిలో పెట్టుకుని, తగు కార్యక్రమాన్ని ఏర్పరచుకుని పనిచేస్తూన్న ఆంధ్రమహాసభ గత రెండుసంవత్సరాల వ్యవధిలోనూ ఆశ్చర్యకరమైన అభివృద్ధిచెంది, అందరి ఆదరణను పొందుతోంది.

ప్రప్రథమంగా విక్టోరియా పబ్లికుహాలులోకి గృహప్రవేశం, తదుపరి నాటకకళకి ఒకశాఖ, చిత్రకళకి ఒకశాఖ, శరీరవ్యాయామాదులకి ఒకశాఖ, క్రీడావినోదాలకి ఒకశాఖ,—స్త్రీలకి ఒకశాఖ—ప్రత్యేకించి, ప్రత్యేక కృషిచేస్తూ, అభివృద్ధి సోపానాలకి ఎగబ్రాకుతోంది. దానితో సభ్యులుకూడా అధికమయ్యారు. ఏలోటూ జరగకుండా పోషకులుకూడా ముందుకువచ్చారు—ఉత్తేజోత్సాహాలతో పనిచేస్తూ, కలకల్లాడుతూ కన్నులపండువగా వుంది నేడు చెన్నపురి ఆంధ్రమహాసభ.

ప్రస్తుతకాలంలో చెన్నపురి ఆంధ్రమహాసభ కేవలం మద్రాసులో చేయవలసిన మహత్కార్యం ప్రక్కనున్న బంగాళాఖాతం అంత వుంది. నడుముకట్టి యీ సముద్రాన్ని 'యీది, దాటాలి. ఈ విషయంలో ఆంధ్ర మహాసభా కార్యవర్గంవారు ప్రయత్నించిననాడు, ఈ సభ యీ సముద్రాన్ని దాటనూ దాటుతుంది, ఆంధ్ర పతాకాన్ని మద్రాసాకాశంలో అవిచ్ఛిన్నంగా ఎగరవేయనూ వేస్తుంది, ఆంధ్రప్రతిభకు మద్రాసును మకుటాన్ని చేయనూ చేస్తుంది. మహాసభయొక్క యిప్పటి కార్యోత్సాహాన్ని చూస్తే త్వరలో ఊహాకందని ప్రతిఫలం గోచరించక మానదు.

మహాసభలో ఇంతవరకు పురుషులకే స్థానం వుండేది. ఇటీవల స్త్రీలకుకూడా సభ్యత్వం సమకూరింది. మద్రాసులో అనేక సంఘాలున్నాయి, అనేక సభలున్నాయి, ప్రత్యేకించి స్త్రీ సంఘాలుకూడా వున్నాయి. కాని స్త్రీలశాఖ కలిగిన సభ యిదే మొదటిది—దీనిదే అగ్రస్థానం కూడాను. ఈ మహాసభ నృత్య, చిత్ర, వ్యాయామ, నాటక, సాంఘిక శాఖలలో స్త్రీ ప్రతినిధులు నేడు ప్రముఖస్థానాలు పొంది వున్నారు.

ఇన్ని శాఖలు, ఇంతమంది సభ్యులుగల యీ మహాసభయొక్క కార్యక్రమంలో, స్త్రీ పురుషు లిద్దరు అన్యోన్యంగా వివిధవిషయాలలో కృషిచెయ్యడానికి ప్రస్తుతం మహాసభ వున్న విక్టోరియా పబ్లిక్ హాలులో తగినంత విశాలమైన స్థలం లభ్యమవడంలేదు. దానికిగాను స్త్రీలశాఖను ప్రత్యేకించవలసిన కార్యభారం మహాసభ తలపెట్టి మైలాపూరులో లజ్ ఛర్చిరోడ్డులో వున్న 'మాధవభాగ్'లోకి స్త్రీలశాఖను మార్చి, మహాసభయొక్క కార్యక్రమంలో స్త్రీలు నెరవేర్చవలసిన బాధ్యతనంతా యీ నూతన భవనంలో నిర్వహించడానికి పూనుకున్నారు.

# గృహప్రవేశ మహోత్సవము

ఈ నూతన గృహప్రవేశం గత జనవరి మొదటి తేదీని అత్యంతోత్సాహంతో కన్నులపండువగా జరిగింది. మాధవభాగ్ మైలాపూరులో మధ్యగా వుండడంవల్ల స్త్రీల రాకపోకలకు చాలా అనుకూలంగా వుంది.

ఆనాటి మధ్యాహ్నం నూతన గృహప్రవేశ మహోత్సవానికిగాను మాధవభాగ్‌ను సర్వాంగసుందరంగా అలంకరించారు. సభాసమావేశానికి భవనంలోని బయటి ఆవరణలో చక్కని రంగాన్ని నిర్మించారు. సరిగా 4-30 కి సుమారు వేయిమంది పురప్రముఖులు, పురంధ్రీమణులేగాక, మాజీప్రధాని చక్రవర్తుల రాజగోపాలాచార్యులుగారుకూడా విచ్చేసి సభ నలంకరించారు.

గృహప్రవేశమహోత్సవంతోపాటు చెన్నపురి ఆంధ్రమహాసభ ప్రథమ అధ్యక్షులైన సర్. ముత్తా వెంకటసుబ్బారావుగారికి, వారి సతీమణి శ్రీమతి ఆండాళ్ళమ్మగారికి సన్మానపత్ర సమర్పణముకూడా జరిగింది.

స్త్రీశాఖసభ్యులచేత వందేమాతరం ప్రార్థనానంతరాన్ని శ్రీ సాంబమూర్తిగారు సభ్యులకెల్లరకు నాటి కార్యక్రమాన్ని వివరిస్తూ యిలా ప్రసంగించారు—

## ● మహాసభ ఆశయాలు ●

'ఈనాడు నూతన సంవత్సరారంభం. ఇది పాశ్చాత్యుల ఆచారమైనప్పటికీ మనదేశంలోకూడా, ప్రస్తుత పరిస్థితులనుబట్టి, యీ జనవరి మొదటి తేదీని ఒకముఖ్యమైన రోజుగా పరిగణిస్తూవున్నారు. అందుచేత యీరోజున చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖయొక్క గృహప్రవేశ మహోత్సవాన్ని జరుపదలచాము. ఈ మహాసభలో స్త్రీలకుకూడా ఒక శాఖను 1939 నవంబరు 12-వ తేదీని ప్రారంభించబడినది. ఈ కొద్ది వ్యవధిలోనే 150 మంది సభ్యులు చేరారు ఈ శాఖలో. ఇక్కడ నృత్యకళ, సంగీతము, హిందీ యిప్పటికి ప్రారంభించారు. ఇంకను ఇతరములైనవి త్వరలో ప్రారంభిస్తారు. ఇది కేవలం 'సోషల్ క్లబ్బు' కాదు. ఆంధ్రకళాభివృద్ధికి పాటుబడడమే దీని ఆశయం. స్త్రీలు ముఖ్యముగా లలితకళాభివృద్ధికి తోడ్పడితే మన సాంఘిక జీవితం సౌఖ్యవంతమౌతుంది. తద్వారా ఆంధ్రుల ఐకమత్యత అచంచలంగా మద్రాసులో స్థాపింపబడుతుంది. ఈ దృక్పథంతోనే ఈ ఆంధ్రమహాసభ-స్త్రీలశాఖ కృషిచేస్తుంది. ఆంధ్రదేశపు పట్టణాలలో చెన్నపట్టణానికే ఎక్కువ ప్రాముఖ్యతవుంది. ఆంధ్రైక్యతకు, ప్రతిభకు ఇదే కేంద్రస్థానం. ఆంధ్రరాష్ట్రానికి మద్రాసే ముఖ్యపట్టణం. ఇందుకొరకు మద్రాసాంధ్రులు కృషిచెయ్యాలి. అందులోనూ యీ స్త్రీలశాఖ అమితంగా పనిచెయ్యవలసి వుంటుంది. ఈ విషయమైన ప్రత్యేక సౌకర్యములకొరకు స్త్రీలశాఖ యిక్కడకు మార్చబడింది.

రెండుభాగాలుగా చీలిపోయిన చెన్నపురి ఆంధ్రమహాసభను 1916-లో ఒకటిగాచేసి వారే ప్రథమ అధ్యక్షులుగా ఆరు ఏడు సంవత్సరాలవరకు వుండిన సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారి పరిశ్రమ ఫలితమే నేటి మన ఆంధ్రమహాసభ. హైకోర్టు జడ్జిపదవినుండి విశ్రాంతిపొంది, ఇప్పుడు నాగపూరులో నైజాంవారి

బీరారుపరగణాలకు ప్రతినిధిగా వుంటున్నారు. వీరి దంపతులను సన్మానించడంలో ఆంధ్రమహాసభ తన కర్తవ్యాన్ని తాను నెరవేరుస్తోంది అన్నమాట.'

## ● సన్మానపత్ర సమర్పణ ●

తదనంతరం మహాసభ కార్యదర్శులైన శ్రీ రామానుజరావునాయుడుగారు సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారికి సన్మానపత్రం సమర్పించారు.

తరువాత స్త్రీలశాఖ కార్యదర్శురాలైన శ్రీమతి దుర్గాబాయమ్మగారు వెంకటసుబ్బారావుగారి సతియైన శ్రీమతి ఆండాళ్లమ్మగార్కి సన్మానపత్రం చదివి సమర్పించారు.

శ్రీ సుబ్బారావుగారు సన్మానపత్రానికి సమాధానం చెబుతూ ఆంగ్లాన్ని యీలా ఉపన్యసించారు.

'నేను తెలుగులో ధారాళంగా మాట్లాడలేనని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. ఇది నా తప్పు కాదు; చెన్నపురిలోవుండి, అన్యత్రా నివసిస్తూ మా వంశ పారంపర్యాయంగా వస్తూవున్న లోటే దీనికి కారణం.

చెన్నపురి ఆంధ్రమహాసభకు అధ్యక్షుడుగావుండి రెండుగా అయిపోయిన సంఘాలను ఏకంచేశాను. 1916-లోని ఆనాటిసభకు యీనాటి సభకు హస్తిమశకాంతరం భేదంవుంది. ఈ అభివృద్ధికి శ్రీ సాంబమూర్తిగారి నిరంతర కృషి ప్రోత్సాహములే కారణం అని చెప్పడం అతిశయోక్తికాదు.

ఆంధ్రమహాసభ అంటే అది ఒక మహత్తరమైన మహాసంస్థ అన్నమాట. శ్రీ వీరేశలింగంపంతులువంటి స్వచ్ఛమైన సాంఘిక సేవాతత్పరులను నోచిపెట్టుకున్నటువంటి సంస్థ. అటువంటివారి ఆశయాలను మననం చేసుకుంటూ ఆంధ్రమహాసభ పనిచేసిననాడు ఆంధ్రమహాసభ సార్థకరూపం పొందుతుంది. ఈ విషయంలో, ముఖ్యంగా యీ స్త్రీశాఖ, చాలా పాటుపడవలసివుంది. చెన్ననగరంలో మరి ఏ యితర సంస్థకు లేనటువంటి స్త్రీలశాఖ మన ఆంధ్రసభకు వుంది. అటువంటప్పుడు చెన్నపురి స్త్రీలలో ఉత్సాహాన్ని కలుగజేసి, ఉత్తమోత్తమమైన సాంఘికసేవలో పురుషశాఖను యిది మించాలి. యీ భవనం చాలా సదుపాయంగావున్నది గనుక, అసంఖ్యాకములుగా స్త్రీలు యిందులో సభ్యులుగాజేరి, సభను యింకా అభివృద్ధిలోకి తీసుకువస్తారని ఆశిస్తున్నాను.'

తరువాత శ్రీమతి ఆండాళ్లమ్మగారు సన్మానపత్రానికి బదులుచెబుతూ ఇలా మాట్లాడారు—

'నాకీ శుభ సమావేశానికి అధ్యక్షత వహించుటకు అవకాశం కలుగజేసినందులకు మీకెంతయు కృతజ్ఞురాలను.

మద్రాసులో ఆంధ్రమహాసభకు తిరిగి జీవంపోసి, దానిని వృద్ధిపరచడమేకాక, దానిలో స్త్రీశాఖనొకదానిని ప్రత్యేకించి పనిచేయడం నాకు చాలా ఆనందం కలిగిస్తూవుంది. ముఖ్యంగా స్త్రీలు నేడు సాంఘికంగా, రాజకీయంగాకూడా ఎంతనో కృషిచేయవలసివుంది. తగురీతిని సేవచెయ్యడానికి పురుషులు అడ్డుపెడతారను మాటలుచెప్పే రోజులు ఇప్పుడు లేవు. పురుషులు, స్త్రీలు వారివారి కర్తవ్యాల ననుష్ఠించిననాడు మన సంఘం ఎంతైనా పుష్టి చెందుతుంది.

ఈ విషయంలో ఆంధ్రవనితలు మరి ఏ యితరజాతికి తీసిపోరు. చెన్నపురిలోని యీ ఆంధ్ర స్త్రీశాఖవారు గృహిణీ సంబంధమైన విషయాలలో చక్కగ పనిచేసి, చెన్నపురాంధ్రస్త్రీలకేగాక తదితర స్త్రీలకు కూడా మార్గదర్శులౌతారని కోరుతున్నాము. కార్యదీక్ష కలిగిన శ్రీమతి దుర్గాబాయమ్మగారు, సాంబమూర్తిగారు వున్నారు గనుక నాకీవిషయంలో పూర్తి విశ్వాసముంది.

# చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీశాఖ





గృహప్రవేశ మహోత్సవమునకు విచ్చేసిన పురంధ్రీమణులు

# అఖిలభారత సంగీత నృత్యవిద్యాప్రదర్శన పోటీపరీక్షలు



నృత్యవిద్యా ప్రదర్శనములో ప్రథమ బహుమతిని బడసిన

శ్రీ కుమారి హీరాబోస్



వాయిద్య సంగీతములో ప్రథమ బహుమానమును పొందిన

శ్రీ కుమారి నెరాబోస్





శ్రీ మహాలక్ష్మి పఠనమందిరము—హిందీ తరగతి.

నేను అట్టి శుభదినముకొరకు ఎదురుచూస్తూవున్నాను. ఏతత్ఫలితంకొరకు ఆంధ్ర స్త్రీ పురుషులను సర్వతోముఖంగా తోడ్పడ గోరుతున్నాను.'

ఉపన్యాసానంతరం శ్రీమతి ఆండాళ్లమ్మగారి అధ్యక్షతను తదుపరి కార్యక్రమం జరిగింది—

# కళా ప్రదర్శనములు

ప్రథమంలో శ్రీ బృందావన బాలికలు 'పుష్పాపచయం' నృత్యం భావపూరితంగా ప్రదర్శించారు.

ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖలో సంగీతోపాధ్యాయిని అయిన శ్రీమతి ఆర్. బృహదాంబగారు త్యాగరాయకృతులు, గాంధిమహాత్ముని అభిమానగీతమైన 'వైష్ణవజనతో' అను గీతమును హృదయరంజకంగా పాడారు.

పిమ్మట శ్రీమతులు దుర్గాబాయమ్మగారు వీణ, గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత, చిత్రకళావిశారద శ్రీమతి రత్నాల కమలాబాయిగారు ఫిడేలు, బృహదాంబగారు ఫిడేలు, నిర్మలాదేవిగారు సితారా, భానుమతిగారు ఫ్లూటు, జంత్రవాయిద్యాలతో కొన్ని కీర్తనలు వాయించి సభికుల నానందపరచారు.

తరువాత దుర్గ, అనసూయ, రాజ్యలక్ష్మికలసి, ఇంపైన హస్తవిన్యాసాలతో, చక్కని లాస్యవిలాసాలతో, నిండైన గతిగుంభనలతో భరతనాట్యంచేశారు.

కుమారికల్పకం, లీల, మహాలక్ష్మి, లక్ష్మీనరసమ్మ కలిసి మువ్వగోపాలపదమును పాడుతూ హృదయ రంజకంగా అభినయించారు.

స్త్రీల జంత్ర వాద్యప్రకటనలు, యువతుల గాంధర్వగాత్రగానము, బాలికల భరతనాట్యాది నృత్యాలు సొంపునింపుతూ, సభికులను ఆశ్చర్యానందకందళితహృదయారవిందులను చేసివేశాయి. నృత్యగీతాది లలితకళలను ఉపాసించడంలో ప్రతిస్త్రీకిగల ప్రధాన ధర్మాన్ని, హక్కులను, హద్దులను ఆనాటి వేడుక ప్రదర్శనలు స్పష్టీకరించి, స్థిరపరచాయి.

ఈ ప్రదర్శనానంతరాన్ని కార్యక్రమాన్ని ముగించుతూ, శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఇట్లు ప్రసంగించారు—

### ● సహకారమునకు విజ్ఞప్తి ●

'ఇక్కడ నేను ఇప్పుడుచేయబోయేది నేటికార్యక్రమంలో ఆఖరుది. అయితే మీరు ఇంతవరకుచూచి, విన్నదానికంటె ఇది వినడానికి అంతఇంపుగాను వుండదు, కనడానికి అంతసొంపుగానుండదు - అదే నేనుమా స్త్రీశాఖనుగురించి నాలుగుమాటలు చెప్పడం.

ఇంతకుముందు శ్రీ సాంబమూర్తిగారు, చెన్నపురి ఆంధ్రమహాసభయొక్క ఆశయాలను, ప్రత్యేకించి స్త్రీశాఖయొక్క కార్యక్రమాలను మీకందరికి విశదంగా చెప్పివున్నారు.

అయితే సభయొక్క ఆశయాలనుగురించికాక, మాకర్తవ్యాన్నిగురించి మీకు కొంత మనవిచెయ్యాలని సంకల్పించుకున్నాను.

మాస్త్రీశాఖ ఒకనెలాపదిహేనుదినములక్రిందటనే స్థాపింపబడినా, యీకొద్దివ్యవధిలోనే మంచి అభివృద్ధిలోకి వచ్చింది. మొట్టమొదట రు 45లు అద్దెయిచ్చి ఒకయిల్లుతీసుకుని కార్యక్రమాన్ని ప్రారంభించి

నప్పుడు యీఅద్దె ఎట్లాభరించేది అని చాలా ఆతృతపడ్డాము. కాని సుమారు 150 మంది సభ్యులు చేరడమే తడవుగా ధైర్యంకలిగి, ఆ అభివృద్ధినిచూచి, విశాలమైన పెద్దభవనంవుంటేనేకాని వీలులేనిపరిస్థితులు రావడంచేత యీపెద్దఇల్లు తీసుకోనవలసివచ్చినది. ఈనూతన గృహానికి ఇచ్చుకోనవలసిన నూరురూపాయలు అద్దేకాకుండా, నౌకర్లకు జీతాలు, వెలుతురు, నీళ్లు, చివరకుగాలికూడా డబ్బుపెట్టికొనుక్కోవాలన్న విషయం మీకందరకు తెలిసినసంగతే. అంచేత ఇవన్నిభరించి కొంతపనిచేయదలచుకుంటే సుమారు 500మంది సభ్యులైనా చేరాలి. ఈ విషయంలో పురుషులకు నేనొకవిన్నపం చేసుకుంటున్నాను. ప్రతివారు వారి వారి ఆడవారిని ప్రోత్సహించి, యీసంఘంలో సభ్యులుగా చేర్పించవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

ప్రస్తుతం నెలచందా అర్థరూపాయమాత్రమేవుంది. అఖండమైనకార్యభారాన్ని నిర్వహించేందుకు యీఅర్థరూపాయను ఒకరూపాయయిచెయ్యవలసి వుంటుంది. అయినా నాఆంధ్రసోదర సోదరీమణులు యీ విషయమున చేయూత నిస్తారని కోరుతున్నాను.

ఒక్కస్త్రీలనేకాక బాలికలనుకూడా తప్పకపంపమని కోరుతున్నాను. బాలికలతో పనిచేస్తూ వాళ్లకి ఏవిషయాన్నైనా బోధపరచడం ఎంతకష్టమైనా అదినాకుచాలాయిష్టం. కనుకయీవిషయంలో మీరు సర్వవిధముల చేయూతనిమ్మని ప్రార్థిస్తున్నాను.

ఈనాడు మనం కావించినది అసలైన గృహప్రవేశముకాదు; ఇది అద్దిఇళ్ళల్లో అలంకారమే. అనతికాలంలో నిజమైన స్వగృహప్రవేశంచేయాలి. దానికి మద్రాసులోని ఆంధ్రమహాశయులు ప్రయత్నిస్తే ఎంతకాలమో పట్టదు—

## ● విరాళాలు ●

మా స్త్రీశాఖకు 'గృహలక్ష్మి' పత్రికాధిపతులు డాక్టరు కే. యన్. కేసరిగారు ఐదువందలరూపాయలను విరాళంగా నేటి ఉదయమే ఇచ్చివున్నారు. ఇంకనువారు ఒకవేయిరూపాయలు ఇస్తామని వాగ్దానం చేశారు. వారికిమేమెంతయు కృతజ్ఞులము.

శ్రీ పిఠాపురం యువరాణీవారు, శ్రీ వెంకటగిరి రాజావారి కుమార్తెగారు యీసంస్థకు నూరురూపాయలిచ్చి, యావజ్జీవ సభ్యులుగాచేరారు. వీరందరి ప్రోత్సాహానికి మేము సర్వదా కృతజ్ఞులము.'

వెంటనే అధ్యక్షురాలైన శ్రీమతి ఆండాళ్లమ్మగారు నూరురూపాయలు యిచ్చునట్లుగా వాగ్దానం చేశారు.

పిమ్మట 'ఆంధ్రమాత' మంగళగీతికతో, దుర్గాబాయమ్మగారి కృతజ్ఞతాభివందనములతో మహోత్సవము అత్యంత మంగళప్రదంగా ముగిసింది.—

## ● దుర్గాబాయమ్మ ఆదర్శయువతి ●

ఆనాటి సభ, కార్యక్రమం, స్త్రీ పురుషులు కనబరచిన ఉత్సాహం తిలకిస్తే, ముఖ్యంగా స్త్రీలు పనిచేసిననాడు నేటి మన సాంఘిక జీవనము సమరసంగా సాగుతుందని తోచక మానదు. ప్రత్యేకంగా మద్రాసు ఆంధ్ర స్త్రీలలో, కని విని ఎరుగని కార్యోత్సాహం కలిగి, వారు కార్యదీక్షతో ముందుకు రావడం ఆశ్చర్యం కలుగజేస్తుంది. ఈ స్త్రీశాఖ సృష్టికి, అభివృద్ధికి ముఖ్యకారకురాలు శ్రీమతి గుమ్మిడిదల

దుర్గాబాయమ్మగారు. దుర్గాబాయమ్మగారు కబుర్లుచెప్పి కాలంవెళ్లబుచ్చే వ్యక్తికాదు. నిస్తేజంగా నిద్రపోయే తత్వంగాదామెది. మహనీయుల ఆదర్శాలను జీర్ణంచేసుకుంది. వాటిని తు, చ, తప్పకుండా ఆచరణలో పెట్టేటప్పుడు వెనుకంజవేయడం ఎరగదామె. ఆమె ఎక్కడున్నా అక్కడి ప్రజలలో కొంత చైతన్యం కలుగుతుంది. విజయశిఖరముపై దృష్టినుంచి, దారిలోని అడ్డంకులను చెల్లాచెదురుచేసి, గెలుపుటోడులను లెక్కచేయక, ద్విగుణీకృతోత్సాహంతో శిఖరాగ్రానికి ఎక్కుతూవున్న దుర్గాబాయివెంట ఉత్తేజమనస్కులై నడుస్తారు, ఆదర్శాపేక్షగల యువతీయువకులు—

ఆమె గత జీవితంలోని ఘనకార్యాలను స్మరించుకుంటే ఆమె నిర్మాణకార్యదీక్ష విదితమౌతుంది.

కాకినాడలోని హిందీ పాఠశాల ఆమె దేశసేవాసక్తికి ప్రథమఫలితము. మద్రాసు సముద్రతీరాన్ని నాటి ఉప్పుసత్యాగ్రహ సమయంలోని దుర్గావతారం మద్రాసు పౌరుల దృక్పథంలో మెదులుతోంది నేటివరకు.

ఆంధ్ర, ఆంగ్ల, హిందీభాషల్లో చక్కని ప్రవేశం, పాండిత్యమూను; వీణ, ఫిడేలు, హార్మోనియం మొదలైన వాద్యాలలో నేర్పు; మృదుమధురమైన గానం; హావభావపూరితమైన నటన; పదిమందికి మార్గదర్శినియై వారిని కార్యదీక్షా నిమగ్నులనుచేసి, ముందుకు చొరచుకొనిపోయే నిశితబుద్ధిగల దుర్గాబాయమ్మ నేటి యువతీలోకానికి ఒక ఆదర్శవ్యక్తి—

ఏనాడో సాంఘిక దేశసేవలకు తన జీవితాన్ని అంకితంచేసిన దుర్గాబాయమ్మ చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీశాఖ కార్యభారాన్ని వహించింది—వెలుగు జిలుగులను విరజిమ్మే భావిరేఖలను వన్నెవిన్నాణాలతో తీర్చిదిద్దుకుంటోంది స్త్రీశాఖ అప్పుడే—

ఈ శాఖలో కేవలం నృత్యగీతాది లలితకళలు, హిందీ, సాహిత్యాలు మొదలైనవేగాక, సౌఖ్యవంతమైన సంసారాన్ని సాగించటానికి సహాకారమునిచ్చే గృహపరిశ్రమలకుకూడా మంచి స్థానాన్ని ఇచ్చి మద్రాసు గృహిణీలోకంలో దుర్గాబాయమ్మగారు బాగా కృషిచేస్తారని ఆశిస్తున్నాము.

# తెలుగు సోదరీ!

సీ॥ జన్మించినావమ్మ సహనసంపత్తితో భాసిల్లు తెల్గు గర్భాన నీవు
గ్రోలంగజాలితి గురుగుణాఢ్యంబైన యుత్తమ స్తన్యపీయూషమీవు
పెరిగితివీవు యీ పరమపవిత్రమౌ స్వాతంత్ర్య సారభాస్థానమందు
తీర్చినేర్చితివమ్మ దేశభాషలరాణి తేటవెలుగుల జిలుకు తెలుగువాణి

తే॥ గీ॥ అయిననేలకొ మరచితివన్ని, నేటి
ఆనవాయితిలేని యంధానుకరణ
దాస్యభావాల వేవేగ తరిమి నిల్చి
తెలుగుసోదరి, నిల్పుమా తెనుగుతనము!

—శ్రీ ఏడిద కామేశ్వరరావు.

# గృహలక్ష్మీ ప్రశంస

విఖ్యాత కేసరి ప్రఖ్యాత పుత్రివై యాంధ్రదేశంబున నన్నియడల
సంచార మొనరించి సచ్ఛీలవై నీవు జనకుని కీర్తిని జగతియందు
జాటుచునున్నావు శ్రమమైన దలపక దిక్కుల నీకీర్తి పిక్కటిల్ల
స్త్రీసంఘ విద్యల స్త్రీసంఘ ధర్మాల గాపాడ బుట్టిన కాంతవమ్మ

యెల్ల గృహముల వెలయుచు నింపుమీర
సదుపదేశము జేసెడి చానవౌట
రమణగాంచిన యోగృహలక్ష్మి నీకు
నమలమదితోడ జేతు జోహారులమ్మ.

స్త్రీల వెదుకంగదలచిన స్త్రీలయందె
వెదుకదగునంచు వచియింత్రు విబుధులెల్ల
నట్లునీకీర్తి విస్తారమరయుదమన
నాంధ్రవనితా సమాజంబులరయవలయు.

స్త్రీజనావళి యందతి శ్రేష్ఠమైన
నీతిధర్మముల్ బోధించు నేర్పు మెరయ
వ్రాయగలిగెడి సచ్ఛీలవతులయందు
వాణిప్రత్యక్షమగును సత్ఫలదయగుచు.

స్త్రీలవిద్యలు రాణించి చెలువుగాంచి
యలరుభావములెల్ల వృద్ధులకుబొంద
నందుకొనునిన్ను వారెల్ల నంబుజాక్షి
వినయమును మీరపూజింత్రు వేళలెల్ల.

స్త్రీలనెల్లను వృద్ధికి తేదలంచి
మాదువ్యాసము లెల్లను మమతగానెడి
యీసులేనట్టి యా కే. యన్. కేసరికిని
రమ్యమునవెల్గు శ్రీ గృహలక్ష్మి కధిక
భక్తితోడ సమర్పింతు వందనములు.

—శ్రీమతి ఎం. సరస్వతికుమారి.

# బుద్ధి ప్రభుత్వము — ప్రేమ పెత్తనము

శ్రీయుత గోనెల నరసింగరావుగారు, ఎం. ఏ. బి. యల్.



"ప్రేమమయుఁడీశ్వరుఁడు; సృష్టి ప్రేమమయము." 'ప్రేమ' సహజముగ ప్రతి జీవికి ననుభవైకవేద్యమైయున్నది. 'ప్రతిజీవి'యనుటలో నాభావము ప్రాణికోటిలో ప్రతి దానికి ననియే. చీమ, వేఱొకచీమ కాలువిఱిగి బాధపడుచుండిన, దానికివలయు సహాయము తన శక్తినంతయు వినియోగించి చేయును. తన శక్తి కతీతమైనచో తనజాతివారిని సమీపించి బాధపడు తమ సోదరుని పాట్లు విన్నవించి వారి గుండెలను గఱఁగించి దుఃఖార్తిఁజెందిన తమ చీమ తమ్ముని సహాయార్థమై తమజాతి దండునంతను గదలించును. ఆమధుర హృదయమెంత ప్రేమ సంభరితము! ఆవుల 'అంబా'రవములో పక్షుల 'కలకల' స్వనములో తుమ్మెదల 'ఝంకార'ములో ప్రేమ ప్లావిత హృదయము గోచరమగుచుండును. రాయంచ జంటల రాగభరములో భృంగదంపతుల ప్రణయములో హరిణీ హరిణుల యనురాగములో ప్రేమ మాహాత్మ్యమును జూడనగును. చెట్టునకు మొగ్గ దొడిఁగెడుచేష్ట, కోరమునకు వికసించుగుణము, విరికి వలపుల వెదఁజల్లెడి విద్య, ప్రేమ ప్రభావమును జాటుచున్నవి. తుదకు పెంపుడు 'కుక్క తోకాడింపులు' ప్రేమభరితములు కనుకనే సృష్టి ప్రేమమయము.

సృష్టిలో ప్రతిజీవియందును 'ప్రేమ' యను గుణవిశేషము విస్పష్టముగఁ జూడనగును. అట్టియెడ సర్వశక్తి, సర్వాధికారి, సాధుమూర్తియునగు, సర్వేశ్వరుఁడు ప్రేమమయుఁడనుట నిర్వివాదాంశము. 'ప్రేమ'యే యీశ్వరుఁడు. ఈశ్వరుఁడే 'ప్రేమ'. సమస్తాంతరాత్ముఁడై వెలిఁగెడుప్రభు వీశ్వరుఁడు కావుననే సృష్టిప్రేమమయమని చెప్పనొప్పును.

'ప్రేమ'యను పదము విశేష భావగర్భితమైనది. తలిదండ్రులకు బిడ్డలయందుండు ప్రేమ 'వాత్సల్యము'; పిల్లలకు మాతాపితరులయందును గురువులయందును నుండు ప్రేమ 'భక్తి'; భార్యాభర్తల కొండొరులయందుండు ప్రేమ 'ప్రణయము'; అన్నదమ్ములమధ్య నెలరారుప్రేమ 'యభిమానము'; బంధువులయెడ ప్రేమ 'యౌదార్యము'; పెద్దలయెడ ప్రేమ 'గౌరవము'; సమవయస్కులయెడ ప్రేమ 'స్నేహము'; పిన్నలయెడప్రేమ 'యాదరము'; మంచివారి యెడఁగల ప్రేమ 'సౌజన్యము'; బీదలయందలి ప్రేమ 'దాక్షిణ్యము'; సృష్టియందుండు ప్రేమ 'విశ్వప్రేమ'; పరమాత్మదేవునియందుండు ప్రేమ 'దివ్యప్రేమ'; పసిని సుఁగులయెడ ప్రేమ "ముద్దు." ఇది మానవత్వములో నిమిడియున్న ప్రేమతత్వము.

'బుద్ధిప్రభుత్వము-ప్రేమపెత్తనము' యను శీర్షికక్రింద (డిశెంబరు) 'గృహలక్ష్మి'లో ప్రచురించిన ప్రథమ సంపాదకీయవ్యాసమును దిలకించితిని. ఆవ్యాసమునందుఁగల భావము

లతో చాలవఱకు నేనేకీభవించుచున్నాను. ప్రేమవిషయికానుభవములో నాయుద్దేశ్యములఁ గొన్నింటిని వ్రాయనుంకించి యట్లు చేయఁబూనుట చర్వితచర్వణమే యని యెఱింగియు నాకలమునకుఁగల కండూతినణంపఁలేక వ్రాయ సాహసించుచున్నాను. 'బుద్ధి, ప్రేమ' అను నవి స్త్రీ పురుషులకెల్లను సామాన్యగుణములేయైనను, 'బుద్ధి' పురుషుని ప్రత్యేకగుణమును 'ప్రేమ' స్త్రీయొక్క ప్రత్యేకగుణమును అని చెప్పవలసియుండును." ఈ వాక్యమునందలి సత్యమును వేఱుగా వ్రాయనక్కరలేదు. స్త్రీ ప్రేమకుఁ బెట్టినదిపేరు. పురుషుఁడు 'బుద్ధి'కి సన్నిహితుఁడు. పై నుదాహృతమైన గుణవిశేషములు సర్వసాధారణముగ మానవులలో చూడనగును. అట్లని, ప్రేమలేనిస్త్రీలు, బుద్ధిలేని పురుషులు లేరని నా యుద్దేశ్యముకాదు. ప్రపంచమునందనేక ప్రవృత్తులతో గూడుకొనిన వ్యక్తులుగలరు. "స్త్రీ ధృక్పథము మార్చవలెను. వివేకవంతముగ నీతియుతముగ ప్రేమ పూర్వకముగఁ బ్రవర్తింపవలె" నని యుపన్యాసములనిచ్చు విదుషీమణులు వివేకశూన్యులై, యవినీతిపరులై, దుష్ప్రవర్తకులైన వారిని మనము చూచుచున్నాము. అటులనే పురుషులు ప్రాచీన హిందూమత సాంప్రదాయములను ముఖ్యముగ హిందూధర్మశాస్త్రములో శాస్త్రకారుఁడు చిత్రించిన వివాహబంధములను ఛేదింప సమకట్టి పితంతూద్వాహములను మనుస్మృతికారుఁ డొప్పుకొనెఁడా ?" యని యుత్కంఠత నుపన్యసించు బుద్ధిమంతులు దమబిడ్డలు విధివశమున విధవలైన దేవుని దూషించి 'బుఱ్ఱ గొఱిగించి' ముసుఁగువేయించు వారిని మనము జూచుచున్నాము. ఈ యుభయులు, మానవులకు సామాన్యమైన సాధారణ తరగతిలోచేరరు. వీరికివిద్యాధిక్యత యున్నది గాన ప్రత్యేకతరగతిలోనివారు. కాఁబట్టి మనచర్చకు వీరు దూరము. మనకు సంబంధించిన ప్రతిలేమయు ప్రేమమయి, ప్రతిపురుషుఁడును బుద్ధిమంతుఁడు. అనఁగా నొకసుదతి యందెన్ని సుగుణములున్నను 'ప్రేమ' యను గుణవిశేషముత్తేజితముగఁ బ్రకాశించుచుండును. ఆవిధముగానే పురుషునియందు 'బుద్ధి' ప్రస్ఫుటముగఁ బ్రజ్వరిల్లుచుండును.

"సామాన్యముగ సంసారములో భార్య పెత్తనమే యెక్కువగనుండును." సంపాదకమహాశయుని యీ వాక్యమునకు నేను విలువ నూహింపఁజాలకున్నాను. బహుశః 'కోహినూరు' తుల్యమేమో ! స్త్రీల యౌన్నత్యాభివృద్ధులకు బాటుబడు విదుషీమణులెల్లరీ వాక్యమునందలి యర్థమును గ్రహింపవేఁడుకోలు. గృహిణిని గృహయజమాని గౌరవించును; ఆమె నలరించుటకు బ్రయత్నించును; ఆమె కానందముఁ జేకూర్చును; ఆమెను దగురీతిని నాదరించును; మన్నించును. విద్యాగంధశూన్యుఁడగు జానపఁదుడు సైతము తన యర్ధాంగియెడ గౌరవపురస్సరముగఁ బ్రేమ నెఱపి యాదరించుననిన, విద్యావంతుని, వివేకవంతుని, విజ్ఞానవంతుని విషయమును వేఱుగ నుడువనక్కఱలేదు.

విత్తవంతుఁడైనను, రిక్తుడైనను సంసారమునకు సంబంధించిన సర్వవిషయములలోను సహధర్మచారిణికే సర్వాధికారమునొసంగునని, నిస్సంశయముగఁ జెప్పనొప్పును. ఇందు లకుఁ గల ముఖ్యకారణము సతీపతులు ప్రేమపాశములచే బంధింపఁబడియుండుటయే! లోకములో సర్వసామాన్యముగఁ బ్రతి గృహమందును మనము జూచుచున్న విషయమే యిది. సాధారణ పరిస్థితులలో గృహిణి ప్రేమమయి. కనుకనే 'సంయుక్తరాణిలేఖ'లో

> 'ప్రేమమయ సుధామూర్తి సాధ్వీమతల్లి! కలుషరాహిత్య జీవనోత్కలికగరిత!
> మానినీమణి గేహ సామ్రాజ్యలక్ష్మి! తరమె. తెలియఁ దన్మహిమ సాధారణులకు'.

యని పాడుకొనియుంటిని. అట్టియెడ పతులు తమ సతులను చులకనగ జూచు చున్నారనుటలో సత్యమెంతయున్నదో చదువరులే గ్రహింపఁగలరు. స్త్రీలను హీనముగఁ జూచు పురుషులు లేకపోరు; పురుషులను మోసగించు స్త్రీలును లేకపోరు. కాని నేనిది వఱకు నుడివియున్నట్లు వీరు ప్రత్యేకతరగతిలో చేర్పదగ్గవారు. మన చర్చతో వీరికెట్టి సంబంధమునులేదు. మన ప్రసంగమునకు సరియైన స్త్రీ పురుషులు, సంపాదకులు నుడివినట్టి వారే,— ప్రేమమయులు; విజ్ఞానవంతులు.

"సంసారమను శరీరములో పురుషుఁడు శిరస్సు, స్త్రీ హృదయము". "హృదయము ప్రేమకు నిలయము; శిరస్సు బుద్ధి కాశ్రయ"మని సంపాదకమహాశయులు వ్రాసిచ్చి యున్నారు. బహుశః వారి యుద్దేశ్యము పురుషుఁడు బుద్ధిని వినియోగించి, స్త్రీ ప్రేమను పురస్కరించుకొని సంసారము నప్రమత్తతతో నిర్వహింపవలెనని కాబోలును. నేనును కాదనను. స్త్రీ పురుషులకు ప్రధానగుణములవియేయైనను పురుషుఁడు బుద్ధిబలముకలవాఁడై నను కఠినుఁడగుచో, స్త్రీ, ప్రేమమయియయినను సవివేకియగుచో, నిఁక నా సంసార మవిచ్ఛిన్నముగఁ గడుచుటెట్లు? ఒక వ్యక్తిలో బుద్ధికి ప్రేమకు సంబంధములేకపోవచ్చును. అట్టియెడ నిఁక కర్తవ్యమేమి? కాఁబట్టి పురుషుఁడు 'బుద్ధిప్రభుత్వము'తోబాటు 'ప్రేమ పెత్తనము'ను పాటించవలెను. అటులనే స్త్రీయును 'ప్రేమపెత్తనము'తో 'బుద్ధిప్రభుత్వ ము'ను సమన్వయించవలెను. ఈ సందర్భమున సంపాదకులు ప్రయోగించిన పదములు— 'ప్రేమప్రభావము' స్త్రీ పరముగ వివేకముతోఁగూడుకొన్న 'ప్రేమ'యనియు 'జ్ఞానాభి వృద్ధి' పురుష పరముగ ప్రేమతోగూడుకొన్న 'బుద్ధి'యనియు మన మూహింపవలసి యున్నది. 'హృదయములేనినాఁడు శిరస్సు శిలతో సమానమ'ని వ్రాసిన సంపాదకుల వాక్యమునకు, 'శిరములేనినాఁడు హృదయమునూ శిలావేదికతో సమానమ'ని చేర్చి చదువవలయును. అట్లయిననాఁడే యనఁగా, సతీపతులట్లాండ్రారుల నర్థము జేసుకొన్న నాఁడే, సంసారమును వివేకముతో నిర్వహించుటకు వలయు విజ్ఞాన మలవరచుకొన్నారని భావింపవచ్చును. ఆదర్శప్రాయులుగ శ్రీ రామకృష్ణపరమహంస దేవుని, వారి సహధర్మ

చారిణి శ్రీ శారదామాయిని, మనము నిర్ణయింపవచ్చును. ఆ పుణ్యదంపతులలో నొకరు ప్రేమపరవశుఁడైన జ్ఞాననిధి. ఇంకొకరు వివేకవివశమైన ప్రేమనిధి. విజ్ఞానచంద్రికలతో ప్రేమసుధను మెదపినారు! కనుకనే పరిపూర్ణ మానవత్వమును ప్రత్యక్షమొనరించుకొని 'సత్యం, శివం, సుందర'మయినారు.

“పురుషుఁడు రాజు; స్త్రీ రాణి”—“భార్యా భర్తలు నీరక్షీరన్యాయముతో నొప్పారుచు సంసారయాత్రలో తరింప గోరుచో, పురుషుని ప్రభుత్వము, స్త్రీమంత్రిత్వము జరుగవలె” ననుటలో సందేహము లేదు. కాని “భార్య ప్రేమవాహిని” “ప్రేమకు తగిన స్వాతంత్ర్యత నొసంగకుండిన అదిపొంగి పొరలి పురుషుని ముంచివైచును”. “అట్లనే బుద్ధిబలముగల భర్తను ప్రతిఘటింప సాహసించు భార్య, అజ్ఞానభాస్కరుని ఆతప తైక్ష్ణ్యముచే మాడిపోవు” నన్న వాక్యములు నిదానముగ బోధపఱచు కొనవలసి యున్నవి. ప్రేమప్రవాహము పొంగి పొరలి పురుషుని ముంచివేయవలసిన నవకాశము, బుద్ధి బలముగల భర్తను ప్రతిఘటింప సాహసించి యాజ్ఞానభాస్కరు నాతపతైక్ష్ణ్యముచే మాఁడిపోవలసిన యవసరము స్త్రీకి వివేకహీనమైన 'ప్రేమ' యున్నప్పుడుగాని, పురుషునకు ప్రేమహీనమైన 'బుద్ధి' యున్నప్పుడుగాని సంభవించును. అనగా పురుషుఁడు 'బుద్ధి' మంతుఁడేయైన విశేషలాభములేదు. ప్రేమ కలవాఁడుకూడ కావలెను. అటులనే స్త్రీ ప్రేమ మూర్తి యైనంతమాత్రము చాలదు. వివేకవతి కూడకావలెను. 'బుద్ధి' 'ప్రేమ' యను నీరెండు ప్రవృత్తులు ప్రతివ్యక్తియందు నుద్యోతకమగుచుండవలెను. అప్పుడే 'సంసారము' శుభప్రదముగఁ జరుగఁగలదు.

ఈప్రథమ సంపాదకీయవ్యాసమును ప్రతివ్యక్తి యుననఁగా, స్త్రీ పురుషవివక్షత లేకుండ సర్వులు పఠింపవలెనని నా యాశయము. అందులో వారు వ్రాసిచ్చిన “బుద్ధి ప్రభువు - ప్రేమపెత్తందారు” యన్న ముఖ్యవిషయమును మనము మఱువరాదు. 'విజ్ఞాన' మను సుగుణవిశేషము స్త్రీ పురుషుల ప్రవర్తనయందు జక్కఁగఁజూపట్టుచో సంసార నిర్వహణము కడుంగడు సులభసాధ్యమై యాదర్శప్రాయమై యనుసరణీయమై యుండును. “పురుషుఁడు బుద్ధిని పోనాడినడచిన పదభ్రష్టుఁడగును. అట్లనే స్త్రీ ప్రేమను పరిత్యజించిన పతితురాలగును. జ్ఞానముకొఱకు పురుషుఁడును, ఆనందముకొఱకు స్త్రీ యును పాటుపడుట సహజధర్మములై యున్న” వని సంపాదక మహాశయుని కలము ప్రసవించినది. విజ్ఞానపూరితములైన యీదివ్యవాక్కులు ప్రతివ్యక్తియు బాగుగ మననము చేసుకొని యిందలి యర్థమును లెస్సగ గ్రహింపఁ గోరుచున్నాను. వ్యాఖ్యానము చేయఁ బూనిన మఱియొక పెద్దవ్యాసమును ప్రత్యేకముగ వ్రాయవలసివచ్చును. తీఱిక లేమి, జ్ఞానముచేఁజిప్పిలు యీ మధురవాక్కుల యర్థమును సంపూర్ణముగఁ గ్రహింప రసపిపాసులగు

పాఠకులకే వదలివేయుచున్నాను. ఇట్టివే మఱికొన్ని మఱువఁదగనిమాటలు : "ఎండయు, వెలుతురు" వలె, "వెన్నెలయు, చల్లదనము" రీతి పూవుందావియు లీల, వాక్కును సమీచీనార్థసంపత్తిలాగు "భార్యాభర్తలు అన్యోన్యానురాగముతో నైక్యతఁజెంది అల రారుట, ఆదర్శదాంపత్య ధర్మమనబడు" టలో నావంతయు నతిశయోక్తిలేదు.

ఇట్టి యుత్కృష్టాభిప్రాయములతో గూడుకొన్న వ్యాసములను వ్రాసి పాఠకులను విశేషవిజ్ఞానవంతులుగఁజేయ సంకల్పించిన శ్రీ సంపాదకుల యుదారాశయములకు వారి నభినందించుచు నింతటితో నీచర్చను ముగించుచున్నాను.

# సౌందర్యపూజ

అవలఁద్రోసితి కాంక్షాచయమ్మునెల్ల
పోవుచుంటిని సౌందర్యపూజకొఱకు
ఏమి లభియింపనున్నదో యెఱుఁగరాదు
అంతరంగంబు పారవశ్యమునఁదోఁగు.

గద్గదికదోచు పలుకుల, కనులఁదొరగుఁ
బాష్పకణముల, భావనాపథముఁబట్టి
పోవు నను:జూచి యున్మాదమూర్తియనుచు
ఎన్నిసారులు నవ్విపోయినదొ జగము!

కన్నులలరించు నెలసోయగమ్ముఁ జూచి
మ్రొక్కులిడుచుంటి నా కరమ్ములను
మంజులంబయితోచు బ్రహ్మాండమెల్ల మొగిచి
కౌఁగలింతు నొకొ్కక్కమాఱు గాఢరక్తి.

కొండచరియలలో, చెట్లగుబురులో, మ
నోజ్ఞ సైకతభూమిలో నుగ్రతపము
నాచరించుచునుందు నే నహరహంబు
ఆకలియులేదు దప్పియు నాకులేదు.

సలిపిన ప్రయత్నమెల్ల నిష్ఫలముగాఁగ
మరల యత్నించు పరితాపభరములేని
విమల సౌందర్యపూజకై వెడలుచుంటి
మృదుమధుర గీతికారవ ముదితహృదిని.

పాలకంకులపైన నుయాలనూఁగి
కలకలారావ గద్గదగాత్రమెత్తి
హర్షవశమున నను:బిల్చు నలవిహంగ
మములు, సౌందర్యపూజకు మరులుగొలిపి.

అలరులంబోలు మృదుల శయ్యాతలాన
కనులుమోడ్చిన విరహిణీ కాంతయోర్తు
అనవరతమును నను:బిల్చినట్లె తోచు
మధుర సౌందర్యపూజకు మనసుగొలిపి.

పవనపరిరంభణ సుఖమ్ముఁ బడసిపడసి
సోలిపోయెడువల్లరీ బాలయదిగో!
నవ్వుమొగమున రమ్మని నన్నుఁబిల్చు
నమల సౌందర్యపూజకు నాసగొలిపి.

ఫలముగలుగునో కలుగదో వలదుచింత
శాంతమతినై, వినిర్మల సహజమధుర
లలిత సౌందర్యపూజకై రక్తిబూని
కదలిపోయెద నవ్యమార్గములయందు.

దివ్యశంపాలతలు నాకు తెరువుసూప
తోయదగభీర ఘోషముల్ తోడుపడఁగ
నవ్యపథముల భూనభోంతరము దాటి
పోవుచున్నాను సౌందర్యపూజకొఱకు.

—శ్రీయుత బెళ్లూరి శ్రీనివాసమూర్తి.

# పుష్పచయము

## కృష్ణాజిల్లా మహిళా సమావేశము

అఖిలభారత మహిళామండలియొక్క కృష్ణాజిల్లా శాఖవారు గతమాసములో (డిశంబరు) ౭ వ తేదీని భారత మహిళామండలి భవనములో అన్నారీసతీమణిగారి అధ్యక్షతను సభ జరపిరి.

అధ్యక్షులు మాట్లాడుచు, స్త్రీలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములనిన కేవలము క్లబ్బులలో సమావేశమగుచు స్వాతంత్ర్యమును వెలిబుచ్చుకొనుట గాదనియు, మత, సాంఘిక రాజకీయ వ్యవహారములలో యదార్థమగు విజయమును చేకూర్పగలదే స్వాతంత్ర్యమనజెల్లుననియు చెప్పిరి.

స్త్రీజనాభ్యుదయమునకు చాలినన్ని వసతులును, అవకాశములును దేశములో కల్పింపబడకుండుటకు అధ్యక్షులు తమ సంతాపమును వెల్లడించుచు, స్త్రీవిద్య నెక్కువగ వ్యాప్తమొనరించుటకు తగిన ప్రయత్నములను వారు చేయవలెననియు, సంఘముయొక్క అభివృద్ధి కాటంకములగు బాల్యవివాహములు పూర్తిగ బహిష్కరింపబడవలెననియు, ఈ దురాచారముచే దురపిల్లు స్త్రీల దుస్థితిని తొలగింపనా దుస్థితి ననుభవించుచున్నవారే, తీవ్రమగు కృషిసల్పి, సంఘసంస్కరణమున కవసరమగు శాసన సహాయమును నిర్మింప పాటుపడవలెననియు హెచ్చరిక గావించిరి. పరదాపద్ధతి దేశములో నింకను తలచూపుచుండు టెంతయు శోచనీయమనిరి.

బెజవాడలో బాలికా ఉన్నత విద్యాపాఠశాలను నెలకొల్పుటకును, ప్రతిజిల్లాలోను వితంతుశరణాలయ మొకటి స్థాపించి, స్త్రీలకు ఉన్నతపాఠశాలలలోను, కళాశాలలలోను ఉచితముగ విద్యగరపబడు నవకాశముల గల్పించుటకును, వితంతువులైనవారందరికిని విద్యాపరిశ్రమ నిర్బంధవిధానమొనరించుటకును ప్రభుత్వమువారిని వేడ నీ సభవారు తీర్మానముల గావించిరి. సాంఘికవిషయములలో, ముఖ్యముగ బాలికలకు కుటుంబముయొక్క ఆస్థిలో సమానభాగమునకు హక్కు నేర్పరచ నీ సభవారు నిర్ణయించిరి. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమును స్థాపించుటకు స్టేటు సెక్రటరీగారు చూపిన నిరాదరణను నిరసించుచు, ఆంధ్రరాష్ట్రసిద్ధికై వలయు పటుప్రయత్నములను సలుపకుండ ఆంధ్రమహాసభ కార్యనిర్వాహకసంఘమువా రుపేక్ష సేయుటను తీవ్రముగ ఖండించుచు తీర్మానము చేసిరి.

## శ్రీ పాండురంగ స్త్రీ సమాజముయొక్క చతుర్దశ వార్షికోత్సవము

24-12-1939 భానువారంనాడు ఉదయం భగవద్గీత మొదటి ఆరు అధ్యాయములు పారాయణము జరుపబడెను. మధ్యాహ్నము దేవునికి పూజజరిగిన పిమ్మట గ్రామములోని స్త్రీలకు విందుచేసిరి. సాయంకాలము 4 గంటల 10 నిముషములకు సభ ప్రారంభమాయెను. రాజమండ్రినుండి శ్రీ సాధు మాతగారును స్త్రీ సాధువులును దయచేసిరి.

25-12-39 సోమవారమనకూడా 12వ అధ్యాయమువరకు గీతాపారాయణము పూజ భోజనాదికములు పూర్తియైనపిమ్మట శ్రీ వావిలాల పూర్ణ మహాలక్ష్మమ్మగారు ('జడ్జి' శ్రీ వావిలాల శివావధానులు

గారి వదినెగారు దివ్యజ్ఞాన సమాజములో మెంబరు) ప్రస్తుతకాలమందలి స్త్రీలయొక్క ఆవశ్యకతను గూర్చి వివరించిరి.

26-12-39 మంగళవారము 12 మొదలు 18 అధ్యాయములు పూర్తిచేసిరి. సాయంకాలము 3½ గంటలకు సభా ప్రారంభము శ్రీ గోవిందరాజుల అన్నపూర్ణమ్మగారు పాతివ్రత్య ధర్మములనుగూర్చి వివరించిరి. శ్రీ సాధుమాత 'నిష్ట' అనుభవజ్ఞానములనుగూర్చి ఉపన్యసించిరి. యీమూడు దినముల లోను అధ్యక్షులుగా సాధుమాతగారిని యెన్నుకొనుటయైనది.

సమయోచితముగా భజనలు మొదలైనవి జరుపబడెను.

శ్రీమతి ఆచంట సత్యవతీదేవిగారు స్త్రీ సమాజములు వాని ధర్మములనుగూర్చి చక్కగా ఉపన్యసించిరి. (వారి ఉపన్యాస మీదిగువ ప్రచురింపబడినది.)

## సమాజములవలని లాభములు అవెట్లుగా నిలబెట్టుకొనవలెను ?

అమ్మలారా ! సోదరీమణులారా !!

అసలు సమాజముఅంటే అర్ధమేమిటి ? పదుగురొకచోట సమావేశమగుట మంచిచెడ్డలు భక్తిజ్ఞానములు విజ్ఞానవిషయములు, మొదలగు మానవజన్మ యెత్తినందుకు చేయవలసిన విధానములనుగురించియు జన్మ రాహిత్యమగు సాయుజ్య ముక్తిసాధన విధానములగురించియు విమర్శించుకొనుట కేర్పరుపబడినవి. ఇంకను లోకాభి రామాయణములతోను అపకతపక ఆలోచనలతోను కాలము జీవితము వ్యర్ధపరచు కొనకుండగా పురాణశ్రవణము 'కలౌ: స్మరణాన్ముక్తిః' అను ఆర్య వచనానుసారముగా భగవన్నామ స్మరణగా భజన కాలక్షేపములు, మొదలగు భక్త సమాజములద్వారా, తరింపు మార్గమేర్పడును. మిగతా విద్యాజ్ఞాన, సాంఘికార్ధికాది విషయములనే చర్చించుకొనుచు, మానవోన్నతి సాధనములను, వ్యక్తిస్వాతంత్ర్యపు హక్కులనుగురించిన సాధక బాధకము లాలోచించుకొను సమాజములు ఈ రెండు విధ సమాజములుకూడ మానవులందరికి ముఖ్యముగా కావలసినవే.

అయితే అవి వృద్ధికరమగునటులను, శాశ్వతముగా నిలబడులాగునను చేయుట మన ముఖ్యవిధాయకము. అనేక సమాజము లిట్లే పుట్టి అట్టే మాయమగుచుండుట మనము చూచుచున్నాము. అట్లా మఖలో పుట్టి పుబ్బలో మాయమవకుండా దినదినాభివృద్ది యవవలెనన్నచో, 'దేముడి పెళ్లికి అందరూ పెద్దలే' యన్నట్లుగా స్త్రీ సమాజములకు ఆయా పురస్త్రీలందరూ అసహనము, నాదేయన్న అహంబావము వీడి, సమాన అంతస్థులో పూనుకొని పనిచేయుచు నడుపవలెను. వారు పెట్టిన సమాజమునకు మన మెందుకు పాటుపడవలెనని, నన్ను సరిగా మర్యాదచేసి కూర్చోమనలేదని మొదలగు ద్వేషము లుంచుకొనరాదు. స్థాపితలుకూడా అందరికి సమానహక్కులే అందు కల్పించవలెనుకాని, చందా నిర్ణయాన్నిపట్టి హెచ్చుతగ్గులుగా గౌరవమర్యాదలు జరుపుచు, చందా లియ్యలేనివారిని నిరసనగా జూచుచు, మసలరాదు. భగవంతుని సన్నిధిలోను, సాంఘికార్ధికాది విషయములలోను హక్కులు, స్వాతంత్ర్యములు, ధర్మములు, నీతులులోను అందరికి ఒకేరీతి హక్కుకలదు. 'పురుషకారములేనిదే దైవ మనుకూలించడన్నట్లుగా' ఏ సంస్థ స్థాపించినా ఏ సమాజము స్థాపించినను, ఎవరో యొక కొందరే పూనుకొని మొదలెట్టుట తప్పదు. అట్టియెడ, లోకోన్నతి ప్రజోపకారకృత్యములకు తమదే యన్న

కర్తృత్వమెప్పుడు వీడిపోవునో, అట్టి సమాజములు స్థిరముగాను, వృద్ధిగాను నిలబడును. చందానిర్ణయ ముండకూడదు. ధర్మవిషయములో నిర్బంధములు హెచ్చుతగ్గులుండరాదు. అసలే ఇయ్యలేనివారు కూడా యుందురు. వారికందు ప్రవేశముండకూడదా? ఎవరి శక్తికితగినదివా రుడుతాభక్తిగా మానవ సేవ, భగవత్సేవ చేయవలెననుటయే ముఖ్యాశయముగా స్థాపించవలెను. అట్లే నడపవలెను. లేనిచో మేము నెలకు రూపాయిచ్చాము. ఇంత డబ్బుకు జమాఖర్చు వారడుగుట, వీరు చెప్పుట. చందా సొమ్మును దాచి ఖర్చువెచ్చములు చూపించు బాధ్యులపై చందాదారుల కనుమానములు. అక్కడితో మనోద్వేషములు, ద్వేషభావములు మొలకలెత్తుట తోడనే రాకపోకలు విరమించుట మిగతావారవి చూచి నేర్చుకొనుట మొదలగు అసూయాభావలత ప్రాకి సమాజములను క్షీణింపజేయుట, కొద్ది సంవత్సరాలకే అంతరించుట కలుగుచున్నది. గాన, డబ్బు ప్రసంశచేయక, సేవయేముఖ్యమని యెంచి నచో, వారివారి అనుగ్రహప్రసాద పుష్ప, ధన సహాయములతో భక్త సమాజములు సాగును. ధనాశ లేని యుదారులచే విద్యా, లలితకళావిజ్ఞానము లభివృద్ధిగాంచును. ఎవరికి తోచినపని వారు చేయుట, ఎవరికొచ్చిన విద్య వారు చెప్పుట, ఎవరికున్న శక్త్యానుసారము వారు ధర్మముచేయుట, ఎవరికి తోచిన భావములు వారు వ్యక్తీకరించుటయే సమాజోద్దేశములుగా యున్ననాడే, అవి స్థిరవసతు లేర్పరుచుకొని జీవములుదాల్చి విఖ్యాతోన్నతికరములగునని మరలమరల మనవిచేసికొనుచున్నదానను.

ఇంకను, ప్రతి సమాజములకు, లోకవార్తలనుదెల్పు వార్తాపత్రికలుకూడా ముఖ్యము. ఏలననగా, ఏఏ సమాజము లెట్లుగా నడుపబడుచు వృద్ధిగాంచుచున్నవో, వారివారి పనులేమో తెలుసుకొనుచు, మన లోట్లను తెలుసుకొని దిద్దుకొనుట కుపయోగించును. జన్మలలో, నాల్గువిధ జన్మలు. ఉద్భిజ్జ, స్వేదజ, అండజ, జరాయుజములగు ఎనుబదినాలుగుకోట్ల జీవరాసులలోను, భగవస్సన్నిధికిజేర సాధన కరజ్ఞానముగల జన్మ, మానవజన్మ. దానిలోనే తరింపు సాధన మన్వేషించుకొనుట విధాయకము. అది దాటబెట్టుకొనినచో, తిరిగి అధఃపతనమై, జన్మపరంపరలకు జిక్కక తప్పదు. భవరాహిత్యకరమై, జ్ఞానయుతమై, భక్తివైరాగ్య విజ్ఞాన సాధనోపాధికరమైన మానవజన్మలోనే, తన్నుతానెరిగి తరించ వలెను. దీనికి భక్తసమాజములు, భజన కాలక్షేపములు, పూజా సప్తాహ కైంకర్యములు మొదలగు భగవత్సేవ పరమార్థసాధనములు మరియు, జీవితము, ధర్మముగాను, నీతి శీలవిజ్ఞానసౌఖ్యదాయకములు గాను, త్యాగయుతముగాను, ఒకప్రక్క చూచుకొనుటకూడ పరమార్థములోనే చేరును కాన, మానవ సేవకూడ చేయుచుండవలెను. ఈ రెండువిధములు ఇహపరసాధనములే యగుట, నరులవలంబించి తీరవలెను. ఒక్క ఇహమే గమనించి నడచుకొనుటకాదు. భవహరమగుటకు భగవద్భక్తికి మించిన సాధనము లేదు గాన, అది గమనించియే లోకసాధనము చేయుచు, ఒకరిని తరింపచేసి, తాను తరించవలెను.

గాన, అమ్మలారా! గృహావరణంలోనే యుండి, కుటుంబ పామరత్వములోనే మునిగి, స్వార్థపరత్వ జీవితములో, నేను, పిల్లలు, నాది యన్న సంసారాంబుధిలోనే మునిగియున్న నేను సర్వము తెలిసిన పెద్దలయెదుట యుపన్యసించుట హాస్యాస్పదమని సిగ్గుపడుచూ యింతటితో విరమించుచుంటిని.

(శ్రీ ఆచంట సత్యవతమ్మ)

# సమత్వము - సంఘబలము

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

పాశ్చాత్యులందు విశేషముగ ప్రశంసింపబడునది మానవ సమత్వసిద్ధాంతము. సుఖజీవనము వలయు నెడల సర్వమానవులు సమానాధికారము గలిగియుండవలెనని దీని భావాంశము. పాశ్చాత్యులజీవనము ముఖ్యముగా జాతీయభావ ప్రేరితము. ఒక్క దేశమునందు నివసించుజనులు ఒక్క జాతివారమను తలంపుగలిగి తదభివృద్ధికై తమ సర్వశక్తులు ధారపోయుదురు. స్వలాభమునే చూచుకొనుచు ఇతరులకొఱకు పాటుపడని వ్యక్తిని స్వార్థపరుడందురు. స్వకుటుంబపోషణమునే చూచుకొని అన్యకుటుంబములకు పాటుపడని వ్యక్తులను స్వకుటుంబార్థపరులని నుడువుదురు. అటులనే స్వదేశాభిమానముగలిగి అన్యదేశముల మేలు తలంపక స్వోన్నతికి ప్రయత్నించువారిని స్వదేశార్థపరులని జెప్పుదురు. వ్యక్తిగాని, కుటుంబముగాని, జాతిగాని, స్వార్థబద్ధమైనతోడనె జీవనవికాస మరికట్టును. అవి విశ్వవ్యాప్తమైన జీవనములో నెంతవరకు సంబంధముగలిగి యుండగలవో అంతవరకు నభివృద్ధి నిశ్చయము. జీవికి జీవనాధార పదార్థములు బాహ్యమందే యుండును. ఒక వ్యక్తి సుఖజీవనముకై ఎందరెందరెంతెంత పాటుపడి ఎన్నెన్నివస్తువులు సమకూర్చవలెనో?

అటులుండ జాత్యున్నతికిని, దేశోన్నతికిని బాహ్యసాహాయ్యమెంతయవసరమో యోచించుకొనుడు. పరులతో మైత్రీభావమున మెలగకపోవుటయేగాక వైరము బూనుట మూలమున ఏజాతికైనను వినాశము తప్పదు. పాశ్చాత్యదేశములందు విజృంభించియున్న జాతీయత స్వార్థపరత్వమునే లక్ష్యముగా గలిగియున్నందున పరస్పర వైరములకు తావొసంగుచున్నది. ఆ జాతీయత వ్యక్తుల స్వాతంత్ర్యములకును, అభిరుచులకును, సహజవికాసములకును తావొసంగక నణగద్రొక్కుచున్నది. యథార్థముగ వ్యక్తులకు స్వాతంత్ర్యమిచ్చు సంఘమే పదియారుకళలతో వ్యోమవీధిని ప్రకాశించు చంద్రబింబము మాడ్కి పరిపూర్ణమై యుండును. సంఘజీవనము వర్ధిల్లవలెనన్న నిజమైత్రి, అవ్యాజ ప్రేమ, యుండితీరవలె. ప్రతి సంఘమునందు కొందరు శక్తివంతులుగను, కొందరు శక్తి విహీనులుగను కొందరు విజ్ఞాననిధులుగను, కొందరజ్ఞానధనులుగను కొందరు శాంతస్వభావులుగను, కొందరు మూర్ఖ శిరోమణులుగను సర్వదానుండక తప్పదు. శక్తివంతులు శక్తిహీనులను, విజ్ఞానులు అజ్ఞానులను, శాంత స్వభావులు మూర్ఖులను సమత్వబుద్ధితో చూచుట సాధారణ విషయముకాదు. జననీ జనకులు తమ శిశువులకంటె అన్ని అంశములలోను అధికులె.

కాని వారు బిడ్డలను ప్రాణతుల్యులుగా నెంచుటకు కారణము వారి హృదయము లందలి యవ్యాజ ప్రేమవాహిని గదా! అట్టి పవిత్రప్రేమ బలవంతులయందు నెలకొనిన గాని సమత్వజీవనము సంఘమునందు ప్రసరించదు. మానవులలో శక్తి సామర్థ్యములందు, ప్రాపంచిక భోగములందు ఎన్ని తారతమ్యము లున్నప్పటికిని తమయందెల్లరిలోను వ్యాప్తమైయుండు ఆధ్యాత్మికవస్తువగు ప్రేమ స్వరూపుడగు. పరమేశ్వరుని స్మృతిపథము నందిడికొని ప్రేమబద్ధులై యుండినయెడల సమత్వ జీవనమును స్థాపించినవారగుదురు. ఆధ్యాత్మిక జీవనమునకు దూరులైనచో ఎట్టి ఉత్తమ సిద్ధాంతములనైనను నామమాత్ర ముగనె యనుసరించుట సాధ్యముగాని యథార్థరూపమున సాంఘికసమత్వమును నెల కొల్పుట దుర్లభము.

గీ॥ జీవకళలుట్టిపడు నొక చిత్రమరసి చిత్రకారుండు మేన్మరచి నిలుచుండు
మధుర గానామృతాపానమత్తుఁడగుచు హృదయ వీణియతంత్రులు కదలిపోవఁ
గరఁగి తన్మయత్వంబందుఁ గాయకుండు; రసము గొలఁకాఁడు పద్యంపు పసలనెంచి
కవివరేణ్యుఁడు హాయిఁగాఁ గనులుమూయు; మిత్రధర్మంబులోనున్న మేల్మిఁజెలిసి
అతులితానందమును మిత్రుఁడనుభవించు; వీటి స్వారస్యమేమని వెతకిజూడ
నిత్య సత్యాత్మకంబయి నిండివెలుఁగు ప్రేమతత్వంబులోనున్న పెంపుగాదె!

ప్రకృతిరామణీయకమునకు కారణ మూహించిన ప్రతి వస్తువు ప్రత్యేక రూపముతోను, గుణముతోను విరాజిల్లుచుండుటచేతనేగదా! సృష్టియందలి సౌందర్య విశేషము గాంచిన వివిధపదార్థముల ద్వారమున స్పష్టమగు ఆధ్యాత్మ ప్రేమస్వరూప మొక్కటియే. అటులనే సంఘ జీవనము శోభాయమానముగ నుండవలెనన్న స్వభావ ములు, రూపసంపదలు వేర్వేరుగానుండినను ప్రధానోద్దేశ మొక్కటిగానుండవలె. శరీరము నందలి వివిధాంగములుండియు ప్రత్యంగము తనతన కార్యము నిర్వర్తించుచు శరీర జీవన మునకు సాయపడురీతిగను, ఒక కార్యాలయమునందుండు ప్రతి యుద్యోగియు తమతమ కార్యములను నేర్పుతో బుద్ధికౌశల్య మేపారగావించుచు కార్యాలయ ముఖ్యోద్దేశ నిర్వ హణమునకు తోడ్పడుచందంబునను ప్రతి వ్యక్తియు సాంఘిక సమత్వ జీవనమునకై సర్వ శక్తులను ధారపోయుటకు సిద్ధము కావలయును. దీనికి సూత్రము ప్రేమతత్వము. ముత్యాల హారమునకాధారము సూత్రము. సమత్వ సంఘ జీవనమున కాధారము ప్రేమసూత్రము.

# గ్రంథ సమీక్ష

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

గ్రంథకర్త :—శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారిగారు, మద్రాసు. శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షునిచే ప్రకటింపబడినది. వెల రూ. 1-8-0. గ్రంథములు వలయువారు. మేనేజరు, ప్రకటనశాఖ, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు అని వ్రాసిన బడయగలరు.

నవీన భారతదేశ చరిత్రములో, మతోద్ధారకులై మాతృదేశారాధకులైన మహాపురుషులలో శ్రీ వివేకానందస్వామి మొట్టమొదటివాడని నుడువదగును. ప్రాచ్యపాశ్చాత్య భాషాపండితుడును, వేదవేదాంత శాస్త్ర విజ్ఞానవైభవోపేతుడును, యోగిపుంగవుడును, సిద్ధపురుషుడును, భారతస్వాతంత్ర్య యోధాగ్రేసరుడును, హిందూ మతోద్ధారక సార్థక నామధేయుడును, విశ్వప్రేమమయుడును, శ్రీ రామకృష్ణపరమహంసదేవుని ప్రియశిష్యుడును, ఐన శ్రీ వివేకానందస్వామి జీవిత చరిత్రను ప్రతి భారతీయుడును భక్తిశ్రద్ధలతో బఠించి ఆ ధీరోదాత్తుని ఉపదేశామృతమును గ్రోలి, అందలి మహాదాదర్శములను నిత్యజీవితానుభవములందు ద్యోతక మొనరింప దీక్షబూనుట పరమధర్మమైయున్నది.

నవీనయుగయువకుల కుత్సాహపూరితమగు పఠనీయగ్రంథముగ నుపయుక్తమగునట్లు శ్రీ మాధవ బ్రహ్మచారిగారీ దివ్యపురుషుని జీవితచరిత్రను ఆంధ్రమునం దతిరమ్యముగ రచించి, హిందూమత సారస్వత మునకొక ఆంధ్రభాషా విభూషణమును సమర్పించి తమ జీవితమును ధన్యమొనరించుకొనిరనుట అతిశయోక్తి కానేరదు.

ఈ గ్రంథము సుమారు 400 పుటలుగలిగి, సొగసుగుల్కు సైజులో, సొంపునింపు అచ్చులో, చక్కని పండ్రెండు పటములతో నలరారుచున్నది. ముప్పదితొమ్మిదధ్యాయములలో శ్రీ స్వామివారి జీవితచరిత్రను, భక్తిజ్ఞానవైరాగ్య ప్రబోధకమగు విషయములతో, మనోహరమగు మృదుమధుర శైలిలో వ్రాసిన గ్రంథకర్త మతసేవావిలసితమగు భాషాసేవాసత్ప్రియత్న మెంతయు శ్లాఘాపాత్రము. ప్రజల ఆధ్యాత్మికాభివృద్ధి కెంతయు తోడ్పడగల, ఇట్టి సద్గ్రంథములను వ్రాయించి, హిందూమత ప్రచార మొనరించి, మానవ జాత్యుద్ధరణమునకు పాటుపడుచున్న శ్రీ రామకృష్ణ మఠమువా రెంతయు వందనీయులు.

## సుగ్రీవవిజయము

కందుకూరి రుద్రకవి కృతము—శ్రీ కపిలేశ్వర పురాధినాయక ప్రకటితము. వెల 0-4-0. ప్రతులకు జమీందారు, కపిలేశ్వరపురము, తూర్పుగోదావరిజిల్లా, అని వ్రాయవలయును.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారీ గ్రంథ పీఠికయందు చెప్పినటుల ఈ సుగ్రీవవిజయమను లఘుకృతి శ్రీ బాలపామరాదులుగూడ పఠింపదగియున్నది. మధుర కవిత్వ వీరకరుణరసభరితమై, నీతిహృద్యమై, శ్రీ బాలపామరాదులుగూడ పఠింపదగియున్నది. మధుర కవిత్వ

పాటలు, వచనములును మధురమైన శైలిలో రచింపబడినవి. శ్రీమద్రామాయణములోని కిష్కింధాకాండ కథాభాగమైన ఇందలి ఇతివృత్తమెంతయు చతురతతో రచింపబడినది. ఈ గ్రంథమును మనోహరమగురీతిని ముద్రింపించి ఆంధ్రమాత మకుటమునకొక భాషామణిభూషణమును తయారుచేసిన శ్రీ బలుసు బుచ్చి సర్వారాయ ప్రభువు లెంతయు ప్రశంసాపాత్రులు.

### శ్రీ మాణిక్య కల్పవల్లీ వేంకటకేశవ కృష్ణకల్యాణాశీస్సంగ్రహము

ప్రకాశకులు :—శ్రీ రాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహదరు జమీందారుగారు, వేగాయమ్మ పేట, రామచంద్రపురం తాలూకా.

శ్రీ పుణ్యమూర్తుల వేంకటకేశవ కృష్ణరావు, శ్రీ మాణిక్య కల్పవల్లి, వారి వివాహ మహోత్స సందర్భమున వధూవరుల దీవించుచు బహువిద్వత్కవివర్యు లతిప్రమోదముతో ప్రసాదించియుండిన ఆశీస్సులు, సంగ్రహముగ నిందు పొందుపరుపబడినవి.

శ్రీ స్నేహలతా కవితా సంఘాధ్యక్షులును, సరసకవితాచాతుర్య విలసద్విశేషవిజ్ఞానసంపన్నులును నగు శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారి ఆశీర్వాద పద్యరత్నములతోడను, ఏతద్విద్వద్వర్య విరచిత పీఠికారాజముతోడను విలసిల్లుచున్న ఈ చిన్ని గ్రంథము ఆంధ్రభాషావధూటికొక అమూల్యాలంకార మనబరగుచున్నదనుట అతిశయోక్తి యెంతమాత్రమును కాదు.

### శ్రీమతి సి. సరస్వతీబాయిగారి సరస్వతీ ప్రసన్నస్మరణీయ సద్గ్రంథము:—

ఎగ్మూరు జగన్నాధ భక్తసభవారిచే ప్రకటితము. మూల్యమొక రూప్యము (రూ. 1-0-0)

సంగీత సాహిత్య విద్యావిలసద్విస్తారిత యశోవిశాల వైభవోపేతయు, 'అభినవ సరస్వతీ' సార్థక నామాంకితయు, దక్షిణభారత మహిళామండల దివ్యరత్న విభూషణ విదుషీమణియు నగు శ్రీమతి సి. సరస్వతీ బాయిగారినిగూర్చి వివిధభాషా పండిత ప్రముఖులును, సుప్రసిద్ధ గాయక శిఖామణులును గావించియుండిన సంస్తుతులనన్నిటిని ఒక గ్రంథరూపమున ముద్రించి, ఆ యువిదారత్నమునకు ఘనగౌరవచిహ్నముగ సమర్పించి ఎగ్మూరు జగన్నాధ భక్తసభవారు చేసిన సత్కారమెంతయు శ్లాఘాపాత్రము. ఇంత కీర్తినిగడించిన ఈ కాంతారత్నముయొక్క జ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయ నెంతయు ప్రయోజనకరముగనున్న ఈ స్తోత్ర రత్నగ్రంథమును భారత మహిళారత్నములందరును పఠించి, శ్రీమతి సరస్వతీబాయిగారి సద్విద్యాదర్శములను మార్గదర్శకములుగ గైకొని, అట్టి ఘనతనుగడింప నెల్లరుత్సాహింతురని విశ్వసించుచున్నాము.

## పత్రికాపరిచయము

### కాగడా : తెలుగు వారపత్రిక (మద్రాసు)

సంపాదకులు : శ్రీ తాపీ ధర్మారావుగారు బి.యే. సంవత్సర చందా రు. 4-0-0 లు, ఆరుమాసములకు రు. 2-8-0, విడిప్రతిక వెల ఒకఅణా. ఇదివరలో 'జనవాణి' పత్రికాసంపాదకులై యుండి ఆంధ్రదేశమునకంతె టను చిరపరిచితులైన శ్రీ తాపీ ధర్మారావుగారు క్రొత్తగా నీ వారపత్రికను ప్రారంభించి, సన్నుతింపదగిన పత్రికా సారస్వతాదర్శములతో ప్రోత్సహింపబడి, జంకును గొంకును లేకుండ సత్యమును చాటింప సమకట్టి, ప్రస్తుత కాలానుగుణమగు పత్రికా విజ్ఞానప్రచారమును చేయ బూనుటెంతయు ప్రశంసాపాత్రమగు విషయము.

కీ॥ శే॥ కళాప్రపూర్ణ గిడుగు రామమూర్తి పంతులుగారి స్మృతి

## "గృహలక్ష్మి" సానుభూతి

క॥ గిడుగువరాన్వయతిలకా! మడిసితివనుమాట లాంధ్రమాతకుఁ జెవిలోఁ
బడినంత మాత్రమెవ్విధి యడలెనొ! శోకార్తిఁజెంది హాహా యనుచున్.

సీ॥ సవరభాషాసేవసల్పి గడించిన కీర్తికాయుఁడు రామమూర్తిగారు
వాదంబులోఁ బ్రతివాది నోరెత్తక వాదింపఁగల దిట్ట వరలువక్త
గిడుగు పేర్విన్ననే గడగడ వడకుచుఁ బల్కకుందురదెట్టి ప్రౌఢులైన
గంభీరభీకరాకారుఁ డమృతమయుఁ డౌదార్యమతి మహాత్యాగమూర్తి

గీ॥ ఆంధ్రభాషకుఁ బెన్నిధియైనవాఁడు వ్యావహారికభాషకై సేవఁజేసి
దేహయాత్రనుజాలించి దివికిఁజనియె ధైర్య మూనుమా! ఆంధ్రమాతామతల్లి!

ఉ॥ తీరని దుఃఖవారిధిని ద్రింపి సతీసుత బంధుమిత్రులన్
వీరవతంసుడార్యకుల వేంకటరామ కళాప్రపూర్ణుఁ డీ
ధారుణిఁ బాసిపోయెనని తాపముఁ జెందనివారలుందురే
వారి ప్రశాంత తేజమిట వారకఁగూర్చుత శోభనావళుల్॥

## జ్వరము వచ్చునప్పుడు ఆహారము ఎందుకు అసహ్యము పుట్టించును

జ్వరముచే బాధపడునప్పుడు మీదేహమందలి సకలావయవములు అలసటజెంది ద్రవమునే కోరుటచేత ఘనపదార్థములన్న అసహ్యము, విపరీతమైన దాహముగలుగును.

మీకడుపు బలహీనముగానుండుటచే సాధారణ ద్రవపదార్థముకూడ జీర్ణించుటకష్టము. అందుచేత తిన్న ఆహారము వాంతియగును, లేదా అతివిరేచనములగును. దీనినుండి గుణమునొందుటకు బలహీనతను పోగొట్టి, శక్తిని సంపాదించవలెను.

హార్లిక్స్ త్వరలో జీర్ణమగుటయేకాక సకలావయవములకు తగినంతపుష్టిని యొసగునని డాక్టర్లు గ్రహించినారు. కాబట్టి జ్వరమునుండి గుణముజెందుకాలములో, అటుతర్వాతకూడా దినమూ హార్లిక్స్‌ను సేవించిన దేహదారుఢ్యముగలిగి, ఏజ్వరమునైనను ఎదరించేశక్తిని సంపాదింతురు.

నేడే హార్లిక్స్‌ను కొనుడు:—అన్నిచోట్ల దొరుకును.




ఆంధ్రుల సంగీతవిద్యాప్రదర్శనాప్రాభవము—స్వవిద్యాదరాభిమానములు

ఈమధ్య చెన్ననగరములో సంగీతవిద్యాలయము (Music Academy) వారి యధ్వర్యమునను భారత లలితకళాసంఘము (Indian Fine Arts Society) వారి యాజమాన్యమునను పదిరోజులు వరుసగా సంగీతప్రదర్శనములు జరుపబడినవి.

చెన్నపురిలోనున్న ఆంధ్రులందరును ఆంధ్రగాయకశిఖామణుల కీప్రదర్శనములం దొసంగబడిన ప్రత్యేకగౌరవార్హతను గుర్తించియేయున్నారు. మచ్చునకుమాత్ర మొక ఆంధ్రసంగీతవిద్వాంసున కీసభలలో విద్యాప్రదర్శనమున కవకాశ మొసంగబడుటలో మద్రాసులో ఆంధ్రగాయకులకుగలుగుచున్న ఆదరాతిశయమందరకును విశదమగుచున్నది.

ఈ రాజధానిలోనేగాక ఇతర రాష్ట్రములందునుగల పేరెన్నికగన్న సంగీత విద్వాంసులలో నగ్రగణ్యులుగ సంభావింపబడుచున్నవారిలో నొకరుగ, ఆంధ్రులచేతనే గాక అరవలచేతనుగూడ, ఏకగ్రీవముగ నెన్నబడిన శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడు గారికి ప్రక్కవాయిద్య ప్రదర్శనార్హతయేగాని ప్రత్యేక ఫిడేలువాయిద్య ప్రదర్శనభాగ్యము ఈ పదిరోజులలో జరిగిన సభలలో నొకచోటను లభింపకుండుట మద్రాసులో ఆంధ్రులకు గల గౌరవసత్కారములను వెల్లడించు విషయములలో నొకటిగ నున్నది.

వీణావాయిద్యమై పుణ్యమును విశేషముగ నార్జించి, దక్షిణహిందూదేశములో నిపుడున్న వైణికశ్రేష్ఠులలో నొకరని నిర్ణయింపబడిన, వీణాచార్య శ్రీ ఈమని అచ్యుత రామశాస్త్రిగారి కీసభలలో తమ విద్యాప్రతిభను ప్రదర్శింపగలుగు భాగ్యము లేకుండుట బహువిచారకరమగు సంగతి. స్వస్థలమునువీడి సకలకష్టములకోర్చి సంగీత విద్యాపరిశ్రమను, ప్రచారమును, చెన్నపురిలోని పెద్దలయొక్కయు రసికాగ్రగణ్యులయొక్కయు ప్రోత్సాహముచే చేయ సాహసించి, యిచ్చటకు విచ్చేసి, వీణాగానకళారాధనమును గావించుచున్న వీరి ఆశయములు సంగీత విద్యాభిమానులెల్ల రాదరింపదగినవయ్యు, తగు ప్రాపును ప్రోత్సాహమును బొందకుండుటకు పురప్రముఖులు విద్యాపోషణ విషయములో నేమరుటయే కారణము.

ఇది యిట్లుండ, నీమధ్యనే సంక్రాంతిపండుగ దినములలో రాజమండ్రీ మొదలగు పట్టణములలో నేర్పాటుచేయబడిన సంగీతప్రదర్శనములు అరవగాయక శిఖామణులను సత్కరించుటకే ఏర్పరుపబడినవా, యను భావము పొడముచున్నది.

ఆంధ్ర దేశముయొక్క మధ్యభాగ ప్రదేశములలోగూడ అరవ విద్వాంసులకే గౌరవము జరుగుచుండుటయు, ఆంధ్రగాయకుల విద్యాప్రదర్శనములకు ప్రాధాన్యము లేకుండుటయు, ఆంధ్రుల హీనస్థితికి ప్రత్యక్ష ప్రమాణముగాదా? ఆంధ్రగాయకుల యభాగ్యస్థితి అరవల అధిక బుద్ధిబలప్రతాప భాగ్యవశమున గలిగినదిగాదు. ఇది ఆంధ్రుల స్వయంకృతాపరాధ ఫలితమే. ఈ విషయము నాంధ్రులెల్లరును బాగుగ నాలోచింపదగును.

'పొరుగింటి పుల్లకూర రుచి'యను విధమునను 'దూరపుకొండలు నునుపు'అను సామెతప్రకారమునను ఆంధ్రులకు అరవగాయకులసాంబారు రుచించినటుల స్వసోదర విద్వాంసుల గానసుధారసము మధురముగ నుండనేరదు.

'పెరటిలోనిచెట్టు మందరికి రాద'ను తెరంగున స్వదేశములో ఆంధ్రసంగీత విద్వాంసులకు సత్కారముగలుగుటలేదను మాటనిజమే; కాని పరదేశములో ప్రాప్తించుచున్న పరపతియుగూడ పూర్ణానుస్వారముతో సరిసమానముగానే యున్నది.

ఆంధ్రులలో, సంగీతవిద్య నభ్యసించుటకంటె అదృష్టహీనమైనవిషయము మరొకటి లేదనియే ప్రస్తుతపరిస్థితులనుబట్టి చెప్పవలసియున్నది. జీవితమంతయు నీ విద్యాసాధనకై ధారబోసి ఆలుబిడ్డలను పోషించుకొనుటకు నయితము సరిపడుసంపాదనలేక అల్లాడుచున్న ఆంధ్రగాయకులకు గానకళోపాసనచే ననుభవింపదగిన ఆనంద మింకెక్కడున్నది?

స్వసోదరసంగీతవిద్వాంసులయెడ నుపేక్షాభావమూని ఇతరప్రదేశ విద్వాంసుల నాదరించుచుండుట, ఆంధ్రదేశములో అసలు విద్యయే అంతరించిపోవుటకు కారణమగునేమో అను అనుమానమున కాస్పదమొసంగుచున్నది.

తన్నుమాలిన ధర్మమును మొదలుచెడ్డ బేరము శ్రేయస్కరమగునా? స్వజనుల నాదరించిన పిదపగదా పెరవారికి పెద్దగ నాతిథ్య మొసంగుట? ఇతరుల ప్రతిభను ప్రోత్సహించుటకై ఇంటిలోని వారిని తిరస్కరించుట వివేకమగునా?

ఆంధ్రమహిళామండలిలో అధికముగ సంగీతవిద్యా పరిశ్రమనుసలిపి, సభలలో విద్యానైపుణ్యమును ప్రదర్శింపగల ప్రమదలు లేరనియే చెప్పవచ్చును. ఇది, ఎంతయు శోచనీయమగు విషయము. ఆంధ్రసోదరీమణులు గానకళానైపుణ్యము నత్యధికముగ పొందుటకు పాటుపడ నుత్సాహింపవలెను.

సంగీతవిద్యాప్రావీణ్యమే సుదతులకు సహజమగు విద్యాభూషణము. అరవసోదరీ మణులలో అసమాన గానకళామాధుర్యమును ప్రదర్శింపగల 'కోకిలగాన' శ్రీ మధుర సుబ్బులక్ష్మి అమ్మాళ్, శ్రీ డి. కే. పట్టమ్మాళ్, శ్రీమతి అలిమేలు జయరామయ్యరు సతీమణి మొదలగు సంగీత విద్యాధురీణల ప్రదర్శనములు ఆదర్శములుగ గైకొని ఆంధ్ర

సోదరీమణులందరును, వారి చందమున సంగీతప్రదర్శనాప్రాభవమును సభలలో వెల్లడింప గలుగుటకు విశేషముగ పరిశ్రమసలుప దీక్షను బూనవలెను.

ఆంధ్రమాత కధికమగు శాశ్వతయశస్సు నొడగూర్చిన శ్రీ త్యాగరాజస్వామివారి భక్తిరససంభరితమగు సంగీతవిద్యామహిమను సుస్థిరముగ ఆంధ్రదేశమునందు నిలబెట్టుటకై ఆంధ్రవనితారత్నములు పట్టుప్రయత్నములను చేయుదురనియు, ఆంధ్రగాయక శిఖామణుల విద్యాప్రదర్శనములనే ఆంధ్రభూమియందు అందరును ప్రోత్సహింతురనియు విశ్వసించుచున్నాము.

శిశుపోషణ బోధనా విద్యాలయములయొక్క విశేషావశ్యకత

ఇటీవలనే చిట్టల్‌డ్రగ్‌లో శిశుసంరక్షణాలయముయొక్కయు, శిశుపోషణ విద్యాలయముయొక్కయు శంఖుస్థాపనమొనరించు సందర్భమున లేడీ మీర్జా ఇస్మాయిల్‌గారు హిందూదేశములో నిట్టి సంరక్షణ కేంద్రములయొక్కయు శిశుపోషణ విద్యాలయముల యొక్కయు ప్రత్యేకప్రాముఖ్యతను వెల్లడించియుండిరి.

అజ్ఞానముచే బిడ్డల నుక్కిరిబిక్కిరి చేయునట్టియు, అవివేకముచే క్రమముదప్పి యనర్థముల వాటిల్లజేయునట్టియు, స్థితిలోనున్న మాతృప్రేమ, హిందూదేశములో చక్కబడవలెనన్న శిశుపోషణ విద్యాలయములను, శిశుసంరక్షణ గృహములను చాలగ స్థాపింప కడు నవసరమైయున్నదనియు, సర్వవిధముల అభివృద్ధిగాంచిన మైసూరు సంస్థానములో గూడ నిట్టి గృహములును విద్యాలయములును చాలతక్కువగ నుండుట అసంతుష్టికరమగు విషయమేననియు, ఇట్టి వసతుల నేర్పరచుటకు మంచి పద్ధతుల నాలోచింప నెంతయు అవకాశమున్నదనియు, శిశువుల ఆరోగ్యము చక్కగ అభివృద్ధియగుటకు విశాలమైన గదులలో నేయడ్డునులేకుండ వారిని విడువవలెననియు, ఈ శిశుసంరక్షణ గృహములు చాలినంత వెలుతురును, గాలియులోనికి చొరనిచ్చునటుల నిర్మింపవలెననియు చెప్పియుండిరి.

పసితనమే బాలబాలికల పురోభివృద్ధికి పునాదియైయున్నది కావున బిడ్డల నెంత మంచి పద్ధతులలో బెంచి, యెంతమంచి శిక్షణము నొసంగిన, వారంత ఘనతను, బుద్ధి విశాలతను, ఆరోగ్యభాగ్యమును జీవితములో ననుభవింపగలుగుదురు.

అజ్ఞానముతో నావహింపబడిన తల్లుల చేతులలోను, అనారోగ్యముచే నావహింపబడిన గృహములలోను, అపవిత్రతచే నిండియుండిన వాతావరణములోను, అవివేకాదర్శములతోగూడిన అక్రమ పద్ధతులలోను పెంపబడిన బిడ్డలెట్లు అభివృద్ధిని గాంతురు?

EDITED BY DR. K. N. KESARI; PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

